శ్రీరస్తు

# శ్రీవేదాంతపంచదశి

శ్రీ విద్యారణ్యప్రణీతము

శ్రీరామకృష్ణవిరచితవ్యాఖ్యాన

ఆంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1965

# భూమిక

"వేదాంతపంచదశి" యనుపేరుతో సుప్రసిద్ధి వహించియున్న ఈగ్రంథరత్నమును మహర్షి కల్పుఁడగు "శ్రీవిద్యారణ్యస్వామి" రచించెను. ఉపనిషత్తులందును, బ్రహ్మసూత్ర, తద్భాష్యాది గ్రంథములందును ప్రౌఢముగ చర్చించి నిర్ణయింపఁబడిన వేదాంతశాస్త్రసిద్ధాంతము లన్నియు నిందు అతి సులభశైలిలో సుకుమారమతులకుఁగూడ తెలియునటుల విశదీకరింపఁబడియున్నవి. ఈగ్రంథమునందు తత్త్వవివేకము, పంచభూతవివేకము, పంచకోశవివేకము మున్నగు ౧౫ ప్రకరణములలో ఆయావిషయములను ప్రధానముగా గ్రహించి చర్చించి నిర్ణయించియుండుటచేత "వేదాంతపంచదశి" అను నామ మీగ్రంథమునకు సార్థకనామ మయి ఒప్పుచున్నది. ఏతద్గ్రంథకర్తయగు విద్యారణ్యస్వామి ౧౪-వ శతాబ్దప్రారంభమునం దవతరించి దాదాపు ఆశతాబ్దము చివరివఱకు జీవించి శ్రీశృంగేరి జగద్గురుపీఠమునధిష్ఠించి బ్రహ్మభూయమునందిన మహనీయపురుషుఁడు. ఇతఁడు పూర్వాశ్రమమునందు మాధవాచార్యుఁ డను పేరుతో విఖ్యాతిని గాంచెను. మఱియు సకలశాస్త్రపారంగతుఁ డగుటచేత "సర్వజ్ఞస్సహి మాధవః" అని సర్వజ్ఞబిరుదవిరాజితుఁడయి వేదభాష్యాద్యనేకగ్రంథరాజముల నొనర్చి వన్నెకెక్కెను. దక్షిణహిందూస్థానమునందు పదునాల్గవశతాబ్దియందు ఏర్పడిన "విజయనగరసామ్రాజ్య" మీమహనీయుని మంత్రాలోచనబలమువలననే జగద్విఖ్యాతిని గడించెను. ఈ 'వేదాంతపంచదశి' అను గ్రంథమునకు విద్యారణ్యశిష్యుఁడగు రామకృష్ణపండితునిచేత విరచితమయిన సంస్కృతవ్యాఖ్యానమును చేర్చి ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితముగ మేమిప్పుడు దీనిని ముద్రించియున్నారము. ఈగ్రంథము శ్రీవిద్యారణ్యవిరచిత మని సర్వసాధారణముగ అందఱు తలంచుచున్నను వ్యాఖ్యాతయగు శ్రీరామకృష్ణుఁడును, మఱికొందఱును భారతీతీర్థుఁడును, విద్యారణ్యుఁడును గలిసి యీగ్రంథమును రచించి రని తలంచుచున్నారు. పరమేశ్వరుని యనుగ్రహము సరిగా నున్నయెడల శ్రీవిద్యారణ్యకృతములగు అనుభూతిప్రకాశము వివరణప్రమేయసంగ్రహము మున్నగు వేదాంతగ్రంథములను ఆంధ్రటీకాతాత్పర్యవివరణములతో త్వరలో ముద్రించి పాఠకులకందఁజేయఁగలము.

తండయార్పేట
చెన్నపట్టణము
1-4-1934

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.



# విషయసూచిక



| ప్రకరణము. | | | పుటసంఖ్య. |
|---|---|---|---|




# వి ష య సూ చి క



# ఉపోద్ఘాతము

యః సాక్షాత్ భువనేశ్వరీం భగవతీమారాధ్య భక్త్యా పున
స్తస్యాస్సత్కృపయా పరై రసులభం లబ్ధ్వా మహాన్తం నిధిం,
సౌవర్ణీం విరచయ్య వృష్టిమపి యః ప్రాదాత్ ప్రజాభ్యో ముదం
సోఽయం శ్రీశశిఖండమౌళికృపయా జీయాచ్చిరం మాధవః.

శ్రీవిద్యారణ్యమునీంద్ర ప్రణీతంబగు నీవేదాంతపంచదశి యను గ్రంథరాజము శ్రీమచ్ఛంకరాచార్యకృతమగు నుపదేశసాహస్రి యను గ్రంథరత్నమువలె ముముక్షువులకుఁ బెన్నిధియై విజ్ఞానధనమును అవిచ్ఛిన్నముగ నొసఁగూర్చుచున్నది. ఏతద్గ్రంథవిషయమై ముచ్చటించుటకు ముందు గ్రంథకర్తయొక్క జీవితమునుగూర్చి ప్రస్తావించుట వాంఛనీయము కాని, యిమ్మహాత్ముని దివ్యచరిత్రము గ్రంథస్థముగ నున్నటులు కనఁబడదు. ఎంతటి పండితుల నడిగినను దెలియ దను వారలు, లేక, యేవో రెండుమూటలతో సరిపెట్టువారలేకాని సమగ్రముగఁ దెలిసినవారలీయాంధ్రదేశమునఁ గానరారు. బ్రహ్మశ్రీ మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే 1895-వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడిన పంచదశీగ్రంథములో దీపికాపంచకమనెడి ద్వితీయభాగారంభమున వ్రాయఁబడిన పీఠికలోమాత్రము శ్రీవిద్యారణ్యస్వామిజీవితము విషయమై కొంత ప్రస్తావము గలదుగాని యది సమగ్రముగను విశ్వసనీయముగను లేదు. 1926-వ సంవత్సరములో శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే ముద్రణమైన 'జీవన్ముక్తిప్రకాశిక' యను గ్రంథములో 'శ్రీవిద్యారణ్యస్వామిజీవితము' అని కొంత వ్రాయఁబడెను గాని, అది యసంపూర్తిగ నున్నది. తుదకు నాకత్యంత ప్రియమిత్రులును కర్ణాటబ్రాహ్మణులును ప్రస్తుతము కాశీపురనివాసులు నగు బ్రహ్మశ్రీ యం. యస్. శ్రీకంఠశాస్త్రిగారికి వ్రాయఁగా ఆయన నింతదయతో విశేషపరిశ్రమమొనర్చి అనేకగ్రంథములనుండి కొన్ని విషయములను (Notes) ఇంగ్లీషు కర్ణాటభాషలలో వ్రాసిపంపిరి. దాని ననుసరించి ఈ క్రిందివిషయములను వ్రాయఁగలిగితిని.

# శ్రీవిద్యారణ్యస్వామిజీవితము



## 1. జన్మభూమి:—

ఈమహాత్ముని జన్మభూమి కర్ణాటదేశమున తుంగభద్రానదీతీరమున (రామాయణ కాలమున కిష్కింధానగరమని ప్రసిద్ధిగాంచిన) 'విజయ'పురము లేక విజయనగరము.

## 2. జననాది కాలము:—

శ్రీశంకరాచార్యులవారి జననాదికాలమువలె వీరి జననాదికాలముగూడ ఇంత వఱకు నిదమిత్థమ్మని నిశ్చయింపఁబడలేదు. అయినను గొన్ని తామ్రశాసనములనుబట్టి యిట్లు నిర్ణయింపవచ్చును.

| | శాలివాహనశకము | క్రీస్తుశకము |
|---|---|---|
| జననము | | 1267 A. D. |
| సన్న్యాసాశ్రమస్వీకారము<br>శ్రీశారదా పీఠాధిపత్యము. | 1253 | 1331 A. D. |
| సిద్ధి (బ్రహ్మైక్యము) | 1308 | 1386 A. D. |

పూర్ణాయుర్దాయము 129 సంవత్సరములు.

[శ్రీవిద్యాతీర్థులును, శ్రీశంకరాచార్యుల గురువులు నగు శ్రీగౌడపాదాచార్యులువారును, 120 సం॥ రములు జీవించిరి. వర్తమానకాలమందుఁగూడ 120; 130 సంవత్సరములు జీవించిన వారలు గలరు కనుక శ్రీవిద్యారణ్యులు 120 సంవత్సరములు జీవించిరా యని శంకింపఁబనిలేదు.]

శ్రీ శృంగేరీమఠములో వీరి ఆరాధన ప్రతిసంవత్సరము జ్యేష్ఠ శుద్ధ త్రయోదశీ తిథియందు జరుగుచున్నది. ఈపీఠముయొక్క జగద్గురు పరంపరనుబట్టి వీరి గురువగు శ్రీవిద్యాతీర్థులు (లేక శ్రీవిద్యాశంకరులు) 1228 A. D. మొదలు, 1333 A. D. పర్యంతము శృంగేరీపీఠాధిపత్యమును వహించినట్లు కనఁబడుచున్నది. కావున మాధవాచార్యులవారు ఈకాలమందు ఉండిరనుట సంగతమే.

## 3. కుటుంబము:—

"శ్రీమతీ జననీయస్య సుకీర్తిర్మాయణః పితా
సాయణస్సోమనాథశ్చ మనోబుద్ధిసహోదరౌ,

యస్య బోధాయనం సూత్రం శాఖా యస్యచ యాజుషీ
భారద్వాజం యస్య గోత్రం సర్వజ్ఞస్సహి మాధవః."

అని పరాశరస్మృతి వ్యాఖ్యానపీఠికయందు శ్రీమాధవాచార్యులవారు వ్రాసినశ్లోకముల ననుసరించి, ఈయన తల్లి శ్రీమతి, తండ్రి మాయణుఁడు, సోదరులు సాయణసోమనాథులను వారలు, బోధాయనసూత్రము, తైత్తిరీయ యజుశ్శాఖ, భారద్వాజస గోత్రము అని స్పష్టమగుచున్నది. ✓

ఈయనకుఁ బూర్వాశ్రమమందు మాధవుఁడు, మాధవార్యుఁడు, మాధవామాత్యుఁడు, మాధవాచార్యుఁడు ననెడినామము లొప్పారెను. సన్న్యాసాశ్రమస్వీకారమున "విద్యారణ్యస్వామి" యనఁబడె నని కొందఱ మతము.

## 4. శైశవావస్థ, ఉపనయనాది సంస్కారములు:—

తండ్రి మాయణుఁ డీయనకు మాధవుఁ డని నామకరణం బొనర్చి, 'సర్వజ్ఞవిష్ణు' వనెడి పండితునియొద్ద విద్యాభ్యాసమునకై యొప్పగించెను. మాధవాచార్యులు మేధాసంపన్నుఁడై అత్యల్పకాలములోనె నాలుగు వేదములును సకలశాస్త్రములను, ఇతర విద్యలను సర్వజ్ఞ గురువునొద్ద నభ్యసించెను. ✓

"పారంగతం సకలదర్శనసాగరాణా
మాత్మోపకారచరితార్థిత సర్వలోకమ్,
శ్రీశార్ఙ్గపాణితనయం నిఖిలాగమజ్ఞం
సర్వజ్ఞవిష్ణు గురుమన్వహమాశ్రయేహమ్."

అని శ్రీవిద్యారణ్యస్వామి తనచే రచియింపఁబడిన 'సర్వదర్శనసంగ్రహ' మను గ్రంథమున వక్కాణించెను. కనుక సర్వజ్ఞవిష్ణు వీయనకుఁ బూర్వాశ్రమమందు విద్యాగురువు. ✓

## 5. వివాహము:—

మాధవాచార్యులు విద్యాభ్యాసకాలమంతయు బ్రహ్మచర్యవ్రతనిష్ఠతో వేదశాస్త్రాది సకలవిద్యల నభ్యసించినమీఁద గుర్వాజ్ఞంగొని స్వస్థలమునకుం జనెను. తల్లిదండ్రుల కోరికప్రకారము గృహస్థాశ్రమ స్వీకారమున కంగీకరించినవాఁడై, 'బాదాలి' లేక 'బాదామి' యనెడి ప్రస్తుతనామముగల 'వాతాపిపురము'న కధీశుఁడగు చాళుక్యరాజునకు మంత్రియగు వీతిహోత్రుని ప్రియనందనయగు 'వీతిహోత్రి' యను కన్యారత్నమును పరిణయమాడెను. అప్పటికి యీయన వయస్సు 40-50 సంవత్స

✓

రములైనను బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠుఁడు గనుక, 25 సంవత్సరముల బాలునివలె నుండె నని వాడుక.

6. తపశ్చర్య:—

మాధవాచార్యులు హంపియందు భువనేశ్వరీ దేవతాలయములో గాయత్రీ మంత్రోపాసనముజేయుచు లక్ష్మీప్రాప్తికై చిరకాలము ఘోరతపస్సు చేసెను. ఎంత కాలము తపస్సాచరించినను లక్ష్మి ప్రసన్నురాలు కాకపోవుటచే తీవ్రతపస్సు చేసెద నని దీక్షవహించి మూఁడుమాసములు పరిపక్వఫలములను దినుచు ఆఱుమాసములు జలపానము మాత్రమే చేయుచు ఒక వత్సరము వాయుభక్షణముచేసియు పిమ్మట నాలుగేండ్లు నిరాహారియయ్యును తన దారిద్ర్యమహాంబుధిని లక్ష్మీపదపంకజ నౌకాసహాయమున దాఁటవలె ననెడి సంకల్పముతో అత్యంతభక్తితో తీవ్రతపంబు సల్పెను. పంకజాసన సంతుష్టచిత్తయై నిజరూపమున దర్శన మిచ్చెను. అప్పుడు మాధవాచార్యులు శరీరము గగుర్పొడువ ఆనందబాష్పపూరితలోచనుఁడై వినయ భయభక్తులతో నాలక్ష్మీదేవిని అనేకవిధములఁ బ్రస్తుతించెను. పద్మాలయ మందస్మితముఖారవిందయై మృదుమధుర వచనముల "ఓయీ! విబుధాగ్రగణ్యా! నీతపస్సునకు మెచ్చితి. కాని నీమనోరథ మీజన్మమున సిద్ధింపదు. 'పరజన్మమందు సిద్ధించును." అనెను. మాధవాచార్యు లాపలుకులను విని బద్ధాంజలియై యిట్లనెను. "తల్లీ! యత్యాశ్రమస్వీకారము పరజన్మ మగు నని శ్రుతిస్మృతిపురాణాదులు ఘోషించుచున్నవి. యతికి ఆత్మవిజ్ఞానమే పరమధనము. కావున నేను యత్యాశ్రమమును స్వీకరించి, శృంగగిరిపురమున నివసించుచు, శిష్యవర్గముతో అధ్యాత్మవిద్య నభ్యసించెదను." లక్ష్మీ దర్శనప్రభావమున క్షణభంగురమగు ధనమునందు అభిమానముతొలఁగి, యిట్లు వైరాగ్యము గలిగి అధ్యాత్మ విద్యాసక్తుఁడగు మాధవాచార్యునిఁగూర్చి లక్ష్మి యిట్లానతిచ్చెను. "ఓవిద్వాంసుఁడా! ముల్లోకములందును ప్రజలు ఐశ్వర్యకాములై అనన్యభక్తితో నన్నుం గొలుచుచుందురు. లక్ష్మీప్రసన్నత గలవార లేకదా ధన్యులు, నాకొఱకై యింత యుగ్రతపం బొనర్చి యిప్పుడు ధనమువలదనెదవేల? నావరము మోఘము. నీవు సన్న్యాసాశ్రమము స్వీకరించి నను నీతపఃఫలముగ యత్యాశ్రమమందే నీకు సకలైశ్వర్యముల నొనఁగూర్చెదను." పద్మాలయయొక్క సుధామధుర వచనములను విని, "జననీ! పరోపకారార్థమై ప్రయత్న పూర్వకముగ నీపదసరోజముల నెపుడు ధ్యానింతునో యపుడుమాత్రమే నాకు ధనము నొసంగుము" అనెను. ఈవచనమును విని లక్ష్మి మోదమొంది "వత్సా! నీవు ఎపుడు, ఏదేశమందు నన్ను ధ్యానింతువో యపుడు ఆదేశమందంతటను సువర్ణవృష్టి గురిపించెదను. ఈ నావచనము సత్యము. నీకు శాశ్వతఖ్యాతి కలుగును." అని యాశీర్వదించి అంత

ర్ధానమందెను. అంతట మాధవాచార్యులు నిజగృహమునకుఁ బోయి, మాతాపితరుల యనుజ్ఞఁగొని, శృంగగిరిపురమునకుం జనెను.

## 7. సన్న్యాసాశ్రమస్వీకారము - పీఠాధిపత్యము:—

ఆకాలమందు (శా. శ. 1253. క్రీ. శ. 1331 A.D.) శ్రీవిద్యాతీర్థులవారు శ్రీశృంగేరీపీఠాధిపత్యమును వహించియుండిరి. మాధవాచార్య లాయతిసార్వభౌముని వలన సన్న్యాసాశ్రమమును స్వీకరించి, "విద్యారణ్యస్వామి" యను ఆశ్రమనామముం బడసి, ప్రజోత్పత్తిసంవత్సర (1331 A. D.) కార్తికశుక్లసప్తమీ శుభదినమున శ్రీశృంగేరీపీఠాధిపత్యమును వహించెను. అంతనుండి మాధవాచార్యులు "శ్రీజగద్గురు విద్యారణ్యస్వామి" యని జగత్ప్రఖ్యాతిం గనెను. (శ్రీవిద్యాతీర్థులవారికి విద్యాశంకరులని నామాంతరము గలదు.)

## 8. విజయనగర (విద్యానగర) ప్రతిష్ఠ:—

1336 A.D. సంవత్సరమున బళ్లారిజిల్లాలో తుంగభద్రానదీతీరమున శ్రీవిరూపాక్షస్వామివారిక్షేత్రమందు విజయనగర మని ప్రఖ్యాతినొందిన విద్యానగరమును నిర్మించి దానికి శ్రీవిద్యారణ్యస్వామి శంకుస్థాపన మొనరించెను. ఆవిజయనగరసామ్రాజ్యమునకు బుక్కభూపాలుని పట్టాభిషేక మొనర్చెను. ఆబుక్కరాయల కోరికపై శ్రీవిరూపాక్షక్షేత్రమునకును అచటి శ్రీచక్రమునకును శ్రీవిద్యారణ్యస్వామి ఆధిపత్యమును వహించెను. ఈ శ్రీచక్రయంత్రము విద్యారణ్యస్వామిచేతనే ప్రతిష్ఠింపఁబడెను. మహత్తరమైన యీయంత్రమునకు నెనిమిదిదిశలను నెనిమిది ఏనుంగులును, ఎనిమిది సర్పములును చిత్రింప బడెను.

శ్రీచక్రమునున్ను విజయనగరమునున్ను ప్రతిష్ఠించు ముహూర్తమందు అవశకునమగుటచేత ఆపట్టణమునకును శ్రీచక్రమునకును భవిష్యత్కాలమున ననర్థము వాటిల్లు నని శ్రీవిద్యారణ్యస్వామి తలంచెను. ఆయనచే రచియింపఁబడిన 'కాలజ్ఞాన' మనెడి గ్రంథములో నీభవిష్యదనర్థములు వక్కాణింపఁబడినవి.

ఈవిద్యానగర (విజయనగర) రాజ్యమును బరిపాలించిన భూపతులకును వారల సంతతి రాకొమరులకును శ్రీవిద్యారణ్యులు రమారమి ఏబదిసంవత్సరములు ప్రధానమంత్రిగా నుండి రాజ్యమును సమర్థతతోఁ బరిపాలించుచు, విశేషాభివృద్ధికిఁ దెచ్చిరి. ఆకాలమందు విజయనగరముయొక్క వైభవాతిశయము దిగంతవిఖ్యాతిం గాంచియుండుటచేత విదేశీయు లనేకు లీపట్టణమును జూడవచ్చి దాని విభవాతిశయముల ననేకవిధముల గ్రంథరూపమున వర్ణించిరి.

## 9. సువర్ణవృష్టిగురిపించుట:—

ఒకానొకకాలమందు విజయనగరసంస్థానమున ధనము శూన్యమయ్యెను. ప్రజలును మిగుల దారిద్ర్యముచే బొక్కుచుండిరి. అప్పుడు రాజు శ్రీవిద్యారణ్యామునీశ్వరునితో నీదురవస్థను విన్నవింపఁగా, పూర్వము లక్ష్మీదేవి తన కొసంగిన వరమును జ్ఞప్తియందుంచుకొని, రాజుతో "రాజా! శ్రీగాయత్రీ దేవినిఁ బ్రార్థించి సువర్ణవర్షమును గురిపించెదను. నీ ప్రజల గృహావరణమునందును వారల పొలములలోను గురిసిన సువర్ణము ప్రజలదే. నీకోటయావరణములోను బాటలలోను గయాళుభూములలోను వర్షించు సువర్ణము నీయది. ఇందున కంగీకరింతువేని సువర్ణవృష్టికురియును" అనెను. రాజు సంతోషముతో నంగీకరించెను. అంతట విద్యారణ్యులు గాయత్రీదేవిని ఒక ముహూర్తకాలము స్వర్ణవృష్టిం గురిపింపఁ బ్రార్థింపగా నపారమగు సువర్ణము వర్షించెను. దానివలనఁ బృథ్వీశునకును బ్రజలకును నపారమగుధనము లభించెను.

## 10. శ్రీవిద్యారణ్యస్వామికి బ్రహ్మరక్షస్సు సమావేశమగుట:—

ఒకానొకకాలమందు శ్రీవిద్యారణ్యులు శిష్యులతో నుత్తరదేశమునకుఁ బోవుచుండ దారిలో నొక యశ్వత్థవృక్షముమీఁద నివసించుచుండిన బ్రహ్మరక్షస్సు శ్రీవిద్యారణ్యునిఁజూచి, "నిలువుము, కదలకుము. నీవు నాప్రశ్నములకు తృప్తికరముగ నుత్తరము లొసంగుదువేని నీకు నేను స్వాధీనుఁడ నయ్యెద. లేదేని నీ వీవృక్షమునందు నాతోడ నివసింపవలెను" అని ప్రతిజ్ఞ చేసెను. విద్యారణ్యులు బ్రహ్మరక్షస్సు అడిగిన ప్రశ్నము లన్నిటికి తృప్తికరముగ నుత్తరము లొసంగెను. అపుడు బ్రహ్మరక్షస్సు చెట్టునుండి దిగివచ్చి విద్యారణ్యులపాదములకు సాష్టాంగనమస్కారముచేసెను. అంతట ఆయన రక్షస్సునావాహనముచేసి యొక సంపుటమందుంచి తనతోఁ గొనిపోయి శృంగేరీపీఠమునొద్ద నొక శిలావిగ్రహమును స్థాపించి దానియందు బ్రహ్మరక్షస్సును ఆవాహనముచేసి, దానికి నిత్యనైవేద్యాదులు జరుగుటకు తగిన స్థిరవసతినేర్పఱచెను. ఆశిలావిగ్రహము ఇప్పటికినిఁ గలదు. శృంగేరీపీఠాధిపతు లగు నే జగద్గురువునకైనను వేదశాస్త్రాదులలో నెట్టి సందేహముకలిగినను ఆబ్రహ్మరక్షస్సు స్వప్నమందుఁ గనఁబడి సంశయముల నివారణ సేయునఁట.

## శ్రీవిద్యారణ్యస్వామికి బ్రహ్మరక్షస్సు చెప్పిన పూర్వవృత్తాంతము:—

శ్రీరామచంద్రుఁడు త్రేతాయుగమున రావణాసురుని వధించినకారణమున నతనికి బ్రహ్మహత్యాదోషము ఘటించెను. తద్దోషపరిహారార్థము కాలపురుషదానము జేయవలెనని శ్రీరాముని కులగురువగు వసిష్ఠముని యానతిచ్చెను. అట్లొక కాలపురుషవిగ్రహమును స్వర్ణముతోఁ జేయించి దాని ప్రతిగ్రహముచేయుట కనేక విప్రోత్తముల రప్పించిరి.

దానమును గ్రహించుట కెవ్వరును సాహసింపరైరి. నే పూర్వజన్మమున శృంగి భట్టను బ్రాహ్మణుఁడను. వేదములను సమస్తశాస్త్రములను సంపూర్ణముగ నభ్యసించినాఁడను. శ్రీరామచంద్రుఁడు నన్నుం జూచి యాకాలపురుషదానమును గ్రహింపుమని ప్రోత్సహించెను. దానమును గ్రహించితిని. దాన ప్రతిగ్రహానంతరము ధారవిడిచిన తత్‌క్షణమే శ్రీరామచంద్రుఁడు గుర్వాజ్ఞాప్రకారము వెనుమొగముచేసి సభనుండి వెడలెను. అందువలన నే నిట్లు బ్రహ్మరక్షస్సనైతిని. ప్రతిగ్రహానంతరము నేను శ్రీరాముని మోమును జూచియుంటినేని నా కీరాక్షసత్వము కలుగకుండెడిది. ఇది నా పురాకృతకర్మఫలము.

## 11. శ్రీవిద్యాతీర్థులవారి బ్రహ్మైక్యము:—

శ్రీవిద్యాతీర్థులు (శ్రీవిద్యాశంకరస్వామి) లంబికాయోగసిద్ధుఁడు. 1333 A.D. సంవత్సరములో కార్తీకశుద్ధసప్తమినాఁడు లంబికాయోగనిష్ఠుడై తనను సమాధియందు సజీవునిగాఁ గప్పివేయుఁ డనియు పదిరెండు వత్సరములవఱకు సమాధినిఁ దెఱువ రాదనియు శిష్యుల కాజ్ఞాపింప వార లట్లొనర్చిరి. కాని, మూఁడేండ్లతరువాత కొందఱు శిష్యులు సమాధిని తెఱచిచూడఁగా తీర్థులవారిశరీరమందు కొంతమార్పు కలుగుటం జూచి వారి అజ్ఞోల్లంఘనవలన నేమిప్రమాదము ఘటించునో యను భయముతో సమాధిద్వారము నెప్పటియట్ల గప్పివేసిరి. ఆనాటిరాత్రి తీర్థులవారు శ్రీవిద్యారణ్యస్వామికిని మఱికొందఱు శిష్యులకును స్వప్నమందుఁ గనఁబడి తమ యాజ్ఞ నుల్లంఘించి సమాధిని తెఱవఁగూడ దనియు విజయనగరపురాధీశుని సహాయముఁగొని తన సమాధిపైని నొక ఆలయమును గట్టింపవలె ననియు నాజ్ఞాపించిరి. శ్రీవిద్యారణ్యస్వామి వారియాజ్ఞానుసారముగ తీర్థులవారి సమాధిపై "శ్రీవిద్యాశంకరమందిర" మను పేరిడి యొక దివ్యమందిరమును నిర్మించిరి. ఇప్పటికిని శ్రీతీర్థులవారు సమాధియందు సజీవులై యోగనిష్ఠనున్నా రని వాడుక. ఆయాలయము అయిదువందల సంవత్సరముల క్రిందట గట్టఁబడినదయ్యును ఇప్పటికిని నూతనముగ నిర్మింపఁబడినదానివలె గనఁబడును.

ఆ యాలయముయొక్క ముఖమండపముచుట్టును పదిరెండు ఱాతిస్తంభములు గలవు. ఆ స్తంభములు శాస్త్రపద్ధతుల ననుసరించి మేషాది పండ్రెండురాసులలో నొక్కొక్క స్తంభ మొక్కొక్క రాశియొక్క నామమును వహించియున్నవి. సూర్యుఁడు పండ్రెండు మాసములలో నొక్కొక్కమాసమం దొక్కొక్కరాశియందుఁ బ్రవేశించు ననుట లోకవిదితమే. ఈమండపవిశేషమునగల అద్భుతము ఏమనఁగా, ఆయామాసములలో సూర్యుఁడేయేరాశియందుఁ బ్రవేశించియుండునో యాయారాశియొక్క పేరుగల స్తంభము

మీఁదనే సూర్యకిరణములు ప్రసరించునుగాని యితర స్తంభములమీఁదఁ బ్రసరింపవు. ఇదియే అత్యద్భుతమును దురవగాహమును. ఈయద్భుతమును గనుటకే యనేకులగు పాశ్చాత్యులును (Europeans) ఇంజనీయర్లును నీమందిరమును నిప్పటికినిఁ జూచి పోవుచుందురు.

## 12. శృంగేరియందు శారదాప్రతిష్ఠ:—

శ్రీ ఆదిశంకరాచార్యులవారు కాశ్మీరదేశమునుండి శారదామూర్తిని శృంగేరీ మఠమునకుఁ గొనితెచ్చినప్పుడు చందనవిగ్రహముగాఁ బ్రతిష్ఠించిరి. శ్రీ విద్యారణ్యస్వామి శృంగేరీపీఠాధిపత్యమును వహించినపిమ్మట పంచలోహములతో శారదావిగ్రహమును నిర్మించి ప్రతిష్ఠించి కుంభాభిషేక మొనరించిరి. ఆ శారదాంబావిగ్రహమే యిపు డర్చింపఁబడుచున్నది.

శ్రీ విద్యారణ్యస్వామి తన పీఠాధిపత్యకాలములో శృంగేరీవిరూపాక్షమఠములలో ముఖ్యమగు ప్రతికాగితముమీఁదను మఠములకుఁ జెందిన పాత్రలు మున్నగు సామానుల మీఁదను "శ్రీ విద్యాశంకర" అనెడి తమ గురువుగారిపేరుగల ముద్రను వేయుటకు నేర్పాటుచేసెను. ఆముద్రయే యిపుడును నుపయోగింపఁబడుచున్నది.

శ్రీ విద్యారణ్యస్వామి తమ తల్లిగారి ప్రీతికొఱకు కొన్నిభూములను ఈనాములుగా నొసంగెను. 'కచర' యను పూర్వనామముగల గ్రామమును 'మాధవపుర' మని తనపేర అగ్రహారముగ బ్రాహ్మణుల కొసంగెను. తుంగభద్రానదియొక్క యొక భాగమునకు "మాధవతీర్థ" మని పేరిడెను. శృంగేరీమఠములోని శ్రీ శంకరభగవత్పాదులవారి శిలావిగ్రహము శ్రీ విద్యారణ్యస్వామిచేతనే నిర్మింపఁబడినది. మఱియు శృంగేరీవిరూపాక్షపీఠములలో నిపుడు ఉపయోగములోనున్న బిరుదులు విలువగల భూషణములును శ్రీ విద్యారణ్యస్వామిచేతనే సంపాదింపఁబడినవి. వీరిగురువగు శ్రీ విద్యాతీర్థులవారియొక్కయు శ్రీ విద్యారణ్యస్వామియొక్కయు ప్రఖ్యాతి భారతదేశమందంతటను వ్యాపించియున్నది.

శ్రీ విద్యారణ్యస్వామి విజయనగరసామ్రాజ్యమునకు అమాత్యమాత్రుఁడయ్యును రాజ్యతంత్రమందు సార్వభౌమాధికారము గలిగియుండెను. ఇండియాదేశపు సార్వభౌములలో నెవ్వరును రాజ్యపరిపాలనాసామర్థ్యమందును బుద్ధికౌశలమందును విద్యారణ్యస్వామికి సరికారు. ఈమహాత్ముఁడు "కర్ణాటక సింహాసనస్థాపనచార్యులు" అనెడి బిరుదు వహించెను. ఆధ్యాత్మికజ్ఞానమందును రాజకీయవ్యాపారమందును మేధాశక్తియందును సకల కలాకౌశలమందును నీయన అద్వితీయుఁడు.

13. శ్రీవిద్యారణ్యస్వామి నిర్యాణము:—

ఇట్లు దిగంతవిఖ్యాతిఁగాంచి 1386 A. D. సంవత్సరమున జ్యేష్ఠ శుద్ధ త్రయోదశీ సోమవారమున పంపాక్షేత్రమందు శ్రీవిరూపాక్షేశ్వరసన్నిధియందు శ్రీ విద్యారణ్యస్వాములు బ్రహ్మైక్యమును బొందిరి. వీరి నిర్యాణానంతరము బుక్కరాయల పుత్రుఁడు రెండవ హరిహరరాయలు నాలుగు వృత్తులు దైవములకును, తొంబదియాఱు వృత్తులు బ్రాహ్మణులకును మాన్యములుగ నొసంగి తమ కులగురువగు శ్రీవిద్యారణ్య స్వామి గౌరవార్థము "విద్యారణ్యపుర" మనెడి అగ్రహారమును నిర్మించెను. ఆయగ్ర హార మిప్పటికిని శృంగేరికి దక్షిణమందుఁ గలదు.

శ్రీవిద్యారణ్యులగురువులు శ్రీవిద్యాతీర్థులు, శ్రీభారతీ కృష్ణతీర్థులు, శ్రీశంకరా నందులు, శ్రీకంఠనాథులు అనువారలు అని కొంద ఱందురు. హంపియందుఁ గల శ్రీవిరూపాక్షేశ్వరాలయము వెనుకతట్టున నొక మందిరము కలదు. అందు రెండడుగుల యెత్తుగల శ్రీవిద్యారణ్యస్వామివారి శిలావిగ్రహము కూర్చుండి కుడిచేతితో తత్త్వ బోధచేయుచున్నట్లు గలదు.

మహారణ్యమువంటి వేదవేదాంగ తర్క-వ్యాకరణ మీమాంసా జ్యోతిషాది సమస్తవిద్యలయందును పారంగతుఁ డగుటచేత 'విద్యారణ్య' లనెడినామ మిమ్మహాత్ము నకు సార్థకమయ్యెను. ఈమహాత్ముఁడు రచియించిన గ్రంథములు 1800 లకు పైగా నుండు నని కింవదంతి. వానిలో ముఖ్యమైనవి:—

౧. వేదభాష్యము:—ఇందు నాలుగువేదములకు సంహిత, బ్రాహ్మణము ఆరణ్యక భాగముల కన్నిటికి సమగ్రమయిన వ్యాఖ్యానము గలదు. దీనికి 'మాధవీయ వేదార్థ ప్రకాశ' యని నామాంతరము.

౨. అధికరణరత్నమాల:—ఇందు 192 అధికరణములతో ఉత్తర మీమాంసకు వ్యాఖ్యయు టీకయుం గలవు. (ఇది విద్యారణ్యకృతము కాదని కొంద ఱందురు.)

౩. సర్వదర్శనసంగ్రహము:—వేదాంతవిషయము. (ఇదియుఁ బైయట్లే.)

౪. అనుభూతిప్రకాశిక:—300 శ్లోకములు గలిగి ద్వాదశోపనిషత్తులయొక్క సారాంశము గలది.

౫. బ్రహ్మగీత:—ఇందు శ్రీశంకర మధ్వ రామానుజ సిద్ధాంతములు చర్చింపఁ బడి, అద్వైతము స్థాపింపఁబడినది. దీనికి 'ప్రకాశిక' యను టీకయుం గలదు. (ఇది వేఱొకరిచేఁ జేయఁబడిన దనువాదము కలదు.)

౬. శ్రీవేదాంతపంచదశి:—(క్రింది వివరణమును జూడుఁడు.)

౭. జీవన్ముక్తివివేకము:—ఇందు సన్న్యాసాశ్రమవిధులు వ్యక్తీకరింపఁబడినవి.

౮. దృగ్దృశ్యవివేక టీక:—శ్రీశంకరభగవత్పాదులవారి దృగ్దృశ్యవివేక మను గ్రంథమునకు టీక.

౯. అపరోక్షానుభూతి, టీక:—శ్రీశంకరాచార్యప్రణీతం బగు అపరోక్షానుభూతి యను గ్రంథమునకు టీక.

౧౦. ధాతువృత్తి 2500 శ్లోకములతో క్రియాపదములయొక్క 2200 మూలధాతువులకు వివరణము. ✓

౧౧. కాలమాధవీయము:—ధర్మశాస్త్రము.

౧౨. శతప్రశ్నకల్పలతిక:—1000 శ్లోకములతో 100 ప్రశ్నముల కుత్తరములుగ పంచద్రావిడ, పంచగౌడ బ్రాహ్మణశాఖలవిషయమై వివరింపఁబడినది.

౧౩. పరాశరమాధవీయము:—పరాశరస్మృతికి వ్యాఖ్యానము.

౧౪. జైమినీ న్యాయమాలావిస్తరము :—జైమినీయ పూర్వ మీమాంసా వ్యాఖ్యానము.

౧౫. ఆచారమాధవము:—బ్రాహ్మణాచారవిధులు.

౧౬. వ్యవహారమాధవము:—న్యాయశాస్త్రము.

౧౭. విద్యారణ్యకాలజ్ఞానము:—భవిష్యద్విషయములను దెల్పుజ్యోతిషము.

౧౮. శంకరదిగ్విజయము :—ఆదిశంకరాచార్యచరిత్ర—16 అధ్యాయములు గలది. (ఇది విద్యారణ్యకృతమా యను శంక కలదు.)

౧౯. వేదాంతాశీర్వాదము:—బ్రహ్మాశీర్వాదపద్ధతి.

మఱియు వివరణప్రమేయసంగ్రహము మున్నగు ననేకగ్రంథములు గలవు. మహమ్మదీయులదండయాత్రలు జరగుకాలమున నీమహాత్ముని గ్రంథములు దుర్మార్గులగు తురుష్కులకుఁ జిక్కు ననుభీతిచే కొన్ని గ్రంథములు పర్వతగుహాలందును, కొన్ని భూమిలోపలను భద్రపఱుపఁబడినవి. వానిలో ననేకగ్రంథములు 70—80 సంవత్సరముల క్రిందట పైకిఁదీయఁబడినవి అని చెప్పుదురు.

శ్రీ వేదాంతపంచదశి యను నీగ్రంథమును మూఁడుఖండములుగ భాగించి, పరమాత్మయొక్క

సత్ స్వరూపమును వివేకపంచకమందును

చిత్ స్వరూపమును దీపపంచకమునందును

ఆనందస్వరూపమును ఆనందపంచకమునందును

పదియేను ప్రకరణములుగ అతిస్ఫుటముగ వివరించి గ్రంథనామమును సార్థకముచేసిరి.

శ్రీవిద్యారణ్యులు పంచదశీ మంత్రోపాసకు లనియు, అందుచే మంత్రబీజములు పదునేనింటికి పదునేను ప్రకరణములను గల్పించి పరబ్రహ్మముయొక్క సచ్చిదానంద స్వరూపమును వ్యక్తీకరించి రనియుఁ గొందఱ యభిప్రాయము. ✓

ఈగ్రంథము శ్రీవిద్యారణ్యప్రణీత మని పేరొందినను ఇందలి మొదటి ఆఱు ప్రకరణములు మాత్రమె విద్యారణ్య ప్రణీతము లనియు, మిగత తొమ్మిదిప్రకరణము లును వీరిగురు వగు శ్రీభారతీతీర్థులచే రచియింపఁబడె ననియు తోఁచెడిని. ✓

వృత్తిప్రభాకర మనెడి గ్రంథములో నీపంచదశి మొదటి పదిప్రకరణములు శ్రీ విద్యారణ్యులచేతను, మిగత ఐదుప్రకరణములు శ్రీభారతీ కృష్ణతీర్థులచేతను రచియింపఁ బడె నని చెప్పఁబడినది. ✓

ఏది యెట్లున్నను నీపంచదశి ప్రత్యేకము శ్రీవిద్యారణ్యులచేత రచియింపఁబడ లే దనుట నిర్వివాదాంశ మనవచ్చును. ✓

ఈ పంచదశీగ్రంథమునకు సమగ్రముగ సంస్కృతవ్యాఖ్యానము శ్రీరామకృష్ణ పండితునిచే రచియింపఁబడినది. ఈ రామకృష్ణకవి గొప్ప సంస్కృతపండితుఁడు, "వేదాంతపరిభాష" యను గ్రంథము రచియించిన ధర్మరాజాధ్వర్యుని పుత్ర రత్నము. ఈయన వేదాంతపరిభాషకుఁ గూడ వ్యాఖ్యానమును వ్రాసెను. ఈవ్యాఖ్యా నములందు ప్రతిప్రకరణాంతమున "ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ భారతీతీర్థ విద్యారణ్యమునివర్యకింకరేణ శ్రీరామకృష్ణాఖ్యేన విదుషా విరచితే" అని వ్రాయఁబడియుండుటచేత, నీరామకృష్ణపండితుఁడు శ్రీభారతీ తీర్థులకును శ్రీవిద్యా రణ్యస్వామికిని శిష్యుఁ డనియు, వారి సమకాలమందు నున్నవాఁడనియు స్పష్టమగు చున్నది. ✓

ఇదివఱలో ముద్రణమైన పంచదశీప్రతులందు ఆంధ్రటీకాతాత్పర్యములలోని లోపము లీప్రతియందు సవరణ చేయఁబడుటయేకాక కొన్నివివరణములుకూడ నిందుఁ జేర్పఁబడినవి. మోక్షాసక్తు లగు వారలలో మందాధికారులకు సయితము నీగ్రంథము సుబోధముగ నున్నది. ముముక్షువు లీగ్రంథమును సమగ్రముగఁ జదివి సారగ్రాహకు

లగుదురేని వారలు అవిద్యాంధకార వినిర్ముక్తులై మోక్షసామ్రాజ్యమును జూఱగొనుటకు సందియము లేదు.

కీ. శే॥ బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారికిఁ బుత్త్రరత్నమగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు వ్యయప్రయాసములకు వెఱదీయక యనేకాముద్రిత గ్రంథములను ముద్రించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చుచున్నారు. ఆంధ్రమహాశయు లెల్లరు వీరియుద్యమమునకుఁ దోడ్పడుట యుచితము. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికీర్తి ఆచంద్రార్కస్థాయిగ వర్ధిల్లుఁగాక!

పేరూరు పేట
తూర్పుగోదావరిజిల్లా.
13-6-1934

ఇట్లు,
సుజనవిధేయుఁడు,
కామర్షి వేంకటసుబ్బయ్య.



శ్రీ ర స్తు
శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## ప్రథమప్రకరణము

## తత్త్వవివేకప్రకరణము

అవతారిక. శ్రీవిద్యారణ్యస్వామి అతిగంభీర మగు వేదాంతశాస్త్రతాత్పర్యము సర్వసామాన్యముగ బోధయగుటకై పంచదశి యను పేర నొక గ్రంథమును నిర్మింపఁ దలంచి శిష్టాచారానుసారముగఁ దొలుదొల్త మంగళాచరణమును గావింపుచు ననుబంధచతుష్టయమును సూచింపుచున్నాఁడు. గురువులకును దేవతలకును ప్రత్యక్షముగ పూజానమస్కారాదుల నాచరించుటయే మంగళాచరణ మైనను శిష్యులకు నీవిషయము (గ్రంథము నారంభింపఁ బోవునప్పుడు గురుదేవతానమస్కారముల నాచరింపవలయు నను విషయము) తెలియుటకై దానిని గ్రంథారంభమున శ్లోకముచే వివరింపుచున్నాఁడు:—

శ్లో. నమః శ్రీశఙ్కరానందగురుపాదాంబుజన్మనే,
సవిలాసమహామోహగ్రాహగ్రాసైకకర్మణే. 1

## వ్యాఖ్యానమ్

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
ప్రత్యక్తత్త్వవివేకస్య క్రియతే పదదీపికా.

ప్రారిప్సితస్య గ్రన్థస్యావిఘ్నేన పరిసమాప్తిప్రచయగమనాభ్యాం శిష్టాచారపరిప్రాప్తమిష్టదేవతాగురునమస్కారలక్షణం మంగళాచరణం స్వేనానుష్ఠితం శిష్య

శిష్యార్థం శ్లోకేనోపనిబధ్నాతి. అర్థాద్విషయప్రయోజనే చ సూచయతి నమ ఇతి. శం సుఖం కరోతీతి శంకరః సకలజగదానందకరః పరమాత్మా*ఏష హ్యేవానందయాతీతి శ్రుతేః. ఆనందః నిరతిశయప్రేమాస్పదత్వేన పరమానందరూపః ప్రత్యగాత్మా. శంకర శ్చాసావానందశ్చేతి శంకరానందః ప్రత్యగభిన్నః పరమాత్మా. సఏవ గురుః పరిపక్వమలా యే తాన్ ప్రతిబంధకపాపోత్సాదన హేతుశక్తిపాతేన యోజయతి పరే తత్త్వే* స దీక్షయాచార్యమూర్తిస్థ ఇత్యాగమాత్. శ్రీమాంశ్చాసౌ శంకరానందగురుశ్చేతి గంధద్విప ఇత్యాదివత్సమాసః. అనేన శ్రీగురోరణిమాద్యైశ్వర్యసంపన్నత్వం సూచితం. యద్వా శ్రియా భూత్యా శం కరోతీతి శ్రీశంకరః *"రాతే ర్ధాతుః పరాయణ" మితి శ్రుతేః. అనేన శ్రీగురోర్భక్తేష్టసంపాదనే సామర్థ్యం సూచితం భవతి. తస్య గురోః పాదావేవాంబుజన్మ కమలం తస్మై నమః ప్రహ్వీభావోఽస్తు. కిం విధాయ. సవిలాసమహామోహగ్రాహగ్రాసైక కర్మణే—విలాసః కార్యవర్గస్తేన సహ వర్తత ఇతి సవిలాసః ఏవంవిధో యో మహామోహో మూలాజ్ఞానం సఏవ గ్రాహః మక రాదివత్స్వవశం ప్రాప్తస్యాతీవ దుఃఖహేతుత్వాత్తస్య గ్రాసో గ్రసనం స ఏవైకం ముఖ్యం కర్మ వ్యాపారో యస్య తత్తథా తస్మా ఇత్యర్థః. అత్ర చ శంకరానంద పద ద్వయసామానాధికరణ్యేన జీవబ్రహ్మణోరేకత్వలక్షణో విషయః. జీవస్య భూమ బ్రహ్మరూపతయాఽపరిచ్ఛిన్న సుఖావిర్భావలక్షణం ప్రయోజనం సూచితం. సవిలా సేత్యాదినా నిశ్శేషానర్థనివృత్తిలక్షణం ప్రయోజనం ముఖత ఏవాభిహితం.

టీక. సవిలాస...కర్మణే - సవిలాస=స్వకార్యములతో (తనచే సృజింపఁబడిన ప్రపంచముతోఁ)గూడిన, మహామోహ=మూలాజ్ఞాన మనెడు, గ్రాహ=మొసలియొక్క, (మొసలి తనయొద్దకు వచ్చినజంతువులను నీటిలోని కీడ్చికొనిపోవునట్లు ఈయజ్ఞానము కూడఁ దనవైపునకు మఱలినవారిని బంధించివైచును గావున నిట్లు పోల్పఁబడెను.) గ్రాస= మ్రింగుటయె (జయించుటయె లేక ధ్వంసము చేయుటయె), ఏక=ప్రధానమైన, కర్మణే= పనిగాఁగల, శ్రీ...అంబుజన్మనే-శ్రీ = శోభాయుక్తుఁడైన, శంకర=సర్వలోకములకు నానందమును కలిగించునట్టి పరమేశ్వరుఁడే స్వరూపముగాఁగల, ఆనంద=పరమానంద రూపుఁడగు జీవుఁడె యైయున్న (జీవుఁ డానందరూపుఁ డను విషయము రా-వ శ్లోకమున స్పష్టమగును. గురు=గురువుయొక్క, (పరమేశ్వరుఁడు పరిపక్వచిత్తులను గురురూప ముతో స్వయముగనే యనుగ్రహించు ననియు, శక్తిపాతవిద్యచే వారిజ్ఞానమును దృఢము సేయు ననియు, శాస్త్రములు ఘోషింపుచుండుటచే నిట్లు చెప్పఁబడెను. మఱియు పద ప్రయోగసామర్థ్యముచే నిది [శంకరానందపదము] గురునామధేయమే యగునేమొ

యని తోఁచుచున్నది.) పాద = పాదము లనెడు, అంబుజన్మనే = కమలమునకు (ఇది జాత్యేకవచనము), నమః=నమస్కారము.

తాత్పర్యము. ఈప్రపంచ మంతయు నజ్ఞానమువలన జనించినది. అజ్ఞాన మనఁగా భ్రాంతి. దానిచే జీవులు స్వయముగ పరబ్రహ్మమున కంటె నభిన్నులె యయ్యు, భిన్నులుగాను తమకంటె భిన్నమగు ప్రపంచము మఱియొకటి యుండి తమ్ము బంధించుచున్నట్లును తలంచుచున్నారు. ఇదియె బంధము. ఇట్టిబంధమును బోధనశక్తిచే ధ్వంసముచేసి శిష్యుల సదా యనుగ్రహించుచుండు శంకరానందగురువుయొక్క పాదపద్మములకు నమస్కరించెదను. అభేదవిజ్ఞానముచేఁ బరమేశ్వరరూపునిఁగా నెఱింగి మ్రొక్కెదను.

విశేషాంశము. ఇచ్చట శంకరానందపదసారస్యముచే జీవబ్రహ్మైక్యము చూపింపఁబడెను. వేదాంతశాస్త్రమునకు విషయప్రయోజనము లివియె. తెలియఁబడ కుండునంతవఱకు నిదియె ప్రతిపాద్యవిషయ మగును. తెలియఁబడినపిదప మోక్షరూప మగుటచే నిదియె ఫలమగును. మఱియు "సవిలాసమహామోహ" అను విశేషణముచేఁ బ్రత్యక్షముగనే అజ్ఞాననివృత్తిరూపమగు శాస్త్రఫలము వర్ణింపఁబడియున్నది. ఈసూచనలవలన "మోక్షేచ్ఛగలవాఁడే యీశాస్త్రమున కధికారి" యనియు, "బోధ్యబోధకభావమే (బోధ్యుఁ డనఁగా బోధింపఁబడఁదగువాఁడు. బోధకుఁ డనఁగా బోధించువాఁడు) శిష్యునకును శాస్త్రమునకు గలసంబంధము" అనియు తేటపడుచున్నది. కావున, అధికారి సంబంధము విషయము ఫలము అను నాలుగు అనుబంధములు నీశ్లోకముచేతనే సూచింపఁబడెను.

అవ. ఇట్లు శాస్త్రమునకుఁ గల యనుబంధముల నిరూపించి నూతనగ్రంథము నారంభించుటలోఁ దనకుఁ గల యుద్దేశము నెఱింగించుచు గ్రంథారంభమును సమర్థించుచున్నాఁడు:—

శ్లో. తత్పాదాంబురుహద్వంద్వసేవానిర్మలచేతసామ్,
సుఖబోధాయ తత్త్వస్య వివేకోఽయం విధీయతే. 2

వ్యా. ఇదానీ మవాంతరప్రయోజనకథనపురస్సరం గ్రంథారంభం ప్రతిజానీతే—తత్పాదేతి. తస్య గురోః పాదావేవాంబురుహే కమలే తయోర్ద్వంద్వం తస్య సేవయా పరిచర్యయా స్తుతినమస్కారాదిలక్షణయా నిర్మలం రాగాది రహితం

చేతోఽన్తఃకరణం యేషాం తే తథోక్తాస్తేషాం సుఖబోధాయానాయాసేన తత్వజ్ఞానోత్పాదనాయాయం వక్ష్యమాణప్రకారః తత్వస్య అనారోపితస్వరూపస్య * "అఖండం సచ్చిదానందం మహావాక్యేన లక్ష్యత" ఇతి వక్ష్యమాణస్య వివేకః ఆరోపితాత్పంచకోశాదిలక్షణాజ్జగతో వివేచనం విధీయతే క్రియత ఇత్యర్థః.

టీ. తత్ ... చేతసాం-తత్ = ఆగురువుయొక్క (బ్రహ్మాభిన్నజీవరూపుఁ డగు జగద్గురువుయొక్క), పాద అంబురుహ=కమలములవంటి పాదములయొక్క, ద్వంద్వ=జతయొక్క, సేవా = పరిచర్యచేత (స్తుతినమస్కారాదులచేత), నిర్మల = పరిశుద్ధమైన, చేతసాం=మనస్సుగల యధికారులకు; (ప్రథమశ్లోకమున గ్రంథకర్త తన గురువునే యభివర్ణించియున్నను, ఆయనను పరమేశ్వరరూపునిగ నభివర్ణించెను. కావున, నిచ్చట గుర్వారాధన యనఁగాఁ బరమేశ్వరారాధన మనియె యూహింపవలయును. "పరమేశ్వరానుగ్రహముచేఁ జిత్తశుద్ధికలవారలకు" అని సమాసార్థము), సుఖబోధాయ = అనాయాసముగఁ దెలియుటకై, అయం = ఈ, తత్త్వస్య = యథార్థస్వరూపముయొక్క (బ్రహ్మముయొక్క జీవునియొక్క యనికూడఁ జెప్పవచ్చును. అతఁడును బ్రహ్మమే కదా !) వివేకః=వివేచనము (ఇతర పదార్థములనుండి [ప్రపంచమునుండి] విభాగించుట. అనఁగా, ఈవిభాగము నుపదేశించు నీ క్రొత్తగ్రంథము), విధీయతే = చేయఁబడుచున్నది.

తా. వేదాంతశాస్త్రము మిగుల గంభీరమై సామాన్యులకు దుర్బోధమై యున్నది. ఇట్లగుటచే దానిని సమగ్రముగ విచారింప లేకను, విచారించియు బుద్ధిమాంద్యమువలన నర్థనిర్ణయము చేయనేరకను ననేకు లాయాసపడుచున్నారు. చిత్తశుద్ధి లేనివారలవిషయమటుండ చిత్తశుద్ధి కలవారలు కూడ శాస్త్రగాంభీర్యమువలన నాయాసపడవలసివచ్చుచున్నది. కావున, నీయాయాసమును దీర్చుటకై శాస్త్రతాత్పర్యమును సవిమర్శముగను సంక్షేపముగను బోధించుటకై యీ క్రొత్తగ్రంథము నారంభించుచున్నాను. జీవుఁడు బ్రహ్మరూపుఁడేయైనను అజ్ఞానమువలన నాబ్రహ్మమందు పంచకోశము లారోపింపఁబడి (పంచకోశములు ౩-వ ప్రకరణమున వివరింపఁబడును.) యుండుటచే బ్రహ్మభిన్నుఁడుగఁ దోఁచుచున్నాఁడు. ఆయనకు నాకోశములతో సంబంధము లేని తెఱంగు సుఖతరముగ విమర్శింపఁబడును; "జీవుఁడును ప్రపంచాతీతుఁడే" యను విషయము నిరూపింపఁబడి జీవబ్రహ్మైక్యము స్థాపింపఁబడును.

అవ. ఇట్లు గ్రంథారంభమును సమర్థించి విషయనిరూపణమును ప్రారంభించుచున్నాఁడు.—పరబ్రహ్మము సత్యజ్ఞానానందరూప మని శ్రుతులయందు స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. జీవుఁడును అట్టివాఁడే యైనంగాని వారలకు నైక్యము సంభవింపదనుట నిర్వివాదాంశము కదా! కావున జీవబ్రహ్మైక్యము నుపదేశింపఁబోవువాఁడగుటచే నీగ్రంథకర్త మొట్టమొదట "జీవుఁడును సత్యజ్ఞానానందరూపుఁడే" యని నిరూపింప వలసినవాఁడై యున్నాఁడు. ప్రపంచ మంతయు జీవుని సుఖదుఃఖాత్మకునిగనే కదా చూచుచున్నది. ఈ కారణమువలన జీవుని యథార్థరూపమును నిరూపింపఁదలంచి కవి మొట్టమొదట "జ్ఞానము నిత్యము" అను విషయమును సాధించుచున్నాఁడు. వేదాంత మతమునందు ఆత్మ జ్ఞానరూపుఁడే యగుటచే నీ నిరూపణమే సర్వోపదేశములకు నాధార మని తెలిసికొనవలయును. అందు మొట్టమొదట సర్వానుభవసిద్ధంబును ప్రత్యక్షంబును సుఖముగ బుద్ధికి గోచర మగునదియు నగు జాగ్రదవస్థనే కైకొని యీ విషయము (జ్ఞాననిత్యత్వమును) చూపుచున్నాఁడు:—

శ్లో. శబ్దస్పర్శాదయో వేద్యా వైచిత్ర్యా జ్జాగరే పృథక్,
తతో విభక్తా తత్సంవి దైకరూప్యా న్న భిద్యతే. 3

వ్యా. జీవబ్రహ్మణోరేకత్వలక్షణవిషయసంభావనాయ జీవస్య సత్యజ్ఞానాదిరూపతాం దిదర్శయిషురాదౌ జ్ఞానస్యాభేదప్రతిపాదనేన నిత్యత్వం సాధయతి—శబ్దస్పర్శాదయ ఇత్యాదినా. తత్ర తావద్విస్పష్టవ్యవహారవతి జాగరే జ్ఞానస్యాభేదం సాధయతి—శబ్దేతి. జాగరే ఇంద్రియైరర్థోపలబ్ధి ర్జాగరితమిత్యుక్తలక్షణేऽవస్థావిశేషే వేద్యాః సంవిద్విషయభూతాః శబ్దస్పర్శాదయః ఆకాశాదిగుణత్వేన ప్రసిద్ధాస్తదాధారత్వేన ప్రసిద్ధా ఆకాశాదయశ్చ వైచిత్ర్యాత్పరస్పరం గవాశ్వాదివద్వైలక్షణ్యోపేతత్వాత్పృథక్ పరస్పరం భిద్యంతే తతః తేభ్యో విభక్తా బుద్ధ్యా వివేచితా తత్సంవిత్తేషాం శబ్దాదీనాం సంవిత్ జ్ఞానం ఐకరూప్యాత్సంవిదిత్యేకాకారేణావభాసమానత్వాద్గగనమివ న భిద్యతే. అత్రాయం ప్రయోగః. వివాదాధ్యాసితా సంవిత్స్వాభావికభేదశూన్యా ఉపాధిపరామర్శమంతరేణావిభావ్యమానభేదత్వాద్గగనవత్ శబ్దసంవిత్స్పర్శసంవిదో న భిద్యతే. సంవిత్త్వాత్స్పర్శసంవిద్వదితి ఏకస్యా ఏవ సంవిదో గగనస్యేవౌపాధికభేదేనాపి భిన్నవ్యవహారోపపత్తౌ వాస్తవభేదకల్పనాయాం గౌరవం బాధకమున్నేయమ్.

టీ. జాగరే = జాగ్రదవస్థయందు, వేద్యాః = తెలియఁదగిన, శబ్దస్పర్శాదయః = శబ్దము స్పర్శము మొదలుగాఁగల, (శబ్దాదిగుణములును, వాని కాశ్రయ

ములగు నాకాశాదిభూతములును, వానివలన జనించిన స్తంభకుడ్యాదులు ననుట). భావాః=పదార్థములు, వైచిత్ర్యాత్ = విరుద్ధధర్మములు కలిగియుండుటవలన, పృథక్ = పరస్పరభిన్నములై యున్నవి. తత్సంవిత్ = ఆపదార్థములను గ్రహించు జ్ఞానము మాత్రము, తతః = ఆపదార్థములనుండి (చూడఁబడు పదార్థములనుండి), విభక్తా = (చూచునదియగుటచే) వేఱుచేయఁబడినదై, (కంటికినిఁ గంటిచేఁ జూడఁబడు పదార్థమునకు సంబంధము లేనట్లు చూచువానికిని, చూడఁబడువానికిని సంబంధ ముండ దని తాత్పర్యము.) ఐకరూప్యాత్=తన ఏకస్వరూపముచుండి, న భిద్యతే=భిన్నము కాదు.

తా. ఇంద్రియములచేఁ బదార్థములను గ్రహించుట యేది గలదో యది జాగ్రదవస్థ యనఁబడుచున్నది. ఈ అవస్థ మిగుల విస్పష్టముగనే యున్నదికదా! దీనియందు మన మనేక పదార్థములను గుణములను జూచుచున్నాము; "ఇది శబ్దము. ఇది స్పర్శము. ఇది యాకాశము. ఇది వాయువు. ఇది స్తంభము" అని వానిని పరస్పరభిన్నములనుగాఁ గూడ నెఱుంగుచున్నాము. వానియాకారములయందును గుణములయందును అనంతమగు భేదము కానవచ్చుచుండుటచే "ఈ పదార్థములయందు భేదము కలదు" అనుట యెంతయు యుక్తియుక్తముగా ననుభవానుసారముగా నున్నది. ఈ విషయమున వర్ణించిన కారణములచే మనకుఁ బ్రమాద మేమియు లేదు. ఇఁకను బ్రమాదస్థానమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. మనము పదార్థజ్ఞానస్వరూపమును గూడ నిట్టిభేదములు కలదానినిగానే తలంచుచున్నాము. పరస్పరభిన్నము లగు రెండు పదార్థములను గ్రహించినప్పుడు పదార్థములతోఁ బాటు జ్ఞానమునకుఁగూడ భేదము కలిగె ననుకొనుచున్నాము. శబ్దజ్ఞానమునకంటె స్పర్శజ్ఞానము భిన్న మని భ్రాంతి నొందుచున్నాము. ఇదియే మన ప్రమాదము. ఇదియే జీవుని యథార్థస్వరూపము తెలియకుండుటకుఁ గారణము. ఇదియే మఱల మఱల సంసారదుఃఖము ననుభవించుటకు మూలకారణము.

వి. కొంచెము విచారించినచో మీతలంపు భ్రాంతి యని తెలియకపోదు. పదార్థములకు భేదము కల దను విషయము సర్వప్రమాణసిద్ధమైయున్నది. దీనికి పదార్థములయందుఁ గానవచ్చు ఆకారాదిభేదములే కదా, కారణము. ఇట్టి కారణము ఆ జ్ఞానముల

విషయమున లేదు. శబ్దజ్ఞానమైనను స్పర్శజ్ఞానమైనను ఘటజ్ఞానమైనను పటజ్ఞానమైనను జ్ఞానమే. ఒక జ్ఞానమునకు నేది స్వరూపమో యేది కార్యమో రెండవదానికిఁగూడ నదియే స్వరూపము. అదియే కార్యము. జ్ఞానము లన్నియుఁ జైతన్యాత్మకములే. అవి తమకు గోచరములగువానిని గ్రహించునవియే. ఇదియు సర్వానుభవసిద్ధమగు విషయమే. భ్రాంతివలన నొకవేళ నాజ్ఞానముల భిన్నములనుగా భావించుచున్నను స్వరూప విచారము చేయునప్పుడు పై నిర్ణయము నెవ్వఁడును నిరాకరింప సాహసింపఁడు. వస్తుస్వరూప మిట్టిదియై యుండ దీనికి విరుద్ధముగా భేదమును భావించుట భ్రాంతి యనుటలో సంశయ మేమి? మఱియొక విశేషము. చూడఁబడు పదార్థమునకంటెఁ జూచుపదార్థము భిన్నముగా నుండి తీఱవలయు ననుట నియమము. మనము స్తంభమును జూచునపుడు దానికంటె వేఱుగనే యున్నా మనుట నిస్సంశయ మగు విషయమే కదా! వ్రేలు తన యగ్రమును తాను స్పృశింపలేనట్లు ఖడ్గము తన యంచును తాను కోసికొనలేనట్లు ఏపదార్థముగాని తన్ను తాను చూచికొన నేర దనుటయు నపూర్వ విషయము కాదు. కావున చూడఁబడు శబ్దాదులకంటె చూచుచున్న జ్ఞానము అవశ్యముగా భిన్నమై తీఱవలయును. ఇట్లుండ పదార్థభేదమువలన జ్ఞానమునకు భేదము కలుగుట ఎట్లు? ఈవిధముగా స్వరూపముచేతఁగాని కార్యముచేతఁగాని స్వభావముచేతఁగాని సాధింపఁబడుటకు వీలులేనిభేదము లున్నట్లు తలంచుట భ్రాంతి కాక మఱియే మగును? కావున నీ భ్రాంతిని వదలి "పదార్థములు భిన్నములైనను జ్ఞానము ఏకరూపమే" యని నిశ్చయింపవలయును. ఎన్నిపదార్థములఁ జూచినను కన్నొక్కటిగనే యుండవచ్చు ననుటలో వివాదము లేదుకదా! ఈకారణమువలన జాగ్రదనుభవము విచారదృష్టి గలవారికి జ్ఞానముయొక్క ఏకరూపత్వమును విస్పష్టముగాఁ జూపుచున్నది యనుటలో సందియ మింతయైనను లేదు.

ఇది యంతయు యథార్థమే యని తోఁచుచున్నను ప్రత్యక్షానుభవానుసారముగా మఱియొక విధముగాఁ గూడ నిర్ణయింపవచ్చును. పదార్థభేదమును వలెనే జ్ఞానభేదమునుగూడఁ గల్పింపవచ్చును. "మీరు చూపినది యనుమానము; మేము చూపినది ప్రత్యక్షము కదా." అనియెద వేమొ వినుము. ప్రత్యక్షము భ్రాంతిగాఁగూడ నుండు ననుటకు వీలు కలిగియుండ, దాని నాధారము చేసి లేనిదానిని కల్పింప నేల సాహసింపవలయును? జ్ఞాన మొక్కటియే యనుటకంటె (జ్ఞానము లనేకములు) అని వాని భేదమును సాధింపఁజూచుట భారమగును కదా. రజ్జుసర్పజ్ఞానము మొదలగునవి భ్రాంతులే యయ్యును ప్రత్యక్షములే యగుచున్నవికదా. మీ యనుమానముకూడ నిట్టిదియే కావచ్చును అనియెదవేమొ వినుము. మాయనుమానము మీ ప్రత్యక్షమువలె

స్వతంత్రముగా విషయనిర్ణయమును చేయుట లేదు. వేదతాత్పర్యమును మాత్రమే యనువాదము చేయుచున్నది. తత్త్వమసి "=ఆ బ్రహ్మమే నీవు" అను మొదలగు వాక్యములచే శ్రుతి జీవబ్రహ్మైక్యమును బోధింపుచున్నది. ఆ యైక్యము స్వరూపైక్యము లేకున్న సంభవింపనేరదుకదా. ఈ కారణమువల్ల శబ్దప్రమాణ మంగీకరింపఁబడునంతవఱకు మా యనుమానము భ్రాంతిరూపము కానేరదు. కావున నెట్లు చూచినను పదార్థములయం దెన్ని భేదము లున్నను జ్ఞానమునకు భేదము కలుగదు. విచారము లేక పోవుటయే కాని మేము నిర్ణయించిన విషయముగూడ వాస్తవస్థితిలోఁ బ్రత్యక్షగోచరమే కాని యనుమానసాధ్యము కాదు. అనుమానసాధ్యమే యని పట్టుపట్టినను దానికిని (ఆయనుమానమునకును) ప్రత్యక్షసహాయము కావలసియే యుండును, కావున నా ప్రత్యక్షమునకును మీరు చూపిన ప్రత్యక్షమునకును విరోధ ముండు ననుటలో సంశయము లేదు. ఈ ప్రత్యక్షము అనుమానమూలము జ్ఞానముయొక్క యభేదమును సాధించును. మీ ప్రత్యక్షము భేదమును సాధించును. సమానబలమునకు విరోధము కలిగినప్పు డెయ్యది బహుప్రమాణముల కనుకూల మై యుండునో యెయ్యది ప్రమాణాంతరముచే బాధింపఁబడకుండునో దానినేకదా విచారపరాయణులు గ్రహింపవలయును. ఈకారణమువలనఁ బ్రత్యక్షాంతరముచేతనే బాధనొందునది యగుటచే మీ ప్రత్యక్షము ఆదరణీయముకాదు. శబ్ద ప్రమాణమునకు ననుకూలమైనది యగుటచే మా యనుమానంబును దాని కాధార మగు ప్రత్యక్షంబును మాత్రమే ప్రమాణములు. కావున జాగ్రదవస్థయందుఁ జూడఁబడు పదార్థము లెన్ని యున్నను వానికంటె భిన్నమగుటచే చూచుజ్ఞానము మాత్ర మొక్కటియే. దానిస్వరూపమునందు భేదము లే దని ఇదివఱకే నిరూపించి యున్నాముకదా.

అవ. ఇట్లు జాగ్రదవస్థయందు జ్ఞానముయొక్క యేకత్వమును సాధించి స్వప్నావస్థయందును ఈ న్యాయమునే అతిదేశించుచున్నాఁడు:—

శ్లో. తథా స్వప్నేఽత్ర వేద్యం తు న స్థిరం జాగరే స్థిరమ్,
తద్భేదోఽత స్తయో స్సంవి దేకరూపా న భిద్యతే. (4)

వ్యా. ఉక్తాన్యాయం స్వప్నేఽప్యతిదిశతి—తథేతి. యథాజాగరే షైచిత్ర్యాద్విషయాణాం భేదః ఏకరూప్యాత్సంవిదోఽభేదశ్చ తథా తేనైవప్రకారేణ స్వప్నే కరణేషూపసంహృ తేషు జాగరితసంస్కారజః ప్రత్యయః సవిషయః స్వప్న ఇత్యుక్తలక్షణాయాం స్వప్నావస్థాయామపి విషయాఏవ భిన్నానసంవిదితి. నను యది స్వప్నజాగరయో రేకాకారతావిషయతత్సంవిదో ర్భేదాభేదాభ్యాం తర్హి స్వప్నో జాగర ఇతి భేదవ్యవహారః కిన్నిమిత్తక ఇత్యాశంక్యాహ—అత్ర వేద్యంత్వితి. అత్ర స్వప్నే

వేద్యం పరిదృశ్యమానం వస్తుజాతం న స్థిరం న స్థాయి. ప్రతీతిమాత్రశరీరత్వాత్. జాగరే తు పరిదృశ్యమానం వస్తుజాతం స్థిరం స్థాయి. కాలాంతరేఽపి ద్రష్టుం యోగ్యత్వాదతః. స్థిరాస్థిరవిషయత్వలక్షణ వైలక్షణ్యాత్తద్భేద స్తయోః స్వప్నజాగరయోర్భేద ఇత్యర్థః. నను స్వప్నజాగరయోర్భేద శ్చేత్తత్సంవిదోరపి భేదః స్యాత్ ఇత్యాశంక్యాహ—తయోరితి. ఏకరూపేతి హేతు గర్భవిశేషణమ్.

టీ. తథా=ఆవిధముగానే (జాగ్రదవస్థయందువలెనే), స్వప్నే = స్వప్నావస్థయందును, వేద్యం = తెలిసికొనవలయును (జాగ్రదవస్థ యందుఁ బదార్థము లెన్ని యున్నను వానిని చూచుజ్ఞానమునకు భేదము లేనట్లు స్వప్నావస్థయందును బదార్థము లెన్నియైనను జ్ఞానమునకు భేదము లేదని గ్రహింపవలయు ననుట). అత్ర=ఈస్వప్నావస్థయందు, వేద్యం తు = తెలిసికొనఁబడుపదార్థమైతే, న స్థిరం = స్థిరమయినది కాదు (సంకల్పమునకు మాత్రమే గోచర మగుటవలనను, సంకల్పమే స్వరూపముగా కలిగి యుండుటవలనను మఱునాఁడు గానవచ్చునది కా దనుట). జాగరే=జాగ్రదవస్థయందున్ననో, స్థిరం = స్థిరమైనది (మఱునాఁటికిఁగూడఁ గానఁబడునది యనుట). అతః= ఈకారణమువలన (పదార్థములలోని స్వభావభేదములవలన), తద్భేదః-తత్=ఆ స్వప్నజాగ్రదవస్థలకు, భేదః=భేదము కలిగినది. తయోః=ఆ స్వప్నజాగ్రత్తలయొక్క (స్వప్నజాగ్రత్తలను గ్రహించు), సంవిత్=జ్ఞానము, ఏకస్వరూపా = ఏకస్వరూపము గలది యగుటచే, న భిద్యతే=పరస్పరము భిన్నము కాదు.

తా. చూడఁబడుపదార్థములకంటెఁ జూచునట్టి జ్ఞానము భిన్నము కావలయు ననియు, దానిస్వరూపస్వభావములకు భేదము గానరాకపోవుటచే నది యేకమే యనియు, పదార్థములకు మాత్రమే భేదము కల దనియు, నాభేదముతో జ్ఞానమునకు సంబంధ ముండ దనియు సవిమర్శముగఁ బూర్వశ్లోకమున వివరించి యున్నాము. ఈసిద్ధాంతము జాగ్రదాద్యవస్థలు మూఁడింటిలో దేనినిబట్టి చూచినను సరిపడును. సుషుప్త్యవస్థవిషయ మ టుండనిండు. జాగ్రత్స్వప్నములు మాత్రము సమానములే. ఈ రెండవస్థలయందును అనేక పదార్థములు పరస్పరభిన్నములగు స్వరూపములతోఁ గానవచ్చుచున్నవి యనుట యనుభవసిద్ధమేకదా! కావున జాగ్రదవస్థయందువలెనే స్వప్నావస్థయందును పదార్థములు మాత్రమే భిన్నములుగాని జ్ఞానము భిన్నము కా దని నిర్వివాదముగా గ్రహింపవచ్చును.

వి. "ఇట్లు చెప్పినచో నిది స్వప్నావస్థ. ఇది జాగ్రదవస్థ" అను భేదవ్యవహార మేమికారణమునఁ గలుగును? దృశ్యపదార్థములకును ద్రష్ట యగుజ్ఞానమునకును స్వభావ మొక్కటియే కదా! "జాగ్రదవస్థయందును పదార్థములు మాత్రమే భిన్నములు; స్వప్నావస్థయందును బదార్థములే భిన్నములు. జాగ్రదవస్థయందును జ్ఞానము ఏక రూపము; స్వప్నావస్థయందు నది యట్టిదియే కదా!" అనియెదవేమొ వినుము. సమ స్తేంద్రియములు నుపసంహరింపఁబడినప్పుడు కేవలమనస్సుచే జాగ్రదవస్థయందలి సంస్కారములవలనఁ బదార్థముల నెదుట నున్నట్లు భావించుటయే స్వప్నము. ఇదియె కల. ఈ కలయందలిపదార్థములకు సంకల్పమే స్వరూపము. ఏకాంతముననుండి తత్ప రుఁడై యేదేని యొక పదార్థమును ధ్యానించుచుండిన నది యెదుర నిలిచినట్లు తోఁచు టయు చిత్త మన్యాయత్తమైనచో నది యడంగుటయు బహుజనులకు ననుభవములో నున్న విషయమే. స్తంభకుడ్యాదిపదార్థము లట్టివి కావనుటయు చిత్త మెట్లున్నను వానికి నాశము లేదనుటయుఁ గూడఁ బ్రత్యక్షమే. ఈయనుభవములనుబట్టి చూచిన స్తంభాదిజాగ్రత్పదార్థములయొక్క స్వరూపములకును స్వప్నపదార్థములయొక్క స్వరూ పములకును భేద ముండవలయు నని తోఁచుచున్నది. రెండింటియాకారములు నొక్క టియే యైన రెండు నొక్కవిధముగానే యుండవలసివచ్చును కదా! కావున స్వప్నము నందలి పదార్థము లస్థిరములు. వానిని కాలాంతరమునందుఁ జూచుటకు వీలులేదు. ఒక నాఁటి కలయందుఁ గలిగిన సంకల్పమే మఱియొకనాఁడును కలుగవచ్చు నని సాధించి నను సంకల్పములు క్షణికము లగుటచే నప్పటి కప్పుడు క్రొత్తపదార్థము తోఁచు చున్నది యనియే చెప్పవలయునుగాని మొట్టమొదటి పదార్థమే యంతవఱకు నిలిచి యున్నది యనుటకు వీలు లేదు కదా! ఇఁక జాగ్రదవస్థయందలి పదార్థము లన్నియో స్థిరములు. ఎప్పుడు చూచినను కానవచ్చునవి; కొంతకాలమువఱకు నిలిచియుండునవి; ఈవిధముగ పదార్థస్వభావములు భిన్నము లగుటచే జాగ్రత్స్వప్నావస్థలకు భేదవ్యవ హారము కలిగినది. పదార్థములయందు మాత్రమే పరస్పరభేదము కలదు అను నంశము మాత్రము రెండవస్థలయందును సమానమే యైనను నిప్పుడు బాధ లేదు కదా! పదార్థ ములు మాత్ర మట్టివే యయినను వానియందు స్థిరత్వాస్థిరత్వము లను భేదము కలదు. అని చెప్పవచ్చు ననుటలో వివాదము లేదు కదా! జ్ఞానము మాత్రము ఏకస్వభావము కలదియే యైనను అంతమాత్రమున నవస్థలకు నైక్యము సంభవింప నక్కఱ లేదు. ఇంచు కంత భేద మున్నను నది భేదవ్యవహారమునకు చాలును కదా!

"ఇట్లయిన జ్ఞానము అవస్థాభేదము నాశ్రయించి భిన్నము కావలయును. ఏ యవస్థకు నాయవస్థయందు జ్ఞానము ఏకరూపమే యైనను జాగ్రజ్జ్ఞానము స్వప్నజ్ఞానము

ననిదైనను భేదము కలిగి తీరవలయును” అనియెదవేమొ అట్లును బనిలేదు. అవస్థ లెన్ని తీరుల మాఱినను జ్ఞాన మొక్కటియే కావచ్చును. జ్ఞానమునకు రూపభేదము కలుగనేరదని యిదివఱకే వివరించియున్నాము. జాగ్రద్జ్ఞానమైనను స్వప్నజ్ఞానమైనను జ్ఞానమే కదా! కావున జ్ఞానమునకు నెట్లును భేదము సంభవింపదు. మఱియు రాత్రి యీ పాన్పుపై పవ్వళించి నిదురించితిని. చెన్నపట్టణమున విహరించినట్లు కల గాంచితిని. మఱల మేల్కనునప్పటికి మీ రెదుట నున్నారు.అను మొదలగు వ్యవహారములు సర్వానుభవసిద్ధములు. వీనినిబట్టి చూచిన జాగ్రత్స్వప్నావస్థలు రెండు నొక్క ద్రష్టకే గోచరము లగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ద్రష్టయు జ్ఞానమే యనుటలో వివాదము లేదు. ద్రష్టకును దృశ్యమునకును సంబంధ ముండ దనుటయు దృఢముగ నిరూపింపఁబడెను. కావున జాగ్రత్స్వప్నములఁజూచుటయు పరస్పరభిన్న పదార్థములఁ జూచినంత మాత్రమే కాని యధికము కాదు. కావున పదార్థములకు భేద మున్నను జ్ఞానమునకు భేదము లేనట్లు ప్రస్తుతసందర్భమునఁ గూడ జాగ్రత్స్వప్నములకు భేద మున్నను జ్ఞానమునకు భేదము లేదు. కావున నీరెండవస్థలయందును జ్ఞాన మొక్కటియే.

అవ. ఈవిధముగ జాగ్రత్స్వప్నావస్థలయందు జ్ఞాన మొక్కటియే యని సాధించి సుషుప్త్యవస్థయందు నీవిషయ మిట్టిదియే (జ్ఞాన మేకరూప మైనదియే) యని స్థాపింపఁబోవుచు మొట్టమొదట సుషుప్త్యవస్థయందు జ్ఞానము కలదా? లేదా? యను సంశయమును నివారించుచున్నాఁడు:—

శ్లో. సుప్తోత్థితస్య సౌషుప్తతమోబోధో భవేత్స్మృతిః,
సా చాఽవబుద్ధవిషయాఽవబుద్ధం తత్తదా తతః. 5

వ్యా. ఏవమవస్థాద్వయే జ్ఞానస్యైకత్వం; ప్రసాధ్యసుషుప్తికాలీనస్యాపి తస్య తేనైక్య ప్రసాధనాయ తత్ర తావత్ జ్ఞానం సాధయతి—సుప్తేతి. పూర్వం సుప్తః పశ్చాదుత్థితః సుప్తోత్థితః. సుప్తం సుషుప్తిః తస్మాదుత్థిత ఇతివా. తస్య సౌషుప్తతమో బోధః సుషుప్తి కాలీనస్య తమసోఽజ్ఞానస్య యో బోధో జ్ఞానమస్తి న కించిదవేదిషమితి, సాస్మృతి రేవ భవేన్నానుభవః. తత్కారణస్యేంద్రియసన్నికర్షవ్యాప్తిలింగాదేర భావాదితి భావః. తతః కిం తత్రాహ—సా చేతి. సా చ స్మృతిరవబుద్ధవిషయా అవ బుద్ధోఽనుభూతో విషయో యస్యాః సా తథోక్తా. యాస్మృతిః సాఽనుభవపూర్వికేతి వ్యాప్తిర్లోకే దృష్టేతి భావః. తతోఽపి కిం తత్రాహ—అవబుద్ధమితి. తత్తస్మాత్ కారణాత్తత్సౌషుప్తం తమస్తదా సుషుప్తౌ అవబుద్ధం అనుభూతమిత్యభ్యుపగంతవ్యం. అత్రాయం ప్రయోగః. విమతం న కించిదవేదిషమితి జ్ఞానం అనుభవపూర్వకం భవితుమర్హతి స్మృతిత్వాత్సా మే మాతేతి స్మృతివదితి.

టీ. సుప్తోత్థితస్య-సుప్త = నిదురనుండి; లేక నిద్రించి, ఉత్థితస్య = మేల్కొనిన వానికి, సౌషుప్త...బోధః - సౌషుప్త=సుషుప్తిసమయమునందలి, తమః = అజ్ఞానము యొక్క (ఏమియుఁ దెలియ లే దను విషయముయొక్క), బోధః=జ్ఞానము (నిదుర యందు నే నేమియు నెఱుంగను అను జ్ఞానము). [యః=ఏది కలదో], [సా = అది], స్మృతిః=స్మరించుటయే (ఒకమా అనుభవింపఁబడిన విషయమును జ్ఞప్తికిఁ దెచ్చుకొను టయె), భవేత్=అగును. (సుషుప్తియందలి యజ్ఞానము మెలఁకువయందు కానవచ్చుట లేదు. కావున దానినిగూర్చి కలుగు జ్ఞానము అనుభవరూపమైనది. [అనుభవము లనఁగా బ్రత్యక్షాదులు] కానేర వనుట). సా చ=ఆస్మృతియు, అవబుద్ధవిషయా - అవబుద్ధ = అనుభవింపఁబడిన, విషయా=అజ్ఞానము కలది (భవేత్=కావలయును). (సుషుప్తికాల మున నజ్ఞానము ననుభవింపకుండిన దానినిగూర్చిన యీస్మృతి కలుగనేర దనుట. తత్= ఆకారణమువలన, తదా = ఆసుషుప్త్యవస్థయందు, తమః=అజ్ఞానము, అవబుద్ధం=అనుభ వింపఁబడినది (జ్ఞానమునకు గోచరమైనది) (భవేత్ = అగును).

తా. ఇఁక మూఁడవది యగుసుషుప్త్యవస్థనుగూర్చి కొంత విచా రింపవలసి యున్నది. స్థూలదృష్టితోఁ జూచిన నాయవస్థయందు విష యానుభవము లేకపోవుటచే నందు జ్ఞానము కలదో లేదో యని సంశ యము జనించుచున్నది. విచారించినచో నీసంశయమునకు నవకాశమే దొఱకదు. నిదురనుండి మేల్కాంచినపుడు "నాకు నిదురలో నేమియుఁ దెలియలేదు" అని వ్యవహరించుట సర్వసామాన్యముగ ననుభవములో నున్నవిషయమే. ఈవ్యవహారము విమర్శించి చూచిన సుషుప్త్యవస్థ యందును గ్రహించువాఁ డొక్కఁ డున్నాఁ డనుట విశదమగుచున్నది. ఎట్లనిన.—

వి. అనుభవ మనియు స్మృతి యనియు జ్ఞానము ద్వివిధము. అనుభవములు ప్రత్యక్షాదులు. ఇంద్రియములతో విషయములను గ్రహించుట గుఱుతుచేతఁగాని పోలికచేతఁగాని పదార్థముల నూహించుట, పరుని యుపదేశముచే నొక విషయమును నిర్ణయించుట యను నీ మొదలగునవి యనుభవములు. ఇట్టి యనుభవములవలన జనించి చిత్తమునందు దృఢమై యున్న సంస్కారము కాలాంతరమున సంకల్పరూపమై ప్రకటమగుట స్మృతి. ప్రత్యక్షాదులచే గ్రహింపఁబడినవిషయమును తగిన సమయమున జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటయే స్మృతి యని తెలిసికొనవలయును. వ్యవహారము లన్నియు జ్ఞానలాభములే యగుటచే ప్రతివ్యవహారంబును (ఈయనుభవస్మృతులలో) నొదేని యొకి

భవింపవలయును. ప్రస్తుత వ్యవహారము దేనిలో నేకీభవించె నని కొంచెము విచారింతము. అనుభవమునకు నింద్రియవిషయసంయోగమయినను గుఱుతయినను పరోపదేశమయిన నుండవలయును కదా! ప్రస్తుత వ్యవహారమును విమర్శించిన నిట్టి వేవియు లే వనుట స్పష్టమే. "నాకు నిదురలో నేమియుం దెలియకుండెను" అను వాక్యమునకు "నిదుర యందలి అజ్ఞానమును నే నెఱుంగుదును" అనియె కదా యర్థము; "నేను కలలో పదార్థము లెవ్వియుఁ గాన లేదు—అనఁగా పదార్థముల విషయమున నజ్ఞానము కలదు. దానిని నేను చూచుచున్నాను" అనియె కదా తాత్పర్యము. ఇట్లగుటచే వ్యవహరించు కాలమున నా అజ్ఞానము ఎదుట లేదు; దాని నూహించుటకు గుఱుతుగాని సుషుప్త్యవస్థలో నజ్ఞాన ముండును అను పరోపదేశము కాని లేదు. పరోపదేశమువలన కలిగిన వ్యవహార మైనచో సుషుప్త్యవస్థయం దజ్ఞాన ముండును అని మాత్రమే కదా యుండ వలయును. ఈకారణమువలన ప్రస్తుత వ్యవహార మనుభవములలోఁ జేర లేదు. ఇఁక దీనిని స్మృతి యని మాత్రమే చెప్పవలసియున్నది. స్మృతి యైన దానికిఁ బూర్వమున నను భవ మొక్కటి యుండి తీరవలయు నని యిదివఱకే నిరూపించి యున్నాము. ఈవిష యము లోకసిద్ధముగఁ గూడ నున్నది. కావున కొంచెము విచారించినచో సుషుప్త్యవస్థయందుఁ గూడ నప్పటి అజ్ఞానమును ప్రత్యక్షముగ ననుభవించుచు (చూచుచు) జ్ఞాన మున్నది యని యంగీకరించి తీరవలసి వచ్చుచున్నది. ఇట్టి యనుభవము నంగీకరించినచో నాయనుభవమువలనఁ బ్రస్తుతస్మృతి కలిగె ననవచ్చును. లేకున్నఁ గారణము లేకయే కార్యము జనించె ననవలసివచ్చుటచే సర్వప్రమాణములకును నిరర్థకత్వము కలుగును కదా! కావున సూక్ష్మదృష్టిచే విచారించిన సుషుప్త్యవస్థయందును జ్ఞానము కలదు; అది యింద్రియాదిసర్వపదార్థములను తనయందు లీనము చేసికొనియున్న యవిద్యను (ఇదియె అజ్ఞానము) చూచుచుండును. వ్యవహారవాక్యార్థమును విమర్శించినప్పుడె యీ విషయము స్పష్ట మయ్యెనుకదా! మఱియును సుషుప్త్యవస్థలో నేదియు లేదు అని సాధింపఁజూచిన మాసిద్ధాంతమునకు భంగము రాదు. కల దనుటకుఁగాని లే దనుటకుఁ గాని సాక్షి యొక్కఁ డుండి తీరవలయు ననుట నిర్వివాదాంశము. చూచువాఁడేకదా యెదుట పదార్థ మున్నపుడు "ఇది యిచ్చట నున్నది" యనియును, లేనప్పుడు "ఇది యిచ్చట లేదు" అనియును చెప్పఁగలఁడు! కావున నెట్లు చెప్పఁజూచినను సాక్షి నంగీ కరింపక తప్పదు. జాగ్రత్స్వప్నములయందువలెనే సుషుప్త్యవస్థయందును సాక్షి కలఁడు. జాగ్రత్స్వప్నములయందు పదార్థములను చూచును; సుషుప్తియందు వాని యభావ మును చూచును. సాక్షియే జ్ఞానము. కావున నిర్వివాదముగ సుషుప్త్యవస్థయందును జ్ఞాన మున్నది.

అవ. ఇట్లు సుషుప్త్యవస్థయందు జ్ఞానము కల దని నిరూపించి "ఆ జ్ఞానముకూడ జాగ్రత్స్వప్నజ్ఞానములకంటె భిన్నము కాదు" అని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. స బోధో విషయా ద్భిన్నో న బోధా త్స్వప్నబోధవత్,

వ్యా. తస్యానుభవస్యస్వవిషయాదజ్ఞానాద్భేదం బోధాంతరాదభేదం చాహ:— సబోధ ఇతి. స బోధః సౌషుప్తాజ్ఞానానుభవః విషయా దజ్ఞానాద్భిన్నః పృథగ్భవితు మర్హతి. బోధత్వాద్ఘటబోధవత్. బోధాంతరాన్న భిద్యతే. బోధత్వా త్స్వప్నబోధవత్. ఫలితం కథయన్నుక్తన్యాయమన్యత్రాప్యతిదిశతి—ఏవమిత్యాదినా. స్థానత్రయేఽపి ఏకదినవర్తిని జాగ్రదాద్యవస్థాత్రయేఽపి సంవిదేకైవ. సర్వం వాక్యం సావధారణమితి న్యాయాత్ తద్వద్దినాంతర ఇతి.

టీ. సః=ఆ (అజ్ఞానానుభవరూపమైన), బోధః=జ్ఞానము (సుషుప్తిసాక్షి యగు జ్ఞానము), విషయాత్=తనకుగోచర మగు నజ్ఞానమునకంటె, భిన్నః=వేఱై యుండును. (సాక్షి యగుటచే దృశ్యమునకంటె భిన్న మగు ననుట). స్వప్నబోధవత్=స్వప్నము నందలి జ్ఞానమువలె, బోధాత్ = మఱియొక జ్ఞానమునుండి, న (భిన్నః) = వేఱైనది కానేరదు (జ్ఞానముల కన్నింటికిని స్వరూపస్వభావము లొక్కటియే కదా యనుట).

తా. ఈవిధముగ సుషుప్త్యవస్థయందు జ్ఞానము కల దనుట సిద్ధాంత మయ్యెను. కావున నదియు జాగ్రత్స్వప్న జ్ఞానములకంటె భిన్నము కానేరదు. అజ్ఞానములు తమచే చూడఁబడుపదార్థములకంటె మాత్రమే భిన్నము లైనట్లు ఇదియు (సుషుప్త్యవస్థయందలిజ్ఞానంబును) తనచే గ్రహింపఁబడు నజ్ఞానముకంటె మాత్రమే భిన్న మగును; అవి (అజ్ఞానములు) తమలో భిన్నములు కాన నిదియు వానికంటె భిన్నము కానేరదు. అన్నియు జ్ఞానములే కదా!

అవ. జ్ఞానమునందు భేదము లే దని నిరూపించి యిప్పుడు దానికి ఫలభూతమగు జ్ఞాననిత్యత్వమును సాధించుచున్నాఁడు:—

శ్లో. ఏవం స్థానత్రయేఽప్యేకా సంవి త్తద్వ ద్దినాంతరే. 6
మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యే ష్వనేకధా,
నోదేతి నాస్తమే త్యేకా సంవి దేషా స్వయంప్రభా. 7

వ్యా. యథైకస్మిన్ దివసేఽవస్థాత్రయేఽపి జ్ఞానస్యాభేదః ఏవమన్యస్మిన్నపి దివసేఽనేకధాఽనేక ప్రకారేణ గతాగమ్యేష్వతీతాగామిషు మాసేషు చైత్రాదిషు,

అబ్దేషు ప్రభవాదిషు, యుగేషు కృతాదిషు, కల్పేషు బ్రహ్మాదిషు చ జ్ఞానస్యాభేద ఏవే త్యర్థః. సంవిద ఏకత్వసమర్థనే ఫలితమాహ:—నోదేతీతి. యతః సంవిదేకాఽతో నోదేతి నోత్పద్యతే. నాస్తమేతి న వినశ్యతి చ. అసాక్షికయోరుత్పత్తివినాశయోరసిద్ధేః స్వోత్పత్తివినాశయోస్తయైవ సంవిదా గ్రహీతుమశక్యత్వాత్సంవిదన్తరాభావాచ్చేతి భావః. నను సంవిదన్తరాభావే గ్రాహకాభావాదస్యా అప్యభావే జగదాంధ్యం ప్రసజ్యేతేత్యత ఆహ:—ఏషేతి. అత్రాయం ప్రయోగః. సంవిత్స్వయంప్రకాశా అవేద్యత్వే సత్య పరోక్షత్వాద్వ్యతిరేకేణ ఘటవత్. నచాయం విశేషణాసిద్ధో హేతుః సంవిదః స్వసంవేద్యత్వే కర్మకర్తృత్వవిరోధాత్పరవేద్యత్వే ఽనవస్థానాదతః స్వప్రకాశత్వేన భాసమానాయాః సంవిదః సర్వావభాసకత్వసంభవాన్న జగదాంధ్యప్రసంగ ఇతి భావః.

టీ. ఏవం=ఇట్లు విచారించిన, స్థానత్రయే అపి=మూఁడవస్థలయందును, సంవిత్ = జ్ఞానము, ఏకా = ఒక్కటియె (సర్వం వాక్యం సావధారణం = "వాక్యములన్నియు నవధారణముతోఁ [నిశ్చయమును సూచించు ఏవశబ్దముతోఁ] గూడినవియె" అను లోకన్యాయము ననుసరించి యీవిధముగ నర్థము చెప్పఁబడెను). తద్వత్ = అట్లె, దినాంతరే = మఱియొక దినమునందును గ్రహింపవలయును. అనేకధా=అనేకవిధములుగా, గతాగమ్యేషు-గత = కడచిపోయినట్టియు, ఆగమ్యేషు = రాఁబోవునట్టియు, మాస...కల్పేషు - మాస = నెలలయందును, అబ్ద=సంవత్సరములయందును; యుగ = యుగములయందును, కల్పేషు = కల్పములయందును, [తద్వత్] సంవిత్ = జ్ఞానము, ఏకా=ఒక్కటియే. ఏషా=ఈజ్ఞానము, న ఉదేతి = ఉదయింపదు (ఒకప్పుడు పుట్టునది కా దనుట.) న అస్తం ఏతి=అస్తమింపదు (నశింపదు). స్వయంప్రభా=తనంతటఁదానే ప్రకాశించును.

తా. పై చేసిన నిరూపణవలన "ఒక్కదినమునఁ నున్నమూఁడవస్థలయందును జ్ఞానమునకు భేదము లేదు" అనుట స్పష్టమైనది కదా! ఈ సిద్ధాంతమును విమర్శించిన నొక దినమునందువలెనే మఱియొకదినమునందును జ్ఞానమునకు భేద ముండ దనుట నిస్సంశయముగ స్పష్టమగును. ఇట్లే విచారించినచో నెన్ని దినములు గడచినను మాసములు పోయినను సంవత్సరము లతిక్రమించినను యుగములు చెల్లినను కల్పములు గడచినను జ్ఞానముమాత్ర మొక్కటియే యనుటలో వివాద ముండదు. భవిష్యత్కాలమున నెట్లో యట్లే భూతకాలమునందును ఎన్నిదినములకు ముందైనను, ఎన్నిమాసములకు పూర్వమునన్నైనను,

ఎన్నిసంవత్సరములకు ముంగల నయినను, ఎన్నియుగములకుఁ బూర్వమున నయినను, ఎన్నికల్పములకు దిగువనైనను జ్ఞాన మొక్కటియే యగును. కావున నేదే దెట్లెట్లు మాఱినను జ్ఞానమునకు మార్పు లేదు.

“ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఇప్పుడు జ్ఞానమునకు నుత్పత్తివినాశములే లేవని చెప్పిన ట్లైనది. ఇట్టి పదార్థ మొక్కటి కల దనుట ప్రత్యక్షవిరుద్ధము. అన్ని పదార్థములకు నుత్పత్తి కానవచ్చుచుండ నొక్కదానికి మాత్ర మేల లేకపోవును?” అని యెదవేమొ వినుము. అన్నిటికి నుత్పత్తి కల దనుట నిక్కమే కాని జ్ఞానమునకు మాత్రము లేదు. అది సర్వసాక్షి యని మున్నే వివరించి యున్నాము కదా! సర్వసాక్షి యగువాఁ డుత్పత్తివినాశములకుఁ గూడ సాక్షిగ నుండవలయును. దృశ్యపదార్థముల కంటెఁ బూర్వకాలమున నుండనివాఁడు వానిని చూడలేఁడు కదా! కావున నీజ్ఞాన ముత్పత్తికంటెఁ బూర్వమున నుండవలయును. మఱియు నొకదాని వినాశమును జూచువాఁ డావినాశమునకంటెఁ బిదప నుండిననే కాని “ఆపదార్థము నశించినది” అని చెప్పనేరఁడు. కావున నీజ్ఞానము వినాశమునకంటె నావల కూడ నుండవలయును. ఇట్లైన దీనికి నుత్పత్తివినాశములు సంభవించుటకు నవకాశ మెక్కడిది? త్రికాలముల యందు నేకరూపముతో నుండిననే కాని సాక్షిత్వము సంభవింపదు.

“ఇట్లు చెప్ప నేల? ఈజ్ఞానము ప్రపంచమునకంటె ముందు జనించి ప్రపంచోత్పత్తిని చూడవచ్చును; వినాశమునకంటె నావల కొంతకాలము నిలిచి వినాశమును గ్రహింపవచ్చును” అనియెదవేమొ. అది సరి కాదు. అప్పుడు జ్ఞానమునకుఁ గూడ నుత్పత్తివినాశము లుండును గావున వానిని చూచుటకు మఱియొకసాక్షి కావలసివచ్చును. వానికిని నుత్పత్తివినాశము లుండునేని వానిని చూచుటకు మఱియొకసాక్షి యుండవలసివచ్చును. ఇట్లు వరుసగా సాక్షులను గ్రహింపఁబోయిన నెప్పటికిని ముగింపు కలుగదు. ఇది దోషము కదా! మఱియు నుత్పత్తి గల పదార్థము లన్నియు నచేతనము లనుట ప్రత్యక్షమై యున్నది. పంచభూతములు మొదలు మనయెదురఁ గానవచ్చు సర్వప్రపంచము లచేతనములుగనే యున్నవి. మనుష్యులు పశువులు మొదలగుభూతములు జనించుచుండుటయు చేతను లగుటయుఁ గానవచ్చుచున్నను, అచ్చట సూక్ష్మదృష్టితో విచారించిన పైసిద్ధాంతమే స్పష్టమగును. అచ్చట శుక్రశోణితపరిణామముచే జనించినది దేహమే కాని మఱియేదియుఁ గాదు. దేహ మచేతన మనుటలో నెవరికిని వివాదము లేదు కదా! కావున నుత్పత్తియుండినచో నాజ్ఞానము జ్ఞానమే కాకపోవలసివచ్చును. ఇది సర్వానుభవవిరుద్ధముకదా! కావున జ్ఞాన మెప్పటికి నొకటియే. ఒకప్పుడును జనిం

పదు మఱియొకప్పుడును నశింపదు. సర్వసాక్షియై యెప్పటికి నేకరూపముతో ప్రకాశించుచుండును.

"ఇట్లు చెప్పిన మఱియొక దోషము వచ్చును. సాక్షి లేకున్న నేవిషయముగూడ సిద్ధింప దని మీరే యంగీకరించి యున్నారు. ఆయంగీకారమువలననే కదా యుత్పత్తివినాశమూలమున జ్ఞాననిత్యత్వమును సాధించితిరి! మీమాట కిచ్చుటనే భంగము కలిగినది. అన్నిటికి సాక్షి కావలసియున్న జ్ఞానమునకుమాత్ర మక్కఱ లేదా?" అనియెదవేమొ వినుము. జ్ఞానమునకు నితరసాక్షి యుండుటకు వీలులేదు. ఉండవలయు నని పట్టుపట్టిన నది చేతనమా? చేతనమా? అచేతనమైనను సమమా? హీనమా? అధికమా? ఇం దేపక్షంబును యుక్తము కాదు. అచేతనము చేతనమును గ్రహించు ననుట హాస్యాస్పదము కదా! ఇఁక చేతనము సమ మైనచో సమకాంతి గలదీపము రెండవ దీపమును ప్రకాశింపఁజేయలేనట్టు జ్ఞానమును ప్రకాశింపఁజేయనేరదు; హీనమయినచో దానినిగూర్చి చెప్పవలసినపనియే లేదు. అధికమైనచో నొక్కదానికంటె నధికమైనది మఱియొక్కటి యుండ దానికంటె నధికమైనది వేఱొక్కటిమాత్ర మేల యుండ రాదు? అట్లుండుట నంగీకరింతు మేని సాక్షిపరంపరకు నంత మెన్నఁడో? ఈకారణము వలన సాక్షి యొక్కఁడే కలఁ డని మాత్రమే యంగీకరించి తీరవలయును. లోకమున చేతనాచేతనములు రెండే కలవు గాని యితరములు లేవు. అందును స్వరూపాదిభేదములచే నచేతనములు భిన్నము లగును కాని చేతనములు కా వని మున్నె పలుమాఱు వివరించియున్నాము. కావునఁ జేతనపదార్థ మొక్కటియే. అది నిత్యము. స్వయంప్రకాశము. దీపము తనంత వెలుఁగుచు చుట్టు నున్న పదార్థములఁ బ్రకాశింపఁజేయునట్లు ఈజ్ఞానమును తనంత తానే వెలుఁగుచు సర్వప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నది.

"ఇట్లు చెప్ప నేల? ఈజ్ఞానమును పరుఁడు గ్రహింపలే కున్నను తనంత తానే తెలిసికొనవచ్చును" అనియెదవేమొ. అదియు సంభవింపదు. అప్పుడు తెలిసికొనుట యనుక్రియకు తానే కర్త తానే కర్మ కావలసివచ్చును. ఇది విరుద్ధము. వ్రేలు తన యగ్రమును తాను స్పృశింపలేనట్లు ఖడ్గము తనయంచును తాను గోసికొనలేనట్లు ఏ పదార్థంబును తన్నుఁ దా నేమియు చేసికొననేర దని తనకార్యమునకు తనను కర్మగా చేసికొననేర దని యిదివఱకే సవిమర్శముగఁ జూపియున్నాము. వాఁడు తన్నుఁదాను ఖండించుకొనియెను అనుమొదలగు ప్రయోగము లనేకములు గలవు; వీనికి గతి యేమి? అనియెదవేమొ వినుము. శరీరమునకు నవయవములు కలవు. కావున నొక యవయవము చేయుకార్యమునకు మఱియొక యవయవము కర్మ కావచ్చును. జ్ఞానమున కన్ననో యెట్టి యవయవములు కాని క్రియలు కాని లేవు. కావున నవయవభేదము నాశ్రయించి

ప్రవర్తించు కర్మకర్తరి ప్రయోగము. "తన్ను తానే ఖండించుకొనియెను" అనుమొదలగు ప్రయోగములు ఈజ్ఞానవిషయమున కార్యసాధకములు కానేరవు. కావున నెట్లు చూచినను సర్వసాక్షి యగునీజ్ఞానము స్వయముగఁగాని పరులచేతఁగాని యెఱుంగఁబడఁ దగినది కాదు; అపరోక్షమై (ఆత్మరూపమై) ప్రకాశించునది; నిత్యము.

అవ. జీవబ్రహ్మైక్యము నుపదేశించువాఁడు కావున మొట్టమొదట నీగ్రంథకర్త జీవుని సత్యజ్ఞానానందరూపునిగ సాధింపఁ దలంచుచున్నాఁడని మూఁడవశ్లోకముయొక్క యవతారికయందు వివరించియున్నాము. ఇప్పటికి జ్ఞాననిత్యత్వము సయుక్తికముగ సాధింపఁబడెను. నిత్యత్వ మనినను సత్యత్వ మనిన నొక్కటియే. ఇఁక నీక్రిందిశ్లోకమున జ్ఞానమునకు జీవునకుఁ గలసంబంధమును, జీవుఁ డానందరూపుఁడగుటయు వివరింపఁబడును:—

శ్లో. ఇయ మాత్మా పరానందః పరప్రేమాస్పదం యతః,
మా న భూవం హి భూయాస మితి ప్రేమాఽత్మ నీక్ష్యతే. 8

వ్యా. భవత్వేవం సంవిదో నిత్యత్వం స్వప్రకాశత్వం చ. తతః కిమిత్యత ఆహ:- ఇయమితి. అత్రాయంప్రయోగః. ఇయం సంవిదాత్మా భవితుమర్హతి. నిత్యత్వే సతి స్వప్రకాశత్వాద్వ్యతిరేకేణైవం న త దేవం. యథా ఘట ఇతి ఆత్మనో నిత్యసంవిద్రూపత్వ ప్రసాధనేన సత్యత్వ మపి సాధితం భవతి. నిత్యత్వాతిరిక్తసత్యత్వాభావాత్ నిత్యత్వం సత్యత్వం. తద్యస్యాస్తి తన్నిత్యం సత్యమితి వాచస్పతిమిశ్రై రుక్తత్వా దితి భావః. ఆత్మన ఆనందరూపత్వం సాధయతి. పరానంద ఇతి. ఆత్మేత్యనుషజ్యతే. పరశ్చాసావానందశ్చేతి పరానందః నిరతిశయసుఖస్వరూప ఇత్యర్థః. తత్ర హేతుమాహ:—పరేతి. యతో యస్మాత్కారణాత్పరస్య నిరుపాధికత్వేన నిరతిశయస్య ప్రేమ్ణః స్నేహస్య ఆస్పదం విషయస్తస్మాదత్రేద మనుమానం ఆత్మా పరమానందరూపః పరప్రేమాస్పదత్వాత్, యః పరమానందరూపో న భవతి నాసౌ పరప్రేమాస్పదం. యథా ఘటః. తథా చాయం పరప్రేమాస్పదం న భవతీతి న. తస్మాత్పరమానందరూపో న భవతీతి న. నన్వాత్మని ధిఙ్మామితి ద్వేషస్యోపలభ్యమానత్వాత్ప్రేమాస్పదత్వమేవాసిద్ధం. కుతః పరప్రేమాస్పదత్వ మిత్యాశంక్య తస్య దుఃఖసంబంధనిమిత్తకత్వేనాన్యథాసిద్ధత్వాత్ప్రేమ్ణ శ్చాత్మన్యనుభవసిద్ధత్వాన్నైవమితి పరిహరతి—మా న భూవమితి. హి యస్మాత్కారణాదాత్మని విషయే మా న భూవ మహం మా భూవమితి న మమాసత్వం కదాపి మాభూత్కింతు భూయాసమేవ సదా సత్వమేవ మమ భూయాది త్యేవంవిధం ప్రేమేక్ష్యతే సర్వైరనుభూయతే. అతో నాసిద్ధి రిత్యర్థః.

టీ. ఇయం = ఈజ్ఞానమే, ఆత్మా = స్వస్వరూపము (జ్ఞానమే జీవుఁ డనుట). యతః = ఏకారణమువలన, పరప్రేమాస్పదం - పర=అధికమైన (ఉపాధి లేకుండుటచే) నిరతిశయమైన, నిరతిశయ మనఁగా నన్నింటికంటె నధికమైనది), ప్రేమ = ప్రీతికి ఆస్పదం=స్థానమగుచున్నాఁడో [తతః = ఆకారణమువలన], [ఆత్మా=జీవుఁడు], పరానందః = పరమానందరూపుఁడు (ఆనందరూపము కానిపదార్థమునం దెవ్వరికిని ప్రేమ యుండ దనుట). ఆత్మని = తనయందు (జీవునియందు) మా భూవం [ఇతి] న = నేను భూమిపై నుండ నక్కఱ లేదు. అను నుద్దేశము కలుగదు. భూయాసం ఇతి=ఎప్పటికిని జీవించియే లేక నిలిచియే యుండవలయు నని, ప్రేమ=ప్రీతి, ఈక్ష్యతే = సర్వానుభవ సిద్ధమై కానవచ్చుచున్నది. తన నాశము నెవ్వఁడును కోరఁడు కదా యనుట. ఏది యెట్లు పోయినను తానుమాత్రము చక్కఁగా నుండినఁ జాలు నని ప్రతివాఁడును కోరుచుండునుగదా యని తాత్పర్యము.

తా. పై నిరూపణమువలన జ్ఞానము సత్య మని తేలినది. ఆ జ్ఞానమే జీవుఁడు, అదియే స్వస్వరూపము. జ్ఞాన మొక్కటితప్ప తక్కిన వేవియు నిత్యములు కావు. స్వప్రకాశములును కావు, స్వస్వరూప భూతములును కావు. ఘటమును స్వస్వరూపముగ నెవ్వఁడైన భావించునా? "దేహము నట్లు భావించుచున్నారు కదా" యనియెదవేమొ, అది భ్రాంతి. దేహము పాంచభౌతికము; జడము. మనచుట్టు నున్న పదార్థము లన్నియు నిట్టివే. ఇట్లుండఁ దక్కినవానియందు లేనియాత్మ భావనను దేహమున నుంచిన నది భ్రాంతి యనుటలో సంశయ మేమి? మఱియు "ఇది నాచేయి, నాకాలు" అను మొదలగువ్యవహారము లనేకములు లోకమున నున్నవి. వీనితాత్పర్యమును విమర్శించిన "నా యిల్లు" అను మొదలగువాక్యములయొక్క తాత్పర్యమువలె "నేను వేఱు, చేయి వేఱు" అనిమాత్రమే కదా తేలును. ఈ కారణము వలనఁగూడ ఆత్మ దేహముకంటె భిన్నుఁడే. ఇదియునుగాక దేహ మచేతనము. ఆత్మ యట్టివాఁ డని యెవ్వరు నంగీకరింపరుకదా! కావున దేహము నాత్మగా భావించుట భ్రాంతి యనుటలో వివాదము లేదు. ఈకారణమువలన నేది జడమో యనిత్యమో యది యాత్మ కాదు. స్వప్రకాశంబును నిత్యంబు నగుటచే జ్ఞానమే యాత్మ. ఈనిరూపణ వలన జీవుఁడు సత్యజ్ఞానరూపుఁ డనుట సిద్ధాంత మైనది.

వి. ఇట్లైతే జీవుఁ డానందరూపుఁడుగాఁ గూడ నున్నాఁడు. ప్రతివానికి తన యందు ప్రేమ కల దనుట నిర్వివాదముకదా! ఏ యేపదార్థములయందు ప్రేమ యుండునో అవియెల్ల నియతముగ నానందరూపములై యుండవలయును. తన కానందము కలుగు ననియె కదా ప్రతివాఁడును పదార్థములఁ బ్రేమించుట. ఇందును మఱియొక విశేషము కలదు. లోకమున నన్నిపదార్థములు నొక్కవిధముగ నానందమును కలిగించుట లేదు; ప్రేమయు వానియం దొక్కతీరుగ నుండుట లేదు. ఆనందమునందును ప్రేమయందు ననేక తారతమ్యములు గానవచ్చుచున్నవి. కావున నేపదార్థ మెంత యానందము నొసంగఁగలదో దానియం దంతప్రేమ యుండు నని సిద్ధాంతము చేయవలసి యున్నది. ఇది సర్వానుభవసిద్ధ మగువిషయమే. ఈకారణమువలన దేనియందలి ప్రేమకంటె నధిక మగుప్రేమ మఱియొకదానిపై నుండదో యది (ప్రేమాస్పదవస్తువు) పరమానందరూపము కావచ్చు ననుటలో సంశయము లేదు. కావున జీవుఁడు సామాన్యముగ నానంద రూపుఁడే కాదు; పరమానందరూపుఁడుకూడ నై యున్నాఁడు. "ఇట్లు చెప్ప నేల ? ఆత్మకంటె నధికముగ పురుషుఁడు దేనిని కాని ప్రేమింపఁ డనుట నిశ్చయమే కాని అంతమాత్రమున వాఁడు (ఆత్మ) పరమానందరూపుఁడు కానేరఁడు. పరమానందరూపుఁ డనిన నాతనియందు దుఃఖసంస్పర్శ మించుకంతయు నుండక పోవలసివచ్చును. అప్పుడు అతనియందు ద్వేష మెప్పటికిని కలుగఁగూడదు కదా. అట్లు కలుగుట లేదు. లోక మున సాధారణముగ ప్రతిమనుష్యుఁడు నొక్కొకసమయమున 'ఛీ నాబ్రతుకేల?' యని తన్నుఁ దాను ద్వేషించుకొనుచున్నాఁడు కదా" యనియెదవేమో వినుము. ఇది తన మీఁద నున్న ద్వేషమువలన వచ్చినది కాదు. తాను మృతినొందవలయు నని యెవ్వనికి నుండదు కదా! దుఃఖమువలన కలుగుబాధను సహింపలేక మాత్రమే యట్టి వ్యవహారము జరుగుచున్నది. "ఈబాధకంటె మృతియైనను మేలు" అని మాత్రమే యావ్యవహార మునకు తాత్పర్యము. ఏవి యెట్లు పోయినను తాను మాత్రము సుఖముగ నభివృద్ధి నొందవలయు ననియే కదా ప్రతివానికిని కోరిక. కావున నింతమాత్రమున జీవుఁడు పరమానందరూపుఁడు కాకపోఁడు. ఇట్టివానికి దుఃఖసంబంధ ముండదు కదా !" యందువేమో. అది లేకున్నను భ్రాంతిచే నున్నట్లు భావింపఁబడుచున్నది యనియు నదియే బంధ మనియు నివివఱకే సూచించియున్నాము. ఇఁకముందు గ్రంథమునందును ఈవిషయము స్పష్టము కాఁగలదు. కావున నిప్పటికి జీవుఁడును సత్యజ్ఞానానంద రూపుఁడే పరమేశ్వరుని యట్టివాఁడే యని తేలినది.

"అగునుగాక. ఆనందమును కలిగించువానిపై లోకమునఁ బ్రీతి ప్రతివానికి నున్నది యనుట నిస్సంశయమే. అధికముగ నానందమును కలిగింపఁగలవి యధికమగు

ప్రేమకు నాస్పదము లగుచున్నవి యనుటయు సత్యమే. ఇట్లైనను జీవునకు ఆనందరూపము కలదనుట యుక్తియుక్తము కానేరదు. పదార్థములన్నియు తమ తమ సామర్థ్యము కొలఁది యానందమునకుఁ గారణములే కావలయునుగాని మఱియొకవిధముగ (ఆనంద రూపములుగ) నుండనేరవు కదా!" అనియెదవేమో అట్లుకాదు. ఆనందమును గలిగించు ననుటయే మొట్టమొదట సంభవింపదు. జీవుఁడైనను మఱియేపదార్థమైనను ఆనందరూపము కావలసినదియే కాక తజ్జనకము కానేరదు. ఆనందములలో తారతమ్యము గానవచ్చుచున్నది; దుఃఖములలో కూడ నట్లే తారతమ్యము గానవచ్చుచున్నది. ఈయానంద దుఃఖములకు పరస్పరము విరోధము కల దనుట నిర్వివాదము కదా! ఇఁక వీనికి జనకము లగు పదార్థము లుండునేని యవి నియతములుగ నుండవలయును. ఆనందమును కలిగించునవి దుఃఖమును కలిగింపఁగూడదు. దుఃఖమును కలిగించునవి యానందమును కలిగింపఁ గూడదు. మఱియు నీయానందదుఃఖములలోఁ దారతమ్యములు కలవు గావున "ఇంత పరిమాణము గల యానందాదుల నిట్టిపదార్థము జనింపఁజేయును" అను నియమము కూడ నుండవలయును. "దేశకాలభేదములవలన మార్పులు కలుగవచ్చును కదా !" యని యెదవేమొ. ఇచ్చటవచ్చు స్వభావమునుగూర్చి మాటలాడుచున్నాముగాని లోకానుభవసమన్వయమునుగూర్చి కాదు. మఱియు దేశకాలభేదమువలన నధికసామర్థ్యము గలది యల్పమగుటచే వీలు కలదు కాని యల్పసామర్థ్యము కలది యధికమగుటకు వీలు లేదు. ఏదియు నియతి నతిక్రమింపదు కదా ! అల్పసామర్థ్యమే నియతమై యుండ నధికసామర్థ్య మెట్లు కలుగును. దేశకాలము లెంత యనుకూలములుగ నున్నను పొన్నగంటికూర మహావృక్షము కాదుకదా! అధికసామర్థ్యముగలవి యల్పసామర్థ్యములు కావచ్చు ననుటకును నిట్లే నియమము కలదు. దేశకాలము లెంత యనుకూలములు కాకున్నను వటవృక్షము నేలపైఁ బ్రాకులాడ నేరదు. కావున నేపదార్థములకైనను దేశకాలములవలన నధికభేదము కలుగ నేరదు. కావున నానందదుఃఖము లొకదాని వలన జనించు ననుపక్షము నంగీకరించినచో పైనఁజూపిననియమము లవశ్యముగ నుండవలయును. లోకమున వానిలో నొక్కటి యైనను గానవచ్చుట లేదు. పదార్థ మొక్కటియే యయ్యు నొకనికి నధికముగాను మఱియొకనికి నల్పముగాను ఆనందమును కలిగించుచుండుటను ప్రత్యక్షముగఁ జూచుచున్నాము. వృక్షచ్ఛాయ ప్రచండాతపము నుండి వచ్చినవానికి నెంత యానందమును కలిగించునో యితరులకు నంత యానందమును కలిగింపదనుట నిస్సంశయము. ఇచ్చట కొంచెము విచారింపుఁడు. ఈవృక్షచ్ఛాయకు నల్పానందమును కలిగించుట స్వభావమా? లేక యధికానందమును కలిగించుట స్వభావమా? లేక దేశకాలభేదమువలన నాస్వభావములకు నెట్లేని మార్పు కలిగెనా ? ఇం

దేపక్షము నంగీకరించినను నిలువదు. దేని కేది స్వభావమో దాని కెన్నఁటికిని ధ్వంసము కలుగదు. దేశకాలభేదమువలనఁ గూడ దానికి మార్పు రాదు. వచ్చినను ఆమార్పు వస్తువునందును దానిమూలమున ఫలమునందునుఁగూడ గానవచ్చుటచే నొకనికి నొకవిధముగాను మఱియొకనికి మఱియొకవిధముగాను తోఁచుటకు వీలులేదు. దేశకాలభేదముచే క్షీణించిన వటవృక్షము క్షీణించిన ట్లొకఁడును వృద్ధిఁజెందినట్లు మఱియొకఁడు చూచుట కలదా? కావున ననేకతారతమ్యములతోఁ గానవచ్చు ఆనందములకు ప్రత్యేకకారణములు లేవని తేలినది. ఇదియునుగాక ఆనందమును కలిగించుపదార్థము దుఃఖమును కలిగింపఁగూడ దనునియమమైనను లోకమున లేదు. కొందఱిచే నాదరింపఁబడుచున్న పదార్థములే మఱికొందఱిచే ద్వేషింపఁబడుచున్నవి. కొందఱి కిష్టమైన యాహారపదార్థములు మఱికొందఱకు రుచింపవనుట సుప్రసిద్ధము. కావున నెట్లును ఆనందదుఃఖములు పదార్థములవలన కలుగు ననువాదము యుక్తము కాదు.

ఇట్లే యీయానందదుఃఖములు పదార్థములకు గుణము లనుటకును వీలు లేదు. అవి రెండును విరుద్ధధర్మములు గలవియగుటచే నొకదాని కాశ్రయమైన పదార్థమును మఱియొక్కటి ఆశ్రయింపదు. అగ్నియందుఁగల వేడిమితోఁగూడఁ జల్లఁదన ముండదు కదా! కావున నీపక్షమునుబట్టి చూచినను ఆనందగుణకపదార్థమువలన దుఃఖానుభవము కలుగఁగూడదు. మఱియుఁ దారతమ్యములను గూర్చి విచారింపఁబోయిన నవి నిత్యములనినచో గుణమునకు విభాగము సంభవింపదు. కావున నాపక్షము యుక్తియుక్తము కానేరదు. గుణములకు నవయవము లుండవు. "ఇది కొంచెము తెల్లగా నున్నది. ఇది మిక్కిలి తెల్లగా నున్నది." అను మొదలగు వ్యవహారములు మాలిన్యము మొదలగువానిచేఁ గలిగిన తిరస్కారమువలన జనించినవియే కాని గుణముయొక్క యల్పాధికభావమువలన జనించినవి కావని సర్వవాదులు నంగీకరించి యున్నారు. ఇఁక నాతారతమ్యముల ననిత్యములనుగాఁ జెప్పినచో మాపక్షమునే యంగీకరించిన ట్లగును. అపుడు ఆనంద మొక్కటియే యనియు నది తారతమ్యములతో చూడఁబడుచున్నదియనియు మాత్రమేకదా చెప్పవలయును. అపుడు లేనితారతమ్యములు తోఁచుటకుఁ గారణ మేమి యనవలెను? భ్రాంతియే యనవలయును. భ్రాంతివలననే కాని లేనివి యున్నట్లు తోఁపవు. ఎండమావులయందు నీరు మొదలగువానిని సృజింపఁగలదిభ్రాంతియే కదా. మఱియు నిది చేతనునకు మాత్రమే కలుగునది యగుటచేత "పురుషునిభ్రాంతివలన ఆనందదుఃఖములు ఏకస్వరూపములే యైనను తారతమ్యములు కలవిగఁ దోఁచుచున్నవి" యనవలయును. ఈవిషయము నంగీకరించిన నిఁక చెప్పఁబడు పదార్థములకును ఒదమునకును గలసంబంధ మేమిగ నుండవలయును?ఆనందాదులు కార్యము లగుటకుఁ

గాని గుణము లగుటకుఁగాని వీలు లేదని సయుక్తికముగా నిరూపింపఁబడుటవలనను మూఁడవమార్గము లేకపోవుటవలనను అవి పదార్థములకు స్వరూపములే యైతీరవలయు ననియే చెప్పవలయును కదా !

ఇట్లయినను దుఃఖానుభవము కలుగుటకు వీలు లేదు, సర్వపదార్థములవలనను ఒక్కొకప్పుడొకానొకని కైనను ఆనందానుభవము కలుగుచునే యున్నది గావున సర్వపదార్థములును ఆనందరూపములే యనవలసియున్నది. ఇట్లుండ దానికి విరుద్ధముగ లోకమున దుఃఖానుభవ మెటనుండి కలుగును? అనియెదవేమొ వినుము. ప్రపంచమున వాస్తవస్థితిలో దుఃఖ మనునదియే లేదు. సర్వమును ఆనందమే. ఎంతదుఃఖమైనను క్రమ క్రమముగ క్షీణించి యల్పకాలములోనే యడంగుట యీవిషయమున ననుభవ దృష్టాంతము. పురుషుఁ డెప్పుడును స్వస్థచిత్తుఁడయ్యే యుండును. దుఃఖము నడుమనడుమ వచ్చుచుఁ బోవుచుండును. ఈయనుభవమును విమర్శించినచో పురుషస్వభావ మేది యగును? ఆనందమే. దుఃఖాభావ మానందమే కదా. ఈతత్త్వమును గ్రహించియే లోకులు సర్వసాధారణముగ "ఆపదలు కాపురము చేయునా?" అనున్యాయమును వాడుకొను చున్నారు. కావున దుఃఖము కేవలము భ్రాంతిసిద్ధ మైనదియే. సర్వప్రపంచమును కల్పించిన అజ్ఞానమే యేకస్వరూపునియందు జీవపరభేదమును సంపాదించిన అవిద్యయే యేకజీవునియందు స్వపరభేదమును నిర్మించిన మిథ్యాజ్ఞానమే యానందరూపము లగు పదార్థములనే దుఃఖరూపములనుగ భావించునట్లు చేయుచున్నది. అనాదినుండియు మనసునందు నిలిచియున్న రాగద్వేషాదులే (భేదదృష్టియే) దీనికిఁ గారణము. ఏయే పదార్థములయందు ద్వేష ముండునో ఆయాపదార్థములు దుఃఖరూపములుగాఁ గానం బడును. "తనకు దుఃఖానుభవము కలిగినపిదప ద్వేషము జనించు ననుట యుక్తియు క్తముకాని, ముందే జనించు ననుట యెట్లు" అనియెదవేమొ వినుము. సంసార మనాది యగుటచే నేది ముందో నిర్ణయించుటకు వీలు లేదు. ఏపదార్థమునకును దుఃఖరూప ముండుటకు వీలు లేదని పూర్వముననే యానందరూపత్వసిద్ధాంతముచే నిరూపింపఁ బడెను కదా! 'ఇట్లు చెప్ప నేల? ద్వేష మానందరూపపదార్థమును దుఃఖరూపమునుగఁ గనుపఱచిన ట్లీరాగము దుఃఖరూపమగు పదార్థమును ఆనందరూపముగఁ గనపఱచె నన రాదా? పదార్థములకు దుఃఖమే నైజస్వరూప మనరాదా?" అనియెదవేని ఈపూర్వపక్ష మిదివఱకే ఖండింపఁబడెను. సుఖము నిత్య మనియు, దుఃఖ మాగంతుక మనియుఁ గల లోకానుభవమును సదృష్టాంతముగ సన్యాయముగ నిదివఱకే వివరించియున్నాము. దేనికైనను నిత్యమగునదియే స్వరూప మగును గాని యాగంతుక మట్లు కానేరదుకదా ! కావున దుఃఖము భ్రాంతిసిద్ధము. సర్వపదార్థములకు ఆనందమే స్వరూపము. కావున

జీవునకును ఆనందమే స్వరూపము. జీవబ్రహ్మములకు భేదము లేదు గావునను బ్రహ్మము సర్వవ్యాపక మగుటచేతను వానియందు కలయానందమే సర్వపదార్థములయందు నున్నది. ఈపదార్థములన్నియుఁగూడ త్రాటియందు సర్పమువలె నజ్ఞానముచే వానియందే యారోపింపఁబడినవి యగుటచే వానికంటె భిన్నములు కావు. అయినను అనాదినుండి వచ్చుచున్న అజ్ఞానమువలన వీనిని బ్రహ్మభిన్నములుగాఁ జూచుచున్నాము. వీనికి స్వరూప భూతమగు పరమానందమును గూడఁ బరిచ్ఛిన్నానందముగఁ జూచుచున్నాము. ఏపదార్థము నందు బహుజనులకు వారివారి చిత్తపరిపాకము ననుసరించి యాదర మధిక ముగ నుండునో, వాని నధికానందముగ కలిగించువానినిగాను ఇతరముల నల్పానందజనకము లనుగాను తలంచుచున్నాము. ఇదియే ఆనందతారతమ్యానుభవమునకుఁ గారణము. ఇందువలననే జీవునియందు మాత్రము పరిపూర్ణానందము గోచర మగుచున్న దని చెప్పుటకు వీలు కలిగినది. ఆతఁడు బ్రహ్మమున నారోపితుఁడు గాక శుద్ధుఁడే యగుటచే నిట్టి యనుభవము కలుగుటలో విరోధము లేదు. కావున సర్వపదార్థములకంటె ఆత్మయందే యధిక ప్రేమ కలదు. కావున నాతఁడు పరమానందరూపుఁడే. ఆనందతారతమ్య మెట్లు భ్రాంతిసిద్ధమో ప్రీతితారతమ్యముకూడ నట్లే భ్రాంతిసిద్ధ మని తెలిసికొనవలయును. తత్త్వజ్ఞులకు నన్నియు పరమానందరూపములే. పరప్రేమాస్పదములే. కావున సర్వవిధముల జీవుఁడును పరమేశ్వరునివలెనే సత్యజ్ఞానానందరూపుఁ డని సిద్ధాంత మైనది! ఈ సిద్ధాంతమువలన "జీవబ్రహ్మములకు భేదము లేదు" అనుట సిద్ధించినది.

అవ. "ఆత్మయందు ప్రేమ కల దనుట నిర్వివాదమే కాని యదియే సర్వాధిక మనుటకుఁ బ్రమాణ మేమి?" యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్ప్రేమాత్మార్థ మన్యత్ర నైవ మన్యార్థ మాత్మని,
అత స్తత్పరమం తేన పరమానంద తాత్మనః. 9

వ్యా. నను మా భూత్స్వరూపాసిద్ధిః ప్రేమ్ణః పరత్వే మానాభావాద్విశేషణాసిద్ధిర్హేతో రిత్యాశంక్యాహ:—తత్ప్రేమేతి. అన్యత్ర స్వాతిరిక్తే పుత్త్రాదౌ యత్ప్రేమ తదాత్మార్థం తేషామాత్మశేషత్వనిమిత్తకమేవ న స్వాభావికం. ఏవమాత్మని విద్యమానం ప్రేమాన్యార్థం న. ఆత్మనోఽనన్యశేషతయాన్యశేషత్వనిమిత్తకం న భవతి. కిన్త్వాత్మత్వనిమిత్తకమేవాతో నిరుపాధికత్వాత్తత్పరమం నిరతిశయం ఫలితమాహ:—తేనేతి. తేన నిరతిశయప్రేమాస్పదత్వేనాత్మనః పరమానందతా నిరతిశయసుఖరూపత్వం సిద్ధమ్.

టీ. అన్యత్ర = ఇతర పదార్థములయందుఁ (పుత్రమిత్రకళత్రాదులయందు) గల, తత్ = సర్వలోకప్రసిద్ధమయిన, ప్రేమ=స్నేహము, ఆత్మార్థం=తనకొఱకై మాత్రమే యున్నది (తనకు నుపయోగింతు రను కారణమువలన మాత్రమే భార్యాపుత్రాదుల యందు ప్రీతి కలుగుచున్నది యనుట.) ఆత్మని=తనయందుఁ గల (ప్రేమ), ఏవం = పైన వర్ణించిన విధముగ (ఒకనిపై నుండు ప్రేమ తనకొఱకైనట్లు), అన్యార్థం = ఇతరుల కొఱకైనది (ఇతరులకు తా నుపయుక్తుఁ డగు ననుకారణమువలన కలిగినది). న=కాదు. అతః = ఈకారణమువలన (ప్రేమకు తానే ముఖ్యాధార మగుటవలన), తత్ = ఆ ప్రేమ (తనయందుఁ [జీవునియందు] గల ప్రేమ), పరమం = సర్వాధిక మైనది. తేన = ఆకారణమువలన, ఆత్మనః=జీవునకు, పరమానందతా = పరమానంద స్వరూపము కలదు.

తా. మఱియు జీవునకు పరమానందస్వరూపము కల దనువిషయము లోకానుభవముచేతఁ గూడ బాగుగ స్థిరపఱుపవచ్చును. సర్వాధిక మగుప్రేమ దేనియం దుండునో అది పరమానందరూపము కావలయు ననియు, అట్టిప్రేమ జీవునియందే కల దనియుఁ గదా పూర్వము వివరించితిమి. ఈవిషయమున లోకానుభవము కలదు. ప్రతివాఁడును భార్యాపుత్రపశుమిత్రధనాదులఁ బ్రేమించుచున్నాఁడు కదా! ఈ ప్రేమకుఁ గారణ మేమి? ఈభార్యాపుత్రాదులలో నేపదార్థమైన దుష్టమై తనకు నుపయోగింపనిచో దానియం దెవ్వఁడైన ప్రేమమును జూపుచున్నాఁడా? లోకమున స్త్రీపురుషాదులును పశుపక్ష్యాదులు ననేకము లున్నను వానియందు సర్వసాధారణముగ ప్రేమను చూపుచున్నాఁడా? లేదు. తనకు నుపయోగించువానినిమాత్రమే ప్రతిపురుషుఁడును స్త్రీయును ప్రేమించుచున్నారు. పశుపక్ష్యాదులవిషయము కూడ నిట్టిదియే. తమ్ము నెవ్వఁ డాహారదానాదులచే రక్షించునో వానిని మాత్రమే యవి ప్రేమించుచున్నవి. వానివలన తమకు నుపయోగము కలదు కావున వాని నభిమానింపుచున్నవి. ఇది సర్వానుభవసిద్ధ మగు విషయము. ఇప్పుడు విచారింపుఁడు. ప్రతిజంతువునకును సర్వాధిక మగుపదార్థ మెయ్యది? దేనికొఱకై సర్వంబును ప్రేమింపఁబడు చున్నదో అట్టియాత్మయే కదా సర్వపదార్థములయందు నున్నప్రేమ తనకొఱకే యనుట మాత్రమేకాని తనపై నున్నప్రేమ మఱియొక దానికొఱకై యెప్పుడును పరిణమించుట లేదు. ఒకనికి తనవలన

ప్రయోజనము కలుగవలయు ననునుద్దేశముతో నెవ్వఁడును పదార్థాంతరమును ప్రేమింపఁడు. "ఇది యేమి? పరోపకారు లగుమహానుభావులు ప్రతిఫలమును కోరకయే పరులకు మహోపకారములఁ గావింపు చున్నారు కదా!" యనియెదవేని, వారును పరలోకములయందు తమకు సుఖభోగములు కలుగవలయు నను నుద్దేశముతోనే యాచరించుచున్నారు. ఇహమున ప్రతిఫలము లేకపోయినంతమాత్రమున తనపై నున్న ప్రేమ పదార్థము కానేరదు. పరలోకమును విశ్వసింపని వారు సహిత మిహలోకముననే మహాకీర్తిని గోరి పరోపకారము నాచరించుచున్నారు. మనస్సున కట్టి యుద్దేశము లేదని సాధించినను దాని వలనఁ గలుగుప్రతిఫలము కర్తకు వచ్చియే తీరును. అప్పుడు "ఆత్మ పరులకు నుపయుక్తుఁ డగుచున్నాఁడు" అనుట భ్రాంతియే యగును కదా! మఱియు నాత్మయొకప్పుడు పదార్థుఁడు కావలసివచ్చును; మఱి యొకప్పుడు స్వతంత్రుఁడు కావలసివచ్చును. ఇతరభూతములను స్వీయముగా నుపయోగించుకొనునప్పుడు స్వతంత్రుఁడు, ఇతర భూతముచే నుపయోగించుకొనఁబడునప్పుడు పరతంత్రుఁడును కావలసి వచ్చును. ఈ రెండు ధర్మములును పరస్పరవిరుద్ధములు. కావున నొక్కని యందే యుండుటకు వీలు లేదు. "పరులచే నుపయోగించుకొనఁబడుటకుఁ దగినవాఁడు" అనుట మొట్టమొదట సిద్ధించినఁగదా "ఆత్మయందుఁ గలప్రేమ పరార్థ మగునా? కాదా?" యని విచారించుటకు నవకాశము కలుగుట. కావున నెప్పటికిని ఆత్మయందు కల ప్రేమ పరార్థము కానేరదు.

వి. ఇట్లు చెప్ప నేల? ఆత్మ పరులచేతఁ గూడ నుపయోగించుకొనఁబడుచునే యున్నాఁడు. భృత్యుఁడు ప్రభువుచే నుపయోగించుకొనఁబడుచున్నట్లే అన్నవస్త్రాది గ్రహణము మూలమున ప్రభువు కూడ భృత్యునిచే నుపయోగించుకొనఁ బడుచునే యున్నాఁడు కదా! అనియెదవేమొ వినుము. వాస్తవస్థితిలో ఆత్మ యనేకులుగ నున్నాఁడని తలంచుటయే భ్రాంతి. విచారించిన నందఱ యాత్మయు నొక్కటియే. రెండవది యని యొక పదార్థ ముండిననే కదా యాత్మ పరార్థుఁ డగుట. మఱియు కొంచెము విమర్శించిన నీపూర్వపక్షమే రాదు. ప్రభువు పనిచెప్పిన దానిని నిర్వహించునది భృత్యునిదేహమే కాని యాత్మ కానేరదు. ఆత్మ సర్వసాక్షి యగుటచే దేహముకంటె భిన్నుఁ డని మున్నే వివరించి యున్నాము కదా! మఱియు భృత్యుఁ డడిగిన యన్న

వస్త్రాదుల నొసంగునది ప్రభువుయొక్క దేహమే కాని యాత్మ కాదు. ఆత్మ తన స్వయంజ్యోతిచే నింద్రియాదులఁ బ్రవర్తింపఁజేయువాఁడే కాని యెప్పటికిని స్వయముగ ప్రవర్తించువాఁడు కాఁడు. ఈవిధముగ విమర్శించినచో మీరు చూపిన దృష్టాంతమునందును దేహ మాత్మచేత నుపయోగించుకొనఁబడునది కాని ఆత్మ యన్య మగు నేపదార్థముచేతను ఉపయోగించుకొనఁబడుట లేదు.

కావున ఆత్మయందలి ప్రేమ స్వార్థమేకాని పరార్థము కానేరదు. ఇతర పదార్థములయందలి ప్రేమయును ఆత్మార్థమే యని వివరించితిమి. కావున నీప్రేమయందు (ఆత్మవిషయక మగు ప్రేమయందు) కొఱఁతయేమియు లేదు. ఇది పరిపూర్ణమైనదియే; సర్వాధిక మైనదియే. ఇట్లగుటచే నిట్టిప్రేమకు నాస్పదుఁ డగుటచే ఆత్మ పరమానంద రూపుఁడనుటలో సంశయము లేదు. ఆత్మకంటె నధికముగ మఱియొక్కదానిని ప్రేమించుటకు వీలు లేదు. కావున ఆత్మకంటె నధికముగ మఱియొక్కటి పరమానందరూపము కలది యగుటకు వీలు లేదు. కావున నెట్లు చూచినను జీవుఁడు పరమానందరూపుఁడు. ఈతనికి సత్యజ్ఞానరూపములు కల వని మున్నే వివరించి యున్నాము. శ్రుతియందును పరమేశ్వరుండు సత్యజ్ఞానానందరూపుఁ డని చెప్పఁబడియున్నాఁడు. జీవుఁడును నట్టివాఁడే యని నిరూపింపఁబడుటచే వారిరువురకు నైక్యము సిద్ధించినది.

అవ. ఇట్లు సర్వార్థమును వివరించి యుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం సచ్చిత్పరానంద ఆత్మా యుక్త్యా తథావిధమ్,
పరం బ్రహ్మ తయో శ్చైక్యం శ్రుత్యంతే షూపదిశ్యతే. 10

వ్యా. ఏతైః సప్తభిః శ్లోకైః ప్రతిపాదితమర్థం సంక్షిప్య దర్శయతి:—ఇత్థమితి. శబ్దస్పర్శాదయ ఇత్యాదినా జ్ఞానస్య నిత్యత్వం ప్రసాధ్య తస్యై వేయమాత్మేత్యాత్మత్వ ప్రసాధనేనాత్మనః సచ్చిద్రూపత్వం సాధితం. పరానంద ఇత్యాదినా చ పరమానంద రూపత్వం సమర్థితమతః ఆత్మా మహావాక్యే త్వంపదార్థః సచ్చిదానంద రూపః సిద్ధః. నన్వుక్తలక్షణస్యాత్మనో యుక్త్యైవావగతా వుపనిషదాం నిర్విషయత్వే నాప్రామాణ్య ప్రసంగ ఇత్యాశంక్యాహ:—తథా విధమితి. తథా తాదృగ్విధా ప్రకారో యస్య తత్తథావిధం సచ్చిదానందరూపం పరంబ్రహ్మ తత్పదార్థస్తయో స్త్వంపదార్థయోరైక్య మఖండైకరసత్వం గ శ్రుత్యంతేషు వేదాంతేషు ఉపదిశ్యతే ప్రతిపాద్యతే. అతో న వేదాంతానాం నిర్విషయత్వమిత్యర్థః.

టీ. ఇత్థం = ఈవిధముగ, యుక్త్యా = యుక్తులతోఁజూచిన, ఆత్మా = జీవుఁడు, పరానందః=పరమానందస్వరూపుఁడు (సత్యజ్ఞానస్వరూపుఁడు అని కూడ గ్రహింపవలయును). పరం బ్రహ్మ=పరబ్రహ్మము కూడ, తథావిధమ్ = అట్టిదియే, శ్రుత్యంతేషు =

వేదాంతములయందు (ఉపనిషత్తులయందు), తయో శ్చ = ఆయిద్దఱకును, ఐక్యం = అభేదము, ఉపదిశ్యతే = ఉపదేశింపఁబడును.

తా. ఈవిధముగ శ్లోకసప్తకముచే జీవుఁడు సత్యజ్ఞానానంద రూపుఁ డని యుక్తులచే సాధింపఁబడెను. "శబ్దస్పర్శాదయః" అను శ్లోకము మొదలు "సంవి దేషా స్వయంప్రభా" అను శ్లోకమువఱకు సత్యజ్ఞానరూపములును, తర్వాత "పరమానంద తాత్మనః" అను నంతవఱకు ఆనందస్వరూపంబును అభివర్ణింపఁబడెను. పరబ్రహ్మము కూడ నిట్టివాఁడే యనుట శబ్దప్రమాణమువలన గోచర మగుచున్నది. తెలియనివిషయమును ప్రకటించిననే కాని శాస్త్రమునకు ప్రామాణ్యము కలుగదు. ప్రత్యక్షాదులకంటె భిన్నముగ గ్రహింపఁబడినప్పుడు శబ్ద ప్రమాణము ప్రమాణాంతరముల కగోచర మగువిషయమును చెప్పి తీరవలయును. అదియును ప్రత్యక్షాదిగోచర మగువిషయమునే చెప్పు నేని యనువాదమాత్రమే యగునుకాని ప్రత్యక్షప్రమాణము కానే రదు కదా! కావున పరబ్రహ్మమును గూర్చియు నాతని లక్షణములను గూర్చియు వేద మెట్లు చెప్పిన నట్లే యంగీకరించి తీరవలయును. మఱియు నావేదము జీవబ్రహ్మములకు నభేదమునే యుపదేశించు ననువిషయ మునుబట్టి చూచినను ఈవిషయమే సిద్ధాంత మగును. జీవుఁడు సత్య జ్ఞానానందరూపుఁ డను విషయము కేవలములగు ననుభవములతోనే నిరూపింపఁబడెనుకదా! ఆతనికి నభిన్నమగు బ్రహ్మము మాత్రము భిన్నస్వరూప మగుట యెట్లు? కావున పరబ్రహ్మము కూడ సచ్చిదానంద రూప మనుట నిర్వివాదాంశము. ఉపనిషత్తులును ఈకారణమువలన "తత్త్వ మసి" ఇత్యాది మహావాక్యములమూలమున నీజీవబ్రహ్మము లకు భేదము లే దని యేకవాక్యముగఁ జెప్పుటయేకాక "నేను బ్రహ్మ భిన్నుఁడను; దుఃఖరూపుండను; సంసారిని." అను మొదలగు భ్రాంతు లనుగూడ నివారింపుచున్నవి. ఇదియే శాస్త్రార్థసంగ్రహము.

అవ. ఈరీతిగ సర్వశాస్త్రార్థమును సంక్షేపముగఁ జెప్పి దానిని విస్తరించువాఁడై యాక్షేపసమాధానములతో బంధస్వరూపమును వివరింపుచున్నాఁడు:—

శ్లో. అభానే న పరం ప్రేమ భానే న విషయే స్పృహా,
అతో భానే ప్యభా తాఽసౌ పరమానందతాఽఽత్మనః. 11

వ్యా. ఆత్మనః పరమానందరూపత్వమాక్షిపతి.—అభాన ఇతి. పరమానంద రూపత్వం న భాసతే భాసతేవా. అభానేఽప్రతీతౌ న పరం ప్రేమాత్మ నిరతిశయ స్నేహాస్యస్యాద్విషయసౌందర్యజ్ఞానజన్యత్వా త్స్నేహస్య భానే ప్రతీతౌతు విషయే సుఖసాధనే ప్రగాఢా తజ్జన్యే సుఖేవా స్పృహా ఇచ్ఛా న స్యా త్ఫలప్రాప్తౌ సత్యాం సాధనేచ్ఛానుపపత్తేః నిత్యనిరతిశయానందలాభే సతి క్షణికే సాధనపారతంత్ర్యాదిదోష దూషితే వైషయికే సుఖే స్పృహాఽయోగాచ్చ తస్మాన్నానందరూపతాత్మన ఉప పన్నేతి ప్రకారాంతరస్యాత్మసంభవాన్నైవమితి పరిహరతి.—అత ఇతి. యతోనాభాన పక్షయో రుభయోరపి దోషోఽస్త్యతః కారణాదాత్మనోఽసౌ పరమానందతాభానేఽపి ప్రతీతౌ సత్యామపి అభానతా న ప్రతీతా భవతి.

టీ. అభానే=ప్రకాశింపకపోయినయెడల (ఆత్మ స్పష్టముగ తెలియఁబడకుండిన యెడల), పరం = పూర్వము చెప్పినట్లు సర్వోత్కృష్టమైన, ప్రేమ=ప్రీతి, న=ఆత్మ యందు కలుగుటకు వీలు లేదు (విషయము స్పష్టముగఁ బ్రకాశించిననే కదా దాని యందు రాగద్వేషములు కలుగు ననుట). భానే=ఆయాత్మ ప్రకాశించునేని, విషయే= ఇతర పదార్థములయందు, స్పృహా=ఆశ (వీనివలన మన మానందము ననుభవింపవలయు నను నాశ), న = కలుగదు (ఆత్మ పరిపూర్ణానందరూపుఁడు కావునను, విషయములు ఆత్మభిన్నములుగాను, పరిచ్ఛిన్నానందరూపములుగాను భావింపఁబడుచున్నవి కావునను ఆత్మను చూచిన పిదప విషయములపై నిచ్ఛ జనింప దనుట.) అతః=ఈకారణమువలన, ఆత్మనః = జీవునియొక్క, అసౌ=ఈ, పరమానందతా=ఆనందరూపము, భానే అపి = ప్రకాశించుచున్నను, అభాతా=ప్రకాశింపకున్నది యనవలయును.

తా. ఇప్పటికి సంక్షేపముగ శాస్త్రార్థము వివరింపఁ బడెను. ఇఁక నిదియే సవిస్తరముగ విమర్శింపఁబడును. పైనఁ జూపిన యుక్తుల వలన జీవుఁడు సత్యజ్ఞానానందరూపుఁ డనుట స్పష్టమయ్యెను కదా! దీనిపై నొక యాక్షేపమునకు నవకాశము కలదు. ఈజీవరూపము స్పష్టముగ ప్రకాశించునా? లేదా? ప్రకాశించు ననినచో నప్పుడు అల్పానందమును కలిగించు నితర పదార్థములపైఁ బ్రేమ యుండుటకు వీలు లేదు. సామ్రాజ్యము దొరకినవెనుక చిన్న యుద్యోగముల నర్థించువాఁ డెవ్వఁడైనఁ గలఁడా? తానే పరమానందరూపుఁడైనచో, బహుప్రయాససాధ్యము లగు నల్పసుఖముల నెవ్వఁడైనఁ గోరునా? ఇఁక ప్రకాశింప దనినచో సర్వానుభవసిద్ధమై సర్వాధికముగ ఆత్మ

యందుఁ గన్పట్టు ప్రేమకు గతి లేకపోవలసివచ్చును. వస్తువు రమ్యమని తెలియకున్న దాని నెవ్వఁడును ప్రేమింపనేరఁడు కదా ! ఈ వస్తుప్రేమసంబంధ మనాదియే యైనను పరస్పరకార్యకారణభావమునకు మాత్రము భంజక మేదియు లేదు. కావున ఆత్మ (జీవుఁడు) ప్రకాశించుచున్నాఁ డనినను దోషమే, లేదనినను దోషమే యగుచున్నది.

వి. కావున నీసంశయమును నివారించుట యావశ్యకము. ఆత్మకు సత్వరూపము జ్ఞానరూపము ఆనందరూపము అని మూఁడురూపములు కలవు. అందు తత్త్వజ్ఞానరూపములు ప్రకాశించుచునే యున్నవి. ప్రకాశింప కున్నను వానివలన దోషోద్భావన చేయుటకు వీలు లేదు. కావుననే కేవల మానందరూపమునుబట్టియే యాత్మప్రకాశాప్రకాశముల నిర్ణయించుటకై దోషోద్భావన చేయఁబడెను. దీనికి సమాధానము లేకపోలేదు. అగుటయు కాకపోవుటయు నని రెండుమాత్రమే నియతము లనియు, వానియందు దోషము కలిగినచో నిఁక సమాధానమునకు నవకాశ ముండ దనియు భావించుట తగదు. సంపూర్ణముగఁ గాకయు, కాకపోవకయు మధ్యస్థమై యుండుస్థితులు కూడఁ గొన్ని కలవు. అర్థసిద్ధము లగు కార్యము లన్నియు నీజాతిలోనివే కావున జీవస్వరూపము కూడ నిట్టిదియే యనవచ్చును. అది ప్రకాశించుచుండియు ప్రకాశింపకున్నది.

అవ. "ఇది యెట్లు? ఒక్కనియందు విరుద్ధధర్మము లుండునా" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అధ్యేతృవర్గమధ్యస్థపుత్రాధ్యయనశబ్దవత్,
భానేఽప్యభానం భానస్య ప్రతిబంధేన యుజ్యతే. 12

వ్యా. నన్వేకస్య యుగపద్భానాభానే న యుజ్యేతే ఇత్యాశంక్య కిమిదమయుక్తత్వం అదృష్టచరత్వ ముపపత్తిరహితత్వం వా ! నాద్య ఇత్యాహ—అధ్యేతృవర్గేతి. అధ్యేతౄణాం వేదపాఠకానాం వర్గః సమూహ స్తస్య మధ్యే తిష్ఠతీత్యధ్యేతృవర్గమధ్యస్థః. సచాసౌ పుత్రశ్చేతి తథా. తస్యాధ్యయనం తత్కర్తృకం పఠనం తస్య శబ్దోధ్వనిర్యథా బహిస్థస్య పితుర్భాసమానోఽపి సామాన్యతోభాసతేనవిశేషతోఽయం మత్పుత్రధ్వనిరితి, తథానంద స్యాపి భానేఽప్యభానం భవతీత్యర్థః. ద్వితీయం ప్రత్యాహ—భానస్యేతి. భానేఽప్యభాన మిత్యేతదత్రాప్యనుపపంజనీయం. భానస్య స్ఫురణస్య ప్రతిబంధేన వక్ష్యమాణలక్షణేన భానేఽప్యభానం సామాన్యతః ప్రతీతావపి విశేషా కారేణాప్రతీతిర్యుజ్యతే, ఉపపద్యత ఇత్యర్థః.

టీ. అధ్యేతృ...శబ్దవత్-అధ్యేతౄ = అధ్యయనము చెప్పువారియొక్క, వర్గ=సమూహమునుయొక్క, మధ్య=నడుమ, స్థ=ఉన్న, పుత్ర = పుత్రునియొక్క, అధ్యయనశబ్దవత్=అధ్యయనము చెప్పుధ్వనివలె, భావస్య=ప్రకాశముయొక్క (జీవుని యానంద స్వరూపము ప్రకాశించుటయొక్క), ప్రతిబంధేన=తిరస్కారముచే, భానేఅపి=ప్రకాశించుచున్నను (సామాన్యముగ ప్రకాశించుచున్నను), అభానం = ప్రకాశింపకుండుట (విస్పష్టముగఁ బ్రకాశింపకుండుట), యుజ్యతే = యుక్తియుక్తమగును.

తా. పైన చేసిన సిద్ధాంతములో నాక్షేప మేమియు లేదు. ఆత్మస్వరూపము ప్రకాశించియు ప్రకాశింపకున్నది యనవచ్చును. ఒక్కపదార్థమునందు విరుద్ధధర్మము లుండఁగూడ దనుట యిచట సిద్ధాంతభంగమును కలిగింపనేరదు. ఈయాక్షేపమున నీయభిప్రాయ మేమి విరుద్ధధర్మములు గలపదార్థములు లోకమునఁ గానవచ్చుట లేదనియా? లేక నాపక్షమును సిద్ధాంతము చేయుటకుఁ దగిన యుక్తులు లేవనియా? ఇందు మొదటిపక్షము యుక్తము కాదు. విరుద్ధధర్మములు కలపదార్థములనేకములు లోకమునఁ గానవచ్చుచున్నవి. విరుద్ధధర్మము లనఁగా శీతోష్ణాదులవంటివి కావు. సామాన్యవిశేషభేదములచే భిన్నములైన ధర్మములే యని తెలిసికొనవలయును. జీవునిఁగూర్చి చెప్పిన ప్రకాశాప్రకాశములు నిట్టివే. "జీవుఁడు సామాన్యముగ ప్రకాశించుచున్నను విశేషముగఁ బ్రకాశింపకున్నాఁడు" అని మాత్రమే పై సిద్ధాంతము చేయఁబడె నని గ్రహింపవలయును. విచారించిన నివి విరుద్ధధర్మములే కానేరవు. సామాన్యవిశేషభావములే పరస్పరభిన్నములు కాని ప్రకాశమునకు విరుద్ధగుణ మేదియు రాలేదుకదా!

వి. ఇట్టిపదార్థములు లోకములో ననేకములు ప్రత్యక్షగోచరము లైయున్నవి. పలువురు బాలు రధ్యయనము చెప్పుచున్నసమయమున వారలతోఁగూడి యొకనిపుత్రుఁ డుచ్చైస్స్వరములో నధ్యయనమును చెప్పుచున్నను వెలుపలనున్నతండ్రికి ఇది నాపుత్రునికంఠధ్వని యని స్పష్టముగఁ దెలియదు కదా! ఇంతమాత్రమున నాపుత్రకంఠధ్వని యచ్చట లేదా? ఉన్నది. ఉన్నను విశేషముగఁ దెలియఁబడుట లేదు. శబ్దసామాన్యజ్ఞానము మాత్రమే యచ్చట కలదు గాని ఇది పుత్రకంఠధ్వని యిది యితరుల కంఠధ్వని యనువిశేషజ్ఞానము మాత్రము లేదు. ఇట్లే జీవునియానందరూపముగూడ సామాన్యముగఁ బ్రకాశింపవచ్చును; విస్పష్టముగఁ బ్రకాశింపక పోవచ్చును. కావున మొదటిపక్షము

నాశ్రయించిన మాసిద్ధాంతమునకు భంగము కలుగదు. ఇఁక రెండవపక్షము నాశ్రయించుటకును వీలు లేదు. లోకానుభవసిద్ధమైనసిద్ధాంతమును స్థాపించుటకు యుక్తులు లేక పోవునా? సామాన్యముగఁ బ్రకాశించియు విశేషముగఁ బ్రకాశింపకుండుట నేదియైన నొక ప్రతిబంధ ముండవచ్చును. ప్రకాశమునకు ప్రతిబంధము కలిగినచో నది స్పష్టము కాకపోవచ్చును;మిగుల మాలిన్యము గలయద్దమునం దున్న దీపమువలెఁ బ్రకాశస్వభావము కలవాఁ డగుటచేఁ గొంతవఱకు నాతఁడు (జీవుఁడు) ప్రకాశింపవచ్చును. కావున మా సిద్ధాంతమునకు నెట్లును భంగము లేదు. జీవరూపము ప్రకాశించియుఁ బ్రకాశింపకున్నది.

అవ. జీవప్రకాశమునకు ప్రతిబంధము కల దంటిరి కదా. దానికి స్వరూప మేమి ? యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రతిబంధోఽస్తి భాతీతి వ్యవహారార్హవస్తుని,
తన్నిరస్య విరుద్ధస్య తస్యోత్పాదన ముచ్యతే. 13

వ్యా. కోఽసౌ ప్రతిబంధ ఇత్యత ఆహ:—ప్రతిబంధఇతి. అస్తి భాతీతి వ్యవహారార్హ వస్తుని అస్తి విద్యతే భాతి ప్రకాశత ఇత్యేవంప్రకారం వ్యవహారమర్హతీత్యస్తిభాతీతివ్యవహారార్హం తచ్చ తద్వస్తు చేతి యథా తస్మిన్ తం పూర్వోక్తం వ్యవహారం నిరస్య నిరాకృత్య విరుద్ధస్య నాస్తి న భాతీత్యేవంరూపస్య తస్య వ్యవహారస్యోత్పాదనం జననం ప్రతిబంధ ఇత్యుచ్యతే.

టీ. అస్తి=కలదు, భాతి = ప్రకాశించుచున్నది. ఇతి = అని, వ్యవహారార్హవస్తుని-వ్యవహార = వ్యవహరించుటకు, అర్హ = తగిన, వస్తుని = బ్రహ్మాభిన్నజీవరూపమగు పదార్థమునందు (వాస్తవస్థితిలో స్పష్టముగనే ప్రకాశించుచు నున్న జీవుని యందు), తత్ =ఆవ్యవహారమును, నిరస్య = త్రోసివేసి, విరుద్ధస్య=దానికి విరుద్ధమైన (లేదు ప్రకాశించుట లే దనుస్వరూపము గల), తస్య=ఆవ్యవహారముయొక్క, ఉత్పాదనం = పుట్టించుట (అట్లు వ్యవహరించుట). ప్రతిబంధ = ప్రతిబంధ మని (ప్రకాశమునకు నాటంక మని), ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. వాస్తవస్థితిలో నీ జీవుఁడు స్పష్టముగనే ప్రకాశించుచున్నాఁడు. మనుజులు వానిని ప్రకాశింపనివానిగ భ్రాంతిచే భావించుచున్నారు. ఈవిధముగ చేయు భావన యేది కలదో అదియే ప్రతిబంధము. "కలదు; ప్రకాశించుచున్నది." అని వ్యవహరింపఁదగిన పదార్థమును విరుద్ధముగ "లేదు; ప్రకాశించుట లేదు" అని వ్యవహరించుటయే ప్రతిబంధము. ఈప్రతిబంధమువలననే జీవప్రకాశ మాటంక

పఱుపఁబడి యున్నది. ప్రకాశస్వరూపుఁ డగుటచే నాతఁడు మనోహంకారాదులతోఁ గలసి విభాగము చేయరాకుండఁ గొంత ప్రకాశించుచున్నాఁడు. ఇదియే యాతని సామాన్యప్రకాశప్రకారము. "వీఁడు జీవుఁడు; ఇవి ఇంద్రియములు." అని ప్రత్యేకముగా నెఱుంగుటయే కదా విశేషప్రకాశ మనఁగా నర్థము కావున నీప్రతిబంధ ముండుటచే జీవరూపము ప్రకాశించియు ప్రకాశింప కున్నది. "జీవుఁడు కలఁ డని యందఱకును తెలియును కదా! ఇందప్రకాశ మేది కలదు. ఆయనయొక్క యానందరూపము మాత్రము ప్రకాశింపకుండిన ప్రకాశింపకుండనిండు; దానికి పైఁజెప్పిన ప్రతిబంధ ముండిన నుండనిండు." అనినొక వేమొ వినుము. జీవస్వరూపము కల దనిమాత్రమే కాక ప్రకాశించుచున్నది యని కూడ సామాన్యముగఁ దెలియుచున్నది యని మేమును చెప్పుచునే యున్నాము. విశేషముగ మాత్రము దెలియలే దనుచున్నాము. విచారింపఁగా జీవుని యథార్థస్వరూపము దేహాదులకంటె వేఱైనది; సుఖదుఃఖాదిసంబంధములు లేనిది. ఇంత యేల? ఆతఁడే పరమేశ్వరుఁడు. ఈ యథార్థరూప మెవ్వరికైన స్పష్టమగుచున్నదా? లేదు కదా! ఇట్లగుటచే కేవలసామాన్యజ్ఞాన మున్నను లాభకారి కానేరదు. మఱియు నీసామాన్యజ్ఞానముకూడ వివేకవంతులకు మాత్రమే కలదు. కాని సర్వసామాన్యముగ నెల్లరకు లేదు. దేహమునే యాత్మగా భావించి వాదించువారలు కూడఁ గలరు కదా! కావున జీవస్వరూపమంతయు ప్రకాశాప్రకాశములతోనే యున్నది యనవలయును. ఈవిచారణ యానందరూపము నొక్కదానినే కూర్చినది మాత్రమే యనుట తగదు. అది వాదముకొఱకై మాత్రమే యుపలక్షణార్థముగ ("ఈయానందరూపప్రకాశమును గూర్చి చేయఁబడిన నిర్ణయము నాశ్రయించి సత్యజ్ఞానరూపములయొక్కయు స్వభావమును నిర్ణయింపవలయును" అని యూహించుటకు సాధనముగ) గ్రహింపఁబడె నని మున్నె వివరించి యున్నాము. కావున నెట్లు చూచినను "విపరీతభావనారూపప్రతిబంధమువలన జీవరూపము తదభిన్న మగుటచే బ్రహ్మరూపంబును ప్రకాశించుచుండియు ప్రకాశింపకున్నది" యనుటయే సిద్ధాంతము.

అవ. ఈవిధముగ విపరీతజ్ఞానమే ప్రతిబంధ మని చెప్పి దానికి హేతువును చూపుచున్నాఁడు:—

శ్లో. తస్య హేతు స్సమానాభిహారః పుత్రధ్వనిశ్రుతౌ,
ఇ హానాది రవిద్యైవ వ్యామోహైకనిబంధనమ్. 14

వ్యా. ఉక్తలక్షణస్య ప్రతిబంధస్య కారణం దృష్టాంతదార్ష్టాంతికయోః క్రమేణ దర్శయతి—తస్యేతి. పుత్రధ్వనిశ్రుతౌ పుత్రధ్వని శ్రవణలక్షణే దృష్టాంతే తస్య ప్రతిబంధస్య హేతుః కారణం సమాన అభిహారః బహుభిః సహ పఠనం. ఇహ దార్ష్టాంతికే వ్యామోహైకనిబంధనం వ్యామోహానాం విపరీతజ్ఞానానామేకనిబంధనం ముఖ్య కారణమనాదిరుత్పత్తిరహితా ఽవిద్యా. వక్ష్యమాణలక్షణా ప్రతిబంధస్య హేతు రిత్యర్థః.

టీ. పుత్రధ్వనిశ్రుతౌ - పుత్ర = పుత్త్రునియొక్క, ధ్వని = కంఠధ్వనిని, శ్రుతౌ = వినుటయందు ("అధ్యేతృవర్గమధ్యస్థ" అను శ్లోకమునందు చెప్పఁబడిన దృష్టాంతమునందు), తస్య=ఆప్రతిబంధమునకు (పుత్త్రునికంఠధ్వని వినఁబడకుండుటకుఁ గారణమైన యాటంకమును), హేతుః=కారణము, సమానాభిహారః - సమాన=పలువురి తోఁకలసి, అభిహారః = పలుకుటయే (అనేకుల కంఠధ్వనితోఁ గలసివచ్చుచుండుటచే, పుత్రకంఠధ్వని విభాగించి యెఱుంగుటకు వీలు కాకున్నది యనుట). ఇహ = ఈజీవుని విషయమునందన్ననో, వ్యామోహైకనిబంధనం - వ్యామోహ=విపరీతజ్ఞానమును, ఏక= ముఖ్యముగ, నిబంధనం=కూర్చునట్టి (విపరీతజ్ఞానమును కలిగించు), అనాదిః=ఉత్పత్తి లేని, అవిద్యా ఏవ=అవిద్యయే, (దీనిలక్షణము క్రిందచెప్పఁబడును.) హేతుః= కారణము.

తా. ఈ ప్రతిబంధము దేనివలన కలిగెనో చెప్పెదను వినుము. అధ్యయనము చేయుచున్న బాలురనడుమ నున్నపుత్త్రునియొక్క కంఠ ధ్వని ప్రత్యేకముగ గ్రహింపరాకుండుటకుఁ గూడఁ బ్రతిబంధమే కారణ మగు ననుట నిర్వివాదాంశము. ప్రకాశాప్రకాశములు కల ప్రతిపదార్థమునందును నీప్రతిబంధమే విశేషజ్ఞానాభావమునకుఁ గారణ మగుచుండు నని యిదివఱకే వివరించి యున్నాము కదా! ప్రతిబంధ లక్షణ మిచ్చటఁగూడ (పుత్త్రుని కంఠధ్వనిని వినుట యను దృష్టాంతము నందుఁగూడ) సమన్వయించును. పుత్త్రునికంఠధ్వనియు కలదియే; వాస్తవ స్థితిలోఁ జక్కఁగాఁ బ్రకాశించుచున్నదియే. లేనిదానివలెను ప్రకాశిం పనిదానివలెను విపరీతజ్ఞానముచే భావింపఁబడుచున్నది. కావున

దృష్టాంతమునందును ప్రకాశాప్రకాశములకు ప్రతిబంధమే కారణము. ప్రతిబంధ మనఁగా విపరీతజ్ఞానమే యని యిదివఱకే వివరించి యున్నాము. దృష్టాంతమున నీవిపరీతజ్ఞానమునకుఁ గారణము తోడిబాలురకంఠధ్వనియే. పలువురతోఁ గూడి చదువుచుండుటచే నొక్కని కంఠధ్వని విభాగించుటకు వీలు లేకున్నది యని యెల్లరకుఁ దెలిసిన విషయమే కదా! అట్లే జీవుని విషయమునందును విపరీతజ్ఞానమున కొక్కకారణము కలదు. అదియే సర్వలోకమోహినియగు నవిద్య(అజ్ఞానము.) దీనిస్వరూపము క్రింది శ్లోకములలో సవిమర్శముగ నిరూపింపఁబడును.

వి. "ఈపక్షము యుక్తియుక్తముగ నుండలేదు. జీవబ్రహ్మములకు భేదము లేదంటిరి. ఆతత్త్వము ప్రకాశించియు ప్రకాశింపకున్నది." యంటిరి. దానికిఁ గారణ మజ్ఞాన మంటిరి. లోకమున చేతనజడపదార్థములు రెండు మాత్రమే కల వంటిరి. అందును చేతనపదార్థము జీవబ్రహ్మాత్మకమైనది యొక్కటియే యంటిరి. ఇం దీయజ్ఞాన మెవ్వనికిఁ గలదు? జీవున కనిన నాతనికిని బ్రహ్మమునకును భేదము లేకపోవుటచే బ్రహ్మమునకే యనవలయును. ఇది యిష్టము కాదుకదా? ఇఁక జడమునకు నజ్ఞాన ముండు ననుట సంభవింప దనుటయే నిర్వివాదము. తెలిసికొనఁగలవాఁడేకదా తెలిసికొనకుండు ననఁదగియుండును. మనోధర్మమగుజ్ఞానము మనోరహితము లగు జడముల కెట్లు కలుగును?" అనియెదవేమొ వినుము. వాస్తవస్థితిలో జీవబ్రహ్మములకు భేదము లేకపోయినను లోకానుభవము ననుసరించి చూచిన భేదము కలదు. పరమార్థమునందు లేకపోయిన వ్యవహారమునందు భేదము కలదు. ఈభేదము నాశ్రయించి యీ అజ్ఞానము జీవునకు కల దనవచ్చును. దానివలన నాతఁడు స్వస్వరూపభూతుఁ డగుపరమేశ్వరునిఁ దన కంటె భిన్నునిగఁ దలంచుచున్నాఁ డనవచ్చును. "ఇట్లు చెప్పిన 'జీవుఁడు అజ్ఞానము వలన తన్నే తనకంటె వేఱుగఁ దలంచుచున్నాఁడు' అనిన య ట్లైనది. బ్రహ్మమునకుఁ గూడ నజ్ఞానసంబంధము నంగీకరించిన ట్లైనది." అనియెదవేమొ అట్లు గాదు. వ్యావహారికభేదమువలన జీవబ్రహ్మము లభిన్ను లైనను భిన్నులుగా భావింపఁబడుచున్నారు కదా! మఱియు తన్ను తానే తనకంటె భిన్నునిగఁ దలంచుటయు నప్రసిద్ధము కాదు. అవివేకులు పదుగు రొక కార్యమును సాధింపఁబోయి మఱల తమ్ము లెక్కించుకొనవలసి వచ్చినచో నందు లెక్కించువాఁడు తన్ను విడిచి తక్కినవారిని మాత్రమే లెక్కించుకొనుటయుఁ గల దని లోకమున ప్రసిద్ధి కలదు. (ఈదృష్టాంతము గ్రంథమునందే ముమ్ముందు స్పష్టము కాఁగలదు.) అప్పు డాలెక్కించినవాఁడు తన్నే యన్యునిఁగ భావిం

చిన వాఁడగును కదా! మఱియు సున్మత్తులు విచారపరాయణులు మొదలగువారు తమ తోఁ దామే సంభాషించుకొనుచుండుటను జూచుచున్నాము.స్వప్నమునందును సంస్కార వశమున తనయందే కల్పింపఁబడి తానే యయ్యున్న వివిధపదార్థములఁ దానే తనకంటె భిన్నములుగ భావించి పురుషుఁడు వ్యవహరించుచున్నాఁ డనుటలో వివా దములేదు. ఇట్లగుటచేఁ దగినకారణ మున్నప్పుడు తన్ను తనకంటె నన్యునిగ భావిం చుట యొకవిరుద్ధాంశము కాదు. "జీవబ్రహ్మములకు వ్యావహారికభేదము కల దని తన్నే యాధారము చేసికొని వాదించుచున్నారు. పరమార్థస్థితి యొకవిధముగ నుండఁ గేవల వ్యావహారికస్థితి కార్యసాధక మగుట యెట్లు?" అనియెదవేమొ వినుము. ప్రపంచము నందలి సర్వవిషయములును ఈవ్యావహారికస్థితి నాశ్రయించియే ప్రవర్తించుచున్నవి. సర్వశాస్త్రములును దీని నాశ్రయించియే యుపదేశింపుచున్నవి. సర్వకార్యములును దీని నాశ్రయించియే జరుగుచున్నవి. కావున ప్రస్తుతజీవబ్రహ్మభేదవిషయమునుగూర్చి ఈ యాక్షేపము చెల్లదు. చూడుఁడు. పరమార్థస్థితి ననుసరించిన దేనికి నవకాశము కలదో? బ్రహ్మము సత్యజ్ఞానానందరూప మనియు, నిర్వికార మనియు శ్రుతి చెప్పుచు న్నది; జీవుఁడు కూడ నట్టివాఁడే యని నిరూపించియున్నాము. ఆతఁడు సాక్షి యగు టచే నితరపదార్థములతో సంబంధము కలుగ దని నిరూపించియే యున్నాము కదా ! ఇప్పటికి చేతనతత్త్వ మొక్కటియైనది. ఇప్పుడు శాస్త్రము లెవ్వనిఁగూర్చి ధర్మముల నుపదేశించును? నీతుల నెఱింగించును? చికిత్సాదుల బోధించును? గ్రహతారకాదుల వివరించును? సృష్టిస్థితి ప్రళయముల నిర్ణయించును? ఆత్మజ్ఞానము ప్రకటించును? సర్వ శాస్త్రములును హితప్రాప్తినిఁ గూర్చియు నహితనివృత్తినిఁగూర్చియు మాత్రమే కదా ప్రవర్తించుచున్నవి. నిత్యశుద్ధుఁడై యానందరూపుఁడై యుత్పత్తి వినాశములు లేని వాఁడై యున్న పరమేశ్వరునకు హిత మెయ్యది? అహిత మెయ్యది? ఆయన దేనిని పరిగ్రహింపవలయును? దేనిని విడువవలయును? ఎవ్వఁడైనను తనకుఁ గల సుఖమునకంటె నధికసుఖమును సంపాదింపఁ బ్రయత్నించును. పరమేశ్వరుఁడన్ననో స్వయముగనే పరమానందరూపుఁడు. ప్రతివాఁడును దుఃఖమును పరిత్యజింపఁజూచును; ఆదుఃఖము భ్రాంతిసిద్ధ మగుటచే నెప్పటికిని బొత్తిగనే లేదు కావున దానివలనఁ బరమేశ్వరునకు సంబంధ మెట్లు కలుగును. కావున పరమార్థస్థితి నాశ్రయించినచో నేశాస్త్రమునకును ప్రవృత్తియే కలుగదు? అన్ని శాస్త్రములును వ్యావహారికస్థితి నాశ్రయించియే ప్రవర్తిం చుచున్నవి. ఇట్లుండ వేదాంతశాస్త్ర మొక్కటి మాత్ర మట్లు ప్రవర్తింపఁగూడ దను నిర్బంధ మేమి? "ఇట్లైన నీపరమార్థస్థితియే యసత్యమేమో? ఇదియు వేదాంతశాస్త్రము చేత నిర్ణయింపఁ బడినదియే కదా అనియెదవేమొ. ఈవాదము నిలువదు. జీవబ్రహ్మైక్య

మును గూర్చి సవిమర్శముగ మున్నే వివరించియున్నాము. శాస్త్రమంతయుఁ గూడ దానిని గూర్చియే వివరింపఁబోవుచున్నది. మఱియు నితరశాస్త్రములు నిర్ణయించిన భేదము ప్రమాణము కాఁగా యథార్థమైన యభేదము మాత్ర మట్లేల కారాదు? "భేద మనుభవములో నున్నదికదా !" యనియెదవేమొ. అనుభవ మంతయు యథార్థముగనే యుండవలయు నను నియమ మెచ్చట నున్నది? త్రాటియందు సర్పమును చూచుటయు ప్రత్యక్షానుభవమే కదా ! మఱియుఁ బ్రమాణాంతరసిద్ధము లగు విషయములఁ దెల్పిన శాస్త్రములే కావని యిదివఱకే నిరూపించి యున్నాము. కావున విచారించినచో వేదాంతశాస్త్రమొక్కటియే శాస్త్రము (పరమార్థమును దెల్పుశాస్త్రము). తక్కినవి స్వర్గాదిరూపము లగు కొన్ని యపూర్వవిషయముల బోధించుచుండుటచే నాయావిష యములయందు శాస్త్రములే (ప్రమాణములే) యైనను ప్రస్తుతవిషయమున (జీవబ్రహ్మ భేదాభేదవిషయమున) మాత్రము శాస్త్రములు (ప్రమాణములు) కానేరవు. అది యట్లుండె. పైవిమర్శము ననుసరించి చూచిన వ్యావహారికభేదము నాశ్రయించి అజ్ఞాన మునకు జీవునితో సంబంధమును చెప్పుటవలన విరోధ మించుకయు లేదు.

"ఇట్లయినను మీపక్షము నిలువదు. ఈయజ్ఞాన మెప్పుడు పుట్టినది ? జీవుఁ డెప్పుడు జనించెను ? అజ్ఞానము లేకున్న జీవబ్రహ్మభేదము లేదు; జీవబ్రహ్మభేదము లేకున్న నజ్ఞానమున కాశ్రయము లేదు." అనియెదవేమొ వినుము. ఈయజ్ఞాన మనాది. జీవుఁడును అనాదియె. అజ్ఞానవశమున నాతఁ డనుభవించు సంసారంబును అనాదియె. చక్రమునకు నారంభ మిది యని లేనట్లు ఈసంసారచక్రమునకుఁగూడ నారంభ మిది యని లేదు. అట్లుండకపోయిన నయుక్తమగును కదా యనియెదవేమొ. ఏదేని యొకదాని నారంభముగఁ గైకొని మాత్రమే వ్యవహారమును సమర్థించుకొనవచ్చును. ఇట్లుకాక యొకటి యవశ్యముగ నారంభ ముండితీరవలయునన్నచో ననేకవిరోధములు వచ్చును. బహుకాలమునుండియు నిర్మలమై నిర్వికారమైయున్న బ్రహ్మమునుండి యాకస్మికముగ జీవుఁ డొక్కఁడు తదభిన్నుఁడయ్యును సంసారియై యుదయించె ననిన నాకస్మికత్వము వచ్చును. ఉన్నట్లుండి కారణములేకయే యేదియో యొకటి కలిగె ననిన నది యుక్తికి నిలువదు కదా ! మఱియు నాజీవుఁడు నిరర్థకముగ తా నేమియుఁ జేయకయె బహువిధ సుఖదుఃఖముల ననుభవించె ననియుఁకూడ ననవలసివచ్చును. మొట్టమొదట జీవునకు సుఖ దుఃఖహేతువు లగు పూర్వకర్మములు లేవుకదా ! ఇదియు నసిద్ధమే. ఇట్లు చేయనిదె వచ్చె ననిన నంతకంటె నయుక్తమేది కలదు ? ఇదియునుగాక, ఆది కలిగినపదార్థములకు నంతము కూడ నుండవలయును. అప్పు డొకప్పటికి జీవుఁ డాకస్మికముగా నశించు ననవలసివచ్చును. అప్పుడు అంత్యజన్మమున చేసినకర్మలు ఫలశూన్యములై పోవలసివచ్చును. ఇదియు అయుక్తమే కదా ! కావున జీవునకుఁగాని, అతనిచే ననుభవింపఁబడు జన్మమరణ

రూప మగు సంసారమునకుఁగాని, అందలి సుఖదుఃఖాదులకుఁ గారణ మగు కర్మకుఁగాని సర్వమునకును మూలకారణ మగు నజ్ఞానమునకుఁ గాని యాది లేదు. అజ్ఞాన మనఁగా భ్రాంతియే యగుటచేతను, జీవాదిభేదము దానివలన జనించినది మాత్రమే యగుట చేతను, దానికి (అజ్ఞానాది సర్వప్రపంచమునకు) నంతము మాత్రము కలదు. త్రాటిని చూచి భ్రాంతివలన సర్ప మని గ్రహించినపుడు దీపము తెచ్చి "ఇది పాము కాదు త్రాడు" అని చూపఁగానే యాభ్రాంతి నశించునట్లే సద్గురుజ్ఞానదీపమువలన "ఇది ప్రపంచము కాదు; నీవు జీవుఁడవు కావు. సర్వము పరబ్రహ్మమే" అని చూపిన నప్పు డీభ్రాంతియు తొలంగు నని తెలిసికొనవలయును. కావున జ్ఞానోదయపర్యంతము అనా దిగ నీజీవునకు నజ్ఞానసంబంధము కలదు. ఆ అజ్ఞానము జీవు నాశ్రయించి పరమేశ్వరు నాచ్ఛాదించుచున్నది. జీవపరమేశ్వరులు పరమార్థస్థితిలో నొక్కటియే యైనను వ్యావ హారికభేదము నాశ్రయించి యిట్లు చెప్పఁబడె నని గ్రహింపవలయును.

ఈహేతువు కూడ చక్కఁగా నుండలేదు. ఊహకు నందనివిషయముల నన్నిటి నిట్లే సమన్వయింపవచ్చును. ప్రమాణముల కగోచర మగుటచే నీహేతువు అంగీ కార్యము కాదు. దీనికి దృష్టాంతమే లేదు. ఇట్టిహేతువు నంగీకరించువా రెవ్వరు? అని యెదవేమొ వినుము. మీవాదము మాకును సమ్మతమే. ఈహేతు వప్రామాణికమైనను మాసిద్ధాంతమునకు కొఱఁత లేదు. మీఁదు మిక్కిలి దీని కప్రామాణ్యము కలుగుటయే మాకు నభ్యర్థనీయము. వాస్తవస్థితిలో బ్రహ్మభిన్న మగు పదార్థ మొక్కటియును లే దనియు సర్వమును కల్పితమే యనియుఁగదా మామతము. ఇప్పుడు విచారింపుఁడు. మేము అనాదిత్వహేతువుతో దేనిని సాధింపవలయునో? "జీవాజ్ఞానసంబంధము నట్లే సాధించితిరి కదా?" యనియెదవేమొ. జీవాజ్ఞానములే పరమార్థస్థితిలో లే వనిన వాని సంబంధమును సాధించుట మతములో నెట్లు ప్రవేశింపఁగలదు? "అట్లైన దానిని మహా ప్రయాసతో సాధించితి రేల?" యందువేమొ. ఆపని అనాది యగు సంసారవాసనచే మోహితులై "దీని కుత్పత్తి యెన్నఁడు?" అని విచారింపఁ దలంచువారికొఱకై చేయఁబడెను. సిద్ధాంతమునకు మాత్రము దీనిని సాధించుటవలనఁ బ్రయోజనము లేదు. కావున నీయనాదిత్వహేతు వప్రామాణిక మైనను మాసిద్ధాంతమునకు హాని లేదు. ఏమతస్థు లీహేతువుచే తమ సిద్ధాంతముల సమర్థింపఁజూతురో వారికే కదా యీ దోష యుక్త మైన సిద్ధాంతభంగము కలుగుట. కావున నవిద్యాజీవులకుఁ గల సంబంధ మనాది యనుటలో సంశయము లేదు. ఇట్టి యవిద్యయే జీవునకు భ్రాంతిని కలిగించుచుఁ దనకుఁదానే సామాన్యముగఁ బ్రకాశించుచుండియు విశేషముగఁ బ్రకాశింపకుండినట్లు చేసినది; తనయందు తనకే విపరీతజ్ఞానమును కలిగించినది.

అవ. ఇఁక నవిద్యాస్వరూపమును సోపోద్ఘాతముగ సహేతుకముగ వివరింపుచున్నాఁడు:—

శ్లో. చిదానందమయబ్రహ్మప్రతిబింబసమన్వితా,
తమోరజస్సత్త్వగుణా ప్రకృతి ర్ద్వివిధా చ సా. 15
సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయాఽవిద్యే చ తే మతే,

వ్యా. ఇదానీం ప్రతిబంధహేతుభూతా మవిద్యాం ప్రతిపాదయితుం తన్మూలభూతాం ప్రకృతిం వ్యుత్పాదయతి—చిదానందేతి. యచ్చిదానందరూపం బ్రహ్మ తస్య ప్రతిబింబేన ప్రతిచ్ఛాయయా సమన్వితా యుక్తా తమోరజస్సత్త్వగుణా సత్త్వరజస్తమోగుణానాం సామ్యావస్థాయా సా ప్రకృతి రిత్యుచ్యతే. సా చ ద్వివిధా ద్విప్రకారా భవతి. చకారాద్వక్ష్యమాణం ప్రకారం సూచయతి. సహేతుకం ద్వైవిధ్యమేవ దర్శయతి—సత్త్వేతి. సత్త్వస్య ప్రకాశాత్మకస్య గుణస్య శుద్ధిః గుణాంతరేణా కలుషీకృతతా అవిశుద్ధిః గుణాంతరేణ కలుషీకృతత్వం తాభ్యాం సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం. తే చ ద్వివిధే మాయాఽవిద్యే మాయేత్యవిద్యేతి చ మతే సంమతే. విశుద్ధసత్త్వప్రధానా మాయా. మలినసత్త్వప్రధానా అవిద్యేత్యర్థః.

టీ. చిత్...సమన్వితా-చిదానందమయ = జ్ఞానానందరూపుఁడైన, బ్రహ్మ = పరబ్రహ్మముయొక్క, ప్రతిబింబ = ప్రతిబింబముతో (అద్దమునందు ప్రతిఫలించినముఖప్రతిబింబమువలెఁ దనయందుఁ బ్రతిఫలించిన బ్రహ్మప్రతిబింబముతో),సమన్వితా=కూడినట్టిదియు, తమోరజస్సత్త్వగుణా=సత్త్వరజస్తమోగుణములే రూపముగఁగలదియు (సత్త్వరజస్తమోగుణము లెక్కువతక్కువలు గాక సమానముగ నుండుస్థితియే స్వరూపముగఁగల), ప్రకృతిః = మూలప్రకృతి కలదు (ఇదియే తనయందలి ప్రతిబింబముయొక్క సామర్థ్యమువలన ప్రపంచమును నిర్మించి యందు జీవులను బహువిధములుగ సంచరింపఁజేయుచున్నది.) సా చ=అదియు, ద్వివిధా=రెండువిధములైనది, తే=ఆరెండువిధములును, సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం-సత్త్వ=ప్రకాశరూప మగు సత్త్వగుణముయొక్క, శుద్ధి=నిర్మలత్వముచేతను (ఇతరగుణములతో సంబంధము లేకపోవుటయె శుద్ధి యనఁబడును). అవిశుద్ధిభ్యాం = మాలిన్యముచేతను (ఇతరగుణములతో కలియుటయె మాలిన్యము), మాయావిద్యే=మాయయు నవిద్యయు నని (శుద్ధసత్త్వగుణము మాయ యనియు, అపరిపక్వగుణ మవిద్య యనియు), మతే = అంగీకరింపఁబడుచున్నవి.

తా. అవిద్య యనఁగా నజ్ఞాన మని సామాన్యముగ నిదివఱకే తెలుపఁబడి యున్నది. ఇఁక దాని విశేషస్వరూపమును వినుఁడు. సర్వప్రపంచమునకును మూలకారణమై మూలప్రకృతి యను నొక తత్త్వము

కలదు. ప్రపంచమున బహుభేదములతో ననుభవములో నున్న సత్వ రజస్తమోగుణములు సమానములై యెక్కువ తక్కువలు లేక యుండు టయే దానికి స్వరూపము. ప్రపంచమునఁ గానవచ్చు శాంతవృత్తి సత్వ గుణ మనియు, కామక్రోధాదియుక్తమై మనస్సును సంక్షోభింపఁజేయు ఘోరవృత్తి రజోగుణ మనియు, మూఢవృత్తి తమోగుణ మనియు తెలిసికొనవలయును. ఈవృత్తులకు గుణములు కారణము లని యైనను చెప్పవచ్చును.

వి. ఇట్టి యీప్రకృతి యనాదినుండియు పరమేశ్వరునియం దున్నది; పరమేశ్వ రుని నాధారము చేసికొనియే ప్రవర్తింపుచున్నది. దీనికి నద్దమువంటి స్వభావము కలదు. పరమేశ్వరుఁడు దీనియందుఁ బ్రతిబింబించియున్నాఁడు. ఆప్రతిబింబముయొక్క సామర్థ్యమువలననే యిది కార్యముల నాచరించుచున్నది. ఇంతమాత్రమువలన నద్వైత సిద్ధాంతమునకు భంగము వచ్చు నని తలంపవలదు. బ్రహ్మాభిన్నమగు పదార్థము లన్నియు శూన్యరూపములే యనియు, సంసారనిమగ్నులకొఱకై మాత్రమే వ్యావహారిక భేద మంగీకరింపఁబడుచున్నది యనియు జ్ఞప్తియం దుంచుకొనవలయును. మఱియు "ఉనికి" యనునది యొక్కటిగ మాత్రమే యుండవలయు ననుట సామాన్యజ్ఞానమునకుఁగూడ గోచరమగు విషయమే. అవి రెండు కల వనినచో వానికి భేదము కల దనువిషయమును నిరూపించుట యశక్యము కదా. స్వరూపభావములు సమానములై యుండ భేదము కలుగుట సంభవింప దని మున్నే వివరించి యున్నాము. ఈకారణమువలన బ్రహ్మ ప్రకృతులయొక్క సత్తలు (ఉనుకులు) భిన్నములుగ నుండుటకుఁ గూడ వీలు లేదు. కావున నివియన్నియు "ప్రకృతి పురుషులు వేఱువేఱుగా నున్నారు. పురుషుఁడు ప్రకృతియందుఁ బ్రతిబింబించెను" అను మొదలగు విషయములన్నియు కేవలవ్యావ హారికము లగుచుఁ బారమార్థికతత్త్వమునకు బాధను కలిగింపనేరవు.

ఇట్టి ప్రకృతి రెండువిధములుగ నున్నది. ఒకటి మాయ; రెండవది యవిద్య. ప్రకృతి యనఁగా సత్వరజస్తమోగుణముల సామ్యస్థితియే యని యిదివఱకే చెప్పితిమి. అందు సత్వగుణము ప్రకాశరూప మని స్పష్టము చేసితిమి. అది నిర్మలముగ నున్నప్పుడు మాయ యనఁబడును. నిర్మలముగ నుండుట యనఁగా రజస్తమోగుణములతోఁ గలియ కుండుటయే. మఱియు నది యపరిశుద్ధమైనప్పుడు అవిద్య యనఁబడును. అపరిశుద్ధ మగుట యనఁగా రజస్తమోగుణములతోఁ గూడుటయే యని తెలిసికొనవలయును. ఇట్లు చెప్పుటచే ప్రకృతియందు కల దని చెప్పఁబడిన బ్రహ్మప్రతిబింబ మీరెండింటియందు నుండవలయు నని తేలుచున్నది కదా.

అవ. ఇట్లు అవిద్యాప్రస్తావమువలన మాయాస్వరూపమునుగూడ వివరించి దానికిఁ (ఆవివరణమునకుఁ) బ్రయోజనమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయాబింబో వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః. 16
అవిద్యావశగ స్త్వన్య స్తద్వైచిత్ర్యా దనేకధా,

వ్యా. యదర్థం మాయాఽవిద్యయోర్భేద ఉక్తస్తదిదానీం దర్శయతి—మాయాబింబ ఇతి. మాయాబింబః మాయాప్రతిఫలితశ్చిదాత్మాతాం మాయాం వశీకృత్య స్వాధీనీకృత్య వర్తమానః సర్వజ్ఞః సర్వజ్ఞత్వాదిగుణకః ఈశ్వరః స్యాత్. అవిద్యేతి. అవిద్యావశగోఽవిద్యాయాం ప్రతిబింబత్వేన స్థితః తత్పరతంత్రస్తు చిదాత్మాఽన్యోజీవః. స్యాత్ సచ తద్వైచిత్ర్యాత్తస్యా అవిద్యాయా ఉపాధిభూతాయా వైచిత్ర్యాదవిశుద్ధితారతమ్యాదనేకధా నేకప్రకారో దేవతిర్యగాదిభేదేన వివిధో భవతీత్యర్థః. * 'యథాముంజాదిషీకైవమాత్మా యుక్త్యా సముద్ధృతః, శరీరత్రితయాద్ధీరైః పరం బ్రహ్మైవ జాయత' ఇత్యుత్తరత్ర శరీరత్రితయా ద్వివేచితస్య జీవస్య పరబ్రహ్మత్వం వక్ష్యతి—తత్ర తాని కాని త్రీణి శరీరాణి? తత్తదుపాధికో వా జీవః కిం రూపో భవతీత్యాకాంక్షాయాం తత్సర్వం క్రమేణ వ్యుత్పాదయతి సా కారణశరీరమిత్యాదినా—

టీ. మాయాబింబః = శుద్ధసత్త్వరూపిణి యగుమాయయందుఁ ప్రతిబింబించిన బ్రహ్మప్రతిబింబము, తాం=తనకు నుపాధి యైనయామాయను, వశీకృత్య = స్వాధీనము చేసికొని (ఆమాయ శుద్ధప్రకృతి యగుటచే నిర్మల మగునద్దము దీపము నావరింపనట్లు బ్రహ్మప్రతిబింబము నావరింప దనుట). సర్వజ్ఞః = సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వాదిగుణములు కల, ఈశ్వరః = ఈశ్వరుఁడు (ఈశ్వరశబ్దముచే వ్యవహరింపఁబడునది.) స్యాత్ = అగును (శుద్ధసత్త్వమున నున్నపరమేశ్వరబింబము నీశ్వరశబ్దముచే వ్యవహరించుచున్నామనుట). అన్యః తు = రెండవప్రతిబింబమైతే (మలినసత్త్వరూపిణి యగునవిద్యయందు ప్రతిబింబించియున్న రెండవప్రతిబింబమైతే), అవిద్యావశగః-అవిద్యా=ఆ యవిద్యకు, వశగః=స్వాధీనమైనది (ఆయవిద్య మురికితోఁ గూడినయద్దము దీపప్రకాశమును గూడ తగ్గించునట్లు తనయందలిప్రతిబింబము నాచ్ఛాదించుచున్నది యనుట).తద్వైచిత్ర్యాత్ - తత్ = ఆ యవిద్యయొక్క, వైచిత్ర్యాత్ = విచిత్రస్వభావములవలన (అవిద్య రజస్తమోగుణములతోఁ గూడిన సత్త్వమే యగుటచే నాగుణములయొక్క సంయోగభేదములవలన ననుట). అనేకధా=నానావిధములుగ నున్నది (ఆసంయోగములో సత్త్వగుణ మధికముగ నున్నప్పుడు దేవరూపముతోను, రజోగుణ మధిక మైనప్పుడు మనుష్యరూపముతోను, తమోగుణ మధికమైనప్పుడు పశుపక్ష్యాదిరూపములతోను నున్నది. ఈ ప్రతిబింబమే జీవశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది యని తెలిసికొనవలయును).

తా. ఇచ్చట నొక విశేషాంశము చెప్పవలసియున్నది. మూల ప్రకృతియందు పరమేశ్వర ప్రతిబింబము కల దని చెప్పియున్నాము. ఈ కారణమువలన ప్రకృతిభేదము లగుమాయావిద్యలయందును, ఆప్రతి బింబ ముండవచ్చు నని సుఖముగనే యూహింపవచ్చును. బింబప్రతిబింబ ములకు భేదము కలుగదు. కావున పరమేశ్వరుని యేకరూపమునకు నెప్ప టికిని హాని లే దనియు నిర్ణయింపవచ్చును. ఇక ప్రకృతము వినుఁడు. ఆమాయావిద్యలు తమయందుఁ గల ప్రతిబింబముల కుపాధు లనఁబడును. ఉపాధి యనఁగా నావరణము. అద్దమునందలి యవస్థాభేదములవలన ముఖ ప్రతిబింబము దీర్ఘముఁగాఁగాని, హ్రస్వముగాఁగాని, మలినముగాఁ గాని గానవచ్చినట్టు లీబ్రహ్మ ప్రతిబింబంబును మాయావిద్యోపాధుల నాశ్ర యించి బహువిధములుగఁ గానవచ్చుచున్నది. ఇంతమాత్రమువలన ముఖ్యబింబమునకుఁ గాని తుదకు ప్రతిబింబమునకైననుగాని ఆవికార ములతో సంబంధము కలుగ దని మఱియొకమాఱు చెప్ప నక్కఱలేదు. అద్దములో నున్న యవస్థాభేదములతో ముఖమునకుఁగాని తత్ప్రతిబింబ మునకుఁగాని సంబంధ ముండ దనుటలో నెవ్వరికిని వివాదము లేదుకదా! అయినను ఇచ్చట నొక్క విశేషము కలదు. ముఖ మచేతన మగుటచే నుపాధిగతవికారములఁ దనవిగా నది యభిమానించుట లేదు. బ్రహ్మము చేతనుఁ డగుటచే న ట్లభిమానించుచున్నాఁడు. ఈయభిమానమే బంధ కారణము. "ఇది యెట్లు సరిపడును? బింబము చేతనమైనను అచేతనమైనను ప్రతిబింబమునకు దానివలనఁ గలుగు నుపకార మేదియు లేదు. అది మాత్ర మెప్పటికి నచేతనమేకదా. ఇట్లుండ ముఖ ప్రతిబింబ ముపాధిధర్మ ములఁ దనవిగ నభిమానింపలేకున్న బ్రహ్మప్రతిబింబము మాత్ర మెట్లభి మానింపఁగలదు?" అనియెదవేమొ. వినుము. ఇచ్చటఁ బ్రతిబింబ మనఁగా లౌకికప్రతిబింబమువంటిదే యని తలంపవలదు. కొన్ని విషయములయందు దీనితో పోలిక యున్నను మఱికొన్ని విషయములయందు లేదు. ప్రతి బింబ మయ్యును బింబధర్మముల సచ్చిదానందాదుల సమగ్రముగఁ గలిగి యుండుటయే. ఈవిషయమున దృష్టాంతము. "దృష్టాంత మనిన సర్వ విషయములయందును సమానమై యుండవలయును కదా!" యని యెదవేమొ. అట్టి నియమము లేదు. ముఖము చంద్రునివలె నున్నది యనిన,

దానియందు (ముఖమునందుఁ) జంద్రునకుఁ గల ప్రకాశాది గుణములు కొన్నిమాత్రమే యుండునుగాని, వెన్నెలకాయుట భూమికి ప్రదక్షిణము సేయుట కలంకము మొదలగు నన్నిగుణములును లేవు. వాఁడు మన్మథుని వలె నున్నాఁ డనిన నంత సౌందర్యవంతుఁ డని మాత్రమే యర్థ మగును గాని శరీరవిహీనుఁ డని యర్థ మగునా? కావున దృష్టాంతదార్ష్టాంతికము లకు నేయంశమున పోలిక కావలయు నని యుద్దేశింపఁబడెనో, యాయం శమునమాత్రమే పోలిక కలుగునుగాని తక్కిన యంశములయందు కలు గదు. ప్రస్తుతవిషయమునందును "అద్దము మొదలగునుపాధులయందలి ధర్మములతో నందలి ప్రతిబింబములకు నెట్లు వాస్తవస్థితిలో సంబంధము లేదో, అట్లు లేకున్నను ఉన్నట్లు మనుష్యులచే నెట్లు భావింపఁబడు చున్నదో, అట్లే యీబ్రహ్మమునకును మాయాఽవిద్యాసంబంధము లేదు; లేకున్నను ఉన్నట్లు భావింపఁబడుచున్నది." అను నంశమున మాత్రమే ప్రతిబింబముతో పోలిక యుద్దేశింపఁబడెను. ఈయర్థము సిద్ధించుటకై మాత్రమే "బ్రహ్మము మాయాఽవిద్యలయందు ప్రతిబింబించియున్నాఁ డు" అని చెప్పఁబడెను. (విశేషము వలయువారు నాచే రచింపఁబడిన బ్రహ్మసూత్రార్థచంద్రిక, అంశాధికరణము. అ. ౨. పా. 3. సూ. ४3. ४3 చూచుకొనునది.) ఇఁక ప్రకృతము ననుసరింతము. ఈమాయాఽవిద్య లలో మొట్టమొదటిదానికిఁ గారణోపాధి యనియు, రెండవదానికిఁ గార్యోపాధి యనియుఁ బేర్లు. మాయా నిర్మలమైనది యగుటచే నందలి ప్రతిబింబము దానిధర్మములఁ (మాయాధర్మము లగు స్వచ్ఛత్వాదులఁ) దనవిగ భావించినను స్వస్వరూపస్థితినుండి భ్రంశము నొందలేదు; సత్త్వ గుణము జ్ఞానరూప మగుటచే సర్వాధిక మగుటచే సర్వనియామక మగు టచే (సత్త్వగుణము చిత్తమునకు శాంతిని కలిగించి చక్కని యాలోచ నను పుట్టించును. కావున దానివలన నేయేవిషయముల నెట్లెట్లు నిర్వ హింపవలసినదియు కరతలామలకముగ గోచర మగుచున్నది యనుట యనుభవసిద్ధము. ఇట్టి సామర్థ్యమునకుఁ గారణ మగుటచే నదియే సర్వ నియామక మని చెప్పఁబడెను (సర్వశక్తియుక్త మగుటచే సత్త్వమున నిలిచినయోగులు గూడ జగత్సృష్టిప్రళయములందు సహితము సామ ర్థ్యము కలిగియున్నా రనిన శుద్ధతత్త్వముయొక్క ప్రభావమునుగూర్చి

యేమి చెప్పవలయును). ఇది సర్వజ్ఞము, సర్వాధికము, సర్వనియామకము, సర్వశక్తియుక్తము మాత్రమే యై సర్వప్రపంచమును నిర్మింపఁగలుగు చున్నది. ఆమాయాసహితపరమేశ్వర ప్రతిబింబమే పాలు పెరుఁగుగా మారినట్లు అసహాయమై ప్రపంచరూపముతోఁ బరిణమించినది. ఇందును పరిణామ ముపాధి యగుమాయకే గాని యందలి ప్రతిబింబమునకుఁ గాదని తెలిసికొనవలయును. (ఈవిషయము ముస్ముందు వివరింపఁబడును) ఈవిధముగ మాయయందలి ప్రతిబింబము జగత్కారణ మగుటచే దానికిఁ (మాయకుఁ) గారణోపాధి యని పేరు కలిగినది. ఇందలి ప్రతి బింబమునకుఁ బైన వర్ణించినవిధముగ మాయాసంబంధము స్వరూపభ్రంశ కారణము కాకుండుటచే "ఆప్రతిబింబము మాయను వశపఱచుకొని యెను." అని చెప్పఁబడెను. ఈబింబమునకే యీశ్వరుఁ డని పేరు. ఇఁక రెండవది యగువిద్య కార్యోపాధి. కార్య మనఁగా సృజింపఁబడినది. ఈయుపాధియం దున్నప్రతిబింబమునకు జీవుఁ డని పేరు. వాస్తవస్థితి లోఁ గార్య మనునదియే లేకున్నను మూలప్రకృతియొక్క ప్రభావము వలన నది తోఁచుచున్నది యని యిదివఱకే చెప్పియున్నాము. ఈజీవుఁడు తానును శుద్ధబ్రహ్మమే యైనను సృజింపఁబడినవానివలె (పరతంత్రుని వలె) భ్రాంతిచే తనను భావించుకొనుచున్నాఁడు. ఈయువిద్య యపరిశుద్ధ సత్వగుణమే రూపముగఁ గలది యగుటచే దీనిధర్మములఁ దనవిగ భావిం చుటవలన నందలి ప్రతిబింబమునకు స్వస్వరూపచ్యుతి కలిగినది; పరమార్థ స్థితిలో లేకున్నను కలిగిన ట్లైనది. అందలిసత్వగుణము రజస్తమోగుణ సంసర్గముచే శుద్ధము కాకపోవుటచేతను తన జ్ఞానశక్తి నత్యల్పముగ మాత్రమే వెల్లడింపఁగలది యగుటచేతను ఆప్రతిబింబము అపరిశుద్ధంబును కించిద్జ్ఞంబును కామరాగాదియుక్తంబు నైనది. ఇట్లు స్వరూపస్థితి మాఱ్పునొందుటచే "అవిద్యాప్రతిబింబ మవిద్యకు లోఁబడినది" యని చెప్పఁబడెను. ఈవిధముగ జీవుఁ డవిద్యావశగతుఁ డై సంసారచక్ర మునఁ బరిభ్రమించుచున్నాఁడు. ఆయువిద్య గుణత్రయసంబంధమువలన వచ్చినది కావున నాసంయోగములోని భేదములవలన నానాభేదముల నొందుచున్నాఁడు. ఆసంయోగమునందు జీవుఁడు సత్వగుణ మధికమై నచో దేవత యనియు, రజోగుణ మధికమైనచో మనుష్యుఁ డనియు,

తమోగుణ మధిక మైనచో పశుపక్ష్యాదు లనియుఁ బిలువఁబడు చున్నాఁడు. ఇట్లు ఆజీవుఁడు తనను కార్యభూతునిగఁ (పరమేశ్వరునిచే సృజింపఁబడినవానిఁగఁ) దలంచుకొనుచుండుటచేఁ గార్య మయ్యెను; ఆతని యుపాధి గావున నవిద్యయుఁ గార్యోపాధి యయ్యెను. సర్వ వ్యవహారములును భ్రాంతిసిద్ధము లనువిషయమును బాగుగ జ్ఞప్తియం దుంచుకొనవలయును.

వి. ఇది యుక్తముగ నుండలేదు. ప్రతిబింబము కావలయు ననిన రెండు పదార్థ ములును (బింబమును ప్రతిబింబమును గ్రహించు దర్పణాదులును)దూరదూరముగ నుండ వలయును. ఇచ్చట రెండును సర్వవ్యాపకములే. ఇట్లుండ ప్రతిబింబ మెట్లు కలుగును? మఱియు నీప్రకృతికి "పరమేశ్వరుని యునికికంటె భిన్న మగునునికియే లే దని కూడఁ జెప్పితిరి కదా!" అనియెద వేమొ వినుము. ఈప్రతిబింబవిషయమును గూర్చి యిదివఱకే చాలినంతవఱకు వివరించియున్నాము. దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణ మగు పోలిక యుండవలసినపని లే దనికూడ నిరూపించి యున్నాము. "బ్రహ్మము ప్రతిబిం బించెను" అనుటకు "లోకమున ప్రతిబింబములకు నుపాధివికారములు లేకున్నను కలిగి యున్నట్లు భావింపఁబడుచున్నవిధంబుననే పరమేశ్వరునకును నుపాధివికారములు లేకున్నను సంబంధమాత్రమువలన నని యథార్థముగనే కల వని భ్రాంతిచేఁ దలంపఁబడు చున్నవి" అనుటయె తాత్పర్య మని చెప్పియున్నాము. గావున నీప్రశ్నమునకు నిచట నవకాశము బొత్తిగనే లేదు. ఉపాధులవలె బ్రహ్మము ఆత్మభిన్న మగుపదార్థమునం దెప్పటికిని ప్రతిబింబించినవాఁడు కాఁడు కదా! అయినను ఈపూర్వపక్షము ఖండించు టకు యుక్తులు లేకపోలేదు. ప్రతిబింబించునప్పుడు పరిచ్ఛిన్నప్రమాణములు కల రెండు పదార్థములు పరస్పరము భిన్నస్థానములలో నుండవలయు ననుట యొక నియ మము కాదు. ఆకాశము సర్వవ్యాపక మనుట యందఱు నంగీకరించిన విషయమే. వాయ్వాది సర్వభూతములు నాయాకాశమునందే నిలిచియున్నవి యనుటయుఁ బ్రత్య క్షమే. అవకాశ మిచ్చునది యంతయు నాకాశమే కదా! ఇట్టి యీయాకాశము తన యందే నిలిచియున్న జలములలో ప్రతిబింబించుచుండుటను మనము చూచుచున్నాము. "నక్షత్రాదులు మాత్రమే ప్రతిబింబించుచున్నవిగాని యాకాశము ప్రతిబింబించుట లేదు" అనియెదవేమొ అట్లు కాదు. ఆకసమున నక్షత్రాదు లెట్లు గానవచ్చుచున్నవో అట్లే జలమునందును గానవచ్చుచున్నవి గావున, వానిమధ్యమున నున్నయాకాశముఁ గూడ జలమున గానవచ్చుచున్న దనియే చెప్పితీరవలయును. లేకున్న నచ్చట నవకా శము గాన వచ్చుటకుఁ గారణ మేమి? "ఆకాశమునకు శబ్దము మాత్రమే గుణ

మనియు, నది కన్నులకు గానరా దనియు నందఱు నంగీకరించి యున్నారు. ఇట్లుండ దానికి ప్రతిబింబ మెక్కడిది? బింబమే కానరాకుండిన దానికి ప్రతిబింబ ముండునా?" అనియెదవేమొ. ఇప్పుడు మేము పారమార్థి కాకాశమును గూర్చి మాటలాడుట లేదు; "ఇది యాకాశము, నల్లగా నున్నది" అని సర్వసాధారణముగ వ్యవహరింపఁబడుచున్న భ్రాంతిసిద్ధాకాశమును గూర్చియే మాటలాడుచున్నాము. "ఇట్లైన నది సర్వవ్యాపకము కాదు కదా!" అనియెదవేమొ వినుము. విచారదృష్టిచే నారసిన నీవిషయము తెలియవచ్చుచున్నది కాని సామాన్యులదృష్టికి నాభ్రాంతిసిద్ధాకాశముగూడ సర్వవ్యాపకమే. సామాన్యులు ఆకాశమును నీలవర్ణము కలదానినిగాను, పూర్వభాగమున మాత్రమే యున్నదానినిగాను తలంచియు దాని సర్వవ్యాపకత్వము నంగీకరించి యున్నారు; సమీపమున నున్నప్పు డేమియుఁ గానరా దనియు, దూర మగుకొలఁది కొంచెము గోచర మగు ననియుఁ గూడఁ జెప్పుచున్నారు. కావున నిట్టి యీసామాన్యుల పక్షము నాశ్రయించియే యట్లు చెప్పఁబడెను. బ్రహ్మప్రతిబింబవిషయము కూడ నిట్టిదియే. అదియు సామాన్యుల యభిప్రాయము నాశ్రయించి చెప్పఁబడునదియే. విచారించిన బ్రహ్మభిన్న పదార్థమే యుండ దని యనేకపర్యాయములు నిరూపించియున్నాము. కావున సర్వవ్యాపక మయ్యు నాకాశము తనయందున్న జలములలో నెట్లు ప్రతిబింబించెనో యట్లే పరమేశ్వరుండును తనయందే యున్నప్రకృతియందు ప్రతిబింబించి యున్నాఁడు. మఱియొక విశేషము. ఆయాకాశము మేఘములయందలి జలములయందును, వానిచే కలిగిన ఘటస్థిత జలములయందును ప్రతిబింబించినట్లు, ఆ యీశ్వరుండును శుద్ధసత్వరూపిణి యగు మాయయందును తత్పరిణామభేద మగు నవిద్యయందును ప్రతిఫలించి యున్నాఁడు. (మాయ తన శుద్ధసూక్ష్మస్వరూపమును [సత్యగుణ మొక్కటియే స్వరూపముగ కలిగి యుండుటను] విడిచి రజస్తమస్సంసర్గచే స్థూలభావమును బొందుటయే కదా యవిద్యకు స్వరూపము. ఇది మాయాపరిణామ మనుటలో సంశయ మేమి?) మేఘజలము ఘటజలమునకుఁ గారణమైనట్లు మాయ యవిద్యకుఁ గారణము. ఘటజలము మేఘజలమునకుఁ గార్యమైనట్లు అవిద్య మాయకుఁ గార్యము. ఈకారణము వలనఁగూడ మాయ కారణోపాధి (కరణభూత మగునుపాధి). అవిద్య కార్యోపాధి.—

అవ. ఈవిధముగ జీవేశ్వరతత్వములను బోధించి జీవోపాధిని సవిమర్శముగ విమర్శింపుచున్నాఁడు. ఈవిమర్శవలన జీవునియందు భ్రాంతిచే నారోపింపఁబడుచున్న యుపాధిధర్మము లన్నియు తేటపడు ననియు, దానిచే ముముక్షువులు ఆధర్మముల భ్రాంతికల్పితములుగ నెఱిఁగి పరిహరించి జీవుని ప్రత్యేకముగ విభాగించి యెఱుంగఁ గలుగుదు రనియు నభిప్రాయము.

శ్లో. సా కారణశరీరం స్యాత్ ప్రాజ్ఞస్తత్రాఽభిమానవాన్. 17

వ్యా. సాఽవిద్యా కారణశరీరం స్థూలసూక్ష్మశరీరాదికారణభూతం ప్రకృత్యవస్థావిశేషత్వాత్కారణముపచారాచ్ఛీర్యతే తత్త్వజ్ఞానాద్వినశ్యతి చేతి శరీరం స్యాత్తత్ర కారణశరీరేఽభిమానవాన్ తాదాత్మ్యాధ్యాసేనాఽహ మిత్యభిమానవాన్ జీవః ప్రాజ్ఞః ప్రజ్ఞా అవినాశిస్వరూపాఽనుభవరూపా యస్య స ప్రజ్ఞః—ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః ఏతన్నామకః స్యాదిత్యర్థః.

టీ. సా = ఆయవిద్య, కారణశరీరం = జీవునకు గారణశరీరము ప్రపంచమునకుఁ గారణంబును ఆవరణ మగుటచే శరీరమువంటిదియుఁ గావున దానికిఁ గారణశరీర మనుపేరు కలిగెను. ప్రకృతి యంతయు నొక్కటియే కావున నవిద్యయు జగత్కారణమే, [ద్వైతవివేక మను నాల్గవప్రకరణమున జీవేశ్వరసృష్టులు ప్రత్యేకముగఁగూడ వివరింపఁబడి యున్నవి]. స్యాత్ = అగును. తత్ర = దానియందు, అభిమానవాన్ = ఆత్మాభిమానము కలజీవుఁడు, ప్రాజ్ఞ=ప్రాజ్ఞుఁ డనంబడును. (అదియే జీవత్వమునకు నారంభము. కావున జ్ఞానశక్తి సంపూర్ణమై యెన్నటికిని నశింపకపోవుటచే నీ పేరు కలిగినది.)

తా. పైన జీవోపాధిగా వర్ణింపఁబడిన యవిద్య యాతనికిఁ గారణశరీర మగును. ప్రపంచమునకుఁ గారణమై శరీరమువలె నాతని నావరించునదియై యుండుటచే దాని (అవిద్యను) నిట్లు వ్యవహరించుచున్నాము. మాయావిద్యలు రెండును ప్రకృతియే. కావున రెండింటికిని జగత్ కారణత్వము కల దని తెలిసికొనవలయును. అవిద్య మాయాపరిణామభూత యని చెప్పఁబడియున్నను జగత్కారణ మగుటకు విరోధము లేదు. పరిణామ మని చెప్పుట కూడ స్థూలసూక్ష్మావస్థల నాశ్రయించియే యని వివరించియే యున్నాము. ఈవిధముగఁ దనకుఁ గారణశరీర మగు నవిద్యను ఆత్మగా నభిమానించుచు దానిధర్మములఁ దనవిగ భ్రాంతి నొందుచు నున్నప్పుడు జీవుఁడు ప్రాజ్ఞుఁ డనఁబడును. ఇది (అవిద్యావరణము) ఇతని స్వరూపభ్రంశమునకు ప్రథమసోపాన మగుటచే నట్లు వ్యవహరింపఁబడుచున్నాఁడు. ప్రాజ్ఞుఁ డనఁగాఁ బండితుఁడు. యథార్థస్వరూపము జ్ఞానమే. కావున నిట్లు వ్యవహారము గలిగెను.

మఱియు "నేను సంసారిని, దుఃఖిని" అను సంకల్పములకంటె "నేను సృష్టికర్తను, సర్వవిభాగముల నేర్పఱచితిని" అను సంకల్పములు శ్రేష్ఠములు కదా! కారణాభిమానికి నిట్టిసంకల్పములే కలుగవలసి యుండుట చేతఁ గూడ నీతనిని ప్రాజ్ఞశబ్దముతో వ్యవహరింపవచ్చును. ఈతఁడు తక్కినవారల కంటె (సంసారులకంటె) బుద్ధిమంతుఁడే కదా!

అవ. ఇట్లు కారణశరీరోపాధిని వివరించి సూక్ష్మశరీరమును వివరించుచున్నాఁడు:—

శ్లో. తమఃప్రధానప్రకృతే స్తద్భోగా యేశ్వరాజ్ఞయా,
వియత్పవనతేజోఽంబుభువో భూతాని జజ్ఞిరే. 18
సత్త్వాంశైః పంచభి స్తేషాం క్రమా ద్ధీంద్రియపంచకమ్,
శ్రోత్రత్వగక్షిరసనఘ్రాణాఖ్య ముపజాయతే. 19
తై రంతఃకరణం సర్వై ర్వృత్తిభేదేన తద్ద్విధా,
మనో విమర్శరూపం స్యా ద్బుద్ధిః స్యా న్నిశ్చయాత్మికా. 20
రజోంశైః పంచభి స్తేషాం క్రమా త్కర్మేంద్రియాణి తు,
వాక్పాణిపాద పాయూపస్థాభిధానాని జజ్ఞిరే. 21
తై స్సర్వై స్సహితైః ప్రాణో వృత్తిభేదా త్స పంచధా,
ప్రాణోఽపాన స్సమాన శ్చోదానవ్యానౌ చ తే పునః. 22
బుద్ధికర్మేంద్రియప్రాణపంచకై ర్మనసా ధియా,
శరీరం సప్తదశభిః సూక్ష్మం తల్లింగ ముచ్యతే. 23
ప్రాజ్ఞ స్తత్రాభిమానేన తైజసత్వం ప్రపద్యతే,
హిరణ్యగర్భతా మీశ స్తయో ర్వ్యష్టిసమష్టితా. 24

వ్యా. క్రమప్రాప్తం సూక్ష్మశరీరం తదుపాధికం జీవం వ్యుత్పాదయితుం తత్కారణాకాశాదిసృష్టిమాహ—తమఃప్రధానేతి. తద్భోగాయ తేషాం ప్రాజ్ఞానాం భోగాయ సుఖదుఃఖసాక్షాత్కారసిద్ధయే తమఃప్రధానప్రకృతే స్తమోగుణ ప్రధానాయాః ప్రకృతేః పూర్వోక్తాయా ఉపాదానకారణభూతాయాః సకాశాదీశ్వరాజ్ఞయా ఈశనాదిశక్తియుక్తస్య జగదధిష్ఠాతురాజ్ఞయా ఈక్షాపూర్వకసర్జనేచ్ఛారూపయా నిమిత్తకారణభూతాయా వియదాదిపృథివ్యంతాని పంచభూతాని జజ్ఞిరే ప్రాదుర్భూతా న్యుత్పన్నానీత్యర్థః.

భూతసృష్టి మభిధాయ భౌతికసృష్టి మభిదధాన ఆదౌ జ్ఞానేంద్రియసృష్టి మాహ—సత్త్వాంశైరితి. తేషాం వియదాదీనాం పంచభిః సత్త్వాంశైః సత్త్వగుణభాగై రుపాదానభూతైః శ్రోత్రత్వగక్షిరసనఘ్రాణాఖ్యం ధీంద్రియపంచకం ధీంద్రియాణి. తేషాం పంచకం క్రమాదుపజాయతే. ఏకైకభూతసత్త్వాంశా దేకైకమింద్రియం జాయత ఇత్యర్థః. 19.

సత్త్వాంశానాం ప్రత్యేకమసాధారణకార్యాణ్యభిధాయ సర్వేషాం సాధారణం కార్యమాహ—తైరితి. తైః సహ సత్త్వాంశైః సర్వైః సంభూయ వర్తమానై రంతఃకరణం మనోబుద్ధ్యుపాదానభూతం ద్రవ్యముపజాయత ఇత్యనుషంగః. తస్యావాంతరభేదం సనిమిత్తమాహ—వృత్తీతి. తదంతఃకరణం వృత్తిభేదేన పరిణామభేదేన ద్విధాద్విప్రకారం భవతి. వృత్తిభేదమేవ దర్శయతి—మన ఇతి. విమర్శరూపం విమర్శః సంశయాత్మికా వృత్తిః సా స్వరూపం యస్య తత్తథా తన్మనః స్యాత్. నిశ్చయాత్మికా నిశ్చయోఽధ్యవసాయస్స ఆత్మా స్వరూపం యస్యాస్సా నిశ్చయాత్మికా సా వృత్తి ర్బుద్ధిః స్యాత్. 20.

క్రమప్రాప్తానాం రజోంశానాం ప్రత్యేకమసాధారణకార్యాణ్యాహ—రజోంశైరితి. తేషాం వియదాదీనామేవ పంచభి రజోంశై రజోభాగైస్తూపాదాన భూతై ర్వాక్పాణిపాదపాయూపస్థాభిధానాని ఏతన్నామకాని కర్మేంద్రియాణి క్రియాజనకాని ఇంద్రియాణి జజ్ఞిరే. 21.

రజోంశానామేవం సాధారణం కార్యమాహ—తై స్సర్వైరితి. సహితైః సంభూయ కారణతాం గతైః ప్రాణో జాయత ఇతి శేషః. తస్యావాంతరభేదమాహ—వృత్తిభేదాదితి. స ప్రాణో వృత్తిభేదాత్ప్రాణనాదివ్యాపారభేదాత్ పంచ ప్రకారో భవతి. వృత్తిభేదానేవ దర్శయతి—ప్రాణ ఇతి. తే పునస్తే తు భేదాః ప్రాణాదిశబ్దవాచ్యా ఇత్యర్థః. 22.

యదర్థమాకాశాదిప్రాణాంతానాం సృష్టిరుక్తా తదిదానీం దర్శయతి:—బుద్ధీతి. బుద్ధయో జ్ఞానాని కర్మాణి వ్యాపారాస్తజ్జనకానీంద్రియాణి బుద్ధీంద్రియాణి కర్మేంద్రియాణి చేత్యర్థః. బుద్ధికర్మేంద్రియాణి చ ప్రాణాశ్చ బుద్ధికర్మేంద్రియప్రాణాః తేషాం పంచకాని తైర్మనసా విమర్శాత్మకేన ధియా నిశ్చయరూపయా బుద్ధ్యా చ సహ సప్తదశభిః సప్తదశసంఖ్యాకైః సూక్ష్మశరీరం భవతి తస్యైవ సంజ్ఞాంతరమాహ—"తల్లింగ" మితి ఉచ్యతే వేదాంతేష్విత్యర్థః. 23.

ఏవం సూక్ష్మశరీర మభిధాయ తదభిమానిత్వప్రయుక్తం ప్రాజ్ఞేశ్వరయోరవసాంతరం దర్శయతి—ప్రాజ్ఞ ఇతి. ప్రాజ్ఞో మలినసత్త్వప్రధానాఽవిద్యోపాధికో జీవః

తత్ర తేజశ్శబ్దవాచ్యాంతఃకరణోపలక్షితలింగశరీరేఽభిమానేన తాదాత్మ్యాభిమానేన తైజసత్వం తైజసనామకత్వం ప్రపద్యతే ప్రాప్నోతి ఈశః విశుద్ధసత్త్వప్రధానమాయోపాధికః పరమేశ్వరస్తత్ర శరీరేఽహమిత్యభిమానేన హిరణ్యగర్భతాం హిరణ్యగర్భసంజ్ఞకత్వం ప్రపద్యత ఇత్యనుషంగః తైజసహిరణ్యగర్భయోర్లింగ శరీరాభిమానే సమానే సతి తయోః పరస్పరం భేదః కిం నిబంధన ఇత్యత ఆహ—తయోరితి. తయోః తైజస హిరణ్యగర్భయో ర్వ్యష్టిత్వం సమష్టిత్వం భవతి. అతఏవ భేద ఇత్యర్థః. 24.

టీ. తద్భోగాయ - తత్=ఆజీవునకు, భోగాయ = కర్మఫలభోగము కలుగుటకొఱకు (జీవునకు కర్మఫలము పూర్వకల్పమునుండి వచ్చె నని గ్రహించునది.) ఈశ్వరాజ్ఞయా-ఈశ్వర=మాయయందు ప్రతిబింబించియున్న బ్రహ్మముయొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచే, తమఃప్రధానప్రకృతేః - తమఃప్రధాన = తమోగుణమే ముఖ్యముగఁ గల, ప్రకృతేః=మూలప్రకృతినుండి(తమోగుణము మిగుల నధికముగనున్న గుణసంయోగము నుండి), వియత్ ...భువః-వియత్=ఆకాశము, పవన=వాయువు, తేజః=అగ్ని, అంబు=జలము, భువః=భూమి, అను, భూతాని=భూతములు (పంచభూతములు. ఇవి సూక్ష్మభూతములు.) జజ్ఞిరే=జనించెను (త్రాటియందు సర్పము జనించునట్లు భ్రాంతివలన జనించె ననుట జీవుఁడు పూర్వకర్మసంస్కారమువలన పరమేశ్వరుని పంచభూతరూపునిగ సంభావించె ననుట.) 18. తేషాం=ఆసూక్ష్మభూతములయొక్క, పంచభిః=అయిదైన, సత్త్వాంశైః=సత్త్వగుణభాగములచే (ఈభూతములు త్రిగుణసంయోగమువలన జనించినవి.కావున నందు సత్త్వరజోభాగములు కూడఁ గొంత యుండవలయు నని గ్రహింపవలయును). క్రమాత్=వరుసగ, శ్రోత్ర...ఆఖ్యం-శ్రోత్ర=చెవి, త్వక్ = చర్మము, అక్షి=కన్ను, రసన = నాలుక, ఘ్రాణ = నాసిక, ఆఖ్యం=అను పేర్లుగల, ధీంద్రియపంచకమ్ = జ్ఞానేంద్రియము లైదును (శబ్దస్పర్శాదులను గ్రహించును కావున వీని కీపేర్లు కలిగెను.) ఉపజాయతే=పుట్టుచున్న (ది) వి, (భూతసత్త్వాంశములలో నాకాశాదిసత్త్వాంశములవలన శ్రోత్రాదులు కలిగె ననుట. ఇదియు పరమేశ్వరు నాయారూపములతో భావించుటయే యని తెలిసికొనవలయును. సృష్టియంతయు నిట్లు భావనామాత్రమే యని గ్రహించునది.) 19. తైః=ఆసత్త్వాంశములు, సర్వైః=మొత్తముగకూడి(సత్త్వభాగ మంతయుఁ గలసి యనుట.) అంతఃకరణం=అంతఃకరణము (లోపలనుండి యింద్రియములమూలమున సర్వవిషయముల గ్రహించుపదార్థము) [ఉపజాయతే]. తత్ = ఆయంతఃకరణము, వృత్తిభేదేన=కార్యభేదములచే, ద్విధా = రెండువిధము లగుచున్నది. (భూతములయందలి సత్త్వభాగములలో కొంత సముదాయముగాను, కొంత ప్రత్యేకముగాను గ్రహించినచో సముదాయ మంతఃకరణ మనియు ప్రత్యేకభాగము లింద్రియము లనియుఁ జెప్పఁబడు నని

గ్రహింపవలయును. ఇంతయేకాని అంతఃకరణ మింద్రియసముదాయరూపము కాదు.) విమర్శరూపం=విచారము చేయుటయే స్వరూపముగాఁ గల అంతఃకరణము (ఏవిషయము నైన విమర్శించుసమయమున ననుట). మనః=మనస్సు, స్యాత్ =అగును. నిశ్చయాత్మికా= నిశ్చయించు నంతఃకరణము (ఇచ్చట ప్రధాన మగుబుద్ధి శబ్దమునుబట్టి స్త్రీలింగము ప్రయోగింపఁబడెను.) బుద్ధి=బుద్ధి [స్యాత్] [తేషాం] [పంచభిః]. 20. రజోంశైః తు= రజోగుణభాగములచేతనైతే (ప్రత్యేకముగ గ్రహింపఁబడిన భాగములచేత), వాక్ ... అభిధానాని-వాక్=వాక్కు, పాణి=హస్తములు, పాద=పాదములు, పాయు = గుదము, ఉపస్థ, అభిధానాని=అనుపేర్లుగల, కర్మేంద్రియాణి=కర్మేంద్రియములు (ఇవి పనిచేయు నవి కావున నీపేరు వీనికిఁ గలిగెను), [జజ్ఞిరే] 21. తైః=ఆరజోగుణభాగములు, సర్వైః=అన్నియు, సహితైః=కూడినచో (మొత్తముగ గ్రహింపఁబడిన రజోగుణభాగ ములు), ప్రాణః=శరీరధారణ హేతు వగు వాయువు [ఉపజాయతే] (ఇచ్చటఁగూడ మునుపటివలెనే ప్రాణము నింద్రియసముదాయరూపముగ గ్రహింపఁగూడదు). సః = ఆవాయువు, వృత్తిభేదాత్ = కార్యభేదమువలన, పంచధా = అయిదువిధములుగ నుండెను. తే పునః = ఆవాయువులు వరుసగా, ప్రాణః=ప్రాణవాయువు, అపానః = అపానవాయువు, సమానః చ = సమానవాయువు, ఉదానవ్యానౌ చ = ఉదానవ్యాన వాయువులు అగుచున్నవి. (ఇందు ప్రాణవాయువు హృదయమున నుండి యుచ్ఛ్వాస రూపముగ వెలికి వచ్చుచు పోవుచుండును. అపానవాయువు గుదస్థానమున నుండి మల మూత్రాదుల వెడలించుచుండును. సమానవాయువు నాభియందుండి యాహారమును పచ నముచేయువిషయమున జఠరాగ్నికి తోడుపడుచుండును. ఉదానవాయువు కంఠమున నుండి యాహారమును లోనికిఁ గొనుచుండును. వ్యానవాయువు సర్వశరీరము వ్యాపించి రక్తమును ప్రసరింపఁజేయుచు నాహారరసము నన్నియవయవములకును బంచియిచ్చు చుండును.) 22. బుద్ధి...పంచకైః-బుద్ధి = జ్ఞానసాధనములును, కర్మ=కర్మసాధనము లును, అగు, ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములయొక్కయు, ప్రాణ = ప్రాణవాయువుల యొక్కయు, పంచకైః = అయిదింటితోఁగూడిన సముదాయములచేతను (జ్ఞానేంద్రి యము లైదు, కర్మేంద్రియము లైదు, ప్రాణాదివాయువు లైదుఁ గలసి పదునేనింటి తోడను), మనసా=మనసుతోడను, ధియా=బుద్ధితోడను గూడి, సప్తదశభిః = పదునేడు తత్త్వములతో, సూక్ష్మం శరీరం = సూక్ష్మశరీరము (సూక్ష్మభూతములవలన కలిగినది యై కన్నులకు గానరానిది యగుటచే దీనికీ పేరు కలిగెను). [ఉపజాయతే] తత్ =ఆసూక్ష్మ శరీరమే, లింగం = లింగశరీర మని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. (సృష్టియంతయు భావనామాత్రమే యని మఱియొకమాఱు విన్నవించుచున్నాను). 23. తత్ర =

ఆసూక్ష్మశరీరమునందు, అభిమానేన = ఆత్మాభిమానముచేత (ఇదియే నేను. ఆఁకలి దప్పి మొదలగునవి నాకే గలవు. సర్వేంద్రియకార్యముల నేనే చేయుచున్నాను అను నభిమానమువలన), ప్రాజ్ఞః=ఇదివఱకు కారణశరీరోపాధిచేఁ బ్రాజ్ఞుఁ డని వ్యవహరింపఁ బడుచున్న జీవుఁడు, తైజసత్వం=తైజసుఁడనుపేరును (ఈసూక్ష్మశరీరము తేజోరూపమగుటచే నిందలి జీవున కీపేరు కలిగెను.) ప్రపద్యతే=పొందుచున్నాఁడు. ఈశః = ఈశ్వరుఁడు (మాయయం దున్న ప్రతిబింబము), తత్ర-అభిమానేన (అయీశ్వరుఁడే మాయాసహితుఁడై ప్రపంచరూపముగఁ బరిణమించుచున్నాఁడు గావున నాతనికిఁగూడ సూక్ష్మశరీరమునందు ప్రవేశము కలదు. ఆత్మాభిమానము సర్వసాధరణ మని యిదివఱకే వివరించియున్నాను). హిరణ్యగర్భతాం=హిరణ్యగర్భుఁ డను పేరును (ఈతఁడే చతుర్ముఖుఁడు. ఈతఁడే జీవసృష్టికి మొట్టమొదటివాఁడు), ప్రపద్యతే. తయోః=ఆజీవేశ్వరులకు, వ్యష్టిసమష్టితా = క్రమముగ వ్యష్టి యనియు, సమష్టి యనియు వ్యవహారము కలదు. (ఇదియే వారికి భేదకారణము. పూర్వకల్పమున ననుభవించియున్న యనుభవము నాశ్రయించి తత్సంస్కారమువలన జీవులచే నీకల్పమున పరమేశ్వరుఁడే నానావిధములుగఁ జూడఁబడుచున్నాఁ డనుటయే సృష్టికి తాత్పర్యము). 24.

తా. మాయాబింబ మగు నీశ్వరుఁడు మాయాసహితుఁడై ప్రపంచరూపమునఁ బరిణమించుచున్నాఁ డని సూచించియున్నాము. ఇది కేవల జీవేశ్వరవిభాగజ్ఞానార్థమై చెప్పఁబడెను కాని ప్రకృతియందు మాయ యను విభాగము ప్రత్యేకముగను, అవిద్య యను విభాగము ప్రత్యేకముగను చీల్పఁబడియుండలేదు. కావున "ప్రకృతియందలి ప్రతిబింబము దానితోఁ గూడి ప్రపంచరూపముగఁ బరిణమించుచున్న దనుటయే దాని కభిప్రాయము. వాస్తవస్థితిలోఁ బ్రకృతికే పరిణామము కాని ప్రతిబింబమునకు లేదు కావున నీసిద్ధాంతమువలన లోప మేమియు రాదు. ఈశ్వరుని శుద్ధత్వమునకును జీవుని యశుద్ధత్వమునకును భంగము రాదు. బ్రహ్మ ప్రతిబింబముయొక్క సహాయముచేఁ బ్రకృతి ఏయేరూపములతోఁ బరిణామమును జెందుచుండునో ఆయారూపమునందెల్ల వీరలు (ఈజీవేశ్వరులు) తమ స్వభావములతోనే (శుద్ధ్యశుద్ధులతోనే) ప్రవేశింపవచ్చును. వాని నెల్లఁ దమ యాత్మలుగ నభిమానింపవచ్చును. ప్రకృతి యెట్లెట్లు పరిణమించినను దానియందుండు శుద్ధసత్త్వమలినసత్త్వాదులకు నాశము కలుగదు కదా!

వి. ఈ యీశ్వరుఁడు శుద్ధుఁ డగుటచే నీతనిసంకల్పములు నియతముగ సిద్ధించు చుండును. యోగిశక్తిసామాన్యులవిషయమే యట్లుండ నిఁక ప్రథమప్రతిబింబ మగుపర మేశ్వరునిగూర్చి యేమి చెప్పవలయును? ఉపాధివశమున నాతనికి సర్వజ్ఞత్వాదులు కలి గిన తెఱంగు మున్నే వివరించితిని. సంకల్పముకూడ నట్లే కలుగవచ్చును కదా! ఇదియే యీశ్వరాజ్ఞ. మాయాప్రతిబింబమునకు నుపాధిసంసర్గవలన కలిగిన స్రష్టృత్వాభి మానమే యీశ్వరాజ్ఞ. బ్రహ్మము ప్రకృతికి సృష్టియందు సహాయ మాచరించుటయే యీశ్వరాజ్ఞ యని పరస్పరస్థితిలో నుపచరింపఁబడుచున్నది. ఈశ్వరుఁడు సర్వనియా మకుఁడుకదా !

ఇట్లాపరమేశ్వరునిచే నియమింపఁబడి ప్రకృతి సర్వస్థూలసూక్ష్మప్రపంచమును నిర్మించును. పూర్వకల్పమునందు నేదియేది యెట్లెట్లుండెనో అట్లట్లే నిర్మించును. ప్రపంచ మనాది యని సవిమర్శముగ వివరించి యున్నాము కదా. ఇదియే సృష్టి. దీనికిఁ కారణము పూర్వకల్పాంతమున పరిపాకదశకు నుపక్రమించి ఫలోన్ముఖములు కాకుండు నట్టి జీవకర్మలే. జీవులు సంసారబద్ధులై బహువిధకర్మల నాచరింపుచు ననేకజన్మముల యందు కాలానుసారముగ వారిఫలముల ననుభవించుచు నున్నారు. ప్రతికర్మకును ఫలము లిచ్చుసామర్థ్యము గలుగునప్పటికి కొంతకాలము పట్టుచుండును. ఏల యనిన:— (కర్మలు శుభరూపము లైనట్టి కాని యశుభరూపము లైనట్టి కాని సంకల్పముల మనసు నందు నెలకొల్పును. శుభకర్మల (ధర్మముల) నాచరించువానికి శుభసంకల్పములును అశుభకర్మల (అధర్మముల) నాచరించువానికి నశుభసంకల్పములును కలుగు ననుట సర్వప్రత్యక్షసిద్ధ మగువిషయమే. ఈసంకల్పములు మనసున నాటియుండుటచే నాతఁడు రెండవజన్మమునందు వీని కనుగుణముగనే కర్మాచరణము గావించును. ఈజన్మమున పుణ్యకర్మములఁ జేసి పుణ్యసంకల్పములు దృఢములయ్యెనేని రెండవజన్మ మునందును ఆసంకల్పముల నాశ్రయించి పుణ్యకర్మములనే యాచరించును. అప్పుడు స్థిర పడిన సంకల్పముల నాశ్రయించి యెవ్వరి జన్మమునందును అప్పటి సంకల్పముల నాశ్ర యించి తర్వాతి జన్మములందును ఇట్లు పరంపరగా పుణ్యకర్మములనే యాచరించు చుండును. పాపకర్మములగతికూడ నిట్టిదియే. మఱియు సంకల్పములు దృఢము లగు కొలఁది తద్విషయమునఁ బురుషప్రయత్నము కూడ నధికమైనచో మఱింత యభివృద్ధికిఁ గారణ మగును. శాస్త్రాభ్యాసాదినియమము లిందుకొఱకే యేర్పడినవి. శాస్త్రాదులఁ దెలిసి కార్యాకార్యముల నెఱిఁగి బలవంతముగనైన నకార్యములఁ బరిత్యజించెనేని మిగుల నభివృద్ధి దొరకును. పరంపరగ వచ్చుచున్న పుణ్యసంకల్పములకు నీ పురుషప్రయత్నము తోడుపడునుగదా. ఇట్లే శ్రద్ధావిరహితులై పాపకర్మ

ములఁ దొలఁగించుకొనుటకుఁ బ్రయత్నము సేయకుండినచోఁ గ్రమక్రమముగ పాప మభివృద్ధియై వానిని జెఱచును. ఇదియే కర్మఫలప్రకారము. ఈసంకల్పములే వాసనలని చెప్పఁబడుచున్నవి. ఇఁక నాలోచింపుఁడు. మనసునందు నిలుచుటకు నుపక్రమించినవాసన స్థిరపడి తన కనుగుణముగఁ గర్మను చేయించుటకు నెంతకాలము పట్టునో? ఈవిషయమును నిర్ణయించుటకు నపూర్వయుక్తులతోఁ బని లేదు; ప్రత్యక్షానుభవమే కలదు. ఒక సత్పురుషుఁడు అధర్మముల చేయుటకై పరులచే ప్రేరేపింపఁబడునేని యెంతకాలమునకు దాని నంగీకరించునో? ఎంతకాలమునకు మనసున సమాధానపఱుచుకొనును ? ఎంతకాలమునకు లజ్జాభయములఁ బరిత్యజించును ? మఱియెంతకాలమునకుఁ గార్యోన్ముఖుఁ డగును? ఎంతకాలమునకుఁ దన యంతరాత్మను జయించి కార్యము నొనర్చును? పిదపనైన నెంతకాలమునకు పశ్చాత్తాపబాధను తప్పించుకొనును ? ఇప్పటికిఁగదా సంకల్పము దృఢమైనది యనవలయును. ఇట్లే దుష్టునకు మంచిసంకల్పము కలుగవలయు ననినను బహుకాలము పట్టును. వాఁడు తన పరివారమునుండి తప్పించుకొనుటకే మొట్టమొదట నెంతయో కాలము పట్టును కదా! కావున నీలోకానుభవమునుబట్టి చూచిన "సంకల్పము దృఢమై తన కనుకూలముగఁ గార్యములఁ చేయించుటకు నెంతయో కాలము కావలయును" అని తేలుచున్నది. కర్మవాసనావిషయముకూడ నిట్టిదియే. దానికిని తన కనుకూలముగఁ గర్మల నాచరింపఁజేయుట బహుకాలము పట్టును. ఇట్లగుటచేతనే పురాణములయందు "ఏడుజన్మములనాఁడు చేసినపుణ్యకర్మ నేఁడు ఫలము నొసంగెను" అనుమొదలగు వాక్యము లనేకము లున్నవి. కావున సర్వజీవులకర్మలును కొంతకాలము ఫలము నొసంగకపూర్వము పరిపాకావస్థలలో నుండవలసినవియే. ఈవిధముగ నేసమయమున ఫలోన్ముఖ మగుకర్మ యొక్కటియు లేక ప్రపంచమునందలి సర్వజీవులయొక్క కర్మలును పరిపాకస్థితినే యారంభించునో యాసమయమున భోగార్థ మగుప్రపంచముతో నుపయోగము లేదు కావున మహాప్రళయము కలుగును. అప్పుడు జీవులు తమ తమ కర్మవాసనలతోఁ గూడిన అంతఃకరణములతోనే పరమేశ్వరునియం దడంగి యుందురు. ప్రకృతియే ప్రపంచరూపముగఁ బరిణమించినది. కావున బ్రపంచాంతర్భాగ మగు నంతఃకరణములయందలి కర్మవాసనలు దానియందే (ప్రకృతియందే) యడంగు ననియు, జీవులు బ్రహ్మరూపులే కావున నుపాధిభంగము లేకున్నను సుషుప్త్యవస్థయందువలె నాయుపాధిచే బాధింపఁబడక పరమేశ్వరమాత్రులే యగుదురనియు గ్రహింపవలయును. ఈవిధముగ విచారించిన ప్రళయము మహాసుషుప్తి యనియే చెప్పఁదగియున్నది. ఈసుషుప్తి పూర్వకర్మలు ఫలోన్ముఖము లగునంతవఱకు నుండును. అవి ఫలోన్ముఖములు కాఁగానే జీవులకు మఱల మెలఁకువ వచ్చును. జాగ్ర

దవస్థయందువలె మఱల వారి నుపాధి బాధింప నారంభించును. అప్పుడు నిదురనుండి మేల్కాంచినవారికి పూర్వదినమున నున్నపదార్థము లట్లే కానవచ్చినట్లు ఈజీవులకును పూర్వకల్పమున నున్నపదార్థములట్లే కానవచ్చును. ఇదియే సృష్టి. పూర్వకల్పాంతమున నిలిచియున్నకర్మలే పైన వర్ణించినవిధముగ దీనికిఁ గారణములు.

ఇఁక సృష్టిస్వరూపము నాకర్ణింపుఁడు. ఆప్రకృతిలో తమోగుణ మధికముగాను తక్కినగుణములు స్వల్పములుగాను గల సంయోగమునుండియే భూతములు జనించు నని తెలిసికొనవలయును. సత్వగుణము ఇతరగుణములతో సంసర్గము నొందుకొలఁది నపరిశుద్ధ మగుచు నుండు ననుట నిస్సంశయము. అందు తమోగుణమే యధికమైన నిఁక దాని స్థితి నేమని వర్ణింపవలయును? జ్ఞానప్రకాశము క్షీణ మగుటచే నాసంయోగమును అజ్ఞానమనియే చెప్పవచ్చును. ఆసంయోగమునే యన నేల? పురుషునకు బంధక మగుటచేఁ బ్రకృతి యంతయు నజ్ఞానిరూపిణియే. ఇంతకు ముందు వివరించినవివరణముల నాశ్రయించి యీప్రకృతి స్వయముగ లేనిదయ్యు నున్నట్లు తోఁచుచున్నది యని తేలినదికదా! ఇట్టిది భ్రాంతిరూపముకాక మఱి యేమగును. సత్వగుణము జ్ఞానరూపమే యైనను అది తక్కినగుణములకంటె మాత్రమే శ్రేష్ఠ మగునుగాని పరమేశ్వరుఁడు కానేరఁడు. అట్లే యగు ననిన నది బంధకము గానేరదుకదా! కావున నదియు నజ్ఞానరూపమే. ఆయజ్ఞానముతో నది మూఢత గాక కొంచె ముత్తమస్థితిలో నున్నది మాత్రమే యగును. కావున ప్రకృతి అజ్ఞానము. ప్రపంచ మజ్ఞానపరిణామము. త్రాటియందు తోఁచు సర్పమునకు వలె దీనికి నజ్ఞానముకంటె భిన్నమగుస్వరూపము లేదు. భ్రాంతి యున్నంతకాలము మాత్రమే రజ్జుసర్పము కానవచ్చును. కావున దానికి నదియే స్వరూప మనుట నిర్వివాదవిషయము కదా! కావున నజ్ఞానము స్వయముగ సర్పరూపమునఁ బరిణమించి యాసర్పమునుత్రాటిపై నెట్లారోపించుచున్నదో, యట్లే యచ్చటఁ గూడ మూలప్రకృతి యనఁబడునజ్ఞానము ప్రపంచరూపమునఁ బరిణమించి దానిని పరమేశ్వరునియం దారోపించుచున్నది. అనఁగా పురుషుఁడు అజ్ఞానమువలన త్రాటిని సర్పముగఁ దలంచినట్లే అవిద్యాప్రతిబింబ మగుజీవుఁడు కల్పితభేదభిన్న మగు స్వస్వరూపమును (బ్రహ్మమును) ప్రపంచముగఁ దలంచుచున్నాఁడు. ఇదియే సృష్టిస్వరూపము.

ప్రపంచ మనాదియగుటచే ననేక కల్పములయందు సమానమగుక్రమ మనుభవింపఁబడియుండెను. కావున నాసంస్కారము ననుసరించి ప్రపంచభ్రాంతియు నేకక్రమము ననుసరించియు కలుగును. ఉత్తరకల్పసృష్టి పూర్వకల్పసృష్టి ననుసరించియే యుండు ననుటకు నిది యొక ప్రబలకారణము. మఱియు నొకానొకకాలమున నొకానొక పూర్వసంస్కారము బలవంతమై యొకానొక యపూర్వసృష్టినిఁ గూడఁ గలిగింపవచ్చును.

కావునఁ గొన్ని గ్రంథములయందు (ముఖ్యముగ వాసిష్ఠరామాయణమునందు భుశుండోపాఖ్యానమున) బహువిధము లగు విచిత్రసృష్టులు కూడ వర్ణింపఁబడి యున్నవి. అది అట్లుండె. ప్రకృతము నాకర్ణింపుఁడు. ప్రపంచభ్రాంతికి నారంభమున సూక్ష్మపంచభూత భ్రాంతి కలుగును. శుద్ధపరబ్రహ్మమున నాకాశభ్రాంతియు, నాకాశరూపముగ భావింపఁబడిన బ్రహ్మమునందు వాయుభ్రాంతియు, వాయురూపముగఁ దలంపఁబడిన పరమేశ్వరునియం దగ్నిభ్రాంతియు, నా అగ్న్యాత్మకునియందు జలభ్రాంతియు, నందు పృథివీ భ్రాంతియు కలుగును. ఇదియే పంచసూక్ష్మభూతసృష్టిప్రకారము. ఇట్లే సర్వమును తత్తత్కారణరూపముగ భావింపఁబడిన పరమేశ్వరునియందు తత్తత్కార్యభ్రాంతి కలుగుచుండు నని తెలిసికొనవలయును.

ఈసూక్ష్మభూతములు గుణత్రయసంయోగమువలన జనించినవే కావున నిందు సత్త్వగుణాంశములును రజోగుణాంశములును తమోగుణాంశములునుగూడఁ గలవు. ఇందుఁ దమోగుణాంశములు స్థూలము లగుటచే వానినిఁగూర్చి స్థూలశరీరవివరణమునందు వివరింపఁబడును. ఇఁక నీసత్త్వాంశములను ప్రత్యేకముగ రెండుగా విభాగించి యందొక్కొక్క భాగమును బ్రత్యేకముగను గ్రహించినఁ గ్రమముగ శ్రోత్రాదిజ్ఞానేంద్రియము లగును. తక్కినయర్థభాగముల నన్నిటిని మొత్తముగ గ్రహించిన నంతఃకరణ మగును. అది విచారము చేయుఁనప్పుడు మన స్సనియు, నిశ్చయించునప్పుడు బుద్ధి యనియుఁ జెప్పఁబడును గాని పదార్థముమాత్ర మొక్కటియే. ఇట్లే రజోంశముల రెండేసిగా విభాగించిన ప్రత్యేకముగ గ్రహింపఁబడిన యర్ధభాగములు వాగాదికర్మేంద్రియములును సముదాయముగ గ్రహింపఁబడినవి ప్రాణము నగును. ఈప్రాణము హృదయస్థానమున నిలుచుట యుచ్ఛ్వాసరూపముగ వెలికివచ్చుట మొదలగు స్థానక్రియాభేదములచే నైదునామములతో వ్యవహరింపఁబడుచున్నది కాని వస్తు వొక్కటియే.

ఇది సూక్ష్మసృష్టి. ఇప్పుడు వర్ణింపఁబడిన జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, ప్రాణాదు లైదును మనోబుద్ధులు రెండును గలిసి పదునేడుతత్త్వములతో సూక్ష్మశరీర మేర్పడెను. అవిద్యావశగతుఁడై స్వరూపచ్యుతి నొందియున్న జీవునకు సంసారపాతమును కలిగించుటకు నివి రెండవసోపానము. దీనిని బ్రవేశించిన జీవుఁడు దీనినే ఆత్మగా నభిమానించుచు, జ్ఞానేంద్రియధర్మము లగు వినుట, తాఁకుట, చూచుట, రుచిచూచుట, మూర్కొనుట యను కార్యములను తన కార్యములనుగానే భావించుచు కర్మేంద్రియకృత్యము లగుమాటలాడుట మొదలగువానిని తన పనులుగానే యభిమానించుచు, ప్రాణధర్మము లగు నాఁకలిదప్పులఁ దనవిగానే భ్రాంతినొందుచు, మనోధర్మము లగు కామక్రోధాదులును సంకల్పాదులును బుద్ధిధర్మము లగునిశ్చయధైర్యాదులును గూడ తనయవిగానే గ్రహించుచు, "నేను వినుచున్నాను, మాటలాడు

చున్నాను, ఆఁకలిగొనియున్నాను, ఆలోచించుకొనుచున్నాను, నిశ్చయించుచున్నాను” అని వ్యవహారము చేయుచుండును. కారణశరీరావరణమునందుకంటె నిం దీతనికి భ్రాంతి యధికమయ్యెను. కావున నీశరీరము నభిమానించునప్పు డీతనికి ప్రాజ్ఞనామము పోయినది. ఈశరీరము తేజోరూపము కావునను, ఆతనికి దీనియం దాత్మాభిమానము కలిగెను కావునను ఇప్పుడు తైజసుఁ డని పేరు వచ్చినది. అవిద్యాప్రతిబింబమువలెనే మాయాప్రతిబింబ మగునీశ్వరుఁడును ఇప్పుడు తన మొదటి సోపానమును దిగి సూక్ష్మశరీరమును ప్రవేశించును. ఇప్పటికిని నీతనిశుద్ధత్వమునకు హాని యుండదు. మొట్టమొదట నున్నంత శుద్ధుఁడుగ నుండకున్నను జీవునికంటె శుద్ధుఁడే యగును. ఈతనికి పారిశుద్ధ్యము తగ్గుటచే నీశ్వరనామము పోయి హిరణ్యగర్భుఁ డనుపేరు కలిగినది. ఈతఁడే చతుర్ముఖబ్రహ్మ. మఱియు నీజీవేశ్వరోపాధులకు క్రమముగ వ్యష్టిసమష్టి యని పేర్లు.

అవ. ఇట్లు జీవేశ్వరోపాధులకు వ్యష్టిసమష్టి సంజ్ఞల విధించి వానికి హేతువులఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సమష్టి రీశ స్సర్వేషాం స్వాత్మతాదాత్మ్యవేదనాత్,
తదభావా త్తతోఽన్యే తు కథ్యంతే వ్యష్టిసంజ్ఞయా. 25

వ్యా. ఈశ్వరస్య సమష్టిరూపత్వే జీవానాం వ్యష్టిరూపత్వే చ కారణమాహ—సమష్టిరితి. ఈశః ఈశ్వరో హిరణ్యగర్భః సర్వేషాం లింగశరీరోపాధికానాం తైజసానాం స్వాత్మతాదాత్మ్యవేదత్స్వాత్మతాదాత్మ్యస్యైకత్వస్య వేదనాత్ జ్ఞానాత్సమష్టిర్భవతి. తత ఈశ్వరాదన్యే జీవాస్తు తదభావా త్తస్య తాదాత్మ్యవేదనస్యాభావాద్వ్యష్టిసంజ్ఞయా వ్యష్టిశబ్దేన కథ్యంతే.

టీ. సర్వేషాం = అన్నిటిని, ప్రపంచము నంతయు ననుట (ఇది కర్మార్థకమున షష్ఠి). స్వాత్మ ... వేదనాత్-స్వాత్మ =తనతో, తాదాత్మ్య = ఒక్కటియే యని, వేదనాత్ = తెలిసికొనుటవలన (కారణశరీరమున నున్నప్పుడు కారణప్రపంచమును, సూక్ష్మశరీరమున నున్నప్పుడు సూక్ష్మప్రపంచమును, స్థూలమున నున్నప్పుడు స్థూలప్రపంచమును గూడ నాత్మగా భావించుటవలన), ఈశః=ఈశ్వరుఁడు, సమష్టిః = సమష్ట్యుపాధికుఁ డనఁబడును. (సమష్టి యనఁగా మొత్త మగుటచే నీ పేరు వచ్చెను.) తతః = ఆయీశ్వరునికంటె, అన్యే తు = ఇతరు లగుజీవులైతే, తదభావాత్ = అది లేకపోవుటవలన (ప్రపంచము నంతయు నాత్మగఁ దలఁపక తన యుపాధి నొక్కదానినే యట్లు తలంచుటవలన), వ్యష్టి సంజ్ఞయా=వ్యష్ట్యుపాధికుఁ డను పేరుతో(వ్యష్టి యనఁగా విభాగము కావున జీవుల కీపేరు వచ్చెను). కథ్యంతే=చెప్పఁబడుచున్నారు.

తా. జీవేశ్వరు లిరువురును తమ యుపాధుల నాత్మలుగ భావించు వారే యని యిదివఱకే వివరించియున్నాము కదా! అందు జీవుఁడు తన యుపాధిని మాత్రమే యాత్మగా భావించి తక్కినవాని నన్యములుగఁ జూచును. ఈశ్వరుఁడు ఏయుపాధియం దున్నపుడు దానితోఁ గూడిన ప్రపంచమునంతయును ఆత్మనుగ భావించును. ఉపాధులలోని శుద్ధత్వాశుద్ధత్వములే యిందుకుఁ గారణములు.ఇట్లగుటచే జీవుఁడు వ్యష్టి యనియు, నీశ్వరుఁడు సమష్టి యనియుఁ జెప్పఁబడెను. వ్యష్టి యనఁగా నొక్కటి. సమష్టి యనఁగా మొత్తము. ఒక్క వృక్షమునుమాత్రమే గైకొని మాటలాడిన వ్యష్టి. వనమును గైకొనిన సమష్టి యని తెలిసికొనవలయును. భావములయందు మాత్రమే భేదముగాని యింద్రియ ధర్మాదుల నాత్మధర్మములుగ భావించుట మొదలగువ్యాపారములు మాత్రము జీవేశ్వరులకు సమానమే యని గ్రహింపవలయును. ఈశ్వరుఁడు తన యుపాధికి లోఁబడఁడు. కావున నీభావన లున్నను బద్ధుఁడు కాఁడనియు,జీవుఁ డుపాధివశుఁడు కావున బద్ధుఁ డయ్యె ననియు తెలిసికొనవలయును. ఇట్లగుటచేతనే యీసూక్ష్మప్రపంచము స్థూల ప్రపంచముతోఁగూడ జీవునకు భోగసాధన మగుచున్నది. జీవుఁడు దాని సత్యముగ భావించి కామక్రోధాదివశగతుఁడై సుఖదుఃఖముల ననుభవించుచు నవి తనవిగానే యభిమానించి సంక్షోభించుచు నున్నాఁడు. ఈశ్వరుఁడు శుద్ధుఁ డగుటచే లీలామాత్రముగఁ జూచుచున్నాఁడు. జీవుని భోగమే సృష్టికిఁ బ్రయోజనము.

అవ. ఇట్లు సూక్ష్మప్రపంచమును వివరించి యిఁక స్థూలప్రపంచమును వివరింపుచున్నాఁడు:—

శ్లో. తద్భోగాయ పున ర్భోగ్యభోగాయతనజన్మనే,
పంచీకరోతి భగవాన్ ప్రత్యేకం వియదాదికమ్. 26

వ్యా. ఏవం లింగశరీరం తదుపాధికౌ తైజసహిరణ్యగర్భౌ చ దర్శయిత్వా స్థూలశరీరాద్యుత్పత్తిసిద్ధయే పంచీకరణం నిరూపయితుమాహ—తద్భోగాయేతి. భగవానైశ్వర్యాదిగుణషట్కసంపన్నః పరమేశ్వరః, పునః పునరపి తద్భోగాయ తేషాం జీవానాం భోగాయైవ భోగ్యభోగాయతనజన్మ భోగ్యస్యాన్నపానాదేర్భోగాయతనస్య జరాయుజాదిచతుర్విధశరీరజాతస్య చ జన్మనే ఉత్పత్తయే వియదాదికమాకా

శాది భూతపంచకం ప్రత్యేకమేకైకం పంచీకరోతి, అపంచాత్మకం పంచాత్మకం సంపద్యమానం కరోతి.

టీ. తద్భోగాయ = ఆజీవుని యనుభవముకొఱకై, పునః = తిరిగి (సూక్ష్మసృష్టి యైన పిదప). భోగ్య...జన్మనే - భోగ్య = అనుభవింపఁదగిన గృహారామాదుల యొక్కయు, భోగాయతన = భోగస్థాన మగుస్థూలదేహముయొక్క, జన్మనే = పుట్టుక కొఱకై, భగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుఁ డగునీశ్వరుఁడు, వియదాదికం=ఆకాశాది పంచభూతములను (సూక్ష్మభూతములలో మిగిలియున్న తమోగుణాంశముల ననుట). ప్రత్యేకం=వేఱువేఱుగా, పంచీకరోతి = అయిదైదుగఁ జేయుచున్నాఁడు. (భూతసామాన్యము నందు లట్. అయిదైదుగఁ జేసె నమట).

తా. ఇట్లు సూక్ష్మసృష్టి ముగిసినపిదప నది జీవభోగమునకు చాలకపోవుటచే గృహారామాదిపదార్థములును వానియందలి సుఖదుఃఖముల ననుభవింపఁగలస్థూలశరీరమును నిర్మింపఁదలంచి సృష్టికర్త యగు నాపరమేశ్వరుఁడు (ఆయనయొక్క సహాయమువలననే ప్రకృతి సర్వకార్యముల నాచరించుచున్నది. కావున నిట్లు చెప్పఁబడెను). సూక్ష్మభూతములలోని తమోగుణాంశములఁ గైకొని పంచీకరణము నీక్రిందివిధముగఁ గావించెను. సత్వరజోంశలచేత మాత్రమే సూక్ష్మసృష్టి జరిగె నని వివరించితిమి కదా!

అవ. ఇట్లు పంచీకరణము నుద్దేశించి తత్ప్రకారము నెఱింగించుచున్నాఁడు:—

శ్లో. ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః,
స్వస్వేతరద్వితీయాంశై ర్యోజనాత్పంచ పంచ తే. 27

వ్యా. కథమేకైకస్య పంచపంచాత్మకత్వమిత్యత ఆహ.—ద్విధేతి. వియదాదికమేకైకం ద్విధా ద్విధా తంత్రేణోచ్చారితో ద్విధాశబ్దః. విధాయ కృత్వా భాగద్వయోపేతం కృత్వేత్యర్థః. పునశ్చ పునరపి ప్రథమం భాగం చతుర్ధా భాగచతుష్టయోపేతం విధాయేత్యనుషజ్యతే. స్వస్వేతరద్వితీయాంశైః స్వస్మాత్స్వస్మాదితరేషాం చతుర్ణాం భూతానాం యో యో ద్వితీయః స్థూలో భాగ స్తేన తేన సహ ప్రథమప్రథమ భాగాంశానాం చతుర్ణాం చతుర్ణాం మధ్యే ఏకైకస్య యోజనాత్తే వియదాదయః ప్రత్యేకం పంచపంచాత్మకా భవంతి.

టీ. ఏకైకం = ఒక్కొక్క భూతమును (ఒక్కొక్క భూతములోని తమోగుణాంశమును, ద్విధా=రెండుగా, విధాయ=చేసి, పునః=మఱల, ప్రథమం = మొదటి

దానిని, (అందొక్క భాగమును),చతుర్ధా=నాలుగు విధములుగ, విధాయ=చేసి, స్వ... అంశైః-స్వస్వ=తమతమకంటె, ఇతర=ఇతరములైన భూతములయొక్క, ద్వితీయాంశైః =రెండవ భాగములతో (నాలుగుగ భాగింపఁబడని భాగములతో), యోజనాత్= చేర్చుట వలన, తే=ఆయాకాశాదులు, పంచ పంచ = అయిదైదు భూతములతో కలిసి నవిగ, (భవంతి = అగుచున్నవి).

తా. పంచీకరణ మనఁగా నొక్కొక్క భూతము నైదుఁగ చేయుట. అది యెట్లేర్పడు ననిన, సూక్ష్మభూతములలోని తమోగుణాంశముల నైదింటిని ప్రత్యేకముగ రెండుగ భాగించి యొక భాగము నట్లే యుంచి తక్కిన భాగమును మఱల నాల్గు భాగములుగ విభజింపవల యును. అప్పుడు ప్రతిభూతమునందును అర్ధభాగ మొక్కటియు పరక భాగములు నాల్గును కలిసి యైదుభాగము లేర్పడును. పిదప వరుసగ నొక్కొక్కభూతమునందలి పరకభాగముల నాల్గింటిని తక్కిననాల్గుభూత ములలోఁ జేర్చుచుండవలయును. ఆకాశమునందలి పరకభాగముల వాయ్వాద్యులయందును, వాయువునందలి పరకభాగముల నాకాశాగ్ని జలపృథ్వులయందును ఇట్లే యన్ని భూతములయొక్క పరకభాగములను మిగిలిన భూతములు నాల్గింటిలోఁ జేర్చుచు రావలయును. ఇట్లు చేసిన ప్రతిభూతమునందును తన యంశమర్ధంబును తక్కిన భూతములలోని పరక భాగములు నాల్గును కలసి యొక యర్ధంబు నుండును. ఇప్పుడు ప్రతి భూతమునందును అయిదు భాగములు (ఒక సగభాగము నాల్గు పరకభాగ ములు) కలవుకదా! ఇదియే పంచీకరణము. ఆపరమేశ్వరుఁడు స్థూల ప్రపంచము నుత్పత్తిచేయఁ దలంచి మొదటనే స్థూలము లయియున్న తమోంశముల మఱింత స్థూలములఁ గావించును. ఇట్లు చేయుటచేతనే మనము ప్రతిభూతమునందును అల్పముగ నైన నధికముగ నైన పంచ భూతగుణముల ననుభవించుచున్నాము.

అవ. పంచీకరణప్రయోజనమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. తైరండ స్తత్ర భువనం భోగ్యభోగాశ్రయోద్భవః,
హిరణ్యగర్భ స్థూలే౽స్మిన్ దేహే వైశ్వానరో భవేత్. 28
తైజసా విశ్వతాం యాతా దేవతిర్యఙ్నరాదయః,

వ్యా. ఏవం పంచీకరణ మభిధాయ తైర్భూతై రుత్పాద్యం కార్యవర్గం దర్శ యతి.—తైరండ ఇతి. తైః పంచీకృతై రుపాదానకారణభూతై రండో బ్రహ్మాండ

ఉత్పద్యతే. తత్ర బ్రహ్మాండాంతర్భువనాన్యుపరిభాగే వర్తమానా భూమ్యాదయః సప్త లోకా భూమేరధః స్థితాన్యతలాదీని సప్తపాతాళాంతాని. తేషు చ భువనేషు తైస్తైః ప్రాణిభిరోక్తుం యోగ్యాన్యన్నాదీని తత్తల్లోకోచితశరీరాణి చ. తైరేవం పంచీకృతేర్భూతై రీశ్వరాజ్ఞయా జాయంతే. ఏవం స్థూలశరీరోత్పత్తిమభిధాయ, తేషు స్థూలశరీరేషు అభిమానవతో హిరణ్యగర్భస్య సమష్టిరూపస్య వైశ్వానరసంజ్ఞకత్వం ఏకైకస్థూలశరీరాభిమానవతాం వ్యష్టిరూపాణాం తైజసానాం విశ్వసంజ్ఞకత్వం చ భవతీత్యాహ— హిరణ్యగర్భఇతి. అస్మిన్ స్థూలదేహే వర్తమానో హిరణ్యగర్భో వైశ్వానరో భవేత్.

టీ. తైః=అపంచీకృతమహాభూతములచే, అండః = బ్రహ్మాండము, [జాయతే= పుట్టును.] తత్ర=ఆబ్రహ్మాండమునందు, భువనం = చతుర్దశభువనములును, [జాయంతే] భోగ్య... ఉద్భవః - భోగ్య = ఆయాలోకములయందు అనుభవింపఁదగినపదార్థముల యొక్కయు, భోగాశ్రయ = ఆయాలోకములయందలి సుఖదుఃఖముల ననుభవించుటకు యోగ్యము లైనబహువిధదేహములయొక్కయు (భూలోకమున పృథివీమయదేహము, చంద్రలోకమున జలమయదేహము, వాయులోకమున వాయుమయదేహము, అగ్నిలోకములయందు తేజోమయదేహము. ఇట్లు దేహభేదములఁ దెలిసికొనవలయు.) ఉద్భవః=పుట్టుక [భవతి = కలుగుచున్నది.] (వీని కన్నిటికిని పంచీకృతభూతములే యుపాదానకారణ మనుట.) అస్మిన్=ఈ, స్థూలే=స్థూలమైన (కంటికిఁ గానవచ్చునది కావున దీని కీపేరు కలిగినది.) దేహే=దేహమునందు (ఈప్రపంచమును ఆత్మగా నభిమానించుటవలన ననుట.) హిరణ్యగర్భః = సూక్ష్మప్రపంచాభిమాని యగునీశ్వరుఁడు, వైశ్వానరః = వైశ్వానరనామము కలవాఁడు (నరు లనఁగా జీవులు వారల నందఱ నాత్మగా భావించువాఁడు కావున నితని కీపేరు కలిగినది.) భవేత్=అగును. తైజసాః= సూక్ష్మశరీరాభిమానులగుజీవులు, దేవతిర్యఙ్నరాదయః = దేవపశుపక్షిమనుష్యాదిభేదములతో, విశ్వతాం = విశ్వనామమును (నానారూపములు కలవార లగుటచేతనే యీ నామము కలిగెను.) యాతాః = పొందిరి.

తా. ఇట్లు పంచీకరణము చేయఁబడిన స్థూలభూతములనుండి బ్రహ్మాండము జనించెను. అందు పదునాలుగులోకములును,అందలి భోగ్యపదార్థములును, భిన్నభిన్నస్వభావములు కల శరీరములును కలిగెను. ఇదియంతయు తత్కారణరూపముతో నున్నబ్రహ్మమును తత్కార్యరూపముతో భావించుట మాత్రమేకాని బ్రహ్మాభిన్నపదార్థ మొక్కటియు జనింపనే లే దని తెలిసికొనవలయును.

వి. ఈస్థూలప్రపంచము సంసారపాతమునకు మూఁడవసోపానము. ఇందు ప్రవేశించిన యీశ్వరుఁడు స్థూలప్రపంచము నంతయు నాత్మగా భావించువాఁ డగుటచే మఱి కొంత యపరిశుద్ధుఁడై తన హిరణ్యగర్భనామమును కోల్పోయి వైశ్వానరనామముచేఁ బిలువఁబడుచున్నాఁడు. జీవుఁడును ఈశరీరమును (స్థూలశరీరమును) ఆత్మగా నభిమానించి దానికిఁ గలుగు శీతోష్ణాదులఁ దనవిగ భావింపుచు "నాకు చలిగా నున్నది. తాపముగ నున్నది" అని వ్యవహరించు చున్నాఁడు. మఱియు దానియందుఁ గల దేవతిర్యఙ్మనుష్యాదిభేదముల (రూపభేదముల)ఁ దనకే యున్నట్లు భావింపుచు "నేను దేవతను. మనుష్యుఁడను." అని భావించుచున్నాఁడు. ఇట్లు నానాభావన యుండుటచేతనే యీతనికి విశ్వుఁ డనుపేరు కలిగినది.

అవ. ఇట్లు సర్వమును వర్ణించి జీవస్థితిని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. తే పరాగ్దర్శినః ప్రత్యక్తత్త్వబోధవివర్జితాః,
కుర్వతే కర్మభోగాయ కర్మ కర్తుం చ భుంజతే. 29
నద్యాం కీటా ఇ వావర్తా దావర్తాంతర మాశు తే,
వ్రజంతే జన్మనో జన్మ లభంతే నైవ నిర్వృతిమ్. 30

వ్యా. తత్రైవ వర్తమానాస్తైజసా విశ్వా భవంతి. తేషామవాంతరభేదమాహ—దేవతిర్యగితి. ఇదానీం తేషాం విశ్వసంజ్ఞాం ప్రాప్తానాం జీవానాం తత్వజ్ఞానరహితత్వేన సంసారాపత్తిప్రకారం సదృష్టాంతం శ్లోకద్వయేనాహ—తే పరాగితి. తే దేవాదయః పరాగ్దర్శినః బాహ్యానేవ శబ్దాదీన్ పశ్యంతి. నతు ప్రత్యగాత్మానం* "పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూ స్తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మ"న్నితి శ్రుతేః. నను తార్కికాదయో దేహవ్యతిరిక్తమాత్మానం జానంతీత్యాశంక్య యద్యప్యాత్మానం తే జానంతి, తథాపి శ్రుతిసిద్ధం తత్త్వం న జానంతీత్యాశయేనోక్తమిత్యాహ—ప్రత్యగితి. కుర్వత ఇతి. అతఏవ భోగాయ సుఖాద్యనుభవాయ మనుష్యాదిశరీరాణ్యధిష్ఠాయ కర్మ తత్తచ్ఛరీరోచితాని కర్మాణి కుర్వతే జాతావేకవచనం. పునశ్చ కర్మ కర్తుం దేవాది శరీరైస్తత్తత్ఫలం భుంజతే చ. ఫలానుభవాభావే తత్తత్సజాతీయేచ్ఛానుపపత్త్యా తత్తత్సాధనానుష్ఠానానుపపత్తేః, ఏవం వర్తమానాస్తే జీవాః నదీప్రవాహపతితాః కీటా ఆవర్తాదావర్తాంతరమాశు వ్రజంతః యథా నిర్వృతిం సుఖం న లభంతే. ఏవమాశుజన్మనో జన్మ వ్రజంతః సుఖం నైవ లభంత ఇతి.

టీ. తే=ఆజీవులు, పరాగ్దర్శినః-పరాక్=వెలుపలికి (తనకంటె భిన్నముగ నున్నవి యని తలంపఁబడుపదార్థముల మాత్రమే), దర్శినః = చూచుచు, ప్రత్యక్... వివర్జితాః-ప్రత్యక్=లోపలనున్న, తత్వ = తమ యథార్థస్వరూపముయొక్క (ఉపాధి

వశమున మఱుగు పడియున్న యథార్థ స్వరూపముయొక్క యనుట.) బోధ=జ్ఞానము చేత, వివర్జితాః = శూన్యులు, కర్మ = బహువిధపుణ్యాపాపకర్మలను, భోగాయ = సుఖ దుఃఖానుభవమునకై, కుర్వతే=చేయుదురు. (బహువిధకర్మల నాచరించి తత్ఫలముల ననుభవించుచుందు రనుట.) కర్మ కర్తుం చ=చేయుటకై, భుంజతే=సుఖదుఃఖముల నను భవింతురు. (సుఖదుఃఖానుభవముకొఱకు జన్మ రాఁగా దానియందు పూర్వవాస నాను గుణముగ మఱికొన్ని కర్మల నాచరింతు రనుట.) తే=ఈవిధముగ కర్మవశగతులగు నా జీవులు, నద్యాం=నదియందుఁబడిన, కీటాః=పురుగులు, ఆశు=శీఘ్రముగ, ఆవర్తాత్ = ఒక సుడినుండి, ఆవర్తాంతరం ఇవ=మఱియొక సుడినివలె (ప్రవాహవేగమున నొక సుడిలో నుండి మఱియొక సుడికిఁ బోయినట్లు), జన్మతః=ఒక జన్మనుండి, జన్మ=మఱియొక జన్మను గూర్చి, వ్రజంతః = పోవుచున్నవారై (జన్మమరణపరంపర నొందుచు) నిర్వృతిమ్ = సుఖమును (శాంతిని), న ఏవ లభంతే = పొందనే పొందరు.

తా. ఇప్పటికి జీవుఁడు సంపూర్ణముగ స్వరూపమునుండి భ్రష్టుఁ డయ్యెను. స్థూలదేహమునందలి ఆత్మాభిమానమువలన నాజీవునకు నానాత్వము కలిగె నని చెప్పియున్నాము. సూక్ష్మదేహముకూడ నిట్టి నానాకత్వమును కలిగించునదియే యైనను స్థూలదేహము వచ్చునంత వఱకు నది దృఢము కాదు. కావున సూక్ష్మశరీరభేదము కానరాని దగు టచే "ఈజీవుఁడు వీనికంటె వేఱు" అను వ్యవహార మేర్పడుటకు వీలు లేదు కావున నిట్లు చెప్పఁబడె నని గ్రహించునది. ఇట్టి యారోపిత నానాత్వమువలనను, నింద్రియములు బాహ్యపదార్థములను మాత్రమే గ్రహించుచుండ వానిపై నాత్మాభిమాన ముండుటచేతను, జీవుఁడు వెలుపలిపదార్థములను మాత్రమే చూడఁగలఁడు కాని యుపాధివశ మున మఱుఁగుపడియున్న స్వస్వరూపమును చూడ నేరఁడు. తాను సర్వ శక్తియుక్తుఁడే యైనను, అవిద్య నాత్మగా భావించుటవలన నీతని కిట్టి దురవస్థ కలిగెను. ఏశరీరమును ఆత్మగా భావించునో యాశరీరమే తా నయ్యెను. ఇట్లే మనస్సును ఆత్మగా భావించుటచే మనోమాత్రుఁడై బహువిధశుభాశుభకర్మల నాచరించుచు దానిఫలముల ననుభవించును. (కర్మలు ఫలము నిచ్చువిధము పదునెనిమిదవశ్లోకము మొదలు ఇరువది నాలుగవ శ్లోకమువఱకు వ్రాసిన తాత్పర్యమునఁ జూచుకొనునది.) అనుభవ మనఁగా మనస్సునకుఁ గలుగు సుఖదుఃఖములఁ దనవిగ భావించు

టయే. వాసనావశమున మఱలఁ గర్మముల నాచరించుచున్నాఁడు. ఇట్లు కర్మవశగతులై జీవులు ఒక జన్మమునుండి మఱియొక జన్మము నెత్తుచు సంసారచక్రమున విడుపడలేక పరిభ్రమించుచున్నారు. నదియందుఁబడి ప్రవాహవేగమువలన నొక సుడినుండి మఱియొక సుడికిఁ బోవుచు గిర గిరఁ దిరుగుచు శ్రమనొందు పురుగులవలె శ్రమలనొందుచున్నారు. ఎప్పటికిని విముక్తిని గానలేకున్నారు.

అవ. ఇఁక బంధమోక్షము కలుగువిధమును సదృష్టాంతముగ వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. సత్కర్మపరిపాకాత్తే కరుణానిధి నోద్ధృతాః,
ప్రాప్య తీరతరుచ్ఛాయాం విశ్రామ్యంతి యథాసుఖమ్. 31
ఉపదేశ మవాప్యైవ మాచార్యా త్తత్త్వదర్శినః,
పంచకోశవివేకేన లభంతే నిర్వృతిం పరామ్. 32

వ్యా. ఏవం సంసారాపత్తి మభిధాయ తన్నివృత్త్యుపాయం దర్శయితుం దృష్టాంతం తావదాహ—సత్కర్మేతి. తే కీటాః సత్కర్మపరిపాకాత్పూర్వోపార్జిత పుణ్యకర్మపరిపాకాత్కృపాళునా కేనచిత్పురుషవిశేషేణోద్ధృతా నదీప్రవాహా ద్బహిర్నిస్సారితాః సంతస్తీరతరుచ్ఛాయాం ప్రాప్య సుఖం యథా భవతి తథా యద్వ ద్విశ్రామ్యంతి. 31.

ఇదానీం దృష్టాంతసిద్ధమర్థం దార్ష్టాంతికే యోజయతి—ఉపదేశమితి. ఏవముక్తేన ప్రకారేణ పూర్వోపార్జితపుణ్యకర్మపరిపాకవశాదేవ తత్త్వదర్శినః ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కారవతః ఆచార్యాద్గురోః సకాశాదుపదేశం తత్త్వమస్యాది వాక్యార్థజ్ఞానసాధనం శ్రవణం వక్ష్యమాణమవాప్య సంపాద్య పంచకోశవివేకేనాన్నాదీనాం పంచానాం కోశానాం వివేకేన వక్ష్యమాణవివేచనేన పరాం నిర్వృతిం మోక్షసుఖం లభంతే ప్రాప్నువంతి. 32.

టీ. [తే=ఆపురుగులు], సత్...పరిపాకేన-సత్=శుభములైన, కర్మ=పురాకృత కర్మలయొక్క, పరిపాకేన=ఫలముచే, కరుణానిధినా=దయామయుఁడగు నొకానొకపురుషునిచేత, ఉద్ధృతాః=నదినుండి వెలుపలికి తీయఁబడినవై, తీర...చ్ఛాయాం-తీరతరు=నదీతీరమున నున్న వృక్షములయొక్క, ఛాయాం=నీడను, ప్రాప్య=పొంది, సుఖం=సుఖముగ, యథా=ఏవిధముగ, విశ్రామ్యంతి = విశ్రమించునో, ఏవం=ఈవిధముగ, [తే=ఆ జీవులు], తత్త్వదర్శినః=బ్రహ్మవేత్తయగు, ఆచార్యాత్=గురువువలన, ఉపదేశం=స్వస్వరూపోపదేశమును ("నీవు జీవుఁడవు కావు. పరమేశ్వరుఁడవు" అను నుపదేశమును),అవాప్య=

పొంది, పంచకోశవివేకేన-పంచకోశ = క్రింద వర్ణింపఁబడఁబోవు నన్నమయాదికోశ ములనుండి, వివేకేన = తన స్వరూపమును విభాగించుకొనుటచే, పరాం=అత్యధికమైన, నిర్వృతిం = ఆనందమును (బ్రహ్మానందమును), లభంతే = పొందెదరు.

తా. ఇఁక వీరలకు ముక్తి కలుగు తెఱంగు నాకర్ణింపుము. ఇప్ప టికి నొకదానిపై నొకటిగ మూఁడుపాధు లావరించియుండుటచే జీవులు తమ శక్తిని సంపూర్ణముగఁ గోలుపోయిరికదా! నదీప్రవాహావశ గతములై తమశక్తిని గోల్పోయిన పురుగువలె నిరాధారులై యున్నారు కదా! కావున వీరికి నన్యసాహాయ్యము కావలయును. ఆపురు వులను నేదయామయుండైనను వెలుపలికి తీసివేయవలసినట్లు వీనినిఁ గూడ నేమహాత్ముఁడైన సంసారనదినుండి వెలుపలికిఁ దీసివేయవల యును. ఆపురుగులకు పోవుటకు సిద్ధముగ నున్న జీవము మఱల నిల్చు టకు పురాకృతసుకృతపరిపాక మొక్కటియే కారణము. అట్లే వీరిబంధ వినాశమునకుఁ గూడ సుకృతపరిపాకమే కారణము. అనేకజన్మముల నుండి చేయఁబడుచు వచ్చుచున్న పుణ్యకర్మలవలన కలిగిన సంస్కార ములు మనసును నిర్మలము చేసిననేగాని గురూపదేశమును గ్రహించు సామర్థ్యము కలుగదుగదా! ఈవిధముగ సద్గురూపదేశము కలిగిన చిత్తము (జీవుఁ డనియే చెప్పవచ్చును. అభిమానమువలన జీవచిత్తము లకు భేదమే పోయినదికదా!) జీవస్వరూపమునుగూర్చి విచారింప నారంభించునప్పుడు క్రమక్రమముగ నుపాధులకును జీవస్వరూపము నకును భేదము గ్రహింపఁబడును. ఈయుపాధులు పంచకోశములుగ విభాగింపఁబడియున్నవి. ఇట్లు పంచకోశములనుండి విభాగింపఁబడినచో నదినుండి వెలుపలికి తీయఁబడి యొక చెట్టునీడక్రింద నిలిచి సుఖించు పురుగులవలె జీవులును మోక్షము నొంది సుఖింతురు.

అవ. ఇప్పుడు పంచకోశస్వరూపమును వివరించువాఁడై మొట్టమొదట నుద్దేశ పూర్వకముగ లక్షణమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్నం ప్రాణో మనో బుద్ధి రానంద శ్చే తి పంచ తే,
కోశా స్తై రావృతః స్వాత్మా విస్మృత్యా సంసృతిం వ్రజేత్. 33

వ్యా. కే తేన్నాదయః పంచకోశా ఇత్యాకాంక్షాయాం తానుపదిశతి—అన్నం ప్రాణ ఇతి. అన్నం ప్రాణో మనో బుద్ధిరానందశ్చేతి పంచకోశాః. బుద్ధిర్విజ్ఞానం తేషా మన్నాదీనాం కోశశబ్దాభిధేయత్వే కారణమాహ—తైరితి. తైః కోశైరావృత ఆచ్ఛాదితః స్వాత్మా స్వస్వరూపభూత ఆత్మా విస్మృత్యా స్వస్వరూపవిస్మరణేన సంసృతిం జననాదిప్రాప్తిరూపం సంసారం వ్రజేత్ ప్నప్తం. కోశో యథా కోశకారక్రిమేరావరకత్వేన క్లేశహేతురేవ మన్నాదయోఽప్యాద్వయానందత్వాద్యావరకత్వే నాత్మనః క్లేశహేతుత్వాత్కోశా ఇత్యుచ్యంత ఇత్యర్థః.

టీ. అన్నం = అన్నము, ప్రాణః = ప్రాణము, మనః=మనస్సు, బుద్ధిః = బుద్ధి, ఆనందశ్చ = ఆనందము, ఇతి=అని, తే=ఆ, కోశాః=కోశములు (ఆవరణములు), పంచ= అయిదు అగుచున్నవి; స్వాత్మా = స్వస్వరూపము (జీవుఁడు లేక బ్రహ్మము), తైః = ఆకోశములచే, ఆవృతః = ఆవరింపఁబడి, విస్మృత్యా = స్వస్వరూపమును మఱచుట చేత, సంసృతిం = సంసారమును, వ్రజేత్ = పొందును.

తా. అన్నప్రాణ మనోబుద్ధ్యానందము లైదును కోశములు. కోశము లనఁగా నావరణములు. ఇవియే సర్వప్రపంచము ననువిషయము క్రమముగ నిరూపింపఁబడును. ఈకోశములచే నావరింపఁబడి ఆత్మ స్వస్వరూపమును మఱచి సంసారమున మునింగియున్నాఁడు.

అవ. ఇట్లు పంచకోశముల నుద్దేశించి ప్రత్యేకముగ వానిస్వరూపమును వెల్లడించుచున్నాఁడు:—

శ్లో. స్యాత్పంచీకృతభూతోత్థో దేహః స్థూలోఽన్నసంజ్ఞకః,
లింగే తు రాజసైః ప్రాణైః ప్రాణః కర్మేంద్రియైః సహ. 34
సాత్త్వికై ర్ధీంద్రియైః సాకం విమర్శాత్మా మనోమయః,
తైరేవ సాకం విజ్ఞానమయో ధీ ర్నిశ్చయాత్మికా. 35
కారణే సత్త్వ మానందమయో మోదాదివృత్తిభిః,
తత్తత్కోశై స్తు తాదాత్మ్యా దాత్మా తత్తన్మయో భవేత్. 36

వ్యా. తేషాం కోశానాం స్వరూపాణి క్రమేణ వ్యుత్పాదయతి—స్యాత్పంచీకృతేత్యాదినా మోదాదివృత్తిభిరిత్యంతేన సార్ధశ్లోకద్వయేన. పంచీకృతేభ్యో భూతేభ్య ఉత్పన్నః స్థూలో దేహోఽన్నసంజ్ఞకః అన్నమయశబ్దితః కోశః స్యాత్. ప్రాణస్తు ప్రాణమయకోశస్తు లింగశరీరే వర్తమానై రాజసై రజోగుణకార్యభూతైః ప్రాణైః ప్రాణాపానాదిభిర్వాయుభిః పంచభిర్వాగాదిభిః కర్మేంద్రియైః సహ దశభిః స్యాత్. 34.

వ్యా. విమర్శాత్మా సంశయాత్మకం పంచభూతసత్వకార్యం యన్మన ఉక్తం తత్సాత్త్వికైః ప్రత్యేకం భూతసత్వకార్యభూతైర్ధీంద్రియైశ్శ్రోత్రాదిభిః పంచభిర్జ్ఞానేంద్రియైః సాకం సహితం మనోమయః కోశః స్యాదితి పూర్వేణ సంబంధః. నిశ్చయాత్మికా ధీస్తేషామేవ సత్వకార్యరూపా బుద్ధిస్తైరేవ పూర్వోక్తైర్జ్ఞానేంద్రియైరేవ సాకం సహితా సతీ విజ్ఞానమయః విజ్ఞానమయాఖ్యః కోశః స్యాత్. 35.

వ్యా. కారణే కారణశరీరభూతాయా మవిద్యాయాం యన్మలినసత్వమస్తి తన్మోదాదివృత్తిభిః ప్రియమోదప్రమోదాఖ్యైరిష్టదర్శనలాభభోగజన్యైః సుఖవిశేషైః సహితమానందమయః ఆనందమయాఖ్యః కోశః స్యాదితి. నను స్థూలశరీరాదీనాం "మన్నమయాదిశబ్దవాచ్యత్వే స వా ఏషపురుషోఽన్నరసమయ" ఇత్యుపక్రమ్య "తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాదన్యోఽంతర ఆత్మా ప్రాణమయోఽన్యోఽంతర ఆత్మా మనోమయః" ఇత్యాది శ్రుతత్వాదాత్మనోఽన్నమయాదిశబ్దవాచ్యత్వం కథముచ్యత ఇత్యాశంక్య దేహాదీనామన్నాదివికారత్వేనాన్నమయాదిశబ్దవాచ్యత్వమ్. ఆత్మనస్తు తేన తాదాత్మ్యాభిమానాదిత్యాహ—తత్తదితి. ఆత్మా ప్రత్యగాత్మా తత్తత్కోశైః తేన తేన కోశేన సహతాదాత్మ్యాత్ తాదాత్మ్యాభిమానాత్తత్తన్మయస్తత్తత్కోశమయః స్యాద్వ్యవహారకాలేఽన్నమయాదికోశప్రాధాన్యాదన్నమయాదిశబ్దవాచ్య ఇత్యర్థః. తుశబ్దశ్చాత్మనః కోశేభ్యో వైలక్షణ్యద్యోతనార్థః. 36.

టీ. పంచీకృతభూతోత్థః = పంచీకరణము చేయఁబడిన మహాభూతములనుండి జనించిన, స్థూలః=స్థూలమైన, దేహః=దేహము, అన్నసంజ్ఞకః = అన్న మను పేరుగల కోశము, స్యాత్ =అగును. లింగే తు=సూక్ష్మశరీరమునందైతే, రాజసైః = రజోభూత సమష్టివలన పుట్టిన, ప్రాణైః పంచాత్మక మగుప్రాణవాయువుతో, కర్మేంద్రియైః = కర్మేంద్రియములతో, సహ=కలసి, ప్రాణః=ప్రాణ మను కోశంబును, సాత్వికైః=సత్వభూతవ్యష్టివలన కలిగిన, ధీంద్రియైః = జ్ఞానేంద్రియములతో, సాకం = కూడిన, విమర్శాత్మా=విచారించు స్వభావము కల మనస్సు స్వరూపముగాఁగల, మనోమయః = మనోమయకోశంబును, తైః ఏవ = జ్ఞానేంద్రియములతోనే, సాకం=కూడిన, నిశ్చయాత్మికా=నిశ్చయరూపిణి యగు, బుద్ధిః = బుద్ధియే స్వరూపముగాఁగల, విజ్ఞానమయః=విజ్ఞానమయకోశంబును, స్యాత్ = అగును (ప్రత్యేకాభిప్రాయమున నేకవచనము ప్రయోగింపఁబడెను). కారణే = కారణశరీరమగు నవిద్యయందు, సత్వం = మలినసత్వ మేది కలదో యదియే, మోదాదివృత్తిభిః = ప్రియమోద ప్రమోదరూపవృత్తులతోఁగూడి (ప్రియ మనఁగా నిష్టవస్తువును చూచుటవలన కలిగినసుఖము. మోద మనఁగా దానిని సంపాదించుట వలన కలుగునానందము. ప్రమోద మనఁగా దాని ననుభవించుటవలన

జనించుతృప్తి). ఆనందమయః = ఆనందమయకోశమగును. ఆత్మా=జీవుఁడు, తత్తత్కోశైః = ఆయాకోశములతో, తాదాత్మ్యాత్ తు = తాదాత్మ్యసంబంధము ("అదియే నేను" అను భావనయే స్వరూపముగఁ గలసంబంధము) వలన, తత్తన్మయః=ఆయాకోశములే స్వరూపముగఁ గలిగి యన్నమయాదిశబ్దములచే వ్యవహరింపఁదగినవాఁడు, భవేత్ = అగును.

తా. పై పంచకోశములయందు స్థూలశరీర మొక కోశముగాను, సూక్ష్మశరీరము మూఁడు కోశములుగాను, కారణశరీర మొక కోశముగాను విభాగింపఁబడెను. ప్రపంచమంతయు స్థూలసూక్ష్మకారణాత్మకమే కావున నీవిభాగము ప్రపంచవిభాగమే యని తెలిసికొనవలయును. బంధమును కలిగింపలేకపోయినను ఈశ్వరునకుఁగూడ నీకోశములచే నావరణము కలదనియే గ్రహింపవలయును. అందు స్థూలదేహ మన్నము వలనఁబుట్టి దానిచేత నభివృద్ధి నొందినది యగుటచే నన్నమయకోశమని చెప్పఁబడుచున్నది. సూక్ష్మశరీరమున నున్న మూఁడుకోశములును ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములు. అందు సూక్ష్మ భూతములలోని రజోభాగ మంతయు అనఁగా రజోవ్యష్టిచే జనించిన కర్మేంద్రియములును తత్సమష్టిచే జనించినప్రాణంబును గలసి ప్రాణమయకోశము. సూక్ష్మభూతములలోని సత్త్వాంశ మంతయు మనోమయ విజ్ఞానమయకోశములై యున్నవి. జ్ఞానేంద్రియములతోఁ గూడినమనస్సు మనోమయకోశము. అట్టి బుద్ధి విజ్ఞానమయకోశము. కారణశరీర మగు నవిద్యయందుఁ గల మలినసత్త్వము తన ప్రియమోదాదివృత్తులతోఁ గూడి ఆనందమయకోశము.

వి. "ఇట్లు చెప్పిన దోషము వచ్చును. అన్నమయాదిశబ్దములు కోశములకే నామధేయంబులైనచో శ్రుతికి విరోధము వచ్చును. 'అన్యోఽంతర ఆత్మా ప్రాణమయః = అన్నమయాత్మకు లోపల ప్రాణమయాత్మ గలఁడు' అని శ్రుతియందు అన్నమయాది పదము లాత్మవాచకములుగానె చెప్పఁబడి యున్నవి కదా!" యనియెదవేమో. ఇది యొక దోషము కాదు. జీవునకు నాయాకోశములయం దాత్మాభిమానము కల దని యిదివఱకే చెప్పఁబడెను. ఇట్లగుటచే శ్రుతి యాతని నట్లు వ్యవహరించినది. కోశములును అన్నాదిరూపములే యగుటచే నట్లు చెప్పఁబడవచ్చును. ఆయాకోశములకు నాయన్నాదులే కదా స్వరూపము. కావున నిందు విరోధ మేమియు లేదు.

అవ. ఇట్లు పంచకోశస్వరూపమును నిరూపించి ఫలమును చెప్పుచు నుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. అన్వయవ్యతిరేకాభ్యాం పంచకోశవివేకతః,
స్వాత్మానం తత ఉద్ధృత్య పరం బ్రహ్మ ప్రపద్యతే. 37

వ్యా. కథం తర్హి ఏవంవిధస్యాత్మనో బ్రహ్మత్వం భవతీత్యాశంక్య కోశేభ్యో వివేచనాద్భవతీత్యాహ.—అన్వయేతి. అన్వయవ్యతిరేకాభ్యాం వక్ష్యమాణాభ్యాం పంచకోశవివేకతః పంచానాం కోశానా మన్నమయాదీనాం వివేకతః ప్రత్యగాత్మనో వివేచనేన పృథక్కరణేన. యద్వా కోశేభ్యోఽన్నమయాదిభ్యః ఆత్మనః పృథక్ కరణేన స్వాత్మానం ప్రత్యగాత్మానం తతస్తేభ్యః కోశేభ్యః ఉద్ధృత్య బుద్ధ్యా నిష్కృష్య చిదానందస్వరూపం నిశ్చిత్య పరం బ్రహ్మ పూర్వోక్తపంచకోశవిలక్షణం ప్రపద్యతే ప్రాప్నోతి. బ్రహ్మైవ భవతీత్యర్థః.

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం=అన్వయవ్యతిరేకములచేత (వీనిస్వరూపము దిగువ శ్లోకమునుండి వర్ణింపఁబడును.) పంచకోశవివేకతః = పంచకోశములనుండి వేఱుచేయుట వలన, ఆత్మానం=జీవుని, తతః = ఆపంచకోశాత్మక ప్రపంచమునుండి, ఉద్ధృత్య=ఉద్ధరించి (గురూపదేశమువలన ననుట.) పరం బ్రహ్మ = శుద్ధపరబ్రహ్మమును, ప్రపద్యతే = పొందును (స్వస్వరూపజ్ఞానముచే బ్రహ్మమే యగు ననుట.)

తా. ఈవిధముగ పంచకోశస్వరూపము నెఱింగి గురూపదేశ సహాయమువలన నేజీవుఁడు నిర్మలచిత్తముతో నన్వయాతిరేకముల విచారించి పంచకోశములనుండి స్వస్వరూపమును వేఱుపఱచునో వాఁడు పరమేశ్వరుఁడే యగును. బంధము పైన వర్ణించినవిధముగ భ్రాంతికల్పితమే, (లేకయు నుండునట్లు తోఁచునదియే) కావున యథార్థ స్థితిని తెలిసికొనఁగానే యదృశ్యమై పోవును.

అవ. ఇట్లు ఫలమును వర్ణించి అన్వయవ్యతిరేకస్వరూపమును వివరించుచున్నాఁడు:—

శ్లో. అభానే స్థూలదేహస్య స్వప్నే య ద్భాన మాత్మనః,
సోఽన్వయో వ్యతిరేక స్తద్భానేఽ న్యానవభాసనమ్. 38
లింగాభానే సుషుప్తౌ స్యా దాత్మనో భాన మన్వయః,
వ్యతిరేక స్తు తద్భానే లింగ స్యాభాసముచ్యతే. 39

తద్వివేకా ద్వివిక్తా స్స్యుః కోశాః ప్రాణమనోధియః,
తే హి తత్ర గుణావస్థా భేదమాత్రా త్పృథక్కృతాః. 40
సుషుప్త్యభానే భానం తు సమాధా వాత్మ నోఽన్వయః,
వ్యతిరేక స్త్వాత్మభానే సుషుప్త్యనవభాసనమ్. 41
యథా ముంజా దిషీ కైవ మాత్మా యుక్త్యా సముద్ధృతః,
శరీరత్రితయా ద్ధీరైః పరం బ్రహ్మైవ జాయతే. 42

వ్యా. ఇదానీం వివక్షితాన్వయవ్యతిరేకౌ దర్శయతి.—అభాన ఇతి. స్వప్నే స్వప్నావస్థాయాం స్థూలదేహస్యాన్నమయకోశస్యాఽభానేఽప్రతీతౌ సత్యాం ఆత్మనః ప్రతీచో యద్భానం స్వప్నసాక్షిత్వేన యత్స్ఫురణమస్తి స ఆత్మనోఽన్వయ స్తస్యామేవ స్వప్నావస్థాయాం తద్భానే తస్యాత్మనః స్ఫురణే సతి అన్యానవభాసన మన్యస్య స్థూలదేహ స్యానవభాసనమప్రతీతిః వ్యతిరేకః స్థూలదేహస్యేతి శేషః. అస్మిన్ ప్రకరణేఽన్వయవ్యతిరేకశబ్దాభ్యామనువృత్తివ్యావృత్తీ ఉచ్యేతే. 38.

ఏవం స్థూలదేహస్యానాత్మత్వావబోధకాన్వయవ్యతిరేకౌ దర్శయిత్వా లింగ దేహస్య తథాత్వావగమకౌ తౌ దర్శయతి.—లింగేతి. సుషుప్తౌ సుషుప్త్యవస్థాయాం లింగాభానే లింగస్యసూక్ష్మదేహస్యాఽభానేఽ ప్రతీతౌ ఆత్మనో భానం తదవస్థాసాక్షిత్వే స్ఫురణమాత్మనోఽన్వయః స్యాత్తద్భానే ఆత్మభానే లింగస్యాభానం లింగ దేహస్యాస్ఫురణం వ్యతిరేక ఉచ్యతే. 39.

నను పంచకోశవివేచనముపక్రమ్య లింగదేహవివేచనం ప్రకృతాసంగతమిత్యాశంక్య ప్రాణమయాదికోశ త్రితయస్య తత్రైవాంతర్భావాన్న ప్రకృతాసంగతి రిత్యాహ.—తద్వివేకాదితి. తస్య లింగశరీరస్య వివేకాద్వివేచనా త్ప్రాణమనోధియఏతన్నామకాః కోశా వివిక్తా ఆత్మనః పృథక్ కృతాః స్యుః కుత ఇత్యత ఆహ:—తే హీతి. హి యస్మాత్ కారణాత్ తే ప్రాణమయాదయః తత్ర తస్మిన్ లింగశరీరే గుణావస్థా భేదమాత్రాద్గుణయోః సత్వరజసోరవస్థా భేదమాత్రా ద్గుణప్రధానభావేనావస్థా విశేషా దేవ పృథక్ కృతాః భేదేన నిర్దిష్టా ఇత్యర్థః. 40.

ఇదానీ మానందమయకోశత్వేన వివక్షితస్య కారణశరీరస్య వివేచనోపాయమాహ.—సుషుప్తీతి. సమాధౌ వక్ష్యమాణలక్షణాయాం సమాధ్యవస్థాయాం సుషుప్త్యభానే సుషుప్తిశబ్దోపలక్షితస్య కారణదేహరూపస్యాజ్ఞానస్యాప్రతీతౌ ఆత్మనస్తు. తుశబ్దోఽవధారణే ఆత్మన ఏవభానం స్ఫురణం యదస్తిస ఆత్మనోఽన్వయః ఆత్మభానే ఆత్మనః స్ఫూర్తౌ సత్యాం సుషుప్త్యనవభాసనం సుషుప్త్యుపలక్షితస్యాజ్ఞానస్యాప్రతీతి

రేవ వ్యతిరేక స్తస్యేతి. అత్రాయం ప్రయోగః ప్రత్యగాత్మా అన్నమయాదిభ్యో భిద్యతే తేషు పరస్పరం వ్యావర్తమానేష్వపి స్వయమవ్యావృత్తత్వాత్ యద్యేషు వ్యావర్తమానేష్వపి న వ్యావర్తతే. తత్. తేభ్యో భిద్యతే యథా కుసుమేభ్యః సూత్రం యథా వా ఖండాదివ్యక్తిభ్యో గోత్వమితి. 41.

అన్వయవ్యతిరేకాభ్యాం కోశపంచకాద్వివిక్తస్యాత్మనో బ్రహ్మప్రాప్తి ర్భవతీత్యుక్తం. తత్ప్రతిపాదికామంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మేత్యాదికాం, తం విద్యాచ్ఛుక్రమమృతమిత్యంతాం కఠశ్రుతిమర్థతః పఠతి:—యథేతి. యథా యేన ప్రకారేణ ముంజాదేతన్నామకాత్తృణవిశేషాదిషీకాం గర్భస్థం కోమలం తృణం యుక్త్యా బహిరావరకత్వేన స్థితానాం స్థూలపత్రాణాం విభజనలక్షణోపాయేన సముద్ధ్రియతే, ఏవమాత్మాపి యుక్త్యాఽన్వయవ్యతిరేకలక్షణోపాయేన శరీరత్రితయాత్పూర్వోక్తాచ్ఛరీరత్రితయాద్ధీరైః బ్రహ్మచర్యాదిసాధనసంపన్నై రధికారిభిః సముద్ధృతః పృథక్కృతశ్చేత్స పరం బ్రహ్మైవ జాయతే చిదానందరూపస్య లక్షణస్యోభయోరవిశిష్టత్వాదిత్యభిప్రాయః. 42.

టీ. స్వప్నే=స్వప్నావస్థయందు, స్థూలదేహస్య=స్థూలదేహము, అభానే [సతి]= ప్రకాశింపకుండఁగా, ఆత్మనః=జీవునియొక్క, భానం=సాక్షిరూపముగ ప్రకాశించుట, యత్=ఏది కలదో, సః=అది (అన్వయశబ్దము ననుసరించి యీపదము పుంలింగమునఁ బ్రయోగింపఁబడెను.) అన్వయః=అన్వయ మనఁబడును. (స్థూలదేహము లేనప్పుడు కూడ నుండుట నాత్మవిషయమున నన్వయ మనుట.) తద్భానే=ఇట్లాస్వప్నావస్థయందే ఆత్మ ప్రకాశించుచుండఁగా, అన్యానవభాసనమ్-అన్య=రెండవదియగు స్థూలశరీరముయొక్క, అనవభాసనమ్=ప్రకాశాభావమే, వ్యతిరేకః = దేహపక్షమున వ్యతిరేకము. సుషుప్తౌ= సుషుప్త్యవస్థయందు, లింగాభానే = సూక్ష్మశరీరము ప్రకాశింపకుండఁగా, ఆత్మనః = స్వస్వరూపముయొక్క, భానం=ప్రకాశించుట, అన్వయః = అన్వయము, తద్భానే = ఆలింగశరీరప్రకాశమునందు, లింగస్య=సూక్ష్మశరీరముయొక్క, అభానం తు=ప్రకాశింపకుండుటయైతే, వ్యతిరేకః ఉచ్యతే=వ్యతిరేక మని చెప్పఁబడును. తద్వివేకాత్-తత్= ఆసూక్ష్మశరీరము, వివేకాత్=వేఱుచేయుటవలన, ప్రాణమనోధియః=ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములైన, కోశాః=కోశములు, విభక్తాః=విభజింపఁబడినవి, స్యుః=అగును. తే=ఆమూఁడుకోశములును, తత్ర = ఆసూక్ష్మశరీరమునందు, గుణ...మాత్రాత్-గుణ = సత్వరజోగుణములయొక్కయు, అవస్థా=విచారనిశ్చయరూప భృత్తులయొక్కయు, భేదమాత్రాత్=భేదమువలన మాత్రమె, పృథక్ = వేఱువేఱుగ, కృతాః హి=చేయఁబడినవి (గణింపఁబడినవి) కదా. సమాధౌ = సమాధియందు, (దీనిస్వరూపము ముస్ముందు ప్రక

టింపఁబడును.) సుషుప్త్యభానే [సతి] = సుషుప్తిశబ్దముచే నెఱుఁగఁబడెడి కారణశరీర రూపమగు అజ్ఞానముయొక్క, అభానే (సతి) = స్ఫురణములేకపోవుచుండఁగా, ఆత్మనస్తు=ఆత్మయొక్క యే, భానం=స్ఫురణము, అన్వయః=ఆత్మకన్వయమగును. ఆత్మభానే (సతి)=ఆత్మయొక్క స్ఫురణము గలుగుచుండఁగా, సుషుప్త్యనవభాసనం తు=సుషుప్తిచే నెఱుఁగఁబడెడి కారణశరీరరూపాజ్ఞానముయొక్క, అనవభాసనంతు = అస్ఫురణత్వమే, వ్యతిరేకః = కారణశరీరరూపాజ్ఞానమునకు వ్యతిరేకమగును. ముంజాత్ = ముంజగడ్డినుండి, ఇషీకా = లోపలనున్నపుల్ల (మోవు లేక ఊచ,), యథా = ఎట్లో, ఏవం = ఈవిధముగానే, ధీరైః=పండితులచే, శరీరత్రియాత్=స్థూలసూక్ష్మకారణశరీరమునుండి, యుక్త్యా=ఉపాయముచే (పైనచూపఁబడిన యన్వయవ్యతిరేకములచే, సముద్ధృతః = ఉద్ధరింపఁబడిన (విభాగించి గ్రహింపఁబడిన), ఆత్మా=స్వస్వరూపము (జీవుఁడు), పరం బ్రహ్మ ఏవ = పరబ్రహ్మమే, జాయతే=అగును.

తా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూఁడింటియందును జ్ఞానమొక్కటియే యనియు, జ్ఞానరూపుఁడగుటచే జీవుఁడు నీమూఁడవస్థలయందు నేకరూపముతో నున్నాఁడనియు నిదివఱకే వివరించియున్నాము. దేహములు మాత్ర మిట్లు లేవు కదా! స్థూలశరీరము జాగ్రదవస్థయందు మాత్రమే ప్రకాశించునుగాని స్వప్నావస్థయందు ప్రకాశింపదు. జాగ్రదవస్థయందు మాత్రమే కదా! "నేను రాముఁడను. కృష్ణుండను" అనుచుఁ దన శరీరముచే వివిధకార్యముల నాచరించుట. స్వప్నావస్థయందు కూడ దేహము కానవచ్చినను సర్వవ్యవహారములును జాగ్రదవస్థయందువలెనే జరుగుచున్నను అప్పటి దేహమీస్థూలదేహము కాదనుట యందఱు నెఱింగినదియే. ఇట్లగుటచే స్థూలశరీర మాత్మ కానేరదు. అట్లైనచో ఆత్మ యెచ్చట నుండునో అచ్చటనెల్ల స్థూలశరీర ముండవలయును కదా. స్వప్నావస్థయం దట్లు లేదని వివరించియే యున్నాము. (ఈకారణమువలననే యన్నమయకోశ మాత్మ కాదు. స్థూలశరీరమే కదా యన్నమయకోశము.) ఇట్లే సుషుప్త్యవస్థయందు మనస్సు మొదలగునవి లేకుండుటచే లింగశరీరము లేదు. అప్పుడు సర్వేంద్రియాదులును తమకు కారణ మగు నవిద్యయందు లీనములైనవి కదా! ఆత్మమాత్ర మప్పుడును అజ్ఞానసాక్షియై యున్నాఁడని యిదివఱకే యెఱింగించియున్నాము. ఈకారణమువలన సూక్ష్మశరీరముకూడ ఆత్మ కానేరదు. అదియును ఆత్మ యున్నస్థలమునం దెల్ల

లేదు కదా! ఈశరీరమునందు ప్రాణమయమనోమయ విజ్ఞానమయము లను మూఁడుకోశము లుండుటచే నవి యన్నియును ఆత్మ కావు. సత్వ రజోగుణభేదము నాశ్రయించి ప్రాణమయకోశంబును, విచారనిశ్చయ వృత్తుల నాశ్రయించి మనోమయవిజ్ఞానమయకోశములును కల్పింపఁబడి నవేకాని యాశరీరమంతయు నొక్కటియె కదా! ఈవిధముగానే కారణశరీరము కూడ ఆత్మ కాదు. సుషుప్త్యవస్థకంటె నవ్వల తురీయావస్థ యను నొక యవస్థ కలదు. అందు నింద్రియాదులే కాక వానికి లయస్థానమగు నవిద్యయు సర్వకారణమగు పరమేశ్వరునియందు లయము నందును (దీనిస్వరూపము ముస్ముందు వివరింపఁబడును.) ఆయవస్థ యందు సుషుప్తియు లేదుకదా. ఆత్మమాత్రము సర్వాధిష్ఠాన మగుటచే నప్పుడుగూడ నుండవలయును. ఇట్లగుటచేఁ గారణశరీరముకూడ ఆత్మ కా దనుటయే సిద్ధాంతము. కారణశరీరమే యానందమయ కోశము కావున నాయానందమయకోశముకూడ ఆత్మ కాదు. ఇప్పటికి ఆత్మ పంచకోశములకంటెను శరీరత్రయమునకంటెను భిన్నుఁ డని తేలినది. పైనున్నపొఱలను మెలపున తొలఁగించి ముంజగడ్డినుండి లోపలియీూచను వెలికిఁ దీయునట్లు పైన వర్ణించినవిధముగ శరీర త్రయమునుండియు (పంచకోశములనుండియు) విభాగింపఁబడియెనేని ప్రత్యగాత్మ కేవలబ్రహ్మమే యగును. భ్రాంతిమాత్రమేకాని ఎప్పటికిని స్వస్వరూపబ్రహ్మమునకు మాఱ్పు లేదుకదా!

అవ. ఇప్పటికి వేదాంతశాస్త్రార్థమంతయు ప్రకటింపఁబడెను. ఇట్లు చేయఁబడుటచే నుత్తరగ్రంథమునకుఁ బ్రయోజనము కలుగకపోవు నను శంక రాఁగా ఆప్రయోజనమును తాత్పర్యనిరూపణమూలమున సమర్థించుచున్నాఁడు:—

శ్లో. పరాపరాత్మనో రేవం యుక్త్యా సంభావి తైకతా,
తత్త్వమస్యాదివాక్యైః స్సా భాగత్యాగేన లక్ష్యతే. 43

వ్యా. ఏతావతా గ్రంథసందర్భేణ సఫలస్య తత్వజ్ఞానస్య నిరూపితత్వాదుత్తర గ్రంథభాగస్యానారంభ ప్రసంగ ఇత్యాశంక్య తదారంభసిద్ధయే వృత్తానుకథనపూర్వక ముత్తరగ్రంథస్య తాత్పర్యమాహ:—పరాపరేతి. ఏవముక్తప్రకారేణ పరాపరాత్మనో స్తత్త్వం పదార్థయోః పరమాత్మజీవాత్మనో రేకతాఽభిన్నతా యుక్త్యా లక్షణసామ్య ప్రదర్శనాద్యుపాయేన సంభావితా అంగీకారితా. సా ఏకతా తత్త్వమస్యాదివాక్యైః. స్పష్టం భాగత్యాగేన విరుద్ధాంశపరిత్యాగేన లక్ష్యతే లక్షణయా వృత్త్యా బోధ్యతే.

టీ. ఏవం = ఈవిధముగ, యుక్త్యా=యుక్తులతో (జాత్యేకవచనము); పరాపరాత్మనోః - పర=మాయోపాధియందుండి శుద్ధుఁ డైనట్టియు (పరమేశ్వరునకును), అపర = అవిద్యోపాధియం దున్నట్టియు (జీవునకు), ఆత్మనోః = ఆత్మల కిరువురకు, ఏకతా = ఐక్యము, సంభావితా = నిశ్చయింపఁబడినది. సా = అది, తత్త్వమస్యాది వాక్యై శ్చ=తత్త్వమసి అను మొదలగు మహావాక్యములచేతఁ గూడ, భాగత్యాగేన-భాగ = పరస్పర విరుద్ధము లగునుపాధులను, త్యాగేన=విడుచుటచే (విడిచి యనుట), లక్ష్యతే = ఊహింపఁబడుచున్నది.

తా. పైన వర్ణించినవిధముగ యుక్తులవలన జీవేశ్వరైక్యము సిద్ధించినది. ఈశ్వరుఁడును శుద్ధుఁడే కావున జీవునకు నాతనితో నైక్యము చెప్పినంతనే పరమేశ్వరునితో నైక్యము చెప్పిన ట్లగును. ఈవిషయమునే "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" అను మొదలగు మహావాక్యములు విరుద్ధాంశముల విడిచి జహదజహల్లక్షణచే బోధింపుచున్నవి. ఈబోధను తెల్పుట కయ్యే యుత్తరగ్రంథ మారంభింపఁబడెను.

అవ. అట్లు మహావాక్యప్రస్తావమును తెచ్చి వానిని విమర్శింపుచున్నాఁడు. అందు మొదట తత్పదార్థమును జెప్పుచున్నాఁడు. (తత్త్వమసి యను మహావాక్యమునే వివరించుచున్నాఁ డని గ్రహింపవలయును):—

శ్లో. జగతో య దుపాదానం మాయా మాదాయ తామసీమ్,
నిమిత్తం శుద్ధసత్త్వాం తా ముచ్యతే బ్రహ్మ తద్గిరా. 44

వ్యా. తత్త్వమసీతి వాక్యార్థజ్ఞానస్య తదాదిపదార్థజ్ఞానపూర్వకత్వాత్తత్పదస్య వాచ్యార్థం తావదాహ.—జగత ఇతి. యత్సచ్చిదానందలక్షణం బ్రహ్మ, తామసీం తమోగుణప్రధానాం మాయామాదాయ ఉపాధిత్వేన స్వీకృత్య జగతశ్చరాచరాత్మకస్య కార్యవర్గస్య ఉపాదానమధ్యాసాధిష్ఠానం శుద్ధసత్త్వాం విశుద్ధసత్త్వప్రధానాం తాముపాధిత్వేన స్వీకృత్య నిమిత్తముపాదానాద్యభిజ్ఞం కర్తృ భవతి తద్బ్రహ్మ నిమిత్తోపాదానోభయరూపం బ్రహ్మ తద్గిరా తత్త్వమసీతి వాక్యస్థేన తత్పదేనోచ్యతే.

టీ. యః = ఏసచ్చిదానందలక్షణబ్రహ్మ, తామసీం = తమోగుణప్రధానమైన, మాయాం=ప్రకృతిని, ఆదాయ=గ్రహించి(దానియందు ప్రతిబింబించి యనుట),యత్ = ఏది, జగతః=ప్రపంచమునకు, ఉపాదానం=ఉపాదానకారణమై యున్నదో, (తమః ప్రధాన యగుప్రకృతి ప్రపంచరూపముగఁ బరిణమించునప్పుడు, దానితోఁ గూడి ప్రపంచరూపమైన ట్లేది తోఁచుచున్నదో) శుద్ధసత్త్వాం = శుద్ధసత్త్వప్రధాన మగు, తాం = ఆ ప్రకృతిని, ఆదాయ = కైకొని, నిమిత్తం = నిమిత్తకారణమైయున్నదో,

[తత్ =ఆ] బ్రహ్మ=పరబ్రహ్మము, తద్గిరా=మహావాక్యమునందలి తచ్ఛబ్దముచే, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా. మూలప్రకృతికి సత్త్వాదిగుణములే స్వరూప మనియు, అందుఁ బరమేశ్వరుఁడు ప్రతిబింబించియున్నాఁ డనియు, నాప్రకృతి యందలి తమోగుణప్రధానసంయోగమువలనఁ బ్రపంచము జనించు చున్నది యనియు నిదివఱకే చెప్పియున్నాము. పరమేశ్వరుని ప్రతి బింబము ప్రకృతియందంతటను కలదు కావున ఆయన ప్రతి ప్రకృతి పరిణామమునందును జీవేశ్వరాదిరూపములతో నట్లే వచ్చుచుండు ననియు వివరించితిమి. ఆజీవేశ్వరులు తాము ప్రవేశించిన యుపాధినెల్ల నాత్మగా భావించుచున్నారనియుఁ జెప్పితిమి, కావున తమోగుణప్రధాన మగు ప్రకృతిసంయోగమున నున్న ప్రతిబింబముయొక్క స్వభావము కూడ నిట్టిదియే యని తెలిసికొనవలయును. జీవుఁ డనఁబడు ప్రతి బింబము మలినసత్త్వమునందుమాత్రమే ప్రతిబింబించినది. సంయోగ మెట్లు మాఱినను అందు సత్త్వగుణమే కొంత యధికముగ నుండును. ఇఁక ప్రస్తుత ప్రతిబింబ మన్ననో తమోగుణమునందు ప్రతిబింబించినది. ఈయుపాధియందును తక్కినగుణము లున్నను అవి మిగుల స్వల్పము లుగ నుండును కదా! కావున నీప్రతిబింబము ఆరంభస్థితిలోనే జీవుని కంటె నధికముగ స్వరూపభ్రంశమును పొంది జడప్రాయమై యున్నది. తమోగుణప్రధానప్రకృతి పరిణామము నొందినప్పుడు స్వయముగనే పరిణమించినట్లు తలంచుచున్నది. ఇట్లగుటచేతనే దీనిని ప్రత్యేకముగ నింతకుముందు వర్ణింపలేదు.

వి. ఈవిధముగ తమోగుణప్రధాన యగుమాయయందు తాదాత్మ్యాభిమానము కలిగియే బ్రహ్మము ప్రపంచమున కుపాదానకారణ మగుచున్నదో (మట్టి కుండరూపము నొందునట్లు ఏకారణము తానే కార్యరూపము నొందునో అది యుపాదానకార ణము.) శుద్ధసత్త్వప్రధాన యగుప్రకృతినే యాశ్రయించి ఏ బ్రహ్మము ఈప్రపంచము నకు నిమిత్తకారణ మగుచున్నదో (ఈశ్వరుఁడు శుద్ధుఁడు గావున నాయనకు "నేనే ప్రపంచరూపము నొందుచున్నాను" అను తాదాత్మ్యభ్రాంతి లేదు. "నావలన నీప్రకృతి ప్రవర్తించుచున్నది" యను జ్ఞానము కలదు. నిమిత్తకారణ మనఁగా కుండకు కుమ్మరివానివలెనే సాక్షిమాత్రమై యుండుకారణము.) ఆయభిన్ననిమిత్తోపాదాన కారణ (ప్రతిబింబ మంతయు నొక్క బింబమే యగుటచే నిట్లు చెప్పఁబడెను.) మగుపరబ్రహ్మమే

తచ్ఛబ్దముచేఁ జెప్పఁబడును. ఈశ్వరుఁడు శుద్ధుఁ డగుటచేతను తమఃప్రధానప్రకృతి యందలి ప్రతిబింబము మిగుల హీనమై కల దనియే గోచరము కాకపోవుటచేతను వానిని గూర్చి విచారింపక సిద్ధ మైనట్లే యైక్యము వర్ణింపఁబడెను. జీవుఁడుమాత్రము సంసారి యని లోకమునఁ దోఁచుచుండుటచేతను శుద్ధబ్రహ్మ మని వేదముచేఁ జెప్పఁబడుచుం డుటచేతను నుపదేశార్థమై మిగుల్పఁబడెను. ఇట్లు కాకున్న తమోగుణప్రతిబింబితుఁడు కాని జీవుఁ డీశ్వరునకు చేరికయేకదా!

అవ. ఇపుడు సర్వసంశయకారణ మగు త్వంపదార్థమును నిర్ణయింపు చున్నాఁడు:—

శ్లో. యదా మలినసత్త్వాం తాం కామకర్మాదిదూషితామ్,
అదత్తే త త్పరం బ్రహ్మ త్వంపదేన త దోచ్యతే. 45

వ్యా. త్వంపదవాచ్యార్థమాహ.—యదేతి. తదేవ బ్రహ్మ యదా యస్యా మవ స్థాయాం మలినసత్త్వాం ఈషద్రజస్తమోమిశ్రణేన మలినసత్త్వప్రధానాం అత ఏవ. కామ కర్మాదిదూషితాం తా మవిద్యాశబ్దవాచ్యాం మాయామాదత్తే ఉపాధిత్వేన స్వీకరోతి, తదా త్వంపదేనోచ్యతే.

టీ. తత్=ఆ, పరం బ్రహ్మ = పరబ్రహ్మము, యదా=ఎప్పుడు, మలినసత్త్వాం = మలినసత్త్వప్రధాన యగు నట్టియు, కామ...దూషితామ్ - కామ=కోర్కెలు, కర్మ = కర్మము, ఆది = మొదలగువానిచే, దూషితాం=దుష్టమైన (కలుషమైన)ట్టియు, తాం= ఆమూలప్రకృతిని, ఆదత్తే = స్వీకరించునో, తదా=అప్పుడు, త్వం పదేన=త్వంశబ్దముచే, ఉచ్యతే = చెప్పఁబడును.

తా. మలినసత్త్వప్రధాన యగు ప్రకృతినిఁగూర్చిగాని దాని యందలి ప్రతిబింబమును గూర్చిగాని క్రొత్తగాఁ జెప్పవలసినది యేమియు లేదు. రజస్తమోగుణసంసర్గచే సత్త్వగుణమే ప్రధానముగా కలది యయ్యును కలుష యై కామక్రోధాదులచేతను బహువిధకర్మలచేతను దుష్టముగ చేయఁబడిన యాయవిద్యయందు ప్రతిబింబించియున్న జీవుఁడే త్వంశబ్దమున కర్థము. ఈతత్త్వంశబ్దములు ఉపాధిసహిత ప్రతి బింబములనే చెప్పు నని గ్రహింపవలయును. తమః ప్రధానప్రకృతియుఁ దత్ప్రతిబింబంబును శుద్ధసత్త్వప్రధానప్రకృతియు దత్ప్రతిబింబంబును కలసి తచ్ఛబ్దమున కర్థము. మలినసత్త్వప్రధానప్రకృతియుఁ దత్ప్రతి బింబంబును కలసి త్వంశబ్దార్థము.

అవ. ఇఁక "అసి" యను పదముయొక్క యర్థము స్పష్ట మగుటచే వాక్య తాత్పర్యమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. త్రితయీ మపి తాం ముక్త్వా పరస్పరవిరోధినీమ్,
అఖండం సచ్చిదానందం మహావాక్యేన లక్ష్యతే. 46

వ్యా. ఏవం తత్త్వంపదార్థానభిధాయ వాక్యార్థమాహ.—త్రితయీ మితి. త్రితయీమపి త్రిప్రకారామపి తమఃప్రధానవిశుద్ధసత్త్వప్రధాన మలినసత్త్వప్రధానత్వ భేదేనోక్తా మతఏవ పరస్పరవిరోధినీం తాం మయాం ముక్త్వా పరిత్యజ్య అఖండం భేదరహితం సచ్చిదానందం బ్రహ్మ మహావాక్యేన లక్ష్యత ఇతి ఉక్తమ్.

టీ. పరస్పరవిరోధినీమ్ = ఒకదానికొకటి విరోధముగా నున్న, త్రితయీంఅపి= మూఁడువిధములైన, తాం = ఆప్రకృతిని, ముక్త్వా=విడిచి, అఖండం = ఉపాధికృత విభాగములులేని, సచ్చిదానందం = సత్యజ్ఞానానందస్వరూప మగు శుద్ధపరబ్రహ్మము, మహావాక్యేన = మహావాక్యముచే, లక్ష్యతే = ఊహింపఁబడును. (అసి = అగుచున్నావు అను పద మాతత్త్వంశబ్దార్థములకు నైక్యమును చెప్పుచున్నది కావున నందు ఆయాయుపాధులు పరస్పరవిరుద్ధము లగుటచే వానిని పరిత్యజించిననే కాని వాక్యార్థము కుదుర దనుట.)

తా. అసి పదమునకు "అగుచున్నావు" అని యర్థ మనుట స్పష్టము. ఇందువలన "తత్త్వమసి" యను మహావాక్యమునకు "నీవు ఆబ్రహ్మమ వగుచున్నావు" అని యర్థ మేర్పడును. ఈతత్త్వంశబ్దము లుపాధులతోఁ గూర్చియే కల్పితభేదభిన్నము లగు ప్రతిబింబములఁ జెప్పు నని యిదివఱకే వివరించి యున్నాము. ఇట్లగుటచే నిచ్చట నుపాధులకుఁగూడఁ బరస్పర మైక్యము సంభవింపవలసి వచ్చినది. ఇది తాత్పర్యమునకు విరుద్ధ మగుటచే నిచ్చటను లక్షణావృత్తి యంగీకరింపఁబడవలయును. సామాన్యముగఁ బదార్థములచే తాత్పర్యము సమన్వితము కానప్పుడు తాత్పర్యానుకూలముగ నాపదములనుండియే వానికి సంబంధించిన మఱియొక యర్థము గ్రహించుట 'లక్షణావృత్తి' యనఁబడును. "దేశము క్షోభించుచున్నది" యను మొదలగువాక్యములయందు దేశక్షోభ యనఁగా గృహారామాదులు కదలుచు నుండుటకు వీలు లేక పోవుటచే ఆదేశపదమునే యనుసరించి యందలి జనులకు క్షోభ కలుగుచున్నది యని యర్థమును చెప్పుట యేది కలదో ఇదియే లక్షణావృత్తి. ఇది జహల్లక్షణ యనియును అజహల్లక్షణ

యనియు జహదజహల్లక్షణ యనియు త్రివిధము. (ఇది వేదాంతుల మతము. ఇతర శాస్త్రములయందు మూఁడవలక్షణ లేదు.) అందు వాక్యమునఁ బ్రస్తాపింపఁబడినపదార్థమును సంపూర్ణముగ వదలి దానికి సంబంధించిన యితర పదార్థములను మాత్రమే గ్రహించుట జహల్లక్షణ. ప్రస్తాపింపఁబడినపదార్థమును సంపూర్ణముగ విడువక తత్సంబంధి యగుపదార్థము గ్రహించుట యజహల్లక్షణ. ఆపదార్థముల కొంత విడిచి కొంత విడువక తత్సంబంధమగు పదార్థమును గ్రహించుట జహదజహల్లక్షణ. "ఆ గ్రామముమీఁదుగ పోయిన నీవు గమ్యస్థానమును చేరుదువు" అను మొదలగువాక్యములు వినఁబడినప్పుడు గ్రామముపై నెక్కి పోవుట సంభవింపదు. కావున నాగ్రామపదార్థమును బొత్తుగనే విడిచి దానిప్రక్క నున్న త్రోవను పరిగ్రహించి "ఆగ్రామమునకు ప్రక్కగా నున్న త్రోవ ననుసరించిన గమ్యస్థానమునకు చేరఁగలవు" అని యన్వయించుకొనుచున్నాము. ఇది జహల్లక్షణ కుదాహరణము. అజహల్లక్షణ యిదివఱకే యుదాహరింపఁబడెను. "దేశము క్షోభించుచున్నది" అనువాక్యమున దేశపదార్థమును విడువకయే యందలి ప్రజలు గ్రహింపఁబడిరి కదా! ఇఁక మూఁడవలక్షణముఁగూర్చి కొంత విచారింతము. అందు ప్రస్తాపితపదార్థములోఁ గొంతభాగమే విడువఁబడుచుండుటచే శేషించినభాగము పరిగ్రహింపఁబడును; ఇంతయే కాని ప్రస్తాపితపదార్థభిన్న మగునది ఏదియు గ్రహింపఁబడదు. తక్కిన లక్షణలలో నిట్లు కా దనుట స్పష్టమే. "నాఁడు నాతో మాటలాడిన రాముఁడే వీఁడు" అను మొదలగువాక్యములు దీని కుదాహరణములు. ఇచ్చట "అతఁడే యీతఁడు" అను రెండుశబ్దములచేతను దేశకాలాది యుక్తుఁ డగు రాముఁ డొక్కఁడే చెప్పఁబడుచున్నాఁడు కదా! నాఁటికిని నేఁటికిని దేశకాలాదిభేదము లనేకము లుండఁ బదార్థములు రెండు నైక్యము నొందుట యెట్లు? ఈకారణమువలనఁ నిట్టి వాక్యములయందు దేశకాలాదులు పరిత్యజింపఁబడి రాముఁడు మొదలగు వారు మాత్రమే గ్రహింపఁబడుచున్నారు. ఇం దొక భాగము విడువఁబడియే మఱియొక భాగము మాత్రము గ్రహింపఁబడుటచే నిది మూఁడవది యగు జహదజహల్లక్షణ.

వి. ప్రస్తుతవాక్యమునందును ఈమూఁడవలక్షణమే గ్రహింపఁబడి యున్నది. తత్త్వంశబ్దార్థములలో నొక్కభాగ మగు త్రివిధ ప్రకృతులును (శుద్ధసత్వ మలినసత్వ తమఃప్రకృతులు మూఁడును) పరిత్యజింపఁబడినవి. అవి పరస్పరవిరుద్ధస్వభావములు కలవి కదా! వానిని విడువఁగా శేషించినబ్రహ్మ ప్రతిబింబ మేది కలదో అదియే ఏకముగ గ్రహింపఁబడినది. ఉపాధులు లేకపోయిన బ్రహ్మమునకు పారమార్థికవిభాగ మింతయు లేదు కదా! ఇట్లు మహావాక్యముచే జీవేశ్వరైక్య మూహింపఁబడుచున్నది. ఇంతకు ముందు చూపఁబడినయుక్తులకు నీశ్రుతివాక్యములే యవలంబములు. వాక్య మనునది అభిధావృత్తిచేతఁగాని లక్షణావృత్తిచేతఁగాని వ్యంజనావృత్తిచేతఁగాని తన తాత్పర్యము ను వెల్లడింపవచ్చును. అభిధావృత్తి యనఁగా ప్రసిద్ధపదములచేతనే తాత్పర్యము ను చెప్పుట. లక్షణావృత్తి యనఁగా నూహచేత తాత్పర్యమును తెలుపుట. దీనిస్వరూపా దులు మున్నే వివరింపఁబడెను. వ్యంజనావృత్తి యనఁగా నొక యర్థమును చెప్పుచు మఱియొక యర్థమును స్ఫురింపఁజేయుట. ఇది సాధారణముగ ప్రౌఢకావ్యములయందు మాత్రమే శోభను కలిగించుటకై యుపయోగింపఁబడుచున్నది. కావున లక్షణా వృత్తిచేఁ దాత్పర్యమును ప్రకటించినంత మాత్రమున వాక్యమున కప్రామాణ్యము రాదు. ప్రత్యక్షానుభవము నాధారముగఁ గైకొని ప్రవర్తించు యుక్తులును బహువిధ ముల నీయైక్యమును స్థిరపఱచినవి కదా! విషయమును చెప్పునది వేదము. యుక్తులు దాని ననువాదముచేసినవి యని మాత్రమే ఎఱుంగునది. ఇట్లు కాకున్న శబ్దప్రమాణమే లేకపోవలసివచ్చు నని యిదివఱకే వివరించియున్నాము.

అవ. ఈయర్థమునే గ్రంథకర్త స్వయముగ వివరింపుచున్నాఁడు:—

శ్లో. సోఽయ మిత్యాదివాక్యేషు విరోధా త్తదిదంతయోః,
త్యాగేన భాగయో రేక ఆశ్రయో లక్ష్యతే యథా. 47
మాయాఽవిద్యే విహాయైవ ముపాధీ పరజీవయోః,
అఖండం సచ్చిదానందం పరం బ్రహ్మైవ లక్ష్యతే. 48

వ్యా. నన్వేవం లక్షణావృత్త్యా వాక్యార్థబోధనం క్వ దృష్టమిత్యాశంక్యాహ:—సోఽయమితి. సోఽయం దేవదత్త ఇత్యాదివాక్యేషు తదిదంతయోః తదేతద్దేశ కాలవైశిష్ట్యలక్షణయో ర్ధర్మయో ర్విరోధాదైక్యానుపపత్తేర్భాగయో ర్విరుద్ధాంశ యోస్త్యాగేనైక ఆశ్రయో దేవదత్తస్య రూపమేక మేవ యథా లక్ష్యతే. 47.

ఏవం దృష్టాంత మభిధాయ దార్ష్టాంతిక మాహ.—మాయాఽవిద్యే ఇతి. ఏవం సోఽయం దేవదత్త ఇత్యాదివాక్యే యథా తద్వత్పరజీవయో రుపాధీ ఉపాధిభూతే

మాయాఽవిద్యే పూర్వోక్తే విహాయాఖండం భేదరహితం సచ్చిదానందం పరంబ్రహ్మైవ మహావాక్యేన లక్ష్యతే.

టీ. సోఽయం=వాఁడే వీఁడు, ఇత్యాదివాక్యేషు=అను మొదలగు వాక్యముల యందు, తదిదంతయోః = ఆ ఈ యను (ఆ దేశకాలాదులకును ఈ దేశకాలాదులకు ననుట), విరోధాత్ = విరోధ ముండుటవలన, భాగయోః = విరుద్ధాంశములయొక్క, త్యాగేన = విడుచుటచేత (విడిచి యనుట). ఏకః=ఒక్కఁడైన, ఆశ్రయః = వాని కాధార మగు పురుషుఁడు, యథా=ఎట్లు, లక్ష్యతే=గుఱుతింపఁబడునో, ఏవం = ఈ విధముగానే, పరజీవయోః=జీవేశ్వరులకు, ఉపాధీ = ఆవరణములైన, మాయాఽవిద్యే= మాయావిద్యలను, విహాయ = విడిచి, అఖండం = భేదములేని, సచ్చిదానందం = సత్యజ్ఞానానందరూపమైన, పరం బ్రహ్మ ఏవ=పరబ్రహ్మమే, లక్ష్యతే=గుఱుతింపఁబడును.

తా. "వాఁడే వీఁడు" అను మొదలగువాక్యములను సమన్వయించునప్పుడు లోకులు పరస్పరవిరుద్ధములైయున్న "ఆ, ఈ" అను పదములయొక్క యర్థములను (దేశకాలాదులను) పరిత్యజించి ముఖ్యుఁడగు పురుషుని మాత్రమే ఎట్లు గ్రహించుచున్నారో అట్లే తత్త్వమస్యాది వాక్యములయందును జీవేశ్వరులకు నుపాధులై యున్న మాయావిద్యలను విడిచి కల్పితభేదరహిత మగు బ్రహ్మమును మాత్రమే గ్రహింపవలయును.

అవ. ఇఁక నీవాక్యార్థమును దృఢపఱచుటకై పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు:—

శ్లో. సవికల్పస్య లక్ష్యత్వే లక్ష్యస్య స్యా దవస్తుతా,
నిర్వికల్పస్య లక్ష్యత్వం న దృష్టం న చ సంభవి. 49

వ్యా. నను కిం మహావాక్యేన లక్ష్యం సవికల్పముత నిర్వికల్పమితి వికల్ప్య ప్రథమే పక్షే దోష మాహ పూర్వవాదీ.—సవికల్పస్యేతి. సవికల్పస్య వికల్పేన విపరీతత్వేన కల్పితేన నామజాత్యాదినా రూపేణ వర్తత ఇతి సవికల్పం తస్య లక్ష్యత్వే వాక్యేన బోధ్యత్వే లక్ష్యస్య వాక్యార్థత్వే లక్ష్యస్యావస్తుతా స్యాత్ మిథ్యాత్వం స్యాత్. ద్వితీయే దోషమాహ.—నిర్వికల్పస్యేతి. నిర్వికల్పస్య నామజాత్యాదినా రహితస్య లక్ష్యత్వం న దృష్టం లోకే. న క్వాపి దృష్టం న చ సంభవి ఉపపద్యమాన మపి న భవతి లక్ష్యత్వ ధర్మవతో నిర్వికల్పత్వవ్యాఘాతా దితి యావత్.

టీ. సవికల్పస్య=వికల్పముతోఁగూడిన, బ్రహ్మమునకే (వికల్ప మనఁగా కల్పిత నామరూపాదులు), లక్ష్యత్వే = మహావాక్యముచే నూహింపఁబడఁదగినస్థితి కల దనిన;

లక్ష్యస్య = లక్ష్యమగుపదార్థమునకు, అవస్తుతా=భ్రాంతిసిద్ధత్వము, స్యాత్ = అగును. (కలితనామరూపాదులు బ్రహ్మమునకు నిత్యములే యగునేని యప్పు డాయనయు నామ రూపములవలె మిథ్యాభూతుఁడే కావలయు ననుట). నిర్వికల్పస్య = నామరూపాది శూన్యునకు, లక్ష్యత్వం=ఊహింపఁదగినస్థితి, న దృష్టం=లోకమునఁ గానరాదు. (నామ రూపాదులు లేనివాని నూహించుటయే లే దనుట). న చ సంభవి=అట్లూహింపవచ్చు ననుటకును వీలు లేదు. ("అట్లు చెప్పిన ఊహింపఁ దగియుండుట" యను ధర్మమైనను వానియం దుండును కదా! ఇఁక నాతఁడు వికల్పశూన్యుం డెట్లగు ననుట).

తా. ఇచ్చట నొక సంశయము కలదు. మహావాక్యమును బ్రహ్మము నూహించి చెప్పు నని కదా పైన సిద్ధాంతము చేయఁబడెను. అది యెట్లు చేయుటకు వీలు లేదు? లోకమున నేవిషయము నోటితో చెప్పఁబడినను మనస్సుతో నూహింపఁబడినను, అదియెల్ల నామరూపాత్మ కముగానే యున్నది. ఈనామరూపములు కల్పితములే కాని పారమా ర్థికములు కావంటిరి కదా! వాస్తవస్థితిలో నివి బొత్తుగనే లే వంటిరి కదా! ఇట్టిన నిఁక నీయూహ యెట్లు పొసంగును? ఈమహావాక్య ములు కల్పితనామరూపసహితుఁ డగు బ్రహ్మము నూహించిచెప్పునా? లేక శుద్ధబ్రహ్మము నూహించి చెప్పునా? వికల్పసహితునే యూహించు నందురేని యప్పు డది మీమతమున పరమార్థవస్తువు కానేరదు. వేద మట్టి వస్తువునే కదా యుపదేశింపవలయును. ఇఁక రెండవపక్షము నవ లంబించినను, అది సరిపడదు. ఈపక్షము నెంత ప్రయాసపడి సాధించి నను పరమేశ్వరునకు వికల్పశూన్యత్వము రాదు. ఏవికల్పము లేకు న్నను మహావాక్యములచే నూహింపఁబడువాఁ డను ధర్మమైన నుండక పోదుకదా! ఇదియు నిర్వికారునకు వికారమే యనుటలో సంశయ మేమి? కావున నెట్లును మీసిద్ధాంతము సరిపడ లేదు.

అవ. ఇట్లు వాక్యమునకును పరమేశ్వరునకును గలసంబంధమును గూర్చి పూర్వ పక్షమును గావించి "సర్వమును కల్పితమే; మహావాక్యముచేత బ్రహ్మ మూహింపఁ బడుచున్న దనుటయుఁ గల్పితమే" యను నభిప్రాయములతో నాపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు:—

శ్లో. వికల్పో నిర్వికల్పస్య సవికల్పస్య వా భవేత్,
ఆద్యే వ్యాహతి రన్యత్రానవస్థాత్మాశ్రయాదయః. 50

వ్యా. సిద్ధాంతీ జాత్యుత్తరత్వాన్నేదం చోద్యమితి వికల్పపూర్వకం దోష మాహ—వికల్ప ఇతి. సవికల్పస్య వా నిర్వికల్పస్య వా లక్ష్యత్వమితి తయో ర్వికల్ప స్త్వయా కృతః. స కిం నిర్వికల్పస్య? ఉత, సవికల్పస్య భవేత్? ఆద్యే ప్రథమే పక్షే వ్యాహతి స్త్వయోక్తో వ్యాఘాత ఏవ. అప్యత్ర ద్వితీయే పక్షే అనవస్థాదయః, తథాహి సవికల్పస్య వికల్ప ఇత్యత్ర వికల్పేన సహ వర్తత ఇత్యత్ర తృతీయాంతక వికల్ప పదేన ప్రథమాంత వికల్పపదేన చైక ఏవ వికల్పోఽభిధీయతే. ద్వౌ వా? ఏక ఏవ చేత్స్వయమేక ఏక వికల్పాశ్రయ విశేషణతయాఽఽశ్రయ స్తదాశ్రితో వికల్ప శ్చేత్త దాత్మాశ్రయతా. ద్వౌ చేత్తదా తృతీయాంతశబ్దనిర్దిష్టస్యాపి వికల్పస్వ సవికల్పరూప త్వాత్తదాశ్రయస్యాపి సవికల్పత్వాత్తద్విశేషణభూతో వికల్పః కిం ప్రథమాంతశబ్ద నిర్దిష్ట ఏవ వికల్పః? ఉత తాభ్యామన్యః? ఆద్యే అన్యోన్యాశ్రయతా ద్వితీయేఽపి ధర్మివిశేషణీభూతో వికల్పః కిం ప్రథమాంతశబ్దనిర్దిష్టః? ఉత తేభ్యో న్యః? ఆద్యే చక్రకాపత్తి ర్ద్వితీయే తస్యాప్యన్య స్తస్యాప్యన్య ఇత్యనవస్థాపాత ఇతి.

టీ. వికల్పః = కల్పితనామరూపములు లేక పూర్వపక్షిచేఁ జేయఁబడినవికల్పము ("వాక్యమెవ్వనిఁ జెప్పు" అను వికల్పము). నిర్వికల్పస్య=నిర్వికల్పునికి, భవేత్ వా= ఉండునా? సవికల్పస్య=సవికల్పునికి, భవేత్ వా=ఉండునా? ఆద్యే=మొదటిపక్షమున, వ్యాహతిః = చెప్పినమాటకే భంగము వచ్చును. లేక పూర్వపక్షి పైశ్లోకమునందే చెప్పి యున్నదోషము వచ్చును. అన్యత్ర=రెండవపక్షము నవలంబించిన, అనవస్థా... ఆదయః- అనవస్థా=ముగింపు లేకపోవుటయు, ఆత్మాశ్రయ = తన్ను తానే యాశ్రయించుటయు, ఆదయః=అను మొదలగు దోషములు (అన్యోన్యాశ్రయచక్రకాపత్తిదోషములు) కలు గును. (కావున వికల్ప మొకనికి కల దని తలంచుట భ్రాంతియే యగును. కాని యెప్పటికిని యథార్థము కానేర దనుట).

తా. ఈపూర్వపక్షము యుక్తమయినది కాదు. పరమేశ్వరుని యందు సర్వమును కల్పితమై యున్నది. ఏదియు బొత్తిగ లేకున్నను అన్నియు పరిపూర్ణముగ నున్నవి. ఈపక్షము నంగీకరించిననే సరి యగును గాని లేకున్న నెట్లును కుదురదు. ఈవిధముగఁ గాక మఱేయేవిధముగ నైనను వస్తురూపమును సాధింపఁబోయిన నది సరిపడదు. ఈ కార ణమువలన నీపూర్వపక్షమే చేయఁదగినది కాదు. పూర్వపక్షి యెట్లు పూర్వపక్షమును కావించెనో సిద్ధాంతియు నట్లే సిద్ధాంతము కావింప వచ్చును. లక్ష్యత్వమును (ఊహింపఁబడఁదగినస్థితిని) గూర్చి పూర్వపక్షి

యెట్టి యాక్షేపములఁ గావించెనో, వాఁడొనర్చిన వికల్పమును (వికల్ప ల్పమనఁగా రెండు పక్షములును గైకొని యాక్షేపించుట) గూర్చియు నట్టియాక్షేపములనే కావింపవచ్చును. ఎట్లనిన:

వి. పూర్వపక్షి వికల్పమును కావించెనుగదా! ఆవికల్పము నిర్వికల్పుని గూర్చియా? లేక సవికల్పుని గూర్చియా? నిర్వికల్పునకు నేదియు (ఏధర్మంబును) లే దని యాతఁడే యంగీకరించి యున్నాఁడు. ఇట్లుండ నీవికల్పముమాత్ర మాతనిఁ జెందుట ఎట్లు? వికల్పింపఁదగియుండుట యనునదియు నొక్క ధర్మమే కదా! మఱియు నిర్వికల్పుని గూర్చి వికల్పించితి ననుటకంటె వెఱ్ఱితనము వేఱొక్కటి లేదు. నిర్వి కల్పుఁ డనఁగా వికల్పము లేనివాఁడు కదా! వానిని వికల్పించుట ఎట్లు? కావున నిర్వి కల్పునిగూర్చి వికల్పము జరిగె ననుట సంభవింపదు.

ఇఁక "సవికల్పుని గూర్చియే పూర్వపక్షి వికల్పించెను" అనుటయు యుక్తికి నిలు వదు. సవికల్పుఁ డనఁగా వికల్పముతోఁ గూడినవాఁ డని కదా యర్థము. ఇట్టివానికే వికల్పము కల దనిన ననేక దోషములు వచ్చుచు. ఎవ్వనికి వికల్పము లేదో వానిని గూర్చి వికల్పము సంభవింప దని యిదివఱకే తెలిసికొనియున్నాము కదా! కావున నొక వికల్ప ముండిననేకాని దాని నాశ్రయించి రెండవవికల్పము రా దని తెలియు చున్నది. కావున నాశ్రయముగ నుండవలసిన వికల్పంబును దాని నాశ్రయించి వచ్చు వికల్పంబును నొక్కటియే యందురా? లేక భిన్నము లందురా? ఒక్కటియే యనిన "ఒక వికల్పమే తనకుఁ దానే యాశ్రయ మగుచున్నది" యనియుఁ "దన్ను దానే యాశ్రయించుచున్నది" యనియుఁ జెప్పవలసి వచ్చును. ఇది సరికాదుకదా. ఒక్క పదార్థమే ఆశ్రయముగ నాశ్రితముగఁగూడ నుండుట యెట్లు? ఇదియే ఆత్మా శ్రయ దోషము.

ఇఁక నావికల్పములు పరస్పరభిన్నము లనినచో నప్పటికిని దోషములు నివర్తిం పవు. "వికల్పముతోఁ గూడినవానికి వికల్పము కలదు" అని కదా చెప్పఁబడెను. "ఒక వికల్పముండిననే కాని మఱియొక వికల్పము రాదు" అని దీనివలననే నిశ్చిత మగు చున్నది) ఇట్లైన తృతీయావిభక్తితోఁ జెప్పఁబడిన వికల్పము కూడ వికల్పమే కావున నిది పదార్థము నాశ్రయించుటకుఁ బూర్వమునఁగూడ నాపదార్థమున మఱియొక వికల్ప ముండవలయును. ఒక వికల్పము లేనిది రెండవ వికల్పము రాదు కదా! ఇప్పుడు నిర్ణ యింపుఁడు. ఈమూఁడవవికల్పము కూడ ప్రస్తావములోనున్న రెండు వికల్పములలోఁ జేరునా? చేరదా? చేరునేని యన్యోన్యాశ్రయదోషము వచ్చును. అప్పుడు ప్రథమా విభక్తితోఁ జెప్పఁబడిన వికల్పము తృతీయావిభక్తితోఁ జెప్పఁబడినదానికిని, తృతీయా

విభక్తితోఁ జెప్పఁబడినది ప్రథమావిభక్తితోఁ జెప్పఁబడినదానికిని ఆశ్రయము లగుచుం డును కదా! ఇట్లుకాక మూఁడవవికల్పము నొక్కదాని నంగీకరించిన నది ప్రస్తుత వికల్పద్వయములో ప్రథమావిభక్తితోఁ జెప్పఁబడినవికల్పమేనా? లేక యామూడింటి కంటె అన్యమా? మొదటిపక్షమున చక్రకదోషము వచ్చును. చక్రకదోష మనఁగా చక్రమువలె నియమము లేకుండ నంగీకరింపఁబడిన పదార్థములే పరస్పరము కార్య కారణ భావమును జెందుట. అంగీకరింపఁబడిన మూఁడవవికల్పము కూడ వికల్పమే కావున నది పదార్థము నాశ్రయించుటకుఁగూడ మున్ముందుగ నాపదార్థము నొక వికల్ప మాశ్రయించి యుండవలయును. కావున నీవికల్పము ప్రస్తుతవికల్పత్రయమునకంటె భిన్న మగునేని యనేకవికల్పముల నంగీకరింపవలసివచ్చును. నాల్గవవికల్పము కూడ వికల్పమే కావున దానికై హేతువుగ నైదవవికల్పంబును దానికి హేతువుగ నాఱవ వికల్పంబును నిట్లే లెక్కకు మిక్కిలి యగువికల్పముల నంగీకరింపవలసి వచ్చును. ఇదియే యనవస్థాదోషము. (ఎప్పటికిని ముగింపు లేకుండుట యను దోషము.)

కావునఁ బూర్వపక్షి చేసినవికల్పమే యుక్తము కానేరదు. మఱియు వికల్ప మనఁగా కల్పితనామరూపాదులు. కావున నానామరూపాదులు తత్సహితునకుఁగాని తద్రహితునకు నుండవు. ఈవాద మీవిషయమునఁ గూడ నుపయోగపడు నని తెలిసి కొనవలయును. "కల్పన కల్పనాసహితునియందు యుండునా? తద్రహితునియం దుం డునా?" యని విచారింప నారంభించినఁ బైయుక్తు లన్నియు నిం దుపయోగపడును. కల్పన యనునది విశేషమేమియును లేకుండ నిర్వికారుఁ డగుశుద్ధుని నాశ్రయింపదు కదా!

అవ. ఇట్లు పూర్వపక్షమును దూషించి మఱికొన్ని విషయములనుగూడ నీ వాదము చేతనే నిర్ణయింపవచ్చు ననుచున్నాఁడు:—

శ్లో. ఇదం గుణక్రియాజాతిద్రవ్యసంబంధవస్తుషు,
సమం తేన స్వరూపస్య సర్వ మేత దితీష్యతామ్. 51

వ్యా. న కేవలమత్రైవేదం దూషణమపితు సర్వత్రైవంవిధ వికల్పపూర్వకం దూషణం ప్రసరతీత్యాహ.—ఇదమితి. ఇదం వికల్పదూషణజాతం గుణక్రియాజాతి ద్రవ్యసంబంధ వస్తుషు గుణాదిసంబంధాంతేషు పంచసు వస్తుషు సమం. తథాహి గుణః కిం నిర్గుణే వర్తతే? అథవా గుణవతి? క్రియాపి క్రియారహితే వర్తతే? క్రియా వతివా? ఆద్యే వ్యాఘాతోఽన్యత్రాత్మాశ్రయాదయ ఇతి. సర్వత్ర చైవమూహ్యం. నన్విదమసదుత్తరం చేత్కిం సదుత్తర మిత్యాశంక్యాహ— తేనేతి. తేనైవం వికల్పస్యా సంగతత్వేనైతద్గుణాదికం సర్వం స్వరూపస్యేతి ఇష్యతాం గుణాదయః సర్వే వస్తు స్వరూపే వర్తంత ఇత్యభిప్రాయః.

టీ. ఇదం=ఈన్యాయము, గుణ...వస్తుషు - గుణ=గుణము (శబ్దస్పర్శాదులు), క్రియా = వ్యాపారము, జాతి = జాతి, ద్రవ్య = ద్రవ్యములును (పృథివ్యాధులు), సంబంధ=సంయోగాదులు అనియెడు, వస్తుషు = పదార్థములయందు, సమం=సమానమే, (ఈన్యాయము నాశ్రయించియే గుణాదులు కూడ నెవ్వరికిని నుండ వని నిర్ణయింప వచ్చు ననుట). తేన=ఈకారణమువలన, ఏతత్ సర్వం=ఇదియంతయు, స్వరూపస్య= స్వరూపమునకే కలదు. (ఈగుణాదులన్నియు కల్పితములై స్వరూపమునందే యున్నవి యనుట.) ఇతి=అని, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁ గాక.

తా. మఱియు పైయుక్తులను గుణాదివ్యవస్థనుగూర్చి నిర్ణయింప వలసినప్పుడుగూడ నుపయోగింపవచ్చును. "గుణము సగుణునికిఁ గలదా? లేక నిర్గుణునికి కలదా?" అని ప్రశ్నించి దానికి సమాధానము చెప్పఁదలఁచినప్పుడు ఇదియు వికల్పమే కావున పైశ్లోకమున వివరింపఁ బడిన యుక్తియంతయు నట్లే యుపయోగపడును. ఇదియును గాక నీపూర్వపక్షమును నాశ్రయించి కూడ నట్టియుక్తులతోనే సమాధానము ప్రత్యక్షముగఁ జెప్పవచ్చును. ఎట్లనిన:—గుణము నిర్గుణున కుండదు. అట్లుండుటకును వీలు లేదు. నిర్గుణపదమునకు గుణాభావము కలవాఁ డని కదా యర్థము. తనకు విరోధి యగు నభావ (స్వప్రతియోగికాభావ) మున్నచోట నేపదార్థముగాని స్వయముగ నుండుట యెట్లు? మఱియు గుణాభావము కూడ గుణమే కావున లేక విశేషమే కావున (విశేష మనఁగా దేనినాశ్రయించి పదార్థమును గుఱుతింతురో యట్టి ధర్మ మని తెలిసికొనవలయును. ఎవ్వనియొద్ద గుణము లేదో అనఁగా గుణాభావము కలదో వాఁడు నిర్గుణుఁడని కదా నిర్గుణపదార్థము తక్కిన వానినుండి వేఱుచేయుదుము.) అదియు నిర్గుణునియం దుండరాదు. ఇఁక సగుణునికే గుణము కల దనుటయు సంభవింపదు. "వీనికీ స్వభావము కలదు." అనిన "ఇట్లు కలుగుటకుఁ గారణ మేమి?" అను ప్రశ్న ముద యించును. దానికి లోకమున "అది దానియందలి విశేషము" అని మాత్రమే సమాధానము కలదు. ఇది యందఱకును ప్రసిద్ధ మగు విష యము. విశేష మనఁగా సాధారణముగ గుణమే యగును. కావున నొక్క గుణము లేనిది మఱియొక గుణ మాశ్రయింపదు. ఇట్లగుటచే పైనఁ జూపినట్లు విమర్శించినచో నిచ్చటఁ గూడ నాత్మాశ్రయాదిసర్వ దోషములను జూపవచ్చును.

వి. ఇట్లే "క్రియ క్రియాసహితునకుఁ గలదా ? క్రియారహితునకుఁ గలదా ? జాతి జాతిసహితునకుఁ గలదా ? తద్రహితునకుఁ గలదా ? ద్రవ్యత్వము తత్సహితునికిఁ గలదా ? తద్రహితునికిఁ గలదా ? సంబంధము సంబంధసహితునకుఁ గలదా ? తద్రహితునకుఁ గలదా ? అనువాదముల నన్నిటిని నిట్లే పరిష్కరింపవచ్చును. "ఇది సరిగా నుండ లేదు. ద్రవ్యత్వాదు లాశ్రయించుటకు నొక విశేష ముండవలయు ననుట యథార్థమే కాని యావిశేషము గుణకర్మాదిరూపమే. (అనఁగా గుణాశ్రయమగుపదార్థమునందు గుణ రూపముగానే యుండు ననియు, కర్మాశ్రయమగు పదార్థమునందు కర్మరూపమునే యుండు ననియు) యనుటకు వీలు లేదు. గుణాశ్రయ మగు పదార్థమునందు గలవిశేషము కర్మరూపముగ నుండిన నుండవచ్చును కదా ?" అనియెదవేమొ. వినుము. ఇట్లు నియమించుటకు వీ లెట్లు కలుగును ? విశేష మనునది నానారూపములతో నుండు ననుట యథార్థమే యైనను గుణాదులలో నేది పదార్థముల నాశ్రయింపఁబోవుచున్నదో విశేషముకూడ తద్రూపముగ నుండు ననియుఁ గల్పింపవచ్చును కదా! కావున నీవాద మంత దృఢము కాదు. పైశ్లోకమున నంతమునందు వివరింపఁబడిన కల్పనావాదమునందు కూడ నిట్లే విషయనిర్ణయమును కావింపవలయును. కల్పనాశ్రయమగుపదార్థమునకుఁ గూడ నున్నవిశేషము కల్పనారూపముగనే యుండవచ్చు నని నిర్ణయింపవలయును.

"ఇది చక్కనివాదము కాదు. దీనియందు వంచన మాత్రమే ప్రధానముగ నున్నది; విషయనిర్ణయమునకుఁ జక్కని యనుభవదృష్టాంత మిందుఁ గానరాలేదు" అని యెదవేమొ. యథార్థమే. వాదమున దోష మేమియు లేదు కాని తక్కినచోట్లవలె నిచ్చట ననుభవదృష్టాంతము లేదు. ఈవిషయమును మొట్టమొదటనే సూచించితిమి. "ఉత్తరము కూడ ప్రశ్నమువంటిదే యని నిరూపించితిమి కదా ! కావున నీపూర్వ పక్షమే యుక్తము కాదు. బ్రహ్మము నిత్యశుద్ధ మనియు కల్పితములై యాతనియందు నామరూపాదు లన్నియు నున్నవి యనియు మొట్టమొదటనుండియు చెప్పుచున్నాము; ఇట్లుండ గుణక్రియాదులు మాత్రము కల్పితములై యేల యుండరాదు ? మహావాక్యములచే నూహింపఁదగియుండుట (మహావాక్యలక్ష్యత్వము) అను గుణముమాత్ర మేల కల్పితము కారాదు ? ఈకారణమువలన పైవిషయమునఁ బూర్వపక్షము గావించి జాత్యుత్తరముచే నలయుటకంటె "పరమేశ్వరునియందు కల్పితమై సర్వంబును కలదు" అని యంగీకరించుట యుక్తము.

అవ. ఇట్లు పూర్వపక్షమును ఖండించి మహావాక్యార్థము నుపసంహరించుచున్నారు:—

శ్లో. వికల్పతదభావాభ్యా మసంస్పృష్టాత్మ వస్తుని,
వికల్పితత్వలక్ష్యత్వ సంబంధాద్యా స్తు కల్పితాః. 52

వ్యా. భవత్వేవమన్యత్ర ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ.—వికల్పేతి. వికల్పతదభావాభ్యాం వికల్పేన వికల్పాభావేన చాసంస్పృష్టాత్మవస్తునిసంస్పర్శరహిత పరమాత్మ వస్తుని వికల్పితత్వసంబంధాద్యా స్తత్ర వికల్పితత్వం నామ సవికల్పస్య వా నిర్వికల్పస్య వేతి పూర్వోక్తేన విషయీకృతత్వం. లక్ష్యత్వం లక్షణావృత్త్యా జ్ఞాప్యత్వం. సంబంధః సంయోగాదిరాదిశబ్దేన ద్రవ్యాదయో గృహ్యంతే. తుశబ్దోఽవ ధారణే. తత్ర ద్రవ్యం నామ గుణానామాశ్రయో ద్రవ్యం, సమవాయికారణం ద్రవ్య మితి వాతార్కికైర్లక్షితం. కర్మవ్యతిరిక్తత్వే సతి జాతిమాత్రాశ్రయో గుణః నిత్యమేక మనేక వృత్తి సామాన్య మితి లక్షితా జాతిః. సంయోగవియోగయోరసమవాయికారణ జాతీయం కర్మేతి లక్షితా క్రియా. ఏతే సర్వే స్వరూపే కల్పితా ఏవేత్యర్థః.

టీ. వికల్పతదభావాభ్యాం = వికల్పము, అది లేకుండుట అనువానితో, అసం స్పృష్టాత్మవస్తుని - అసంస్పృష్ట=సంబంధములేని, ఆత్మవస్తుని=పరమాత్మునియందు, వికల్పి తత్వ...ఆద్యాః - వికల్పితత్వ = "మహావాక్యములు సగుణునిఁ జెప్పునా ? నిర్గుణునిం జెప్పునా ?" అను మొదలగువిధముల వికల్పింపఁదగియుండుట, లక్ష్యత్వ=ఊహింపఁదగి యుండుట, సంబంధ = సంయోగాదిసంబంధములు, ఆద్యాఃతు = మొదలగునవియైతే, కల్పితాః = కల్పింపఁబడినవి.

తా. వాస్తవస్థితిలో పరబ్రహ్మమునందు గుణములును లేవు; తద భావంబును లేదు. అభావము కూడ విశేషమే యగుటచే నదియు నిర్వి కారునియం దుండుట సంభవింప దని యిదివఱకే చెప్పియున్నాము కదా! కావున నాతనియం దీగుణాదు లన్నియును తదభావములతోఁ గూడఁ గల్పింపఁబడినవే. కావున "మహావాక్యములచే గుఱుతింపఁదగి యుండుట" యనుగుణము కూడ కల్పింపఁబడినదియే. ఇట్లగుటచే ఆయనను మహావాక్యము లూహించుచున్నవి యనిన నేమి, యూహింప లేవనినను నంతియే. అభావముకూడ నాయనయం దుండదు కదా! కావున నీవిషయమునఁ బూర్వపక్షమును చేయుటయే సంభ వింపదు. (అనఁగా ఆత్మభిన్నములుగ మహావాక్యములు కల వనుటయు నవి ఆత్మ నూహించి చెప్పు ననుటయు నవి యాత్మ నెట్లూహింపఁగల

వను పూర్వపక్షంబును తత్సిద్ధాంతంబును కూడఁ బ్రపంచమువలె కల్పనామాత్రమే యని పరమతాత్పర్యము.)

అవ. ఇట్లు మహావాక్యవిచారము నుపసంహరించి జ్ఞానసిద్ధికి నంతరంగసాధనములగు శ్రవణాదుల నభివర్ణించుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం వాక్యై స్తదర్థానుసంధానం శ్రవణం భవేత్,
యుక్త్యా సంభావితత్వానుసంధానం మననం తు తత్. 53
తాభ్యాం నిర్విచికిత్సేఽర్థే చేతసః స్థాపితస్య యత్,
ఏకతానత్వమేతద్ధి నిదిధ్యాసన ముచ్యతే. 54

వ్యా. ఏతావతా గ్రంథసందర్భేణ కిముక్తం భవతీత్యాకాంక్షాయాం ఫలితమాహ.—ఇత్థమితి. ఇత్థం జగతో యదుపాదాన మిత్యాది గ్రంథజాతోక్త ప్రకారేణ వాక్యై స్తత్త్వ మస్యాదివాక్యై స్తదర్థానుసంధానం తేషాం వాక్యానామర్థస్య జీవబ్రహ్మణోరేకత్వలక్షణస్యానుసంధానం శ్రవణం భవేత్. యుక్త్యా శబ్దస్పర్శాదయో వేద్యా ఇత్యాదినా పరాపరాత్మనోరేవం యుక్త్యా సంభావితైకతేత్యం తేన గ్రంథసందర్భేణోక్తప్రకారేణ సంభావితత్వానుసంధానం శ్రుతస్యార్థస్యోపపద్యమానత్వజ్ఞానం యదస్తి తత్తు మనన మిత్యుచ్యతే.

ఇదానీం నిదిధ్యాసనమాహ.—తాభ్యామితి. తాభ్యాం శ్రవణమననాభ్యాం నిర్విచికిత్సే నిర్గతా విచికిత్సా సంశయో యస్మాదసౌ నిర్విచికిత్సః తస్మిన్నర్థే విషయే స్థాపితస్య ధారణావతశ్చేతసః. * దేశసంబంధ శ్చిత్తస్యధారణేతి పతంజలినోక్తత్వాద్యదేకతానత్వ మేకాకారవృత్తిప్రవాహవత్వ మేతన్నిదిధ్యాసనముచ్యతే. హి ప్రసిద్ధం యోగశాస్త్రే తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమితి.

టీ. ఇత్థం=ఈవిధముగ, వాక్యైః=తత్త్వమసి అను మొదలగు మహావాక్యముల ౹త (మహావాక్యము లన్నియు మహావాక్యవివేకమున వివరింపఁబడును.) తత్ ... నుసంధానం - తత్=ఆవాక్యములయొక్క, అర్థ=తాత్పర్యభూతార్థమైన జీవబ్రహ్మైక్యమును, అనుసంధానం = గ్రహించుట, శ్రవణం=శ్రవణము (వినికి), భవేత్ = అగును. యుక్త్యా=యుక్తులతో, సంభావితత్వానుసంధానం-సంభావితత్వ=నిశ్చయమును (జీవుఁడు నిశ్చితముగ బ్రహ్మమే యను నిశ్చయమును), అనుసంధానం తు [యత్ = ఏది కలదో], తత్=అది, మననం = మనన మనఁబడును. (మనన మనఁగా విచారణ.) తాభ్యాం=ఈరెండింటిచేతను, నిర్విచికిత్సే = నిస్సంశయమైన, అర్థే= విషయమునందు,

జీవబ్రహ్మైక్యమునందు), స్థాపితస్య = నిలుపఁబడిన, చేతసః = మనస్సునకుఁ గలుగు, ఏకతానత్వం = ఏకాగ్రత్వము, యత్ = ఏది కలదో, ఏతత్=ఇదియే, నిదిధ్యాసనం= నిదిధ్యాసనము (ధ్యానము), అని, ఉచ్యతే హి = చెప్పఁబడుచున్నది కదా.

తా. స్పష్టము.

అవ. ఇట్లు సాధనముల వర్ణించి యందు నిదిధ్యాసనమే సమాధి యగు నను చున్నాఁడు:—

శ్లో. ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్,
నివాతదీపవ చ్చిత్తం సమాధి రభిధీయతే. 55

వ్యా. తస్యైవ నిదిధ్యాసనస్య పరిపాకదశారూపం సమాధిమాహ.—ధ్యాతృ ధ్యానే ఇతి. నిదిధ్యాసనే తావద్ధ్యాతా ధ్యానం ధ్యేయం చేతి త్రితయం భాసతే. తత్ర యదా చిత్తమభ్యాసవశేన ధ్యాతృధ్యానే ధ్యాతారం ధ్యానం చ క్రమా త్పరి త్యజ్య ధ్యేయైకగోచర ధ్యేయ మేక మేవ గోచరో విషయో యస్య తత్తథావిధం భవతి, తదా సమాధిరిత్యుచ్యతే. తత్ర దృష్టాంతః నివాతేతి—వాయురహితే ప్రదేశే వర్తమానో దీపో యథా నిశ్చలో భవతి తద్వదిత్యర్థః.

టీ. క్రమాత్=క్రమముగ, ధ్యాతృధ్యానే=ధ్యానముచేయువాఁడు, ధ్యానము అను రెండింటిని, పరిత్యజ్య = విడిచి, ధ్యేయైకగోచరమ్ [సత్]=ధ్యానింపఁబడుచున్న పదార్థమునం దొక్కదానియందే నిలిచి, నివాతదీపవత్ - నివాత = గాలిలేని స్థలమున నున్న, దీపవత్=దీపమువలె నున్న, చిత్తం=ధ్యానాయత్తమైన చిత్తము, సమాధిః = సమాధి యని, అభిధీయతే = చెప్పఁబడును. (పరబ్రహ్మముతో నేకీభవించినచిత్తము కేవలము నిర్మల మగుటచే ప్రకాశరూపమై యుండును. కావున దీపముతోఁ బోల్పఁ బడెను.)

తా. ఆనిదిధ్యాసనము ధ్యానరూప మగుటచే నందు ధ్యానించు వాఁడు ధ్యానము ధ్యానింపఁబడునది యను మూఁడు పదార్థములు కలవు. వాస్తవస్థితిలో బ్రహ్మమునందు భేదములు లేవు కదా! ఏక స్వరూపమగుదాని ధ్యానించువానికి భేదము కానఁబడుట యయుక్త మని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. అట్లు కనఁబడుటయు సంభవింపదు; భ్రాంతివలన సంభవించినను అది యథార్థము కానేరదు. ప్రస్తుతము జీవు లాత్మనిశ్చయము కలవారలైనను, అనాదినుండియు భేదసంస్కా రము దృఢముగ వచ్చుచున్నది. కావున నది వారిని వెంటనే విడు వదు. ధ్యాన మభ్యాస మగుకొలఁది చిత్తము ధ్యాతృధ్యానముల

రెండింటిని విడిచి పరమేశ్వరునియందు మాత్రమే ఏకీభవించును. ఇదియే సమాధి.

అవ. "ఇట్లు చిత్తము లీన మగునేని యప్పుడు వృత్తు లేవియు నుండవు కదా! ఇట్లైన నామనస్సు బ్రహ్మమునే కనుచున్నది యనుటకు మాత్ర మెట్లు వీలు కలుగును? అదియు (బ్రహ్మమును చూచుటయు) నంతర్ముఖవృత్తియే కదా!" యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వృత్తయ స్తు తదానీ మజ్ఞాతా అ ప్యాత్మగోచరాః,
స్మరణా దనుమీయంతే వ్యుత్థితస్య సముత్థితాత్. 56

వ్యా. నను సమాధౌ వృత్తీనామనుపలబ్ధా ధ్యేయైకగోచరత్వమపి నిశ్చేతుం న శక్యత ఇత్యాశంక్య వృత్తిసద్భావస్యానుమానగమ్యత్వాన్నైవ మిత్యాహ.—వృత్తయ స్త్వితి. ఆత్మగోచరా ఆత్మా గోచరో విషయో యాసాం తా వృత్తయస్తు తదానీం సమాధికాలేఽ జ్ఞాతా అపి. వ్యుత్థితస్య సమాధేరుత్థితస్య సముత్థితాదుత్పన్నాత్స్మరణా దేతావంతం కాలం సమాహితోఽభూవ మిత్యేవం రూపాదనుమీయంతే యద్యత్స్మర్యతే తత్తదనుభూత మితి వ్యాప్తే శ్లోకసిద్ధత్వా దిత్యర్థః.

టీ. వృత్తయః తు = మనోవృత్తులైతే, తదానీం=ఆసమాధిసమయమునందు, అజ్ఞాతా అపి = ప్రత్యక్షముగఁ దెలియఁబడని వైనను, వ్యుత్థితస్య = ఆసమాధినుండి మేల్కాంచినవానికి, సముత్థితాత్ = పుట్టిన, స్మరణాత్ = స్మృతివలన, ఆత్మగోచరాః - ఆత్మ = సర్వసాక్షికి, గోచరాః = గోచరము లగుచునే యున్నవిగా, అనుమీయంతే=ఊహింపఁబడుచున్నవి. ఆత్మను గ్రహించుచున్నవిగాఁగూడ నూహింపఁబడుచున్నవి యనవచ్చును. (వృత్తులు ఆత్మను గ్రహించుచు ఆత్మచేత గ్రహింపఁబడుచునున్నవి యని తాత్పర్యము).

తా. సమాధికాలమునందు నెంతకాలము నిలిచినను పురుషున కొకప్పటికి ప్రారబ్ధవశమున మెలఁకువ కలుగుచునే యున్నది. అప్పుడు వాఁడు "నేను సమాధియం దుంటిని" అని స్మరించుచున్నాఁడు. ఈస్మృతినిబట్టి చూచిన దీనికి నొక యనుభవ ముండవలయు నని నిస్సంశయముగ నిర్ణయింపవచ్చును. అట్లు విచారించినచో నాయనుభవమునకు స్వరూప మేమిగా నుండవలయును? ఆత్మ తన కభిముఖమై యున్నచిత్తమును గ్రహించుటయే కదా! చిత్తమభిముఖమగుట యనఁగా నందుండి వృత్తిజనించుటయే యనుట నిర్వివాదము. మనస్సు ఏపదార్థమును

గ్రహింపవలయు ననినను వృత్తిరూపముగ దానిపైకిఁ బ్రసరించి కాని గ్రహింపదు. ఆవృత్తియు పదార్థాకారమును జెందినది యయ్యె దానిపై వ్యాపించును. (ఈవిషయము మున్ముందు సవిస్తరముగ ప్రకటింపఁ బడును). (ఇదియే మనస్సు విషయాభిముఖ మయ్యె ననుటకు నర్థము. కావున సమాధియందును ఇట్లే మనస్సునుండి బ్రహ్మాకారవృత్తిపరంపర జనించుచుండు ననియే యూహింపవచ్చును. ఇట్లగుటచే "సమాధి యందు మనస్సు బ్రహ్మమును మాత్రమే ధ్యానింపుచున్నది" యనుట వలన విరోధ మేమియు లేదు. ధ్యాన మనఁగా పలుమాఱు ధ్యేయ స్వరూపమును భావించుటయే. కావున "సమాధియందు వృత్తిపరంపర (అనేక వృత్తులు) కలదు" అని చెప్పవలయును. బాహ్యావృత్తులు మాత్రము సంస్కారవిశేషమువలన సుషుప్తినుండి మేల్కాంచిన వానికివలెనే సమాధినుండి మేల్కాంచినవానికిని కలిగినను సుషుప్తి యందువలెనే సమాధియందును లేవని తెలిసికొనవలయును. మనస్సు అంతర్ముఖ మగుట యొక్కటి తప్ప తక్కిన విషయమున నందంతటను సుషుప్తిసమాధులకు భేదము లేదు.

అవ. 'ఇదియు యుక్తము కానేరదు. ఏవృత్తి కలుగవలయు ననినను ప్రయత్న ముండవలయును. సమాధియం దన్ననో యట్టిప్రయత్నములకు నవకాశము లేదు. ధ్యేయమునకంటె భిన్న మగునది యేదియు లేదు కదా? ఉండిననే కాని ప్రయత్నం బును కలుగదు కదా!" యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వృత్తీనా మనువృత్తి స్తు ప్రయత్నా త్ప్రథమా దపి,
అదృష్టాసకృదభ్యాససంస్కారసచివా ద్భవేత్. 57

వ్యా. నను, తదానీం వృత్త్యుత్పాదకప్రయత్నాభావా త్కథం వృత్త్యను వృత్తిరిత్యాశంక్య తాత్కాలికప్రయత్నాభావేఽపి ప్రాథమికాదేవ ప్రయత్నాదదృష్టాది సహకారిసహితాద్భవతీ త్యాహ:—వృత్తీనామితి. ధ్యేయైకగోచరాణాం వృత్తీనామనువృత్తిస్తు ప్రవాహరూపేణానుగతిస్తు ప్రథమాదపి ప్రయత్నాత్సమాధిపూర్వకాలీనాదపి అదృష్టమశుక్లకృష్ణకర్మాఖ్యో యః పుణ్యవిశేషః కర్మాశుక్లకృష్ణం యోగిన స్త్రివిధమితరేషామితి పతంజలినా సూత్రితత్వాత్ యశ్చాసకృదభ్యాససంస్కారః పునఃపునః సమాధ్యభ్యాసేన జనితో భావనాఖ్యః సంస్కారవిశేష స్తాభ్యాం సహకారి కారణాభ్యాం సహ వర్తమానాద్భవతి.

టీ. వృత్తీనాం = ఆత్మవిషయకము లగునంతర్ముఖవృత్తులయొక్క, అనువృత్తిః తు = అనుసరణ మైతే (ఒకదానివెనుక, మఱి యొక్కటి జనించుట యైతే), అదృష్ట ...సచివాత్ - అదృష్ట = అశుక్లకృష్ణ మనఁబడు పుణ్యపాపములుకాని కర్మచేతను, (ఇట్టికర్మయే యోగమును కలిగించు నని యోగశాస్త్రజ్ఞులు చెప్పెదరు.) అసకృత్ = పలుమాఱు, అభ్యాస = యోగాభ్యాసముచేయుటచేత కలిగిన సంస్కారభావన యనఁబడు సంస్కారముతోను (భావనయే వాసన), సచివాత్ =కూడిన, ప్రథమాత్ = సమాధికి పూర్వమున నున్న, ప్రయత్నాత్ అపి = ప్రయత్నమువలననైనను, భవేత్ = కలుగవచ్చును.

తా. మఱియు చిత్తమునుండి వృత్తులు జనించుటకు ప్రయత్న ముండవలయును. సమాధియం దట్టిప్రయత్న ముంఢుటకు వీలు లేదు. భేదదృష్టి లేనిది ప్రయత్న ముండదు; భేదదృష్టి లేనిది సమాధి కుదు రదు. కావున “సమాధి యనఁగా నొక్క చిత్తవృత్తియే యగునేమో?” యను సంశయము జనించుటకు నవకాశము కలదు. అయితే ఈసంశయ మునకు నాధారము లేదు. ధ్యాన మనఁగా ధ్యేయమును పలుమాఱు స్మరించుటయే. కావున వృత్తు లనేకములుగ నుండి తీరవలయును. అప్పటికప్పుడు ప్రయత్నము లేకపోయినను సమాధియందు నిలుచు టకుఁ బూర్వ మది కలదు! త్రిప్పి విడువఁబడినచక్రము మఱల మఱలఁ ద్రిప్పఁబడకున్నను కొంతకాలమువఱకు తిరుగునట్లు మొట్ట మొదటి ప్రయత్నముచేతనే మనస్సు వృత్తిపరంపరను కలిగింపవచ్చును. మఱియు నాప్రయత్నమునకు సహాయముగ మఱికొన్ని కూడ నున్నవి. మొదటిది పురాకృతకర్మ. ఇది యెట్టివానికైనను అనఁగా ప్రకృతజన్మ మున మొట్టమొదటినుండియు నెట్టిప్రవర్తనతో నున్న వానికైనను బలాత్కారముగ యోగసిద్ధి నొసంగఁగలదు. ఇది పుణ్యరూపము గాని పాపరూపముగాని కా దనియు కేవలము యోగసాధనము మాత్రమే యగునుకాని మఱి దేనిని కలిగింప దనియు యోగశాస్త్ర జ్ఞులు చెప్పెదరు. “కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం” అను సూత్రముచే యోగశాస్త్రమున నీవిషయమే వర్ణింపఁబడి యున్నది. రెండవది యభ్యాసము. పలుమాఱు సమాధి అభ్యసించుటవలన నావాసన మనస్సునందు దృఢమై సమాధి కుపక్రమింపఁగానే నదీ వేగమువలె పరంపరగా వృత్తుల జనింపఁజేయును. కావున నాసమయ

మున ప్రయత్నము కలుగుటకు వీలు లేదనునించుక కారణముచే "సమాధియందు వృత్తులే లేవు" అని కాని "ఉన్నను ఒక్క వృత్తి మాత్రమే కలదు" అని కాని చెప్పి ధ్యానపదార్థమును భగ్నము చేయ సాహసింపఁగూడదు.

అవ. ఈసమాధి కల దను విషయమునఁ బ్రమాణముఁ జూపుచున్నాఁడు:—

శ్లో. యథా దీపో నివాతస్థ ఇత్యాదిభి రనేకథా,
భగవా నిమ మే వార్థ మర్జునాయ న్యరూపయత్. 58

వ్యా. నన్వయం సమాధిః పూర్వాచార్యైర్న నిరూపితో దృష్ట ఇత్యాశంక్య సర్వగురుణా శ్రీపురుషోత్తమేన నిరూపితత్వా న్నైవమిత్యాహ.—యథేతి. యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతేత్యాదిభిః శ్లోకైః అనేకథా నానాప్రకారేణ భగవాన్ జ్ఞానైశ్వర్యాదిసంపన్నః ఇమమేవ నిర్వికల్పకసమాధిరూపమర్థమర్జునాయ శిష్యాయ న్యరూపయ న్నిరూపితవాన్.

టీ. నివాతస్థః = గాలిలేనిస్థలమున నున్న, దీపః = దీపము, యథా = ఎట్లో, (ఇది యోగికి నుపమానము), ఇత్యాదిభిః = అను మొదలగువాక్యములచే, అనేకథా = అనేకవిధములుగ, భగవాన్ = భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు, అర్జునాయ = అర్జునుని కొఱకు, ఇమం=ఈ, అర్థం ఏవ=విషయమునే (సమాధిస్వరూపమునే), న్యరూపయత్ = నిరూపించెను.

తా. ఇట్టి స్వరూపముగల సమాధి యుండుట సంభవింప దని తలంతువేమొ? అది తగదు. సర్వలోకగురువగు శ్రీకృష్ణభగవానులు. అర్జునునకు నీవిషయమునే "యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా, యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః" అను మొదలగుశ్లోకములచే నాఱవయధ్యాయమునందు వివరించి యున్నాఁడు.

అవ. ఇట్లు సప్రమాణముగ సమాధిని వివరించి తదభ్యాసమువలనఁ గలుగు ఫలమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. అనాదా విహ సంసారే సంచితాః కర్మకోటయః,
అనేన విలయం యాంతి శుద్ధో ధర్మో వివర్ధతే. 59

వ్యా. అస్య సమాధేరవాంతరఫలమాహ.—అనాదావితి. అనాదౌ స్పష్టం. ఇహాఽస్మిన్ సంసారే సంచితాః సంపాదితాః కర్మకోటయః కర్మణాం పుణ్యాపుణ్యలక్షణానాం కోటయ ఇత్యుపలక్షణం. అపరిమితాని కర్మాణీత్యర్థః. అనేన సమాధినా విలయం యాంతి వినశ్యంతి. క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ఇతి శ్రుతేః, జ్ఞానాగ్ని స్సర్వకర్మాణీతి స్మృతేశ్చ. శుద్ధోః ధర్మః సవిలాసా విద్యానివర్తక సాక్షాత్కార సాధనభూతో ధర్మో వివర్ధతే. స్పష్టమ్.

టీ. అనాదౌ=అనాదియైన, ఇహ=ఈ, సంసారే=సంసారమునందు, సంచితాః = సంపాదింపఁబడిన, కర్మకోటయః=అపరిమితములైన పుణ్యాపుణ్యరూపకర్మలు, అనేన=ఈ సమాధిచేత, విలయం=నాశమును, యాంతి=పొందుచున్నవి. విశుద్ధః=నిర్మలమగు (సాక్షాత్కారమును కలిగించునట్టి), ధర్మః=ధర్మవిశేషము (చిత్తశుద్ధి), వివర్ధతే=వృద్ధినొందును.

తా. "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" ఆపరాత్మరునిఁ గనుఁగొనినయెడల అనాదినుండి యార్జింపఁబడిన సర్వకర్మలును క్షీణించును. ఓ యర్జునా! జ్ఞాన మను నగ్ని కర్మల నొక్కక్షణములో భస్మము చేయును. అను మొదలగు శ్రుతిస్మృతుల ననుసరించి చూచిన నీసమాధి వలన సర్వకర్మలును నశించును; సాక్షాత్కారసాధన మగుచిత్తశుద్ధి దినదినమునకు నభివృద్ధి నొందును.

అవ. ఈవిషయమున మహాత్ముల సమ్మతిని చూపుచున్నాఁడు:—

శ్లో. ధర్మమేఘ మిమం ప్రాహు స్సమాధిం యోగవిత్తమాః,
వర్షత్యేష యతో ధర్మామృతధారా స్సహస్రశః. 60

వ్యా. తత్ర కిం ప్రమాణమిత్యత ఆహ.—ధర్మేతి. యోగవిత్తమాః అతిశయేన యోగజ్ఞా బ్రహ్మసాక్షాత్కారవంత ఇతి యావత్. ఇమం నిర్వికల్పసమాధిం ధర్మమేఘం ప్రాహుః స్పష్టం. తదుపపాదయతి.—వర్షతీతి. యతః కారణా దేష సమాధి ర్ధర్మామృతధారాః ధర్మలక్షణా అమృతధారాః సహస్రశో వర్షతి క్షణమేకం క్రతుశతస్యాపీతి శ్రుతేరతో ధర్మ మేఘం ప్రాహురితి. పూర్వేణాన్వయః.

టీ. ఏషః = ఈ నిర్వికల్పసమాధి (సామాన్యనిదిధ్యాసనము సవికల్పసమాధి యనియు, నిప్పుడు వర్ణింపఁబడినది నిర్వికల్పసమాధి యనియు తెలిసికొనవలయును.) ధర్మ...ధారాః - ధర్మ = ధర్మ మనెడు (ఇది చిత్తశుద్ధి కానోపు నని మున్నే వివరించి

యున్నాము). అమృత = అమృతముయొక్క, ధారాః = ధారలను, సహస్రశః=వేన వేలుగ, యతః = ఏకారణమువలన, వర్షతి = వర్షింపుచున్నదో [తతః = ఆకారణము వలన], యోగవిత్తమాః = యోగవేత్తలలో నగ్రేసరులు, ఇమం=ఈ, సమాధిం = నిర్వికల్పసమాధిని, ధర్మమేఘం = ధర్మమును (వర్షించు) మేఘ మని, ప్రాహుః = చెప్పిరి.

తా. "క్షణ మేకం క్రతుశతస్య = నిర్వికల్పసమాధి నొక్క క్షణ కాల మాచరించువాఁడు నూఱు మహాయజ్ఞములు చేసినవాఁ డగును" అను మొదలగుశ్రుతుల నాశ్రయించిన పైసిద్ధాంతమున కేమియు భంగము రాదు. వేదాంతవేత్త లగుమహాత్ములుగూడ నీసమాధి నిట్లే వర్ణింపుచున్నారు. ధర్మము నపరిమితముగ వర్షధారలవలె వర్షించునది కావున దీనిని ధర్మమేఘ మనిరి.

అవ. ఇట్లు సర్వమును వివరించి సమాధికిఁ గల ముఖ్యప్రయోజనమును చెప్పుచు విషయము నుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. అమునా వాసనాజాలే నిశ్శేషం ప్రవిలాపితే,
సమూలోన్మూలితే పుణ్యపాపాఖ్యే కర్మసంచయే. 61
వాక్య మప్రతిబద్ధం స త్ప్రాక్పరోక్షావభాసితే,
కరామలకవ ద్బోధ మపరోక్షం ప్రసూయతే. 62

వ్యా. ఇదానీం సమాధేః పరమప్రయోజన మాహ.—అమునేతి. అమునా సమాధినా వాసనాజాలే అహంకారమమకారకర్తృత్వాద్యభిమానహేతుభూతే జ్ఞానవిరుద్ధే సంసారసమూహే నిశ్శేషం యథా భవతి తథా ప్రవిలాపితే వినాశితే పుణ్యపాపాఖ్యే కర్మసంచయే సమూలోన్మూలితే మూలసహితం యథా భవతి తథోన్మూలితే ఉద్ధృతే వినాశిత ఇతి యావత్.

ఫలితమాహ:—వాక్యమితి. వాక్యం తత్త్వమస్యాదివాక్యం అప్రతిబద్ధం సత్కర్మవాసనాభ్యాం ప్రతిబంధరహితం సత్ ప్రాక్ పరోక్షావభాసితే పూర్వం పరోక్షతయా ప్రకాశితే తత్త్వే కరామలకవత్కరస్థితామలకగోచరమివాపరోక్ష మపరోక్షతయా తత్త్వావభాసనసమర్థం బోధం జ్ఞానం ప్రసూయతే జనయతి.

టీ. అమునా = ఈసమాధిచేత, వాసనాజాలే = శుభాశుభవాసనాసమూహము, నిశ్శేషం = మిగులు లేకుండ, ప్రవిలాపితే [సతి] = నశింపఁజేయఁబడినప్పుడు, పుణ్యపాపాఖ్యే=పుణ్యపాపము లను పేరు గల, కర్మసంచయే=కర్మసమూహము, సమూలో

న్మూలితే-సమూల=వేరుతోఁగూడ, ఉన్మూలితే [సతి] = పెల్లగింపఁబడినప్పుడు, (కర్మకు మూలము వాసనలే యని గ్రహించునది.) వాక్యం = తత్త్వమస్యాదిమహావాక్యము, అప్రతిబద్ధం సత్ = కర్మలచేతఁగాని వాసనలచేతఁగాని ప్రతిబంధములేనిదై, ప్రాక్ = మొట్టమొదట, పరోక్షావభాసితే = పరోక్షముగ (స్వానుభవశూన్యముగ)ఁ బ్రకాశించును. తతః=పిదపఁ జేయఁబడిన (తత్త్వే = తత్త్వమందు). కరామలకవత్=అఱచేత నున్న ఉసిరిక పండువలె, అపరోక్షం = ప్రత్యక్షమైన, బోధం = జ్ఞానమును, ప్రసూయతే = కలిగించును (అపరోక్షజ్ఞానమును కలిగించు ననుట.)

తా. సమాధి దృఢమయ్యోనేని అనాదినుండియు మనస్సున నెలకొనియున్న వాసనలును, వానివలన సంపాదింపఁబడియున్న కర్మలును నిశ్శేషముగ నశించును. అప్పుడు ప్రతిబంధరహితమై మహావాక్యజనిత జ్ఞానము ప్రకాశించును. మొట్టమొదట పరోక్షరూపమున నుండి పరిపాకమును జెందుకొలఁది నపరోక్షముగ మాఱును. మొట్టమొదట జీవబ్రహ్మము లొక్కటి యని సామాన్యజ్ఞానము కలుగును; పిదప నేనే బ్రహ్మము నను విశేషజ్ఞానము కలుగును.

అవ. ఇప్పుడు పరోక్షాపరోక్షజ్ఞానమున ప్రభావమును వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. పరోక్షం బ్రహ్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం,
బుద్ధిపూర్వకృతం పాపం కృత్స్నం దహతి వహ్నివత్. 63
అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం,
సంసారకారణాజ్ఞానతమసశ్చండభాస్కరః. 64

వ్యా. ఇదానీం పరోక్షజ్ఞానస్య ఫలమాహ.—పరోక్షమితి. దేశికపూర్వకం గురుముఖాల్లబ్ధం తత్త్వమస్యాద్యాగమజన్యం పరోక్షం బ్రహ్మవిజ్ఞానం బుద్ధిపూర్వకం యథా భవతి తథా కృతం కృత్స్నం సమస్తం పాపం వహ్నివద్దహతి.

అపరోక్షజ్ఞానఫలమాహ:—అపరోక్షేతి. శాబ్దం దేశికపూర్వకం వ్యాఖ్యాతం అపరోక్షాత్మవిజ్ఞాన మపరోక్షస్యాత్మనో విజ్ఞానం సంశయవిపర్యయరహితం యత్ జ్ఞానం తత్సంసారకారణాజ్ఞానతమసః సంసారకారణం యదజ్ఞానమస్తి తదేవ తమస్తస్య చండభాస్కరః మధ్యాహ్నకాలీనసూర్యః బాహ్యతమసశ్చండభాస్కర ఇవాజ్ఞాన తమసో నివర్తక ఇత్యర్థః.

టీ. దేశికపూర్వకం = గురుముఖమువలన లభించినట్టిదియు, శాబ్దం = మహావాక్యసంబంధమైనదియు నగు, పరోక్షం=పరోక్షమైన, బ్రహ్మవిజ్ఞానం=బ్రహ్మజ్ఞానము,

వహ్నివత్ = అగ్నివలె, కృత్స్నం = సంపూర్ణమైన, బుద్ధిపూర్వకృతం=బుద్ధిపూర్వకముగఁ జేయఁబడిన, పాపం=పాపమును (ఇది యుపలక్షణము. పుణ్యము నని కూడ గ్రహించునది. ముక్తికిఁ గర్మ యంతయు విరుద్ధమే), దహతి=కాల్చును, దేశికపూర్వకం శాబ్దం, అపరోక్షాత్మవిజ్ఞానం = అపరోక్షబ్రహ్మజ్ఞానము, సంసార...తమసః-సంసార = సంసారమునకు, కారణ = కారణమైన, అజ్ఞాన=అవిద్య యనెడు, తమసః=అంధకారమునకు, చండభాస్కరః=ప్రచండసూర్యుఁడు (అజ్ఞానాంధకారమును ధ్వంసముచేయు ననుట).

తా. అందు పరోక్షజ్ఞానము కలిగినతోడనే బుద్ధిపూర్వకకృత పాపముకూడ నశించును. తక్కినవానినిఁగూర్చి చెప్ప నేల? ఇచ్చట పాప మనుటవలన కేవలపాపమునే గ్రహింప రాదు. సర్వకర్మములను గ్రహింపవలయును. పరోక్షజ్ఞానమువలన నన్నికర్మములును నశించు ననవలయును. కర్మలన్నియు భేదసాధ్యము లగుటచే నభేదమును బోధించు జ్ఞానమునకు విరుద్ధములే కదా! మఱియు నపరోక్షజ్ఞానమును గూర్చి చెప్పవలసినదియే లేదు. అది తనయుత్పత్తితోనే మూలావిద్యాంధకారము నడంచును; ముక్తిని కరతలామలకము గావించును.

అవ. ఇట్లు తత్త్వార్థమును సంక్షేపముగ వివరించి ప్రకరణార్థము నుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం తత్త్వవివేకం విధాయ విధివ న్మన స్సమాధాయ,
విగలితసంసృతిబంధః ప్రాప్నోతి పరం పదం నరో నచిరాత్. 65

ఇతి ప్రత్యక్తత్త్వవివేకః.

వ్యా. గ్రంథాభ్యాసఫలమాహ:—ఇత్థమితి. నర ఇత్థముక్తేన ప్రకారేణ తత్త్వవివేకం తత్త్వస్య బ్రహ్మాత్మైకత్వలక్షణస్య వివేకం కోశపంచకా ద్వివేచనం విధాయ కృత్వా తస్మింస్తత్త్వే విధివచ్ఛాస్త్రోక్తప్రకారేణ మనః సమాధాయ స్థిరీకృత్య విగళితసంసృతిబంధోఽపరోక్షజ్ఞానేన నివృత్తసంసారబంధస్సన్ పరం పదం నిరతిశయానందరూపం మోక్షం నచిరాదవిలంబేన ప్రాప్నోతి సత్యజ్ఞానానందలక్షణం బ్రహ్మైవ భవతీత్యర్థః.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమద్భారతీతీర్థ విద్యారణ్య మునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితా
తత్త్వవివేకవ్యాఖ్యా సమాప్తా.

టీ. ఇత్థం = ఈవిధముగ, తత్త్వవివేకం = జీవుని యథార్థస్వరూపముయొక్క వివేకం=వివేచనము (పంచకోశములనుండి విభాగించుటను), విధాయ=చేసి, విధివత్ = శాస్త్రోక్తరీతిగా, మనః = మనస్సును, సమాధాయ = సమాధానపఱచి (సమాధియందు నిలిపి యనుట), విగళిత...బంధః - విగళిత = వీడిపోయిన, సంసృతిబంధః = సంసార బంధము కలవాఁడై, నరః=మనుష్యుఁడు, నచిరాత్ = శీఘ్రముగ, పరం పదం = పరమ పదమును, ప్రాప్నోతి = పొందును.

తా. పైన వర్ణించినవిధముగ నేపురుషుఁడు తత్త్వనిర్ణయమును గావించి యేకాగ్రతను స్థిరపఱచుకొనునో యట్టివాఁడు సంసారబంధ విముక్తుఁడై శీఘ్రముగ ముక్తినొందును.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామశర్మచే వివరింపఁబడిన పంచదశియందు

తత్త్వవివేక మను ప్రథమప్రకరణము.





శ్రీ ర స్తు

శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## ద్వితీయ ప్రకరణము

### మహాభూతవివేక ప్రకరణము

అవ. పరమేశ్వరునిస్వరూప మవాఙ్మనసగోచర మగుటచే దానిని నిరూపించుటకు మహాభూతస్వరూపనిరూపణము చక్కని యుపాయ మగు నని నిశ్చయించి, పరమేశ్వరుఁడు వీనిచేతనే యాస్వాదింపఁబడి బహువిధప్రపంచరూపముతోఁ దోఁచుచున్నాఁడు కావున వీనిధర్మములను ప్రత్యేకముగ విభాగించిన నందు నిగూఢమైయున్న యాత్మతత్త్వము ప్రకాశించు నని నిశ్చయించి మహాభూత స్వరూపముల వానిమూలమున సర్వప్రపంచస్వరూపముల వివరించువాఁడై మొట్టమొదట ప్రయోజననిరూపణపూర్వకముగఁ బ్రతిజ్ఞను గావించుచున్నాఁడు:—

శ్లో. సదద్వైతం శ్రుతం యత్త త్పంచభూతవివేకతః,
బోద్ధుం శక్యం తతో భూతపంచకం ప్రవివిచ్యతే. 1

వ్యాఖ్యానమ్

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
పంచభూతవివేకస్య వ్యాఖ్యానం క్రియతే మయా.

వ్యా. 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయ' మితి శ్రుత్యాజగదుత్పత్తేః పురా యత్ జగత్కారణం సద్రూపమద్వితీయం బ్రహ్మ శ్రుతం తస్యావాఙ్మనసగోచరత్వేన స్వతోఽవగంతు మశక్యత్వాత్తత్కార్యత్వేన తదుపాధిభూతస్య భూతపంచకస్య, వివేకద్వారా తదవబోధనాయోపోద్ఘాతత్వేన భూతపంచకవివేకం ప్రతిజానీతే—సదద్వైతమితి.

టీ. అద్వైతం = ఏకస్వరూపమైన, యత్ = ఏ, సత్ = సద్రూపబ్రహ్మము, శ్రుతం=వేదమునందు వర్ణింపఁబడెనో, తత్ =అది, పంచభూతవివేకతః-పంచభూత = పంచభూతములను (అనఁగా వానిధర్మములను), వివేకతః=విభాగించుటవలన, బోద్ధుం = తెలిసికొనుటకు, శక్యం = శక్యమగును. తతః = ఆకారణమువలన, భూతపంచకం = ఈపంచభూతములును, ప్రవివిచ్యతే = విభాగించి వర్ణింపఁబడును.

తా. పరమేశ్వరుఁడు మొట్టమొదట ఆకాశముగాను, పిదప వాయువుగాను ఇట్లు భ్రాంతిచే పంచభూతములుగ తత్కార్య మగుసర్వ ప్రపంచముగ నవిద్యాప్రతిబింబములచే (జీవులచేఁ) జూడఁబడె నని మున్నే వివరించియున్నాము కదా! ఇట్లగుటచే జీవు లాబ్రహ్మమునందు (స్వస్వరూపమునందే యని గ్రహింపవలయును.) ఆకాశాదిధర్మముల నెల్ల నారోపించుచున్నారు. త్రాటిని సర్పముగఁ జూచినప్పుడు సర్పధర్మములఁ ద్రాటియం దారోపించిన ట్లీబ్రహ్మమునందును భ్రాంతిసిద్ధములగు నాకాశాదులధర్మముల నారోపించుచున్నారు. ఇట్టి యారోపమువలన వచ్చుస్వరూపంబును ఆరోపితధర్మంబులును (ఆరోపములయందు ఎప్పటికిని ధర్మములుమాత్రమే యారోపింపఁబడును. కాని ధర్మియగుపదార్థము కాదు. త్రాటియందు భ్రాంతివలన సర్పధర్మములుమాత్రమే చూడఁబడును కాని సర్పము దానిపై నిలువదు.) కలసిపోవుటచే "వీనిలో నేది వస్తుస్వరూపము? ఏవి యారోపితధర్మములు?" అని విభాగించుటకు నలవి కాకున్నది. విభాగింపకున్న స్వస్వరూపజ్ఞానము కలుగదు కదా! కావున నారోపితము లగు నాకాశాదులధర్మముల వివరించి చూపినచో నప్పుడు సులభముగఁ దన్నిరాకరణమువలన స్వస్వరూపము తేటపడును. మఱియు తమోమయప్రకృతితోఁ గూడిన పరమేశ్వర ప్రతిబింబమే ప్రపంచరూపముతోఁ బరిణమించె నని కూడఁ జెప్పితిమి. అందును ప్రకృతికే పరిణామ మనియు,పరమేశ్వరునిపక్షమున నది వివర్తమే (స్వరూపమునకు హాని లేకయే పదార్థాంతరముగఁ దోఁచుట. త్రాడు తన స్వరూపమును పోఁగొట్టుకొనకయే సర్పస్వరూపముతో తోఁచుచున్నది యనుట దీనికి దృష్టాంతము.)అనియుఁ జెప్పితిమి. కావున ధర్మమును విభాగించి యాకాశమును ప్రకృతిమాత్రముగ నిర్ణయించిన

అధిష్ఠానరూప మగు బ్రహ్మము శేషించును. అప్పుడు భ్రాంతిసిద్ధమయినది యగుటచే నాకాశము కూడ లేనిది యగును. "స దేవ సో మ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్=ఓశాంతుఁడా! ఈ ప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వకాలమున నేక స్వరూప మగు బ్రహ్మముగ మాత్రమే యుండెను." అను మొదలగు శ్రుతులచేఁ జెప్పఁబడినవిషయము స్పష్ట మగును. కార్యమును బాగుగ విమర్శించినఁ గారణస్వరూపమును నిర్వి వాదముగ తెలిసికొనవచ్చును. మట్టికుండ గా మాఱినపిదపఁగూడ కుండకు సంబంధించిన యాకారాదివిశేషధర్మములు బుద్ధిచే విభాగించి నచో మృత్తికాస్వరూపము తేటపడునుకదా! కావున సులభముగఁ దత్త్వజ్ఞానమును కలిగించుటకై ఈ ప్రకరణమున పంచభూతముల విమ ర్శించుచున్నాము.

అవ. ఇట్లు ప్రయోజనమును వర్ణించి భూతగుణముల సంక్షేపముగ వివరించుచు ప్రకరణము నారంభించుచున్నాఁడు:—

శ్లో. శబ్దస్పర్శౌ రూపరసౌ గంధో భూతగుణా ఇమే,
ఏకద్విత్రిచతుఃపంచగుణా వ్యోమాదిషు క్రమాత్. 2

వ్యా. తత్ర తావదాకాశాదీనాం పంచానాం భూతానాం గుణతో భేదజ్ఞాప నాయ తద్గుణానాహ.—శబ్దేతి. "నన్వేతే గుణాః కిం సర్వేషాముత ఏకైకస్యైకైక గుణ ఇతి విమర్శయన్నోభయథాపి; కింతు ప్రకారాంతరమస్తి" ఇత్యభిప్రాయే ణాహ.—ఏకేతి.

టీ. శబ్దస్పర్శౌ = శబ్దస్పర్శములును, రూపరసౌ = రూపరసములును, గంధః = గంధంబును, ఇమే=ఇవి, భూతగుణాః=భూతములయందు కలగుణములు, వ్యోమాదిషు= ఆకాశాదులయందు, క్రమాత్ = వరుసగా, ఏకద్విత్రిచతుఃపంచగుణాః = ఒకటి రెండు మూఁడు నాలుగు అయిదు గుణములు; ఉండును.

తా. శబ్దస్పర్శరూపరసగంధము లైదును భూతస్వభావములు. ఇందు శబ్ద మాకాశమునకును, శబ్దస్పర్శములు వాయువునకును, శబ్ద స్పర్శరూపము లగ్నికిని, శబ్దస్పర్శరూపరసములు జలమునకును శబ్దస్పర్శ రూపరసగంధములు పృథివికిని గలవు. ఇవి యన్నియు ననుభవములోనే యున్నవి.

అవ. ఆయనుభవమును వివరింపుచున్నాఁడు:—

శ్లో. ప్రతిధ్వని ర్వియచ్ఛబ్దో వాయౌ బీసీతి శబ్దనమ్,
అనుష్ణాశీతసంస్పర్శో వహ్నౌ భుగుభుగుధ్వనిః. 3
ఉష్ణస్స్పర్శః ప్రభా రూపం జలే బులుబులుధ్వనిః,
శీతస్స్పర్శ శ్శుక్లరూపం రసో మాధుర్య మీరితమ్. 4
భూమౌ కడకడాశబ్దః కాఠిన్యం స్పర్శ ఇష్యతే,
నీలాదికం చిత్రరూపం మధురామ్లాదికో రసః. 5
సురభీతరగంధౌ ద్వౌ గుణా స్సమ్య గ్వివేచితాః,

వ్యా. తదేవ ప్రకారాంతరం విశదయతి.—ప్రతిధ్వనిరితి. ఆకాశే తావచ్ఛబ్ద ఏవ గుణః స చ ప్రతిధ్వనిరూపః. వాయౌ శబ్దస్పర్శౌ. తత్ర వాయుశబ్దమనుకారేణ దర్శయతి. బీసీతి శబ్దనమితి. ఏవముత్తరత్రానుకరణశబ్దనం ద్రష్టవ్యం. తస్య స్పర్శ మాహ.—అనుష్ణాశీతసంస్పర్శ ఇతి. వహ్నౌ శబ్దస్పర్శరూపాణీతి త్రయో గుణాః. తే చ క్రమేణాభిధీయంతే. వహ్నౌ భుగుభుగుధ్వనిః. 3.

ఉష్ణః స్పర్శః ప్రభా రూపమితి జలే శబ్దాదయో రసాంతాశ్చత్వారో గుణాస్తానాహ.—జలే బులుబులుధ్వనిః. శీత స్పర్శః శుక్లం రూపం రసో మాధుర్యమితి. 4.

భూమౌ శబ్దాదిగంధాంతాః పంచగుణాస్తానుదాహరతి.—భూమౌ కడకడాశబ్ద ఇత్యాదినా సురభీతరగంధే ద్వావిత్యం తేన. 5.

ఉక్తమర్థముపసంహరతి. గుణా ఇతి.

టీ. ప్రతిధ్వనిః = ప్రతిధ్వని, వియచ్ఛబ్దః - వియత్ = ఆకాశభూతమునందుఁగల, శబ్దః=శబ్దము, వాయౌ=వాయుభూతమునందు, బీసీ ఇతి=బీసీ అనునట్టి (ఇది యనుకరణము), శబ్దనం = శబ్దము కలదు. (ఇది గాలి వీచునప్పుడు కలుగుధ్వని) అనుష్ణ... సంస్పర్శః-అనుష్ణ = వేఁడికానట్టియు, అశీత=చల్లన గానట్టియు, సంస్పర్శః=స్పర్శయుఁ గలదు. వహ్నౌ=అగ్నియందు, భుగుభుగుధ్వనిః = భుగుభుగు అనుచప్పుడు కలదు. (ఇది మండునప్పుడు కలుగుధ్వనికి ననుకరణము). ఉష్ణస్స్పర్శః = వేఁడియగుస్పర్శ కలదు. ప్రభా=ఆయగ్నికిఁ గలకాంతియే, రూపం = రూప మగును. జలే=నీటియందు, బులుబులుధ్వనిః = బులుబులుధ్వని కలదు. (ఇదియు నీరు పాఱునప్పుడు కలుగుధ్వనికి ననుకరణము). శీతస్స్పర్శః = చల్లనిస్పర్శ కలదు. శుక్లరూపం = తెల్లనివర్ణము కలదు. మాధుర్యం=తీపియే, రసః=రస మని, ఈరితం=చెప్పఁబడెను. భూమౌ = భూమియందు, కడకడాశబ్దః = కడకడ యనుశబ్దము కలదు (ఇది కఠినపదార్థముల సంయోగాదులవలనఁ

గలుగుధ్వనికి ననుకరణము), స్పర్శ=స్పర్శము, కాఠిన్యం=కఠినత్వమే యని, ఇష్యతే= అంగీకరింపఁబడుచున్నది. నీలాదికం = నలుపుమొదలగు, చిత్రరూపం=విచిత్ర వర్ణములు కలవు. మధురామ్లాదికాః=తీపి పులుపు మొదలగు, రసః=సర్వరసములు కలవు. సురభీతర గంధౌ - సురభి=సువాసన, ఇతర = దానికంటె భిన్నమైనదుర్వాసన యను, గంధౌ = గంధములు (వాసనలు), ద్వౌ=రెండును గలవు. [ఇతి=ఈవిధముగ,] గుణాః=భూతగుణములు, సమ్యక్=బాగుగ, వివేచితాః = వివేచన చేయఁబడినవి.

తా. ఆకాశమునందుఁ గల శబ్దము మన కనుభవములో నున్న ప్రతిధ్వనియే; ఇది వాయుధ్వని కాదు. వాయ్వాదిభూతములకు చాంచల్యము కలిగినప్పుడు మాత్రమే ధ్వని కలుగును. ఇట్టిచాంచల్యము లేనికాలమునఁ గూడఁ బ్రతిధ్వని కలదు. కావున నది యాకాశధ్వనియే యనవలయును. ఆకాశ మనఁగా సర్వభూతములకు నాధారమగునట్టి బయలు. ప్రతిధ్వని యచ్చటనే కలుగుచున్నది. "ఇక్లైన నావరణ మేల? నిరావరణ మగుస్థలమునఁ బ్రతిధ్వని కలుగుట లేదు. కావున గాలియే మన ధ్వనిని కొనిపోయి యావరణమునకుఁ దగిల్చి మఱలి వచ్చుచుండు ననియు, ధ్వనిశేషము మఱలఁ దెచ్చుననియు నిదియే ప్రతిధ్వని యనియుఁ జెప్పవలయును" అని కొంచఱు చెప్పుచున్నారు ఇది యుక్తము కాదు. శబ్దము వాయువశమున సంచరించు ననుట నిశ్చయమే యైనను అది మన కంఠమునుండి వచ్చుధ్వనియే యనుట సంభవింపదు. ఒక స్థలమున జనించినశబ్దము అట్లే శ్రవణమువఱకు రా దనియు, నాశబ్దమునుండి యొక శబ్దధార జనించు ననియు సిద్ధాంతము. కావున ఒక ధ్వనివలన కలిగిన రెండవధ్వని ప్రతిధ్వని యనఁబడును. ఇది వాయుధ్వని కాదని యిదివఱకే నిరూపించితిమి; ఇతర భూతశబ్దముగూడఁ గానేర దని చెప్పితిమి. కావున నది యాకాశశబ్దమే ఇట్టిదియే యై వాయువుచే సంచరింపఁజేయఁబడును గాని యది ప్రత్యేకశబ్దము కాదు. మఱియు ప్రతిధ్వనికి నావరణ ముండవలయు నని నియమము కూడ లేదు. పైన వర్ణించినవిధముగఁ జూచిన నొకనితో మఱియొక్కఁడు మాట లాడునప్పుడు కూడ వినువానికి వినవచ్చునది ప్రతిధ్వనియే కదా? కావున నా ప్రతిధ్వని యాకాశమునందే జనించుచున్నది యనుట

నిర్వివాదము. ఒక శబ్దమునుండి మఱియొకశబ్దము జనించునను పక్షంబును నిర్వివాదమే. అట్లు కాకున్న నొక స్థలమునఁ గలిగినధ్వని దూరమున నున్నవారికి బహుకాలమునకు నల్పపరిమాణముతో వినవచ్చుటకుఁ గారణ మేమి ? మిగుల దూరమున నున్నవారలకు బొత్తుగనే వినరా కుండుటకుఁగారణ మేమి? ఒక శబ్దమునుండి శబ్దపరంపరలు జనించుచున్న వనిన నవి యొకదానికంటె నొకటి యల్పపరిమాణము కలవి యగుచు నుండును గావున నివి యన్నియు సంభవింపవచ్చును. కారణమునకంటె కార్య మల్పముగ నుండు ననుట నిర్వివాదము. కావున నెట్లు చూచి నను ప్రతిధ్వని యాకాశశబ్ద మనుటలో సంశయము లేదు. ఇది యొక్కటియె యాకాశగుణము.

వి. వాయువునందు శబ్దస్పర్శములు కలవు. అందు గాలి వీఁచునప్పుడు చాంచల్య మునఁ గలుగుధ్వనియే శబ్దము, వాయువు పరమాణురూప మనియు, వానిసమ్మర్దమువలన నాధ్వని యాకాశమునందే కలుగుచున్నది యనియుఁ గొందఱు చెప్పుదురు. ఇది యుక్తముకాదు. పరమాణుస్వరూప మాకాశమువంటిదని యావాదులచే నంగీకరింపఁబడి యుండుటచే వానికి సంమర్దము కలుగు ననుటయే మొదల సరిపడదు; కలిగినను అప్పుడు కలుగుధ్వని సంమర్దధ్వనియే యగునుగాని ప్రతిధ్వని కాకుండుటచే నాకాశధ్వని కానే రదు. ప్రతిధ్వని వాయ్వాదు లున్నను అనఁగా సేవించుచున్నను చలింపకున్నను కలుగు చున్నది. ప్రస్తుత ధ్వని మాత్ర మట్లు కలుగుట లేదు. నియతముగ వాయుచాంచల్య మున్నప్పుడు మాత్రమే కలుగుచున్నది. కావున నీశబ్దము వాయుశబ్దమే ! ఇట్లే దీనికిఁ గలస్పర్శ ముష్ణంబును శీతంబును కా దని తెలిసికొనవలయును. ఇది వెచ్చనిగాలి, చల్లనిగాలి యనువ్యవహారములు తేజోజలసంబంధముచే కలుగుచున్నవి యని గ్రహించు నది. మేఘజలముమీఁదినుండిగాని నదీ తటాకాదులమీఁదినుండిగాని వచ్చుగాలి జల సంస్పర్శగలది యగుటచే చల్లనిగాలి యని చెప్పఁబడుచున్నది. కాలినకొండలపైనుండి గాని యితరము లగు నష్టపదార్థములమీఁదినుండిగాని వచ్చుగాలి వేఁడిగాలి యనఁబడు చున్నది. ఈ యనుభవమువలన నీరెండుస్పర్శములును గాలికి లే వని తోఁచుచున్నది. కావున విశేషమెద్దియు లేని సామాన్యస్పర్శమే వాయుస్పర్శ మని నిర్ణయింపవలసి వచ్చుచున్నది.

అగ్నియందు శబ్దస్పర్శరూపములు కలవు. అగ్ని మండునప్పుడు కలుగు భుగు భుగు ధ్వనియే దానిశబ్దము. ఇదియు నాకాశశబ్దమునకంటె భిన్నమే యని వాయు

నిరూపణమునందు నిరూపించినయుక్తుల ననుసరించి నిర్ణయించుకొన వలయును. దీనికి ఉష్ణస్పర్శము కల దనుట యనుభవసిద్ధము. మఱియు దానికి ప్రకాశమే రూపము. ఇది (శ్వేతరూప మనియు, నందును అభాస్వరశ్వేతరూప మనియుఁ గొందఱు చెప్పుదురు.) ఇది యుక్తయు కాదు. అగ్నికిఁగల కాంతి సామాన్యకాంతియే కాని యందేరూపంబును స్పష్టము కాదు. మఱియు విమర్శించిన నది సర్వవర్ణములకు నాధార మని తేలుచున్నది. దీనికి నింద్రచాపమే దృష్టాంతము. అగ్నియందుఁ గలరూప మెద్దియో సూర్యుని యందు కలదియు నదియే. మేఘజలంబున సూర్యకాంతి ప్రతిబింబించినప్పుడు ప్రతిబింబానుసారముగఁ గలుగు కాంతిసమూహమే ఇంద్రధనుస్సు. ఈవిషయ మనేకస్థలములయందు వర్ణింపఁబడి యున్నది. దీనిని బట్టిచూచిన సూర్యకాంతియందు సర్వవర్ణములును కల వని తెలియుచున్నది. సూర్యకాంతియు నగ్నికాంతియు నొక్కటియే యని నిరూపించితిమి. కావున నీరూపము లన్నియు నగ్నియందు కల వన వలయును. కావున నగ్నియందలి రూపము సామాన్యరూపమే కాని, యందు విశేషము లేవియు లేవనియే చెప్పవలయును. ఆరూపమును తెల్లనిది యని కాని యెఱ్ఱనిది యని కాని చెప్పఁగూడదు. "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం"="అగ్నికిఁ గల యెఱ్ఱనిరూప మేది కలదో అది తేజస్సునకు: గలరూపము" అను శ్రుతియు పైనఁజూపఁబడిన మతమునకు విరుద్ధముగ నున్నది. వారు తేజస్సునకుఁ గల రూపము తెల్లనిది యనిరి; ఇది యెఱ్ఱనిదియనుచున్నది కదా! "ఇట్లైన మీసిద్ధాంతమునకుఁగూడ విరుద్ధమే కదా!" యనియెదవేమొ యట్లుకాదు. రూపము సామాన్య మైన దానిని లోకానుసారముగ నేవిశేషముతోనైనఁ జెప్పవచ్చును కాని తెల్లనిదైన యెఱ్ఱని దని చెప్పుటకు వీలులేదు కదా! కావున నగ్నికిఁ గలరూపము నిర్వివాదముగ సామాన్యరూపమే.

జలమునందు శబ్దస్పర్శరూపరసములు కలవు. అందు జలచాంచల్యమువలనఁ కలుగు గుడుగుడుధ్వని జలధ్వని. స్పర్శము శీతస్పర్శము. రూపము తెలుపు. "యమునా నది జలము నల్లనై యున్నదికదా!" అనియెదవేమొ? వినుము. అది నీలవర్ణము కల భూసంబంధమువలనఁ గాని పదార్థాంతరసంబంధమువలనఁగాని యట్లున్నది యనవలయును. ఆజలమును పైకి నెగుఱవైచినఁ దెల్లగా నుండుటయే ఇందుకు దృష్టాంతము. అయినను ఆతెల్పు ఉజ్జ్వలమైనది కాదని కొందఱు చెప్పెదరు. ప్రకాశాప్రకాశములు పదార్థ సంబంధము ననుసరించునవి యగుటచే నిట్లు చెప్పుట యనుచితము. ఏవర్ణము కలపదార్థ మైనను ఆవర్ణముచే ననేకపర్యాయములు పూయఁబడెనేని యప్పు డధిక కాంతిగలది యగుచున్నది యనుట మనకుఁ బ్రత్యక్షమైయున్నది కావున నిరుపాధికమగుటచే శాశ్వేతవర్ణము కనుపింపక పోవచ్చునుగాని యింతమాత్రమున నదియే దానికి

స్వభావమనుట యుక్తము కానేరదు. ఇఁక దీనిరసము సామాన్యరసమే. మాధుర్య మనుట యనుభవమును బట్టి మాత్రమే చెప్పఁబడెను. వైశేషికసిద్ధాంతముకూడ నిట్టిదియే. అయినను, నది యన్యసంబంధమువలన వచ్చినదియే కాని స్వాభావికము కా దని తెలిసికొనవలయును. లవణాదిరసము లెట్లు భూసంబంధమువలనఁ గలిగినవియో యట్లే మాధుర్యము కూడ వాతాది సంబంధమువలనఁ గలిగినది. "జలమునందు రస మేదియు స్పష్టముగఁ గాన రా కున్నను కరకకాయ మొదలగువానిని భక్షించినపిదప దానిని రుచిచూచినచో మధురరసము ప్రకట మగును. దానివలన జలమునందు కలరసము మాధుర్యమే యనవలయును" అని వైశేషికులు చెప్పుచున్నారు. కాని యిది యుక్తముకాదు. ఉపాధివలనఁ గలుగునది యేదియు స్వభావము కానేరదు. "జిహ్వకు నాజలమునందలి రసమును గ్రహించు సామర్థ్యము తగ్గియుండును. కరకకాయ మొదలగుపదార్థములు దాని నభివృద్ధిచేయును" అని వారు చెప్పెదరుగాని యదియు ననుభవవిరుద్ధమే. కరకకాయవలనఁ గలిగిన ఒగరు అనఁగా దానిలోని నున్నసియమములు ఎంతవఱకు నాలుకపై నుండునో అంతవఱకు మాత్రమే జలము మధురముగాఁ దోఁచును. అది జిహ్వాసామర్థ్యము నభివృద్ధి చేసియుండునేని పిదపఁగూడ నాజల మట్లే తోఁచవలయును కదా. ఇట్లు లేదు, ఈకారణమువలన జలమునందలి రసమునకు విశేషములు లేవు. అయినను సామాన్యానుభవము ననుసరించి గ్రంథకర్తచే మధురరసమే యని చెప్పఁబడెను.

భూమియందు శబ్దాదిగుణము లైదు కలవు. ఆకారముగల పదార్థము లొండొంటిని తగులుటవలన కలుగు కటకట యనుశబ్దము పృథ్వీశబ్దము. భూలోకమునందలి పదార్థము లన్నియు పృథ్వీమయపదార్థములే యని తెలిసికొనవలయును. భూమియందు కఠినస్పర్శముకల దనుట యెల్లరు నెఱింగినదియే.. పాకభేదమువలన మృదుస్పర్శము నిందు కలదు. కాయలు మొదలగునవి పరిపక్వమును జెందునప్పుడు మెత్తన యగుటయే యిందుకు దృష్టాంతము. మఱియు నిందు శుక్లరక్తపీతాది సర్వవర్ణములును కలవు. సర్వపదార్థములును పృథ్వీమయము లగుటచే నందలి వివిధరసములును పృథ్వీరసములే. "భూమికి నల్లనిరూపము కలదు" అని ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పఁబడినవిషయము అత్యంత తమోగుణప్రధానభూతమగు నను నుద్దేశముచేతఁ జెప్పఁబడినది యని తెలిసికొనవలయును. ఇదియును కాక నిందు గంధగుణ మొక్కటి సర్వాధికమై యున్నది. ఇది సుగంధదుర్గంధ రూప మని గ్రంథకర్త చెప్పియున్నాఁడు. సామాన్యానుభవము ననుసరించి మాత్రమే ఇట్లు చెప్పఁబడె నని గ్రహించునది. విచారించిన యెడల గంధము సామాన్యగంధమే. దానికినుపాధుల ననుసరించిమాత్రమే యాభేదములు కలుగుచున్నవి యని తేటపడును. మంచివాసన యున్న పదార్థమునుండియే యది మురిగిపోయినప్పుడు

చెడ్డవాసన వచ్చుటయే యిందుకు దృష్టాంతము. సువాసనయే దానికి స్వభావ మైనచో నెప్పటికి నట్లు చెడ్డవాసన రాఁగూడదు కదా! కావున పృథ్వీ గంధము సామాన్య గంధమే. ఇంత యేల? సామాన్యము లగు శబ్దస్పర్శరూపరసగంధములే క్రమముగ తక్కిన భూతవిశేషగుణములతో నొక్కొక్కభూతమున నుండును. విశిష్టం శుద్ధం నాతిరిచ్యతే=విశేషయుక్త మగుపదార్థము శుద్ధమునకంటె భిన్నము కాదు అను న్యాయము ననుసరించి చూచిన నితర భూతములయందలి శబ్దము లాకాశశబ్దమునకంటె భిన్నములు కావు. స్పర్శములు వాయుస్పర్శకంటె భిన్నములు కావు. రూపము లగ్ని రూపమునకంటెను రసములు జలరసమునకంటెను భిన్నములుకావు. ఇదియే పరమసిద్ధాంత మైనను, సామాన్యుల యనుభవము నాశ్రయించి యిట్లు గుణవివేచనము చేయఁబడె నని తెలిసికొనవలయును.

అవ. జ్ఞానేంద్రియములను స్థానస్వరూపస్వభావములతోఁగూడ వివరింపు చున్నాఁడు:—

శ్లో. శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా ఘ్రాణం చేంద్రియపంచకమ్. 6
కర్ణాదిగోళకస్థం త చ్ఛబ్దాది గ్రాహకం క్రమాత్,
సౌక్ష్మ్యా త్కార్యానుమేయం తత్ప్రాయో ధావే ద్బహిర్ముఖమ్. 7
కదాచి త్పిహితే కర్ణే శ్రూయతే శబ్ద ఆంతరః,
ప్రాణవాయౌ జాఠరాగ్నౌ జలపానేఽన్నభక్షణే. 8
వ్యజ్యంతే హ్యంతరా స్స్పర్శా మీలనే చాంతరం తమః,
ఉద్గారే రసగంధౌ చే త్యక్షాణా మాంతరగ్రహః. 9

వ్యా. ఏవంగుణతో భేదమభిధాయ కార్యతో భేదజ్ఞాపనాయ తత్కార్యాణి జ్ఞానేంద్రియాణి తావదాహ—శ్రోత్రమితి. తేషాం స్థానాని వ్యాపారాంశ్చ దర్శయతి.—కర్ణాదీతి. ఇంద్రియసద్భావే కిం ప్రమాణ మిత్యాకాంక్షాయాం కార్యలింగ కానుమాన మిత్యాహ.—సౌక్ష్మ్యాదితి. తచ్చ రూపోపలబ్ధిః కరణజన్యా. క్రియాత్వా చ్ఛిదిక్రియావదిత్యాది ద్రష్టవ్యం. సౌక్ష్మ్యాదపంచీకృతపంచభూతకార్యత్వేన దుర్లక్ష్యత్వాదిత్యర్థః. ఏతేషాం స్వభావమాహ.—ప్రాయ ఇతి. "పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూ" రితి శ్రుతేరిత్యర్థః. 7.

ప్రాయశ్శబ్దేన సూచితం క్వచిత్కరణానామాంతర విషయగ్రాహకత్వం దర్శయతి.—కదాచిదితి. ద్వాభ్యాం. కదాచిత్కర్ణస్య పిధానే కృతే సతి ప్రాణవాయౌ జాఠరాగ్నౌ చ విద్యమాన అంతరః శబ్దః శ్రూయతే. 8.

జలపానేఽన్నభక్షణే చాంతరస్పర్శా అభివ్యజ్యంతే అభివ్యక్తా భవంతి. నేత్రనిమీలనే కృతే, ఆంతరం తమ ఉపలభ్యంతే ఉద్గారే. జాతే రసగంధౌ ద్వౌ గృహ్యేతే. ఇత్యనేన ప్రకారేణాక్షాణామాంతరగ్రహః. అక్షాణామితి కర్తరి షష్ఠీ. ఆంతరస్య విషయస్య గ్రహో గ్రహణమింద్రియకర్తృకకర్మాంతరవిషయగ్రహణం భవతీత్యర్థః. 9.

టీ. శ్రోత్రం = చెవి, త్వక్చక్షుషీ=త్వగింద్రియము నేత్రము, జిహ్వా=నాలుక, ఘ్రాణంచ=నాసికయు నని, ఇంద్రియపంచకం=పంచేంద్రియములు కలవు. తత్ = ఆ యింద్రియములు. (పంచక మని యేకవచన ముండుటచే, తత్ అని యేకవచనము ప్రయోగింపఁబడెను.) కర్ణాదిగోళకస్థం-కర్ణాది=చెవి మొదలగు, గోళక=గోళములయందు (చెవి చర్మము కన్ను నాలుక ముక్కు అనువానియందు), స్థం=ఉండి, క్రమాత్ =వరుసగా, శబ్దాదిగ్రాహకం=శబ్దాదులను గ్రహించుచున్నది. తత్, సౌక్ష్మ్యాత్ =అతి సూక్ష్మమగుటవలన, కార్యానుమేయం - కార్య = శబ్దమును గ్రహించుట మొదలగు కార్యములవలన, అనుమేయం = ఊహింపఁదగినది యై యున్నది (కంటికిఁ గానరాదనుట). ప్రాయః = సామాన్యముగ, బహిర్ముఖం = వెలుపలిభాగమునకే, ధావేత్ = పరుగులిడుచున్నవి (ఈ ఏకవచనముల కన్నిటికిని "ఇంద్రియపంచకం" అనునేకవచనశబ్దమే మూలము.) కదాచిత్ = ఒకానొకప్పుడు, కర్ణే=చెవి, పిహితే సతి = మూయఁబడుచుండఁగా, ప్రాణవాయౌ=ప్రాణవాయువునందును, జాఠరాగ్నౌ = జఠరాగ్నియందును గల, ఆంతరః=లోపలి, శబ్దః=శబ్దము, శ్రూయతే = వినవచ్చును. (చెవులు మూసినప్పుడు వినఁబడుచప్పుడు లోపలిధ్వని యని తెలిసికొనవలయును. అది వాయ్వగ్నుల సంచారధ్వని). జలపానే=నీరు ద్రావునప్పుడును, అన్నభక్షణే = అన్నము తినునప్పుడును, అంతరాః = లోపలి, స్పర్శాః = శీతోష్ణమృదుకఠినస్పర్శములు, వ్యజ్యంతే హి = తోఁచుచున్నవి కదా (చల్లనినీరు త్రాగునప్పుడు వక్షస్స్థలమునొద్ద, చల్లదనంబును వెచ్చనినీరు త్రాగునప్పుడు వెచ్చదనంబును తెలియుచుండు ననుట యనుభవసిద్ధము. ఇట్లే యన్నపుముద్ద మ్రింగఁబడునప్పుడు కంఠమునందును హృదయమునందునుఁ గూడ మృదుకఠినస్పర్శలు తెలియుచుండుటయు ననుభవసిద్ధమే.) మీలనే = కన్నుమూసినప్పుడు, ఆంతరం = లోపలి, తమః చ=చీఁకటియు. [వ్యజ్యతే = తోఁచుచున్నది]. ఉద్గారే = త్రేఁచునప్పుడు, రసగంధౌ చ = రుచియు, వాసనయు, [వ్యజ్యేతే=ప్రకాశించుచున్నవి]. ఇతి = ఇట్లు, అక్షాణాం=జ్ఞానేంద్రియములయొక్క, ఆంతరగ్రహః= లోపలిశబ్దాదులను గ్రహించుట (అనఁగా నింద్రియములు లోపలి శబ్దాదుల నీవిధముగ గ్రహించును) అని తెలిసికొనవలయును.

తా. శ్రోత్రేంద్రియము, త్వగింద్రియము, నేత్రేంద్రియము, జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియము నని జ్ఞానేంద్రియములు ఐదు. ఇవి చెవి, త్వక్కు, నేత్రము, నాలుక, ముక్కు ననెడి గోళకముల యందు నుండి శబ్దస్పర్శరూపరసగంధములను గ్రహించుచున్నవి. ఈ యింద్రియములు అతిసూక్ష్మములగుటవలన నవి నెరవేర్చు కార్యములను బట్టి ఊహింపఁదగినవి. ఈయైదింద్రియములును బాహ్యవ్యాపారము గలవి. ఒకప్పుడు చెవులను మూసినయెడల ప్రాణవాయువువలనను జఠరాగ్నివలనను గలిగెడి లోపలిశబ్దములు వినఁబడును. నీరు త్రావునప్పుడును అన్నము భుజించునపుడును ఆంతరమందుఁ గల శీతోష్ణమృదుకఠిన స్పర్శములు గోచరించును. కన్నులు మూసినప్పుడు లోపలి చీఁకటి తోఁచును. త్రేన్చునప్పుడు రుచియు వాసనయు తోఁచును. ఇటుల నీయింద్రియపంచకముయొక్క వ్యాపారమును దెలిసికొనఁదగును.

అవ. ఇఁక కర్మస్వరూపనిరూపణపూర్వకముగ కర్మేంద్రియస్వభావాదుల వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. పంచోక్త్యాదానగమనవిసర్గానందకాః క్రియాః,
కృషివాణిజ్యసేవాద్యాః పంచ స్వంతర్భవంతి హి. 10
వాక్పాదపాణిపాయూపస్థైరక్షై స్తత్క్రియాజనిః,
ముఖాదిగోళకేష్వాస్తే తత్కర్మేంద్రియపంచకమ్. 11

వ్యా. ఏవం జ్ఞానేంద్రియ వ్యాపారానభిధాయ కర్మేంద్రియాసత్త్వవాదినం ప్రతి తత్సద్భావసమర్థనాయ తల్లింగభూతాం స్తద్వ్యాపారానాహ.—పంచేతి. ఉక్తిశ్చాదానం చ గమనం చ విసర్గశ్చ ఆనందశ్చేతి ద్వంద్వసమాసః. ఉక్త్యాదానగమనవిసర్గానందాఖ్యాః పంచక్రియాః ప్రసిద్ధాః ఇతి శేషః. నను కృష్యాదీనాం క్రియాంతరాణా మపి సత్త్వాత్కథం పంచేత్యుక్త మిత్యాశంక్యాహ.—కృషీతి.

కాని తాని క్రియాజనకా నీంద్రియాణి ఇత్యత ఆహ.—వాక్పాదేతి. వాగాదిభిరక్షై స్తత్క్రియాజనిస్తాసాం క్రియాణాం ఉత్పత్తిర్భవతీతి శేషః. అత్రాపి ఉక్తిః కరణపూర్వికా క్రియాత్వాదిత్యాదికార్యలింగకమనుమానం ద్రష్టవ్యం. తస్య కర్మేంద్రియపంచకస్య స్థానాన్యాహ.—ముఖాదీతి. ఆదిశబ్దేన కరచరణౌ గుదశిశ్నచ్ఛిద్రే చ గృహ్యేతే.

టీ. ఉక్తి...ఆనందకాః-ఉక్తి=మాటలాడుట, ఆదాన=(ఇచ్చుట, గ్రహించుట) గమన=నడుచుట, విసర్గ=విసర్గము, ఆనందకాః = ఆనందము, అను పంచ=ఐదే, (సర్వం వాక్యం సావధారణం అనున్యాయము ననుసరించి ఇట్లర్థము చెప్పఁబడెను). క్రియాః= లోకమునందుఁగల కార్యములు, కృషి...ఆద్యాః-కృషి = సేద్యము, వాణిజ్య=వ్యాపారము, సేవా = సేవచేయుట, ఆద్యాః = మొదలైనవి యన్నియు, పంచసు = పైయేనింటి యందును, అంతర్భవంతి హి = అంతర్భావమును చెందును కదా (ఏకార్యము నాచరించి నను, ఏవ్యాపారమును చేసినను మాటలాడుటయో నడచుటయు నిచ్చుటయు పుచ్చుకొనుటయు కాక మఱి యేమియు లేదు కదా ? కావున నన్నియును పైన వర్ణించిన అయిదు కర్మలలోనే చేరు నని తెలిసికొనవలయును). వాక్...ఉపస్థైః - వాక్=వాక్కు, పాణి = హస్తములు, పాద = పాదములు, ఉపస్థైః = ఉపస్థ అనునట్టి, అక్షైః = ఇంద్రియములచేత, తత్...జనిః - తత్=పూర్వోక్తములైన, క్రియా=పనులయొక్క, జనిః= పుట్టుక కలుగును. (వాగాదికర్మేంద్రియములు క్రమముగ మాటలాడుట మొదలగు కార్యముల నాచరించు ననుట). తత్ = ఆ, కర్మేంద్రియపంచకం = కర్మేంద్రియము లైదును, ముఖాదిగోళకేషు = నోరు మొదలగు గోళకములయందు (అనఁగా నోరు చేతులు కాళ్లు గుదము గుహ్యము అనువానియందు), ఆస్తే = ఉన్న (వి)ది.

తా. వాక్పాణిపాదపాయూపస్థ లనెడి కర్మేంద్రియములవలన మాటాడుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, నడుచుట, మలవిసర్జనము, ఆనందించుట ననెడిక్రియలు జరుగుచున్నవి.

అవ. మనస్స్వరూపస్వభావములను ప్రకటించుచున్నాఁడు:—

శ్లో. మనో దశేంద్రియాధ్యక్షం హృత్పద్మే గోళకే స్థితమ్,
తచ్చాన్తఃకరణం బాహ్యేష్వస్వాతంత్ర్యా ద్వినేంద్రియైః. 12
అక్షే ష్వర్థార్పితే ష్వేత ద్గుణదోషవిచారకమ్,
సత్త్వం రజ స్తమ శ్చాస్య గుణా విక్రియతే హితైః. 13

వ్యా. ఇదానీముక్తదశేంద్రియప్రేరకత్వేన ప్రస్తుతస్య మనసః కృత్యం స్థానం చ దర్శయతి:—మన ఇతి. తస్యాంతరింద్రియత్వం సనిమిత్తకమాహ—తచ్చేతి. దశేంద్రియాధ్యక్షత్వమేవ దర్శయతి:—అక్షేష్వితి. అక్షేష్వింద్రియేష్వర్థార్పితేషు విషయ స్థాపితేషు సత్సు ఏతన్మనో గుణదోషవిచారకమిదం సమీచీనమిదమసమీచీన మిత్యాది విచారకారీత్యర్థః. అయం భావః—ఆత్మనః ప్రమాతృత్వేన సర్వజ్ఞానసాధారణ్యాచ్చక్షురాదీనాం రూపాదిజ్ఞానజననమాత్రే చరితార్థత్వాత్తద్గుణదోషవిచారస్యోపలభ్యమాన

స్యాన్యథానుపపత్త్యా తత్కారణత్వేన మనసో వైరాగ్యకామాద్యనేకవిధవృత్తిమత్త్వ ప్రదర్శనాయ సత్త్వాదిగుణవత్త్వం దర్శయతి.—సత్త్వమితి. తేషాం తద్గుణత్వే కారణ మాహ.—విక్రియత ఇతి. హి యతః తైర్గుణైర్విక్రియతే వికారం ప్రాప్నోతీత్యర్థః.

టీ. మనః=మనస్సు, దశేంద్రియాధ్యక్షం - దశ=పదియైన, ఇంద్రియ=పూర్వోక్తము లగుజ్ఞానకర్మేంద్రియములకు, అధ్యక్షం = ప్రభువు, హృత్పద్మే=హృదయ కమల మనెడు, గోళకే=గోళమున, స్థితం=ఉన్నది. తత్ చ=అదియు, అన్తఃకరణం = లోపలి యింద్రియము [భవతి = అగుచున్నది]. ఇంద్రియైః వినా = ఇంద్రియములు లేక పోయిన, బహిః=వెలుపల, అస్వాతంత్ర్యాత్ = స్వాతంత్ర్యము (స్వతంత్రముగ సంచరించుశక్తి) లేకపోవుటవలన, అక్షేషు = ఇంద్రియములు, అర్థార్పితేషు సత్సు-అర్థ = విషయము లగు శబ్దాదులయందు, అర్పితేషు సత్సు = ప్రవేశపెట్టఁబడి యుండఁగా, గుణ...విచారకం-గుణ = గుణములను, దోష=దోషములను, విచారకం=విచారించుచుండును. అస్య=ఈమనస్సునకు, సత్త్వం రజః తమః చ=సత్త్వరజస్తమస్సులు, గుణాః గుణములు, తైః=వానిచేత [తత్ = ఆమనస్సు] విక్రియతే హి=వికారమును చెందును కదా.

తా. శబ్దస్పర్శాదులకంటె నధికము లగుపదార్థములను మనము చూచుట లేదు. మనము ఏవిషయమును వినినను దేనిని తాఁకినను చూచినను మూర్కొనినను అందు గ్రహించుట శబ్దాదులనే యనుట నిర్వివాదము. ఇట్లే మాటలాడుట మొదలగువానికంటె నితరములగు పనులు లేవు. మన మేకార్యము నాచరించినను అది మాటలాడుట మొదలగువానిలో నెందేని యేకీభవింపక తప్పదు. ఈపదియు పది యింద్రియములచేతను కలుగుచున్నవి. వీనికి మనస్సు రాజు. సంకల్పము లేని దిం దొక్కటియుఁ బ్రవర్తింపదు కదా! ఆమనస్సునకు హృదయ కమలము స్థానము. ప్రస్తుతము కొందఱు శిరస్సే దానిస్థాన మను చున్నారుగాని యది శ్రుత్యాదులకు విరుద్ధము. మెదడు తలయందు కల దనియు, దానియందు భయాదిచిహ్నములు కానవచ్చుచున్నవి యనియు వా రట్లు చెప్పుచున్నారుకాని అంతమాత్రమున మనస్స్థాన మదియే యనుటకు వీలు లేదు. మనస్సు ఎచ్చట నున్నను, ఎచ్చట సంకల్పించినను (సర్వశరీరస్థితిని తెలుపునాడులవలె మెదడు కూడ స్వభావజ్ఞానమునకు నొకసాధనముగ నుండిన నుండవచ్చును కదా!

"అట్లైన భగవంతుఁడు దానిని దాఁచియుంపరాదే. నాడులవలెఁ బ్రకటించియే యుండవచ్చునే." అనిమొదవేమొ. పరమేశ్వరుని యభిప్రాయము నెవ్వఁడును నిర్ణయింపనేరఁడు. దానిని ప్రకటించుటవలన పూర్వజన్మజ్ఞానాది ప్రకటనమువలన వలెనే యనేకకీడు లుండవచ్చును. కావున మనస్సునకు హృదయమే స్థానమని శ్రుత్యనుసారముగ నంగీకరించుటవలన నిర్బంధ ముండదు. మఱియు దీనికి నింద్రియములకువలె వెలుపలికి పోవుటకు స్వాతంత్ర్యములేదు కావుననే దీని కంతఃకరణ మని పేరు. ఇది యింద్రియములు విషయముల గ్రహింపక నుపక్రమించినప్పుడు వానితోఁ గలసి వెలుపలికి వచ్చి యంపలిగుణదోషముల విచారించుచుండును. దీనికి సత్వరజస్తమస్సు లను మూఁడుగుణములు కలవు. వీనిచే నిది యనేకవికారము నొందుచుండును. సత్వగుణ మధిక మైనప్పుడు శాంత మై విచారవంత మై పుణ్యపాపసంకల్పముల విధినిషేధపూర్వకముగ విమర్శింపుచు నుండును. ఇది పశ్చాత్తాపానుభవము గల ప్రతివారలకును విశద మైనవిషయమే. రజోగుణ మధికమైనప్పుడు కామక్రోధాదులు గలది యగును; సంక్షోభమును జెందుచు బహువిధకర్మల నాచరించును. తమోగుణ మధికమైనప్పుడు మూఢ మై యేమియుఁ జేయక యూరకుండును. నిదురించును. ఇట్లగుటచేతనే క్రమముగ నీగుణములవలన శాంతఘోరమూఢవృత్తులు కలుగు నని చెప్పఁబడుచున్నది.

వి. ఈ యింద్రియముల స్వరూపవ్యాపారములను దెలియుట యావశ్యకము గనుక నవి సంక్షేపముగఁ జెప్పఁబడును:—

జ్ఞానేంద్రియములు. ౫.

| ఇంద్రియములు. | కార్యక్రమము. | అధిదేవత. |
|---|---|---|
| 1. శ్రోత్రేంద్రియము | శబ్దములను వినును. | దిక్కు. |
| 2. త్వగింద్రియము | స్పర్శమును గ్రహించును. | వాయువు. |
| 3. చక్షురింద్రియము | రూపమును దెలిసికొనును. | సూర్యుఁడు. |
| 4. రసనేంద్రియము | రుచులను గ్రహించును. | వరుణుఁడు. |
| 5. ఘ్రాణేంద్రియము | వాసనలను గ్రహించును. | అశ్వినిదేవతలు. |

### కర్మేంద్రియములు. 5

| ఇంద్రియములు. | కార్యక్రమము. | అధిదేవత. |
|---|---|---|
| 1. వాగింద్రియము | పుణ్యపాపమిశ్రసంభాషణము చేయును. | చతుర్ముఖుఁడు. |
| 2. పాణీంద్రియము | దానప్రతిగ్రహములు సేయును. | ఇంద్రుఁడు. |
| 3. పాదేంద్రియము | గమనాగమనములు సేయును. | ఉపేంద్రుఁడు. |
| 4. పాయురింద్రియము | మలవిసర్జనము చేయును. | మృత్యువు. |
| 5. ఉపస్థేంద్రియము | శుక్రమూత్రవిసర్జనము సేయును. | ప్రజాపతి. |

### వాయుపంచకములు. 5

| | | |
|---|---|---|
| 1. ప్రాణవాయువు | ఉచ్ఛ్వాసము చేయును. | విశిష్టుఁడు. |
| 2. అపానవాయువు | నిశ్వాసము చేయును. | విశ్వకర్త. |
| 3. వ్యానవాయువు | అన్నరసమును శరీరమునందంతటఁబంచిపెట్టును. | విశ్వయోని. |
| 4. ఉదానవాయువు | సుషుప్తియందు సకలేంద్రియముల నుపసంహరించుకొని తనకు కారణ మగు నజ్ఞానమందు లయించుచు, ఉత్క్రమణసమయమున సకలేంద్రియములను గ్రహించికొని లోకాంతరమునకుఁ బోవును. | అజుఁడు. |
| 5. సమానవాయువు | జఠరాగ్నితోఁ గూడి ఆహారమును పచనము చేయును. | జయుండు. |

### అంతఃకరణచతుష్టయము.

| | | |
|---|---|---|
| 1. మనస్సు | సంకల్పవికల్పములఁ జేయును. | చంద్రుఁడు. |
| 2. బుద్ధి | నిశ్చయించును. | చతుర్ముఖుఁడు |
| 3. చిత్తము | చంచలమై ధారణము చేయును. | క్షేత్రజ్ఞుఁడు. |
| 4. అహంకారము | నేనసెడి అభిమానము. | రుద్రుఁడు. |

అవ. సత్త్వాదిగుణములవలన కలుగు మనోవృత్తులనే సవిస్తరముగ వివరించుచున్నాఁడు:—

శ్లో. వైరాగ్యం క్షాంతి రౌదార్య మిత్యాద్యా స్సత్త్వసంభవాః,
కామక్రోధౌ లోభయత్నా విత్యాద్యా రజ సోత్థితాః. 14
ఆలస్యభ్రాంతితంద్ర్యాద్యా వికారా స్తమ సోత్థితాః,
సాత్త్వికైః పుణ్యనిష్పత్తిః పాపోత్పత్తి శ్చ రాజసైః. 15

తామసై ర్నోభయం కింతు వృథాయుఃక్షపణం భవేత్,
అత్రాహం ప్రత్యయీ కర్తే త్యేవం లోకవ్యవస్థితిః. 16

వ్యా. గుణై స్తస్య విక్రియమాణత్వమేవ ప్రపంచయతి.—వైరాగ్యమితి. స్పష్టత్వాన్న వ్యాఖ్యాయతే.

వ్యా. వైరాగ్యాదీనాం కార్యాణి విభజ్య దర్శయతి—సాత్త్వికై రితి.

వ్యా. ఏతేషాం బుద్ధిస్థత్వాదంతఃకరణాదీనాం సర్వేషాం స్వామినమాహ—అత్రేతి. అహం ఇతి ప్రత్యయవాన్కర్తా ప్రభురిత్యర్థః. లోకే హి కార్యకారీ ప్రభురిత్యేవముపదిశ్యతే.

టీ. వైరాగ్యం = వైరాగ్యము, క్షాంతిః=ఓర్పు, ఔదార్యం = దాతృత్వము, ఇత్యాద్యాః=అను మొదలగునవి, సత్వసంభవాః = సత్వగుణమువలనఁ గలిగినవి. కామక్రోధా = కామక్రోధములు, లోభయత్నౌ = లోభప్రయత్నములు (అత్యాశయు కార్యములఁ జేయవలయు ననుప్రయత్నంబును), ఇత్యాద్యాః = అను మొదలగునవి, రజసా=రజోగుణముచే, ఉత్థితాః = పుట్టినవి. ఆలస్య...ఆద్యాః - ఆలస్య=ఆలస్యము, భ్రాంతి=భ్రమ, తంద్రి = కూరుకుపాటు, ఆద్యాః=మొదలైన, వికారాః = వికారములు, తమసా=తమోగుణమువలన, ఉత్థితాః = పుట్టినవి. సాత్వికైః = సత్వధర్మములచేత, పుణ్యనిష్పత్తిః-పుణ్యా=పుణ్యముయొక్క, నిష్పత్తిః=పుట్టుక కలుగును. రాజసైః= రజోగుణసంబంధములైన ధర్మములచే, పాపోత్పత్తిః-పాప=పాపముయొక్క, ఉత్పత్తిః= పుట్టుక కలుగును. తామసైః = తమోగుణధర్మములచే, ఉభయం=ఈరెండును, న=కలుగవు. కింతు=ఇఁక నేమనిన, వృథా=నిరర్థకముగ, ఆయుః క్షపణం-ఆయుః=ఆయుస్సును, క్షపణం = కడపుట, భవేత్=అగును. అత్ర = ఈసర్వవిషయములయందును, అహం ప్రత్యయీ = అహంకారము గలవాఁడే, కర్తా=కర్త (ప్రభువు), ఇత్యేవ=ఈవిధముగ, లోకవ్యవస్థితిః - లోక=లోకముయొక్క, వ్యవస్థితిః=ఏర్పాటు కల దనుట.

తా. అందు వైరాగ్యాదులు సత్వధర్మములు; కామాదులు రజోధర్మములు; ఆలస్యాదులు తమోధర్మములు. సత్వధర్మములచేఁ బుణ్యంబును, రజోధర్మముచేఁ బాపంబును, కలుగును. తమోధర్మములచేఁ నేవియుఁ గలుగవు. ఆయుష్కాలమంతయు నూఱక వెచ్చింపఁబడును. ప్రమాదాదులచే నాలస్యాదులచేఁ బురుషుఁ డేమియుఁ జేయ నేరక మూఢుఁడై యూరకుండును. ఈవిధముగ నింద్రియాదు లన్నియు వివరింపఁబడెను. ఇంద్రియములశక్తి బాహ్యవిషయములఁ జూచునంతవఱకే

కర్మేంద్రియములకుఁ గార్యముల నాచరించుటయందే సామర్థ్యము. "ఇది మంచిది, యిది చెడ్డది" అను విచారణ యొకటి గానవచ్చు చున్నది గావున నది మనోధర్మ మని యంగీకరింపవలసియున్నది. ఆత్మ సామాన్యజ్ఞానరూపుఁ డగుటచే నిట్లు విచారింపఁడు. జ్ఞానేంద్రి యములకును గ్రహించునంతవఱకే సామర్థ్యము కావున నవి విచా రింపనేరవు. ఇట్లగుటచే నావిచారణ మనోధర్మమే నిశ్చయరూపము నొందినప్పు డదియే బుద్ధిధర్మ మగును. ఈ మనోబుద్ధులకు సత్త్వాదిగుణ ములు వికారకారణములు. ఈయింద్రియాదుల సాధనములుగ గైకొని భోగముల ననుభవించువాఁడు అహంకారార్థభూతుఁ డగు జీవుఁడు. ఇదియే లోకవ్యవస్థాప్రకారము.

అవ. ఈవిధముగ లోకస్థితిని వర్ణించి యిప్పుడు ఆలోకము ఆకాశాదిభూత జన్యమే యని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. స్పష్టశబ్దాదియుక్తేషు భౌతికత్వ మతిస్ఫుటమ్,
అక్షాదా వపి త చ్ఛాస్త్రయుక్తిభ్యా మవధార్యతామ్. 17

వ్యా. ఏవం జగతః స్థితిమభిధాయేదానీం తస్య భౌతికత్వజ్ఞానోపాయమాహ— స్పష్టేతి. స్పష్టశబ్దాదియుక్తేషు స్పష్టైః శబ్దస్పర్శాదిగుణైః సహి తేషు ఘటాదిషు వస్తుషు భూతకార్యత్వం స్పష్టమేవావగమ్యతే. ఇంద్రియాదిషు కథంభూతకార్యత్వనిశ్చయ ఇత్యాశంక్యాగమానుమానాభ్యామిత్యాహ—అక్షాదావపీతి. అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణ స్తేజోమయీ వాగిత్యాది శాస్త్రం. అనుమానం చ విమతాని శ్రోత్రాదీని భూతకార్యాణి భవితుమర్హంతి. భూతాన్వయవ్యతిరేకానువిధాయిత్వాత్ యద్యదన్వయవ్యతిరేకానువిధాయి తత్తత్కార్యం దృష్టం. యథా మృదన్వయవ్యతి రేకానువిధాయీ ఘటో మృత్కార్యం దృష్టం తథా చేమాని—తస్మాత్తథేతి. తద న్వయవ్యతిరేకానువిధాయిత్వం చ 'షోడశకళః సోమ్య పురుష' ఇత్యాదినా ఛాందో గ్యశ్రుతౌ మనసః శ్రుతం. తద్వదన్యత్రాపి ద్రష్టవ్యమ్.

టీ. స్పష్ట...యుక్తేషు-స్పష్ట=స్ఫుటములైన, శబ్దాది=శబ్దను మొదలగు గుణ ములతో, యుక్తేషు=కూడియున్న ఘటాదిపదార్థములయందు, భౌతికత్వం=భూతజన్య త్వము (ఆపదార్థములు భూతజన్యము లనుట), అతిస్ఫుటం = మిగుల స్పష్టమయ్యే యున్నది. అక్షాదౌ అపి = ఇంద్రియములు మొదలగువానియందును, తత్ =ఆభూత

జన్యత్వము, శాస్త్రయుక్తిభ్యాం = వేదముచేతను యుక్తిచేతను, అవధార్యతాం=నిశ్చయించుకొనఁబడుఁ గాక.

తా. ఇప్పటికి ప్రపంచస్వభావ మంతయుఁ బ్రకటింపఁబడినది. ఇఁక నీప్రపంచ మెందుండి వచ్చెనో చెప్పవలసియున్నది. ఇది పరమేశ్వరునియందు భ్రాంతిచేఁ జూడఁబడుచున్నది యని ప్రకటించియున్నాము కదా. ఆభ్రాంతిని తొలఁగించుకొనవలయు ననిన మొట్టమొదట దీని కారణము నెఱుంగుట యావశ్యకము. కారణము నెఱింగిననేగాని కార్యధర్మములు తేటపడవు. ఆధర్మములు తేటపడిననేకాని అధిష్ఠానము వేఱుచేయుటకు వీలు లేదు. కొన్నికొన్నిచోట్ల వ్యతిరేకమున్నను సామాన్యముగఁ గారణధర్మములు కార్యములకుఁ గలుగుచుండు ననుట నియమము. ఈనియమమునకు ననుభవము విరుద్ధమైనచో నప్పుడే కదా "కారణధర్మములు కార్యములకు నియతముగఁ గలుగునా లేదా" యని విచారింపవలయును.

వి. ప్రస్తుతప్రపంచవిషయమున నట్టి సంశయమేదియు లేదు. దీనికి పంచభూతములు కారణము. పంచభూతములకుఁ గలశబ్దాదిగుణములే యెందును గానవచ్చుచున్నవి. ప్రపంచమందలి ప్రతిబాహ్యపదార్థంబును స్పర్శరూపాదిగుణయుక్తమనుట నిర్వివాదము. ఆంతరము లగునింద్రియాదులు నిట్టివే యనుట సులభముగ నిర్ణయింపవచ్చును. వేదము "అన్నమయం హి సౌమ్య మనః ఆపోమయః ప్రాణ స్తేజోమయీవాక్"=ఓశాంతుఁడా! మనస్సు అన్నమయము, ప్రాణములు జలమయములు, (వీనిస్వరూపము వాయువేయైనను జలముచే నభివృద్ధి నొందునుగావున [జలపానముచే శరీరమునుండి వెడలక నిలచియుండును కావున]నిట్లు చెప్పఁబడెను). "వాక్కు తేజోమయము" అని మనః ప్రభృతులకు భూతమయత్వమును చెప్పుచున్నది. "మనస్సు అన్నముచేత నభివృద్ధినొందును"అను విషయము సదృష్టాంతముగఁ జూపఁబడియున్నది. ఏపదార్థము దేనిచే నభివృద్ధి నొందునో అది దానినుండియే జనించె ననుట లోకసిద్ధము. మట్టిచేతను నీటిచేతను అభివృద్ధినొందునట్టి గోడ వానినుండియే జనించె ననుటలో వివాదము లేదుకద! మఱియు నీవేదాభిప్రాయమును దృఢపఱచుయుక్తు లనేకములు కలవు. "చక్షు స్తైజసం శబ్దాదిమధ్యే రూపస్యైవాభివ్యంజకత్వాత్ దీపవత్. రసనం ఆప్యం, శబ్దాదీనాం మధ్యే రసస్యైః రసస్యైవాభివ్యంజకత్వాత్ ద్రాక్షారసవత్" = "దీపమువలె శబ్దాదివిషయములలో రూపమునొక్కదానినే వ్యక్తీకరించునది కావున నేత్రేంద్రియముగూడ తేజోభూతమువలన జనించి

నదియే. ద్రాక్షారసమువలె శబ్దాదులలో రుచిని మాత్రమే యభివ్యక్తి నొందించునది యగుటచే జిహ్వ జలభూతమువలన జనించినదియే" అను మొదలగు ననుమానము లీవిషయమునే యనువాదము చేయుచున్నవి. కావున నీశాస్త్రయుక్తులచే నాద్రవపదార్థములు కూడ భౌతికములే యని నిర్ణయించుకొనవలయును.

అవ. ఇట్లు భూతభౌతికముల విభజించి "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అని మొట్టమొదట నుద్దేశింపఁబడిన శ్రుతిని పదార్థపూర్వకముగ నర్థమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏకాదశేంద్రియై ర్యుక్త్యా శాస్త్రే ణా ప్యవగమ్యతే,
యావ త్కించి ద్భవే దేత దిదంశబ్దోదితం జగత్. 18
ఇదం సర్వం పురా సృష్టే రేక మే వాద్వితీయకమ్.
స దే వాసీ న్నామరూపే నాస్తా మి త్యారుణే ర్వచః. 19

వ్యా. ఏవం భూతాని భౌతికాని చ వివిచ్య దర్శయిత్వా ప్రకృతాం సదేవ సోమ్యేదమగ్ర ఆసీదిత్యాద్యద్వితీయబ్రహ్మప్రతిపాదికాం శ్రుతిం వ్యాచక్షాణ స్తద్వాక్యస్థేదంపదస్యార్థమాహ—ఏకాదశేతి. ప్రత్యక్షాభిః సర్వైః ప్రమాణైరపి శబ్దాదర్థా పత్త్యాదిప్రమాణజ్ఞానైశ్చ యావత్కించిజ్జగదవగమ్యతే తత్సర్వం సదేవే త్యాదివాక్యస్థే నేదంపదేనాభిహితమిత్యర్థః.

ఏవమిదంశబ్దస్యార్థ మభిధాయ ఇదానీం తాం శ్రుతిం స్వయమేవార్థతః పఠతి—ఇదమితి. అరుణస్యాపత్యమారుణిరుద్దాలక స్తస్యవచనమిత్యర్థః.

టీ. ఏకాదశేంద్రియైః = అంతఃకరణముతోఁ గూడ పదునొకండింద్రియముల చేతను, యుక్త్యా=ప్రత్యక్షాదిప్రమాణములచేతను, శాస్త్రేణ అపి = వేదాదిశాస్త్రముల చేతను, యావత్ కించిత్ అవగమ్యతే = ఇంత యని నిరూపింపశక్యముకాక తెలియఁబడుచున్నదో, ఏతత్ = ఈ, జగత్ = ప్రపంచము, ఇదంశబ్దోదితం=శ్రుతియందలి ఇదంశబ్దముచేఁ జెప్పఁబడినది. భవేత్=అగును. సృష్టేః=సృష్టికి, పురా=ముందు, ఇదం= ఈకనఁబడు ప్రపంచము, సర్వం=అంతయు, ఏకం ఏవ=ఒకటియే యై, అద్వితీయకం = రెండవది లేనిది (సజాతీయవిజాతీయ స్వగతభేదములు లేనిది), సత్ ఏవ=సన్మాత్రము గానే (సత్తాస్వరూప మగు బ్రహ్మమాత్రముగానే), ఆసీత్=ఉండెను. నామరూపే= ఇప్పుడు కానవచ్చు నామరూపములు, నాస్తాం=లేవు. ఇతి = అని, ఆరుణేః = అరుణ మహాముని కుమారుఁడగు నుద్దాలకునియొక్క, వచః = వాక్యము ("స దేవ" అను శ్రుతివాక్యమునకు నర్థము).

తా. ఈవిధముగ భూతభౌతికరూపమై బహువిధభేదభిన్నమై సర్వేంద్రియములచేతను ప్రత్యక్షాదులచేతను సర్వశాస్త్రములచేతను గ్రహింపఁబడుచు నుండు నీప్రపంచ మంతయు "ఇది" యనుశబ్దముచేత మాత్రమే ఆత్మభిన్నముగ వ్యవహరింపఁబడుచున్నది. ఇది యంతయు సృష్టికిఁ బూర్వమున సజాతీయవిజాతీయస్వగతభేదములు లేని బ్రహ్మముగ మాత్రమే యుండె ననియు నిప్పటి నామరూపాదులు లే వనియు నుద్దాలక వాక్యరూపమున శ్రుతి చెప్పుచున్నది. ఇది సద్రూపముగానే యారంభదశయం దుండెను కాని శూన్యము కా దనుచున్నది. పరమేశ్వరుఁ డీ ప్రపంచ మనుచున్నది.

వి. ౧. ప్రత్యక్షము, ౨. అనుమానము, 3. ఉపమానము, ౪. శబ్దము(ఆగమము), ౫. అర్థాపత్తి, ౬. అనుపలబ్ధి, ౭. సంభవము, ౮. ఐతిహ్యము అనునవి అష్టవిధ ప్రమాణములు.

౧. ప్రత్యక్షప్రమాణము—తాను స్వయముగాఁగాని, యొకరు చూపినఁగాని చూచి యిది యట్టి పదార్థ మని తెలిసికొనుట.

౨. అనుమానము—ఒకవస్తువుతో సంబంధించిన మఱియొక వస్తువును జూచి యట్టి వస్తువుగూడ నచ్చట నుండు నని యూహించి తెలిసికొనుట.

3. ఉపమానప్రమాణము—ఒక వస్తువునుబోలు మఱియొక వస్తువును జూచి యా వస్తువుగూడ నిట్లే యుండు నని తెలిసికొనుట.

౪. శబ్దప్రమాణము—మఱియొక ప్రమాణమువలనఁ దెలియఁబడుటకు వీలులేని వస్తువు ఇట్టి దని తెలియఁజేయు ప్రాజ్ఞుని వాక్యమునుబట్టి యట్టివస్తువును దెలిసికొనుట.

౫. అర్థాపత్తిప్రమాణము—పైలక్షణములనుబట్టి యీయంశ మి ట్లుండవచ్చు నని నిర్ణయించుకొని తెలిసికొనుట.

౬. అనుపలబ్ధిప్రమాణము—ఒక పదార్థ మొక స్థలమందు లేకపోవుటను దెలిసికొనుట.

౭. సంభవప్రమాణము—శతసంఖ్యలలో దశసంఖ్య లున్న వనియు, సహస్రసంఖ్యలలో శతసంఖ్య లున్న వనియు, లక్షసంఖ్యలలో సహస్రసంఖ్య లున్న వనియు గ్రహించుట.

౮. ఐతిహ్యప్రమాణము—ఒక చెట్టునందు బ్రహ్మరాక్షస్సున్న దని యొకా నొకఁడు చెప్పఁగా, ఆమాటను ప్రజలు విని యాచెట్టుదగ్గఱకుఁ బోవునపు డామాటను జ్ఞప్తికిఁ దెచ్చుకొని భయపడుట.

అవ. ప్రస్తావవశమున వర్ణింపఁబడిన సజాతీయవిజాతీయ స్వగతభేదముల యొక్క స్వరూపమును నిరూపించుచు "ఏకమే వాద్వితీయం" అను పదములయర్థమును వివరించుచున్నాఁడుః—

శ్లో. వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదిభిః,
వృక్షాంతరా త్సజాతీయో విజాతీయ శ్శిలాదితః. 20
తథా సద్వస్తునో భేదత్రయం ప్రాప్తం నివార్యతే,
ఐక్యావధారణద్వైతప్రతిషేధై స్త్రిభిః క్రమాత్. 21

వ్యా. ఏకమేవాద్వితీయమితి పదత్రయేణ సద్వస్తు స్వగతాదిభేదత్రయం ప్రసక్తం నివారయితుం లోకే స్వగతాది భేదత్రయం తావద్దర్శయతి—వృక్షస్యేతి.

ఏవమనాత్మని భేదత్రయం ప్రదర్శ్య సద్వస్తున్యపి ప్రసక్తం తత్ భేదత్రయం శ్రుతౌ పదత్రయేణ నివార్యత ఇత్యాహ—తథేతి. వస్తుత్వసామాన్యాదనాత్మనీవ సద్రూపాత్మన్యపి ప్రసక్తం స్వగతాదిభేదత్రయమైక్యావధారణద్వైతప్రతిషేధాభిధాయకైః ఏకమేవాద్వితీయ మితి త్రిభిః పదైః క్రమేణ నివార్యత ఇత్యర్థః.

టీ. వృక్షస్య=ఒక వృక్షమునకు, పత్రపుష్పఫలాదిభిః=ఆకులు పువ్వులు గాయలు మొదలగువానితో (వీనిలో పరస్పరము కలుగునది.) స్వగతః భేదః = స్వగతభేదము (తనలోని పదార్థములతోఁ దనకుఁ గలుగు భేదము స్వగతభేద మనుట).వృక్షాంతరాత్ = మఱియొక వృక్షమునుండి, భేదః=భేదము, సజాతీయః = సజాతీయభేదము (వృక్షమునకు మఱియొక వృక్షము సమానజాతి కలదియేకదా). శిలాదితః=ఱాయి మొదలగువాని నుండి కలిగిన భేదము, విజాతీయః=విజాతీయభేదము, వృక్షమునకు ఱాయి సమానజాతి కలది కాదు కదా. తథా = ఆవిధముగానే, సద్వస్తునః = సత్పదార్థమునకు, ప్రాప్తం = సామాన్యన్యాయము ననుసరించి ("అన్ని పదార్థములకును భేదత్రయము కలదు" అను న్యాయము ననుసరించి) సంభవించిన భేదత్రయం=పైన వర్ణింపఁబడిన మూఁడు భేదములును, క్రమాత్=క్రమముగ, ఐక్య... ప్రతిషేధైః-ఐక్య = ఒక్కటి యనుటచేతను ("ఏకం" అను పదముచేతను), అవధారణ="ఒక్కటియే" యని నిశ్చయించుటచేతను ("ఏవ" అను పదముచేతను), ద్వైత=రెండవదానిని, ప్రతిషేధైః="సత్పదార్థమునకంటె భిన్నమైనది లేదు" అని నిషేధించుటచేతను ("అద్వితీయం" అను పదముచేతను),నివార్యతే = తొలఁగింపఁబడుచున్నది.

తా. లోకమున ప్రతిపదార్థమునకును సజాతీయవిజాతీయ స్వగత భేదము లని మూఁడు భేదము లుండును. అందు ఏపదార్థమునకైనను

తన యవయవములనుండి కలుగుభేదము స్వగతభేదము; అవయవము లలో పరస్పరము కలుగుభేదముకూడ నిట్టిదియే. అవయవము లన్నియుఁ బదార్థములే కావున వానియందు పరస్పరము భేదము కలిగినను పదార్థమునకు నవయవమునకు భేదము కలిగినట్లే యగును. "ఇది చేయి, ఇది దేహము, ఇది పండు, ఇది వృక్షము, ఇది లోపలియిల్లు, ఇది గృహము" అను మొదలగువ్యవహారము లీవిషయమున నుదాహరణ ములు. ఇట్లే పదార్థమునకు సమానజాతీయ మగు మఱియొకపదార్థ ముతో కల భేదము సజాతీయభేదము. "ఇది మనుష్యదేహము; ఇది పశుదేహము; ఇది వేపచెట్టు; ఇది మామిడిచెట్టు" అను మొదలగువ్యవ హారము లీభేదమున కుదాహరణములు. ఇందు విశేషణములకు మాత్రమే భేదముగాని పదార్థము లొక్క జాతిలోనివే యని తెలిసి కొనవలయును. రెండును దేహములే; రెండును వృక్షములే కదా! ఇంతదూరము కూడఁ బోవ నక్కఱ లేదు. "ఈమనుష్యదేహమునకంటె నీమనుష్యదేహము వేఱు. ఈవేపచెట్టుకంటె నీవేపచెట్టు భిన్నము. ఈమామిడిచెట్టు పొలములో నున్నది; ఈమామిడిచెట్టు దొడ్డిలో నున్నది." అను మొదలగువ్యవహారములు కూడ నీవిషయమునందే యుదాహరణములు; ఇఁక మూఁడవది విజాతీయభేదము. ఇది పదార్థ మునకు నన్యజాతి (మఱియొక) పదార్థముతోఁ గల భేదము. "ఇది కొయ్య, ఇదిఱాయి" అను మొదలగు వ్యవహారము లీవిషయమున నే దృష్టాంతములు.

వి. ఈభేదములు ప్రపంచమున నే పదార్థమునకుఁ జూచినను గానవచ్చుచునే యున్నవియనుట స్పష్టము. ఈకారణమువలన పదార్థమంతయు భేదత్రయముతోఁగూడి యుండవలయును అను ననుభవ నియమ మొక్కటి సంభవించును. దీని నాశ్రయించి ప్రపంచమునకుఁ బూర్వరూప మగుపదార్థమునకును నీభేదము లుండవలయు నని పూర్వపక్షము రాఁగా దానిని "ఏకం ఏవ అద్వితీయం" అను మూఁడుపదములచేతను శ్రుతి వరుసగా నివారించుచున్నది. "సత్పదార్థ మొక్కటి" యని చెప్పి యవయవములు లే వని తెలియఁజేసి స్వగతభేదమును నివారింపుచున్నది. "అది యొక్కటియే" యని చెప్పి దానివంటిది మఱియొక్కటి లే దని తెలిపి సజాతీయభేదమును తొలఁగింపు చున్నది. "దానికంటె భిన్న మగునది లేదు" అని చెప్పి యన్యజాతి కలపదార్థమైన నుండ దని నిరూపించి విజాతీయభేదమును నిషేధించుచున్నది.

అవ. ఇట్లు సామాన్యముగ భేదత్రయాభావమును నిరూపించి దానికి యుక్తులను జూపువాఁడై మొట్టమొదట స్వగతభేదాభావమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. సతో నావయవా శ్శంక్యా స్తదంశ స్యానిరూపణాత్,
నామరూపేణ త స్యాంశౌ తయో *రద్యా ప్యనుద్భవాత్. 22
నామరూపోద్భవ స్యైవ సృష్టిత్వా త్సృష్టితః పురా,
న తయో రుద్భవ స్తస్మా న్నిరంశం స ద్యథా వియత్. 23

వ్యా. సద్వస్తునస్తావన్న స్వగతభేదః శంకితుం శక్యతే. అస్య నిరవయవత్వా దిత్యాహ—సత ఇతి. నామరూపయోః సదవయవత్వం కిం న స్యాదిత్యాశంక్య సృష్టేః పురా తయోరభావాన్న సదంశత్వమిత్యాహ—నామేతి.

కుతో నామరూపయోరభావ ఇత్యాశంక్యాహ—నామరూపేతి. ఫలిత మాహ—తస్మాదితి. అత్రాయం ప్రయోగః సద్వస్తు స్వగతభేదశూన్యం భవితుమర్హతి నిరవయవత్వాద్గగనవదతి.

టీ. సతః = సత్పదార్థమునకు, అవయవాః = అవయవములు, న శంక్యాః=కల వని సంశయింపఁదగవు (నిరూపించుటకు వీలు లేకపోవుటచే సత్పదార్థమున కవయవ ములు కల వనుట సిద్ధాంతము కానేరదు. అవయవము లుండిననే కాని స్వగతభేదము కలుగదు. కావున నాసత్పదార్థమునకు స్వగతభేదము లే దనుట). నామరూపే=నామ రూపములు రెండును, తస్య=ఆ సత్పదార్థమునకు, అంశౌ = భాగములు, న=కానేరవు. తయోః=ఆరెండింటికిని, అద్యాపి=ఇప్పటికిని (కేవల సత్పదార్థ ముండునప్పుడు), అను ద్భవాత్=పుట్టుక లేదు కావున ('తస్య అంశౌ న' అని పూర్వముతో నన్వయము). నామరూపోద్భవస్య ఏవ = నామరూపోత్పత్తియే, సృష్టిత్వాత్ = సృష్టియగుటవలన, సృష్టితః = సృష్టికంటె, పురా=ముందు, తయోః = వానికి, ఉద్భవః=పుట్టుక, న=లేదు. తస్మాత్ = ఆకారణమువలన, తత్ = తత్పదార్థము, వియత్ యథా = ఆకాశమువలె, నిరంశం = భాగములు లేనిదే.

తా. యుక్తులచేత విచారించినను తత్పదార్థమునందు స్వగతాది భేదము లుండవు. స్వగతభేద ముండవలయు ననిన నవయవము లుండ వలయు నని మొట్టమొదటనే వివరించి యున్నాము కదా! ఈసత్ప దార్థమునకు నట్టి అవయవములు లేవు. కల వనిన వానిని నిరూపింప

* పా. రాద్యాప, (అద్య = సృష్టికంటెఁ బూర్వము, అనుద్భవాత్ = పుట్టుక లేనందున)

వలసివచ్చును. అట్టినిరూపణకు నవకాశము బొత్తిగనే లేదు. అవయవములు కలపదార్థములు నాశము నొందు ననుట నియమము కావున ప్రపంచమునకు ఆద్యవస్థ యగు నీసత్పదార్థ మవయవయుక్త మగునేని యది నశించునదియే కావలయును. అప్పటికి ప్రపంచ మొకప్పుడు శూన్యమగు ననవలసివచ్చును. ఇట్లు భవిష్యత్కాలమున శూన్య మగునేని భూతకాలమునందు నొకప్పుడు శూన్యమై యుండవలయును. పిదప జనించియుండవలయును. ఈసృష్టికి నాద్యంతములే లే వనుట సంభవింపదు కదా! అవయవసహిత మగుటచే ఘటాదిపదార్థములవలె నెప్పటికో యొకప్పటికి నిది నశించియే తీరవలయును. ఎప్పుడో యొకప్పుడు జనించియే యుండవలయును కదా! కావున ప్రపంచప్రథమావస్థారూప మగు సత్పదార్థమునకు నవయవము లుండుటకు వీలు లేదు.

వి. "సత్పదార్థము ప్రపంచపూర్వావస్థ యైనచో దానికి ప్రపంచమునకువలెనే భేదము లుండవలయును. నాశముఁగూడ కలుగవలయును. ఆపూర్వావస్థ ప్రపంచభిన్న మగు పదార్థాంతర మనుటకు వీలులేదు కదా." అనియెదవేమొ వినుము. వాస్తవస్థితిలో మామతమున ప్రపంచము జనింపనే లేదు. పరబ్రహ్మమునందు భ్రాంతిచే నున్నట్లు చూడఁబడుచుమాత్రమే యున్నది యనికదా చెప్పితిమి. కావున నీప్రశ్నమునకే యవకాశము లేదు. సామాన్యముగ నాలోచించినఁ బ్రపంచమునకును యీసత్పదార్థమునకును కల్పిత భేదము కలదు. ఈభేదము నాశ్రయించి, ప్రళయకాలమున ప్రపంచము నామరూపాదుల విడిచి యీసత్పదార్థమున నేకీభవించు ననియు సృష్టికాలమున మఱల విజృంభించు ననియుఁ జెప్పవచ్చును. ఈకారణమువలనఁ బూర్వావస్థ యనఁగా ప్రపంచముయొక్క ప్రథమావస్థ యని గాని సృష్టికిఁబూర్వమునఁ గల రూపభేద మని కాని యర్థము కాదు. ఈవిధముగ చెప్పినచో సత్పదార్థము ప్రపంచమువంటిది కానక్కఱలేదు కదా.

"కల్పితభేదము నాశ్రయించి యెట్లో దీనిని సమర్థించుటకంటె దీనినిగూడ సావయవ మని యంగీకరించుటయే మేలని తోఁచుచున్నది. అట్లంగీకరించినఁ బ్రపంచ మొకప్పుడు శూన్యమైయుండవలయునని చెప్పియున్నారుగాని, అట్లుండినమాత్రమున దోషమేమి?" అనియెదవేమొ వినుము. మొట్టమొదట శూన్యమైయుండినచో పిదప నే పదార్థముకాని జనింపనేరదు. శూన్యమునకును కలిమికిని విరోధమైయుండ నిది యెట్లు పొసంగును? "కృష్ణునికిముందు శూన్యపురుషుఁ డొక్కఁడు రాజ్యము చేయుచుండెను" అనుట సరియగునా? కావున నేపదార్థముకాని యుత్పత్తికిఁబూర్వమున శూన్యముగనుండి

పిదప జనించె ననుట సంభవింపదు. ఏవిశేషణమైనను భావమునకే గాని యభావమున కుండదు. వస్తువే శూన్య మగుటచే న ట్లుండుటకును వీలు లేదు కదా! కావున నాసత్ప దార్థమున కవయవముల నంగీకరించి ప్రపంచ మొకప్పుడు శూన్యరూపముగ నుండు ననుట నంగీకరించినప్పుడు ప్రపంచజననమే యసంభవ మగును. కావున నియమముగ సత్పదార్థమున కవయవములులేవు అనియే యంగీకరించి తీరవలయును. ఇంత యేల? అవయవము లున్న నాశ ముండవలయును. సత్పదార్థమునకును లేమికిని విరోధము. కావున నది నశించుటకు వీలు లేదు. ఇ ట్లుండ దానికి నవయవము లుండుట యెట్లు సంభవించును? బొత్తిగనే సంభవింపదు కదా! కావున సత్పదార్థమునకు స్వగతభేదము కూడ లేదు. స్వగతభేదము అవయవాధీన మని యిదివఱకే యెఱింగించితిమి.

ఇట్లు చెప్పనేల? అసత్పదార్థమునందు ప్రపంచము ఐక్యము నొందుటచే ప్రపంచ గతనామరూపములే దానికి నవయవములు కావచ్చును. లేకున్న దానికే 'సత్' అను నామంబును వేదవర్ణిత మగు నొకానొక రూపంబును కలదుకదా! అవి యైనను దాని యవయవములు కావచ్చు ననియెదవేమొ వినుము. ప్రపంచసద్వస్తువులకుఁ గల భేదము కల్పితభేద మని వివరించియే యున్నాము. ఈకారణమువలన ప్రపంచము సద్వస్తువు నందు లీన మగుట యనఁగా రెండును అభిన్నము లై యుండుటయే కాని ప్రపంచము తన నామరూపములతో కూడ నందుఁజేరుట గాదు.ఈకారణమువలన ప్రపంచశతనామ రూపములవలన సత్పదార్థమునకు నవయవములు సంభవింపవు. మఱియు విచారింపఁగాఁ బ్రపంచ మనఁగా నామరూపములే యైయున్నవి. నామరూపభిన్నముగ లోకమున నే పదార్థము గానవచ్చుచున్నదో కొంచెము విచారింపుఁడు. 'ఇది స్తంభము'అను వ్యవహారము నందు స్తంభ మనునామంబును దీర్ఘ రూపంబును గోచర మగుచున్నవి. ఆరెండింటిని విడి చిన నచ్చట పదార్థ మేది కలదో విమర్శింపుఁడు. కట్టె కలదు కదా యనియెదవేమొ యచటను నామరూపములే కట్టె యను నామంబును తాలివలె నతికఠినముగాక లోహము వలె నగ్నియందుఁ గరుఁగక కొంచెము మృదువై యుండు నొకానొక రూపముమాత్రమే కలదు. ఇట్లే యేపదార్థమును విమర్శించినను నామరూపములుతప్ప మఱియొక్కటిలేదు. కావున ప్రపంచ మనఁగా నామరూపములే. ప్రపంచము జనించెను అనఁగా నామరూప ములు జనించెను అనియే యర్థము. ఇట్లుండ సృష్టికిఁ బూర్వమున సత్పదార్థముకలదు అనిన "నామరూపోత్పత్తికిఁ బూర్వము సత్పదార్థము కలదు" అనియే యర్థమగుచుండ నిఁక దానికి నానానామరూపములును అవయవములును లే నట్లగును. "వాఁడు పుట్టక ముందే సర్వ శాస్త్రపారీణుఁ డయ్యెను" అనుమాట నెవ్వరైన విశ్వసింతురా?కావున నాసత్పదార్థమున కవయవములే లేవు. "సత్ అనునామంబును వేదోక్త మగు నేదియో యొక రూపంబును

దానికిఁ గలవు" అని పూర్వపక్షము చేసితివి. అదియు పైనఁ జూపినయుక్తి ననుసరించి చూచినచో యుక్తము కానేరదు. నామరూపములే పుట్టకున్నవి యొక పదార్థము నాశ్రయించియున్న వనుట యెట్లు? "ఇట్లైన ఇది సత్పదార్థము అను వ్యవహార మెట్లు వచ్చెను" అనియెదవేమొ. వినుము. ఆవ్యవహారము కేవలము వ్యావహారికము. ఆనామము ఊరక కల్పింపఁబడినదియే. ఏదియో యొకనామధేయము లేకున్న దానినిగూర్చి యేమియు మాటలాడుటకు వీలులేదుకదా. కావున వాస్తవస్థితిలో నాపదార్థమునకు నామధేయమే లేదు. రూపంబును శ్రుతిచే "ఇది ఇట్టిది" యని విధిపూర్వకముగ నుపదేశింపఁబడుట లేదు. "ఆసత్పదార్థముయొక్క రూపము వర్ణములు కలది కాదు, ఆకారము కలది కాదు." అని ఇట్లు నిషేధపూర్వకముగ మాత్రమే సూచింపఁబడుచున్నది. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ=బ్రహ్మము సత్యరూపము జ్ఞానరూపము ఆద్యంతములు లేనిదని" ఇత్యాది శ్రుతులు విధిపూర్వకముగఁగూడఁ జెప్పుచున్నవి కదా! అనియెదవేమొ. వినుము. అవియు లోకమున నున్న సత్యజ్ఞానాదుల మాత్రమే చెప్పుచు వానిమూలమున పరమేశ్వర రూపము నూహింపవలయు నని మాత్రమే బోధించుచున్నవి. కావున సత్పదార్థమునకు నవయవములు లేవు; వాని నాధారము చేసికొని గలుగు స్వగతభేదంబును లేదు.

అవ. ఇట్లు స్వగతభేదమును నిరాకరించి సజాతీయ భేదమును నిరాకరించుచున్నాఁడు:—

శ్లో. సదంతరం సజాతీయం న వైలక్షణ్యవర్జనాత్,
నామరూపోపాధిభేదం వినా నైవ సతో భిదా. 24

వ్యా. మా భూత్స్వగతభేదః. సజాతీయభేదః కిం న స్యాదిత్యాశంక్య తత్సజాతీయం సదంతరమితి వక్తవ్యం. న తన్నిరూపయితుం శక్యతే, తతో వైలక్షణ్యాభావాదిత్యాహ—సదంతరమితి. నను ఘటసత్తా పటసత్తేతి సతో భేదః ప్రతిభాసత ఇత్యాశంక్య ఘటాకాశమఠాకాశవదౌపాధికో భేదో న స్వతో భాతీత్యాహ—నామరూపోపాధిభేదమితి. అత్రాయం ప్రయోగః—సద్వస్తు సజాతీయభేదరహితం భవితుమర్హతి. ఉపాధిపరామర్శమంతరేణావిభావ్యమానభేదత్వాత్ గగనవదితి.

టీ. వైలక్షణ్యవర్జనాత్-వైలక్షణ్య = భేదము, వర్జనాత్ = లేకపోవుటవలన (భేదమును నిరూపించుటకు వీలు లేకపోవుటవలన), సజాతీయం = సమానజాతిగల, సదంతరం=రెండవ సత్పదార్థము, న=లేదు. నామ...భేదం - నామ=పేరు, రూప = రూపము అనెడు, ఉపాధి = ఉపాధులయొక్క, భేదం వినా=భేదములేకుండా, సతః= సత్ పదార్థమునకు, భిదా=భేదము, న ఏవ = లేనేలేదు. (నామరూపభేదములవలన సత్పదార్థము భిన్నముగ నెన్నఁబడుచున్నది గాని యందు వాస్తవభేదము లే దనుట.)

తా. ఇట్లే యాసత్పదార్థమునకు సజాతీయభేదముకూడ లేదు. సమానజాతి గల రెండవపదార్థ ముండిననేకాని యాభేదము రా దని యిదివఱకే వివరించియున్నాము. ప్రస్తుతమున నట్టిపదార్థము లేదు. కల దనిన నిరూపించుటకు వీలు లేదు. సత్పదార్థమునకు సజాతీయ మనిన మఱియొక సత్పదార్థమే కదా కావలయును. అట్టిది యుండదు. "సత్" అనఁగా ఉనికి. ఇదియే భావము. ఇట్టివి రెండు కల వనిన వానిలో భేదము చూపఁబడవలసియుండును. అట్లు చూపుటకు వీలు లేదు. రెండును ఉనుకులే యయియుండ, వానిలో భేద మెట్లు గ్రహింపవచ్చును? "రెండుగ నుండఁగూడదా?" యని యొక్కరును, "ఒక్కటిగనే యుండఁగూడదా?" యని మఱియొక్కరును ఊరక వాదించుచుండవలసినదియే. మఱియు భేదవాదికిఁ బ్రమాణములు లేవు గావున నైక్యవాదివాదమే యప్పుడు బలవంత మగును. "వానికిఁ గూడఁ బ్రమాణములు లేవుకదా!" యనియెదవేమొ. భేదవాది తన వాదమును సాధింపలేకపోవుటయే ఐక్యవాదికి ప్రబలప్రమాణము.

"ఇట్లు చెప్పనక్కఱలేదు, సత్పదార్థమునందు భేదము కల దను పక్షము ననేక విధముల సిద్ధాంతము చేయవచ్చును. సత్పదార్థ మనఁగా భావమే యని మీరే యంగీక రించియున్నారు. లోకమున భావపదార్థము లాఱు కల వని వైశేషికులు చెప్పుదురు. మఱియు సర్వపదార్థములును 'కలదు కలదు' అని ప్రత్యేకముగ వ్యవహరింపఁబడు చుండుటచే ప్రతిపదార్థమునకు నొక్కొక్క కలిమి కల దని తోఁచుచున్నది. ఇట్లైన సత్పదార్థము లనేకములు కల వనియే చెప్పవచ్చును" అనియెదవేమొ? అది సరికాదు. ఇంతకుమున్నె యొకమాఱు ప్రపంచ మనఁగా నామరూపములేయని వివరించియున్నాను. ప్రపంచ మంతయు బ్రహ్మమున నారోపింపఁబడుచున్నది యనియుఁ జెప్పి యున్నాను. ఆబ్రహ్మమే సత్పదార్థ మనియు సూచించి యున్నాను. ఇట్లగుటచే నామరూపభేద ముల నాశ్రయించి యొక్క పదార్థమునే లోకు లనేకములుగఁ జూచుచున్నా రన వచ్చును కదా! లోకానుభవ మంతయుఁ బరమార్థముగానే యుండ నవసరము లే దని తత్త్వవివేకమునందే సదృష్టాంతముగఁ బ్రకటింపఁబడి యున్నది. కావున నింతమాత్రము వలన నాసత్పదార్థమునందు భేదమును సాధించుటకు వీలులేదు. విచారింపుఁడు. "ఘటము కలదు. స్తంభము కలదు." అను వ్యవహారములలో ఘటనామరూపములకంటె స్తంభనామ రూపములు భిన్నము లగుచున్నవి యనుట నిశ్చయమే కాని కలుములకు భేద మెక్కడిది. "ఘటము కలదు" అనునప్పుడు ఘటమునుగూర్చి మన మేవిశేషము నెఱుంగుచున్నా మో

"స్తంభము కలదు" అనునప్పుడుకూడ నావిశేషమునే యెఱుంగుచున్నాముకదా! కావున కలిమియును సత్పదార్థ మెప్పటికి నొక్కటియే. దానికి సజాతీయమగు మఱియొక సత్పదార్థము లేదు. ఔపాధికభేదము పదార్థాంతరమును బుట్టింపదు కదా! కావున నీసత్పదార్థమునకు స్వగతభేదమువలెనే సజాతీయభేదము కూడ లేదు.

అవ. ఇప్పుడు విజాతీయభేదాభావమును నిరూపించుచున్నాఁడు.—

శ్లో. విజాతీయ మస త్తత్తు న ఖ ల్వ స్తీతి గమ్యతే,
నా స్యాతః ప్రతియోగిత్వం విజాతీయా ద్భిదా కుతః. 25

వ్యా. భవతు. తర్హి, విజాతీయాద్భేద ఇత్యాశంక్య, సతో విజాతీయమసత్ త్స్యాసత్త్వేనైవ ప్రతియోగిత్వాసంభవేన తత్ప్రతియోగికోఽపి భేదో నాస్తీత్యాహ— విజాతీయమితి.

టీ. విజాతీయం = సత్పదార్థమునకు విరుద్ధజాతిని కలది, అసత్ = అసత్పదార్థమే, (సత్తు కానిది అసత్తే కదా యనుట.) తత్ తు = ఆ యసత్పదార్థమైతే, అస్తి ఇతి=ఉన్నది యని, న గమ్యతే ఖలు=తెలియఁబడుట లేదు కదా! అతః=ఈకారణము వలన, అస్య = ఈ యసత్పదార్థమునకు, ప్రతియోగిత్వం = ఆధారత్వములేక విరోధిత్వము, న = లేదు (ఈ యసత్పదార్థము దేనికిని నాధారము కానేరదు. విరోధియు కానేర దనుట), విజాతీయాత్=విజాతీయపదార్థమునుండి, భిదా = భేదము, కుతః = ఎక్కడనుండి కలుగును. (విజాతీయపదార్థమే లేకున్న సత్పదార్థమునకు, దానినుండి భేద మెట్లు కలుగు ననుట).

తా. సత్పదార్థ మనఁగా కలిమి. దానికి విరుద్ధజాతి కలది లేమి. ఆలేమి బొత్తుగనే లే దని యెల్లరకును దెలియును. ఇ ట్లుండ దాని నుండి భేద మెట్లు జనించును? "లేమి కలదు" అని యెవ్వఁడును జెప్పఁడుకదా! కావున సత్పదార్థమునకు విజాతీయభేదము కూడ లేదు.

అవ. ఇట్లు భేదత్రయాభావమును యుక్తులచేత గూడ నిర్ణయించి ఛాందోగ్యశ్రుతివ్యాఖ్యానపూర్వకముగ స్వసిద్ధాంతమును స్థాపించి శిష్యులకు దానియందు చిత్తస్థైర్యమును సంపాదించుటకై ఖండనార్థము పూర్వపక్షమతము నుద్ధరించుచున్నాఁడు.—

శ్లో. ఏక మే వాద్వితీయం స త్సిద్ధ మత్ర తు కే చన,
విహ్వలా అస దే వేదం పు రాసీ ది త్యవర్ణయన్. 26

వ్యా. ఫలితమాహ:—ఏకమేవేతి. ఇదానీం స్థూణానిఖననన్యాయేన సదద్వైతమేవ ద్రఢయితుం పూర్వపక్షమాహ—అత్ర త్వితి.

టీ. సత్ = సత్పదార్థము, ఏకం ఏవ అద్వితీయం = ఒక్కటియే రెండవది లేదు అనుట. సిద్ధం = సిద్ధించినది. అత్ర తు = ఈవిషయమునందైతే, విహ్వలాః = భ్రాంతులై (యథార్థస్థితిని గ్రహింప లేక) కే చన = కొందఱు, ఇదం = ఈ ప్రపంచము, పురా = పూర్వమున (సృష్టికి పూర్వమున), అసత్ ఏవ = అసత్పదార్థముగానే, ఆసీత్ = ఉండెను. ఇతి = అని, అవర్ణయన్ = చెప్పిరి.

తా. ఈవిధముగ పైనఁ జూపిన యుక్తులు "ఏక మే వాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతిచేఁ జెప్పఁబడిన యర్థమునే యనువాదము చేయుచున్నవి. ఇట్లు శ్రుతియుక్తులచే నభేదము సిద్ధించుచుండ ప్రపంచము సద్రూపమే యనుట స్థిరమగుచుండ నీ నిజస్థితిని గనుఁగొనలేక కొందఱు భ్రాంతులై "ఈప్రపంచము సృష్టికి పూర్వమున శూన్యరూపముగానే యుండె ననుచున్నారు.

అవ. ఈయసద్వాది భ్రాంతుఁ డగుటకుఁ గల కారణమును సదృష్టాంతముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మగ్న స్యాబ్ధౌ య థాఽక్షాణి విహ్వలాని త థాస్య ధీః,
అఖండైకరసం శ్రుత్వా నిఃప్రచారా బిభే త్యతః. 27

వ్యా. విహ్వలత్వే దృష్టాంతమాహ:—మగ్నస్యేతి. దార్ష్టాంతికే యోజయతి— తథేతి. అస్యాసద్వాదినః. జాతావేక వచనం. ధీరంతఃకరణమఖండైకరసం వస్తుశ్రుత్వా నిష్ప్రచారా సాకారవస్తునీవాఖండైకరసే వస్తుని ప్రచారరహితా సతీ అతోఽస్మాద్వస్తునో బిభేతి.

టీ. అబ్ధౌ = సముద్రమునందు, మగ్నస్య = మునిఁగినవానియొక్క, అక్షాణి= ఇంద్రియములు, యథా = ఎట్లు, విహ్వలాని = చెదరిపోవునో, తథా = అట్లే, అస్య= ఈయసద్వాదియొక్క (ఇది జాత్యేకవచనము). ధీః = బుద్ధి, అఖండైకరసం-అఖండ= విభాగములులేనట్టియు, ఏకరసం=ఏకస్వరూపమగు బ్రహ్మమును, శ్రుత్వా = విని, నిఃప్రచారా = ఆబ్రహ్మమునంచు సంచరింపలేనిదై, అతః = ఆబ్రహ్మమునుండి, బిభేతి = భయము నొందును.

తా. స్పష్టము (అసద్వాదులకు "సత్పదార్థ మొక్కటియే" యనుటలో నమ్మకము కుదుర దనుట).

అవ. ఈవిషయమున మహాత్ముల సమ్మతిని జూపుచున్నాఁడు —

శ్లో. గౌడాచార్యా నిర్వికల్పే సమాధా వన్యయోగినామ్,

సాకార బ్రహ్మనిష్ఠానా మత్యన్తం భయ మూచిరే. 28

వ్యా. ఉక్తార్థే ఆచార్యసమ్మతిం దర్శయతి—గౌడాచార్యా ఇతి.

టీ. గౌడాచార్యాః = గౌడపాదాచార్యులు (ఈయన శంకరభగవత్పాదులకు పరమగురువు.) నిర్వికల్పే సమాధౌ = నిర్వికల్పసమాధియందు (ఇది తత్త్వవివేకమున సమాధి యను పేర వర్ణింపఁబడెను.) సాకార బ్రహ్మనిష్ఠానాం = శివవిష్ణ్వాదిరూపములతో సాకారసహితముగఁ బరమేశ్వరు నుపాసించు, అన్యయోగినామ్ = జ్ఞానయోగులు కాక తక్కినవారలకు, అత్యన్తం = మిగుల, భయం=భయము కలుగు నని, ఊచిరే = చెప్పిరి.

తా. అసద్వాదుల చిత్తము పరమేశ్వరునిఁ జూచి భయము నొందు నని చెప్పియుంటిమి కదా. దాని నాచార్యులు కూడ సమ్మతించి యున్నారు. వారు శివవిష్ణ్వాద్యుపాసకులకుఁ గూడ నట్టిభయము కల దనుచున్నారు. ఇఁక మిగుల మందమతు లగు నసద్వాదులను గూర్చి వేఱుగాఁ జెప్ప నేల?

అవ. ఇట్లు సమ్మతిని సామాన్యముగఁ దెల్పి దీనిని సూచించు నయ్యాచార్యుని వార్తికమును గూడ నుదాహరించు చున్నాఁడు.—

శ్లో. అస్పర్శయోగో నా మైష దుర్దర్శః సర్వయోగిభిః,
యోగినో బిభ్యతి హ్యస్మా దభయే భయదర్శినః. 29

వ్యా. కేన వాక్యేనోక్తవంత ఇత్యాకాంక్షాయాం తదీయం వార్తిక మేవ పఠతి:—అస్పర్శేతి. యోఽయమస్పర్శయోగాఖ్యో నిర్వికల్ప స్సమాధిః ఏషసర్వయోగిభిః (సాకారధ్యాననిష్ఠైర్దుర్దర్శః దుఃఖేన ద్రష్టుం యోగ్యః. దుష్ప్రాప ఇత్యర్థః) తత్రోపపత్తిమాహ—యోగిన ఇతి. హి యస్మాత్కారణాద్యోగినః పూర్వోక్తద్వైత దర్శినః అభయే భయశూన్యే సమాధౌ నిర్జనే దేశే బాలా ఇవ భయదర్శినో భయ హేతుత్వం కల్పయంతః. అస్మాదస్పర్శయోగాద్భీతిం ప్రాప్నువంతి.

టీ. ఏషః = నిర్వికల్పసమాధి, అస్పర్శయోగః నామ = అస్పర్శ మను పేరు కలది (అస్పర్శయోగ మనఁగా స్పృశింపరాని అనఁగా నసాధ్యమైన యోగము.) సర్వయోగిభిః=యోగు లనఁబడు నందఱచేతను, దుర్దర్శః = చూడరానిది, సాధింపరానిది యనుట (జ్ఞానయోగి తప్ప తక్కినవార లీసమాధిని సాధింపనేర రనుట). యోగినః = జ్ఞానయోగితప్పఁ దక్కినవారలు (భక్తియోగి కర్మయోగి మొదలగువారలు), అభయే= భయము లేనిస్థలమునందు "ద్వితీయా ద్వై భయం = రెండవపదార్థ ముండిననే కాని

భయము కలుగదు అను శ్రుతి ననుసరించి చూచిన భేదమును చూచువార లగుటచే నాయితర యోగులకే భయ ముండును. ఏకస్వరూపమును చూచువాఁ డగుటచే జ్ఞాన యోగికి న ట్లుండదు. ఇట్లు నిర్వికల్పసమాధి భయరహిత మైనదియే యైనను (దాని యందు), భయదర్శినః - భయ=భయమును, దర్శినః=చూచువారై, అస్మాత్ = ఈనిర్వికల్పసమాధినుండి, బిభ్యతి హి = భయము నొందుచున్నారు కదా.

తా. ఆగౌడపాదాచార్యవార్తికమున ని ట్లున్నది. "ద్వితీయాద్వై భయం" అను శ్రుతి ననుసరించిన, రెండవపదార్థ ముండిననే కాని భయము కలుగ దని తెలుచున్నది. తనకంటె నన్యమైనది యొకటి కలదని తోఁచిననే కాని భయము కలుగుట లే దనుట సర్వానుభవసిద్ధము. భయ మనఁగా నేమి? అది యెట్లు కలుగును? విచారించి నచో మాచే నొనర్పఁబడిన సిద్ధాంతమే స్థిర మగును. "వాఁడు న న్నేమి చేయును" అనునదియే కదా భయమునకు స్వరూపము. ఇప్పుడు విమర్శించినవాఁ డొక్కఁడు తా నొక్కఁడు నని రెండు పదార్థము లుండి తీరవలయు నని తెలుచున్నది. ఇ ట్లగుటచే విమర్శించిన నీయుక్తియు పై శ్రుత్యర్థము ననువాదము చేయుచున్నది. ఈకారణమువలన బాగుగ విచారింతు రేని భక్తియోగ కర్మయోగములయందే భయము కలదుగాని జ్ఞానయోగమున దానిచే సాధింపఁబడు సమాధియందు భయము లేదు. భక్తికర్మయోగములయందు రెండుగను రెండింటి కంటె నధికముగను గూడ పదార్థములు కలవు; కావున పై శ్రుతి యుక్తుల ననుసరించి భయము కలుగవచ్చును. కలుగుచు నున్నది. భక్తి యోగులు "మనము బాగుగ నారాధింపకున్న శివున కేమి క్రోధము కలుగునో? విష్ణువున కేమి క్రోధము కలుగునో?" యని భయము నొందుచునే యున్నారు. కర్మయోగులును "కర్మయందు ప్రమాదము కలిగిన నేదేవత కోపించునో?" యని భీతి నొందుచునే యున్నారు.

వి. ఇట్లున్నను ఆయోగులు నిర్వికల్పసమాధి యన్న మిగుల భయము నొందెదరు. నిర్జన మగుస్థలమున విడువఁబడిన బాలుఁడు తనకు భయము నొందవలసినకారణము లేకున్నను మిగుల భీతి నొందునట్లు వారును నేకరూప మగుటచే భయము నొందవలసిన కారణము లేకున్నను, ఈసమాధిని జూచి భయము నొందుచున్నారు. ఇ ట్లగుటచే దీనికి "అస్పర్శయోగము" అని పేరు. ఇది యందఱకును సాధ్యము కాదు.

అవ. ఇట్లు వచనపూర్వకముగ గౌడపాదాచార్యుని సమ్మతిని వివరించి శంకర భగవత్పాదపూజ్యులసమ్మతిని కూడ వచనపూర్వకముగ నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. భగవత్పూజ్యపాదా శ్చ శుష్కతర్కపటూనమూన్,
ఆహు ర్మాధ్యమికాన్ భ్రాన్తా నచింత్యేఽస్మిన్ సదాత్మని. 30
అనాదృత్య శ్రుతిం మౌర్ఖ్యా దిమే బౌద్ధా స్తపస్వినః,
ఆపేదిరే నిరాత్మత్వ మనుమానైకచక్షుషః. 31

వ్యా. శ్రీమదాచార్యైరప్యేతదభిహిత మిత్యాహ:—భగవదితి.
తద్వార్తికం పఠతి:—అనాదృత్యేతి.

టీ. భగవత్పూజ్యపాదాః చ = శంకరాచార్యులును, శుష్కతర్కపటూన్ - శుష్క=నిస్సారమైన, తర్క = వాదమునందు, పటూన్ = సమర్థులైన, అమూన్ = ఈ యసద్వాదులను, అచింత్యే = మనస్సునకు గోచరము కాని, అస్మిన్ = ఈ, సదాత్మని=సద్రూపునియందు, మాధ్యమికాన్ = మధ్యస్థులైన, భ్రాన్తాన్ = భ్రాంతులనుగ (భ్రాంతి నొందియు నొందనివారినిగ), ఆహుః = చెప్పిరి. "ఇమే=ఈ, తపస్వినః = శోచనీయులైన (వారికిఁ గలిగిన దుస్థితికై తక్కినవారలు వగపవలయు ననుట). బౌద్ధాః= బౌద్ధులు, శ్రుతిం = వేదమును, మౌర్ఖ్యాత్ = మూర్ఖత్వమువలన, అనాదృత్య = ఆదరింపక, అనుమానైకచక్షుషః-అనుమాన=అనుమానమే, ఏక=ముఖ్యమైన, చక్షుషః= నేత్రములుగ గలవారై (అనఁగా ననుమానముచేతనే సర్వవిషయములు సాధింపఁ బూనినవారై), నిరాత్మత్వం = శూన్యరూపత్వమును, ఆపేదిరే = పొందిరి. (వారికి నాత్మయే, సిద్ధింపకపోయె ననుట.)" "[ఇతి-ఆహుః] (అని పూర్వముతో నన్వయము).

తా. అవాఙ్మానసగోచరుఁడైన ఈ సద్రూపపరమాత్మవిషయమై శుష్కతర్కవాదసమర్థు లగు మాధ్యమికులు (బౌద్ధులు) భ్రమించి రనియు, వీరలు తమ మూర్ఖత్వముచేత "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవా ద్వితీయం" అనెడి ఇత్యాది శ్రుతిని నిగ్రహించి అనుమానమే ముఖ్య నేత్రముగాఁ గలవారగుచు బుద్ధిసాక్షి యగు ఆత్మ నంగీకరింపక శూన్య భావమును పొంది రనియు శ్రీశంకరాచార్యులు చెప్పిరి.

వి. "పాపము! ఈబౌద్ధులు తమ యవివేకమువలన శ్రుతి నాదరింపక కేవల మనుమానముతోడనే కార్యనిర్వాహము చేయనెంచి కట్టకడకు శూన్యరూపు లైరి" అను వాక్యముచే నీవిషయమును బోధించిరి. అసత్పదార్థమునకును కలిమికిని విరోధ మగుటచే నా యసత్పదార్థ మెప్పటికి నుండదు. సత్పదార్థముకాని యసత్పదార్థము కాని యేది

జగత్కారణ మగునో అదియే ఆత్మ, కావునఁ జగత్కారణము శూన్య మైనచో నాత్మయు శూన్యమే కావలయు నని భావము. జగత్తునకుఁ బూర్వమున నున్నది యని చెప్పఁబడుచున్నది జగత్కారణమునుగూర్చియే యని తెలిసికొనవలయును. కార్యమునకంటె బూర్వమున నియతముగ నుండునది కారణమే కదా!

అవ. ఇట్లు అసద్వాదము భ్రాంత మని స్వయముగాను ఆచార్యవాక్యములవలనను స్థిరపఱిచి యిప్పు డావాదమును దృష్టాంతపూర్వకముగ ఖండించుచున్నాఁడు:—

శ్లో. శూన్య మాసీ దితి బ్రూషే సద్యోగం వా సదాత్మతామ్,
శూన్యస్య న తు త ద్యుక్త ముభయం వ్యాహతత్వతః. 32
న యుక్త స్తమసా సూర్యో నాపి చాసౌ తమోమయః,
సచ్ఛూన్యయో ర్విరోధిత్వా చ్ఛూన్య మాసీ త్కథం వద. 33

వ్యా. ఇదానీమసద్వాదం వికల్ప్య దూషయతి:—శూన్యమాసీదిత్యనేన వాక్యేన. శూన్యస్య సత్తాం జాతియోగం వా సద్రూపతాం వా బ్రూషే ఇతి వికల్పార్థః. తదుభయం సత్తాసంబంధసద్రూపత్వలక్షణం శూన్యస్య వ్యాహతత్వాన్న యుజ్యత ఇత్యర్థః.

'వ్యాహతత్వమేవ' దృష్టాంతపూర్వకం ద్రఢయతి—న యుక్త ఇతి.

టీ. "శూన్యం = శూన్యము, ఆసీత్ = ఉండెను." ఇతి = అని, సద్యోగం - సత్ =అసత్పదార్థముతో, యోగం = సంబంధమునుగూర్చి, ("శూన్యమునకు సత్తతో సంబంధము కలదు" అని), బ్రూషే = చెప్పుచున్నావా? సదాత్మతామ్=సత్స్వరూపమును గూర్చి ("శూన్యము, సన్మయము" అని), [బ్రూషే] వా=చెప్పుదువా? వ్యాహతత్వతః=విరుద్ధ మగుటవలన, శూన్యస్య=శూన్యమునకు, తత్ ఉభయం తు=ఆరెండును (సత్తాసంయోగంబును సత్తామయత్వంబును) న యుక్తం=తగదు. సూర్యః = చీఁకటికి విరుద్ధుఁ డైనసూర్యుఁడు, తమసా = ఆచీఁకటితో, న యుక్తః = కూడియుండఁడు, అసౌ=ఈయన, తమోమయః అపి = చీఁకటియే స్వరూపముగఁ గలవాఁడును, నచ = కాఁడు, సచ్ఛూన్యయోః = సత్తకును శూన్యమునకును, విరోధి త్వాత్ =పరస్పర విరోధ ముండుటవలన, కథం = ఎట్లు, శూన్యం = శూన్యము, ఆసీత్ = ఉండెనో, వద = చెప్పుము.

తా. ఈయసద్వాద మెట్లును యుక్తియుక్తము కానేరదు. ఎప్పు డైనను శూన్యము కల దనుటకే వీలు లేదు. ఎట్లనిన:—"సత్" అనఁగా కలిమి. శూన్య మనఁగా లేమి. ఇప్పుడు చెప్పుము. శూన్యము కల దనిన దానికిఁ గలిమితో సంబంధము కల దనియా లేక కలిమియే దాని

స్వరూప మనియా యర్థము ? లోకమున "కలదు" అని చెప్పఁబడు పదార్థములయం దంతట నిట్టి స్థితులలో నేదియో యొకటి యున్నది. "సత్పదార్థము కలదు" అనునప్పుడు కల దని చెప్పఁబడినపదార్థము నకు నదియే (కలిమియే) స్వరూప మగుచున్నది. "ఘటము కలదు. స్తంభము కలదు" అను మొదలగు వ్యవహారములయందు ఘటస్తంభాది నామరూపములు సత్పదార్థమున కుపాధు లనియు, వానికి దానితో సంబంధము కల దనియు చెప్పియే యున్నాము. కావున నేపదార్థము కల దని చెప్పఁబడినను అచ్చట నీరెండు పక్షములలో నేదియో యొక పక్షము సిద్ధమై యుండును.

వి. కావున ప్రస్తుతవ్యవహారమున నేపక్షము నంగీకరింపవలయును? శూన్యము నకు సత్తయే రూప మనిన నంతకంటె హాస్యాస్పదము మఱియొక్కటి లేదు కదా! సూర్యునకు చీఁకటియే స్వరూప మనిన నెవ్వరు విశ్వసింతురు? ఇఁక శూన్యముగూడ సత్తకు నొక యుపాధి యనిన నుపాధి లేమియే యగుటచే నుపాధియే కానేరదు. దానితో నాపదార్థమునకు సంబంధమును కలుగనేరదు. సూర్యుఁడు చీఁకటితో నెప్పటికైనఁ గూడియుండునా? కలిమికిని లేమికిని నిత్యవిరోధ మగుట ప్రత్యక్షసిద్ధము. ఇట్లుండ శూన్యము కలిగెను అనుట యెట్లు? కొంచెము విచారించి చెప్పుము.

అవ. ఇట్లైన మీమతము (వేదాంతమతము) కూడ యుక్తమైనది కాదు. బ్రహ్మము భేదశూన్య మగునేని యందు నామరూపాది భేదయుక్త మగు నీప్రపంచ మెట్లు నిలచియుండును. సవికల్పనిర్వికల్పములకు విరోధము కదా యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వియదాదే ర్నామరూపే మాయయా సువికల్పితే,

వ్యా. నను, భవన్మతే వియదాదీనాం నిర్వికల్పే బ్రహ్మణి సత్వం వ్యాహత మిత్యాశంక్యాహ—వియదాదేరితి.

టీ. వియదాదేః = ఆకాశాది ప్రపంచముయొక్క, నామరూపే = నామరూపములు రెండును, మాయయా=మాయచేత, సువికల్పితే = పరమేశ్వరునియందు (ఇదియే సత్పదార్థము) కల్పింపఁబడినవి. (సత్పదార్థమే భ్రాంతివలన ప్రపంచరూపముగాఁ జూడఁబడుచున్నది కాని తద్భిన్న మగు ప్రపంచమే లే దనుట.)

తా. ఈ ఆకాశాదులు పరమేశ్వరునియందు భ్రాంతిచేఁ జూడఁబడుచున్నవి యని తత్త్వవివేకమునందే వివరించితిమి. ప్రపంచమునకును

నామరూపవ్యతిరిక్త మగు స్వరూప మేదియు లే దనియు నీ ప్రకరణ మునఁ జెప్పితిమి. సత్తకు స్వాభావికంబుగ భేదము లే దనియు నామ రూపోపాధివలననే యట్టి భేదము కలుగుచున్నది యనియు వివరించి తిమి. వీనిని విమర్శించి చూచిన నామరూపాత్మకప్రపంచ మంతయు కల్పితమే యనియు సత్పదార్థ మొక్కటియే యంతటను కల దనియుఁ దేలును. "ఇట్టి రూపము గలది యాకాశము" అని కేవల నామరూప ములఁబట్టి వ్యవహరించుటయే కాని వానిఁ దొలఁగించిన నచ్చట నుండునది కేవల సత్పదార్థమే కాని మఱియొక్కటి కా దని తెలిసికొన వలయును. ఈ నామరూపములు కల్పితము లగుటచే నూరక యున్నట్లు తోఁచుటయే కాని పరమార్థస్థితిలో లేవు. ఇట్లైన నిఁక వాస్తవ స్థితిలో బ్రహ్మాభిన్నపదార్థ మెక్కడిది? బ్రహ్మాభిన్నపదార్థ ముండిననే కదా "బ్రహ్మము ఏకరూపమై యుండఁగా నానావిధభేదములు కల ప్రపం చము దానిలో నైక్యము నొందు ననుట యెట్లు?" అను పూర్వపక్షము రావలయును. అట్టి భేదమే లేదు. ప్రపంచబ్రహ్మములకుఁ గల భేదము కల్పితము మాత్రమే యని మున్నే ప్రకటించి యున్నాము కదా! కావున "సత్పదార్థమునందు సృష్టికిఁ బూర్వమున ప్రపంచ మైక్యము నొందియున్నది" యనుటలో విరోధ మేమియు లేదు.

అవ. "ఇట్లైన శూన్యముకూడ నిట్టిదియే కావచ్చును. దానికిని మాయాకల్పిత నామరూపము లుండవచ్చును. ప్రపంచమునకువలెనే దానికిని సత్పదార్థముతో సంయోగ ముండవచ్చును. అప్పుడు శూన్యము కలదు అనుటవలన దోష ముండదు కదా యనిన నా విషయమునఁ దన యంగీకారమును చూపుచు "ఇట్లు చెప్పిన బౌద్ధసిద్ధాంతము నిలు వదు" అనుచున్నాఁడు:—

శ్లో. శూన్యస్య నామరూపే చ తథా చే జ్జీవ్యతాం చిరమ్. 34

వ్యా. తర్హి శూన్యస్యాపి నామరూపే సద్వస్తుని కల్పితే ఇతి వదతో బౌద్ధ స్యాపసిద్ధాంత ఇత్యభిప్రాయేణాహ:—శూన్యస్యేతి.

టీ. శూన్యస్య = శూన్యముయొక్క, నామరూపే చ = నామరూపములును మాయయా=మాయచేతనే, సువికల్పితే=సత్పదార్థమునందు కల్పింపఁబడినవి. [ఇతి=అని వక్తవ్యం = చెప్పవలయును]. తథా చేత్ = అట్లయ్యేనేని, [శూన్యం=ఆశూన్యము] చిరం=బహుకాలము, జీవ్యతాం=అభివృద్ధి నొందును గాక. (ఇట్లు చెప్పుటవలన వేదాంత సిద్ధాంతమునకు వచ్చు భంగ మేదియు లే దనుట.)

తా. "ఇట్లైన శూన్యముగూడ నిట్టిదియే కావచ్చును" అందు వేమొ. అది బౌద్ధసిద్ధాంతమునకే విరుద్ధము. వారు మొట్టమొదట శూన్యము కల దనియు, దానినుండి సద్రూప మగుప్రపంచ ముద్భవించు ననియు కదా చెప్పుదురు. అట్టి యాశూన్యము కూడ ప్రపంచము వలెనే సత్పదార్థమునందే కల్పింపఁబడినది యగునేని యప్పుడు వారి సిద్ధాంత మెట్లు నిలుచును? ఈ కారణమువలన శూన్యమునకు బొత్తిగనే సంభవింపని నామరూపముల నంగీకరించినను వేదాంతమతమునకు వచ్చు విరోధ మేమియు లేదు. అసద్వాదులకు వచ్చు నానుకూల్యం బును లేదు.

అవ. "మమ్ము నాక్షేపించినట్లు కాదు. వేదాంత మతమునందును ఆసత్పదార్థము నకు 'సత్' అను నామంబును వేదోక్త మగు నొకానొక రూపంబును కల దనుచున్నారు కదా ! అవియు కల్పితము లనియే మీ రంగీకరించి తీరవలయును. "వేదాంతమతమునఁ బరమార్థము లగు నామరూపములు బొత్తుగనే లేవు కదా" యనిన నట్లు కా దను చున్నాఁడు:—

శ్లో. సతోఽపి నామరూపే ద్వే కల్పితే చేత్తదా వద,
కుత్రేతి

వ్యా. నను తర్హి శూన్యస్యేవ సద్వస్తునోఽపి నామరూపే కల్పితే ఏవాంగీ కర్తవ్యే భవన్మతే వాస్తవయోర్నామరూపయో రభావాదితి శంకతే సతోఽపి వికల్పా సహత్వాదయం పక్ష ఏవానుపపన్న ఇత్యభిప్రాయేణ పరిహరతి—తదేతి. అయమభి ప్రాయః. సతో నామరూపే కిం సతి కల్పితే? ఉతాసతి? అథవా జగతి? నాద్యః. అన్యస్య రజతాదే ర్నామరూపయోః అన్యత్ర శుక్తికాదావారోపదర్శనాత్సతో నామరూపయోః సత్యేవ కల్ప నాయోగాత్. న ద్వితీయః. అసతో నిరాత్మకస చాధిష్ఠానత్వాయోగాత్. న తృతీయః. సత ఉత్పన్నస్య జగతః సన్నామరూపకల్ప నాధిష్ఠానత్వానుపపత్తేరితి మభూదధిష్ఠానం అనయోః కల్పనా.

టీ. సతః అపి=సత్పదార్థముయొక్క గూడ, నామరూపే = నామరూపములు, ద్వే=రెండును, కల్పితే చేత్ = కల్పింపఁబడెనేని, తదా = అప్పుడు, కుత్ర = ఎచ్చట, [కల్పితే] ఇతి = అని, వద = చెప్పుము.

తా. "సత్పదార్థమునకును నామరూపములు కలవు. నామ రూపములు లేకుండ నేదియు నుండదు కదా! మీ మతమునందును

పారమార్థికము లగు నామరూపములు లేవు. కావున సత్పదార్థమునకుఁ గల నామరూపములు కూడ నన్నిటివలెనే కల్పితములు కావలయును. ఇట్లైన నవియు ప్రపంచమువలె శూన్యరూపము కావలయును లేకున్న నన్నియు కలవియే యైనను కావలయును." అని వాదింపఁబోయిన నది యుక్తము కాదు. సత్పదార్థమునకు నామరూపములే లేవనియు వ్యవహారార్థమై మాత్రమే యట్లు గ్రహింపఁబడుచున్నవి యనియు యిదివఱకే చెప్పితిమి. ఇట్లు కాదనిన నా కల్పనకు నాధార మేది? ఏదియైన నొక పదార్థ ముండినఁ గదా దానియందు మఱియొకదానిని కల్పింపవచ్చును. "ఏదియో యొక పదార్థ ముండవచ్చును" అనియెదవేమొ. అది యేది నిర్ణయించి చూడుము. మఱియొక సత్పదార్థమా? అసత్పదార్థమా? లేక ప్రపంచమా? మఱియొక సత్పదార్థమే యనుట సంభవింపదు. "రెండు సత్పదార్థములు కలవు" అనుటయే యసంభవ మని మున్నే వివరించియున్నాము. కావున మొదటిపక్షము నాశ్రయించిన "తన నామరూపములు తనయందే కల్పింపఁబడెను" అనవలసివచ్చును. ఇది విరుద్ధము. ఎచ్చటఁ జూచినను మఱియొకదాని నామరూపంబులు మఱియొకదానియందు కల్పింపఁబడుచున్నవి యనుట ప్రసిద్ధమై యున్నది. భ్రాంతులయం దీ విషయము ప్రత్యక్షము సర్పనామరూపముల రజ్జువునందును రజతనామరూపముల ముత్యపుచిప్పయందును నారోపించుచుండుటను జూచుచున్నాము. "రజ్జువును రజ్జువుగాను, శుక్తిని శుక్తిగాను స్వకీయనామరూపములతోనే వ్యవహరించుట కలదు. అవి గూడ వేదాంతమతమునఁ గల్పితములే కదా." యనియెదవేమొ వినుము. ఏ పదార్థములకుఁగాని నామరూపములు స్వాభావికములు కావనియు, అవి యన్నియు సత్పదార్థమునందే కల్పింపఁబడినవి యనియు సర్వపదార్థములకును యథార్థస్వరూపము సద్రూపుఁ డగు పరమేశ్వరుఁడే యనియుఁ జెప్పియున్నాము. కావున సర్వస్థలములయందును ఒక పదార్థముయొక్క నామరూపములు మఱియొక పదార్థమునం దారోపింపఁబడుచున్నవియే కాని తన నామరూపములు తనయందే యెచ్చట నారోపింపఁబడుట లేదు. ఇట్లైన సద్రూపమునందు దేని నామరూపము లారోపింపఁబడుచున్నవి? ప్రపంచనామరూపము లనియెదరేమొ! అప్పటికిని ఈ

ప్రపంచము సత్పదార్థమున నారోపింపఁబడుచున్నదియే కాదా! మొట్ట మొదట ।నీ నామరూపములు దేనికి సంబంధించియుండెను అనియెద వేమొ. ఈప్రపంచంబును దీనికి నుపాదాన కారణ మగు నవిద్యయు ననాదు లనియు వీనికి పుట్టుక లే దనియు నిదివఱకే పలుమాఱు వివరించి యున్నాము. కావున భ్రాంతిసిద్ధ మగు పూర్వకల్పప్రపంచముయొక్క నామరూపముల నుత్తరకల్పమునందును, అందలి నామరూపములు తదనంతర కల్పమునందును జీవులు కల్పితభేదభిన్న మగు స్వస్వరూపమున నారోపించుచున్నారు. కావున నెప్పటికిని తన నామరూపములు తనయందే యారోపింపఁబడు ననుట చెల్లదు.

వి. ఇఁక రెండవ పక్షము నవలంబించిన నది బొత్తిగనే సరిపడదు. అసత్పదార్థము బొత్తిగనే లేని దగుచుండ నది యొక కల్పనకు నాధార మగుట యెట్లు? మూఁడవ పక్షము గూడ నిట్లే యుక్తియుక్తము కానేరదు. భ్రాంతిసిద్ధమై తనయందే యారోపితమై యుండు ప్రపంచమునందే తన నామరూపము లారోపింపఁ బడె ననుట. ఇట్టిది శూన్య మని వేఱుగా చెప్పవలయునా? కావున నెట్లు చూచినను సత్పదార్థముయొక్క నామరూపములు కల్పితము లనుట యుక్తిశూన్యము.

అవ. "అధిష్ఠానము (ఆధారము) లే దను కారణమువలననే కదా మీ రిటు సిద్ధాంతము చేసితిరి. ఆ యధిష్ఠానమే లే దని తలంచెదము. అట్లైన దోష మేమి యనిన నిది ప్రవిరుద్ధ మనుచున్నాఁడు:—

శ్లో. నిరధిష్ఠానో న భ్రమః క్వచి దీక్ష్యతే. 35

వ్యా. కిం న స్యాదిత్యాశంక్యాహ—నిరధిష్ఠాన ఇతి.

టీ. నిరధిష్ఠానః = ఆధారములేని, భ్రమః = భ్రాంతి, క్వచిత్ = ఎచ్చటను, న ఈక్ష్యతే = చూడఁబడుట లేదు.

తా. "ఆధారము లేకయే యిట్టి కల్పన జరిగి యుండవచ్చును" అనిన నది యుక్తము కాదు. ప్రపంచమున నెచ్చటను ఆధారము లేని కల్పన లేదు. కల్పన యనఁగా నొకదాని ధర్మముల మఱియొకదాని యందు ఆరోపించుటయే యని యిదివఱకే నిరూపించి యున్నాము. భ్రాంతి యనినను ఇదియే కదా. కావున దీనికి నాధారము లేకున్న సరిపడదు. ఆధారము లేని భ్రాంతి జనించుట లేదు కదా! త్రాఁటిని జూచిన దాని నెవ్వఁడైన సర్పముగా భ్రమించును కాని త్రాడే

లేకున్న నాభ్రాంతి యెట్లు కలుగును ? "ఏమియు లేకున్నను ఒక్కొక్క సమయమున నెవ్వరో యొక రున్నట్లు భ్రాంతి కలుగుచున్నది" యని యెదవేమొ. అదియు చీకటినిగాని కన్ను చెదరుటచే నేర్పడినరూప మునుకాని యాధారము చేసికొని కలుగు భ్రాంతియే. కావున భ్రాంతికి నధిష్ఠాన మవశ్యముగ నుండవలయును. పూర్వోక్తవిధముగ నది సిద్ధింపకపోవుటచే సత్పదార్థముయొక్క నామరూపములు కల్పిత ములు కావు. ఇవి పారమార్థికస్థితిలో లేకున్నను వ్యావహారికస్థితిలో నిత్యములే.

అవ. "ఇట్లైనను 'స దాసీత్' అను వాక్యమే మొట్టమొదట స్థిరము కానేరదు" అని పూర్వపక్షి యాక్షేపించుచున్నాఁడు:—

శ్లో. స దాసీ దితి శబ్దార్థభేదే వైగుణ్య మాపతేత్,
అభేదే పునరుక్తిః స్యాత్

వ్యా. నను "సదేవేదమగ్ర ఆసీ" దిత్యత్ర యథా వ్యాఘాత ఉక్తః, తథా "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీ" దిత్యత్రాపి దోషోఽస్తీతి శంకతే—సదాసీదితీతి. తథాహి సదాసీ దితిశబ్దభేదయోరర్థభేదోఽస్తి వా? నవా? అస్తి చేదద్వైతహానిర్నాస్తి చేత్పునరుక్తిః స్యాత్.

అతః సదాసీదిత్యనుపపన్నమితి ద్వితీయపక్షమాదాయ—పరిహరతి.

టీ. "సత్ = సత్పదార్థము, ఆసీత్ = కలదు" ఇతి = అని, శబ్దార్థ భేదే - శబ్దార్థ=శబ్దార్థములకు, భేదే = భేదముకలదేని, వైగుణ్యం = అద్వైత భంగము, ఆప తేత్=వచ్చును. అభేదే=భేదము లేకపోయెనేని, పునరుక్తిః = పునరుక్తి, స్యాత్ = కలుగును.

తా. "అసదాసీత్" అను వాక్యముపై నెట్లు దోషమును చెప్పి తిరో "సదాసీత్" అను వాక్యముమీఁదఁ గూడ నట్లే దోషము చెప్ప వచ్చును. సత్ అనినను, ఆసీత్ అనినను అర్థ మొక్కటియా? రెండా? విచారించిన, సత్ అనినను ఉనికియే; ఆసీత్ అనినను ఉనికియే కదా! కావున నీయర్థములకు భేదము లే దనినచోఁ బునరుక్తిదోషము వచ్చును. ఒక్క యర్థమునే రెండుమాఱులు చెప్పుట యనుచితము కదా! ఇట్లు గాక యేదియో యొక విధముగ వానికి భేదమును సాధింపఁ

బోయిన మత సిద్ధాంతమునకు భంగము వచ్చును. ఉనికి యొక్కటియే యని కదా మీరు చెప్పుచున్నారు.

అవ. అభేదపక్షము నాశ్రయించి యీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు:—

శ్లో. మైవం లోకే త థేక్షణాత్. 36

కర్తవ్యం కురుతే వాక్యం బ్రూతే ధార్యస్య ధారణమ్,
ఇత్యాదివాసనాయుక్తం ప్రత్యాసీ త్స ది తీరణమ్. 37

వ్యా. మైవమితి. పునరుక్తిదోషస్య కః పరిహార ఇత్యాశంక్యాహ—లోకే ఇతి. లోకే ఏవం విధేషు ప్రయోగేషు పునరుక్త్యభావః కుత్ర దృష్ట ఇత్యాశంక్యాహ—కర్తవ్యమితి. భవత్వేవం లోకే. శ్రుతౌ కిమాయాత మిత్యత ఆహ—ఇత్యాదీతి.

టీ. మా ఏవం = ఇట్లు (అభేదము నంగీకరించిన పునరుక్తిదోషము కలుగు నని) చెప్పఁగూడదు. లోకే = లోకమునందు, తథా = ఆవిధముగ, ఈక్షణాత్ = చూచుచుండుటవలన; అట్లు చెప్పఁగూడ దని పూర్వముతో నన్వయము; కర్తవ్యం = చేయవలసినదానిని, కురుతే=చేయుచున్నాఁడు. వాక్యం=చెప్పఁదగినదానిని, బ్రూతే = చెప్పుచున్నాఁడు. ధార్యస్య = ధరింపవలసినదానిని, ధారణమ్ = ధరించుచున్నాఁడు. (ఇచ్చట కర్త్రార్థమునందు షష్ఠి "ధరించుట కలుగుచున్నది" యని యుండఁగా తాత్పర్యమును గ్రహించి సుఖార్థమై "ధరించుచున్నాఁడు" అని చెప్పఁబడెను). ఇతి...యుక్తం-ఇత్యాది=అను మొదలగు, వాసనా=యథార్థస్థితిలో పునరుక్తి యున్నను దానిని దోషముగఁ గైకొనక సర్వసాధారణముగ జరుగుచున్న వ్యవహారములకు సంబంధించిన సంస్కారములతో, యుక్తం ప్రతి = కూడియున్న శిష్యునిఁగూర్చియే, సత్ ఆసీత్ =సత్పదార్థము కలదు. ఇతి=అని, ఈరణం = చెప్పుట కలుగుచున్నది (శ్రుతి చెప్పుచున్నది యనుట).

తా. పై పూర్వపక్షము యుక్తమైనది కాదు. "సత్ ఆసీత్" అను రెంఢు పదములకును అర్థభేద మెప్పటికిని లేదు. ఇట్లు లేకపోయి నంతమాత్రమున పునరుక్తి కలుగదు. కలిగినను లోకవ్యవహారసిద్ధ మగుటచే దోషమును కలిగింపదు. వాఁడు కార్యమును చేయుచున్నాఁడు, వాక్యమును చెప్పుచున్నాఁడు, ఇత్యాది వ్యవహారములనేకములు లోకమునఁ గానవచ్చుచునే యున్నవి. ఇవి దోషములుగఁ బరిగ్రహింపఁబడుట లేదు కదా! కావున "స దాసీత్" అను వాక్యము దోషయుక్తము కాదు. మఱియు వాస్తవస్థితిలో నాసత్పదార్థ

మునుగూర్చి చెప్పువాఁ డెవ్వఁడు? ఏకస్వరూపునిఁగూర్చి చెప్పఁదగిన విషయముమాత్ర మేది కలదు? వినువాఁడు మాత్ర మెవ్వఁడు? ఈ సర్వమును కల్పిత మగు గురుశిష్యభేదము నాశ్రయించియే కదా వచ్చుచున్నది. ఇచ్చట శిష్యుఁడగువాఁ డజ్ఞుఁడు కావునను వాని చిత్తమున వ్యవహారవాసన లన్నియు స్థిరములై యున్నవి కావునను వాని చిత్తము ననుసరించియే వేద ముపదేశించుచున్నది. పైనఁజూపిన లోకవ్యవహారముల నిర్దోషములుగఁ బరిగ్రహించు వ్యవహారములకు సంబంధించిన సంస్కారములు వాని చిత్తమున నున్నవి గావున వేదము వానినిగూర్చి యిట్లు చెప్పుచున్నది. కావున నభేదపక్షము నాశ్రయించిన దోష మేమియు లేదు.

అవ. "ఇట్లైనను ఆశ్రుతివాక్యము సంపూర్ణముగ స్థిరముకాలేదు. 'అగ్రే=సృష్టికి పూర్వమున' అని యం దున్నది. సత్పదార్థ మేకరూపమే యగునేని దానియందు కాలభేద మెక్కడిది? మఱియు ప్రపంచము లేనప్పు డేకరూపముగ నున్న పదార్థమునకు ప్రపంచమున్నప్పుడు భేదము కలుగవచ్చును. ఇదియంతయు మీసిద్ధాంతమునకు విరుద్ధమే కదా!" యనిన సమాధానమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. కాలాభావే పురే త్యుక్తిః కాలవాసనయా యుతం,
శిష్యం ప్ర త్యేవ తే నాత్ర ద్వితీయం న హి శంక్యతే. 38

వ్యా. నన్వద్వితీయే వస్తుని భూతకాలాభావాదగ్ర ఆసీదిత్యుక్తిరనుపపన్నే త్యాశంక్యాహ—కాలేతి. నను జగదుత్పత్తేః పురా జగదభావేన సద్వితీయత్వం బ్రహ్మణ ఇత్యాశంక్య శ్రుతిప్రవృత్తే ర్ద్వైతవాసనావిష్టశ్రోతృప్రతిబోధనార్థత్వాత్ నాతిశంకనీయ మిత్యాహ—తేనేతి.

టీ. కాలాభావే = ఏక స్వరూప మగు సత్పదార్థమునందు కాలభేదము లేకున్నను, "పురా = పూర్వకాలమునందు" ఇతి=అని, ఉక్తిః = చెప్పుట, కాలవాసనయా = కాలసంస్కారముతో, యుతం = కూడిన, శిష్యం ప్రతిఏవ = శిష్యునిఁ గూర్చియే, తేన = ఇట్లే సర్వమును ప్రపంచవాసనాయుక్తుం డగు శిష్యుని గూర్చియే చెప్పఁబడుచుండుటచేత, ద్వితీయం=మఱియొక్క విషయము లేక సత్పదార్థమునకంటె ప్రపంచము భిన్నముగ నుండవలయు నను విషయము, న శంక్య తే హి = సంశయింపఁ దగదు కదా! (ఇచట ప్రశ్న లేవియుఁ బనికి రా వనుట.)

తా. ఇట్లే "సృష్టికిఁ బూర్వమున సర్వము సత్పదార్థమే యయి యుండెను" అనుటయు శిష్యుని చిత్తము నాశ్రయించియె యని తెలిసి

కొనవలయును. పరమేశ్వరుఁడు ఏకరూపుఁడగుటచే ఆయనయందు దేశకాలాదిభేదములు లేవు. అయినను శిష్యునకు నట్టి కాలవాసన కలదు. కావున దాని నాశ్రయించి శ్రుతి యాయనయందును కాలమును కల్పించుచున్నది. ఇది యొక్కటియే యన నేల? శ్రుతి యాయద్వితీయునిఁగూర్చి చెప్పు సర్వవిషయములును శిష్యునిచిత్తము నాశ్రయించియే చెప్పఁబడుచున్నవి. భేదవాసన కలవాఁడగుటచేతనే ప్రపంచబ్రహ్మములకు భేదమునుకూడ చెప్పుచున్నది. ఇంతమాత్రమువలన నాయనకు పారమార్థికభేదాదు లుండవలసిన పని లేదు. కావున నీవిషయమై శంకలఁ జేయుటయే తగనిపని. శిష్యుల మనస్సు లెట్లెట్లున్నన ట్లట్లెల్ల నుపదేశింపుచు గురువులు వారి నుద్ధరింపవలయును కదా.

అవ. ఇప్పుడు సర్వవాదివాక్స్తంభమున సిద్ధాంతరహస్యము నెఱిఁగించుచున్నాఁడు:—

శ్లో. చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా,
అద్వైతభాషయా చోద్యం నాస్తి నాపి తదుత్తరమ్. ౭౨

వ్యా. ఇదానీం సిద్ధాంతరహస్యమాహ—చోద్యమితి. వ్యవహారదశాయాం చోద్యాదికర్తవ్యం. పరమార్థతస్త్వద్వైతమేవ తత్త్వమిత్యర్థః.

టీ. చోద్యం వా = ప్రశ్నకాని, పరిహారః వా = ఉత్తరముకాని, ద్వైతభాషయా=భేదముతో, క్రియతాం = చేయఁబడుఁగాక, అద్వైతభాషయా = అద్వైతముతో విచారించిన, చోద్యం = ప్రశ్నము, నాస్తి=లేదు. తదుత్తరమ్ అపి = దానికి ఉత్తరమును, న = లేదు.

తా. అడుగుట చెప్పుట యనునవి భేద మున్నప్పుడే కాని కలుగవు. అభేద మైనప్పుడు అడుగువాఁ డెవ్వఁడు ? చెప్పువాఁ డెవ్వఁడు ? ఈకారణమువలన శాస్త్రమునందు చిత్తదార్ఢ్యమునకై చేయఁబడు ప్రశ్నోత్తరము లన్నియు ద్వైతము నాశ్రయించియే చేయఁబడుచున్నవి. ఈకారణమువలన నద్వితీయాత్మునిఁగూర్చి ప్రశ్నయే లేదు. భేదవాసనాయుక్తు లగు శిష్యులకొఱకై యట్లు చెప్పఁబడుచున్నది. కావున నందు దోష మేమియు నుండదు.

అవ. "భేదమే పరమార్థము కారాదా" యనిన నట్లు చెప్పుట శబ్దప్రమాణమునకు విరుద్ధ మని స్మృతి నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. తదా స్తిమితగంభీరం న తేజో న తమ స్తతమ్,
అనాఖ్య మనభివ్యక్తం స త్కించి దవశిష్యతే. 40

వ్యా. పరమార్థతో ద్వైతాభావే స్మృతిం ప్రమాణయతి—తదేతి. స్తిమితం నిశ్చలం గంభీరం దురవగాహం మనసా విషయీకర్తుమశక్యం న తేజ స్తేజస్త్వానధికరణం. న తమ స్తమసో విలక్షణం. అనావరణస్వభావం. తతం వ్యాప్తం. అనాఖ్యం వ్యాఖ్యాతు మశక్యమనభివ్యక్తం చక్షురాదిభిరప్యవిషయీకృతం. సచ్ఛాన్యవిలక్షణం. అత ఏవ కించిదిదంతయా నిర్దేష్టుమశక్య మవశిష్యతే ద్వైతనిషేధావధిత్వే నావతిష్ఠతి ఇత్యర్థః.

టీ. తదా = సృష్టికిఁబూర్వకాలమున, స్తిమితగంభీరం = నిశ్చలమును గంభీరము నైనట్టిదియు, న తేజః= తేజస్సు కానిదియు, న తమః = చీఁకటికంటె భిన్నమైనదియు, తతం = సర్వవ్యాపకమైనదియు, అనాఖ్యం="ఇది యిట్టిది" యని చెప్పరానిదియు, అనభివ్యక్తం=ఇంద్రియములకు గోచరము కానిదియు నగు, కించిత్ =అనిర్వచనీయమగు, సత్ = సత్పదార్థము మాత్రమే, అవశిష్యతే = మిగిలియున్నది.

తా. భేదమే పరమార్థ మనుటకు నెట్లును వీలు లేదు. ప్రపంచము చేతనజడరూప మనుట నిస్సంశయము. అందు చేతనులు జీవులు. తక్కిన ప్రపంచము జడము. ఇందు జీవేశ్వరరూపములు రెండు నొక్కటియే యని కేవల యుక్తులతోఁ గూడ నిరూపించి శ్రుతిచే నుపదేశింపఁబడిన యైక్యము ననువాదము చేసియున్నాము. జడప్రపంచమును కేవల నామరూపాత్మకమే యని నిర్ణయించియున్నాము. నామరూపములను విభాగించిన నెందును సత్తకంటె భిన్నమగుపదార్థ మేదియు లేదనియుఁ జెప్పియున్నాము. ఒక్క పదార్థమునే అనేక నామరూపములతోఁ జూచుట పరమార్థము కా దనుటలో సంశయము లేదుకదా! మఱియు నామరూపములకు భేదమే కాని సత్తకు భేదము లే దనియును నిరూపించియున్నాము. ఈభేదము భ్రాంతిసిద్ధముగఁ గూడ నుండుట సంభవించుచుండ, కేవల వ్యవహారము నాశ్రయించి నిర్హేతుకముగ భిన్న స్వరూపముతో నుండుటకు వీలులేని సత్తకు భేదము కల్పించుట యేటి యుక్తి? వ్యవహారమంతయు సత్యముగానే యుండితీరవలయు నను నియమ మెందైనఁ గలదా? రజ్జుసర్పముకూడ వ్యవహారసిద్ధమే. అది సత్య మగుచున్నదా? ఇదియునుగాక భేదము ప్రత్యక్షసిద్ధము.

శబ్దప్రమాణముఁ గూడ దీనినే చెప్పునేని యప్పు డప్రమాణమే యగును. ప్రమాణాంతరసిద్ధ మగు విషయమును జెప్పుట యనువాద మె యగునుకదా! తెలియనిదానిని తెలుపుటయే ప్రమాణమునకు లక్షణము. కావున లోకసిద్ధ మగు భేదముచే పరమతాత్పర్యముగఁ జెప్పిన వేదమునకుఁ బ్రామాణ్యభంగము కలుగును. "కలిగినఁ గలుగుఁగాక" అనియెదవేమొ. అట్లు చెప్పుటకు వీలులేదు. లోకమున సాధారణముగ సర్వవిషయములయందును శబ్దప్రమాణ మంగీకరింపఁబడుచున్నది. "నాలుగు దినములకు ముందు కాశీపట్టణమున నుత్సవము జరిగెను" అని యెవ్వఁడేని చెప్పిన నాయుత్సవమును చూడకయే జనులావిషయమును సమ్మతిఁ గొనుచున్నారు. కావున శబ్దప్రమాణ మవశ్యముగ నంగీకరింపఁ బడవలసినదియే. సామాన్యులవాక్యములే యిట్లుండ, అనాదిసిద్ధమగు పరమేశ్వరవాక్యమును గూర్చి యేమి చెప్పవలయును? (వేదము పరమేశ్వరనిర్మిత మనుటను గూర్చి నాచే రచింపఁబడిన బ్రహ్మసూత్రార్థచంద్రిక మూఁడవ యధికరణము చూచునది.) అట్లంగీకరించిన పైనవర్ణించినవిధముగ దానియందభేదమే చెప్పఁబడి యుండవలయును. "సదేవ" అను మొదలగుశ్రుతిచే నీవిషయమే చెప్పఁబడి యున్నది. దీని యర్థమును వివరించుచు పైస్మృతియు నీవిషయమునే ప్రకటించుచున్నది. యుక్తియు దీనినే యనువాదము చేయుచున్నది యనుట పైననే చూపియున్నాము. కావున నెప్పటికి నభేదమే పరమార్థము.

అవ. మఱియొక పూర్వపక్షము నుపక్రమించుచున్నాఁడు:—

శ్లో. నను భూమ్యాదికం మాభూ త్పరమాణ్వంతనాశతః,
కథం తే వియతో సత్త్వం బుద్ధి మారోహ తీతి చేత్. 41

వ్యా. నను జనిమత్త్వేన అనిత్యస్య భూమ్యాదేరసత్త్వమస్తు. నిత్యాకాశస్యాసత్త్వం కథమంగీక్రియత ఇతి శంకతే—నన్వితి.

టీ. నను = ఓయి, పరమాణు...నాశతః - పరమాణ్వంత = పరమాణువులకు, నాశతః=నశించు స్వభావము గలది యగుటవలన(అవయవము లుండుటవలన,)భూమ్యాదికం = భూమి మొదలగు భూతసముదాయమును, భౌతికములును, మాభూత్ = సృష్టికి పూర్వకాలమున నుండకుండిన నుండకుండునుగాక. వియతః = అవయవములు లేని

యాకాశముయొక్క, అసత్వం = లేమి, తే=నీయొక్క (వేదాంతియొక్క), బుద్ధిం = బుద్ధిని, కథం ఆరోహతి = ఎట్లు అధిష్ఠించును? (ఎట్లు తెలియు ననుట). ఇతి చేత్ = అనియెదవేని వినుము.

తా. ఈ పూర్వపక్షము తార్కికులది. వారిమతమున నాకాశమునకు నవయవములు లేవు. అది నిత్యము. తక్కిన భూతములు నాల్గును పరమాణువులనుండి ద్వ్యణుకత్య్రణుకాదిక్రమంబున జనించి నవియగుటచే నవయవయుక్తములు. పరమాణువులు స్వయముగ నవయవాదులు లేనివైనను ఆకాశకల్పనమున నైనను రెండు చేరి ద్వ్యణుకమగు ననియు, అట్టి ద్వ్యణుకములు మూఁడు గలసి త్ర్యణుక మగు ననియు, ఇదియే క్రమమున కొంతకాలమునకు భూమ్యాదిమహాపిండము లేర్పడు ననియు వారు చెప్పెదరు. ఇట్లగుటచే వారు భూమ్యాదినాశముల నంగీకరించి యాకాశముయొక్క యభావమును గూర్చిమాత్రమే పూర్వపక్షము చేసిరి. "ఆకాశము లే దనువిషయమును నిర్ణయించుట సంభవింపదు" అని వారి యభిప్రాయము.

అవ. దృష్టాంతపూర్వకముగ నీపూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అత్యంతం నిర్జగ ద్వ్యోమ యథాదౌ బుద్ధిమాశ్రితం,
త థైవ స న్నిరాకాశం కుతో నాశ్రయతే మతిమ్. 42

వ్యా. దృష్టాంతావష్టంభేన పరిహరతి—అత్యంతమితి. అత్యంతం నిర్జగజ్జగన్మాత్రరహితమిత్యర్థః.

టీ. అత్యంతం=మిక్కిలి, నిర్జగత్ = జగత్తులేని (జగత్తును విడిచిన యనుట), వ్యోమ=ఆకాశము, బుద్ధిం=బుద్ధిని, ఆదౌ=సృష్టికి పూర్వమందున్నట్లు, యథా=ఏప్రకారము, ఆశ్రితమ్ = ఆశ్రయించినదియో, తథైవ=అట్లే, నిరాకాశం = ఆకాశము లేని, సత్ = సత్పదార్థము (ఆకాశరహిత మగు సత్పదార్థము), కుతః = ఏకారణమువలన, మతిమ్ = బుద్ధిని, నాశ్రయతే = ఆశ్రయింపదు?

తా. ఆకాశాభావము బుద్ధికి గోచర మగుటలో నాశ్చర్యమేదియు లేదు. సర్వప్రపంచహీన మగు నాకాశ మెట్లు గోచరమయ్యెనో, అట్లే యాకాశవిహీన మగు శుద్ధతత్వపదార్థము కూడ గోచర మయ్యెను. ఇందు అసంభవ మేదియు లేదు. ఆకాశమును సత్పదార్థమును సాధారణముగ సర్వవిషయములయందు నొక్కటియె.

అవ. దీనిపై మఱల ప్రతివాది నుద్బోధించి (తెలిపి) మఱల వానిపక్షము ఖండించుచున్నాఁడు:—

శ్లో. నిర్జగ ద్వ్యోమ దృష్టం చే త్ప్రకాశతమసీ వినా,
క్వ దృష్టం కిం చ తే పక్షే న ప్రత్యక్షం వియ త్ఖలు. 43

వ్యా. నహి దృష్టే తదనుపపన్నమితి న్యాయమాశ్రిత్య చోదయతి—నిర్జగదితి. దర్శనమేవాసిద్ధమితి పరిహరతి—ప్రకాశేతి. అపసిద్ధాంతో ఽపీత్యాహ—కిం చేతి.

టీ. నిర్జగత్=సర్వప్రపంచరహితమైన, వ్యోమ = ఆకాశము, దృష్టంచేత్ = ప్రత్యక్షముగాఁ గానవచ్చునది యనియెదవేని, ప్రకాశతమసీవినా = కాంతియో, చీఁకటియో యీరెంటిలో నేదియో యొకటి లేకుండ, క్వ=ఎచ్చట, దృష్టం=ప్రత్యక్షమగుచున్నది? కిం చ = మఱియు, తే=నీయొక్క, పక్షే = పక్షమునందు, వియత్ = ఆకాశము, ప్రత్యక్షం=కానవచ్చునది. న ఖలు = కాదుకదా.

తా. "ఇట్లు చెప్ప నేల? ప్రపంచశూన్య మగునాకాశము ప్రత్యక్షముగ నున్నది. భూమ్యాదులనుండి దానిని విభాగించి చూడవచ్చును. సత్పదార్థ మిట్టిది కాదు కదా! భూమ్యాదులు నశించుస్వభావము కలవి కావున సత్పు డొకవేళ శేషించియుండు నన్నను ప్రత్యక్షము మాత్రము కాదుకదా. ఆకాశము కూడ నిట్టిదియే యగుటచే నాసత్పదార్థ మద్వితీయము కానేరదు" అనియెద వేమొ. ఆకాశముకూడ ప్రపంచరహితముగ కానవచ్చుట లేదు. ఎంత విభాగించి చూచినను ఆకాశము తేజస్సుతోనైనను, చీఁకటితోనైనను కూడియుండునేకాని యూరక యుండ దనుట స్పష్టము. కావున నెప్పుడు కానవచ్చినను ఆయాకాశము ప్రపంచసహితమయ్యే కానవచ్చుచుండును. మఱియు నీమతమున (తార్కిక మతమున) నాయాకాశము ప్రత్యక్షమే కాదు. కావున నీకు ప్రపంచరహిత కేవలాకాశానుభవమును లేదు. ఆకాశరహిత సత్పదార్థానుభవమును లేదు.

అవ. ఇట్లు పూర్వవాదిని ఖండించి గ్రంథకర్త స్వానుభవమును వివరించుచున్నాఁడు:—

శ్లో. సద్వస్తు శుద్ధం త్వస్మాభి ర్నిశ్చితై రనుభూయతే,
తూష్ణీం స్థితౌ న శూన్యత్వం శూన్యబుద్ధేశ్చ వర్జనాత్. 44

వ్యా. నను దర్శనాభావః సద్వస్తున్యపి సమాన ఇత్యాశంక్య, సతః సర్వానుభవ సిద్ధత్వాన్నైవ మిత్యాహ—సద్వస్త్వితి. నను తూష్ణీంభావే శూన్యమేవ. ఇతరస్య కస్యాపి ప్రతీత్య భావాదిత్యాశంక్య శూన్యస్యాపి శూన్యప్రతీత్యభావాచ్ఛూన్యమపి న సంభవతీ త్యాహ—న శూన్యత్వమితి.

టీ. శుద్ధం = ఆకాశాదిసర్వప్రపంచరహితమై నిర్మలమైయున్న, సద్వస్తు తు= సత్పదార్థమైతే, నిశ్చితైః = జ్ఞాననిశ్చయముగల, అస్మాభిః = మాచే (వేదాంతులచే) తూష్ణీం స్థితౌ=సర్వసంకల్పములను విడిచి మౌనముతో నున్నప్పుడు లేక సమాధియందు, అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది (ఏవిషయమును కాని సంకల్పింపక, మనస్సును శాంతముచేసి యున్నప్పుడు ఆమనస్థ్సితిని గ్రహించుసాక్షియే సత్పదార్థ మనుట. అది ప్రపంచమును చూచునదియే కావున నీప్రపంచము దానియందు లేదనుట.) శూన్యబుద్ధేః=శూన్య మొకప్పుడు కల దను బుద్ధిని, వర్జనాత్ చ=తొలఁ గించుటవలన (అట్టి యభిప్రాయము యుక్తియుక్తము కా దనుటవలన,) [తథా = ఆ మౌనకాలమునందు]. శూన్యత్వం = లేమి, న [అనుభూయతే] = అనుభవింపఁబడుట లేదు.

తా. మావిషయ మన్ననో యిట్టిది కాదు. నిష్ప్రపంచ మగు నాకాశము మీకువలెనే మాకును అనుభవమున లేకపోయినను ఆకాశరహితమగు పరతత్త్వము మాత్ర మనుభవమున నున్నవి. మాలో నైనను సామాన్యులకు లేకున్నను జ్ఞానసిద్ధులకుఁ గలదు. జ్ఞానుల యను భవమేకదా యెప్పటికైనను ప్రమాణము. ఆయనుభవ మెట్లు కలుగు ననిన్ల వినుము. సర్వసంకల్పములను విడిచి మనస్సును నిశ్చలము గావించి చూచిన నాయమనస్కస్థితియందు మనస్సాక్షి యగుచేతన మొక్కటి గానవచ్చును. "ఇప్పు డీమనస్సు సంకల్పింపక నిశ్చలమైయున్నది; ఇప్పుడు దీనియందు సంకల్పము జనింపఁబోవుచున్నది," అను మొదలగువిషయ ముల నాచేతనమే గ్రహించుచున్నది. "చిత్తవృత్తు లేవియు లేనప్పుడు ఏమియు లేదు" అనియెద వేమో! అప్పటికిని శూన్య మనుపదార్థమే యుండ దనియు నట్టియభిప్రాయము భ్రాంతియే యగు ననియు నిది వఱకే వివరించితిమి. ప్రస్తుతానుభవమునుగూర్చియు నిప్పు డేమియు లేదు అని యెవ్వఁడును తలంచుట లేదు. "ఇది సాక్షి". అని గ్రహించు నప్పుడును మనోవృత్తి యుండకతీరదు కదా యనియెద వేమో.

అమనోవృత్తి యున్నను లేకున్నను సాక్షి సాక్షియే కదా. ఈయనుభవము సంకల్పము లున్నప్పుడు కూడ కలుగవచ్చునే అనియెద వేమొ. అది సత్యమే. స్పష్టముగఁ దెలియవచ్చునవస్థ యను కారణమున నిదర్శనార్థమై మాత్రమే మౌనస్థితి ప్రస్తాపింపఁబడెను కాని విజ్ఞానికి నిట్టి యనుభవము సర్వకాలములయందుఁ గూడ నుండు ననుటలో మాకు వివాదము లేదు. ఈవిధముగ ననుభవములో నున్న యాసాక్షి ప్రపంచమును చూచువాఁడు కావున నాతనికి నీ ప్రపంచముతో సంబంధము కలుగ దనుట ప్రత్యేకముగ చెప్పవలసినవిషయము కాదు. కంటికి తనచేఁ జూడఁబడు స్తంభాదులతో సంబంధము లే దనుటలో వివాదము లేదుకదా. కావున నాకాశాదిసర్వప్రపంచరహిత మై యున్న సత్పదార్థము మా కనుభవములో నున్నది. ప్రపంచమునకును సత్పదార్థమునకును గల సంబంధము కల్పితమే యని పలుమాఱు చెప్పి యున్నాము కదా! కావున సత్పదార్థమునఁ బ్రపంచగంధము (వాస్తవ సంబంధము) లేదు.

అవ. మఱికొన్ని సంశయముల నివారించి సత్పదార్థానుభవమును స్థిరము చేయుచున్నాఁడు:—

శ్లో. సద్బుద్ధి రపి చే న్నాస్తిమా స్త్వస్య స్వప్రభత్వతః,
నిర్మనస్కత్వసాక్షిత్వా త్సన్మాత్రం సుగమం నృణామ్. ౪౫

వ్యా. నను తర్హి సద్బుద్ధ్యభావాత్సత్త్వమపి న ఘటత ఇతి శంకతే—సద్బుద్ధిరితి. తస్య స్వప్రకాశత్వాన్న తద్బుద్ధ్యభావోఽనిష్ట ఇతి పరిహరతి—మాస్త్వస్యేతి. స్వగోచర బుద్ధ్యభావే కథం సద్వస్త్వవగంతుం శక్యత ఇత్యత ఆహ—నిర్మనస్కత్వేతి.

టీ. సద్బుద్ధిః అపి=ఇప్పు డొక పదార్థ మున్నది యను తలంపును, నాస్తిచేత్ = ఆ యనుభవసమయమున లే దందువేని, అస్య = ఈపరమేశ్వరుఁడు (ఇది కర్త్రర్థమందు షష్ఠి), స్వప్రభత్వతః=స్వయంప్రకాశుఁ డగుటవలన, మా అస్తు = (ఆతలంపు) లేక పోవునుగాక. నిర్మనస్కత్వసాక్షిత్వాత్-నిర్మనస్కత్వ = మనస్సు లే దనువిషయమునకు, సాక్షిత్వాత్=సాక్షి యగుటవలన, సన్మాత్రం=ఆసత్పదార్థము, నృణామ్=మనుష్యులకు, సుగమం = సులభముగఁ దెలియును (మౌనస్థితినుండి మెలఁకువఁ జెందినపిదప "నే నింతకుముందు మౌనముతో నుంటిని" అని స్మరించుటవలన నప్పుడు సాక్షి కలఁ

డనుట యూహింపఁబడుచున్నది. అప్పుడును తన సంకల్పాభావము తనకుఁ దెలియు చునే యుండును కదా యనుట).

తా. "ఆమౌన కాలమున 'ఇచ్చట నేదియు లేదు' అను శూన్య బుద్ధి యెట్లు లేదో 'ఇచ్చట నొక పదార్థము కలదు'అను సద్బుద్ధియు లేదు కదా. ఇట్లుండ నచ్చట సత్పదార్థమే యనుభవింపఁబడుచున్నది. అనుట యెట్లు?" అనియెదవేమొ వినుము. ఏబుద్ధియు లేకపోయినను అను భవమునకు విరోధము రా దని మున్నే వివరించియున్నాము. అప్పుడు సాక్షి కలఁడు కావున శూన్యబుద్ధి లేదు. ఆసాక్షియు స్వప్రకా శుఁడే (అన్యసహాయము లేక స్వయముగనే ప్రకాశించువాఁడే) యగు టచే సద్బుద్ధియు లేకపోయిన లేకపోవచ్చును. సంకల్ప మున్నను లేకు న్నను ప్రతివానికిని సంకల్పాభావము తెలియుచునే యున్నది యను టలో సంశయము లేదు. ఆస్థితినుండి మెలకువనొందినపిదపఁ గూడ "ఇంతకాలమువఱకు మౌనముతో నుంటిని" అని స్మరించుచున్నాఁడు కదా. కావున మనస్సంక్షోభము లేనప్పుడు కూడ నిర్వికారుఁడై సాక్షి యున్నాఁ డనుటను గ్రహించుట బహుసులభము. "భేదము మౌనత మున లేదుకదా. అనుభవించువాఁ డెవ్వఁడు? అనుభవింపఁ బడు వాఁ డెవ్వఁడు" అనియెదవేమొ. ప్రశ్నోత్తరము లన్నియు జీవేశ్వరు లకుఁ గల కల్పితభేదము నాశ్రయించియే జరుగవలయు నని మొట్ట మొదటనే చెప్పియున్నాము. అవిద్యోపాధియం దున్న పరమేశ్వరుఁడే నిర్మలమగు స్వస్వరూపమును చిత్తసాక్షిగ తానే యనుభవించును.

అవ. ఇట్లు వాదముల ఖండించి నిదర్శనపూర్వకముగ శ్రుత్యర్థమును పరిష్క రించుచున్నాఁడు:—

శ్లో. మనోజృంభణరాహిత్యే యథా సాక్షీ నిరాకులః,
మాయాజృంభణతః పూర్వం సత్తథైవ నిరాకులమ్. 46

వ్యా. ఏవం నిష్ప్రపంచస్య సాక్షిణస్తూష్ణీంస్థితౌ భానం ప్రదర్శ్యైత ద్దృష్టాంత బలేన సృష్టేః పురాపి సద్వస్తు తథావగంతుం శక్యత ఇత్యాహ—మన ఇతి.

టీ. మనోజృంభణరాహిత్యే - మనః = మనస్సుయొక్క, జృంభణ = విజృంభ ణము (వృత్తులచే ప్రసరించుట), రాహిత్యే=లేనప్పుడు, సాక్షీ = సాక్షి యగు స్వస్వ రూపము, యథా = ఎట్లు, నిరాకులః = నిర్మలమైయున్నదో, తథా ఏవ = అట్లే,

సత్ = సత్పదార్థము, మాయాజృంభణతః - మాయా = మాయయొక్క, జృంభణతః= ప్రపంచరూప మగు జృంభణమునకంటె, పూర్వం = ముందు, నిరాకులమ్ = నిర్మలమై యుండెను.

తా. కావున మౌనస్థితియందు మనస్సు లేనప్పుడు నిర్మలుఁడై సర్వపదార్థసంబంధముల వర్జించి సాక్షి యెట్లు స్వయముగఁ బ్రకాశించుచున్నాఁడో సత్పదార్థముకూడ మాయచేఁ బ్రపంచము సృజింపఁబడకముందట్లే ప్రకాశించుచుండెను. మనస్సు విషయాకారముగఁ బరిణమింపక పూర్వము సాక్షి యెట్లు సిద్ధుఁడై యుండునో మాయ ప్రపంచాకారముగఁ బరిణమింపక పూర్వము సత్పదార్థము నట్లే నిర్మలమై యుండును. శ్రుతి యీయర్థమునే చెప్పుచున్నది.

వి. స్వభావము సహజమగుపదార్థమునకు, నింతయేల యేపదార్థమునకైనను, తిరస్కారము (ఆచ్ఛాదనము) మాత్రమే కాని స్వభావనాశ మెప్పటికిని కలుగ దనుట సర్వప్రమాణసిద్ధము. కావున విచారించినచో మనోవిజృంభణమునకు పూర్వమువలెనే తర్వాత కూడ సాక్షి నిర్మలుఁడుగనే యున్నాఁడు. విజృంభించినదియు విజృంభింపకుండినదియు మనస్సే. సాక్షియన్ననో యెప్పుడెప్పు డేయేస్థితి కలుగునో దానినెల్లఁ జూచువాఁడుగనే యున్నాఁడు. చూడఁబడు పదార్థమునందు కల వికారములు చూచువానికి నంటవు కదా! కావున భ్రాంతివలన వివేచన చేయలేక మోసపోవుటయే కాని సాక్షికి నేది యెట్లైనను వికారము లేదు; ఉండుటకును వీలు లేదు. స్తంభము భగ్నమైనచో దానిని చూచుకన్ను భగ్నమగునా? కావున నెప్పటికిని సాక్షి నిర్వికారుఁడే. ఇట్లే సత్పదార్థంబును మాయావిజృంభణమునకుఁ బూర్వమున నేస్థితిలో నున్నదో తర్వాత కూడ నాస్థితిలోనే యుండును. ఎప్పటికిని నిర్వికారముగనే యుండును. నామరూపములు బహువిధములుగ దానియం దారోపింపఁబడినను దానిస్వరూపమునకు మాత్రము హాని కలుగదు. త్రాటిని సర్పముగఁ దలంచిన మనస్సునందే దోషము కలదు గాని త్రాటి కేమియు మార్పు లేదు కదా! కావున నెన్ని భేదములఁ జూచుచున్నను వానినెల్ల నామరూపభేదములుగా నిశ్చయించి సత్పదార్థ మొక్కటియే సర్వాత్మక మని గ్రహించి జీవుఁడును సత్యజ్ఞానానందరూపుఁడే కావున దానికిని తనకును భేదము లే దని నిశ్చయించుకొనవలయు నని యాస్థితికి పరమాభిప్రాయము.

అవ. ఇట్లు సర్వమును వివరించి మాయాస్వరూపమును నిర్ణయింపుచున్నాఁడు:—

శ్లో. నిస్తత్త్వా కార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్ని శక్తివత్,
న హి శక్తిం క్వచిత్కశ్చిత్ బుధ్యతే కార్యతః పురా. 47

వ్యా. మాయాయాః కిం లక్షణమిత్యత ఆహ—నిస్తత్త్వేతి, నిస్తత్త్వా జగత్కారణభూతాద్వస్తునః పృథక్ తత్త్వరహితా కార్యగమ్యా వియదాది కార్యలింగగమ్యా అస్య సద్వస్తునః శక్తిర్వియదాదికార్యజననసామర్థ్యం మాయేత్యుచ్యతే. వస్తుస్వరూపాతిరిక్తశక్తిసద్భావే దృష్టాంతమాహ—అగ్నీతి. యథాగ్న్యాదిస్వరూపాతిరిక్తం స్ఫోటాది కార్యలింగగమ్యం వహ్న్యాదినిష్ఠం సామర్థ్యమస్తి తద్వదిత్యర్థః. శక్తేః కార్యలింగగమ్యత్వం వ్యతిరేకముఖేన ప్రథయతి—నహి శక్తిమితి.

టీ. నిస్తత్త్వా = తత్త్వరూపమునకంటె భిన్న మగు స్వరూపము లేనిదియు, కార్యగమ్యా - కార్య = ఆకాశాదుల సృజించుటచే, గమ్యా = ఊహింపఁబడవలసినదియు నగు, అస్య శక్తిః=ఈ సత్పదార్థముయొక్క శక్తి, అగ్నిశక్తివత్ = అగ్నిహోత్రముయొక్క శక్తివలె, మాయా = సత్పదార్థభిన్నముగ "మాయ" యను పదముచే వ్యవహరింపఁ బడుచున్నది. (అగ్నిపదమునకంటె భిన్న మగు "కాల్చుట" యను పదముచే నగ్నిశక్తి యెట్లు పిలువఁబడుచున్నదో అట్లే యనుట.) క్వచిత్ = ఎచ్చటను, కశ్చిత్ = ఎవ్వఁడును, కార్యతః = కార్యమునకంటె, పురా=ముందు, శక్తిం=పదార్థమునందలి సామర్థ్యమును. న బుధ్యతే హి = తెలియఁబడదు.

తా. ప్రపంచము మాయచే సృజింపఁబడుచున్నది యని చెప్పియున్నాము. ఈ మాయను గూర్చి కొంత చెప్పవలసియున్నది. విచారించిన దీనికి బ్రహ్మాభిన్న మగుస్వరూపమే లేదు. సృష్టిని చూచిన మాత్రనే ఇది గ్రహింపఁబడవలసియున్నది. ఏదియో యొక కారణము లేక సృష్టి కలుగదు కావునను పరమేశ్వరుఁడును శక్తి లేక యే కార్యమును చేయనేరఁడు కావునను స్వరూపభిన్నముగ నీశక్తి కల్పింపఁబడుచున్నది. ఒక్క పరమేశ్వరుని విషయమే కాదు, ఏ పదార్థము కాని శక్తి లేక యే కార్యమును సాధింపనేరదు. ప్రతి స్థలమునందును కార్యములనుబట్టి శక్తులు కల్పింపఁబడుచునే యున్నవి. అగ్ని తనలో వైవఁబడిన పదార్థమును కాల్చుచున్నది. అప్పుడు "అగ్నికి కాల్చు సామర్థ్యము కలదు" అని వచనము చెప్పుచున్నాము. ఎచ్చటను కార్యమును చూడకున్న శక్తి కానవచ్చుట లేదు కదా! ఇట్లే ప్రస్తుత విషయమునందును ఆసత్పదార్థమునకు ప్రపంచ నిర్మాణ సామర్థ్యము కల

దనుట కార్యముచేఁ దెలియవచ్చుచున్నది. ఈ సామర్థ్యమే మాయ యనఁబడుచున్నది. ఇది వాస్తవస్థితిలో నా సత్పదార్థముకంటె భిన్నము కాకపోయినను భిన్నముగఁ గల్పింపఁబడుచున్నది; స్వరూపమే లేని దైనను స్వరూపము కలదిగ నెన్నఁబడుచున్నది.

అవ. "తత్త్వము లేని పదార్థ మొక్కటి కల దనుట యెట్లు?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. న సద్వస్తు సతః శక్తి ర్న హి వహ్నేః స్వశక్తితా,
సద్విలక్షణతాయాం తు శక్తేః కిం తత్త్వ ముచ్యతామ్. 48

వ్యా. ఏవం శక్తేః కార్యలింగగమ్యత్వ ముపపాద్య నిస్తత్త్వరూపతాముపపాదయతి—న సద్వస్తితి. అయమభిప్రాయః. సద్వస్తునః శక్తిః కిం సతీ? ఉతాసతీ. నతావత్సతీ. తథాత్వే సతోఽభిన్నత్వేన తచ్ఛక్తిత్వాయోగాత్. ఉక్తార్థే దృష్టాంతమాహ—నహి వహ్నేరితి. ద్వితీయేఽపి కిం నరవిషాణతుల్యా ఉత సద్విలక్షణేతి వికల్పాభిప్రాయేణ పృచ్ఛతి—సద్విలక్షణేతి.

టీ. సద్వస్తు=సత్పదార్థము, సతః = సత్పదార్థమునకు, శక్తిః=శక్తి, న = కానేరదు. వహ్నేః=అగ్నికి, స్వశక్తితా = తనకుఁ దానే శక్తిగా నుండుట, న హి = లేదు కదా (అగ్ని తనకుఁ దానే శక్తి కాదు కదా యనుట). శక్తేః = ఆశక్తి, సద్విలక్షణతాయాం తు = సత్పదార్థమునకంటె భిన్న మగునేని, తత్త్వం = దాని స్వరూపము, కిం = ఏమిగా నుండును? ఉచ్యతామ్ = చెప్పఁబడుఁగాక (శూన్యమే యగును కదా యనుట).

తా. స్వరూపము లేని పదార్థ మొక్కటి కల దనుట నిశ్చయముగ నాశ్చర్యకారణమే కాని మాయాస్వరూపమును గూర్చి విచారించునప్పు డట్లు తలంప నక్కఱ లేదు. ఏల యనిన:—లోకమునఁ గల ప్రతి పదార్థమును సద్రూపముగా నైన నసద్రూపముగ నైన నుండవలయునుగదా! ఈమాయ వీనిలో నేది? సద్రూప మనినచో నా సత్పదార్థంబునకును దీనికిని భేద ముండుటకు వీలు లేదు. నామరూపభేదమే కాని సత్తకు భేద మెంతును లే దనియు రెండవ సత్త యున్నదని చెప్పుటకు వీలు లే దనియు నిదివఱకే నిరూపించియున్నాము. ఇట్లు చూచిన, శక్తియు శక్తిమంతుండు నొక్కటియే యగును. ఇదియు విరుద్ధము. ఏపదార్థ మైనను దానే తన సామర్థ్యమై యున్నది యనుటకు వీలు కలదా? అగ్నికి తద్భిన్నరూపము కల దాహము (కాల్చుట)

శక్తి యగుచున్నది కాని ఆ యగ్నియే శక్తి యగుట లేదు కదా! ఇట్లే జలమునకును తద్భిన్నరూప మగు ద్రవత్వమే శక్తి యగుచున్నది కాని జలమే శక్తి యగుట లేదు కదా! కావున శక్తిశక్తిమంతులకు నవశ్యము భేద ముండవలయును. ఇట్లైన రెండవ పక్షము నాశ్రయింపవలసివచ్చును. అప్పుడు చెప్పఁబడు సత్పదార్థమునకంటె భిన్న మగునది యేమి కావలయును?

శ్లో. శూన్యత్వ మితి చే చ్ఛూన్యం మాయాకార్య మి తీరితమ్,

వ్యా. తత్రాద్యం పక్షమనూద్య దూషయతి—శూన్యత్వమితి.

టీ. [తత్త్వం = మాయాస్వరూపము] శూన్యత్వం = శూన్యముగ నుండుటయే, ఇతి చేత్ = అనియెదవేని, "మాయాకార్యం = మాయచే సృజింపఁబడిన ప్రపంచము, శూన్యం=శూన్యమైనదియే" ఇతి = అని, ఈరితమ్ = చెప్పఁబడి న ట్లగును. (ఇది సమ్మతముకాదు కదా యనుట).

తా. ఇఁక నా రెండవపక్షము నాశ్రయించి "మాయ సత్పదార్థమునకంటె భిన్నమైనదియే" యనిన "మాయ శూన్యరూపమే" యని చెప్పి న ట్లగును. సత్పదార్థమునకంటె వ్యతిరిక్తమైనది శూన్యమే కదా! ఇట్లైన ప్రపంచము కూడ శూన్యరూపమే కావలసివచ్చును. "ఇది మీకు సమ్మతమే కదా!" యనియెదవేమొ. అట్లు కాదు. మేము (వేదాంతులు) ప్రపంచమును శూన్య మనుట లేదు. ప్రపంచము కానవచ్చుట లే దని చెప్పుట లేదు. కానవచ్చినను ఇది కల్పిత మని గ్రహింపవలయు నని మాత్రమే చెప్పుచున్నాము. దీని స్వరూపము శుద్ధబ్రహ్మమే యయి యున్నను మఱియొక విధముగఁ జూచుచున్నా రని చెప్పుచున్నాము. ఒకే విధముగ నున్నదానిని మఱియొక విధముగఁ జూచుట భ్రాంతి యనుచున్నాము. సద్రూపుఁ డగు పరమేశ్వరునకును ప్రపంచమునకును మేము చెప్పెడి భేదము కల్పితమే యని పలుమాఱు వివరించి యున్నాము. ఇ ట్లగుటచే మాకు వీని యభేదమే సమ్మత మనుటలో వివాదము లేదు కదా! ఇట్లు సత్పదార్థమునే ప్రపంచమునుగాఁ జెప్పు మాకు "ప్రపంచము శూన్యము" అనుటలో సమ్మత ముండునా? కావున నీపక్ష మెట్లును యుక్తము కానేరదు. కారణమును శూన్య మని

చెప్పి కార్యమును సత్య మనుట సంభవింపదు కదా! కావున మాయా స్వరూప మెట్లును నిర్ణయింపఁబడుటకు వీలు కాదు.

అవ. పర్యవసానమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. న శూన్యం నాపి సద్యాదృక్తాదృక్తత్త్వమి హేష్యతామ్. 49

వ్యా. శూన్యస్య నామరూపే చ తథాచేజ్జీవ్యతాం చిరమిత్యత్రేత్యర్థః. తస్మా ద్ద్వితీయః పక్షః పరిశిష్యత ఇత్యాహ—న శూన్యమితి. మాయాస్వరూపం సత్త్వా సత్త్వాభ్యాం నిర్వచనానర్హ మిత్యభిప్రాయః.

టీ. [అతః = ఈ కారణమువలన], ఇహ = ఈ మాయావిషయమునందు, యాదృక్ తత్త్వం = ఎట్టి స్వభావము, న శూన్యం = శూన్యరూపము కాదో, సత్ అపిచ = సద్రూపంబును, న=కాదో, తాదృక్ = అట్టి [సత్వం=స్వభావము; కల దని;] ఇష్యతామ్ = నిశ్చయింపఁబడుఁగాక (ఈమాయ అనిర్వచనీయరూపిణి యనుట).

తా. ఈ విధముగ విచారించిన నెట్లు చెప్పుటకును వీలు లేక పోవుటచే నీమాయను అనిర్వచనీయరూపిణి యని మాత్రమే నిర్ణ యింపవలయును. అనిర్వచనీయరూపిణి యనఁగా నిర్ణయించుటకు వీలు కానిది యనుట. సద్రూపిణి యని కాని అసద్రూపిణి యని కాని నిర్ణయించుటకు వీలు కా దని యిదివఱకే నిర్ణయించితిమి కదా! కావున "మాయ సద్రూపిణియు కాదు, అసద్రూపిణియు కాదు" అని మాత్రమే సిద్ధాంతము చేయవలయును.

అవ. శ్రుతియు నీ విషయమునే చెప్పుచున్నది యనుచున్నాఁడు:—

శ్లో. నాస దాసీ న్నో స దాసీ త్తదానీం కిం త్వభూ త్తమః,
సద్యోగా త్తమస స్సత్త్వం న స్వత స్తన్నిషేధనాత్. 50

వ్యా. అస్మిన్నర్థే శ్రుతిం ప్రమాణయతి—నాసదితి, 'తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే' ఇత్యాది శ్రుతిః ప్రమాణమిత్యర్థః. తర్హి తమ ఆసీదితి కథం సత్త్వముచ్యతే ఇత్యత ఆహ—సద్యోగాదితి. కుత ఇత్యత ఆహ—తన్నిషేధనాదితి.

టీ. తదానీం=సృష్టికి పూర్వకాలమున, తమః = అజ్ఞానము (మాయ), అసత్ = అసద్రూపమై, న ఆసీత్ =ఉండలేదు. సత్ =సద్రూపముగాను, న ఆసీత్ =ఉండలేదు. కింతు =ఇఁక నేమంటే, అభూత్ =ఉండెను. తమసః = ఆమాయకు, సద్యోగాత్ = సత్పదార్థ సంబంధమువలన (దాని నామరూపములును సత్పదార్థమునందే యారోపింపఁబడి యుండుటవలన), సత్త్వం=కలిమి కలిగినది. తన్నిషేధనాత్ -తత్ =అసద్రూపమును, నిషే

ఘనాత్ = నిషేధించుటవలన (మాయ సద్రూపిణి యగుటకు వీలు లేదనుటవలన) స్వతః = స్వాభావికముగ, న = మాయకు సద్రూపత్వము లేదు.

తా. "సృష్టికిఁ బూర్వమున మాయ కలదు గాని యది సద్రూపిణియు కాదు, అసద్రూపిణియు కాదు" అని "తమ ఆసీత్తమసాగూఢమగ్రే" = "(అనిర్వచనీయత్వ మను) నంధకారముచేఁ గప్పఁబడిన మాయ సృష్టికిఁ బూర్వమున నుండెను" అను మొదలగు వాక్యములచే శ్రుతి చెప్పుచున్నది. మాయకు పరమార్థసత్యత్వము లేదని యిదివఱకే నిరూపించియున్నాము. నామరూపము లన్నియు సత్పదార్థమునందే యారోపింపఁబడిన వనియు నిరూపించియున్నాము. కావున నీ మాయకుఁ గూడ సత్పదార్థసంబంధమువలననే సత్త్వము కలిగినది యని తెలిసికొనవలయును - (అనఁగా నీమాయ ప్రపంచమువలెనే పరమేశ్వరుని యందున్నట్లు కానవచ్చునదియే కాని వాస్తవముగ నుండునది కా దనుట.)

అవ. పర్యవసానమును చెప్పుచు భేదమును సాధించుచున్నాఁడు—

శ్లో. అత ఏవ ద్వితీయత్వం శూన్యవన్న హి గణ్యతే,
న లోకే చైత్రతచ్ఛక్త్యో ర్జీవితం లిఖ్యతే పృథక్. 51

వ్యా. ఫలితమాహ—అత ఏవేతి. యతః స్వతస్సత్త్వం మాయాయాః నాస్తి, అతః శూన్యస్యేవ మాయాయా అపి ద్వితీయత్వం న గణ్యతేహి నైవాద్రియతే ఇత్యర్థః. అనృతస్య ద్వితీయత్వానంగీకారే దృష్టాంతమాహ—న లోకే ఇతి.

టీ. అతః ఏవ = ఈ కారణమువలననే, శూన్యవత్ = శూన్యమునకువలె [మాయాయాః=మాయకు], ద్వితీయత్వం=బ్రహ్మాభిన్నస్థితి (మాయ బ్రహ్మమునకు రెండవది యనుట). న గణ్యతే=గణింపఁబడదు, లోకే = లోకమునందు, చైత్రతచ్ఛక్త్యోః - చైత్ర=చైత్రుఁ డను పురుషునకును, తత్ = వానియొక్క, శక్త్యోః=శక్తికిని, జీవితం= జీవితము (చరిత్రము), పృథక్ = వేఱు(వేఱు)గా, న లిఖ్యతే = వ్రాయఁబడదు కదా.

తా. ఇట్లగుటచేతనే (అనిర్వచనీయరూపిణి యగుటచేతనే) యీ మాయ బ్రహ్మాభిన్న మగు ద్వితీయపదార్థముగ నెన్నఁబడుట లేదు. ఎచ్చటను శక్తిశక్తిమంతులకు భేదవ్యవహారము లేదు కదా! శక్తిమంతునిఁగూర్చి యేది చెప్పఁబడునో అదియే శక్తినిగూర్చియు చెప్పఁబడిన ట్లగుచున్నది; శక్తినిగూర్చి యేది చెప్పఁబడునో అదియే శక్తి

మంతునిఁగూర్చి చెప్పఁబడి న ట్లగుచున్నది. ఇది సర్వానుభవసిద్ధము. "ఇట్లైనఁ దానే తన శక్తి కావచ్చు నని యంగీకరించిన ట్లైనది. శక్తిశక్తిమంతులకు భేదమును చెప్పుట లేదు కదా" యనియెదవేమొ. అట్లు సంశయింప వలదు. ఇప్పుడు చెప్పినది శక్తి శక్తిమంతులకు భేదము లే దని కాదు. ఉన్నను భేదముగ పరిగణింపఁబడ దని మాత్రమే. కావున దోష మేమియు లేదు. ఈమాయవలెనే సర్వశక్తులు ననిర్వచనీయములే, శక్తిమంతులకంటె నభిన్నములే యని తెలిసికొనవలయును. ఈకారణమువలన (మాయ ప్రపంచమువలెనే లేని దయ్యు నున్నట్లు గానవచ్చుటవలన) నీమాయ యున్నను పరమేశ్వరుని యద్వితీయత్వమునకు భంగము కలుగదు.

అవ. ఇపుడు మఱియొక ఆక్షేపమును ఖండించుచు శక్తి శక్తిమంతులకు భేదము పరిగణింపఁబడ దను సిద్ధాంతమును దృఢపఱుచుచున్నాఁడు:—

శ్లో. శక్త్యాధిక్యే జీవితం చే ద్వర్ధతే తత్ర వృద్ధికృత్,
న శక్తిః కిం తు తత్కార్యం యుద్ధకృష్యాదికం తథా. 52
సర్వథా శక్తిమాత్రస్య న పృథగ్గణనా క్వచిత్,
శక్తికార్యం తు నై వాస్తి ద్వితీయం శంక్యతే కథమ్. 53

వ్యా. నను శక్త్యాధిక్యే జీవితాధిక్యం దృశ్యతే. అతః శక్తేరపి పృథక్ జీవితత్వమస్తీతి శంకతే—శక్త్యాధిక్యేతి. న శక్తిర్జీవితవర్ధనే కారణమపితు తత్కార్యం యుదకృష్యాది ఇతి పరిహరతి—తత్రేతి. దార్ష్టాంతికే యోజయతి—తథేతి.

వ్యా. సర్వథేతి. మాభూచ్ఛక్త్యా సద్వితీయత్వం సతోఽపితు తత్కార్యేణ తద్భవత్యేవేత్యాశంక్య తస్య తదానీమసత్త్వాత్తేనాపి న సద్వితీయత్వ మిత్యాహ—శక్తి కార్యం త్వితి.

టీ. శక్త్యాధిక్యే = శక్తి అధికమైనప్పుడు, జీవితం = శక్తిమంతుని చరిత్రము, వర్ధతే = అభివృద్ధి నొందును. (ఇతి) చేత్ = అనియెదవేని వినుము. తత్ర = అచ్చట, వృద్ధికృత్ = అభివృద్ధిని కలిగించినది, శక్తిః = శక్తి, న = కాదు, కిం తు = ఇఁకనేమనిన, యుద్ధకృష్యాదికం-యుద్ధః = యుద్ధము, కృషి = సేద్యము, ఆదికం=మొదలగునట్టి, తత్కార్యం=దానియొక్క కార్యమే, తథా = అట్లే ప్రకృత విషయమునందును గ్రహింపవలయు ననుట; (లోకమునందు వలెనే పరమేశ్వరుని విషయమునందును జగన్నిర్మాణశక్తిని భిన్నముగ గ్రహించుటకు వీలు లే దని భావము). క్వచిత్ = ఎచ్చ

టను, సర్వథా = ఎట్లు చూచినను, శక్తిమాత్రస్య=కేవల శక్తిని (కర్మార్థమందు షష్ఠి.) పృథక్ = ప్రత్యేకముగ, న గణనాత్ = గణింపకపోవుటవలన శక్తి శక్తిమంతు లొక్కటియే; శక్తికార్యం తు = ఆశక్తివలన కలిగినపని యైతే, న అస్తి ఏవ=బొత్తిగనే లేదు (సృష్టికిపూర్వమున లే దనుట.) ద్వితీయం = సత్పదార్థమునకంటె భిన్న మగుపదార్థము కల దని, కథమ్ = ఎట్లు, శంక్యతే = సందేహింపఁబడును? (నిస్సంశయ ముగ రెండవ పదార్థము లే దనుట.)

తా. "ఇట్లు చెప్ప నేల? శక్తిమంతునికంటె భిన్నముగ శక్తినిఁ గూర్చికూడ కొంత వివరింప వచ్చు ననియే తోఁచుచున్నది. ఎవ్వనికి శక్తి యధికముగ నుండునో, వాఁడు విశేషముగఁ గొనియాడఁబడు చున్నాఁడు. వాని చరిత్ర మిక్కిలి వర్ణనీయ మగుచున్నది. అట్లు లేని వారు సామాన్యముగనే యున్నారు. ఈభేదమునకుఁ గారణము శక్తియే కదా! దీనినిబట్టి చూచిన శక్తియుఁగూడ కొంత ప్రత్యేక చరిత్ర కల దనియే తోఁచుచున్నది. పదుగురిలో నధికముగ నెవ్వఁడైన స్తోత్రము చేయఁబడెనేని, వానినిగూర్చిన స్తోత్రమునందలి యధిక భాగమంతయు వాని శక్తినిఁగూర్చియే రచింపఁబడినది యనవలయును. కావున శక్తిని శక్తిమంతునికంటె భిన్నముగ గ్రహింపవచ్చును." అని యెదవేమొ వినుము.

వి. అభివృద్ధి గానవచ్చినచోట దానికిఁ గారణము శక్త్యాధిక్యము కాదు. దేశకాల సంయోగ సౌకర్యమువలనఁ గలిగిన తద్విజృంభణమే. శక్తిలో నెక్కువ తక్కువలు లేవు. ఉన్న వనుటకును వీలు లేదు. ఈ న్యూనాధికభావములు ఏ పదార్థమునకుఁగాని స్వాభావికము లనుట సంభవింపదు. తత్త్వవివేక ప్రకరణమున నానందమునుగూర్చి యిట్టి విచారము జరుపఁబడియే యున్నది. అయినను సుఖబోధార్థమై యిచ్చటఁగూడ శక్తి నాశ్రయించి విచారింతము. దానికి న్యూనాధికభావములు స్వాభావికములే యగునేని, కొందఱియందు అల్పశక్తియు మఱికొందఱియం దధికశక్తియు నియతమై యుండ వలసివచ్చును. లోకమున నట్లు గానవచ్చుట లేదు. కొంతకాలము శక్తిహీనుఁడై యున్నట్లు తోఁచినవాఁడే యొకానొక సమయమున నద్భుతకార్యముల నిర్వర్తించు చుండుటయు, సంపూర్ణ శక్తిమంతుండును ఒక్కొక వేళ నిష్ప్రయోజకుఁ డగుచుండు టయుఁ బ్రత్యక్షముగఁ జూచుచున్నాఁడు. శక్తికి నల్పాధిక భావములే నియతము లగునేని యిట్టి మార్పులు గానరాఁగూడదు కదా! "మనుష్యజాతియం దిట్టి సందర్భములు కానవచ్చినను నితర జాతులయందిట్లు లేదు. మృగజాతి నిత్యముగ మనుష్య

జాతికంటె శక్తిహీన మయ్యే యున్నది. ఒకప్పుడును దానియం దాధిక్యము కానరాలేదు కదా." అనియెదవేమొ. అచ్చటను శక్తికి లోప మేదియు లేదు. మనుష్యుని యవయవములవంటి యవయవములు లేక పోవుటచే నా మృగములు మనుష్యకార్యములఁ జేయలేకున్నవి. అందును నెంతవఱకు నవయవ సంయోగ ముండునో, అంతవఱకును కార్యముల నాచరించుచునే యున్నవి. మనుష్యుని వలె నిలువనేర్చి హస్తములవలె ముంగలిపాదముల నుపయోగింపఁగల భల్లూకము అట్టి సామర్థ్యములేని యితర జంతువులవలె తన కెదురైనవానిని నోటితో కఱువఁ బ్రయత్నింపక చేతితో కొట్టుచున్నది. వ్యాఘ్రము అంతకంటె నల్పమగు నవయవ సంయోగము కలది కావున తన శత్రువుతో నిలువఁబడి పోరాడుట లేదు. వానరము ఆ భల్లూకమునకంటె నవయవ సంయోగములో నధిక మగునది కావున మనుష్యకార్యములఁ జాలవఱకు నాచరించుచున్నది. స్థిరసన్నివేశము సరిగాలేదు కావున నే మృగమును మనుష్యునివలె విషయగ్రహణము పరిపూర్ణముగఁ జేయలేకున్నది. కావున నెట్లు చూచినను కారణాంతరములవలన న్యూనాధికభావములు దోఁచును. అంతియే కాని యే పదార్థమునకైన నది స్వాభావికము కాదు. పురాకృతకర్మసంస్కారము దీనికి ముఖ్యకారణము. ఏ యే పురుషుఁడు పుణ్యకర్మ పరిపాకమువలన జనించుచున్నాఁడో, వాఁడు చక్కని యవయవ సంయోగము దేశకాలాదుల యానుకూల్యము గలవాఁడై తన కర్మఫలమునకుఁ దగినయట్లు కార్యముల నాచరించును. పాపకర్మ పరిపాకమువలన తదనుభవమునకై జనన మొందినవాఁడు అవయవసంయోగమునందేని దేశకాలాద్యానుకూల్యమునందేని మఱియొందేని విఘ్నము నొంది కార్యముల సాధింప నేర కుండును. లోకులు భ్రాంతులగుటచే నీ యథార్థతత్త్వము నెఱుంగలేక "వాని శక్తి యపరిమితము" అని శక్తియందాధిక్యము నారోపింతురు.

కావున నభివృద్ధికారణము (చరిత్రాభివృద్ధికారణము) శక్తికాదు. తద్వ్యాజృంభణమే. పైన వర్ణించిన విధముగ పురాకృతసుకృతపరిపాకమువలన దేశకాలాద్యానుకూల్యము కలిగిన శక్తి తన సామర్థ్యమును యుద్ధాదిరూపములఁ గొంతవఱకైనను సామాన్యులకంటె నధిక మగునట్లు వెల్లడింపఁ గలుగునేని యదియే పురుషునకు స్తోత్రహేతు వగుచున్నది. సంసారమగ్నులై యవిద్యచే తమ స్వస్వరూపమును గోల్పోయిన జీవులకు పరిపూర్ణసామర్థ్య మెక్కడిది? అది సృష్టికర్త యగు పరమేశ్వరునకే కాని మఱియొక్కనికిఁ గలుగనేరదు కదా? అదియే యందఱకుఁగూడ నున్నశక్తి. కల్పిత భేదము నాశ్రయించి "అందఱు" అని చెప్పుటయే కాని ఉన్న తత్త్వ మొక్కటియే కదా! ఇట్లందఱియెడఁ బరిపూర్ణశక్తియై యున్నను భేదకారణ మగు నవిద్యచే నాచ్ఛాదింపఁబడి బహువిధముల న్యూనాధిక భావములతో వ్యవహరింపఁబడుచున్నదియని తెలిసికొనవలయును. కావున నే విధముగఁ జూచినను శక్తి శక్తిమంతులకు భేద

మెన్నఁబడుట యెచ్చటను లేదు. ఇంత యేల? "పరమేశ్వరుఁడు సర్వశక్తియుక్తుఁడు" అనుటయుం వానిని కొనియాడుటయుఁ గూడ వాని వలన కలిగిన సృష్టికార్యమును బట్టియే. విచారించిన వానియం దున్న శక్తికి నాధిక్యమును లేదు. మన శక్తికి నల్పత్వమును లేదు. భేదము లన్నియు నుపాధికృతములే కాని స్వాభావికములు కావు. కావున శక్తికి నెట్లును ప్రత్యేక చరిత్ర సంభవింపదు.

ఈవిధముగ నెట్లు చూచినను శక్తికి ప్రత్యేక వ్యవహారము లేకపోవుటచే శక్తిమంతులకు భేద మున్నను శక్తి వేఱుగ పరిగణింపఁబడదు. శక్తిమంతుఁ డొక్కఁడు; శక్తి మఱియొక్కటి యని చెప్పుటకు నెట్లును వీలులేదు. కావున మాయకును పరమేశ్వరునకును భేద మున్నట్లు కానవచ్చుటయే కాని నిజముగ లేదు. "ఇట్లైనను మాయాకార్యమగు ప్రపంచమునకును వానికిని భేద ముండవచ్చునుకదా" అనియెద వేమొ. సృష్టికిఁబూర్వమున నీ ప్రపంచమే లేదు కదా! కలిగిన పిదప నైనను భేదము రావచ్చు ననుటకును వీలు లేదు. ఒకప్పుడు లేనిది యాకస్మికముగ నెట్లు వచ్చును? మఱియు వేఁడిమికల యగ్నికి శీత గుణ మెప్పటికిని కలుగనట్లు అద్వితీయుఁ డగువానికి సద్వితీయత్వ మెట్లు కలుగును? కావునఁ బరమేశ్వరునికంటె భిన్న మగు పదార్థ మున్నది యనుటకే వీలులేదు. మఱియు సృష్టికిఁ బూర్వమున నున్న స్థితినిఁగూర్చియే మాటలాడుచున్నాము. కావున నీ ప్రశ్నమునకు ('సృష్టికిఁ బిదపనైన ద్వైతము కలదా?' యను ప్రశ్నమునకు) నవకాశమే లేదు. కావున సృష్టికిఁ బూర్వమున శక్తియుక్తుఁ డైనను శక్తి యనిర్వచనీయ మగుటచేఁ బరమేశ్వరు డద్వితీయుఁడే.

అవ. "అగునుగాక. ఈ శక్తి పరమేశ్వరునియం దంతట నున్నదా? లేక యొక స్థలమునందు మాత్రమే యున్నదా? మొదటి పక్షము నంగీకరించిన ముక్తులు శుద్ధ బ్రహ్మరూపు లగుదు రనుటకు వీలు లేదు. రెండవవాని నంగీకరించినఁ బరమేశ్వరునకు నవయవములఁ జెప్పవలయును. అది మీకు సమ్మతము కాదు." అనిన సమాధానముఁ జెప్పువాఁడై సదృష్టాంతముగ స్వసిద్ధాంతమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. న కృత్స్నబ్రహ్మవృత్తిః సా శక్తిః కింత్వేకదేశభాక్,
ఘటశక్తి ర్యథా భూమౌ స్నిగ్ధమృద్యేవ వర్తతే. 54

వ్యా. నను సచ్ఛక్తిః సతి సర్వత్ర వర్తతే? ఉతైకదేశే? నాద్యః. ముక్తైః ప్రాప్యబ్రహ్మభావప్రసంగాత్. న ద్వితీయః. నిరంశత్వేన విరోధిత్వాత్. ఇత్యాశంక్యాద్యానంగీకారాత్ ద్వితీయే పరిహారో వక్ష్యతే ఇత్యభిప్రాయేణాహ—న కృత్స్నేతి. ఏకదేశవృత్తౌ దృష్టాంతమాహ—ఘటేతి.

టీ. ఘటశక్తిః = కుండ యగుశక్తి, భూమౌ = భూమిలో (సర్వవిధము లగు మృత్తికలలో,) స్నిగ్ధమృది ఏవ = బంకమట్టియందే, యథా=ఎట్లు, వర్తతే=ఉన్నదో, [తథా = అట్లు,] సా = ఆ, శక్తిః = మాయాశక్తి, కృత్స్నబ్రహ్మవృత్తిః-కృత్స్న=పరిపూర్ణమైన, బ్రహ్మ = పరబ్రహ్మమునందు (పరబ్రహ్మమున నంతటను అనుట.) వృత్తిః = ఉండునది, న=కాదు. కింతు=ఇఁక నే మనిన, ఏక దేశభాక్-ఏకదేశ=కొంతభాగమును మాత్రమే, భాక్ = పొందునది.

తా. ఈ విధముగ ననిర్వచనీయరూపిణియై యభిన్న యద్వ్యై పరమేశ్వరునియందు నిలచియున్న మాయాశక్తి వానియం దొక యల్ప భాగమున మాత్రమే యున్నది. భూమి యంతయు మృత్తికయే యైనను యం దొక విధ మగు మృత్తికయందు (బంకమంటియందు) మాత్రమే కుండను గలిగించు సామర్థ్య మున్నట్లు ఆ పరమేశ్వరుని యందును ఒక్క భాగమునందు మాత్రమే ప్రపంచరూపముగ విజృంభింపఁగల యా మాయాశక్తి కలదు.

వి. పరమేశ్వరునియం దంతటను ఈశక్తి కలదనుట శ్రుతికిని యుక్తికిని సరిపడదు. శ్రుతులు ఏకాంశమునందుమాత్రమే మాయ కల దనును. అవి సమానార్థము లగు స్మృతులతోఁ గూడ దిగువ నుదాహరింపఁ బడును. యుక్తి యన్నలో—పరమేశ్వరుని యం దంతటను శక్తియున్నయెడల నా శక్తి ప్రపంచాకారముతో పరిణమించినప్పుడు ఆ పరమేశ్వరునియం దంతటను ప్రపంచాధ్యాసము కలుగును. అప్పుడు వెదకుటకుఁ గాని గ్రహించుటకుఁ గాని ఆత్మగా నిర్ణయించుటకుఁ గాని పరమేశ్వరుఁడు ప్రత్యేకముగ నుండఁడు. ఇట్లుండకున్న ముక్తియే సంభవింపదు. పరమార్థస్థితి యెట్లున్నను సర్వము కల్పితమాత్రమే యైనను పరమేశ్వర రూపమును ప్రత్యేకముగ గ్రహించుటకు వీలు లేక పోవుటచే ముక్తియే లేకపోవును. మౌనమునందుఁ గాని సుషుప్తియందుఁ గాని సమాధియందుఁగాని శుద్ధాత్మానుభవము కలుగుటకే వీలు లేకపోవును. ప్రపంచాభావరూపము లగు సమాధ్యాదులే లేకపోవును. కావున మాయ పరమేశ్వరునియందు సమగ్రముగ లేదు. ఏకదేశమునందు మాత్రమే కలదు.

అవ. మాయ పరమేశ్వరునియం దేకభాగమున మాత్రమే యున్నది యనుటకును మాయ నతిక్రమించియు శుద్ధపరమేశ్వరుఁ డున్నాఁ డనుటకును బ్రమాణములఁ జూపుచున్నాఁడు:—

శ్లో. పాదోఽస్య సర్వా భూతాని త్రిపా ద స్తి స్వయంప్రభః,
ఇ త్యేకదేశవృత్తిత్వం మాయాయా వదతి శ్రుతిః. 55

విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్;
ఇతి కృష్ణోఽర్జునా యాహ జగత స్త్వేకదేశతామ్. 56
స భూమిం విశ్వతో వృత్వా హ్యత్యతిష్ఠ ద్దశాంగులమ్,
వికారావర్తి చాత్రాస్తి శ్రుతిసూత్రకృతో ర్వచః. 57

వ్యా. శక్తేరేకదేశవృత్తిత్వే ప్రమాణమాహ—పాదోఽస్యేతి.
న కేవలం శ్రుతిరేవ స్మృతి రప్యస్తీత్యాహ—విష్టభ్యేతి.

ఇదానీం నిర్మాయస్య రూపసద్భావే ప్రమాణమాహ—స భూమిమితి. వికారావర్తిచ తథా స్థితిమాహేతి—సూత్రకారవచన మిత్యర్థః.

టీ. "అస్య = ఈ పరమేశ్వరునియొక్క, పాదః = పాతికభాగమే, సర్వా భూతాని = సమస్తభూతములు సై యున్నవి; స్వయంప్రభః = స్వప్రకాశస్వరూపుఁడగు శుద్ధి పరమేశ్వరుఁడు, త్రిపాత్ = ముప్పాతికభాగము, అస్తి = కలఁడు" ఇతి = అని, శ్రుతిః=శ్రుతి, మాయాయాః=మాయకు, ఏక దేశవృత్తిత్వం-ఏకదేశ=పరమేశ్వరునియొక్క భాగమున, వృత్తిత్వం=ఉండుటను, (మాయ పరమేశ్వరుని యందొక్క భాగమున మాత్రమే యున్న దని), ఆహ=చెప్పుచున్నది. "అహం=నేను (కృష్ణుఁడు), ఇదం=ఈ, కృత్స్నం=సమస్తమైన, జగత్ = ప్రపంచమును, ఏకాంశేన = ఒక్క భాగముతో, విష్టభ్య=గ్రహించి (వ్యాపించి), స్థితః = ఉన్నాను. ఇతి = అని, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, జగతః=ప్రపంచముయొక్క, ఏకదేశతాం తు = ఏకభాగస్థితి సైతే (ప్రపంచము పరమేశ్వరుని యందొక్కస్థలముననే యున్నది యనుటను), ఆహ = చెప్పెను. "సః=ఆ పరమేశ్వరుఁడు, భూమిం = (ఇది యుపలక్షణము) భూమ్యాదిసర్వప్రపంచమును, విశ్వతః=సంపూర్ణముగ, వృత్వా=ఆవరించి, దశాంగులమ్=దశాంగుల పరిమాణము (అధిక పరిమాణ మనుట.)కలుగునట్లుగా, అత్యతిష్ఠత్ =అతిక్రమించియుండెను. వికారావర్తి-వికార=ప్రపంచవికారములయందు, అవర్తి చ=ఉండకుండఁగాను, అత్యతిష్ఠత్ = అతిక్రమించి (సర్వప్రపంచము నతిక్రమించి)యుండెను. "ఇతి=అని, అత్ర=ఈవిషయమునందు, శ్రుతిసూత్రకృతోః = వేదముయొక్కయు సూత్రకారునియొక్కయు, వచః=వాక్యము, అస్తి=కలదు. (ఇందు "సభూమిం" అనునది శ్రుతి యనియు, "వికారావర్తిచ" అనునది సూత్ర మనియు తెలిసికొనవలయును. "వికారావర్తి చ తథాహి స్థితి మాహ." బ్రహ్మసూత్రార్థచంద్రిక ౪-౪-౧౯).

అవ. "ఈశ్రుతుల కభిప్రాయ మేమి? అవయవ హీనుఁ డగు పరమేశ్వరునకు నవయవములు కలవా?" యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరంశేఽప్యంశ మారోప్య కృత్స్నేఽంశే వేతి పృచ్ఛతః,
తద్భాష యోత్తరం బ్రూతే శ్రుతిః శ్రోతృహితైషిణీ. 58

వ్యా. తర్హి నిరంశత్వే విరోధ ఇత్యస్యః కః పరిహార ఇత్యాశంక్య వాస్తవ నిరంశత్వావగమాన్న విరోధ ఇత్యభిప్రాయేణోదాహృత శ్రుత్యభిప్రాయమాహ.— నిరంశేఽపీతి.

టీ. నిరంశే అపి = పరమేశ్వరుఁడు పరమార్థస్థితిలో నంశములు లేనివాఁడైనను ఆయనయందు, అంశం = అంశమును, ఆరోప్య = కల్పించి, "కృత్స్నే = పరమేశ్వరునియం దంతటను మాయ కలదా? అంశే వా = పరమేశ్వరునియం దొక భాగమున మాత్రమే యామాయ యున్నదా?" ఇతి = అని, పృచ్ఛతః = స్వభ్రాంతి ననుసరించి ప్రశ్నించు శిష్యునకు, శ్రోతృహితైషిణీ-శ్రోతృ = వినువానియొక్క, హిత = లాభమును, ఏషిణీ=కోరునట్టి, శ్రుతిః = వేదము, తద్భాషయా - తత్ =ఆ శిష్యునియొక్క, భాషయా = భాషతో (వాని భ్రాంతి ననుసరించి యనుట), ఉత్తరం = ఉత్తరమును, బ్రూతే=చెప్పుచున్నది. వ్యవహారస్థితిలో నట్లు చెప్పినను పారమార్థికస్థితికి భంగము కలుగదు కదా యనుట).

తా. ఈ శ్రుతిస్మృతి సూత్రములు పరమేశ్వరునకు నవయవములను స్థాపించుచున్నవి యని తలంపవలదు.స్వాయముగనే తమలో ప్రధానభూతము లగు నద్వితీయ శ్రుతులకు విరోధము సంపాదించుచున్నవి యని భ్రాంతి నొందవలదు. భేదశ్రుతులను ప్రధానముగ నైకొన్నను అనువాదరూపములై నిలుచును గాని యభేద శ్రుతు లట్లు నిలువవు కదా! కావున నభేద శ్రుతులే గత్యంతరము లేకపోవుటచేఁ బ్రాధాన్యము నొందవలసియున్నవి. అవయవములు కలిగనేని స్వగతభేదము కలుగు నని యిదివఱకే చెప్పితిమి కదా. కావున నే వాక్యములకుఁగాని యే సూత్రములకుఁగాని భేదమునఁ దాత్పర్య ముండదు.

వి. కావున పై శ్రుత్యాదుల యభిప్రాయమునుగూర్చి కొంత విచారింపవలసి యున్నది. పరమార్థస్థితిలోఁ బరమేశ్వరుఁడు ఏకరూపుఁడే యైనను ఆయనయందు వ్యావహారికముగ సర్వము నుండవచ్చు నని యిదివఱకే వివరించియున్నాము. శిష్యుల యభిప్రాయము నాశ్రయించియే శ్రుతి బోధింప నుపక్రమించు ననియు నిరూపించి యున్నాము, "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అను శ్రుత్యర్థమును విచారించునప్పుడు అందు కాలవ్యవస్థనుగూర్చి చెప్పఁబడుట యెల్లఁ గాలవాసనాయుక్తుఁ డగు శిష్యునిఁ

గూర్చియె యని నిర్ణయించి యున్నాము. ఇట్లే యిచ్చటఁగూడ నవయవసంస్కార యుక్తుఁ డగు శిష్యునిఁగూర్చియే యిట్లు చెప్పుచున్నది యని తెలిసికొనవలయును. పరమేశ్వరుని యథార్థస్థితి యెఱుంగలేక ప్రపంచమునఁ బ్రతిపదార్థమునందును గానవచ్చు నవయవములవంటి యవయవములు పరమేశ్వరునకుఁ గూడ నుండవలయు నని నిశ్చయించి యా నిశ్చయముచే "ఈ మాయ సర్వావయవయుక్తుఁ డై సంపూర్ణుఁ డగు పరమేశ్వరుని యం దంతట నున్నదా? లేక యొక్క యవయవమున మాత్రమే యున్నదా? అని ప్రశ్నించినవానిని గూర్చి "పరమేశ్వరునకు నవయవములే లేవు" అనిన నంతమాత్రమున వాని భ్రాంతి తొలఁగ దని తలంచి, వేదము క్రమక్రమముగ వానిని బరమార్థములోనికిఁ దెచ్చునదియై యారంభంబున వాని ప్రశ్నకు ననుకూలముగఁ బరమేశ్వరునియందు కల్పితావయవముల నంగీకరించి యుత్తరము చెప్పినది. ఇట్లే దాని ననుసరించిన స్మృతులును సూత్రములును గూడ చెప్పుచున్నవి. "పరమేశ్వరుని యం దంతటను మాయ యుండుటకు వీలులేదు" అను విషయమును సాధించు యుక్తియు నిట్టి యభిప్రాయముతోనే ప్రవర్తించినది కావున సర్వమును భ్రాంతికల్పితమే. పరమేశ్వరునియం దేదియు లే దని నిర్ణయించుకొనవలయును. భ్రాంతిచే సర్వమును కల దనియు నిర్ధారణ చేసికొనవలయును. భ్రాంతి లేనప్పుడు సర్వమును పరమేశ్వరుఁడే; ఉన్నప్పుడు ఆయనయందు అనిర్వచనీయ మగు మాయాశక్తి యొక యంశమున నుండి వానియందు ఆకాశాదినామరూపముల నారోపించుచు నా యంశములోఁ గొంత భాగమును స్వాధీనము చేసికొని సంసారము ననుభవింపఁజేయుచున్నది. ఇదియే సిద్ధాంత సంగ్రహము.

అవ. ఇట్లు శక్తి బ్రహ్మముల సద్భావమును వారి కల్పితసంబంధమును నిరూపించి సృష్టిప్రకారమును తెలుపుచున్నాఁడు:—

శ్లో. సత్తత్వ మాశ్రితా శక్తిః కల్పయే త్సతి విక్రియాః,
వర్ణా భిత్తిగతా భిత్తౌ చిత్రం నానావిధం యథా. 59

వ్యా. యదర్థం బ్రహ్మణి మాయా సమర్థితా తదిదానీమాహ—సత్తత్వమితి. విక్రియా వివిధత్వేన క్రియంత ఇతి విక్రియాః కార్యవిశేషా ఇత్యర్థః. తత్ర దృష్టాంత మాహ—వర్ణా ఇతి. వర్ణా రక్తపీతాదయః ధాతువిశేషాః.

టీ. భిత్తిగతాః = గోడయందున్న, వర్ణాః=వర్ణములు, భిత్తౌ = ఆగోడయందు, నానావిధం = నానావిధములైన, చిత్రం=బొమ్మలను, యథా = ఎట్లు, కల్పయేత్ = కల్పించునో, [తథా=అట్లు], సత్తత్వం = సత్పదార్థమును, ఆశ్రితా = ఆశ్రయించిన, శక్తిః=శక్తి (మాయాశక్తి) సతి=ఆ సత్పదార్థమునందు, విక్రియాః = బహువిధములైన కార్యములను, కల్పయేత్ = కల్పించును.

తా. పైన వర్ణించిన విధముగఁ బరమేశ్వరునియందు నిలిచి యున్న మాయ వానియందు బహువికారములఁ గల్పించుచున్నది. గోడపై వర్ణములు మాత్రమే వ్రాయఁబడినను అవి సన్నివేశభేదములచే బహువిధము లగు చిత్రములను కలిగించుచుండుటఁ బ్రత్యక్షముగఁ జూచుచున్నాము కదా! విచారించినచో చిత్తరువులు వర్ణములకంటె భిన్నములు కానట్లును ఆవర్ణములయొక్క పరిణామములే యైనట్లును ఈ ప్రపంచంబును మాయకంటె భిన్నము కాదు. మాయాపరిణామ రూపము కూడ నై యున్నది. మఱియు నెన్ని చిత్రము లున్నను వాని వలన గోడయొక్క స్థితికి నెట్టి మార్పును లేనట్లు ఎన్ని వికారము లున్నను బరమేశ్వరునకు నెట్టి మార్పును లేదు.

అవ. ఇట్లు ప్రపంచ హేతుస్వరూపములను సామాన్యముగ వివరించి ప్రత్యేకముగ విభాగించువాఁడై మొట్టమొదట ఆకాశమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. ఆద్యో వికార ఆకాశః సోఽవకాశస్వరూపవాన్,
ఆకాశోఽస్తీతి సత్తత్వ మాకాశేఽప్యనుగచ్ఛతి. 60
ఏకస్వభావం సత్తత్వ మాకాశో ద్విస్వభావకః,
నావకాశ స్సతి వాయ్వౌ స చైషోఽపి ద్వయం స్థితమ్. 61

వ్యా. తత్ర ప్రథమం కార్యవిశేషం దర్శయతి—అద్య ఇతి. తత్స్వరూపమాహ—సోఽవకాశ ఇతి. ఆకాశస్య బ్రహ్మకార్యత్వే హేతుమాహ—ఆకాశ ఇతి.

తతః కిమిత్యత ఆహ—ఏకేతి. ఉక్తమర్థం విశదయతి. నావకాశ ఇతి. సతి సద్వస్తున్యవకాశో నాస్తి. కింతు సత్స్వభావ ఏక ఏవ. ఆకాశే తు సత్స్వభావశ్చ, ఏషోఽప్యవకాశస్వభావోఽపీతి ద్వయం స్థితం. విద్యత ఇత్యర్థః.

టీ. ఆద్యః = మొట్టమొదటి దైన, వికారః = వికారము, ఆకాశః=ఆకాశమే, సః=అది, అవకాశ స్వరూపవాన్ = అవకాశమే (ఎడమే) స్వరూపముగ కలది.(సర్వ భూతములును సర్వ జంతువులు నెందు నిలిచియున్నవో యదియే యాకాశ మనుట). "ఆకాశః అస్తి" = "ఆకాశము కలదు" ఇతి = అని, ఆకాశేఽపి = ఆకాశము నందును, సత్తత్వం = సత్పదార్థము, అనుగచ్ఛతి=అనుసరించుచున్నది. ("కలదు" అని వ్యవహరింపఁబడునది సత్పదార్థ మగు కలిమియే [భావమే] కదా యనుట). సత్తత్వం= సత్పదార్థము, ఏకస్వభావః=కలిమి యను నొక్కటియే స్వభావముగ కలది. ఆకాశః ద్విస్వభావః=రెండు స్వభావములు (కలిమియు నవకాశంబు ననుట) కలది. సతి=సత్ప

దార్థమున నిదు, అవకాశః = అవకాశము (ఎడము), న = లేదు (సత్పదార్థము దట్ట మైనది యనుట). వ్యోమ్ని=ఆకాశమున నన్నను, స చ=ఆ కలిమియు (ఇది సత్పదార్థ స్వభావము). ఏషః అపి = ఈయవకాశంబును (ఇది యాకాశ స్వభావము). ద్వయం= ఈ రెండును, స్థితమ్ = ఉన్నవి. ("ద్వయం" అను పదము రెండు పదార్థముల యొక్క సమూహమునందు వర్తించుటచే నా సమూహముచే ప్రధానముగఁ గైకొని స్థితశబ్దము ఏకవచనమునఁ బ్రయోగింపఁబడెను.)

తా. అట్లు మాయచేఁ గల్పింపఁబడుచున్న వికారములలో మొట్ట మొదటిది యాకాశము. దానికి ఎడమే స్వరూపము. అది వాయువు మొదలగు తక్కిన భూతములకును భూతకార్యము లగు సర్వజంతువు లకు నునికిపట్టై యున్నది. అది పైన నెచ్చటనో యున్నది, కానవచ్చు చున్నది యని తలంచుట భ్రమ. మన మందఱము నాకాశమునందే యున్నాము. ఎట్లనిన—వాయువు సర్వవ్యాపక మై మనచుట్టు నున్నది యని యందఱు నెఱుంగుదురు. తాళవృంతముల విసరునప్పుడు ఆ వాయువే చలించి మనకు స్పర్శసుఖమును కలిగించుచున్నది యనుట సర్వజనవిదితము. ఒక పదార్థ మున్నచోట మఱియొక పదార్థ ముండు టకు వీలు లే దనుటయు ప్రత్యక్షసిద్ధమే. కావున మన మే స్థలమున నుందుమో, అచ్చట వాయు వుండుటకు వీలు లేదు. అది తొలఁగి మనచుట్టు మాత్రమే యుండవలయును గాని మన మున్నచోటనే యుండుటకు వీలు లేదుకదా! కావున నాగాలి యెచ్చటికి తొలఁగినదో మన మెచ్చట దానిచే నావృతుల మై యున్నామో ఆ యెడమే యాకాశము.

వి. ఈ ఆకాశమునకు రెండు స్వభావములు కలవు. అవకాశము దానికి స్వరూప మని యిప్పుడే వివరించితిమి. రెండవ స్వరూపము సత్పదార్థము. ఇదియు వ్యవహారము వలననే తెలియవచ్చుచున్నది. "ఆకాశము కలదు" అని లోకమున వ్యవహారము కలదు కదా! ఇచ్చట నాకాశశబ్దము నవకాశముచే చెప్పఁబడుచున్నది; కలదు అను పదముచే కలిమి చెప్పఁబడుచున్నది. వాస్తవస్థితిలో నీ కలిమి యాకాశ ధర్మము కాకున్నను భ్రాంతిచే నట్లు భావింపఁబడుచున్నదికదా! కలిమియే సత్పదార్థ మని యిదివఱకే తెలిపి యున్నాము. కావున నది యాకాశ ధర్మము కా దనుటలో వివాద మేమియు లేదు. కావున నీ విధమున విచారించినచో భ్రాంతి నాశ్రయించి చూచిన నాకాశమున నవ కాశంబును కలిమియు నను రెండు ధర్మములు గానవచ్చుచున్నవి. సర్వమునకును

భ్రాంతియే మూలమనియు భ్రాంతి లేకున్న నేదియు లేదనియు పలుమాఱు వివరించి యున్నాము. కావున సత్పదార్థము ఏకస్వభావము. ఆకాశము ద్విస్వభావము.

అవ. ఈ విషయమునే మఱియొక విధముగఁ గూడ సమర్థించుచున్నాఁడు:—

శ్లో. యద్వా ప్రతిధ్వని ర్వ్యోమ్నో గుణో నాసౌ స తీక్ష్యతే,
వ్యోమ్ని ద్వౌ సద్ధ్వనీ తేన స దేకం ద్విగుణం వియత్. 62

వ్యా. సదాకాశయో రేకద్విస్వభావత్వం ప్రకారాంతరేణ వ్యుత్పాదయతి— యద్వేతి. ప్రతిధ్వనిర్వ్యోమ్నోగుణ ఇత్యుపపాదిత మధస్తాత్. అసౌ ప్రతిధ్వనిః సద్వస్తుని నేక్ష్యతే నోపలభ్యతే. వ్యోమ్ని తు సద్ధ్వనీ సచ్ఛబ్దౌ ఉభావప్యుపలభ్యేతే. తేన కారణేన సదేకస్వభావం; వియత్ ద్విగుణం ద్విస్వభావకమిత్యర్థః.

టీ. యద్వా = అట్లుగాక పోయినను, ప్రతిధ్వనిః = ప్రతిధ్వని, వ్యోమ్నః = ఆకాశముయొక్క, గుణః=గుణము, అసౌ=ఇది, సతి=సత్పదార్థమునందు, న ఈక్ష్యతే= కానఁబడదు. వ్యోమ్ని = ఆకాశమునందు, సద్ధ్వనీ=సత్తయును శబ్దంబును అను, ద్వౌ= రెండు గుణంబులు కలవు. తేన=ఆకారణమువలన, సత్ = సత్పదార్థము, ఏకం = ఏక స్వభావము కలది. వియత్ = ఆకాశము, ద్విగుణం = రెండు గుణములు కలది.

తా. మఱియొక విధముగఁ గూడ పై విషయమును సాధింప వచ్చును. సృష్ట్యాదియం దున్న సత్పదార్థము ఏకస్వభావము కలది యనియు మొట్టమొదట సృజింపఁబడిన యాకాశము రెండు గుణములు కలది యనియు నిరూపింప వచ్చును. ఆకాశమునందు ప్రతిధ్వని కల దని యిదివఱకే నిరూపించి యున్నాము. వాయ్వాదిభూతములనుండి యవకాశస్వరూప మగు నాకాశమును విభాగింప లేకున్నను ప్రతిధ్వనికి నాధార మను కారణమును బట్టి విభాగింపవచ్చును. ప్రతిధ్వని యితర భూతములయందు కలుగ నేర దని యిదివఱకే యుక్తియుక్తముగ సవిస్తరముగ నిర్ణయించి యున్నాము. "ఉన్నది" యను వ్యవహార ముచేఁ గలిమి యాకాశమునఁ గల దనుట నిర్వివాదమే కదా! కావున నాకాశమునందు ప్రతిధ్వని యొక్కటియు కలిమి యొక్కటియు రెండు ధర్మములు కలవు. సత్పదార్థమున నీ ప్రతిధ్వని లేకపోవుటచే నొక్క ధర్మమే. కావున నీ విధముగ నేకరూప మై నిర్వికార మై యున్న సత్పదార్థమునందు మాయ ద్విగుణ మగు నాకాశమును కల్పించినది యని తెలిసికొనవలయును.

అవ. "ఇట్లైన సత్పదార్థమే ప్రధాన మగుటచే దానికి నాకాశము ధర్మమై యుండవలయును. లోకమున నట్లు లేదు. కలిమి యాకాశమునకే ధర్మముగఁ గానవచ్చు చున్నది. ఇ ట్లగుటకుఁ గారణ మేమి?" యనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యా శక్తిః కల్పయే ద్వ్యోమ సా సద్వ్యోమ్నో రభిన్నతాం,
ఆపాద్య ధర్మధర్మిత్వం వ్యత్యయే నావకల్పయేత్. 63
సతో వ్యోమత్వ మాపన్నం వ్యోమ్న స్సత్తాం తు లౌకికాః,
తార్కికా శ్చావగచ్ఛంతి మాయాయా ఉచితం హి తత్. 64
య ద్యథా వర్తతే తస్య తథాత్వం భాతి మానతః,
అన్యథాత్వం భ్రమే ణేతి న్యాయో౽యం సార్వలౌకికః. 65

వ్యా. నన్వాకాశస్య సద్బ్రహ్మకార్యత్వే ఆకాశస్య సత్తేతి సత ఆకాశధర్మతా కుతః ప్రతిభాతీత్యాశంక్యాహ—యా శక్తిరితి. యా మాయా సద్వస్తుని ఆకాశం కల్పయతి సా ప్రథమతః సద్వ్యోమ్నో రభేదం కల్పయిత్వా పశ్చాత్తద్ధర్మధర్మిభావం వైపరీత్యేన కల్పయతి. అత ఆకాశస్య సత్తేతి భానముపపద్యత ఇత్యర్థః.

వ్యా. మాయయా వైపరీత్యం కథం కృతమిత్యాశంక్యాహ—సత ఇతి. వస్తుతత్త్వవిచారే క్రియమాణే మృదో ఘటరూపత్వమివ సతో వ్యోమత్వమాపన్నం సద్వస్తునః ఆకాశరూపత్వం ప్రాప్తం లౌకికాః ప్రాణినః. శాస్త్రిషు మధ్యే తార్కికాశ్చ తద్వైపరీత్యేన వ్యోమ్నో గగనస్య ధర్మిణః సత్తాం సద్రూపధర్మజాతిం చావగచ్ఛంతి జానంతి. నను అన్యస్యాన్యథాప్రతీతి రనుపపన్నేత్యాశంక్యాహ—మాయాయా ఇతి. తద్విపరీతదర్శన హేతుత్వం మాయాయా యుక్త మిత్యర్థః.

వ్యా. మాయాయా విపరీతప్రతీతిహేతుత్వం లౌకికన్యాయప్రదర్శనేన స్పష్టీకరోతి—యద్యథేతి. యచ్ఛుక్త్యాది యథా యేన శుక్తికాది రూపేణ వర్తతే తస్య తథాత్వం శుక్త్యాదిరూపత్వం ప్రమాణతః స్ఫురతి. అన్యథాత్వం రజతాదిరూపత్వం తద్భ్రమేణ భ్రాంత్యా ప్రతిభాతీత్యయం న్యాయః సర్వలోకప్రసిద్ధ ఇత్యర్థః.

టీ. యా = ఏ, శక్తిః = మాయాశక్తి, వ్యోమ = ఆకాశమును, కల్పయేత్ = కల్పించుచున్నదో, సా = అదియే, సద్వ్యోమ్నోః = సత్పదార్థమునకు నాకాశమునకు, అభిన్నతామ్ = అభేదమును (విభాగించి తెలిసికొనుటకు వీలులేని స్థితిని), ఆపాద్య = కలిగించి, ధర్మధర్మిత్వం=ధర్మధర్మిభావమును (సత్పదార్థము ప్రధానముగాను, [ఇదియే ధర్మి] ఆకాశము గుణముగాను, [ఇదియే ధర్మము] ఉండుటను, వ్యత్యయేన = విపరీతముగ (ఆకాశము ప్రధానముగాను; సత్పదార్థము గుణముగాను), అవకల్పయేత్ =

కల్పించును. తతః = ఆకారణమువలన, [సతః=సత్పదార్థమునుండి], ఆపన్నం=మృత్తిక నుండి ఘటమువలె పరమార్థ స్థితిలో జనించిన (మాయాసహిత సత్పదార్థమునకు మాయా పరిణామమువలన పరిణామము నంగీకరించి యిట్లు వ్యాఖ్యానమున చెప్పఁబడెను. "రజ్జువునుండి సర్పమువలె" నను నుపమానము మిగుల యుక్తియుక్తముగ నుండును). వ్యోమత్వం తు=ఆకాశత్వము (ఆకాశరూపము) నైతే, లౌకికాః=శాస్త్రముల పొంతఁ బోని సామాన్యులను, తార్కికాః చ = వైశేషికశాస్త్రమును నిర్మించిన తార్కికులును, వ్యోమ్నః=ఆకాశమునకుఁ గల, సత్తాం = సత్తారూపగుణమునుగ (ఉనికి యను గుణము నుగ), అవగచ్ఛంతి = తెలిసికొనుచున్నారు (నిశ్చయించుచున్నా రనుట). తత్=అది (ఈవిపరీతజ్ఞానము), మాయాయాః=మాయకు, ఉచితం హి=తగినదియే కదా! "యత్ =ఏ పదార్థము, యథా=ఎట్లు, వర్తతే = ఉన్నదో, తస్య = దానికి, తథాత్వం = అట్టి స్వరూపము (యథార్థస్వరూప మనుట). మానతః=ప్రమాణమువలన (యథార్థ జ్ఞానము వలన ననుట). భాతి=ప్రకాశించును (తెలియు ననుట). భ్రమేణ=భ్రాంతిచేత, అన్యథాత్వం=విపరీతరూపము (వస్తువు ఒక విధముగా నున్న మఱియొక విధముగా) (భాతి) ఇతి=అని, సార్వలౌకికః = సర్వలోకసిద్ధ మగు, న్యాయః = న్యాయము కలదు కదా ! (మాయ యనఁగా భ్రాంతి యని యభిప్రాయము).

తా. మాయా విజృంభణ సమయమున నిట్టి విపరీత జ్ఞానము కలుగుట యొక వింత కాదు. మొట్టమొదట నిర్వికార మగు సత్పదార్థమునం దాకాశము నెప్పు డీమాయ కల్పించినదో యప్పుడే వానికి (సత్పదార్థమునకు నాకాశమునకు) నభేదమును కల్పించును. ఆకాశమునకంటె వేఱుగా సత్పదార్థము గానరాకుండునట్లు చేయును. భ్రాంతియందు మన కీవిషయము ప్రత్యక్ష సిద్ధమయ్యే యున్నది. మనభ్రమ త్రాటి యందు సర్పమును కల్పించిన పిదప నా త్రాటిని సర్పభిన్నముగాఁ గానరానిచ్చుచున్నదా? మనము సర్పమును చూచునప్పుడు త్రాటిని ప్రత్యేకముగఁ జూడఁగలుగుచున్నామా? ఇచ్చటి యభేదశబ్దార్థ మిదియే. "వాస్తవస్థితిలోఁ బరమేశ్వరునికంటె నాకాశము భిన్నము కాదు కదా! మాయయు నిట్టి కార్యమునే చేసిన నిఁక హాని యేమి కలదు?" అని భ్రాంతి నొందవలదు. "పరమేశ్వరునకు నాకాశమునకు భేదము లేదు" అనిన "పరమేశ్వరుఁడును ఆకాశమునను రెండు పదార్థములు కలవు; వానికి భేదము లేదు" అని యర్థము కాదు. ఎన్ని యుక్తులఁ జెప్పినను ఘటకుడ్యము లభిన్నములు కాఁగలవా ? ఇఁక నేమి

యనిన "మన మాకాశ శబ్దముతో నే పదార్థమును వ్యవహరించు చున్నామో అది బ్రహ్మమే" అని మాత్రమే దానికి నర్థము. ఇట్లైన నాకాశశబ్దవాచ్య మగు నవకాశమునకు ధ్వనియుక్తమునకు నామ రూపాత్మకమునకు నిట్టి స్థితిలోఁ బరమేశ్వరునితో నభేద మెట్లు గలుగును. వాని కివి యెవ్వియు లేవు కదా! కావున నిచ్చటి యభేద శబ్దార్థము "ఆకాశవ్యతిరిక్తముగఁ గాన రాకుండుటమే"యనవలయును.

వి. ఈ విధముగ నభేదమును కలిగించిన పిదప నామాయయే వాని ధర్మధర్మి భావముల విపరీతములఁ గావించును. కారణ మగుటచేతను ఆకాశభ్రాంతికి నాధార మగుటచేతను సత్పదార్థము ప్రధానము; దానినుండి జనించినది యగుటచేతను దాని వివర్తమే (స్వరూపమునకు హాని లేకుండ నొక పదార్థమునందు దోఁచు మఱియొక పదార్థము వివర్త మనఁబడును) యగుటచేతను, ఆకాశము దానికి గుణము. మాయా ప్రభావమువలన సత్పదార్థ మాకాశ మయ్యెను కాని ఆకాశము సత్పదార్థముగ కాలేదు. సృష్ట్యారంభమున మాయాశక్తికి నాశ్రయమై యున్నది సత్పదార్థమే యని యిదివఱకే నిరూపించియున్నాము కదా! ఇట్లైనను ఆకాశమే సత్పదార్థ మైనట్లు మాయ లోపించు చున్నది. సామాన్యలౌకికులే కాక శాస్త్రనిర్మాతలలోఁ గూడఁ దార్కికు లిట్లే విపరీతముగ గ్రహించుచున్నారు. దీనికంతయు నభేదమే కారణము. పరమేశ్వరుని సత్పదార్థమును వేఱుగ విభాగించుటకు వీలు (శక్తి) లేకపోవుటచేతను సత్పదార్థమునందే యభిన్నముగఁ గల్పింపఁబడినది యగుటచే సద్రూపముగ (ఉన్నట్లు) తోఁచుచుండుటచేతను "ఆకాశధర్మమే సత్త" యని గ్రహింపఁబడుచున్నది.

ఇది మాయకు నుచితమే. మనము లోకమున విపరీత జ్ఞానహేతువు లగువానినే మాయ లనుచున్నాము. ఇంద్రజాలికుఁ డొక నిర్జనప్రదేశమున నొక పట్టణమును చూపినచో దానిని మాయ యనుచున్నాము. స్వప్నమున నొక పట్టణము గానవచ్చి యడంగినచో దానిని మాయ యనుచున్నాము. ఇట్లే యీజగత్కారణమును మాయ యనఁబడుచున్నది గావున నిది సేయు కార్యములును విపరీతములు కావచ్చును. స్వప్నేంద్రజాలమాయలు లేనివానిని జూపినట్లే ఇదియు లేని ప్రపంచమును జూపుచున్నది. ఆ మాయ లోకపదార్థమును (ఇంద్రజాలము భూపరాగాదులను స్వప్నము ఆత్మను) మఱియొక పదార్థమునుగ (ఇంద్రజాలము పట్టణమునుగాను స్వప్నము పదార్థాంతరమును గాను) జూపినట్లు, ఇదియు నొకదానిని (సత్పదార్థమునందు కల్పింపఁబడిన యాకాశత్వమును) మఱియొక పదార్థమునుగ (ఆకాశమునందుఁ గల కలిమినిగ)ఁ జూపు

చున్నది. మఱియు దీనినిగూర్చి యింత విచారింప నక్కఱ లేదు. మాయ యనినను భ్రమ యనిన నొక్కటియే. లోకులు యథార్థజ్ఞానమువలన యథార్థ స్థితియు భ్రాంతి వలన విపరీత స్థితియు గ్రహింపఁబడుచుండు నని సాధారణముగానే చెప్పుకొను చున్నారు కదా? కావున "ఆకాశమునకు కలిమి కలదు" అను వ్యవహారము సంభవించు చున్నది యనుటలో విరోధము లేదు. ఇంతమాత్రమునఁ బరమార్థ స్థితికి భంగమును లేదు. పరమార్థస్థితి మున్నే బహువిధముల వివరింపఁబడి యున్నది కదా !

అవ. ఈ విధముగ నాకాశ సృష్టియు దానియందు సత్త్వము నారోపించుటయు భ్రాంతివలన కలుగుచున్నవి యని చెప్పి వానిని తొలఁగించుకొను నుపాయము నుపదే శించుచున్నాఁడు:—

శ్లో. ఏవం శ్రుతివిచారాత్ప్రాగ్యథా యద్వస్తు భాసతే,
విచారేణ విపర్యేతి తత స్తచ్చింత్యతాం వియత్. 66

వ్యా. ఏవం భ్రాంత్యా విపరీతప్రతిభానం దర్శయిత్వా తన్నివృత్త్యుపాయ మాహ—ఏవమితి. ఏవముక్తేన ప్రకారేణ శ్రుతివిచారాత్ప్రాక్ శ్రుత్యర్థవిచారా త్పూర్వం యద్వస్తు యత్స ద్రూపం బ్రహ్మభ్రాంత్యా యథా యేన గగనాదిరూపేణ వర్తతే తచ్ఛ్రుత్యర్థపరాలోచనేన విపర్యేతి గగనాదిభావం పరిత్యజ్య సద్రూపం బ్రహ్మైవ భవతి. తతః శ్రుతివిచారేణ వస్తుయాథాత్మ్యదర్శనసంభవాత్త ద్వియచ్చింత్య తాం విచార్యతామిత్యర్థః.

టీ. ఏవం = ఈవిధముగ చూచిన, శ్రుతివిచారాత్ = వేదవిచారమునకంటె, ప్రాక్=ముందు, యద్వస్తు = ఏపదార్థము, యథా = ఎట్లు, భాసతే = ప్రకాశించునో, తత్=ఆవస్తువు, విచారేణ=విచారమువలన (వేదవిచారమువలన), విపర్యేతి=విపరీత మగు చున్నది (లోకము ననుసరించి చూచిన నొక విధముగఁ గానవచ్చు వస్తువు వేదసిద్ధాం తము నాశ్రయించి విచారించినచో మఱియొక విధముగ నిర్ణయింపఁబడుచున్నది యనుట. లోకమున నాశమునకు సత్త్వము కల దని వ్యవహార మున్నను విచారించి నచో సత్పదార్థమునకే యాకాశత్వము కల దని యేర్పడుచున్నది కదా!) తతః = ఆకారణమువలన, తత్ వియత్ = ఆయాకాశము, చింత్యతాం = విచారింపఁబడుఁగాక (ఇందేది యథార్థమో విచారింపవలయు ననుట.)

తా. స్పష్టము.

అవ. విచారస్వరూపమును విస్తరించుచున్నాఁడు:—

శ్లో. భిన్నే వియత్సతీ శబ్దభేదా ద్బుద్ధే శ్చ భేదతః,

వ్యా. విచారస్వరూపమేవ దర్శయతి—భిన్నే ఇతి. భిన్నే ఇతి ప్రతిజ్ఞాతార్థే హేతుమాహ—శబ్దేతి. వియత్సచ్ఛబ్దయోరపర్యాయత్వాదిత్యర్థః. హేత్వంతరమాహ —బుద్ధేశ్చేతి.

టీ. శబ్దభేదాత్ = వానిని తెలుపుశబ్దములో భిన్నము లగుటవలనను, బుద్ధేః= బుద్ధి, భేదతః చ = భేద ముండుటవలనను, వియత్సతీ = ఆకాశముసు సత్పదార్థమును, భిన్నే=పరస్పరభిన్నము లైనవి (ఆకాశశబ్దంబును సచ్ఛబ్దంబును భిన్నార్థములను చెప్పునవి యగుటచేతను వానియందు భేదబుద్ధి కూడ నుండుటచేతను ఆకాశ సత్పదార్థములు పరస్పరభిన్నములే యనుట).

తా. ఇచ్చట సామాన్యయుక్తులు కూడ విమర్శదృష్టితో నాలోచించిన శ్రుత్యర్థమునకే యనుకూలముగ నున్నవి కాని లోకవ్యవహారమునకు ననుకూలములుగ లేవు. లోకవ్యవహారము నాశ్రయించి చూచిన "రజ్జు సర్పభ్రాంతియందు సర్పమునకంటె భిన్నముగ రజ్జువు చూడఁబడనట్లు ఆకాశమునకంటె భిన్నముగ సత్పదార్థము చూడఁబడుట లేదు" అని చెప్పియున్నాము. ఈ యభేదము పరమార్థమునకు విరుద్ధ మనియు నిర్ణయించి యున్నాము. సామాన్యయుక్తులచేత విచారించినను నీ యభేదము గానవచ్చుట లేదు. ఆకాశ సత్పదార్థములకు భేదమే తేలుచున్నది ఎట్లనిన:—"ఆకాశము కలదు" అను స్థలమున నాకాశపదమునకు "కలదు" అను పదమునకును అర్థము సమానము కాదు. ఆకాశపదము అవకాశాత్మకమై శబ్దగుణయుక్తమై యున్న యొకానొక పదార్థమును చెప్పును. "కలదు" అను పదము కలిమిని మాత్రమే చెప్పును. ఇట్లుండ నీ రెండు పదార్థములు నొక్కటి యగుట యెట్లు? పదములు హరివిష్ణ్వాదిపదములవలె పర్యాయపదము లైనప్పుడే కదా వానిచేఁ జెప్పఁబడు పదార్థము లొక్కటి కావలయును. ఇవి పర్యాయపదములు కా వనుట నిస్సంశయము. మఱియు వీనివిషయమై భేదబుద్ధియుఁ గలదు. కావున నాకాశ సత్పదార్థములు పరస్పరభిన్నములే.

అవ. ఆకాశ సత్పదార్థములవిషయమై కల భేదబుద్ధిని చూపుచున్నాఁడు:—

వాయ్వాది ష్వనువృత్తం స న్న తు వ్యోమే తి భేదధీః. 67

వ్యా. తమేవ హేతుం విశదయతి.—వాయ్వాదిష్వితి. యద్వాయ్వాదిషు భూతేషు సన్వాయుః సత్తేజ ఇత్యేవం ప్రకారేణానువృత్తం భాసతే. వ్యోమ తు నైవం భాసత ఇతి యత్ జ్ఞానం సా భేదధీః భేదబుద్ధిరిత్యర్థః.

టీ. "సత్=సత్పదార్థము, వాయ్వాదిషు=వాయువు మొదలగు తక్కిన భూతములయందును, అనువృత్తం=అనుసరించినది ("వాయువు కలదు. అగ్ని కలదు" అను మొదలగు వ్యవహారములు కలవు కదా యనుట). వ్యోమ తు=ఆకాశ మైతే, న [అనువృత్తం]=అనుసరింప లేదు" ఇతి=అని, భేదధీః=ఆకాశ సత్పదార్థ విషయమై, భేదబుద్ధి (ఆకాశము వేఱు, సత్పదార్థము వేఱు అను బుద్ధి) కలదు.

తా. ఈ విషయమున రెండవ హేతువుగ నిర్ణయింపఁబడిన భేదబుద్ధిని విమర్శించెదను వినుము. లోకమున "ఆకాశము కలదు" అను వ్యవహారమువలెనే "వాయువు కలదు, అగ్ని కలదు, జలము కలదు, భూమి కలదు" అని సర్వభూతములయందును సత్యవ్యవహారములు కలవు. ఆకాశవ్యవహారము మాత్ర మొక్క యాకాశ భూతమునందే కలదు. ఈ విషయము సర్వ ప్రసిద్ధము కదా! దీనినిబట్టి చూచిన సత్పదార్థ మన్నిభూతములయందును ననువర్తించియున్నది యనియు నాకాశ మట్లు గాక యొక్కటనే (ఆకాశమునందే) యున్న దనియు తేలుచున్నది కదా! ఇట్లుండ నీ రెండింటియందు నైక్యబుద్ధి కలుగుట యెట్లు? రెండు నొక్కటియే యైన నాకాశముకూడ సత్పదార్థమువలె సర్వభూతములతోఁ జేరి వ్యవహరింపఁబడవలదా! కావున లోకులకు వీని విషయమున "సత్త్వము సర్వవ్యాపకము; ఆకాశత్వ మట్టిది కాదు" అను భేదబుద్ధి కలుగుట లేదు. కావున నెట్లును ఆకాశ సత్పదార్థములు అభిన్నములు (అభేదస్వరూపము 63, 64, 65 శ్లో.) కానేరవు. కావున యుక్తులును వేదసిద్ధాంతమునే యనువాదము చేయుచున్నవి.

అవ. "ఇంతమాత్రమున వేదార్థ మెట్లు సిద్ధించెను? అందు సత్పదార్థమే ప్రధాన మని యున్నది కదా! ఆకాశ సత్పదార్థములకు భేద మున్నను ఆకాశమునకు సత్పదార్థము గుణ మగుటలో విరోధ మేమి?" యనిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. సద్వస్త్వధికవృత్తిత్వా ద్ధర్మి వ్యోమ్న స్తు ధర్మ తా,

వ్యా. ఏవం సదాకాశయోర్భేదం ప్రసాధ్య వ్యోమ్నః సత్తేతి భ్రాన్త్యా ప్రతీతస్య ధర్మిధర్మభావస్య విచారేణ వ్యత్యయం దర్శయతి—సద్వస్త్వితి.

టీ. అధికవృత్తిత్వాత్ - అధిక = అనేక పదార్థములయందు, వృత్తిత్వాత్ = ఉండుటవలన, సద్వస్తు=సత్పదార్థము, ధర్మి = ప్రధానము. వ్యోమ్నః తు=ఆకాశమున కైతే, ధర్మతా=ఒక్క స్థలమునందు మాత్రమే యుండుటవలన గుణత్వము మాత్రమే కలదు. (ఈ ఆకాశ మను పదార్థము గుణముగ నుండవలసినదియే యనుట).

తా. సత్వ మాకాశమునకు ధర్మ మని తలంచుట భ్రాంతి యని సకారణముగ నిరూపించి యున్నాము. లోకదృష్టి యంతయు నిట్టిదియే యనియు ననుభవపూర్వకముగ దీని యథార్థస్థితిని (ఆకాశము ధర్మ మను స్థితిని) సాధించుటకు వీలు లే దనియుఁ దలంపవలదు. అది సామాన్యవ్యవహారము నాశ్రయించి చెప్పఁబడినదియే కాని మఱే యొక్కటి కాదు. విచారించిన నీ విషయము సుఖముగానే నిర్ణయింప వచ్చును. ఎట్లనిన:—

వి. లోకమున నొక న్యాయము కలదు. అనేక పదార్థములయం దేది యను వర్తించి యుండునో యది ప్రధాన మనియు, నేది యొక స్థలమున మాత్రమే యుండునో యది గుణ మనియుఁ జెప్పఁబడుచున్నది. భూమ్యాది పదార్థములు రూప రసాది బహుగుణములయం దనువర్తింపుచున్నవి. వానికి రూపంబును రసమును గంధ మును స్పర్శమును అను మొదలగు ననేక గుణములు కలవు కదా! ఆ రూపాదులు మాత్రము అట్లనువర్తించుట లేదు. ఒకవేళ వానిలో (ఆ రూపాదులలోఁ గొన్ని యొకటి రెండు భూతములవఱకు ననువర్తించినను అన్నియు నట్లనువర్తించుట లేదు. అనువర్తించినవి యైనను భూమ్యాదులవలె నంత యధికముగ ననువర్తించుట లేదు. ఇట్టి సందర్భమును విమర్శించి లోకులు బహుస్థలములయం దనువర్తించినవానిని ప్రధా నము లనియు నల్పస్థలములయందు మాత్రమే యుండు వానిని గుణము లనియుఁ జెప్పుచున్నారు. రూపాదులు భూమ్యాదులకు గుణము లనుట సుప్రసిద్ధము కదా! కావున నీన్యాయము ననుసరించి చూచిన బహుభూతములయం దనువర్తించి యుండు నది యగుటచే సత్పదార్థము ప్రధానము ధర్మి. అట్లుండనిది యగుటచే నాకాశము ధర్మము. కావున లౌకికయుక్తులనైనను కొంచెము బాగుగ విచారించినచో వేదాభిప్రా యమే సిద్ధాంత మగును.

అవ. సరియే ధర్మమైనను ఈయాకాశము నిత్యము కావచ్చును. భూమ్యాదులకు గుణమే యైనను రూపము వాస్తవమే యగుచున్నది కదా! కావున నిప్పటికి లోకాను భవమువలన నద్వైతము సిద్ధింపలేదు అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ధియా సతః పృథక్కారే బ్రూహి వ్యోమ కిమాత్మకమ్. 68

వ్యా. రూపరసాదిష్వనువృత్తస్య ద్రవ్యస్యేవ ఆకాశవాయ్వాదిష్వనువృత్తస్య సతో ధర్మిత్వం రసాదిభ్యో వ్యావృత్తస్య రూపస్యేవ వాయ్వాదిభ్యో వ్యావృత్తస్య నభసో ధర్మత్వమిత్యర్థః. నను తర్హి ఘటాద్భిన్నరూపస్య యథా వాస్తవత్వం తథా సతో భిన్నస్య నభసోఽపి స్యాదిత్యాశంక్య, సద్వ్యతిరిక్తస్య నభసో దుర్నిరూపత్వాన్నైవమిత్యాహ—ధియేతి.

టీ. ధియా=బుద్ధితో, సతః=సత్పదార్థమును (కర్మార్థమందు షష్ఠి) పృథక్కృతే= వేఱుచేసినయెడల, వ్యోమ=ఆకాశము, కిమాత్మకమ్=ఏమి స్వరూపము గలదో, బ్రూహి= చెప్పుము.

తా. అద్వైత శ్రుత్యర్థము సిద్ధింపలేదన వలదు. కొంచెము విచారించిన సర్వమును స్పష్ట మగును. రూపము భూమ్యాదులకు ధర్మమే యైనను దానికి ప్రత్యేకరూపము కలదు. నేత్రేంద్రియము చేత మాత్రమే గ్రహింపఁదగియుండుట యను ప్రత్యేక స్వభావమును కలదు. ఇట్లగుటచే దానిని ప్రత్యేకముగ నిరూపింపవచ్చును. ఇచ్చట మాత్ర మట్లు లేదు. ఆకాశమును ప్రత్యేకముగ నిరూపించుటకు వీలు లేదు. బుద్ధి బలముచే నా సత్పదార్థమును విభాగించిన కేవలాకాశ మునకు స్వరూప మేది యగును? చెప్పుము.

అవ. ఈ ప్రశ్నమునకు నొక విధముగ సమాధానమును కల్పించి తత్ఖండన పూర్వకముగ స్వసిద్ధాంతమును స్థాపించుచున్నాఁడు:—

శ్లో. అవకాశాత్మకం తచ్చే దసత్తదితి చింత్యతాం,
భిన్నం సతోఽసచ్చ నేతి వక్షి చే ద్వ్యాహతి స్తవ. 69

వ్యా. దుర్నిరూపత్వమసిద్ధమితి శంకతే—అవకాశాత్మకమితి. తర్హి సతో విలక్షణత్వా దసదేవ స్యాదితి పరిహరతి—అసదితి. సతో విలక్షణస్యాసత్త్వం నాస్తీతి వదతో దోషమాహ—భిన్నమితి.

టీ. తత్=ఆ యాకాశము, అవకాశాత్మకం=అవకాశస్వరూప మైనది, (ఇతి) చేత్=అనియెదవేని, తత్=అది, అసత్=అసద్రూప మైనది, ఇతి = అని, చింత్యతాం= నిశ్చయింపఁబడుఁగాక, "సతః=సత్పదార్థమునకంటె, భిన్నం=వేఱైనది. అసత్ చ న = అసత్పదార్థమును కాదు," ఇతి=అని, వక్షి చేత్ = చెప్పుదువేని, తవ=నీకు, వ్యాహతిః= వాక్యభంగము వచ్చును.

తా. "సత్పదార్థమును వేఱు చేసినను ఆకాశమునకు ప్రత్యేక స్వరూపము కలదు. దానికి నవకాశము స్వరూపము గదా!" అని యెదవేమొ. అది సరియే. అంతమాత్రమువలన నాకాశమునకు ప్రత్యేక స్థితి సంభవింపదు. సత్పదార్థమునకు వ్యతిరిక్తమైనది యంతయు నసత్పదార్థమే కావలయు ననుట నిస్సంశయము కదా! "సత్పదార్థమునకంటె భిన్నమైనను అసత్పదార్థము కాదు" అనుట చెల్లదు. లోకమునఁ బ్రతివిషయమును రెండుగా విభాగింపవచ్చును. "మంచి చెడ్డ; సుఖము దుఃఖము; మేలు కీడు." ఇత్యాదులు నియతవిభాగములై యున్నవి. ఇందు వస్తు స్వరూపాదులలో భేదము లెన్ని యున్నను వానితో నవసరము లేకయే ప్రతి పదార్థమును నొక విధము కా దని నిరూపింపఁబడినచో నియమితముగ మఱియొక విధము కలది యగుచుండును. పదార్థములు పరస్పర మెట్టి భేదములు కలవి యైనను మంచివి కా వని నిరూపింపఁబడినచో నియతముగ చెడ్డవియే యగును. సుఖకరములు కా వని నిరూపింపఁబడినచో నియతముగ దుఃఖకరములే యగును. శీతములు కా వని నిరూపింపఁబడినచో నుష్ణములే యగును. మేలు కా దని నిరూపింపఁబడినచోఁ గీడే యగును. సదసద్విభాగము కూడ నిట్టిదియే. సర్వప్రపంచమును కలిమి లేము లని ద్వివిధముగ విభాగింపవచ్చును. కావున నే పదార్థము "ఇది సద్రూపము కాదు (కలది కాదు)" అని నిరూపింపఁబడునో అది నియతముగ లేనిదే కావలయును. కావున "సత్పదార్థమునకంటె భిన్న మయ్యు నసత్పదార్థము కాదు" అనుట యెట్లును యుక్తియుక్తము కాదు. అప్పుడు చెప్పిన వాక్యమునకే భంగము వచ్చును. కావున నాకాశమునకు నవకాశస్వరూపమున్నను అసద్రూపమే. నామరూపములు భ్రాంతిచేత మాత్రమే సత్పదార్థమునందు కల్పింపఁబడినవి యనియు నామరూపభిన్న మగు పదార్థమే లేదనియు నీవఱకుఁగూడ నిరూపించియే యున్నాము కదా! ఈవిధముగ నాకాశ మసద్రూపమే యని తేలుటచే నది యూరక యున్నట్లు మాత్రమే కానవచ్చుచున్నది కాని వాస్తవ స్థితిలో లే దని మాత్రమే చెప్పవలసియున్నది. అప్పుడు సద్రూప మొక్కటియే శేషించును. కావున నద్వైతశ్రుత్యర్థ మనుభవముచేతఁ గూడ తేలినది యని నిశ్చయ మగుచున్నది.

అవ. ఇట్లు కేవలాద్వైతమును యుక్తులతోఁ గూడ సాధించి ప్రత్యక్షమునకు గతిని కల్పించుచున్నాఁడు:—

శ్లో. భాతీతి చే ద్భాతు నామ భూషణం మాయికస్య తత్,
యదస ద్భాసమానం త న్మిథ్యా స్వప్నగజాదివత్. 70

వ్యా. అసత్వే భానం న స్యాదిత్యాశంక్య తుచ్ఛవిలక్షణత్వాద్భానం న విరుధ్యత ఇత్యాహ—భాతీతి చేదితి అవిరోధం దర్శయితుం మిథ్యావస్తునో లక్షణం సదృష్టాంతమాహ—యదసదితి.యద్వస్తు స్వరూపేణావిద్యమానమపి భాసతే, తత్స్వప్నగజాదివన్మిథ్యేత్యర్థః.

టీ. ''భాతి = ఈ ఆకాశ మున్నట్టు ప్రకాశించుచున్నది'', ఇది చేత్ = అని యొదవేని, భాతు నామ=ప్రకాశింపనిమ్ము. తత్ =ఆప్రకాశము, మాయికస్య = మాయావాదికి, భూషణం = అనుకూలమే, (అట్లు ప్రకాశించుటవలన వాదమునకు భంగము రా దనుట). యత్ = ఏది, అసత్ = లేని దయ్యును, భాసమానం = ప్రకాశించుచున్నదో, తత్ = అది, స్వప్నగజాదివత్ = కలలోని యేనుఁగు మొదలగువానివలె, మిథ్యా = త్రికాలములయందు లేనిదియే-లేక అనిర్వచనీయ మైనదియే, (అనిర్వచనీయ మనఁగా కల దని కాని, లే దని కాని నిరూపించుటకు వీలు లే నిది. లే దని నిరూపించుటకు వీలులేకపోవుట కేవల ప్రకాశమువలననే యని యెఱుంగునది.) యగును.

తా. ''ఇట్లు చెప్పినను అద్వైత శ్రుత్యర్థము తేలుట లేదు. మీరు పైఁ జూపినది సామాన్యయుక్తి కాని నియతము కాదు. కీడు కా వని నిరూపింపఁబడిన పదార్థములు కొన్ని మేలు కీడులను రెండింటిని కూడ కలిగింపక యూరకుండవచ్చును. ఇది ప్రత్యక్షాదు లగు నితర ప్రమాణములవలన నిర్ణయింపఁబడుచున్నది. కావున నితర ప్రమాణము లెవ్వియు విరుద్ధములు కా నప్పుడు మాత్రమే పై న్యాయ మన్వయింపవలయును కాని సర్వకాలములయందును గాదు. కావున సత్పదార్థము కాకపోయినంత మాత్రముననే యాకాశ మసత్పదార్థ మగు ననుటకు వీలు లేదు. అసత్పదార్థ మైనఁ గాన రాకపోవలయును గదా. ఆకాశము ప్రత్యక్షముగ నవకాశరూపమునఁ గానవచ్చుచునే యున్నది. కావున నిది సత్పదార్థము కాకపోయినను కలదియే యని చెప్పుటలో విరోధ ముండదు'' అనియొదవేమో వినుము.

వి. విచారించి చూచిన నీ సంశయము కలుగవలసినపనియే లేదు. వాస్తవస్థితిలో శూన్యరూపము లయ్యుఁ గానవచ్చు పదార్థము లనేకములు కలవు. ప్రత్యక్ష మంతయు యథార్థమే కావలయు ననియు నియమము లేదు. కలయందు పురుషుఁడు గజాశ్వాదులఁ జూచుచున్నాఁ డనుట ప్రత్యక్షసిద్ధము. అందఱిచేత ననుభూతము. కలయం దవి యెచ్చటనుండి వచ్చినవి చెప్పుము. అప్పుడు స్థూలశరీరముతో సంబంధమే లేదు; దానిని నఱుకుచున్నను తెలియరాదు కదా! స్థూలశరీరసంబంధ మున్నప్పుడు జాగ్రదవస్థయందు కానఁబడు పదార్థములనే సత్యములనుగాఁ దలంచుచున్నా రనుట నిర్వివాదాంశము. మఱియు కలయందు మన స్సొక్కటి తప్ప మఱి యేదియు లే దనుట సర్వసాధారణము కదా! కావున కలయందు గజాదులు లే వనియే చెప్పి తీరవలయును. ఇంతవఱకు వివాదము లేదు కదా! ఇప్పుడు ప్రత్యక్షప్రమాణము నుపయోగించి చూడుఁడు. "లేనివి కానరావు కావున స్వప్నమునందలి గజాదులును యథార్థములు కావలయును." అనుటకు వీలు కలదా. ఇట్లే యీ యుక్తివలన నాకాశమునకు సత్యత్వము కల దని సాధించుటకును వీలు లేదు. ఏ యే పదార్థము లేనిదయ్యు ప్రకాశించుచుండునో అది మిథ్య. (త్రికాలములయందు లేకయే యున్నట్లు తోఁచునది.) కావున నాకాశము మిథ్య; అది త్రికాలములయందును లేదు. ఇది ప్రకాశించిన ప్రకాశింపనిమ్ము. మేము దానిని వలదనుట లేదు. "అజ్ఞానప్రభావమువలన నట్లు లేని దయ్యుఁ బ్రకాశించుచున్నది" యని మాత్రమే చెప్పుచున్నాము. కావున నీ యుద్భావించిన దూషణము మాపక్షమునకు భూషణమే యగుచున్నవి. ఇదియు మాయాప్రభావమునే వర్ణించునుగదా! కావున పైన వర్ణించిన విధముగ యుక్తులచే నద్వైత శ్రుత్యర్థము సిద్ధించె ననుటలో వివాదము లేదు.

అవ. "ఇది మిగుల నద్భుతముగా నున్నది. ఎప్పుడును విడువకుండునవి పరస్పర భిన్నములుగ గ్రహింపఁబడుట లేదు" అనిన దృష్టాంతపూర్వకముగ సమాధానమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. జాతివ్యక్తీ దేహిదేహౌ గుణద్రవ్యే యథా పృథక్,
వియత్సత్తే తథైవాస్తు పార్థక్యం కోఽత్ర విస్మయః. 71

వ్యా. నను నియమేన సహోపలభ్యమానయోర్భేదో న దృష్టచర ఇత్యాశంక్యాహ—జాతీతి.

టీ. జాతివ్యక్తీ=జాతులును వ్యక్తులును (జాతి యనఁగా నాకారము. వ్యక్తి యనఁగా నాయాకారము గల పదార్థము. గోవుయొక్క యాకారమునకు గోజాతి యని పేరు.

ప్రత్యేక గోవులకు గో వ్యక్తు లని పేరు.) దేహి దేహౌ=దేహియు దేహమును, గుణ ద్రవ్యే = రూపాది గుణములును పృథివ్యాది ద్రవ్యములును, యథా=ఎట్లు, పృథక్ = భిన్నములో (ఎప్పుడును పరస్పరము విడువకుండునవి యయ్యు భిన్నములై యున్నవో, వియత్సతోః = ఆకాశ సత్వతార్థములకు, పార్థక్యం = భేదము, తథైవ=అట్లే, అస్తు = కలుగునుగాక. అత్ర=ఈ విషయమున, విస్మయః=ఆశ్చర్యము, కః=ఏమి ?

తా. నియమముగ పరస్పరము విడువక యుండునవి యనునంత మాత్రమున భేదము కలుగఁగూడ దని నిర్ణయించుటకు వీలు లేదు. లోకమున ననేక స్థలములయం దిట్టి వానిలో భేదము గానవచ్చుచున్నది. జాతి వ్యక్తిని విడిచి కాని, వ్యక్తి జాతిని విడిచి కాని యుండుట లేదు. జాతి యనఁగా నియత మగు నొకానొక యాకారము; వ్యక్తి యనఁగా నది కల పదార్థము. గో జాతిని విడిచి యొక్క గోవైన ప్రత్యేకముగ నుండునా? గోవును విడిచి జాతి యుండునా? గో జాతి యనఁగా గో స్వరూపమే. కావున నది లేనిది గోవే కానేరదు కదా ! ఇట్లు విడువని సంబంధముకలవి యైనను, జాతివ్యక్తులు పరస్పరభిన్నములై యున్నవి. ఇచ్చటను జాతి వ్యక్తి పదములు పర్యాయములు కాకపోవుటయు, జాతి సర్వగోవులయందు నుండునది యనియు, వ్యక్తి యొక పిండమునందు మాత్రమే యుండు ననియు, భేదముతో భావించుటయు, పరస్పర భేదము కలదనుటకు (జాతికంటె వ్యక్తి భిన్న మనుటకు)ఁ గారణములు. ఇట్లే దేహధారియు దేహమును నెప్పటికిని పరస్పరముఁ బరిత్యజింపవు. జీవుఁడు స్థూల దేహమును విడిచినను సూక్ష్మ దేహమును విడువఁడు. స్థూల దేహము నైనను అప్పటికి విడుచుటయే కాని తత్క్షణమే మఱి యొకదాని నంగీకరించుచునే యుండును. మఱియు గుణ మెప్పటికిని ద్రవ్యమును పరిత్యజింపదు. పరిత్యజించిన దానికి ప్రత్యేకముగ నిలు కడయే లేదు కదా! ద్రవ్యమును గుణమును విడువదు. దానికి నప్పుడు ద్రవ్యత్వమే లేదుకదా !

వి. ఇట్లు ఎప్పటికిని పరస్పరము విడువని వైనను, ఇవియు పై న్యాయముచే (పదములు పర్యాయములు కాకపోవుట భేద బుద్ధి యను కారణములనుబట్టి చేసిన యూహచే) పరస్పరభిన్నము లనియే సాధింపఁదగియున్నవి. "వీనికిఁ గల సంబంధము సమవాయ సంబంధము.ఆసంబంధమువలన నివి భిన్నము లయ్యుఁ గాక యా పూర్వస్థితితోనుండును" అని

యొద వేమో. అది సరిపడదు. సమవాయ మైనను పిదప నేది యైనను నదియు సంబంధమే కదా! సంబంధము పదార్థద్వయము లేకున్న సంభవింపదు. కావున నే సంబంధముచే సంబద్ధము లైనను పదార్థములలో భేదముమాత్రము పోదు. మఱియు "భేద ముండియు లేకున్నది" యనిన మా వాదమునే యంగీకరించి న ట్లగును. ఆకాశ మసత్పదార్థ మగుటచే సత్పదార్థా కాశములకు వ్యవహారకాలమున భేదంబును పారమార్థిక దశయం దభేదంబును కల దనియే కదా మేము చెప్పుచున్నాము. (సమవాయ సంబంధమునుగూర్చి బ్రహ్మసూత్రార్థచంద్రిక ఆరంభణాధికరణము. అ. ౨. ప. ౧. సూ. ౧౪. చూచునది) కావున నీజాతి వ్యక్త్యాదులు నిర్వివాదముగ భిన్నములె. సత్పదార్థాకాశములు కూడ నిట్టివే కావచ్చును. నియతముగఁ బరస్పరము విడువకుండునంతమాత్రమున రెండు పదార్థములు నభిన్నములు కా నక్కఱ లే దనుట సిద్ధించెనుకదా! కావున నీ సిద్ధాంతమున నాశ్చర్య మేమి? ఇ ట్లగుటచే ననుభవము కూడ నద్వైతశ్రుత్యర్థము ననువాదము చేయుచున్నది.

అవ. "ఇది యంతయు యథార్థముగనే తోఁచుచున్నను, మనస్సునందు స్థిర మగుటలేదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధోఽపి భేదో నో చిత్తే నిరూఢిం యాతి చే త్తదా,
అనైకాగ్ర్యా త్సంశయా ద్వా రూఢ్యభావోఽస్య తే వద. 72
అప్రమత్తో భవ ధ్యానా దా ద్యేఽన్యస్మి న్వివేచనం,
కురు ప్రమాణయుక్తిభ్యాం తతో రూఢతమో భవేత్. 73

వ్యా. భేదో యద్యపి బుధ్యతే, తథాపి నిశ్చితో న భవతీతి శంకతే—బుద్ధోఽపీతి. తస్య పరిహారం వక్తుం నిశ్చయాభావే కారణం పృచ్ఛతి—అనైకాగ్ర్యాదితి.

వ్యా. ఆద్యే పరిహారమాహ—అప్రమత్త ఇతి. ఆద్యే ప్రథమే వికల్పే ధ్యానా త్తత్రప్రత్యయైకతానతా ధ్యాన మిత్యుక్తలక్షణాదప్రమత్తోభవ సావధానమనా భవే దితియావత్. ద్వితీయే పరిహారమాహ—అన్యస్మిన్నితి. తతః కిమిత్యత ఆహ—తత ఇతి.

టీ. భేదః = ఈయాకాశ సత్పదార్థముల భేదము, బుద్ధః అపి = తెలిసికొనఁబడినను, చిత్తే = మనస్సునందు, నిరూఢిం = దార్ఢ్యమును, న యాతి చేత్=పొందుట లే దనియెదవేని, తదా=అప్పుడు, వద = చెప్పుము. తే = నీకు, అస్య = ఈ విషయము యొక్క, రూఢ్యభావః = దార్ఢ్యాభావము (ఈ భేదము మనస్సున స్థిరపడకుండుట. అనైకాగ్ర్యాత్ = చిత్త మేకాగ్రము కాకపోవుటవలననా? సంశయాత్ వా = సందేహము తీరకపోవుట వలననా?) ఆద్యే = చిత్త మేకాగ్రము కాకపోవుటవలననే యిట్టి దార్ఢ్యము కలుగకుండునేని, ధ్యానాత్=ధ్యానమువలన (ఈ విషయమునే పలు

మాఱు ఏకాంతమున స్మరించుటవలన, అప్రమత్తః = ఏకాగ్రచిత్తుఁడవు, భవ = కమ్ము, (ఈ నిశ్చితార్థమునే పలుమాఱు స్మరించిన నం దేకాగ్రత కలుగు ననుట). అన్యస్మిన్ = రెండవది యయ్యోనేని (సంశయము వీడకుండెనేని,) ప్రమాణయుక్తిభ్యాం=వేదవాక్యముచేతను స్వానుభవముచేతను, వివేచనమ్ = విచారమును, కురు = చేయుము. తతః = తర్వాత, రూఢతమః = ఈ భేదము మిగుల దృఢమైనది. భవేత్ = కాఁగలదు.

తా. "ఇట్లు చెప్పినను, ఇది మనస్సున నిలుచుట లేదు. కావున నిది చక్కని సిద్ధాంతము కాకుండునేమో యని సంశయము కలుగుచున్నది" అనియెదవేమో. అది యుక్తము కాదు. ఈ విషయము నిర్వివాద మని స్వానుభవముచేతనే నిరూపించితిమి. అనుభవము చక్కనిది కాకపోయినచో సిద్ధాంతము నట్టిదే కావలయును గాని అనుభవము సరియైనచో సిద్ధాంతము సరికాక పోదు. స్వానుభవము నెవ్వఁడును కా దనలేఁడు కదా. "ఇట్లైన మనస్సున నిలువకుండు టేల?" యనియెదవేమోవినుము. దానికిఁ గొంత కారణము కలదు. అనాదినుండియు నాకాశబ్రహ్మములకు నభేదమును (ఈ యభేదమునకు స్వరూపము 63-64-65 శ్లోకములలో నీ ప్రకరణమునందే నిరూపింపఁబడెను.) చూపుచుండినను భ్రాంతి మనస్సున నెలకొనియున్నది. దానివలన నది (మనస్సు) వ్యవహార విషయముల గ్రహించినంత సుకరముగఁ బారమార్థిక విషయముల గ్రహింపనేరదు. కావున మనస్సు దీనియం దేకాగ్రతను జెందనేరదు. మఱియు భ్రాంతి యధికమై యుండుటవలననే సంశయములును తీరిన ట్లుండవు. ఈ కారణములవలనమాత్రమే యీ సిద్ధాంతము దృఢము కాకున్నది. కావున తత్త్వము నెఱుంగఁగోరుదువేని వీనిలో నేది నీకు బలవంతమై సిద్ధాంతదార్ఢ్యమును కలిగింపకున్నదో విచారించి దానిని నివర్తింపఁజేయుము. మనస్సునకు నేకాగ్రత కుదురకున్నఁ బలుమాఱు సిద్ధాంతార్థము ధ్యానించుచు నిది ధ్యాసనము నాచరింపుము; సంశయములే మఱల మఱల నుద్భవించుచు నశింపకుండిన శాస్త్రయుక్తులచేఁ బలుమాఱు విచారింపుచు మననము నాచరింపుము. పలుమాఱు శ్రవణమునుగూడ గావింపుము. (శ్రవణమనన నిదిధ్యాసనముల స్వరూపము తత్త్వవివేకము 53-54-శ్లో) అంత సిద్ధాంతదార్ఢ్యము కలుగును.

అవ. ఇట్లు సర్వమును వివరించి యుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. ధ్యానా న్మానా ద్యుక్తి తోఽపి రూఢే భేదే వియత్సతోః,
న కదాచి ద్వియ త్సత్యం సద్వస్తు చ్ఛిద్రవ న్న చ. 74

వ్యా. తతోఽపికిమిత్యత ఆహ—ధ్యానాదితి. ధ్యానం పూర్వోక్తలక్షణం. మానం 'భిన్నే వియత్సతీ శబ్దభేదాద్బుద్ధేశ్చ భేదత' ఇత్యత్రోక్తం. యుక్తిస్తు సద్వ స్త్వధిక దేశవృత్తిత్వా దిత్యాదావుక్తా. ఏతై ర్ధ్యానాదిభిర్వియత్సతోర్భేదే చిత్తే నిరూఢిం యాతే సతి వియత్కదాచిన్న సత్యం. కింతు సర్వదా మిథ్యైవావభాసతే, సద్వస్త్వపి ఛిద్రవదవకాశవన్న చ నైవ. భవతీతి శేషః.

టీ. ధ్యానాత్=ధ్యానమువలనను (ఇదియే నిదిధ్యాసనము) మానాత్=ప్రమాణమువలనను (వేదసిద్ధాంతమును గ్రహించుటవలన ననుట. ఇదియే శ్రవణము), యుక్తితః అపి = యుక్తివలనను (యుక్తిచే నిర్ధారణ చేయుటవలన ననుట. ఇదియే మననము) వియత్సతోః = ఆకాశ సత్పదార్థములకు, భేదే = భేదము, రూఢే [సతి] = నిరూఢము కాఁగానే, వియత్ = ఆకాశము, కదాచిత్ = ఎప్పటికిని, సత్యం = సత్యమైనది, న= కానేరదు. సద్వస్తు = సత్పదార్థము ఛిద్రవత్ చ = రంధ్రము కలది (రెండవ పదార్థ ముండుటచేఁ బరిచ్ఛిన్న మైనది. [పరిచ్ఛిన్న మనగా సర్వవ్యాపకము కానిది]) న = కానేరదు.

తా. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనములచే నాకాశ సత్పదార్థములకుఁ గల భేదము చిత్తమునందు దృఢ మయ్యెనేని యప్పు డాకాశమెప్పటికిని లేనిదియే యగును. సత్పదార్థమును సర్వపరిపూర్ణము అద్వితీయము నగును. కావున సృష్టికి పూర్వమునందే కాక సృష్టికాలము నందుకూడ సత్పదార్థ మొక్కటియే కలదు. సృష్టి యంతయు నున్నట్లు తోఁచునదియే కాని యున్నది కాదు.

అవ. ఈ విచారమువలన కలుగు నుపయోగమును రెండు శ్లోకములచే వివరించు చున్నాఁడు:—

శ్లో. జ్ఞస్య భాతి సదా వ్యోమ నిస్తత్త్వోల్లేఖపూర్వకమ్,
సద్వస్త్వపి విభా త్యస్య నిశ్ఛిద్రత్వపురస్సరమ్. 75
వాసనాయాం ప్రవృద్ధాయాం వియత్సత్యత్వవాదినమ్,
సన్మాత్రాబోధయుక్తం చ దృష్ట్వా విస్మయతే బుధః. 76

వ్యా. వియత్సత్త్వవివేచనే ఫలమాహ—జ్ఞస్యేతి.

వ్యా. వియన్మిథ్యాత్వం సతో వస్తుత్వం చ సదా చింతయతః కిం భవతీత్యత ఆహ—వాసనాయామితి. బుధో వియత్సతో స్తత్త్వవేత్తా గగనస్య సత్యత్వం బ్రువాణం నిరవకాశసద్వ స్త్వవబోధరహితం చ దృష్ట్వా విస్మయం ప్రాప్నోతీత్యర్థః.

టీ. జ్ఞస్య = పైఁజెప్పినవిధమున సర్వమును నిర్ణయించుకొని సిద్ధాంతపదార్థమును చెందిన మహాత్మునకు, వ్యోమ = ఆకాశము, సదా = ఎల్లప్పుడును, నిః...పూర్వకం - నిస్తత్త్వ = నిరాత్మకత్వమును (అభావమును), ఉల్లేఖ = గ్రహించుటయే, పూర్వకమ్ = ముందుగా ("దీనికి స్వరూపమే లేదు" అను వివేకముతో), భాతి = ప్రకాశించును (అజ్ఞానికివలెనే జ్ఞానికిఁ గూడ నాకాశము గానవచ్చినను, ఆయన దానిని సత్యముగ తలంపఁ డనుట). సద్వస్తు అపి = సత్పదార్థముకూడ, అస్య = ఈ జ్ఞానికిని, ని... సరమ్ - నిచ్ఛిద్రత్వ = రంధ్రము లేకుండుటయే, (సర్వవ్యాపక మగుటయే) పురస్సరమ్ = ముందుగా (సర్వవ్యాపకత్వముతో ననుట). విభాతి = ప్రకాశించును. (బ్రహ్మ మును సర్వవ్యాపకమునుగాఁ జూచుచుండు ననుట). వాసనాయాం = ఈ దృఢాను భవమువలన కలిగిన సంస్కారము, ప్రవృద్ధాయాం [సత్యాం] = అభివృద్ధి నొందెనేని, వియత్...వాదినమ్ - వియత్ = ఆకాశముయొక్క, సత్యత్వ = సత్యరూపమును ("ఆకాశము సత్యము" అని). వాదినమ్ = వాదించునట్టివానిని, సత్...యుక్తం- సన్మాత్ర = సర్వమును తత్పదార్థమే యని, అబోధ = తెలిసికొనక పోవుటతో (అజ్ఞాన ముతో), యుక్తం చ = కూడినట్టివానిని, దృష్ట్వా = చూచి, బుధః = పండితుఁడు, విస్మయతే = ఆశ్చర్యపడును. (అజ్ఞాని తనకుఁ గల సంస్కారములవలన నాకాశసత్ప దార్థ భేదమును గూర్చి చెప్పినప్పు డెట్లాశ్చర్యము నొందునో అట్లే జ్ఞానియు నాకాశ సత్పదార్థము లయ భేదమునుగూర్చి చెప్పువానినిఁ జూచి యాశ్చర్యము - నొందు నని భావము.

తా. ఈ విధముగ శ్రవణాదులచే నాకాశ సత్పదార్థములకుఁ గల భేదమును నిర్ణయించుకొనిన నప్పు డా జ్ఞాని సామాన్యులవలెనే సర్వవ్యవహారముల నాచరించుచున్నను బంధము నొందఁడు. విచారిం చిన నీ పంచభూతములును వానివలన జనించిన భౌతికములును కూడ పై న్యాయము ననుసరించి శూన్యములే యగును గావున నేమియు వానిని బంధింప నేరవు. వానికి నీ యాకాశము గానవచ్చినప్పుడు, అది సత్యముగఁ దోఁపదు. ఆకాశమువలెనే యన్నియు సత్యములుగ తోఁప వని గ్రహించునది. అట్లు తోఁచిననే కదా వానియందు రాగ ద్వేషములు జనించుట. అజ్ఞానికివలెనే వీనికిని ఆ యాకాశము గాన వచ్చినను స్వప్నగజాదులవలె నసత్యముగనే తోఁచునుగాని సత్య మని

యించుకైనను తోఁపదు. సత్పదార్థంబును సర్వవ్యాపక మనియే తోఁచు చుండును గాని యెప్పటికినిఁ బరిచ్ఛిన్నముగ తోఁపదు. ధ్యానమువలన నీ తలంపులు దృఢము లయ్యెనేని పిదప నజ్ఞానస్థితియం దున్న భావనల వలెనే పరమార్థభావనలును మనస్సున నెలకొనును. అప్పుడు జ్ఞాన ప్రసంగము లజ్ఞానికి నద్భుతావహము లైనట్లే అజ్ఞానప్రసంగములును ఇపుడు జ్ఞానికి నద్భుతావహము లగును. ఇట్టి దార్ఢ్యము కలిగెనేని వాఁడు జీవించియు సర్వసంసారబంధవర్జితుఁడై ముక్తుం డగును. చేతన జడరూప మగు సర్వప్రపంచము నీ యుక్తితో సత్పదార్థమాత్రముగఁ జూచుటయేకదా పరమార్థము. అదియే కదా ముక్తి. భ్రాంతిచే సర్వ ప్రపంచమును తనకు ద్వితీయమునుగా భావించి రాగద్వేషముల నొంది తదర్థము బహువిధ కర్మల నాచరించి వానివలన సుఖ దుఃఖములఁ జెంది నట్లు తలంచుచు మోహితుఁడై యుండుటయేకదా బంధము. తన యద్వితీయత్వము పారమార్థికముగ నెఱింగిన పిదప నిది యెం దుండును? కావున నీ విజ్ఞానమే ముక్తికి సాధనము.

అవ. ఇట్లు ఆకాశ సృష్టిని గూర్చి సర్వమును వివరించి యీ న్యాయమును తక్కిన స్థలములందును అతిదేశించుచున్నాఁడు:—

శ్లో. ఏవ మాకాశమిథ్యాత్వే సత్సత్యత్వేచ వాసితే,
న్యాయే నానేన వాయ్వాదేః సదంస్తు ప్రవివిచ్యతామ్. 77

వ్యా. ఉక్తన్యాయమన్యత్రాప్యతిదిశతి—ఏవ మితి.

టీ. ఏవం = ఈ విధముగ, ఆకాశమిథ్యాత్వే - ఆకాశ = ఆకాశముయొక్క, మిథ్యాత్వే = అసత్యత్వంబును, సత్సత్యత్వే - సత్ = సత్పదార్థముయొక్క, సత్యత్వే చ = సత్యస్వరూపంబును, వాసితే (సతి) = సంస్కారరూపమున దృఢము కాఁగానే, అనేన=ఈ (ఆకాశ విచారమునందు చూపఁబడిన,) న్యాయేన=యుక్తులతో, (జాత్యేక వచనము) సదంస్తు = సత్పదార్థము, వాయ్వాదేః = వాయువు మొదలగు భూతముల నుండి, ప్రవివిచ్యతామ్ = విభాగింపఁబడుఁగాక, విచారణచే నిట్లే సత్పదార్థమును వాయ్వాదిభిన్నమునుగ నిశ్చయింపవలయు ననుట.

తా. స్పష్టము.

అవ. వాయు విచారమునందుఁ గల కొన్నివిశేషములను జూపువాఁడై మొట్ట మొదట వాయుస్వరూపమును వివరించుచున్నాఁడు:—

శ్లో. సద్వస్తు న్యేకదేశస్థా మాయా త త్రైకదేశగం,
వియ త్త త్రా ప్యేకదేశగతో వాయుః ప్రకల్పితః. 78

వ్యా. నన్వాకాశకార్యస్య వాయోరకారణభూతేన సద్వస్తునా తాదాత్మ్య ప్రతీత్యయోగాత్సతో వివేచనమప్రయోజక మిత్యాశంక్య సాక్షాత్సంబంధాభావేఽపి పరంపరయా సంబంధోఽస్తీత్యాహసద్వస్తునీతి.

టీ. మాయా = మాయ, సద్వస్తుని = సత్పదార్థమునందు, ఏకదేశస్థా = ఒకభాగమున నున్నది. ఈవిషయము (ఈప్రకరణమున ౫౪-వ శ్లోకమున వివరింపఁబడెను.) తత్ర = ఆమాయయందు, వియత్ =ఆకాశము, ఏకదేశగం=అల్పప్రదేశమున నున్నది. (కార్యములు కారణములకంటె నల్పములై యుండుట నియమము కదా యనుట. మృత్తికకంటె ఘటము అల్పపరిమాణము కలదియే యగు ననుట ప్రత్యక్షసిద్ధము. ఘటమునకై భూమిలో నున్నమృత్తిక యంతయు గ్రహింపఁబడదు కదా.) తత్రాపి = ఆయాకాశమునందు, వాయుః=వాయువు, ఏకదేశగతః=అల్పభాగమున నున్నవాఁడుగా, ప్రకల్పితః = కల్పింపఁబడెను. (దీనికిని "ఆకాశా ద్వాయుః" = "ఆకాశాకారమును జెందిన బ్రహ్మమునుండి వాయువు జనించెను" అను శ్రుతియే కారణము. మఱియు నాకాశమునకంటె వాయువు (అల్పపరిమాణము కలది యను విషయము మున్ముందు పురాణ ప్రమాణముచే విమర్శింపఁబడును.)

తా. స్పష్టము.

అవ. ఇట్లు వాయుసృష్టిని చెప్పి తత్స్వరూపము ప్రత్యక్ష మగుటచే నీక్రింద దానిధర్మములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శోషస్పర్శౌ గతి ర్వేగో వాయుధర్మా ఇమే మతాః,
త్రయస్స్వభావా స్సన్మాయావ్యోమ్నాం యే తేఽపివాయుగాః.

వ్యా. ఏవం సద్వాయ్వోః సంబంధం ప్రదర్శ్య తయోర్ధర్మతో భేదజ్ఞానాయ వాయౌ ప్రతీయమానాన్ ధర్మానాహ—శోషస్పర్శావితి. ఏవం ప్రాతిస్వికాన్ ధర్మాన్ అభిధాయ కారణతః ప్రాప్తాంస్తానాహ—త్రయ ఇతి. సన్మాయావ్యోమ్నాం యే త్రయః స్వభావాఃశీలవిశేషా ధర్మాస్తేఽపి వాయుగాః వాయౌ విద్యంత ఇత్యర్థః.

టీ. శోషస్పర్శౌ - శోష = ఎండుటయు, (ఎండించుటయు) స్పర్శౌ = తాఁకుటయు, గతిః = గమనంబును, వేగ = వేగంబును, ఇమే = ఇవి, వాయుధర్మాః = వాయువునకుఁ గల ధర్మము లని, మతాః=నిశ్చయింపఁబడినవి. సన్మాయావ్యోమ్నాం = సత్పదార్థమునకును, మాయకును, ఆకాశమునకును. యే = ఏ, త్రయః = మూఁడైన,

స్వభావాః = స్వభావములు కలవో, తే అపి = అవియు, వాయుగాః = వాయువునం దున్నవి.

తా. స్పష్టము.

అవ. విశదమగుటకై సత్పదార్థముయొక్కయు, మాయయొక్కయు, ఆకాశము యొక్కయు ధర్మములఁ బ్రస్తావించి వాని వాయువునందుఁ జూపుచున్నాఁడు:—

శ్లో. వాయు ర స్తీతి సద్భావ స్సతో వాయౌ పృథక్కృతే,
నిస్తత్త్వరూపతా మాయా స్వభావో వ్యోమగో ధ్వనిః. 80

వ్యా. కే తే ధర్మా ఇత్యత ఆహ—వాయురితి. వాయుర స్తీతి వ్యవహారహేతు సద్రూపత్వ సద్వస్తునో ధర్మ ఏకః. వాయౌ సద్వస్తునో వివేచితే సతి యన్నిస్తత్వ రూపత్వం స మాయాధర్మో ద్వితీయః. శబ్దో వ్యోమ్న స్సకాశాదాగతో ధర్మస్తృతీయ ఇత్యర్థః.

టీ. "వాయుః = వాయువు, అస్తి = కలదు," ఇతి = అని, (ఇట్లు వాయువు నందు వ్యవహరింపఁబడు కలిమి) సద్భావ = సత్పదార్థముయొక్క స్వభావము, వాయౌ = ఆవాయువు, సతః = సత్పదార్థమునుండి, పృథక్కృతే [సతి] = ఆకాశ విచారమునందు చూపఁబడు యుక్తుల ననుసరించి వేఱు చేయఁబడఁగా నేర్పడునట్టి, నిస్తత్వరూపతా = శూన్యరూపము లేక అనిర్వచనీయరూపము, మాయాస్వభావః = మాయయొక్క స్వభావము, ధ్వనిః=వాయుచాంచల్యమువలన కలుగుధ్వని, వ్యోమగః= ఆకాశస్వభావము, (ఆకాశము సామాన్యశబ్దరూప మని ప్రకరణారంభమునసే సూచించి యున్నాము.)

తా. స్పష్టము.

అవ. ఈ సిద్ధాంతముపై నొక యాక్షేపము జూపుచున్నాఁడు.—

శ్లో. సతోఽనువృత్తి స్సర్వత్ర వ్యోమ్నో నేతి పురేరితమ్,
వ్యోమానువృత్తి రధునా కథం న వ్యాహతం వచః. 81

వ్యా. నను వ్యోమవివేచనప్రస్తావే 'వాయ్వాదిష్వనువృత్తం సన్నతు వ్యోమేతి భేదధీ' రిత్యత్ర వాయ్వాదావాకాశానువృత్తిర్నివారితా. ఇదానీం వ్యోమానువృత్తిరభి ధీయతే. అతః పూర్వోత్తరవిరోధ ఇతి శంకతే—సత ఇతి. వ్యోమానువృత్తి రధునో చ్యత ఇతి శేషః.

టీ. సర్వత్ర = అన్నిభూతములయందు, సతః = సత్పదార్థముయొక్క, అను వృత్తిః = అనువర్తనము; కలదు; వ్యోమ్నః = ఆకాశముయొక్క, [అనువృత్తిః = అను వర్తనము,] న = లేదు, (సర్వ పదార్థములయందును సత్పదార్థము కలదు కాని యాకా

శము లేదనుట). పురా = ముందు, (ఈప్రకరణమునందే 66-వ శ్లోకమున) ఈరితం = చెప్పఁబడెను. అధునా = ఇప్పుడు, (ఇచ్చటనే 80-వ శ్లోకమునందు) వ్యోమానువృత్తిః - వ్యోమ = ఆకాశముయొక్క, అనువృత్తిః = అనువర్తనము, (ఆకాశము కూడ వాయువునం దున్న దనుట.) [ఈరితా = చెప్పఁబడెను.] వచః = పూర్వోక్త వాక్యము, కథం = ఎట్లు, న వ్యాహతం = విరుద్ధము కాదు? (అవశ్యముగ విరుద్ధ మగు ననుట.)

తా. పై శ్లోకమున చేయఁబడిన సిద్ధాంతము సరిగ్గానైనది కాదు. సత్త్వదార్థముయొక్కయు మాయ యొక్కయు ధర్మములు మాత్రము వాయువునం దుండవచ్చును కాని ఆకాశ ధర్మము లుండుటకు వీలు లేదు. ఇదివఱకు నొకమాఱు "సత్త్వదార్థ మన్ని భూతములయందు ననువర్తించును గాని యాకాశ మట్లనువర్తింపదు." అని చెప్పి యున్నారు. ఇప్పుడు "ఆకాశముకూడ వాయువునం దనువర్తించి యున్నది" యనిన మీ ప్రతిజ్ఞకు భంగము రాలేదా ?

అవ. ఈ యాక్షేపమునకు సమాధానమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఛిద్రానువృత్తి ర్నే తీతి పూర్వోక్తి రధునా త్వియమ్,
శబ్దానువృత్తి రే వోక్తా వచసో వ్యాహతిః కుతః. ॥ 82 ॥

వ్యా. పూర్వమవకాశలక్షణస్వరూపానువృత్తిర్నివారితా. ఇదానీం ధర్మానువృత్తి రేవాభిధీయతే. న స్వరూపానువృత్తిరతో న వ్యాహతిరితి పరిహారతి—ఛిద్రేతి.

టీ. "ఛిద్రానువృత్తిః - ఛిద్ర = ఆకాశమునకు స్వరూపభూత మగు నవకాశము యొక్క, అనువృత్తిః = అనువర్తనము, న = ఇతరభూతములయందు లేదు", ఇతి = ఇతి అనునదియే, పూర్వోక్తిః = ఇదివఱకు చేయఁబడిన ప్రజ్ఞకు నర్థము (ఇదివఱకు ఆకాశ స్వరూపభూత మగు నవకాశ మితర భూతములయందు లేదంటి మనుట.) అధునాతు = ఇప్పుడైతే, ఇయం = ఈ, శబ్దానువృత్తిః ఏవ = ఆకాశగుణ మగు శబ్దము మాత్రమే యితర భూతములయం దనువర్తించియున్నది యని మాత్రమే, ఉక్తా = చెప్పఁబడెను. (ఇయం - అనుపదము అనువృత్తిః అనుదానికి విశేషణ మని తెలిసికొనవలయును. ఇచ్చట నాకాశ ధర్మమును గూర్చి మాత్రమే చెప్పితి మనుట). వచసః = వాక్యమునకు, వ్యాహతిః=భంగము, కుతః=ఎక్కనుండి వచ్చును? (ప్రతిజ్ఞా భంగము లే దనుట.)

తా. ఇచ్చట ప్రతిజ్ఞా భంగము లేదు. ఇదివఱకు ఆకాశ స్వరూప మితర భూతములయం దనువర్తింప దని మాత్రమే చెప్పియున్నాము.

దానికి ధ్వని గుణముగాని స్వరూపము కాదు. అచ్చట "సత్పదార్థము వలె నాకాశ మితర భూతములయం దనువర్తింపదు." అని చెప్పఁబడి యుండుటచే "సత్పదార్థములోని యేభాగము (స్వరూపము) అనువర్తించునో యాకాశములోని ఆభాగమె (స్వరూపమె) యనువర్తింపదు" అనిమాత్రమే తేలుచున్నది. ఆ సత్పదార్థమునకుఁ గల స్వరూపము కార్యములందు అంతటను ననువర్తించును. కాని యాకాశమునకును స్వరూప మేది కలదో అది యితర భూతములయందు అనువర్తింపదు. ఇంత యేల? "ఈ పదార్థము దానియం దుండదు." అనిన "నీ పదార్థము యొక్క స్వరూపము దానిలో నుండదు." అనియే కదా యర్థము. ప్రస్తుతము చెప్పఁబడిన దన్ననో గుణానువృత్తి దీనికి స్వరూపముతో సంబంధము లేకున్నను సంబంధమాత్రమువలన దాని గుణము మఱి యొక పదార్థమునకు సంబంధింపవచ్చును. కావున ప్రతిజ్ఞాభంగము లేదు. వస్త్రమునందు తంతువుల యాకార మనువర్తింపకున్నను తెలుపు నలుపు మొదలగు వర్ణములు మాత్ర మనువర్తించుచునే యున్నవి కదా! "ఇది యేల? తంతువుల పొడవు నాశ్రయించియే వస్త్రమునకుఁ బరిమాణము వచ్చుచున్నది. మఱియు గుణమునకును గుణవంతమునకుఁ గల సంబంధము నిత్య మగుటచే నం దేది యనువర్తించినను రెండు ననువర్తించినట్లే" యనియెదవేమొ వినుము. తంతువు సన్నముగాను దీర్ఘముగాను మాత్రమే యున్నను వస్త్రము వెడల్పుగాను గూడ నున్నది. అది దారముల సముదాయమే కదా. ఇట్లైన తంతురూప మంతయు దానియం దనువర్తించి యున్నది యనుట యెట్లు? తంతువు ఏకము. పట మనేకాత్మకము. మఱియు నాకార మేయే ధర్మముతోఁ గూడియుండునో, అనఁగా దీర్ఘత్వము హ్రస్వత్వము కృశత్వము మొదలగు నేస్వభావములతోఁ గూడియుండునో, ఆ స్వభావములతోఁ బరిపూర్ణముగ ననువర్తించిననే కాని యనువృత్తి కాదు. ఇచ్చట పొడవుమాత్ర మొక వేళ యనువర్తించినను వెడల్పు అనువర్తింపలేదు. ఒక్కదారమే వస్త్రము కాదుకదా! పొడవు సహిత మొక దారముచేతనే యేర్పడె ననుటకు వీలు లేదు. కావున స్వరూపానువృత్తి లేకున్నను

గుణానువృత్తి కలుగు ననుటలో వివాదము లేదు. ఇంక సమవాయ సంబంధమును గూర్చి యిదివఱకే చెప్పియున్నాము. సంబంధ మేది యైనను పదార్థద్వయమునకుఁ గాని యుండ దని యున్నాము. పదార్థములు రెండైనప్పుడు వానికిఁ గల సంబంధము నిత్య మగుట యెట్లు? సంయోగమునకు నెప్పటికైన వియోగ ముండవలసినదియే కదా! కావున గుణగుణిసంబంధమువలన గుణికూడ గుణము ననుసరించియే వచ్చుచుండు నను వాదము చెల్లదు. గుణగుణి భేదమునుగూర్చి కూడ నిదివఱకే (యీ ప్రకరణమునందే డెబ్బదియొకటవ శ్లోకమున) వివరించి యున్నాము. కావున పూర్వోత్తర వాక్యములకు విషయభేదము కలదు. కావున ప్రతిజ్ఞాభంగము లేదు.

అవ. మఱియొక యాక్షేపమును జూపుచున్నాఁడు:—

శ్లో. నను సద్వస్తుపార్థక్యా దసత్వం చే త్తదా కథం,
అవ్యక్తమాయావైషమ్యా దమాయామయ తాపి నో. 83

వ్యా. నను వాయోః సద్బ్రహ్మవిలక్షణత్వాదసత్త్వలక్షణం మాయామయత్వం యద్యుచ్యతే తర్హ్యవ్యక్తస్వరూపమాయావైలక్షణ్యాదమాయామయత్వమపి కిం న స్యాదితి చోదయతి—నన్వితి.

టీ. నను=ఓయి, సద్వస్తుపార్థక్యాత్-సద్వస్తు=సత్పదార్థమునుండి, పార్థక్యాత్=వే ఱగుటవలన [వాయోః=వాయువునకు], అసత్వం=అసద్రూపత్వము, [భవతి] చేత్=అగునేని, అవ్యక్తమాయావైషమ్యాత్ - అవ్యక్త = అవ్యక్తరూప మైన (ఇంద్రియ గోచరముకాని), మాయా = మాయకంటె (సృష్టికిఁ బూర్వమున కేవల రూపముతో నున్న మాకంటె లేక ఇంద్రియగోచరము కాని యాకాశమును కల్పించి తద్రూపమున నున్న మాయకంటె), వైషమ్యాత్ = భిన్నమగుటవలన (ఇంద్రియగోచర మగుటవలన), అమాయమయతా-అపి=మాయాస్వరూపము లేకపోవుటయు (మాయా స్వభావమును కలిగియుండక పోవుటయు), తదా = అప్పుడు, కథం=ఎట్లు, న [భవతి] = లేకుండును? (సత్పదార్థ భిన్న మైనప్పు డసత్పదార్థ మెట్లయ్యెనో మాయాభిన్న మైనప్పుడును మాయాస్వభావరహిత మట్లే కావలయు ననుట.)

తా. ఇప్పటికిని దోషము నివర్తింప లేదు. ఆకాశగుణ మును వర్తించుటను సమర్థించితిరి గాని మఱియొక దోషము వచ్చుచున్నది. "సత్పదార్థమునుండి విభాగించినప్పుడు కలుగు శూన్యరూప మేది

కలదో అదియే వాయువునందుఁ గల మాయా స్వభావము" అని చెప్పి యున్నారు. ఇది సరిపడదు. మాయ యొక్కటియే యయ్యును వ్యక్తావ్యక్త భేదములచే మీా సిద్ధాంతమునఁ బరిగ్రహింపఁబడి యున్నది. సృష్టికిఁ బూర్వము కేవల రూపముతో నున్నప్పుడు కాని అప్రత్యక్షమగు నాకాశమును సృజించి తద్రూపమున నున్నప్పుడు కాని మీారు ఆ మాయనే అవ్యక్త మనుచున్నారు; బీజావస్థను విడిచి ప్రపంచ రూపముగా విజృంభింప నారంభించినప్పుడు కాని వాయ్వాది ప్రత్యక్షభూతముల సృజించి తద్రూపముతో నిలిచినప్పుడు కాని దానినే వ్యక్త మనుచున్నారు. ఇందు అవస్థాభేదమువలన నామభేదము మాత్రమే కలదు కాని వస్తువు ఒక్కటియే కదా! ఇఁక జూడుఁడు. ఈ వాయువు అవ్యక్తమునకంటె భిన్నమై యున్నది. ఇది వ్యక్తముకదా. అవ్యక్తమునకంటె భిన్న మనినను మాయకంటె భిన్న మనినను ఒక్కటియే. కావున నది మాయామయము కా దని చెప్పవచ్చును కదా. సృష్టికిఁ బూర్వమున బీజావస్థలో నున్న మాయనే యవ్యక్తముగ గ్రహించినచో నీదోష మాకాశమునందుఁ గూడఁ బ్రసరించును. మీారు చూపిన న్యాయము ననుసరించి యాకాశము కూడ మాయామయమే కదా! కావున నీ భూతములు మాయామయములు కాకున్నచో సత్యములే కావలసివచ్చును. కావున దీనికి సమాధాన మేమి ?

అవ. ఈపూర్వపక్షమునకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిస్తత్త్వరూపతైవాత్ర మాయాత్వస్య ప్రయోజికా,
సాశక్తికార్యయో స్తుల్యా వ్యక్తావ్యక్తత్వభేదినోః. 84

వ్యా. నావ్యక్తత్వం మాయామయత్వే ప్రయోజకం? కింతు నిస్తత్వరూపత్వం. తత్తు మాయాయామివ వాయ్వాదావప్యస్తీతి న మాయామయత్వహానిరితి పరిహరతి— నిస్తత్వేతి.

టీ. అత్ర = ప్రస్తుత వాదమునందు, నిస్తత్వరూపతా ఏవ = పరమార్థ స్థితిలో స్వరూప మేమియు లేకుండుటయే, మాయాత్వస్య=మాయ యగుటకు (మాయామయ మగుటకు), ప్రయోజికా = లక్షణము (ఏది వ్యవహారమునకుఁ గానవచ్చుచున్నను, పరమార్థస్థితిలో లేదో యదియే మాయామయ మనఁబడు ననుట). సాచ = అయ్యాలక్షణము, వ్యక్తావ్యక్తత్వభేదినోః = వ్యక్త మనియు అవ్యక్త మనియు, వ్యవహరింపఁబడు

చున్న, శక్తికార్యయోః=శక్తికిని తత్కార్యము లగు భూతములకును, తుల్యా=సమాన మైనదియే, (సద్భిన్నము లగుటచే నీ రెండును నిరాత్మకములే యనుట).

తా. ఈ పూర్వపక్షము యుక్తమైనది కాదు. సృష్టికి పూర్వమున బీజావస్థలో నున్నశక్తి సూక్ష్మమైనది యగుటచే నవ్యక్త మనఁబడును; అదియే కార్యరూపముగ విజృంభించిన పిదప వ్యక్త మనఁబడును. ఇంతయే కాని అవస్థాభేదములఁ బరిత్యజించిన వీనిలో స్వరూప భేద మేదియు లేదు. ఏమి చెప్పినను స్వరూపము నాశ్రయించియే కదా చెప్పవలయును. "ఇట్టి న మాయకు లక్షణ మేది?" యనియెదవేమొ వినుము. వ్యవహారస్థితిలోఁ గానవచ్చుచుండియును బరమార్థస్థితిలో శూన్యరూప మగుటయే మాయకు స్వరూపము. ఇది పైని నిరూపించిన విధముగ నవ్యక్తమునందును (మాయాశక్తియందును) వ్యక్తము నందును (తత్కార్య మగు ప్రపంచమందును) గూడఁ గలదు కదా. కావున నవ్యక్తము కాకపోయినంతమాత్రమున వాయువు కాని యాకాశము కాని మాయామయము కా కుండదు. కావున మాయా స్వభావము వాయువునందు కల దనుట నిర్వివాదమే.

అవ. "ఇట్టి న నామాయయందు వ్యక్తావ్యక్తభేద మేల కలిగెను?" అనిన "దాని విచారముతో నిప్పుడు పని లేదు" అని పరిహరించుచున్నాఁడు:—

శ్లో. సదసత్త్వవివేకస్య ప్రస్తుతత్వాత్స చింత్యతాం,
అసతోఽవాంతరో భేద ఆస్తాం తచ్చింతయాత్ర కిమ్. 65

వ్యా. నను శక్తికార్యయోరుభయోరపి నిస్తత్త్వరూపతాయామవిశిష్టాయాం వ్యక్తావ్యక్తత్వలక్షణో భేదః కుత ఇత్యాశంక్య, తద్విచారః ప్రస్తుతానుపయుక్త ఇతి పరిహరతి—సదసత్త్వేతి. అసతో మాయా తత్కార్యరూపస్యావాంతరభేదో వ్యక్తావ్యక్తత్వరూప ఇత్యర్థః.

టీ. సదసత్త్వవివేకస్య=సదసత్పదార్థముల విచారమే, ప్రస్తుతత్వాత్ = ఆరంభింపఁబడియుండుటవలన, సః=అదియే, చింత్యతామ్ = విచారింపఁబడుఁగాక. అసతః = అసత్పదార్థముయొక్క, అవాంతరః=లోపలనున్న, భేదః=వ్యక్తావ్యక్తభేదము, ఆస్తాం= ఉండనిమ్ము, అత్ర=ప్రస్తుతమున, కిం=ఏమిప్రయోజనము (ఈ విచారమునకు నిది సమయము కా దనుట).

తా. స్పష్టము.

అవ. ఇట్లు విశేషముల ప్రస్తావించి యాకాశ విచారానుసారముగ సిద్ధాంతమును మనస్సున నిడుకొని యుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. సద్వస్తు బ్రహ్మశిష్టోఽంశో వాయు ర్మిథ్యా యథా వియత్,
వాసయిత్వా చిరం వాయో ర్మిథ్యాత్వం మరుతం త్యజేత్. 86

వ్యా. ఫలితమాహ—సద్వస్త్వితి. వాయౌ యః సదంశస్తద్బ్రహ్మరూపం శిష్టోఽంశో నిస్తత్వరూపాదిః వాయోః స్వరూపం. స చ వాయుః నిస్తత్వరూపత్వాదేవ ఆకాశవన్మిథ్యా ఇత్థం వాయోర్మిథ్యాత్వం చిరం వాసయిత్వా మరుతం త్యజేత్ మరుత్సత్య బుద్ధిం త్యజేదిత్యర్థః.

టీ. సద్వస్తు="కలదు" అను వ్యవహారముచే వ్యవహరింపఁబడుచుండు భాగము, బ్రహ్మ=పరబ్రహ్మము; శిష్టః = మిగిలిన, అంశః = మాయాకాశాంశములు, వాయుః = వాయుస్వరూపము, వియత్ యథా = ఆకాశమువలెనే, మిథ్యా = అసత్యమైనది, చిరం = బహుకాలము, వాయోః = వాయువుయొక్క, మిథ్యాత్వం=అసత్యత్వమును, వాసయిత్వా = స్థిరము చేసికొని, మరుతం = వాయువును, త్యజేత్ = విడువవలయును (వాయువునందుఁ గల సత్యత్వ బుద్ధిని విడువవలయు ననుట).

తా. కావున నాకాశమువలెనే వాయువుకూడ మిథ్యయే యనుటలో సంశయము లేదు. ఆకాశమునందువలెనే యిందును గాన వచ్చు కలిమి సత్పదార్థము; ధర్మి తక్కిన భాగ మంతయును ధర్మము సద్భిన్న మగుటచే నసద్రూపము. కావున నీవాయువును కూడ మిథ్యగా నెఱింగి యా జ్ఞానము దృఢమగునంతవఱకు శ్రవణ మనన నిదిధ్యాసనముల నాచరించి యనంతరమున దీనిని పరిత్యజింపవలయును. ఆకాశవిచారమున వివరింపఁబడిన యనుభవజ్ఞానము నొంది యీ వాయువు కానవచ్చుచున్నను దానిచే బంధములేక యుండవలయును. దాని నింద్రజాలీయ నగరమును చూచినట్లు చూడవలయును. (ఇంద్రజాల నగరమును చూచుట యనఁగా "ఇది ఇంద్రజాల నగరము" అని తెలిసి చూచుట యని గ్రహించునది).

అవ. ఇట్లు వాయువిచారమును ముగించి వహ్నినిగూర్చి ప్రస్తావమును నారంభించుచున్నాఁడు:—

శ్లో. చింతయే ద్వహ్ని మ ప్యేవం మరుతో న్యూనవర్తినమ్,
బ్రహ్మాండావరణే ష్వేషా న్యూనాధికవిచారణా. 87

వ్యా. వాయౌ ఉక్తం విచారం తేజస్యప్యతిదిశతి—చింతయేదితి. నను 'సద్వస్తున్యేకదేశస్థా మాయా తత్రే' త్యాదినా వియదాదీనాం న్యూనాధికభావ ఉక్తః. స లోకే న క్వాపి దృశ్యత ఇత్యాశంక్యాహ—బ్రహ్మాండేతి.

టీ. మరుతః = వాయువునకంటె, న్యూనవర్తినమ్ = తక్కువగా నున్న, వహ్నిం అపి = అగ్నినిఁగూర్చికూడ, ఏవం = ఈ విధముగనే, చింతయేత్ = విచారింపవలయును, ఏషా=ఈ, న్యూనాధిక విచారణా=ఎక్కువ తక్కువలను గూర్చిన విచారము, బ్రహ్మాండావరణేషు-బ్రహ్మాండ=బ్రహ్మాండముయొక్క, ఆవరణేషు = ఆచ్ఛాదనము లగు పంచభూతములయందే, (అస్తి = కలదు.)

తా. పైన విచారించిన విధముగనే అగ్నినిఁ గూర్చియు విచారించి నిర్ణయింపవలయును. ఆకాశమునకంటె వాయువు అల్పపరిమాణము కలది యైనట్లు ఆ వాయువునకంటె నగ్నియు నల్పపరిమాణము గలదియే. ఈ యల్పాధిక పరిమాణములు లోకమునఁ గానవచ్చుట లేదని యెదవేమొ. అవి లౌకిక భూతములనుగూర్చి చెప్పిన విషయము కాదు. లౌకికభూతములకుఁ గూడ నీ విభాగము సంబంధించినను స్పష్టముగఁ దెలియుటకై బ్రహ్మాండ కటాహమునకు నావరణభూతము లైన యాకాశాదులనుగూర్చి మాత్రమే యీ తారతమ్యము చెప్పఁబడుచున్నది. బ్రహ్మాండ కటాహమును మొదట పృథ్వియు దానిపై జలంబును మీఁద నగ్నియు నావల మారుతంబును, అనంతరంబున నాకాశంబును నావరించియున్నవి యని పురాణము.

అవ. ఇట్లుద్దేశించి యాయగ్నికిఁ గల పరిమాణంబును స్వభావంబును ప్రమాణంబునుఁ గూడ నిరూపించుచున్నాఁడు:—

శ్లో. వాయో ర్దశాంశతో న్యూనో వహ్ని ర్వాయౌ ప్రకల్పితః,
పురాణోక్తం తారతమ్యం దశాంశై ర్భూతపంచకే. 88

వ్యా. వాయోః కియతాంశేన న్యూనో వహ్నిరిత్యత ఆహ—వాయోరితి. తస్య వాస్తవత్వశంకాం వారయతి—వాయావితి. నన్వయం న్యూనాధికభావః స్వకపోలకల్పిత ఇత్యాశంక్యాహ—పురాణోక్తమితి.

టీ. వహ్నిః = ఈయగ్ని, వాయోః = వాయువుకంటె, దశాంశతః = పదియవ భాగముతో, న్యూనః=అల్పమైనది (వాయువులో పదియవభాగ మనుట). వాయౌ = ఆవాయువునందే, ప్రకల్పితః = కల్పింపఁబడినది (మాయచే నున్నట్లు తోఁపింపఁబడినది యనుట). భూతపంచకే = అయిదు భూతములయందును పరస్పరము, దశాంశైః=

దశమ భాగములతో, తారతమ్యం = న్యూనాధిక భావము (ఆకాశ వాయ్వగ్ని జల పృథువులు వరుసగా పూర్వపూర్వములకంటె ఉత్తరోత్తరములు దశమాంశములుగ మాత్రమే యున్నవి (యనుట). పురాణోక్తం = పురాణమునందుఁ జెప్పఁబడెను. స్మృతీతిహాస పురాణాదులు వేదార్థము ప్రకటించునవియే కావునను "అనంతా వై వేదాః" = "వేదములకు నంతము లేదు" అను శ్రుతి నాశ్రయించి చూచిన ప్రస్తుతము పాఠములో నున్న వేదమే వేదసర్వస్వ మనుటకు వీలు లేకపోవుటచేతను,ఇప్పటి వేదమున నీ విషయము లేకున్నను దీనికి మూల శ్రుతి యొక్కటి యుండవలయు నను నూహ నవశ్య మాచరింపవలయును. దీనికి నీ విధముగ వేదోక్తత్వముకూడ కల దని నిర్ణయింపవలయు నని భావము.)

తా. ఆకాశమునందు వాయువు కల్పింపఁబడినట్లే వాయువునందు పదియవ భాగమున నీ యగ్నియుఁ గల్పింపఁబడెను. ఆకాశాదులలో కారణము లగు పూర్వభూతములలో కార్యము లగు నుత్తరభూతములు పదియవవంతు మాత్రమే యుండు ననుట పురాణములయందు ప్రసిద్ధమై యున్నది "వేదప్రసిద్ధి లేదు కదా!" అని యెంచవేమో. అదియు సూచనాపూర్వకముగఁ గలదు. లేకున్నను కల్పింపఁబడవచ్చును. అనుమాన ప్రమాణమునకు నొక యవకాశ మున్నది. "అనంతా వై వేదాః" అను శ్రుతి ననుసరించి చూచిన ప్రస్తుతము తుదకు పురాణకాలమందైనను పాఠములో నున్నయంతవఱకే వేద మనియు నిఁక లే దనియుఁ జెప్పుటకు వీలు లేదు. శ్రుతిపురాణాదులును వేదార్థమును విశదీకరించుటకై యేర్పడినవి. కావున లేని విషయమును చెప్పు ననుటయు సంభవింపదు. కావున నిప్పటికి కేవల పురాణవాక్యములే మిగిలి యున్నను వీనికి మూలభూతము లగు శ్రుతు లొకప్పు డుండె నని చక్కఁగ నూహింపవచ్చును. కావున నీవిషయమున వేదప్రామాణ్యము కూడ కలదు.

అవ. అగ్నిస్వరూపమును విచారార్థమై సవిస్తరముగ వివరించుచున్నాఁడు:—

శ్లో. వహ్నౌ పూర్ణః ప్రకాశాంతాః పూర్వాఽనుగతి రత్ర చ,
అస్తి వహ్నౌ స్స నిస్తత్త్వ శ్శబ్దవాన్ స్పర్శవా నపి. 89
సన్మాయావాయ్వనుగత్వాంశై ర్వ్యక్త స్యాగ్నే ర్నిజో గుణః,
రూపం తత్ర సత స్సర్వ మన్య ద్బుద్ధ్యా వివిచ్యతామ్. 90

వ్యా. వహ్నేః స్వరూపమాహ—వహ్నావితి. అత్రాపి వాయావివ కారణధర్మా అనుగతా ఇత్యాహ—పూర్వేతి. కే తే ధర్మా ఇత్యాకాంక్షాయామాహ—అస్తీతి.

వ్యా. ఏవమగ్నౌ కారణధర్మానుగత్యనువాదపూర్వకం స్వకీయం ధర్మం దర్శయతి—సన్మాయేతి. ఇత్థం సవిశేషణం వహ్నిస్వరూపం వ్యుత్పాద్య, ఇదానీం సద్వస్తునో వహ్నిం వివినక్తి - తత్రేతి. తత్ర తేషు మధ్యే సతః సద్వస్తునోఽన్యత్సర్వగధర్మజాతం మిథ్యేతి బుద్ధ్యా వివిచ్యతాం పృథక్ క్రియతామిత్యర్థః.

టీ. వహ్నిః=అగ్నిహోత్రము, ఉష్ణః = వేఁడి యైనది, ప్రకాశాత్మా=కాంతియే స్వరూపముగఁ గలది. అత్ర చ=ఈ యగ్నియందును, పూర్వానుగతిః-పూర్వ = అగ్ని యుత్పత్తికంటెఁ బూర్వమున నున్న సన్మాయాకాశ వాయువుల ధర్మములయొక్క, అను గతిః = అనువర్తనము కలదు. (ఈ యగ్నియందు సత్పదార్థముయొక్కయు, మాయయొక్కయు, నాకాశముయొక్కయు, వాయువుయొక్కయు ధర్మములు కల వనుట). వహ్నిః=అగ్ని, అస్తి=కలదు. (ఇది సత్స్వభావప్రదర్శనము) సః=ఆయగ్ని, నిస్తత్త్వః = సత్పదార్థమునుండి భేదింపఁబడినచో శూన్య రూప మగును (ఇది మాయాధర్మ ప్రదర్శనము). శబ్దవాక్=అగ్నియందును శబ్దము కలదు. (ఇది యాకాశధర్మ ప్రదర్శనము). స్పర్శవాక్ అపి = ఈ యగ్నియందు స్పర్శ కలదు (ఇది వాయుధర్మ ప్రదర్శనము). [ఏవం = ఈ విధముగ]. సత్...అంశైః - సత్=సత్పదార్థముయొక్కయు, మాయా= మాయయొక్కయు, వ్యోమ=ఆకాశముయొక్కయు, వాయు = వాయువుయొక్కయు, అంశైః = భాగములతో (ధర్మములతో ననుట). యుక్తస్య = కూడిన, అగ్నేః = అగ్నికి, నిజః = స్వకీయమైన, గుణః = గుణము, రూపం = రూపము (అగ్నికి నిరుపాధిక మగు రూపము విశేషగుణ మనుట). తత్ర = ఈ చెప్పఁబడినవానిలో, సతః = సత్పదార్థమునకంటె, అన్యత్ = భిన్నమైన, సర్వం = సమస్తమును (అనఁగా మాయాస్వభావము మొదలుగాఁ గల సర్వస్వభావములును), బుద్ధ్యా = బుద్ధిచే, వివిచ్యతామ్= విభాగింపఁబడును గాక.

తా. అగ్నిభూతమునకుఁ గాంతియే స్వరూపము. వేఁడిమి స్వభావము. సత్పదార్థము మొదలగువాని స్వభావములు కూడ నిచ్చట నున్నవి. "కలదు" అను వ్యవహారమే సత్స్వభావ ముండుటకు నిదర్శనము. శూన్యరూపమే మాయాస్వభావము. ఆకాశమునందుఁ గల శుద్ధ శబ్ద మిచ్చట విశేషణయుక్తమై భుగుభుగు ధ్వని యని వ్యవహరింపఁబడుచున్నది. ఇట్లే వాయుగత మగు స్పర్శంబును విశేషణయుక్తమై యిందు వేఁడిమి కలదిగా కానవచ్చుచున్నది. మఱియు దీని నిజగుణము రూపము. ఇవి యన్నియు సత్పదార్థమునకంటె భిన్నము లని యాకాశ వాయు భూతముల విచారించినట్లు విచారించి విభాగింపవలయును.

అవ. ఈ యగ్నివిచారమునకు ఫలమును చెప్పుచు జలవిచారము నుపక్రమించుచున్నాఁడు:—

శ్లో. సతో వివేచితే వహ్నౌ మిథ్యాత్వే సతి వాసితే,
ఆపో దశాంశతో న్యూనాః కల్పితా ఇతి చింతయేత్. 91

వ్యా. ఏవం వహ్నే ర్మిథ్యాత్వనిశ్చయానంతరమపాం మిథ్యాత్వం చింతయేదిత్యాహ—సత ఇతి.

టీ. వహ్నౌ=ఈ యగ్ని, సతః = సత్పదార్థమునుండి, వివేచితే = విభాగింపఁబడఁగా, మిథ్యాత్వే='అగ్ని సద్భిన్న మగుటచే నసత్యము' అని యగ్నియొక్క మిథ్యాభావము. వాసితే సతి = శ్రవణమనన నిదిధ్యాసనములచే మనస్సునందు దృఢముచేసికొనఁబడెనేని, ఆపః = జలంబును, దశాంశతః = అగ్నియందు పదియవ భాగముగ, న్యూనాః=అల్పపరిమాణముతో, కల్పితాః = మాయచే నగ్నియందే కల్పింపఁబడినవి, ఇతి=అని, చింతయేత్=విచారింపవలయును (పూర్వమువలెనే జలమునుగూర్చి విచారింపవలయు ననుట).

తా. స్పష్టము.

అవ. విచారార్థమై జలస్వరూపము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సంత్యా పోఽమూః శూన్యతత్త్వాః సశబ్దాః స్పర్శసంయుతాః,
రూపవత్యో ఽన్యధర్మానువృత్త్యా స్వీయో రసో గుణః. 92

వ్యా. అస్యాపి కారణధర్మాన్ స్వధర్మాంశ్చ విభజ్య దర్శయతి—సంత్యాప ఇతి. శబ్దేన సహ వర్తత ఇతి సశబ్దః సశబ్దశ్చాసౌ స్పర్శశ్చ సశబ్దస్పర్శః తేన యుక్తా ఇత్యర్థః.

టీ. ఆపః=నీరు, సంతి=కలవు (అప్ శబ్దము నిత్య బహువచనము). అమూః=ఇవి, శూన్యతత్త్వాః=సత్పదార్థమునుండి విభాగించిన శూన్యరూపము లగును. సశబ్దాః=శబ్దగుణముతోఁ గూడియున్నవి, స్పర్శసంయుతాః=స్పర్శగుణము కలిగియున్నవి. రూపవత్యః = రూపముకలిగియున్నవి [ఏతత్ = ఇది], అన్యధర్మానువృత్త్యా-అన్య=ఇతరములైనవియదాదులయొక్క, ధర్మ = ధర్మములయొక్క, అనువృత్త్యా=అనువర్తనముచేత కలుగుచున్నది. స్వీయః=స్వకీయమైన, గుణః=గుణము, రసః = రసము.

తా. స్పష్టము.

అవ. జల విచారము నుపసంహరించి భూ విచారము నారంభించుచున్నాఁడు:—

శ్లో. సతో వివేచితా స్వప్సు తన్మిథ్యాత్వే చ వాసితే,
భూమి ర్దశాంశతో న్యూనా కల్పి తాఽప్స్వితి చింతయేత్. 93

వ్యా. వివేకధ్యానాభ్యామపాం మిథ్యాత్వం నిశ్చిత్యానంతరం భూమేర్మి థ్యాత్వం చింతనీయ మిత్యాహ—సత ఇతి.

టీ. అప్సు = ఈ జలము, సతః = సత్పదార్థమునుండి, వివేచితాసు [సతీషు] = వివేచన చేయఁబడినపిదప, తన్మిథ్యాత్వే-తత్ =ఆ జలముయొక్క, మిథ్యాత్వే=వ్యావహారికస్థితియందుఁ గానవచ్చుచున్నను పారమార్థికస్థితియం దట్లు లేకపోవుట, వాసితేచ= చిత్తమునందు దృఢము చేసికొనఁబడిన తర్వాత, భూమిః=భూమి, దశాంశతః=పదియవ భాగంబున, న్యూనా = అల్పపరిమాణముగలదై, అప్సు=జలములయందు, కల్పితా = కల్పింపఁబడెను. ఇతి=అని, చింతయేత్ =విచారింపవలయును. (సర్వసృష్టియు కల్పనామాత్రమే కదా యని భావము).

తా. స్పష్టము.

అవ. భూ స్వరూపమును తన్నిర్ణయమువలన చేయవలసిన కార్యమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. అస్తి భూ స్తత్వశూ న్యాస్యాం శబ్దస్పర్శౌ సరూపకౌ,
రస శ్చ పరతో గంధో నైజ స్సత్తా వివిచ్యతామ్. 94

వ్యా. తస్యా మిథ్యాత్వచింతనాయ తద్ధర్మా నపి విభజతే—అస్తి భూరితి. తేభ్యః సత్తామాత్రం పృథక్ కర్తవ్యమిత్యాహ—సత్తేతి.

టీ. భూః=భూమి, అస్తి=కలదు. [సా = అది], తత్వశూన్యా = సత్పదార్థమునుండి విభాగించినచో శూన్యమైనది. అస్యాం = దీనియందు, సరూపకౌ=రూపముతోఁ గూడిన, శబ్దస్పర్శౌ = శబ్దస్పర్శములును (అనఁగా శబ్దస్పర్శ రూపములు), రసః చ = రసమును కలవు; పరతః=ఇవికాక, గంధః = గంధము, నైజః = స్వాభావికము, (శబ్దస్పర్శ రూప రస గంధము లైదును సామాన్యరూపముతో నాకాశాదులయందు కలవనియును గంధము మాత్రము పృథివియందు విశేషముగఁ గూడ నున్నది యనియును, తక్కిన శబ్దాదులు స్వస్వభూతములను మాత్రము విడిచి తక్కినచోట్ల ననువర్తించినప్పుడు మాత్రమే విశేషయుక్తము లగు ననియు ప్రకరణారంభమునందే వివరించియున్నాము.) (తతః=ఇట్లు భూ రూపమును నిర్ణయించిన పిదప), సత్తా=సత్పదార్థము, వివిచ్యతామ్=విభాగింపఁ బడుఁగాక (పైనఁ జూపిన విచారము నాశ్రయించి సత్పృథువుల విభాగించి పృథివి నసత్యరూపముగ నిర్ణయింపవలయు ననుట).

తా. స్పష్టము.

అవ. ఫలకథనముతో భూ విచారమును ముగించి పంచభూతములవలెనే బ్రహ్మాండాదులను కూడ నసత్యరూపము లని నిర్ణయించుచున్నాఁడు:—

శ్లో. పృథక్ కృతాయాం సత్తాయాం భూమి ర్మిథ్యావశిష్యతే,
భూమే ర్దశాంశతో న్యూనం బ్రహ్మాండం భూమిమధ్యగమ్. 95
బ్రహ్మాండమధ్యే తిష్ఠంతి భువనాని చతుర్దశ,
భువనేషు వసం త్యేషు ప్రాణిదేహా యథాయథమ్. 96
బ్రహ్మాండలోకదేహేషు సద్వస్తుని పృథక్ కృతే,
అసం తోఽండాదయో భాంతు తద్భా నేఽపీహ కా క్షతిః.97

వ్యా. సత్తా పృథక్కరణే ఫలమాహ—పృథగితి. ఇదానీం భౌతికేభ్యో బ్రహ్మాండాదిభ్యః సతో వివేచనాయ తదవస్థానప్రకారం దర్శయతి—భూమేరితి. బ్రహ్మాండేతి. స్పష్టమ్. తేషు సద్వివేచనే ఫలమాహ—బ్రహ్మాండేతి.

టీ. సత్తాయాం = సత్పదార్థము, పృథక్ కృతాయాం = విభాగింపఁబడెనేని, భూమిః=భూమి, మిథ్యా=అసద్రూపిణియై, అవశిష్యతే = మిగులును, భూమి మధ్యగమ్= భూమి మధ్యమున నున్న, బ్రహ్మాండం = బ్రహ్మాండము, భూమేః=భూమికంటె, దశాంశతః=పదియవ భాగముగ, న్యూనం=తక్కువ యైనది (భూమిలో పదియవ భాగముగఁ గల్పింపఁబడె ననుట), బ్రహ్మాండమధ్యే = ఆ బ్రహ్మాండమునకు నడుమ, చతుర్దశ=పదునాలుగైన, భువనాని = లోకములు, తిష్ఠంతి=ఉన్నవి. (ఇవియుఁ గల్పిత మాత్రములే యని యూహించునది). ఏషు = ఈ, భువనేషు = లోకములయందు, యథాయథమ్ = స్వస్వపరిమాణానుసారముగ, ప్రాణిదేహాః = దేవమనుష్యాదిశరీరములు, వసంతి=ఉన్నవి. (భువనములు మాత్రము బ్రహ్మాండములో పదియవ భాగమే. ప్రాణి దేహములు కూడి స్వస్వపరిమాణములలో నెన్ని భేదము లున్నను మొత్తముమీఁద పదియవ భాగమే యని తెలిసికొనవలయును. దేహము లనేకము లగుటచే "యథాయథం" = "యథేష్టముగ" అని ప్రయోగింపఁబడెను.) బ్రహ్మాండలోక దేహేషు = ఈ విధముగ నున్న బ్రహ్మాండములయందును, లోకములయందును, దేహములయందును గల, సద్వస్తుని = "కలదు" అను వ్యవహారమునకుఁ గారణ మయిన సత్పదార్థము, పృథక్ కృతే సతి = విభాగింపఁబడెనేని (అన్నియుఁ బాంచభౌతికములే యగుటచే భూతములకుఁ గల భేదము వీనికిని సత్పదార్థముతో నవశ్య ముండును కదా యని భావము). అండాదయః = బ్రహ్మాండాదులు, అసంతః = అసద్రూపములే యగును. భాంతు=అవి యున్నట్లు ప్రకాశించు

చుండిన ప్రకాశింప నిమ్ము. ఇహ = ఇచ్చట (వివేకము కలిగిన పిదప ననుట), తద్భానే-తత్ =ఆ బ్రహ్మాండాదులు, భానే అపి = ప్రకాశించినను, కా క్షతిః = ఏమి హాని? (అవి వివేకికి నసద్రూపములుగానే కదా తోఁచు ననుట).

తా. స్పష్టము.

అవ. "ప్రపంచ మెట్లు ప్రకాశించినను వివేకికి హాని లేదు" అను విషయమున హేతువును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. భూతభౌతికమాయానాం సమ త్వేఽత్యంతవాసితే,
సద్వ_స్త్వద్వైత మి త్యేషా ధీ ర్విపర్యేతి న క్వచిత్. 98

వ్యా. తద్భానే కా క్షతిరిత్యుక్తమేవార్థం స్పష్టీకరోతి—భూతేతి. భూతానామాకాశాదీనాం భౌతికానాం బ్రహ్మాండాదీనాం మాయాయాశ్చ తత్కారణభూతాయా మిథ్యాత్వే వివేకధ్యానాభ్యాం చిత్తే దృఢం వాసితే సతి సద్వస్తునోఽద్వైతత్వబుద్ధిః కదాచిన్న విహన్యత ఇత్యర్థః.

టీ. భూత భౌతికమాయానాం = భూతములయొక్కయు వానినుండి జనించిన బ్రహ్మాండాదులయొక్కయు వానికిఁ గారణ మగు మాయయొక్కయు, సమత్వే = అసత్యత్వమును, అత్యంతవాసితే = చిత్తమున మిగుల దృఢమయ్యేనేని, సద్వస్తు = సత్పదార్థము, అద్వైతమితి = ఏకరూప మనెడి, ఏషా ధీః = ఈబుద్ధి, క్వచిత్ = ఎప్పటికిని (ఏ పదార్థమును చూచినప్పుడైన ననుట) న విపర్యేతి = విపరీతము కాదు. తిరుగ దనుట; (ఒకప్పుడైన సద్భిన్న పదార్థమును సత్యముగ భావింప దనుట).

తా. ఆకాశాది పంచభూతములకును, అభూతకార్యము లగు బ్రహ్మాండలోక దేహాదులకును, వీని కన్నిటికినిఁ గారణ మగు మాయకును మిథ్యాభావమును వివేకధ్యానములచేత చిత్తమందు మిక్కిలి దృఢ మగు పర్యంతము అభ్యసింపవలెను. అట్లు మిథ్యాభావము దృఢమగుటవలన సద్వస్తువునందు అద్వైతభావబుద్ధి యెప్పటికిని నశింప దని యభిప్రాయము.

అవ. "ఇట్లు సర్వప్రపంచము నసత్యమైన జ్ఞానికి వ్యవహారలోపము కలుగవలసి వచ్చును" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సదద్వైతాత్పృథగ్భూతే ద్వైతే భూమ్యాదిరూపిణి,
తత్తదర్థక్రియా లోకే యథా దృష్టా త థైవ సా. 99

వ్యా. నను భూమ్యాదీనామసత్త్వే విదుషో వ్యవహారలోపః ప్రసజ్యేతే త్యాశంక్య వివేకేన మిథ్యాత్వనిశ్చయేఽపి భూమ్యాదేః స్వరూపోపమర్దనాభావాన్న వ్యవహారో లుప్యత ఇత్యాహ.—సదద్వైతాదితి.

టీ. సదద్వైతాత్ = సత్పదార్థ మద్వితీయ మగుటవలన, ద్వైతే = రెండవది యగు, భూమ్యాదిరూపిణి = భూమ్యాదులే స్వరూపముగాఁ గల భూత భౌతికములు, పృథగ్భూతే సతి=భిన్నముకాఁగా, లోకే = లోకమునందు, తత్తదర్థక్రియా = ఆయా భూమ్యాదుల ప్రయోజనము, యథా = ఎట్లు, దృష్టా = చూడఁబడెనో, సా = అది, (ప్రయోజన మనుట). తథా ఏవ = అట్లే యని తెలిసికొనవలయును. (వ్యవహారమునకు లోపము కలుగవలసిన పని లే దనుట).

తా. ఇట్టి జ్ఞానమువలన జ్ఞానికి వ్యవహారలోకము కలుగ నక్కఱ లేదు. ఈప్రపంచమును సత్పదార్థభిన్నముగాను మిథ్యగాను విచారముచే నిర్ణయించితిమి. ఇంతయేకాని దాని స్వరూపమును ధ్వంసము చేయలేదు కదా! "జ్ఞానమాత్రముచేతనే రజ్జుసర్పము వ్యవహార సాధనము కాకుండ పోవుచున్నది కదా. ఇట్లే ప్రపంచముకూడఁ బో వచ్చును." అనియెద వేమొ యట్లు కాదు. రజ్జుసర్పభ్రాంతి యప్పుడు మాత్రమే జనించినది; ప్రపంచభ్రాంతి యన్ననో అనాది. కారణ దార్ఢ్యము ననుసరించియే కదా కార్యదార్ఢ్యము కలుగుట. కావున రజ్జుసర్పమువలె నిది జ్ఞానమాత్రముతో వ్యవహార సాధనత్వమును విడువ నేరదు. "కారణము నశించెను గదా!" అనియెద వేమొ. కారణ నాశానంతరమునఁ గూడఁ గార్య మొకింతకాల ముండు ననుట జగత్ప్రసిద్ధము. రజ్జుసర్పభ్రాంతి పోయిన పిదపఁగూడ సర్పదర్శనమువలన గలిగిన భయకంపాదులు కొంతకాలమువఱకు తొలఁగవు, స్థాణు పురుషభ్రాంతి తొలఁగినపిదపఁ గూడ చోరభ్రాంతివలనఁ గలిగిన భయము వెంటనే తొలఁగదు. ఇట్లే ప్రపంచభ్రాంతి తొలఁగినను భ్రాంతిసమమున నున్న వ్యవహారము తొలఁగదు. రజ్జుసర్పభ్రాంతి మొదలగువానివలనఁ గలిగిన భయాదు లల్పకాలము మాత్రమే యుండుటయు ప్రపంచభ్రాంతివలన కలిగిన వ్యవహారము జీవితాంతమువఱకును మఱియొక పక్షమున మఱికొన్ని జన్మములవఱకునుఁ గూడ నుండుటయు కారణదార్ఢ్యతారతమ్యమువలన నని యెఱుంగునది, భ్రాంతి నాశముతోడనే రజ్జుసర్పాదులు గానరాకుండుటకును ప్రపం

చము బహుకాలమువఱకు గానవచ్చుచుండుటకును గూడ నిదియే కారణము. కావున మిథ్యాత్వమును నిర్ణయించినంత మాత్రమున వ్యవహారము లోపము నొంద నక్కఱ లేదు? భ్రాంతి సమయమున నే యే విషయ మె ట్లెట్లు జరుగుచుండెనో తర్వాత కూడ నట్లట్లే జరుగ వచ్చును కావున జ్ఞాన్యజ్ఞానులకు నిశ్చయమునందే కాని వ్యవహారము నందు భేదము లేదు.

అవ. ఇట్లైనచో సాంఖ్యాదులు చెప్పు భేదసాధనయుక్తులకు బరిహార మేమి? అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సాంఖ్యకాణాదబౌద్ధాద్యైర్జగద్భేదో యథా యథా,
ఉత్ప్రేక్ష్యతే నైకయుక్త్యా భవత్వేష తథా తథా. 100

వ్యా. నను సత్తత్త్వస్యాద్వైతరూపత్వే సాంఖ్యాదిభిరభిధీయమానస్య భేదస్య కుతో న నిరాసః క్రియత ఇత్యాశంక్య వ్యావహారికభేదస్యాస్మాభిరభ్యుపగతత్వా త్తన్నిరాసాయ న ప్రయత్యత ఇత్యాహ—సాంఖ్యేతి.

టీ. సాంఖ్య...ద్యైః—సాంఖ్య=సాంఖ్యులచేతను, కాణాద=తార్కికులచేతను, బౌద్ధాద్యైః=బౌద్ధులు మొదలగువారిచేతను, జగద్భేదః-జగత్ = ప్రపంచముయొక్క, భేదః = భేదము, యథా యథా=ఏయే విధముగా, అనేక యుక్త్యా - అనేక=బహువిధ ములైన, యుక్త్యా = యుక్తులచేత, ఉత్ప్రేక్ష్యతే = ఊహింపఁబడుచున్నదో, తథా తథా=అయ్యాయి విధంబుల, ఏషః=ఈ జగద్భేదము, భవతు=అగుఁగాక.

తా. సాంఖ్యులును, బౌద్ధులును, తార్కికులును, వేదప్రామా ణ్యము నంగీకరింపక కేవల యుక్తులచేత నీశ్వరునికంటె జగంబు వేఱ నియు నది సత్య మనియుం జెప్పెదరు. మే మన్ననో అద్వితీయ బ్రహ్మ ముకన్న వేఱుగా సత్యముగా నీ జగత్తు లే కున్నను వ్యవహారకాలము నందుమాత్రము స్వప్నప్రపంచమువలె నుండవచ్చు నని సమాధానము చెప్పుచున్నాము, కావున వారి యుక్తుల నింతకన్న నిరసింప నక్కఱ లేదు.

అవ. "సాంఖ్యాదివాదులును సప్రమాణముగా సద్వస్తువునకు భేదము చెప్పు చున్నారు. దానిని మీరు ఎట్లు నిరసించెదరు?" అనిన, దానికి సమాధానము చెప్పు చున్నాఁడు:—

శ్లో. అవజ్ఞాతం సదద్వైతం! నిశ్శంకైరన్యవాదిభిః,
ఏవం కా క్షతిరస్మాకం తద్ద్వైతమవజానతామ్. 101

వ్యా. నను ప్రమాణసిద్ధస్య సత్త్వభేదస్యావజ్ఞానుపపన్నే త్యాశంక్యాహ— అవజ్ఞాతమితి. యథాన్యవాదిభిః సాంఖ్యాదిభిః నిశ్శంకైః శ్రుత్యాదిసిద్ధస్యాపి సదద్వైతస్యావజ్ఞా క్రియతే శ్రుతియుక్త్యనుభవావష్టంభేనాస్మాభిస్తదీయద్వైతానాదరణే కిం హీయత ఇత్యర్థః.

టీ. నిశ్శంకైః = నిర్భయులైన, అన్యవాదిభిః = సాంఖ్యాదివాదులచేత, సదద్వైతమ్ = సద్రూప మగు నద్వైతతత్త్వము, అవజ్ఞాతం = నిరాకరింపఁబడినది. ఏవమ్= ఇట్టులే, తద్ద్వైతం = ఆద్వైతము, అవజానతాం = నిరాకరించెడి, అస్మాకం = మాకు, అనఁగా శ్రుతి యుక్తి అనుభవము అనువానిచే నిరాకరించువా రమయిన మాకు, కా క్షతిః=ఏమి లోపము? అనఁగా ద్వైతము సత్యము గా దని నిరాకరించుట తప్పు కా దనుట.

తా. మాయద్వైతతత్త్వము శ్రుతియుక్త్యనుభవసిద్ధ మై యున్నది. అట్టిదానినే వారు నిరసించినప్పుడు మేము ద్వైతమును సత్యము గా దని నిరసించుట యెంతమాత్రము తప్పు గాదు. శ్రుత్యాది బలముచే నట్లు చేయఁగలిగితి మని యభిప్రాయము.

అవ. "ద్వైతనిరాకరణము చేయుటవలన నీ కేమైనఁ బ్రయోజనము గలదా?" యనిన జీవన్ముక్తి యను ప్రయోజన మున్నది. నిష్ప్రయోజనముగా ద్వైతమును నిరసించుచున్నా మనుకొనవలదు అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ద్వైతావజ్ఞా సుస్థితా చేదద్వైతే ధీః స్థిరా భవేత్,
స్థైర్యే తస్యాః పుమా నేష జీవన్ముక్త ఇతీర్యతే. 102

వ్యా. నను నిష్ప్రయోజనేయం ద్వైతావజ్ఞేత్యాశంక్య జీవన్ముక్తిలక్షణప్రయోజనసద్భావాన్నైవ మిత్యాహ—ద్వైతేతి.

టీ. ద్వైతావజ్ఞా - ద్వైత = ప్రపంచముయొక్క, అవజ్ఞా = నిరసించుట, సుస్థితా చేత్ = దృఢముగా నున్నచో, అద్వైతే = అద్వితీయ బ్రహ్మతత్త్వమునందు, ధీః = బుద్ధి-అనఁగా దృఢనిశ్చయత, స్థిరా = కదలనిదై, భవేత్=ఉండును. తస్యాః = అట్టిద్వైత తిరస్కారమునకు, స్థైర్యే = స్థిరత్వము గల్గియుండిన, ఏషః=ఈ, పుమాన్= అధికారి యైన పురుషుఁడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడు, ఇతి = అని, ఈర్యతే = వ్యవహరింపఁబడుచున్నాఁడు.

తా. ద్వైత మంతయు మిథ్య యని యెప్పుడు దృఢనిశ్చయ మేర్పడునో అప్పుడు అద్వితీయ మైన బ్రహ్మతత్వమున దృఢనిశ్చయత యేర్పడును. అట్లు దృఢనిశ్చయత గల మనుజుఁడు జీవన్ముక్తుఁ డనుటకు సందేహము లేదు. జీవన్ముక్తుఁడు అనఁగా జీవించియున్నపుడే సంసారబంధముచే విడువఁబడినవాఁ డనుట. జీవన్ముక్తి లాభము ద్వైత మిథ్యాత్వజ్ఞానమువల్లఁ గల్గుటచే ద్వైత నిరాకరణము నిష్ప్రయోజనము గాదు.

అవ. ఇట్లు ద్వైతమును నిరాకరించినందువలన జీవన్ముక్తిలాభము మాత్రమే కాదు. విదేహముక్తిలాభముం గూడఁ గలదు. అనెడి శ్రీకృష్ణవాక్యమును నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి. 103

వ్యా. న కేవలం జీవన్ముక్తిరేవ ప్రయోజన మపితు విదేహముక్తి రపీత్యభిప్రాయేణ కృష్ణవాక్యమప్యుదాహరతి—ఏషేతి.

టీ. హేపార్థ = ఓయర్జునా, ఏషా = ఇది, బ్రాహ్మీ = బ్రహ్మయం దుండునట్టి, స్థితిః=ఉనికి, అనఁగా సర్వమును సన్న్యసించి బ్రహ్మస్వరూపుఁడై యుండుట. ఏనాం= ఈ విధముగా బ్రహ్మయై యుండుటను, ప్రాప్య=పొంది, న విముహ్యతి = విమోహమును బొందఁడు, అస్యాం = ఈస్థితియందు, అంతకాలేఽపి = అంత్యసమయమునందునను, స్థిత్వా = ఉండి, బ్రహ్మనిర్వాణం = మోక్షమును, ఋచ్ఛతి = పొందును.

తా. బ్రహ్మాత్మైక్యస్థితి నీకు పై విధముగఁ దెల్పఁబడెను. బ్రహ్మభావముతో నుండువాఁ డిఁక నెన్నఁటికిని సంసారబంధమునఁ జిక్కుకొనఁడు. ఈస్థితి యవసానకాలమందుఁ గల్గినను విదేహ కైవల్యము నిరభ్యంతరముగఁ గల్గును. మొదటనే బ్రహ్మచర్యమున సన్న్యసించినవానికే యీ బ్రహ్మభావ మలవడెనేని యిఁక జెప్పవలసిన దేమి? అని యర్జునునకు శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత ద్వితీయాధ్యాయమందుఁ జెప్పెఁగదా.

అవ. "ఇట నంతకాల మనుటచే నిప్పు డున్న దేహము పడిపోవుట యని కాదు" అని తన యభిప్రాయము నుడువుచున్నాఁడు:—

శ్లో. సదద్వైతేఽనృతద్వైతే యదన్యోన్యైక్యవీక్షణమ్,
తస్యాంతకాలస్తద్భేదబుద్ధి రేవ న చేతరః. 104

వ్యా. అంతకాలశబ్దేన వర్తమానదేహపాతోఽభిధీయత ఇత్యాశంకాం వారయితుం వివక్షితమర్థమాహ—సదద్వైత ఇతి. సద్రూపేఽద్వైతేఽనృతరూపే ద్వైతేచ యదన్యోన్యాధ్యాసలక్షణమైక్యజ్ఞానమస్తి తస్యైక్యభ్రమస్యాంతకాలో నామతయో రద్వైతద్వైతయో స్సత్యానృతరూపేణ భేదబుద్ధిరేవ నాపరో వర్తమానదేహపాత ఇత్యర్థః.

టీ. సదద్వైతే - సత్ = సద్రూపమైన, అద్వైతే = అద్వితీయబ్రహ్మము నందును, అనృతద్వైతే - అనృత=ఋతముగాని యనఁగా మిథ్యయైన, ద్వైతే=ద్వైతమునందును, యత్ = ఏ, అన్యోన్యైక్యవీక్షణం-అన్యోన్య=పరస్పరతాదాత్మ్యముగల, ఐక్యవీక్షణం = ఐక్యజ్ఞానముండెనో; తస్య=ఆయైక్యభ్రమకు, అంతకాలః = అవసానకాల మనఁగా, తద్భేదబుద్ధిరేవ - తత్ = వానియొక్క అనఁగా ద్వైతాద్వైతములయొక్క, భేదబుద్ధిరేవ=ద్వైతము మిథ్య, అద్వైతము సత్యము అను భిన్నముగా నున్న నిశ్చయమే యగును. ఇతరః=అన్యమైన దేహపాతము. న చ = కానేరదు.

తా. సద్వస్తురూప మగు అద్వైతమందును, మిథ్యారూప మగు ద్వైతమందును ఆన్యోన్యాధ్యాసలక్షణముగల ఏ యైక్యభ్రమ కలదో ఆ ఐక్యభ్రమకు అంతకాల మనఁగా ఆ అద్వైతద్వైతములయొక్క సత్యమిథ్యారూపబుద్ధియే యగునుగాని ప్రాణహాని కాదు. ఇట్లు పూర్వోక్తభగవద్వాక్యమందుఁ గల అంతకాలశబ్దమునకు అర్థ మని తెలియవలెను.

అవ. లేక యీయంతకాలశబ్దమునకు లోకములోని వాడుకనుబట్టి మరణ మని యర్థము చేసినను చేయ నగును. తప్పు లేదు అనుచున్నాఁడు:—

శ్లో. యద్వాంతకాలః ప్రాణస్య వియోగోఽస్తు ప్రసిద్ధితః,
తస్మిన్కాలేఽపి న భ్రాంతేర్గతాయాః పునరాగమః. 105

వ్యా. ఇదానీం లోకప్రసిద్ధార్థస్వీకారేఽపి న దోష ఇత్యభిప్రాయేణాహ—యద్వేతి.

టీ. యద్వా=పైవిధముగాఁ గాక, అంతకాలః=అంతకాల మనఁగా, ప్రసిద్ధితః = లోకమున వాడుకొనురీతిగా, ప్రాణస్య = ప్రాణముయొక్క, వియోగః = పోవుట యనియే, అస్తు=అగుఁ గాక, మరణ మనినను అనవచ్చును. తస్మిన్ = ఆ, కాలేఽపి = సమయమందును, గతాయాః = పోయిన, భ్రాంతేః=భ్రమయొక్క, పునః = తిరుగ, ఆగమః = వచ్చుట, న = లేదు.

తా. మఱియొకపక్షమందు పూర్వోక్త భగవద్వాక్యమందుఁ గల అంతకాలశబ్దమునకు మరణసమయ మని అర్థముచేసినను, పూర్వము వివేకముచేత నశించిన ద్వైతభ్రాంతి, మరణకాలమందు సయితము మఱలఁ గలుగ దని యభిప్రాయము.

అవ. ఈయర్థమునే స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. నీరోగ ఉపవిష్టో వా రుగ్ణో వా విలుఠన్ భువి,
మూర్ఛితో వా త్యజత్యేష ప్రాణాన్ భ్రాంతి ర్న సర్వథా.

వ్యా. ఉక్తమేవార్థం ప్రపంచయతి—నీరోగ ఇతి.

టీ. ఏషః = ఇతఁడు, నీరోగః = రోగములు లేనివాఁడయి, ఉపవిష్టో వా = సుఖముగాఁ గూర్చుండి కాని, రుగ్ణః = రోగములు గలవాఁడై, భువి = భూమియందు, విలుఠన్ వా = దొఱలుచుఁగాని, మూర్ఛితో వా = మూర్ఛపోయి గాని-అనఁగా మనః స్మారకము లేక గాని, ప్రాణాన్ = ప్రాణములను, త్యజతు = విడుచునుగాక. సర్వథా = అన్నివిధములచేతను, భ్రాంతిః = ద్వైతభ్రమ, న = ఎంతమాత్రము కలుగదు.

తా. ఏరోగమును లేక సుఖముగా కూర్చున్నవాఁడు కూర్చుండి నట్లుండి ప్రాణములు విడచినను, వ్యాధి బాధచే భూమిని బడి పొరలుచు ప్రాణములు విడచినను, మనస్స్మారకమే లేక ప్రాణములు వదలినను జ్ఞానికి వివేకముచే నశించిన ద్వైతభ్రాంతి మఱల గలుగ దని భావము.

అవ. "ప్రాణము పోవునపుడు మూర్ఛ మొదలగువానిచే నదివఱకుఁ గల్గిన బ్రహ్మజ్ఞానము నశింపదా?" అనిన దృష్టాంతము చెప్పి బ్రహ్మజ్ఞానము నశింప దని సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దినే దినే స్వప్నసుప్త్యోరధీతే విస్మృతేఽప్యయమ్,
పరేద్యుర్నానధీతస్స్యాత్తద్వద్విద్యా న నశ్యతి. 107

వ్యా. నను ప్రాణవియోగకాలే మూర్ఛాదినా జ్ఞాననాశభ్రాంతి స్స్యాదేవేత్యాశంక్య జ్ఞాననాశాభావే దృష్టాంతమాహ—దిన ఇతి. యథా ప్రత్యహమధీతే వేదే స్వప్నసుషుప్త్యాద్యవస్థాయాం విస్మృతేఽపి పరేద్యురనధీతవేదత్వం నాస్తి. తథామృతికాలేఽపి తత్త్వానుసంధానాభావేఽపి విజ్ఞాననాశాభావ ఇత్యర్థః.

టీ. దినేదినే = ప్రతిదినము, అధీతే = పఠింపఁబడిన వేదము, స్వప్నసుప్త్యోః = స్వప్నావస్థ సుషుప్త్యవస్థలయందు, విస్మృతేఽపి = మఱచిపోయినను, అయం=ఈవేదాధ్యయనము, పరేద్యుః = మఱునాఁడు, అనధీతః = చదువఁబడనిది, న స్యాత్ =కానేరదు. తద్వత్ = ఆరీతిగనే, విద్యా = బ్రహ్మజ్ఞానము, న నశ్యతి = నశింపదు.

తా. వేదము చదువుకొని యొకఁడు స్వప్నసుషుప్త్యవస్థలలో నాచదివినవేదమును మఱచినను మఱుదినము మేల్కాంచినవెంటనే మఱపులేక వచ్చినదానిం జదువుట చూచుచున్నాము. అటువలెనే యొకవేళ బ్రహ్మజ్ఞానము మూర్ఛాదులచేత మరణకాలమున నంతరించిన ట్లున్నను నది యెంతమాత్రము చెడక యుండును. అనఁగా జ్ఞానమునకు నాశము కలుగదు.

అవ. ఒకమాఱు బ్రహ్మజ్ఞానము గలిగిన నది యెన్నటికిని నశింపదు. అని దానిబలమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. ప్రమాణోత్పాదితా విద్యా ప్రమాణం ప్రబలం వినా,
న నశ్యతి న వేదాంతాత్ప్రబలం మాన మీక్ష్యతే. 108

వ్యా. జ్ఞాననాశాభావమేవోపపాదయతి—ప్రమాణేతి.

టీ. విద్యా=బ్రహ్మజ్ఞానము, ప్రమాణోత్పాదితా - ప్రమాణ = వేదాంతప్రమాణముచేత, ఉత్పాదితా = పుట్టింపఁబడుచున్నది. అనఁగాఁ గలుగును. ప్రబలం = అతిశయబలముగల, ప్రమాణం వినా = ప్రమాణములేనిదగుచు, న నశ్యతి = నశింపదు. పోఁజాల దనుట. వేదాంతాత్ = ఉపనిషత్ప్రమాణముకంటె, ప్రబలం = మంచిబలముగల, మానం = ప్రమాణము, నేక్ష్యతే = చూడఁబడదు. అనఁగా వేదాంతప్రమాణమును మించినప్రమాణ మెక్కడను లేనే లే దనుట.

తా. సద్గురువులయొద్ద వేదాంతవిచారము చేయఁగాఁ జేయఁగా బ్రహ్మైక్యజ్ఞానము కలుగుచున్నది. అట్లు దృఢముగను సప్రమాణముగను గలిగిన నిత్యాపరోక్షసాక్షాత్కారజ్ఞానము వేదాంతప్రమాణమును మించిన యింకొకప్రమాణ ముండినప్పుడుగదా నశింపవలెను. అట్టిప్రమాణరాజము వేదాంతమే యై యుండ బ్రహ్మజ్ఞాన మెన్నఁటికైన నశించునా? నశింప దని భావము.

అవ. ఇదివఱకు చెప్పుచున్న యంశమును ముగించుచున్నాఁడుః—

శ్లో. తస్మాద్వేదాంతసంసిద్ధం సదద్వైతం న బాధ్యతే,

అంతకాలేఽప్యతో భూతవివేకాన్నిర్వృతిస్స్థితా.
ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
మహాభూతవివేకః.

వ్యా. ఉపపాదితమర్థ ముపసంహరతి—తస్మాదితి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమద్భారతీతీర్థ విద్యారణ్య
మునివర్యకింకరేణ శ్రీరామకృష్ణాఖ్యేనవిదుషావిరచితా
పంచభూతవివేకవ్యాఖ్యా సమాప్తా.

టీ. తస్మాత్ = ఆకారణమువలన, వేదాంతసుసిద్ధం - వేదాంత = ఉపనిషత్ప్రమాణానుసారముగా, సంసిద్ధం = చక్కఁగాఁ గలిగిన, సదద్వైతం - సత్ = సద్రూపమైన, అద్వైతం = ద్వితీయమిథ్యాత్వనిశ్చయపూర్వకమైన బ్రహ్మజ్ఞానము, అంతకాలేఽపి=మరణకాలముననుు, న బాధ్యతే = బాధింపఁబడదు అనఁగా నశింప దనుట. అతః= నశింపని దగుటచేత, భూతవివేకాత్ - భూ = పంచభూతములయొక్క, వివేకాత్ = పరిశీలనచేసి తెలిసికొనుటవలన, నిర్వృతిః = ముక్తి, స్థితా = తప్పక కల్గుచున్నది.

తా. చక్కఁగా వేదాంతములను శ్రవణమనననిదిధ్యాసనముల చేతఁ జిరతరాభ్యాస మొనర్చుటవలనఁ గలిగినప్రత్యగభిన్నబ్రహ్మజ్ఞానము ప్రాణవియోగసమయమునఁ గూడ నశింప దని తేలినది. కనుక భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములను, వానిగుణములను లక్షణములను బరిశీలించి ఆత్మతత్త్వము నపరోక్షముగా నెఱింగినవారికిం బునరావృత్తి లేని మోక్షసామ్రాజ్యము తప్పక గల్గు నని యెఱుంగవలయును.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు మహాభూతవివేక మను
ద్వితీయ ప్రకరణము.



శ్రీరస్తు
శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## తృతీయ ప్రకరణము

### పంచకోశవివేక ప్రకరణము

అవ. శ్రీవిద్యారణ్యస్వాములవారు తైత్తిరీయోపనిషత్తాత్పర్యమును వర్ణింప దలంచి పంచకోశవివేక మను ప్రకరణమును ఆరంభించుచు విషయప్రయోజనములను సూచించుచున్నారు (విషయ మన గ్రంథములో చెప్పఁబడెడియంశము, ప్రయోజన మనఁగా గ్రంథపాఠమువలనఁ గలిగెడిలాభము).

శ్లో. గుహాహితం బ్రహ్మ యత్తత్ పంచకోశవివేకతః,
బోద్ధుం శక్యం తతః కోశపంచకం ప్రవివిచ్యతే. 1

వ్యా. తైత్తిరీయోపనిషత్తాత్పర్యవ్యాఖ్యానరూపం పంచకోశవివేకాఖ్యం ప్రకరణమారభమాణ, ఆచార్య స్తత్ర శ్రోతృప్రవృత్తిసిద్ధయే ప్రయోజన మభిధేయం సూచయన్ ముఖతశ్చికీర్షితం గ్రంథం ప్రతిజానీతే:—గుహాహిత మితి. 'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమ' న్నితి శ్రుత్యా గుహాహితత్వేనాభిహితం యద్బ్రహ్మాస్తి తద్గుహాశబ్దవాచ్యాన్నమయాదికోశపంచకవివేకేన జ్ఞాతుం శక్యతే. తత స్తేషాం కోశానాం పంచకంప్రకర్షేణ ప్రత్యగాత్మనః సకాశాద్విభజ్య ప్రదర్శ్యత ఇత్యర్థః.

టీ. యద్బ్రహ్మ = ఏబ్రహ్మవస్తువు, గుహాహితం - గుహా = పంచకోశము లనెడి గుహయందు, అహితం = ఉంచఁబడియున్నదో, తత్ = ఆపరబ్రహ్మను, పంచకోశవివేకతః - పంచకోశ = అయిదుకోశములయొక్క, వివేకతః = వేఱుపఱచి తెలిసికొనుట వలన, బోద్ధుం = తెలిసికొనుటకు, శక్యం = సాధ్యమగుచున్నది. తతః = అందువలన, కోశపంచకం - కోశ = అన్నమయాదికోశములయొక్క, పంచకం = ఐదును, ప్రవివిచ్యతే=వేఱుపఱచి తెలుపఁబడుచున్నది, (కోశ మనఁగా అత్మను మాటుపఱచెడి కత్తియొఱవంటి పదార్థము).

తా. శ్రు. 'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్' అను శ్రుతిచేత అన్నమయాదిపంచకోశము లనెడిగుహాయందు ఏపర బ్రహ్మము ఉన్నట్లు చెప్పఁబడెనో, ఆపరబ్రహ్మమును పంచకోశములను వివేచనచేసి యెఱుఁగుటకు సాధ్య మగును. అందుచేత కోశపంచక మును ప్రత్యగాత్మస్వరూపముకంటె వేఱుగా విభజించి యీప్రకరణ మున తెలుపఁబడును.

శ్లో. దేహాదభ్యంతరః ప్రాణః ప్రాణాదభ్యంతరం మనః,
తతః కర్తా తతో భోక్తా గుహా సేయం పరంపరా. 2

వ్యా. నను కేయం గుహా? యస్యాం నిహితం బ్రహ్మకోశపంచకవివేకే నావ బుధ్యత ఇత్యాశంక్య శ్రుత్యా గుహాశబ్దేన వివక్షితమర్థమాహ—దేహాదితి. దేహాదన్న మయాత్ప్రాణమయః అభ్యంతరః ఆన్తరః ప్రాణాత్ప్రాణమయాన్మనః మనోమయః అభ్యంతర ఆంతరస్తతో మనోమయాత్కర్తా విజ్ఞానమయః ఆంతర ఇత్యనుషజ్యతే. తతో విజ్ఞానమయాద్భోక్తా ఆనందమయః. సోఽపి పూర్వవదాంతర ఇత్యర్థః. సేయం అన్నమయాద్యానందమయాంతానాం పరంపరా గుహాశబ్దే నోచ్యత ఇత్యర్థః.

టీ. దేహాత్ = అన్నమయకోశముకంటె, ప్రాణః = ప్రాణమయకోశము, అభ్యం తరః = లోపలిది. ప్రాణాత్ = ప్రాణమయకోశముకంటె, మనః = మనోమయకోశము; అభ్యంతరం = లోపలిది. తతః = ఆ మనోమయకోశముకంటె; కర్తా = విజ్ఞానమయకోశ మును, తతః = ఆవిజ్ఞానమయకోశముకంటె, భోక్తా = ఆనందమయకోశమును, (అభ్యం తరః=లోపలిది అగును) సేయం-ఆ యీ పరంపరాక్రమముగా నున్న పంచకోశస్వరూ పము, గుహా=గుహ యని చెప్పబడుచున్నది.

తా. స్థూలదేహము అన్నమయకోశ మని చెప్పఁబడుచున్నది. దానికంటె లోపల ప్రాణమయకోశమును, దానికి లోపల మనోమయ కోశమును, దానికి లోపల విజ్ఞానమయకోశమును, దానికిని లోపల ఆనందమయకోశమును గలవు. ఈవిధముగా నొకటికంటె నొకటి క్రమముగా లోపలివై యున్నవి. ఇట్టి పంచకోశస్వరూపము గుహ యని చెప్పఁబడుచున్నది.

అవ. అన్నమయకోశము కార్యమైనను అయ్యదియే ఆత్మ యని యేల చెప్పఁ గూడదు? అను శంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. పితృభుక్తాన్నజాద్వీర్యాజ్జాతోఽన్నేనైవ వర్ధతే,
దేహస్సోఽన్నమయోఽనాత్మా ప్రాక్పోర్ధ్వం తదభావతః. 3

వ్యా. ఇదానీమన్నయస్య స్వరూపం తదనాత్మత్వం చ దర్శయతి—పితృభుక్తేతి. పితృభుక్తాన్నజాన్మాతా పితృభుక్తాద్యవవ్రీహ్యాలక్షణా దన్నాజ్జాయమానం యద్వీర్యమస్తి తస్మాద్వీర్యాద్యో దేహో జాతః. యశ్చ జననానంతరం క్షీరాద్యన్నేనైవ వర్ధతే స దేహోఽన్నమయోఽన్నస్య వికారః, స ఆత్మా న భవతి. కుత ఇత్యత ఆహ—ప్రాగితి జన్మనః ప్రాక్ మరణాదూర్ధ్వం చ తదభావతః తస్య దేహస్యాభావా దిత్యర్థః. వివాదాధ్యాసితో దేహ ఆత్మాన భవతి. కార్యత్వా ద్ఘటాదివదితి భావః.

టీ. పితృభుక్తాన్నజాత్-పితృభుక్త=తలిదండ్రులచే భుజింపఁబడిన, అన్నజాత్=అన్నమువలన కలిగిన, వీర్యాత్ = వీర్యమువలన, (శుక్లశోణితములవలన), జాతః = పుట్టిన, దేహః = స్థూలదేహము, అన్నేనైవ=అన్నముచేతనే, వర్ధతే=పెరుఁగుచున్నది. సః = ఆ స్థూలదేహము, అన్నమయః = అన్నవికారమగును. అన్నముయొక్క కార్యమగు ననుట. ప్రాక్ = ఉత్పత్తికి పూర్వమును, ఊర్ధ్వం చ = నశించినతర్వాతను, తదభావతః = ఆస్థూలదేహము లేకపోవుటవలన, సః = ఆ స్థూలదేహము, ఆత్మా = ఆత్మ, న = కాదు.

తా. తల్లిదండ్రులచేత భుజింపఁబడిన యన్నమువలన పుట్టి యన్నముచేతనే పెరిఁగి అన్నవికారమైన అన్నమయకోశము ఉత్పత్తికి పూర్వమును నశించినతర్వాతను లేకపోవుటవలన స్థూలదేహ మాత్మ కాదు. అనఁగా, వివాదమునకు ఆధారమైన స్థూలదేహము కార్యమగుటవలన ఘటాదులవలెనే ఆత్మకా దని యభిప్రాయము.

శ్లో. పూర్వజన్మ న్యస న్నేతజ్జన్మ సంపాదయే త్కథమ్,
భావిజన్మ న్యసత్కర్మ న భుంజీ తేహ సంచితమ్. 4

వ్యా. హేతురస్తు. సాధ్య మభూద్విపక్షే బాధకాభావాదప్రయోజకోఽయం హేతురిత్యాశంక్య కృతాభ్యాగమకృతవిప్రణాశాఖ్యబాధకసద్భావాన్మైవ మితి పరిహరతి—పూర్వజన్మనీతి. ఏతద్దేహరూపస్యాత్మనః పూర్వస్మిన్జన్మన్యసత్త్వాదేతజ్జన్మహేత్వదృష్టా సంభవేఽప్యస్య జన్మనోఽప్యక్రియమాణత్వాదకృతాభ్యాగమః, ప్రసజ్యేత. తథా భావిజన్మన్యప్యస్య దేహరూపస్యాత్మనోఽ సత్త్వాదభావాదిహానుష్ఠితయోః పుణ్యపాపయోః ఫలభోక్తురభావేన భోగమంతరేణాపి కర్మక్షయః ప్రసజ్యేతాయం కృతవిప్రణాశః ఏవం కృతనాశాకృతాభ్యాగమరూపబాధకసద్భావాదాత్మనః కార్యత్వం నాంగీకర్తవ్యమితి భావః.

టీ. పూర్వజన్మని = వెనుకటిజన్మమునందు, అసన్ = ఆత్మత్వముచేత దేహము లేని దగుచు, ఏతజ్జన్మ = ఈజన్మమును, కథం = ఎట్లు, సంపాదయేత్ = సంపాదించును? (సంపాదింప శక్యము కా దనుట.) భావిజన్మని=రాఁబోవు జన్మమునందు, అసత్=ఆత్మత్వముచేత శరీరము లేకపోవుచు, ఇహ = ఈజన్మమందు, సంచితం = సంపాదింపఁబడిన, కర్మ = కర్మను, న భుంజీత = అనుభవింపకయే నశింపవలసివచ్చును.

తా. ఈశరీరము పుట్టుటకు ముందుజన్మమున సుకృతదుష్కృతముల నాచరించెడి ఆత్మ లేనియెడల శరీరము గలుగుటయే ఘటింపదు. కారణము లేనిదే కార్యము నెవ్వరు నంగీకరింపరు. ఇదియే యకృతాభ్యాగమదోష మనఁబడును. ఇప్పుడు ఈశరీరమూలమునఁ జేసినపుణ్యపాపఫలములను జన్మాంతరమున ననుభవించుటకై యప్పు డాత్మ యుండి తీరవలెను. అప్పు డాత్మయే లేదు అనునెడల పుణ్యపాపములు నిష్ఫలములు అనవలసివచ్చును. ఇయ్యది కృతవిప్రణాశ మను దోషము. దీనిని శాస్త్రకారు లంగీకరింపరు. కావున పూర్వోత్తర కాలములందును నుండెడి యాత్మ పూర్వోత్తరకాలములందు లేక మధ్యకాలములోనే యుండెడి స్థూలదేహ మనఁబడుచున్న అన్నమయకోశములు కానేరదు ఇవి ఆత్మకంటె భిన్నములుకాని, యొక్కటియగు ఆత్మ కా దని భావము.

అవ. ఈవిధముగా నన్నమయకోశము ఆత్మ గా దని నిరూపించి, ప్రాణమయకోశస్వరూపమును దాని అనాత్మత్వమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. పూర్ణో దేహే బలం యచ్ఛ న్నక్షాణాం,యః ప్రవర్తకః,
వాయుఃప్రాణమయో నాసా వాత్మా చైతన్యవర్జనాత్. 5

వ్యా. ఏవమన్నమయకోశస్యానాత్మత్వం ప్రదర్శ్య ప్రాణమయకోశస్య స్వరూపం తదనాత్మత్వం చ దర్శయతి—పూర్ణ ఇతి. యో వాయుర్దేహే పూర్ణః పాదాదిమస్తకపర్యంతం వ్యాప్తస్సన్బలం యచ్ఛన్వ్యానరూపేణ సామర్థ్యం ప్రయచ్ఛన్నక్షాణాం చక్షురాదీనామింద్రియాణాం ప్రవర్తకః ప్రేరకో వర్తతే, న వాయుః ప్రాణమయ ఇత్యుచ్యతే. అసావప్యాత్మా న భవతి. తత్ర హేతుమాహ—చైతన్యేతి. వివాదాధ్యాసితః ప్రాణా ఆత్మా న భవతి జడత్వాద్ఘటాదివదితి భావః.

టీ. యః = ఏవాయువు, దేహే = శరీరమునందు, పూర్ణస్సన్=అంతటను నిండి యున్నదగుచు, బలం=సామర్థ్యమును, యచ్ఛన్=ఇచ్చుచు, అక్షాణాం=చక్షురాదీంద్రియములను, ప్రవర్తకస్సన్=ప్రవర్తింపఁజేయుచు, (వర్తతే)=వర్తించుచున్నదో, సః =

అ. ప్రాణమయః=ప్రాణమయకోశమనెడి, అసౌ=ఈ, వాయుః = వాయువు, చైతన్యవర్జ నాత్-చైతన్య=తెలివియొక్క, వర్జనాత్=లేకపోవుటవలన, ఆత్మా = ఆత్మ, న=కాదు.

తా. దేహమందు ఆపాదమస్తకము నంతటను వ్యాపించి వ్యానరూపముచేత దేహమునకు బలమిచ్చుచు, చక్షురాదీంద్రియ ములను ప్రేరేపించుచుండువాయువు ప్రాణమయకోశ మనఁబడును. ఇది చైతన్యము లేనిదై జడస్వభావము గలది గనుక ఘటాదులవలెనే ఆత్మ కాదు.

అవ. ఇప్పుడు మనోమయకోశమును దానియనాత్మత్వమును తెలుపుచున్నాఁడు:—

శ్లో. అహంతాం మమతాం దేహే గేహాదౌ చ కరోతి యః,
కామాద్యవస్థయా భ్రాంతో నాసా వాత్మా మనోమయః. 6

వ్యా. ఇదానీం మనోమయస్వరూపప్రదర్శనపూర్వకం తస్యాప్యనాత్మత్వమాహ —అహంతామితి. దేహేఽహంతామహంభావం గృహాదౌ మమతాం మదీయత్వాభి మానం చ యః కరోతి అసౌ మనోమయ ఇతి స ఆత్మా న భవతి. కుత ఇత్యత ఆహ— కామాదీతి హేతుగర్భవిశేషణం. కామక్రోధాదివృత్తిమత్త్వేనానియతస్వభావాదిత్యర్థః. మనోమయః ఆత్మా న భవతి. వికారిత్వా ద్దేహవదితి భావః.

టీ. యః = ఏమనస్సు, దేహే = శరీరమునందు, అహంతాం = నే ననెడిభావ మును, గేహాదౌ = గృహారామక్షేత్రాదులందు, మమతాం=నాది యనే యభిమానమును, కరోతి=చేయుచున్నదో, అసౌ=ఈమనస్సు, మనోమయః=మనోమయకోశము, కామా ద్యవస్థయా=కామక్రోధాదివికారములుగలది యగుటచేత, భ్రాంతః = చపలస్వభావము గల మనస్సు, ఆత్మా=ఆత్మ, న=కాదు.

తా. శరీరమును తన్నుఁగాను గృహారామక్షేత్రాదులను తనవి గాను తోఁపింపఁజేయునదియు, కామక్రోధాది వికారములు గలదియు చపలస్వభావము గలదియు నగు మనస్సు మనోమయకోశ మని చెప్పఁ బడును. ఇది కామక్రోధాదివికారములు గలిగి చపలస్వభావము గలది యగుటచేత దేహమువలెనే ఆత్మ కాదు.

అవ. ఇప్పుడు విజ్ఞానమయకోశస్వరూపమును దానియనాత్మత్వమును, నిరూ పించుచున్నాఁడు:—

శ్లో. లీనా సుప్తౌ వపుర్బోధే వ్యాప్నుయా దానఖాగ్రగా,
చిచ్ఛాయోపేతధీర్నాత్మా విజ్ఞానమయశబ్దభాక్. 7

వ్యా. అనంతరం కర్తృశబ్దవాచ్యస్య విజ్ఞానమయస్య స్వరూపం ప్రదర్శయంస్తదనాత్మత్వం దర్శయతి—లీనేతి. యా చిచ్ఛాయోపేతా ధీశ్చిదాభాసయుతా బుద్ధిః సుప్తౌ సుప్తికాలే లీనా విలీనా సతీ బోధే జాగరణకాలే ఆనఖాగ్రగా నఖాగ్రపర్యంతం వర్తమానా సతీ వపుః శరీరం వ్యాప్నుయాత్. సంవ్యాప్య వర్తతే. సా విజ్ఞానమయశబ్దభాగ్విజ్ఞానమయశబ్దే నోచ్యమానాఽసావప్యాత్మా న భవతి విలయాద్యవస్థావత్త్వాత్ ఘటాదివదిత్యర్థః.

టీ. చిచ్ఛాయోపేతధీః - చిచ్ఛాయా = చైతన్యప్రతిబింబముతో, ఉపేత = కూడుకొనిన, ధీః=బుద్ధి, సుప్తౌ = సుషుప్తికాలమున, లీనా సతీ=లయించినదై, బోధే = జాగ్రదవస్థయందు, ఆనఖాగ్రగా = నఖశిఖపర్యంతము వ్యాపించినదై, వపుః శరీరమును, వ్యాప్నుయాత్ = వ్యాపించియుండును, సా = ఆబుద్ధి, విజ్ఞానమయశబ్దభాక్ = విజ్ఞానమయకోశ మనఁబడుచున్న దగుచు, ఆత్మా=ఆత్మ, న=కాదు.

తా. సుషుప్తికాలమున లయించుచు జాగ్రదవస్థయందు నఖశిఖపర్యంతము వ్యాపించుచుండెడి చైతన్యప్రతిబింబముతోఁ గూడిన బుద్ధి విజ్ఞానమయకోశ మనఁబడును. ఈ బుద్ధియు విలయాద్యవస్థలు (సంకోచవికాసములు) గలదియగుటచే ఘటాదులవలెనే ఆత్మ కాదు.

అవ. మనోబుద్ధులు రెండును అంతఃకరణవికారములే కదా. తన్మయము లగు మనోమయవిజ్ఞానమయకోశములకు భేద మెట్లు ఘటించును? అనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కర్తృత్వకరణత్వాభ్యాం విక్రియేతాన్తరింద్రియమ్,
విజ్ఞానమనసీ అంతర్బహిశ్చైతే పరస్పరమ్. 8

వ్యా. నను మనోబుద్ధ్యోరంతఃకరణత్వావిశేషాత్ మనోమయవిజ్ఞానమయరూపేణ కోశద్వయకల్పనానుపపన్నేత్యాశంక్య కర్తృత్వకరణత్వాభ్యాం భేదసద్భావాద్ఘటత ఏవ మనోమయత్వాదిభేద ఇత్యాహ—కర్తృత్వేతి. అంతరింద్రియమంతఃకరణం కర్తృత్వకరణత్వాభ్యాం కర్తృరూపేణ కరణరూపేణ చ విక్రియేత పరిణమత ఇత్యర్థః. ఏతే కర్తృకరణే విజ్ఞానమనసీ విజ్ఞానమనశ్శబ్దవాచ్యే భవతః. ఏతే చ పరస్పరం అంతర్బహిర్భావేన వర్తేతే. అతః కోశద్వయముపపద్యతే ఇత్యర్థః.

టీ. అంతరింద్రియం = అంతఃకరణము, కర్తృత్వకరణత్వాభ్యాం - కర్తృత్వ = కర్త యగుటయొక్క స్వరూపము చేతను, కరణత్వాభ్యాం = కరణత్వముచేతను, విక్రియేత=పరిణమించును. ఏతే = ఈకర్తృకరణములు రెండును, విజ్ఞానమనసీ=విజ్ఞాన

మయకోశ మనియు, మనోమయకోశ మనియు చెప్పఁబడుచు, పరస్పరం = ఒకదాని కొకటి, అంతర్బహిశ్చ = వెలుపటి దనియు, లోపలి దనియు భావము గలవై వర్తించుచున్నవి.

తా. కర్తృత్వశక్తి గలది విజ్ఞానమయకోశము. కరణత్వశక్తి గలది మనోమయకోశము. కరణ మనఁగా ముఖ్యసాధనము. ఈ రెండింటిలో విజ్ఞానమయకోశము లోపలిది. మనోమయకోశము వెలుపలిది. కనుక నీ రెండింటికిని భేదము ఘటింపవచ్చును.

అవ. ఇప్పుడు భోక్త యని చెప్పఁబడెడి ఆనందమయకోశస్వరూపమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. కాచిదంతర్ముఖా వృత్తి రానందప్రతిబింబభాక్,
పుణ్యభోగే భోగశాంతౌ నిద్రారూపేణ లీయతే. 9

వ్యా. ఇదానీం భోక్తృశబ్దవాచ్యస్యానందమయస్యానాత్మ దర్శయితుం తస్య చ స్వరూపమాహ—కాచిదితి. పుణ్యభోగే పుణ్యకర్మఫలానుభవకాలే కదాచిద్ధీవృత్తిరంతర్ముఖా సతీ ఆనందప్రతిబింబభాగాత్మస్వరూపస్యానందస్య ప్రతిబింబం భజతే. సైవ భోగశాంతౌ పుణ్యకర్మఫలభోగోపరమే సతి నిద్రారూపేణ లీయతే విలీనా భవతి. సా వృత్తిరానందమయ ఇత్యభిప్రాయః.

టీ. పుణ్యభోగే = పుణ్యకర్మముయొక్క ఫలానుభవకాలమునందు, కాచిత్ = ఒకానొకటైన, వృత్తిః = బుద్ధివృత్తి, అంతర్ముఖా (సతీ) = అంతర్ముఖమై, ఆనందప్రతిబింబభాక్ = ఆనందరూప మగు బ్రహ్మముయొక్క ప్రతిబింబమును గ్రహించుచు, భోగశాంతౌ-భోగ = పుణ్యకర్మముల ఫలభోగము, శాంతౌ = నశింపఁగా, నిద్రారూపేణ = నిద్రారూపముతో, లీయతే = లయించుచున్నది.

తా. అంతర్ముఖమైన యొకానొకబుద్ధివృత్తి యానందస్వరూపమగు బ్రహ్మముయొక్క ప్రతిబింబమును గ్రహించును. అదియే యానందమయకోశ మనఁబడును. ఆకోశము పుణ్యభోగకాలమునందు అభివ్యక్త మగును. పుణ్యఫలభోగము క్షయింపఁగానే నిద్రారూపముగా లయించును.

అవ. ఆనందమయకోశము ఆత్మ గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కాదాచిత్కత్వతో నాత్మా స్యాదానందమయోఽప్యయమ్,
బింబభూతో య ఆనంద ఆత్మాసౌ సర్వదా స్థితేః. 10

వ్యా. తస్యానాత్మత్వమాహ—కాదాచిత్కేతి. అయమానందమయోఽపి కాదాచిత్కత్వాదాత్మా న స్యాదఘ్రాదిపదార్థవదిత్యర్థః. నను విద్యమానానామానందమయాదీనాం సర్వేషా మాత్మత్వనిరాసే నైరాత్మ్యం ప్రసజ్యేతేత్యాశంక్యాహ—బింబభూత ఇతి. బుద్ధ్యాదౌ ప్రతిబింబతయావస్థితస్య ప్రియాదిశబ్దవాచ్యస్య ఆనందమయస్య బింబభూతః కారణభూతో య ఆనందోఽసావేవాత్మా భవతి. కుత ఇత్యత ఆహ—సర్వదేతి. నిత్యత్వాదిత్యర్థః. వివాదాధ్యాసితః ఆనంద ఆత్మా భవితుమర్హతి. నిత్యత్వా న్నానైకాంతికతేతి భావః.

టీ. అయం = ఈ, ఆనందమయోఽపి = ఆనందమయకోశంబును, కాదాచిత్కత్వతః = ఒకానొకప్పుడు తోఁచుటవలన, ఆత్మా = ఆత్మ, న స్యాత్ = కానేరదు. బింబభూతః=బింబస్వరూపమైన, యః=ఏ, ఆనందః=ఆనందము గలదో, అసౌ=ఈబింబభూతమైనయానందము, సర్వదా=ఎల్లప్పుడును, స్థితేః = ఉండుటవలన, ఆత్మా = ఆత్మ, స్యాత్ = అగును.

తా. ఉత్పత్తిలయములు గలిగి యొకానొకప్పుడు మాత్రము తోఁచుటచేత, అనఁగా నెప్పుడు నుండని దగుటచేత ఆయానందమయకోశమును నిత్యమైనయాత్మ కాఁజాలదు. ప్రియము, మోదము, ప్రమోదము ననెడి సుఖవిశేషవృత్తులచేతఁ జెప్పఁదగిన ఆనందమయము బుద్ధ్యాదులయందు ప్రతిబింబభావముచేత వర్తించుచున్నది. అట్టి ఆనందమయ మనెడి ప్రతిబింబమునకుఁ గారణభూతమైన ఆనందబింబ మెద్దికలదో ఆ ఆనందబింబము సర్వకాలసర్వావస్థలయందును నిత్యశుద్ధ ముక్త నిష్కళ నిష్క్రియ నిర్గుణ పరిపూర్ణచైతన్యస్వరూపము కలిగియుండుటచే నిదియే ఆత్మ యగును.

(ఇష్టవస్తువును జూచుటవలనఁ గలిగిన సంతోషము 'ప్రియము.' ఆ యిష్టవస్తువు లభించుటచేతఁ గలిగెడి సంతోషము 'మోదము.' ఇట్టివస్తువును అనుభవించుటచేతఁ గలిగెడి సంతోషము 'ప్రమోదము.')

అవ. పూర్వవాది యాక్షేపము:—

శ్లో. నను దేహముపక్రమ్య నిద్రానందాంతవస్తుషు,
మాభూదాత్మత్వమన్యస్తు న కశ్చిదనుభూయతే. 11

వ్యా. నన్వితి. అన్నమయాద్యానందమయాంతానాం కోశానాముక్తైర్హేతుభిరాత్మత్వం నఘటతే. తస్మా ఘటిష్టాఽస్త్వాత్మా నుపలభ్యమానత్వా న్నైవం సంభవతీతి.

టీ. నను = ఓయి, దేహం = అన్నమయకోశమును, ఉపక్రమ్య=మొదలుకొని, నిద్రానందాంతవస్తుషు = ఆనందమయకోశ పర్యంతమైన కోశములయందు, ఆత్మత్వం = ఆత్మభావము, మా భూత్ = ఉండకపోవుఁగాక, అన్యస్తు = వేఱొకటైన, కశ్చిత్ = ఏదియును, నానుభూయతే=అనుభవింపఁబడుట లేదే.

తా. అన్నమయకోశము మొదలుకొని ఆనందమయకోశము పర్యంతము ఆత్మ లేదంటివి. ఈకోశములకంటె వ్యతిరిక్త మగు ఆత్మ మాచే తెలియఁబడుట లేదు. కనుక శూన్యవాదము ఘటించు నని ప్రశ్న చేయుచున్నాఁడు. (పూర్వపక్షము చేయువాఁ డనుట.)

అవ. పైప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బాఢం నిద్రాదయస్సర్వేఽనుభూయంతే న చేతరః,
తథాప్యేతేఽనుభూయంతే యేనతం కోనివారయేత్. 12

వ్యా. పరిహరతి—బాఢమితి. అత్ర నిద్రాశబ్దేన నిద్రానందో లక్ష్యతే. నిద్రాదయో దేహాంతా ఉపలభ్యంతేఽన్యే నానుభూయంత ఇతి యదుక్తం తత్సత్యం. కథం తర్హి తదతిరిక్తస్యాత్మనోఽంగీకార ఇత్యత ఆహ—తథాపీతి. అన్యస్యానుపలభ్యమానత్వేఽపి యద్బలాదేతేషాం ఆనందమయాదీనా ముపలభ్యమానతా భవతి సోఽనుభవః కథం నాంగీక్రియత్ ఇత్యర్థః.

టీ. బాఢం = సత్యము, నిద్రాదయః=ఆనందమయకోశము మొదలైన, సర్వే = అన్నికోశములును, అనుభూయంతే = అనుభవింపఁబడుచున్నవి. ఇతరః = ఈపంచకోశములకంటె వేఱైన యాత్మ, న చ = అనుభవింపఁబడుట లేదు. తథాపి = ఆవిధముగా తెలియఁబడకపోయినప్పటికిని, యేన = ఏయనుభవబలముచేత, ఏతే = ఇవి, అనఁగా (పంచకోశములు), అనుభూయంతే = అనుభవింపఁబడుచున్నవో, తం = ఆయనుభవమును, కః=ఎవఁడు, నివారయేత్=వారింపఁగలుగును. ఎవ్వఁడును నివారింప లేఁ డనుట.

తా. ఓయి పూర్వవాదీ! నీవు చెప్పినది సత్యము. అన్నమయాది పంచకోశములును అన్యునిచేత ననుభవింపఁబడుచున్నవనియు, ఆ పంచకోశములకంటె నన్యుఁ డగు ఆత్మ అనుభవింపఁబడుట లేదనియు నీవు చెప్పితివి. అట్లు ఆత్మ పంచకోశములవలె ననుభవింపఁబడకున్నను, ఏ అనుభవమువలన నీ పంచకోశములు ననుభవింపఁబడుచున్నవో ఆ యనుభవమే ఆత్మ. అట్టి ఆత్మను ఎవఁడు నిరాకరింపఁగలఁడు? అట్టి ఆత్మ నవశ్య మంగీకరింపవలె ననుట.

అవ. ఆత్మ యున్నయెడల నేల కనుపింపదు? కనుపింపనందున ఆత్మ లేదన వలసి వచ్చును గదా అనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వయమేవానుభూతిత్వా ద్విద్యతే నానుభావ్యతా,
జ్ఞాతృజ్ఞానాంతరాభావా దజ్ఞేయో న త్వసత్తయా. 13

వ్యా. నన్వాత్మేభ్యోఽన్య ఆత్మా యది విద్యతే తర్హ్యుపలభ్యేత. నోపలభ్యతే. అతో నాస్తీత్యాశంక్యాహ—స్వయమితి. ఆనందమయాదీనాం సాక్షిణోఽనుభవరూపత్వాదేవానుభావ్యత్వం నాస్తీతి. నను అనుభవరూపత్వే ప్యనుభావ్యత్వం కుతోఽనస్యాదిత్యాశంక్యాహ—జ్ఞాత్రితి. జ్ఞాతా చ జ్ఞానం చ జ్ఞాతృజ్ఞానే అన్యే జ్ఞాతృజ్ఞానే జ్ఞాతృజ్ఞానాంతరే. తయోరభావః. తస్మాదజ్ఞేయో జ్ఞానవిషయో న భవతీతి. జ్ఞాత్రాద్యభావాద్వా న జ్ఞాయతే. స్వస్యైవాసత్త్వాద్వా. కిమత్ర వినిగమనే కారణమిత్యత ఆహ—నత్వసత్తయేతి. నిద్రానందాదిసాక్షిత్వే నాసత్త్వస్య పూర్వమేవ నిరాకృదత్వాదితి భావః.

టీ. స్వయమేవ = తానే, అనుభూతిత్వాత్ = అనుభవస్వరూప మగుటవలన, అనుభావ్యతా=మఱియొకవిషయములో ననుభవ మగుట, న విద్యతే=కాఁజాలదు. జ్ఞాతృజ్ఞానాంతరాభావాత్-జ్ఞాతృ=తనకంటె వేఱైన జ్ఞాతయొక్కయు, జ్ఞానాంతర = మఱియొక తెలివి యొక్కయు, అభావాత్=లేకపోవుటవలన, అజ్ఞేయః = జ్ఞానవిషయము కాదు. అసత్తయా తు=లేకపోవుటచేతనైతే, న = అజ్ఞేయముకాదు (గ్రహింపఁబడక పోవుటకు హేతువు లే దనుట).

తా. అనుభవస్వరూప మగుటచే ఆత్మ మఱియొక యనుభవములో విషయము కాఁజాలదు. ఆత్మ జ్ఞానవిషయము కాకపోవుటకు ఆత్మయొక్క లేమి హేతువు కాదు. తనకంటె మఱియొకటి గ్రహించునది లేకపోవుటయే యాత్మ గ్రహింపఁబడకపోవుటకు హేతువు.

అవ. ఆత్మ యనుభవవిషయము గా దనుటకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు:—

శ్లో. మాధుర్యాదిస్వభావానా మన్యత్ర స్వగుణార్పిణామ్,
స్వస్మిం స్తదర్పణాపేక్షా నో నచా స్త్యన్యదర్పకమ్. 14

వ్యా. అనుభవరూపస్యాత్మనోఽనుభావ్యత్వాభావే దృష్టాంతమాహ—మాధుర్యాదితి. ఆదిశబ్దేనాహ్లాదయో గృహ్యంతే. మాధుర్యాదయః స్వభావాః సహజా ధర్మవిశేషా యేషాం తే మాధుర్యాదిస్వభావాః గుడాదయస్తేషా మన్యత్ర స్వసంస్పృష్టపదార్థేషు చణకాదిషు స్వగుణార్పిణాం స్వగుణాన్మాధుర్యాదీనర్పయంతీతి స్వగుణార్పిణస్తేషాంస్వస్మిన్ స్వస్వరూపే గుడాదిలక్షణే తదర్పణాపేక్షా తేషాం మాధుర్యాదీనాం అర్పణేసంపాదనే

ఉపేక్షా ఆకాంక్షా మాధుర్యాదికం కేన చిత్సంపాదనీయ మిత్యేవంరూపా నో నైవ విద్యతే. కించాన్యదర్పకం నాస్తిగుడాదీనాం మాధుర్యాదిప్రదం వస్త్వంతరం నాస్తీత్యర్థః.

టీ. అన్యత్ర = మఱియొక పదార్థమునందు, స్వగుణార్పిణాం=తమగుణములను చేర్చెడి, మాధుర్యాదిస్వభావానాం=తీపి పులుపు మొదలగు సహజధర్మములు గల బెల్లము చింతపండు మొదలగు పదార్థములకు, స్వస్మిన్=తమయందు, తదర్పణాపేక్షా = మాధుర్యాదిధర్మములను చేర్పవలసిన యపేక్ష, నో=లేదు. అర్పకం=సంపాదించెడి, అన్యచ్చ=మఱియొకవస్తువును, నాస్తి=లేదు.

తా. సెనగపిండి మొదలగు వేఱుపదార్థములందు తమగుణమును చేర్చెడి మాధుర్యాదిస్వభావము గల చక్కెర మున్నగువస్తువులలో మాధుర్యాదికము చేయుటకై మఱియొకపదార్థము ఏవిధముగా నపేక్షింపఁబడదో, యనుభవరూప మగు ఆత్మయం దనుభవమునకై వేఱొకపదార్థ మపేక్షింపఁబడదు. ఆత్మ ఎల్లప్పుడును అనుభవరూపమే యగును.

శ్లో. అర్పకాంతరరాహిత్యే ఽప్యస్త్యేషాం తత్స్వభావతా,
మాభూత్తథానుభావ్యత్వం బోధాత్మా తు న హీయతే. 15

వ్యా. సదృష్టాంతం ఫలితమాహ—అర్పకాంతరేతి. మాధుర్యాదిసమర్పకవస్త్వంతరాభావేఽపి ఏషాం గుడాదీనాం మాధుర్యాదిస్వభావతా యథా విద్యతే ఏవమాత్మనో ఽప్యనుభవవిషయత్వం మాభూదనుభవరూపతా తు భవత్యేవేత్యర్థః.

టీ. అర్పకాంతరరాహిత్యేఽపి = మాధుర్యముకుచేర్చెడి మఱియొకవస్తువు లేకపోయినను, ఏషాం = ఈవస్తువులకు; చక్కెర మొదలగువాని కనుట. తత్స్వభావతా = మాధుర్యాదిస్వభావము, అస్తి=కలదు, తథా=ఆప్రకారముగా నాత్మకు, అనుభావ్యత్వం =అనుభవవిషయ మగుట, మాభూత్ = లేకపోవుఁగాక, బోధాత్మా తు=అనుభవరూపత్వమైతే, న హీయతే = లోపింపదు. ఉండియే తీరు ననుట.

తా. అనుభవరూప మగు ఆత్మయందు ననుభవము గలుగఁజేసెడి యితరపదార్థము లేకున్నను అనుభవరూపత్వ ముండియే తీరును. ఆత్మ యనుభవవిషయ మెన్నటికిని గాదు.

శ్లో. స్వయంజ్యోతి ర్భవత్యేష పురోఽస్మాద్భాసతేఽఖిలాత్,
తమేవ భాంత మన్వేతి తద్భాసా భాస్యతే జగత్. 16

వ్యా. ఉక్తార్థే ప్రమాణమాహ—స్వయమితి. అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి. అస్మాత్సర్వస్మా త్పురతస్సువిభాతి. * "తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతీ" త్యాదిశ్రుతయః ఆత్మనః స్వప్రకాశత్వం బోధయంతీత్యర్థః.

టీ. ఏషః=ఈయాత్మ, స్వయంజ్యోతిః = స్వప్రకాశస్వరూపుఁడు, భవతి=అగుచున్నాఁడు. అస్మాత్=ఈ, అఖిలాత్=సర్వజగత్తుకంటె, పురః=ముందు, భాసతే=ప్రకాశించుచున్నాఁడు. [సర్వం=తక్కినదంతయు), భాంతం=స్వయముగాప్రకాశించుచున్న, తమేవ=ఆయాత్మనే, అన్వేతి = అనుసరించి ప్రకాశించుచున్నది. తద్భాసా-తత్=ఆయాత్మయొక్క, భాసా = స్వప్రకాశరూపముచేత, జగత్=జగత్తంతయు, భాస్యతే = ప్రకాశింపఁ జేయఁబడుచున్నది.

తా. ఆత్మ బోధస్వరూపుఁడుగాని బోధవిషయుఁ డెన్నఁటికిని గాఁడు. బోధ, అనుభవము, అపరోక్షము, స్వయంప్రకాశము అనిన నివియన్నియు నొక్కటియే యగును. ఈయర్థములకు శ్రుతులను బ్రమాణములనుగా నుదాహరించుచున్నాఁడు—శ్రు. "అత్రాయం పురుషస్స్వయం జ్యోతిర్భవతి" అను శ్రుతి యాత్మస్వప్రకాశస్వరూపుఁడని చెప్పుచున్నది. "తమేవ భాంతమనుభాతి సర్వం" అనుశ్రుతి యాత్మచేతనే సర్వము ప్రకాశింపఁజేయఁబడుచున్న దనియు, ఆత్మ ప్రకాశస్వరూపుఁ డనియుఁ జెప్పుచున్నది.

శ్లో. యేనేదం జానతే సర్వం తం కేనాన్యేన జానతామ్,
విజ్ఞాతారం కేన విద్యాచ్ఛక్తం వేద్యే తు సాధనమ్. 17

వ్యా. "యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాద్విజ్ఞాతారమరే కేన విజానీయా" దితి వాక్యమర్థతః పఠతి—యేనేదమితి. యేనసాక్షిచైతన్యరూపేణాత్మ నేదం సర్వం దృశ్యజాతం జానతే ప్రాణినః. తం సాక్షిణమాత్మానమన్యేన కేన సాక్ష్యభూతేన జడేన జానతామవగచ్ఛేయుః. పుమాంస ఇతి శేషః.అస్యైవ వాక్యస్య తాత్పర్యమాహ-విజ్ఞాతారమితి. దృశ్యజాతస్య విజ్ఞాతారం కేన దృశ్యభూతేన విద్యాద్విజానీయాన్న కేనాపి జానాతీత్యర్థః. నను మనసా జ్ఞాస్యతీత్యాశంక్యాహ—శక్తమితి. సాధనం తు జ్ఞానసాధనం మనస్తు వేద్యే జ్ఞాతవ్యవిషయే శక్తం సమర్థం. న తు జ్ఞాతర్యాత్మని. *"నైవ వాచా న మనసా" ఇత్యాదిశ్రుతేస్తస్యాపి జ్ఞేయత్వే కర్మత్వకర్తృత్వ విరోధాచ్చేతి భావః.

టీ. యేన=ఏయాత్మచేత, ఇదం=ఈ, సర్వం = ప్రపంచమునంతటిని, జానతే = జనులు తెలిసికొనుచున్నారో, తం = ఆయాత్మను, అన్యేన = జడరూపమై యితరమైన, కేన = దేనిచేత, జానతాం = తెలిసికొనియెదరు, తెలిసికొనఁజాల రనుట. విజ్ఞాతారం= దృశ్యమును తెలిసికొనెడి ఆత్మను, కేన = ఏదృశ్యరూపముచేత, విద్యాత్ = తెలిసికొన వచ్చును. తెలియుటకు సాధ్యము కా దనుట. సాధనం తు=సాధనమనినన్నో, వేద్యే = జ్ఞాన విషయమైన ప్రపంచమునందు, శక్తం = పనిచేయును. ఉపయోగించు ననుట.

తా. శ్రు. "యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్" అను శ్రుతియు, "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" ఆత్మ నెఱుఁగు నది మఱియొకటి లేదనియు, ఆత్మయే యన్నింటి నెఱుంగునదియు, సాధనము లన్నియు దృశ్యములపై నుపయోగింపఁబడునుగాని దృగ్రూపమం దుపయోగింపవనియుం జెప్పుచున్నవి. దృక్కనినను అనుభవ మనినను నొక్కటే యగును.

శ్లో. స వేత్తి వేద్యం తత్సర్వం నాన్యస్తస్యాస్తివేదితా,
విదితావిదితాభ్యాం తత్పృథగ్బోధస్వరూపకమ్. 13

వ్యా. ఆత్మనః స్వప్రకాశకత్వమేవ "స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా." "అన్యదేవ తద్విదితా దథో అవిదితాద" ధీతి వాక్యద్వయమపి ప్రమాణం మన్వాన స్తద్వాక్యద్వయమర్థతః పఠతి. స వేత్తీతి. స ఆత్మా యద్యద్వేద్యం తత్తత్సర్వం వేద్యం వేత్తి. తస్యాత్మనో వేదితా జ్ఞాతాఽన్యో నాస్తి. తద్బోధస్వరూపకం బ్రహ్మవిదితావిదితాభ్యాం, విదితం జ్ఞాతం జ్ఞానేన విషయీకృతం అవిదితమజ్ఞానేనావృతం. తాభ్యాం పృథగ్విలక్షణం బోధస్వరూపత్వా దేవేత్యర్థః.

టీ. సః=ఆయాత్మ, వేద్యం=ఎఱుఁగఁదగిన దేదిగలదో, తత్సర్వం = ఆ తెలియఁదగినదాని నంతయును, వేత్తి=తెలిసికొనుచున్నాఁడు, తస్య = ఆయాత్మకు, అన్యః = ఇతరుఁడైన, వేదితా= తెలిసికొనెడివాఁడు, నాస్తి=లేఁడు, బోధస్వరూపకం = అనుభవ స్వరూపమైన, తత్ = ఆపరబ్రహ్మము, విదితావిదితాభ్యాం - విదిత= తెలియఁబడినదానికంటెను, అవిదితాభ్యాం = తెలియఁబడనిదానికంటెను, పృథక్=వేఱైనది.

తా. శ్రు. "స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా" అను శ్రుతియు, "అన్యదేవ తద్విదితా దథో అవిదితాదధి" అను శ్రుతియు నాత్మకంటె వేఱగు ద్రష్ట లేఁడనియు, జ్ఞాతాజ్ఞాతములకంటె విలక్షణ మనియు ఆత్మకు స్వప్రకాశత్వమునే బోధించుచున్నవి. ఈ స్వప్రకాశత్వమునే ఆత్మకు ననుభవరూపముగఁ దెలియవలెను.

అవ. జ్ఞాతాజ్ఞాతములకంటె వేఱైనపదార్థ ముండుట యెట్లు ఘటించును? పదార్థ మనునది జ్ఞాతము కావలెను. లేదా అజ్ఞాతము కావలెను. కాని జ్ఞాతాజ్ఞాతములు రెండునుం గా దను టెట్లు? అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బోధే ప్యనుభవో యస్య న కథంచన జాయతే,
తం కథం బోధయేచ్ఛాస్త్రం లోష్టం నరసమాకృతిమ్. 19

వ్యా. నను విదితావిదితాతిరిక్తో బోధో నానుభూయత ఇత్యాశంక్య విదితవిశేష ణస్య వేదనస్యైవ బోధస్వరూపత్వా త్తదనుభవేవా విదితస్యాప్యనుభవాభావప్రసంగా ద్భోగానుభవోఽవశ్య మంగీకర్తవ్య ఇది సోపహాసమాహ—బోధేఽపీతి. యస్యమందస్య బోధేఽపి ఘటాదిస్ఫురణరూపేఽప్యనుభవః సాక్షాత్కారః కథంచన కథమపి న జాయతే. తం నరసమాకృతిం నరసమాకారం లోష్టం లోష్టవజ్జడం మనుష్యంశాస్త్రం కథం బోధయేత్ ? న కథమపి బోధయేదిత్యర్థః.

టీ. యస్య=ఎవనికి, బోధేఽపి=స్ఫురణ కలిగినప్పటికిని, అనుభవః = అనుభవము, కథంచన = ఏవిధమునను, న జాయతే=కలుగదో, తం = అటువంటి, నరసమాకృతిం = మనుష్యునితో సమానమైన యాకారముగల, లోష్టం=మట్టిముద్దను, మట్టిముద్దవలె బుద్ధి లేనివాని ననుట, శాస్త్రం = శాస్త్రము, కథం=ఎట్లు, బోధయేత్ = బోధింపఁగలుగును? బోధింపఁజాల దనుట.

తా. జ్ఞాత మన్న తెలియఁబడునది గదా! తెలివి యనునది ప్రకాశింపక తెలియఁబడునది యనుటయే సంభవింపదు. కనుక స్వప్రకాశ మగు బోధ నెఱుంగ ననెడి మనుజుఁడు మనుష్యాకార మగు మట్టిముద్ద యగును గాని మనుజుఁ డనంజెల్లదు. అనఁగా ననుభవము అనుభవ విషయము కాకపోయినను స్వప్రకాశము కావచ్చు ననుట.

అవ. బోధ యనినను అనుభవ మనినను నొక్కటే యంటివి. అది తెలియఁ బడుట లేదే. అనుట నీ వన్నమాటకు విరుద్ధము అని సదృష్టాంతముగ చెప్పుచున్నాఁడు:—

శ్లో. జిహ్వా మేఽస్తి నవేత్త్యుక్తిర్లజ్జాయై కేవలం యథా,
న బుధ్యతే మయా బోధో బోద్ధవ్య ఇతి తాదృశీ. 20

వ్యా. బోధో న బుధ్యత ఇత్యుక్తిరేవ వ్యాహతేతి సదృష్టాంతమాహ— జిహ్వేతి. మే జిహ్వాస్తి న వేత్త్యుక్తిర్భాషణం యథా లజ్జాయై కేవలం లజ్జాజననాయైవ భవతి, న బుద్ధిమత్త్వజ్ఞాపనాయ, జిహ్వయా వినా భాషణానుపపత్తేః. ఏవం మయా

బోధో న బుధ్యతే, ఇతః పరం బోద్ధవ్య ఇత్యుక్తిరపి తాదృశీ లజ్జా హేతురేవ. బోధేన వినా తద్వ్యవహారాసిద్ధేరిత్యర్థః.

టీ. మే=నాకు, జిహ్వా = నాలుక, అస్తి వా = ఉన్నదా, నాస్తి వా = లేదా, ఇతి = ఈప్రకారమైన, ఉక్తిః = సంభాషణము, యథా = ఏప్రకారము, కేవలం = ముఖ్యముగా, లజ్జాయై=సిగ్గుకొఱకు అగుచున్నదో, తథా = (ఆప్రకారము,) మయా= నాచేత, బోధః = అనుభవము, న బుధ్య తే = తెలియఁబడలేదు. బోద్ధవ్యః = తెలుపఁబడుఁగాక. ఇతి=ఈవిధమైన సంభాషణమును, తాదృశీ = అటువంటిదేను-అనఁగా లజ్జా కరమైన దనుట.

తా. నాకు నాలుక యున్నదా లేదా యని యడుగుట ఎట్లు హాస్యాస్పద మగునో, యట్లే యనుభవస్వరూప మైన బోధ నాచే నెఱుఁగఁబడలేదు గనుకఁ దెలియునటుల బోధింపు మనుటయు హాస్యా స్పదమే యగును.

అవ. బోధ యనఁగా స్ఫురణ మని తెలిసినది. అది బ్రహ్మజ్ఞానమున కేమి యుప యోగపడును? అనిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. యస్మిన్ యస్మి న్నస్తి లోకే బోధ స్త త్తదుపేక్షణే,
యద్బోధమాత్రం తద్బ్రహ్మేత్యేవం ధీర్బ్రహ్మనిశ్చయః. 21

వ్యా. భవత్వేవంవిధః స బోధస్తథాపి ప్రకృతే బ్రహ్మపరోధే కిమాయాత మిత్యాశంక్యాహ—యస్మిన్నితి. లోకే జగతి యస్మిన్యస్మిన్ ఘటాదిలక్షణే విషయే బోధో జ్ఞానమస్తి తత్తదుపేక్షణే తస్య తస్య ఘటాదివిషయస్యోపేక్షణేఽనాదరణే కృతే సతి యద్బోధమాత్రం ఘటాదౌ సర్వత్రానుస్యూతం యత్ స్ఫురణమస్తి తదేవ బ్రహ్మేత్యేవంరూపా ధీర్బుద్ధిర్బ్రహ్మనిశ్చయో బ్రహ్మావగతిరిత్యర్థః.

టీ. లోకే=లోకమునందు, యస్మిన్ యస్మిన్ = ఏయేపదార్థమునందు, బోధః= బోధ గలుగునో, తత్తత్ = ఆయాఘటాదివిషయమును, ఉపేక్షణే = త్రోసివైచిన, యత్=ఏ, బోధమాత్రం= స్ఫురణము మాత్రము మిగిలియుండునో, తత్ = ఆస్ఫుర ణము, బ్రహ్మేతి = పరబ్రహ్మ మగు నని, ఏవం=ఈవిధమైన, ధీః=బుద్ధి, బ్రహ్మనిశ్చయః= బ్రహ్మ మని యెఱుంగుట.

తా. ఏయేపదార్థమునందు బోధ కలుగునో, యాయాఘటాది పదార్థముల విడిచి తెలివినిమాత్రము గ్రహించిన, సర్వపదార్థముల యందు వ్యాపించినయాస్ఫురణమే బ్రహ్మ మని బ్రహ్మనిశ్చయము గలు గుటే ప్రయోజన మని భావము.

అవ. ఘటాదిపదార్థములను నుజ్జగించి యీ యనుభవరూపమైన బ్రహ్మమును తెలిసికొనునెడలఁ బంచకోశవిచారణ ఎందుకు? అని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః,
స్వస్వరూపం స ఏవ స్యాత్ శూన్యత్వం తస్య దుర్ఘటమ్. 22

వ్యా. నను ఘటాదివిషయాపేక్షయా తదర్థానుభవరూపం బ్రహ్మావగమ్యతే చేత్తర్హి కోశపంచక వివేకోఽయం నిష్ప్రయోజనస్స్యాదిత్యాశంక్య బ్రహ్మణః ప్రత్యగ్రూపతాజ్ఞానేన వినా సంసారానివృత్తే స్తథాత్వావబోధోపయోగిత్వా న్న తస్యాపి వైయర్థ్య మిత్యాహ—పంచకోశేతి. పంచానాం కోశానామన్నమయాదీనాం పరిత్యాగే బుద్ధ్యానాత్మత్వనిశ్చయే కృతే తత్సాక్షిరూపస్య బోధస్యావశేషణాత్స సాక్షిరూపో బోధ ఏవ స్వస్వరూపం బ్రహ్మైవ స్యాత్. నన్వన్నమయాదీనాం అనుభవసిద్ధానాం త్యాగే శూన్యపరిశేషస్స్యాదిత్యాశంక్యాహ—శూన్యత్వ మితి. తస్య సాక్షిబోధస్య శూన్యత్వం దుర్ఘటం, దుస్సంపాద్యమిత్యర్థః.

టీ. పంచకోశపరిత్యాగే - పంచకోశ = అన్నమయాదిపంచకోశములయొక్క, పరిత్యాగే=ఆత్మకా దని పరిత్యజించినప్పుడు, సాక్షిబోధావశేషతః-సాక్షిబోధ=సాక్షిస్వరూపమైన బోధయొక్క, అవశేషతః = శేషించుటవలన, స ఏవ=ఆబోధయే, స్వస్వరూపం = తనస్వరూపము, బ్రహ్మస్వరూప మనుట, తస్య = ఆ యాత్మస్వరూపమునకు, శూన్యత్వం = శూన్యత్వము (లేమి), దుర్ఘటం = ఎన్నఁటికిని ఘటింపదు.

తా. పంచకోశముల నొక్కొక్కటిని బరిశీలించి వానిని అనాత్మలని త్రోసివైవఁగా సాక్షియైనబోధమాత్రము శేషించును. అదియే తన యథార్థమైన స్వరూపము. అట్టి యాత్మస్వరూపము శూన్య మనుట ఎన్నటికిని సంభవింపదు.

అవ. శూన్యత్వ మెన్నటికిని ఘటింపకుండుటను స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. అస్తి తావత్స్వయం నామ వివాదావిషయత్వతః,
స్వస్మిన్నపి వివాదశ్చేత్ప్రతివాద్యత్ర కో భవేత్. 23

వ్యా. దుర్ఘటత్వమేవోపపాదయతి—అస్తీతి. స్వయంశబ్దవాచ్యం స్వస్వరూపం లౌకికానాం వైదికానాం చ మతేతావద స్త్యేవ. కుతఇత్యత ఆహ—వివాదేతి. స్వస్వరూపస్య విప్రతిపత్తివిషయత్వాభావాదిత్యర్థః.విపక్షే బాధకమాహ—స్వస్మిన్నితి.స్వాత్మన్యపి విప్రతిపత్తౌ సత్యామత్రాస్యాం విప్రతిపత్తౌ కః ప్రతివాది స్యాన్న కోఽపీత్యర్థః.

టీ. వివాదావిషయత్వతః - వివాద = తగవునకు, అవిషయత్వతః = విషయము కాకపోవుటవలన, స్వయంనామ = స్వస్వరూపము, తావత్=అన్నిమతములయందును, అస్తి = ఉన్నది. స్వస్మిన్నపి = తనస్వరూపమందును, వివాదశ్చేత్ = వివాదము కలిగినయెడల, అత్ర=ఈవిషయమై, కః = ఎవఁడు, ప్రతివాదీ = ప్రతిఘటించి వాదము చేయువాఁడు, భవేత్=అగును? ప్రతిఘటించి వాదముచేయువాఁడు లేఁ డనుట.

తా. తా నని వ్యవహరింపఁబడెడువస్తు వున్నదా లేదా యను సందేహ మెవ్వరికిని లేదు. ఒకవేళ యున్న దంను వేని, యట్లు ప్రతిఘటించి వాదము చేయువాఁడు లేఁడు.

అవ. తాను లేఁడనువాఁడు ప్రతివాదిగా నుండలేఁడు అనెద వేల?

శ్లో. స్వాసత్త్వం తు న కస్మైచిద్రోచతే విభ్రమం వినా,
అతఏవ శ్రుతిర్బాధం బ్రూతే చాసత్త్వవాదినః. 24

వ్యా. నను స్వాసత్త్వవాద్యేవ ప్రతివాదీ భవిష్యతీత్యాశంక్య, తథావిధః కోఽపి నాస్తీత్యాహ—స్వాసత్త్వమితి. భ్రాంతిమేకాం విహాయాన్యస్యాం దశాయాం స్వస్యాభావః కేనాపి నాంగీక్రియత ఇత్యర్థః. కుత ఏవం నిశ్చీయత ఇత్యాశంక్యాహ—అత ఇతి. యతః కస్మైచిన్నరోచతే. అతఏవ శ్రుతిరపి అసత్త్వవాదినో బాధం బ్రూతే.

టీ. విభ్రమం వినా=భ్రాంతి లేకుండ, స్వాసత్త్వం తు=తాను లేఁ డని తలంచుట, కస్మైచిత్=ఎవ్వనికిని, న రోచతే=ఇష్టము కాదు. అతఏవ = కనుకనే, అసత్త్వవాదినః = శూన్య మని వాదించెడువానికి, శ్రుతిశ్చ=శ్రుతియును, బాధం = బాధను, బ్రూతే=చెప్పుచున్నది.

తా. తాను లేఁ డని యెవ్వఁడో భ్రాంతుఁడై యనవలెను గాని తనలేమి యెవ్వనికి సరిపడదు. అట్లు లేఁ డనువానికి బాధకమును శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఆశ్రుతినే చెప్పుచున్నాఁడు:—

శ్లో. అసద్బ్రహ్మేతి చేద్వేద స్వయ మేవ భవే దసత్,
అతోఽస్య మా భూ ద్వేద్యత్వం స్వసత్త్వం త్వభ్యుపేయతామ్.

వ్యా. కేయం శ్రుతిరిత్యాకాంక్షాయాం "అసద్బ్రహ్మే" త్యారభ్య "అసన్నేవ" త్యాదికాంతాం శ్రుతిమర్థతః పఠతి—అసదితి. యది బ్రహ్మాసదితి జానీయా

తర్హి స్వయమేవ బ్రహ్మణోఽసత్త్వజ్ఞాన్యసద్భవేత్స్వస్యైవ బ్రహ్మరూపత్వాదిత్యర్థః. ఫలితమాహ—అత ఇతి.

టీ. బ్రహ్మ = బ్రహ్మము, అసదితి = లేదని, వేదచేత్ = తెలిసికొనెనేని, స్వయమేవ = తానే, అసత్ = శూన్యము, భవేత్ = కావలసివచ్చును, లేకపోవు ననుట. అతః = ఈహేతువువలన, అస్య=ఈబోధస్వరూపుఁడగు ఆత్మకు, వేద్యత్వం = జ్ఞాన విషయము, మాభూత్ =లేకపోవుఁగాక, స్వసత్త్వం తు = తనయునికి, అభ్యుపేయతాం = సిద్ధించుఁగాక.

తా. శ్రు. "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి చేద్వేద" అనునది మొదలు "అసన్నేవ స భవతి" అనువఱకు శ్రుతి యేమి చెప్పినది ? ఎవ్వఁడు బ్రహ్మము లేదని తలఁచునో, వాఁడే లేనివాఁడగు నని చెప్పినది గావున ఆత్మ యొకదానిచేత తెలియఁబడునది కాకపోవచ్చును గాని ఆత్మ లేల్వాయి యున్న దనుట యొప్పుకొనక తప్పదు.

అవ. ఏదేని విశిష్టరూపము నంగీకరింతువేని, ఆరూపముచేత తెలియఁబడె నని యంగీకరించి నట్లగును. తెలియఁబడునది కాదందువా యది శూన్యమైనది కావలసి వచ్చును అనెడి యాక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కీదృక్తర్హీతి చేత్పృచ్ఛేదీదృక్తా నాస్తి తత్ర హి
యదనీదృగతాదృక్చ తత్స్వరూపం వినిశ్చిను. 21

వ్యా. ఇదానీమాత్మనః స్వప్రకాశత్వం వక్తుకామస్తస్య వేద్యత్వాభావే కీదృక్స్వరూపమితి ప్రశ్నముత్థాపయతి—కీదృగితి. అయమభిప్రాయః. ఆత్మన ఈదృక్త్వాదినా కేనచిద్రూపేణ వైశిష్ట్యాంగీకారే తేనైవ రూపేణ వేద్యత్వం స్యాత్. తదనంగీకారే శూన్యత్వమితి. సత్య మీదృక్త్వాద్యంగీకారే తథైవ వేద్యత్వం. తత్తు నాంగీక్రియత ఇత్యాహ—ఈదృగితి. ఉపలక్షణమేతత్తాదృక్త్వస్యాపి. ఉభయాభావమేవాహ—యదనీదృగితి.

టీ. తర్హి=అట్లైతే, కీదృక్ ఇతి=ఆయాత్మస్వరూప మెట్టి దని, పృచ్ఛేశ్చేత్ = అడిగితివేని, తత్ర=ఆయాత్మస్వరూపమునందు, ఈదృక్తా = ఇట్టిదనుట, నాస్తిహి= లేదే లేదు. అనీదృక్ = ఇటువంటి దని చెప్పుటకు సాధ్యముకానిదియు, అతాదృక్చ=అటువంటి దని చెప్పుటకు సాధ్యము కానిదియు, యత్ = ఏది గలదో, (తత్)=అస్వరూపము, తత్స్వరూపం=ఆయాత్మస్వరూప మని, వినిశ్చిను=నిశ్చయించుకొనుము.

తా. ఆయాత్మ యెటువంటి దని యడిగెదవేని వినుము. ఇట్టిది యట్టిది యని చెప్పుటకు సాధ్యము గాని దేదో యట్టిస్వరూపము ఆత్మ యని తెలియ నగును.

అవ. మీమాట కర్థము మాకు తెలియలేదు. విస్పష్టముగా చెప్పు మందువా? అది వచింప నలవి గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అక్షాణాం విషయ స్త్వీదృ క్పరోక్ష స్తాదృగుచ్యతే,
విషయీ నాక్షవిషయ స్స్వత్వాన్నాస్య పరోక్షతా. 27

వ్యా. నహి ప్రతిజ్ఞానమాత్రేణార్థసిద్ధి రిత్యాశంక్య, ఈదృక్తాదృక్త్వశబ్దయో రర్థ మభిదధాన స్తదవాచ్యత్వ ముపపాదయతి—అక్షాణామితి. ప్రత్యక్షస్యైవ ఘటాదేరీదృక్ఛబ్దవాచ్యత్వం దృష్టం. పరోక్షస్యైవ ధర్మాదేస్తాదృక్ఛబ్దవాచ్యత్వం. ద్రష్టురాత్మన స్తు ఇంద్రియజన్యజ్ఞానవిషయత్వాభావాన్నే దృక్త్వం. స్వేనైవ పరోక్షత్వాభావాన్న తాదృక్త్వమిత్యర్థః.

టీ. అక్షాణాం = ఇంద్రియములకు, విషయః = కనఁబడెడి ఘటాదికము, ఈదృక్ = ఇట్టి దని చెప్పఁబడును. పరోక్షః=ఇంద్రియముల కగపడని పుణ్యాదికము, తాదృక్ = అట్టిదని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. విషయీ తు=ఆత్మ యనినచో, అక్షవిషయః = ఇంద్రియములకు గోచరించెడిది, న = కాదు. అస్య = ఈయాత్మ, స్వత్వాత్=తానై యుండుటవలన, పరోక్షతా = పరోక్షత్వమును, అనఁగా నగపడకుండుట యనుట. న = లేదు.

తా. ఇంద్రియములకుఁ బ్రత్యక్ష మగు ఘటాదిపదార్థము ఇట్టిది యని చెప్పఁబడుచున్నది. ఇంద్రియములకుఁ బ్రత్యక్షముగాని పుణ్యాధికము అట్టిది యని చెప్పఁబడుచున్నది. ద్రష్ట యగు ఆత్మ చక్షురాదీంద్రియములకుఁ బ్రత్యక్షము కానివాఁ డగుటచేత ఇట్టివాఁ డని చెప్పఁబడఁడు. తనకుఁ బరోక్షత్వము లేమిచే అట్టివాఁ డనియుం జెప్పఁబడఁడు. కనుక నిట్టిదట్టిది యనెడిశబ్దములచేత చెప్పనలవిగానిది ఆత్మ యని తెలియవలెను.

అవ. అయితే, శూన్యము కానోపును అనువానికి పరిహారము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవేద్యోఽప్యపరోక్షోఽతః స్వప్రకాశో భవత్యయం,
సత్యం జ్ఞానమనంతం చేత్యస్తీహ బ్రహ్మలక్షణమ్. 2

వ్యా. తర్హి శూన్యమితి ద్వితీయం పక్షం ఫలదర్శనవ్యాజేన పరిహరతి—అవేద్య ఇతి. ఇంద్రియజన్యజ్ఞానవిషయత్వాభావేఽప్యపరోక్షత్వాత్స్వప్రకాశ ఇత్యర్థః. అత్రాయం ప్రయోగః. ఆత్మా స్వప్రకాశః సంవిత్కర్మతా మంతరేణాపరోక్షత్వాత్సం వేదనవదితి. న చ విశేషణాసిద్ధో హేతుః. ఆత్మనః సంవిత్కర్మత్వే కర్మకర్తృభావ విరోధప్రసంగాత్. స్వస్వరూపేణ కర్తృత్వం విశిష్టరూపేణ కర్మత్వమిత్యవిరోధ ఇతి చేత్ గమనక్రియాయామపి ఏకస్యైవ స్వస్వరూపేణ కర్తృత్వం విశిష్టరూపేణ కర్మత్వ మిత్యతి ప్రసంగాత్. న చ సాధనవికలో దృష్టాంతః. సంవేదనస్య సంవేద నాంతరాపేక్షాయా మనవస్థానాదితి తర్కమతే ఘటోఘటజ్ఞానేన భాసతే ఘటజ్ఞాన మను వ్యవసాయనేతి సంవేదనవత్స్వప్రకాశే దృష్టాంతః సాధనవికల ఇతి చేన్న. జ్ఞానస్య జ్ఞానాంతరేణ భాసమానత్వాభావాత్ సాధనవికలః. నన్వాత్మనః స్వప్రకాశ త్వేన సిద్ధత్వేఽపి బ్రహ్మలక్షణాభావాత్ న బ్రహ్మత్వసిద్ధిరిత్యాశంక్య తల్లక్షణం తత్ర యోజయతి. సత్యమితి. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మేతి" శ్రుత్యా యద్బ్రహ్మణో లక్షణముక్తం తదాత్మని విద్యత ఇత్యర్థః.

టీ. అయం = ఈయాత్మ, అవేద్యోఽపి = ఇంద్రియములచేత ఘటాదులవలె తెలియఁబడనిదైనను, అపరోక్షః = తనస్వరూపమే కనుక నిత్యాపరోక్షమైనది, అతః= కనుక, స్వప్రకాశః = స్వయముగా ప్రకాశించునది. భవతి = అగుచున్నది. బ్రహ్మ లక్షణం-బ్రహ్మ=పరమాత్మయొక్క, లక్షణం = స్వరూపలక్షణము, సత్యం = సత్యమును, జ్ఞానం=చిద్రూపమును, ఇహ=దీనియందు, ఆత్మయం దనుట. అస్తి = కలదు.

తా. ఈ ప్రత్యగాత్మ ఇంద్రియజన్యజ్ఞానముచేతఁ దెలియఁ బడెడువాఁడు గాకపోయినను సాక్షాత్ప్రత్యక్షముగ 'అహం' (నేను) అని స్ఫురించుచుండుటచేత, స్వప్రకాశుఁ డగును. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనెడి శ్రుతిచేత బ్రహ్మము సద్రూప మనియు చిద్రూప మనియు అనంత మనియు, బ్రహ్మస్వరూపలక్షణము చెప్పఁబడెను. ఆ బ్రహ్మలక్షణములు ప్రత్యగాత్మయందును గలవు. కనుక నీయాత్మకు బ్రహ్మత్వము స్వతఃసిద్ధము.

అవ. ఆత్మకు సత్యత్వముఁ జెప్పుటకు సత్యత్వలక్షణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యత్వం బాధరాహిత్యం జగద్బాధైకసాక్షిణః.
బాధః కింసాక్షికో బ్రూహి న త్వసాక్షిక ఇష్యతే. 29

వ్యా. ఆత్మనః సత్యత్వోపపాదనాయ తావత్సత్యత్వస్య లక్షణమాహ—సత్యత్వమితి. బాధశూన్యత్వం సత్యత్వం. సత్యమబాధ్యం బాధ్య మిథ్యేతి తద్వివేక ఇతి పూర్వాచార్యైరుక్తత్వాత్. అస్తు. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—జగదితి. జగతః స్థూలసూక్ష్మశరీరాదిలక్షణస్య యో బాధః సుప్తిమూర్ఛాసమాధిషు అవిద్యమానతా, తత్సాక్షిత్వేనైవ వర్తమానస్యాత్మనో బాధః కింసాక్షికః. కస్సాక్షీ అస్య బాధస్య. అసౌ కింసాక్షికః. న కోఽపి సాక్షీ విద్యత ఇత్యర్థః. అసాక్షికోఽప్యాత్మబాధః కిం న స్యాదిత్యాశంక్యాహ—న త్వితి సాక్షిరహితో బాధో నాభ్యుపగంతవ్యోఽన్యథాఽతి ప్రసంగాదితి భావః.

టీ. బాధరాహిత్యం = బాధయొక్క లేకపోవుట, సత్యత్వం = సత్యత్వము (అగును). బాధ యనఁగా లేమి యనుట. జగద్బాధైకసాక్షిణః-జగత్ =జగత్తుయొక్క, బాధ = లేమికి, ఏక = ముఖ్యమైన, సాక్షిణః = ఎఱింగెడియాత్మయొక్క, బాధః = లేమి, అభావమనుట, కింసాక్షికః = ఎవఁడు సాక్షిగాఁ గలిగియున్నది? బ్రూహి = చెప్పుము. ఆత్మయొక్కయభావము నెఱింగినసాక్షి లేఁ డనుట. అసాక్షికస్తు=సాక్షిలేని యభావము, నేష్యతే=ఒప్పుకొనఁబడదు.

తా. సత్యత్వ మనిన బాధ లేకుండుట బాధ యనఁగా లేమి యగును. బాధింపఁబడనిది సత్య మనియు, బాధింపఁబడెడిది మిథ్య యనియుఁ బూర్వాచార్యు లొప్పియుండిరి. స్థూలసూక్ష్మశరీరాదిరూపమగు జగత్తుయొక్క లేమిని సుషుప్తిమూర్ఛాదులందుఁ జూచుచున్నాము. ఆలేమిని యెఱింగినవాఁ డొకఁ డుండవలయునుగదా. సాక్షి లేనిదాని నెవ్వఁడును అంగీకరింపఁడు. అట్టిసాక్షియె యాత్మ యనఁబడును. కాదు. అసాక్షికమైనదానిని నే నంగీకరింతు నందువేని అది అతిప్రసంగ మగు నని భావము.

అవ. ఈసంగతి దృష్టాంతములచేత స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. అపనీతేషు మూర్తేషు హ్యమూర్తం శిష్యతే వియత్,
శక్యేషు బాధితేష్వంతే శిష్యతే యత్తదేవ తత్. 30

వ్యా. ఉక్తమర్థం దృష్టాంతేన స్పష్టయతి—అపనీతేష్వితి. మూర్తేషు గృహాదిగతేషు ఘటాదిష్వపనీతేషు గృహాదిభ్యో నిస్సారితేషు సత్సు యథాపనేతుమశక్యం నభ ఏవ శిష్యతే. ఏవం స్వవ్యతిరిక్తేషు మూర్తామూర్తేషు దేహేంద్రియాదిషు నిరాకర్తుం శక్యేషు బాధితేషు నేతి నేతీతి శ్రుత్యా నిరాకృతేషు సత్సు అంతే అవసానే సర్వనిరాకరణసాక్షిత్వేన యో బోధోఽవశిష్యతే స ఏవ బాధరహిత ఆత్మేత్యర్థః.

టీ. మూర్తేషు = ఇంద్రియగోచరములైనట్టి గృహాదులయం దుండెడి ఘటాది పదార్థములు, అపనీతేషు సత్సు = ఇంటిలోపలనుండి యవలఁ బాఱవేయఁబడు చుండఁగా, (యత్) వియత్ = ఏయాకాశము, శిష్యతే = కదలింప శక్యము గాని దగుచు నిలిచి యుండెనో (తథా = ఆవిధముగనే), శక్యేషు = శక్యములైనవి, బాధితేషు సత్సు = ఆత్మకా దని నిరాకరింపఁబడుచుండఁగా, అంతే = చివరకు, యత్ = ఏబోధస్వరూపము, శిష్యతే = సాక్షియై నిలవఁబడుచున్నదో, తదేవ = ఆబోధస్వరూపమే, తత్ = ఆయాత్మ యగును.

తా. ఇంటిలో నున్న ఘటాదివస్తువుల నవల నుంచిన నుంచ వచ్చును. అచటి యాకాశమును గదలింప నెట్లు శక్యము కాదో యటు లనే దేహేంద్రియాదుల శాస్త్రముచే నిది గాదిది కా దని త్రోసి వేయఁగా నేది చివరకు శేషించి తొలఁగింప సాధ్యము గా కుండునో, అనఁగా నిరాకరింపఁబడినవాని నెఱుంగునో యట్టిబోధయే యాత్మ యగు నని యెఱుంగ నగును.

అవ. కనుపడుదాని నంతను నిషేధించిన నేమియు మిగులదు. శేషించినది యాత్మ యను టె ట్లనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వబాధే న కించిచ్చే ద్యన్నకించి త్తదేవ తత్,
భాషా ఏవాత్ర భిద్యంతే నిర్బాధం తావ దస్తి హి. 31

వ్యా. నను ప్రతీయమానస్యసర్వస్యాపినిషేధేకించిన్నావశిష్యతే. అతఃకథం శిష్యతే. యత్తదేవతదిత్యవశిష్టస్యాత్మత్వముచ్యతఇతి శంకతే. సర్వబాధఇతి.నకించిదవశిష్యత ఇతి వదతామపి తథా ప్రయోగసిద్ధయే సర్వాభావవిషయం జ్ఞానమవశ్యమభ్యుపేతవ్యం. అతస్తదేవాస్మదభిమతాత్మస్వరూపమిత్యభిప్రాయేణ పరిహరతి—యన్నేతి. న కించిదితిశబ్దేన యచ్చైతన్యముచ్యతే, తదేవ తద్బ్రహ్మేత్యర్థః. నను న కించిదిత్యభావవాచకేన న కించిచ్ఛబ్దేన కథంచైతన్యముచ్యతే ఇత్యాశంక్య బాధసాక్షిణోఽవశ్యమభ్యుపేయత్వాదభిధాయకశబ్దేష్వేవ విప్రతిపత్తిర్నాభిధేయ ఇతి పరిహరతి—భాషా ఇతి. అత్ర బాధసాక్షిణి ప్రత్యగాత్మని భాషా ఏవ న కించిత్సాక్షీత్యాది.' శబ్దా ఏవ భిద్యంతే. నిర్బాధం బాధరహితం. సాక్షిచైతన్యం తు విద్యత ఏవేత్యర్థః.

టీ. సర్వబాధే సతి = సర్వప్రపంచమునకు మిథ్యాత్వము గలుగుచుండఁగా, కించిత్ = కొంచెమును, న చేత్ = లేదంటివేని, న కించిత్ = ఏమియు లేదనెడిది, యత్ = ఏది గలదో, తదేవ - అట్టిజ్ఞానమే, తత్=ఆయాత్మ యగును. అత్ర=ఈవిష

యమునందు, భాషా ఏవ=మాటలే, భిద్యంతే = వేఱుపడుచున్నవి. నిర్బాధంతావత్ = బాధింపఁ బడనిసాక్షిచైతన్యము, అస్తిహి = ఉన్నదిగదా !

తా. "దృశ్యము నంతయు నిది గాదిది గాదని త్రోసివైచినచో, నేమియు మిగులదు. ఏది చివరకు మిగులుచున్నదో అదియే యాత్మ యనుట కుదురదు." చివర కేమియు మిగుల్చలే దనిక్షి తెలిసికొనెడి జ్ఞానమే బ్రహ్మ మగును. ఒక్కొకదాని నాత్మ గా దని త్రోసివైచిన, కట్టకడపట సర్వాభావమును గుర్తెఱింగెడిజ్ఞానమే యాత్మ.

అవ. ఈయర్థమునకు శ్రుతిప్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. అత ఏవ శ్రుతిర్బాధ్యం బాధిత్వా శేషయత్యదః,
స ఏష నేతి నేత్యాత్మేత్యతద్వ్యావృత్తిరూపతః. 32

వ్యా. ఉక్తమర్థం శ్రుత్యారూఢం కరోతి—అతఏవేతి. యతః సాక్షిచైతన్య మబాధ్యమతఏవ "స ఏష నేతి నేత్యా" త్మేతి శ్రుతిరతద్వ్యావృత్తిరూపతోఽనాత్మ పదార్థనిరాకరణద్వారేణ బాధ్యం నిరాకరణయోగ్యం సర్వమనాత్మకవస్తుజాతం బాధి త్వానిరాకృత్య అతో నిరాకర్తుమశక్యం ప్రత్యక్ స్వరూపం శేషయత్యవశేషయతి.

టీ. అత ఏవ = ఇందువల్లనే, శ్రుతిః = శ్రుతి, బాధ్యం = బాధింపఁ దగిన దానిని, బాధిత్వా=నిషేధించి, స ఏషః=ఆయీ, ఆత్మా=ఆత్మ, నేతి నేతి=ఇది కా దిది కా దని, అతద్వ్యావృత్తిరూపతః = అనాత్మపదార్థములను నిరాకరించుటచేత, అదః = ఈ ప్రత్యక్స్వరూపమును, శేషయతి = మిగుల్చుచున్నది.

తా. "స ఏష నేతి నేత్యాత్మా" ఈయాత్మ ఇది కా దిది కాదనెడి శ్రుతి అనాత్మపదార్థమును నిరాకరించి, నిరాకరింప శక్యముగాని ప్రత్యగాత్మస్వరూపము నాత్మగా మిగుల్చుచున్నది.

అవ. ఏది బాధింప శక్యము? ఏది బాధింప నశక్యము అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదం రూపం తు యద్యావత్ తత్త్యక్తుం శక్యతేఽఖిలం,
అశక్యో హ్యనిదంరూపః స ఆత్మా బాధవర్జితః. 33

వ్యా. నేతి నేతీతి శ్రుతిర్బాధయోగ్యం బాధిత్వా బాధితుమశక్యం అవశేష యతీత్యుక్తం. తత్ర కీదృశం బాధితుం శక్యం కీదృశమశక్యమితి వివక్షాయాం తదుభయం విభజ్య దర్శయతి. ఇదం రూపమితి. ఇదమిత్యేవం దృశ్యత్వేనానుభూయమానం రూపం స్వరూపం యస్య దేహాదేస్తదిదం రూపం తుశబ్దోఽవధారణే. యద్యావదితి పదద్వయం సర్వదృశ్యోపసంగ్రహార్థం. ఏవం చ సతి యద్దృశ్యం ఇదమఖిలం త్యక్తుం

శక్యత ఏవేత్యర్థస్సంపద్యతే. అనిదంరూపః ప్రత్యక్త్వేనేదంతయావగంతుం అయోగ్యః సాక్షీ అశక్యస్త్యక్తుమిత్యర్థః. హీతి నిపాతేన ప్రసిద్ధిద్యోతకేన త్యక్తుస్స్వరూపత్వేన త్యాగాయోగ్యతాం సూచయతి. ఫలితమాహ—ఆత్మేతి. యో బాధరహితః సాక్షీ, స ఏవాత్మా నాహం కారాది ర్దృశ్య ఇత్యర్థః.

టీ. ఇదం రూపం తు = ఇది యనుస్వరూపము గలది, యత్ =ఏది, యావత్ = ఎంతవఱకుఁ గలదో, అఖిలం = సమస్తమైన, తత్ = అది, త్యక్తుం = నిరాకరించుటకును శక్యతే = వీలగును. అనిదంరూపః = ఇది యని చూపనలవి గానట్టియు, బాధవర్జితః = బాధరహితమైన, స ఆత్మా = ఆసాక్షిచైతన్యము, అశక్యో హి = నిరాకరింప నశక్యము గదా.

తా. ఇది యది యని యెంతవఱకు నిర్దేశింప నలవి యగునో, అంతవఱకు నిషేధింప వీలగును. ఇట్లన్నింటిని నిషేధించినప్రత్యగాత్మయే తా నగుటంజేసి, దానిని ఇది యని చెప్పుటకు వీలు లేదు. అందుచే నట్టి సాక్షి నిరాకరింపఁబడక మిగిలి యాత్మ యనఁబడును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సిద్ధం బ్రహ్మణి సత్యత్వం జ్ఞానత్వం తు పురేరితం,
స్వయమేవానుభూతిత్వా దిత్యాదివచనైః స్ఫుటమ్. ॥31॥

వ్యా. భవత్వాత్మనోఽబాధ్యత్వం. ప్రకృతే కిమాయాత మిత్యత ఆహ—సిద్ధమితి. బ్రహ్మణి బ్రహ్మలక్షణే యత్సత్యత్వమభిహితం తదాత్మని సిద్ధం. భవతు సత్యత్వం. జ్ఞానత్వం కథమిత్యాకాంక్షాయాం తత్పూర్వమేవోపపాదితమిత్యాహ—జ్ఞానత్వమితి. "స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా" *ఇత్యాదిభిర్వచనైర్జ్ఞానరూపత్వం పూర్వమేవ సమ్యగభిహితమిత్యర్థః.

టీ. బ్రహ్మణి = బ్రహ్మమందు, సత్యత్వం = అబాధితత్వము, బాధింపఁబడక పోవుట, సిద్ధం = ఫలించినది. జ్ఞానత్వం=జ్ఞానస్వరూపమయితే, స్వయమేవ=స్వయముగానే, అనుభూతిత్వాత్ = అనుభవించెడివాఁడగుటవలన, ఇత్యాదివచనైః = ఇవిమొదలగువాక్యములచే, స్ఫుటం=స్పష్టముగా, పురా=వెనుక, ఈరితం = చెప్పఁబడెను.

తా. బ్రహ్మ మబాధితత్వస్వరూప మనుటచే సత్యత్వము సాధింపఁబడినది. జ్ఞానత్వము 13-వ శ్లోకమునందు స్పష్టముగాఁ జెప్పఁబడెను. అందుచే బ్రహ్మము సత్యజ్ఞానస్వరూపము.

అవ. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను శ్రుతిలోని మూఁడవపదగు ననంతత్వమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. న వ్యాపిత్వాద్దేశతోఽంతో నిత్యత్వాన్నాపి కాలతః,
న వస్తుతోఽపి సార్వాత్మ్యాదానంత్యం బ్రహ్మణి త్రిధా. 35

వ్యా. నను సత్యత్వ జ్ఞానత్వయోరాత్మని సిద్ధత్వేఽప్యానంత్యం న ఘటతే. బ్రహ్మణ్యాపి తస్యాసిద్ధేరిత్యాశంక్య బ్రహ్మణి తావత్తత్సాధయతి—న వ్యాపిత్వాదితి. *"నిత్యం విభుం సర్వగతం సూక్ష్మం. ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం. ఇదం సర్వం యదయమాత్మా సర్వం హ్యేతద్బ్రహ్మ బ్రహ్మైవేదం సర్వ" మిత్యాదిశ్రుతిషు వ్యాపిత్వనిత్యత్వసర్వాత్మత్వప్రతిపాదనాద్బ్రహ్మణస్త్రివిధమప్యానంత్యం దేశకాలవస్తుకృతపరిచ్ఛేదరాహిత్యమభ్యుపేతవ్యమిత్యర్థః.

టీ. వ్యాపిత్వాత్ = అంతట వ్యాపించిన దగుటచే, దేశతః = దేశమువలన, అంతః = పరిచ్ఛేదము, న = లేదు. నిత్యత్వాత్ = నిత్య మగుటవలన, కాలతః = కాలమువలనను, న = అంతము లేదు. సార్వాత్మ్యాత్ = శ్రుతులయందుఁ జెప్పఁబడిన యట్లు బ్రహ్మము సర్వవస్తుస్వరూప మగుటవలన, వస్తుతోఽపి = వస్తువులను బట్టియు, న = నాశము లేదు. బ్రహ్మణి = బ్రహ్మమందు, త్రిధా=మూఁడు విధములుగా, అనంత్యం = అనంత స్వభావ మున్నది.

తా. 1. 'నిత్యం విభుం సర్వగతం' అనెడి శ్రుతిచేత దేశకృతపరిచ్ఛేదము లేదు. 2. 'నిత్యం నిత్యానా' మనెడి శ్రుతిచే కాలపరిచ్ఛేదము లేదు. 3. 'సర్వం హ్యేతద్బ్రహ్మ' యనెడి శ్రుతిచే వస్తుకృతపరిచ్ఛేదమును లేదు. ఇట్లు మూఁడువిధము లగునాశమును బ్రహ్మమందు లేనందున అనంతత్వము సిద్ధించుచున్నది.

అవ. యుక్తివలనను అనంత్యమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. దేశకాలాన్యవస్తూనాం కల్పితత్వాచ్చ మాయయా,
న దేశాదికృతోఽంతోఽస్తి బ్రహ్మానంత్యం స్ఫుటం తతః. 36

వ్యా. న కేవలం శ్రుతితః. కింతు యుక్తితోఽపీత్యాహ—దేశకాలేతి. పరిచ్ఛేద హేతూనాం దేశకాలాన్యవస్తూనాం మాయయా కల్పితత్వాచ్చ గంధర్వనగరాదిభిర్గగనస్యేవ న దేశాదిభిః కృతః పారమార్థికః పరిచ్ఛేదో బ్రహ్మణి సంభవతి యతస్తతో బ్రహ్మణ్యానంత్యం తావద్వ్యక్తమేవ. తదేతత్సత్యమాత్మా బ్రహ్మైవ. బ్రహ్మాత్మైవాత్ర హ్యేవం న విచికిత్స్యమిత్యోం సత్యమాత్మైవ నృసింహో దేవో బ్రహ్మ భవతి. అయమాత్మా బ్రహ్మేత్యాదిభిః శ్రుతిభిరాత్మనో బ్రహ్మాభేదప్రతిపాదనాత్తస్యాప్యానంత్యం సిద్ధమితి తాత్పర్యమ్.

టీ. మాయయా=మాయచేత, దేశకాలాన్యవస్తూనాం=దేశము, కాలము, ఇతర వస్తువులును; కల్పితత్వాత్ = కల్పింపఁబడుటవలన, దేశాదికృతః = దేశము మొదలగువానిచే కలిగిన, అంతః = నాశము, న = లేదు. తతః = అందువలన, బ్రహ్మానంత్యం = బ్రహ్మ కనంతత్వము, స్ఫుటం = విశదము.

తా. గారడివాఁడు తనవిద్యచేత కల్పించిన గంధర్వనగరము మొదలగువానిచేత ఆకాశమున కెట్లు యథార్థమైన పరిచ్ఛేదము లేదో, అటులే, దేశకాలవస్తుకృతపరిచ్ఛేదము బ్రహ్మమునకు లేదు. అందున బ్రహ్మమున కనంతత్వము యుక్తినిబట్టియు స్ఫుట మగుచున్నది.

అవ. జడ మగు జగత్తు బ్రహ్మమందు కల్పితమైనను బ్రహ్మమునకు పరిచ్ఛేదము లేక పోవచ్చును. జీవేశ్వరులు చేతనులుగదా. వారేల బ్రహ్మమునకు పరిచ్ఛేదము గలిగింపఁ జాల రనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యం జ్ఞాన మనంతం యద్బ్రహ్మ తద్వస్తు తస్య తత్,
ఈశ్వరత్వం చ జీవత్వముపాధిద్వయకల్పితమ్. 37

వ్యా. నను జడస్య జగతో బ్రహ్మణ్యారోపితత్వేన బ్రహ్మణః పరిచ్ఛేదకత్వాభావేఽపి చేతనయోర్జీవేశ్వరయోస్తదసంభవాత్తత్కృత పరిచ్ఛేదకత్వే నానంత్యం బ్రహ్మణో న సంగచ్ఛత ఇత్యాశంక్య తయోరప్యౌపాధిక రూపత్వేన పారమార్థికత్వాభావాన్న తయోరపి వాస్తవపరిచ్ఛేదహేతుత్వమిత్యభిప్రాయేణాహ—సత్యమితి. యత్సత్యాదిరూపం బ్రహ్మ తద్వస్తు తదేవ పారమార్థికం. తస్య బ్రహ్మణో యల్లోక ప్రసిద్ధమీశ్వరత్వం జీవత్వం చ తద్వక్ష్యమాణోపాధిద్వయేన కల్పితం. అతః తత్త్వాదేవ జడవజ్జీవేశ్వరయోరపి తత్పరిచ్ఛేదకత్వాభావ ఇతి భావః.

టీ. సత్యం = సత్యస్వరూపమైనట్టియు, జ్ఞానం = జ్ఞానస్వరూపమైనట్టియు, అనంతం = అనంతస్వరూపమైనట్టియు, యత్ బ్రహ్మ=ఏ బ్రహ్మముగలదో, తత్=ఆ పరబ్రహ్మము, వస్తు = పారమార్థిక మగును. తస్య = ఆ బ్రహ్మమునకు, ఈశ్వరత్వం = ఈశ్వరభావమును, జీవత్వం చ = జీవత్వమును, ఉపాధిద్వయకల్పితం = రెం డుపాధులచేతఁ గల్పింపఁబడెను.

తా. సత్యజ్ఞానానంత రూపలక్షణము గల ఏపరబ్రహ్మము గలదో ఆబ్రహ్మమే పారమార్థిక మగును. ఈశ్వరజీవత్వములు రెండును రెం డుపాధులచేత ఆపరబ్రహ్మమునకే కల్పింపఁబడినవి. అట్లు జీవేశ్వరు లిద్దరును బ్రహ్మమందుఁ గల్పింపఁబడుటచేత, జడరూప మగు జగత్తు

వలెనే ఆజీవేశ్వరులును వాస్తవమైన బ్రహ్మమునకు పరిచ్ఛేదమును గలిగింపఁజాల రని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ఈశ్వరోపాధిభూతమైన శక్తిని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. శక్తిరస్త్యైశ్వరీ కాచి త్సర్వవస్తునియామికా,
ఆనందమయమారభ్య గూఢా సర్వేషు వస్తుషు. 38

వ్యా. కిం తదుపాధిద్వయమిత్యాకాంక్షాయాం తదుభయం క్రమేణ దిదర్శయిషురాదావీశ్వరోపాధిభూతాం శక్తిం నిరూపయతి—శక్తిరితి. ఐశ్వరీ ఈశ్వరోపాధితయా ఈశ్వరసంబంధినీ కాచిత్సదసత్త్వాదిభీ రూపైర్నిర్వక్తుమశక్యా సర్వవస్తునియామికా సర్వేషామంతర్యామిబ్రాహ్మణోక్తానాం పృథివ్యాదీనాంనియమ్యవస్తూనాంనియమనకర్త్రీశక్తిరస్తి సా కుత్ర తిష్ఠతి? కుతో వా నోపలభ్యత ఇత్యాశంక్యాహ— ఆనందేతి. ఆనందమయాదిషు బ్రహ్మాండాంతేషు సర్వేషు గూఢా వర్తతేఽతో నోపలభ్యత ఇత్యర్థః.

టీ. సర్వవస్తునియామికా=అన్నింటిని నియమించునట్టి, ఐశ్వరీ=ఈశ్వరసంబంధమగు, కాచిత్=అనిర్వాచ్యమైన, శక్తిః=శక్తి, అస్తి=కలదు. ఆనందమయం = ఆనందమయకోశము, ఆరభ్య=మొదలుకొని, సర్వేషు వస్తుషు=అన్నివస్తువులయందు, గూఢా = తెలియఁబడని దగుచు (అస్తి=ఉన్నది).

తా. సర్వవస్తువులను నియమించు నీశ్వరశక్తి యొకటి గలదు. అది ఆనందమయకోశము మొదలుకొని సర్వవస్తువులయందు నిమిడియుండుటంజేసి మన యింద్రియములచే తెలియఁబడదు.

అవ. తెలియఁబడనిచో లే దని యేల చెప్పరా దనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వస్తుధర్మా నియమ్యేరన్ శక్త్యా నైవ యదాతదా,
అన్యోన్యధర్మసాంకర్యాద్విప్లవేత జగత్ఖలు. 39

వ్యా. నియమేనానుపలభ్యమానాయాస్తస్యా అసత్త్వమేవ కిం న స్యాదిత్యాశంక్య జగన్నియమనాన్యథానుపపత్త్యా సావశ్యమభ్యుపేయేత్యాహ—వస్తుధర్మా ఇతి. వస్తూనాం పృథివ్యాదీనాం కాఠిన్యద్రవత్వాదయో యదా శక్త్యా న వ్యవస్థాప్యంతే తదా తేషాం ధర్మాణాం సాంకర్యాద్వ్యామిశ్రణే నైకత్రావస్థానాత్ జగద్విప్లవేత. అనియత వ్యవహారవిషయతాం ప్రాప్నుయాదిత్యర్థః. ఖల్వితి ప్రసిద్ధిం ద్యోతయతి.

టీ. యదా=ఎప్పుడు, శక్త్యా=శక్తిచే, వస్తుధర్మాః = పృథివ్యాదివస్తువులయొక్క కాఠిన్యద్రవత్వాదిధర్మములు, న నియమ్యేరన్=సరిగానుంచఁబడవో, తదా=అప్పుడు, అన్యోన్యధర్మసాంకర్యాత్ = ఒకదాని ధర్మములు మఱియొకవస్తువునందు చేరుటవలన, జగత్ = ప్రపంచము, విప్లవేత ఖలు = హాని నొందును కదా!

తా. ఈశ్వరశక్తి లేనిచో, వస్తుధర్మముల నియమము తప్పును. అందుచే జగద్విప్లవము (ప్రపంచమందలివస్తువులయందు ఎల్లప్పుడు నియతమైనధర్మ ముండక పోవుట) ఘటించును. అందుచే శక్తి లేదనుటకు వీలు లేదు.

అవ. జడమగు నీశక్తికి జగన్నియామకత్వ మెట్లు ఘటించు ననిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. చిచ్ఛాయావేశత శ్శక్తిశ్చేతనేవ విభాతి సా,
తచ్ఛక్త్యుపాధిసంయోగా ద్బ్రహ్మైవేశ్వరతాం వ్రజేత్. 40

వ్యా. నను జడాయా అస్యా జగన్నియామకత్వం న యుజ్యత ఇత్యాశంక్యాహ—చిచ్ఛాయేతి. సా శక్తిశ్చిచ్ఛాయావేశతశ్చిదాభాసప్రవేశాచ్చేతనేవ చేతనత్వమాపన్నేవ విభాతి ప్రతీయతే. అతోఽస్యా నియామకత్వం ఘటత ఇత్యర్థః. అస్తు. ప్రస్తుతే కిమాయాతమిత్యత ఆహ—తచ్ఛక్తీతి. సా చాసౌ శక్తిశ్చేతి కర్మధారయః. సైవోపాధిస్తేన సంయోగః సంబంధస్తస్మా ద్బ్రహ్మైవ సత్యాదిలక్షణమీశ్వరతాం సర్వజ్ఞత్వాదిధర్మయోగితాం వ్రజేత్ ప్రాప్నుయాత్.

టీ. సా శక్తిః=ఆశక్తి. చిచ్ఛాయావేశతః=చైతన్యప్రవేశమువలన, చేతనేవ = చేతనత్వమును పొందినదానివలె, విభాతి=తోఁచుచున్నది. తచ్ఛక్త్యుపాధిసంయోగాత్ = ఆశక్తియను నుపాధిసంబంధమువలన, బ్రహ్మైవ=బ్రహ్మమే, ఈశ్వరతాం = ఈశ్వరత్వమును, వ్రజేత్ = పొందును.

తా. స్వయముగా మాయాశక్తి జడమైనను, చైతన్యప్రతిబింబమువలన చేతనమువలె తోఁచుచున్నది. అట్టిశక్తి యను నుపాధినిఁబట్టి బ్రహ్మమునకును ఈశ్వరత్వము ఆరోపింపఁబడుచున్నది.

అవ. పంచకోశము లుపాధిగాఁ గల జీవత్వమునుగూర్చి చెప్పుచున్నాఁడు:—

శ్లో. కోశోపాధివివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతాం,
పితా పితామహశ్చైకః పుత్రపౌత్రౌ యథా ప్రతి. 41

వ్యా. జీవత్వోపాధిభూతానాం కోశానాం ప్రాగేవాభిహితత్వా త్తన్నిమిత్తకం జీవిత్వమిదానీమాహ—కోశోపాధీతి. కోశా ఏవ ఉపాధిః కోశోపాధి స్తద్వివక్షాయాం పర్యాలోచనాయాం క్రియమాణాయాం బ్రహ్మైవ సత్యాదిలక్షణమేవ జీవితాం జీవవ్యవహారవిషయతాం గచ్ఛతి. నన్వేకస్యైవ విరుద్ధధర్మద్వయయోగిత్వం యుగపన్న క్వాపి దృష్టచరమిత్యాశంక్యాహ—పితేతి. యథైక ఏవ దేవదత్త ఏకదైవ పుత్రం

ప్రతి పితా భవతి. పౌత్రం ప్రతి తు పితామహః. ఏవం బ్రహ్మాపి కోశోపాధివివక్షాయాం జీవో భవతి శక్త్యుపాధివివక్షాయాం. ఈశ్వరశ్చ భవతీత్యర్థః.

టీ. ఏకః=ఒక్క దేవదత్తుఁడు, యథా=ఎట్లు, పుత్రపౌత్రౌ ప్రతి=పుత్రునిఁగూర్చియు, పౌత్రునిఁగూర్చియు, పితా = తండ్రియు, పితామహశ్చ = తాతయు (అగుచున్నాఁడో) అట్లే కోశోపాధివివక్షాయాం=పంచకోశము లను నుపాధి నాలోచింపఁగా, బ్రహ్మైవ=బ్రహ్మమే, జీవతాం = జీవవ్యవహారమును, యాతి = పొందుచున్నది.

తా. దేవదత్తుఁ డొక్కఁడే కొడుకునుబట్టి తండ్రియు, మనుమనిఁబట్టి తాతయు అయినట్లు బ్రహ్మ మొక్కటియే పంచకోశోపాధిచే జీవుఁడనియు, శక్త్యుపాధిచే ఈశ్వరుఁడనియు వ్యవహరింపఁబడుచున్నది.

అవ. ఈయర్థమును దృష్టాంతముతోఁ జూపుచున్నాఁడు:—

శ్లో. పుత్రాదేరవివక్షాయాం న పితా న పితామహః,
తద్వన్నేశో నాపి జీవశ్శక్తికోశావివక్షణే. 42

వ్యా. వ్యస్తుతస్తు జీవత్వమీశ్వరత్వం వా బ్రహ్మణో నాస్తీత్యేతత్సదృష్టాంతమాహ—పుత్రాదేరితి.

టీ. పుత్రాదేః = పుత్రాదికముయొక్క, అవివక్షాయాం = వివక్ష లేనప్పుడు, పితా న = తండ్రి కాఁడు. న పితామహః=తాతయు కాఁడు. తద్వత్ = అట్లే, శక్తికోశావివక్షణే= మాయాశక్తియొక్కయు, పంచకోశములయొక్కయు, వివక్ష లేనప్పుడు, ఈశః=ఈశ్వరుఁడు, న= కాఁడు, జీవోఽపి=జీవుఁడును, న=కాఁడు.

తా. పుత్రుఁడు, పౌత్రుఁడు అనెడి వివక్ష లేనప్పుడు, దేవదత్తుఁడు తండ్రియు తాతయు కానియట్లు మాయాశక్తి, పంచకోశములు అనెడి వివక్ష లేనప్పుడు బ్రహ్మమునకు ఈశ్వరత్వ జీవత్వములు లేవు.

అవ. జ్ఞానఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. య ఏవం బ్రహ్మ వేదైష బ్రహ్మైవ భవతి స్వయం,
బ్రహ్మణో నాస్తి జన్మాతః పున రేష న జాయతే. 43

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
పంచకోశవివేకః.

వ్యా. ఇదానీముక్తజ్ఞానస్య ఫలమాహ—యఏవమితి. యస్సాధనచతుష్టయసంపన్న ఏవముక్తేన ప్రకారేణ పంచకోశవివేకపురస్సరం బ్రహ్మ ప్రత్యగభిన్నం సత్యాదిలక్షణం వేద సాక్షాత్కరోతి. ఏష స్వయం బ్రహ్మైవ భవతి. "సయోహ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి. బ్రహ్మవిదాప్నోతి పర" మిత్యాదిశ్రుతిభ్యః. తతోఽపి కిమిత్యత ఆహ—బ్రహ్మణ ఇతి. "న జాయతే మ్రియతే వా విపశ్చి" దిత్యాదిశ్రుతేః బ్రహ్మణస్తావ జ్జన్మనాస్తి అతఏవ విద్వానపి స్వాత్మన స్తద్రూపత్వావగమాన్నైవ జాయతే న చ పున రావర్తత ఇతి శ్రుతేరితి.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమద్భారతీతీర్థ విద్యారణ్య
మునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితా
పంచకోశవివేకవ్యాఖ్యా సమాప్తా.

టీ. ఏవం = ఇట్లు, యః = ఎవఁడు, బ్రహ్మ = బ్రహ్మను, వేద = తెలిసికొనునో, సః = వాఁడు, స్వయం = తాను, బ్రహ్మైవ = బ్రహ్మమే, భవతి = అగుచున్నాఁడు. అతః=ఇందువలన, బ్రహ్మణః=బ్రహ్మమునకు, జన్మ = పుట్టుక, నాస్తి = లేదు, ఏషః = ఈజ్ఞానియు, పునః=తిరిగి, న జాయతే=పుట్టఁడు.

తా. ఎవఁడు సాధనసంపత్తిగలవాఁడై, పైఁజెప్పినవిధమున పంచకోశములను వివేకించి ప్రత్యగభిన్నముగా బ్రహ్మమును సాక్షాత్కరించుకొనునో, వాఁడు బ్రహ్మమే యగును. బ్రహ్మమునకు జననాదులు లేవు. కనుక నట్టి బ్రహ్మవిదునకును పునరావృత్తి లేదని పంచకోశ వివేకముయొక్క తాత్పర్యము.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు పంచకోశవివేక మను
తృతీయప్రకరణము.

---



శ్రీరస్తు

శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## చతుర్థ ప్రకరణము

## ద్వైతవివేక ప్రకరణము

అవ. విద్యారణ్యులు ద్వైతవివేక మను ప్రకరణమును జెప్పఁదలఁచి మంగళము నాచరించుచు గ్రంథము నారంభించుచున్నారు:—

శ్లో. ఈశ్వరేణాపి జీవేన సృష్టం ద్వైతం వివిచ్యతే,
వివేకే సతి జీవేన హేయో బంధస్స్ఫుటీ భవేత్. 1

వ్యాఖ్యానము.

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ
మయా ద్వైతవివేకస్య క్రియతే పదయోజనా.

వ్యా. చికీర్షితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయాభిలషితదేవతాతత్త్వానుస్మరణలక్షణం మంగళమాచరన్ అస్య వేదాంతప్రకరణత్వాచ్ఛాస్త్రీయమేవానుబంధచతుష్టయం సిద్ధవత్కృత్య గ్రంథారంభం ప్రతిజానీతే—ఈశ్వరేణేతి. ఈశ్వరేణ కారణోపాధికే నాంతర్యామిణా జీవేనాపి కార్యోపాధికే నాహంప్రత్యయినా చ సృష్టముత్పాదితం ద్వైతం జగద్వివిచ్యతే విభజ్య ప్రదర్శ్యతే. అస్య ద్వైతవివేచనస్య కాకదంత పరీక్షావన్నిష్ప్రయోజనత్వం వారయతి—వివేక ఇతి. వివేకేసతి జీవేశ్వరసృష్టయోర్ద్వైతయోర్వివేచనే కృతే సతి జీవేన పూర్వోక్తేన హేయఃపరిత్యాజ్యో బంధో బంధహేతుః ద్వైతం స్ఫుటీభవేత్ స్పష్టతాంగచ్ఛేత్. ఏతావజ్జీవేన హేయమితి నిశ్చీయత ఇత్యర్థః.

టీ. ఈశ్వరేణ = కారణోపాధికుఁడైన ఈశ్వరునిచేతను, జీవేనాపి = కార్యోపాధికుఁడైన జీవునిచేతను, సృష్టం = పుట్టింపఁబడిన, ద్వైతం = జగత్తు, వివిచ్యతే =

విభజింపఁబడుచున్నది. వివేకేసతి=ద్వైతవిమర్శ చేసినప్పుడు, జీవేన = జీవుని చేత, హేయః = విడువఁదగిన, బంధః = బంధము, స్ఫుటీభవేత్ = స్పష్టమగును.

తా. మాయోపాధికుఁ డగు నీశ్వరునిచేతను, అవిద్యోపాధికుఁ డగు జీవునిచేతను సృజింపఁబడిన ద్వైతము విభజనగా తెల్పఁబడుచున్నది. ఇట్లు వివేచనచేయుటచే బంధహేతు వగు ద్వైతము జీవుని చేత విడువఁ దగిన దని స్పష్ట మగును.

అవ. శ్వేతాశ్వతరవాక్యార్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం,
స మాయీ సృజతీత్యాహుః శ్వేతాశ్వతరశాఖినః. 2

వ్యా. నన్వదృష్టద్వారా జీవానామేవ జగద్ధేతుత్వం వాదినో వర్ణయంతి. అతః కథమీశ్వరస్రష్టృత్వముచ్యతే జగత ఇత్యాశంక్య బహుశ్రుతివిరోధాన్నేదం చోద్యమిత్యాపయితుమర్హతీత్యభిప్రేత్య శ్వేతాశ్వతరవాక్యం తావదర్థతః పఠతి—మాయాంత్వితి. మాయోపాధిమీశ్వరం ప్రస్తుత్యాస్మాన్మాయీ సృజతే విశ్వమేతదితి తస్యేశ్వరస్య జగత్స్రష్టృత్వం శ్వేతాశ్వతరశాఖినో వర్ణయంతీత్యర్థః.

టీ. మాయాం=మాయను, ప్రకృతిం=కారణముగాను, మహేశ్వరం తు=ఈశ్వరుని, మాయినం = మాయోపాధికునిగను, విద్యాత్ = తెలిసికొనవలెను. శ్వేతాశ్వతరశాఖినః=శ్వేతాశ్వతరశాఖవారు, మాయీ=మాయోపాధికుఁడైన, సః=ఆ యీశ్వరుఁడు, సృజతీతి=సృజించుచున్నాఁడని, ఆహుః = చెప్పుదురు.

తా. మాయ ప్రకృతి యనంబడును. అట్టి మాయయే యుపాధిగాఁగల యీశ్వరుఁడు జగత్తును సృజించె నని శ్వేతాశ్వతరోపనిషత్తునందు చెప్పఁబడెను.

అవ. ఈయర్థమునే ఐతరేయోపనిషత్తుకూడ చెప్పుచున్నది:—

శ్లో. ఆత్మా వా ఇద మగ్రేఽభూత్స ఈక్షత సృజా ఇతి,
సంకల్పేనాసృజల్లోకా న్స ఏతానితి బహ్వృచాః. 3

వ్యా. ఐతరేయోపనిషద్వాక్యమర్థతోఽనుసంక్రామతి—ఆత్మేతి. "ఆత్మా వా ఇదమేకఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాంల్లోకా న సృజత" ఇత్యనేన వాక్యేనాద్వితీయస్య పరమాత్మన ఏవ జగత్స్రష్టృత్వం బహ్వృచా ఋక్శాఖాధ్యాయిన ఆహురిత్యర్థః.

టీ. అగ్రే=సృష్టికి పూర్వము, ఇదం=ఈజగత్తు, ఆత్మా వా=ఆత్మగానే, అభూత్= ఉండెను. సః=ఆపరమాత్మ, సృజా ఇతి=సృష్టించెద నని, ఈక్షత = సంకల్పించెను. సంకల్పేన=సంకల్పముచేత, సః=ఆపరమాత్మ, ఏతాన్ లోకాన్ = ఈలోకములను, అసృజదితి=సృష్టించె నని, బహ్వృచాః (ఆహుః) = బహ్వృచు లనిరి.

తా. ఈప్రపంచము సృష్టికి పూర్వము ఆత్మగా నుండెను. అట్టి పరమాత్మ వీనిని సృజించెద నని సంకల్పించి లోకముల సృష్టించె నని బహ్వృచు లనిరి.

అవ. రెండుశ్లోకములతో తైత్తిరీయశ్రుత్యభిప్రాయమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఖం వాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాః క్రమాదమీ,
సంభూతా బ్రహ్మణ స్తస్మా దేతస్మాదాత్మనోఽఖిలాః. 4

వ్యా. ఈశ్వరస్య జగత్కారణత్వే తైత్తిరీయశ్రుతిరపి ప్రమాణమిత్యభిప్రేత్య తద్వాక్యమర్థతః పఠతి—ద్వాభ్యాం. ఖమితి.

టీ. తస్మాత్=అట్టి, ఏతస్మాత్ ఆత్మనః=ఈప్రత్యగభిన్నమైనఆత్మయను, బ్రహ్మణః =బ్రహ్మమువలన, ఖం=ఆకాశము, వాయు...దేహాః-వాయు=వాయువు, అగ్ని = అగ్ని, జల=ఉదకము, ఉర్వీ=భూమియు, ఓషధ = ఓషధులు, అన్న=అన్నము, దేహాః = శరీరములు, అమీ అఖిలాః=ఇవన్నియు, క్రమాత్=వరుసగా, సంభూతాః=పుట్టినవి.

తా. ఆప్రత్యగభిన్నబ్రహ్మమువలన క్రమముగా ఆకాశాది దేహాంతములగు సర్వవస్తువులును పుట్టెను.

శ్లో. బహు స్యామహమేవాతః ప్రజాయేయేతి కామతః,
తప స్తప్త్వాఽసృజత్సర్వం జగదిత్యాహ తిత్తిరిః. 5

వ్యా. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే" త్యుపక్రమ్య "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" ఇత్యాదినా "అన్నాత్పురుష" ఇత్యంతేన వాక్యేన గుహాహితత్వేన ప్రత్యగభిన్నాద్బ్రహ్మణ ఆకాశాదిదేహపర్యంతం జగదుత్పన్నమిత్యభిధాయోపరిష్టా దపి* "సోఽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి. స తపోఽతప్యత, స తప స్తప్త్వా, ఇదం సర్వమసృజత యదిదం కిం" చేతి వాక్యేన తస్యైవ బ్రహ్మణో జగత్సర్గేచ్ఛాపూర్వక పర్యాలోచనేన జగత్స్రష్టృత్వం తిత్తిరిరాహేత్యర్థః.

టీ. అహమేవ = నేనే, బహు = నానావిధములుగా, స్యాం = అయ్యెదను. ప్రజాయేయ = కార్యవర్గమును అయ్యెదను. ఇతి కామతః = అనెడి సంకల్పమువలన,

తపః=తపస్సును, తప్త్వా=చేసి, సర్వం జగత్=సర్వజగత్తును, అసృజత్ ఇతి = సృజించె నని, తిత్తిరిః=తిత్తిరిముని, ఆహ=చెప్పెను.

తా. సమస్తకార్యవర్గమును బహురూపములును తానే యయ్యెద నని సంకల్పించి, సమస్తజగత్తును ఆత్మ సృజించె నని తిత్తిరిముని చెప్పెను.

అవ. ఛాందోగ్యాభిప్రాయమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదమగ్రే స దేవాసీ ద్బహుత్వాయ తదైక్షత,
తేజోఽ బన్నాండజాదీని ససర్జేతి చ సామగాః. 6

వ్యా. ఛాందోగ్యేఽపి బ్రహ్మణ ఏవ జగత్స్రష్టృత్వం శ్రుతిమిత్యాహ—ఇద మితి. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయ" మితి సద్రూపమద్వితీయం బ్రహ్మోపక్రమ్య "తదైక్షత, బహు స్యాం ప్రజాయేయేతి, తత్తేజోఽసృజ" తేత్యాదినా తస్యైవేక్షణపూర్వకం తేజోఽబన్నస్రష్టృత్వ మభిధాయ "తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంత్యండజజరాయుజముద్భిజ్జ" మిత్యాదినా అండజాది శరీరనిర్మాతృత్వం చ సామగా వర్ణయంతీత్యర్థః.

టీ. ఇదం=ఈజగత్తు, అగ్రే=సృష్టికిపూర్వము, సదేవ=సన్మాత్రమయ్యే, ఆసీత్ = ఉండెను. తత్=ఆబ్రహ్మము, బహుత్వాయ=అనేకరూపములగుటకు, ఐక్షత=సంకల్పించెను. తేజోఽబన్నాండజాదీని = తేజస్సు, ఉదకములు, అన్నము, అండజములు మొదలగువానిని, ససర్జేతి = సృజించె నని, సామగాః = సామశాఖవారు, (ఆహుః = చెప్పుదురు).

తా. సృష్టికి పూర్వము ఈప్రపంచ మంతయు సన్మాత్రమే యయ్యుండి, యట్టిబ్రహ్మము బహురూపముల నందుటకు సంకల్పించి పంచభూతములను అండజస్వేదజజరాయుజోద్భిజ్జము లను చతుర్విధ భూతజాతమును సృజించె నని సామశాఖీయులు చెప్పిరి.

ని. 1. అండజములు = గ్రుడ్డువలన పుట్టినవి. (పక్షులు పాములు మొదలగు చెవులులేనివి.) 2. స్వేదజములు = చెమటవల్ల పుట్టినవి (పేలు నల్లులు మొదలగునవి) 3. జరాయుజములు=మావివలన బుట్టినవి (మనుష్యులు పశువులు మొదలగు చెవులు గలవి). 4. ఉద్భిజ్జములు=భూమిని భేదించుకొని పుట్టినవి (తరుగుల్మలతాదులు).

శ్లో. విస్ఫులింగా యథా వహ్నే ర్జాయంతేఽ క్షరత స్తథా,
వివిధాశ్చి జ్జడా భావా ఇత్యాథర్వణికశ్రుతిః. 7

వ్యా. ముండకోపనిషద్యపి "తదేతత్సత్యం యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః తథాక్షరాద్వివిధాస్సోమ్య భావాః ప్రజాయంతే తత్ర చైవాపియంతీత్యక్షరశబ్దవాచ్యాద్బ్రహ్మణో జగదుత్పత్తిః శ్రూయత ఇత్యాహ—విస్ఫులింగా ఇతి.

టీ. వహ్నేః = ప్రదీప్తమగు అగ్నినుండి, విస్ఫులింగా = మిణుగురులు, యథా= ఏప్రకారము, జాయంతే = పుట్టుచున్నవో, తథా = ఆప్రకారము, అక్షరతః = పరబ్రహ్మమునుండి, వివిధాః=నానావిధములైన, చిజ్జడాః=చేతనజడాత్మకములైన, భావాః= వస్తువులును, (జాయంతే=పుట్టుచున్నవి), ఇతి=అని, ఆథర్వణికశ్రుతిః = ముండకోపనిషత్తు (ఆహ = చెప్పెను).

తా. ప్రజ్వరిల్లుచున్న యగ్నినుండి విస్ఫులింగములు పుట్టినట్లు పరమాత్మనుండి చేతనజడాత్మకమైన సర్వపదార్థములు పుట్టె నని ముండకశ్రుతి చెప్పెను.

అవ. బృహదారణ్యకశ్రుతిని చెప్పుచున్నాఁడు:—

శ్లో. జగదవ్యాకృతం పూర్వమాసీద్వ్యాక్రియతాధునా,
దృశ్యాభ్యాం నామరూపాభ్యాం విరాడాదిషు తే స్ఫుటే. ౪

వ్యా. ఏవం బృహదారణ్యకేఽప్యవ్యాకృతశబ్దవాచ్యాద్బ్రహ్మణో నామరూపాత్మకం జగదుత్పన్నమితి శ్రుతమిత్యాహ—జగదితి. "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌ నామాయమిదం రూప"మితి వాక్యేన సృష్టేః పురాఽస్పష్టనామరూపత్వేనావ్యాకృతశబ్దవాచ్యాన్మాయోపాధికాద్బ్రహ్మణో నామరూపస్పష్టీకరణలక్షణా శక్తిరుక్తా. తయోర్నామరూపయోర్విరాడాదిషు స్థూలకార్యేషు స్పష్టతా చ. "తదిదమప్యేతర్హి నామరూపాభ్యామేవ వ్యాక్రియతే అసౌ నామాయమిదం రూప"మితి వాక్యేనాభిహితా. తేచ విరాడాదయః "ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుషవిధ" ఇత్యాదినా ఏవమేవ "యదిదం కించ మిథునమాపిపీలికాభ్యస్తత్సర్వమసృజ" తేత్యంతేన [illegible]

టీ. పూర్వం=సృష్టికిపూర్వము, జగత్=జగత్తు, అవ్యాకృతం=అవ్యాకృతమనెడి బ్రహ్మమాత్రముగ, ఆసీత్ = ఉండెను. అధునా = ఇప్పుడు, దృశ్యాభ్యాం నామరూపాభ్యాం=కనుపించెడి నామరూపములచేత, వ్యాక్రియత = [illegible]. విరాడాదిషు = విరాట్టు మొదలగు స్థూలకార్యములందు, తే=ఆనామరూపములు, స్ఫుటే = స్పష్టమగుచున్నవి.

తా. సృష్టికి పూర్వము బ్రహ్మమే యుండెను. ఈజగత్సృష్టి కాలమునం దాబ్రహ్మము నామరూపములుగా మాఱెను. ఆనామరూపములు స్థూలకార్యములైన విరాడాదులయందు స్పష్టమగుచున్నవి.

శ్లో. విరాణ్మనునరా గావః ఖరాశ్వాజావయ స్తథా,
పిపీలికావధిద్వంద్వమితి వాజసనేయినః. 9

టీ. విరాణ్మనునరాః=విరాట్టు, మనువులు, నరులు, గావః=గోవులు, ఖరాశ్వాజావయః=గాడిదెలు, గుఱ్ఱములు మొదలైనవియు, తథా=ఆలాగుననే, పిపీలికావధిద్వంద్వం=చీమలవరకు నవధిగాఁగల జంతువులరాశియంతయు (బ్రహ్మణః = బ్రహ్మమువలన, అజాయత = పుట్టెను). ఇతి = అని, వాజసనేయినః = వాజసనేయులు, (ఆహుః = చెప్పిరి).

తా. బృహదారణ్యకోపనిషత్తునందును, విరాట్టు మొదలుగా బ్రహ్మాది పిపీలికపర్యంతమును గల స్త్రీపురుషరూపజంతు మిథునరాశి యగు సర్వప్రపంచమును బ్రహ్మమువలననే పుట్టినట్లు చెప్పఁబడెను.

అవ. బ్రహ్మమే జీవరూపముగా ప్రవేశించినట్లు చెప్పుచున్నాఁడు:—

శ్లో. కృత్వా రూపాంతరం జైవం దేహే ప్రావిశదీశ్వరః,
ఇతి తాః శ్రుతయః ప్రాహు ర్జీవత్వం ప్రాణధారణాత్. 10

వ్యా. ఉదాహృతాభిః శ్రుతిభిః ద్వైతసృష్ట్యభిధానానంతరం బ్రహ్మణో జీవరూపేణ తత్ర ప్రవేశోఽప్యభిహిత ఇత్యాహ—కృత్వేతి. శ్రుతయః జైవం జీవసంబంధిరూపాంతరం అవిక్రియబ్రహ్మణో విలక్షణం వికారిరూపమిత్యర్థః. దేహే దేహజాతే జీవత్వం కుత ఇత్యత ఆహ—జీవత్వమితి. ప్రాణాదీనాం స్వామిత్వేన ప్రేరకత్వం ప్రాణధారణం తస్మాజ్జైవం రూపం కృత్వా ప్రావిశదిత్యుక్తం.

టీ. ఈశ్వరః = ఈశ్వరుఁడు, జైవం = జీవసంబంధమగు, రూపాంతరం = మఱియొకరూపమును, కృత్వా = చేసికొని, దేహే = దేహసమూహమునందు, ప్రావిశదితి = ప్రవేశించెనని, తాః శ్రుతయః = ఆ యుపనిషత్తులన్నియు, ప్రాహుః=చెప్పుచున్నవి. ప్రాణధారణాత్ = ప్రాణములను ధరించుటవలన, జీవత్వం = జీవభావ మేర్పడుచున్నది.

తా. ఆబ్రహ్మమే వికారరూపమగు జీవత్వమును పొంది దేహసమూహమునందు ప్రవేశించె నని శ్రుతులు చెప్పుచున్నవి. ప్రాణాదులకు ప్రేరకుఁ డగుటవలన జీవభావ మేర్పడె నని తెలియఁదగును.

అవ. ఆజీవత్వమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. చైతన్యం య దధిష్ఠానం లింగదేహశ్చ యః పునః,
చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే. 11

వ్యా. కిం తదిత్యపేక్షాయా మాహ—చైతన్యమితి. యదధిష్ఠానం లింగదేహ కల్పనాధారభూతం యచ్చైతన్యమస్తి; యశ్చ తత్ర కల్పితో లింగదేహో; యశ్చ తస్మిన్ లింగదేహే వర్తమానశ్చిదాభాసస్తత్సంఘస్తేషాం త్రయాణాం సమూహో జీవశబ్దేనోచ్యత ఇత్యర్థః.

టీ. అధిష్ఠానాం=లింగదేహమున కాధారమైన, యత్ చైతన్యం=ఏచైతన్యము గలదో, యః పునః లింగదేహశ్చ = ఏ లింగదేహము కలదో, లింగదేహస్థా = సూక్ష్మ శరీరమం దున్నట్టి, చిచ్ఛాయా=చిత్ప్రతిబింబము కలదో, తత్సంఘః=ఆమూఁడింటిసము దాయము, జీవ ఇతి=జీవుఁ డని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. లింగదేహము మొదలగు సర్వకల్పనల కాధారమైన చైతన్యమును, చైతన్యమందు కల్పింపఁబడిన లింగదేహమును, లింగ దేహమున ప్రతిబింబించిన చిదాభాసుఁడును, ఈమూఁడును చేరి జీవుఁ డనఁబడును. (బింబరూపముగాయొక్క ప్రతిబింబము చిదాభాసుఁడు.)

అవ. ఈశ్వరుఁడే జీవరూపమున ప్రవేశించె నంటివి. దానికి దుఃఖిత్వాదివిరుద్ధ ధర్మము లేల గలిగె ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాహేశ్వరీ తు యా మాయా తస్యా నిర్మాణశక్తివత్,
విద్యతే మోహశక్తిశ్చ తం జీవం మోహయత్యసౌ. 12

వ్యా. నన్వీశ్వరస్యైవ జీవరూపేణ ప్రవిష్టత్వే తస్యాజ్ఞత్వదుఃఖిత్వాదివిరుద్ధ ధర్మవత్త్వం కుత ఇత్యాశంక్యాహ—మాహేశ్వరీ త్విది. మాహేశ్వరీ "మాయినం తు మహేశ్వర" ఇతి శ్రుత్యుక్తా మహేశ్వరసంబంధినీ యా మాయాస్తి తస్యా నిర్మాణశక్తివజ్జగత్సర్జనసామర్థ్యవన్మోహశక్తిశ్చ మోహనసామర్థ్య మప్యస్తి. "తదేత జ్జడం మోహాత్మక" మితి శ్రుతేః. తతః కిమిత్యత ఆహ—తం జీవమితి. అసౌ మోహన శక్తిస్తం పూర్వోక్తం జీవం మోహయతి విధానిబంధివిస్మరూపజ్ఞానరహితం కరోతి.

టీ. మహేశ్వరీతు = ఈశ్వరసంబంధిని యగు, యా = ఏ, మాయా=మాయా శక్తిగలదో, తస్యాః = ఆట్టిమాయకు, నిర్మాణశక్తివత్ = జగత్తులను కల్పించెడి శక్తి వలె, మోహశక్తిశ్చ = అందఱను మోహింపఁజేసెడిశక్తియు, విద్యతే=కలదు. అసౌ = ఈమోహశక్తి, తం జీవం=ఆజీవుని, మోహయతి=మోహింపఁజేయుచున్నది.

తా. ఈశ్వరశక్తికి జగన్నిర్మాణశక్తియు మోహింపఁజేసెడి శక్తియుఁ గలదు. ఆమోహనశక్తిచే జీవుఁడు మోహింపఁజేయఁబడు చున్నాఁడు.

అవ. మోహింపఁజేసిన నేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మోహాదనీశతాం ప్రాప్య మగ్నో వపుషి శోచతి,
ఈశసృష్ట మిదం ద్వైతం సర్వముక్తం సమాసతః. 13

వ్యా. తతోఽపి కిమిత్యత ఆహ = మోహాదితి. మోహాత్పూర్వోక్తాదనీశతా మిష్టానిష్టప్రాప్తిపరిహారయోరసామర్థ్యం ప్రాప్య, వపుషి నిమగ్నః శరీరే తదాత్మ్యాభి మానం గతః శోచతి దుఃఖిత్వాద్యభిమానం కరోతి. *"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః" ఇతి శ్రుతేరిత్యర్థః. వక్ష్యమాణసాంకర్య పరిహారాయ వృత్తం నిగమయతి—ఈశేతి. సమాసతః సంక్షేపేణేత్యర్థః.

టీ. మోహాత్ = పూర్వోక్తమోహనశక్తివలన, అనీశతాం = అసమర్థతను, ప్రాప్య = పొంది, వపుషి = శరీరమందు, నిమగ్నః = అభిమానమును పొంది, శోచతి = దుఃఖించుచున్నాఁడు. ఈశసృష్టం = ఈశ్వరునిచే సృజింపఁబడిన, ఇదం=ఈ, సర్వం = ద్వైతం=సమస్తప్రపంచమును, సమాసతః = సంగ్రహముగా, ఉక్తం = చెప్పఁబడినది.

తా. మోహనశక్తివలన జీవునకు అసమర్థత ఏర్పడుచున్నది. (కావలసినవానిని పొందుటకు శక్తి లేకుండుటయు, అనిష్టమును తొలఁగించుకొనుటకు శక్తిలేకుండుటయు అసమర్థత యనంబడును.) శరీరమందు తాదాత్మ్యాభిమానమువలన దుఃఖమును పొందు చున్నాఁడు. ఈవిధముగా ఈశ్వరసృష్టమైన జగత్తునుగూర్చి చెప్పఁ బడెను.

అవ. జీవుఁడు ద్వైతమును సృజించె ననుటకు ప్రమాణమును జూపు చున్నాఁడు:—

శ్లో. సప్తాన్న బ్రాహ్మణే ద్వైతం జీవసృష్టం ప్రపంచితం,
అన్నాని సప్తజ్ఞానేన కర్మణాఽజనయత్పితా. 14

వ్యా. నను జీవస్య ద్వైతస్రష్టృత్వే కిం మానమిత్యాశంక్యాహ—సప్తాన్నేతి. కథం తత్ర ప్రపంచితమిత్యాశంక్య సప్తాన్నశబ్దవాచ్యద్వైతసృష్టిప్రతిపాదకం "యత్సప్తాన్నాని మేధయా తపసా జనయత్పితే"తి వాక్యమర్థః సంగృహ్ణాతి— అన్నానీతి. పితా స్వాదృష్టద్వారా జగదుత్పాదనేక సర్వలోకపాలకో జీవ ఇత్యర్థః.

టీ. జీవసృష్టం = జీవునిచే సృజింపఁబడిన, ద్వైతం = ప్రపంచము, సప్తాన్న బ్రాహ్మణే = సప్తాన్నబ్రాహ్మణమునందు, ప్రపంచితం=వివరముగా చెప్పఁబడెను. పితా = లోకపాలకుఁడైన జీవుఁడు, జ్ఞానేన=తెలివిచేతను, కర్మణా=కర్మచేతను, సప్త అన్నాని = ఏడువిధములైన యన్నములను, అజనయత్=సృజించెను.

తా. ఛాందోగ్యోపనిషత్తులోని సప్తాన్న బ్రాహ్మణమునందు జీవ సృష్టి వివరింపఁబడియున్నది. జీవుఁడు తన జ్ఞానకర్మములచేత ఏడు అన్నములను సృష్టించెను.

అవ. ఆ సప్తాన్నములనే చెప్పుచున్నాఁడు:—

శ్లో. మర్త్యాన్న మేకం దేవాన్నే ద్వే పశ్వన్నం చతుర్థకం,
అన్య త్త్రితయ మాత్మార్థ మన్నానాం వినియోజనమ్. 15

వ్యా. నన్వన్నసప్తకసర్జనం కిమర్థ మిత్యాశంక్య తద్వినియోగోఽపి "ఏకమస్య సాధారణం, ద్వే దేవానభాజయత్, త్రీణ్యాత్మనేఽకురుత పశుభ్య ఏకం ప్రాయచ్ఛ" దితి వాక్యే నోక్త ఇత్యాహ—మర్త్యాన్నమితి. వినియోజనముక్త మితి శేషః.

టీ. మర్త్యాన్న మేకం = మనుష్యునియన్నమొకటి, దేవాన్నే ద్వే = దేవాన్నములు రెండు, పశ్వన్నం చతుర్థకం = పశువులయన్నము నాల్గవది, అన్యత్=తక్కిన, త్రితయం=మూఁడన్నములును, ఆత్మార్థం=తనకొఱకు, అన్నానాం=అన్నముల యేడింటి యొక్క, వినియోజనం=విభాగము, (ఉక్తం=చెప్పఁబడెను).

తా. సప్తాన్నముల విభజించి మర్త్యాన్న మొకటి, దేవాన్నములు రెండు, పశ్వన్న మొకటి, చేరి నాల్గు. మిగిలిన మూఁడన్నములు తన నిమిత్తము అని చెప్పఁబడెను.

అవ. సప్తాన్నబ్రాహ్మణమునందు రమారమి రెండు ఖండికలపర్యంత మీ విష యమే చెప్పఁబడిన దనుచున్నాఁడు:—

శ్లో. వ్రీహ్యాదికం దర్శపూర్ణమాసౌ క్షీరం తథా మనః,
వాక్ ప్రాణా శ్చేతి సప్తత్వ మన్నానా మవగమ్యతామ్. 16

వ్యా. "తాని చ సప్తాన్నా న్యేకమస్య సాధారణమితీదమేవాస్య జగత్సాధా రణమన్నం యదిదమద్యత" ఇత్యాదినా "అయమాత్మా వాఙ్మయో మనోమయః ప్రాణ మయ" ఇత్యంతేన వాక్యసందర్భేణ శేషభూతఖండికాద్వయరూపేణ దర్శితానీత్యా హ—వ్రీహ్యాదికమితి.

టీ. వ్రీహ్యాదికం = ధాన్యము మొదలగునదియు, దర్శపూర్ణమాసౌ = అమావాస్యా పూర్ణిమలును, క్షీరం = పాలును, తథా = అటులనే, మనః = మనస్సును వాక్ ప్రాణాశ్చ=ఇంద్రియములును, ప్రాణములును, ఇతి=అని, అన్నానాం=అన్నముల యొక్క, సప్తత్వమితి=ఏడగుట, యని, అవగమ్యతాం=తెలియవలెను.

తా. వడ్లు మొదలగు ధాన్యము సామాన్యమర్త్యాన్నము. అమావాస్యాపూర్ణిమలు దేవాన్నములు. క్షీరము పశ్వన్నము. మనస్సు, ఇంద్రియములు, ప్రాణవర్గమును ఆత్మాన్నములు. ఇట్లు సప్తాన్నస్వరూపము వివరింపఁబడెను.

అవ. "సప్తాన్నములు జగత్తులోనివిగదా! జగత్తు ఈశ్వరసృష్టముగదా! అపుడు సప్తాన్నములు జీవునిచే సృజింపఁబడిన వనెద వేమి" యనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఈశేన యద్యప్యేతాని నిర్మితాని స్వరూపతః,
తథాపి జ్ఞానకర్మభ్యాం జీవోఽకార్షీ త్తదన్నతామ్. 17

వ్యా. ననూక్తసప్తాన్నానాం జగదంతఃపాతిత్వేనేశ్వరనిర్మితత్వాజ్జీవనిర్మితత్వాభిధానమయుక్తమిత్యాశంక్య తత్స్వరూపస్యేశ్వరనిర్మితత్వేఽపి భోగ్యత్వాకారస్య జీవనిర్మితత్వాన్నైవమిత్యాహ—ఈశేనేతి. జ్ఞానకర్మభ్యాం జ్ఞానం విహితం ప్రతిషిద్ధం చ దేవతా పరయోషిదాదివిషయధ్యానం; కర్మ చ విహితం యజ్ఞాదిరూపం ప్రతిషిద్ధం హింసాదిరూపం తాభ్యామిత్యర్థః. తదన్నతాం తేషాం వ్రీహ్యాదిప్రాణాంతానాం స్వభోగోపకరణత్వమిత్యర్థః.

టీ. యద్యపి=విచారింపఁగా, ఏతాని = ఈయేడన్నములు, స్వరూపతః=స్వరూపముచేత, ఈశేన = ఈశ్వరునిచే, నిర్మితాని = నిర్మింపఁబడినని. తథాపి = అటులైనను, జీవః=జీవుఁడు, జ్ఞానకర్మభ్యాం = జ్ఞానకర్మలచేత, తదన్నతాం = వానిని భోగసాధనమగుటను, అకార్షీత్ = చేసికొనెను.

తా. సప్తాన్నము లీశ్వరునిచే సృజింపఁబడినవైనను, జీవుఁడు వానిని తన జ్ఞానకర్మలచేత భోగసాధనములుగాఁ జేసికొనెను.

వి. జ్ఞానము విహిత మనియు ప్రతిషిద్ధ మనియు ద్వివిధము. అందు దేవతాది ధ్యానము విహితజ్ఞాన మనఁబడును. పరస్త్రీ పరధనాపహరణాదిరూప మగు ధ్యానము ప్రతిషిద్ధజ్ఞాన మనఁబడును. మఱియు, కర్మయును విహిత మనియు ప్రతిషిద్ధ మనియు ద్వివిధము. యజ్ఞాదిరూపమగు కర్మము విహితము. హింసాదిరూపకర్మము ప్రతిషిద్ధము.

ఇట్టి జ్ఞానకర్మములచేత జీవుఁడు ఆ సప్తాన్నములను తనకు భోగసాధనము లగునట్లుగ వానికి భోగ్యాకారత్వము నిర్మించె నని తెలియవలెను.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఈశకార్యం జీవభోగ్యం జగద్ద్వాభ్యాం సమన్వితం,
పితృజన్యా భర్తృభోగ్యా యథా యోషి త్తథేష్యతామ్. 18

వ్యా. కిముక్తం భవతీతి తత్రాహ—ఈశకార్యమితి. జగత్సప్తాన్నత్వేన ఉక్తం వ్రీహ్యాదిరూపం ఈశకార్యత్వేన జీవభోగ్యత్వేన చ ద్వాభ్యాం సంబంధమిత్యర్థః. ఏకస్యోభయసంబంధే దృష్టాంతమాహ—పితృజన్యేతి.

టీ. జగత్ = సప్తాన్నరూపముగాఁ జెప్పఁబడిన ధాన్యాదికము, ఈశకార్యం= ఈశ్వరకార్యముగను, జీవభోగ్యం=జీవునకు భోగ్యముగను, ద్వాభ్యాం=జీవేశ్వరు లిద్దఱితో, సమన్వితం=కూడుకొనియున్నది. యోషిత్=స్త్రీ, పితృజన్యా = తండ్రివలన పుట్టినదై, భర్తృభోగ్యా = పెనిమిటిచే ననుభవింపఁదగినదైనది, యథా = ఎట్లో, తథా = అట్లే యని, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁగాక.

తా. సప్తాన్నరూపం బగు జగత్తు ఈశ్వరునివలన పుట్టి, జీవునిచే ననుభవింపఁబడుచున్నది. కనుక నిద్దఱిసంబంధము గలదిగాఁ జెప్పఁబడెను. దృష్టాంతము:—ఒకస్త్రీ తండ్రిచే పుట్టింపఁబడి, పెనిమిటిచే ననుభవింపఁబడునట్లు జగత్తు ఈశ్వరునిచే సృజింపఁబడి జీవునిచే భోగింపఁబడుచున్నది.

అవ. జగత్సృష్టియందు జీవేశ్వరులకు సాధన మే మనిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయావృత్త్యాత్మకో హీశసంకల్ప స్సాధనం జనౌ,
మనోవృత్త్యాత్మకో జీవ సంకల్పో భోగసాధనమ్. 19

వ్యా. ఈశజీవయోర్జగత్సర్జనే కిం సాధన మిత్యత ఆహ—మాయేతి.

టీ. జనౌ=సృష్టియందు, మాయావృత్త్యాత్మకః = మాయావృత్తి స్వరూపముగాఁ గలిగిన, ఈశసంకల్పః = ఈశ్వరసంకల్పము, సాధనం హి = సాధనముగదా! మనోవృత్త్యాత్మకః = మనోవృత్తి స్వరూపముగాఁ గల, జీవసంకల్పః = జీవసంకల్పము, భోగసాధనం = అనుభవసాధన మగును.

తా. ఈశ్వరసంకల్పము జగత్తును సృజించుటకును, జీవసంకల్పము దాని ననుభవించుటకును సాధనము లగును.

అవ. "భోగ్యవస్తు వన్నియు ఈశ్వరసృష్టములంటివిగదా! అట్లైన జీవునిచే నీ జగత్తు భోగసాధనముగాఁ జేయఁబడుచున్న దని ఏల చెప్పెద"వనినఁ జెప్పుచున్నాఁడు:-

శ్లో. ఈశనిర్మితమణ్యాదౌ వస్తున్యేకవిధే స్థితే,
భోక్తృధీవృత్తినానాత్వా త్తద్భోగో బహుధేష్యతే. 20

వ్యా. నన్వీశసృష్టవస్తుస్వరూపాతిరిక్తో భోగత్వాకార ఏవ నాస్తి. కో జీవేన సృజ్యత ఇత్యాశంక్యాహ—ఈశనిర్మితేతి. ఏకస్మి న్నేవ విషయే బహువిధోపభోగ ఉపలభ్యమాన స్తత్ప్రయోజకం భోగ్యాకారభేదం గమయతీత్యర్థః.

టీ. ఈశనిర్మితమణ్యాదౌ = ఈశ్వరునిచే సృజింపఁబడిన మణిమొదలైన, వస్తుని= వస్తువులు, ఏకవిధే=ఒక్కవిధమై, స్థితే = ఉండఁగా, భోక్తృధీవృత్తినానాత్వాత్ = అనుభవించెడివారివృత్తులు పలువిధములుగా నుండుటవలన, తద్భోగః = ఆమణ్యాదుల యనుభవము, బహుధా = నానావిధములుగా, ఇష్యతే = అనుభవింపఁబడుచున్నది.

తా. పరమేశ్వరునిచే సృజింపఁబడిన వస్తువులు ఒకేవిధమైనను, ఆవస్తువులే అనుభవించెడివారిబుద్ధివృత్తుల కనుగుణముగా బహువిధములుగా ననుభవింపఁబడుచున్నవి.

అవ. ఆయనుభవభేదమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. హృష్యత్యేకో మణిం లబ్ధ్వా క్రుధ్యత్యన్యో హ్యలాభతః,
పశ్యత్యేవ విరక్తోఽత్ర న హృష్యతి న కుప్యతి. 21

వ్యా. నను సతి భోగభేదే భోగ్యభేదః కల్ప్యేత. స ఏవ నాస్తీత్యాశంక్య దృశ్యమానత్వా న్నైవమిత్యాహ—హృష్యతీతి. ఏకో మణ్యర్థీ తం లబ్ధ్వా హృష్యతి. అన్య స్తథావిధ స్తదలాభాత్ క్రుధ్యతి. అత్ర మణౌ విషయే విరక్తస్తు తం మణిం పశ్యత్యేవ. లాభాలాభనిమిత్తౌ హర్షక్రోధౌ న ప్రాప్నోతీత్యర్థః.

టీ. ఏకః=మణివాంఛగలయొకఁడు, మణిం=మణిని, లబ్ధ్వా=పొంది, హృష్యతి= సంతోషించుచున్నాఁడు. అన్యః=మఱియొకఁడు (దానినిఁ గోరినవాఁడే), అలాభతః= అది లభింపమింజేసి, క్రుధ్యతి=కోపించుచున్నాఁడు. అత్ర=ఈమణివిషయమై,విరక్తః= దానియం దపేక్షలేనివాఁడు, పశ్యత్యేవ = ఊరకచూచును. న హృష్యతి = సంతసింపఁడు, న కుప్యతి = కోపింపఁడు.

తా. మణి దొరకినవానికి సంతోషమును, లభింపనివానికి కోపమును, విరక్తుఁ డగువానికి సంతోషము కోపమునులేక ఔదాసీన్యమును కలిగించుచున్నది. అందుచే ఒకేవస్తువు చిత్తవృత్తిభేదముచే ననుభవమందు భేదమును కలిగించుట ప్రసిద్ధము.

అవ. జీవసృష్టములైన యాకారభేదములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రియోఽప్రియ ఉపేక్ష్యశ్చేత్యాకారా మణిగాస్త్రయః,
సృష్టా జీవై రీశసృష్టం రూపం సాధారణం త్రిషు. 22

వ్యా. కే తే భోగభేదోపరక్తా జీవసృష్టా ఆకారభేదా ఇత్యత ఆహ—ప్రియ ఇతి. మణినిష్ఠాః ప్రియత్వాప్రియత్వోపేక్ష్యత్వలక్షణా ఆకారభేదా జీవైః సృష్టాః త్రిష్వపి సాధారణమనుస్యూతం యన్మణిరూపం తదీశ్వరనిర్మిత మిత్యర్థః.

టీ. ప్రియః = ప్రీతివిషయత్వమును, అప్రియః = ప్రీతివిషయము కాకపోవుటయు, ఉపేక్ష్యశ్చ = ఉపేక్షావిషయత్వము, ఇతి = అనియెడి, ఆకారాః = ఆకారములు, త్రయః = మూఁడును, మణిగాః = మణినిగూర్చినవి, జీవైః = జీవులచేత, సృష్టాః = కలిగింపఁబడినవి. ఈశసృష్టం = ఈశ్వరుఁడు కలిగించినది, త్రిషు=మూఁడింటియందు, సాధారణం = సామాన్యముగ నంటియున్న, రూపం = మణిరూప మగును.

తా. ఈశ్వరునిచే నిర్మింపఁబడిన మణిస్వరూప మొక్కటే విధముగా నుండినను ఆయాజీవులు దానిని ప్రేమించుట, కోపించుట, ఉపేక్షించుట యను నాకారములు మూఁడువిధంబులుగా నిర్మింపఁబడినవి.

అవ. మఱియొక యుదాహరణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. భార్యా స్నుషా ననాందా చ యాతా మాతేత్యనేకధా,
ప్రతియోగిధియా యోషి ద్భిద్యతే న స్వరూపతః. 23

వ్యా. ఉక్తం జీవసృష్టాకారభేదముదాహరణాంతరేణ స్పష్టయతి. భార్యేతి. ననాందా భర్తృభగినీ యాతా దేవరపత్నీ ప్రతియోగిధియా భర్తృశ్వశురాదిలక్షణ ప్రతియోగిగోచరయా బుద్ధ్యా తత్తదపేక్షయేత్యర్థః.

టీ. యోషిత్ = స్త్రీ, ప్రతియోగిధియా=భేదబుద్ధిచేత, భార్యా = భార్యగాను, ననాందాచ = ఆఁడుబిడ్డగాను, యాతా = తోడికోడలుగాను, మాతా = తల్లిగాను, ఇతి = ఇట్లు, అనేకధా = నానావిధములుగా భేదించుచున్నది. స్వరూపతః = స్త్రీ స్వరూపమునందు, న = భేదము లేదు.

తా. ఒకస్త్రీని పెనిమిటి మామ మొదలైనవారు భార్య, కోడలు, ఆఁడుబిడ్డ, తోడికోడలు, తల్లి యని వారివారివరుస ననుసరించి భేదముగాఁ దలంచినను స్త్రీ స్వరూపమునందు భేదము లేనట్లు జీవుల బుద్ధివృత్తి ననుసరించి ద్వైతము నానావిధములుగా నుండినను ఈశ్వర సృష్టిలో నొకేవిధముగా నుండుటకు భంగము లేదు.

అవ. నీవన్నమాట బాగుగా లే దని పూర్వపక్షి యాక్షేపించుచున్నాఁడు:—

శ్లో. నను జ్ఞానాని భిద్యంతా మాకారస్తు న భిద్యతే,
యోషి ద్వపుష్యతిశయో న దృష్టో జీవనిర్మితః. 24

వ్యా. నను యోషిద్విషయాణి భార్యాస్నుషేత్యాదిజ్ఞానాన్యేవ భిన్నాన్యుపలక్ష్యంతే. న తు తద్విషయభూతాయా యోషితస్స్వరూపే భేదో దృశ్యతే. అతః ప్రతియోగిధియా యోషిద్భిద్యత ఇత్యుక్తమయుక్తమితి శంక్యతే—నన్వితి.

టీ. నను = ఓసిద్ధాంతీ, జ్ఞానాని = స్త్రీవిషయకమైన జ్ఞానములు, భిద్యంతాం= వేఱుపఱుపఁబడుఁగాక. ఆకారస్తు=స్త్రీయొక్క యాకార మన్ననో, న భిద్యతే=వేఱుపఱుపఁబడుట లేదు. యోషిద్వపుషి=స్త్రీశరీరమునందు, జీవనిర్మితః = జీవునిచే నిర్మింపఁబడిన, అతిశయః = క్రొత్తరూపము, న దృష్టః = చూడఁబడుట లేదు.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ! ఒకస్త్రీని గూర్చి వారివారికి భార్యయని, కోడ లని యభిప్రాయములు భిన్నభిన్నములుగా నుండుఁ గాక. ఆకారములో భేదము లేదే. జీవుఁడు నిర్మించిన క్రొత్తయాకారము స్త్రీయం దేదని కనుపించుచున్నదా? కనుపించుట లే దని భావము. ఇది పూర్వపక్షియాక్షేపము.

అవ. సిద్ధాంతి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మైవం మాంసమయీ యోషి త్కాచి దన్యా మనోమయీ,
మాంసమయ్యా అభేదేఽపి భిద్యతే హి మనోమయీ. 25

వ్యా. జ్ఞానవైలక్షణ్యస్య జ్ఞేయవైలక్షణ్యావినాభూతత్వాత్ జ్ఞేయాకారభేదోఽంగీకర్తవ్య ఏవేత్యాశయేన పరిహరతి—మైవమితి.

టీ. మైవం = ఇటు లాక్షేపింపరాదు. మాంసమయీ = మాంసమయరూపము గల, యోషిత్ = స్త్రీ, అన్యా = ఇతరమగు, కాచిత్ = ఒకానొక, మనోమయీ= మనోమయరూపము గలదియు నగును. మాంసమయ్యా = మాంసమయరూపముచేత, అభేదేఽపి = భేదము లేకపోయినను, మనోమయీ = మనోమయరూపము, భిద్యతే హి = భేదింపఁబడుచున్నదే యగును.

తా. ఓ పూర్వపక్షీ! నీశంక సరిగా లేదు. ఆస్త్రీస్వరూపము మాంసమయాకార మొకటి, మనోమయాకార మొకటి. ఇట్లు ద్వివిధాకారము గలిగియున్నది. మాంసమయదేహమునం దాకారభేదము లేకున్నను, పెనిమిటి మామ మొదలగువారికి మనోవృత్తియందు స్త్రీని

గుఱించి యాకారభేదము కలుగుచునే యున్నది. ఎప్పుడును వస్తువునం దేదో విశేషము లేనిది అభిప్రాయభేదము కలుగదు. అట్లు కలుగుటచేత స్త్రీస్వరూపమునందు నానాకారవిశేషమున్నట్లు ఒప్పుకొనక తప్పదు. ఆయాకారవిశేషమే జీవసృష్టము.

అవ. మఱల పూర్వవాది శంకించుచున్నాఁడు:—

శ్లో. భ్రాంతిస్వప్నమనోరాజ్యస్మృతిష్వస్తు మనోమయం,
జాగ్రన్మానేన మేయస్య న మనోమయతేతి చేత్. 26

వ్యా. నను, భ్రాంత్యాదిస్థలే బాహ్యవిషయాభావాత్ తత్రత్యం వస్తు మనోమయమస్తు. ప్రమితిస్థలే తు తదనుపపన్నం. బాహ్యవస్తున స్సత్త్వాదితి శంకతే— భ్రాన్తీతి. మానేన ప్రత్యక్షాదిప్రమాణేన మేయస్య ప్రమేయస్యేత్యర్థః.

టీ. భ్రాంతిస్వప్నమనోరాజ్యస్మృతిషు = భ్రాంతికాలమునను, స్వప్నకాలమునను, మనస్సులో నితరవిషయముల నాలోచించునప్పుడును, స్మరించుటయందును; మనోమయం=మనోమయాకారము, అస్తు = ఉండుఁగాక! జాగ్రన్మానేన = ప్రత్యక్షప్రమాణముచేత, మేయస్య = విషయమగు వస్తువునకు, మనోమయతా = మనోమయభావము, న=తగదు. ఇతి చేత్ = ఇట్లందువేని, వినుము.—

తా. ఓసిద్ధాంతీ! భ్రాంతిదశయందును, స్వప్నదశయందును, విషయధ్యానమందును, స్మరించుటయందును తోఁచెడిదానిని మనోమయమంటివి సరే కాని, ప్రత్యక్షముగా జాగ్రదవస్థలో కనుపడెడి వస్తువులను మనోమయ మని చెప్పు టెట్లు? ప్రత్యక్షమున కనుపట్టెడిదానికంటె వే అని చెప్పుటకు వీలు కాదు.

అవ. సిద్ధాంతి పైయాక్షేపణకు సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. బాఢం మానే తు మేయేన యోగాత్స్యాద్విషయాకృతిః,
భాష్యవార్తికకారాభ్యా మయ మర్థ ఉదీరితః. 27

వ్యా. ప్రమితిస్థలే బాహ్యంవిషయసత్త్వమంగీకరోతి— బాఢమితి. కథం తర్హి తద్విషయస్య మనోమయత్వ ముచ్యత ఇత్యత ఆహ— మానే త్వితి. మానే విషయాకృతిస్తు తస్య మేయేన యోగాత్సంబంధాత్స్యాత్. నన్విదం స్వకపోలకల్పితమిత్యాశంక్యాహ— భాష్యేతి.

టీ. బాఢం = సరే, మానే = ప్రమాణమునందు, మేయేన = విషయముతో, యోగాత్ = సంబంధమువలన, విషయాకృతిః = విషయాకారము, స్యాత్ = అగును.

అయం అర్థః = ఈసంగతి, భాష్యవార్తికకారాభ్యాం = భాష్యకారులచేతను, వార్తిక కారులచేతను, ఉదీరితః = చెప్పఁబడెను.

తా. మనోవృత్తి ప్రమాణము. ఘటాదివిషయము ప్రమేయము. చిదాభాసునితోఁ గూడిన మనోవృత్తి ప్రమేయముతో చేరినపుడు, ఆమనోవృత్తియందు విషయాకార మేర్పడును. ప్రత్యక్షమునఁ జూచు వస్తువులయాకారము చిత్తమునం దేర్పడుచున్నది. అదియే మనోమయ రూప మగు నని భాష్యవార్తిక కారు లిరువురును చెప్పిరి.

అవ. భాష్యకారునివాక్యమును పఠించుచున్నాఁడు:—

శ్లో. మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా,
రూపాదీన్ వ్యాప్నువ చ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్. 28

వ్యా. తత్ర తావద్భాష్యకారవచన ముదాహరతి—మూషేతి. యథా ద్రుతం తామ్రం మూషాయాం సిక్తం సత్తన్నిభం జాయతే తత్సమానాకారవద్భవతి. తథా రూపాదీన్ విషయాన్ వ్యాప్నువద్విషయాకురర్వచ్చిత్తం ధ్రువమవశ్యం తన్నిభం దృశ్యతే ఉపలభ్యత ఇత్యర్థః.

టీ. యథా = ఎట్లు, మూషాసిక్తం = మూసయందు కరుగఁబడిన, తామ్రం = రాగి, తన్నిభం = ఆమూసయాకారమునకు సమానమైన యాకారముగలది, జాయతే= అగునో, తథా = అట్లే, రూపాదీన్ = రూపము మొదలగు విషయములను, వ్యాప్నువత్ = వ్యాపించిన, చిత్తం=చిత్తము, ధ్రువం = నిశ్చయముగా, తన్నిభం = ఆఘటాది విషయాకారముగలదిగా, దృశ్యతే = చూడఁబడుచున్నది.

తా. విగ్రహాదులను పోతపోయువాఁడు తామ్రమును కరగి మూసకట్టి పోయును. అప్పు డాతామ్రము మూసయాకారమును జెందును. అట్లే ఘటము మొదలగు వస్తువులయందు వ్యాపించిన మనస్సు ఆ యా విషయాకారమును పొందుట యనుభవసిద్ధము. ఇదియే మనోమయరూపము.

అవ. మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యంజనో వా యథాలోకో వ్యంగ్యస్యాకారతామియాత్,
సర్వార్థవ్యంజకత్వాద్ధీ రర్థాకారా ప్రదృశ్యతే. 29

వ్యా. నను తామ్రాదేరగ్నిసంపర్కాద్ద్రుతస్య మూషానిషిక్తస్య కఠినమూషాభిఘాతేన శైత్యాపత్తౌ మూషాకారాపత్తావపి బుద్ధేరమూర్తాయాస్తామ్రాదివిలక్షణాయా

విషయవ్యాప్తావపి కుతస్తదాకారాపత్తిరిత్యాశంక్య దృష్టాంతాంతరమాహ—వ్యంజక ఇతి. యథా వా వ్యంజకః ప్రకాశక ఆలోక ఆతపాదిర్వ్యంగ్యస్య ప్రకాశ్యస్య ఘటాదే రాకారతామాకారవత్తామియా త్ప్రాప్నుయాదేవం ధీరపి సర్వార్థస్య వ్యంజకత్వా త్సకలపదార్థప్రకాశకత్వాదర్థాకారా అర్థస్యాకార ఇవాకారో యస్యాః సా తథా ప్రదృశ్యతే ప్రకర్షేణోపలభ్యత ఇత్యర్థః.

టీ. వ్యంజకః = వస్తువులను కనఁబఱచెడి, ఆలోకః = వెలుతురు మొదలగునది, వ్యంగ్యస్య = ఘటాదిపదార్థములయొక్క, ఆకారతాం = ఆకారమును, ఇయాత్ = పొందును. ధీః = బుద్ధి, సర్వార్థవ్యంజకత్వాత్ = సర్వపదార్థములను ప్రకాశింపఁజేయున దగుటవలన, అర్థాకారా = ఆయావిషయాకారముకలదై ప్రదృశ్యతే=చూడఁబడుచున్నది.

తా. వెల్తురు మొదలైనది ఘటాదివిషయాకారమును పొందినట్లు బుద్ధి సర్వవిషయములను (వెల్తురువలె) ప్రకాశింపఁజేయునదిగాన, ఆయావిషయాకారమై కన్పట్టును.

అవ. వార్తికకారాభిప్రాయమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. మాతు ర్మానాభినిష్పత్తి ర్నిష్పన్నం మేయమేతి తత్,
మేయాభిసంగతం తచ్చ మేయాభత్వం ప్రపద్యతే. 30

వ్యా. ఇదానీం వార్తికకారవచనమాహ—మాతురితి. మాతుః సాధిష్ఠానబుద్ధిస్థచిదాభాసరూపాత్ప్రమాతుర్మానాభినిష్పత్తిర్మానస్య సాభాసాంతఃకరణవృత్తిరూపస్యాభినిష్పత్తిరుత్పత్తి ర్భవతీతి శేషః. నిష్పన్న ముత్పన్నం తన్మానం మేయం ఘటాదిరూపమేతి ప్రాప్నోతి. కించ తన్మానం మేయాభిసంగతం ప్రమేయేణ సంబద్ధం సన్మేయాభత్వం మేయస్యాభేవాభా యస్య తన్మేయాభం తస్య భావస్తత్త్వం మేయసమానాకారతాం ప్రపద్యతే ప్రాప్నోతీత్యర్థః.

టీ. మాతుః = ప్రమాతవలన, మానాభినిష్పత్తిః = ప్రమాణముయొక్కయుత్పత్తి యగుచున్నది. నిష్పన్నం=అట్లు పుట్టినప్రమాణము, మేయం=ఘటాదివిషయరూపమును, ఏతి = పొందుచున్నది. తచ్చ = ఆప్రమాణము, మేయాభిసంగతం = ప్రమేయములోఁగూడినదై, మేయాభత్వం = ఘటాదివిషయాకారమును, ప్రపద్యతే= పొందుచున్నది.

తా. అంతఃకరణప్రతిఫలితచైతన్యము ప్రమాత యనంబడును. అట్టి ప్రమాతతోఁ గూడిన మనోవృత్తి ప్రమాణ మనఁబడును.

ఘటాదివిషయములు ప్రమేయములు. ప్రమాణము ప్రమేయాకారమును పొందుచున్నది. ఘటాదిసమానాకారమును పొందు ననుట.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యేవం విషయౌ ద్వౌ స్తో ఘటౌ మృన్మయధీమయౌ,
మృన్మయో మానమేయస్స్యాత్సాక్షిభాస్యస్తు ధీమయః. 31

వ్యా. భవత్వేవం, ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—సత్యేవమితి. నను మృన్మయఘటస్యేవ మనోమయఘటస్య తేనైవ మనసా గ్రహీతుమశక్యత్వాత్ గ్రాహకాంతారాభావాచ్చాసిద్ధిరేవేత్యాశంక్య గ్రాహకాంతరాభావోఽసిద్ధ ఇత్యాహ— మృన్మయో మానమేయ స్తథా ధీమయః సాక్షిభాస్య ఇత్యర్థః.

టీ. ఏవం సతి = ఇట్లుండఁగా, విషయౌ = విషయములైన, ఘటౌ = ఘటములు, మృన్మయధీమయౌ = మృద్వికారముగాను, బుద్ధివృత్తిరూపముగాను, ద్వౌ = రెండుగా, స్తః=అగుచున్నవి. మృన్మయః = మృన్మయఘటము, మానమేయః = ప్రమాణముచే తెలుపఁబడునది, స్యాత్ = అగును. ధీమయః = బుద్ధివృత్తిమయమగు ఘటము, సాక్షిభాస్యః = ప్రత్యగాత్మచే భావింపఁబడును.

తా. ఘటము మృద్వికారముగాను మనోమయముగాను, రెండుగా నగుచున్నది. మృద్వికారఘటము వృత్తిగమ్యము. ధీమయ ఘటము సాక్షిచేతనే తెలియఁబడును.

అవ. జీవసృష్టద్వైతము బంధహేతు వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్వయవ్యతిరేకాభ్యాం ధీమయో జీవబంధకృత్,
సత్యస్మిన్ సుఖదుఃఖే స్త స్తస్మిన్నసతి న ద్వయమ్. 32

వ్యా. భవత్వేవం ద్వివిధం ద్వైతం. అత్ర కస్య హేయత్వం, కస్యవా నేతి న జ్ఞాయత ఇత్యాశంక్య జీవసృష్టస్యైవ హేయత్వమిత్యభిప్రేత్య తస్య బంధహేతుత్వం దర్శయతి—అన్వయేతి. అన్వయవ్యతిరేకావేవ దర్శయతి—సత్యస్మిన్నితి, అస్మిన్ జీవసృష్టే మానసప్రపంచే సతి విద్యమానే సుఖదుఃఖే స్తో భవతః. అసతి తు తస్మిన్న ద్వయం సుఖం దుఃఖం చ నాస్తీత్యర్థః.

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం = అన్వయవ్యతిరేకములచే, ధీమయః=మనోవృత్తిరూపమగు ద్వైతము, జీవబంధకృత్ = జీవునకు బంధము కలిగించుచున్నది. అస్మిన్ సతి = ఈమనోమయద్వైతముండఁగా, సుఖదుఃఖే = సుఖదుఃఖములు, స్తః = కలుగు

చున్నవి. తస్మిన్ = ధీమయద్వైతము, అసతి=లేనప్పుడు, ద్వయం = సుఖదుఃఖములు రెండును, న = కలుగవు.

తా. మనోమయద్వైత మున్నంతవఱకు జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. అట్టిధీమయద్వైతము లేకున్న జీవునకు సుఖదుఃఖములు లేవని అన్వయవ్యతిరేకములచేఁ జెప్పుచున్నాఁడు. అన్వయ మనఁగా, ఒకటియున్న మఱియొకటియు ఉన్న దనుట. వ్యతిరేక మన్న, ఒకటి లేకున్న రెండవదియు లే దనుట.

అవ. ఈయన్వయవ్యతిరేకములు బాహ్యవస్తువిషయము లేల కా వని శంకించుచున్నాఁడు:—

శ్లో. అసత్యపి చ బాహ్యార్థే స్వప్నాదౌ బధ్యతే నరః,
సమాధిసుప్తి మూర్ఛాసు సత్యప్యస్మి న్న బధ్యతే. 33

వ్యా. ననుచాన్వయవ్యతిరేకౌ బాహ్యార్థవిషయౌ కిం న స్యాతామిత్యత ఆహ—అసతీతి. నరో మనుష్యః. ఏతదుపలక్షణమన్యేషామపి. స్వప్నాదౌ స్వప్న స్వప్రత్యక్షకాలే బాహ్యార్థేఽనుకూలే యోషిదాదౌ ప్రతికూలే వ్యాఘ్రాదౌ చ పారమార్థికే విద్యమానేఽపి అవిద్యమానేఽపి బధ్యతే సుఖదుఃఖాభ్యాం యుజ్యతే. సమాధ్యవస్థాసు అస్మిన్ బాహ్యార్థే సత్యపి న బధ్యతే న సుఖదుఃఖాదిభాగ్భవతి. అతస్తద్విషయావన్వయవ్యతిరేకౌ న స్త ఇత్యర్థః.

టీ. నరః = మనుష్యుఁడు బాహ్యార్థే = బాహ్యవిషయజాతము, అసత్యపి = లేనిదైనను, స్వప్నాదౌ = స్వప్నమనోరాజ్యాదులయందు, బధ్యతే = సుఖదుఃఖములను పొందుచున్నాఁడు. సమాధిసుప్తిమూర్ఛాసు = సమాధి సుప్తి మూర్ఛావస్థలయందు, అస్మిన్ = ఈ బాహ్యవిషయములైన వ్యాఘ్రాదికము, సత్యపి = ఉన్నను, న బధ్యతే = సుఖదుఃఖములను కలిగించుట లేదు.

తా. స్వప్నమనోరాజ్యములందు బాహ్యవిషయములు లేకున్నను సుఖదుఃఖములు జీవునకు కలుగుచున్నవి. సమాధి, సుప్తి, మూర్ఛావస్థలయందు బాహ్యవస్తువు లున్నను సుఖదుఃఖములు కలుగుట లేదు. కావున బాహ్యవస్తువులు సుఖదుఃఖహేతువు లనుటకు వీలు లేదు. అట్టి బాహ్యవస్తువులు మనోమయములైనవు కావు. అట్టి ధీమయవస్తుజాతమే సుఖదుఃఖహేతువు.

అ. మనోమయమగు ద్వైతమే బంధహేతు వనుటను స్పష్టీకరించుచున్నాఁడు:—

ఘటాదివిషయములు ప్రమేయములు. ప్రమాణము ప్రమేయాకారమును పొందుచున్నది. ఘటాదిసమానాకారమును పొందు ననుట.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యేవం విషయౌ ద్వౌ స్తో ఘటౌ మృన్మయధీమయౌ,
మృన్మయో మానమేయస్స్యాత్సాక్షిభాస్యస్తు ధీమయః. 31

వ్యా. భవత్వేవం, ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—సత్యేవమితి. నను మృన్మయఘటస్యేవ మనోమయఘటస్య తేనైవ మనసా గ్రహీతుమశక్యత్వాత్ గ్రాహకాంతరాభావాచ్చాసిద్ధిరేవేత్యాశంక్య గ్రాహకాంతరాభావోఽసిద్ధ ఇత్యాహ— మృన్మయో మానమేయ స్తథా ధీమయః సాక్షిభాస్య ఇత్యర్థః.

టీ. ఏవం సతి = ఇట్లుండఁగా, విషయౌ = విషయములైన, ఘటౌ = ఘటములు, మృన్మయధీమయౌ = మృద్వికారముగాను, బుద్ధివృత్తిరూపముగాను, ద్వౌ = రెండుగా, స్తః=అగుచున్నవి. మృన్మయః = మృన్మయఘటము, మానమేయః = ప్రమాణముచే తెలుపఁబడునది, స్యాత్ = అగును. ధీమయః = బుద్ధివృత్తిమయమగు ఘటము, సాక్షిభాస్యః = ప్రత్యగాత్మచే భావింపఁబడును.

తా. ఘటము మృద్వికారముగాను మనోమయముగాను, రెండుగా నగుచున్నది. మృద్వికారఘటము వృత్తిగమ్యము. ధీమయము ఘటము సాక్షిచేతనే తెలియఁబడును.

అవ. జీవసృష్టద్వైతము బంధహేతు వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్వయవ్యతిరేకాభ్యాం ధీమయో జీవబంధకృత్,
సత్యస్మిన్ సుఖదుఃఖే స్త స్తస్మిన్నసతి న ద్వయమ్. 32

వ్యా. భవత్వేవం ద్వివిధం ద్వైతం. అత్ర కస్య హేయత్వం, కస్యనా చేతి న జ్ఞాయత ఇత్యాశంక్య జీవసృష్టస్యైవ హేయత్వమిత్యభిప్రేత్య తస్య బంధహేతుత్వం దర్శయతి—అన్వయేతి. అన్వయవ్యతిరేకావేవ దర్శయతి—సత్యస్మిన్నితి, అస్మిన్ జీవసృష్టే మానసప్రపంచే సతి విద్యమానే సుఖదుఃఖే స్తో భవతః. అసతి తు తస్మిన్న ద్వయం సుఖం దుఃఖం చ నాస్తీత్యర్థః.

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం = అన్వయవ్యతిరేకములచే, ధీమయః=మనోవృత్తిరూపమగు ద్వైతము, జీవబంధకృత్ = జీవునకు బంధము కలిగించుచున్నది. అస్మిన్ సతి = ఈమనోమయద్వైతముండఁగా, సుఖదుఃఖే = సుఖదుఃఖములు, స్తః = కలుగు

చున్నవి. తస్మిన్ = ధీమయద్వైతము, అసతి=లేనప్పుడు, ద్వయం = సుఖదుఃఖములు రెండును, న = కలుగవు.

తా. మనోమయద్వైత మున్నంతవఱకు జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. అట్టిధీమయద్వైతము లేకున్న జీవునకు సుఖదుఃఖములు లేవని అన్వయవ్యతిరేకములచేఁ జెప్పుచున్నాఁడు. అన్వయ మనఁగా, ఒకటియున్న మఱియొక్కటియును ఉన్న దనుట. వ్యతిరేక మన్న, ఆమొదటిది లేకున్న రెండవదియును లే దనుట.

అవ. ఈయన్వయవ్యతిరేకములు బాహ్యవస్తువిషయము లేల కావని శంకించుచున్నాఁడు:—

శ్లో. అసత్యపి చ బాహ్యార్థే స్వప్నాదౌ బధ్యతే నరః,
సమాధిసుప్తిమూర్ఛాసు సత్యప్యస్మిన్న బధ్యతే. 33

వ్యా. సమాధావన్వయవ్యతిరేకౌ బాహ్యార్థవిషయౌ కిం న స్యాతామిత్యత ఆహ—అసతీతి. నరో మనుష్యః. ఏతదుపలక్షణమన్యేషామపి. స్వప్నాదౌ స్వప్నస్మృత్యాదికాలే బాహ్యార్థే మనుకూలే యోషిదాదౌ ప్రతికూలే వ్యాఘ్రాదౌ చ పారమార్థికే విషయేఽసత్యపి అవిద్యమానేఽపి బధ్యతే సుఖదుఃఖాభ్యాం యుజ్యతే. సమాధ్యాదిషు తు అస్మిన్ బాహ్యార్థే సత్యపి న బధ్యతే న సుఖదుఃఖాదిభాగ్భవతి. అతస్తద్విషయావన్వయవ్యతిరేకౌ న స్త ఇత్యర్థః.

టీ. నరః = మనుష్యుఁడు బాహ్యార్థే = బాహ్యవిషయజాతము, అసత్యపి = లేనిదైనను, స్వప్నాదౌ = స్వప్నమనోరాజ్యాదులయందు, బధ్యతే = సుఖదుఃఖములను జెందుచున్నాఁడు. సమాధిసుప్తిమూర్ఛాసు = సమాధి సుప్తి మూర్ఛావస్థలయందు, అస్మిన్ = ఈ బాహ్యవిషయములైన వ్యాఘ్రాదికము, సత్యపి = ఉన్నను, న బధ్యతే = సుఖదుఃఖములను కలిగించుట లేదు.

తా. స్వప్నమనోరాజ్యాదుల బాహ్యవిషయములు లేకున్నను సుఖదుఃఖములు జీవునకు కలుగుచున్నవి. సమాధి, సుప్తి, మూర్ఛావస్థలయందు బాహ్యవస్తువు లున్నను సుఖదుఃఖములు కలుగుట లేదు. కావున బాహ్యవస్తువులు సుఖదుఃఖహేతువు లనుటకు వీలు లేదు. అట్టి బాహ్యవస్తువులు మనోమయములైనవని. అట్టి ధీమయవస్తుజాతమే సుఖదుఃఖకారణము.

అవ. మనోమయద్వైతమే బంధహేతు వనుటను స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. దూరదేశం గతే పుత్రే జీవత్యేవాత్ర తత్పితా,
విప్రలంభకవాక్యేన మృతం మత్వా ప్రరోదితి. 34

వ్యా. మనోమయప్రపంచస్య బంధకత్వే నాన్వయవ్యతిరేకావుదాహరణేన స్పష్టయతి—దూరదేశమితి. దేశాంతరం ప్రాప్తే పుత్రే తత్ర జీవత్యేవ సత్యత్ర స్వగృహే స్థితః కస్య పితా విప్రలంభకస్య మిథ్యావచనైః పరవంచకస్య త్వత్పుత్రో మృత ఇత్యేవంరూపేణ వాక్యేన స్వపుత్రం మృతం కల్పయిత్వా ప్రకర్షేణ రోదనం కరోతి.

టీ. పుత్రే = పుత్రుఁడు, దూరదేశం = దూరదేశమును, గతే=పొందినవాఁడై, జీవత్యేవ=జీవించియుండియే, అత్ర = ఇక్కడ (తనయింటను), తత్పితా=వానితండ్రి, విప్రలంభకవాక్యేన = మోసగానిమాటచేత, మృతం = చచ్చె నని, మత్వా = తలఁచి, ప్రరోదితి = ఏడ్చుచున్నాఁడు.

తా. దూరదేశములోనున్న పుత్రుఁడు వాస్తవముగా సజీవుఁడై యున్నను, మోసగాఁడు తనపుత్రుఁడు చచ్చె నని చెప్పినమాటచే తండ్రి దుఃఖమును పొందుచున్నాఁడుగదా! బాహ్యపుత్రుఁడున్నను, మనోమయపుత్రుఁడు నశించుటచే తండ్రికి దుఃఖము కల్గినది.

అవ. దానినే వ్యతిరేకముచేఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. మృతేఽపి తస్మిన్ వార్తాయా మశ్రుతాయాం న రోదితి,
అత స్సర్వస్య జీవస్య బంధకృ న్మానసం జగత్. 35

వ్యా. తస్మిన్నేవ పుత్రే తత్రైవ మృతేఽపి తన్మృతివార్తాయా మశ్రుతాయాం సత్యాం న రోదనం కరోతి. ఫలితమాహ—అత ఇతి.

టీ. తస్మిన్ = ఆపుత్రుఁడు, మృతేఽపి=చచ్చినను, వార్తాయాం=మరణవార్త, అశ్రుతాయాం = వినఁబడనప్పుడు, న రోదితి = ఏడ్వఁడు. అతః = అందుచేత, సర్వస్య జీవస్య = జీవుల కందఱికిని, మానసం జగత్ = మనోమయద్వైతము, బంధకృత్ = సుఖదుఃఖములను కల్గించుచున్నది.

తా. అట్టిపుత్రుఁడు చచ్చినను, మరణవార్త తండ్రికి తెలియనంతవఱకు, వానికి దుఃఖము లేదుగదా! అందుచేత మనోమయప్రపంచమే బంధహేతు వని పై రెండుశ్లోకములయందలి యన్వయవ్యతిరేకదృష్టాంతములచే స్పష్టము.

అవ. బాహ్యప్రపంచమునకును సుఖదుఃఖములకును సంబంధము లేదంటివి. అది బౌద్ధమతాంతర్గతవిజ్ఞానవాద మగు ననఁగా సమాధానము:—

శ్లో. విజ్ఞానవాదో బాహ్యార్థ వైయర్థ్యాత్స్యాదిహేతి చేత్,
న హృద్యాకార మాధాతుం బాహ్యస్యాపేక్షితత్వతః. 36

వ్యా. ధీమయస్య జగతో బంధహేతుత్వాంగీకారే బాహ్యార్థాపలాపాదపసిద్ధాంతాపాతః స్యాదితి శంకతే—విజ్ఞానేతి. పరిహరతి—నేతి. యద్యపి మానసప్రపంచస్యైవ బంధహేతుత్వం, తథాపి తద్ధేతుత్వేన బాహ్యార్థస్యాపి స్వీకారాన్న విజ్ఞానవాదప్రసంగ ఇతి భావః.

టీ. బాహ్యార్థే = బాహ్యవస్తువు, వైయర్థ్యాత్ = వ్యర్థమగుటవలన, ఇహ = ఇక్కడ, విజ్ఞానవాదః=విజ్ఞానవాదము, స్యాదితి చేత్=అగునంటివేని, హృది ఆకారం= చిత్తములో బాహ్యవస్తురూపమును, ఆధాతుం = కల్గించుటకు, బాహ్యస్య=బాహ్యము యొక్క, అపేక్షితత్వతః = కావలసివచ్చుటచే, న = విజ్ఞానవాదము కాదు.

తా. చిత్తమునం దాకారమును కలిగించుటకు బాహ్యవస్త్వపేక్ష మేము కావలె ననుచున్నాము గాన, అట్టి అపేక్ష బొత్తిగా అనవసర మనెడి విజ్ఞానవాదములో మా వాదము చేరదు.

అవ. విజ్ఞానవాదమైనను విరుద్ధ మేమియు లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వైయర్థ్యమస్తు వా బాహ్యం న వారయితుమీశ్మహే,
ప్రయోజన మపేక్షంతే న మానానీతి హి స్థితిః. 37

వ్యా. నను న హృద్యాకారమర్పణాయ బాహ్యపదార్థోఽపేక్షణీయః పూర్వపూర్వమానసప్రపంచసంస్కారస్యైవోత్తరోత్తరమానసప్రపంచహేతుత్వోపపత్తేరిత్యాశంక్య ప్రౌఢివాదేన తదంగీకరోతి—వైయర్థ్యమితి. తర్హి విజ్ఞానవాదాత్కో భేద ఇత్యత ఆహ—బాహ్యమితి. విజ్ఞానవాదినో బాహ్యార్థమేవాపలపంతి. వయం న తథేత్యయమేవ భేద ఇత్యర్థః. ప్రయోజనశూన్యత్వాద్వస్తునోఽభ్యుపగమోఽప్యయుక్త ఇత్యాశంక్యాహ—ప్రయోజనమితి. మానాధీనా వస్తుసిద్ధిర్న ప్రయోజనాధీనా. మాన సిద్ధస్య ప్రయోజన శూన్యస్యాపి సత్త్వస్య తార్కికైర్ద్వ్యాదిభిర్వానభ్యుపగమాదితిభావః.

టీ. వైయర్థ్యం = వ్యర్థత్వము. అస్తు = అగుఁగాక, బాహ్యం = బాహ్యపదార్థము, వారయితుం = నివారించుటకు, నేశ్మహే = అంగీకరింపము. మానాని = ప్రమా

ణములు, ప్రయోజనం = ప్రయోజనమును, నాపేక్షంతే=అపేక్షింపవు, ఇతి = ఇట్లు, స్థితిర్హి = శాస్త్రనిర్ణయముగదా.

తా. విజ్ఞానవాదు లెప్పుడును బాహ్యవస్తుస్థితిని ఒప్పుకొనరు. మేము బాహ్యవస్తుస్థితిని వ్యవహారకాలమునం దొప్పుకొనుచున్నాము గాన వారివాదమునకును మావాదమునకును భేదము కలదు. ప్రయోజనము లేనంతమాత్రముచే వస్తువే లే దని చెప్పుట శాస్త్రవిరుద్ధము. వస్తుసిద్ధి ప్రమాణముల నపేక్షించును గాని, ప్రయోజనము నపేక్షింప దని శాస్త్రనిర్ణయము గదా! ప్రత్యక్షాదిప్రమాణములచే వస్తువు లున్నట్లు తెలియుచుండఁగా వస్తుస్థితిచే ప్రయోజనము లేనందున వస్తువు లసలే లే వని లౌకికులును, ఇతరవాదులును చెప్పరు. మేమును చెప్పము.

అవ. మనోమయద్వైతనివృత్తిచేతనే బంధము పోవునెడల, బ్రహ్మజ్ఞానమెందుకు? అని శంక:—

శ్లో. బంధశ్చేన్మానసం ద్వైతం త న్నిరోధేన శామ్యతి,
అభ్యసే ద్యోగ మేవాతో బ్రహ్మజ్ఞానేన కిం వద. 33

వ్యా. మానసద్వైతస్యైవ బంధహేతుత్వే తస్య మనోనిరోధాత్మకయోగేనైవ నివృత్తిసంభవాద్బ్రహ్మజ్ఞానస్య బంధనివర్తకత్వాభ్యుపగమో విరుధ్యేతేతి శంకతే —బంధశ్చేదితి.

టీ. మానసం ద్వైతం = మనోమయప్రపంచము, బంధశ్చేత్ = బంధమైన, తత్ నిరోధేన = మనోనిరోధాత్మకయోగముచేతనే, శామ్యతి = శమించును. అతః= అందుచే, యోగమేవ = మనోనిగ్రహమునే, అభ్యసేత్ = అభ్యసింపవలెను. బ్రహ్మజ్ఞానేన = బ్రహ్మజ్ఞానముచే, కిం = ఏమిప్రయోజనమో, వద = చెప్పుము.

తా. ఓసిద్ధాంతీ, మనోమయప్రపంచమే బంధహేతు వంటివేని, అట్టి బంధనివృత్తి యోగాభ్యాసముచే కలిగెడి మనోనిగ్రహమువలన కలుగును. బ్రహ్మజ్ఞానముచే బంధనివృత్తి యని యేల చెప్పితివి?

అవ. సిద్ధాంతి సమాధానము:—

శ్లో. తాత్కాలికద్వైతశాంతా వప్యాగామిజనిక్షయః,
బ్రహ్మజ్ఞానం వినా న స్యా దితి వేదాంతడిండిమః. 39

వ్యా. యోగేన కిం ద్వైతోపశమస్తాత్కాలిక ఉచ్యతే? ఆత్యంతికో వేతి వికల్ప్యద్వయమంగీకృత్య ద్వితీయం దూషయతి—తాత్కాలికే.* "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైర్జ్ఞాత్వా శివం శాంతిమత్యంతమేతి"-"యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః, తదా దేవమవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్య"తీత్యాదిశ్రుతిష్వన్వయవ్యతిరేకాభ్యాం బ్రహ్మజ్ఞానాదేవ బంధనివృత్తిరభిధీయత ఇతి భావః.

టీ. తాత్కాలికద్వైతశాంతావపి = తాత్కాలికముగా ద్వైతము శమించినను, ఆగామిజనిక్షయః = రాఁబోయెడి జన్మక్షయము, బ్రహ్మజ్ఞానం వినా = బ్రహ్మజ్ఞానము లేనిది, న స్యాదితి = కలుగదని, వేదాంతడిండిమః = ఉపనిషత్సిద్ధాంతము.

తా. మనోనిగ్రహముచే తాత్కాలికద్వైతశాంతి కలుగునే కాని, ఉత్తరకాలమందు జన్మరాహిత్యము, బ్రహ్మజ్ఞానము లేక సాధనాంతరముచే కలుగ నేరదని వేదాంతసిద్ధాంతము.

అవ. బాహ్యప్రపంచనాశము లేనిది బ్రహ్మజ్ఞానసిద్ధియే లేదని శంకింప,బాహ్యప్రపంచమందు మిథ్యాత్వనిశ్చయము కలిగినఁజాలును. నాశ మక్కఱ లేదు. అని చెప్పుచున్నాఁడు.

శ్లో. అనివృత్తేఽపీశసృష్టే ద్వైతే తస్య మృషాత్మతామ్,
బుద్ధ్వా బ్రహ్మాద్వయం బోద్ధుం శక్యం వస్త్వైక్యవాదినః. 40

వ్యా. నను బాహ్యద్వైతనివారణమంతరేణాఽద్వితీయబ్రహ్మజ్ఞానమేవ నోదీయాదిత్యాశంక్య తన్నివారణాభావేఽపి తస్య మిథ్యాత్వజ్ఞానాదేవ పారమార్థికమద్వైతం బోద్ధుం శక్యత ఇత్యాహ—అనివృత్తేఽపీతి.

టీ. ఈశసృష్టే = ఈశ్వరునిచే సృజింపఁబడిన, ద్వైతే = ప్రపంచము, అనివృత్తేఽపి = నశింపకపోయినను, తస్య=ఆబాహ్యప్రపంచముయొక్క, మృషాత్మతాం= మిథ్యాత్వమును, బుద్ధ్వా=గ్రహించి, అద్వయం=అద్వితీయమైన, బ్రహ్మ = బ్రహ్మమును, బోద్ధుం = తెలిసికొనుటకు, వస్త్వైక్యవాదినః=జీవబ్రహ్మైక్యమును జెప్పెడి యద్వైతికి, శక్యం = సాధ్యము.

తా. ఈశ్వరసృష్టమైన బాహ్యప్రపంచము నశింపకున్నను, దానియందు మిథ్యాత్వనిశ్చయము గలిగిన వానికి అద్వితీయబ్రహ్మమును తెలిసికొన సాధ్యమగును. ఇది అద్వైతసిద్ధాంతము.

శ్లో. ప్రళయే తన్నివృత్తౌ తు గురుశాస్త్రాద్యభావతః,
విరోధిద్వైతాభావేఽపి న శక్యంబోద్ధు మద్వయమ్. 41

వ్యా. న ద్వైతమృషాత్వజ్ఞానమద్వైతజ్ఞానప్రయోజక మపితు తన్నివారణమేవేతి త్యభినివిశమానం ప్రత్యాహ—ప్రళయే ఇతి. ప్రళయే ప్రళయావస్థాయాం తన్నివృత్తౌ తు తస్య ద్వైతస్య నివృత్తౌ సత్యాం తు విరోధిద్వైతాభావేఽప్యద్వైతజ్ఞాన విరోధిత్వేన భవదభిమతస్య ద్వైతస్య నివారణే సత్యపి గురుశాస్త్రాద్యభావతః గురు శాస్త్రాదిరూపస్య జ్ఞానసాధనస్యాభావాద్ధేతోరద్వయం వస్తు బోద్ధుం శక్యం న భవతి. అత స్తన్నివారణ మప్రయోజకమితి భావః.

టీ. ప్రళయే = ప్రళయకాలమందు, తన్నివృత్తౌ = ఆబాహ్యప్రపంచము యొక్క నివృత్తి గలుగుచుండఁగా, గురుశాస్త్రాద్యభావతః = గురుశాస్త్రాదులు లేకపోవు టవలన. విరోధిద్వైతాభావేఽపి = అద్వితీయమునకు విరోధియగు ద్వైతప్రపంచము లేకున్నను, అద్వయం = అద్వితీయమైన బ్రహ్మమును, బోద్ధుం = తెలిసికొనుటకు, నశక్యం = సాధ్యము గాదు.

తా. ప్రళయకాలమునందు బాహ్యప్రపంచము నశించు చున్నను, జ్ఞానసాధన మగు గురుశాస్త్రాదులు లేకపోవుటవలన బ్రహ్మ మును తెలిసికొన వీలుగాదు. అందుచే బాహ్యప్రపంచనాశము చే ప్రయోజనము లేదు.

అవ. ఈవిషయమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. అబాధకం సాధకం చ ద్వైత మీశ్వరనిర్మితమ్,
అపనేతు మశక్యం చే త్యాస్తాం తద్ద్వేష్యతే కుతః. 42

వ్యా. తథాపి సతి ద్వైతే కథమద్వైతజ్ఞానమిత్యాకంక్యాహ—అబాధకమితి. ఈశ్వరనిర్మితద్వైతమబాధకం తన్మృషాత్వజ్ఞానేనైవాద్వైతజ్ఞానోత్పత్తేరుక్తత్వాత్సా ధకం చ గురుశాస్త్రాదిరూపస్య తస్య జ్ఞానసాధనత్వాదాకాశాదిరూపద్వైతమస్మాభి రపనేతుమశక్యం చేతి హేతో స్తద్ద్వైతమాస్తాం. కుతః కారణాద్ద్వేష్యత ఇత్యర్థః.

టీ. ఈశ్వరనిర్మితం = ఈశ్వరునిచే నిర్మింపఁబడిన, ద్వైతం = ప్రపంచము, అబాధకం = బ్రహ్మజ్ఞానమునకు ప్రతిబంధకము కాదు, సాధకం చ = పైసాధకము, అపనేతుం=నశింపఁజేయుటకు, అశక్యం చ = శక్యము గానిది యగును. ఇతి=ఇందువలన, తత్ = ఆబాహ్యప్రపంచము, ఆస్తాం = ఉండనీ, కుతః = ఎందువలన, ద్వేష్యతే = ద్వేషింపఁ బడును?

తా. బ్రహ్మసాక్షాత్కారమునకు బాహ్యప్రపంచము ప్రతి బంధము కాకుండుటయే గాక, సాధకము గూడ నగును. అట్టిదానిని

బాహ్యప్రపంచ ముండుటయందు నీ కేల ద్వేషము? బాహ్యప్రపంచ మున్నను, జీవునకు దానియందు మిథ్యాత్వనిశ్చయ మేర్పడిన, నట్టి ద్వైతమువలన సుఖదుఃఖములు లేవు. అదియుఁగాక దానిని నశింపఁ జేయుటయు నశక్యము.

అవ. మనోమయద్వైతము రెండువిధములుగా నున్న దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. జీవద్వైతం తు శాస్త్రీయ మశాస్త్రీయ మితి ద్విధా,
ఉపాదదీత శాస్త్రీయ మా తత్త్వస్యావబోధనాత్. 43

వ్యా. ఇదానీం జీవద్వైతం విభజతే—జీవేతి. కిం తద్ద్వివిధమపి సదా హేయ మేవ? నేత్యాహ—ఉపాదదీతేతి. అతత్త్వస్యావబోధనాత్ తత్త్వస్యావబోధన పర్యంతమిత్యర్థః.

టీ. జీవద్వైతం తు = జీవసృష్టిప్రపంచమయితే (మానసప్రపంచము), శాస్త్రీయ=శాస్త్రీయమును, అశాస్త్రీయ మితి = శాస్త్రవిరుద్ధమునని, ద్విధా = రెండు విధములుగా నున్నది. శాస్త్రీయం = శాస్త్రీయ మైన మానసప్రపంచమును, ఆ తత్త్వస్య=తత్త్వముయొక్క, అవబోధనాత్=తెలిసినంతవఱకు, ఉపాదదీత=గ్రహింప వచ్చును.

తా. జీవసృష్టమానసప్రపంచము శాస్త్రీయ మనియు, అశాస్త్రీయ మనియు ద్వివిధము. శాస్త్రీయమైనదానిని బ్రహ్మసాక్షాత్కారపర్యంతము గ్రహింపవచ్చును.

అవ. శాస్త్రీయమానసప్రపంచమును వివరించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మబ్రహ్మవిచారాఖ్యం శాస్త్రీయం మానసం జగత్,
బుద్ధే తత్త్వే తచ్చ హేయమితి శ్రుత్యనుశాసనమ్. 44

వ్యా. కిం తచ్ఛాస్త్రీయం ద్వైతమిత్యాకాంక్షాయామాహ—ఆత్మేతి. ప్రత్యగ్రూపస్య బ్రహ్మణో విచారాఖ్యం యచ్ఛ్రవణాదికం తచ్ఛాస్త్రీయం మానసం జగదిత్యర్థః. నన్వాతత్త్వస్యావబోధనాదిత్యుక్తమనుపపన్నం. "ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాంతచింతయే" త్యుక్తత్వా దిత్యాశంక్యాహ—బుద్ధ ఇతి. తత్త్వే బ్రహ్మాత్మైక్యలక్షణే బుద్ధే సాక్షాత్కృతే సతీత్యర్థః. తర్హ్యాసుప్తే రితి వాక్యస్య కా గతిరితి చేత్ "దద్యాన్నావసరం కించిత్కామాదీనాం మనాగ"పీతి పూర్వార్ధే కామాద్యవసరప్రదానస్య నిషిద్ధత్వా త్తత్పరమేవేతి వదామః. అతో న కాప్యనుపపత్తిరితి భావః.

టీ. శాస్త్రీయం=శాస్త్రీయమైన, మానసం జగత్ = మానసప్రపంచము, ఆత్మ బ్రహ్మవిచారాఖ్యం=ఆత్మయే బ్రహ్మమనెడి విచారాత్మకమైన శ్రవణాదికము, తత్త్వే= పరతత్త్వము, బుద్ధే సతి = తెలియఁబడిన దగుచుండఁగా, తచ్చ = ఆశాస్త్రీయ మానస ప్రపంచము, హేయమితి = విసర్జింపఁదగిన దని, శ్రుత్యనుశాసనం = శ్రుతియొక్క ఆజ్ఞ యగును.

తా. శాస్త్రీయమానసప్రపంచ మనఁగా బుద్ధిచే ప్రత్యగాత్మ పరమాత్మలయొక్క స్వరూపములను గూర్చి శ్రవణమననాదులను చేయుట. అట్టి శ్రవణాదికమువలన, దానిచే సాధింపఁదగు బ్రహ్మసాక్షాత్కారము కలిగిన పిమ్మట, దానిని విసర్జింపవచ్చు నని శ్రుతియే చెప్పుచున్నది.

అవ. దృష్టాంతమును, ప్రమాణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్య చ పునః పునః,
పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తా న్యథోత్సృజేత్. 45

వ్యా. తత్త్వబోధోత్తరకాలం తద్ధేయత్వప్రతిపాదనపరాః శ్రుతీరుదాహరతి— శాస్త్రాణీత్యాదిభ్యా. (౪౫, ౪౬, ౪౭).

టీ. మేధావీ=ప్రాజ్ఞుఁడు, శాస్త్రాణి=వేదాంతశాస్త్రములను, అధీత్య=అధ్యయనము చేసి, పునఃపునః=పలుమాఱు, అభ్యస్య చ=ఆవృత్తిచేసి, పరమం బ్రహ్మ = పరబ్రహ్మమును, విజ్ఞాయ = తెలిసికొని, అథ = తరువాత, తాని = ఆశాస్త్రములను, ఉల్కావత్ = కొఱవికట్టెవలె, ఉత్సృజేత్ = వదలనగును.

తా. బుద్ధిమంతుఁడు వేదాంతశాస్త్రమును గురుముఖమున చదివి, పలుమాఱు మననముచేసికొని, బ్రహ్మసాక్షాత్కారము కలిగినపిమ్మట నట్టిశాస్త్రమును విడువవచ్చును. వంటచేసినవాఁడు వంటపని పూర్తియైన తర్వాత, కొఱవులను పాఱవైచినట్లు శాస్త్రాదికమును బ్రహ్మసాక్షాత్కారానంతరము విడువవచ్చును.

అవ. మఱియొకదృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. గ్రంథ మభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః,
పలాల మివ ధాన్యార్థీ త్యజే ద్గ్రంథ మశేషతః. 46

టీ. జ్ఞానవిజ్ఞాన తత్పరః = శాస్త్రజ్ఞానమునందును అనుభవమునందును అనురక్తుఁడైన, మేధావీ=ప్రజ్ఞాశాలి, గ్రంథం=శాస్త్రమును,అభ్యస్య=చదివి, ధాన్యార్థీ=ధాన్యము

గవలెనువాఁడు, పలాలమివ = వరిగడ్డినివదలినట్లే, అశేషతః = పూర్తిగా, గ్రంథం=
స్తకజాలమును, త్యజేత్=విడువ నగును.

తా. ధాన్యార్థియగువాఁడు తన కక్కఱలేని గడ్డిని పాఱవైచి
ట్లు, బ్రహ్మజ్ఞానముకొఱకు శాస్త్రాదులను పఠించినవాఁడు బ్రహ్మసాక్షా
త్కారానంతరము శాస్త్రాదికమును త్యజింపఁదగును.

అవ. బ్రహ్మజ్ఞాని అనాత్మవిషయకము లగు శబ్దములను విడువవలె నను
న్నాఁడు:—

శ్లో. త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః,
నానుధ్యాయే ద్బహూ౯ శబ్దా౯ వాచో విగ్లాపనం హి తత్. 47

టీ. ధీరః=ప్రాజ్ఞుఁడగు, బ్రాహ్మణః = బ్రహ్మజ్ఞానేచ్ఛగలవాఁడు, తమేవ = ఆ పర
మాత్మనే, విజ్ఞాయ=ప్రత్యగభిన్నముగా తెలిసికొని, ప్రజ్ఞాం=చిత్తైకాగ్రతను, కుర్వీత=
చేయవలెను. బహూ౯ శబ్దా౯ = అనాత్మవిషయకములగు పెక్కుశబ్దములను,
సంగతులను) నానుధ్యాయేత్ = చింతింపఁదగదు. తత్=అట్లు చింతించుట, వాచః=
నోటికి, విగ్లాపనం హి=శ్రమకరము గదా.

తా. ఆత్మ సాక్షాత్కారానంతరము, అనాత్మవిషయకశబ్దముల
నుండి ఇంద్రియములను పోనీక, ఆత్మస్వరూపమునందే సమాధిని
చేయవలెను. అనఁగా బ్రహ్మసాక్షాత్కారానంతరము సర్వవ్యవహార
ములను విడువవలె నని యభిప్రాయము.

అవ. శ్రుతిప్రమాణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. త మే వైకం విజానీథ హ్యన్యా వాచో విముంచథ,
యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ ఇత్యాద్యాః శ్రుతయః స్ఫుటాః. 48

వ్యా. తమేవైకం విజానీథేత్యనేన "తమేవైకం జానథాత్మాన మన్యా వాచో
విముంచథ" "అమృతస్యైష సేతు" రితి శ్రుతిరర్థతః పఠితేతి.

టీ. ఏకం = అద్వితీయమైన, త మేవ = ఆపరమాత్మనే, విజానీథ = తెలిసి
కొనుఁడు, అన్యాః వాచః = ఇతరవాక్యములను, విముంచథ = విడువుఁడు, ప్రాజ్ఞః =
నిశ్చయజ్ఞానము గలవాఁడు, వాక్ = ఇంద్రియములను, మనసీ = మనస్సునందు,
యచ్ఛేత్=నియమింపవలెను. ఇత్యాద్యాః = ఈ మొదలైన, శ్రుతయః = శ్రుతులు,
స్ఫుటాః = స్పష్టములు.

తా. "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేత్ జ్ఞానమాత్మని, జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని" యనెడి శ్రుతి ఇంద్రియములను మనస్సునందును, వానిని బుద్ధియందును, వానిని మహత్తత్త్వమందును, పై యన్నింటిని ప్రత్యగాత్మయందును, నిశ్చలముగా నిలుపఁ దగు నని చెప్పుచున్నది. ఇట్లే యితరశ్రుతులును గలవు. తరువాత అనాత్మవిషయక సర్వవాక్యములను త్యజించి అద్వితీయ బ్రహ్మమునే తెలిసికొను మని ఈశ్రుతులు చెప్పుచున్నవి.

అవ. అశాయస్త్రీమానసప్రపంచమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అశాస్త్రీయ మపి ద్వైతం తీవ్రం మంద మితి ద్విధా,
కామక్రోధాదికం తీవ్రం మనో రాజ్యం తథేతరత్. 49

వ్యా. అశాస్త్రీయస్యాపి ద్వైతస్యావాంతరభేదమాహ.— అశాస్త్రీయమితి. ద్విధాద్వివిధమపి క్రమేణోదాహరతి—కామేతి. ఇతరత్ మందమిత్యర్థః.

టీ. అశాస్త్రీయం = అశాస్త్రీయమైన, ద్వైతమపి = మనోమయప్రపంచమును, తీవ్రం మందమితి = తీవ్ర మనియు మంద మనియు, ద్విధా = ద్వివిధము, కామక్రోధాదికం = కామక్రోధాదులతోఁ గూడుకొన్న మనోమయప్రపంచము, తీవ్రం = తీవ్ర మనఁబడును. తథా=అట్లే, మనోరాజ్యం = సంతతవిషయధ్యానము, ఇతరత్ = మంద మనఁబడును.

తా. అశాస్త్రీయమానసప్రపంచము తీవ్ర మనియు, మంద మనియు ద్వివిధము. కామక్రోధాదులతోఁ జేరినది తీవ్ర మనియు, స్త్రీప్రక్ఛంద నాదివిషయధ్యానముతో చేరినది మంద మనియు చెప్పెదరు.

అవ. శాస్త్రీయద్వైతమును తత్త్వజ్ఞానానంతరమే త్యజింప నగు నని యేల యనెదరు? అని పూర్వపక్షి యడుగుచున్నాఁడు:—

శ్లో. ఉభయం తత్త్వబోధాత్ ప్రాఙ్నివార్యం బోధసిద్ధయే,
శమ స్సమాహితత్వం చ సాధనేషు శ్రుతం తతః. 50

వ్యా. కిమనయోః శాస్త్రీయద్వైతస్యైవ తత్త్వబోధోత్తరకాలమేవ హేయత్వం నేత్యాహ—ఉభయమితి. ప్రాఙ్నివారణం కిమర్థ మిత్యత ఆహ—బోధేతి సిద్ధయే తత్రలింగమాహ—శమ ఇతి. యతస్తత్త్వబోధాత్ప్రాక్ తయోర్హేయత్వం తత ఏవ నిత్యానిత్యవస్తువివేకాదిబ్రహ్మజ్ఞానసాధనేషు మధ్యే శాంతః సమాహిత ఇతి ద్వాభ్యాం శాంతిసమాధీ శ్రూయేతే ఇత్యర్థః.

టీ. తత్వబోధాత్ = తత్త్వజ్ఞానమునకు, ప్రాక్ = ముందు, బోధసిద్ధయే=జ్ఞానలాభముకొఱకు, ఉభయం = రెండువిధములైన అశాస్త్రీయమానసప్రపంచములను, నివార్యం = నివారింపఁదగును. తతః = అందుచే, సాధనేషు = బ్రహ్మజ్ఞాన సాధనములయందు, శమః = శాంతియు, సమాహితత్వం చ = ఏకాగ్రతయు, శ్రుతం = చెప్పఁబడినవి.

తా. తీవ్రమందము లనెడి అశాస్త్రీయ ద్వివిధమానసప్రపంచమును వేదాంత శ్రవణారంభముననే విడువ వలెను. ఏల యన, వానిం ద్యజింపకున్న వేదాంతశ్రవణమున కధికారము గలిగించు సాధనచతుష్టయసంపత్తి కలుగనేరదు. తీవ్రమానసప్రపంచమును విడువకున్న శాంతి గలుగదు సమాహితత్వమును కుదురదు. విషయచింతనము విడువకున్న వైరాగ్యము కుదురదు. ఈయర్హతలు లేనిది బోధ యలవడదు.

వి. సాధనచతుష్టయసంపత్తి యనఁగా:—1. నిత్యానిత్యవస్తువివేకము, 2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము, 3. శమాదిషట్కసంపత్తి, 4. ముముక్షుత్వము, అనునవి.

1. సత్యవస్తువు బ్రహ్మ మనియు ప్రపంచ మసత్య మనియుఁ దెలియుట నిత్యానిత్య వస్తువివేక మనఁబడును.

2. ఇహలోకపరలోక వస్తుభోగములయందు ఇచ్ఛ లేకపోవుటయె ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము.

3. శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ యనునవి గలిగి యుండుట శమాదిషట్కసంపత్తి.

4. మోక్షమును పొందవలె ననెడి దృఢనిశ్చయబుద్ధి గలిగియుండుట ముముక్షుత్వ మనఁబడును.

ఈ నాలుగును నొకదానికంటె నొకటి బలవంతములు. ఈసాధనచతుష్టయసంపత్తి గలిగినపిమ్మటనే సద్గురుపునొద్ద వేదాంతశ్రవణాదులను జేయవలె ననియు, నట్టి సాధన చతుష్టయసంపత్తిగలవాఁడే బ్రహ్మోపదేశమున కర్హుఁ డనియు నభిప్రాయము.

అవ. బ్రహ్మ సాక్షాత్కారానంతరమును, ఈయశాస్త్రీయమానసప్రపంచమును గ్రహింపరాదు.

శ్లో. బోధా దూర్ధ్వం చ తద్ధేయం జీవన్ముక్తిప్రసిద్ధయే,
కామాది క్లేశబంధేన యుక్తస్య న హి ముక్తతా. 51

వ్యా. నను తత్త్వబోధాత్ప్రాక్ నివార్యమిత్యభిధానా దుత్తరకాలమస్య స్వీకార్యతా స్యాదిత్యాశంక్యాహ—బోధాదితి. ఉక్తమర్థం వ్యతిరేకముఖేన దృఢయతి—కామాదీతి. కామాదిరూపో యః క్లేశః స ఏవ బంధః తేన యుక్తస్య బద్ధస్య ముక్తతా జీవన్ముక్తత్వం. న హి నాస్త్యే వేత్యర్థః.

టీ. జీవన్ముక్తిప్రసిద్ధయే = జీవన్ముక్తిలాభమునకై, బోధాదూర్ధ్వం చ=జ్ఞానము కలిగినతర్వాతను, తత్ = అతీవ్రమందమానసప్రపంచము, హేయం = విడువవలెను. కామాదిక్లేశబంధేన యుక్తస్య = కామాదివ్యసనములవలని బంధములో చిక్కుకొనిన వానికి, ముక్తతా = ముక్తి, న హి = లేదుగదా.

తా. కామక్రోధాదులు (తీవ్ర మందమానస ప్రపంచము). ముక్తిప్రతిబంధము లగుటచే వానిని బోధానంతరము సయితము గ్రహింపరాదు.

అవ. నాకు జీవన్ముక్తి అక్కఱ లేదు, విదేహకైవల్యమే చాలు నని పూర్వవాది శంకకు సమాధానము:—

శ్లో. జీవన్ముక్తి రియం మాభూత్ జన్మాభావే త్వహం కృతీ,
తర్హి జన్మాపి తే ఽస్త్యేవ స్వర్గమాత్రాత్కృతీ భవాన్. 53

వ్యా. నను జన్మాదిసంసారాదుద్విగ్నస్యాత్యంతికపురుషార్థరూపతయా విదేహముక్త్యైవాలం. కి మనయా ఆపాతికయా జీవన్ముక్త్యేతి శంకతే—జీవన్ముక్తిరితి. ఐహిక భోగనివృత్తిభయా జ్జీవన్ముక్తిత్యాగే ఆముష్మిక భోగనివృత్తిభయాత్ విదేహముక్తిరపి త్యాజ్యా స్యాదితి ప్రతిబంద్యా పరిహరతి—తర్హీతి.

టీ. ఇయం = ఈ, జీవన్ముక్తిః = జీవన్ముక్తి, మాభూత్ = లేకపోవుగాక, అహం=నేను, జన్మాభావే తు=జన్మరాహిత్యము గలుగుచుండఁగా, కృతీ = కృతార్థుఁడ నయ్యెదను. తర్హి=అట్లుంటివేని, తే = నీకు, జన్మాపి = జన్మము, అస్త్యేవ = ఉన్నది. భవాన్=నీవు, స్వర్గమాత్రాత్ = స్వర్గభోగమువలననే, కృతీ = ధన్యుఁడవు.

తా. 'నాకు విదేహముక్తియే చాలు' నంటివేని,నీవు అతీవ్రమంద రూపము లగు ద్వైతమును విసర్జింపక పోతివేని నీకు విదేహముక్తియు కలుగదు. నీకు వేదాంతశ్రవణ మనెడి పుణ్యకర్మవలన స్వర్గము మాత్రము ప్రాప్తించును.

అవ. కామక్రోధాదుల త్యజించుటను గుఱించియే చెప్పుచున్నాఁడు:—

శ్లో. క్షయాతిశయదోషేణ స్వర్గో హేయో యదా తదా,

స్వయం దోషతమాత్మాయం కామాదిః కిం న హీయతే. 53

వ్యా. ప్రతిబందీమోచనం శంకతే—క్షయేతి. దోషయుక్తత్వేన స్వర్గాదేస్త్యాజ్యత్వే సకలపురుషార్థవిఘాతకత్వేనాతీవ దోషరూపస్య కామాదేః సుతరాం త్యాజ్యత్వమిత్యాహ—తదా స్వయమితి.

టీ. క్షయాతిశయదోషేణ = నశించుటయే, అధికమగుదోషముచేత, యదా = ఎప్పుడు, స్వర్గః = స్వర్గము, హేయః = విడువఁదగినదో, తదా = అప్పుడు, దోషతమాత్మా = అధికదోషమే, స్వయం = తానైన, కామాదిః = కామక్రోధాదివర్గము, కిం = ఏల, న హీయతే = విడువఁదగదు.

తా. అశాశ్వత మనెడి ఒక్కదోషమాత్రమున నే స్వర్గాదికము హేయమైనచో, సర్వానర్థ మూలము లగుకామక్రోధాదుల నేల విడువరాదు?

అవ. వైరాగ్యసంపాదనమునకు విరుద్ధమైన కామక్రోధాదులను విసర్జించెదను. ఐహికభోగోపయోగకరము లైన కామాదుల గ్రహించిన నేమి?

శ్లో. తత్త్వం బుద్ధ్వాపి కామాదీన్ని శ్శేషం న జహాసి చేత్,
యథేష్టాచరణం తే స్యాత్ కర్మశాస్త్రాతిలంఘినః. 54

వ్యా. నను వైరాగ్యాదిసంపాదనేనాత్యంతానర్థహేతోః కామాదేస్త్యక్తత్వాదైహికభోగమాత్రోపయోగికామాద్యభ్యుపగమే కో దోష ఇత్యాశంక్యాహ—తత్త్వమితి. తత్త్వవిత్త్వాభిమానేన విధినిషేధశాస్త్రమతిక్రమ్య కామాద్యధీనతయా వర్తమానస్య తవ యథేష్టాచరణం స్యాదిత్యర్థః.

టీ. తత్త్వం=తత్త్వమును, బుద్ధ్వాపి=ఎఱింగియు, కామాదీన్=కామాదులను, నిశ్శేషం=పూర్తిగా, న జహాసి చేత్ = విడువకుంటివేని, కర్మశాస్త్రాతిలంఘినః = కర్మశాస్త్రమును నుల్లంఘించిన, తే=నీకు, యథేష్టాచరణం=స్వేచ్ఛాప్రవర్తనము, స్యాత్ =అగును.

తా. బ్రహ్మవేత్తవైనను కామక్రోధాదులను పూర్తిగా విడువవేని, నీవు కర్మభ్రష్టుండవై స్వేచ్ఛాచారి వగుదువు. అనఁగా నీవు బ్రహ్మవేత్త ననెడి అభిమానముచేత విధినిషేధరూప మగు కర్మశాస్త్రముల నతిక్రమించి, కామక్రోధాదుల యొక్క వశమందు వర్తించుచున్న యెడల నీయిష్టప్రకారము ప్రవర్తించినవాఁడ వగుదువని యభిప్రాయము.

అవ. స్వేచ్ఛావర్తన దోషమును చెప్పుచున్నాడు:—

శ్లో. బుద్ధాద్వైతసుతత్వస్య యథేష్టాచరణం యది,
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచిభక్షణే. 55

వ్యా. అస్తు కో దోష ఇత్యాశంక్య తదనిష్టత్వప్రతిపాదనపరం సురేశ్వరాచార్య వచనముదాహరతి—బుద్ధాద్వైతేతి. బుద్ధమద్వైతతత్త్వమద్వైతస్వరూపం బ్రహ్మ యేనస బుద్ధాద్వైతసుతత్వ స్తత్వవిత్తస్య యథేష్టాచరణం యది స్యాత్ తర్హి అశుచిభక్షణాదిక మపి స్యాత్. తథా సతి శునాం తత్త్వదృశాం చైవ న కోఽపి విశేషస్స్యాదిత్యర్థః.

టీ. బుద్ధాద్వైతసుతత్వస్య=తెలియఁబడిన అద్వైతతత్వము గలవానికి, యథేష్టాచరణం యది = స్వేచ్ఛాచారప్రవర్తన ముండెనేని, తత్వదృశాం = తత్వవేత్తలకును, శునాంచ=కుక్కలకును, అశుచిభక్షణే = అమేధ్యములను తినుటయందు, కో భేదః = భేద మేమి ?

తా. బ్రహ్మవేత్తలును కామక్రోధాదిపీడితు లైనచో, వారికిని అమేధ్యభక్షణముచేయు కుక్కలకును భేదము లేదు. కాన కామక్రోధాదు లత్యంతము విడువఁదగినవి. (అని సురేశ్వరాచార్యులు చెప్పిరి.)

అవ. దీనివలని యనిష్ట మే మనినం జెప్పుచున్నాడు:—

శ్లో. బోధా త్పురా మనోమాత్రదోషాత్క్లిష్టాస్యథాధునా,
అశేషలోకనిందా చే త్యహో తే బోధవైభవః. 56

వ్యా. ఏతావతా కిమనిష్టమాపాదిత మిత్యాశంక్య సోపహాసము త్తరమాహ— బోధాదితి. తత్వజ్ఞానోదయా త్ప్రాక్కామక్రోధాదిచిత్తదోషైస్తవ క్లేశోఽభూత్. ఇదానీం తు సర్వలోకనిందయాఽపి స ఇతి క్లేశద్వైగుణ్యమితి భావః.

టీ. బోధాత్పురా = జ్ఞానోదయమునకు మున్ను, మనోమాత్రదోషాత్=కామక్రోధాదిదోషములవలన, క్లిశ్నాసి = దుఃఖించితివి, అథ = బ్రహ్మజ్ఞానానంతరము, అధునా = ఇప్పుడు, అశేషలోకనిందా చ=జను లందరిచేత నిందయును, ఇతి = ఇట్లు కలిగిన, తే = నీయొక్క, బోధవైభవః = జ్ఞానాతిశయము, అహో = ఏమని చెప్పఁదగును.

తా. బ్రహ్మజ్ఞానోత్పత్తికి పూర్వము నీకు కామక్రోధాదులచే కలిగిన దుఃఖము, జ్ఞానోదయానంతరము ద్విగుణమైన యెడల నీజ్ఞాన

మహిమ ఏ మని వర్ణింపవచ్చును! దుఃఖము నెక్కువచేసెడి జ్ఞానము జ్ఞానమే కాదు.

అవ. కామక్రోధములను విడువు మని బోధించుచున్నాఁడు:—

శ్లో. విడ్వరాహాదితుల్యత్వం మా కాంక్షీ స్తత్త్వవిద్భవాన్,
సర్వధీదోషసంత్యాగా ల్లోకైః పూజ్యశ్చ దేవవత్. 57

వ్యా. తర్హి కిం కర్తవ్య మిత్యత ఆహ—విడ్వరాహేతి. సర్వోత్కర్ష హేతు జ్ఞానవాన్ త్వం కామాదిత్యాగాశక్తత్వేన సర్వాధమవిడ్వరాహాదిసామ్యం మా కాంక్షీత్ కింతు కామాదిలక్షణసకల మనోదోషహానేన సర్వజనైర్దేవవత్పూజ్యశ్చ పూజ్యో భవేత్యర్థః.

టీ. తత్త్వవిత్ = బ్రహ్మజ్ఞానివగు, భవాన్=నీవు, విడ్వరాహాదితుల్యం=కుక్క, పంది మొదలగు జంతువులతో సమత్వమును, మా కాంక్షీత్ = ఇచ్ఛయింపకుము. సర్వధీ దోషసంత్యాగాత్ = సమస్తచిత్తదోషములయొక్క (కామక్రోధాదులయొక్క) పరిత్యజించుటవల్ల, లోకైః = ప్రజలచేత, దేవవత్ = దేవతవలె, పూజ్యశ్చ = పూజ నీయుఁడవు, భవ = కమ్ము.

తా. జ్ఞానోదయము కలిగిన నీవు, కామక్రోధాదుల వర్జింప నశక్తుఁ డవై, హీనజంతువులతో సాటిని గోరుట యుక్తముగాదు. కామక్రోధముల విసర్జించి, చిత్తదోషములను పోఁగొట్టుకొని, దేవుని వలె, సమస్తలోకముచేతను పూజనీయుఁడ వగుదువు.

అవ. కామాదుల విసర్జించుటకు మార్గమును దర్శించుచున్నాఁడు:—

శ్లో. కామ్యాదిదోషదృష్ట్యాద్యాః కామాదిత్యాగహేతవః,
ప్రసిద్ధా మోక్షశాస్త్రేషు తా నన్విష్య సుఖీ భవ. 58

వ్యా. తత్త్యాగోపాయమాహ—కామ్యేతి. కామ్యాః కామనా విషయాః స్రగాదయ ఆదయో యేషాం ద్వేష్యాదీనాం తే కామ్యాదయస్తేషాం యే దోషా అనిత్యత్వసాతిశయిత్వాదయస్తేషాం దృష్టిరవలోకనమాద్యం యేషాం కోపస్వరూప విచారాదీనాం తే తథోక్తాస్తేషాం కామాదిత్యాగహేతుత్వే ప్రమాణమాహ— ప్రసిద్ధా ఇతి. భవతు. తతః కిమాయాత మిత్యత ఆహ— తానన్విష్యేతి.

టీ. కామ్యాదిదోషదృష్ట్యాద్యాః=కోరఁదగిన వస్తువులయొక్కయు, ద్వేష విష యములయొక్కయు, ఇంక మదమాత్సర్యాదులు కలిగించెడి విషయములయొక్కయు, దోషదృష్టి మొదలుగాఁగలవి. కామాదిత్యాగహేతవః = ఆ కామాదులను త్యజించుటకు

టీ. విషయాన్=శబ్దస్పర్శాది విషయములను, ధ్యాయతః=ధ్యానించెడి, పుంసః=పురుషునకు, తేషు = ఆవిషయములయందు, సంగః = ఆసక్తి, ఉపజాయతే = కల్గుచున్నది. సంగాత్ = ఆసక్తివలన, కామః = కామము, సంజాయతే = పుట్టుచున్నది. కామాత్=కామమువలన, క్రోధః = కోపము, అభిజాయతే = పుట్టుచున్నది.

తా. విషయములను సంతతము చింతించుటచేత వానియందాసక్తియు, అట్టి యాసక్తిచే కామమును, దానివలన క్రోధమును ఇట్లు క్రమక్రమముగా నాశము వాటిల్లును గాన విషయచింతనమును చేయరాదు.

అవ. మనోరాజ్యమును విడుచుటకు మార్గమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. శక్యం జేతుం మనోరాజ్యం నిర్వికల్పసమాధితః,
సుసంపాదః క్రమాత్సోఽపి సవికల్పసమాధినా. 61

వ్యా. తర్హ్యస్య మనోరాజ్యస్య కః పరిహారోపాయ ఇత్యత ఆహ—శక్యమితి. సోఽపి కుతః సిధ్యతీత్యాహ—సుసంపాద ఇతి.

టీ. నిర్వికల్పసమాధితః = నిర్వికల్పసమాధివలన, మనోరాజ్యం=మనోరాజ్యము, జేతుం = జయించుటకు, శక్యం = సాధ్యము. సోఽపి = ఆనిర్వికల్ప సమాధియు, క్రమాత్=క్రమముగా, సవికల్పసమాధినా = సవికల్పసమాధిచే, సుసంపాద్యః = సులభముగా సంపాదింపవచ్చును.

తా. సవికల్పసమాధిచే నిర్వికల్పసమాధిని సంపాదించి, దానివలన మనోరాజ్యమును జయింపవచ్చును.

అవ. సమాధికి యోగ్యత లేనివానినిగూర్చి చెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధతత్త్వేన ధీదోషశూన్యేనైకాంతవాసినా,
దీర్ఘం ప్రణవ ముచ్చార్య మనో రాజ్యం విజీయతే. 62

వ్యా. నన్వష్టాంగయోగయుక్తస్య తథాస్తు. తద్రహితస్య కా గతి రిత్యత ఆహ—బుద్ధతత్త్వేనేతి. బుద్ధమవగతం తత్త్వం బ్రహ్మాత్మైక్యలక్షణం యేన స బుద్ధతత్త్వస్తేన కామక్రోధాదిబుద్ధిదోషరహితేన ఏకాంతవాసినా విజనదేశనివాసశీలేన పురుషేణదీర్ఘం షడ్ద్వాదశాపిమాత్రోపేతం ప్రణవమోంకార ముచ్చార్య మనోరాజ్యం విజీయతే వినివార్యత ఇత్యర్థః.

టీ. బుద్ధతత్త్వేన = తెలియఁబడిన తత్త్వముగలవాఁడు గనుక, ధీదోషశూన్యేన=చిత్తదోషములేని, ఏకాంతవాసినా=ఒంటరిగా నివసించెడివానిచే, దీర్ఘం = పొడవుగా

హేతువులుగా, మో...సిద్ధాః - మోక్షశాస్త్ర వేదాంతశాస్త్రములయందు, ప్రసిద్ధాః = చెప్పఁబడియున్నవి. తాన్ = ఆకామాదులను, అన్విష్య = శోధించి (పరిత్యజించి), సుఖీ = సుఖవంతుఁడవు, భవ = కమ్ము.

తా. క్రోరెడి వస్తువులయం దున్న అనిత్యసాతిశయత్వాదిలోపములను గమనించుట వానియందలి యపేక్ష పోడమకుండుటకు కారణము. ద్వేష్యాదివస్తువులయందును నిట్లే దోషదృష్టిచే ద్వేషాదులు కలుగుచుండును. ఇది కామక్రోధాదులను త్యజించుటకు వేదాంతశాస్త్రములందుఁ జెప్పఁబడిన యుపాయము. అట్లు కామక్రోధవర్జితుఁడవై సుఖవంతుఁడవు గమ్ము.

అవ. మనోరాజ్యము నేల విడువవలె ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. త్యజ్యతా మేష కామాది ర్మనోరాజ్యే తు కా క్షతిః,
అశేషదోషబీజత్వాత్ క్షతి ర్భగవతేరితా. 59

వ్యా. నను కామాదీనామనర్థహేతుత్వాత్త్యాజ్యత్వమస్తు. మనోరాజ్యస్య త్వతథాత్వాత్తత్త్యాగో నాపేక్షిత ఇతి శంకతే—త్యజ్యతామితి. సాక్షాదనర్థహేతుత్వాభావేఽపిపరంపరయాతద్ధేతుత్వాత్త్యాజ్యత్వమే వేత్యభిప్రేత్య పరిహరతి—అశేషేతి.

టీ. ఏషః = ఈ, కామాదిః = కామాదులు, త్యజ్యతాం = విడువఁబడుఁగాక. మనోరాజ్యే తు = ధ్యానవిషయమందైతే, కా క్షతిః = అనిష్టకారణమే మున్నది? (ఇతి చేత్ = ఇట్లుంటివేని), అశేషదోషబీజత్వాత్ = మనోరాజ్యము (విషయచింతనము) సకలానర్థమూలమగుటవలన, క్షతిః = లోపము గల దని, భగవతా = శ్రీకృష్ణునిచే, ఈరితా = చెప్పఁబడెను.

తా. మనోరాజ్యము ప్రత్యక్షముగా ననర్థహేతువు కాకున్నను, పరంపరగా ననిష్టములను కలిగించును గాన నదియును తప్పే యని శ్రీకృష్ణులు గీతలయందు చెప్పిరి.

అవ. ఆగీతావాక్యమును చూపుచున్నాఁడు:—

శ్లో. ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. 60

వ్యా. పరంపరయాఽనర్థహేతుత్వప్రదర్శనపరం భగవద్వాక్య ముదాహరతి—ధ్యాయత ఇతి.

టీ. విషయాన్=శబ్దస్పర్శాది విషయములను, ధ్యాయతః=ధ్యానించెడి, పుంసః=పురుషునకు, తేషు = ఆవిషయములయందు, సంగః = ఆసక్తి, ఉపజాయతే = కల్గుచున్నది. సంగాత్ = ఆసక్తివలన, కామః = కామము, సంజాయతే = పుట్టుచున్నది. కామాత్=కామమువలన, క్రోధః = కోపము, అభిజాయతే = పుట్టుచున్నది.

తా. విషయములను సంతతము చింతించుటచేత వానియందాసక్తియు, అట్టి యాసక్తిచే కామమును, దానివలన క్రోధమును ఇట్లు క్రమక్రమముగా నాశము వాటిల్లును గాన విషయచింతనమును చేయరాదు.

అవ. మనోరాజ్యమును విడుచుటకు మార్గమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. శక్యం జేతుం మనోరాజ్యం నిర్వికల్పసమాధితః,
సుసంపాదః క్రమాత్సోఽపి సవికల్పసమాధినా. 61

వ్యా. తర్హ్యస్య మనోరాజ్యస్య కః పరిహారోపాయ ఇత్యత ఆహ—శక్యమితి. సోఽపి కుతః సిధ్యతీత్యాహ—సుసంపాద ఇతి.

టీ. నిర్వికల్పసమాధితః = నిర్వికల్పసమాధివలన, మనోరాజ్యం=మనోరాజ్యము, జేతుం = జయించుటకు, శక్యం = సాధ్యము. సోఽపి = ఆనిర్వికల్ప సమాధియు, క్రమాత్=క్రమముగా, సవికల్పసమాధినా = సవికల్పసమాధిచే, సుసంపాద్యః = సులభముగా సంపాదింపవచ్చును.

తా. సవికల్పసమాధిచే నిర్వికల్పసమాధిని సంపాదించి, దానివలన మనోరాజ్యమును జయింపవచ్చును.

అవ. సమాధికి యోగ్యత లేనివానినిగూర్చి చెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధతత్త్వేన ధీదోషశూన్యేనైకాంతవాసినా,
దీర్ఘం ప్రణవ ముచ్చార్య మనో రాజ్యం విజీయతే. 62

వ్యా. నన్వష్టాంగయోగయుక్తస్య తథాస్తు. తద్రహితస్య కా గతి రిత్యత ఆహ—బుద్ధతత్త్వేనేతి. బుద్ధమవగతం తత్త్వం బ్రహ్మాత్మైక్యలక్షణం యేన స బుద్ధతత్త్వస్తేన కామక్రోధాదిబుద్ధిదోషరహితేన ఏకాంతవాసినా విజనదేశనివాసశీలేన పురుషేణదీర్ఘం ప్లుతాదిశాపిమాత్రోపేతం ప్రణవమోంకార ముచ్చార్య మనోరాజ్యం విజీయతే వినివార్యత ఇత్యర్థః.

టీ. బుద్ధతత్త్వేన = తెలియఁబడిన తత్త్వముగలవాఁడు గనుక, ధీదోషశూన్యేన=చిత్తదోషములేని, ఏకాంతవాసినా=ఒంటరిగా నివసించెడివానిచే, దీర్ఘం = పొడవుగా.

ప్రణవం=ప్రణవమును, ఉచ్చార్య = ఉచ్చరించి, మనోరాజ్యం = విషయధ్యానము, విజీయతే = జయింపఁబడును.

తా. యమనియమాదుల కనర్హుఁడైనవాఁడు ప్రత్యగ్బ్రహ్మైక్యమును శ్రవణాదులచేఁ గలిగి, కామక్రోధాదిచిత్తదోషరహితుఁడగుచు, నొంటరిగా నుండి, దీర్ఘప్రణవోచ్చారణచే విషయములయందలి చిత్తవిక్షేపమును పోఁగొట్టుకొనవచ్చును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. జితే తస్మిన్ వృత్తిశూన్యం మన స్తిష్ఠతి మూకవత్,
ఏత త్పదం వసిష్ఠేన రామాయ బహుధేరితమ్. 63

వ్యా. మనోరాజ్యవిజయే కిం భవతీత్యత ఆహ—జితే తస్మిన్నితి. యథా మూకః సకలవాగ్వ్యవహారరహిత స్తిష్ఠత్యేవం మనోఽపి సర్వవ్యాపారరహితం అవతిష్ఠత ఇత్యర్థః. అవృత్తికమనోవస్థానస్య పురుషార్థత్వే ప్రమాణమాహ—ఏతత్పదమితి. ఏతత్పదమియం దశేత్యర్థః.

టీ. తస్మిన్ = అవిషయచింతనము, జితే సతి = జయింపఁబడెనేని, మనః = మనస్సు, మూకవత్ = మూఁగవానివలె, వృత్తిశూన్యం = సంకల్పరహితమై, తిష్ఠతి = నిశ్చల మగును. ఏతత్పదం = ఈస్థితి, వసిష్ఠేన = వసిష్ఠమహర్షిచే, రామాయ = శ్రీరామమూర్తికొఱకు, బహుధా=అనేకపర్యాయములు, ఈరితం = చెప్పఁబడెను.

తా. మనోరాజ్యమును జయించుటచే, మనస్సు సంకల్పవికల్పములు లేనిదై, మూఁగవానివలె నిశ్చలమగు నని, వసిష్ఠమహర్షి రాముని కు బోధించెను.

అవ. వసిష్ఠునిబోధను రెండుశ్లోకములతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్,
సంపన్నం చే త్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః. 64

వ్యా. వాసిష్ఠశ్లోకద్వయముదాహరతి—దృశ్యమితి. "నేహ నానాస్తి కించ నే"త్యాదిశ్రుత్యాఽద్వితీయ బ్రహ్మాతిరిక్తజగదభావజ్ఞానేన మనసః సకాశాత్ దృశ్యనివారణం సంపన్నం. యది తర్హి నిరతిశయం మోక్షసుఖం సంపన్నమితి జానీయాదిత్యర్థః.

టీ. దృశ్యం=ప్రపంచము, నాస్తీతి=లేదనెడి, బోధేన = అద్వితీయబ్రహ్మజ్ఞానముచే, మనసః=మనస్సునుండి, దృశ్యమార్జనం=దృశ్యమును లేకుండఁజేయుట (మనోమయ

ప్రపంచమును నశింపఁజేయుట), సంపన్నంచేత్ = లభించెనేని, తత్=అప్పుడు, పరా=శ్రేష్ఠమైన, నిర్వాణనిర్వృతిః = మోక్షసుఖము, ఉత్పన్నా = పుట్టును. లభించు నని తెలియును.

తా. అద్వితీయబ్రహ్మముకంటె వేఱైన దృశ్యప్రపంచము లేనే లేదనెడి 'నేహ నానాస్తి కించన' అను శ్రుతివిభక్తి, మనస్సునుండి దృశ్యమును వారించెదవేని మోక్షము లభించె నని యెఱుంగుము.

శ్లో. విచారిత మలం శాస్త్రం చిర ముద్గ్రాహితం మిథః,
సంత్యక్తవాసనా న్మౌ నా దృతే నా స్త్యుత్తమం పదమ్. 65

వ్యా. కించ అద్వైతశాస్త్రమత్యర్థం విచారితం. తథా పరస్పరం గురుశిష్యాది సంవాదద్వారాచిరకాలంప్రత్యాయితంచ. ఏవం కృత్వా కిం నిశ్చితమిత్యత ఆహ—సంత్యక్తేతి. సమ్యక్పరిత్యక్తకామాదివాసనాన్మనసస్తూష్ణీంభావాదృతేఽధికః పురుషార్థో నాస్తీతి నిశ్చితమిత్యర్థః.

టీ. శాస్త్రం = అద్వైతశాస్త్రము, అలం = అత్యంతము, విచారితం = విచారింపఁబడెను. మిథః = గురుశిష్యసంప్రదాయానుసారముగా, చిరం = చాలకాలము, ఉద్గ్రాహితం = గ్రహింపఁజేయఁబడినది. సంత్యక్తవాసనాత్ = పూర్తిగ విడువఁబడిన వాసనలుగలిగిన, మౌనాదృతే = మనోవృత్తినాశమువినాగా, ఉత్తమం పదం = పరమ పదము (పురుషార్థము), నాస్తి=లే దని నిశ్చయింపఁబడెను.

తా. వేదాంతశాస్త్రమును గురుశిష్యసంప్రదాయానుసారముగా చక్కఁగా విచారించి "అనుభవారూఢజ్ఞానముచే వాసనాక్షయము, మనోనాశము కలిగినవాఁడై పరమపురుషార్థమును పొందు" నని నిశ్చయింపఁబడినది.

అవ. ప్రారబ్ధాధీనముగా చిత్తవిక్షేపము గలిగెనేని, దాని నివారించుట కుపాయమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. విక్షిప్యేత కదాచిద్ధీః కర్మణా భోగదాయినా,
పున స్సమాహితా సా స్యా త్తదైవాభ్యాసపాటవాత్. 66

వ్యా. ఏవం నిర్వృత్తిస్య చిత్తస్య ప్రారబ్ధకర్మణా విక్షేపే సతి తత్ప్రతీకారోపాయః క ఇత్యపేక్షాయామాహ—విక్షిప్యేత ఇతి. భోగప్రదేన ప్రారబ్ధకర్మణా బుద్ధిః కదాచిద్విక్షిప్యతే చేత్తర్హి సా బుద్ధిరభ్యాసపాటవాత్తదైవ పునరపి సమాహితా స్యాదిత్యర్థః.

టీ. భోగదాయినా = భోగము నిచ్చెడి, కర్మణా = ప్రారబ్ధకర్మచే, కదాచిత్ = ఒకప్పుడు. ధీః=బుద్ధి, సిక్షిప్యతే = చలించును. సా=ఆబుద్ధి, పునః = తిరిగి, తదైవ = వెంటనే, అభ్యాసపాటవాత్ = అభ్యాసాతిశయమువలన, సమాహితా = నిశ్చలముగాఁ జేయఁబడినది, స్యాత్ = అగును.

తా. ఒకవేళ నీబుద్ధి ప్రారబ్ధకర్మచే చలించినను, అభ్యాసముచే తిరిగి నిరోధింపఁ బడఁదగును.

అవ. చిత్తవిక్షేపములేనివానిని బ్రహ్మవేత్తయనుట అప్రధానమనుచున్నాఁడు:—

శ్లో. విక్షేపో యస్య నాస్త్యస్య బ్రహ్మవిత్త్వం న మన్యతే,
బ్రహ్మైవాయ మితి ప్రాహు ర్మునయః పారదర్శినః. 67

వ్యా. సదా చిత్తవిక్షేపరహితస్య బ్రహ్మవిత్త్వమప్యౌపచారికమిత్యాహ— విక్షేప ఇతి. పారదర్శినో వేదాంతపారగా ఇత్యర్థః.

టీ. యస్య = ఎవ్వనికి, విక్షేపః = చిత్తవిక్షేపము, నాస్తి = లేదో, అస్య = అతనికి, బ్రహ్మవిత్త్వం = బ్రహ్మవిత్స్వభావము, న మన్యతే = తలంచఁబడదు. అయం= ఇతఁడు, బ్రహ్మైవేతి=బ్రహ్మవేత్త యని, పారదర్శినః=వేదాంతపారగులగు, మునయః = మహర్షులు, ప్రాహుః = చెప్పిరి.

తా. ఎవరికి చిత్తవిక్షేపము లేదో, వానిని బ్రహ్మవేత్త యనుటు లేదు. వాఁడు సాక్షాత్పర బ్రహ్మమే యని మహర్షులు వచించిరి.

అవ. ఈవిషయమున వసిష్ఠునివాక్యము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః,
య స్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మ న బ్రహ్మవిత్స్వయమ్. 68

వ్యా. అత్రాపి వసిష్ఠవాక్యముదాహరతి—దర్శనాదర్శనే ఇతి. "అహం బ్రహ్మ జానామి న జానా" మీతి వ్యవహారద్వయం పరిత్యజ్య స్వయమద్వితీయచైతన్య మాత్రరూపేణావతిష్ఠతే స స్వయం బ్రహ్మైవ న బ్రహ్మవిదిత్యర్థః.

టీ. బ్రహ్మన్=ఓబ్రాహ్మణుఁడా, యః = ఎవఁడు, దర్శనాదర్శనే = బ్రహ్మమును గుర్తెఱుఁగుదు నని ఎఱుఁగ ననియెడి వ్యవహారద్వయమును, హిత్వా = పరిత్యజించి, స్వయం = తాను, కేవలరూపతః = అద్వితీయచైతన్యమాత్రముగా, అవతిష్ఠతే = ఉండునో, సతు = వాఁడయితే, బ్రహ్మ = బ్రహ్మమే, బ్రహ్మవిత్ = బ్రహ్మవిదుఁడు మాత్రము, న = కాఁడు.

తా. ఎవఁడు "నేను బ్రహ్మమును ఎఱుఁగుదు నని గాని, ఎఱుఁగ నని కాని," ఏవ్యవహారము లేక, తా నద్వితీయప్రత్యగభిన్నచైతన్య

మాత్రముగా నుండునో, వాఁడు బ్రహ్మమే యగును. బ్రహ్మవిదుఁడు మాత్రమే కాఁడు.

అవ. ద్వైతవివేచనఫలమును ప్రకరణాంతమునఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జీవన్ముక్తేః పరా కాష్ఠా జీవద్వైతవివర్జనాత్,
లభ్యతేఽసావతోఽత్రేద మీశద్వైతాద్వివేచితమ్. 69

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
ద్వైతవివేకః

వ్యా. సఫలం ద్వైతవివేచన ముపసంహరతి—జీవన్ముక్తేరితి. అసావుక్తప్రకారా జీవన్ముక్తేః పరా కాష్ఠా నిరతిశయపర్యవసానభూమి ర్జీవద్వైతస్య మనోమయప్రపంచస్య వివర్జనాత్పరిత్యాగా ల్లభ్యతే ప్రాప్యతే. అతః కారణాదిదం జీవద్వైతమీశద్వైతాదీశ్వర సృష్టద్వైతాద్వివేచితం వివిచ్య ప్రదర్శితమిత్యర్థః.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమద్భారతీతీర్థవిద్యారణ్య
మునివర్యకింకరేణ శ్రీరామకృష్ణాఖ్యేన విదుషా విరచితా
ద్వైతవివేకవ్యాఖ్యా సమాప్తా.

టీ. అసౌ = ఈ, జీవన్ముక్తేః = జీవన్ముక్తునియొక్క, పరా = ఉత్కృష్టమైన, కాష్ఠా = పరమావధి, జీవద్వైతవివర్జనాత్ = జీవసృష్టమనోమయప్రపంచమును త్యజించుటవలన, లభ్యతే = లభింపఁబడుచున్నది, అతః=ఈహేతువువలన, అత్ర = ఇచట, ఇదం = ఈమనోమయప్రపంచము, ఈశద్వైతాత్ = ఈశ్వరసృష్టప్రపంచమునుండి, వివేచితం = వేఱుగా విభజింపఁబడినది.

తా. ఈప్రకరణమునందు జీవసృష్టప్రపంచమునకును, ఈశ్వర సృష్టాకాశాదిబాహ్యప్రపంచమునకును భేదము వివరింపఁబడినది. జీవసృష్టమైన మనోమయద్వైతమును విడుచుటచే జీవన్ముక్తుఁడు పరమావధి యగు బ్రహ్మైకస్థితిని పొందుచున్నాఁడు.

ఇతి శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు ద్వైతవివేక మను
చతుర్థప్రకరణము.

---



శ్రీ ర స్తు

శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## పంచమ ప్రకరణము

### మహావాక్యవివేక ప్రకరణము

అవ. మోక్షాపేక్షగలవానికి మోక్షసాధనము బ్రహ్మాత్మైక్యజ్ఞానము. అట్టియైక్య జ్ఞానము గలుగుటకొఱకు నాలుగు వేదములలో మిక్కిలి ప్రసిద్ధము లయిన నాల్గు మహా వాక్యముల యర్థమును నిరూపింపఁ దలఁచి ముందుగా శ్రీవిద్యారణ్యగురువర్యుఁడు అందరిని తరింపఁజేయవలయు నను మహాదయగలవారు గనుక ఋగ్వేదము ఐతరే యారణ్యకమందున్న "ప్రజ్ఞానం బ్రహ్మ" యను మహావాక్యమునందలి 'ప్రజ్ఞాన' శబ్ద మున కర్థముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఓం యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ,
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్. 1

వ్యాఖ్యానమ్

నత్వా శ్రీభారతీతీర్థ విద్యారణ్యమునీశ్వరౌ,
మహావాక్యవివేకస్య కుర్వే వ్యాఖ్యాం సమాసతః.

వ్యా. ముముక్షోర్మోక్షసాధనబ్రహ్మాత్మైక్యత్వావగతిసిద్ధయే ప్రసిద్ధానాం చతు ర్ణాం మహావాక్యానాం అర్థం క్రమేణ నిరూపయన్ పరమదయాళురాచార్య ఆదౌ తావదైతరేయారణ్యకగతే "ప్రజ్ఞానం బ్రహ్మేతి" మహావాక్యే ప్రజ్ఞానశబ్దస్యార్థ మాహ—యేనేక్షత ఇతి. యేన చక్షుర్ద్వారా నిర్గతాంతఃకరణవృత్త్యావహితచైత న్యేన ఇదం దర్శనయోగ్యం రూపాదిక మీక్షతే పశ్యతి పురుషస్తథా శ్రోత్రద్వారా నిర్గతాంతఃకరణవృత్త్యుపాధికేన యేన శబ్దజాతం శృణోతి; తథైవ ఘ్రాణద్వారా,

నిర్గతాంతఃకరణవృత్త్యుపహితేన యేన గంధజాతం జిఘ్రతి; యేన వాగింద్రియా న్నిర్గతేన వ్యాకరోతి శబ్దజాతం వ్యాహరతి; యేన రసనేంద్రియద్వారా నిర్గతాంతః కరణవృత్త్యుపాధికేన స్వాద్వస్వాదూ రసౌ విజానాతి; అనుక్తసముచ్చయార్థశ్చశబ్దః. తథాచోక్తానుక్తైస్సకలేంద్రియైః అంతఃకరణవృత్తిభేదైశ్చోపలక్షితం యచ్చైతన్యమస్తి తదేవాత్ర ప్రజ్ఞానమిత్యుచ్యత ఇత్యర్థః. అనేన యేన వా పశ్యతీత్యాదేః సర్వాణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయానీత్యంతస్యావాంతరవాక్యసందర్భస్యార్థః సంక్షిప్య దర్శితః.

టీ. యేన = ఏచైతన్యముచేత, ఇదం = చూడఁదగిన రూపాదికమును, ఈక్షతే= చూచుచున్నాఁడో, శృణోతి=శబ్దములను వినుచున్నాఁడో, జిఘ్రతి=గంధముల నాఘ్రా ణించుచున్నాఁడో, వ్యాకరోతి చ = అనేక శబ్దములతో వ్యవహరించుచున్నాఁడో, స్వాద్వస్వాదూ = మధురరసములను తిక్తరసములను, విజానాతి= తెలిసికొనుచున్నాఁడో తత్ = ఆచైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞాన మని, ఉదీరితం = చెప్పఁబడుచున్నది.

తా. పురుషుఁడు అంతఃకరణవృత్తితోఁ గూడి నేత్రేంద్రియ ద్వారా వెలుపటికి వ్యాపించిన యేచైతన్యముతో దర్శనయోగ్యమగు రూపమును జూచునో, శ్రవణయోగ్యములైన శబ్దములఁ జెవులతో నాలకించునో, వాసనచూడఁదగిన సుగంధ దుర్గంధముల ముక్కుతో వాసనచూచునో, వాగింద్రియముతో సర్వశబ్దములను వ్యవహరించునో, నాలుకతో తీపి చేఁదు వగరు మొదలగు రుచుల నెఱుంగునో, అట్టి యంతఃకరణవృత్తిద్వారా సకలేంద్రియద్వారా వెలుపటికి వ్యాపించిన చైతన్యము ప్రజ్ఞాన మనఁబడుచున్నది.

అవ. "ప్రజ్ఞానం బ్రహ్మ" యను మహావాక్యమందలి ప్రజ్ఞానశబ్దార్థమును చెప్పి యిప్పుడు బ్రహ్మశబ్దార్థమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు,
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి. 2

వ్యా. ఏవం ప్రజ్ఞానశబ్దస్యార్థమభిధాయ బ్రహ్మశబ్దస్యార్థమాహ—చతుర్ముఖేతి. ఉత్తమేషు దేవాదిషు మధ్యమేషు మనుష్యేషు అధమేషు అశ్వగవాదిషు దేహధారిషు ఆకాశాదిభూతేషు చ జగజ్జన్మాదిహేతుభూతం యదేకం చైతన్యమస్తి తద్బ్రహ్మేత్యర్థః. అనేన చ "ఏష బ్రహ్మైషఇంద్ర" ఇత్యాదేః "ప్రజ్ఞా ప్రతిష్ఠే" త్యంతస్యావాంతరవా క్యస్యార్థః సంక్షిప్య దర్శితః. ఇత్థం పదార్థ మభిధాయ వాక్యార్థమాహ—అతఇతి,

యతః సర్వత్రావస్థితం ప్రజ్ఞానం బ్రహ్మేతో మయ్యపి స్థితం ప్రజ్ఞానం బ్రహ్మైవ ప్రజ్ఞాన త్వావిశేషాదిత్యర్థః.

టీ. చతుర్ము...షు-చతుర్ముఖ=బ్రహ్మదేవునియందును, ఇంద్రదేవేషు=ఇంద్రాది దేవతలయందును, మనుష్య = మనుష్యులయందును, అశ్వ = గుఱ్ఱములయందును, గవా దిషు = గోవులు మొదలగువానియందును గల, ఏకం = ఒక్కటియగు, చైతన్యం = చైతన్యము, బ్రహ్మ=బ్రహ్మ మగును. అతః = ఆకారణమువలన, మయ్యపి = నాదేహ మందును గల, ప్రజ్ఞానం = ప్రజ్ఞానము, బ్రహ్మ = బ్రహ్మ మగును.

తా. ఉత్తమజీవు లగు బ్రహ్మాదిదేవతలయందును, మధ్యమజీవు లగు మనుష్యులయందును, అధమజీవు లగు అశ్వగవాది జంతువు లందును, ఆకాశాది భూతములందును ఏ అద్వితీయచైతన్యము గలదో ఆచైతన్యము బ్రహ్మ మగును. ఇట్లు ముందుపదార్థమును సంక్షేపముగాఁ జెప్పి వాక్యార్థమును తెల్పియున్నాఁడు. సర్వజీవులయందు సామాన్య మైయున్న చైతన్యము నాయందును ప్రజ్ఞానస్వరూప మగు బ్రహ్మ మై విలసిల్లుచున్న దని యెఱుంగనగును.

అవ. యజుశ్శాఖాంతర్గతమగు బృహదారణ్యక శ్రుతిలోని "అహం బ్రహ్మాఽస్మి" యను రెండవ వాక్యమునందలి అహంశబ్దార్థము నిందుఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. పరిపూర్ణః పరాత్మాఽస్మిన్దేహే విద్యాధికారిణి,
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే. 3

వ్యా. ఏవం ఋక్ శాఖాగతం మహావాక్యార్థం నిరుచ్య యజుశ్శాఖాసు మధ్యే బృహదారణ్యకోపనిషద్గతస్యాహం బ్రహ్మాస్మీతి మహావాక్యస్యార్థావిష్కరణాయ అహంశబ్దస్యార్థమాహ—పరిపూర్ణ ఇతి. పరిపూర్ణః స్వభావతో దేశకాలవస్తుభిరపరి చ్ఛిన్నః పరమాత్మా అస్మిన్మాయాకల్పితే జగతి విద్యాధికారిణి శమాదిసాధనసంపన్న త్వేన విద్యా సంపాదనయోగ్యేఽస్మిన్ శ్రవణాద్యనుష్ఠానవతి దేహే మనుష్యాది శరీరే బుద్ధేర్బుద్ధ్యు పలక్షితస్య సూక్ష్మశరీరస్య సాక్షితయాఽ వికారిత్వేనావభాసక తయా స్థిత్వాఽవస్థాయస్ఫురన్ ప్రకాశమానోఽహమితీర్యతే. లక్షణయాఽహంపదేనో చ్యత ఇత్యర్థః.

టీ. పరిపూర్ణః = దేశకాలవస్తువులయం దెల్లతావుల నిండిన, పరమాత్మా = పర మాత్మ, అస్మిన్ = ఈమాయాకల్పితమైన జగత్తునందును, విద్యాధికారిణి = జ్ఞానసంపా దనకుం దగిన మనుష్యాదిశరీరమందును, బుద్ధేః = బుద్ధ్యుపలక్షిత మగు సూక్ష్మదేహమును పకును, సాక్షితయా స్థిత్వా = సాక్షియైయుండి, స్ఫురన్ = ప్రకాశించుచు, అహమి తీర్యతే = అహమ్మను పదముచే వ్యవహరింపఁబడుచున్నది.

తా. సకలదేశములయందును, సకలకాలములయందును, సకల వస్తువులయందును అపరిచ్ఛిన్నమై (ఎడతెఱపిలేనిదై) యుండిన పరమాత్మ మాయచే కల్పితమైన ప్రపంచమునందలి యెల్లశరీరములకు సాక్షియై యొప్పుచు నేను నే నని వ్యవహరింపఁబడుచున్నది. ఇదియే "అహమస్మి" యను మహావాక్యమునందలి అహంశబ్దార్థ మని తెలిసికొనునది.

అవ. ఇఁకను బ్రహ్మశబ్దార్థమును జెప్పుచున్నాఁడు.—

శ్లో. స్వతఃపూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః,
అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మ భవామ్యహమ్. 4

వ్యా. బ్రహ్మశబ్దార్థమాహ—స్వత ఇతి. స్వతః పరిపూర్ణః స్వభావతో దేశకాలాద్యనవచ్ఛిన్నః పూర్వోక్తః పరమాత్మా అత్రాస్మిన్మహావాక్యే బ్రహ్మశబ్దేన బ్రహ్మేత్యనేన వర్ణితః. లక్షణయోక్త ఇత్యర్థః. ఏతద్వాక్యగతేనాస్మీతిపదేన పదద్వయసామానాధికరణ్యలభ్యం జీవబ్రహ్మణోరైక్యం పరామృశ్యత ఇత్యాహ—అస్మీతి. ఫలితమాహ— తేనేతి.

టీ. స్వతః = స్వాభావికముగా, పూర్ణః = నిండియున్న, పరాత్మా = పరమాత్మ, బ్రహ్మశబ్దేన = బ్రహ్మ మనుమాటచేత, వర్ణితః = చెప్పఁబడినది. అస్మీతి = అస్మి యని, ఐక్యపరామర్శః = జీవబ్రహ్మములకు ఏకత్వముయొక్క నిరూపణము చేయఁబడుచున్నదనుట, తేన = ఆహేతువుచేత, అహం = నేను, అనఁగా చిదాభాసుఁ డనుట, బ్రహ్మ= బ్రహ్మస్వరూపము, భవామి=అగుచున్నాను.

తా. స్వాభావికముగా నపరిచ్ఛిన్నముగా నైనదిచెప్పఁబడిన పరమాత్మస్వరూపమే యిచట బ్రహ్మశబ్దముచేత లక్షణచే చెప్పఁబడినది. అస్మి యనుపదముతో జీవేశ్వరుల కిద్దరికి నైక్యముగూడ నిరూపింపఁబడినది. కాఁబట్టి దేహేంద్రియాదివిలక్షణమై అహంశబ్దవాచ్యమైన నేనే బ్రహ్మము నని తాత్పర్యము.

అవ. సామవేదమందుఁ గల ఛాందోగ్యములో "తత్త్వమసి" యను నొక మహావాక్యము గలదు. ఆట్టి వాక్యమున కర్థమును నిరూపింపఁదలఁచి యందలి తత్ అను పదమునకు లక్ష్యార్థమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. ఏక మేవాద్వితీయం సన్నామరూపవివర్జితమ్,
సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే. 5

వ్యా. ఇదానీం ఛాందోగ్యశ్రుతిగతస్య తత్త్వమసీతి వాక్యస్యార్థప్రకాశనాయ తత్పదలక్ష్యార్థ మాహ—ఏకమేవేతి. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయ" మితి వాక్యేన సృష్టేః పురా స్వగతాదిభేదశూన్యం నామరూపరహితం యత్సద్వస్తు ప్రతిపాదితమస్తి అస్య సద్వస్తునోఽధునాపి సృష్ట్యుత్తరకాలేఽపి తాదృక్త్వం విచార దృష్ట్యా తథాత్వం తదితిపదే నేర్యతే లక్ష్యత ఇత్యర్థః.

టీ. సృష్టేః = ప్రపంచముయొక్కయుత్పత్తికి, పురా = ముందు, నామరూప వివర్జితం = నామము రూపము లేని, అద్వితీయం = తనకంటె వేఱైన మఱి యేరెండవ పదార్థములేని, ఏకమేవ = ఒక్కటేయయిన, సత్ =సద్వస్తువు చెప్పఁబడినదో, అస్య = ఈసద్వస్తువునకు, అధునాపి = ఈసృష్టియైన తర్వాతకూడ, తాదృక్త్వం=విచారదృష్టిచే నట్టిస్వభావము, తదితి = తత్ అను పదముచేత, ఈర్యతే = లక్షణావృత్తిచేత చెప్పఁ బడుచున్నది.

తా. ఏసద్వస్తువు సృష్టికి పూర్వము ఛాందోగ్యమున "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" అని సజాతీయభేదము, విజాతీయభేదము, స్వగతభేదము అను త్రివిధభేదమును లేక నామరూపములును లేనిదిగా చెప్పఁబడెనో, యట్టి సద్వస్తువు సృష్టి జరిగినతర్వాతను కూడ విచారించి చూడ నట్టి స్వభావము గలదిగానే 'తత్' అనెడి పదముచే లక్షణావృత్తిచేత బోధింపఁబడుచున్నది.

అవ. తత్ అనుదాని కర్థము చెప్పి 'త్వం' అనెడి పదమునకు లక్ష్యార్థమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్,
ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్. 6

వ్యా. త్వంపదలక్ష్యార్థమాహ—శ్రోతురితి. శ్రోతుః శ్రవణాద్యనుష్ఠానేన వాక్యార్థ ప్రతిపత్తుర్దేహేంద్రియాతీతం దేహేంద్రియోపలక్షితస్థూలాదిశరీరత్రయసాక్షితయా తద్విలక్షణం వస్తు సద్వస్త్వేవ త్వంపదేరితం వాక్యగతేన త్వమితి పదేన లక్షిత మిత్యర్థః. ఏకద్వాక్యస్థేన అసీతి పదేన తత్త్వంపదసామానాధికరణ్యలబ్ధం పదార్థద్వయైక్యం శిష్యం ప్రతి ప్రత్యాయ్యత ఇత్యాహ—ఏకతేతి. సిద్ధమర్థమాహ—తదైక్యమితి, తయోస్తత్త్వం పదార్థయోరైక్యంప్రమాణసిద్ధమేకత్వ మనుభూయతాం ముముక్షుభి రిత్యర్థః.

టీ. శ్రోతుః = (శ్రవణాదులను చేసి వాక్యార్థజ్ఞానము గల) ముముక్షువునకు. దేహేంద్రియాతీతం=స్థూలసూక్ష్మకారణములనెడి దేహత్రయముకంటెను,ఇంద్రియముల

కంటెను, అతీతం = విలక్షణమైన అనఁగా వేఱైయున్న, వస్తు=వస్తువు(సద్వస్తు వనుట), త్వంపదేరితం = నీవు అనెడి యర్థముగల త్వంపదముచేత లక్షితమయ్యెను. అసీతి = ఐతి వనెడి యర్థముగల అసిపదముచేత, ఏకతా=ఏకత్వము, అనఁగా ఒక్కటి యగుట, గ్రాహ్యతే=తెల్పఁబడుచున్నది. తదైక్యం - తత్=ఆజీవేశ్వరుల కిరువురకును, ఐక్యం = ఏకత్వము, అనఁగా భేదములేకుండుట, అనుభూయతాం = మోక్షేచ్ఛగలవారిచే నను భవింపఁబడవలయును.

తా. సద్గురువులయొద్ద శ్రవణాదులు చేసి మహావాక్యార్థ జ్ఞానము కల్గియున్న ముముక్షువునకు దేహత్రయవిలక్షణంబును సర్వేంద్రియవిలక్షణంబును అయిన సద్వస్తువే యీ మహావాక్యమున త్వంపదముచేత లక్షణావృత్తిచేతఁ దెల్పఁబడినది. అసిపదముచేత నైక్యము చెప్పఁబడినది గనుక, ఓముముక్షులారా! జీవేశ్వరుల స్వభావ మును జక్కఁగాఁ బరికించి జీవబ్రహ్మైక్యనిశ్చయముం గనుఁడు.

అవ. అథర్వణవేదమందలి "అయమాత్మా బ్రహ్మ" అను మహావాక్యార్థ మిపుడు తెల్పంబడును:—

శ్లో. స్వప్రకాశాపరోక్షత్వమయమి త్యుక్తితో మతమ్,
అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతి గీయతే. 7

వ్యా. క్రమప్రాప్తస్యాథర్వణవేదగతస్యాయమాత్మా బ్రహ్మేతి వాక్యస్యార్థం వ్యాచికీర్షురాదావయమాత్మేతి పదద్వయేన వివక్షితమర్థంక్రమేణ దర్శయతి—స్వప్రకాశేతి. అయమిత్యుక్తితోఽయమితి శబ్దేన స్వప్రకాశాపరోక్షత్వం స్వయంప్రకాశేనాపరోక్షత్వం మతమభిమతం. అదృష్టాదివన్నిత్యపరోక్షత్వం ఘటాదివత్ దృశ్యత్వం చ వ్యావర్తయితుం విశేషణద్వయమితి బోద్ధవ్యం. దేహాదిష్వస్యాత్మశబ్దప్రయోగదర్శనాదత్రాత్మశబ్దేన కిం వివక్షితమిత్యాకాంక్షాయామాహ—అహంకారేతి. అహంకార ఆదిర్యస్య ప్రాణ మన ఇంద్రియదేహసంఘాతస్య సోఽహంకారాదిః తథా దేహః అంతోయస్యోక్తసంఘాతస్య సదేహాంతః అహంకారాదిశ్చాసౌ దేహాంతశ్చేతి తథా తస్మాత్ప్రత్యగధిష్ఠానతయా సాక్షితయా చాంతర ఆత్మేతి గీయతే అస్మిన్వాక్య ఇత్యర్థః.

టీ. అయమితి = ఇది, లేక వీఁడు అనెడి యర్థము గల అయమనుశబ్దముచేత, స్వప్రకాశాపరోక్షత్వం = స్వయముగా ప్రకాశించుటచే నపరోక్ష మగుట (ప్రత్యక్ష మగుట). మతం = ఇష్టమైన, అహంకారాది = అహంకారము మొదలగాఁ గలదియు, దేహాంతాత్ = దేహమంతముగాఁ గలదియు నగు సంఘాతముకంటె, ప్రత్యక్=లోని

ద్దైనది, ఆత్మేతి=ఆత్మయని, గీయతే=ఈవాక్యమందు వర్ణింపఁబడుచున్నది. ప్రత్యగాత్మ చెప్పఁబడుచున్న దనుట.

తా. ఋగ్యజుస్సామవేదములయందలి మహావాక్యార్థమును వివరించి యథర్వణవేదశ్రుతియందలి "అయమాత్మా బ్రహ్మ" అను నాల్గవ వాక్యములోని అయం, ఆత్మా, బ్రహ్మ అని మూఁడుపదములలోని మొదటి రెండు పదములచే (అయమాత్మా అనువానిని) స్వయం ప్రకాశస్వరూపము కలిగి సర్వజనప్రత్యక్షమయి నట్టియు, దేహేంద్రియమనోహంకారాదులకంటె వేఱైనట్టియు సర్వాధార మైనట్టిదియు సర్వము నెఱుంగునట్టిదియునైన ప్రత్యగాత్మ చెప్పఁబడిన దని భావము.

శ్లో. దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే,
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్. 8

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
మహావాక్యార్థవివేకః.

---

వ్యా. బ్రాహ్మణాదిష్వపి బ్రహ్మశబ్దస్య ప్రయోగదర్శనాత్తద్వ్యావర్తనాయాత్ర వివక్షితమర్థమాహ—దృశ్యమానస్యేతి. దృశ్యత్వేన మిథ్యాభూతస్య సర్వస్యాకాశాదేర్జగతస్తత్త్వమధిష్ఠానతయా తద్బాధావధిత్వేన చ పారమార్థికం సచ్చిదానందలక్షణం యద్రూపమస్తి తద్బ్రహ్మశబ్దేనేర్యతే కథ్యత ఇత్యర్థః. వాక్యార్థమాహ—తద్బ్రహ్మేతి. యదుక్తలక్షణం బ్రహ్మ స్వప్రకాశాత్మరూపం స్వరూపం యస్య తత్స్వప్రకాశాత్మ రూపకం స ఏవేత్యర్థః.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్యశ్రీమద్భారతీతీర్థ విద్యారణ్య
మునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితా
మహావాక్యవివేక వ్యాఖ్యా సమాప్తా.

---

టీ. దృశ్యమానస్య=(మిథ్యాభూతమయ్యును) కనఁబట్టుచున్న, సర్వస్య=ఆకాశాది సర్వస్వరూపమైన, జగతః=ప్రపంచముయొక్క, తత్త్వం=యథార్థస్వరూపము (అధిష్ఠాన రూపము) బ్రహ్మశబ్దేన = బ్రహ్మమనెడి పదముచేత, ఈర్యతే = చెప్పఁబడుచున్నది. తద్బ్రహ్మ = ఆపరబ్రహ్మము, స్వప్రకాశాత్మరూపకం - స్వప్రకాశ = స్వయముగా

ప్రకాశించెడి, ఆత్మ = ప్రత్యగాత్మయే, రూపకం = స్వరూపముగాఁగలది, (ప్రత్యగాత్మయే పరబ్రహ్మ మనుట.)

తా. విచారణచేసినపుడు రజ్జుసర్పము పోల్కి మిథ్యాభూతమైన యాకాశాదిసర్వప్రపంచము పారమార్థికమైన (రజ్జువువలె యథార్థమైన) బ్రహ్మమే కాని వేఱు కాదు. అది తనకుఁ దానే ప్రకాశించుచుండుటకు నాత్మ యగును. అనఁగా ప్రత్యగాత్మయే బ్రహ్మమని భావము.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు మహావాక్యవివేక మను పంచమప్రకరణము.



ఓం

శ్రీ ర స్తు

శ్రీ గణేశాయ నమః

# శ్రీ వేదాంతపంచదశి

## షష్ఠ ప్రకరణము

## చిత్ర దీప ప్రకరణము

అవ. గ్రంథకర్త యగు శ్రీవిద్యారణ్యస్వామి "పరమాత్మని" అనుపదముచేత ఇష్టదేవతను స్మరించుచు "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అను న్యాయముచొప్పున దృష్టాంతపూర్వకముగా ఆత్మయందు జగదారోపణముం జూపుచున్నాఁడు:—

శ్లో. ఓమ్. యథా చిత్రపటే దృష్టమవస్థానాం చతుష్టయమ్,
పరమాత్మని విజ్ఞేయం తథావస్థాచతుష్టయమ్. 1

వ్యాఖ్యానమ్

యస్య స్మరణమాత్రేణ విఘ్నా దూరం ప్రయాంతి హి,
వందేఽహం దంతివక్త్రం తం వాంఛితార్థప్రదాయకమ్.
నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ
క్రియతే చిత్రదీపస్య వ్యాఖ్యా తాత్పర్యబోధినీ.

వ్యా. చికీర్షితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయ పరమాత్మనీతిపదేనేష్టదేవతాతత్త్వానుసంధానలక్షణం మంగళమాచరన్నస్య గ్రంథస్య వేదాంతప్రకరణత్వాత్తదీయైరేవ విషయాదిభిస్తద్వత్తాసిద్ధిం మనసి నిధాయాధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యత ఇతి న్యాయమనుసృత్య పరమాత్మన్యారోపితస్య జగతః స్థితిప్రకారం సదృష్టాంతం ప్రతిజానీతే—యథేతి. చిత్రపటే యథా వక్ష్యమాణానాం అవస్థానాం చతుష్టయం దృష్టం తథైవ పరమాత్మన్యపి వక్ష్యమాణ మవస్థాచతుష్టయం జ్ఞేయమితి.

టీ. చిత్రపటే = రంగులగుడ్డయందు, యథా = ఏవిధముగా, అవస్థానాం = అవస్థలయొక్క, చతుష్టయం = నాల్గు అనేసంఖ్య, దృష్టం = చూడఁబడునో, తథా = ఆవిధముననే, పరమాత్మని = పరమాత్మయందు, అవస్థాచతుష్టయం = నాల్గు అవస్థలు విజ్ఞేయం = తెలియఁదగును.

తా. రంగులబట్టయం దేవిధముగా నాలుగవస్థలు కనఁబడునో యటులనే పరమాత్మయందును నాలుగవస్థలు కనఁబడుచున్నవి.

అవ. దృష్టాంతదార్ష్టాంతికములయం దానాల్గవస్థలను జూపుచున్నాఁడు:—

శ్లో. యథా ధౌతో ఘట్టితశ్చ లాంఛితో రంజితః పటః,
చిదంతర్యామిసూత్రాత్మా విరాడాత్మా తథేర్యతే. 2

వ్యా. కిం తదిత్యాకాంక్షాయాం దృష్టాంతదార్ష్టాంతికయో రుభయోరప్యవస్థా చతుష్టయం క్రమేణోద్దిశతి—యథేతి. ధౌతో, ఘట్టితో, లాంఛితో, రంజిత ఇత్యేవం ప్రకారాశ్చతస్రోఽవస్థా యథా చిత్రపటే ఉపలభ్యంతే, తథా పరమాత్మన్యపి చిత్, అంతర్యామీ, సూత్రాత్మా, విరాట్, చేత్యవస్థాచతుష్టయం బోద్ధవ్యమిత్యర్థః.

టీ. యథా = ఏప్రకారము, పటః = వస్త్రము, ధౌతః = ధౌత మనియు, ఘట్టితః = ఘట్టిత మనియు, లాంఛితః = లాంఛిత మనియు, రంజితః=రంజిత మనియు (చెప్పఁబడునో) తథా = అదేప్రకారము (పరమాత్మయును), చిదంతర్యామిసూత్రాత్మా విరాడాత్మేతి = చిత్తు, అంతర్యామి, సూత్రాత్మ, విరాట్స్వరూపము అని, ఈర్యతే = చెప్పఁబడుచున్నది.

తా. వస్త్రము ౧. ధౌతము, ౨. ఘట్టితము, ౩. లాంఛితము, ౪. రంజితము, అని నాల్గవస్థలం బొందినట్లు ఆత్మయును ౧. చిత్తు, ౨. అంతర్యామి, ౩. సూత్రాత్మ, ౪. విరాట్టని నాల్గవస్థలు గలిగి శాస్త్రమందుఁ దెలియఁబడుచున్నది.

అవ. దృష్టాంతమందు చూపించిన యవస్థలను దార్ష్టాంతికమునఁ జూపుచున్నాఁడు:—

శ్లో. స్వతశ్శుభ్రోఽత్ర ధౌతిస్స్యాద్ఘట్టితోఽన్నవిలేపనాత్,
మష్యాకారైర్లాంఛితస్స్యా ద్రంజితో వర్ణపూరణాత్. 3

వ్యా. దృష్టాంతస్థితానా మవస్థానాం స్వరూపం క్రమేణ వ్యుత్పాదయతి—స్వతఇతి. అత్ర ఆస్వవస్థాసు మధ్యే స్వతో ద్రవ్యాంతరసంబంధం వినా శుభ్రో ధౌత

ఇత్యుచ్యతే. అనేనలిప్తో ఘట్టితః మషీమయైరాకారైర్యుక్తో లాంఛితః యథాయోగ్యం వర్ణైః పూరితో రంజితః స్యాత్.

టీ. అత్ర = ఈదృష్టాంతమందు, స్వతః = ఏపదార్థసంబంధము లేక స్వాభావికముగా, శుభ్రః = తెల్లనిదైన వస్త్రము, ఘాతః = ఘాత (గుంజిన) వస్త్రము, స్యాత్ = అగును. అన్యవిలేపనాత్ = ఇంకొకపదార్థముతోఁ బూయఁబడుటవలన, ఘట్టితః = ఘట్టితవస్త్రమగును. మష్యాకారైః = మసితో నిండినయాకారములచేత, లాంఛితః = లాంఛితవస్త్ర మగును. వర్ణపూరణాత్ - వర్ణ = రంగులను, పూరణాత్ = అద్దుటవలన, రంజితః = రంజితవస్త్రమగును.

తా. మఱే యేయితరపదార్థము చేరక స్వాభావికస్థితిలో నున్నబట్టను శుభ్రవస్త్రం బనియు, గంజి మొదలగువానిం జేర్చినప్పుడు ఘట్టితవస్త్రం బనియును, మసి మొదలగు నాకారముల నద్దినప్పుడు లాంఛితవస్త్రం బనియు, ఎచ్చట నేరంగును వేయవలయునో యా యారంగులు పూర్తిగా నద్దినప్పుడు రంజితవస్త్రం బనియు వాడఁ బడును.

అవ. పైశ్లోకమునఁ జెప్పంబడిన నాల్గవస్థలను దార్ష్టాంతికమందు సరిపుచ్చుచున్నాఁడు:—

శ్లో. స్వతశ్చిదంతర్యామీ తు మాయావీ సూక్ష్మసృష్టితః,
సూత్రాత్మా స్థూలసృష్ట్యైవ విరా డిత్యుచ్యతే పరః. 4

వ్యా. దార్ష్టాంతికే తా వ్యుత్పాదయతి—స్వత ఇతి. పరః పరమాత్మా మాయాతత్కార్యరహితశ్చిదిత్యుచ్యతే, మాయాయోగాదంతర్యామీ. అపంచీకృతభూతసమష్టిసూక్ష్మశరీరయోగా త్సూత్రాత్మా. పంచీకృతభూతకార్యసమష్టిస్థూలశరీరోపాధియోగా ద్విరాడితి.

టీ. పరః = పరమాత్మ, స్వతః = మాయాతత్కార్యసంబంధము లేనిస్వాభావికస్థితిలో, చిత్ = చిత్తనఁబడును, మాయావీ = మాయతోఁగూడినపుడు, అంతర్యామీ= అంతర్యామి యనఁబడును. సూక్ష్మసృష్టితః = పంచీకరణము చేయఁబడని పంచభూతకార్యసమష్టిస్వరూపమయిన సూక్ష్మశరీరసంబంధము కల్గినపుడు, సూత్రాత్మా = హిరణ్యగర్భుఁ డనఁబడును. స్థూలసృష్ట్యైవ = పంచీకరణము చేయఁబడినపంచభూతకార్యసమష్టిస్థూలశరీరసంబంధముచేతనే విరాట్ = విరాట్టు, ఇతి = అనియును, కథ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. మాయయు తత్కార్యసంబంధమును లేని పరమాత్మను చిత్తు అందురు. మాయాసంబంధము కల్గియున్న ఆత్మను అంతర్యామి యందురు. పంచీకరణము చేయఁబడని పంచభూతముల కార్యమైన సమష్టిసూక్ష్మశరీరోపాధి గల పరమాత్మను సూత్రాత్మ లేక హిరణ్యగర్భుఁ డందురు. పంచీకరణము చేయఁబడిన పంచభూత కార్యములయొక్క సమష్టి స్థూలశరీరోపాధి గల పరమాత్మను విరాట్టను చున్నారు.

అవ. పరమాత్మను చిత్రపటముతోఁ బోల్చితివి గనుక పరమాత్మయందుఁ గల చిత్రము లెవ్వి? అను శంకకు సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మాద్యాః స్తంబపర్యంతాః ప్రాణినోఽత్ర జడా అపి,
ఉత్తమాధమభావేన వర్తంతే పటచిత్రవత్. 5

వ్యా. నను పరమాత్మనః చిత్రపటస్థానీయత్వే తదాశ్రితాని చిత్రాణి వక్తవ్యానీత్యత ఆహ—బ్రహ్మాద్యా ఇతి. అత్ర పరమాత్మని ఉత్తమాధమభావేన వర్తమానం బ్రహ్మాదిస్తంబపర్యంతం చేతనాచేతనాత్మకం గిరినద్యాదిజడజాతం చ చిత్రస్థానీయ మిత్యర్థః.

టీ. అత్ర = ఈపరమాత్మయందు, బ్రహ్మాద్యాః = బ్రహ్మమొదలుకొని, స్తంబపర్యంతాః=గడ్డిపోఁచవఱకుఁ గల, ప్రాణినః = జీవులును, జడా అపి = అచేతనములైన చెట్లు గుట్టలు మున్నగువస్తువులు, ఉత్తమాధమభావేన = ఉత్తమస్థితితోడను, నీచస్థితితోడను, పటచిత్రవత్=వస్త్రమునందలి చిత్తరువువలె, వర్తంతే = ప్రవర్తించుచున్నవి.

తా. ఉత్తమస్థితిలోని జీవులు, బ్రహ్మాదిదేవతాగణము, దాని తరువాత మనుష్యులు, అటుతరువాత పశుపక్ష్యాదివర్గము, ఇట్లొకదానికన్న నొకటి యుత్తమాధమభావములో నున్నవి. నదీపర్వతాదికమైన యచేతనవర్గము తక్కువస్థితిలో నున్నది. ఇట్లుత్తమాధమభావమున నున్న చేతనాచేతనము లెన్నట్టియు బ్రహ్మ మొదలు గడ్డిపోఁచవఱకు నుండు జీవరాశి యంతయు రంగుబట్టయందుఁ గల చిత్తరువువలె నున్నది.

అవ. బ్రహ్మ మొదలగువారిని కొందఱిని మాత్రము చేతను లనుటకు కారణము చెప్పఁ బూని దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. చిత్రార్పితమనుష్యాణాం వస్త్రాభాసాః పృథక్పృథక్,
చిత్రాధారేణ వస్త్రేణ సదృశా ఇవ కల్పితాః. 6

వ్యా. బ్రహ్మాదిజగతశ్చైతన స్థానీయత్వే కారణం వక్తుం దృష్టాంతమాహ— చిత్రేతి. యథా చిత్రే లిఖితానాం మనుష్యాదిశరీరాణా మేవ నానావర్ణోపేతా వస్త్రవిశేషా లిఖ్యంతే తే చ శీతాద్యనివారకత్వా ద్వస్త్రాభాసా ఏవ.

టీ. చిత్రార్పితమనుష్యాణాం =చిత్తరువులో వ్రాయఁబడిన మనుష్యులకు, పృథ క్పృథక్ = ప్రత్యేకప్రత్యేకముగా, చిత్రాధారేణ = చిత్తరువున కాధారమైన, వస్త్రేణ = బట్టతోడ, సదృశా ఇవ = సమానము లైనవానివలె, వస్త్రాభాసాః = ఆభాస వస్త్రములు (అనఁగా వస్త్రములవలెఁ గన్పడును గాని వస్త్రములు కావనుట), కల్పితాః= చిత్రకారకునిచే లిఖింపఁబడుచున్నవి.

తా. చిత్తరువులలోని మనుష్యులకు ఆయావస్త్రములు కట్టఁబడి నట్లు వ్రాయుదురు. వానికి రంగులు వేఱు వేఱుగా నుండును. అవి యన్నియు అసలు బట్టపైన నధ్యకము చేయఁబడినవే కదా! ఆవస్త్రములు చలిని పోఁగొట్టఁజాలక పోయినను వస్త్రములవలె మాత్రము గన్పట్టు చున్నవి.

అవ. దృష్టాంతమందలియంశమును దార్ష్టాంతికమందు సరిపుచ్చుచున్నాఁడు: —

శ్లో. పృథక్పృథక్చిదాభాసాశ్చైతన్యాధ్యస్తదేహినాం,
కల్ప్యంతే జీవనామానో బహుధా సంసరం త్యమీ. 7

వ్యా. దార్ష్టాంతికమాహ—పృథగితి. ఏవం పరమాత్మన్యారోపితానాం దేవా దీనాం శరీరాణా మేవ జీవనామానశ్చిదాభాసాః ప్రత్యేకం కల్ప్యంతే. న పర్వతాదీ నాం. తేషాం తత్కల్పనే కారణమాహ—బహుధేతి. అమీ జీవాః దేవతిర్యఙ్మను ష్యాది శరీరప్రాప్త్యా. బహుధా సంసరంతి న పరమాత్మా. తస్య నిర్వికారత్వాదిత్యభి ప్రాయః.

టీ. చైతన్యాధ్యస్తదేహినాం - చైతన్య = చైతన్యమందు, అధ్యస్త = ఆరో పింపఁబడిన, దేహినాం = జీవులకు, చిదాభాసాః = చిదాభాసు లని, పృథక్పృథక్ = ప్రత్యేకప్రత్యేకముగా, కల్ప్యంతే = కల్పనలు చేయఁబడుచున్నని, అమీ జీవనా మానః= ఈజీవు లని చెప్పఁబడుమనుష్యపశుపక్ష్యాదులు, బహుధా=పెక్కుభంగుల, సంస రంతి=సంసారమునఁ బడుచున్నవి అనఁగా జననమరణములఁ బొందుచున్నవి.

తా. వస్త్రమునంపలి బొమ్మలకు నేర్పఱచిన ఆబొమ్మవస్త్రములు వలె చైతన్యమం దారోపితులైన జీవులకే చిదాభాసు లను నామము ప్రత్యేకముగా పెట్టఁబడుచున్నది. నదీపర్వతాదులకు లేదు. అనేక

విధము లగు జననమరణములనిట్టి చిదాభాసు లనఁబడుజీవులే పొందుటం జేసి యట్లు చెప్పుచున్నారు. అనఁగా పరమాత్మ ఏవికారములు లేని వాఁడు గాన చిదాభాసు లనఁబడు జీవులయందలి జననాది వికారములు ఆకూటస్థనిర్వికారచైతన్యము నెంతమాత్ర మంట వని యెఱుంగ నగు.

అవ. లోకములోఁ గొందఱు వాదులు ఆత్మకే సంసార మనుచుండుట కేమి కారణమని యడిగినచో నందు కజ్ఞానమే కారణ మని దృష్టాంతపూర్వకముగ సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వస్త్రాభాసస్థితా న్వర్ణా న్యద్వదాధారవస్త్రగాన్,
వదం త్యజ్ఞాస్తథా జీవసంసారం చిద్గతం విదుః. 8

వ్యా. నను సర్వే వాదినో లౌకికా శ్చాత్మన ఏవ సంసారఇతి వదంతి. తత్ర కిం కారణ మిత్యాశంక్య అజ్ఞానమేవ కారణమితి సదృష్టాంతమాహ—వస్త్రాభాసేతి.

టీ. అజ్ఞాః = మూఢులు, యద్వత్ = ఏప్రకారము, వస్త్రాభాసస్థితాన్ = ఆభాసవస్త్రములం దుండునట్టి, వర్ణాన్ = రంగులను, ఆధారవస్త్రగాన్ = చిత్తరువున కాధార మగు వస్త్రమందున్నవానినిగా, వదంతి=చెప్పుచున్నారో, తథా=ఆప్రకారమే, జీవసంసారం = జీవులసంసారమును అనఁగా జననమరణాదిరూప మగుస్థితిని, చిద్గతం = చైతన్యమం దున్నదానినిగా, విదుః = అనుకొనుచున్నారు.

తా. చలి మొదలగువానిం బోఁగొట్టమిచే వస్త్రములుఁ గాక వస్త్రములవలెఁ గన్పడును గనుక చిత్రగతమనుష్యాదిశరీరములకుఁ గట్టించుమండఁబట్టులను వస్త్రాభాసము లనఁదగును. అట్టియాభాసవస్త్రముల యందుండురంగులు ఆబొమ్మ లేవస్త్రమందు చిత్రింపఁబడెనో, అట్టియాధారముగా నున్నవస్త్రము నున్నట్లు తలచెడివారు అందలి నిజము నెఱుఁగనివారు గాన, తెలివిలేనివా రనఁబడుదురు. అట్లు తెలియనివారు దృష్టాంతమున పొరఁబడి వేఱుగా నభిప్రాయపడినట్లు జీవునిసంసారమును జననమరణాదులను కూటస్థచైతన్యమం దున్నట్లు పొరపడుచున్నారు. వస్తుస్వభావమునుబట్టి మొదట చిత్రాధారవస్త్రమందు వర్ణములు లేనియట్లాత్మయందును నేవికారములు లేవనుట.

అవ. చిత్తరువునఁ బ్రాయఁబడిన పర్వతములు నదులు మొదలగువానికి వస్త్రకల్పన లేకపోవుటను దృష్టాంతమూలకముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. చిత్రస్థపర్వతాదీనాం వస్త్రాభాసో న దృశ్యతే,
సృష్టిస్థమృత్తికాదీనాం చిదాభాసస్తథా న హి. 9

వ్యా. గిరినద్యాదీనాం తు చిదాభాసకల్పనాభావం దృష్టాంతపురస్సరమాహ— చిత్రస్థేతి. ప్రయోజనాభావాదితి భావః.

టీ. చిత్రస్థపర్వతాదీనాం = చిత్తరువులో లిఖింపఁబడిన పర్వతములు మొదలగు వానికి, వస్త్రాభాసః = ఆభాసవస్త్రకల్పన, (యథా = ఏవిధముగా), న దృశ్యతే = చూడఁబడదో, తథా=ఆవిధంబుననే, సృష్టిస్థమృత్తికాదీనాం=సృష్టియం దుండుభూమి మొదలగువానికి, చిదాభాసః=చిదాభాసకల్పన (జీవకల్పన యనుట), న హి=లేదు.

తా. చిత్తరువున లిఖింపఁబడినపర్వతములు నదులు మున్నగు వానికి వస్త్రము లున్నట్లు లిఖించుట లేనట్లు సృష్టిలోనిభూమి మొదలగువస్తువులకు చిదాభాసులనెడి వ్యవహారము లేదు. చిదాభాసు లనఁగా చిత్ప్రతిబింబములు. చైతన్యవ్యవహార మనుట.

అవ. ఇటులనే ఆత్మయం దారోపింపఁబడిన సంసారము జ్ఞానముచేత నివర్తించు నని చెప్పఁ బూని యాసంసారమునకు కారణమైన అవిద్యయొక్క స్వరూపము చెప్పు చున్నాఁడు:—

శ్లో. సంసారః పరమార్థోఽయం సంలగ్నస్స్వాత్మవస్తుని,
ఇతి భ్రాంతిరవిద్యా స్యా ద్విద్యయైషా నివర్తతే. 10

వ్యా. ఏవమాత్మన్యారోపితస్య సంసారస్య జ్ఞాననివర్త్యత్వసిద్ధయే తన్మూలభూతా మవిద్యామాహ—సంసార ఇతి.

టీ. ఆత్మవస్తుని = పరమాత్మయందు, అయం సంసారః = ఈసంసారము, పారమార్థికః = యథార్థమైనదై, సంలగ్నః = సంబంధించియున్నది. ఇతి భ్రాంతిః = అను పొరపాటు, అవిద్యా = అవిద్య, స్యాత్ = అగును. ఏషా=ఈయవిద్య, విద్యయా = జ్ఞానముచేత, నివర్తతే = పోవును.

తా. ఈసంసారము అనఁగా జననాదిజీవధర్మము ఆత్మయందు చేరిక కలది యనుకొనుట పొరపాటు. దీనినే అవిద్య యందురు. అది జ్ఞానముచేత నివర్తించును.

అవ. విద్య యన నేమి? అవిద్య యెట్లు లభించును? అని యాశంకించుకొని విద్యాస్వరూపమును, అట్టివిద్య లభించుట కుపాయమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. ఆత్మాభాసస్య జీవస్య సంసారో నాత్మవస్తునః,
ఇతి బోధో భవేద్విద్యా లభ్యతేఽసౌ విచారణాత్. 11

వ్యా. కేయం విద్యా తల్లాభోపాయశ్చ క ఇత్యాకాంక్షాయాం విద్యాస్వరూపం తల్లాభోపాయం చ దర్శయతి—ఆత్మాభాసస్యేతి. చిదాభాసస్యేత్యర్థః.

టీ. ఆత్మాభాసస్య = చిదాభాసుఁడైన, జీవస్య = జీవునకు, సంసారః = సంసారముగలదు. ఆత్మవస్తునః = పరమాత్మకు, న = సంసారము లేదు. ఇతి బోధః = అనెడి జ్ఞానము, విద్యా = విద్య, భవేత్ = అగును. అసౌ = ఇట్టివిద్య, విచారణాత్ = పరిశీలనమువలన, లభ్యతే = లభించును.

తా. జీవునకే సంసారము గాని ఆత్మకెంతమాత్రమును సంసారము లేదు. ఇట్టివిజ్ఞానమే బోధ యనంబడును. ఈబోధ చక్కఁగా శాస్త్రయుక్త్యనుభవములవలనఁ బరిశీలించినఁగాని గలుగదు. ఇదియే దీని కుపాయము.

అవ. విచారమునల్ల విద్య లభించు నంటివి. దేనివిచారముచేత లభించునో తెల్పు మన్న ట్లాశంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. సదా విచారయే త్తస్మాత్ జగజ్జీవపరాత్మనః,
జీవభావజగద్భావబాధే స్వాత్మైవ శిష్యతే. 12

వ్యా. విచారాల్లభ్యతే విద్యేత్యుక్తం. కస్య విచారాల్లభ్యతే విద్యేత్యాశంక్యాహ—సదేతి. నను పరాత్మా విచార్యతాం మోక్షావస్థాయాం. ఫలరూపేణావస్థావాజ్జీవజగతోర్విచారః కోవ్పయుజ్యత ఇత్యాశంక్య తయోరపవాదేన పరమాత్మావశేషేణ ఉపయుజ్యత ఇత్యాహ—జీవభావేతి.

టీ. తస్మాత్ = ఆహేతువువలన, జగజ్జీవపరాత్మనః = ౧. జగత్తును, ౨. జీవుని, 3. ప్రత్యగాత్మను, సదా = ఎల్లప్పుడును, విచారయేత్=పరిశీలింపవలెను. జీవభావజగద్భావబాధే = జీవభావమునకును జగద్భావమునకును బాధ గలిగినపుడు (విచారించిన మీఁద రెండు భావములు సరి గా వని తెలిసికొన్నప్పు డనుట). స్వాత్మైవ = తనవాస్తవరూపమైనపరమాత్మయే, శిష్యతే = శేషించుచున్నది (నిలుచు ననుట).

తా. ముముక్షు వగువాఁ డెల్లప్పుడు జగత్తన నేమి ? జీవుఁడన నేమి ? పరమాత్మ యన నేమి? అని విమర్శించినచో నామొదటి రెండును కల్పితములుగ తేలును. చివర కాత్మయొక్కటియే మిగులును. మోక్షావస్థయందు ఫలరూపమై శేషించును. కాఁబట్టి ఆత్మవిచారము చేయనగును. జగద్విచారము జీవవిచారము చేయ నేల యనెద వేమో. ఆరెండింటికిని కల్పితస్వరూపము లని నిశ్చయించినఁగదా అకల్పి

కమును పారమార్థికమునైన ఆత్మస్వరూపము మిగులుట అని యెఱుంగ వలెను.

అవ. విచారణ చేసి జగత్తును జీవుని బాధించ మంటివి. ఈ రెండు పోయిన తరువాత సర్వవ్యవహారము లోపించు నందువా? బాధశబ్దార్థమును గమనించుము అని చెప్పుచున్నారు:—

శ్లో. నాప్రతీతి స్తయో ర్బాధః కింతు మిథ్యాత్వనిశ్చయః,
నోచే త్సుషుప్తిమూర్ఛాదౌ ముచ్యే తాయత్నతో జనః. 13

వ్యా. నను విచారేణ జీవభావజగద్భావబాధే స్వాత్మైవ శిష్యత ఇత్యుక్తం. విచారేణ జీవజగతో ర్బాధే తదప్రతీత్యా వ్యవహారలోపః ప్రసజ్యేతేత్యాశంక్య బాధశబ్దస్య వివక్షితమర్థం వివక్షే దండం చాహ—నాప్రతీతిరితి. సుషుప్తిమూర్ఛాదౌ స్వత ఏవ ద్వైతప్రతీత్యభావా త్తత్త్వజ్ఞానం వినాపి ముక్తిః స్యాదిత్యర్థః.

టీ. తయోః=ఆజీవజగత్తులకు, బాధః = బాధ యనఁగా, అప్రతీతిః = కనఁబడకుండుట, న = కాదు. కిం తు = మఱేమియనఁగా, మిథ్యాత్వనిశ్చయః=మిథ్యాభూతమైన దనెడి నిశ్చయము, (సత్యము గా దనెడి నిశ్చయ మనుట,) నోచేత్ = అట్లుల గానిచో, జనః = జనము, అయత్నతః = జ్ఞానయత్నములేకయే, సుషుప్తిమూర్ఛాదౌ= గాఢనిద్రయందును మూర్ఛాద్యవస్థలందును, ముచ్యేత = సంసారబంధమునుండి విడుపఁబడవలయును.

తా. బాధ యన్న జీవులును జగత్తును కనఁబడమి గాదు. జీవజగత్తులు రెండును సత్యములు కావనునిశ్చయము. కనఁబడమి యనినచో నిద్రావస్థయందును మూర్ఛాద్యవస్థలయందును స్ఫురింపనంతమాత్రమున ముక్తి వచ్చినదా? లేదు కనుక జీవజగద్రూపబాధ యనఁగా ద్వైతము మిథ్య యనెడి దృఢనిశ్చయమే యగునుగాని స్ఫురింపక పోవుట కాదు. అందుచేత జ్ఞానికి వ్యవహారలోపము లే దని తెలియ వలెను.

శ్లో. పరమాత్మావశేషోఽపి తత్సత్యత్వ వినిశ్చయః,
న జగద్విస్మృతి ర్నో చే జ్జీవన్ముక్తి ర్న సంభవేత్. 14

వ్యా. స్వాత్మైవ శిష్యత ఇత్య నేనాపి పరమాత్మనః సత్యత్వజ్ఞాన మేవ వివక్ష్యతే. నతదతిరిక్తజగద్విస్మృతిః జీవన్ముక్త్యభావప్రసంగాదిత్యాహ—పరమాత్మేతి.

టీ. పరమాత్మావశేషోఽపి=పరమాత్మ యొక్క శేషించుట యనఁగా, తత్సత్యత్వ నిశ్చయః = ఆపరమాత్మ సత్యమైన దగుట యను నిశ్చయము (అగును). జగద్విస్మృతిః = జగత్తును మఱచుట, న=కాదు. నోచేత్ = అట్లు గానిచో, జీవన్ముక్తిః = జీవించినకాలమున ముక్తి గల్గుట, న సంభవేత్ = సంభవింపనేరదు.

తా. పరమాత్మ శేషించు నని చెప్పుటవలన ఆ పరమాత్మ సత్య మనెడి జ్ఞానమే యగునుగాని జగత్తును మఱచియుండుట కాదు. ఇట్లు కానిచో మొదల జీవన్ముక్తి సంభవింపదు. జీవించియుండియే సంసారబంధము నుండి విడువఁబడుట జీవన్ముక్తి యని చెప్పఁబడును.

అవ. విచారణ యెంతవఱకు చేయవలె ననుదాని కవధి చెప్పుచున్నాఁడు:—

శ్లో. పరోక్షా చాపరోక్షేతి విద్యా ద్వేధా విచారజా,
తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోఽయం సమాప్యతే. 15

వ్యా. సదా విచారయేదిత్యుక్త్యా దేహపాతపర్యంతం విచారప్రసక్తౌ సత్యాం తస్యావధిమాహ—పరోక్షేతి.

టీ. విచారజా = విచారణచేయఁగాఁ గలిగిన, విద్యా=జ్ఞానము, పరోక్షా చాపరోక్షేతి = పరోక్ష మనియు నపరోక్ష మనియు, ద్వేధా=రెండువిధములుగా నున్నవి. తత్ర = ఆరెండింటిలో, అపరోక్షవిద్యాప్తౌ = అపరోక్షజ్ఞానము గలిగెనేని, అయం విచారః = ఈవిచారణ, సమాప్యతే = పూర్తియగును.

తా. విచారణ చేయఁగా రెండువిధములుగా జ్ఞానము గలుగు చున్నది. 1. పరోక్షజ్ఞానము, 2. అపరోక్షజ్ఞానము. పరోక్ష మనఁగా నేలోకాంతరముననో యేదేశాంతరముననో పరమాత్మ యున్న దను కొనుట. అపరోక్షజ్ఞాన మనఁగా పరమాత్మ ప్రత్యగభిన్నమైన దనెడి జ్ఞానము. ఇట్టియపరోక్షజ్ఞానము దృఢ మగువఱకు విచారణచేయ వలయు నని యవధి తెల్పఁబడినది.

అవ. ఆ ద్వివిధములయిన పరోక్షాపరోక్షజ్ఞానములస్వరూపము తెల్పఁబడు చున్నది:—

శ్లో. అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞాన మేవ తత్,
అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కార స్స ఉచ్యతే. 16

వ్యా. విచారజన్యావిద్యాపరోక్షత్వాపరోక్షత్వభేదేన ద్వేధేత్యుక్తం. తయో రుభయోః స్వరూపం క్రమేణ దర్శయతి—అస్తి బ్రహ్మేతి.

టీ. బ్రహ్మ = పరబ్రహ్మము, అస్తీతి = ఉన్నదని, వేదచేత్ =సామాన్యముగా తెలిసికొనినచో, తత్ = అది, పరోక్షజ్ఞానమేవ = పరోక్షజ్ఞానమే యగుచున్నది. అహం = నేను, బ్రహ్మేతి = బ్రహ్మమని, వేదచేత్ = తెలిసికొన్నచో, సః = ఆబోధ, సాక్షాత్కారః = అపరోక్షజ్ఞానముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. గురువులకడ శ్రవణము సల్పునెడ వారు మహావాక్యార్థబోధ చేయుదురు. అప్పుడే యధికారికి బ్రహ్మ మనునది యున్న దనెడి జ్ఞాన మేర్పడును. అది పరోక్షజ్ఞాన మగుచున్నది. తరువాత మఱి కొంత మననాదులు బాగుగా చేయను చేయను ఆబ్రహ్మము నేనే యనెడి బ్రహ్మమునకును తనకు నభేదజ్ఞాన మేర్పడుచున్నది. ఇది యపరోక్షజ్ఞాన మనఁబడుచున్నది.

అవ. అపరోక్షజ్ఞానమున కసాధారణకారణ మైన ఆత్మతత్త్వవివేచనమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్సాక్షాత్కారసిద్ధ్యర్థమాత్మతత్త్వం వివిచ్యతే,
యేనాయం సర్వసంసారా త్సద్య ఏవ విముచ్యతే. 17

వ్యా. ఏవంవిధాత్మసాక్షాత్కారాసాధారణకారణమాత్మతత్త్వవివేచనం ప్రతిజానీతే—తత్సాక్షాత్కారేతి. యేన సాక్షాత్కారేణ పుమాన్ సద్య ఏవ విముచ్యతే. తత్సాక్షాత్కారసిద్ధ్యర్థమితి పూర్వేణాన్వయః.

టీ. యేన = ఏయపరోక్షసాక్షాత్కారముచేత, అయం = ఈవిచారణచేయు పురుషుఁడు, సర్వసంసారాత్ = సమస్తమైన సంసారబంధమునుండి, సద్యఏవ = సాక్షాత్కారము గలిగినక్షణముననే, విముచ్యతే = విడువఁబడుచున్నాఁడో, తత్సాక్షాత్కారసిద్ధ్యర్థం = ఆబ్రహ్మసాక్షాత్కారము గలుగుటకొఱకు, ఆత్మతత్త్వం = ఆత్మస్వరూపము, వివిచ్యతే = విశదపఱచి చెప్పఁబడును.

తా. బ్రహ్మయొక్క యేసాక్షాత్కారము గలిగినవెంటనే పురుషుఁడు సంసారబంధమునుండి విముక్తిఁ బొందునో, యట్టిబ్రహ్మసాక్షాత్కార మందఱకు సిద్ధింపఁ జేయుట కిఁక పైగ్రంథములో ఆత్మస్వరూపము చక్కఁగా నిరూపింపఁబడును.

అవ. ప్రత్యగాత్మకు యథార్థముగా నేకత్వము గలుగుటకొఱకు లోకవ్యవహారములోఁ దోఁచెడు చైతన్యభేదమును దృష్టాంతపూర్వకముగా నుడువుచున్నాఁడు:—

శ్లో. కూటస్థో బ్రహ్మజీవేశా విత్యేవం చిచ్చతుర్విధా,
ఘటాకాశమహాకాశౌ జలాకాశాభ్రఖే యథా. 18

వ్యా. చిదాత్మనః పారమార్థికమేకత్వం నిశ్చేతుం వ్యవహారదశాయాం ప్రతీయమానం చైతన్యభేదముద్దిశతి—కూటస్థ ఇతి. ఏకస్యాశ్చితే శ్చాతుర్విధ్యే దృష్టాంతమాహ—ఘటాకాశేతి.

టీ. ఘటాకాశమహాకాశౌ = ఘటాకాశమును, మహాకాశమును, జలాకాశాభ్రఖే = జలాకాశ మేఘాకాశములును, యథా = ఏవిధంబుగా నాలుగు తెఱఁగులుగ నుండెనో, ఏవం = ఈప్రకారము, చిత్ =ఆత్మచైతన్యము, కూటస్థః=కూటస్థుఁ డనియు, బ్రహ్మా = బ్రహ్మ మనియు, జీవేశా = జీవేశ్వరులనియు, చతుర్విధా = నాలుగువిధములుగాఁ దోఁచుచున్నవి.

తా. ఒకటియగు నాకాశము ఘటాకాశము, మహాకాశము, జలాకాశము, మేఘాకాశము నని నాల్గువిధములుగా నున్నట్లు ఆత్మచైతన్యముకూడ కూటస్థుఁ డనియు, బ్రహ్మ మనియు, జీవుఁ డనియు, ఈశ్వరుఁ డనియు నాల్గు విధములుగా వ్యవహారదశలోఁ దోఁచుచున్నది.

అవ. ఘటములోని యాకాశమును, ఘటముతో చేరని యాకాశము అనఁగా మహాకాశమును అందఱు వాడుకచే నెఱింగినవే. ఇవిగాక యందఱికి వాడుకలో తెలియని జలాకాశమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. ఘటావచ్ఛిన్న ఖే నీరం య త్తత్ర ప్రతిబింబితః,
సాభ్రనక్షత్ర ఆకాశో జలాకాశ ఉదీర్యతే. 19

వ్యా. ఘటావచ్ఛిన్నస్య ఘటాకాశస్య తదనవచ్ఛిన్నస్య చ మహాకాశస్య ప్రసిద్ధత్వాత్తౌ విహాయాప్రసిద్ధంజలాకాశంవ్యుత్పాదయతి—ఘటావచ్ఛిన్నేతి. ఘటావచ్ఛిన్నేఆకాశే యదుదకమస్తి తత్ర జలే ప్రతిబింబితోఽభ్రనక్షత్రసహిత ఆకాశో జలాకాశ ఇత్యుచ్యతే.

టీ. ఘటావచ్ఛిన్నఖే = ఘటములోపల నున్న యాకాశమందు, యత్ = ఏ, నీరం = ఉదకముగలదో, తత్ర = ఆయుదకమున, ప్రతిబింబితః = ప్రతిబింబించిన, సాభ్రనక్షత్ర ఆకాశః=మేఘనక్షత్రములతోఁ గూడినయాయాకసము, జలాకాశః = జలాకాశ మని, ఉదీర్యతే = చెప్పఁబడుచున్నది.

తా. ఘటములోని యాకాశమం దేనీరు గలదో, యానీటిలోఁ బ్రతిబింబించినట్టి మేఘనక్షత్రములతోఁ గూడిన యాకాశమును జలాకాశ మని చెప్పుచున్నారు.

అవ. జలాకాశస్వరూపముం జెల్పి మేఘాకాశముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. మహాకాశస్య మధ్యే యన్మేఘమండల మీక్ష్యతే,
ప్రతిబింబతయా తత్ర మేఘాకాశో జలే స్థితః. 20

వ్యా. అభ్రాకాశం వ్యుత్పాదయతి—మహాకాశస్యేతి. తత్ర మేఘమండలే యజ్జలం తస్మిన్నిత్యర్థః.

టీ. మహాకాశస్య = ఘటాదిసంబంధము లేనిమహాకాశముయొక్క, మధ్యే = నడుమను, యత్ = ఏ. మేఘమండలం = మేఘసముదాయము, ఈక్ష్యతే = చూడఁబడునో, తత్ర=ఆమేఘమండలమందలి, జలే = నీటియందు, ప్రతిబింబతయా = ప్రతిఫలించుటచేత, స్థితః = ఉండిన యాకసము, మేఘాకాశః=మేఘాకాశ మనఁబడును.

తా. మహాకాశమునందలి మేఘమండలములో నుండు జలమందుఁ బ్రతిఫలించినయాకాశము మేఘాకాశ మనఁబడుచున్నది.

అవ. మేఘమం దున్నజలము మనకుఁ దెలియనప్పుడు ఆజలమందాకాశముం బ్రతిఫలించిన దని యెఱుంగు టెట్లు? అను శంకకు సమాధానము జెప్పుచున్నాఁడు:—

శ్లో. మేఘాంశరూపముదకం తుషారాకారసంస్థితం,
తత్ర స్వప్రతిబింబోఽయం నీరత్వా దనుమీయతే. 21

వ్యా. నను మేఘజలస్యాప్రతీయమానత్వాన్నభసస్తత్ర కథం ప్రతిబింబితత్వజ్ఞానమిత్యాశంక్యాహ—మేఘాంశేతి. మేఘస్థజలస్య ప్రత్యక్షేణానుపలంభేఽపి వృష్టిలక్షణకార్యేణ మేఘే తదుపాదాన ముదకం సూక్ష్మావయవరూప మస్తీత్యనుమీయతే. ఉదకత్వేనైవ లింగేన ప్రతిబింబవత్త్వమపి. వివుతం జలం ఆకాశబింబవద్భవితుమర్హతి జలత్వాత్. ఘటగతజలవదిత్యనుమానేన మేఘాంశరూపే జలేఽప్యాకాశప్రతిబింబవద్భావోఽవగమ్యత ఇత్యర్థః.

టీ. మేఘాంశరూపం = మేఘమునందు అంశరూపమైన, (సూక్ష్మావయవరూప మనుట), ఉదకం=నీరు, తుషారాకారసంస్థితం - తుషార=మంచునీటియొక్క, ఆకార = ఆకారమువంటియాకారముతోడ, సంస్థితం = ఉన్నది. తత్ర = ఆమేఘమందు, నీరత్వాత్ =నీటిస్వభావముబట్టి, అయంస్వప్రతిబింబః=ఈతన ప్రతిబింబము, ఆకాశప్రతిబింబ మనుట, అనుమీయతే = అనుమాన ప్రమాణముచేతఁ దెలియఁబడుచున్నది.

తా. మేఘములోని జలమును మనము చూడలేకపోయినను, వర్షించుట యనుకార్యముచేత వర్షమునకుఁ గారణమైన జలము మంచువలె సూక్ష్మరూపముగా నుండి యుండవచ్చు నని యూహింప వచ్చును. కారణము లేనిది కార్యము పుట్టదు గదా. మేఘమందు సూక్ష్మరూపముగా జలము లేనిది వర్ష మెటుల సంభవించు నని యనుమాన ప్రమాణముచేత నెఱుంగవచ్చును. ఊహింపవచ్చు ననుట. నీటిని యూహించి యెపుడు తెలిసికొంటిమో నీటిస్వభావమును బట్టి యాకాశము అందు ప్రతిబింబించుట గూడ నాయనుమానప్రమాణముచేతనే తెలియఁబడు నని భావము.

అవ. దృష్టాంతముగా తీసికొనిన యాకాశచతుష్టయమును స్పష్టపఱచి దార్ష్టాంతిక మందలి కూటస్థుఁడు మొదలగునాల్గింటిలో మొదటికూటస్థశబ్దమున కర్థంబును దానికి నిర్వచనమునుం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అధిష్ఠానతయా దేహద్వయావచ్ఛిన్నచేతనః,
కూటవన్నిర్వికారేణ స్థితః కూటస్థ ఉచ్యతే. 22

వ్యా. ఏవందృష్టాంతభూతమాకాశచతుష్టయం వ్యుత్పాద్యదార్ష్టాంతికే ప్రథమోద్దిష్టం కూటస్థం వ్యుత్పాదయతి—అధిష్ఠానేతి. పంచీకృతాపంచీకృత భూతకార్యత్వేన స్థూలసూక్ష్మరూపస్య దేహద్వయస్యావిద్యాకల్పితస్యాధారతయా వర్తమానత్వేన తాభ్యామవచ్ఛిన్నఆత్మా కూటస్థ ఇత్యుచ్యతే. తత్ర కూటస్థశబ్దప్రవృత్తౌ నిమిత్తమాహ—కూటవదితి.

టీ. దేహద్వయావచ్ఛిన్నచేతనః - దేహద్వయ=స్థూలసూక్ష్మరూపము లయిన రెండు శరీరములతోడను, అవచ్ఛిన్న=చేరియున్న, చేతనః=ఆత్మచైతన్యము, అధిష్ఠానతయా=ఆధారముగానుండుటచేత, కూటవత్ = బంగారు వెండిమొదలగు సొమ్ములు చేయుచునపుడాధారముగా నుండునట్టియినుప దాగలివలె, నిర్వికారేణ = ఏవిధమైన వికారముఁ జెందకుండ (మారకుండ ననుట), స్థితః = ఉండువాఁడు గనుక, కూటస్థః = కూటస్థుఁ డని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. స్థూలశరీరము, సూక్ష్మశరీరము అనెడి రెండుదేహములును అవిద్యచే కల్పింపఁ బడినవి. అందు మొదటిస్థూలదేహము పంచీకృతభూతములకార్యము. రెండవది యగు సూక్ష్మశరీరము అపంచీకృతములైన భూతములకార్యము. పై రెండు శరీరములతోఁ గూడుకొన్న

యాత్మచైతన్యము, వాని కాధార మగు కంసాలియింటిలో వెండి బంగారు సొమ్ములు చేయుట కాధారమగుదాగలివలె నేవికారముం జెందక యుండునదిగాన కూటస్థుఁ డనఁబడుచున్నది. అనఁగా కూటము వలె నిర్వికారముగా నుండునదిగాన కూటస్థుఁ డని నిర్వచనము చేయఁ బడుచున్నది.

అవ. వైవిధముగా కూటస్థశబ్దమును నిర్వచించి, యాకూటస్థునియందు బుద్ధి కల్పింపఁబడెను; అట్టిబుద్ధియందుఁ బ్రతిఫలించినవాఁడు గనుక నాకూటస్థునిలోఁ జేరిక యైనవాఁడే జీవుఁడుగాన జీవస్వరూపమును జీవశబ్దమునకు నిర్వచనముఁ జెప్పు చున్నాఁడు:—

శ్లో. కూటస్థే కల్పితా బుద్ధిస్తత్ర చిత్ప్రతిబింబకః,
ప్రాణానాం ధారణాజ్జీవస్సంసారేణ స యుజ్యతే. 23

వ్యా. ఏవం కూటస్థం వ్యుత్పాద్య జీవస్య కూటస్థకల్పితబుద్ధిప్రతిబింబకత్వేన తత్సమీపాలితాత్తం వ్యుత్పాదయతి—కూటస్థ ఇతి. తస్య జీవశబ్దాభిధేయత్వే నిమిత్త మాహ—ప్రాణానామితి. కూటస్థాతిరిక్తజీవకల్పనమప్రయోజక మిత్యాశంక్య, అవికారిణః కూటస్థస్య సంసారాసంభవవాత్తన్నిర్వాహార్థం సోఽంగీకర్తవ్య ఇత్యాహ— సంసారేణేతి.

టీ. కూటస్థే=కూటమువలె నిర్వికారమైనచైతన్యమందు, బుద్ధిః=బుద్ధి, కల్పితా= కల్పింపఁబడినది. తత్ర = ఆబుద్ధియందు, చిత్ప్రతిబింబకః = కూటస్థచైతన్యముయొక్క ప్రతిబింబరూపము గలవాఁడు, అనఁగా చిదాభాసుఁ డనుట. ప్రాణానాం = ప్రాణాదులను, ధారణాత్ = ధరించుటవలన, జీవః = జీవుఁడు, (స్యాత్ = అగును.) సః = ఆజీవుఁడు, సంసారేణ = సంసారముతో, యుజ్యతే = సంబంధమును బొందు చున్నాఁడు.

తా. కూటస్థునియందు బుద్ధి కల్పింపఁబడి యాబుద్ధియందు కూటస్థునిప్రతిబింబమైనచిదాభాసుఁడు జీవుఁ డని వ్యవహరింపఁ బడుచు చున్నాఁడు గనుక జీవశబ్దమునకు వ్యుత్పత్తి ప్రాణముల ధరించుటవలన నని చెప్పఁబడియె. ఆకూటస్థునికంటె వేఱుగా జీవుఁ డనునామాంతర మేల గలిగె ననఁగా కూటస్థుఁడు నిర్వికారుఁడు గనుక వానికి సంసార ముండుట సంభవింపనేరదు. చిత్ప్రతిబింబితుఁడై చిదాభాసుఁ డనఁ బడు జీవుఁడే సంసారమును బొందుచున్నాఁడు.

అవ. కూటస్థుఁ డని జీవునికంటె వే ఱొకఁ డున్నచో నతఁ డేల తెలియఁ బడఁడో చెప్పు మనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. జలవ్యోమ్నా ఘటాకాశో యథా సర్వ స్తిరోహితః,
తథా జీవేన కూటస్థ స్సోఽన్యోన్యాధ్యాస ఉచ్యతే. 24

వ్యా. నను జీవాతిరిక్తః కూటస్థోఽస్తి చేత్కిమితి న ప్రతిభాసత ఇత్యాశంక్య జీవేన తిరోహితత్వాదితి సదృష్టాంతమాహ—జలేతి. నన్వేత త్తిరోధానం న క్వాపి శాస్త్రే ప్రతిపాదితత్యాశంక్య తస్యాన్యోన్యాధ్యాసశబ్దేనాభిధానాన్నైవ మిత్యాహ— అన్యోన్యాధ్యాస ఇతి. ఉచ్యతే భాష్యాదిష్వితి శేషః.

టీ. జలవ్యోమ్నా = జలాకాశముచేత, ఘటాకాశః = ఘటమందలి యాకాశము, సర్వః = అంతయును, యథా = ఏవిధముగా, తిరోహితః = కప్పఁబడినదో, తథా = అదేవిధమున, జీవేన = జీవునిచేత, కూటస్థః = కూటస్థాత్మయు, (తిరోహితుఁడయ్యె ననుట). సః = అవిధమగు తిరోధానము, అన్యోన్యాధ్యాసః - అన్యోన్య=పరస్పరమైన అధ్యాసః = అధ్యాస మని, ఉచ్యతే = శాస్త్రములయందుఁ జెప్పఁబడుచున్నది.

తా. ఘటాకాశము జలాకాశముచేఁ గప్పఁబడినతీరున జీవుని చేతఁ గూటస్థుఁడును గ్రమ్మఁబడినాఁడు. అందువలన ఈసంగతి (యన్యోన్యాధ్యాస) తెలియఁబడుట లేదు. అని బ్రహ్మసూత్ర భాష్యాదిశాస్త్రములలో వెల్లడింపఁబడియున్నది.

అవ. ఈయధ్యాసకుఁ గారణ మవిద్యయే. అవిద్య యనఁగా జీవునకును కూటస్థునకును సంసారదశలో భేదము తోఁపమియే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అయం జీవో న కూటస్థం వివినక్తి కదాచన,
అనాది రవివేకోఽయం మూలావిద్యేతి గమ్యతామ్. 25

వ్యా. నన్వయమేవాధ్యాసశ్చేదస్య కారణరూపాఽవిద్యా వక్తవ్యేత్యాశంక్య జీవ కూటస్థయోః సంసారదశాయాం భేదాప్రతీతిరేవ అవిద్యేత్యాహ—అయమితి.

టీ. అయం జీవః = ఈజీవుఁడు (చిదాభాసుఁడు) కదాచన = ఎన్నఁడును, కూటస్థం = కూటస్థుని, న వివినక్తి = వేఱుగా నున్న ట్లెఱుఁగఁడు. అనాదిః=ఆదిలేని, అయం అవివేకః = ఈయవివేకము, మూలావిద్యేతి = మూలాజ్ఞాన మని, గమ్యతాం= తెలియఁబడుఁగాక. తెలిసికొనఁదగు ననుట.

తా. చిదాభాసుఁ డనఁబడెడి యీజీవుఁ డెన్నఁడును కూటస్థుఁడు తనకంటె వేఱుగా నున్న ట్లెఱుంగఁడు. అనాది యగు యీయెఱుఁగక పోవుటయే అవివేకము (అవిద్య) అని చెప్పఁబడును. ఈ యవివేకమే

సంసారకారణ మని తెలియవలెను. అనఁగా, జీవకూటస్థులకు సంసార దశయందు భేదప్రతీతి లేమియే అవిద్య యని యభిప్రాయము.

అవ. ఈయవిద్యాకల్పితుఁడు జీవుఁడు, జీవత్వము తెలియవలె నంటే యవిద్యా స్వరూపమును తెలియవలెను. అది విక్షేపావరణరూపమై యున్నది. విక్షేపమున కావర ణమే కారణము. గావున ముందు ఆవరణరూపావిద్యను దెల్పుచున్నాఁడు:—

శ్లో. విక్షేపావృతిరూపాభ్యాం ద్విధాఽవిద్యా వ్యవస్థితా,
న భాతి నాస్తి కూటస్థ ఇత్యాపాదనమావృతిః. 26

వ్యా. పూర్వోక్తస్య జీవస్య అవిద్యాకల్పితత్వస్య స్పష్టీకరణాయ అవిద్యాం విభజతే విక్షేపహేతుత్వేనాభ్యర్హితత్వాదావృతిం ప్రథమం లక్షయతి—న భాతీతి. కూటస్థో న భాతి న ప్రకాశతే నాస్తి చేతి వ్యవహారహేతురావరణమిత్యర్థః.

టీ. అవిద్యా = అవిద్య, విక్షేపావృతిరూపాభ్యాం = విక్షేపరూపముచేతను, ఆవరణరూపముచేతను, ద్విధా=రెండు విధములుగా, వ్యవస్థితా=వర్తించుచున్నది. కూట స్థః = కూటస్థుఁడు, నాస్తి = లేఁడు, న భాతి = ప్రకాశింపఁడు, ఇతి = అని, ఆపా దనం = అనుటకుఁగారణమైనది, ఆవృత్తిః = ఆవరణము, (స్యాత్ = అగును.)

తా. అవిద్య విక్షేపావరణము లనెడి రెండువిధములుగా నున్నది. కూటస్థుఁడు లేఁడు, ప్రకాశింపఁ డనుట కిదియే కారణము. ఆవరించి కూటస్థుని మఱుగుపఱచినది గనుక ఆవరణ మని దీనికి సార్థకనామ మేర్పడినది.

అవ. అవిద్యయు, అవిద్యవలనం గలిగిన యావరణమును రెండునుం గల వని నీ కెట్లు దెలియును అనుశంకకు లోకానుభవమువల్లనే తెలియు నని సమాధానము చెప్పు చున్నాఁడు:—

శ్లో. అజ్ఞానీ విదుషా పృష్టః కూటస్థం న ప్రబుధ్యతే,
న భాతి నాస్తి కూటస్థ ఇతి బుద్ధ్వా వదత్యపి. 27

వ్యా. నన్వవిద్యాయాస్తత్కృతావరణస్య చ సద్భావే కిం ప్రమాణ మిత్యా శంక్య లోకానుభవ ఏవేత్యాహ—అజ్ఞానీతి. విదుషా కూటస్థం కిం జానాసీతి పృష్టో ఽజ్ఞానీ తం న జానామీత్యజ్ఞానమనుభూయ వక్తి, అయమవిద్యానుభవః. న కేవల మజ్ఞానానుభవమేవ వక్తి అపితు నాస్తి న భాతి కూటస్థ ఇతి కూటస్థాభావాభావే చానుభూయ వదతి. అయమావరణానుభవః. అత ఉభయత్రానుభవః ప్రమాణ మితి భావః.

టీ. అజ్ఞానీ = జ్ఞానములేనివాఁడు, విదుషా = జ్ఞానిచేత, కూటస్థం = కూటస్థాత్మనుగూర్చి, పృష్టః = అడుగఁబడినవాఁడై, న ప్రబుధ్యతే=ఆకూటస్థుని నే నెఱుఁగను అని యుత్తరము చెప్పుచున్నాఁడు. కూటస్థ = కూటస్థుఁడు, న భాతి=ప్రకాశింపఁడు, నాస్తి = లేఁడు, ఇతి = ఈప్రకారంబుగా, బుద్ధ్వాపి=ఆ అజ్ఞానానుభవముఁదెలిసియు, వదతి = ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు.

తా. జ్ఞాని అజ్ఞానిని నీవు కూటస్థు నెఱుఁగుదువా యని యడిగి నప్పుడు ఆ అజ్ఞాని నేను కూటస్థుని గుఱ్తెఱుఁగ నని బదులు చెప్పును. ఎఱుఁగ నని చెప్పుట యజ్ఞాన మనుభవించి చెప్పుటయే. అజ్ఞానానుభవ మిట్టిదే. ఇదియునుంగాక కూటస్థుఁడు లేఁడు, ప్రకాశింపఁ డని కూడ చెప్పుచున్నాఁడే. ఇదియే ఆవరణానుభవము గల్గియున్నందుకు సాక్ష్యము. అవిద్యావరణములు రెండు గలవనుటలో నిట్టి యనుభవమే సాక్ష్యము.

అవ. మీయద్వైతమతములో ఆత్మ స్వయంప్రకాశస్వరూప మందురు. అందవిద్యయుండుట సంభవింపదు కదా. చీకటి వెల్తురు ఒకచోట నుండుట సంభవించునా? సంభవింపదు. అట్లవిద్యయే లేకపోవుచుండ నవిద్యాకార్యమగు నావరణముండుటయు మొదలే సంభవింపదు. ఎప్పు డవిద్యావరణములు రెండును లేవో విక్షేప మనునదియు లేకపోవలసివచ్చును. ఇట్లవిద్యావరణవిక్షేపములు ఎపుడు లేకుండెనో జ్ఞానముచేఁ బోఁగొట్టుకొనం దగిన సంసార మనియెడియనర్థమును లేదు. కాన జ్ఞానముతోఁ బని లేదు కనుక జ్ఞానప్రతిపాదకశాస్త్రముతోఁ గూడం బనిలేదు. అని యిం మొదలగునాక్షేపము లెన్నియో వచ్చును. ఈయాక్షేపములన్నియుం బైనఁజెప్పఁబడిన యనుభవముచేతనే వారింపఁబడుచున్న వని సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వప్రకాశే కుతోఽవిద్యా తాం వినా కథమావృతిః,
ఇత్యాదితర్కజాలాని స్వానుభూతిర్గ్రసత్యసౌ. 28

వ్యా. నను, భవన్మతే ఆత్మనః స్వప్రకాశత్వా త్తస్మిన్నవిద్యా నోపపద్యతే. తేజస్తిమిరయోరివ విరుద్ధస్వభావత్వేన తయోః సంబంధానుపపత్తేరవిద్యాభావే చ తత్కార్యభూతమావరణం దుర్నిరూప్యం స్యాత్తదభావే చ తన్మూలకస్య విక్షేపస్యాసంభవః. విక్షేపాభావేన జ్ఞాననివర్త్యస్యానర్థస్యాభావాత్. జ్ఞానవైయర్థ్యం తత్ తత్ప్రతిపాదకం శాస్త్రమప్రమాణం స్యాదిత్యాశంక్యైతత్సర్వం పూర్వోక్తానుభవబాధితమిత్యాహ— స్వప్రకాశ ఇతి. న హి దృష్టేఽనుపపన్నం నామేతి న్యాయాదితి భావః.

టీ. స్వప్రకాశే=స్వయముగాఁ బ్రకాశించెడి ఆత్మయందు (కూటస్థునియందు) అవిద్యా=అజ్ఞానము, కుతః=ఎట్లుగా నుండును? (ఉండదనుట), తాం వినా=అయవిద్య లేక, ఆవృతిః = ఆవరణము, కథం = ఎట్లుండును? (ఉండ దనుట). ఇత్యాది తర్కజాలాని = ఈ మొదలయిన యాక్షేపములను, అసౌ స్వానుభూతిః = ఈ తమ యవిద్యానుభవము, గ్రసతి = అణఁచివేయుచున్నది.

తా. స్వయముగాఁ బ్రకాశించెడి కూటస్థునియం దవిద్య యుండుట యసంభవము. వెలుఁగువంటిది ఆత్మ. చీఁకటివంటిది అవిద్య. ఈ రెండింటికిని ఏకత్రస్థితి కుదురదు. అవిద్య లేకపోఁగా దానివలన నేర్పడినయావరణము లేకపోవును. ఇఁకను ఆదిశబ్దముచేత వచ్చెడు నాక్షేపములు, వానివలనఁ గల్గిన విక్షేపము, విక్షేపమువలనఁ గలిగిన సంసారదుఃఖమును లేకపోవుచుండఁగా జ్ఞానసంపాదన మనావశ్యక మగుచున్నది. అటుపైని జ్ఞానమును బ్రతిపాదించెడి తత్త్వశాస్త్రము నిష్ప్రయోజనము కావలసివచ్చు నని యీ మొదలగునాక్షేపముల నన్నింటిని అవిద్యానుభవమును పైన నిరూపించియుంటిమి కదా. ఆ యనుభవ ముండియుండఁగా లే దనరా దని "న హి దృష్టేఽనుపపన్నం నామ" యను న్యాయము బోధించుచున్నది.

అవ. తన యనుభవమందు విశ్వాసము లేనివానికి తత్త్వనిశ్చయము గలుగఁ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వానుభూతావవిశ్వాసే తర్కస్యాప్యనవస్థితేః,
కథం వా [1]తార్కికస్తస్య తత్త్వనిశ్చయమాప్నుయాత్. 29

వ్యా. నన్వనుభవస్యోక్తతర్కవిరోధేనాభాసత్వాన్న తేన తత్త్వనిశ్చయ ఇత్యాశంక్య అనుభవప్రామాణ్యానభ్యుపగమే కేవలతర్కస్య నిశ్చాయకత్వస్య స్వేనైవానభ్యుపగతత్వాన్న తార్కికస్య తత్త్వనిశ్చయః క్వాపి స్యాదిత్యాహ—స్వానుభూతావితి.

టీ. స్వానుభూతౌ = తనయనుభవమందు, అవిశ్వాసే = విశ్వాసము లేనప్పుడు, తర్కస్యాపి = ఆక్షేపణలకును, అనవస్థితేః = హద్దులేకపోవుటవలన, తస్య = ఆయాత్మస్వరూపముయొక్క, తత్త్వనిశ్చయం = స్వరూపనిశ్చయమును, తార్కికః = తర్కము

1. పాఠాంతరం - తార్కికంమన్యః = తార్కికాభిమాని.

చేయువాఁడు (ఆక్షేపణ లెక్కువగాఁ జేయువాఁడనుట). కథం వా = ఏప్రకారముగా, ఆప్నుయాత్ =పొందఁగలఁడు? తత్త్వనిశ్చయమును పొందఁ జాలఁ డనుట.

తా. తన యనుభవముమీఁద విశ్వాసము లేక యూరక కుతర్కములుగా పెడవాదములు చేయఁబోడఁగినచోఁ దత్త్వస్వరూపము దెలియఁబడ దని యెఱుంగవలెను.

అవ. తఱచినఁగాని వెన్నరా దన్నట్లు తన సందేహనివృత్తికొఱకుఁ దర్కింపఁ గూడదా యనినచో ననుభవమునకు విరుద్ధముగా లేనిపోని కుశంకలు చేయరా దను చున్నాము గాని శంకింపవల దని చెప్పుట లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధ్యారోహాయ తర్కశ్చే దపేక్ష్యేత తథా సతి,
స్వానుభూత్యనుసారేణ తర్క్యతాం మా కుతర్క్యతామ్. 30

వ్యా. నన్వనుభవః తత్త్వనిశ్చాయక ఏవ. తథాప్యనుభూయమానస్యార్థస్య సంభావితత్వజ్ఞానాయ తర్కోఽప్యభ్యుపేతవ్య ఇత్యాశంకామనూద్య తర్హ్యనుభవానుసారేణైవ తర్కో వర్ణనీయో న తద్విరోధేనేత్యాహ—బుద్ధ్యారోహాయేతి.

టీ. బుద్ధ్యారోహాయ = విషయము బుద్ధియం దెక్కుటకు, తర్కః = తర్కించుట, అపేక్ష్యేత చేత్ = ఆవశ్యక మని తలంపఁబడినచో, తథాసతి = అట్లైనయెడల, స్వానుభూత్యనుసారేణ=తన యనుభవానుసారముగా, తర్క్యతాం = తర్కింపనగును, మా కుతర్క్యతాం=కుశంకలు చేయఁజనదు. అనుభవవిరుద్ధముగా శంకింపరా దనుట.

తా. విషయము బుద్ధికి గోచరించుటకు వాదించినను, అనుభవానుసారముగా వాదింపవలెఁ గాని, లేనిపోనికుశంకలు చేయఁ గూడదు.

అవ. తర్కింపవలసినరీతి యిది యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వానుభూతి రవిద్యాయా మావృతౌ చ ప్రదర్శితా,
అతః కూటస్థచైతన్యమవిరోధీతి తర్క్యతామ్. 31

వ్యా. కోఽసావనుభవో యదనుసారేణ తర్కో వర్ణనీయ ఇత్యాకాంక్షాయాం పూర్వోక్తమవిద్యాదిగోచరమనుభవం స్మారయతి—స్వానుభూతిరితి. ఫలితమాహ—అత ఇతి.

టీ. అవిద్యాయాం = అవిద్యయందును, ఆవృతౌ చ = ఆవరణమందును, స్వానుభూతిః = తనయనుభవము, ప్రదర్శితా = తెలుపఁబడినది. అతః = పైతెల్పఁబడి

నదిగనుక, కూటస్థచైతన్యం=కూటస్థచైతన్యము, అవిరోధీతి=అవిద్యతో విరోధింపని దని, తర్క్యతాం = తర్కింపవచ్చును.

తా. అవిద్యావరణముల రెండింటివిషయమై తనయనుభవమును నిరూపించియుంటిమి. కాఁబట్టి కూటస్థచైతన్యమునకును అవిద్యకు విరోధము లే దని తర్కింపవచ్చును.

అవ. అవిద్యకు విరోధి విద్య యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తచ్చే ద్విరోధి కేనేయమావృతిర్హ్యనుభూయతాం,
వివేకస్తు విరోధీ స్యాత్తత్త్వజ్ఞానిని దృశ్యతామ్. 32

వ్యా. తమేవ తర్కమభినీయ దర్శయతి—తచ్చేదితి. అవిద్యావరణసాధక చైతన్యస్యైవ తద్విరోధిత్వేఽవిద్యాప్రతీతిరేవ న స్యాదితి భావః. తర్హ్యవిద్యాయాః కో విరోధిత్యత ఆహ—వివేక ఇతి. వివేక ఉపనిషద్విచారజన్యం జ్ఞానం వివేకస్య అవిద్యావిరోధిత్వం క్వ దృష్టమిత్యత ఆహ—తత్త్వజ్ఞానినీతి.

టీ. తత్ = (కూటస్థచైతన్యము), విరోధి చేత్ = అవిద్యకు విరోధియైనచో, కేన = దేనిచేత, ఇయం = ఈ, ఆవృతిః = ఆవరణము, అనుభూయతాం హి = అనుభవింపఁబడును. (మఱియొకదానిచే ననుభవింపఁ బడ దనుట) వివేకస్తు=వివేక మనిననో, విరోధీ = అవిద్యకు విరోధి, స్యాత్ = అగును. తత్త్వజ్ఞానిని - తత్త్వ = ఆత్మస్వరూపముయొక్క, జ్ఞానిని=జ్ఞానముగలవానియందు, దృశ్యతాం=తెలియఁబడుఁగాక.

తా. అవిద్యకు కూటస్థచైతన్యము విరోధి యయ్యె నేని అవిద్య కూటస్థుని నాశ్రయించియుండదు. అప్పు డావరణముయొక్క యనుభవ మెవనిచేతను ననుభవింపఁబడుటకును వీ లుండదు. అజ్ఞానియం దావరణానుభవము గన్పడుచున్నది. కనుక కూటస్థచైతన్యమునకు నవిద్యకును విరోధము లేకుండుట స్పష్టము. మఱి యవిద్యకు విరోధి వివేకము (విద్య) తత్త్వజ్ఞునియందు అవిద్య లేకపోవుట యను అనుభవముచేత, నీచెప్పఁబడినయంశము నిర్వివాదముగా ననుభూత మనుటకు సందియము లే దని భావము.

అవ. అవిద్యావరణాధ్యాసములం జెప్పి విక్షేపాధ్యాసమును దెల్పుచున్నాఁడు:-

శ్లో. అవిద్యావృతకూటస్థే దేహద్వయయుతా చితిః,
శుక్తౌ రూప్యవదధ్యస్తా విక్షేపాధ్యాస ఏవ హి, 33

వ్యా. ఏవ మవిద్యావరణే దర్శయిత్వా విక్షేపాధ్యాసమాహ—అవిద్యేతి. పూర్వోక్తావిద్యావరణవతి కూటస్థే ప్రత్యగాత్మన్యారోపితః స్థూలసూక్ష్మశరీరసహిత శ్చిదాభాసో విక్షేపాధ్యాస ఇత్యర్థః.

టీ. అవిద్యావృతకూటస్థే - అవిద్యావృత = అవిద్యావరణములు గలిగిన, కూటస్థే = కూటస్థునియందు (ప్రత్యగాత్మయందు), శుక్తౌ = ముత్తెపుఁజిప్పయందు, రూప్యవత్ =వెండివలెను, అధ్యస్తా = ఆరోపింపఁబడిన, దేహద్వయయుతా = స్థూలసూక్ష్మములనెడి రెండుశరీరములతోఁ గూడియున్న, చితిరేవ=చైతన్యమే, (చిదాభాసుఁ డనుట.) విక్షేపాధ్యాసో హి = విక్షేప మను పేరుగల యధ్యాసముగదా.

తా. శుక్తియందు రజతము భ్రాంతిచే నారోపింపఁబడినట్లు అవిద్యావరణములు గల కూటస్థునియందు స్థూలసూక్ష్మము లనెడి రెండుశరీరములు గల చిదాభాసుఁ డారోపింపఁబడెను. విక్షేపాధ్యాస మనఁగా నీచిదాభాసుఁడే యగు నని యెఱుంగవలెను.

శ్లో. ఇదమంశస్య సత్యత్వం శుక్తిగం రూప్య ఇష్యతే,
స్వయంత్వం వస్తుతా చైవం విక్షేపే వీక్ష్యతేఽన్యగమ్. 34

వ్యా. అస్య విక్షేపస్యాధ్యాసత్వసిద్ధయే శుక్తిరజతాధ్యాససామ్యం దర్శయతి- ఇదమంశస్యేతి. శుక్తికాయాం స్థితం పురోదేశాదిసంబంధిత్వమబాధ్యత్వం చ యథాఽరోపితే చ రజతేఽవభాసతే, ఏవం స్వయంత్వం వస్తుత్వం చ కూటస్థనిష్ఠమారోపితే చిదాభాసేఽవభాసత ఇత్యర్థః.

టీ. శుక్తిగం = ముత్తెపుఁజిప్పయందున్న, అంశస్య = అంశముయొక్క, ఇదం= ఇదంత్వమును, సత్యత్వం=సత్యతయును, రూప్యే = వెండియందు, ఇష్యతే = అంగీకరింపఁబడుచున్నది. ఏవం = ఈవిధమైన, స్వయంత్వం = కూటస్థునిస్వయంత్వమును, (తా నసెడిభావ మనుట.) వస్తుతా చ = వస్తుత్వమును, విక్షేపే = విక్షేపదశయందు, అన్యగం = చిదాభాసునియం దున్నట్లు, వీక్ష్యతే=చూడఁబడు చున్నది.

తా. ముత్తెపుఁజిప్పను జూచి యొకఁడు భ్రాంతిచేత ఇది వెండి యని చెప్పును. అప్పుడు ముత్తెపుఁజిప్పయం దిది యనెడి ఇదంత్వమును సత్యతయు బాధింపఁబడకుండుట యనుట వాస్తవముగా నుండఁగా నా రెండును దానియం దారోపింపఁబడిన వెండియందు తోఁచినపగిది యథార్థముగా కూటస్థునియందలి స్వయంత్వమును వస్తుత్వమును కూటస్థునియందు విక్షేపముచే కల్పితుఁడైన చిదాభాసునియందును గనఁబడుచున్నవి.

అవ. పైశ్లోకమున దృష్టాంతదార్ష్టాంతికములు రెండింటియందును సామాన్యాంశము ఆరోపితమందుఁ దోఁచుటను దెల్పి విశేషాంశము కూడ దృష్టాంతదార్ష్టాంతికముల యందుఁ దోఁచుటను గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. నీలపృష్ఠత్రికోణత్వం యథా శుక్తౌ తిరోహితం,
అసంగానందతాద్యేవం కూటస్థేఽపి తిరోహితమ్. 35

వ్యా. ఏవం సామాన్యాంశప్రతీతిముభయత్ర ప్రదర్శ్య విశేషాంశాప్రతీతి సామ్యం దర్శయతి—నీలేతి.

టీ. శుక్తౌ = ముత్తెపుఁజిప్పయందు, నీలపృష్ఠత్రికోణత్వం - నీల = నల్లగా నుండుటయు, పృష్ఠ=వెనుకటిభాగమును, త్రికోణత్వం = ముక్కోణములు తీరియుండుటయు, యథా = ఏవిధముగా, తిరోహితం = తెలియకుండఁ గప్పఁబడియుండెనో, ఏవం = ఈప్రకారము, అసంగానందతాది = అసంగత్వము ఆనందత్వము పరిపూర్ణత్వము మొదలగునవి, కూటస్థేఽపి = కూటస్థునియందును, తిరోహితం = తెలియకుండఁ గప్పఁబడినవి.

తా. దృష్టాంత మైనము త్తెపుఁజిప్పలోని నల్లఁదనమును, మూఁడు కోణములు గలిగియుండుటయు వెనుకటిభాగమును వెండియందుఁ దోఁచనట్లు దార్ష్టాంతికమైన కూటస్థునియందలి అసంగత్వమును ఆనందత్వమును ఆదిశబ్దముచేఁ బరిపూర్ణత్వమును మొదలయిన విశేషాంశములు చిదాభాసునియందు కనఁబడకుండ మఱుగుపడియున్న వని తెలియవలెను.

అవ. ఈవిషయమున నింకొక సాదృశ్యముం జూపుచున్నాఁడు:—

శ్లో. ఆరోపితస్య దృష్టాంతే రూప్యం నామ యథా తథా,
కూటస్థాధ్యస్తవిక్షేపనామాహ మితి నిశ్చయః. 36

వ్యా. సామ్యాంతరం దర్శయతి—ఆరోపితస్యేతి. దృష్టాంతే శుక్తిస్థలే ఆరోపితపదార్థస్య రూప్యమితి నామ యథా ఏవం కూటస్థే కల్పితస్య చిదాభాసరూపవిక్షేపస్య పూర్వోక్తస్యాహమితి నామేత్యర్థః.

టీ. దృష్టాంతే = సాదృశ్యమునందు (శుక్తియందు) ఆరోపితస్య = ఆరోపింపఁబడినదానికి, రూప్యం=వెండియనెడు, నామ = పేరు, యథా = ఏవిధముగాఁ గలిగెనో, తథా = ఆవిధముననే (దార్ష్టాంతికమందుననుట.) కూటస్థాధ్యస్తవిక్షేపనామ-కూటస్థ= ప్రత్యగాత్మయందు, అధ్యస్త=ఆరోపించఁబడిన, విక్షేప = చిదాభాసరూపముయొక్క, నామ=పేరు, అహమితి=నే నని, నిశ్చయః=వ్యవహారము గలదగుచున్నది.

తా. శుక్తికాస్థలమునందుఁ గల్పితమైన పదార్థమునకు వెండి యనుపేరు గల్గినట్లు దార్ష్టాంతికస్థలమైన ప్రత్యగాత్మయందుఁ గల్పితుఁడైనచిదాభాసునిపేరు 'అహం' (నేను) అని చెప్పుదురు. *

అవ. ఎదుట నున్న ముత్యపుఁజిప్పకును మన నేత్రేంద్రియమునకును సంబంధము గలుగఁగానే యిది వెండి యని శుక్తికంటె వేఱుగా వెండి యను నభిమానము గలిగినట్లు దార్ష్టాంతికమందు ఆత్మకన్న వేఱయిన వస్తు విది యని యభిమానము గల్గుట లేదు అని యాశంకించి ఆత్మకన్న వేఱుగా నే నని యభిమానము దార్ష్టాంతికమందు నుండియున్న దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదమంశం స్వతః పశ్యన్ రూప్య మిత్యభిమన్యతే,
తథా స్వం చ స్వతః పశ్య న్నహ మిత్యభిమన్యతే. 37

వ్యా. నను దృష్టాంతే పురోవర్తిని శుక్తిశకలే ఇంద్రియసన్నికర్షే జాతే సతి రూప్య మిదమితి తదతిరిక్తరజతాభిమాన ఉపపద్యతే. నైవం దార్ష్టాంతికే ఆత్మాతిరిక్త వస్త్వభిమాన ఇత్యాశంక్యాత్రాపి స్వప్రకాశతయా చిదాత్మన్యవభాసమానే తదతిరిక్తోఽహ మిత్యభిమాన ఉపలభ్యతేఽతో న వైషమ్యమిత్యభిప్రాయేణాహ—ఇదమంశమితి.

టీ. ఇదం=ఇది యనెడి, అంశం = అంశమును, స్వతః=స్వయముగా, పశ్యన్= చూచుచు, రూప్యమితి = వెండి యని, అభిమన్యతే = అభిప్రాయపడుచున్నాఁడు. తథా=ఆప్రకారము, స్వం చ = తనను కూడ, స్వతః = తానుగా, పశ్యన్=చూచుచు, అహమితి = నే నని, అభిమన్యతే = తలఁచుచున్నాఁడు.

తా. శుక్తి రజతస్థలములో శుక్తియందలిదైన యిది యను నిదమంశమును తాను గనుఁగొని శుక్తీతరమైన వెండిగా నభిప్రాయమును బొంది నట్లు ఆత్మను చూచుచు నాత్మేతరమైనయహంత్వాభిమానమును బొందుచున్నాఁడు. అనఁగా నేను నే అని తలఁచు ననుట. ఇందువల్ల దృష్టాంతదార్ష్టాంతికములకుఁ బరస్పరవైషమ్యము లేదు.

అవ. స్వయ మనుశబ్దమునకును, అహమ్మనుశబ్దమునకును నొకటే యర్థ మగుట వలన సాదృశ్యము సరిపోదే యని యాక్షేపము రాఁగా సరిపోవు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదంత్వరూప్యతే భిన్నే స్వత్వాహంతే తథేష్యతాం,
సామాన్యం చ విశేషశ్చ హ్యుభయత్రాపి గమ్యతే. 38

• వ్యా. నను స్వయమహంశబ్దయోరేకార్థత్వా త్కథం దృష్టాంతదార్ష్టాంతిక యోస్సామ్యమిత్యాశంక్యేదంరూప్యశబ్దార్థయోస్స్వయమహంశబ్దార్థయోశ్చ సామాన్య విశేషరూపత్వస్యోభయత్ర సామ్యాన్నైవమిత్యాహ—ఇదమితి.

టీ. ఇదంత్వరూప్యతే = ఇది యనెడి శబ్దార్థమును వెండి యనెడి శబ్దార్థమును, భిన్నే = భిన్నములగును. (శుక్తియం దిది యనుభావ మున్నది, వెండియందు రూప్య భావ మున్నది అనుట.) తథా=అప్రకారము, స్వత్వాహంతే=తా ననెడి శబ్దార్థమును నేన నెడి శబ్దార్థమును (స్వశబ్దభావము స్వత్వ మగును, అహంశబ్దభావ మహంత్వ మగును అనుట,) ఇష్యతాం = (భిన్నములని) ఒప్పుకొని తీరవలయును. ఉభయత్రాపి=రెండింటి యందును, సామాన్యం చ=సామాన్యమును, విశేషశ్చ = విశేషమును, (సామాన్య విశేష భావము). గమ్యతే = తెలియఁబడుచున్నది.

తా. దృష్టాంతమందలి యిది యని యర్థ మిచ్చు నిదంశబ్దార్థ మును వెండి యని యర్థ మిచ్చురూప్యశబ్దార్థము నెట్లు సమానమైన యర్థము గలవి కావో యట్లే దార్ష్టాంతికమందలి స్వయంశబ్దార్థమును అహంశబ్దార్థమును భిన్నార్థకములు (ఒకే యర్థము గలవి కా వనుట). రెండింటిలో సామాన్యార్థమును విశేషార్థమును నున్నట్లు తెలియను చున్నది. కాఁబట్టి దృష్టాంతదార్ష్టాంతికములందు సాదృశ్యము సరిపోవు చునే యున్నది.

అవ. స్వయంశబ్దమునకు సామాన్యార్థ మున్న దనుటకు లౌకికప్రయోగము నుదా హరణ మిచ్చుచున్నాఁడు:—

శ్లో. దేవదత్తః స్వయం గచ్ఛేత్త్వం వీక్షస్వ స్వయం తథా,
అహం స్వయం న శక్నోమీత్యేవం లోకే ప్రయుజ్యతే. 39

వ్యా. స్వయంశబ్దార్థస్య సామాన్యరూపత్వం స్పష్టీకర్తుం లౌకికం ప్రయోగం తావద్దర్శయతి— దేవదత్తేతి.

టీ. దేవదత్తః = దేవదత్తుఁడు, స్వయం = స్వయముగా, గచ్ఛేత్=పోవుఁగాక, తథా=అప్రకారము, త్వం=నీవు, స్వయం=స్వయముగా, వీక్షస్వ=చూడుము. అహం = నేను, స్వయం = స్వయముగా, న శక్నోమి=సమర్థుఁడనుగాను, ఇతి = అని, ఏవం =

ఈప్రకారముగా, లోకే = లోకమున, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. (సామాన్యరూపముగా స్వయంశబ్ద ముపయోగింపఁబడుచున్న దనుట).

తా. దేవదత్తుఁడా, స్వయముగా వెళ్లుము. నీవు స్వయముగాఁ జూడుము. నేను స్వయముగా సమర్థుఁడను గాను. అని స్వయంశబ్దమును లోకమున సామాన్యరూపముతో వాడుకొనుట యనుభవసిద్ధము.

అవ. లోకమందు ప్రయోగమున్నమాత్రమున స్వయంశబ్దమునకు సామాన్య రూపత్వ మెట్లంగీకరింతు నందునా? ఇది వెండి యనుచోట నంగీకరించినట్లు అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదం రూప్య మిదం వస్త్ర మితి యద్వ దిదం తథా,
అసౌ త్వమహ మిత్యేషు స్వయ మిత్యభిమన్యతే. 40

వ్యా. భవత్వేవం లోకే ప్రయోగః. కథమేతావతా స్వయంశబ్దార్థస్య సామాన్య రూపత్వ మిత్యాశంక్యేదంశబ్దార్థవ దిత్యాహ—ఇదం రూప్యమితి. యథా రూప్య వస్త్రాదౌ సర్వత్రేదంశబ్దస్య ప్రయుజ్యమానత్వా త్తదర్థస్య సామాన్యరూపత్వం, తథా అసౌ త్వమహమిత్యాదౌ సర్వత్ర స్వయంశబ్దప్రయోగా త్తదర్థస్యాపి సామాన్యరూపత్వ మవగమ్యత ఇత్యర్థః.

టీ. ఇదం = ఇది, రూప్యం = వెండి, ఇదం = ఈయెదుటిది, వస్త్రం = బట్ట, ఇతి=ఇట్లుగా, ఇదం=ఇది యను నర్థముగలశబ్దము, యద్వత్ = ఎట్లుగనో, (సామాన్య రూపముగా వాడఁబడునో యనుట). తథా = అమాదిరిగా, అసౌ = వీఁడు, త్వం = నీవు, అహం=నేను, ఇతి = అనెడి, ఏతేషు = ఈశబ్దములయందు, స్వయం = తా నని యర్థమిచ్చునట్టి స్వయంశబ్దము, అభిమన్యతే = అంగీకరింపఁబడుచున్నది.

తా. ఇది వెండి ఇది వస్త్రము అని ఇదం శబ్దము సమానముగా నుపయోగింపఁబడినట్లు వీఁడు నేను నీవు అనెడి తావులందు స్వయం శబ్దము సమానముగాఁ బ్రయోగింపఁబడుటచేత స్వయంశబ్దమునకు సామాన్యరూపత్వము సిద్ధించుచున్నది.

అవ. స్వయంశబ్దమునకును అహంశబ్దమునకును లోకమందలి శబ్దప్రయోగము లలో భిన్నములైన యర్థములం దుపయోగింపఁబడుటం జూపితివి సరి. భిన్నార్థకము లయిన నీకేమి లాభము? అనిన ట్లాశంకించుకొని యాలాభమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. అహంత్వాద్భిద్యతాం స్వత్వం కూటస్థే తేన కిం తవ,
స్వయంశబ్దార్థ ఏవైష కూటస్థ ఇతి మే భవేత్. 41

వ్యా. భవతు స్వయమహంశబ్దయోర్లోకే భేదః. ఏతావతా కూటస్థాత్మని కిమా యాతమితి పృచ్ఛతి—అహంత్వాదితి. సామాన్యరూపస్స్వయంశబ్దార్థ ఏవ కూటస్థ ఇతీదమాయాత మిత్యాహ—స్వయంశబ్దార్థ ఇతి.

టీ. (అహంశబ్దభావము అహత్వ మనఁబడును. స్వశబ్దభావము స్వత్వమనఁ బడును). అహంత్వాత్ = అహంశబ్దభావముకంటె, స్వత్వం = స్వశబ్దభావము, భిద్యతాం = భేదింపఁబడుఁగాక; వేఱుగా నుండుఁగాక యనుట. తేన = ఆభేదించుట చేత, తవ = నీకు, కిం=ఏమిలాభము? (ఇ ట్లనినచో), ఏషః = ఈ, స్వయంశబ్దార్థఏవ= స్వయంశబ్దముయొక్క యర్థమే, కూటస్థ ఇతి = కూటస్థుఁ డని, మే=నాకు, భవేత్ = అగును. స్వయంశబ్దార్థము కూటస్థుఁడగుటే లాభ మనుట.

తా. అహంశబ్దమునకంటె స్వయంశబ్దము భేదించిన నీకుఁ గల్గు లాభ మేమి యందువా? స్వయంశబ్దార్థము సామాన్యరూపముచేత కూటస్థుఁ డగుటే నాకు లాభ మని గ్రహింపుము.

అవ. స్వధర్మము అన్యత్వమును వారించును గాని కూటస్థుని బోధింప దంటివా? అది మాకు సమ్మతమే యని యొప్పుకొనుచున్నాఁడు:—

శ్లో. అన్యత్వవారకం స్వత్వ మితి చే దన్యవారణం,
కూటస్థస్యాత్మతాం వక్తుమిష్టమేవ హి తద్భవేత్. 42

వ్యా. నను స్వత్వరూపో ధర్మోఽన్యత్వం నివారయతి న కూటస్థత్వం బోధ యతీతి శంకతే—అన్యత్వవారకమితి. స్వయంశబ్దార్థస్య కూటస్థస్యైవాత్మత్వాత్స్వ త్వేనాన్యవారణమిష్టమేవేతి పరిహరతి—అన్యవారణం కూటస్థస్యేతి.

టీ. స్వత్వం = స్వయంశబ్దభావరూప మగు ధర్మము, అన్యత్వవారకం = అన్య శబ్దభావరూపమగు ధర్మమును వారించునది. ఇతి చేత్ = అని యంటివేని, కూటస్థస్య= ప్రత్యగాత్మకు, ఆత్మతాం = ఆత్మభావమును, వక్తుః = చెప్పఁదలఁచినవానికి (నాకు), తత్ = ఆ, అన్యవారణం = అన్యమును నివారించుట, ఇష్టమేవ = అంగీకారమే, భవేత్ = అగును.

తా. స్వయంశబ్దభావరూప మగు ధర్మము అన్యధర్మమును వారించునంటివా, ప్రత్యగాత్మకు ఆత్మభావమును జెప్పఁబూనిన మాకు నది యిష్టమే యని భావము.

అవ. గోవు, అశ్వము, ఉదకము మొదలగు శబ్దములు భిన్నార్థకములైనట్లు స్వయంశబ్దమును ఆత్మశబ్దమును వేఱువేఱగునర్థములు గలవి కదా. స్వయంశబ్దార్థమైన

కూటస్థ శబ్దమునకు ఆత్మభావ మెట్లు ఘటించు నని యాశంకించి సమాధానము చెప్పు చున్నాఁడు:—

శ్లో. స్వయ మాత్మేతి పర్యాయౌ తేన లోకే తయోస్సహ,
ప్రయోగో నాస్త్యతస్స్వత్వమాత్మత్వం చాన్యవారకమ్. 43

వ్యా. నను స్వయమాత్మశబ్దయోర్భిన్నప్రవృత్తినిమిత్తయోర్గవాశ్వాది శబ్దయోరి వైకార్థ్యాభావాత్కథం స్వయంశబ్దార్థస్య కూటస్థస్యాత్మత్వ మిత్యాశంక్య హస్త కరాదిశబ్దవదేకార్థత్వోపపత్తేర్నైవమితి పరిహరతి—స్వయమాత్మేతీతి. పర్యాయత్వే సహప్రయోగాభావే హేతుమాహ—తేన లోక ఇతి. ఫలితమాహ—అతస్స్వత్వ మితి.

టీ. స్వయం = స్వయంశబ్దంబును, ఆత్మేతి = ఆత్మ యనెడిశబ్దంబును, పర్యాయౌ=ఒకయర్థము గలవి. (సమానార్థకపదంబు లనుట). తేన = పర్యాయపదములయిన కారణముచేత, లోకే = లోకమునందు, తయోః = ఆరెండుశబ్దంబులకును, సహ ప్రయోగః = ఒక్కస్థలమందుఁ బ్రయోగము, నాస్తి = లేదు. అతః = ఈహేతువు చేత, స్వత్వం = స్వయంశబ్దభావమును, ఆత్మత్వం చ = ఆత్మశబ్దభావంబును, అన్య వారకం=అన్యశబ్దమును నివారించునది, (స్యాత్ = అగును).

తా. హస్తము, కరము; పాదము, పదము; ముఖము, వక్త్రము -ఈజంటపదంబులు ఒకదాని కొకటి పర్యాయపదము లైనట్లు స్వయం శబ్దంబును, ఆత్మశబ్దంబును నొకేయర్థము గలవి గాన, నీరెండుపదముల కెక్కడ నేకవాక్యమందుఁ బ్రయోగము గనుపింపదు కాన, స్వయం శబ్దార్థమే ఆత్మ. అందుచేత నీస్వయంశబ్దాత్మశబ్దార్థములు అన్యశబ్దార్థ మును నివారించును. స్వయంశబ్దార్థమైన కూటస్థున కాత్మభావము ఘటించు నని భావము.

అవ. స్వయంశబ్దమును ఆత్మశబ్దమును పర్యాయపదము లయినచో అచేతనము లయిన ఘటాదులయందు స్వయంశబ్ద ముపయోగింపఁబడుచున్నదే. అదెట్లు ఘటించును? అని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘట స్స్వయం న జానాతీత్యేవం స్వత్వం ఘటాదిషు,
అచేతనేషు దృష్టం చేద్దృశ్యతా మాత్మసత్త్వతః. 44

వ్యా. నను ఘటాదిష్వచేతనే ష్వపి స్వయంశబ్దస్య ప్రయోగదర్శనాత్స్వ యంత్వాత్మత్వయోరేకత్వం న ఘటత ఇతి శంకతే—ఘట ఇతి. ఘటాదిష్వపి స్ఫురణ

రూపేణాత్మచైతన్యస్య సత్త్వాత్తేష్వపి స్వయంశబ్దప్రయోగో న విరుధ్యత ఇత్యాహ—దృశ్యతామితి.

టీ. ఘటః = కుండ, స్వయం = తాను, న జానాతి = తెలిసికొనఁ జాలదు, ఇతి = అని, ఏవం = ఈలాగున, అచేతనేషు = చేతనములు కాని, ఘటాదిషు = ఘటపటాదులయందు, స్వత్వం=స్వయంశబ్ద ముపయోగింపఁబడుట, దృష్టంచేత్=చూడఁబడుచున్న దంటివా, ఆత్మసత్త్వతః=ఆత్మచైతన్యముయొక్క యుండుటచేత, దృశ్యతాం= తెలియఁబడుఁగాక, స్వయంశబ్ద ముపయోగించుట కూడు నని గ్రహింపవలయు ననుట.

తా. కుండ తాను దెలిసికొనఁజాలదు. అనెడి వాక్యమునుబట్టి చేతనములుగాని ఘటము మొదలగువానియందుఁగూడ నీయాత్మ పర్యాయమైన స్వయంశబ్ద ముపయోగింపఁబడుచున్న దంటివా, ఆత్మ చేతనాచేతనములయం దన్నింటియందును సమానముగా నుండుటవల్ల నచేతనము లగు ఘటాదులయందును నుపయోగింపఁబడియుండు నని తెలియనగును.

అవ. ఘటపటాదులయందుఁ గూడ చైతన్య ముండినచో మనుష్యపశుపక్ష్యాదులనుమాత్రమే చేతను లనుట నిష్ప్రయోజనమే కదా యని యాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. చేతనాచేతనభిదా కూటస్థాత్మకృతా న హి,
కింతు బుద్ధికృతాభాసకృతైవే త్యవగమ్యతామ్. 45

వ్యా. నను ఘటాదిష్వస్యాత్మచైతన్యస్య సత్త్వే చేతనవిభాగో నిర్నిమిత్తికస్స్యాదిత్యాశంక్య చేతనాచేతనవిభాగస్య చిదాభాససత్త్వాసత్త్వలక్షణకారణసద్భావాన్నైవమితి పరిహరతి—చేతనేతి.

టీ. చేతనాచేతనభిదా=ఇవి చేతనములు ఇవి యచేతనము లనెడి భేదము, కూటస్థాత్మకృతా = కూటస్థచైతన్యమునుబట్టి వచ్చినది. న హి = కాదుగదా. కింతు = ఇఁక నేమంటే, బుద్ధికృతాభాస కృతైవేతి - బుద్ధి = బుద్ధియందు, కృత = ప్రతిఫలించిన, ఆభాస=చిదాభాసునియందు, కృతైవ=కల్పింపఁబడినదే, ఇతి = అని, అవగమ్యతాం = గ్రహింపఁబడుఁగాక.

తా. ఇవి చేతనములు, ఇవి యచేతనము లనెడి వ్యవహారము కూటస్థచైతన్యమునుబట్టి రాలేదు, మఱి దేనిని బట్టి వచ్చిన దన బుద్ధి

ప్రతిబింబితుఁ డైన చిదాభాసునిఁబట్టి వచ్చినదే యని యెఱుంగవల యును. చిదాభాసుఁ డుండు మనుష్యాదులను చేతను లనియు చిదా భాసుఁడు లేని కుండ గోడ మొదలగునవి యచేతనము లనియు వ్యవహ రించుట నిష్ప్రయోజనము గాదు.

అవ. చిదాభాసుఁ డుండినచో చేతనములు. అతఁడు లేనిచో నచేతనములగును, అని యొప్పుకొనినచో నచేతనములయం దాత్మచైతన్య ముండు నని యొప్పిన మీ కేమి లాభమున్నది? యని యాశంక రాఁగా నచేతనకల్పన కధిష్ఠాన మొకటియుండి తీరవలెను అనెడి యభిప్రాయముతో నచేతనము లయిన ఘటపటాదు లాకూటస్థచైతన్యమందే యారోపింపఁబడుటను దృష్టాంతసహితముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యథా చేతన ఆభాసః కూటస్థే భ్రాంతికల్పితః,
అచేతనో ఘటాదిశ్చ తథా తత్రైవ కల్పితః. 46

వ్యా. నను చేతనాచేతనవిభాగస్య చిదాభాససత్త్వాసత్త్వప్రయుక్తతాభ్యుప గమేఽచేతనేష్వాత్మసత్త్వాభ్యుపగమో నిష్ప్రయోజనస్స్యాదిత్యాశంక్య చేతనాచేతన విభాగహేతుత్వేన కూటస్థస్యానభ్యుపగమ్యత్వేఽప్యచేతనకల్పనాధిష్ఠానత్వేన కూట స్థోఽభ్యుపగంతవ్య ఇత్యభిప్రాయేణ ఘటాదేస్తత్ర కల్పితత్వం సదృష్టాంతమాహ— యథాచేతన ఇతి.

టీ. చేతనః = చేతనుఁ డైన, ఆభాసః=చిదాభాసుఁడు, కూటస్థే = ప్రత్యగాత్మ యందు, యథా = ఏవిధముగా, భ్రాంతికల్పితః = అవిద్యచేత నారోపింపఁబడియెనో, తథా = ఆవిధముగా, అచేతనః = చేతనరహితమైన, ఘటాదిశ్చ = ఘటాదులును, తత్రైవ = ఆప్రత్యగాత్మయందే (కూటస్థునియందె) కల్పితః = అవిద్యచేఁ గల్పింపఁ బడెను.

తా. కూటస్థునియందు చిదాభాసుఁ డవిద్యచేతఁ గల్పితుఁడై నట్లు కూటస్థునియందు ఘటాద్యచేతనవర్గమును నవిద్యచేఁ గల్పింపఁ బడినది. చేతనాచేతనముల కన్నింటికిని కల్పనాధిష్ఠానము కూటస్థ చైతన్య మొక్కటే యనుట మాకు లాభము.

అవ. స్వయంశబ్దమునకును ఆత్మశబ్దమునకును భేదము లే దని తేలఁగా వాది కొంచె మధికప్రసంగముగా నాశంక (పూర్వపక్షము) చేయుచున్నాఁడు:—

శ్లో. తత్తేదంతే అపి స్వత్వ మివ త్వమహామాదిషు,
సర్వత్రానుగతే తేన తయోరవ్యాత్మ తేతి చేత్. 47

వ్యా. సత్వాత్మయో రేకత్వేఽతిప్రసంగం శంకతే తత్తేదంతే అపీతి. త్వమహ మాదిషు సర్వత్రానుగతస్య స్వత్వస్యైవ సర్వత్రానుగతయో స్తత్తేదంతయోర ప్యాత్మస్వరూపతా కిం న స్యాదితి భావః.

టీ. (యేన=ఏకారణముచేత), స్వత్వమివ = స్వయంశబ్దభావమువలె, త్వమహ మాదిషు = నీవు నేను అను మొదలయినశబ్దములయందు, సర్వత్ర = అంతటను, తత్తేదంతే అపి = తచ్ఛబ్దభావమగు తత్తయును, ఇదంశబ్దభావ మగు ఇదంత యును, (అది యిది అనుశబ్దముల ధర్మమనుట). అనుగతే = సామాన్యముగాఁ బ్రయోగింపఁబడుచున్నవో, తేన=ఆకారణముచేత, తయోరపి = తత్తేదంతలకు రెండింటికిని, ఆత్మతా=ఆత్మత్వము, (స్యాత్=అగును). ఇతి చేత్=ఆత్మత్వము కలుగు నని యన్నపక్షమందు.

తా. ఏమోయీ యద్వైతసిద్ధాంతీ ! స్వయంశబ్దమునకు నీవు నేను వీఁడు అనుచోట్ల సమానముగాఁ బ్రయోగించుటచే ఆత్మత్వ మొప్పినట్లు అది ఇది యనుశబ్దములును నంతట సమానముగాఁ బ్రయోగింపఁబడుటచే ఆత్మత్వ మంగీకరించుము అని పూర్వపక్షీ యాక్షేపించెను.

అవ. తత్=అది, ఇదం=ఇది, ఈరెండిటికిని ఆత్మత్వము సంభవింప దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తే ఆత్మత్వేఽప్యనుగతే తత్తేదంతే తత స్తయోః,
ఆత్మత్వం నైవ సంభావ్యం సమ్యక్త్వాదే ర్యథాతథా. 48

వ్యా. తత్తేదంతయోరాత్మత్వాధికవృత్తిత్వాదాత్మత్వం న సంభవతీత్యాహ— తే ఆత్మత్వేఽపీతి. తత్తేదంతే స్వత్వమివ యద్యపి త్వమహమాదిషు అనుగతే, తథాపి తేష్వనువర్తమానే ఆత్మత్వేఽప్యనుగతే తదాత్మత్వమిదమాత్మత్వ మిత్యాదివ్యవహారసంభవాదత స్తయో రాత్మత్వాధికవృత్తిత్వాదాత్మస్వరూపతా న సంభావ్యతే. తత్ర దృష్టాంతస్సమ్యక్త్వాదేరితి. ఆత్మ త్వం సమ్యగాత్మత్వమసమ్యగితి వ్యవహారవశాదాత్మత్వేఽప్యనువర్తమానయోః సమ్యక్త్వాసమ్యక్త్వయో రివేత్యర్థః.

టీ. తేఽఆ, తత్తేదంతే=అది యనుటయు ఇది యనుటయు అనఁగా తత్త ఇదంతలనుట, ఆత్మత్వేఽపి = ఆత్మభావమునందును, అనుగతే = అనువర్తించుచున్నవి. తతః = అందువలన, సమ్యక్త్వాదేః - సమ్యక్త్వ = మంచిదగుటకును, ఆదేః = చెడ్డది అనుటకును, యథా = ఏప్రకారము, ఆత్మత్వం=ఆత్మభావము, న సంభావ్యం = సంభవింపదో, తథా = అటువలెనే, తయోః = అది ఇది యనెడు తత్తేదంత్వములకు, ఆత్మత్వం = ఆత్మభావము, న సంభావ్యం = సంభవింప నేరదు.

తా. తచ్ఛబ్దభావము తత్త యనఁబడుచున్నది. ఇదంశబ్దభావము ఇదంత యనఁబడుచున్నది. స్వయంశబ్దముంబోలె అది ఇది యనెడి శబ్దార్థములు వ్యవహారమున వానిచిత్తము దేవాలయమునకుం బోయి నపుడు తదాత్మకమై యున్న దనియు, ఇంటియొద్ద దారాపత్యాదులఁ గాంచినపుడు ఇదమాత్మక మనియు వాడఁబోనఁబడుచున్నది. అనఁగా తదిదంశబ్దములు రెండింటిలో ఆత్మశబ్దము చేర్చియుపయోగింపఁబడు చున్న దనుట. తత్తేదంతలు స్వశబ్దమువలె త్వమహమాదులందే కాక, సమ్యక్త్వాసమ్యక్త్వములవలె ఆత్మత్వ మనెడి ధర్మమునందును గూడ నుండుటచేత, ఈతత్తేదంతలును వీనివలె ఆత్మ కానేరవు.

అవ. ఇపుడు వ్యవహారసిద్ధ మగు నర్థమును ఫలితముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్తేదంతే స్వతాన్యత్వే త్వంతాహంతే పరస్పరం,
ప్రతిద్వంద్వితయా లోకే ప్రసిద్ధే నాస్తి సంశయః. 49

వ్యా. ఏవం ప్రాసంగికం పరిసమాప్య ఫలితప్రదర్శనాయ లోకవ్యవహారసిద్ధ మర్థమనువదతి—తత్తేదంతే ఇతి. తత్తాప్రతియోగిత్వ మిదంతాయాస్తదిద మితి స్వత్వ ప్రతియోగిత్వ మన్యత్వస్య స్వయమన్య ఇతి త్వంతా ప్రతియోగిత్వ మహంతా యాస్త్వమహమితి లోకే ప్రతిద్వంద్విత్వేన ప్రయోగదర్శనాత్ప్రసిద్ధమితి భావః.

టీ. తత్తేదంతే = అది ఇది యనుశబ్దధర్మములును, స్వతాన్యత్వే = తాను ఇతరము అనెడి శబ్దధర్మములును, త్వంతాహంతే = నీవు నేను అనెడి శబ్దధర్మములును, పరస్పరం = ఒకదానితో నొకటి, ప్రతిద్వంద్వితయా = ప్రతిద్వంద్వములుగా (విరుద్ధార్థకములుగా ననుట) లోకే = లోకవ్యవహారములందు, ప్రసిద్ధే = ప్రసిద్ధములై యున్నవి. సంశయః = సందేహము, నాస్తి = లేదు.

తా. లోకవ్యవహారమున అది ఇది, తాను ఇతఁడు, నీవు నేను ఇట్టియర్థము గల జంటమాటలను వ్యతిరేకార్థకములుగా వాడు చున్నారు. కాన పై రెండింటికిని (తత్తేదంతల కనుట) విరోధము సుప్రసిద్ధమే యని యెఱుంగ నగు.

అవ. పైనచెప్పినరీతిగా విరోధమును గనుపఱచినందువలనఁ గలుగులాభమును వివరించుచున్నాఁడు:—

శ్లో. అన్యతాయాః ప్రతిద్వంద్వీ స్వయం కూటస్థ ఇష్యతాం,
త్వంతాయాః ప్రతియోగ్యేషోఽహమిత్యాత్మని కల్పితః. 50

వ్యా. భవత్వేవం లోకే. ప్రకృతే కిమాయాత మిత్యత ఆహ—అన్యతాయా ఇతి. అన్యత్వప్రతియోగీ స్వయంశబ్దార్థః త్వంతాప్రతియోగ్యహంశబ్దార్థశ్చిదాభాసః కూటస్థే కల్పిత ఇత్యర్థః.

టీ. స్వయం = తా ననెడి శబ్దార్థ మగు, కూటస్థః = ప్రత్యగాత్మ, అన్యతాయాః = అన్యశబ్దభావమునకు, ప్రతిద్వంద్వీ=విరోధి యని, ఇష్యతాం=తెలియఁబడుఁగాక, త్వంతాయాః=నీ వనెడి శబ్దభావమునకు, ప్రతియోగీ=ప్రతిద్వంద్వి యైన(విరోధి యైన) ఏషోఽహం = నేన నెడిచిదాభాసుఁడు, ఆత్మని = కూటస్థునియందు (ప్రత్యగాత్మయందు) కల్పితః = ఆరోపింపఁబడెను.

తా. తా నని వ్యవహరింపఁబడెడు ప్రత్యగాత్మ అన్యపదార్థములకు విరోధియే. నీ వనెడుదానికి విరోధి యగు నే ననెడి చిదాభాసుఁడు ప్రత్యగాత్మయందు కల్పింపఁబడెను.

అవ. నీవు నేను, అది ఇది, తాను ఇతరుఁడు అనువానికి భేద ముండినట్లు జీవేశ్వరులకు నింత విస్పష్టముగా భేదము తెలియఁబడినచో నేల అందఱును స్పష్టముగా తెలిసికొనరు? అని శంకించి సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. అహంతాస్వత్వయోర్భేదే రూప్యతేదంతయోరివ,
స్పష్టేఽపి మోహమాపన్నా ఏకత్వం ప్రతిపేదిరే. 51

వ్యా. నను క్తప్రకారేణ జీవకూటస్థయోర్భేదే సత్యపి సర్వే ఇత్థం కిమితి న జానంతీత్యాశంక్యాహ—అహంతేతి. బుద్ధిసాక్షిణ, కూటస్థస్య బుద్ధ్యా ప్రత్యక్షీకర్తుమశక్యత్వాహమితి ప్రతిభాసమానయో ర్జీవకూటస్థయోర్భ్రాన్త్యైకత్వం ప్రతిపన్నా ఇత్యర్థః.

టీ. రూప్యతేదంతయోరివ-రూప్యతా=రూప్యత్వమునకును, (వెండియనెడి శబ్దభావమునకు) ఇదంతయోరివ = ఇదంత్వమునకునువలె (ఇది యనెడి శబ్దభావమునకునువలె.) అహంతాస్వత్వయోః=తాననెడి శబ్దభావమునకు నేననెడి శబ్దభావమునకును, భేదే సత్యపి = భేదము స్పష్టముగా కనఁబడుచుండినప్పటికిని, మోహం = భ్రాంతిని, ఆపన్నాః = పొందినవారలై, ఏకత్వం = జీవునకును, ప్రత్యగాత్మకును, (కూటస్థునకును, చిదాభాసునకును) ఇద్దరికిని అభేదమును, ప్రతిపేదిరే = పొందిరి.

తా. ముత్యపుచిప్పను చూచి యిది వెండి యని భ్రమపడినపుడు ఇది యని చెప్పుట యేది కలదో, అది ఇదంత్వము. అది శుక్తిధర్మము. రూప్యత్వ మనునది శుక్తికయందు కల్పిత మైనరజతధర్మము. ఈ

రెండింటికిని వలెనే అహంతాస్వత్వములకు భేదము విస్పష్టముగనే కనఁబడుచున్నది. కూటస్థునియందు తాననెడి శబ్దభావమును చిదాభాసునియందు అనఁగా జీవునియందు అహంశబ్దభావమును అనుట. అజ్ఞానముచేత భ్రాంతిపడి కూటస్థజీవులకు భేదము లేదని తలంచుచున్నారు.

అవ. జీవుఁడును కూటస్థుఁడును ఒక్కఁడే యని యీభ్రమ కలుగుట కేమి కారణము అని యడిగెదవేని దానికి తాదాత్మ్యాధ్యాసమే కారణ మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తాదాత్మ్యాధ్యాస ఏవాత్ర పూర్వోక్తావిద్యయా కృతః,
అవిద్యాయాం నివృత్తాయాం తత్కార్యం వినివర్తతే. 52

వ్యా. నన్వస్య జీవకూటస్థయో రేకత్వభ్రమస్య కిం కారణమి త్యపేక్షాయామాహ—తాదాత్మ్యేతి. అత్రాస్మిన్ గ్రంథేఽనాదిరవివేకోయ మిత్యత్రోక్తయాఽవిద్యయేత్యర్థః. యతోఽవిద్యాకార్యత్వమస్యాతోఽవిద్యానివర్తకజ్ఞానేనైవ తన్నివృత్తిరిత్యాహ—అవిద్యాయా మితి.

టీ. అత్ర = ఈవిషయమందు, పూర్వోక్తావిద్యయా = పైన చెప్పఁబడిన యనాది యగు నజ్ఞానముచేత, కృతః = కల్పింపఁబడిన, తాదాత్మ్యాధ్యాస ఏవ = అన్యోన్యాధ్యాసమే ఇట్టిభ్రాంతికి కారణ మగును. అవిద్యాయాం = అజ్ఞానము, నివృత్తాయాం సత్యాం = నివర్తింపఁబడిన దగుచుండఁగా, తత్కార్యం = ఆయవిద్యాకార్య మగు అన్యోన్యాధ్యాసము (తాదాత్మ్యాధ్యాసము.) వినివర్తతే = పోవుచున్నది.

తా. ఈచిత్రదీపమునందలి యిరువదిరెండవశ్లోకమున చెప్పఁబడిన యనాద్యవిద్యచే కల్పింపఁబడిన పరస్పరాధ్యాసమే కూటస్థచిదాభాసు లొక్కటి యని పొరపడుటకుఁ గారణము. అన్యోన్యాధ్యాసమవిద్యయొక్క కార్యమగుటంజేసి యవిద్యను పోఁగొట్టెడిజ్ఞానముచేతనే యీయధ్యాసమును పోవు నని గ్రహింపవలయును.

అవ. అధ్యాసము అవిద్యాకార్యము గనుక నాయవిద్య అనఁగా కారణము నివర్తించిన, తత్కార్య మగు నధ్యాసమును నివర్తించు నని మీ రనుట సంగతముగా లేదు. అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవిద్యావృతితాదాత్మ్యే విద్యయైవ వినశ్యతః,
విక్షేపస్య స్వరూపం తు ప్రారబ్ధక్షయమీక్షతే. 53

వ్యా. నన్వధ్యాసస్యావిద్యాకార్యత్వాత్తన్నివృత్త్యా నివృత్తిరిత్యేత దనుప పన్నం. బ్రహ్మాత్మైకత్వం విద్యాయాముత్పన్నాయామప్యవిద్యాకార్యస్య దేహాదేరుప లభ్యమానత్వాదిత్యత ఆహ—అవిద్యావృతీతి. అవిద్యైకకారణయోరావృతితాదాత్మ్యయో ర్విద్యయైవ వినివృత్తిః. కర్మసహితావిద్యాజన్యస్య తు విక్షేపస్వరూపస్య కర్మావ సానపర్యంత మవస్థానమిత్యవిరోధ ఇతి భావః.

టీ. అవిద్యావృతితాదాత్మ్యే - అవిద్యా = అజ్ఞానముయొక్క కార్యము లగు, ఆవృతితాదాత్మ్యే = ఆవరణమును, అన్యోన్యాధ్యాసమును, విద్యయైవ = జ్ఞానము చేతనే, వినశ్యతః = నశించుచున్నవి. విక్షేపస్య=ప్రారబ్ధకర్మముతోఁ గూడిన విక్షేపము యొక్క, స్వరూపం తు = స్వరూపమనిననో, ప్రారబ్ధక్షయం = ప్రారబ్ధకర్మనాశమును, ఈక్షతే = చూచుచున్నది. ప్రారబ్ధకర్మ నశించెడుదనుక నుండు ననుట.

తా. అవిద్యవలన ఆవరణమును అధ్యాసమును కలిగినవి. ఈ రెంటును జ్ఞానము కలుగఁగనే నశించును. ఇఁక నవిద్యవలన పుట్టినట్టియు ప్రారబ్ధకర్మముతోఁ గూడినదియు నగు విక్షేపము ప్రారబ్ధము క్షయించెడువఱకు నుండును. కావున నసంగత మేమియు లేదు.

అవ. కారణ మైన యవిద్య నివర్తించిన తత్కార్య మగు విక్షేప ముండుట యెట్లు సంభవించును? అను ప్రశ్నను శాస్త్రాంతరములయందలి దృష్టాంతముచేత సమా ధానపఱచుచున్నాఁడు:—

శ్లో. ఉపాదానే వినష్టేఽపి క్షణం కార్యం ప్రతీక్ష్యతే,
ఇత్యాహుస్తార్కికా స్తద్వదస్మాకం కిన్న సంభవేత్. 54

వ్యా. నను ప్రారబ్ధకర్మణో నిమిత్తమాత్రత్వా త్తత్సద్భావమాత్రేణోపాదానే వినష్టేఽపి కథం కార్యానువృత్తిరిత్యాశంక్య శాస్త్రాంతరసిద్ధదృష్టాంతేన తదనువృత్తిం సంభావయతి—ఉపాదాన ఇతి.

టీ. తార్కికాః = తర్కశాస్త్రజ్ఞులు, ఉపాదానే = ఉపాదానకారణము, వినష్టేఽపి = నశించినప్పటికిని, కార్యం=కార్యము, క్షణం = క్షణకాలము, ప్రతీక్ష్యతే= చూడఁబడుచున్నది. ఇతి = అని, ఆహుః=చెప్పుచున్నారు. తద్వత్ = అదేవిధముగా, అస్మాకం = మాకును, న సంభవేత్ కిం = సంభవింపదా? సంభవించు ననుట.

తా. ఉపాదానకారణము నశించినతర్వాత కార్యము క్షణకాల ముండు నని తార్కికు లందురు. అటులనే మా వేదాంతసిద్ధాంత మందును కారణమైన యవిద్య నశించినతర్వాత తత్కార్య మగు

విక్షేపస్వరూపమైన దేహాదికము కొంతకాలముండు ననుటలో తప్పేమి? కొంతకాల ముండవచ్చు ననుట తప్పు లే దని భావము.

అవ. అయ్యా! తార్కికులు కారణము నశించినతర్వాత కార్యము క్షణకాల ముండునంటే మీరును అట్లే అనక వారు జేనెడు నేసినారు గనుక మేము బారెడు నేసినామనునట్లు ప్రారబ్ధకర్మ క్షయించెడువఱకు నుండు నని మీరు చెప్పవచ్చునా? అనిన సమాధానపఱచుచున్నాఁడు:—

శ్లో. తంతూనాం దినసంఖ్యానాం తైస్తాదృక్ క్షణ ఈరితః,
భ్రమస్యాసంఖ్యకల్పస్య యోగ్యః క్షణ ఇహేష్యతామ్. 55

వ్యా. నను తార్కికైః కార్యస్య క్షణమాత్రమవస్థాన మంగీకృతం. న చిరకాల మిత్యాశంక్యాహ—తంతూనా మితి. సంసారస్యానాదికాలమారభ్యానువృత్తత్వాత్తత్సంస్కారవశేన కులాలచక్రభ్రమవచ్చిరకాలానువృత్తిర్న విరుధ్యత ఇతి భావః.

టీ. దినసంఖ్యానాం = దినములచేత లెక్కింపఁదగిన, తంతూనాం = దారములకు, తైః = ఆతార్కికులచేత, తాదృక్ = అటువంటి, క్షణః=క్షణకాలము, ఈరితః= చెప్పఁబడియుండెను. ఇహ = ఈసంసారమునందు, అసంఖ్యకల్పస్య = లెక్కించుటకు నలవి గాని యనేక కల్పములనుండి యుండెడు, భ్రమస్య = భ్రమకు, యోగ్యః = అనురూప మగు, క్షణః = క్షణకాలము, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁగాక.

తా. దారములు నశించినతర్వాత క్షణకాలమునకు వస్త్రము నశించునని తార్కికులు అనుటలో దారములు కొన్నిరోజులలో తయారైనవి గనుక అవి నశించినతర్వాత క్షణకాలమునకు వస్త్రము నశించు ననవచ్చును. అనేక కల్పములనుండి యుండిన అవిద్య నశించినతర్వాత నశింపఁదగిన దేహాదులకును కుమ్మరవానిచక్రమువలె దానికి తగినంత కాలము నశించుటకు కావలయును. అని మే మేల చెప్పరాదు?

అవ. తార్కికులు చెప్పినట్లే మేమును అయుక్తముగా చెప్పినా మని దీనిచేత ననుకొనకుఁడు. మామాటకు వారిమాటకును వార యున్నది అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వినా క్షోదక్షమం మానం తైర్వృథా పరికల్ప్యతే,
శ్రుతియుక్త్యనుభూతిభ్యో వదతాం కిన్ను దుశ్శకమ్. 56

వ్యా. నను తార్కికైర్యథా ఽయుక్తమభిహితం తద్వద్భవతాపీత్యాశంక్య స్వోక్తా తతో వైషమ్యం దర్శయతి—వినేతి. క్షోదక్షమం విచారసహం మానం వినా ప్రమాణమంతరేణేత్యర్థః. * తస్య "తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంప

త్స్యే” ఇతి శ్రుతిః. చక్రభ్రమాదిదృష్టాంతో యుక్తిః. అనుభూతిర్విద్వదనుభవః. ఏతేభ్యః ప్రమాణేభ్యః కిం వక్తుమశక్య మిత్యభిప్రాయః.

టీ. తైః = ఆతార్కికులచేత, క్షోదక్షమం = విచారసహమైన, మానం వినా = ప్రమాణము లేకుండ, వృథా = వ్యర్థముగా, పరికల్ప్యతే=వాదముచేయఁబడుచున్నది. శ్రుతియుక్త్యనుభూతిభ్యః - శ్రుతి=వేదప్రమాణమువలనను, యుక్తి=అనుమానప్రమాణమువలనను, అనుభూతిభ్యః = అనుభవమువలనను, వదతాం = చెప్పెడి మాకు, కిన్నుదుశ్శకం = ఏమి శక్యము గాదు ? అన్నియుం శక్యము లగు ననుట.

తా. తార్కికులు ప్రమాణమును వదలి తమ యిచ్ఛవచ్చిన చొప్పున నేమేమో కల్పించిరి. మే మట్లు కాదు. ఏది చెప్పినను శ్రుతి, యుక్తి, అనుభవము నను నీమూఁడు ప్రమాణములకు సరిపోవునట్లు చెప్పెదము. కుమ్మరవాఁడు చక్రమును త్రిప్పి విడిచినతర్వాత కొంత సేపటివఱకు అది తిరుగుచునే యుండునట్లు అవిద్య నశించినతర్వాత దేహాదికము ప్రారబ్ధకర్మ నశించుపర్యంత ముండు నని “తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే” అను మొదలైన శ్రుతిని, కులాలచక్రదృష్టాంతమనెడి యుక్తిని, జ్ఞానులయొక్క యనుభవ మనెడు అనుభవమును ప్రమాణములుగా తీసికొని మాటలాడునట్టి మేము అన్నింటిని సాధింపఁగలము. అని భావము.

అవ. ప్రకృతవిషయమును నిరూపణచేయుచున్నాఁడు:—

శ్లో. ఆస్తాం దుస్తార్కికైస్సాకం వివాదః ప్రకృతం బ్రువే,
స్వాహమోస్సిద్ధమేకత్వం కూటస్థపరిణామినోః. 57

వ్యా. ప్రకృతమనుసరతి—ఆస్తామితి. స్వయమహంశబ్దార్థయోః కూటస్థపరిణామినోరేకత్వం భ్రాంత్యా సిద్ధం.

టీ. దుస్తార్కికైస్సాకం = దుష్టులగు తార్కికులతో, వివాదః = కలహము, ఆస్తాం=అట్లుండనిమ్ము. ప్రకృతం=ప్రస్తుతవిషయమును, బ్రువే=చెప్పెదను. స్వాహమోః= స్వశబ్దార్థమును, అహంశబ్దార్థమును అయిన, కూటస్థపరిణామినోః = కూటస్థ చిదాభాసులకు, ఏకత్వం = ఏకత్వము, సిద్ధం = భ్రాంతిచేత నేర్పడినది.

తా. సరి, తార్కికులసంగతి అటుండ నిండు. మనకు ప్రకృతమునకుం గావలసినదానిని నుడివెదము. స్వశబ్దముచే చెప్పఁబడెడి ప్రత్యగాత్మకును అహంశబ్దముచే చెప్పఁబడెడి జీవునకును ఏకత్వము భ్రాంతిచే కుదుఱను గాని మఱే దేనిచేతను కుదుర నేరదు.

అవ. జీవకూటస్థుల కేకత్వము భ్రాంతిసిద్ధ మయినచో నీభ్రాంతి యందఱికిఁ గల్గునా? యనిన శ్రుతికి యథార్థమయిన యర్థమును తెలియఁజాలనివారి కందఱకుం గల్గు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. భ్రామ్యంతే పండితంమన్యా స్సర్వే లౌకికతార్కికాః,
అనాదృత్య శ్రుతిం మౌర్ఖ్యాత్కేవలాం యుక్తిమాశ్రితాః. 58

వ్యా. నను కూటస్థజీవయోరేకత్వం భ్రాంతిసిద్ధం చేదిదం భ్రాంతమితి కేఽపి కుతో న జానంతి ఇత్యాశంక్య శ్రుతితాత్పర్యపర్యాలోచనశూన్యత్వాదిత్యాహ—భ్రామ్యంత ఇతి.

టీ. పండితంమన్యాః = తమకుఁదామే పండితుల మని తలంచెడి, లౌకిక తార్కికాః = లోకజ్ఞానము మాత్రము కలిగియున్నవారును, తర్కింపఁగలవారును నయిన, సర్వే=అందఱును, మౌర్ఖ్యాత్ = పెంకెపట్టువలన, శ్రుతిం = ప్రమాణరాజ మగువేదమును, అనాదృత్య=లక్ష్యముచేయక, కేవలాం యుక్తిం = యుక్తినిమాత్రమే, ఆశ్రితాః = అవలంబించినవా రగుచు, భ్రామ్యంతే = పొరపడుచున్నారు.

తా. శ్రుతితాత్పర్యమును సరిగా గ్రహింప లేని దురభిమానులగు లౌకికతార్కికులు శబ్దప్రమాణము నుజ్జగించి యుక్తిని మాత్ర మవలంబించి కూటస్థుఁడును జీవుఁడును నొక్కఁడే యని పొరపడుదురు.

అవ. శ్రుతుల కర్థములు చెప్పఁగలవార లట్లేల భ్రాంతి నొందెద రనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. పూర్వాపరపరామర్శవికలా స్తత్ర కేచన,
వాక్యాభాసా న్స్వస్వపక్షే యోజయంత్యప్యలజ్జయా. 59

వ్యా. నను శ్రుత్యర్థప్రవక్తారోఽపి కేచిదిత్థం కుతో న జానంతీత్యాశంక్య తేషాం సాకల్యేన శ్రుత్యర్థపర్యాలోచనాభావా దిత్యాహ—పూర్వాపరేతి.

టీ. తత్ర = ఆతార్కికులయందును లౌకికులయందును, కేచన = కొందఱు, పూర్వాపరపరామర్శవికలాః - పూర్వ = ముందువాక్యములకును, అపర=తరువాతనున్న వాక్యములకును, పరామర్శ = అర్థమును బరిశీలించుటయందు, వికలాః = సమర్థులుగాక, స్వస్వపక్షే = తమ తమ యభిప్రాయములయందు, వాక్యాభాసాన్ - వాక్య = ఇతర వాక్యములయొక్క, ఆభాసాన్=ఆభాసవాక్యములను (పూర్వపక్షులగువారికి పై నిజముగా తమ కనుకూలించెడివానివలెఁ గనుపట్టెడి వనుట.) అలజ్జయా = అపార్థములఁ జెప్పుచున్నామే యని లజ్జలేక, యోజయంతి = అతుకు పెట్టుచున్నారు.

తా. శ్రుతుల కర్థము చెప్పునప్పుడు పూర్వాపరవాక్యముల సమన్వయ మెఱింగి యొండొంటికి విరోధము లేకుండ విమర్శింపఁదగిన సమర్థత లేక, యితరవాక్యములచేత ఖండితము లయ్యెడి పూర్వపక్షముల వాక్యముల నెత్తుకొని, తమ రనుకొన్న సంగతికి సిగ్గైన లేక ముడి పెట్టుచున్నారు. సంబంధింపఁ జూచుచున్నా రనుట.

అవ. అట్లు వాదించెడివారిని వరుసగా చెప్పంబూని యందు ప్రత్యక్షప్రమాణమే ముఖ్య మని యెంచెడి లోకాయతికుఁడు స్థూలభావము నొందియున్నాఁడు గాన నా విచారకీతిం దెల్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థాదిశరీరాంతసంఘాతస్యాత్మతాం జగుః,
లోకాయతాః పామరాశ్చ ప్రత్యక్షాభాసమాశ్రితాః. 60

వ్యా. తత్ర తావత్ప్రత్యక్షైకప్రమాణాభ్యుపగమే నాతిస్థూలత్వాల్లోకాయతాదిపక్షం ప్రథమతోఽనుభాషతే—కూటస్థాదీతి. ప్రత్యక్షసిద్ధత్వేన దేహాదేరాత్మత్వం పారమార్థికం స్యాదిత్యాశఙ్క్యోక్తం ప్రత్యక్షాభాస మితి.

టీ. లోకాయతాః = చార్వాకుఁడు మున్నగువారును, పామరాశ్చ = సాధుసేవయును శాస్త్రాభ్యాసమును లేనివారును, ప్రత్యక్షాభాసం=ప్రత్యక్షముగా భాసించెడు స్థూలశరీరమును, ఆశ్రితాః = అనుసరించినవా రగుచు, కూటస్థాదిశరీరాంతసంఘాతస్య—కూటస్థాది = కూటస్థుఁడు మొదలుగాఁగలిగి, శరీరాంత = శరీరమే అవసానముగాఁ గలిగిన, సంఘాతస్య = సమూహమునకు, ఆత్మతాం = ఆత్మత్వమును (ఆత్మభావమును), జగుః = చెప్పిరి.

తా. కొందఱు లౌకికులును, లోకాయతుఁడు మున్నగువారును స్థూలదేహము ననుసరించి కూటస్థుఁడు మొదలుకొని శరీరముదనుకను ముంకన్ట్టి సమూహమునే ఆత్మ యని నమ్ముచున్నారు.

అవ. ఆవాదులు స్వయముగాఁ బ్రత్యక్షమే ముఖ్యప్రమాణ మని వాదించెడువారైనను పరులను మోసముచేయ నెంచి తమమతమును శ్రుతిసిద్ధమైనమత మని తెలుపుటకు నచ్చుటచ్చుట కొన్ని శ్రుతివాక్యముల నుదాహరింతు రనుచున్నాఁడు:—

శ్లో. శ్రౌతీకర్తుం స్వపక్షం తే కోశమన్నమయం తథా,
విరోచనస్య సిద్ధాంతం ప్రమాణం ప్రతిజజ్ఞిరే. 61

వ్యా. తే ప్రత్యక్షైకప్రమాణవాదినోఽపి పరవ్యామోహనాయ స్వమతం శ్రుతిసిద్ధమితి దర్శయితుం వాక్యమప్యుదాహరంతీత్యాహ—శ్రౌతీకర్తుమితి. కోశమన్న

మయమితి శబ్దేనాన్నమయకోశప్రతిపాదకం. "స వా ఏష పురుషోఽన్నరసమయ" ఇత్యాదివాక్యం లక్ష్యతే విరోచనస్య సిద్ధాంతమితి. తత్సిద్ధాంతప్రతిపాదక "మాత్మైవ దేహమయ" ఇత్యాదివాక్యం లక్ష్యతే. ఏతద్వాక్యద్వయం ప్రమాణత్వేన ప్రతిజానంత ఏవ. న తూపపాదయితుం క్షమాః ప్రకరణవిరోధాదితి భావః.

టీ. తే=ఆలోకాయతాదులు, స్వపక్షం = తమమతమును, శ్రౌతీకర్తుం=శ్రుతిసమ్మతముగాఁ జేయుటకు, అన్నమయం = అన్నవికారమైన, కోశం=కోశమును, తథా=ఆప్రకారము, విరోచనస్య=విరోచనునియొక్క, సిద్ధాంతం = నిర్ణయమును, ప్రమాణం =ప్రమాణముగా, ప్రతిజజ్ఞిరే = గ్రహించిరి.

తా. ఆలోకాయతాదులు తమమతమును శ్రుతిసమ్మత మని తెల్పుటకు "స వా ఏష పురుషోఽన్నరసమయః" = ఆపరమాత్మ అన్నమయకోశ స్వరూపుఁడు అని యర్థము గల వాక్యమును "ఆత్మైవ దేహమయః" ఆత్మ దేహమయుం డని యీమొదలగు విరోచనుని సిద్ధాంతవాక్యములను సందర్భవిరుద్ధముగా తీసికొని యీయర్థమును చెప్పెదరు.

అవ. దేహమే యాత్మ యనెడి మతమునందలి దోషమును చూపుటకు నింకొక మతమును నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. జీవాత్మనిర్గమే దేహమరణస్యాత్ర దర్శనాత్,
దేహాతిరిక్త ఏవాత్మేత్యాహుర్లోకాయతాః పరే. 62

వ్యా. అస్మిన్ మతే దోషదర్శనపురస్సరం మతాంతర ముత్థాపయతి— జీవాత్మేతి.

టీ. పరే = మఱికొందఱైన, లోకాయతాః = లోకాయతులు, జీవాత్మనిర్గమే (సతి)=జీవాత్మ లేచిపోయిన దగుచుండఁగా, అత్ర=ఇచ్చట, దేహమరణస్య=స్థూలము పడిపోవుటయొక్క, దర్శనాత్ = ప్రత్యక్షమువలన, (దేహము పడిపోవుట ప్రత్యక్షముగా చూచుటవలన ననుట.) దేహాతిరిక్త ఏవ - దేహ = స్థూలదేహముకంటె, అతిరిక్త ఏవ = వేఱైనవాఁడె, ఆత్మా=ఆత్మ యని, ఆహుః = చెప్పుచున్నారు.

తా. లోకాయతులలోనే మఱికొందఱు జీవుఁడు ఈదేహమును విడిచి వెళ్లఁగానే యీదేహము మృతమై పోవుటను చూచుచున్నాముగాన దీనిని ఆత్మ యనుట యుక్తము కాదు. ఈదేహముకంటె ఆత్మ వేఱుగా నున్న దని యందురు.

అవ. పైకారణముచేత దేహముకన్న ఆత్మ వేఱైనది యనిన వారిని నిదిగో మేము స్థూలదేహమే యాత్మ యన దానికన్న వేఱుగా నీవుచెప్పిన యాత్మ యెట్టిది అని యాక్షేపించిన, దాని కింకొకవాది సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యక్షత్వేనాభిమతా ఽహంధీర్దేహాతిరేకిణం,
గమయే దింద్రియాత్మానం వచ్మీత్యాదిప్రయోగతః. 63

వ్యా. కీదృశో దేహాతిరిక్త ఆత్మా? కేన వా ప్రమాణేనావగమ్యతే? ఇత్యాశంకాయామాహ—ప్రత్యక్షత్వేనేతి. అహం వచ్మి పశ్యామిత్యాదిప్రయోగదర్శనాత్ దేహాతిరిక్తాహంబుద్ధిగమ్యానీంద్రియాణ్యాత్మేత్యర్థః.

టీ. వచ్మీత్యాదిప్రయోగతః = నేను చెప్పుచున్నాను అను మొదలగు ప్రయోగములను బట్టి, ప్రత్యక్షత్వేన = ప్రత్యక్షభావముచేత, అభిమతా = అంగీకరింపఁబడిన, అహంధీః = నే ననెడుబుద్ధి, దేహాతిరేకిణం = స్థూలదేహవ్యతిరిక్తుఁడైన, ఇంద్రియాత్మానం = ఇంద్రియస్వరూపుని, గమయేత్ = తెలియఁజేయును.

తా. నేను చెప్పుచున్నాను. నేను వెళ్లుచున్నాను. నేను చూచుచున్నాను. ఇట్టిప్రయోగములంబట్టి దేహముకంటె వేఱై నే ననెడిబుద్ధిచేత ప్రత్యక్షముగ తెలియఁబడు నింద్రియములే ఆత్మ అనఁగా బుద్ధిచేత పొందఁదగిన వాగాదీంద్రియములే ఆత్మ యని లోకాయతులలో కొందఱు చెప్పెద రని అభిప్రాయము.

అవ. ఇంద్రియము లచేతనములు గదా "అవి యాత్మ యగుట యెట్లు" అని ఆక్షేపింపఁగా నింద్రియములే ఆత్మ యనియెడువాది బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. వాగాదీనా మింద్రియాణాం కలహః శ్రుతిషు శ్రుతః,
తేన చైతన్యమేతేషా మాత్మత్వం తత ఏవ హి. 64

వ్యా. నన్వింద్రియాణామచేతనానాం కథమాత్మత్వమిత్యాశంక్య శ్రుతిష్వింద్రియ సంవాదశ్రవణాదచేతనత్వమసిద్ధమిత్యాహ—వాగాదీనామితి. చేతనత్వస్యైవాత్మలక్షణత్వాత్ చేతనానామింద్రియాణాం ఆత్మత్వముచితమిత్యాహ-ఆత్మత్వమితి.

టీ. శ్రుతిషు = వేదములయందు, వాగాదీనాం = వాక్కు మొదలైన, ఇంద్రియాణాం = ఇంద్రియములయొక్క, కలహః = వివాదము, శ్రుతః=వినఁబడుచున్నది. తేన = ఆహేతువుచేత, ఏతేషాం = ఈవాక్కు మొదలగు నింద్రియములకు, చైతన్యం = చేతనభావము, (అస్తి = కలదు). తత ఏవ హి = అందువలననే, ఆత్మత్వం = ఆత్మభావమును (అస్తి = కలదు).

తా. వేదవాక్యములయందు వాగాదీంద్రియములు తమలోఁ దాము కలహించిన ట్లున్నది. వానికి చేతనభావము లేనిచో కలహించుట సంభవము కాదు. ఇంద్రియమును చేతనము లని దానినిబట్టి యొప్పకతప్పదు గనుక ఆ చేతనములైన యింద్రియములే ఆత్మ యగును అని యిటు లొకానొకవాదిమతము.

అవ. మఱియొక హైరణ్యగర్భవాదివాదముఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. హైరణ్యగర్భాః ప్రాణాత్మ వాదిన స్త్వేవమూచిరే,
చక్షురాద్యక్షలోపేఽపి ప్రాణసత్త్వే తు జీవతి. 65

వ్యా. మతాంతరముత్థాపయతి—హైరణ్యగర్భా ఇతి.

టీ. ప్రాణాత్మవాదినః = ప్రాణవాయువే యాత్మ యని వాదించెడి, హైరణ్యగర్భాస్తు = హైరణ్యగర్భమతస్థులన్ననో, చక్షురాద్యక్షలోపేఽపి-చక్షురాది=నేత్రేంద్రియము మొదలైన, అక్ష = ఇంద్రియములయొక్క, లోపేఽపి=లోపము కలిగినను, ప్రాణసత్త్వే తు = ప్రాణము నిలిచియుండెనేని, జీవతి = బ్రతుకుచున్నాఁడు (ఇతి = అని), ఏవం = ఈప్రకారముగా, ఊచిరే = చెప్పిరి.

తా. నేత్రములు మొదలైన యింద్రియములకు సుషుప్త్యాద్యవస్థలందు లోపము గలిగినను పురుషుఁడు జీవించియుండుట మనము చూచుచున్నాము గనుక, ఇంద్రియము లాత్మ యనుట సరికాదు. మఱి యేమి యనిన, ప్రాణమే ఆత్మ యన నొప్పును అని హైరణ్యగర్భమతస్థులు చెప్పెదరు.

శ్లో. ప్రాణో జాగర్తి సుప్తేఽపి ప్రాణశ్రైష్ఠ్యాదికం శ్రుతం,
కోశః ప్రాణమయ స్సమ్యగ్విస్తరేణ ప్రపంచితః. 66

వ్యా. ప్రాణస్యాత్మత్వే శ్రౌతలింగాని దర్శయతి—ప్రాణ ఇతి. "ప్రాణాదయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి" ఇత్యాదినా ప్రాణజాగరణం శ్రూయతే. "తతః ప్రాణో ప్రసన్న ఉదతిష్ఠత్. తదుత్థమభవ త్తదేతదుక్థ" మితి. ప్రాణస్య శ్రైష్ఠ్యాదికం శ్రూయతే. "అన్యోఽంతర ఆత్మా ప్రాణమయ" ఇత్యాదినా ప్రాణమయకోశః ప్రపంచితః. ఆదిశబ్దేన ప్రాణసంవాదప్రవేశాదికం గ్రాహ్యమ్.

టీ. ప్రాణః=ప్రాణము, సుప్తేఽపి=నిదురించియున్నపుడును, జాగర్తి= నిలచి పని చేయుచున్నది. ప్రాణశ్రైష్ఠ్యాదికం=ప్రాణముయొక్క శ్రేష్ఠత్వసూచకమైనకథ, శ్రుతం=

వేదమందు వినఁబడుచున్నది. ప్రాణమయః = ప్రాణమయమైన, కోశః = కోశము, సమ్యక్ = స్పష్టముగా, విస్తరేణ = వివరముగా, ప్రపంచితః = (శ్రుతులయందు) చెప్పఁబడినది.

తా. నిదురించుచున్నప్పుడు తక్కిన యింద్రియము లన్నియు తమ తమ వ్యాపారములను మాని నిలిచియుండుతఱి ప్రాణవాయువు మాత్రము ఎడ తెఱపిలేక బుస్సుబుస్సు మని పనిచేయుచునే యున్నది. కనుక, ప్రాణము తక్కిన యింద్రియములకన్న గొప్పది యని యీ మొదలగు విషయములు శ్రుతియందు చెప్పఁబడుటవలన ప్రాణమే ఆత్మ యని హైరణ్యగర్భమతస్థులు పల్కుచున్నారు.

అవ. ప్రాణముకంటె అన్యము ఆత్మ యనువాదిమతము నుద్ఘాటించుచున్నాఁడు:—

శ్లో. మన ఆత్మేతి మన్యంత ఉపాసనపరా జనాః,
ప్రాణస్యాభోక్తృతా స్పష్టా భోక్తృత్వం మనసస్తతః. 67

వ్యా. ప్రాణాదప్యాంతరస్య మనసః ఆత్మత్వవాదినో మతం దర్శయతి—మన ఆత్మేతీతి. ప్రాణస్యానాత్మత్వే యుక్తిమాహ—ప్రాణస్యేతి.

టీ. ఉపాసనపరాః = ఉపాసనయం దాసక్తి కలిగిన, జనాః=ప్రజలు, మనః = మనస్సును, ఆత్మేతి = ఆత్మ యని, మన్యంతే = తలంచుచున్నారు. ప్రాణస్య = ప్రాణమునకు, అభోక్తృతా=భోక్తృత్వము లేకపోవుట, అనఁగా సుఖదుఃఖముల ననుభవింప లేకపోవుట, స్పష్టా=ఎల్లరకు విశదమే కదా, మనసః=మనస్సునకు, భోక్తృత్వం = సుఖదుఃఖముల ననుభవించుట, (అస్తి = కలదు). తతః = అందువలన.

తా. మఱియు నుపాసనచేయువారు ప్రాణమునకు భోక్తృత్వము లేకపోవుటయు, మనసునకు భోక్తృత్వ ముండుటయుం బరికించి మనంబె యాత్మ యగుట యుక్తియుక్త మని చెప్పుచున్నారు.

అవ. ఈవిషయమున నింకొక యుక్తియును చెప్పుచున్నాఁడు:—

శ్లో. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః,
శ్రుతో మనోమయః కోశస్తేనాత్మేతీరితం మనః. 68

వ్యా. మనస ఆత్మత్వే యుక్తిప్రతిపాదికాం శ్రుతిమాహ—మన ఏవేతి. "తస్మాద్వా ఏతస్మాత్ప్రాణమయాత్, అన్యోఽంతర ఆత్మా మనోమయః" ఇతి శ్రుత్యంతరం దర్శయతి—శ్రుత ఇతి. ఫలితమాహ—తేనేతి.

టీ. మనుష్యాణాం = మనుష్యులయొక్క, బంధమోక్షయోః = బంధమోక్షములకు, కారణం = హేతువైనది, మన ఏవ = మనస్సే అగును. మనోమయః = మనోమయమనెడి, కోశః=కోశము, శ్రుతః = వేదములయందు చెప్పఁబడియున్నది. తేన = ఆకారణముచేత, మనః=మనస్సు, ఆత్మేతి=ఆత్మ యని, ఈరితం=చెప్పఁబడుచున్నది.

తా. శ్రు. "తస్మాద్వా ఏతస్మాత్ ప్రాణమయాదన్యోఽంతర ఆత్మామనోమయః" అని ప్రాణముకంటె మనోమయకోశము వేఱైనదనియు బంధమోక్షములకు కారణమైన దనియు వేదమందు చెప్పఁబడియుండుటచేత మనోమయకోశమే ఆత్మ యని చెప్పవలయును. అని ఉపాసకులు వాదించుచున్నారు.

అవ. ఇఁక బౌద్ధుని వాదమును తెలుపుచున్నాఁడు:—

శ్లో. విజ్ఞానమాత్రేతి పర ఆహుః క్షణిక వాదినః,
యతో విజ్ఞానమూలత్వం మనసో గమ్యతే స్ఫుటమ్. 69

వ్యా. మనసోఽప్యాంతరస్య విజ్ఞానస్య ఆత్మత్వవాదినో బౌద్ధస్య మతం దర్శయతి—విజ్ఞానమితి. విజ్ఞానస్యాంతరత్వే యుక్తిమాహ—యత ఇతి.

టీ. పరే = మఱికొందఱైన, క్షణికవాదినః = క్షణికవాదులు, యతః = ఏకారణమువలన, మనసః = మనస్సునకు, విజ్ఞానమూలత్వం = విజ్ఞానమే కారణ మగుట, స్ఫుటం = స్పష్టముగా, గమ్యతే = తెలియఁబడుచున్నదో (తతః = ఆకారణమువలన,) విజ్ఞానం = విజ్ఞానమయకోశము అనఁగా బుద్ధి, ఆత్మేతి = ఆత్మ యని, ఆహుః = చెప్పుచున్నారు.

తా. బుద్ధి మనస్సునకు కారణమై యంతకంటె లోపలి దగుటచేత క్షణికవాదు లగు బౌద్ధులు విజ్ఞానమయకోశమే ఆత్మ యని చెప్పుచున్నారు.

అవ. మనోమయకోశమునకు విజ్ఞానమయకోశమునకు భేదము తెలుపఁబడుచున్నది:—

శ్లో. అహంవృత్తి రిదంవృత్తి రిత్యంతఃకరణం ద్విధా,
విజ్ఞానం స్యాదహంవృత్తి రిదంవృత్తిర్మనో భవేత్. 70

వ్యా. విజ్ఞానమనశ్శబ్దవాచ్యస్యాంతః కరణస్యైకత్వాత్కథం మనోవిజ్ఞానయోః కార్యకారణభావ ఇత్యాశంక్య త ముపపాదయితుం తయోర్భేదం తావద్దర్శయతి—అహంవృత్తిరితి.

టీ. అహంవృత్తిః = నే ననెడి వృత్తి స్వరూపముగను, ఇదంవృత్తిః = ఇది యనెడివృత్తి స్వరూపముగను, ఇతి = ఈవిధముగా, అంతఃకరణం = అంతరింద్రియము, ద్విధా = రెండుతెఱఁగులుగా నున్నది; అహంవృత్తిః = నే ననెడి వృత్తిస్వరూపము, విజ్ఞానం = బుద్ధి, స్యాత్ = అగును. ఇదంవృత్తిః = ఇది యనెడువృత్తిస్వరూపము, మనః = మనస్సు, భవేత్ = అగును.

తా. అంతరింద్రియము నే ననెడి వృత్తిరూపముగను, ఇది యనెడి వృత్తిరూపముగను ద్వివిధముగా నున్నది. నే ననెడి అంతఃకరణ వృత్తిని విజ్ఞాన మనియు ఇది యనెడి బాహ్యవృత్తిని మన స్సనియుఁ జెప్పుదురు. ఈ రెండింటికిని కార్యకారణభావము కూడ కలదు.

అవ. ఆ రెండింటికిని కార్యకారణభావమును తెల్పుచున్నాఁడు:—

శ్లో. అహంప్రత్యయబీజత్వ మిదంవృత్తే రితి స్ఫుటం,
అవిదిత్వా స్వమాత్మానం బాహ్యం వేత్తి నతు క్వచిత్. 71

వ్యా. తయోః కార్యకారణభావమాహ—అహం ప్రత్యయబీజత్వమితి. తదే వోపపాదయతి—అవిదిత్వేతి. అహంవృత్త్యుదయాభావే ఇదంవృత్త్యనుదయాదనయోః కార్యకారణభావ ఇత్యర్థః.

టీ. ఇదంవృత్తేః = ఇది యనెడి వృత్తికి, అహంప్రత్యయబీజత్వం = నే ననెడి వృత్తియే కారణముగాఁ గలిగి యుండుట, అతిస్ఫుటం=మిగులస్పష్టముగా తెలియుచునే యున్నది. స్వం = తానైన, ఆత్మానం = స్వరూపమును, అవిదిత్వా = తెలిసికొనక, బాహ్యం=బాహ్యవిషయమును, క్వచిత్తు = ఎన్నటికిని, న వేత్తి = తెలిసికొనఁజాలఁడు.

తా. ఇది యని వెలుపలనుండు వస్తువును గ్రహించెడి వృత్తికి నే ననెడి అంతఃకరణవృత్తియే కారణము. ఎప్పుడును నే ననెడి వృత్తి కలుగక ఇది యనే వృత్తి పుట్టఁజాలదు. ఇది యనే వృత్తి స్వరూపము గాఁగల మనస్సునకు నే ననెడి వృత్తిస్వరూపముగల బుద్ధి కారణ మగును. ఇందుచేత బుద్ధివృత్తియైన విజ్ఞానమయకోశము కారణ మనియుఁ మనోమయకోశము కార్య మనియు తెల్లంబగును.

అవ. బౌద్ధులలో నవాంతరభేదమగు క్షణికవిజ్ఞానవాదివాదమును చెప్పు చున్నాఁడు:—

శ్లో. క్షణే క్షణే జన్మనాశా వహంవృత్తేర్మితౌ యతః,
విజ్ఞానం క్షణికం తేన స్వప్రకాశం స్వతో మితేః. 72

వ్యా. తస్య విజ్ఞానస్య క్షణికత్వేఽనుభవం ప్రమాణయతి—క్షణే ఇతి. క్షణికత్వముపపాద్య స్వప్రకాశత్వ ముపపాదయతి—స్వప్రకాశమితి. స్వేనైవ ప్రమితత్వా దిత్యర్థః.

టీ. యతః = ఏహేతువువలన, క్షణేక్షణే = ప్రతిక్షణమునందును, అహం వృత్తేః=నేను అనెడి వృత్తికి, జన్మనాశౌ = ఉత్పత్తియు నాశమును, మితౌ = తెలియఁబడుచున్నవో, తేన = ఆహేతువుచేత, విజ్ఞానం = విజ్ఞానము, క్షణికం = క్షణకాలముందునది, స్వతః = స్వయముగా, మితేః = తెలియఁబడుటవలన, స్వప్రకాశం = స్వయంప్రకాశమానమును, (స్యాత్ =అగును.)

తా. విజ్ఞానవాది యను బౌద్ధులలో నొకతెగవారు నే ననెడి వృత్తికి ప్రతిక్షణమునందు నుత్పత్తియు నాశమును కనఁబడుచుండుట చేత నావిజ్ఞానము క్షణిక మనియు అనఁగా క్షణకాలము మాత్రముండు నది యనియు తనచేతనే తెలియఁబడుటవలన స్వయంప్రకాశరూప మగు ననియుం జెప్పుచున్నారు.

అవ. అట్టి విజ్ఞానవాది తనవాదమునకు బలకరముగ నుదాహరించెడి శ్రుత్యర్థమును విజ్ఞానమే యాత్మ యనుటను చెప్పుచున్నాఁడు:—

శ్లో. విజ్ఞానమయకోశోఽయం జీవ ఇత్యాగమా జగుః,
సర్వసంసార ఏతస్య జన్మనాశసుఖాదికః. 73

వ్యా. విజ్ఞానస్యాత్మత్వే ఆగమః ప్రమాణమిత్యాహ—విజ్ఞానమయేతి. * "తస్మాద్వా ఏతస్మాన్మనోమయాదన్యోఽంతర ఆత్మా విజ్ఞానమయ" "విజ్ఞానం యజ్ఞం తనుత" ఇత్యాదివాక్యం విజ్ఞానస్యాత్మత్వప్రతిపాదకమితి భావః.

టీ. అయం విజ్ఞానమయకోశః = ఈవిజ్ఞానమయకోశము, జీవ ఇతి = జీవుఁడని, ఆగమాః=వేదములు, జగుః=చెప్పుచున్నవి. జన్మనాశ సుఖాదికః - జన్మ=ఉత్పత్తియు, నాశ=మరణంబును, సుఖాదికః = సుఖము దుఃఖము మొదలుగాఁగల, సర్వసంసారః = సంసార మంతయు, ఏతస్య=ఈజీవునకు, (భవతి=కలుగుచున్నది.)

తా. శ్రుతి. "తస్మాద్వా ఏతస్మా న్మనోమయాత్, అన్యోంతర ఆత్మా విజ్ఞానమయః," "విజ్ఞానం యజ్ఞం తనుతే" ఈమొదలైనశ్రుతులు మనోమయకోశముకంటె వేఱుగా లోపల విజ్ఞానమయ మనెడి కోశము కల దనిఁయు, ఆ విజ్ఞానమయకోశమే జీవుఁ డనియు, విజ్ఞానముకే ఆత్మ భావమును శ్రుతులు చెప్పుచున్న వనియు విజ్ఞానమయుఁడే జీవుఁ

డనియు, వానికే ఈజననమరణరూప మగు సంసార మనియు క్షణిక విజ్ఞానవాదులగు బౌద్ధులు వాదింతురు.

అవ. ఆ బౌద్ధులలో అవాంతరభేదమైన శూన్యవాదివాదమును చెలుపు చున్నాఁడు:—

శ్లో. విజ్ఞానం క్షణికం నాత్మా విద్యుదభ్రనిమేషవత్,
అన్యస్యానుపలబ్ధత్వా చ్ఛూన్యం మాధ్యమికా జగుః. 74

వ్యా. బౌద్ధావాంతరభేదస్య శూన్యవాదినో మతం దర్శయతి—విజ్ఞానమితి.

టీ. విద్యుదభ్రనిమేషవత్ - విద్యుదభ్ర = మేఘమందలి మెఱపుయొక్క, నిమేషవత్=స్ఫురణమువలె, మెఱపు మెఱసినట్లనుట. క్షణికం = క్షణకాలముండునట్టి, విజ్ఞానం=విజ్ఞానము, న ఆత్మా=ఆత్మ కానేరదు. అన్యస్య=అన్యవస్తువు, అనుపలబ్ధత్వాత్ = తెలియఁబడకపోవుటవలన, (భావార్థకమగు హేత్వర్థపంచమికి పూర్వమందున షష్ఠీవిభక్తికి ప్రథమావిభక్త్యర్థము చెప్పవలయును.) శూన్యం=శూన్య మని, మాధ్యమికాః= మాధ్యమికు లనెడి బౌద్ధులు, జగుః=చెప్పెదరు.

తా. మేఘమునందు మెఱపు మెఱసి యంతలోననే నశించు నట్లు విజ్ఞానమును క్షణకాలములోనె పుట్టి నశించును గనుక నది ఆత్మ కాఁజాలదు. ఆవిజ్ఞానమునకన్న వేఱగువస్తు వింకొకటి కనఁబడ మిచే శూన్యమే పరిశేషించును గనుక శూన్యమే ఆత్మ యగును అని బౌద్ధులలో శూన్యవాదులు వాదించుచున్నారు.

అవ. ఇఁక నాశూన్యవాదులు తమ యభిప్రాయమే శ్రుతియందును గనుపట్టు చున్న దని చెప్పుచున్నారు.—

శ్లో. అస దేవేద మిత్యాదా విదమేవ శ్రుతం తతః,
జ్ఞానజ్ఞేయాత్మకం సర్వం జగద్భ్రాంతిప్రకల్పితమ్. 75

వ్యా. తత్ర శ్రుతి మాహ—అసదేవేదమితీతి. శూన్యస్యైవ తద్రూపత్వే ప్రతీయమానస్య జగతః కా గతిరిత్యత ఆహ—జ్ఞానేతి.

టీ. ఇదం = ఈజగత్తు, అసదేవ = సృష్టికి పూర్వము లేనే లేదు, ఇత్యాదౌ= ఈ మొదలగు శ్రుతిసమూహమందు, ఇదమేవ=ఈ శూన్యత్వమే, శ్రుతం=వినఁబడు చున్నది. తతః = అందువలన, సర్వం = సమస్తమైన, జ్ఞానజ్ఞేయాత్మకం = జ్ఞానస్వరూపము కలిగినట్టియు జ్ఞానముచే తెలియఁబడెడి స్వరూపము గలిగినట్టియు, సర్వం=సమస్త

మైన, జగత్=జగత్తు, భ్రాంతిప్రకల్పితం - భ్రాంతి = అజ్ఞానముచేత, ప్రకల్పితం = కల్పింపఁబడినది.

తా. మఱియు సృష్టికి పూర్వము ఈ ప్రపంచమంతయు శూన్యమై యుండె నని "అసదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అనెడి శ్రుతియు మావాదమునే చెప్పుచున్నది. కావున జ్ఞానరూపమును జ్ఞానముచే తెలియఁబడెడి స్వరూపమును గల యీ ప్రపంచమంతయు నజ్ఞానముచేత కల్పింపఁబడినది. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అనెడి శ్రుతిని మార్చి యసదేవ యని శ్రుతియం దున్న ట్లుచ్చరించుచు మాశూన్యవాదమునే శ్రుతి కూడ చెప్పిన దని శూన్యవాదులు వాదించెదరు.

అవ. ఇపుడు అద్వైతసిద్ధాంతి శూన్యమతమునందలి దోషమును నిరూపించు చున్నాఁడు:—

శ్లో. నిరధిష్ఠానవిభ్రాంతే రభావా దాత్మనోఽస్తితా,
శూన్యస్యాపి ససాక్షిత్వా దన్యథా నోక్తిరస్య తే. 76

వ్యా. తదేతన్మతం దూషయతి—నిరధిష్ఠానేతి. నిస్స్వరూపస్య శూన్యస్యాధిష్ఠానత్వాయోగాన్నిరధిష్ఠానస్య భ్రమస్యానుపపత్తే ర్జగత్కల్పనాధిష్ఠానస్యాత్మనః సత్తాభ్యుపగంతవ్యా. కించ శూన్యవాదినాపి శూన్యసాక్షిత్వే నావశ్యమాత్మాఽభ్యుపగంతవ్యః. అన్యథా తస్యానభ్యుపగమే అస్య శూన్యస్యోక్తి శ్శూన్యమిత్యభిధానం బౌద్ధస్య తవమతే న సిద్ధ్యేదితి భావః.

టీ. నిరధిష్ఠానవిభ్రాంతేః - నిరధిష్ఠాన=నిరాధారమైన, విభ్రాంతేః = భ్రాంతి యొక్క, అభావాత్ = లేకపోవుటవలన, ఆత్మనః = ఆత్మయొక్క, అస్తితా = ఉనికి, (భవతి = కలదు). జగత్కల్పనకు ఆధారమగు ఆత్మను నొప్పుకొని తీరవలయు ననుట. శూన్యస్యాపి = శూన్యమును, ససాక్షిత్వాత్ = సాక్షితో కూడియుండిన దగుటవలన, ఆత్మనః = శూన్యమునకు సాక్షియైన ఆత్మయొక్క (శూన్యమును తెలిసికొనెడి ఆత్మ యొక్క) అస్తితా = స్థితి, (భవతి = కలదు) అని పూర్వవాక్యముతో నన్వయము. అన్యథా = ఆత్మశూన్యమునకు సాక్షియై యున్న దని యొప్పుకొననియెడల, అస్య=ఈ శూన్యముయొక్క, ఉక్తిః=మాట, శూన్య మని చెప్పుట యనుట. తే=నీకు, న=కుదురదు.

తా. నిరాధార మగు భ్రాంతియుండుట యసంభవము. ఇది శూన్యము అని చెప్పువాఁడు ఆశూన్యమును తా నెఱిఁగి చెప్పవల

యగును. అట్లు శూన్యమును తెలిసికొనెడివాని నొకని నొప్పుకొనక తప్పదు. ఆశూన్యసాక్షియే ఆత్మ యగును కావున నీ జగత్కల్పనకు నాధారుం డగు ఆత్మవస్తు వున్న దని శూన్యవాది యొప్పనిచో శూన్య మనుమాటయే నోటితో ననుటకు సాధ్యము కాదు అని యద్వైత సిద్ధాంతి యావాదమును నొక్క యుక్తితోడనే ఖండించుచున్నాఁ డని భావము.

అవ. ఇంతవఱకు వేదబాహ్యములైన మతములను వారివారి వాదములను వర్ణించి చూపి వేదము నొప్పుకొని వాదించెడి వారివాదములం దెలుపఁబోవుచున్నాఁడు:—

శ్లో. అన్యో విజ్ఞానమయత ఆనందమయ ఆంతరః,
అస్తీత్యే వోపలబ్ధవ్య ఇతి వైదికదర్శనమ్. 77

వ్యా. కస్తర్హ్యాత్మేత్యత ఆహ—అన్య ఇతి. *"తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యోఽంతర ఆత్మానందమయః." "అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావే" నేతిచ శ్రుతి సద్భావాదానందమయః ఆత్మాభ్యుపగంతవ్య ఇతి వైదికదర్శనం వైదికసిద్ధాంతః.

టీ. విజ్ఞానమయతః = విజ్ఞానమయకోశముకంటె, అన్యః = వేఱైనట్టియు, ఆంతరః = లోపలిదై యుండునట్టియు, ఆనందమయః = ఆనందమయకోశము, అస్తీతి= ఉన్నదని, ఉపలబ్ధవ్య ఏవేతి = అంగీకరింపవలసినదే యని, వైదికదర్శనం - వైదిక = వేదము నొప్పినవారియొక్క, దర్శనం = సిద్ధాంత మగును.

తా. విజ్ఞానమయకోశముకంటె వేఱుగా లోపల నున్న ఆనంద మయకోశ మొకటి కల దని "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాదన్యోఽంతర ఆత్మానందమయః" అని శ్రుతి చెప్పుచున్నది గనుక, ఆనందమయ కోశము ఆత్మ యగు నని వైదికులు వాదించుచున్నారు.

అవ. ఇంతకు పూర్వము ఆత్మస్వరూపవిషయమైన వివాదమును తెలిపి యింక మీఁదట ఆత్మపరిమాణమునుగుఱించిన వివాదమును తెలియఁజేయుచున్నాఁడు:—

శ్లో. అణు ర్మహా న్మధ్యమో వేత్యేవం తత్రాపివాదినః,
బహుధా వివదంతేహి శ్రుతియుక్తిసమాశ్రయాత్. 78

వ్యా. ఏవమాత్మస్వరూపే విప్రతిపత్తిం ప్రదర్శ్య తత్పరిమాణ విశేషేఽపివాది విప్రతిపత్తిం దర్శయతి—అణురితి.

టీ. అణుః = అణుపరిమాణుఁడా, మహాన్ = పరిమాణరహితమైనవాఁడా, మధ్యమో వేతి=మధ్యమపరిమాణముగలవాఁడా యని, ఏవం = ఇట్లు, తత్రాపి = ఆపరి

మాణవిషయమునందును, వాదినః = వాదించెడువారు, శ్రుతియుక్తిసమాశ్రయాత్ - శ్రుతియుక్తి = వేదప్రమాణము ననుసరించిన యుక్తులయొక్క, సమాశ్రయాత్ = ఆధారమువలన, బహుధా = పలువిధములుగా, వివదంతే హి = వివాద పడుచున్నారు గదా.

తా. ఆత్మయొక్క పరిమాణమునుగుఱించి కొందఱు అణుపరిమాణము గలవాఁ డనియు, మఱికొందఱు అట్లు కాదు ఏపరిమాణమును లేనివాఁ డనియు, నింక కొందఱు మధ్యమపరిమాణము గలవాఁ డనియు వేదమందలి యుక్తుల నాధారపఱచుకొని వివాదపడుచున్నారు.

అవ. అణుపరిమాణవాదులు వాదించెడి వాదమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. అణుం వదంత్యాంతరాళా సూక్ష్మనాడీప్రచారతః,
రోమ్ణ స్సహస్రభాగేన తుల్యాసు ప్రచరత్యయమ్. 79

వ్యా. అత్రాణుత్వవాదినస్తావ ద్దర్శయతి—అణుమితి. అణుత్వాభిధానే హేతుమాహ—సూక్ష్మేతి. తదుపపాదయతి—రోమ్ణ ఇతి. నాడీష్వితి శేషః. సూక్ష్మాసు నాడీషుసంచారోఽణుత్వమంతరేణ న ఘటత ఇత్యభిప్రాయః.

టీ. అంతరాళాః = అణుపరిమాణవాదులలోనివారు, సూక్ష్మనాడీప్రచారతః - సూక్ష్మ=బహుసన్నని, నాడీ=నాడులయందు, ప్రచారతః=సంచరించుటవలన, అణుం = అణుపరిమాణముగలవానినిగా, (ఆత్మ పరమాణువంత యనుట), వదంతి=చెప్పుచున్నారు. అయం=ఈయాత్మ, రోమ్ణః = వెండ్రుకలో, సహస్రభాగేన = సహస్రాంశముతో, తుల్యాసు = సమానములైన, (నాడీషు = సూక్ష్మనాడులయందు), ప్రచరతి=సంచరించుచున్నాఁడు.

తా. అణుపరిమాణవాదులలో కొంద ఱిట్లు కొన్నియుక్తులు చెప్పుచున్నారు. అవి ఏవి యనఁగా ఆత్మ వెయ్యవపాలు అయిన బహు సూక్ష్ములైన సన్నని నాడులలో సంచరించుచున్నాఁడు. అంత సూక్ష్మమైనవాఁడు ఆత్మ కాకపోయినట్లైన అట్టివానియందు సంచరించుట సంభవింపనేరదు. కాఁబట్టి ఆత్మ పరమాణు వంత పరిమాణము గలవాఁడగును అని చెప్పుదురు.

అవ. తమవాదమునకు ననుకూలమగు కొన్ని శ్రుతులను నుగ్గడించుచున్నారు:—

శ్లో. అణోరణీయానేషోఽణు స్సూక్ష్మా త్సూక్ష్మతరం త్వితి,

అణుత్వమాహు శ్శ్రుతయ శ్శతశోఽథ సహస్రశః. 80

వ్యా. అణుత్వే కిం ప్రమాణమిత్యత ఆహ—అణోరితి. *"అణోరణీయా న్మహతో మహీయాన్ ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః." "సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్య" మిత్యాదిశ్రుతయ ఇత్యర్థః.

టీ. ఏషః = ఈయాత్మ, అణుః=అణువంతవాఁడును, అణోః = అణువుకంటె, అణీయాన్=సూక్ష్మమైన పరమాణు వంతవాఁడును, సూక్ష్మాత్=సూక్ష్మముకంటె, సూక్ష్మతరం త్వితి=మఱింత సూక్ష్మమైయున్న వాఁ డని, శతశః = నూఱులకొలఁదియు, అథ = అట్లు గాక, సహస్రశః = వేనవేలు సంఖ్యగల, శ్రుతయః = శ్రుతులు, అణుత్వం = అణుపరిమాణము కలిగియుండుటను, ఆహుః = చెప్పుచున్నవి.

తా. ఆపరమాణువాదులు "శ్రు. అణోరణీయాన్ మహతో మహీయాన్" "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః," "సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం" ఈ మొదలైన యనేకశ్రుతులు ఆత్మను అణుపరిమాణము గలవానినిగా చెప్పుచున్న వని నిరూపించుచున్నారు.

శ్లో. వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ,
భాగో జీవస్స విజ్ఞేయ ఇతి చాహాపరా శ్రుతిః. 81

వ్యా. శ్రుత్యంతర ముదాహరతి—వాలాగ్రేతి.

టీ. సః జీవః = ఆజీవుఁడు, శతధాకల్పితస్య = నూఱుచీలికలుగా చేయఁబడిన, వాలాగ్రశతభాగస్య-వాలాగ్ర = వెంట్రుకకొనయొక్క, శతభాగస్య = నూఱవపాలుయొక్క, భాగః=పరిమాణముగలవాఁడని, విజ్ఞేయ ఇతి=తెలియఁదగినవాఁ డని. అపరా= మఱియొక్కటైన, శ్రుతిశ్చ = శ్రుతియు, ఆహ = చెప్పెను.

తా. ఆత్మ యణుపరిమాణ మని చెప్పెడివారు జీవునిపరిమాణమును చెప్పుటలో నొక వెంట్రుకకొనను నూఱుచీలికలుగా చీల్చిన ాఱవ అంశము ఎంత సూక్ష్మముగా నుండునో జీవుఁ డంత పరిమాణముగలవాఁ డని శ్లోకమందు చెప్పఁబడిన "వాలాగ్రశతభాగస్య" ను మొదలైన శ్రుతి నుదాహరించి తా మనిన యణుత్వమును దృఢపఱుచుచున్నారు.

అవ. ఇఁక బౌద్ధులలో నొక తెగవారైన దిగంబరులయొక్క వాక్యమును చెప్పు చున్నాఁడు:—

శ్లో. దిగంబరా మధ్యమత్వమాహు రాపాదమస్తకం,

చైతన్యవ్యాప్తిసంస్దృష్టే రానఖాగ్రశ్రుతేరపి. 82

వ్యా. మధ్యమపరిమాణవాదినో మతం దర్శయతి—దిగంబరా ఇతి. తత్రోపపత్తిమాహ—ఆపాదేతి. *"స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్య" ఇతి శ్రుతి రప్యత్ర ప్రమాణ మిత్యాహ—ఆనఖాగ్రేతి.

టీ. దిగంబరాః = దిగంబరు లను బౌద్ధవాదులు, ఆపాదమస్తకం = పాదములు మొదలు శిరస్సువఱకును, చైతన్యవ్యాప్తిసందృష్టేః = చైతన్యవ్యాప్తి కనిపించుటవలనను, ఆనఖాగ్రశ్రుతేరపి - ఆనఖాగ్ర = గోటిచివరవఱకును (చైతన్యవ్యాప్తి గలదు) అనెడి శ్రుతియుండుటవలనను, మధ్యమత్వం=ఆత్మకు మధ్యమపరిమాణము కలుగుటను, ఆహుః = చెప్పిరి.

తా. చైతన్యము కరుగునఁబోసిన బంగారమువలె నెక్కడ నొక్కి చూచినను కాలిబొటనవ్రేలు మొదలుకొని శిరస్సువఱకు వ్యాపించుట యనుభవముచే తెలియఁబడుచుండుటవలనను, శ్రుతి. "స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" అని ఈ ఆత్మ కాలిగోటికొన మొదలుకొని శిరస్సుపర్యంతము ఈ శరీరమునందు ప్రవేశించియున్నాఁ డని శ్రుతిలో నుండుటవలనను దిగంబరులు ఆత్మ మధ్యమపరిమాణము గల దని వాదింతురు.

అవ. దిగంబరులవాదము ననుసరించి ఆత్మ దేహ మెంతదియో ఆత్మ యంతది యని చెప్పవల మనిన నొక యసందర్భ మిందు కనఁబడుచున్నది. అది ఎద్ది యనిన ఆత్మ సూక్ష్మనాడులయందు సంచరించునని కూడ శ్రుతియందుఁ జెప్పఁబడినదే. మధ్యమపరిమాణము గలదియైనచో నాడులయందు సంచరించుట యెట్లు పొసఁగును అనెడి శంకకు సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. సూక్ష్మనాడీప్రచారస్తు సూక్ష్మై రవయవై ర్భవేత్,
స్థూలదేహస్య హస్తాభ్యాం కంచుక ప్రతిమోకవత్. 83

వ్యా. నను మధ్యమపరిమాణత్వే శ్రుతిసిద్ధో నాడీప్రచారో న ఘటత ఇత్యాశంక్యాహ—సూక్ష్మనాడీతి. యథా దేహావయవయోర్హస్తయోః కంచుకప్రవేశేన దేహస్య కంచుక ప్రవేశ స్తద్వదాత్మావయవానాం సూక్ష్మాణాం నాడీషు ప్రచారేణాత్మనోఽపి ప్రచార ఉపచర్యత ఇత్యర్థః.

టీ. హస్తాభ్యాం = రెండుచేతులచేత, స్థూలదేహస్య=స్థూలదేహమునకు, కంచుకప్రతిమోకవత్ = చొక్కా తొడుగుకొనినట్లు, సూక్ష్మనాడీప్రచారస్తు - సూక్ష్మ=సన్న

దైన, నాడీ=నాడులయందు, ప్రచారస్తు = సంచరించుటయైతే, సూక్ష్మైః = సూక్ష్మము లైన, అవయవైః = అవయవములచేత, భవేత్ = అగును.

తా. చేతులయందు చొక్కాను తొడుగుకొన్న, దేహామునకు చొక్కా చేరియుండినట్లు ఆత్మయొక్క సూక్ష్మావయవములైన నాడుల యందు సంచారము కలుగుటవలన ఆత్మకును సంచారము నాడుల యందు కలిగినట్లే యగు నని దిగంబరులు సమాధానము చెప్పుదురు.

శ్లో. న్యూనాధికశరీరేషు ప్రవేశోఽపి గమాగమైః,
ఆత్మాంశానాం భవేత్తేన మధ్యమత్వం వినిశ్చితమ్. 84

వ్యా. నన్వాత్మనో నియతమధ్యమపరిమాణత్వే కర్మవశాన్న్యూనాధికశరీర ప్రవేశో న ఘటత ఇత్యాశంక్యావయవాగమాపాయాభ్యామాత్మనో నియతమధ్యమపరి మాణత్వాద్దేహావదుభయం న విరుధ్యత ఇత్యాహ—న్యూనాధికేతి, ఫలితమాహ— తేనేతి.

టీ. న్యూనాధికశరీరేషు = చిన్నశరీరములయందును పెద్దశరీరములయందును, ప్రవేశోఽపి=ప్రవేశంబును, ఆత్మాంశానాం-ఆత్మ=ఆత్మసంబంధములైన, అంశానాం = భాగములయొక్క (అవయవములయొక్క), గమాగమైః = ఉత్పత్తివినాశములచేత, భవేత్=అగును. తేన=ఆకారణముచేత, మధ్యమత్వం=మధ్యమపరిమాణము కలదియగుట, వినిశ్చితం = నిర్ణయింపఁబడినది.

తా. ఆత్మ నియతముగా మధ్యమపరిమాణము గలదియే యైన యెడల సుకృతదుష్కృతకర్మవశమున నొకప్పుడు పెద్దశరీరము వచ్చు టయు నొకప్పుడు మఱి చిన్నదిశరీరము వచ్చుటయును ఘటింపదే యనెదవేమో. గొప్పశరీరముగాని కొద్దిశరీరముగాని వచ్చునపుడు ఆత్మయొక్క అవయవములకు నుత్పత్తినాశము లుండుటచేత ఆయా శరీరములందు ప్రవేశము కుదురవచ్చును. అందుచేత మధ్యమపరిమా ణము గలది ఆత్మ యగుచున్న దని మే మన్న మాటలో లోపము లేదు. అని దిగంబరులు చెప్పెదరు.

అవ. ఇప్పుడు అద్వైతసిద్ధాంతి మధ్యమపరిమాణవాదిని ఆక్షేపించు చున్నాఁడు:—

శ్లో. సాంశస్య ఘటవన్నాశో భవత్యేవ తథా సతి,
కృతనాశాకృతాభ్యాగమయోః కో వారకో భవేత్. 85

వ్యా. ఆత్మనస్సావయవత్వే ఘటాదివదనిత్యత్వప్రసంగే నైతత్ దూషయతి— సాంశస్యేతి. భవతు; కో దోష స్తత్రాహ—తథా సతీతి. కృతయోః పుణ్యాపాపయో ర్భోగమంతరేణ నాశః. అకృతయోరకస్మాత్ ఫలదాతృత్వమకృతాభ్యాగమః. ఏతద్దోష ద్వయమాత్మనో ఽనిత్యత్వాభ్యుపగమే భవేదితి భావః.

టీ. సాంశస్య = అవయవములతోఁ గూడిన (సావయవపదార్థమైనయనుట) ఆత్మకు, ఘటవత్=ఘటమునకు వలె, నాశః = వినాశము, భవత్యేవ = కలుఁగనే కలుగు చున్నది. తథాసతి = అట్లు ఆత్మకు నాశము నంగీకరించినయెడల, కృతనాశాకృతా భ్యాగమయోః - కృత = చేయఁబడిన పుణ్యాపాపములయొక్క, నాశ = నశించిపోవుట యును, అకృత = తనచేతఁ జేయఁబడని పుణ్యాపాపములయొక్క, అభ్యాగమయోః = ప్రాప్తించుటయును, వారకః = నివారించెడువాఁడు, కః = ఎవ్వఁడు, భవేత్=ఉండును? (నివారించెడువాఁ డెవ్వఁడును నుండఁ డనుట).

తా. పై శ్లోకమువలన ఆత్మ సావయవపదార్థమైనట్లు దిగంబర వాది యనిన మాటలోని తప్పు చక్కఁగా గమనింపవలయును. ఆత్మ సావయవపదార్థ మని యొప్పితివేని, అట్టి ఆత్మ ఘటాదులవలె నశింప వలసివచ్చును. నశింపనీ యందువేమో? ఆత్మ నశించినట్లైతే ఒక దేహ ముతో చేసిన పుణ్యాపాపము లా దేహముతోడనే నశించిపోవును. ఇది యొక తప్పు. దీనిని కృతనాశ మనెడి దోషముగాఁ జెప్పెదరు. పూర్వము జన్మయు పుణ్యాపాపకర్మయు లేకపోవుటచేత ఆజన్మలో సుకృత దుష్కృతములయొక్క కార్యములైన సుఖదుఃఖములు నిర్నిమిత్తము గావచ్చుట రెండవతప్పు. దీనిని అకృతాభ్యాగమదోష మనెదరు. ఈ రెండు దోషములును దిగంబరసిద్ధాంతిపైని బ్రహ్మాస్త్రమువలె పడు చున్నవి. వీనిని అనఁగా ఈ రెండు దోషములను వారించుట కెవరి కిని సాధ్యము కా దని భావము. అనఁగా ఆత్మ కనిత్యత్వము నంగీక రించినయెడల ఈ రెండుదోషములును సంభవించు నని భావము.

అవ. పైరీతిగా ఆత్మ యణుపరిమాణుఁ డనుటయు, మధ్యమపరిమాణుఁ డను టయు నను రెండుపక్షములును సరిగా లేవు. ఆత్మ ఆకాశమువలె నిరవయవమును వ్యాప కము ననుట యుక్త మనుచున్నాఁడు:—

శ్లో. తస్మాదాత్మా మహానేవ నైవాణుర్నాపి మధ్యమః,
ఆకాశవ త్సర్వగతో నిరంశ శ్శ్రుతిసమ్మతః. 86

స్వరూపుఁ డనియు, చిద్రూపః = జ్ఞానస్వరూపుఁ డనియు, చిదచిద్రూపః=జ్ఞానాజ్ఞానస్వరూపుఁ డనియు, ఇత్యపి = ఇట్టివిధముగా, బహుధా=బహువిధములుగా, కలహం = వివాదమును, యయుః=పొందిరి. (వాదినః=వాదు లని యధ్యాహార్యము), ప్రాభాకరాః= మీమాంసకులును, తార్కికాశ్చ=తార్కికులును, అస్య = ఇతనికి, (ఆత్మకు), అచిదాత్మతాం=అచిద్రూపత్వమును, (జడరూపత్వమును), ప్రాహుః=చెప్పుచున్నారు. ఆత్మా = ఆత్మ, ఆకాశవత్ = ఆకాశమువలె, ద్రవ్యం = ద్రవ్య మనియు, శబ్దవత్=ఆకాశగుణమైన శబ్దమువలె, చితిః = జ్ఞానము, తద్గుణః = ఆయాత్మగుణ మనియు, (ప్రాహుః = చెప్పుచున్నారు), అని పూర్వవాక్యముతో నన్వయము.

తా. వాదులు పైవిధముగ వాదించి యటుతర్వాత ఆయాత్మస్వరూప మెట్టి దని చర్చించుటలో కొందఱు ఆత్మ జడస్వరూపుఁ డనియును, మఱికొందఱు జ్ఞానస్వరూపుఁ డనియును, ఇంక కొందఱు జ్ఞానాజ్ఞానస్వరూపుఁ డనియును వివాదపడిరి. అట్టివాదులలో ప్రాభాకరమతస్థులును తార్కికులును ఆత్మ యాకాశమువలె ద్రవ్యము, ఆకాశగుణమైనశబ్దమువలె జ్ఞానమును ఆత్మగుణము అగుచున్నది. ఇందుచేత ఆత్మ జడస్వరూపుఁ డగును అని వాదించిరి.

అవ. ఆత్మయొక్క విశేషగుణములను వివరించుచున్నాఁడు:—

శ్లో. ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చ ధర్మాధర్మౌ సుఖాసుఖే,
తత్సంస్కారాశ్చ తస్యైతే గుణాశ్చితివదీరితాః. 39

వ్యా. తస్యైవ విశేషగుణాంతరాణ్యాహ—ఇచ్ఛేతి. తత్సంస్కారాః భావనాః.

టీ. ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చ - ఇచ్ఛా = కోరికయు, ద్వేష = ద్వేషమును, ప్రయత్నాశ్చ = ప్రయత్నమును, ధర్మాధర్మౌ=ధర్మమును అధర్మమును, సుఖాసుఖే = సుఖమును దుఃఖమును, తత్సంస్కారాశ్చ-తత్ = వానియొక్క, సంస్కారాశ్చ=వాసనలును, ఏతే = ఇవి, చితివత్ = జ్ఞానమువలె, గుణాః = ఆత్మగుణము లని, ఈరితాః= చెప్పఁబడుచున్నవి.

తా. కోరిక, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సుఖము, దుఃఖము, వీనివాసనలును జ్ఞానమువలెనే ఆత్మగుణము లని ప్రాభాకరాదులు చెప్పెదరు.

వ్యా. అతః పరిశేషాదాత్మనో విభుత్వం సిద్ధమిత్యాహ—తస్మాదితి. తత్ర ప్రమాణమాహ—ఆకాశవదితి. *ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" "నిష్కలం నిష్క్రియ" మిత్యాద్యాగమః ప్రమాణమిత్యర్థః.

టీ. తస్మాత్ = ఆకారణమువలన, ఆత్మా = పరమాత్మ, మహాన్నైవ = పరిమాణరహితుఁడును, అణుః = అణుపరిమాణుఁడును, నైవ = ఎంతమాత్రము కాఁడు, మధ్యమోఽపి = మధ్యమపరిమాణము కలవాఁడును, న = కాఁడు, ఆకాశవత్ = ఆకాశమువలె, సర్వగతః = అంతట వ్యాపించినవాఁడును, నిరంశః = అవయవములు లేనివాఁడును, (ఇతి = అని), శ్రుతిసమ్మతః = వేదమందు చెప్పఁబడియున్నది.

తా. శ్రు. "ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః, నిష్కళం నిష్క్రియం శాంతం" అనఁగా ఆత్మ ఆకాశమువలె వ్యాపకుఁడును, నిత్యుఁడును, నిరవయవుఁడును, నిష్క్రియుఁడును శాంతుఁడును అయియున్నాఁడు, అని శ్రుతి చెప్పుచుండుటవలన ఆత్మ అణుపరిమాణము గలదియు మధ్యమపరిమాణము గలదియు ఎంతమాత్రము కానేరదు. దీనిచేత ఆత్మకు విభుత్వము (వ్యాకపకత్వము) సిద్ధించిన దని యెఱుంగవలయును.

అవ. పైవిధముగా ఆత్మకు విభుత్వమును (వ్యాపకత్వమును) నిర్ణయించి చిద్రూపత్వమును సాధింప నెంచి యీ విషయమగు వివాదములను తెల్పఁబోవుచున్నాఁడు:—

శ్లో. ఇత్యుక్త్వా తద్విశేషే తు బహుధా కలహం యయుః,
అచిద్రూపోఽథ చిద్రూప శ్చిదచిద్రూప ఇత్యపి. 87
ప్రాభాకరాస్తార్కికాశ్చ ప్రాహురస్యాచిదాత్మతాం,
ఆకాశవ ద్ద్రవ్యమాత్మా శబ్దవ త్తద్గుణస్థితిః. 88

వ్యా. ఏవమాత్మనో విభుత్వం ప్రసాధ్య, తస్య చిద్రూపత్వం నిశ్చేతుం తావద్వాదివిప్రతిపత్తిం దర్శయతి—ఇత్యుక్త్వేతి.

అచిద్రూపత్వవాదినో మతం దర్శయతి—ప్రాభాకరా ఇతి—తత్ప్రక్రియామనుభాషతే ఆకాశవద్ద్రవ్యమితి. ఆత్మా ద్రవ్యం భవితుమర్హతి. గుణవత్త్వాదాకాశవదిత్యనుమానం సూచితం ఆత్మా పృథివ్యాదిభ్యో భిద్యతే జ్ఞానగుణకత్వాత్. యత్పృథివ్యాదిభ్యో న భిద్యతే తత్ జ్ఞానగుణకమపి న భవతి. యథా పృథివ్యాదీత్యనుమానం ద్రష్టవ్యం.

టీ. ఇతి = ఈప్రకారము, ఉక్త్వా = చెప్పి, అథ = తర్వాత, తద్విశేషే తు-తత్ = ఆయాత్మయొక్క, విశేషే తు = స్వరూపవిశేషమందైతే, అచిద్రూపః = జడ

స్వరూపుఁ డనియు, చిద్రూపః = జ్ఞానస్వరూపుఁ డనియు, చిదచిద్రూపః=జ్ఞానాజ్ఞాన స్వరూపుఁ డనియు, ఇత్యపి = ఇట్టివిధముగా, బహుధా=బహువిధములుగా, కలహం = వివాదమును, యయుః=పొందిరి. (వాదినః=వాదు లని యధ్యాహార్యము), ప్రాభాకరాః= మీమాంసకులును, తార్కికాశ్చ=తార్కికులును, అస్య = ఇతనికి, (ఆత్మకు), అచిదాత్మతాం=అచిద్రూపత్వమును, (జడరూపత్వమును), ప్రాహుః=చెప్పుచున్నారు. ఆత్మా = ఆత్మ, ఆకాశవత్ = ఆకాశమువలె, ద్రవ్యం = ద్రవ్య మనియు, శబ్దవత్=ఆకాశగుణమైన శబ్దమువలె, చితిః = జ్ఞానము, తద్గుణాం = ఆయాత్మగుణ మనియు, (ప్రాహుః = చెప్పుచున్నారు), అని పూర్వవాక్యముతో నన్వయము.

తా. వాదులు పైవిధముగ వాదించి యటుతర్వాత ఆయాత్మస్వరూప మెట్టి దని చర్చించుటలో కొందఱు ఆత్మ జడస్వరూపుఁ డనియును, మఱికొందఱు జ్ఞానస్వరూపుఁ డనియును, ఇంక కొందఱు జ్ఞానాజ్ఞానస్వరూపుఁ డనియును వివాదపడిరి. అట్టివాదులలో ప్రాభాకరమతస్థులును తార్కికులును ఆత్మ యాకాశమువలె ద్రవ్యము, ఆకాశగుణమైనశబ్దమువలె జ్ఞానమును ఆత్మగుణము అగుచున్నది. ఇందుచేత ఆత్మ జడస్వరూపుఁ డగును అని వాదించిరి.

అవ. ఆత్మయొక్క విశేషగుణములను వివరించుచున్నాఁడు:—

శ్లో. ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చ ధర్మాధర్మౌ సుఖాసుఖే,
తత్సంస్కారాశ్చ తస్యైతే గుణాశ్చితివదీరితాః. 89

వ్యా. తస్యైవ విశేషగుణాంతరాణ్యాహ—ఇచ్ఛేతి. తత్సంస్కారాః భావనాః.

టీ. ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చ - ఇచ్ఛా = కోరికయు, ద్వేష = ద్వేషమును, ప్రయత్నాశ్చ = ప్రయత్నమును, ధర్మాధర్మౌ=ధర్మమును అధర్మమును, సుఖాసుఖే = సుఖమును దుఃఖమును, తత్సంస్కారాశ్చ-తత్ = వానియొక్క, సంస్కారాశ్చ=వాసనలును, ఏతే = ఇవి, చితివత్ = జ్ఞానమువలె, గుణాః = ఆత్మగుణము లని, ఈరితాః= చెప్పఁబడుచున్నవి.

తా. కోరిక, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సుఖము, దుఃఖము, వీనివాసనలును జ్ఞానమువలెనే ఆత్మగుణము లని ప్రాభాకరాదులు చెప్పెదరు.

అవ. ఈగుణములకు ఉత్పత్తివినాశములకు కారణము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మనో మనసా యోగే స్వాదృష్టవశతో గుణాః,
జాయంతే ఽథ ప్రలీయంతే సుషుప్తేఽదృష్టసంక్షయాత్. 90

వ్యా. ఏషాం గుణానాముత్పత్తివినాశకారణమాహ—ఆత్మన ఇతి. స్వాదృష్ట వశత ఆత్మనో మనసా యోగ ఇత్యన్వయః.

టీ. స్వాదృష్టవశతః = తన యదృష్టవశమున, ఆత్మనః = ఆత్మకు, మనసా = మనస్సుతో, యోగే సతి = సంబంధము కలిగినప్పుడు, గుణాః = కొన్ని గుణములు, జాయంతే = పుట్టుచున్నవి. సుషుప్తే = గాఢనిద్రయందు, అదృష్టసంక్షయాత్ = అదృష్టము నశించుటవలన, అథ = తర్వాత, ప్రలీయంతే = లయము పొందు చున్నవి.

తా. తన యదృష్టమునుబట్టి ఆత్మకు మనస్సుతో సంబంధము కలిగినప్పుడు కొన్ని గుణములు పుట్టి యవి యన్నియు అదృష్టము క్షీణించుటవలన లయించుచున్న వని ప్రాభాకరాదు లనిరి.

అవ. ఆత్మ జడస్వరూపుఁడైనయెడల చేతనుఁడగు టెట్లు? అను ప్రశ్నకు సమా ధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. చితిమత్త్వాచ్చేతనోఽయమిచ్ఛాద్వేషప్రయత్నవాన్,
స్యాద్ధర్మాధర్మయోః కర్తా భోక్తా దుఃఖాదిమత్త్వతః. 91

వ్యా. ఆత్మనోఽచిద్రూపత్వే కథం చేతనత్వాభ్యుపగమ ఇత్యాశంక్య చితి మత్త్వాదిత్యాహ—చితిమత్త్వాదితి. ఆత్మనశ్చేతనత్వే హేత్వంతరమాహ—ఇచ్ఛేతి. తస్యేశ్వరాద్వైలక్షణ్యమాహ—స్యాదితి.

టీ. అయం = ఈయాత్మ, ఇచ్ఛాద్వేషప్రయత్నవాన్ - ఇచ్ఛా = కోరికయు, ద్వేష=విరోధమును, ప్రయత్నవాన్ = పూనికయుఁ గలవాఁడగుచు, చితిమత్త్వాత్ = జ్ఞానగుణముగలవాఁడగుటవలన, చేతనః=చేతనుఁడు, స్యాత్ =అగును. ధర్మాధర్మయోః= పుణ్యపాపములను, కర్తా = చేయువాఁడగుచు, దుఃఖాదిమత్త్వతః = దుఃఖమును సుఖ మును గలవాఁడగుటవలన, భోక్తా = పుణ్యపాపకర్మలయొక్క ఫలము ననుభవించెడు వాఁడు, స్యాత్ = అగును.

తా. ఆత్మ రాగము ద్వేషము ప్రయత్నము మొదలైనజ్ఞానగుణ ములు గలిగియుండుటచే చేతనుఁడనియు పుణ్యపాపములను గలిగిం చెడి ధర్మాధర్మములను చేయువాఁడగుచు కర్తయు కర్మఫలమైన సుఖదుః ఖాదులను అనుభవించెడివాఁడగుటచేత భోక్తయు నగు నని చెప్పఁ

బడుచున్నాఁడు. కర్తృత్వభోక్తృత్వరాగద్వేషాదులు గల ఆత్మ ఈశ్వరునికంటె వేఱగు నని యు చెప్పఁబడును.

అవ. ఆత్మ సర్వగతుఁడంటివే; ఆయాత్మకు లోకాంతరగమనము సిద్ధింపదు గదా అని యంటివేని చెప్పెద వినుము:—

శ్లో. యథాఽత్ర కర్మవశతః కాదాచిత్కం సుఖాదికం,
తథా లోకాంతరే దేహే కర్మణేచ్ఛాది జన్యతే. 92

వ్యా. నన్వాత్మనో విభుత్వే లోకాంతరగమనాదికం కథం ఘటేతేత్యాశంక్యాస్మిన్ దేహే కర్మవశాదిచ్ఛా ద్యుత్పత్తౌ సత్యామాత్మనోఽవస్థానాదివ్యవహార ఇవ కర్మవశా ల్లోకాంతరే దేహాంతరోత్పత్తౌ తదవచ్ఛిన్నాత్మప్రదేశే సుఖాద్యుత్పత్తి వశాత్తత్రాత్మనో గమనాదికవ్యవహార ఇత్యౌపచారికమాత్మనో గమనాదికమిత్యభిప్రేత్యాహ—యథాత్ర కర్మవశ ఇతి.

టీ. యథా = ఏప్రకారము, కర్మవశతః = కర్మాధీనముగా, అత్ర = ఈశరీరమునందు, సుఖాదికం = సుఖదుఃఖాదికము, కాదాచిత్కం = ఒకానొకప్పుడు గలుగునో తథా = ఆప్రకారము, లోకాంతరే = మఱియొకలోకమున, దేహే సతి = శరీరము కలిగినప్పుడు, కర్మణా = కర్మచేత, ఇచ్ఛాది = కోరికమొదలైనది, జన్యతే=పుట్టింపఁబడుచున్నది.

తా. అప్పుడప్పుడును కర్మవశమున సుఖదుఃఖాదులు కలిగినట్లు పరలోకమునఁ గూడ కర్మమువలన అక్కడ దేహము పుట్టఁగానే రాగద్వేషప్రయత్నాదులు కలుగును. సుఖదుఃఖాదులును గలుగును. దేహోత్పత్తి సుఖదుఃఖాదులనుబట్టి ఆత్మ యొక లోకమునుండి మఱియొక లోకమునకు పోయినట్లు వ్యవహరింపఁబడుచున్నది. నిజముగా ఆత్మకు గమనాదికము లేక గమనాదిక మున్నట్లు వ్యవహరించుట గౌణముగా జరుగుచున్న దని ప్రాభాకరు లనిరి.

శ్లో. ఏవం చ సర్వగస్యాపి సంభవేతాం గమాగమౌ,
కర్మకాండస్సమగ్రోఽత్ర ప్రమాణమితి తేఽవదన్. 93

వ్యా. ఏవమితి. ఆత్మనః సకర్తృత్వాది ధర్మవత్త్వే కిం ప్రమాణమిత్యత ఆహ—కర్మకాండ ఇతి.

టీ. సర్వగస్యాపి = అంతట నుండువాఁడైనను, (ఆత్మనః = ఆత్మకు,) గమాగమౌ = రాకపోకలు, ఏవం = ఈతీరుగా, సంభవేతాం=సంభవించుచున్నవి. అత్ర =

ఇట్లనుటయందు, సమగ్రః = ఫలసహితమైన, కర్మకాండః = కర్మలను బోధించెడి గ్రంథము, ప్రమాణం = ప్రమాణము, ఇతి = ఇట్టు లని, తే=ఆప్రాభాకరుఁడు మొదలగువారు, ఆవదన్ = చెప్పియున్నారు.

తా. ఆత్మ యన్నిచోట్ల నుండినదే యైనను ఆయాలోకములకు పోకపోకలు గౌణముగా పైన చెప్పఁబడినవిధమున సంభవించుచున్నను. ఈవిషయమున ఫలసహితమైన కర్మకాండయే ప్రమాణము అని ప్రాభాకరులు నుడివిరి.

అవ. ఓసిద్ధాంతీ! నీవు చెప్పినమాటలలో పూర్వాపరసందర్భము కనిపించుటలేదు. ఎట్లనఁగా చెప్పఁబడియేడవశ్లోకమున విజ్ఞానమయకోశముకంటె ఆనందమయకోశము లోపలిదియు నది ఆత్మయనియు చెప్పి యిపుడు ఇచ్ఛాదులు గలవాఁడను మఱియొకఁ డున్నట్లు చెప్పుట విరుద్ధమైయున్నది యను ప్రశ్న రాఁగా సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. ఆనందమయకోశో య స్సుషుప్తౌ పరిశిష్యతే,
అస్పష్టచిత్స ఆత్మైషాం పూర్వకోశోఽస్య తే గుణాః. 94

వ్యా. నన్వన్యో విజ్ఞానమయాత్ ఆనందమయ ఆంతర ఇత్యత్రానందమయస్యాత్మత్వముక్తం. ఇదానీమిచ్ఛాదిమానన్యః ప్రతిపాద్యతేఽతః పూర్వోత్తరవిరోధ ఇత్యాశంక్యాహ—ఆనందమయేతి. సుషుప్తావస్పష్టచిద్య ఆనందమయకోశః పరిశిష్యతే స పూర్వకోశః పూర్వోక్తేషు పంచకోశేషు ప్రథమ ఏషాం ప్రభాకరాదీనామాత్మా. అస్యాత్మత్వ వక్తే పూర్వోక్తాః జ్ఞానాదయో గుణా ఇత్యర్థః.

టీ. సుషుప్తౌ = గాఢముగా నిద్రించునపుడు, అస్పష్టచిత్ - అస్పష్ట=స్పష్టము కాని, చిత్ = జ్ఞానస్వరూపమైన, యః = ఏయానందమయకోశము, పరిశిష్యతే = మిగిలియున్నట్లు చెప్పఁబడెనో, సః = ఆ, పూర్వకోశః = మొదటిదైన యానందమయకోశము, ఏషాం=ఈప్రాభాకరాదులకు, ఆత్మా=ఆత్మయగుచున్నది. అస్య=ఇట్టియాత్మకును, తే = ఆవి, గుణాః = గుణము లగుచున్నవి.

తా. గాఢముగా నిదురించునప్పుడు విస్పష్టముగాని జ్ఞానస్వరూపముగలిగిన ఏ యానందమయకోశము మిగిలియుండునట్లు చెప్పఁబడెనో అట్టి మొదటిదగు నానందమయకోశము ప్రాభాకరుల కాత్మ యగుచున్నది. తర్వాత చెప్పఁబడిన జ్ఞానాదులన్నియు నట్టి యాత్మగుణము లగుచున్నవి. కనుక నిచ్చట పూర్వాపరసందర్భవిరోధము లేదని యెఱుంగనగును.

అవ. ప్రాభాకరమతమును వర్ణించి ఇపుడు భాట్టమతమును ప్రస్తావమునకు తెచ్చు చున్నాఁడు:—

శ్లో. గూఢం చైతన్య ముత్ప్రేక్ష్య జడబోధస్వరూపతాం,
ఆత్మనో బ్రువతే భాట్టా శ్చిదుత్ప్రేక్షోత్థితస్మృతేః. 95

వ్యా. అస్యైవాత్మనశ్చిదచిద్రూపత్వం భాట్టా వర్ణయంతీత్యాహ—గూఢమితి. భాట్టా ఆత్మనో గూఢమస్పష్టం చైతన్యముత్ప్రేక్ష్య ఊహిత్వా చిజ్జడోభయాత్మకతాం వర్ణయతి. చైతన్యోత్ప్రేక్షాయాం కారణమాహ—చిదుత్ప్రేక్షేతి. ఉత్థితస్మృతేశ్చిదుత్ప్రేక్షా భవతీతి యోజనా. సుప్తేరుత్థితస్య జాయమానాత్మస్మరణాత్సౌషుప్తచైతన్యస్యోత్ప్రేక్షా భవతీత్యర్థః.

టీ. భాట్టాః = భట్టపాదమతము ననుసరించినవారు (భాట్టమతస్థులు), ఆత్మనః= ఆత్మయొక్క, గూఢం = విస్పష్టముగాని, చైతన్యం = జ్ఞానస్వరూపమును, ఉత్ప్రేక్ష్య= పరిశీలనచేసి, జడబోధస్వరూపతాం - జడ = అజ్ఞానస్వరూపుఁడగుటను, బోధస్వరూపతాం = జ్ఞానస్వరూపుఁడగుటను, బ్రువతే=చెప్పుచున్నారు. ఉత్థితస్మృతేః-ఉత్థిత = నిదుర మేల్కాంచినవానియొక్క, స్మృతేః=స్మృతినిబట్టి, (నేను సుఖముగా నిద్రించితిని, నాకేమి తెలియలేదు, అనెడి స్మృతివలన ననుట), చిదుత్ప్రేక్షా = జ్ఞానస్వరూపముయొక్క యూహ, (భవతి = కలుగుచున్నది).

తా. ఆత్మయొక్క యస్పష్టమగు జ్ఞానస్వరూపమును పరిశీలించి జ్ఞానాజ్ఞానస్వరూపుఁ డనియు, నిద్ర మేల్కాంచిన తర్వాత కలిగెడి స్మృతినిఁబట్టి చైతన్యస్వరూపుఁ డనియు భట్టపాదమతస్థులు ఊహించుచున్నారు.

అవ. భాట్టమతస్థులు ఆత్మను జ్ఞానస్వరూపుఁ డని యూహించిన తెఱంగెఱింగించుచున్నాఁడు:—

శ్లో. జడో భూత్వా తదాస్వాప్సమితి జాడ్యస్మృతి స్తదా,
వినా జాడ్యానుభూతిం న కథంచి దుపపద్యతే. 96

వ్యా. చిదుత్ప్రేక్షాప్రకారమేవ స్పష్టయతి—జడో భూత్వేతి. తథా సుషుప్తికాలే జడో భూత్వాఽస్వాప్సమిత్యేవంరూపా జాడ్యస్మృతి రుత్థితస్య పురుషస్య జాయమానా సుషుప్తికాలీనజాడ్యానుభవమంతరేణానుపద్యమానా తదానీం తస్య జాడ్యానుభవం కల్పయతీతి భావః.

టీ. తదా=అప్పుడు, నిదురించునప్పు డనుట. జడః=జడస్వరూపుఁడను, భూత్వా= అయియుండి, అస్వాప్సం = నిద్రపోయితిని, ఇతి = ఈప్రకారముగా, జాడ్యస్మృతిః-

జాడ్య = జడత్వముయొక్క, స్మృతిః=స్మరణము (భవతి=కలుగుచున్నది). జాడ్యాను భూతిం వినా=జాడ్యానుభవములేక, తదా=ఆసుషుప్తికాలమందైన, స్మృతిః = స్మరించుట, కథంచిత్=ఏప్రకారముగను, నోపపద్యతే = సంభవింపనేరదు.

తా. నిద్ర లేచి నిదురించునప్పటి తనయనుభవమును స్మరించి సుషుప్తికాలమున నేను జడస్వరూపుఁడనై నిద్రించితిని అనుకొనుచున్నాఁడు. గాఢనిద్రలో జడస్వరూపముయొక్క అనుభవము లేనిది స్మరించుట తటస్థింపదు. ఇట్లు ఆత్మయొక్క జడరూపత్వమును భాట్టు లూహించుచున్నారు.

అవ. సుషుప్తికాలమున చైతన్యము లోపించుట లేదనుటకు శ్రుతిప్రమాణము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ద్రష్టుర్దృష్టేరలోపశ్చ శ్రుతస్సుప్తౌ తతస్స్వయం,
అప్రకాశప్రకాశాభ్యా మాత్మా ఖద్యోతవద్యుతః. 97

వ్యా. సుషుప్తౌ చైతన్యలోపాభావే ప్రమాణమాహ—ద్రష్టురితి. "న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వా"దితి శ్రుతౌ ద్రష్టురాత్మన స్స్వరూపభూతాయాః దృష్టేర్లోపో న విద్యతే వినాశరహితస్వభావత్వాత్. అన్యథా లోపవాదినోఽపి నిస్సాక్షికస్య వక్తుమశక్యత్వాత్సుషుప్తౌ చైతన్యలోపాభావ శ్శ్రూయతే. తతోఽపి కారణాదయమాత్మా ఖద్యోతవస్ఫురణాభ్యాం యుక్తో భవతీత్యర్థః.

టీ. సుప్తౌ = నిద్రపోవుసమయమునందు, ద్రష్టుః = ఆత్మయొక్క, దృష్టేః = స్వరూపచైతన్యమునకు, అలోపశ్చ = లోపము లేకపోవుటయు, శ్రుతః = వేదమందు వినఁబడుచున్నది, తతః = ఆకారణమువలన, స్వయం = తానైన, ఆత్మా = ఆత్మ, ఖద్యోతవత్=సూర్యునివలె, అప్రకాశప్రకాశాభ్యాం - అప్రకాశం = ప్రకాశించకపోవుటతోడను, ప్రకాశాభ్యాం = ప్రకాశించుటతోడను, యుతః = కూడుకొన్నవాఁడగును.

తా. శ్రు. "న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే; అవినాశిత్వాత్" అనఁగా ఆత్మచైతన్యమునకు నాశము లేకపోవుటవలన లోపము లేదు. ఒకవేళ నెవ్వఁడైన లోపముండు నని చెప్పినయెడల ఆలోపమునకు సాక్షి యగువాఁ డొకఁ డుండి తీరవలయును అని యొప్పక తప్పదు. సుషుప్తికాలమునందును ఆత్మచైతన్యమునకు లోపము లేదని శ్రుతి చెప్పుచున్నది గనుక సూర్యుఁడు ఒకప్పుడు

ప్రకాశించుటయు మేఘాచ్ఛాదితుఁడైనప్పుడు ప్రకాశించకపోవుటయు వలె చిదచిద్రూపత కలిగి యున్నాఁ డని భాట్టమతస్థు లనిరి.

అవ. ఈభాట్టమతమందలి లోపమును దెల్పెడి సాంఖ్యమతమును ప్రసంగము లోనికిఁ దెచ్చుచున్నాఁడు:—

శ్లో. నిరంశస్యోభయాత్మత్వం న కథం చిద్ఘటిష్యతే,
తేన చిద్రూప ఏవాత్మే త్యాహు స్సాంఖ్యా వివేకినః. 98

వ్యా. అస్మిన్ భాట్టమతే దూషణాభిధానపురస్సరం సాంఖ్యమతముత్థాపయతి— నిరంశస్యేతి.

టీ. వివేకినః = విమర్శనశీలురగు, సాంఖ్యాః = సాంఖ్యమతస్థులు, నిరంశస్య = అవయవరహితునకు, ఉభయాత్మత్వం=చైతన్యస్వభావము కలుగుటయు, జడస్వభావము కలుగుటయు, కథంచిత్ = ఏవిధముచేతను, న ఘటిష్యతే = ఘటింపఁజాలదు, తేన = ఆహేతువుచేత, ఆత్మా=ఆత్మ, చిద్రూప ఏవ = జ్ఞానస్వరూపుఁడే యగు నని, ఆహుః= చెప్పుచున్నారు.

తా. ఆత్మ నిరవయవస్వరూపుఁడు గనుక జ్ఞానస్వరూపుఁ డగుటయు అజ్ఞానస్వరూపుఁ డగుటయు సంభవింపదు గనుక ఆత్మను చిద్రూపుఁ డనియే చెప్పఁదగు నని పరిశీలనశక్తి గలిగిన సాంఖ్యమతస్థులు నిరూపించుచున్నారు.

అవ. అయితే నిదురలేచినవాఁడు నిద్రించితిని గాని నా కేమియుఁ దెలియలేదు అని యజ్ఞానమును స్మరించుట కేమి సమాధానము చెప్పెద రని యాక్షేపింపఁగా దానికి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. జాడ్యాంశః ప్రకృతే రూపం వికారి త్రిగుణం చ తత్,
చితో భోగాపవర్గార్థం ప్రకృతిస్సా ప్రవర్తతే. 99

వ్యా. జాడ్యస్మ్రతే స్తర్హి కా గతిరిత్యాశంక్యాహ—జాడ్యాంశ ఇతి. తత్ప్రకృతిరూపం సత్వరజస్తమోగుణాత్మకం. ప్రకృతికల్పనాయాం ప్రయోజనమాహ— చిత ఇతి. చితః పురుషస్యేతి యావత్.

టీ. జాడ్యాంశః=అజ్ఞానభాగము, ప్రకృతేః=మూలప్రకృతియొక్క, రూపం = స్వరూపమగుచున్నది. తత్ = ఆ ప్రకృతిస్వరూపము, త్రిగుణాత్మకం - త్రిగుణ = సత్వరజస్తమోగుణము లనియెడి, ఆత్మకం=స్వరూపము గలదియు, వికారి చ=వికారము గలదియు, (అగుచున్నది). చితః=ఆత్మకు, భోగాపవర్గార్థం = భోగమోక్షములకొఱకు

(జీవునకు భోగమోక్షములను గలిగించెదుకొఱకు), సా ప్రకృతిః = ఆ మూలప్రకృతి, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

తా. సుషుప్తికాలములో జడస్వరూపుఁడై యున్నట్లు నిదుర లేచినవాఁడు "నే నేమి ఎఱుఁగ" నని స్మరించుట ప్రకృతిస్వరూపమే యగును. ఆ ప్రకృతి త్రిగుణాత్మకమై యున్నది. త్రిగుణము లనఁగా సత్త్వము రజస్సు తమస్సు అని గుణములు మూఁడు. అట్లు త్రిగుణ స్వరూపమై వికారము గలదియునైన ప్రకృతి పురుషునకు సుఖదుఃఖా నుభవమును మోక్షమును ఇచ్చుటకు ప్రవర్తించుచున్నది. ఇట్లు ప్రకృతి వలన జడస్వరూపానుభవము కలుగ వచ్చు నని సాంఖ్యులు చెప్పెదరు.

అవ. అసంగుఁడైన ఆత్మ యనెడి పురుషునకును ప్రకృతికిని భేదము కలిగి యుండఁగా ప్రకృతిచేత పురుషునకు భోగమోక్షము లెట్లు కలుగు నని యాక్షేపము రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అసంగాయాశ్చి తేర్బంధమోక్షౌ భేదాగ్రహాన్మతౌ,
బంధముక్తిన్యవస్థార్థం పూర్వేషా మివ చిద్భిదా. 100

వ్యా. నను చితోఽసంగత్వేన ప్రకృతిపురుషయోరత్యంతవివిక్తత్వాత్ ప్రకృతి ప్రవృత్త్యాకథం పురుషస్యభోగాపవర్గావిత్యాశంక్య తయోర్వివేకస్యాగ్రహణాత్పురుషే భోగాపవర్గా వ్యవహ్రియేతే ఇత్యాహ—అసంగాయా ఇతి. తార్కికాదిభిరివసాంఖ్యై రాత్మభేదోఽంగీక్రియత ఇత్యాహ—బంధముక్తీతి.

టీ. భేదాగ్రహాత్ - భేద=ప్రకృతిపురుషులు వేఱనుటయొక్క, అగ్రహాత్ = తెలియక పోవుటవలన, అసంగాయాః = దేనితోడను సంగములేని (సంబంధములేని), చితేః = పురుషునకు, బంధమోక్షౌ = బంధమోక్షములు, మతౌ = చెప్పఁబడినవి. బంధముక్తివ్యవస్థార్థం = బంధమోక్షములను స్థాపించుటకొఱకు, పూర్వేషామివ = నుక చెప్పఁబడిన తార్కికాదులవలె, చిద్భిదా = ఆత్మభేదము, (ప్రకృతిపురుషులకు దము), మతా = అంగీకరింపఁబడినది.

తా. ప్రకృతి వేఱు పురుషుఁడు వే ఱని ప్రకృతిపురుషుల భేదము తెలియఁబడకపోవుటచేత జీవునకు బంధమోక్షములు గలుగుచున్నవి యని తార్కికాదులవలె సాంఖ్యమతస్థులు కూడ బంధమోక్షముల స్థాపించుటకొఱ కాత్మభేదము నంగీకరించుచున్నారు.

అవ. ప్రకృతి యుండుటకును పురుషుఁడు అసంగుఁడనుటకును శ్రుతి నుదాహ రించుచున్నాఁడు:—

శ్లో. మహతః పరమవ్యక్త మితి ప్రకృతి రుచ్యతే,
శ్రుతావసంగతా తద్వదసంగోహీత్యతిస్ఫుటా. 101

వ్యా. ప్రకృతిసద్భావే పురుషస్యాసంగత్వే చ శ్రుతిముదాహరతి—మహత ఇతి.

టీ. ప్రకృతిః = ప్రకృతి, మహతః = మహత్తత్వముకంటె, పరం = అన్యమైన దనియు, అవ్యక్తం = నేత్రాదీంద్రియములకు వ్యక్తము కాని దనియు, శ్రుతౌ = శ్రుతి యందు, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. తద్వత్=అటువలెనే, అసంగతా=అసంగత్వము, అసంగోహీతి = పురుషుఁడు సంగి కాఁ డనెడి శ్రుతిచేతను, అతిస్ఫుటా = మిక్కిలి స్పష్టమై యున్నది.

తా. ప్రకృతి మహత్తత్వముకంటె పరమై యున్న దనియు అది యేయింద్రియములకును గోచరింప దనియు శ్రుతియందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు "శ్రు. అసంగో హ్యయం పురుషః" పురుషుఁడు దేనిసంబంధము లేనివాఁడు అని ఈశ్రుతిచేత స్పష్టమగుచున్న దని సాంఖ్యుల సిద్ధాంతము.

అవ. ఇంతవఱకు జీవవిషయమై వాదుల యభిప్రాయమును దెలిపి ఈశ్వరుని విషయమై వాదుల వివాదములను దెలుప నెంచి ఈశ్వరరూపమును నిరూపణ సేయు చున్నాఁడు:—

శ్లో. చిత్సన్నిధౌ ప్రవృత్తాయాః ప్రకృతేర్హి నియామకం,
ఈశ్వరం బ్రువతే యోగా స్స జీవేభ్యః పరశ్శ్రుతః. 102

వ్యా. ఏవం జీవవిషయాం వాదివిప్రతిపత్తిం ప్రదర్శ్యేశ్వరవిషయాం తాం ప్రదర్శయితుం ఈశ్వరరూపం తావత్ స్థాపయతి—చిత్సన్నిధావితి. నను ప్రకృతి పురుషాతిరిక్తేశ్వరకల్పనమప్రమాణమిత్యాశంక్యాహ—స జీవేభ్య ఇతి.

టీ. యోగాః = యోగులు, చిత్సన్నిధౌ = ఆత్మసమీపమునందు, ప్రవృత్తా యాః = ప్రవర్తించుచుండెడి, ప్రకృతేః = ప్రకృతికి, ఈశ్వరం = ఈశ్వరుని, నియా మకం = నియమించెడువానినిగా, బ్రువతే = చెప్పుచున్నారు, సః = ఆ ఈశ్వరుఁడు, జీవేభ్యః=జీవులకంటె, పరః=ఉత్కృష్టుఁ డని, శ్రుతః=వేదమందు చెప్పఁబడెను.

తా. చిద్రూపముయొక్క సమీపమునందు ప్రకృతి యున్న దనియు అట్టి ప్రకృతిని ఈశ్వరుఁడు నియమించు ననియు యోగ మతము. ఆఈశ్వరుఁడు జీవులకంటె శ్రేష్ఠుఁ డని వేదములయందు తెలుపఁబడుచున్న దని కూడ యోగులు చెప్పుచున్నారు.

అవ. ఈశ్వరునియొక్క యునికిని చెప్పెడి శ్రుతిని పఠించుచున్నాఁడు:—

శ్లో. ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశ ఇతి హి శ్రుతిః,
ఆరణ్యకే సంభ్రమేణ హ్యంతర్యామ్యుపపాదితః. 103

వ్యా. తామేవేశ్వరసద్భావప్రతిపాదికాం శ్రుతిం పఠతి—ప్రధానేతి. ప్రధానం గుణసామ్యావస్థారూపం క్షేత్రజ్ఞా జీవాస్తేషాం పతిః గుణాస్సత్త్వాదయస్తేషామీశో నియామక ఇత్యర్థః. న కేవలమియమేవ శ్రుతిరీశ్వరప్రతిపాదికా. అంతర్యామిబ్రాహ్మణమపీత్యాహ—ఆరణ్యక ఇతి.

టీ. ప్రధానక్షేత్రజ్ఞపతిః-ప్రధాన=ప్రకృతికిని, క్షేత్రజ్ఞ=జీవులకును, పతిః = అధిపతియును, గుణేశః = సత్త్వరజస్తమోగుణములకు నియామకుఁడును, (అయియున్నాఁడు) ఇతి = ఈప్రకారముగా, శ్రుతిర్హి = శ్రుతియున్నదిగదా. వేదము చెప్పుచున్నది, ఆరణ్యకే=అరణ్యమునం దధ్యయనము చేయఁదగిన అంతర్యామి బ్రాహ్మణమునందు, అంతర్యామీ = ఈశ్వరుఁడు, సంభ్రమేణ = ఆదరముతో, ప్రతిపాదితః = చెప్పఁబడియుండెను.

తా. ప్రకృతి సత్త్వరజస్తమోగుణము లనెడి మూఁడుగుణముల యొక్క సామ్యావస్థ యగుచున్నది. అట్టి ప్రకృతిని జీవులను సత్త్వరజస్తమోగుణములను నియమించెడివాఁడు ఈశ్వరుఁ డొకఁడు కలఁడనియు అంతర్యామి బ్రాహ్మణమునందును ఆదరముతో ఈశ్వరుఁడు చెప్పఁబడె ననియు యోగులు చెప్పుచున్నారు.

అవ. ఈశ్వరవిషయమై వాదులవివాదముల నుపపాదించుచున్నాఁడు:—

శ్లో. అత్రాపి కలహాయంతే వాదినస్స్వస్వయుక్తిభిః,
వాక్యాన్యపి యథాప్రజ్ఞం దార్ఢ్యాయోదాహరంతి హి. 104

వ్యా. తామేవ వాదివిప్రతిపత్తిం ప్రతిజానీతే—అత్రాపీతి. ప్రజ్ఞామనతిక్రమ్య యథాప్రజ్ఞం.

టీ. అత్రాపి = ఈ యీశ్వరవిషయమందును, వాదినః = ఆయా వాదులు, స్వస్వయుక్తిభిః - స్వస్వ = తమతమయొక్క, యుక్తిభిః = యుక్తులచేత, కలహాయంతే = కలహించుచున్నారు, దార్ఢ్యాయ = తమ తమ మతమును, స్థిరీకరించు కొనుటకొఱకు (స్థాపించుకొనుటకొఱకు) యథాప్రజ్ఞం = తమతమ ప్రజ్ఞానుసారముగా, వాక్యాన్యపి = అందుకు సాధకములైన వాక్యములనుకూడ, ఉదాహరంతి హి = ఉదాహరించుచున్నారు గదా.

తా. ఈశ్వరస్వరూపవిషయమున తమతమ యుక్తులతో వాదులు వాదించుచు వారివారి మతములను స్థాపించుకొన నెంచి వారివారి ప్రజ్ఞ చూపుచు నందుల కనుకూలించు పూర్వప్రయోగములను కూడ సాధకములుగా నుదాహరించుచున్నారు.

అవ. పతంజలిచేతఁ జెప్పఁబడిన సూత్రార్థమును పఠించుచున్నాఁడు:—

శ్లో. క్లేశకర్మవిపాకైస్తదాశయైరప్యసంయుతః,
పుంవిశేషో భవేదీశో జీవవత్సోఽప్యసంగచిత్. 105

వ్యా. ఇదానీం పతంజలినోక్తమీశ్వరప్రతిపాదకం క్లేశకర్మవిపాకైస్తదాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరఇత్యేతత్సూత్రమర్థతః పఠత—క్లేశేతి. క్లేశా అవిద్యాదయః, పంచకర్మాణి కర్మ శుక్లకృష్ణం యోగిన స్త్రివిధమితరేషామితి సూత్రితాని సతిమూలే తద్విపాకా జాత్యాయుర్భోగా ఇత్యుక్తాః కర్మవిపాకాః. ఫలవిశేషాస్తదాశయాస్తేషాం సంస్కారాస్తైః క్లేశాదిభిరసంస్పృష్టః పురుషవిశేష ఈశ్వరో భవతి. సోఽపి జీవవదసంగశ్చిద్రూపశ్చేత్యర్థః.

టీ. క్లేశకర్మవిపాకైః - క్లేశ = అవిద్యాదిపంచక్లేశములతోడను, కర్మ = కర్మములతోడను, విపాకైః=ఆయా కర్మఫలవిశేషములతోడను, తదాశయైః=వాని సంస్కారములతోడను, అసంయుతః = అంటని, పుంవిశేషః = పురుషోత్తముఁడు, ఈశః = ఈశ్వరుఁడు, భవేత్ = అగును. సోఽపి = ఆ యీశ్వరుఁడును, జీవవత్ = జీవునివలె, అసంగచిత్ - అసంగ = సంబంధము లేనివాఁడును, చిత్ = చిద్రూపుఁడును (భవేత్= అగును.)

తా. పురుషోత్తముండైన యీశ్వరుండు అవిద్యాది పంచక్లేశములు లేనివాఁడు కర్మలును కర్మఫలములైన జాత్యాయుర్భోగాదులును లేనివాఁడును, జీవునివలె దేనితో సంబంధము లేనివాఁడును చిత్స్వరూపుండును అగు నని పతంజలిమహర్షి "క్లేశకర్మవిపాకైస్తదాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" అని సూత్రమును చేసి యున్నారు. మఱియు "కర్మాశుక్లకృష్ణం యోగిన స్త్రివిధ మితరేషాం" అనఁగా యోగికి అశుక్లకృష్ణ మనెడి పేరు గల కర్మము, అనగా అదృష్టము కల దనియు తదితరులకు మూఁడువిధములైన కర్మ లుండు ననియు యోగసూత్రకర్త యగు పతంజలిమహర్షియే సెలవిచ్చి యున్నారు.

అవ. ఈశ్వరుఁడు సంగము లేనివాఁడును చిద్రూపుఁడును అయ్యేనేని యతఁడు నియమించు టెట్లు అను ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. తథాపి పుంవిశేషత్వా ద్ఘటతేఽస్య నియంతృతా,
అవ్యవస్థౌ బంధమోక్షా వాపతేతా మిహాఽన్యథా. 106

వ్యా. సర్వసంగచిద్రూపత్వే కథం నియంతృత్వమిత్యత ఆహ—తథాపీతి. ఈశ్వరస్య నియంతృత్వానభ్యుపగమే దోషమాహ—అవ్యవస్థావితి.

టీ. తథాపి = ఆప్రకారముగా నీశ్వరుఁ డసంగచిద్రూపుఁ డైనను, పుంవిశేషత్వాత్ = పురుషోత్తముఁడగుటంబట్టి, అస్య = ఇతనికి, నియంతృతా=నియామకుఁడగుట, ఘటతే = సంభవించుచున్నది. అన్యథా=నియామకత్వము సంభవింపక పోయిన యెడల, ఇహ = ఈపురుషునియందు (జీవునియందు), బంధమోక్షౌ = బంధమును మోక్షమును, అవ్యవస్థౌ = వ్యవస్థలేనివై, (నియమము లేనివై) ఆపతేతాం = కావలసి వచ్చును.

తా. ఈశ్వరుఁడు అసంగచిద్రూపుఁడైనను పురుషోత్తముఁ డగుట వలన సర్వమును నియమించుటకు సమర్థుఁ డగుచున్నాఁడు. ఈశ్వరునకు నియామకత్వశక్తి లేదని చెప్పినయెడల బంధమోక్షములు వ్యవస్థ స్థములు కావలసివచ్చును అని పతంజలిమతము.

అవ. అసంగుఁడైన ఈశ్వరుఁడు నియామకుఁ డగుటకు వేదమే ప్రమాణ మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. భీషాస్మా దిత్యేవమాదా వసంగస్య పరాత్మనః,
శ్రుతం తద్యుక్త మప్యస్య క్లేశకర్మా ద్యసంగమాత్. 107

వ్యా. అసంగ స్యేశ్వరస్య నియంతృత్వం నిష్ప్రమాణకమిత్యాశంక్యాహ—భీషేతి. తన్నియంతృత్వం శ్రుతం. ననుశ్రుతమప్యయుక్తం కథమంగీక్రియత ఇత్యత ఆహ—యుక్తమపీతి. జీవధర్మస్య క్లేశాదేరభావాదుపపన్నం చేత్యర్థః.

టీ. అస్మాత్ = ఈపరమేశ్వరునివలని, భీషా = భయముచేత, ఇత్యేవమాదౌ = ఈ మొదలైన శ్రుతియందు, అసంగస్య = అసంగుఁడైన, పరమాత్మనః = పరమాత్మునకు, తత్ = ఆ నియామకత్వము, శ్రుతం = శ్రుతియందు చెప్పఁబడినది. అస్య= ఈయీశ్వరునకు, క్లేశకర్మాద్యసంగమాత్ - క్లేశ = అవిద్యాదిపంచక్లేశములయొక్కయు, కర్మాది= కర్మ విపాకము మొదలైనవానియొక్కయు, అసంగాత్ = సంబంధము లేకపోవుటవలన, తదపి = అనియామకత్వ ముండుటయు, ఇచ్చట తత్ అను పదము కాకికంటివలె నుభయవాక్యములయందు నన్వయము గలిగియున్నది, యుక్తం = తగినదే యగును.

తా. శ్రుతి. "భీషాస్మాద్వాతః పవతే" అస్మాత్=ఈ యీశ్వరుని వలన, భీషా=భయముచేత, వాతః=వాయువు, పవతే = వీచుచున్నది. అని యీశ్రుతికి అర్థము. ఇట్లులనే పరమాత్మవలని భయముచేత సూర్యుఁడు, అగ్నియు, నింద్రుఁడు, మృత్యుదేవతయుఁ బని చేయుచున్నా రని ఆశ్రుతి వరుసగా చెప్పియున్నది. దీనివలన నీశ్వరుఁడు సర్వమును నియమించును అని తేటపడుచున్నది. కావున జీవులయొక్క సుకృతదుష్కృతములకు ఫలమైన సుఖదుఃఖము లీశ్వరుని నంటక పోవుటంజేసి యీశ్వరునకు నసంగతయు నియామకత్వమును రెండు నుండవచ్చు ననుట యుక్తమే యగుచున్న దని యోగశాస్త్రసూత్రకర్త యగు పతంజలిమహర్షి మతము.

అవ. జీవులు అసంగచిద్రూపులు. ఈశ్వరుఁడు నట్లే యసంగచిద్రూపుఁ డని యుభయులను సమానులనుగాఁ జెప్పినచో నీశ్వరునకు నియామకుఁ డని యాధిక్య మేమి యని యాశంకించి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జీవానామప్యసంగత్వాత్ క్లేశాది ర్నహ్యథాపి చ,
వివేకాగ్రహతః క్లేశకర్మాది ప్రాగుదీరితమ్. 108

వ్యా. నను జీవా అప్యసంగచిద్రూపాః క్లేశాదిరహితా ఏవ. తథా చేశ్వరే కో విశేష ఇత్యాశంక్య జీవానాం స్వతః క్లేశాదిరహితత్వేఽపి బుద్ధ్యా సహ వివేకాగ్రహాత్ క్లేశాదిరస్తీతి పూర్వోక్తం స్మారయతి—జీవానామితి.

టీ. జీవానామపి = జీవులుకూడ, ఇచట షష్ఠికి ప్రథమార్థము. అసంగత్వాత్ = అసంగు లగుటవలన, క్లేశాదిః = క్లేశకర్మాదులు, నహి = యథార్థముగా లేవు. అథాపి చ = అట్లులయినప్పటికిని, వివేకాగ్రహతః-వివేక = అసంగత్వజ్ఞానముయొక్క, అగ్రహతః = లేకపోవుటవలన, ప్రాక్ ఉదీరితం = ముందు చెప్పఁబడిన, క్లేశకర్మాది = అవిద్యాది పంచక్లేశములును కర్మలును, ఆదిశబ్దముచేత, జాత్యాయుర్భోగాదిఫలములును, (సన్తి = కలవు).

తా. జీవులకు వాస్తవముగా క్లేశకర్మాదులు లేకుండినను అట్టి జ్ఞానము అనగా క్లేశకర్మాదులు మనకు లేవు అనెడి జ్ఞానము లేనివారగుటచేత వీరు జీవు లని చెప్పఁబడుచున్నారు. ఈశ్వరునకు అట్టి జ్ఞానవిశేషము గలదు. కనుక నియామకత్వమును నీశ్వరత్వమును అనెడి

యాధిక్యము తగియున్నది అని పతంజలిమహర్షిమతము. దీనినే యోగమత మందురు.

అవ. ఇప్పుడు తార్కికులమతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిత్యజ్ఞానప్రయత్నేచ్ఛాగుణా నీశస్య మన్వతే,
అసంగస్య నియంతృత్వ మయుక్తమితి తార్కికాః. 109

వ్యా. తార్కికాస్త్వసంగస్య నియామకత్వమసహమానా జీవవిలక్షణత్వాయ జ్ఞానాదిగుణత్రయం నిత్యమంగీకుర్వత ఇత్యాహ—నిత్యేతి.

టీ. తార్కికాః = తార్కికులు, అసంగస్య = నిస్సంగుఁడైన, ఈశస్య = ఈశ్వరునకు, నియంతృత్వం = నియామకత్వము, అయుక్తమితి = యుక్తము కా దని, నిత్యజ్ఞానప్రయత్నేచ్ఛాగుణాన్-నిత్య=నిత్యములైన, జ్ఞాన=జ్ఞానమును, ప్రయత్న = ప్రయత్నమును, ఇచ్ఛా=కోరికయు ననెడి, గుణాన్=మూఁడు గుణములను, మన్వతే = అంగీకరించుచున్నారు.

తా. ఈశ్వరుఁడు అసంగుఁడు గనుక నాతనికి నియామకత్వము చెప్పుట తగదు. నిత్యములైన ౧. జ్ఞానము, ౨. ప్రయత్నము, 3. ఇచ్ఛయు ననెడి యీమూఁడు గుణములు మాత్ర మున్నట్లు తార్కికు లంగీకరించుచున్నారు.

అవ. ఇచ్ఛాదిగుణము లీశ్వరునకు కలవు అని యంగీకరించినచో నిఁక జీవుని కంటె తారతమ్య మేమి గలదు?

శ్లో. పుంవిశేషత్వ మప్యస్య గుణై రేవ నచాన్యథా,
సత్యకామ స్సత్యసంకల్ప ఇత్యాది శ్రుతి ర్జగౌ. 110

వ్యా. నన్విచ్ఛాదిగుణకస్య కథం జీవాద్వైలక్షణ్య మిత్యాశంక్య గుణానాం నిత్యత్వాదేవేతి పరిహరతి—పుంవిశేషత్వమితి. గుణానాం నిత్యత్వే ప్రమాణమాహ —సత్యేతి.

టీ. అస్య = ఈ యీశ్వరునకు, గుణైరేవ = గుణములచేతనే, పుంవిశేషత్వం= పురుషులలో నధికుఁడైయుండుట, (భవతి = కలుగుచున్నది). అన్యథా=వేఱువిధముగా, న చ = కలుగదు. సత్యకామః - సత్య = నిత్యమైన, కామః=ఇచ్ఛకలవాఁ డనియు, సత్యసంకల్పః - సత్య=యథార్థమైన, సంకల్పః=సంకల్పము గలవాఁ డనియు, ఇత్యాది= ఈ మొదలగు సంగతులను, శ్రుతిః = వేదవాక్యము, జగౌ = చెప్పెను.

తా. జ్ఞాన ప్రయత్నేచ్ఛ లనెడు నిత్యములైన మూఁడుగుణములు ఈశ్వరునకుఁ గలవు, కనుకనే జీవునికంటె నీశ్వరుఁడు విలక్షణుఁడు, కనుక నధికుఁడుగను చెప్పఁబడుచున్నాఁడు. మఱియు శ్రు. "సత్యకామః సంత్యసంకల్పః" = సత్యమైన యిచ్ఛయు సత్యమైనసంకల్పమును గలవాఁడని యీ మొదలైన శ్రుతిసమూహము ఈశ్వరుని గుణాధిక్యమునకు ప్రమాణముగా నున్నది యని తార్కికులు చెప్పుచున్నారు.

అవ. ఆ తార్కిక మతమునందును దోషము కనఁబడుచున్నది యని వేఱొక మతమును ప్రస్తావించుచున్నాఁడు:—

శ్లో. నిత్యజ్ఞానాదిమత్త్వేఽస్య సృష్టిరేవ సదా భవేత్,
హిరణ్యగర్భ ఈశోఽతో లింగదేహేన సంయుతః. 111

వ్యా. తత్రాపి దోషసద్భావాత్పక్షాంతరమాహ—నిత్యేతి. తస్య హిరణ్యగర్భస్య కిం రూపమిత్యత ఆహ—లింగదేహేనేతి. మాయోపాధికః పరమాత్మా లింగశరీరసమష్ట్యభిమానేన హిరణ్యగర్భ ఇత్యుచ్యత ఇత్యర్థః.

టీ. అస్య = ఈయీశ్వరునకు, నిత్యజ్ఞానాదిమత్త్వే సతి = నిత్యమైన జ్ఞానాది గుణములు గల్గియుండఁగా, సదా = ఎల్లప్పుడును, సృష్టిరేవ = సృష్టించుటయే,భవేత్ = సంభవించును. అతః = ఈహేతువువలన, లింగదేహేన = సమష్టిసూక్ష్మశరీరముతో, సంయుతః = కూడుకొనిన, హిరణ్యగర్భః=సమష్టిసూక్ష్మశరీరాభిమానియైన, సూత్రాత్మా= ఈశ్వరుఁడు (భవేత్ = అగును.)

తా. తార్కికులు చెప్పినప్రకారము అంతర్యామియైన ఈశ్వరునకు జ్ఞానప్రయత్నేచ్ఛ లనెడు మూఁడుగుణములును నిత్యములై యున్నయెడల ఆయీశ్వరునివలన సృష్టి యెప్పుడు నగుచుండవలయును. అట్లు లేకపోవుటచేత హిరణ్యగర్భుఁడే యీశ్వరుఁడు కావలయుననియు, అంతర్యామి యీశ్వరుఁడు కానేరఁడనియు మాయయే యుపాధిగాఁగల సమష్టిలింగశరీరాభిమానియగు పరమాత్మయే హిరణ్యగర్భుఁ డనఁబడు ననియు హైరణ్యగర్భులు వాదించుచున్నారు.

అవ. హిరణ్యగర్భుఁ డీశ్వరుఁ డనుటకు ప్రమాణ మే మనఁగాఁ జెప్పుచున్నారు:-

శ్లో. ఉద్గీథబ్రాహ్మణే తస్య మాహాత్మ్యమితి విస్తృతం,
లింగసత్త్వేఽపి జీవత్వం నాస్య కర్మాద్యభావతః, 112

వ్యా. హిరణ్యగర్భస్యేశ్వరత్వే కిం ప్రమాణమిత్యత ఆహ—ఉద్గీథేతి. నను, లింగశరీరయోగే జీవస్యాదిత్యాశంక్యావిద్యాకామకర్మాభావాన్న జీవ ఇత్యాహ—లింగసత్త్వేఽపీతి.

టీ. తస్య = ఆహిరణ్యగర్భునియొక్క, మాహాత్మ్యం = ఘనత, ఉద్గీథబ్రాహ్మణే = ఛాందోగ్యోపనిషత్తునందలి యుద్గీథబ్రాహ్మణమున, విస్తృతం = వివరించి చెప్పఁబడినది. ఇతి = ఇట్లు (చెప్పుదురు), అస్య = ఇతనికి, లింగసత్త్వేఽపి - లింగ = సూక్ష్మశరీరము యొక్క, సత్త్వేఽపి = ఉనికి గల్గియున్నను, కర్మాద్యభావతః = కర్మక్లేశాదులయొక్క, అభావతః = లేకపోవుటవలన, జీవత్వం = జీవభావము, న = లేదు.

తా. ఛాందోగ్యోపనిషత్తునందలి యుద్గీథబ్రాహ్మణమునందు నీ విషయము చెప్పఁబడినది. కావున ఆయుద్గీథబ్రాహ్మణ మీవిషయమునఁ బ్రమాణమైయున్నది. సమష్టిసూక్ష్మశరీరసంబంధాభిమానము కల్గియుండినను, అవిద్యాకామకర్మలు లేకపోవుటచేత నాహిరణ్యగర్భునకు జీవత్వము ఘటింపనేరదు. ఇది హైరణ్యగర్భవాదులమతము.

అవ. ఇప్పుడు విరాట్టు ఈశ్వరుఁ డగుననెడి వారివాదమును అందుకు ప్రమాణమును రెండు శ్లోకములతోఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. స్థూలదేహం వినా లింగదేహో న క్వాపి దృశ్యతే,
వైరాజో దేహ ఈశోఽత స్సర్వతో మస్తకాదిమాన్. 113

శ్లో. సహస్రశీర్షేత్యేవం చ విశ్వతశ్చక్షురిత్యపి,
శ్రుత మిత్యాహు రనిశం విశ్వరూపస్య చింతకాః. 114

వ్యా. కేవలం లింగశరీరస్య స్థూలదేహం విహాయానుపలభ్యమానత్వాత్ స్థూలశరీరసమష్ట్యభిమానీ విరాడేవేశ్వర ఇత్యాహ—స్థూలదేహం వినేతి.

తత్సద్భావే ప్రమాణమాహ—సహస్రశీర్షేతి. శ్రుతం వాక్యమితి శేషః. విశ్వరూపస్య చింతకాః విరాడుపాసకాః.

టీ. లింగదేహః = సూక్ష్మదేహము, స్థూలదేహం వినా = స్థూలశరీరము లేక, క్వాపి = ఎక్కడను, న దృశ్యతే = చూడఁబడుట లేదు. అతః = ఈహేతువుచేత, సర్వతః = అంతటను, మస్తకాదిమాన్ - మస్తక=శిరస్సును, ఆదిమాన్=నేత్రపాదాద్యవయవములుగల, వైరాజః = విరాట్పురుషునిసంబంధమైన, దేహః = దేహము, సమష్టిస్థూలశరీరాభిమానియైన విరాట్పురుషుఁ డనుట. ఈశః = ఈశ్వరుఁడు, (భవతి = అగుచున్నాఁడు), విశ్వరూపస్య = విరాట్పురుషునియొక్క, చింతకాః = ఉపాసన

చేయువారు, అనిశం = ఎల్లప్పుడును, సహస్రశీర్షేతి = వేయి శిరస్సులు గలవాఁడనియు, విశ్వతః = అంతటను, చక్షురిత్యపిచ = నేత్రములు కలవాఁ డనియు, ఏవం= ఈ మొదలైన సంగతి, శ్రుతం = పురుషసూక్తములో చెప్పఁబడినది. ఇతి = అని, ఆహుః = చెప్పుచున్నారు.

తా. స్థూలదేహము లేక సూక్ష్మశరీర ముండుట ఎన్నఁటికిని సంభవింపదు. కావున శిరఃపాదాద్యవయవములు గల విరాట్పురుషుఁడే యీశ్వరుఁ డనియు, ఇందుకు పురుషసూక్తము ప్రమాణ మనియు విరాడుపాసకులు వాదించుచున్నారు.

అవ. ఈ విరాట్పురుషోపాసనయందును తప్పు గనిపించుచున్న దనెడి వారి వాదమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. సర్వతః పాణిపాదత్వే క్రిమ్యాదే రపి చేశతా,
తత శ్చతుర్ముఖో దేవ ఏవేశో నేతరః పుమాన్. 115

వ్యా. అత్రాపి దోషదృష్ట్యా దేవతాంతరమాలంబత ఇత్యాహ—సర్వత ఇతి.

టీ. సర్వతః = అంతట, పాణిపాదత్వేసతి = చేతులును పాదములును గలవాఁ డగుచుండఁగా, క్రిమ్యాదేరపిచ = పురుగులు మొదలగువానికి సయితము, ఈశతా = ఈశ్వరత్వము (సిద్ధింపవలసియుండెను.) తతః=ఆహేతువుచేత, చతుర్ముఖః = నాలుగు ముఖములు గలిగిన, దేవఏవ = బ్రహ్మదేవుఁడే, ఈశః = ఈశ్వరుఁడు, ఇతరః=అన్యుఁడైన, పుమాన్ = పురుషుఁడు, న = కాఁడు, ఈశ్వరుఁడు కాఁ డనుట.

తా. కాలుచేతులు సామాన్యముగా క్రిమికీటకాదులకుం గూడఁ గలవు. అంతమాత్రముచేత (కాలుచేతులు గలిగినమాత్రముచేత) విరాట్పురుషున కీశ్వరత్వము చెప్పుట యుక్తము కాదు మఱేమి యనవలయు ననఁగా చతుర్ముఖుఁ డైన బ్రహ్మయే యీశ్వరుఁ డనుట ఉచితముగాఁ గన్పట్టుచున్నది.

శ్లో. పుత్రార్థం త ముపాసీనా ఏవ మాహుః ప్రజాపతిః,
ప్రజా అసృజతేత్యాది శ్రుతిం చోదాహరంత్యమీ. 116

వ్యా. ఏవం కైరుచ్యత ఇత్యత ఆహ—పుత్రార్థమితి. "ప్రజాపతిః ప్రజా అసృజ" తేత్యాదివాక్యం తత్ర ప్రమాణమిత్యాహురిత్యాహ—ప్రజాపతీరితి.

టీ. పుత్రార్థం = పుత్రసంతానముకొఱకు, తం = ఆచతుర్ముఖబ్రహ్మను, ఉపాసీనాః = ఉపాసన చేసెడివారు, ఏవం = ఈ చెప్పఁబోయెడి విధముగా, ఆహుః =

చెప్పుచున్నారు. అమీ = ఈచతుర్ముఖబ్రహ్మోపాసకులు, ప్రజాపతిః = బ్రహ్మదేవుఁడు, ప్రజాః = ప్రజలను, అసృజత = సృష్టించెను. ఇత్యాదిశ్రుతిం చ = ఈ మొదలగు వేదవాక్యములను, ఉదాహరంతి = ఉదాహరణముగా చెప్పుచున్నారు.

తా. శ్రు. "ప్రజాపతిః ప్రజా అసృజత" బ్రహ్మదేవుఁడు ప్రజలను సృష్టించెను గనుక బ్రహ్మదేవునే ఈశ్వరుఁ డనవలయును అని చతుర్ముఖ బ్రహ్మోపాసనమును సంతానాద్యపేక్షలతోఁ జేసెడి జనులు వాదించుచున్నారు.

అవ. ఇప్పుడు భాగవత మతస్వరూపమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. విష్ణోర్నాభే స్సముద్భూతో వేధాః కమలజ స్తతః,
విష్ణురేవేశ ఇత్యాహు ర్లోకే భాగవతా జనాః. 117

వ్యా. భాగవతమతమాహ—విష్ణోరితి.

టీ. కమలజః = కమలమునందు పుట్టిన, వేధాః = బ్రహ్మదేవుఁడు, విష్ణోః = శ్రీమహావిష్ణువుయొక్క, నాభేః = నాభికమలమువలన, సముద్భూతః = పుట్టియుండెను. తతః = అందుచేత, విష్ణురేవ = శ్రీ మహావిష్ణువే, ఈశ ఇతి = ఈశ్వరుఁ డగు నని, లోకే = లోకమునందు, భాగవతాః = భగవద్భక్తులైన (భాగవతులగు), జనాః = జనులు, ఆహుః = చెప్పుచున్నారు.

తా. చతుర్ముఖ బ్రహ్మ విష్ణుదేవునియొక్క నాభికమలమునందు జనించినవాఁడు కనుక విష్ణుమూర్తిని దేవుఁ డనుట యుక్తియుక్తము కాని బ్రహ్మదేవుఁడే ఈశ్వరుఁ డనుట సరి కా దని భాగవతజనులు పల్కుదురు.

అవ. శైవమతస్వరూపమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. శివస్య పాదావన్వేష్టుం శార్ఙ్గ్యశక్త స్తతశ్శివః,
ఈశో న విష్ణు రిత్యాహు శ్శైవా ఆగమమానినః. 118

వ్యా. శైవానాంమతమాహ-శివస్యేతి.

టీ. శార్ఙ్గీ = విష్ణుదేవుఁడు, శివస్య = శివునియొక్క, పాదౌ = పాదములను, అన్వేష్టుం = వెదకుటకొఱకు, అశక్తః=అసమర్థుఁ డయ్యెను. తతః = ఆకారణమువలన, శివః = శివుఁడు, ఈశః = ఈశ్వరుఁడు అనవలయును. విష్ణుః = శ్రీమహావిష్ణువు, నేతి= ఈశ్వరుఁడు కాఁ డని, ఆగమమానినః = శైవాగమమునందు అభిమానము గలిగిన, శైవాః = శివభక్తులు, ఆహుః = చెప్పుచున్నారు.

తా. శివమతస్థులు ఆగమమునందలి యభిమానముచేత మా శివునిపాదములను వెదకి తెలిసికొనుటకుచేతఁగాని విష్ణుదేవుని ఈశ్వరుఁ డనుట చెల్లదు. శైవాగమముప్రకారము పరమశివుని ఈశ్వరుఁ డనఁ దగియున్నది.

అవ. గణపతిమతస్థులవాదమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. పురత్రయం సాదయితుం విఘ్నేశం సోఽప్యపూజయత్,
వినాయకం ప్రాహురీశం గాణపత్యమతే రతాః. 119

వ్యా. గాణపత్యమతమాహ—పురత్రయమితి.

టీ. సోఽపి = ఆశివుఁడును, పురత్రయం = త్రిపురములను, (త్రిపురాసురుల ననుట.) సాధయితుం = సాధింపనెంచి, విఘ్నేశం = విఘ్నములను దొలఁగించునట్టి గణపతిని, అపూజయదితి = పూజించియుండె నని, గాణపత్యమతే=గాణపత్య మనెడి మతమునందు, రతాః = తాత్పర్యముగల జనులు, వినాయకం = గణపతిని, ఈశం = ఈశ్వరునిగా, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా. త్రిపురాసురులను సంహారింపఁ బోవునప్పుడు ముందుగా శివుఁడు గణపతిని పూజించినట్లు పురాణములలో నుండుటచేత గణపతిని ఈశ్వరుఁ డనవలయుఁగాని, శివుని ఈశ్వరుఁ డనరాదు అని గాణపత్య మతస్థులు వాదించెదరు.

అవ. ఇట్లే తమ తమ మతాభిమానముచేత బహుజనులు బహువిధవాదములు చేయుచు ననేకమతముల నేర్పఱచి రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవమన్యే స్వస్వపక్షాభిమానేనాన్యథాన్యథా,
మంత్రార్థవాదకల్పాదీ నాశ్రిత్య ప్రతిపేదిరే. 120

వ్యా. ఉక్తన్యాయమన్యత్రాప్యతిదిశతి—ఏవమితి. అన్యే భైరవమైరాలాద్యుపాసకాః. అన్యథాన్యథా వర్ణనే కారణమాహ—స్వస్వేతి. తత్రతత్ర ప్రమాణాని సంతీతి దర్శయతి—మంత్రేతి.

టీ. ఏవం = ఈవిధముగా, అన్యే = మఱికొందఱు, (భైరవాద్యుపాసకు లనుట.) స్వస్వపక్షాభిమానేన = తమ తమ మతాభిమానముచేత, అన్యథాన్యథా = అనేక విధములుగా, మంత్రార్థవాదకల్పాదీన్ - మంత్ర = మంత్రములయందలి, అర్థవాద = కథలను, కల్పాదీన్ = స్థలపురాణాదులను, ఆశ్రిత్య = అనుసరించి, ప్రతిపేదిరే = ఈశ్వరునిగా నుపాసించిరి.

తా. మఱికొందఱు తమ తమ మతాభిమానము చేత వేదమంత్రములయందలి కథలను ఆయా స్థలపురాణములనుబట్టి వేలు వేలు దేవతల నుపాసనచేయుచున్నారు.

అవ. ఇట్లు లెక్కలేని మతము లున్న వని తెల్పుచున్నాఁడు:—

శ్లో. అంతర్యామిణమారభ్య స్థావరాంతేశవాదినః,
సంత్యశ్వత్థార్కవంశాదేః కులదైవత్వదర్శనాత్. 121

వ్యా. ఏవం కతి మతానీత్యాశంక్య, అసంఖ్యానీత్యాహ—అంతర్యామిణమితి. స్థావరేశవాదో న క్వాపి దృష్టచర ఇత్యాశంక్యాహ—అశ్వత్థార్కేతి.

టీ. అశ్వత్థార్కవంశాదేః - అశ్వత్థ = రావిచెట్లును, అర్క = జిల్లేడుచెట్లును, వంశ = వెదళ్లును, ఆదేః = మొదలైనవానియొక్క, కులదైవత్వదర్శనాత్ = కులదేవతలనుగా నుపాసించుట (కనఁబడుచుండుట) వలన, అంతర్యామిణం = అంతర్యామిని, ఆరభ్య = మొదలుకొని, స్థావరాంతేశవాదినః - స్థావర = స్థావరములైన చెట్లు చేమలవఱకు, ఈశ = ఈశ్వరభావమును, వాదినః = వాదించెడువారును, సంతి = కలరు.

తా. అంతర్యామి మొదలుకొని చివరకు రావిచెట్లు, తులసిచెట్లు, జిల్లేడుచెట్లు, పుట్టలు, గుట్టలు, దేవుఁ డనియు కులదేవత లనియు పూజించెడిమతము లెన్నియో గణనాతీతములుగ నున్నవి. కావున స్థావరములే ఈశ్వరుఁ డని యేల యనరాదు. అని బహుజనులు చెప్పుచున్నారు.

అవ. ప్రపంచమున నెందఱున్నారో యందఱికన్నిమతము లున్నట్లు తెలియఁబడుచున్నది. ఇందులో గ్రాహ్యములైన మతము లేవి? అగ్రాహ్యములైన మతము లేవి యని ప్రశ్న రాఁగా చెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వనిశ్చయకామేన న్యాయాగమవిచారిణాం,
ఏకైవ ప్రతిపత్తిస్స్యా త్సాప్యత్ర స్ఫుటముచ్యతే. 122

వ్యా. నన్వేవం మతభేదే కస్యోపాదేయత్వం కస్య వా హేయత్వ మిత్యాకాంక్షాయామాహ—తత్త్వనిశ్చయేతి. తత్త్వనిశ్చయకామేన తత్త్వనిశ్చయేచ్ఛయా న్యాయాగమయోర్విచారణశీలానాం పురుషాణాం ప్రతిపత్తిరేకైవ స్యాత్. సా కీదృశీత్యతఆహ—సాప్యత్రేతి.

టీ. తత్త్వనిశ్చయకామేన=పరతత్త్వనిశ్చయమును కోరినయెడల, న్యాయాగమ విచారిణాం = న్యాయవిచారమును వేదాంతవిచారమును గలవారికి, ప్రతిపత్తి=తత్త్వ నిశ్చయము, ఏకైవ = ఒక్కటే యుండును. సాపి = ఆ తత్త్వనిశ్చయబుద్ధియు, అత్ర= ఈచిత్రదీపికయందు, స్ఫుటం=సందేహములు పాయునట్లు, ఉచ్యతే=చెప్పఁబడును.

తా. చక్కఁగా వేదాంతశాస్త్రమును మీమాంసాన్యాయము లను పరిశీలించి నిశ్చయించినవారి కిన్ని మతములే లేవు. వారిమతము పరతత్త్వ మొక్కటితప్ప తక్కినవన్నియు వారి వారి యధికారము నను సరించి బోధసౌకర్యార్థముగాఁ దెలుపఁబడిన వని యీచిత్రదీపమునందు స్పష్టీకరింపఁబడును.

అవ. అట్టి నిశ్చయమును దెలుపఁబూని దాని కనుకూలమైన యొక శ్రుతిని చెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం,
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్. 123

వ్యా. తామేవ ప్రతిపత్తిం దర్శయితుం తదనుకూలాం శ్రుతిం పఠతి—మాయాం త్వితి. మాయామేవ ప్రకృతిం జగదుపాదానకారణం విద్యాత్ జానీయాత్. మాయినం తుమాయోపాధికమంతర్యామిణమేవ మహేశ్వరం మాయాధిష్ఠాతారం నిమిత్తకారణం జానీయాత్. అస్య మాయినో మహేశ్వరస్యావయవభూతై రంశరూపైశ్చరాచరాత్మకై ర్జీవైః కృత్స్నమిదం జగద్వ్యాప్త మిత్యస్యాశ్శ్రుతేరర్థః.

టీ. మాయాం తు=మాయను, ప్రకృతం=ప్రకృతినిగా, విద్యాత్ = తెలిసికొన వలయును. మాయినం తు = మాయోపాధికుఁడైన యీశ్వరుని, మహేశ్వరం=మాయా ధిష్ఠాతయైన పరమేశ్వరునిగా (విద్యాత్=తెలిసికొనవలెను). అస్య = ఈ పరమేశ్వరుని యొక్క, అవయవభూతైస్తు=అవయవస్వరూపులైన (చరాచరాత్మకములైన) సర్వజీవుల చేత, ఇదం=ఈ, సర్వం=సమస్తమైన, జగత్=జగత్తు, వ్యాప్తం=వ్యాపింపఁబడియున్నది.

తా. మాయ యీజగత్తునకు నుపాదానకారణ మగుచు ప్రకృతి యనఁబడుచున్నది. ఇట్టి మాయకు నాధారుఁడైన యంతర్యామిని మహేశ్వరునిగా నీయంతర్యామియొక్క అంశస్వరూపులైన జంగమ స్థావరాత్మకమైన (మనుష్యపశుపక్షివృక్షాదిస్వరూపమై) సర్వప్రపం చము వానిచే వ్యాపింపఁబడిన దని వేదము చెప్పుచున్నది.

అవ. ఈశ్రుతి చెప్పినచొప్పున న్యాయనిర్ణయము చేయుట తగియున్నదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇతి శ్రుత్యనుసారేణ న్యాయ్యో నిర్ణయ ఈశ్వరే,
తథా సత్యావిరోధస్స్యాత్ స్థావరాంతేశవాదినామ్. 124

వ్యా. ఏతచ్ఛ్రుత్యనుసారేణేశ్వరవిషయే నిర్ణయో యుక్త ఇత్యాహ—ఇతీతి. కుతో యుక్త ఇత్యాశంక్య సర్వత్రావిరుద్ధత్వాదిత్యాహ—తథేతి. సర్వస్యాపీశ్వరత్వాభ్యుపగమాన్న కేనాపి విరోధ ఇతి భావః.

టీ. ఇతి=ఈ పైన చెప్పఁబడినప్రకారముగల, శ్రుత్యనుసారేణ=శ్రుతి ననుసరించి, ఈశ్వరే = ఈశ్వరవిషయకమైన, నిర్ణయః = నిర్ధారణము, న్యాయ్యః = న్యాయయుక్తమైయున్నది. తథా సతి=అట్లగుచుండఁగా, స్థావరాంతేశవాదినాం-స్థావరాంతేశ= వృక్షముల పర్యంతమునుండు సర్వభూతములను, ఈశ = యీశ్వరుఁ డని, వాదినాం = వాదముచేయువారికి, అవిరోధః = విరోధము లేక పోవుట (సర్వసమ్మతమై యుండుట), స్యాత్ =అగును.

తా. "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అని పైనచెప్పఁబడి యున్న శ్రుతిప్రకారము స్థావరపర్యంతములగు సర్వభూతములును ఈశ్వరస్వరూప మని చెప్పుట సర్వజనసమ్మతమై యున్నది.

అవ. ఇపుడు మాయాస్వరూపమును నిరూపణము చేయుచున్నాఁడు:—

శ్లో. మాయా చేయం తమోరూపా తాపనీయే తదీరణాత్,
అనుభూతిం తత్ర మానం ప్రతిజజ్ఞే శ్రుతి స్స్వయమ్. 125

వ్యా. నను జగత్ప్రకృతిభూతాయాః కిం రూప మిత్యత ఆహ—మాయా చేయమితి. కుత ఇత్యత ఆహ—తాపనీయ ఇతి. మాయా చ తమోరూపేతి తాపనీయోపనిషది తమోరూపత్వస్యాభిధానాదిత్యర్థః. మాయాయా స్తమోరూపత్వే కిం ప్రమాణమిత్యాకాంక్షాయాం అనుభూతిరితి. శ్రుతిరేవాత్రానుభవః ప్రమాణమితి ప్రజానీత ఇత్యాహ —అనుభూతిమితి.

టీ. తాపనీయే=తాపనీయోపనిషత్తునందు, తదీరణాత్ = ఆ మాయాస్వరూపము చెప్పఁబడుటవలన,. ఇయం చ = ఈమాయ, తమోరూపా=తమోగుణస్వరూపమైనది, తత్ర=తమోగుణస్వరూపము గలుగుటయందు, అనుభూతిం = అనుభవమును, మానం = ప్రమాణముగా, శ్రుతిః=శ్రుతి, స్వయం=తాను, ప్రతిజజ్ఞే=తెల్పినది.

తా. శ్రు. "మాయా చ తమోరూపా" మాయ తమోగుణస్వరూపమైన దని యుత్తరతాపని పూర్వతాపని యను నుపనిషత్తుల

యందు చెప్పఁబడినశ్రుతి లోకానుభవమును ప్రమాణముగాఁ జేసి చెప్పియున్నది.

అవ. ఆ లోకానుభవమునే వివరించుచున్నాఁడు:—

శ్లో. జడం మోహాత్మకం తచ్చే త్యనుభావయతి శ్రుతిః,
ఆబాలగోపం స్పష్టత్వా దానంత్యం తస్య సాబ్రవీత్. 126

వ్యా. తత్ర మాయాయా స్తమోరూపత్వే కోఽసావనుభవ ఇత్యాకాంక్షాయాం తదేతజ్జడం మోహాత్మక మితి శ్రుతిరేవాత్రానుభవం స్పష్టయతీత్యాహ—జడమితి. అనంతమితి శ్రుత్యా సర్వానుభవం సిద్ధత్వముచ్యత ఇత్యాహ—ఆబాలేతి. జడం మోహం చ ప్రకృతేః కార్యమిత్యాబాలగోపాలాదీనాం సర్వేషామనుభవఇత్యర్థః.

టీ. తత్ = ఆ తమోగుణస్వరూపమగుమాయ, జడం = జడ మనియుఁ, మోహాత్మకం=అజ్ఞాన స్వరూపమైన దనియు, ఇతి = ఇట్లుగా, శ్రుతిః=వేదవాక్యము, అనుభావయతి = లోకానుభవము తెలుపుచున్నది. ఆబాలగోపం = పిల్లవాఁడు మొదలుకొని వెఱ్ఱిగొల్లవాఁడువఱకు, స్పష్టత్వాత్ = అందఱికిఁ దెలిసిన దగుటవలన, తస్య = ఆ తమోగుణస్వరూపమైన మాయకు, ఆనంత్యం = అనంతత్వమును, సా=ఆ వేదవాక్యము, అబ్రవీత్=చెప్పెను.

తా. మాయ జడస్వరూప మైన దనియు, నందఱను మోహింపఁ జేయునదియు, అనంతస్వభావము గల దనియు శ్రు. "తదేతజ్జడం మోహాత్మకం అనంతం" ఈ మొదలైన వేదవాక్యములు మాయాస్వరూపము ఆబాలగోపవిదిత మని అనుభవగోచర మగుటను తెల్పుచున్నవి.

శ్లో. అచిదాత్మఘటాదీనాం యత్స్వరూపం జడం హి తత్,
యత్ర కుంఠీభవేద్బుద్ధి స్స మోహ ఇతి లౌకికాః. 127

వ్యా. జడశబ్దస్యార్థమాహ—అచిదాత్మేతి. మోహశబ్దార్థ మాహ—యత్రేతి.

టీ. అచిదాత్మఘటాదీనాం-అచిదాత్మ = చేతనపదార్థములుగాని, ఘటాదీనాం= ఘటపటాదివస్తువులయొక్క, యత్ స్వరూపం = ఏస్వరూపము గలదో, తత్ = అది, జడం హి=జడశబ్దార్థముగదా, యత్ర = ఏవిషయమందు, బుద్ధిః = బుద్ధి, కుంఠీభవేత్= తెలిసికొనఁజాలక భ్రాంతిని జెందునో, సః=అది, మోహ ఇతి=మోహ మని, లౌకికాః= సామాన్యముగా లోకజ్ఞానము గలవారు (ఆహుః=చెప్పుచున్నారు).

తా. కుండ, గోడ మొదలైనవి అచేతనము లనెడి బుద్ధి యేది కలదో, యది జడస్వరూపముయొక్క యనుభవ మగును. "ఇది నా

"బుద్ధికి నందకుండ నున్నది" యనునట్టి యనుభవము మోహస్వరూపము యొక్క యనుభవ మగును. ఇది యెల్లరకును దెలిసినవిషయమే.

అవ. పైన చెప్పఁబడినవిధమున సర్వానుభవసిద్ధమైన యానంత్యము సిద్ధించిన దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం లౌకికదృష్ట్యైత త్సర్వైరప్యనుభూయతే,
యుక్తిదృష్ట్యా త్వనిర్వాచ్యం నాసదాసీదితి శ్రుతే. 128

వ్యా. ఉక్తప్రకారేణ సర్వానుభవసిద్ధత్వలక్షణమానంత్యం సిద్ధమిత్యాహ— ఇత్థమితి. ఏతజ్జాడ్యమోహలక్షణతమోరూపత్వం నన్వేవం మాయాయాస్సర్వానుభవసిద్ధత్వేఘటాదివత్ జ్ఞానేనానివర్త్యత్వం స్యాదిత్యాశంక్యాహ—యుక్తీతి. తుశబ్దః శంకావ్యావృత్త్యర్థః. అనిర్వాచ్యం సత్త్వేనాసత్త్వేన వా నిర్వక్తు మశక్యం. తత్ర కిం ప్రమాణమిత్యత ఆహ—నాసదితి.

టీ. ఏతత్ = ఈజాడ్యమోహలక్షణమైన తమోరూపత్వము, ఇత్థం = ఈపైన చెప్పఁబడినవిధమున, లౌకికదృష్ట్యా = లోకజ్ఞానముచేత, సర్వైరపి = ఎల్లజనులచేతను, అనుభూయతే = అనుభవింపఁబెడుచున్నవి. నాసదాసీదితి శ్రుతే = సద్రూపమును అసద్రూపమును కా దని చెప్పెడి శ్రుతినిబట్టియు, యుక్తిదృష్ట్యా=యుక్తిచేత నాలోచించి చూచుటచేతను, అనిర్వాచ్యం = అనిర్వాచ్యమైనది. అనఁగా సద్రూప మని కాని అసద్రూప మని కాని వాక్కుచే చెప్పుట కలవి కా దనుట (స్యాత్=అగును).

తా. ప్రకృతిసంబంధమైన జడస్వరూపమైనట్టియు మోహస్వరూపమైన తమోరూపత్వము చక్కని లోకజ్ఞానముకలిగి పరిశీలించుటచేత నెల్లరకు ననుభవగోచర మగును. ఇది సద్రూపమును అసద్రూపమును కా దనెడి శ్రు. "నాస దాసీన్నో స దాసీత్" ఈశ్రుత్యర్థమునుబట్టియు, యుక్తిచేత చూచినను అనిర్వాచ్య మగుచున్నది. అనఁగా వాక్కుచే నిట్టి దని వచింప శక్యము గాని దనుట.

అవ. ఈ శ్రుత్యర్థమును హేతువులచేత స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. నాస దాసీద్విభాతత్వా న్నో సదాసీచ్చ బాధనాత్,
విద్యాదృష్ట్యా శ్రుతం తుచ్ఛం తస్య నిత్యనివృత్తితః. 129

వ్యా. అస్యాశ్శ్రుతేరభిప్రాయమాహ—నాసదాసీదితి. బాధనాన్నేహనానాస్తి కించనేతి శ్రుత్యా నిషేధాదిత్యర్థః. సదసద్రూపత్వం తు. "విరుద్ధత్వాదయుక్త"మితి శ్రుత్యోపేక్షితం. ఏవం యుక్తిదృష్ట్యాఽనిర్వచనీయత్వం ప్రదర్శ్య "తుచ్ఛమిదం

రూపమస్యే"తి శ్రుతిర్విద్వదనుభవేన తస్యాస్తుచ్ఛత్వం దర్శయతీత్యాహ—విద్యేతి. తుచ్ఛత్వే హేతుమాహ—తస్యేతి.

టీ. విభాతత్వాత్ = (ఆమాయ) ప్రకాశించుచుండుటవలన, అసత్ = అసద్రూపమైనది, నాసీత్ = కాదు, బాధనాత్ = శ్రుతి నిషేధించుటవలన, సచ్చ = సద్రూపంబును, నో ఆసీత్ = కాదు. తస్య = ఆతమస్స్వరూప మగు మాయ, నిత్యనివృత్తితః - నిత్య = ఎల్లప్పుడును, నివృత్తితః = నివర్తించుటవలనను, విద్యాదృష్ట్యా= జ్ఞానదృష్టిచేత, తుచ్ఛం=తుచ్ఛమైనది, కాలత్రయమందు లేని దని, శ్రుతం = శ్రుతిచేతఁ జెప్పఁబడినది.

తా. ఈమాయ శశవిషాణము (కుందేటికొమ్ము) వంధ్యాపుత్త్రుఁడు (గొడ్రాలికొడుకు) మొదలైనవానివలె లేని దందుమా? ప్రకాశించుటచేత లేనిది (అసద్రూపము) అనుటకు వీలులేదు. శ్రు. "నేహ నానాస్తి కించన" అనఁగా ఇహ=ఈఆత్మయందు, కించన = ఏదియును, నాస్తి = లేదు. అనెడి ఈశ్రుతిచేత నిషేధింపఁబడుటవలన ఉనికి గలది (సద్రూపము) అనుటకు వీలు లేదు. ఈరెండుపక్షములు గాక మూఁడవది గ్రైన ఉన్నది లేదు (సదసద్రూపము) అనెడి పక్షము పరస్పరవిరుద్ధధర్మము గలది గనుక శ్రుతియే యాపక్షమును శ్రు. "అయుక్తం" అను శ్రుతిచేత నుపేక్షించినది "తుచ్ఛమిదం రూపస్య" ఆప్రకృతిజ్ఞానముచేత నివర్తించున దగుటవలనను విద్వదనుభవమును బట్టియు తుచ్ఛము (కాలత్రయమందు లేనిది) అని శ్రుతిచేత చెప్పఁబడినది.

అవ. ఈచెప్పఁబడినసంగతిని పూర్తిచేయుచున్నాఁడు:—

శ్లో. తుచ్ఛాఽనిర్వచనీయా చ వాస్తవీ చేత్యసౌ త్రిధా,
జ్ఞేయా మాయా త్రిభిర్బోధైః శ్రౌతయౌక్తికలౌకికైః. 130

వ్యా. ఉపపాదితమర్థముపసంహరతి—తుచ్ఛేతి. శ్రౌతబోధేన తుచ్ఛా కాలత్రయేఽప్యసతీ యౌక్తికబోధేనాఽనిర్వచనీయా లౌకికబోధేన వాస్తవీ చేత్యేవం త్రిధా మాయా జ్ఞేయేత్యర్థః.

టీ. అసౌ మాయా = ఈమాయ, శ్రౌతయౌక్తికలౌకికైః-శ్రౌత=శ్రుతిసంబంధమైనట్టియు, యౌక్తిక = యుక్తిసంబంధమైనట్టియు, లౌకికైః = లోకసంబంధమైనట్టియు, త్రిభిః = మూఁడైన, బోధైః = బోధలచేత (దృష్టులచేత) తుచ్ఛా = కాల

త్రయమందు లేనిదియు, అనిర్వచనీయా చ = వాక్కుచే చెప్పనలవికానిదియు, వాస్తవీచ = సత్యమైనదియు, ఇతి = అని, త్రిధా = మూఁడువిధములు గలదిగా, జ్ఞేయా = తెలిసికొనఁదగినది (అగును). ఇచట యథాక్రమముగా నన్వయచాతుర్యమును గ్రంథకర్త చూపించియున్నాఁడు.

తా. ఈమాయ (క్రమముగా) శ్రౌతసంబంధమగు దృష్టిచేత కాలత్రయమందు లేని దనియు, యుక్తిసంబంధమగు దృష్టిచేత వాక్కుచే చెప్పనలవి కాని దనియు, లోకసంబంధమైన దృష్టిచేత వాస్తవమైన దని(యుఁ (తుచ్ఛ, అనిర్వచనీయ, వాస్తవి అని మూఁడు విధములు గల దిగ) తెలిసికొనవలసినది.

అవ. ఈమాయయొక్క కృత్యమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. అస్య సత్త్వమసత్త్వం చ జగతో దర్శయ త్యసౌ,
ప్రసారణాచ్చ సంకోచా ద్యథా చిత్రపట స్తథా. 131

వ్యా. అస్య సత్త్వమసత్త్వం చ దర్శయతీతి శ్రుతేరర్థమస్యాః కృత్యమాహ— అస్యేతి. ఏకస్యా ఏవ మాయాయా జగత్సత్త్వాసత్త్వప్రదర్శకత్వే దృష్టాంతమాహ— ప్రసారణాదితి.

టీ. చిత్రపటః = బొమ్మలయద్దకము గల వస్త్రము, యథా = ఏవిధముగ, ప్రసారణాత్ = విస్తరింపఁజేయుటవలనను, సంకోచాచ్చ = ముడుచుటవలనను, తన యందలి చిత్రపుంబొమ్మలయునికిని ఆవి లేకపోవుటను చూపుచున్నదో, తథా = ఆవిధముగ, అసౌ = ఈమాయ, అస్య = ఈ, జగతః = జగత్తుయొక్క, సత్త్వం = ఉండుటను, అసత్త్వం చ = లేకపోవుటను, దర్శయతి = చూపించుచున్నది.

తా. బొమ్మలయద్దకము కలిగిన యొకానొక చిత్రవస్త్రమును విస్తరింపఁ జేసినపుడు దానియందలి యునికి తెలియును. ఆవస్త్రమునే ముడిచినపుడు దానియందలి బొమ్మలయొక్క లేకపోవుటయును తెలియును. అటువలె ఈమాయ ప్రపంచముయొక్క కలిమిలేములం జూపుచున్నది. మాయ చేయుచున్న చమత్కారకార్యమిదియే. శ్రు. "అస్య సత్త్వమసత్త్వం చ దర్శయతి" అనెడి శ్రుత్యర్థ మీశ్లోకమందు తెల్పఁబడినది.

అవ. ఇప్పుడు శ్రు. "స్వతంత్రాస్వతంత్రత్వేన" అనెడి శ్రుతిచేత మాయయందు స్వాతంత్ర్యమును అస్వాతంత్ర్యమును చెప్పఁబడియుండుటచేత నందులకు తగిన యుపపత్తిని దెల్పుచున్నాఁడు:—

శ్లో. అస్వతంత్రా హి మాయా స్యా దప్రతీతే ర్వినా చితం,
స్వతంత్రాపి తథైవ స్యా దసంగస్యాన్యథాకృతేః. 132

వ్యా. స్వతంత్రాస్వతంత్ర త్వేనేతి శ్రుత్యా మాయాయా స్స్వాతంత్ర్యాస్వాతంత్ర్యే దర్శితే. తత్రోభయత్రోపపత్తిమాహ — అస్వతంత్రేతి. స్వభాసకచైతన్యం విహాయ న ప్రకాశత ఇత్యస్వతంత్రాఽసంగస్యాత్మనోఽన్యథాకరణాత్ స్వతంత్రాపీత్యర్థః.

టీ. మాయా = ప్రకృతి, చితం వినా = చిద్రూపుఁడైన ఆత్మను వదలి, అప్రతీతేః = స్ఫురింపకపోవుటవలన, అస్వతంత్రా హి = స్వతంత్రతలేనిదే, స్యాత్ = అగును. అసంగస్య=నిస్సంగుఁడైన కూటస్థుని, అన్యథా=సంగము కలవానినిగా, కృతేః= చేయుటవలన, స్వతంత్రాపి = స్వాతంత్ర్యము కలదియు, తథైవ = ఆప్రకారముగనే, స్యాత్ = అగును.

తా. మాయ ఆత్మను వదలిపెట్టిన స్ఫురింపదు గనుక స్వాతంత్ర్యము లేని దనవలయును. అసంగుఁడైన ప్రత్యగాత్మను సంగము గల వానినిగాఁ జేయుటచేత స్వతంత్రాస్వతంత్రత్వేన = స్వాతంత్ర్యము నస్వాతంత్ర్యము రెండును గల దనెడి హేతువు చెప్పఁబడినది.

అవ. కూటస్థుని సంగము గలవానినిగాఁ జేసినరీతిని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థాసంగ మాత్మానం జగత్త్వేన కరోతి సా,
చిదాభాసస్వరూపేణ జీవేశావపి నిర్మమే. 133

వ్యా. అన్యథాకరణమేవ స్పష్టయతి—కూటస్థాసంగమితి. జీవేశావాభాసేన కరోతీతి శ్రుత్యుక్తం జీవేశ్వరవిభాగం చ కరోతీత్యాహ—చిదాభాసేతి.

టీ. సా = ఆమాయ, కూటస్థాసంగం-కూటస్థ=కూటస్థుఁ డగుటచేత, అసంగం = ఏసంగములేని (దేనితో నంటని), ఆత్మానం = ప్రత్యగాత్మను, జగత్త్వేన=ప్రపంచస్వరూపునిగా, కరోతి = చేయుచున్నది. చిదాభాసస్వరూపేణ = చిదాభాస స్వరూపము చేత, జీవేశావపి = జీవుని నీశ్వరుని కూడ, నిర్మమే = నిర్మించినది.

తా. స్వభావముచేత నిర్వికారుఁడును అసంగుఁడు నైన ప్రత్యగాత్మను జగద్రూపునిగాఁ జేసినది. (సర్వజగత్తును ప్రత్యగాత్మయందు యథార్థముగా లేనిదానిని కల్పించిన దనుట.) మఱియు ఆమాయ జీవేశ్వరు లిద్దఱని చిదాభాసస్వరూపముచేత విభాగము కలుగఁ జేసినది. ఈయర్థము శ్రు. "జీవేశావాభాసేన కరోతి" అనెడి శ్రుతిచేత తెలుపఁబడెను.

అవ. మాయ ఆత్మను జగద్రూపునిగాఁ జేసినయెడల, ఆయాత్మస్వరూపమునకు హాని వచ్చునే యని ప్రశ్న రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థమనుపద్రుత్య కరోతి జగదాదికం,
దుర్ఘటైకవిధాయిన్యాం మాయాయాం కా చమత్కృతిః. 134

వ్యా. నన్వాత్మనోఽన్యథాకరణే కూటస్థత్వహానిస్స్యాదిత్యాశంక్యాహ—కూటస్థమితి. నను కూటస్థత్వావిఘాతేన జగదాదిస్వరూపత్వాపాదనం దుర్ఘటమిత్యాశంక్య మాయాయాం దుర్ఘటైకవిధాయిత్వాన్నేద మాశ్చర్యకారణమిత్యాహ—దుర్ఘటేతి. అన్యథా మాయాత్వమేవ భజ్యేతేతి భావః.

టీ. కూటస్థం = ప్రత్యగాత్మనుగూర్చి, అనుపద్రుత్య = ఉపద్రవము కలుగఁ జేయక (కూటస్థస్వరూపమునకు హాని కలిగింపక) జగదాదికం = జగత్తుమొదలైనదానిని, కరోతి = చేయుచున్నది. దుర్ఘటైకవిధాయిన్యాం - దుర్ఘట = చేయనలవిగాని పనులను, విధాయిన్యాం = చేయఁగలిగిన, మాయాయాం = మాయయందు, చమత్కృతిః= ఆశ్చర్యపడఁదగినది, కా = ఏమి. (అస్తి = ఉన్నది? వింత లే దనుట.)

తా. కూటస్థస్వరూపమునకు నేమాత్రము హాని కలుగనీయక యాకూటస్థునియందు జగత్తు నంతయు కల్పించినది. అఘటనఘటనాసామర్థ్యముగలిగిన, అనఁగా నెంతటి యసాధ్యకార్యములనైనఁ జేయఁగలిగిన మాయవిషయమై యిది యిట్లు చేయు ననుట యొక వింతకాదు.

అవ. మాయ ఎంతటి యసాధ్యకార్యముల నైనఁ జేయఁగల దని దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ద్రవత్వ ముదకే వహ్నావౌష్ణ్యం కాఠిన్యమశ్మని,
మాయాయాం దుర్ఘటత్వం చ స్వతస్సిధ్యతి నాన్యతః. 135

వ్యా. మాయాయా దుర్ఘటకారిత్వస్వభావత్వే దృష్టాంతమాహ—ద్రవత్వమితి. ఉదకాదీనాం ద్రవత్వాది యథా స్వాభావికం తద్వన్మాయాయా దుర్ఘటకారిత్వమిత్యర్థః.

టీ. ఉదకే = నీటియందు, ద్రవత్వం = ద్రవస్వభావమును, వహ్నౌ = అగ్నియందు, ఔష్ణ్యం = వేఁడిమిని, అశ్మని = ఱాతియందు, కాఠిన్యం = కఠినత్వమును, మాయాయాం = మాయయందు, దుర్ఘటత్వం చ = అసాధ్యమైనపనులం జేయుట, స్వతః = స్వాభావికముగనే, సిధ్యతి = ఏర్పడుచున్నది, అన్యతః = ఇంకొకదానివలన, న = ఏర్పడ లేదు.

తా. ఉదకమునందు ద్రవత్వమును, అగ్నియం దుష్ణత్వమును, ఱాతియందు కాఠిన్యమును, నితర పదార్థములవలనఁ గలుగక స్వభావ సిద్ధములై యున్నట్లు మాయ యందును అఘటనాఘటనరూప మగు శక్తి స్వతస్సిద్ధమై యున్నదే కాని మఱియొక పదార్థమువలనఁ గలుగ లేదు.

శ్లో. న వేత్తి లోకో యావత్తం సాక్షాత్తావ చ్చమత్కృతిమ్,
ధత్తే మనసి పశ్చాత్తు మా యైషేత్యుపశామ్యతి. 136

వ్యా. నను మాయాయా దుర్ఘటకారిత్వ మాశ్చర్యకారణం న భవతీ త్యుక్త మనుపపన్నం. లోకే మాయాయాశ్చమత్కారహేతుత్వదర్శనాదిత్యాశంక్య మాయా ప్రయోక్తృసాక్షాత్కారపర్యంత మేవాస్యా ఆశ్చర్యకారణత్వం నోపరిష్టాదిత్యాహ—న వేత్తీతి.

టీ. తం = ఆకూటస్థుని, లోకః = జనము, యావత్ = ఎంతవఱకు, సాక్షాత్ = ప్రత్యక్షముగా, న వేత్తి = తెలిసికొనదో, తావత్ = అంతవఱకు, మనసి = మనస్సునందు, చమత్కృతిం = చమత్కారమును, ధత్తే = చేయుచున్నది. పశ్చాత్తు = ఆపరమాత్మను తెలిసికొనినతర్వాతనైతే, ఏషా = ఈ, మాయేతి = మాయ యనునది, ఉపశామ్యతి=ఉపశమించుచున్నది. స్వరూపనాశనము నొందుచున్న దనుట.

తా. లోకములో మాయాచమత్కారములు చేయువాఁడు తానగపడక యెన్నెన్నియో చిత్రప్రదర్శనములను గనపఱచి చిట్టచివరకు అవి యసత్యము లని కనుపడఁగానే యదివఱకు కనుగొనినదంతయు మిథ్య యైనట్లు యీమాయాప్రపంచమంతయు ఆపరమాత్మసాక్షాత్కారము కలుగువఱకే తోఁచునుగాని ఆత్మసాక్షాత్కారము కలిగిన వెనుక నింత చమత్కృతినిఁ జూపిన మాయ మాయమగును. లేని దగునని భావము. అంతఱకి వింత కలిగించు తన చమత్కారమును యథార్థముగా లే దని తెలుపును.

అవ. జగత్తు సత్యమని వాదించెడి నైయాయికులనుగూర్చి యిట్టి చమత్కారములు చేయవచ్చును గాని జగత్తు మాయ యని వాదించెడివాదియొద్ద నిట్టిచోద్యములు పనికిరా వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రసరంతి హి చోద్యాని జగద్వస్తుత్వవాదిషు,
న చోదనీయం మాయాయాం తస్యాశ్చోద్యైక రూపతః. 137

వ్యా. కించ జగత్సత్త్వవాదినో నైయాయికాదీన్ ప్రత్యేవం విధాని చోద్యాని కర్తవ్యాని న మాయావాదినం ప్రతీత్యాహ—ప్రసరంతీతి.

టీ. జగద్వస్తుత్వవాదిషు - జగత్=ప్రపంచమునకు, వస్తుత్వ = సత్యత్వమును, వాదిషు = చెప్పుచుండెడి తార్కికులు మొదలైనవారియొద్ద, చోద్యాని = ఆక్షేపణలు, ప్రసరంతి హి=పనికివచ్చును గదా. తస్యాః = ఆమాయకు, చోద్యైకరూపతః-చోద్యః= వింతయె, ఏక = ముఖ్యమైన, రూపతః = స్వరూపము గనుక, మాయాయాం = మాయవిషయమై, చోదనీయం = చేయఁదగినచోద్యము, న = లేదు.

తా. తార్కికులు మొదలైనవాదులు ప్రపంచము సత్య మని చెప్పుచున్నారు. కనుక మీరు చేయు నాక్షేపణలు వారియొద్ద పనికి వచ్చును గాని చోద్యమే ముఖ్యస్వరూపముగాఁ గలిగిన మాయవిష యమై యట్టి చోద్యములు (ఆశ్చర్యములు) చేయుట కూడదు.

అవ. మాయను గుఱించి వాదము చేయుచుండెడువారిని గుఱించి చోద్యము చేయువిషయమై అధికప్రసంగమును చేయుచున్నాఁడు:—

శ్లో. చోద్యేఽపి యది చోద్యం స్యాత్త్వచ్చోద్యే చోద్యతే మయా,
పరిహార్యం తతశ్చోద్యం న పునః ప్రతి చోద్యతామ్. 138

వ్యా. మాయావాదినం ప్రతి చోద్యకరణేఽతిప్రసంగమాహ—చోద్యేఽపీతి. తర్హి కిం కర్తవ్య మిత్యత ఆహ—పరిహార్యమితి.

టీ. చోద్యేఽపి = ఆశ్చర్యపడఁదగినదానియందును, చోద్యం = ఆక్షేపణము, స్యాద్యది=కలిగినయెడల (చేసినటులైన ననుట.) త్వచ్చోద్యే = నీయాక్షేపముమీఁద, మయా = నాచేతను, చోద్యతే = ఇంకొకచోద్యము చేయఁబడును. తతః = ఆకారణమువలన, చోద్యం=ఆక్షేపణము, పరిహార్యం = (నీచేత) నివారింపఁదగినది. పునః = తిరిగి యెన్నఁటికిని, న ప్రతిచోద్యతాం =వ్యతిరేకముగా నాక్షేపణ చేయఁగూడదు.

తా. ప్రపంచము మాయామయ మని వాదించెడివానితో పెడవాదములకు దిగితివేని, అట్టి పెడవాదములు చేయుటకు మేమును తీసిపోము. కనుక లేనిపోని నీచోద్యములను కట్టిపెట్టి యిఁకమీఁదన నెన్నటికి నిట్టి యాక్షేపణములు చేయంజనదు.

అవ. చెప్పినసంగతిని విశదపఱిచి చెప్పుచున్నాఁడు:—

శ్లో. విస్మయైకశరీరాయా మాయాయా శ్చోద్యరూపతః,
అన్వేష్యః పరిహారోఽస్యా బుద్ధిమద్భిః ప్రయత్నతః. 139

వ్యా. ఉక్తమేవార్థం ప్రపంచయతి—విస్మయేతి.

టీ. విస్మయైకశరీరాయాః - విస్మయః = ఆశ్చర్యమే, ఏక=ముఖ్యమైన, శరీరాయాః = స్వరూపముగాఁగల, మాయాయాః = మాయ, చోద్యరూపతః = చోద్యరూపమై యుండుటవలన, బుద్ధిమద్భిః = తెలివిగలవారిచేత, ప్రయత్నతః=పూనికతో, అస్యాః = ఈమాయకు, పరిహారః = నివారణోపాయము, అన్వేష్యః = యోచింపఁదగినది.

తా. మాయయే చోద్యమైనది గనుక తెలివి గలవారు అట్టి మాయను తొలఁగింపఁదగిన గొప్ప ప్రయత్నము యోచింపవలయును.

అవ. మాయాస్వరూపము తెలిసియుండినఁ గదా దానిని నివారించుటకుఁ బ్రయత్నము చేయుట. దానిస్వరూప మిట్టి దని యెఱుకపడలేదే యని శంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయాత్వమేవ నిశ్చేయ మితి చే త్తర్హి నిశ్చిను,
లోకప్రసిద్ధమాయాయా లక్షణం య త్తదీక్ష్యతామ్. 140

వ్యా. మాయాత్వనిశ్చయే తత్పరిహారాన్వేషణముచితం. స ఏవ నేదానీం సిద్ధ ఇతి శంకతే—మాయాత్వమితి. మాయాలక్షణసద్భావాన్మాయాత్వం నిశ్చీయతామిత్యభిప్రాయేణాహ—తర్హీతి. కిం లక్షణ మిత్యత ఆహ—లోకేతి.

టీ. మాయాత్వమేవ = మాయాస్వరూపమే, నిశ్చేయమితి చేత్ = నిర్ధారణ చేయవలయు నంటివేని, తర్హి = అటులైనయెడల, నిశ్చిను = మాయాస్వరూపమును నిశ్చయించుకొనుము. లోకప్రసిద్ధమాయాయాః - లోకప్రసిద్ధ = జగత్ప్రసిద్ధమగు, మాయాయాః = మాయకు, యత్ = ఏ, లక్షణం = స్వరూపము కలదో, తత్ = ఆస్వరూపము (నీచే), ఈక్ష్యతాం = తెలియఁబడుఁగాక.

తా. మాయాస్వరూప మిట్టి దని తెలిసికొనఁ గోరితివేని దాని స్వరూపమును చెప్పెదను తెలిసికొనుము.

శ్లో. న నిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా,
సా మాయే తీంద్రజాలాదౌ లోకాః స్సంప్రతిపేదిరే. 141

వ్యా. తస్యా అపి కిం లక్షణమిత్యత ఆహ—న నిరూపయితుమితి.

టీ. యా = ఏది, ఇంద్రజాలాదౌ = ఇంద్రజాలము మొదలగునవి చేయు నపుడు, నిరూపయితుం=నిర్ధారణ చేయుటకు, న శక్యా సతీ=శక్యము కానిదై, విస్పష్టం =మిక్కిలి స్పష్టముగా, భాసతే చ = ప్రకాశించుచున్నదో, సా = అది, మాయేతి = మాయ యని, లోకాః = జనులు, సంప్రతిపేదిరే = గ్రహించిరి.

తా. ఇంద్రజాలము మొదలైనవి చూచునపుడు ఏది నిర్ణయింప శక్యము గానిదై మిక్కిలి స్పష్టముగా ప్రకాశించునో అది లోకప్రసిద్ధ మైన మాయాస్వరూపముగా జనులు నిశ్చయించుచున్నారు.

శ్లో. స్పష్టం భాతి జగచ్చేద మశక్యం తన్నిరూపణం,
మాయామయం జగత్తస్మా దీక్షస్వాపక్షపాతతః. 142

వ్యా. దృష్టాంతే సిద్ధలక్షణం దార్ష్టాంతికేయోజయతి—స్పష్టమితి.

టీ. ఇదం జగచ్చ = ఈప్రపంచంబును, స్పష్టం = స్పష్టముగా, భాతి=కనఁబడు చున్నది. తన్నిరూపణం=ఆజగన్నిరూపణము, అశక్యం=ఇట్టి దని నిర్ణయించుటకు శక్యము కాదు. తస్మాత్ = ఆహేతువువలన, అపక్షపాతకః = పక్షపాతములేక, జగత్=ప్రపం చమును, మాయామయం = మాయామయముగా, ఈక్షస్వ = తెలిసికొనుమా.

తా. ఇంద్రజాలము చేయునపుడు కనఁబడెడి వస్తువులవలె నీ జగత్తును మనచేత చూడఁబడిన దగుచు నిట్టి దని స్వరూపనిరూపణముఁ జేయ శక్యము కాకయున్నది. ఈకనఁబడెడి జగత్తును మాయామయ మని తెలిసికొనుము.

శ్లో. నిరూపయితుమారబ్ధే నిఖిలైరపి పండితైః,
అజ్ఞానం పురతస్తేషాం భాతి కక్ష్యాసు కాసు చిత్. 143

వ్యా. జగతోఽశక్యనిరూపణత్వం కథమిత్యాశంక్య తద్దర్శయతి—నిరూపయితు మితి.

టీ. నిఖిలైరపి పండితైః = పండితులందఱిచేతను, నిరూపయితుం = నిరూపించు టకు, ఆరబ్ధే సతి = ప్రారంభింపఁబడిన దగుచుండఁగా, తేషాం = ఆపండితులయొక్క, పురతః = ఎదుట, కాసుచిత్ = కొన్నియైన, కక్ష్యాసు = పక్షములందు, అజ్ఞానం = అజ్ఞానము, (తెలిసికొనలేకపోవుట), భాతి = కనఁబడుచున్నది.

తా. పండితు లంద ఱొక చోటఁ గూడి ప్రపంచముయొక్క స్వరూపమును నిరూపించుటకు నుభయపక్షములుగా చేరి ఈజగత్తు

ఏవిధముగా వచ్చిన దని విచారించునెడ నుభయపక్షములవారును చెప్పలేక మాకు తెలియ దనుకొనెదరు. అదియే అజ్ఞానస్వరూపము గావున జగత్తుయొక్క పుట్టుక ఇట్టి దని నిర్ణయింప నెవరికిం దరముగాదు.

అవ. అశక్యముగానుండుటను ఉదాహరణముచే స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. దేహేంద్రియాదయో భావా వీర్యేణోత్పాదితాః కథం,
కథం వా తత్ర చైతన్య మిత్యుక్తే తే కిముత్తరమ్. 144

వ్యా. అశక్యనిరూపణత్వమేవోదాహరణేన స్పష్టయతి—దేహేంద్రియేతి.

టీ. దేహేంద్రియాదయః=దేహము ఇంద్రియములును మొదలైన, భావాః = పదార్థములు, వీర్యేణ = శుక్లశోణితములచేత, కథం=ఎట్లుగా, ఉత్పాదితాః=పుట్టింపఁబడినవి? తత్ర=వానియందు, చైతన్యం=చేతనత్వము, కథం వా = ఎట్లు కలిగినది? ఇతి= ఈప్రకారము, ఉక్తే సతి = ప్రశ్నచేయఁబడినపుడు, తే = నీకు, ఉత్తరం = సమాధానము, కిం = ఏ మున్నది?

తా. దేహేంద్రియాదిపదార్థములు శుక్లశోణితములవలన నెట్లు కలిగెను? వానియందు చైతన్య మె ట్లేర్పడెను? అని ని న్నెవరైన నడిగెదరు. దానికి నీ వేమి సమాధానము చెప్పెదవో చెప్పుము.

అవ. ఇప్పుడు స్వాభావికము గావచ్చు నని వాదించెడువాఁడు ప్రశ్నచేయుచున్నాఁడు:—

శ్లో. వీర్యస్యైష స్వభావశ్చేత్కథం తద్విదితం త్వయా,
అన్వయవ్యతిరేకౌ యౌ భగ్నౌ తౌ వంధ్యవీర్యతః. 145

వ్యా. స్వభావవాదీ శంకతే—వీర్యస్యేతి. సిద్ధాంతీ పృచ్ఛతి—కథం తదితి. అన్వయవ్యతిరేకాభ్యాం జానామీత్యాశంక్య వ్యాప్త్యభావాన్నైవమిత్యాహ—అన్వయేతి. వంధ్యవీర్యతః వంధ్యాయాం చ తత్ర వీర్యస్య వ్యర్థత్వాత్ వ్యాప్తిరగ్నఘటతే, యత్రయత్ర వీర్యం తత్రతత్ర దేహాదికమితి. నాన్వయోఽపి.

టీ. వీర్యస్య = శుక్లశోణితములకు, ఏషః = ఇది, స్వభావశ్చేత్ = స్వభావమనినట్లైతే, తత్ = అది, త్వయా = నీచేత, కథం = ఎట్లుగా, విదితం=తెలియఁబడినది? యౌ = ఏ, అన్వయవ్యతిరేకౌ = అన్వయమును వ్యతిరేకమును గలవో, తౌ = ఆరెండును, వంధ్యవీర్యతః - వంధ్య=నిష్ప్రయోజనమైన (కార్యోత్పాదనశక్తి లేని) వీర్యతః = శుక్లశోణితములు కలుగుట వలన, భగ్నౌ = భంగపాటు నొందినవి (చెడిపోయిన వనుట).

తా. ఓ స్వభావవాదీ, అది వీర్యమునకు స్వభావ మని యనెద వేమో, అది నీ కెట్లు తెలిసెను? ఎక్కడెక్కడ శుక్లశోణితములు చేరునో, యక్కడక్కడ దేహేంద్రియాదులు పుట్టుచున్నవి. ఎక్కడెక్కడ శుక్ల శోణితములచేరిక లేదో, యక్కడక్కడ దేహేంద్రియాదుల పుట్టుక లేదు. వీర్యసంబంధము కలిగినపుడు దేహేంద్రియాదికార్యము పుట్టుట అన్వయము. అది లేనపుడు పుట్టకపోవుట వ్యతిరేకము. ఇట్టి అన్వయవ్యతిరేకములు గోడ్రాలియందు వీర్యసేకము కలిగినను కార్యోత్పత్తి లేమింజేసి నీవు చెప్పినవ్యాప్తి యుపయోగింపదు. కావున స్త్రీయందు వీర్యసేకము కలుగఁగానే దేహేంద్రియాదులు పుట్టుట స్వభావ మనియెడు నీవాదము చెల్ల నేరదు.

శ్లో. న జానామి కి మప్యేత దిత్యంతే శరణం తవ,
అత ఏవ మహాన్తోఽస్య ప్రవదంతీంద్రజాలతామ్. 146

వ్యా. ఏవం పునఃపునః పృష్టే సతి కిమపి న జానామీత్యేవోత్తరం దేయమితి. ఫలితమాహ—న జ్ఞానామీతి.

టీ. ఏతత్ = దీనిని, కిమపి = ఏమాత్రమును, న జానామి=ఎఱుంగను, ఇతి = ఈలాగున, అంతే = కడపట, తవ=నీకు, శరణం = నమస్కారము (అని చెప్పుదువు). అత ఏవ = ఇందువల్లనే, మహాంతః = పెద్దలు, ఇంద్రజాలతాం=ఇంద్రజాలమువంటి దగుటను, ప్రవదంతి = చెప్పుచున్నారు.

తా. గట్టిగా దీనికిఁ గారణము చెప్పి కదలు మనిన, నీవు చెప్పఁ జాలక నా కేమియు తెలియదు, మన్నింపు మని చేతులు జోడించెదవు (నమస్కరించెదవు). ఇది తెలియ నలవికాదు గనుకనే తెలిసిన పెద్దలు ఈప్రపంచ మంతయు నింద్రజాలమువలె మాయ యనిరి.

అవ. జగత్తు అనిర్వాచ్య మనెడి విషయమున పెద్దల యొప్పుదలను జెప్పు చున్నాఁడు:—

శ్లో. ఏతస్మాత్కిమివేంద్రజాలమపరం యద్గర్భవాసే స్థితమ్
రేతశ్చేతతి హస్తమస్తకపదప్రోద్భూతనానాంకురమ్,
పర్యాయేణ శిశుత్వయౌవనజరావేషై రనేకై ర్వృతం
పశ్యత్యత్తి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛత్యథాగచ్ఛతి. 147

వ్యా. ఉక్తానిర్వచనీయత్వే వృద్ధసమ్మతిం దర్శయతి—ఏతస్మాదితి.

టీ. గర్భవాసే = గర్భగోళమునందు, స్థితం = ప్రవేశించినట్టి, యత్ రేతః = ఏవీర్యము, హస్త... నానాంకురం సత్ - హస్త = హస్తములుగాను, మస్తక = శిరస్సుగాను, పద=పాదములుగాను, ప్రోద్భూత=పుట్టిన, నానా = అనేకవిధములైన, అంకురం సత్ =ఉత్పత్తిగలదై, పర్యాయేణ = క్రమముగా, అనేకైః=నానావిధములైన, శిశుత్వ యౌవనజరావేషైః = బాల్యయౌవనవార్ధక్యము లను వేషములతో, వృతం సత్ = కూడుకొనిన దగుచు, చేతతి = చేతనము గలది యగుచున్నది. పశ్యతి=చూచుచున్నది. అత్తి=తినుచున్నది. శృణోతి = వినుచున్నది. జిఘ్రతి=వాసన చూచుచున్నది. తథా= మఱియు, గచ్ఛతి = పోవుచున్నది, అథ = అదేవిధమున, ఆగచ్ఛతి = వచ్చుచున్నది. ఏతస్మాత్ = దీనికంటె, అపరం = వేఱొకటియైన, ఇంద్రజాలం = గారడి, కిమివ = ఏమున్నది? ఏమియు లే దనుట.

తా. పురుషుని రేతస్సు స్త్రీయోనియందుఁ బ్రవేశింపఁజేయఁబడిన దగుచు నచట నానావిధములుగ (హస్తమస్తకపాదాదిరూపముగా ననుట) పరిణమించి చేతనము గలదై యుత్పత్తియగును. తరువాతఁ గ్రమక్రమముగా బాల్యము, యౌవనము, వార్ధక్యము అనెడి వేషములతోఁ గూడుకొని చూచుటయు, తినుటయు, వినుటయు, వాసన చూచుటయు, పోవుటయు, వచ్చుటయు మొదలగు పనులం జేయుచున్నది. చూచితిరా యింతకంటె నింద్రజాలము అనఁగా విచిత్ర మేమున్నది? ఇంతకన్న నింద్రజాలము వేఱుగా లే దనుట అని ఈసంసారమును గొప్ప యింద్రజాలముగా పెద్దలు వర్ణించియున్నారు.

శ్లో. దేహవద్వటధానాదౌ సువిచార్య విలోక్యతాం,
క్వ ధానా కుత్ర వా వృక్ష స్తస్మాన్మాయేతి నిశ్చిను. 143

వ్యా. న కేవలం దేహస్యైవ దుర్నిరూపత్వం. కింతు వటవృక్షాదేరపీత్యాహ— దేహవదితి.

టీ. దేహవత్ = దేహమువలెనే, వటధానాదౌ = మఱ్ఱిగింజ మొదలగువానియందు, సువిచార్య = బాగుగా పరిశీలించి, విచార్యతాం = విచారింపఁబడుఁగాక. ధానా = మఱ్ఱిగింజ, క్వ=ఎక్కడ? మిక్కిలి స్వల్పమైన దనుట; వృక్షో హి = మఱ్ఱిచెట్టన్ననో, కుత్ర=ఎక్కడ? తస్మాత్ = ఆకారణమువలన, మాయేతి = దీని నంతయు మాయ యని (మాయావైభవ మని), నిశ్చిను = తెలిసికొనుము.

తా. ఈదేహమును పరిశీలించినట్లే మఱ్ఱిగింజను బరిశీలింపుము. మఱ్ఱిగింజ ఎంతచిదిగా నున్నది! దానివిధమును యోచించిన మనో

వాక్కులకు గోచరింపనట్లు దేహేంద్రియాదిసకలప్రపంచమును ఇట్టి దని నిశ్చయించుటకు సాధ్యముగామింజేసి ఇదియే యింద్రజాలతుల్య మగు మాయవైభవ మని తెలియవలెను.

అవ. మాకు సమాధానము చెప్పుటకు శక్తిలేకపోవచ్చును గాని యుదయనాచార్యులు మొదలైన తార్కికులు దీనికి సమాధానము చెప్పి యుండి రందువేమో యని శంకించి సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరుక్తావభిమానం తే దధతే తార్కికాదయః,
హర్షమిశ్రాదిభి స్తే తు ఖండనాదౌ సుశిక్షితాః. 149

వ్యా. నన్వస్మాభిర్నిర్వక్తుమశక్యత్వేఽపి ఉదయనాదిభిరాచార్యైర్నిరుచ్యత ఇత్యాశంక్యాహ—నిరుక్తావితి.

టీ. తే తార్కికాదయః = ఆ యుదయనాచార్యులు మొదలైనతార్కికులు, నిరుక్తౌ=తర్కశాస్త్రమునందు, అభిమానం = పట్టుదలను, దధతే = ధరించుచున్నారు, (కలిగియున్నారు), తే తు=వారన్ననో, హర్ష మిశ్రాదిభిః = పూజ్యు లగు శ్రీహర్షుఁడు మున్నగు తార్కికశిరోమణులచేత, ఖండనాదౌ=ఖండనగ్రంథాదులలో, సుశిక్షితాః = తగిన సమాధానములచేత శిక్షింపఁబడిరి.

తా. మీాయుదయనాచార్యులు మొదలగు తార్కికులు తర్కశాస్త్రమునం దభిమానము గలిగి యెన్నెన్నో పూర్వపక్షములు చేసి యుండిరి. ఆపూర్వపక్షములను లేశలేశముగ శ్రీహర్షుఁడు మొదలగు మహామహులగు తార్కికులును నద్వైతులును అగు పెద్దలు సమాధానము చెప్పి మరుమాట లేకుండఁ జేసియుండిరి.

అవ. ఈసంగతియందు మనువు మొదలగు సాంప్రదాయజ్ఞులవాక్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అచింత్యాః ఖలు యే భావా న తాం స్తర్కేషు యోజయేత్,
అచింత్యరచనారూపం మనసాఽపి జగ త్ఖలు. 150

వ్యా. ఉక్తార్థే సాంప్రదాయికానాం వాక్యం సంవాదయతి—అచింత్యా ఇతి.

టీ. యే భావాః=ఏపదార్థములు, అచింత్యాః = యోచించుటకు శక్యము కానివో, తాన్ = ఆపదార్థములను, తర్కేషు = వాదములయందు, న యోజయేత్ = చేఁర్చరాదు. మనసాఽపి = మనస్సుచేతనైనను, జగత్ = ప్రపంచము, అచింత్యరచ

సారూపం ఖలు - అచింత్య = యోచింప నలవికాని, రచనా=కల్పనయొక్క. రూపం ఖలు = స్వరూపము కలది గదా.

తా. ఏపదార్థములు యోచించినను యోచన కందవో యట్టి పదార్థములనుగూర్చి తర్కింప రా దనియు ఈజగత్తును యోచింప నలవి గాని కల్పనారూప మనియు సాంప్రదాయికులు చెప్పిరి.

అవ. జగత్తునం దట్టిరచన యుండనిమ్ము. మాయయం దేమి వచ్చినది? అని శంకించి సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. అచింత్యరచనాశక్తి బీజం మాయేతి నిశ్చిను,
మాయాబీజం తదేవైకం సుషుప్తావనుభూయతే. 151

వ్యా. నను భవత్వేవం జగతోఽచింత్యరచనాత్వం మాయాయాం కిమాయాత మిత్యత ఆహ—అచింత్యరచనేతి. అచింత్యరచనాశక్తిమత్ యద్బీజం కారణం సైవ మాయేత్యర్థః. నన్వేవం విధం కారణం క్వ దృష్టమిత్యత ఆహ—మాయేతి.

టీ. అచింత్యరచనాశక్తి - అచింత్య = చింతింప నలవిగాని, రచనా = కల్పన యొక్క, శక్తి = శక్తి గలిగిన, బీజం = కారణము, మాయేతి = మాయ యని, నిశ్చిను = తెలిసికొనుము. ఏకం = ఒక్కటియైన, తత్ మాయాబీజమేవ - మాయా = మాయ యనెడి, బీజమేవ = కారణమే, సుషుప్తౌ=గాఢనిద్రయందు, అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది.

తా. పై విధముగ నీజగత్తుయొక్క కల్పనమును ఆలోచించి చెప్పలేము. అట్టిరచనకు కారణమైనదే మాయ యని తెలియ నగును. ఆమాయ యనెడి కారణము అందఱిచేత సుషుప్తియం దనుభవింపఁ బడుచునే యున్నది.

అవ. ఆసుషుప్తి జగత్కారణ మెట్లయ్యె ననిన సమాధానము చెప్పు చున్నాఁడు:—

శ్లో. జాగ్రత్స్వప్నజగత్తత్ర లీనం బీజ ఇవ ద్రుమః,
తస్మా దశేషజగతో వాసనా స్తత్ర సంస్థితాః. 152

వ్యా. కథం తస్య జగద్బీజత్వమిత్యత ఆహ—జాగ్రదితి. తతః కిమిత్యత ఆహ—తస్మాదితి. యతో జగత్కారణం మాయాఽతోఽశేషజగద్వాసనా స్తత్ర మాయాయాం సంస్థితాః తిష్ఠతీత్యర్థః.

టీ. బీజే = విత్తనమునందు, వృక్ష ఇవ = చెట్టువలె, తత్ర = ఆసుషుప్తియందు, జాగ్రత్స్వప్నజగత్ = జాగ్రత్ప్రపంచమును, స్వప్నప్రపంచమును, లీనం = అణఁగి యున్నవి. తస్మాత్=ఆకారణమువలన, అశేషజగతః=సమస్తమైన ప్రపంచముయొక్క వాసనాః=సంస్కారములు, భావన లనుట, సంస్థితాః=లీనమైయున్నవి.

తా. బీజమునందు వృక్షము లీనమై యున్నపగిది, సుషుప్తి యందు జాగ్రత్స్వప్నప్రపంచము లిమిడియున్నవి. ఆరీతిగా సర్వజగ ద్వాసన లామాయయందు లీనమైయున్నవి. కావున మాయ జగత్కా రణం బగును.

శ్లో. యా బుద్ధివాసనా స్తాసు చైతన్యం ప్రతిబింబతి,
మేఘాకాశ వదస్పష్ట చిదాభాసోఽనుమీయతామ్. 153

వ్యా. తతోఽపి కిం తత్రాహ—యా బుద్ధీతి. నను, తాను ప్రతిబింబోఽస్తిచే త్కుతో నానుభూయత ఇత్యాశంక్యాస్పష్టత్వాదిత్యాహ—మేఘేతి. తర్హి కుత స్తత్సిద్ధి రిత్యత ఆహ—అనుమీయతామితి.

టీ. యాః బుద్ధివాసనాః=ఏబుద్ధివాసనలు గలవో, తాసు = వానియందు, చైత న్యం=కూటస్థచైతన్యము, ప్రతిబింబతి=ప్రతిఫలించుచున్నది. మేఘాకాశవత్ = మేఘము నందు ప్రతిబింబించిన యాకాశమువలె, అస్పష్టచిదాభాసః - అస్పష్ట = స్పష్టముగా తెలియఁబడని, చిదాభాసః = జీవుఁడు, అనుమీయతామ్ = ఊహచే తెలియఁబడుఁగాక. (ఊహించి తెలిసికొనవలె ననుట.)

తా. ఆబుద్ధివాసనలయందు కూటస్థచైతన్యము ప్రతిబింబించి యుండినను మేఘోదకమునందు ప్రతిబింబించిన యాకాశమువలె మనకు తెలియఁబడుట లేదు. అట్లు స్పష్టముగా తెలియఁబడని చిదాభాసుని అనుమానప్రమాణముచేత (ఊహచేత) తెలిసికొనవలెను.

శ్లో. సాభాసమేవ తద్బీజం ధీరూపేణ ప్రరోహతి,
అతో బుద్ధౌ చిదాభాసో విస్పష్టం ప్రతిభాసతే. 154

వ్యా. నను మేఘాంశోదకస్యాస్పష్టాకాశప్రతిబింబవత్త్వేఽపి తజ్జాతీయస్య ఘటోదకస్య స్పష్టాకాశప్రతిబింబవస్సద్భావా న్మేఘాకాశానుమానం ఘటతే. ఇహ తు తథావిధదృష్టాంతాభావా త్కథమనుమానోదయ ఇత్యాశంక్యాత్రాపి తథావిధ దృష్టాంతసంపాదనాయాహ—సాభాసమితి. చిదాభాసవిశిష్టం తదేవాజ్ఞానం బుద్ధి రూపేణ పరిణమమానం విస్పష్టం చిదాభాసవద్భవతీతి భావః. ఏవం చేదమనుమా

మత్ర సూచితం భవతి. విమతా బుద్ధివాసనాశ్చిత్ప్రతిబింబవత్యో భవితుమర్హంతి. బుద్ధ్యవస్థావిశేషత్వాత్, బుద్ధివృత్తివదితి.

టీ. సాభాసం = చిదాభాసునితోఁగూడిన, తత్ బీజమేవ = మాయ యనెడి యాకారణమే, ధీరూపేణ=బుద్ధిరూపముగా, ప్రరోహతి=అంకురించుచున్నది. అతః = ఈహేతువుచేత, బుద్ధౌ=బుద్ధియందు, చిదాభాసః = చిదాభాసుఁడు, విస్పష్టం=మిక్కిలి స్పష్టముగా, ప్రతిభాసతే = ప్రకాశించుచున్నాఁడు.

తా. అస్పష్టచిదాభాసునితోఁ గూడినట్టి యా మాయ యనెడి కారణమైన అజ్ఞానము బుద్ధిరూపముగా పరిణమించుచున్నది. కనుక బుద్ధియందు ప్రతిఫలించినచైతన్యము చిదాభాసుఁ డని స్పష్టముగా తెలియ నగును.

శ్లో. మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతౌ శ్రుతం,
మేఘాకాశ జలాకాశా వివ తౌ సువ్యవస్థితౌ. 155

వ్యా. ఏవం జీవేశ్వరయోర్మాయికత్వం శ్రుత్యుక్తముపపాదిత ముపసంహరతి— మాయాభాసేనేతి. నను జీవేశయోర్మాయకత్వే సమానే కథమవాంతరభేదసిద్ధిరిత్యాశంక్యాస్పష్టస్పష్టోపాధిమత్త్వేన మేఘాకాశజలాకాశయోరివ తత్సిద్ధిరిత్యాహ— మేఘాకాశేతి.

టీ. మాయా=మాయాశక్తి, ఆభాసేన = చిదాభాసస్వరూపముచేత, జీవేశౌ = జీవుని, ఈశ్వరుని, కరోతీతి=చేయుచున్న దని, శ్రుతౌ=వేదమునందు, శ్రుతం=వినఁబడుచున్నది, తౌ=వారిద్దఱును, (ఈశ్వరుఁడును, జీవుఁడును), మేఘాకాశజలాకాశావివ - మేఘాకాశ=మేఘమునందు ప్రతిబింబించిన యాకాశమువలెను, జలాకాశావివ=జలమునందు ప్రతిబింబించిన యాకాశమువలెను, సువ్యవస్థితౌ = ఉండిరి.

తా. మాయాశక్తి జీవేశ్వరుల నిరువురను ఆభాసులనుగాఁ జేసె నని వేదమందు చెప్పఁబడియున్నది. మేఘమునందు ప్రతిఫలించిన యాకాశముపగిది నస్పష్ట మగు కూటస్థచైతన్యము నీశ్వరుఁ డనియు, బుద్ధిరూపముగాఁ బరిణమించిన యా అజ్ఞానమునందే ఘటమునందలి జలమునందుఁ బ్రతిఫలించిన యాకాశమువలె ప్రతిబింబించి స్పష్టముగా నుండువానిని జీవుఁ డనియుం దెలియవలయును. స్పష్టాస్పష్టము లైన యుపాధులు గలవా రగుటచేత స్పష్టోపాధికుఁడు జీవుఁ డనియు, నస్పష్టమైన మాయోపాధికుఁ డీశ్వరుఁ డనియు నిట్లు జీవేశ్వరు లనెడి భేద మేర్పడెను.

శ్లో. మేఘవద్వర్తతే మాయా మేఘస్థితతుషారవత్,
ధీవాసనా శ్చిదాభాస స్తుషారస్థఖవత్స్థితః. 156

వ్యా. ఈశస్య మేఘాకాశసామ్యం స్ఫుటీకరోతి—మేఘవదితి.

టీ. మాయా=మాయ, మేఘవత్=మబ్బువలె, వర్తతే=వర్తించుచున్నది. మేఘస్థితతుషారవత్-మేఘ = మేఘమునందలి, తుషారవత్=ఉదకబిందువువలె, ధీవాసనా = బుద్ధివాసనలు, వర్తంతే=వర్తించుచున్నవి. చిదాభాసః=చిదాభాసుఁడు, తుషారస్థఖవత్ = తుషారస్థ=మేఘములోని సూక్ష్మమైన ఉదకమందలి, ఖవత్ = ఆకాశమువలె (మేఘాకాశమువలె) స్థితః= = ఉండెను.

తా. మేఘమువంటిది మాయ, మేఘమం దుండెడు నుదకబిందువులవంటివి యామాయయం దుండెడు బుద్ధివాసనలు. ఆబుద్ధివాసనల యందు ప్రతిబింబించిన జీవుఁడు చిదాభాసుఁ డనుట. మేఘములోని జలమునందు ప్రతిఫలించిన యాకాశమువంటివాఁ డని తెలియవలయును.

శ్లో. మాయాధీన శ్చిదాభాస శ్శ్రుతో మాయీ మహేశ్వరః,
అంతర్యామీ చ సర్వజ్ఞో జగద్యోనిస్స ఏవ హి. 157

వ్యా. మాయాప్రతిబింబస్యేశ్వరత్వే కిం ప్రమాణమిత్యాశంక్య—శ్రుతిరేవేత్యాహ—మాయాధీన ఇతి.న కేవలమీశ్వరత్వమస్య శ్రుతం. అపి త్వంతర్యామిత్వాదికమపి ధర్మజాతం శ్రుతమస్తీత్యాహ—అంతర్యామీతి.

టీ. మాయాధీనః = మాయయందు ప్రతిఫలించిన, చిదాభాసః = చిదాభాసుఁడు, మాయీ = మాయకు అధిష్ఠాతయైన, మహేశ్వరః = నియామకుఁడగు నీశ్వరుం డని, శ్రుతః = శ్రుతియందు చెప్పబడినది. సఏవ = ఆమాయాధిష్ఠాత యగు చిదాభాసుఁడే, అంతర్యామీ = అంతర్యామి యనియు, సర్వజ్ఞః = సర్వముం దెలిసినవాఁడనియు, జగద్యోనిః - జగత్ = ప్రపంచమునకు, యోనిః = కారణభూతుఁ డనియు, శ్రుతః = వేదమందు చెప్పఁబడియున్నాఁడు.

తా. మాయయందు ప్రతిబింబించి మాయాధీనుఁడై మాయకు ఆధారుఁడైన చిదాభాసుని ఈశ్వరుఁ డనియు, ఆచిదాభాసుఁడే సర్వజ్ఞుఁడు అంతర్యామి జగద్యోని మొదలగు శబ్దములచేత శ్రుతియందు చెప్పఁబడియున్నాఁడు.

అవ. బుద్ధివాసనయందు ప్రతిఫలించినవాఁడు ఈశ్వరుఁ డెట్లగు నని శంకించి శ్రుతిఁ జూపుచున్నాఁడు:—

శ్లో. సౌషుప్త మానందమయం ప్రక్రమ్యైవం శ్రుతిర్జగౌ,
ఏవం సర్వేశ్వర ఇతి సోఽయం వేదోక్త ఈశ్వరః. 158

వ్యా. నను ధీవాసనా ప్రతిబింబస్యేశ్వరత్వాదికం కథం శ్రుతిసిద్ధమిత్యాశంక్య తదుపపాదికాం శ్రుతిం దర్శయతి—సౌషుప్తమితి. *సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవేత్యాదికా శ్రుతిః ధీవాసనాప్రతిబింబరూపస్యానందమయస్యేశ్వరత్వాదికం ప్రతిపాదయతీత్యర్థః.

టీ. సౌషుప్తం = గాఢనిద్రయందైన, ఆనందమయం = ఆనందమయకోశమును, ప్రక్రమ్య=ప్రారంభించి, ఏషః = ఈ ఆనందమయకోశము, సర్వేశ్వరః - ఇతి = సర్వేశ్వరుఁ డని, శ్రుతిః = వేదము, జగౌ = చెప్పెను. సః అయం = ఆ యీ యానందమయకోశము, వేదోక్తః = వేదమందుఁ జెప్పఁబడిన, ఈశ్వరః = ఈశ్వరుఁడు, (భవతి=అగుచున్నాఁడు.)

తా. శ్రు. "సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవ" ఈ శ్రుతికి అర్థము. "సుషుప్తిస్థానే=సుషుప్తియందు, ఏకీభూతః=ఆనందమయకోశమం దున్న వాఁడు, ప్రజ్ఞానఘన ఏవ = జ్ఞాననిధియైన ఈశ్వరుఁడే" అని యీ మొదలైన శ్రుతి సుషుప్తిసంబంధమైన మాయయం దున్న బుద్ధివాసనలయందు ప్రతిబింబించిన ఆనందమయకోశమును ఈశ్వరుఁ డని వేదము చెప్పుచున్నది.

అవ. ఆనందమయకోశమునకు సర్వజ్ఞత్వాదిధర్మము లుండినట్లు చెప్పుట యనుభవవిరుద్ధముగా నున్నదే యని శంక రాఁగా చెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వజ్ఞత్వాదికే తస్య నైవ విప్రతిపద్యతామ్,
శ్రౌతార్థస్యావితర్క్యత్వాన్మాయాయాం సర్వసంభవాత్. 159

వ్యా. నన్వానందమయస్య సర్వజ్ఞత్వాదికమనుభవవిరుద్ధమిత్యాశంక్యాహ—సర్వజ్ఞత్వాదిక ఇతి. కుత ఇత్యత ఆహ—శ్రౌతేతి. ఇతోఽపి న విప్రతిపత్తిః కార్యేత్యాహ—మాయాయామితి.

టీ. తస్య=ఆ యానందమయకోశమునకు, సర్వజ్ఞత్వాదికే=సర్వజ్ఞత్వము మొదలగుధర్మములు గలిగియుండుటయందు, శ్రౌతార్థస్య = శ్రుతియందు చెప్పఁబడిన యర్థము, అవితర్క్యత్వాత్=వితర్కములు చేయఁగూడనిదగుటవలనను, మాయాయాం=మాయయందు, సర్వసంభవాత్=అంతయును సంభవించుటవలనను, నైవ విప్రతిపద్యతాం=వివరింపఁగూడదు.

తా. శ్రుతియందుఁ జెప్పఁబడిన యర్థమునందు ఆక్షేపణలు తగ్గక పోవుటవలనను మాయయందు సర్వమును సంభవించుటవలనను ఆనందమయకోశమునకు సర్వజ్ఞత్వాది ధర్మములు కలిగియుండుట విషయమై భిన్నాభిప్రాయముతో కలహింపరాదు.

అవ. శ్రుతియందుఁ జెప్పఁబడినమాత్రమున ఱాలు తేలుచున్నవి అను వాక్యము వలె ననుభవవిరుద్ధమైనమాట గ్రాహ్యము కా దని యాశంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అయం యత్సృజతే విశ్వం తదన్యథయితుం పుమాన్,
న కోఽపి శక్తస్తేనాయం సర్వేశ్వర ఇతీరితః. 160

వ్యా. నన్వనుకూలయుక్త్యభావే శ్రుతిరపి గ్రావప్లవనవాక్యవదర్థవాదస్స్యాదిత్యాశంక్య, శ్రుతిప్రామాణ్యసిద్ధయే సర్వేశ్వరత్వాదికముపపాదయతి—అయమితి. అయమానందమయో యజ్జాగ్రదాది విశ్వం సృజతి తన్న కేనాప్యన్యథాకర్తుం శక్యతే. అతోఽయం సర్వేశ్వర ఇత్యర్థః.

టీ. అయం=ఈ ఆనందమయకోశము, యత్ విశ్వం=ఏ ప్రపంచమును, సృజతే= సృష్టించుచున్నదో, తత్ = ఆప్రపంచము, అన్యథయితుం = మరియొకవిధముగా చేయుటకు, పుమాన్ = పురుషుఁడు, కోఽపి = ఎవ్వఁడును, న శక్తః = సమర్థుఁడు గాఁడు. తేన = ఆకారణముచేత, అయం = ఈ యానందమయకోశము, సర్వేశ్వర ఇతి = సర్వేశ్వరుఁ డని, ఈరితః = వేదమందు తెలుపఁబడినది.

తా. ఏజాగ్రత్స్వప్నాదిరూప మగు ప్రపంచమును ఆనందమయకోశము పుట్టించెనో యాజగత్తును నింకొక విధముగా మార్చుటకు నెవఁడును సమర్థుఁడు గాఁడు. కావున ఆనందమయకోశము సర్వేశ్వరుఁ డని తెల్పఁబడెను.

అవ. ఇపుడు సర్వజ్ఞత్వమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. అశేషప్రాణిబుద్ధీనాం వాసనాస్తత్ర సంస్థితాః,
తాభిః క్రోడీకృతం సర్వం తేన సర్వజ్ఞ ఈరితః. 161

వ్యా. ఇదానీం సర్వజ్ఞత్వముపపాదయతి—అత్రసౌషుప్తేఽజ్ఞానే కారణభూతే కార్యభూతానాం సర్వప్రాణిబుద్ధీనాం వాసనా నివసంతి. తాభిశ్చ వాసనాభిస్సర్వం జగత్ క్రోడీకృతం విషయీకృతం తేన సర్వబుద్ధివాసనావదజ్ఞానోపాధికత్వేన సర్వజ్ఞ ఉచ్యత ఇత్యర్థః.

టీ. తత్ర = ఆయానందమయకోశమునందు, అశేషప్రాణిబుద్ధీనాం - అశేష = సమస్తమైన, ప్రాణి = జీవులయొక్క, బుద్ధీనాం = బుద్ధులయొక్క, వాసనాః=సంస్కారములు, సంస్థితాః = ఉండియున్నవి. తాభిః = ఆవాసనలచేత, సర్వం=జగత్తంతయు, క్రోడీకృతం = నిండియున్నది, తేన=అందుచేత, సర్వజ్ఞః = సర్వజ్ఞుఁడని, ఈరితః= చెప్పఁబడెను.

తా. ఆయజ్ఞానస్వరూపమైన యానందమయకోశ మనెడి కారణమునందు జీవుల బుద్ధివాసనలు గ్రామఫోనులోని ప్లేటులయందు మాటలును పాటలును చేరియుండునట్లు లీనమైయున్నవి. గ్రామఫోనుప్లేటుకు సూది తగిలించినవెంటనే మాటలు పాటలు వెడలునట్లు ప్రపంచమంతయు ఆబుద్ధివాసనలచేత సృష్టమగుచున్నది. కనుక ఆయానందమయకోశము సర్వజ్ఞుఁడని చెప్పఁబడెను.

అవ. సర్వజ్ఞత్వము పొందినట్లైతే అందఱికిని యాయనుభవ మెందుకు కలుగదు అని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వాసనానాం పరోక్షత్వాత్సర్వజ్ఞత్వం నహీక్ష్యతే,
సర్వబుద్ధిషు తద్దృష్ట్వా వాసనాస్వనుమీయతామ్. 162

వ్యా. నను యది సర్వజ్ఞత్వమస్తి తర్హి తత్ కుతో నానుభూయత ఇత్యాశంక్య తదుపాధీనాం వాసనానాం పరోక్షత్వాన్నానుభవ ఇత్యాహ—వాసనానామితి. కథం తర్హి తదవగమ ఇత్యాశంక్యాహ—సర్వబుద్ధిష్వితి, సర్వబుద్ధినిష్ఠం సర్వజ్ఞత్వం సకారణభూతవాసనాగతసర్వజ్ఞత్వపురస్సరం భవితుమర్హతి. కార్యనిష్ఠధర్మవిశేషత్వాత్పటగతరూపాదివదిత్యర్థః.

టీ. వాసనానాం = బుద్ధివాసనలు, పరోక్షత్వాత్ = ప్రత్యక్షములు కావు గనుక, సర్వజ్ఞత్వం = సర్వజ్ఞత్వాదిధర్మము, నహీక్ష్యతే = అనుభవింపఁబడుటలేదు. తత్ = ఆసర్వజ్ఞత్వమును, సర్వబుద్ధిషు = అన్ని బుద్ధులయందును, దృష్ట్వా = చూచి, వాసనాసు = బుద్ధిసంస్కారములయందు, అనుమీయతాం = ఊహించి తెలియఁబడుఁగాక.

తా. బుద్ధివాసనలు ప్రత్యక్షములు కావు గనుక ఆనందమయకోశమునందు సర్వజ్ఞత్వాదిధర్మము తెలియఁబడుట లేదు. సకలబుద్ధులయందును నున్న సర్వజ్ఞత్వమునుబట్టి బుద్ధులయందలివాసనల నూహించి తెలిసికొనవలెను. ఎటుల ననఁగా వస్త్రమునం దుండెడి నలుపు తెలుపు

మొదలైన గుణములు దానికిఁ గారణమైన దారములలో నుండుటను తెలిసికొనువిధమున కార్యమునందు కనఁబడెడి ధర్మము కారణమందు తప్పక యుండు నని యూహించుట సులభమే కదా.

శ్లో. విజ్ఞానమయముఖ్యేషు కోశే ష్వన్యత్ర చైవ హి,
అంత స్తిష్ఠ న్యమయతి తేనాంతర్యామితాం వ్రజేత్. 163

వ్యా. సర్వజ్ఞత్వముపపాద్యైషోఽంతర్యామీతిశ్రుత్యుక్తమంతర్యామిత్వ ముపపాదయతి—విజ్ఞానేతి. అన్యత్ర పృథివ్యాదౌ తిష్ఠన్ యమయతి యత స్తేనేత్యన్వయః.

టీ. విజ్ఞానమయముఖ్యేషు = విజ్ఞానమయకోశము మొదలగు కోశములయందును, అన్యత్ర చైవ హి=పృథివ్యాదిభూతములయందును, అంతః = లోపల, తిష్ఠన్=ఉన్నవాఁడై, యమయతి = ప్రేరేపించుచున్నాఁడు (నియమించుచున్నాఁడనుట). తేన = ఆకారణముచేత, అంతర్యామితాం = అంతర్యామిభావమును, వ్రజేత్ = పొందును.

తా. ఈశ్వరుఁడు ఆనందమయకోశముచేత విజ్ఞానకోశము మొదలగు కోశములయందును పృథివి మొదలగు పంచభూతములయందును లోపలనుండి ప్రేరేపించువాఁడై యుండుటచేత అంతర్యామిభావమును పొంది అంతర్యామి యని శ్రు. "యో విజ్ఞానే తిష్ఠన్" మొదలైన శ్రుతులచేత నంతర్యామిబ్రాహ్మణమునందు తెలుపఁబడి యున్నాఁడు.

అవ. ఈయభిప్రాయమును నింకొక శ్లోకముచే దృఢపఱచుచున్నాఁడు:—

శ్లో. బుద్ధౌ తిష్ఠ న్నాంతరోఽస్యా ధియా నేక్ష్యశ్చ ధీవపుః,
ధియమంతర్యమయతీత్యేవం వేదేన ఘోషితమ్. 164

వ్యా. అస్మిన్నర్థే అంతర్యామిబ్రాహ్మణం కృత్స్నం ప్రమాణమితి దర్శయితుం తదేకదేశభూతం యో విజ్ఞానే తిష్ఠన్నిత్యాదివాక్యమర్థతోఽనుక్రామతి.—బుద్ధావితి.

టీ. బుద్ధౌ=బుద్ధియందు, ఆంతరః=లోపలను, తిష్ఠన్ = ఉండి, ధీవపుస్సన్ = బుద్ధియే యుపాధిగాఁగలవాఁడై, ధియా = బుద్ధిచేత, నేక్ష్యశ్చ = చూడఁబడనివాఁడై, అంతః=లోపల, ధియం=బుద్ధిని, యమయతీతి = నియమించుచున్నాఁ డని, వేదేన = వేదముచేత, ఏవం = ఈప్రకారముగా, ఘోషితం = వెల్లడింపఁబడినది.

తా. ఈశ్వరుఁడు ప్రాణములకును బుద్ధికిని లోపలనుండినను బుద్ధిచేత చూడఁబడకపోయినను, బుద్ధియే శరీరముగాఁ గలవాఁడై

బుద్ధిని ప్రేరేపించుచున్నాఁ డని యంతర్యామిబ్రాహ్మణమునందు స్పష్టీకరింపఁబడెను,

శ్లో. తంతుః పటే స్థితో యద్వదుపాదానతయా తథా,
సర్వోపాదానరూపత్వా త్సర్వత్రాయ మవస్థితః. 165

వ్యా. ఇదానీమంతర్యామిబ్రాహ్మణస్య ప్రతిపర్యాయం వ్యాఖ్యానే గ్రంథబాహుళ్యభయా ద్వ్యాఖ్యానస్య సర్వపర్యాయసంచారిత్వసిద్ధయే "యస్సర్వేషు భూతే"ష్వితి పర్యాయం వ్యాచక్షాణో "యస్సర్వేషు భూతేషు తిష్ఠ" న్నిత్యస్యార్థం దృష్టాంతేనాహ—తంతుః పట ఇతి.

టీ. పటే = వస్త్రమునందు, తంతుః = నూలిపోఁగు, యద్వత్ = ఏవిధముగా, ఉపాదానతయా = ఉపాదానకారణమగుటచేత, స్థితః = ఉండినదో, తథా = ఆవిధముగా, అయం = ఈయంతర్యామి, సర్వోపాదానరూపత్వాత్ = సర్వప్రపంచమునకు నుపాదానకారణమగుటవలన, సర్వత్ర=అంతటను, అవస్థిత=ఉన్నాఁడు.

తా. ఉపాదానకారణ మనఁగా కార్యమునందు కారణము ప్రవేశించియుండుట. నూలు వస్త్రమునకు కారణమై వస్త్రమునందు ప్రవేశము కలిగియుండునట్లు అంతర్యామియును జగత్తున కుపాదానకారణమై జగత్తంతయు నిండియున్నాఁ డను భావము.

శ్లో. పటాదప్యాంతర స్తంతు స్తంతో రప్యంశు రాంతరః,
అంతరత్వస్య విశ్రాంతి ర్యత్రాసా వనుమీయతామ్. 166

వ్యా. ననూపాదానతయా సర్వత్రాయ మవస్థితశ్చేత్ కిమితి సర్వత్ర నోపలభ్యత ఇత్యాశంక్య సర్వాంతరత్వాదిత్యాహ—పటాదపీతి. అత్రేదమనుమానం—అంతరత్వతారతమ్యం క్వచిద్విశ్రాంతం తారతమ్యత్వాదణుత్వతారతమ్యవదితి.

టీ. పటాదపి = వస్త్రముకంటెను, తంతుః = దారములు, ఆంతరః = లోపలివి, తంతోరపి = దారముకంటెను, అంశుః = నూలుతునక, ఆంతరః = లోపలిది, యత్ర= ఎచ్చటివఱకు, అంతరత్వస్య=లోని దగుట, విశ్రాంతిః = సరిపోవునో, తత్ర = అచ్చట, అసౌ = ఈ అంతర్యామి, అనుమీయతాం = ఉన్నట్లూహింపఁబడుఁగాక.

తా. వస్త్రముకంటె నూలిపోఁగులు లోపలివి నూలిపోఁగులకంటె నూలిపోఁగుతునుక లోపలిది. ఇట్లు ఒకదానికంటె నొకటి లోపలిదై చివర కెక్కడ నాఁగిపోవునో యక్కడ నంతర్యామి యున్నాఁ డని అనుమానప్రమాణమువలన నెఱుంగవలెను. అన్నింటికిని లోపల నుండుటచేత ననుభవగోచరుఁ డగుట లే దని యభిప్రాయము.

శ్లో. ద్విత్ర్యాంతరత్వకక్ష్యాణాం దర్శనేఽప్యయమాంతరః,
న వీక్ష్యతే తతో యుక్తి శ్రుతిభ్యామేవ నిర్ణయః. 167

వ్యా. నన్వాంతరత్వేప్యంశ్వాదివదంతర్యామిదర్శనం కిం న స్యాదిత్యాశంక్య తేషామివ బాహ్యత్వాభావాన్న దృశ్యత ఇత్యభిప్రాయేణాహ—ద్విత్ర్యాంతరత్వేతి. కుతస్తర్హి తన్నిర్ణయ ఇత్యత ఆహ—తత ఇతి. అచేతనస్య చేతనాధిష్ఠానమంతరేణ ప్రవృత్త్యనుపపత్తిర్యుక్తిః. శ్రుతిస్తూదాహృతైవ.

టీ. ద్విత్ర్యాంతరత్వకక్ష్యాణాం=రెండుమూఁడు అంతరువులయొక్క, దర్శనేఽపి= తెలియుటయందును, అయం = ఈయంతర్యామి, అంతరస్సన్ = సర్వమునకు లోపలి వాఁడై, న వీక్ష్యతే=చూడఁబడుటలేదు. తతః = అందువలన, యుక్తిశ్రుతిభ్యామేవ= యుక్తిశ్రుతులచేతనే, నిర్ణయః = నిర్ణయమగును. (అనఁగా నీశ్వరనిర్ణయము చేయవలె ననుట). అచేతనమగు జగమునకు చేతనాధారములేకయే ప్రవర్తనము గూడ దనుట యుక్తి. ''యస్సర్వేషు భూతేషు తిష్ఠన్'' అనెడి వాక్యము శ్రుతి.

తా. అంతర్యామి మనకు తెలియఁబడకుండుటకు మధ్య నంతరువు లెన్నియో కలవు. అందుచేత నా యంతర్యామి యగు ఈశ్వరుఁడు అగపడుట లేదు. శ్రుతిచేతను, ఉపాయముచేతను తెలిసికొనఁదగు నని పెద్దలు నిర్ణయించిరి.

శ్లో. పటరూపేణ సంస్థానా త్పటస్తంతోర్వపుర్యథా,
సర్వరూపేణ సంస్థానా త్సర్వమస్య వపుస్తథా. 168

వ్యా. యస్య సర్వాణి భూతాని శరీరమిత్యస్యార్థమాహ—పటరూపేనేతి. పటరూపేణావస్థితస్య తంతోః పటశ్శరీరం యథా. ఏవం సర్వరూపేణావస్థితస్య సర్వం శరీరమిత్యర్థః.

టీ. పటరూపేణ = వస్త్రరూపముచేత, అవస్థానాత్ = ఉండుటవలన, తంతోః= దారములకు, పటః=వస్త్రము, యథా=ఏవిధముగా, వపుః = శరీరమగునో, తథా = ఆవిధముగా, సర్వరూపేణ = సార్వాత్మ్యముచేత (సర్వాకారముగ), సంస్థానాత్ =ఉండుటవలన, అస్య=ఈఅంతర్యామికి, సర్వం= జగత్తంతయు, వపుః=శరీర మగుచున్నది.

తా. నూలు వస్త్రాకారముగా నుండుటచేత వస్త్రము నూలునకు శరీరమైనట్లు అంతర్యామి జగదాకారముగా నుండుటచేత నంతర్యామికి జగత్తంతయు శరీర మని శ్రుతి చెప్పుచున్నది.

శ్లో. తంతోః సంకోచవిస్తారచలనాదౌ పటో యథా,
అవశ్యమేవ భవతి న స్వాతంత్ర్యం పటే మనాక్. 169

వ్యా. "యస్సర్వాణి భూతాన్యంతరో యమయ"తీతి వాక్యస్య తాత్పర్యం సదృష్టాంతమాహ శ్లోకద్వయేన—తంతోరితి.

టీ. తంతోః = నూలియొక్క, సంకోచవిస్తారచలనాదౌ = ముడిచినపుడును, విస్తరింపఁజేసినప్పుడును, పటః = వస్త్రము, యథా = ఏప్రకారముగా, అవశ్యమేవ = ముఖ్యముగా నటువలెనే, భవతి = అగుచున్నదో, (నూలివలె సంకోచవికాసములను పొందుచున్నదో), పటే = వస్త్రమునందు, మనాక్ = ఇంచుకయైనను, స్వాతంత్ర్యం= స్వతంత్రత, (తథా=ఆప్రకారముగా) న=లేదు.

తా. నూలును కుచ్చెపట్టిన, వస్త్రము కుచ్చెపెట్టఁబడినట్లును నూలు పఱచిన, వస్త్రమును పఱఁబడిన దగును. నూలు ననుసరించి వస్త్ర ముండవలసినదే కాని వస్త్రమున కేవిధమైన స్వాతంత్ర్యమును లేదు.

అవ. దీనిని దార్ష్టాంతికమందును తెలియఁజేయుచున్నాఁడు:—

శ్లో. తథాఽంతర్యామ్యయం యత్ర యయా వాసనయా యథా,
విక్రియేత తథా వశ్యం భవత్యేవ న సంశయః. 170

వ్యా. తంతుసంకోచాదినా పటసంకోచాది ర్యథా భవతి ఏవం పృథివ్యాదిషూపాదానత్వేన స్థితోఽంతర్యామీ యయా యయా వాసనయా యథా యథా ఘటాది కార్యరూపేణ విక్రియతే, తథా తథా తత్త త్కార్యమవశ్యం భవతీతి భావః.

టీ. తథా = ఆప్రకారము, అయం = అంతర్యామీ, ఈయంతర్యామి యగు నీశ్వరుఁడు, యత్ర=ఎచ్చట, యయా=ఏ, వాసనయా = సంస్కారముచేత, యథా = ఏవిధముగా, విక్రియేత = ఘటాదిరూపముగా మాఱునో (ఆయాకార్యము), తథా=ఆ ప్రకారము, అవశ్యం=ముఖ్యముగా (తప్పక), భవత్యేవ=కానే యగుచున్నది.

తా. పంచభూతములకును ప్రాణాదులకును నన్నింటికి నుపాదానకారణమైనట్టియు, అంతర్యామి యైనట్టియు ఈశ్వరుఁడు ఏయే వాసనలచేత నెక్కడెక్కడ నేయేవిధముగ వికారమును పొందునో, ఘటాదికార్యరూపమును ధరించునో ఆయావిధముగ కార్యవర్గమును కారణాధీనమై యున్న దనుటకు సంశయము లేదు.

శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. 171

వ్యా. ఏవమంతర్యామిప్రతిపాదికాం శ్రుతిముపన్యస్య స్మృతిమప్యుపన్యస్యతి—ఈశ్వర ఇతి.

టీ. హేఅర్జున = ఓయర్జునా! యన్త్రారూఢాని (ఇవ) = యంత్రముల నధిష్ఠించియున్నవానివలె, సర్వభూతాని = సమస్తభూతములను, మాయయా = (త్రిగుణాత్మకమైన తన) శక్తిచేత, భ్రామయన్ = (కర్మములయందు) ప్రవర్తింపఁజేయుచున్న, ఈశ్వరః=జగన్నియామకుఁడు, సర్వభూతానామ్=సమస్తభూతములయొక్క, హృద్దేశే=హృదయప్రదేశమందు, తిష్ఠతి=ఉన్నాఁడు.

తా. ఓయర్జునా! యంత్రారూఢులైనవానివలె సమస్తభూతములను తన మాయచే కర్మములయందుఁ బ్రవర్తింపఁజేయుచు నున్న జగదీశ్వరుఁడు సర్వభూతముల హృదయప్రదేశమందు ఉన్నాఁడు. అని శ్రీకృష్ణపరమాత్మ గీతలలో అర్జునునకు బోధించెను.

అవ. ఈపైన చెప్పఁబడిన భగవద్వాక్యములలోని యొక్కొకపదార్థమును విశదపఱచుచున్నాఁడు:—

శ్లో. సర్వభూతాని విజ్ఞానమయాస్తే హృదయే స్థితాః,
తదుపాదానభూతేశ స్తత్ర విక్రియతే ఖలు. 172

వ్యా. సర్వభూతానామితి పదస్యార్థమాహ—సర్వభూతానీతి. తే చ హృదయపుండరీకే స్థితాః. నను తేషాం కుతో హృద్యవస్థానమిత్యాశంక్య హృద్యంతర్యామిణో విజ్ఞానమయాకారేణ పరిణామాదిత్యాహ—తదుపాదానేతి.

టీ. సర్వభూతాని = సమస్తభూతములును, విజ్ఞానమయాః = విజ్ఞానమయులగుచున్నవి. తే = ఆవిజ్ఞానమయులు, హృదయే = హృదయప్రదేశమునందు, స్థితాః= ఉండియున్నవి. తదుపాదానభూతేశః - తత్ = ఆవిజ్ఞానమయాది కోశములకు, ఉపాదానభూత = ఉపాదానకారణమైన, ఈశః = ఈశ్వరుఁడు, తత్ర = ఆహృదయదేశమందు, విక్రియతే ఖలు = విజ్ఞానమయముగ మాఱి వికారమును పొందుచున్నాఁడు గదా.

తా. సర్వభూతము లనెడి పైశ్లోకమునందలి సర్వభూతపదమునకు విజ్ఞాన మయు లని యర్థము. ఆవిజ్ఞానమయస్వరూపులు జీవులు.

వానికి నుపాదానకారణమైన యీశ్వరుఁడు హృదయమున విజ్ఞానమయకోశాకారముగ పరిణమించుటంజేసి హృదయకమలమునం దా విజ్ఞానమయకోశము లున్న వని యెఱుఁగవలయును.

అవ. భగవద్వాక్యమునందలి "యంత్రారూఢాని" అనెడి పదముయొక్క అర్థమును వివరించుచున్నాఁడు:—

శ్లో. దేహాదిపంజరం యంత్రం తదారోహోఽభిమానితా,
విహితప్రతిషిద్ధేషు ప్రవృత్తిర్భ్రమణం భవేత్. 173

వ్యా. యంత్రారూఢానీత్యత్ర యంత్రారోహశబ్దయోరర్థమాహ—దేహాదీతి. భ్రామయన్నితి పదే ప్రకృత్యర్థమాహ—విహితేతి.

టీ. దేహాదిపంజరం = పంజరమువంటి దేహాదికము, యంత్రం = యంత్రము (అగును). అభిమానితా = అభిమానము గలుగుట, తదారోహః = దాని నెక్కుట, విహితప్రతిషిద్ధేషు-విహిత=ధర్మములందును, ప్రతిషిద్ధేషు=అధర్మములందును, ప్రవృత్తిః= ప్రవర్తించుట, భ్రమణం = తిరుగుట, భవేత్ = అగును.

తా. పంజరమువంటి దేహేంద్రియాదికము యంత్ర మగును. ఆదేహేంద్రియాదికమునందు అభిమానము కలుగుటయే ఎక్కుట యనఁబడును. ధర్మాధర్మములందు ప్రవర్తించుట తిరుగుట యగును. అని యీవిధమున భగవద్వాక్యమునందుఁ గల యంత్రారోహశబ్దముల యర్థమును 'భ్రామయన్' అను పదములోని భ్రముధాత్వర్థంబును అగు నని యెఱుంగునది.

అవ. ఇప్పుడు 'భ్రామయన్' అను పదములోని ణిచ్ అనుప్రత్యయముయొక్క అర్థమును, మాయా అను పదముయొక్క అర్థమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. విజ్ఞానమయరూపేణ తత్ప్రవృత్తి స్వరూపతః,
స్వశక్త్యేశో విక్రియతే మాయయా భ్రామణం హి తత్. 174

వ్యా. ఇదానీం ణిచ్ ప్రత్యయమాయాపదయో రర్థమాహ—విజ్ఞానమయేతి.

టీ. ఈశః = ఈశ్వరుఁడు, స్వశక్త్యా=తన శక్తిచేతను, విజ్ఞానమయరూపేణ = విజ్ఞానమయకోశస్వరూపముచేతను, తత్ప్రవృత్తిస్వరూపతః-తత్ =అవిజ్ఞానమయకోశము యొక్క, ప్రవృత్తి=ప్రవర్తించుటయొక్క, స్వరూపతః=స్వరూపముచేతను, విక్రియతే = వికారమును పొందుచున్నాఁడు. తత్ హి = అదియే, మాయయా = మాయచేత, భ్రామణం = భ్రమింపఁ జేయుట (అనఁగా త్రిప్పుట అగును).

తా. ఈశ్వరుఁడు తన శక్తిచేత విజ్ఞానమయకోశస్వరూపము గను ఆవిజ్ఞానమయకోశముయొక్క ప్రవర్తించుట స్వరూపముగను పరిణామము పొందుచున్నాఁడు. విజ్ఞానమయకోశస్వరూపుఁడగుచున్నాఁడనుట. ఇట్లగుటయే మాయచేత తిరుగునట్లు చేయుట యనంబడును.

అవ. "యః పృథివ్యా మంతరో యమయతి" అను శ్రుతియందలి యమయతి యనుపదమునకును ఇదియే యర్థ మని చెప్పి యావరుసలలో నెన్నిసారు లీపదము వచ్చినను, ఇట్లే యర్థమును చెప్పుకొనవలసిన దనియుం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అంత ర్యమయతీత్యుక్త్యాఽయ మేవార్థ శ్శ్రుతౌ శ్రుతః,
పృథివ్యాదిషు సర్వత్ర న్యాయోఽయం యోజ్యతాం ధియా. 175

వ్యా. శ్రౌతస్య యమయతీతి పదస్యాప్యయమేవార్థ ఇత్యాహ—అంతర్యమయతీతి. ఉక్తవ్యాఖ్యానం పర్యాయాంతరేష్వతిదిశతి—పృథివ్యాదిష్వితి.

టీ. అంతః = లోపల, యమయతీతి = నియమించుచున్నాఁడని, ఉక్త్యా = చెప్పుటచేత, అయం అర్థ ఏవ=ఈయర్థమే, శ్రుతౌ=శ్రుతియందు, శ్రుతః = వినఁబడినది, అయం, న్యాయః=ఈన్యాయము, పృథివ్యాదిషు = భూమి మొదలగు పంచభూతముల యందును, సర్వత్ర=అన్నిచోట్లను, ధియా=ప్రజ్ఞచేత, యోజ్యతాం = సంబంధింపఁజేసి కొనవలయును.

తా. 'అంతర్యమయతి' అను పదముచేత నీశ్వరుఁడు సర్వాంతరుండై నియమించుచున్నాఁడనెడి యర్థమునే శ్రుతి దెలుపుచున్నది గావున ఇట్లే యావరుసలలో ప్రతివాక్యాంతమున వచ్చెడి 'యమయతి' పదమునకు అర్థము చెప్పుకొనవలయును.

అవ. మన సర్వకార్యప్రవృత్తియు ఈశ్వరాధీనమే అయియున్నది యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. జానామి ధర్మం న చ మే ప్రవృత్తిర్జానామ్యధర్మం న చమే నివృత్తిః,
కేనాపి దేవేన హృది స్థితేన యథా నియుక్తోఽస్మి తథా కరోమి.

వ్యా. ప్రవృత్తిజాతస్య. సర్వస్యేశ్వరాధీనత్వే వచనాంతర ముదాహరతి—జానామి ధర్మమితి.

టీ. ధర్మం=ధర్మమును, జానామి = ఎఱుఁగుదును. మే=నాకు (దానియందు), ప్రవృత్తిః=ప్రవర్తించుట, నచ=లేదు. అధర్మం=అధర్మమును, జానామి = గుర్తెఱుఁగుదును. మే=నాకు (దానియందు), నివృత్తిః = ప్రవేశింపకుండుట, నచ=లేదు. హృది=

౹యమునందు, స్థితేన=ఉన్నట్టి, కేనాపి = ఒకానొకఁడైన, దేవేన = దేవునిచేత,
=ఏవిధముగా, నియుక్తః = నియమింపఁబడినవాఁడను, అస్మి=అయితినో, తథా =
ముగా, కరోమి = చేయుచున్నాను.

తా. నాకు ఇది ధర్మము, ఇది అధర్మము అని తెలియక పోలేదు
), ధర్మకార్యమును చేయుటయు అధర్మకార్యమును మానుకొనుట
ను మాత్రము లేదు. దీనికి కారణ మేమి యని అందురేమో,
ఁడో నాహృదయముననుండి ప్రేరేపించి బలాత్కారముగాఁ బని
యించుచున్న వాఁడు గాన, నాయంతరాత్మ ఎట్లు ప్రేరేపించునో
ట్లు చేయుదును.

అవ. ప్రవృత్తి ఈశ్వరాధీనము గాక, ఈశ్వరాధీన మయ్యెనేని పురుషుఁడు ప్రయ
పవలయును అను లౌకికవాదుక నిరర్థక మగును గదా యని శంకించి ఆ పురుష
యత్నమును ఈశ్వరరూపమే యగు నని చెప్పుచున్నాఁడు:—

నార్థః పురుషకారేణేత్యేవం మా శంక్యతాం యతః,
ఈశః పురుషకారస్వరూపేణాపి వివర్తతే. 177

వ్యా. నను ప్రవృత్తేరీశ్వరాధీనత్వే పురుషప్రయత్నో వ్యర్థస్స్యాదిత్యాశంక్య,
షప్రయత్నస్యాపీశ్వరస్వరూపత్వాన్నైవమితి పరిహరతి—నార్థ ఇతి. అర్థః ప్రయో
పురుషకారః పురుషప్రయత్నః.

టీ. యతః=ఏహేతువువలన, ఈశః = ఈశ్వరుఁడు, పురుషకారస్వరూపేణాపి=
షప్రయత్నరూపముతోడను, వివర్తతే = విశేషముగ వర్తించుచుండెనో (అతః =
హేతువువలన,) పురుషకారేణ = పురుషప్రయత్నముతో, అర్థః=లాభము, నేతి =
దని, మా శంక్యతాం = శంకింపఁగూడదు.

తా. ఈశ్వరుఁడు పురుషప్రయత్న స్వరూపముగా నున్నాఁడు
ౕక మనము ప్రయత్నముచేయుటవలన లాభము లే దని యెన్న
ననుకొనరాదు.

అవ. పురుషప్రయత్నము కూడ నీశ్వరస్వరూపమే యైనచో నియమించు
న్నాఁ డనియు, భ్రమింపఁజేయు చున్నాఁ డనియు ననుట వ్యర్థము గదా యందు
రా, వ్యర్థము కాదు అని నుడువుచున్నాఁడు:—

ఈదృగ్బోధేనేశ్వరస్య ప్రవృత్తిర్నైవ వార్యతాం,
తథాపీశస్య బోధేన స్వాత్మాసంగత్వధీజనిః. 178

వ్యా. నను పురుషప్రయత్నస్యాపీశ్వరస్వరూపత్వే యమయతీతి భ్రామయన్నితి ప్రతిపాదితమంతర్యామిప్రేరణం వృథా స్యాదిత్యాశంక్య తద్బోధేన స్వాత్మాసంగత్వ జ్ఞానలక్షణఫలస్య సత్త్వాన్నైవమితి పరిహరతి—ఈదృగితి. ఈదృగ్బోధేనేశస్య పురుష కారాదిరూపేణాప్యవస్థానజ్ఞానే న ప్రవృత్తిః అంతర్యామిరూపేణ ప్రేరణం నైవ వార్యతామ్.

టీ. ఈదృగ్బోధేన=ఇటువంటి జ్ఞానముచేత, ఈశ్వరస్య = ఈశ్వరునియొక్క, ప్రవృత్తిః = ప్రేరేపణము, నైవ వార్యతాం=నివారింపఁబడక పోవుగాక (నివారింపఁ బడ దనుట). తథాపి=అట్లైనప్పటికిని, ఈశస్య = ఈశ్వరునియొక్క, బోధేన = తెలిసి కొనుటచేత, స్వాత్మాసంగత్వధీజనిః-స్వాత్మా = తన స్వరూపముయొక్క, అసంగత్వధీ= అసంగత్వజ్ఞానముయొక్క, జనిః = ఉత్పత్తి, (భవతి = అగుచున్నది).

తా. ఈశ్వరుఁడు పురుషప్రయత్న స్వరూపముగాఁ గూడ నున్నాఁ డని తెలిసికొనినంతమాత్రమున ఈశ్వరుఁడు ప్రేరేపించు చున్నాఁడను మాటకు విరోధము లేదు. లేక పోవుటయే కాక, ఈశ్వ రునియొక్క స్వరూపమును బాగుగా గ్రహించుట చేత తాను ఏవిధ మైన సంగము లేనివాఁ డనెడి (దేనితో నంటనివాఁ డనుట) విజ్ఞాన ముదయించుచున్నది. ఇదియే పరమలాభము.

అవ. తాను సంగము లేనివాఁ డనెడి జ్ఞానము గలుగుటయే మోక్షస్వరూప మని శ్రుతిస్మృతులు బోధించుచున్న వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తావతా ముక్తిరిత్యాహు శ్శ్రుతయ స్స్మృతయ స్తథా,
శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే ఇత్యపీశ్వరభాషితమ్. 179

వ్యా. ఆత్మనోఽసంగత్వజ్ఞానేనాపి కిం ప్రయోజనమిత్యత ఆహ—తావతేతి. శ్రుతిస్మృత్యుదితస్య తస్యానతిలంఘనీయత్వే స్మృతిం దర్శయతి—శ్రుతిస్మృతీ ఇతి.

టీ. శ్రుతయః = శ్రుతులును, తథా = అలాగున, స్మృతయః= స్మృతులును, తావతా=ఆత్మనిస్సంగుఁ డని తెలియుటచేత, ముక్తిరితి=మోక్షము కలుగుచున్న దని, ఆహుః=చెప్పుచున్నవి, శ్రుతిస్మృతీ = శ్రుతులును స్మృతులును, మమ = నాయొక్క, ఆజ్ఞేవేత్యపి = ఆజ్ఞలే సుమా యని, ఈశ్వరభాషితం - ఈశ్వర=పరమేశ్వరస్వరూపుఁ డగు శ్రీకృష్ణపరమాత్మచేత, భాషితం = తెలుపఁబడినది.

తా. శ్రుతులును, స్మృతులును తన యాత్మస్వరూపము దేనితో నంటనిది అనెడి జ్ఞానముచేత మోక్షము గలుగు నని బోధించుచున్నవి.

ఆశ్రుతిస్మృతులు నాయాజ్ఞారూపము లని భగవద్గీతయందు కృష్ణపరమాత్మయు వచించియున్నాఁడు.

అవ. శ్రుతిచేతను కూడ ఈశ్వరుఁడే భయహేతు వని తెలుపఁబడిన దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆజ్ఞయా భీతి హేతుత్వం భీషాస్మాదితి హి శ్రుతం,
సర్వేశ్వరత్వ మేతత్స్యా దంతర్యామిత్వతః పృథక్. 180

వ్యా. శ్రుత్యాప్యీశ్వరస్య భీతిహేతుత్వముక్తమిత్యాహ—ఆజ్ఞయేతి, ఈశ్వరస్య భీతిహేతుత్వ కిమర్థముక్తమిత్యాశంక్య సర్వేశ్వరత్వస్యాంతర్యామిత్వతః పార్థక్య సిద్ధయ ఇతి మత్వాహ—సర్వేశ్వరత్వ మితి.

టీ. అస్మాత్=ఈయీశ్వరునివలన, భీషేతి=భయము గలుగుచున్న దనెడి శ్రుతిచేత, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, భీతిహేతుత్వం=భయహేతుత్వము, శ్రుతం హి = వినఁబడుచున్నదిగదా, ఏతత్=ఈభయహేతుత్వము, అంతర్యామిత్వతః = అంతర్యామిత్వముకంటె, పృథక్=వేఱైన, సర్వేశ్వరత్వం=సర్వేశ్వరస్వభావము, (అగుచున్నది).

తా. శ్రు. "భీషాస్మాత్" అను శ్రుతివలన ఈశ్వరాజ్ఞచేత భయహేతుత్వము గలుగుచున్నది. ఈ భయహేతుత్వము అంతర్యామిస్వభావముకంటె వేఱైన సర్వేశ్వరభావమే యగును. అనఁగా అంతర్యామిత్వముకంటె సర్వేశ్వరత్వమునకు భేద మున్న దని తెలుపుటకు శ్రుతి చెప్పె నని తెలియవలయును.

అవ. లోపలను వెలుపలను నంతయు నియమించినవాఁడు ఈశ్వరుఁడే యనుటకు రెండు మంత్రములను పఠించుచున్నాఁడు:—

శ్లో. ఏతస్య వా అక్షరస్య ప్రశాసన ఇతి శ్రుతిః,
అంతః ప్రవిష్టశ్శాస్తాయం జనానా మితి చ శ్రుతిః. 181

వ్యా. బహిరంతశ్చేశ్వర ఏవ నియామక ఇత్యత్ర శ్రుతిద్వయమాహ—ఏతస్యేతి.

టీ. ఏతస్య=ఈ, అక్షరస్య వా = నాశరహితుఁడైన ఈశ్వరునియొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు - ఈమొదలైన గ్రంథమందు, (సర్వప్రపంచము పరమేశ్వరాజ్ఞయందే వర్తించుచున్న దనుట), శ్రుతిః=శ్రుతి చెప్పుచున్నది, ఇతి=అనియు, అయం=ఈపరమేశ్వరుఁడు, జనానాం=జనులయొక్క, అంతః=లోపల, ప్రవిష్టః = ప్రవేశించినవాఁడగుచు, శాస్తా=శాసించుచున్నాఁడు, ఇతి చ=అనియు, శ్రుతిః = వేఱొకశ్రుతి చెప్పుచున్నది.

తా. జగత్తంతయు అక్షరుఁడగు నీశ్వరాజ్ఞయందు వర్తించు చున్న దనియు, ప్రాణికోటిలో నంతయు నీశ్వరుఁ డుండి శాసించు చున్నాఁ డనియు నీ రెండు మంత్రములు చెప్పుచున్నవి.

శ్లో. జగద్యోని ర్భవే దేష ప్రభవాప్యయకృత్త్వతః,
ఆవిర్భావతిరోభావా వుత్పత్తిప్రళయావుతౌ. 182

వ్యా. క్రమప్రాప్తస్యైషయోని రిత్యస్యార్థమాహ—జగద్యోనిరితి. ప్రతిజ్ఞా తార్థే 'ప్రభవాప్యయాహి భూతానా' మితి వాక్యం హేతుత్వేన యోజయతి—ప్రభవేతి. ప్రభవాప్యయావుత్పత్తిప్రళయౌ తత్కర్తృత్వాత్ జగద్యోనిరిత్యర్థః. ఉత్పత్తి ప్రళయశబ్దయోర్వివక్షితమర్థమాహ—ఆవిర్భావేనేతి. ఉత్పత్తిప్రళయావావి ర్భావతిరోభావౌ మతావితి యోజనా.

టీ. ప్రభవాప్యయకృత్త్వతః = సృష్టిలయములను చేయుటవలన, ఏషః = ఈ యీశ్వరుఁడు, జగద్యోనిః = జగత్కారణమైనవాడు, భవేత్ =అగును, ఉత్పత్తిప్రళయౌ = ఉత్పత్తిప్రళయములు రెండును, ఆవిర్భావతిరోభావౌ - ఆవిర్భావ = ఉత్పత్తి యనఁగా ఆవిర్భావ మనియు, ప్రళయౌ=ప్రళయ మనఁగా తిరోభావమనియుం, మతౌ= చెప్పఁబడినవి.

తా. పరమేశ్వరుఁడు లోకముయొక్క సృష్టిస్థితిలయములను చేయుచుండుటవలన జగత్తునకు కారణ మనియు ఉత్పత్తిప్రళయము లనఁగా ఆవిర్భావతిరోభావము లనియు అనఁగా వ్యక్త మగుటయు వ్యక్తము కాకపోవుటయు నని శ్రుతియందు చెప్పఁబడియున్నది.

అవ. పరమేశ్వరుఁడు ఆవిర్భావ మనియెడి యుత్పత్తికి కారణుం డగుటను దృష్టాంతమూలముగా చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆవిర్భావయతి స్వస్మి న్విలీనం సకలం జగత్,
ప్రాణికర్మవశా దేష పటో యద్వ త్ప్రసారితః. 183

వ్యా. ఆవిర్భావకారిత్వం సదృష్టాంత ముపపాదయతి—ఆవిర్భావయతీతి. యథాసంకుచితశ్చిత్రపటః స్వస్య ప్రసారణేన స్వనిష్ఠాని చిత్రాణ్యావిర్భావయతి ఏవ మీశోఽపీత్యర్థః.

టీ. పటః=వస్త్రము, ప్రసారితః = విస్తరింపఁబడిన దగుచు, యద్వత్ =ఏప్రకార ముగా తనయందుఁ గల చిత్రవర్ణములను తోపింపఁజేయుచున్నదో, తద్వత్ =అట్టువలె,

ఏషః = ఈశ్వరుఁడు, స్వస్మిన్ = తనయందు, లీనం = లయించిన, సకలం=సమస్తమైన, జగత్ = ప్రపంచమును, ప్రాణికర్మవశాత్ = జీవులయదృష్టము ననుసరించి, ఆవిర్భావయతి=ఆవిర్భవింపఁ జేయుచున్నాఁడు. (వ్యక్తపఱచుచున్నాఁ డనుట.)

తా. ఒక బొమ్మలుగల రంగుబట్ట విడదీసినపుడు దానియందలి బొమ్మల నగపఱిచెడువిధమున నీశ్వరుండును, దనయందు లీన మైన జగత్తును, ప్రాణులయదృష్టము (అనఁగా సృష్టికాఁదగిన కర్మల యుద్బోధ మనుట) ననుసరించి కనఁబఱచుచున్నాఁడు.

అవ. మఱియు నీశ్వరుఁడే ప్రళయమునకుఁ గారణ మనుటను ఇపుడు చెప్పుచున్నాఁడు:—

శ్లో. పునస్తిరోభావయతి స్వాత్మన్యేవాఖిలం జగత్,
ప్రాణికర్మక్షయవశా త్సంకోచితపటో యథా. 184

వ్యా. తస్యైవ ప్రలయకారణత్వం దర్శయతి—పునరితి. సఏవ పటస్సంకుచితః చిత్రాణి యథా తిరోభావయతి తద్వదిత్యర్థః.

టీ. సంకోచితపటో యథా=మడఁతపెట్టఁబడిన బట్టవలె, ప్రాణికర్మక్షయవశాత్-ప్రాణి=జీవులయొక్క, కర్మ=కర్మఫలములయొక్క, క్షయవశాత్ = క్షయించుటనుబట్టి, అఖిలం=సకలమైన, జగత్=ప్రపంచమును, స్వాత్మన్యేవ = తనయందే, పునః = మఱల, తిరోభావయతి=లయింపఁజేయుచున్నాఁడు.

తా. బొమ్మలరంగుబట్టను ముడిచినపుడు ఆవస్త్రము తనయందలి బొమ్మలను గనుపఱచనితెఱంగున పరమేశ్వరుఁడు ప్రపంచభోగముల ననుభవింపఁదగినకర్మము జీవులకు తీరిపోఁగానే, సర్వప్రపంచమును దనయందు లయింపఁజేయు నని భావము.

అవ. ఆవిర్భావతిరోభావములం గూర్చి మఱికొన్ని దృష్టాంతములం జెప్పుచున్నాఁడు:—

శ్లో. రాత్రిఘస్రౌ సుప్తిబోధా వున్మీలననిమీలనే,
తూష్ణీంభావమనోరాజ్యే ఇవ సృష్టిలయావిమౌ. 185

వ్యా. ఆవిర్భావతిరోభావయో ర్దృష్టాంతాంతరాణి దర్శయతి—రాత్రిఘస్రావితి. ఘస్రో౽హః.

టీ. రాత్రిఘస్రావివ = రేయుంబగళ్లవలెను, సుప్తిబోధావివ = సుషుప్తిజాగ్రదవస్థలవలెను, ఉన్మీలననిమీలనే ఇవ = ఉన్మేషనిమేషములవలెను, తూష్ణీంభావమనో

రాజ్యే ఇవ=మిన్నకుండుటయు సంకల్పించుటయువలెను, ఇమౌ=ఈసృష్టిప్రళయములు, (స్యాతాం=అగుచున్నవి).

తా. స్పష్టము.

అవ. ఈశ్వరుఁడు ఆరంభకత్వముచేతనా, లేక పరిణామత్వముచేతనా, జగత్తు యొక్క సృష్టిస్థితిలయమునకు గారణమంటివి? ఆకారణత్వము ఈశ్వరుఁడు జగద్రూపముగ పరిణమించుటచేత నంటివా? ఆరంభకత్వముచేత నంటివా? అద్వితీయుఁడైన వాని కారంభకత్వము సంభవింపనేరదు. నిరవయవమైన పదార్థముగాన పరిణమించుటయు సంభవింపదు అనియెడి పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆవిర్భావతిరోభావశక్తిమత్త్వేన హేతునా,
ఆరంభపరిణామాది చోద్యానాం నాత్ర సంభవః. 186

వ్యా. నన్వీశ్వరస్య జగద్యోనిత్వం కి మారంభకత్వేన? కిం వా తదాకారపరిణామిత్వేన నాద్యః. అద్వితీయస్యారంభకత్వాయోగాత్ న ద్వితీయః నిరవయవస్య పరిణామాసంభవాదిత్యాశంక్య నివర్తవాదాశ్రయణాన్నాయం దోష ఇతి పరిహరతి— ఆవిర్భావేతి.

టీ. ఆవిర్భావతిరోభావశక్తిమత్త్వేన = సృష్టిప్రళయములఁ జేయునట్టి శక్తి గలిగిన, హేతునా=కారణములచేత, ఆరంభపరిణామాది చోద్యానాం=ఆరంభవాదముల యొక్కయు, పరిణామవాదము యొక్కయు పూర్వపక్షములకు, అత్ర=ఈ పరమేశ్వరునియందు, న సంభవః=సంభవింపదు.

తా. అనఁగా త్రాఁడు సర్పమువలె తోఁచెడివిధమున ఆయద్వితీయమగు వస్తువు జగద్రూపముగ తోఁచు నని చెప్పెడి మావాదమును నీపూర్వపక్షములు ఖండింపఁజాలవు. వీనికి సమాధానము వుుందు గ్రంథములో అద్వైతానందప్రకరణమునందు స్పష్టపఱచియున్నారము. అచట చూడఁదగును.

అవ. అద్వితీయుండైన యీశ్వరునకు చేతనాచేతనరూపమైన జగత్తునకు నుపాదానకారణ మగుట యెట్లు అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అచేతనానాం హేతుస్స్యాజ్జాడ్యాంశో నేశ్వరస్తథా,
చిదాభాసాంశతస్త్వేష జీవానాం కారణం భవేత్. 187

వ్యా. నన్వేక ఏవేశ్వరః కథం చేతనాచేతనజగదుపాదానం భవిష్యతీత్యాశంక్యాచిత్ప్రాధాన్యేనాచేతనోపాదానం చిత్ప్రాధాన్యేన చేతనోపాదానం చ భవిష్యతీత్యాహ—అచేతనానామితి.

టీ. జాడ్యాంశః = జాడ్యాంశమైన ప్రకృతిరూపము, అచేతనానాం=జడములైన దేహేంద్రియాదులకు, హేతుః = కారణము, స్యాత్ = అగును, ఈశ్వరః = ఆత్మచైతన్యము, తథా = ఆప్రకారము, (జడములకు కారణ మగుట) న=లేదు,ఏషతు= ఈశ్వరుఁ డన్ననో, చిదాభాసాంశతః = మాయాప్రతిబింబితమైన చిదాభాసరూపము వలన, జీవానాం = జీవులకు, కారణం = హేతువు, భవేత్ = అగును.

తా. దేహేంద్రియాద్యచేతనపదార్థములకు ఈశ్వరుఁడు మాయోపాధికుఁడు కాఁబట్టి ఆమాయయే కారణ మగును గాని ఈశ్వర చైతన్యము దేహేంద్రియాది జడపదార్థమునకుఁ గారణము గాదు. ప్రకృతిప్రాధాన్యముచేత అచేతనములకు నుపాదానకారణ మగును. చిదాభాసరూపముచేత జీవులకుఁ గారణ మగును.

శ్లో. తమః ప్రధానః క్షేత్రాణాం చిత్ప్రధానశ్చిదాత్మనాం,
పరః కారణతా మేతి భావనాజ్ఞానకర్మభిః. 188

శ్లో. ఇతి వార్తిక కారేణ జడచేతన హేతుతా,
పరమాత్మన ఏవోక్తా నేశ్వరస్యేతి చేన్న తత్. 189

వ్యా. నను మాయావిన ఈశ్వరస్య జగత్కారణత్వప్రతిపాదన మనుపపన్నం సురేశ్వరాచార్యైః పరమాత్మన ఏవ తదభిధానాదితి శంకతే ద్వాభ్యాం—తమః ప్రధానఇతి. తమః ప్రధానః తమోగుణప్రధానమాయోపాధికః పరమాత్మా క్షేత్రాణాం శరీరాదీనాం చిత్ప్రధానశ్చిదాత్మనాం చ భావనాజ్ఞానకర్మభిః భావనా సంస్కారః జ్ఞానం దేవతాధ్యానాదికర్మ పుణ్యాపుణ్యలక్షణం తైర్నిమిత్తభూతైరిత్యర్థః.

టీ. తమఃప్రధానః = మాయోపాధికుఁడైన, పరః = పరమాత్మ, క్షేత్రాణాం= జడములైన సర్వశరీరములకును, చిత్ప్రధానః=చైతన్యప్రధానుఁడగు పరమాత్మ, చిదాత్మనాం = చేతనులైనజీవులకును, భావనాజ్ఞానకర్మభిః-భావనా=సంస్కారములచేతను, జ్ఞాన = ఉపాసనములచేతను, కర్మభిః=పుణ్యపాపరూపకర్మములచేతను, కారణతామ్= కారణత్వమును, ఏతి=పొందుచున్నాఁడు. ఇతి=ఈవిధముగా, వార్తికకారేణ=వార్తికములనుచేసిన సురేశ్వరాచార్యులచేత, పరమాత్మన ఏవ=ఆత్మచైతన్యమునకే, జడచేతన హేతుతా=చేతనాచేతనరూపమైన జగత్తునకు కారణం బనుట, ఉక్తా=తెలుపఁబడినది. ఈశ్వరస్య = ఈశ్వరునకు, నేతి చేత్ = కారణత్వము చెప్పఁబడ లేదని యంటివేని, తత్=అట్లు చెప్పుట, న=కాదు.

తా. మాయోపాధికుఁ డగు నీశ్వరుండు జడపదార్థములకును, చేతనప్రధానుఁ డగు పరమాత్మ చేతనములకును సంస్కారములును, ఉపాసనలును, సుకృతదుష్కృతకర్మలును అనెడి ఈమూఁడు నిమిత్తములతో కారణత్వముగలిగి యున్నాఁడు. ఈప్రకారముగా వార్తికకారుఁడైన సురేశ్వరాచార్యులవారు చేతనాచేతనలక్షణమైన జగత్తునకు కారణ మని చెప్పియుండిరి గాని ఈశ్వరుఁడు జగత్కారణ మని చెప్ప లేదు. గనుక మాయోపాధికుఁ డగు నీశ్వరుఁడు జగత్కారణుం డగుట యెట్లు తటస్థించును అని పై రెండుశ్లోకములచేత పూర్వపక్షము చేయఁబడెను.

అవ. పైపూర్వపక్షమునకు సిద్ధాంతము చెప్పఁబడుచున్నది:—

శ్లో. అన్యోన్యాధ్యాస మత్రాపి జీవకూటస్థయో రివ,
ఈశ్వర బ్రహ్మణోస్సిద్ధం కృత్వా బ్రూతే సురేశ్వరః. 190

వ్యా. త్వంపదార్థ ఇవ తత్పదార్థేఽప్యధిష్ఠానారోప్యయోరన్యోన్యాధ్యాసస్య వివక్షితత్వాన్నైవ మితి పరిహరతి—న తత్ అన్యోన్యాధ్యాసమితి.

టీ. సురేశ్వరః=వార్తికకారుఁడైన సురేశ్వరాచార్యుఁడు, అత్రాపి=ఇట్టిస్థలమునందును, జీవకూటస్థయో రివ = జీవునకును కూటస్థునకును వలె, ఈశ్వరబ్రహ్మణోరపి = ఈశ్వరునకును పరబ్రహ్మమునకును, అన్యోన్యాధ్యాసం = పరస్పరాధ్యాసమును, సిద్ధం కృత్వా = సిద్ధమైనదానినిగాఁ జేసి, బ్రూతే = జగత్కారణత్వమును జెప్పెను.

తా. ఓపూర్వపక్షవాదీ! సురేశ్వరాచార్యులవారు ఈశ్వరునకును, పరబ్రహ్మమునకును జీవకూటస్థులకు వలెనే తాదాత్మ్యాధ్యాసమును సిద్ధింపఁజేసి యీశ్వరునకు జగత్కారణత్వమును జెప్పుచున్నాఁడు. గాని కేవలపరమాత్మకు జగత్కారణత్వమును జెప్పలేదు అని అభిప్రాయము.

అవ. ఈశ్వరబ్రహ్మములకు తాదాత్మ్యాధ్యాసమును సిద్ధించిన ట్లెంచుచు సురేశ్వరాచార్యులవారు జగత్కారణత్వమును చెప్పి రని నీ కెట్లు తెలియును అనిగొనెదవేమో. చెప్పెద ననుచున్నాఁడు:—

శ్లో. సత్యం జ్ఞాన మనంతం య ద్బ్రహ్మ తస్మా త్సముత్థితాః,
ఖవాయ్వగ్ని జలోర్వ్యోషధ్యన్న దేహా ఇతి శ్రుతిః. 191

వ్యా. నను సురేశ్వరాచార్యైరీశ్వరబ్రహ్మణో రన్యోన్యాధ్యాసం సిద్ధవత్కృత్య వ్యవహృత ఇతి కుతోఽవగమ్యత ఇత్యాశంక్య శ్రుత్యర్థపర్యాలోచనవశాదితి దర్శయితుం శ్రుతిమర్థతః పఠతి—సత్యమితి.

టీ. సత్యం = సద్రూపుఁడును, జ్ఞానం = చిద్రూపుఁడును, అనంతం = అనంతస్వరూపమును గల, యత్=ఏ పరబ్రహ్మము గలదో, తస్మాత్ = ఆ పరబ్రహ్మమువలన, ఖ వా య్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాః - ఖ=ఆకాశమును, వాయు = వాయువును, అగ్ని=అగ్నియు, జల=ఉదకమును, ఉర్వీ = భూమియు, ఓషధి = సమస్తమైన ఓషధులును, అన్న=భుజించెడి పదార్థములును, దేహ = శరీరములును, సముత్థితాః = పుట్టినవి, ఇతి = అని, శ్రుతిః = వేదము (చెప్పుచున్నది).

తా. ఆకాశము వాయువు మొదలైన పంచభూతంబులును, ఓషధులును, భోజ్యపదార్థములును, ఉద్భిజ్జజరాయుజాండజస్వేదజములనెడి భూతకోటియు మొదలగు సర్వప్రపంచంబును సత్యజ్ఞానానంతస్వరూపుఁడైన పరబ్రహ్మమువలన పుట్టిన దని శ్రు. "సత్యం జ్ఞాన మనంతం" అనెడి తైత్తిరీయశ్రుతిని బట్టి తెలియుచున్న దని భావము.

అవ. నీ విప్పు డుదాహరించిన శ్రుతిచేత ఈశ్వరబ్రహ్మములకు అన్యోన్యాధ్యాసము గల దని ఎట్లు గ్రహింప నగును అని శంకించి యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆపాతదృష్టిత స్తత్ర బ్రహ్మణో భాతి హేతుతా,
హేతోశ్చ సత్యతా తస్మా దన్యోన్యాధ్యాస ఇష్యతే. 192

వ్యా. భవత్వేవం శ్రుతిః. అనయా కథమన్యోన్యాధ్యాసావగతిరిత్యత ఆహ—ఆపాతేతి. తత్ర తస్యాం శ్రుతౌ సత్యాదిలక్షణస్య నిర్గుణబ్రహ్మణో జగత్కారణత్వం జగత్కారణస్య మాయావినశ్చిదాభాసస్య చ సత్యత్వమాపాతతః ప్రతీయమానమన్యోన్యాధ్యాసమంతరేణ న ఘటత ఇతి భావః.

టీ. తత్ర = పైశ్రుతియందు, ఆపాతదృష్టితః = సామాన్యదృష్టిచే నాలోచించిన, బ్రహ్మణః = నిర్గుణబ్రహ్మమునకు, హేతుతా = జగత్కారణత్వము, భాతి= స్ఫురించుచున్నది. హేతోశ్చ = కారణమైన ఈశ్వరునకు, సత్యతా = సత్యత్వమును, ఆపాతదృష్టితః = సామాన్యదృష్టిచేతనే, భాతి = తెలియుచున్నది, తస్మాత్ = ఆకారణమువలన, అన్యోన్యాధ్యాసః = తాదాత్మ్యాధ్యాసము, ఇష్యతే = అంగీకరింపఁబడుచున్నది.

తా. ఈశ్లోకతాత్పర్యము సద్గురువులవలన అంతర్బుద్ధిగలవార లకుఁ గాని గ్రహింపసాధ్యము కాదు కాన జాగ్రత్తగా గమనించి తెలిసికొనవలయును. నాశక్తివంచన లేక దీనిభావమును నెఱిఁగించు చున్నాను.

అధ్యాస మనఁగా త్రాటిని జూచి పాముకొనునట్లు ఒక వస్తువును నింకొకటిగా తలంచుట. ఇఁక తాదాత్మ్యాధ్యాస మనఁగా రెండు వస్తు వులయొక్క ధర్మములలో నొకదాని ధర్మములు మఱియొకదానియం దున్నట్లు నిశ్చయించుట. ఒక మొద్దును చూచి పురుషుఁ డనియు, పురు షుని చూచి మొద్దనియు తలంచుటవలె జీవునకును కూటస్థునకును, అజ్ఞానదృష్టిచేత నన్యోన్యాధ్యాసము కలిగినట్లే ఈశ్వరునకును, (మాయోపాధికుఁడైన చిదాభాసునకు) నిర్గుణబ్రహ్మమునకును, వీరిద్ద ఱికిని "సత్యం జ్ఞానమనంతం" అనుమొదలైన శ్రుతిసమూహమునందు సత్యత్వమును జగత్కారణత్వమును తోఁచుట పరస్పరమైన యధ్యా సము లేకయే సంభవింపనందున, అట్లు సురేశ్వరాచార్యులవారు సత్యజ్ఞానానందాదిలక్షణమైన పరబ్రహ్మమునకు జగత్కారణత్వమును ఈశ్వరబ్రహ్మములయొక్క తాదాత్మ్యాధ్యాసమును సిద్ధవత్తుగా చేసి చెప్పి రని తెలియవలయును.

అవ. ఇట్లు అన్యోన్యాధ్యాసముచేత సిద్ధించిన ఏకత్వమును ప్రకరణారంభమున ఉదాహరించిన ఘట్టితపటదృష్టాంతమును స్మరింపఁజేసి స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. అన్యోన్యాధ్యాసరూపోఽసావన్నలిప్తపటో యథా,
ఘట్టితే నైకతా మేతి తద్వద్భ్రాంత్యైకతాం గతః. 193

వ్యా. ఏవమన్యోన్యాధ్యాససిద్ధమీశ్వరబ్రహ్మణోరేకత్వం పూర్వతోదాహృత ఘట్టితపటదృష్టాంతస్మారణేన దృఢయతి.—అన్యోన్యేతి.

టీ. అన్నలిప్తపటః-అన్న = గంజిచేత, లిప్త = పూయఁబడిన, పటః=తెల్లబట్ట, ఘట్టితేన = ఘట్టితరూపముతో, ఏకతాం=ఏకత్వమును, యథా = ఏవిధముగా, ఏతి = పొందుచున్నదో, తద్వత్ =ఆవిధముగానే, అన్యోన్యాధ్యాసరూపః = పరస్పరాధ్యాస స్వరూపుఁడైన, అసౌ=ఈశ్వరుఁడు, భ్రాంత్యా=అజ్ఞానముచేత, ఏకతాం = ఐక్యమును (ఒక్కటియగుట), గతః = పొందెను.

తా. గంజి, కరక్కాయ మొదలైన అన్యపదార్థములచేత పూయఁబడిన తెల్లనిబట్ట ఘట్టితరూపముతో అభేదము గలిగి యున్నట్టు

బ్రహ్మముతో అన్యోన్యాధ్యాసము గలిగిన మాయాప్రతిబింబితుఁడైన ఈశ్వరుఁడును అజ్ఞానముచేత నిర్గుణబ్రహ్మముతో భేదము లేనట్లు అజ్ఞానులకు తోఁచుచున్నాఁడు.

అవ. నిర్గుణబ్రహ్మమునకు ఈశ్వరునకును అజ్ఞానముచేత ఏకత్వము గలిగినందులకు దృష్టాంతముం జెప్పి అజ్ఞానులకు భేదస్ఫురణము లేకపోవుటయందు నింకొక దృష్టాంత మిచ్చుచున్నాఁడు:—

శ్లో. మేఘాకాశమహాకాశౌ వివిచ్యేతే న పామరైః,
తద్వద్బ్రహ్మేశయోరైక్యం పశ్యంత్యాపాతదర్శినః. 194

వ్యా. భ్రాంత్యైకతాపత్తౌ దృష్టాంతమభిధాయాపాతదర్శినాం భేదాప్రతీతౌ పూర్వోక్తమేవ దృష్టాంతాంతరం దర్శయతి—మేఘాకాశేతి. తద్వత్ బ్రహ్మేశయోరైక్యం పశ్యంతి. న భేదమిత్యర్థః.

టీ. పామరైః = అజ్ఞానులచేత, మేఘాకాశమహాకాశౌ - మేఘాకాశ = మేఘాకాశమును, మహాకాశౌ = మహాకాశమును, నవివిచ్యేతే = విభజనగాఁ దెలియఁబడవు, తద్వత్ =అటులనే, బ్రహ్మేశయోః=పరబ్రహ్మమునకును ఈశ్వరునకును, ఐక్యం= భేదము లేకపోవుటను, ఆపాతదర్శినః = పరిశీలనశక్తిలేని అజ్ఞానులు, పశ్యంతి=చూచుచున్నారు.

తా. తెలియనివారు మేఘాకాశము వేఱు, మహాకాశము వేఱు అని యెఱుంగక రెండింటి నొకటిగాఁ దలంచినట్లు, అజ్ఞానులు ఈశ్వరుఁడు పరబ్రహ్మము వే అని గుర్తెఱుంగక రెండు నొకటే యని పొరపాటుపడుచున్నారు.

అవ. ఈశ్వరపరబ్రహ్మములకు భేద మని తెలియు టెట్లు? అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపక్రమాదిభిర్లింగైస్తాత్పర్యస్య విచారణాత్,
అసంగం బ్రహ్మ మాయావీ సృజత్యేష మహేశ్వరః. 195

వ్యా. కుతస్తర్హి బ్రహ్మేశయోర్భేదావగతిరిత్యత ఆహ—ఉపక్రమేతి. "ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతాఫలం, అర్థవాదోపపత్తీ లింగం తాత్పర్యనిర్ణయే" ఇత్యుక్తైః షడ్విధైర్లింగైశ్శ్రుతి తాత్పర్యావధారణే సతి బ్రహ్మాసంగం మాయావీ స్రష్టేత్యవగమ్యత ఇతి శేషః.

టీ. ఉపక్రమాదిభిః = ఉపక్రమము మొదలైన, లింగైః = షడ్విధలింగముల చేత, తాత్పర్యస్య = శ్రుతితాత్పర్యముయొక్క, విచారణాత్ = విచారణచేయుట వలన, బ్రహ్మ = పరబ్రహ్మము, అసంగం = సంగరహితమైనది. ఏషః=ఈ, మాయావీ = మాయయే శరీరముగాఁగల యీశ్వరుఁడు, సృజతీతి=ప్రపంచసృష్టి చేయుచున్నాఁడని (తెలియుచున్నది.)

తా. "శ్లో. ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతాఫలం అర్థవాదోపపత్తిశ్చ లింగం తాత్పర్యనిర్ణయే." అనఁగా 1-ఉపక్రమోప సంహారములు, 2-అభ్యాసము, 3-అపూర్వత్వము, 4-ఫలము, 5-అర్థ వాదము, 6-ఉపపత్తి యనెడి షడ్విధలింగములచేత ఉపనిషత్తులకుఁ దాత్పర్యనిర్ణయముఁ జేయుటవలన, బ్రహ్మము అసంగమనియు, మాయి కూఁడయిన ఈశ్వరుఁడు జగత్తును సృష్టించుచున్నాఁడనియుం దెలియఁ బడును. (లింగ మనఁగా గూఢ మగు అంతరార్థము.)

1. ఉపక్రమము—సృష్టికిఁ బూర్వ మీవిశ్వమంతయు నామ రూపరహితమై యుండె నని ప్రతిపాదించుట. ఇట "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము.

ఉపసంహారము— దృశ్యప్రపంచమంతయు నాసద్రూపబ్రహ్మ మయమే యగు ననియు, ఆ బ్రహ్మమే సత్య మనియు, ఆబ్రహ్మమే ఆత్మ యని ప్రతిపాదించుట "ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము. ఈయుపక్రమోపసంహారములు రెండును అద్వితీయాత్మస్వరూపమును బ్రతిపాదించుటచేత నొకటే లింగముగఁ జెప్పఁబడును.)

2. అభ్యాసము— ఆబ్రహ్మము నీవే యని యుపదేశించుట. "తత్త్వమసీ" త్యాదిశ్రుతులు ప్రమాణము.

3. అపూర్వత— సంఘాతమం దుండెడి ప్రత్యగభిన్నపరమా త్మను ఎఱుఁగవా యేమి, యనెడి "అత్ర తావకిల సతోఽన్యనభాస" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము.

4. ఫలము—ప్రారబ్ధ మెంత పర్యంతము నశింపదో అంత పర్యం తము దేహేంద్రియాదిప్రపంచము మిథ్యారూపముగఁ దోఁచుచు,

ఆప్రారబ్ధమునకు నిశ్శేషనాశన మెప్పుడు కలుగునో యప్పుడు జగము బ్రాంతిగాఁ దోఁచక అద్వితీయాత్మస్వరూపముగ నుండు నని అద్వితీయాత్మజ్ఞానమునకు ఫలమును ప్రతిపాదించి చెప్పెడి "తస్య తావదేవ యావన్న విమోక్ష్యేథ సంపత్స్య" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము.

5. అర్థవాదము—ఏవస్తువును వినుటచేత వినఁబడని వస్తువు వినఁబడుచున్నదో; ఏవస్తువును మననముచేయుటచేత మననముచేయఁబడని వస్తువు మననముచేయఁబడుచున్నదో యని యిట్లు అద్వితీయాత్మజ్ఞానముకొఱకు అర్థవాదమును బ్రతిపాదించెడి "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాత" మిత్యాదిశ్రుతులు ప్రమాణము.

6. ఉపపత్తి—మృత్తికవలనఁ గలిగిన ఘటాదులును బంగారువలనఁ గలిగిన కటకమకుటాదులును కారణముకంటె రూపముచే భిన్నముగఁ దోఁచినను ఈకార్యములకు ఉచ్చారణముతప్ప మఱియొక అర్థము లేమిచే కారణవ్యతిరిక్తముగ కార్యము లేదనెడి యుక్తిని బ్రతిపాదించెడి "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్య" మిత్యాదిశ్రుతులు ప్రమాణము.

ఈప్రకారము షడ్విధలింగములచేత శ్రుతులకు తాత్పర్యమును నిర్ణయించినవానికి శ్రవణమాత్రముచేత అద్వితీయాత్మజ్ఞానము గలుగును.

అవ. బ్రహ్మముయొక్క అసంగత్వమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. సత్యం జ్ఞాన మనంతం చేత్యుపక్రమ్యోపసంహృతం,
యతో వాచో నివర్తంత ఇత్యసంగత్వనిర్ణయః. 196

వ్యా. శ్రుతావుపక్రమోపసంహారైకరూపప్రదర్శనేనోక్తం బ్రహ్మణోఽసంగత్వం స్పష్టయతి—సత్యమితి. అతోఽసంగత్వనిర్ణయో భవతీతి శేషః.

టీ. సత్యం=సత్యస్వరూప మనియు, జ్ఞానం=చిద్రూప మనియు, అనంతం చేతి = అనంత మనియు, ఉపక్రమ్య=మొదలిడి, యతః=ఏనిర్గుణపరబ్రహ్మమునుండి, వాచః = సకలవాక్కులును, (వాక్కని యుపలక్షణముచేత సర్వేంద్రియవ్యాపారము లనుట.) నివర్తంత ఇతి = నివర్తించుచున్నవో యని, ఉపసంహృతం = అక్కడికి బ్రహ్మప్రకరణము ముగింపఁబడెను. (అతః=) కనుక, అసంగత్వనిర్ణయః = పరబ్రహ్మముయొక్కయసంగత్వమును నిర్ధారణము చేయుట (అగును.)

తా. తైత్తిరీయకశ్రుతియందు సద్రూపమును చిద్రూపమును అనంతరూపమును నగు బ్రహ్మ మను అర్థము గల శ్రు. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని మొదలుపెట్టి యాప్రశ్నము కొంతదూరమైన తర్వాత చిట్టచివరకు ఏనిర్గుణపరబ్రహ్మమును సర్వేంద్రియవ్యాపారము లును గ్రహింపలేక యతనికడనుండి మఱలెనో యనెడి యర్థముగల, శ్రు. "యతో వాచో నివర్తంతే" అనెడి వాక్యముతో నిర్గుణబ్రహ్మ స్వరూపనిరూపణము ముగింపఁబడినది. ఇందువలన నేమి తెలియఁబడు చున్నది? బ్రహ్మ మసంగవస్తు వని నిర్ధారణమగుచున్న దని భావము.

అవ. మాయోపాధికుఁ డగునీశ్వరుఁడు జగంబు సృష్టించె ననెడి శ్రుతిని జూపు చున్నాఁడు:—

శ్లో. మాయీ సృజతి విశ్వం సన్నిరుద్ధస్తత్ర మాయయా,
అన్య ఇత్యపరా బ్రూతే శ్రుతిస్తేనేశ్వరస్సృజేత్. 197

వ్యా. మాయావిన ఈశ్వరస్య స్రష్టృత్వప్రతిపాదికాం శ్రుతిమర్థతో దర్శ యతి—మాయీతి. "అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధ" ఇతి శ్రుతిరీశ్వరస్య స్రష్టృత్వం, జీవస్య తత్ర జగతి బద్ధత్వం చ దర్శ యతీతి భావః.

టీ. మాయీ = మాయయే శరీరముగాఁగల యీశ్వరుఁడు, విశ్వం = జగత్తును, సృజతి=పుట్టించుచున్నాఁడు. అన్యః=వేఱొకఁ డగుజీవుఁడు, మాయయా=మాయచేత, తత్ర=ఆజగత్తునందు, సన్నిరుద్ధ ఇతి=నిరోధింపఁ బడె నని, అపరా = వేఱొకటియగు, శ్రుతిః=వేదవాక్యము, బ్రూతే=చెప్పుచున్నది. తేన=ఆకారణముచేత, ఈశ్వరః=ఈశ్వ రుఁడు, సృజేత్ = సర్వజగత్తును సృష్టించెను.

తా. శ్రు. "అస్మాన్మాయీ సృజతే విశ్వ మేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" అనఁగా మాయోపాధికుఁ డైన ఈశ్వరుఁడు జగత్తును సృష్టించెను. ఆసృజింపఁబడిన జగత్తునందు వేఱొకఁడు అనఁగా జీవుఁడు మాయచేత నిర్బంధింపఁబడె నని యర్థమును శ్రుతి చెప్పుటచేత జగత్తులు సృజించినవాఁడు ఈశ్వరుం డని యెఱుంగ నగు.

అవ. ఇంతవఱకు చెప్పిన గ్రంథముచేత ఆనందమయకోశస్వరూపుఁ డగు ఈశ్వ రుఁడు జగత్తునకు కారణము అని స్పష్టపఱచి వానివలనఁ బ్రపంచోత్పత్తివిధమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆనందమయ ఈశోఽయం బహు స్యామిత్యవైక్షత,
హిరణ్యగర్భరూపోఽభూత్సుప్తిస్స్వప్నో యథా భవేత్. 198

వా. ఏవమానందమయేశ్వరస్య జగత్కారణత్వం ప్రతిపాద్య తస్మాజ్జగదుత్పత్తి ప్రకారమాహ—ఆనందమయఇతి. ఈక్షిత్వా చ హిరణ్యగర్భరూపోఽభూత్తస్మాద్వా ఏతస్మాదిత్యన్వయః. తత్ర దృష్టాంతమాహ—సుప్తిరితి.

టీ. ఆనందమయః = ఆనందమయకోశస్వరూపుఁడైన, అయం ఈశః = ఈ యీశ్వరుఁడు, బహు స్యామితి = విస్తారమగు ప్రపంచరూప మయ్యెద నని, అవైక్షత = చూచెను (సంకల్పించె ననుట) సుప్తిః = సుషుప్తి, స్వప్నః = స్వప్నరూపము, యథా = ఎట్లుగా, భవేత్ = అగునో (అట్లే యీశ్వరుండును), హిరణ్యగర్భరూపః = హిరణ్యగర్భుఁ డని పేరు గలవాఁడు, అభూత్ = ఆయెను.

తా. ఆనందమయకోశస్వరూపుఁ డైన ఈశ్వరుఁడు విస్తారముగా నయ్యెద నని సంకల్పించి సుషుప్త్యవస్థ స్వప్నముగా మాఱిన తెఱంగున హిరణ్యగర్భరూపుఁ డయ్యెను. ఈవిషయము సమష్టిలింగశరీరాభిమాని స్వరూపనిరూపణము చేయు సందర్భమున ప్రత్యక్తత్త్వ వివేకమునందు విశేషించి చెప్పియున్నాము గనుక గ్రంథవిస్తరభీతిచే నిట వ్రాయలేదు.

అవ. శ్రుతులలో కొన్నిచోట్ల ఒకదానితర్వాత నొకటి సృష్టింపఁబడినట్లును మఱికొన్నిశ్రుతులలో నొక్కమాఱుగనే సృష్టియైనట్లును భిన్నక్రమముగ అనఁగా పరస్పర విరుద్ధముగఁ జెప్పఁబడియెఁగదా! మే మేది నిజ మని గ్రహింపవలె? దేనిని విడువవలె నని ప్రశ్న రాఁగా నుభయమును గ్రహింప వలసినదే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. క్రమేణ యుగపద్వైషా సృష్టిర్జ్ఞేయా యథా శ్రుతి,
ద్వివిధశ్రుతిసద్భావా ద్ద్వివిధస్వప్నదర్శనాత్. 199

వా. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాదౌ క్రమేణ సృష్టి శ్రవణాత్ "ఇదగ్ం సర్వమసృజ" తేతి. యుగపచ్ఛ్రవణాచ్చ క స్యోపాదేయత్వం? కస్య వా హేయత్వ మిత్యాకాంక్షాయాం శ్రుతియుక్త్యుపేతత్వాదుభయం గ్రాహ్యమిత్యాహ—క్రమేణేతి. ఏషా జగత్సృష్టిర్ద్వివిధా శ్రుతిసద్భావాత్. క్రమేణ యుగపద్వా యథాశ్రుతి జ్ఞేయేతి యోజనా. తత్రోపపత్తి ర్ద్వివిధస్వప్నదర్శనాదితి. లోకే క్రమయుక్తస్య చాక్రమయుక్తస్య చ స్వప్నపదార్థజాతస్య దర్శనాదితి భావః.

టీ. ద్వివిధశ్రుతిసద్భావాత్-ద్వివిధ=రెండువిధములైన, శ్రుతి = వేదవాక్యముల యొక్క, సద్భావాత్=ఉండుటవలన, ద్వివిధస్వప్నదర్శనాత్-ద్వివిధ = రెండువిధములైన, స్వప్న=స్వప్నములయొక్క, దర్శనాత్=అనుభవ ముండుటవలన, ఏషా సృష్టిః=ఈ సృష్టి, క్రమేణ వా=ఒకదాని తర్వాత నొకటి యని గాని, యుగపద్వా = ఒక్కమాఱుగా పుట్టె నని గాని, యథాశ్రుతి=శ్రుతులలోఁ జెప్పఁబడినయట్లు, జ్ఞేయా=తెలిసికొనవలెను.

తా. శ్రు. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" సృష్టిక్రమమును నీశ్రుతి మొదలుకొని "ఆత్మవలన ఆకాశము పుట్టెను. ఆకాశమువలన వాయువు, వాయువువలన నగ్నియు, అగ్నివలన ఉదకంబును, ఉదకమువలన పృథివియు, పృథివివలన ఓషధులును, ఓషధులవలన నన్నంబును, అన్నమువలన పురుషుఁడును పుట్టె" నని ఇట్టియర్థమును బోధించుచు నొక శ్రుతి చెప్పినది. మఱియొక శ్రుతి "ఇదగ్ం సర్వ మసృజత" ఈసర్వప్రపంచమును సృష్టించెను అనెడి యర్థమును బోధించుచు సృష్టియంతయు నొక్కమాఱుగా జరిగినట్లు చెప్పినది. రెండును శ్రుతులే గనుక రెండు విధములును యథార్థములని మనము గ్రహింపవలయును. మన యనుభవములో స్వప్నము ఒకదానితర్వాత నొకటి వచ్చుటయు ఒకమాఱే స్వప్నమందు వస్తువులన్ని యగపడుటయుఁ జూచుచున్నారము గాన నుభయవిధమును గ్రహించుట యుక్తియుక్తముగా నున్నది" అని తెలియవలెను.

అవ. హిరణ్యగర్భునిస్వరూపమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. సూత్రాత్మా సూక్ష్మదేహాఖ్య స్సర్వజీవఘనాత్మకః,
సర్వాహంమానధారిత్వాత్క్రియాజ్ఞానాదిశక్తిమాన్. 200

వ్యా. హిరణ్యగర్భస్య స్వరూపం నిరూపయతి—సూత్రాత్మేతి. సూత్రాత్మా పటే సూత్రమివ జగత్యనుస్యూత ఆత్మా స్వరూపం యస్య సః సూక్ష్మదేహ ఇత్యాఖ్యా యస్య స తథావిధ స్సర్వజీవఘనాత్మక స్సర్వేషాం జీవానాం లింగశరీరోపాధికానాం ఘనాత్మక స్సమష్టిస్వరూపః. తత్ర హేతు స్సర్వాహం మానేతి. సర్వేషు వ్యష్టిలింగశరీరేషు అహంమానత్వాదితి భావః. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తిమాంశ్చ.

టీ. సూత్రాత్మ = సూత్రములు (దారములు) వస్త్రమందువలె జగంబులోపల వ్యాపించియున్నవాఁడు గనుక సూత్రాత్మ యనియు, సూక్ష్మదేహాఖ్యః = సూక్ష్మదేహ మనెడి పేరు గలిగినట్టియు, క్రియాజ్ఞానాదిశక్తిమాన్=క్రియాశక్తియు జ్ఞానశక్తియు

ఆదిశబ్దముచేత నిచ్ఛాశక్తియుం గలిగినట్టియు, సర్వాహంమానధారిత్వాత్ =సమస్తమైన లింగశరీరములయందు నభిమానము గలిగియుండుటవలన, సర్వజీవఘనాత్మకః-సర్వజీవ= లింగశరీరోపాధికు లగు సర్వజీవులయొక్క, ఘనాత్మకః = సమష్టిస్వరూపుఁడును, అగు చున్నాఁడు. హిరణ్యగర్భుఁ డనుట.

తా. సూక్ష్మదేహ మని పేరు గలిగిన లింగశరీరములయం దన్నింటి యందును అభిమానము గలిగి యిచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులు గలిగి వస్త్రమునం దంతటు దారములు వ్యాపించియుండులాగున జగత్తం తయు వ్యాపించినవాఁడు హిరణ్యగర్భుఁ డగును. ఇది హిరణ్యగర్భుని స్వరూపము.

అవ. హిరణ్యగర్భస్థితియందు జగత్తు స్ఫురించెడివిధంబును స్పష్టపఱచుటకు దృష్టాంతమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యూషే వా ప్రదోషే వా మగ్నో మందే తమస్యయం,
లోకో భాతి యథా తద్వ దస్పష్టం జగ దీక్ష్యతే. 201

వ్యా. హిరణ్యగర్భావస్థాయాం జగత్ప్రతీతౌ దృష్టాంతమాహ—ప్రత్యూష ఇతి. ప్రత్యూషః ఉషఃకాలః.

టీ. ప్రత్యూషే వా = ఉషఃకాలమునందుఁగాని, ప్రదోషే వా = (సాయంకాలము) ప్రదోష కాలమునందుఁ గాని, మందే = కొంచెముగా వ్యాపించిన, తమసి = చీఁకటియందుఁ గాని, మగ్నః=మునిఁగియున్న, అయం లోకః = ఈ లోకము, యథా= ఏప్రకారముగ, భాతి=ప్రకాశించుచున్నదో (కనఁబడుచున్నదో) తద్వత్ = ఆప్రకారమే, (హిరణ్యగర్భునియందు), జగత్ = లోకము, అస్పష్టం=అంతస్పష్టముగాఁ గనుపింపనిదై, ఈక్ష్యతే = చూడఁబడుచున్నది.

తా. సూర్యోదయము కాక పూర్వమును సూర్యాస్తమయమైన తరువాతను కొంచెము చీఁకటియున్నప్పుడు ఈలోక మంత స్పష్టముగాఁ గనుపింపనట్లు ఆహిరణ్యగర్భస్థితియందు లోకము అంతగా నభివ్యక్తము కానిదై యుండును.

అవ. అందఱికిని తెలియునట్టి దృష్టాంతమును నీశ్లోకమునందుఁ జెప్పి యీప్రకరణారంభమున రెండవశ్లోకమునఁ జెప్పిన ఘట్టితపటదృష్టాంతమును నిపుడు దెల్పుచున్నాఁడు:—

శ్లో. సర్వతో లాంఛితో మష్యా యథా స్యాద్ఘట్టితః పటః,
సూక్ష్మాకారైస్తథేశస్య వపుస్సర్వత్ర లాంఛితమ్. 202

వ్యా. ఏవం లోకప్రసిద్ధదృష్టాంతమభిధాయ, యథా ధౌత ఇతి పూర్వోక్త శ్లోకేఽభిహితం లాంఛితం పటం దృష్టాంతయతి—సర్వత ఇతి. యథా ఘట్టితః పటో మషీమయై రాకారవిశేషైర్లాంఛితో భవతి, తథా మాయిన ఈశ్వరస్య వపుః అపంచీకృత భూతకార్యైర్లింగశరీరం లాంఛితమిత్యర్థః.

టీ. ఘట్టితః=ఘట్టిత మనెడి స్థితిని బొందిన, పటః = వస్త్రము, మష్యా=మసితో (నల్లనియాకారముతో), సర్వతః = అంతటను, లాంఛితః = గుర్తులు గలిగియుండునది, యథా=ఏప్రకారము, స్యాత్ = అగునో, తథా = ఆప్రకారము, ఈశస్య = మాయోపాధికుం డగు నీశ్వరునియొక్క, వపుః = స్వరూపము, సూక్ష్మాకారైః=అస్పష్టములైన యాకారములతో, సర్వత్ర = అంతటను, లాంఛితం = గుర్తులు గలదిగాఁ జేయఁబడుచున్నది.

తా. రంగువేయువాఁడు వస్త్రముల పైన బొమ్మలయుద్ధకము చేయవలయు నని తెల్లని బట్టను దెచ్చి దానిని ముందుగా కరక్కాయల నీళ్లలోను కొంచెము గంజిలోను ముంచి ఘట్టనచేయును. ఆస్థితి ఘట్టిత మనఁబడును. అది యీశ్వరాకారస్థితికి దృష్టాంత మగును. ఘట్టిత మైన తర్వాత నావస్త్రము నెండ వైచి దాని మీఁద తాను వేయఁదలఁచిన బొమ్మలయాకారమును నల్లనిమసితో నొక గుర్తుగా చేయును. అది వస్త్రమునకు లాంఛితస్థితి యగును. అటులనే అపంచీకృతములైన పంచభూతకార్యములచేత గుఱుతు లేర్పడిన సమష్టిలింగశరీరోపాధికుఁడైన హిరణ్యగర్భుని యాకారము లాంఛిత మనఁబడుచున్నది.

అవ. అందఱికిని స్పష్టముగాఁ దెలియుటకు నింకొక దృష్టాంతమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. సస్యం వా శాకజాతం వా సర్వతోఽంకురితం యథా,
కోమలం తద్వదేవైష పేలవో జగదంకురః. 203

వ్యా. "బుద్ధ్యారోహాయ వైభవాత్" దృష్టాంతాంతరమాహ—సస్యం వేతి.

టీ. సస్యం వా = పైరుగాని, శాకజాతం వా = కూరదినుసులుగాని, సర్వతః = అంతట, అంకురితం సత్ =మొలిచి, యథా=ఏప్రకారముగా, కోమలం = కోమలముగా నుండునో, తద్వత్ = ఆప్రకారమే హిరణ్యగర్భునియందును, ఏషః జగదంకురః = ఈజగత్తనెడిమొలక, పేలవః = సూక్ష్మమై యుండునది, (భవతి = అగుచున్నది)

తా. ఒకచోట మడి చేసి వడ్లుగాని తోటకూరగింజలు బచ్చలి గింజలుగాని చల్లి దినము నీరు చల్లుచుండిన నది మొలిచి బహుకోమల ముగఁ గనఁబడెడివిధమున హిరణ్యగర్భునియందు జగత్తు సూక్ష్మరూప ముగా నంకురించి యుండును.

అవ. ఈప్రకారముగా సమష్టిలింగశరీరాభిమాని యగు హిరణ్యగర్భునిస్వరూప మును దెలిపి, సమష్టిస్థూలశరీరాభిమాని యగువిరాట్పురుషునిఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. ఆతపాభాతలోకో వా పటో వా వర్ణపూరితః,
సస్యం వా ఫలితం యద్వత్తథా స్పష్టవపుర్విరాట్. 204

వ్యా. ఏవం సూత్రాత్మస్వరూపం విశదీకృత్య తస్యైవావస్థాభేదం పంచీకృతభూత కార్యోపాధికం విరాజం దృష్టాంతత్రయేణ విశదయతి—ఆతపేతి.

టీ. ఆతపాభాతలోకో వా-ఆతప = ఎండచేత, ఆభాత = అంతటఁ బ్రకాశింపఁ జేయఁబడుచున్న, లోకో వా = లోకము గాని, వర్ణపూరితః-వర్ణ = అన్నిరంగులచేత, పూరితః = నిండింపఁబడిన, (పూర్తిగా రంగులు వేయఁబడిన) దనుట. పటో వా = చిత్తరువుబట్టగాని, ఫలితం = బాగుగా పండిన, సస్యం వా=పైరు గాని, (స్పష్టముగాఁ) యద్వత్ =ఏవిధముగాఁ గనఁబడునో, తథా=ఆవిధముగా, విరాట్ = విరాట్పురుషుఁడు, స్పష్టవపుః=స్పష్టమైనశరీరముగలవాఁడు, (భవతి=అగుచున్నాఁడు).

తా. సూర్యుఁ డుదయించి యెండ నలుదిక్కుల వ్యాపించినపుడు లోక మెట్లుండునో, బొమ్మలగుడ్డ రంగు లన్నియు నద్దఁబడినతర్వాత నెట్లుండునో, బాగుగా పండినతర్వాత పైరెట్లుండునో అట్లే విరాట్పురుషుఁడు స్పష్టముగా పంచీకృతపంచమహాభూతకార్యోపాధికుఁ డగుచు ప్రపంచస్వరూపముతో నొప్పుచున్నాఁడు.

అవ. విరాట్పురుషుఁ డీవిధముగా నున్నట్లభివర్ణింపఁబడినతావులను జెప్పు చున్నాఁడు:—

శ్లో. విశ్వరూపాధ్యాయ ఏష ఉక్తస్సూక్తే ఽపి పౌరుషే,
ధాత్రాది స్తంబపర్యంతా నేతస్యావయవాన్విదుః. 205

వ్యా. సూర్యోదయానంతరమాతపేన ప్రకాశితో లోకః ఆతపాభాతలోకః. తత్సద్భావే ప్రమాణమాహ—విశ్వరూపేతి. విశ్వరూపాధ్యాయాదౌ కీదృగూపమదిత మిత్యాకాంక్షాయాం బ్రహ్మాది స్తంబపర్యంతం జగత్తద్రూపముదితమిత్యాహ— ధాత్రాదీతి.

టీ. ఏషః = ఈ విరాట్పురుషుఁడు, విశ్వరూపాధ్యాయే=విశ్వరూపమును తెలిపిన గీతలయందలి పదునొకండవ యధ్యాయమునందును, పౌరుషే సూక్తేఽపి = పురుష సూక్తమునందును, ఉక్తః=తెలుపఁబడెను. ధాత్రాది స్తంబపర్యంతాన్ = బ్రహ్మదేవుఁడు మొదలుకొని గడ్డిపోచవఱకు నుండెడి భూతములను, ఏతస్య = ఈ విరాట్పురుషుని యొక్క, అవయవాన్ = అవయవములనుగా, విదుః=తెలిసికొనుచున్నారు.

తా. బ్రహ్మదేవుఁడు మొదలుకొని గడ్డిపోచవఱకు నుండెడు భూతజాతము లన్నియు నావిరాట్పురుషునిస్వరూప మగు నని గీతల యందు పదునొకండవ యధ్యాయమునను పురుషసూక్తంబునను జెప్పఁ బడియున్నది. విరాట్పురుషునివైభవ మంతయు శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడియున్న దనుట.

అవ. అంతర్యామి మొదలుకొని కుద్దాలకాదిపర్యంతముగల సర్వవస్తువులను నీశ్వరరూపముగా నర్చింపవచ్చు నని మూఁడు శ్లోకములలోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఈశసూత్రవిరాడ్వేధోవిష్ణురుద్రేంద్రవహ్నయః,
విఘ్నభైరవమైరాళమారికాయక్షరాక్షసాః. 206

శ్లో. విప్రక్షత్రియవిట్ఛూద్రాగవాశ్వమృగపక్షిణః,
అశ్వత్థవటచూతాద్యా యవవ్రీహితృణాదయః. 207

శ్లో. జలపాషాణమృత్కాష్ఠవాస్యాకుద్దాలకాదయః,
ఈశ్వరాస్సర్వ ఏవైతే పూజితాః ఫలదాయినః. 208

వ్యా. ఏతావతా ప్రకృతే కిమాయాతమిత్యాశంక్యాంతర్యామిప్రభృతి కుద్దాలకాదిపర్యంతం వస్తుజాతం ప్రత్యేకమీశ్వరత్వేన పూజ్యతా మిత్యాహ—ఈశేత్యాది శ్లోకత్రయేణ.

టీ. ఈశసూత్రవిరాడ్వేధోవిష్ణురుద్రేంద్రవహ్నయః - ఈశ = అంతర్యామియు, సూత్ర=హిరణ్యగర్భుఁడును, విరాట్=విరాట్ పురుషుఁడును, వేధః=చతుర్ముఖబ్రహ్మయు, విష్ణు=విష్ణుమూర్తియు, రుద్ర=శివుఁడును, ఇంద్ర=దేవేంద్రుఁడును, వహ్నయః = అగ్నిదేవుఁడును, విఘ్నభైరవమైరాళమారికాయక్షరాక్షసాః - విఘ్న = విఘ్నేశ్వరుఁడును, భైరవ = భైరవుండును, మైరాళ = మైరాళుఁడును, మారికా = మారియు, యక్ష = యక్షులును, రాక్షసాః = రాక్షసులును, విప్రక్షత్రియవిట్ఛూద్రాః - విప్ర=బ్రాహ్మణులును, క్షత్రియ = రాజులును, విట్ = వైశ్యులును, శూద్రాః = శూద్రులును, గవాశ్వమృగపక్షిణః-గో = గోవులును, అశ్వ = గుఱ్ఱములును, మృగ = సింహాము

లోనుగాఁగలమృగంబులును, పక్షిణః = గరుత్మంతుఁడు మొదలైనపక్షులును, అశ్వత్థవట చూతాద్యాః - అశ్వత్థ = రావిచెట్లును, వట = మఱ్ఱిచెట్లును, చూతాద్యాః = మామిడి తులసి వేప మొదలైనచెట్లును, యవవ్రీహితృణాదయః-యవ = యవలు గోధుమలు మొదలైనవియు, వ్రీహి = వడ్లును, తృణాదయః = గడ్డిమొదలైనవియు, జలపాషాణ మృత్కాష్ఠవాస్యాకుద్దాలకాదయః - జల = ఉదకంబును, పాషాణ = పాషాణమును, మృత్ = మట్టియు, కాష్ఠ = కొయ్యలును, వాస్యా = ఉలి చేబాడిస మొదలగుపని ముట్లును, కుద్దాలకాదయః = గొడ్డలి ఖడ్గము మొదలైన ఆయుధములును, ఏతే సర్వే= ఇవి అన్నియు, ఈశ్వరా ఏవ = ఈశ్వరస్వరూపములుగనే, పూజితాస్సంతః=పూజింపఁ బడిన వగుచు, ఫలదాయినః = వారి వారి యభీష్టముల నిచ్చుచున్నవి.

తా. అంతర్యామి మొదలుగ తృణపర్యంతముగ గల దృశ్య ప్రపంచములోని సర్వవస్తువులును ఈశ్వరస్వరూపమే కనుక వీనిలో నేవస్తువును బూజించినను ఈశ్వరునిఁ బూజించినట్లే యగుచు వారి వారి యభీష్టసిద్ధి యగు నని భావము.

అవ. శ్రు. "తం యథా యథోపాసతే తథైవ భవతి"అనెడి శ్రుతిప్రమాణమును బట్టి పూజించుచున్నా రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యథా యథోపాసతే తం ఫల మీయు స్తథా తథా,
ఫలోత్కర్షాపకర్షౌ తు పూజ్య పూజానుసారతః. 209

వ్యా. "తం యథా యథోపాసతే తథైవభవ"తీతి శ్రుతిః. తత్తత్పూజాత స్తత్ఫల సద్భావే ప్రమాణమిత్యాహ—యథా యథేతి.నను సర్వేషామీశ్వరత్వే ఫలవైషమ్యం కుత ఇత్యాశంక్య పూజ్యానామధిష్ఠానానాం పూజనానామర్చాదీనాం చ సాత్త్వికాది భేదేన వైషమ్యమిత్యాహ—ఫలోత్కర్షేతి.

టీ. తం = ఆపరమేశ్వరుని, యథా యథా = ఎవ్వ రెవ్వరు ఏ యేవిధముగ, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తథా తథా=వారు వారు ఆయావిధమైన, ఫలం= లాభమును, ఈయుః = పొందెదరు. ఫలోత్కర్షాపకర్షౌ తు - ఫల = లాభముయొక్క, ఉత్కర్ష = ఆధిక్యమును, అపకర్షౌతు = న్యూనతయు (తారతమ్య మనుట.) పూజ్య పూజానుసారతః-పూజ్య = పూజింపఁబడెడి వస్తువులయొక్కయు, పూజా = పూజించెడి విధములయొక్కయు, అనుసారతః=తగినట్టుగా, (భవతి=కలుగుచున్నది.)

తా. ఎవ్వ రెవ్వరు పైనఁ జెప్పఁబడిన దేవతాదులను ఏయేవిధ ముగ నుపాసించెదరో అట్టివారు ఆయాలాభములను పొందుదు రని

"తం యథా యథోపాసతే" ఇత్యాది శ్రుతికి నర్థము. ఇఁక వారు వారు పొందెడు లాభములలో న్యూనాధికతలు గలుగుటకు నాయామూర్తి తారతమ్యమును బట్టియు, పూజించెడువారు చేయునట్టి పూజాతారతమ్యమునుబట్టియు కారణ మేర్పడుచున్నది.

అవ. ముక్తి యెట్లు లభించును అనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ముక్తిస్తు బ్రహ్మతత్త్వజ్ఞానాదేవ న చాన్యథా,
స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే యథా. 210

వ్యా. సాంసారికఫలసిద్ధిరేవం భవతు. ముక్తిః కస్యోపాసనాద్భవతీత్యాశంక్య జ్ఞానవ్యతిరేకేణ న కేనాపి భవతీత్యాహ—ముక్తిరితి. తత్ర దృష్టాంతమాహ—స్వప్రబోధమితి. స్వజాగరణమంతరేణ స్వనిద్రాకల్పితస్వప్నో యథా న నివర్తతే, తథా బ్రహ్మతత్త్వజ్ఞానమంతరేణ తదజ్ఞానకల్పితస్స్వసంసారో న నివర్తత ఇతి భావః.

టీ. ముక్తిస్తు = ముక్తి యన్ననో (జన్మరాహిత్యమన్ననో,) బ్రహ్మతత్త్వజ్ఞానాదేవ-బ్రహ్మతత్త్వ = అద్వితీయమైనట్టియు, ప్రత్యగభిన్నమైనట్టియు పరబ్రహ్మస్వరూపముయొక్క, జ్ఞానాదేవ=జ్ఞానమువలననే (భవతి=కలుగుచున్నది.) అన్యథా=వేఱొకవిధముగా, న చ=మోక్షము కలుగదు. స్వస్వప్నః-స్వ=తనకుఁ గలిగిన, స్వప్నః = కల, స్వప్రబోధం వినా=మేలుకొనుట లేక, యథా=ఏవిధముగా, నైవ హీయతే=నివర్తింపదో (ఆవిధముగా బోధవలననే ముక్తి కలుగు ననుట.)

తా. నిద్రించువానికి వచ్చినకలలు మేలుఁకువ రానిది యెట్లు పోఁజాలవో, జీవునకు అజ్ఞానవశంబునఁ గలిగిన సర్వబంధములును తత్త్వజ్ఞానమువలననే తొలంగు నని భావము.

అవ. ద్వైతప్రపంచ మంతయు స్వప్నమువంటిది దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వితీయబ్రహ్మతత్త్వే స్వప్నోఽయమఖిలం జగత్,
ఈశజీవాదిరూపేణ చేతనాచేతనాత్మకమ్. 211

వ్యా. నను ద్వైతనివృత్తిలక్షణాయా ముక్తేః స్వప్నదృష్టాంతేన తత్త్వబోధసాధ్యత్వాభిధానమనుపపన్నం. నివర్త్యస్య ద్వైతస్య స్వప్నతుల్యత్వాభావాదిత్యాశంక్యాన్యథా గ్రహణరూపత్వేన స్వప్నతుల్యత్వమస్త్యేవ. "త్రయమేతత్సుసుప్తం స్వప్నమాయామాత్ర" మితి శ్రుత్యాభిహితత్వాన్నైవ మిత్యాహ—అద్వితీయేతి. ఈశజీవాది రూపేణ వర్తమానం చేతనాత్మకం యదఖిలం జగదస్త్యయమద్వితీయబ్రహ్మతత్త్వే స్వప్న ఇతి యోజనా.

టీ. చేతనాచేతనాత్మకం - చేతన = చైతన్యరూపమైనట్టియు, అచేతనాత్మకం= జడరూపమైనట్టియు, ఈశజీవాదిరూపేణ = ఈశ్వరుఁడును జీవుఁడును మొదలుగాఁగలిగిన స్వరూపముతో వర్తించెడి, అఖిలం = సమస్తమైన, జగత్=ప్రపంచము, అద్వితీయబ్రహ్మతత్వే - అద్వితీయ = ద్వైతరహితమైన (తనకంటె భిన్నవస్తువు లేని) బ్రహ్మతత్వే=బ్రహ్మస్వరూపమునందు, అయం=ఈ ద్వైతప్రపంచము, స్వప్నః = స్వప్నము, (భవతి = అగుచున్నది).

తా. ఈశ్వరుఁడు జీవుఁడు మొదలగు స్వరూపముతో వర్తించుచు చేతనాచేతనరూపమైన యీద్వైతప్రపంచమంతయు ఆయద్వితీయపరబ్రహ్మతత్వమునందు స్వప్నమై యున్నది. అనఁగా నీద్వైతప్రపంచము వాస్తవముగా లేదని భావము.

అవ. జీవేశ్వరులు అద్వితీయబ్రహ్మముకంటె భిన్నులు గానిచో, ద్వైతప్రపంచము లోనివారుగా నేల చెప్పఁబడిరి యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆనందమయవిజ్ఞానమయావీశ్వరజీవకౌ,
మాయయా కల్పితావేతౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్. 212

వ్యా. నన్వీశజీవయోర్బ్రహ్మాభిన్నయోః కథం జగదంతః పాతిత్వమిత్యాశంక్య తయోర్మాయాకల్పితత్వేన జగదంతఃపాతిత్వమిత్యాహ—ఆనందమయేతి.

టీ. ఆనందమయవిజ్ఞానమయౌ = ఆనందమయకోశ విజ్ఞానమయకోశ స్వరూపులైన, ఈశ్వరజీవకౌ=ఈశ్వరజీవులు, ఏతౌ=ఈ యిరువురును, మాయయా=మాయచేత, కల్పితౌ=కల్పింపఁబడిరి. తాభ్యాం=వారిరువురిచేత, సర్వం = ప్రపంచమంతయు, ప్రకల్పితం = కల్పింపఁబడినది.

తా. ఈజగత్తంతయు మాయాకల్పితులైనట్టి ఆనందమయ విజ్ఞానమయకోశస్వరూపు లగు నీశ్వరజీవులచేతనే కల్పింపఁబడినది గనుక జగత్తులోఁ జేర్చి చెప్పఁబడిరి.

అవ. ఎవనిచేత నేది కల్పింపఁబడినదియు నిరూపించుచున్నాఁడు:—

శ్లో. ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా,
జాగ్రదాదివిమోక్షాంతః సంసారో జీవకల్పితః. 213

వ్యా. తాభ్యాం సర్వం కల్పితమిత్యుక్తం. తత్ర కేన కియత్కల్పిత మిత్యాకాంక్షాయామాహ—ఈక్షణాదీతి. "స ఐక్షత లోకాన్నుసృజా" ఇత్యాదికయా "ఏతయా

ద్వారాప్రాపద్యతే"త్యంతయా శ్రుత్యా ప్రతిపాదితసృష్టిరీశ్వరకర్తృకా. "తస్యత్రయ ఆవసథా" ఇత్యాదికయా "స ఏతమేవ పురుషం బ్రహ్మతతమపశ్య" దిత్యంతయా శ్రుత్యా ప్రతిపాదితస్సంసారో జీవకర్తృక ఇత్యర్థః.

టీ. ఈక్షణాది ప్రవేశాంతా-ఈక్షణ = సంకల్పమే, ఆది = మొదలుగాఁగలిగినట్టియు, ప్రవేశ = ప్రవేశమే, అంతా = అవసానముగాఁ గలిగినట్టియు, సృష్టిః = సృష్టి, ఈశేన = ఈ మాయోపాధికుఁడైన యీశ్వరునిచేత, కల్పితా=కల్పింపఁబడినది. జాగ్రదాది విమోక్షాంతః-జాగ్రత్ = జాగ్రదవస్థ, ఆది = మొదలుగాఁ గలిగినట్టియు, విమోక్ష=విదేహకైవల్యమే, అంతః = అవసానముగాఁ గలిగినట్టియు, సంసారః=సంసారము, జీవకల్పితః = జీవునిచేత కల్పింపబడినది.

తా. ఛాందోగ్యోపనిషత్తునందు శ్రు. "స ఐక్షత లోకాన్ను సృజా ఇతి" అనెడి శ్రుతి మొదలుకొని శ్రు. "ఏతయా ద్వారా ప్రాపద్యత" అనువఱకుఁ జెప్పఁబడినసృష్టి ఈశ్వరునివలన కలిగె ననియు, శ్రు. "త్రయ ఆవసథా" అని ప్రారంభించి శ్రు. "స ఏత మేవ పురుషం బ్రహ్మతత మపశ్యత్" అనుదానివఱకు చెప్పఁబడిన సంసారము జీవునివలనఁ గలిగె ననియుఁ దెలియ నగును.

అవ. బ్రహ్మ మొక్కటి మాత్రమే సత్యమై యుండ జీవేశ్వరులనుగుఱించి వాదు లెందుకు వివాదపడుచున్నారు అని శంకించి యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వితీయం బ్రహ్మతత్త్వమసంగం తన్న జానతే,
జీవేశయోర్మాయికయో ర్వృథైవ కలహం యయుః. 214

వ్యా. నను బ్రహ్మణ ఏవ పారమార్థికత్వే వాదినాం జీవేశ్వరతత్వవిషయా విప్రతిపత్తిః కుత ఇత్యాశంక్య శ్రుతిసిద్ధతత్త్వజ్ఞానశూన్యత్వాహ—అద్వితీయమితి.

టీ. అద్వితీయం = తనకంటె భిన్నవస్తువు లేనట్టియు, అసంగం = దేనితో నంటునిదియు నైన, తత్ బ్రహ్మతత్వం = ఆ నిర్గుణస్వరూపమున, న జానతే = (వాదులు) గుర్తెఱుంగరు. మాయికయోః = మాయచేత కల్పితులైన, జీవేశయోః=జీవేశ్వరులవిషయమున, వృథైవ=నిరర్థకముగనే, కలహం=కలహమును, యయుః = పొందుచున్నారు.

తా. "వివేకశూన్యు లగుచుఁ గొందఱు జీవుఁ డిట్టివాఁడను ఈశ్వరుఁ డట్టివాఁడు" అనుచు నేవేవో లేనిపోని యుక్తులను బన్ని శుష్కవాదములు చేయుచుందురు. జీవేశ్వరు లిద్దఱును మాయా

కల్పితములే యనియు, నిర్గుణపరబ్రహ్మ మొక్కటియే అద్వితీయము నసంగము నగు ననియు నెఱుంగక వివాదపడుచున్నారు.

అవ. వాదులు వివేకము లేక జీవేశ్వరులను గుఱించి కలహించుచుండిన మీ రేల వారింపరా దని శంకించి యుత్తర మిచ్చుచున్నాఁడు:—

శ్లో. జ్ఞాత్వా సదా తత్త్వనిష్ఠా న తు మోదామహే వయం,
అనుశోచామ ఏవాన్యాన్న భ్రాన్తై ర్వివదామహే. 215

వ్యా. జీవేశ్వరవిషయాయా వాదివిప్రతిపత్తేరజ్ఞానమూలత్వే తథావిధత్వం తే కిం న బోధనీయా ఇత్యాశంక్య వృథాశ్రమత్వాన్నేత్యాహ— జ్ఞాత్వేతి.

టీ. తత్వనిష్ఠాః=బ్రహ్మనిష్ఠులగు, వయం=మేము, సదా = ఎల్లప్పుడును, జ్ఞాత్వా తు=తత్త్వమును తెలిసియుండియు, న మోదామహే=సంతోషించుట లేదు, అన్యాన్= ఇతరులను గూర్చి (అజ్ఞానులఁ గూర్చి), అనుశోచామ ఏవ = విచారపడుచునే యున్నారము. భ్రాన్తైః=అజ్ఞానులతో, న వివదామహే = కలహింపఁబూనము.

తా. ఎల్లప్పుడును బ్రహ్మనిష్ఠులమై సంతసింపక అజ్ఞానులస్థితిని దలంచి విచారించుచునే యున్నారము కాని యాయజ్ఞానులతో వాదమునకుఁ జొఱము.

అవ. అట్లు పలువిధంబుల నజ్ఞానముచే ననాత్మవాదము చేసెడువారిని తెలుపుచున్నాఁడు:—

శ్లో. తృణార్చకాదియోగాంతా ఈశ్వరే భ్రాంతిమాశ్రితాః,
లోకాయతాదిసాంఖ్యాంతా జీవే విభ్రాంతిమాశ్రితాః. 216

వ్యా. ఈశ్వరే జీవే చ భ్రాన్త్యా విప్రతిపన్నాన్వాదినో విభజ్య దర్శయతి— తృణేతి.

టీ. ఈశ్వరే = పరమేశ్వరునివిషయమై, తృణార్చకాదియోగాంతాః = గడ్డి పోచను పూజించువారు మొదలుకొని యోగులవఱకును, భ్రాంతిం = పొరపాటును, ఆశ్రితాః = పడినవారు. జీవే = జీవునివిషయమున, లోకాయతాదిసాంఖ్యాంతాః = లోకాయతులు మొదలగు సాంఖ్యులవఱకును, విభ్రాంతిం = విశేషమైన పొరపాటును, ఆశ్రితాః = పొందియున్నారు.

తా. ఈచెప్పఁబడిన వాదులలో ఈశ్వరునివిషయమున గడ్డిని బూజించువారు మొదలు యోగులవఱకును నందఱు పొరపడినవారే.

లోకాయతులు మొదలు సాంఖ్యులవఱకును జీవునివిషయమునఁ జాల పొరపడియున్నవారలే. జీవేశ్వరుల నిర్ధారణవిషయమునఁ నందఱును నిప్పులోఁ గాలు వైచియున్నవారే యని భావము.

అవ. ఎవ్వఁడైన నొక్కఁడు పొరపాటుపడుమ గాని యందఱిని పొరపడి రనుట పొరపాటు గదా. ఒకవేళ పొరపడి రనుకొందము. అందువలన నేమి నష్టము అను ప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వితీయబ్రహ్మతత్త్వం న జానంతి యదా తదా,
భ్రాంతా ఏవాఖిలాస్తేషాం క్వ ముక్తిః క్వేహ వా సుఖమ్. 217

వ్యా. కుతో భ్రాంతత్వం తేషా మిత్యత ఆహ—అద్వితీయేతి.తతః కిం తత్రాహ—తేషామితి. పరిగృహీతపక్షప్రతిపాదనాభినివేశేన చిత్తవిశ్రాంత్యభావాత్ నైహికమపి సుఖం తేషామి త్యాహ—క్వేహ వేతి.

టీ. యదా = ఎప్పుడు, అద్వితీయబ్రహ్మతత్త్వ = అద్వితీయమైన పరబ్రహ్మ స్వరూపమును, న జానంతి=గుర్తెఱుంగరో, తదా = అప్పుడు, అఖిలాః = అందఱును, భ్రాంతా ఏవ=భ్రాంతులే యగుచున్నారు. తేషాం = వారికి (అజ్ఞానులకు), ముక్తిః= మోక్షము, క్వ = ఎక్కడిది ? లే దనుట. ఇహ = ఈలోకమునందును, సుఖంవా = సంతోషమైనను, క్వ = ఎక్కడిది ?

తా. అద్వితీయబ్రహ్మతత్త్వము నెఱుంగనివా రందఱును భ్రాంతులే యగుదురు. అట్టి అజ్ఞానులకు నిహపరలోకములయందును సుఖము లేదు. జన్మరాహిత్య మన్ననో మొదలే లే దని వేఱుగా చెప్ప నక్కఱ లేదు.

అవ. అజ్ఞానులకు సుఖ మెంతమాత్రము లే దని తీసివేయఁగూడదు. కొందఱికి విద్యలచేతను, కొందఱికి ధనముచేతను, కొందఱికి సంతానముచేతను, కొందఱికి అధికారముచేతను సుఖము కలిగియున్నట్లు చూచుచున్నా మందువేని, యది సుఖ మని బ్రహ్మవిదు లనుకొన రని దృష్టాంత పూర్వకముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉత్తమాధమభావశ్చేత్తేషాం స్యా దస్తు తేన కిం,
స్వప్నస్థరాజ్యభిక్షాభ్యాం న బుద్ధ స్స్పృశ్యతే ఖలు. 218

వ్యా. నను తేషాం బ్రహ్మవిద్యాభావే ఽపీతరవిద్యా ప్రయుక్త ఉత్తమాధమ భావో దృశ్యతే. ఉత్తమత్వప్రయుక్తం సుఖం కేషాం చిత్స్యాదిత్యాశంక్య తస్య ముముక్షుభిరనాదరణీయత్వం దృష్టాంతేనాహ—ఉత్తమాధమేతి.

టీ. తేషాం = ఆవాదములలో, ఉత్తమాధమభావః = ఉత్తమత్వమును అధమత్వమును, స్యాచేత్ = ఉండునేని, అస్తు = ఉండుఁగాక, తేన = దానితో, కిం = ఏమి ప్రయోజనము? ప్రయోజనము లేదనుట. స్వప్నస్థరాజ్యభిక్షాభ్యాం - స్వప్నస్థ=కలలో నుండిన, రాజ్య = రాజ్యముచేతను, భిక్షాభ్యాం = భిక్షాటనముచేతను, బుద్ధః=మేలుకొనినవాఁడు, న స్పృశ్యతే ఖలు = స్పృశింపఁబడఁడు గదా.

తా. విద్యాధనాదులచేత వారలు ఉత్తమాధమభావము గలదని తలంచినఁ దలంతురు గాక. దానివలన చిత్తవిశ్రాంతిరూపమైన ప్రయోజన మగపడదు. ఎట్లు లనఁగా కలలో రాజ్యము చేసినను భిక్ష మెత్తినను మేలుకొనినతర్వాత నా కల గనిన వానికి రాజ్యము చేసితి నన్న సుఖము లేదు, భిక్ష మెత్తితి నన్న దుఃఖమును లేదు అని సర్వజనవిదితమే కదా. కనుక నట్టియుత్తమాధమభావమును ముముక్షువులు లెక్కచేయరు.

అవ. చిత్తవిశ్రాంతిహేతువు లేమిఁజేసి ముముక్షువులు దానిని గణింప రనుచున్నాఁడు:—

శ్లో. తస్మాన్ముముక్షుభి ర్నైవ మతి ర్జీవేశవాదయోః,
కార్యా కింతు బ్రహ్మతత్త్వం విచార్యం బుధ్యతాం చ తత్. 219

వ్యా. జీవేశ్వరవాదయో ర్ముక్తిహేతుత్వాభావాన్న ముముక్షుభి స్తత్ర మతిర్నివేశ నీయే త్యుపసంహరతి—తస్మాదితి. తర్హి కిం కర్తవ్య మిత్యాశంక్య శ్రుతివిచారేణ బ్రహ్మ బోధ ఏవ కర్తవ్య ఇత్యాహ—కింత్వితి.

టీ. తస్మాత్ = ఆహేతువువలన, ముముక్షుభిః = మోక్షకాములచేత, జీవేశయోః = జీవేశ్వరవాదములయందు, మతిః = బుద్ధి, కార్యా = చేయఁదగినది,నైవ= కానేకాదు. (ఉంచఁగూడ దనుట). కింతు = ఇఁక నేమి యనఁగా, బ్రహ్మ తత్త్వం = అద్వితీయ మగు పరబ్రహ్మస్వరూపము, విచార్యం=విచారణచేయఁదగినది. తత్ = అట్టి బ్రహ్మస్వరూపము, బుధ్యతాం చ = నిత్యాపరోక్షమైనట్లు తెలియవలసియున్నది.

తా. మోక్షమందు కాంక్షయము గలవారు జీవేశ్వరులవాదములతో వృథా కాలక్షేపములు చేయక యెల్లప్పుడును ఉపనిషద్వేద్య మగు నద్వితీయబ్రహ్మతత్త్వమును విచారణచేసి యట్టిబ్రహ్మతత్త్వమును అపరోక్షస్వరూపముగా నెఱుంగునది.

అవ. బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకు జీవేశ్వరులస్వరూపమును నివారింపఁ జనదా యందువేని, మంచిది. అట్టి విచారణమును బ్రహ్మస్వరూపముదనుక చేయవలసిన దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. పూర్వపక్షతయా తౌ చేత్తత్త్వనిశ్చయ హేతుతాం,
ప్రాప్నుతోఽస్తు నిమజ్జస్వ తయోర్నైతావతా వశః. 220

వ్యా. నను బ్రహ్మతత్త్వనిశ్చయాయ తయోస్స్వరూపం హేయత్వేన జ్ఞాతవ్య మిత్యాశంక్య తథాత్వే జీవేశవాదయోరేవ బుద్ధిర్న పరిసమాపనీయేత్యాహ—పూర్వ పక్షతయేతి. ఏతావతా పూర్వపక్షతయా తత్త్వనిర్ణయహేతుత్వసంభవేన తయోర్జీ వేశవాద యోరేవావశో వివేకజ్ఞానశూన్యో న నిమజ్జస్వేతి యోజనా.

టీ. పూర్వపక్షతయా = పూర్వపక్షభావముచేత, తౌ=ఆజీవేశ్వరులను, (విచార యేత్) చేత్ = విచారించెడిపక్షమున, తత్త్వనిశ్చయహేతుతాం - తత్వనిశ్చయ = బ్రహ్మస్వరూపనిశ్చయముయొక్క, హేతుతాం = కారణత్వమును, ప్రాప్నుతః=పొందు నట్టి నీకు, అస్తు = ఉపయోగమగుఁగాక. ఏతావతా = ఇట్టివిచారణచేత, తయోః = ఆజీవేశ్వరవాదములందు, వశస్సన్ = తన్మయుఁడ వగుచు, న నిమజ్జస్వ = మునిఁగి పోకుము.

తా. జీవేశ్వరులస్వరూపమును పూర్వపక్షములచేత విచారిం చుట బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకే యందువా? ఆజీవేశ్వర వాదములలోనే తన్మయుఁడవై మునిఁగిపోకుము. బ్రహ్మస్వరూపము దనుక వివేకముతో విచారించుము.

అవ. ఇప్పుడు వాది పూర్వపక్షమును (ఆక్షేపణము) చేయుచున్నాఁడు:—

శ్లో. అసంగచిద్విభు ర్జీవ స్సాంఖ్యోక్త స్తాదృగీశ్వరః,
యోగోక్తస్తత్త్వమో రర్థౌ శుద్ధౌ తావితి చేచ్ఛృణు. 221

వ్యా. నను సాంఖ్యయోగశాస్త్రోక్త యోర్జీవేశయోశ్శుద్ధచిద్రూపత్వేన భవద్భిర ప్యుపాదేయత్వాన్న తయోః పూర్వపక్షత్వమితి శంకతే. అసంగచిదితి. సాంఖ్యయోగ శాస్త్రోక్తయోర్జీవేశయోశ్శుద్ధచిద్రూపత్వేఽపి తయోర్వాస్తవభేదస్య త్వైరంగీకారాన్నా యమస్మత్సిద్ధాంత ఇత్యాహ—శృణ్వితి.

టీ. జీవః = జీవుఁడు, అసంగచిత్ = అసంగచిద్రూపుఁడును, విభుః = వ్యాప కుఁడును, ఈశ్వరః = ఈశ్వరుఁడును, తాదృక్ = అట్టివాఁడుగా, (అసంగచిద్రూపుఁ డును, వ్యాపకుఁడును అనుట), సాంఖ్యోక్తః=సాంఖ్యులచేత చెప్పఁబడెను. యోగోక్తః=

యోగులచేతను చెప్పఁబడెను. తౌ = ఆయీాశ్వర జీవు లిద్దఱును, తత్త్వమోః = తత్ప దముయొక్కయు, త్వంపదముయొక్కయు, అర్థౌ = అర్థమగుదు రనియు, శుద్ధౌ = పరి శుద్ధు లగుదు రనియు, ఇతి చేత్ = ఈవిధముగా నంటివేని, శృణు = సమాధానము చెప్పుచున్నాను వినుము.

తా. సాంఖ్యులును యోగులును, జీవేశ్వరు లిరువురిని చిద్రూపులుగను వ్యాపకులుగను శుద్ధులుగను తత్త్వంపదార్థముల కర్థమైన వారుగను చెప్పుచున్నారు గనుక నాసాంఖ్యయోగమతములను ఖండింపక అద్వైతు లగు మీరు అంగీకరింపఁ డందువేమో చెప్పెద వినుము.

శ్లో. న తత్త్వయోరుభా వర్థా వస్మత్సిద్ధాంతతాం గతౌ,
అద్వైతబోధనాయైవ సా కక్షా కాచి దిష్యతే. 222

వ్యా. న తత్త్వయోరితి. తత్త్వంపదయోరుభా వర్థావస్మత్సిద్ధాంతత్వం న గతా వితి యోజనా. నను, కూటస్థబ్రహ్మశబ్దాభ్యాం శుద్ధౌ తత్త్వంపదార్థా భవద్భిరపి భిన్నౌ నిరూపితావిత్యాశంక్యాహ—అద్వైతబోధనాయైవేతి.

టీ. తత్త్వమోః = తత్పదముయొక్కయు, త్వంపదముయొక్కయు, అర్థౌ = అర్థమైన, ఉభౌ = జీవేశ్వరు లిరువురు, అస్మత్సిద్ధాంతతాం = మాసిద్ధాంతస్వరూప మును, న గతౌ = పొందినవారు కారు. సా కక్షా = ఆపక్షము, కాచిత్ = కొంతవఱ కును, అద్వైతబోధనాయైవ - అద్వైత = తత్త్వంపదార్థముల కైక్యమును, బోధనా యైవ = బోధించుటకే, ఇష్యతే = కొంతవఱకు మాచేత నంగీకరింపఁబడినది.

తా. మాయద్వైతసిద్ధాంతమున తత్త్వంపదార్థస్వరూపులైన జీవేశ్వరులు భిన్ను లని నిత్యు లని యంగీకరింపము. బ్రహ్మతత్త్వ మొక్కటియే పరమార్థస్వరూప మగును. అట్టి యద్వైతబ్రహ్మతత్త్వ మును తెలుపుటకు కొంతవఱకు నాపక్షమును చెప్పితిమి.

అవ. అయితే తత్త్వంపదార్థవిచారణ యేల చేసెద రంటిరా చెప్పెద వినుఁడు. అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అనాదిమాయయా భ్రాంతా జీవేశౌ సువిలక్షణౌ,
మన్యంతే తద్వ్యుదాసాయ కేవలం శోధనం తయోః. 223

వ్యా. లోకప్రసిద్ధభేదనిరాసద్వారా తదైక్యప్రతిపాదనాయైవ తా భేదేనా నూదితౌ, న తు తయోర్భేదః ప్రతిపాద్యత ఇతి భావః. తర్హి పదార్థశోధనం కిమిత్యా

వ్యా—అనాదీతి. అత్ర మాయాశబ్దేన స్వాశ్రయవ్యామోహికా అవిద్యా లక్ష్యతే. తయా విపరీతజ్ఞానం ప్రాప్తాం కర్తృత్వాదిమత్త్వం జీవస్య సర్వజ్ఞత్వాదిగుణయోగిత్వం చేశ్వరస్య పారమార్థికం మన్యంతే. అతస్తన్నివృత్త్యర్థమేవ శోధనం క్రియత ఇత్యర్థః.

టీ. అనాదిమాయయా = అనాదియైనమాయచేత, భ్రాంతాః = భ్రాంతినొందినవారు, జీవేశ్వరౌ=జీవేశ్వరు లిద్దఱును, సువిలక్షణౌ = యథార్థముగా భేదము గలవా రని, మన్యంతే = అభిప్రాయపడుచున్నారు; తద్వ్యుదాసాయ-తత్ = ఆజీవేశ్వర భేదము యొక్క, వ్యుదాసాయ = నివృత్తికొఱకు, తయోః = ఆజీవేశ్వరులయొక్క శోధనం = పరిశోధనము, కేవలం = ముఖ్యమైనది, (భవతి = అగుచున్నది.)

తా. తనకు ఆశ్రయమైన వస్తువును మోహింపఁజేయునది అవిద్య. అట్టి అవిద్యచేత జనులు విపరీతజ్ఞానవంతు లగుచు, జీవునకు కర్తృత్వాదిధర్మములును, ఈశ్వరునకు సర్వజ్ఞత్వాదిగుణయోగిత్వమును పారమార్థిక మని తలంచుచున్నారు. ఆకారణమువలన నట్టి జనులకుఁ గల విపరీతజ్ఞానము నివర్తించుటకొఱకే ఆతత్త్వంపదార్థముల యొక్క శోధనమును మేము ముఖ్యముగాఁ జెప్పితిమి.

అవ. జీవేశ్వరులశోధనము చేయుటయం దిదివఱకు చెప్పిన దృష్టాంతమును జ్ఞాపకము చేయుచున్నాఁడు:—

శ్లో. అత ఏవాత్ర దృష్టాంతో యోగ్యః ప్రాక్సమ్యగీరితః,
ఘటాకాశమహాకాశజలాకాశాభ్రఖాత్మకః. 224

వ్యా. పదార్థశోధనప్రకారమేవ దిదర్శయిషుస్తదుపాయత్వేన పూర్వోక్తదృష్టాంతం స్మారయతి—అత ఏవేతి. యతః పదార్థశోధనం కర్తవ్యమత ఏవేత్యర్థః.

టీ. అతఏవ=ఇందువల్లనే, అత్ర=ఈ జీవేశ్వరపదార్థశోధనవిషయమై, యోగ్యః= తగిన, ఘటాకాశమహాకాశజలాకాశాభ్రఖాత్మకః - ఘటాకాశ = ఘటాకాశము యొక్కయు, మహాకాశ = మహాకాశముయొక్కయు, జలాకాశ = జలాకాశము యొక్కయు, అభ్రక = మేఘాకాశముయొక్కయు, ఆత్మకః = స్వరూపము గల, దృష్టాంతః = దృష్టాంతము, ప్రాక్ = ఇంతకుపూర్వము, సమ్యక్ = లెస్సగా, ఈరితః= చెప్పఁబడెను.

తా. తత్త్వంపదార్థశోధనము చేయవలయును గనుక నందు విషయమై ఘటాకాశమహాకాశ జలాకాశ మేఘాకాశస్వరూపమైన దృష్టాంతమును మే మిదివఱకే చెప్పియుంటిమి.

అవ. ఇప్పుడు తత్త్వంపదార్థముల శోధింపవలసినవిధమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. జలాభ్రోపాధ్యధీనే తే జలాకాశాభ్రఖే తయోః,
ఆధారౌ తు ఘటాకాశమహాకాశౌ సునిర్మలౌ. 225

వ్యా. పదార్థశోధనప్రకారమాహ—జలాభ్రేతి. యే జలాకాశాభ్రఖే తే జలాభ్రోపాధ్యధీనత్వాదపారమార్థికే. తయోరాధారభూతౌ ఘటాకాశమహాకాశౌ సునిర్మలౌ జలాద్యుపాధినిరపేక్షాకాశమాత్రరూపావిత్యర్థః.

టీ. తే = ఆరెండైన, జలాకాశాభ్రఖే = జలాకాశమేఘాకాశములు, జలాభ్రోపాధ్యధీనే = జలోపాధి యనునట్టియు, మేఘోపాధి యనునట్టియు రెండుపాధులకు, అధీనే=స్వాధీనములైనవి. తయోః = ఆజలాకాశ మేఘాకాశంబుల రెంటికిని, ఆధారౌ = ఆధారములైన, ఘటాకాశమహాకాశౌ తు = ఘటాకాశమహాకాశములైతే, సునిర్మలౌ=మిగుల పరిశుద్ధములు (ఘటమునకును మేఘమునకును విలక్షణములై యున్నవి).

తా. జలమునందలి యాకాశమునకు జల ముపాధి యగును. మేఘమునందలి యాకాశమునకు మేఘ ముపాధి యగును. జలాకాశమున కాధారమైన ఘటాకాశమును మేఘాకాశమున కాధారమైన మహాకాశమును జలాకాశ మేఘాకాశములతో నంటక శుద్ధములై యున్నవి.

అవ. దార్ష్టాంతికమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవ మానందవిజ్ఞానమయౌ మాయాధియోర్వశౌ,
తదధిష్ఠానకూటస్థబ్రహ్మణీ తు సునిర్మలే. 226

వ్యా. దార్ష్టాంతికమాహ—ఏవమితి.

టీ. ఏవం = ఈలాగున, ఆనందవిజ్ఞానమయౌ - ఆనంద = ఆనందమయకోశస్వరూపుఁడైన ఈశ్వరుఁడును, విజ్ఞానమయౌ = విజ్ఞానమయకోశస్వరూపుఁడైన జీవుఁడును, మాయాధియోః = మాయకును బుద్ధికిని, వశౌ=స్వాధీనములైయున్నారు. తదధిష్ఠానకూటస్థబ్రహ్మణీ తు - తత్ =ఆయానందమయ విజ్ఞానమయకోశములకు, అధిష్ఠాన= ఆధారములైన, కూటస్థబ్రహ్మణీ తు=కూటస్థుఁడును, బ్రహ్మచైతన్యమును, సునిర్మలే = ఆరెండు కోశములయొక్క సంబంధము లేనివై యున్నవి.

తా. ఆనందమయ విజ్ఞానమయకోశస్వరూపు లైన జీవేశ్వరులు పై దృష్టాంతప్రకారము మాయాబుద్ధులకు రెండింటికి నధీనులై

యున్నారు. ఆయానందమయ విజ్ఞానమయకోశములకు నధిష్ఠానభూతము లైన కూటస్థబ్రహ్మచైతన్యము లన్ననో, యాయానందమయ విజ్ఞాన మయసంబంధములేక ఘటాకాశమహాకాశములవలె విలక్షణులై యున్నారు. అనఁగా దృష్టాంతమందు చెప్పఁబడిన జలమేఘము లనెడి యుపాధులను వేఱుచేసిచూచిన నచట నాకాశ మొక్కటియైనట్లు దార్ష్టాంతికమునందు ఆనందమయ విజ్ఞానమయకోశము లనెడి యుపా ధులను వేఱుచేసి చూచిన నుపహిత మగు బ్రహ్మచైతన్య మొక్కటి యగు నని రహస్యము.

అవ. పదార్థద్వయశోధనమునకు నుపయుక్తముగానైన సాంఖ్యయోగమతము లను అంగీకరింప మని యనెదవేమో యీరెండింటిని నొప్పుకొంటి మేని నితర తార్కి కాదివాదములను నొప్పుకొనవలసివచ్చును గనుక "దశానా మేకాదశ" యన్నట్లు పదింటిలో పదకొండవదిగా నంగీకరించెద మనుచున్నాఁడు:—

శ్లో. ఏతత్కృష్ణోపయోగేన సాంఖ్యయోగౌ మతౌ యది,
దేహోఽన్నమయకత్వాత్వా దాత్మ త్వేనాభ్యుపేయతాం. 227

వ్యా. నను పదార్థద్వయశోధనకృష్ణోపయోగిత్వేనాపి సాంఖ్యయోగమతద్వయ మంగీకార్యమితి చేదత్యల్పమిదముచ్యతే. ఇతరేషామపి శాస్త్రాణాం తత్తత్కృష్ణోప యోగిత్వేనాస్మాభిరభ్యుపేయత్వాదిత్యాహ—ఏతదితి.

టీ. ఏతత్కృష్ణోపయోగేన-ఏతత్కృష్ణా = ఈపదార్థద్వయశోధన మనెడి భాగ మునకు, ఉపయోగేన=ఉపయోగముగా, సాంఖ్యయోగౌ = సాంఖ్యమతమును, యోగ మతమును, మతౌ యది=వేదాంతసమ్మతములగునని యంటివేని, అన్నమయకత్వాత్= అన్నమయకోశమును చెప్పుట కుపయోగించుటవలన, దేహః=దేహము, ఆత్మత్వేన = ఆత్మస్వరూపముగా, అభ్యుపేయతాం = అంగీకరింపవలసివచ్చును. అ ట్లంగీకరించుటకు వీలుపడ దనుట.

తా. పదార్థద్వయశోధనమున కుపయోగించు నని సాంఖ్యయోగ మతముల నొప్పుకొను మందువేని. నన్నమయకోశమును దెల్పుట కుపయోగించు స్థూలదేహమును ఆత్మగా నొప్పికొనవలసివచ్చును.కనుక నితర మతములవలెనే సాంఖ్యయోగమతములు రెండును వేదాంతసమ్మత ములుగా నంగీకరింపఁబడ వని యభిప్రాయము.

అవ. మాయద్వైతమతమున కేవిషయమున సాంఖ్యయోగమతములు విరుద్ధములై యున్నవనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మభేదో జగత్సత్య మీశోఽన్య ఇతి చేత్త్రయం,
త్యజ్యతే తైస్తదా సాంఖ్యయోగ వేదాంతసమ్మతిః. 228

వ్యా. కుత స్తర్హి సాంఖ్యయోగయో ర్వేదాంతవిరోధిత్వమిత్యాశంక్య జీవభేద జగత్సత్యత్వేశ్వరతాటస్థ్యలక్షణేఽంశే ఇత్యాహ—ఆత్మభేద ఇతి.

టీ. ఆత్మభేదః = ఆత్మభేదమనుటను, జగత్సత్యం = జగత్తు సత్యమైన దనుటను, ఈశః = ఈశ్వరుఁడు, అన్య ఇతి = అన్యుఁడనుటను, త్రయం=ఈ మూఁడంశములను, త్యజ్యతే చేత్ = పరిత్యజించినచో, తదా=అప్పుడు, సాంఖ్యయోగవేదాంతసమ్మతిః= సాంఖ్యులకును, యోగులకును, అద్వైతశాస్త్రసమ్మతము. (స్యాత్ = అగును).

తా. 1. ఆత్మభేదమును, 2. జగత్సత్యత్వమును, 3. ఈశ్వరుఁడు తటస్థుఁ డగుచు వేఱై యున్నాఁడు అను నీమూఁడంశములను వారు వదలివేసినయెడల ఆసాంఖ్యయోగమతములు రెండింటికిని వేదాంతసమ్మతము గలుగును.

అవ. ఇపుడు జీవుఁ డసంగుఁ డని తెలిసికొనినచో మోక్షము కలుగుచుండఁగా, మీరు చెప్పెడి యద్వైతబోధతోఁ బనిలేకపోవు నని యాక్షేపింపఁగా అద్వైతజ్ఞానము కలుగనిది జీవుఁ డసంగుఁ డని యెఱుఁగుట తటస్థింప దనెడి యాశయమును మనస్సులో నుంచుకొని యుత్తర మిచ్చుచున్నాఁడు:—

శ్లో. జీవోఽసంగత్వమాత్రేణ కృతార్థ ఇతి చేత్తదా,
స్రక్చందనాదినిత్యత్వమాత్రేణాపి కృతార్థతా. 229

వ్యా. నను జీవస్యాసంగత్వజ్ఞానాదేవ ముక్తిసిద్ధేః కిమద్వైతబోధేనేత్యాశంక్యా ద్వైతజ్ఞానమంతరేణాసంగత్వాదికం న సంభావ్యత ఇత్యభిసంధిం హృది నిధాయోత్తరమాహ—జీవ ఇతి.

టీ. జీవః=జీవుఁడు, అసంగత్వమాత్రేణ=అసంగుఁ డని యెఱింగినమాత్రముచేత, కృతార్థ ఇతి చేత్=పురుషుఁడు ధన్యుఁ డగుచున్నాఁ డని యంటివా, తదా=అప్పుడు, స్రక్చందనాదినిత్యత్వమాత్రేణాపి - స్రక్=పుష్పహారములయొక్కయు, చందనాది = చందనము మొదలైన సుగంధద్రవ్యములయొక్కయు, నిత్యత్వమాత్రేణాపి = నిత్యములని యెఱింగినంతమాత్రముచేత, కృతార్థతా=మనోరథసిద్ధి యని చెప్పవలసి వచ్చును.

తా. జీవుఁడు నిస్సంగుఁ డని యెఱిఁగినమాత్రముచేతనే పురుషుఁడు ధన్యుఁ డగునేని స్రక్చందనాదిపదార్థములు నిత్యము లని తెలిసికొనినమాత్రముచేతనే పురుషుఁడు ధన్యుఁ డగుచున్నాఁ డని చెప్పవలసివచ్చును.

అవ. అద్వైతసిద్ధాంతి గూడ తన యభిప్రాయమును వెల్లడించుచున్నాఁడు:—

శ్లో. యథా స్రగాదినిత్యత్వం దుస్సంపాద్యం తథాత్మనః,
అసంగత్వం న సంభావ్యం జీవతోర్జగదీశయోః. 230

వ్యా. అభిసంధిమావిష్కరోతి—యథేతి. జీవతోర్విశేష్యవిశేషణాకారేణ భాసమానయోః.

టీ. స్రగాదినిత్యత్వం = పుష్పహారాదులు నిత్యము లగుట, యథా=ఏవిధముగ, దుస్సంపాద్యం=సంభవింపదో, తథా=ఆవిధముగ, జగదీశయోః=జగత్తును ఈశ్వరుఁడును, జీవతోస్సతోః = విశేష్యాకారముచేతను భాసించుచుండఁగా, ఆత్మనః=ఆత్మకు, అసంగత్వం = నిస్సంగత్వము, న సంభావ్యం=సంభవింప నేరదు.

తా. ఈశ్వరుఁడును జగత్తును నిత్య మనియెడిసాంఖ్యులును యోగులును స్రక్చందనాదిపదార్థములకు నిత్యత్వము సాధింప లేని విధంబున విశేష్యవిశేషణాకారములచేత జీవేశ్వరులు భాసించుచుండఁగా, ఆత్మ కసంగత్వము సాధింప నలవిగా దని యెఱుంగవలెను.

శ్లో. అవశ్యం ప్రకృతి స్సంగం పురేవాపాదయే త్తథా,
నియచ్ఛ త్యేతమీశోఽపి కోఽస్య మోక్ష స్తథా సతి. 231

వ్యా. అసంభవమేవ స్పష్టయతి. అవశ్యమితి. ఫలితమాహ—కోఽస్యేతి.

టీ. ప్రకృతిః=అవిద్య, పురేవ=అజ్ఞానదశయందు వలెనే, అవశ్యం=ముఖ్యముగా, సంగం=దేహేంద్రియాదిసంబంధమును, ఆపాదయేత్ = కలిగించును. తథా=అప్రకారము, ఈశోఽపి = ఈశ్వరుండును, ఏతం=ఈపురుషుని, నియచ్ఛతు = నియమించును. తథాసతి=అట్లైనయెడల, అస్య=ఈపురుషునకు, మోక్షః=మోక్షము, కః=ఏవిధముగాఁ గలుగును ? ఎన్నటికిని కలుగ నేర దనుట.

తా. సాంఖ్యయోగుల మతప్రకారము అసంగత్వము పురుషున కెన్నఁటికిని సంభవింపదు. వారిమతములో ప్రకృతి, పురుషుఁడును, ఈశ్వరుఁడును నిత్యములు. అజ్ఞానదశయందు ప్రకృతి, దేహేంద్రియాద్యభిమానమును గలిగించుటయు నీశ్వరుఁడు, పురుషుని నియమించుటయు

నెట్లుండెనో, జ్ఞానదశయందును ప్రకృతియు నీశ్వరుండును నిత్యులు గనుక వారి మామూలుపనులను వారు చేయుచుండుటంబట్టి జీవున కసంగత్వము ఘటింపదు. అందువలన మోక్షమును నెన్నటికిని ఘటింపదని స్పష్టమగుచున్నది.

శ్లో. అవివేకకృత స్సంగో నియమ శ్చేతి చే త్తథా,
బలా దాపతితో మాయావాదస్సాంఖ్యస్య దుర్మతేః. 232

వ్యా. సంగనియమనయోరవివేకకార్యత్వాత్ వివేకజ్ఞానేన చావివేకనివృత్తౌ కుతః పునస్సంగాద్యుత్పత్తిరితి శంకతే—అవివేకేతి. ఏవం సత్యపసిద్ధాంతపాత ఇతి పరిహరతి—బలాదితి. అయం భావః-అవివేకో నామ కిం? వివేకాభావః, కిం వాతదన్యః? ఉత తద్విరోధీ? నాద్యః, అభావమాత్రస్య భావకార్యజనకత్వాయోగాత్. న ద్వితీయః, వివేకాదన్యస్య ఘటాదేస్సంగహేతుత్వాదర్శనాత్. తృతీయే తు తస్య భావరూపాజ్ఞానత్వమేవేతి మాయావాదప్రసంగ ఇతి.

టీ. సంగః = దేహేంద్రియసంబంధమును, నియమశ్చ = నియమించుటయును, అవివేకకృతఇతిచేత్ = అవివేకముచేతఁ గలిగింపఁబడిన వంటివేని, తథా = ఆప్రకారముగ, బలాత్ = బలాత్కారముచేత, దుర్మతేః = దుష్టమైనబుద్ధి గల, సాంఖ్యస్య = సాంఖ్యునకు, మాయావాదః=మాయావాదప్రసంగము, ఆపతితః=కలిగెను.

తా. ప్ర. సంగనియమములు రెండును అవివేకకార్యము లగుటచేత నవివేకము నివర్తించుచుండఁగా మఱల సంగాద్యుత్పత్తి లేదని సాంఖ్యుఁడు చెప్పినయెడల దోషమేమి? ఉ. ఇట్లు సాంఖ్యుఁడు చెప్పినయెడల వాని కిచ్ఛలేకనే బలాత్కారముచేత నా సాంఖ్యునిమతము మాయావాదప్రసంగ మగుచు అపసిద్ధాంత మగును. న+వివేకము అను నీ రెండింటికిని సమాసము చేయఁగా అవివేక మని యైనది. నఞునకు మూఁడువిధములుగా నర్థము చెప్పవచ్చును. అభావము, అన్యము, విరోధి యని. ఇచట నఞ్ అను పదమునకు అభావ మని చెప్పితిమా, న+వివేకము అవివేకము—వివేకాభావ మని యర్థమగును. అందువలన వివేకాభావమువలన సంగనియమము లనెడి కార్యములు పుట్టినవనవలెను. అభావమువలన భావోత్పత్తి గలుగు ననుట యెవరిచేతను నంగీకరింపఁబడదు. లేక అన్యమని యర్థము చెప్పెడిపక్షమున నవివేకము, అవివేకము, వివేకాన్యము అని యగును. అన్యములైన ఘటపటాదులవలన

సంగము గలిగిన దనుట లోకానుభవవిరుద్ధము. అట్లుగాక న+వివేకము= అవివేకము. వివేకవిరోధి యని యగును. అనఁగా అజ్ఞానము కావలె. అదే యని యొప్పినచో నుక్కిరిబిక్కిరియై యేమి చెప్పుటకుఁ దెలియని సాంఖ్యుఁడు వాని మతసిద్ధాంతమునకు విరుద్ధముగా మే మన్నట్లు మాయ, అజ్ఞానము అని తప్పనిసరిగా నొప్పుకొనవలసివచ్చును. కావున సాంఖ్యయోగశాస్త్రములు రెండును వేదాంతసమ్మతములు కావని తెలియవలెను.

అవ. మీయద్వైతములో మాత్రము నిట్టి బాధలు లేవా? అద్వితీయమైన బ్రహ్మపదార్థము దక్క వేఱువస్తువు లేకపోవుచుండఁగా ఈబంధమోక్షముల నెవరికి చెప్పవలెను? చెప్పలేక యప్పుడు మావలె మీరును ఆత్మభేదము తప్పనిసరిగా నంగీకరింపవలసి వచ్చునే యని యాక్షేపము చేయుచున్నాఁడు:—

శ్లో. బంధమోక్షవ్యవస్థార్థ మాత్మనానాత్వ మిష్యతాం,
ఇతి చేన్న యతో మాయా వ్యవస్థాపయితుం క్షమా. 233

వ్యా. అద్వైతాభ్యుపగమే బంధమోక్షవ్యవస్థానుపపత్తేరాత్మభేదోఽంగీకర్తవ్య ఇతి చోదయతి—బంధమోక్షేతి. ఏకస్యాత్మనో మాయయా బంధమోక్షవ్యవస్థోపపత్తేర్నైవమితి పరిహరతి—న యత ఇతి.

టీ. ఆత్మనానాత్వం = ఆత్మకు భేదము, బంధమోక్షవ్యవస్థార్థం = బంధమోక్షములయొక్క స్థాపనముకొఱకు, ఇష్యతాం=అంగీకరింపఁబడుఁగాక, ఇతి చేత్ = ఈవిధముగా నంటివా, న=అట్లనఁగూడదు, యతః=ఏహేతువువలన, మాయా=మాయ, వ్యవస్థాపయితుం=బంధమోక్షావస్థలను స్థాపనచేయుటకు, క్షమా=సామర్థ్యము గలదియగునో.

తా. 'ఓ అద్వైతసిద్ధాంతీ! ఆత్మ యొక్కటియే సత్యమంటివి? ఎవనికి బంధము? ఎవనికి మోక్షము? బంధమోక్షములు రెండవవస్తువే లేకపోవుటచే నీకు కుదరవు గనుక మేము చెప్పినయట్లు ఆత్మలు అనేకములు అని యొప్పుకొనుము' అనెదవేమో. అట్లన నవసరము లేదు. అవిద్యవలన బంధము, విద్యవలన మోక్షము అనిన నెంత సులువుగా బంధమోక్షములు మాయవలనఁ గలుగుచున్నవో తెలియుము.

అవ. మాయమాత్రము బంధమోక్షముల నెట్లు స్థాపింపఁగల దందువేమో, దానికి దుర్ఘటములైనకార్యములం జేయుట స్వాభావికము అని సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. దుర్ఘటం ఘటయామీతి విరుద్ధం కిం న పశ్యసి,
వాస్తవౌ బంధమోక్షౌ తు శ్రుతిర్న సహతే తరామ్. 234

వ్యా. మాయాపి కథం వ్యవస్థాపయేదిత్యాశంక్య తస్యా దుర్ఘటకారిత్వస్వాభావ్యాదిత్యాహ—దుర్ఘటమితి. బంధస్యావిద్యకత్వేఽపి మోక్షో వాస్తవోఽభ్యుపేతవ్య ఇత్యాశంక్య శ్రుతివిరోధాన్నైవమిత్యాహ—వాస్తవావితి. న సహతే తరామతితరాం నైవ సహత ఇత్యర్థః. బంధమివ మోక్షమపి వాస్తవం న సహత ఇతి భావః.

టీ. దుర్ఘటం = చేయనలవికానిపనిని, ఘటయామీతి = సాధించుచున్నానసెడి, విరుద్ధం = విరుద్ధముగా పలుకుటను, న పశ్యసి కిం = ఎఱుంగవా యేమి (లోకానుభవసిద్ధమే యనుట.) బంధమోక్షౌ = బంధమును మోక్షమును, వాస్తవౌ తు = వాస్తవములగుటను, శ్రుతిః=వేదవాక్యము, న సహతే తరాం=ఎంతమాత్రము నంగీకరింపదు.

తా. 'చేయ నలవి కానిపనిని నేను చేయుచున్నాను' అని లోకమున వాడుకొనుమాట నెఱుంగుదుము కదా. నిజముగా చేయనలవి కాని పనిని చేయుచున్నా ననుట విరుద్ధము, (అసంభవము). కనుక మాయ మన మసంభవ మనుకొనినవానిని సంభవింపఁజేయఁగలదు. అట్లు సంభవింపఁజేయుట మాయకు స్వభావసిద్ధము. లేనిపోని బంధమోక్షములను ఆమాయయే కల్పించినది. వాస్తవముగా ఆత్మకు బంధమోక్షము లున్న వని వేదము చెప్పియుండలేదు. ఇదియునుంగాక బంధమోక్షాదులు లే వని కంఠోక్తముగఁ గూడఁ దెల్పియున్నది.

అవ. అట్లు ఆత్మకు బంధమోక్షములు లే వని చెప్పిన శ్రుతిని జూపుచున్నాఁడు:—

శ్లో. న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా. 235

వ్యా. మోక్షాదేర్వాస్తవత్వప్రతిషేధికాం శ్రుతిం పఠతి—న నిరోధ ఇతి. నిరోధః నాశః. ఉత్పత్తిర్దేహసంబంధః. బద్ధస్సుఖదుఃఖాదిధర్మవాన్. సాధకః శ్రవణాద్యనుష్ఠాతా, ముముక్షుస్సాధనచతుష్టయసంపన్నః. ముక్తః నివృత్తావిద్యః. ఇత్యేతత్సర్వం వస్తుతో నాస్తీత్యర్థః.

టీ. నిరోధః=నాశము, న=లేదు. ఉత్పత్తిశ్చ = జన్మమును, న=లేదు. బద్ధః = సుఖదుఃఖాదిధర్మములు గలిగినబద్ధుఁడు, న=కాఁడు, సాధకః = శ్రవణమననాదుల సను

క్షించెడు సాధకుండును, న = కాఁడు. ముముక్షుః = సాధనచతుష్టయసంపన్నుఁడైన ముముక్షువు, న=కాఁడు, ముక్తః = అవిద్యానివృత్తి గల ముక్తుఁడును, నవై = కాఁడు. ఏషా=ఇట్టిస్థితి, పరమార్థతేతి=యథార్థస్వరూప మని శ్రుతి చెప్పుచున్నది.

తా. జననమరణములు, సుఖదుఃఖములు, శ్రవణమననాద్యనుష్ఠానము మున్నగు సకలవ్యవహారములును పరమార్థమందు లేవు అని శ్రుతి చెప్పుచున్నది.

అవ. జీవేశ్వరాదిసకలభేదములు మాయాకల్పితము లనుటను దెల్పి యుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. మాయాఖ్యాయాః కామధేనో ర్వత్సౌ జీవేశ్వరావుభౌ,
యథేచ్ఛం పిబతాం ద్వైతం తత్త్వం త్వద్వైతమేవ హి. 236

వ్యా. ఏవం జీవేశ్వరాదిభేదస్య మాయామయత్వ ముపపాదిత ముపసంహరతి— మాయాఖ్యాయా ఇతి.

టీ. మాయాఖ్యాయాః = మాయ యనుపేరు గల, కామధేనోః = కామధేనువునకు, జీవేశ్వరౌ = జీవేశ్వరు లనెడి, ఉభౌ = రెండైన, వత్సౌ = దూడలు, (స్తః= కలవు). ద్వైతం=ద్వైతమనెడి క్షీరమును, యథేచ్ఛం=స్వేచ్ఛగా, పిబతాం=త్రాగఁబడుఁగాక, అనఁగా జీవేశ్వరు లిరువురును మాయాకల్పితు లనుట. తత్త్వం తు = పారమార్థికసత్యస్వరూపమైతే, అద్వైతమేవహి=అద్వైతబ్రహ్మతత్త్వ మొక్కటియేకదా.

తా. మాయ యనెడు కామధేనువుయొక్క దూడ లైన జీవేశ్వరులు ద్వైత మనియెడి క్షీరపానమును యథేచ్ఛముగఁ జేయనిమ్ము అనిన దానిభావము ద్వైతప్రపంచమును జీవేశ్వరులును నీ మొదలగు భేదజాత మంతయు మాయాకల్పితమును, అసత్యంబును నగు నని తెలియవలెను.

అవ. మాయాకల్పితులు గనుక జీవేశ్వరులకు భేదము మిథ్య యగుఁగాక. మాయాసంబంధము లేని కూటస్థబ్రహ్మములకుఁ గల భేదము యథార్థ మని యేల యనరాదు అని శంకించి యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థబ్రహ్మణో ర్భేదో నామమాత్రాదృతేన హి,
ఘటాకాశమహాకాశౌ వియుజ్యేతే నహి క్వచిత్. 237

వ్యా. నను జీవేశ్వరయోర్మాయికత్వేన తద్భేదోఽపి పారమార్థికస్స్యాత్, ఇత్యాశంక్య భేదప్రయోజకస్య స్వరూపవైలక్షణస్యాభావాన్నైవమితి పరిహరతి—కూటస్థేతి.

నామమాత్రాద్భేదప్రతీతావపి వస్తుతో భేదాభావే దృష్టాంతం పూర్వోక్తం స్మారయతి—ఘటాకాశేతి.

టీ. కూటస్థబ్రహ్మణోః = ప్రత్యగాత్మపరమాత్మలకు, భేదః = భేదము, నామమాత్రాదృతే=నామమాత్రమే కాని, నహి = వాస్తవముగా లేదు. ఘటాకాశమహాకాశౌ = ఘటాకాశ మహాకాశములు రెండును, క్వచిత్=ఎన్నఁడును, న వియుజ్యేతేహి=భేదమును పొందవు గదా.

తా. ఇది ఘటాకాశము ఇది మహాకాశము అని నోట ననుటయే గాని యిన్ని యాకాశములు లేక యాకాశ మొక్కటే యైనట్లు ప్రత్యగాత్మపరమాత్మ లనియు కూటస్థబ్రహ్మము లనియు భేదముగా చెప్పుట మాత్రమే కాని వాస్తవముగా స్వరూపమునుబట్టి చూచిన కూటస్థబ్రహ్మములకు రెండింటికిని నభేద మనుటయే సత్యమగును.

అవ. అటులైతే యందఱును అభేదస్వరూపమునందే అభినివేశ మేల గలిగి యుండరు అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యదద్వైతం శ్రుతం సృష్టేః ప్రాక్తదేవాద్య చోపరి,
ముక్తావపి వృథా మాయా భ్రామయత్యఖిలాన్ జనాన్. 238

వ్యా. ఏవం భేదస్య మిథ్యాత్వసమర్థనేన కిం ఫలమిత్యాహ—యదద్వైతమితి. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయ"మితి శ్రుతౌ యదద్వితీయం బ్రహ్మప్రతిపాదితం తదేవ కాలత్రయేఽప్యబాధ్యత్వేన వాస్తవం న భేద ఇతి భావః. కుతస్తర్హి స ద్వైతే దేఽభినివేశః క్రియత ఇత్యత ఆహ—వృథామాయేతి. తత్త్వజ్ఞానరహితత్వాదభినివేశం కుర్వంతీతి భావః.

టీ. సృష్టేః=సృష్టికంటె, ప్రాక్ = పూర్వము, యత్ అద్వైతం=ఏ యద్వైతబ్రహ్మతత్వము, శ్రుతం=శ్రుతిలోఁ జెప్పఁబడినదో, తదేవ=ఆయద్వితీయబ్రహ్మతత్త్వమే, అద్య=ఈసృష్టికాలమునను, ఉపరి చ=భవిష్యత్కాలంబునను, ముక్తావపి = మోక్షదశయందును, (అద్వైతస్వరూపమైయున్నది). మాయా=అవిద్య, అఖిలాన్ జనాన్ = నిఖిలజనులను, వృథా=నిరర్థకముగా, భ్రామయతి = భ్రమించుచున్నది.

తా. అవిద్యచేత నందఱును నభేదస్వరూపమును దెలియలేక భ్రమపడుచున్నారుగాని అద్వైతబ్రహ్మతత్వ మొక్కటియే సృష్టికి

పూర్వమును సృష్టియైయున్న కాలమునను ప్రళయమైనతర్వాతను మోక్షదశయందును నేకరూపమై విలసిల్లుచున్న దని తెలియవలెను.

అవ. ఈప్రపంచ మంతయు మిథ్య యని చెప్పెడివారు కూడ సర్వవ్యవహారములు గలవారలై కనఁబడుచున్నారే యాతత్త్వజ్ఞానమువలన లాభ మే మున్నది యని శంకించుచున్నాఁడు:—

శ్లో. యే వదంతీత్థ మేతేఽపి భ్రామ్యంతేఽవిద్యయాఽత్ర కిం,
న యథా పూర్వమేతేషా మత్ర భ్రాంతేరదర్శనాత్. 239

వ్యా. నను ప్రపంచస్య మాయామయత్వం తత్త్వస్యాద్వితీయత్వం చ యే వర్ణయంతి తేఽపి సంసారవంతో దృశ్యంతే. అతస్తత్త్వజ్ఞానేన కిం ప్రయోజనమితి శంకతే—యే వదంతీతి. కర్మవశాత్కేషాంచిద్వ్యవహారే సత్యపి పూర్వవదభినివేశాభావాన్నైవమితి పరిహరతి—న యథేతి.

టీ. యే = ఎవ్వరు, ఇత్థం = ఈప్రకారముగా, వదంతి = చెప్పుచున్నారో, తేఽపి=అట్టివారును, అవిద్యయా = మాయచేత, భ్రామ్యంతే=భ్రమించుచున్నారు; అత్ర=ఈతత్త్వజ్ఞానముచేత, కిం=లాభ మేమి, (ఇతి చేత్=ఇట్లంటివా), ఏతేషాం= ఈతత్త్వజ్ఞులకు, యథాపూర్వం=వెనుకటి యవివేకదశయందువలె, అత్ర=ఈజ్ఞానదశయందు, భ్రాంతేః=భ్రాంతియొక్క, అదర్శనాత్=లేకపోవుటవలన, న=అట్లనరాదు. తత్త్వజ్ఞానముచేత లాభముచేత లాభము లే దని యనఁగూడ దనుట.

తా. తత్త్వజ్ఞానము గలవారు పామరులవలె సర్వవ్యవహారములను జేయుచుండినను నవిద్యచేతఁ గలిగిన భ్రాంతి నివర్తించుటంజేసి యిట్టి యవిద్యానివృత్తిరూప మైన లాభము వారికి కలదు గనుక తత్వజ్ఞానముచేత జ్ఞానులకు లాభము లేదనఁగూడదు.

అవ. తత్త్వజ్ఞానము గలవారి కవిద్యాభ్రాంతి లే దని తెలుప అజ్ఞానినిశ్చయమును జ్ఞానినిశ్చయమును నెఱిఁగించుచున్నాఁడు:—

శ్లో. ఐహికాముష్మిక స్సర్వసంసారో వాస్తవ స్తతః,
న భాతి నాస్తి చాద్వైత మిత్యజ్ఞానివినిశ్చయః. 240

శ్లో. జ్ఞానినో విపరీతోఽస్మాన్నిశ్చయ స్సమ్య గీక్ష్యతే,
స్వస్వనిశ్చయతో బద్ధో ముక్తోఽహం చేతి మన్యతే. 241

వ్యా. జ్ఞానినాం భ్రాంత్యభావం దర్శయితుం అజ్ఞానినాం నిశ్చయం తావదాహ—ఐహికేతి. ఇహ లోకే భవః ఐహికః. పుత్రకళత్రాదిపోషణరూపః. అముష్మిన్ పరలోకే భవః ఆముష్మికః స్వర్గసుఖాద్యనుభవరూపః.

తత్త్వవినిశ్చయస్య తతో వైలక్షణ్యం దర్శయతి—జ్ఞానిన ఇతి. అద్వైతం పారమార్థికం భాతి చ సంసారస్త్వపారమార్థిక ఇతి నిశ్చయ ఇత్యర్థః. తతః కిమిత్యాశంక్య స్వస్వ నిశ్చయానుసారేణ ఫలం భవతీత్యాహ—స్వస్వేతి.

టీ. ఐహికాముష్మికః — ఐహిక=ఇహలోకసంబంధమైనపుత్రమిత్రకళత్రాదిపోషణ రూపమైనట్టియు, ఆముష్మికః = స్వర్గసుఖాద్యనుభవరూపమైనట్టియు, సర్వసంసారః = సంసారము, వాస్తవః = ఎప్పుడు నుండును. తతః = ఆకారణమువలన, అద్వైతం = అద్వైతబ్రహ్మతత్త్వము, న భాతి = భాసించుట లేదు. నాస్తి చ=లేను లేదు. ఇతి= ఈవిధముగా, అజ్ఞానివినిశ్చయః = అజ్ఞానుల నమ్మకము.

అస్మాత్=ఈఅజ్ఞానుల నమ్మకముకంటె, జ్ఞానినః=తత్త్వజ్ఞానము గలవారియొక్క, నిశ్చయః=నమ్మకము, విపరీతః=భిన్నమైన దని, సమ్యక్=దృఢముగా, ఈక్ష్యతే=తెలియు చున్నది. స్వస్వనిశ్చయతః=తన తన నిశ్చయము ననుసరించి (నమ్మకమునుబట్టి), అహం= నేను, బద్ధ ఇతి=బద్ధుఁడ ననియు, ముక్త ఇతి చ=ముక్తుఁడ ననియు, మన్యతే = తలంచు చున్నాఁడు.

తా. ఈలోకసంబంధమైన పుత్రమిత్రకళత్రక్షేత్రవర్గమును పరలోకసంబంధ మగు స్వర్గసుఖాద్యనుభవమును ననునవియే వాస్తవములు. అద్వైతబ్రహ్మతత్త్వ మనునది మనకుఁ గనుపించుట లేదు గనుక నది లేదని అజ్ఞానుల నమ్మకము. ఇఁక జ్ఞానుల నమ్మక మే మన, అద్వైతబ్రహ్మతత్త్వముమాత్రమే సత్యము, తక్కినదంతయు మిథ్య యని యుండును. అట్టి నమ్మకములవలనఁ బ్రయోజన మేమి యనిన లాభము వారి వారి నిశ్చయానుసారముగా నుండును. అజ్ఞాని యట్టి యశాస్త్రీయనిశ్చయముచేత జననమరణముల నొందుచున్నాఁడు, జ్ఞాని శాస్త్రీయమైననిశ్చయము గలిగి కృతార్థుఁ డగుచున్నాఁడు. ఇట్లు జ్ఞాని కిని నజ్ఞానికిని ననుభవవైషమ్యమునుబట్టి ఫలవైషమ్యమును గలదు.

అవ. అద్వైతస్వరూపము శాస్త్రములు చెప్పఁగా వినుటయే కాని కనిపించుట లేదు గనుక, అజ్ఞాను లట్టి నిశ్చయము గలిగియుండవచ్చును. అని శంకింపఁగా బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. నాద్వైత మపరోక్షం చేన్న చిద్రూపేణ భాసనాత్,
అశేషేణ న భాతం చేద్ద్వైతం కిం భాసతేఽఖిలమ్. 242

వ్యా. అద్వైతం భాతీత్యుక్తిః శాస్త్రత ఏవ. నానుభవతస్తన్నిశ్చయ ఇతి శంక తే—నాద్వైతమితి. అనుభవాగోచరత్వమసిద్ధమితి పరిహరతి—న చిద్రూపేణేతి. ఘటస్స్ఫురతీతి ఘటాదిష్వనుస్యూతస్ఫురణరూపేణ భానాదిత్యర్థః. నను చిద్రూపత్వస్య భానేఽపి తత్కార్త్స్న్యేన న ప్రతీయత ఇతి శంకతే—అశేషేణేతి. సాకల్యేన భానాభావోద్వైతేఽపి సమాన ఇత్యాహ—ద్వైతం కిమితి.

టీ. చిద్రూపేణ = చైతన్యరూపముగా, అద్వైతం = అద్వైతబ్రహ్మతత్త్వము, భాసనాత్ = భాసించుచుండుటవలన, అపరోక్షం = గోచరించుట లేదని, న చేత్ = అద్వైతమునంగీకరింపకపోతివేని, న=అట్లంగీకరింపకపోవుట యుక్తము కాదు. అశేషేణ=సర్వస్వరూపముచేత, న భాతం చేత్=భాసింప లేదంటివేని, అఖిలం ద్వైతం= సమస్తమైనద్వైతము మాత్రము, భాసతే కిం=భాసించుచున్నదా?

తా. ద్వైతబ్రహ్మతత్త్వ మనుభవగోచర మగుట లేదు గనుక జగత్తును సత్య మని అజ్ఞానులు నమ్ముచున్నా రనుట న్యాయము కాదు. తనను జీఁకటిలోఁ గూర్చుండఁ బెట్టి యున్నావా యని యడిగిన నున్నా నని చెప్పుటచే చైతన్యస్వరూపముగా సర్వానుభవసిద్ధమై నిత్యాపరోక్షమై తెలియఁబడుచునే యున్నది. పూర్తిగా తెలియఁబడుట లేదని యాక్షేపించెద వేని, నీద్వైతము మాత్రము పూర్తిగా గోచరించుచున్నదా? పూర్తిగా గోచరించుట లేదని భావము.

అవ. పూర్తిగా తెలియకపోవుట యుభయులకు సమానము అని చెప్పి దానికి సమాధానమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. దిఙ్మాత్రేణ విభానం తు ద్వయో రపి సమం ఖలు,
ద్వైతసిద్ధివ దద్వైతసిద్ధి స్తే తావతా న కిమ్. 243

వ్యా. ఏవం దోషసామ్యమభిధాయ పరిహారసామ్యమాహ—దిఙ్మాత్రేణేతి. దిఙ్మాత్రేణైకదేశేన ద్వయోర్ద్వైతాద్వైతయోరిత్యర్థః. ఏతావతా కథం పరిహారసామ్య మిత్యాశంక్యాహ—ద్వైతసిద్ధివదితి. తే తవ పక్షే తావతా ఏకదేశప్రతీతిసద్భావేన ద్వైతసిద్ధివత్ ద్వైతనిశ్చయ ఇవాద్వైతసిద్ధిరద్వైతనిశ్చయోఽపి కిం న భవతి? కింతు భవత్యేవేత్యర్థః.

టీ. దిఙ్మాత్రేణ=కొంతభాగము మాత్రము, విభానం తు=స్ఫురించుట యన్ననో, ద్వయోరపి=ద్వైతాద్వైతపక్షములు రెండింటియందును, సమం ఖలు = సమానమే కదా.

తే = నీకు (ద్వైతి కనుట), తావతా = కొంతభాగము మాత్రము స్ఫురించుటచేత, ద్వైతసిద్ధివత్ = ద్వైతనిశ్చయమువలె, అద్వైతసిద్ధిః = అద్వైతమందు నిశ్చయము, కిం=ఎందుకు, న=కలుగదు? (కలుగుచున్న దనుట).

తా. ద్వైతాద్వైతపక్షములు రెండింటియందును నంతయు పూర్తిగా స్ఫురింపకపోవుట యను దోషము సమానముగా నున్నది. దానికి పరిహారము గూడ పూర్తిగాఁ దెలియఁబడక పోయినను దాని యందు సత్యత్వనిశ్చయము నీకుఁ గలిగినట్లే అద్వైతనిశ్చయమును మాకుఁ గలిగిన దని యనుకొనఁ గూడదా? అనుకొన నగు నని భావము.

అవ. అద్వైతము సిద్ధింపకపోవుటను నింకొకవిధముగా నాక్షేపించుచున్నాఁడు:-

శ్లో. ద్వైతేన హీనమద్వైతం ద్వైతజ్ఞానే కథం త్విదం,
చిద్భానం త్వవిరోధ్యస్య ద్వైతస్యాతోఽసమే ఉభే. 244

వ్యా. పూర్వవాదీ ప్రకారాంతరేణాద్వైతాసిద్ధిం శంకతే—ద్వైతేనేతి, అద్వైతం ద్వైతరహితం తయోః పరస్పరవిరోధాత్తథా సదద్వైతప్రతీతావద్వైతం న సంభవతీత్యర్థః. నను తర్హి ద్వైతస్యాప్యద్వైతవిరోధిత్వా దద్వైతే ప్రతిభాసమానే ద్వైతస్యాసిద్ధిరితి చోద్యం సమానమిత్యాశంక్యాహ పూర్వవాదీ—చిద్భానంత్వితి. భవన్మతే చిద్రూపప్రతీతేరేవాద్వైతప్రతీతిత్వాత్తస్యాశ్చ ద్వైతవిరోధిత్వాభావా న్నోభయోస్సామ్యమితి భావః.

టీ. ద్వైతేన = ద్వైతముచేత, అద్వైతం = అద్వైతము, హీనం = లేనిది, (భవతి=అగుచున్నది). ద్వైతజ్ఞానే సతి = ద్వైతముయొక్క స్ఫూర్తి గలుగుచుండఁగా, ఇదం తు= ఈయద్వైతనిశ్చయము, కథం=ఎట్లు కలుగును (కలుగ దనుట). చిద్భానంతు-చిత్ = చిద్రూపతయొక్క, భానం తు=తోఁచుట యన్ననో, అస్య = ఈ, ద్వైతస్య= ద్వైతమునకు, అవిరోధి=విరోధి గాదు. అతః=ఇందువలన, ఉభే = ద్వైతాద్వైతములు రెండును, అసమే=సమానములు గావు.

తా. అద్వైతము అను మాటను విడఁదీసి చూచినయెడల ద్వైతము లేనిది అని యగును. ద్వైత మనుమాటకును అద్వైత మను మాటకును రెంటింటికిని విరోధ ముండుటవలన మాద్వైత ముండఁగా నద్వైత ముండుట సంభవింపనేరదు. నీవును నే నన్నట్లే ద్వైతమును నద్వైతమునకు విరోధి కనుక నద్వైతజ్ఞానము దోఁచుచుండఁగా ద్వైత

ముండుటమాత్ర మసంభవము గాదా యని యనెదవా? నీయద్వైత మతమున చిద్రూపముగా భాసించుటయే యద్వైతజ్ఞానమగును. అప్పుడు ద్వైత మనుమాటకు నద్వైత మనుమాటకును విరోధము లేమింజేసి యీ రెంటికిని సాదృశ్యమే కుదురదు. (సామ్యము తటస్థింప దనుట.) దోషము సమానము గనుక, పరిహారమును సమాన మనుట యొప్పదు.

అవ. ఇట్లు పూర్వపక్షి యాక్షేపింప సిద్ధాంతి ద్వైతము మిథ్యయైనది గనుక వాస్తవ మైన యద్వైతమును కొట్టివేయఁజాల దని తనపైన వైచిన దోషమునకు నద్వైతసిద్ధాంతి పరిహారము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం తర్హి శృణు ద్వైత మసన్మాయామయత్వతః,
తేన వాస్తవ మద్వైతం పరిశేషా ద్విభాసతే. 245

వ్యా. ప్రతీయమానస్యాపి ద్వైతస్య వాస్తవత్వాభావాన్న వాస్తవాద్వైతవిఘాతిత్వమితి పరిహరతి సిద్ధాంతీ—ఏవమితి. ప్రసక్తప్రతిషేధేఽన్యత్రాప్రసంగాచ్ఛిష్యమాణే సంప్రత్యయః పరిశేషః.

టీ. ఏవం తర్హి=ద్వైతాద్వైతములకు సామ్యము కుదురనిపక్షమున, ద్వైతం = ద్వైతము, మాయామయత్వతః = మాయాకల్పిత మగుటవలన, అసత్ = వాస్తవ మైనది కాదు. తేన = అందుచేత, వాస్తవం = సత్యస్వరూపమైన, అద్వైతం = అద్వైతబ్రహ్మతత్త్వము, పరిశేషాత్ = పరిశేషన్యాయమువలన, (పరిశేషన్యాయ మనఁగా—"ప్రసక్తప్రతిషేధేఽన్యత్రాప్రసంగాచ్ఛిష్యమాణే సంప్రత్యయః పరిశేషః" దీనియర్థ మేమనఁగా—ప్రసక్తస్య=ప్రాప్తించిన వస్తువును, ప్రతిషేధే=నిషేధించినప్పుడు, అన్యత్ర = ఇతరమైనదానిని, అప్రసంగాత్ = చెప్పకపోవుటవలన, శిష్యమాణే = మిగిలియుండు దానియందు, సంప్రత్యయః = జ్ఞానము, పరిశేషః=పరిశేష మనఁబడును. నలుగురు కూర్చుండియుండఁగా నింకొకఁడు వచ్చి యిచట నాయుంగరము పెట్టితిని కానరాలేదు అనినపుడు కూర్చున్నవారిలో నొక్కొకరు ప్రత్యేకముగా నేను తీసితినా యని యడిగిన నీవు తీయలేదు అని ముగ్గురివలకు నిట్లే చెప్పి నాల్గవవానిని అడిగినప్పుడు ఏమి బదులుచెప్పక యూరకుండెను. అప్పు డుంగరమునంగతి ఎవరు తీసిన ట్లూహించెదము? ఇప్పుడు చెప్పిన పరిశేషన్యాయమునుబట్టి నాల్గవవాఁడు తీసినాఁ డని స్పష్టమై నట్లు లనుట.) విభాసతే=ప్రకాశించుచున్నది.

తా. ఓద్వైతవాదీ! ద్వైతమునకును అద్వైతమునకును సాదృశ్యము లేకపోవుటవలన ద్వైత మద్వైతమును కొట్టివేయఁగల

దంటివి నామాటను పూర్తిగా విని తర్వాత నే మనస్సులయునో యప్పు డనెదవు కాక. నీద్వైతము మాయచేత కల్పితమంటిమి. అందుచేత నది యసత్య మగును. ఎప్పుడు ద్వైతము మిథ్యయైనదో, యప్పు డేది పరిశేషన్యాయమునుబట్టి నిలిచియుండునో చెప్పుము. అద్వైతమే ప్రకాశించు నని భావము.

అవ. అద్వైతము మిగిలియుండుటనే చెప్పుచున్నాఁడు:—

శ్లో. అచింత్యరచనారూపం మాయైవ సకలం జగత్,
ఇతి నిశ్చిత్య వస్తుత్వ మద్వైతే పరిశేష్యతామ్. 246

వ్యా. పరిశేషప్రకారమేవ దర్శయతి—అచింత్యేతి. న చింత్యా అచింత్యా అచింత్యా రచనా రూపం యస్య తత్తథావిధం సకల జగత్ మాయైవ మిథ్యైవేత్యనేన ప్రకారేణానిర్వచనీయత్వా న్మిథ్యాత్వం ద్వైతస్య నిశ్చిత్య వాస్తవమద్వైతం పరిశేష్యతామిత్యర్థః.

టీ. అచింత్యరచనారూపం-అచింత్య=ఆలోచించుటకు శక్యముకాని, రచనా = కల్పనయొక్క, రూపం=స్వరూపము గల, సకలం జగత్=సర్వప్రపంచము, మాయైవ= మిథ్యయే, ఇతి=అని, నిశ్చిత్య = నిశ్చయించి, అద్వైతే = అద్వైతమందు, వస్తుత్వం = వాస్తవమైయుండుట, పరిశేష్యతాం=శేషింపఁజేయఁబడుఁగాక (మిగుల్చు మనుట).

తా. ఆలోచన కందని కల్పనారూపమువంటి రూపము గల జగత్తంతయు మిథ్య యని నిశ్చయించిన, అద్వైతము శేషించి యథార్థముగా నిలిచియుండును. నీద్వైత మనిర్వచనీయత్వముచేత నిలిచియుండ దని భావము.

అవ. సిద్ధాంతీ! నీవు చెప్పినచొప్పున నద్వైతనిశ్చయము కలిగినను, పూర్వవాసనచేత మాటిమాటికి ద్వైతసత్యత్వము తోఁచఁగూడదా యని యాశంకింపఁగా బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. పునర్ద్వైతస్య వస్తుత్వం భాతి చేత్త్వం తథా పునః,
పరిశీలయ కో నా త్ర ప్రయాస స్తేన తే వద. 247

వ్యా. నన్వేవమద్వైతనిశ్చయే కృతేఽపి పునః పునర్ద్వైతసత్యత్వం పూర్వవాసనయా భాతీత్యాశంక్య తన్నివృత్తయే పునః పునర్మిథ్యాత్వం విచారయేదిత్యాహ— పునర్ద్వైతస్యేతి. ఆవృత్తిరసకృదుపదేశాదితి చతుర్థాధ్యాయే ఆత్మనః శ్రవణాద్యావర్తనస్య విహితత్వాదావృత్తిసేనేతి భావః.

టీ. ద్వైతస్య=ద్వైతమునకు, వస్తుత్వం=సత్యత్వము, పునః=తిరుగ, భాతిచేత్= తోఁచు నని యంటివా, త్వం=నీవు, పునః=మఱల, తథా=వెనుకటిరీతిగానే, పరిశీలయ = విచారణచేయుము (ద్వైతము మిథ్య యని పరికింపు మనుట). అత్ర = ఈద్వైతమిథ్యాత్వమును, తేన=ఇట్లు పరిశీలించుటచేత, తే=నీకు, ప్రయాసః=శ్రమ, కో వా=ఏమియో, వద=చెప్పుము.

తా. పూర్వవాసనచేత ద్వైతసత్యత్వము తిరుగా తోఁచు నని యంటివా, వెనుకటివలెనే మఱల నాత్మవస్తువును విచారించుము. ఇట్లు ద్వైతము సత్య మని తోఁచినపు డంతయు మిథ్య యని పరిశీలించుట కేమి కష్టము? సులభముగా మాటిమాటికిఁ బరిశీలించుటయందు శ్రమ లే దని భావము.

అవ. ఇట్లు దృఢముగా నపరోక్షవస్తువుయొక్క సాక్షాత్కారపర్యంతము అవధిగా నద్వైతస్వరూపమును విచారించుటయం దాయాసము లే దని మాచేఁ దెలుపఁబడినది. ఇఁక శ్రమ యన్ననో అది నీద్వైతము తోఁచినప్పుడే తప్పక కలుగుచున్న దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కియంతం కాలమితి చేత్ఖేదోఽయం ద్వైత ఇష్యతాం,
అద్వైతే తు న యుక్తోఽయం సర్వానర్థనివారణాత్. 243

వ్యా. కియంతం కాలమిత్థం విచారణీయమిత్యాశంక్య, తత్రాపరోక్షవిద్యాప్త్యా విచారోఽయం సమాప్యత ఇతి విచారకాలావధేరుక్తత్వాన్న ద్వైతవిచారేఽయం ఖేదో యుక్తః. కింతు ద్వైతప్రతిభాస ఏవ యుక్త ఇత్యాహ—కియంతమితి.

టీ. అయం ఖేదః = ఈశ్రమ, కియంతం కాలంచేత్ = ఎంతకాలమువఱకు ననెదవేని, ద్వైతే= ద్వైతమునందు, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁగాక. (ఈప్రశ్నము ద్వైతమునందే చేయు మనుట.) సర్వానర్థనివారణాత్ = సర్వదుఃఖములను నివారణచేయుటవలన, అద్వైతే తు = అద్వైతమతమం దన్ననో, అయం=ఇటువంటి కష్టము, న యుక్తః = కూడియుండునదికాదు.

తా. ఎంతకాల మిట్లు శ్రమపడుచు విచారణచేయవలయు ననెదవేని, ఎన్ని శ్రమలుండినను ద్వైతమునందే యుండును గాని సర్వానర్థములను దొలఁగించు నద్వైతస్వరూపమును విచారించుటయందించుకేని శ్రమ లేదు.

అవ. ఆత్మజ్ఞానము కలిగియుండినను నాయందు ఆఁకలియు, దప్పియు మొదలగు ననర్థము లట్లే ప్రత్యక్షముగాఁ గనుపడుచుండఁగా నద్వైతాత్మజ్ఞానము సర్వానర్థనివారక మని యె ట్లన నొప్పు నని యాశంకించుచున్నాఁడు:—

శ్లో. క్షుత్పిపాసాదయో దృష్టా యథాపూర్వం మయీతి చేత్,
మచ్ఛబ్దవాచ్యేఽహంకారే దృశ్యంతాం నేతి కో వదేత్. 249

వ్యా. నన్వేవమద్వైతాత్మతత్త్వాపరోక్షజ్ఞానవత్యపి మయి క్షుత్పిపాసాద్యనర్థస్య పరిదృశ్యమానత్వాదనర్థనివారకత్వమాత్మజ్ఞానస్యాసిద్ధమితి శంకతే—క్షుత్పిపాసాదయ ఇతి. కిం మచ్ఛబ్దవాచ్యేఽహంకారే దృశ్యంతే? ఉత మచ్ఛబ్దోపలక్షితే చిదాత్మనీతి వికల్ప్య ఆద్యమంగీకరోతి—మచ్ఛబ్దవాచ్య ఇతి. న ద్వితీయః; తస్యాసంగత్వాదవిషయత్వాచ్చేతి బహిరేవ ద్రష్టవ్యం.

టీ. మయి=నాయందు, యథాపూర్వం=పూర్వమువలెనే, క్షుత్పిపాసాదయః = ఆఁకలియు దప్పికయు మొదలయినవి, దృష్టా ఇతి చేత్ =కనఁబడుచున్న వని యంటివా, మచ్ఛబ్దవాచ్యే - మచ్ఛబ్ద=నే ననెడి శబ్దముచేత, వాచ్యే=చెప్పఁదగిన, అహంకారే = అహంకారమునందు, దృశ్యంతాం = చూడఁబడుఁగాక, నేతి=లే దని, కః = ఎవఁడు, వదేత్ = చెప్పును ?

తా. అవివేకదశయందువలె నిప్పు డద్వైతజ్ఞానము గలిగినతర్వాత కూడ క్షుత్పిపాసాదు లుండనే యున్నవే యనెదవేమో. అవి నేననెడి శబ్దమున కర్థమైన అహంకారము నవిగాఁ దలంపుము. చిదాత్మయసంగుఁడును నవిషయుఁడును నై యున్నాఁడు గనుక క్షుత్పిపాసాదిధర్మముల కచ్చట ప్రసక్తి లేదు.

అవ. ఆ చిద్రూపవస్తువునందును నధ్యాసవశముగా క్షుత్పిపాసాదు లుండు నని యనఁగూడదా యని శంకించి యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. చిద్రూపేఽపి ప్రసజ్యేరం స్తాదాత్మ్యాధ్యాసతో యది,
మాధ్యాసం కురు కింతు త్వం వివేకం కురు సర్వదా. 250

వ్యా. వస్తుతస్తత్ప్రతీత్యభావేఽపి భ్రాంత్యా తత్ప్రసక్తిస్స్యాదితి శంకతే—చిద్రూపేఽపీతి. ఏవం తర్హ్యనర్థహేతోరధ్యాసస్య నివృత్తయే సదా వివేకః క్రియతామిత్యాహ—మాధ్యాసమితి.

టీ. తాదాత్మ్యాధ్యాసతః=అన్యోన్యాధ్యాసమువలన, చిద్రూపేఽపి=చిద్రూపుఁడైన యాత్మయందును, ప్రసజ్యేరన్ యది = చేరు నని యంటివా, త్వం = నీవు,

అధ్యాసం=అధ్యాసమును, మా కురు = చేయఁబోకుము. కింతు=ఇఁక నేమి యనఁగా, సర్వదా = ఎల్లప్పుడును, వివేకం = (కూటస్థచిదాత్మ యొక్కయు, అహంకారాదుల యొక్కయు) విభజనమును, కురు=చేయుము.

తా. అన్యోన్యాధ్యాసమువలన క్షుత్పిపాసాదుల చిద్రూపుని యందే ప్రసక్తము లగు నని యంటివా? అధ్యాసమునే చేయకు. కూటస్థ చిదాత్మను అహంకారాదులను విభజించి క్షుత్పిపాసాదులు అహంకారధర్మము లని తెలిసికొనుము.

అవ. అనాదివాసనావశమున నధ్యాసము వదలక వెంటఁబడుచున్న దంటివా, అవివేకమునే దృఢముగా చేసికొనిన నది నివర్తించును. అధ్యాసము నివర్తించుట కింత కన్న నుపాయాంతరము లేదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఝడిత్యధ్యాస ఆయాతి దృఢవాసనయేతి చేత్,
ఆవర్తయేద్వివేకం చ దృఢం వాసయితుం సదా. 21

వ్యా. అనాదివాసనావశాత్ పునః పునరధ్యాసాగమనే తన్నివృత్తయే వివేక ఏవావర్తనీయః. నోపాయాంతర మిత్యాహ—ఝడితీతి.

టీ. దృఢవాసనయా=దృఢమైన వాసనచేత, ఝడితి = శీఘ్రముగా, అధ్యాసః= అన్యోన్యాధ్యాసము, ఆయాతి ఇతి చేత్=వచ్చుచున్న దని యనినచో, దృఢం=దృఢముగా, వాసయితుం = నిల్పుటకొఱకు, వివేకం చ=వివేకమును, (కూటస్థుఁడును చిదాభాసుఁడును వేఱనెడి జ్ఞానమును), ఆవర్తయేత్ = పలుమారు వల్లెవేయవలయును (అభివృద్ధి చేయవలయును).

తా. అనాదివాసనచేత నన్యోన్యాధ్యాసము శీఘ్రముగా నివర్తింపక పోయెనేని కూటస్థచిదాభాసుల స్వరూపవిచారణమును బలుమాఱు గట్టిగా చేయఁగా నది పూర్తిగా నివర్తింపఁగల దని భావము.

అవ. ఎంతకాలము విచారణ చేసినను, ద్వైతము మిథ్య యని యుక్తి కుదురునే కాని యనుభవము కలుగదు అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వివేకే ద్వైతమిథ్యాత్వం యుక్త్యైవేతి న భణ్యతాం,
అచింత్యరచనాత్వస్యానుభూతిర్హి స్వసాక్షికీ. 22

వ్యా. నను విచారేణ ద్వైతస్య మాయామయత్వం యుక్త్యైవ సిధ్యతి. నానుభవత ఇత్యాశంక్యాచింత్యరచనాత్వలక్షణమిథ్యాత్వానుభవస్య స్వసాక్షికత్వాన్నైవమితి పరిహరతి—వివేక ఇతి.

టీ. వివేకే సతి = వివేకము కలుగుచుండఁగా, యుక్త్యైవ = యుక్తిచేతనే, ద్వైతమిథ్యాత్వం = ద్వైత మసత్య మగుట, ఇతి=అని, న భణ్యతాం = అనకుము. అచింత్యరచనాత్వస్య - అచింత్య = ఆలోచింప శక్యముకాని, రచనాత్వస్య = రచన గలుగుటయొక్క, అనుభూతిః = అనుభవము, స్వసాక్షికీ - స్వ = తానే, సాక్షికీ = సాక్షిగాఁ గలది.

తా. అచింత్యరచనాస్వభావలక్షణము గల ద్వైతమిథ్యాభావము నకు అనుభవమే సాక్షిగాఁ గలిగి యున్నది. కనుక అనుభవముచేత ద్వైతమునకు మాయామయత్వము సిద్ధింపలే దని చెప్పఁగూడదు.

అవ. మీరు అచింత్యరచనయే మిథ్యాత్వమునకు లక్షణమని చెప్పితిరి. అట్టిలక్షణము చిదాత్మునియందు నున్నది అని అతివ్యాప్తిని శంకింపఁగా నొక మాట చెప్పఁబూనుకొని కొంతవఱ కంగీకరించినట్లు నటించి యాయాక్షేపమును ఖండించుచున్నాఁడు:—

శ్లో. చిదప్యచింత్యరచనా యది తర్హ్యాస్తు నో వయం,
చితం సుచింత్యరచనాం బ్రూమో నిత్యత్వకారణాత్. 253

వ్యా. నన్వచింత్యరచనాత్వం మిథ్యాపదార్థలక్షణముక్తం చిదాత్మన్యతివ్యాప్తమితి శంకతే—చిదపీతి. ప్రాగభావయుక్తత్వే సత్యచింత్యరచనాత్వం మిథ్యాత్వలక్షణమితి వివక్షురచింత్యరచనాత్వమాత్మనోఽంగీకరోతి—తర్హ్యాస్త్వితి. ఏవమంగీకారేఽపసిద్ధాంత ఇత్యాశంక్య పరిహరతి—నో వయమతి. తత్ర హేతుమాహ—నిత్యత్వేతి. వయం చితం సుచింత్యరచనాం నో బ్రూమ ఇతి యోజనా.

టీ. చిదపి=చిద్రూపుఁడగు కూటస్థుఁడును, అచింత్యరచనా యది - అచింత్య= ఆలోచింప నలవి గాని, రచనా యది=కల్పనారూపము గలదని యంటివేని, తర్హ్యాస్తు= సరి అగుఁగాక, నిత్యత్వకారణాత్ = నిత్యమైయుండుటవలన, చితం=చిత్తును, వయం= మేము, సుచింత్యరచనాం - సుచింత్య = విచారింపశక్యమైన, రచనాం = రచన గల దానినిగా, నో బ్రూమః = చెప్పము.

తా. కూటస్థచిద్రూపుఁడు గూడ నచింత్యరచనాస్వరూపము గలవాఁ డందువా ? పోనీ! అట్లే కానిమ్ము. అట్లయినపక్షమున మీ యద్వైతసిద్ధాంతవిరోధము గాదా యనెదవా ? మేము చిద్రూపమును సుచింత్యరచనాస్వరూపము గలదానినిగాఁ జెప్పము. అనఁగా తాను ప్రాగభావముతోఁ గూడిన యచింత్యరచనాత్వము మిథ్యాత్వమునకు లక్షణముగాఁ జెప్పఁదలంచుటచేతను, అది నిత్యము గనుకను మాకపసిద్ధాంతప్రసక్తి లే దని యొప్పెను.

అవ. చిద్రూపమునకు నిత్యత్వ మెట్లు కుదురు నని శంక రాఁగా నుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రాగభావో నానుభూత శ్చితే ర్నిత్యా తతశ్చితిః,
ద్వైతస్య ప్రాగభావస్తు చైతన్యేనానుభూయతే. 254

వ్యా. చితేర్నిత్యత్వం కుత ఇత్యాశంక్య ప్రాగభావానుభవాభావాదిత్యాహ— ప్రాగభావ ఇతి. యతశ్చితేః ప్రాగభావో నానుభూత స్తతో నిత్యేతి యోజనా. ఇద మత్రాకూతం. చితేః ప్రాగభావోఽస్తీతి వదన్ ప్రష్టవ్యః—చిత్ప్రాగభావః కిం చితానుభూయతే? ఉతాన్యేన? నాన్యేన తస్య జడత్వేనానుభవితృత్వానుపపత్తేః. చితానుభూయత ఇత్యపి పక్షే కించిదంతరేణోత స్వేనైవ? నాద్యః. అద్వైతవాదే చిదంతరస్యైవాభావాత్. తత్స్వీకారేఽపి చిత్ప్రతియోగికస్యాభావస్య చిద్గ్రాహణమంతరేణ గ్రహీతు మశక్యత్వాత్. తస్యా అపి గృహ్యమాణత్వే ఘటాదివదచిత్త్వాపత్తేః. నాపి ద్వితీయస్స్వాభావస్య స్వేన గ్రహీతుమశక్యత్వాదితి. నను ద్వైతస్య ప్రమాత్రాది భేదరూపత్వాత్తదభావస్య చ తేనైవానుభవితుమశక్యత్వాత్తదనుభవిత్రంతరాభావాచ్చ చైతన్యవదేవ ద్వైతస్యాపి నిత్యత్వాపత్తిరిత్యాశంక్యానుభవిత్రంతరాభావోఽసిద్ధ ఇతి పరిహరతి—ద్వైతస్యేతి. జాగ్రదాదిద్వైతాభావస్య సుషుప్తౌ సాక్షిణానుభూయమానత్వాత్ "తమసస్సాక్షీ సర్వస్య సా" క్షీతి శ్రుతే శ్చేతి భావః.

టీ. చితేః = చిద్రూపమునకు, ప్రాగభావః=పూర్వము లేకపోవడము, న అనుభూతః = అనుభవింపఁబడియుండలేదు. తతః=ఆకారణమువలన, చితిః = చిద్రూపము, నిత్యా=నిత్యమైన దగును. ద్వైతస్య=ద్వైతముయొక్క, ప్రాగభావస్తు=ప్రాగభావ మనినను, చైతన్యేన=చైతన్యముచే, అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది.

తా. చైతన్యముయొక్క ప్రాగభావ మెవనిచేతను ననుభవింపఁబడలేదు గనుక నది నిత్య మనఁబడుచున్నది. ద్వైతముయొక్క ప్రాగభావము సుషుప్తికాలమున సాక్షిచైతన్యముచేత ననుభవింపఁబడుచున్నది గనుక దానికి మిథ్యాత్వము చెప్పవలయును. ప్రాగభావ మనఁగా పూర్వమందులేమి.

అవ. పైనఁ జెప్పఁబడినవిధమున ద్వైతమిథ్యాత్వము సిద్ధించె నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రాగభావయుతం ద్వైతం రచ్యతే హి ఘటాదివత్,
తథాఽపి రచనాఽచింత్యా మిథ్యా తేనేంద్రజాలవత్. 255

వ్యా. ఏవం చ ప్రాగభావయుతత్వే సత్యచింత్యరచనాత్వస్య మిథ్యాత్వలక్షణస్య సద్భావాత్ ద్వైతమిథ్యాత్వం సిద్ధమిత్యాహ—ప్రాగభావేతి. ప్రాగభావయుతమితి హేతుగర్భితం విశేషణం ద్వైతం ప్రాగభావయుతత్వాత్ ఘటాదివద్రచ్యతేహి. తథాపి రచ్యమానత్వేఽపి. తస్య ద్వైతస్య రచనాఽచింత్యా. తేన రచ్యమానత్వే సత్యచింత్యరచనాత్వేనైంద్రజాలికప్రాసాదవన్మిథ్యేత్యర్థః.

టీ. ప్రాగభావయుతం = ప్రాగభావముతోఁ గూడుకొనిన, ద్వైతం = ద్వైతప్రపంచము, ఘటాదివత్ =ఘటపటాదిపదార్థమువలె, రచ్యతే = కల్పింపఁబడుచున్నది. తథాపి = అట్లు కల్పింపఁబడినప్పటికిని, రచనా=ద్వైతకల్పనము, అచింత్యా = ఇట్టిదని యాలోచింప శక్యము గాని దగుమ. తేన = ఆకారణముచేత, (కల్పనాస్వరూపము లగుటచేత), ఇంద్రజాలవత్ = ఇంద్రజాలమువలె, మిథ్యా=అసత్యమైనది. (భవతి = అగుచున్నది).

తా. ద్వైతము ప్రాగభావముతోఁ గూడిన దగుచు ఘటాదులవలె రచింపఁబడుచున్నది. అట్లు రచింపఁబడినప్పటికిని గారడివానిచేతఁ గనఁబఱచఁబడిన వస్తువులవలె, ద్వైతముయొక్కకల్పనయు నెట్లు రచింపఁబడినదో యోచింప శక్యము కాదు గనుక ద్వైతము మిథ్యయగుచున్నది.

అవ ఇంతవఱకు చిద్రూపముయొక్క నిత్యతయు, చిద్వ్యతిరిక్తమైనదానికి మిథ్యాత్వమును సాధింపఁబడినవి కాని అద్వైతబ్రహ్మతత్త్వమున కపరోక్షత్వము సాధింపఁబడ లేదంటివా? నీ స్వవచనమునకు వ్యాఘాతము కలుగుచున్నది. అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. చిత్ప్రత్యక్షా తతోఽన్యస్య మిథ్యాత్వం చానుభూయతే,
నాద్వైతమపరోక్షం చేత్యేతన్న వ్యాహతం కథమ్. 256

వ్యా. చితిస్తావత్స్వప్రకాశత్వేన నిత్యాపరోక్షా చ భాసతే. చిద్వ్యతిరిక్తస్య చ మిథ్యాత్వం తయైవ చితానుభూయత ఇతి దర్శితం. ఏవం చ సత్యద్వైతస్యాపరోక్షత్వం నాస్తీతి వదతో వ్యాఘాతశ్చ స్యాదిత్యాహ—చిత్ప్రత్యక్షేతి. చిద్రూపేణ భాసనాదిత్యభిహితయుక్తి సముచ్చయార్థచ్చశబ్దః అద్వైతమపరోక్షం నేత్యేతత్కథం న వ్యాహతం చేతి యోజనా.

టీ. చిత్ = చైతన్యము, ప్రత్యక్షా = స్ఫూర్తిరూపము (అగును). తతః = ఆచైతన్యముకంటె, అన్యస్య = వేఱైనద్వైతమునకు, మిథ్యాత్వం చ = మిథ్య యగు

టయును, అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది. అద్వైతం = అద్వైతము, అపరోక్షం = పరోక్షము కాదు. ప్రత్యక్షమైన దనుట. నేతి=కా దని, ఏతత్ = ఈ నీ మాట, కథం=ఎట్లు? న వ్యాహతం=కొట్టువడదు? (విరోధమగును అనుట). ఈశ్లోకము నందలి చ శబ్దముచేత ౨౪౫ శ్లోకములో చెప్పఁబడిన యుక్తిసమూహము సూచిత మగుచున్నది.

తా. చైతన్యము తనను ప్రత్యక్షముగాఁ దెలిసికొనుటయందన్యవస్తువు నపేక్షింపకయే తెలిసికొనుచున్నది. ద్వైతము జడస్వరూపమగుటచేత, అటుల తనను తాను తెలిసికొనఁజాలక చైతన్యముచేతఁ దెలియఁబడిన కారణముచేత ద్వైతము మిథ్య యగు ననియుఁ దెలుపఁబడి యుండెను. ఇట్లు తెలుపఁబడియుండినను మఱల చైతన్య మపరోక్షము గా దని నీ వనుట విరుద్ధము.

అవ. "ఉపనిషదర్థము నిట్లెఱిగినవారుకూడ నిట్టి అద్వైతబ్రహ్మతత్త్వమునందేల విశ్వాసమును బొందరు" అని ద్వైతవాది యడుగఁగా సిద్ధాంతి యెదురెత్తుగ చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం జ్ఞాత్వాఽప్యసంతుష్టాః కేచిత్కుత ఇతీర్యతాం,
చార్వాకాదేః ప్రబుద్ధస్యాప్యాత్మా దేహః కుతో వద. 257

వ్యా. ఏవం వేదాంతార్థం జానతామపి పురుషాణాం కేషాంచి దత్ర విశ్వాసః కుతో న జాయత ఇతి పృచ్ఛతి—ఇత్థమితి. సమ్యగ్విచారశూన్యత్వాదితి వివక్షుః ప్రతిబందీం గృహ్ణాతి—చార్వాకాదేరితి. ఆదిశబ్దేన పామరా గృహ్యంతే. ప్రబుద్ధస్య ఊహాపోహకుశలస్య.

టీ. ఇత్థం=ఈలాగున, కేచిత్=కొందఱు, జ్ఞాత్వాపి = ఉపనిషదర్థ మెఱిఁగినను, కుతః = ఎందువలన, అసంతుష్టాః=సంతోషమును బొందరో, ఈర్యతాం=తెలుపఁబడుఁగాక ! అని యడిగితివేని, ప్రబుద్ధస్య = తెలివితేటలు గల, చార్వాకాదేరపి = చార్వాకుఁడు మొదలగువారికిని, పామరులకును, దేహః = స్థూలదేహము, ఆత్మా=ఆత్మ యగుట, కుతః = ఎందువలన? వద = చెప్పుము.

తా. ఉపనిషదర్థమును తెలిసికొనినవారయ్యు దానియందు సంతోషవిశ్వాసములను కొంద ఱేల పొంద రని న న్నడిగితివి. నేనును నిన్ను నొకటి యడిగెదను. చార్వాకాదులు మంచి తెలివితేటలు గలవారు గదా? ఈస్థూలదేహమే యాత్మ యని యేల పొరపడిరో చెప్పుము.

నే నడిగినదానికి నీ వేమి సమాధానము చెప్పెదవో అదియే నేను చెప్పెడి యుత్తర మని తెలిసికొనుము, అని సిద్ధాంతి ప్రతిద్వంద్విసమాధానము చెప్పెను.

అవ. ఇప్పుడు పూర్వవాది ప్రతిబందీమోచనమును శంకింపఁగా సిద్ధాంతి సరసమైనపద్ధతిలో బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. సమగ్విచారో నాస్త్యస్య ధీదోషాదితి చేత్తథా,
అసంతుష్టాస్తు శాస్త్రార్థం న త్వీక్షంత విశేషతః. 258

వ్యా. ప్రతిబందీమోచనం శంకతే—సమ్యగితి. సామ్యేన సమాధత్తే—తథేతి, ధీదోషాదిత్యనువర్త్యతే. తుశబ్ద ఏవశబ్దార్థః.

టీ. అస్య = ఈ చార్వాకుఁడు మొదలగువర్గమునకు, ధీదోషాత్=బుద్ధిదోషమువలన, సమ్యక్ = చక్కఁగా, విచారః = ఉపనిషదర్థవిచారము, నాస్తీతి చేత్=లే దనియంటివా, అసంతుష్టాస్తు=వేదాంతార్థము నెఱింగినను చిత్తవిశ్రాంతి నొందనివారలన్ననో. విశేషతః = అతిశయముగా, శాస్త్రార్థం=ఉపనిషదర్థమును, న త్వీక్షంత = జాగ్రత్తగా పరిశీలింపరు (పరిశీలించి తెలిసికొనరు.)

తా. చార్వాకాదులకు బుద్ధిదోషమువలన స్థూలదేహమె యాత్మయగు నని తోఁచునో యటులనే యుపనిషదర్థ మెఱిఁగినవారును శాస్త్రార్థమును చక్కఁగా పరిశోధించి తెలిసికొనకపోవుటచే చిత్తవిశ్రాంతి నొందలే రని తెలియుము.

అవ. ఇప్పుడు ఇదివఱలో విచారణచేసిన తత్త్వజ్ఞానమునకు ఫలమును, నట్టి ఫలమును దెల్పెడు శ్రుతిని దెల్పుచున్నాఁడు:—

శ్లో. యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః,
ఇతి శ్రౌతం ఫలం దృష్టం నేతి చేద్దృష్టమేవ తత్. 259

వ్యా. ఇత్థం తత్త్వం విచార్య తజ్జన్యతత్త్వజ్ఞానఫలం విచారయితుం తత్ప్రతిపాదికాం శ్రుతిం పఠతి—యదేతి. "అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" ఇతి. అస్య మంత్రస్యోత్తరార్ధం అస్య ముముక్షోర్హృది శ్రితాయే కామాస్తాదాత్మ్యాధ్యాసమూలా ఇచ్ఛాదయస్సంతి, తే సర్వే యదా యస్మిన్ కాలే ప్రముచ్యంతే తత్త్వజ్ఞానేధ్యాసనివృత్తౌ నివర్తంతే, అథ తదానీమేవ మర్త్యః పూర్వం దేహతాదాత్మ్యాధ్యాసేన మరణశీలః పురుషః అమృతః అధ్యాసాభావేన తద్రహితో భవతి. తత్ర హేతుమాహ— "అత్ర బ్రహ్మ సమశ్నుతే" ఇతి. అత్రాస్మిన్నేవ దేహే బ్రహ్మ సత్యాదిలక్షణం సమశ్ను

తే సమ్యగాప్నోతీత్యస్యాశ్శ్రుతేరర్థః. శ్రుత్యా ప్రతిపాదితం ఫలం కామనివృత్త్యాది లక్షణం నానుభవసిద్ధం. కింతు శాబ్దమేవేతి శంకతే—శ్రౌతమితి. సమనంతర శ్రుతి వాక్యతాత్పర్యపర్యాలోచనయా తస్య దృష్టత్వం సిధ్యతీత్యభిప్రాయేణ పరిహరతి—దృష్టమేవ తదితి.

టీ. యదా=ఎప్పుడు, అస్య = ఈసాధకునియొక్క, హృది = హృదయమందు, శ్రితాః = ఉండిన, యేకామాః = ఏకోరికలు గలవో, తే సర్వే = అవి యన్నియు, ప్రముచ్యంతే=విడువఁబడుచున్నవి. ఇతి=ఇట్లు, శ్రౌతం = శ్రుతియందుఁ జెప్పఁబడిన, ఫలం=తత్త్వజ్ఞానఫలము, దృష్టం = కనఁబడుచున్నది. నేతి చేత్ = తత్త్వజ్ఞానఫలము ప్రత్యక్షముగా దంటివేని, తత్ = అది, అనఁగా తత్త్వజ్ఞానఫల మనుట, దృష్టమేవ= ప్రత్యక్షమైనదే యగును. అని మఱియొక శ్రుతి చెప్పుచున్నది.

తా. శ్రు. "యదా సర్వే ప్రముచ్యంతే" అని ప్రారంభము చేసి ఈశ్రుతికడకు శ్రు. "అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అని చెప్పినది. దీని తాత్పర్య మేమి యనఁగా—సాధకునియొక్క హృదయమునందు నధ్యాసమూలకములైన రాగద్వేషాదు లున్న కాలమున నితఁడు మర్త్యుఁ డనఁబడుచున్నాఁడు. మర్త్యుఁ డనఁగా మరణించెడు వాఁడు. అధ్యాసమూలకములైన రాగద్వేషాదులు పూర్తిగా పోయినప్పుడు మరణము లేనివాఁడై ఈదేహమునందే సత్య జ్ఞానాదిలక్షణములు గల బ్రహ్మస్వరూపమును అపరోక్షముగా(తానేనై) యనుభవించుచున్నాఁడు. అని తత్త్వజ్ఞానఫలము ఈదేహమందే కన వచ్చు ననెడి శ్రుతితాత్పర్యమునుబట్టి బ్రహ్మజ్ఞానఫలము ప్రత్యక్ష మగు నని తెలియవలెను.

అవ. ఇట్టి బ్రహ్మాపరోక్షజ్ఞానము లేకపోవుటయే గ్రంథి యనఁబడుచున్నది అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యదా సర్వే ప్రభిద్యంతే హృదయగ్రంథయ స్త్విత్తి,
కామా గ్రంథిస్వరూపేణ వ్యాఖ్యాతా వాక్యశేషతః. 200

వ్యా. తస్య దృష్టత్వస్పష్టీకరణాయ తద్వాక్యముదాహృత్య తస్యార్థమాహ—యదా సర్వ ఇతి. అనేన వాక్యశేషేణ కామప్రమోకస్య గ్రంథిభేదత్వేన వ్యాఖ్యాతత్వాద్గ్రంథిభేదస్యాహంకారచిదాత్మనోస్తాదాత్మ్యాధ్యాసనివృత్తిలక్షణస్యానుభవ సిద్ధత్వాన్నాప్రత్యక్షతేతి భావః. వాక్యశేషత ఇత్యనేన వాక్యేనేత్యర్థః.

టీ. యదా = ఎప్పుడు, హృదయగ్రంథయః = హృదయగ్రంథులు, సర్వే = అన్నియు, ప్రభిద్యంతే = తెగిపోవునో, ఇతి=ఈలాగున, కామాః=రాగద్వేషాదులు, గ్రంథిస్వరూపేణ = పీటముడులవంటి వని, వాక్యశేషతః = కడపటి వాక్యమువలన, వ్యాఖ్యాతాః=విశదముగ తెలుపఁబడినవి.

తా. హృదయగ్రంథు లనఁగా జడమైన అహంకారమునకు చిదాత్మకు తాదాత్మ్యాధ్యాస మగును. అట్టి యధ్యాసముచేతనే రాగద్వేషాదులు హృదయమున పీటముళ్లవలె దుర్భేద్యములై యున్నవి. అవి యెప్పుడు తత్త్వజ్ఞానము గలుగునో అప్పుడు విడి పోవుచున్నవి. అని "యదా సర్వే ప్రభిద్యంతే హృదయగ్రంథయస్త్విత్తి" (విజ్ఞాననిష్ఠాకాలమందు సకల హృదయగ్రంథులును భేదింపఁబడుచున్నవో) యను నీశ్రుతి విశదపఱచుచున్నది.

అవ. లోకమున కామ మనఁగా కోరిక యని వాడుచున్నారు కాని గ్రంథి యని వాడుక లేదు. గ్రంథి యని కామము నేల చెప్పితి వని యాశంకించి బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. అహంకారచిదాత్మానా వేకీకృత్యావివేకతః,
ఇదం మే స్యా దిదం మే స్యాదితీచ్ఛాః కామశబ్దితాః. 261

వ్యా. నను, లోకే కామశబ్దేనేచ్ఛాభేద ఏవోచ్యతే. అతః కథం తస్య గ్రంథిత్వేన వ్యాఖ్యానమిత్యాశంక్యాధ్యాసమూలస్యైవేచ్ఛావిశేషస్య కామశబ్దవాచ్యత్వం నేచ్ఛామాత్రస్యేత్యాహ—అహంకారేతి.

టీ. అవివేకతః = అజ్ఞానమువలన, అహంకారచిదాత్మానా - అహంకార=అహంకారమును. చిదాత్మానౌ = కూటస్థచైతన్యమును, ఏకీకృత్య=ఏకముగా చేసి, (రెంటికిని తాదాత్మ్యాధ్యాసముచేసి) ఇదం=ఇది, మే=నాకు, స్యాత్=కావలెను, ఇదం=ఇది, మే=నాకు, స్యాత్=కావలెను. ఇతి=ఇటువంటి, ఇచ్ఛాః=కోరికలు, కామశబ్దితాః=కామములని చెప్పఁబడుచున్నది.

తా. అచిత్తైన అహంకారమును చిద్రూపుఁడైనకూటస్థుని ఒక్కటిగాఁ దలంచుట చిదచిద్గ్రంథి యనఁబడును. ఇదియే అజ్ఞానమువలనఁ గలిగిన యధ్యాసము. అట్టి అధ్యాసముచేత 'నిది నాకుఁ గావలె నిది నాకుఁ గావలయు' ననెడి యిచ్ఛలు కామము లని చెప్పఁబడుచున్నవి.

అవ. అధ్యాసమువలన కలిగిన కామమును పరిత్యజింపవలయును. అనినపుడు

ఇంతకంటె వేఱైనవస్తువు నవలంబించి కదా విడువవలయును, అనెదవేమొ.
సమ్మతమే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అప్రవేశ్య చిదాత్మానం పృథక్పశ్య న్నహంకృతిం,
ఇచ్ఛం స్తు కోటివస్తూని న బాధో గ్రంథిభేదతః.

వ్యా. నన్వధ్యాసమూలస్యైవ కామస్య త్యాజ్యత్వే సతీతరోఽభ్యుపే
స్స్యాదిత్యాశంక్య బాధకత్వాభావాదభ్యుపేయతయేత్యాహ—అప్రవేశ్యేతి. అహం-
కారే చిదాత్మానమప్రవేశ్య తాదాత్మ్యాభ్యాసేనానంతర్భావ్యేత్యర్థః.

టీ. చిదాత్మానం=ప్రత్యగాత్మను, అప్రవేశ్య = అహంకారముతో
అహంకృతిం = జడమైన యహంకారమును, పృథక్ = ప్రత్యగాత్మకంటె
పశ్యన్ = కనుఁగొనుచు, గ్రంథిభేదతః - గ్రంథి=చిదచిద్గ్రంథి యనెడు
భేదతః = తెంపివేయుటవలన (వేఱుగా తెలిసికొనుటవలన) కోటివస్తూని =
వస్తువులను, ఇచ్ఛన్ = కోరుచుండినను, న బాధః = ఏవిధమైన బాధయును
(మాకాక్షేపము లే దనుట).

తా. ప్రత్యగాత్మను అహంకారముకంటె విలక్షణమైన
గను దానితో నంటినదానినిగను దెలిసికొనుట గ్రంథిభేదము (అ
నివృత్తి) యనఁబడుచున్నది. అప్పు డేయేకోరిక లున్నను నవి
నకు సుఖదుఃఖాద్యనర్థములను నీయఁజాల వని తెలియవలెను.

అవ. అధ్యాస మెపుడు నివర్తించెనో యటుపైన కోరికలు పొడముట
దందు వేమో? ప్రారబ్ధకర్మవశమువలన కామాదులు పుట్టినను పుట్టవచ్చును అని
చున్నాఁడు:—

శ్లో. గ్రంథిభేదేఽపి సంభావ్యా ఇచ్ఛాః ప్రారబ్ధదోషతః,
బుద్ధ్వాఽపి పాపబాహుళ్యాదసంతోషో యథా తవ.

వ్యా. నన్వధ్యాసాభావే కామానామనుదయాపత్తిస్స్యాదిత్యాశంక్య
వశాత్తేషా ముత్పత్తిస్సంభవిష్యతీత్యాహ — గ్రంథిభేదేఽపీతి. అత్ర
మాహ—బుద్ధ్వాపీతి.

టీ. యథా=ఎట్లు, బుద్ధ్వాపి = వేదాంతార్థమును తెలిసినప్పటికిని, పాప
ళ్యాత్=పాపాధిక్యమువలన, అసంతోషః=తృప్తిలేకపోవుట, తవ=నీకు, (ఆసీత్
పించెనో), తథా=అటు, గ్రంథిభేదేఽపి = చిదచిద్గ్రంథి వీడిపోయినను, ప్రారబ్ధదో

ప్రారబ్ధ = ప్రారబ్ధకర్మముయొక్క, దోషతః = లోపమువలన, ఇచ్ఛాః = కామాదులు, సంభావ్యాః = సంభవింపవచ్చును.

తా. వేదాంతార్థము నెన్నివిధముల నెంతగా బోధించినను పాపాధిక్యమువలన నీకు సంతోషము గలుగని విధంబున గ్రంథిభేదము గలిగినను (అధ్యాస నివర్తించినను) ప్రారబ్ధకర్మదోషమువలన కామాదులు పుట్టుట యసంభవము గాదని గ్రహింపుము.

అవ. అధ్యాస పోయినతర్వాత నహంకారాదిసంబంధము లైన కామాదులు అనర్థదాయకములు కా వని దృష్టాంతములను చెప్పుచున్నాఁడు:—

శ్లో. అహంకారగతేచ్ఛాద్యైర్దేహవ్యాధ్యాదిభిస్తథా,
వృక్షాదిజన్మనాశైర్వా చిద్రూపాత్మని కిం భవేత్. 264

వ్యా. అధ్యాసాభావేఽహంకారగతేచ్ఛాదేరబాధకత్వం దృష్టాంతద్వయప్రదర్శనేన విశదయతి—అహంకారేతి. యథా దేహగతవ్యాధ్యాదిభిరహంకారసాక్షిణో బాధో నాస్తి, దేహసంబంధరహితత్వాత్. యథా వా వృక్షాదిగతైర్జన్మాదిభిరేవమధ్యాస నివృత్తావహంకారగతేచ్ఛాదిభిరపి చిద్రూపాత్మని కిం భవేదితి భావః.

టీ. చిద్రూపాత్మని = చిత్స్వరూపుఁడైన ప్రత్యగాత్మయందు, అహంకారగతేచ్ఛాద్యైః-అహంకార=అంతఃకరణమునందు, గత=ఆశ్రయించియుండిన, ఇచ్ఛాద్యైః= కామాదులచేతఁగాని, దేహవ్యాధ్యాదిభిః = దేహమునందలి రోగములు మొదలగు వానితోఁగాని, తథా = అలాగున, వృక్షాదిజన్మనాశైర్వా - వృక్షాది = చెట్లు చేమలు మొదలగువానియొక్క, జన్మనాశైర్వా = ఉత్పత్తివినాశములతోఁగాని, కిం భవేత్ = ఏమి యపాయము గలుగును? (ఏమి యపాయమును లే దనుట).

తా. సాధకున కెప్పు డధ్యాసము నివర్తించినదో యప్పుడు వాఁడు దేహాహంకారాదులతో సంబంధములేక వాని కన్నింటికిని సాక్షి చిద్రూపుఁడై యలరారుచుండఁగా దేహమునం దుండు రోగాదులును చెట్లచేమలయం దుండు నుత్పత్తివినాశంబులును బాధింపనితెఱంగున నహంకారమున నుండు కామాదులును నెంతమాత్రము ఆచిద్రూపుని బాధింపఁజాల వని గ్రహింపుము.

అవ. ప్రత్యగాత్మ యసంగస్వరూపుఁడును నద్వితీయుండును నగుటవలన నధ్యాస మున్నకాలమునఁగూడ కామాదిబాధలు లేకపోవలయుఁగదా యనిన, నా కనుకూలమైన యాశంక నే చేసితి వని సంతసించుచు, నుత్తరము జెప్పుచున్నాఁడు:—

శ్లో. గ్రంథిభేదా త్పురాప్యేవమితి చేత్తన్న విస్మర,
అయమేవ గ్రంథిభేద స్తవ తేన కృతీ భవాన్. 265

వ్యా. నను చిదాత్మనోఽసంగస్యైకరూపత్వాత్పూర్వమపి కామాదిబాధో నాస్తీతి శంకతే—గ్రంథిభేదాదితి. ఏవంవిధబోధస్యైవగ్రంథిభేదత్వేనాస్మాభిరభిధీయమానత్వాదిదం చోద్యమస్మదనుకూలమిత్యాహ—తన్నవిస్మరేతి.

టీ. గ్రంథిభేదాత్=గ్రంథివిచ్ఛేదముకంటె, పురాపి = పూర్వముకూడ, (అజ్ఞానదశయందును), ఏవ మితి చేత్ = ఇటుల ప్రత్యగాత్మ యనారోపితస్వరూపుఁడై యున్నాఁడందువేని, తత్ = ఆమాటను, (ఆత్మ యనారోపితస్వరూపుఁ డగుటను), న విస్మర=మఱువకుము. అయమేవ = కూటస్థుఁడు సర్వదా అసంగుఁ డనెడి యీబోధయే, తవ=నీయొక్క, గ్రంథిభేదః = హృదయగ్రంథిని భేదించుట. తేన = ఆయఖండబోధచేత, భవాన్=నీవు, కృతీ=కృతార్థుఁడ వగుచున్నావు.

తా. హృదయగ్రంథి విడిపోవుటకు (అహంకారాదిసాక్షి నని యెఱుంగుటకు)పూర్వ మజ్ఞానదశయందును నిప్పటి జ్ఞానదశయందును లెనే ఆత్మ అసంగుఁడై యనారోపితస్వరూపుఁడై యద్వైతతత్త్వమై ఆనందఘనమై అపరోక్షస్వరూపమై సద్రూపుఁడై చిద్రూపుఁడై యుండు నంటివా? ఉపనిషద్బోధ యదియే. గ్రంథివిచ్ఛేదం బన నిదియే; నేను దెల్పునదియు నిదియే. నీవు శంకించినదియు నిదియే; నేను సమాధానము చెప్పునదియు నిదియే. నీ కట్టితత్త్వబోధ కలిగెనేని దానిని మఱువక దృఢమగునట్లు పూర్వోక్తరీతిగా నావృత్తి చేయుచుఁ గృతార్థుండవు గమ్ము.

అవ. గ్రంథి యనఁగా నిట్టిజ్ఞానము లేకుండుటయే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నైవం జానంతి మూఢాశ్చే త్సోఽయం గ్రంథి ర్న చాపరః,
గ్రంథితద్భేదమాత్రేణ వైషమ్యం మూఢబుద్ధయోః. 266

వ్యా. ఏవంవిధజ్ఞానాభావఏవ గ్రంథిరిత్యాహ—నైవమితి. నను, జ్ఞానినోఽపీచ్ఛాభ్యుపగమే జ్ఞాన్యజ్ఞానినోః కుతో వైలక్షణ్యమిత్యాశంక్య గ్రంథిభేదాతిరేకేణ న కుతోఽపీత్యాహ—గ్రంథితద్భేదేతి.

టీ. మూఢాః = అజ్ఞానులు, ఏవం = ఇటువంటి స్వరూపముగా, న జానంతీతి చేత్ = తెలిసికొనఁజాలరంటి వేని, సోఽయం = అదియే, గ్రంథిః = చిదచిద్గ్రంథి, (భవతి = అగుచున్నది). అపరః = మఱియొక గ్రంథి, న చ=లేదు. మూఢబుద్ధయోః.

మూఢ = అజ్ఞానికిని, బుద్ధయోః = జ్ఞానికిని, గ్రంథితచ్ఛేదమాత్రేణ-గ్రథి = గ్రంథి యుండుటచేతను, తత్ =ఆగ్రంథియొక్క, ఛేదమాత్రేణ=లేకపోవుటచేతను, వైషమ్యం= తారతమ్యము, (భవతి=కలుగును).

తా. అజ్ఞాను లిట్టిస్వరూపమును తెలిసికొనుట లేదే యంటివేని తెలియకపోవుటయే హృదయగ్రంథి యనఁబడును. ఇంతకన్న వేఱుగా గ్రంథి లేదు. ఎవనికి నిట్టిగ్రంథి విడిపోవునో వాఁడు జ్ఞాని యనియు, ఎవనికి నీగ్రంథి విడిపోకయుండునో వాఁడే యజ్ఞాని యనియు నుభయులకు తారతమ్యము గ్రంథివిచ్ఛేదమునుబట్టియు, గ్రంథివిచ్ఛేదము కాకుండుటంబట్టియు నేర్పడిన దని తెలియ నగును.

అవ. వీఁడు జ్ఞాని యనియు వీఁడు అజ్ఞాని యనియు వ్యవహారమునకుఁ గారణాంతరము లే దని తెల్పుచున్నాఁడు:—

శ్లో. ప్రవృత్తౌ వా నివృత్తౌ వా దేహేంద్రియమనోధియాం,
న కించి దపి వైషమ్యమ స్త్యజ్ఞానివిబుద్ధయోః. 267

వ్యా. కారణాంతరాభావమేవ విశదయతి—ప్రవృత్తావితి.

టీ. దేహేంద్రియమనోధియాం - దేహ = దేహముయొక్కయు, ఇంద్రియ = ఇంద్రియములయొక్కయు, మనః = మనస్సుయొక్కయు, ధియాం=బుద్ధియొక్కయు, ప్రవృత్తౌ వా = కర్మములను చేయుటయందుఁగాని, నివృత్తౌ వా=ఊరకుండుటయందుఁగాని అజ్ఞానివిబుద్ధయోః=అజ్ఞానికిని జ్ఞానికిని, కించిదపి = ఏమాత్రమును, వైషమ్యం = తారతమ్యము, నాస్తి=లేదు.

తా. జ్ఞానికిని అజ్ఞానికిని భేదము గ్రంథియొక్క కలిమిలేములంబట్టి యేర్పడినది గాని దేహేంద్రియమనోబుద్ధులయొక్క ప్రవృత్తినివృత్తులంబట్టి యెంతమాత్రము నేర్పడ లే దని స్పష్టముగాఁ దెలియ వలయును.

అవ. ఈ చెప్పఁబడిన యర్థమును దృఢపఱచుటకు దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రాత్యశ్రోత్రియయోర్వేద పాఠాపాఠకృతా భిదా,
నాహారాదావస్తి భేదస్సోఽయం న్యాయోఽత్ర యోజ్యతామ్.

వ్యా. ఉక్తార్థే దృష్టాంతమాహ—బ్రాత్యేతి.

టీ. వ్రాత్యశ్రోత్రియయోః=వ్రాత్యునకును శ్రోత్రియునకును, భిదా=భేదము, వేదపాఠాపాఠకృతా - వేదపాఠ = వేదమును చదువుటచేతను, అపాఠ = వేదమును చదువకపోవుటచేతను, కృతా = ఏర్పడినది. ఆహారాదౌ=భోజనాదివ్యవహారములందు, భేదః=తారతమ్యము, నాస్తి = ఏమాత్రమును లేదు. సః అయం న్యాయః = ఆ యీ న్యాయము, అత్ర = ఈ జ్ఞానివిషయమునను అజ్ఞానివిషయమునను, యోజ్యతాం=సమన్వయము చేసికొనఁబడుఁగాక, (సరిపోవు ననుట).

తా. వ్రాత్యుఁ డనఁగా నుపనయనాదిసంస్కారములు లేని బ్రాహ్మణుఁడు; వేదాధ్యయనాదియోగ్యతలు గల బ్రాహ్మణుఁడు శ్రోత్రియుఁ డనఁబడుచున్నాఁడు. ఉభయులును బ్రాహ్మణులే కదా. ఇందులో మొదటివానిని వ్రాత్యుఁ డనుటకును రెండవవానిని శ్రోత్రియుఁ డనుటకును గారణము వేదాధ్యయనము లేకపోవుటయును అది గలిగి యుండుటయునే. ఇంతియ గాని వారి భోజనాదివ్యవహారములంబట్టి కాదు. ఈవిధంబుననే అజ్ఞానివిషయంబునను జ్ఞానివిషయంబునను నీ దృష్టాంతముంబట్టి సమన్వయము చేయనగును.

అవ. గ్రంథి విడిపోయినవాఁడు జ్ఞాని యగు నని యిదివఱకుఁ జెప్పినమాటకు శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన గీతవాక్యమును ప్రమాణముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి,
ఉదాసీనవదాసీన ఇతి గ్రంథిభిదోచ్యతే. 269

వ్యా. జ్ఞానినో గ్రంథిశూన్యత్వే గీతావాక్యం ప్రమాణయతి—న ద్వేష్టీతి. సంప్రవృత్తాని ప్రాప్తాని దుఃఖాని న ద్వేష్టి. నివృత్తాని సుఖాని న కాంక్షతి. కింతు ఉదాసీనవద్వర్తత ఇత్యర్థః. గ్రంథిభిదా గ్రంథిభేదః.

టీ. సంప్రవృత్తాని=సంప్రాప్తములైన దుఃఖాదులను గూర్చి, (జ్ఞాని) న ద్వేష్టి= ద్వేషింపఁడు, (ఏవగింపఁడు), నివృత్తాని = తొలఁగిన సుఖాదులను, న కాంక్షతి = కోరఁడు. (నా కివి గావలయు నని దేవిరింపఁ డనుట). ఉదాసీనవత్ = ఉదాసీనుని వలె. (ఊరకున్నవానివలె, ఆసీనః = కూర్చుండినవాఁడు, (జ్ఞాని) యనఁబడుచున్నాఁడు. ఇతి=ఇట్లు, గ్రంథిభిదా = గ్రంథిభేదము, (అవిద్యానివృత్తి), ఉచ్యతే = తెలుపఁబడుచున్నది.

తా. జ్ఞాని యగువాఁడు అప్రాప్తముగ లభించినదానిని పరిత్యజింపఁడు. లభింపనివానికై యాశపడఁడు. ఇంక నేమి చేయు ననఁగా

ఏమియుపనిలేనివానివలె నూఱక కూరుచుండియుండును. చిదచిద్గ్రంథి వీడినవాని తెఱంగిట్టి దని కృష్ణపరమాత్మచే భగవద్గీతయం దను గ్రహింపఁబడినది.

అవ. నీ వుదాహరించిన వాక్యము ఉదాసీనుఁడై యుండవలెను అనెడి విధిపర మగును గాని గ్రంథి వీడిపోవలయు ననుటను విధింపదు. అని యాశంకించి బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఔదాసీన్యం విధేయం చేద్వచ్ఛబ్దో వ్యర్థతా మియాత్,
న శక్తా అస్య దేహాద్యా ఇతి చేద్రోగ ఏవ సః. 270

వ్యా. నన్విదం వాక్యమౌదాసీన్యవిధిపరం. న తు గ్రంథిభేదే ప్రమాణమితి శంకతే—ఔదాసీన్యమితి. విధిపరత్వే వచ్ఛబ్దో వ్యర్థస్స్యాదితి పరిహరతి—వచ్ఛబ్ద ఇతి. నను, జ్ఞానిదేహాదేరకార్యక్షమత్వాదప్రవృత్తిర్నతు గ్రంథిభేదాదిత్యాశంక్యోప హసతి—న శక్తాఇతి.

టీ. ఔదాసీన్యం=ఏమియుచేయక యూఱకుండవలయు ననుటను, విధేయం చేత్= విధించుచున్న దని యంటివా? వచ్ఛబ్దః = ఉదాసీనవత్ అనెడి పదంబున నుండు వత్ ప్రత్యయము, వ్యర్థతాం = నిరర్థకమగుటను, ఇయాత్ = పొందును. అర్థము లేని దగు ననుట. అస్య = ఈజ్ఞానియొక్క, దేహాద్యాః=దేహేంద్రియాదులు, న శక్తాః=ఏపనిని జేయఁజాలవు. ఇతి చేత్=ఇట్లంటివా, సః=అట్లేమియు చేయలేకపోవుట, రోగఏవ = వ్యాధియే యగును.

తా. నీ వుదాహరించిన గీతావాక్యము జ్ఞానికి హృదయగ్రంథి భేదము గావలయు ననుటకుఁ బ్రమాణముగా చెప్పితివి. ఆవాక్యమున కర్థ మది గాదు. "జ్ఞానియైనవాఁడు కాలుచేతులు కదల్పక యొకచోట నూఱక కూర్చుండవలయు ననుటను దెలుపుచున్న దని నేనేల యన రాదు" అనియెదవేమో! నీయర్థము వ్యర్థము, అనఁగా నర్థము లేని దని అందలి వచ్ఛబ్దము చెప్పుచున్నది. లేక నీ వన్నయర్థము రావలయు ననిన "ఉదాసీనో ఽయమాసీనః" అని వచ్ఛబ్దము లేకయుండిన నట్లు చెప్ప వచ్చును. అట్లుగాక "వదాసీనః" అని వచ్ఛబ్దముతో చేరియుండుట వలన నూరకుండు వానివలె కూర్చుండవలయు నని యర్థమగును. కనుక నీవనిన యర్థము ఘటింపదు. జ్ఞానియొక్క దేహేంద్రియాదు లేపనిని జేయఁజాలవు గనుక నట్లు చెప్పఁబడె నని యందువేమో! అట్లు

పనిచేయలేక పోవుట గ్రంథిభేదమువలనఁ గాదు, అది రోగమే యగును.

అవ. కానీ, అది రోగమే యనుకొనెదము. తప్పేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వబోధం క్షయవ్యాధిం మన్యంతే యే మహాధియః,
తేషాం ప్రజ్ఞాతివిశదాం కిం తేషాం దుశ్శకం వద. 271

వ్యా. భవతు. కో దోషస్తత్రాహ—తత్త్వబోధమితి. కిం దుశ్శకమసాధ్యమిత్యర్థః.

టీ. యే మహాధియః = ఏబుద్ధిశాలురు, తత్త్వబోధం = తత్త్వజ్ఞానమును, క్షయవ్యాధిం = దేహేంద్రియాదులను క్షీణింపఁజేసెడివ్యాధినిగా, మన్యంతే=తలంతురో, తేషాం = వారియొక్క (అట్లు తలంచినవారియొక్క), ప్రజ్ఞా = తెలివి, అతివిశదా = ఎంత నిర్మలమైనది ? తేషాం = అట్టివారికి, దుశ్శకం = సాధ్యముకానిది, కిం = ఏదియో, వద = చెప్పుము.

తా. దేహేంద్రియాదులు క్షీణించి పనిచేయక యుండెనేని తత్త్వబోధగలవానినిగా నెఱుంగవలయును అనెడి యామహాబుద్ధిమంతులతెలివి నేమి చెప్పవలయును ! తత్త్వజ్ఞానమును క్షయవ్యాధి యనినవారిఁక నెంతటి యకార్యములనైనఁ జేయ వెనుకంజ వేయ రని సిద్ధాంతి హేళనము చేసినాఁడని భావము.

అవ. జ్ఞానులగువారు ప్రవృత్తిని విడిచి నివృత్తులై యున్నట్లు పురాణములలోఁ జెప్పఁబడుచుండఁగా నన్నిట్లేల పరిహసించెద వందువేమో యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. భరతాదేరప్రవృత్తిః పురాణోక్తేతి చేత్తదా,
జక్షన్ క్రీడన్ రతిం విందన్నిత్యశ్రౌషీర్న కిం శ్రుతిమ్. 272

వ్యా. నన్వస్థానే పరిహాసోఽయం జ్ఞానినాం ప్రవృత్త్యభావస్య పురాణసిద్ధత్వాదితి శంకతే—భరతాదేరితి. శ్రుతిమజానానశ్చోదయసీతి—పరిహరతి. జక్షన్నితి. "జక్షన్ క్రీడన్ రమమాణ స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా వయస్యైర్వా నోపజనం స్మరన్నిదం శరీర"మితి శ్రౌతం వాక్యం నాశ్రౌషీరిత్యర్థః. జక్షన్ భక్షయన్. జక్ష భక్షహసనయోరితి ధాతుః. క్రీడన్ స్వేచ్ఛయా విహరన్ రమమాణః స్త్ర్యాదిభిః

నోపజనం స్మరన్నిదం శరీరమితి ఉపజనం జనానాం సమీపే వర్తమానమిదం స్వశరీరం నస్మరన్నానుసందధాన ఇత్యర్థః. శ్లోకే రతిం విందన్నితి శ్రౌతస్య రమమాణ ఇతి పదస్య వ్యాఖ్యానమ్.

టీ. భరతాదేః=భరతుఁడు మొదలైన జ్ఞానివర్గమునకు, అప్రవృత్తిః = ప్రవర్తింపకపోవుట, పురాణోక్తా = పురాణములయందుఁ జెప్పఁబడినది. ఇతి చేత్=ఇట్లందువేమో! తదా=అప్పుడు, జక్షన్ = భక్షించుచు, క్రీడన్=ఆడుచు, రతిం = పుత్రమిత్రాదులయం దనురాగమును, విందన్ = పొందుచు, ఇతి = ఈవిధముగా స్వస్వరూపమున నుండు ననెడి, శ్రుతిం=వేదవాక్యమును, నాశ్రౌషీః కిం = వినలేదా యేమి?

తా. జడభరతాదు లే పని చేయకయు నూరకుండి రని పురాణములలోఁ దెల్పఁబడలేదా యనెదవేమో? శ్రుతిలో జీవన్ముక్తునిస్థితిని దెల్పుచు, భక్షించుచు, ఆడుచు, అనురక్తుఁ డగుచుఁ దన శరీరము నే మఱచి యానందమయుఁడై యున్నట్లు చెప్పఁబడినదే. దానికి నీ వేమి చెప్పెదవో చెప్పుము. అనఁగా వేదార్థముఁ దెలియక యిట్లు ప్రశ్నించుచున్నా వని ఎగతాళిచేసినాఁ డని భావము.

అవ. నేను పురాణమునఁ జెప్పఁబడిన జడభరతాదుల నిర్వ్యాపారత కేమి యర్థ మనిన దానికి ప్రతిగా శ్రుత్యర్థమును చెప్పి హాస్యము చేసితివి. ఇప్పుడైనను పురాణమందుఁ జెప్పఁబడిన యర్థమునకు సమన్వయ మె ట్లందువేని దాని సమన్వయ మి ట్లగు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. న హ్యాహారాది సంత్యజ్య భరతాద్యాస్స్థితాః క్వచిత్,
కాష్ఠపాషాణవ త్కింతు సంగభీతా ఉదాసతే. 273

వ్యా. నను తర్హి పురాణస్య కా గతిరిత్యాశంక్య పురాణమప్యౌదాసీన్య బోధన పరం. న ప్రవృత్త్యభావపరమిత్యభిప్రేత్యాహ—న హ్యాహారాదీతి.

టీ. భరతాద్యాః = జడభరతుఁడు మొదలగువారు, క్వచిత్=ఎన్నఁడును, ఆహారాది=ఆహారాదులను, సంత్యజ్య = వదలిపెట్టి, కాష్ఠపాషాణవత్ - కాష్ఠ = కొయ్యలవలెను, పాషాణవత్ = పాషాణములవలెను, న హి స్థితాః=ఉన్నవారుకారు, కింతు = ఎట్లుండి రనఁగా, సంగభీతాస్సంతః = దారాపుత్రాదిసంగమునకు భయపడిన వా రగుచు, ఉదాసతే = ఉదాసీనులై యుండిరి. ఏమియుం బనిలేనివారివలె వర్తించి రనుట.

తా. పురాణములయందుఁ జెప్పఁబడిన జడభరతుఁడు మొదలగు జ్ఞానులు ఏ పనియుఁ జేయక యాహారాదులను సముతము బరిత్యజించి

యూరకుండుట లేదు. పుత్రమిత్రాదులఁ గైకొనిన, వానితో సంబంధ మేర్పడును అను భయముచేత కాష్ఠప్రాయులుగ నుదాసీనులుగ నుండి రని సమన్వయము చేయఁదగును.

అవ. జడభరతాదులచేత విషయసంగ మేల పరిత్యజింపఁబడినది ?—

శ్లో. సంగీ హి బాధ్యతే లోకై ర్నిస్సంగ స్సుఖమశ్నుతే,
తేన సంగః పరిత్యాజ్య స్సర్వదా సుఖమిచ్ఛతా. 274

వ్యా. సంగోఽపి కుత స్త్యజ్యత ఇత్యత ఆహ—సంగీతి.

టీ. సంగీ=విషయాసక్తిగలవాఁడు, లోకైః=జనులచేత, బాధ్యతే=బాధింపఁబడు చున్నాఁడు. నిస్సంగః = విషయాసక్తిలేనివాఁడు, సుఖం = సౌఖ్యమును, అశ్నుతే= పొందుచున్నాఁడు. తేన = ఆకారణముచేత, సర్వదా = ఎల్లప్పుడును, సుఖం=సౌఖ్య మును, ఇచ్ఛతా = కోరెడువానిచేత, సంగః = విషయాసక్తి, పరిత్యాజ్యః = పరిత్యజింపఁ దగిన దగును.

తా. ఎవఁడు విషయములందాసక్తుఁడై యుండునో యట్టివాఁ డందఱిచే బాధింపఁబడుచున్నాఁడు. విషయాసక్తి లేనివాఁడు సుఖ పడుచున్నాఁడు. జనులచే గౌరవింపఁబడుచున్నాఁడు. కాన సుఖాపేక్ష గలవాఁ డెల్లప్పుడును విషయాసక్తిని విడువవలయును.

అవ. మీరు చెప్పినదానివలన నాకి ట్లర్థమైనది. మనస్సునందు సంగము లేక యుండవలయు నని. అయితే లోపల నిస్సంగులై యున్నను వెలుపట నాహారవిహార ములను జరిపెడువారిని అజ్ఞాను లని జను లందురే యని యాశంకించి యుత్తరము చెప్పు చున్నాఁడు:—

శ్లో. అజ్ఞాత్వా శాస్త్రహృదయం మూఢో వక్త్యన్యథాఽన్యథా,
మూర్ఖాణాం నిర్ణయస్త్వాస్తా మస్మ త్సిద్ధాంత ఉచ్యతే. 275

వ్యా. నను, తర్హి, మానససంగస్యైవ త్యాజ్యత్వేఽంతస్సంగశూన్యానాం బహిర్వ్యవహారతామజ్ఞత్వాదికం జనైః కథముచ్యత ఇత్యాశంక్య, శాస్త్రతాత్పర్య జ్ఞానశూన్యత్వాదిత్యాహ—అజ్ఞాత్వేతి. అలో మూఢవ్యవహారో నాత్ర విచారణీయ ఇత్యాహ—మూర్ఖాణామితి. తర్హి కిమనుసంధేయమిత్యాకాంక్షాయాం శాస్త్ర హృదయమిత్యాహ—అస్మత్సిద్ధాంత ఇతి.

టీ. శాస్త్రహృదయం=శాస్త్రతాత్పర్యమును, అజ్ఞాత్వా=తెలియక, మూఢః = మూఢుఁడు, అన్యథాన్యథా=పలువిధములుగా, వక్తి=చెప్పును. మూర్ఖాణాం = మూర్ఖుల

యొక్క, నిర్ణయః=నిశ్చయము, ఆస్తాం=అట్లుండుఁగాక. అస్మత్ సిద్ధాంతః-అస్మత్=మా యొక్క, సిద్ధాంతః=నిర్ణయము, (శాస్త్రతాత్పర్యము). ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. మూఢులు శాస్త్రతాత్పర్యము నెఱుఁగక వారివారికిఁ దోఁచినటుల పరిపరివిధములఁ బల్కుదురుగాక. వారి నిశ్చయము మన కేల? మాసిద్ధాంతమును అనఁగా వేదాంతశాస్త్రతాత్పర్యమును దెల్పుదుము.

అవ. మీరు దెల్పెడి శాస్త్రతాత్పర్య మేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వైరాగ్యబోధోపరమాః సహాయా స్తే పరస్పరం,
ప్రాయేణ సహ వర్తంతే వియుజ్యంతే క్వచిత్క్వచిత్. 276

వ్యా. కోఽసావిత్యత ఆహ—వైరాగ్యేతి.

టీ. వైరాగ్యబోధోపరమాః - వైరాగ్య = విరక్తియు, బోధ = జ్ఞానమును, ఉపరమాః = ఉపరతియు, తే= ఈ యవి మూఁడును, పరస్పరం=ఒకటికొకటి, సహాయాః = సహాయములగును. ప్రాయేణ=తఱచుగా, సహ వర్తంతే = ఆమూఁడును కలిసియుండును. క్వచిత్ క్వచిత్ = ఒకానొకనియం దొకటికొకటి, వియుజ్యంతే = లేకయుండును.

తా. వైరాగ్యము, బోధ, ఉపరతి ఈమూఁడును నొకటితో నొకటి కలిసి తత్త్వబోధకుఁ దోడ్పడుచు నుండును. ఒక్కొకనియందు నొకటి గాని రెండు గాని లేకను పోవచ్చును.

అవ. వైరాగ్యబోధోపరతు లొకటికొకటి కలిసియుండు ననుటచేత వానికి పరస్పరము భేదము లేదా? అని శంక రాఁగా వానికి పరస్పరము భేదము గల దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. హేతుస్స్వరూపకార్యాణి భిన్నా న్యేషా మసంకరః,
యథావ దవగంతవ్య శ్శాస్త్రార్థం ప్రవివిచ్యతా. 277

వ్యా. వైరాగ్యాదీనాం మన్యోన్యాపరిహారేణావస్థానదర్శనాదభేదశంకాయాం తద్ధేత్వాదీనాం భేదాద్భేదోఽవగంతవ్య ఇత్యాహ—హేతుస్వరూపేతి.

టీ. ఏషాం = ఈవైరాగ్యబోధోపరతులయొక్క, హేతుస్వరూపకార్యాణి = హేతువును, స్వరూపమును, కార్యమును, భిన్నాని = వేఱుగా నున్నవి. శాస్త్రార్థం = శాస్త్రతాత్పర్యమును, ప్రవివిచ్యతా = విభజించి తెలిసికొనువారిచేత, యథావత్ = ఉన్నది యున్నట్లుగా, అసంకరః = వీనికి భేదము, అవగంతవ్యః = తెలిసికొనఁదగినది.

తా. వైరాగ్యబోధోపరతులకు మూఁడింటికిని హేతువు స్వరూపము కార్యమును వేఱువేఱుగా నుండును. శాస్త్రతాత్పర్యమును బాగుగా పరిశీలించి తెలిసికొనెడివాఁడు అవి యెట్లున్నవో అట్లుగానె దేని కది వేఱే యని తెలిసికొనవలయును. అనఁగా నామూఁడును వాస్తవముగా భిన్నము లని భావము.

అవ. ఆమూఁడింటిలో మొదటి దగు వైరాగ్యముయొక్క హేతుస్వరూపకార్యములను దెలుపుచున్నాఁడు:—

శ్లో. దోషదృష్టిర్జిహాసా చ పునర్భోగే ష్వదీనతా,
అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్య త్రయోఽప్యమీ. 278

వ్యా. తత్ర వైరాగ్యస్య హేత్వాదిత్రయం దర్శయతి—దోషదృష్టిరితి.

టీ. దోషదృష్టిః = విషయములయందలి లోపములను గనిపెట్టుటయు, జిహాసా చ=భోగములను వదలిపెట్టుటయు, పునః = తిరిగి, భోగేషు = విషయసుఖములయందు, అదీనతా=దీనత్వము లేకపోవుటయు (కోరిక లేకపోవుట యనుట), అమీ త్రయోఽపి= ఈమూఁడును, వైరాగ్యస్య = వైరాగ్యముయొక్క, అసాధారణహేత్వాద్యాః - అసాధారణ = తక్కిన బోధోపరతులయం దుండని, హేత్వాద్యాః = హేతుస్వరూపకార్యము లగును.

తా. విషయములయం దనిత్యతయు సాతిశయత్వము మొదలగు దోషదర్శనము వైరాగ్యమునకు హేతువు. విషయసుఖములను పరిత్యజించుట వైరాగ్యముయొక్క స్వరూపము. మఱి యెన్నటికిని భోగేచ్ఛకలుగకపోవుట వైరాగ్యముయొక్క కార్యము. ఇట్లు హేతుస్వరూపకార్యములు తక్కిన బోధోపరతులకు లేక వైరాగ్యమునకు మాత్రమే యుండుటంజేసి యివి యసాధారణము లనఁబడుచున్నవి.

అవ. బోధయొక్క హేతు స్వరూప కార్యములను దెలుపుచున్నాఁడు:—

శ్లో. శ్రవణాదిత్రయం తద్వత్తత్త్వమిథ్యావివేచనం,
పునర్గ్రంథే రనుదయో బోధస్యైతే త్రయో మతాః. 279

వ్యా. ఇదానీం తత్త్వబోధస్య కారణాదిత్రయం దర్శయతి—శ్రవణాదీతి. ఆది శబ్దేన మనననిదిధ్యాసనే గృహ్యేతే. "ఆత్మా వారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇత్యాత్మదర్శనసాధనత్వేన శ్రవణాదివిధానాచ్ఛ్రవణాదేర్జ్ఞానహేతుత్వం

తత్త్వమిథ్యావివేచనం కూటస్థస్యాహంకారాదేశ్చ భేదజ్ఞానం గ్రంథేరనుదయోఽన్యోన్యాధ్యాసానుత్పత్తిః.

టీ. శ్రవణాతిత్రయం = శ్రవణము మొదలుగాఁ గలిగిన మూఁడును (శ్రవణమనననిధిధ్యాసములు), తద్వత్ = అట్లుగా, తత్త్వమిథ్యావివేచనం - తత్త్వ = ఆత్మతత్త్వముయొక్కయు, మిథ్యా = అహంకారాదులయొక్కయు, వివేచనం=భేదజ్ఞానంబును, పునఃమఱల, గ్రంథేః = హృదయగ్రంథియొక్క, అనుదయః = ఉదయింపకపోవుటయు, ఏతేత్రయః = ఈమూఁడును, బోధస్య = తత్త్వజ్ఞానమునకు, మతాః = హేతుస్వరూపకార్యము లని చెప్పఁబడుచున్నవి.

తా. శ్రు. "ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" దీని కర్థము. అరే=ఓమైత్రేయి, ఆత్మావా=ఆత్మయే, ద్రష్టవ్యః=తెలిసికొనఁదగినది, శ్రోతవ్యః=విననఁదగినది; మన్తవ్యః=యుక్తులతో ననుదినము తలఁచి తెలిసికొనఁదగినది; నిదిధ్యాసితవ్యః = ధ్యానింపఁదగినది. ఇట్లు ఆత్మజ్ఞానమునకు సాధనములనుగా శ్రవణమనననిదిధ్యాసములను విధించుటవలన నీమూఁడును జ్ఞాన (బోధ) హేతువులగును. కూటస్థాత్మయు అహంకారాదులు వే ఱని తెలిసికొనుటయు, వాని రెండింటిలో కూటస్థుఁడు సత్య మనియు, అహంకారాదులు మిథ్య యనియు నెఱుంగుట బోధయొక్క స్వరూప మగును. అన్యోన్యాధ్యాసరూప మగు గ్రంథి యెన్నటికి నుదయింపకుండుట బోధయొక్క కార్య మగును. ఇట్లు బోధయొక్క హేతుస్వరూపకార్యములు దెలుపఁబడినవి.

అవ. ఉపరతియొక్క హేతుస్వరూపకార్యములను దెలుపుచున్నాఁడు:—

శ్లో. యమాది ర్ధీనిరోధశ్చ వ్యవహారస్య సంక్షయః,
స్యుర్హేత్వాద్యా ఉపరతే రిత్యసంకర ఈరితః. 280

వ్యా. ఉపరతేస్తాని దర్శయతి—యమాదిరితి. ఆదిపదేన నియమాదయో గృహ్యంతే. ధీనిరోధశ్చిత్తవృత్తినిరోధలక్షణో యోగః.

టీ. యమాదిః = యమనియమాదులును, ధీనిరోధశ్చ = చిత్తనిరోధంబును, వ్యవహారస్య = లోకవ్యవహారముయొక్క, సంక్షయః = లేకుండుటయు, ఉపరతేః = ఉపరతియొక్క, హేత్వాద్యాః = హేతుస్వరూపకార్యములుగ, స్యుః=అగుచున్నవి. ఇతి=ఇట్లు, అసంకరః = వానిభేదము, ఈరితః=చెప్పఁబడెను.

తా. ఉపరతికి యమనియమాదులు హేతువు లనియు, చిత్తైకాగ్రత స్వరూప మనియు, లోక వ్యవహారము లేకపోవుట కార్య మనియు నిట్లు హేతుస్వరూపకార్యములు ప్రత్యేకముగా తెలుపఁబడినవి.

వి. 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధ్యానము, 7. ధారణము, 8. సమాధి అనునవి అష్టాంగములు.

1. యమ మనఁగా—జీవహింస చేయకుండుట, యథార్థమును జెప్పుట, దొంగిలింపకుండుట, బ్రహ్మచర్యము, అప్రతిగ్రహము నను సుగుణములు గలిగియుండుట.

2. నియమ మనఁగా—బాహ్యాంతరపరిశుద్ధత, తపస్సు, సంతోషము, వేదాధ్యయనము, ఈశ్వరప్రణిధానము ననునవి.

3. ఆసనము—పద్మాసనాదుల నభ్యసించుట.

4. ప్రాణాయామము—రేచకపూరకకుంభకములచే ప్రాణాయామము నభ్యసించుట.

5. ప్రత్యాహారము—విషయములనుండి ఇంద్రియములను మఱలించి స్వస్థానమందు నిలుపుట.

6. ధ్యానము—బ్రహ్మమును సగుణముగఁగాని, నిర్గుణముగఁగాని, ఏకాగ్రచిత్తముతో చింతించుట.

7. ధారణము—మూలాధారాదిచక్రములందు మనస్సును నిలుపుట.

8. సమాధి—నిర్గుణబ్రహ్మతత్త్వమందు నిశ్చలచిత్తవృత్తి.

అవ. వైరాగ్యబోధోపరతులు మూఁడును ముఖ్యములేనా? లేక కొన్నిమాత్రమే ముఖ్యములా? ఇందు ముఖ్య మేది? అముఖ్యము లేవి? యని యడుగఁగా చెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వబోధః ప్రధానం స్యాత్సాక్షాన్మోక్షప్రదత్వతః,
బోధోపకారిణా వేతౌ వైరాగ్యోపరమా వుభౌ. 281

వ్యా. కిమేతేషాం సమప్రాధాన్యముత నేత్యాశంక్యాహ—తత్త్వబోధ ఇతి. "తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి. నాన్యః పంథా విద్యతేఽయనా" యేతి శ్రుతేరిత్యర్థః ఇతరయోస్తూపకారిత్వమ్. "బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్. శాంతో దాంత ఉపరతస్తితిక్షు స్సమాహితో భూత్వాఽత్మన్యేవాత్మానం పశ్యే" దితి శ్రుతిభ్యామవగమ్యతే.

టీ. సాక్షాత్ = ప్రత్యక్షముగా, మోక్షప్రదత్వతః=మోక్షము నిచ్చెడి దగుట వలన, తత్త్వబోధః=తత్త్వజ్ఞానము, ప్రధానం=ముఖ్యమైనది, స్యాత్=అగును. ఏతౌ= ఈ, వైరాగ్యోపరమౌ - వైరాగ్య=విరక్తియును, ఉపరమౌ = ఉపరతియు, ఉభౌ = రెండును, బోధోపకారిణౌ - బోధ = తత్త్వజ్ఞానమునకు, ఉపకారిణౌ = అనుకూలించి సహాయము చేయుచున్నవి.

తా. 1. వైరాగ్యము, 2.బోధ, 3. ఉపరతి అను నీమూఁడింటిలో తత్త్వబోధ మోక్షమును గలుగఁజేయును గనుక ముఖ్యము. తక్కిన రెండును తత్త్వబోధకు సహాయకారు లగును.

అవ. ౨౭౬-వ శ్లోకమున తఱచుగా నివి మూఁడును కలిసియుండును. ఒక్కొక్క పురుషునియందు నొకటి రెండు లేకుండిన నుండవచ్చును అని చెప్పఁబడినది. దానికి కారణము నిప్పుడు దెల్పుచున్నాఁడు:—

శ్లో. త్రయోఽప్యత్యంతపక్వాశ్చేన్మహత స్తపసః ఫలం,
దురితేన క్వచి త్కించి త్కదాచి త్ప్రతిబధ్యతే. 282

వ్యా. ప్రాయేణ సహ వర్తంతే వియుజ్యంతే క్వచిత్కదాచిదిత్యుక్తం. తత్ర కారణ మాహ—త్రయోఽపీతి. అనేకజన్మార్జితపుణ్యపుంజపరిపాకేన త్రయాణాం సహభావో భవతి. అన్యథా తు ప్రతిబంధకపాపానుసారేణ పురుషవిశేషే కాలవిశేషే కస్యచిత్ప్రతిబంధో భవతీతి భావః.

టీ. త్రయోఽపి =వైరాగ్యబోధోపరతులు మూఁడును, అత్యంతపక్వాశ్చేత్ = మిక్కిలి పరిపక్వము లాయెనేని, మహతః = అత్యధికమైన, తపసః = పూర్వపుణ్యమునకు, ఫలం = ఫలమగును. అనఁగా అనేక జన్మములయందుఁ జేసిన తపస్సు ఫలించిన దనుట. దురితేన = పాపము చేత, క్వచిత్ = ఒకానొకనియందు, కదాచిత్ = ఒకానొకప్పుడు, కించిత్ = ఒకటొకటి, ప్రతిబధ్యతే = లేకపోవుచున్నది.

తా. జన్మాంతరపుణ్యముచేత ఒకానొక మహాపురుషునియందు వైరాగ్యబోధోపరతులు మూఁడును పూర్తిగా నుండును. ఒకానొకని యందు నేదో యొక యించుక పాపవశంబున ఒక టొకటి లేక పోవచ్చును.

అవ. ఏవి యున్నను నేవి లేకపోయినను తత్త్వజ్ఞానము లేనిది మోక్షము సిద్ధింప దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వైరాగ్యోపరతీ పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే,
యస్య తస్య న మోక్షోఽస్తి పుణ్యలోకస్తపోబలాత్. 283

వ్యా. తత్రాపి తత్త్వజ్ఞానప్రతిబంధే మోక్షో నాస్తీత్యాహ—వైరాగ్యేతి. తర్హి వైరాగ్యాదిసంపాదనం నిష్ఫలమిత్యాశంక్య. శ్లో. "ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీ స్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయత" ఇతి భగవద్వచనాత్పుణ్యలోకప్రాప్తిర్భవతీత్యాహ—పుణ్యలోకస్తపోబలాదితి.

టీ. యస్య = ఎవనికి, వైరాగ్యోపరతీ = విరక్తియు ఉపరతియు, పూర్ణే = పూర్తిగా నుండినను, బోధస్తు = తత్త్వజ్ఞానము, ప్రతిబధ్యతే = లేకపోవునో, తస్య= వానికి, మోక్షః = మోక్షము, నాస్తి = లేదు. తపోబలాత్=విరక్తియు, నుపరతియు ననెడి తపోబలమువలన, పుణ్యలోకః=స్వర్గాదిపుణ్యలోకములు, (భవత్ = కలుగును).

తా. వైరాగ్యంబును, ఉపరతియు పూర్ణముగా నుండి తత్త్వజ్ఞానము లేకపోయిన యెడల మోక్షము కలుగదు. కాని "ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" - పుణ్యాత్ములు నివసించెడి లోకముల యందుఁ జిరకాల ముండి శిష్టాచారసంపత్తిగల శ్రీమంతులయింటిలోఁ దపోవిఘ్నము గలవాఁడు పుట్టు నని భగవద్గీతయందు చెప్పినచొప్పున వైరాగ్యోపరతు లనెడి తపోబలమువలన పుణ్యలోకావాప్తి కలుగు చున్నది. ఎప్పటికిని మంచి పని వ్యర్థము కాదు.

అవ. వైరాగ్యోపరతులు మాత్రము లేక తత్త్వజ్ఞానముమాత్ర ముండిన నే మగు ననఁగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా,
మోక్షో వినిశ్చితః కింతు దృష్టదుఃఖం న నశ్యతి. 284

వ్యా. వైరాగ్యోపరత్యోస్తు ప్రతిబంధే జీవన్ముక్తిసుఖం న సిధ్యతీత్యాహ—పూర్ణే బోధ ఇతి.

టీ. బోధే = తత్త్వజ్ఞానము, పూర్ణే సతి=పరిపూర్ణముగా నుండఁగా, తదన్యౌ= ఆతత్త్వజ్ఞానముకంటె వేఱైన, ద్వౌ=వైరాగ్యోపరతులు రెండును, యదా=ఎప్పుడు, ప్రతిబద్ధౌ = లేకపోవునో, తదా = అప్పుడు, మోక్షః=మోక్షము, వినిశ్చితః = తప్పక వచ్చును, కింతు = కాని, దృష్టదుఃఖం = ప్రారబ్ధకర్మ ననుభవించుచుండెడు దుఃఖము, న నశ్యతి = నశింపదు.

తా. తత్త్వజ్ఞానము పూర్ణముగా నుండి వైరాగ్యోపరతులు లేని యెడల మోక్షము తప్పక కలుగును. కాని జీవన్ముక్తిసుఖము గలుగ నేరదు. ప్రారబ్ధమువలనఁ గలుగుదుఃఖము నశింపదు.

అవ. వైరాగ్యాదులకు అవధినిఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధి ర్మతః,
దేహాత్మవత్పరాత్మత్వదార్ఢ్యే బోధస్సమాప్యతే. 285

శ్లో. సుప్తివ ద్విస్మృతి స్సీమా భవే దుపరమస్య హి,
ధియా స్వయా వినిశ్చేయం తారతమ్యమవాంతరమ్. 286

వ్యా. ఇదానీం వైరాగ్యాదీనామవధిం దర్శయతి—బ్రహ్మలోకేతి.

సుప్తివదితి. అవాంతరతారతమ్యం తు స్వస్వబుద్ధ్యా నిశ్చేయ మిత్యాహ— ధియేతి.

టీ. బ్రహ్మలోకతృణీకారః - బ్రహ్మలోక = సత్యలోకమును, తృణీకారః=తృణప్రాయముగాఁ దలంచుట (అపేక్ష లేకపోవుట), వైరాగ్యస్య = వైరాగ్యమునకు, అవధిః = హద్దుగ, మతః = (అని) చెప్పఁబడినది. దేహాత్మవత్=దేహము నేను అనెడి జ్ఞానమువలె, పరాత్మత్వదార్ఢ్యే సతి = పరమాత్మస్వరూపనిశ్చయము గలిగి యుండెనేని (నేను పరమాత్మనే యనెడి దృఢజ్ఞానము గలిగి యుండెనేని). బోధః = జ్ఞానము, సమాప్యతే = పూర్తి యగుచున్నది.

టీ. సుప్తివత్=గాఢనిద్రయందు వలె, విస్మృతిః = సర్వవ్యవహారములను మఱచుట, ఉపరమస్య=ఉపరతికి, సీమా=అవధి, భవేద్ధి = అగుచున్నది గదా. అవాంతరం= మధ్యనుగల, తారతమ్యం = హెచ్చుతగ్గులను (భేదము), స్వయాధియా = తన బుద్ధిచేత, వినిశ్చేయం = నిశ్చయించుకొనవలయును.

తా. వైరాగ్యమున కవధి సత్యలోకాధిపత్యము లభించు నని నను నపేక్ష లేకపోవుట. జ్ఞానమున కవధి దేహము నే నని యెడి దృఢజ్ఞాన మవివేకవశయం దె ట్లుండెనో యట్లు ఆత్మస్వరూపము నే ననెడి దృఢనిశ్చయము గలిగియుండుట. ఉపరతి కవధి గాఢముగ నిదురించు నపుడు ప్రపంచసంబంధము లగు సర్వవ్యవహారములను మఱచినట్లు నిఖిలవ్యవహారములయందు జ్ఞోక్యము లేకయుండుట. వీనిలో నేది

యెంతవఱకు తనకుఁ గలిగినదియు తన బుద్ధికే విశదమగును అని రెండు శ్లోకముల తాత్పర్యమగును.

అవ. తత్త్వజ్ఞానులలోఁగూడ కొందఱు రాగద్వేషాదితారతమ్యము గలవారుగాఁ గనఁబడుటచేత జ్ఞానమువలన ముక్తి కలుగకపోవచ్చునని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆరబ్ధకర్మనానాత్వా ద్బుద్ధానా మన్యథాన్యథా,
వర్తనం తేన శాస్త్రార్థే భ్రమితవ్యం న పండితైః. 287

శ్లో. స్వస్వకర్మానుసారేణ వర్తంతాం తే యథాయథా,
అవిశిష్ట స్సర్వబోధ స్సమా ముక్తి రితి స్థితిః. 288

వ్యా. నను, తత్త్వబోధవతామపి రాగాదిమత్త్వేన వైషమ్యోపలంభాత్ జ్ఞానస్యాపి ముక్తిహేతుత్వం నిశ్చేతుం న శక్యమిత్యాశంక్య రాగాదేః వ్యాధ్యాదివ దారబ్ధకర్మఫలత్వాన్ముక్తిప్రతిబంధకత్వమసిద్ధమ్. అతో న శాస్త్రార్థే విప్రతిపత్తవ్య మిత్యాహ—ఆరబ్ధకర్మనానాత్వాదితి.

తర్హి కిం ప్రతిపత్తవ్య మిత్యత ఆహ—స్వస్వేతి. సర్వేషాం బ్రహ్మాహమస్మీతి జ్ఞానమేకాకారం నిరవద్యబ్రహ్మరూపేణావస్థానం చ సమానమితి భావః.

టీ. ఆరబ్ధకర్మనానాత్వాత్-ఆరబ్ధకర్మ = ప్రారబ్ధకర్మయొక్క, నానాత్వాత్ = అనేకవిధములైన దగుటవలన (ప్రారబ్ధకర్మ పలువిధంబులుగా నుండుటవలన), బుద్ధానాం = తత్త్వజ్ఞులయొక్క, వర్తనం = ప్రవర్తనము, అన్యథాన్యథా = వేఱు వేఱుగా, (స్యాత్ =ఉండును). తేన = ఆహేతువుచేత, శాస్త్రార్థే = శాస్త్రతాత్పర్యమునందు (వేదాంతసిద్ధాంతమునందు, పండితైః = జ్ఞానబోధగలవారిచేత, న భ్రమితవ్యం = భ్రాంతిపడవలసినపని లేదు.

టీ. తే=అజ్ఞానులు, స్వస్వకర్మానుసారేణ = తమ తమ ప్రారబ్ధకర్మానుసారముగా, యథాయథా=వారి వారి కిచ్చవచ్చినట్లు, వర్తంతాం=వర్తింతురుగాక. సర్వబోధః = సార్వాత్మ్యమైన జ్ఞానము (అఖండాకారమైన బ్రహ్మస్వరూపమే నేననెడి జ్ఞానము), అవిశిష్టః=భేదములేనిది. ఇతి = ఈవిధమైన, ముక్తిః = జ్ఞానఫలమైన ముక్తి, సమా = సమానమైనది. (ఇతి = అని), స్థితిః = వేదాంతసిద్ధాంతము.

తా. ప్రారబ్ధకర్మ యనేకరీతులుగా నుండుటచేత నాయాజ్ఞానులు ఆయావిధముల వర్తించినను స్వరూపబోధయం దేమాత్రము తార

తమ్యము లేదనియు, అట్టి సార్వాత్మ్యబోధ ననుసరించి ముక్తియందు తారతమ్యము లేదనియు నిది వేదాంతసిద్ధాంత మనియు నిస్సంశయముగాఁ బండితు లగువారు గ్రహింతురు గాక.

అవ. ఈప్రకరణముయొక్క తాత్పర్యమును సంక్షేపముగాఁ దెల్పుచున్నాఁడు:-

శ్లో. జగ చ్చిత్రం స్వచైతన్యే పటే చిత్రమివార్పితం,
మాయయా తదుపేక్ష్యైవ చైతన్యే పరిశేష్యతామ్. 289

వ్యా. ప్రకరణస్యాస్య తాత్పర్యం సంక్షిప్య దర్శయతి—జగతి.

టీ. పటే = వస్త్రమునందు, చిత్రం = బొమ్మలయుద్దకము, అర్పితమివ = వేయఁబడినట్లు, స్వచైతన్యే=తన స్వరూపమైన చైతన్యమునందు (పరమాత్మయందు), చిత్రం= విచిత్రమైన, జగత్ = ప్రపంచము, మాయయా = మాయచేత, అర్పితం = కల్పింపఁబడినది. తత్ = అట్టిజగత్తును (వాస్తవముగ లేక మాయచే నాత్మయం దారోపితమైనదనుట), ఉపేక్ష్య = మిథ్య యని నిరాకరించి, చైతన్య ఏవ = ఆత్మచైతన్యమే, పరిశేష్యతాం = పరిశేషన్యాయముచే గ్రహింపఁబడుఁగాక.

తా. స్వాభావికముగాఁ బరిశుద్ధమైన వస్త్రమునందు చిత్రకారునిచే నానాయాకారములు గల చిత్రములు (బొమ్మలు) ఎట్లు గల్పింపఁబడునో యటులనే యచింత్యరచనగల మాయచేత తన స్వరూపమైన బ్రహ్మచైతన్యమునందు నానావిధమైన ప్రపంచము కల్పింపఁబడినది గనుక మాయాకల్పితమైన ఈద్వైతప్రపంచమును మిథ్య యని నిరాకరించి శుద్ధచైతన్యముమాత్రమే మిగిలియున్న దని సూక్ష్మదృష్టితోఁ దెలియఁబడుఁగాక.

అవ. ఈచిత్రదీప మను గ్రంథమును నభ్యసించుటవలనం గలుగు లాభమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. చిత్రదీప మిమం నిత్యం యేఽనుసందధతే బుధాః,
పశ్యంతోఽపి జగచ్చిత్రం తే ముహ్యంతి న పూర్వవత్. 290

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
చిత్రదీప స్సమాప్తః.

వ్యా. గ్రంథాభ్యాసఫలమాహ—చిత్రదీపమితి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్య శ్రీచరణశిష్యేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితం తాత్పర్యబోధినీనామకం చిత్రదీప వ్యాఖ్యానం సమాప్తమ్.

---

టీ. యే బుధాః = ఏపండితులు, ఇమం చిత్రదీపం=ఈచిత్రదీప మనెడు గ్రంథ మును, అనుసందధతే = అనుసంధానము చేయుచుందురో, తే = అట్టివారు, చిత్రం = విచిత్రమైన, జగత్=ప్రపంచమును, పశ్యంతోఽపి = చూచుచుండినను, పూర్వవత్ = వెనుకటివలె (అజ్ఞానదశయందువలె), న ముహ్యంతి=మోహమును బొందరు.

తా. దీపమును జూచువారు చీకటివలని దృష్టిభంగమును పొందనియట్లు చిత్రదీప మను నీగ్రంథమును (గ్రంథస్థవిషయమును) నిరంతర మను సంధానముచేయుచున్న పండితులు విచిత్రమగు నీప్రపంచ మును జూచుచుండినను నజ్ఞానదశయందు వ్యామోహముం జెందినట్లు మోహమును జెందరు.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు చిత్రదీప మను షష్ఠప్రకరణము.





శ్రీరస్తు
శ్రీ గణేశాయ నమః.

# శ్రీ వేదాంతపంచదశి

## సప్తమ ప్రకరణము

### తృప్తిదీప ప్రకరణము

అవ. శ్రీవిద్యారణ్యస్వామివారు తృప్తిదీప మను ప్రకరణమును ప్రారంభింపఁ దలఁచి యేశ్రుత్యర్థమును ప్రకరణమునందుఁ బ్రతిపాదింపఁ దలంచిరో యాశ్రుతిని మొట్టమొదటఁ జెప్పుచున్నారు.

శ్లో. ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్. 1

వ్యాఖ్యానమ్

శ్లో. అఖండానందరూపాయ శివాయ గురవే నమః,
శిష్యాజ్ఞానతమోధ్వంస పట్వర్కేందువహ్నిమూర్తయే. ౧.
వేదార్థస్య ప్రకాశేన తమోహార్దం నివారయన్,
పుమర్థాంశ్చతురో దేయా ద్విద్యాతీర్థమహేశ్వరః. ౨.
నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
క్రియతే తృప్తిదీపస్య వ్యాఖ్యానం గుర్వనుగ్రహాత్. ౩.

తృప్తిదీపాఖ్యం ప్రకరణమారంభమాణః శ్రీభారతీతీర్థగురు స్తస్య శ్రుతివ్యాఖ్యానరూపత్వాత్, తద్వ్యాఖ్యేయాం శ్రుతిమాదౌ పఠతి—ఆత్మానం చేదితి.

టీ. పూరుషః=పురుషుఁడు, అయం = ఈస్వయంప్రకాశస్వరూపుఁడైన కూటస్థపరమాత్మ, అస్మీతి = నేనై యున్నా నని, ఆత్మానం = తన యథార్థస్వరూపమును, విజానీయాచ్చేత్ = విస్పష్టముగాఁ దెలిసికొనెనేని, కిం=ఏఫలమును, ఇచ్ఛన్=కోరుచు, కస్య = ఏభోక్తయొక్క, కామాయ = ప్రీతికొఱకు, (తప్యమానం = తపించుచుండిన) శరీరం = శరీరమునుగూర్చి, అను సంజ్వరేత్ = అనుసరించి తపించును? తపింపఁ డనుట.

తా. సర్వప్రకాశానందస్వరూపుఁ డగు కూటస్థచైతన్యస్వరూపము నే నైతి నని తన యథార్థస్వరూపమును తెలిసికొనియుండెనేని ఏలాభమును గోరి యేభోక్తయొక్క సంతోషముకొఱకు సర్వదా తపించుచుండెడి శరీరము ననుసరించి పరితపించును ? మాయాకల్పితమగుచు భోక్తృభోగ్యవర్గముతోఁ గూడిన యీద్వైతప్రపంచము తనయందు యథార్థముగ స్ఫురింపక పోవుటచేత నెంతమాత్రము తపింపఁ డని భావము.

అవ. ఇప్పుడు తాను చేయఁబూనిన తృప్తిదీప మను గ్రంథముయొక్క విచారము దానివలన లాభమునుం దెలుపుచున్నాఁడు:—

శ్లో. అస్యాః శ్రుతే రభిప్రాయ స్సమ్య గత్ర విచార్యతే,
జీవన్ముక్తస్య యా తృప్తిస్సా తేన విశదాయతే. 2

వ్యా. ఇదానీం చికీర్షితగ్రంథవిచారం తత్ఫలం చ దర్శయతి—అస్యా ఇతి. అత్ర తృప్తిదీపాఖ్యే గ్రంథే "ఆత్మానం చేద్విజానీయా" దిత్యాదికాయాః శ్రుతేరభిప్రాయః తాత్పర్యం సమ్యగ్విచార్యతే. తేనాభిప్రాయవిచారేణ జీవన్ముక్తస్య శ్రుతిప్రసిద్ధా యా తృప్తిస్సా విశదాయతే స్పష్టీభవతి.

టీ. అత్ర = తృప్తిదీప మను ప్రకరణమునందు, అస్యాః = ఇప్పు డుదాహరింపఁబడిన, శ్రుతేః = "ఆత్మానం చ" అను మొదలైన శ్రుతియొక్క, అభిప్రాయః = తాత్పర్యము. సమ్యక్ = చక్కఁగా, విచార్యతే = విచారణచేయఁబడును. తేన = అట్టి విచారణచేత, జీవన్ముక్తస్య = జీవన్ముక్తునకు, యా తృప్తిః = ఏసంతృప్తిగలదో, సా = అట్టిసంతృప్తి, (నిరతిశయానందము), విశదాయతే = విశదీకరింపఁబడును. (స్పష్టమగునట్లు తెలియఁజేయఁబడును.)

తా. ఈతృప్తిదీపప్రకరణమున నిప్పుడు చెప్పిన శ్రుత్యర్థవిచారము పూర్తిగాఁ జేయఁబడుచున్నది. ఇట్లు శ్రుతితాత్పర్యమును జక్కఁగా విచారించుటచేత జీవన్ముక్తుఁ డెట్టి యానందముతో నుండునో యది విశద మగు నని భావము.

అవ. ఇంతకుముందు చెప్పఁబడిన శ్రుతియందు "పూరుషః" అనెడి పదము గలదు. దాని కర్థమును జెప్పఁదలఁచి ఉపోద్ఘాతముగా (ప్రతిపాదింపఁదలఁచిన యంశమునంతయు బుద్ధియం దుంచుకొని యందుల కుపయోగించెడి మఱియొక యంశమును పట్టించుట) సృష్టినిగుఱించి సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడు:

శ్లో. మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః,
కల్పితావేవ జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్. 3

వ్యా. "పదచ్ఛేదః పదార్థోక్తిర్విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణ"మితి వ్యాఖ్యానలక్షణస్యోక్తత్వాత్ పురుష ఇతి పదస్యార్థ మభిధాతుం తదుపోద్ఘాతత్వేన సృష్టిం సంక్షిప్య దర్శయతి—మాయాభాసేనేతి, ప్రతిపాద్యమర్థం బుద్ధౌ సంగృహ్య తదర్థ మర్థాంతరవర్ణనముపోద్ఘాతః. అత్ర మాయాశబ్దేన చిదానందమయబ్రహ్మప్రతిబింబసమన్వితా సత్త్వరజస్తమోగుణాత్మికా జగదుపాదానభూతా ప్రకృతిరుచ్యతే. సా చ సత్త్వగుణస్య శుద్ధ్యవిశుద్ధిభ్యాం ద్విధా భిద్యమానా క్రమేణ మాయా చావిద్యా చేతి భవతి. తత్తయోర్మాయావిద్యయోః ప్రతిబింబితం బ్రహ్మచైతన్యమేవేశ్వరో జీవశ్చేత్యుచ్యతే. తదిదం తత్త్వవివేకాఖ్యే గ్రంథే శ్రీమద్విద్యారణ్యగురుభి ర్నిరూపితం. *"చిదానందమయబ్రహ్మప్రతిబింబసమన్వితా, తమోరజస్సత్త్వగుణా ప్రకృతిర్ద్వివిధా చ సా. సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయా విద్యే చ తేమతే, మాయాబింబో వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః. అవిద్యావశగస్త్వన్యస్తద్వైచిత్ర్యాదనేకధా, సా కారణశరీరం స్యాత్ప్రాజ్ఞస్తత్రాభిమానవా"నితి. ఇమమేవార్థం మనసి నిధాయ "జీవేశాభాసేన కరోతి మాయా చావిద్యా చ స్వయమేవ భవ"తీతి శ్రుతిరపి ప్రవృత్తా. అతో జీవేశ్వరయో ర్మాయాకల్పితత్వం అన్యత్కృత్స్నం జగత్తాభ్యామేవ కల్పితమ్.

టీ. మాయా=ప్రకృతి, జీవేశౌ = జీవుని, ఈశ్వరుని, ఆభాసేన=ఆభాసులనుగా, కరోతి = చేయుచున్నది. ఇతి = అని, శ్రుతత్వతః= శ్రుతియందు చెప్పఁబడుటవలన, జీవేశౌ=వారిద్దఱిచేత, సర్వం = సమస్తమైన ద్వైతప్రపంచము, ప్రకల్పితం = ప్రచురముగాఁ గల్పింపఁబడినది.

తా. త్రిగుణాత్మకమైన ప్రకృతి జీవేశ్వరుల నిరువురను చిదాభాసులనుగా (చిత్ప్రతిబింబము లనుట.) చేసిన దని శ్రుతియందు తెలుపఁబడుటంజేసి జీవేశ్వరు లిరువురును మాయాకల్పితు లగుచున్నారు. అట్టిజీవేశ్వరులచేత నీజగత్తంతయుఁ గల్పింపఁబడెను.

అవ. అట్లు కల్పింపఁబడిన జగత్తునందు ఏవస్తు వెవనిచేతఁ గల్పింపఁబడినదో తెలుప మనఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఈక్షణాదిప్రవేశాంతా సృష్టి రీశేన కల్పితా,
జాగ్రదాదివిమోక్షాంతః సంసారో జీవకల్పితః. 4

వ్యా. తత్ర కేన కియత్కల్పిత మిత్యత ఆహ— ఈక్షణాదీతి. * "తదైక్షత బహు స్యాం ప్రజాయే"యేతి శ్రుతమీక్షణ మాదిర్యస్యాస్సా ఈక్షణాదిః, "అనేన జీవేనాత్మ నానుప్రవి"శ్యేతి శ్రుతేః ప్రవేశోఽంతో యస్యాస్సా ప్రవేశాంతా ఈక్షణాదిశ్చాసౌ ప్రవేశాంతా చేతి పశ్చాత్కర్మ ధారయః. సేయం సృష్టిరీశ్వరేణ కల్పితా. జాగ్రదాదిర్యస్య సంసారస్యాసౌ జాగ్రదాదిర్విమోక్షో ముక్తిరంతో యస్య సః విమోక్షాంతస్స చ సంసారో జీవేన కల్పితః తదభిమానిత్వాజ్జీవస్యేత్యర్థః. తే చ జాగ్రదాదయ ఇత్థం శ్రూయంతే. * "స ఏష మాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వం, స్త్రీ అన్నపానాదివిచిత్రభోగైస్స ఏవా జాగ్రత్పరితృప్తిమేతి. స్వప్నేఽపి జీవస్సుఖదుఃఖభోక్తా స్వమాయయా కల్పితవిశ్వలోకే, సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూతస్సుఖరూపమేతి. పునశ్చ జన్మాంతరకర్మయోగాత్స ఏవ జీవ స్స్వపితి ప్రబుద్ధః, పురత్రయే క్రీడతి యశ్చ జీవ స్తతస్తు జాతం సకలం విచిత్రం. జాగ్రత్స్వప్న సుషుప్త్యాదిప్రపంచం యత్ప్రకాశతే, తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యత" ఇతి.

టీ. ఈక్షణాది ప్రవేశాంతా - ఈక్షణాది = సంకల్పము మొదలుగాఁ గలిగి నట్టియు, ప్రవేశాంతా=ప్రవేశ మంతముగాఁ గలిగినట్టియు, సృష్టిః=సృష్టి, ఈశేన = ఈశ్వరునిచేత, కల్పితా=చేయఁబడినది. జాగ్రదాదివిమోక్షాంతః - జాగ్రదాది=జాగ్రదవస్థ మొదలుగా, విమోక్షాంతః=ముక్తియే యవధిగాఁ గలిగిన, సంసారః = సంసారము, జీవకల్పితః = జీవునిచేతఁ జేయఁబడినది.

తా. పై వ్యాఖ్యానములో నుదాహరింపఁబడిన శ్రు. "తదైక్షత" "అనేన జీవేన" తత్ = ఆపరమాత్మ, ఐక్షత = సంకల్పించెను అనెడి యర్థము గల శ్రుతి మొదలుకొని, "అనేన జీవేన" తన స్వరూపమైన జీవరూపముగాఁ బ్రవేశించి అనువఱకుఁ జెప్పఁబడినసృష్టి యీశ్వరునిచేఁ జేయఁబడిన దనియు, జాగ్రదవస్థ మొదలుకొని, "జాగ్రత్స్వప్న సుషుప్త్యాది" ఈ మొదలగు సందర్భముచేత మోక్షపర్యంత మభివర్ణింపఁబడిన సంసారము జీవునిచేఁ గల్పింపఁబడిన దనియుఁ దెలియనగును.

అవ. ఇట్లు పురుషశబ్దముయొక్క అర్థమును తెలిసికొనుటకుఁ దగిన సృష్టిని జెప్పి యిప్పుడు పురుషశబ్దమున కర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. భ్రమాధిష్ఠానభూతాత్మా కూటస్థాసంగచిద్వపుః,
అన్యోన్యాధ్యాసతోఽసంగధీస్థజీవోఽత్ర పూరుషః. ౯

వ్యా. ఏవం పురుషశబ్దార్థావబోధోపయోగినీం సృష్టిమభిధాయేదానీం పురుషశబ్దార్థమాహ—భ్రమాధిష్ఠానేతి. యః కూటస్థాసంగచిద్వపురవికార్యసంగచిత్స్వరూపః భ్రమాధిష్ఠానభూతాత్మా భ్రమస్య దేహేంద్రియాద్యధ్యాసస్యాధిష్ఠానభూతః అధిష్ఠానత్వేన వర్తమానః పరమాత్మాఽస్తి. సోఽసంగ ఏవ అన్యోన్యాధ్యాసతః అన్యోన్యస్మిన్నన్యోన్యాత్మకతామన్యోన్యధర్మాంశ్చాధ్యస్య సర్వవ్యవహారభాగ్భవతీత్యాచార్యై ర్నిరూపితేన తాదాత్మ్యాధ్యాసేనాసంగధీస్థజీవః స్వేన పారమార్థికసంబంధశూన్యాయాం బుద్ధౌ వర్తమానో జీవస్సన్నత్రాస్యాం శ్రుతౌ పురుష ఇత్యుచ్యతే. * "స వా అయం పురుషస్సర్వాసు పూర్షు శేతే పురి శయ" ఇతి.శ్రుత్యా పురుషశబ్దస్య వ్యుత్పాదితత్వాత్పురుషస్యైవ చ పూరుషత్వా త్పురుష ఏవ పూరుషః బుద్ధ్యాదికల్పనాధిష్ఠాన కూటస్థచైతన్యమేవ బుద్ధౌ ప్రతిబింబితత్వేన ప్రాప్తజీవభావం సత్పురుషశబ్దేనోచ్యత ఇత్యభిప్రాయః.

టీ. కూటస్థాసంగచిద్వపుః - కూటస్థ=నిర్వికారుండును, అసంగ=నిస్సంగుఁడును, చిద్వపుః=చిద్రూపుఁడును అయినట్టియు, భ్రమాధిష్ఠానభూతాత్మా- భ్రమ=దేహేంద్రియాదులయొక్క యధ్యాసమునకు, అధిష్ఠానభూత = ఆధారముగా నుండిన, ఆత్మా=పరమాత్మ, అన్యోన్యాధ్యాసతః=తాదాత్మ్యాధ్యాసమువలన, అసంగధీస్థ జీవస్సన్-అసంగ=తనతో యథార్థముగా సంబంధము లేని, ధీ=బుద్ధియందు, స్థ=వర్తించుచున్న, జీవస్సన్=జీవుఁడై, అత్ర=ఈ శ్రుతియందు, పూరుషః = పురుషుఁడు అని చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఇంతకు ముందు చెప్పఁబడిన శ్రుతియందలి పూరుషశబ్దముచేత దేహేంద్రియాదులయొక్క యధ్యాసమునకు నధిష్ఠానభూతుఁడైనట్టియు, నిర్వికారుఁడైనట్టియు, చిద్రూపుఁడైన యా యసంగుఁడే "అన్యోన్యస్మిన్నన్యోన్యాత్మకతా మన్యోన్యధర్మాం శ్చాధ్యస్య సర్వవ్యవహారభా గ్భవతి" అని భాష్యమున శ్రీమచ్ఛంకరభగవత్పాదులచేఁ దెలుపఁబడిన తాదాత్మ్యాధ్యాసమువలనఁ దనతో యథార్థ మగు సంబంధము లేని బుద్ధియందుఁ బ్రతిబింబించినవాఁ డగుచు సర్వనాడులయందు వ్యాపించియుండుటవలన జీవుఁ డగుచు నీశ్రుతియందు చెప్పఁబడుచున్నాఁడు.

అవ. అందలి పురుషశబ్దముచేత చిదాభాసుఁ డగు జీవుఁడే తెల్పఁబడె ననక అధిష్ఠానభూతుఁ డగు కూటస్థచైతన్యమును నేల గ్రహింపవలయు నని యాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సాధిష్ఠానో విమోక్షాదౌ జీవోఽధిక్రియతే న తు,
కేవలో నిరధిష్ఠానవిభ్రాంతేః క్వాప్యసిద్ధితః. 6

వ్యా. నన్వత్ర పురుషశబ్దేన కేవలచిదాభాసరూపో, జీవ ఏవోచ్యతాం. [illegible] నేన కూటస్థచైతన్యేనాధిష్ఠానభూతేనేత్యాశంక్య తస్య మోక్షాద్యన్వయిత్వప్రత్యసిద్ధే[illegible] తదపి స్వీకర్తవ్య మిత్యాహ—సాధిష్ఠాన ఇతి. సాధిష్ఠానః అధిష్ఠానేన కూటస్థ[illegible] న్యేన సహితో జీవః విమోక్షాదౌ మోక్షస్వర్గాదిసాధనానుష్ఠానేధిక్రియతే అధి[illegible] భవతి. న కేవల చిదాభాసః. కుత ఇత్యత ఆహ—నిరధిష్ఠానేతి. అధిష్ఠానరహిత[illegible] రోప్యస్య లోకేఽదృష్టత్వాదితి భావః.

టీ. సాధిష్ఠానః=అధిష్ఠానమైన కూటస్థునితోఁ గూడిన, జీవః = చిదాభాసుఁడు, విమోక్షాదౌ = మోక్షస్వర్గాదిసాధనానుష్ఠానమునందు, అధిక్రియతే=అధికారి [illegible] చున్నాఁడు. నిరధిష్ఠానవిభ్రాంతేః-నిరధిష్ఠాన = అధిష్ఠానమును విడిచిన, విభ్రాంతేః = ఆరోపముయొక్క, అసిద్ధితః = లేకపోవుటవలన, కేవలస్తు = చిదాభాసుఁడు మాత్రము, న = అధికారి గానేరఁడు.

తా. స్వర్గమోక్షాదిసాధనములను ననుష్ఠించుటకు అధిష్ఠాన [illegible] కూటస్థచైతన్యముతోఁ గూడిన జీవుఁడే యధికారి యగును. [illegible] యనఁగా ముత్యపుచిప్ప లేనియెడల ఇది వెండి యనెడి యధిష్ఠానము లేని యారోప మెప్పుడును సంభవింపదు. కాన సంసారమోక్షసిద్ధి [illegible] గెడికొఱకు కూటస్థాసంగ చిద్రూపుని గ్రహించితిమి.

అవ. ఇప్పుడు అధిష్ఠానచైతన్యముతోఁ గూడిన యాచిదాభాసునకు [illegible] రాదులు గలుగుటను రెండు శ్లోకములలో వివరించుచున్నాఁడు:—

శ్లో. అధిష్ఠానాంశసంయుక్తం భ్రమాంశ మవలంబతే,
యదా తదాఽహం సంసారీత్యేవం జీవోఽభిమన్యతే. 7

వ్యా. ఇదానీం సాధిష్ఠానస్యైవ తస్య సంసారాద్యన్వయిత్వం శ్లోకద్వ[illegible] విభజ్య దర్శయతి—అధిష్ఠానాంశేతి. జీవో యదా అధిష్ఠానాంశసంయుక్తం [illegible] సహితం భ్రమాంశం చిదాభాసోపేతం శరీరద్వయమవలంబతే స్వస్వరూపత్వేన [illegible] కరోతి, తదాహం సంసారీత్యేవ మభిమన్యతే.

టీ. యదా=ఎప్పుడు, జీవః = జీవుఁడు, అధిష్ఠానాంశసంయుక్తం=అధిష్ఠాన[illegible] కూటస్థరూపముతోఁ గూడినట్టి, భ్రమాంశం = చిదాభాసునితోఁ గూడిన దేహద్వయ[illegible] మును, అవలంబతే = తన రూప మని భావించుచున్నాఁడో, తదా=అప్పుడు, అహం =

నేను, సంసారీతి=సంసారముగలవాఁడ నని, (సుఖదుఃఖాదులు గలవాఁడ నని), ఏవం= ఈప్రకారము, అభిమన్యతే = అభిమానము గలవాఁ డగుచున్నాఁడు.

తా. కూటస్థచైతన్యముతోడను చిదాభాసునితోడను గూడిన శరీరద్వయమును జీవుఁ డెప్పుడు తన రూప మని భావించునో, యప్పుడు నేను సుఖదుఃఖాదులు గల సంసారి నని యభిమానమును పొందును.

శ్లో. భ్రమాంశస్య తిరస్కారా దధిష్ఠానప్రధానతా,
యదా తదా చిదాత్మాఽహ మసంగోఽస్మీతి బుధ్యతే. 8

వ్యా. యదా పునర్భ్రమాంశస్య దేహద్వయసహితస్య చిదాభాసస్య తిరస్కారాత్ మిథ్యాత్వజ్ఞానేనానాదరణాత్ అధిష్ఠానప్రధానతా అధిష్ఠానభూతస్యైవ కూటస్థస్య స్వరూపత్వం జీవేన స్వీక్రియతే, తదాహం చిదాత్మాఽసంగశ్చాస్మీతి బుధ్యతే జానాతి.

టీ. యదా=ఎప్పుడు, భ్రమాంశస్య = ఆరోపితస్వరూపమైనట్టి, దేహద్వయ ముతోఁ గూడిన చిదాభాసునియొక్క, తిరస్కారాత్ = నిరాకరించుటవలన, అధిష్ఠాన ప్రధానతా=అధిష్ఠానమైన కూటస్థస్వరూపము (గ్రహింపఁబడునో), తదా = అప్పుడు, అహం=నేను, చిదాత్మా=చిద్రూపుఁడను, అసంగః=నిస్సంగుఁడను, అస్మి=అగుచున్నాను, ఇతి=అని, బుధ్యతే=(జీవుఁడు) తెలిసికొనుచున్నాఁడు.

తా. ఎప్పుడు జీవుఁడు దేహద్వయముతోఁ గూడిన చిదాభాస స్వరూపము మిథ్య యగును గావున అధిష్ఠానకూటస్థచైతన్యస్వరూప మును మాత్రము తెలిసికొనునో యప్పుడు నే నసంగచిద్రూపుండ నైతి నని గ్రహించుచున్నాఁడు.

అవ. అసంగచిద్రూపుఁ డగు కూటస్థుఁడు నేను అనెడి జ్ఞానమునకు విషయుఁడు కాఁడు. కనుక నధిష్ఠానచైతన్యము జీవరూప మైనప్పుడు నే నసంగచిద్రూపుఁడ నైతి నని జీవుఁ డనుకొనుట ఘటింపదే యని యాశంకించి బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. నాసంగేఽహంకృతి ర్యుక్తా కథ మస్మీతి చేచ్ఛృణు,
ఏకో ముఖ్యో ద్వా వముఖ్యా విత్యర్థ స్త్రివిధోఽహమః. 9

వ్యా. నన్వధిష్ఠానచైతన్యస్య జీవస్వరూపత్వస్వీకారే చిదాత్మాహమసంగోఽస్మీతి బుధ్యత ఇతి యదుక్తం తదనుపపన్నం స్యాత్. అసంగచిద్రూపస్య కూటస్థస్యాహంప్రత్యయవిషయత్వాభావాదితి శంకతే—నాసంగ ఇతి. అసంగే చిదాత్మన్య విషయే అహంప్రత్యయో న యుజ్యతే యతః అతః కథమస్మీతి జానీయాత్? న కథమ

పీత్యర్థః. ముఖ్యయా వృత్త్యాహంప్రత్యయవిషయత్వాభావేఽపి లక్షణయా తదస్తీతి వివక్షురహంశబ్దార్థం తావద్విభజతే—శృణ్వితి. అహమోఽహంశబ్దస్యేత్యర్థః.

టీ. అసంగే = దేహేంద్రియాది సంబంధములేని కూటస్థునియందు, అహంకృతిః = అహంకారము, న యుక్తా సతీ=ఉండఁదగని దగుచుండఁగా, కథం = ఎట్లు, అస్మీతి చేత్=నే నసంగచిద్రూపుఁడ నైతి నని తెలిసికొను నంటివా? శృణు=చెప్పుచున్నాను, వినుము. అహమః = అహంశబ్దముయొక్క, అర్థః=అర్థము, ఏకః=ఒక్కటి, ముఖ్యః=ముఖ్యార్థమును, ద్వౌ=రెండు, అముఖ్యౌ=అముఖ్యార్థములును అగును. ఇతి = ఈవిధముగా, త్రివిధః=మూఁడువిధములైన యర్థములు గలది, (అహంశబ్ద మగును.)

తా. అసంగచిద్రూపుఁడు నే ననెడి జ్ఞానమునకు విషయుఁడు గాఁడు. కనుక ఆయధిష్ఠానస్వరూపము జీవుఁడే యనుకొనుట యెట్లు పొసఁగును ? అని యంటివా? అహంశబ్దమునకు ముఖ్యార్థము (వాచ్యార్థము) ఘటింపకపోయినను, లాక్షణికార్థము ఘటింపవచ్చు నని చెప్పఁబూని అహంశబ్దమునకు నొకటి ముఖ్యార్థము, రెండు గౌణార్థములును (లక్షణచేఁ జెప్పఁదగినవి) గల వని తెల్పెను.

అవ. అహంశబ్దముయొక్క ముఖ్యార్థమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. అన్యోన్యాధ్యాస్తరూపేణ కూటస్థాభాసయోర్వపుః,
ఏకీభూయ భవే న్ముఖ్య స్తత్ర మూఢైః ప్రయుజ్యతే. 10

వ్యా. కీదృశో ముఖ్యోఽర్థ ఇత్యాకాంక్షాయాం తం దర్శయతి—అన్యోన్యేతి. కూటస్థచిదాభాసయోః స్వరూపమన్యోన్యాధ్యాసే నైక్యం ప్రాప్తం అహంశబ్దస్య వాచ్యత్వేన ముఖ్యోఽర్థో భవతి. అస్య కుతో ముఖ్యత్వ మిత్యత ఆహ— తత్ర మూఢైరితి. యత ఇత్యధ్యాహారః. తత్ర తస్మిన్నవివిక్తే కూటస్థచిదాభాసయోః స్వరూపే యతో వివేకజ్ఞానశూన్యై స్సర్వైరప్యహంశబ్దః ప్రయుజ్యతే, అతోఽస్య ముఖ్యత్వమిత్యర్థః.

టీ. కూటస్థాభాసయోః = కూటస్థునియొక్కయు, చిదాభాసుఁడైన జీవునియొక్కయు, వపుః=స్వరూపము, అన్యోన్యాధ్యస్తరూపేణ = తాదాత్మ్యాధ్యాసరూపముగా, ఏకీభూయ = ఒకటియై, ముఖ్యః = వాచ్యార్థము, భవేత్ = అగును. తత్ర = ఆ యేకీభవించిన స్వరూపమునందు, మూఢైః = పామరజనముచేత, (యతః) = ఏ హేతువుచేత, ప్రయుజ్యతే = అహంశబ్దము వాడఁబడుచున్నదో, ఆకారణమువలన ముఖ్యార్థ మగు నని వెనుకటి వాక్యముతో నన్వయించు కొనవలెను.

తా. తెలియనివారు కూటస్థచిదాభాసుల తాదాత్మ్యాధ్యస్తరూపమును (రెంటియొక్క విశిష్టరూపమును) నే నని వ్యవహరింతురు. అదియే యహంశబ్దమునకు ముఖ్యార్థ మగును.

అవ. ఇప్పు డముఖ్యార్థముల రెంటిని దెలుపుచున్నాఁడు:—

శ్లో. పృథగాభాసకూటస్థా వముఖ్యౌ తత్ర తత్త్వవిత్,
పర్యాయేణ ప్రయుఙ్క్తేఽహంశబ్దం లోకే చ వైదికే. 11

వ్యా. ఇదానీమముఖ్యౌ ద్వౌ దర్శయతి—పృథగితి. ఆభాస్యకూటస్థౌ ప్రత్యేకమహంశబ్దార్థత్వేన యదా వివక్షితౌ తదా అముఖ్యార్థౌ భవతః. అనయోరముఖ్యత్వే కారణమాహ—తత్ర తత్త్వవిదితి. అత్రాపి యత ఇత్యధ్యాహారః. తత్త్వవిద్యతస్తత్ర తయోః కూటస్థచిదాభాసయోరహంశబ్దం లౌకికే వైదికవ్యవహారే చ పర్యాయేణ ప్రయుఙ్క్తే ఇతి యోజనా. అయం భావః—చిదాభాసకూటస్థయో రవివిక్తరూపస్య సార్వజనీనవ్యవహారవిషయత్వా న్ముఖ్యార్థత్వం. వివిక్తరూపస్య తు కతిపయజనైః కదాచిదేవ వ్యవహ్రియమాణత్వాదముఖ్యార్థత్వమితి.

టీ. ఆభాసకూటస్థౌ - ఆభాస = చిదాభాసుఁడును, కూటస్థౌ = కూటస్థుఁడును, పృథక్ = వేఱుగా విభజింపఁబడినవార లగుచు, అముఖ్యౌ = గౌణార్థము గలవారు (అగుచున్నారు). (యతః = ఏహేతువువలన), తత్ర = ఆకూటస్థచిదాభాసులయందు, తత్త్వవిత్ = తత్త్వజ్ఞానము గలవాఁడు, అహంశబ్ద = నే ననెడిమాటను, లోకే = లోకవ్యవహారమందును, వైదికే చ=వైదికవ్యవహారమునందును, పర్యాయేణ=ఒకొక్కసారి, ప్రయుఙ్క్తే = ఉపయోగించుచున్నాఁడు. (అతః = ఈహేతువుచేత గౌణార్థము లగును.)

తా. కూటస్థుఁడును చిదాభాసుఁడును ప్రత్యేకముగా (నొకరొకరిని కలుపక విభజించి) నే ననెడి శబ్దముతో వాడినపుడు గౌణార్థము గలవా రగుదురు. తత్త్వజ్ఞాని యగువాఁడు లౌకికవైదికవ్యవహారములయందు కూటస్థచిదాభాసులస్వరూపం బెఱిఁగినవాఁ డగుచు నే ననెడి శబ్దమును కూటస్థునియం దొకప్పుడును చిదాభాసునియం దొకప్పుడును బ్రత్యేకించి వాడుటంజేసి యముఖ్యార్థము (గౌణార్థములు) అగును.

అవ. ఇప్పుడు చక్కఁగా తెలియుటకొఱకుఁ బర్యాయముగా వాడుటను వివరించుచున్నాఁడు:—

శ్లో. లౌకికే వ్యవహారేఽహం గచ్ఛామీత్యాదికే బుధః,
విविచ్యైవ చిదాభాసం కూటస్థాత్తం వివక్షతి. 12

వ్యా. పర్యాయేణ ప్రయుజ్క్తే ఇత్యుక్తమేవార్థం ప్రపంచయతి ప్రతిపత్తి సౌకర్యాయ శ్లోకద్వయేన—లౌకికేతి. బుధో విద్వానహంగచ్ఛామిత్యాది లౌకికవ్యవహారే కూటస్థాచ్చిదాభాసం వివిచ్య తమేవాహంశబ్దేన వివక్షతి వక్తుమిచ్ఛతి.

టీ. బుధః = తెలిసినవాఁడు, (తత్త్వజ్ఞాని), అహం = నేను, గచ్ఛామి=పోవుచున్నాను. ఇత్యాదికే = ఇదిమొదలగు, లౌకికవ్యవహారే = లోకవ్యవహారమునందు, కూటస్థాత్ =కూటస్థునినుండి, చిదాభాసం = చిదాభాసుని, వివిచ్య = పరిశీలనచే విభజనముచేసి, తమేవ=ఆచిదాభాసునే, వివక్షతి=జెప్పఁబూనుచున్నాఁడు.

తా. నేను పోవుచున్నాను, నేను వచ్చుచున్నాను మొదలైన మాటలను లోకవ్యవహారమున నుపయోగించునపుడు ఈవాక్యముల యందు కర్తృపద మైన నేను అనెడి దానిని కూటస్థునినుండి చిదాభాసుని విభజించి విద్వాంసుఁడు ఆచిదాభాసుని నే నని చెప్పుచున్నాఁడు.

అవ. కూటస్థుఁడు నేను అనెడి జ్ఞానమునందు విషయుఁడు కావచ్చు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అసంగోఽహం చిదాత్మాహ మితి శాస్త్రీయదృష్టితః,
అహంశబ్దం ప్రయుఙ్క్తేఽయం కూటస్థే కేవలే బుధః. 13

వ్యా. అసంగ ఇతి. అయమేవ బుధశ్శాస్త్రీయదృష్టితః వేదాంతశ్రవణజనితజ్ఞానేన కేవలే చిదాభాసాద్వివిక్తే కూటస్థేఽసంగోఽహం, చిదాత్మాహ మితి లక్షణయాహంశబ్దం ప్రయుఙ్క్తే. అతో లక్షణయా అహంశబ్దార్థత్వేవాహం ప్రత్యయవిషయత్వసంభవాదసంగోఽహమస్మీతి జ్ఞానముపపద్యత ఇత్యభిప్రాయః.

టీ. అయం బుధః = ఈవిద్వాంసుఁడు, శాస్త్రీయదృష్టితః - శాస్త్రీయ = వేదాంతశ్రవణముచేఁ గలిగిన. దృష్టితః = జ్ఞానమువలన, అహం = నేను, అసంగః = నిస్సంగుఁడవనునట్టియు, అహం = నేను, చిదాత్మా = చిద్రూపుఁడను, ఇతి = ఇట్లు వైదికవ్యవహారమునందు, కేవలే=చిదాభాసునికంటె వేఱుగా గ్రహింపఁబడిన, కూటస్థే= కూటస్థునియందు, అహంశబ్దం = నేననెడిశబ్దమును ప్రయుఙ్క్తే = లక్షణావృత్తిచేత వాడుచున్నాఁడు.

తా. నేను దేహేంద్రియాదులసంబంధము లేనివాఁడను, నేను చిద్రూపుఁడను, అని యిట్లు వైదికవ్యవహారములందు వేదాంతశాస్త్ర

శ్రవణమువలన కలిగిన జ్ఞానమునుబట్టి చిదాభాసునినుండి విభజింపఁ బడిన కూటస్థునియందు విద్వాంసుఁడు నే ననెడి పదమును వాడు చున్నాఁడు. కాఁబట్టి కూటస్థుఁడు వైదికవ్యవహారమున నే ననెడి జ్ఞాన మునందు విషయుఁడు నిరభ్యంతరముగాఁ గావచ్చును. కూటస్థుఁడు జ్ఞానవిషయుఁ డగుట కభ్యంతరము లే దనుట.

అవ. ఈశ్లోకమునందు పూర్వవాది ఆక్షేపించుచున్నాఁడు:—

శ్లో. జ్ఞానితాజ్ఞానితే త్వాత్మాభాసస్యైవ న చాత్మనః,
తథా చ కథమాభాసః కూటస్థోఽస్మీతి బుధ్యతామ్. 14

వ్యా. నను పృథగాభాసకూటస్థావహంశబ్దస్యాముఖ్యార్థా విత్యుక్తం. తయో ర్మధ్యే కూటస్థః అజ్ఞాననివృత్తయేఽసంగోఽస్మీతి జానాతి. కింవా చిదాభాసః. స తావ త్కూటస్థః తస్యాసంగచిద్రూపత్వేన జ్ఞానిత్వాజ్ఞానిత్వయో రనుపపత్తేః. అత శ్చిదా భాసస్య జ్ఞానిత్వాదికం వక్తవ్యం. తథా చ సతికూటస్థాదన్య శ్చిదాభాసోఽహం కూట స్థోఽస్మీతి నజ్ఞాతు మర్హతీతి శంకతే-జ్ఞానితాజ్ఞానితేతి.

టీ. జ్ఞానితాజ్ఞానితే తు = జ్ఞానము గలిగి యుండుటయు, నజ్ఞానము గలిగి యుండుటయు, ఆత్మాభాసస్య ఏవ - ఆత్మ = కూటస్థాత్మయొక్క, ఆభాసస్యైవ = ప్రతిబింబమైన చిదాభాసునకే (కలవు). ఆత్మనః = కూటస్థునకు, న చ=లేవు. (జ్ఞానము గలుగుట జ్ఞానము లేకపోవుట యనుట), తథా చ = ఆవిధముగా నగుచుండఁగా, ఆభాసః = చిదాభాసుఁడు, కూటస్థః=కూటస్థస్వరూపము, అస్మీతి = ఐతి నని, కథం = ఎట్లు, బుధ్యతాం = తెలిసికొనును, తెలిసికొన సమర్థుఁడు గాఁ డనుట.

తా. జ్ఞానము కలుగుటయు లేకపోవుటయు బుద్ధి ప్రతిఫలితచిదా భాసునకు సంభవించును గాని కూటస్థునకు సంభవింపవు. ఆవిధముగా నగుచుండ కూటస్థునికంటె నన్యుఁ డగు చిదాభాసుఁడు నేను కూట స్థుఁడ నైతి నని తలంచుట యెట్లు సంభవించును? సంభవింపదు అని పూర్వపక్షి యాక్షేపించెను.

అవ. చిదాభాసుఁడు కూటస్థునికంటె నన్యుఁడు గాఁడు గనుక నీ యాక్షేపము చేయఁగూడదు:—

శ్లో. నాయం దోష శ్చిదాభాసః కూటస్థైకశరీరవాన్,
ఆభాసత్వస్య మిథ్యాత్వా త్కూటస్థత్వావశేషణాత్. 15

వ్యా. తస్య కూటస్థాదన్యత్వమేవాసిద్ధమితి పరిహరతి—నాయమితి. పత్తిమాహ—ఆభాసత్వేతి. యథా దర్పణే ప్రతీయమానస్య ముఖాభాసస్య వత్వం. గ్రీవాస్థ ముఖమేవ తత్త్వం. తద్వదితి భావః.

టీ. అయం దోషః = ఈదోషము, న = లేదు, ఆభాసత్వస్య = రూపము, మిథ్యాత్వాత్ = మిథ్య యగుటవలన (సత్యము కాకుండుటవలన) స్థత్వావశేషణాత్ - కూటస్థత్వ = కూటస్థస్వరూపమే, అవశేషణాత్ = సశేషించుటవలన, చిదాభాసః = ప్రతిబింబస్వరూపుఁడైన చిదాభాసుఁడు, కూ రవాన్ - కూటస్థ = కూటస్థస్వరూపమే, ఏక = ముఖ్యమైన, శరీరవాన్=శరీ గలవాఁడు, స్వరూపముగాఁ గలవాఁ డనుట (అగును).

తా. నీవు చెప్పిన దోష మిచ్చట సంభవింపదు. ముఖమ మునందు ప్రతిఫలించినపుడు ప్రతిఫలించినరూపము వాస్తవము ముఖముమాత్రము వాస్తవమైనతెఱఁగున ప్రతిబింబస్వరూప చిదాభాసుఁడు మిథ్య యగుటవలన కూటస్థస్వరూపమే యథార్థ శేషించియుండుటవలన చిదాభాసుఁడు కూటస్థునిస్వరూపుఁడే య గాని కూటస్థునికంటె నన్యుఁ డెన్నటికిని గానేరఁడు. కాఁబట్టి కూటస్థరూపము తానైతి ననుకొనుట తప్పు గాదు.

అవ. చిదాభాసుఁడు మిథ్యయైనపుడు వాఁడు కూటస్థుఁడ నైతి నను జ్ఞానము మాత్రము మిథ్య యేల గాకుండు నని శంకింపఁగా మా కదియు సవ యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థోఽస్మీతి బోధోఽపి మిథ్యా చేన్నేతి కో వదేత్,
న హి సత్యతయాభీష్టం రజ్జుసర్పవిసర్పణమ్.

వ్యా. నను చిదాభాసస్య మిథ్యాత్వే తదాశ్రితం కూటస్థోఽస్మీతి జ్ఞా మిథ్యాస్యాదితి శంకతే—కూటస్థయితి. కూటస్థస్వరూపాతిరిక్తస్య కృత్స్న మిథ్యాత్వాభ్యుపగమాత్తన్మిథ్యాత్వమస్మాకమిష్టమేవేతి పరిహరతి—నేతి కో వ ఉక్తమర్థం దృష్టాంతేన స్పష్టయతి—నహీతి. రజ్జ్వాం కల్పితస్య సర్పస్య గతా మపి ప్రతీయమానం వాస్తవం నాంగీక్రియతే యథా తద్వదితి భావః.

టీ. కూటస్థః = కూటస్థుఁడను, అస్మీతి = అయితి ననెడు, బోధోఽపి = జ్ఞ బును, మిథ్యా చేత్ = మిథ్య యగు నంటివా, న=మిథ్యకాదు, ఇతి=అని, కః=ఎవ్వ వదేత్ = చెప్పును? (ఎవ్వఁడును చెప్పఁ డనుట). రజ్జుసర్పవిసర్పణం - రజ్జు = యందు, సర్ప = పాముయొక్క, విసర్పణం = గమనము. మొదలైనది, సత్యతయ సత్యముగా, నహ్యభీష్టం = అంగీకరింపఁబడదు గదా.

తా. రజ్జువునందు భ్రాంతిచే కల్పింపఁబడిన సర్పముయొక్క గమనాదికము ఎవనిచేతను సత్యముగా నెట్లు అంగీకరింపఁబడదో, అటులనే కూటస్థుఁడ నే నైతి ననెడి జ్ఞానంబును మిథ్య యందువేమో, అది మాకును సమ్మతమే యగును. చిదాభాసుఁడు మిథ్య యగును. వాఁడు సంపాదించిన నేను కూటస్థుఁడ నైతి ననెడి జ్ఞానముమాత్రము మిథ్య కా దని యెవ రందురు. మిథ్య యగుట యందఱకు సమ్మతమే.

అవ. జ్ఞానము మిథ్య యగునేని, యాజ్ఞానముచేత సంసారనివృత్తి యెట్లగు నని యాశంకించి సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. తాదృశేనాపి బోధేన సంసారో హి నివర్తతే,
యక్షానురూపో హి బలి రిత్యాహు ర్లౌకికా జనాః. 17

వ్యా. జ్ఞానస్య మిథ్యాత్వే తేన సంసారనివృత్తిర్న స్యాదిత్యాశంక్య నివర్త్యస్య సంసారస్యాపి, తథాత్వా త్తన్నివృత్తిరుపపద్యతే. స్వప్నవ్యాఘ్రదర్శనేన నిద్రానివృత్తివదిత్యభిప్రాయేణాహ—తాదృశేనేతి. తత్ర యాదృశో యక్షస్తాదృశో బలి రితి లౌకిక గాథాం సంవాదయతి—యక్షేతి.

టీ. తాదృశేన = అట్లు మిథ్యయైన, బోధేనాపి = జ్ఞానముచేతనుకూడ, సంసారః = సంసారము, నివర్తతే హి = నివృత్తియగుచున్నది గదా. లౌకికాః=పామరులైన, జనాః=జనులు, బలిః = బలి, యక్షానురూపః = యక్షుఁ డెంతయో బలియు నంతే, ఇతి = అని, ఆహుర్హి = చెప్పుచున్నారు గదా.

తా. కలలోఁ గనఁబడిన పెద్దపులిని చూచుటచేత నిద్రకు భంగము గలిగినటుల మిథ్యయైన జ్ఞానముచేత సంసారము నివర్తించు ననుటకు సందియము లేదు. పామరులయొక్క వాడుకయు దీనిని బలపఱచుచున్నది. యక్షుఁ డెంతయో బలియు నంతే యని పామరు లను కొనుదురు. అనఁగా గొప్ప దయ్యమునకు నిచ్చెడు బలియు గొప్పదే యగును. అను వాడుకనుబట్టి స్వప్నమందుఁ గనఁబడిన పెద్దపులియు సత్యము కాదు. దానిని చూచిన జ్ఞానమును సత్యము కాదు. అట్టి యసత్యజ్ఞానముచేత నిద్ర పోయినట్లు చిదాభాసుఁడును మిథ్యయే. అతనికి కూటస్థుఁడను నే నైతి ననెడి జ్ఞానమును మిథ్యయే. ఇట్టిజ్ఞానముచేత సంసారము నివర్తించు ననుట తప్పు గాదు.

అవ. ఇప్పుడు చెప్పుచున్న యంశమును నుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. తస్మాదాభాసపురుష స్సకూటస్థో వివిచ్య తం,
కూటస్థోఽస్మీతి విజ్ఞాతు మర్హతీ త్యభ్యధాచ్ఛ్రుతిః. 18

వ్యా. ఉపపాదితమర్థ ముపసంహరతి—తస్మాదితి. యస్మాత్కూటస్థ ఏవ చిదాభాసస్య నిజం స్వరూపం. తస్మా త్పురుషశబ్దవాచ్యః కూటస్థ సహితశ్చిదాభాస స్తత్ కూటస్థం మిథ్యాభూతాత్స్వస్మాద్వివిచ్య లక్షణయా కూటస్థోఽస్మీత్యవగంతుం శక్నోతీ త్యభిప్రాయేణ శ్రుతిరస్మీత్యుక్తవతీత్యర్థః.

టీ. తస్మాత్ = ఆకారణమువలన, ఆభాసపురుషః - ఆభాస=చిదాభాసుఁడును పురుషః = పురుషుఁ డని చెప్పఁదగినట్టియు, సకూటస్థ = కూటస్థునితోఁ గూడిన జీవుఁడు, తం = ఆకూటస్థుని, వివిచ్య=తనకంటె వేఱుగా విభజించి, కూటస్థ=కూటస్థుఁడును, అస్మీతి = ఐతి నని, విజ్ఞాతుం = తెలిసికొనుటకొఱకు, అర్హతి=తగుచున్నాఁడు, ఇతి = ఇట్లుగా, శ్రుతిః = వేదవాక్యము, అభ్యధాత్ = చెప్పెను.

తా. ఏ హేతువుచేత కూటస్థుఁడే చిదాభాసునకు నిజస్వరూపమో, ఆకారణమువలన పురుషుఁ డని చెప్పఁబడుచు కూటస్థునితోఁ గూడిన చిదాభాసుఁడు [జీవుఁడు] మిథ్యాభూతుఁడైన తనకంటె కూటస్థుని విభజించి గౌణవృత్తిచేత [లక్షణావృత్తిచేత] కూటస్థుఁడ నైతి నని తెలిసికొన నర్హుఁ డని ప్రకరణారంభమున నుదాహరింపఁబడిన శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఇట్లు "పురుషోఽస్మి" అని శ్రుతియందలి యీపదముల యభిప్రాయము తేటపఱచి "అయం" అను పదమును ప్రయోగించిన శ్రుత్యభిప్రాయమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. అసందిగ్ధావిపర్యస్తబోధో దేహాత్మనీక్ష్యతే,
తద్వదత్రేతి నిర్ణేతు మయ మిత్యభిధీయతే. 19

వ్యా. ఏవం పురుషోఽస్మీతి పదద్వయప్రయోగాభిప్రాయమభిధాయ అయమితి పదప్రయోగాభిప్రాయమాహ—అసందిగ్ధేతి. లౌకికానాం ప్రసిద్ధే దేహరూప ఆత్మని సంశయవిపర్యయరహితోఽయమస్మీతి బోధో యద్వదుపలభ్యతే. అత్ర ప్రత్యగాత్మని విషయే తద్వత్తథావిధంజ్ఞానం ముక్తిసిద్ధయే సంపాద్యమితి నిర్ణేతు మయమిత్యభిధీయతే. శ్రుత్యేతి శేషః.

టీ. యద్వత్ = ఏవిధముగా, దేహాత్మని = దేహరూపమైన ఆత్మయందు, అసందిగ్ధావిపర్యస్తబోధః - అసందిగ్ధ = సందేహరహితమైనట్టియు, అవిపర్యస్త = విపర్యయ

రహితమైన, బోధః=ఈదేహమే నేనైతినని నెడి జ్ఞానము, ఈత్యతే=కనఁబడుచున్నదో (పామరజనుల కనుట). అత్ర = ఈప్రత్యగాత్మవిషయమున, తద్వత్ = అటువంటి జ్ఞానము మోక్షసిద్ధికై సంపాదింపవలయును. ఇతి = అని, నిర్ణేతుం = నిశ్చయించుటకు, అయమితి = ఇది యాత్మ యని, అభిధీయతే = శ్రుతిచేత తెలుపఁబడుచున్నది.

తా. పూర్వోక్తశ్రుతియందలి "అయం" అను పదప్రయోగము మన కేమి బోధించుచున్న దనఁగా సర్వజనప్రసిద్ధమైన యీదేహము నే నని సంశయవిపర్యయములు లేనిజ్ఞానము కలిగినట్లు మోక్షము లభించుటకు నీప్రత్యగాత్మస్వరూపము నే నైతి నని నిశ్చయము సంపాదింపవలయును అని బోధించుచున్నది.

అవ. ఇట్టిజ్ఞానము మోక్షమునకు సాధనము ఇట్లే యాచార్యులవారును చెప్పి రని వారివాక్యము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. దేహాత్మజ్ఞానవద్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం,
ఆత్మన్యేవ భవే ద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే. 20

వ్యా. ఈదృశ్యస్యైవ బోధస్య మోక్షసాధనత్వే చాచార్యవాక్యం సంవాదయతి—దేహాత్మేతి. అహం మనుష్య ఇతి దేహాత్మవిషయో దృఢప్రత్యయో యథా, ఏవం ప్రత్యగాత్మన్యేవ దేహాత్మత్వజ్ఞానబాధనేన బ్రహ్మాహమస్మీతి జ్ఞానం యస్య జాయతే స విద్వాన్నేచ్ఛన్నపి మోక్షేచ్ఛారహితోఽపి ముచ్యతే సంసారహేతోర్జ్ఞానస్య జ్ఞానేనోపబాధితత్వాదితి భావః.

టీ. దేహాత్మజ్ఞానవత్ = దేహమే ఆత్మ యనెడిజ్ఞానమువలె, జ్ఞానం=దృఢమైన బ్రహ్మజ్ఞానము, దేహాత్మజ్ఞానబాధకం - దేహాత్మ = శరీరమే యాత్మ యనెడి, జ్ఞాన = జ్ఞానమును, బాధకం = పోఁగొట్టునదై, ఆత్మన్యేవ = ప్రత్యగాత్మయందే, యస్య = ఎవనికి, భవేత్ = కలుగునో, సః = వాఁడు, నేచ్ఛన్నపి = ముక్తిని గోరకున్నను, ముచ్యతే = సంసారబంధమునుండి విముక్తుఁ డగుచున్నాఁడు.

తా. లోకమున నెవనికి నీదేహమే నే ననెడి నిశ్చయమువలె దేహాత్మజ్ఞానమును బోఁగొట్టెడి బ్రహ్మజ్ఞానము దృఢముగా నేను బ్రహ్మమను [బ్రహ్మాహమస్మి] అని ప్రత్యగాత్మయందు కుదురునో, వానికి వల దనినను మోక్షము తప్పక కలుగు నని యాచార్యులవారు చెప్పి రని భావము.

అవ. "అయం" అనెడి పదమునుగుఱించి పూర్వవాది మఱియొకవిధముగఁ బ్రశ్న చేయుచున్నాఁడు:—

శ్లో. అయ మిత్యపరోక్షత్వ ముచ్యతే చే త్తదుచ్యతాం,
స్వయంప్రకాశం చైతన్య మపరోక్షం సదా యతః. 21

వ్యా. అయమితి పదప్రయోగస్యాభిప్రాయాంతరం శంకతే—అయమితి. యథా ఽయం ఘట ఇత్యాదిప్రయోగే ష్విదమా నిర్దిష్టస్య వస్తున ఆపరోక్ష్యం దృష్టం, తథాయమస్తీ త్యత్రాపీతి భావః. తదప్యస్మాకమిష్టమే వేత్యాహ—త దుచ్యతామితి. కుత ఇత్యత ఆహ—స్వయమితి. సాధనాంతరనిరపేక్షతయాఽవభాసమానచైతన్యం వ్యవధాయకాభావాన్నిత్యమపరోక్షమిత్యస్మాభిరభ్యు పేతత్వాదిత్యర్థః.

టీ. అయమితి = అయ మనెడి పదప్రయోగముచే, అపరోక్షత్వం = ఆత్మకు ప్రత్యక్షత్వమును, ఉచ్యతే చేత్ = చెప్పఁబడుచున్న దంటివా, యతః=ఏ హేతువు వలన, స్వయం = తానుగా, (అన్యాపేక్ష లేక), ప్రకాశం=ప్రకాశించెడి, చైతన్యం= కూటస్థచైతన్యము, అపరోక్షం = ప్రత్యక్షమై యున్నదో, (తతః = ఆహేతువువలన) తత్ = ఆయపరోక్షత్వము, ఉచ్యతాం = చెప్పఁబడుఁగాక.

తా. ఇది కుండ, ఇది వస్త్రము అనెడి వాక్యములలో నిది యని చెప్పఁబడిన వస్తువునకు ప్రత్యక్షత్వ మెట్లు తెలియఁబడెనో, ఇది కూటస్థాత్మ యగును అనెడి వాక్యమం దుండెడి యిది యను నర్థము గల "అయం" అను పదముచేత తెలుపఁబడిన ఆత్మయు నట్లు ప్రత్యక్షమైనదే యగు నని యనెదవేమో, అన్యవస్తుసహాయ మవసరము లేక యెల్లప్పుడును ప్రకాశించునట్టి కూటస్థచైతన్యము ప్రత్యక్షమైన దనుట మాకును సమ్మతమే.

అవ. ఆత్మకు స్వయముగాఁ బ్రకాశించుటచేత 'అయం' అను పదమున కిప్పు డొప్పుకొనిన యపరోక్షత్వమును, దీనియొక్క యభిప్రాయాంతరమునుబట్టి పరోక్షత్వమును, నిదివఱకుఁ జెప్పఁబడిన జ్ఞానాజ్ఞానవిషయత్వమును నుండుట ఘటింపదు అని శంక రాఁగా ఘటించు నని బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. పరోక్ష మపరోక్షం చ జ్ఞాన మజ్ఞాన మిత్యదః,
నిత్యాపరోక్షరూపేఽపి ద్వయం స్యాద్దశమే యథా. 22

వ్యా. నన్వాత్మనస్స్వప్రకాశచిద్రూపత్వేన నిత్యాపరోక్షత్వాభ్యుపగమేఽయమితి పదప్రయోగస్యాభిప్రాయాంతరవర్ణనాంగీకారబలాదాగతమాత్మనః పరోక్షవిష

యత్వ మపరోక్షవిషయత్వం చ పూర్వోక్తం జ్ఞానాజ్ఞానాశ్రయవిషయత్వం చానుప పన్నం స్యాదిత్యాశంక్య దశమ ఇవ సర్వముపపద్యత ఇత్యాహ—పరోక్షమితి. పరోక్షమపరోక్షం చేత్యేకం యుగళం. జ్ఞానమజ్ఞానమిత్యపరం. ఇదం ద్వయం నిత్యాపరోక్షరూపేఽప్యాత్మని దశమ ఇవ స్యాదిత్యర్థః.

టీ. పరోక్షం = ప్రత్యక్షము గాక పోవుటయు, అపరోక్షం చ=ప్రత్యక్షమగుటయు, జ్ఞానం=జ్ఞానమును (తెలివి యనుట), అజ్ఞానం=తెలివి లేకపోవుటయు, ఇతి = అనెడి, అదః ద్వయం=ఈరెండును, దశమే యథా = పదియవవానియందువలె, నిత్యాపరోక్షరూపేఽపి=నిత్యమును నపరోక్షంబును నైన ఆత్మయందును, స్యాత్=ఉండును (ఘటించును).

తా. ఆత్మ నిత్యమైనదియు, ప్రత్యక్షమైనదియు నగును. స్వయముగా నిట్టిదైనను పదియవవానియందు వలె నాత్మయందు పరోక్షవిషయత్వాపరోక్షవిషయత్వంబును జ్ఞానాజ్ఞానవిషయత్వంబును ననెడి రెండు జంటలును ఘటింపవచ్చును.

అవ. పదియవవాఁ డని చెప్పిన దృష్టాంతము వివరించుచున్నాఁడు:—

శ్లో. నవసంఖ్యాహృతజ్ఞానో దశమో విభ్రమాత్తదా,
న వేత్తి దశమోఽస్మీతి వీక్షమాణోఽపి తాన్నవ. 23

వ్యా. దృష్టాంతం వ్యుత్పాదయతి—నవసంఖ్యేతి. పరిగణనీయపురుషనిష్ఠయా నవసంఖ్యయా అపహృతాత్మజ్ఞానో దశమస్తదా తాన్ పరిగణనీయాన్ నవసంఖ్యాకాన్వీక్షమాణోఽపి సమ్యక్పశ్యన్నపి భ్రాంత్యా గణనాకర్తారం స్వాత్మానం దశమోఽహ మస్మీతి న వేత్తీత్యర్థః.

టీ. నవసంఖ్యాహృతజ్ఞానః - నవసంఖ్యా = తొమ్మిదిమంది యనెడి లెక్కచేత హృత = పోయిన, జ్ఞానః=తెలివి గల, దశమః = పదియవవాఁడు, తాన్ నవ = ఆ తొమ్మిదిమంది మనుష్యులను, వీక్షమాణోఽపి=ప్రత్యక్షముగా చూచుచుండియు, విభ్రమాత్ = భ్రమవలన (తెల్విలేమిచే ననుట). తదా=ఆ లెక్కించునపుడు, దశమః = పదియవవాఁ డను, అస్మి=నే నగుచున్నాను, ఇతి=అని, న వేత్తి = గుర్తెఱుఁగఁడు.

తా. ఒకప్పుడు పదిమంది మనుష్యులు కలిసి యొకయూరికిఁ బోవుచుండ దారిలో నొక యేఱు దాటవలసి వచ్చెను. అప్పు డాయేటిని దాఁటి యావలిగట్టున, కంపలును చేరిరి. అంత మన మందఱము గట్టుకు చేరితిమా లేదా యని యం దొకనికి సందేహము కలిగి, ఒకఁడు ఇద్దఱు

అని వరుసగా నెదుటఁ గనుపించెడి తొమ్మిదిమందిని లెక్కపెట్టి యాలెక్క పెట్టుటలో తా నొకఁ డున్నట్లు ప్రత్యక్షముగా నెఱిఁగియుండినను పది యవవాఁడు తా నని తెలిసికొనలేక, అయ్యో పదియవవాఁ డేటఁ బడి పోయినాఁ డని చింతింపఁ జొచ్చెను. ఇట్లు ప్రతివాఁడును లెక్కింప మొద లిడి తొమ్మిదిమందిని లెక్కించి తనను మఱచుచు వచ్చెను. ఇట్టికథలో లెక్కపెట్టెడివాఁడు తా నొకఁ డున్నాఁ డని వానికిఁ దెలిసియు నేను పదియవవాఁడ నగుదు నని తెలియకపోవుటయే యిచ్చట భ్రాంతి (అజ్ఞానము) అనఁబడును.

అవ. ఇట్లజ్ఞానమును దశమునియందుఁ గనుపఱిచి అజ్ఞానకార్యమగు నావర ణముం గూడ నా పదియవవానియందుఁ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. న భాతి నాస్తి దశమ ఇతి స్వం దశమం తదా,
మత్వా వక్తి త దజ్ఞానకృత మావరణం విదుః. 24

వ్యా. ఏవం దశమేఽజ్ఞానం ప్రదర్శ్య తత్కార్యమావరణం దర్శయతి—న భాతీతి. తదా దశమస్స్వం దశమం సంతం దశమో న భాతి నాస్తీతి మత్వా వక్తి. అస్యావరణస్య యత్కారణం తదజ్ఞానకృతం. అజ్ఞానకార్య మావరణం విదుర్బుధా ఇతి శేషః.

టీ. తదా=అప్పుడు, స్వం=తాను, దశమం సంతం=పదియవవాఁడై యుండియు, దశమః = పదియవవాఁడు, నాస్తి=లేఁడు, న భాతి=కనఁబడఁడు, ఇతి = ఈలాగున, మత్వా=తెలిసి, వక్తి = చెప్పుచున్నాఁడు, తత్ = అట్లు చెప్పుటను, అజ్ఞానకృతం = అజ్ఞానముచేత చేయఁబడిన, ఆవరణం = ఆవరణమునుగా, (బుధాః=పండితులు), విదుః= తెలియుదురు.

తా. తా నున్నాఁ డని తెలిసియు పదియవవాఁడు లేఁడు కనఁ బడఁడు అని యాలెక్క లెక్కించునప్పుడు చెప్పుటకు నజ్ఞానకృత మగు నావరణము కారణం బని తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు. ఆవరణము ద్వివిధము. అసత్త్వావరణ మనియు, అభానావరణ మనియు. పదియవ వాఁడు లేఁ డనుట యసత్త్వావరణ మగును. పదియవవాఁడు కనఁబడ లే డనుట యాభానావరణ మగును. ఇట్లావరణస్వరూపమును దెలియనగు.

అవ. ఇప్పుడు అజ్ఞానకార్య మగు విక్షేపమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. నద్యాం మమార దశమ ఇతి శోచన్ ప్రరోదితి,
అజ్ఞానకృతవిక్షేపం రోదనాదిం విదు ర్బుధాః. 25

వ్యా. అజ్ఞానస్యైవ కార్యవిశేషవిక్షేపం దర్శయతి—నద్యామితి.

టీ. దశమః = పదియవవాఁడు, నద్యాం = ఏటియందు, మమార = చనిపోయి నాఁడు. ఇతి = అని, శోచన్ = శోకించుచు, ప్రరోదితి = పొరలిపొరలి యేడ్చుచున్నాఁడు. బుధాః=తెలిసినవారు, రోదనాదిం = పెద్దగా నేడ్చుట మొదలగుదానిని, అజ్ఞానకృతవిక్షేపం - అజ్ఞాన = అజ్ఞానముచేత, కృత = చేయఁబడిన (అజ్ఞానకార్యమనుట), విక్షేపం = విక్షేపముగా, విదుః=తెలిసికొనుచున్నారు.

తా. పదియవవాఁ డేటిలో చనిపోయినాఁ డని శోకముతోఁ బెద్దగా నేడ్చుచుండుట మొదలగుదానిని అజ్ఞానకార్య మగు విక్షేపమునుగాఁ బెద్దలు చెప్పుదురు.

అవ. పదియవవాఁడు లేఁ డనెడి యసత్త్వావరణమును దొలఁగించునట్టి పరోక్షజ్ఞానమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. న మృతో దశమోఽస్తీతి శ్రుత్వాప్తవచనం తదా,
పరోక్షత్వేన దశమం వేత్తి స్వర్గాదిలోకవత్. 26

వ్యా. దశమస్యాసత్త్వాంశనివర్తకం పరోక్షజ్ఞానమాహ—న మృత ఇతి.

టీ. తదా = అప్పుడు, దశమః = పదియవవాఁడు, న మృతః = మరణింపలేదు, అస్తి=కలఁడు, ఇతి=అని, ఆప్తవచనం = హితునిమాటను, శ్రుత్వా = విని, పరోక్షత్వేన=ఎక్కడనో యున్నట్లుగా, స్వర్గాదిలోకవత్ = స్వర్గాదిలోకమువలె, దశమం= పదియవవానిని, వేత్తి = తెలిసికొనుచున్నాఁడు.

తా. ఈవిధముగాఁ బదియవవాఁ డేడ్చుచుండఁగా నింతలో వాని స్నేహితుం డొకఁ డరుదెంచి, మిత్రుఁడా, యేడ్వకుము. పదియవవాఁడు చనిపోలేదు. ఉన్నాఁ డని చెప్పినప్పుడు ఎక్కడనో స్వర్గాదిలోకము లున్నట్లు పదియవవాఁ డెక్కడనో యున్నాఁ డని తలంచును. ఎక్కడనో యున్నాఁడు అని యెఱుంగుట పరోక్షజ్ఞాన మగును దీనిచేత లేఁ డనెడు అసత్త్వావరణము పోవుటచేతఁ బరోక్షజ్ఞానముచే నసత్త్వావరణము నశించు నని పాఠకులు ముఖ్యముగా గ్రహింపవలయును.

అవ. ఆ పదియవవానియొక్క కనఁబడ లే దనెడి అభానావరణము దొలఁగించు నపరోక్షజ్ఞానమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. త్వమేవ దశమో உసీతి గణయిత్వా ప్రదర్శితః,
అపరోక్షతయా జ్ఞాత్వా హృష్యత్యేవ న రోదితి. 27
అజ్ఞానావృతివిక్షేపద్వివిధజ్ఞానతృప్తయః,
శోకాపగమ ఇత్యేతే యోజనీయాశ్చిదాత్మని. 28

వ్యా. తస్యైవాభానాంశనివర్తకమపరోక్షజ్ఞానం దర్శయతి—త్వమేవేతి. స్వేన పరిగణితైర్నవభిస్సహాస్యాత్మానం గణయిత్వా త్వమేవ దశమో உసీతి ప్రదర్శితః. అహం దశమో உస్మీత్యపరోక్షతయా జ్ఞాత్వా హర్షం ప్రాప్నోతి రోదనం త్యజతి.

ఏవం దృష్టాంతభూతే దశమే ప్రదర్శిత మవస్థాసప్తక మనూద్య, దార్ష్టాంతికే ఆత్మన్యపి తద్యోజనీయమిత్యాహ—అజ్ఞానేతి. అజ్ఞానం చావృతిశ్చ విక్షేపశ్చ ద్వివిధజ్ఞానం చ తృప్తిశ్చేతి ద్వంద్వసమాసః.

టీ. త్వమేవ=నీవే, దశమః=పదియవవాఁడవు, అసీతి=అయితివని, గణయిత్వా=లెక్కపెట్టి, ప్రదర్శితః = స్నేహితునిచే చూపఁబడినవాఁడై, అపరోక్షతయా=ప్రత్యక్షభావముచేత, జ్ఞాత్వా=నేనే పదియవవాఁడ నని తెలిసికొని, హృష్యత్యేవ = మిక్కిలి సంతోషమునే పొందుచున్నాఁడు. న రోదితి = విలపించుటను మానుచున్నాఁడు. అజ్ఞానావృతివిక్షేపద్వివిధజ్ఞానతృప్తయః - అజ్ఞాన=అజ్ఞానమును, ఆవృతి=ఆవరణమును, విక్షేప=విక్షేపమును, ద్వివిధజ్ఞాన = పరోక్షాపరోక్షము లనెడు రెండు జ్ఞానములును, తృప్తయః = సంతృప్తియు (ఆనందప్రాప్తియు), శోకాపగమః = దుఃఖనివృత్తియు, ఇత్యేతే = ఇట్లు పదియవవానియందు చూపఁబడిన ఈ యేడవస్థలును, చిదాత్మని = కూటస్థాత్మయందు, యోజనీయాః = ఆలోచించి సరిపుచ్చవలెను.

తా. నీవే పదియవవాఁడ వని మిత్రుఁడొకఁడు లెక్కపెట్టి చూపించినపుడు నేనే పదియవవాఁడ నని తనను బ్రత్యక్షముగాఁ దెలిసికొని మిక్కిలి యానందము పొందుచు, పదియవవాఁడు నదిలో చనిపోయినాఁ డను దుఃఖమును పూర్తిగా విడుచుచున్నాఁడు. ఇప్పుడు దృష్టాంతముగాఁ దెలుపఁబడిన కథయందు పదియవ వానికిఁ గలిగిన అవస్థలను ఆలోచింపఁగా నేడువిధములుగఁ గన్పట్టుచున్నవి. ఏటి యొడ్డునకు వచ్చి వరుసగా తొమ్మిదిమందిని లెక్కించి లెక్కపెట్టెడి తా నుండినను మఱచుట యనునది అజ్ఞాన మనెడి మొదటి యవస్థ. పదియవవాఁడు లేఁడు గనఁబడఁ డనునది ఆవరణ మనెడి రెండవ అవస్థ. ఏటిలోఁ బడి చనిపోయినాఁ డని శోకముతో రోదనము చేయుట

విక్షేప మనెడి మూఁడవ అవస్థ. అప్పుడు స్నేహితుఁడు వచ్చి పదియవ వాఁడు మరణింపలేదు, ఉన్నాఁ డని తెల్పినపు డెక్కడనో చాటున నున్నాఁ డని భావించుట పరోక్షజ్ఞాన మనెడి నాల్గవ అవస్థ. అంతఁ గ్రమముగా నందఱిని లెక్కించి నీవే పదియవవాఁడ వని తన ప్రేలితోఁ బొడిచి ప్రత్యక్షముగాఁ దెల్పుట అపరోక్షజ్ఞాన మను నైదవ అవస్థ. తదుపరి నేనే పదియవవాఁడను బ్రతికియున్నా నని తలఁచి దుఃఖమును బాయుట యనునది దుఃఖనివృత్తి యను నాఱవ అవస్థ. పదుగురము జీవముతో సుఖముగా నరికి చేరితి మని యానందించుట ఆనంద ప్రాప్తి యనెడి యేడవ అవస్థ. ఇట్టి యేడువిధములైన అవస్థలను ఆత్మయందును గల్గుచున్నవి యని బుద్ధిమంతు లూహించి తెలియవలయును.

అవ. ఇట్లు దృష్టాంతమును స్పష్టపఱచి దార్ష్టాంతిక మగు నాత్మయందును అజ్ఞానము మొదలగు సప్తావస్థలను గ్రమముగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. సంసారాసక్తచిత్తస్సంశ్చిదాభాసః కదాచన,
స్వయంప్రకాశకూటస్థం స్వతత్త్వం నైవ వేత్త్యయమ్. 29

వ్యా. తత్రాత్మన్యజ్ఞానాదికం క్రమేణ దర్శయతి—సంసారాసక్తేత్యాదినా శ్లోకచతుష్టయేన. అయం చిదాభాసో విషయసంపాదనాదిష్వాసక్తచిత్తస్సన్, కదాచన శ్రుతివిచారాత్పూర్వం కదాచిదపి స్వతత్త్వం స్వస్య నిజం రూపం స్వప్రకాశచిద్రూపం కూటస్థం ప్రత్యగాత్మానం నైవ వేత్తి న జానాతీతి యత్తదజ్ఞానమ్.

టీ. అయం చిదాభాసః=ఈజీవుఁడు, సంసారాసక్తచిత్తస్సన్ - సంసార=సంసారమునందు, ఆసక్త=లగ్నమైన, చిత్తస్సన్=మనస్సుగలవాఁడగుచు, కదాచన = ఇదివఱకెన్నఁడును (వేదాంతవిచారముచేయుటకు పూర్వ మనుట), స్వతత్త్వం=తన నిజరూప మగు, స్వయంప్రకాశకూటస్థం - స్వయం = ఇతరాపేక్షలేక, ప్రకాశ = వెలింగెడు, కూటస్థం=ప్రత్యగాత్మ చైతన్యమును, నైవ వేత్తి=గుర్తెఱుఁగఁడు.

తా. ఈచిదాభాసుఁ డగు జీవుఁడు శరీరదారాపత్యక్షేత్రవిత్తాదులయం దాసక్తచిత్తుఁ డయి వేదాంతవిచారము చేయక ముందు ఎన్నఁడును తన స్వరూప మగు స్వప్రకాశచైతన్య మగు ఆత్మను నెఱుంగకుండుట యజ్ఞాన మను ప్రథమావస్థ యగును.

శ్లో. న భాతి నాస్తి కూటస్థ ఇతి వక్తి ప్రసంగతః,
కర్తా భోక్తాఽహమస్మీతి విక్షేపం ప్రతిపద్యతే. 30

వ్యా. న భాతీతి. చిదాత్మవిషయే ప్రసంగే జాతే కూటస్థో నాస్తి న భాతీతి మత్వా బ్రూతే. ఇదమజ్ఞానకార్యమావరణం కూటస్థాసత్త్వాభానాభిధానవత్కర్తృత్వాదిక మాత్మన్యారోపయతి—అస్యారోపస్య హేతుర్దేహద్వయయుత శ్చిదాభాసో విక్షేపః.

టీ. ప్రసంగతః=కూటస్థుని ప్రస్తావన గలిగినపుడు, కూటస్థః=కూటస్థుఁడు, నాస్తి= లేఁడు, న భాతి = ఎక్కడను గనఁబడఁడు, ఇతి = అని, వక్తి = చెప్పుచున్నాఁడు. (జీవుఁడు) అహం=నేను, కర్తా=కర్మలను జేయువాఁడను, భోక్తా=కర్మఫలములగు సుఖ దుఃఖాదుల ననుభవించెడివాఁడను, అస్మీతి=అగుదు నని, విక్షేపం = విక్షేపస్థితిని, ప్రతిపద్యతే = పొందుచున్నాఁడు.

తా. కూటస్థుని ప్రస్తావన రాఁగా నీచిదాభాసుఁ డగు జీవుఁడు కూటస్థుఁడు లేఁ డనియు కనఁబడఁ డనియుఁ జెప్పుట అసత్త్వాభానరూప మగు నావరణద్వితీయావస్థ. నేను కర్తను, నేను భోక్తను అని కర్మములను, కర్మఫలము లగు సుఖదుఃఖాదులను తనపై నారోపించుకొనుట విక్షేప మను తృతీయావస్థ. ఈయారోపణకారణము స్థూల సూక్ష్మశరీరములతోఁ గూడిన చిదాభాసుని విక్షేప మని చెప్పుదురు.

శ్లో. అస్తి కూటస్థ ఇత్యాదౌ పరోక్షం వేత్తి వార్తయా,
పశ్చాత్కూటస్థ ఏవాస్మీత్యేవం వేత్తి విచారతః. 31

వ్యా. అస్తి కూటస్థ ఇతి. పరేణ బోధితః కూటస్థోఽస్తీతి జానాతి. ఇదం పరోక్షజ్ఞానం. శ్రవణాది పరిపాకవశాత్కూటస్థోఽహమేవాస్మీతి జానాతి. ఇదమపరోక్షజ్ఞానం.

టీ. వార్తయా=గురువుయొక్క వాక్యముచేత, కూటస్థః=కూటస్థుఁడు, (అస్తీతి= ఉన్నాఁ డని), ఆదౌ=ప్రథమమున, పరోక్షం=పరోక్షముగా (ఎక్కడనో యున్నట్లు), వేత్తి = తెలిసికొనుచున్నాఁడు, పశ్చాత్ = అవెనుక, విచారతః = విచారణమువలన, కూటస్థ ఏవ=కూటస్థుఁడనే, అస్మి=నే నగుచున్నాను, ఇతి=అని, ఏవం=ఇట్లు, వేత్తి = ప్రత్యక్షముగా కూటస్థుని గుర్తెఱుఁగుచున్నాఁడు.

తా. సద్గురువు చెప్పుటచేత కూటస్థుఁ డొకఁడు గలఁ డని తెలిసికొనుట పరోక్షజ్ఞాన మను నాల్గవ అవస్థ. అటుతర్వాత శ్రవణాదుల

యొక్క పరిపాకవశంబున ఆకూటస్థుఁ డను నేనే యగుదు ననుట అపరోక్షజ్ఞాన మను పంచమావస్థ యగును.

శ్లో. కర్తా భోక్తేత్యేవమాదిశోకజాతం ప్రముంచతి,
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ తుష్యతి. 32

వ్యా. కర్తేతి. కూటస్థాసంగాత్మజ్ఞానానంతరం కర్తృత్వాదిశోకజాతం త్యజతి. యదయం శోకాపగమః కృత్యం కర్తవ్యజాతం కృతం నిష్పాదితం ప్రాపణీయం ఫలజాతం ప్రాప్తం లబ్ధమితి తుష్యతీతి యదియం తృప్తిరిత్యర్థః.

టీ. కర్తా = సర్వకర్మములను చేయువాఁడను, భోక్తా = చేసిన కర్మలఫలముల ననుభవించువాఁడను, ఇతి=అని, ఏవమాది = ఈ మొదలైనరూపము గల, శోకజాతం= దుఃఖసమూహమును, ప్రముంచతి = విడిచిపెట్టుచున్నాఁడు. కృత్యం = చేయవలసిన దంతయు, కృతమితి= చేయఁబడె ననియు, ప్రాపణీయం = పొందఁదగినఫల మంతయు, ప్రాప్తమిత్యేవ=పొందఁబడె ననియు, తుష్యతి=ఆనందించుచున్నాఁడు.

తా. అట్లపరోక్షజ్ఞానము గలిగినతర్వాత కర్తృత్వభోక్తృత్వ రూప మగు సకలదుఃఖంబులను విడుచుట దుఃఖనివృత్తి యను నాఱవ అవస్థ యగును. చేయవలసినదాని నంతయు చేసితిని, పొందఁదగిన కర్మఫలములను పొందితిని, అనఁగా నేను చేయవలసినదియు పొందఁ దగినదియు లే దని యానందముతో నుండుట యానందావాప్తి యను నేడవ అవస్థ యగును.

అవ. ఈపైన చెప్పఁబడిన సప్తావస్థలను దార్ష్టాంతికమునందును జూపి మఱల నొకమాఱు ఆమొత్తమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞాన మావృతి స్తద్వద్విక్షేపశ్చ పరోక్షధీః,
అపరోక్షమతి శ్శోకమోక్ష స్తృప్తి ర్నిరంకుశా. 33

వ్యా. దార్ష్టాంతికేఽప్యుక్త మవస్థాసప్తకం అనువదతి—అజ్ఞానమితి.

టీ. అజ్ఞానం = అజ్ఞానంబును, ఆవృతిః = ఆవరణములు రెండును, తద్వత్ = ఆప్రకారము, విక్షేపః = విక్షేపంబును, పరోక్షధీః = పరోక్షజ్ఞానంబును, అపరోక్షమతిః = అపరోక్షజ్ఞానంబును, శోకమోక్షః = దుఃఖనివృత్తియు, నిరంకుశా=నిరాటంకమగు, తృప్తిశ్చ = తృప్తియును (ఆనందప్రాప్తి యనుట), ఇవి సప్తావస్థలని తెలియవలయును.

తా. స్పష్టము.

అవ. ఈ తెలుపఁబడిన సప్తావస్థ లాత్మధర్మము లని యొప్పినపక్షమున ఆకూట స్థునియొక్క నిర్వికారత్వము కొట్టుపడిపోవును గదా యని యాశంకించి, ఆయవస్థ లన్నియు చిదాభాసునిధర్మములే కాని కూటస్థునకు లే వనుచున్నాఁడు:—

శ్లో. సప్తావస్థా ఇమా స్సంతి చిదాభాసస్య తా స్విమౌ,
బంధమోక్షౌ స్థితౌ తత్ర తిస్రో బంధకృతస్స్మృతాః. 34

వ్యా. ననూక్తావస్థాసప్తకస్యాత్మధర్మత్వాంగీకారే తస్య కూటస్థత్వం వ్యాహన్యే తేత్యాశంక్య ఏతాస్సప్తావస్థా శ్చిదాభాసస్యైవ; న కూటస్థస్యేత్యాహ—సప్తావస్థా ఇతి. సర్వం వాక్యం సావధారణమితి న్యాయేన చిదాభాసస్యైవేత్యవగమ్యతే. న కూటస్థస్య సప్తావస్థానాం. ఆసామత్రోపన్యాసో వృథేత్యాశంక్య న వృథాత్వం బంధ మోక్షకారిత్వద్యోతనఫలత్వాదుపన్యాసస్యేత్యభిప్రాయేణాహ—తాస్విమావితి. కిమా సాం సప్తానామప్యవిశేషేణ బంధమోక్షకారిత్వం నేత్యాహ—తత్రేతి. అజ్ఞానావరణ విక్షేప రూపాస్తిస్ర ఇత్యర్థః.

టీ. ఇమాః సప్తావస్థాః=ఈ యే డవస్థలు, చిదాభాసస్య=చిదాభాసునకు, సంతి= కలవు, తాసు = ఆ సప్తావస్థలయందు, ఇమౌ బంధమోక్షౌ = ఈ బంధమోక్షములు, స్థితౌ = రెండు నున్నవి, తత్ర=ఆ యే డవస్థలయందు, తిస్రః=అజ్ఞానము, ఆవరణము, విక్షేపము అనెడి మూఁ డవస్థలు, బంధకృతః=బంధమును కలిగించుచున్న వని, స్మృతాః =చెప్పఁబడినవి.

తా. ఆయే డవస్థలు చిదాభాసునకే కలవుగాని కూటస్థునకు లే వని భావము. ఆయవస్థలలో బంధమోక్షములు రెండు నున్నవి. అజ్ఞానావరణవిక్షేపములు మూఁడును బంధమును గలిగించు నని తెల్పఁబడినవి.

అవ. అజ్ఞానావరణవిక్షేపము మూఁడింటిలో నజ్ఞానస్వరూపమును జెప్పు చున్నాఁడు:—

శ్లో. న జానామీత్యుదాసీనవ్యవహారస్య కారణమ్,
విచారప్రాగభావేన యుక్తమజ్ఞాన మీరితమ్. 35

వ్యా. ఆసాం బంధకారిత్వదర్శనాయ తిసృణామపి స్వరూపం ప్రత్యేకం కార్య ప్రదర్శనేన స్పష్టీచికీర్షురజ్ఞానస్య స్వరూపం తావద్దర్శయతి—న జానామీతి. ఆత్మ తత్త్వవిచారప్రాగభావసహితం ఉదాసీనవ్యవహారస్య కారణం న జానామీత్యనుభూయ మాన మేతదజ్ఞానమీరితమిత్యర్థః.

టీ. విచారప్రాగభావేన-విచార = బ్రహ్మవిచారము చేయుటకు, ప్రాక్ = పూర్వము, అభావేన = అభావముతో, యుక్తం = కూడుకొనునట్టియు, ఉదాసీనవ్యవహారస్య = ఉదాసీనుఁడుగా నుండుటకు, కారణం = కారణమైనట్టియు, న జానామి = గుర్తెఱుంగను, ఇతి = ఇట్టి యనుభవముగలది, అజ్ఞానం = అజ్ఞాన మని, ఈరితం = చెప్పఁబడుచున్నది.

తా. ఆత్మతత్త్వవిచారముకంటె పూర్వ మభావముతోఁ గూడి యేమియు చేయక యూరకుండుటకుఁ గారణ మగుచు నే నెఱుఁగ నని యనుభవింపఁబడుచున్న యిది అజ్ఞాన మనఁబడుచున్నది.

అవ. ఆవరణస్వరూపమును దానికార్యమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. అమార్గేణ విచార్యాథ నాస్తి నో భాతి చేత్యసౌ,
విపరీతవ్యవహృతి రావృతేః కార్య మిష్యతే. 36

వ్యా. ఆవృతిస్వరూపం తత్కార్యం చ దర్శయతి—అమార్గేణేతి. శాస్త్రోక్తప్రకార మతిలంఘ్య కేవలతర్కేణ విచార్యానంతరం కూటస్థో నాస్తి న భాతీత్యేవంరూపో విపరీతవ్యవహార ఆవరణకార్యమిత్యర్థః.

టీ. అమార్గేణ = శాస్త్రోక్తమార్గము నతిక్రమించి కేవలతర్కముచేత, విచార్య = విచారణచేసి, అథ = తరువాత, అసౌ = ఈకూటస్థుఁడు, నాస్తీతి = లేఁ డనియు, నో భాతీతి చ = స్ఫురింపఁ డనియు, విపరీతవ్యవహృతిః = విపరీతముగా వ్యవహరించుట, ఆవృతేః = ఆవరణముయొక్క, కార్యం = కార్య మని, ఇష్యతే = అంగీకరింపఁబడుచున్నది.

తా. శాస్త్రోక్తరీతితోఁ గాక కేవల తర్కముచేత (యుక్తులతో) విచారించి కూటస్థుఁడు లేఁ డనియు, ప్రకాశింపఁ డనియు విరుద్ధముగా వ్యవహరించుట యావరణకార్య మనఁబడుచున్నది.

అవ. విక్షేపస్వరూపమును దానికార్యమునుం దెల్పుచున్నాఁడు:—

శ్లో. దేహద్వయచిదాభాసరూపో విక్షేప ఈరితః,
కర్తృత్వాద్యఖిల శ్శోక స్సంసారాఖ్యోఽస్య బంధకః. 37

వ్యా. విక్షేపస్య స్వరూపం తత్కార్యం చ దర్శయతి—దేహద్వయేతి. స్థూలసూక్ష్మాఖ్య శరీరద్వయసహితశ్చిదాభాస ఏవ విక్షేపః. బంధకః బంధహేతుస్సంసారాఖ్యః కర్తృత్వాద్యఖిలశ్శోకః. అస్య చిదాభాసస్య కార్యమితి శేషః. కర్తృత్వాదీత్యాదిశబ్దేన ప్రమాతృత్వాదయో గృహ్యంతే.

టీ. దేహద్వయచిదాభాసరూపః-దేహద్వయ=స్థూలసూక్ష్మశరీరముతోఁ గూడిన చిదాభాసరూపః = చిదాభాసునిస్వరూపము, విక్షేపః=విక్షేప మని, ఈరితః = చెప్పబడును, బంధకః = బంధహేతువైన, సంసారాఖ్యః = సంసార మనెడు పేరు గల కర్తృత్వాద్యఖిలః - కర్తృత్వ = కర్తృత్వము, ఆది = మొదలుగాఁగల, అఖిలః సమస్తమైన, శోకః = దుఃఖము, అస్య = విక్షేపరూపుఁడైన యీచిదాభాసునియొక్క (కార్యం = కార్య మగును.)

తా. స్థూలసూక్ష్మదేహములతోఁ గూడిన చిదాభాసుఁడు విక్షేప మని చెప్పఁబడును. బంధహేతువైనట్టియు, సంసార మను పేరు గల నట్టియు, కర్తృత్వభోక్తృత్వాది రూప మగు సర్వదుఃఖము విక్షేపరూపుఁడైన చిదాభాసుని కార్య మగును.

అవ. ఈచెప్పఁబడిన సప్తావస్థలు చిదాభాసుని వనుట యుక్తియుక్తముగ లేదు. విక్షేపోత్పత్తికి ముందే అజ్ఞానావరణము లుండుటవలనను, చిదాభాసుఁడు విక్షేపములో జేరినవాఁడగుటవలనను చిదాభాసునకు సప్తావస్థలు కలిగియున్న వనుట ఘటింపదని సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞాన మావృతి శ్చైతే విక్షేపాత్ప్రాక్ప్రసిద్ధ్యతః,
యద్య ప్యథా ప్యవస్థే తే విక్షేపస్యైవ నాత్మనః.

వ్యా. నను సప్తావస్థాశ్చిదాభాసస్యేత్యుక్తమనుపపన్నమ్. అజ్ఞానావరణయోర్విక్షేపోత్పత్తేః పురా స్థితత్వా చ్చిదాభాసస్య చ విక్షేపాంతఃపాతిత్వా త్తదవస్థాత్వానుపపత్తే రిత్యాశంక్యాహ—అజ్ఞానమితి. అనయోరజ్ఞానావరణయోర్విక్షేపాత్పురా స్థిత త్వేఽపి నాత్మావస్థాత్వం, తస్యాసంగత్వేనావస్థావత్త్వానుపపత్తేః. అతః పరిశేషాచ్చిదాభాసావస్థాత్వమేవ తయోర్వక్తవ్య మితి భావః.

టీ. యద్యపి = విచారింపఁగా, అజ్ఞానం = అజ్ఞానమును, అవృతిశ్చ = ఆవరణమును ననెడి, ఏతే = ఈరెం డవస్థలును, విక్షేపాత్ =విక్షేపముకంటె, ప్రాక్ =ముందు, ప్రసిద్ధ్యతః = ఉండియున్నవి, అథాపి = అట్లుండినను, తే అవస్థే = ఆరెండవస్థలు, విక్షేపస్య ఏవ = విక్షేపరూపుఁడైన చిదాభాసునకే (ఉండి యున్నవి). ఆత్మనః ఆత్మకు, న = లేవు.

తా. అజ్ఞానావరణములు రెండును విక్షేపమునకు పూర్వము ముందున్ను, ఆత్మ యసంగుఁ డగుటంజేసి కూటస్థాత్మకు ఆయవస్థ లున్నవనుటకు తగదు. చిదాభాసునకుఁ గల వనుట తగియున్నది.

అవ. అవస్థలు గలవాఁ డని చెప్పిన చిదాభాసుఁ డప్పుడు లేఁడు గదా? వానికిఁ బూర్వమం దున్నయవస్థలు చిదాభాసుని వను టెట్లు? అని యాశంకించి యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. విక్షేపోత్పత్తితః పూర్వమపి విక్షేపసంస్కృతిః,
అస్త్యేవ తదవస్థాత్వ మవిరుద్ధం తత స్తయోః. 39

వ్యా. అవస్థావతో విక్షేపస్య తదానీమభావా త్తదవస్థాత్వాభిధాన మనుపపన్న మిత్యాశంక్య విక్షేపాభావేఽపి తత్సంస్కారస్య తదానీం సత్త్వాద్విక్షేపావస్థాత్వాభిధానం న విరుధ్యత ఇత్యాహ—విక్షేపేతి. తతః కారణా త్తయో స్తదవస్థాత్వవర్ణన మవిరుద్ధమితి యోజనా.

టీ. విక్షేపోత్పత్తితః = విక్షేపముయొక్క పుట్టుటకంటె, పూర్వమపి = ముందు కూడ, విక్షేపసంస్కృతిః = విక్షేపముయొక్క సంస్కారము, అస్త్యేవ = ఉండనే యున్నది. తతః = ఆకారణమువలన, తయోః=ఆయజ్ఞానావరణములకు, తదవస్థాత్వం= ఆచిదాభాసునియవస్థ లగుట, అవిరుద్ధం = తప్పుగాదు.

తా. విక్షేపరూపుఁడైన చిదాభాసుఁడు పుట్టుటకు మున్నే విక్షేపసంస్కార ముండియే యున్నది. కనుక నప్పుడు సంస్కారరూపముగా విక్షేప ముండుటచేత నజ్ఞానావరణములు చిదాభాసునివి యన వచ్చును. అట్లనుటవలనఁ దప్పు లేదు.

అవ. లేనిపోనిసంస్కారము నొప్పుకొని యాయవస్థలను చిదాభాసునకుఁ జెప్పుట కంటె నధిష్ఠానరూపముగా సుప్రసిద్ధుఁడైన పరబ్రహ్మమునవే యనరాదా? అనిన నది యధికప్రసంగ మగును గనుక నట్లనఁగూడ దనుచు వారించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మణ్యారోపితత్వేన బ్రహ్మావస్థే ఇమే ఇతి,
న శంకనీయం సర్వాసాం బ్రహ్మణ్యే వాధిరోపణాత్. 40

వ్యా. నన్వప్రసిద్ధసంస్కారాభ్యుపగమద్వారా విక్షేపావస్థాత్వవర్ణనాద్వరమధిష్ఠానతయా ప్రసిద్ధబ్రహ్మావస్థాత్వవర్ణనమిత్యాశంక్యాతిప్రసంగాన్నైవమితి పరిహరతి—బ్రహ్మణీతి.

టీ. ఇమే = ఈయజ్ఞానావరణములు రెండును, బ్రహ్మణి = కూటస్థునియందు ఆరోపితత్వేన = కల్పింపఁబడిన వగుటచేత, బ్రహ్మావస్థే=కూటస్థునియవస్థలు, ఇతి=అని, న శంకనీయం = ఆక్షేపింపఁదగదు. బ్రహ్మణ్యేవ = పరబ్రహ్మమందే, సర్వాసాం = సర్వావస్థలయొక్క, అధిరోపణాత్ = ఆరోపింపఁబడుటవలన (అటుల శంకింపఁదగ దనుట.)

తా. అన్నియు నధిష్ఠానస్వరూపుఁ డగు బ్రహ్మమందే కల్పిత మగుటవలన నీయజ్ఞానావరణము లనెడి రెండవస్థలుకూడ బ్రహ్మమునవే యగు ననుట యధికప్రసంగ మగును కనుక నట్లనఁగూడదు.

అవ. అన్నియు బ్రహ్మమందుఁ గల్పితములైనను విక్షేపముయొక్క యుత్పత్తియైనతర్వాత నుండెడు సంసారిత్వాదిధర్మములు జీవునివిగాఁ గనఁబడుచుండుటచేత బ్రహ్మముయొక్క అవస్థ లనుట పనికి రా దని పూర్వపక్షి యాక్షేపించుచున్నాఁడు:—

శ్లో. సంసార్యహం విబుద్ధోఽహం నిశ్శోక స్తుష్ట ఇత్యపి,
జీవగా ఉత్తరావస్థా భాంతి న బ్రహ్మగా ఇతి. 41

వ్యా. నను బ్రహ్మణ్యారోపితత్వావిశేషేఽపి విక్షేపోత్పత్త్యుత్తరకాల భావినీనాం సంసారిత్వాద్యవస్థానాం జీవాశ్రితత్వేనానుభూయమానత్వాన్న బ్రహ్మావస్థాత్వమితి శంకతే—సంసారీతి. సంసారీ కర్తృత్వాదిధర్మవాన్ విబుద్ధస్తత్త్వసాక్షాత్కారవాన్, నిశ్శోకశ్శోకరహితః, తుష్టః, వక్ష్యమాణకృత్యత్వాదిజనితసంతోషవానహమస్మీత్యుత్తరావస్థా జీవగాః జీవాశ్రితా భాంతి న బ్రహ్మాశ్రితా ఇత్యర్థః.

టీ. అహం = నేను, సంసారీతి = సంసారముగలవాఁడ ననియు, అహం=నేను, విశుద్ధ ఇతి = విశేషజ్ఞానము గలవాఁడ ననియు, నిశ్శోక ఇతి = దుఃఖము లేనివాఁడ ననియు, తుష్ట ఇత్యపి = తృప్తిగలవాఁడ ననియు, ఉత్తరావస్థాః = తరువాతియవస్థలు (విక్షేప జ్ఞాన దుఃఖనివృత్తి తృప్తు లనెడి నాలు గవస్థలు), జీవగాః = జీవునివిగా, భాంతి = కనఁబడుచున్నవి. బ్రహ్మగాః=బ్రహ్మము నాశ్రయించినవి, ఇతి=అనుట. న= కూడదు.

తా. నేను కర్తృత్వభోక్తృత్వములు మొదలగు ధర్మములుగల వాఁడను. విశేషజ్ఞానము గలవాఁడను, దుఃఖము లేనివాఁడను, సంతోషము గలవాఁడను నను నవస్థలు నాలుగును జీవుని నాశ్రయించిన వనియు, బ్రహ్మము నాశ్రయింపలే దనియుం బూర్వపక్షి శంకించెను.

అవ. సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. తద్వ్యాజ్ఞోఽహం బ్రహ్మసత్త్వభానే మద్దృష్టితో న హి,
ఇతి పూర్వే అవస్థే చ భాసేతే జీవగే ఖలు. 42

వ్యా. ఏవం తద్వ్యాజ్ఞానావరణయోరపి జీవాశ్రితత్వేనానుభూయమానత్వాజ్జీవాపాశ్వమేవేతి పరిహరతి—తద్వ్యాజ్ఞోఽహమితి, మద్దృష్టితో మమానుభవేనేత్యర్థః.

టీ. తర్హి = అలాగునసైతే, అహం=నేను, అజ్ఞః = తెలియనివాఁడను, బ్రహ్మ సత్త్వభానే=బ్రహ్మముయొక్క స్థితి ప్రకాశములు, మద్దృష్టితః = నాయనుభవమువలన, నహీతి=లే వనియు, పూర్వే = విక్షేపమునకుఁ బూర్వమం దుండిన, అవస్థే = అజ్ఞానావరణము లనెడి రెం డవస్థలును, జీవగే=జీవునియం దున్నవిగను, భాసేతే ఖలు = కనఁబడుచున్నవిగదా.

తా. నేను మూఢుఁడ ననియు, బ్రహ్మముయొక్క సత్త్వభానములు నాయనుభవమువలన లే వనియును, విక్షేపమునకు ముం దుండిన యజ్ఞానావరణము లనెడి రెం డవస్థలును జీవునిచే ననుభవింపఁబడుటచే జీవుఁ డగు చిదాభాసునికే కలిగియున్నట్లును బ్రత్యగాత్మకు లే నట్లును తెలిసికొను మని సిద్ధాంతి సమాధానము చెప్పెను.

అవ. అజ్ఞానము బ్రహ్మము నాశ్రయించిన ట్లేల చెప్పిరి? అని పూర్వవాది యడుగఁగా సిద్ధాంతి సమాధానము జెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞానస్యాశ్రయో బ్రహ్మేత్యధిష్ఠానతయా జగుః,
జీవావస్థాత్వ మజ్ఞానాభిమానిత్వా దవాదిషమ్. 43

వ్యా. నను, తర్హ్యజ్ఞానాశ్రయత్వం బ్రహ్మణః పూర్వాచార్యైః కథముక్తమిత్యాశంక్య తద్వివక్షాం దర్శయతి—అజ్ఞానస్యేతి. బ్రహ్మణోఽజ్ఞానాధిష్ఠానత్వవివక్షయా తదాశ్రయత్వముక్తం భవద్భి స్త్వర్హి కిం వివక్షయా జీవావస్థాత్వముక్తమిత్యాశంక్యస్వవివక్షాం దర్శయతి—జీవావస్థాత్వమితి.

టీ. (పూర్వాచార్యాః=పూర్వులైన యాచార్యపురుషులు), అజ్ఞానస్య=అజ్ఞానమునకును, అధిష్ఠానతయా = ఆధారమగుటచేత, బ్రహ్మ = కూటస్థుఁడు, ఆశ్రయః = ఆశ్రయము, ఇతి=అని, జగుః = చెప్పిరి. అజ్ఞానాభిమానిత్వాత్ = అజ్ఞానమునం దభిమానము గలవాఁ డగుటవలన, జీవావస్థాత్వం=జీవునియవస్థనుగా, అవాదిషం=చెప్పితిని.

తా. అజ్ఞానమున కాధారముగ బ్రహ్మవస్తు వున్న దనెడి యుద్దేశముచేత బ్రహ్మ మజ్ఞానమున కాశ్రయ మని (పూర్వాచార్యులు) చెప్పిరి. జీవుఁ డజ్ఞానమునం దభిమానము గలిగి దాని ననుభవించుచుండుటచేత ఆ అజ్ఞానము జీవుని యవస్థనుగాఁ జెప్పితిని.

అవ. ఇఁకను ముక్తిహేతువులైన పరోక్షజ్ఞానము అపరోక్షజ్ఞానము లనెడి రెం డవస్థలను చెప్పుచున్నాఁడు:—

శ్లో. జ్ఞానద్వయేన నష్టేఽస్మి న్నజ్ఞానే తత్కృతావృతిః,
న భాతి నాస్తి చేత్యేషా ద్వివిధాఽపి వినశ్యతి. 44

వ్యా. ఏవం బంధహేతుమవస్థాత్రయం ప్రదర్శ్యావశిష్టా స్వవస్థాసు మధ్యే పూర్వోక్తాజ్ఞానావరణనివృత్తిద్వారా ముక్తిహేతుమవస్థాద్వయం దర్శయతి—జ్ఞానద్వయేనేతి. పరోక్షత్వాపరోక్షత్వలక్షణేన జ్ఞానద్వయేనావరణకారణేఽజ్ఞానే నష్టే సతి తత్కృతావృతిః తేనాజ్ఞానేనోత్పాదితం న భాతి నాస్తీతి వ్యవహారకారణం ద్వివిధమప్యావరణం కారణాభావాన్నశ్యతీతి.

టీ. జ్ఞానద్వయేన = రెండు విధములైన జ్ఞానముచేత, అస్మిన్ అజ్ఞానే = ఈ యజ్ఞానము, నష్టే సతి = నశించుచుండఁగా, నాస్తి = కూటస్థుఁడు లేఁ డనియు, న భాతీతి చ = ప్రకాశింపలే దనియు, ఏషా తత్కృతావృతిః = ఈయజ్ఞానముచేత చేయఁబడిన, ద్వివిధా = రెండువిధములైన, ఆవృతిరపి = ఆవరణమును, వినశ్యతి = పూర్తిగా నశించుచున్నది.

తా. పరోక్షజ్ఞానముచేతను, అపరోక్షజ్ఞానముచేతను, అజ్ఞానము నశింపఁగానే కూటస్థుఁడు లేఁడు, ప్రకాశింపఁడు అనెడు అజ్ఞానకార్యములైన యసత్త్వావరణమును నభానావరణమునుఁ బూర్తిగా నశించు నని తెలియవలెను.

శ్లో. పరోక్షజ్ఞానతో నశ్యే దసత్త్వావృతిహేతుతా,
అపరోక్షజ్ఞాననాశ్యా హ్యభానావృతిహేతుతా. 45

వ్యా. కస్యాంశస్య కేనాంశేన నివృత్తిరిత్యపేక్షాయాం ఉభయం విభజ్య దర్శయతి—పరోక్షజ్ఞానత ఇతి. కూటస్థో నాస్తీత్యసత్త్వావరణకారణత్వం నివర్తతే. కూటస్థోఽస్తీత్యపరోక్షజ్ఞానేన తు కూటస్థో న భాతీత్యేవం రూపావరణకారణత్వం నివర్తతే.

టీ. అసత్త్వావృతిహేతుతా - అసత్త్వ=కూటస్థుఁడు లేఁ డనెడు, ఆవృతి=ఆవరణమునకు, హేతుతా=అజ్ఞానము హేతు వగుట, పరోక్షజ్ఞానతః = వేదాంతార్థవిచారణమువలనఁ గలిగిన (కూటస్థుఁ డొకఁడు గలఁ డను జ్ఞానమువలన), నశ్యేత్ =పోవును. అభానావృతిహేతుతా - అభాన=కూటస్థుఁడు ప్రకాశింప లే దనెడు, ఆవృతి=ఆవరణముయొక్క, హేతుతా=అజ్ఞానహేతుత్వము, అపరోక్షజ్ఞాననాశ్యా హి - అపరోక్ష

జ్ఞాన = ఆకూటస్థుఁడను నేనే యగుదు నను జ్ఞానముచే, నాశ్యా హి=నశింపఁజేయదగి నదియే యగును.

తా. కూటస్థుఁ డున్నాఁ డను పరోక్షజ్ఞానమువలన కూటస్థుఁడు లేఁ డనుటకు కారణమైన యావరణమును, నేను కూటస్థుఁడ నైతి నను నపరోక్షజ్ఞానమువలన కూటస్థుఁడు ప్రకాశింప లేఁ డనుటకు కారణమైన యావరణాంశమును నివర్తించు నని భావము.

అవ. ఇపుడు జ్ఞానముయొక్క ఫలరూప మగు అవస్థాద్వయమందు ప్రథమావస్థను జెప్పుచున్నాఁడు:—

శ్లో. అభానావరణే నష్టే జీవత్వారోపసంక్షయాత్,
కర్తృత్వాద్యఖిల శ్శోక స్సంసారాఖ్యో నివర్తతే. 46

వ్యా. ఇదానీం జ్ఞానస్య ఫలరూపావస్థాద్వయే ప్రథమావస్థామాహ—అజ్ఞానావరణ ఇతి. అజ్ఞానావరణే నివృత్తే భ్రాంత్యా ప్రతీయమానస్య జీవత్వస్యాపి నివృత్తత్వా త్తన్నిమిత్తకః కర్తృత్వాదిలక్షణస్సంసారాఖ్యశ్శోకస్సర్వోఽపి నివర్తత ఇత్యర్థః.

టీ. అభానావరణే = కూటస్థుఁడు ప్రకాశింపలే దనెడి, ఆవరణే = ఆవరణము, నష్టే సతి = నివర్తింపఁగా, జీవత్వారోపసంక్షయాత్ - జీవత్వ = జీవభావ మనెడి, ఆరోప = అధ్యాసముయొక్క, సంక్షయాత్ = నివర్తించుటవలన, సంసారాఖ్యః = సంసార మనుపేరు గల, కర్తృత్వాద్యఖిలః = కర్తృత్వభోక్తృత్వాదిరూపముయొక్క సమస్తమైన, శోకః = దుఃఖము, నివర్తతే = నివర్తించును.

తా. అపరోక్షజ్ఞానముచేత కూటస్థుఁడు ప్రకాశింపలే దనుటకు కారణ మగు నజ్ఞానావరణము నశింపఁగా జీవత్వారోపణము నశించును. అట్లు జీవత్వారోపణము నివర్తింపఁగా కర్తృత్వభోక్తృత్వాదిరూప మగు సర్వదుఃఖము నివర్తించును.

అవ. ఇట్లు జ్ఞానఫలరూపములైన రెం డవస్థలలో దుఃఖనివృత్తి యను ప్రథమావస్థను దెలిపి తృప్తి యను రెండవ యవస్థను దెల్పుచున్నాఁడు:—

శ్లో. నివృత్తే సర్వసంసారే నిత్యముక్తత్వభాసనాత్,
నిరంకుశా భవే త్తృప్తిః పునశ్శోకాసముద్భవాత్. 47

వ్యా. ఏవం శోకాపగమరూపామవస్థాం ప్రదర్శ్య నిరంకుశతృప్తిలక్షణాం ద్వితీయాం దర్శయతి—నివృత్తే సర్వసంసార ఇతి.

టీ. సర్వసంసారే = సమస్తమైన సంసారము, నివృత్తే సతి=నివర్తింపఁగా, నిత్యముక్తత్వభాసనాత్ - నిత్య = ఎడతెగని, ముక్తత్వ = ముక్తస్వభావముయొక్క, భాసనాత్ =స్ఫురించుటవలన, పునః=మఱల, శోకాసముద్భవాత్ - శోక=దుఃఖముయొక్క, అసముద్భవాత్ = ఉత్పత్తి లేకపోవుటవలన, నిరంకుశా = నిరుపాధికమైన, తృప్తిః = ఆనందము, భవేత్ = కలుగును.

తా. సర్వదుఃఖము నివర్తించి యఖండ మగు నసంగతయొక్క స్ఫూర్తివలనను దుఃఖరూప మగు సంసారముయొక్క యుత్పత్తిలేక పోవుటవలనను నిరతిశయ మగు నానందము జ్ఞానికి కలుగుచున్నది.

అవ. "ఆత్మానం చేత్" ఇత్యాదిమంత్రమునకుఁ దాత్పర్యము తెల్పెద మని యది విడనాడి అప్రకృతముగా నవస్థాసప్తకమును జెప్పుచుంటి రని యాక్షేపము రాఁగా ఆ శ్రుతితాత్పర్యమును నిరూపించుటకు ననుకూల మగు సంగతినే చెప్పుచున్నాఁ డని శ్రుతితాత్పర్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యే ఉభే ఇమే,
అవస్థే జీవగే బ్రూత ఆత్మానం చేదితి శ్రుతిః. 48

వ్యా. నన్వాత్మానాం చేద్విజానీయాదితి మంత్రవ్యాఖ్యానే ప్రవృత్తస్తత్తద్విహాయ మధ్యేఽజ్ఞానాద్యవస్థాసప్తకనిరూపణం ప్రకృతాసంగత మిత్యాశంక్యాత్మానం చేద్విజానీయాదిత్యస్యాః శ్రుతేస్తాత్పర్యనిరూపణ శేషత్వేనాభిహితత్వాన్న ప్రకృతా సంగత మిత్యభిప్రేత్య శ్రుతితాత్పర్యమాహ—అపరోక్షజ్ఞానేతి. చిదాభాసనిష్ఠం యదవస్థాసప్తకమస్తి తత్రాపరోక్షజ్ఞానశోకనివృత్తిలక్షణమవస్థాద్వయం ప్రతిపాదయితు మయం మంత్రః ప్రవృత్త ఇత్యభిప్రాయః.

టీ. ఆత్మానం చేత్ = ఆత్మస్వరూపమును తెలిసికొనిన ట్లాయెనా, ఇతి=అనెడి, శ్రుతిః=మంత్రము, అపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యే - అపరోక్షజ్ఞాన=అపరోక్షజ్ఞాన మనుపేరు గలిగినట్టియు, శోకనివృత్త్యాఖ్యే = దుఃఖనివృత్తి యను పేరుగలిగినట్టియు, ఉభే=రెండైన, ఇమే అవస్థే=ఈ యవస్థలను, జీవగే = చిదాభాసునియందు దున్నవానినిఁగా, బ్రూతే = చెప్పుచున్నది.

తా. శ్రు. "ఆత్మానం చేద్విజానీయా దయ మస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్" ఈమంత్రము చిదాభాసునియందు దున్న యవస్థాసప్తకములో అపరోక్షజ్ఞానశోకనివృత్తులనెడి రెండవస్థలును నున్న వని చెప్పుటకు ప్రవర్తించినది కావున

యీయేకవస్థలను నిరూపించుట యాశ్రుతి తాత్పర్యనిరూపణమున కవసర మగుటచేత నిది ప్రస్తుతాంశమునకు నుపయోగించు నదే యని తెలియవలెను.

శ్లో. అయ మిత్యపరోక్షత్వ ముక్తం తద్ద్వివిధం భవేత్,
విషయస్వప్రకాశత్వా ద్ధియాఽప్యేవం తదీక్షణాత్. 49

వ్యా. నను, అయమిత్యపరోక్షత్వ మిత్యత్రాయమితి పదేనాత్మనోఽపరోక్షత్వ ముచ్యత ఇత్యుక్తం. తథా సత్యపరోక్షజ్ఞానవిషయత్వమేవ స్యాన్న పరోక్షజ్ఞాన విషయత్వ మిత్యాశంక్య తదుపపాదనాయాపరోక్షజ్ఞానం విభజతే—అయమితీతి. ద్వైవిధ్యే కారణమాహ—విషయేతి. విషయస్య చిద్రూపస్యాత్మన స్స్వప్రకాశత్వేన తదీక్షణా త్తస్య విషయస్యాత్మనోఽవలోకనాచ్చేత్యర్థః.

టీ. విషయస్వప్రకాశత్వాత్ - విషయ=తన విషయము, స్వప్రకాశత్వాత్= స్వయముగా ప్రకాశించుటవలన (ఇతర సాధనాపేక్షతో నవసరము లేకయే యనుట). ధియా = బుద్ధిచేత, ఏవం = ఇట్లు స్వప్రకాశస్వరూపముగా, తదీక్షణా దపి = ఆ యాత్మను తెలిసికొనుటవలనను, తత్=అయపరోక్షత్వము, ద్వివిధం = రెండు విధములు గలది, భవేత్ = అగును.

తా. ఇరువదియొకటవ శ్లోకమున "అయం" అను పదమునకుఁ జెప్పఁబడిన యపరోక్షత్వము రెండు విధములు గలది యగుచున్నది. తాను స్వయముగా ప్రకాశించుటచేత నపరోక్షజ్ఞానవిషయుఁ డగును. బుద్ధిచేత నాయాత్మను తెలిసికొనుటవలన పరోక్షజ్ఞానవిషయుండు నగును.

అవ. ఇట్లు ద్వివిధ మని చెప్పుటవలన నుపయోగ మేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరోక్షజ్ఞానకాలేఽపి విషయస్వప్రకాశతా,
సమా బ్రహ్మ స్వప్రకాశ మస్తీత్యేవం విబోధనాత్. 50

వ్యా. భవతు ద్వైవిధ్యం ఏతావతా పరోక్షజ్ఞానవిషయత్వే కిమాయాతమిత్యాశంక్య విషయస్వప్రకాశత్వం పరోక్షజ్ఞానవిషయత్వవిరోధి న భవతీత్యాహ—పరోక్షజ్ఞానేతి అపరోక్షజ్ఞానకాల ఇవ పరోక్షజ్ఞానకాలేఽపి విషయస్య బ్రహ్మణస్స్వప్రకాశతాస్త్యేవ. తత్రోపపత్తిమాహ—బ్రహ్మ స్వప్రకాశమితి.

టీ. స్వప్రకాశం = స్వయంప్రకాశమానమగు, బ్రహ్మ = బ్రహ్మపదార్థము, అస్తీతి=కల దని, ఏవం = ఈలాగున, విబోధనాత్ = బుద్ధిచేత (స్వయంప్రకాశరూప

ముగాఁ దెలియుటవలన), పరోక్షజ్ఞానకాలేఽపి=పరోక్షజ్ఞానకాలమునందును, విషద స్వప్రకాశతా = ఆత్మకు స్వయంప్రకాశత్వము, సమా=సమానముగా నున్నది.

తా. బ్రహ్మ మున్న దని పరోక్షజ్ఞానము కలవాఁడు బుద్ధిచే నీవిధముగాఁ దెలిసికొనుచున్నాఁడు. బ్రహ్మమునకు స్వప్రకాశత్వ మపరోక్షజ్ఞానసమయమున నున్నట్లు పరోక్షజ్ఞానకాలమునను తుల్యముగా నున్నది అని.

అవ. ప్రత్యగభిన్న మగు పరబ్రహ్మవిషయకజ్ఞానమునకు పరోక్షత్వ మెట్లు గలిగె నని యాశంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అహం బ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీత్యేవ ముల్లిఖేత్,
పరోక్షజ్ఞాన మేత న్న భ్రాంతం బాధానిరూపణాత్.

వ్యా. ప్రత్యగభిన్నబ్రహ్మగోచరస్య జ్ఞానస్య కుతః పరోక్షత్వమిత్యాశంక్య ప్రత్యగంశాగ్రహణాదిత్యాహ—అహం బ్రహ్మేతి. నన్విదం భ్రాంతమిత్యాశంక్య భ్రాంతిత్వం కిం బాధ్యత్వాదుత వ్యక్త్యనుల్లేఖాదథవా అపరోక్షేణ గ్రహణయోగ్యస్య పారోక్ష్యేణ గ్రహణాత్? యద్వాంశాగ్రహణాదితి చతుర్ధా వికల్ప్య ప్రథమం ప్రత్యాహ—ఏతదితి. ఏతన్న భ్రాంతం.

టీ. అహం=నేను, బ్రహ్మేతి=బ్రహ్మము నని, అనుల్లిఖ్య=ప్రత్యక్షముగా తెలియక, బ్రహ్మ=బ్రహ్మవస్తువు, అస్తీతి=ఉన్న దని, ఏవం = ఇట్లు సామాన్యాకారముగా ఉల్లిఖేత్ = తెలిసికొనును. ఏతత్=ఇట్టిస్వరూపమగు, పరోక్షజ్ఞానం=పరోక్షజ్ఞానము బాధానిరూపణాత్-బాధా = బాధయొక్క, అనిరూపణాత్ = నిరూపణ లేకపోవుట వలన, భ్రాంతం=మిథ్యాజ్ఞానము, న=కాదు.

తా. నేను బ్రహ్మము నైతి నని ప్రత్యక్షముగా బ్రహ్మస్వరూపమును దెలిసికొనక బ్రహ్మవస్తు వొకటి గల దని తెలిసికొనుట పరోక్షజ్ఞాన మగును. ఈపరోక్షజ్ఞానమునకు బాధ లేమింజేసి మిథ్యాజ్ఞానము కా దని తెలియవలెను.

అవ. పరోక్షజ్ఞానము మిథ్యాజ్ఞానము కా దనుటకు గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మ నాస్తీతి మానం చేత్స్యాద్బాధ్యేత తద్బాధ్యతే,
న చైవం ప్రబలం మానం పశ్యామోఽతో న బాధ్యతే.

వ్యా. హేతుం వివృణోతి—బ్రహ్మ నాస్తీతి.

టీ. బ్రహ్మ = పరబ్రహ్మము, నాస్తీతి=లే దనెడి, మానం = ప్రమాణవచనము, స్యాచ్చేత్ =ఉండెనేని, తదా=అప్పుడు, ధ్రువం=నిశ్చయముగా, బాధ్యేత = పరోక్ష జ్ఞానము బాధింపఁబడును. ఏవం = ఇట్లు, ప్రబలం = ప్రబల మగు, మానం=ప్రమాణ వచనమును, న పశ్యామః=గు ర్తెఱుఁగము (లే దనుట), అతః=ఇందువలన, న బాధ్యతే= పరోక్షజ్ఞానము బాధింపఁబడదు (మిథ్యాజ్ఞానము కాఁజాల దనుట).

తా. బ్రహ్మము లే దనెడి ప్రమాణవచన ముండెనేని యప్పుడు పరోక్షజ్ఞానము తప్పక బాధింపఁబడి మిథ్యాజ్ఞాన మగును. ఇట్టి ప్రబల ప్రమాణవచన మెక్కడను గనఁబడమిచే పరోక్షజ్ఞానము మిథ్యా జ్ఞానము కాదు.

అవ. వ్యక్తిస్వరూపము గోచరింపనందువలన నది మిథ్యాజ్ఞానమందు వేని నట్లు చెప్పుట అతిప్రసంగ మగు నని నిందించుచున్నాఁడు:—

శ్లో. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ భ్రమత్వే స్వర్గధీ రపి,
భ్రాంతిస్స్యా ద్వ్యక్త్యనుల్లేఖాత్సామాన్యోల్లేఖదర్శనాత్. 53

వ్యా. ద్వితీయమతిప్రసంగేన దూషయతి—వ్యక్తీతి. అయం స్వర్గ ఇత్యేవ మాకారేణ గ్రహణాభావాత్, కింతు స్వర్గోఽస్తీత్యేవం సామాన్యాకారేణ ప్రతీతే స్స్వర్గబుద్ధేరపి భ్రమత్వప్రసంగ ఇత్యర్థః.

టీ. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ - వ్యక్తి = బ్రహ్మస్వరూపముయొక్క, అనుల్లేఖ మాత్రేణ=ప్రత్యక్షముగాఁ దెలియ నంతమాత్రముచేత, భ్రమత్వే సతి=మిథ్యాత్వము గలుగుచుండఁగా, స్వర్గధీ రపి = స్వర్గము గల దని తలంచుటయు, వ్యక్త్యనుల్లేఖాత్ - వ్యక్తి=స్వర్గస్వరూపముయొక్క, అనుల్లేఖాత్ =ప్రత్యక్షముగా నెఱుఁగకపోవుటవలన, సామాన్యోల్లేఖదర్శనాత్ - సామాన్య=సామాన్యాకారమున, ఉల్లేఖ=ఉన్న దని తెలిసి కొనుటయొక్క, దర్శనాత్ = అనుకొనుటవలన, భ్రాంతిః=మిథ్యాజ్ఞానము, స్యాత్ = కావలసివచ్చును.

తా. బ్రహ్మస్వరూపమును బ్రత్యక్షముగా నెఱుఁగనంతమా త్రముచేత నట్టి పరోక్షజ్ఞానము మిథ్య యగు నేని 'స్వర్గ మున్నది, కాశి యున్నది' అనెడి జ్ఞానము ప్రత్యక్షముగా స్వర్గమును, కాశిని తాను చూడనంతమాత్రమున సామాన్యాకారముగా నున్నది యనెడి జ్ఞానము గూడ మిథ్యాజ్ఞానమే కావలసివచ్చును కనుక పరోక్షజ్ఞా నము వ్యక్తిస్వరూపము దెలియనంతమాత్రమున మిథ్యాజ్ఞాన మనుట యతిప్రసంగ మగును గనుక న ట్లనరాదు.

.ముగాఁ దెలియుటవలన), పరోక్షజ్ఞానకాలేఽపి=పరోక్షజ్ఞానకాలమునందును, విష స్వప్రకాశతా = ఆత్మకు స్వయంప్రకాశత్వము, సమా=సమానముగా నున్నది.

తా. బ్రహ్మ మున్న దని పరోక్షజ్ఞానము కలవాఁడు బుద్ధిచే నీవిధముగాఁ దెలిసికొనుచున్నాఁడు. బ్రహ్మమునకు స్వప్రకాశత్వ అపరోక్షజ్ఞానసమయమున నున్నట్లు పరోక్షజ్ఞానకాలమునను తు ముగా నున్నది అని.

అవ. ప్రత్యగభిన్న మగు పరబ్రహ్మవిషయకజ్ఞానమునకు పరోక్షత్వ మె గలిగె నని యాశంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అహం బ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీత్యేవ ముల్లిఖేత్,
పరోక్షజ్ఞాన మేత న్న భ్రాంతం బాధానిరూపణాత్.

వ్యా. ప్రత్యగభిన్నబ్రహ్మగోచరస్య జ్ఞానస్య కుతః పరోక్షత్వమిత్యాశం ప్రత్యగంశాగ్రహణాదిత్యాహ—అహం బ్రహ్మేతి. నన్విదం భ్రాంతమిత్యాశంక్యా భ్రాంతత్వం కిం బాధ్యత్వాదుత వ్యక్త్యనుల్లేఖాదథవా అపరోక్షేణ గ్రహణయోగ్య పారోక్ష్యేణ గ్రహణాత్? యద్వాంశాగ్రహణాదితి చతుర్ధా వికల్ప్య ప్ర ప్రత్యాహ—ఏతదితి. ఏతన్న భ్రాంతం.

టీ. అహం=నేను, బ్రహ్మేతి=బ్రహ్మము నని, అనుల్లిఖ్య=ప్రత్యక్షముగా తె గక, బ్రహ్మ=బ్రహ్మవస్తువు, అస్తీతి=ఉన్న దని, ఏవం = ఇట్లు సామాన్యాకారను ఉల్లిఖేత్ = తెలిసికొనును. ఏతత్=ఇట్టిస్వరూపమగు, పరోక్షజ్ఞానం=పరోక్షజ్ఞానక బాధానిరూపణాత్-బాధా = బాధయొక్క, అనిరూపణాత్ = నిరూపణ లేకపోవు వలన, భ్రాంతం=మిథ్యాజ్ఞానము, న=కాదు.

తా. నేను బ్రహ్మము నైతి నని ప్రత్యక్షముగాఁ బ్రహ్మస్వరూ మును దెలిసికొనక బ్రహ్మవస్తు వొకటి గల దని తెలిసికొనుట పరో జ్ఞాన మగును. ఈపరోక్షజ్ఞానమునకు బాధ లేమిం జేసి మిథ్యాజ్ఞానమ కా దని తెలియవలెను.

అవ. పరోక్షజ్ఞానము మిథ్యాజ్ఞానము కా దనుటకుఁ గారణమును జె చున్నాఁడు:—

శ్లో. బ్రహ్మ నాస్తీతి మానం చేత్స్యాద్బాధ్యేత తదాధ్రువమ్,
న చైవం ప్రబలం మానం పశ్యామోఽతో న బాధ్యతే.

వ్యా. హేతుం వివృణోతి— బ్రహ్మ నాస్తీతి.

టీ. బ్రహ్మ = పరబ్రహ్మము, నాస్తీతి=లే దనెడి, మానం = ప్రమాణవచనము, స్యాచ్చేత్=ఉండెనేని, తదా=అప్పుడు, ధ్రువం=నిశ్చయముగా, బాధ్యేత = పరోక్ష జ్ఞానము బాధింపఁబడును. ఏవం = ఇట్లు, ప్రబలం = ప్రబల మగు, మానం=ప్రమాణ వచనమును, న పశ్యామః=గుర్తెఱుఁగము (లే దనుట), అతః=ఇందువలన, న బాధ్యతే= పరోక్షజ్ఞానము బాధింపఁబడదు (మిథ్యాజ్ఞానము కాఁజాల దనుట).

తా. బ్రహ్మము లే దనెడి ప్రమాణవచన ముండెనేని యప్పుడు పరోక్షజ్ఞానము తప్పక బాధింపఁబడి మిథ్యాజ్ఞాన మగును. ఇట్టి ప్రబల ప్రమాణవచన మెక్కడను గనఁబడమిచే పరోక్షజ్ఞానము మిథ్యా జ్ఞానము కాదు.

అవ. వ్యక్తిస్వరూపము గోచరింపనందువలన నది మిథ్యాజ్ఞానమందువేని నట్లు చెప్పుట అతిప్రసంగ మగు నని నిందించుచున్నాఁడు:—

శ్లో. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ భ్రమత్వే స్వర్గధీ రపి,
భ్రాంతిస్స్యా ద్వ్యక్త్యనుల్లేఖాత్సామాన్యోల్లేఖదర్శనాత్. 53

వ్యా. ద్వితీయమతిప్రసంగేన దూషయతి—వ్యక్తీతి. అయం స్వర్గ ఇత్యేవ మాకారేణ గ్రహణాభావాత్, కింతు స్వర్గోఽస్తీత్యేవం సామాన్యాకారేణ ప్రతీతే స్స్వర్గబుద్ధేరపి భ్రమత్వప్రసంగ ఇత్యర్థః.

టీ. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ - వ్యక్తి = బ్రహ్మస్వరూపముయొక్క, అనుల్లేఖ మాత్రేణ=ప్రత్యక్షముగాఁ దెలియ నంతమాత్రముచేత, భ్రమత్వే సతి=మిథ్యాత్వము గలుగుచుండఁగా, స్వర్గధీ రపి = స్వర్గము గల దని తలంచుటయు, వ్యక్త్యనుల్లేఖాత్ - వ్యక్తి=స్వర్గస్వరూపముయొక్క, అనుల్లేఖాత్=ప్రత్యక్షముగా నెఱుఁగకపోవుటవలన, సామాన్యోల్లేఖదర్శనాత్ - సామాన్య=సామాన్యాకారమున, ఉల్లేఖ=ఉన్న దని తెలిసి కొనుటయొక్క, దర్శనాత్ = అనుకొనుటవలన, భ్రాంతిః=మిథ్యాజ్ఞానము, స్యాత్ = కావలసివచ్చును.

తా. బ్రహ్మస్వరూపమును బ్రత్యక్షముగా నెఱుఁగనంతమా త్రముచేత నట్టి పరోక్షజ్ఞానము మిథ్య యగు నేని 'స్వర్గ మున్నది, కాశి యున్నది' అనెడి జ్ఞానము ప్రత్యక్షముగా స్వర్గమును, కాశిని తాను చూడనంతమాత్రమున సామాన్యాకారముగా నున్నది యనెడి జ్ఞానము గూడ మిథ్యాజ్ఞానమే కావలసివచ్చును కనుక పరోక్షజ్ఞా నము వ్యక్తిస్వరూపము నెఱుఁగనంతమాత్రమున మిథ్యాజ్ఞాన మనుట యతిప్రసంగ మగును గనుక న ట్లనరాదు.

-ముగాఁ దెలియుటవలన), పరోక్షజ్ఞానకాలేఽపి=పరోక్షజ్ఞానకాలమునందును, విషయ-స్వప్రకాశతా = ఆత్మకు స్వయంప్రకాశత్వము, సమా=సమానముగా నున్నది.

తా. బ్రహ్మ మున్న దని పరోక్షజ్ఞానము కలవాఁడు బుద్ధిచేత నీవిధముగాఁ దెలిసికొనుచున్నాఁడు. బ్రహ్మమునకు స్వప్రకాశత్వము అపరోక్షజ్ఞానసమయమున నున్నట్లు పరోక్షజ్ఞానకాలమునను తుల్యముగా నున్నది అని.

అవ. ప్రత్యగభిన్న మగు పరబ్రహ్మవిషయకజ్ఞానమునకు పరోక్షత్వ మెట్లు గలిగె నని యాశంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అహం బ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీత్యేవ ముల్లిఖేత్,
పరోక్షజ్ఞాన మేత న్న భ్రాంతం బాధానిరూపణాత్. 51

వ్యా. ప్రత్యగభిన్నబ్రహ్మగోచరస్య జ్ఞానస్య కుతః పరోక్షత్వమిత్యాశంక్య ప్రత్యగంశాగ్రహణాదిత్యాహ—అహం బ్రహ్మేతి. నన్విదం భ్రాంతమిత్యాశంక్యాస్య భ్రాంతత్వం కిం బాధ్యత్వాదుత వ్యక్త్యనుల్లేఖాదథవా అపరోక్షేణ గ్రహణయోగ్యస్య పారోక్ష్యేణ గ్రహణాత్? యద్వాంశాగ్రహణాదితి చతుర్ధా వికల్ప్య ప్రథమం ప్రత్యాహ—ఏతదితి. ఏతన్న భ్రాంతం.

టీ. అహం=నేను, బ్రహ్మేతి=బ్రహ్మము నని, అనుల్లిఖ్య=ప్రత్యక్షముగా నెఱుఁగక, బ్రహ్మ=బ్రహ్మవస్తువు, అస్తీతి=ఉన్న దని, ఏవం = ఇట్లు సామాన్యాకారముగా, ఉల్లిఖేత్ = తెలిసికొనును. ఏతత్=ఇట్టిస్వరూపమగు, పరోక్షజ్ఞానం=పరోక్షజ్ఞానము, బాధానిరూపణాత్-బాధా = బాధయొక్క, అనిరూపణాత్ = నిరూపణ లేకపోవుట వలన, భ్రాంతం=మిథ్యాజ్ఞానము, న=కాదు.

తా. నేను బ్రహ్మము నైతి నని ప్రత్యక్షముగా బ్రహ్మస్వరూపమును దెలిసికొనక బ్రహ్మవస్తు వొకటి గల దని తెలిసికొనుట పరోక్షజ్ఞాన మగును. ఈపరోక్షజ్ఞానమునకు బాధ లేమింజేసి మిథ్యాజ్ఞానము కా దని తెలియవలెను.

అవ. పరోక్షజ్ఞానము మిథ్యాజ్ఞానము కా దనుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మ నాస్తీతి మానం చేత్స్యాద్బాధ్యేత తదాధ్రువమ్,
న చైవం ప్రబలం మానం పశ్యామోఽతో న బాధ్యతే. 52

వ్యా. హేతుం వివృణోతి—బ్రహ్మ నాస్తీతి.

టీ. బ్రహ్మ = పరబ్రహ్మము, నాస్తీతి=లే దనెడి, మానం = ప్రమాణవచనము, స్యాచ్చేత్=ఉండెనేని, తదా=అప్పుడు, ధ్రువం=నిశ్చయముగా, బాధ్యేత = పరోక్షజ్ఞానము బాధింపఁబడును. ఏవం = ఇట్లు, ప్రబలం = ప్రబల మగు, మానం=ప్రమాణ వచనమును, న పశ్యామః=గుర్తెఱుఁగము (లే దనుట), అతః=ఇందువలన, న బాధ్యతే= పరోక్షజ్ఞానము బాధింపఁబడదు (మిథ్యాజ్ఞానము కాఁజాల దనుట).

తా. బ్రహ్మము లే దనెడి ప్రమాణవచన ముండెనేని యప్పుడు పరోక్షజ్ఞానము తప్పక బాధింపఁబడి మిథ్యాజ్ఞాన మగును. ఇట్టి ప్రబల ప్రమాణవచన మెక్కడను గనఁబడమిచే పరోక్షజ్ఞానము మిథ్యాజ్ఞానము కాదు.

అవ. వ్యక్తిస్వరూపము గోచరింపనందువలన నది మిథ్యాజ్ఞానమందు వేని నట్లు చెప్పుట అతిప్రసంగ మగు నని నిందించుచున్నాఁడు:—

శ్లో. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ భ్రమత్వే స్వర్గధీ రపి,
భ్రాంతిస్స్యా ద్వ్యక్త్యనుల్లేఖాత్సామాన్యోల్లేఖదర్శనాత్. 53

వ్యా. ద్వితీయమతిప్రసంగేన దూషయతి—వ్యక్తీతి. అయం స్వర్గ ఇత్యేవ మాకారేణ గ్రహణాభావాత్, కింతు స్వర్గోఽస్తీత్యేవం సామాన్యాకారేణ ప్రతీతే స్స్వర్గబుద్ధేరపి భ్రమత్వప్రసంగ ఇత్యర్థః.

టీ. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ - వ్యక్తి = బ్రహ్మస్వరూపముయొక్క, అనుల్లేఖ మాత్రేణ=ప్రత్యక్షముగాఁ దెలియ నంతమాత్రముచేత, భ్రమత్వే సతి=మిథ్యాత్వము గలుగుచుండఁగా, స్వర్గధీ రపి = స్వర్గము గల దని తలంచుటయు, వ్యక్త్యనుల్లేఖాత్ - వ్యక్తి=స్వర్గస్వరూపముయొక్క, అనుల్లేఖాత్=ప్రత్యక్షముగా నెఱుఁగకపోవుటవలన, సామాన్యోల్లేఖదర్శనాత్ - సామాన్య=సామాన్యాకారమున, ఉల్లేఖ=ఉన్న దని తెలిసికొనుటయొక్క, దర్శనాత్ = అనుకొనుటవలన, భ్రాంతిః=మిథ్యాజ్ఞానము, స్యాత్ = కావలసివచ్చును.

తా. బ్రహ్మస్వరూపమును బ్రత్యక్షముగా నెఱుఁగనంతమాత్రముచేత నట్టి పరోక్షజ్ఞానము మిథ్య యగు నేని 'స్వర్గ మున్నది, కాశి యున్నది' అనెడి జ్ఞానము ప్రత్యక్షముగా స్వర్గమును, కాశిని తాను చూడనంతమాత్రమున సామాన్యాకారముగా నున్నది యనెడి జ్ఞానము గూడ మిథ్యాజ్ఞానమే కావలసివచ్చును కనుక పరోక్షజ్ఞానము వ్యక్తిస్వరూపము తెలియనంతమాత్రమున మిథ్యాజ్ఞాన మనుట యతిప్రసంగ మగును గనుక న ట్లనరాదు.

అవ. ఉన్నాఁడనెడి వాక్యమువలన పరోక్షజ్ఞానము గలిగెనేని, అపరోక్షజ్ఞానము దేనివలనం గలుగు నని శంకించి విచారణతోఁ గూడినవాక్యమువలనఁ గల్గు నని బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా బ్రహ్మేతి వాక్యార్థే నిశ్శేషేణ విచారితే,
వ్యక్తి రుల్లిఖ్యతే యద్వ ద్దశమ స్త్వమసీ త్యతః. 58

వ్యా. నను వాక్యాత్పరోక్షజ్ఞానముత్పద్యతే చేదపరోక్షజ్ఞానం కుతో జాయత ఇత్యాశంక్య విచారసహితాద్వాక్యాదేవేత్యాహ—ఆత్మేతి. అయమాత్మా బ్రహ్మేతి వాక్యార్థే సమ్యగ్విచార్యమాణే పూర్వమ స్తీతి పరోక్షతయాఽవగతస్య బ్రహ్మణః ప్రత్యగభిన్నత్వం సాక్షాత్క్రియతే. తత్ర దృష్టాంతః—యద్వదితి. దశమ స్త్వమసీ త్యతో వాక్యా త్స్వాత్మని దశమత్వం యథా సాక్షాత్క్రియతే తద్వదిత్యర్థః.

టీ. ఆత్మా=ప్రత్యగాత్మ, బ్రహ్మేతి=బ్రహ్మమగు నని, వాక్యార్థే=మహావాక్యము యొక్కయర్థము, నిశ్శేషేణ=పూర్తిగా, విచారితే సతి = విచారింపఁబడఁగా, దశమః = పదియవవాఁడవు, త్వం=నీవు, అసీతి = అగుచున్నా వనెడి, అతః = ఈవాక్యమువలన, యద్వత్ = ఏవిధముగాఁ బదియవవాఁడు తానే యైనట్లు ప్రత్యక్షజ్ఞానము గలుగునో, (అటువలె) వ్యక్తి=స్వరూపజ్ఞానము (తానేబ్రహ్మ మను నపరోక్షజ్ఞానము), ఉల్లిఖ్యతే= స్పష్టమగుచున్నది.

తా. శ్రు. "అయ మాత్మా బ్రహ్మ" ఈప్రత్యగాత్మస్వరూపమే బ్రహ్మ మగును అనియెడి నీమహావాక్యముయొక్క యర్థమును జక్కఁగాఁ బరిశీలించి తెలిసికొనినప్పుడు పదియవవాఁడవు నీవే యని నప్పుడు వానికిఁ బదియవవాఁడను నేనే యని వ్యక్తి యెట్లు ప్రత్యక్ష మగునో యట్లు ఆబ్రహ్మస్వరూపము నేనే యగుదు నని యపరోక్ష సాక్షాత్కారము గలుగును.

అవ. అపరోక్షజ్ఞానము గలిగెడి విధముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. దశమః క ఇతి ప్రశ్నే త్వమేవేతి నిరూపితే,
గణయిత్వా స్వేన సహ స్వమేవ దశమం స్మరేత్. 59

వ్యా. విచారసహకృతేన వాక్యేనాపరోక్షజ్ఞానోత్పత్తిప్రకార సదృష్టాంత మాహ—దశమ ఇతి. త్వయా స్తీతి నిరూపితో దశమః క ఇతి ప్రశ్నే కృతే నిరూపితే సతి తస్య త్వమేవేతి పరిహారేఽభిహితే స్వాత్మనా సహేతరాన్నవగణయిత్వాహం దశమోఽ స్తీతి స్వమేవ దశమం స్మరేదిత్యర్థః.

టీ. దశమః = పదియవవాఁడు, కః = ఎవఁడు, ఇతి = అనెడి, ప్రశ్నే=ప్రశ్న, కృతే సతి = చేయఁబడినప్పుడు, త్వమేవ = నీవే, ఇతి = అని, నిరూపితే=నిరూపణము చేయఁబడిన దగుచుండఁగా, స్వేన సహ = తనతోఁగూడ, గణయిత్వా = అందఱిని లెక్కపెట్టుకొని, దశమం = పదియవవానిని, స్వమేవ = తననుగానే, స్మరేత్ = తెలిసికొనును.

తా. పదియవవాఁ డున్నాఁ డంటివిగదా, వాఁ డెక్కడ నున్నాఁడు, చెప్పు మనఁగానే యాప్తహితుఁడు నీవే పదియవవాఁడ వని బదులు చెప్పఁగా నప్పుడు తనను గూడ చేర్చుకొని యందఱిని లెక్క పెట్టుకొని నేనే పదియవవాఁడ నగుదు నని తెలిసికొనును.

అవ. పదియవవాఁడ నైతి ననెడి జ్ఞానము విచారణతోఁ గూడిన దగుచు మిత్ర వాక్యముచేఁ గలిగినదగుటంజేసి యెన్నటికిని విపర్యయముం బొందదు అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. దశమోఽస్మీతి వాక్యోత్థా న ధీరస్య విహన్యతే,
ఆదిమధ్యావసానేషు న నవత్వస్య సంశయః. 60

వ్యా. అస్య దశమోఽస్మీతి జ్ఞానస్య విచారసహితవాక్యజనితత్వాన్నవిపర్యయాది రూపతేత్యాహ—దశమ ఇతి. అస్య దశమస్య త్వమేవ దశమోఽసీతి వాక్యాత్పరిగణనాదిలక్షణవిచారసహితా దుత్పన్నాహం దశమోఽస్మీతి బుద్ధిర్న విహన్యతే. న కేనాపి జ్ఞానేన బాధ్యతే. పరిగణనక్రియాయాం చ నవానామాదిమధ్యావసానేషు పరిగణనేఽస్యాహం దశమో న వేతి సంశయశ్చ. న భవేదతస్సా దృఢా పరోక్షరూపేత్యర్థః.

టీ. దశమః = పదియవవాఁడను, అస్మీతి = ఐతి ననెడి, అస్య = ఈదశముని యొక్క, ధీః = జ్ఞానము, వాక్యోత్థా = విచారసహిత మగు వాక్యమువలనఁ గలిగినది. (కావున), న విహన్యతే=ఎన్నటికినిం జెడదు. ఆదిమధ్యావసానేషు = లెక్కపెట్టునపుడు మొదటను, నడుమను, చివరను, నవత్వస్య=తొమ్మిదిమంది యగుటయొక్క, సంశయః = సందేహము, న = లేదు.

తా. ఈదశమునకుఁ గలిగిన పదియవవాఁడ నైతి నను జ్ఞానము విచారణతోఁ గూడిన మహావాక్యముద్వారా కల్గుటచేత, నది యెన్నఁటికిని మార్పును బొందదు. త్రిప్పించి మళ్ళించి యెన్నిమాఱులు లెక్కించినను వారు తొమ్మిదిమంది యనుటయందును దాను పదియవ

వాఁడ ననుటయందును సంశయము గాని విపర్యయము గాని గలుగదు. ఇది విచారసహకృత మగు వాక్యమువలనఁ గలిగినది గనుక నింత దృఢత గల్గియున్నది.

అవ. ఈయర్థమును దార్ష్టాంతికమందుఁ జూపుచున్నాఁడు:—

శ్లో. సదేవేత్యాదివాక్యేన బ్రహ్మసత్త్వం పరోక్షతః,
గృహీత్వా తత్త్వమస్యాదివాక్యాద్వ్యక్తిం సముల్లిఖేత్. 61

వ్యా. ఏతత్సర్వం దార్ష్టాంతికే యోజయతి—సదేవేత్యాదీతి. "స దేవసోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయ" మిత్యాదివాక్యేన బ్రహ్మసద్భావం ప్రథమం నిశ్చిత్య తస్య జీవరూపేణప్రవేశాది యుక్తిపర్యాలోచనయా ప్రత్యగ్రూపత్వంసంభావ్య తత్త్వ మసీత్యాదివాక్యేనాద్వితీయబ్రహ్మరూపమాత్మానమహం బ్రహ్మాస్మీతి సాక్షాత్కుర్యాత్.

టీ. సదేవ=సృష్టికిఁబూర్వము సద్రూపముగా నుండె ననెడి, ఇత్యాదివాక్యేన= ఈ మొదలగువాక్యముచేత, పరోక్షతః = పరోక్షజ్ఞానముగా, బ్రహ్మసత్త్వం = బ్రహ్మ స్వరూపముయొక్క యునికిని, గృహీత్వా = తెలిసికొని, తత్త్వమసి - తత్ = ఆపర బ్రహ్మస్వరూపము, త్వం = నీవు, అసి=ఐతివి, ఇత్యాది వాక్యాత్ = ఇది మొదలగు మహావాక్యమువలన, వ్యక్తిం = అద్వితీయబ్రహ్మతత్త్వమును, సముల్లిఖేత్ = నేనైతి నని యపరోక్షముగాఁ దెలిసికొనును.

తా. పదియవవాఁ డున్నాఁ డని మొదటఁ దెలిసికొన్నట్లు శ్రు. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అనెడి శ్రుతివలన సృష్టికి పూర్వము సన్మాత్రమై యున్న దని పరోక్షజ్ఞానము గలిగెను. తరువాత నాపర బ్రహ్మమే జీవస్వరూపముతోఁ బ్రవేశించెను అనెడి యర్థము గల వాక్యసందర్భముచేత బ్రత్యగాత్మగా నుండెను, అని యెఱింగి "తత్త్వ మసి" అను మహావాక్యార్థమును విచారించి యాబ్రహ్మస్వరూపము నేనే యైతి నను నపరోక్షజ్ఞానమును (నేనే పదియవవాఁడ ననుకొన్న విధంబున) నొందుచున్నాఁ డని భావము.

శ్లో. ఆదిమధ్యావసానేషు స్వస్య బ్రహ్మత్వధీరియమ్,
నైవ వ్యభిచరే త్తస్మాదాపరోక్ష్యం ప్రతిష్ఠితమ్. 62

వ్యా. ఆదిమధ్యేతి. అత ఇయమాత్మనో బ్రహ్మత్వబుద్ధిః పంచానాం కోశానా మాదిమధ్యావసానేష్వాత్మనో వ్యవహారోఽపి నైవాన్యథా భవతి. అతోఽస్యా బుద్ధేర పరోక్షజ్ఞానత్వం సుసిద్ధమిత్యర్థః.

టీ. స్వస్య=తనకు, ఇయం బ్రహ్మత్వధీః=ఈచెప్పఁబడిన బ్రహ్మము నేనే యా జ్ఞానము, ఆదిమధ్యావసానేషు = కోశములయొక్క యాదియందును, మధ్యమందు చివరయందును (వ్యవహారేఽపి=వ్యవహరించునప్పుడును), నైవ వ్యభిచరేత్ =మాఱ తస్మాత్ =ఆకారణమువలన, అపరోక్ష్యం = అపరోక్షత్వము, ప్రతిష్ఠితం = దృఢమ నిలుచును.

తా. ఈముముక్షువునకు విచారసహిత మగు మహావాక్య వలనఁ గలిగిన "నేను బ్రహ్మము నైతిని" అను జ్ఞానము పంచకోశము యొక్క ఆదిమధ్యాంతములయందు వ్యవహరించుచున్నను, తో ద్రను లెక్కించెడి వానికి దశముఁడ నైతి ననెడి బుద్ధి మాఱని విధంబ మాఱదు. అందువలన నపరోక్షజ్ఞానము స్థిరమై నిలుచు నని భావము

అవ. మొదట కేవలవాక్యమువలనఁ బరోక్షజ్ఞానము గలుగు ననియు, వి సహితవాక్యమువలన నపరోక్షజ్ఞానము గల్గు ననియు, మీ కెట్లు తెలిసె నని య గఁగా, తైత్తిరీయశ్రుత్యర్థమును బరికింపఁగా నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. జన్మాదికారణత్వాఖ్యలక్షణేన భృగుః పురా,
పారోక్ష్యేణ గృహీత్వాఽథ విచారాద్వ్యక్తిమైక్షత.

వ్యా. నన్వేవం ప్రథమతః కేవలవాక్యాత్పరోక్షజ్ఞానముత్పద్యతే. ప ద్విచారసహితాదపరోక్షజ్ఞానమిత్యేతత్కుతోఽవగమ్యత ఇత్యాశంక్య తైత్తిరీయ శ్రుత్యర్థపర్యాలోచనయేత్యాహ—జన్మాదీతి. భృగునామకః కశ్చిదృషిః "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మే" తీతి వాక్యశ్రుతేన జగజ్జన్మాదికారణత్వ లక్షణేన జగత్కారణం బ్రహ్మ పరోక్షతయాఽవగత్యాన్నమయాదిపంచకోశవిచా ద్వ్యక్తిం ప్రత్యగాత్మరూపం బ్రహ్మ దృష్టవానిత్యర్థః.

టీ. పురా=పూర్వకాలమునందు, భృగుః=భృగుమహర్షి, జన్మాదికారణత్వా లక్షణేన - జన్మాది=ఉత్పత్తిస్థితిలయములకు, కారణత్వాఖ్య = కారణ మగుట య లక్షణేన = స్వరూపము గల వాక్యముచేత, పారోక్ష్యేణ=పరోక్షముగా, గృహీత్వ గ్రహించి, అథ=తరువాత, విచారాత్ = పంచకోశవిచారణవలన, వ్యక్తిం = స్వ మును, ఐక్షత = తెలిసికొనెను.

తా. పూర్వము వరుణునికుమారుం డగు భృగుమహర్షి "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవ

యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ" అనెడి వాక్యమునందు వినఁబడిన జగత్కారణ మగు బ్రహ్మమును పరోక్షజ్ఞానము చేత తెలిసికొని యాతర్వాత అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయకోశము లనెడి పంచకోశముల నొక్కొక్కదానిని విచారించి యీకోశములకంటె విలక్షణ మైన ప్రత్యగాత్మస్వరూపమును బ్రహ్మమని తెలిసికొన్నట్లు తైత్తిరీయకశ్రుతివలనఁ దెలియఁబడినది.

అవ. ఆప్రకరణమున భృగుమహర్షి తండ్రి యగు వరుణుఁడు నీవు బ్రహ్మమ వైతి వని యుపదేశించినట్లు వాక్యము గనఁబడదే. భృగుమహర్షికి నాత్మసాక్షాత్కారము గలుగు టె ట్లని శంకించుకొని, సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. యద్యపి త్వమసీత్యత్ర వాక్యం నో చేద్ భృగోః పితా,
తథాప్యన్నం ప్రాణ మితి విచార్యస్థల ముక్తవాన్. 64

వ్యా. నన్వస్మిన్ ప్రకరణే త్వం బ్రహ్మాసీత్యేవమాద్యుపదేశవాక్యాభావాత్కథం భృగోరాత్మసాక్షాత్కార ఇత్యాశంక్యాత్మసాక్షాత్కారహేతువిచారయోగ్యస్థలప్రదర్శనాదిత్యాహ—యద్యపీతి.

టీ. యద్యపి = విచారించఁగా, అత్ర = ఈతైత్తిరీయకశ్రుతియందు, భృగోః = భృగుమహర్షి యొక్క, పితా = తండ్రి యగు వరుణుఁడు, త్వం = నీవు, అసి=బ్రహ్మమ వైతివి. ఇతి=అనెడి, వాక్యం = వాక్యమును, నో చేత్ = చెప్పలే దని యంటివా, తథాఽపి = అట్లు చెప్పకపోయినను, అన్నం = అన్నమయకోశము, ప్రాణమితి=ప్రాణమయకోశ మనియు, విచార్యస్థలం - విచార్య = విచారణచేయఁదగిన, స్థలం = ప్రదేశమును, ఉక్తవాన్ = చెప్పెను.

తా. విచారింపఁగా వరుణుఁడు తనకుమారుఁ డగు భృగుమహర్షికి నీవు బ్రహ్మమవైతి వని చెప్పలే దంటివేని, అట్లు చెప్పకుండినను, అన్నమయకోశ మనియు, ప్రాణమయకోశ మనియు, విజ్ఞానమయకోశ మనియు, ఆనందమయకోశ మనియు పంచకోశములను దెల్పెడి వాక్యములచే ఆత్మను దెలిసికొనుటకు విచారింపఁదగినతావును దెల్పెను.

అవ. అన్నమయాదికోశములను విచారించినఁ బ్రత్యగాత్మస్వరూపము తెలియును గాని బ్రహ్మస్వరూపముఁ దెలియు టె ట్లని శంకించుకొని బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్నప్రాణాదికోశేషు సువిచార్య పునః పునః,

ఆనందవ్యక్తిమీక్షిత్వా బ్రహ్మలక్ష్మాప్యయూయుజత్. 65

వ్యా. నన్వన్నమయాదికోశేషు విచారితేషు ప్రతీచస్స్వాత్మత్వాకారో భవతు— బ్రహ్మణస్తు కథమిత్యాశంక్య ప్రతీచ ఏవ బ్రహ్మత్వా త్పంచకోశవిచారేణానందాత్మ వ్యక్తిం సాక్షాత్కృత్య "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతీ" త్యేవం బ్రహ్మలక్షణమపి ప్రతీచ్యేవ యోజితవానిత్యాహ—అన్నప్రాణాదీతి.

టీ. పునః = మాటిమాటికిని, అన్నప్రాణాదికోశేషు = అన్నమయ ప్రాణమయాదికోశములయందు, సువిచార్య=ఆత్మను బాగుగా విచారించి, ఆనందవ్యక్తిం = ఆత్మయొక్క యానందస్వరూపమును, ఈక్షిత్వా = తెలిసికొని, బ్రహ్మలక్ష్మాపి-బ్రహ్మ = పరబ్రహ్మముయొక్క, లక్ష్మాపి = లక్షణమును, అయూయుజత్ = ప్రత్యగాత్మయందే చేర్చెను.

తా. ఆభృగుమహర్షి ప్రత్యగాత్మయే బ్రహ్మస్వరూప మగుట వలన పంచకోశములను విచారించి యందు ఆనందాభివ్యక్తిని నెఱింగి శ్రు. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయన్త్యభిసంవిశంతి" అనఁగా ఆనందము వలననే భూతకోటి పుట్టుచున్నది. పుట్టిన భూతకోటి యానందము చేతనే జీవించుచున్నది. ఆనందమునందే లయించుచున్నది. అనెడి యానందస్వరూపమును పరిశీలించి యది బ్రహ్మస్వరూపముగా గ్రహించి యాబ్రహ్మమును ప్రత్యగాత్మస్వరూపముగా గ్రహించెను.

అవ. బ్రహ్మము తటస్థలక్షణము గల దగుటచేత ప్రత్యగాత్మకంటె వేఱైనది కదా? ఆనందస్వరూప మగు ప్రత్యగాత్మయందుఁ బ్రహ్మలక్షణ మున్నట్లు తెలిసికొనుట యె ట్లని శంకించుకొని యుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యం జ్ఞాన మనంతం చేత్యేవం బ్రహ్మస్వలక్షణమ్,
ఉక్త్వా గుహాహితత్వేన కోశే ష్వేత త్ప్రదర్శితమ్. 66

వ్యా. నను, బ్రహ్మలక్షణస్యానందాత్మరూపేణ ప్రతీచి యోజనం న ఘటేత. బ్రహ్మణస్తటస్థత్వేన ప్రతీచో భిన్నత్వాదిత్యాశంక్య న భేదస్సత్యాదిలక్షణస్య బ్రహ్మణః ప్రత్యగ్రూపేణావస్థాన శ్రవణాదిత్యాహ—సత్యమితి. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మే" త్యేవం బ్రహ్మస్వలక్షణం బ్రహ్మణస్స్వరూపలక్షణమభిధాయ, "యో వేద నిహితం

గుహాయాం పరమే వ్యోమ” న్నిత్యనేన వాక్యేన పంచకోశగుహాంతరస్థితత్వేన తస్యైవ ప్రత్యగ్రూపత్వమభిహితమిత్యర్థః.

టీ. సత్యం = సత్యత్వమును, జ్ఞానం = చిద్రూపత్వమును, అనంతం చ = అనంతత్వమును, బ్రహ్మస్వలక్షణం = బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము, ఇత్యేవం = అని యీప్రకారము, ఉక్త్వా = చెప్పి, గుహాహితత్వేన = పంచకోశరూపమైన గుహాలో నుండుటచేత, కోశేషు = పంచకోశములయందు, ఏతత్ = ఈప్రత్యగాత్మస్వరూపమగు, ప్రదర్శితం = శ్రుతిచేఁ దెల్పఁబడెను. (బ్రహ్మమునకే ప్రత్యగ్రూపత్వము దెల్పఁబడిన దనుట.)

తా. శ్రు. “సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ” అనెడి శ్రుతి సత్యజ్ఞానానంతత్వము పరబ్రహ్మమునకు స్వరూపలక్షణ మని చెప్పి యటు పిమ్మట శ్రు. “యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్” అను వాక్యముచేత బంచకోశస్వరూప మైన గుహాలోపల నాబ్రహ్మ మున్న దని చెప్పుటవలన నాపరబ్రహ్మమునకే ప్రత్యగాత్మస్వరూపము తెల్పఁబడెను. ఇట్లు తెల్పుటచేత ప్రత్యగాత్మపరమాత్మలయొక్క స్వరూప మొక్కటే యగు నని యీవాక్యసందర్భమును గమనింపఁగా విశదమగుచున్నది.

అవ. ఇట్లు తైత్తిరీయకశ్రుతినిబట్టి భృగుమహర్షికి ముందు పరోక్షజ్ఞానము గలిగి క్రమముగా విచారించుటచేత నపరోక్షసాక్షాత్కారము గలిగిన దని తెల్పి యీయంశము బలపఱచుటకు ఛాందోగ్యశ్రుతియందుఁ దెల్పఁబడినదానిని నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. పారోక్ష్యేణ విబుద్ధ్యేంద్రో య ఆత్మేత్యాదిలక్షణాత్,
అపరోక్షీకర్తుమిచ్ఛం శ్చతుర్వారం గురుం యయౌ. 67

వ్యా. ఏవం తైత్తిరీయశ్రుతిపర్యాలోచనయా భృగోః పరోక్షత్వజ్ఞానపూర్వకం విచారజన్యత్వం సాక్షాత్కారస్య దర్శయిత్వా, ఛాందోగ్యశ్రుతిపర్యాలోచనయాపి తద్దర్శయతి—పారోక్ష్యేణేతి. ఇంద్రః “య ఆత్మాపహతపాప్మా విరజో విమృత్యుర్విశోకో విజిఘత్సః” ఇత్యాదివాక్యప్రతిపాదితేన లక్షణేనాత్మానం పరోక్షతయావగత్య విచారాచ్ఛరీరత్రయనిరాకరణేన తత్సాక్షాత్కరణాయ “గురుం బ్రహ్మాణం చతుర్వార ముపపన్న” ఇతి ఛాందోగ్యోపనిషద్యష్టమాధ్యాయే శ్రూయతే.

టీ. ఇంద్రః = దేవేంద్రుఁడు, యః = ఎవఁడు, ఆత్మేతి = ఆత్మ యనెడి, ఆదిలక్షణాత్ = మొదలగుస్వరూపము గల వాక్యమువలన, పారోక్ష్యేణ = పరోక్షత్వ

ముగ, విబుధ్య=బ్రహ్మతత్త్వమును దెలిసికొని, అపరోక్షీకర్తుం = అట్టిబ్రహ్మముయొ యపరోక్షసాక్షాత్కారముకొఱకు, ఇచ్ఛన్ = కుతూహలము గలవాఁడగుచు, వ్వారం=నాల్గు పర్యాయములు, గురుం=బ్రహ్మస్వరూపమును నుపదేశించెడి బ్రహ్మదే గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. "శ్రు. య ఆత్మాఽపహతపాప్మా విరజో విమృత్యుర్విశో విజిఘత్సః" ఏయాత్మ పాపము లేనివాఁడో విరజస్కుఁడో మృత్యు లేనివాఁడో శోకము లేనివాఁడో క్షుత్పిపాసలు లేనివాఁడో యర్థము గలిగిన యీ మొదలైనవాక్యమున చెప్పఁబడిన స్వరూప చేత నింద్రుఁడు ఆత్మను పరోక్షముగా తెలిసికొని విచారణచేసి స్థూ సూక్ష్మకారణము లనియెడి శరీరత్రయమును నిరాకరించి ఆబ్రహ్మ యొక్క యపరోక్షసాక్షాత్కారముకొఱకు తన గురు వగు చతు బ్రహ్మయొద్దకు నాలుగు తడవలు వెళ్లియున్నాఁడని ఛాందోగ్యశ్రు యం దెనిమిదవ యధ్యాయమునందుఁ దెల్పఁబడినది.

అవ. ఇప్పుడు పరోక్షజ్ఞానము గలిగినతర్వాత నపరోక్షజ్ఞానము కలుగు నైతరేయశ్రుతియందును గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా వా ఇద మిత్యాదౌ పరోక్షం బ్రహ్మ లక్షితమ్,
అధ్యారోపాపవాదాభ్యాం ప్రజ్ఞానం బ్రహ్మ దర్శితమ్.

వ్యా. ఇదానీమైతరేయశ్రుతావపి తద్దర్శయతి—ఆత్మా వా ఇతి. "ఆత్మా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిష"దిత్యనేన వాక్యేన బ్రహ్మణో లక్షణ ధాయ, "స ఈక్షత లోకాన్ను సృజా" ఇత్యుపక్రమ్య, "తస్య త్రయ ఆవసథాస్త్ర స్వప్నాఅయమావసథోఽయమావసథ" ఇత్యనేన పరమాత్మని జగదధ్యారోపప్ర మభిధాయ "స జాతో భూతాన్యభివ్యైక్షత్కిమిహాన్యం వా వదిష"దితి తస్యారో స్యాపవాదమభిధాయ స్వయమేవ పురుషం బ్రహ్మ తత మపశ్యదితీదమదర్శమితీతి గాత్మనో బ్రహ్మస్వరూపత్వ మభిహితం. "పునశ్చ పురుషేఽహ వేత్యాదినా" సాధనవైరాగ్యజననాయ గర్భవాసాదిదుఃఖం ప్రదర్శ్య "కోఽయమాత్మేతి వయవ స్మహే" ఇత్యాదినా విచారేణ తత్త్వంపదార్థపరిశోధనపురస్సరం ప్రజ్ఞానం బ్ర ప్రజ్ఞానరూపస్యాత్మనో బ్రహ్మత్వం దర్శితమిత్యర్థః.

టీ. ఇదం = ఈజగత్తంతయు, ఆత్మా వా = సృష్టికిఁ బూర్వము బ్ర యుండెననెడి, ఇత్యాదౌ=ఈమొదలగు వాక్యసందర్భమునందు, బ్రహ్మ=పరబ్ర పరోక్షం = పరోక్షముగా, లక్షితం = తెలుపఁబడెను. అధ్యారోపాపవాదాభ్యా

అధ్యారోపముచేతను అపవాదముచేతను, ప్రజ్ఞానం=ప్రత్యగాత్మస్వరూపము, బ్రహ్మేతి= బ్రహ్మ మని, దర్శితం = తెల్పఁబడినది.

తా. ఐతరేయశ్రుతియందు శ్రు. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన మిషత్" ఈజగత్తంతయు సృష్టికి పూర్వము బ్రహ్మమైయున్నది బ్రహ్మేతర మించుకంతయును లేదు. అని మొదట బ్రహ్మలక్షణంబును చెప్పి "స ఈక్షత, లోకాన్ను సృజై" ఆపరమాత్మ లోకము నంతయు సృజింతు నని సంకల్పించె నని చెప్పి, "తస్యత్రయ ఆవసథాస్త్రయ స్స్వప్నా అయ మావసథోఽ య మావసథః" = ఆపర మాత్మకు మూఁడుచోట్లు అనఁగా స్థూలసూక్ష్మకారణశరీరములు ఉనికి పట్లనియు, జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూఁడవస్థలు గల వనియు, ఈహృదయగుహ ముఖ్యనివాసస్థాన మనియు నిట్లు భూతభౌతిక ప్రపంచ మంతయు నాపరమాత్మయందే కల్పింపఁబడిన దని యాపర మాత్మయందు నిట్లు జగదారోపణముం దెలిపి "స జాతో భూతాన్యభి వ్యైక్షత కిమిహాన్యం వావదిషత్" అని ఆరోపితమైన యాజగత్తును ఆత్మగా దని యపవాదమును జెప్పి "స్వయమేవ పురుషం బ్రహ్మతత్త్వ మపశ్యత్" అని ప్రత్యగాత్మబ్రహ్మస్వరూపముఁ దెలిపి "పురుషేఽహా మేవ" అని మొదలగు వాక్యసందర్భముచేత జ్ఞానసాధనమైన వైరా గ్యోత్పత్తికొఱకు గర్భవాసాదిదుఃఖమును తెలిపి "కోఽయ మాత్మేతి వయ ముపాస్మహే" ఈ మొదలైనగ్రంథములచేత తత్పదార్థము యొక్కయు త్వంపదార్థముయొక్కయు పరిశోధనప్రకారముం దెలిపి "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యముచేత ప్రత్యగాత్మకు బ్రహ్మ త్వము నిశ్చయింపఁబడినది. అనఁగా కొన్ని వాక్యములచేత పరోక్షత్వ మును మహావాక్యవిచారణముచేత నపరోక్షత్వమును ఐతరేయశ్రుతి యందు కూడ తెల్పఁబడియుండె నని భావము.

అవ. ఇట్లే యితర శ్రుతులయందును దెల్పఁబడిన దని గ్రహింపవలయు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవాంతరేణ వాక్యేన పరోక్షా బ్రహ్మధీ ర్భవేత్,
సర్వత్రైవ మహావాక్యవిచారా దపరోక్షధీః. 69

వ్యా. ఉక్తన్యాయమితరాసు శ్రుతిష్వప్యతిదిశతి—అవాంతరేణేతి. సర్వత్ర సర్వాసు శ్రుతిష్విత్యర్థః.

ముగ, విబుధ్య=బ్రహ్మతత్త్వమును దెలిసికొని, అపరోక్షీకర్తుం = అట్టిబ్రహ్మముయొక్క యపరోక్షసాక్షాత్కారముకొఱకు, ఇచ్ఛన్ = కుతూహలము గలవాఁడగుచు, చతుర్వారం=నాల్గు పర్యాయములు, గురుం=బ్రహ్మస్వరూపమును నుపదేశించెడి బ్రహ్మదేవుని గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. "శ్రు. య ఆత్మాఽపహతపాప్మా విరజో విమృత్యుర్విశోకో విజిఘత్సః" ఏయాత్మ పాపము లేనివాఁడో విరజస్కుఁడో మృత్యువు లేనివాఁడో శోకము లేనివాఁడో క్షుత్పిపాసలు లేనివాఁడో యని యర్థము గలిగిన యీ మొదలైనవాక్యమున చెప్పఁబడిన స్వరూపముచేత నింద్రుఁడు ఆత్మను పరోక్షముగా తెలిసికొని విచారణచేసి స్థూల సూక్ష్మకారణము లనియెడి శరీరత్రయమును నిరాకరించి ఆబ్రహ్మము యొక్క యపరోక్షసాక్షాత్కారముకొఱకు తన గురు వగు చతుర్ముఖ బ్రహ్మయొద్దకు నాలుగు తడవలు వెళ్లయున్నాఁడని ఛాందోగ్యశ్రుతియం దెనిమిదవ యధ్యాయమునందుఁ దెల్పఁబడినది.

అవ. ఇప్పుడు పరోక్షజ్ఞానము గలిగినతర్వాత నపరోక్షజ్ఞానము కలుగుటను నైతరేయశ్రుతియందును గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా వా ఇద మిత్యాదౌ పరోక్షం బ్రహ్మ లక్షితమ్,
అధ్యారోపాపవాదాభ్యాం ప్రజ్ఞానం బ్రహ్మ దర్శితమ్. 68

వ్యా. ఇదానీమైతరేయశ్రుతావపి తద్దర్శయతి—ఆత్మా వా ఇతి. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిష"దిత్యనేన వాక్యేన బ్రహ్మణో లక్షణమభిధాయ, "స ఈక్షత లోకాన్ను సృజా" ఇత్యుపక్రమ్య, "తస్య త్రయ ఆవసథాస్త్రయ స్స్వప్నాఅయమావసథోఽయమావసథ" ఇత్యనేన పరమాత్మని జగదధ్యారోపప్రకారమభిధాయ "స జాతో భూతాన్యభివ్యైక్షత్కిమిహాన్యం వా వదిష"దితి తస్యారోపితస్యాపవాదమభిధాయ స్వయమేవ పురుషం బ్రహ్మ తత మపశ్యదితీదమదర్శమితీతి ప్రత్యగాత్మనో బ్రహ్మస్వరూపత్వ మభిహితం. "పునశ్చ పురుషేఽహ మేవేత్యాదినా" జ్ఞానసాధనవైరాగ్యజననాయ గర్భవాసాదిదుఃఖం ప్రదర్శ్య "కోఽయమాత్మేతి వయముపాస్మహ" ఇత్యాదినా విచారేణ తత్త్వంపదార్థపరిశోధనపురస్సరం ప్రజ్ఞానం బ్రహ్మేతి ప్రజ్ఞానరూపస్యాత్మనో బ్రహ్మత్వం దర్శితమిత్యర్థః.

టీ. ఇదం = ఈజగత్తంతయు, ఆత్మా వా = సృష్టికిఁ బూర్వము బ్రహ్మమై యుండెననెడి, ఇత్యాదౌ=ఈమొదలగు వాక్యసందర్భమునందు, బ్రహ్మ=పరబ్రహ్మము, పరోక్షం = పరోక్షముగా, లక్షితం = తెలుపఁబడెను. అధ్యారోపాపవాదాభ్యాం =

అధ్యారోపముచేతను అపవాదముచేతను, ప్రజ్ఞానం=ప్రత్యగాత్మస్వరూపము, బ్రహ్మేతి= బ్రహ్మ మని, దర్శితం = తెల్పఁబడినది.

తా. ఐతరేయశ్రుతియందు శ్రు. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన మిషత్" ఈజగత్తంతయు సృష్టికి పూర్వము బ్రహ్మమైయున్నది బ్రహ్మేతర మించుకంతయును లేదు. అని మొదట బ్రహ్మలక్షణంబును చెప్పి "స ఈక్షత, లోకాన్ను సృజై" ఆపరమాత్మ లోకము నంతయు సృజింతు నని సంకల్పించె నని చెప్పి, "తస్యత్రయ ఆవసథాస్త్రయ స్స్వప్నా అయ మావసథో౽ య మావసథః" = ఆపరమాత్మకు మూఁడుచోట్లు అనఁగా స్థూలసూక్ష్మకారణశరీరములు ఉనికిపట్లనియు, జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూఁడవస్థలు గల వనియు, ఈహృదయగుహా ముఖ్యనివాసస్థాన మనియు నిట్లు భూతభౌతిక ప్రపంచ మంతయు నాపరమాత్మయందే కల్పింపఁబడిన దని యాపరమాత్మయందు నిట్లు జగదారోపణముం దెలిపి "స జాతో భూతాన్యభివైక్షత కిమిహాన్యం వావదిషత్" అని ఆరోపితమైన యాజగత్తును ఆత్మగా దని యపవాదమును జెప్పి "స్వయమేవ పురుషం బ్రహ్మతత్వమపశ్యత్" అని ప్రత్యగాత్మబ్రహ్మస్వరూపముఁ దెలిపి "పురుషో౽హమేవ" అని మొదలగు వాక్యసందర్భముచేత జ్ఞానసాధనమైన వైరాగ్యోత్పత్తికొఱకు గర్భవాసాదిదుఃఖమును తెలిపి "కో౽య మాత్మేతి వయ ముపాస్మహే" ఈ మొదలైనగ్రంథములచేత తత్పదార్థముయొక్కయు త్వంపదార్థముయొక్కయు పరిశోధనప్రకారముం దెలిపి "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యముచేత ప్రత్యగాత్మకు బ్రహ్మత్వము నిశ్చయింపఁబడినది. అనఁగా కొన్ని వాక్యములచేత పరోక్షత్వమును మహావాక్యవిచారణముచేత నపరోక్షత్వమును ఐతరేయశ్రుతియందు కూడ తెల్పఁబడియుండె నని భావము.

అవ. ఇట్లే యితర శ్రుతులయందును దెల్పఁబడిన దని గ్రహింపవలయు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవాంతరేణ వాక్యేన పరోక్షా బ్రహ్మధీ ర్భవేత్,
సర్వత్రైవ మహావాక్యవిచారా దపరోక్షధీః. 69

వ్యా. ఉక్తన్యాయమితరాసు శ్రుతిష్వప్యతిదిశతి—అవాంతరేణేతి. సర్వత్ర సర్వాసు శ్రుతిష్విత్యర్థః.

టీ. అవాంతరేణ = అయామధ్యనుండెడు, వాక్యేన=వాక్యముచేత, పరోక్షా=పరోక్షమైన, బ్రహ్మధీః=బ్రహ్మజ్ఞానము, భవేత్ =కలుగును. సర్వత్ర=అన్నిశ్రుతులందును, మహావాక్యవిచారాత్ =తత్త్వమస్యాదిమహావాక్యములయొక్క యర్థవిచారముచేయుట వలన, అపరోక్షధీః=అపరోక్షబ్రహ్మసాక్షాత్కారము (భవేత్ = కలుగును).

తా. కొన్ని కొన్ని యవాంతరవాక్యములచేత పరోక్షజ్ఞానము కలుగును. సకల శ్రుతులయందును తత్త్వమస్యాదిమహావాక్యార్థవిచారణవలన నపరోక్షబ్రహ్మజ్ఞానము కలుగు నని తెలుపఁబడెను.

అవ. మహావాక్యార్థవిచారమువలన నపరోక్షజ్ఞానము కలుగు నని స్వకపోలకల్పితముగా మీరు కల్పించిన ట్లున్నదే యని శంకించి వాక్యవృత్తి యను గ్రంథమున నాచార్యులవా రిట్లు వక్కాణించినా రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మాపరోక్ష్యసిద్ధ్యర్థం మహావాక్య మితీరితమ్,
వాక్యవృత్తా వతో బ్రహ్మాపరోక్ష్యే విమతి ర్న హి. 70

వ్యా. నను మహావాక్యవిచారస్యాపరోక్షజ్ఞానజనకత్వం స్వకపోలకల్పితమిత్యాశంక్య వాక్యవృత్తావాచార్యైస్తథా ప్రతిపాదితత్వాన్నైవ మిత్యాహ—బ్రహ్మాపరోక్ష్యేతి. అతో వాక్యాద్బ్రహ్మాపరోక్ష్యజ్ఞానే విప్రతిపత్తిర్నాస్తీత్యర్థః.

టీ. బ్రహ్మాపరోక్ష్యసిద్ధ్యర్థం=బ్రహ్మముయొక్క యపరోక్షసాక్షాత్కారము గలిగెడుకొఱకు, మహావాక్యం = తత్త్వమస్యాదిమహావాక్యములు, ఇతి=ఇట్లు ప్రవర్తించుచున్న వని, వాక్యవృత్తౌ = వాక్యవృత్తి యనెడు గ్రంథమున, ఈరితం = శ్రీశంకరభగవత్పాదులవారిచేఁ జెప్పఁబడినది. అతః = ఇట్టి మహావాక్యార్థవిచారణవలన, బ్రహ్మాపరోక్ష్యే=బ్రహ్మముయొక్క యపరోక్షజ్ఞానవిషయమున, విమతిః=వివాదము, న హి = లేదుగదా.

తా. తత్త్వమస్యాదిమహావాక్యములు అపరోక్షబ్రహ్మసాక్షాత్కారము గలిగించుటకుఁ బ్రవర్తించుచున్న వని శ్రీశంకరభగవత్పాదులవారు వాక్యవృత్తి యను గ్రంథమునందు స్పష్టముగాఁ దెల్పినారు గనుక అపరోక్షబ్రహ్మజ్ఞానము మహావాక్యార్థవిచారము వలనఁ గలుగు ననెడి యంశమునందు వివాద మేమాత్రము లే దని తెలియవలెను.

అవ. ఆచార్యులవారు ఆవాక్యవృత్తియందే మని చెప్పినదియుం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆలంబనతయా భాతి యోఽస్మత్ ప్రత్యయశబ్దయోః,
అంతఃకరణసంభిన్న బోధస్స త్వంపదాభిధః. 71

వ్యా. వాక్యవృత్త్యుపపాదన ప్రకారం దర్శయతి—ఆలంబనయేతి. యోఽంతః కరణసంభిన్నబోధః అంతఃకరణోపాధిక శ్చిదాత్మా అస్మత్ప్రత్యయశబ్దయోరహమితి జ్ఞానస్యాహమితిశబ్దస్య చావలంబనతయా విషయత్వేన భాతి. సః తథావిధోబోధః. త్వంపదాభిదః త్వమితి పదమభిధా అభిధాయకం యస్య సః త్వంపదాభిధః. త్వంపద వాచ్య ఇత్యర్థః.

టీ. అంతఃకరణ సంభిన్నబోధః - అంతఃకరణ=అంతఃకరణముతోడ, సంభిన్న= కూడుకొనిన, బోధః = చిదాత్మస్వరూపుఁడు, యః = ఎవఁడు, (అస్తి = కలఁడో), సః= ఆ బోధస్వరూపుఁడైన చిదాభాసుఁడు, అస్మత్ ప్రత్యయశబ్దయోః - అస్మత్ప్రత్యయ=నే ననెడి జ్ఞానమునకును, శబ్దయోః = నే ననెడి శబ్దమునకును, ఆలంబన తయా = విషయముగా, భాతి = ప్రకాశించుచున్నాఁడో, సః = అట్టి చిదాభాసుఁడు, త్వంపదాభిధః = త్వం అనెడి పదముచేతఁ జెప్పఁబడుచున్నవాఁడు, "తత్త్వమసి" అనెడి వాక్యమునందలి త్వంపదవాచ్యుఁ డనుట.

తా. అంతఃకరణోపాధికుఁ డగు చిదాభాసుఁడు నే ననెడి జ్ఞానమునకు నే ననెడి శబ్దమునకును విషయ మగుచు, తత్త్వమసి యనెడి మహావాక్యమునందలి త్వంపదమునకు వాచ్యార్థ మగుచున్నాఁడు.

అవ. ఇప్పుడు తత్పదవాచ్యార్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాయోపాధి ర్జగద్యోని స్సర్వజ్ఞత్వాదిలక్షణః,
పారోక్ష్యశబల స్సత్యాద్యాత్మక స్తత్పదాభిధః. 72

వ్యా. ఏవం త్వంపదవాచ్యార్థమభిధాయ తత్పదవాచ్యార్థ మాహ—మాయోపాధిరితి. పారోక్ష్యశబలః పరోక్షత్వధర్మవిశిష్ట ఇత్యర్థః. ఏవం తటస్థలక్షణమభిధాయ స్వరూపలక్షణమాహ—సత్యాద్యాత్మకఇతి. సత్యమాదిర్యేషాం జ్ఞానాదీనాం తే సత్యాదయః. ఆత్మా స్వరూపం యస్య స తథావిధస్తత్పదాభిధః తత్పదమభిధా వాచకం యస్య సః తత్పదాభిధః. తత్పదవాచ్య ఇత్యర్థః.

టీ. మాయోపాధిః = మాయయే యుపాధిగాఁ గలిగినట్టియు, జగద్యోనిః=జగత్కారణమైనట్టియు, సర్వజ్ఞత్వాదిలక్షణః = సర్వజ్ఞత్వము మొదలగు ధర్మములు స్వరూపముగాఁ గలిగినట్టియు, పారోక్ష్యశబలః = పరోక్షత్వధర్మవిశిష్టుఁడైనట్టియు, సత్యాద్యాత్మకః = సత్యజ్ఞానానంతత్వములు స్వరూపలక్షణముగాఁ గల పరమాత్మ,

తత్పదాభిధః = తత్త్వమసి యను మహావాక్యములోని మొదటి తత్ అను పదమునకు వాచ్యార్థము (స్యాత్ = అగుచున్నాఁడు.)

తా. మాయోపాధికత్వంబును జగత్కారణత్వంబును సర్వజ్ఞత్వాదిపరోక్షధర్మవిశిష్టత్వంబును నాపరమాత్మకు తటస్థలక్షణం బగును. సత్యజ్ఞానానంతత్వాదిలక్షణములు బ్రహ్మమునకు స్వరూపలక్షణంబులగును. ఇట్లు స్వరూపలక్షణంబును తటస్థలక్షణంబును గల పరమాత్మ మహావాక్యమునందలి తత్పదముచేఁ జెప్పఁబడుచున్నాఁడు. తత్పదవాచ్యార్థ మనుట.

అవ. ఇట్లు త్వంపదతత్పదములకు వాచ్యార్థముం దెలిపి వాక్యార్థజ్ఞానమునకై లక్షణావృత్తి నాశ్రయింప వలయు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యక్పరోక్షతైకస్య సద్వితీయత్వపూర్ణతా,
విరుధ్యేతే యతస్తస్మా ల్లక్షణా సంప్రవర్తతే. 73

వ్యా. ఏవం పదార్థమభిధాయ వాక్యార్థబోధనాయ లక్షణావృత్తిరాశ్రయణీయేత్యాహ—ప్రత్యక్పరోక్షతేతి. ప్రత్యక్పరోక్షత్వే సద్వితీయత్వేన సహితా పూర్ణతేతి మధ్యమపదలోపిసమాసః. సద్వితీయత్వపూర్ణత్వే చైకస్య వస్తునో యతో విరుధ్యేతే అతో లక్షణావృత్తిరాశ్రయణీయేత్యర్థః.

టీ. ఏకస్య = ఒక్కవస్తువునకు, ప్రత్యక్పరోక్షతా - ప్రత్యక్ = ప్రత్యగ్భావము (దేహేంద్రియాదుల కన్నింటికిని లోపలిదై యుండి సర్వసాక్షిగా స్ఫురించుచుండు ననుట), పరోక్షతా=పరోక్షత్వమును, సద్వితీయత్వపూర్ణతా - సద్వితీయత్వ=రెండవదానితోఁ గూడియున్నటువంటి, పూర్ణతా = పరిపూర్ణత్వంబును, యతః = ఏ హేతువువలన, విరుధ్యేతే = విరుద్ధములై యున్నవో, తస్మాత్ = ఆహేతువువలన, లక్షణా = లక్షణావృత్తి, సంప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

తా. ఒక్క బ్రహ్మవస్తువు దేహేంద్రియాదుల కన్నింటికి సర్వాంతరముగా నుండి సర్వసాక్షిగాఁ బ్రకాశించుచున్నది. ఆబ్రహ్మమే ఆకాశము మొదలగు సకలభూతభౌతికాత్మక మగు జగత్తునకు ఆధారముగా నుండియు ప్రత్యగాత్మవలె స్ఫురింపక పరోక్షముగా నున్నది. మఱియు దేహేంద్రియాదిద్వైతముతోఁ గూడుకొనిన ప్రత్యగాత్మ పరిచ్ఛిన్నుఁడై యున్నాఁడు. నిఖిలజగదాధార మగు పరమాత్మ పరిపూర్ణుఁడై యున్నాఁడు. ప్రత్యక్త్వమును పరోక్షత్వమును, అద్వితీ

యత్వమును సద్వితీయత్వమును, పరిచ్ఛిన్నత్వమును బరిపూర్ణత్వమును ననునవి యొకదాని కొకటి విరోధించుటనుబట్టి వీని కైక్యము పొసఁగ నందున లక్షణావృత్తి నాశ్రయించుట యవసర మగును.

అవ. లక్షణావృత్తిస్వరూప మెట్టి దనఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వమస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా,
సోఽయమిత్యాదివాక్యస్థపదయోరివ నాపరా. 74

వ్యా. సా చ కీదృశీత్యత ఆహ—తత్త్వమసీతి. భాగలక్షణా భాగత్యాగలక్షణేత్యర్థః. తత్ర దృష్టాంతః. సోఽయమితి. సోఽయం దేవదత్త ఇతి వాక్యస్థయోః సోఽయమితి పదయోర్యథా జహదజహల్లక్షణావృత్తిరాశ్రితా నాపరా న జహల్లక్షణా. నాప్యజహల్లక్షణా. తద్వదత్రాపీత్యర్థః.

టీ. సోఽయం=అతఁడే యితఁడు, ఇత్యాదివాక్యస్థపదయోరివ = ఈమొదలగు వాక్యములందలి పదముల రెంటియందువలె, తత్త్వమస్యాదివాక్యేషు = అపరబ్రహ్మము నీవై తివి అను మహావాక్యములయందు, భాగలక్షణా = భాగత్యాగ మనెడు పేరుగల (జహదజహల్లక్షణ యనుట). లక్షణా=లక్షణ (అగుచున్నది). అపరా = ఇతరలక్షణ, కేవల జహల్లక్షణగాని కేవలాజహల్లక్షణగాని, (అంతయు విడిచినది ఏమియు విడువనిది) అనుట. న = లేదు.

తా. అతఁడే యీదేవదత్తుఁడు అని ప్రయోగించినపుడు ఆ ప్రదేశమును ఆకాలమును ఈప్రదేశమును ఈకాలమును విడిచిపెట్టి దేవదత్తులకు మాత్రమును ఐక్యము స్వీకరించునట్లు నీవు బ్రహ్మమవైతివి అను వాక్యమునందును నట్లే కొంత యంశమును తత్పదమునందును కొంత యంశమును త్వంపదమందును వదలిపెట్టుచున్నాము. కనుక దీనిని (ఈలక్షణను) భాగత్యాగలక్షణ యని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. మహావాక్యములయందు నీ లక్షణమే స్వీకరింపనగును. కేవలజహల్లక్షణను (అంతయు విడిచిన దానిని) కేవలాజహల్లక్షణను (ఏమాత్రమును విడువనిది) స్వీకరింపరా దని భావము.

వి. లక్షణావృత్తి త్రివిధము.—1. జహల్లక్షణ, 2. అజహల్లక్షణ, 3. జహదజహల్లక్షణ యని.

1. జహల్లక్షణ (విడిచినది).—"గంగాయాం ఘోషః," (గంగయందు గొల్లపల్లె) యను చోట గంగలో గొల్లపల్లె యుండదు గనుక గంగను విడచి గంగయొద్దున గొల్లపల్లె యున్న దని గ్రహించుట.

2. అజహల్లక్షణ (విడువనిది).—"మంచాః క్రోశంతి," (మంచములు అఱచుచున్నవి యను నపుడు మంచములు కూయవు గనుక మంచములమీఁదనున్న పురుషులఱచుచున్నా రని మంచములు సహితముగ పురుషుల ఆక్రోశమును గ్రహించుట.

3. జహదజహల్లక్షణ (విడిచి విడువనిది).—"సోఽయం దేవదత్తః" (ఆదేవదత్తుఁడే యితఁడు) అనునపుడు విరుద్ధధర్మములు గల ఆకాలము యీకాలము, ఆదేశము, యీదేశము, ఆవయస్సు యీవయస్సు మొదలగు విరుద్ధాంశములను విడిచి కేవల లక్ష్యార్థభూతుఁ డగు దేవదత్తునే వాక్యార్థముగ గ్రహించుట.

ఇటులనే 'తత్త్వమసీ'త్యాది మహావాక్యములయొక్క లక్ష్యార్థమును లక్షణావృత్తిచే గ్రహింపవలె నని యభిప్రాయము.

అవ. గోవును తీసికొని రమ్ము అనెడి వాక్యము మొదలగు వాక్యములయందు లక్షణావృత్తి లేకయే వాక్యార్థబోధ గలిగినట్లు యిక్కడ మాత్ర మేల గలుగ దని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః,
అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః. 75

వ్యా. నను గామానయేత్యాదివాక్యేషు లక్షణావృత్త్యా వినాపి వాక్యార్థబోధో దృశ్యతే. తద్వదత్రాపి కిం న స్యాదిత్యాశంక్యాహ—సంసర్గ ఇతి. యథా లోకే గామానయేత్యాదౌ పదైస్స్మారితానాం ఆకాంక్షాదిమతాం గవాదిపదార్థానామన్వయో వాక్యార్థత్వేనాంగీకృతః. యథా నీలం మహత్సుగంధ్యుత్పల మిత్యాదౌ నీలత్వాది విశిష్టస్యోత్పలస్య వాక్యార్థత్వం స్వీకృతం, నైవ మత్రమహావాక్యేషు సంసర్గ విశిష్టయోరన్యతరస్య వాక్యార్థత్వమభ్యుపగమ్యతే. కిం త్వఖండైకరసత్వేన స్వగతాదిభేదశూన్యవస్తుమాత్రరూపేణ వాక్యార్థో విద్వద్భిరభ్యుపేతః. అతో లక్షణాఽఽశ్రయణీయేత్యర్థః.

టీ. అత్ర = ఈమహావాక్యములయందు, సంసర్గో వా = సంసర్గరూపము గాని, విశిష్టో వా = విశిష్టరూపమైనఁగాని, వాక్యార్థః = వాక్యాన్వయము, న సమ్మతః = ఇష్టము కాదు. విదుషాం = విద్వాంసులకు, అఖండైకరసత్వేన = అఖండైకరసస్వరూపముగా, వాక్యార్థః = వాక్యసమన్వయము, సమ్మతః = అంగీకృత మగుచున్నది.

తా. గోవును తీసికొనిరమ్ము అనెడి వాక్యమునందు ఆకాంక్షాదులు గలిగిన గోవు మొదలైన పదార్థములకు అన్వయము వాక్యార్థమని యంగీకరింపఁబడినది. ఇదియే సంసృష్టవాక్యార్థమునకు దృష్టాంతమగును. నీలం మహత్సుగంధ్యుత్పలం = నల్లని గొప్ప వాసన గల కలువ

అన్నచోట నీలత్వాదిధర్మములతోఁ గూడిన కలువకు వాక్యార్థము స్వీకరింపఁబడినది. ఇది విశిష్టవాక్యార్థమునకు దృష్టాంత మగును. ఇట్లు సంసర్గరూప మగు వాక్యార్థము గాని విశిష్టరూప మగు వాక్యార్థము గాని మహావాక్యములయం దంగీకరింపఁబడదు. మఱియేమి యంగీకరింపఁబడు ననఁగా అఖండైకరసరూపమైన సజాతీయవిజాతీయస్వగత భేదములు లేని వస్తుమాత్రరూపముగా వాక్యార్థము (సమన్వయము) పండితు లంగీకరించుచున్నారు. కావున నానశ్లోకముగ లక్షణావృత్తిని స్వీకరింపవలయును.

అవ. అఖండైకరసరూప మగు వాక్యార్థమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యగ్బోధో య ఆభాతి సోఽద్వయానందలక్షణః,
అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణా. 76

వ్యా. అఖండైకరసం వాక్యార్థం దర్శయతి—ప్రత్యగ్బోధ ఇతి. యః ప్రత్యగ్బోధస్సర్వాంతరశ్చిదాత్మా ఆభాతి బుద్ధ్యాదిసాక్షిత్వేన స్ఫురతి సోఽద్వయానందలక్షణః అద్వితీయానందరూపః పరమాత్మేత్యర్థః. అద్వయానందరూపశ్చ తథావిధః పరమాత్మా ప్రత్యగాత్మైవేత్యర్థః.

టీ. ప్రత్యగ్బోధః = సర్వాంతరుఁ డయిన, (దేహేంద్రియాదుల కన్నింటికిని లోపలివాఁ డైన), యః = ఏప్రత్యగాత్మ, ఆభాతి = అన్నింటిని దెలిసికొనెడి వాఁడుగా స్ఫురించుచుండెనో, సః = ఆప్రత్యగాత్మ, అద్వయానందలక్షణః = అద్వితీయమైన యానందస్వరూప మగు పరమాత్మ యగుచున్నాఁడు. అద్వయానందరూపశ్చ = అద్వితీయమైన యానందస్వరూపముగల పరమాత్మయు, ప్రత్యగ్బోధైకలక్షణః=దేహేంద్రియాదుల కాంతరుఁడగు ప్రత్యగాత్మస్వరూపము గలవాఁడు.

తా. ఇక్కడ దేహేంద్రియాదుల కన్నింటికిని లోపలివాఁడై చిద్రూపుఁడైన ప్రత్యగాత్మ అద్వితీయమై (తనకంటె వేఱువస్తువు లేనిదై) ఆనందస్వరూప మైన పరమాత్మయే యగును. అటులనే అద్వితీయానందస్వరూపుఁ డగు పరమాత్మయు ప్రత్యగాత్మస్వరూపుఁ డగును.

అవ. ఇట్టి యఖండార్థబోధవలన లాభ మేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇత్థమన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తి ర్యదా భవేత్,
అబ్రహ్మత్వం త్వమర్థస్య వ్యావర్తేత తదైవ హి. 77

వ్యా. ఏవమఖండార్థబోధేన కిం స్యాదిత్యత ఆహ—ఇత్థమితి.

టీ. ఇత్థం = ఈలాగున, అన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తిః - అన్యోన్య = ప్రత్యగాత్మ పరమాత్మల యొండొరులయొక్క, తాదాత్మ్య=స్వరూపైక్యముయొక్క, ప్రతిపత్తిః=జ్ఞానము, యదా=ఎప్పుడు, భవేత్ = కలుగునో, తదైవ=అప్పుడే, త్వమర్థస్య=త్వంపదమున కర్థ మగు ప్రత్యగాత్మకు, అబ్రహ్మత్వం = భ్రాంతిసిద్ధ మగు జీవభావము, వ్యావర్తేత హి = నివర్తించును గదా.

తా. ఇట్లు ప్రత్యగాత్మపరమాత్మ లొక్కటియే యని యైక్యజ్ఞాన మెప్పుడు గలుగునో యప్పుడే త్వంపదార్థ మగు ప్రత్యగాత్మకు నజ్ఞానము వలనఁ గలిగిన జీవభావము నివర్తించును.

అవ. మఱియు తత్పదార్థముయొక్క పరోక్షజ్ఞానంబు నట్లే నివర్తించు ననియు దానివలని లాభమునుం జెప్పుచున్నాఁడు:—

శ్లో. తదర్థస్య చ పారోక్ష్యం యద్యేవం కిం తతశ్శృణు,
పూర్ణానందైకరూపేణ ప్రత్యగ్బోధోఽవతిష్ఠతే. 78

వ్యా. తదర్థస్యేతి. త్వమర్థస్య ప్రత్యగాత్మనోఽబ్రహ్మత్వం భ్రాంతిసిద్ధాబ్రహ్మరూపతా. తదర్థస్య బ్రహ్మణశ్చ పారోక్ష్యం పరోక్షజ్ఞానైకవిషయత్వం చ నివర్తతే తతోఽపి కిమితి పృచ్ఛతి—యద్యేవమితి. ఉత్తరమాహ—శృణ్వితి.

టీ. తదర్థస్య = తత్పదార్థ మగు బ్రహ్మముయొక్క, పారోక్ష్యం చ = పరోక్షత్వంబును, (నివర్తేత = నివర్తించును). అని వెనుకటి శ్లోకమందలి క్రియాపదముతో నన్వయింపవలెను. ఏవం యది = ప్రత్యగాత్మకు జీవభావంబును, పరబ్రహ్మకు పరోక్షజ్ఞానవిషయత్వంబును నివర్తించె నేని, తతః = దానివలన, కిం = ప్రయోజన మేమంటివేని, శృణు=చెప్పెద వినుము. ప్రత్యక్ = దేహేంద్రియాదులకన్నింటికిని నాంతరుఁడగు, బోధః = ప్రత్యగాత్మ, పూర్ణానందైకరూపేణ = పరిపూర్ణమైన యానంద స్వరూపముతో, అవతిష్ఠతే = ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు.

తా. తత్పదార్థ మగు పరబ్రహ్మమునకు పరోక్షభావమును వెనుకటి శ్లోకమునందలిరీతిగా ప్రత్యగాత్మకు జీవభావంబును నివర్తించును. ఇట్లు నివర్తించిన నేమి ప్రయోజన మందువా? ప్రత్యగాత్మ యఖండానందస్వరూపుఁడై యుండుటే పరమలాభము.

అవ. మహావాక్యార్థవిచారము పరోక్షజ్ఞానసాధన మని వేదలక్షణము గనుపడుచుండఁగా నపరోక్షజ్ఞానము గలిగించు నని యెట్లు చెప్ప నగును అని యాశంకించి వాదిని ఎగతాళి చేయుచున్నాఁడు.—

శ్లో. ఏవం సతి మహావాక్యాత్పరోక్షజ్ఞాన మీర్యతే,
యైస్తేషాం శాస్త్రసిద్ధాంతవిజ్ఞానం శోభతే తరామ్. 79

వ్యా. నను సమయబలేన సమ్యక్పరోక్షానుభవసాధనమాగమ ఇత్యాగమలక్షణం. అతో వాక్యస్యాపరోక్షజ్ఞానకత్వం కథ ముచ్యత ఇత్యాశంక్య సిద్ధాంతపరిజ్ఞాన శూన్యోఽయమితి మనసి నిధాయోపహసతి—ఏవం సతీతి. ఏవం వదంతః సిద్ధాంత రహస్యం నైవ జానంతీత్యర్థః.

టీ. ఏవంసతి = ఈవిధముగా నఖండైక్యజ్ఞానము గలుగుచుండఁగా, యైః=ఎవరి చేత, మహావాక్యాత్ = మహావాక్యార్థమువలన, పరోక్షజ్ఞానం = పరమాత్మ యొక్క డనో యున్నాఁ డనుజ్ఞానము, ఈర్యతే = చెప్పఁబడునో, తేషాం = అట్టివారియొక్క, శాస్త్రసిద్ధాంతవిజ్ఞానం - శాస్త్ర = వేదాంతశాస్త్రముయొక్క, సిద్ధాంత = నిర్ణయము యొక్క, విజ్ఞానం = నిశ్చయజ్ఞానము, శోభతే తరాం = అత్యధికముగా వెలుంగును, (అట్టివారికి శాస్త్రసిద్ధాంతజ్ఞానము లేనే లే దనుట.)

తా. ప్రత్యగాత్మపరమాత్మలకు అఖండైక్యజ్ఞానము గలుగుచుం డఁగా మహావాక్యార్థవిచారమువలన పరోక్షజ్ఞానము గలుగు నని యెవరిచే వాదింపఁబడునో యట్టివారిజ్ఞానము మిక్కిలి వెలుఁగుచున్నది. అనఁగా నట్టివారు వేదాంతసిద్ధాంతము నెంతమాత్ర మెఱుంగ రని పరి హాసము చేయుచున్నా రని భావము.

అవ. సిద్ధాంత ముండిన నుండుఁగాక. వాక్యమునకు పరోక్షజ్ఞానమును గలిగించుట యుక్తికిని సరిపోవుచున్నదే అని శంకింపఁగా నీహేతువాదము బాగుగా లేదని ఖండించు చున్నాఁడు:—

శ్లో. ఆస్తాం శాస్త్రస్య సిద్ధాంతో యుక్త్యా వాక్యాత్పరోక్షధీః,
స్వర్గాదివాక్యవన్నైవం దశమే వ్యభిచారితః. 80

వ్యా. నను సిద్ధాంతస్తావ త్తిష్ఠతు. వాక్యస్య పరోక్షజ్ఞానజనకత్వం త్వనుమానసిద్ధ మితి శంకతే—ఆస్తామితి. వివుతం వాక్యం పరోక్షజ్ఞానజనకం భవితుమర్హతి. వాక్యత్వా త్స్వర్గాదిప్రతిపాదకవాక్యవదిత్యనుమానేన పరోక్షజ్ఞానజనకత్వం సిద్ధమిత్యర్థః. అనై కాంతికోఽయం హేతురితి పరిహరతి—నైవమితి. దశమస్త్వమసీతి వాక్యే వాక్యత్వే సత్యపరోక్షజ్ఞానజనకత్వస్యోపలంభాదితి భావః.

టీ. శాస్త్రస్య = వేదాంతశాస్త్రముయొక్క, సిద్ధాంతః = నిర్ణయము, ఆస్తాం= అటుండనిమ్ము. యుక్త్యా = అనుమానప్రమాణముచేత, వాక్యాత్ = వాక్యమువలన, స్వర్గాదివాక్యవత్ - స్వర్గాది = స్వర్గలోకము మొదలగువానిని ప్రతిపాదించెడి, వాక్య

వత్ = వాక్యమువలెనే, పరోక్షధీః = పరోక్షజ్ఞానము గలుగును. (ఇతి చేత్=ఇట్లంటి వేని), దశమే=పదియవవానియందు, వ్యభిచారతః = నిలువకపోవుటవలన, ఏవం=ఇట్లు పరోక్షజ్ఞానము గలుగు నని చెప్పుట, న=బాగుండలేదు.

తా. మీశాస్త్రసిద్ధాంతముతో మాకుఁ బనిలేదు. మాయుక్తిని బట్టి స్వర్గాదులును ప్రతిపాదించెడు వేదవాక్యమువలన పరోక్షజ్ఞాన ముద యించినట్లు మహావాక్యవిచారణవలనను పరోక్షజ్ఞానమే కల్గు నని మే మేల యనరా దనెదవేమో ? "నీవు పదియవవాఁడవు" అనెడు వాక్యమునం దపరోక్షజ్ఞానము గలుగుటచేత వాక్యమువలన పరోక్ష జ్ఞాన మను నీయుక్తి సరిపోలేదు గనుక ని ట్లనఁగూడదు.

అవ. మఱియు త్వంపదమున కర్థమైన జీవునకుఁ బరోక్షత్వము చెప్పుట బాగు లేదు గనుకను మహావాక్యవిచారము పరోక్షజ్ఞానము గలిగించు నని చెప్పుట యంగీక రింపఁబడ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వతోఽపరోక్షజీవస్య బ్రహ్మత్వమపి వాంఛతః,
నశ్యే త్సిద్ధాపరోక్షత్వ మితి యుక్తి ర్మహత్యహో. 81

వ్యా. కించ త్వంపదార్థస్య జీవస్య పరోక్షత్వాభావప్రసంగాదపి న మహావాక్యం పరోక్షజ్ఞానజనక మిత్యంగీకార్యమిత్యాహ—స్వత ఇతి.

టీ. స్వతః=స్వాభావికముగ, అపరోక్షజీవస్య=అపరోక్షస్వరూపుఁడైన జీవుఁడు, బ్రహ్మత్త్వ మపి=బ్రహ్మభావమును సయితము, వాంఛతస్సతః = అభిలషించుచుండఁగా, సిద్ధాపరోక్షత్వం=స్వతస్సిద్ధ మగు నపరోక్షత్వము, నశ్యేత్=పోవును, ఇతి యుక్తిః = ఇట్లనెడి యుక్తి, అహో = ఆహా! మహత్=ఎంత గొప్పది! (అహో యనునది పరి హాసమును బోధించును.)

తా. జీవుఁడు తనకు తాను సహజముగా నపరోక్షస్వరూపుఁడై బ్రహ్మభావమును గోరుచుండ నిదివఱకు తన కున్న యపరోక్షత్వము మహావాక్యార్థవిచారమువలనఁ బోవు నని యుక్తిచేత నూహించుట ఆహా! యెంత గొప్ప సంగతిగా నున్నది. అని దీనిని విన్నవారు పరి హాసింతు రనుట.

అవ. ఎవ రే మనిన నేమి? మా కిదియే సమ్మతమగును అందువేని, ఒక్కమాట చెప్పెద విను మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వృద్ధి మిష్టవతో మూలమపి నష్ట మితీదృశమ్,
లౌకికం వచనం సార్థం సంపన్నం త్వత్ప్రసాదతః. 82

వ్యా. ఇష్టాపత్తిరిత్యాశంక్యాహ—వృద్ధమితి.

టీ. వృద్ధిం=వడ్డిని, ఇష్టవతః=కోరుచుండెడువానియొక్క, మూల మపి = అసలు సొమ్ముకూడ, నష్టం = పోయినది, ఇతి = అనెడి, ఈదృశం = ఇటువంటి, లౌకికం = లోకసంబంధ మైన, (లోకమున వాడునట్టి), వచనం = సామెత, సార్థం=సార్థక మైనది (అర్థముతోఁ గూడినది) త్వత్ప్రసాదతః = నీదయవలన, సంపన్నం=అయినది. (సార్థక మైన దనుట.)

తా. 'వడ్డియాశ మొదలు చెఱిచె' నను సామెత నీదయవలన యథార్థమగుచున్నది. అనఁగా నపరోక్షత్వము స్వతస్సిద్ధ మగుచు, బ్రహ్మభావమును గోరెడు జీవుని యపరోక్షత్వము పోవు ననుట వడ్డి యాశ మొదలు చెఱిచె నన్న ట్లున్న దని తెలియవలెను.

అవ. జీవుఁ డంతఃకరణ ముపాధిగాఁ గలవాఁడు (సోపాధికుఁడు) గనుక నప రోక్షత్వము తగియుండును. నిరుపాధికమైన బ్రహ్మవస్తువున కట్టియపరోక్షత్వము చెప్పఁ దగ దని పూర్వపక్షి యాక్షేపించుచున్నాఁడు:—

శ్లో. అంతఃకరణ సంభిన్నబోధో జీవోఽపరోక్షతామ్,
అర్హ త్యుపాధిసద్భావా న్నతు బ్రహ్మానుపాధితః. 83

వ్యా. నను సోపాధికత్వాజ్జీవస్యాపరోక్షత్వం యుక్తం. బ్రహ్మణస్తు నిరుపాధి కస్య తన్న యుజ్యత ఇతి శంకతే—అంతఃకరణేతి.

టీ. ఉపాధిసద్భావాత్ = ఉపాధి (శరీరము) గలవాఁ డగుటవలన, అంతః కరణ సంభిన్నబోధః - అంతఃకరణ = అంతరింద్రియముతోడ, సంభిన్న = కూడుకొనిన, బోధః=చైతన్యస్వరూపుఁడైన (చిదాభాసుఁ డనుట), జీవః=జీవుఁడు, అపరోక్షతాం= అపరోక్షత్వమునుగూర్చి, అర్హతి = తగుచున్నాఁడు, అనుపాధితః=ఉపాధిలేని దనుట వలన, బ్రహ్మ తు = బ్రహ్మమన్ననో, న = అపరోక్షత్వమునకుఁ దగదు.

తా. జీవుఁడు సోపాధికుఁ డగుటచేత నతని కపరోక్షత్వ ముండుఁ గాక. నిరుపాధికుం డైన పరమాత్మ కట్టి యపరోక్షత్వము చెప్పఁగూడ దని వాది యాక్షేపించెను.

అవ. బ్రహ్మమునకు నిరుపాధికత్వము సిద్ధింప దని సిద్ధాంతి చెప్పుచున్నాఁడు:—

శ్లో. నైవం బ్రహ్మత్వబోధస్య సోపాధివిషయత్వతః,
యావద్విదేహకైవల్య ముపాధే రనివారణాత్. 84

వ్యా. బ్రహ్మణో నిరుపాధికత్వమసిద్ధమితి పరిహరతి—నైవం బ్రహ్మేతి. జీవస్య బ్రహ్మరూపతాజ్ఞానం యదస్తి తస్య సోపాధికజ్ఞానవిషయత్వాత్తద్విషయస్య బ్రహ్మ

బోఽపి సోపాధికత్వం జ్ఞానస్య సోపాధికవిషయత్వం చ జ్ఞేయస్య సోపాధికత్వమంత రేణ న ఘటత ఇతి భావః. తదేవ కుత ఇత్యత ఆహ—యావదితి.

టీ. బ్రహ్మత్వబోధస్య = బ్రహ్మమనైతి ననెడి జ్ఞానము, సోపాధివిషయత్వతః- సోపాధి=ఉపాధితోఁగూడిన, విషయత్వతః = విషయము గల దగుటవలన, ఏవం = ఈ ద్వైవిధముగా నీ వనుట, న=బాగులేదు. (బ్రహ్మము నిరుపాధిక మని యనఁగూడ దనుట). యావద్విదేహకైవల్యం = విదేహముక్తిపర్యంతము, ఉపాధేః = ఉపాధియొక్క, అని వారణాత్=జీవునకు నివర్తింపక పోవుటవలన (జ్ఞానస్య సోపాధికవిషయత్వం = జ్ఞాన మునకు సోపాధికవిషయత్వము గలిగియున్నది.)

తా. విదేహముక్తిపర్యంతము జీవున కుపాధి (శరీరము) నివర్తిం పదు గనుక జీవునిచేఁ దెలియఁబడెడి బ్రహ్మము సోపాధికుఁడు గానిచో నాబ్రహ్మజ్ఞానమునకు సోపాధికవిషయత్వము ఘటింప దని భావము.

అవ. జీవబ్రహ్మములయొక్క యుపాధులకుఁ గల తారతమ్యముం దెలుపు మని యాశంకించి యుత్తరముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అంతఃకరణసాహిత్యరాహిత్యాభ్యాం విశిష్యతే,
ఉపాధి ర్జీవభావస్య బ్రహ్మతాయాశ్చ నాన్యథా. 85

వ్యా. నను తర్హి జీవబ్రహ్మణోః విలక్షణముపాధిద్వయం వక్తవ్యమిత్యా శంక్యాహ—అంతఃకరణేతి. జీవభావబ్రహ్మభావయోరంతఃకరణసాహిత్యరాహిత్యే ఏవోపాధీ ఇత్యర్థః.

టీ. జీవభావస్య = జీవత్వముయొక్కయు, బ్రహ్మతాయాశ్చ = బ్రహ్మత్వము యొక్కయు, ఉపాధిః=ఉపాధిత్వము, అంతఃకరణసాహిత్య రాహిత్యాభ్యాం - అంతః కరణ = అంతఃకరణముతో, సాహిత్య = కూడుటచేతను, రాహిత్యాభ్యాం = కూడక పోవుటచేతను, విశిష్యతే = భేదించుచున్నది. అన్యథా = మఱియొకవిధముగా, న = భేదము లేదు.

తా. అంతఃకరణసంబంధము జీవున కుపాధి యగును. అట్టి యంతః కరణసంబంధము లేకుండుట బ్రహ్మమున కుపాధి యగును. ఇంతకన్న వేఱొకవిధంబుగా జీవబ్రహ్మముల కుపాధి లేదు.

అవ. అంతఃకరణసంబంధము భావరూప మగును గనుక నది జీవున కుపాధి కావచ్చును. అభావరూప మగు నంతఃకరణసంబంధము లేకపోవుట యుపాధి యనఁ జెల్ల దని యాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. యథా విధి రుపాధి స్స్యాత్ప్రతిషేధ _స్తథా న కిమ్,
సువర్ణలోహభేదేన శృంఖలాత్వం న భిద్యతే. 86

వ్యా. నన్వంతఃకరణసంబంధస్య భావరూపత్వాదుపాధిత్వమస్తు, నాభావరూపస్య తద్రాహిత్యస్య తదుచితమిత్యాశంక్య యావత్కార్యమవస్థాయి భేదహేతోరుపాధి తేత్యుక్తోపాధిలక్షణస్య సాహిత్యరాహిత్యయోరుభయోరపి సత్త్వాదుచితమేవోపాధిత్వ మిత్యభిప్రాయేణ పరిహరతి—యథావిధిరితి. విధిర్భావరూపోఽంతఃకరణసంబంధో యథాఉపాధిస్స్యాత్తథా ప్రతిషేధోఽభావరూపోఽంతఃకరణవియోగో న కిం? ఉపాధి ర్న స్యాత్కిం? స్యాదేవేత్యర్థః. తథాపి భావాభావరూపత్వలక్షణమవాంతరవైలక్షణ్యం దృశ్యత ఏవేత్యాశంక్య, తస్యాకించిత్కరత్వేనానాదరణీయత్వ మిత్యభిప్రేత్య దృష్టాంతమాహ—సువర్ణేతి. పురుషప్రచారనిరోధకత్వాంశేఽనుపయుక్తం సువర్ణత్వ లోహత్వాది వైలక్షణ్యం యద్వదనాదరణీయం తద్వదిత్యర్థః.

టీ. విధిః=భావరూపం బగు నంతఃకరణసంబంధము, ఉపాధిః=ఉపాధి, యథా= ఏప్రకారముగా, స్యాత్=అగునో, తథా=ఆప్రకారము, ప్రతిషేధః=అంతఃకరణసంబంధము లేకపోవుట, న కిం=ఉపాధి గాకపోవునా? (ఉపాధి యగు ననుట). సువర్ణలోహ భేదేన - సువర్ణ=బంగార మనియు, లోహ=ఇను మనియు, భేదేన=భేదముచేత, శృంఖలాత్వం = సంకిళ్లగుట, న భిద్యతే = వేఱుకాదు.

తా. భావరూప మగు నంతఃకరణసంబంధ మెట్లుపాధి యగునో యభావరూప మగు నంతఃకరణవియోగంబును నట్లే యుపాధి యగును. భావాభావరూప మగు నవాంతరభేదము నంతగాఁ బాటింప నవసరము లేదు. సంకిళ్లు బంగారువి యైనను నినుపవి యైనను రెండింటియందును బంధకత్వము కలదు. బంగారుసంకిళ్లు, ఇనుపసంకిళ్లు అనెడి భేదము నెట్లు పాటింపరో యట్లే భావాభావరూప మగు భేదముతోఁ బని లే దని యెఱుంగవలయును.

అవ. విధినిషేధంబులు రెండును పరబ్రహ్మమును తెలిసికొనుటకు సాధనము లగు లని యాచార్యులవారు వక్కాణించిరి అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేన చ,
వేదాంతానాం ప్రవృత్తిస్స్యా ద్ద్విధేత్యాచార్యభాషితమ్. 87

వ్యా. విధేరివ నిషేధస్యాపి బ్రహ్మబోధోపాయత్వేన బ్రహ్మోపాధిత్వం ద్రఢయితుం విధినిషేధయోరుభయోరపి బ్రహ్మబోధోపాయత్వ మాచార్యైర్నిరూపితమితి దర్శయతి—అతదితి. తచ్ఛబ్దేన బ్రహ్మాభిధీయతే. అతచ్ఛబ్దేన తదతిరిక్తమజ్ఞానాది. నేతి

నేతీత్యాదివ్యావృత్తి ర్నిరసనం. న తత్ అతత్. తస్య ప్రపంచస్య వ్యావృత్తిర్నిర సనం. తదేవరూపం ఉపాయ స్తేన సాక్షాద్విధిముఖేన విధిర్విధానం సాక్షాద్వాచకశబ్ద ప్రయోగః సత్యం జ్ఞానమనంతమిత్యేవమాదిరూప స్తేన చ విధిముఖేన తద్ద్వారేణాపీత్య ర్థః. వేదాంతానాముపనిషదాం ప్రవృత్తిః ప్రవర్తనం ప్రతిపాదితం బ్రహ్మణీతి శేషః.

టీ. అతద్వ్యావృత్తిరూపేణ - అతత్ = బ్రహ్మేతరమగు నజ్ఞానాదికము యొక్క, వ్యావృత్తిరూపేణ=నిరసన మనెడి యుపాయముచేతను, సాక్షాద్విధిముఖేన చ=ప్రత్యక్షమగు శబ్దప్రయోగముచేతను, వేదాంతానాం = ఉపనిషత్తులయొక్క, ప్రవృత్తిః = బ్రహ్మమందు ప్రవర్తించుట, ద్విధేతి = రెండు విధములుగా నున్న దని, ఆచార్యభాషితం = పెద్దలచేఁ జెప్పఁబడినది.

తా. శ్రు. "నేతి నేతి" = ఇది యాత్మగా దిది యాత్మగా దని దేహేంద్రియాదిసర్వజగత్తును నిషేధించుట అతద్వ్యావృత్తి యనఁ బడును. శ్రు. "సత్యం జ్ఞాన మనంతం" సద్రూపంబును చిద్రూపంబును అనంతరూపంబును బ్రహ్మ మగు నని శబ్దప్రయోగవిధానపూర్వముగఁ జెప్పుట ప్రత్యక్షవిధి యనఁబడును. వేదాంతములు శబ్దప్రయోగవిధాన పూర్వముగ బ్రహ్మమును బోధించును. ఆయుపనిషత్తులే కొన్ని చోట్ల ఇది యాత్మగా దిది యాత్మగా దని నిషేధరూపముగను బ్రహ్మమును బోధించును. విధి నిషేధంబులు రెండును నుపనిషత్తులయందు బ్రహ్మ బోధ కుపాయంబులుగా గ్రహింపఁబడిన వని యాచార్యులు పలికిరి.

అవ. వేదాంతములు ఆత్మ యిది గా దిది గా దని దేహేంద్రియాదిసర్వప్రపం చము బ్రహ్మము గా దని నిషేధరూపమున బోధించునెడల నే ననెడిశబ్దమున కర్థ మగు కూటస్థుని సయిత మట్లు నిషేధించిన ట్లగును. అందువలన నేను బ్రహ్మమనైతి నని జ్ఞానముకలుగుట సంభవింపదే యని శంకించుచున్నాఁడు:—

శ్లో. అహమర్థపరిత్యాగా దహం బ్రహ్మేతి ధీః కుతః,
నైవమంశస్య హి త్యాగో భాగలక్షణయోదితః. 88

వ్యా. నను వేదాంతానామతద్వ్యావృత్త్యా బ్రహ్మబోధకత్వాంగీకారేఽహం శబ్దార్థస్య కూటస్థస్యాపి త్యాగప్రసంగా దహం బ్రహ్మాస్మీతి సామానాధికరణ్యేన జ్ఞానం నోదేతుమర్హతీతి శంకతే—అహమర్థేతి. అహంశబ్దార్థస్య సర్వస్యాత్యక్తత్వాన్నైవమితి పరిహరతి—నైవమితి. హి యస్మాత్కారణాత్ భాగలక్షణయా జహదజహల్లక్షణయా అంశస్యాహంశబ్దార్థైకదేశస్య జడాంశస్య త్యాగ ఈరితః. న కూటస్థస్యాతోఽహం బ్రహ్మాస్మీతి జ్ఞానముపపద్యత ఇత్యర్థః.

టీ. అహమర్థపరిత్యాగాత్ - అహమర్థ = అహంశబ్దార్థముయొక్క (దేహేంద్రియాదులయొక్క), పరిత్యాగాత్ = పరిత్యజించుటవలన, అహం = నేను, బ్రహ్మేతి= బ్రహ్మమనైతి ననెడి, ధీః = జ్ఞానము, కుతః = ఎట్లుగాఁ గల్గును (కలుగఁ దనుట అని యంటివా), ఏవం = ఇట్లనుట, న = కూడదు. భాగలక్షణయా = భాగత్యాగలక్షణ చేత (జహదజహల్లక్షణచేత), అంశస్య = అహంశబ్దార్థమునందలి జడాంశముయొక్క, త్యాగః = పరిత్యాగము, ఉదితో హి = తెల్పఁబడినది గదా.

తా. అహంశబ్దార్థమైన కూటస్థాత్మనుకూడ ఆత్మ గా దని విడిచి పెట్టితి మేని నేను బ్రహ్మమ నైతి నను సామానాధికరణ్యజ్ఞాన ముద యించుట సంభవింప దని యనెదవేమో ? భాగత్యాగలక్షణచేత నహంశబ్దార్థమందుఁ గల జడాంశమును మాత్రమే విడిచిపెట్టుట గాని కూటస్థాత్మను విడిచిపెట్టుట లేదు. కాఁబట్టి నేను బ్రహ్మమ నైతి ననెడి జ్ఞానము కలుగవచ్చును.

అవ. అహమర్థమందుఁ గల జడాంశమును మాత్రము పరిత్యజించి బోధించెడి విధమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. అంతఃకరణసంత్యాగా దవశిష్టే చిదాత్మని,
అహంబ్రహ్మేతి వాక్యేన బ్రహ్మత్వం సాక్షిణీక్ష్యతే. 89

వ్యా. అంశత్యాగేన బోధనప్రకారమభినీయ దర్శయతి—అంతఃకరణేతి.

టీ. అంతఃకరణసంత్యాగాత్ = అంతఃకరణ మాత్మ గా దని నిషేధించుటవలన, అవశిష్టే=నిషేధింపఁగా మిగిలినట్టియు, చిదాత్మని = చిద్రూపుఁడు నగు, సాక్షిణి=సాక్షి స్వరూపుఁడైన కూటస్థునియందు, అహం=నేను, బ్రహ్మ = బ్రహ్మ మను, ఇతి వాక్యేన= అనెడు వాక్యముచేత, బ్రహ్మత్వం=బ్రహ్మభావము, ఈక్ష్యతే=అనుభవింపఁబడుచున్నది.

తా. అహంశబ్దార్థమందుఁ గల జడాంశ మైన అంతఃకరణమును ఆత్మ గా దని నిషేధించి శేషించిన కూటస్థచైతన్యమందు నేను బ్రహ్మము నైతి నని చెప్పెడి మహావాక్యముచేత దేహేంద్రియాదిసాక్షి యగు చిద్రూపమునందు బ్రహ్మత్వ మనుభవింపఁబడుచున్నది.

అవ. కేవలప్రత్యగాత్మ స్వయంప్రకాశమానుం డగుటంజేసి బుద్ధివృత్తికి విషయుఁ డగుట (గోచరించుట) ఘటింపదే యున్నట్లు శంకించి దానికి బదులు చెప్పు చున్నాఁడు:—

శ్లో. స్వప్రకాశోఽపి సాక్ష్యేష ధీవృత్త్యా వ్యాప్యతేఽన్యవత్,
ఫలవ్యాప్యత్వ మేవాస్య శాస్త్రకృద్భి ర్నివారితమ్. 90

వ్యా. నను కేవలస్య ప్రత్యగాత్మనః స్వప్రకాశత్వా ద్బుద్ధివృత్తివిషయత్వం న ఘటత ఇత్యాశంక్యాహ—స్వప్రకాశ ఇతి. అన్యవద్ఘటాదివదిత్యర్థః. స్వప్రకాశోఽహమిత్యేవం బుద్ధివృత్తిసంభవాదితి భావః. తర్హ్యపసిద్ధాంతాపాత ఇత్యాశంక్య పూర్వాచార్యైరపి వృత్తివ్యాప్యత్వస్యాంగీకృతత్వాన్నాయమపసిద్ధాంత ఇతి పరిహరతి—ఫలవ్యాప్యత్వమితి. ఫలం వృత్తిప్రతిబింబితచిదాభాసస్తద్వ్యాప్యత్వమేవాస్య ప్రత్యగాత్మనో నిరాకృతం, స్వస్యైవ స్ఫురణరూపత్వాదితి భావః.

టీ. ఏషః సాక్షీ=ఈసర్వసాక్షి యగు ప్రత్యగాత్మ. స్వప్రకాశోఽపి = స్వయముగాఁ బ్రకాశించుచుండినను, ధీవృత్త్యా = బుద్ధివృత్తిచేత, అన్యవత్ = ఘటాదికమువలె, వ్యాప్యతే=వ్యాపింపఁబడుచున్నాఁడు. అస్య = ఈప్రత్యగాత్మకు, ఫలవ్యాప్యత్వమేవ - ఫలఃబుద్ధివృత్తియందు ప్రతిఫలించిన చిదాభాసరూపముయొక్క, వ్యాప్యత్వమేవ = వ్యాపింపఁబడుటయే, శాస్త్రకృద్భిః = శాస్త్రకర్తలచేత, నివారితమ్=నివారింపఁబడెను. (వృత్తివ్యాప్యత్వము నిరాకరింపఁబడ లే దనుట.)

తా. సర్వసాక్షియైన ప్రత్యగాత్మ తాను స్వయముగాఁ బ్రకాశించువాఁడైనను బుద్ధివృత్తిచేత ఘటాదులు వ్యాపింపఁబడినట్లు వృత్తిచేత వ్యాపింపఁబడుచున్నాఁడు. ఈప్రత్యగాత్మకు శాస్త్రకర్తలు ఫలవ్యాప్యత్వము (చిదాభాసరూపముచేత వ్యాపించుట) లే దనిరి గాని వృత్తివ్యాప్యత్వమును నిరాకరింపలేదు.

అవ. ఆత్మయందు ఫలవ్యాప్తి లే దని చెప్పఁ దలఁచి అనాత్మకు వృత్తిచేతను ఫలముచేతను వ్యాప్తి గల దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధితత్స్థచిదాభాసౌ ద్వావపి వ్యాప్నుతో ఘటమ్,
తత్రాజ్ఞానం ధియా నశ్యే దాభాసేన ఘటః స్ఫురేత్. 91

వ్యా. ఆత్మని ఫలవ్యాప్త్యభావం దర్శయితుమనాత్మనో వృత్త్యా ఫలేన చ వ్యాప్యత్వం దర్శయతి—బుద్ధీతదితి. ఉభయవ్యాప్తేః ప్రయోజనమాహ—తత్రేతి. తత్ర తయోర్బుద్ధి చిదాభాసయోర్మధ్యే ధియా బుద్ధివృత్త్యా ప్రమాణభూతయా అజ్ఞానం నశ్యతి. జ్ఞానాజ్ఞానయోః విరోధాదితి భావః. ఆభాసేన చిదాభాసేన ఘటస్స్ఫురేత్; జడత్వేన స్వతస్స్ఫురణాయోగాదితి భావః.

టీ. బుద్ధితత్స్థ చిదాభాసౌ - బుద్ధి = బుద్ధివృత్తియుఁ, తత్స్థ = ఆబుద్ధివృత్తియం దున్న, చిదాభాసౌ = ఫల మని చెప్పఁబడు చిదాభాసుండును, ద్వావపి = రెండును, ఘటం=ఘటమును, వ్యాప్నుతః = వ్యాపించుచున్నవి. తత్ర=ఆ రెండింటియందు, ధియా= ప్రమాణరూపమగు బుద్ధివృత్తిచేత, అజ్ఞానం=అజ్ఞానము, నశ్యేత్ = నశించును. ఆభాసేన = చిదాభాసునిచేత, ఘటః = ఘటము, స్ఫురేత్ = స్ఫురించును.

తా. బుద్ధివృత్తియు నాబుద్ధివృత్తి ప్రతిఫలితుఁ డగు చిదాభాసుఁడును ఇద్దఱును ఘటమునందు వ్యాపించుచున్నారు. ఆ రెండింటిలో బుద్ధివృత్తిచేత ఘటము నావరించియుండిన అజ్ఞానము నశించును. చిదాభాసునిచేత ఘటము స్ఫురించును. ఘటము జడ మగుటచేతఁ దాను స్వయముగా ప్రకాశించుట సంభవింపదు.

అవ. అనాత్మవస్తు వగు ఘటాదికమందు వ్యాపించుటకంటె నాత్మయందు వ్యాపించుటయందలి తారతమ్యముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మ ణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రపేక్ష్యతే,
స్వయం స్ఫురణరూపత్వా న్నాభాస ఉపయుజ్యతే. 92

వ్యా. ఇదానీమాత్మని తతో వైలక్షణ్యం దర్శయతి—బ్రహ్మణీతి. ప్రత్యగ్బ్రహ్మణోరేకత్వస్యాజ్ఞానేనావృతత్వాత్తస్యాజ్ఞానస్య నివృత్తయే వాక్యజన్యయాఽహం బ్రహ్మాస్మీత్యాకారకయా ధీవృత్త్యా వ్యాప్తిరపేక్ష్యతే. స్వస్యైవ స్ఫురణరూపత్వాత్తత్స్ఫురణాయ చిదాభాసో నాపేక్ష్యతే, అతో యుజ్యమానోఽపి చిదాభాసో నోపయుజ్యత ఇత్యర్థః.

టీ. బ్రహ్మణి=ప్రత్యగాత్మయందు, అజ్ఞాననాశాయ = అజ్ఞాననాశముకొఱకు, వృత్తివ్యాప్తిః=బుద్ధివృత్తియొక్క వ్యాప్తి, అపేక్ష్యతే = కోరఁబడుచున్నది. (అవసరమగు ననుట). స్వయం = ప్రత్యగాత్మ యగు తాను, స్ఫురణరూపత్వాత్ = ప్రకాశస్వరూపుఁ డగుటవలన, ఆభాసః = చిదాభాసుఁడు, నోపయుజ్యతే=ఉపయోగింపఁడు.

తా. ప్రత్యగాత్మ పరమాత్మ లొక్కటి యగుట యజ్ఞానావరణముచేత నాచ్ఛాదింపఁబడియుండుటంబట్టి మహావాక్యార్థవిచారణము వలనఁ కలిగిన నేను బ్రహ్మము నైతి నను బుద్ధివృత్తియొక్క వ్యాప్తి ప్రత్యగాత్మయం దావశ్యక మగును. ప్రత్యగాత్మ తాను స్ఫురణరూపుఁ డగుటవలన చిదాభాసునివ్యాప్తి (ఫలవ్యాప్తి) యుపయోగింపఁబడదు,

అవ. ఈవిషయమును దృష్టాంతముచేత స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. చక్షుర్దీపావపేక్ష్యేతే ఘటాదే ర్దర్శనే యథా,
న దీపదర్శనే కింతు చక్షు రేక మపేక్ష్యతే. 93

వ్యా. ఉక్తమర్థం దృష్టాంతప్రదర్శనేన విశదయతి—చక్షురితి. అంధకారావృతఘటాదిదర్శనే చక్షుర్దీపావుభావ ప్యపేక్ష్యేతే. దీపప్రదర్శనే తు తథా న. కింతు ఏకం చక్షురేవా పేక్ష్యతే యథా, తథా బ్రహ్మణ్య జ్ఞాననాశాయేతి పూర్వేణ సంబంధః.

టీ. ఘటాదేః = ఘటపటాదిజడవస్తువులయొక్క, దర్శనే = కనుఁగొనుటకు, చక్షుర్దీపౌ=కన్నులును దీపమును, అపేక్ష్యేతే = కావలయును. దీపదర్శనే=దీపమును జూచుటయందు, న=చక్షుర్దీపములు రెండునుం బనిలేదు. కింతు=మఱి యేమి యనఁగా, ఏకం చక్షుః = ఒక్క కన్నుమాత్రము, యథా=ఏవిధముగా, అపేక్ష్యతే=కోరఁబడునో.

తా. కుండ మొదలగు జడవస్తువులను జీఁకటిలోఁ గనుఁగొనవలె ననిన దీపంబును కన్నులును నుండినంగాని చూచుట ఘటింపదు. దీపమును జూడవలె నన్ననో యది ప్రకాశవస్తువు గనుక మఱియొక దీపంబును కన్నులును రెం డవసరము లేదు. కన్ను లుండినఁ జాలును. అట్లే అనాత్మవస్తువులు దెలిసికొనునప్పుడు చిదాభాసవ్యాప్తియు బుద్ధివృత్తివ్యాప్తియు నవసర మగును గాని సహజముగ ప్రకాశరూపుఁడగు ఆత్మను దెలిసికొనుటకు వృత్తివ్యాప్తిమాత్రము చాలు నని తెలియనగును.

అవ. చిదాభాసుం డెప్పుడును బుద్ధివృత్తులతోఁ గలిసియే యుండును గనుక నాబుద్ధివృత్తి ప్రత్యగాత్మయందు వ్యాపించినప్పుడు దానితోఁ గూడ చిదాభాసుని వ్యాప్తియుఁ గలుగునే యను ప్రశ్నకు నుత్తరం బిచ్చుచున్నాఁడు:—

శ్లో. స్థితోఽప్యసౌ చిదాభాసో బ్రహ్మ ణ్యేకీభవే త్పరమ్,
న తు బ్రహ్మణ్యతిశయం ఫలం కుర్యాద్ఘటాదివత్. 94

వ్యా. నను బుద్ధితద్వృత్తీనాం చిదాభాసవైశిష్ట్యస్యాభావ్యాద్ఘటాదిష్వివ బ్రహ్మణ్యపి ఫలవ్యాప్తి ర్బలాద్భవేదిత్యాశంక్యాహ—స్థితోఽపీతి. యద్యపి ఘటాద్యాకారవృత్తివద్బ్రహ్మగోచరవృత్తావపి చిదాభాసోఽస్తి తథాపి నాసౌ బ్రహ్మణో భేదేన భాసతే. కింతు ప్రచండాతపమధ్యవర్తి ప్రదీప ప్రభావాత్తేనైకీభూత ఇవ భవతి. అత స్స్ఫురణలక్షణాతిశయజనకో న బ్రహ్మణీత్యర్థః.

టీ. అసౌ చిదాభాసః = ఈ చిదాభాసుఁడు, స్థితో౽పి = బుద్ధివృత్తియందుఁ గలిసి యుండినను, బ్రహ్మణి=ప్రత్యగాత్మయందు, ఏకీభవేత్=ఏకమైయుండును. పరం= ఇతరమైన, అతిశయం=అతిశయమైన, ఫలం తు=ప్రయోజనమునో, (స్ఫురణరూపమగు నతిశయమును), న కుర్యాత్=చేయనేరఁడు.

తా. విచారింపఁగా ఘటాదిరూప మగు వృత్తియందువలె బ్రహ్మమును గోచరింపఁజేసెడి వృత్తియందును చిదాభాసుం డుండును గాని యతఁడు ప్రత్యగాత్మకన్న వేఱుగా స్ఫురింపఁడు. మంచి దీప్తి గలిగిన యెండయందు దీపమును బెట్టినపుడు ఆదీపకాంతియు నెండలోనే చేరునట్లు చిదాభాసుఁడు ప్రత్యగాత్మయం దేకీభవించును. కాని బ్రహ్మమునందు స్ఫురణాతిశయంబును గలిగింపఁజాలఁడు.

అవ. బ్రహ్మమునందు ఫలవ్యాప్తి లేక వృత్తివ్యాప్తి మాత్ర ముండు ననుటకుఁ బ్రమాణ మేమి యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అప్రమేయ మనాదిం చే త్యత్ర శ్రుత్యేద మీరితమ్,
మనసైవేద మాప్తవ్య మితి ధీవ్యాప్యతా శ్రుతా. 95

వ్యా. నను, బ్రహ్మణి ఫలవ్యాప్తిర్నాస్తి. వృత్తివ్యాప్తిస్తు విద్యత ఇత్యుక్తం. తత్ర కిం ప్రమాణమిత్యాశంక్యాగమః ప్రమాణమిత్యాహ—అప్రమేయమితి. "నిర్వికల్ప మనంతం చ హేతుదృష్టాంతవర్జితం, అప్రమేయమనాదిం చ యద్ జ్ఞాత్వా ముచ్యతే బుధ" ఇత్యత్రాస్మిన్మంత్రే శ్రుత్యా౽మృతబిందూపనిషదా౽ప్రమేయశబ్దేనేదం ఫలవ్యాప్తిరాహిత్యముక్తం. "మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించనే"తి కఠవల్ల్యాం ధీవ్యాప్యతా శ్రుతా. వృత్తివ్యాప్యత్వం శ్రుతమిత్యర్థః.

టీ. అత్ర = ఈవిషయమున, అప్రమేయం = బ్రహ్మము అప్రమేయ మనియు, అనాదిం చేతి=అనాది యనియుం బ్రతిపాదించునట్టి, శ్రుత్యా = వేదవాక్యముచేత, ఇదం = ఈఫలవ్యాప్తి లేకుండుట, ఈరితం = చెప్పఁబడినది. ఇదం = ఈప్రత్యగాత్మ, మనసైవ = మనస్సుచేతనే, ఆప్తవ్యం = గ్రహింపఁదగినది, ఇతి = ఇట్లుగా, (శ్రుతిచేత) ధీవ్యాప్యతా=బుద్ధివృత్తియొక్క వ్యాపించుట, శ్రుతా=శ్రుతియందుఁ దెల్పఁబడినది.

తా. బ్రహ్మము నిర్వికల్పంబును అనంతంబును హేతుదృష్టాంతములు లేనిదియు, అప్రమేయంబును ననాదియు నగును. ఇట్టి బ్రహ్మము నేపండితుఁ డెఱుంగునో వాఁడు ముక్తుఁ డగు నని యమృతబిందూప

నిపత్తునం దీయర్థము గల శ్రుతి యప్రమేయశబ్దముచేత ఫలవ్యాప్తి (చిదాభాసవ్యాప్తి) లేకుండుటను దెలిపెను. మఱియు కఠవల్లియందు మనస్సుచేతనే బ్రహ్మము తెలియఁబడు ననియు బ్రహ్మేతరము లేదనియుఁ జెప్పుచు బుద్ధివృత్తివ్యాప్యత్వము దెల్పఁబడెను గనుక నట్టి శ్రుతు లీవిషయమునం బ్రమాణము లగు నని గ్రహింపవలయును.

అవ. "ఆత్మానం చేత్" మొదలగు శ్రుతి అపరోక్షజ్ఞానము, దుఃఖనివృత్తియు నను నీయవస్థలు జీవుని వని చెప్పుచున్నట్లు ఈప్రకరణమునందలి నలువదియొనిమిదవ శ్లోకమునఁ జెప్పియుంటిరి. ఆమంత్రమున నేభాగమునం దపరోక్షజ్ఞానము దెల్పఁబడెనో యూనతీయవలయు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి వాక్యతః,
బ్రహ్మాత్మవ్యక్తి ముల్లిఖ్య యో బోధ స్సోఽభిధీయతే. 96

వ్యా. ఆత్మానం చేద్విజానీయాదితి మంత్రేణాపరోక్షజ్ఞానం శోకనివృత్త్యాఖ్యాం జీవగతమవస్థాద్వయమభిధీయత ఇత్యుక్తం. అపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యే ఉభే ఇమే, అవస్థే జీవగే బ్రూత ఆత్మానం చేదితి శ్రుతిరిత్యనేన శ్లోకేన తత్ర కియతాంశేనా పరోక్షజ్ఞానముచ్యత ఇత్యాకాంక్షాయామాహ—ఆత్మానమితి. బ్రహ్మాత్మవ్యక్తిం సత్యాది లక్షణ బ్రహ్మాభిన్నం ప్రత్యగాత్మస్వరూపముల్లిఖ్య విషయీకృత్య యో బోధో జాయతే బ్రహ్మాహమస్మీతి సోఽభిధీయతేఽనేన వాక్యేనేత్యర్థః.

టీ. అయం = ఈస్వప్రకాశానందస్వరూప మగు పరమాత్మ, అస్మీతి=నే నైతి నని, ఆత్మానం=స్వస్వరూపముచే, విజానీయాచ్చేత్ = తెలిసికొనినట్టాయెనా, వాక్యతః= అనెడి వాక్యమువలన, బ్రహ్మ = బ్రహ్మస్వరూపుఁ డగు తనను (ప్రత్యగాత్మను), ఉల్లిఖ్య = విషయముగాఁ జేసికొని, యః బోధః = ఏజ్ఞానము గలుగునో, సః=ఆబోధ, అభిధీయతే=ఈవాక్యముచేతఁ దెల్పఁబడుచున్నది.

తా. సత్యజ్ఞానానందస్వరూప మైన పరబ్రహ్మమునకంటె వేఱు గాని ప్రత్యగాత్మస్వరూపమును బ్రత్యక్షముగాఁ జేసికొనెడు నపరోక్షజ్ఞానము ఈ (ఆత్మానం చేత్ అను) వాక్యమువలనఁ దెలుపఁబడె నని యెఱుంగవలెను.

అవ. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అను మహావాక్యార్థవిచారణవలన నప రోక్షజ్ఞానము గలిగినను జ్ఞానదార్ఢ్యముకొఱకు మాటిమాటికి నావృత్తి చేయవలసిన దని

యాచార్యులు సెలవిచ్చియున్నారు. కనుక శ్రవణాద్యావృత్తి ముఖ్యకర్తవ్య మగు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అస్తు బోధోఽపరోక్షోఽత్ర మహావాక్యాత్తథాఽప్యసౌ,
న దృఢశ్శ్రవణాదీనా మాచార్యైః పునరీక్షణాత్. 97

వ్యా. నను, తర్హి పూర్వోక్తరీత్యాసకృద్వాక్యవిచారాదేవాపరోక్షజ్ఞానసిద్ధే రావృత్తి రసకృదుపదేశాదిత్యాదౌ విహితం శ్రవణాద్యావర్తనమననుష్ఠేయం స్యాదిత్యాశంక్య జ్ఞానదార్ఢ్యాయ తదావర్తనానుష్ఠానస్యాచార్యైరభిహితత్వాత్తదనుష్ఠేయమేవేత్యాహ—అస్తు బోధ ఇతి. అత్ర బ్రహ్మాత్మవిషయే మహావాక్యాత్సకృచ్ఛ్రితాద్విచారసహితా దపరోక్షబోధోఽస్తు భవతు. తథాపి నాసౌ దృఢః. అతశ్శ్రవణాద్యావర్తనీయం శ్రీమచ్ఛంకరాచార్యైః పునర్వాక్యార్థజ్ఞానోత్పత్త్యనంతరమపి శ్రవణాద్యావర్తనాభిధానాదిత్యర్థః. జ్ఞానదార్ఢ్యాయేత్యేతదర్థాల్లభ్యతే.

టీ. అత్ర = ఈబ్రహ్మాత్మవిషయమున, మహావాక్యాత్ = విచారముతోఁగూడిన మహావాక్యార్థమువలన, అపరోక్షః = ప్రత్యక్షమగు, బోధః = జ్ఞానము, అస్తు=గలుగుఁగాక, తథాపి=అట్లు కలిగినను, ఆచార్యైః = శ్రీమచ్ఛంకరభగవత్పాదులచేత, పునః = మరల, (మహావాక్యార్థజ్ఞానము గలిగినపిమ్మటఁగూడ) శ్రవణాదీనాం = వేదాంతశాస్త్ర శ్రవణంబును, అభ్యాసాదికంబును, ఈరణాత్ = చెప్పఁబడుటవలన, న దృఢః = అట్టి జ్ఞానము దృఢముగా నిలుపదు.

తా. విచారసహిత మగు మహావాక్యార్థమువలన నపరోక్ష జ్ఞానము కలిగినను నది దృఢముగా నిలువఁజాలదు కనుక అపరోక్ష జ్ఞానము కలిగినపిమ్మట కూడ మాటిమాటికి శ్రవణమననాద్యభ్యాస మావశ్యకమగు నని శ్రీశంకరాచార్యులవారును సెలవిచ్చిరి.

అవ. శ్రీశంకరులవారివాక్యముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్,
శమాదిసహిత స్తావ దభ్యసే చ్ఛ్రవణాదికమ్. 98

వ్యా. ఆచార్యైః కేన వాక్యేనాభిహితమిత్యాశంక్య తద్వాక్యం పఠతి. అహం బ్రహ్మేతి.

టీ. అహం=నేను, బ్రహ్మేతి=బ్రహ్మమనై తి నని, వాక్యార్థబోధః-వాక్యార్థ = మహావాక్యార్థవిచారణవలన, బోధః = కలిగిన యపరోక్షజ్ఞానము, యావత్ = ఎప్పటికి, దృఢీభవేత్=దృఢముగా నిలుచునో, తావత్=అప్పటిదనుక, శమాదిసహితస్సన్-

శమాది=శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అనెడి యాఱు గుణములతోఁ గూడుకొనినవాఁ డగుచు, శ్రవణాదికం=శ్రవణమననాదులను, అభ్యసేత్ = అభ్యసింపవలయును.

తా. మహావాక్యార్థవిచారమువలనఁ గలిగిన యపరోక్షజ్ఞానము బాగుగా దృఢ మగుపర్యంతము శమాదిగుణములు గలవాఁడై శ్రవణ మననాదుల ననుక్షణ మభ్యసింపవలయు నని శ్రీశంకరాచార్యులు వక్కాణించిరి.

అవ. వేదాంతవాక్యప్రమాణమువలనఁ గలిగినజ్ఞానము దృఢముగా నుండకుండుటకుఁ గతం బేమి యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బాఢం సంతి హ్యదార్ఢ్యస్య హేతవశ్శ్రుత్యనేకతా,
అసంభావ్యత్వమర్థస్య విపరీతా చ భావనా. 99

వ్యా. నను వాక్యప్రమాణజనితస్య జ్ఞానస్యాదార్ఢ్యం కుత ఇత్యాశంక్యాహ— బాఢమితి. హి యస్మాత్కారణాచ్ఛ్రుత్యనేకతా శ్రుతీనాం నానాత్వ మేకో హేతుః. అర్థస్యాప్యఖండైకరసస్యాద్వితీయబ్రహ్మరూపస్యాలౌకికత్వేనాసంభావితత్వమపరః. విపరీతభావనా చ పునః కర్తృత్వాభిమానరూప స్తృతీయ ఇత్యేవంవిధా అదార్ఢ్యస్య హేతవో బాఢం సంతి సర్వథా విద్యంతే. అతో౽పరోక్షానుభవదార్ఢ్యాయ శ్రవణాదిక మావర్తనీయమితి భావః.

టీ. హి=ఏకారణమువలన, శ్రుత్యనేకతా- శ్రుతి=శ్రుతులయొక్క, అనేకతా=నానాత్వంబును (వెక్కు శ్రుతులును అనుట), అర్థస్య=అఖండైకరసరూపమైన యద్వితీయ బ్రహ్మముయొక్క, అసంభావ్యత్వం = ఆ లౌకికస్వరూపముతో నుండుట సంభవింప దనుకొనుటయు, విపరీతా = వ్యతిరేకమైన, భావనా=భావనయు, అదార్ఢ్యస్య = జ్ఞానముయొక్క దృఢముగా నిలువమికి, హేతవః=కారణములు, బాఢం = పలువిధములుగా, సంతి కలవు.

తా. శ్రుతు లనేక విధములుగా నుండుటవలన పరబ్రహ్మవిషయమున సంశయము గలుగుట యొక కారణము. అఖండైకరసరూప మగు నద్వితీయబ్రహ్మవస్తువు లోకవిలక్షణ వస్తువుగా భావింపకపోవుట యసంభావన యను రెండవకారణము. నేను కర్తను, నేను భోక్తను అని మఱల నభిమానము గలుగుట విపరీతభావన యను మూఁడవ కారణము. ఈవిధముగా నపరోక్షజ్ఞానము దృఢముగా నిలువకుండు

టకు బహువిధంబు లగు కారణంబు లున్నవి. కావున నిట్టి ప్రతిబంధక సామగ్రిని నివారించుటకును నపరోక్షజ్ఞానము దృఢ మగుటకును శ్రవణమననాదులను సర్వదా చేయవలయును.

అవ. శ్రుతులు భిన్నభిన్నములుగాఁ జెప్పుచుండుటవలనఁ గలిగిన సంశయ భావన నివర్తించుటకు నెప్పుడు శ్రవణము ముఖ్యకర్తవ్య మనుచున్నాఁడు:—

శ్లో. శాఖాభేదా త్కామభేదాచ్ఛ్రుతం కర్మాన్యథాన్యథా,
ఏవమత్రాపి మాశంకీత్యతః శ్రవణ మాచరేత్. 100

వ్యా. ఏవం త్రివిధా నదార్ఢ్య హేతూనుపన్యస్య శ్రుతినానాత్వప్రయుక్తా దార్ఢ్యనివృత్తయే శ్రవణావృత్తిః కార్యేత్యాహ—శాఖేతి. యథా శాఖాభేదాత్కర్మ భేద శ్శ్రూయతే; "యదృచైవ హౌత్రం క్రియతే యజుషాధ్వర్యవం సామ్నోద్గీథ" మితి. యథా వా కామభేదా "త్కారీర్యా వృష్టికామో యజేత, శతకృష్ణలమాయు ష్కామ" ఇత్యాదికర్మభేదశ్శ్రుతః. ఏవ ముపనిషత్స్వపి ప్రతిపాద్యతత్త్వస్య భేద శంకాయాం సత్యాం తన్నివారణాయ శ్రవణం పునః పునః కర్తవ్యమిత్యర్థః.

టీ. శాఖాభేదాత్ = ఋగ్యజుస్సామాథర్వణము లను వేదశాఖలభేదమువల నను, కామభేదాత్ = వారి వారి యిష్టములు భిన్నములుగా నుండుటవలనను, కర్మ = చేయఁదగినపని, అన్యథాన్యథా=అనేక విధములుగా, శ్రుతం=శ్రుతులయందుఁ దెల్పఁ బడుచున్నది. ఏవం = ఈప్రకారముగా, అత్రాపి = ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడెడి తత్త్వస్వరూపమునందును, మాశంకి=భేదమున్నదని శంకింపఁబడక పోవుఁగాక, ఇత్యతః= ఇట్టిసందేహము లుండుటవలన, శ్రవణం=నిత్యము వేదాంతశ్రవణమును, ఆచరేత్ = చేయవలయును.

తా. శ్రు. "యదృచైవ హౌత్రం క్రియతే, యజుషాధ్వర్యవం, సామ్నోద్గీథం" = ఋగ్వేదముచేత హౌత్రము చేయఁబడును. యజు ర్వేదముచేత ఆధ్వరము చేయఁబడును. సామవేదముచేత ఔద్గాత్రము చేయఁబడును. అని ఈవిధంబున నాయావేదములతో నాయాకర్మలు యజ్ఞాదులయందు విధింపఁబడుచున్నవి. మఱియు, వారి వారి యభీష్ట ముల ననుసరించి శ్రు. "కారీర్యా వృష్టికామో యజేత శతకృష్ణల మాయుష్కామః" అనఁగా వర్షమును గోరినవాఁడు కారీరి యనెడి పేరు గల ఇష్టిని చేయవలయు ననియు, ఆయుష్యాభివృద్ధినిఁ గోరిన వాఁడు 'శతకృష్ణల' మ్మను పేరు గల ఇష్టినిఁ జేయవలయు ననియు

టీ. ఏతత్ = ఈశ్రవణము, సమన్వయాధ్యాయే = సూత్రభాష్యమునందలి సమన్వయాధ్యాయమునందు (ప్రథమాధ్యాయమునందు), సూక్తం=చక్కఁగాఁ జెప్పఁబడినది. అర్థస్య = ఉపనిషదర్థముయొక్క, సంభావనా = సంభావన, తాత్పర్యనిర్ణయము (మననము), ధీస్వాస్థ్యకారిభిః=చిత్తస్వాస్థ్యమును గలిగించెడి, తర్కైః=యుక్తుల చేత, ద్వితీయాధ్యాయే = రెండవ యధ్యాయమున, ఈరితా = వ్యాసుఁడు మొదలగు వారిచేతఁ జెప్పఁబడినది.

తా. సూత్రభాష్యమునందు ప్రథమాధ్యాయమున సంశయనివృత్తిహేతు వగు శ్రవణపద్ధతియు, అందలి రెండవ యధ్యాయంబున అసంభావనానివృత్తిహేతు వగు మననమును యుక్తులచేత చేయవలసిన రీతియును శ్రీవేదవ్యాసులవారిచేతను సూత్రరూపముగను, శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారిచేత సూత్రభాష్యములయందును విస్పష్టముగాఁ దెల్పఁబడినది. కనుక వేదాంతార్థ శ్రవణముచేత సంశయము నివర్తించు ననియు, వేదాంతార్థ మననముచేత అసంభావన యనెడి అదార్ఢ్యహేతువు నివర్తించు ననియుం దెలియవలెను.

అవ. విపరీతభావన నివర్తించుటకు సాధనం బగు చిత్తైకాగ్రత యెట్లు కలుగునో చెప్పుచున్నాఁడు:—

శ్లో. బహుజన్మదృఢాభ్యాసా ద్దేహాదిష్వాత్మధీః క్షణాత్,
పునఃపున రుదేత్యేవం జగత్సత్యత్వధీ రపి. 103
విపరీతా భావనేయ మైకాగ్ర్యాత్సా నివర్తతే,
తత్త్వోపదేశాత్ప్రాగేన భవత్యేతదుపాసనాత్. 104

వ్యా. ఇదానీం విపరీతభావనాం తన్నివృత్త్యుపాయం చ దర్శయతి—బహుజన్మేతి.

విపరీతేతి. విపరీతభావనానివర్తకం యదైకాగ్ర్యం తత్కుతో జాయత ఇత్యాశంక్యాహ—తత్త్వేతి. ఏతదైకాగ్ర్యం బ్రహ్మోపదేశాత్ప్రాగేవ సగుణబ్రహ్మోపాసనాద్భవతి భవేదిత్యర్థః.

టీ. బహుజన్మదృఢాభ్యాసాత్ - బహుజన్మ=అనేక జన్మములయందలి, దృఢాభ్యాసాత్=దృఢమైన యభ్యాసమువలన, దేహాదిషు=దేహాదులయందు, ఆత్మధీః=ఆత్మయనెడి బుద్ధియు, ఏవం = ఈప్రకారముగ, జగత్సత్యత్వధీరపి - జగత్=దేహేంద్రియాదిజగత్తుయొక్క, సత్యత్వధీరపి = సత్యత్వబుద్ధియు, క్షణాత్ = క్షణమాత్రములో, పునఃపునః=మాటిమాటికి, ఉదేతి = పుట్టుచున్నది. ఇయం=ఇది, విపరీతా=విపరీతమైన,

భావనా = అభిప్రాయము, సా = ఆవిపరీతభావన, ఐకాగ్ర్యాత్ = ఏకాగ్రతవలన, నివర్తతే = నివర్తించుచున్నది. ఏతత్ = ఈచిత్తైకాగ్రత, తత్త్వోపదేశాత్-తత్త్వ = బ్రహ్మతత్త్వముయొక్క, ఉపదేశాత్ = ఉపదేశమును బొందుటకంటె, ప్రాగేవ = పూర్వమందే, ఉపాసనాత్ = సగుణబ్రహ్మోపాసనమువలన, భవతి=ఏర్పడుచున్నది.

తా. దేహాదులే యాత్మ యనియు దేహేంద్రియాదిజగత్తు సత్యమైన దనియు అనేక జన్మములయందలి దృఢాభ్యాసమువలన క్షణమాత్రములో మాటిమాటికి నిట్టిబుద్ధి కలుగుచున్నది. ఇదియే విపరీత భావన యనఁబడును. ఈవిపరీతభావన చిత్తైకాగ్రతవలన నివర్తించును. ఆచిత్తైకాగ్రత పరబ్రహ్మోపదేశమునకుఁ బూర్వము సగుణోపాసనమును, భగవన్నామసంకీర్తనమును సాధుజనసేవనమును జేయుటవలనఁ గలుగుచున్నది.

అవ. సగుణబ్రహ్మోపాసనాదికము చేయవలయునను సంగతి మీ కెట్లు తెలిసినది అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాస్తయోఽత ఏవాత్ర బ్రహ్మశాస్త్రేఽపి చింతితాః,
ప్రాగనభ్యాసినః పశ్చాద్బ్రహ్మాభ్యాసేన తద్భవేత్. 105

వ్యా. నన్వేతత్కుతోఽవగతమిత్యాశంక్య ఉపాసనావిచారస్య వేదాంతశాస్త్రే కృతత్వాదిత్యాహ—ఉపాస్తయ ఇతి. అకృతోపాస్తికస్య కుతస్తజ్జన్మేత్యత ఆహ—ప్రాగితి.

టీ. అతఏవ=కనుకనే, అత్ర=ఈ చిత్తైకాగ్రతవిషయమునందు, ఉపాస్తయః = ఆయుపాసనములు, బ్రహ్మశాస్త్రేఽపి = వేదాంతశాస్త్రమునందును, చింతితాః = విచారింపఁబడినవి. ప్రాక్ = తత్త్వోపదేశము గాకపూర్వము, అనభ్యాసినః = చిత్తైకాగ్రతయొక్క యభ్యాసము లేనివానికి, పశ్చాత్ = సగుణోపాసనము చేసినతర్వాత, బ్రహ్మాభ్యాసేన = స్వరూపానుసంధానముచేత, తత్ =ఆచిత్తైకాగ్రత, భవేత్ = కలుగును.

తా. వేదాంతశాస్త్రమునందును నక్కడక్కడ చిత్తైకాగ్రత విషయమున నుపాసనలు వివరింపఁబడియున్నవి. సగుణోపాసనము చేసి చిత్తైకాగ్రత పూర్తిగాఁ గలుగనివానికి తత్త్వోపదేశమైన వెనుక నిత్యమునట్టి పరతత్త్వము ననుసంధానము చేయుటవలన చిత్తైకాగ్రత క్రమముగాఁ గలుగును.

అవ. బ్రహ్మాభ్యాస మన నెట్టిదో చెప్పుచున్నాఁడు:—

శ్లో. తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనం,
ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః. 106

వ్యా. బ్రహ్మాభ్యాసశ్చ కీదృశ ఇత్యాకాంక్షాయామాహ—తచ్చింతనమితి.

టీ. తచ్చింతనం = ఆప్రత్యగాత్మస్వరూపమును విచారించుటయు, తత్కథనం= ఆపరబ్రహ్మస్వరూపమునుగుఱించియే మాటలాడుచుండుటయు, అన్యోన్యం=సాధకులలోః నొకరితో నొకరు, తత్ప్రబోధనం = ఆ బ్రహ్మానుభవమును దెల్పుకొనుచుండుటయు, ఏతదేకపరత్వం చ=ఈప్రత్యగాత్మయే సర్వోత్కృష్టమైన దని యాసక్తి గలిగియుండు టయు, బ్రహ్మాభ్యాసం = బ్రహ్మాభ్యాసమునుగా, బుధాః=తెలిసిన పెద్దలు, విదుః=చెప్పు చున్నారు.

తా. ఎల్లప్పుడును ప్రత్యగాత్మ పరమాత్మలయొక్క స్వరూపమును గూర్చియు నారెంటియొక్క యేకత్వమునుగూర్చియు నాలోచించు చుండుటయు నెప్పుడును బ్రహ్మతత్త్వమునుగూర్చియే భాషించుటయు, అభ్యాసకులతో తమ తమ యనుభవములను దెల్పుకొనుటయు, ప్రత్య గ్బ్రహ్మముల యఖండైక్యమే పరమోత్కృష్ట మని యాసక్తి గలిగి యుండుటయు బ్రహ్మాభ్యాస మగు నని తెలిసినపెద్దలు చెప్పెదరు.

అవ. ప్రత్యగ్బ్రహ్మైక్యమును స్పష్టపఱచుటకు శ్రుతి నుదాహరించుచున్నాఁడు:-

శ్లో. తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః,
నానుధ్యాయా ద్బహూ౯ శబ్దా న్వాచో విగ్లాపనం హి తత్.

వ్యా. ఏతదేకపరత్వం విశదయితుం శ్రుతిమాహ—తమేవేతి. ధీరో బ్రహ్మ చర్యాదిసాధనసంపన్నః బ్రాహ్మణో బ్రహ్మభవితుమిచ్ఛు ర్ముముక్షు స్తమేవ ప్రత్యగ్రూపం పరమాత్మానమేవ విజ్ఞాయ సంశయాద్యభావో యథా భవతి తథా జ్ఞాత్వా ప్రజ్ఞాం బ్రహ్మాత్మైకత్వజ్ఞానసంతతిరూపమైకాగ్ర్యం కుర్వీత సంపాదయేత్. అనాత్మగోచరా న్బహూ౯ శబ్దాన్నానుధ్యాయాన్నానుస్మరేత్. ధ్యానేనాభిధానమప్యుపలక్ష్యతే. నాభి దధ్యాచ్చ అన్యథాశబ్దధ్యానేన వాగ్విగ్లాపనానుపపత్తేః. కుత ఇత్యత ఆహ— వాచో విగ్లాపనం. విగ్లాపయతీతి విగ్లాపనం శ్రమహేతుః. అయమభిప్రాయః—ఇతర శబ్దాను సంధానే మనసశ్శ్రమో భవతి. తదభిధానేన వాచ ఇతి.

టీ. ధీరః=బ్రహ్మచర్యము మొదలగు సాధనములతోఁ గూడియుండి, బ్రాహ్మణః= తాను బ్రహ్మ మగుటకు కోరికగల ముముక్షువు, తమేవ = ఆ ప్రత్యగభిన్నబ్రహ్మమునే, విజ్ఞాయ = సంశయభావన విపరీతభావనలు లేకుండఁ దెలిసికొని, ప్రజ్ఞాం=బ్రహ్మాత్మైకత్వ

జ్ఞానసంతతిరూప మగునేకాగ్రతను, కుర్వీత = సంపాదింపవలయును. బహూన్ శబ్దాన్ = అనాత్మవిషయకము లగు పెక్కుమాటలను, నానుధ్యాయాత్ = స్మరింపఁగూడదు, తత్ = అట్లు స్మరించుటయు, నుచ్చరించుటయు, వాచః = వాక్కునకు, విగ్లాపనం హి=శ్రమహేతువే యగును.

తా. బ్రహ్మచర్యాదిసాధనముల సంపాదించి బ్రహ్మభావమును సంపాదింపఁగోరెడి ముముక్షు వగు బ్రాహ్మణుఁడు ప్రత్యగ్బ్రహ్మైక్యమును సంశయభావనవిపరీతభావనలు లేక చక్కఁగా తెలిసికొని ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానసంతానరూపం బగు చిత్తైకాగ్రతను సంపాదింపవలయును. అనాత్మసంబంధంబులైన శబ్దములను స్మరించుట గాని యుచ్చరించుట గాని తగదు. పెక్కుశబ్దములను స్మరించుటచేత మనస్సునకును, ఉచ్చరించుటవలన వాక్కునకును శ్రమ కలుగును.

అవ. ఏకాగ్రతను సంపాదింపవలయు నని చెప్పెడి స్మృతిని జెప్పుచున్నాఁడు:-

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 108

వ్యా. ఏవమైకాగ్ర్యప్రతిపాదికాం శ్రుతిమభిధాయ స్మృతిమప్యాహ—అనన్యా ఇతి. యే జనా అనన్యా అహం బ్రహ్మాస్మీతి జ్ఞానేన మదభిన్నాస్సంత స్తథైవ మాం చింతయంతః పర్యుపాసతే పరితస్సర్వేష్వపి కాలేషు ఉపాసతే మద్రూపా ఏవవర్తంతే. తేషాం నిత్యాభియుక్తానాం సదా మచ్చిత్తానాం తేషామహం తదాత్మత్వేనానుసంధీయమానోఽహం యోగక్షేమమలభ్యలాభలబ్ధపరిరక్షణరూపౌ యోగక్షేమౌ వహామి సంపాదయామీత్యర్థః.

టీ. యే జనాః = ఏజనులు. అనన్యాః = నేను బ్రహ్మమనైతి ననెడి జ్ఞానముచేత నాకంటె వేఱు గానివారై, మాం = నన్ను, చింతయంతః=పరమేశ్వరుని ధ్యానింతురో, పర్యుపాసతే=సర్వకాలములయందు మద్రూపులై యుందురో, తేషాం నిత్యాభియుక్తానాం=ఎప్పుడును నాయందు మనస్సు కలిగినయట్టివారియొక్క, యోగక్షేమం-యోగ=ప్రాప్తముగానిదానిం బ్రాప్తింపఁజేయుటను, క్షేమం=ప్రాప్తించినదానిని స్థిరముగానుంచుటను, అహం = నేను, వహామి = సంపాదించెదను.

తా. ఏజనులు నేను బ్రహ్మమనైతి నను జ్ఞానముచేత నాతో నైక్యమును జెంది నన్ను నిరంతరము ధ్యానించుచు నాస్వరూపులై

యుందురో యట్టివారి యోగక్షేమంబులను నేను సంపాదించెదను. లభింపని వస్తువు లభించుట యోగ మనఁబడును. లభించినవస్తువు రక్షింపఁబడుట క్షేమ మనఁబడును.

అవ. పైన నుదాహరింపఁబడిన శ్రుతిస్మృతుల తాత్పర్యమును చెప్పుచున్నాఁడు:-

శ్లో. ఇతి శ్రుతిస్మృతీ నిత్యమాత్మన్యేకాగ్రతాం ధియః,
విధత్తో విపరీతాయా భావనాయాః క్షయాయ హి. 109

వ్యా. ఉదాహృతయోః శ్రుతిస్మృత్యోస్తాత్పర్యమాహ—ఇతీతి. ఏతే శ్రుతిస్మృతీ విపరీతభావనానివృత్తయే ఆత్మని సదా చిత్తైకాగ్ర్యం ప్రతిపాదయత ఇత్యర్థః.

టీ. ఇతి=ఈప్రకారము, శ్రుతిస్మృతీ=శ్రుతిస్మృతులు రెండును, విపరీతాయాః భావనాయాః=విపరీతభావనయొక్క, క్షయాయ = నివర్తించుటకొఱకు, ఆత్మని=ప్రత్యగాత్మయందు, నిత్యం=ఎల్లప్పుడు, ధియః = మనస్సునకు, ఏకాగ్రతాం=ఏకాగ్రతను, విధత్తః = విధించుచున్నవి.

తా. పైన నుదాహరింపఁబడిన "తమేవ ధీరో" అను శ్రుతియు "అనన్యాః" అను స్మృతియు విపరీతభావనయు నివర్తించుటకొఱకే నిరంతరము చిత్తైకాగ్రత యుండవలయు నని నిరూపించుచున్నవి.

అవ. దేహాదులయం దాత్మత్వబుద్ధియు జగత్తునందు సత్యత్వబుద్ధియు నిట్లీరెండింటికిని విపరీతభావన యగుట యెట్లని శంకించి విపరీతభావనాలక్షణమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. యద్యథా వర్తతే తస్య తత్త్వం హిత్వాన్యథాత్వధీః,
విపరీతా భావనా స్యా త్పిత్రాదా వరిధీ ర్యథా. 110

వ్యా. నను దేహాద్యాత్మత్వబుద్ధేః జగత్సత్యత్వబుద్ధేశ్చ కుతో విపరీతభావనాత్వమిత్యాశంక్య తల్లక్షణయోగాదితి దర్శయితుం తస్యాః లక్షణమాహ—యద్యథేతి. యద్వస్తు శుక్త్యాది యథా యేన శుక్త్యాదిరూపేణ వర్తతే. తస్య తత్త్వం శుక్త్యాదిరూపత్వం పరిత్యజ్యాన్యథాత్వధీరన్యథాతస్య రజతరూపత్వస్య ధీర్జ్ఞానం విపరీతభావనా స్యాత్ అతస్మింస్తద్బుద్ధిరితి యావత్. తాముదాహరతి.

టీ. యత్ = ఏవస్తువు, యథా=ఏవిధముగా, వర్తతే = ఉన్నదో, తస్య = ఆ వస్తువుయొక్క, తత్త్వం = యథార్థస్వరూపమును, హిత్వా=విడిచిపెట్టి, అన్యథాత్వధీః= వేఱొకవస్తువుగాఁ దలంచుట, పిత్రాదౌ = తండ్రి మొదలగువారియందు, అరిధీర్యథా= శత్రువు లనెడి బుద్ధివలె, విపరీతా భావనా = విపరీతభావన, స్యాత్ =అగును.

తా. ముత్యపుచిప్పను జూచి వెండి యని యొక వస్తువునం దింకొక వస్తువుయొక్క యారోపణము చేయు బుద్ధి తల్లిదండ్రులు మొదలగు నాప్తజనులయందు శత్రుభావంబువలె విపరీతభావన యగు నని యెఱుంగ నగును.

అవ. ఈ చెప్పఁబడిన విపరీతభావనాలక్షణమును ప్రకృతాంశమునందు సరిపెట్టుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా దేహాదిభిన్నోఽయం మిథ్యా చేదం జగత్తయోః,
దేహాద్యాత్మత్వసత్యత్వధీ ర్విపర్యయభావనా. 111

వ్యా. ఉక్తలక్షణం ప్రకృతే యోజయతి ఆత్మేతి. అయమాత్మా వస్తుతో దేహాదిభ్యో భిన్నః. ఇదం జగచ్చ మిథ్యా. ఏవం సత్యపి తయోరాత్మజగతోర్యథాక్రమం దేహాద్యాత్మత్వబుద్ధిర్జగత్సత్యత్వబుద్ధిశ్చ యా సా విపరీతభావనేత్యర్థః.

టీ. అయం ఆత్మా=ఈప్రత్యగాత్మ, దేహాదిభిన్నః = దేహేంద్రియాదులకంటె వేఱగును. ఇదం జగచ్చ = దేహేంద్రియాదిప్రపంచంబును, మిథ్యా = వాస్తవముగా లేని దగును. (ఇట్లున్నను), తయోః = ఆ యాత్మజగత్తులయందు, దేహాద్యాత్మత్వసత్యత్వధీః-దేహాది=దేహాదులయందు, ఆత్మత్వ=ఆత్మత్వబుద్ధియు, సత్యత్వధీః=దేహేంద్రియాది జగత్తునందు సత్యత్వబుద్ధియు, విపర్యయభావన యగును.

తా. ఈప్రత్యగాత్మ దేహేంద్రియాదులకంటె భిన్నుఁడు. దేహేంద్రియాది జగత్తును మిథ్య యగును. ఇట్లుండ దేహేంద్రియాదులే యాత్మ యనియు దేహేంద్రియాది జగత్తు సత్య మనియు నెంచుట విపరీతభావన యగును.

అవ. ఇంతకు ముందు విపరీతభావన యేకాగ్రతవలన నశించు నని సామాన్యముగాఁ దెలుపఁబడెను. ఇప్పుడు విపరీతభావన తత్త్వభావనచేత నశించు నని విశేషాకారముగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వభావనయా నశ్యేత్సాఽతో దేహాతిరిక్తతాం,
ఆత్మనో భావయేత్తద్వ న్మిథ్యాత్వం జగతోఽనిశమ్. 112

వ్యా. పూర్వమైకాగ్ర్యాత్సా నివర్తత ఇతి సామాన్యేనోక్తమర్థం విశేషాకారేణాహ—తత్త్వభావనయేతి. సా దేహాద్యాత్మత్వజగత్సత్యత్వధీరూపా విపరీతభావనా తత్త్వభావనయా ఆత్మనోదేహాతిరిక్తత్వస్య జగతో మిథ్యాత్వస్య చ భావనయా నిరంతరధ్యానేన నశ్యేత్. అత ఆత్మనో దేహాతిరిక్తత్వం దేహాజగతోర్మిథ్యాత్వం చ సదా భావయేదిత్యుక్తం.

టీ. సా=అవిపరీతభావన, తత్త్వభావనయా - తత్త్వ=ప్రత్యగాత్మ పరమాత్మయే యనెడి, భావనయా = ధ్యానముచేత, నశ్యేత్ =నశించును. అతః = ఈహేతువువలన, అనిశం=ఎల్లప్పుడును, ఆత్మనః = ప్రత్యగాత్మకు, దేహాతిరిక్తతాం - దేహ = స్థూలసూక్ష్మ కారణశరీరములకంటె, అతిరిక్తతాం = వేఱగుటను, భావయేత్ = ధ్యానింపవలయును. తద్వత్ = అటులనే, అనిశం = ఎల్లప్పుడును, జగతః = దేహేంద్రియాది ప్రపంచము యొక్క, మిథ్యాత్వం = నిజముగా లేకుండుటను, భావయేత్ = ధ్యానింపవలయును.

తా. విపరీతభావన ప్రత్యగభిన్న పరమాత్మధ్యానముచేత నశించును. కావున నెల్లప్పుడును ప్రత్యగాత్మ దేహేంద్రియాదులకన్న వే ఱనియు, నటులనే దేహేంద్రియాదిప్రపంచము మిథ్య యనియు చింతనము చేయవలయును.

అవ. అట్టి ధ్యానవిషయములో జపము చేయునపుడు కొన్ని నియమము లున్నట్లు నియమము లేవైనఁ గలవా యని పూర్వపక్షి శంకించుచున్నాఁడు:—

శ్లో. కిం మంత్రజపవ న్మూర్తిధ్యానవ చ్చాత్మభేదధీః,
జగన్మిథ్యాత్వధీశ్చాత్ర హ్యావర్త్యా స్యాదుతాన్యథా. 113

వ్యా. తత్ర జపాదావివనియమాపేక్షాస్తినా? న వేతి పృచ్ఛతి—కిం మంత్రజపవదితి. ఆత్మభేదధీరాత్మనో దేహాదిభ్యోవిభిన్నజ్ఞానం జగతో మిథ్యాత్వానుసంధానం చ మంత్రజపవ ద్దేవతాధ్యానాదివత్కిం నియమేనానుష్ఠాతవ్య ముత లౌకిక వ్యవహారావన్నియమమంతరేణాపి కర్తుం శక్యత ఇతి.

టీ. ఆత్మభేదధీః = ప్రత్యగాత్మ వే ఱనెడి జ్ఞానము, జగన్మిథ్యాత్వధీశ్చ=ప్రపంచముయొక్క మిథ్యాత్వజ్ఞానంబును, మంత్రజపవత్ = మంత్రజపమువలెను, మూర్తిధ్యానవచ్చ=దేవతామూర్తులయొక్క ధ్యానమువలెను, అత్ర=ఈబ్రహ్మాభ్యాసమునందు, ఆవర్త్యా=మాటిమాటికి నావృత్తి చేయఁదగినది, స్యాత్కిం = అగునా? ఉత = లేక, అన్యథా = ఇంకొక విధముగా, స్యాత్కిం = అగునా?

తా. ప్రత్యగాత్మ దేహాదులకంటె వే ఱనెడి జ్ఞానంబును, దేహేంద్రియాదిజగత్తంతయు మిథ్య యనెడి జ్ఞానంబును మంత్రజపము వలెను దేవతలను ధ్యానించుటవలెను నియమముతో నిన్ని సారు లని చేయవలయునా? లేక యితర వ్యవహారములవలెనే నియమములు లేక చేయవలయునా? యని పూర్వవాది శంకించుచున్నాఁడు.

అవ. ఇప్పుడు పూర్వపక్షి యడిగినదానికి సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్యథేతి విజానీహి దృష్టార్థత్వేన భుక్తివత్,
బుభుక్షు ర్జపవద్భుఙ్క్తే న కశ్చిన్ని యతః క్వచిత్. 1

వ్యా. దృష్టఫలకత్వాన్నాత్ర నియమః కశ్చిదస్తీత్యాహ—అన్యథేతి. అన్య నియమం విద్ధీత్యర్థః. తత్ర హేతుమాహ—దృష్టార్థత్వేతి. తత్ర దృష్టాంతమాహ—భుక్తివదితి, దృష్టార్థేఽపిభోజనే నియమః శ్రుతిస్మృత్యో రుపలభ్యత ఇత్యాశంక్యాహ—బుభుక్షురితి క్షుదపనయనాయ భోక్తుమిచ్ఛుపురుషో జపం కుర్వాణ ఇవ ని మేన భుఙ్క్తే అపితు యథా క్షుద్బాధోపశాంతి స్స తథా భోజనం కరోతీత్యర్థః.

టీ. దృష్టార్థత్వేన=ప్రత్యక్షఫలము కల దగుటచేత, భుక్తివత్ = భోజనము అన్యథేతి=నియమ మక్కఱలేదని, విజానీహి = తెలిసికొనుము. బుభుక్షుః = భోజన చేయఁదలఁచిన, కశ్చిత్ = ఎవఁడును, నియతస్సన్ = నియమము గలవాఁ డగు క్వచిత్ = ఎన్నఁడును, జపవత్ = జపము చేయువానివలె, న భుంక్తే=భుజింపఁడు.

తా. ఈబ్రహ్మాభ్యాసము ప్రత్యక్షఫలము గలది గనుక నియ మేమియు లేకయే చేయ నగును. ఎటుల యనఁగా, కేవల క్షు వారణముకొఱకు భోజనము చేయువాఁడు జపము చేయువానివలె ని మముతో భుజించుట లేదు. మఱి యెట్లు భుజించు ననఁగా; క్షుద్బా నివృత్తియగునట్లు భోజనము చేయును.

అవ. ఈసంగతిని వివరించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అశ్నాతి వా నవాశ్నాతి భుంక్తేవా స్వేచ్ఛయాఽ న్యథా,
యేన కేన ప్రకారేణ క్షుధామపనినీషతి. 1

వ్యా. ఏతదేవ ప్రపంచయతి—అశ్నాతి వాన్నే సతి కదాచిద్భుఙ్క్తే. న శ్నాతి తస్మిన్నసతి క్షుద్బాధానివారక ద్యూతాదిచేష్టయాఽనశ్నన్నేవ కాలం న అన్యథా వా తిష్ఠన్ గచ్ఛన్ శయానో వా స్వేచ్ఛయా భుఙ్క్తే యేన కేన ప్ర రేణ తత్కాలికీం క్షుద్బాధా మపనేతుమిచ్ఛతి. అయమభిసంధిః క్షుద్బాధానివ రక్షణదృష్టఫలాయ భోజనమేవం కార్యం. నియమాస్తు పరలోకహేతవ ఇతి.

టీ. (అన్నే సతి = అన్నము దొరకినపుడు), అశ్నాతి వా = భుజింపవచ్చు (అన్నే అసతి = అన్నము దొరకనపుడు), నవాశ్నాతి = భోజనము చేయకయు చ్చును. (అనఁగా ఆఁకలిబాధ తెలియకుండుటకు నేయాటలోనో యాడుచు కా గడపు ననుట), అన్యథా వా=మఱియొక విధముగా నైనను, స్వేచ్ఛయా=తనయిచ్ఛ నట్లు, భుంక్తే=నిలుచుండియో పండుకొనియో నడచుచునో భుజించుచున్నాఁడు. కేన ప్రకారేణ = ఏవిధముచేతనైనను, క్షుధాం = అప్పటి క్షుద్బాధను, అపనినీ పోఁగొట్టుకొనఁ దలఁచుచున్నాఁడు.

తా. లోపల నపరిమితముగా నాఁకలి యగుచున్నప్పు డన్నము దొరకిన భుజించును. లేకున్న నాబాధ తెలియకుండుటకు చీట్లాట, పులిజూదము, చదరంగము మొదలైన యాటలలో దేనితోడనో కాలము గడపుచు నేమియుఁ దినక పోవును. అథవా యేదైన పండు మొదలైన వానితో దేనినైన నియమములేక కూర్చుండియో నిలుచుండియో పండుకొనియో నోట వేసికొనును. ఏదో యొక విధమున నాఁకలి పోఁ జూచును. పరలోకలాభము శ్రుతిస్మృతులయందు దెలుపఁబడినవిధమున నియమముతో నాచరించువానికిఁ గలదు, గాని వీఁడు అప్పటి యాఁకలి మాత్రము పోఁ జూచెడివాఁడు గనుక నియమము లేవియు లేకయే భుజించును.

అవ. జపము మొదలగువానియం దైతే భోజనమువలె కా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నియమేన జపం కుర్యా దకృతౌ ప్రత్యవాయతః,
అన్యథాకరణేఽనర్థస్స్వరవర్ణవిపర్యయాత్. 116

వ్యా. జపాదౌ భోజనాద్వైలక్షణ్యం దర్శయతి—నియమేనేతి. తత్ర హేతుమాహ—అకృతావితి. భవత్యేవమకరణే ప్రత్యవాయశ్చ. అన్యథాకరణేతు స నాస్తీత్యాశంక్యాహ—అన్యథేతి. "మంత్రో హీనస్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తోన తమర్థమాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుస్స్వరతోఽపరాధా" దిత్యుక్తత్వాదితి భావః.

టీ. జపం = జపమును, నియమేన = నియమముతో, కుర్యాత్ = చేయవలయును. అకృతౌ = నియమములో చేయనపుడు, ప్రత్యవాయతః = పాపము గలుగుచుండుటవలన (నియమముతో జపము సేయవలయును). అన్యథా = వేఱొకవిధముగా, స్వరవర్ణవిపర్యయాత్ - స్వర = ఉదాత్తాదిస్వరములయొక్కయు, వర్ణ = అకారాద్యక్షరములయొక్కయు, విపర్యయాత్ = తారుమారుగా నుచ్చరించుటవలన, కరణే = మంత్రజపము చేయుటయందు, అనర్థః = కీడు (స్యాత్ = కలుగును).

తా. మంత్రానుష్ఠానము మొదలగునవి యదృష్టఫలకము లగుటం జేసి (అప్రత్యక్షఫలమును గలిగించునవి యగుటచేత) వానిని బహునియమముతోఁ జేయవలెను. మంత్రములో స్వరముగాని యక్షరముగాని లోపించినను తారుమారైనను కీడు వాటిల్లును. శ్లో. "మంత్రో హీనస్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థ

శ్లో. అన్యథేతి విజానీహి దృష్టార్థత్వేన భుక్తివత్,
బుభుక్షుర్జపవద్భుఙ్క్తే న కశ్చిన్నియతః క్వచిత్. 114

వ్యా. దృష్టఫలకత్వాన్నాత్ర నియమః కశ్చిదస్తీత్యాహ—అన్యథేతి. అన్యథా నియమం వినేత్యర్థః. తత్ర హేతుమాహ—దృష్టార్థత్వేతి. తత్ర దృష్టాంతమాహ—భుక్తివదితి, దృష్టార్థేఽపిభోజనే నియమః శ్రుతిస్మృతిభ్యో రుపలభ్యత ఇత్యాశంక్యాహ—బుభుక్షురితి క్షుదపనయనాయ భోక్తుమిచ్ఛుప్పురుషో జపం కుర్వాణ ఇవ నియమేన భుఙ్క్తే అపితు యథా క్షుద్బాధోపశాంతి స్స తథా భోజనం కరోతీత్యర్థః.

టీ. దృష్టార్థత్వేన=ప్రత్యక్షఫలము కల దగుటచేత, భుక్తివత్ = భోజనమువలె, అన్యథేతి=నియమ మక్కఱలేదని, విజానీహి = తెలిసికొనుము. బుభుక్షుః = భోజనము చేయఁదలఁచిన, కశ్చిత్ = ఎవఁడును, నియతస్సన్ = నియమము గలవాఁ డగుచు, క్వచిత్ = ఎన్నఁడును, జపవత్ = జపము చేయువానివలె, న భుంక్తే=భుజింపఁడు.

తా. ఈబ్రహ్మాభ్యాసము ప్రత్యక్షఫలము గలది గనుక నియమ మేమియు లేకయే చేయ నగును. ఎటుల యనఁగా, కేవల క్షున్నివారణముకొఱకు భోజనము చేయువాఁడు జపము చేయువానివలె నియమముతో భుజించుట లేదు. మఱి యెట్లు భుజించు ననఁగా; క్షుద్బాధ నివృత్తియగునట్లు భోజనము చేయును.

అవ. ఈసంగతిని వివరించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. అశ్నాతి వా నవాశ్నాతి భుంక్తేవా స్వేచ్ఛయాఽన్యథా,
యేన కేన ప్రకారేణ క్షుధామపనినీషతి. 115

వ్యా. ఏతదేవ ప్రపంచయతి—అశ్నాతి వాన్నే సతి కదాచిద్భుఙ్క్తే. నవాశ్నాతి తస్మిన్నసతి క్షుద్బాధానివారక ద్యూతాదిచేష్టయాఽనశ్నన్నేవ కాలం నయతి. అన్యథా వా తిష్ఠన్ గచ్ఛన్ శయానో వా స్వేచ్ఛయా భుఙ్క్తే యేన కేన ప్రకారేణ తత్కాలికీం క్షుద్బాధా మపనేతుమిచ్ఛతి. అయమభిసంధిః క్షుద్బాధానివృత్తిరక్షణదృష్టఫలాయ భోజనమేవం కార్యం. నియమాస్తు పరలోకహేతవ ఇతి.

టీ. (అన్నే సతి = అన్నము దొరకినపుడు), అశ్నాతి వా = భుజింపవచ్చును. (అన్నే అసతి = అన్నము దొరకనపుడు), నవాశ్నాతి = భోజనము చేయకయు పోవచ్చును. (అనఁగా ఆఁకలిబాధ తెలియకుండుటకు నేయాటలానో యాడుచు కాలము గడపు ననుట), అన్యథా వా=మఱియొక విధముగా నైనను, స్వేచ్ఛయా=తనయిచ్ఛవచ్చినట్లు, భుంక్తే=నిలుచుండియో పండుకొనియో నడచుచునో భుజించుచున్నాఁడు. యేన కేన ప్రకారేణ = ఏవిధముచేతనైనను, క్షుధాం = అప్పటి క్షుద్బాధను, అపనినీషతి= పోఁగొట్టుకొనఁ దలఁచుచున్నాఁడు.

తా. లోపల నపరిమితముగా నాఁకలి యగుచున్నప్పు డన్నము దొరకిన భుజించును. లేకున్న నాబాధ తెలియకుండుటకు చీట్లాట, పులిజూదము, చదరంగము మొదలైన యాటలలో దేనితోడనో కాలము గడపుచు నేమియుఁ దినక పోవును. అథవా యేదైన పండు మొదలైన వానితో దేనినైన నియమములేక కూర్చుండియో నిలుచుండియో పండుకొనియో నోట వేసికొనును. ఏదో యొక విధమున నాఁకలి పోఁ జూచును. పరలోకలాభము శ్రుతిస్మృతులయందు దెలుపఁబడినవిధమున నియమముతో నాచరించువానికిఁ గలదు, గాని వీఁడు అప్పటి యాఁకలి మాత్రము పోఁ జూచెడివాఁడు గనుక నియమము లేవియు లేకయే భుజించును.

అవ. జపము మొదలగువానియం దైతే భోజనమువలె కా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నియమేన జపం కుర్యా దకృతౌ ప్రత్యవాయతః,
అన్యథాకరణేఽనర్థస్స్వరవర్ణవిపర్యయాత్. 116

వ్యా. జపాదౌ భోజనాద్వైలక్షణ్యం దర్శయతి—నియమేనేతి. తత్ర హేతుమాహ—అకృతావితి. భవత్యేవమకరణే ప్రత్యవాయశ్చ. అన్యథాకరణేతు స నాస్తీత్యాశంక్యాహ—అన్యథేతి. "మంత్రో హీనస్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుస్స్వరతోఽపరాధా" దిత్యుక్తత్వాదితి భావః.

టీ. జపం = జపమును, నియమేన = నియమముతో, కుర్యాత్ = చేయవలయును. అకృతౌ = నియమముతో చేయనపుడు, ప్రత్యవాయతః = పాపము గలుగుచుండుటవలన (నియమముతో జపము సేయవలయును). అన్యథా = వేఱొకవిధముగా, స్వరవర్ణవిపర్యయాత్ - స్వర = ఉదాత్తాదిస్వరములయొక్కయు, వర్ణ = అకారాద్యక్షరములయొక్కయు, విపర్యయాత్ = తారుమారుగా నుచ్చరించుటవలన, కరణే = మంత్రజపము చేయుటయందు, అనర్థః = కీడు (స్యాత్ = కలుగును).

తా. మంత్రానుష్ఠానము మొదలగునవి యదృష్టఫలకము లగుటం జేసి (అప్రత్యక్షఫలమును గలిగించునవి యగుటచేత) వానిని బహు నియమముతోఁ జేయవలెను. మంత్రములో స్వరముగాని యక్షరముగాని లోపించినను తారుమారైనను కీడు వాటిల్లును. శ్లో. "మంత్రో హీనస్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థ

మాహ, సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశ్శతుస్స్వరతో పరాధాత్." మంత్రానుష్ఠానాదులలో నేలోపము కలిగినను ననర్థము పొసఁగు నని దీనివలనఁ దెలియుచున్నది.

అవ. ఆఁకలిబాధ యెప్పటి కప్పుడు కనఁబడెడిది గనుక నియమము లేక భుజించిన భుజింపవచ్చును. విపరీతభావన ప్రత్యక్షముగా నప్పుడు బాధ గలిగింపక పోవుట చేత నదృష్టఫలము నిచ్చెడు బ్రహ్మాభ్యాసము నియమముతోఁ జేయవలదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. క్షుధేవ దృష్టబాధాకృద్విపరీతా చ భావనా,
జేయా కేనాప్యుపాయేన నాస్త్యత్రానుష్ఠితేః క్రమః. 117

వ్యా. నను క్షుద్బాధాయాదృష్టబాధహేతుత్వాత్తన్నివృత్తయేఽనియమేనాపి భోక్తవ్యమేవ. విపరీతభావనాయాస్తు తథాత్వాభావాత్తన్నివర్తకం ధ్యానమదృష్టఫలాయ నియమేనానుష్ఠేయమిత్యాశంక్యాహ—క్షుధేవేతి. విపరీతభావనాయా దుఃఖహేతుత్వస్యానుభవసిద్ధత్వాదితి భావః.

టీ. క్షుధేవ = ఆఁకలివలె, విపరీతా భావనా చ = విపరీతభావనయు, దృష్టబాధాకృత్ = ప్రత్యక్షముగా బాధను గలిగించుచున్నది, (కనుక) కేనాప్యుపాయేన= ఏ ఉపాయముచేతనైనను, జేయా = గెలువఁదగినది. అత్ర = ఈవిపరీతభావనను నశింపఁజేయువిషయమున, అనుష్ఠితేః = ధ్యానానుష్ఠానముయొక్క, క్రమః=విధానము, నాస్తి = లేదు.

తా. క్షుద్బాధ యందఱకుఁ బ్రత్యక్షముగాఁ గష్టముఁ బెట్టుచున్నట్లు విపరీతభావనయును సకల దుఃఖములకు మూలముగా నున్నది గనుక దాని నెట్లైనను బోఁగొట్టుకొనవలయును. అట్టి విపరీతభావనను బోఁగొట్టునట్టి ధ్యానము విషయమున నేవిధ మగు నియమము నక్కఱలేదు.

అవ. ఆ విపరీతభావమునను బోఁగొట్టుకొనుట కుపాయ మేమి యందువా యది యిదివఱకే తెలుపఁబడిన దని చెప్పుచున్నాఁడు.—

శ్లో. ఉపాయః పూర్వ మేవోక్త స్తచ్చింతాకథనాదికః.
ఏతదేకపరత్వేఽపి నిర్బంధో ధ్యానవ న్నహి. 118

వ్యా. తర్హి స ఉపాయః ప్రదర్శనీయ ఇత్యాశంక్య పూర్వమేవ ప్రదర్శిత ఇత్యాహ—ఉపాయ ఇతి. నను జపవత్పాఠ్యమ్ముఖత్వాదినియమో మాభూద్ధ్యానవదేవ తదైకపరత్వలక్షణైకాగ్రతానిర్బంధోఽస్తీత్యాశంక్యాహ—ఏతదితి.

టీ. తచ్చింతాకథనాదికః - తత్ = అప్రత్యగభిన్న బ్రహ్మముయొక్క, చింతా = ధ్యానంబును, కథనాదికః = సంభాషణంబును మొదలుగాఁగల, ఉపాయః = ఉపాయము (బ్రహ్మాభ్యాసము), పూర్వమేవ = ఇంతకు మున్నే, ఉక్తః = తెలుపఁబడినది. ఏతదేకపరత్వేఽపి-ఏతత్ = ఈప్రత్యగభిన్న మగు పరమాత్మయొక్క, ఏకపరత్వేఽపి = ముఖ్యముగా చిత్తైకాగ్రతను గలుగఁజేయు నిదిధ్యాసనమునందును, ధ్యానవత్ = ధ్యానమునందు వలె, నిర్బంధః = నియమము, నహి = లేనే లేదు.

తా. ప్రత్యగభిన్న మగు పరమాత్మను ధ్యానించెడు విషయమున "తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనం, ఏతదేక పరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" అనెడి నూటయాఱవ శ్లోకంబున నుపాయము చెప్పఁబడెను. ఆపరబ్రహ్మమును ప్రత్యగభిన్న స్వరూపముగ సర్వదా ధ్యానింపవలెను. అట్టి పరబ్రహ్మమును గుఱించియే ముచ్చటించుట మొదలగునదియే యుపాయం బగును. ధ్యానమునందు వలె బ్రహ్మమునుగుఱించి నిదిధ్యాసనమును చేయుటలో నియమము పని లేదు.

అవ. ధ్యానమందు మాత్రము నిర్బంధ మేమి యున్నది? ధ్యానింపఁదగిన మూర్తిని జింతించుటయే కదా యని శంకించి యందలి నిర్బంధమును దెలుపుటకు ధ్యానస్వరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మూర్తిప్రత్యయసాంతత్యమన్యానంతరితం ధియః,
ధ్యానం తత్రాతినిర్బంధో మనసశ్చంచలాత్మనః. 119

వ్యా. నను ధ్యానస్య ధ్యేయచింతామాత్రాత్మకత్వాత్తత్ర కో నిర్బంధ ఇత్యాశంక్య ధ్యానే నిర్బంధం దర్శయితుం ధ్యానస్వరూపం తావదాహ—మూర్తీతి. ధియో బుద్ధేస్సంబంధినాం మూర్తిప్రత్యయానాం దేవతాదిమూర్తిగోచరాణాం ప్రత్యయానాం యత్సాంతత్యమవిచ్ఛిన్నతయా ప్రవాహత్వం తదన్యానంతరితం అన్యేన విజాతీయప్రత్యయేనావ్యవహితం సద్ధ్యానమిత్యుచ్యతే ఏవం ధ్యానస్వరూపం నిరూప్య తత్ర నిర్బంధం దర్శయతి—తత్రేతి. సదా పర్యటనశీలస్య కరితురగాదే రేకత్ర స్తంభాదౌ బంధనేన యథోపరోధో భవ తద్వదితి భావః.

టీ. ధియః = బుద్ధియొక్క, మూర్తిప్రత్యయసాంతత్యం - మూర్తి = ఆయా దేవతలయొక్క, ప్రత్యయ = స్వరూపజ్ఞానములయొక్క, సాంతత్యం = ఎడతెగకయుండుట, అన్యానంతరితం - అన్య = వేఱువిషయముచేత, అనంతరితం = వ్యవధానము లేని

దగుచు, ధ్యానం = ధ్యాన మనఁబడుచున్నది. తత్ర=అట్టిధ్యానమునందు, చంచలాత్మ నః = చపలస్వభావము గలిగిన, మనసః=చిత్తమునకు, అతినిర్బంధః = ఎక్కువ నిర్బంధము, (అస్తి = కలదు.)

తా. దేనిని మనము ధ్యానింతుమో యామూర్తివిషయక మగు జ్ఞానము తప్ప అన్యవిషయక మగు జ్ఞానమునకు నవకాశము లేదు. ఏదేవతామూర్తిని ధ్యానింతుమో యామూర్తిధ్యాన మవిచ్ఛిన్న తైలధారవలె నుండుట ధ్యానలక్షణము. ఈవిధ మగు ధ్యానములో నత్యంతము చపలస్వభావ మగు మనస్సును గదలకుండ నిల్పుటయందు, కరితురగాదులను కట్టుకట్టును బంధించినట్లు గొప్ప నిర్బంధము గలదు.

అవ. మనస్సు చాల చపలమైన దనుటయందు గీతావాక్యమును బ్రమాణముగాఁ జూపుచున్నాఁడు:—

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 120

వ్యా. మనసశ్చాంచల్యాదౌ గీతావాక్యం ప్రమాణయతి—చంచలంహీతి. ప్రమాథి ప్రమథశీలం పురుషస్య వ్యాకులత్వకారణం బలవత్సమర్థ మనిగ్రాహ్యమిత్యర్థః. దృఢం సత్యసతి వా విషయే లగ్నం తత ఉద్ధర్తుమశక్యమిత్యర్థః, అతస్తస్య మనసో నిగ్రహో వాయోర్నిగ్రహ ఇవ సుదుష్కరః.

టీ. హేకృష్ణ = ఓకృష్ణా! మనః = మనస్సు, చంచలం= మిక్కిలి చపలస్వభావము గలదియు, ప్రమాథి = ఎప్పుడును వ్యాకులత గలిగించునదియు, బలవత్=నిగ్రహింపశక్యము గానిదియు, దృఢం = సద్విషయమునో దుర్విషయమునో పట్టుకొనెనా యావిషయము నుండి మరలింప నలవికానిదియు (భవతి=అగుచున్నది.) తస్య = అట్టి మనస్సుయొక్క, నిగ్రహం = అరికట్టుట, వాయోరివ = గాలిని నిరోధించుటను వలె, సుదుష్కరం = చాల దుష్కరముగా (చేయనలవిగానిదిగా), మన్యే = తలంచుచున్నాను.

తా. అర్జునుఁడు భగవంతునితో ని ట్లనుచున్నాఁడు:—ఓకృష్ణా! మనస్సు ఎప్పుడును జలించునదియు వ్యాకులత గలిగించునదియు నిగ్రహింప నలవి గానిదియు ఏవిషయమున నేని ప్రవేశించెనా యిఁక నచ్చటినుండి మరల్ప శక్యము గానిదియు నై యున్నది. ఇట్టి మనస్సును

నిగ్రహించుట వాయువును నిగ్రహించుటవలె చాల కష్టసాధ్యముగా నున్నది.

అవ. మనోనిగ్రహము దుష్కరమైన దనుటలో గీతావాక్యమును దెలిపి యోగ వాసిష్ఠమునందలి శ్లోకమును బ్రమాణముగాఁ జూపుచున్నాఁడు:—

శ్లో. అప్యబ్ధిపానా న్మహత స్సుమేరూన్మూలనా దపి,
అపి వహ్న్యశనాత్సాధో విషమశ్చిత్తనిగ్రహః. 121

వ్యా. మనసో దుర్నిగ్రహత్వే వాసిష్ఠవాక్యమపి ప్రమాణయతి—అపీతి.

టీ. హేసాధో = ఓవసిష్ఠమహర్షీ, అబ్ధిపానాదపి = సముద్రోదకము నంతయు త్రాగుటకంటెను, మహతః = గొప్పది యగు, సుమేరూన్మూలనాదపి=గొప్ప మేరుపర్వతమును పెల్లగించుటకంటెను, వహ్న్యశనాదపి = అగ్నిని మ్రింగుటకంటెను, చిత్తనిగ్రహః = మనస్సును వశపఱచుకొనుట, విషమః = సాధ్యముగానిది, భవతి = అగుచున్నది.

తా. ఓవసిష్ఠమహర్షీ! సముద్రోదకము నంతయు పానముచేయుటకంటెను, పర్వతములలో గొప్పది యగు మేరుపర్వతమును పెల్లగించుటకంటెను, జ్వాలాగ్నిని మ్రింగుటకంటెను మనస్సును నిరోధించుట చాల కష్టతర మగు నని శ్రీరామచంద్రమూర్తి తెల్పెను.

అవ. ఇట్లు ధ్యానవిషయమున మనస్సును నిగ్రహించుట మొదలగుకష్ట మతిశయముగా నున్నది; బ్రహ్మాభ్యాసమున నిట్టి నిర్బంధములు లే వని తెల్పుచున్నాఁడు:—

శ్లో. కథనాదౌ న నిర్బంధశ్శృంఖలాబద్ధదేహవత్,
కిం త్వనంతేతి హాసాద్యైర్వినోదో నాట్యవద్ధియః. 122

వ్యా. ప్రకృతే తతో వైషమ్యం దర్శయతి—కథనాదావితి. శృంఖలాబద్ధదేహస్య యథా నిర్బంధః న తథా కథనాదావిత్యర్థః. ఆదిశబ్దేన తచ్చింతనాది సంగృహ్యతేన కేవలం నిర్బంధాభావశ్చ ప్రత్యుత ధియో వినోద ఇత్యాహ—కింత్వితి.ఇతిహాసః పూర్వేషాం కథా ఆద్యా యేషాం లౌకికకథానుకూలయుక్తిదృష్టాంత ప్రదర్శనాదీనాం తే అనంతాః అసంఖ్యాః. అనంతాశ్చతే ఇతిహాసాద్యాశ్చేత్యనంతేతిహాసాద్యాస్తైర్ధియః బుద్ధేర్వినోదః క్రీడావిషయో భవతి. తత్రదృష్టాంతః—నాట్యవదితి. నృత్యక్రియానిరీక్షణమివేత్యర్థః.

టీ. శృంఖలాబద్ధదేహవత్ - శృంఖలా = సంకెళ్లచేత, బద్ధ = బంధింపఁబడిన, దేహవత్ = దేహమునకు వలె, కథనాదౌ = పరబ్రహ్మస్వరూపమును గూర్చి చెప్పుట

మొదలగువానియందు, నిర్బంధః=కష్టము, న=లేదు. కింతు=ఇఁక నే మనఁగా, అనంతేతి హాసాద్యైః-అనంత = లెక్కలేని, ఇతిహాసాద్యైః=పూర్వులకథలు మున్నగువానిచేత, ధియః = బుద్ధికి, నాట్యవత్ = నాట్యమును జూచునట్లు, వినోదః = ఉత్సాహము (భవేత్ = కలుగును).

తా. సంకెళ్ళచే నిర్బంధింపఁబడిన దేహమునకుఁ గల నిర్బంధము వంటి నిర్బంధము, బ్రహ్మస్వరూపవిషయికసంభాషణచింతనాదిరూప మగు బ్రహ్మాభ్యాసమందు లేకపోవుటయే కాక, ఇతిహాసముచేతను, అపరిమితలౌకికకథానుకూల యుక్తి దృష్టాంతములను జూపుటచేతను, నాట్యక్రియను జూచునప్పుడు బుద్ధికి వినోదముగ నున్నట్లును, ఈ బ్రహ్మాభ్యాసమందుఁగూడ బుద్ధికి ఉత్సాహ మతిశయించును. (ఇతిహాస మనఁగా పూర్వులయొక్క చరిత్రము).

అవ. కథాదులచేత చిత్తైకాగ్రతారూప మగు నిదిధ్యాసనమునకు విఘాతము గలుగును గదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. చిదేవాత్మా జగన్మిథ్యేత్యత్ర పర్యవసానతః,
నిదిధ్యాసనవిక్షేపో నేతిహాసాదిభిర్భవేత్. 123

వ్యా. నను కథాదిభిరపి తదేకపరత్వవిఘాతస్స్యాదిత్యాశంక్యాహ—చిదేవేతి= ఇతిహాసాదీనామాత్మా చిన్మాత్రరూపో న దేహాదిరూపః జగచ్చ మిథ్యేత్యేతస్మిన్నర్థే పర్యవసానాన్నతై రేతదేకపరత్వశబ్దాభిధేయస్య నిదిధ్యాసనస్య విక్షేప ఇత్యర్థః.

టీ. ఆత్మా=ప్రత్యగాత్మ, చిదేవ = చిన్మాత్రరూపుఁడు, జగచ్చ = జగత్తంతయు, మిథ్యేతి=మిథ్య యనియు, అత్ర = ఈ అర్థమునందు, పర్యవసానతః=బ్రహ్మాభ్యాసము పర్యవసించుటవలన, ఇతిహాసాదిభిః-ఇతిహాస=పూర్వపుచరిత్రలు, ఆదిభిః=మొదలగువాని చేత, నిదిధ్యాసనవిక్షేపః - నిదిధ్యాసన=బ్రహ్మభావమునకు, విక్షేపః = విఘాతము, న భవేత్ = కలుగనేరదు.

తా. ప్రత్యగాత్మ చిన్మాత్రుఁ డగును, జగత్తు మిథ్య యగును అనెడి యర్థమునందు పర్యవసించుటవలన పూర్వచరిత్రలు మొదలగు వానిచేత నేను బ్రహ్మమనైతిని (బ్రహ్మాహమస్మి) అనెడి బ్రహ్మభావ మునకు (నిదిధ్యాసనమునకు) భంగము గలుగదు.

అవ. ఇతిహాసాదులచేత నిదిధ్యాసనమునకు భంగము గలుగనిచో కృషివాణిజ్య ములు చేసినను ఏకపరత్వమునకు (బ్రహ్మభావమునకు) భంగము కలుగదా యని యాశం కించి బదులు చెప్పుచున్నాఁడు.—

శ్లో. కృషివాణిజ్యసేవాదౌ కావ్యతర్కాదికేషు చ,
విక్షిప్యతే ప్రవృత్త్యా ధీస్తైస్తత్ర స్మృత్యసంభవాత్. 124

వ్యా. నన్వితిహాసాదీనామంగీకారే కృష్యాదేరపి ప్రసక్తిస్స్యాదిత్యాశంక్యాహ—కృషీతి.

టీ. ధీః=బుద్ధి, కృషివాణిజ్యసేవాదౌ - కృషి = వ్యవసాయము చేయుటయందును, వాణిజ్య = వర్తకము చేయుటయందును, సేవాదౌ = నౌకరిచేయుట మొదలగు వానియందును, కావ్యతర్కాదికేషు చ=కావ్యములు తర్కశాస్త్రము మొదలగువాని నభ్యసించుటయందును, ప్రవృత్త్యా=ప్రవర్తించుటచేత, విక్షిప్యతే = విశేషముగా చలించుచున్నది. తైః = ఆ కృషి మొదలగువానిచేత, తత్ర = ఆచిత్తైకాగ్రతయందు, స్మృత్యసంభవాత్=నేను బ్రహ్మ మైతి ననెడి స్మరణయొక్క, అసంభవాత్ = సంభవింపక పోవుటవలన (బుద్ధివిక్షేపము గలుగును).

తా. బ్రహ్మాభ్యాసము చేయువాఁడు వ్యవసాయమును వర్తకమును నౌకరిని కావ్యతర్కాదులను నభ్యసించుటయు మొదలగు వ్యవహారములను జేయునపుడు వానిచిత్త మితరత్ర ప్రవర్తించుటచేత నేను బ్రహ్మ మైతి ననెడి నిదిధ్యాసనము లేని దగుచు విక్షేపమును బొందుచున్నది. కావున బ్రహ్మాభ్యాసమునకు కృషివాణిజ్యాదులవలన భంగము గలుగును.

అవ. వ్యవసాయము మున్నగునవి తత్త్వానుసంధానమునకు విఘ్నకారులు గనుక వానిని బరిత్యజింపవలయును. అట్టివియే కనుక భోజనము మొదలగువానిని మాత్రము పరిత్యజింపవలదా యని శంకించి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనుసందధతైవాత్ర భోజనాదౌ ప్రవర్తితుం,
శక్యతేఽత్యంతవిక్షేపాభావాదాశు పునస్స్మృతేః. 125

వ్యా. నను కృష్యాదీనాం తత్త్వానుసంధానవిఘాతిత్వేన, త్యాజ్యత్వే భోజనాదేరపి తథాత్వాత్తదపి త్యాజ్యమేవేత్యాశంక్యాహ—అనుసందధతైవేతి. కుతఇత్యత ఆహ—అత్యంతేతి. విక్షేపాభావోఽపి కుత ఇత్యత ఆహ—ఆశు పునస్స్మృతేరితి.

టీ. అనుసందధతా = తత్త్వానుసంధానము చేయువానిచేత, అత్ర భోజనాదౌ= ఈభోజనము మొదలగువానియందు, అత్యంతవిక్షేపాభావాత్ =అంతగా విక్షేపము లేకపోవుటవలన, ఆశు = వెంటనే, పునః=తిరిగి, స్మృతేః = నేను బ్రహ్మము ననెడి స్మృతి గలుగుటవలన, ప్రవర్తితుం = ప్రవర్తించుటకు, శక్యతే ఏవ = శక్యమే యగుచున్నది.

తా. బ్రహ్మాభ్యాసము చేయువాఁడు కృష్యాదులను మానినట్లు భోజనాదులను మానవలసినపనిలేదు. ఎందువలన ననఁగా భోజనాదుల వలన నించుక బ్రహ్మభావమునకు మఱపు గలిగినను వెంటనే మఱల జ్ఞాపకమునకు వచ్చును గనుక భోజనాదుల మానవలసినపని లేదు.

అవ. ఇంచుకంత విక్షేపము గలిగినమాత్రమున పురుషార్థమునకు హాని కలుగవా యందువేమో చెప్పెద వినుము.

శ్లో. తత్త్వవిస్మృతిమాత్రాన్నా నర్థః కింతు విపర్యయాత్,
విపర్యేతుం న కాలోఽస్తి ఝుడితి స్మరతః క్వచిత్. 126

వ్యా. నను తదానీం విక్షేపాభావేఽపి తత్త్వవిస్మృతిసద్భావా త్పురుషార్థహాని స్స్యాదిత్యాశంక్యాహ—తత్త్వవిస్మృతీతి. నుతస్తర్హ్యనర్థ ఇత్యత ఆహ—కింతు విపర్యయాదితి. విస్మరణే సతి విపర్యయోఽపి స్యాదిత్యాశంక్యాహ—విపర్యేతుమితి.

టీ. తత్త్వవిస్మృతిమాత్రాత్ = బ్రహ్మస్వరూపమును మఱచినంతమాత్రమున, అనర్థ = పురుషార్థమునకు హాని, న=లేదు. కింతు=మఱి యే మనఁగా, విపర్యయాత్ = విపరీతభావనవలన, (అనర్థః=పురుషార్థహానియగును). ఝుడితి = శీఘ్రముగా, స్మరతః= బ్రహ్మభావమును స్మరించుచున్నవాఁ డగుచుండఁగా, క్వచిత్ = ఎచ్చటను, విపర్యేతుం = విపరీతభావమును బొందుటకు, కాలః = అవకాశము, నాస్తి = లేదు.

తా. ఇంచుకంత బ్రహ్మభావమును మఱచినమాత్రాన పురుషార్థహాని లేదు మఱి దేనివలన ననఁగా, నేను మనుష్యుఁడ నని విపరీతభావమును బొందుటవలన పురుషార్థహాని యగును. స్నానభోజనాదులను చేయుచున్నప్పుడు కొంచెము బ్రహ్మభావమును మఱచినను వెంటనే బ్రహ్మభావముతో నుండవచ్చును గనుక విపరీతభావన కవకాశము లేదు. కాఁబట్టి పురుషార్థహానియు లేదు.

అవ. భోజనాదులయందు ప్రవర్తించినట్లే తర్కాభ్యాసము మొదలగువానియందును ప్రవర్తించుచుండఁగా తర్కాభ్యాసాదులవలన బ్రహ్మభావమునకు భంగము కలుగు నని యేల చెప్పుచున్నా రనఁగా చెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్త్వస్మృతే రవపరో నాస్త్యన్యాభ్యాసశాలినః,
ప్రత్యుతాభ్యాసఘాతిత్వా ద్బలాత్తత్త్వముపేక్ష్యతే. 127

వ్యా. నను భోజనాదిషు ప్రవృత్తస్యేవ తర్కాద్యభ్యాసప్రవృత్తస్యాపి తత్త్వస్మరణం కిం న స్యాదిత్యాశంక్యాహ—తత్త్వస్మృతేరితి. న కేవలం తత్త్వానుసంధా

నావసరాభావ ఏవ కింతు కావ్యతర్కాద్యభ్యాసస్య. తత్త్వాభ్యాసవిరోధిత్వాత్తదానీం స్మృతమపి తత్త్వం బలాదుపేక్ష్యత ఇత్యాహ—ప్రత్యుతేతి.

టీ. అన్యాభ్యాసశాలినః-అన్య=తర్కము మొదలగు నితర శాస్త్రములయొక్క, అభ్యాసశాలినః = అభ్యసించెడు స్వభావము గలవానికి, తత్త్వస్మృతేః - తత్త్వ = బ్రహ్మాభావముయొక్క, స్మృతేః = స్మరించుటకు, అవసరః = అవసరము, నాస్తి = లేదు. ప్రత్యుత = విచారింపఁగా, అభ్యాసఘాతిత్వాత్ = బ్రహ్మాభ్యాసమును జెడఁ గొట్టున దగుటవలన, బలాత్ = ఇతర శాస్త్రాభ్యాసబలమువలన, తత్త్వం = బ్రహ్మాను సంధానము, ఉపేక్ష్యతే = ఉపేక్ష చేయఁబడును.

తా. తర్కాదుల నభ్యసించెడువానికి తత్త్వానుసంధానమున కవకాశ ముండదు. ఇంతయేకాక యవి యనాత్మ శాస్త్రము లగుటంజేసి తత్త్వాభ్యాసమునకు బాధకము లగును. అందువలన తత్త్వానుసంధాన ముపేక్షింపఁబడును గనుక తర్కాద్యభ్యాసము బ్రహ్మాభ్యాసికి తగ దని చెప్పితిమి.

అవ. తత్త్వానుసంధానమునకు బాధకములు గనుక యవి త్యాజ్యము లనుటకు ప్రమాణముం జూపుచున్నాఁడు:—

శ్లో. తమేవైకం విజానీథ హ్యన్యావాచో విముంచథ,
ఇతి శ్రుతం తథాన్యత్ర వాచో విగ్లాపనం త్వితి. 128

వ్యా. తత్త్వానుసంధానవిరోధిత్వాత్త్యాజ్యత్వేప్రమాణత్వేవ "తమేవైకం విజానథాత్మాన మన్యా వాచో విముంచథ, అమృతస్యైష సేతు" రితి శ్రుతివాక్యమర్థతః పఠతి—తమేవేతి. "నానుధ్యాయాద్బహూం చ్ఛబ్దా న్వాచోవిగ్లాపనం హి త"ది త్యేతదపి వాక్యం శ్రూయత ఇత్యాహ—తథేతి.

టీ. ఏకం=అద్వితీయుఁడగు, తమేవ=ఆపరబ్రహ్మమునే, విజానథ=తెలిసికొనుఁడు, అన్యాః వాచః = ఇతర శబ్దములను, విముంచథ = విడువుఁడు, ఇతి = ఈవిధముగా, శ్రుతంహి = ముండకోపనిషత్తునందు చెప్పఁబడినదిగదా, తథా = అదేప్రకారముగా, అన్యత్ర=వేఱొకశ్రుతియందును, వాచః=వాక్కునకు, విగ్లాపనంత్వితి = శ్రమహేతు వగు నని, (చెప్పఁబడినది.)

తా. శ్రు. "తమేవైకం విజానథాత్మాన మన్యావాచో విముంచథా అమృతస్యైష సేతుః." అద్వితీయుం డగు నాపరమాత్మనే తెలిసి కొనుఁడు. అనాత్మ విషయకములగు నితర వాక్యములను విడిచిపెట్టుఁడు. మోక్షమునకు ఇట్టి బ్రహ్మసాక్షాత్కారము సముద్రమునకు చెలియలి

కట్టవలె హద్దగుచున్నది అని యీశ్రుత్యర్థము. శ్రు. "నానుధ్యాయా బహూంచ్ఛబ్దాన్వాచో విగ్లాపనం హి తత్" అనాత్మవిషయకములగు ననేక శబ్దములను స్మరింప రాదు. అట్లు స్మరించుటవలన మనస్సునకును ఉచ్చరించుటవలన వాక్కునకును శ్రమ కలుగును. అని దీని యర్థము. కావున కావ్యతర్కాదుల నభ్యసించుట బ్రహ్మానుసంధానమునకు భంగకరము గనుక వానిని తత్త్వానుసంధానము జేయువాఁ డవశ్యముగా విడిచిపెట్టవలయును.

అవ. స్నానభోజనాదులను జేయవచ్చును. కావ్యతర్కాదుల నభ్యసింపఁ గూడదు, అనుట నా కంత బాగుండలేదు. వదలిపెట్టిన రెంటిని వదిలిపెట్టవలసినదే. స్వీకరించిన రెంటిని స్వీకరింపవలసినదే యని పట్టుదలతోఁ బ్రశ్నింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆహారాది త్యజన్నైవ జీవే చ్ఛాస్త్రాంతరం త్యజన్,
కిం న జీవసి యేనైవం కరోష్యత్ర దురాగ్రహమ్. 129

వ్యా. నను తత్త్వానుసంధానాతిరిక్తమాహారాది యథా న త్యజ్యత ఏవ మితరశాస్త్రాద్యభ్యాసోఽపి క్రియతా మిత్యాగ్రహం కుర్వాణం ప్రత్యాహ—ఆహారాదీతి.

టీ. ఆహారాది=అన్నపానాదులను, త్యజన్=విడిచిపెట్టినచో, నైవ జీవేత్ = జీవింప శక్యము కాదు. శాస్త్రాంతరం = ఇతర శాస్త్రమును (కావ్యతర్కాదులను), త్యజన్=వదలిపెట్టుచు, న జీవసి కిం = జీవింపలేవా (జీవింపవచ్చు ననుట), అత్ర = ఇందువిషయమున, యేన = ఏకారణముచేత, ఏవం = ఈవిధముగా, దురాగ్రహం = చెడ్డపట్టుదలను, కరోషి = చేయుచున్నావు?

తా. అన్నపానాదులను వర్జించి బ్రతుక లేము. కావ్యతర్కాద్యభ్యాసమును వర్జించి బ్రతుకలేమా? బ్రతుకవచ్చును. ఇట్టివిషయమున స్నానభోజనాదులు బ్రహ్మాభ్యాసమునకు బాధకములు గావు. కనుక చేయ వచ్చు నని నేను చెప్పఁగా కావ్యతర్కాదులు గూడఁ జేయ వచ్చు నని నీ కీ పిచ్చిపట్టుదల యేల? కావ్యతర్కాద్యభ్యాసము వలె భోజనాదిక మపాయకరము గా దని భావము.

అవ. అయితే జనకుఁడు మొదలగువారు తత్త్వవిదులు గదా. వారు రాజ్యపరిపాలనము మొదలగు వ్యవహారముల నెట్లు చేసిరి అని ప్రశ్నించుచున్నాఁడు:—

శ్లో. జనకాదేః కథం రాజ్య మితి చేద్దృఢబోధతః,
తథా తవాపి చేత్తర్కం పఠ యద్వా కృషిం కురు. 130

వ్యా. నను, తర్హి జనకాదీనాం త్త్వవిదామపి కథం రాజ్యపరిపాలనాదౌ ప్రవృత్తిరితి శంకతే—జనకాదేరితి. దృఢాపరోక్షజ్ఞానిత్వాత్తేషాం సా న బాధికేత్యభిప్రాయేణ పరిహరతి—తర్హి మమాపి దృఢబోధోఽస్తీతి వదంతం ప్రత్యాహ—తథేతి.

టీ: జనకాదేః = జనకుఁడు మొదలైనవారికి, రాజ్యం = రాజ్యపాలనము మొదలగు వ్యవహారప్రవృత్తి, కథమితి చేత్=ఎట్లు పనికివచ్చె నంటివా, దృఢబోధతః-దృఢ=చలింపని, బోధతః = అపరోక్షజ్ఞానమువలన (పనికి వచ్చె నని తెలియుము). తవాపి=నీకును, తథాచేత్ = అట్టి దృఢాపరోక్షజ్ఞానముగలిగి యుండెనేని, తర్కం = తర్కశాస్త్రమును, పఠ=అభ్యసింపుము. యద్వా=అట్లుగాక, కృషిం = వ్యవసాయమును, కురు = చేయుము.

తా. జనకుఁడు మొదలగు జ్ఞానులు రాజ్యపరిపాలనము మొదలగు వ్యవహారములు చేసియుండలేదా అని యనెదవేమో వారు దృఢమైనయపరోక్షజ్ఞానము గలవారు గనుక ఆవ్యవహారాదులు వారి బ్రహ్మాభ్యాసమునకు బాధకములు గాకపోయెను. నీకును అట్టి దృఢజ్ఞానము కలిగియుండినచో నపుడు కావ్యతర్కాభ్యాసముఁ జేసినను కృషివాణిజ్యాదులు సల్పినను బాధకము లేదు. దృఢాపరోక్షజ్ఞానము గలుగకపూర్వము ప్రాణములు నిల్పుటకు నన్నపానాదులు దక్క మఱి యేవియును బనికిరావు.

అవ. తత్త్వవేత్తలు సంసారము నిస్సారమైన దని యెఱింగియు నేల సంసారమునం బ్రవర్తించుచున్నారో అని యడిగెదవేని చెప్పెద వినుము:—

శ్లో. మిథ్యాత్వవాసనాదార్ఢ్యే ప్రారబ్ధక్షయకాంక్షయా,
అక్లిశ్నంతః ప్రవర్తంతే స్వస్వకర్మానుసారతః. 131

వ్యా. నను తత్త్వవిదస్సంసారాసారతాం జానంతః కుత స్తత్ర ప్రవర్తిష్యంతే ఇత్యాశంక్య ప్రారబ్ధస్యావశ్యం భావిఫలత్వాద్భోగేన తత్క్షయాయ ప్రవృత్తిరిత్యాహ—మిథ్యాత్వేతి.

టీ. మిథ్యాత్వవాసనాదార్ఢ్యే సతి - మిథ్యాత్వ=జగత్ మిథ్యాత్వముయొక్క, వాసనా = సంస్కారముయొక్క, దార్ఢ్యేసతి = దృఢత్వము గలిగియున్నప్పుడు, ప్రారబ్ధక్షయకాంక్షయా - ప్రారబ్ధ = ప్రారబ్ధకర్మయొక్క, క్షయ = నశించుటయొక్క, కాంక్షయా=కోరిక చేత, అక్లిశ్నంతః=ఏమి శ్రమ లేనివారగుచు, స్వస్వకర్మానుసారతః= తమ తమ ప్రారబ్ధానుసారముగ, ప్రవర్తంతే = ప్రవర్తించుచున్నారు.

తా. జ్ఞానులు జగత్తు మిథ్య యనియు, బ్రహ్మస్వరూపము కన్న నితర మేమియు లేదనియు దృఢజ్ఞానము గలవారు గనుక ప్రారబ్ధకర్మము ననుసరించి యాప్రారబ్ధక్షయమును గోరుచు క్లేశరహితులై సంసారమునం బ్రవర్తించుచున్నారు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" = ప్రారబ్ధకర్మ మనుభవించినం గాని క్షయింప దని యున్నది గనుక ప్రారబ్ధక్షయముకొఱకుంగాను జ్ఞానులు సంసారమునం బ్రవర్తించుచున్నా రని యెఱుంగవలయును.

అవ. అయితే అనాచారమునందుం గూడం బ్రవృత్తి యుండునా యని శంకించి బదులు చెప్పుచున్నాఁడు:—

శ్లో. అతి ప్రసంగో మాశంక్యస్స్వకర్మవశవర్తినాం,
అస్తు వా కేన శక్యేత కర్మ వారయితుం వద. 132

వ్యా. తర్హ్యనాచారేఽపి ప్రవృత్తిస్స్యాదిత్యాశంక్యాహ—అతిప్రసంగ ఇతి. ప్రారబ్ధవశాదేవాతిప్రసఙ్గోఽపి స్యాదిత్యాశంక్యాంగీకరోతి—అస్త్వితి.

టీ. స్వకర్మవశవర్తినాం = తమ ప్రారబ్ధకర్మాధీనముగాం బ్రవర్తించెడి జ్ఞానులకు, అతి ప్రసంగః=అతిప్రసంగము, మా శంక్యః = శంకింపరాదు. అస్తు వా=అతిప్రసంగము గలిగినం గలుగుంగాక, కేన = ఎవ్వనిచేత, కర్మ=ప్రారబ్ధకర్మము, వారయితుం = నివారించుటకొఱకు, శక్యేత = శక్యమగునో, వద = చెప్పుమా.

తా. తమతమ ప్రారబ్ధకర్మము ననుసరించి ప్రవర్తించెడి జ్ఞానులు విధినిషేధముల గమనించి ప్రవర్తింప రనంగూడదు. ఒకవేళం బ్రవర్తించినం బ్రవర్తింతురుగాక, ప్రారబ్ధకర్మమును నడ్డగించుటకు ఎవనికి శక్తి గలదు? విధినిషేధరూపశాస్త్రము నుల్లంఘించుట అతిప్రసంగ మనంబడును. అట్టి అతిప్రసంగము గలిగినను జ్ఞానులకు తప్పు లేదనుట.

అవ. జ్ఞానులకును అజ్ఞానులకును ప్రారబ్ధకర్మమును తప్పక యనుభవించుట సమానమైనయెడల వీరు జ్ఞాను లని వీ రజ్ఞాను లని తారతమ్య మే మున్నది? అని శంకించినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. జ్ఞానినోఽజ్ఞానిన శ్చాత్ర సమే ప్రారబ్ధకర్మణి,
న క్లేశో జ్ఞానినో ధైర్యాన్మూఢః క్లిశ్యత్యధైర్యతః. 133

వ్యా. నను జ్ఞాన్యజ్ఞానినోః ప్రారబ్ధకర్మణ్యావశ్యభోక్తవ్యతయా సమానేఽనయోః కో వైలక్షణ్యసిద్ధిరిత్యాశంక్యాహ—జ్ఞానిన ఇతి.

టీ. అత్ర=ప్రారబ్ధకర్మ తప్పక యనుభవింపవలసినదే అనుటయందు, జ్ఞానినః = జ్ఞానికిని, అజ్ఞానినశ్చ=అజ్ఞానికిని, ప్రారబ్ధకర్మణి = ప్రారబ్ధకర్మ, సమే సతి = సమానమై యుండఁగా, జ్ఞానినః=జ్ఞానికి, ధైర్యాత్ = ధైర్యమువలన, క్లేశః = కష్టము, న=లేదు, మూఢః = అజ్ఞాని, అధైర్యతః = అధైర్యమువలన, క్లిశ్యతి=క్లేశము నొందుచున్నాఁడు (దుఃఖపడుచున్నాఁడు.)

తా. జ్ఞాన్యజ్ఞానులకు ప్రారబ్ధకర్మ ననుభవించుట సమానమే యైనను ధైర్యమువలన జ్ఞాని దుఃఖపడఁడు. అజ్ఞాని దుఃఖపడును. జ్ఞానికిని అజ్ఞానికిని నిదే భేదము.

అవ. ఇప్పు డిందువిషయమున దృష్టాంతము చెప్పుచున్నాఁడు:—

శ్లో. మార్గే గంత్రోర్ద్వయోశ్శ్రాంతౌ సమాయామప్యదూరతాం,
జానన్ ధైర్యాద్ద్రుతం గచ్ఛ త్యన్య స్తిష్ఠతి దీనధీః. 134

వ్యా. తత్ర దృష్టాంతమాహ—మార్గఇతి.

టీ. మార్గే=మార్గమునందు, గంత్రోః = పోవుచుండెడి, ద్వయోః=జ్ఞాన్యజ్ఞానుల కిరువురకును, శ్రాంతౌ = శ్రమ, సమాయామపి = సమానముగా నుండినను, ధైర్యాత్ = ధైర్యమువలన, అదూరతాం = సామీప్యమును, (జ్ఞానీ = జ్ఞానియగువాఁడు), జానన్ = గుర్తెఱుఁగుచు, గచ్ఛతి = పోవుచున్నాఁడు, దీనధీః = దైన్యబుద్ధిగల, అన్యః = మఱి యొకఁడు (అజ్ఞాని), తిష్ఠతి = అధైర్యమువలన నిలుచుచున్నాఁడు.

తా. ఒక చోటికిఁ బోవలయు నని జ్ఞానియు నజ్ఞానియు బయలు దేఱి మార్గమునఁ బోవుచుండఁగా కొంతదూరము పోవుసరికి నిరువుర కును మార్గశ్రమ సమానముగా నుండినప్పటికిని జ్ఞాని ధైర్యముచేత పోవలసినతావు చాలదగ్గర నున్నట్లు తలంచుచు ననాయాసముగాఁ బోవుచున్నాఁడు. రెండవవాఁ డగు నజ్ఞాని దుర్బలచిత్తుఁడు గనుక ధైర్యము లేక యయ్యో కాళ్లు గుడ్డపేలికలవలె తేలిపోవుచున్నవే అని దుఃఖించుచు పోలేక నిలిచిపోవుచున్నాఁడు. ఈలాగున జ్ఞాన్య జ్ఞానుల కిరువురకుఁ బ్రారబ్ధకర్మానుభవమునందు సామ్య ముండినను దుఃఖ పడుటలోమాత్రము భేదము గన్పట్టుచున్నది.

అవ. శ్రు. "ఆత్మానం చేత్" అనెడి మంత్రముయొక్క పూర్వార్ధమును నీ విధముగా ననువదించుచు జ్ఞానఫలమును దెల్పెడి యామంత్రముయొక్క యుత్తరార్ధ మునుగూర్చి ప్రసంగించుచున్నాఁడు:—

శ్లో. సాక్షాత్కృతాత్మధీ స్సమ్య గవిపర్యయ బాధితః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్. 135

వ్యా. ఇత్థముపపాదితమాత్మానం చేదితి మంత్రస్య పూర్వార్థమనుపదర్శ్య ఫల ప్రదర్శన పరముత్తరార్థమవతారయతి—సాక్షాదితి. సమ్యక్సాక్షాత్కృతాత్మధీః సాక్షాత్కృతః ఆత్మాయయా సాసాక్షాత్కృతాత్మా తాదృశీ ధీర్యస్యసః సాక్షాత్కృతాత్మధీః అవిపర్యయబాధితః విపర్యయేణ దేహాద్యాత్మత్వబుద్ధ్యా బాధితో న భవతీత్యవిపర్యయ బాధితః ఉభయం హేతుగర్భితం విశేషణమ్.

టీ. సమ్యక్ = లెస్సగా, సాక్షాత్కృతాత్మః - సాక్షాత్కృత = సాక్షాత్కరింపఁబడిన (అపరోక్షముగాఁ దెలిసికొనఁబడిన), ఆత్మ=ఆత్మగల, ధీః = బుద్ధిగలవాఁడు, అవిపర్యయబాధితః = దేహాదికమే యాత్మ యనెడి విపరీతబుద్ధిచేత బాధింపఁ బడనివాఁ డగుచు, కిమిచ్ఛన్ = ఏమి ఫలమును గోరుచు, కస్య = ఏభోక్తయొక్క, కామాయ = ప్రీతికొఱకు, శరీరం = శరీరము, (తప్యమానం = తపించుచుండఁగా), అను సంజ్వరేత్ = అనుసరించి తపించును? (వాస్తవముగా ద్వైతభ్రాంతి లేకుండుట చేత నెంత మాత్రము తపింపఁ డనుట).

తా. ఈప్రకరణారంభమునఁ దెల్పఁబడిన మంత్రముయొక్క యుత్తరార్థ మే మని చెప్పుచున్న దనఁగా ఆత్మయొక్క యపరోక్షజ్ఞానముగలిగి దేహమే నే ననెడి విపరీతభావన పూర్తిగా నశించినట్టి జ్ఞాని యేమి లాభమును గోరి యేభోక్తయొక్క ప్రీతికొఱకు దేహము తపింపఁగా నట్టిదేహము ననుసరించి తపించు నని యాక్షేపించుచున్నది. సంపూర్ణమైన జ్ఞానదశయందు మాయాకల్పితం బగు భోక్తృభోగ్యాత్మకమైన ద్వైతభావము లేమింజేసి జ్ఞానికి తాపము లే దని భావము.

అవ. ఇప్పు డీశ్లోకమునం దామంత్రయొక్క యుత్తరార్థమునకుఁ దాత్పర్యముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. జగన్మిథ్యాత్వధీభావా దాక్షిప్తౌ కామ్యకాముకౌ,
తయో రభావే సంతాప శ్శామ్యేన్నిస్స్నేహదీపవత్. 136

వ్యా. అస్య మంత్రార్థస్య తాత్పర్యమాహ—జగన్మిథ్యేతి. కామ్యం చ కాముకశ్చ కామ్యకాముకౌ తావాక్షిప్తౌ నిరస్తౌ తన్నిరాకరణే కారణమాహ—జగన్మిథ్యాత్వేతి. తతః కిమిత్యత ఆహ—తయోరితి. తయోః కామ్యకాముకయోరభావే సంతాపః కామనానిమిత్తకః. కారణాభావాన్నిస్స్నేహదీపవత్ శామ్యేదిత్యర్థః.

టీ. జగన్మిథ్యాత్వధీభావాత్-జగత్=దేహేంద్రియాదిజగత్తుయొక్క, మిథ్యాత్వధీభావాత్ = మిథ్యాత్వజ్ఞానమువలన, కామ్యకాముకౌ - కామ్య = కోరఁదగిన పదార్థమును, కాముకౌ = కోరునట్టి పురుషుఁడు, ఆక్షిప్తౌ=ఉభయములును నిరాకరింపఁబడిరి, తయోః = ఆ రెంటికిని (కామ్యకాముకుల కనుట), అభావే సతి = లేమి కలుగుచుండఁగా, నిస్నేహదీపవత్ = చమురు లేని దీపమువలె, సంతాపః=కామనానిమిత్తక మగు దుఃఖము, శామ్యేత్ = అణఁగిపోవును.

తా. ఎప్పుడు దేహేంద్రియాది జగన్మిథ్యాత్వజ్ఞానము దృఢముగా నేర్పడెనో యపుడు కోరఁదగిన భోగ్యపదార్థము లేదు. ఆ పదార్థము నపేక్షించెడి పురుషుఁడును లేఁడు. ఇట్లు భోగ్యపదార్థంబును భోక్తయును లేకపోవుచుండఁగా భోగనిమిత్త మగు దుఃఖము చమురు లేని దీపము చల్లారునట్లు నశించును. కారణమైన కామ్య మెప్పుడు లేకపోయెనో తత్కార్య మగు దుఃఖంబును అప్పుడే లేకపోవును అని భావము.

అవ. కోరఁదగినపదార్థ మెప్పుడు లేదో, కోరికయు కోరుటవలని దుఃఖంబును లే దని లోకానుభవమును శంకించుకొని తగిన సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. గంధర్వపత్తనే కించిన్నైంద్రజాలికనిర్మితే,
జానన్ కామయతే కింతు జిహాసతి హసన్నిదమ్. 137

వ్యా. కామ్యాభావా త్కామనాభావః క్వ దృష్ట ఇత్యాశంక్యాహ — గంధర్వేతి. మాయావినిర్మితే పత్తనే స్థితం వస్తు కించిదపి ఇదమైంద్రజాలికనిర్మితమితి జానన్న కామయతే న కేవలం కామానాభావః ప్రత్యుతేదమనృతమితి హసన్ జిహాసతి పరిత్యక్తుమిచ్ఛతి.

టీ. ఐంద్రజాలికనిర్మితే - ఐంద్రజాలిక = ఇంద్రజాలముచేయు గారడివాని చేత, నిర్మితే = మాయచేత కల్పింపఁబడిన, గంధర్వపత్తనే = గంధర్వనగరమునందు, (స్థితం = ఉన్నట్టివస్తువు,) కించిదపి = కొంచెమైనను, జానన్=ఇది గారడివానిమాయ చేత కల్పింపఁబడిన దని యెఱుంగుచు, న కామయతే = అపేక్షింపఁడు. కింతు=ఇఁక నే మనఁగా, ఇదం = ఈకనిపించెడిది = సత్యము గా దని. హసన్ = నవ్వుచు, జిహాసతి = వదలిపెట్టఁ దలఁచుచున్నాఁడు.—

తా. ఒక గారడివాఁ డింద్రజాల మనియెడి వినోదమును జేయుచు నొక మాయాపట్టణమును నిర్మింపఁగా నందలివస్తువు లన్నియు

మాయచే కల్పింపఁబడిన వని యెఱింగినవాఁ డందలి వస్తువును అపే క్షింపకుండుటయే కాక యావ స్తువులం గనుఁగొని నవ్వుచు నొక్క వస్తువు నైనఁ దీసికొనఁబూనఁడు.

అవ. ఈసంగతిని ప్రకృతివిషయములోఁ (దార్ష్టాంతికమునందుఁ) జూపు చున్నాఁడు:—

శ్లో. ఆపాతరమణీయేషు భోగే ష్వేవం విచారవాన్,
నానురజ్జతి కింత్వేతాన్ దోషదృష్ట్యా జిహాసతి. 138

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—ఆపా తేతి. ఏవమాపాతరమణీయేషు ప్రతీతి మాత్రరమ్యేషు భోగేషు భుజ్యంత ఇతి భోగాః విషయాస్స్రక్చందనవనితాదయ స్తేషు ఏవం విచారవానాపాతరమణీయత్వానుసంధానవాన్నానురజ్జతి నాస క్తిం కరోతి కింతు దోషదర్శనే నైతాన్పరిత్యక్తు మిచ్ఛతి.

టీ. ఆపాతరమణీయేషు = పైకి మాత్రము రమ్యముగా నగపడెడు, భోగేషు = స్త్రీలు, పుష్పములు, చందనము మొదలగు విషయములందు, ఏవం = ఈవిధముగా, విచారవాన్ = ఇవి పైకిమాత్రమందముగాఁ గనఁబడు నని తలఁచెడివాఁడు, నాను రజ్జతి = వాని నపేక్షింపఁడు. కింతు = ఇఁక నేమనఁగా, దోషదృష్ట్యా = వానిలోపము లను దెలియుటచేత, ఏతాన్ = ఈ స్రక్చందనవనితాదిభోగంబులను, జిహాసతి=విడువఁ దలఁచుచున్నాఁడు.

తా. పైకి అందముగాఁ గన్పడును గాని విచారించిన నన్నియు నసహ్యము లని పరిశీలన బుద్ధిగలవాఁడు స్త్రీలను పుష్పములను చంద నాదులను కోరకుండుటయే కాక వానిని దూరముగా విడిచిపెట్టఁ బూనుచున్నాఁడు.

అవ. విషయములందలి దోషములం దెల్పుచున్నాఁడు:—

శ్లో. అర్థానామార్జనే క్లేశ స్తథైవ పరిపాలనే,
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్ క్లేశకారిణః. 139

వ్యా. కే తే విషయదోషా ఇత్యత ఆహ—అర్థానామితి.

టీ. అర్థానాం = ధనము మొదలగు విషయములయొక్క, ఆర్జనే = సంపాదిం చుటయందును, తథైవ = ఆవిధముననే, పరిపాలనే = సంపాదింపఁబడిన వానిని గాపా డుటయందును, క్లేశః = శ్రమము, (భవతి = కలుగుచున్నది.) నాశే = ధనాదివిషయ ములు నశించుటయందును, దుఃఖం = విచారము (కలుగును.) వ్యయే = ధనాదివిషయ

నష్టమందును, దుఃఖం = క్లేశము (కలుగును.) క్లేశకారిణః = సర్వవిధంబుల దుఃఖ హేతువులైన, అర్థాన్ = ధనాదివిషయములను గూర్చి, ధిక్ = కాల్పనా, అని నింద చేయ నగును.

తా. ధనాదివిషయములను సంపాదించుటయందును దుఃఖమే కలుగుచున్నది; సంపాదించిన ధనాదులను గాపాడుకొనునప్పుడును కష్టము తప్పదు. ఆధనాదివిషయములు చోరులు మొదలైనవారిచేత నపహరింపఁబడినప్పుడును దుఃఖము కలుగును. చేతిమీఁదుగా ఖర్చుచేయ వలసివచ్చినప్పుడును కష్టముగానే యుండును. ఇట్లు సర్వవిధముల చేతను దుఃఖదాయకములగు నాధనాదులను తగులఁబెట్టనా యని నిందింపవచ్చును.

అవ. ఈరీతిగా విషయములయందలి దుఃఖహేతుత్వమును దెలిపి యందలియస హ్యతను జూపుచున్నాఁడు:—

శ్లో. మాంసపాంచాలికాయాస్తు యంత్రలోలేఽంగపంజరే,
స్నాయ్వస్థిగ్రంథిశాలిన్యాః స్త్రియాః కిమివ శోభనమ్. 140

వ్యా. ఏవం విషయాణాం దుఃఖహేతుత్వం ప్రదర్శ్యాశోభనత్వం క్వచిద్దర్శ యతి—మాంసేత్యాదిశ్లోకద్వయేన. స్నాయవస్సిరాః అస్థీని ప్రసిద్ధాని. గ్రంథయో మాంసనిచయరూపనితంబస్తనాదయ ఏతైశ్చ సహితాయాః మాంసపాంచాలికాయాః పుత్తలికాయాయోషితో యంత్రలోకే యంత్రవచ్చంచలశీలే అంగపంజరే అంగాన్యేవ పంజరం నీడం తస్మిన్ శరీరే కిం శోభనమివ! న కిమపీత్యర్థః.

టీ. స్నాయ్వస్థిగ్రంథిశాలిన్యాః - స్నాయుః=నరములతోడను, అస్థి = ఎము కలతోడను, గ్రంథి = స్తనములు మొదలగు కణుతులతోడను, శాలిన్యాః = ప్రకా శించుచున్నట్టియు, (నరములు, ఎముకలు, స్తనములు మొదలగు మాంసపిండములు గలది యనుట.) మాంసపాంచాలికాయాః = మాంసమయ మగు బొమ్మవంటి, స్త్రియాః = ఆఁడుదానియొక్క, యంత్రలోలే = యంత్రమువలె చలించు స్వభావము గల, అంగపంజరే = పంజరమువంటి శరీరమునందు, కిమివ శోభనం = ఏమి రమ్యత యున్నది? (రమ్యత లేనే లే దనుట).

తా. ప్రతివారలును స్త్రీలను జూచి వ్యామోహపడుచున్నారు. ఉన్న దున్నట్లు స్త్రీస్వరూపమును విమర్శచేసినచో నరములు, ఎముక లును, పిఱుఁదులును, స్తనములును అనియెడి మాంసపుముద్దలును

గలిగి కదలెడు యంత్రపుబొమ్మవంటి శరీరమునందు వేడుకపడఁ దగినది యే మున్నది ?

శ్లో. ఏవమాదిషు శాస్త్రేషు దోషాస్సమ్యక్ప్రపంచితాః,
విమృశన్ననిశం తాని కథం దుఃఖేషు మజ్జతి. 141

వ్యా. ఏవమాదిష్విత్యాదిశబ్దేన "త్వఙ్మాంసరక్తబాష్పాంబు పృథక్కృత్వా విలోచనే, సమాలోకయ రమ్యం చేత్కిం ముధా పరిముహ్యసి" ఇత్యేవమాదయో గృహ్యంతే.

టీ. ఏవమాదిషు = ఇది మొదలగు, శాస్త్రేషు = శాస్త్రములయందు, దోషాః = విషయములయందలి లోపములు, సమ్యక్ = లెస్సగా, ప్రపంచితాః = వివరింపఁబడినవి. తాని = ఆలోపములను, అనిశం = ఎల్లప్పుడును, విమృశన్ = విమర్శబుద్ధితోఁ జూచెడివాఁడు, దుఃఖేషు = స్త్రీ మొదలగు దుఃఖములయందు, కథం = ఎట్లుగా, మజ్జతి = మునుఁగును? (స్త్రీ మొదలగు విషయముల నపేక్షింపఁ డనుట).

తా. పైనఁ జెప్పఁబడిన విధముగా ధనమును స్త్రీలును మొదలగు విషయములయందలి దోషములు శాస్త్రములలో వివరముగాఁ జెప్పఁబడినవి. అట్టి విషయదోషములను జక్కఁగా గమనించినవాఁ డెన్నఁ డకిని వానికొఱకు కాశపడఁడు. ఇదియునుంగాక విమర్శించునపుడు బుద్ధిలో చర్మమును మాంసమును రక్తమును జొల్లును దేని కది వేఱుగా నున్నట్లు భావించిన నందు రమ్యమగు వస్తు వొక్కటి యైన నున్నదా ? ఏల వృథాగా వ్యామోహముం జెందెదవని "త్వఙ్మాంసరక్తబాష్పాంబు పృథక్కృత్వా విలోచనే, సమాలోకయ రమ్యం చేత్కిం ముధా పరిముహ్యసి." ఈ మొదలగు శాస్త్రములు గ్రహింపనగును.

అవ. ఎప్పుడు విషయములయందలి దోషములను బరికించి తెలిసికొనునో యప్పటినుండి విషయభోగములయం దాసక్తి పుట్ట దని యుక్తియుక్త మగు దృష్టాంతమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. క్షుధయా పీడ్యమానోఽపి న విషం హ్యత్తుమిచ్ఛతి,
మృష్టాన్నధ్వస్తతృడ్జానన్నామూఢ స్తజ్జిఘుత్సతి. 142

వ్యా. విషయదోషదర్శనే సతి భోగేచ్ఛాభావే యుక్తిసహితం దృష్టాంతమాహ—క్షుధయేతి. స్వయమమూఢః వివేకీ మృష్టాన్నభోజనేన ధ్వస్తా వినష్టా తృట్తృష్ణా ఆకాంక్షా యస్య స తథోక్తః ఇదం విషమిత్యేవం జానన్ తద్విషం న జిఘుత్సతి నాత్తుమిచ్ఛతీత్యర్థః.

టీ. క్షుధయా = ఆఁకలిచేత, పీడ్యమానోఽపి=బాధింపఁబడుచుండినను, విషం= విషమును, అత్తుం = తినుటకు; నేచ్ఛతిహి = ఇచ్ఛగింపఁడు కదా. అమూఢః = వివేకము గలవాఁడు, మృష్టాన్నధ్వస్తతృట్ - మృష్టా = షడ్రసోపేతమైన, అన్న = అన్నము తినుటచేత, ధ్వస్త = నశింపఁజేయఁబడిన, తృట్ = అపేక్ష కలవాఁడు, తత్ = ఆవిష మును, జానన్ = ఇది విష మని గుర్తెఱుఁగుచు, న జిఘుత్సతి = భక్షింపఁగోరఁడు.

తా. ఆఁకలి యెంత బాధించినను విషమును నెవ్వఁడైన భక్షింపఁ గోరునా ? కోరఁడు. షడ్రసోపేతమై పరిశుద్ధమైన పాయసశర్కరా పూపములను భుజించుటచేత నాఁకలి లేనివాఁడును విషమును ఇది విష మని గుర్తెఱిఁగినవాఁడును విషమును భక్షింపఁగోరడు.

అవ. జ్ఞానికిని ప్రారబ్ధకర్మ ప్రబల మగుటవలన భోగేచ్ఛ జనింపఁగూడదా యని యాశంకించి యొక వేళ కోరిక గలిగినను ప్రీతిపూర్వకముగా ననుభవింపఁ డని సమా ధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రారబ్ధకర్మప్రాబల్యాద్భోగే ష్విచ్ఛా భవే ద్యది,
క్లిశ్యన్నేవ తదాఽ ప్యేష భుంక్తే విష్టిగృహీతవత్. 143

వ్యా. నను ప్రారబ్ధకర్మణః ప్రబలత్వాత్ జ్ఞానినోఽపీచ్ఛా భవేదిత్యాశంక్య సత్యామపీచ్ఛాయాం ప్రీతిపురస్సరం న భుఙ్క్తే ఇత్యాహ—ప్రారబ్ధేతి.

టీ. ప్రారబ్ధకర్మప్రాబల్యాత్ - ప్రారబ్ధకర్మ = ప్రారబ్ధకర్మయొక్క, ప్రాబల్యాత్ = ప్రబలత్వమువలన, భోగేషు = విషయభోగములయందు, ఇచ్ఛా = జ్ఞానికి కోరిక, భవేద్యది = కలిగెనేని, తదాపి = అప్పుడును, ఏషః = ఈజ్ఞాని, విష్టిగృహీతవత్ = కూలిలేక వెట్టిమూటలు మోయువానివలె, క్లిశ్యన్నేవ = దుఃఖపడుచునే, భుంక్తే = అనుభవించు చున్నాఁడు.

తా. ప్రారబ్ధకర్మయొక్క ప్రాబల్యమువలన విషయ భోగముల యందుఁ గోరిక గలిగెనేని అప్పుడును, ఎప్పుడును నరకబాధ నొందిన వానివలె దుఃఖపడుచునే యనుభవించును గాని జ్ఞాని యగువాఁడు విషయసుఖములను బ్రీతిపూర్వముగా ననుభవింపఁడు.

అవ. జ్ఞాని ప్రీతిపూర్వముగా విషయసుఖముల ననుభవింపఁ డని వానియను భవము మీకుఁ దెలియు టెట్లు ? అనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. భుంజానానా అపి బుధాశ్శ్రద్ధావంతః కుటుంబినః,
నాద్యాపి కర్మ నశ్ఛిన్న మితి క్లిశ్యంతి సంతతమ్. 144

వ్యా. కథమేతదవగమ్యత ఇత్యాశంక్య లోకదర్శనాదిత్యాహ—భుంజానా ఇతి.

టీ. శ్రద్ధావంతః = శ్రద్ధగలవారును, కుటుంబినః = కుటుంబవంతులును నగు, బుధాః=జ్ఞానులు,భుంజానా అపి=ప్రారబ్ధకర్మఫలము ననుభవించువారయ్యు, అద్యాపి= ఇప్పటికిని, నః=మాకు, కర్మ = ప్రారబ్ధకర్మ, నచ్ఛిన్నమితి=క్షయింపలే దని, సంతతం = ఎల్లప్పుడును, క్లిశ్యంతి = దుఃఖపడుచున్నారు.

తా. లోకమున గురువేదాంతవాక్యములయందు విశ్వాసము గలిగి దారాపుత్రాదులతోఁ గూడుకొనియుండెడి జ్ఞానులు ప్రారబ్ధకర్మ ఫలము ననుభవించుచుండినను మాకీ ప్రారబ్ధకర్మము ఇప్పటికిని క్షయింప లేదే యని నిరంతరము దుఃఖించుచుందు రని లోకానుభవము చేతఁ దెలిసికొంటి మని భావము.

అవ. ఈ సంసారదుఃఖ మజ్ఞానులకుఁ బోలె జ్ఞానులకు కూడ నుండెనేని జ్ఞానముండి నిష్ప్రయోజనము గదా యని యాశంకించి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నాయం క్లేశోఽత్ర సంసారతాపః కింతు విరక్తతా,

భ్రాంతిజ్ఞాననిదానో హి తాపస్సాంసారికస్స్మృతః. 145

వ్యా. నను తత్త్వవిదాం సంసారనిమిత్తకస్తాపోఽనుపపన్నః జ్ఞానవైయర్థ్యాపాతాదిత్యాశంక్యాహ—నాయమితి. అయం క్లేశః నాద్యాపి కర్మనశ్ఛిన్నమిత్యేవమనుతాపాత్మకః సంసారతాపో న భవతి. కిం త్వత్ర సంసారే విరక్తతా అసక్తిరహితతా. తాపకత్వాభావే యుక్తిమాహ—భ్రాంతీతి. హి యస్మాత్కారణాత్సాంసారికస్తాపో భ్రాంతిజ్ఞాననిదానః భ్రాంతిజ్ఞానకరణకస్స్మృతః పూర్వాచార్యైః. అయంతు వివేకజ్ఞానమూలత్వాన్న తథావిధ ఇత్యర్థః.

టీ. అయం క్లేశః = ఈదుఃఖము, సంసారతాపః = సంసారసంబంధ మగు పరితాపము, న = కాదు, కింతు = కాక యే మనఁగా, అత్ర = ఈసంసారమందు, విరక్తతా = విరక్తి గలుగుట. భ్రాంతిజ్ఞాననిదానః = భ్రాంతిజ్ఞానము నిమిత్తముగాఁగల, తాపః = దుఃఖము, సాంసారికః = సంసారసంబంధ మగు దుఃఖ మని, స్మృతః = తెలిసినవారిచేతఁ జెప్పఁబడినది.

తా. జ్ఞానులు మా కిప్పటికిని ప్రారబ్ధకర్మము క్షయింపకపోయెనే యని దుఃఖించుట సంసారముమీఁద విరక్తి గాని సంసారసంబంధ మగు దుఃఖము గాదు; మఱియు సాంసారికదుఃఖ మనఁగా భ్రాంతిజ్ఞానము చేతఁ గలిగిన పరితాప మగును; అని తెలిసిన పెద్దలు ప్రారబ్ధకర్మ యింకను క్షయింప లేదే అనెడు సంతాపము వివేకమూలమైనది గనుక నాదుఃఖమును భ్రాంతిమూలక మగు సంసారదుఃఖ మనఁ గూడ దని చెప్పిరి.

అవ. ఈదుఃఖ మవివేకమూలమైనదో వివేకమూలకమైనదో యెట్లు తెలియు నని యాశంకించి సర్వకామములను నివర్తింపఁజేయుటంజేసి వివేకమూలక మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వివేకేన పరిక్లిశ్య న్నల్పభోగేన తృప్యతి,
అన్యథానంతభోగేఽపి నైవ తృప్యతి కర్హిచిత్. 146

వ్యా. అయం క్లేశో వివేకమూలః అవివేకమూలో వేతి కుతోఽవగమ్యత ఇత్యాశంక్య కామనివర్తకత్వా ద్వివేకమూల ఇత్యాహ—వివేకేతి.

టీ. వివేకేన = వివేకముచేత, పరిక్లిశ్యన్ = మిక్కిలి క్లేశపడుచు, అల్పభోగేన = స్వల్పమగు సుఖముతో, తృప్యతి = సంతృప్తినొందుచున్నాఁడు, అన్యథా= అట్లు వివేకము లేనియెడల, అనంతభోగేఽపి = అపరిమితసుఖము గలిగినప్పటికిని, కర్హిచిత్ = ఒకానొకప్పుడు, నైవ తృప్యతి = సంతృప్తిని పొందనే పొందఁడు.

తా. జ్ఞాని యగువాఁడు ఆత్మానాత్మవివేకముచేత ప్రారబ్ధకర్మము క్షయింప లేదని క్లేశము (సంతాపము) నొందుచుండినను కామము లేనివాఁడు గనుక స్వల్పసుఖముచేతనే సంతృప్తినిఁ బొందుచున్నాఁడు. అట్టి ఆత్మానాత్మవివేకము లేనివాఁడు విషయసుఖము లెంత కలిగియుండినను కామము నశింపకపోవుటచేత నొకప్పుడును సంతృప్తిని జెందఁడు. కావున జ్ఞానియొక్క దుఃఖము వివేకమూలమైన దని గ్రహింపవలెను.

అవ. జ్ఞానికివలె నజ్ఞానికిఁగూడ విషయసుఖముచేతనే తృప్తి గలుగును. కాఁబట్టి వివేకము నిష్ప్రయోజన మని యాశంకించి విషయభోగము సంతృప్తికి హేతువు కాదని చెప్పెడి శ్రుతిని దెల్పుచున్నాఁడు:—

శ్లో. న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. 147

వ్యా. వివేకిన ఇవావివేకినోఽపి భోగేనైవ తృప్తిస్స్యాదతో వివేకోఽప్రయోజక ఇత్యాశంక్య భోగస్య తృప్తిహేతుత్వాభావప్రతిపాదికాం శ్రుతిం పఠతి న జాతుకామ ఇతి.

టీ. కామానాం = ప్రియమైన వస్తువులయొక్క, భోగేన = అనుభవించుటచేత, కామః = కోరిక, జాతు = ఎప్పటికిని, న శామ్యతి = తగ్గదు. హవిషా = ఆజ్యముచేత, కృష్ణవర్త్మేవ = అగ్నిహోత్రునివలె, భూయః = తర్వాత నధికముగా, అభివర్ధత ఏవ = పెరుఁగుచునే యుండును.

తా. ప్రియమైనవస్తువుల ననుభవించుటచేత నావస్తువులమీఁద కోరిక యెన్నటికిని తగ్గదు. నేయి పోసినకొలఁది యగ్ని మండుచునే యుండును గాని తగ్గనియట్లు విషయసుఖముల ననుభవించుటచేత కామ మభివృద్ధి చెందును గాని విషయభోగ మింతటితో చాలు నని తృప్తి కలుగనేరదు అని యీ శ్రుతి తాత్పర్యము.

అవ. వివేకమూలక మగు విషయసుఖము సంతృప్తిని గలిగించుట యనుభవసిద్ధ మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతి తుష్టయే,
విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి న చోరతామ్. 148

వ్యా. వివేక మూలస్య భోగస్య తృప్తిహేతుత్వ మనుభవసిద్ధమిత్యాహ—పరిజ్ఞాయేతి. అయం భోగ ఏతావానేనం ప్రయాససాధ్య ఇత్యేవ మనుభవపూర్వ శ్చేదలం బుద్ధిహేతుర్హి దృశ్యత ఇత్యర్థః. నను తృష్ణాహేతో ర్భోగస్య వివేకసాహచర్య మాత్రేణ కథం తుష్టికరత్వ మిత్యాశంక్య సహచారివిశేషవశాద్విపరీత కార్యకారిత్వం లౌకికే దృష్టమిత్యాహ—విజ్ఞాయేతి. అయం చోర ఇతి జ్ఞాత్వా తేన సహావర్తమానస్య పురుషస్య న చోరో భవతి. కింతు మిత్ర తా మేతీత్యర్థః.

టీ. పరిజ్ఞాయ=వివేకము కలిగి, ఉపభుక్తః = అనుభవింపఁబడిన, భోగః=విషయసుఖము, తుష్టయే=తృప్తికొఱకు, భవతిహి=అగుచున్నదిగదా, (తృప్తి హేతువగుచున్న దనుట). విజ్ఞాయ = తెలిసి, సేవితః=సేవింపఁబడిన, చోరః = దొంగ, మైత్రీం=మిత్రత్వమును, ఏతి=పొందుచున్నాఁడు, చోరతాం=చోరభావమును, నైతి=పొందఁడు.

తా. వివేకముతో విషయసుఖంబుల ననుభవించినయెడల అవి సుఖహేతు వగును దానివలన తృప్తియుఁ గలుగును. వీఁడు దొంగ యని తెలిసి వానితో పరిచయము చేసినయెడల, వాఁడు స్నేహితుఁ డగును గాని దొంగ కానేరఁడు. ఇట్టి యనుభవమును లోకమునఁ జూచుచున్నాము గదా.

అవ. కోరికలు స్వభావముగాఁ గల మనస్సునకు నల్పభోగములచేతఁ దృప్తి గలుగు టెట్లని యాశంకించి నిదిధ్యాసముచేత నేకాగ్రతను బొందిన మనస్సునకు తృప్తి కలుగు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. మనసో నిగృహీతస్య లీలాభోగోఽల్పకోఽపి యః,
తమేవాలబ్ధవిస్తారం క్లిష్టత్వాద్బహు మన్యతే. 149

వ్యా. నను కామనాస్వరసత్వాన్మనసః కథం స్వల్పభోగేన తృప్తిస్స్యా దిత్యా శంక్య నిదిధ్యాసనేన గృహీతస్యాతథాత్వాద్భవత్యేవ తృప్తిరిత్యాహ—మనస ఇతి. గృహీతస్య యోగాభ్యాసేన వశీకృతస్య మనసోఽల్పకోఽపి స్వల్పోఽపి లీలా భోగః లీలానుభవో యోఽస్తి, అలబ్ధవిస్తారమప్రాప్తబాహుళ్యం తమేవ భోగం క్లిష్ట త్వాద్దోషయుక్తత్వా ద్బహు మన్యతే, అధికత్వేన జానాతీత్యర్థః.

టీ. నిగృహీతస్య=యోగాభ్యాసముచేత వశపఱచుకొనఁబడిన, మనసః=మనస్సు నకు, అల్పకోఽపి = స్వల్పమైన దైనను, లీలాభోగః = విలాసార్థమైన యనుభవము, యః = ఏది, (అస్తి = కలదో), అలబ్ధవిస్తారం - అలబ్ధ = పొందఁబడని, విస్తారం = బాహుళ్యముగల, (విస్తారము కాని దనుట.) తమేవ = ఆభోగమునే, క్లిష్టత్వాత్ = దోషముతోఁ గూడిన దగుటవలన, బహు మన్యతే = గొప్పగాఁ దలఁచుచున్నాఁడు.

తా. యోగాభ్యాసముచేత స్వాధీనము చేసికొనఁబడిన మన స్సన కెంత స్వల్పభోగమైనను నాయల్పసుఖమునే యధికముగాఁ దలంచుచున్నాఁడు. నిదిధ్యాసనముచేత మనస్సుయొక్క కామనా స్వభావము నశించిపోవుటవలన స్వల్పభోగముచేతనే తృప్తిఁ బొందు చున్నాఁ డని భావము.

అవ. యోగాభ్యాసముచేత నిగ్రహింపఁబడిన మనస్సు గలవాఁడు ఏమాత్రము సుఖము గలిగినను తృప్తి పొందుచున్నాఁడు అని దృష్టాంతముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. బద్ధముక్తో మహీపాలో గ్రామమాత్రేణ తుష్యతి,
పరైరబద్ధో నాక్రాంతో న రాష్ట్రం బహు మన్యతే. 150

వ్యా. నిగృహీత మనస స్స్వల్పేనాపి భోగేన తృప్తిర్భవతీత్యత్ర దృష్టాంత మాహ—బద్ధముక్త ఇతి.

టీ. బద్ధముక్తః - బద్ధ = శత్రువులచేత బంధింపఁబడి. ముక్తః = సదలిపెట్టఁ బడిన, మహీపాలః=భూపాలుఁడు (రాజు). గ్రామమాత్రేణ=ఒక్క గ్రామముచేతనే, తుష్యతి=సంతృప్తిని బొందుచున్నాఁడు. పరైః=శత్రువులచేత, అబద్ధః = బంధింపఁబడ నట్టియు, అనాక్రాంతః = నిరాటంకముగాఁ బ్రవర్తించెడిరాజు, రాష్ట్రం=దేశమును, న బహుమన్యతే = అదియొక్క గొప్పగా తలంపఁడు.

తా. శత్రువులచేతఁ బట్టువడి విడువఁబడిన రాజు ఒక్క గ్రామ మును నీ కిచ్చితిమి పో అని యొక గ్రామము నిచ్చినంతమాత్రమున

నెంతో తృప్తిపడుచున్నాఁడు. శత్రువులచేతఁ బట్టువడక నిరంకుశముగాఁ బ్రవర్తించెడిరాజున కెన్ని రాజ్యము లిచ్చినను తృప్తియే కలుగదు. ఇట్టులే ఏ కాగ్రతను పొందిన మనస్సున కేమాత్రము సుఖము లభించినను తృప్తి కలుగును. వివేకశూన్యమై నిగ్రహింపఁబడని మనస్సున కెన్ని భోగములు గలిగినను ఎప్పటికిని తృప్తి గలుగదని భావము.

అవ. వాది యొక పూర్వపక్షమును జేయుచున్నాఁడు:—

శ్లో. వివేకే జాగ్రతి సతి దోషదర్శనలక్షణే,
కథమారబ్ధకర్మాపి భోగేచ్ఛాం జనయిష్యతి. 151

వ్యా. నను ప్రారబ్ధకర్మప్రాబల్యాద్భోగేష్విచ్ఛా భవేద్యదీత్యత్ర కర్మవశాదిచ్ఛా భవేదిత్యుక్తం. తదనుపపన్నం. ఇచ్ఛావిఘాతిని వివేకజ్ఞానే సతి తదుత్పత్త్యసంభవాదితి శంకతే—వివేక ఇతి.

టీ. జాగ్రతి = జాగ్రదవస్థయందు, దోషదర్శనలక్షణే - దోషదర్శన = వస్తువులయందలిదోషమును గనిపెట్టుటయే, లక్షణే = స్వరూపముగాఁగల, వివేకే = జ్ఞానము కలిగియుండఁగా, ఆరబ్ధకర్మాపి = ప్రారబ్ధకర్మమును, కథం = ఎట్లు, భోగేషు = విషయభోగములయందు, ఇచ్ఛాం = వాంఛను, జనయిష్యతి = పుట్టింపఁగలదు? (కోరికను పుట్టింపలే దనుట).

తా. ఓసిద్ధాంతీ,నీ విదివరలో నూటనలువదిమూఁడవ శ్లోకములోఁ బ్రారబ్ధకర్మవశమువలన జ్ఞానికి విషయభోగములయందు వాంఛ కలుగునని చెప్పియుంటివి. ఆమాట యేమియు బాగుండ లేదు. ఎందువలన ననఁగా జాగ్రదవస్థయందు జ్ఞానికి భోగేచ్ఛలను పోఁగొట్టు విషయభోగములయందలి దోషములను తెలియఁజేయునట్టి వివేకజ్ఞాన ముండియుండఁగా ప్రారబ్ధకర్మ విషయవాంఛను పుట్టించు ననుట యసమంజసము గదా యని పూర్వపక్షి యాశంకించెను.

అవ. సిద్ధాంతి యట్టిప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నైష దోషో యతోఽనేకవిధం ప్రారబ్ధ మిష్యతే,
ఇచ్ఛాఽనిచ్ఛా పరేచ్ఛా చ ప్రారబ్ధం త్రివిధం స్మృతమ్. 152

వ్యా. దోషదర్శనే సత్యపీచ్ఛాజన్మ సంభవిష్యతి. ప్రారబ్ధస్య నానాప్రకారత్వాదితి పరిహరతి—నైవ ఇతి. నానాప్రకారత్వమేవ దర్శయతి. ఇచ్ఛేతి. ఇచ్ఛాజనకమనిచ్ఛయా భోగప్రదం పరేచ్ఛయా భోగప్రదం చేతి త్రివిధమిత్యర్థః.

టీ. యతః = ఏహేతువువలన, ప్రారబ్ధం = ప్రారబ్ధకర్మ, అనేకవిధం = పలువిధములు గలదిగా, ఇష్యతే=అంగీకరింపఁబడుచున్నదో (తతః = ఆహేతువువలన), ఏషః దోషః = ఇట్టిదోషము, న = లేదు. ప్రారబ్ధం = ప్రారబ్ధ కర్మ, ఇచ్ఛా = ఇచ్ఛాప్రారబ్ధమనియు (ఇచ్ఛను పుట్టించునది యనుట.) అనిచ్ఛా = అనిచ్ఛాప్రారబ్ధ మనియు (తానిచ్ఛగింపకయే భోగము నిచ్చున దనుట). పరేచ్ఛా చ=పరేచ్ఛా ప్రారబ్ధ మనియు (పరులయొక్క సంకల్పముచేత భోగమునిచ్చునది యనుట). త్రివిధం=ఇట్లు మూఁడు విధములుగా, స్మృతం = చెప్పఁబడినది.

తా. ప్రారబ్ధకర్మ మూఁడువిధములుగాఁ జెప్పఁబడుచున్నది. ఇచ్ఛాప్రారబ్ధమనియు, అనిచ్ఛాప్రారబ్ధ మనియు, పరేచ్ఛాప్రారబ్ధ మనియు మూఁడువిధములుగా నున్నది. ఇచ్ఛను కలిగించునది గాన నిచ్ఛాప్రారబ్ధ మనఁబడును. ఇచ్ఛ లేకయే భోగము నిచ్చుటంజేసి యనిచ్ఛాప్రారబ్ధ మనఁబడుచున్నది. పరుల యిచ్ఛచేత భోగము నిచ్చుటంజేసి పరేచ్ఛాప్రారబ్ధ మనఁబడుచున్నది. ఈలాగున ప్రారబ్ధకర్మ మనేక విధంబులుగా నుండుటచేత జ్ఞానికి వివేకజ్ఞాన ముండినప్పటికిని ప్రారబ్ధకర్మ మిచ్ఛను పుట్టించుట దోషము కా దని సిద్ధాంతి పూర్వపక్షికి సమాధానము చెప్పె నని భావము.

అవ. ఇప్పు డిచ్ఛాప్రారబ్ధముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. అపథ్యసేవినశ్చోరా రాజదారరతా అపి,
జానన్త ఏవ స్వానర్థమిచ్ఛన్త్యారబ్ధకర్మతః. 153

వ్యా. ఇచ్ఛాప్రారబ్ధం దర్శయతి—అపథ్యేతి.

టీ. అపథ్యసేవినః - అపథ్య = తమకు నుత్తరకాలమున మేలు కలిగింపని పనులను, సేవినః = సేవించువారును (అపథ్యవస్తువును భుజించు రోగులును ననుట). చోరాః = దొంగలను, రాజదారరతా అపి - రాజదార = రాజస్త్రీలయందు, రతా అపి = అభిలాషగలవారును, స్వానర్థం = తమకు సంభవించెడి యనర్థమును, జానన్త ఏవ = గుర్తెఱింగినవారయ్యే, ఆరబ్ధకర్మతః = ప్రారబ్ధమువలన, ఇచ్ఛన్తి = దుష్కార్యములు చేయఁ దలఁచుచున్నారు.

తా. అనర్థకరంబు లగు కార్యములను ఆచరించెడువారును అపథ్యవస్తువులను భుజించునట్టి రోగులును పరద్రవ్యముల నపహరించునట్టి దొంగలును రాజస్త్రీలయం దభిలాష గలవారును వీర లందఱును

ప్రారబ్ధకర్మవలనఁ బ్రేరితులై తమ కనర్థము (కీడు) గలుగు నని యెఱిం గియు దుష్కార్యములను జేయఁ గడంగుచున్నారు. ఇట్లుకార్యములం దిచ్ఛను బుట్టించునది గనుక నిచ్ఛాప్రారబ్ధమని తెలియవలయును.

అవ. పథ్యము హితము, పథ్యము గానిది (హితమును గలిగింపనిది) అపథ్యము. ఇట్లు అహితమును గలుగఁజేయునిచ్ఛ ప్రారబ్ధకర్మయొక్క ఫల మని ఎట్లు తెలియును. అని యాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. న చాత్రైతద్వారయితుమీశ్వరేణాపి శక్యతే,
యత ఈశ్వర ఏవాహ గీతాయా మర్జునం ప్రతి. 154

వ్యా. అపథ్యసేవాదీచ్ఛాయాః ప్రారబ్ధఫలత్వం కుతోఽవగమ్యత ఇత్యాశంక్య అపరిహార్యత్వాదిత్యభిప్రేత్యాహ—న చేతి. అత్రాఽస్మిన్ లోకే అపథ్యాదీచ్ఛంతీ త్యేతత్కుత ఇత్యత ఆహ—యత ఇతి.

టీ. అత్ర = ఈప్రపంచమునందు, ఏతత్ = ఈప్రారబ్ధకర్మను, వారయితుం = అడ్డగించుటకు, ఈశ్వరేణాపి = పరమేశ్వరునికైనను, న శక్యతే = శక్యముకాదు, యతః = ఏహేతువువలన, ఈశ్వర ఏవ = పరమేశ్వరుఁడే, గీతాయాం = భగవద్గీత యందు, అర్జునంప్రతి = అర్జునునింగూర్చి, ఆహ = చెప్పెనో.

తా. ప్రారబ్ధకర్మఫలమును తప్పించుటకు పరమేశ్వరునకుఁ గూడ శక్యము కాదు. ఏహేతువువలన భగవద్గీతయందు పరమేశ్వరుం డగు శ్రీకృష్ణుఁడే యర్జునునిఁ గూర్చి యిట్లు చెప్పియుండెను. అనఁగా ఎవనికి ఏయిచ్ఛ గలిగినను నదిప్రారబ్ధకర్మఫల మగు ననియు నట్టిప్రారబ్ధకర్మకు పరి హారము లే దనియు భావము.

అవ. కృష్ణుఁడు చెప్పిన యావాక్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 155

వ్యా. గీతావాక్యం పఠతి—సదృశమితి. వివేకజ్ఞానవానపి పురుషస్స్వస్యా స్స్వకీయాయాః ప్రకృతేస్సదృశమనురూపం చేష్టతే. ప్రకృతిర్నామ పూర్వకృత ధర్మాధర్మాది సంస్కారః వర్తమాన జన్మాదావభివ్యక్తః. జ్ఞానవానపి కిం పునర్మూర్ఖ స్తస్మా త్ప్రకృతిం యాంతి భూతాని. నిగ్రహః ప్రవృత్తినివృత్త్యోర్నిరోధో మయాన్యేన వా కృతః కిం కరిష్యతి ? న కిమపీత్యర్థః.

టీ. జ్ఞానవానపి = జ్ఞానము గలవాఁడును, స్వస్యాః=తనయొక్క, ప్రకృతేః = ప్రకృతికి (ప్రకృతి యనఁగా నీజన్మమం దభివ్యక్తమైన పూర్వజన్మములయందుఁ జేయ బడినధర్మాధర్మములు మొదలగువానియొక్క సంస్కారము). సదృశం = సమానముగా, చేష్టతే = ప్రవర్తించుచున్నాఁడు. భూతాని = ప్రాణికోటులు, ప్రకృతిం = తమతమ ధర్మాధర్మాదిసంస్కారములను, యాంతి=పొందుచున్నవి, నిగ్రహః = ప్రవృత్తినివృత్తుల యొక్క నిగ్రహము (నాచేతను గాని పరునిచేతను గాని చేయఁబడిననిరోధ మనుట). కిం కరిష్యతి = ఏమి చేయలే దనుట).

తా. అర్జునా! యెంత జ్ఞానము గలవాఁడైనను తనపూర్వజన్మ సంస్కారము ననుసరించి యాయావనులలో ప్రవృత్తినివృత్తులను జరుపుచున్నాఁడు. జ్ఞానియొక్కస్థితియే యిట్టు లుండ, మూఢులసంగతిని గూర్చి చెప్పవలయునా? ప్రాణికోటి యంతయు తమజన్మాంతరమునందలి ధర్మాధర్మసంస్కారము ననుసరించి ప్రవర్తించుచుండును. అట్టిప్రవృత్తిని మాన్పుటకు నాచేతను మఱియొకనిచేతను కూడ శక్యము గాదు. అని కృష్ణపరమాత్మ యర్జునునకుం జెప్పెను. ఇట్టిభగవద్వాక్యముచేత నీఁక ముందు ననర్థములను గలిగించుకోరికలు ప్రారబ్ధకర్మమువలననే పుట్టింపఁ బడుచున్న వని స్పష్టమగుచున్నది.

అవ. ప్రారబ్ధకర్మము మహాతీవ్రమైనదియు ననివార్యంబైనదియు నయి యున్న దనుటకు నింకొకవాక్యసమ్మతియుం గల దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవశ్యంభావిభావానాం ప్రతీకారో భవేద్యది,
తదా దుఃఖైర్న లిప్యేరన్నలరామయుధిష్ఠిరాః. 156

వ్యా. తీవ్రప్రారబ్ధస్యాపరిహార్యత్వే వచనాంతరసమ్మతి మాహ—అవశ్యమితి. అవశ్యంభావినాం భావానాం దుఃఖాదీనామిత్యర్థః.

టీ. అవశ్యం = ముఖ్యముగా, భావిభావానాం - భావి=కాఁదగిన, భావానాం= దుఃఖాదిభావములకు, ప్రతీకారః = పరిహారము, భవేద్యది = ఉండినచో, తదా = ఆవెనుకటికాలమునందు, నలరామయుధిష్ఠిరాః = నలచక్రవర్తియు, శ్రీరామచంద్ర మూర్తియు, ధర్మరాజును, దుఃఖైః = దుఃఖములచేత, న లిప్యేరన్ = పీడింపఁబడక యుందురు.

తా. తప్పక సంభవించెడిదుఃఖాదులకుఁ బరిహార ముండినచో పూర్వకాలమునందు నలమహారాజును, శ్రీరామచంద్రమూర్తియు,

ధర్మరాజును అంతంతకష్టముల నేల యనుభవించెదరు ? అంతటి వారయ్యు దుఃఖాదులకుఁ బరిహారము లేమింజేసి యన్నియిక్కట్లు పడిరి. కనుక తీవ్రప్రారబ్ధమునకుఁ బరిహారము లే దని యీవాక్యము చేతఁ దెలియఁబడుచున్నది.

అవ. ప్రారబ్ధమునకు పరిహారము లేనిచోఁ బ్రారబ్ధమునుం దప్పింపఁజాలని యీశ్వరున కీశ్వరత్వము చూడ నేలబీరకాయవంటిదే యగు నని యాశంకించి సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. న చేశ్వరత్వ మీశస్య హీయతే తావతా యతః,
అవశ్యంభావితాప్యేషా మీశ్వరేణైవ నిర్మితా. 157

వ్యా. ప్రారబ్ధస్యాపరిహార్యత్వే తత్పరిహారాసమర్థస్యేశ్వరస్యానీశ్వరత్వప్రసంగ ఇత్యాశంక్యాహ—న చేశ్వరత్వమితి. కుత ఇత్యత ఆహ—యతః అవశ్యమితి. యతః కారణాదేషాం దుఃఖాదీనామవశ్యంభావితాపి ఈశ్వరేణైవ నిర్మితా, అతో నానీశ్వరత్వప్రసంగ ఇత్యర్థః.

టీ. తావతా=ప్రారబ్ధకర్మమును దప్పింపకపోయినంతమాత్రముచేత, ఈశస్య = ఈశ్వరునియొక్క, ఈశ్వరత్వం = ఈశ్వరభావము, న చ హీయతే = లేకపోదు, యతః = ఏకారణమువలన, ఏషాం = ఈదుఃఖాదులయొక్క, అవశ్యంభావితాపి = తప్పక యనుభవింపఁజేయుటయు, ఈశ్వరేణైవ=ఈశ్వరునిచేతనే, నిర్మితా=ఏర్పఱుపఁబడినదో.

తా. ప్రారబ్ధకర్మమును దప్పింపఁజాలనంతమాత్రముచేత నీశ్వరుని ఈశ్వరత్వంబున కేమాత్రమును గొఱంత గలుగదు. ఈదుఃఖాదులను దప్పక యనుభవింపవలయు ననెడిశాసనముచేసినవాఁ డీశ్వరుఁడే కనుక నతని యీశ్వరత్వమున కేకొఱంతయును లేదు.

అవ. ఈవిధముగా నిచ్ఛా ప్రారబ్ధమును వివరముగాఁ దెల్పి యిప్పు డనిచ్ఛా ప్రారబ్ధముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రశ్నోత్తరాభ్యామేవైతద్గమ్యతేఽర్జునకృష్ణయోః,
అనిచ్ఛాపూర్వకం చాస్తి ప్రారబ్ధ మితి తచ్ఛృణు. 158

వ్యా. ఏవం సప్రపంచమిచ్ఛాప్రారబ్ధ మభిధాయానిచ్ఛాప్రారబ్ధం వక్తుమారభతే—ప్రశ్నోత్తరాభ్యామితి. అనిచ్ఛాపూర్వకం చ ప్రారబ్ధమస్తి ఏతదర్జునకృష్ణయోః ప్రశ్నోత్తరాభ్యామేవ గమ్యతే జ్ఞాయత ఇతి యోజనా. తదభిధానాయ శిష్యమభిముఖీకరోతి—తచ్ఛృణ్వితి.

టీ. అనిచ్ఛాపూర్వకం = తనయిచ్ఛాపూర్వకము గాని, ప్రారబ్ధం చ = ప్రారబ్ధ మొక్కటియు, అస్తీతి = కల దని, ఏతత్ = ఈసంగతి, అర్జునకృష్ణయోః = అర్జునుని యొక్కయు కృష్ణునియొక్కయు, ప్రశ్నోత్తరాభ్యామేవ = క్రమముగా నర్జునిప్రశ్న చేతను శ్రీకృష్ణుఁడు దెల్పినయుత్తరముచేతను, గమ్యతే = తెలియఁబడుచున్నది. తత్ = దానిని, శృణు = తెల్పెద వినుము.

తా. అనిచ్ఛాపూర్వకం బగు ప్రారబ్ధమొక్కటి గలదు. అట్టి ప్రారబ్ధ మున్నట్లు అర్జునునిప్రశ్నవలనను శ్రీకృష్ణునియుత్తరమువలనను దెలియఁబడుచున్నది. దాని నెఱింగించెద విను మని శిష్యుని నున్ముఖునిగాఁ జేయుచున్నాఁడు.

అవ. అర్జునుఁ డనిచ్ఛాప్రారబ్ధమును గుఱించి చేసిన ప్రశ్నమును నిప్పుడు చూపుచున్నాఁడు:—

శ్లో. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలా దివ నియోజితః. 159

వ్యా. తత్రార్జునస్య ప్రశ్నం తావద్దర్శయతి—అథ కేనేతి. హే వార్ష్ణేయ వృష్ణి సంబంధిన్! అయం పురుషః కేన ప్రయుక్తః ప్రేరితః అనిచ్ఛన్నపి ఇచ్ఛామకుర్వన్నపి రాజ్ఞా బలాన్నియోజిత ఇవ పాపం చరతి—ఆచరతి.

టీ. హేవార్ష్ణేయ = వృష్ణికులోద్భవుం డగు శ్రీకృష్ణా, అథ = అనంతరము, అయం పూరుషః = ఈపురుషుఁడు, కేన = దేనిచేతను, ప్రయుక్తస్సన్ = ప్రేరేపింపఁబడి, అనిచ్ఛన్నపి=ఇచ్ఛ లేనివాఁడైనను, (రాజ్ఞా = రాజుచేత), బలాత్=బలాత్కారముగ, నియోజిత ఇవ = నియమింపఁబడినవానివలె, పాపం = పాపకర్మను, చరతి = ఆచరించుచున్నాఁడో (తెల్పు మనుట).

తా. వృష్ణివంశమున నవతరించిన యో శ్రీకృష్ణా! ఈపురుషుఁడు తన కిచ్ఛ లేకుండినను రాజుచేత బలాత్కారముగ భటుఁడు నియమితుఁడై పనిచేయునట్లు ఎవనిచేతఁ బ్రేరితుఁ డగుచుఁ బాపకర్మంబుల నాచరించుచున్నాఁడో యనుగ్రహించి తెల్పు మని యర్జునుం డడిగెను.

అవ. ఆయర్జునునిప్రశ్నకు శ్రీకృష్ణుఁడు తెల్పిన యుత్తరమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 160

వ్యా. శ్రీకృష్ణస్యోత్తరమాహ — కామఇతి. ఏష పురుషప్రవర్తకః రజోగుణాత్సముద్భవః ఉత్పత్తిర్యస్య సః రజోగుణసముద్భవః కామ ఏషః ప్రసిద్ధోఽయం కామః కదాచిత్క్రోధరూపేణాపి పరిణమతే. తతః క్రోధస్స పునః కీదృశః ? మహాశనః మహదశనం విషయజాతం యస్య స మహాశనః, మహాపాప్మా మహతః పాపస్య హేతుత్వా దుపచారా న్మహాపాప్మత్వమస్య అత ఇహ సంసారే ఏవం కామక్రోధ రూపిణం వైరిణం విద్ధి. అయమభిప్రాయః—ప్రారబ్ధవశాదుద్రిక్తరజోగుణకార్యయోః కామక్రోధయోరన్యతరస్యైవ పురుషప్రవర్తత్వం న ప్రవృత్తిరిచ్ఛయేతి.

టీ. ఏషః కామః = ఈకామంబును, ఏషః క్రోధః = ఈకోపంబును, రజోగుణ సముద్భవః = రజోగుణంబువలనఁ బుట్టినవి (రజోగుణకార్యము లనుట). మహాశనః= విషయసమూహం బను నధికాహారము గలిగినట్టియు, మహాపాప్మా = గొప్పపాపము నకు హేతు వగుటవలన నౌపచారికముగ మహాపాపియే యనం దగినదియు నగు, ఏనం= ఈకామక్రోధరూపమగు దానిని, ఇహ = ఈజన్మమందు, వైరిణం=పరమశత్రువునుగా, విద్ధి = తెలియుము.

తా. అర్జునా, రజోగుణమువలన బుట్టినకామము (సంకల్పము) పురుషునిఁ బ్రవర్తింపఁజేయునదై యొకప్పు డదియే క్రోధరూపముగా మాఱి దానికి విషయము లనియెడి యెంతయాహారమైనను చాలక పెద్దతిండిపోతు వలె మిహాపాపములను కలుగఁజేయుటవలన మహాపాపి యనంబడి యెల్లజనులను నెప్పుడును బాధించుచుండెడు నీకామ క్రోధంబులనే పరమశత్రువులనుగాఁ దెలిసికొనుము. ప్రారబ్ధకర్మవలన రజోగుణ మతిశయించిన కామముగాఁగాని క్రోధముగాఁగాని యై పురుషునిం బ్రేరేపించి విషయములయందుఁ బ్రవర్తింపఁజేయును. అంతియగాని యెన్నఁడును బురుషుఁడు తనయిచ్ఛచేత నేవిషయముల యందుఁ బ్రవర్తింపఁ డని గట్టిగా నమ్ముము.

అవ. పురుషుని నియమములయందుఁ బ్రవర్తింపఁజేయు నని కామక్రోధము లన వలెనుగాని, అనిచ్ఛాప్రారబ్ధము నేల ప్రవర్తింపఁజేయు నని శంకించి అనిచ్ఛయే పురుషుని విషయములయందుఁ బ్రవర్తింపఁజేయుచున్న దను వాక్యమును జూపుచున్నాఁడు:—

శ్లో. స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోఽపి తత్. 161

వ్యా. నన్వత్ర కామక్రోధయో రేవ పురుషప్రవర్తకత్వముపలక్ష్యతే, నానిచ్ఛా ప్రారబ్ధస్యేత్యాశంక్య తస్యైవ ప్రవర్తకత్వప్రతిపాదకం తద్వాక్యం పఠతి—స్వభావ జేనేతి. కౌంతేయ స్వేనైవానుష్ఠితేత అత ఏవ స్వకీయేన ప్రారబ్ధేన కర్మణా నిబద్ధస్సన్ యత్కర్తుం నేచ్ఛసి తదపి మోహాదవివేకతః అవశః పరవశః కరిష్యసి అతోఽనిచ్ఛా ప్రారబ్ధమస్తీత్యభ్యుపగంతవ్యమితి భావః.

టీ. హే కౌంతేయ = కుంతీపుత్రుఁడవగు నోయర్జునా, స్వేన = తనచేతనే యనుష్ఠింపఁబడినది గనుక, స్వభావజేన = తనదైన, కర్మణా = ప్రారబ్ధకర్మముచేత నిబద్ధస్సన్ = నిరోధింపఁబడినవాఁడ వగుచు, యత్ = ఏయుద్ధమును, కర్తుం = చేయు టకు, నేచ్ఛసి = ఇష్టపడవో, తదపి = ఆయుద్ధంబును, మోహాత్ =అజ్ఞానమువలన, అవ శస్సన్ = పరవశుండ వగుచు, కరిష్యసి = చేయఁగలవు.

తా. ఓయర్జునా, వెనుకటి జన్మంబులలోఁ దనచే ననుష్ఠింపఁబడిన దగుటవలన తన ప్రారబ్ధకర్మచేత బంధింపఁబడినవాఁడ వగుచు నేయుద్ధము నొనరింపనిష్టపడవో యాయుద్ధమును నవివేకమువలనఁ బరవశుండ వగుచుఁ జేసెద వని శ్రీకృష్ణపరమాత్మ చెప్పియుండెను. ఇందువలన ననిచ్ఛాప్రారబ్ధ మొకటి యున్న దని యంగీకరింప వలసియున్నది.

అవ. ఇఁక పరేచ్ఛాప్రారబ్ధమును గుఱించి తెల్పుచున్నాఁడు:—

శ్లో. నానిచ్ఛంతో న చేచ్ఛంతః పరదాక్షిణ్యసంయుతాః,
సుఖదుఃఖే భజంత్యేతత్పరేచ్ఛాపూర్వకర్మ హి. 162

వ్యా. ఇదానీం పరేచ్ఛాప్రారబ్ధమస్తీత్యాహ—నానిచ్ఛంత ఇతి. అనిచ్ఛం తోఽపి న భజంతి. ఇచ్ఛంతోఽపి న భజంతి కింతు పరదాక్షిణ్యసంయుక్తాస్సంత స్తత్ప్రీత్యర్థమేవ సుఖదుఃఖే అనుభవంతి. అత ఏతత్సుఖాదిభోగహేతుభూతం పరే చ్ఛాపూర్వకం ప్రారబ్ధం ప్రసిద్ధమిత్యర్థః. అతఏవ దోషదర్శనే సత్యపి ప్రారబ్ధస్యాపరి హార్యత్వాత్తస్యేచ్ఛాజనకత్వం న నివారయితుం శక్నోతీతి భావః.

టీ. అనిచ్ఛంతః=ఇష్టము లేనివారును, సుఖదుఃఖే=సుఖదుఃఖంబులను, న భజంతి అనుభవింపరు; ఇచ్ఛంతశ్చ = ఇష్టపడువారును, న భజంతీతి న = అనుభవింపరను మాట లేదు (అనుభవింతు రనుట.) (కింతు = ఇఁక నే మనఁగా), పరదాక్షిణ్యసంయుతా స్సంతః = ఇతరులదాక్షిణ్యముతోఁ గూడినవా రగుచు, సుఖదుఃఖే=సుఖదుఃఖములను,

భజంతి = అనుభవించుచున్నారు. ఏతత్ = ఇది, పరేచ్ఛాపూర్వకర్మహి = పరేచ్ఛాపూర్వకమైన ప్రారబ్ధము గదా.

తా. సుఖదుఃఖములను బుద్ధిపూర్వకముగ ననుభవింపరు. ఆసుఖదుఃఖములనే యన్యులయొక్క ప్రీతికొఱకు సమ్మతిపడి యనుభవింతురు. ఇట్లు సుఖదుఃఖాదిభోగములకు హేతుభూత మగు పరేచ్ఛాప్రారబ్ధము లోకమున సుప్రసిద్ధమే యై యున్నది. కాఁబట్టి జ్ఞానికి విషయముల యందు దోషదృష్టి యుండినను ప్రారబ్ధమునకుఁ బరిహారము లేదు. గనుక దానికి నిచ్ఛను పుట్టింపకుండఁ జేయుట కెవ్వారికిని సాధ్యము గాదు.

అవ. జ్ఞానికిని నిచ్ఛయుండె నేని, శ్రు. "కిమిచ్ఛన్" అనఁగా నేమి ఫలము నిచ్ఛయించుచు జ్ఞాని ప్రవర్తించు నని చెప్పిన యీ శ్రుత్యర్థమునకు నిప్పుడు మీ రంగీకరించినమాట విరోధించును గదా యని పూర్వవాది యాక్షేపింప సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కథం తర్హి కిమిచ్ఛన్ని త్యేవ మిచ్ఛా నిషిధ్యతే,
నేచ్ఛానిషేధః కింత్విచ్ఛాబాధో భర్జితబీజవత్. 163

వ్యా. నను తత్త్వవిదోఽపీచ్ఛాంగీకారే కి మిచ్ఛన్నితి శ్రుతివిరోధఇతి శంకతే—కథం తర్హీతి. కిమిచ్ఛన్నిత్యనేన వాక్యేన కథమిచ్ఛాభావో వర్ణిత ఇత్యర్థః. నానేనేచ్ఛా భావోఽభిధీయతే, కింతు సత్యా అపి తస్యాస్సమర్థప్రవృత్తిజనకత్వం నాస్తీతి బోధ్యత ఇతి పరిహరతి—నేచ్ఛానిషేధ ఇతి. స్వరూపేణ సత్యా అపి తస్యాస్సామర్థ్యరాహిత్యే దృష్టాంతమాహ—భర్జితేతి.

టీ. తర్హి = అట్లైనచో, కిమిచ్ఛన్నితి = ఏమి ఫలము నిచ్ఛయించు ననెడి వాక్యముచేత, ఏవం = ఈవిధముగా, ఇచ్ఛా = కోరిక, కథం=ఎట్లు, నిషిధ్యతే = నిషేధింపఁబడుచున్నది. (తత్త్వవిదున కిచ్ఛయే లే దని యాశ్రుతి యెట్లు చెప్పె ననుట). ఇచ్ఛా నిషేధః = ఇచ్ఛ లేకపోవుట, న=కాదు, కింతు = మఱి యేమనఁగా, భర్జితబీజవత్ - భర్జిత = వేయించఁబడిన, బీజవత్ = గింజలవలె, ఇచ్ఛాబాధః = ఇచ్ఛయొక్క లేమి, (ఉక్తః = చెప్పఁబడెను.).

తా. శ్రు. "కిమిచ్ఛన్" ఏమి ఫలము నిచ్ఛయించుచు అని తత్త్వజ్ఞాని కిచ్ఛయే లే దని శ్రుతి తెల్పుచుండ నీవు తత్త్వజ్ఞాని కిచ్ఛ నంగీకరించుట శ్రుత్యర్థమునకు విరోధము గాదా యనిన నామాట

యొక్క యర్థ మది కాదు. మఱియేమి యనఁగా ఇచ్ఛ కలిగినను జ్ఞానము గలిగినతర్వాత నాయిచ్ఛ వేయించఁబడిన గింజలు (అగ్నితప్తంబైన గింజలు) మఱల మొలకలెత్త నట్లు ఆ కలిగినయిచ్ఛ జననమరణాదికార్యములను బుట్టింపఁజాల దని దాని యర్థము. అనఁగా ఇచ్ఛాస్వరూప ముండవచ్చును. కాని వేఁచిన గింజలవలె కార్యక్షమము కాకపోవచ్చు నని భావము.

అవ. ఇదివఱకు సంగ్రహముగాఁ జెప్పఁబడినయంశమును విస్తరించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. భర్జితాని తు బీజాని సంత్యకార్యకరాణి చ
విద్వదిచ్ఛా త థేష్టవ్యాఽసత్త్వబోధాన్న కార్యకృత్. 164

వ్యా. సంక్షేపేణోక్తమర్థం ప్రపంచయతి—భర్జితానీతి. యథా భర్జితాని బీజాని స్వయం స్వరూపేణ విద్యమానాన్యపి నాంకురాది కార్యకారాణి భవంతి, తథా విద్వదిచ్ఛా స్వయం విద్యమానాపీష్యమాణపదార్థస్యాసత్త్వజ్ఞానేన బాధితత్వాన్న వ్యసనాది కార్యక్షమేత్యర్థః.

టీ. భర్జితాని = అగ్నితప్తములైన (వేయించఁబడిన), బీజానీ తు = విత్తనములైతే, సంతి = స్వరూపముతో నున్నవి. అకార్యకరాణిచ=మొలకయెత్తుట మొదలగు పనులను జేయఁజాలవు. తథా = అటువలెనే, విద్వదిచ్ఛా - విద్వత్ = జ్ఞానియొక్క, ఇచ్ఛా = ఇచ్ఛయు, ఏష్టవ్యా = అంగీకరింపఁదగును, అసత్త్వబోధాత్ - అసత్త్వ = జగన్మిథ్యాత్వముయొక్క, బోధాత్ = జ్ఞానమువలన, కార్యకృత్ = సుఖదుఃఖాది కార్యములను గలిగించునది, న = కాదు.

తా. వేయించఁబడిన గింజలు చూచుటకు గింజలవలె నగపడుచుండినను వానికి మొలక యెత్తఁదగిన శక్తిలేనట్లు జ్ఞానికి నిచ్ఛ కలిగినను జగత్తు మిథ్య యను నిశ్చయజ్ఞానము కలిగియుండుటవలన సుఖదుఃఖాదులను పునర్జన్మమును నియ్యఁజాల వని తెలిసికొనవలయును.

అవ. ప్రయోజనము లేదు గనుక జ్ఞాని కిచ్ఛయే లే దన రాదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. దగ్ధబీజమరోహేఽపి భక్షణాయోపయుజ్యతే,
విద్వదిచ్ఛాఽప్యల్పభోగం కుర్యాన్న వ్యసనం బహు. 165

వ్యా. నను తర్హి విదుష ఇచ్ఛైవ నాంగీకర్తవ్యా, ఫలాభావాదిత్యాశంక్య, ఫలాభావోఽసిద్ధో భోగలక్షణఫలసద్భావాదితి స దృష్టాంతమాహ—దగ్ధబీజమితి. దగ్ధం భర్జితమితి యావత్. వ్యసనం విపదాదిరూపం బహువిధం వ్యసనం. ని. "వ్యసనం విపది భ్రంశే దోషే కామజకోపజ" ఇత్యభిధానాత్.

టీ. దగ్ధం = కాల్చఁబడిన, బీజం = గింజ, అరోహేఽపి = మొలక యెత్తక పోయినను భక్షణాయ = తినుటకు, ఉపయుజ్యతే = పనికివచ్చుచున్నది, (అటులనే) విద్వదిచ్ఛాపి = జ్ఞానియొక్క యిచ్ఛయును, అల్పభోగం = స్వల్ప మగు భోగమును, కుర్యాత్ = కలుగఁజేయును, బహు వ్యసనం = ఎక్కువదుఃఖమును, న కుర్యాత్ = కలిగింపఁజాలదు.

తా. అగ్నితప్త మగు విత్తనము మొలిపించుటకుఁ బనికి రాక పోయినను తినుట కుపయోగించినట్లు జ్ఞానికిఁ గలిగినయిచ్ఛయు విశేష దుఃఖాదులను గలిగింప లేకపోయినను స్వల్ప భోగమునకుఁ బనికివచ్చు నని యీ దృష్టాంతముచేత స్పష్టమగుచున్నది.

అవ. ప్రారబ్ధకర్మమే భోగద్వారా జననమరణాది దుఃఖములను గలిగించు నని యేల యనరా దనెదవా చెప్పెద విను.—

శ్లో. భోగేన చరితార్థత్వాత్ప్రారబ్ధం కర్మ హీయతే,
భోక్తవ్యసత్యతా భ్రాంత్యా వ్యసనం తత్ర జాయతే. 166

వ్యా. నను కర్మైవ భోగద్వారా వ్యసనమపి జనయేదిత్యాశంక్యాహ—భోగేనేతి. ప్రారబ్ధకర్మణో భోగమాత్రహేతుత్వాన్న వ్యసనజనకత్వ మిత్యర్థః. కుతస్తర్హి వ్యసనజన్మేత్యత ఆహ—భోక్తవ్యేతి. తత్ర తస్మిన్విషయే.

టీ. ప్రారబ్ధం = ప్రారబ్ధమనియెడి, కర్మ = కర్మము, చరితార్థత్వాత్ = భోగము నిచ్చుటవలన (ప్రారబ్ధకర్మ భోగమాత్రమునకుఁ గారణ మగుటవలన), భోగేన=అనుభవించుటచేత, హీయతే = నశించుచున్నది, భ్రాంత్యా = అజ్ఞానముచేత, భోక్తవ్య సత్యతా - భోక్తవ్య = అనుభవింపఁదగిన పదార్థములకు, సత్యతా = సత్యత్వము తోఁచు చుండఁగా, తత్ర = ఆవిషయమందు, వ్యసనం = దుఃఖాదికము, జాయతే = పుట్టును.

తా. ప్రారబ్ధకర్మము భోగమునుమాత్ర మిచ్చి తాను నశించి పోవుచున్నది. కాని వ్యసనమును గలిగింపఁజాలదు. అనుభవింపఁదగిన పదార్థము అజ్ఞానముచేత సత్యముగాఁ దోచునెడ నావిషయమున జననాదిదుఃఖము తప్పక కలుగు నని తెలియవలెను.

అవ. దుఃఖాదులకు హేతు వగు భ్రమనుగుఱించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. మా పినశ్య త్వయం భోగో వర్ధతా ముత్తరోత్తరం,
మా విఘ్నాః ప్రతిబధ్నంతు ధన్యోఽస్మ్యస్మాదితి భ్రమః. 167

వ్యా. వ్యసనహేతుం భ్రమం దర్శయతి—మా వినశ్యత్వితి. అయం భోగో మా వినశ్యతు. ఏవ ఉత్తరోత్తరం వర్ధతాం. విఘ్నాశ్చైనం మా ప్రతిబధ్నంతు. అస్య ప్రతిబంధం మా కుర్వంతు. అస్మాదేవ భోగాదహం ధన్యః కృతార్థోఽస్మీత్యేవం రూపో భ్రమో భవతి. తతశ్చ వ్యసనమిత్యర్థః.

టీ. అయం భోగః = ఈభోగము, మా వినశ్యతు = ఎన్నఁటికిని నశింపక పోవుఁ గాక. ఉత్తరోత్తరం = పైపైన, వర్ధతాం = అభివృద్ధియగుఁగాక, విఘ్నాః = అటంక ములు, మా ప్రతిబధ్నంతు = బాధింపకపోవుఁగాక, అస్మాత్ = ఈకలిగినభోగమువలన, ధన్యః అస్మి=ధన్యుఁడ నైతిని; ఇతి=ఇట్లనుకొనుట, భ్రమః = భ్రమ యనఁబడును.

తా. నా కిప్పుడు గలిగిన యీసుఖము నశింపక క్రమముగా నభివృద్ధి పొందవలయును. ఇట్టిభోగమున కేయాటంకములు గలుగకుండును గాక. ఇట్టిసుఖము కలుగుటవలన నేను కృతార్థుఁడను అని యనుకొనుటయే భ్రాంతి యనఁబడును.

అవ. ఇట్టి భ్రాంతి పోవునట్టియుపాయమును ప్రాసంగికముగా నెఱిఁగించుచున్నాఁడు:—

శ్లో. యదభావి న తద్భావి భావి చేన్న త దన్యథా,
ఇతి చింతావిషఘ్నోఽయం బోధో భ్రమనివర్తకః. 168

వ్యా. ప్రసంగాదస్య పరిహారోపాయమాహ—యదభావీతి. యద్భవితు మయోగ్యం త న్న భవేదేవ. భవితుం యోగ్యం చైత్తదన్యథా న భవే దేవేత్యేవం రూపశ్చింతా విషఘ్నః. ఇదం మే శ్రేయః కదా భవిష్యతి? ఇదమనిష్టం కదా నివర్తిష్యత ఇత్యేవ మాదిచింతైవ విషమివ స్వసంస్పృష్టపురుషస్య నాశహేతుత్వాద్విషమిదం. చింతావిషం హంతీతి చింతావిషఘ్నః ఏవంభూతో యో బోధసోఽయం భ్రమనివర్తకః పూర్వోక్తభ్రమస్య నివర్తక ఇత్యర్థః.

టీ. యత్=ఏది, అభావి=కాదో, తత్=అది, న భావి=కానేకాదు. భావిచేత్=కావలసియుండెనా, తత్ = అది, అన్యథా = వేఱుగా, న = కాదు, ఇతి = అనెడి, చింతావిషఘ్నః = విచార మనెడి విషమును బోఁగొట్టునట్టి, అయం బోధః=ఈజ్ఞానము, భ్రమనివర్తకః = భ్రమను బోఁగొట్టునది (అగును).

తా. ఏది కాదో యది కానేకాదు, కాఁ దగినది కాకమానదు. మనుష్యునకుఁ గలిగెడివిచారము లనెడివిషమును బోఁగొట్టునట్టి యిట్టి జ్ఞానము భ్రాంతిని దొలఁగించును.

అవ. జ్ఞానికిని అజ్ఞానికిని భోగానుభవము సమానముగా నుండి యున్నను నిందులో నొకనికి వ్యసనము గలుగ దనుటయు నింకొకనికి (అజ్ఞానికి) వ్యసనము గలుగు ననుటయు నెట్లు పొసఁగు ననిన విపరీతజ్ఞానముయొక్క యునికిలేములంబట్టి య ట్లగు నని సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సమేఽపి భోగే వ్యసనం భ్రాంతో గచ్ఛేన్న బుద్ధవాన్,
అశక్యార్థస్య సంకల్పాద్భ్రాంతస్య వ్యసనం బహు. 169

వ్యా. నను విద్వదవిదుషో రుభయోరపి భోగిత్వావిశేషే ఏకస్య వ్యసనమపరస్య తు తన్నేత్యేతత్కుత ఇత్యాశంక్య విపరీతజ్ఞానసత్త్వాసత్త్వాభ్యాం తత్సిద్ధిరిత్యాహ—సమేఽపీతి. బుద్ధవాన్ జ్ఞానవాన్ జ్ఞానీత్యర్థః. భ్రాంతే కథం వ్యసనహేతుత్వమిత్యత ఆహ—అశక్యార్థస్యేతి.

టీ. భోగే = ప్రారబ్ధకర్మఫలానుభవము, సమేఽపి=(అజ్ఞానికిని జ్ఞానికిని) సమానముగా నుండినను, భ్రాంతః=భ్రమను పొందినవాఁడు, వ్యసనం=దుఃఖమును, గచ్ఛేత్= పొందును. బుద్ధవాన్ = జ్ఞానము గలవాఁడు, న గచ్ఛేత్ = దుఃఖమును బొందఁడు. భ్రాంతస్య=భ్రాంతిపొందినవానికి, అశక్యార్థస్య=సాధ్యము గానివిషయసముదాయముయొక్క, సంకల్పాత్=సంకల్పమువలన, బహువ్యసనం=అధికమైనదుఃఖము (కలుగును).

తా. జ్ఞానికిని అజ్ఞానికిని ప్రారబ్ధకర్మఫలానుభవము సమానముగా నుండినను, అజ్ఞాని దుఃఖమును బొందును. జ్ఞాని దుఃఖము నొందఁడు. ఏల యనఁగా నజ్ఞాని తనకు సాధింప నలవికానివిషయములను బలుమాఱు చింతించుచు నధికముగా దుఃఖము నొందుచున్నాఁడు; మఱియు విపరీతజ్ఞానము కలిగియుండుటవలన సర్వానర్థములను పొందుచున్నాఁడు. జ్ఞాని యట్టివిపరీతజ్ఞానము లేకపోవుటవలన సర్వానర్థనివృత్తి గలిగి తృప్తిఁ బొందుచున్నాఁడు.

అవ. జ్ఞానికి వ్యసనము లేకపోవుటను దెల్పుచున్నాఁడు:—

శ్లో. మాయామయత్వం భోగస్య బుద్ధ్వాఽఽస్థాముపసంహరన్,
భుంజానోఽపి న సంకల్పం కురుతే వ్యసనం కుతః. 170

వ్యా. వివేకిన స్తదభావం దర్శయతి—మాయామయత్వమితి.

టీ. భోగస్య = విషయానుభవమునకు, మాయామయత్వం = మిథ్యాత్వమును, బుద్ధ్వా=తలంచి, ఆస్థాం=విషయభోగములయం దాసక్తిని, ఉపసంహరన్=తగ్గించినవాఁడగుచు, భుంజానోఽపి=ప్రారబ్ధకర్మఫలము ననుభవించుచుండినను, సంకల్పం=విచారమును, న కురుతే=చేయఁడు. వ్యసనం=దుఃఖము, కుతః=వాని కెట్లు కలుగును ? కలుగ దనుట.

తా. వివేకము గలవాఁడు ప్రారబ్ధకర్మముయొక్క ఫలభోగము నందు మిథ్యాత్వనిశ్చయము గలిగి విషయభోగములయం దాసక్తిని వీడి కర్మఫలము ననుభవించుచుండినను సంకల్పమును జేయఁడు గనుక వానికి దుఃఖము లుండ నేరవు.

అవ. మిథ్యాత్వజ్ఞాన ముండినను భోగము తాత్కాలికసుఖము నిచ్చుటవలన ఆసక్తి లేకపోవు టెట్లు అని యాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వప్నేంద్రజాలసదృశమచింత్యరచనాత్మకం,
దృష్టం నష్టం జగ త్పశ్యన్ కథం తత్రానురజ్యతి. 171

వ్యా. నను మాయామయత్వబోధే సత్యపి భోగస్య తదానీంతన సుఖహేతుత్వా త్కుతఆస్థోపసంహార ఇత్యాశంక్య బహువిధదోషదర్శనాదిత్యాహ—స్వప్నేంద్రేతి.

టీ. స్వప్నేంద్రజాలసదృశం = స్వప్నముతోను ఇంద్రజాలముతోను సమానమైనట్టియు, అచింత్యరచనాత్మకం - అచింత్య=ఇట్టిదని యోచింప శక్యముకాని, రచనా= కల్పనయే, ఆత్మకం = స్వరూపముగాఁ గలిగినట్టియు, దృష్టం సత్ = చూడఁబడుచున్న దగును, నష్టం=నశించెడి, జగత్ = ప్రపంచమును, పశ్యన్ = చూచుచు, తత్ర=ఆజగత్తు నందు, కథం=ఏలాగున, అనురజ్యతి = అనురక్తిని పొందును ? ఆసక్తుఁడు కాఁ డనుట.

తా. స్వప్నమువలెను ఇంద్రజాలమువలెను మిథ్యారూపముగఁ గనఁబడుచు నశించెడిజగత్తును జూచుచు నందలివిషయములయం దన్నియు దోషములే కనఁబడుటచేత నాజగత్తునందును విషయముల యందును జ్ఞాని ఆసక్తుఁడు కాఁ డని భావము.

అవ. జగత్తును స్వప్నేంద్రజాలములవలె చూచుట యేవిధముగాఁ గల్గునో యాయుపాయముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వస్వప్న మాపరోక్ష్యేణ దృష్ట్వా పశ్యన్ స్వజాగరమ్,
చింతయే దప్రమత్త స్సన్నుభా వనుదినం ముహుః. 172

వ్యా. ననూక్తస్వప్నేంద్రజాలసాదృశ్యాదిజ్ఞానే సత్యాసక్తిభావో న భవేత్తదేవ కుతో జాయత ఇత్యాశంక్య తజ్జన్మోపాయమాహ—స్వస్వప్నమితి శ్లోకద్వయేన. స్వకీయ స్వప్నమపరోక్షతయా దృష్ట్వా స్వకీయం చ జాగరమనుభవన్ స్వప్నజాగరావుభావపి అప్రమత్తస్సన్ముహుశ్చింతయేత్స్వప్నతుల్యోఽయం జాగర ఇతి.

టీ. స్వస్వప్నం = తనయొక్క స్వప్నమును, అపరోక్ష్యేణ = ప్రత్యక్షముగా, దృష్ట్వా=చూచి, స్వజాగరం = తనజాగ్రదవస్థను, పశ్యన్=కనుఁగొనుచు, ఉభౌ=స్వప్నజాగరములను రెండింటిని, అప్రమత్తస్సన్=పొరపాటులేకుండ, అనుదినం=ప్రతిదినమునందును, ముహుః=మాటిమాటికిని, చింతయేత్ = విచారింపవలయును. జాగ్రదవస్థయు స్వప్నమువంటిదే యగు నని తలంపవలయు ననుట.

తా. వివేకియగువాఁడు (జ్ఞాని) స్వప్నమును ప్రత్యక్షముగాఁ జూచి తనజాగ్రదవస్థను జూచుచు పొరపాటుపడక స్వప్నజాగరములు రెండింటినిగురించి యనుదినంబును స్వప్నమువలె జాగ్రదవస్థయు సత్యము కా దని మాటిమాటికి విచారింపవలయును.

శ్లో. చిరం తయోస్సర్వసామ్య మనుసంధాయ జాగరే,
సత్యత్వబుద్ధిం సంత్యజ్య నానురజ్యతి పూర్వవత్. 173

వ్యా. ఏవం తయో స్స్వప్నజాగరణయో స్సర్వసామ్యం తాత్కాలికభోగహేతుత్వపరిణతివిరసత్వవినాశిత్వాదిలక్షణం చిరమనుసంధాయ జాగరేఽపి సత్యత్వబుద్ధిం సంత్యజ్య పరిత్యజ్య జాగ్రద్వస్తుష్వపి పూర్వవజ్జగత్సత్యత్వజ్ఞానదశాయామివ నానురజ్యతి అనురక్తో న భవతీత్యర్థః.

టీ. తయోః = అస్వప్నజాగ్రదవస్థలకు, సర్వసామ్యం = సర్వవిధముల సాదృశ్యమును, చిరం = బహుకాలము, అనుసంధాయ = తలంచి, జాగరేఽపి = జాగ్రదవస్థయందును, సత్యత్వబుద్ధిం = సత్యత్వబుద్ధిని, సంత్యజ్య = విడిచిపెట్టి, పూర్వవత్ = అజ్ఞానదశయందు వలె, నానురజ్యతి = అనురక్తుఁడు గాఁడు.

తా. ఈలాగున స్వప్నజాగ్రదవస్థలకు రెండింటికిని తాత్కాలిక భోగమునకు హేతు వగుటయు పరిపక్వస్థితియందు విరసత్వమును బొందుటయు నశించుటయు మొదలగులక్షణములు గల సర్వసామ్యమును బహుకాల మనుసంధానముచేసి జాగ్రదవస్థయందుఁ గనఁబడెడి యావద్వస్తువులయందును సత్యత్వబుద్ధి లేకపోవుటచేత నజ్ఞానదశలో ననురక్తుఁ డైనట్లు అనురక్తుఁడు కాఁడు. ఆసక్తిని జెందఁ డని భావము.

అవ. ప్రపంచవిషయక మగు మిథ్యాత్వజ్ఞానమునకును విషయసత్యత్వమును ననుసరించెడి భోగమునకును పరస్పరము విరోధ ముండుటవలన మిథ్యాత్వజ్ఞాన ముండియుండఁగా జ్ఞానికి ప్రారబ్ధకర్మఫలభోగ మెట్లు గలుగుట తటస్థించును? అని పూర్వవాది యాక్షేపింపఁగా విషయము సత్యమై యుండినఁగాని కర్మఫలభోగ ముండ దనునియమము లేకపోవుటవలన విరోధము లే దని పరిహరించుచున్నాఁడు:—

శ్లో. ఇంద్రజాల మిదం ద్వైత మచింత్యరచనాత్వతః,
ఇత్యవిస్మరతో హానిః కా వా ప్రారబ్ధభోగతః. 174

వ్యా. నను ప్రపంచగోచరస్య మిథ్యాత్వజ్ఞానస్య విషయసత్యత్వోపజీవినో భోగస్య చ పరస్పరవిరోధాన్మిథ్యాత్వజ్ఞానే సతి కథం భోగసిద్ధిరిత్యాశంక్య భోగస్య విషయసత్యత్వాపేక్షాభావాన్న విరోధ ఇతి పరిహరతి—ఇంద్రజాలమితి. ఇదం ద్వైతం భోగ్యజాతమచింత్యరచనాత్వాదింద్రజాలవన్మిథ్యేతి యుక్త్యానుసంధాయా విస్మరతో విదుషః ప్రారబ్ధభోగతః ప్రారబ్ధకర్మఫలయోస్సుఖదుఃఖయో రనుభవేన మిథ్యాత్వానుసంధానస్య కా వా హానిః? వాశబ్దాన్మిథ్యాత్వానుసంధానేన భోగస్య కా హానిః? విభిన్న విషయత్వాదితి భావః.

టీ. అచింత్యరచనాత్వతః - అచింత్య = చింతించుటకు నలవి కాని, రచనాత్వతః = కల్పనారూపము గలిగి యుండుటవలన, ఇదం ద్వైతం = భోగ్యపదార్థములరాశి యగు నీద్వైతము, ఇంద్రజాల మితి = ఇంద్రజాలమువంటి దని (మిథ్య యని), అవిస్మరతః = నిత్య మనుసంధానము చేయుచు మఱవనిజ్ఞానికి, ప్రారబ్ధభోగతః - ప్రారబ్ధ = ప్రారబ్ధకర్మఫలముయొక్క, భోగతః = అనుభవించుటవలన, హానిః = బాధ, కా వా = ఏ మున్నది? ప్రారబ్ధకర్మఫలమును జగన్మిథ్యాత్వజ్ఞానము నీ రెండును ప్రత్యేకవిషయము లగుటవలన, ప్రారబ్ధకర్మఫలములైన సుఖదుఃఖములయొక్క యనుభవముచేత జగత్తు మిథ్యయగు నని తలంచుట కేమియు బాధ లేదు. జగత్తు మిథ్య యని యనుసంధానము చేయుటచేత ప్రారబ్ధకర్మఫలభోగమున కయినను బాధ లే దనుట.

తా. అచింత్యరచనారూప మగుటవలన ద్వైత మంతయు నింద్రజాలమువలె మిథ్య యగు నను సంగతిని గుర్తెఱింగినజ్ఞానికి ప్రారబ్ధఫల మగు సుఖదుఃఖానుభవముచేత జగన్మిథ్యాత్వానుసంధానమునకైనను, జగన్మిథ్యాత్వానుసంధానముచేత ప్రారబ్ధభోగమునకైనను హాని లేదు. ప్రారబ్ధకర్మభోగంబును మిథ్యాత్వజ్ఞానంబును భిన్నవిషయంబులగుటవలనను, భోగమునకు విషయములయొక్క

సత్యత్వాపేక్షతోఁ బనిలేక పోవుటవలనను రెండింటికి విరోధము లేదని భావము.

అవ. ఆరెండును భిన్నవిషయము లగుటను దెలియఁజేయుచున్నాఁడు:—

శ్లో. నిర్బంధ స్తత్త్వవిద్యాయా ఇంద్రజాలత్వసంస్మృతౌ,
ప్రారబ్ధస్యాగ్రహో భోగే జీవస్య సుఖదుఃఖయోః. 175

వ్యా. విభిన్నవిషయత్వమేవ దర్శయతి—నిర్బంధఇతి. తత్త్వవిద్యాయా జగత్తత్త్వగోచరస్య జ్ఞానస్య నింద్రజాలవజ్జగతో మిథ్యాత్వానుసంధానే నిర్బంధః. సతు భోగా పలాపే ప్రారబ్ధకర్మణశ్చ జీవస్య సుఖదుఃఖయోః ప్రదానే ఆగ్రహః. న తు భోగ్యస్య సత్యత్వాపాదన ఇతి భావః.

టీ. తత్త్వవిద్యాయాః - తత్త్వ=జగత్తుయొక్క స్థితిని దెలిపెడి, విద్యాయాః = జ్ఞానమునకు, ఇంద్రజాలత్వసంస్మృతౌ = ఇంద్రజాలముయొక్క, స్థితిని దలంచుట యందు, నిర్బంధః=పట్టుదల (కలదు). తత్త్వజ్ఞానమునకు జగత్తు మిథ్య యని తోపింపఁ జేయుటకు స్వభావము గలదు గాని కర్మభోగమును లేకుండఁజేసెడి స్వభావము లేదనుట. ప్రారబ్ధస్య = ప్రారబ్ధకర్మము, జీవస్య=జీవునియొక్క, సుఖదుఃఖములయందు, ఆగ్రహః= అభినివేశము (కలదు). ప్రారబ్ధకర్మకు జీవునకు సుఖదుఃఖముల నిచ్చుటకు శక్తి కలదు. గాని భోగ్య మగు జగత్తు మిథ్య యని తెల్పుశక్తి లేదనుట.

తా. తత్త్వజ్ఞానమునకు జగత్తు ఇంద్రజాలమువలె మిథ్య యగు నని తెల్పుటకు శక్తి గలదు గాని ప్రారబ్ధకర్మఫలభోగమును నశింపఁ జేయుటకు శక్తిలేదు. ఇటులనే ప్రారబ్ధకర్మమునకు జీవునకు సుఖదుఃఖముల నిచ్చుటయందు శక్తిగలదు. కాని ద్వైతమునకు సత్యత్వమును సంపాదించెడిశక్తి లేదు. అనఁగా తత్త్వజ్ఞానము జగన్మిథ్యాత్వము విషయముగాఁ గలది ప్రారబ్ధకర్మ జీవునకు సుఖదుఃఖానుభవము నిచ్చుట విషయముగాఁ గలది. ఇట్లు రెండును భిన్నవిషయము గలవి యగుటవలనఁ బరస్పరవిరోధము లేదని భావము.

అవ. ఈలాగున తత్త్వజ్ఞానంబును ప్రారబ్ధకర్మయు భిన్నవిషయంబు లగుటను దెలిపి యనుభవమును జూపుచున్నాఁడు:—

శ్లో. విద్యారబ్ధే విరుధ్యేతే న భిన్నవిషయత్వతః,
జానద్భిరప్యైంద్రజాలవినోదో దృశ్యతే ఖలు. 176

వ్యా. ఏవం విభిన్నవిషయత్వం ప్రదర్శ్య ప్రయోగమాహ—విద్యేతి. విద్యాప్రారబ్ధకర్మణీ పరస్పరం న విరుధ్యేతే. విభిన్నవిషయత్వాత్. సంప్రతిపన్నరూపరసజ్ఞా

నవదిత్యర్థః. భోగ్యమిథ్యాత్వజ్ఞానం భోగబాధకం న భవతీత్యేతత్క్వ దృష్ట మిత్యాశంక్యాహ—జానద్భిరితి. ఐంద్రజాలవినోదః ఇంద్రజాలసంబంధిచమత్కార విశేషః జానద్భిరపీంద్రజాలత్వం జానద్భిరప్యవలోక్యత ఇతి ప్రసిద్ధమిత్యర్థః.

టీ. విద్యారబ్ధే = తత్త్వవిద్యయు ప్రారబ్ధకర్మయును, భిన్నవిషయత్వతః = భిన్నవిషయము లగుటవలన, న విరుధ్యేతే = ఒకదాని నొకటి బాధింపవు. ఐంద్ర జాల = ఇంద్రజాలసంబంధ మగు, వినోద = వినోదము, జానద్భిరపి = (ఇది మాయ యని) ఎఱిఁగిన వారిచేతఁగూడ, దృశ్యతే ఖలు = చూడఁబడుచున్నది గదా.

తా. తత్త్వవిద్యయు . ప్రారబ్ధకర్మయు వేఱువేఱువిషయము గలవి గనుక రూపరసజ్ఞానమువలె నొకదానితో నొకటి విరోధింపవు. భోగ్య మగు ద్వైతము మిథ్యయగు ననెడి జ్ఞానము భోగమును బాధింపఁజాల దని మీ రెట్లు దెలియు నని యందువేమో, ఇంద్ర జాలము సత్యము గా దని యెఱింగినవారును, ఆయింద్రజాలమునందలి చమత్కారమును వినోదముగాఁ జూచుచుండుటను గనుచున్నారము గదా. దీనింబట్టియే మిథ్యాత్వజ్ఞానము భోగమునకు బాధకము గా దని స్పష్టమగుచున్నది.

అవ. ఈపైవిధముగా విద్యాప్రారబ్ధకర్మలకు రెండింటికిని బరస్పరవిరోధము లే దని నిర్ణయించితిమి. ఓవాదీ, విరోధ మున్నది యనియే వాదింతువా? నిన్ను కొన్ని సంగతు లడిగెదము. ప్రారబ్ధకర్మ జ్ఞానమునకు విరోధియా? జ్ఞానము ప్రారబ్ధకర్మమునకు విరోధియా? ప్రారబ్ధకర్మము జ్ఞానమునకు విరోధి యగుట సంభవింపనేర దని నిరూపించు చున్నాఁడు:—

శ్లో. జగత్సత్యత్వమాపాద్య ప్రారబ్ధం భోజయేద్యది,
తదా విరోధి విద్యాయా భోగమాత్రాన్న సత్యతా. 17

వ్యా. కించ విద్యాప్రారబ్ధకర్మణో ర్విరోధోఽస్తీతి వదన్ ప్రష్టవ్యః—కిం ప్రారబ్ధకర్మ విద్యావిరోధీత్యుచ్యతే? ఉత విద్యా ప్రారబ్ధకర్మవిరోధినీతి. నాద్య ఇత్యాహ—జగదితి. ఆరబ్ధం కర్మ జగతో భోగ్యజాతస్య సత్యత్వమబాధ్యత్వ మాపాద్య సంపాద్య యది భోజయేత్ జీవస్య సుఖదుఃఖే దద్యాచ్చేత్తదా విద్యావిషయస్య మిథ్యాత్వస్యాపహారాద్విద్యాయా విరోధి స్యాత్. న చ తథా కరోతి. కింతు భోగమేవ ప్రయచ్ఛత్యతో న విద్యావిరోధి ప్రారబ్ధమితి భావః భోగబలాదేవ భోగ్యస్య సత్యత్వమపి స్యాదిత్యాశంక్యాహ—భోగమాత్రాదితి. విమతం జగత్ సత్యం భోగ్యత్వా దిత్యత్ర దృష్టాంతాభావ ఇతిభావః.

టీ. ప్రారబ్ధం=ప్రారబ్ధకర్మము, జగత్సత్యత్వం-జగత్=భోగ్యపదార్థమగు జగత్తునకు, సత్యత్వం=నిలిచియుండుటను, ఆపాద్య=సంపాదించి, భోజయేద్యది=జీవునకు సుఖదుఃఖంబులఁ గలుగఁజేయు నెడల, తదా = అప్పుడు, విద్యాయాః=జ్ఞానమునకు, విరోధి = విరోధము గలది (అగును) భోగమాత్రాత్ = సుఖదుఃఖానుభవమును గలిగించిన మాత్రమున, సత్యతా = భోగ్య మగు జగత్తునకు సత్యత్వము; న = సిద్ధింపదు.

తా. ప్రారబ్ధకర్మ భోగ్యజాతమునకు సత్యత్వమును సంపాదించి జీవునకు సుఖదుఃఖంబుల నిచ్చినచో నప్పుడు విద్యావిషయక మగు మిథ్యాత్వము నపహరించిన దగుటవలన ప్రారబ్ధకర్మము విద్యకు విరోధి యగును. ప్రారబ్ధకర్మ మాలాగున చేయుట లేదు. భోగమునుమాత్ర మిచ్చుచున్నది. కాఁబట్టి ప్రారబ్ధకర్మము విద్యకు విరోధి కాదు. భోగ బలమువలననే భోగ్యపదార్థమునకు సత్యత్వమును గలుగు నని యంటివా? భోగమాత్రమువలన భోగ్యపదార్థమునకు సత్యత్వము గలుగు ననువిషయములో నీకు దృష్టాంతమే లే దని భావము.

అవ. మిథ్య యగు పదార్థములచేత భోగము గలుగు ననుటయందును దృష్టాంతము లేదని యనిన శ్లాశంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అనూనో జాయతే భోగః కల్పితైః స్వప్నవస్తుభిః,
జాగ్రద్వస్తుభి రప్యేవ మసత్యైర్భోగ ఇష్యతామ్. 178

వ్యా. నను మిథ్యాపదార్థై ర్భోగో భవతీత్యత్రాపి దృష్టాంతో నాస్తీత్యాశంక్యాహ—అనూన ఇతి.

టీ. కల్పితైః=కల్పింపఁబడిన, స్వప్నవస్తుభిః = కలలోఁ గనఁబడెడివస్తువులచేత, అనూనః=కొఱవడని, భోగః=భోగము, జాయతే=కలుగుచున్నది. ఏవం = ఈవిధముగా, అసత్యైః=సత్యములు కాని, (అనఁగా మిథ్యాభూతములైన), జాగ్రద్వస్తుభిరపి=జాగ్రదవస్థలయందు అగపడువస్తువులచేతను, భోగః=భోగము,ఇష్యతాం=అంగీకరింపఁబడుఁగాక.

తా. స్వప్నావస్థయందు వాసనాకల్పితము లైన వస్తువులచేత భోగము గలిగినట్లు జాగ్రదవస్థయందును మిథ్య యగు వస్తువులచేత భోగము కల్గుచున్న దని యొప్పి తీరవలయును గదా. ఇందుచేత మిథ్యాపదార్థములచేత భోగము గలుగు ననుటలో దృష్టాంతము లే దనఁగూడదు,

అవ. తత్త్వవిద్య ప్రారబ్ధకర్మమునకు విరోధియా యనెడి రెండవపూర్వపక్షమును భోసఁగ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యది విద్యాఽపహ్నువీత జగత్ప్రారబ్ధఘాతినీ,
తదా స్యా న్నతు మాయాత్వబోధేన తదపహ్నవః. 179

వ్యా. నాపి ద్వితీయ ఇత్యాహ—యది విద్యేతి. విద్యా యది జగద్భోగ్యజాత మపహ్నువీత నేదం రజతమితి నిషేధకజ్ఞానవత్ప్రతీయమానస్య భోగ్యస్య స్వరూపం విలాపయే త్తదా ప్రారబ్ధకర్మభోగస్య సుఖదుఃఖానుభవస్య సాధనాపహారేణ ప్రారబ్ధకర్మ విఘాతినీ స్యాన్న చ తత్కరోతి. కింతు మిథ్యాత్వమేవ బోధయతి. అతో న ప్రారబ్ధ కర్మవిరోధినీతి భావః. నను మిథ్యాత్వబోధనాదేవ స్వరూపమపి విలాపయే దిత్యాశంక్యాహ—నతు మాయేతి, ఇంద్రజాలాదౌ స్వరూపవిలాపనమంతరేణాపి మిథ్యాత్వజ్ఞానదర్శనాదితి భావః.

టీ. విద్యా=తత్త్వజ్ఞానము, జగత్ = భోగ్యజాతమగు జగత్తును, అపహ్నువీత యది=స్వరూపనాశనము చేసెనేని, తదా = అప్పుడు, ప్రారబ్ధఘాతినీ = ప్రారబ్ధమును నశింపఁజేయునది, స్యాత్ = అగును. మాయాత్వబోధేన - మాయాత్వ = ప్రపంచము మిథ్యయనెడి. బోధేన = జ్ఞానముచేత, తదపహ్నవస్తు - తత్ = భోగ్యజాతమైన యా ప్రపంచ స్వరూపముయొక్క, అపహ్నవస్తు = నాశమన్ననో, న స్యాత్ =అగుటలేదు.

తా. తత్త్వజ్ఞానము భోగ్యపదార్థరాశి యగు జగత్తును నిది వెండి గాదు అనెడి నిషేధజ్ఞానమువలె స్వరూపనాశనము చేసియుండినచో ప్రారబ్ధకర్మ భోగ్య మగుసుఖదుఃఖానుభవముయొక్క సాధనము నపహరించుటచేత ప్రారబ్ధకర్మమునకు విరోధి యని యప్పుడు చెప్పవచ్చును గాని, తత్త్వవిద్య యెట్లును భోగ్యపదార్థమును నశింపఁజేయుటలేదు. ఇఁక నేమి సేయుచున్న దనఁగా, భోగ్యరాశి యంతయు మిథ్యయగు నని బోధించుచున్నది. కావున, తత్త్వవిద్య ప్రారబ్ధకర్మమునకు విరోధి యనరాదు. జగత్తు మిథ్య యని బోధించినందువలననే దానిస్వరూపమును గూడ నశింపఁజేయు నని యందువా? ఇంద్రజాలమును గనుఁగొనునప్పుడు అచ్చట వస్తువులను నశింపఁజేయకయే యావస్తువులు సత్యములు గా వనెడి జ్ఞాన ముండుట యనుభవసిద్ధమే యగును. ఇటులనే జగత్తు మిథ్య యని తెలిసికొనుటచేత భోగ్యరూపం బగు జగత్తునకు నాశనము గలుగ దని గ్రహింప నగును.

అవ. పైన చెప్పఁబడిన యంశమునే విపులముగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. అనపహ్నుత్య లోకా స్తదింద్రజాల మిదం త్వితి,
జానంత్యేవానపహ్నుత్య భోగ్యమాయాత్వధీ స్తథా. 180

వ్యా. ఏతదేవ ప్రపంచయతి—అనపహ్నుత్యేతి. లోకా జనా స్తదింద్రజాల స్వరూపమనపహ్నుత్య అనిరస్య ఇద మింద్రజాలమితి జానంత్యేవ యథా తథా భోగ్య మనపహ్నుత్య అవినాశ్య మాయాత్వధీ ర్జగన్మిథ్యాత్వజ్ఞానం భవతీత్యర్థః.

టీ. లోకాః = జనులు, తత్ = ఆయింద్రజాలస్వరూపమును, అనపహ్నుత్య= నశింపఁజేయక, ఇదం = ఇది, ఇంద్రజాలం త్వితి = గారడి సుమా యని, జానంత్యేవ= తెలిసికొనుచునే యున్నారు. తథా = ఆలాగున, అనపహ్నుత్య = భోగ్యపదార్థమును (భోగమును) నశింపఁజేయక, భోగ్యమాయాత్వధీః - భోగ్య=అనుభవింపఁబడెడి జగత్తు యొక్క, మాయాత్వధీః=మిథ్యాత్వజ్ఞానము, భవతి=అగుచున్నది.

తా. జనులు ఇంద్రజాలమును చూచునప్పు డందలివస్తువులను నశింపఁ జేయకయే యచటి వస్తువులు నిజముగా వని తెలిసికొనునట్లు అనుభవింపఁబడెడి భోగ్యపదార్థములును వానియనుభవమును మిథ్య యగు ననెడిజ్ఞానము గలుగుటకు సందేహము లేదు.

అవ. ఇప్పుడు పూర్వవాది శ్లోకద్వయముతో నాక్షేపించుచున్నాఁడు—

శ్లో. యత్ర త్వస్య జగత్స్వాత్మా పశ్యేత్క స్తత్ర కేన కం,
కిం జిఘ్రే త్కిం వదేద్వేతి శ్రుతౌ తు బహుఘోషితమ్. 181

శ్లో. తేన ద్వైత మపహ్నుత్య విద్యోదేతి న చాన్యథా,
తథా చ విదుషో భోగః కథం స్యా దితి చేచ్ఛృణు. 182

వ్యా. యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్తత్కేన కం పశ్యేదిత్యాది శ్రుతిర్ద్రష్టృదర్శనదృశ్యాభావం బోధయత్యతో విద్యోత్పద్యమానా జగద్విలాపయేదేవ. ఏవం సతి విదుషో భోగశ్చ కథం స్యా దితి శ్రుత్యవష్టంభేన శంకతే. శ్లోకద్వయేన యత్ర త్విత్యాదినా. యత్ర యస్యాం విద్యావస్థాయాం కృత్స్నం జగదస్య విదుషాస్స్వాత్మైవాభూదిదం సర్వం యదయమాత్మేతి జ్ఞానేన స్వరూపమేవ భవతి. తత్ర తస్యాం దశాయాం క్రోద్రష్టా కేన సాధనేన చక్షుషా కిం దృశ్యం రూపజాతం పశ్యేదేవం ఘ్రాణలక్షణేన కిం కుసుమాదికం జిఘ్రేత్కిం వాక్యం కేన వాగింద్రియేణ వా వదేదేవ మితరేంద్రియ వ్యాపారాభావద్యోతనాయ వాశబ్దః. ఇత్యేవంప్రకారేణ శ్రుతౌ బహువార మభిహిత మిత్యర్థః.

వ్యా. తతః కిమిత్యత ఆహ— తేన ద్వైతమితి. స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హీత్యస్మిన్ సూత్రే యత్రత్వస్యేత్యాద్యాహృతాయాశ్శ్రుతేస్సుప్తిమోక్షయోరన్యతరవిషయత్వేన వ్యాఖ్యాతత్వాన్న విద్యయా జగదపహ్నవ ఇతి పరిహరతి— శృణ్వితి.

టీ. యత్ర = ఏతత్త్వజ్ఞానదశయందు, జగత్ = ప్రపంచమంతయు, అస్య = ఈజ్ఞానికి, స్వాత్మా = స్వస్వరూపమే యగునో, తత్ర = అట్టిజ్ఞానదశయందు, కః = ఏద్రష్ట (చూచెడువాఁడు), కేన = ఏసాధనముచేత (చక్షురింద్రియముచేత), కిం = ఏ దృశ్యమగు రూపాదికమును, పశ్యేత్ =చూచును? (చూడఁజాలఁడనుట). కేన=ఏఘ్రాణేంద్రియముచేత, కిం=ఏపుష్పాదులను, జిఘ్రేత్ = వాసన చూచును? (అఘ్రాణింపఁడనుట). కేన=ఏవాగింద్రియముచేత, కిం=ఏవాక్యమును, వదేత్ =చెప్పును? (చెప్పలేఁడనుట.) ఇతివా=ఈలాగున నాయాయింద్రియముచేత నా యా వ్యాపారమును జేయఁడని, శ్రుతౌ = వేదమునందు, బహు = చాలపర్యాయములు, ఘోషితం=చెప్పఁబడెను. తేన=ఆకారణముచేత, విద్యా=జ్ఞానము, ద్వైతం=జగత్తును, అపహ్నుత్య = నశింపఁజేసి, ఉదేతి=పుట్టుచున్నది. అన్యథా=మఱియొకవిధముగా (జగత్తును నశింపఁజేయక యనుట). న చ=పుట్టదు. తథాచ=ఆప్రకార మగుచుండఁగా, విదుషః=జ్ఞానియగువానికి, భోగః = విషయానుభవము, కథం = ఎట్లు, స్యాదితి చేత్ = కలుగు నని యంటివా, శృణు = చెప్పెద వినుము.

తా. ఓయద్వైతసిద్ధాంతీ! ఏజ్ఞానదశయందు నీజగత్తంతయు శ్రు. "ఇదం సర్వం యదయమాత్మా" అను శ్రుతి ననుసరించి జ్ఞానికి తనస్వరూపమే యగుచున్నదో అట్టి జ్ఞానదశయందు ఏద్రష్ట ఏచక్షురింద్రియ మనెడి సాధనముచేత నేదృశ్యమును చూచును? అటులనే ఏఘ్రాణేంద్రియసాధనముచేత ఏపుష్పాదులను నాఘ్రాణించును? ఏవాగింద్రియసాధనముచేత నేవాక్యమును బల్కును? అని శ్రు. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" ఈ మొదలగు శ్రుతి జ్ఞానదశలో ద్రష్టృదర్శనము, దృశ్యము అనెడి త్రిపుటి లేదని తెల్పుచున్నది. కాఁబట్టి జ్ఞానదశలో జ్ఞానము కలిగినప్పుడు జగత్తు నశించు నని తెలుటచేత జ్ఞానము ద్వైతమును నశింపఁజేసియే పుట్టును గాని నశింపఁజేయక జ్ఞాన ముదయింపదు అట్లగుచుండ జ్ఞానికి భోగము సిద్ధించు టెట్లు? అని వాది యాక్షేపింప సిద్ధాంతి సమాధానమును చెప్పెద విను మనుచున్నాఁడు అని భావము.

అవ. వాది పైరెండుశ్లోకములచేతఁ జేసినయాక్షేపమునకు సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సుషుప్తివిషయా ముక్తివిషయా వా శ్రుతి స్త్వితి,
ఉక్తం స్వాప్యయసంపత్త్యోరితి సూత్రే హ్యతిస్ఫుటమ్. 183

వ్యా. స్వాప్యయస్సుషుప్తిస్సంపత్తి ర్ముక్తిరిత్యర్థః.

టీ. శ్రుతిస్తు=ఈశ్రుతి యన్ననో, సుషుప్తివిషయా=సుషుప్తివిషయముగలదిగాఁ గాని, ముక్తివిషయా వా = ముక్తివిషయమును గలదిగాఁ గాని, ఇతి = అన్వయింపఁబడు నని, స్వాప్యయసంపత్త్యోః = "స్వాప్యయసంపత్త్యోః" అనెడి, ఇతి సూత్రే=ఇష్ట బ్రహ్మసూత్రమునందు, అతిస్ఫుటం=మిక్కిలిస్పష్టముగా, ఉక్తం హి=తెల్పఁబడినదిగదా.

తా. ఓవాదీ! శ్రు. "యత్ర త్వస్య" అనుశ్రుతి నాధారముచేసి కొని నీ వాక్షేపించితివి గాని "స్వాప్యయసంపత్త్యోః" అను బ్రహ్మ సూత్రమునందు ఆశ్రుతిని సుషుప్తివిషయముగాఁ గాని ముక్తివిషయ ముగాఁ గాని యన్వయింపవలయు నని విస్పష్టముగఁ దెల్పఁబడియుండ నాశ్రుతి నాధారముచేసికొని నీ వాక్షేపింపఁ గూడదు.

అవ. ఆశ్రుతిని సుషుప్త్యాదివిషయము గలదానినిగా నన్వయము నంగీకరింప నిచో బాధకముఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. అన్యథా యాజ్ఞవల్క్యాదే రాచార్యత్వం న సంభవేత్,
ద్వైతదృష్టావవిద్వత్తా ద్వైతాదృష్టౌ న వాగ్వదేత్. 184

వ్యా. అస్యాశ్శ్రుతేస్సుప్త్యాదివిషయత్వానంగీకారే బాధకమాహ—అన్య థేతి. తత్రోపపత్తిమాహ—ద్వైతేతి. యాజ్ఞవల్క్యాదిర్యది ద్వైతం పశ్యేత్తర్హి దాఽద్వైతజ్ఞానాభావాన్నాచార్యో భవేత్. అథ ద్వైతం న పశ్యతి తర్హి బోధ్య ప్యాద్యనుపలబ్ధాదాచార్యవాక్ శిష్యం ప్రతి బోధనాయ న ప్రవర్తేత. అతో విద్యా సంప్రదాయోచ్ఛేదప్రసంగ ఇతి భావః.

టీ. అన్యథా=వేరొకవిధముగా (ఆశ్రుతిని సుషుప్తివిషయముగాఁ గాని, మోక్ష విషయము గాఁ గాని యంగీకరింపనియెడల), యాజ్ఞవల్క్యాదేః = యాజ్ఞవల్క్యుఁడు మున్నగువారికి, ఆచార్యత్వం = ఉపదేశకు లగుట, న సంభవేత్ = సంభవింపనేరదు. ద్వైతదృష్టౌసత్యాం=ద్వైతదృష్టి గలిగియుండినప్పుడు, అవిద్వత్తా=అద్వితీయజ్ఞానము లేకుండుటయు, ద్వైతాదృష్టౌ=ద్వైతజ్ఞానము లేనప్పుడు, వాక్=వాక్కు, న వదేత్= చెప్పకపోవును, (తనకంటె వేఱుగా శిష్యాదివస్తువులే లేనియప్పుడు వారికి బోధించుట కాచార్యవాక్యము ప్రవర్తింప దనుట).

తా. పైన చెప్పఁబడిన శ్రుతిని సుషుప్తివిషయముగాఁ గాని మోక్షవిషయముగాఁ గాని అంగీకరింపనిచో యాజ్ఞవల్క్యుఁడు మొదలగువారికి నాచార్యత్వము సంభవింపదు. ఎందువల్ల ననఁగా ద్వైతము తోఁచెనా, అద్వైతజ్ఞానము లేకపోవుటచేత నద్వైతజ్ఞానము లేని వాఁడాచార్యుఁడుగా నుండుట సంభవింపదు. ద్వైతస్ఫురణము లేకుండెనచో శిష్యాదులు గల రని యనుకొనమిచేత నెవనికి బోధించుటకాచార్యవాక్యము బయలువెడలును ? ఇట్టి ప్రసంగమువలన విద్యాసంప్రదాయమునకే యుచ్ఛేదము వాటిల్లును గనుక ఇట్టిప్రసంగములు చేయరా దని భావము.

అవ. సిద్ధాంతీ, యాజ్ఞవల్క్యాదులకు శిష్యులకు బోధించునప్పు డుండెడి జ్ఞానము పరోక్షజ్ఞాన మనియు నిర్వికల్పకసమాధియందు ద్వైతప్రతీతి (స్ఫురణము) లేమింజేసి అప్పటిజ్ఞాన మపరోక్షజ్ఞాన మనియు నేల చెప్పరా దని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్వికల్పసమాధౌ తు ద్వైతాదర్శనహేతుతః,
సైవాపరోక్షవిద్యేతి చే త్సుషుప్తి స్తథా న కిమ్. 185

వ్యా. నను, యాజ్ఞవల్క్యాదీనా మాచార్యత్వదశాయాం విద్యమానస్య జ్ఞానస్య విద్యాత్వమ స్త్యేవ. తథాపి తస్య నాపరోక్షవిద్యాత్వం ద్వైతప్రతీతిసద్భావాత్. నిర్వికల్పకసమాధౌ తు ద్వైతదర్శనాభావాత్సైవాపరోక్షవిద్యేతి శంకతే— నిర్వికల్పేతి. ద్వైతాప్రతీతేరప్యతి ప్రసంగాపాదకత్వాన్నైవమితి పరిహరతి—సుషుప్తి స్తథానకిమితి.

టీ. నిర్వికల్పసమాధౌ తు = నిర్వికల్పక సమాధియం దన్నచో, ద్వైతాదర్శనహేతుతః=ద్వైతస్ఫురణము లేనికారణముచేత, సైవ=ఆద్వైతవిస్మృతియే, అపరోక్షవిద్యేతి చేత్ = అపరోక్షజ్ఞానమగు నని యంటివేని, సుషుప్తిః = సుషుప్త్యవస్థ, తథా= అట్టిది, న కిం=కాదా ? (అట్లు ద్వైతప్రతీతి లేనిదే యగు ననుట).

తా. ఓ వాదీ, నీవు నిర్వికల్పసమాధియందు ద్వైతము స్ఫురించుట లేదు గనుక నట్టిది యపరోక్షజ్ఞానము కావచ్చును. శిష్యులకు బోధించునప్పుడు యాజ్ఞవల్క్యాదులు మొదలగు నాచార్యవర్గమునకు ద్వైతస్ఫురణ ముండునుగాన నది పరోక్షజ్ఞాన మని చెప్పుట అతి ప్రసంగమగును. అనఁగా ద్వైతస్ఫురణము లేనియవస్థకు విద్యాత్వ మంగీకరిం

చినచో ద్వైతస్ఫురణము లేని సుషుప్తిని గూడ జ్ఞానదశనుగా నంగీక రింపవలసివచ్చును గనుక నది యధికప్రసంగ మగు నని భావము.

అవ. అధికప్రసంగము లేనితెఱంగునఁ బ్రశ్నించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మతత్త్వం న జానాతి సుప్తౌ యది తదా త్వయా,
ఆత్మధీరేవ విద్యేతి వాచ్యం న ద్వైతవిస్మృతిః. 186

వ్యా. అతిప్రసంగపరిహారం శంకతే—ఆత్మతత్త్వమితి. సుప్తౌ ద్వైతదర్శనాభావేఽప్యాత్మగోచరజ్ఞానాభావాన్న విద్యాత్వం తస్యా ఇత్యర్థః. తర్హి ప్రాప్తం వివేకజ్ఞానస్యైవ విద్యాత్వం. న ద్వైతదర్శనాభావస్యేత్యాహ—తదేతి.

టీ. సుప్తౌ = సుషుప్తిదశయందు, ఆత్మతత్త్వం=ఆత్మస్వరూపమును, న జానాతి యది = గుర్తెఱుఁగఁడంటివా, తదా = అప్పుడు, త్వయా = నీచేత, ఆత్మధీరేవ=ఆత్మజ్ఞానమే, విద్యేతి = విద్య యని, వాచ్యం = చెప్పఁదగును. ద్వైతవిస్మృతిః = జగత్తును మఱచుట అనఁగా స్ఫురింపకపోవుట, న = విద్య కానేరదు.

తా. సుషుప్తికాలమునందు ద్వైతస్ఫూర్తి లేకపోయినను ఆత్మస్వరూపజ్ఞానము లేదు గనుక, నది విద్య కాదంటివా మంచిది. అప్పుడు ఆత్మజ్ఞానమే విద్య యగును. ద్వైతప్రతీతి లేకపోవుట విద్య కాదని యెఱుంగుము.

అవ. ద్వైతప్రతీతి లేకుండుటయు, ఆత్మజ్ఞానము గలిగియుండుటయు నీ రెండును చేరి విద్య యగును గాని, యొకటిమాత్ర ముండుట విద్య కానేర దని శంకించు చున్నాఁడు:—

శ్లో. ఉభయం మిళితం విద్యా యది తర్హి ఘటాదయః,
అర్ధవిద్యాభాజిన స్స్యుస్సకలద్వైతవిస్మృతేః. 187

వ్యా. నను, ద్వైతాదర్శనాత్మజ్ఞానయోర్మిళితయో రేవ విద్యాత్వం; నైకైకస్యేతి శంకతే—ఉభయమితి. ద్వైతవిస్మృతేరపి విద్యాంశత్వాంగీకారే జడస్యాప్యర్ధవిద్యాత్వప్రసంగ ఇతి పరిహరతి—తర్హి ఘటాదయ ఇతి. అత్రోపపత్తిమాహ—సకలేతి.

టీ. మిళితం = కలిసియుండిన, ఉభయం = అద్వైతజ్ఞానమును ద్వైతజ్ఞానము లేకుండుటయు ననెడి రెండును, విద్యా యది = విద్య యగు నని యంటివా, తర్హి = అట్లైనచో, ఘటాదయః = ఘటపటాది జడపదార్థంబులును, సకలద్వైతవిస్మృతేః = సమస్తమైనద్వైతజ్ఞానము లేకయుండుటవలన, అర్ధవిద్యాభాజినః = సగము విద్యను పొందినట్టియున్నవి, స్యుః = అగుచున్నవి.

తా. ద్వైతవిస్మృతియు| ఆత్మజ్ఞానంబును రెండును కలిసి విద్య యగు నని యంటివా, ఘటపటాదిజడపదార్థంబు లిందలి ద్వైతవిస్మృతి గలిగి యుండుటంజేసి సగము జ్ఞానము గలిగియున్న దని యనవలసి వచ్చును గాన నట్లు లనకూడ దని భావము.

అవ. రెండును గలిసియే విద్య యనువారిమతమునందు దోషముం గనుపఱచు చున్నాఁడు:—

శ్లో. మశకధ్వనిముఖ్యానాం విక్షేపాణాం బహుత్వతః,
తవ విద్యా తథా న స్యాద్ఘటాదీనాం యథా దృఢా. 188

వ్యా. అస్మిన్నేవ పక్షే సమాధిమతాం పురుషాణామర్ధవిద్యావత్త్వమపి న స్యాదితి సోపహాసమాహ—మశకధ్వనీతి. ఘటాదీనాం యథా ద్వైతవిస్మరణం దృఢం, తథా తం సమాధావ్ద్వైతవిస్మరణం న సంభవతి. మశకధ్వన్యాదీనామనేకేషాం విక్షేపాణాం సద్భావాదిత్యర్థః.

టీ. మశకధ్వనిముఖ్యానాం - మశక = దోమలయొక్క, ధ్వని = చప్పుడు, ముఖ్యానాం = మొదలుగాఁగల, విక్షేపాణాం = వికల్పములయొక్క, బహుత్వతః = అనేకత్వమువలన, ఘటాదీనాం = కుండలు మొదలగువానికి, యథా = ఏవిధముగా, విద్యా = విద్య, దృఢా = దృఢమైనదో, తథా = అవిధముగా, తవ = నీకు, విద్యా = విద్య, న స్యాత్ = కలుగకపోవును.

తా. తత్త్వజ్ఞానమును ద్వైతవిస్మృతియు రెండును గలిసి విద్య యనునెడల ద్వైతవిస్మృతి విద్యలో సగము గావలసివచ్చును. యోగికి మశకధ్వనులు మొదలగువిక్షేపములు గమనించుటవలన విద్యలోని సగ భాగము గూడ ఘటింపదు.

అవ. ఆత్మజ్ఞానమే విద్య యగు నని యంగీకరించునెడల నది మాకును సమ్మతమే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మధీ రేవ విద్యేతి యది తర్హి సుఖీ భవ,
దుష్టచిత్తం నిఃసంధ్యా చ్చే న్నిరుంధి త్వం యథాసుఖమ్. 189

వ్యా. నను ఆత్మజ్ఞానస్యైవ విద్యాత్వం న ద్వైతవిస్మృతేరితి శంకతే—ఆత్మధీరేవేతి. తదస్మాకమిష్ట మిత్యభిప్రాయేణాశీర్వాదయతి—తర్హి సుఖీ భవేతి. నన్వాత్మధీరేవ విద్యా సా న దుష్టచిత్తే సంభవత్యతశ్చిత్తదోషపరిహారాయ చిత్తవృత్తినిరోధః కార్య ఇతి శంకా మనుభాషతే—దుష్టచిత్తమితి. తదఙ్గీకరోతి—నిరుంధి త్వమితి.

టీ. ఆత్మధీరేవ = ఆత్మజ్ఞానమే, విద్యేతి యది = విద్యయనెదవేని, తర్హి = అట్లులైతే, సుఖీ భవ = సుఖవంతుఁడవు గమ్ము. దుష్టచిత్తం = దోషయుక్తమగు మనస్సును, నిరుంధ్యాచేత్ = దోషనివృత్తికై చిత్తమును నిరోధింపవలసియుండునందువేని, యథాసుఖం = సుఖముగా, త్వం = నీవు, నిరుంధి = అరికట్టుము.

తా. ఆత్మజ్ఞానమే విద్య యని యంగీకరించునెడల నది మాకును సమ్మతమే. చిత్తనిరోధము లేనిది విద్య ఘటింపదు గనుక చంచలచిత్తమును నిరోధింపవలయు నంటివేని, యథాసుఖముగాఁ జిత్తము నరికట్టుము. (అదియును మాకు సమ్మతమే.)

శ్లో. తదిష్ట మేష్టవ్యమాయామయత్వస్య సమీక్షణాత్,
ఇచ్ఛన్న ప్యజ్ఞవ న్నేచ్ఛే త్కిమిచ్ఛ న్నపి హి శ్రుతమ్. 190

వ్యా. తదిష్టమితి. అస్మాకమపీతి శేషః. కుత ఇత్యత ఆహ—ఏష్టవ్యేతి. చిత్తదోషాపగమే సతి అద్వితీయాత్మజ్ఞానాయేష్యమాణం జగన్మాయామయత్వం సమ్యగీక్ష్యతే యతః, అత ఇష్టమిత్యర్థః. ఏవం కిమిచ్ఛన్నితి మంత్రాంశేనాభిప్రేతమర్థముపపాదిత ముపసంహరతి—ఇచ్ఛన్నితి. ఇచ్ఛన్నప్యయమజ్ఞవన్నేచ్ఛేదతః కిమిచ్ఛన్నితి శ్రుతమితి యోజనా.

టీ. ఏష్టవ్యమాయామయత్వస్య - ఏష్టవ్య = (అద్వితీయాత్మజ్ఞానముకొఱకు) కోరఁదగిన, మాయామయత్వస్య = జగన్మాయామయత్వమును, సమీక్షణాత్ = చూచుట వలన, తత్ = ఆచిత్తనిరోధము, (అస్మాకం = మాకు), ఇష్టం = సమ్మతము, ఇచ్ఛన్నపి = జ్ఞాని కోరినను, అజ్ఞవత్ = అజ్ఞానివలె, నేచ్ఛేత్ = కోరఁడు. (అతః = ఆకారణము వలన), కిమిచ్ఛన్నితి = కిమిచ్ఛన్నని, శ్రుతం హి = వేదములయందుఁ జెప్పఁబడినదే.

తా. జ్ఞాని ప్రపంచమును మాయామయంబుగ గుర్తెఱుంగును గానఁ జిత్తనిరోధమును జేయును. అతఁడు ప్రారబ్ధవశంబున విషయముల నిచ్ఛగించినను అజ్ఞునివలె బద్ధుఁడై కోరఁడు. "కిమిచ్ఛన్ కస్య కామాయ" అను శ్రుతిలో "కిం" మనుపద మీయర్థమునే సూచించును.

అవ. "జ్ఞాని విషయముల నిచ్ఛగించును. అట్లయినను నజ్ఞునివలెఁ గోరఁడు." అని యిట్టి యభిప్రాయముల శాస్త్రము లేల గల్పింపవలె ననుశంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. రాగో లింగమబోధస్య సంతు రాగాదయో బుధే,
ఇతి శాస్త్రద్వయం సార్థమేవం సత్యవిరోధతః. 191

వ్యా. ఏవమభిప్రాయవర్ణనే కారణమాహ—రాగో లింగమితి. శ్లో. "రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు, కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరో" రితి తత్త్వవిదో౽రాగనిషేధపరంశాస్త్రం. *శాస్త్రార్థస్య సమాప్తత్వా న్ముక్తిస్స్యాత్తావతాపి తే, రాగాదయస్సంతు కామం న తద్భావో౽పరాధ్యత" ఇతి. తస్యైవరాగాంగీకారపరం చ శాస్త్రమ్. ఏవం చ సతి తత్త్వవిదో దృఢరాగాభావే సతి శాస్త్రద్వయం సార్థమర్థవద్భవత్యవిరోధతః. రాగనిషేధపరస్య శాస్త్రస్య దృఢరాగ విషయత్వా త్తదభ్యుపగమపరస్య శాస్త్రస్య రాగాభాసవిషయత్వాదితి భావః.

టీ. అబోధస్య=జ్ఞానములేమికి, రాగః=విషయానురాగము, లింగం = చిహ్నము అనియు, బుధే=జ్ఞానియందు, రాగాదయః = రాగద్వేషాదులు, సంతు = ఉండుఁగాక అనియు, ఇతి=ఇట్టి, శాస్త్రద్వయం = శాస్త్రద్వయము, ఏవం సతి = ఇటులు చెప్పిన యెడల, అవిరోధతః = విరోధము లేకుండ, సార్థం = సార్థకంబగును.

తా. "రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు, కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః" అనుశాస్త్రము విషయానురాగ మజ్ఞానమునకు గుర్తు తొఱటయం దగ్ని గలవృక్షమునకుఁ జెమ్మ యుండనేరదు గదా అను శాస్త్రము జ్ఞానికి విషయానురాగ ముండ దని తెల్పుచున్నది. "శాస్త్రార్థస్య సమాప్తత్వా న్ముక్తిస్స్యాత్తావతాపి తే, రాగాదయస్సంతు కామం న తద్భావో౽పరాధ్యతే" అనుశాస్త్రము బ్రహ్మవిదునకు జ్ఞానమువలన మోక్షము ఘటించును. గనుక రాగాదు లున్నను బాధకములు గావు అని తెల్పుచున్నది. ఈ రెండుశాస్త్రములును జ్ఞాని విషయములను గోరినను నజ్ఞానివలె బద్ధుఁడై కోరఁ డని చెప్పిననే సమన్వయము లగును.

అవ. "కి మిచ్ఛన్" అనుదానిభావమును వర్ణించు "కస్య కామాయ" అను శ్రుతిభావముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. జగన్మిథ్యాత్వవత్స్వాత్మా సంగత్వస్య సమీక్షణాత్,
కస్య కామాయేతి వచో భోక్త్రభావవివక్షయా. 192

వ్యా. ఏవం కిమిచ్ఛన్నిత్యంశస్యాభిప్రాయ ముపవర్ణ్య కస్య కామాయేత్యంశస్యాభిప్రాయమాహ—జగదితి. యథా జగన్మిథ్యాత్వబోధేన వాస్తవ కామ్యాభావవివక్షయా కిమిచ్ఛన్నిత్యుక్తం. ఏవమాత్మనో౽సంగత్వబోధే చ వాస్తవభోక్తృత్వాభావ వివక్షయా కస్య కామా యేతి శ్రుత్యాభిహితమిత్యర్థః.

టీ. ఆత్మధీరేవ = ఆత్మజ్ఞానమే, విద్యేతి యది = విద్యయనెదవేని, తర్హి = అట్లులైతే, సుఖీ భవ = సుఖవంతుఁడవు గమ్ము. దుష్టచిత్తం = దోషయుక్త మగు మనస్సును, నిరుంధ్యాచేత్ = దోషనివృత్తికై చిత్తమును నిరోధింపవలసియుండునందువేని, యథాసుఖం = సుఖముగా, త్వం = నీవు, నిరుంధి = అరికట్టుము.

తా. ఆత్మజ్ఞానమే విద్య యని యంగీకరించునెడల నది మాకును సమ్మతమే. చిత్తనిరోధము లేనిది విద్య ఘటింపదు గనుక చంచలచిత్తమును నిరోధింపవలయు నంటివేని, యథాసుఖముగాఁ జిత్తము నరికట్టుము. (అదియును మాకు సమ్మతమే.)

శ్లో. తదిష్ట మేష్టవ్యమాయామయత్వస్య సమీక్షణాత్,
ఇచ్ఛన్న ప్యజ్ఞవ న్నేచ్ఛే త్కిమిచ్ఛ న్నపి హి శ్రుతమ్. 190

వ్యా. తదిష్టమితి. అస్మాకమపీతి శేషః. కుత ఇత్యత ఆహ—ఏష్టవ్యేతి. చిత్త దోషాపగమే సతి అద్వితీయాత్మజ్ఞానాయేష్యమాణం జగన్మాయామయత్వం సమ్యగీక్ష్యతే యతః, అత ఇష్టమిత్యర్థః. ఏవం కిమిచ్ఛన్నితి మంత్రాంశేనాభిప్రేతమర్థముపపాదిత ముపసంహరతి—ఇచ్ఛన్నితి. ఇచ్ఛన్నప్యయమజ్ఞవన్నేచ్ఛేదతః కిమిచ్ఛన్నితి శ్రుతమితి యోజనా.

టీ. ఏష్టవ్యమాయామయత్వస్య - ఏష్టవ్య = (అద్వితీయాత్మజ్ఞానముకొఱకు) కోరఁదగిన, మాయామయత్వస్య = జగన్మాయామయత్వమును, సమీక్షణాత్ = చూచుట వలన, తత్ = ఆచిత్తనిరోధము, (అస్మాకం = మాకు), ఇష్టం = సమ్మతము, ఇచ్ఛన్నపి = జ్ఞాని కోరినను, అజ్ఞవత్ = అజ్ఞానివలె, నేచ్ఛేత్ = కోరఁడు. (అతః = ఆకారణము వలన), కిమిచ్ఛన్నితి = కిమిచ్ఛన్నని, శ్రుతం హి = వేదములయందుఁ జెప్పఁబడినదే.

తా. జ్ఞాని ప్రపంచమును మాయామయంబుగ గుర్తెఱుంగును గానఁ జిత్తనిరోధమును జేయును. అతఁడు ప్రారబ్ధవశంబున విషయముల నిచ్ఛగించినను అజ్ఞునివలె బద్ధుఁడై కోరఁడు. "కిమిచ్ఛన్ కస్య కామాయ" అనుశ్రుతిలో "కి" మ్మనుపద మీయర్థమునే సూచించును.

అవ. "జ్ఞాని విషయముల నిచ్ఛగించును. అట్లయినను నజ్ఞునివలెఁ గోరఁడు." అని యిట్టి యభిప్రాయముల శాస్త్రము లేల గల్పింపవలె ననుశంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. రాగో లింగమబోధస్య సంతు రాగాదయో బుధే,
ఇతి శాస్త్రద్వయం సార్థమేవం సత్యవిరోధతః. 191

వ్యా. ఏవమభిప్రాయవర్ణనే కారణమాహ—రాగో లింగమితి. శ్లో. "రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు, కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః" ఇతి తత్త్వవిదో రాగనిషేధపరంశాస్త్రం. *శాస్త్రార్థస్య సమాప్తత్వా న్ముక్తిస్స్యాత్తావతాపి తే, రాగాదయస్సంతు కామం న తద్భావోఽపరాధ్యత" ఇతి. తస్యైవరాగాంగీకారపరం చ శాస్త్రమ్. ఏవం చ సతి తత్త్వవిదో దృఢరాగాభావే సతి శాస్త్రద్వయం సార్థమర్థవద్భవత్యవిరోధతః. రాగనిషేధపరస్య శాస్త్రస్య దృఢరాగ విషయత్వాత్తదభ్యుపగమపరస్య శాస్త్రస్య రాగాభాసవిషయత్వాదితి భావః.

టీ. అబోధస్య=జ్ఞానము లేమికి, రాగః=విషయానురాగము, లింగం = చిహ్నము అనియు, బుధే=జ్ఞానియందు, రాగాదయః = రాగద్వేషాదులు, సంతు = ఉండుఁగాక అనియు, ఇతి=ఇట్టి, శాస్త్రద్వయం = శాస్త్రద్వయము, ఏవం సతి = ఇటులు చెప్పిన యెడల, అవిరోధతః = విరోధము లేకుండ, సార్థం = సార్థకంబగును.

తా. "రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు, కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః" అనుశాస్త్రము విషయానురాగ మజ్ఞానమునకు గుర్తు తొఱ్ఱయం దగ్ని గలవృక్షము నకుఁ జెమ్మ యుండనేరదు గదా అను శాస్త్రము జ్ఞానికి విషయానురాగ ముండ దని తెల్పుచున్నది. "శాస్త్రార్థస్య సమాప్తత్వా న్ముక్తిస్స్యాత్తావతాపి తే, రాగాదయస్సంతు కామం న తద్భావోఽపరాధ్యతే" అనుశాస్త్రము బ్రహ్మవిదునకు జ్ఞానమువలన మోక్షము ఘటించును. గనుక రాగాదు లున్నను బాధకములు గావు అని తెల్పుచున్నది. ఈ రెండుశాస్త్రములును జ్ఞాని విషయములను గోరినను నజ్ఞానివలె బద్ధుఁడై కోరఁ డని చెప్పిననే సమన్వయము లగును.

అవ. "కి మిచ్ఛన్" అనుదానిభావమును వర్ణించు "కస్య కామాయ" అను శ్రుతిభావముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. జగన్మిథ్యాత్వవత్స్వాత్మా సంగత్వస్య సమీక్షణాత్,
కస్య కామాయేతి వచోభోక్త్రభావవివక్షయా. 192

వ్యా. ఏవం కిమిచ్ఛన్నిత్యంశస్యాభిప్రాయ ముపవర్ణ్య కస్య కామాయేత్యంశస్యాభిప్రాయమాహ—జగదితి. యథా జగన్మిథ్యాత్వబోధేన వాస్తవ కామ్యాభావవివక్షయా కిమిచ్ఛన్నిత్యుక్తం. ఏవమాత్మనోఽసంగత్వబోధే చ వాస్తవభోక్తృత్వాభావ వివక్షయా కస్య కామా యేతి శ్రుత్యాభిహితమిత్యర్థః.

టీ. జగన్మిథ్యాత్వవత్ = జగన్మిథ్యాత్వము వలె, స్వాత్మాసంగత్వస్య - స్వాత్మ = స్వస్వరూపముయొక్క, అసంగత్వస్య = సంగము లేకుండుటయొక్క, సమీక్షణాత్ = చూచుటవలన, భోక్తృభావవివక్షయా - భోక్తృ = భోక్తయొక్క, అభావ = లేకుండుట యొక్క, వివక్షయా = చెప్పఁదలఁచుటచేత, కస్య కామాయేతి = కస్య కామాయ యని (ఎవ్వనికోరికనిమిత్త మనుట). వచః = వాక్యము, భవతి = ప్రవర్తించుచున్నది.

తా. జ్ఞాని జగత్తు నసత్యముగను, తనను అసంగునిగను గ్రహించును గాన నిజముగా భోక్త లేనందున నెవ్వనికోరికకై పరితపించు నని భోక్త నిషేధింపఁ బడియెను.

అవ. ఆత్మకు భోక్తృత్వము లేదని శ్రుతి నిషేధించుటకు భోక్తృత్వప్రసక్తి యుండవలెను. ఆత్మను భోక్తనుగా నెవ్వ రొప్పినారు ? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. పతిజాయాదికం సర్వం తత్తద్భోగాయ నేచ్ఛతి,
కింత్వాత్మ భోగార్థ మితి శ్రుతా వుద్ఘోషితం బహు. 193

వ్యా. నన్వాత్మనో భోక్తృత్వప్రతిషేధ స్తత్ప్రసక్తిపూర్వకో వక్తవ్యః. సా తు న విద్యతే, అసంగత్వాదాత్మన ఇత్యాశంక్య తస్య స్వానుభవసిద్ధత్వాన్నైవ మిత్యభిప్రేత్య తదనువాదికాం శ్రుతిమర్థతోఽనుక్రామతి—పతిజాయేతి. "న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవ" తీత్యారభ్య "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవ" తీత్యంతేన వాక్యసందర్భేణ పతిజాయాదికస్య ప్రపంచస్యాత్మనో భోగసాధనత్వం ప్రతిపాద్యతే. తత ఆత్మనో భోక్తృత్వప్రసక్తిరిత్యర్థః.

టీ. పతిజాయాదికం = పెనిమిటి భార్య మొదలగాఁగల, సర్వం = సకలపదార్థములను, తత్తద్భోగాయ = ఎదుటివారిభోగముకొఱకు, నేచ్ఛతి = కోరఁడు. కింతు = మఱి యేమి యనఁగా, ఆత్మభోగార్థమితి = ఆత్మభోగముకొఱకే యని, శ్రుతౌ = వేదమునందు, బహు = విశేషము, ఉద్ఘోషితం = చెప్పఁబడెను.

తా. మనుజుఁడు భోగసాధనంబుల నన్నింటిని వానివాని కొఱకుఁ బ్రేమించుట లేదు. ఆత్మభోగముకొఱకే వాని నన్నిటిని బ్రేమించుచున్నాఁ డని శ్రుతియే యజ్ఞులయం దజ్ఞానకల్పితం బగు భోక్తృత్వము ప్రసక్తమైన దని చెప్పుచున్నది కనుక ఆత్మకు భోక్తృత్వ ప్రసక్తి కలిగె నని తెలియవలెను.

అవ. ఈవిధముగా నాత్మకు భోక్తృత్వప్రసక్తిని గనఁబఱచి యాభోక్తృత్వ మును నిరసింపఁదలఁచి వికల్పించుచున్నాఁడు:—

శ్లో. కిం కూటస్థశ్చిదాభాసో యథా కిం చోభయాత్మకః,
భోక్తా తత్ర న కూటస్థోఽసంగత్వాద్భోక్తృతాం వ్రజేత్. 194

వ్యా. ఏవమాత్మనో భోక్తృత్వం ప్రదర్శ్య తదపవాదాయ భోక్తారం వికల్ప యతి—కిం కూటస్థ ఇతి. కూటస్థస్య భోక్తృత్వం కిం? ఉత చిదాభాసస్య? కింవో భయాత్మకస్యేతి వికల్పార్థః. తత్ర ప్రథమం ప్రత్యాహ—భోక్తా తత్రేతి.

టీ. భోక్త=కర్మఫలమననుభవించెడివాఁడు, కూటస్థః = కేవలప్రత్యగాత్మయా, కిం = లేక, చిదాభాసః = కేవలచిదాభాసుఁడా, యథాకించ=లేక, ఉభయాత్మకః = కూటస్థసహిత చిదాభాసుఁడా? యని వికల్పార్థము. తత్ర = ఆమూఁడుపక్షములందు, కూటస్థః=కేవలప్రత్యగాత్మ, అసంగత్వాత్ = అసంగత్వమువలన, (అసంగుఁడగుటచే), భోక్తృతాం = భోక్తృత్వమును, న వ్రజేత్ = పొందఁడు.

తా. భోక్త కూటస్థుఁడా? లేక చిదాభాసుఁడా? లేక యుభ యాత్మకుఁడా? యని వికల్పించి యసంగుఁ డగుటంజేసి కూటస్థుఁడు నిర్వికారుఁడగుటవలన భోక్తృత్వమును బొందఁడు.

అవ. అసంగుఁడైనను భోక్తృత్వ మేల గలుగదు? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సుఖదుఃఖాభిమానాఖ్యో వికారో భోగ ఉచ్యతే,
కూటస్థశ్చ వికారీ చేత్యేత న్న వ్యాహతం కథమ్? 159

వ్యా. అసంగత్వమస్తు భోక్తృత్వం చ భవతు కో దోష ఇత్యాశంక్యాహ— సుఖేతి. సుఖత్వదుఃఖత్వాభిమానలక్షణో వికారో భోగః. సోఽసంగస్య కూటస్థస్య న యుజ్యతే. కూటస్థత్వవికారిత్వయో రేకత్ర సమావేశాయోగాదిత్యర్థః.

టీ. సుఖదుఃఖాభిమానాఖ్యః = సుఖదుఃఖాభిమాన మను పేరుగల, వికారః = వికారమే, భోగః = భోగ మని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. కూటస్థశ్చ = కూట స్థుఁడు, వికారీ చ = వికారవంతుఁడు, ఇత్యేతత్ =ఇట్లనుట, కథం = ఏలాగున, న వ్యాహతం = బాధితము గాదు? (విరోధ మగు ననుట.)

తా. సుఖదుఃఖాభిమానరూప మగు వికారము భోగ మనఁ బడును. కూటస్థుఁ డన నిర్వికారుఁడు. నిర్వికారిత్వమును, వికారిత్వ మును నొకనికి సంభవింపవు,

అవ. చిదాభాసునకు భోక్తృత్వమును నిరసించుచున్నాఁడు:—

శ్లో. వికారిబుద్ధ్యధీనత్వా దాభాసో వికృతా వపి,
నిరధిష్ఠానవిభ్రాంతిః కేవలా న హి తిష్ఠతి. 196

వ్యా. నను తర్హి వికారిణ శ్చిదాభాసస్య భోక్తృత్వం స్యాదిత్యాశంక్య వికారిత్వేఽపి నిరధిష్ఠానస్య తస్యైవాసిద్ధేర్నైవమితి పరిహరతి—వికారీతి. చిదాభాసస్య వికారిబుద్ధ్యుపాధ్యధీనత్వా త్స్వస్మిన్వికారే సంభవత్యపి తస్యారోపితస్యారోపిత స్వరూపత్వేనాధిష్ఠానభూతం కూటస్థం విహాయ స్వాతంత్ర్యేణావస్థానాసంభవా త్కేవల చిదాభాసస్యాపి భోక్తృత్వం న సంభవతీతి భావః.

టీ. ఆభాసః = చిదాభాసుఁడు, వికృతా వపి=వికారము గల్గినప్పటికిని, వికారి బుద్ధ్యధీనత్వాత్ - వికారి = వికారవంత మగు, బుద్ధి=బుద్ధికి, అధీనత్వాత్ = స్వాధీన మగుటవలన, (న = భోక్త గానేరఁడు.) నిరధిష్ఠానవిభ్రాంతిః - నిరధిష్ఠాన=అధిష్ఠానము లేని, విభ్రాంతిః = భ్రమ, కేవలా = కేవలమైనదై, న తిష్ఠతి హి = ఉండదుగదా.

తా. చిదాభాసుఁడు వికారి యగు బుద్ధిని ఉపాధిగాఁ గలిగి యుండుటచేత తనయందు వికారము సంభవించినను, ఆ చిదాభాసుఁడు కల్పితుఁ డగుటవలన తనకు ఆధారభూతుఁ డగు కూటస్థుని విడిచి స్వాతంత్ర్యస్థితి సంభవింపమిచే, కేవలచిదాభాసునకు భోక్తృత్వము సంభవింప దని యభిప్రాయము.

అవ. మూఁడవపక్షము అనఁగా భోక్త యుభయాత్మకుఁ డని యంగీకరింపక తీర దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉభయాత్మక ఏవాతో లోకే భోక్తా నిగద్యతే,
తాదృగాత్మానమారభ్య కూటస్థ శ్శేషిత శ్శ్రుతౌ. 197

వ్యా. తస్మాత్తృతీయః పక్షః పరిశిష్యత ఇత్యాహ—ఉభయాత్మక ఇతి. యత ఏకైకస్య భోక్తృత్వం న సంభవత్యత ఉభయాత్మకసాధిష్ఠానచిదాభాస ఏవ లోకే వ్యవహారదశాయాం భోక్తేత్యభిధీయతే. పరమార్థతస్తూభయాత్మకత్వ మేవ న ఘటత ఇతి భావః. "నహ్యసంగోహ్యయం పురుష" ఇత్యాదావసంగత్వస్యైవ "యోఽయం విజ్ఞానమయః ప్రాణే" ష్విత్యాదౌ బుద్ధిసాక్షిత్వస్యాపి శ్రవణాదుభయాత్మకం భోక్తృ స్వరూపమపి పారమార్థికమేవ స్యాన్న లోకవ్యవహారమాత్రసిద్ధ మిత్యాశంక్య శ్రుతే స్తత్ర తాత్పర్యాభావాన్నైవమిత్యాహ—తాదృగితి. తాదృగాత్మానం బుద్ధ్యుపాధికం భోక్తార మాత్మాన మారభ్యానూద్య కూటస్థః బుద్ధ్యాదికల్పనాధిష్ఠానభూతశ్చిదాత్మా శేషితః. బుద్ధ్యాద్యనాత్మనిరసనేన పరిశేషితః శ్రుతౌ బృహదారణ్యకాదావిత్యర్థః.

టీ. అతః = ఆకారణమువలన, లోకే = లోకమందు (వ్యవహారదశయందు), ఉభయాత్మక ఏవ = కూటస్థసహితచిదాభాసుఁడే, భోక్తా = కర్మఫలమనుభవించెడి వాఁడగునని, నిగద్యతే=చెప్పఁబడుచున్నాఁడు. శ్రుతౌ = బృహదారణ్యకాది శ్రుతియందు, తాదృక్ = అటువంటి, ఆత్మానం = భోక్తను, ఆరభ్య = చెప్పుటకారంభించి, కూటస్థః = ప్రత్యగాత్మ, శేషితః = శేషింపఁబడెను. (బుద్ధ్యాద్యనాత్మనిరసనముచేత శేషింపఁబడె ననుట).

తా. ఏకారణముచేత కూటస్థ చిదాభాసులలో నొక్కొకనికిఁ బ్రత్యేకముగ భోక్తృత్వము సంభవింపదో ఆకారణముచేత కూటస్థసహిత చిదాభాసుఁడే వ్యవహారదశయందు భోక్త యని చెప్పఁబడుచున్నాఁడు. అనఁగా పరమార్థదశయందు కూటస్థసహితచిదాభాసత్వమే ఘటింప దని యభిప్రాయము. బృహదారణ్యకాదిశ్రుతియందు బుద్ధ్యుపాధికుఁ డగు భోక్తను జెప్పుటకుఁ బ్రారంభించి బుద్ధ్యాదులకు అనాత్మత్వము నిశ్చయించుటచేత బుద్ధ్యాదికల్పనకు ఆధారభూతుఁ డగు చిద్రూపకూటస్థుఁడు శేషింపఁబడెను.

అవ. ఈయర్థమునందు బృహదారణ్యకశ్రుతితాత్పర్యముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా కతమ ఇత్యుక్తే యాజ్ఞవల్క్యో విబోధయన్,
విజ్ఞానమయమారభ్యాసంగం తం పర్యశేషయత్. 198

వ్యా. తత్ర బృహదారణ్యకవాక్యార్థం తావత్సంక్షిప్య దర్శయతి—ఆత్మేతి. జనకేన కతమ ఆత్మేత్యేవమాత్మని పృష్టే సతి యాజ్ఞవల్క్యస్తం విబోధయన్యోఽయం విజ్ఞానమయః ప్రాణేష్విత్యాదినా విజ్ఞానమయముపక్రమ్యాసంగోఽహ్యయం పురుష ఇత్యసంగం కూటస్థం పరిశేషితవానిత్యర్థః.

టీ. ఆత్మా = ఆత్మ, కతమః = ఎట్టివాఁడు? ఇతి=ఈలాగున, ఉక్తే=ప్రశ్నింపఁబడుచుండఁగా, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యమహర్షి, విబోధయన్=బోధించుచు, విజ్ఞానమయం = విజ్ఞానమయుని, ఆరభ్య = ఉపక్రమించి, అసంగం = అసంగుఁడగు, తం = ఆకూటస్థుని, పర్యశేషయత్ = మిగిల్చెను.

తా. దేహేంద్రియమనఃప్రాణాదులలో ఆత్మ యెట్టివాఁ డనియు నెవ్వఁ డనియు జనకచక్రవర్తి ప్రశ్నింప, యాజ్ఞవల్క్యమహర్షి బుద్ధితాదాత్మ్యాపన్నుఁ డగు విజ్ఞానమయుని నుపక్రమించి "అసంగోహ్యయం పురుషః" అను వాక్యముచే నిర్వికారుఁ డగు కూటస్థుఁడే ఆత్మ యగు నని బోధించెను.

అవ. ఈ యర్థమునందు ఐతరేయశ్రుతిని గూడఁ బ్రమాణముగాఁ జూపుచున్నాఁడు:—

శ్లో. కోఽయమాత్మేత్యేవమాదౌ సర్వత్రాత్మా విచారతః,
ఉభయాత్మకమారభ్య కూటస్థశ్శేష్యతే శ్రుతౌ. 199

వ్యా. ఏవం బృహదారణ్యకేఽసంగాత్మపరిశేషప్రకారం ప్రదర్శ్య ఐతరేయాదిశ్రుత్యంతరేష్వపి తద్దర్శయతి—కోఽయమాత్మేతి. "వయముపాస్మహే కతరస్స ఆత్మే"త్యేవమాదావాత్మవిచారేణాంతఃకరణోపాధిక మాత్మాన మారభ్య ప్రజ్ఞానమాత్రాత్మకః కూటస్థః పరిశేషితః. ఏవమన్యత్రాపి ద్రష్టవ్యం. ఏవం యుక్తిశ్రుతిపర్యాలోచనాయా ముభయాత్మకస్య భోక్తుర్మిథ్యాత్వం. పారమార్థికస్యాసంగస్య కూటస్థస్యాభోక్తృత్వం సిద్ధం.

టీ. అయమాత్మా = ఈయాత్మ, కః = ఎవఁడనెఁడి, ఇత్యాదౌ = ఈమొదలగు వాక్యములందు, సర్వత్ర = అంతటను, ఏవం = ఈప్రకారము, విచారతః = విచారణవలన, శ్రుతౌ = శ్రుతియందు, ఉభయాత్మకం=కూటస్థసహితచిదాభాసుని (భోక్తను), ఆరభ్య = తెలుపుటకు ప్రారంభించి, ఆత్మా = ప్రత్యగాత్మయగు, కూటస్థః = నిర్వికారుఁడు, శేష్యతే = శేషింపఁబడుచున్నాఁడు.

తా. ఈయాత్మ యెవఁడు? ఎవనిని మేము ఉపాసింపవలెను? ఆయాత్మయెటువంటి వాఁడు? అనెడి అర్థముగల "కోయమాత్మేతి వయముపాస్మహే, కతరస్స ఆత్మేతి" ఇత్యాది ఐతరేయశ్రుతివాక్యమందు ఆత్మవిచారముచేత అంతఃకరణోపాధికుఁ డగు భోక్తను జెప్పుటకు ప్రారంభించి ప్రజ్ఞానమాత్రస్వరూపుఁడగు కూటస్థుఁడు శేషింపఁబడెను. ఇట్లు యుక్తిశ్రుతులచేత నాలోచింపఁగా కూటస్థ సహితచిదాభాసుఁడగు భోక్త మిథ్యారూపుఁడనియు పారమార్థికుఁడగు అసంగకూటస్థునకు భోక్తృత్వము లేదనియు స్పష్టమగుచున్నది. కనుక పరమార్థమందు భోక్త గలఁ డనెడి విషయమై శ్రుతియొక్క అభిప్రాయము కాదని తెలియవలెను.

అవ. భోక్త మిథ్యాభూతుఁడైనయెడల నాతనియందు సత్యత్వబుద్ధి గల్గుటకేమి కారణము? అనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థసత్యతాం స్వస్మిన్నధ్యస్యాత్మా వివేకతః,
తాత్త్వికీం భోక్తృతాం మత్వా న కదాచిజ్జిహాసతి. 200

వ్యా. ననూక్తరీత్యా భోక్తుర్మిథ్యాత్వే ప్రాణినాం తస్మిన్ సత్యత్వబుద్ధిః కుతో జాయత ఇత్యాశంక్యాహ—కూటస్థేతి. ఆత్మా లోకప్రసిద్ధో భోక్తాఽవివేకతః స్వస్య కూటస్థాద్వివేకజ్ఞానాభావేన కూటస్థనిష్ఠం సత్యత్వమాత్మన్యధ్యస్య తద్ద్వారా స్వనిష్ఠం స్వభోక్తృత్వస్యాపి సత్యతాం మత్వా భోగం కదాచిదపి న హాతుమిచ్ఛతి.

టీ. కూటస్థసత్యతాం = కూటస్థునిసత్యత్వమును, స్వస్మిన్ = చిదాభాసుఁడగు తనయందు, ఆత్మావివేకతః-ఆత్మ = స్వరూపముయొక్క, అవివేకతః = అజ్ఞానమువలన, అధ్యస్య = ఆరోపించుకొని, భోక్తృతాం = భోక్తృత్వమును, తాత్త్వికీం=సత్యమైన దానినిగా, మత్వా = తలఁచి, కదాచిత్ = ఎప్పుడును, న జిహాసతి = భోగమును వదలుట కిచ్ఛగింపఁడు.

తా. చిదాభాసుఁడు తనయధిష్ఠాన మగు కూటస్థునిసత్యత్వమును అజ్ఞానముచేఁ దనయం దారోపించుకొని తనను సత్యమైన వానిగా నెంచి భోగములను విడువఁజాలఁడు.

అవ. అట్లైనయెడల "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను శ్రుతి యాత్మకు భోగము గల దని చెప్పుచున్నదే, దీనికి సమాధాన మేమి? అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. భోక్తా స్వస్యైవ భోగాయ పతిజాయాదిమిచ్ఛతి,
ఏష లౌకిక వృత్తాంతః శ్రుత్యా సమ్య గనూదితః. 201

వ్యా. నను, తర్హి "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీత్యాత్మశేషత్వం భోగ్యస్య కథం ప్రతిపాద్యత" ఇత్యాశంక్య న కూటస్థాత్మశేషత్వం ప్రతిపాద్యతే. కింతు లోకప్రసిద్ధోభయాత్మకభోక్తృశేషత్వమేవ శ్రుత్యానూద్యత ఇత్యాహ—భోక్తేతి. లోకే యో భోక్తా సః స్వస్యైవ భోగాయ పతిజాయాది భోగోపకరణమిచ్ఛతీత్యయం లౌకికవృత్తాంతః శ్రుత్యా సమ్యగనూదితః. నార్థాంతరం ప్రతిపాద్యత ఇత్యర్థః.

టీ. భోక్తా = భోక్త, స్వస్యైవ = తనయొక్కయే, భోగాయ=భోగముకొఱకు, పతిజాయాదిం=భర్తృ భార్య మొదలగు పరికరమును, ఇచ్ఛతి = కోరుచున్నాఁడు. (ఇతి = ఈలాగంటి), లౌకికవృత్తాంతః లోకసిద్ధమగు వృత్తాంతము, శ్రుత్యా=వేదముచేత, సమ్యక్ = లెస్సగా, అనూదితః = అనువదింపఁబడినది.

తా. లోక ప్రసిద్ధుఁడగు నుభ యాత్మకుని భోక్తగా నెంచి భర్తృభార్యాదిభోగసాధనముల నాత్మసంబంధములుగా శ్రుతి చెప్పెను గాని, కేవలకూటస్థాభిప్రాయముతోఁ గాదు.

అవ. అనువాదమునకు ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. భోగ్యానాం భోక్తృశేషత్వా న్మా భోగ్యేష్వనురజ్యతాం,
భోక్తర్యేవ ప్రధానేఽతోఽనురాగం తం విధిత్సతి. 202

వ్యా. అనువాదః కిమర్థ మిత్యాశంక్య భోక్తర్యేవ ప్రేమ్ణో విధానాయేత్యాహ —భోగ్యానామితి. భోగ్యానాం పతిజాయాదీనాం భోక్తుస్స్వస్య భోగోపకరణత్వా ద్భోగ్యేష్వనురాగో న కర్తవ్యః. కింతు ప్రధానభూతే భోక్తర్యేవానురాగః కర్తవ్య ఇతి విధానాయేత్యర్థః.

టీ. భోగ్యానాం = భర్తృభార్యాదిభోగపదార్థములు, భోక్తృశేషత్వాత్= భోక్తకు భోగసాధనములగుటవలన, భోగ్యేషు=భర్తృభార్యాదులందు, మానురజ్యతాం =అనురాగము చేయఁబడకుండుఁగాక, (అనురాగము జేయఁ దగ దనుట). అతః=ఆకారణమువలన, ప్రధానే = ప్రధానభూతుఁ డగు, భోక్తర్యేవ = భోక్తయగు తనయందే, తం = ఆ, అనురాగం=అనురాగమును, విధిత్సతి=విధించుట కిచ్ఛయించుచున్నది.

తా. భోగ్యము లగు భర్తృభార్యాదివిషయములు భోక్తకు పరికరములు, భోక్తయే ప్రధానుఁడు. భోక్త యగు ఆత్మనే ప్రేమించుము. అని చిత్తము నాత్మాభిముఖముగాఁ జేయుటకై యీసంగతి శ్రుతియం దనువదింపఁబడియెను.

అవ. భోగ్యములందుఁ బ్రేమను మాని యాత్మనే ప్రేమించు మని చెప్పెడి పురాణవాక్యము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ,
త్వామనుస్మరతస్సా మే హృదయా న్మాపసర్పతు. 203

వ్యా. భోగ్యేషు ప్రేమత్యాగపురస్సరమాత్మప్రేమకర్తవ్యతాయాం దృష్టాంతత్వే నేశ్వరే ప్రేమప్రార్థనాపరం పురాణవచనముదాహరతి — యా ప్రీతిరితి. అవివేకానా మాత్మజ్ఞానశూన్యానాం విషయేష్వనపాయినీ దృఢా యా ప్రీతిరస్తి. హే మాధవ లక్ష్మీపతే, సా ప్రీతిస్త్వామనుస్మరతస్త్వాం సదా చింతయతో మే హృదయాన్మనసః సర్పతు అపగచ్ఛతు. మమ మనో విషయే ష్వాసక్తిం పరిత్యజ్య త్వయ్యేవ సదా తిష్ఠత్వి త్యర్థః. యద్వా. అవివేకినాం విషయేషు దృఢా యా యాదృశీ ప్రీతిరస్తి సా తాదృశీ త్వయి విషయే విద్యమానా ప్రీతిస్త్వామనుస్మరతో మే హృదయాన్నాప సర్పతు మాపగచ్ఛతు. సదాతిష్ఠత్విత్యర్థః.

టీ. అవివేకానాం=అవివేకులకు, విషయేషు = శబ్దాది విషయముల యందు, అనపాయినీ = ఎడతెగని, యా ప్రీతిః = ఏప్రేమ గలదో, సా = ఆప్రీతి, హేమాధవ =

ఓలక్ష్మీపతీ ! త్వాం = నిన్ను, అనుస్మరతః = స్మరించుచుండెడి, మే=నాయొక్క, హృదయాత్ = హృదయమునుండి, సర్పతు = తొలంగుఁగాక.

తా. ఓశ్రియఃపతీ ! నాచిత్తము విషయములం బ్రేమింపకుండుఁగాక. నిన్నే ప్రేమించుఁగాక. ఈశ్లోకమున కర్థాంతరంబునుం గూడఁ జెప్పుదురు. దానిం దెల్పెదను.

టీ. అవివేకానాం = ఆత్మజ్ఞానము లేనివారికి, విషయేషు = శబ్దాదివిషయములందు, అనపాయినీ = దృఢమైన, యా ప్రీతిః = ఎట్టిప్రీతియుండునో, సా = అట్టి ప్రేమ (నీయందు నా కుండునట్టిప్రేమ), త్వాం = నిన్ను, అనుస్మరతః = అనుక్షణము ధ్యానించెడి, మే = నాయొక్క, హృదయాత్ = హృదయమునుండి, మాపసర్పతు = తొలంగకుండుఁగాక. (ఎల్లప్పుడు దృఢముగా నిలుచుఁగాక యనుట.)

తా. అజ్ఞానులకు విషయములందు దృఢముగాఁ బ్రేమ యున్నట్లు అనుక్షణము నిన్నే ధ్యానించుచున్న నాకు నీయం దట్టి ప్రేమ దృఢముగా నెలకొనుఁగాక. దీనింబట్టి విషయాదులం బ్రేమింపక యా సర్వేశ్వరునే యెడతెగక ప్రేమింపుఁ డని రహస్యము.

అవ. ఇట్టి పురాణవాక్య ముండుఁగాక, దానిచే మన కేమి లాభము ? అనెడి శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇతి న్యాయేన సర్వస్మా ద్భోగ్యజాతా ద్విరక్తధీః,
ఉపసంహృత్య తాం ప్రీతిం భోక్తర్యేవ బుభుత్సతే. 204

వ్యా. భవత్వేవం పురాణే. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—ఇతి న్యాయేనేతి. ఇత్యనేన పురాణోక్తన్యాయేన సర్వస్మాద్భోగ్యజాతాత్పతిజాయాదిలక్షణాద్విరక్తధీః విరక్తా ధీర్యస్యాసౌ విరక్తధీః పురుషస్తాం భోగ్యగోచరాం ప్రీతిం భోక్తర్యాత్మన్యుపసంహృత్య ఏవమాత్మానం బుభుత్సతే బోద్ధుమిచ్ఛతి.

టీ. ఇతి=ఇట్టి, న్యాయేన = న్యాయముచేత, సర్వస్మాత్ = సమస్తమగు, భోగ్యజాతాత్ = భోగ్యవర్గమువలన, విరక్త ధీః=వైరాగ్యబుద్ధిగలవాఁడై, తాం ప్రీతిం=ఆ ప్రీతిని, భోక్తర్యేవ = భోక్త యగు ఆత్మయందే, ఉపసంహృత్య = సంగ్రహించి, బుభుత్సతే = తెలిసికొనఁగోరుచున్నాఁడు.

తా. ఇత్తెఱంగున వైరాగ్యబుద్ధి గలిగి భోగ్యజాతములను బ్రేమింపక భోక్త యగుతననే ప్రేమించి యతనిం దెలిసికొన నిచ్ఛగించును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్రక్చందనవధూవస్త్రసువర్ణాదిషు పామరః,
అప్రమత్తో యథా తద్వన్న ప్రమాద్యతి భోక్తరి. 205

వ్యా. ఏవమాత్మన్యేవ ప్రేమోపసంహారే ఫలితం సదృష్టాంతమాహ— స్రక్చందనేతి. పామరః పృథగ్జనః స్రగాదివిషయేషు యథాఽప్రమత్తస్సావధానో భవతి ఏవం ముముక్షురప్యాత్మని విషయే న ప్రమాద్యత్యనవధానం న కరోతి. కింతు తచ్చింతయైవ తిష్ఠతీత్యర్థః.

టీ. పామరః = పామరుఁడు, యథా = ఏవిధంబుగాను, స్రక్చందనవధూవస్త్రసువర్ణాదిషు - స్రక్ = పూలదండలును, చందన = మంచిగంధంబును, వధూ=స్త్రీలును, వస్త్ర = వస్త్రములును, సువర్ణ = బంగారము, ఆదిషు = మొదలుగాఁ గలవానియందు, అప్రమత్తః = సావధానుఁడగునో, తద్వత్ = ఆవిధంబుననే, (ముముక్షురపి = మోక్షమున నిచ్ఛగలవాఁడును), భోక్తరి=భోక్త యగు ఆత్మయందు, న ప్రమాద్యతి=ప్రమాదమును బొందఁడు. (ఆత్మను జింతించు ననుట).

తా. పామరుఁడు స్రక్చందనాది విషయములఁ బ్రేమించునట్లు జ్ఞాని సర్వదా ఆత్మను బ్రేమించును.

అవ. ఈవిషయములో ననేకదృష్టాంతములఁ జూపుచున్నాఁడు:—

శ్లో. కావ్యనాటకతర్కాదిమభ్యస్యతి నిరంతరం,
విజిగీషుర్యథా తద్వన్ముముక్షుస్స్వం విచారయేత్. 206

వ్యా. అనవధానాభావమేవ బహుభిర్దృష్టాంతైస్స్పష్టయతి— కావ్యేతి. యథా విజిగీషుః ప్రతివాదిజయకామ ఇహ లోకే ప్రధానః పురుషో నిరంతరం కావ్యాదీనభ్యస్యతి ఏవం ముముక్షురపి సదా స్వాత్మానం విచారయేత్.

టీ. విజిగీషుః=జయేచ్ఛగలవాఁడు, కావ్యనాటకతర్కాదిం=కావ్యములు, నాటకములు, తర్కము మొదలగువానిని, యథా = ఏవిధముగాను, నిరంతరం = ఎడతెగక, అభ్యస్యతి=అభ్యసించునో, తద్వత్ = అటువలె, ముముక్షుః = మోక్షేచ్ఛ గలవాఁడు, స్వం = స్వస్వరూపమును, విచారయేత్ = విచారించును.

తా. వాదిని జయింపఁగోరువాఁడు కావ్యనాటకాదుల నిరంతరమభ్యసించునట్లు మోక్షేచ్ఛగలవాఁడు స్వస్వరూపమును సర్వదా విచారించును.

శ్లో. జపయాగోపాసనాది కురుతే శ్రద్ధయా యథా,
స్వర్గాదివాంఛయా తద్వచ్ఛ్రద్ధధ్యాత్స్వే ముముక్షయా. 207

వ్యా. జపేతి. యథా వైదికశ్చ స్వర్గాద్యర్థీ తత్తత్సాధనాని జపాదీని శ్రద్ధాపురస్సర మనుతిష్ఠతి తథా ముముక్షురపి మోక్షేచ్ఛయా స్వే శ్రౌతే ఆత్మనివిశ్వాసం కుర్యాత్.

టీ. యథా = ఏవిధముగా, స్వర్గాదివాంఛయా = స్వర్గాదులయందలి కోరిక చేత, శ్రద్ధయా = శ్రద్ధతో, జపయాగోపాసనాది = జపములు యాగములు ఉపాసన మొదలగువానిని, కురుతే=చేయుచున్నాఁడో, తద్వత్ = అటువలెనే, ముముక్షయా= మోక్షేచ్ఛచేత, స్వే = స్వస్వరూపమునందు, శ్రద్దధ్యాత్ = శ్రద్ధచేయవలయును.

తా. స్వర్గాదులందుఁ గోరికగలవాఁడు శ్రద్ధతో జపయాగాదుల నాచరించునట్లు మోక్షకాముఁడు స్వస్వరూపవిచారమునం దాసక్తి చేయవలయును.

శ్లో. చిత్తైకాగ్ర్యం మహాయోగీ మహాయాసేన సాధయేత్,
అణిమాదిప్రేప్సయైవం వివిచ్యాత్త్వం ముముక్షయా. 203

వ్యా. యోగీ యోగాభ్యాసవా నణిమాద్యైశ్వర్యలాభేచ్ఛయా మహాయాసేన చిత్తైకాగ్ర్యం యథా సంపాదయేత్తద్వదయముప్యాత్మానం సదా వివిచ్యాత్ దేహాదిభ్యో వివిచ్య జానీయాదిత్యర్థః.

టీ. యథా = ఏవిధంబున, యోగీ = యోగి, మహాయాసేన = గొప్పశ్రమచేత, అణిమాది ప్రేప్సయా = అణిమాదిసిద్ధులఁబొందవలె నను కోరికచేత, చిత్తైకాగ్ర్యం = చిత్తనైశ్చల్యమును; సాధయేత్ = సాధించునో, ఏవం=ఈవిధంబుగా, ముముక్షయా = మోక్షేచ్ఛచేత, స్వం=స్వరూపమును, వివిచ్యాత్=వేఱుపఱచి గుర్తెఱుంగ నగును.

తా. అణిమాదిసిద్ధికాముఁ డగు యోగి విస్తారము శ్రమతో చిత్తైకాగ్ర్యము నెట్లు సాధించునో అటులనే, ముముక్షువు స్వస్వరూపమును సర్వదా విచారించుకొనవలయును.

అవ. దృఢాభ్యాసము చేయువారికి ఫలముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. కౌశలాని వివర్ధంతే తేషామభ్యాసపాటవాత్,
యథా తద్వద్వివేకోఽస్యాప్యభ్యాసాద్విశదాయతే. 209

వ్యా. నన్వేవమేతేషాం సదాభ్యాసేన కిం ఫలమిత్యత ఆహ—కౌశలానీతి. యథా తేషాం కావ్యాద్యభ్యాసవతా మభ్యాసపాటవేన తస్మింస్తస్మిన్విషయే కౌశలాని వివర్ధంతే, ఏవమస్యాపి ముముక్షోరభ్యాసా ద్వివేకో దేహాదిభ్య ఆత్మనో భేదజ్ఞానం విశదాయతే స్పష్టం భవతి.

టీ. తేషాం=వారికి, అభ్యాసపాటవాత్ - అభ్యాస = అభ్యాసముయొక్క, పాటవాత్ = దార్ఢ్యమువలన, యథా = ఏవిధముగా; కౌశలాని=నేర్పులు, వివర్ధంతే=

వృద్ధిపొందుచున్నవో, తద్వత్ =ఆవిధముగనే, అస్యాపి = ఈముముక్షువునకును, అభ్యాసాత్ =అభ్యాసమువలన, వివేకః=ఆత్మానాత్మవివేకము, విశదాయతే=స్పష్టమగుచున్నది.

తా. కావ్యనాటకాద్యభ్యాసులకు నాయానైపుణ్యము లభివృద్ధియగునట్లు ముముక్షువున కభ్యాసమువలన ఆత్మానాత్మవివేకము స్ఫుటమగును.

అవ. వివేకపాటవమునకు ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. వివిచ్యతా భోక్తృతత్త్వం జాగ్రదాదిష్వసంగతా,
అన్వయవ్యతిరేకాభ్యాం సాక్షిణ్యధ్యవసీయతే. 210

వ్యా. వివేకవైశద్యస్య ఫలమాహ—వివిచ్యతేతి. అన్వయవ్యతిరేకాభ్యాం భోక్తృతత్త్వం భోక్తుః పారమార్థికస్వరూపం, వివిచ్యతా భోగేభ్యో జడజాతేభ్యో భేదేన జానతా పురుషేణ జాగ్రదాదిషు=జాగ్రత్స్వప్నసుషుప్తిష్వవస్థాసు సాక్షిణ్యసంగతా అధ్యవసీయతే నిశ్చీయత ఇత్యర్థః.

టీ. భోక్తృతత్త్వం - భోక్తృ = భోక్తయొక్క, తత్త్వం=యాథాత్మ్యమును, వివిచ్యతా = విమర్శచేయువానిచేత, సాక్షిణి = సాక్షిచైతన్యమునందు, అన్వయవ్యతిరేకాభ్యాం= అన్వయవ్యతిరేకములచేత, జాగ్రదాదిషు=జాగ్రదాద్యవస్థలయందు, అసంగతా=సంగము లేకుండుట, అధ్యవసీయతే=నిశ్చయింపఁబడుచున్నది.

తా. వివేకవైశద్యము గలవానికి జాగ్రదాదిదశలయందుఁ దన యసంగత్వము అన్వయవ్యతిరేకములచేత స్ఫుటముగా స్ఫురించును.

అవ. అన్వయవ్యతిరేకములఁ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. యత్ర యద్దృశ్యతే ద్రష్ట్రా జాగ్రత్స్వప్నసుషుప్తిషు,
తత్రైవ తన్నేతరత్రే త్యనుభూతిర్హి సమ్మతా. 211

వ్యా. అన్వయవ్యతిరేకౌ దర్శయతి—యత్రేతి. జాగ్రదాదిషు మధ్యే యత్ర యస్మిన్ స్థానే జాగ్రతి స్వప్నే సుషుప్తౌ వా యత్ స్థూలం ప్రవివిక్తమానందశ్చేతి త్రివిధం భోగ్యం ద్రష్ట్రా సాక్షిణా దృశ్యతే అనుభూయతే తద్దృశ్యం తత్రైవ తస్యామేవావస్థాయాం తిష్ఠతి. నేతరత్ర ఇతరస్యామవస్థాయాం నాస్తి. ద్రష్టా తు సర్వత్రానుగతతయా వర్తత ఇత్యనుభవస్సర్వసమ్మతః. హి ప్రసిద్ధమేతదిత్యర్థః.

టీ. ద్రష్ట్రా = చూచెడివానిచేత (సాక్షిచేత), జాగ్రత్స్వప్నసుషుప్తిషు = జాగ్రత్స్వప్నసుషుప్తిదశలయందు, యత్ర = ఏదశయందు, యత్ = ఏపదార్థము, దృశ్యతే = చూడఁబడుచున్నదో, తత్ = ఆపదార్థము, తత్రైవ = అక్కడనే, భవతి= ఉండును. ఇతరత్ర = మఱియొకస్థలమునందు, న=ఉండదు. ఇతి = ఈలాగుననే, అనుభూతిః = అనుభవము, సమ్మతా హి = సమ్మతముగదా.

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులయందు వేర్వేఱుగాఁ దాఁ గను గొన్న వస్తువులు ఆయాదశలయందే కన్పట్టునుకాని వేఱు దశలయందుఁ గన్పడకుండును. ఆత్మయన్ననో యన్ని దశలయం దొక్కరూపై కన్ప ట్టును. (ఇవియే యన్వయవ్యతిరేకములగును.)

అవ. ఈయర్థమునందు శ్రుతిని గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. స యత్తత్రేక్షతే కించి త్తేనానన్వాగతో భవేత్,
దృష్ట్వైవ పుణ్యం పాపం చేత్యేవం శ్రుతిషు డిండిమః. 212

వ్యా. న కేవలమనుభవః కింత్వాగమోఽపీత్యభిప్రాయేణ. * "స యత్తత్ర కించి త్పశ్యత్యనన్వాగతస్తేన భవత్యసంగో హ్యయం పురుషః స వా ఏష ఏతస్మిన్ సం ప్రసాదేరన్త్వాచరిత్వా దృష్ట్వైవ పుణ్యం చాపుణ్యం చ పునః ప్రతిన్యాయం ప్రతియో న్యాద్రవ" తీత్యాది వాక్యద్వయమర్థతః పఠతి—స యదితి. స ఆత్మా తత్ర తస్యా మవస్థాయాం యత్కించి ద్భోగ్యమీక్షతే పశ్యతి, తేన దృశ్యేనానన్వాగతో భవేదను సృత్య గతో న భవేత్కింతు స్వయమేవావస్థాంతరం గచ్ఛతీత్యర్థః. పుణ్యం పుణ్యఫలం సుఖం. పాపం పాపఫలం దుఃఖం చ దృష్ట్వైవానాదాయైవేత్యర్థః.

టీ. సః=ఆజీవుఁడు, తత్ర=ఆజాగ్రదాదిదశలయందు, యత్కించిత్=ఏకొంచెము భోగ్యపదార్థమును, ఈక్షతే = కనుఁగొనుచున్నాఁడో, తేన=దానితో, అనన్వాగతః = కలిసికొనినవాఁడు, భవేత్ = అగును. పుణ్యం = పుణ్యమును, పాపం చ = పాపమును, దృష్ట్వైవ = చూచియే, (స్వీకరింపక) (ఆద్రవతి = వెళ్లుచున్నాఁడు), ఇత్యేవం = ఈలాగున, శ్రుతిషు=వేదంబులయందు, డిండిమః=భేరి (వేదాంతసిద్ధాంత మనుట).

తా. జాగ్రదాది దశలయందు పదార్థములను ఆత్మ చూచునే కాని వాని నంటఁ దని వేదాంతము లుద్ఘోషించుచున్నవి.

అవ. భోక్తృతత్త్వమును స్పష్టపఱచెడి మఱికొన్ని శ్రుతులఁ గనఁబఱచు చున్నాఁడు:—

శ్లో. జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం య త్ప్రకాశతే,
తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే. 213

వ్యా. భోక్తృతత్త్వవివేచనపరాణి శ్రుత్యంతరాణి దర్శయతి—జాగ్రదితి. యత్సత్యజ్ఞానానందలక్షణం బ్రహ్మ సాక్షిరూపేణావస్థితం సత్ జాగ్రదాదిప్రపంచం ప్రకాశయతి తద్బ్రహ్మాహమస్మి. న బుద్ధిచిదాభాసాద్యహమస్మీతి జ్ఞాత్వా శ్రుత్య నుభవాభ్యాం నిశ్చిత్య సర్వప్రతిబంధైః ప్రమాతృత్వకర్తృత్వాదిభిః ప్రముచ్యతే ప్రకర్షేణ సర్వాత్మనా ముచ్యతే.

టీ. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది=జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి మొదలుగాఁగల, ప్రపంచం = ప్రపంచమును, యత్ = ఏచైతన్యము, ప్రకాశతే = ప్రకాశింపఁజేయు చున్నదో, తత్ బ్రహ్మ=అపరబ్రహ్మస్వరూపము, అహం=నేను, ఇతి = అని, జ్ఞాత్వా = తెలిసికొని, సర్వబంధైః = సకలబంధములచేత, ప్రముచ్యతే = బాగుగ విడువఁబడు చున్నాఁడు.

తా. జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచమును బ్రకాశింపఁజేసెడి బ్రహ్మమే తా నని యెఱింగినచో సంసారబంధము శమించును. అని కైవల్యోపనిషత్తు చెప్పుచున్నది.

శ్లో. ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు,
స్థానత్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే. 214

వ్యా. జాగ్రదాదిష్వవస్థాసు ఏక ఏవాత్మా మంతవ్యో జ్ఞాతవ్యః. ఏవం వివేక జ్ఞానేన స్థానత్రయవ్యతీతస్యావస్థాత్రయా ద్వివిక్తస్యాత్మనః పునర్జన్మ న విద్యతే. ఏత చ్ఛరీరపాతానంతరం శరీరాంతరప్రాప్తిర్నాస్తీత్యర్థః.

టీ. జాగ్రత్స్వప్నసుషుప్తి = జాగ్రదాద్యవస్థాత్రయమునందు, ఆత్మా=ఆత్మ, ఏక ఏవ = ఒక్కఁడనియే, మంతవ్యః = తెలియఁదగినవాఁడు, స్థానత్రయవ్యతీతస్య-స్థానత్రయ = అవస్థాత్రయమువలన, వ్యతీతస్య = వేఱుపఱుపఁబడినవానికి, పునర్జన్మ = మఱుజన్మము, న విద్యతే = లేదు.

తా. అవస్థాత్రయమునం దాత్మ యొక్కఁడే. నే నవస్థాత్రయ ముల నంటనివాఁడ నని యెఱింగినవానికి తిరిగి జన్మము లేదు. మోక్షమే యగును.

శ్లో. త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్,
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః. 215

వ్యా. త్రిష్వితి. త్రిషు ధామసు త్రిష్వపి స్థానేషు యద్భోగ్యం స్థూలప్రవివిక్తా నందరూపం యశ్చ భోక్తా విశ్వతైజసప్రాజ్ఞరూపో యశ్చ భోగ స్తదనుభవరూపశ్చేతి యే విందతే తేభ్యస్స్థానాదిభ్యో విలక్షణో యశ్చిన్మాత్రరూపస్సాక్షీ సదాశివః. నిరతి శయానందరూపత్వేన సర్వదా శోభమానః పరమాత్మాస్తి సోఽహమస్మీత్యర్థః.

టీ. త్రిషు = మూఁడైన, ధామసు = జాగ్రత్స్వప్నసుషుప్తిస్థానములయందు, యత్ = ఏది, భోగ్యం=భోగ్యమై, అస్తి = కలదో, భోక్తా=భోక్త, యః = ఎవఁడు, అస్తి=కలఁడో, భోగశ్చ=భోగంబును, యత్=ఏది, భవేత్ = ఉండునో, తేభ్యః=వాని

కంటె, విలక్షణః = వేఱైనట్టియు, సాక్షీ = ద్రష్టనైనట్టియు, సదాశివః = ఎల్లప్పుడును మంగళస్వరూపుఁడనైన, అహం=నేను, చిన్మాత్రః = చిద్రూపుఁడను.

తా. జాగ్రదాద్యవస్థాత్రయమందును గ్రమముగా స్థూల రహస్యానందరూప మగు నేభోగ్యము గలదో, మఱియు, విశ్వతైజసప్రాజ్ఞరూపుఁ డగు నే భోక్త గలఁడో, మఱియు ఆయా యనుభవ రూపమగు నేభోగము గలదో, వానియన్నిటికంటె విలక్షణుఁడైనట్టి యే చిద్రూపుఁడు గలఁడో ఆసాక్షి యగు పరమాత్మ నిరతిశయానంద స్వరూపముచేత సర్వదా మంగళస్వరూపుఁ డగు ననియు, ఆపరమాత్మ యే నేనైతి నని ముముక్షువగువాఁడు నిశ్చయించుకొనవలె నని యీ శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఈవిధముగా ఆత్మ యసంగుఁ డని నిశ్చయింపఁబడఁగా, భోక్తృత్వ మెవరి దని శంక కలుగఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం వివేచితే తత్త్వే విజ్ఞానమయశబ్దితః,
చిదాభాసో వికారీయో భోక్తృత్వం తస్య శిష్యతే. 216.

వ్యా. ఏవం వివేకేనాత్మతత్త్వేఽసంగే నిశ్చితే సతి భోక్తృత్వం కస్యేత్యత ఆహ—ఏవమితి. యో విజ్ఞానమయశబ్దేనాభిధీయమానశ్చిదాభాస స్తస్య వికారిత్వా ద్భోక్తృత్వమిత్యర్థః.

టీ. ఏవం = ఈవిధముగాను, తత్త్వే=తత్త్వము, వివేచితే సతి = వేఱుపఱుపఁబడిన దగుచుండఁగా, విజ్ఞానమయశబ్దితః=విజ్ఞానమయశబ్దవాచ్యుఁ డగు, యః వికారీ = ఏవికారి యగు, చిదాభాసః = చిదాభాసుఁడు, (అస్తి = కలఁడో), తస్య = అతనికి, భోక్తృత్వం=భోక్తృత్వము, శిష్యతే = మిగులుచున్నది.

తా. ఇత్తెఱంగునం జక్కఁగాఁ బరికింపఁ వికారము గల చిదాభాసుఁడే భోక్త యని స్పష్టమగుచున్నది.

అవ. చిదాభాసునకు భోక్తృత్వ మంగీకరించినచో "కస్య కామాయేతి వచో భోక్తృభావవివక్షయా" అని వెనుక నీ వనినమాట యెట్లు కుదురు నని యాక్షేపము రాఁగా పారమార్థికుఁ డగు భోక్త లేఁ డని మాయొక్క తాత్పర్య మని చెప్పుచుఁ జిదాభాసునకు మిథ్యాత్వమును సాధించుచున్నాఁడు:—

శ్లో. మాయికోఽయం చిదాభాస శ్శ్రుతే రనుభవా దపి,
ఇంద్రజాలం జగత్ప్రోక్తం తదంతఃపాత్యయం యతః. 217

వ్యా. నను చిదాభాసస్య భోక్తృత్వాంగీకారే కస్య కామాయేతి వచో భోక్తృభావవివక్షయే పూర్వోక్తం వ్యాహన్యేతేత్యాశంక్య. తస్య వచనస్య పారమార్థికభోక్తృభావపరత్వమభిప్రేత్య భోక్తుశ్చిదాభాసస్య మిథ్యాత్వం సాధయతి—మాయికఇతి. అయం చిదాభాసో మాయికో మృషాత్మకః. 'శ్రుతేః' జీవేశావాభాసేన కరోతీతి శ్రుతేః. అనుభవాదపి ద్రష్ట్రాదిత్రితయమధ్యవర్తిత్వేన అనుభూయమానత్వాదపీత్యర్థః. తదేవోపపాదయతి—ఇంద్రజాలమితి. ఇంద్రజాలవన్మిథ్యాభూతే జగత్యంతర్భూతత్వాదస్యాపి మిథ్యాత్వం తద్వదనుభూయతే విద్వద్భిరితి శేషః. యస్మాజ్జగదంతఃపాతీత్యతో మృషేతి యోజనా.

టీ. జగత్=జగత్తు, ఇంద్రజాలం=గారడివంటిది (అని) ప్రోక్తం = చెప్పఁబడినది. యతః = ఏహేతువువలన, అయం = ఈచిదాభాసుఁడు, తదంతఃపాతి = ఆజగత్తులోఁ జేరినవాఁడో, (తతః = ఆకారణమువలన), అయం చిదాభాసః = ఈ చిదాభాసుఁడు, శ్రుతేః=శ్రుతివలనను, అనుభవాదపి=అనుభవముచేతను, మాయికః = మిథ్యాస్వరూపుఁ డగును.

తా. ఆమాయ చిదాభాసరూపముచేత జీవేశ్వరులనిరువురనుసృష్టించుచున్న దనిచెప్పెడి "జీవేశాభాసేన కరోతి" అనెడిశ్రుతిచేతను, అనుభవముచేతను ఈ చిదాభాసుఁడు మిథ్యారూపుఁ డగును.

అవ. ఈచిదాభాసుఁడు సుషుప్తిసమాధులయందు నశించును గనుక మిథ్యాభూతుఁ డని చెప్పుచున్నాఁడు:—

శ్లో. విలయోఽప్యస్య సుప్త్యాదౌ సాక్షిణా హ్యనుభూయతే,
ఏతాదృశం స్వస్వభావం వివినక్తి పునః పునః. 218

వ్యా. అస్య చిదాభాసస్య జగత ఇవ వినాశిత్వానుభవాదపి మృషాత్వమిత్యాహ—విలయోఽపీతి. మూర్చ్ఛాదిరాదిశబ్దార్థః. భవతు మృషాత్వం. తతః కిమిత్యత ఆహ—ఏతాదృశమితి. యదా కూటస్థాద్వివేచితశ్చిదాభాసో మాయికో జాతస్తదా స్వతత్వమేతాదృశం మృషాత్మకం పునః పునః వివినక్తి కూటస్థాద్వివిచ్య జానాతి.

టీ. అస్య = ఈ చిదాభాసునియొక్క, విలయోఽపి = లయంబును, సుప్త్యాదౌ=సుషుప్త్యాదిదశలయందు, సాక్షిణా = సాక్షిచైతన్యముచేత, అనుభూయతే హి = అనుభవింపఁబడుచున్నది గదా. ఏతాదృశం = ఇట్టి, స్వస్వభావం = తనస్వభావమును, పునఃపునః = మాటిమాటికి, వివినక్తి = కూటస్థునికంటె భిన్నముగా విభజించి తెలిసికొనుచున్నాఁడు.

తా. సుషుప్తి సమాధులయందుఁ జిదాభాసునిలేమిని సాక్షి గాంచుచున్నాఁడు. ఇట్టిచిదాభాసుఁడు తనమిథ్యాత్వమును మాటి మాటికి వేఱుపఱిచి తెలిసికొనుచున్నాఁడు.

అవ. అట్టివివేచనవలనఁ గలిగిన లాభమును దెలుపుచున్నాఁడు:—

శ్లో. వివిచ్య నాశం నిశ్చిత్య పునర్భోగం న వాంఛతి,
ముమూర్షుశ్శాయితో భూమౌ వివాహం కోఽభివాంఛతి. 219

వ్యా. తతోఽపి కిమిత్యత ఆహ—వివిచ్యేతి. స్వవినాశనిశ్చయే భోగేచ్ఛాభావే దృష్టాంతమాహ—ముమూర్షురితి.

టీ. వివిచ్య = వివేచనచేసి, నాశం = తననాశమును, నిశ్చిత్య = నిశ్చయించి, పునః = తిరుగా, భోగం = భోగమును, న వాంఛతి = కోరఁడు. ముమూర్షుః = చావ సిద్ధమై, భూమౌ = భూమియందు, శాయితః = శయనింపఁజేయబడిన, కః = ఎవఁడు, వివాహం=పెండ్లిని, అభివాంఛతి=కోరును ?

తా. మరణోన్ముఖుఁడు వివాహము నపేక్షింపనియట్లు తన నాశము నెఱింగిన చిదాభాసుఁడు భోగము నపేక్షింపఁడు.

అవ. ఇంతియ కాదు. వెనుకటివలెఁ దా భోక్త నని వ్యవహరింప సిగ్గుపడు నని యును జెప్పుచున్నాఁడు:—

శ్లో. జిహ్రేతి వ్యవహర్తుం చ భోక్తాహమితి పూర్వవత్,
ఛిన్ననాస ఇవ హ్రీతః క్లిశ్యన్నారబ్ధమశ్నుతే. 220

వ్యా. కించ పూర్వవదహం భోక్తేత్యేవం వ్యవహర్తుమపి లజ్జత ఇత్యాహ—జిహ్రేతీతి. తర్హి జ్ఞానోత్పత్త్యనంతరం ప్రారబ్ధావసానపర్యంతం కథం వ్యవహరతీత్యత ఆహ—ఛిన్నేతి. ఛిన్ననాస ఇవ హ్రీతో లజ్జితః క్లిశ్యన్నేదానీమపి కర్మ క్షీయత ఇతి క్లేశమనుభవన్ ప్రారబ్ధ మశ్నుతే. ప్రారబ్ధకర్మఫలం భుఙ్క్తే ఇత్యర్థః.

టీ. అహం=నేను, భోక్తేతి=భోక్త నని, పూర్వవత్=వెనుకటివలె, వ్యవహర్తుం= వ్యవహరించుటకు, జిహ్రేతి = లజ్జపడుచున్నాడు. ఛిన్ననాస ఇవ = నాసికాచ్ఛేదము నొందినవానివలె, హ్రీతః = లజ్జపడినవాఁడై, క్లిశ్యన్ = క్లేశము నొందుచు, ఆరబ్ధం = ప్రారబ్ధ కర్మమును, అశ్నుతే=అనుభవించుచున్నాఁడు.

తా. ఇట్టి చిదాభాసుఁడు "నేను భోక్త" నని వ్యవహరించుట కును సిగ్గుపడును. ముక్కుకోయఁబడినవాని యట్లు లజ్జితుఁడై ప్రారబ్ధ కర్మ మనుభవించుచున్నాఁడు.

అవ. ఇప్పుడు జ్ఞానానంతరము సాక్షికి భోక్తృత్వము లేదని కైముతికన్యాయముచేఁ జెప్పుచున్నాఁడు:—"కిముత" యనుశబ్దముచేతఁ జెప్పఁబడునది గనుక కైముతికము అనఁబడును. దండము నమలువాని కప్పడములు నమలుట ఏమి చెప్పవలె ననురీతి న్యాయము.

శ్లో. యథా స్వస్యాపి భోక్తృత్వం మంతుం జిహ్రేత్యయం తథా,
సాక్షిణ్యారోపయే దేత దితి కైవ కథా వృథా. 221

వ్యా. ఇదానీం జ్ఞానానంతరం సాక్షిణో భోక్తృత్వాభావః కైముతికన్యాయేన సిద్ధ ఇత్యాహ—యదేతి. అయం చిదాభాసస్స్వస్యాపి భోక్తృత్వం మంతుమహం భోక్తేతి జ్ఞాతుం జిహ్రేతి విలజ్జతే యదా, తదా ఏతత్స్వగతం భోక్తృత్వం సాక్షిణ్యసంగే ఆరోపయేదితి వృథా కథా. అర్థశూన్యా కైవ? న కాపీత్యర్థః.

టీ. అయం=ఈ చిదాభాసుఁడు, యథా = ఏప్రకారము, స్వస్యాపి = తనకును, భోక్తృత్వం=భోక్తృత్వమును, మంతుం=ఎఱుఁగుటకు, జిహ్రేతి=లజ్జించుచున్నాఁడో, తథా = ఆప్రకారము, ఏతత్ = ఈ భోక్తృత్వమును, సాక్షిణి=సాక్షిచైతన్యమునందు, ఆరోపయేదితి = ఆరోపము జేయుననెడివాక్యము, కైవ = ఏది ? కథా = ఇట్లు కల్పించిన వాక్యము, వృథా=అర్థశూన్య మగును.

తా. చిదాభాసుఁడు తనను భోక్తనుగాఁ దలంచుటకే లజ్జించు నప్పు డిట్టి యసత్యపుభోక్తృత్వమును సాక్షియం దెట్లు లారోపించును? ఆరోపింపఁజాలఁ డని భావము.

అవ. ఈ యర్థమును శ్రుతియందుఁ గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. ఇత్యభిప్రేత్య భోక్తార మాక్షిప త్యవిశంకయా,
కస్య కామాయేతి తత శ్శారీరానుజ్వరో న హి. 222

వ్యా. ఉక్తమర్థం శ్రుత్యారూఢం కరోతి—ఇతీతి. కస్య కామాయేతి శ్రుతిరిత్యర్థః కూటస్థస్య చిదాభాసస్య వా పారమార్థికభోక్తృత్వాభావమభిప్రేత్యావిశంకయా శంకారాహిత్యేన భోక్తారమాక్షిపతి నిరాకరోతి. భవత్యేవం భోక్త్రాక్షేపః. తతః కిమిత్యత ఆహ—తత ఇతి. నహి జ్వరో జ్వరణం సంతాపః.

టీ. కస్యకామాయేతి = ఏభోక్తయొక్క ప్రీతికొఱకు అనెడి అర్థముగల యీ శ్రుతి, ఇతి = పూర్వోక్తప్రకారము, అభిప్రేత్య=నిశ్చయించి, అవిశంకయా = నిస్సంశయముగా, భోక్తారం = భోక్తను, ఆక్షిపతి = నిరాకరించుచున్నది. తతః = ఆకారణమువలన, శారీరానుజ్వరః=దేహసంబంధ మగుసంతాపము (దుఃఖము), నహి=లేనే లేదు.

తా. "కస్యకామాయ" అనెడి శ్రుతివాక్యము వాస్తవ మగు భోక్తృత్వము కూటస్థునికా చిదాభాసునికా యని విచారించి, పరమార్థమందు భోక్తలేఁ డని నిశ్చయించి, నిస్సంశయముగా భోక్త లేఁడని, భోక్తను నిరాకరించుచున్న దని తెలియవలెను. కనుక నిశ్చలా పరోక్షజ్ఞానికి శరీరసంబంధదుఃఖము లేనే లేదు.

అవ. బ్రహ్మవిదునకు శరీరత్రయతాపములు లే వని చెప్పుటకై యాశరీరత్రయమును తాపత్రయమునుం జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్థూల సూక్ష్మం కారణం చ శరీరం త్రివిధం స్మృతం,
అవశ్యం త్రివిధోఽస్త్యేవ తత్ర తత్రోదితో జ్వరః. 223

వ్యా. తత్త్వవిదశ్శరీరానుజ్వరాభావం దర్శయితుం శరీరభేదం తత్ర తత్ర జ్వర సద్భావం చ దర్శయతి—స్థూలమితి.

టీ. శరీరం = శరీరము, స్థూలం = స్థూల మనియు, సూక్ష్మం = సూక్ష్మ మనియు, కారణం చ = కారణ మనియు, త్రివిధం = త్రివిధ మని, స్మృతం = చెప్పఁబడినది, తత్ర తత్ర = ఆయాశరీరమందు, ఉదితః = చెప్పఁబడిన, త్రివిధః = త్రివిధ మగు, జ్వరః = దుఃఖము, అవశ్యం = ముఖ్యముగా, అస్త్యేవ = కలదేను.

తా. స్థూలము, సూక్ష్మము, కారణము అని శరీరము త్రివిధము. ఆశరీరములయందుఁ బ్రత్యేకించి వేఱువేఱగు తాపములు గలవు.

అవ. స్థూలదేహతాపములఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. వాతపిత్తశ్లేష్మజన్యవ్యాధయః కోటిశ స్తనౌ,
దుర్గంధిత్వకురూపత్వదాహభంగాదయ స్తథా. 224

వ్యా. తత్ర స్థూలశరీరే జ్వరాంస్తావదాహ—వా తేతి.

టీ. తనౌ = స్థూలదేహమునందు, కోటిశః = కోట్లకొలఁది వాతపిత్తశ్లేష్మజన్యవ్యాధయః = వాతపిత్తశ్లేష్మవికృతివలనం గలిగిన రోగములును, తథా=అటులనే, దుర్గంధిత్వకురూపత్వ దేహభంగాదయః = దుర్గంధము, కురూపము, అంగవైకల్యము, పరితాపము మున్నగునవియును, (సన్తి = కలవు.)

తా. స్థూలదేహమునందు వ్యాధులును, దుర్గంధాది దోషంబులును తాపహేతువు లని భావము.

అవ. సూక్ష్మశరీరమునందలి తాపములఁ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. కామక్రోధాదయశ్శాంతిదాంత్యాద్యా లింగదేహగాః,
జ్వరా ద్వయేఽపి బాధంతే ప్రాప్త్యాఽప్రాప్త్యా నరం క్రమాత్.

వ్యా. సూక్ష్మశరీరే జ్వరాన్ దర్శయతి—కామేతి. కామశాంత్యాదీనాం చ జ్వరత్వ ముపపాదయతి—ద్వయేఽపి ద్వివిధా అపి క్రమేణప్రాప్త్యప్రాప్తిభ్యాం నరం బాధంతేఽతో జ్వరసామ్యాత్ జ్వరా ఇత్యుచ్యంత ఇత్యర్థః.

టీ. కామక్రోధాదయః = కామము క్రోధము మొదలగునవియు, శాంతిదాంత్యాద్యాః = శమము దమము మొదలగునవియు, లింగదేహగాః = సూక్ష్మశరీరమును బొందిన జ్వరాః = తాపములు. ద్వయేఽపి = ఈ రెండువిధములైనవియు, ప్రాప్త్యా= లభించుటచేతను, అప్రాప్త్యా = లభింపకపోవుటచేతను, నరం=మనుష్యుని, క్రమాత్ = వరుసగా, బాధంతే = బాధించుచున్నవి.

తా. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య డంభ దర్పాసూయాది దుర్గుణములును, శమదమాది గుణములును, లింగదేహమును, (సూక్ష్మదేహమును) బొందియున్న (అంటియున్న) తాపములు. కామాదులు పురుషుని నంటికొని పరితపింపఁజేయును. శమదమాదులు ఘటింపక పోయెనేని తపింపఁజేయును.

అవ. కారణశరీరమునందలి జ్వరమును ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్న దని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. స్వం పరం చ న వేత్త్యాత్మా వినష్ట ఇవ కారణే,
ఆగామిదుఃఖబీజం చే త్యేత దింద్రేణ దర్శితమ్. 226

వ్యా. కారణశరీరగతో జ్వరశ్ఛాందోగ్యశ్రుతావుక్త ఇత్యాహ—స్వం పరమితి. "నాహం ఖల్వయ మేవం సంప్రత్యాత్మానం జానాత్యయ మహ మస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమివాపీతో భవతి. నాహమత్ర భోగ్యం పశ్యా" మీతి వాక్యేన స్వపర జ్ఞానశూన్యత్వమజ్ఞానే నష్టప్రాయత్వం పరేద్యురాగామిదుఃఖబీజవాసనాసద్భావం చేంద్రేణ శిష్యేణ గురోః ప్రజాపతేః పురతో నివేదితమిత్యర్థః.

టీ. కారణే=కారణశరీరమునందు, (సుషుప్తియందు), ఆత్మా=ఆత్మ, వినష్ట ఇవ= నశించినవానివలె, స్వం = తనను, పరం చ = ఇతరుని, న వేత్తి=గుర్తెఱుఁగదు. ఏతత్ = ఈకారణశరీరము, ఆగామిదుఃఖబీజం చ - ఆగామి = రాఁబోయెడి, దుఃఖ=దుఃఖమునకు బీజం చ=కారణము, ఇతి=ఇట్లు, ఇంద్రేణ=ఇంద్రునిచేత, దర్శితం=చూపింపఁబడినది.

తా. సుషుప్తియందుఁ దనను మఱియొకరిని గుర్తెఱుంగఁడు. ఈసుషుప్తి రాఁబోయెడి జాగ్రత్స్వప్నములకు హేతువగును. ఈసంగతి నింద్రుఁడు ప్రజాపతితోఁ జెప్పినట్లు సామవేదోపనిషత్తునందుఁ

దెల్పఁబడెను. (స్వపరజ్ఞానశూన్యత్వము, అజ్ఞానముచే నష్టప్రాయత్వము ఆగామిదుఃఖబీజవాసనాస్థితియు కారణశరీరమందుఁ గల జ్వరము లని తెలియవలెను.)

అవ. ఇత్తెఱంగున శరీరత్రయమునందలి జ్వరంబులఁ గనఁబఱచి యయ్యవి యని వార్యము లని తెల్పుచున్నాఁడు:—

శ్లో. ఏతే జ్వరా శ్శరీరేషు త్రిషు స్వాభావికా మతాః,
వియోగే తు జ్వరై స్తాని శరీరా ణ్యేవ నాసతే. 227

వ్యా. ఏవం త్రిష్వపి దేహేషు జ్వరానభిధాయ తేషామపరిహార్యత్వమాహ— ఏత ఇతి. త్రిష్వపి శరీరేషు ప్రతీయమానా ఏతే జ్వరాః శరీరైస్సహోత్పన్నత్వేన, స్వాభావికాః సంతతాః. స్వాభావికత్వం వ్యతిరేకముఖేన ద్రఢయతి—వియోగేత్విత. యతః కారణాదేభిర్జ్వరై స్తేషాం శరీరాణాం వియోగే సతి తాని శరీరాణి నాసత ఏవ నైవ భవంతి. అతస్స్వాభావికా ఇత్యర్థః.

టీ. ఏతే జ్వరాః=ఈతాపములు, త్రిషు శరీరేషు=మూఁడుశరీరములయందును, స్వాభావికాః=స్వభావసిద్ధంబు లని, మతాః = అభిమతములు (చెప్పఁబడినవి). జ్వరైః= తాపములతోడ, వియోగే తు=ఎడబాటు గల్గునెడల, తాని శరీరాణ్యేవ=ఆశరీరంబులే, నాసతే = ఉండవు.

తా. ఈతాపంబులు శరీరత్రయమునకు సహజంబులు. ఇట్టిజ్వరములు (తాపములు) లేనిచో శరీరములే యుండవు.

అవ. ఇందుకుఁ దగినదృష్టాంతమును జూపుచున్నాఁడు:—

శ్లో. తంతో ర్వియుజ్యేత పటో వాలేభ్యః కంబళో యథా,
మృదో ఘట స్తథా దేహో జ్వరేభ్యోఽపీతి దృశ్యతామ్. 228

వ్యా. తత్ర దృష్టాంత మాహ—తంతోరితి.

టీ. పటః=వస్త్రము, తంతోః = దారమునుండి, వియుజ్యేత = విడియుండునా? ఉండదు. కంబళః=కంబళి, వాలేభ్యః=వెండ్రుకలనుండి, (వియుజ్యేత=విడియుండునా? ఉండదు.) ఘటః = కుండ, మృదః=మృత్తికనుండి, (వియుజ్యేత = విడియుండునా? ఉండదు.) దేహోఽపిశరీరత్రయమునయితము, జ్వరేభ్యః=జ్వరములనుండి, వియుజ్యేత= విడియుండునా? ఉండదు. కావున, (తత్ = దృష్టాంతమునందలి పటాదిత్రయము తంత్వాదికమును విడిచియుండుట), యథా=ఎట్లు అసంభవమో, (ఇదమపి=దార్ష్టాంతికమందు ఈశరీరత్రయము నైతము జ్వరములను విడిచియుండుట) తథా = అట్లే అసంభవము, ఇతి=అని, దృశ్యతాం = తెలియవలెను.

తా. దారములను విడిచి వస్త్రమును, రోమములను విడిచి గొంగడియు, మట్టిని వీడి కుండయు నుండనట్లు జ్వరముల నుజ్జగించి శరీరము లుండవు. అనఁగా శరీరములు జ్వరమయము లని భావము.

అవ. కూటస్థునకు జ్వరాభావమును కైముతికన్యాయముచేతఁ జెప్పఁ బూని మొదట చిదాభాసునకు జ్వరాభావమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. చిదాభాసే స్వతః కోఽపి జ్వరో నాస్తి యతశ్చితః,
ప్రకాశైకస్వభావత్వ మేవ దృష్టం న చేతరత్. 229

వ్యా. ఇదానీం కూటస్థే జ్వరాభావం కైముతికన్యాయేన దిదర్శయిషుశ్చిదాభాసే తావజ్జ్వరాభావం దర్శయతి—చిదాభాస ఇతి. చిదాభాసే స్వతశ్శరీరత్రయగత జ్వరసంబంధ మంతరేణ న కోఽపి జ్వరో విద్యతే. కుత ఇత్యత ఆహ—యత ఇతి. చితః ప్రకాశైకస్వభావస్య విద్వదనుభవసిద్ధత్వాత్ప్రతిబింబస్య చిదాభాసస్య తథాత్వ మేష్టవ్య మితి భావః.

టీ. చిదాభాసే=జీవునియందు, స్వతః = తనయంతట, కోఽపి జ్వరః=ఎట్టితాపమును, నాస్తి=లేదు. యతః=ఏహేతువువలన, చితః=చైతన్యమునకు, ప్రకాశైకస్వభావత్వమేవ=ప్రకాశమాత్రస్వభావమే, ఇష్టం=చూడఁబడినది. ఇతరత్ = మఱియొకటి, న చ దృష్టం=చూడఁబడ లేదు.

తా. చిదాభాసుఁడు (జీవుఁడు) ప్రకాశస్వభావుఁడు గనుక నాతని కేవిధము లగు జ్వరములును లేవు.

అవ. చిదాభాసునకు జ్వరములు లే వని యెందుకు సాధింపఁబడెనో తత్ఫలముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. చిదాభాసేఽప్యసంభావ్యా జ్వరా స్సాక్షిణి కా కథా,
ఏవమప్యేకతాం మేనే చిదాభాసో హ్యవిద్యయా. 230

వ్యా. యదర్థం చిదాభాసే జ్వరాభావ ఉపపాదితస్తదిదానీం దర్శయతి—చిదాభాసే ఇతి. యదా చిదాభాసేఽపి జ్వరా న సంభావ్యంతే. తదా న సాక్షిణి సంభవంతీతి కిము వక్తవ్యమితి భావః. నను తర్హి జ్వరామీత్యనుభవస్య కా గతిరిత్యత ఆహ—ఏవమప్యేకతామితి.

టీ. జ్వరాః=జ్వరములు, చిదాభాసేఽపి=చిదాభాసునియందును అసంభావ్యాః=ఊహింపఁబడునవి కావు, సాక్షిణి=సాక్షి యగు కూటస్థునియందు, కా కథా=ఎక్కడి

పార్థ! ఏవమపి=ఈలాగైనను, చిదాభాసః = చిదాభాసుఁడు, అవిద్యయా=అజ్ఞానముచేత, ఏకతాం=దేహత్రయైక్యమును, మేనే=తలంచెను, హి=ఇది ప్రసిద్ధము.

తా. చిదాభాసుఁడు ప్రకాశస్వభావుఁడు గనుక నతనికే జ్వరములు సంభవింపకపోవుచుండ, కూటస్థున కెట్లు సంభవించును? సంభవింప వనుట. చిదాభాసుఁడు తనయందు జ్వరములు లేనివాఁడైనను అవిద్యచేత నేకత్వమునుబొంది నేను తపించుచున్నా నని యభిమానించుచున్నాఁడు.

అవ. దీనినే వివరించుచున్నాఁడు:—

శ్లో. సాక్షీ సత్యత్వమధ్యస్య స్వేనోపేతే వపుస్త్రయే,
తత్సర్వం వాస్తవం స్వస్య స్వరూప మితి మన్యతే. 231

వ్యా. ఏకతాం మేనే ఇతి సంక్షేపేణోక్తమర్థం ప్రపంచయతి—సాక్షీతి. చిదాభాసః స్వేన సహితే శరీరత్రయే సాక్షిగతం సత్యత్వమధ్యస్య తత్సర్వం జ్వరవత్ శరీరత్రయం స్వస్య వాస్తవం రూపమితి మన్యత ఇత్యర్థః.

టీ. (చిదాభాసః=చిదాభాసుఁడు), స్వేన=తనతో, ఉపేతే=తాదాత్మ్యాభిమానమున స్వీకరింపఁబడిన, వపుస్త్రయే = శరీరత్రయమునందు, సాక్షిసత్యత్వం = కూటస్థుని యొక్క సత్యత్వమును, అధ్యస్య = ఆరోపణము చేసికొని, తత్సర్వం = అదియంతయు, వాస్తవం=సత్యమగు, స్వస్య = తనయొక్క, స్వరూపమితి = స్వరూప మని, మన్యతే= తలంచుచున్నాఁడు.

తా. చిదాభాసుఁడు నేను మనుష్యుఁడను, నేను కర్తను, నేను అజ్ఞుఁడను అని తనయం దారోపింపఁబడిన (తాదాత్మ్యాభిమానముచే స్వీకరింపఁబడిన) శరీరత్రయమునందు కూటస్థుని సత్యత్వమును జేర్చి యిదియంతయు సత్య మని పొరఁబడుచున్నాఁడు.

అవ. ఇట్టిభ్రాంతి కల్గినపుడు తన కెట్టినష్టము కల్గుచున్నదో దెల్పుచున్నాఁడు:-

శ్లో. ఏతస్మిన్ భ్రాంతికాలేఽయం శరీరేషు జ్వరత్స్వథ,
స్వయమేవ జ్వరామీతి మన్యతే హి కుటుంబివత్. 232

వ్యా. ఏవం భ్రాంతిజ్ఞానే సతి కిం భవతీత్యాహ—ఏతస్మిన్నితి. అయం చిదాభాసః అస్యాం భ్రాంతివేళాయాం శరీరనిష్ఠం జ్వరం స్వాత్మన్యారోపయతీత్యర్థః. తత్ర దృష్టాంతమాహ—కుటుంబివదితి.

టీ. ఏతస్మిన్ భ్రాంతికాలే = ఈ భ్రాంతిసమయమునందు, అయం = ఈచిదాభాసుఁడు, శరీరేషు = శరీరములయందుఁగల, జ్వరత్సు = జ్వరమును (స్వాత్మన్యారోప

యతి=తనస్వరూపమం దారోపించుకొనుచున్నాఁడు). అథ తు=అటుపిమ్మటనో, స్వయ మేవ=తానే, కుటుంబివత్ = సంసారివలె (పామరగృహస్థునివలె), జ్వరామీతి = తపించుచున్నా నని, మన్యతే హి=తలంచుచున్నాఁడు.

తా. ఇట్టిభ్రాంతి కల్గినపుడు చిదాభాసుఁడు యజమానునివలె తనకు తాపము లేకపోయినను శరీరతాపములఁ దనయం దారోపించుకొని తపించుచున్నా నని దుఃఖించును.

అవ. దృష్టాంతమును విశదపఱచుచున్నాఁడు:—

శ్లో. పుత్రదారేషు తప్యత్సు తపామీతి వృథా యథా,
మన్యతే పురుష స్తద్వదాభాసోఽప్యభిమన్యతే. 233

వ్యా. దృష్టాంతం విశదయతి—పుత్రదారేష్వితి.

టీ. పుత్రదారేషు = కుమాళ్లును భార్యయు, తప్యత్సు = తపించుచుండఁగా, పురుషః=పామరజనుఁడు, యథా = ఏప్రకారము, తపామి=నేను తపించుచున్నా నని, వృథా=వ్యర్థముగా, మన్యతే = తలంచుచున్నాఁడో, తద్వత్ = ఆలాగుననే, చిదాభాసోఽపి=చిదాభాసుఁడును, అభిమన్యతే = అభిమానమును పొందుచున్నాఁడు.

తా. భార్యాపుత్రాదులకు జ్వరాదిబాధలు కల్గినప్పుడు వారియం దభిమానము గల గృహయజమానుఁడు తపించునటుల దేహత్రయాభిమానము గల చిదాభాసుఁడు వ్యర్థముగా నేను తపించుచున్నా నని తలఁచుచున్నాఁడు.

అవ. ఈవిధముగా భ్రాంతికాలమునందు చిదాభాసునకు జ్వరములఁ గనఁబఱచి వివేకదశయందు జ్వరములు లే వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వివిచ్య భ్రాంతి ముజ్ఝిత్వా స్వమప్యగణయన్ సదా,
చింతయన్ సాక్షిణం కస్మాచ్ఛరీర మనుసంజ్వరేత్. 234

వ్యా. ఏవమవివేకదశాయాం చిదాభాసస్య భ్రాంత్యా జ్వరం ప్రదర్శ్య వివేకదశాయాం తదభావం దర్శయతి—వివిచ్యేతి. చిదాభాసః కూటస్థం స్వాత్మానం శరీరాణి చ వివిచ్య భేదేన జ్ఞాత్వా ఇదం సర్వం మమ వాస్తవం రూపమితి మన్యత ఇత్యుక్తాం భ్రాంతిం పరిత్యజ్య స్వస్యాభాసరూపత్వజ్ఞానేన స్వస్మిన్న ప్యాదరమకుర్వన్ స్వస్య నిజం రూపం జ్వరాదిరహితం సాక్షిణం సదా చింతయన్ కస్మాచ్ఛరీరమనుసంజ్వరేత్ జ్వరవచ్ఛరీర మనుసృత్య స్వయం కస్మాత్సంజ్వరేత్ ? న సంజ్వరేదేవేత్యర్థః.

టీ. (చిదాభాసః = చిదాభాసుఁడు), వివిచ్య = శరీరములను సాక్షిని తనకంటె వేఱుగాఁ జేసి, భ్రాంతిం = భ్రాంతిని, ఉజ్ఝిత్వా=వదలిపెట్టి, స్వమపి = తననుగూడ, అగణయన్=లెక్కింపక, సదా=ఎల్లప్పుడు, సాక్షిణం=తననిజరూపమైన కూటస్థాత్మను, చింతయన్ = ధ్యానించుచు, కస్మాత్=ఏహేతువువలన, శరీరం=శరీరమును, అనుసంజ్వరేత్ = అనుసరించి తపించును? (తపింపఁడనుట).

తా. దేహత్రయమును నేను గా ననియు నా కధిష్ఠాన మగు సాక్షియే సత్యస్వరూపుఁ డనియుఁ దలంచుచు తన చిదాభాసరూపమును గూడ లెక్కింపక వర్తించుజీవునకు శరీరతాపము లుండ వని భావము.

అవ. భ్రాంతిజ్ఞానము తాపములకు హేతువు. తత్త్వజ్ఞానము తాపనివృత్తికి హేతువు అని దృష్టాంతముతోఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. అయథావస్తుసర్పాదిజ్ఞానం హేతుః పలాయనే,
రజ్జుజ్ఞానేఽహిధీధ్వస్తౌ కృత మప్యనుశోచతి. 235

వ్యా. భ్రాంతిజ్ఞానతత్త్వజ్ఞానయోర్జ్వర తదభావకారణత్వం దృష్టాంతప్రదర్శనేన స్పష్టయతి—అయథేతి. రజ్జ్వాదౌ కల్పితస్య సర్పాదేర్జ్ఞానం పలాయనకారణం భవతి. ఆదిశబ్దేన స్థాణౌ కల్పితశ్చోరో గృహ్యతే రజ్జ్వాదిజ్ఞానేన సర్పాదిబుద్ధినివృత్తౌ తదపి పలాయనమనుశోచతి. వృథాకృతం మయేత్యనుతప్యత ఇత్యర్థః.

టీ. అయథావస్తు = అ యథార్థవస్తువగు (రజ్జ్వాదికమందుఁ గల్పింపఁబడిన), సర్పాది = సర్పము మొదలగు పదార్థములయొక్క, జ్ఞానం=జ్ఞానము, పలాయనే=పాఱిపోవుటయందు, హేతుః = కారణము, రజ్జుజ్ఞానే=రజ్జుజ్ఞానము గల్గుచుండఁగా, అహిధీధ్వస్తౌ = సర్పజ్ఞానమునకు ధ్వంసము గల్గుచుండఁగా, కృతమపి = చేసినపలాయనముఁగూర్చియు, అనుశోచతి = పశ్చాత్తప్తుఁడగుచున్నాఁడు.

తా. రజ్జువును జూచి సర్ప మని భ్రమించినపుడు పలాయనము చేయును. పిమ్మట రజ్జు వని తెలిసినప్పుడు తెలియక పరుగిడితి నని చింతించును. కనుక, భ్రాంతిజ్ఞానము జ్వరమునకుఁ గారణ మనియు, వాస్తవజ్ఞానము జ్వరాభావమునకుఁ గారణ మనియుం దెలియవలెను.

అవ. సాక్షిని చింతించువిధమును దృష్టాంతముతో స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. మిథ్యాభియోగదోషస్య ప్రాయశ్చిత్తత్వసిద్ధయే,
క్షమాపయ న్నివాత్మానం సాక్షిణం శరణం గతః. 236

వ్యా. సాక్షిణం సదాచింతయన్నిత్యుక్తమర్థం దృష్టాంతేన స్పష్టయతి—మిథ్యేతి. యథా లోకే మిథ్యాభియోగకర్తా తద్దోషస్య ప్రాయశ్చిత్తసిద్ధ్యర్థం మిథ్యాభియుక్తం పునఃపునః క్షమాపయతి—ఏవమయం చిదాభాసోఽపి సాక్షిణ్య సంగాత్మని భోక్తృత్వాధ్యారోపలక్షణమిథ్యాభియోగదోషప్రాయశ్చిత్తార్థం సాక్షిణమాత్మానం క్షమాపయన్నివ శరణంగతః.

టీ. మిథ్యాభియోగదోషస్య = మిథ్యాపవాదదోషముయొక్క, ప్రాయశ్చిత్తత్వసిద్ధయే = ప్రాయశ్చిత్తము ఘటించుటకొఱకు, ఆత్మానం = ఆత్మను, క్షమాపయన్నివ = క్షమాపణము వేఁడుచున్నవానివలె, సాక్షిణం = సాక్షిని, శరణం=శరణమును, గతః = పొందుచున్నాఁడు.

తా. సాక్షికి తాపము గల దని తాను పొరపడి తలఁచినందులకు ప్రాయశ్చిత్తముకొఱకు క్షమింపు మని సాక్షిని వేఁడుచున్న వానివలె శరణమును బొందును. అనఁగా చిన్మాత్రచింతనము గలవాఁడై వర్తించుచున్నాఁడు.

అవ. ఇందువిషయమై మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆవృత్తపాపనుత్త్యర్థం స్నానాద్యావర్త్యతే యథా,
ఆవర్తయన్నివ ధ్యానం సదా సాక్షిపరాయణః. 237

వ్యా. తత్రైవ దృష్టాంతాంతరమాహ—ఆవృత్తేతి. యథా పాపకారిణా పురుషేణావృత్తపాపనుత్త్యర్థమభ్యస్త పాపాపనోదయ విహితం స్నానాదికం ప్రాయశ్చిత్తమావర్త్యతే పునఃపునరనుష్ఠీయతే, తథాయమపి చిరం సాక్షిణి సంసారిత్వాధ్యారోపణ దోషపరిహారాయ ధ్యానం పరివర్తయన్నివ సదాసాక్షిపరాయణో భవతి.

టీ. ఆవృత్తపాపనుత్త్యర్థం = చిరకాలమాచరింపఁబడిన పాపమును బోఁగొట్టుకొనుటకొఱకు, స్నానాది = స్నానాదికము, యథా = ఎట్లు, ఆవర్త్యతే = పలుమాఱాచరింపఁబడునో (అవిధముగా), ధ్యానం=ధ్యానమును, ఆవర్తయన్నివ = పలుమాఱాచరించువానివలె, సదా = ఎల్లప్పుడు, సాక్షిపరాయణః = సాక్షినిష్ఠుఁడు (చిన్మాత్రనిష్ఠుఁడు), (భవతి = అగుచున్నాఁడు.)

తా. లోకములో పాపి అనేక పాపములు పోవుట కనేకస్నానముల నాచరించునట్లు చిదాభాసుఁడు అనాదికాలమునుండి సాక్షిని పాపత్రయానుతప్తునిగాఁ దలంచిన పాపమును పోఁగొట్టుకొనుటకా యనునట్లు ఎప్పుడును సాక్షిచింతనము గలవాఁడై యుండును.

అవ. చిదాభాసుఁడు తనగుణములను ప్రకాశింపఁజేయుటకై లజ్జించు నని సదృష్టాంతముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపస్థకుష్ఠినీ వేశ్యా విలాసేషు విలజ్జతే,
జానతోఽగ్రే తథాభాసః స్వప్రఖ్యాతౌ విలజ్జతే. 238

వ్యా. ఏవం సాక్షిపరత్వం దృష్టాంతై రుపవర్ణ్య స్వగుణ ప్రఖ్యానే లజ్జాశీలత్వం సదృష్టాంతమాహ—ఉపస్థకుష్ఠినీతి.

టీ. ఉపస్థకుష్ఠినీ=మర్మస్థానమున కుష్ఠవ్యాధిగల, వేశ్యా=వారాంగన, జానతః= ఎఱిఁగినవానియొక్క, అగ్రతః = ఎదుట, విలాసేషు = విలాసములయందు, (యథా = ఏవిధముగా), విలజ్జతే = సిగ్గుపడునో, తథా = ఆవిధముగా, చిదాభాసః = చిదాభాసుఁడు, స్వప్రఖ్యాతౌ = తనగుణములను బొగడుకొనువిషయమై, విలజ్జతే=సిగ్గుపడుచున్నాఁడు.

తా. మర్మస్థలమునందు కుష్ఠవ్యాధిగలవేశ్య తనతో లోఁగడ సంబంధము గలవిటునియెదుటఁ దనవిలాసములఁ గనఁబఱుప లజ్జించునట్లు తనమిథ్యాత్వమును నెఱింగినసాక్షియెదుట నేను కర్తను భోక్తనని పల్కుటకు చిదాభాసుఁడు లజ్జించును.

అవ. శరీరత్రయమును వేఱుగాఁ గనుఁగొనిన చిదాభాసుఁడు మఱల శరీరాభిమానమును జెందఁ డనుటకు దృష్టాంతముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. గృహీతో బ్రాహ్మణో మ్లేచ్ఛైః ప్రాయశ్చిత్తం చరన్ పునః,
మ్లేచ్ఛైస్సంకీర్యతే నైవ తథాభాసశ్శరీరకైః. 239

వ్యా. ఇదానీం శరీరత్రయాద్వివేచితస్య చిదాభాసస్య పునస్తైస్సహ తాదాత్మ్యభ్రమాభావే దృష్టాంతమాహ—గృహీత ఇతి.

టీ. మ్లేచ్ఛైః=తురుష్కులచేత, గృహీతః పట్టుకొనఁబడిన, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, ప్రాయశ్చిత్తం = ప్రాయశ్చిత్తమును, చరన్=ఆచరించుచున్నవాఁడై, పునః = తిరుగా, మ్లేచ్ఛైః = తురుష్కులతో, నైవ సంకీర్యతే = ఎన్నటికినికలిసికొననే కలిసికొనఁడు. తథా = ఆలాగున, ఆభాసః = చిదాభాసుఁడు, శరీరకైః = శరీరములతో, నైవ సంకీర్యతే = కలిసికొననే కలిసికొనఁడు.

తా. పొరపాటుగా మ్లేచ్ఛునితోఁ గలిసికొని యాదోషము నివర్తించుటకై ప్రాయశ్చిత్త మాచరించుకొనిన మహాబ్రాహ్మణుఁడు మఱల మ్లేచ్ఛులతో నెన్నటికిని గలియనట్లు విచారముచేసి శరీరత్రయ

సంబంధమును వదులుకొనిన చిదాభాసుఁడు మఱల శరీరత్రయముతో నెన్నటికిని తాదాత్మ్యమును బొందఁడు.

అవ. సాక్షిచింతనమునకు వేఱొకలాభమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. యౌవరాజ్యే స్థితో రాజపుత్రస్సామ్రాజ్య వాంఛయా,
రాజాను కారీ భవతి తథా సాక్ష్యను కార్యయమ్. 240

వ్యా. న కేవలం స్వాపరాధనివృత్తయే సాక్ష్యనుసరణం. కింతు మహాప్రయోజన సిద్ధ్యర్థ మపీతి సింహావలోకనన్యాయేన దృష్టాంతమాహ—యౌవరాజ్య ఇతి. రాజాను కారీ భవతి రాజేవ ప్రజారంజనాదిగుణవాన్ భవతీత్యర్థః.

టీ. యౌవరాజ్యే=యువరాజస్థానమునందు, స్థితః=ఉన్నట్టి, రాజపుత్రః=రాజ కుమారుఁడు, సామ్రాజ్యవాంఛయా = రాజ్యమునందలి కోరికచేత, రాజానుకారీ = రాజునుబోలి వర్తించువాఁడు, భవతి = అగుచున్నాఁడు. తథా=అలాగుననే, అయం = ఈచిదాభాసుఁడు, సాక్ష్యనుకారీ = కూటస్థుని ననుకరించుచున్నాఁడు.

తా. యువరాజు రాజ్యమును గోరి రాజును బోలి వర్తించు నట్లు చిదాభాసుఁడు మోక్షకాంక్షచే కూటస్థైక చింతనముగలవాఁడై యుండును.

అవ. యువరాజునకు రాజానుకరణమునందు రాజ్యలాభము గలదు. ఈతని కట్టి లాభ మేది యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. యో బ్రహ్మ వేద బ్రహ్మైవ భవత్యేష ఇతి శ్రుతిం,
శ్రుత్వా తదేకచిత్తస్సన్ బ్రహ్మ వేత్తి న చేతరత్. 241

వ్యా. నను, యువరాజస్య రాజానుసరణే సామ్రాజ్యఫలం దృశ్యతే నైవం సాక్ష్యనుసరణే అతస్తదనుసరణే కథం ప్రవర్తత ఇత్యాశంక్యాహ—య ఇతి* "స యోహ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి నాస్యా బ్రహ్మవిత్కులే భవతి, తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవ' తీతి శ్రుతౌ బ్రహ్మభావాదిరూపస్య ఫలస్య శ్రూయమాణత్వా త్తత్ఫలవాంఛయా సాక్ష్యనుసరణే ప్రవర్తనం యుక్తమిత్యర్థః.

టీ. యః = ఎవఁడు, బ్రహ్మ = బ్రహ్మమును, వేద = గుర్తెఱుంగునో, ఏషః = వీఁడు, బ్రహ్మైవ = బ్రహ్మ, భవతి = అగుచున్నాఁడు. ఇతి = ఈలాగంటే, శ్రుతిం = శ్రుతిని, శ్రుత్వా = విని, తదేకచిత్తస్సన్ - తత్ = ఆబ్రహ్మమునందు, ఏక =

ఒకదానియందే, చిత్తస్సన్ = మనస్సు కలవాఁడై, బ్రహ్మ = బ్రహ్మమును, వేత్తి=తెలిసికొనుచున్నాఁడు. ఇతరత్ = మఱియొకదానిని, న వేత్త = తెలిసికొనఁజాలఁడు.

తా. "ఆపరబ్రహ్మము నెవఁ డెఱుఁగునో వాఁడే పరబ్రహ్మమగును, లేదా, బ్రహ్మవిదుని కులమందు పుట్టును. దుఃఖమును దాటును, పాప విముక్తుఁ డగును, పంచకోశరూపగుహలవలనను కామప్రమోహకరూప హృదయగ్రంథులవలనను ముక్తుఁ డగుచు అమృతరూపుఁ డగుచున్నాఁడు," అని చెప్పెడి (పైవ్యాఖ్యానములోఁ జెప్పఁబడిన) శ్రుతిని నమ్మి తాను బ్రహ్మమును దెలిసికొనును. ఇతరము నెఱుఁగఁడు.

అవ. బ్రహ్మజ్ఞానమువలన తనకు బ్రహ్మత్వము ఘటించె నేని తన చిదాభాసత్వము పోవునే. తననాశనమునకుఁ బ్రయత్నించెడివాఁ డెవ్వఁడైనం గలఁడా? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. దేవత్వకామా హ్యగ్న్యాదౌ ప్రవిశంతి యథా తథా,
సాక్షిత్వేనావశేషాయ స్వవినాశం స వాంఛతి. 242

వ్యా. నను బ్రహ్మజ్ఞానేన బ్రహ్మభావప్రాప్తౌ చిదాభాసత్వమేవ వినశ్యేత్ అతస్స్వవినాశాయ కథం ప్రవర్తత ఇత్యాశంక్యాహ—దేవత్వకామేతి. యథా లోకే దేవత్వప్రాప్తికామా మనుష్యా భృగ్వగ్నిప్రయాగగంగాప్రవేశాదౌ ప్రవర్తంతే. ఏవం సాక్షిరూపేణావస్థానలక్షణస్యాధికఫలస్య విద్యమానత్వాచ్చిదాభాసత్వాపగమహేతౌ బ్రహ్మజ్ఞానేఽపి ప్రవృత్తిర్ఘటత ఏవేత్యర్థః.

టీ. యథా=ఏవిధముగా, దేవత్వకామాః=దేవత్వముగోరినవారు, అగ్న్యాదౌ = అగ్ని మొదలగుదానియందు, ప్రవిశంతి = ప్రవేశించుచున్నారో, తథా=అవిధముగా, సాక్షిత్వేన = సాక్షిభావముతో, అవశేషాయ = మిగిలియుండుటకొఱకు, సః = ఆ చిదాభాసుఁడు, స్వవినాశం = తననాశమును, వాంఛతి = కోరుచున్నాఁడు.

తా. దేవభావము గల్గు నని పతివ్రతలు సహగమనము చేయునట్లును, గంగా యమునా సంగమమున మరణించుటవలన దేవభావము కల్గు నని కోరికగలవారు అగ్నిజలాదులలోఁ బ్రవేశించునట్లును చిదాభాసుఁడు తన కుత్కృష్ట మగు బ్రహ్మభావము ఘటించు నని చిదాభాసత్వము విడువ నిచ్ఛగించుచున్నాఁడు.

అవ. చిదాభాసుఁ డని యెంతవఱకు వ్యవహరింపఁబడునో యాసంగతిని దృష్టాంతపూర్వకముగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. యావత్స్వదేహదాహం స నరత్వం నైవ ముంచతి,
తావదారబ్ధ దేహం స్యాన్నాభాసత్వవిమోచనమ్. 243

వ్యా. నను తత్వజ్ఞానే సాభాసత్వమపగచ్ఛతి చేత్కథం తత్త్వవిదాం జీవత్వ వ్యవహార ఇత్యాశంక్య ప్రారబ్ధకర్మక్షయపర్యంతం తదుపపత్తి సదృష్టాంతమాహ— యావదితి. యథాగ్న్యదౌ ప్రవిష్టం పురుషః దాహాదినా స్వదేహనాశపర్యంతం నరత్వం వ్యవహారయోగ్యత్వం నైవ ముంచతి, ఏవం ప్రారబ్ధకర్మక్షయపర్యంతం చిదాభాసత్వ వ్యవహారో న నివర్తత ఇత్యర్థః.

టీ. సః = ఆదేవత్వకాముఁడు, యావత్స్వదేహనాశం = తన స్థూలదేహము నశించువఱకు, నరత్వం = మనుష్యత్వమును, న ముంచతి = వదలిపెట్టఁడు, (తథా = ఆలాగుననే, యావదారబ్ధదేహం = ప్రారబ్ధకర్మార్జిత మగు దేహము నశించువఱకు, ఆభాసత్వవిమోచనం = చిదాభాసత్వ పరిత్యాగము, న స్యాత్ = లేకపోవును.

తా. పతివ్రతాదులకు స్థూలదేహము నశింపనిది దేవత్వము రానట్లు చిదాభాసునకుఁ బ్రారబ్ధదేహము నశింపనిచో నట్టిచిదాభాసత్వము విడువదు.

అవ. జ్ఞానికి అజ్ఞానము పోయినతర్వాత నేను భోక్త ననుభ్రాంతి యెటుల నను వర్తించును ? అను శంకకు దృష్టాంతపూర్వకముగ సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. రజ్జుజ్ఞానేఽపి కంపాది శ్శనై రేవోపశామ్యతి,
పునర్మందాంధకారే సా రజ్జుః క్షిప్తోరగీ భవేత్. 244

వ్యా. నను భోక్తృత్వాదిభ్రమోపాదానస్యాజ్ఞానస్య నివృత్తత్వాత్కథం పునర్భోగానువృత్తిః కథం వా మర్త్యోఽహమితి విపరీతప్రతీతిరిత్యాశంక్య దృష్టాంతే ప్రదర్శ్యనైతత్సంభావయతి—రజ్జుజ్ఞాన ఇతి.

టీ. రజ్జుజ్ఞానేఽపి=త్రాటని నెఱింగియున్నను, కంపాదిః = భయకంపాదికము, శనైరేవ=మెల్లగానే, ఉపశామ్యతి=శమించుచున్నది. పునః=తిరుగ, మందాంధకారే= స్వల్పమగు చీఁకటియందు, సారజ్జుః = ఆత్రాడు, క్షిప్తా = వేయఁబడినదగును, ఉరగీ = సర్పము, భవేత్ = అగును.

తా. త్రాడుం జూచి సర్ప మని భ్రమచెందినవానికి తిరుగ త్రాడని గ్రహించిన కొంతకాలమునకుఁ గాని వెనుకటి భయకంపాదులు వీడవు. మఱియొకప్పుడు కొలఁది చీకటిలో త్రాటిని జూచినేని సర్ప మని భ్రమించును.

అవ. దీనిని దార్ష్టాంతికమునందుఁ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. ఏవమారబ్ధభోగోఽపి శనైః శామ్యతి నో హఠాత్,
భోగకాలే కదా చిత్తు మర్త్యోఽహమితి భాసతే. 245

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—ఏవమితి.

టీ. ఏవం = ఈవిధముగాను, ఆరబ్ధభోగోఽపి = ప్రారబ్ధభోగంబును, శనైః = మెల్లగా, శామ్యతి = శమించుచున్నది. హఠాత్ = బలాత్కారమున, న=తొలఁగదు, భోగకాలే తు=భోగసమయమునందన్నను, కదాచిత్=ఒకానొకప్పుడు, అహం=నేను, మర్త్యః=మనుష్యుఁడను ఇతి=అని, భ్రామ్యతి=పొరపడుచున్నాఁడు.

తా. అటులనే జ్ఞాని యగు చిదాభాసునకు ప్రారబ్ధభోగము కొంతకాలంబునకుఁగాని శమింపదు. భోగానుభవసమయంబున నొక ప్పుడు నేను మనుజుఁడ నని కూడ ననుకొనును.

అవ. మఱల మనుష్యుఁడ నను భ్రమ గల్గినయెడల తొల్లింటితత్త్వజ్ఞానము నశింపదా యను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నైతావతా ఽపరాధేన తత్త్వజ్ఞానం వినశ్యతి,
జీవన్ముక్తివ్రతం నేదం కింతు వస్తుస్థితిః ఖలు. 246

వ్యా. నను పునర్మర్త్యబుద్ధ్యుదయే తేన తత్వజ్ఞానం బాధ్యతేత్యాశంక్యాహ—నైతావతేతి. కదాచిదహం మర్త్య ఇత్యేవంవిధజ్ఞానోదయమాత్రేణాగమప్రమాణజనిత తత్వజ్ఞానం న బాధ్యతే కుత ఇత్యత ఆహ—జీవన్ముక్తీతి. ఇదం మర్త్యత్వబుద్ధ్యను కరణలక్షణం జీవన్ముక్తివ్రతం నియమేనానుష్ఠేయం న భవతి కింతు సమ్యక్ జ్ఞానేన భ్రాంతిజ్ఞానినివృత్తిరిత్యయం వస్తుస్వభావః అతః కదాచిన్మర్త్యత్వబుద్ధ్యుదయేఽపి పున స్తత్వజ్ఞానాంతరేణ తస్యా ఏవ బాధ్యత్వమితి భావః.

టీ. ఏతావతా = ఇంతమాత్రపు, అపరాధేన = తప్పిదముచేత, తత్త్వజ్ఞానం = ఆత్మజ్ఞానము, న వినశ్యతి = నశింపదు. ఇదం = ఈమర్త్యత్వానుకరణము. జీవన్ముక్తి వ్రతం = జీవన్ముక్తిరూపవ్రతము న = కానేరదు. కింతు = మఱి యేమి యనఁగా, వస్తు స్థితిః ఖలు = యథార్థస్థితి గదా.

తా. జ్ఞాని యొకప్పుడు పూర్వభ్రమానువృత్తిచే మనుజుఁడ నని తలంచినను తొల్లింటి తత్త్వజ్ఞానము నశింపదు. జీవన్ముక్తుఁడు తనను మనుజునిగాఁ దలంపవలయు నని విధి కాదు. యథార్థజ్ఞానముచేత భ్రాంతిజ్ఞానము నశించును కనుక నిది వస్తుస్వభావ మగును.

అవ. దశమునియందు భ్రమకార్య మనువర్తించుటను గనపఱచుచున్నాడు:—

శ్లో. దశమోఽపి శిరస్తాడం రుదన్ బుద్ధ్వా న రోదితి,
శిరోవ్రణస్తు మాసేన శనైః శామ్యతి నో తదా. 247

వ్యా. భవతు రజ్జుసర్పాదిస్థలే విపరీతజ్ఞాననివృత్తావపి తత్కార్యకంపాద్యను వృత్తిః ప్రకృతదృష్టాంతే దశమే దశమస్త్వమసీతివాక్యవిచారజన్యజ్ఞానేన భ్రమ నివృత్తౌ తత్కార్యానువృత్తిర్నోపలభ్యత ఇత్యాశంక్యాహ—దశమోఽపీతి. దశమోఽస్మీతి జ్ఞానోదయే సతి శిరస్తాడన పూర్వకం రోదనమాత్రం నివర్తతే తాడన వ్రణస్తు అనువర్తత ఏవేత్యర్థః.

టీ. దశమోఽపి = పదియవవాఁడును, శిరస్తాడం = శిరస్తాడనపూర్వకముగా, రుదన్ = రోదనము చేయుచు, బుద్ధ్వా = తాను దశముఁడైనట్లు గుర్తెఱింగి, న రోదితి = విలపింపఁడు. శిరోవ్రణస్తు = తలగాయము మాత్రము, మాసేన = మాస కాలముచేత, శనైః = మెల్లఁగా, శామ్యతి = శమించుచున్నది. తదా = అప్పుడే, న శామ్యతి = మానదు.

తా. పదియవవాఁడు నేను పదియవవాఁడ నని యెఱింగిన తర్వాత నేడ్వకపోయినను వెనుక శిరస్తాడనమువలనం గలిగినగాయము నెలదినములకుఁగాని మానదు.

అవ. జ్ఞానము గలిగినపిమ్మటను సంసార మనువర్తించునెడల జీవన్ముక్తిపురుషార్థము గాకపోవు ననుశంకకు సమాధానము దృష్టాంతపూర్వకముగాఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. దశమామృతిలాభేన జాతో హర్షో వ్రణవ్యథాం,
తిరోధత్తే ముక్తిలాభస్తథా ప్రారబ్ధదుఃఖితామ్. 248

వ్యా. నను జ్ఞానోత్తరకాలేఽపి సంసారానువృత్తౌ జీవన్ముక్తేః కుతః పురుషార్థతే త్యాశంక్య ముక్తిలాభజన్యహర్షస్య దుఃఖాచ్ఛాదకస్య సత్వాత్పురుషార్థతేతి దృష్టాంత పూర్వకమాహ—దశమేతి.

టీ. దశమామృతిలాభేన - దశమ = పదియవవానియొక్క, అమృతిలాభేన = బ్రతికియుండె నని గ్రహించుటచేత, జాతః = కలిగిన, హర్షః = సంతోషము = వ్రణ వ్యథాం = నెత్తిగాయపుబాధను, తిరోధత్తే = కప్పివేయును. తథా = అలాగున, ముక్తి లాభః = జీవన్ముక్తిలాభము; ప్రారబ్ధదుఃఖితాం = ప్రారబ్ధదుఃఖమును, (తిరోధత్తే = కప్పి వేయుచున్నది.)

తా. పదియవవాఁడు బ్రతికియున్నాఁడని తెలిసినందువలనఁ గలిగిన సంతోషము నెత్తిమీఁదిగాయపుబాధ నుపశమింపఁజేసినట్లు

జీవన్ముక్తిసుఖము ప్రారబ్ధదుఃఖమును నగపడనీయదు. అనఁగా కప్పి వేయును.

అవ. ఇది జీవన్ముక్తివ్రతము గా దని చెప్పినందువలని ఫలితమును జెప్పు చున్నాఁడు:—

శ్లో. వ్రతాభావా ద్యదాధ్యాస స్తదా భూయో వివిచ్యతాం,
రససేవీ దినే భుంక్తే భూయో భూయో యథాతథా. 249

వ్యా. జీవన్ముక్తివ్రతం నేవ మిత్యుక్తం తత్ర వ్రతత్వాభావే కిమాయాత మిత్యత ఆహ—వ్రతాభావాదితి. పునః పునర్విచారకరణే దృష్టాంతమాహ—రససేవీతి. యథా రససేవీ నరః. ఏకస్మిన్నేవ దినే క్షుద్బాధాపరిహారాయ పునః పునర్భుంక్తే తద్వదధ్యాస నివృత్తయే పునః పునర్వివేకః క్రియతామిత్యర్థః.

టీ. వ్రతాభావాత్ = జీవన్ముక్తివ్రతము లేకపోవుటవలన, యదా = ఎప్పుడు, అధ్యాసః=భ్రమ, భవతి=అగుచున్నదో, తదా=అప్పుడు, భూయః=తిరుగ, వివిచ్యతాం= వేఱు చేయఁబడుఁ గాక, రససేవీ = రసముచు సేవించెడివాఁడు, దినే = ఒకదినమున, భూయో భూయః = మాటిమాటికి, యథా = ఏతీరున, భుంక్తే=భక్షించునో, తథా = ఆవిధముగా నని పైవాక్యముతో నన్వయించుకొనవలయును.

తా. ఇది యొకవ్రతము కాదు కనుక భ్రమ కల్గినప్పు డెల్లను స్వస్వరూపవిచారముం జేసికొనవచ్చును. ఔషధసేవచేయువాఁడు ఆఁకలి కల్గినపుడెల్ల అన్నమును తినఁడా? అటులనే స్వస్వరూపవిచా రముం జేయు మని భావము.

అవ. ప్రారబ్ధకర్మఫలము జ్ఞానముచే నశింపనియెడల మఱి దేనిచే నశించును? ఇందుకు దృష్టాంతపూర్వముగ సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. శమయత్యౌషధేనాయం దశమస్స్వం వ్రణం యథా,
భోగేన శమయిత్వైత త్ప్రారబ్ధం ముచ్యతే తథా. 250

వ్యా. జ్ఞానేనానివర్త్యస్య ప్రారబ్ధకర్మఫలస్య కేన తర్హి నివృత్తి రిత్యాశంక్య తాడనజన్యవ్రణస్య ఔషధేనేవ భోగేనైవ నివృత్తిరిత్యాహ—శమయతీతి.

టీ. అయం దశమః = ఈపదియవవాఁడు, స్వయం = తనదైన, వ్రణం=గాయ మును, యథా = ఏవిధముగా, ఔషధేన = మందుచేత, శమయతి = పోఁగొట్టుకొనునో, తథా=ఆవిధముగ, ఏతత్ = ఈప్రారబ్ధమును, భోగేన = భోగముచేత, శమయిత్వా = శమింపఁజేసి, ముచ్యతే = ముక్తుఁ డగును.

తా. పదియవవాఁడు ఔషధసేవచేసి శిరోవ్రణమును మాన్పుకొనునట్లు జ్ఞాని భోగముచే ప్రారబ్ధకర్మమును శమింపఁజేసి ముక్తుఁడగుచున్నాఁడు.

అవ. కడచినవానిం జెప్పి యుత్తరగ్రంథము నవతరింపఁజేయుచున్నాఁడు:—

శ్లో. కిమిచ్ఛన్నితి వాక్యోక్తశోక మోక్ష ఉదీరితః,
ఆభాసస్య హ్యవస్థాహి షష్ఠీ తృప్తిస్తు సప్తమీ. 251

వ్యా. "అపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యే ఉభే ఇమే. అవస్థే జీవగే బ్రూతి ఆత్మానం చేదితి శ్రుతి" శ్లోకేన. * "ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మనుసంజ్వరే" దిత్యస్మిన్మంత్రే ఉపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యే జీవావస్థే ద్వే అభిహితే ఇత్యుక్తం. ఇదానీం తదభిధానసూచితాంజీవస్య సప్తమీం తృప్తిలక్షణామవస్థాం వృత్తానుకీర్తనపూర్వక వక్తుమారభతే.—కిమిచ్ఛన్నితి. కిమిచ్ఛన్నిత్యుత్తరార్థేనాభిహితో యశ్శోకమోక్షస్స ఏతావతాగ్రంథసందర్భేణ ఉదీరితోఽభిహితః. ఏషా "అజ్ఞానమావృతి స్తద్వద్విక్షేపశ్చ పరోక్షధీః, అపరోక్ష మతి శ్శోకమోక్ష స్తృప్తిర్నిరంకుశే" త్యనేన శ్లోకేనాభిహితాసు సప్తసు జీవావస్థాసు షష్ఠీత్యాహ—ఆభాసస్యేతి. సప్తమీ వ్యాఖ్యాయత ఇతి శేషః.

టీ. కిమిచ్ఛన్నితి = కిమిచ్ఛన్ననెడి, వాక్యోక్తః = వాక్యముచేతఁ జెప్పఁబడిన, శోకమోక్షః = దుఃఖనివృత్తి, ఉదీరితః = మాచేఁజెప్పఁబడినది. ఏషా = ఇది, ఆభాసస్య=చిదాభాసునియొక్క, షష్ఠీ=ఆఱవదైన, అవస్థా హి=స్థితి గదా, తృప్తిస్తు=తృప్తి, సప్తమీ=ఏడవది, (వ్యాఖ్యాయతే = ఇఁక జెప్పఁబడును).

తా. చిదాభాసుని యేడవస్థలలో శోకనివృత్తి యను నాఱవయవస్థ యిదివఱలో వర్ణింపఁబడినది. తృప్తి యను నేడవయవస్థను వర్ణించెదము.

అవ. జీవన్ముక్తుని తృప్తి నిరంకుశమైన దని సంసారికులతృప్తికంటె వైలక్షణ్యమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. సాంకుశా విషయైస్తృప్తి రియం తృప్తి ర్నిరంకుశా,
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ తృప్యతి. 252

వ్యా. అపరోక్షజ్ఞానజన్యాయా స్తృప్తేర్నిరంకుశత్వం ప్రతియోగిప్రదర్శన పురస్సరం ప్రతిజానీతే—సాంకుశేతి. విషయలాభజన్యాయా స్తృప్తే ర్విషయాంతర కామతయా కుంఠితత్వాత్సాంకుశత్వం. అస్యాస్తు తదభావా న్నిరంకుశత్వం. తదేవదర్శయతి—కృతమితి.

టీ. విషయైః = విషయములచేతనైన, తృప్తిః = తృప్తి, సాంకుశా = మొక్క-పోయినది. అనఁగా పరిచ్ఛిన్నము. ఇయం = ఈ, తృప్తిః = (అపరోక్షజ్ఞానస్య) తృప్తి, నిరంకుశా=అడ్డులేనిది, కృత్యం=చేయఁదగినపని, కృతం=చేయఁబడినది, ప్రాపణీయం = పొందఁదగినలాభము, ప్రాప్తం=పొందఁబడినది, ఇత్యేవ = అనియే, తృప్యతి=సంతసించుచున్నాఁడు.

తా. విషయలాభజన్య మగు తృప్తికి అన్యవిషయకామత్వముచేత చెలుపు గలుగును గనుక నట్టితృప్తి సాంకుశ మని చెప్పఁబడును. అపరోక్ష బ్రహ్మజ్ఞానమువలన తృప్తి గలుగుచుండఁగా మఱియొక సుఖేచ్ఛ కలుగమిచే నట్టితృప్తి నిరంకుశ మని చెప్పఁబడును. అట్టినిరంకుశ తృప్తి గలిగిన జీవన్ముక్తుఁడు చేయఁదగినవాని నన్నింటినిఁ జేసితిని, పొందఁదగినవాని నన్నింటినిం బొందితిని అని ఆనందించును.

అవ. ఆ కృతకృత్యత్వమును నుపపాదించుచున్నాఁడు:—

శ్లో. ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే,
బహుకృత్యం పురాస్యాభూత్తత్సర్వమధునా కృతమ్. 253

వ్యా. కృతకృత్యత్వమేవోపపాదయతి—ఐహికేతి. అస్య విదుషస్తత్త్వజ్ఞానోదయాత్పూర్వ మిహలోకే ఇష్టప్రాప్తయే అనిష్టనివృత్తయే చ కృషివాణిజ్యాదిక స్వర్గాది సిద్ధయే యాగోపాసనాదికం మోక్షసాధనజ్ఞానసిద్ధయే శ్రవణాదికం చేతి బహువిధం కర్తవ్య మాసీదిదానీంతు సాంసారికఫలేచ్ఛాభావా ద్బ్రహ్మానందసాక్షాత్కారస్య సిద్ధత్వాచ్చ తత్సర్వం కృషియాగశ్రవణాదికం కృతం కృతప్రాయమభూదతః పరమనుష్ఠేయత్వాభావాదిత్యర్థః.

టీ. అస్య=ఈవిద్వాంసునకు, పురా = జ్ఞానోత్పత్తికంటెఁ బూర్వము, ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై - ఐహిక = ఇహలోకమునందలి సుఖముల, ఆముష్మిక = పరలోకమునందలి సుఖముల, వ్రాత = సముదాయముయొక్క-, సిద్ధ్యై = సిద్ధికొఱకును, ముక్తేశ్చ = మోక్షముయొక్క-యు, సిద్ధయే = సిద్ధికొఱకును, బహు = అనేకమైన, కృత్యం=చేయఁదగినది, అభూత్=ఉండెను, తత్సర్వం = అదియంతయు, అధునా=ఇప్పుడు, కృతం = చేయఁబడినది.

తా. ఈ విద్వాంసునకు తత్త్వజ్ఞానోదయమునకుఁ బూర్వము ఇష్టప్రాప్తికొఱకును, అనిష్టనివృత్తికొఱకును కృషివాణిజ్యాదికర్మము జేయఁదగినదై యుండెను. స్వర్గాదిపుణ్యలోకసిద్ధికొఱకు యాగోపాస

నాదికము జేయఁదగిన దైయుండెను. తత్త్వజ్ఞానోదయ మైనపిమ్మటనో, సాంసారికఫలేచ్ఛ లేమిచేతను బ్రహ్మానందసాక్షాత్కారము గలుగుట చేతను ఆ కృషియాగాదిమంతయుఁ జేయఁబడినట్లాయెను. కనుక నిప్పుడు చేయఁదగినదంతయుఁ జేసినట్లె నాకు అన్ని లాభములు కలిగిన వని తృప్తి నొందును. ఇదియే కృతకృత్యత్వము.

అవ. కృతకృత్యత్వమునకు ఫల మగు నిరంకుశతృప్తిని ప్రతియోగి పురస్సరముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. తదేత త్కృతకృత్యత్వం ప్రతియోగిపురస్సరం,
అనుసంధద దేవాయ మేవం తృప్యతి నిత్యశః. 254

వ్యా. ఏవం కృతకృత్యత్వముపపాద్య తత్ఫలభూతాం తృప్తిం దర్శయతి— తదేతదితి. ప్రతియోగిపురస్సరం ప్రతియోగ్యనుసంధానపూర్వకం యథా భవతి తథా ఏవం వక్ష్యమాణప్రకారేణ సర్వదా తృప్యతి.

టీ. తదేతత్ = ఆ యీ, కృతకృత్యత్వం = ధన్యతను. ప్రతియోగిపురస్సరం= ఎదిరిసంగతిని, అనుసందధదేవ = తలంచుచునే, అయం = ఈజీవన్ముక్తుఁడు, నిత్యశః = ఎల్లప్పుడు, తృప్యత్యేవ=తృప్తిని జెందుచున్నవాఁడే యగును.

తా. తనకృతకృత్యత్వమును సంసారులకంటె తనకుఁ గలయుత్కర్షమునుం దలంచి యీజీవన్ముక్తుఁడు సంతసించుచునే యుండును.

అవ. అనుసంధానమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. దుఃఖినోఽజ్ఞా స్సంసరంతు కామం పుత్త్రాద్యపేక్షయా,
పరమానందపూర్ణోఽహం సంసరామి కిమిచ్ఛయా. 255

వ్యా. తదేవానుసంధానం ప్రపంచయతి దుఃఖినోజ్ఞా ఇత్యాదినా—"కృత కృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పున" రిత్యతః ప్రాక్తనేన గ్రంథేన. తత్ర తావ దైహికసుఖార్థిభ్యో వైలక్షణ్యం స్వస్య దర్శయతి—దుఃఖిన ఇతి.

టీ. దుఃఖినః = దుఃఖవంతులైన, అజ్ఞాః = పామరులు, కామం= స్వేచ్ఛచేత, పుత్త్రాద్యపేక్షయా = పుత్త్రాదులయందలియపేక్షతో, సంసరంతు=సంసారమును బొందుదురుగాక. పరమానందపూర్ణం=బ్రహ్మానందముచేఁ బూర్ణుఁడనైన, అహం=నేను, కిమిచ్ఛయా=దేనియందలికోరికచేత, సంసరామి = సంసారింతును ?

తా. సకాములు పుత్త్రాదులఁ గోరి యాయాకర్మములఁ జేయుదురు గాక. నిష్కాముఁడను బ్రహ్మానందపూర్ణుఁడను నగు నే నేల వానిం జేయుదును?

అవ. పరలోకప్రదము లగు యజ్ఞాదులను జేయువారికన్నఁ దనకుఁ గల్గు నుత్కర్షముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనుతిష్ఠంతు కర్మాణి పరలోకయియాసవః,
సర్వలోకాత్మకః కస్మాదనుతిష్ఠామి కిం కథమ్. 256

వ్యా. స్వర్గాద్యర్థం కర్మాద్యనుష్ఠాతృభ్యో వైలక్షణ్యమాహ—అనుతిష్ఠంత్వితి.

టీ. పరలోక యియాసవః=పరలోకమును బొందఁగోరినవారు, కర్మాణి=యజ్ఞాది కర్మముల, అనుతిష్ఠంతు=ఆచరింతురు గాక. సర్వలోకాత్మకః = సర్వలోకాత్ముఁడనైన, అహం=నేను, కస్మాత్ = ఏహేతువువలన, కిం=దేనిని, కథం=ఎట్లుగా, అనుతిష్ఠామి = ఆచరింతును?

తా. స్వర్గాదిలోకములఁ గోరెడివారు యజ్ఞాదుల నాచరించిన నాచరింతురు గాక. సర్వాత్మకుండ నగు నాకు వానితోఁ బనిలేదు.

అవ. స్వలాభము లేకున్నను పరోపకారార్థమైనను బ్రవర్తింపరాదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదా నధ్యాపయంతు వా,
యేఽత్రాధికారిణో మే తు నాధి కారోఽక్రియత్వతః. 257

వ్యా. నను స్వార్థప్రవృత్త్యభావేఽపి పదార్థప్రవృత్తిః కిం న స్యాదిత్యాశంక్యాధికారాభావాత్సాపి నాస్తీత్యాహ—వ్యాచక్షతామితి.

టీ. యే=ఎవ్వరు, అత్ర = ఈవిషయమై, అధికారిణః = అధికారముగలవారో, తే=వారు, శాస్త్రాణి = శాస్త్రములను, వ్యాచక్షతాం=వ్యాఖ్యానము చేయుదురు గాక. వేదాన్ = వేదములను, అధ్యాపయంతు = చదివింతురుగాక. మే తు=నాకైతే, అక్రియత్వతః = క్రియలు లేమింజేసి, అధికారః = అధికారము, నాస్తి=లేదు.

తా. కర్మాధికారము గలవారలు వేదాధ్యయనాదులఁ గావింతురుగాక. నిష్క్రియుఁడ నగు నాకు వానియం దధికారము లేదు.

అవ. జ్ఞానియందును తనదేహముం గాపాడుకొనుటకొఱకు భిక్షాహారణాదికమును పరలోకసాధనం బగు స్నానానుష్ఠానాదికమును గనఁబడుచున్నది. కనుక నితనికి అక్రియత్వ మెట్లు ఘటించు ననుటకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిద్రాభిక్షే స్నానశౌచే నేచ్ఛామి న కరోమిచ,
ద్రష్టారశ్చేత్కల్పయంతి కిం మే స్యాదన్యకల్పనాత్. 258

వ్యా. నను స్వదేహభరణార్థం భిక్షాహరణాదికం పరలోకార్థం స్నానాదికం చ భవతా క్రియమాణముపలక్ష్యతే అతోఽక్రియత్వమసిద్ధ మిత్యాశంక్య తదపి స్వదృష్ట్యానైవాస్తి కింత్వన్యైరేవ తత్కల్ప్యత ఇత్యాహ—నిద్రేతి.

టీ. నిద్రాభిక్షే=నిద్రాభిక్షలును, స్నానశౌచే = స్నానమును, మృత్తికాశౌచాదికమును, అహం=నేను, నేచ్ఛామి=కోరను. న కరోమి చ=చేయను. ద్రష్టారః=చూచెడివారు, కల్పయంతిచేత్ = కల్పించిరేని, అన్యకల్పనాత్ = ఇతరులకల్పనవలన, మే = నాకు, కిం స్యాత్ = ఏ మగును.

తా. నేను స్వదేహరక్షణార్థము గాని పరలోకముకొఱకుఁ గాని దేనినిం గోరుట లేదు. చేయుటయును లేదు. చూపరు లను కొన్నచో నాకేమి కొఱంత యగును.

అవ. ఇతరు లనుకొనుటవలన తనకు బాధలేమిని దృష్టాంతపూర్వకముగా వక్కాణించుచున్నాఁడు:—

శ్లో. గుంజాపుంజాది దహ్యేత నాన్యారోపితవహ్నినా,
నాన్యారోపితసంసారధర్మానేవ మహం భజే. 259

వ్యా. అన్యకల్పనయాపి బాధోఽస్తీత్యాశంక్య తదభావే దృష్టాంతమాహ—గుంజాపుంజేతి.

టీ. గుంజాపుంజాది = గురిగింజలరాశి మొదలగునది, అన్యారోపితవహ్నినా = తనయందు ఇతరులచేత నారోపింపఁబడిన నిప్పుచేత, న దహ్యేత = దహింపనేరదు. ఏవం=ఈవిధంబుగ, అన్యారోపితసంసారధర్మాన్ - అన్య=ఇతరులచేత, ఆరోపిత=ఆరోపింపఁబడిన, సంసారధర్మాన్=సంసారధర్మములను, అహం=నేను, న భజే=పొందను.

తా. గురిగింజలరాశిని అగ్ని యని కొందఱు భ్రమింపవచ్చును. పరకల్పిత మగుటచే నసత్య మగు నాయగ్ని దేనినైనం గాల్పఁగలదా ? కాల్పఁజాలదు. అటులనే యజ్ఞానులు నన్ను సంసారిగాఁ దలంచిన మాత్రమున నేను సంసారి నగుదునా ? కా నని భావము.

అవ. ఫలాంతరము గోరనందున కర్మానుష్ఠానము లేక పోయినను బ్రహ్మసాక్షాత్కారముకొఱకు శ్రవణాదులఁ జేయవలదా ? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. శృణ్వంత్వజ్ఞాతతత్త్వాస్తే జానన్ కస్మాచ్ఛృణోమ్యహం,
మన్యంతాం సంశయాపన్నా న మన్యేఽహ మసంశయః. 260

వ్యా. నను ఫలాంతరేచ్ఛాభావే కర్మానుష్ఠాన మభూత్తత్త్వసాక్షాత్కారాయ శ్రవణాదికం కర్తవ్యమేవేత్యాశంక్యాజ్ఞానాద్యభావాచ్ఛ్రవణాదికర్తృత్వమపి మమ నాస్తీత్యాహ—శృణ్వంత్వితి. అజ్ఞాతతత్త్వాః అజ్ఞాతం బ్రహ్మాత్మైకత్వలక్షణం తత్త్వం యైస్తే తథాభూతా శ్శ్రవణం కుర్వంతు తత్త్వమిత్థమన్యథా వేతి సంశయవంతో మననం కుర్వంతు మమ తు తదుభయాభావాన్నోభయత్ర ప్రవృత్తిరిత్యర్థః.

టీ. అజ్ఞాతతత్త్వాః = తత్త్వ మెఱుఁగని, తే=వారు, శృణ్వంతు = శ్రవణము చేయుదురు గాక. జానన్=శాస్త్రార్థజ్ఞానము గల, అహం=నేను, కస్మాత్ = ఎందువలన, శృణోమి = శ్రవణము చేయుదును. సంశయాపన్నాః = సంశయమును బొందినవారు, మన్యంతాం=మననము చేయుదురు గాక. అసంశయః=సంశయరహితుఁడ నగు, అహం= నేను, న మన్యే = మననము చేయను.

తా. శాస్త్రార్థజ్ఞానము లేనివారు (పరతత్త్వము నెఱుఁగనివారు) శ్రవణము చేయుదురు. సంశయాపన్నులు మననము చేయుదురు. నాకు శాస్త్రార్థనిశ్చయము గలదు కనుక సంశయము లేదు. అట్టినాకు శ్రవణమననము లెప్పుడు నవసరము లే దని భావము.

అవ. విపర్యయనివృత్తికొఱకు నిదిధ్యాసనము వలదా యనిన సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. విపర్యస్తో నిదిధ్యాసే త్కిం ధ్యాన మవిపర్యయాత్,
దేహాత్మత్వవిపర్యాసం న కదాచి ద్భజామ్యహమ్. 261

వ్యా. మా భూతాం శ్రవణమననే విపర్యయనిరాసార్థం నిదిధ్యాసనం కర్తవ్యమిత్యాశంక్య దేహాదావాత్మత్వబుద్ధిలక్షణస్య విపర్యయస్యాభావా త్తదపి నానుష్ఠేయమిత్యాహ—విపర్యస్త ఇతి.

టీ. విపర్యస్తః=విపరీతభ్రమగలవాఁడు, నిదిధ్యాసేత్ =నిదిధ్యాసమును జేయును. అవిపర్యయాత్ = విపర్యయము లేకపోవుటవలన, ధ్యానం=ధ్యానము, కిం=ఎందుకు ? కదాచిత్ = ఎప్పుడును, అహం=నేను, దేహాత్మత్వవిపర్యాసం = దేహమే యాత్మ యనెడి పొరపాటును, న భజామి = పొందను.

తా. దేహ మాత్మ యని భ్రమ చెందువాఁ డట్టిభ్రమ తొలంగుటకై ఆత్మధ్యాన మొనరించును. నా కట్టిభ్రమ లేదు. నే నేల ధ్యానము చేయవలెను ? అదియు నా కనవసరము.

అవ. జ్ఞానికి భ్రమయే లేనిచో నేను మనుష్యుఁడ ననువ్యవహార మెట్లు ఘటించు ననుశంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అహం మనుష్య ఇత్యాదివ్యవహారో వినాప్యముం,
విపర్యాసం చిరాభ్యస్తవాసనాతో౽వకల్పతే. 262

వ్యా. నను విపర్యయాభావే అహం మనుష్య ఇతివ్యవహారః కథం ఘటత ఇత్యాశంక్య వాసనావశాద్భవతీత్యాహ—అహమితి.

టీ. అహం=నేను, మనుష్యః = మనుష్యుఁడను, ఇత్యాదివ్యవహారః=ఈ మొదలగు వ్యవహారము, అముం విపర్యాసం=ఈవిపర్యయమును, వినాపి=వదలిపెట్టినను, చిరాభ్యస్త వాసనాతః-చిర=చాలాకాలమునుండి, అభ్యస్త=అభ్యసింపఁబడిన, వాసనాతః=సంస్కారమువలన, అవకల్పతే=నెఱవేఱుచున్నది.

తా. జ్ఞానికి దేహాత్మభ్రాంతి లేకపోయినను, అజ్ఞానదశయందలి యలవాటునుబట్టి నేను మనుష్యుఁడ నని యప్పుడప్పుడు వ్యవహరించును.

అవ. ఈవ్యవహార మెప్పుడు శమించు నను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రారబ్ధకర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే,
కర్మాక్షయే౽ప్యసౌ నైవ శామ్యేద్ధ్యానసహస్రతః. 263

వ్యా. తర్హ్యస్య వ్యవహారస్య నివృత్తిసిద్ధయే ధ్యానం సంపాద్యమిత్యాశంక్య ప్రారబ్ధక్షయమంతరేణాస్య నివృత్తిర్నాస్తీత్యాహ—ప్రారబ్ధేతి.

టీ. ప్రారబ్ధకర్మణి=ప్రారబ్ధకర్మ, క్షీణే=క్షయింపఁగా, వ్యవహారః=నేను మనుష్యుఁడ నను వ్యవహారము, నివర్తతే=తొలఁగును. కర్మాక్షయే = ప్రారబ్ధకర్మము నశింపనియెడల, అసౌ = ఈవ్యవహారము, ధ్యానసహస్రతః = వేయిధ్యానములవలననైనను, నైవ శామ్యేత్ = శమింపదు.

తా. ప్రారబ్ధము నశించె నేని వ్యవహార ముపశమించును. అది నశింపనంతకాలము నెన్నిధ్యానములు చేసినను వ్యవహార ముపశమింపదు.

అవ. వ్యవహారము తగ్గుటకొఱకు ధ్యాన మక్కఱ లేదా యను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. విరళత్వం వ్యవహృతే రిష్టం చేద్ధ్యాన మస్తుతే,
అబాధికాం వ్యవహృతిం పశ్యన్ ధ్యాయామ్యహం కుతః. 264

వ్యా. నను ప్రారబ్ధనిమిత్తకస్యాపి వ్యవహారస్య విరళత్వాయ ధ్యానం కర్తవ్యమేవేత్యాశంక్య వ్యవహారస్యాబాధకత్వదర్శనాత్తన్నివృత్తయే ధ్యానమననుష్ఠేయమిత్యాహ—విరళత్వమితి.

టీ. వ్యవహృతేః=వ్యవహారముయొక్క, విరళత్వం = పలుచదనము, తే=నీకు, ఇష్టంచేత్ = ఇష్టమైనయెడల, ధ్యానం=ధ్యానము, అస్తు=అగుఁగాక. వ్యవహృతిం = వ్యవహారమును, అబాధికాం = బాధకముకానిదానినిగా, పశ్యన్ = చూచుచున్న, అహం = నేను, కుతః = ఎందుకు, ధ్యాయామి = ధ్యానింతును.

తా. వ్యవహారము తగ్గవలెనని కోరిక గలవారు ధ్యానము చేయుదురుగాక. నాకు వ్యవహారము బాధకము గాదు. కాన ధ్యానముతోఁ బని లేదు. అనఁగా వ్యవహారము తన తత్త్వజ్ఞానమును బాధింపదని తత్త్వజ్ఞుని నిశ్చయము.

అవ. జ్ఞాని విక్షేపపరిహారముకొఱకు సమాధి చేయక తీరదుగదా యను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. విక్షేపో నాస్తి యస్మాన్మే న సమాధిస్తతో మమ,
విక్షేపో వా సమాధిర్వా మనసస్స్యాద్వికారిణః. 265

వ్యా. ధ్యానస్యాకర్తవ్యత్వేఽపి విక్షేపపరిహారాయ సమాధిః కర్తవ్య ఇత్యాశంక్య విక్షేపసమాధ్యోర్మనోధర్మత్వాన్న విక్షేపనివారకేఽపి సమాధావమాధికార ఇత్యాహ—విక్షేప ఇతి.

టీ. యస్మాత్ = ఏహేతువువలన, మే = నాకు, విక్షేపః=విక్షేపము, నాస్తి = లేదో, తతః = ఆహేతువువలన, మమ = నాకు, సమాధిః = సమాధి, న = లేదు, విక్షేపో వా = విక్షేపమైనను, సమాధిర్వా = సమాధి యైనను, వికారిణః=వికారవంతమైన, మనసః = మనస్సునకు, స్యాత్ = అగును.

తా. నేను చిద్రూపుఁడను, నాకు విక్షేపము లేదు. కనుక సమాధితో నాకు అవసరము లేదు. విక్షేపముగాని సమాధిగాని వికారవంతమైన మనస్సునకుఁ గాని నిర్వికారం బగు ఆత్మకు సంభవింపదు.

అవ. సమాధిఫల మగు ననుభవమును సంపాదింపవలదా యను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిత్యానుభవరూపస్య కో వా మేఽనుభవః పృథక్,
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ నిశ్చయః. 266

వ్యా. నను తథాపి సమాధిఫలమనుభవః సంపాదనీయ ఇత్యాశంక్యతస్య మత్స్వరూపత్వాన్న సంపాద్యత్వమిత్యాహ—నిత్యేతి. ఉపపాదితం కృతకృత్యత్వం నిగమయతి—కృతం కృత్యమితి.

టీ. నిత్యానుభవరూపస్య = ఎడతెగనియనుభవమే స్వరూపముగాఁగల, మే = నాకు, పృథక్ = వేఱుగా, అనుభవః = అనుభవము, కుతః = ఎక్కడిది ? కృత్యం = చేయఁదగినపని, కృతం = చేయఁబడినది. ప్రాపణీయం = పొందఁదగినది, ప్రాప్తం = పొందఁబడినది. ఇత్యేవ = అనియే, నిశ్చయః = నానిశ్చయము (అగుచున్నది).

తా. నేను నిత్యానుభవరూపుఁడను. నాకు సంపాదింపఁ దగిన యనుభవము వేఱుగా లేదు. చేయఁదగినకృత్యములు నెఱవేఱినవి. పొందఁదగినమోక్ష సుఖము పొందఁబడినది. ఇదియే నానిశ్చయము.

అవ. ఇటుల నియమ మంగీకరింపనిచో జ్ఞానికి స్వేచ్ఛాచారము ప్రసక్త మగునే యనెడిశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాన్యథాపి వా,
మమాకర్తు రలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్. 267

వ్యా. ఏవం సర్వత్ర కర్తృత్వానభ్యుపగమే అనియతవృత్తిత్వం ప్రసజ్యేతే త్యాశంక్య ప్రారబ్ధవశాత్ప్రాప్తమనియతవృత్తిత్వమంగీకరోతి—వ్యవహార ఇతి. లౌకికో భిక్షాహారాదిశ్శాస్త్రీయో జపసమాధ్యాదిరన్యథాపి వా ప్రతిషిద్ధహింసాదిర్వా వ్యవహారః కర్తృత్వ భోక్తృత్వరహితస్య మమ ప్రారబ్ధం కర్మానతిక్రమ్య ప్రవర్తతామిత్యర్థః.

టీ. అకర్తుః = కర్తకానట్టియు, అలేపస్య = భోక్తకానట్టియు, మమ = నాకు, లౌకికో వా = లోకసిద్ధము కాని, శాస్త్రీయో వా=శాస్త్రసిద్ధము గాని, అన్యథాపి వా= మఱియొకవిధమైనది గాని, వ్యవహారః = వ్యవహారము, యథారబ్ధం = ప్రారబ్ధానుసార ముగ, ప్రవర్తతాం = ప్రవర్తించుఁగాక.

తా. నేను కర్తను గాను. భోక్తను గాను. ప్రారబ్ధానుసార ముగా నావ్యవహార మెట్లుండిన నుండనిమ్ము. అది నాకు బాధకము కాదు.

అవ. ఇటుల నిజము చెప్పి ప్రౌఢవాదముతో సమాధానము చెప్పుచున్నాఁడు. ప్రౌఢవాదం బన నెదిరివానివాద మంగీకరించి చెప్పుట:—

శ్లో. అథవా కృతకృత్యోఽపి లోకానుగ్రహకామ్యయా,
శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేఽహం కా మమ క్షతిః. 268

వ్యా. ఏవం వస్తుతత్త్వమభిధాయ ప్రౌఢవాదేనాహ—అథవేతి. లోకానుగ్రహకామ్యయా ప్రాణ్యనుగ్రహేచ్ఛయేత్యర్థః.

టీ. అథవా = అటుల గాక పోయినను, కృతకృత్యోఽపి=నేను కృతకృత్యుఁడ నైనను, లోకానుగ్రహకామ్యయా=లోకము ననుగ్రహింపవలె నను సంకల్పముచేత,

శాస్త్రీయేణ = శాస్త్రసిద్ధ మగు, మార్గేణైవ = మార్గముచేతనే, వర్తే = వర్తించెదను, మమ = నాకు, కా క్షతిః = ఏమి నష్టము? (నష్టము లే దనుట.)

తా. నే నెటుల వర్తించినను తప్పు లేదు. లోకానుగ్రహము కొఱకు శాస్త్రీయముగనే వర్తించెదను నా కేమి నష్టము?

అవ. శాస్త్రీయమార్గమునందు వర్తించినయెడల తదభిమానమువలన నీకు వికారము గలుగదా యనుశంకకు రెండుశ్లోకములతో సమాధానము నిచ్చుచున్నాఁడు:—

శ్లో. దేవార్చనస్నానశౌచభిక్షాదౌ వర్తతాం వపుః,
తారం జపతు వాక్తద్వత్పఠత్వామ్నాయమస్తకమ్. 269
విష్ణుం ధ్యాయతు ధీర్యద్వా బ్రహ్మానందే విలీయతాం,
సాక్ష్యహం కించిదప్యత్ర న కుర్వే నాపి కారయే. 270

వ్యా. శాస్త్రీయ ఏవ మార్గే ప్రవర్తనాంగీకారే తర్హి తదభిమానప్రయుక్తో వికారస్స్యాదిత్యాశంక్యాహ—దేవార్చనేత్యాదినా శ్లోకద్వయేన తారం. ప్రణవం ఆమ్నాయమస్తకం వేదాంతశాస్త్రం.

టీ. వపుః = శరీరము, దేవార్చనస్నాన శౌచభిక్షాదౌ - దేవార్చన = దేవతాపూజయు, స్నాన = స్నానమును, శౌచ = మృత్తికాశౌచాదికము, భిక్షా = భిక్షయు, ఆదౌ = మొదలగు వానియందు, వర్తతాం = ప్రవర్తించుఁగాక, వాక్ = వాగింద్రియము, తారం = ప్రణవమును, జపతు = జపించుఁగాక, తద్వత్ = అటువలె, ఆమ్నాయమస్తకం = వేదాంతమును, పఠతు = పఠించుఁగాక, ధీః = బుద్ధి, విష్ణుం = విష్ణుమూర్తిని, ధ్యాయతు = ధ్యానముచేయుఁగాక. యద్వా=అట్లుగాక, బ్రహ్మానందే= బ్రహ్మానందమునందు, విలీయతాం = నిమగ్నమగుఁగాక, అహం = నేను, అత్ర = దీనికంతకును, సాక్షీ = తటస్థముగఁ జూచువాఁడను కాని, కించిదపి = కొంచెమైనను, న కుర్వే = చేయను, నాపి కారయే = చేయించను.

తా. ఆయాయింద్రియములు ఆయాపనులను జేయుచునుండుఁగాక. నేను వానికన్నిటికిని సాక్షిమాత్రుఁడను. నే నొక్కదానిని జేయుటయు లేదు, చేయించుటయును లేదు.

అవ. ఫలితముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం చ కలహః కుత్ర సంభవేత్కర్మిణో మమ,
విభిన్నవిషయత్వేన పూర్వాపరసముద్రవత్. 271

వ్యా. ఫలితమాహ—ఏవం చేతి.

టీ. ఏవంచ = నిజ మిట్లుండఁగా, కర్మిణః = కర్మానుష్ఠానపరునకును, మమ = నాకును, విభిన్నవిషయత్వేన=భిన్నములగు విషయములు గలవార మగుటచేత, పూర్వాపరసముద్రవత్ = ప్రాక్పశ్చిమసముద్రములకువలె, కుత్ర = ఏవిషయమున, కలహః = వివాదము, సంభవేత్ = సంభవించును? (సంభవింప దనుట.)

తా. నిజ మిది గనుక కర్మపరునకును నాకును విషయము వేఱగుటంజేసి యన్యోన్యము నెట్టివిరోధంబును లేదు.

అవ. కర్మికిని జ్ఞానికిని గల విషయభేదమును స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. వపుర్వాగ్ధీషు నిర్బంధః కర్మిణో న తు సాక్షిణి,
జ్ఞానిన స్సాక్ష్యలేపత్వే నిర్బంధో నేతరత్ర హి. 272

వ్యా. విభిన్నవిషయత్వమేవ స్పష్టయతి.

టీ. కర్మిణః = కర్మానుష్ఠానపరునకు, వపుర్వాగ్ధీషు = శరీరవాఙ్మనస్సులు మూఁటియందు, నిర్బంధః = పట్టుదల గలదు. సాక్షిణి = సాక్షియందు, న = పట్టుదలలేదు. జ్ఞానినః = జ్ఞానికి, సాక్ష్యలేపత్వే = సాక్షియొక్క నిర్లేపత్వమునందు, నిర్బంధః=పట్టుదలగాని, ఇతరత్ర = ఇతరములైన వాఙ్మనోబుద్ధులయందు, న హి = పట్టుదలలేదు.

తా. కర్మానుష్ఠానపరునకు శరీర వాఙ్మనస్సులయందు నిర్బంధము గలదు; సాక్షియందు నిర్బంధములేదు. జ్ఞానికి సాక్షియొక్క నిర్లేపత్వమునందే నిర్బంధముగాని శరీరవాఙ్మనస్సులయందు పట్టుదలలేదు. కనుక కర్మి జ్ఞాను లిద్దఱును విభిన్నవిషయు లగుదురు.

అవ. ఇటు లన్యోన్యవిరోధము లేకపోయినను పరస్పరము కలహించెడికర్మతుఁడును జ్ఞానియు విద్వాంసులకు పరిహాసపాత్రు లగుదు రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం చాన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌ బధిరావివ,
వివదేతాం బుద్ధిమంతో హాస న్త్యేవ విలోక్య తౌ. 273

వ్యా. తథాపి యా జ్ఞానికర్మిణౌ కలహం కుర్వాతే తౌ విద్వద్భిః పరిహాసనీయావిత్యాహ—ఏవం చేతి.

టీ. ఏవంచ = ఇట్లుండఁగా, అన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌ = ఒండొరులవృత్తాంతము తెలియంగని కర్మియును జ్ఞానియును, బధిరావివ = చెవిటివారివలె, వివదేతాం = కలహింతురు, బుద్ధిమంతః = బుద్ధిశాలురు, తౌ = వారిరువురిని, విలోక్య = కనుఁగొని, హాసన్త్యేవ = తప్పక నవ్వెదరు.

తా. స్వస్వాభిప్రాయంబుల (తమభావములను) నెఱుంగని కర్మియు జ్ఞానియును వాదించునపుడు వారివాదములు చెవిటివారల వాదములవలె బుద్ధిమంతులకు నవ్వు పుట్టించును.

అవ. అపహాస్య మెందు కని శంక గలుగఁగా కలహించుటకు విషయము లేదని శ్లోకద్వయమున నిరూపించుచున్నాఁడు:—

శ్లో. యం కర్మీ న విజానాతి సాక్షిణం తస్య తత్త్వవిత్,
బ్రహ్మత్వం బుధ్యతాం తత్ర కర్మిణః కిం విహీయతే. 274

వ్యా. కుతః పరిహాస్యత్వమిత్యాశంక్య నిర్విషయకలహకారిత్వాదిత్యాహ— యమితి. కర్మీ యం సాక్షిణం కర్మానుష్ఠానోపయోగిదేహవాగ్బుద్ధ్యతిరిక్తం ప్రత్యగాత్మానం న విజానాతి తత్త్వవిదా తస్య బ్రహ్మత్వే బుద్ధే కర్మిణః. కర్మానుష్ఠానే కిం హీయతే.

టీ. కర్మీ = కర్మానుష్ఠానపరుఁడు, యంసాక్షిణం = ఏసాక్షిని, న విజానాతి = గుర్తెఱుంగఁడో, తస్య = అట్టిసాక్షికి, తత్త్వవిత్ = బ్రహ్మవిదుఁడు, బ్రహ్మత్వం = బ్రహ్మత్వమును, బుధ్యతాం = తెలిసికొనుఁగాక. తత్ర = ఆవిషయమై, కర్మిణః = కర్మానుష్ఠానపరునకు, కిం హీయతే = ఏమి నష్టము గలుగును? (నష్టము లే దనుట.)

తా. కర్మపరుఁడు సాక్షి నెఱుంగఁడు, అట్టి సాక్షియే బ్రహ్మమని జ్ఞాని యనినచో కర్మపరున కేమి నష్టము ? కర్మఠున కేమియు లోటు లే దని భావము.

శ్లో. దేహవాగ్బుద్ధయ స్త్యక్తా జ్ఞానినాఽనృతబుద్ధితః,
కర్మీ ప్రవర్తయత్వాభి ర్జ్ఞానినో హీయతేఽత్ర కిమ్. 275

వ్యా. దేహేతి. జ్ఞానినా మిథ్యాత్వబుద్ధ్యా పరిత్యక్తాభిర్దేహవాగ్బుద్ధిభిః కర్మానుష్ఠానేజ్ఞానినోవాకిం విహీయతే? అతోనిర్విషయ కలహకారిణోః పరిహాసనీయత్వమిత్యర్థః.

టీ. జ్ఞానినా=జ్ఞానిచేత, అనృతబుద్ధితః మిథ్యాబుద్ధివలన, దేహవాగ్బుద్ధయః = శరీరవాఙ్మనస్సులు, త్యక్తాః = విడిచిపెట్టఁబడినవి, అభిః = యీశరీరవాఙ్మనస్సులచేత, కర్మీ=కర్మానుష్ఠానపరుఁడు, ప్రవర్తయతు = ప్రవర్తించుఁగాక. అత్ర=ఈవిషయమున, జ్ఞానినః=జ్ఞానికి' కిం హీయతే = నష్ట మేమి? (నష్టము లే దనుట.)

తా. జ్ఞాని వాఙ్మనఃకాయంబులను అసత్యబుద్ధిచేఁ ద్యజించెను. జ్ఞానిచేఁ ద్యజింపఁబడిన వాఙ్మనఃకాయములతోఁ గర్మపరుఁడు కర్మముల నాచరించెనేని, జ్ఞాని కేమి కొఱంత ? (ఏమాత్రము నష్టము లే దనుట.)

అవ. ఉపయోగములేదు గనుక జ్ఞాని కర్మప్రవృత్తిని అంగీకరింపఁడంటివేని నట్టి యుపయోగాభావము నివృత్తికిని సమానమని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రవృత్తి ర్నోపయుక్తా చేన్నివృత్తిః క్వోపయుజ్యతే,
బోధహేతు ర్నివృత్తిశ్చే ద్బుభుత్సాయాం తథేతరా. 276

వ్యా. కర్మానుష్ఠానం ప్రయోజనశూన్యత్వాన్న జ్ఞానినాభ్యుపగమ్యత ఇతి శంకతే—ప్రవృత్తిరితి. ఉపయోగాభావో నివృత్తావపి సమాన ఇతి పరిహరతి—నివృత్తిరితి. నివృత్తేర్బోధహేతుత్వాన్నోపయోగాభావ ఇతి శంకతే—బోధహేతుర్నివృత్తిశ్చేదితి. తర్హి ప్రవృత్తిరపి బుభుత్సాహేతుత్వాదుపయోగవతీత్యాహ—బుభుత్సాయామితి.

టీ. ప్రవృత్తిః = కర్మాచరణము, నోపయుక్తాచేత్ = ఉపయోగింపదంటివేని, నివృత్తిః=నివృత్తి, క్వ=ఎక్కడ, ఉపయుజ్యతే=ఉపయోగించును? నివృత్తిః = నివృత్తి, బోధహేతుశ్చేత్ = జ్ఞానహేతువంటివేని, తథా = అట్టులే, ఇతరా=ఇతరప్రవృత్తియును, బుభుత్సాయాం = జ్ఞానేచ్ఛోత్పాదనమునందు (కారణ మగును.)

తా. జ్ఞానికి ప్రవృత్తినివృత్తులు రెండింటితోను బనిలేదు. నివృత్తి బోధహేతు వగును. కనుక నుపయోగించు నంటివా బోధేచ్ఛోత్పాదనమునందుఁ బ్రవృత్తి అనఁగా కర్మానుష్ఠానము కారణము గనుక దాని నేల యంగీకరింపరాదు ?

శ్లో. బుద్ధశ్చేన్న బుభుత్సేత నాప్యసౌ బుధ్యతే పునః,
అబాధా దనువర్తేత బోధో న త్వన్యసాధనాత్. 277

వ్యా. నను బుద్ధస్యబుభుత్సాభావాత్ప్రవృత్తే రనుపయోగిత్వమితి పునశ్శంకతే—బుద్ధశ్చేదితి. తర్హి బుద్ధస్య పునర్బోధాభావాత్తద్ధేతునివృత్తిరపి బుద్ధం ప్రత్యనుపయోగినీ త్యాహ—నాపీతి. సకృజ్జాతస్య బోధస్య స్థిరత్వాయ నివృత్తి రపేక్ష్యత ఇత్యాశక్య స్థిరత్వం బాధకాభావమపేక్ష్యతే న సాధనాంతరమిత్యాహ—అబాధాదితి. వాక్యప్రమాణజన్యజ్ఞానస్య బలవతా ప్రమాణేన బాధాభావాదనువృత్తిస్స్యాదేవ, అతో న సాధనాంతరం తదర్థమనుష్ఠేయమిత్యర్థః.

టీ. బుద్ధః=జ్ఞానియగువాఁడు, నబుభుత్సేతచేత్=బోధేచ్ఛ నపేక్షింపఁడంటివా, అసౌ = ఈజ్ఞాని, పునః=తిరుగ, న బుధ్యతే = జ్ఞానము నపేక్షింపఁడు. బోధః = జ్ఞానము, అబాధాత్ = బాధలేమింజేసి, అనువర్తేత=అనువర్తించును, అన్యసాధనాత్ = ఇతరసాధనములను, నతు = అపేక్షింపదు.

తా. జ్ఞానము కలవానికి జ్ఞానేచ్ఛతోఁ బనిలేదు. కనుక జ్ఞానేచ్ఛను గలుగఁజేయు ప్రవృత్తిమార్గ మనవసరము అంటివేని జ్ఞానియు

నఁగా జ్ఞానము గలవాఁడు గనుక అట్టివానికి జ్ఞానసాధనం బగునివృత్తి తోడనుం బనిలేదు. విదేహకైవల్యపర్యంతము జ్ఞాన మనువర్తింపవలదా? అందువలన జ్ఞానికి నివృత్తి అనవసర మంటివేని నదియును సరిగాదు. తత్త్వజ్ఞానమును బాధించెడి ప్రబలప్రమాణము లేనందున ఒక మాటు గల్గిన యపరోక్షజ్ఞానమే ఆమరణ మనువర్తించును. ఇతర సాధనములతోఁ బనిలేదు. కాన జ్ఞానికిఁ బ్రవృత్తినివృత్తులు సమము లని భావము.

అవ. బ్రహ్మవిదుని జ్ఞానము ప్రమాణాంతరములచే బాధితము గాకపోయినను నవిద్యాతత్కార్యములచే బాధితము గాఁగూడదా యనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నావిద్యా నాపి తత్కార్యం బోధం బాధితుమర్హతి,
పురైవ తత్త్వబోధేన బాధితే తే ఉభే యతః. 278

వ్యా. నను ప్రమాణాంతరేణాభావేఽప్యవిద్యయా తత్కార్యేణ కర్తృత్వాద్యాసేన వా బాధస్స్యాదిత్యాశంక్యాహ—నావిద్యేతి. తత్ర హేతుమాహ—పురైవేతి.

టీ. అవిద్యా=అవిద్యగాని, తత్కార్యమపి=అవిద్యాకార్యమగు కర్తృత్వాదికము గాని, బోధం=తత్వసాక్షాత్కారమును, బాధితుం=బాధించుటకొఱకు, నార్హతి=తగదు, తేఉభే=ఆరెండును, పురైవ=లోగడనే, తత్త్వబోధేన = తత్త్వసాక్షాత్కారముచేత, యతః = ఏహేతువువలన, బాధితే = బాధింపఁబడినవో; అని పూర్వవాక్యముతో నన్వయము.

తా. అవిద్యాతత్కార్యములు తత్త్వజ్ఞానముచేత బాధితము లైనవి (కొట్టుపడినవి). కనుక అట్లు బాధితము లగుచు మృతప్రాయము లైన అవిద్యాతత్కార్యములు తత్త్వసాక్షాత్కారమును జెఱుపఁ జాలవు.

అవ. అవిద్య బాధితమైనను నవిద్యాకార్యము లగుదేహేంద్రియాదులు కనఁబడుచున్నవి గనుక బాధితములు గావు. అట్టి యవిద్యాకార్యములు బోధను నశింపఁ జేయునేమో యనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బాధితం దృశ్యతా మక్షై స్తేన బాధో నదృశ్యతే,
జీవన్నాఖుర్న మార్జారం హంతి హన్యాత్కథం మృతః. 279

వ్యా. నన్వవిద్యాయాభాధితత్వేపి తత్కార్యస్య ప్రతీయమానస్య బాధితత్వాసంభవాత్తేన బోధస్య బాధో భవేదిత్యాశంక్య ఉపాదాననివృత్త్యైవ తస్యాపి బాధిత

త్వాన్న తేనాపి బాధ శ్శంకితుం శక్యత ఇత్యాహ—బాధితమితి. తత్ర దృష్టాంత మాహ—జీవన్నితి. ఆఖుర్మూషకః.

టీ. బాధితం=తత్వజ్ఞానబాధితమైన దేహేంద్రియాదికము (అనఁగా దృశ్యము). అక్షైః=ఇంద్రియంబులచేత, దృశ్యతాం = చూడఁబడుఁగాక. తేన = ఆ దృశ్యముచేత, బాధః=జ్ఞానమునకు నాశము, న దృశ్యతే=చూడఁబడదు. జీవన్ = బ్రదికియుండిన, ఆఖుః=ఎలుక, మార్జారం=పిల్లిని, న హంతి = చంపలేదు. మృతః = చచ్చిన, ఆఖుః = ఎలుక, కథం=ఎట్లు, మార్జారం=పిల్లిని, హన్యాత్ =చంపును.

తా. దృశ్యము తత్త్వజ్ఞానబాధితమై గన్పట్టుఁగాక. చచ్చిన యెలుక పిల్లిని జంపఁజాలనట్లు తత్వజ్ఞానముచే హతప్రాయ మగు దృశ్యము బోధను బాధింపఁజాలదు.

అవ. ద్వైతదర్శనముచేత తత్త్వజ్ఞానము బాధింపఁబడకుండుటను దృష్టాంత ముతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అపి పాశుపతాస్త్రేణ విద్ధశ్చేన్న మమార యః,
నిష్ఫలేషువినున్నాంగో నంక్ష్యతీత్యత్ర కా ప్రమా. 280

వ్యా. ద్వైతదర్శనేన తత్త్వబోధస్య బాధాభావం కైముతికన్యాయప్రదర్శ నేన ద్రఢయితుం తదనుకూలం దృష్టాంతమాహ—అపీతి. యస్సమర్థః పాశుపతాస్త్రేణ విద్ధోఽపి న మమార చేత్కిల స నిష్ఫలేషువినున్నాంగః శల్యరహితేషుణా వ్యథితదేహ స్సన్నంక్ష్యతి నాశం ప్రాప్స్యతీత్యత్ర కా ప్రమా? ప్రమాణం నాస్తీత్యర్థః.

టీ. పాశుపతాస్త్రేణ = పాశుపతాస్త్రముచేత, యః = ఎవఁడు, విద్ధశ్చే దపి = కొట్టఁబడినను, న మమార=చావలేదో, సః=వాఁడు, నిష్ఫలేషువినున్నాంగః-నిష్ఫల = మొనలేని, ఇషు=బాణముచేత, వినున్న = గ్రుచ్చఁబడిన, అంగః=శరీరముగలవాఁడై, నంక్ష్యతి=నశింపఁగలఁడు. ఇత్యత్ర = ఈయంశమునందు, కా ప్రమా=ఏమిప్రమాణము? (ప్రమాణము లే దనుట.)

తా. పాశుపతాస్త్రముచేతను హతుఁడు గానివాఁడు మొండి బాణముచేత హతుఁ డగుట యెట్లసంభవమో, తత్త్వజ్ఞానమునకుఁ బూర్వమే దృశ్యముచేత బాధితముగాని బోధ నదృశ్యముచేత తిరుగఁ దా నెట్లు బాధింపఁబడును? ఇదియు నట్లే యసంభవము.

అవ. దృష్టాంతసిద్ధాంతం బగుసంగతిని ప్రకృతమునందు సమన్వయించు చున్నాఁడు:—

శ్లో. ఆదావవిద్యయా చిత్రైః స్వకార్యై ర్జృంభమాణయా,
యుద్ధ్వా బోధోఽజయత్సోఽద్య సుదృఢో బాధ్యతాం కథమ్. 281

వ్యా. దృష్టాంతసిద్ధమర్థం దార్ష్టాంతికే యోజయతి—ఆదావితి. ఆదౌ విద్యాభ్యాససమయే చిత్రైర్బహువిధైః స్వకార్యైః ప్రమాతృత్వభోక్తృత్వకర్తృత్వాదిభిర్జృంభమాణయా వివర్ధమానయాఽవిద్యయా బోధో యుద్ధ్వా యుద్ధం కృత్వా తామజయత్ స ఏవాభ్యాసపాటవేన సుదృఢోఽద్యేనానీమవిద్యానివృత్తౌ సత్యాం నిర్మూలేన తత్కార్యేణాధ్యాసేన కథం బాధ్యతాం న కథమపి బాధ్యేతేత్యర్థః.

టీ. ఆదౌ=మొదట, చిత్రైః = విచిత్రములైన, స్వకార్యైః = తనకార్యములగు కర్తృత్వభోక్తృత్వాదులచేత, జృంభమాణయా=వృద్ధిని బొందుచున్న, అవిద్యయా = అజ్ఞానముతో, యుద్ధ్వా = యుద్ధముచేసి, బోధః = జ్ఞానము, అజయత్ = జయించెను. సుదృఢః = మిగుల దృఢమైన, సః = అజ్ఞానము, అద్య = ఇప్పుడు, కథం = ఎట్లు, బాధ్యతాం = బాధింపఁబడును.

తా. సంసారదశలో కర్తృత్వభోక్తృత్వాదులు విజృంభించుచుండు సమయముననే అవిద్యతోఁ బోరాడి యవిద్యను జయించి బ్రహ్మసాక్షాత్కారమును బొందెను. అట్టి బ్రహ్మసాక్షాత్కారము తనచే లోఁగడనే పరాజితం బగు నవిద్యచేత బాధింపఁబడదు. నిశ్చయము.

అవ. సిద్ధమైన యర్థమును రూపకాలంకారముచే నభివర్ణించుచున్నాఁడు:—

శ్లో. తిష్ఠంత్వజ్ఞానతత్కార్యశవా బోధేన మారితాః,
న భీతిర్బోధసమ్రాజః కీర్తిః ప్రత్యుత తస్య తైః. 282

వ్యా. ఉపపాదితమర్థం శ్రోతృబుద్ధ్యారోహాయ రూపకేణాహ—తిష్ఠంత్వితి.

టీ. బోధేన = తత్త్వజ్ఞానముచేత, మారితాః = చంపఁబడిన, అజ్ఞానతత్కార్యశవాః = అజ్ఞానము దాని కార్యంబు లనియెడి పీనుంగులు, తిష్ఠంతు=ఉండుఁగాక. బోధసమ్రాజః = బోధ యను చక్రవర్తికి, భీతిః = భయము, న = లేదు. ప్రత్యుత = విచారింపఁగా, తస్య = ఆబోధచక్రవర్తికి, తైః=ఆయజ్ఞానతత్కార్యశవములచేత, కీర్తిః = ప్రతిష్ఠ (అస్తి = కలదు).

తా. బోధచేత మిథ్యాభూతములుగా గ్రహింపఁబడి హతప్రాయములై అజ్ఞానతత్కార్యము లుండిన నుండనిండు. వానినిఁ జూచి తత్త్వవిదుఁడు ఇవి యేమి చేయునో యని భయపడఁడు. యుద్ధకాలములో మహావీరులతోఁ బోరాడి వారిం జంపిన శూరుఁడు వాదిశవము

లను జూచి భయమందఁడు. ఇంతియ గాదు. దీనివలన నీమహాపీడఁ డిందఱిని బోకార్చె నను కీర్తినే పొందును. అటులనే జ్ఞానికి కీర్తియే సంభవించును.

అవ. ఇట్టి జ్ఞానికి లాభముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. య ఏవమతిశూరేణ బోధేన న వియుజ్యతే,
ప్రవృత్త్యా వా నివృత్త్యా వా దేహాదిగతయాస్య కిమ్. 283

వ్యా. భవత్వేవం ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—య ఇతి. యః పుమానేవ ముక్తప్రకారేణాతిశూరేణావిద్యాతత్కార్యఘాతకేన బోధేన బ్రహ్మాత్మత్వజ్ఞానేన న వియుజ్యతే న కదాచిదపి వియుక్తో భవతి. అస్య పుంసో దేహాదినిష్ఠయా ప్రవృత్త్యా వా నివృత్త్యా వా కిం ? న కిమపీష్టమనిష్టం చేత్యర్థః.

టీ. యః = ఎవఁడు, ఏవం = ఈవిధముగా అతిశూరేణ = మిక్కిలిశూరుఁడైన, బోధేన = జ్ఞానముతో, న వియుజ్యతే = ఎడబాటును బొందఁడో, అస్య = ఇతనికి, దేహాదిగతయా = శరీరాదికమును బొందిన, ప్రవృత్త్యావా = ప్రవృత్తితోఁగాని, నివృత్త్యావా = నివృత్తితోఁగాని, కిం = ఏమి ప్రయోజనము.

తా. ఇట్టి వీర్యవంత మగు బోధగల మహనీయుఁడు శరీరగతము లగు ప్రవృత్తినివృత్తులచే హాని చెందఁడు.

అవ. జ్ఞానింబోలి యజ్ఞానియు ప్రవృత్తినివృత్తుల నేల మానకూడ దనుప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రవృత్తావాగ్రహో న్యాయ్యో బోధహీనస్య సర్వథా,
స్వర్గాయ వాపవర్గాయ యతితవ్యం యతో నృభిః. 284

వ్యా. తర్హి జ్ఞానివదజ్ఞానినోఽపి ప్రవృత్తావాగ్రహో న యుక్త ఇత్యాశఙ్క్యాహ—ప్రవృత్తావితి. తత్రోపపత్తిమాహ—స్వర్గాయేతి.

టీ. బోధహీనస్య = అపరోక్షజ్ఞానము లేనివానికి, సర్వథా=సకలవిధములచేత, ప్రవృత్తౌ = ప్రవర్తనమున, ఆగ్రహః = అభినివేశము, న్యాయ్యః=యుక్తము. యతః= ఏహేతువువలన, నృభిః = అజ్ఞానులగు మనుజులచేత, స్వర్గాయవా = స్వర్గముకొఱకు గాని, అపవర్గాయవా = మోక్షముకొఱకుగాని, యతితవ్యం = యత్నింపఁదగినదో. (ఆకారణమున).

తా. బ్రహ్మవిదునితో నజ్ఞాని పోల్పఁదగఁడు. బ్రహ్మవిదుఁడు కృతకృత్యుఁడు. అజ్ఞానికి స్వర్గమోక్షములతోఁ బని గలదు. కనుక నితఁడు తదర్థమై యత్నించుట న్యాయ్యము.

అవ. కర్మపరులతోఁ గలసియున్నపుడు జ్ఞాని యెట్లు చరించునో యాసంగతిని దెలియపఱచుచున్నాఁడు:—

శ్లో. విద్వాంశ్చేత్తాదృశాం మధ్యే తిష్ఠేత్తదనురోధతః,
కాయేన మనసా వాచా కరోత్యేవాఖిలాః క్రియాః. 285

వ్యా. విదుషఆగ్రహేణ యుక్త ఇత్యుక్తం తర్హి కర్మిణాం మధ్యే వర్తమానేన తేన కిం కర్తవ్యమిత్యాహ—విద్వాంశ్చేదితి. విద్వాంస్తాదృశాం కర్మిణాం మధ్యే తిష్ఠే చ్చేత్తదనురోధతస్తేషామనుసారేణ శరీరాభిస్సర్వాః క్రియాః కరోత్యేవ న తాన్కర్మిణో నివారయే దిత్యర్థః.

టీ. విద్వాన్ = బ్రహ్మవిదుఁడు, తాదృశాం మధ్యే = అట్టి అజ్ఞానులనడుమను, తిష్ఠేచ్చేత్ = ఉన్నయెడల, తదనురోధతః = వారి ననుసరించి, కాయేన = శరీరము చేతను, మనసా = మనస్సుచేతను, దాచా = వాక్కుచేతను, అఖిలాః = సమస్తములైన, క్రియాః = క్రియలను, కరోత్యేవ = చేయుచునే యుండును.

తా. బ్రహ్మవిదుఁడు అజ్ఞానులతోఁ గలసినపుడు తనకుఁ బ్రయోజనము లేకపోయినను లోకానుగ్రహము కొఱకు మనోవాక్కాయము లచే నాయాపనులు అజ్ఞానులవలెనే చేయును.

అవ. ముముక్షువులతోఁ గలసినపుడు జ్ఞాని ప్రవర్తించెడి విధమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. ఏష మధ్యే బుభుత్సూనాం యదా తిష్ఠేత్తదా పునః,
బోధాయైషాం క్రియాస్సర్వా దూషయంస్త్యజతు స్వయమ్. 286

వ్యా. అస్యైవ తత్వబుభుత్సూనాం మధ్యే స్థితస్య కృత్యమాహ—ఏషమధ్య ఇతి. ఏష విద్వాన్బుభుత్సూనాం మధ్యే యదా తిష్ఠేత్తదా తేషాం బుభుత్సూనాం బోధాయ తత్త్వజ్ఞానజననాయ తాః క్రియా దూషయన్స్వయమపి త్యజతు.

టీ. ఏషః = ఈజ్ఞాని, యదా=ఎప్పుడు, బుభుత్సూనాం మధ్యే = తత్త్వజ్ఞానాపేక్షగలవారియొక్క మధ్యయందు, తిష్ఠేత్ = ఉండునో, తదా=అప్పుడు, తేషాం = ఆముముక్షువులకు, బోధాయ = బోధకొఱకు, సర్వాః = సమస్తములైన, క్రియాః = క్రియలను, దూషయన్ = దూషించుచు, స్వయం = తాను, త్యజతి = వదలిపెట్టుచున్నాఁడు:—

తా. ఈ మహనీయుఁడు ముముక్షువులయొద్ద వారికి జ్ఞానము కలుగుటకొఱకు కర్మలవలన ప్రయోజనము లేదని నుడువుచు దానును మానివేయును.

అవ. ఎందు కిటుల చేయుననుప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవిద్వదనుసారేణ వృత్తిర్బుద్ధస్య యుజ్యతే,
స్తనంధయానుసారేణ వర్తతే తత్పితా యతః. 287

వ్యా. కుత ఏవం కర్తవ్యమిత్యత ఆహ—అవిద్వదితి. అజ్ఞాన్యనుసారేణ జ్ఞానినో వర్తనముచితం కృపాళుత్వాత్తేషా మనుకంపనీయత్వాచ్చేతిభావః. ఏవం క్వ దృష్టమిత్యత ఆహ—స్తనంధయేతి. స్తనంధయా స్తనపానకర్తారః శిశవ ఇత్యర్థః.

టీ. బుద్ధస్య = బ్రహ్మవిదునకు, అవిద్వదనుసారేణ = అజ్ఞానుల ననుసరించుటచే, వృత్తిః=వర్తనము, యుజ్యతే=యుక్తమగుచున్నది. యతః=ఏహేతువువలన, తత్పితా= వానితండ్రి, స్తనంధయానుసారేణ = బాలునియిష్టానుసారముగా, వర్తతే = ఉండునో, అటులనే యని పైదానితో నన్వయము.

తా. బాలుని చిత్తవృత్తిని వానితండ్రి యనుసరించి బుద్ధి చెప్పు నట్లు జ్ఞాని అజ్ఞానుల చిత్తవృత్తుల ననుసరించి వారల యోగ్యతాను సారముగ బోధించును వారికి విశ్వాసము గల్గుట కొఱకు దానును నటులనే వర్తించును.

అవ. దీనినే స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. అధిక్షిప్తస్తాడితో వా బాలేన స్వపితా తదా,
న క్లిశ్నాతి న కుప్యేత బాలం ప్రత్యుత లాలయేత్. 288

వ్యా. పితుస్తనంధయానుసారిత్వమేవ దర్శయతి—అధిక్షిప్త ఇతి.

టీ. బాలేన = పిల్లవానిచేత, స్వపితా = తనతండ్రి, అధిక్షిప్తః = తిరస్కరింపఁ బడినను, తాడితోవా = కొట్టఁబడినను, తదా=అప్పుడు, న క్లిశ్నాతి=క్లేశమునొందఁడు. న కుప్యేత = కోపగింపఁడు. ప్రత్యుత = ఇఁక నేమి యన, బాలం=పిల్లవానిని, లాలయేత్ = బుజ్జగించును.

తా. బాలుఁడు తెలియక తండ్రిని దిట్టినను గొట్టినను తండ్రి యది తప్పిదముగా నెంచి కోపగింపఁడు. తెలియక యిటుల చేసె నని క్షమించి బుజ్జగించును.

అవ. దార్ష్టాంతికముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిందితః స్తూయమానో వా విద్వానజ్ఞైర్న నిందని,
న స్తౌతి కింతు తేషాం స్యాద్యథా బోధ స్తథా చరేత్. 289

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—నిందిత ఇతి. విద్వాన్ అజ్ఞైర్నిందిత స్తూయమానో వా స్వయం న నిందతి న స్తౌతి కింతు తేషా మజ్ఞానాం యథా బోధ ఉపజాయతే తథాచరేత్.

టీ. విద్వాన్ = పండితుఁడు, అజ్ఞైః = అజ్ఞానులచేత, నిందితః = నిందింపఁబడినను, స్తూయమానోవా = స్తుతింపఁబడినను, న నిందతి=నిందింపఁబడు, న స్తౌతి=స్తుతింపఁడు. కింతు=ఇఁక నేమి యన, తేషాం=ఆయజ్ఞానులకు, బోధః=బోధ, యథాస్యాత్=ఎట్లుగాఁ గల్గునో, తథా=అప్రకారముగా, ఆచరేత్=ఆచరించును.

తా. బ్రహ్మవిదుఁడు అజ్ఞానుల స్తుతినిందల గమనింపఁడు. వారికి బోధగల్గురీతిని వర్తించును.

అవ. ఇటులు చేయుటకు హేతువును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యేనాయం నటనేనాత్ర బుధ్యతే కార్యమేవ తత్,
అజ్ఞప్రబోధా న్నైవాన్యత్కార్యమస్త్యత్ర తద్విదః. 290

వ్యా. ఏవమాచరణే నిమిత్తమాహ—యేనేతి. అయమజ్ఞానీ అత్రాస్మిన్ లోకే విదుషో యేన యాదృశేన నటనేనాచరణేన బుధ్యతే తత్త్వమవగచ్ఛతి. తదాచరణం తేన కర్తవ్యమేవ. తర్హి తద్వదేవ కార్యాంతరమపి ప్రసజ్యేతేత్యత ఆహ—అజ్ఞేతి. యతస్తద్విదస్తత్త్వవిదః అత్రలోకేఽజ్ఞప్రబోధాదన్యత్కర్తవ్యం నైవాస్త్యతస్తదనుసరణేన తత్త్వబోధనం కర్తవ్యమిత్యర్థః.

టీ. అత్ర=ఈలోకమునందు, యేన నటనేన = ఏయాచరణముచేత, అయం = ఈయజ్ఞుఁడు, బుధ్యతే = జ్ఞానముగలవాఁ డగునో, తదేవ=అదియే, కార్యం = జ్ఞానికి కర్తవ్యము, అత్ర = ఈలోకమున, తద్విదః = బ్రహ్మవిదునకు, అజ్ఞప్రబోధాత్ = అజ్ఞానుల బోధించుటకంటె, అన్యత్=వేఱొక, కార్యం = పని, న = లేదు.

తా. తా నెటుల వర్తించిన అజ్ఞానులకు జ్ఞానలాభము గల్గునో అటులనే వర్తించును. అజ్ఞానులఁ గడదేర్చుటకన్న జ్ఞానుల కొండు కర్తవ్యము లేదు.

అవ. యావద్గ్రంథ తాత్పర్యమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. కృతకృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః,
తృప్యన్నేవం స్వమనసా మన్యతేఽసౌ నిరంతరమ్. 291

వ్యా. వృత్తవర్తిష్యమాణయోస్తాత్పర్యమాహ—కృతకృత్యేతి. అసౌ విద్వాన్ పూర్వోక్తప్రకారేణ కృతకృత్యతయా కృతం కృత్యజాతం యేనాసౌ కృతకృత్య

స్తస్య భావ స్తత్తా తయా తృప్తస్సన్ వక్ష్యమాణప్రకారేణ ప్రాప్తప్రాప్యతయా ప్రాప్తం ప్రాప్యం యేన సః ప్రాప్తప్రాప్యః. తస్య భావ స్తత్తా తయా తృప్యన్ తృప్తో భవన్ స్వమనసా నిరంతరమేవం మన్యతే.

టీ. కృతకృత్యతయా=కృతకృత్యత్వముచేతను, ప్రాప్తప్రాప్యతయా = పొందవలసినదానిం బొందుటచేతను, తృప్తః=తృప్తినొందినవాఁడగుచు, స్వమనసా=తన మనస్సుచేత, ఏవం = ఈవిధముగా, తృప్యన్=తృప్తుఁడగుచు, అసౌ=ఈవిద్వాంసుఁడు, నిరంతరం=ఎడతెగక, మన్యతే = తలంచుచున్నాఁడు.

తా. నిత్యతృప్తుఁడును పురుషార్థలాభము కలిగినట్టియు జ్ఞాని మనస్సులో నిట్లు తలంచును.

అవ. ఆతలంచెడి విధంబు చివరదనుక చెప్పుచున్నాఁడు:—

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి,
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్. 292

వ్యా. కిం మన్యత ఇత్యత ఆహ—ధన్యోఽహం ధన్యోఽహ మిత్యాదినా. ధన్యః కృతార్థః. ఆదరార్థే వీప్సా. నిత్యమనవరతం స్వాత్మానం స్వస్య నిజం రూపం దేశాద్యనవచ్ఛిన్నం ప్రత్యగాత్మాన మంజసా సాక్షాద్యతో వేద్మి జానామి, అతో ధన్య ఇత్యర్థః. ఏవమాత్మజ్ఞానలాభనిమిత్తాం తుష్టి మభిధాయ తత్ఫలలాభనిమిత్తాం తుష్టిం దర్శయతి—ధన్య ఇతి. బ్రహ్మానందః బ్రహ్మభూతానందః మే స్పష్టం విభాతి స్పష్టం యథా భవతి తథా స్ఫురతీత్యర్థః.

టీ. నిత్యం=ఎల్లప్పుడు, స్వాత్మానం=స్వస్వరూపమును, అంజసా=యథార్థముగా, వేద్మి=గుర్తెఱుంగుచున్నాను. అతః = ఈహేతువువలన, అహం=నేను, ధన్యోఽహం ధన్యోఽహం = మిగుల ధన్యుఁడను, ఆదరార్థము ద్విరుక్తము. ఇటులనే ముందును గ్రహించునది. మే=నాకు, బ్రహ్మానందః=బ్రహ్మానందము, స్పష్టం=స్ఫుటముగా, విభాతి=ప్రకాశించుచున్నది, ధన్యోఽహం ధన్యోఽహం = నే నత్యంతము ధన్యుఁడను.

తా. స్పష్టము.

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య,
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి. 293

వ్యా. ఏవమిష్టప్రాప్త్యా తుష్టి మభిధాయానిష్టనివృత్త్యాపి తుష్యతీత్యాహ—ధన్యోఽహమితి. అద్య ఇదానీం దుఃఖం దుఃఖస్వరూపం సంసారం న వీక్షే న పశ్యామి.

అతః కృతార్థ ఇత్యర్థః. దుఃఖాప్రతీతౌ కారణమాహ—ధన్యోఽహమితి. అనేక కర్మ వాసనాజాలమజ్ఞానం క్వాపి పలాయితం నష్టమిత్యర్థః.

టీ. సాంసారికం = సంసారసంబంధమైన, దుఃఖం = దుఃఖమును, అద్య = ఇప్పుడు, న వీక్షే=చూడను. అతః=ఈకారణమువలన, ధన్యోఽహం ధన్యోఽహం= నేను మిక్కిలి ధన్యుఁడను, స్వస్య=నాయొక్క, అజ్ఞానం=అజ్ఞానము, క్వాపి = ఎచ్చటికో, పలాయితం=పరుగెత్తిపోయినది, అతః=ఇందువలన, ధన్యోఽహం ధన్యోఽహం= చాల ధన్యుండను.

తా. స్పష్టము.

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్,
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్. 294

వ్యా. అజ్ఞాననివృత్తఫలకృతకృత్యత్వంప్రాప్తప్రాప్యత్వంచ దర్శయతి—ధన్యఇతి.

టీ. నవిద్యతే = లేదు. అతః = ఇత్యాదికమును పైవలెనే, సర్వం=సమస్తమైన, ప్రాప్తవ్యం = పొందఁదగినది, అద్య = ఇప్పుడు, సంపన్నం=లభించినది, ధన్యోఽహం ధన్యోఽహం = అత్యంతము కృతార్థుండను.

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే,
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః. 295

వ్యా. ఇదానీం కృతకృత్యత్వమిత్యాదినా జాతాయాస్తృప్తేర్నిరతిశయత్వమాహ—ధన్య ఇతి. ఇతః పరం వక్తవ్యాదర్శనాత్తుష్టిరేవ పరిస్ఫురతీతి దర్శయతి—ధన్య ఇతి.

టీ. మే=నాయొక్క, తృప్తేః = తృప్తికి, ఉపమా=సాదృశ్యము, లోకే=లోకమందు, కా=ఏది, భవేత్=అగును? (నాతృప్తినిరుపమానమైన దనుట). ధన్యోఽహం ధన్యోఽహం=ఇఁక కోరఁదగినది లేనందున తన ధన్యవాదముతో ముగించుచున్నాఁడు.

శ్లో. అహో పుణ్య మహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్,
అస్య పుణ్యస్య సంపత్తే రహో వయ మహో వయమ్. 296

వ్యా. అస్యసర్వస్య కారణభూతపుణ్యపుంజపరిపాకమనుస్మృత్య తుష్యతీత్యాహ—అహో పుణ్యమితి. ఏవంవిధపుణ్యసంపాదకమాత్మానమనుస్మృత్య తుష్యతి—అస్యేతి.

టీ. పుణ్యం = పుణ్యము, అహో=ఎంత ఆశ్చర్యకరము ! దృఢం = దృఢముగా, ఫలితం=ఫలించినది. అస్య = ఈపుణ్యముయొక్క, సంపత్తేః = సంపత్తివలన, వయం = మేము, అహో=ఎంతవారము, సర్వత్ర ద్విరుక్తి ఆదరార్థ మగు నని యెఱుంగునది.

శ్లో. అహో శాస్త్ర మహో శాస్త్ర మహో గురు రహో గురుః,
అహో జ్ఞాన మహో జ్ఞాన మహో సుఖ మహో సుఖమ్. 297

వ్యా. ఇదానీం సమ్యగ్జ్ఞానసాధనం శాస్త్రం తదుపదేష్టార మాచార్యం చాను స్మృత్య తుష్యతి. అహో శాస్త్రమితి. పునశ్చ శాస్త్రజన్యం జ్ఞానం తత్సుఖం చాను స్మృత్య సంతుష్యతి—అహో జ్ఞానమితి.

టీ. శాస్త్రం=శాస్త్రము, అహో = ఎంతచిత్రమైనది, గురుః=గురువు, అహో= ఎంతటిమహనీయుఁడు, జ్ఞానం = జ్ఞానము, అహో = ఎంతదొడ్డది ! సుఖం = మోక్ష సుఖము, అహో=ఎంత గొప్పది ! అనఁగా వీనిమహాత్త్వముల కవధియే లే దనుట.

శ్లో. తృప్తిదీప మిమం నిత్యం యేఽనుసందధతే బుధాః,
బ్రహ్మానందే నిమజ్జంత స్తే తృప్యంతి నిరంతరమ్. 298

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
తృప్తిదీప స్సమాప్తః.

వ్యా. గ్రంథాభ్యాసఫలమాహ—తృప్తిదీపమితి.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితం తాత్పర్యబోధినీనామకం తృప్తిదీప వ్యాఖ్యానం సమాప్తమ్.

టీ. ఇదం తృప్తిదీపం = ఈతృప్తిదీప మను ప్రకరణమును, యే బుధాః = ఏ విద్వాంసులు, నిత్యం=అనుదినము, అనుసందధతే = అనుసంధానము చేయుదురో, తే= వారు, బ్రహ్మానందే=బ్రహ్మానందమునందు, నిమజ్జంతః=మునిఁగినవా రగుచు, నిరంతరం = ఎడతెగక, తృప్యంతి = తృప్తిని జెందుదురు.

తా. ఈతృప్తిదీప మను ప్రకరణమును నిత్య మనుసంధానము చేయువారు బ్రహ్మానందామృతాబ్ధిలో నోలలాడుదురు.

ఇది శ్రీవిద్యారణ్యకృతంబగు పంచదశియందు తృప్తిదీప మను
సప్తమప్రకరణము.

శ్రీ ర స్తు
శ్రీ గణేశాయ నమః.



# శ్రీ వేదాంతపంచదశి

## అష్టమ ప్రకరణము

---

### కూటస్థదీప ప్రకరణము

అవ. ముముక్షువునకు మోక్షసాధనం బగు బ్రహ్మజ్ఞానము త్వంపదార్థశోధనము వలనం గలుగును. కాన త్వంపదార్థశోధనపర మగు కూటస్థదీప మను ప్రకరణము నారంభింపఁదలంచి శ్రీవిద్యారణ్యులు త్వంపదలక్ష్యార్థమును వాచ్యార్థమును దృష్టాంతములతో వేఱువేఱుగా చెప్పుచున్నారు:—

శ్లో. ఖాదిత్యదీపితే కుడ్యే దర్పణాదిత్యదీప్తివత్,
కూటస్థభాసితో దేహో ధీస్థజీవేన భాస్యతే. 1

వ్యాఖ్యానమ్

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
కుర్వే కూటస్థదీపస్య వ్యాఖ్యాం తాత్పర్యదీపికామ్.

వ్యా. అత్ర ముముక్షో ర్మోక్షసాధనస్య బ్రహ్మాత్మైకత్వజ్ఞానస్య త్వంపదార్థశోధనపూర్వకత్వా త్త్వంపదార్థశోధనపరం కూటస్థదీపాఖ్యం గ్రంథమారభమాణ ఆచార్యో ఽస్య గ్రంథస్య వేదాంతప్రకరణత్వేన తదీయైరేవ విషయాదిభి స్తద్వత్తాసిద్ధిమభిప్రేత్య త్వం పదలక్ష్యవాచ్యౌ కూటస్థజీవౌ సదృష్టాంతం భేదేన నిర్దిశతి—ఖాదిత్యేతి. ఖాదిత్య దీపితే ఖే ఆదిత్యః ఖాదిత్యః ప్రసిద్ధసూర్య ఇత్యర్థః. తేన చ తత్సంబంధ్యాలోకో లక్ష్యతే. తేన దీపితే ప్రకాశితే కుడ్యే దర్పణాదిత్యదీప్తివత్ దర్పణేషు నిపత్య పరావృత్తైశ్చ కుడ్యసంబద్ధై రాదిత్యరశ్మిభి స్తత్ప్రకాశనమివ కూటస్థభాసితః కూటస్థేనా విశారిచై తన్యేన భాసితః ప్రకాశితో దేహో ధీస్థజీవేన బుద్ధిస్థచిదాభాసేన భాస్యతే ప్రకాశ్యతే. , అనేనసామాన్యతో విశేషతశ్చ కుడ్యావభాసకాదిత్యప్రకాశద్వయమివ దేహావభాసకచై తన్యద్వయమస్తీతి ప్రతిజ్ఞాతం భవతి.

టీ. ఖాదిత్యదీపితే = ఆకాశమునందలిసూర్యునిచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన, కుడ్యే = గోడయందు, దర్పణాదిత్యదీప్తివత్-దర్పణాదిత్య=అద్దమందు ప్రతిఫలించిన సూర్యునియొక్క, దీప్తివత్=ప్రకాశమువలె, కూటస్థభాసితః=కూటస్థుని చేఁ బ్రకాశింపఁజేయఁబడిన, దేహః = స్థూలదేహము, ధీస్థజీవేన = అంతఃకరణమునందు ప్రతిఫలించిన చిదాభాసుఁ డగుజీవునిచేత, భాస్యతే=ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

తా. ఆకాశమునందలి సూర్యునివంటివాఁడు కూటస్థుఁడు. అద్దములోఁ బ్రతిఫలించిన సూర్యునివంటివాఁడు చిదాభాసుఁడు. అనఁగా జీవుఁడు. గోడను బోలినది శరీరము. ఎండచే వ్యాప్తంబగుగోడపైని అద్దములోని సూర్యప్రతిబింబముయొక్క ప్రభ వ్యాపించిన నెట్టులుండునో, అట్టులే కూటస్థునిచేఁ బ్రకాశింపఁజేయఁబడిన శరీరము చిదాభాసునిచేఁగూడఁ బ్రకాశింపఁజేయఁబడినపుడు ద్విగుణప్రకాశము గలదై వర్తించును. అనఁగా త్వంపదలక్ష్యార్థ మగు కూటస్థుఁ డాకాశసూర్యునివంటి వాఁడు. త్వంపదవాచ్యార్థ మగు చిదాభాసుఁడు దర్పణములోని సూర్యప్రతిబింబమువంటివాఁ డగు నని భావము.

అవ. ఆదిత్యప్రతిబింబముయొక్క దీప్తికంటె వేఱుగా నాకాశమం దున్న సూర్యునిప్రకాశము గోడయందుఁ గన్పడుట లేదే యని శంకించి యట్టిరెండు ప్రకాశములను విభజించి చూపుచున్నాఁడు:—

శ్లో. అనేకదర్పణాదిత్యదీప్తీనాం బహుసంధిషు,
ఇతరా వ్యజ్యతే తాసామభావేఽపి ప్రకాశతే. 2

వ్యా. నను తత్ర దర్పణాదిత్యదీప్తివ్యతిరేకేణ ఖాదిత్యదీప్తిర్నోపలభ్యత ఇత్యాశంక్య తాభ్యస్తాం విభజ్య దర్శయతి—అనేకేతి. యా అనేకా బహుదర్పణజన్యాః కుడ్యే తత్రతత్ర మండలాకారవిశేషప్రభాదృశ్యంతే తాసాం సంధిషు మధ్యేషు ఇతరా సామాన్యప్రకాశరూపఖాదిత్యప్రభా వ్యజ్యతే అభివ్యక్తోపలభ్యతే. తాసాం దర్పణజన్య ప్రభాణామభావేఽపి దర్పణాపగమాదినాఽసత్త్వే చ స్వయం సర్వత్ర ప్రకాశతే.

టీ. అనేకదర్పణాదిత్యదీప్తీనాం-అనేక=వేఱువేఱగు, దర్పణాదిత్య = అద్దములందుఁ బ్రతిఫలించిన సూర్యులయొక్క, దీప్తీనాం=కాంతులయొక్క, బహుసంధిషు = పెక్కైనమధ్యభాగములందు, ఇతరా = ప్రతిబింబదీప్తికంటె వేఱగు ఆకాశసూర్యుని దీప్తి, వ్యజ్యతే = కనఁబడుచున్నది. తాసాం = ఆప్రతిబింబదీప్తులయొక్క, అభావేఽపి=లేమియందును, ప్రకాశతే = ఆదీప్తియే ప్రకాశించుచున్నది.

తా. అనేకములగు అద్దములనుండి ప్రతిఫలించిన సూర్యబింబ కాంతులు గోడమీఁద నక్కడక్కడ విశేష కాంతితో మండలాకారములుగఁ గనుపడును. ఆమండలాకార విశేషప్రభలమధ్య సర్వసామాన్యమగు సూర్యప్రభయు గనుపడును. అద్దములు లేనపుడు ఆమండలాకారప్రభలు లేకపోయినను గోడమీఁద సర్వసామాన్యసూర్యప్రభయే యుండును. కనుక దర్పణప్రతిబింబితదీప్తులు సూర్యప్రకాశముకంటె భిన్నములు కా వని తెలియవలెను.

అవ. ఈదృష్టాంతసిద్ధ మగునర్థమును దార్ష్టాంతికమందుఁ గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. చిదాభాసవిశిష్టానాం తథానేకధియా మసౌ,
సంధిం ధియా మభావం చ భాసయన్ ప్రవివిచ్యతామ్. 3

వ్యా. దృష్టాంతసిద్ధమర్థం దార్ష్టాంతికే యోజయతి—చిదాభాసేతి. తథా తేనైవ ప్రకారేణ చిదాభాసవిశిష్టానాం చిత్ప్రతిబింబయుక్తానా మనేకధియా మనేకానాం బుద్ధివృత్తీనాం ఘటజ్ఞానాదిశబ్దవాచ్యానాం సంధిమంతరాళం జాగ్రదాదౌ ధియాంతాసామేవ బుద్ధివృత్తీనామభావం చ సుషుప్త్యాదౌ భాసయన్ ప్రకాశయన్ అసౌ కూటస్థః ప్రవివిచ్యతాం తాభ్యో భేదేన జ్ఞాయతామిత్యర్థః.

టీ. చిదాభాసవిశిష్టానాం = చిదాభాసునితోఁ గూడుకొనిన, అనేక ధియాం = అనేకములగు బుద్ధి వృత్తులయొక్క, సంధిం = మధ్యభాగమును, ధియాం = బుద్ధులయొక్క, అభావం చ = లేమినిగూడ, భాసయన్ = ప్రకాశింపఁజేయుచున్న, అసౌ = ఈకూటస్థుఁడు, ప్రవివిచ్యతాం = వివేచనచేసి తెలిసికొనఁబడుఁగాక.

తా. పూర్వోక్తదృష్టాంతప్రకారము చిదాభాసునితోఁ గూడిన అనేకబుద్ధివృత్తులయొక్క మధ్యకాలమున, జాగ్రదాదికమందుఁ బ్రకాశింపఁజేయుచున్నట్టియు మఱియు, సుషుప్త్యాదికమందు ఆబుద్ధివృత్తులయొక్క అభావమును బ్రకాశింపఁజేయుచున్నట్టియు కూటస్థచైతన్యము ఆబుద్ధివృత్తులకంటె భిన్న మని గ్రహింపవలెను.

అవ. దేహాస్థకూటస్థచిదాభాసులకుఁ గలభేదమును చూపుటకొఱకు దేహముకంటె బాహ్యమందును చిదాభాసబ్రహ్మముల నిపుడు విభజించి చూపుచున్నాఁడు:—

శ్లో. ఘటైకాకారధీస్థా చిద్ఘట మేవావభాసయేత్,
ఘటస్య జ్ఞాతతా బ్రహ్మచైతన్యేనావభాస్యతే. 4

వ్యా. ఇదానీం దేహాంతః కూటస్థచిదాభాసయో ర్భేదప్రదర్శనాయ దేహాద్బహిరపి చిదాభాసబ్రహ్మణీ విభజ్య దర్శయతి—ఘటేతి. ఘటైకాకారధీస్థా చిత్ ఘటస్యైకస్యాకార ఇవాకారో యస్యాస్సా ఘటైకాకారా తథావిధాయాం బుద్ధౌ వర్తమానశ్చిదాభాసః ఘటమేకమేవావభాసయేత్తస్య ఘటస్య జ్ఞాతతాఖ్యో ధర్మో ఘటో జ్ఞాత ఇతి వ్యవహారహేతుర్యస్స ఘటకల్పనాధిష్ఠానేన బ్రహ్మచైతన్యేన సాధనభూతేనావభాస్యతే ప్రకాశ్యత ఇత్యర్థః.

టీ. ఘటైకాకారధీస్థా - ఘటైక=ఘట మను నొకపదార్థముయొక్క, ఆకార = ఆకారముగల, ధీస్థా=అంతఃకరణప్రతిబింబితమైన, చిత్ = చైతన్యము, ఘటమేవ=ఘటమునే, అవభాసయేత్ = ప్రకాశింపఁజేయును. ఘటస్య=ఘటముయొక్క, జ్ఞాతతా = జ్ఞాతత్వము అనఁగాఁ దెలియఁబడుట, బ్రహ్మచైతన్యేవ = బ్రహ్మచైతన్యముచేత, అవభాస్యతే = ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

తా. 'ఇది ఘటము' అని ఘటమును గ్రహించెడిబుద్ధివృత్తియందుఁ బ్రతిఫలితం బగు చైతన్యము ఘటముం బ్రకాశింపఁజేయును. నాచేత ఘటము జ్ఞాతమయ్యెను (తెలియఁబడెను). అనునపుడు ఘటమునందలిజ్ఞాతత్వము బ్రహ్మచైతన్యముచేతఁ బ్రకాశింపఁజేయఁబడును. ఘటమం దుండెడిజ్ఞాతత్వమును వృత్తిప్రతిబింబచైతన్యము గ్రహింపఁజాలదు.

అవ. ఘటమందలి జ్ఞాతత్వమును గనఁబఱచుచైతన్యమే ఘటమును గనఁబఱచఁగలుగును గదా. ఇక్కడ బుద్ధివృత్తి నేల యంగీకరింపవలెను? అను ప్రశ్నకుసమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞాతత్వేన భాతోఽయం ఘటో బుద్ధ్యుదయాత్పురా,
బ్రహ్మణైవోపరిష్టాత్తు జ్ఞాతత్వేనేత్యసౌ భిదా. 5

వ్యా. నను జ్ఞాతత్వావభాసకచైతన్యేనైవ ఘటప్రతీతిసంభవాద్బుద్ధిః కిమర్థేత్యాశంక్య ఘటస్య జ్ఞాతతాదిభేదసిద్ధ్యర్థేత్యాహ—అజ్ఞాతత్వేనేతి. బుద్ధ్యుదయాత్పురా అయం ఘటో బ్రహ్మణైవాజ్ఞాతత్వేన ప్రకాశితో బుద్ధ్యుత్పత్తౌ సత్యాంజ్ఞాతత్వేన బ్రహ్మణైవ ప్రకాశ్యత ఇతీయానేవ భేదః; నాన్య ఇత్యర్థః.

టీ. అయం ఘటః = ఈఘటము, బుద్ధ్యుదయాత్ = వృత్త్యుత్పత్తికంటె, పురా = లోఁగడ, అజ్ఞాతత్వేన = తెలియఁబడనిదిగ, (బ్రహ్మముచేత), భాతః=ప్రకాశింపఁ జేయఁబడెను. ఉపరిష్టాత్తు = వృత్త్యుత్పత్త్యనంతరమైతే, అసౌ=ఈఘటము, బ్రహ్మణైవ = బ్రహ్మముచేతనే జ్ఞాతత్వేన = జ్ఞాతత్వధర్మపూర్వకముగా (భాస్యతే = ప్రకాశింపఁ జేయఁబడును), ఇతి = ఈలాగున, భేదః = కూటస్థచిదాభాసులభేదము.

తా. (బుద్ధియందు) ఇది ఘట మనువృత్తి జనించుటకుఁబూర్వము నాకు ఘటము తెలియ దనును. అప్పుడు అజ్ఞాతత్వపూర్వకముగా ఘటము సాక్షిచేఁ దెలియఁబడుచున్నది. ఇది ఘట మనువృత్తి జనించిన పిదప నాచే ఘటము తెలియఁబడిన దని యనును. ఆ తెలియఁబడుట యనఁగా ఘటమందలి జ్ఞాతత్వము సాక్షిచే గ్రహింపఁబడుట. ఘటమును గ్రహించునది వృత్తిప్రతిబింబితచైతన్యము. జ్ఞాతత్వమును గ్రహించునది సాక్షిచైతన్య మని యెఱుంగవలెను.

అవ. ఒకేఘటమునకు జ్ఞాతత్వము అజ్ఞాతత్వము అనెడి ధర్మము లెట్లు సంభవించును? అను శంకకు సమాధానము చెప్పుటకై జ్ఞాతత్వ మనఁగా జ్ఞానవిషయత్వము. అజ్ఞాతత్వ మనఁగా అజ్ఞానవిషయత్వము అని నిర్వచింపవలయును. కనుక జ్ఞానాజ్ఞానముల స్వరూపముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. చిదాభాసాంతధీవృత్తిర్జ్ఞానం లోహాంతకుంతవత్,
జాడ్యమజ్ఞానమేతాభ్యాం వ్యాప్తః కుంభో ద్విధోచ్యతే. 6

వ్యా. నన్వేకస్యైవ ఘటస్య జ్ఞాతత్వాజ్ఞాతత్వలక్షణం ద్వైరూప్యం కథం సంభవతీత్యాశంక్య తదవబోధనాయజ్ఞాతత్వాజ్ఞాతత్వాని మిత్తయోర్జ్ఞానాజ్ఞానయోస్స్వరూపం తావద్దర్శయతి—చిదాభాసేతి. చిదాభాసాంతధీవృత్తిః చిదాభాసశ్చిత్ప్రతిబింబస్సోఽంతే పురోభాగే యస్యాః సా ధీవృత్తిః జ్ఞానమిత్యుచ్యతే. బోధేద్ధాబుద్ధిరిత్యాచార్యై రభిధానాత్. తత్ర దృష్టాంతో లోహాంతకుంతవదితి జాడ్యం స్వతస్ఫూర్తిరహితత్వమజ్ఞాత మిత్యుచ్యతే. ఏతాభ్యాం పర్యాయేణ వ్యాప్తస్సర్వతస్సంబద్ధః కుంభో ద్విధోచ్యతే. జ్ఞాత ఇతి. అజ్ఞాత ఇతి చోచ్యత ఇత్యర్థః.

టీ. చిదాభాసాంతధీవృత్తిః = చైతన్యప్రతిబింబమంతమందుఁ గలయంతఃకరణవృత్తి, లోహాంతకుంతవత్ = మొనయందు లోహము గల బల్లెమువలె, జ్ఞానం = జ్ఞాన మని చెప్పఁబడును. జాడ్యం = జడత్వము, అజ్ఞానం=అజ్ఞాన మని చెప్పఁబడును. ఏతాభ్యాం=ఈజ్ఞానాజ్ఞానములచేత, వ్యాప్తః = వ్యాపింపఁబడిన, కుంభః = ఘటము, ద్విధా = రెండువిధములుగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. "బోధేద్ధా బుద్ధిః" అను శ్రీశంకరాచార్యవచనానుసారముగ బోధచేఁ బ్రకాశించునది 'బుద్ధి' యనఁబడును. ఇనుమును పురోభాగమందుఁగల ఈఁటెవంటి చిదాభాసుని పురోభాగమందుఁగల బుద్ధివృత్తి 'జ్ఞాన' మనఁబడును. ఆ బుద్ధియొక్క జడాంశము (స్వతస్స్ఫూర్తి

రహితత్వము) 'అజ్ఞాన' మనఁబడును. ఈజ్ఞానాజ్ఞానములచేతఁ బర్యాయముగ నంతట వ్యాపింపఁబడినఘటము ద్వివిధముగాఁ జెప్పఁబడుచున్నది. అనఁగా జ్ఞానముచే వ్యాపింపఁబడిన ఘటము జ్ఞాత మనియు, అజ్ఞానముచే నావరింపఁబడిన ఘటము అజ్ఞాత మనియుఁ జెప్పఁబడు నని యభిప్రాయము.

అవ. అజ్ఞాత మగు ఘటము బ్రహ్మచైతన్యముచేఁ బ్రకాశింపఁ జేయఁబడినట్లు జ్ఞాత మగు ఘటముకూడ బ్రహ్మచైతన్యముచేత నేల ప్రకాశింపఁజేయఁబడవలెను? జ్ఞానాత్మక మగు వృత్తిచేతనే ఘటమునకుఁ బ్రకాశము లభించును గదా యను నాక్షేపము నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞాతో బ్రహ్మణా భాస్యో జ్ఞాతః కుంభ స్తథా న కిమ్,
జ్ఞాతత్వజననేనైవ చిదాభాసపరిక్షయః. 7

వ్యా. నన్వజ్ఞాతస్య కుంభస్యాజ్ఞానవ్యాప్తత్వాద్భవతు బ్రహ్మావభాస్యత్వం. జ్ఞానవ్యాప్యస్య కుంభస్య కుతో బ్రహ్మచైతన్యావభాస్యత్వ మిత్యాశంక్యాజ్ఞానస్యాజ్ఞాతతాజనన ఇవ జ్ఞానస్యాపి, జ్ఞాతతాజననమాత్రోపక్షీణత్వాదజ్ఞాతకుంభవత్ జ్ఞాతకుంభస్యాపి బ్రహ్మావభాస్యత్వం భవతీత్యాహ—అజ్ఞాత ఇతి. యథా అజ్ఞాతః కుంభో బ్రహ్మణాభాస్య స్తథాజ్ఞాతః కుంభో న కిం బ్రహ్మావభాస్యో భవతి? కింతు భవత్యేవేత్యర్థః. కుత ఇత్యత ఆహ—జ్ఞాతత్వేతి.

టీ. యథా = ఏవిధముగాను, అజ్ఞాతః = అజ్ఞాతమగు ఘటము, బ్రహ్మణా = బ్రహ్మముచేత, భాస్యః=ప్రకాశింపఁజేయఁదగినదో, జ్ఞాతః = జ్ఞానవిషయమైన, ఘటః = ఘటము, తథా = ఆవిధముగా, న కిం? = కాదా? (భాస్యమగు ననుట.) జ్ఞాతత్వజననేనైవ = జ్ఞాతత్వముయొక్క పుట్టించుటచేతనే, చిదాభాసపరిక్షయః=చిదాభాసుని యొక్క చారితార్థ్యము, (భవతి = అగుచున్నది).

తా. జ్ఞానవిషయ మగు ఘటము బ్రహ్మముచేఁ బ్రకాశింప జేయఁబడినట్లు చిత్ప్రతిబింబసహితవృత్తిచేఁ బ్రకాశింపఁ జేయఁబడిన ఘటము గూడ బ్రహ్మచైతన్యముచేతనే ప్రకాశింపఁ జేయఁబడును. బ్రహ్మచైతన్యము ఘటమును బ్రకాశింపఁజేసినపుడు వృత్తిప్రతిఫలిత చిదాభాసుఁడు ఘటము నేల ప్రకాశింపఁజేయవలె నని శంకింపఁ బని లేదు. ఈచిదాభాసుఁడు ఘటమునందు జ్ఞాతత్వమును బుట్టించి చరితార్థుఁ డగును. అట్టిజ్ఞాతత్వము గల ఘటమును బ్రహ్మచైతన్యమే ప్రకాశింపఁజేయును.

అవ. అజ్ఞానవ్యాప్తివలన ఘటమున కజ్ఞాతత్వము గలిగినట్లు చైతన్యప్రతిబింబము లేని బుద్ధివృత్తియొక్క వ్యాప్తిచేతనే జ్ఞాతత్వ మేల కలుగఁగూడదు? బుద్ధివృత్తియందు చైతన్యము ప్రతిఫలించు నని యేల యొప్పుకొనవలెను? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆభాసహీనయా బుద్ధ్యా జ్ఞాతత్వం నైవ జన్యతే,
తాదృగ్బుద్ధేర్విశేషః కో మృదాదే స్స్వ ద్వికారిణః. 8

వ్యా. నన్వజ్ఞాతతాజననాయాఽజ్ఞానమివ జ్ఞాతతాజననాయాపి బుద్ధిరేవాలం. కిమనేన చిదాభాసేనేత్యాశంక్య చిదాభాసరహితాయా బుద్ధేర్ఘటాదివదప్రకాశరూప సత్వేన జ్ఞాతతాజననం న సంభవతీత్యాహ—ఆభాసేతి.

టీ. ఆభాసహీనయా = చిదాభాసరహిత మగు, బుద్ధ్యా = బుద్ధివృత్తిచేత, జ్ఞాతత్వం=జ్ఞాతత్వము, నైవ జన్యతే=కలుగనే కలుగదు. తాదృగ్బుద్ధేః = అట్టిబుద్ధికి, వికారిణః = వికారవంత మగు, మృదాదేః = మృత్తిక మొదలగు దానికంటె, కః=ఏమి, విశేషః = విశేషము? (విశేష మేమియు లే దనుట).

తా. చిదాభాసరహిత మగుబుద్ధి జ్ఞాతత్వముం గలుగఁజేయఁ జాలదు. దానికిని మృత్తునకును తారతమ్యము లేదు.

అవ. ఈయర్థమును దృష్టాంతముచే స్పష్టపఱచుచున్నాఁడు:—

శ్లో. జ్ఞాత ఇత్యుచ్యతే కుంభో మృదా లిప్తో న కుత్రచిత్,
ధీమాత్రవ్యాప్తకుంభస్య జ్ఞాతత్వం నేష్యతే తథా. 9

వ్యా. చిదాభాసరహితబుద్ధివ్యాప్తస్య ఘటస్య జ్ఞాతత్వాభావం దృష్టాంతప్రదర్శనేన స్పష్టయతి—జ్ఞాత ఇతి. లోకే కుత్రచిదపి ఘటః మృదా శుక్లకృష్ణాదిరూపయా లిప్తో లేపనం ప్రాప్తో జ్ఞాత ఇతి నోచ్యతే యథా, తథా చిదాభాసరహితబుద్ధివ్యాప్తస్యాపి కుంభస్య జ్ఞాతత్వం నాభ్యుపగమ్యత ఇతి భావః.

టీ. మృదా = మృత్తికచేత, లిప్తః = పూయఁబడిన, కుంభః = ఘటము, కుత్రచిత్ = ఎక్కడను, జ్ఞాత ఇతి = తెలియఁబడిన దని, నోచ్యతే = చెప్పఁబడదు. తథా= ఆవిధముగనే, ధీమాత్రవ్యాప్తకుంభస్య = చైతన్యప్రతిబింబరహితం బగు వృత్తిచే వ్యాప్తమైన ఘటమునకు, జ్ఞాతత్వం = జ్ఞాతత్వము, నేష్యతే = అంగీకరింపఁబడదు.

తా. బుద్ధివృత్తియందు చైతన్యము ప్రతిబింబింపనియెడల నదియు మట్టివంటిదే. మట్టి పూసినకుండను జ్ఞాత మని యందురా? అనరు. అట్టులే కేవలబుద్ధివృత్తిచే వ్యాపింపఁబడినకుండకును జ్ఞాతత్వము

ఘటింపక పోవును. కనుక ఘటము జ్ఞాతమైన దనియెడి లోకవ్యవహారము నిర్వహించుటకు బుద్ధివృత్తియందు చైతన్యప్రతిబింబ మంగీకరింపక తీఱదు.

అవ. జ్ఞాతత్వముకొఱకు వృత్తికయందు చిత్ప్రతిబింబ మంగీకరింప నవసరము లేదు. ఆకాశసూర్యప్రభ వలె వ్యాప్తమగుబ్రహ్మచైతన్యముచేతనే ఘటమునకు జ్ఞాతత్వము ఘటించును. అను శంకకు సమాధానము:—

శ్లో. జ్ఞాతత్వం నామ కుంభే తచ్చిదాభాసఫలోదయః,
న ఫలం బ్రహ్మచైతన్యం మానాత్ప్రాగపి సత్త్వతః. 10

వ్యా. ఫలితమాహ—జ్ఞాతత్వమితి. యతః కేవలాయాః బుద్ధేః జ్ఞాతత్వజననాసమర్థత్వమతః కుంభే చిదాభాసలక్షణస్య ఫలస్య వ్యాప్తిరేవ జ్ఞాతత్వం నామ ప్రసిద్ధమిత్యర్థః. నన్వథాపి చిదాభాసో న కల్పనీయః బ్రహ్మచైతన్యస్యైవ ఫలస్య సద్భావాదిత్యాశంక్యాహ—న ఫలమితి. బ్రహ్మచైతన్యం ఫలం ఘటాదిస్ఫురణం న భవతీతి కుత ఇత్యతఆహ—మానాదితి, మానాత్ప్రాగపి ప్రమాణప్రవృత్తేః పూర్వమపి విద్యమానత్వాత్ఫలస్య తు తదుత్తరకాలీనత్వనియమాదితి భావః.

టీ. కుంభే = కుంభమునందు, జ్ఞాతత్వం నామ=జ్ఞాతత్వ మనఁగా, తచ్చిదాభాసఫలోదయః-తత్ = ఆబుద్ధివృత్తియందు, చిదాభాస = చైతన్యప్రతిబింబముయొక్క, ఫలోదయః = ఫలావిర్భావమే, బ్రహ్మచైతన్యం = బ్రహ్మచైతన్యము, మానాత్ = ప్రమాణముకంటె, ప్రాగపి = లోగడను, సత్త్వతః = ఉండుటవలన, ఫలం = ఫలము, కాదు.

తా. బుద్ధివృత్తియందుఁ బ్రతిఫలించిన చిదాభాసునిప్రకాశము ఘటముపైఁ బడినప్పుడే ఘటము జ్ఞాత మని వ్యవహరింపఁబడును. ఈ వ్యవహారమును బ్రహ్మచైతన్యవ్యాప్తి నిర్వహింపఁజాలదు. బ్రహ్మచైతన్యము వృత్తి పుట్టుటకుఁ బూర్వము కూడ ఘటమందు వ్యాపించియే యున్నది. కనుక దానినిబట్టి యీవ్యవహారము ఘటించునెడలఁ గనులు దెఱచి చూచుటకు ముందును ఘటము నాకు జ్ఞాతమైన దనవలసి వచ్చును. అట్లు లోకానుభవము లేదు. కనుక జ్ఞాతత్వము చిదాభాసునివ్యాప్తికి ఫలము. బ్రహ్మచైతన్యవ్యాప్తికి ఫలము గాదు.

అవ. నీవు చెప్పినసిద్ధాంతము సురేశ్వరవార్తికవిరుద్ధ మని పూర్వపక్షి యాక్షేపింపఁగా నావార్తికమును గనఁబఱచి దానితాత్పర్యమును వర్ణింపఁ దలఁచి మొదట వార్తికమును వ్రాయుచున్నాఁడు:—

శ్లో. పరాగర్థప్రమేయేషు యా ఫలత్వేన సమ్మతా,
సంవిత్సైవేహ మేయోఽర్థో వేదాంతోక్తిప్రమాణతః. 11

వ్యా. నన్విదం పరాగర్థప్రమేయేష్విత్యాది సురేశ్వరవార్తికవిరుద్ధమిత్యాశంక్య తద్వివక్షానభిజ్ఞస్య ఇదం చోద్య మితి పరిహరతి—పరాగర్థేతి. అస్య చాయమర్థః. పరాగర్థా బాహ్యా ఘటాదయః పదార్థాస్తేషు ప్రమేయేషు ప్రమాణవిషయేషు సత్సు యా ప్రమాణఫలత్వేనాభ్యుపేతా సంవిదస్తి సైవేహాస్మిన్వేదాంతశాస్త్రే వేదాంతోక్తి ప్రమాణతో వేదాంతవాక్యలక్షణప్రమాణేన మేయోఽర్థో జ్ఞాతవ్యోఽర్థః.

టీ. పరాగర్థప్రమేయేషు పరాగర్థ = బాహ్యార్థములు, ప్రమేయేషు=విషయము లైనపుడు, యాసంవిత్ =ఏజ్ఞానము, ఫలత్వేన=ఫలముగ, సమ్మతా=ఇష్టమైనదో, సైవ = అట్టి సంవిత్తే (జ్ఞానమే), ఇహ=ఈవేదాంతశాస్త్రమునందు, వేదాంతోక్తి ప్రమాణతః= వేదాంతవాక్యప్రమాణమువలన, మేయః=తెలియఁదగిన, అర్థః=అర్థము (వస్తువు).

తా. విషయములను ప్రకాశింపఁ జేసెడి జ్ఞానమే వేదాంత శాస్త్ర ప్రతిపాద్య మైన బ్రహ్మము.

శ్లో. ఇతి వార్తిక కారేణ చిత్సాదృశ్యం వివక్షితమ్,
బ్రహ్మచిత్ఫలయో ర్భేద స్సాహస్ర్యాం విశ్రుతో యతః. 12

వ్యా. ఇత్యనేన వార్తికేన బ్రహ్మచైతన్యసదృశశ్చిదాభాసః ప్రమాణఫలత్వేన వివక్షితః. న బ్రహ్మచైతన్యమితి భావః. వార్తికకారాణామీదృశీ వివక్షేతి కుతోఽవగమ్యత ఇత్యాశంక్య తద్గురుభిః శ్రీమదాచార్యై రుపదేశసాహస్ర్యాం బ్రహ్మచైతన్య చిదాభాసయోర్భేదస్య ప్రతిపాదితత్వాదిత్యాహ—బ్రహ్మచిదితి. బ్రహ్మ చ చిత్ఫలం చ బ్రహ్మచిత్ఫలే తయోరితి విగ్రహః.

టీ. ఇతి=ఈలాగున, వార్తికకారేణ=వార్తికకారు లగు సురేశ్వరాచార్యులవారి చేత, చిత్సాదృశ్యం=చైతన్యములకు పోలిక, వివక్షితం=వివక్ష చేయఁబడినది. యతః= ఏ హేతువువలన, సాహస్ర్యాం=ఉపదేశసాహస్రి యను భాష్యకార ప్రణీతగ్రంథము నందు, బ్రహ్మచిత్ఫలయోః = బ్రహ్మమునకును వృత్తిప్రతిఫలితచిదాభాసునకును, భేదః = భేదము, విశ్రుతః = విశేషించి చెప్పఁబడినదో.

తా. పైశ్లోకమున చెప్పఁబడినవిధముగా సురేశ్వరాచార్యుల వారు చెప్పిరి గాన వేదాంతప్రతిపాదిత మగు బ్రహ్మమే ఘటమును ప్రకాశింపఁజేయును. దానంజేసియే ఘటము జ్ఞాత మని వాఁడబడును చిదాభాసవ్యాప్తిచేఁ గా దని శంకింపవలదు. సురేశ్వరులగురువు లగు

శ్రీమచ్ఛంకరభగవత్పాదులు ఉపదేశసాహస్రి యను గ్రంథమునందు బ్రహ్మమును, చిదాభాసుని వేఱుగాఁ జెప్పియుండిరి. కావున సురేశ్వరాచార్యులు ఘటమునకు జ్ఞాతత్వమును గలుగఁజేయువృత్తిప్రతిబింబితచిదాభాసుఁడు వేదాంతప్రతిపాద్య మగు బ్రహ్మమువంటివాఁ డని చెప్పెఁ గాని, బ్రహ్మమే జ్ఞాతత్త్వము గలుగఁజేయు నని తమగురువుల సిద్ధాంతమునకు విరుద్ధముగాఁ జెప్పలే దని భావము.

అవ. ఇందువలనఁ బ్రకృతమం దేమి లభించిన దనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆభాస ఉదిత స్తస్మాజ్జ్ఞాతత్వం జనయే ద్ఘటే,

తత్పునర్బ్రహ్మణా భాస్య మజ్ఞాతత్వవదేవ హి. 13

వ్యా. ఏవం చ సతి ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—ఆభాస ఇతి. యస్మాద్బ్రహ్మచిత్ఫలయోర్భేదః ప్రసిద్ధః తస్మాద్ఘటే ఉదిత ఉత్పన్న ఆభాసశ్చిదాభాస స్తత్ర ఘటే జ్ఞాతత్వం జనయేదుత్పన్నం తత్ జ్ఞాతత్వం పునరజ్ఞాతత్వవద్బ్రహ్మణైవావభాస్యం భవతి హి ప్రసిద్ధ మిత్యర్థః.

టీ. తస్మాత్=ఆహేతువువలన, ఉదితః = పుట్టిన, చిదాభాసః = చిదాభాసుఁడు, ఘటే = ఘటమునందు, జ్ఞాతత్వం = జ్ఞాతత్వమును, జనయేత్=పుట్టించును. తత్పునః = అట్టిజ్ఞాతత్వము, అజ్ఞాతత్వవదేవహి = అజ్ఞాతత్వమువలెనే, బ్రహ్మణా=పరబ్రహ్మముచేత, భాస్యం హి = ప్రకాశింపఁజేయఁదగినది గదా.

తా. కనుక వృత్తిప్రతిఫలితచిదాభాసునివ్యాప్తిచే ఘటమునందుజ్ఞాతత్వము గలుగును. వృత్తి జనించుటకు పూర్వము అజ్ఞాతత్వము బ్రహ్మచైతన్యముచేఁ దెలియఁబడినట్లు వృత్తి జనించినపిమ్మట ఘటమునందుండెడి జ్ఞాతత్వము గూడ బ్రహ్మచైతన్యముచే గ్రహింపఁ బడును. జ్ఞాతత్వమును బుట్టించుట చిదాభాసునిపని. జ్ఞాతత్వము నెఱుంగుట బ్రహ్మచైతన్యముపని.

అవ. బ్రహ్మచిదాభాసులకు విషయ భేదములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. ధీవృత్త్యాభాసకుంభానాం సమూహో భాస్యతే చితా,

కుంభమాత్రఫలత్వాత్స ఏక ఆభాసతస్స్ఫురేత్. 14

వ్యా. ఏవం బ్రహ్మచిదాభాసయో ర్భేదముపపాదితం విషయభేదప్రదర్శనేన స్పష్టయతి—ధీవృత్త్యేతి. చితా బ్రహ్మచైతన్యేనేత్యర్థః. చిదాభాసస్య కుంభమాత్రనిష్ఠ ఫలరూపత్వాత్తేనాభాసేన స ఘట ఏక ఏవ స్ఫురేద్భాస్యేతేత్యర్థః.

టీ. ధీవృత్త్యాభాసకుంభానాం - ధీవృత్తి = బుద్ధివృత్తియొక్కయు, ఆభాస = చిదాభాసునియొక్కయు, కుంభానాం=ఘటముయొక్కయు, సమూహః=సముదాయము, చితా = బ్రహ్మచైతన్యము చేత, భాస్యతే=ప్రకాశింపఁజేయఁబడుచున్నది. కుంభమాత్ర ఫలత్వాల్ = (చిదాభాసుఁడు) ఘటమాత్రమును విషయముగాఁ జేసికొనును గనుక, సః= అఘటము, ఏకః=ఒక్కటి, ఆభాసతః=చిదాభాసునివలన, స్ఫురేత్ =ప్రకాశించును.

తా. బుద్ధివృత్తిని, తత్ప్రతిబింబితుఁడగు చిదాభాసుని, తద్వ్యాప్తమగుఘటమును ఈమూఁడింటిని బ్రహ్మచైతన్యము ప్రకాశింపఁ జేయును. వృత్తిప్రతిఫలితుఁ డగు చిదాభాసుఁడు ఘటము నొక్క దానినే ప్రకాశింపఁజేయును.

అవ. కుంభము బ్రహ్మచిదాభాసులచే వ్యాపింపఁబడు ననుటకుఁ గారణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. చైతన్యం ద్విగుణం కుంభే జ్ఞాతత్వేన స్ఫురత్యతః,
అన్యేఽనువ్యవసాయాఖ్యమాహురేత ద్యథోదితమ్. 15

వ్యా. కుంభస్య చిదాభాసబ్రహ్మోభయభాస్యత్వే లింగమాహ—చైతన్యమితి. అతో ఘటస్య బ్రహ్మచిదాభాసోభయభాస్యత్వాత్కుంభే జ్ఞాతత్వేన ద్విగుణం చైతన్యం భాతి. ఇదమేవ ఘటజ్ఞాతతావభాసకం చైతన్యం తార్కికైర్నామాంతరేణ వ్యవహ్రియత ఇత్యాహ—అన్యఇతి. యథోదితం యథోక్తమేతదేవ బ్రహ్మచైతన్యం అన్యే తార్కికా అను వ్యవసాయాఖ్యం జ్ఞానాంతరం ప్రాహురితి యోజనా.

టీ. అతః=అందువలన (చిదాభాసబ్రహ్మములనెడి రెండింటిచేతను ఘటము ప్రకాశింపఁబడుటవలన), కుంభే=ఘటమందు, జ్ఞాతత్వేన=జ్ఞాతత్వముచేత, ద్విగుణం=ద్విగుణమగు, చైతన్యం=చైతన్యము, స్ఫురతి = స్ఫురించుచున్నది. యథోదితఁ=వెనుక చెప్పఁబడిన, ఏతత్=ఈ బ్రహ్మచైతన్యమును, అన్యే=ఇతరమతస్థులగు తార్కికులు, అను వ్యవసాయాఖ్యం=అను వ్యవసాయమనెడి పేరుగల జ్ఞానాంతరమును, ఆహుః=చెప్పెదరు.

తా. గోడయందు ఆకాశసూర్యప్రభయు దర్పణసూర్యప్రభయు వ్యాపించియున్నస్థలమున నిబ్బడిగాఁ బ్రకాశ ముండునట్లు ఘటము నందు చిదాభాసునిప్రకాశమును బ్రహ్మచైతన్యప్రకాశమునుజేరి ద్విగుణమై యుండుటంజేసి ఘటము స్ఫుటముగా జ్ఞాతమై ప్రకాశించును. ఈజ్ఞాతత్వమును బ్రకాశింపఁజేయు బ్రహ్మచైతన్యమును తార్కికులు అనువ్యవసాయ మనెడి జ్ఞానాంతర మందురు.

అవ. చిదాభాసబ్రహ్మములకు వ్యవహారమునుబట్టి భేదమును చూపుచున్నాఁడు:—

శ్లో. ఘటోఽయమిత్యసావుక్తిరాభాసస్య ప్రసాదతః,
విజ్ఞాతో ఘట ఇత్యుక్తిర్బ్రహ్మానుగ్రహతో భవేత్. 16

వ్యా. అయం ఘట ఇతి జ్ఞాతో ఘట ఇతి వ్యవహారభేదాదపి చిదాభాసబ్రహ్మణోర్భేదోఽవగంతవ్య ఇత్యాహ—ఘటోఽయమితి.

టీ. అయం - ఇది, ఘటః=ఘటము, ఇతి = ఈలాగని, ఉక్తిః = చెప్పుట, ఆభాసస్య = చిదాభాసునియొక్క, ప్రసాదతః = అనుగ్రహమువలన, భవతి = అగుచున్నది. ఘటః = ఘటము, విజ్ఞాతః = తెలియఁబడినది. ఇతి = ఈలాగున, ఉక్తిః = పల్కుట, బ్రహ్మానుగ్రహతః = బ్రహ్మప్రసాదమువలన, భవేత్ = అగును.

తా. ఇది ఘటమని వాడుటకు చిదాభాసుఁడు కారణము. ఘటము జ్ఞాతమైన దని వాడుటకు బ్రహ్మచైతన్యవ్యాప్తి కారణము.

అవ. దేహమునకు వెలుపల చిదాభాసబ్రహ్మములను విభజించి తెలిసికొనినట్లు దేహములో వా రిరువురిని గనుఁగొనువిధముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆభాసబ్రహ్మణీ దేహాద్బహిర్యద్వద్వివేచితే,
తద్వదాభాసకూటస్థౌ వివిచ్యేతాం వపుష్యపి. 17

వ్యా. దేహాద్బహిశ్చిదాభాసబ్రహ్మణీ వివిచ్యేతే యథా తథా దేహాంతశ్చిదాభాసకూటస్థౌ వివేచనీయావిత్యాహ—ఆభాసేతి.

టీ. ఆభాసబ్రహ్మణీ = చిదాభాసుఁడును బ్రహ్మమును, దేహాత్ = శరీరముకంటె, బహిః = వెలుపల, యద్వత్ = ఏవిధంబుగా, వివేచితే = వేఱుచేసి గ్రహింపఁబడినవో, తద్వత్ = అటువలెనే, వపుష్యపి = శరీరమునందును, ఆభాసకూటస్థౌ = చిదాభాసకూటస్థులు, వివిచ్యేతాం = వేఱుపఱిచి గ్రహింపఁబడుదురు గాక.

తా. దేహమునకు వెలుపల చిదాభాసకూటస్థులం బ్రత్యేకించి గ్రహించినట్లు దేహమందును నట్లే వా రిరువురిం బ్రత్యేకించి గ్రహింపవలయును.

అవ. వెలుపల ఘటాదులయందు వృత్తివ్యాప్తి గలిగినట్లు అంతరము లగు కామక్రోధాదులందు వేఱుగా వృత్తులు లేవుగదా. అక్కడ చిదాభాసబ్రహ్మములను వేఱు వేఱుగా నెటుల గ్రహింప నగును? అను శంకకు సమాధానము:—

శ్లో. అహంవృత్తౌ చిదాభాసః కామక్రోధాదికాసు చ,
సంవ్యాప్య వర్తతే తప్తే లోహే వహ్నిర్యథా తథా.

వ్యా. నను దేహాద్బహిశ్చిదాభాసవ్యాప్యఘటాకారవృత్తివదాంతరవిషయగోచర వృత్త్యభావాత్కథం తద్వ్యాపకః చిదాభాసోఽభ్యుపగమ్యత ఇత్యాశంక్య విషయ గోచరవృత్త్యభావేఽప్యహమాదివృత్తి సద్భావాత్తద్వ్యాపకశ్చిదాభాసోఽభ్యుపగంతుం శక్యత ఇతి సదృష్టాంతమాహ—అహమితి.

టీ. వహ్నిః=అగ్ని, తప్తే లోహే = కాల్పఁబడిన యినుమునందు, యథా = ఏప్రకారము, వర్తతే = వర్తించునో, తథా = ఆప్రకారము, చిదాభాసః = చిదా భాసుఁడు, అహంవృత్తౌ=నే ననెడి వృత్తియందును, కామక్రోధాదికాసుచ = కామ క్రోధాదివృత్తులయందును, సంవ్యాప్య = వ్యాపించి (వర్తతే)=వర్తించుచున్నాఁడు.

తా. అగ్నితప్తమైన యినుములో అగ్ని వ్యాపించియుండునట్లు చిదాభాసుఁడు అహంవృత్తియందును, కామక్రోధాదివృత్తులందును వ్యాపించి వర్తించును.

అవ. అహమాదివృత్తులు చిదాభాసునిచేఁ బ్రకాశింపఁజేయఁబడు ననుసంగతిని దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వమాత్రం భాసయేత్తప్తం లోహం నాన్యత్కదాచన,
ఏవమాభాససహితా వృత్తయస్స్వస్వభాసికాః. 19

వ్యా. అహమాదివృత్తీనామేవ చిదాభాసభాస్యత్వం దృష్టాంతప్రపంచనేన స్పష్టయతి—స్వమాత్రమితి.

టీ. తప్తం = కాచఁబడిన, లోహం=లోహము, స్వమాత్రం = తననుమాత్రమే, భాసయేత్ = ప్రకాశింపఁజేయును. అన్యత్ = ఇతరమైనదానిని, కదాచన = ఎప్పుడును, న భాసయేత్ = ప్రకాశింపఁజేయదు. ఏవం = ఈప్రకారముగా, ఆభాస సహితాః = చిదాభాసునితోఁ గూడుకొనిన, వృత్తయః = కామక్రోధాదివృత్తులు, స్వస్వభాసికాః = తమతమను బ్రకాశింపఁజేయునవి యగును.

తా. కాల్చినయినుపగుండులోని నిప్పు చీఁకటిలో దానిని మాత్రమే గనఁబఱుపఁజాలును. గాని రెండవదానినిం గనఁబఱుపఁ జాలదు. ఈవిధముగాఁ గామాదివృత్తులలోఁ బ్రతిఫలించిన చిదా భాసుఁడు ఆవృత్తులను మాత్రమే ప్రకాశింపఁజేయును.

అవ. ఇట్లు చిదాభాసుని నిరూపించి, యిఁక కూటస్థస్వరూపనిరూపణము జేయు టకై వృత్త్యభావసమయము నిపుడు వివరించుచున్నాఁడు:—

శ్లో. క్రమాద్విచ్ఛిద్య విచ్ఛిద్య జాయంతే వృత్తయోఽఖిలాః,
సర్వా అపి విలీయంతే సుప్తిమూర్ఛాసమాధిషు. 20

వ్యా. ఏవం చిదాభాసం వ్యుత్పాద్య, కూటస్థస్వరూపం వ్యుత్పాదయితుం తదుపయోగినం వృత్త్యభావావసరం దర్శయతి—క్రమాదితి.

టీ. అఖిలాః = సమస్తములైన, వృత్తయః = వృత్తులు, క్రమాత్ = వరుసగా, విచ్ఛిద్య విచ్ఛిద్య = నడుమనడుమ వ్యవధిని జెంది, జాయంతే=పుట్టుచున్నవి. సర్వా అపి = సమస్తవృత్తులు, సుప్తిమూర్ఛాసమాధిషు = సుషుప్తిమూర్ఛాసమాధులయందు, విలీయంతే = లయించుచున్నవి.

తా. జాగ్రత్స్వప్నములందు వృత్తులు వరుసగా నప్పుడప్పుడు పుట్టుచుండును. వృత్తు లన్నియు సుషుప్తిమూర్ఛాసమాధులయందు లయించును.

అవ. వృత్తి విలయ మగుఁగాక. కూటస్థుని దెలియుట కిది యెట్లుపయోగించును? అనుప్రశ్నకు సమాధానము:—

శ్లో. సంధయోఽఖిలవృత్తీనా మభావా శ్చావభాసితాః,
నిర్వికారేణ యేనాసౌ కూటస్థ ఇతి చోచ్యతే. 21

వ్యా. భవత్వేవం సమాధ్యాదౌ వృత్తివిలయః. అనేన కథం కూటస్థోఽవగమ్యత ఇత్యాశంక్య వృత్త్యభావసాక్షిత్వేనాసావవగమ్యత ఇత్యాహ—సంధయ ఇతి వృత్తిసంధయో వృత్త్యభావాశ్చ యేన నిర్వికారచైతన్యేనావభాస్యంతే, అసౌ కూటస్థోఽవగంతవ్య ఇత్యర్థః.

టీ. అఖిలవృత్తీనాం = సమస్తవృత్తులయొక్క, సంధయః = సంధులును, అభావాశ్చ = వృత్తులయొక్క అభావములును, నిర్వికారేణ = వికారరహితుఁడైన, యేన = ఎవనిచేత, అవభాసితాః = ప్రకాశింపఁజేయఁబడినవో, అసౌ = ఇతఁడు, కూటస్థ ఇతి చ = కూటస్థుఁ డనియు, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఒక బుద్ధివృత్తి నశించి మఱియొక బుద్ధివృత్తి పుట్టుచుండఁగా ఆ రెండువృత్తులయొక్క నడిమికాలము 'సంధి' యనఁబడును. అట్టి సంధికాలములును, సుషుప్తి మూర్ఛా సమాధ్యవస్థలయందు వృత్తులయొక్క అభావములును ఏ నిర్వికారసాక్షి చైతన్యముచేత తోఁచఁబడుచున్నవో ఆసాక్షిచైతన్యమే కూటస్థుఁ డనఁబడును.

అవ. దీని ఫలితముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘటే ద్విగుణచైతన్యం యథా బాహ్యే తథాంతరే,
వృత్తిష్వపి తతస్తత్ర వైశద్యం సంధితోఽధికమ్. 22

వ్యా. ఏవం చ సతి కిం ఫలితమిత్యత ఆహ—ఘట ఇతి. బాహ్యే ఘటే యథా ఘటమాత్రావభాసకశ్చిదాభాసః ఘటస్య జ్ఞాతతావభాసకం బ్రహ్మచైతన్యం చేతి చైతన్య ద్వైగుణ్యం తథాంతరే ఽహంకారాదివృత్తిష్వపి కూటస్థచైతన్యం వృత్త్యవభాస కశ్చిదాభాసశ్చేతి ద్విగుణచైతన్యమస్తి. తత్రోపపత్తిమాహ—తత ఇతి. యతో ద్విగుణ చైతన్యమస్తి, తతస్సంధితస్సంధిభ్యస్తత్ర వృత్తిషు వైశద్యమధికం దృశ్యత ఇతి శేషః.

టీ. యథా=ఏవిధముగా, బాహ్యే = వెలుపల, ఘటే = ఘటమునందు, ద్విగుణ చైతన్యం=ఇనుమడిచైతన్యము, (అస్తి = కలదో), తథా=అలాగుననే, అంతరే=లోపలి, వృత్తిష్వపి = వృత్తులయందును, ద్విగుణచైతన్యం = ద్విగుణచైతన్యము, అస్తి కలదు. తతః=ఆహేతువువలన, సంధితః = సంధికాలమువలన, తత్ర = ఆ అహమాదివృత్తుల యందు, వైశద్యం=స్పష్టత్వము, అధికం=అధికముగ, (దృశ్యతే)=చూడఁబడుచున్నది.

తా. వెలుపలిఘటమునందు చిదాభాసవ్యాప్తియు కూటస్థ వ్యాప్తియు నుండుటంజేసి చైతన్య మెట్లు ద్విగుణమై యుండెనో యట్టులే కామక్రోధాదివృత్తులయందు చిదాభాసవ్యాప్తియు కూటస్థ వ్యాప్తియు నుండుటంజేసి వృత్తులయంతరాళమునకంటె చైతన్యము ద్విగుణమై యుండును.

అవ. ఘటాదులయందు వలె వృత్తులయందు జ్ఞాతత్వాజ్ఞాతత్వావభాసకుఁడుగా కూటస్థుని నేల స్వీకరింపరాదను శంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జ్ఞాతతాజ్ఞాతతే న స్తో ఘటవద్వృత్తిషు క్వచిత్,
స్వస్య స్వేనాగృహీతత్వాత్తాభిశ్చాజ్ఞాననాశనాత్. 23

వ్యా. నన్వత్రాపి ఘటాదిష్వివ జ్ఞాతతాజ్ఞాతతావభాసకత్వేన కూటస్థః కిం నేష్యత ఇత్యాశంక్య తత్ర జ్ఞాతతాద్యభావాదేవేత్యాహ—జ్ఞాతతేతి. తత్రోపపత్తి మాహ—స్వస్యేతి. జ్ఞానాజ్ఞానవ్యాప్తిభ్యాం జ్ఞాతతాజ్ఞాతతే భవతః. వృత్తీనాం తు స్వప్రకాశత్వేన జ్ఞానవ్యాప్తిర్నాస్తి. తాభిర్వృత్తిభిస్స్వోత్పత్తిమాత్రేణ స్వగోచ రస్యాజ్ఞానస్య నివర్తితత్వాదజ్ఞానస్య వ్యాప్తిరపి నాస్తీతి భావః.

టీ. స్వస్య = తాను, స్వేన = తనచేత, అగృహీతత్వాత్ = గ్రహింపఁబడక పోవుటవలన, తాభిః=ఆవృత్తులచేత, అజ్ఞాననాశనాచ్చ=అజ్ఞానముయొక్క నాశము వలనను, ఘటవత్=ఘటమునందువలెనే, వృత్తిషు = వృత్తులయందు, క్వచిత్=ఎప్పటి కిని, జ్ఞాతతాజ్ఞాతతే = జ్ఞాతత్వాజ్ఞాతత్వములు, న స్తః = లేవు.

తా. ఘటమునందువలె వృత్తులయందు జ్ఞాతత్వాజ్ఞాతత్వములు సంభవింపవు. ఎందువల్ల ననఁగా కర్మకర్తృత్వవిరోధముచేత వృత్తిని

వృత్తిగ్రహింపఁజాలదు. జ్ఞానవ్యాప్తిచేత ఘటాదులయందు జ్ఞాతత్వము గలుగుచున్నది. అజ్ఞానవ్యాప్తిచేత ఘటాదులయందు అజ్ఞాతత్వము గలుగుచున్నది. బుద్ధివృత్తులలో స్వప్రకాశ రూపత్వము గలిగి యుండుటచేత ఆవృత్తులయందు జ్ఞానము వ్యాపింపదు. అందువలన వృత్తులయందు జ్ఞాతత్వము సంభవింపదు. మఱియు, నావృత్తులు తాము ఉత్పత్తియైనమాత్రమున స్వగోచరాజ్ఞానము నివర్తించుటవలన ఆ వృత్తులయందు అజ్ఞానవ్యాప్తియు లేదు. అందువలన వృత్తులయందు అజ్ఞాతత్వమును లేదని తెలియవలెను.

అవ. చిదాభాసకూటస్థులలో నొకటి వికారియు మఱియొకటి యవికారియు ననుటకు హేతువును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ద్విగుణీకృతచైతన్యే జన్మనాశానుభూతితః,
అకూటస్థం తదన్యత్తు కూటస్థమవికారతః. 24

వ్యా. నను కూటస్థచిదాభాసయోరుభయోరపి చిత్త్వే సమానే ఏకస్య కూటస్థత్వ మపరస్యాకూటస్థత్వమిత్యేతత్కుత ఇత్యాశంక్య చిదాభాసనిష్ఠయోర్జన్మనాశయోరను భూయ మానత్వాత్తస్యాకూటస్థత్వ మపరస్య వికారిత్వే ప్రమాణాభావాత్కూటస్థత్వ మిత్యాహ—ద్విగుణీతి.

టీ. ద్విగుణీకృతచైతన్యే = ద్విగుణముగాఁ జేయఁబడినచైతన్యమునందు, జన్మనాశానుభూతితః = ఉత్పత్తినిలయముల యొక్క యనుభవమువలన, అకూటస్థం=(చిదాభాసస్వరూపము) వికారియైనది. తదన్యత్తు = దానికంటెవేఱగు చైతన్యము, అవికారతః = నిర్వికారత్వమువలన, కూటస్థం = కూటస్థముగలది యగును.

తా. వృత్తులందు రెండుచైతన్యములు గలవు. వానిలో జన్మనాశములు గలది గనుక చిదాభాసస్వరూపము సవికారము. కూటస్థ చైతన్యము నిర్వికారమును నిత్యమును నగును.

అవ. చిదాభాసునికంటె వేఱుగా కూటస్థుని నీవే కల్పించితివి. పూర్వీకు లెవ్వరును అంగీకరింపరు. అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అంతఃకరణతద్వృత్తిసాక్షీత్యాదావనేకధా,
కూటస్థ ఏవ సర్వత్ర పూర్వాచార్యైర్వినిశ్చితః. 25

వ్యా. చిదాభాసవ్యతిరిక్త కూటస్థాభ్యుపగమ స్స్వకపోలకల్పిత ఇత్యాశంక్యాచార్యైః కూటస్థస్యోపపాదితత్వాన్నైవమిత్యాహ—అంతఃకరణేతి. "అంతఃకరణ

తద్వృత్తి సాక్షీ చైతన్యవిగ్రహః, ఆనందరూపస్సత్యస్సన్కిన్నాత్మానం ప్రపద్యసే" ఇత్యాదా విత్యర్థః.

టీ. అంతఃకరణతద్వృత్తిసాక్షీత్యాదౌ = అంతఃకరణము తద్వృత్తిసాక్షియను మొదలగువాక్యములందు, కూటస్థ ఏవ = కూటస్థుఁడే, సర్వత్ర = అంతట, అనేకధా= పలువిధంబులుగా, పూర్వాచార్యైః = పూర్వాచార్యులచేత, వినిశ్చితః = నిశ్చయింపఁబడెను.

తా. "అంతఃకరణతద్వృత్తిసాక్షీ చైతన్యవిగ్రహః, ఆనందరూపస్సత్యస్సన్ కిన్నాత్మానం ప్రపద్యసే" నీవు అంతఃకరణమునకును తద్వృత్తులకును సాక్షివి. చైతన్యస్వరూపుఁడవును, ఆనందరూపుఁడవును, సత్యస్వరూపుఁడవును అగుచు నాస్వరూపము నెందుకు భావింపవు? అని దీనియర్థము. ఇత్యాదివాక్యములయందు శ్రీశంకరాచార్యాదులు కూటస్థుని నిరూపించిరి గాన నిది స్వకపోలకల్పితము గాదు.

అవ. కూటస్థునికంటె వేఱగు చిదాభాసుఁడును పూర్వాచార్యులచే నంగీకరింపఁబడె నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మాభాసాశ్రయాశ్చైవం ముఖాభాసాశ్రయా యథా,
గమ్యంతే శాస్త్రయుక్తిభ్యామిత్యాభాసశ్చ వర్ణితః. 26

వ్యా. కూటస్థాతిరిక్తశ్చిదాభాసోఽపి తైర్వర్ణిత ఇత్యాహ—ఆత్మాభాసేతి. ఆత్మా చాభాసశ్చాశ్రయశ్చాత్మాభాసాశ్రయాశ్చేతి ద్వంద్వస్సమాసః. ముఖాభాసాశ్రయా ఇత్యత్రాపి తథా. ముఖం ప్రసిద్ధమాభాసో ముఖప్రతిబింబః ఆశ్రయో దర్పణాదిశ్చేతి. త్రయం యథా ప్రత్యక్షేణావగమ్యతే ఏవమాత్మా కూటస్థ ఆభాసశ్చిదాభాసః ఆశ్రయోంతఃకరణాదిరితి త్రయోఽపి శాస్త్రయుక్తిభ్యామవగమ్యంత ఇత్యర్థః. అత్ర చాభాసశబ్దేన కూటస్థాతిరిక్తశ్చిదాభాసో వర్ణిత ఇతి భావః మనసస్సాక్షీతి బుద్ధేస్సాక్షీతి బుద్ధిసాక్షిణః కూటస్థస్య ప్రతిపాదకం శాస్త్రం "రూపం రూపం ప్రతిరూపో బభూ" వేతి చిదాభాసప్రతిపాదకం. వికారిత్వావికారిత్వరూపా యుక్తిః పూర్వమేవోక్తేతి భావః.

టీ. ముఖాభాసాశ్రయా యథా = ముఖంబును ప్రతిబింబమును దర్పణము నెట్టులో, ఏవం=ఈవిధముగా, ఆత్మాభాసాశ్రయాశ్చ-ఆత్మ = కూటస్థుఁడును, ఆభాస= చిదాభాసుఁడును, ఆశ్రయాశ్చ = అంతఃకరణమును, శాస్త్రయుక్తిభ్యాం = శాస్త్రము చేతను యుక్తులచేతను, గమ్యంతే= తెలియఁబడుచున్నవి. ఇతి=ఈలాగున, ఆభాసశ్చ = చిదాభాసుఁడును, వర్ణితః = వర్ణింపఁబడెను.

తా. ముఖమును తత్ప్రతిబింబమును దర్పణంబును లోకము నందు ప్రసిద్ధమైన తెఱంగున కూటస్థుఁడును, చిదాభాసుఁడును, అంతఃకరణంబును శాస్త్రయుక్తులచే సుప్రసిద్ధంబులై యున్నవి. అని కూటస్థుని కంటె వేఱుగా చిదాభాసుఁ డంగీకరింపఁబడెను.

అవ. చిదాభాసుని అంగీకరింపఁగూడ దని పూర్వపక్షి యధిక్షేపించుచున్నాఁడు:—

శ్లో. బుద్ధ్యవచ్ఛిన్నకూటస్థో లోకాంతరగమాగమౌ,
కర్తుం శక్తో ఘటాకాశ ఇవాభాసేన కిం వద. 27

వ్యా. తత్ర చిదాభాసమాక్షిపతి—బుద్ధీతి. స్వస్మిన్ కల్ప్యమానయా బుద్ధ్యావచ్ఛిన్నకూటస్థ ఏవ ఘటద్వారా ఘటాకాశ ఇవ బుద్ధిద్వారా లోకాంతరగమనాగమనే కర్తుం శక్నోతి. అతశ్చిదాభాసకల్పనాయాం గౌరవమితి భావః.

టీ. బుద్ధ్యవచ్ఛిన్నకూటస్థః = బుద్ధిపరిచ్ఛిన్నుం డగు కూటస్థుఁడు, లోకాంతరగమాగమౌ = స్వర్గాదిలోకంబులఁగూర్చి గమనాగమనంబులను, ఘటాకాశ ఇవ = ఘటాకాశమువలెను, కర్తుం=చేయుటకొఱకు, శక్తః=సమర్థుఁడు, ఆభాసేన = చిదాభాసునితో, కిం = ఏమి ప్రయోజనమో, వద = చెప్పుము.

తా. బుద్ధియందు వ్యాపించియున్న కూటస్థుఁడు ఘటాకాశము వంటివాఁడు. అతఁడు స్వర్గాదిలోకములకు గమనాగమనంబు లొనర్ప సమర్థుఁడు. బుద్ధియందు చైతన్యప్రతిబింబము నంగీకరించినందువలనఁ బ్రయోజన మే మున్నదో చెప్పుము. ప్రయోజనము లేదని భావము.

అవ. చిదాభాసుని నంగీకరించుటకుఁ గారణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. శృణ్వాసంగః పరిచ్ఛేదమాత్రాజ్జీవో భవే న్నహి,
అన్యథా ఘటకుడ్యాద్యై రవచ్ఛిన్నస్య జీవతా. 28

వ్యా. అసంగస్య కూటస్థస్య బుద్ధ్యవచ్ఛేదమాత్రేణ జీవత్వం న ఘటతే. అన్యథాతిప్రసంగాదితి పరిహరతి—శృణ్వాసంగ ఇతి.

టీ. శృణు = వినుము. అసంగః = సంగములేని చిదాభాసుఁడు, పరిచ్ఛేదమాత్రాత్ = చేరినంతమాత్రమున, జీవః=జీవుఁడు, న భవేద్ధి=కాఁజాలఁడుగదా, అన్యథా= అట్లు కానియెడల, ఘటకుడ్యాద్యైః=కుండ, గోడ మొదలగువానిచేత, అవచ్ఛిన్నస్య= కూడుకొనినచైతన్యమునకు, జీవతా = జీవత్వము, భవేత్ = కావలసివచ్చును.

తా. ఎట్లు ఘటము కుడ్యము మొదలగువానియందు వ్యాప్తం బగుచైతన్యము జీవుఁడు కాకుండునో యట్లు అంతఃకరణమందు వ్యాపించినకూటస్థచైతన్యమునకు జీవత్వము ఘటింప దని తాత్పర్యము.

అవ. అంతఃకరణమునకును ఘటకుడ్యాదులకును దారతమ్యము కలదని శంకించి యట్టి తారతమ్యంబువలననే కూటస్థునికంటె స్వచ్ఛ మగు అంతఃకరణమునందుఁ బ్రతిఫలించిన చిదాభాసుఁడు వేఱని సిద్ధించు నని మూఁడుశ్లోకములలో నిరూపించుచున్నాఁడు:—

శ్లో. న కుడ్యసదృశీ బుద్ధిస్స్వచ్ఛత్వాదితి చేత్తథా,
అస్తు నామ పరిచ్ఛేదే కిం స్వాచ్ఛ్యేన భవేత్తవ. 29

వ్యా. బుద్ధికుడ్యయోస్స్వాచ్ఛ్యాస్వాచ్ఛ్యాభ్యాం వైషమ్యం శంకతే—నేతి. ఉక్తం స్వచ్ఛత్వం పరిచ్ఛేదప్రయోజకం న భవతీత్యాహ—తథా. అస్త్వితి.

టీ. బుద్ధిః=బుద్ధి, స్వచ్ఛత్వాత్=నిర్మలమగుటవలన, కుడ్యసదృశీ=గోడవంటిది, నేతిచేత్ = కాదంటివేని, తథా=అవిధముననే, అస్తు నామ = అగుగాక, పరిచ్ఛేదే=అవచ్ఛిన్నత్వపక్షమునందు, స్వాచ్ఛ్యేన = స్వచ్ఛత్వముచేత, తవ = నీకు, కిం = ఏమి, భవేత్ = అగును? (ఏమి లాభమును లే దనుట).

తా. బుద్ధి నిర్మలమైనది. గోడ మలినమైనది. కాన రెండును సమానములు గావు. అంటివేని సమానములు గాకపోవుఁగాక. అట్టి యుపాధులభేదము అవచ్ఛేదపక్షమునందు అవచ్ఛిన్నునకు లాభనష్టంబులఁ గలుగఁజేయఁజాలదు.

శ్లో. ప్రస్థేన దారుజన్యేన కాంస్యజన్యేన వా నహి,
విక్రేతుస్తండులాదీనాం పరిమాణం విశిష్యతే. 30

వ్యా. ఉక్త మర్థం దృష్టాంతేన స్పష్టయతి—ప్రస్థేనేతి. దారుకాంస్యజన్యయోః ప్రస్థయోస్థితే స్వచ్ఛత్వాస్వచ్ఛత్వే తండులపరిమాణే న్యూనాధికభావహేతూ న భవత ఇత్యర్థః.

టీ. దారుజన్యేన=కొయ్యవలనఁ బుట్టినదిగాని, కాంస్యజన్యేనవా = కంచువలన నేర్పడినట్టిదిగాని, ప్రస్థేన = కుంచముచేత, విక్రేతుః=అమ్మెడివానికి తండులాదీనాం=బియ్యముమొదలగువానియొక్క, పరిమాణం=కొలఁత, న హి విశిష్యతే తారతమ్యమును బొందదు.

తా. అమ్మెడువానికి కంచుమానికతో కొల్చినను కొయ్యమానికతో కొల్చినను బియ్యము మొదలగువానిపరిమాణము సమానముగా నుండును. అట్టులే అంతఃకరణావచ్ఛిన్నుఁడు జీవుఁడైనయెడల ఘటకుడ్యాద్యవచ్ఛిన్నుఁడు జీవుఁ డేల కాఁగూడ దని శంకించువాని భావము.

శ్లో. పరిమాణావిశేషేఽపి ప్రతిబింబో విశిష్యతే,
కాంస్యే యది తదా బుద్ధావప్యాభాసో భవేద్బలాత్. 31

వ్యా. కాంస్యప్రస్థే తండులపరిమాణాధిక్యాభావేఽపి ప్రతిబింబలక్షణమాధిక్య మస్తీత్యాశంక్య తర్హి బుద్ధావపి చిదాభాసో భవత్వైవాంగీకృతస్స్యాదిత్యాహ—పరి మాణావిశేష ఇతి.

టీ. పరిమాణావిశేషేఽపి = పరిమాణమునందు తారతమ్యము లేకపోయినను, కాంస్యే = కంచుమానిక యందు, ప్రతిబింబః=ప్రతిబింబము, విశిష్యతే=అతిశయించు చున్నది. ఇతి యది=ఈలాగంటివేని, తదా = అప్పుడు, బుద్ధావపి = బుద్ధియందును, ఆభాసః = చిదాభాసుఁడు, బలాత్ = నీవాక్యబలమున, భవేత్ = అగును.

తా. దారుపాత్రమందును కాంస్యపాత్రమందును బరిమాణ మొక్కటేయైనను కంచుపాత్రమునందు ధాన్యము ప్రతిఫలించును, అంటివేని నట్లులే కంచుపాత్రమువంటి యంతఃకరణమునందు చైతన్యము ప్రతిబింబించును. ఆప్రతిబింబమే కూటస్థునికంటె వేఱగు చిదాభాసుఁ డని యంగీకరింపక తీరదని భావము.

అవ. ప్రతిబింబమును నంగీకరించినమాత్రమున చిదాభాసు నంగీకరించుట యెట్లగును? అనుదానికి సమాధానము:—

శ్లో. ఈషద్భాసనమాభాసః ప్రతిబింబ స్తథావిధః,
బింబలక్షణహీనస్సన్ బింబవద్భాసతే స హి. 32

వ్యా. ప్రతిబింబాంగీకారే చిదాభాసః కథమంగీకృతస్స్యాదిత్యాశంక్య ప్రతి బింబాభాసశబ్దాభ్యామభిధేయస్యార్థస్యైక్యాదిత్యాహ—ఈషదితి. ప్రతిబింబస్యాభా త్వం కథమిత్యాశంక్యాభాసలక్షణయోగాదిత్యాహ—బింబలక్షణేతి. హి యస్మా త్కారణాత్ప్రతిబింబో బింబలక్షణరహితో బింబవదవభాసతే అతో హేతో ర్బింబా భాస ఇతి భావః.

టీ. ఈషద్భాసనం=ఇంచుకప్రకాశించుట, ఆభాసః = ఆభాసము. ప్రతిబింబః= ప్రతిబింబము, తథావిధః = అట్టిరీతిగలది. సః=ఆప్రతిబింబము, బింబలక్షణహీనస్సన్= బింబలక్షణము లేని దగుచు, బింబవత్ = బింబమువలె, భాసతే హి = ప్రకాశించు చున్నదిగదా.

తా. ఆభాస మన ఇంచుక ప్రకాశించునది. అదియే ప్రతిబింబము. అట్టిది బింబలక్షణము లేక బింబమువలె భాసిల్లును. కాన ప్రతిబింబ మనినను చిదాభాసుఁ డనినను నొక్కటియే.

అవ. ఆభాసమందు ప్రతిబింబలక్షణమును సమన్వయము చేయుచున్నాఁడు:—

శ్లో. ససంగత్వవికారాభ్యాం బింబలక్షణహీనతా,
సూర్తిరూపత్వమేతస్య బింబవద్భాసనం విదుః. 33

వ్యా. ఆభాసలక్షణయోగిత్వమేవ స్పష్టయతి—ససంగత్వేతి. ఏతస్య చిదాభాసస్య సంగత్వవికారిత్వాభ్యాం బింబభూతాసంగావికారిచైతన్యలక్షణహీనత్వం స్ఫురణరూపత్వం బింబవదవభాసనమిత్యర్థః. హేతులక్షణరహితా హేతువదవభాసమానా హేత్వాభాసా ఇతి వదిత్యర్థః.

టీ. ససంగత్వవికారాభ్యాం = సంగముగల్గుటయు వికారమునందుట యను రెండుధర్మములచేత, బింబలక్షణహీనతా = బింబలక్షణములు లేకపోవుట, (భవతి = అగుచున్నది). ఏతస్య = ఈప్రతిబింబమునకు, స్ఫూర్తిరూపత్వం=ప్రకాశరూపత్వము, బింబవత్ = బింబమువలె, భాసనం = ప్రకాశించుట యని, విదుః = తెలిసికొనిరి.

తా. బింబలక్షణము లేనిదగుచు బింబమువలెఁ బ్రకాశించునది ప్రతిబింబము. ప్రతిబింబము దర్పణగతమాలిన్యాదిధర్మములఁ జెందును. ఉత్పత్తిలయాదివికారములఁ జెందును గనుక బింబలక్షణములు దాని యందు లేవు. ప్రకాశించుట యనునదియే బింబముతో పోల్కి గాన ప్రతిబింబలక్షణము దర్పణప్రతిబింబమున సమన్వితము. ఆభాసం బనిన నిదియే.

అవ. ఇటుల చిదాభాసుని నిరూపించి యతఁడు బుద్ధికంటె వేఱని తెల్పుచున్నాఁడు:—

శ్లో. న హి ధీభావభావిత్వాదాభాసోఽస్తి ధియః పృథక్,
యథా మృదల్పమేవోక్తం ధీరప్యేవం స్వదేహతః. 34

వ్యా. ఇత్థం చిదాభాసస్యాప్రయోజకతాం నిరాకృత్య ఇదానీం తస్య బుద్ధేః పృథక్త్వం సాధయితుం పూర్వపక్షమాహ—నహీతి. యథా మృది సత్యామేవ భవన్ ఘటో న మృదో భిద్యతే తద్వదితి భావః. న న్వేవం తర్హి దేహాతిరిక్తా ధీరపి న సిధ్యేదితి ప్రతిబంద్యా పరిహరతి. అల్పమితి.

టీ. ధీభావభావిత్వాత్ =బుద్ధియుండిననే యుండెడివాఁడగుటవలన, ఆభాసః= చిదాభాసుఁడు, యథా మృత్ = మృత్తువలె, ధియః=బుద్ధికంటె, పృథక్ = వేఱుగా, నాస్తి హి=లేఁడు కదా. అల్పమేవ=స్వల్పముగనే, ఉక్తం = చెప్పఁబడినది. ఏవం = ఈవిధముగా, స్వదేహతః = తనదేహముకంటె, ధీరపి = బుద్ధియు, న = వేఱుకాదు.

తా. బుద్ధి యుండినఁగాని తత్ప్రతిబింబితుం డగుచిదాభాసుఁ డుండఁడు. కాన బుద్ధికంటె వేఱుగా చిదాభాసుఁడు లేఁడు. మట్టికంటె కుండ వేఱుగా నుండునా? ఉండదు గదా యని శంకింపఁగా నిట్లంగీకరించితి మేని స్థూలదేహ ముండిననే బుద్ధి యుండును గాన స్థూల దేహముకంటె బుద్ధియు వేఱుగా లే దని యనవలసివచ్చును. కనుక నీపూర్వపక్షము యుక్తము కా దని సిద్ధాంతి ప్రతిబంది యిచ్చుచున్నాఁడు. ప్రతిబంది యనఁగా వాది యొక్క దోషమును గనుపఱుపఁగా దానిపైఁ బ్రతివాది యంతటి మఱియొకదోషమును వానిపక్షమునఁ గనపఱచుట.

అవ. పూర్వపక్షకారుఁడు ప్రతిబందీమోచనమును శంకించుచున్నాఁడు:—

శ్లో. దేహే మృతేఽపి బుద్ధిశ్చేచ్ఛాస్త్రాదస్తి తథా సతి,
బుద్ధేరన్యశ్చిదాభాసః ప్రవేశశ్రుతిషు శ్రుతః. 35

వ్యా. ప్రతిబందీమోచనం శంకతే— దేహేమృత ఇతి. దేహవ్యతిరిక్తాయా బుద్ధేస్సవిజ్ఞానో భవతీత్యాది శ్రుతిసిద్ధత్వాన్నా సత్త్వమితి భావః. నను శ్రుతిబలాద్దేహాతిరిక్తా బుద్ధిరభ్యుపగమ్యతే చేత్తర్హి ప్రవేశశ్రుతిబలాద్బుద్ధ్యతిరిక్తశ్చిదాభాసోఽప్యభ్యుపేయ ఇత్యాహ—తథాసతీతి.

టీ. దేహే = శరీరము, మృతేఽపి = మరణించినను, శాస్త్రాత్ = శాస్త్రము వలన, బుద్ధిః = బుద్ధి, అస్తి చేత్ = ఉన్నదంటివా, తథాసతి = అట్లైనయెడల, బుద్ధేః = బుద్ధికంటె, అన్యః = వేఱైన, చిదాభాసః = చిదాభాసుఁడు, ప్రవేశశ్రుతిషు = ప్రవేశశ్రుతులయందు, శ్రుతః = చెప్పఁబడెను.

తా. శరీరమును బుద్ధియు నొక్కటి గాదు; శరీరము నష్టమైనను సూక్ష్మశరీరం బగు బుద్ధి గల దని శాస్త్రము దెల్పుచున్న దని యంటివేని అట్టిశాస్త్రము బుద్ధికంటె వేఱుగా చిదాభాసుఁడు బుద్ధిలోఁ బ్రవేశించె నని చెప్పుచున్నది గనుక బుద్ధికంటె వేఱుగా చిదాభాసుని నంగీకరించి తీఱవలెను.

అవ. చిదాభాసుఁడు బుద్ధితోఁ గలసియే ప్రవేశించును గాని బుద్ధ్యతిరిక్తుఁ డగుచు బుద్ధిలోఁ బ్రవేశించు నని శ్రుతియం దెక్కడను వక్కాణింపఁబడి యుండ లే దనుటకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ధీయుక్తస్య ప్రవేశశ్చేన్నైతరేయే ధియః పృథక్,
ఆత్మా ప్రవేశం సంకల్ప్య ప్రవిష్ట ఇతి గీయతే. 36

వ్యా. నను బుద్ధ్యుపాధికస్యైవ ప్రవేశో యుజ్యతే నేతరస్యేతి శంకతే—ధీయుక్తస్యేతి. ఐతరేయశ్రుతౌ బుద్ధ్యతిరిక్తస్యైవ ప్రవేశశ్రవణాన్నైవమితి పరిహరతి—ఐతరేయ ఇతి.

టీ. ధీయుక్తస్య = బుద్ధితోఁగూడిన చిదాభాసునకు, ప్రవేశశ్చేత్ = ప్రవేశమంటివా, న = కాదు. ఐతరేయే = ఐతరేయశ్రుతియందు, ధియః = బుద్ధికంటె, పృథక్ = వేఱుగా, ఆత్మా = ఆత్మ, ప్రవేశం = ప్రవేశమును, సంకల్ప్య = సంకల్పించి, ప్రవిష్టః = ప్రవేశించెను. ఇతి = అని, గీయతే = చెప్పఁబడుచున్నది.

తా. చిదాభాసుఁడు బుద్ధితోఁ గలసియే మఱియొక చోటఁ బ్రవేశించునుగాని బుద్ధికంటె వేఱుగా బుద్ధిలోఁ బ్రవేశించుట వేదమందెచ్చటను చెప్పఁబడియుండలేదని యనఁ జెల్లదు. ఐతరేయశ్రుతియందు చిదాభాసుఁడు సంకల్పపూర్వకముగా బుద్ధిలోఁ బ్రవేశించినట్లు చెప్పంబడెను.

అవ. ఐతరేయశ్రుత్యర్థమును బఠించుచున్నాఁడు:—

శ్లో. కథం త్విదం సాక్షదేహం మదృతే స్యాదితీరణాత్,
విదార్య మూర్ధసీమానం ప్రవిష్టస్సంసరత్యయమ్. 37

వ్యా. తాం శ్రుతిమర్థతః పఠతి—కథం త్వితి. అయం పరమాత్మా సాక్షదేహం అక్షాణి దేహశ్చాక్షదేహాస్తైస్సహ వర్తత ఇతి సాక్షదేహమిదం జడజాతం మదృతే చేతనం మాం విహాయ కథన్ను స్యాన్న కథమపి నిర్వహేదితి విచార్య మూర్ధసీమానం కపాలత్రయమధ్యదేశం విదార్య సన్నిధిమాత్రేణ భిత్వా ప్రవిష్టస్సన్ సంసరతి జాగ్రదాదిక మనుభవతీత్యర్థః.

టీ. సాక్షదేహం=ఇంద్రియములతోను దేహముతోను గూడిన, ఇదం = ఈజడసమూహము, మదృతే = నన్ను వినాగా, కథం స్యాదితి = ఎట్లుగా నుండునని, ఈరణాత్ = చెప్పుటవలన, మూర్ధసీమానం = కపాల మధ్యప్రదేశమును, విదార్య = భేదించి, ప్రవిష్టః = ప్రవేశించినవాఁడై, అయం = ఈచిదాభాసుఁడు, సంసరతి = సంసారమును బొందుచున్నాఁడు.

తా. శరీరము ఇంద్రియములును మనస్సును మొదలగుజడసమూహము నేను లేనిది యుండ దని శిరోభాగమును భేదించుకొని చిదాభాసుఁడు ప్రవేశించి సంసార మనుభవించు నని ఐతరేయశ్రుతి దెల్పుచున్నది. ఇక్కడ బుద్ధికంటె వేఱగు చిదాభాసుఁడు బుద్ధియందుఁ బ్రవేశించె నని చెప్పఁబడినది.

అవ. అసంగునకు ప్రవేశ మెట్లు లని శంకించుచున్నాఁడు:—

శ్లో. కథం ప్రవిష్టోఽసంగశ్చేత్ సృష్టి ర్వాస్య కథం వద,
మాయికత్వం తయో స్తుల్యం వినాశశ్చ సమ స్తయోః. 38

వ్యా. నన్వసంగస్యాత్మనః ప్రవేశోఽప్యయుక్త ఇతి శంకతే—కథం ప్రవిష్ట ఇతి. ఇదం చోద్యం సృష్టావపి సమానమిత్యాహ—సృష్టిరితి. సృష్టికర్తుర్మాయికత్వాన్న దోష ఇత్యాశంక్యాయం పరిహారః ప్రవేష్టర్యపి సమాన ఇత్యాహ—మాయికత్వమితి. అనయోర్మాయికత్వే హేతుశ్చ సమాన ఇత్యాహ—వినాశ ఇతి.

టీ. అసంగః = అసంగుఁడగుఆత్మ, కథం = ఎట్లుగా, ప్రవిష్టశ్చేత్=ప్రవేశించు ననెదవేని, అస్య = ఈయసంగు: డగుఆత్మకు, సృష్టిర్వా = సృష్టియైనను, కథం = ఎట్లు అగును? వద = చెప్పుము. తయోః = ఆప్రవేశించెడువానికిని సృజించెడువానికిని, మాయికత్వం = మాయామయత్వము, తుల్యం = సమానము. తయోః = ఆయిద్దఱికిని, వినాశశ్చ = వినాశంబును, సమః = సమానమైనది (అగును.)

తా. అసంగుఁడగుఆత్మ అంతఃకరణములో నెట్లు ప్రవేశించె నని శంకింపవలదు. అసంగ మగు ఆత్మ ఎట్లు జగంబును సృజించెనో చెప్పుము. సృజించుట మాయిక మంటివా? ప్రవేశించుటయును నట్టిదే ప్రవేశించెడివాఁడును సృజించెడివాఁడును మాయికు లనుటకు శ్రుతియందు వీరిద్దఱికి నాశము చెప్పుటయే యాధారము.

అవ. చిదాభాసుఁడును నశించు ననుటకుఁ బ్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. సముత్థాయైష భూతేభ్య స్తాన్యేవానువినశ్యతి,
వినష్టిమితి మైత్రేయ్యై యాజ్ఞవల్క్య ఉవాచ హి. 39

వ్యా. 'ప్రజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తీతి' ఔపాధికరూపస్య వినాశిత్వప్రతిపాదికాం శ్రుతిం దర్శయతి— సముత్థాయేతి. ఏష ప్రజ్ఞానఘన ఆత్మా ఏతేభ్యో దేహేంద్రియాదిరూపేభ్యః పంచ భూతకార్యేభ్యో నిమిత్తభూతేభ్యః ఉపాధ్యస్సముత్థాయ జీవత్వాభిమానం ప్రాప్య తాన్యేవ దేహాదీని వినశ్యంత్యనువినశ్యతి. తేషు వినశ్యత్సు తత్కృతం జీవత్వాభి మానం జహాతి. ఏవంప్రకారేణ సోపాధికరూపస్య వినాశిత్వం యాజ్ఞవల్క్యో మైత్రేయ్యై ఉవాచ ఉక్తవానిత్యర్థః.

టీ. ఏషః=ఈయాత్మ, భూతేభ్యః=పంచభూతకార్యము లగు దేహేంద్రియాది రూపమువలన, సముత్థాయ = జీవత్వాభిమానమును బొంది, తాన్యేవ = ఆదేహాదులు, వినష్టిం=నాశమును బొందుచుండఁగా, అనువినశ్యతీతి = అనుసరించి నాశమును బొందు

చున్నాఁడు (జీవత్వాభిమానమును విడుచుచున్నాఁడు) అని, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యఋషి, మైత్రేయ్యై = మైత్రేయికి, ఉవాచ హి = చెప్పెను.

తా. జీవుఁడు పంచభూతమయ మగునంతఃకరణ మనెడి యుపాధి వలన జీవత్వాభిమానము చెంది యది నశించినప్పుడు తానును నశించుచున్నాఁడు. అనఁగా జీవత్వాభిమానమును వదలుచున్నాఁడు. అని యాజ్ఞవల్క్యశ్రుతి చెప్పుచున్నది.

అవ. కూటస్థనిత్యత్వమునుగూర్చి శ్రుతిని గనఁబఱచుచున్నాడు:—

శ్లో. అవినాశ్యయమాత్మేతి కూటస్థః ప్రవివేచితః,
మాత్రాసంసర్గ ఇత్యేవమసంగత్వస్య కీర్తనాత్. 40

వ్యా. "అవినాశీ వా అరేఽయమాత్మానుచ్ఛిత్తిధర్మా" ఇతి శ్రుత్యా కూటస్థస్తతో విభిన్నః ప్రదర్శిత ఇత్యాహ—అవినాశీతి. 'మాత్రాసంసర్గస్త్వస్య భవ'తీతి శ్రుత్యాఽవినాశిత్వే హేతుమసంగత్వం చోక్తవానిత్యాహ—మాత్రేతి. మీయంత ఇతి మాత్రా దేహాదయస్తాభిరస్యాత్మనోఽసంసర్గో భవతీత్యర్థః.

టీ. అయం ఆత్మా=ఈయాత్మ, అవినాశీతి=నశించెడువాఁడు గాఁ డని చెప్పెడి శ్రుతిచేత, కూటస్థః=కూటస్థుఁడు, మాత్రాసంసర్గః=విషయములతోఁ గూడికొనువాఁడు గాఁడు, ఇత్యేవం = ఈలాగున, అసంగత్వస్య = అసంగత్వముయొక్క, కీర్తనాత్ = చెప్పుటవలన, ప్రవివేచితః = వివేచన చేయఁబడెను.

తా. ఆత్మ నశించెడువాఁడు కాఁడు. ఆతఁడు దేహాదులలో సంసక్తి నొందఁడు. అని యనుటంజేసి యీబృహదారణ్యకశ్రుతి కూటస్థునే ప్రతిపాదించుచున్నదని గ్రహింపనగును.

అవ. 'జీవాపేత' మిత్యాది శ్రుతి జీవుఁడు (చిదాభాసుఁడు) నశింపఁ డని దెల్పుచుండ నాచిదాభాసుఁడు నశించునని యనుట తగదు. అనుటకు సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. జీవాపేతం వావ కిల శరీరం మ్రియతే న సః,
ఇత్యత్ర న విమోక్షోఽర్థః కింతు లోకాంతరే గతిః. 41

వ్యా. నను 'జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత' ఇతి శ్రుత్యా అస్యౌపాధికస్యాప్యవినాశిత్వం ప్రతిపాద్యత ఇత్యాశంక్య తస్యాశ్శ్రుతేర్దేహాంతర ప్రాప్తివిషయతయా నాత్యంతికనాశాభావపరత్వమిత్యాహ—జీవాపేతమితి. జీవాపేతం జీవరహితం జీవేనత్యక్తమితి యావత్. వావ ఏవ జీవో న మ్రియత ఇత్యర్థః.

టీ. జీవాపేతం = జీవునిచే వదలిపెట్టఁబడినట్టి, శరీరంవావకిల = శరీరమే, మ్రియతే = నశించును. సః = ఆచిదాభాసుఁడు, (జీవుఁడు) న మ్రియతేతి = నశింపఁడని, అత్ర=ఈ శ్రుతియందు, విమోక్షః=మోక్షము, అర్థః=అర్థము, న=కాదు. కింతు=ఇఁక నేమి యన, లోకాంతరే=లోకాంతరమున, గతిః=ప్రాప్తి (అగుచున్నది.)

తా. "జీవాపేతం" అను శ్రుతి శరీరము నశించును గాని జీవుఁడు నశింపఁడని చెప్పుచున్నది. జీవుఁడు నశించు నని నీ వెట్లు చెప్పితి వని యనవలదు. ఆ శ్రుతి మోక్షమును జెప్పుటలేదు. జీవుఁడు స్థూల శరీరమును వదలి లోకాంతరములకుఁ బోవు నని చెప్పుచున్నది గాని మోక్షదశలో జీవత్వము నశింప దని చెప్పుటలేదు. అనఁగా జీవునకు దేహాంతరప్రాప్తినిఁ జెప్పుచున్నదేకాని మోక్షదశయందు నాశము లే దని యీ శ్రుతి చెప్పుట లే దని యభిప్రాయము.

అవ. జీవుఁడు నశించునెడల నశింపని బ్రహ్మమును దాను తెలిసికొను టెట్లు? అను ప్రశ్నకు సమాధానము:—

శ్లో. నాహం బ్రహ్మేతి బుద్ధ్యేత స వినాశీతి చేన్న తత్,
సామానాధికరణ్యస్య బాధాయామపి సంభవాత్. 42

వ్యా. నను జీవస్య వినాశిత్వేఽహం బ్రహ్మాస్మీత్యవినాశి బ్రహ్మ తాదాత్మ్యజ్ఞానం న ఘటత ఇతి శంకతే—నాహమితి. వినాశీ స జీవోఽహం బ్రహ్మేతి బ్రహ్మరూపేణాత్మానం న బుద్ధ్యేత న జానీయాత్. వినాశ్యవినాశినోరేకత్వవిరోధాదితి చేన్ముఖ్య సామానాధికరణ్యాభావేఽపి బాధాయాం సామానాధికరణ్యసంభవాత్. జీవభావబాధేన బ్రహ్మభావోఽవగంతుం శక్యత ఇత్యాహ—న తదితి.

టీ. సః వినాశీ=ఆ నశించెడి జీవుఁడు, అహం బ్రహ్మేతి=నేను బ్రహ్మ మనిన, న బుద్ధ్యేతేతిచేత్ = ఎఱుంగఁడని యనెదవేని, తత్ = అట్లు, న=కాదు. సామానాధికరణ్యస్య = సామానాధికరణ్యమునకు, బాధాయామపి = బాధయందును, సంభవాత్ = సంభవించుటవలన (న తత్=అట్లు కా దని). పూర్వవాక్యముతో నన్వయము.

తా. నశించెడి జీవుఁడు నశింపని బ్రహ్మమే నే నని యెట్లనుకొనును? ఇది విరుద్ధము గదా యని యనవలదు. నేను బ్రహ్మము ననఁగా నాయొక్క కర్తృత్వస్వరూప మసత్యము, నానిజరూపము బ్రహ్మమే యని దీనిభావము. దీనిని బాధాసామానాధికరణ్య మని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు.

అవ. ఈ యర్థమునందుఁ బ్రమాణముం గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. యోఽయం స్థాణుః పుమానేష పుంధియా స్థాణుధీరివ,
బ్రహ్మాస్మీతి ధియాఽశేషా హ్యహంబుద్ధిర్నివర్త్యతే. 43

వ్యా. బాధాసామానాధికరణ్యేన వాక్యార్థప్రతిపత్తిప్రకారో వార్తికకారైస్సదృష్టాంతోఽభిహిత ఇతీమమర్థం తద్వాక్యోదాహరణపూర్వకం దర్శయతి—యోఽయం స్థాణురితి. సామానాధికరణ్యస్య బాధార్థత్వం "స్థాణురేష పుమా" నిత్యస్మిన్వాక్యే పురుషత్వబోధేన స్థాణుత్వబుద్ధి ర్నివర్తతే యథా ఏవ మహం బ్రహ్మాస్మీతి బోధేనాహం బుద్ధిః కర్తాహ మస్మీ త్యేవ మాదిరూపా సర్వాపి నివర్త్యత ఇతి.

టీ. యోఽయం = ఏయీ, స్థాణుః = దుంగ గలదో, ఏషః = ఇది, పుమాన్ = పురుషుఁడు (ఇతి=ఇట్టి, పుంధియా = పురుషబుద్ధిచేత, స్థాణుధీరివ = స్థాణుబుద్ధివలెనే, బ్రహ్మాస్మీతి ధియాఽపి = నేను బ్రహ్మమ నను జ్ఞానముచేతను, ఏషా అహంబుద్ధిః = ఈ యహం బుద్ధి నే ననుజ్ఞానము), నివర్త్యతే హి = నివర్తింపఁజేయఁబడుచున్నదిగదా.

తా. "స్థాణురేషః పుమాన్" (స్థాణువుగఁదోఁచునది పురుషుఁడు) అనెడి వాక్యమందు పురుషత్వబుద్ధిచేత స్థాణుత్వబుద్ధి నివర్తించుచున్నది. ఇది సామానాధికరణ్యముయొక్క బాధార్థమందు దృష్టాంత మగును. ఈ ప్రకారమే "అహం బ్రహ్మాస్మి" యనెడి బోధచేత 'నేను కర్తనై తి' ననెడి యిత్యాదిరూప సర్వసంసారబుద్ధి (అహంబుద్ధి) నివర్తించుచున్నది.

శ్లో. నైష్కర్మ్యసిద్ధావప్యేవమాచార్యైస్స్పష్టమీరితమ్,
సామానాధికరణ్యస్య బాధార్థత్వమతోఽస్తు తత్. 44

వ్యా. నైష్కర్మ్యేతి. ఏవముక్తేన ప్రకారేణాచార్యైర్వార్తికకారైర్నైష్కర్మ్యసిద్ధౌ సామానాధికరణ్యస్య బాధార్థత్వం స్పష్టమీరితమితి ఫలితమాహ—అతోఽస్తుతదితి. అతః కారణాద్బ్రహ్మాహమస్మీతి వాక్యే తత్సామానాధికరణ్యస్య బాధార్థత్వమస్త్విత్యర్థః.

టీ. ఏవం=ఈవిధముగాను, నైష్కర్మ్యసిద్ధావపి=నైష్కర్మ్యసిద్ధి యను గ్రంథంబునను, ఆచార్యైః = సురేశ్వరాచార్యులచేత, సామానాధికరణ్యస్య = సమానవిభక్తిప్రయోగమునకు, బాధార్థత్వం=బాధయే యర్థముగాఁ గల్గుట, స్పష్టం = స్ఫుటముగా, ఈరితం = చెప్పఁబడినది. అతః=ఈ హేతువువలన, తత్=ఆసామానాధికరణ్యబాధార్థత్వము, అస్తు = నేను బ్రహ్మమనైతి ననెడివాక్యమం దగుఁగాక.

తా. ఈవిధముగా నైష్కర్మ్యసిద్ధియందు నేను బ్రహ్మమ నను నప్పుడు నేను అనెడి చిదాభాసరూపము బాధిత ంబగు నని సామానాధి కరణ్యము బాధార్థక నుని సురేశ్వరునిచేఁ జెప్పఁబడెను. కనుక నదియే యుక్తముగా నున్నది.

అవ. ఇట్టి సామానాధికరణ్యము శ్రుతులలో మఱెచ్చటనైనఁ గలదా యని శంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వం బ్రహ్మేతి జగతా సామానాధికరణ్యవత్,
అహం బ్రహ్మేతి జీవేన సమానాధికృతిర్భవేత్. 45

వ్యా. నన్వేవమపి శ్రుతిషు బాధాయాం సామానాధికరణ్యం న క్వాపి దృష్ట మిత్యాశంక్య సర్వం హ్యేతద్బ్రహ్మే త్యత్ర బాధాయాం సామానాధికరణ్య దృష్ట మతోఽత్రాపి తద్వద్భవిష్యతీత్యాహ—సర్వం బ్రహ్మేతీతి.

టీ. సర్వం బ్రహ్మేతి = అంతయు బ్రహ్మమే యని, జగతా = ప్రపంచముతో, సామానాధికరణ్యవత్=సామానాధికరణ్యమువలె, అహం బ్రహ్మేతి = నేను బ్రహ్మమ నని, జీవేన=జీవునితో, సమానాధికృతిః=సామానాధికరణ్యము, భవేత్=అగును.

తా. "సర్వం హ్యేతద్బ్రహ్మ" అను శ్రుతియందు సర్వము బ్రహ్మమనునపుడు సర్వ మనునది యసత్యము, బ్రహ్మమనునది నిజము, అని యెట్లు గ్రహింపవలెనో అట్లే నేను బ్రహ్మమ నననపుడు నే నను నది యసత్యము. బ్రహ్మ మనునదియే నిజ మని గ్రహింపవలయును.

అవ. అట్లైనయెడల వివరణకారులు సామానాధికరణ్యమునకు బాధాత్వము నెందుకు నిరాకరించిరి అను ప్రశ్నమునకు సమాధానము:—

శ్లో. సామానాధికరణ్యస్య బాధార్థత్వం నిరాకృతమ్,
ప్రయత్నతో వివరణే కూటస్థస్య వివక్షయా. 46

వ్యా. నను తర్హి వివరణాచార్యైర్బాధసామానాధికరణ్యం కుతో నిరాకృతమి త్యాశంక్య తైరహంశబ్దేన కూటస్థస్య వివక్షితత్వాదిత్యాహ—సామానాధికరణ్యస్యేతి.

టీ. వివరణే = వివరణమునందు, కూటస్థస్య = కూటస్థునియొక్క, వివక్షయా = చెప్పవలె ననెడి యిచ్ఛచేత, ప్రయత్నతః=ప్రయత్నమువలన, సామానాధికరణ్యస్య = సామానాధికరణ్యమునకు, బాధార్థత్వం = బాధయే యర్థముగాఁ గల్గుట, నిరాకృతం= నిరాకరింపఁబడినది.

తా. వివరణకారులు నే ననుమాటకు కూటస్థుఁ డర్థమని యంగీ కరించి నేను బ్రహ్మమ నననప్పుడు ఈ సమానవిభక్తిప్రయోగము

బాధార్థకము గా దని నిరూపించిరి. నే ననఁగా కూటస్థుఁడు. అతఁడు అబాధితుఁడు గాన నీసామానాధికరణ్యము బాధార్థకము గా దని వారి (వివరణకారుని) యభిప్రాయము.

అవ. దీనినే వివరింపుచున్నాఁడు:—

శ్లో. శోధిత స్త్వంపదార్థో యః కూటస్థో బ్రహ్మరూపతాం,
తస్య వక్తుం వివరణే తథోక్తమితరత్ర చ. 47

వ్యా. కూటస్థత్వవివక్షయేత్యుక్తమర్థం వివృణోతి—శోధిత ఇతి. శోధితో బుద్ధ్యాదిభ్యో వివేచిత స్త్వంపదలక్ష్యో యః కూటస్థో వక్ష్యమాణలక్షణ స్తస్య బ్రహ్మరూపతాం సత్యత్వాదిలక్షణబ్రహ్మరూపతాం వక్తుం వివరణాదిషు బాధాసామానాధికరణ్యనిరాకరణపూర్వకం ముఖ్యసామానాధికరణ్యముక్తమిత్యర్థః.

టీ. శోధితః=బుద్ధ్యాదులవలన వేఱుపఱచఁబడిన, త్వంపదార్థః=త్వంపదార్థమైన, యః కూటస్థః=ఏకూటస్థుఁడు గలఁడో, తస్య=అతనికి, బ్రహ్మరూపతాం=బ్రహ్మస్వరూపమును, వక్తుం=చెప్పుటకొఱకు, వివరణే = వివరణగ్రంథమునందు, తథా = ఆవిధముగా, ఉక్తం=చెప్పఁబడినది. ఇతరత్ర చ = మఱియొకచోటను, (ఉక్తం = చెప్పఁబడినది.)

తా. బుద్ధ్యాదివిలక్షణుఁడును త్వంపదలక్ష్యార్థంబు నగు కూటస్థుఁడే బ్రహ్మ మని చెప్పుటకు వివరణకారు లట్లు బాధార్థత్వము నిరాకరించిరి.

అవ. కూటస్థునకు బ్రహ్మముతో నైక్యమును సంభావించుటకొఱకు కూటస్థశబ్దము యొక్క అర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. దేహేంద్రియాదియుక్తస్య జీవాభాసభ్రమస్య యా,
అధిష్ఠానచితిస్సైషా కూటస్థోఽత్ర వివక్ష్యతే. 48

వ్యా. ఇదానీం కూటస్థస్య బ్రహ్మణైక్యం సంభావయితుం కూటస్థశబ్దేన వివక్షితమర్థమాహ—దేహేతి. ఆదిశబ్దేన మనఆదయో గృహ్యంతే ఏవం చ దేహేంద్రియాదియుక్తస్య శరీరద్వయయుక్తస్య జీవాభాసభ్రమస్య చిదాభాసరూపభ్రమస్య యాధిష్ఠానచితిర్యదధిష్ఠానచైతన్యమస్తి తదత్ర వేదాంతేషు కూటస్థత్వేన వివక్షితమిత్యర్థః.

టీ. దేహేంద్రియాదియుక్తస్య = శరీరేంద్రియాదులతోఁ గూడుకొనిన, చిదాభాసభ్రమస్య=చిదాభాసభ్రమకు, యా అధిష్ఠానచితిః = ఏయధిష్ఠానచైతన్యము గలదో, సైషా = ఆయీచైతన్యము, అత్ర=ఈశాస్త్రమునందు, కూటస్థః = కూటస్థుఁడని, వివక్ష్యతే=వివక్ష చేయఁబడుచున్నాఁడు (అంగీకరింపఁబడుచున్నాఁడు.)

తా. దేహేంద్రియాదులతాదాత్మ్యమును బొందినచిదాభాసున కాధారభూత మగు చైతన్యమే కూటస్థుఁ డని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది.

అవ. బ్రహ్మశబ్దంబున కర్థము చెప్పుచున్నాఁడు:—

శ్లో. జగద్భ్రమస్య సర్వస్య యదధిష్ఠానమీరితం,
త్రయ్యంతేషు తదత్ర స్యాద్బ్రహ్మశబ్దవివక్షితమ్. 49

వ్యా. బ్రహ్మశబ్దస్య చార్థమాహ—జగదితి. కృత్స్నజగత్కల్పనాధిష్ఠానం యచ్చైతన్యం వేదాంతేషు నిరూపితం తదత్ర బ్రహ్మశబ్దేన వివక్షితమిత్యర్థః.

టీ. సర్వస్య=సమస్తమైన, జగద్భ్రమస్య = జగత్తనియెడి భ్రమకు, త్రయ్యంతేషు=ఉపనిషత్తులయందు, యత్=ఏది, అధిష్ఠానం=అధిష్ఠాన మని, ఈరితం = చెప్పఁబడినదో, తత్=అది, అత్ర = ఈమహావాక్యమునందు, బ్రహ్మశబ్దవివక్షితం = బ్రహ్మశబ్దముచే చెప్పఁబడినది, స్యాత్ = అగును.

తా. సకలజగత్కల్పన కాధారభూతమై వ్యాపక మగు చైతన్యమే బ్రహ్మశబ్దార్థము.

అవ. జీవుఁడు కల్పితుఁడు గాఁడే. జీవున కధిష్ఠానము కూటస్థుఁ డని యెట్లు చెప్పెదవు ? అని యడుగఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏకస్మిన్నేవ చైతన్యే జగదారోప్యతే యదా,
తదా తదేకదేశస్య చిదాభాసస్య కా కథా. 50

వ్యా. నను జీవభ్రమాధిష్ఠానం చైతన్యం కూటస్థ ఇత్యుక్తమనుపపన్నం జీవస్యారోపితత్వాసిద్ధేరిత్యాశంక్య తస్యారోపితత్వం కైముతికన్యాయేన సాధయతి—ఏకస్మిన్నితి. జగదేకదేశత్వం చానేన జీవేనాత్మనాను ప్రవిశ్యేత్యాది శ్రుతిసిద్ధమ్.

టీ. ఏకస్మిన్నేవ=ఒక్కటేయైన, చైతన్యే=చైతన్యమునందు, జగత్ = జగత్తు, యదా=ఎప్పుడు, ఆరోప్యతే=ఆరోపింపఁబడుచున్నదో, తదా=అప్పుడు, తదేకదేశస్య=జగదంతర్భూతుఁ డగు, చిదాభాసస్య = జీవునకు కల్పన, కా కథా = ఎక్కడివార్త.

తా. జగత్తంతయు బ్రహ్మమందుఁ గల్పిత మని యొప్పుకొనినప్పుడు జగదేకదేశభూతుఁ డగు చిదాభాసుఁడు బ్రహ్మ మగు కూటస్థుని యందుఁ గల్పితుఁ డనుటకు సంశయము లేదు.

అవ. చైతన్య మొక్కటి గదా. తత్పదార్థ మని త్వంపదార్థ మనియు భేద మెందు కనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. జగత్తదేకదేశాఖ్యసమారోప్యస్య భేదతః,
తత్త్వంపదార్థౌ భిన్నౌ స్తో వస్తుతస్త్వేకతా చితేః. 51

వ్యా. నను జగదధిష్ఠానచైతన్యస్యైకత్వాత్తత్త్వంపదార్థయోః భేదాభావే తత్త్వంపదార్థయోః పౌనరుక్త్యమిత్యాశంక్య తయోరౌపాధికో భేదో వాస్తవమైక్యమిత్యాహ—జగదితి. జగదితి తదేకదేశ ఇతి చ ఆఖ్యా యస్య సమారోప్యస్య తత్తథా జాతావేకవచనమ్.

టీ. జగత్తదేకదేశాఖ్యసమారోప్యస్య - జగత్ = జగత్తు, తదేకదేశ = జగదేకదేశమగు నంతఃకరణము నసెడి, సమారోప్యస్య = ఆరోపింపఁదగినపదార్థముయొక్క, భేదతః=భేదమువలన, తత్త్వంపదార్థౌ = తత్పదార్థత్వంపదార్థములు, భిన్నౌ = భిన్నములు, స్తః=అగుచున్నవి. వస్తుతస్తు=యథార్థముగా, చితేః=చైతన్యమునకు, ఏకతా = ఏకత్వము, (అస్తి=అగుచున్నది).

తా. జగత్కల్పన కాధార మగు బ్రహ్మము తత్పదార్థము. జగత్తులోఁ జేరినయంతఃకరణపుంగల్పనకు నాధార మగు చైతన్యము త్వంపదార్థము ఈకల్పితములను విడనాడి చూచినయెడల చైతన్య మొక్కటియే యగును.

అవ. చిదాభాసుఁడు కల్పితుం డనుటకు హేతువులం జెప్పుచున్నాఁడు:—

శ్లో. కర్తృత్వాదీన్ బుద్ధిధర్మాన్ స్ఫూర్త్యాఖ్యాం చాత్మరూపతాం,
దధద్విభాతి పురత ఆభాసోఽతో భ్రమో భవేత్. 52

వ్యా. నను చిదాభాసస్య శుక్తికారజతాదివదధిష్ఠానారోప్యోభయధర్మవత్త్వానుపలంభాత్కథమారోపితత్వ మిత్యాశంక్యాహ—కర్తృత్వాదీనితి. బుద్ధ్యుపాధిద్వారా సమారోప్యమాణా న్కర్తృత్వభోక్తృత్వప్రమాతృత్వాదీన్, స్ఫురణలక్షణమాత్మరూపత్వం చ దధత్పురతోభాతి స్పష్టం ప్రతిభాసతే. అత ఆభాసః కల్పిత ఇత్యర్థః.

టీ. కర్తృత్వాదీన్ = కర్తృత్వము మొదలగు, బుద్ధిధర్మాన్=అంతఃకరణధర్మములను, స్ఫూర్త్యాఖ్యాం=స్ఫురణ మను పేరుగల, ఆత్మరూపతాం=ఆత్మరూపత్వమును, దధత్ = ధరించినవాఁడై, పురతః=ముందు, విభాతి=ప్రకాశించుచున్నాఁడు. అతః = ఈ హేతువువలన, ఆభాసః = చిదాభాసుఁడు, భ్రమః = భ్రాంతికల్పితుఁడు, భవేత్ = అగును.

తా. చిదాభాసుఁడు నేను కర్త నని యనుకొనును. కర్తృత్వము తనది కాదు. అది బుద్ధిధర్మము. ప్రకాశించుట యాత్మధర్మము. ఈ

రెండింటిని జేర్చుకొని దర్పణధర్మమును ముఖధర్మమును జేర్చుకొని యెదుటఁ బ్రకాశించు ముఖప్రతిబింబమువలె చిదాభాసుఁడు భ్రాంతి కల్పితుం డగు నని భావము.

అవ. ఇట్టి భ్రాంతికిఁ గారణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. కా బుద్ధిః కోఽయ మాభాసః కోవాఽఽత్మాత్ర జగత్కథం,
ఇత్యనిర్ణయతో మోహో హేయ స్సంసార ఇష్యతే. 53

వ్యా. అస్య భ్రమస్య కిం కారణ మిత్యాకాంక్షాయాం బుద్ధ్యాదిస్వరూపాపరిజ్ఞానమేవేత్యాహ—కా బుద్ధిరితి. తస్య నివర్తనీయత్వాయానర్థహేతుమాహ—హేయ ఇతి.

టీ. బుద్ధిః=బుద్ధి, కా=ఏది? అయం ఆభాసః=ఈచిదాభాసుడు, కః = ఎవఁడు? ఆత్మా=ఆత్మ, కోవా=ఎవ్వఁడు? అత్ర = ఈయాత్మయందు, జగత్ = జగత్తు, కథం= ఎట్లుగా నుండెను? ఇతి = ఈప్రకారము, అనిర్ణయతః = నిర్ణయము లేకపోవుటవలనఁ గలిగిన, హేయః = వదలఁదగిన, మోహః = అవివేకము, సంసారః = సంసార మని, ఇష్యతే = అంగీకరింపఁబడుచున్నది,

తా. ఎట్టిది బుద్ధి? చిదాభాసుఁ డెవఁడు? ఆత్మ యన నెట్టిది? జగత్తునకు రూప మెద్ది? అని విచారింపనంతకాలము దుఃఖ మగు సంసార మనువర్తించును. చిదాభాసునకు అజ్ఞానమే కారణ మని ముఖ్య తాత్పర్యము.

అవ. ఇట్టిసంసారమును దొలఁగింపఁజేయుసాధనమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బుద్ధ్యాదీనాం స్వరూపం యో వివినక్తి స తత్త్వవిత్,
స ఏవ ముక్త ఇత్యేవం వేదాంతేషు వినిశ్చయః. 54

వ్యా. అస్య కిన్నివర్తకమిత్యాకాంక్షాయాం బుద్ధ్యాదిస్వరూపవివేక ఏవ నివర్తక ఇత్యభిప్రేత్య తద్వానేవ జ్ఞానీ. తత ఏవానర్థనివృత్తిరిత్యాహ—బుద్ధ్యాదీనామితి.

టీ. బుద్ధ్యాదీనాం = బుద్ధి మొదలగువానియొక్క, స్వరూపం = స్వరూపమును, యః=ఎవ్వఁడు, వివినక్తి=వివేచించి గ్రహించునో, సః=వాఁడు, తత్త్వవిత్ = తత్త్వవిదుఁడు, స ఏవ=వాఁడే, ముక్తః=ముక్తుఁడు, ఇత్యేవం=ఈలాగున, వేదాంతేషు=వేదాంతములయందు, వినిశ్చయః = నిశ్చయము.

తా. బుద్ధి మొదలగునవి తనకంటె వేఱనియు మిథ్యాభూతంబులనియును గ్రహించినవాఁడే తత్త్వవిదుఁడు. అతఁడే ముక్తుఁడు. ఇదియే వేదాంతసిద్ధాంతము. తత్త్వజ్ఞానమే సంసారానర్థనివర్తక మని భావము.

అవ. ఫలితముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం చ సతి బంధస్స్యాత్క స్యేత్యాదికుతర్కజాః,
విడంబనా దృఢం ఖండ్యాః ఖండనోక్తిప్రకారతః. 55

వ్యా. ఏవం బంధమోక్షయో రవివేకమూలత్వే సత్యద్వైతవాదే కస్య బంధః కస్య వా మోక్ష ఇత్యేవమాదిరూపాస్తార్కికైః క్రియమాణాః కుతర్కమూలాః పరిహాసవిశేషాః ఖండనోక్తయుక్తిభి స్తేషాం నిరుత్తరత్వాపాదనేన పరిహరణీయా ఇత్యాహ —ఏవమితి.

టీ. ఏవం చ సతి=ఇట్లగుచుండఁగా, కస్య=ఎవనికి, బంధః = బంధము, స్యాత్ = అగును ? ఇత్యాది = ఈ మొదలుగాఁగల, కుతర్కజాః = పెడవాదమువలనఁ గలిగిన, విడంబనాః = పరిహాసములు, ఖండనోక్తిప్రకారతః = ఖండనఖాద్యమందుఁ జెప్పిన విధముగా, దృఢం = దృఢముగా, ఖండ్యాః = ఖండింపఁదగినవి.

తా. నిజ మిట్టిది. బంధ మెవరికి ? మోక్ష మెవరికి ? అని మతాంతరస్థులు చేయు శంకలను ఖండనఖాద్యగ్రంథములో శ్రీహర్షమహాపండితుఁడు బోధించిన యుక్తులచే ఖండింపవలయును. వానిం గమనింపవలయును. నిజము విచారించినచో నెవ్వరికిని బంధము లేదు. అజ్ఞానమునుబట్టి విచారించితి మేని అజ్ఞానకల్పితుం డగు చిదాభాసునకే బంధ మని యాగ్రంథముయొక్క ముఖ్యతాత్పర్యము.

అవ. ఇట్టికూటస్థుఁడు గలఁ డనుటకుఁ బురాణవాక్యములు శ్లోకత్రయముచే పఠించుచున్నాఁడు:—

శ్లో. వృత్తేస్సాక్షితయా వృత్తిప్రాగభావస్య చ స్థితః,
బుభుత్సాయా స్తథాఽజ్ఞోఽస్మీత్యాభాతా జ్ఞానవస్తునః. 56

వ్యా. ఏవం శ్రుతియుక్తిభ్యాం కూటస్థం బుద్ధ్యాదిభ్యో వివిచ్య దర్శయిత్వా పురాణేష్వపి తద్వివేకః కృత ఇత్యాహ—వృత్తేరిత్యాది శ్లోకత్రయేణ. కామాది వృత్త్యుత్పత్తౌ సత్యాం తత్సాక్షిత్వేన వృత్త్యుదయాత్పూర్వం తత్ప్రాగభావసాక్షిత్వేన

జిజ్ఞాసాయాం సత్యాం తత్సాక్షిత్వేన తతః పూర్వమజ్ఞోఽస్మీత్యనుభూయమానా జ్ఞాన సాక్షిత్వేన చ శివ ఏవ తిష్ఠతి.

టీ. వృత్తేః = కామాదివృత్తికిని, వృత్తిప్రాగభావస్య చ=ఆకామాదివృత్తియొక్క ప్రాగభావమునకును, బుభుత్సాయాః=జిజ్ఞాసకును, సాక్షితయా=సాక్షిభావముచేత, స్థితః= చిద్రూపుఁడగు శివుఁడు స్థితిని బొందుచున్నాఁడు. (తతఃపూర్వం=అంతకంటెఁ బూర్వము.) అజ్ఞః=వివేకములేనివాఁడను, అస్మీతి=ఇతి నని యనుభవింపఁబడుచుండెడి, అజ్ఞానవస్తునః = అజ్ఞానమునకు, సాక్షితయా = సాక్షిత్వముచేత, ఆభాతా = ప్రకాశకుఁ డగుచున్నాఁడు.

తా. కామాదివృత్తి ఉదయించుచుండఁగా నావృత్తికి సాక్షిత్వముచేతను, ఆకామాదివృత్తి ఉదయించుటకంటెఁ బూర్వము ఆ వృత్తియొక్క ప్రాగభావమునకు సాక్షిత్వముచేతను, మఱియు, జిజ్ఞాస గలుగుచుండఁగా ఆజిజ్ఞాసకు సాక్షిత్వముచేతను, అంతకుఁ బూర్వము ఎఱుఁగనివాఁడ నైతి నని యనుభవింపఁబడుచుండెడి అజ్ఞానమునకు సాక్షిత్వముచేతను, ఈప్రకారము జ్ఞానవస్తు వగు శివుని కంతటను స్థితి గలిగియున్నది. అనఁగా ఆత్మ సర్వసాక్షియై యుండును.

శ్లో. అసత్యాలంబనత్వేన సత్యస్సర్వజడస్య తు,
సాధకత్వేన చిద్రూపస్సదా ప్రేమాస్పదత్వతః. 57
ఆనందరూప స్సర్వార్థసాధకత్వేన హేతునా,
సర్వసంబంధవత్త్వేన సంపూర్ణ శ్శివసంజ్ఞితః. 58

వ్యా. సచాసత్యస్య జగతః ఆలంబనత్వేనాధిష్ఠాన సత్యః, జడస్య సర్వస్య సాధకత్వేనావభాసకత్వాత్ చిద్రూపః సర్వదా ప్రేమవిషయత్వా దానందరూపః.

సర్వార్థావభాసకత్వేన సర్వసంబంధిత్వాత్సంపూర్ణ ఇత్యుచ్యతే. అత్ర చేదమభిప్రేతం. విమతశ్శివః వృత్త్యాదిభ్యో భిద్యతే. వృత్త్యాదిసాక్షిత్వాత్. యద్వృత్త్యాదిభ్యో న భిద్యతే తత్తద్వృత్త్యాదిసాక్షీ న భవతి. యథావృత్త్యాది. విమత శ్శివస్సత్యో భవితు మర్హతి. మిథ్యాధిష్ఠానత్వాదసత్యరజతాధిష్ఠాన శుక్తివత్. విమతశ్చిద్రూపః జడమాత్రావభాసకత్వాద్యచ్చిద్రూపం న భవతి తత్సర్వం జడావభాసక మపి న భవతి. యథా ఘటాది. విమతః పరమానందరూపః పరప్రేమాస్పదత్వాత్. యత్పరమానందరూపం న భవతి తత్పరప్రేమాస్పదమపి న భవతి యథా ఘటాది. విమతః పరిపూర్ణ స్సర్వసంబంధిత్వాద్గగనవత్. సర్వసంబంధిత్వం చ సర్వార్థసాధకత్వేన. విమత స్సర్వ సంబంధవాన్సర్వావభాసకత్వాద్య స్సర్వసంబంధవాన్న భవతి స సర్వావభాసకోఽపి భవతి యథా దీపాదిరితి.

టీ. అసత్యాలంబనత్వేన=అసత్యమగు జగంబున కాధార మగుటచేత, సత్యః= సత్య స్వరూపుఁడు, సర్వజడస్యతు=సకలజడవర్గమునకు, సాధకత్వేన=సాధకుఁ డగుట చేత, చిద్రూపః = చైతన్యస్వరూపుఁడు, సదా = ఎల్లప్పుడు, ప్రేమాస్పదత్వతః=ప్రేమ విషయుఁ డగుటవలన, ఆనందరూపః = ఆనందస్వరూపుఁడు, సర్వార్థసాధకత్వేన = సకలపదార్థములకు సాధకుఁ డగుట యనెడి, హేతునా = కారణముచేత, సర్వసంబంధ వత్వేన = సకలసంబంధములు గల్గియుండుటచేతను, సంపూర్ణః = పరిపూర్ణుఁడు నగు, శివసంజ్ఞితః = శివుఁ డని చెప్పఁబడును.

తా. ఆ ప్రత్యగాత్మ యనెడి శివుఁడు అసత్యమగు సర్వజగమునకు అధిష్ఠానమగుటచే సత్యస్వరూపుఁడగును. సకలజడపదార్థవర్గమును ప్రకాశింపఁజేయుటవలన సాధకుఁడగుటచే చిద్రూపుఁడగును. సర్వదా ప్రేమ విషయుఁడగుటవలన ఆనందస్వరూపుఁడగును. సర్వజగమ్ముతో సంబంధము గలవాఁడగుటచే పరిపూర్ణుఁ డనఁబడును. ఇట్లు పురాణవాక్య తాత్పర్యము.

అవ. పురాణవాక్యతాత్పర్యముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇతి శైవపురాణేషు కూటస్థః ప్రవివేచితః,
జీవేశత్వాదిరహితః కేవల స్స్వప్రభశ్శివః. 59

వ్యా. ఉదాహృతపురాణవాక్యస్య తాత్పర్యమాహ—ఇతీతి. ఇత్యేవంప్రకారేణ సూతసంహితాదిషు పురాణేషు జీవేశ్వరత్వాదికల్పనారహితః కేవలోఽద్వితీయ స్స్వప్రకాశశ్చైతన్యరూప శ్శివః కూటస్థో వివేచిత ఇత్యన్వయః.

టీ. ఇతి=ఈవిధంబుగా, శైవపురాణేషు=శైవపురాణములయందు, జీవేశత్వాది రహితః = జీవత్వేశ్వరత్వములు లేని, కేవలః=నిర్వికారుఁడగు, స్వప్రభః=స్వప్రకాశుఁ డగు, శివః=శివుఁడే, కూటస్థః=కూటస్థుఁ డని, ప్రవివేచితః=విభజనగా నిరూపింపఁబడెను.

తా. జీవత్వమును నీశ్వరత్వమును లేని నిర్వికారమగుస్వప్రకాశ చైతన్యమే కూటస్థుఁ డనియు నతఁడే శివుఁ డనియు సూతసంహిత చెప్పుచున్నది.

అవ. జీవత్వేశ్వరత్వములు వాస్తవముగా లే వనుటకుఁ గారణముం జెప్పు చున్నాడు.

శ్లో. మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః,
మాయికా వేవ జీవేశౌ స్వచ్ఛౌ తౌ కాచకుంభవత్. 60

వ్యా. జీవేశత్వాదిరహితత్వం కుత ఇత్యాశంక్య శ్రుత్యా తయోర్మాయికత్వ ప్రదర్శనాదిత్యాహ—మాయేతి. 'జీవేశావాభాసేన కరోతి మాయా చావిద్యాచ స్వయమేవ భవతీతి' శ్రుతిః. మాయావిద్యాధీనయోశ్చిదాభాసయోర్మాయికత్వం ప్రతిపాదయతీతి భావః మాయికత్వే. తయోర్దేహాదిభ్యో వైలక్షణ్యం న స్యాదిత్యాశంక్య పార్థివత్వా విశేషేఽపి కాచకుంభస్య ఘటాదిభ్యో వైలక్షణ్యమివానయో రపి స్యాదిత్యాహ—స్వచ్ఛావితి.

టీ. మాయా = మాయశక్తి, ఆభాసేన=ప్రతిబింబింపఁజేసికొనుటచేత, జీవేశౌ = జీవేశ్వరులను, కరోతి = చేయుచున్నది. ఇతి = ఇట్లని, శ్రుతత్వాత్ = వేదమందుఁ జెప్పఁబడుట వలన, జీవేశౌ = జీవుఁడును ఈశ్వరుఁడును, మాయికావేవ = మాయా కల్పితులే యగుదురు. తౌ = ఆజీవేశ్వరులు, కాచకుంభవత్ = గాజుకడవలవలె (గ్లాసులవలె), స్వచ్ఛౌ = నిర్మలులు.

తా. మాయ తాను రెండురూపములు ధరించి తన రెండు రూపములలోఁ బ్రతిబింబించిన ప్రతిబింబములలో నొకని జీవునిగను వేఱొకని దేవునిగను జేయుచున్న దని "జీవేశావాభాసేన కరోతి మాయా చావిద్యాచ స్వయమేవ భవతి" అనెడి తాపనీయశ్రుతి చెప్పుచున్నది. కాన జీవేశ్వరులు మాయాకల్పితులు. అయినను గాజుడప్పలవలె నిర్మలస్వరూపము గలవారలు.

అవ. ఘటాదులు మాయవలనఁ గలిగెను. జీవేశ్వరులును మాయవలననే కలిగిరి. ఈఘటాదులకంటె వారికి స్వచ్ఛత్వ మేల గలిగెను? అని యాశంకించి దృష్టాంతపూర్వకముగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్నజన్యం మనో దేహాత్స్వచ్ఛం యద్వత్తథైవ తౌ,
మాయికావపి సర్వస్మా దన్యస్మాత్స్వచ్ఛతాం గతౌ. (31

వ్యా. నను ఘటకాచకుంభారంభకయో ర్మృద్విశేషయో ర్భేదా త్తద్వైలక్షణ్య ముచితం. జగజ్జీవేశ్వరభేదహేతోర్మాయాయా ఏకత్వాత్తద్గతయోర్న వైలక్షణ్య మనుచితమిత్యాశంక్య అన్నజన్యయోర్దేహమనసోర్యథా వైలక్షణ్యం తద్వదిత్యాహ—అన్నేతి.

టీ. అన్నజన్యం = అన్నమువలనఁ గలిగిన, మనః = మనస్సు; యద్వత్ = ఏవిధంబుగ, దేహాత్ = దేహమునకంటె, స్వచ్ఛం = నిర్మలమైనదో, తథైవ = ఆవిధం

బునసే, తౌ = ఆజీవేశ్వరులు, మాయికావపి = మాయామయులైనను, అన్యస్మాత్ = ఇతరమైన, సర్వస్మాత్ = సర్వజగత్తుకంటె, స్వచ్ఛతాం = స్వచ్ఛత్వమును, గతౌ = పొందిరి.

తా. స్థూలశరీరము అన్నమువలననే కల్గును. మనస్సుకూడ నన్నమువలననే సాయముం జెందును. అయినను దేహముకంటె మనస్సు స్వచ్ఛ మని యంద అంగీకరించుచునే యున్నారు. జీవేశ్వరులు మాయికులైనను మాయిక మగు జగంబుకంటె నిర్మలు లగుదురు.

అవ. స్వచ్ఛులగుదురు గాక. వీరికి జ్ఞాన మెట్లు ఘటించు ననుప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. చిద్రూపత్వం చ సంభావ్యం చిత్త్వేనైవ ప్రకాశనాత్,
సర్వకల్పనశక్తాయాః మాయాయాః దుష్కరం న హి. 62

వ్యా. భవతు కాచాదివత్స్వచ్ఛత్వం. చిత్త్వం తు కుత ఇత్యాశంక్యాను భవాదిత్యాహ—చిద్రూపేతి. చిద్రూపత్వేన ప్రకాశనమపి మాయికయోరనుపపన్న మిత్యాశంక్య తస్యా దుర్ఘటకారిత్వాదుపపన్నమిత్యాహ—సర్వేతి.

టీ. చిత్త్వేనైవ = చిద్రూపత్వముచేతనే, ప్రకాశనాత్=ప్రకాశించుటవలన, చిద్రూపత్వం చ = చిద్రూపత్వంబును, సంభావ్యం = ఊహింపఁదగినది. సర్వకల్పనశక్తాయాః-సర్వ=సర్వజగత్తుయొక్క, కల్పన=కల్పించుటయందు, శక్తాయాః = సమర్థమైన, మాయాయాః=మాయకు, దుష్కరం=దుస్సాధ్యమైనది, న హి=లేదు గదా.

తా. జీవేశ్వరులు జ్ఞానవంతులుగాఁ గన్పట్టుచున్నారు. జీవుఁడు జ్ఞానవంతుఁ డనుటకు మన యనుభవమే సాక్షి. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁ డని వేదములు నుడువుచున్నవి. కనుక వీ రిరువురును జ్ఞానవంతులే యగుదురు. సర్వజగత్తులను గల్పించినమాయ మాయికు లగు జీవేశ్వరులకు జ్ఞానము గల్పింప లేనంత యసమర్థమైనదా? జ్ఞానవంతులనుగఁ జేయఁగల దనుట.

అవ. చెప్పినయర్థమును కైముతికన్యాయమున దృఢపఱచుచున్నాఁడు:—

శ్లో. అస్మన్నిద్రాపి జీవేశౌ చేతనౌ స్వప్నగౌ సృజేత్,
మహామాయా సృజత్యేతావిత్యాశ్చర్యం కిమత్ర తే. 63

వ్యా. ఉక్తమర్థః కైముతికన్యాయేన ద్రఢయతి—అస్మదితి.

టీ. అస్మన్నిద్రాపి=మననిద్రయు, స్వప్నగా=స్వప్నగతులైనట్టియు, చేతనా = జ్ఞానవంతులునైన, జీవేశౌ = జీవేశ్వరులను, సృజేత్ = సృజించును. మహామాయా = మహామాయ, ఏతౌ=ఈజీవేశ్వరులను, సృజతి=సృజించుచున్నది. ఇత్యత్ర=ఈయంశమునందు, తే=నీకు, కిం ఆశ్చర్యం=ఏమి యాశ్చర్యమున్నది?

తా. మననిద్రయే కలలో జీవుని, ఈశ్వరుని సృజించుచున్నది. అనఁగా నిద్రలో నొకఁడు దేవునియొద్దకుఁ దాఁ బోయినట్లును, ఆయన తనకు వర మిచ్చినట్లును దోఁచును. మననిద్రయే జీవేశ్వరుల సృజించుచుండ సకలజగత్కల్పిత యగు మాయ జీవేశ్వరుల సృజించుటలో వింత యేమున్నది? ఇం దాశ్చర్యము లే దని భావము.

అవ. ఈశ్వరుఁడు మాయికుఁడైనయెడల నాతనికి సర్వజ్ఞత్వము ఘటింపనేర దని యనవలదు. అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వజ్ఞత్వాదికం చేశే కల్పయిత్వా ప్రదర్శయేత్,
ధర్మిణం కల్పయంత్యాస్స్యాత్కో భారో ధర్మకల్పనే. 64

వ్యా. ఈశ్వరస్యాపి మాయికత్వే తస్య శివవదసర్వజ్ఞత్వాదికం స్యాదిత్యాశంక్య సర్వజ్ఞత్వాదికమపి మాయైవ కల్పయిష్యతీత్యాహ—సర్వజ్ఞత్వేతి. తత్రోపపత్తిమాహ—ధర్మిణమితి.

టీ. ఈశే = ఈశ్వరునియందు, సర్వజ్ఞత్వాదికం చ = సర్వజ్ఞత్వము మొదలగు దానిని, కల్పయిత్వా=కల్పించి, ప్రదర్శయేత్=చూపించును. ధర్మిణం=ధర్మిని (విశేష్యమును), కల్పయంత్యాః = కల్పించునట్టి మాయకు, ధర్మకల్పనే-ధర్మ = విశేషణము యొక్క, కల్పనే=కల్పించుటయందు, కః భారః=ఏమి భారము, స్యాత్=అగును.

తా. ఈశ్వరుని గల్పించినమాయ ఈశ్వరునకు సర్వజ్ఞత్వమును గల్పింపఁజాలదా? ఏనుఁగును గల్పించిన చిత్రకారుఁ డాయేనుఁగునకు దంతములం గల్పింపఁజాలఁడా? అట్టులే మాయ యన్నింటిని గల్పింపఁ గల్గు నని తాత్పర్యము.

అవ. ఇట్టులే కూటస్థుఁడును గల్పితుం డని యనరాదా? యనిన సమాధానమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కూటస్థేఽప్యతిశంకా స్యా దితి చే న్మాతిశంక్యతామ్,
కూటస్థమాయికత్వే తు ప్రమాణం న హి విద్యతే. 65

వ్యా. నను జీవేశయోరివ కూటస్థస్యాపి మాయికత్వం ప్రసజ్యేతేతి శంకతే—కూటస్థ ఇతి ప్రమాణాభావాన్నైవ మితి పరిహరతి—మాతిశంక్యతామితి.

టీ. కూటస్థేఽపి=కూటస్థునియందును, అతిశంకా=అధికమగుశంక, స్యాదితిచేత్=కలుగు ననెదవేని, మాతిశంక్యతాం=అధికముగా శంకింపవలదు. కూటస్థమాయికత్వేతు=కూటస్థుఁడు మాయికుఁ డనుట యందు, ప్రమాణం = ప్రమాణము, న హి విద్యతే = లేనేలేదు.

తా. జీవేశ్వరులను మాయికు లనినట్లు కూటస్థుని మాయికుం డనఁజెల్లదు. వేదమున కూటస్థుఁడు మాయికుం డని యెచ్చటను జెప్పఁబడి యుండలేదు.

అవ. కూటస్థుఁడు సత్ స్వరూపుఁ డనుటకుఁ బ్రమాణముం గనఁబఱచు చున్నాఁడు:—

శ్లో. వస్తుత్వం ఘోషయంత్యస్య వేదాంతాస్సకలా అపి,
సపక్షరూపం వస్త్వన్యన్న సహంతే ఽత్ర కించన. 66

వ్యా. కూటస్థస్య వాస్తవత్వేఽపి ప్రమాణం నోపలభ్యత ఇత్యాశంక్యశ్రుతయస్సర్వా అపి ప్రమాణమిత్యాహ—వస్తుత్వమితి. అత్ర కూటస్థస్య పారమార్థికత్వే ప్రతిపక్షభూత మన్య ద్వస్తు కించన న సహంత ఇత్యర్థః.

టీ. అస్య=ఈకూటస్థునకు, వస్తుత్వం=సత్యత్వమును, సకలా అపి=సమస్తములైన, వేదాంతాః=ఉపనిషత్తులు, ఘోషయంతి=స్ఫుటముగా చెప్పుచున్నవి. అత్ర=ఇందువిషయమై, సపక్షరూపం = ప్రతిపక్షభూతమగు, అన్యత్=మఱియొకవస్తువును, కించన = దేనిని, న సహంతే=సహింపవు.

తా. కూటస్థుఁ డొక్కఁడే సత్యస్వరూపుఁడు. ఆయనతో సమాన మగుసత్యము మఱియొక్కటి లేదు. అని సర్వోపనిషత్తులు చెప్పుచున్నవి.

అవ. నీవు శ్రుతులనే కనఁబఱచెదవు. యుక్తు లేల చెప్పవు? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రుత్యర్థం విశదీకుర్మో న తర్కాద్వచ్మి కించన,
తేన తార్కికశంకానా మత్ర కోఽవసరో వద. 67

వ్యా. నను కూటస్థస్య జీవేశయోశ్చ వాస్తవత్వావాస్తవత్వసాధనే శ్రుతయ ఏవ పఠ్యంతే న తర్కైః కించి దపి సాధ్యతే ఇత్యాశంక్య ముముక్షూణాం శ్రుత్యర్థ విశదీకరణాయ ప్రవృత్తత్వాన్న తర్కోపన్యాస ఇత్యాహ—శ్రుత్యర్థమితి.

టీ. శ్రుత్యర్థం = వేదార్థమును, విశదీకుర్మః = స్పష్టపఱచెదము. తర్కాత్ = శుష్కవలన, కించిత్ = ఇంచుకయును, న వచ్మి = చెప్పను. తేన = ఆకారణముచేత, తార్కికశంకానాం=తార్కికులసందేహములకు, అత్ర = ఇక్కడ, కః అవసరః=ఏమి యవసరము? వద=చెప్పుమా.

తా. వేదార్థజ్ఞానమువలన ముముక్షువునకు ముక్తి కలుగును. కాన దానినే మేము చెప్పెదము. శుష్కతర్కమువలన లాభము లేదు. కాన వానితో మాకుఁ బని లేదు. వేదార్థమును నిరూపించుటకు తర్కములతోఁ బనిలేదు.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తస్మాత్ కుతర్కం సంత్యజ్య ముముక్షుశ్శ్రుతిమాశ్రయేత్,
శ్రుతౌ తు మాయా జీవేశౌ కరోతీతి ప్రదర్శితమ్. 68

వ్యా. తతః కి మిత్యత ఆహ—తస్మాదితి. ముముక్షుణా శ్రుత్యర్థః కీదృశోఽను సంధేయ ఇత్యాహ—శ్రుతావిత్యాది. శ్రుతిషు జీవేశయో ర్మాయికత్వమ్.

టీ. తస్మాత్=ఆహేతువువలన, కుతర్కం=పెడయుక్తులను, సంత్యజ్య=వదలిపెట్టి, ముముక్షుః=మోక్షేచ్ఛగలవాఁడు, శ్రుతిం=వేదమును, ఆశ్రయేత్ = ఆశ్రయింపవలెను. శ్రుతౌ తు=వేదమునందైతే, మాయా=మాయ, జీవేశౌ=జీవేశ్వరులను, కరోతి=చేయుచున్నది, ఇతి=ఈలాగున, ప్రదర్శితం = చూపింపఁబడినది.

తా. కనుక కుతర్కముల వదలి మోక్షమునం దిచ్ఛ గలవారు వేదమునే యాశ్రయింపవలెను. వేదమునందు జీవేశ్వరులను మాయ కల్పనచేసె నని చెప్పఁబడియున్నది.

అవ. విచారింపవలసినయంశముల రెండు శ్లోకములతోఁ దెలుపుచున్నాఁడు:—

శ్లో. ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశకృతా భవేత్,
జాగ్రదాదివిమోక్షాంతస్సంసారో జీవకర్తృకః. 69

వ్యా. ఈక్షణాదిప్రవేశాంతాయాః సృష్టే రీశ్వరకర్తృత్వం, జాగ్రత్స్వప్నసుషుప్తిబంధమోక్షలక్షణస్య సంసారస్య జీవకర్తృత్వమ్.

టీ. ఈక్షణాదిప్రవేశాంతా = సంకల్పము మొదలు జీవరూపుఁడై ప్రవేశించుటయే చివరగాఁగల, సృష్టిః=సృష్టి, ఈశకృతా=ఈశ్వరునిచేతఁ జేయఁబడినది, భవేత్ = అగును. జాగ్రదాదివిమోక్షాంతః-జాగ్రదాది = జాగ్రదవస్థ మొదలుగాఁ గలిగి, విమోక్షాంతః=మోక్షమే చివరగాఁగల, సంసారః=సంసారము, జీవకర్తృకః = జీవుఁడే కర్తగాఁ గలది.

తా. "తదైక్షత" అని సృష్ట్యాదియందు మాయాప్రతిబింబ రూపుఁ డగు ఈశ్వరుఁడు సృజింప వలయు నని సంకల్పించి పంచ భూతాదికమును సృజించెను. అనంతరము జీవుఁడై యందుఁ దాను ప్రవేశించెను. ఇది యంతయు నీశ్వరకర్తృక మని చెప్పఁబడును. జాగ్రదవస్థ మొదలు మోక్షపర్యంతము జరిగెడి సంసారవ్యవహారము జీవకర్తృక మని చెప్పఁబడును.

శ్లో. అసంగ ఏవ కూటస్థస్సర్వదా నాస్య కశ్చన,
భవత్యతిశయ స్తేన మనస్యేవం విచార్యతామ్. 70

వ్యా. కూటస్థస్యాసంగత్వాదికం మృతిజన్మాదిలక్షణస్య వ్యవహారజాతస్యాసత్త్వం చ ప్రతిపాదితమతో ముముక్షురిమమర్థం సర్వదా విచారయేదిత్యభిప్రాయః.

టీ. కూటస్థః = కూటస్థుఁడు, అసంగ ఏవ = అసంగుఁడేను. సర్వదా = సర్వకాలములయందును, అస్య = ఈకూటస్థునకు, కశ్చన = ఒకానొక, అతిశయః = అతిశయము, న భవతి = లేదు. తేన = ఆకారణముచేత, మనసి = మనస్సునందు, ఏవం = ఈలాగున, విచార్యతాం = విచారింపఁబడుఁగాక.

తా. కూటస్థుఁడు అసంగుఁడు, కూటస్థున కెప్పుడు నతిశయము లేదు. బంధమోక్షాది తారతమ్యము లేదనుట ఈవిధముగ నెప్పుడు విచారము చేయంజనును.

అవ. కూటస్థునకు బంధమోక్షములు లేవనుటకు శ్రుతిని పఠించుచున్నాఁడు:—

శ్లో. న నిరోధో న చోత్పత్తిర్న బంధో న చ సాధకః,
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా. 71

వ్యా. కూటస్థస్య జన్మాద్యతిశయాభావః కుతోఽవగమ్యత ఇత్యాశంక్య శ్రుతివాక్యాదిత్యభిప్రేత్య తద్వాక్యం పఠతి—న నిరోధ ఇతి.

టీ. నిరోధః = లయము, న = లేదు. ఉత్పత్తిశ్చ = పుట్టుకయు, న = లేదు. బంధః = బంధమును, న = లేదు. సాధకశ్చ = వేదాంతశ్రవణాద్యనుష్ఠానము చేయువాఁడును, న = లేఁడు. ముముక్షుః = ముముక్షువును, న = లేఁడు. ముక్తవై=ముక్తుఁడును, న=లేఁడు. ఏషా=ఇది, పరమార్థతేతి=పరమార్థమని శ్రుతి చెప్పుచున్నది.

తా. వాస్తవముగా బంధమోక్షములు గాని యుత్పత్తిలయములు గాని లేవు. ఒక్కయాత్మయే పరమార్థ మని శ్రుతి చెప్పుచున్నది.

అవ. అట్లైనయెడల శ్రుతి జీవేశ్వరజగత్తుల నేల చెప్పుచున్నది అనుటకు సమాధానము:—

శ్లో. అవాఙ్మనసగమ్యం తం శ్రుతిర్బోధయితుం సదా,
జీవమీశం జగద్వాపి సమాశ్రిత్య ప్రబోధయేత్. 72

వ్యా. నను తర్హి శ్రుతిషు తత్ర తత్ర జీవేశ్వరాదిస్వరూపప్రతిపాదనం కిమర్థమిత్యాశంక్యావాఙ్మనసగోచరస్యాత్మనోఽవబోధనాయేత్యాహ—అవాఙ్మనసేతి.

టీ. శ్రుతిః = వేదము, అవాఙ్మనసగమ్యం = వాఙ్మనస్సులకు గోచరింపని, తం = ఆకూటస్థాత్మను, బోధయితుం = తెలుపుటకొఱకు, సదా = ఎల్లప్పుడును, జీవం = జీవుని గాని, ఈశం = ఈశ్వరునిఁ గాని, జగద్వాపి = జగత్తును గాని, సమాశ్రిత్య = ఆశ్రయించి, ప్రబోధయేత్ = బోధించును.

తా. మనోవాగాద్యతీత మైన ఆయాత్మతత్త్వముం బోధింపఁదలంచి వేదము కల్పితము లగుజీవేశ్వరజగత్తు లను నీమూఁడింటిలో నెద్దానినైన నాశ్రయించి బోధించును.

అవ. తత్త్వ మొక్కటియెకదా, దానిం జెప్పునప్పుడు శ్రుతులకుఁ బరస్పరవిరోధ మెందుకు? అని శంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. యయా యయా భవేత్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని,
సా సైవ ప్రక్రియేహ స్యాత్సాధ్వీత్యాచార్యభాషితమ్. 73

వ్యా. నను తత్త్వస్యైకరూపస్య శ్రుతిబోధ్యత్వే శ్రుతిషు విగానం కుతో దృశ్యత ఇత్యాశంక్య న తత్త్వే విగాన మస్తి. అపితు తద్బోధనప్రకారే తదపి బోధ్యపురుషచిత్త వైషమ్యానుసారేణేతి సురేశ్వరాచార్యైరుక్తమిత్యాహ—యయా యయేతి.

టీ. యయా యయా = ఎట్టి యెట్టిప్రక్రియచేత, పుంసాం = జనులకు, ప్రత్యగాత్మని = ఆత్మయందు, వ్యుత్పత్తిః = అభిముఖ్యము, భవేత్ = అగునో, సాసైవ ప్రక్రియా = ఆయాప్రక్రియయే, ఇహ = ఈ వేదాంతశాస్త్రమునందు, సాధ్వీ = యోగ్యమైనది, స్యాత్ = అగును. ఇతి=ఇట్లు, ఆచార్యభాషితం = సురేశ్వరాచార్యులచేఁ జెప్పఁబడినది.

తా. జగత్తంతయుఁ గల్పితము గనుక శిష్యులకు ఏయేవిధంబులఁ జెప్పినచో బోధ గల్గునో యదియే యుక్త మగుమార్గము. ప్రతిపాదించెడి పద్ధతులలో భేద ముండినను ప్రతిపాదింపఁబడెడి ఆత్మతత్త్వ మొకటియే యని తాత్పర్యము.

అవ. ప్రతిపాదనప్రకారములో భేదముతోఁచుట యైనను అజ్ఞులకే కాని విజ్ఞులకుఁ గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రుతితాత్పర్యమఖిలమబుద్ధ్వా భ్రామ్యతే జడః,
వివేకీ త్వఖిలం బుద్ధ్వా తిష్ఠత్యానందవారిధౌ. 74

వ్యా. శ్రుత్యర్థస్యైకరూపత్వే తత్ప్రతిపాదకానా మేవ కుతో విప్రతిపత్తిరిత్యాశంక్య శ్రుతి తాత్పర్యబోధశూన్యానా మేవ విప్రతిపత్తిర్న తు తద్విదామిత్యాహ—శ్రుతి తాత్పర్యమితి.

టీ. అఖిలం = సమస్తమైన, శ్రుతితాత్పర్యం=వేదతాత్పర్యమును, అబుద్ధ్వా= ఎఱుంగలేక, జడః=అవివేకి, భ్రామ్యతే = భ్రమచెందును. వివేకీ తు = వివేకముగలవాఁడైతే, అఖిలం = సమస్తమును, బుద్ధ్వా = ఎఱింగి, ఆనందవారిధౌ=ఆనందసముద్రమునందు, తిష్ఠతి = ఉండును.

తా. వేదతాత్పర్యము తెలియని అజ్ఞుఁడు భ్రమించును. విజ్ఞుఁడు బ్రహ్మానందసముద్రమున నోలలాడును.

అవ. వివేకము గలవానినిశ్చయమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. మాయామేఘో జగన్నీరం వర్షత్వేవ యథాతథా,
చిదాకాశస్య నో హానిర్న వా లాభ ఇతి స్థితిః. 75

వ్యా. తర్హి వివేకినో నిశ్చయః కీదృశ ఇత్యాకాంక్షాయామాహ—మాయేతి.

టీ. మాయామేఘః = మాయ యనెడి మేఘము, జగన్నీరం = జగత్తనియెడి నీటిని, యథాతథా=ఎట్లో యట్లు, వర్షత్వేవ=వర్షించుచునే యున్నది. చిదాకాశస్య = నిర్రూపమగు నాకాశమునకు నో హానిః=నష్టము లేదు. నవా లాభః=లాభంబును లేదు. ఇతి = ఇట్లు, స్థితిః = వస్తుస్థితి.

తా. మాయ యనెడిమబ్బు జగత్తనియెడి నీటిని వర్షించినను చిదాకాశమునకు లాభనష్టములు లేవు. అట్లే కల్పితులైన జీవునివలనం గాని ఈశ్వరునివలనం గాని జగత్తువలనం గాని నిర్విశేషబ్రహ్మమునకు లాభ నష్టములు లేవు. ఇట్లు వివేకియొక్క నిశ్చయము.

అవ. గ్రంథాభ్యాసఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇమం కూటస్థదీపం యోఽనుసంధత్తే నిరంతరం,
స్వయం కూటస్థరూపేణ దీప్యతేఽసౌ నిరంతరమ్. 76

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
కూటస్థదీప స్సమాప్తః.

వ్యా. గ్రంథాభ్యాసఫలమాహ—ఇమమితి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీ తీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితం తాత్పర్యబోధినీనామకం కూటస్థదీప వ్యాఖ్యానం సమాప్తమ్.

టీ. ఇమం కూటస్థదీపం = ఈకూటస్థదీపమును, యః = ఎవఁడు, నిరంతరం = ఎడతెగక, అనుసంధత్తే = అనుసంధానము చేయుచున్నాఁడో, అసౌ = వీఁడు, నిరంతరం = ఎల్లప్పుడును, కూటస్థరూపేణ=కూటస్థస్వరూపముచేత, దీప్యతే= తేజరిల్లును.

తా. కూటస్థదీపము నెల్లపుడు ననుసంధానము చేయువాఁడు తాను కూటస్థబ్రహ్మమై యెల్లప్పుడును విరాజిల్లును.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు కూటస్థదీప మను అష్టమప్రకరణము.

శ్రీ ర స్తు
శ్రీ గణేశాయ నమః.



# శ్రీ వేదాంతపంచదశి

## నవమ ప్రకరణము

### ధ్యానదీప ప్రకరణము

అవ. సాధనచతుష్టయసంపన్నుఁ డగు ముముక్షువు వేదాంతశ్రవణ మొనర్చినను బుద్ధిమాంద్యమువలన బ్రహ్మాపరోక్షజ్ఞానము గలుగనప్పుడు, అట్టి యపరోక్షజ్ఞానమునకు సాధనం బగు నుపాసనము నిరూపింపఁ దలంచి మొదట నుపాసనమువలనంగూడ జ్ఞానముద్వారా మోక్షము గల్గు నని దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సంవాదిభ్రమవద్బ్రహ్మతత్త్వోపాస్త్యా విముచ్యతే,
ఉత్తరే తాపనీయేఽత శ్రుతోపాస్తిరనేకధా. 1

### వ్యాఖ్యానమ్

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
క్రియతే ధ్యానదీపస్య వ్యాఖ్యా సంక్షేపతో మయా.

వ్యా. ఇహ తావద్వేదాంతశాస్త్రే నిత్యానిత్యవస్తువివేకాదిసాధనచతుష్టయసంపన్నస్య సమ్యక్ఛ్రవణమననిదిధ్యాసనానుష్ఠానవత స్తత్త్వంపదార్థవివేచనపూర్వకం మహావాక్యార్థాపరోక్షజ్ఞానేన బ్రహ్మభావలక్షణో మోక్షో భవతీతి ప్రతిపాదితం. తత్ర శ్రుతోపనిషత్కస్యాపి బుద్ధిమాంద్యాదినా కేనచిత్ప్రతిబంధేన వాక్యార్థవిషయాపరోక్షప్రమిత్యనుత్పత్తౌ సత్యాం తదుత్పాదనద్వారా మోక్షఫలకోపాసనాని దిదర్శయిషురాదౌ తావత్సదృష్టాంతం బ్రహ్మతత్త్వోపాసనయాపి మోక్షో భవతీతి ప్రతిజానీతే—సంవాదీతి. యథా సంవాదిభ్రమేణ ప్రవృత్తస్యాభిప్రేతార్థలాభో భవతి, ఏవం బ్రహ్మతత్త్వోపాసనయాప్యభిలషితో బ్రహ్మభావలక్షణో మోక్షో భవ

తీత్యర్థః. తత్ర కిం ప్రమాణమిత్యత ఆహ—ఉత్తర ఇతి. యత ఉపాసనయాపి మోక్షో ఽస్త్యతః తాపనీయోపనిషద్యనేకప్రకారేణ బ్రహ్మతత్త్వోపాసనా శ్రుతావుక్తేత్యర్థః.

టీ. సంవాదిభ్రమవత్ = సంవాదిభ్రమమువలె, బ్రహ్మతత్త్వోపాస్త్యా=బ్రహ్మతత్త్వముయొక్క యుపాసనచేత, విముచ్యతే=ముక్తుఁడగుచున్నాఁడు. అతః=ఈకారణమువలన, ఉత్తరే తాపనీయే = ఉత్తరతాపనీయోపనిషత్తునందు, ఉపాస్తిః=ఉపాసనము, అనేకధా = అనేకవిధములుగా, శ్రుతా = చెప్పఁబడినది.

తా. సంవాదిభ్రమము ఇష్టవస్తులాభము గలుగఁజేసినట్లు, బ్రహ్మతత్త్వోపాసనము మోక్షము నొసఁగును. కనుకనే నృసింహోత్తర తాపనీయోపనిషత్తునం దనేకవిధంబులుగా బ్రహ్మోపాసనము వర్ణింపఁబడినది. సంవాదిభ్రమ మనఁగా లాభము గలుగఁజేసెడిభ్రమ. జ్ఞాన మని గ్రంథకారునిచే ముందు గ్రంథములోఁ దెలుపఁబడును.

అవ. ఇప్పుడు సంవాదిభ్రమమును దృష్టాంతపూర్వకముగ నిరూపింపఁ దలఁచి యా సంవాదిభ్రమమున వక్కాణించిన సురేశ్వరవార్తికమును బఠించుచున్నాఁడు:—

శ్లో. మణిప్రదీపప్రభయోర్మణిబుద్ధ్యాభిధావతోః,
మిథ్యాజ్ఞానావిశేషేఽపి విశేషోఽర్థక్రియాం ప్రతి. 2

వ్యా. సంవాదిభ్రమవదిత్యుక్తమర్థం సదృష్టాంతం ప్రపంచయితుం సంవాదిభ్రమప్రతిపాదకవార్తికం పఠతి—మణిప్రదీపేతి. మణిశ్చ ప్రదీపశ్చ మణిప్రదీపే తయోః ప్రభే మణిప్రదీపప్రభే తయోరితి విగ్రహః. మణిప్రభాయాం దీపప్రభాయాం చ యా మణిబుద్ధిస్సా మిథ్యాజ్ఞానమేవాతస్మింస్తద్బుద్ధిత్వాత్ అథాపి మణిప్రభాయాం యా మణిబుద్ధిస్సా అర్థక్రియాకారిణీ. మణిప్రభాయాం మణిబుద్ధ్యాభిధావతః పురుషస్య మణిలాభో భవతి. ఇతరస్య తు నాస్తీత్యర్థక్రియాయాం వైషమ్యమస్తీత్యర్థః.

టీ. మణిప్రదీపప్రభయోః = మణియొక్కయు దీపముయొక్కయు కాంతులయందు, మణిబుద్ధ్యా=మణి యనెడి బుద్ధిచేత, అభిధావతోః=పరుగిడెడి యిరువురు పురుషులకు, మిథ్యాజ్ఞానావిశేషేఽపి - మిథ్యాజ్ఞాన=పొరబాటునకు, అవిశేషేఽపి=భేదములేకుండినను, అర్థక్రియాం ప్రతి=ఫలమునుగూర్చి, విశేషః=అతిశయము, అస్తి=కలదు.

తా. మణిప్రభయందును దీపప్రభయందును ఏమణిబుద్ధిగలదో ఆబుద్ధి మిథ్యాజ్ఞానమే యగును. అయినను, మణిప్రభయందు గల బుద్ధి అర్థక్రియను గలిగించును, అనఁగా మణిప్రభయందు మణిబుద్ధిచేఁ బరు

గెత్తుపురుషునకు మణిలాభము గలుగును. దీపప్రభయందు మణిబుద్ధిచేఁ బరుగెత్తు పురుషునకు మణిలాభము గలుగదు. ఈ ప్రకారము అర్థక్రియయందు వైషమ్యము గల దని యభిప్రాయము.

అవ. పైవార్తికమునకు శ్లోకత్రయముచే వ్యాఖ్యానము చేయుచున్నాఁడు:—

శ్లో. దీపోఽపవరకస్యాంత ర్వర్తతే తత్ప్రభా బహిః,
దృశ్యతే ద్వార్యథాన్యత్ర తద్వ ద్దృష్టా మణేః ప్రభా. 3

వ్యా. వార్తికం వ్యాచష్టే—దీపోఽపవరకస్యాంతరిత్యాదినా శ్లోకత్రయేణ. కస్మింశ్చిన్మందిరే అపవరకస్యాంత ర్దీప స్తిష్ఠతి. తస్య ప్రభా బహిర్ద్వారప్రదేశే రత్నమివ వర్తులోపలభ్యతే. తథాఽన్యస్మిన్మందిరే అపవరకస్యాంతఃస్థితస్య రత్నస్య ప్రభా బహిర్ద్వారప్రదేశే దీపప్రభేవ రత్నసమానోపలభ్యతే.

టీ. దీపః=దీపము, అపవరకస్య=గదియొక్క, అంతః=లోపల, వర్తతే=ఉన్నది. తత్ప్రభా = దానివెల్గు, బహిః=వెలుపల, ద్వారి = ద్వారమునందు, వర్తతే=ఉన్నది. తద్వత్ =అటులనే, అన్యత్ర = మణియొకచోట, మణేః = రత్నముయొక్క, ప్రభా= కాంతి, బహిః = వెలుపటి, ద్వారి=ద్వారమునందు; దృశ్యతే = కనఁబడుచున్నది.

తా. ఒకయింటిలో దీపము పెట్టినపుడు దానికాంతి గవాక్షముగుండా ద్వారమునందు ప్రసరించుచుండెను. అట్టులే మణియొకయింటిలో రత్నము పెట్టినపుడు దానికాంతియు గవాక్షముద్వారా ద్వారదేశమునందుఁ బ్రసరించుచుండెను.

శ్లో. దూరే ప్రభాద్వయం దృష్ట్వా మణిబుద్ధ్యాఽభిధావతోః,
ప్రభాయాం మణిబుద్ధి స్తు మిథ్యాజ్ఞానం ద్వయో రపి. 4

వ్యా. దూర ఇతి. తథావిధం ప్రభాద్వయం దూరతో దృష్ట్వా అయం మణిః అయం మణిరితి బుద్ధ్యా ద్వౌ పురుషావభిధావనం కురుత స్తయోర్ద్వయో రపి ప్రభావిషయే జాయమానం మణిజ్ఞానం భ్రాంతమేవ.

టీ. దూరే=దూరమునందు, ప్రభాద్వయం=రెండుకాంతులను, దృష్ట్వా=చూచి, మణిబుద్ధ్యా = అవి మణు లనియెడి భ్రమచేత, అభిధావతోః = పరుగిడువారికి, ప్రభాయాం=కాంతియందు, మణిబుద్ధిస్తు = మణిజ్ఞానమైతే, ద్వయోరపి = ఇరువురికిని, మిథ్యాజ్ఞానం = భ్రమజ్ఞానమే యగును.

తా. దూరమునుండి యీ రెండు కాంతులను జూచి యిరువురు పురుషులు అవి మణు లని భ్రమపడి పరుగిడిరి. అట్టి తఱి నీ యిరువురి జ్ఞానము మిథ్యాజ్ఞానమే యగును.

అవ. అట్లైనను నిరువురకు ఫలతారతమ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న లభ్యతే మణి ర్దీపప్రభాం ప్రత్యభిధావతా,
ప్రభాయాం ధావతాఽవశ్యం లభ్యేతైవ మణిర్మణేః. 5

వ్యా. అథాపి దీపప్రభాయాం మణిబుద్ధిం కృత్వా ధావతా పురుషేణ మణిర్నోపలభ్యతే. మణేః ప్రభాయాం మణిబుద్ధ్యా ధావతా మణిర్లభ్యేతైవ.

టీ. దీపప్రభాం ప్రతి = దీపకాంతినిగూర్చి, అభిధావతా = అభిముఖముగాఁ బరుగెత్తెడువానిచేత, మణిః=రత్నము, న లభ్యతే = పొందఁబడదు. మణేః = రత్నము యొక్క, ప్రభాయాం = కాంతియందు, ధావతా = మణిబుద్ధిచే పరుగిడెడువానిచేత, మణిః=రత్నము, లభ్యేతైవ = అవశ్యము పొందఁబడును.

తా. దీపకాంతిని జూచి రత్న మని భ్రమించినవానికి రత్నము లభింపదు. రత్నప్రభం గాంచి రత్న మని పరుగిడినవానికి యత్నము చేసినచో రత్న మవశ్యముగా లభించును.

అవ. ఈవార్తికమువలనం బ్రకృతమునఁ గల్గులాభముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. దీపప్రభామణిభ్రాంతిర్విసంవాదిభ్రమః స్మృతః,
మణిప్రభామణిభ్రాంతిః సంవాదిభ్రమ ఉచ్యతే. 6

వ్యా. భవత్వేవం వార్తికార్థః ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—దీపప్రభేతి. యా దీపప్రభాయాం మణిభ్రాంతిరస్తి, సా విసంవాదిభ్రమ ఇతి స్మృతా విద్వద్భిర్మణిలాభలక్షణార్థక్రియారహితత్వాత్. యా మణిప్రభాయాం మణిబుద్ధి రస్తి సా తు మణిలాభలక్షణార్థక్రియావత్త్వాత్సంవాదిభ్రమ ఇత్యుచ్యత ఇత్యర్థః.

టీ. దీపప్రభామణిభ్రాంతిః=దీపకాంతియందు మణి యనెడిభ్రాంతి, విసంవాదిభ్రమః=విసంవాదిభ్రమ యని, స్మృతః = చెప్పఁబడును. మణిప్రభామణిభ్రాంతిః = రత్నప్రభయందు రత్నమనెడు భ్రాంతి, సంవాదిభ్రమః = సంవాదిభ్రమ యని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. దీపప్రభను జూచి రత్న మని పొరపడినవాని భ్రమజ్ఞానము 'విసంవాదిభ్రమ' యనఁబడును. విసంవాదిభ్రమ యనఁగా వ్యర్థమగు (లాభములేని) భ్రమ. రత్నప్రభను జూచి రత్న మని భ్రమించినవాని

జ్ఞానము 'సంవాదిభ్రమ' యనఁబడును. సంవాదిభ్రమ యనఁగా లాభము గల భ్రమజ్ఞానము.

అవ. ప్రత్యక్షస్థలములో నిట్టిసంవాదిభ్రమను జూపి యనుమానస్థలములో దానిం గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. బాష్పం ధూమతయా బుధ్వా తత్రాంగారానుమానతః,
వహ్నిర్యదృచ్ఛయా లబ్ధ స్స సంవాదిభ్రమో మతః. 7

వ్యా. ఏవం ప్రత్యక్షవిషయే సంవాదిభ్రమం దర్శయిత్వాఽనుమానవిషయేఽపి తం దర్శయతి—బాష్పమితి. క్వచిత్ప్రదేశే స్థితం బాష్పం ధూమవత్త్వేన నిశ్చిత్య తస్మాత్ప్రదేశే అయం ప్రదేశః అగ్నిమాన్ ధూమవత్త్వాదిత్యనుమానాయ ప్రవృత్తేన పురుషేణ దైవగత్యా యద్యగ్ని స్తత్రోపలభ్యేత తదా బాష్పవిషయం ధూమజ్ఞానం సంవాదిభ్రమో మత స్సమ్మతః.

టీ. బాష్పం=నీటియావిరిని, ధూమతయా = ధూమమునుగా, బుధ్వా = తెలిసి, తత్ర = అక్కడ, అంగారానుమానతః = అగ్నియున్నదని యూహించుటవలన, యదృచ్ఛయా=దైవికముచేత, వహ్నిః - అగ్ని, లబ్ధః = పొందఁబడెను. సః=అది, సంవాదిభ్రమః = సంవాదిభ్రమ యని, మతః = చెప్పఁబడెను.

తా. నీటియావిరిని జూచి యచట నగ్ని కల దని యొకఁ డూహించెను. నీటియావిరిని గాంచి యది పొగ యనుకొనుట పొరబాటైనను దైవికంబుగా నానీటియొద్దన నిప్పు దొఱకెనేని వానికిఁ గలిగిన నీటియావిరియందలి ధూమజ్ఞానము లాభకర మగుటంజేసి యది సంవాదిభ్రమ యనఁబడును.

అవ. శబ్దజ్ఞానమునందు సంవాదిభ్రమను జూపుచున్నాఁడు:—

శ్లో. గోదావర్యుదకం గంగోదకం మత్వా విశుద్ధయే,
సంప్రోక్ష్య శుద్ధిమాప్నోతి స సంవాదిభ్రమో మతః. 8

వ్యా. ఆగమవిషయేఽపి తం దర్శయతి—గోదావర్యుదకమితి. గోదావర్యుదకస్యాఽపి విశుద్ధిహేతుత్వమాగమసిద్ధమత స్తత్ప్రోక్షణా దపి విశుద్ధి ర స్త్యేవ. అథాపి గోదావర్యుదకే యా గంగోదకబుద్ధి స్సా భ్రాంతిరేవ.

టీ. గోదావర్యుదకం=గోదావరియుదకము, గంగోదకం = భాగీరథీజలమునుగా, మత్వా=తలంచి, విశుద్ధయే=పరిశుద్ధికొఱకు, సంప్రోక్ష్య = ప్రోక్షణముచేసికొని, శుద్ధిం= శుద్ధిని, ఆప్నోతి = పొందుచున్నాఁడు. సః = అట్టిది, సంవాదిభ్రమః = సంవాదిభ్రమ యని, మతః = సమ్మతము.

తా. గోదావరీజలమును భాగీరథీజలమును విడివిడిగా రెండు కలశములందు పెట్టఁగా గోదావర్యుదకమే గంగోదక మని పొరపడి యొకఁడు ప్రోక్షించుకొనెను. వానిజ్ఞానము సరికాకపోయినను వస్తుస్వభావముచేత అట్టియుదక ప్రభావముచేత వానికి శుద్ధి కలుగుచున్నది. ఇది సంవాదిభ్రమ మగును.

అవ. ఇంకొక యుదాహరణ మిచ్చుచున్నాఁడు;—

శ్లో. జ్వరేణాప్తస్సన్నిపాతం భ్రాంత్యా నారాయణం స్మరన్,
మృత స్స్వర్గ మవాప్నోతి స సంవాదిభ్రమో మతః. 9

వ్యా. ఉదాహరణాంతరమాహ—జ్వరేణాప్త ఇతి. జ్వరేణ సన్నిపాతం ప్రాప్తః పురుష ఇదం నారాయణస్మరణం మమ స్వర్గసాధనమితి జ్ఞానమంతరేణాపి సన్నిపాత ప్రయుక్తభ్రమవశాత్సాధారణం పురుషతయా వైద్యాదివ న్నారాయణం స్మరన్మృతః స్వర్గమవాప్నో త్యేవ. 'హరిర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావక' ఇతి. 'అక్రుశ్య పుత్ర మఘవాన్యద జామిళోఽపి నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తి'మిత్యాదిపురాణవచనేభ్యః అత్రాపి నారాయణనామ్నః పుత్రనామత్వజ్ఞానం భ్రాంతిరేవ.

టీ. జ్వరేణ = జ్వరముచేత, సన్నిపాతం=సన్నిపాతవ్యాధిని, ఆప్తః = పొందినవాఁడై, భ్రాంత్యా = భ్రాంతిచేత, నారాయణం = విష్ణుమూర్తిని, స్మరన్=స్మరించుచు, మృతః = మరణించినవాఁడు, స్వర్గం = స్వర్గమును, అవాప్నోతి = పొందుచున్నాఁడు. సః = అట్టిది, సంవాదిభ్రమః=సంవాదిభ్రమ యని, మతః = అభిమతము.

తా. సన్నిపాతజ్వరము వచ్చినయొకఁడు భ్రాంతిచే నజామిళుని వలె నారాయణుని స్మరించెనేని యాస్మరణ మయథార్థజ్ఞానమే యైనను వానికి స్వర్గము గల్గును. అదియును సంవాదిభ్రమయే యగును. ఇటు "హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః, అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః" "అక్రుశ్య పుత్రమఘవాన్యదజామిళోఽపి నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తిమ్" (అనిచ్ఛచే స్పృశించినను అగ్ని దహించునట్లు పాపచిత్తుఁడు అనిచ్ఛచే స్మరించినను వానిపాపములను శ్రీమన్నారాయణుండు హరించును. పాపాత్ముఁడగు అజామిళుఁడు తనపుత్రుని 'నారాయణా' యనిపిలుచుచు మృతినొంది ముక్తుఁడాయెను). అనెడి పురాణవాక్యములవలన నారాయణనామమునకు పుత్రనామ

త్వజ్ఞానము భ్రాంతియే యగును. ఇట్టిభ్రాంతి సంవాదిభ్రమ యనఁ బడును.

అవ. తేలినఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యక్షస్యానుమానస్య తథా శాస్త్రస్య గోచరే,
ఉక్తన్యాయేన సంవాదిభ్రమాః స్సంతి హి కోటిశః. 10

వ్యా. ఏవం త్రివిధసంవాదిభ్రమోదాహరణేన సిద్ధమర్థమాహ—ప్రత్యక్షస్యేతి.

టీ. ప్రత్యక్షస్య=ప్రత్యక్షమునకును, అనుమానస్య=అనుమానమునకును, తథా= ఆవిధముననే, శాస్త్రస్య=శాస్త్రమునకును, గోచరే=విషయమునందు, ఉక్తన్యాయేన = చెప్పఁబడినరీతిచేత, సంవాదిభ్రమాః = సంవాదిభ్రమలు, కోటిశః = కోట్లకొలఁది, సంతి = కలవు.

తా. ప్రత్యక్షస్థలంబునను, అనుమానస్థలంబునను, శాస్త్రవిషయంబునను నిట్టిసంవాదిభ్రమలు కోట్లకొలఁది గలవు.

అవ. సంవాదిభ్రమఅను గమనింపనిచో బాధకముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అన్యథా మృత్తికాదారుశిలాస్స్యుర్దేవతాః కథమ్,
అగ్నిత్వాదిధియోపాస్యాః కథం వా యోషిదాదయః. 11

వ్యా. విపక్షే బాధప్రదర్శనేనోక్తమర్థం ద్రఢయతి—అన్యథేతి. అన్యథా సంవాది భ్రమాభావే మృదాదయః ఫలసిద్ధయే దేవతాత్వేన పూజ్యా న భవేయుస్స్వతో దేవతాత్వాభావాదిత్యర్థః. బాధకాంతరమాహ — అగ్నిత్వాదీతి. పంచాగ్నివిద్యాయాం "యోషా వావ గౌతమాగ్నిః పురుషో వావ గౌతమాగ్నిః పృథివీ వావ గౌతమాగ్నిః పర్జన్యో వావ గౌతమాగ్నిరసౌ వావలోకో గౌతమాగ్ని" రిత్యాది వాక్యైర్యోషి త్పురుష పృథివీ పర్జన్యద్యులోకానా మగ్నిత్వేనోపాసనం బ్రహ్మలోకావాప్తిఫలకం న భవేదిత్యర్థః. ఆదిపదేన మనో బ్రహ్మేత్యుపాసీత. ఆదిత్యో బ్రహ్మేత్యాదేశ ఇత్యేవ మాదయో గృహ్యంతే.

టీ. అన్యథా = అట్లుగానియెడల, మృత్తికాదారుశిలాః - మృత్తికా=మట్టియు, దారు=కొయ్యయు, శిలాః = ఱాయియు, దేవతాః=దేవతలు, కథం = ఎట్లుగా, స్యుః అగును? యోషిదాదయః = స్త్రీలు మొదలగునవియు, అగ్నిత్వాదిధియా = అగ్ని మొదలగునవి యనెడిబుద్ధిచేత, కథం = ఎట్లుగా, ఉపాస్యాః = ఉపాసింపఁదగినవి?

తా. సంవాదిభ్రమమును గమనింపనియెడల మృద్దారుశిలలను శాస్త్రప్రకారము దేవత లని భావించెడువారికి సుకృతలాభము లేక

పోవలసివచ్చును. అట్టులే పంచాగ్నివిద్యయందు స్త్రీని, పురుషుని, పృథివిని, మేఘమండలమును, ద్యులోకంబును అగ్ని యనియు, వారియవయవములను నగ్న్యాద్యవయవము లనియు భావించెడివారికి బ్రహ్మలోకప్రాప్తి గలుగు నని చెప్పెడియుపనిషద్వాక్య మప్రమాణము గావలసివచ్చును. స్త్రీ మున్నగువా రెన్నటికి నగ్న్యాదులు గారు. కాఁబట్టి యాయుపాసకులజ్ఞానము భ్రమజ్ఞానమే యైనను దానివలన లాభము గల దని శాస్త్రము చెప్పుచున్నది.

అవ. సంవాదిభ్రమను సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అయథావస్తువిజ్ఞానాత్ఫలం లభ్యత ఈప్సితం,
కాకతాలీయతస్సోఽయం సంవాదిభ్రమ ఉచ్యతే. 12

వ్యా. ఇదానీం బహుభిర్గ్రంథైరుపపాదితం సంవాదిభ్రమం బుద్ధిసౌకర్యాయ సంక్షిప్య దర్శయతి—అయథావస్త్వితి. విహితాదవిహితాద్వా యస్మాదయథావస్తువిజ్ఞానా దీప్సితమభిలషితం ఫలం కాకతాళీయన్యాయతో దైవగత్యా లభ్యతే, సోఽయం సంవాదిభ్రమ ఇత్యర్థః.

టీ. అయథావస్తువిజ్ఞానాత్ = అయథార్థజ్ఞానమువలన, కాకతాళీయతః=దైవయోగమువలన, ఈప్సితం=కోరఁబడిన, ఫలం=లాభము, లభ్యతే (చేత్) = పొందఁబడెనేని, సోఽయం=అట్టిలాభకారి యగు భ్రమ, సంవాదిభ్రమః=సంవాదిభ్రమ యని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. అయథార్థజ్ఞానముచేత దైవికముగా లాభ మబ్బెనేని యాభ్రమ సంవాదిభ్రమ యనంబడును.

అవ. బ్రహ్మోపాసన మయథార్థము గదా. అది యెట్లు మోక్షఫల మొసంగును? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వయం భ్రమోఽపి సంవాదీ యథా సమ్యక్ఫలప్రదః,
బ్రహ్మతత్త్వోపాసనాపి తథా ముక్తిఫలప్రదా. 13

వ్యా. నను బ్రహ్మోపాసనస్యాయథావస్తువిషయస్య కథం సమ్యక్ జ్ఞానసాధ్యముక్తిఫలప్రదత్వమిత్యాశంక్య సంవాదిభ్రమవదేవేత్యాహ—స్వయంభ్రమ ఇతి.

టీ. స్వయం = తనయంతటఁ, యథా=ఏవిధముగా, సంవాదీ = సంవాదిజ్ఞానము, భ్రమోఽపి=భ్రమయైనను, సమ్యక్ఫలప్రదః = మంచిఫలమునిచ్చుచున్నదో, తథా=ఆవిధముననే, బ్రహ్మతత్త్వోపాసనాపి = బ్రహ్మతత్త్వోపాసనయుం, ముక్తిఫలప్రదా = మోక్షఫల మొసంగునది, (భవతి = అగుచున్నది).

తా. లోగడ చెప్పిన సంవాదిభ్రమలు లాభకారులైనట్లు బ్రహ్మో పాసనయును లాభకారి యగును.

అవ. బ్రహ్మతత్త్వమును దెలిసి యుపాసింపవలెనా ? తెలియకయే యుపాసింప వచ్చునా? తెలిసియున్నయెడల తెల్వి యనిన జ్ఞానమే కనుక తెల్వి యుండిన నుపాసనమేల? తెలియకయే యుపాసింపవలయు నంటివా, వస్తుజ్ఞానము లేక యుపాసించు టెట్లు ఘటించును? అనుశంకలకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వేదాంతేభ్యో బ్రహ్మతత్త్వ మఖండైకరసాత్మకమ్,
పరోక్ష మవగ మ్యైతదహ మస్మీత్యుపాసతే. 14

వ్యా. నను, బ్రహ్మతత్త్వం జ్ఞాత్వోపాసనం క్రియతేఽజ్ఞాత్వావా? ఆద్యే ఉపాసనావైయర్థ్యం మోక్షసాధనస్య జ్ఞానస్యైవ విద్యమానత్వాత్. ద్వితీయే విష యాపరిజ్ఞానాదుపాసన మేవ న ఘటత ఇత్యాశంక్యాహ—వేదాంతేభ్య ఇతి. అయ మభిప్రాయః—బ్రహ్మాత్మైకత్వాపరోక్షజ్ఞానస్య మోక్షసాధనస్యానుత్పన్నత్వాన్నోపా సనా వైయర్థ్యం శాస్త్రాత్పరోక్షతయావగతత్వాద్బ్రహ్మణ ఉపాసనావిషయత్వమితి.

టీ. వేదాంతేభ్యః = ఉపనిషత్తులవలన, అఖండైకరసాత్మకమ్-అఖండ=భిన్నము కాని, ఏకరసాత్మకమ్ = ఏకవిధమగు, బ్రహ్మతత్త్వం = బ్రహ్మతత్త్వమును, పరోక్షం= పరోక్షమునుగా, అవగమ్య = తెలిసికొని, ఏతత్ = ఇది, అహమస్మీతి = నేనే యని, ఉపాసతే = ఉపాసించుచున్నారు.

తా. వేదాంతమువలన నఖండైకరసాత్మకం బగు బ్రహ్మ మొకటి గల దని పరోక్షంబుగా గ్రహించి, అపరోక్షజ్ఞానమునకై నేనే బ్రహ్మమ నని యుపాసించును. పరోక్షజ్ఞానము గలదు గనుక నుపాసించుట కభ్యంతరము లేదు. అపరోక్షజ్ఞానము గలుగమింజేసి యుపాసన యవ సరము.

అవ. పరోక్షజ్ఞాన మన నెట్టిదియో యెఱింగించుచున్నాఁడు:—

శ్లో. ప్రత్యగ్వ్యక్తిమనుల్లిఖ్య శాస్త్రా ద్విష్ణ్వాదిమూర్తివత్,
అస్తి బ్రహ్మేతి సామాన్యజ్ఞాన మత్ర పరోక్షధీః. 15

వ్యా. ఉపాస్యబ్రహ్మతత్త్వగోచరస్య పరోక్షజ్ఞానస్య కిం రూపమిత్యా కాంక్షా యామాహ—ప్రత్యగితి. ప్రత్యగ్వ్యక్తిం బుద్ధ్యాదిసాక్షిణమానందాత్మాన మనుల్లిఖ్యావిషయీకృత్య శాస్త్రా త్సత్యజ్ఞానాదివాక్యజాతాద్బ్రహ్మాస్మీత్యేవం సామా న్యాకారేణ జాయమానం జ్ఞానం అత్రాస్యాముపాసనాయాం పరోక్షధీః పరోక్షజ్ఞానం.

వివక్షితమిత్యర్థః. తత్ర దృష్టాంతః—విష్ణ్వాదీతి. విష్ణ్వాదిమూర్తిప్రతిపాదకశాస్త్ర జన్యజ్ఞానవదిత్యర్థః.

టీ. ప్రత్యగ్వ్యక్తిం = బుద్ధ్యాదులకు సాక్షి యగు ప్రత్యగాత్మను, అనుల్లిఖ్య= విషయముచేసికొనక, శాస్త్రాత్ = శాస్త్రమువలన, విష్ణ్వాదిమూర్తివత్ = విష్ణ్వాది మూర్తులవలె, బ్రహ్మ = పరబ్రహ్మము. అస్తీతి = కలదని, సామాన్యజ్ఞానం = సామాన్య జ్ఞానము, అత్ర = ఇక్కడ, పరోక్షధీః = పరోక్షజ్ఞాన మని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నది.

తా. తానే బ్రహ్మమైయుండియు, ఆసంగతి స్ఫురింపక బ్రహ్మ మెక్కడనో గల దనుకొనెడి సామాన్యజ్ఞానము విష్ణ్వాదిమూర్తి జ్ఞానమువలె పరోక్షజ్ఞాన మనఁబడును.

అవ. విష్ణుమూర్తిజ్ఞానము ఎట్లు పరోక్ష మగును ? అని యడుగఁగాఁ జెప్పు చున్నాఁడు:—

శ్లో. చతుర్భుజాద్యవగతావపి మూర్తిమనుల్లిఖన్,
అక్షైః పరోక్షజ్ఞాన్యేవ న తదా విష్ణుమీక్షతే. 16

వ్యా. నను శాస్త్రే విష్ణ్వాదిమూర్తేశ్చతుర్భుజత్వాదివిశేషప్రతీతేః తత్ జ్ఞాన స్యాపి కుతః పరోక్షత్వమిత్యాశంక్యాహ—చతుర్భుజాదీతి. శాస్త్రేణ చతుర్భుజ త్వాదివిశేషప్రతీతావపి చక్షురాదిభి ర్విష్ణ్వాదిమూర్తిమవిషయీకుర్వన్ పురుషః పరోక్ష జ్ఞాన్యేవ. తత్రోపపత్తి మాహ—న తదేతి. తదోపాసనాకాలే విష్ణు ముపాస్యం నేక్షతే నేంద్రియైర్విషయీకరోతీత్యర్థః.

టీ. చతుర్భుజాద్యవగతావపి=నాలుగుభుజంబులు గలవాఁ డని యీ మొదలగు నవి తెలిసినప్పటికిని, అక్షైః = ఇంద్రియంబులచేత, మూర్తిం = స్వరూపమును, అను ల్లిఖన్ = గోచరింపఁజేసికొననివాఁడై, పరోక్షజ్ఞాన్యేవ=పరోక్షజ్ఞానియే, (భవతి=అగు చున్నాఁడు). తదా=అప్పుడు, విష్ణుం=శ్రీమహావిష్ణువును, నేక్షతే=కనుఁగొన లేఁడు.

తా. విష్ణ్వాదిమూర్తి ప్రతిపాదకశాస్త్రముచే విష్ణ్వాదిమూర్తుల యొక్క చతుర్భుజత్వాదివిశేషాకారము తెలియఁబడినను, చక్షురాదు లచే విష్ణ్వాదిమూర్తులను జూడనివాఁ డగుచు పురుషుఁడు పరోక్షజ్ఞాని యే యగును. అనఁగా ప్రత్యక్షముగఁ జూడకపోయినను శాస్త్రజన్య జ్ఞానముచే దెలియుట పరోక్షజ్ఞాన మగును.

అవ. అవిష్ణుజ్ఞానము విష్ణువును గనఁబఱచనంతమాత్రమున భ్రమము కా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. పరోక్షత్వాపరాధేన భవే న్నాతత్త్వవేదనమ్,
ప్రమాణేనైవ శాస్త్రేణ సత్యమూర్తేర్విభాసనాత్. 17

వ్యా. నను విష్ణ్వాదిగోచరస్య జ్ఞానస్య వ్యక్త్యుల్లేఖయిత్రుత్వాభావా ద్భ్రమత్వమిత్యాశంక్య ప్రమాణేన జనితత్వాన్న భ్రమత్వమిత్యాహ—పరోక్షత్వేతి. పరోక్షజ్ఞానత్వం భ్రాంతిజ్ఞానత్వే కారణం న భవతి. కింతు విషయాసత్యత్వం ఇహ తు ప్రమాణభూతేన శాస్త్రేణైవ యథార్థభూతాయా విష్ణ్వాదిమూర్తేరవభాసనాన్న భ్రమత్వ మిత్యర్థః.

టీ. పరోక్షత్వాపరాధేన=పరోక్షత్వముయొక్క లోపముచేత, అతత్త్వవేదనం= అయథార్థజ్ఞానము, న భవేత్ = కాదు. ప్రమాణేన = ప్రమాణ మగు, శాస్త్రేణైవ = శాస్త్రముచేతనే, సత్యమూర్తేః = నిజమైనయాకారముయొక్క, విభాసనాత్ = గోచరించుటవలన (అయథార్థభావము కా దనుట).

తా. గురూపదేశమువలన నప్పుడు విష్ణువు కన్నుల కగపడనంతమాత్రముచేత నాజ్ఞానము భ్రమ మనఁ జెల్లదు. శాస్త్రమే యిట్టిమూర్తి గల దని చెప్పినది. శాస్త్రసిద్ధం బగు రూపమును గోచరింపఁ జేసెడిజ్ఞానము యథార్థ మె ట్లగును? కా దని భావము.

అవ. నేను సచ్చిదానందరూపబ్రహ్మ మనుజ్ఞానము సచ్చిదానందరూపమును గ్రహించి కదా కలుగును. ఇది పరోక్షమేల కావలయు ననుశంకకు సమాధానము:—

శ్లో. సచ్చిదానందరూపస్య శాస్త్రాద్భానేఽప్యనుల్లిఖన్,
ప్రత్యంచం సాక్షిణం తత్తు బ్రహ్మ సాక్షా న్న వీక్షతే. 18

వ్యా. నను సచ్చిదానందవ్యక్త్యుల్లేఖినో బ్రహ్మతత్త్వజ్ఞానస్య శాస్త్రజన్యస్యాపి కుతః పరోక్షతేత్యాశంక్యాపరోక్షత్వప్రయోజకప్రత్యక్త్వోల్లేఖాభావాదిత్యాహ—సచ్చిదానందేతి. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ నిత్యశ్శుద్ధో బుద్ధస్సత్యో ముక్తో నిరంజనస్సద్ధీదం సర్వం సత్సదితి చిద్ధీదం సర్వం ప్రకాశతే' ఇత్యాదిశాస్త్రాత్సచ్చిదానందరూపస్య బ్రహ్మణో భానేఽపి ప్రత్యం చం సాక్షిణమనుల్లిఖన్ తస్య బ్రహ్మణః ప్రత్యగాత్మరూపత్వమజానాన స్తద్బ్రహ్మసాక్షాన్న వీక్షతే నైవ పశ్యతి.

టీ. సచ్చిదానందరూపస్య = సచ్చిదానందస్వరూపమునకు, శాస్త్రాత్=శాస్త్రమువలన, భానేఽపి = భానము (ప్రతీతి) గలిగినను, ప్రత్యంచం = సర్వాంతరుఁడగు, సాక్షిణం=సాక్షిని, అనుల్లిఖన్ = విషయముచేసికొననివాఁడగుచు, తద్బ్రహ్మ=ఆబ్రహ్మమును, సాక్షాత్=ప్రత్యక్షముగా, న తు వీక్షతే = చూడనేలేఁడు.

తా. నేను సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మము నని శాస్త్రమును నమ్మి భావించునప్పుడు తన కాసంగతి నమ్మికచేతనే గ్రహింపఁబడినది గాని యట్టి యనుభవ మప్పుడు తనకు లేదు.

అవ. ఈపరోక్షజ్ఞానము యథార్థజ్ఞాన మెట్లగు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శాస్త్రోక్తేనైవ మార్గేణ సచ్చిదానందనిశ్చయాత్,
పరోక్షమపి తద్ జ్ఞానం తత్త్వజ్ఞానం న తు భ్రమః. 19

వ్యా. కథం తర్హి తథావిధబ్రహ్మగోచరస్య జ్ఞానస్య తత్త్వజ్ఞానత్వ మిత్యాశంక్యాగమ ప్రమాణజన్యత్వాదిత్యాహ—శాస్త్రేతి. తత్ జ్ఞానం పరోక్షమపి శాస్త్రోక్తేనైవ ప్రకారేణ బ్రహ్మణః సచ్చిదానందరూపనిశ్చాయకత్వాత్సమ్యక్ జ్ఞానమేవ న భ్రమ ఇత్యర్థః.

టీ. శాస్త్రోక్తేన = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన, మార్గేణైవ = మార్గముచేతనే, సచ్చిదానందనిశ్చయాత్=సచ్చిదానందస్వరూపనిశ్చయమువలన, తత్ జ్ఞానం = ఆజ్ఞానము, పరోక్షమపి=పరోక్షమైనను, భ్రమః = భ్రమ, న తు = కాదు.

తా. నేను సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మ మనిన శాస్త్రమూలముగనే గ్రహించెను గాన నది స్వానుభవము లేమింజేసి పరోక్షమైనను భ్రమ కాఁజాలదు.

అవ. బ్రహ్మము ప్రత్యగ్రూప మని మహావాక్యములందు వర్ణింపఁబడినది. కనుక ఆమహావాక్యములవలనఁ గలిగినజ్ఞాన మపరోక్షజ్ఞాన మని యేల యనఁగూడదు అను ప్రశ్నమునకు సమాధానము:—

శ్లో. బ్రహ్మ యద్యపి శాస్త్రేషు ప్రత్యక్త్వేనైవ వర్ణితమ్,
మహావాక్యై స్తథాప్యేత ద్దుర్బోధ మవిచారిణః. 20

వ్యా. నను సత్యజ్ఞానాదివాక్యైర్బ్రహ్మణస్సచ్చిదానందరూపత్వమివ తత్త్వమస్యాదివాక్యైః ప్రత్యగ్రూపత్వమపి తస్య బోధ్యత ఏవ. అతశ్శాస్త్రజన్యస్యాపి జ్ఞానస్య ప్రత్యగ్వస్తుల్లేఖిత్వాదపరోక్షత్వమేవేత్యాశంక్యాహ—బ్రహ్మేతి. యద్యపి వేదాంతేషు మహావాక్యైర్బ్రహ్మప్రత్యగాత్మత్వేనైవోపదిష్టం తథాప్యేతద్బ్రహ్మ ప్రత్యగ్రూపత్వం అన్వయవ్యతిరేకాభ్యాం తత్త్వంపదార్థవివేకశూన్యస్య దుర్బోధం బోద్ధుమశక్యమతః కేవలా ద్వాక్యాన్నాపరోక్షజ్ఞానముత్పద్యత ఇత్యర్థః.

టీ. బ్రహ్మ=బ్రహ్మము, యద్యపి=విచారింపఁగా, శాస్త్రేషు = శాస్త్రములయందు, ప్రత్యక్త్వేనైవ=ప్రత్యగ్రూపముగనే, మహావాక్యైః = తత్త్వమస్యాదిమహావాక్యముల

చేత, వర్ణితం = వర్ణింపఁబడినది. తథాపి = అలాగైనను, అవిచారిణః = విచారింపని వానికి, ఏతత్ = ఇది, దుర్బోధం = తెలియశక్యముకాదు.

తా. మహావాక్యములయందు ప్రత్యగాత్మయే బ్రహ్మ యని చెప్పఁబడినది. అయినను విచారముచేయని వాని కీయర్థ మపరోక్షముగాఁ దెలియ శక్యముకాదు.

అవ. చెప్పుటకు మహావాక్యము లుండెను, వాస్తవముగా జీవబ్రహ్మముల యైక్య ముండెను. విచారముతోఁ బని యేమి? అను శంకకు సమాధానము:—

శ్లో. దేహాద్యాత్మత్వవిభ్రాంతౌ జాగ్రత్యాం న హఠాత్పుమాన్,
బ్రహ్మాత్మత్వేన విజ్ఞాతుం క్షమతే మందధీత్వతః. 21

వ్యా. నను సమ్యక్ జ్ఞానస్య ప్రమాణవస్తుపరతంత్రత్వాత్ప్రమాణస్య చ తత్త్వమస్యాదిరూపవాక్యస్య సద్భావాద్వస్తునశ్చ బ్రహ్మాత్మైక్యలక్షణస్య సిద్ధత్వా త్కుతో విచారమంతరేణ దుర్బోధత్వమిత్యాశంక్యాహ—దేహాదీతి. బ్రహ్మాత్మైకత్వాపరోక్ష జ్ఞానవిరోధినో దేహేంద్రియాదిష్వాత్మత్వభ్రమస్య విచారనివర్త్యస్య సద్భావాత్తన్నివృత్తయే చ విచారోఽపేక్ష్యత ఇత్యర్థః.

టీ. దేహాద్యాత్మత్వవిభ్రాంతౌ = శరీరమే యాత్మయనెడి విభ్రమము, జాగ్రత్యాం=ప్రకాశించుచుండఁగా, హఠాత్=బలాత్కారముగాను, పుమాన్=పురుషుఁడు, బ్రహ్మ=బ్రహ్మమును, ఆత్మత్వేన=ఆత్మస్వరూపత్వముగ, విజ్ఞాతుం=తెలిసికొనుటకు, మందధీత్వతః=మందబుద్ధిగలవాఁడగుటవలన, న క్షమతే=సమర్థుఁడు కాఁడు.

తా. దేహమే యాత్మ యనుజ్ఞాన ముండుటంజేసి యాభ్రాంతిని బోఁగొట్టఁదగినవిచారము లేనిదే మహావాక్యము బ్రహ్మాత్మైక జ్ఞానముం గలుగఁజేయఁజాలదు.

అవ. దేహాత్మభ్రమ యుండుటంజేసి పరోక్షజ్ఞానము గూడ సంభవింపకుండ రాదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మమాత్రం సువిజ్ఞేయం శ్రద్ధాలోః శాస్త్రదర్శినః,
అపరోక్షద్వైతబుద్ధిః పరోక్షాద్వైతబుద్ధ్యనుత్. 22

వ్యా. నను తర్హి దేహేంద్రియాదిగోచరస్య ద్వైతభ్రమస్య సద్భావా దద్వితీయ బ్రహ్మగోచరం పరోక్షజ్ఞానమపి నోదీయాదిత్యాశంక్యాహ—బ్రహ్మేతి. ద్వైతభ్రమస్య పరోక్షాద్వైతజ్ఞానావిరోధిత్వాచ్ఛ్రద్ధావతః పుంస శ్శాస్త్రా త్పరోక్షజ్ఞాన

సముత్పద్యత ఏవేత్యాహ—బ్రహ్మమాత్ర మితి. అపరోక్షద్వైతబుద్ధిర్యతః పరోక్షాద్వైతబుద్ధ్యనుత్ అతో బ్రహ్మమాత్రం సువిజ్ఞేయ మితి యోజనా.

టీ. శ్రద్ధాళోః = శ్రద్ధకలిగినటువంటి, శాస్త్రదర్శినః = శాస్త్రజ్ఞునకు, బ్రహ్మమాత్రం = బ్రహ్మమొక్కటియే, సువిజ్ఞేయం = బాగుగాఁ దెలియఁదగినది. అపరోక్షద్వైతబుద్ధిః=ప్రత్యక్షమగు ద్వైతజ్ఞానము, పరోక్షాద్వైతబుద్ధ్యనుత్ = పరోక్షమగు నద్వైతజ్ఞానమును బాధింపఁ జాలదు.

తా. శాస్త్రవిశ్వాసము గలవాఁడు బ్రహ్మ మొకటి గల దని గ్రహింపవచ్చును. ప్రత్యక్ష మగు దేహాత్మజ్ఞానము పరోక్ష మగు బ్రహ్మజ్ఞానమును బ్రతిబంధింపఁజాలదు.

అవ. ఈ యర్థమునందు దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అపరోక్షశిలాబుద్ధిర్న పరోక్షేశతాం నుదేత్,
ప్రతిమాదిషు విష్ణుత్వే కో వా విప్రతిపద్యతే. 23

వ్యా. అపరోక్షభ్రమస్య పరోక్షసమ్యక్ జ్ఞానావిరోధిత్వే దృష్టాంతమాహ—అపరోక్షేతి. విరోధాభావమేవోదాహృత్య దర్శయతి ప్రతిమాదిష్వితి.

టీ. అపరోక్షశిలాబుద్ధిః = ప్రత్యక్షమగుశిలాజ్ఞానము, పరోక్షేశతాం=పరోక్షమగు నీశ్వరత్వమును, న నుదేత్=పోఁగొట్టదు. ప్రతిమాదిషు = ప్రతిమలు మొదలగు వానియందు, విష్ణుత్వే = విష్ణుభావననుగుఱించి, కోవా = ఎవ్వఁడు, విప్రతిపద్యతే = కలహించుచున్నాఁడు ?

తా. శిల యని ప్రత్యక్షముగాఁ గనుపడినను అది విష్ణ్వాది దేవత యనుటలో నెవ్వరికిని వివాదము లేదు.

అవ. కొందఱీయర్థమునందు వివదించుచున్నారే యని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అశ్రద్ధాళో రవిశ్వాసో నోదాహరణమర్హతి,
శ్రద్ధాళోరేవ సర్వత్ర వైదికే ష్వధికారతః. 24

వ్యా. కేచన విప్రతిపద్యమానా ఉపలభ్యంత ఇత్యాశంక్యాహ—అశ్రద్ధాళోరితి. సర్వేషు వేదోక్తానుష్ఠానేషు శ్రద్ధాళోరేవ శ్రద్ధావత ఏవాధికారిత్వాదిత్యర్థః.

టీ. అశ్రద్ధాళోః = గురువేదాంతవాక్యములయందు నమ్మకములేనివానియొక్క, అవిశ్వాసః = విశ్వాసాభావము, ఉదాహరణం = దృష్టాంతమునుగూర్చి, నార్హతి =

తగదు. సర్వత్ర = అంతట, వైదికేషు = వైదికకృత్యములయందు, అధికారతః=శ్రద్ధ గలవారే యధికారు లగుటవలన. అని పూర్వార్థముతో నన్వయము.

తా. శ్రద్ధలేనివానియవిశ్వాసము దృష్టాంతార్హము కాదు. వైదికకర్మములయందు శ్రద్ధాళువే యధికారి యగును.

అవ. ఇట్లన్నంబున పరోక్షజ్ఞానమున కేమి లాభము గల్గిన దనిన, లోకానుభవముచే దృఢపఱచుచున్నాఁడు:—

శ్లో. సకృదాప్తోపదేశేన పరోక్షజ్ఞానముద్భవేత్,
విష్ణుమూర్త్యుపదేశో హి న మీమాంసామపేక్షతే. 25

వ్యా. ఏతావతా పరోక్షజ్ఞానే కిమాయాతమిత్యత ఆహ—సకృదాప్తేతి. ఉక్తమర్థం లోకానుభవేన ద్రఢయతి—విష్ణుమూర్తీతి.

టీ. సకృత్ = ఒక్కమాటు, ఆప్తోపదేశేన = ఆప్తునియొక్క యుపదేశముచేత, పరోక్షజ్ఞానం=పరోక్షజ్ఞానము, ఉద్భవేత్=పుట్టును. విష్ణుమూర్త్యుపదేశః=విష్ణుమూర్తి యొక్క యుపదేశము, మీమాంసాం=చర్చించుటను, నాపేక్షతే=అపేక్షింపదు.

తా. ఆప్తుఁడొక్కమాటు చెప్పినందువలనఁ బరోక్షజ్ఞాన మొదవును. ప్రతిమ మొదలగువానిని దేవుఁడని యనుటకు విచార మక్కఱలేదు.

అవ. అట్లైనయెడల కర్మయును నుపాసనంబును పూర్వోత్తరమీమాంసా శాస్త్రములయందేల విచారింపఁబడుచున్నవి అనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. కర్మోపాస్తీ విచార్యేతే అనుష్ఠేయావినిర్ణయాత్,
బహుశాఖావిప్రకీర్ణం నిర్ణేతుం కః ప్రభుర్నరః. 26

వ్యా. నను తర్హి శాస్త్రేషు కుతో విచారాః క్రియంత ఇత్యాశంక్యానుష్ఠేయయోః కర్మోపాసనయోస్సందేహసంభవాత్తన్నిర్ణయాయ విచారాః క్రియంత ఇత్యాహ—కర్మోపాస్తీ ఇతి. సందేహసంభవమేవోపపాదయతి—బహుశాఖేతి. అనేకాసు శాఖాసు తత్ర తత్ర చోదితం కర్మఉపాసనం వా ఏకత్ర సమాహృత్య నిర్ణేతు మస్మదాదిర్నరః కః ప్రభుస్సమర్థః? న కోఽపీత్యర్థః.

టీ. అనుష్ఠేయావినిర్ణయాత్ - అనుష్ఠేయ = ఆచరింపఁదగినదానియొక్క, అవినిర్ణయాత్ = నిర్ణయములేకపోవుటవలన, కర్మోపాస్తీ = కర్మయును ఉపాసనయు, విచార్యేతే=విచారింపఁ బడుచున్నవి. బహుశాఖావిప్రకీర్ణం - బహు = అనేకములైన, శాఖా = వేదశాఖలయందు, విప్రకీర్ణే = విడివిడిగాఁ జెప్పఁబడిన కర్మోపాసనలను,

నిర్ణేతుం = నిర్ణయించుటకు, కః నరః=ఏమనుజుఁడు, ప్రభుః = సమర్థుఁడు ? (ఎవ్వఁడును సమర్థుఁడు కాఁ డనుట.)

తా. అనేకవేదశాఖలయందు సంకీర్ణముగాఁ జెప్పంబడినకర్మను ఉపాసనను శాస్త్రకారులు నిర్ణయింపనిచో, ననుష్ఠానమే సంభవింపక పోవును. కావున వా రట్లు నిర్ణయించిరి.

అవ. అట్లేని సామాన్యులకు కర్మోపాసనానుష్ఠానమే ఘటింప దని శంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్ణీతోఽర్థః కల్పసూత్రైర్గ్రథితస్తావతాఽఽస్తికః,
విచారేణ వినా కర్మ శక్తోఽనుష్ఠాతుమంజసా. 27

వ్యా. తను తర్హ్యననుష్ఠేయత్వమేవ కర్మోపాసనయోః ప్రాప్తమిత్యాశంక్యాహ—నిర్ణీత ఇతి. జైమిన్యాదిభిః పూర్వాచార్యైర్నిశ్చితోఽర్థః అనుష్ఠానప్రకారః కల్పసూత్రైస్సంగృహీతోఽస్తి. తావతా గ్రథితత్వేనైవ తేషు విశ్వాసవాన్పురుషః విచారం వినాపి కర్మ సమ్య గనుష్ఠాం శక్నోత్యేవ.

టీ. నిర్ణీతః=మీమాంసాదిశాస్త్రములచేత నిర్ణయింపఁబడిన, అర్థః=అర్థము, కల్పసూత్రైః = ఆశ్వలాయనాపస్తంబాదికల్పసూత్రములచేత, గ్రథితః = కూర్పఁబడినది, తావతా = అంతతో, ఆస్తికః = విశ్వాసముకలవాఁడు, విచారేణ వినా = విమర్శింపక, అంజసా=యథార్థముగా, కర్మ=కర్మను, అనుష్ఠాతుం=చేయుటకొఱకు, శక్తః=సమర్థుఁడు (అగుచున్నాఁడు.)

తా. శాస్త్రకారులు నిర్ణయించిన యర్థమును కల్పసూత్రకారులు వానిని సంగ్రహించి యనుష్ఠానోపయోగముగా గ్రంథంబుల రచించియున్నారు. వాని ననుసరించి ఆస్తికోత్తములు మీమాంసా పాండిత్యము లేకపోయినను కర్మల నాచరింపవచ్చును.

అవ. ఇటులే యుపాసనల నాచరింపవచ్చు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాస్తీనా మనుష్ఠాన మార్షగ్రంథేషు వర్ణితమ్,
విచారాక్షమమర్త్యాశ్చ తచ్ఛ్రుత్వోపాసతే గురోః. 28

వ్యా. నను, తత్రోపాసనావిచారాభావాత్తదనుష్ఠానం న సంభవేదిత్యాశంక్యాహ—ఉపాస్తీనామితి. ఆర్షగ్రంథేషు బ్రాహ్మవాసిష్ఠాదిమంత్రకల్పేషు ఉపాసనాప్రకారో వర్ణిత స్తతో విచారాసమర్థా మనుష్యాః కల్పేషూక్తం తదుపాసనం గురుముఖాదవగత్యానుతిష్ఠంతీతి భావః.

టీ. ఉపాస్తీనాం = ఉపాసనలయొక్క, అనుష్ఠానం = ఆచరించుట, ఆర్ష గ్రంథేషు=ఋషిప్రోక్తములగు గ్రంథములయందు, వర్ణితం = వర్ణింపఁబడినది. విచారాక్షమమర్త్యాశ్చ = విచారమునందు సమర్థులుగాని మనుజులు, తత్=దానిని, గురోః= గురువువలన, శ్రుత్వా=విని, ఉపాసతే=ఉపాసించుచున్నారు.

తా. బ్రాహ్మవాసిష్ఠాదికల్పగ్రంథములయం దుపాసనలను జేయు ప్రకారము వర్ణింపఁబడెను. శాస్త్రజ్ఞానము లేనివారు గురుముఖముగా నాయంశములను గ్రహించి యుపాసనములను జేయుదురు.

అవ. అట్లేని పూర్వికులు వేదవిచార మేల చేసి రనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. వేదవాక్యాని నిర్ణేతుమిచ్ఛన్ మీమాంసతాం జనః,
ఆప్తోపదేశమాత్రేణ హ్యనుష్ఠానం హి సంభవేత్. 29

వ్యా. నను తర్హి దానీంతనైరపి గ్రంథకర్తృభిర్వేదవాక్యవిచారః కుతః క్రియత ఇత్యాశంక్య స్వస్వబుద్ధిపరితోషాయైవ క్రియతే నానుష్ఠానసిద్ధయ ఇత్యాహ—వేదేతి.

టీ. వేదవాక్యాని=వేదవాక్యములను, నిర్ణేతుం=నిర్ణయించుటకొఱకు, ఇచ్ఛన్= ఇచ్ఛగించిన, జనః = జనము, మీమాంసతాం = విచారముచేయుఁగాక. ఆప్తోపదేశమాత్రేణ = యథార్థముచెప్పెడివారియొక్క మాటమాత్రముచేతనే, అనుష్ఠానం=ఆచరణము, సంభవేద్ధి = సంభవించును గదా.

తా. తాను స్వయముగా వేదవాక్యంబుల విచారింపఁదలఁచిన వానికొఱకు మీమాంసాశాస్త్రములు రచింపఁబడినవి. అనుష్ఠానమునకుఁ గల్పసూత్రంబులును గురూపదేశంబును చాలును.

అవ. బ్రహ్మసాక్షాత్కారము అట్టిది కాదని వక్కాణించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మసాక్షాత్కృతిస్త్వేవం విచారేణ వినా నృణాం,
ఆప్తోపదేశమాత్రేణ న సంభవతి కుత్రచిత్. 30

వ్యా. నను బ్రహ్మోపాసనవద్బ్రహ్మసాక్షాత్కారస్యాప్యుపదేశమాత్రాదేవ సిద్ధిః కిం న స్యా దిత్యాశంక్యాహ—బ్రహ్మేతి. ఆప్తోపదేశమాత్రేణోపాసనానుష్ఠానోపయోగిపరోక్షజ్ఞానముత్పద్యతే. అపరోక్షజ్ఞానం తు విచారమంతరేణ న జాయత ఇత్యుక్తం.

టీ. బ్రహ్మసాక్షాత్కృతిస్తు = బ్రహ్మసాక్షాత్కారమైతే, ఏవం = ఈవిధముగా, విచారేణ వినా = విచారము లేక, ఆప్తోపదేశమాత్రేణ = అప్తులు చెప్పుటచేతనే, కుత్రచిత్=ఎక్కడను, న సంభవతి = సంభవింపదు.

తా. తాను శ్రవణమననములఁ జేయనిది గురువులు చెప్పినంత మాత్రమున బ్రహ్మసాక్షాత్కారము గలుగదు గాన బ్రహ్మవిచారమావశ్యకముగఁ జేయఁదగినది.

అవ. అందులకుఁ గారణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరోక్షజ్ఞానమశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరత్,
అవిచారోఽపరోక్షస్య జ్ఞానస్య ప్రతిబంధకః. 31

వ్యా. తత్ర కారణమాహ—పరోక్షేతి. యతోఽవిశ్వాస ఏవ పరోక్షజ్ఞానం ప్రతిబధ్నాతి. నావిచారోఽత స్తన్నివృత్తౌ సకృదుపదేశాదేవ పరోక్ష జ్ఞానజన్మోపపద్యతే. అవిచారప్రతిబంధస్యాపరోక్షజ్ఞానస్య తు విచారద్వారా తన్నివృత్తి మంతరేణోత్పత్తిర్న సంభవతి. అతో విచారః కర్తవ్య ఇతి భావః.

టీ. అశ్రద్ధా = అవిశ్వాసము, పరోక్షజ్ఞానం = ప్రత్యక్షముగాని జ్ఞానమును, ప్రతిబధ్నాతి=అరికట్టుచున్నది. ఇతరత్ = మఱియొకటి, న=కాదు. అవిచారః=విచారము లేకపోవుట, అపరోక్షస్య = ప్రత్యక్షరూపమగు, జ్ఞానస్య = జ్ఞానమునకు, ప్రతిబంధకః = ప్రతిబంధించునది (అగును),

తా. అవిశ్వాసము పరోక్షజ్ఞానమును జెఱుచును. అవిచారము అపరోక్షజ్ఞానముం గలుగ నీయదు.

అవ. ఎంతవఱకు విచారింపవలయునో అట్టియవధిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. విచార్యాప్యపరోక్షేణ బ్రహ్మాత్మానం న వేత్తి చేత్,
ఆపరోక్ష్యావసానత్వా ద్భూయో భూయో విచారయేత్. 32

వ్యా. నను విచారే కృతేఽపి యదాఽపరోక్షజ్ఞానం జాయతే. తదా కిం కర్తవ్యమిత్యత ఆహ—విచార్యాపీతి. తత్త్వంపదార్థౌ సమ్యగ్విచార్యాపి వాక్యార్థం బ్రహ్మాత్మైకత్వమపరోక్షతయా న జానాతీతి చేత్తదాపి పునః పునర్విచార ఏవ కర్తవ్యః. అపరోక్షజ్ఞానహేతో రన్యస్యాభావాదితి భావః.

టీ. విచార్యాపి = విచారించియు, అపరోక్షేణ = ప్రత్యక్షముగా, బ్రహ్మాత్మానం=బ్రహ్మరూపమగు ప్రత్యగాత్మను, న వేత్తి చేత్=ఎఱుంగఁడేని, ఆపరోక్ష్యావసానత్వాత్=అపరోక్షజ్ఞానమే యవధిగాఁ గల దగుటవలన, భూయోభూయః=మాటిమాటికి, విచారయేత్ = విచారింపవలయును.

తా. ఒకమాఱు విచారించినయెడల బ్రహ్మసాక్షాత్కారము గలుగనిచో విసుగుచెందక సాక్షాత్కారము గలుగువఱకు పలుమాఱు విచారము చేయవలయును.

అవ. ఈజన్మముననే సాక్షాత్కారము గలుగకుండెనేని విచారము వ్యర్థమగునే యని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. విచారయన్నామరణం నైవాత్మానం లభేత చేత్,
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయే సతి. 33

వ్యా. నను భూయో భూయో విచారేణాపీహ సాక్షాత్కారానుదయే సతి విచారో వ్యర్థస్స్యాదిత్యాశంక్యాహ—విచారయన్నితి.

టీ. ఆమరణం = మరణపర్యంతము, విచారయన్ = విచారముచేయుచున్నను బ్రహ్మాత్మానం=బ్రహ్మస్వరూప మగు ప్రత్యగాత్మను, న లభేత చేత్ = పొందకుండెనేని, ప్రతిబంధక్షయే సతి=ప్రతిబంధము నశింపగా, జన్మాంతరే=ఇంకొకజన్మమున, లభేతైవ= లభించియే తీఱును.

తా. యావజ్జీవము విచారించినను బ్రహ్మసాక్షాత్కారము గలుగ దేని నిరాశం జెందఁగూడదు. ప్రతిబంధము తొలఁగఁగానే జన్మాంతరము నందు బ్రహ్మసాక్షాత్కారము శాస్త్రప్రామాణ్యముచేత తప్పక కలుగును.

అవ. చెప్పినయర్థమున సూత్రమును, శ్రుతిని, యుక్తిని శ్లోకద్వయముచేఁ గనఁ బఱచుచున్నాఁడు:—

శ్లో. ఇహ వాముత్ర వా విద్యేత్యేవం సూత్రకృతోదితమ్,
శృణ్వంతోఽప్యత్ర బహవో యన్న విద్యురితి శ్రుతిః. 34

వ్యా. నన్విదం కుతోఽవగతమిత్యాశంక్య బ్రహ్మసూత్రకృతా వ్యాసేన "ఐహికమప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనా" దిత్యస్మిన్ సూత్రేఽభిధానాదిత్యాహ— ఇహవాముత్రేతి. సతి ప్రతిబంధే ఇహ జన్మని జ్ఞానానుత్పత్తౌ శ్రుతిం దర్శయతి— శృణ్వంత ఇతి.

టీ. ఇహ = ఈలోకమందుఁగాని, అముత్ర=జన్మాంతరమునందుఁగాని, విద్యా = బ్రహ్మసాక్షాత్కారము, భవతి=కలుగుచున్నది. ఇత్యేవం=ఈవిధముగా, సూత్రకృతా= సూత్రకారునిచేత, ఉదితం = చెప్పఁబడినది. శృణ్వంతోఽపి=శ్రవణ మొనర్చినవార లును, అత్ర = ఈలోకమునందు, బహవః = అనేకులు, యత్=ఏ హేతువువలన, న విద్యుః=ఆత్మ నెఱుంగరో, ఇతి=ఈవిధముగా, శ్రుతిః = వేదవాక్యము, అస్తి=కలదు.

తా. విచారపరునకు నీజన్మయందే సాక్షాత్కారము గల్గును. లేదా జన్మాంతరమునందుఁ గల్గును. అని "ఐహికమప్యప్రస్తుతప్రతి

బంధే తద్దర్శనాత్" అను సూత్రమును సూత్రకారులు చెప్పిరి. శ్రవణముచేసినను ప్రతిబంధ ముండినచో నీజన్మమున సాక్షాత్కారము గలుగ దని వేదవాక్యము చెప్పినది.

అవ. ఈ జన్మమందు శ్రవణాదికమును జేసినవానికి జన్మాంతరమందు అపరోక్షజ్ఞానము కలుగు ననెడి విషయమై "గర్భేనుసన్నన్వేషామవేదమహే దేవానాం జనిమాని విశ్వ" ఇత్యాది శ్రుత్యర్థము నిపుడు పఠించుచున్నాఁడు:—

శ్లో. గర్భ ఏవ శయానస్సన్ వామదేవోఽవబుద్ధవాన్;
పూర్వాభ్యస్తవిచారేణ యద్వదధ్యయనాదిషు. 35

వ్యా. ఇహ జన్మని శ్రవణాది కర్తుః జన్మాంతరే ఽపరోక్షజ్ఞానం భవతీత్యత్రాపి 'గర్భేను సన్నన్వేషామవేదమహందేవానాం జనిమాని విశ్వే' త్యాదికాం శ్రుతి మర్థతః పఠతి—గర్భ ఇతి. ఇహ జన్మన్యనుత్పన్నస్య జ్ఞానస్య కాలాంతరోత్పత్తౌ దృష్టాంతమాహ—యద్వదితి.

టీ. వామదేవః = వామదేవమహర్షి, గర్భ ఏవ=గర్భమునందే, శయానస్సన్ = శయనించినవాఁ డగుచు, పూర్వాభ్యస్తవిచారేణ = పూర్వజన్మమం దభ్యసింపఁబడిన విచారముచేత, అధ్యయనాదిషు = అధ్యయనము మొదలగువానియందు, యద్వత్ =ఏవిధంబుగనో, (తద్వత్ =ఆవిధముగా), అవబుద్ధవాన్ = బ్రహ్మమును గుర్తెఱిఁగెను.

తా. వామదేవుఁ డను మహర్షికి పూర్వజన్మమున కొంతవిచారము చేసినప్పటికిని బ్రహ్మజ్ఞానము గలుగలేదు. ఆశరీరము పోయి జన్మాంతరము రాఁగానే గర్భస్థుఁడై యుండఁగనే అధ్యయనాదుల యందువలె బ్రహ్మాపరోక్షజ్ఞానము గలిగినవాఁ డయ్యెను.

అవ. దీనికి దృష్టాంతమును వివరించుచున్నాఁడు:—

శ్లో. బహువారమధీతేఽపి యదా నాయాతి చేత్పునః,
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్. 36

వ్యా. దృష్టాంతం వివృణోతి—బహువారమితి.

టీ. బహువారం=అనేకసారులు, అధీతేఽపి=అధ్యయనము చేయఁబడినను, యదా పునః = ఎప్పుడైతే, నాయాతిచేత్ = రాకయుండెనేని, పుమాన్ = పురుషుఁడు, దినాంతరే=మఱియొకదినమున, అనధీత్యైవ = అధ్యయనముచేయకయే, పూర్వాధీతం= పూర్వ మధ్యయనము చేయఁబడినదానిని, స్మరేత్ =జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనును.

తా. అధ్యయనమును జదువువా రనేకమాఱులు చదివినను గ్రంథము ముఖస్థము కాదేని నాదినమున స్వస్థతగాఁ బరుండి మఱు దినము లేవఁగనే స్మరించినంతమాత్రమున నది తప్పక ముఖస్థ మగును. ఇది యనుభవసిద్ధము.

అవ. మఱికొన్ని దృష్టాంతములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. కాలేన పరిపచ్యంతే కృషిగర్భాదయో యథా,
తద్వదాత్మవిచారోఽపి శనైః కాలేన పచ్యతే. 37

వ్యా. ఆదిశబ్దేన పరిగృహీతాని దృష్టాంతాంతరాణ్యాహ—కాలేనేతి. దార్ష్టాంతికే యోజయతి.

టీ. కృషిగర్భాదయః=వ్యవసాయము గర్భము మొదలగునవి. యథా=ఏవిధమున, కాలేన=కాలముచేత, పరిపచ్యంతే=పక్వములగుచున్నవో, తద్వత్=అటులే, ఆత్మవిచారోఽపి=బ్రహ్మవిచారమునయితము, శనైః=మెల్లగా, కాలేన = కాలముచేత, పచ్యతే= పరిపక్వ మగుచున్నది.

తా. కృషి సల్పువానికి (వ్యవసాయకునకు) గింజల నాటిననాఁడే పంట యింటికి రానేరదు. గర్భము పదిమాసములు నిండినఁ గాని ప్రసవింపదు. అట్టులే శ్రవణము చిరకాలము చేసినం గాని ఫలింపదు. వెంటనే ఫలింపకపోయె నని చింతింపవలదు.

అవ. పలుమాఱు విచారించినను ప్రతిబంధ మున్నయెడల బ్రహ్మజ్ఞానము కలుగ దనుటలోఁ బ్రమాణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పునః పునర్విచారేఽపి త్రివిధప్రతిబంధతః,
న వేత్తి తత్త్వమిత్యేత ద్వార్తికే సమ్యగీరితమ్. 38

వ్యా. బహువారం విచారితేఽపి తత్త్వే ప్రతిబంధబలాత్సాక్షాత్కారో న జాయత ఇత్యేతద్వార్తికకారైరపి నిరూపితమిత్యాహ—పునః పునరితి.

టీ. పునఃపునః = మాటిమాటికి, విచారేఽపి = విచారముచేసినను, త్రివిధప్రతిబంధతః - త్రివిధ = మూఁడువిధంబులగు, ప్రతిబంధతః = ప్రతిబంధములవలన, తత్త్వం = తత్త్వమును, న వేత్తి = గుర్తెఱుంగఁడు. ఇతి = ఈయంశము, వార్తికే = సురేశ్వరవార్తికమందు, సమ్యక్ = లెస్సగా, ఈరితం = చెప్పఁబడెను.

తా. త్రివిధంబు లగు ప్రతిబంధంబు లున్నయెడల నెన్నిమాఱులు విచారించినను ప్రతిబంధములు నివర్తించుదనుక బ్రహ్మ

జ్ఞానము (తత్త్వసాక్షాత్కారము) గలుగ దని శ్రీసురేశ్వరాచార్యుల వారు చెప్పిరి.

అవ. ఆ వార్తికములను ఉదాహరించుచున్నాఁడు:—

శ్లో. కుత స్తజ్జ్ఞానమితి చేత్తద్ధి బంధపరిక్షయాత్,
అసావపి చ భూతో వా భావీ వా వర్తతేఽథవా. 39

వ్యా. తాన్యేవ వార్తికాన్యుదాహరతి — కుత స్తజ్జ్ఞానమిత్యాదినా భరతస్య త్రిజన్మభిరిత్యంతేన. తత్ర తావత్పూర్వ మనుత్పన్నస్య జ్ఞానస్యేదానీముత్పత్తౌ కారణం పృచ్ఛతి—కుత ఇతి. ఉత్తరమాహ—తద్ధి బంధేతి. బంధః ప్రతిబంధ స్తస్య పరిక్షయాదిత్యర్థః. సోఽపి ప్రతిబంధో భూతో భావీ వర్తమానశ్చేతి త్రివిధ ఇత్యాహ —అసావితి.

టీ. తజ్జ్ఞానం=ఆ బ్రహ్మజ్ఞానము, కుత ఇతి చేత్=ఎట్లు గల్గునంటివేని, తత్=అది, బంధపరిక్షయాత్ - బంధ=ప్రతిబంధముయొక్క, పరిక్షయాత్=నాశమువలన, (భవతి= అగుచున్నది). అసావపి చ=ఈ ప్రతిబంధంబును, భూతో వా=కడచినదైనను, భావీవా= రాఁబోవునదియైనను, అథవా = అట్లుగాక, వర్తతే వా = తత్కాలమున నున్నదైనను (అగుచున్నది).

తా. ప్రతిబంధములు నివర్తింపనిది బ్రహ్మసాక్షాత్కారము కలుగదు. ప్రతిబంధములు భావిప్రతిబంధ మనియు భూతప్రతిబంధ మనియు వర్తమానప్రతిబంధ మనియు మూఁడు విధంబులుగా నున్నవి.

అవ. ప్రతిబంధక్షయమువలనిలాభముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. అధీతవేదవేదార్థోఽప్యత ఏవ న ముచ్యతే,
హిరణ్యనిధిదృష్టాంతాదిద మేవ హి దర్శితమ్. 40

వ్యా. భవత్వేవం త్రివిధః ప్రతిబంధ స్తతః కి మిత్యత ఆహ—అధీతేతి. అత ఏవ ప్రతిబంధసద్భావాదేవేత్యర్థః. సతి ప్రతిబంధే జ్ఞానం నోదేతీత్యేతత్ తద్యథా హిరణ్య నిధిం నిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సఞ్చరంతో న విందేయుః ఏవమేవేమాః సర్వాః ప్రజాః అహరహ ర్బ్రహ్మలోకం గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందన్త్యనృతేన హి ప్రత్యూఢా ఇత్యనయా శ్రుత్యా ప్రదర్శితమిత్యాహ—హిరణ్యేతి.

టీ. అధీతవేదవేదార్థోఽపి-అధీత=అధ్యయనముచేయఁబడిన, వేదవేదార్థోఽపి= వేదవేదార్థములు గలవాఁడైనను, అతఏవ=ప్రతిబంధమువలననే, న ముచ్యతే=ముక్తుఁడు

కాఁడు. హిరణ్యనిధిదృష్టాంతాత్ = హిరణ్యనిక్షేపనిదర్శనమువలన, ఇదమేవ = ఈ యర్థమే, దర్శితం హి = చూపించఁబడినది గదా.

తా. వేదవేదాంతములు తెలిసినను ప్రతిబంధములు క్షయింప నిది బ్రహ్మజ్ఞానము గలుగదు. బంగారుపాతరపైఁ గాఁపురమున్నవాఁడు గూడ తన కాబంగారమును గనఁబడకుండ చేయునట్టి యిటుకలు మొదలగువాని యడ్డము తీసివేయునంతవఱకు సువర్ణలాభసుఖము ననుభవింపఁడు. ఇదియు నట్టులే యని భావము.

అవ. భూతప్రతిబంధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అతీతేనాపి మహిషీస్నేహేన ప్రతిబంధతః,
భిక్షుస్తత్త్వం న వేదేతి గాథా లోకే ప్రతీయతే. 41

వ్యా. నన్వతీతస్య బంధకత్వం న దృష్టమిత్యాశంక్యాహ—అతీతేనేతి. అయ మర్థః—కశ్చిద్యతిః పూర్వం గార్హస్థ్యదశాయాంకస్యాం చిన్మహిష్యాం స్నేహం కృత్వా పశ్చాత్సన్న్యాసానంతరం శ్రవణే ప్రవృత్తోఽపి తేనైవ స్నేహజనితా త్ప్రతిబంధా త్తత్త్వం గురుణోపదిష్టమపి న జ్ఞాతవా నిత్యేవంవిధా గాథా లోకే ప్రతీయతే పురాణాదిషు పఠ్యత ఇత్యర్థః.

టీ. అతీతేనాపి=కడచినదైనను, మహిషీస్నేహేన =గేదెయందలి మమకారము చేతనైన, ప్రతిబంధతః = అడ్డంకివలన, భిక్షుః = యతి, తత్త్వం = యథార్థమును, న వేద = గుర్తెఱుఁగఁడయ్యెను, ఇతి = ఈవిధమగు, గాథా=కథ, లోకే = ప్రపంచము నందు, ప్రతీయతే = వ్యవహరింపఁబడుచున్నది.

తా. ఒకఁడు తనగృహస్థాశ్రమమునం దొకబఱ్ఱెను ప్రేమించి యుండెను. అనఁగా గేదెయందు విశేషము మమకారముతో నుండెను. అనంతరము సన్న్యసించెను. ధ్యానము చేయునప్పుడును బ్రహ్మచింతనము చేయఁబూనునప్పుడును పూర్వాభ్యాసమువలన నా బఱ్ఱె (ఎనుము)యే జ్ఞాపకమువచ్చుచుండెను. అని లోక వాడుక కలదు.

అవ. అటులైన నట్టివాని కెట్లు జ్ఞానము గలిగెను? అనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనుసృత్య గురుస్స్నేహం మహిష్యాం తత్త్వముక్తవాన్,
తతో యథావ ద్వేదైష ప్రతిబంధస్య సంక్షయాత్. 42

వ్యా. తర్హి తథా విధస్య తస్య కథం జ్ఞానోత్పత్తిరిత్యత ఆహ—అనుసృత్యేతి. గురుస్తస్య తత్త్వోపదేష్టా తదీయమహిషీస్నేహమనుసృత్య తస్యామేవ మహిష్యాం

తత్త్వం తస్మై మహిష్యుపాధికం బ్రహ్మోక్తవాన్. తతస్సోఽపి మహిషీస్నేహలక్షణప్రతిబంధకాపగమేన గురూపదిష్టం తత్త్వం యథావచ్ఛాస్త్రోక్తప్రకారేణైవ జ్ఞాతవానిత్యర్థః.

టీ. గురుః = గురువు, స్నేహం = మమకారమును, అనుసృత్య = అనుసరించి, మహిష్యాం = భార్యయందే, తత్త్వం = తత్త్వమును, ఉక్తవాన్ = చెప్పెను. తతః = దానివలన, ఏషః = ఈసన్యాసి, ప్రతిబంధస్య = ప్రతిబంధముయొక్క, సంక్షయాత్ = క్షయించుటవలన, యథావత్ = యథార్థమును, వేద = గుర్తెఱింగెను.

తా. ఈసంగతి గమనించి గురు వాయతికి మహిషియే బ్రహ్మమని యుపదేశించెను. ఆయన యట్టులే చింతించి (ధ్యానించి) ప్రతిబంధము క్షయింపఁగనే బ్రహ్మసాక్షాత్కారమును బొందెను.

అవ. వర్తమానప్రతిబంధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః,
ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః. 43

వ్యా. ఏవమతీతప్రతిబంధం ప్రదర్శ్య వర్తమానం దర్శయతి—ప్రతిబంధ ఇతి. వర్తమానః ప్రతిబంధశ్చిత్తస్య విషయాసక్తిరూపః ఏకః ప్రజ్ఞామాంద్య బుద్ధేస్తైక్ష్ణ్యాభావః కుతర్కశ్చ శుష్కతార్కికత్వేన శ్రుత్యర్థస్యాన్యథోహనం విపర్యయదురాగ్రహః విపర్యయే ఆత్మనః కర్తృత్వాదిధర్మయుక్తత్వజ్ఞానలక్షణే దురాగ్రహో యుక్తిరహితోఽభినివేశః ఏతేషామన్యతమస్యాపి సత్త్వే జ్ఞానం నోదేతీత్యర్థః.

టీ. విషయాసక్తిలక్షణః = విషయములయం దాసక్తి యనునదియు, ప్రజ్ఞామాంద్యం = ప్రజ్ఞాలోపమును, కుతర్కశ్చ = కుత్సితయుక్తులును, విపర్యయదురాగ్రహః = కర్తృత్వాదికమందు నిర్యుక్తిక మగుపట్టుదలయు, వర్తమానః=వర్తమాన మగు, ప్రతిబంధః = ప్రతిబంధము.

తా. విషయములయం దాసక్తియు, మందబుద్ధియు, దుర్యుక్తులును, ఎవ్వఁడు చెప్పినను నేను వినను, నేను కర్తృత్వాదిధర్మములు గలవాఁడ ననెడి యభినివేశంబును వర్తమానప్రతిబంధ మనఁబడును.

అవ. ఇది పోవుట కుపాయంబు దెల్పుచున్నాఁడు:—

శ్లో. శమాద్యైశ్శ్రవణాద్యైశ్చ తత్ర తత్రోచితైః క్షయం,
నీతేఽస్మిన్ ప్రతిబంధేఽతస్స్వస్య బ్రహ్మత్వమశ్నుతే. 44

వ్యా. అస్యాః ప్రతిబంధస్య కేన నివృత్తిరిత్యత ఆహ—శమాద్యైరితి. శమాదయః "శాంతో దాంత ఉపరతస్తితిక్షుస్సమాహితో భూ" త్వేతి శ్రుత్యుక్తాః. శ్రవణాదయః "శ్రోతవ్యో నిదిధ్యాసితవ్య" ఇతి శ్రుత్యాభిహితాః. ఏతైస్సాధనైస్తత్ర తత్ర తస్య తస్య ప్రతిబంధస్య నివర్తనే ఉచితైర్యోగ్యైస్తస్మిం స్తస్మిన్ ప్రతిబంధే క్షయం నీతే సతి వినాశితే సతి అతః ప్రతిబంధాపగమాదేవ స్వస్య ప్రత్యగాత్మనో బ్రహ్మత్వం ప్రాప్నోతీత్యర్థః.

టీ. తత్రతత్ర = అక్కడక్కడ, ఉదితైః చెప్పఁబడిన, శమాద్యైః = శమదమాదులచేతను, శ్రవణాద్యైశ్చ = శ్రవణమననాదులచేతను, అస్మిన్ ప్రతిబంధే = ఈప్రతిబంధము, క్షయం = నాశమును, నీతే సతి = పొందింపఁబడఁగా, అతః ఈహేతువువలన, స్వస్య = తనకు, బ్రహ్మత్వం = బ్రహ్మత్వమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

తా. శ్రవణమననాదులచేతను, శమదమాదులచేతను, వర్తమాన ప్రతిబంధము నశించినతోడనే నేను బ్రహ్మమ నని స్వస్వరూపమును సాక్షాత్కరించుకొనుచున్నాఁడు.

అవ. ఆగామిప్రతిబంధమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆగామిప్రతిబంధశ్చ వామదేవే సమీరితః,
ఏకేన జన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః. 45

వ్యా. ఇదానీం భావిప్రతిబంధం దర్శయతి—ఆగామీతి. ఆగామిప్రతిబంధో జన్మాంతరహేతుః ప్రారబ్ధవిశేష ఇత్యర్థః. తస్య చ భోగమంతరేణ నివృత్త్యభావాత్తన్నివృత్తౌ కాలనియమో నాస్తీత్యాహ—ఏకేనేతి. స చ ఏకేన జన్మనా క్షీణో వామదేవస్యేతి శేషః. భరతస్య త్రిజన్మభిః క్షీణ ఇత్యనుషజ్యతే.

టీ. ఆగామిప్రతిబంధశ్చ = ఆగామిప్రతిబంధము (అనఁగా ముందుజన్మమున ననుభవింపఁదగిన ప్రారబ్ధకర్మము), వామదేవే = వామదేవునియందు, సమీరితః=చెప్పఁబడెను. (సః = ఆభావిప్రతిబంధము), (వామదేవస్య = వామదేవునకు), ఏకేన = ఒక్కటియగు, జన్మనా = జన్మముచేత, క్షీణః = నశించెను. భరతస్య = జడభరతునకు, త్రిజన్మభిః = మూఁడుజన్మములచే, క్షీణః = నశించెను.

తా. స్పష్టము.

అవ. అట్టిభావిప్రతిబంధ మెన్నిజన్మలతోఁ దీఱు నని యడుగఁగా నిన్ని యని నియమము లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యోగభ్రష్టస్య గీతాయా మతీతే బహుజన్మని,
ప్రతిబంధక్షయః ప్రోక్తో న విచారోఽప్యనర్థకః. 46

వ్యా. నన్వేకేన త్రిజన్మభిరితి నియతకాలత్వం భవత్వేవోచ్యత ఇత్యాశంక్యాహ—యోగేతి. యోగభ్రష్టస్తత్త్వసాక్షాత్కారపర్యంతం విచారరహిత ఇత్యర్థః. తర్హి తత్త్వవిచారో నిష్ఫలస్స్యాదిత్యాశంక్యాహ—న విచారోఽపీతి. ప్రతిబంధనివృత్త్యనంతరమేవాపరోక్షజ్ఞానలక్షణఫలసద్భావాదితి భావః.

టీ. గీతాయాం=భగవద్గీతయందు, యోగభ్రష్టస్య = యోగభ్రష్టునకు, బహుజన్మని=అనేకజన్మసముదాయము, అతీతే (సతి) = కడచినదగుచుండఁగా, ప్రతిబంధక్షయః=ప్రతిబంధక్షయము, ప్రోక్తః=చెప్పఁబడియెను. విచారోఽపి = విచారంబును, అనర్థకః=నిరర్థకము, న = కాదు.

తా. యోగభ్రష్టుఁ డనేకజన్మములు గడచినపిదప ప్రతిబంధము నశింపఁగా బ్రహ్మసాక్షాత్కారముచే ముక్తుఁ డగుచున్నాఁడు. అని శ్రీకృష్ణభగవానులు చెప్పిరి.

శ్లో. ప్రాప్య పుణ్యకృతాం లోకా నాత్మతత్త్వవిచారతః,
శుచీనాం శ్రీమతాం గేహే సాభిలాషోఽభిజాయతే. 47

వ్యా. గీతాయాం ప్రతిపాదితమర్థం దర్శయతి—ప్రాప్యేత్యాదినా తతో యాంతి పరాం గతి మిత్యంతేన. ప్రాప్యేతి. యోగభ్రష్ట ఆత్మతత్త్వవిచారబలాదేవ పుణ్యకారిణాం లోకా న్స్వర్గవిశేషా న్ప్రాప్య తత్ర బహుకాలం సుఖమనుభూయ తద్భోగావసానే సాభిలాషశ్చేదస్మిన్లోకే శుచీనాం మాతృతః పితృతః శుద్ధానాం శ్రీమతాం కులేఽభిజాయతే.

టీ. (యోగభ్రష్టః=తత్త్వవిచారము చేయుచు బ్రహ్మసాక్షాత్కారముగలుగక మృతుఁడైనవాఁడు), ఆత్మతత్త్వవిచారతః = ఆత్మతత్త్వవిచారమువలన, పుణ్యకృతాం= అశ్వమేధాదియాగములు చేసినవారియొక్కయు, లోకాన్ = స్వర్గాదిలోకములను, ప్రాప్య=పొంది, సాభిలాషః=అభిలాషకలిగెనేని, శుచీనాం=పరిశుద్ధులైన, శ్రీమతాం = సంపన్నులయొక్క, గేహే = గృహమునందు, జాయతే = పుట్టును.

తా. బ్రహ్మతత్త్వవిచారపరుఁడు ప్రతిబంధమువలన నాజన్మమున బ్రహ్మసాక్షాత్కారము గలుగ దేని దేహత్యాగానంతరము స్వర్గాదికములలో మహాసుఖ మనుభవించి శ్రీమంతులగృహంబులలో జనకమహారాజువలెను అశ్వపతికేకయమహారాజువలెను జన్మించెను.

అవ. పక్షాంతరమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
నిస్స్పృహో బ్రహ్మతత్త్వస్య విచారాత్తద్ధి దుర్లభమ్. 48

వ్యా. పక్షాంతరమాహ—అథవేతి. నిఃస్పృహ స్స్వయ మతి విరక్తశ్చే ద్బ్రహ్మతత్త్వవిచారా దేవ ధీమతా మాత్మతత్వనిశ్చయవిచారవతాం యోగినాం చిత్తైకాగ్ర్యవతాం కులే భవతి జాయత ఇత్యర్థః. పూర్వస్మాత్పక్షాదత్ర కో విశేష ఇత్యాహ—తద్ధీతి. హి యస్మాత్కారణా త్తద్యోగికులే జన్మ దుర్లభ మల్పపుణ్యైనాలభ్యమిత్యర్థః.

టీ. అథవా = అటులుగానియెడల, నిస్స్పృహశ్చేత్ = (ఆయోగభ్రష్టుఁడు) నిస్స్పృహుఁడు (అతివిరక్తుఁడు) అగునేని, బ్రహ్మతత్త్వస్య=బ్రహ్మస్వరూపముయొక్క, విచారాత్=విచారమువలన, ధీమతాం = ఆత్మతత్వనిశ్చయవిచారముగల, యోగినాం = చిత్తైకాగ్రతగల పుణ్యపురుషులయొక్క, కులే=కులమందు, భవతి = పుట్టుచున్నాఁడు. తత్=అట్టిజన్మము, దుర్లభం హి=దుర్లభము కదా.

తా. బ్రహ్మవిచారపరుఁడు నిస్స్పృహుఁడైన యెడల బుద్ధిశాలురగు యోగులవంశమున శ్రీశుకునింబోలె జన్మించును. అట్లు జన్మించుట కడు దుర్లభము.

అవ. ఆదుర్లభత్వమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్తస్మాదేతద్ధి దుర్లభమ్. 49

వ్యా. తస్య దుర్లభత్వముపపాదయతి—తత్రేతి. హి యస్మాత్కారణా త్తత్ర తస్మిన్ జన్మని పౌర్వదైహికం పూర్వదేహభవం తం బుద్ధిసంయోగం తత్వవిచారగోచరబుద్ధిసంబంధం శీఘ్రం లభతే ప్రాప్నోతి. న కేవలం బుద్ధిసంబంధమాత్రలాభః, కింతు, తతః పూర్వస్మా త్ప్రియత్నాద్భూయో యతతే చాధికం ప్రయత్నం కరోతి తస్మాదేతజ్జన్మ దుర్లభ మిత్యర్థః.

టీ. హి=ఏకారణమువలన, తత్ర ఆజన్మమునందు, తం పౌర్వదైహికం = పూర్వదేహసంబంధమగు, బుద్ధిసంయోగం = బుద్ధిసంబంధమును, లభతే = పొందుచున్నాఁడో, తతః=అంతకంటె, భూయః=అధికముగా, యతతే చ = ప్రయత్నించును. తస్మాత్ = ఆహేతువువలన, ఏతత్ = ఈయోగికులజన్మము, దుర్లభం=దుర్లభము.

తా. అట్టి యోగికులజన్మమందుఁ బూర్వజన్మమందలి తత్త్వవిచారమువలన మంచిబుద్ధినిగల్గియుండును. అందువలన తొల్లింటికంటె

నధికముగా బ్రహ్మజ్ఞానమునకై యత్నించును. కావున నిట్టిజన్మము దుర్లభము.

అవ. అభ్యాసమునందు హేతువును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్, 50

వ్యా. భూయోఽభ్యాసే కారణమాహ—పూర్వేతి. స యోగభ్రష్టస్తేన పూర్వాభ్యాసే నైవావశోఽపి అస్వాధీనోఽపి హ్రియతే ఆకృష్యతే ఏవ మనేకేషు జన్మసుకృతేన యత్నేన సంసిద్ధస్తత్త్వజ్ఞానసంపన్నస్తస్మాత్తత్త్వజ్ఞానా త్పరాం గతిం ముక్తిం యాతి ప్రాప్నోతీత్యర్థః.

టీ. తేన పూర్వాభ్యాసేనైవ = అతొల్లింటియభ్యాసముచేతనే, సః = ఆయోగభ్రష్టుఁడు, అవశోఽపి = అస్వాధీనుండైనను, హ్రియతే = ఆకర్షింపఁబడుచున్నాఁడు, అనేకజన్మసంసిద్ధః=బహుజన్మములయందు సిద్ధుఁడై, తతః=అనంతరము, పరాం=ఉత్కృష్టంబగు, గతిం=గతిని, యాతి=పొందుచున్నాఁడు.

తా. తనయత్నము లేకయే పూర్వాభ్యాసవశమున తత్త్వజ్ఞానమువైపు ఆకర్షింపఁబడును. ఇట్టి యనేక జన్మసంసిద్ధుఁడు కైవల్యమును బొందును. ఇట్లు గీతాశాస్త్రము చెప్పుచున్నది. కనుక భావిప్రతిబంధనివృత్తియందు కాలనియమము లేదని తెలియవలెను.

అవ. మఱియొక ఆగామిప్రతిబంధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాం నిరుధ్య తాం,
విచారయేద్య ఆత్మానం న తు సాక్షాత్కరోత్యయమ్. 51

వ్యా. ఆగామిప్రతిబంధాంతరం దర్శయతి—బ్రహ్మలోకేతి. బ్రహ్మలోకప్రాప్తీచ్ఛాయాం దృష్టాయాం సత్యాం తాం నిరుధ్య య ఆత్మానం విచారయేత్తస్య సాక్షాత్కారో నైవ జాయత ఇత్యర్థః.

టీ. బ్రహ్మలోకాభివాంఛాయాం = బ్రహ్మలోకమునందలి కోరిక, సమ్యక్, = లెస్సగా, సత్యాం=ఉండఁగా, తాం=ఆకోరికను, నిరుధ్య = అరికట్టి, ఆత్మానం = ఆత్మను (యః=ఎవఁడు), విచారయేత్ = విచారముచేయునో, అయం=వీఁడు, న తు సాక్షాత్కరోతి = బ్రహ్మసాక్షాత్కారమును పొందఁడు.

తా. బ్రహ్మలోకమునకుఁ బోవలయు ననుకోరిక యుండఁగానే దాని నాపివేసి ఆత్మవిచారము చేసినను వాని కీజన్మమున బ్రహ్మసాక్షాత్కారము గలుగదు.

అవ. అట్టివానికి మోక్ష మెప్పటికిఁ గలుగు ననినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా ఇతి శాస్త్రతః,
బ్రహ్మలోకే స కల్పాంతే బ్రహ్మణా సహ ముచ్యతే. 52

వ్యా. నను తర్హి తస్య కదాపి ముక్తి ర్న స్యాదిత్యాశంక్యాహ—వేదాంతేతి. "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాస్సన్యాసయోగాద్యతయశ్శుద్ధసత్త్వాః, తే బ్రహ్మలోకే తు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతి సర్వే, బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పద." మిత్యాదిశాస్త్ర వశాద్బ్రహ్మలోకప్రాప్త్యనంతరం తత్త్వం సాక్షాత్కృత్య బ్రహ్మణా సహ ముక్తిర్భవిష్యతీత్యర్థః.

టీ. వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః - వేదాంతవిజ్ఞాన=వేదాంతములు దెలియుట చేత, సునిశ్చితార్థాః = నిశ్చయింపఁబడినయర్థము గలవారలై, ఇతి శాస్త్రతః = ఇది మొదలగునర్థము దెలిపెడిశాస్త్రమువలన, సః = ఆబ్రహ్మలోకకాముఁడు, బ్రహ్మలోకే = బ్రహ్మలోకమునందు, కల్పాంతే = బ్రహ్మకల్పసమాప్తియందు, బ్రహ్మణా సహ = బ్రహ్మదేవునితోఁగూడ, ముచ్యతే = ముక్తుఁడగుచున్నాఁడు.

తా. "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః" అను తైత్తిరీయశ్రుతి యట్టివానికే బ్రహ్మలోకమునందు బ్రహ్మలోక సమాప్తి కాలమున బ్రహ్మదేవునితోఁ గూడ విదేహకైవల్యము గల్గు నని బోధించుచున్నది.

అవ. కొందఱకు విచారము గూడ లభింప దని నుడువుచున్నాఁడు:—

శ్లో. కేషాం చిత్స విచారోఽపి కర్మణా ప్రతిబధ్యతే,
శ్రవణాయాపి బహుభిర్యో న లభ్య ఇతి శ్రుతేః. 53

వ్యా. ఏవం తత్త్వవిచారే క్రియమాణే ప్రతిబంధవశాదత్ర సాక్షాత్కారో న జాయత ఇత్యభిధాయ తీవ్రపాపినాంతు సోఽపి విచారో దుర్లభఇత్యాహ—కేషాంచిదితి. తత్ర ప్రమాణమాహ—శ్రవణాయేతి. యః పరమాత్మా బహుభిః పురుషైశ్శ్రవణాయాపి శ్రోతుమపి న లభ్యః దుర్లభ ఇత్యర్థః.

టీ. కేషాంచిత్ = కొందఱకు, సః విచారోఽపి = అట్టి తత్త్వవిచారముకూడ, కర్మణా=పాపకర్మచేత, ప్రతిబధ్యతే = అరికట్టఁబడుచున్నది. శ్రవణాయాపి = శ్రవణముకొఱకును, బహుభిః = అనేకులచేత, యః = ఏయాత్మ, న లభ్యః = పొందఁదగినది కాదో, ఇతి శ్రుతేః = ఇట్టి శ్రుతివలన (ఈయర్థము సిద్ధించును.) అని అధ్యాహారము దెచ్చుకొనవలెను.

తా. కొందఱు పాపాత్ములకు బ్రహ్మవిచారమున కవకాశంబును దొరకదు. కనుకనే "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః" అను వేద వాక్య మిట్లు చెప్పెను.

అవ. విచారమునకు సమర్థులు గానిముముక్షువులకు మోక్షసాధనమును గూర్చి యుపాయాంతరముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అత్యంతబుద్ధిమాంద్యాద్వా సామగ్ర్యా వాప్యసంభవాత్,
యో విచారం న లభతే బ్రహ్మోపాసీత సోఽనిశమ్. 54

వ్యా. ఏతావతా సతి ప్రతిబంధే తత్త్వసాక్షాత్కార స్తత్సాధనభూతో విచారశ్చ న సంభవతీత్యభిధాయేదానీం విచారాసమర్థేన పురుషార్థార్థినా కిం కర్తవ్య మిత్యపేక్షాయాం విచారాక్షమమర్త్యాశ్చ తచ్ఛ్రుతో్యపాసతే గురో రితి యత్ప్రాక్ప్రతిజ్ఞాతం తదుపపాదయతి—అత్యంతేతి. సామగ్ర్య సంభవో నామ తత్త్వోప దేష్టు ర్గురో రధ్యాత్మశాస్త్రస్య దేశకాలాదేర్వా అసంభవ స్తస్మాదిత్యర్థః.

టీ. అత్యంతబుద్ధిమాంద్యాద్వా = మిక్కిలి మందబుద్ధివలనఁగాని, సామగ్ర్యాః = విచారసామగ్రి యగు గురుశాస్త్రములయొక్క కాని, అసంభవాత్ = సంభవింపక పోవుటవలన, యః = ఎవ్వఁడు, విచారం = విచారమును, న లభతే = పొందఁడో, సః = వాఁడు, అనిశం = ఎల్లప్పుడు, బ్రహ్మ = బ్రహ్మమును, ఉపాసీత = ఉపాసింప వలయును.

తా. తనకు విచారముచేయవలె ననెడి శక్తి గాని, గురుశాస్త్ర ములు గాని యనుకూలముగా సంభవింపనపుడు మోక్షము గోరెడి వాఁడు బ్రహ్మము నుపాసింపవలెను.

అవ. బ్రహ్మము నిర్గుణము గదా దాని నుపాసించు టెట్లు? అనినం జెప్పు చున్నాఁడు:—

శ్లో. నిర్గుణబ్రహ్మతత్త్వస్య న హ్యుపాస్తే రసంభవః,
సగుణబ్రహ్మణీవాఽత్ర ప్రత్యయావృత్తిసంభవాత్. 55

వ్యా. నను నిర్గుణస్య బ్రహ్మతత్త్వస్య గుణరహితత్వా త్తదుపాసనం న ఘటత ఇత్యాశంక్యోపాసనస్య ప్రత్యయావృత్తిరూపత్వాత్సగుణబ్రహ్మణీవ నిర్గుణేఽపి తత్సం భవతీత్యాహ—నిర్గుణేతి.

టీ. నిర్గుణబ్రహ్మతత్త్వస్య=నిర్గుణబ్రహ్మతత్త్వముయొక్క, ఉపాస్తేః = ఉపా సనమునకు, అసంభవః = అసంభవము, న = లేదు. సగుణబ్రహ్మణీవ = గుణవిశిష్టమగు బ్రహ్మమునందు వలె, అత్ర = ఈనిర్గుణబ్రహ్మమునందు, ప్రత్యయావృత్తిసంభవాత్ = చిత్తవృత్తుల యావృత్తి సంభవించుటవలన (అని పూర్వార్థముతో నన్వయము.)

తా. నిర్గుణబ్రహ్మము నుపాసించుట అసాధ్యము గాదు సగుణ బ్రహ్మమునుపాసించినట్లే నిర్గుణబ్రహ్మము నుపాసింపవచ్చును. ఉపాసన మనఁగా ననేకమారులు లొక్కవిధముగానే భావనచేయుట.

అవ. నిర్గుణోపాసనము ఘటింప దనిన ప్రతిబంది నిచ్చుచున్నాఁడు:—

శ్లో. అవాఙ్మనసగమ్యం తన్నోపాస్యమితి చేత్తదా,
అవాఙ్మనసగమ్యస్య వేదనం న చ సంభవేత్. 56

వ్యా. నను నిర్గుణబ్రహ్మణో వాఙ్మనసగోచరత్వాభావాన్నోపాస్యత్వమిత్యాశంక్య వేదనపక్షే ఽప్యయం దోషః సమాన ఇత్యాహ—అవాఙ్మనసేతి.

టీ. అవాఙ్మనసగమ్యం = వాక్కునకును మనస్సునకును గోచరింపని, తత్ = ఆబ్రహ్మము, ఉపాస్యం = ఉపాసింపఁదగినది, నేతి చేత్ = కాదంటివేని, తదా = అప్పుడు, అవాఙ్మనసగమ్యస్య = వాఙ్మనస్సులకు గోచరింపని బ్రహ్మముయొక్క, వేదనం = జ్ఞానము, న సంభవేత్ = సంభవింపదు.

తా. వాక్కునకును మనస్సునకును దెలియరాని బ్రహ్మము నుపాసించుట కుదుర దంటివేని, యాయవాఙ్మనసగోచరమగుదాని నెఱింగించుటయు సంభవింపదు.

అవ. ఉపాసనము సంభవించువిధమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. వాగాద్యగోచరాకారమిత్యేవం యది వేత్త్యసౌ,
వాగాద్యగోచరాకారమిత్యుపాసీత నో కుతః. 57

వ్యా. నను బ్రహ్మ వాఙ్మనసాగోచరమిత్యేవం జ్ఞాతుం శక్యమిత్యాశంక్య ఏవమేవోపాసితుమపి శక్యమిత్యాహ—వాగాదీతి.

టీ. అసౌ = ఈముముక్షువు, (బ్రహ్మ = నిర్గుణబ్రహ్మము), వాగాద్యగోచరాకారమితి = వాఙ్మనంబులకు గోచరింపని స్వరూపము గలదియని, ఏవం = ఈప్రకారము, వేత్తియది = ఎఱుఁగుచున్నాఁ డనెనపేని, వాగాద్యగోచరాకారమితి = వాఙ్మనంబులకు గోచరింపని స్వరూపము గల దని, కుతః = ఎందువలన, నోపాసీత = ఉపాసింపఁగూడదు? (ఉపాసింపఁదగు ననుట).

తా. నిర్గుణబ్రహ్మమును వాగాదులకు గోచరింపని దనియే తెలిసికొనును. అటులనే యయ్యది వాగాద్యగోచర మనియే యుపాసింపవచ్చును.

అవ. బ్రహ్మము నుపాసించుట సగుణం బగును. అను శంకకు సమాధానము:—

శ్లో. సగుణత్వ ముపాస్యత్వాద్యది వేద్యత్వతోఽపి తత్,
వేద్యం చేల్లక్షణావృత్త్యా లక్షితం సముపాస్యతామ్. 58

వ్యా. బ్రహ్మణ ఉపాస్యత్వే సగుణత్వం ప్రసజ్యేతేత్యాశంక్య వేద్యత్వేఽపి తత్సగుణత్వం స్యాదిత్యాహ—సగుణత్వమితి. తత్సగుణత్వమిత్యర్థః. నను లక్షణావృత్త్యాశ్రయణాన్న వేద్యత్వే సగుణత్వప్రసంగ ఇత్యాశంక్య ఉపాసనమపి తథైవ క్రియతా మిత్యాహ—వేద్యం చేదితి.

టీ. ఉపాస్యత్వాత్ = ఉపాసనలో విషయ మగుటవలన, సగుణత్వం = గుణములతోఁ గూడికొనుట, స్యాద్యతి=అగునందు వేని, వేద్యత్వతోఽపి=జ్ఞానవిషయత్వము వలనను, తత్ = ఆసగుణభావము, (భవతి=అగుచున్నది.) లక్షణావృత్త్యా=లక్షణచేత, వేద్యం చేత్ = తెలియఁబడునంటి వేని, లక్షితం = లక్షణావృత్తిచేత చెప్పఁబడి బ్రహ్మము, సముపాస్యతాం = ధ్యానింపఁబడుఁగాక.

తా. నిర్గుణము ఉపాస్యముగాదు. బ్రహ్మమునకు ఉపాసనావిషయత్వము గలుగుచుండఁగా సగుణత్వము సంభవింపదా? అనెదవేని, బ్రహ్మము జ్ఞానముచేఁ దెలియఁబడుటవలన జ్ఞానపక్షమందును ఆసగుణత్వము సంభవించును. అయితే లక్షణావృత్తిచే బ్రహ్మము నెఱుఁగుట చేత జ్ఞానపక్షమందు సగుణత్వ మెటులఁ గలుగు నంటివా, లక్షణావృత్తిచేఁ దెలియఁబడుప్రకారమే ఉపాసనమును జేయవలె నని తెలిసికొనుము.

అవ. బ్రహ్మ ముపాస్యము గాదని వేదమే నిషేధించుచున్న దని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మ విద్ధి తదేవ త్వం న త్విదం య దుపాసతే,
ఇతి శ్రుతేరుపాస్యత్వం నిషిద్ధం బ్రహ్మణో యది. 59

వ్యా. నను బ్రహ్మణ ఉపాస్యత్వం శ్రుత్యా నిషిధ్యత ఇతి శంకతే—బ్రహ్మ విద్ధీతి. "యన్మనసా న మనుతే, యే నాహు ర్మనో మతం, తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదక యదిదముపాసత" ఇతి శ్రుతిరుపాస్య బ్రహ్మత్వం నిషేధతీత్యర్థః. తత్త్వం యదవాఙ్మనసగమ్యం తదేవ బ్రహ్మ విద్ధి. ఇదమితి యత్తూపాసతే పురుషాస్తన్న విద్ధీతి యోజనా.

టీ. తదేవ = దానినే, త్వం = నీవు, బ్రహ్మ = బ్రహ్మమునుగా, విద్ధి = తెలిసికొనుము. యత్ =దేనిని, ఉపాసతే = (ఉపాసకులు) ఉపాసించుచున్నారో, ఇదం=ఇది,

న తు = బ్రహ్మముగాదు. ఇతి శ్రుతేః = ఇట్టిశ్రుతివలన, బ్రహ్మణః = బ్రహ్మమునకు ఉపాస్యత్వం = ఉపాసింపఁబడుట, నిషిద్ధం యది = నిషేధింపబడిన దంటివేని.

తా. ఉపాసింపఁబడునది బ్రహ్మము గా దని వేదవాక్యము చెప్పెను గాన నిర్గుణబ్రహ్మమున కుపాస్యత్వము లేదు అని యంటివేని.

అవ. ఉపాస్యత్వమువలెనే వేద్యత్వమునకును నిషేధము సమాన మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. విదితాదన్యదేవేతి శ్రుతేర్వేద్యత్వమస్య న,
యథాశ్రుత్యైవ వేద్యం చేత్తథా శ్రుత్యాఽప్యుపాస్యతామ్. 60

వ్యా. ఉపాస్యత్వవద్వేద్యత్వస్యాపి తన్నిషేధస్సమాన ఇత్యాహ—విదితాదితి. "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" ఇతి బ్రహ్మణో వేద్యత్వమపి నివారయతీత్యర్థః. విదితాత్ జ్ఞాతాదిత్యర్థః. అవిదితాదజ్ఞాతాదిత్యర్థః. "విదితావిదితాభ్యామన్యద్బ్రహ్మేతి" శ్రుతిః ప్రతిపాదయతీతి చేత్తర్హి తత్రైవ తజ్జానీయాదిత్యాశంక్యోపాసనేఽప్యేతత్సమానమిత్యాహ—యథేతి.

టీ. విదితాత్ = తెలియఁబడినదానికంటె, అన్యదేవ = బ్రహ్మము వేఱైనదే యగును. ఇతి శ్రుతేః = ఇట్టిశ్రుతివలన, అస్య = ఈబ్రహ్మమునకు, వేద్యత్వం = జ్ఞానవిషయత్వము, న=లేదు. యథాశ్రుత్యైవ = శ్రుతివాక్యము మీఁఅకయే, వేద్యం చేత్ = జ్ఞానవిషయమంటివేని, తథా = అవిధముగను, శ్రుత్యాపి = శ్రుతిచేతను, ఉపాస్యతాం = ఉపాసింపఁబడుఁగాక.

తా. మఱియొక వాక్యము బ్రహ్మము వేద్యము గా దని చెప్పెను గాన జ్ఞానవిషయత్వము గూడ లేక పోవలసివచ్చును. శ్రుతిలోఁ జెప్పఁబడినట్లు అవేద్య మనియే తెలిసికొనవచ్చు నంటివా. అవేద్యమే యని యేల యుపాసింపరాదు ? నిర్గుణబ్రహ్మ మవేద్య మనియే యుపాసింపవచ్చు నని భావము.

అవ. బ్రహ్మమునకు వేద్యత్వము వాస్తవము గా దని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవాస్తవీ వేద్యతా చేదుపాస్యత్వం తథా న కిం,
వృత్తివ్యాప్తిర్వేద్యతా చే దుపాస్యత్వేఽపి తత్సమమ్. 61

వ్యా. నను వేద్యత్వం బ్రహ్మణో వాస్తవం న భవతీత్యాశంక్యోపాస్యత్వమపి తథేత్యాహ—అవాస్తవీతి. నను వేదనపక్షే వృత్తే ర్బ్రహ్మాకారత్వ మస్తి, నోపాసన ఇత్యాశంక్య శబ్దబలాత్తదాకారత్వ ముభయత్ర సమానమిత్యాహ—వృత్తీతి.

టీ. వేద్యతా = జ్ఞానవిషయత్వము, అవాస్తవీ చేత్ = అయథార్థ మంటివేని, ఉపాస్యత్వం = ఉపాసనవిషయత్వము, తథా = అట్టిది, న కిం=కాదా యేమి ? వృత్తి వ్యాప్తిః = వృత్తివిషయత్వము, వేద్యతా చేత్ = వేద్యత్వ మని యంటివేని, ఉపాస్యత్వేఽపి = ఉపాసనావిషయత్వమందును, తత్ = అవృత్తివ్యాప్యత్వము, సమం = తుల్యము (అగును).

తా. వేద్యత్వ మసత్యము, అది నిర్గుణత్వమును చెఱుపదు. అనెదవేని ఉపాస్యత్వమును అసత్యము. అదియు నట్టులే నిర్గుణత్వమును జెఱుపదు. వేద్యత్వ మనఁగా వృత్తివిషయత్వము అని యంటివా ఉపాస్యత్వము గూడ నట్టులే యుపాసనాత్మకవృత్తి విషయత్వరూప మగును. వృత్తికి విషయమైనను వేద్యము కాదు. చైతన్యమునకు విషయమైననే వేద్య మగును. అను సిద్ధాంత మంగీకరించి, వృత్తివిషయత్వము నిర్గుణత్వమును చెఱుప దని యంటివా యట్టులే యుపాసనాత్మకవృత్తివిషయత్వము గూడ నిర్గుణత్వమును జెఱుపఁజాలదు.

అవ. యుక్తిశూన్య మగు నాక్షేపము గూడ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కా తే భక్తిరుపాస్తౌ చే త్కస్తే ద్వేష స్తదీరయ,
మానాభావో న వాచ్యోఽస్యాం బహుశ్రుతిషు దర్శనాత్. 62

వ్యా. యుక్తిశూన్య ఉపాలంభస్తు త్వత్పక్షేఽపి సమాన ఇత్యాహ—కా త ఇతి. నను, నిర్గుణోపాసనే ప్రమాణం నాస్తీత్యాశంక్యానేకాసు శ్రుతిషు ఉపలభ్యమానత్వాన్నైవమిత్యాహ—మానాభావ ఇతి.

టీ. తే=నీకు, ఉపాస్తౌ = ఉపాసనయందు, కా భక్తిః=ఏమి భక్తి? ఇతి చేత్= ఇట్లంటివేని, తే=నీకు, కః ద్వేషః = ఏమి ద్వేషము ? తత్ =దానిని, ఈరయ=చెప్పుము. అస్యాం=ఈయుపాసనయందు, మానాభావః=ప్రమాణాభావము, న వాచ్యః=చెప్పదగినది కాదు. బహుశ్రుతిషు = అనేకశ్రుతులయందు, దర్శనాత్ = కనిపించుటవలన. అని పూర్వవాక్యముతో నన్వయము.

తా. ఉపాసనయందు నీ కింత పట్టుదల యేల? అని నన్నడుగుము. నిర్గుణబ్రహ్మోపాసనయందు నీ కింత ద్వేషమేలకో చెప్పుము. ప్రమా

ణము లేనందున నా కట్టి యుపాసనము సమ్మతము గా దని యంటివేని యట్టు లనరాదు. అనేక శ్రుతులయందు నిర్గుణోపాసన గన్పించుచున్నది.

అవ. శ్రుతులం గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. ఉత్తరస్మింస్తాపనీయే శైబ్యప్రశ్నేఽథ కాఠకే,
మాండూక్యాదౌ చ సర్వత్ర నిర్గుణోపాస్తిరీరితా. 63

వ్యా. బహుశ్రుతిషు దర్శనాదిత్యుక్తమర్థం వివృణోతి—ఉత్తరేతి. తాపనీయోపనిషది తావత్ "దేవా హవై ప్రజాపతిమబ్రువన్నణోరణీయాంసమిమమాత్మాన మోంకారం నో వ్యాచక్ష్వే"త్యాదినా బహుధా నిర్గుణోపాసనమభిధీయతే. శైబ్యప్రశ్నే ప్రశ్నోపనిషది పంచమే ప్రశ్నే "యః పునరేతం త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీ" తేతి, కాఠకే కఠవల్ల్యాం "సర్వే వేదా యత్పద మామనం" తీత్యుపక్రమ్య "ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ, ఏతదాలంబనం శ్రేష్ఠ" మిత్యాదినా ప్రణవోపాసనముచ్యతే. మాండూక్యోపనిషది "ఓమిత్యేతదక్షరమిదం సర్వ" మిత్యాదినావస్థాత్రయాతీతతురీయోపాసనమేవాభిధీయత ఇత్యర్థః. ఆదిశబ్దేన తైత్తిరీయముండకాదయో గృహ్యంతే.

టీ. ఉత్తరస్మిన్ తాపనీయే=నృసింహోత్తరతాపనీయోపనిషత్తునందును, శైబ్యప్రశ్నే=శైబ్యప్రశ్నయందును, అథ=అట్టులే, కాఠకే=కఠోపనిషత్తునందును, మాండూక్యాదౌ = మాండూక్యోపనిషత్తు మొదలగువానియందును, సర్వత్ర = అంతట, నిర్గుణోపాస్తిః=నిర్గుణోపాసన, ఈరితా=చెప్పఁబడినది.

తా. స్పష్టము.

అవ. వీనియనుష్ఠానవిధాన మెక్కడఁ జెప్పఁబడినదనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనుష్ఠానప్రకారోఽస్యాః పంచీకరణ ఈరితః,
జ్ఞానసాధనమేతచ్చే న్నేతి కేనాత్ర వారితమ్. 64

వ్యా. నను నిర్గుణోపాసనం కథమనుష్ఠేయమిత్యత ఆహ—అనుష్ఠానేతి. నన్వేతదుపాసనం జ్ఞానసాధనమేవ న ముక్తిసాధనమిత్యాశంక్య బ్రహ్మతత్త్వోపాస్త్యాపి ముచ్యత ఇతి వదతా మస్మాకమనుకూలమిత్యాహ—జ్ఞానసాధన మితి.

టీ. అస్యాః=ఈనిర్గుణోపాసనయొక్క, అనుష్ఠానప్రకారః=అనుష్ఠానవిధానము, పంచీకరణే=పంచీకరణవార్తికమునందు, ఈరితః=చెప్పఁబడినది. ఏతత్=ఇది, జ్ఞానసాధనంచేత్=జ్ఞానమునకు సాధనమంటివేని, అత్ర=ఈవిషయమై, నేతి=కాదని, కేన=ఎవనిచేత, వారితం=నివారింపఁబడినది? (ఎవ్వరును నివారింప లే దనుట).

తా. నిర్గుణోపాసన చేయువిధము. పంచీకరణవార్తికములో జెప్పఁబడినది. ఇట్టియుపాసన జ్ఞానసాధన మని యందఱు చెప్పుదురు.

అవ. నిర్గుణోపాసన నెవ్వరు నాచరించుట లేదే యను శంకకు సమాధానము:—

శ్లో. నానుతిష్ఠతి కోఽప్యేతదితి చేన్నానుతిష్ఠతు,
పురుషస్యాపరాధేన కిముపాస్తిః ప్రదుష్యతి. 65

వ్యా. నను, సగుణోపాసనమేవ సర్వైరనుష్ఠీయతే, న నిర్గుణోపాసనమిత్యాశంక్య తస్య ప్రమాణసిద్ధస్యాపలాపో న యుక్త ఇత్యాహ—నానుతిష్ఠతీతి.

టీ. కోఽపి=ఎవ్వఁడును, ఏతత్ = దీనిని, నానుతిష్ఠతిచేత్ = ఆచరించుటలేదంటివా, నానుతిష్ఠతు=అనుష్ఠింపకపోవుఁగాక, పురుషస్య=పురుషునియొక్క, అపరాధేన= అపరాధముచేత, ఉపాస్తిః = ఉపాసన, ప్రదుష్యతి కిం = దూషింపఁబడునాయేమి? దూషింపఁబడదనుట.

తా. సగుణోపాసనయే కాని నిర్గుణోపాసన నిపు డెవ్వఁడును జేయుటలేదే? అనెదవేని, పురుషుఁడు నిర్గుణోపాసన ననుష్ఠింపకుండుంగాక. పురుషునియొక్క అపరాధముచేత నిర్గుణోపాసన దూషింపఁబడదు.

అవ. ఇందుకు దృష్టాంతముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇతోఽప్యతిశయం మత్వా మంత్రాన్ వశ్యాదికారిణః,
మూఢా జపంతు తేభ్యోఽతిమూఢాః కృషిముపాసతామ్. 66

వ్యా. ప్రమాణసిద్ధస్యానుష్ఠానాభావేనాపరిత్యాజ్యత్వే దృష్టాంతమాహ—ఇతోఽపీతి. అయమభిప్రాయః—యథా సగుణోపాసనేభ్యః కాలాంతరభావిఫలేభ్యో వశ్యాదికారిమంత్రేషు ఐహికఫలప్రదత్వమతిశయం బుద్ధ్వా మూఢానాం తన్మంత్రజపాదౌ ప్రవృత్తావపి వివేకిభిస్సగుణోపాసనం న పరిత్యజ్యతే, యథా వా నియమానుష్ఠానాపేక్షేభ్యస్తేభ్యోఽపి మంత్రేభ్యః కృష్యాదావతిశయం నియమస్యైరాపేక్ష్యం మత్వా మూఢతరాణాం తత్ర ప్రవృత్తావపి తన్మంత్రానుష్ఠానం న పరిత్యజ్యతే, తథా సాంసారికఫలేప్సూనాం నిర్గుణోపాసనానుష్ఠానాభావేఽపి న ముముక్షుభి ర్నిర్గుణోపాసనం త్యజ్యత ఇతి.

టీ. మూఢాః = మూఢులు, ఇతోఽపి = ఈ నిర్గుణోపాసముకంటె, అతిశయం= అతిశయమైనదానినిగా, మత్వా = తలఁచి, వశ్యాదికారిణః = వశీకరణము మున్నగునవి కలుగఁజేయు, మంత్రాన్=మంత్రములను, జపంతు = జపము చేయుదురుగాక, తేభ్యః=

హారికంటె, అతిమూఢాః = అత్యంతమూఢులు, కృషిం = సేద్యమును, ఉపాసతాం = ఉపాసింతురుగాక.

తా. కొందఱు మందాధికారులు నిర్గుణోపాసనకంటె సగుణోపాసన సులభసాధ్యం బని దాని నాచరింతురు. దానికంటె వశీకరణాదిమంత్రజపము శీఘ్రఫలదాయక మని మరికొందఱు చేయుదురు. ఇదియు స్నానాదినియమసాపేక్షము గనుక కష్టసాధ్య మని యెంచి మఱికొందఱు సేద్యమునే చేయుదురు. తమ తమ యధికారముల ననుసరించి వర్తింతురు. అందువలన నిర్గుణోపాసన కేమియు కొఱంత లేదు.

అవ. ప్రకృతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తిష్ఠంతు మూఢాః ప్రకృతా నిర్గుణోపాస్తిరీర్యతే,
విద్యైక్యాత్సర్వశాఖార్థాన్ గుణానత్రోపసంహరేత్. 67

వ్యా. ఏవం ప్రాసంగికం పరిసమాప్య ప్రకృతమనుసరతి—తిష్ఠంత్వితి. "సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషా" దిత్యుక్తన్యాయేన నిర్గుణోపాసనస్యైకత్వాత్ తాసు తాసు శాఖాసు శ్రుతానుపాస్యగుణా నేకత్రోపసంహృత్యోపాసనం కర్తవ్యమిత్యాహ—విద్యేతి.

టీ. మూఢాః=మూఢులు, తిష్ఠంతు=ఉందురుగాక, ప్రకృతా=ప్రస్తుతమైన, నిర్గుణోపాస్తిః = నిర్గుణోపాసన, ఈర్యతే = చెప్పఁబడుచున్నది. విద్యైక్యాత్ = నిర్గుణవిద్యయొక్క యేకత్వమువలన, సర్వశాఖార్థాన్ = సకలశాఖలయర్థములగు, గుణాన్=గుణములను, అత్ర=ఈనిర్గుణోపాసనయందు, ఉపసంహరేత్=ఉపసంహారము చేయవలెను.

తా. మూఢులజోలి మన కక్కఱ లేదు. నిర్గుణోపాసననుం జెప్పుచున్నాము. అన్నివేదములయందు నిర్గుణోపాసన యొక్కటియే యగును. దానివిశేషము లెచట నెచట చెప్పఁబడినను వాని నన్నిటిని ఉపసంహరించుకొనవలయును.

అవ. గుణములు రెండుతెఱంగులు. విధిరూపము లనియు, నిషేధరూపము లనియు. వానిని సంగ్రహింపవలయు ననుటకుఁ బ్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. ఆనందాదేర్విధేయస్య గుణసంఘస్య సంహృతిః,
ఆనందాదయ ఇత్యస్మిన్ సూత్రే వ్యాసేన వర్ణితా. 68

వ్యా. తే చ గుణా ద్విప్రకారాః విధేయా నిషేధ్యాశ్చేతి. తత్ర "ఆనందో బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, నిత్యశ్శుద్ధో బుద్ధస్సత్యో ముక్తోనిరంజనో విభురద్వయ ఆనందః పరః ప్రత్యగేకరస"ఇత్యాదయో యే విధేయగుణా స్తేషా ముపసంహారః. 'ఆనందాదయః ప్రధానస్యే' త్యస్మి న్నధికరణేఽభిహిత ఇత్యాహ—ఆనందాదేరితి.

టీ. ఆనందాదేః=ఆనందము మొదలుగాఁగల, విధేయస్య=విధిబోధ్యమైన, గుణసంఘస్య=గుణసంఘముయొక్క, సంహృతిః=ఉపసంహారము, ఆనందాదయ ఇతి=ఆనందాదయ యనెడి, అస్మిన్ = ఈసూత్రమునందు, వర్ణితా = వర్ణింపఁబడినది.

తా. బ్రహ్మమునందలి సత్యము, జ్ఞానము, ఆనందము మొదలగు విధేయధర్మములు బ్రహ్మసూత్రములలో సాధనాధ్యాయమున "ఆనందాదయః ప్రధానస్య" అను సూత్రమున వ్యాసమహర్షిచేఁ జెప్పఁబడినవి.

అవ. నిషేధ్యగుణము లెక్కడఁ జెప్పఁబడినవనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అస్థూలాదేర్నిషేధ్యస్య గుణసంఘస్య సంహృతిః,
తథా వ్యాసేన సూత్రేఽస్మిన్నుక్తాక్షరధియాం త్వితి. 69

వ్యా. యే చ 'అస్థూలమనణ్వహ్రస్వం యత్తదదృశ్యమగ్రాహ్యం, అశబ్దమస్పర్శమరూపమవ్యయ' మిత్యాదయో నిషేధ్యగుణా స్తత్ర తత్ర శ్రుతా స్తేషాముపసంహారః. 'అక్షరధియాం త్వవరోధః సామాన్య తద్భావాభ్యామౌపసదవత్తదుక్త' మిత్యస్మిన్నధికరణే ఽభిహిత ఇత్యాహ—అస్థూలాదేరితి.

టీ. అస్థూలాదేః=అస్థూలము మొదలుగాఁగల, నిషేధ్యస్య=నిషేధింపఁదగిన, గుణసంఘస్య=గుణసముదాయముయొక్క, సంహృతిః = ఉపసంహారము, తథా=అవిధముగా, అక్షరధియాం త్వితి=అక్షరధియా మ్మనెడి, అస్మిన్ సూత్రే=ఈసూత్రమునందు, వ్యాసేన = వ్యాసమహర్షిచేత, ఉక్తా = చెప్పఁబడినది.

తా. "అస్థూల మనణు, అహ్రస్వ మదీర్ఘం" నిషేధ్యరూపములగు ధర్మములను, "అక్షరధియాం త్వవిరోధస్సామాన్యతద్భావాభ్యాం" అను సూత్రమునందు వేదవ్యాసమహర్షి వర్ణించెను.

అవ. నిర్గుణబ్రహ్మోపాసనమునందు గుణములను జేర్చుకొను టెట్లు? అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్గుణబ్రహ్మతత్త్వస్య విద్యాయాం గుణసంహృతిః,
న యుజ్యేతేత్యుపాలంభో వ్యాసం ప్రత్యేవ మాం న తు. 70

వ్యా. నను నిర్గుణబ్రహ్మవిద్యాయాం న గుణోపసంహార ఏవ యుజ్యతే. నిర్గుణ విద్యాత్వవిరోధాదిత్యాశంక్య సూత్రకారేణైవ మభిహితస్యోపసంహారస్యాస్మాభి రభి ధీయమానత్వా న్నాస్మా న్ప్రతీదం చోద్య ముచితమిత్యాహ—నిర్గుణేతి.

టీ. నిర్గుణబ్రహ్మతత్త్వస్య = గుణరహిత మగు బ్రహ్మతత్త్వముయొక్క, విద్యాయాం=ఉపాసనయందు, గుణసంహృతిః=గుణములచేరిక, న యుజ్యేత=యుక్తముకాదు. ఇతి=అనెడి, ఉపాలంభః = ఆక్షేపము, వ్యాసం ప్రత్యేవ=వ్యాసులనుగూర్చియే. మాం ప్రతి తు=నన్నుఁగూర్చియైతే, న=కాదు.

తా. నిర్గుణబ్రహ్మోపాసనయందు గుణములఁ జేర్చుకొన నవసరము లేదు. వ్యాసుఁడు స్థూలాదిగుణములఁ జేర్చె నని యెట్లు చెప్పెదవు ? అని న న్నడుగకుము. ఈయధిక్షేపమునకు వ్యాసులే యుత్తరవాది యగును.

శ్లో. హిరణ్యశ్మశ్రుసూర్యాదిమూర్తీనామనుదాహృతేః,
అవిరుద్ధం నిర్గుణత్వమితి చేత్తుష్యతాం త్వయా. 71

వ్యా. హిరణ్యశ్మశ్రుత్వాదిగుణవిశిష్టమూర్తీనా మనభిధానాదిదం నిర్గుణోపాసన మేవేతి చేత్తర్హి న విరోధ ఇత్యాహ—హిరణ్యేతి. హిరణ్యశ్మశ్రుసూర్యాది మూర్తీనాం హిరణ్మయాని శ్మశ్రూణి యస్యాసౌ హిరణ్యశ్మశ్రుః తథావిధస్సూర్యో హిరణ్యశ్మశ్రు సూర్యః ఆదిర్యేషాం హిరణ్యశ్మశ్రుసూర్యాదయ స్తేషాం మూర్తయో హిరణ్యశ్మశ్రు సూర్యాదిమూర్తయ స్తాసామితి విగ్రహః.

టీ. హిరణ్యశ్మశ్రుసూర్యాదిమూర్తీనాం-హిరణ్యశ్మశ్రు = తేజోమయములైన మీసములుగల, సూర్యాదిమూర్తీనాం=సూర్యుఁడు మొదలగుమూర్తులయొక్క, అనుదాహృతేః=ఉదాహరింపక పోవుటవలన, నిర్గుణత్వం=గుణశూన్యత్వము, అవిరుద్ధమితిచేత్ = విరుద్ధము గాదంటివేని, త్వయా=నీచేత, తుష్యతాం=సంతసింపఁబడుఁగాక. (నీవు సంతోషింతువుగాక యనుట).

తా. కరచరణాద్యవయవములు ఈయుపాసనయందుఁ జెప్పఁబడలేదు గనుక, అస్థూలాది బ్రహ్మోపాసన నిర్గుణోపాసన యగు నని సంతసించితి వేని యది మాకును నభిమతమే యగును.

అవ. నిర్గుణోపాసనయందు బ్రహ్మమునందు గుణములను ధ్యానింపవలెనా, లేదా, యను శంక కుత్తరము చెప్పుచున్నాఁడు:—

శ్లో. గుణానాం లక్షకత్వేన న తత్త్వేఽంతఃప్రవేశనం,
ఇతి చేదస్త్వేవమేవ బ్రహ్మతత్త్వముపాస్యతామ్. 72

వ్యా. నన్వానందాదీనామస్థూలాదీనాం చ గుణానాముపాస్యత్వేఽంతః ప్రవేశాభావా త్తద్గుణవిశిష్టత్వేన కథముపాస్యత్వమిత్యాశంక్య తేషాం తత్త్వాంతః ప్రవేశాభావేఽపి తేషాం లక్షకత్వసంభవాత్ తైర్లక్షితం బ్రహ్మోపాస్యమిత్యాహ—గుణానామితి.

టీ. గుణానాం=గుణములు, లక్షకత్వేన=వ్యావర్తకములగుటచేత, తత్త్వే=బ్రహ్మతత్త్వమునందు, అంతఃప్రవేశనం=లోపలఁబ్రవేశించుట, నేతి చేత్ =లేదంటివేని, అస్తు=అగుఁగాక, బ్రహ్మతత్త్వం=బ్రహ్మతత్త్వము, ఏవమేవ=ఇటులనే, ఉపాస్యతాం =ఉపాసింపఁబడుఁగాక.

తా. అస్థూలాదిగుణములును, ఆనందాదిగుణములును, బ్రహ్మము నందు తక్కిన జడపదార్థములకంటెను, పరిచ్ఛిన్నపదార్థములకంటెను భేదమును దెలియఁజేయును. బ్రహ్మతత్త్వమున వీనిం జేర్ప నవసరము లేదు. శుద్ధ మగు బ్రహ్మతత్త్వ ముపాసింపఁదగినది.

అవ. ఉపాసనావిధములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆనందాదిభిరస్థూలాదిభిశ్చాత్మాఽత్ర లక్షితః,
అఖండైకరసస్సోఽహ మస్మీత్యేవముపాసతే. 73

వ్యా. తథోపాసనప్రకారమేవ దర్శయతి—ఆనందాదిభిరితి.—అత్రాసు శ్రుతిషు యోఽఖండైకరసః ఆత్మా ఆనందాదిభిరస్థూలాదిభిశ్చ గుణైర్లక్షిత స్సోఽహమస్మీత్యేవముపాసతే ముముక్షవ ఇతి శేషః.

టీ. ఆనందాదిభిః = ఆనందాదివిశేషములతోను, అస్థూలాదిభిశ్చ = అస్థూలాది శ్రుతులతోను, ఉపలక్షితః = సంబంధింపక బోధింపఁబడిన, అఖండైకరసః - అఖండ = పరిచ్ఛిన్నముగానట్టియు, ఏకరసః = ఏకవిధ మగు స్వభావముగల, సః ఆత్మా=ఆయాత్మ, అహం అస్మి = నేనైతిని, ఇత్యేవం = ఇత్తెఱంగున, ఉపాసతే = ఉపాసనచేయుచున్నారు.

తా. ఆనందాదిగుణములతోడను, అస్థూలాదిగుణములతోడను సంబంధింపక యాగుణములద్వారా శాఖాచంద్రన్యాయముచేఁ గనుఁబడఁబడిన బ్రహ్మమే నే నని యుపాసింపవలెను. శాఖాచంద్రన్యాయ మనఁగా శుక్లపక్షద్వితీయనాఁడు కొమ్మమీఁద పశ్చిమపుదిక్కున చంద్రుఁడు గలఁ డని యొకఁడు చెప్పఁగా మఱియొకఁడు దట్టులే యాచంద్రునిఁ గాంచును. చంద్రునకును కొమ్మకును నేమి సంబంధము లేదు. అటులనే యని భావము.

అవ. ధ్యానమునకును బోధకును గల విశేషములఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. బోధోపాస్త్యోర్విశేషః క ఇతి చేదుచ్యతే శృణు,
వస్తుతంత్రో భవేద్బోధః కర్తృతంత్ర ముపాసనమ్. 74

వ్యా. నన్వేవం సతి విద్యోపాసనయోః కో భేద ఇత్యాశంక్య వస్తుతంత్ర కర్తృతంత్రత్వాభ్యాం భేద ఇత్యాహ—బోధోపాస్త్యోరితి.

టీ. బోధోపాస్త్యోః=బోధకును నుపాసనకును, విశేషః=భేదము, కః=ఎట్టిది? ఇతి చేత్=ఇట్లంటివా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. శృణు=వినుము. బోధః=బోధ, వస్తుతంత్రః=వస్త్వధీనమైనది, ఉపాసనం = ఉపాసనను, కర్తృతంత్రం=కర్త్రధీనమైనది.

తా. బోధ వస్తుయాథార్థ్యమును గనఁబఱచును, ఉపాసన తా ననుకొన్నవిధమున భావించుట. ఎట్లు లనఁగా సాలగ్రామమును జూచి యది శిల యని గ్రహించుట బోధ యగును. ఇది శ్రీమహావిష్ణు వని భావించుట యుపాసన యగును. బోధోపాసనల రెండింటికి భేద మిట్టి దని యెఱుంగ నగును.

అవ. బోధోపాసనలకు భేదము చెప్పుటకై వాని హేతువులఁ జెప్పుచున్నాఁడు:-

శ్లో. విచారాజ్జాయతే బోధోఽనిచ్ఛా యం న నివర్తయేత్,
స్వోత్పత్తిమాత్రాత్సంసారే దహత్యఖిలసత్యతామ్. 75

వ్యా. వైలక్షణ్యాంతరసిద్ధయే బోధస్య హేత్వాదికం దర్శయతి—విచారాజ్జాయత ఇత్యాదినా శ్లోకద్వయేన. విచారాద్వస్తుతత్త్వవిచారోద్బోధో జాయతే. కిం చ విచారా జ్జాయమానం యం బోధ మనిచ్ఛా బోధో మా భూదిత్యేవంరూపా న నివర్తయేన్న నివారయేత్. ఉత్పద్యమానశ్చ బోధ స్స్వజన్మమాత్రాత్సంసారేఽఖిలస్య ప్రపంచస్య సత్యతాం దహతి నాశయతి.

టీ. అనిచ్ఛా = ఇచ్ఛలేకపోవుట, యం=ఏబోధను, న నివర్తయేత్=నివర్తింపఁ జేయదో, (సః) = ఆబోధ, విచారాత్ = తత్త్వవిచారమువలన, జాయతే = పుట్టుచున్నది. స్వోత్పత్తిమాత్రాత్ = తన యుత్పత్తిమాత్రమున; సంసారే=సంసారమునందు అఖిలసత్యతాం = సమస్తమగు సత్యతను, దహతి = నాశము చేయుచున్నది.

తా. వస్తుతత్త్వవిచారమువలన బోధ (జ్ఞానము) కలుగుచున్నది. ఆబోధ అక్కఱలే దనుకొను ఇచ్ఛ కలిగినను, కలిగిన జ్ఞానమును ఆయిచ్ఛ నివారింపఁజేయఁజాలదు. అట్టి బోధ కలిగినతోడనే ప్రపంచము అసత్య మని తోఁచును.

శ్లో. తావతా కృతకృత్యస్సన్నిత్యతృప్తిముపాగతః,
జీవన్ముక్తిమనుప్రాప్య ప్రారబ్ధక్షయమీక్షతే. 76

వ్యా. తావతేతి. తావతా తత్త్వజ్ఞానోత్పత్తిమాత్రేణ నిరతిశయసుఖం ప్రాప్నోతీత్యర్థః.

టీ. తావతా=అందుచేత, కృతకృత్యస్సన్=కృతార్థుఁడగుచు, నిత్యతృప్తిం = శాశ్వతంబగు సంతోషమును, ఉపాగతః = పొందినవాఁడగుచు, జీవన్ముక్తిం=జీవన్ముక్తిని, అనుప్రాప్య=పొంది, ప్రారబ్ధక్షయం = ప్రారబ్ధక్షయమును, ఈక్షతే = చూచుచున్నాఁడు.

తా. తత్త్వజ్ఞానము కలుగఁగానే కృతకృత్యుఁడగుచు జీవన్ముక్తిని జెంది విదేహకైవల్యము కొఱకుఁ బ్రారబ్ధ మెప్పుడు తీరునా యని చూచుచుండును.

అవ. ఉపాసనను నిరూపించుచున్నాఁడు:—

శ్లో. ఆప్తోపదేశం విశ్వస్య శ్రద్ధాళురవిచారయన్,
చింతయేత్ప్రత్యయై రన్యై రనంతరితవృత్తిభిః. 77

వ్యా. ఉపాసనాయాశ్చ బోధాద్వైలక్షణ్యాంతరసిద్ధయే తద్దర్శయతి—ఆప్త ఇతి. ఆప్తస్య గురోరుపదేశముపాస్యస్వరూపప్రతిపాదకవాక్యజాతం విశ్వస్య విశ్వాసం కృత్వాఽవిచారయన్ ఉపాస్య తత్త్వం ప్రత్యయైరన్యైః విజాతీయఘటాదివిషయై రనంతరితవృత్తిభిరవ్యవహితవృత్తిభిశ్చింతయేదితి.

టీ. ఆప్తోపదేశం = గురూపదేశమును, విశ్వస్య = నమ్మి, శ్రద్ధాళుః = శ్రద్ధ గలవాఁడై, అవిచారయన్ = సంశయింపనివాఁడగుచు, అన్యైః = ఇతరములైన, ప్రత్యయైః = జ్ఞానములచేత, అనంతరితవృత్తిభిః = ఎడముచేయఁబడని వృత్తులచేత, చింతయేత్ = ధ్యానింపవలెను.

తా. ఉపాసనచేయువానికి శాస్త్రవిచారముతోఁ బనిలేదు. గురువుల యుపదేశమును నమ్మి యుపాసించును. ఉపాసన యనఁగా భావించెడి వస్తువు దక్క నన్యము మధ్యకాలమున జ్ఞాపకము రాకుండున ట్లెడతెగక ప్రవర్తించెడి వృత్తుల ప్రవాహ మగు నని తెలియనగు.

అవ. ఉపాసన యెంతకాలము చేయవలయు నసెడి విధినిఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యావచ్చింత్యస్వరూపత్వాభిమానస్స్వస్య జాయతే,
తావద్విచింత్యం పశ్చాచ్చ తదేవామృతి ధారయేత్. 78

వ్యా. కియంతం కాలం చింతయేదిత్యాశంక్యాహ—యావదితి.

టీ. యావత్ = ఎంతకాలము, స్వస్య = తనకు, చింత్యస్వరూపత్వాభిమానః - చింత్య = ధ్యానింపఁదగిన దేవతయొక్క, స్వరూపత్వ = ఆకారత్వముయొక్క, అభిమానః=అభిమానము, జాయతే = పుట్టుచున్నదో, తావత్ = అంతవఱకు, విచింత్యం = ఉపాసనచేయఁదగినది. పశ్చాచ్చ=అనంతరమును, తథైవ = ఆవిధంబుగనే, ఆమృతి= మరణపర్యంతము, ధారయేత్ = జ్ఞాపకముంచుకొనవలెను.

తా. ఉపాసింపఁబడెడి దైవము తానే యని గట్టినిశ్చయము గలుగువఱకు నుపాసన యొనర్చి యానిశ్చయమును జీవితకాలమంతయు నిల్పుకొనవలెను.

అవ. ఉపాసకుఁడు తనచే ధ్యానింపఁబడెడి దేవతను తన్నుగా భావించు ననుట కుదాహరణము నిచ్చుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మచారీ భిక్షమాణో యుతస్సంవర్గవిద్యయా,
సంవర్గరూపతాం చిత్తే ధారయిత్వా హ్యభిక్షత. 79

వ్యా. ఉపాసకస్య తద్రూపత్వాభిమానముదాహరణప్రదర్శనేన స్పష్టీకరోతి— బ్రహ్మచారీతి. కశ్చిత్సంవర్గత్వగుణవిశిష్టః ప్రాణోపాసకో బ్రహ్మచారీ భిక్షాహరణార్థమాగత్యాభిప్రతారినామ్నః రాజ్ఞః పురతః 'మహాత్మనశ్చతురో దేవ ఏకః కః సజాగారభువనస్య గోపాః, తం కాపేయం. నాభిపశ్యంతి మర్త్యా అభిప్రతారిన్ బహుధా వసంత'మితి మంత్రేణ స్వాత్మనస్సంవర్గరూపత్వం చిత్తే ధృతం ప్రకటీకృతవానితి ఛాందోగ్యే శ్రూయత ఇత్యర్థః.

టీ. బ్రహ్మచారీ = బ్రహ్మచారి, సంవర్గవిద్యయా = సంవర్గవిద్య యను నుపాసనతో, యుతః=కూడుకొనినవాఁడగుచు, భిక్షమాణః=భిక్షమును యాచించుచు, స్వస్య= తనయొక్క, చిత్తే = మనస్సునందు, సంవర్గరూపతాం = సంవర్గస్వరూపత్వమును, ధారయిత్వా = ధరించి, అభిక్షత హి=యాచించెఁగదా.

తా. సంవర్గోపాసకుఁ డగు నొక బ్రహ్మచారి యభిప్రతారి యను రాజు తన పురోహితు లగు కాంపేయులతో భుజించుచుండ నచటికి భిక్షాటనమునకుఁగా వెళ్లి యాతఁడు తనను గమనింపక పోఁగా సూర్యాదులను నాలో లయింపఁజేసికొనెడి సంవర్గరూపుఁడనైన నే నేతేరఁగా నీ కాంపేయులు ననుగ్రహింపఁజాలరైరి అని యభిప్రతారి యను రాజుతో నాతఁడు పల్కెను. ఈకథ ఛాందోగ్యోపనిషత్తున

నుండెను. దీనివలన మనము గ్రహింపవలసిన దేమనఁగా నుపాసింపఁ బడెడి దేవతయే తా ననెడి యభిమానము తనకు దృఢ మగుదనుక నుపాసింపవలయు నని లభించుచున్నది. సంవర్గ మనఁగా వ్యష్టిసమష్టిరూప ములఁ జెందినవాయువు.

అవ. ఉపాసనకును బోధకును భేదమును జూపుచున్నాఁడు:—

శ్లో. పురుషస్యేచ్ఛయా కర్తు మకర్తుం కర్తు మన్యథా,
శక్యోపాస్తిరతో నిత్యం కుర్యాత్ప్రత్యయసంతతిమ్. 80

వ్యా. ఆమృతి ధారణే నిమిత్తం దర్శయన్ననిచ్ఛాయం న నివర్తయే దిత్యుక్త్వా ద్బోధధర్మాద్వైలక్షణ్యమాహ—పురుషస్యేతి. ఉపాస్తిః పురుషస్యోపాసకస్యేచ్ఛయా కర్తుమకర్తుమన్యథా ప్రకారాంతరేణ వా కర్తుం శక్యా. అతః పురుషస్యేచ్ఛాధీనత్వా దుపాసనం సర్వదా కుర్యాదిత్యర్థః.

టీ. పురుషస్య=మనుజునియొక్క, ఇచ్ఛయా=కోరికచేత, కర్తుం = చేయుటకును, అకర్తుం = చేయకుండుటకును, అన్యథా కర్తుం = మఱియొకవిధముగాఁ జేయుటకును, ఉపాస్తిః = ఉపాసనము, శక్యా=వీలగును, అతః = ఈకారణమువలన, నిత్యం = ఎల్లప్పుడును, ప్రత్యయసంతతిం = వృత్తిప్రవాహమును, కుర్యాత్ = చేయవలయును.

తా. ఉపాసన ఉపాసకుని యిచ్ఛప్రకారము చేయుటకు, చేయకపోవుటకు, మఱియొకవిధముగఁ జేయుటకును శక్యమైన దగును. కనుక నుపాసన సర్వదా చేయవలెను.

అవ. సదా చింతనంబువలనం గల్గు లాభమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. వేదాధ్యాయీ హ్యప్రమత్తోఽధీతే స్వప్నేఽధివాసతః,
జపితా తు జపత్యేవ తథా ధ్యాతాపి వాసయేత్. 81

వ్యా. ఏవం సదా చింతనే కిం భవతీత్యత ఆహ—వేదాధ్యాయీతి. అప్రమత్తో వేదాధ్యాయీ సదాధ్యయనశీలః జపితా సదాజపశీలోఽధివాసతః దృఢవాసనయా స్వప్నాదిష్వధ్యయనం జపం వా కరోతి. ఏవ ముపాసకోఽపి వాసనాదార్ఢ్యా త్స్వప్నాదావపి ధ్యాయతీత్యర్థః.

టీ. వేదాధ్యాయీ=వేదము చదివెడువాఁడు, అప్రమత్తః=ప్రమాదము లేనివాఁడగుచు, స్వప్నే=స్వప్నమునందు, అధివాసతః = దృఢవాసనగలవాఁడై, అధీతే=అధ్యయనము చేయుచున్నాఁడు. హి=ఇది ప్రసిద్ధము. జపితా తు=జపముచేయువాఁడైతే, జపత్యేవ = ఎడతెగక జపించుచుండును. తథా = అవిధంబుగా, ధ్యాతాపి=ధ్యానము చేయువాఁడు కూడ, వాసయేత్ = చిరాభ్యాసము చేయనగును.

తా. వేదమును జదువువాఁ డాగ్రంథము కంఠస్థ మగుటచేతనే ఎల్లప్పుడును బఠించును గాన దానిని గలలోఁగూడఁ బలవరించును. జపము చేయువాఁడు నట్టులే చేయును. ధ్యానము చేయువాఁడును అట్లే దృఢాభ్యాసమును నాపాదింప నగును.

అవ. కలలోఁ గూడ ధ్యాన మనువర్తించుటకు, గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. విరోధిప్రత్యయం త్యక్త్వా నైరంతర్యేణ భావయన్,
లభతే వాసనావేశాత్స్వప్నాదా వపి భావనామ్. 82

వ్యా. స్వప్నాదావపి ధ్యానానువర్తనే కారణమాహ—విరోధీతి. వాసనావశాత్సంస్కారపాటవాత్. భావనాం ధ్యానం.

టీ. విరోధిప్రత్యయం=విరోధించెడివృత్తిని, త్యక్త్వా=వదలి, నైరంతర్యేణ=ఎడతెగక, భావయన్=భావించుచు, వాసనావేశాత్ = వాసనాభినివేశమువలన, స్వప్నాదావపి = స్వప్నము మొదలగువానియందును, భావనాం = వాసనానువృత్తిని, లభతే = పొందుచున్నాఁడు.

తా. ఉపాసకుఁడు ఇతరవృత్తులు లేక ఆనందాదిగుణములచే లక్షితమగు బ్రహ్మమును నేనైతి నని నిరంతరము ధ్యానించుచు, సంస్కార సామర్థ్యమువలన స్వప్నాద్యవస్థలయందు సయితము ధ్యానము చేయుచుండు నని తెలియవలెను.

అవ. ప్రారబ్ధకర్మ యనుభవించెడివాఁ డట్లు నిరంతర మెట్లు ధ్యానము చేయఁగలఁడని ప్రశ్నింపఁగా దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. భుంజానోఽపి నిజారబ్ధమాస్థాతిశయతోఽనిశం,
ధ్యాతుం శక్తో న సందేహో విషయవ్యసనీ యథా. 83

వ్యా. నను, ప్రారబ్ధకర్మవశా ద్విషయాననుభవతః కథం నైరంతర్యేణ భావనాసిద్ధిరిత్యాశంక్యాస్థాతిశయే సతి విషయవ్యసనివద్భావనాసిద్ధిస్స్యాదిత్యాహ—భుంజాన ఇతి.

టీ. నిజారబ్ధం=తన యారబ్ధకర్మమును, భుంజానోఽపి = అనుభవించుచున్నను, ఆస్థాతిశయతః = ఎక్కువపట్టుదలచేత, ధ్యాతుం = ధ్యానమొనరించుటకు, విషయవ్యసని యథా = విషయాసక్తునివలె, శక్తః = సమర్థుఁడు, భవేత్ = అగును. సందేహః = సంశయము, న = లేదు.

తా. ప్రారబ్ధకర్మ ననుభవించుచున్నను, విషయాసక్తుఁడు విషయంబులఁ జింతించుపగిది, నుపాసకుఁడు ఆస్థాతిశయముచేత (పరపురుషునియందుఁ దగిలిన చిత్తముగల స్త్రీవలె) నెడతెగక తత్త్వమును భావింపవచ్చును.

అవ. దృష్టాంతమును వివరించుచున్నాఁడు:—

శ్లో. పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి,
తదేవాస్వాదయత్యంతః పరసంగరసాయనమ్. 84

వ్యా. దృష్టాంతం వివృణోతి—పరవ్యసనినీతి.

టీ. పరవ్యసనినీ = పరపురుషవ్యసనముగల, నారీ = స్త్రీ, గృహకర్మణి = గృహకృత్యమునందు, వ్యగ్రాపి = ఆసక్తి గలదైనను, తత్ = ఆ, పరసంగరసాయనమేవ = పరపురుషసంపర్కమనెడి యమృతమునే, అంతః = లోపల, ఆస్వాదయతి = ఆస్వాదించుచుండును.

తా. పరపురుషానురక్తి గల భామిని గృహమం దెన్ని పనులను జేయుచుండినను పరపురుషసంగమసౌఖ్యమునే నిరంతరము భావించును. అట్లే యుపాసకుండును నిరంతరము ధ్యానమును చేయు నని భావము.

అవ. అట్లు భావించినను నిత్యము చేయుపనులు అడ్డవని దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరసంగం స్వాదయంత్యా అపి నో గృహకర్మ తత్,
కుంఠీభవేదపి త్వేత దాపాతేనైవ వర్తతే. 85

వ్యా. పరసంగాస్వాదనే గృహకృత్యవిచ్ఛేదస్స్యాదిత్యాశంక్యాహ — పరసంగమితి.

టీ. పరసంగం = పరపురుషభోగములు, స్వాదయంత్యాః = సర్వదాచింతనము చేయుచుండెడి వనితకు, తత్ గృహకర్మాపి = ఆగృహకృత్యంబును, నో కుంఠీభవేత్ = చెడదు. అపితు = మఱేమి యనఁగా, ఏతత్ = ఇది, ఆపాతేనైవ=హృదయపూర్వకము గాకయే, వర్తతే = ఉండును.

తా. పరపురుషసంగమసౌఖ్యంబు నెల్లప్పుడు భావించుచుండినను, కాంత గృహకృత్యంబుల మానివేయదు గాని మనఃపూర్వకముగాఁ జేయదు. చేయుచున్నట్లే వెలుపటి కగపడును.

అవ. దీనినే వివరించుచున్నాఁడు:—

శ్లో. గృహకృత్యవ్యసనినీ యథా సమ్యక్కరోతి తత్,
పరవ్యసనినీ తద్వన్న కరోత్యేవ సర్వథా. 86

వ్యా. ఆపాతేనైవ ప్రవృత్త ఇత్యుక్తమర్థం వివృణోతి—గృహకృత్యేతి.

టీ. గృహకృత్యవ్యసనినీ=గృహకార్యములయం దాసక్తిగల పతివ్రత, యథా= ఎట్లు, తత్ = ఆగృహకృత్యమును, సమ్యక్ = లెస్సఁగా, కరోతి = చేయునో, తద్వత్ = ఆవిధముగా, పరవ్యసనినీ = పరపురుషానురక్తి గల వనిత, సర్వథా = ఎల్ల విధంబులను, న కరోత్యేవ = చేయనే చేయదు.

తా. పతివ్రత మనఃపూర్వకముగా శ్రద్ధతో గృహకృత్యంబుల నొనరించునట్లు వ్యభిచారిణి యన్యాసక్త యగుటంజేసి యట్లాచరింపఁ జాలదు.

అవ. దార్ష్టాంతికముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం ధ్యాననైకనిష్ఠోఽపి లేశాల్లౌకికమారభేత్,
తత్త్వవిత్త్వవిరోధిత్వా ల్లౌకికం సమ్యగాచరేత్. 87

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—ఏవం ధ్యానేతి. నను తత్త్వవిదపి లౌకికవ్యవహారం కిం లేశేనాచరతి కిం వా సమ్యగితి వికల్ప్య విషయవ్యవహారస్య తత్త్వజ్ఞానావిరోధిత్వాత్సమ్యగేవాచరతీత్యాహ—తత్త్వవిదితి.

టీ. ఏవం = ఈవిధముగా, ధ్యానైకనిష్ఠోఽపి = ధ్యానపరుఁడును, లేశాత్ = స్వల్పముగా, లౌకికం = లోకవ్యవహారమును, ఆరభేత్ = ఆచరించును. తత్త్వవిత్తు = బ్రహ్మవిదుఁడైతే, ఽవిరోధిత్వాత్ = విరోధింపకపోవుటవలన, లౌకికం=లోకవ్యవహారమును, సమ్యక్ = చక్కఁగా, ఆచరేత్ = ఆచరించును.

తా. ధ్యానైకనిష్ఠుఁడు లోకవ్యవహారమును స్వల్పముగఁ జేయును. బ్రహ్మవిదుఁడు లోకవ్యవహారము తనను బాధింపనందున బాగుగనే చేయును.

అవ. విరోధాభావమును దెల్పుచున్నాఁడు:—

శ్లో. మాయామయః ప్రపంచోఽయమాత్మా చైతన్యరూపధృత్,
ఇతి బోధే విరోధః కో లౌకికవ్యవహారిణః. 88

వ్యా. అవిరుద్ధత్వమేవ దర్శయతి—మాయామయ ఇతి.

టీ. అయం ప్రపంచః = ఈప్రపంచము, మాయామయః = మాయయొక్క

పరిణామము, ఆత్మా = ప్రత్యగాత్మ, చైతన్యరూపధృత్ = చైతన్యస్వరూపుఁడు, ఇతి = ఇట్టిదగు, బోధే సతి = బోధ కల్గుచుండఁగా, లౌకికవ్యవహారిణః = లోకవ్యవహారము చేసెడి బ్రహ్మవిదునకు, విరోధః = విరోధము, కః = ఎట్టిది.

తా. ప్రపంచ మంతయు మిథ్య, చిద్రూప మగు ఆత్మయే సత్యము, అనెడి యనుభవము గల బ్రహ్మవిదుని లౌకికవ్యవహారము బాధింప నేరదు.

అవ. ఎందుకు బాధింపదో చెప్పుచున్నాఁడు:—

శ్లో. అపేక్షతే వ్యవహృతిర్న ప్రపంచస్య వస్తుతాం,
నాపేక్షతే త్మజాడ్యం కిం త్వేషా సాధనాన్యేవ కాంక్షతే. 89

వ్యా. విరోధాభావమేవ ప్రపంచయతి—అపేక్షత ఇతి.

టీ. వ్యవహృతిః=వ్యవహారము, ప్రపంచస్య = ప్రపంచముయొక్క, వస్తుతాం = యాథార్థమును, నాపేక్షతే = కోరదు. ఆత్మజాడ్యం = తనయొక్క మాంద్యమును, నాపేక్షతే = కోరదు. కింతు = ఇఁక నేమి యనఁగా, ఏషా = ఈవ్యవహారము, సాధనాన్యేవ = సాధనములనే, కాంక్షతే = కోరుచున్నది.

తా. జ్ఞానియొక్క వ్యవహారమునకుఁ బ్రపంచ సత్యత్వముతోఁ బనిలేదు. ఆత్మ జడ మని గ్రహింపఁ బనిలేదు. మఱి యేమన, వ్యవహార సాధనము లుండిన నావ్యవహారములు నెఱవేఱును.

అవ. వ్యవహారసాధనములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. మనోవాక్కాయతద్బాహ్యపదార్థాస్సాధనాని తాన్
తత్త్వవి న్నోపమృద్నాతి వ్యవహారోఽస్య నో కుతః. 90

వ్యా. కాని తాని వ్యవహారసాధనానీత్యత ఆహ—మనోవాగితి. తద్బాహ్యాః పదార్థాః గృహక్షేత్రాదయస్తాన్ మన ఆదీంస్తత్త్వజ్ఞానీ న నివారయతి. అతోఽస్య జ్ఞానినో వ్యవహారః కుతో న భవతి? భవత్యే వేత్యర్థః.

టీ. మనోవాక్కాయతద్బాహ్యపదార్థాః = మనస్సు, వాక్కు, శరీరము, శబ్దాదిపదార్థంబులును, సాధనాని = వ్యవహారసాధనంబులు. తాన్ = వానిని, తత్త్వవిత్ = బ్రహ్మవిదుఁడు, నోపమృద్నాతి = నివారింపఁడు. అస్య = ఇతనికి, వ్యవహారః = వ్యవహారము, కుతః = ఎందువలన, నో = లేదు? (కల్గునసుట).

తా. మనోవాక్కాయాదులును శబ్దస్పర్శాదులును వ్యవహార సాధనములు. తత్త్వవిదుఁడు వాని నసత్యములఁగా భావించును,

గాని వాని రూపుమాపలేఁడు. బ్రహ్మవిదునకు వ్యవహారము గల్గుట కేమి యభ్యంతర మున్నది? బ్రహ్మవిదుఁడు వ్యవహరింప వచ్చు నని భావము.

అవ. తత్త్వవిదుఁడు విషయముల బాధింప లేకపోయినను చిత్తమును నిరోధింప వలదా? అనెడి శంకకు సమాధానము:—

శ్లో. ఉపమృద్నాతి చిత్తం చేద్ధ్యాతాఽసౌ న తు తత్త్వవిత్,
న బుద్ధిం మర్దయన్ దృష్టో ఘటతత్త్వస్య వేదితా. 91

వ్యా. నను విషయానుపమర్దనేఽపి తత్త్వవిదా చిత్తోపమర్దనం కార్యమిత్యాశంక్య తథాకరణే తత్త్వవిదేవ న స్యాదిత్యాహ—ఉపమృద్నాతీతి. నను, తత్త్వవిదా చిత్తం నోపమృద్యత ఇత్యేతత్ క్వ దృష్టమిత్యాశంక్యాహ—న బుద్ధిమితి. ఘటతత్త్వస్య వేదితా జ్ఞాతా బుద్ధిం మర్దయన్ పీడయన్నైకాగ్ర్యం కుర్వన్పురుషో న దృష్టో నోపలబ్ధ ఇత్యర్థః.

టీ. బుద్ధిం=బుద్ధిని, ఉపమృద్నాతి చేత్=సంకోచించినయెడల, అసౌ=ఇతఁడు, ధ్యాతా=ధ్యానము చేయువాఁడు, (భవతి = అగుచున్నాఁడు). తత్త్వవిత్ = తత్త్వవిదుఁడు, నతు=కాఁడు. ఘటతత్త్వస్య = ఘటమాహాత్మ్యమును, (ఇది కర్మణిషష్ఠి.) వేదితా=గుర్తెఱిఁగినవాఁడు, బుద్ధిం=చిత్తమును, మర్దయన్ = పీడించుచున్నవాఁడై, న దృష్టః = చూడఁబడలేదు.

తా. బుద్ధి నేకాగ్రము చేయునేని, అతఁడు ధ్యాని గాని జ్ఞాని గాఁడు, కనులతో ఘటమును గాంచువాఁడు బుద్ధిని నితర విషయములందుఁ బోనీయక నిర్బంధించి చూచుటలేదు. ఎట్లు చూచినను ఘటము గన్పడును.

అవ. స్థూలపదార్థము గనుక ఘటము స్ఫుటమై ప్రకాశించును బ్రహ్మపదార్థ మట్టిది గాదే యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సకృత్ప్రత్యయమాత్రేణ ఘటశ్చేద్భాసతే సదా,
స్వప్రకాశోఽయమాత్మా కిం ఘటవచ్చ న భాసతే. 92

వ్యా. నను ఘటస్య స్థూలత్వేన స్పష్టత్వాత్తద్దర్శనే చిత్తపీడనం నాపేక్ష్యత ఇత్యాశంక్య తస్య స్వప్రకాశత్వేన ఘటాదపి స్పష్టతరత్వాచ్చిత్తనిరోధనం నైవాపేక్ష్యత ఇత్యాహ—సకృదితి.

టీ. సకృత్ప్రత్యయమాత్రేణ = ఒకమాటు చూచుటచేతనే, ఘటః = ఘటము, సదా=ఎల్లప్పుడు, భాసతే చేత్=ప్రకాశించు నంటివేని, స్వప్రకాశః=స్వయంప్రకాశ

మానమైన, అయం ఆత్మా=ఈయాత్మ, ఘటవచ్చ=ఘటమువలె, న భాసతే కిం=ప్రకాశిం పదా? (ప్రకాశించు ననుట).

తా. ఒకమాటు చూచిన ఘట మవసర మైనప్పుడెల్ల జ్ఞాపకము వచ్చును. అటులనే స్వప్రకాశమైన ఆత్మ ఘటముకంటెను ప్రసిద్ధము. స్వస్వరూపము గనుక నెల్లప్పుడు ప్రకాశించును.

శ్లో. స్వప్రకాశతయా కిం తే తద్బుద్ధిస్తత్త్వవేదనమ్,
బుద్ధిశ్చ క్షణనాశ్యేతి చోద్యం తుల్యం ఘటాదిషు. 93

వ్యా. నను బ్రహ్మణస్స్వప్రకాశత్వేఽపి తద్గోచరాయా బుద్ధివృత్తేరేవ తత్త్వజ్ఞానత్వాత్తస్యాశ్చ క్షణికత్వేన బ్రహ్మణి పునః పునరవస్థాపనమపేక్ష్యత ఇత్యాశంక్యేదం చోద్యం ఘటాదిష్వపి సమానమిత్యాహ—స్వప్రకాశతయేతి.

టీ. స్వప్రకాశతయా=స్వయంప్రకాశమగుటచేత, తే=నీకు, కిం=ఏమి ప్రయోజనము?, తత్=ఆబ్రహ్మవిషయికమగు, బుద్ధిః=బుద్ధివృత్తియు, తత్త్వవేదనం = తత్త్వజ్ఞానమును, క్షణనాశ్యా=క్షణకాలములో నశించునవి. ఇతి=అని, చోద్యం = పూర్వపక్షము, ఘటాదిషు=ఘటము మొదలగువానియందును, తుల్యం=సమానము.

తా. బ్రహ్మము స్వప్రకాశమైన నీ కేమి లాభము? తత్త్వజ్ఞానమనఁగా బ్రహ్మమును గనఁబఱచెడి (ప్రకాశింపఁజేసెడి) చిత్తవృత్తి గదా. అది క్షణికము. దానిని మాటిమాటికిఁ గలుగఁజేయుటకై చిత్తైకాగ్రత చేయవలదా యనిన ఘటజ్ఞానము గూడ క్షణికమే. కనుక దానిని మఱలఁ గలుగఁ జేయుటకుఁగూడ యత్నింపవలసివచ్చును. ఈ రెండును సమములే.

అవ. ఒకమాటు నిశ్చయించిన ఘటమును నెల్లప్పుడు వ్యవహరింపవచ్చును. దానికొఱకు యత్న మక్కఱలే దంటివేని ఒకమాటు బ్రహ్మము సాక్షాత్కరించె నేని యెప్పుడును ధ్యానము చేయవచ్చును. గనుక నీ రెండును సమములే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘటాదౌ నిశ్చితే బుద్ధిర్నశ్యత్వేవ యదా ఘటః,
ఇష్టో నేతుం తదా శక్య ఇతి చేత్సమమాత్మని. 94

వ్యా. ఘటాదిజ్ఞానస్య క్షణికత్వేన సకృన్నిశ్చితస్య సర్వదా వ్యవహర్తుం శక్యత్వాత్తత్ర చిత్తస్థైర్యసంపాదనమప్రయోజనకమిత్యాశంక్యేదమాత్మన్యపి సమానమిత్యాహ—ఘటాదావితి.

టీ. ఘటాదౌ = ఘటము మొదలగునది, నిశ్చితే (సతి) = నిశ్చయింపఁబడఁగా, బుద్ధిః=బుద్ధి, నశ్యత్యేవ=నశింపనే నశించును. యదా=ఎప్పుడు, ఘటః=ఘటము, ఇష్టః=ఇష్టమో, తదా=అప్పుడు, నేతుం = తీసికొనిపోవుటను (వ్యవహరించుటకు), శక్య ఇతి చేత్=శక్యమగునంటివేని, ఆత్మని=ఆత్మవిషయమై, సమం=సమానము.

తా. ఒకమాటు చూచిన ఘటము నవసర మగునెడ వ్యవహరింప వచ్చును. అట్టులే యొకమాఱు సాక్షాత్కరించిన బ్రహ్మమును అవసర మగునప్పుడు శిష్యులకు బోధింపవచ్చును. తాను ధ్యానింప వచ్చును.

అవ. దీనినే స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. నిశ్చిత్య సకృదాత్మానం యదాపేక్షా తదైవ తమ్,
వక్తుం మంతుం తథా ధ్యాతుం శక్నోత్యేవ హి తత్త్వవిత్. 95

వ్యా. సమమాత్మనీత్యుక్తమర్థం వివృణోతి—నిశ్చిత్యేతి.

టీ. సకృత్=ఒక్కమాటు, ఆత్మానం=ఆత్మను, నిశ్చిత్య = నిశ్చయించి, యదా=ఎప్పుడు, అపేక్షా=అపేక్షయో, తదైవ = అప్పుడే, తం=ఆయాత్మను, వక్తుం=పల్కుటకును, మంతుం = మననముచేయుటకును, తథా = అట్లు, ధ్యాతుం = ధ్యానించుటకును, తత్త్వవిత్=బ్రహ్మవిదుఁడు, శక్నోత్యేవ=సమర్థుఁడే యగుచున్నాఁడు.

తా. బ్రహ్మసాక్షాత్కారము గలవాఁడు తన కిచ్చవచ్చినప్పు డెల్ల బ్రహ్మమునుగూర్చి వచించును; మననము చేయును; ధ్యానించును. దీని కొఱకెప్పుడును నితర వ్యాపారముల మాన నవసరము లేదు.

అవ. జ్ఞాననిష్ఠుఁడు మాత్రము ధ్యానముచేయఁడా యని యడిగినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాసక ఇవ ధ్యాయన్ లౌకికం విస్మరేద్యది,
విస్మరత్యేవ సా ధ్యానాద్విస్మృతిర్న తు వేదనాత్. 96

వ్యా. నను, తత్త్వవిదప్యుపాసకవదాత్మానుసంధానవశాజ్జగదనుసంధానరహితో దృశ్యత ఇత్యాశంక్య సోఽనుసంధానాభావో ధ్యానప్రయుక్తో న వేదనప్రయుక్త ఇత్యాహ—ఉపాసక ఇతి.

టీ. ఉపాసక ఇవ=ఉపాసనచేయువానివలె, ధ్యాయన్ = ధ్యానముచేయుచు, లౌకికం=లోకవ్యవహారమును, విస్మరేద్యది = మఱచునేని, విస్మరత్యేవ=మఱచిపోనిమ్ము, సా విస్మృతిః = ఆమఱపు, ధ్యానాత్ = ధ్యానమువలనఁ గలిగినదికాని, వేదనాత్ = తత్త్వజ్ఞానమువలన, న=కాదు.

తా. బ్రహ్మవిదుఁ డొకప్పుడు లోకవ్యవహారములను మఱచి సమాధినిష్ఠుఁడై యుండును. ఆసమయంబునఁ గల్గిన ప్రపంచసంబంధమైన మఱపు ధ్యానఫలము గాని జ్ఞానఫలము గాదు.

అవ. బ్రహ్మవిదునకు మోక్షముకొఱకు ధ్యాన మక్కఱ లేదా యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ధ్యానం త్వైచ్ఛికమేతస్య వేదనాన్ముక్తిసిద్ధితః,
జ్ఞానాదేవ తు కైవల్యమితి శాస్త్రేషు డిండిమః. 97

వ్యా. నను, తత్త్వవిదాపి ముక్తిసిద్ధయే బ్రహ్మధ్యానం కర్తవ్యమిత్యాశంక్య "జ్ఞానాదేవ తు కైవల్యం ప్రాప్యతే యేన ముచ్యతే, తమేవం విదిత్వాతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ, జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశై"రిత్యాది శాస్త్రసద్భావాన్న మోక్షాయ ధ్యానం కర్తవ్యమిత్యాహ—ధ్యానమితి.

టీ. వేదనాత్=జ్ఞానమువలన, ముక్తిసిద్ధితః=మోక్షముయొక్క సిద్ధించుటవలన, ఏతస్య=ఈబ్రహ్మవిదునకు, ధ్యానం = పరబ్రహ్మవిషయక ధ్యానము, ఐచ్ఛికం=ఇచ్ఛను అనుసరించినది, జ్ఞానాదేవ తు = జ్ఞానమువలననే, కైవల్యం = మోక్షము, ఇతి=అని, శాస్త్రేషు=శాస్త్రములయందు, డిండిమః=భేరీధ్వని (సుప్రసిద్ధమనుట).

తా. బ్రహ్మవిదునకు జ్ఞానముచేతనే కైవల్యము సిద్ధించును. కనుక, ఆబ్రహ్మవిదుఁడు తన కిచ్ఛవచ్చినయప్పుడు ధ్యానించును లేదా మానుకొనును. అది యతనికి మోక్షసాధకమును గాదు; అది లేకుండుట బాధకమును గాదు.

శ్లో. తత్త్వవిద్యది న ధ్యాయేత్ప్రవర్తేత తదా బహిః,
ప్రవర్తతాం సుఖే నాయం కో బాధోఽస్య ప్రవర్తనే. 98

వ్యా. నను తత్త్వవిదో ధ్యానానభ్యుపగమే తస్య సదా బహిః ప్రవృత్తిస్స్యాదిత్యాశంక్యాబాధకత్వాత్ప్రవృత్తిరభ్యుపేయత ఇత్యాహ—తత్త్వవిదితి.

టీ. తత్త్వవిత్=బ్రహ్మవేత్త, న ధ్యాయేద్యది = ధ్యానముచేయఁడేని, తదా = అప్పుడు, బహిః=వెలుపట, ప్రవర్తేత = ప్రవర్తించుననెదవేని, అయం = ఈబ్రహ్మవేత్త, సుఖేన=అనాయాసముచేత, ప్రవర్తతాం=ప్రవర్తించుఁగాక. అస్య=ఇతనికి, ప్రవర్తనే= అట్లు ప్రవర్తించుటయందు, కః బాధః=ఏమి బాధ?

తా. బ్రహ్మవిదుఁడు ధ్యానము చేయకుండినబాహ్యప్రవర్తనము గల్గునంటి వేని అట్లు బాహ్యప్రవృత్తి గల్గినను గల్గుఁగాక. అతని కేమి నష్టము? అతఁడు కృతకృత్యుఁడు. అతని బ్రహ్మనిష్ఠకు నేలోపమును లేదు.

అవ. ఇది అతిప్రసంగము కాదా యనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అతిప్రసంగ ఇతి చేత్ప్రసంగం తావదీరయ,
ప్రసంగో విధిశాస్త్రం చే న్న తత్త్వవిదం ప్రతి. 99

వ్యా. బహిః ప్రవృత్త్యభ్యుపగమేఽతిప్రసంగస్స్యాదిత్యాశంక్య ప్రసంగస్య దుర్నిరూప్యత్వా న్నై వమితి పరిహరతి—అతిప్రసంగఇతి. న ప్రసంగో దుర్నిరూప్యో విధిశాస్త్రస్య ప్రసంగశబ్దేన వివక్షితత్వాదితి చేన్న. తస్యాజ్ఞానివిషయత్వేన తత్త్వవిద్విషయత్వాభావాదిత్యాహ—ప్రసంగ ఇతి. విధిశాస్త్రమిత్యుపలక్షణం నిషేధశాస్త్రస్యాపి.

టీ. అతి ప్రసంగ ఇతి చేత్ = అతిప్రసంగ మంటివేని, ప్రసంగం = ప్రసంగమును, తావత్ = ఇప్పుడు, ఈరయ=చెప్పుము. విధిశాస్త్రం = విధినిషేధప్రతిపాదకశాస్త్రము. ప్రసంగశ్చేత్ = ప్రసంగమగు నంటివేని, తత్ = ఆప్రస్తావము, తత్త్వవిదంప్రతి = బ్రహ్మవేత్తనుగుఱించి, న = కాదు.

తా. బ్రహ్మవిదుఁడు ధ్యానము మానినపక్షమున కట్టుబాటు చెడునంటివేని, నట్టివానికి కట్టుబాటే లేదు. ప్రసంగ మనఁగా విధిశాస్త్రము. (కట్టుపాటు)

అవ. విధినిషేధశాస్త్రమునకు ఆ అజ్ఞానవిషయత్వమునే చూపుచున్నాఁడు:—

శ్లో. వర్ణాశ్రమవయోఽవస్థాఽభిమానో యస్య విద్యతే,
తస్యైవ చ నిషేధాశ్చ విధయస్సకలా అపి. 100

వ్యా. విధిశాస్త్రస్యావిద్వద్విషయత్వమేవ దర్శయతి—వర్ణేతి.

టీ. వర్ణాశ్రమవయోవస్థాభిమానః = వర్ణములును, ఆశ్రమములును, వయస్సును, అవస్థయు, వీనియం దభిమానము, యస్య=ఎవనికి, విద్యతే=కలదో, తస్యైవ = అతనికే, నిషేధాశ్చ = నిషేధంబులును, సకలా అపి = సమస్తములైన, విధయశ్చ = విధులును (కట్టుబాట్లు), (భవంతి = అగుచున్నవి).

తా. వర్ణావస్థావయోవిశేషములు గల అజ్ఞునకే విధినిషేధాధికారము. బ్రహ్మవిదున కట్టి యధికారము లేనే లేదు. శాస్త్ర మాతని నియమింపఁజాలదు.

అవ. నను తత్త్వవిదుని నిశ్చయముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః,
నాత్మనో బోధరూపస్యేత్యేవం తస్య వినిశ్చయః. 101

వ్యా. నను తత్త్వవిదోఽపి దేహధారిత్వేన వర్ణాశ్రమాద్యభిమానిత్వమస్తీత్యాశంక్యాహ—వర్ణాశ్రమేతి.

టీ. మాయయా=మాయవలన, దేహే = దేహమందు, వర్ణాశ్రమాదయః=వర్ణాశ్రమాదులు, పరికల్పితా ఇతి = కల్పింపఁబడిన వనియు, బోధరూపస్య=బోధస్వరూపుఁడగు, ఆత్మనః = ఆత్మకు, నేతి = లేవనియు, ఏవం = ఈ ప్రకారముగా, తస్య = అజ్ఞానియొక్క, వినిశ్చయః = నిశ్చయమగును.

తా. నేను చిద్రూపుఁడ నగు ఆత్మను. నాకు వర్ణాశ్రమాదులు లేవు. అవి యన్నియు మాయాకల్పితదేహసంబంధము లగును గాని నావి కావు. అని బ్రహ్మవిదుని నిశ్చయము.

అవ. జ్ఞానికి చేయఁదగినపని లే దనుటయందు శాస్త్రమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా,
హృదయేనాస్తసర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః. 102

వ్యా. నను తత్త్వవిన్నిశ్చయస్తావత్తిష్ఠతు. శాస్త్రం తు కర్తవ్యం ప్రతిపాదయతీత్యాశంక్య తదపి తస్య కర్తవ్యాభావమేవ బోధయతీత్యాహ—సమాధిమితి. యో హృదయేన బుద్ధ్యా అస్తసర్వాస్థః అస్తాః పరిత్యక్తాః అశేషాః ఆసక్తివిశేషా యస్య తథావిధః అత ఏవోత్తమాశయః ఉత్తమః ఆశయః అభిప్రాయో నిర్మలం జ్ఞానం యస్య స తథోక్తః స ముక్త ఏవ. అతః సమాధిమథకర్మాణీత్యన్వయః.

టీ. సమాధిం=సమాధిని గాని, కర్మాణి = కర్మలను గాని, మా కరోతు=చేయకపోనీ, కరోతు వా=చేయనీ, హృదయేన=మనస్సుచేత, అస్తసర్వాస్థః - అస్త=నిరసింపఁబడిన, సర్వ=సమస్తములైన, ఆస్థః=కోరికలు గల, ఉత్తమాశయః = నిర్మలజ్ఞానము గలవాఁడు, ముక్త ఏవ = కృతకృత్యుఁడే యగును.

తా. బ్రహ్మవిదుఁడు పూర్వాభ్యాసముచేత సమాధిని గాని, కర్మలను గాని చేసినను మానినను, సర్వవాంఛలు లేనివాఁడైనందున, అట్టి విమలచిత్తుఁడు ముక్తుఁడే యగు నని భావము.

అవ. ఈవిషయమున నింకొక ప్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. నైష్కర్మ్యేణ న తస్యార్థస్తస్యార్థోఽస్తి న కర్మభిః,
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః. 103

వ్యా. విదుషః కర్తవ్యం నాస్తి. తత్ర వచనాంతరముదాహరతి—నైష్కర్మ్యేణేతి. నైష్కర్మ్యం కర్మరాహిత్యం తేన కర్మత్యాగేనేత్యర్థః. సమాధానం సమాధిః. జప్యం జపః.

టీ. యస్య = ఎవ్వనియొక్క, మనః = మనస్సు, నిర్వాసనం = వాసనలేనిదో, తస్య = అతనికి, నైష్కర్మ్యేణ = కర్మరాహిత్యముతో, అర్థః = ప్రయోజనము, న = లేదు. కర్మభిః=కర్మలతోడను, తస్య=అతనికి, అర్థః = ప్రయోజనము, న=లేదు. సమాధానజప్యాభ్యాం=సమాధితోడను జపముతోడను, న=ప్రయోజనము లేదు,

తా. వాసనాక్షయము గల మహనీయునకు కర్మలతోఁగాని కర్మరాహిత్యముతోఁగాని సమాధితోఁగాని జపముతోఁగాని మఱి దేనితోఁగాని పనిలే దని శాస్త్రతాత్పర్యము.

అవ. వాసనానివృత్తికొఱకు జ్ఞాని ప్రయత్నింప వలదా? అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మాఽసంగస్తతోఽన్యత్స్యాదింద్రజాలం హి మాయికమ్,
ఇత్యచంచలనిర్ణీతేః కుతో మనసి వాసనా. 104

వ్యా. నను విదుషామపి వాసనానివృత్తయే ధ్యానం కర్తవ్యమిత్యాశంక్య సమ్యజ్ఞానినో వాసనైవ నాస్తీత్యాహ—ఆత్మేతి.

టీ. ఆత్మా=పరబ్రహ్మము, అసంగః=సంగము లేనివాఁడు, అతః=ఈపరబ్రహ్మముకంటె, అన్యత్=ఇతరమైన, జగత్=జగత్తు, మాయికం = మాయాకల్పితమైన, ఇంద్రజాలం హి = ఇంద్రజాలముగదా. ఇతి=ఈలాగని, అచంచలనిర్ణీతేః = దృఢనిశ్చయము గలవానికి, మనసి=మనస్సునందు, వాసనా=ఆశ, కుతః=ఎక్కడిది? (లే దనుట).

తా. జగత్తు మాయికము పరమాత్మ యసంగుఁడు అని గ్రహించినవానికి వాసనయే సంభవింప దని యీ వచనాభిప్రాయము.

అవ. ప్రకృతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం నాస్తి ప్రసంగోఽపి కుతోఽస్యాఽతిప్రసంజనం,
ప్రసంగో యస్య తస్యైవ శంక్యేతాఽతిప్రసంజనమ్. 105

వ్యా. భవత్వేవం. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—ఏవమితి. కస్య తర్హ్యతిప్రసంగ ఇత్యత ఆహ—ప్రసంగ ఇతి.

టీ. ఏవం=ఈవిధముగా, ప్రసంగోఽపి = విధిబద్ధతయును, నాస్తి=లేదు. అస్య = ఈబ్రహ్మవిదునకు, అతిప్రసంజనం=విధ్యతిక్రమము, కుతః = ఎక్కడిది? యస్య=ఎవనికి, ప్రసంగః=ప్రసంగమో, తస్యైవ=వానికే, అతిప్రసంజనం = అతిప్రసక్తి, శంక్యేత = ఊహింపఁబడును.

తా. ఎవ్వఁడు విధిశాస్త్రముల కధికారియో వాఁడు విధి నతిక్రమించెనేని, దోషము అట్టివానికే సంభవించును. విధిశాస్త్రము బ్రహ్మ

విదుని నియమింపఁజాలదు. కావున దాని నతిక్రమించినను నాతనికి దోషము లేదు.

అవ. ఇది యెచట చూడఁబడిన దనిన దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. విధ్యభావా న్న బాలస్య దృశ్యతేఽతిప్రసంజనం,
స్యాత్కుతోఽతిప్రసంగోఽస్య విధ్యభావే సమే సతి. 106

వ్యా. ఏవం క్వ దృష్ట మిత్యత ఆహ—విధ్యభావాదితి. దార్ష్టాంతికే యోజయతి—స్యాదితి.

టీ. బాలస్య=పిల్లవానికి, విధ్యభావాత్=విధి లేకపోవుటవలన, అతిప్రసంజనం=విధ్యతిక్రమము, న దృశ్యతే=చూడఁబడుట లేదు. విధ్యభావే=విధిలేకపోవుట, సమే సతి=సమానమగుచుండఁగా, అస్య = ఈ బ్రహ్మవిదునకు, అతిప్రసంగః = అతిప్రసంగము, కుతః = ఎక్కడిది ? (లే దనుట.)

తా. బాలునకు విధికి లోఁగవలసినది లేనందున విధిదోష మాత్రనికిఁ గలుగదా. జ్ఞానికిం గూడ నట్టులే యగును. బాలుఁడు మలమూత్ర విసర్జనము చేయుచు భుజించుచుండినను దాని నెవ్వరును నాక్షేపింపరు. కారణ మేమి ? అతనింగూర్చి శాస్త్రము విధింపదు. తగిన వయసువచ్చినతర్వాతనే యతఁడు విధ్యధికారి యగు నని భావము.

అవ. బాలునకును బ్రహ్మవిదునకును దారతమ్యమును శంకించి సమాధానము జెప్పుచున్నాఁడు:—

శ్లో. న కించిద్వేత్తి బాలశ్చే త్సర్వం వేత్త్యేవ తత్త్వవిత్,
అల్పజ్ఞస్యైవ విధయస్సర్వే స్యుర్నాన్యయోర్ద్వయోః. 107

వ్యా. బాలస్య విధ్యభావే ప్రయోజకమజ్ఞత్వ మస్తి. న విదుష ఇత్యాశంక్య తస్యాజ్ఞత్వాభావేఽపి విధ్యభావప్రయోజకం సర్వజ్ఞత్వమస్తీత్యాహ—న కించిదితి. తర్హి విధ్యధికారః కస్యేత్యాశంక్యాహ—అల్పజ్ఞస్యేతి.

టీ. బాలః=బాలుఁడు, కించిత్ = దేనినినైనను, న వేత్తి చేత్ = ఎఱుంగఁడని యంటివేని, తత్త్వవిత్=బ్రహ్మవిదుఁడు, సర్వం=సకలమును, వేత్త్యేవ = ఎఱుంగుచునే యున్నాఁడు. సర్వే=సమస్తములైన, విధయః=శాస్త్రీయనిబంధనములు, అల్పజ్ఞస్యైవ=స్వల్పజ్ఞానము గలవానికే, స్యుః = అగుచున్నవి. అన్యయోః ద్వయోః=తక్కిన యిరువురకు, న = లేవు.

తా. బాలున కేమియుం దెలియదు కాన విధినిషేధము లతని బాధింప వంటివేని నన్నియుం దెలియును గాన నవి జ్ఞానిని గూడ బాధింపవు. విధినిషేధములు అల్పజ్ఞునినే బాధించును.

అవ. శాపానుగ్రహసామర్థ్యము గలవాఁడే బ్రహ్మవిదుఁ డగును. అనియెడి భ్రమను నిరసించుచున్నాఁడు:—

శ్లో. శాపానుగ్రహసామర్థ్యం యస్యాసౌ తత్త్వవిద్యది,
తన్న శాపాదిసామర్థ్యం ఫలం స్యాత్తపసో యతః. 108

వ్యా. నను 'వ్యాసాదివచ్ఛాపానుగ్రహసామర్థ్యం యస్య, స ఏవ తత్త్వవిన్నాన్య ఇతి శంక్యతే—శాపేతి. పరిహరతి—తన్నేతి. తత్ర హేతుమాహ—శాపాది సామర్థ్యమితి.

టీ. యస్య=ఎవ్వనికి, శాపానుగ్రహసామర్థ్యం = నిగ్రహానుగ్రహసామర్థ్యము, (అస్తి=కలదో) అసౌ=వీఁడు, తత్త్వవిద్యది = తత్త్వవిదుండంటివేని, తత్=అది, న = కాదు, యతః = ఏహేతువువలన, శాపాదిసామర్థ్యం = శాపాదులిచ్చు సామర్థ్యము, తపసః=తపస్సుయొక్క, ఫలం=ఫలము, స్యాత్=అగును.

తా. జ్ఞానులలోఁ గొందఱు శాపానుగ్రహహేతు వగు తపస్సు గలవా రుందురు. కొందఱట్లుగాక సత్కర్మానుష్ఠానముచేతను విజాతీయమగు తపస్సుచేతను చిత్తశుద్ధిపూర్వకవైరాగ్యముగల్గి శ్రవణమననాదు లాచరించి బ్రహ్మసాక్షాత్కార మందెదరు. తపోనిష్ఠులందు శాపానుగ్రహసామర్థ్యము గనుపించును. అది తపఃఫలముగాని జ్ఞానఫలము గాదు. కావున తపోరహితులయం దట్టి మహిమ లుండవు. అంత మాత్రముచే వారిని జ్ఞానులు గా రని భ్రమింపఁ జనదు.

అవ. వ్యాసాదిమహర్షులయందు నిగ్రహానుగ్రహసామర్థ్యంబు గలదే యనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యాసాదేరపి సామర్థ్యం దృశ్యతే తపసో బలాత్,
శాపాదికారణాదన్యత్తపో జ్ఞానస్య కారణమ్. 109

వ్యా. నను వ్యాసాదీనాం తత్త్వవిదా మపి శాపాదిసామర్థ్యం దృశ్యత ఇత్యాశంక్య తత్ తేషాం న తత్త్వజ్ఞానఫలం అపితు తపఃఫలమిత్యాహ—వ్యాసాదేరితి. నను తర్హి 'తపసా బ్రహ్మ విజిజ్ఞాస'స్వేతి శ్రుతేస్తపోరహితస్య తత్త్వజ్ఞానమపి న ఘటేతేత్యాశంక్య శాపాదికారణాదన్యస్య తపసః సత్త్వాన్నైవమిత్యాహ—శాపేతి.

టీ. వ్యాసాదే రపి=వ్యాసమహర్షి మొదలగువారికిని, తపసః = తపస్సుయొక్క, బలాత్=బలమువలన, సామర్థ్యం = సమర్థత, దృశ్యతే = చూడఁబడుచున్నది. శాపాది కారణాత్ = శాపాదులకు హేతువగు తపస్సుకంటె, అన్యత్=వేఱైన, తపః=తపస్సు, జ్ఞానస్య=జ్ఞానమునకు, కారణం=కారణము.

తా. వ్యాసాదిమహర్షులకు నిగ్రహానుగ్రహములకు హేతువగు తపస్సు గలదు. కావున వారట్టి సామర్థ్యము గలిగి వర్తించిరి. జ్ఞానులకును తపస్సు గలదు గాని, ఇది శాపానుగ్రహహేతు వగు తపస్సుకంటె వేఱగునది. ఇది జ్ఞానమునకే సాధనం బగును.

అవ. వ్యాసాదులయం దుభయవిధ మగు తపస్సు గలదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ద్వయం యస్యాస్తి తస్యైవ సామర్థ్యజ్ఞానయోర్జనిః,
ఏకైకం తు తపః కుర్వన్నేకైకం లభతే ఫలమ్. 110

వ్యా. తర్హి తేషాం వ్యాసాదీనాం తత్వజ్ఞానిత్వం శాపాదికారణత్వం చ కథం దృశ్యత ఇత్యాశంక్య ఉభయవిధతపసస్సద్భావాదిత్యాహ—ద్వయమితి.

టీ. ద్వయం = ఉభయవిధమగు తపస్సు, యస్య = ఎవ్వనికి, అస్తి = కలదో, తస్యైవ=వానికే, సామర్థ్యజ్ఞానయోః = సామర్థ్యజ్ఞానములయొక్క, జనిః = ఉత్పత్తి, (భవతి = అగుచున్నది.) ఏకైకం = ఒక్కొక్కటైన, తపః=తపస్సును, కుర్వన్=ఆచరించుచు, ఏకైకం=ఒక్కొకటైన, ఫలం=లాభమును, లభతే=పొందుచున్నాఁడు.

తా. వ్యాసాదులకు శాపానుగ్రహసామర్థ్యమును గలుగఁజేసెడి తపస్సును జ్ఞానహేతు వగు తపస్సును గలదు గాన, వా రుభయ సామర్థ్యములు గల్గి వర్తించిరి. ఒక్కొక తపస్సుగలవార లొక్కొక సామర్థ్యమునే పొందుదురు.

శ్లో. సామర్థ్యహీనో నింద్యశ్చే ద్యతిభి ర్విధివర్జితః,
నింద్యంతే యతయోఽప్యన్యైరనిశం భోగలంపటైః. 111

వ్యా. నను యశ్శాపాదిసామర్థ్యరహితః తస్య విధ్యభావేఽపి విహితానుష్ఠాతృభిర్నింద్యత్వం స్యాదిత్యాశంక్య తేషామపి విషయలంపటైర్నింద్యత్వం స్యాదిత్యాహ—సామర్థ్యహీన ఇతి.

టీ. సామర్థ్యహీనః = సామర్థ్యము లేనివాఁడును, విధివర్జితః = విధిరహితుఁడగు వాఁడును, యతిభిః=విహితానుష్ఠాతలచేత, నింద్యశ్చేత్ = నింద్యుఁ డంటివేని భోగలంపటైః = భోగాసక్తులగు, అన్యైః = ఇతరులచేత, యతయోఽపి = విహితానుష్ఠాతలును, అనిశం=సర్వదా, నింద్యంతే=నిందింపఁబడుదురు.

తా. శాపానుగ్రహసామర్థ్యము లేని బ్రహ్మవిదుఁడు విధులను మీఱెనేని నియమముతో వర్తించువారలు వాని నాక్షేపింపరా యనిన నొరుల యాక్షేపమును బరికింపఁ జనదు. భోగపరు లీనియమానుష్ఠాతల నాక్షేపించుట లేదా యట్టులే యగు నని భావము.

అవ. భోగలంపటులు నియమానుష్ఠాతల నిందించువిధముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. భిక్షావస్త్రాది రక్షేయుర్యద్యేతే భోగతుష్టయే,
అహో యతిత్వమేతేషాం వైరాగ్యభరమంథరమ్. 112

వ్యా. ఏతేఽపి భోగతుష్ట్యర్థం విషయాన్సంపాదయేయురిత్యాశంక్య తదా తేషాం యతిత్వమేవ హీయతేత్యభిప్రాయేణోపహసతి—భిక్షేతి.

టీ. ఏతే = వీరు, భోగతుష్టయే = భోగతృప్తికొఱకు, భిక్షావస్త్రాది = భిక్షయు వస్త్రములు మొదలగువానిని, రక్షేయుర్యది = రక్షించుకొనెదరంటివేని, ఏతేషాం = వీరి యొక్క, వైరాగ్యభరమంథరం - వైరాగ్య = వైరాగ్యముయొక్క, భర = భారము చేత, మంథరం = వివశమైన, యతిత్వం = నియమానుష్ఠానము, అహో=ఎంత యాశ్చర్య కరమైనది!

తా. ఈ యతులు వైరాగ్యమే కలవారలైరేని వీరికి భిక్షా చింత యేల? వస్త్రాదికంబుల రక్షించుకొనన నేల? అని భోగపరులు వీరిని గూడ నాక్షేపింతురు. కాన నొరుల యాక్షేప మకించిత్కరము.

అవ. ఆటులనే విధినిషేధబద్ధుఁడు గాని జ్ఞానిని నియమపరు లాక్షేపించినను బాధకము గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వర్ణాశ్రమపరాన్మూఢా నిందంత్విత్యుచ్యతే యది,
దేహాత్మమతయో బుద్ధం నిందంత్వాశ్రమవాసినః. 113

వ్యా. విషయలంపటైః పామరైశ్చ క్రియమాణయా నిందయా క్రియాపరాణాం శిష్టానాం హాని ర్నాస్తీత్యుచ్యతే చేత్తర్హి దేహాభిమానిభిః క్రియాపరైః క్రియమాణయా నిందయా తత్త్వవిదోఽపి న హానిరిత్యాహ—వర్ణాశ్రమేతి.

టీ. వర్ణాశ్రమపరాన్=వర్ణాశ్రమధర్మానుష్ఠాతలను, మూఢాః=భోగలంపటు లగు నజ్ఞులు, నిందంతు=దూషింతురు గాక. ఇతి = ఈలాగున, ఉచ్యతే యది = చెప్పఁబడిన యెడల, దేహాత్మమతయః = దేహమం దాత్మబుద్ధిగల, ఆశ్రమవాసినః=ఆశ్రమధర్మనిరతులు, బుద్ధం=జ్ఞానిని, నిందంతు=నిందింతురుగాక.

తా. భోగలంపటులు నిందించినమాత్రమున వర్ణాశ్రమ ధర్మపరులకు నష్టము లేదంటి వేని, దేహాత్మబుద్ధులు నిందించినమాత్రమున జ్ఞానికిని నటులనే నష్టము లేదు.

అవ. ప్రస్తుతముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. తదిత్థం తత్త్వవిజ్ఞానే సాధనానుపమర్దనాత్,
జ్ఞానినా చరితుం శక్యం సమ్యగ్రాజ్యాది లౌకికమ్. 114

వ్యా. ప్రాసంగికం పరిసమాప్య ప్రకృతమనుసరతి—తదిత్థమితి. తత్త్వసాక్షాత్కారణాదిత్థముక్తేన ప్రకారేణ తత్త్వవిజ్ఞానే సతి సాధనానుపమర్దనాల్లౌకికవ్యవహారసాధనానాం మనఆదీనామవిలాపనా ల్లౌకికం రాజ్యాది రాజ్యపరిపాలనాదికర్మ వా జ్ఞానినా సమ్యగాచరితుం శక్యమిత్యర్థః.

టీ. తత్ = ఆకారణమువలన, ఇత్థం = ఈవిధముగా, తత్త్వవిజ్ఞానే = తత్త్వవిజ్ఞానము గల్గుచుండఁగా, సాధనానుపమర్దనాత్ = వ్యవహారసాధనము లగు దేహేంద్రియాదులు గనప్టుచున్నందువలన, జ్ఞానినా = జ్ఞానిచేత, సమ్యక్ = లెస్సగాను, లౌకికం = లోకసిద్ధమైన, రాజ్యాది = రాజ్యము మొదలగునవి, చరితుం=ఆచరించుటకొఱకు, శక్యం=శక్యమైనది.

తా. తత్త్వజ్ఞానము గల్గినను దేహేంద్రియాదులు మిథ్యాభూతము లని తెలియును గాన, వానికి స్వరూపనాశము లేదు. కావున జ్ఞాని లౌకిక మగు రాజ్యాదికము నట్టిసాధనములచేత నాచరింపవచ్చును.

అవ. బ్రహ్మవిదునకు రాజ్యమం దిచ్ఛయే వీలు గాదనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మిథ్యాత్వబుద్ధ్యా తత్రేచ్ఛా నాస్తి చేత్తర్హి మాస్తు తత్,
ధ్యాయన్వాథ వ్యవహరన్యథారబ్ధం వసత్వయమ్. 115

వ్యా. నను తత్త్వవిదః ప్రపంచమిథ్యాత్వజ్ఞానేన తత్రేచ్ఛైవ నోదీయాదితి చేత్తర్హి స్వకర్మానుసారేణ వర్తతా మిత్యాహ—మిథ్యాత్వేతి.

టీ. మిథ్యాత్వబుద్ధ్యా = అసత్యత్వబుద్ధిచేత, తత్ర = ఆరాజ్యాదికమునందు, ఇచ్ఛా=కోరిక, నాస్తి చేత్ = లేదంటివేని, తత్ = అది, మాస్తు = లేకపోవుఁగాక, అయం = ఈబ్రహ్మవిదుఁడు, ధ్యాయన్వా = ధ్యానముచేయుచున్నైనను, అథ = అటుగాక, వ్యవహరన్వా = వ్యవహరించుచున్నైనను, యథారబ్ధం = ఆరబ్ధము నతిక్రమింపక, వసతు=ఉండుఁగాక.

తా. జ్ఞానులలోఁ గొందఱికి మిథ్యాభూతపదార్థములం దిచ్ఛ గలుగదు. అట్టివారు వ్యవహరింపరు. కొందఱికి ప్రారబ్ధానుసారముగ మిథ్యాభూతములందుఁ గూడ వాంఛ గల్గును. వారు రాజ్యాదులు చేయుచుందురు. ఉభయులకును తత్త్వజ్ఞానము సమము. ముక్తియు సమము. వైషమ్యము ప్రారబ్ధాధీనము.

అవ. జ్ఞానికంటె నుపాసకునకు భేదమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాసకస్తు సతతం ధ్యాయన్నేవ వసేద్యతః,
ధ్యానేనైవ కృతం తస్య బ్రహ్మత్వం విష్ణుతాదివత్. 116

వ్యా. ఇదానీముపాసకస్య తతో వైషమ్యం దర్శయతి—ఉపాసక ఇతి. తత్రోపపత్తిమాహ—యత ఇతి. యతః కారణాత్తస్య బ్రహ్మత్వం ధ్యానేనైవ కృతం. న ప్రమాణేన ప్రమితమతో ధ్యాయినా సదా ధ్యానం కర్తవ్యమిత్యర్థః. తత్ర దృష్టాంతః—విష్ణుతాదివదితి. యథా స్వస్మిన్ ధ్యానేన సంపాదితస్య విష్ణుత్వాదేః పారమార్థికత్వం నాస్తి తద్వదిత్యర్థః.

టీ. ఉపాసకస్తు = ఉపాసకుఁడైతే, సతతం = ఎల్లప్పుడును, ధ్యాయన్నేవ = ధ్యానము చేయుచునే, వసేత్ = ఉండును. యతః=ఏహేతువువలన, తస్య=అతనికి, ధ్యానేనైవ = ధ్యానముచేతనే, బ్రహ్మత్వం=బ్రహ్మత్వము, విష్ణుతాదివత్ = విష్ణుత్వము మొదలగుదానివలె, కృతం = చేయఁబడినదో, తతః = ఆహేతువువలన (అని పూర్వార్ధముతో నన్వయము).

తా. ధ్యానము చేయువాఁ డెప్పుడును ధ్యానము చేయుచునే యుండవలెను. ధ్యానము మానినచో తన బ్రహ్మత్వము పోవు నని వాని తాత్పర్యము. నేను విష్ణుండు నని ధ్యానము చేసినపుడు తనకు విష్ణుత్వమెట్లు కల్పితమో బ్రహ్మత్వమును నట్టిదే యని బ్రహ్మసాక్షాత్కారము లేకపోవుటచే నతఁ డనుకొనును.

అవ. బ్రహ్మత్వము ధ్యానమువలన వచ్చినను, అది పారమార్థికము కాఁగూడదు. అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ధ్యానోపాదానకం యత్తత్ ధ్యానాభావే విలీయతే,
వాస్తవీ బ్రహ్మతా నైవ జ్ఞానాభావే విలీయతే. 117

వ్యా. ధ్యానసంపాదితస్యాపి తస్య పారమార్థికత్వం కిం న స్యాదిత్యాశంక్య ధ్యానసంపాదితస్య వాగ్ధేనుత్వాదేర్ధ్యానాపాయేఽపగమదర్శనాన్నైవమిత్యాహ— ధ్యానేతి. జ్ఞానేన ప్రకాశితస్య బ్రహ్మత్వస్య తతో వైలక్షణ్యమాహ—వాస్తవీతి.

హేతుగర్భితం విశేషణం. యతో బ్రహ్మత్వం వాస్తవం, అతో జ్ఞాపకజ్ఞానాభావే సతి నైవ విలీయతే.

టీ. యత్ = ఏబ్రహ్మత్వము, ధ్యానోపాదానకం = ధ్యానము హేతువుగాఁ గలదో, తత్ = అది, ధ్యానాభావే = ధ్యానము లేనిసమయమునందు, విలీయతే = లయమును బొందుచున్నది. వాస్తవీ = యథార్థమైన, బ్రహ్మతా=బ్రహ్మత్వము, జ్ఞానాభావే=జ్ఞానము లేనప్పుడు, నైవ విలీయతే=లయింపదు.

తా. ధ్యానకల్పిత మగు వస్తువు ధ్యానము లేనప్పుడు నశించును. జ్ఞానముచే గ్రహింపఁబడిన పదార్థము వృత్తిజ్ఞానము పోయినను పోనేరదు. కనుక బ్రహ్మాకారాపరోక్షవృత్తి నశించినను బ్రహ్మము నశింపదు.

అవ. బ్రహ్మత్వము జ్ఞానమువలన పుట్టలే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తతోఽభిజ్ఞాపకం జ్ఞానం న నిత్యం జనయత్యదః,
జ్ఞాపకాభావమాత్రేణ న హి సత్యం విలీయతే. 118

వ్యా. వాస్తవత్వాదేవ జ్ఞానేన నైవ జన్యత ఇత్యాహ—తత ఇతి. యతోఽదో బ్రహ్మత్వం నిత్యం తతో జ్ఞానం తస్యాభిజ్ఞాపకమవబోధకమేవ. న జనకమిత్యర్థః. తత్రోపపత్తిం వ్యతిరేకముఖేనాహ—జ్ఞాపకేతి. అయమభిప్రాయః బ్రహ్మత్వం యది జ్ఞానజన్యం స్యాత్తర్హి జ్ఞాననాశే స్వయం విలీయేత. న చ విలీయతే. అతో న జన్యత ఇత్యర్థః.

టీ. తతః = ఆహేతువువలన, జ్ఞానం = జ్ఞానము, అభిజ్ఞాపకం = వస్తువును గనబఱచునది. నిత్యం=నిత్యమైన బ్రహ్మమును, అదః=ఈజ్ఞానము, నజనయతి = పుట్టింపదు. జ్ఞాపకాభావమాత్రేణ = ప్రకాశక మగుజ్ఞానము నశించినంతమాత్రముచేత, సత్యం = నిత్యమైన బ్రహ్మము, న హి విలీయతే=లయింపదు.

తా. వృత్తిజ్ఞానము తనలో విషయమైన బ్రహ్మమును పుట్టింపదు. కావున తాను లేనందున దానిని నశింపఁజేయదు.

అవ. ఉపాసకునకును బ్రహ్మత్వము యథార్థమే యని అంగీకరించుచున్నాఁడు:—

శ్లో. అస్త్వేవోపాసకస్యాపి వాస్తవీ బ్రహ్మతేతి చేత్,
పామరాణాం తిరశ్చాం చ వాస్తవీ బ్రహ్మతా న కిమ్. 119

వ్యా. నను జ్ఞానివదుపాసకస్యాపి బ్రహ్మత్వం వాస్తవమస్త్వేవేతి శంకతే—అస్త్వేవేతి. అత్యల్పమిదముచ్యత ఇత్యభిప్రాయేణాహ—పామరాణామితి.

టీ. ఉపాసకస్యాపి = ఉపాసకునకును, వాస్తవీ = యథార్థమైన, బ్రహ్మతా = బ్రహ్మత్వము, అస్త్యేవేతి చేత్ = కలదంటివేని, పామరాణాం=పామరులకును, తిరశ్చాం చ = తిర్యగ్జంతువులకును, వాస్తవీ = వాస్తవమైన, బ్రహ్మతా=బ్రహ్మత్వము, న కిం = లేదా యేమి?

తా. ఉపాసకునకును బ్రహ్మత్వము కల దంటివేని అట్టి బ్రహ్మత్వము పామరులకును, తిర్యగ్జంతువులకును గలదు. కనుక ఉపాసకునకును బ్రహ్మత్వము గల దని చెప్పుటవలనఁ బ్రయోజనము లేదు.

అవ. పామరులకు బ్రహ్మత్వ ముండినను దెలియఁబడదు గనుక పురుషార్థోపయోగి గాదంటివేని నుపాసకులకును నట్టిదే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞానా దపుమర్థత్వముభయత్రాపి తత్సమం,
ఉపవాసాద్యథా భిక్షా వరం ధ్యానం తథాఽన్యతః. 120

వ్యా. పామరాదీనాం విద్యమానమపి తద్బ్రహ్మత్వ మజ్ఞాతత్వాన్న పురుషార్థోపయోగీత్యాశంక్య అజ్ఞాతత్వేన పురుషార్థోపయోగిత్వముపాసకస్యాపి సమానమిత్యాహ—అజ్ఞానాదితి. నను తర్హ్యుపాసనం కిమర్థమభిధీయత ఇత్యాశంక్యేతరానుష్ఠానేభ్యః శ్రేష్ఠత్వాభిప్రాయేణోక్తమితి దృష్టాంతపూర్వకమాహ—ఉపవాసాదితి.

టీ. అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, తత్=ఆ, అపుమర్థత్వం=అపురుషార్థత్వము, ఉభయత్రాపి = రెండింటియందును, సమం = సమానము, ఉపవాసాత్ = ఉపవాసముకంటె, యథా=ఏవిధముగా, భిక్షా=భిక్షాటనము, వరం=శ్రేష్ఠమో, తథా = ఆవిధముగా, అన్యతః = ఇతర వ్యాపారముకంటె, ధ్యానం = ధ్యానము, వరం = శ్రేష్ఠము.

తా. తెలియఁబడనందున బ్రహ్మత్వము పురుషార్థము గాకపోవుటకు పామరులకును నుపాసకులకును సమానమే. ఉపవాసము చేయుటకంటె భిక్ష మెత్తుకొనుట యెట్లు కొంచెము మంచిదో యితర వ్యాపారముకంటె ధ్యాన మట్లు మంచిది.

అవ. ధ్యానశ్రైష్ఠ్యమును గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. పామరాణాం వ్యవహృతేర్వరం కర్మాద్యనుష్ఠితిః,
తతోఽపి సగుణోపాస్తిర్నిర్గుణోపాసనా తతః. 121

వ్యా. ఇతరానుష్ఠానాచ్ఛ్రైష్ఠ్యమేవ దర్శయతి. పామరాణామితి.

టీ. పామరాణాం = పామరులయొక్క, వ్యవహృతేః = వ్యవహారముకంటె, కర్మాద్యనుష్ఠితిః = కర్మాదుల నాచరించుట, వరం = శ్రేష్ఠము, తతోఽపి = అంతకంటె, సగుణోపాస్తిః = సగుణోపాసనము, వరం = శ్రేష్ఠము. తతః = అంతకంటె, నిర్గుణోపాసనా=నిర్గుణోపాసనము, వరం=శ్రేష్ఠము.

తా. పామరవ్యవహారముకంటె కర్మాచరణమును దానికంటె సగుణోపాసనయును దానికంటె నిర్గుణోపాసనయును శ్రేష్ఠ మని భావము.

అవ. శ్రైష్ఠ్యమునకు హేతువును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యావద్విజ్ఞానసామీప్యం తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే,
బ్రహ్మజ్ఞానాయతే సాక్షాన్నిర్గుణోపాసనం శనైః. 122

వ్యా. ఉత్తరోత్తరశ్రైష్ఠ్యే కారణమాహ—యావదితి. నిర్గుణోపాసనస్య సర్వశ్రైష్ఠ్యే కారణమాహ—బ్రహ్మజ్ఞానాయత ఇతి.

టీ. యావత్ = ఎంత పర్యంతము, విజ్ఞానసామీప్యం = విజ్ఞానసామీప్యమో, తావత్=అంతపర్యంతము, శ్రైష్ఠ్యం=శ్రేష్ఠత్వము, వివర్ధతే=వృద్ధిపొందుచున్నది. నిర్గుణోపాసనం=నిర్గుణోపాసనంబును, శనైః=మెల్లగా, సాక్షాత్=ప్రత్యక్షముగా, బ్రహ్మజ్ఞానాయతే=బ్రహ్మజ్ఞానమువంటి దగుచున్నది.

తా. నిర్గుణబ్రహ్మసాక్షాత్కారమున కెంత సమీపించునో వృత్తి కంత శ్రైష్ఠ్యము ఘటించుచున్నది. నిర్గుణోపాసనవృత్తి బ్రహ్మజ్ఞానమునకు మిక్కిలి సన్నిహితము గాన బ్రహ్మజ్ఞానమువంటిది అగును.

అవ. ఉపాసనమునకు సంవాదిభ్రమసామ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యథా సంవాదివిభ్రాంతిః ఫలకాలే ప్రమాయతే,
విద్యాయతే తథోపాస్తిర్ముక్తికాలేఽతిపాకతః. 123

వ్యా. ఉక్తమర్థం దృష్టాంతప్రదర్శనపూర్వకం ప్రథయతి—యథేతి.

టీ. యథా = ఏవిధముగా, సంవాదివిభ్రాంతిః = సంవాదిభ్రమ, ఫలకాలే = ఫలసమయమునందు, ప్రమాయతే = యథార్థమువలె నాచరించుచున్నదో, తథా = ఆలాగున, ఉపాస్తిః=ఉపాసనము, అతిపాకతః=అత్యంతపరిపాకమువలన, ముక్తికాలే = మోక్షకాలమందు, విద్యాయతే=విద్యవంటి దగును.

తా. సంవాదిభ్రమము తాను యథార్థము గాకపోయినను యథార్థజ్ఞానము గలిగించినట్లు నిర్గుణోపాసన గూడ యథార్థమగు బ్రహ్మసాక్షాత్కారముం గలిగించును.

అవ. సంవాదిభ్రమదృష్టాంతమును విశదీకరించుచున్నాఁడు:—

శ్లో. సంవాదిభ్రమతః పుంసః ప్రవృత్తస్యాన్యమానతః,
ప్రమేతి చేత్తథోపాస్తిర్మాంతరే కారణాయతామ్. 124

వ్యా. నను సంవాదివిభ్రాంతిస్స్వయమేవ న ప్రమా భవతి. కింతు తయా ప్రవృత్తస్యేంద్రియార్థసన్నికర్షాత్ప్రమా జాయత ఇతి శంకతే—సంవాదీతి. అస్తు. తర్హి నిర్గుణోపాసనమపి నిదిధ్యాసనరూపం సద్వాక్యజన్యాపరోక్షజ్ఞానే కారణం భవిష్యతీత్యాహ—తథేతి.

టీ. సంవాదిభ్రమతః=సంవాదిభ్రమవలన, ప్రవృత్తస్య=ప్రవర్తించిన, పుంసః=పురుషునకు, అన్యమానతః=మఱియొక ప్రమాణమువలన, ప్రమేతిచేత్=యథార్థజ్ఞానము గలుగుచున్నదనెదవేని, తథా=అట్టులే, ఉపాస్తిః=ఉపాసన,అంతరే=మఱియొక యథార్థజ్ఞానమునందు, మా కారణాయతాం = కారణమువలె నాచరించునది కాకపోవుఁ గాక.

తా. సంవాదిభ్రమము రత్నయథార్థజ్ఞానమునకుఁ గారణమైనట్లు నిర్గుణోపాసన బ్రహ్మసాక్షాత్కారమునకుఁ గారణం బగును.

అవ. సగుణోపాసన బ్రహ్మసాక్షాత్కారమునకుఁ గారణము గాదా? అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మూర్తిధ్యానస్య మంత్రాదేరపి కారణతా యది,
అస్తు నామ తథాప్యత్ర ప్రత్యాసత్తిర్విశిష్యతే. 125

వ్యా. నన్వేవం సతి మూర్తిధ్యానాదేరపి చిత్తైకాగ్ర్యసంపాదనద్వారా అపరోక్షజ్ఞానసాధనత్వం స్యాదితి చేత్తదప్యంగీక్రియత ఇత్యాహ—మూర్తీతి. తర్హి నిర్గుణోపాసనే కోఽతిశయస్తత్రాహ—తథాపీతి. ప్రత్యాసత్తిః సామీప్యం; జ్ఞానం ప్రతీతి శేషః.

టీ. మూర్తిధ్యానస్య=సగుణమూర్తిధ్యానమునకు, మంత్రాదేరపి = మంత్రాదులకును, కారణతా యది = అపరోక్షజ్ఞాన కారణత్వము గల దంటివేని, అస్తు నామ = అగుఁగాక. తథాపి = అట్టులైనను, అత్ర = నిర్గుణోపాసనయందు, (జ్ఞానం ప్రతి=తత్వజ్ఞానమును గుఱించి), ప్రత్యాసత్తిః = సామీప్యము, విశిష్యతే = అధికమగుచున్నది.

తా. సగుణోపాసనయును మంత్రజపంబును బ్రహ్మసాక్షాత్కారమునకు కారణంబులే యినను బ్రహ్మసాక్షాత్కారమునకు నిర్గుణోపాసన యెంత సన్నిహితమో, అవి అంత సన్నిహితములు గావు.

అవ. నిర్గుణోపాసన బ్రహ్మసాక్షాత్కారమునకు నెట్టు సన్నిహితమో చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్గుణోపాసనం పక్వం సమాధిస్స్యాచ్ఛనైస్తతః,
యస్సమాధిర్నిరోధాఖ్యస్సోఽనాయాసేన లభ్యతే. 126

వ్యా. ప్రత్యాసత్తిప్రకారమేవ దర్శయతి—నిర్గుణేతి. నిర్గుణోపాసనం యదా పక్వం భవతి తదా సవికల్పకసమాధిస్స్యాత్. తతస్సవికల్పకసమాధేర్నిరోధాఖ్యో యస్తస్యాపి నిరోధే సర్వనిరోధాత్ "నిర్బీజస్సమాధి" రితి సూత్రోక్తలక్షణో నిర్వికల్పకస్సమాధిస్సోఽనాయాసేన లభ్యతే.

టీ. నిర్గుణోపాసనం = నిర్గుణోపాసన, పక్వం = పరిపక్వమైనదై, శనైః = మెల్లగా, సమాధిః = సమాధిగ, స్యాత్ = అగును. తతః = అనంతరము, యః నిరోధాఖ్యః = ఏనిరోధ మను పేరు గల, సమాధిః = నిర్వికల్పసమాధి కలదో, సః=అది, అనాయాసేన = ఆయాసము లేకయే, లభ్యతే = లభించుచున్నది.

తా. నిర్గుణోపాసన పరిపక్వమై, సవికల్పసమాధి యగును. అనంతరము నిర్వికల్పసమాధి యనాయాసముగ లభించును.

అవ. దానివలనిలాభముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరోధలాభే పుంసోఽంతరసంగం వస్తు శిష్యతే,
పునః పునర్వాసితేఽస్మిన్వాక్యాజ్జాయేత తత్త్వధీః. 127

వ్యా. భవత్వేవం నిర్వికల్పకలాభస్తతః కిమిత్యత ఆహ—నిరోధేతి. తతోఽపి కిమిత్యత ఆహ—పునః పునరితి. అస్మిన్నసంగే వస్తుని పునః పునర్వాసితే భావితే సతి వాక్యాత్తత్త్వమస్యాది లక్షణాత్తత్త్వధీస్తత్త్వజ్ఞానమహం బ్రహ్మాస్మీత్యేవమాకారం జాయేత ఉత్పద్యేత.

టీ. నిరోధలాభే (సతి) = నిర్వికల్పకసమాధిలాభము గల్గుచుండఁగా, పుంసః = పురుషునికి, అంతః=లోపల, అసంగం = సంబంధములేని, వస్తు=వస్తువు, శిష్యతే=మిగులుచున్నది. పునః పునః=మాటిమాటికి, అస్మిన్=ఈయసంగవస్తువు, వాసితే సతి=భావింపఁబడినదగుచుండఁగా, వాక్యాత్ = మహావాక్యమువలన, తత్త్వధీః = బ్రహ్మసాక్షాత్కారము, జాయేత = కల్గును.

తా. నిర్వికల్పసమాధిలాభము గలుగుచుండఁగా పురుషుని యొక్క స్వరూపమందు సంగరహితమగు ఆత్మవస్తువు శేషించును. ఈ యసంగాత్మవస్తువును మాటిమాటికి భావించుచుండఁగా, తత్త్వమస్యాది వాక్యములవలన 'అహం బ్రహ్మాస్మి' యనెడి పరతత్త్వజ్ఞానము గలుగును.

అవ. తత్త్వజ్ఞానస్వరూపముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్వికారాసంగనిత్యస్వప్రకాశైకపూర్ణతాః,
బుద్ధౌ ఝుడితి శాస్త్రోక్తా ఆరోహంత్యవివాదతః. 128

వ్యా. తత్త్వజ్ఞానస్వరూపమేవ విశదయతి—నిర్వికారేతి.

టీ. శాస్త్రోక్తాః = వేదాంతశాస్త్రమందుఁ జెప్పఁబడిన, నిర్వికారాసంగనిత్యస్వప్రకాశైకపూర్ణతాః - నిర్వికార = వికారములు (మార్పులు) లేమియు, అసంగ = సంగము లేమియు, నిత్య = నిత్యత్వమును, స్వప్రకాశ=తనంతటఁ బ్రకాశించుటయు, ఏక = ఏకత్వమును, పూర్ణతాః = పూర్ణత్వమును, బుద్ధౌ = బుద్ధియందు, ఝుటితి = అతివేగముగానే, అవివాదతః = నిర్వివాదముగా, ఆరోహంతి = కలుగుచున్నవి.

తా. బ్రహ్మసాక్షాత్కారము గలుగఁగనే వేదాంతశాస్త్రమందుఁ జెప్పఁబడిన ఆత్మధర్మములగు నిర్వికారత్వము, అసంగత్వము, నిత్యత్వము, స్వప్రకాశత్వము, అద్వితీయత్వము, పరిపూర్ణత్వము ననునవి బుద్ధియందు నిర్వివాదముగను, శీఘ్రముగను గలుగుచున్నవి. ఇట్లెవ్వనికి స్వసాక్షికత్వము స్ఫురించునో వాఁడె బ్రహ్మవిదుఁడు.

అవ. ఉక్తార్థమునందుఁ బ్రమాణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. యోగాభ్యాస స్త్వేతదర్థోఽమృతబింద్వాదిషు శ్రుతః,
ఏవం చ దృష్టద్వారాపి హేతుత్వాదన్యతో వరమ్. 129

వ్యా. నను నిర్వికల్పకసమాధివశాదపరోక్షజ్ఞానము దేతీత్యత్ర కిం ప్రమాణమిత్యాశంక్యామృతబింద్వాదిశ్రుతయస్సర్వా అపి ప్రమాణమిత్యాహ—యోగాభ్యాస ఇతి. ఫలితమాహ—ఏవమితి. ఏవం చ సతి నిర్గుణోపాసనస్యాప్యపరోక్షజ్ఞానప్రత్యాసత్తిసంభవే సతి దృష్టద్వారాపి నిర్వికల్పకసమాధిలాభద్వారేణాపి శబ్దాదదృష్టద్వారాపి హేతుత్వాత్ జ్ఞానసాధనత్వాదన్యతస్సగుణోపాసనాదిభ్యో వరం శ్రేష్ఠమిత్యర్థః.

టీ. ఏతదర్థః = ఇట్టి సాక్షాత్కారము ప్రయోజనముగాఁగల, యోగాభ్యాసః= యోగాభ్యాసము, అమృతబింద్వాదిషు = అమృతబింద్వాద్యుపనిషత్తులందు, శ్రుతః= చెప్పఁబడినది. ఏవం చ = ఈవిధంబుగా, దృష్టద్వారాపి = సమాధిలాభమువలనను, హేతుత్వాత్ = జ్ఞానమునకుఁ గారణ మగుటవలన, అన్యతః=తక్కిన సగుణోపాసన కంటె, వరం = శ్రేష్ఠము.

తా. కనుకనే బ్రహ్మసాక్షాత్కారమునకు యోగాభ్యాసము సాధన మగు నని యమృతబిందూపనిషత్తు లోనగువానియందుఁ జెప్పంబడెను. కావునఁ గనఁబడువిధమునఁ గూడ సగుణోపాసనముకంటె నిర్గుణోపాసనము బ్రహ్మసాక్షాత్కారంబునకు సన్నిహితం బగు నని భావము,

అవ. ఇట్లు నిర్గుణోపాసనకు అపరోక్షజ్ఞానసాధనత్వము సిద్ధించి యుండఁగా ఆ నిర్గుణోపాసనను ఉపేక్షించి తీర్థయాత్రాది ఇతర కార్యములయందుఁ బ్రవర్తించుట వృథాశ్రమం బగు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపేక్ష్య తత్తీర్థయాత్రాజపాదీనేవ కుర్వతాం,
పిండం సముత్సృజ్య కరం లేఢీతి న్యాయ ఆపతేత్. 130

వ్యా. ఏవం నిర్గుణోపాసనస్యాపరోక్షజ్ఞానసాధనత్వే సిద్ధే సతి తత్పరిత్యజ్యాన్యత్ర ప్రవృత్తానాం వృథా శ్రమస్స్యాదితి లౌకికన్యాయదర్శనేనాహ—ఉపేక్ష్యేతి.

టీ. తత్ = ఆనిర్గుణోపాసనను, ఉపేక్ష్య = ఉపేక్షించి, తీర్థయాత్రాజపాదీనేవ = తీర్థయాత్రయు జపము మున్నగువానినే, కుర్వతాం = చేసెడివారికి, పిండం = చేతిలోని అన్నపుముద్దను, సముత్సృజ్య = పాఱవైచి, కరం=చేతిని, లేఢీతి = నాకుచున్నాఁడనెడి, న్యాయః = సామెత, ఆపతేత్ = ప్రసరించును.

తా. నిర్గుణోపాసనను వదలి తీర్థయాత్రాదులఁ గావించువారు చేతిలోని యన్నపుముద్దను బాఱవైచి వట్టిచేతిని నాకెడివారివలె నవివేకు లని భావము.

అవ. ఆత్మ విచారము మానిన నిర్గుణోపాసకులును అట్టివారు గారా? అనిన అగుదు రని యంగీకరించుచున్నాఁడు:—

శ్లో. ఉపాసకానామప్యేవం విచారత్యాగతో యది,
బాఢం తస్మాద్విచారస్యాసంభవే యోగ ఈరితః. 131

వ్యా. నన్వాత్మతత్త్వవిచారం పరిత్యజ్య నిర్గుణోపాసనం కుర్వతామప్యయం న్యాయస్సమాన ఇత్యాశంక్యాంగీకరోతి—ఉపాసకానామితి. తర్హి నిర్గుణోపాసనం కుతః ప్రతిపాద్యత ఇత్యత ఆహ—తస్మాదితి. యస్మాదుక్తన్యాయప్రసంగ స్తస్మాద్విచారాసంభవే యోగ ఉపాసనముక్తమిత్యర్థః.

టీ. విచారత్యాగతః = తత్త్వపదార్థవిచారత్యాగమువలన, ఉపాసకానామపి = ఉపాసకులకును, ఏవం యది = ఇట్టి న్యాయమే కలుగునంటివేని, బాఢం = కలుగును. తస్మాత్ = ఆకారణమువలన, విచారస్య = విచారణయొక్క, అసంభవే = సంభవింపనపుడు, యోగః = యోగాభ్యాసము, ఈరితః = చెప్పఁబడినది.

తా. తత్త్వంపదార్థవిచారమును జేయక నిర్గుణోపాసన జేయువారికిని ఈన్యాయము వర్తించును. తత్త్వంపదవిచారము సంభవింపని వానికే ఉపాసనాయోగము చెప్పఁబడినది.

అవ. ఆత్మతత్త్వవిచారము సంభవింపకపోవుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బహువ్యాకులచిత్తానాం విచారాత్తత్త్వధీర్నహి,
యోగో ముఖ్యస్తతస్తేషాం ధీదర్పస్తేన నశ్యతి. 132

వ్యా. విచారాసంభవే కారణమాహ—బహ్వితి. యతో విచారో న సంభవతి, అతో యోగః కర్తవ్య ఇత్యాహ—యోగ ఇతి. ముఖ్యత్వే కారణమాహ—ధీదర్ప ఇతి. తేన యోగేన యతో ధీదర్పో నశ్యతి, అతో ముఖ్య ఇత్యర్థః.

టీ. బహువ్యాకులచిత్తానాం = మిగుల చపల మగు మనస్సు గలవారికి, విచారాత్=బ్రహ్మవిచారమువలన, తత్త్వధీః = తత్త్వజ్ఞానము, న హి = కలుగనే కలుగదు. తతః=ఆహేతువువలన, తేషాం=వారికి, యోగః = యోగాభ్యాసము, ముఖ్యః=ప్రధానమైనది, తేన = అట్టి యోగాభ్యాసముచేత, ధీదర్పః = చిత్తమదము, నశ్యతి=నశించుచున్నది.

తా. విక్షిప్తచిత్తులు బ్రహ్మవిచారము చేయఁజాలరు. వారు చిత్తస్థైర్యమునకై యోగ మభ్యసింపవలయును. దానితో చిత్త మద మడంగును.

అవ. విచారాధికారులఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. అవ్యాకులధియాం మోహమాత్రేణాచ్ఛాదితాత్మనామ్,
సాంఖ్యనామా విచారస్స్యాన్ముఖ్యో ఝడితి సిద్ధిదః. 133

వ్యా. ఏవం వ్యాకులచిత్తానాం యోగస్య ముఖ్యత్వమభిధాయ తద్రహితానాం విచార ఏవ ముఖ్య ఇత్యాహ—అవ్యాకులేతి. సాంఖ్యనామా విచారః సాంఖ్యశబ్దవాచ్యస్తత్త్వవిచారో ముఖ్యః. కుత ఇత్యత ఆహ—ఝడితీతి.

టీ. అవ్యాకులధియాం - అవ్యాకుల = చంచలముకాని, ధియాం = బుద్ధి గల్గినట్టియు, మోహమాత్రేణ = భ్రమమాత్రముచేత, ఆచ్ఛాదితాత్మనాం - ఆచ్ఛాదిత = కప్పఁబడిన, ఆత్మనాం = స్వరూపముగలవారలకు, సాంఖ్యనామ=సాంఖ్యం బను పేరు గలిగినట్టియు, ముఖ్యః = ప్రధానమైనట్టియు, ఝడితి = శీఘ్రముగ, సిద్ధిదః = సిద్ధి నిచ్చెడి, విచారః = బ్రహ్మవిచారము, స్యాత్ = కలుగును.

తా. స్థిరచిత్తులై కర్తృత్వాదిభ్రమ మాత్రము కలవారు బ్రహ్మసాక్షాత్కారమునకు ముఖ్యసాధన మైనట్టి సాంఖ్య మను పేరుగల విచార మొనరింపవలయును.

అవ. ఈయర్థమునందుఁ బ్రమాణమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. 134

వ్యా. యోగసాంఖ్యయోరుభయోరపి తత్త్వజ్ఞానద్వారా ముక్తిసాధనత్వే గీతావాక్యం ప్రమాణయతి—యత్సాంఖ్యైరితి. యః సాంఖ్యం చ యోగం చ ఫలత ఏకం పశ్యతి శాస్త్రార్థం సమ్యక్పశ్యతీత్యర్థః.

టీ. సాంఖ్యైః = తత్త్వవిచారపరులచేత, యత్ =ఏస్థానము, ప్రాప్యతే = పొందఁబడునో, తత్ = అది, యోగైరపి = యోగులచేతను, గమ్యతే = పొందఁబడుచున్నది. సాంఖ్యంచ=తత్త్వవిచారమును, యోగంచ = యోగమును, ఏకం=ఒక్క ఫలము గలదానినిగా, యః=ఎవఁడు, పశ్యతి=చూచునో, సః=అట్టివాఁడు, పశ్యతి=యథార్థంబు నెఱిఁగినవాఁ డగుచున్నాఁడు.

తా. సాంఖ్యులచేత నే పరమపదము పొందఁబడుచున్నదో ఆ పరమపదము ధ్యానయోగులచేతను పొందఁబడుచున్నది. సాంఖ్య యోగముల రెండింటిని ఫలముచేత నొక్కటిగ నెవఁడు జూచుచున్నాఁడో వాఁడు శాస్త్రార్థమును యథార్థముగ నెఱిఁగినవాఁ డగును.

అవ. ఇందుకుఁ బ్రమాణముగా శ్రుతినిగూడ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. తత్కారణం సాంఖ్యయోగాభిపన్నమితి హి శ్రుతిః,
యస్తు శ్రుతే ర్విరుద్ధస్స ఆభాసస్సాంఖ్యయోగయోః. 135

వ్యా. న కేవలం గీతావాక్యం-కింతు తన్మూలభూతశ్రుతిరప్యస్తీత్యాహ—తత్కారణమితి. నను సాంఖ్యయోగయోరుభయోరపి తత్త్వజ్ఞానద్వారా ముక్తిసాధనత్వే నాంగీకారే తచ్ఛాస్త్రే ప్రతిపాదితానాం తత్త్వానామపి స్వీకార్యత్వం స్యాదిత్యాశంకాహ—యస్త్వితి. ఆభాసో బాధ్యత ఇత్యర్థః.

టీ. కారణం = స్వకారణమైన, తత్ = ఆబ్రహ్మము, సాంఖ్యయోగాభిపన్నం= విచారముచేతను యోగముచేతను లభించునది, ఇతి=ఇట్టి యర్థమును చెప్పెడి, శ్రుతిర్హి= శ్రుతియును జెప్పుచున్నది. సాంఖ్యయోగయోః = సాంఖ్యయోగములందు, యస్తు = ఏనరుఁడు, శ్రుతేః=శ్రుతికి, విరుద్ధః=విరోధము గలవాఁడగునో, సః=వాఁడు, ఆభాసః = ఆభాసుఁ డగును.

తా. సాంఖ్యయోగంబులు రెండును బ్రహ్మప్రాప్తికి సాధనంబులని శ్రుతి చెప్పుచున్నది. కావున నవి గ్రాహ్యంబు లగును. కాని,

సాంఖ్యశాస్త్రంబునందుఁ గాని యోగశాస్త్రంబునందుఁ గాని యీశ్రుతి సిద్ధము లగు సాంఖ్యయోగంబులకు విరుద్ధముగా నెవఁడు వర్తించునో వాఁడు ఆభాసుఁ డగును. ఇట సాంఖ్యశబ్దమునకు తత్త్వంపదార్థవిచారమనియు, యోగశబ్దమునకు ఉపాసన యనియు గ్రహింపవలెను.

అవ. ఉపాసన పరిపక్వముగాక ముందు దైవవశంబున దేహత్యాగము ఘటించెనేని వానికిం గల్గు ఫలముం దెల్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాసనం నాతిపక్వమిహ యస్య పరత్ర సః,
మరణే బ్రహ్మలోకే వా తత్త్వం విజ్ఞాయ ముచ్యతే. 136

వ్యా. నను ఉపాసనం కుర్వాణస్య తత్త్వజ్ఞానాత్ప్రాక్ మరణే సతి మోక్షో న సిద్ధ్యేదిత్యాశంక్యాహ—ఉపాసనమితి.

టీ. యస్య=ఎవ్వనికి, ఇహ=ఈజన్మమందు, ఉపాసనం=ఉపాసన, నాతిపక్వం=మిగుల పరిపక్వము గాదో, సః = వాఁడు, మరణే = మరణకాలమం దైనను, పరత్ర = జన్మాంతరమునం దైనను, బ్రహ్మలోకే వా=బ్రహ్మలోకమునం దైనను, తత్త్వం=యథార్థజ్ఞానమును, విజ్ఞాయ = తెలిసికొని, ముచ్యతే = ముక్తుఁ డగును.

తా. ఈజన్మమునందు నిర్గుణోపాసన బ్రహ్మసాక్షాత్కారము నియ్యనిచో మరణసమయమునఁ గాని జన్మాంతరమునందుఁ గాని బ్రహ్మలోకమునందుఁ గాని తత్త్వసాక్షాత్కారమును గల్గించి మోక్షము నొసంగును.

అవ. మరణకాలమునందు సాక్షాత్కార మిచ్చు ననుటలోఁ బ్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్,
తం తమేవైతి యచ్చిత్తస్తేన యాతీతి శాస్త్రతః. 137

వ్యా. మరణావసరే జ్ఞానాస్ఫూర్తిలాభే ప్రమాణమాహ—యం యం వాపీతి. 'యచ్చిత్తస్తేనైవ ప్రాణమాయాతి, ప్రాణస్తేజసా యుక్తః సహాత్మనా యథాసంకల్పితలోకం నయ'తీతి వాక్యాచ్చేత్యర్థః.

టీ. యం యం వాపి భావం = ఏయేపదార్థమును, స్మరన్=తలంచుచు, అంతే=అవసానకాలమునందు, కళేబరం=శరీరమును, త్యజతి = వదలుచున్నాఁడో, తంతమేవ=ఆయాభావమునే,ఏతి=పొందుచున్నాఁడు. యచ్చిత్తః=దేనియందు చిత్తము గలవాఁడో, తేన=దానితో, యాతి=పొందుచున్నాఁడు. ఇతి=ఇట్టి, శాస్త్రతః = శాస్త్రమువలన, అనితర్వాతి శ్లోకముతో నన్వయము.

తా. దేహత్యాగకాలమునందు దేనిని స్మరించునో, దానిని బొందు నని భగవద్గీత చెప్పుచున్నది. ఇట్టి యర్థమునే శ్రుతియును దెల్పుచున్నది.

శ్లో. అంత్యప్రత్యయతో నూనం భావిజన్మ తథా సతి,
నిర్గుణప్రత్యయోఽపి స్యాత్సగుణోపాసనే యథా. 133

వ్యా. ననూదాహృతాభ్యాం శ్రుతిస్మృతివాక్యాభ్యామంత్యప్రత్యయతో భావిజన్మాభిధీయతే. న జ్ఞానాన్ముక్తిరిత్యాశంక్య ముఖత స్తథాభిధానమంగీకరోతి—అంత్యప్రత్యయత ఇతి. కథం తర్హి మరణకాలే జ్ఞానాన్మోక్షో భవతీత్యత్రేదం వాక్యద్వయం ప్రమాణత్వేనోపన్యస్త మిత్యాశంక్యాహ—తథా సతీతి. తథా సతి అంత్యప్రత్యయాద్భావిజన్మవినిశ్చయే సతి, సగుణోపాసకస్య యథా మరణావసరే పూర్వాభ్యాసవశాత్సగుణబ్రహ్మాకారప్రత్యయో జాయతే, ఏవం నిర్గుణోపాసకస్యాపి నిర్గుణబ్రహ్మగోచరః ప్రత్యయో జాయతే జనిష్యత ఇత్యర్థః.

టీ. అంత్యప్రత్యయః = అవసానకాలమందు స్మరింపఁబడెడి విషయమువలన, భావిజన్మ=భవిష్యజ్జన్మము, నూనం=నిశ్చయముగ, భవతి=అగుచున్నది. తథాసతి=అట్లగుచుండఁగా, నిర్గుణప్రత్యయోఽపి = నిర్గుణబ్రహ్మజ్ఞానంబును, సగుణోపాసనే యథా = సగుణోపాసనమునందు వలె, భవతి = అగుచున్నది.

తా. సగుణోపాసకునకు నవసానసమయంబున సగుణాకారజ్ఞానము గలిగినట్లు నిర్గుణోపాసకునకును నిర్గుణబ్రహ్మవిషయక సాక్షాత్కారము లభించును. అంత్యప్రత్యయ మనఁగా తాను పూర్వ మభ్యసించుచుండెడి యాయాదేవతావిషయాకారవృత్తి జ్ఞానము.

శ్లో. నిత్యనిర్గుణరూపం తన్నామమాత్రేణ గీయతాం,
అర్థతో మోక్ష ఏవైష సంవాదిభ్రమవన్మతః. 139

వ్యా. నను నిర్గుణబ్రహ్మప్రత్యయాభ్యాసవశాన్నిర్గుణబ్రహ్మప్రాప్తిరేవ భవేన్న ముక్తిరిత్యాశంక్య బ్రహ్మప్రాప్తిముక్త్యోః శబ్దమాత్రేణ భేదో నార్థత ఇత్యాహ—నిత్యనిర్గుణేతి. తద్బ్రహ్మ నిత్యమితి నిర్గుణమితి నామమాత్రేణోచ్యతామర్థత స్త్వేష మోక్ష ఏవ స్వరూపావస్థితిర్ముక్తిరిత్యభిధానాదితి భావః. తత్ర దృష్టాంతమాహ—సంవాదీతి. యథా సంవాదిభ్రమో నామమాత్రేణ భ్రమ ఇత్యుచ్యతే. వస్తుత స్తత్త్వజ్ఞానమేవ. తద్వదిత్యర్థః.

టీ. తత్=ఆబ్రహ్మము, నామమాత్రేణ=పేరుచేతనే, నిత్యనిర్గుణరూపం=నిత్యమగు నిర్గుణస్వరూప మని, గీయతాం=చెప్పఁబడు గాక. ఏవ=ఇది, సంవాదిభ్రమవత్=సంవాదిభ్రమవలె, అర్థతః=ఫలితమును బట్టి, మోక్ష ఏవ=మోక్షమే యని, మతః=అభిమతము.

తా. నిర్గుణోపాసన యని పేరే కాని యిది సంవాదిభ్రమవలె మోక్షమే యగును. మోక్ష మనినను బ్రహ్మప్రాప్తి యనినను నొక్కటే.

అవ. నిర్గుణబ్రహ్మోపాసనము మోక్షసాధన మెట్లగునో తెల్పుచున్నాఁడు:—

శ్లో. తత్సామర్థ్యాజ్జాయతే ధీర్మూలావిద్యానివర్తికా,
అవిముక్తోపాసనేన తారకబ్రహ్మబుద్ధివత్. 140

వ్యా. నను నిర్గుణోపాసనస్య మానసక్రియారూపస్య ముక్తిసాధనత్వాభిధానం విరుద్ధమిత్యాశంక్య తజ్జన్యజ్ఞానస్య మోక్షసాధనత్వాభిధానాన్న విరోధ ఇత్యాహ—తదితి. తత్ర దృష్టాంతమాహ—అవిముక్తేతి. యథా అవిముక్తసగుణబ్రహ్మోపాసన సామర్థ్యాత్తారకబ్రహ్మవిద్యా జాయతే, ఏవం నిర్గుణోపాసనాన్నిర్గుణబ్రహ్మజ్ఞానం జాయత ఇత్యర్థః.

టీ. అవిముక్తోపాసనేన = సగుణబ్రహ్మోపాసనముచేత, తారకబ్రహ్మబుద్ధివత్ = నిర్గుణోపాసనమువలె, తత్సామర్థ్యాత్ = నిర్గుణోపాసనబలమువలన, మూలావిద్యానివర్తికా = మూలావిద్యను దొలఁగించెడి, ధీః = బ్రహ్మసాక్షాత్కారము, జాయతే = పుట్టుచున్నది.

తా. సగుణోపాసనము చేసినవాని కీశ్వరానుగ్రహమున నిర్గుణోపాసన యెట్లు ఘటించునో నిర్గుణోపాసకునకును బ్రహ్మసాక్షాత్కారము నట్లే ఘటించును.

అవ. నిర్గుణోపాసనకు మోక్షము ఫల మనుటకుఁ బ్రమాణములు:—

శ్లో. సోఽకామో నిష్కామ ఇతి హ్యశరీరో నిరింద్రియః,
అభయం హీతి ముక్తత్వం తాపనీయే ఫలం శ్రుతమ్. 141

వ్యా. నను, నిర్గుణోపాసనస్య మోక్షః ఫలమిత్యత్ర కిం ప్రమాణమిత్యత ఆహ—సోఽకామఇతి, "సోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయన్తే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి. అశరీరో నిరింద్రియోఽప్రాణో హ్యమనాః సచ్చిదానందమాత్రస్స స్వరాడ్భవతి. య ఏవం వేద చిన్మయో హ్యయమోంకారశ్చిన్మయమిదం సర్వం తస్మాత్పరమేశ్వర ఏ వైక

మేవ తద్భవత్యేతదమృతమభయమేత ద్బ్రహ్మాభయం వై బ్రహ్మ భవతి. య ఏవం వేదేతి రహస్య" మిత్యాదివాక్యైస్తాపనీయోపనిషది నిర్గుణోపాసనస్య మోక్షః ఫలత్వేన శ్రూయత ఇత్యర్థః.

టీ. సః=ఆ నిర్గుణోపాసకుఁడు, కామస్సన్=మోక్షకామియగుచు, నిష్కామః= ఇతర కామము లేనివాఁడును, అశరీరః = శరీరము లేనివాఁడును, నిరింద్రియస్సన్ = ఇంద్రియములు లేనివాఁడును అగుచు, అభయం హి = సంసారభయరహిత మోక్షమునే పొందుచున్నాఁడని, ఇతి=ఇట్లు, ముక్తత్వం మోక్షరూపమగు, ఫలం = ఫలము, తాపనీయే=తాపనీయోపనిషత్తునందు, శ్రుతం=వినఁబడుచున్నది (చెప్పఁబడుచున్నది).

తా. నిర్గుణోపాసకుఁడు మోక్షకామి యగుచు, కామసంకల్పములును, శరీరాభిమానమును లేనివాఁడై, యింద్రియప్రేరితుఁడు గాక తప్పక మోక్షమును బొందుచున్నాఁడని "సోఽకామో నిష్కామ ఆప్తకామ, ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయన్తే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యను తాపనీయోపనిషద్వాక్యము వలన నిర్గుణోపాసనాఫలము వినఁబడుచున్నది.

అవ. ఉపాసనవలన మోక్షము గలుగునేని "నాన్యః పంథాః" అను శ్రుతి నెట్లు సమన్వయింపవలె ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాసనస్య సామర్థ్యాద్విద్యోత్పత్తిర్భవేత్తతః,
నాన్యః పంథా ఇతి హ్యేతచ్ఛాస్త్రం నైవ విరుధ్యతే. 142

వ్యా. నన్పూపాసనయా ముక్తిస్స్యాచ్చేత్ 'నాన్యః పంథా విద్యతేఽయనా' యేతి శ్రుతివిరోధ ఇత్యాశంక్య విద్యావ్యవధానేన మోక్షప్రదత్వాభిధానాన్న విరోధ ఇత్యాహ—ఉపాసనస్యేతి.

టీ. ఉపాసనస్య = నిర్గుణోపాసనయొక్క, సామర్థ్యాత్ = సామర్థ్యమువలన, విద్యోత్పత్తిః = జ్ఞానోత్పత్తి, భవేత్ = కలుగును. అతః = ఆకారణమువలన, "నాన్యః పంథా ఇతి" అన్యః = ఇతరమైన, పంథాః = త్రోవ, నేతి=లే దని చెప్పెడి, ఏతత్-శాస్త్రం=శాస్త్రము, నైవ విరుధ్యతే=విరోధింపదు.

తా. నిర్గుణోపాసనాసామర్థ్యమువలన బ్రహ్మసాక్షాత్కారము గలుగును. కావున నిర్గుణోపాసనకంటె నన్య మగు మోక్షసాధనము లేదని చెప్పెడి శ్రుతి యసంగతము గాదు.

అవ. మఱియొక ప్రమాణమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. నిష్కామోపాసనాన్ముక్తిస్తాపనీయే సమీరితా,
బ్రహ్మలోకస్సకామస్య శైబ్యప్రశ్నే సమీరితః. 143

వ్యా. మరణే బ్రహ్మలోకే వా తత్త్వం విజ్ఞాయ ముచ్యత ఇత్యుక్తార్థే శ్రుతిం ప్రమాణయతి—నిష్కామ ఇతి. తత్ర 'సోఽకామ' ఇత్యాదితాపనీయవాక్యం పూర్వమేవోదాహృతం.

టీ. నిష్కామోపాసనాత్ = కోరిక లేక చేసిన నిర్గుణోపాసనవలన, ముక్తిః = మోక్షము, (అని) తాపనీయే=తాపనీయ శ్రుతియందు, సమీరితా=చెప్పఁబడినది. సకామస్య = కోరికతో నిర్గుణోపాసన జేయువానికి, బ్రహ్మలోకః = బ్రహ్మలోకము (బ్రహ్మలోకప్రాప్తి గలుగు నని), శైబ్యప్రశ్నే=శైబ్యప్రశ్నయందు, సమీరితః=చెప్పఁబడినది.

తా. కోరిక లేక నిర్గుణోపాస్తి చేయువానికి మోక్షము లభించు నని తాపనీయశ్రుతి చెప్పినది. సకాముఁడగు నిర్గుణోపాసకునకు బ్రహ్మలోకము లభించు నని ప్రశ్నోపనిషత్తు చెప్పుచున్నది.

అవ. ప్రశ్నోపనిషదర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. య ఉపాస్తే త్రిమాత్రేణ బ్రహ్మలోకే స నీయతే,
స ఏతస్మాజ్జీవఘనాత్పరం పురుషమీక్షతే. 144

వ్యా. ఇదానీం శైబ్యప్రశ్నోపనిషద్వాక్యమర్థతః పఠతి—య ఉపాస్త ఇతి. "యః పునరేతత్త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నో యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తస్స సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షత" ఇతి సకామస్య బ్రహ్మలోకప్రాప్తిః శ్రూయత ఇత్యర్థః. నను శైబ్యప్రశ్నే సకామస్య బ్రహ్మలోకగతిరేవ ప్రతీయత ఇత్యాశంక్య తత్ర తత్వసాక్షాత్కారశ్చ శ్రూయత ఇత్యాహ—స ఏతస్మాదితి. బ్రహ్మలోకం గతస్స ఉపాసకః ఏతస్మాజ్జీవఘనాజ్జీవసమష్టిరూపాద్ధిరణ్యగర్భాత్పరముత్కృష్టం పురుషం నిరుపాధికచైతన్యరూపం పరమాత్మానం ఈక్షతే సాక్షాత్కరోతి.

టీ. యః = ఎవఁడు, త్రిమాత్రేణ = త్రిమాత్రాకారప్రణవముచేత, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, సః = వాఁడు, బ్రహ్మలోకే = బ్రహ్మలోకమునందు, నీయతే = పొందింపఁబడుచున్నాఁడు. సః = వాఁడు, ఏతస్మాత్ జీవఘనాత్ =ఈసమష్టిజీవుఁడగు

హిరణ్యగర్భునికంటె, పరం=ఉత్కృష్టుఁడైన, పురుషం=నిర్విశేషబ్రహ్మమును, ఈక్షతే= సాక్షాత్కరించుకొనుచున్నాఁడు.

తా. త్రిమాత్రప్రణవము నుపాసించువాఁడు బ్రహ్మలోకమున కేఁగి యచ్చట హిరణ్యగర్భునికన్న మిన్నయగు నిర్విశేషబ్రహ్మమును సాక్షాత్కరించుకొను నని ప్రశ్నోపనిషత్తునందు "యః పునరేతం త్రిమాత్రేణ" యనెడి శ్రుతివాక్యము చెప్పుచున్నది.

అవ. ఈయర్థమునందు బ్రహ్మసూత్రమును బ్రమాణముగా నుదాహరించు చున్నాఁడు:—

శ్లో. అప్రతీకాధికరణే తత్క్రతున్యాయ ఈరితః,
బ్రహ్మలోకఫలం తస్మాత్సకామస్యేతి వర్ణితమ్. 145

వ్యా. కించ, 'అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణః, 'ఉభయథా చ దోషా త్తత్క్రతు' శ్చేత్యత్ర కామానుసారేణ ఫలప్రాప్తిర్భవతీతి ప్రతిపాదితం తస్మా దపి సకామస్య బ్రహ్మలోకగతిరిత్యుక్తేత్యాహ—అప్రతీకేతి.

టీ. అప్రతీకాధికరణే = అప్రతీకాధికరణమునందు, తత్క్రతున్యాయః = తత్క్రతున్యాయము, ఈరితః = చెప్పఁబడినది, తస్మాత్ =ఆహేతువువలన, సకామస్య= సకామునకు, బ్రహ్మలోకఫలం = బ్రహ్మలోక మనెడి ఫలము (కలుగుచున్నది). ఇతి = ఇట్లుగా, వర్ణితం = వర్ణింపఁబడినది.

తా. "అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణ ఉభయథాచ దోషా త్తత్క్రతుశ్చ" అను సూత్రమున ప్రతీకోపాసకులకంటె వేఱగు సకాములు బ్రహ్మలోకము నొందెద రని చెప్పఁబడెను. తత్క్రతు న్యాయ మనఁగా దేనిని భావించిన నదియే తా నగు ననుట.

అవ. బ్రహ్మలోకగతునకు తత్త్వజ్ఞానము గల్గెడి విధము చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిర్గుణోపాస్తిసామర్థ్యా త్తత్ర తత్త్వమవేక్షతే,
పునరావర్తతే నాయం కల్పాంతే చ విముచ్యతే. 146

వ్యా. తర్హి సకామస్య తత్త్వజ్ఞానం కుతో జాయత ఇత్యాశంక్యాహ—నిర్గుణేతి. "ఇమం మానవమావర్తం నావర్తతే న స పునరావర్తతే న స పునరావర్తత" ఇతి, "బ్రహ్మణా సహ తే సర్వే" ఇత్యాదిశ్రుతిస్మృతిసద్భావాన్న తస్య పునస్సంసార ప్రాప్తిః. కింతు ముక్తిరేవేత్యాహ—పునరావర్తత ఇతి.

టీ. (సః=ఆ సకాముఁడు), నిర్గుణోపాస్తిసామర్థ్యాత్ = నిర్గుణోపాసనాబలము వలన, తత్ర = ఆబ్రహ్మలోకమునందు, తత్త్వం = తత్త్వమును, అవేక్షతే = చూచుచున్నాఁడు. అయం=వీఁడు, పునః=మఱల, నావర్తతే=సంసారమునకు రాఁడు. కల్పాంతే చ=బ్రహ్మకల్పాంతమునందు, విముచ్యతే=ముక్తుఁడగుచున్నాఁడు.

తా. నిర్గుణోపాస్తిబలమువలన బ్రహ్మలోకమునందు బ్రహ్మసాక్షాత్కారము గల్గును. వాఁడు మఱల సంసారమునకు రాఁడు. బ్రహ్మకల్పాంతమునందు ముక్తుఁడగును.

అవ. ప్రణవోపాసనభేదములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రణవోపాస్తయః ప్రాయో నిర్గుణా ఏవ వేదగాః,
క్వచిత్ సగుణతాప్యుక్తా ప్రణవోపాసనస్య హి. 147

వ్యా. ఇదానీం ప్రణవోపాసనప్రసంగాత్ బుద్ధిస్థం తద్ద్వైవిధ్యం దర్శయతి— ప్రణవేతి.

టీ. ప్రాయః = తఱచుగా, వేదగాః = వేదగతములైన, ప్రణవోపాస్తయః = ప్రణవోపాసనలు, నిర్గుణా ఏవ = నిర్గుణములే. క్వచిత్ = కొన్నిచోట్ల, ప్రణవోపాసనస్య = ప్రణవోపాసనకు, సగుణతాపి = సగుణత్వముకూడ, ఉక్తా = చెప్పఁబడినది.

తా. వేదమునఁ జెప్పఁబడిన ప్రణవోపాసనలు ప్రాయికముగా నిర్గుణోపాసనలే. కొన్ని స్థలములందు సగుణోపాసనలు గూడఁ జెప్పఁబడియున్నవి.

అవ. ద్వైవిధ్యమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. పరాపర బ్రహ్మరూప ఓంకార ఉపవర్ణితః,
పిప్పలాదేన మునినా సత్యకామాయ పృచ్ఛతే. 148

వ్యా. ద్వైవిధ్యే ప్రమాణమాహ—పరాపరేతి. 'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారస్తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతమన్వేతీ'తి ఉభయరూపత్వం ప్రతిపాదితమిత్యర్థః.

టీ. మునినా=మహర్షియైన, పిప్పలాదేన = పిప్పలాదునిచేత, పృచ్ఛతే=అడుగుచుండిన, సత్యకామాయ = సత్యకామునికొఱకు, బ్రహ్మరూపః=బ్రహ్మముయొక్క రూపమగు, ఓంకారః = ప్రణవము. పర = పరమనియు (నిర్గుణ మనియు), అపరః = అపరమనియు (సగుణ మనియు), ఉపవర్ణితః=వర్ణింపఁబడినది.

తా. ఓంకారము పరబ్రహ్మముగను, అపరబ్రహ్మముగను భావింపవలసిన దని పిప్పలాదుఁడు సత్యకామునకుఁ జెప్పినట్లు ప్రశ్నోపనిషత్తునందుఁ గలదు. పర మనఁగా నిర్గుణము. అపర మనఁగా సగుణము.

అవ. మఱియొక శ్రుతిని ప్రమాణించుచున్నాఁడు:—

శ్లో. ఏతదాలంబనం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్,
ఇతి ప్రోక్తం యమేనాపి పృచ్ఛతే నచికేతసే. 149

వ్యా. కఠవల్ల్యాం యమేనాపి "ఏతదాలంబనం జ్ఞాత్వే" త్యాదినా ద్వైవిధ్యముక్తమిత్యాహ—ఏతదాలంబనమితి.

టీ. ఏతత్ = ఈ, ఆలంబనం = ఆలంబనభూత మగు ప్రణవమును, జ్ఞాత్వా = తెలిసికొని, యః=ఎవఁడు, యత్ = దేనిని, ఇచ్ఛతి=కోరుచున్నాఁడో, తస్య = వానికి, తదితి = అది పొందఁబడుచున్న దని, యమేనాపి=యమునిచేతను, పృచ్ఛతే = అడుగుచున్న, నచికేతసే=నచికేతస్సుకొఱకు, ప్రోక్తం=చెప్పఁబడినది.

తా. ప్రణవమును సగుణబ్రహ్మముగాఁ గాని నిర్గుణబ్రహ్మముగాఁ గాని భావించిన వానికి కోరిన ఫలము ఘటించు నని యముఁడు నచికేతస్సునకు చెప్పినట్లు కఠోపనిషత్తు చెప్పుచున్నది.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇహ వా మరణే చాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్,
బ్రహ్మసాక్షాత్కృతిస్సమ్యగుపాసీనస్య నిర్గుణమ్. 150

వ్యా. ఉక్తమర్థముపసంహరతి—ఇహ వేతి.

టీ. నిర్గుణం=నిర్గుణబ్రహ్మమును, సమ్యక్=చక్కఁగా, ఉపాసీనస్య=ఉపాసనము చేయుచుండెడి, అస్య=ఇతనికి, ఇహ వా=ఇహలోకమునఁగాని, మరణే చ=మరణసమయమునఁగాని. అథవా=అట్లుగాక, బ్రహ్మలోకే = బ్రహ్మలోకమునందుఁగాని, బ్రహ్మసాక్షాత్కృతిః=బ్రహ్మసాక్షాత్కారము, భవేత్=అగును.

తా. నిర్గుణోపాసకునకు నిహలోకమునఁగాని మరణసమయమునఁగాని బ్రహ్మలోకమునఁగాని బ్రహ్మసాక్షాత్కారము తప్పక కలుగును. కాన నిర్గుణోపాసనను ముఖ్యముగా నాచరింపఁదగును.

అవ. విచారముసేయ సమర్థుఁడు గానివాఁడు నిర్గుణబ్రహ్మధ్యానమునం దధికారి యనుటయందుఁ బ్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. అర్థోఽయమాత్మగీతాయామపి స్పష్టముదీరితః,
విచారాక్షమ ఆత్మానముపాసీతేతి సంతతం. 151

వ్యా. విచారాత్తత్త్వజ్ఞానసంపాదనాసమర్థస్య నిర్గుణబ్రహ్మధ్యానేఽధికార ఇత్యయమర్థ ఆత్మగీతాయాం సమ్యగభిహిత ఇత్యాహ—అర్థోఽయమితి.

టీ. విచారాక్షమః = విచారమునందు సమర్థుఁడు గానివాఁడు, సంతతం = ఎడతెగక, ఆత్మానం = పరమాత్మను, ఉపాసీతేతి = ఉపాసింపవలయు నని, అయం అర్థః= ఈ అర్థము, ఆత్మగీతాయామపి=ఆత్మగీతయందును, స్పష్టం=స్ఫుటముగా, ఉదీరితః=చెప్పఁబడినది.

తా. నిర్గుణోపాసనచేయుటకు అసమర్థుఁడగువాఁడు ప్రత్యగాత్మరూప పరబ్రహ్మము నుపాసింపవలె నని, యీ అర్థము ఆత్మగీతయందును స్పష్టముగఁ జెప్పఁబడినది.

అవ. ఆ ఆత్మగీతావాక్యము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. సాక్షాత్కర్తుమశక్తోఽపి చింతయేన్మామశంకితః,
కాలేనానుభవారూఢో భవేదాఫలితో ధ్రువమ్. 152

వ్యా. ఆత్మగీతావాక్యాన్యేవోదాహరతి—సాక్షాదితి.

టీ. సాక్షాత్కర్తుం=బ్రహ్మమును సాక్షాత్కరించుటకు, అశక్తోఽపి=శక్తి లేనివాఁడైనను, మాం=(పరమాత్మనగు)నన్ను, అశంకితస్సన్=శంకింపనివాఁడగుచు, చింతయేత్= ధ్యానింపవలెను. కాలేన = కొంతకాలమునకు, అనుభవారూఢః = అనుభవమునొందినవాఁడై, ధ్రువం=నిశ్చయముగా, ఆఫలితః = ఫలంబు నొందినవాఁడుగ, భవేత్ = అగుచున్నాఁడు.

తా. బ్రహ్మసాక్షాత్కారము గలుగనివాఁడు నిర్గుణబ్రహ్మధ్యానము చేసెనేని, యనుభవారూఢమగుచున్నాయర్థము వానికి ఫలించును.

అవ. దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యథాఽగాధనిధేర్లబ్ధౌ నోపాయః ఖననం వినా,
మల్లాభేఽపి తథా స్వాత్మచింతాం ముక్త్వా న చాపరః. 153

వ్యా. ధ్యానస్య సమ్యగ్జ్ఞానోపాయత్వే దృష్టాంతమాహ—యథేతి. దార్ష్టాంతికే యోజయతి—మల్లాభ ఇతి.

టీ. యథా = ఎట్లు, అగాధనిధేః = లోఁతగు నిధియొక్క, లబ్ధౌ = ప్రాప్తియందు, ఖననం వినా = త్రవ్వుట విడిచి, ఉపాయః = ఉపాయము, న = లేదో,

తథా = ఆలాగున, మల్లాభేఽపి = నాలాభమునందును, స్వాత్మచింతాం = స్వస్వరూప ధ్యానమును, ముక్త్వా = వదలి, అపరః = వేఱొక, ఉపాయః = ఉపాయము, న = లేదు.

తా. గనిలోని రత్నములు దొరకవలె ననిన భూమిని ద్రవ్వక తీరదు. అట్లే ఆత్మసాక్షాత్కారము గావలె ననిన నిర్గుణోపాసనము కంటె వే ఉపాయము లేదు.

అవ. ఈయర్థమునందు మఱియొక వాక్యమును గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. దేహోపలమపాకృత్య బుద్ధికుద్దాలకాత్పునః,
ఖాత్వా మనోభువం భూయో గృహ్ణీయాం స్వాం నిధిం పుమాన్.

వ్యా. వ్యతిరేకేణోక్త మర్థమన్వయముఖేనాహ—దేహోపలమితి.

టీ. దేహోపలం=దేహ మనియెడి ఱాతిని, అపాకృత్య=వెల్లగించి, బుద్ధికుద్దాలకాత్పునః=బుద్ధి యనెడి గుద్దలివలన,మనోభువం=మనస్సు అనియెడి భూమిని, ఖాత్వా=త్రవ్వి, నిధిం=నిధియైన, మాం=నన్ను, పుమాన్=పురుషుఁడు, గృహ్ణీయాత్=గ్రహింపవలయును.

తా. శరీరాభిమానము వదలి తన బుద్ధిచేత మనస్సునందే ఆత్మ విచారము చేసికొని బ్రహ్మసాక్షాత్కారము నందవలెను. ధన మపేక్షించినవాఁ డెట్లు గనిపై నుండు ఱాతిని దీసి భూమిని త్రవ్వి యందలి ధనముం గ్రహించునో యటులనే యని భావము.

అవ. ధ్యానఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనుభూతేరభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్,
అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః. 15

వ్యా. జ్ఞానేఽసమర్థస్య ధ్యానేఽధికార ఇత్యత్ర వాక్యాంతరం పఠతి—అనుభూతేరితి. ధ్యానాద్ధి బ్రహ్మప్రాప్తౌ కైముతికన్యాయమాహ—అపీతి. ఉపాసకస్య పూర్వమవిద్యమానమపి దేవత్వాదికం ధ్యానాత్ప్రాప్యతే కిల. స్వరూపేణ నిత్యప్రాప్తం సర్వాత్మకం బ్రహ్మ ధ్యానాత్ప్రాప్యత ఇతి కిముత వక్తవ్యమిత్యర్థః.

టీ. అనుభూతేః = అనుభవముయొక్క, అభావేఽపి = లేకపోయినను, బ్రహ్మాస్మీత్యేవ = నేను బ్రహ్మమనైతి ననియే, చింత్యతాం = ధ్యానింపఁబడుఁగాక, అసదపి = తనకు పూర్వము లేని దేవతత్వాదికముగూడ, ధ్యానాత్ = ధ్యానమువలన, ప్రాప్యతే=

పొందఁబడుచున్నది. నిత్యాప్తం=ఎల్లప్పుడు పొందఁబడిన, బ్రహ్మ=బ్రహ్మము, కిం పునః= ఏమి చెప్పవలెను.

తా. బ్రహ్మానుభవము లేకపోయినను నేనే బ్రహ్మమనని ధ్యానింపవలెను. ధ్యానమువలన లేనిది సయితము లభించును. స్వస్వరూపమగు బ్రహ్మము లభించు నని వేఱె చెప్ప నేల? లభించియే తీరు నని భావము.

అవ. పైన చెప్పఁబడినదానిని సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనాత్మబుద్ధిశైథిల్యం ఫలం ధ్యానాద్దినేదినే,
పశ్యన్నపి న చేద్ధ్యాయేత్కోఽపరోఽస్మాత్పశుర్వద. 156

వ్యా. బ్రహ్మధ్యానఫలస్య ప్రత్యక్షసిద్ధత్వాదపి ధ్యానం కర్తవ్యమిత్యాహ— అనాత్మేతి.

టీ. ధ్యానాత్=ధ్యానమువలన, దినేదినే = ప్రతిదినమునందును, అనాత్మబుద్ధిశైథిల్యం=దేహాదులు నేనే ననియెడిబుద్ధి తగ్గిపోవుటయను, ఫలం=లాభమును, పశ్యన్నపి= చూచుచున్నను, న ధ్యాయేచ్చేత్=ధ్యానింపఁడేని, అస్మాత్=వీనికంటె, అపరః = మఱి యొక, పశుః = పశువు, కః = ఎవఁడు ? వద = చెప్పు.

తా. ధ్యానమువలన దినములు గడచినకొలఁది దేహేంద్రియాదులు నేనే యనెడి భ్రమ నశించును. ఇట్టి లాభము గనుపడుచున్నను, ధ్యానింపనివాఁడే నరపశు వని తెలియనగును.

అవ. ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. దేహాభిమానం విధ్వస్య ధ్యానాదాత్మానమద్వయమ్,
పశ్యన్మర్త్యోఽమృతో భూత్వా హ్యత్ర బ్రహ్మ సమశ్నుతే. 157

వ్యా. ఇదానీముపపాదితమర్థం సంక్షిప్య దర్శయతి—దేహాభిమానమితి. మరణశీలే దేహేఽహమిత్యభిమానపరిత్యాగాత్స్వయమమృతో భూత్వా అత్రాస్మిన్నేవ శరీరే స్వస్య నిజం రూపం సచ్చిదానందరూపం బ్రహ్మ ప్రాప్నోతి.

టీ. దేహాభిమానం = శరీరాభిమానమును, విధ్వస్య=ధ్వంసముచేసి, ధ్యానాత్ = ధ్యానమువలన, అద్వయం = తనకంటె భిన్నవస్తువులేని, ఆత్మానం = పరమాత్మను, పశ్యన్ = సాక్షాత్కరించుకొనుచున్న, మర్త్యః = మనుజుఁడు, అమృతో భూత్వా = మరణవర్జితుఁడై, అత్ర = ఇక్కడనే, బ్రహ్మ = బ్రహ్మమును, సమశ్నుతే = పొందుచున్నాఁడు.

తా. ధ్యానము చేయువానికి దేహాభిమానము తొలఁగును. బ్రహ్మసాక్షాత్కారము గలుగును. అమృతరూపుఁడై యీజన్మమందే ముక్తుఁడగును.

అవ. ప్రకరణమునకు ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ధ్యానదీపమిమం సమ్యక్పరామృశతి యో నరః,
ముక్తసంశయ ఏవాయం ధ్యాయతి బ్రహ్మ సంతతమ్. 158

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
ధ్యానదీపస్సమాప్తః.

వ్యా. ధ్యానదీపానుసంధానఫలమాహ—ధ్యానదీపమితి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితం తాత్పర్యబోధినీనామకం ధ్యానదీప
వ్యాఖ్యానం సమాప్తమ్.

టీ. ఇమం ధ్యానదీపం=ఈధ్యానదీపమును, యః నరః=ఏమనుజుఁడు, సమ్యక్=లెస్సగా, పరామృశతి = పరికించుచున్నాఁడో, అయం = ఇతఁడు, ముక్తసంశయ ఏవ=సంశయములు లేనివాఁడై, సంతతం = ఎల్లప్పుడును, బ్రహ్మ= బ్రహ్మమును, ధ్యాయతి=ధ్యానించును.

తా. ఈ ధ్యానదీపప్రకరణమును బాగుగా విమర్శచేసి తెలిసికొనినవానికి సంశయములు తొలఁగి బ్రహ్మధ్యానమునం దభిరుచి గల్గును.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు ధ్యానదీప మను
నవమప్రకరణము.

శ్రీరస్తు
శ్రీ గణేశాయ నమః.



# శ్రీ వేదాంతపంచదశి

## దశమ ప్రకరణము

## నాటకదీప ప్రకరణము

అవ. శ్రీవిద్యారణ్యస్వామి నాటకదీపమును బ్రారంభింపఁ దలంచి మందాధికారుల కనాయాసముగ బ్రహ్మబోధ గలుగుటకు బ్రహ్మమందు జగత్కల్పనమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరమాత్మాద్వయానందః పూర్ణః పూర్వే స్వమాయయా,
స్వయమేవ జగద్భూత్వా ప్రావిశజ్జీవరూపతః. 1

### వ్యాఖ్యానమ్.

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
అర్థో నాటకదీపస్య మయా సంక్షిప్య వక్ష్యతే.

వ్యా. చికీర్షితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయాభిమతదేవతాతత్త్వానుస్మరణలక్షణం మంగళమాచరన్ మందాధికారిణామనాయాసేన నిష్ప్రపంచబ్రహ్మాత్మతత్త్వప్రతిపత్తిసిద్ధయే 'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే, శిష్యాణాం బోధసిద్ధ్యర్థం తత్త్వజ్ఞైః కల్పితః క్రమ' ఇతి న్యాయమనుసృత్యాత్మన్యధ్యారోపం తావదాహ—పరమాత్మేతి. పూర్వే సృష్టేః ప్రాగద్వయానందః పూర్ణః. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" "విజ్ఞానమానందం బ్రహ్మ" "పూర్ణమదః పూర్ణ" మిత్యాదిశ్రుతిప్రసిద్ధః స్వగతాదిభేదశూన్యః పరమానందరూపః పరిపూర్ణః పరమాత్మా స్వమాయయా "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వర" మితి శ్రుత్యుక్తయా స్వనిష్ఠయా మాయాశక్త్యా "స్వయమేవ జగద్భూత్వా తదాత్మానగ్ం స్వయ

మకురుత, సచ్చత్యచ్చాభవ" దితి శ్రుతేః స్వయమేవ జగదాకారతాం ప్రాప్య జీవరూపతః ప్రావిశత్. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్". "అనేన జీవేనాత్మనానుప్రవిశ్యే" త్యాదిశ్రుతేః జీవరూపేణ ప్రవిష్టవానిత్యర్థః.

టీ. పూర్వే = కల్పాదియందు, అద్వయానందః = అద్వితీయానందస్వరూపుఁడై నట్టియు, పూర్ణః=పరిపూర్ణుఁడైనట్టియు, పరమాత్మా=పరమాత్మ, స్వమాయయా=తనమాయచేత, స్వయమేవ=తానే, జగత్=ప్రపంచస్వరూపముగా, భూత్వా=అయి, జీవరూపతః = జీవస్వరూపముతో, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. నిర్విశేషంబును, సత్యజ్ఞానానందస్వరూపంబు నగు బ్రహ్మము అనిర్వచనీయ మగు మాయయొక్క సహాయంబున జగత్తును సృజించి యాజగత్తులో మాయావశంబుననే తాను జీవుఁడై ప్రవేశించెను.

అవ. ఒక్క పరమాత్మయే సర్వశరీరములయందుఁ బ్రవేశించినయెడల దేవమనుష్యాదులకు నుత్తమాధమభావ మెట్లు ఘటించును అని శంకించి సమాధానమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. విష్ణ్వాద్యుత్తమదేహేషు ప్రవిష్టో దేవతాఽభవత్,
మర్త్యాద్యధమదేహేషు స్థితో భజతి దేవతామ్. 2

వ్యా. నను పరమాత్మన ఏవైకస్య సర్వశరీరేషు ప్రవిష్టత్వే పూజ్యపూజకాదిభావేన ప్రతీయమాన ఉత్తమాధమభావో విరుధ్యేతేత్యాశంక్యాహ—విష్ణ్వితి. నాయం స్వాభావిక ఉత్తమాధమభావః. కింతు శరీరోపాధినిబంధనోఽతో న విరోధ ఇతి భావః.

టీ. విష్ణ్వాద్యుత్తమదేహేషు = విష్ణువు మొదలుగాఁగల యుత్తమోపాధులయందు, ప్రవిష్టః = ప్రవేశించినవాఁడై, దేవతా=దేవత, అభవత్ = అయెను. మర్త్యాద్యధమదేహేషు=మనుష్యులు మొదలుగాఁగల హీనోపాధులయందు, స్థితః = ఉన్నవాఁడై, దేవతాం = దేవతను, భజతి = సేవించుచున్నాఁడు.

తా. ఆత్మ యొక్కఁడైనను ప్రకృష్టోపాధులయందుఁ బ్రవేశించి దేవత యగును. నికృష్టోపాధులయం దుండుటచేత దేవత నుపాసించువాఁడగును.

అవ. ఇట్లధ్యారోపమును దెలిపి యిప్పు డపవాదమును జెప్పుచున్నాఁడు. అధ్యారోప మనఁగాఁ జగత్కల్పన యగును. అపవాద మనఁగా బ్రహ్మమందు జగత్తులు లే వని నిషేధించుట:—

శ్లో. అనేకజన్మభజనాత్ స్వవిచారం చికీర్షతి,
విచారేణ వినష్టాయాం మాయాయాం శిష్యతే స్వయమ్. 3

వ్యా. ఇత్థమాత్మన్యధ్యారోపం సంక్షేపేణ ప్రదర్శ్య ససాధనం తదపవాదం సంక్షిప్య దర్శయతి—అనేకేతి. అనేకజన్మభజనాదనేకేషు జన్మసు అనుష్ఠితానాం కర్మణాం బ్రహ్మణి సమర్పణరూపాత్ భజనాత్ స్వవిచారం స్వస్యాత్మనో బ్రహ్మరూపస్య జ్ఞానసాధనం శ్రవణాదికం చికీర్షతి కర్తుమిచ్ఛతి. తతః స్వవిచారేణ విచారజనితజ్ఞానేన మాయాయాం స్వస్యాద్వయానందత్వాదిరూపాచ్ఛాదికాయామజ్ఞానావిద్యాదిశబ్దవాచ్యాయాం వినష్టాయాం నివృత్తాయాం స్వయమద్వయానందపూర్ణః పరమాత్మైవావశిష్యతే.

టీ. అనేకజన్మభజనాత్=అనేకములైన జన్మలయందు భజించుటవలన, స్వవిచారేణ - స్వ = తనయొక్క, విచారేణ = విచారముచేత, విచారం = ఆత్మవిచారమును, చికీర్షతి=చేయ నిచ్ఛగించుచున్నాఁడు. విచారేణ=ఆత్మవిచారముచేత, మాయాయాం=మూలావిద్య, వినష్టాయాం = నశించినదగుచుండఁగా, స్వయం = తాను, (ఆత్మస్వరూపము) శిష్యతే = మిగులుచున్నది.

తా. అనేకజన్మములయం దీశ్వరారాధన చేయుటచే ఆత్మవిచారమున కిచ్ఛ వొడమును. విచారము చేయఁగా మాయ నశించును. మాయ నశింపఁగా ఆత్మస్వరూప మగు తాను మిగులును.

అవ. బంధనివృత్తి మోక్ష మని మోక్షశాస్త్రములు చెప్పుచున్నవి. ఆత్మమాత్రము శేషించుట మోక్ష మని నీ వనుచున్నావు. ఈరెండింటికిని సమన్వయ మెట్లు? అని ప్రశ్నింపఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వయానందరూపస్య సద్వయత్వం చ దుఃఖితా,
బంధః ప్రోక్తస్స్వరూపేణ స్థితిర్ముక్తిరితీర్యతే. 4

వ్యా. నను 'తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే' ఇత్యాదిశ్రుతిభిర్బంధనివృత్తిలక్షణస్య మోక్షస్య జ్ఞానఫలత్వాభిధానాత్ పరమాత్మవిశేషణస్య తత్ఫలతాభిధానమనుపపన్నమిత్యాశంక్యాహ — అద్వయానందేతి. అద్వితీయే బ్రహ్మణి వాస్తవస్య బంధస్య మోక్షస్య వా దుర్నిరూపత్వాద్దుఃఖిత్వాదిభ్రమ ఏవ బంధః స్వరూపావస్థితిలక్షణా తన్నివృత్తిరేవ మోక్షః. అతో న శ్రుతివిరోధ ఇతి భావః.

టీ. అద్వయానందరూపస్య = రెండవది లేనిదియు, ఆనందస్వరూపము నగు పరబ్రహ్మమునకు, సద్వయత్వం చ = సద్వితీయత్వమును, దుఃఖితా = దుఃఖిత్వమును,

బంధః=బంధ మని, ప్రోక్తః = చెప్పఁబడెను. స్వరూపేణ = స్వస్వరూపముతో, స్థితిః= ఉనికి, ముక్తిరితి = మోక్ష మని, ఈర్యతే = చెప్పఁబడుచున్నది.

తా. అద్వితీయ మగు ఆత్మకు నేను సద్వితీయుఁడను, దుఃఖిని అని యనుకొనుటయే బంధము. ఇట్టిభ్రమ లేక స్వస్వరూపమునం దుండుటయే మోక్షము. ఇదియే బంధనివృత్తి. కనుక విరోధ మేమియు లేదు.

అవ. జనకాదులు కర్మచేతనే ముక్తినిఁ జెందిరి. విచారముతోఁ బని యేమి యనినఁ జెప్పుచున్నాఁడు:— ✓

శ్లో. అవిచారకృతో బంధో విచారేణ నివర్తతే,
తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్. 5

వ్యా. నను "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" ఇతి స్మృతే ర్మోక్షస్య కర్మసాధనత్వావగమాత్ కిమనేన విచారజనితజ్ఞానేనేత్యత ఆహ—విచారేతి. విచారప్రాగభావోపలక్షితాజ్ఞానకృతస్య బంధస్య న విచారజన్యజ్ఞానాదన్యతో నివృత్తిరుపపద్యతే. ఉదాహృతస్మృతౌ చ సంసిద్ధిశబ్దేన చిత్తశుద్ధిరేవాభిధీయతే న మోక్ష ఇతి భావః. విచారేణ బంధనివృత్తిరుక్తా కిం విషయేణ విచారేణేత్యత ఆహ—తస్మాదితి. తత్ర సాక్షాత్కారపర్యంతం సర్వదా విచారం కుర్యాదిత్యర్థః.

టీ. అవిచారకృతః = బ్రహ్మవిచారము చేయకపోవుటవలన కలిగిన, బంధః = బంధము, విచారేణ=ఆత్మవిచారముచేత, నివర్తతే=పోవుచున్నది. తస్మాత్ =ఆహేతువువలన, జీవపరాత్మానౌ = జీవపరమాత్మలను, సర్వదైవ = ఎల్లప్పుడును, విచారయేత్ = విచారింపవలెను.

తా. బ్రహ్మవిచారము చేయనందున బంధము ఘటించును. ఆబంధము ఆత్మవిచారముచేత నివర్తించును. కావున జీవాత్మపరమాత్మలను సర్వదా విచారింపవలయును.

అవ. జీవస్వరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అహమిత్యభిమంతా యః కర్తాఽసౌ తస్య సాధనం,
మనస్తస్య క్రియే అంతర్బహిర్వృత్తీ క్రమోత్థితే. 6

వ్యా. తత్ర జీవరూపం తావన్నిరూపయతి—అహమితి. యశ్చిదాభాసవిశిష్టోఽహంకారో వ్యవహారదశాయాం దేహాదావహమిత్యభిమన్యతే, అసౌ కర్తా కర్తృ

త్త్వాదిధర్మవిశిష్టో జీవ ఇత్యర్థః. తస్య కిం కరణమిత్యపేక్షాయామాహ—తస్యేతి. కామాదివృత్తిమానంతఃకరణభాగో మనః. కరణస్య క్రియావ్యాప్తత్వాత్తత్క్రియాం దర్శయతి—తస్య క్రియే ఇతి.

టీ. యః=ఏచిదాభాసవిశిష్టాహంకారము, అహమితి = దేహాదులయందు నేనని, అభిమంతా = అభిమానమును గలుఁగఁజేయుచున్నదో, అసౌ=ఈఅహంకారము, కర్తా= కర్తృత్వాదిధర్మవిశిష్టుఁ డగు జీవుఁ డగును. తస్య = ఆజీవునకు, మనః = మనస్సు, సాధనం = కరణమగును తస్య=ఆమనస్సునకు, క్రమోత్థితే = క్రమక్రమముగ పుట్టెడి, అంతర్బహిర్వృత్తీ = దేహములోపలను వెలుపలను వర్తించునట్టివృత్తులు, క్రియే = క్రియ (వ్యాపారము) లగును.

తా. 'అహం' నేను అని దేహాదులయం దభిమానమును గలిగించు అహంకారము కర్తృత్వాదిధర్మవిశిష్టుఁడగు జీవుఁడు. ఈజీవునకు మనస్సు సాధనము. ఈమనస్సునకు అంతర్బహిర్వృత్తులు క్రియలు.

అవ. ఈవృత్తులస్వరూపమును వృత్తివిషయమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అంతర్ముఖాహమిత్యేషా వృత్తిః కర్తారముల్లిఖేత్,
బహిర్ముఖేదమిత్యేషా బాహ్యం వస్త్విదముల్లిఖేత్. 7

వ్యా. అనయోస్స్వరూపం విషయం చ వివిచ్య దర్శయతి—అంతర్ముఖేతి. ఇదమిత్యేషేతి బహిర్వృత్తేః స్వరూపాభినయః అవిశిష్టేన విషయప్రదర్శనం బాహ్యం దేహాద్బహిర్వర్తమానమిదం తయా నిర్దిశ్యమానం వస్తూల్లిఖేత్ విషయీకుర్యాదిత్యర్థః.

టీ. అంతర్ముఖా=లోపలివైపు ప్రసరించిన, అహమితి=నే ననెడి, ఏషా వృత్తిః= ఈవృత్తి, కర్తారం = కర్త యగు జీవుని, ఉల్లిఖేత్ = విషయముగఁ జేసికొనును. బహిర్ముఖా=వెలుపటివైపున కభిముఖమైన, ఇదమితి=ఇది యనెడి, ఏషా వృత్తిః=ఈవృత్తి, బాహ్యం=వెలుపటిదైన, వస్తు=పదార్థమును, ఉల్లిఖేత్ = విషయముగఁ జేసికొనును.

తా. నే ననెడి అంతఃకరణవృత్తిలో జీవుఁడు గోచరించును. ఇది యనెడి ప్రపంచాభిముఖమగువృత్తిలో బాహ్యపదార్థము గోచరించును.

అవ. జ్ఞానేంద్రియపంచకమున కుపయోగమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదమో యే విశేషాస్స్యుర్గంధరూపరసాదయః,
అసాంకర్యేణ తాన్విద్యాత్ ఘ్రాణాదీంద్రియపంచకమ్. 8

వ్యా. నను మనసైవ సర్వవ్యవహారసిద్ధౌ చక్షురాదివైయర్థ్యం ప్రసజ్యేతేత్యాశంక్యాహ—ఇదమ ఇతి. మనసా ఇదమితి సామాన్యమాత్రం గృహ్యతే. నతు తద్విశేషో గంధాదిరతస్తద్గ్రహణే ఘ్రాణాదికముపయుజ్యత ఇత్యర్థః.

టీ. ఇదమః = ఇది యని నిర్దేశింపఁబడెడి పదార్థముయొక్క, గంధరూపరసాదయః = గంధము, రూపము, రసము మొదలగునవి, యే=ఎట్టి, విశేషాః = భేదములు, స్యుః=కలవో, తాన్=ఆధర్మములను, ఘ్రాణాదీంద్రియపంచకం = ఘ్రాణేంద్రియము మొదలగు నైదింద్రియములనుగా, అసాంకర్యేణ = ప్రత్యేకముగా, విద్యాత్ = తెలిసికొనును.

తా. బాహ్యపదార్థములయందుఁ గల శబ్దస్పర్శాదివిశేషములను ఘ్రాణాదీంద్రియపంచకము ప్రత్యేకముగా గ్రహించును.

అవ. సాధనసహితుఁ డగు జీవునిఁ దెల్పి సాక్షిచైతన్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కర్తారం చ క్రియాం తద్వద్వ్యావృత్తవిషయానపి,
స్ఫోరయేదేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః. 9

వ్యా. ఏవం సోపకరణం జీవస్వరూపం నిరూప్య పరమాత్మానం నిరూపయతి— కర్తారమితి. కర్తారం పూర్వోక్తమహంకారరూపం క్రియామహమిదమాత్మకమనోవృత్తిరూపాం వ్యావృత్తవిషయానపి వ్యావృత్తానన్యోన్యవిలక్షణాన్ ఘ్రాణాదిగ్రాహ్యాన్ గంధాదీన్ విషయాంశ్చ ఏకయత్నేన యుగపదేవ యశ్చిద్వపుశ్చిద్రూప ఏవ సన్ స్ఫోరయేత్ ప్రకాశయేత్. అసావత్ర వేదాంతశాస్త్రే సాక్షీత్యుచ్యత ఇత్యర్థః.

టీ. కర్తారం = కర్తను, క్రియాం చ = వ్యాపారమును, తద్వత్ = అలాగున, వ్యావృత్తివిషయానపి = పరస్పరభిన్నములగు శబ్దాదివిషయములను, ఏకయత్నేన = ఒక్కేపూన్కితో, యః = ఏపరమాత్మ స్ఫోరయేత్ = స్ఫురింపఁజేయునో (ప్రకాశింపఁజేయునో), అసౌ = ఇతఁడు, చిద్వపుః = చిత్స్వరూపుఁడైన, సాక్షీ = సాక్షిచైతన్యము, (భవతి = అగుచున్నాఁడు.)

తా. చేయువానిని, చేసెడి పనిని, శబ్దాదివిషయములను నొక్కమాఱుగాఁ బ్రకాశింపఁజేయువాఁడు సాక్షిచైతన్య మనఁబడును.

అవ. సాక్షి ఒకేసారి సర్వమును బ్రకాశింపఁజేయుట ననుభవమునందుఁ గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. ఈక్షే శృణోమి జిఘ్రామి స్వాదయామి స్పృశామ్యహమ్,
ఇతి భాసయతే సర్వం నృత్యశాలాస్థదీపవత్. 10

వ్యా. సాక్షిణ ఏకయత్నేన సర్వస్ఫోరకత్వమభినీయ దర్శయతి—ఈక్షే శృణోమీతి. ఈక్షే రూపమహం పశ్యామీత్యేవం ద్రష్టృదర్శనదృశ్యలక్షణాం త్రిపుటీ మేకయత్నేన భాసయతే. ఏవం శృణోమీత్యాదావపి యోజ్యం. యుగపదవికారిత్వేనానేకావభాసకత్వే దృష్టాంతమాహ—నృత్యశాలాస్థదీపవదితి.

టీ. అహం = నేను, ఈక్షే = చూచుచున్నాను, శృణోమి = వినుచున్నాను, జిఘ్రామి = ఆఘ్రాణించుచున్నాను, స్వాదయామి = ఆస్వాదించుచున్నాను. (రుచి చూచుచున్నా ననుట.) స్పృశామి = తాఁకుచున్నాను, ఇతి = ఈలాగున, సర్వం = సర్వమును, నృత్యశాలాస్థదీపవత్ = నాటకశాలలోని దీపములవలె, భాసయతే=ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

తా. అట్టి సాక్షి "నేను వినుచున్నాను, ఆఘ్రాణించుచున్నాను, రుచిచూచుచున్నాను, తాఁకుచున్నాను" అని ద్రష్టృదర్శనదృశ్యలక్షణము గల త్రిపుటిని ఒక్కసారిగ, నాటకశాలయందలి దీపమువలె నంతయును బ్రకాశింపఁజేయుచున్నాఁడు.

అవ. దృష్టాంతమును విశదపఱచుచున్నాఁడు:—

శ్లో. నృత్యశాలాస్థితో దీపః ప్రభుం సభ్యాంశ్చ నర్తకీమ్,
దీపయేదవిశేషేణ తదభావేఽపి దీప్యతే. 11

వ్యా. దృష్టాంతం స్పష్టయతి—నృత్యేతి. అవిశేషేణ ప్రభ్వాదివిషయవిశేషావభాసనాయ వృద్ధ్యాదివికారమంతరేణేతి యావత్.

టీ. నృత్యశాలాస్థితః = నాటకశాలయం దున్న, దీపః = దీపము, ప్రభుం = రాజును, సభ్యాన్ = సభ్యులను, నర్తకీం చ = నాట్యమాడెడి స్త్రీని, అవిశేషేణ=ఒకే రీతిగా, దీపయేత్ = ప్రకాశింపఁజేయును. తదభావేఽపి = ఆ ప్రభువు మొదలగు వారలు లేకపోయినను, దీప్యతే=తాను ప్రకాశించుచునే యున్నది.

తా. నాటకశాలలో నున్న దీపము ఆశాలయందుఁగల అందఱను సమానముగాఁ బ్రకాశింపఁజేయును. వా రెవ్వరు లేక పోయినను తాను ప్రకాశించును.

అవ. దీనిని దార్ష్టాంతికమునఁ గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. అహంకారం ధియం సాక్షీ విషయానపి భాసయేత్,
అహంకారాద్యభావేఽపి స్వయం భాత్యేవ పూర్వవత్. 12

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—అహంకారమితి. సుషుప్త్యాదావహంకారాద్యభావేఽపి తత్సాక్షితయా భాత్యేవేత్యర్థః.

టీ. సాక్షీ=సాక్షి, అహంకారంధియం=అహంకారమును బుద్ధిని, విషయానపి = శబ్దాదివిషయములను, భాసయేత్ = ప్రకాశింపఁజేయును. స్వయం = తాను, అహంకారాద్యభావేఽపి = తాను, తనది యను తలంపు లేనప్పుడును, పూర్వవత్ = ఎప్పటి యట్లే, భాత్యేవ=ప్రకాశించుచునే యున్నాఁడు.

తా. నాటకశాలయందలి దీపమువలెనే సాక్షియును జాగ్రదశ యందు తాను, తనది యను బుద్ధి విషయంబుల నెల్ల భాసిలఁజేయుచు నవి లేనప్పుడును ఎప్పటివలెఁ బ్రకాశించుచునే యున్నాఁడు.

అవ. బుద్ధియే యన్నింటినిఁ బ్రకాశింపఁ జేయుచుండ, వేఱేసాక్షి నేల కల్పించెద వనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరంతరం భాసమానే కూటస్థే జ్ఞప్తిరూపతః,
తద్భాసా భాస్యమానేయం బుద్ధిర్నృత్యత్యనేకధా. 13

వ్యా. నను ప్రకాశరూపాయా బుద్ధేరేవాహంకారాది సర్వవస్త్వవభాసకత్వ సంభవాత్ కిం తదతిరిక్తసాక్షికల్పనయేత్యాశంక్యాహ—నిరంతరేతి. కూటస్థే నిర్వికారే సాక్షిణి జ్ఞప్తిరూపతః స్వప్రకాశచైతన్యతయా నిరంతరం భాసమానే సదా స్ఫురతి సతి ఇయం బుద్ధిస్తద్భాసా తస్య సాక్షిణః స్వరూపచైతన్యేన భాస్యమానా ప్రకాశ్యమానైవానేకధా ఘటోఽయం పటోఽయమిత్యాదిజ్ఞానాకారేణ నృత్యతి విక్రియతే. అయం భావః—యతో బుద్ధేర్వికారితయా జడత్వాత్స్వతః స్ఫూర్తిరాహిత్యమతస్తదతిరిక్తస్సర్వావభాసకస్సాక్ష్యప్యభ్యుపగంతవ్య ఇతి.

టీ. కూటస్థే=నిర్వికారుఁ డగు సాక్షి, జ్ఞప్తిరూపతః=స్వప్రకాశచైతన్యరూపము వలన, నిరంతరం = సర్వదా, భాసమానే (సతి) = స్ఫురించుచుండఁగా, ఇయం బుద్ధిః = ఈబుద్ధి, తద్భాసా=ఆసాక్షియొక్క స్వరూపచైతన్యముచేత, భాస్యమానే=ప్రకాశింపఁ బడుచున్న దగుచు, అనేకధా = అనేకవిధముల, నృత్యతి = నాట్యము చేయుచున్నది (వికారమును బొందుచున్నది.)

తా. కూటస్థుఁడు స్వయంప్రకాశమానుఁడై ప్రకాశించు చుండును. ఆయనచే ప్రకాశింపఁజేయఁబడిన బుద్ధి అనేకవిధముల నాట్య మాడుచుండును. అనఁగా వికారముఁ జెందు నని తాత్పర్యము.

అవ. పైఁ జెప్పినదానిని చక్కఁగా తెలుపుటకు నాటకముగా నిరూపించు చున్నాఁడు:—

శ్లో. అహంకారః ప్రభుస్సభ్యా విషయా నర్తకీ మతిః,
తాలాదిధారిణ్యక్షాణి దీపస్సాక్ష్యవభాసకః. 14

వ్యా. ఉక్తమర్థం శ్రోతృబుద్ధిసౌకర్యాయ నాటకత్వేన రూపయతి—అహంకార ఇతి. విషయభోగసాకల్యవైకల్యాభిమానప్రయుక్తహర్షవిషాదవత్త్వాన్నృత్యాభిమాని ప్రభుతుల్యత్వమహంకారస్య పరిసరవర్తిత్వేఽపి విషయాణాం తద్గ్రాహిత్యాత్సభ్యపురుషసామ్యం నానావిధవికారవత్త్వాన్నర్తకీసామ్యం ధియః ధీవిక్రియాణామనుకూలవ్యాపారవత్త్వాత్తాలాదిధారిసమానత్వమింద్రియాణామేతత్సర్వావభాసకత్వాత్సాక్షిణో దీపసాదృశ్యమస్తీతి ద్రష్టవ్యం.

టీ. అహంకారః=నేననెడి యభిమానముఁ జెందెడి జీవుఁడు, ప్రభుః=ప్రభువు, విషయాః = విషయములు, సభ్యాః=సభ్యులు, మతిః=బుద్ధి, నర్తకీ=ఆటకత్తె, అక్షాణి = ఇంద్రియములు, తాలాదిధారిణి=తాళము, మద్దెల మొదలగువానిని వాయించువారలు, సాక్షీ=జీవుఁడు, అవభాసకః = ప్రకాశింపఁజేసెడి, దీపః=దీపము.

తా. జీవుఁడు ప్రభువువంటివాఁడు. విషయములు సభ్యులు. బుద్ధి యాటకత్తెవంటిది. ఇంద్రియములు నాటకాంగములగు తాళాదుల వంటివి. సాక్షిచైతన్యము వీని నన్నిటిని ప్రకాశింపఁజేసెడి దీపమును బోలును.

అవ. సాక్షికి దీపసామ్యము నింకను జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వస్థానసంస్థితో దీపస్సర్వతో భాసయేద్యథా,
స్థిరస్థాయీ తథా సాక్షీ బహిరంతః ప్రకాశయేత్. 15

వ్యా. నను సాక్షిణోఽప్యహంకారాద్యవభాసకత్వే తేన తేన సంబంధాపగమా-గమనరూపవికారవత్త్వం స్యాదిత్యాశంక్యాహ—స్వస్థానేతి. దీపో యథా గమనాది వికారశూన్యః స్వదేశేఽవస్థిత ఏవ సన్ స్వసన్నిహితాఖిలపదార్థానవభాసయతి, ఏవం సాక్ష్యపీతి భావః.

టీ. స్వస్థానసంస్థితః = తన స్థానమం దున్న, దీపః=దీపము, సర్వతః=అంతటను, యథా = ఎట్లు, భాసయేత్ = ప్రకాశింపఁజేయుచున్నదో, తథా = అట్లే, స్థిరస్థాయీ= నిశ్చలమైన, సాక్షీ = సాక్షి, బహిరంతః = దేహమునకు లోపలను, వెలుపలను, ప్రకాశయేత్ = ప్రకాశింపఁజేయును.

తా. రంగస్థలదీపము సంస్థానమందుండియే సర్వమును ఎట్లు ప్రకాశింపఁజేయుచున్నదో, ఆరీతిని నిశ్చలుఁడైన సాక్షి సర్వేంద్రియములను ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

అవ. బహిరంతర్గతమన్నములు సాక్షికి లే వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. బహిరంతర్విభాగోఽయం దేహాపేక్షో న సాక్షిణి,
విషయా బాహ్యదేశస్థా దేహస్యాంతరహంకృతిః. 16

వ్యా. నను సాక్షిణో బహిరంతరవభాసకత్వాభిమానమనుపపన్నం. 'అపూర్వమనపరమనంతరమబాహ్య' మితి శ్రుత్యా తస్య బాహ్యాంతరవిభాగాభావాభిధానాదిత్యాశంక్యాహ—బహిరితి. కస్య బాహ్యత్వం కస్య చాంతరత్వమిత్యత ఆహ—విషయేతి.

టీ. అయం = ఈ, బహిరంతర్విభాగః = బాహ్యాంతరభేదము, దేహాపేక్షః = దేహమునుబట్టియే కలిగెను, (కాని), సాక్షిణి న=ఈభేదము సాక్షికి లేదు. (ఎట్లనఁగా) విషయాః = విషయములు, బాహ్యదేశస్థాః = దేహమునకు వెలుపలనుండునవి, అహంకృతిః=అహంకారము, దేహస్య అంతః=దేహముయొక్క లోపలిది.

తా. విషయములు దేహమునకు బాహ్యదేశస్థములు. అహంకారము దేహములోననుండు వృత్తి. సాక్షికి దేహాపేక్షయే లేదు. అనఁగా సాక్షి దేహమున కంటని దేహవ్యతిరిక్తపదార్థ మగుటంజేసి బహిరంతర్విభాగవిషయచర్చ సాక్షినిగూర్చి లేనే లేదు.

అవ. సాక్షీ నిశ్చయముగా నిశ్చలుఁడయ్యును, బుద్ధియొక్క చలించు స్వభావము సాక్షియందు వృథగా నారోపింపబడుచున్న దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అంతస్థా ధీ స్సహైవాక్షైర్బహి ర్యాతి పునఃపునః,
బాహ్యబుద్ధిస్థచాంచల్యం సాక్షిణ్యారోప్యతే వృథా. 17

వ్యా. నను, స్థిరస్థాయీ తథా సాక్షీ బహిరంతః ప్రకాశయే 'దిత్యవికారిణస్సతో బహిరంతరవభాసకత్వోక్తిరయుక్తా. అహం ఘటం పశ్యామీత్యత్రాహమిత్యంతరహంకారసాక్షితయా ప్రథమతో భాసకస్యానంతరం ఘటం పశ్యామీతి ఘటాకారవృత్తి

స్ఫురణరూపేణ బహిర్నిర్గమానుభవాదిత్యాశంక్యాహ—ంతస్థేతి. ద్రష్టృగ్రాహకత్వేన దేహాంతరావస్థితా బుద్ధిః రూపాదిగ్రహణాయ చక్షురాదిద్వారా భూయో నిర్గచ్ఛతి తథా చ తన్నిష్ఠం చాంచల్యం తద్భాసకే సాక్షిణ్యారోప్యతే. అతో న వాస్తవం సాక్షిణశ్చాంచల్యమితి భావః.

టీ. అంతస్థా=దేహములో నున్న, ధీః=బుద్ధి, అక్షైః=ఇంద్రియములతో, సహ=కూడ, పునః పునః=పలుమాఱు, బహిః=బహిర్విషయములపై, యాతి = పొందుచున్నది (ప్రసరించుచున్నది). అతః=అందువలన, బాహ్యబుద్ధిస్థచాంచల్యం=సాక్షికి వెలుపటనున్న బుద్ధియొక్క చాంచల్యము, వృథా = నిష్ప్రయోజనముగా, సాక్షిణి = సాక్షియందు, ఆరోప్యతే = ఆరోపింపఁబడుచున్నది.

తా. బుద్ధికి ఇంద్రియములద్వారా బాహ్యవిషయగ్రహణము నందుఁ గలిగిన చంచలత్వము నిష్ప్రయోజనముగా సాక్షియందారోపింపఁబడుచున్నదే కాని వాస్తవజ్ఞానముచే సాక్షికి చంచలత్వ మెంత మాత్రమును లే దని తెలిసికొనఁదగును.

అవ. నిశ్చలమైన సాక్షియందు బుద్ధియొక్క బాహ్యచాంచల్యస్వభావ మారోపింపఁబడుచున్నది గాని నిశ్చయముగా సాక్షి అచలమైన పదార్థ మని పైశ్లోకమందు చెప్పఁబడియెఁగదా! దానికి దార్ష్టాంతికమును చూపుచున్నాఁడు:—

శ్లో. గృహాంతరగతస్స్వల్పో గవాక్షా దాతపోఽచలః,
తత్ర హస్తే నర్త్యమానే నృత్యతీవాతపో యథా. 18

వ్యా. భాసకే భాస్యచాంచల్యారోపః క్వ దృష్ట ఇత్యాశంక్యాహ—గృహాంతర గత ఇతి. గవాక్షాత్ గృహాంతరం గతః స్వల్పాతపోఽచల ఏవ వర్తతే. తత్ర తస్మిన్నాతపే పురుషేణ హస్తే నృత్యమానే ఇతస్తతశ్చాల్యమానే యథా ఆతపో నృత్యతీవ చలతీవ లక్ష్యతే; న తు చలతీత్యర్థః.

టీ. గవాక్షాత్ = కిటికీలోనుండి, గృహాంతరగతః=గృహములోనికి చొచ్చిన స్వల్పః=కొంచెమైన, ఆతపః=ఎండ, అచలః=నిశ్చలమైనదే అయినను, తత్ర=ఆయెండయందు, హస్తే నర్త్యమానే సతి=చేయి కదలింపఁబడుచుండఁగా (అనఁగా ఒక పురుషుఁడు తన చేతిని ఆట్టి యెండయందు ఆడించినయెడల), ఆతపః = ఎండ, యథా = ఎట్లు నృత్యతీవ=కదలుచున్నట్లుండునో అట్లే సాక్షియు కదలకుండినను కదలునట్లు తోఁచును.

తా. ప్రకాశింపఁజేయఁబడెడు వస్తువుయొక్క గుణము ప్రకాశింపఁజేసెడు వస్తువునం దారోపించుట మన యనుభవమందుఁ జూపి దానిమూలమున బాహ్యవస్తువునందు బుద్ధియొక్క సంచారముచే సూచించిన సహజచాంచల్యము బుద్ధిని ప్రకాశింపఁజేసి బుద్ధియొక్క సంచారమునుకూడ గుర్తెఱింగెడి సాక్షియం దారోపింపఁ బడుచున్నదే కాని, వాస్తవముగా సాక్షి నిశ్చలమైన దని చెప్పుచున్నాఁడు. ఎటుల కిటికీలోనుండి గృహమునఁ బ్రవేశించుచున్న యెండ నిజముగా కదలిక లేనిదయ్యును, ఆయెండలో చేయి కదలించినయెడల ఎండయే కదలిన ట్లగపడునో అట్లే బుద్ధి బాహ్యవస్తువులయందు ప్రవేశించి నపుడు సాక్షియే చలించుచున్నట్లు వాస్తవవ్యతిరిక్తముగా తోఁచు చున్నది.

అవ. బుద్ధియొక్క చాంచల్యము పైఁజెప్పినరీతిని సాక్షియం దారోపింపఁబడుటం జేసి బుద్ధి సేసెడి గమనాగమనములు సాక్షియే చేయుచున్నటుల మన కగపడుచున్నది. వాస్తవముగా సాక్షి నిశ్చలుఁడు. ఆతనికి గమనాగమనములు లేవు అని చెప్పు చున్నాఁడు:—

శ్లో. నిజస్థానస్థితస్సాక్షీ బహిరంతర్గమాగమౌ,
అకుర్వన్ బుద్ధిచాంచల్యాత్కరోతీవ తథా తథా. 19

వ్యా. దార్ష్టాంతికమాహ—నిజస్థానేతి.

టీ. నిజస్థానస్థితః = స్వస్థానమం దుండెడి, సాక్షీ=సాక్షిభూతుఁడగు పరమాత్మ, బహిః=బయటను, అంతః=లోనను, గమాగమౌ = పోయివచ్చుటలను, అకుర్వన్ = (నిజముగా) చేయకున్నను, బుద్ధిచాంచల్యాత్ = బుద్ధియొక్క చంచలస్వభావమువలన, తథాతథా=బుద్ధియొక్క చాంచల్యమునననుసరించి, కరోతీవ=చేయించుచున్నటులనే కనుపించుచున్నాఁడు.

తా. నిజముగా సాక్షి యగు పరమాత్మ స్వస్థానముననే యున్నాఁడు. ఆయనకు గమనాగమనములు లేవు. ఏల యన, గమనాగమనములు చేయవలసిన యావశ్యకత లేదు. స్వస్థానమం దుండియే సర్వేంద్రియ క్రియలను గుర్తెఱుంగు సామర్థ్యము ఆసాక్షికిఁగలదు గాన, ఆయనకు గమనాగమనజనితచాంచల్యము వాస్తవముగా లేదు. కాని

బుద్ధికి బాహ్యావస్తుసంచారముచేఁ గలిగెడి గమనాగమనము లాసాక్షికి సంబంధించినవే యని తోఁచుచున్నవి.

అవ. పైశ్లోకమున నిజస్థానస్థితస్సాక్షీ (స్వస్థానమందున్న సాక్షీ) అని చెప్పఁబడెను. ఈశ్లోకమున సాక్షియొక్క దేశ మెద్దియో చెప్పుచున్నాఁడు:—

శ్లో. న బాహ్యో నాంతరస్సాక్షీ బుద్ధేర్దేశౌ హి తావుభౌ,
బుద్ధ్యాద్యశేషసంశాంతౌ యత్ర భాత్యస్తి తత్ర సః. 20

వ్యా. నిజస్థానస్థిత ఇత్యనేన కిం బాహ్యాదిదేశస్థత్వమేవోచ్యతే? నేత్యాహ—న బాహ్యమితి. తత్ర హేతుమాహ—బుద్ధేరితి. తర్హి కిం వివక్షితమిత్యత ఆహ—బుద్ధ్యాదీతి. ఆదిశబ్దేనేంద్రియాదయో గృహ్యంతే. సంశాంతిశబ్దేన తత్ప్రతీత్యుపరతిర్వివక్షితా.

టీ. హి=ఎందుచేత, ఉభౌ = రెండైన, తౌ = పైశ్లోకములో చెప్పిన బాహ్యాంతర్దేశములు, బుద్ధేః = బుద్ధియొక్క, దేశౌ = సంచారభూము లగునో, తతః = అందుచేతనే, సాక్షీ = పరమాత్మ, బాహ్యః = బాహ్యప్రదేశము కలవాఁడు, న = కాఁడు. అంతరః = అంతరము కలవాఁడు, న = కాఁడు. యత్ర = ఏదేశమున, బుద్ధ్యాద్యశేషసంశాంతౌ = బుద్ధి మొదలగు ఇంద్రియములకు మిక్కిలి శాంతి కలుగుచున్నదో (అనఁగా) ఎచ్చోట బుద్ధిగాని మఱి యేయింద్రియములు గాని సంచరింపవో, ఎచ్చట ఇంద్రియవ్యాపారమించుకేని లేదో, యత్ర = ఎచ్చట, సః=ఆపరమాత్మ, భాతి=సహజప్రకాశత్వముచే వెలుఁగొందుచున్నాఁడో, తత్ర = అచ్చట, సః = ఆసాక్షి, అస్తి = ఉన్నాఁడు.

తా. ఇంద్రియములయొక్కయు, సాక్షియొక్కయు దేశములు వేఱు వే అని చెప్పుచున్నాఁడు. బాహ్యాంతర్దేశములు బుద్ధిసంచారస్థానము లగుటచే రెండు ప్రదేశములును సాక్షియొక్క దేశములు కావు. ఎక్కడ బహిరింద్రియములు గాని, అంతరింద్రియములు గాని ప్రవేశింపవో అక్కడ స్వయంప్రకాశమానుఁడై సాక్షి ఉన్నాఁడు.

అవ. సాక్షికి వ్యవహారశూన్యత చెప్పినట్లయిన, ఆయనకు ఏదేశమును ఉండఁదగదు. దేశాభావ మేర్పడును. దేశాభావ మేర్పడిన "స్వస్థానస్థితుఁ డగు సాక్షి" అని చెప్ప వీలుపడ దని ఆక్షేపణ చేయఁగా స్వాభిప్రాయమును విస్తరించుచున్నాఁడు:—

శ్లో. దేశః కోఽపి న భాసేత యది తర్హ్యస్తు దేశభాక్,
సర్వదేశప్రక్లృప్త్యైవ సర్వగత్వం న తు స్వతః. 21

వ్యా. నను సర్వవ్యవహారోపరతౌ దేశ ఏవ నోపలక్ష్యతే. కుతస్తన్నిష్ఠత్వ ముచ్యత ఇత్యాశంక్య స్వాభిప్రాయ మావిష్కరోతి—దేశ ఇతి. దేశాదికల్పనాధిష్ఠా నస్య స్వాతిరిక్తదేశాపేక్షా నాస్తీతి భావః. నను దేశాద్యభావే శాస్త్రే సర్వగతత్వసర్వ సాక్షిత్వాద్యుక్తిర్విరుధ్యేతేత్యత ఆహ—సర్వదేశేతి. స్వాభావిక మేవ కిం న స్యాది త్యత ఆహ—నతు స్వత ఇతి. అద్వితీయత్వాదసంగత్వాచ్చేతి భావః.

టీ. దేశః కోఽపి=ఏదేశమును, న భాసేత యది=కుదుర దని యంటివేని, అదేశ భాక్=దేశకూన్యతను పొందినవాఁడు, అస్తు=అగుఁగాక. సర్వదేశ ప్రక్లృప్త్యైవ=సర్వదేశ కల్పనచేతనే, సర్వగత్వం=సర్వగతత్వము, స్యాత్=అగును. స్వతస్తు=స్వాభావికముగా, న = కాదు.

తా. సర్వదేశాదికల్పనకు నాధారుఁ డగు సాక్షికి అన్యదేశా పేక్షయే లేదు. (సాక్షియే సర్వదేశములకు అధిష్ఠానుఁ డయిన, అతనికి వేఱుదేశ మేల కావలెను?) దేశాభావముచేత సాక్షికి సాధారణ ముగా చెప్పఁబడెడి సర్వగతత్వ సరసాక్షిత్వములకు విరోధము కలుగు నని యాక్షేపణము చేయఁగా, సాక్షికి సర్వగతత్వము సర్వదేశ కల్పన చేతనే యేర్పడుచున్న దని సమాధానము చెప్పుచున్నారు.

అవ. స్వదేశకల్పనచేతనే సర్వగతత్వ మేర్పడుచున్న దని చెప్పుటచే సర్వగత త్వము సాక్షికి స్వాభావికము కా దని యొప్పుకొనఁబడుచున్నది. సర్వగతత్వమువలె సర్వసాక్షిత్వమును ఆత్మకు వాస్తవము గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అంతర్బహిర్వా సర్వం వా యం దేశం పరికల్పయేత్,
బుద్ధిస్తద్దేశగస్సాక్షీ తథా వస్తుషు యోజయేత్. 22

వ్యా. సర్వగతత్వవత్సర్వసాక్షిత్వమపి న వాస్తవమిత్యాహ—అంతర్బహిరితి.

టీ. బుద్ధిః = బుద్ధి, అంతః = లోపలిదైనను, బహిర్వా = వెలుపటిదియైనను, సర్వం వాపి = సమస్తమగు, యం=ఏ, దేశం=దేశమును, పరికల్పయేత్=కల్పించునో, సాక్షీ = సాక్షి, తద్దేశగః = ఆదేశమును పొందినవాఁడగును. తథా = అట్లే, వస్తుషు = వస్తువులయందును, యోజయేత్ = ఊహింప నగును.

తా. బుద్ధి తన సంచారవ్యాపారమునం దేదేశమును కల్పించుచున్నదో, ఆదేశమును సాక్షి పొందినవాఁ డగుచున్నాఁడు. అట్లే బుద్ధి ఏవస్తువుపై ప్రసరించునో, సాక్షి ఆవస్తువును పొందినవాఁ డగును. సాక్షికి బుద్ధియొక్క చాంచల్యమును గమనాగమనములు ఎట్లారోపింపఁ బడుచున్నవో, అట్లే బుద్ధియొక్క దేశవస్తుపరికల్పనయు సాక్షియం దారోపింపఁబడుచున్నదే కాని, వాస్తవముగా ఈగుణము లేవియు సాక్షికి స్వాభావికములు గావని సారాంశము.

అవ. వస్తువులయందు ఊహించెడి పద్ధతిని తెలుపుచున్నాఁడు:—

శ్లో. యద్యద్రూపాది కల్ప్యేత బుద్ధ్యా తత్తత్ప్రకాశయన్,
తస్య తస్య భవేత్సాక్షీ స్వతో వాగ్బుద్ధ్యగోచరః. 23

వ్యా. తథా వస్తుషు యోజయేదిత్యేతత్ప్రపంచయతి—యద్యదితి. తర్హి కిం తస్య నిజరూపమిత్యత ఆహ—స్వత ఇతి.

టీ. బుద్ధ్యా = బుద్ధిచే, యద్యత్ = ఏయే, రూపాది = రూపాదికము, కల్ప్యేత = కల్పింపఁబడుచున్నదో, తత్తత్ = ఆయారూపాదికమును, ప్రకాశయన్ = ప్రకాశింపఁజేయుచు, తస్య తస్య = ఆయా యాకారములకు, సాక్షీ భవేత్ =పరమాత్మ సాక్షి యగును. స్వతః=తా నయితే, వాగ్బుద్ధ్యగోచరః = నోటితో వచించుటకుఁగాని, మనస్సుతో తెలిసికొనుటకుఁ గాని వీలులేనివాఁడు. (అనఁగా వచించుటయు తెలిసికొనుటయు కష్ట మనుట).

తా. బుద్ధి ఏయేవస్తువులయందు ప్రసరించుచున్నదో, ఏయే యాకారములను చెందుచున్నదో పరమాత్మ ఆయారూపములను, ఆకారములను ప్రకాశింపఁజేయుచు, వానికి సాక్షిభూత మగుచున్నది. అంతియకాని సహజముగా సర్వసాక్షిత్వము పరమాత్మకు లేదు. పరమాత్మయొక్క నిజరూప మే మన, ఆయన అవాఙ్మానసగోచరుఁ డని చెప్పవలయును గాని వేఱేమియుఁ జెప్ప వీలు లేదు.

అవ. పరమాత్మ అవాఙ్మానసగోచరుఁ డన్నచో, ముముక్షువులచే నెట్లు గ్రహింపఁబడ గలఁ డనెడి యాక్షేపమునకు సమాధానము:—

శ్లో. కథం తాదృఙ్మయా గ్రాహ్య ఇతి చేన్నైవ గృహ్యతామ్,
సర్వగ్రహోపసంశాంతౌ స్వయమేవావశిష్యతే. 24

వ్యా. అవాఙ్మనసగోచరత్వే ముముక్షుణా న గృహ్యేతేతి శంకతే—కథమితి. అగ్రాహ్యత్వమిష్టమేవేత్యాహ—నైవేతి. నన్వాత్మనో విచారేణ వినష్టాయాం మాయాయాం శిష్యతే స్వయమిత్యుక్తం పరమాత్మావశేషణం న సిద్ధ్యేదిత్యత ఆహ—సర్వగ్రహేతి. స్వాత్మాతిరిక్తస్య ద్వైతస్య మిథ్యాత్వనిశ్చయేన తత్ప్రతీత్యుపశాంతౌ స్వాత్మైవ సత్యతయాఽవశిష్యత ఇతి భావః.

టీ. తాదృక్=అవాఙ్మనసాగోచరుఁడగు సాక్షి, మయా=మోక్షేచ్ఛగల నాచే. కథం=ఎట్లు, గ్రాహ్య ఇతి చేత్ = గ్రహింపఁబడఁగలఁడనెదవేని, నైవ గృహ్యతాం = గ్రహింపఁబడకయే యుండుఁగాక. (అయిన నేమి నష్ట మున్నది?) సర్వగ్రహోపసంశాంతౌ సత్యాం = సర్వప్రపంచమునకు లయము కలుగుచుండఁగా, స్వయమేవ = పరమాత్మయే, అవశిష్యతే = మిగులును.

తా. పరమాత్మ అవాఙ్మనసగోచరుం డగుటచే ముముక్షువులకుఁ గూడ గ్రహింప నశక్యుఁడే అయినను, సర్వకాలసర్వావస్థలయందును, బ్రహ్మపదార్థవిచారముచేఁ గలిగెడి ద్వైతమిథ్యాత్వనిశ్చయముచే, బ్రహ్మేతరపదార్థమిథ్యాత్వనిశ్చయజ్ఞానముచే, ముముక్షువు సర్వమును మఱచి, పరమాత్మ యగు తానే శేషించుట గుర్తెఱుంగఁగలఁడు. బ్రహ్మేతరపదార్థములన్నియు నశించుననియు, బ్రహ్మపదార్థ మొక్కటియే అనశ్వరము, సత్యము. అట్టి బ్రహ్మము సర్వేంద్రియక్రియాసాక్షిభూతుఁడగు తానే యనెడి నిశ్చయము గలిగినపుడు ముముక్షువు పరమాత్మయే మిగులు నని గ్రహింపఁగలఁడు.

శ్లో. న తత్ర మానాపేక్షాస్తి స్వప్రకాశస్వరూపతః,
తాదృగ్వ్యుత్పత్త్యపేక్షా చేచ్ఛ్రుతిం పఠ గురోర్ముఖాత్. 25

వ్యా. యద్యప్యుక్తన్యాయేన స్వాత్మా పరిశిష్యతే, తథాపి తదాపరోక్ష్యాయ కించిత్ప్రమాణమపేక్షితమిత్యత ఆహ—న తత్రేతి. తత్ర హేతుమాహ—స్వప్రకాశేతి. నన్వాత్మనః స్వప్రకాశతయా స్వతః స్ఫూర్త్యా మానం నాపేక్ష్యత ఇతి వ్యుత్పత్తిసిద్ధయే మానమపేక్షితమిత్యాశంక్య శ్రుతిరేవాత్ర ప్రమాణమిత్యాహ—తాదృగితి.

టీ. స్వప్రకాశత్వస్వరూపతః=(పరమాత్మ) స్వప్రకాశస్వరూపుఁడై యుండుట చేత, తత్ర = ఆపరమాత్మవిషయమై, మానాపేక్షా = ప్రమాణముయొక్క ఆవశ్యకత, నాస్తి = లేదు. తాదృగ్వ్యుత్పత్త్యపేక్షా చేత్ = అటువంటి వ్యుత్పత్తియొక్క ఇష్ట మున్నచో, గురోః=సద్గురువులయొక్క, ముఖాత్=ముఖమునుండి, శ్రుతిం=వేదమును, పఠ = చదువుకొనుము.

తా. పరమాత్మయొక్క అపరోక్షత్వమునకు ఆయన స్వప్రకాశ స్వరూపుఁ డగుటవలన ప్రమాణ మనవసరము. స్వప్రకాశస్వరూపుఁ డగుటచే ప్రమాణ మనవసరమనెడి వ్యుత్పత్తికైనను ప్రమాణ మక్కఱ లేదా యని శంకింతువేని, నీవు గురువులయొద్ద శ్రుతులను పఠించినచో అట్టి ప్రమాణము తెలియఁగలదు.

అవ. ఉత్తమాధికారికి ద్వైతమిథ్యాజ్ఞాననిశ్చయమువలనను, పరమాత్మయగుట శేషించు నని చెప్పి, మందాధికారికి ఆత్మానుభవోపాయము చెప్పుచున్నాఁడు:—

శ్లో. యది సర్వగ్రహత్యాగో ఽశక్యస్తర్హి ధియం వ్రజ,
శరణం తదధీనోఽంతర్బహిరైవైషోఽనుభూయతామ్. 26

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం
నాటకదీపస్సమాప్తః.

వ్యా. ఏవముత్తమాధికారిణ ఆత్మానుభవోపాయమభిధాయ, మందాధికారిణస్తం దర్శయతి—యదీతి. బుద్ధిశరణత్వే కిం ఫలమిత్యత ఆహ—తదధీన ఇతి. బుద్ధ్యా యదవ్యుత్పరికల్ప్యతే, బాహ్యమాంతరం వా తస్య తస్య సాక్షిత్వేన తదధీనః పరమాత్మా వానుభూయతామిత్యర్థః.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యశ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ
రామకృష్ణాఖ్యవిదుషా విరచితం తాత్పర్యబోధినీనామకం నాటకదీప
వ్యాఖ్యానం సమాప్తమ్.

టీ. సర్వగ్రహత్యాగః = సర్వప్రాపంచిక వ్యవహారత్యాగము, అశక్యో యది= శక్యము గానిచో, తర్హి=అట్లయిన, ధియం = బుద్ధిని, శరణం=రక్షింపు మని, వ్రజ = ప్రార్థింపుము. తదధీన-తత్=ఆబుద్ధికి, అధీనః=ఆధీనుఁడగు, ఏషః=ఈపరమాత్మ, అంతః =

దేహములోపలను, బహిర్వా = దేహముబయటను, అనుభూయతాం = అనుభవింపఁబడుఁగాక.

తా. ప్రాపంచిక వ్యవహారమును వదలుటకు నీకు శక్తి లేదేని, బుద్ధికి లోనై బుద్ధిచే దేహములోపలఁ గాని వెలుపటఁ గాని ఏరూపాదికము కల్పింపఁబడుచున్నదో, ఆరూపాదికమునకు సాక్షివై, ఆపరమాత్మను అనుభవింపుము.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు నాటకదీప మను దశమప్రకరణము.

---

## సారాంశము.

ఈ పైశ్లోకములందు బుద్ధియొక్క గుణములును, వ్యాపారమును సాక్షి కారోపింపఁబడుచున్నవి గాని వాస్తవముగా నవి సాక్షికి సహజములు గా వని చెప్పఁబడెను. బుద్ధియొక్కయు సాక్షియొక్కయు గుణములును వ్యాపారములును వేర్వేరని నిరూపింపఁబడుటచే, సాక్షిభూతుఁడగు పరమాత్మ బుద్ధికన్నను భిన్నుఁ డని గుర్తెఱుంగునది.

---

శ్రీ రస్తు.
శ్రీ గణేశాయ నమః



# శ్రీవేదాంతపంచదశి

## ఏకాదశ ప్రకరణము

## యోగానంద ప్రకరణము

అవ. విద్యారణ్యమునులు 'బ్రహ్మానంద' మనెడు గ్రంథమును చెప్పఁదలఁచి దాని ప్రయోజనమును మొదటఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందం ప్రవక్ష్యామి జ్ఞాతే తస్మిన్నశేషతః,
ఐహికాముష్మికానర్థవ్రాతం హిత్వా సుఖాయతే. 1

వ్యాఖ్యానమ్.

నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ,
బ్రహ్మానందాభిధం గ్రంథం వ్యాకుర్వే బోధసిద్ధయే.

వ్యా. చికీర్షితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయ పరిపంథికల్మష నివృత్తయేఽభిమతదేవతాతత్త్వానుసంధానలక్షణం మంగళమాచరన్ శ్రోతృప్రవృత్తి సిద్ధయే సప్రయోజనమభిధేయమావిష్కుర్వన్ గ్రంథారంభం ప్రతిజానీతే—బ్రహ్మానందమితి. "నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః, యే మందాస్తేఽనుకంప్యంతే సవిశేషనిరూపణైః." సవిశేషబ్రహ్మరూపాణాం దేవతానాం తత్త్వస్య నిర్విశేష బ్రహ్మరూపత్వాభిధానాద్బ్రహ్మణశ్చ "ఆనందో బ్రహ్మే"త్యాదిశ్రుతిభిరానందరూపతాభిధానాత్ బ్రహ్మానందమిత్యానందరూపస్య బ్రహ్మణో వాచకశబ్దప్రయోగేన "యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతీ"తి శ్రుతిప్రోక్తన్యాయేన బ్రహ్మానుసంధానలక్షణం మంగళాచరణం సిద్ధం. బ్రహ్మణశ్చ సర్వవేదాంతప్రతిపాద్యత్వాత్తత్ప్రకరణరూపస్యాస్య గ్రంథస్యాపి తదేవ విషయ ఇతి బ్రహ్మశబ్దప్రయోగేణ విషయశ్చాపి సూచితః. ఐహికేత్యుత్తరార్థే వానిష్టనివృత్తీష్టప్రాప్తిరూపం ప్రయోజనద్వయం ముఖత ఏవోక్తం. బ్రహ్మానందః బ్రహ్మ చాసావానందశ్చేతి బ్రహ్మానందః. వాచ్యవాచకయో రభేదోప

చారాత్తత్ప్రతిపాదకో గ్రంథోఽపి బ్రహ్మానందస్తం ప్రవక్ష్యామీతి తస్మిన్ ప్రతిపాద్యప్రతిపాదకరూపే బ్రహ్మానందే జ్ఞాతేఽవగతే సతి ఐహికాముష్మికానర్థవ్రాతం ఐహికానాం ఇహలోకే భవానాం దేహపుత్రాదిష్వహం మమాభిమానప్రయుక్తానాం ఆధ్యాత్మికాదితాపానాం ఆముష్మికాణామముష్మిన్ పరలోకే భవానాం చ తేషా మనర్థానాం వ్రాతః సమూహః తం అశేషతః నిశ్శేషం యథా భవతి తథా హిత్వా పరిత్యజ్య సుఖాయతే సుఖరూపం బ్రహ్మైవ భవతి.

టీ. బ్రహ్మానందం = బ్రహ్మానంద మనెడు ప్రకరణమును, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను. తస్మిన్ = ఆబ్రహ్మానందము, నిశ్శేషతః = పూర్ణముగా, జ్ఞాతే సతి= తెలియఁబడిన దగుచుండఁగా, ఐహిక...తం - ఐహికాముష్మిక = ఇహలోక, పరలోక సంబంధములగు, అనర్థ = అనర్థములయొక్క, వ్రాతం = సమూహమును, హిత్వా = వదలి, సుఖాయతే=సుఖించును. (-చిదాభాసుఁ డని యధ్యాహారము).

తా. "నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తు మనీశ్వరాః, యే మందాస్తేఽనుకంప్యంతే సవిశేషనిరూపణైః" అనెడి శ్రుతి ఏ మంద ప్రజ్ఞులునిర్విశేషపరబ్రహ్మమును సాక్షాత్కరించుకొననసమర్థులో వారలు సవిశేషనిరూపణములచేత ననుగ్రహింపఁబడుచున్నా రని చెప్పుచున్నది. మఱియు సవిశేషబ్రహ్మరూపులగు దేవతలయొక్క స్వరూపమునకు నిర్విశేషబ్రహ్మరూపత్వము చెప్పఁబడుటవలనను, "ఆనందో బ్రహ్మే" త్యాది శ్రుతులచేత బ్రహ్మమునకు ఆనందరూపత్వము చెప్పఁబడుటవలనను, "బ్రహ్మానందం" అని యీగ్రంథ మారంభింపఁబడుటవలనను, "యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి" యనెడి న్యాయమువలన, బ్రహ్మానుసంధానలక్షణముగల మంగళాచరణ మీగ్రంథమునకు సిద్ధించిన దని తెలియవలెను. ఈశ్లోకముయొక్క ఉత్తరార్థమందు దుఃఖనివృత్తి ఇష్టప్రాప్తిరూపమగు ప్రయోజనద్వయము మొదటనే చెప్పఁబడెను. ఆప్రతిపాద్యప్రతిపాదకరూప మగు బ్రహ్మానందమును దెలిసికొనుటవలన ఇహలోకమందుఁగల దేహ పుత్రాదులయందు "నేను నాది" యనెడి యభిమానముతోఁ గూడిన ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక దుఃఖ సమూహంబును, పరలోకమందుఁగల ఆత్రివిధదుఃఖసమూహమును నిశ్శేషముగా విడిచి పురుషుఁడు నిత్యసుఖస్వరూపపరబ్రహ్మమే తా నగు నని యభిప్రాయము.

అవ. బ్రహ్మజ్ఞానమువలన సర్వాభీష్టములు సిద్ధించు నని చెప్పెడి శ్రుతిస్మృతులను గనుపఱచుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మవిత్పరమాప్నోతి శోకం తరతి చాత్మవిత్,
రసో బ్రహ్మ రసం లబ్ధ్వాఽనందీభవతి నాన్యథా. 2

వ్యా. బ్రహ్మజ్ఞానస్యానిష్టనివృత్తీష్టప్రాప్తిహేతుత్వే బహూని శ్రుతిస్మృతివాక్యాని ప్రమాణాని సంతీతి ప్రదర్శయితుకామస్తావత్ 'బ్రహ్మవిదాప్నోతి పరం', 'శ్రుతం హ్యేవ మేవ భగవద్దృశేభ్య స్తరతి శోకమాత్మవిదితి, సోఽహం భగవశ్శోచామి తం మా భగవాన్ శోకస్య పారం తారయ'త్వితి వాక్యద్వయమర్థతః పఠతి—బ్రహ్మవిదితి. బ్రహ్మవేత్తీతి బ్రహ్మవిత్ పరముత్కృష్టమానందరూపం బ్రహ్మ ప్రాప్నోతి. ఆత్మవిత్ భూమశబ్దవాచ్యం దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యం ఆత్మానం వేత్తీత్యాత్మవిత్ శోకం స్వసంస్పృష్టం పురుషం శోచయతీతి శోక స్తమోమూలః సంసార స్తం తరతి అతిక్రామతి. ననూదాహృతతైత్తిరీయకశ్రుతివాక్యే బ్రహ్మజ్ఞానస్య పరప్రాప్తిహేతుత్వావభాసతే నానందప్రాప్తిహేతుతేత్యాశంక్య ఆనందప్రాప్తిహేతుత్వప్రతిపాదనపరం 'రసో వై సః, రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవ'తీతి తదీయమేవ వాక్యమర్థతః పఠతి—రస ఇతి. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ', 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత' ఇతి ప్రకరణాదౌ బ్రహ్మాత్మశబ్దాభ్యా మభిహితో య ఆత్మాఽసౌ రసః సార ఆనందరూప ఇత్యర్థః. రసమానందరూపం బ్రహ్మ లబ్ధ్వా బ్రహ్మాహమస్మీతి జ్ఞానేన ప్రాప్యానందీభవతి. అపరిచ్ఛిన్ననిరతిశయసుఖవాన్ భవతి. ఉక్తమర్థం వ్యతిరేకప్రదర్శనేన ద్రఢయతి—నాన్యథేతి. అన్యథా బ్రహ్మాత్మైకత్వజ్ఞానం విహాయ సాధనాంతరానుష్ఠానేన నానందీభవతీత్యర్థః.

టీ. బ్రహ్మవిత్=నిర్గుణపరబ్రహ్మమును దెలిసికొనినవాఁడు, పరం=నిరతిశయానందరూప బ్రహ్మమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. ఆత్మవిత్=భూమశబ్దముచేఁ జెప్పఁదగిన ఆత్మ నెఱిఁగినవాఁడు, శోకం = తమోమూలమగు సంసారదుఃఖమును, తరతి = తరించుచున్నాఁడు. రసః = ఆనందరూపుఁడగు ఆత్మ, రసం=ఆనందరూపమగు, బ్రహ్మ= బ్రహ్మమును, లబ్ధ్వా = పొంది, (అహం బ్రహ్మాస్మి యనెడి జ్ఞానముచేత), ఆనందీభవతి= నిరతిశయానందము గలవాఁడుగ అగుచున్నాఁడు. అన్యథా = మఱియొకవిధముగ, న= కాఁజాలఁడు.

తా. తైత్తిరీయోపనిషత్తు "బ్రహ్మవిదాప్నోతి పరం" (బ్రహ్మవిదుఁడు కైవల్యమును పొందును.) అని చెప్పుచున్నది. "తరతి శోక

మాత్మవిత్" అనెడి ఐతరేయశ్రుతి ఆత్మవిదుఁడు సర్వశోకమునుండి ముక్తుఁడగు నని చెప్పుచున్నది. "రసో వై సః, రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీభవతి" అను తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మ మానందస్వరూప మనియు, అట్టి బ్రహ్మస్వరూపవిజ్ఞప్తిచేతనే, ఆనందము లభించు ననియు చెప్పుచున్నది. కాఁబట్టి నిర్గుణ బ్రహ్మమును దెలిసికొనిన ఆత్మవిదుఁడు సంసారదుఃఖమును తరించి, నిరతిశయానందమును బొందును. ఇతరోపాయములవలన నిట్టి యుత్కృష్టపదవి లభింపదు. అని యభిప్రాయము.

శ్లో. ప్రతిష్ఠాం విందతే స్వస్మి న్యదా స్యాదథ సోఽభయః,
కురుతేఽస్మిన్నంతరం చేదథ తస్య భయం భవేత్. 3

వ్యా. ఏవమన్వయముఖేనేష్టప్రాప్త్యనిష్టనివృత్తిప్రతిపాదనపరాణి వాక్యాని ప్రదర్శ్య అన్వయవ్యతిరేకాభ్యామనర్థనివృత్తిప్రదర్శనపరం 'యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి, యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే, అథ తస్య భయం భవ' తీతి వాక్యద్వయమర్థతోఽనుక్రామతి—ప్రతిష్ఠామితి. అస్యాయమర్థః. యదా యస్మిన్ కాలే, హీతి విద్వత్ప్రసిద్ధి ప్రదర్శనపరో నిపాతః. ఏవేత్యయ మేవానర్థనివృత్త్యుపాయో నాన్య ఇతి నియమనార్థః. ఏష ముముక్షుః ఏతస్మిన్విద్వదనుభవగమ్యే అదృశ్యే ఇంద్రియాగోచరే అనాత్మ్యే అనాత్మీయే స్వరూపతయా స్వకీయత్వరహితే అనిరుక్తే నిరుక్తం నిర్వచనం శబ్దేనాభిధానం యత్ర నాస్తి తదనిరుక్తం తస్మిన్నిలయనే నిలీయతేఽస్మిన్నితి నిలయనమాధారః స న విద్యతే యస్య తస్మిన్ స్వమహిమ్నిస్థితే ఇత్యర్థః. అభయమద్వితీయం. 'ద్వితీయాద్వై భయం భవ'తీతి శ్రుతేర్భయశబ్దేనాత్ర భయహేతు ర్భేదో లక్ష్యతే. న విద్యతే భయం భేదో యథా భవతి తథా ప్రతిష్ఠాం ప్రకర్షేణ సంశయవిపర్యయరాహిత్యేన స్థితిః బ్రహ్మాహమస్మీత్యవస్థానం ప్రతిష్ఠా తాం విందతే గురూపసత్త్యాదినా శ్రవణాదికం కృత్వా లభతే. అథ తదానీమేవ స ఏవం విద్వానభయంభయరహితం మోక్షరూపమద్వితీయం బ్రహ్మగతః ప్రాప్తోభవతి. 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతీ'తి శ్రుతేః. యదా యస్మిన్నేవ కాలే ఏష పూర్వోక్తః ఏతస్మిన్నదృశ్యత్వాదిగుణకే ప్రత్యగభిన్నే బ్రహ్మణి ఉదితి నిపాతోఽపిశబ్దార్థః. అరమురల్పమపి అంతరం భేదం ఉపాస్యోపాసకాదిలక్షణం కురుతే పశ్యతి. ధాతూనామనేకార్థత్వాత్. అథ తదానీమేవ తస్య భేదదర్శినో భయం సంసారప్రయుక్తం దుఃఖం భవతి.

టీ. యదా=ఎప్పుడు, స్వస్మిన్ = స్వస్వరూపమునందు, ప్రతిష్ఠాం=ప్రతిష్ఠను, (సంశయవిపర్యయరాహిత్యముచేత 'బ్రహ్మాహమస్మి' యనెడిస్థితిని), విందతే = పొందుచున్నాఁడో, అథ=అప్పుడే, సః=వాఁడు, అభయః = భయరహితుఁడు, స్యాత్=అగును. తస్మిన్ = ఆబ్రహ్మమందు, అంతరం = భేదమును, కురుతే చేత్ = చేయునెడల, అథ = అప్పుడే, తస్య = వానికి, భయం = భీతి, భవేత్ = అగును.

తా. పై వ్యాఖ్యానమందు దుదహరింపఁబడిన "యదా హ్యేవైష, అభయంప్రతిష్ఠాం విందతే" అనెడి శ్రుతి ఏకాలమందు ముముక్షువు విద్వదనుభవగమ్య మగునట్టియు, ఇంద్రియాగోచరమైనట్టియు, స్వరూపముచే స్వకీయత్వరహితమైనట్టియు, శబ్దముచే పేరు లేనట్టియు, స్వమహిమయం దున్నట్టియు, అద్వితీయబ్రహ్మమునందు అభేదబుద్ధితో సంశయవిపర్యయరాహిత్యముచేత, 'అహం బ్రహ్మాస్మి' యనెడి స్థితిని గురూపదేశశ్రవణమననాదికములచేత పొందుచున్నాఁడో అప్పుడావిద్వాంసుఁడు భయరహిత మోక్షరూపాద్వితీయబ్రహ్మమును బొందినవాఁడగునని చెప్పుచున్నది. "యదా హ్యేవైష ఏతస్మిన్నుదర...తస్య భయం భవతి" యనెడి శ్రుతివాక్యము, ఏపురుషుఁడు ఏకాలమందు పూర్వోక్త ప్రత్యగభిన్నబ్రహ్మమందు కొంచెమైనను ఉపాస్యోపాసకాదిలక్షణభేదమును జూచుచున్నాఁడో అప్పుడే యాభేదదృష్టిగలవానికి సంసారప్రయుక్తదుఃఖము గలుగుచున్న దని చెప్పుచున్నది. ఇట్లీరెండు శ్రుతివాక్యములును అన్వయవ్యతిరేక ముఖముగ బ్రహ్మజ్ఞానమువలన దుఃఖనివృత్తియగు నని చెప్పుచున్నవి.

శ్లో. వాయుస్సూర్యో వహ్ని రింద్రో మృత్యుర్జన్మాంతరేఽంతరమ్,
కృత్వా ధర్మం విజానంతోఽప్యస్మాద్భీత్యా చరంతి హి. 4

వ్యా. భేదదర్శినాం భయం భవతీత్యేతద్దృఢీకర్తుం బ్రహ్మాత్మైకత్వజ్ఞానరహితానాం వాయ్వాదీనాం భయప్రదర్శనపరం 'భీషాఽస్మాద్వాతః పవత' ఇత్యాది మంత్రమర్థతః పఠతి—వాయురితి. వాయ్వాదయో జగన్నియామకత్వేన ప్రసిద్ధాః పంచాపి దేవతా అతీతే జన్మని ధర్మమిష్టాపూర్తాదిలక్షణం విజానంతోఽపి జ్ఞానపూర్వక మనుష్ఠితవంతోఽప్యంతరం ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కృత్వాఽస్మా ద్బ్రహ్మణో భీత్యాఽస్మిన్నాప్యాదిజన్మని చరంతి స్వస్వవ్యాపారేషు సదా ప్రవర్తంతే. హిశబ్దేన * "భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః, భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమ" ఇతి కఠశ్రుతౌ యమేనోక్తాం ప్రసిద్ధిం దర్శయతి.

టీ. వాయుః = వాయువు, సూర్యః = సూర్యుఁడు, వహ్నిః = అగ్ని, ఇంద్రః= ఇంద్రుఁడు, మృత్యుః=మృత్యువు, జన్మాంతరే=జన్మాంతరమందు, అంతరం=భేదమును, కృత్వా=చేసి, ధర్మం=ధర్మమును, విజానంతోఽపి=ఎఱింగినవారైనను, భీత్యా=భయము చేత, చరంతి హి=సంచరించుచున్నారుగదా !

తా. జగన్నియామకత్వముచేత సుప్రసిద్ధులగు వాయువు, సూర్యుఁడు, అగ్ని, ఇంద్రుఁడు, మృత్యువు ననెడి యీ పంచదేవతలును పూర్వజన్మమందు ఇష్టాపూర్తాదిలక్షణముగల ధర్మమును జ్ఞానపూర్వకముగా ననుష్ఠానముజేసినవారలైనను, ప్రత్యగాత్మబ్రహ్మములను భేదబుద్ధితోఁ జూచినవారలగుటచే నీవాయ్వాదిజన్మములయందు బ్రహ్మమునకు భీతిజెందినవారలై తమతమ వ్యాపారములయందుఁ బ్రవర్తించుచున్నారని 'భీషాఽస్మాద్వాతః పవతే' ఇత్యాదిమంత్రము చెప్పుచున్నది. ఈప్రకారమే 'భయాదస్యాగ్నిస్తపతి' ఇత్యాది కఠశ్రుతియుఁ జెప్పుచున్నది.

శ్లో. ఆనందం బ్రహ్మణో విద్వా న్న బిభేతి కుతశ్చన,
ఏతమేవ తపేన్నైషా చింతా కర్మాగ్ని సంభృతా. 5

వ్యా. నను 'తరతి శోకమాత్మవి'దిత్యాది షూదాహృతవాక్యేషు బ్రహ్మానందజ్ఞానస్యానర్థనివృత్తిహేతుత్వం స్పష్టం నావభాసత ఇత్యాశంక్య తథా ప్రతిపాదనపరం వాక్యముదాహరతి—ఆనందమితి. రాహోశ్శిర ఇత్యాదివత్ భేదవ్యపదేశ ఔపచారికః. బ్రహ్మణస్స్వరూపభూతమానందం విద్వానపరోక్షతయా జానన్ పురుషః కుతశ్చన కస్మాదపి ఐహికభయహేతోర్వ్యాఘ్రాదేః పారలౌకికభయహేతోః పాపాదేర్వా న బిభేతి భయం న ప్రాప్నోతి. నను తత్త్వవిదః పాపాదేర్భయం నాస్తీతి ఏతత్కుతోఽవగమ్యత ఇత్యాశంక్య తత్ప్రతిపాదకం, 'ఏతగ్ం హ వావ న తపతి, కిమహగ్ం సాధు నాకరవం, కిమహం పాపమకరవ'మితి వాక్యమర్థతః పఠతి—ఏతమితి. కర్మాగ్నిసంభృతా పుణ్యపాపరూపకం కర్మైవాగ్నిః అకరణకరణాభ్యామగ్నివత్సంతాపహేతుత్వాత్తేన సంభృతా సంపాదితా ఏషా, పుణ్యం నాకరవం. కస్మాత్పాపం తు కృతవాన్ కుత ఇత్యేవంరూపా చింతా ఏతమేవ తత్త్వవిదమేవ న తపేత్ న సంతాపయేత్ నాన్యమవిద్వాంసం. స తు తయా చింతయా సదా సంతప్యత ఇత్యర్థః.

టీ. బ్రహ్మణః = బ్రహ్మముయొక్క, ఆనందం=ఆనందస్వరూపమును, విద్వాన్= అపరోక్షత్వముచేఁ దెలిసికొనినవాఁడు, కుతశ్చన = దేనివలనను, న బిభేతి = భయమును

పొందఁడు, కర్మాగ్నిసంభృతా=కర్మ యనెడి అగ్నివలన సంపాదింపఁబడిన, ఏషా=ఈ, చింతా=చింత, ఏతమేవ=ఈబ్రహ్మవేత్తనే, న తపేత్=తపింపఁజాలదు.

తా. "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" యనెడు తైత్తిరీయకశ్రుతి బ్రహ్మస్వరూపమును అపరోక్షముగా నెఱింగిన బ్రహ్మవిదుఁడు ఇహమందు వ్యాధ్యాదికముచేతను, పరమందు పాపాధికముచేతను భయమును బొందఁడని చెప్పుచున్నది. మఱియు, "ఏతగ్ం హవావ న తపతి కిమహగ్ం సాధునాకరవం, కి మహం పాపమకరవమ్" అనెడి శ్రుతి పుణ్యము చేయనివానికి "అయ్యో నే నెందుకు పుణ్యము చేయలేదు" అనియు, పాపముచేసినవానికి "అయ్యో నేను పాపము నేల చేసితి" ననియు చింత కలిగించుననియును, అట్టిచింత తత్త్వజ్ఞానికిఁ గలుగ దనియుఁ జెప్పుచున్నది.

అవ. ఈపైశ్లోకములలో బ్రహ్మజ్ఞానికి ఎట్టిభీతి గాని, శోకము గాని, చింత గాని లే దని చెప్పి, అవి లేకుండుటకు కారణమును, అవి ఎప్పుడు ఉండునదియు ఈక్రింది శ్లోకములలోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం విద్వా న్కర్మణీ ద్వే హిత్వాత్మానం స్మరేత్సదా,
కృతే చ కర్మణీ స్వాత్మరూపే త్వైవైష పశ్యతి. 6

వ్యా. పుణ్యపాపయోరతాపకత్వే హేతుప్రదర్శనపరం 'స య ఏవం విద్వానేతే ఆత్మానగ్ం స్పృణుతే, ఉభేహ్యేవైష ఏతే ఆత్మానగ్ం స్పృణుతే' ఇతి వాక్యద్వయమర్థతః పఠతి—ఏవమితి. స యః కశ్చిత్పుమానేవయుక్తేన ప్రకారేణ 'సయశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే స ఏకః' ఇత్యనేన ప్రకారేణ విద్వాన్ జానన్ ప్రవర్తతే. స ఏతే పుణ్యపాపే హిత్వే త్యధ్యాహారః. ఆత్మానం బ్రహ్మాభిన్నం ప్రత్యంచం స్పృణుతే ప్రీణయతి సదా స్మరేదిత్యర్థః యతః పుణ్యపాపయోర్మిథ్యాత్వానుసంధానేన హానం కృతం అతః తద్విషయా చిన్తైవ నాస్తి కుతః తన్నిమిత్తకస్తాప ఇత్యభిప్రాయః. కించ ఏష విద్వాన్ ఏతే పూర్వోక్తే ఉభే పుణ్యపాపరూపే కర్మణీ దేహేంద్రియాదిప్రవృత్త్యా జనితే స్వాత్మరూపేణైవ. 'ఇదగ్ం సర్వం యదయమాత్మే' త్యాదివాక్యోక్తప్రకారేణ పశ్యతి జానాతీత్యర్థః. అతః స్వాత్మాభిన్నత్వాదప్యతాపకత్వమితి భావః.

టీ. ఏవం = ఈవిధముగా, విద్వాన్ = బ్రహ్మమును నెఱింగినవాఁడు, ద్వే = రెండైన, కర్మణీ = కర్మలను, హిత్వా = వదలి, సదా = ఎల్లపుడు, ఆత్మానం = పరమాత్మను, స్మరేత్ = స్మరించును. కృతే = చేసిన, కర్మణీ = పుణ్యపాపకర్మలను, ఏషః = ఈవిద్వాంసుఁడు, ఆత్మరూపేణైవ = ఆత్మగనే, పశ్యతి = చూచుచున్నాఁడు.

తా. "స యశ్చాయంపురుషే, యశ్చాసావాదిత్యే స ఏకః" 'సయ ఏవం విద్వానేతే ఆత్మానగ్ స్పృణుతే" అనెడి శ్రుతివాక్యములు, ఏపురుషుఁడు తనయందును సూర్యునియందును సమస్తభూతము లందును గల ఆత్మ యొక్కఁడే యని యెఱింగి ప్రవర్తించునో, అట్టి పురుషుఁడు పుణ్యపాపముల నంటక, బ్రహ్మమునకంటె నభిన్న మగు ప్రత్యగాత్మను సర్వదా స్మరించుచుండు నని చెప్పుచున్నవి. అనఁగా, పుణ్యపాపములు రెండును మిథ్య యనెడి అనుసంధానము చేత, ఆపుణ్యపాపచింతయే లేకపోవుటవలన . తన్నిమిత్తకదుఃఖము జ్ఞానికి కలుగనే కలుగ దని యభిప్రాయము. మఱియు, "ఇదగ్ సర్వం యదయమాత్మా" యనెడి శ్రుతిప్రకారము, దేహేంద్రియాదిప్రవర్త నముచేతఁ గలిగెడి పుణ్యపాపకర్మలు సర్వమును ఆత్మయే (స్వస్వరూపమే) యని తలంచుటచేత ఆ పుణ్యపాపములు జ్ఞానికి దుఃఖహేతువులు కావు అని" ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్ స్పృణుతే" అనెడి శ్రుతి చెప్పు చున్నది.

అవ. కర్మము లనేకములు. ఆకర్మముల స్వరూపమే తా నని తెలియనపుడు వాని నాత్మగా భావించుటెట్లు? అనిన, కర్మములు నశించుటకు మఱియొక సాధనమును జెప్పి శ్రుతిని పఠించుచున్నాఁడు:—

శ్లో. భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. 7

వ్యా. నను 'నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరి' తీత్యాదిశాస్త్రసద్భావా దనాదౌ సంసారే బహుజన్మోపార్జితేషు పుణ్యాపుణ్యలక్షణేషు కర్మస్వసంఖ్యాతేష్వ ప్రసిద్ధత్వేనాత్మతయానుసంధానాయోగ్యేషు సత్సు కథం తద్విషయా చింతా న భవే దిత్యాశంక్య సనిదానానాం తేషాం తత్త్వజ్ఞానేన వినాశితత్వాన్న చింతాజనకత్వమి త్యభిప్రాయేణ హృదయగ్రంథ్యాదివివృత్తిపరం ముండకాదిశ్రుతిషుస్థితంవాక్యంపఠతి— భిద్యతే ఇతి. పరావరే పరమపి హిరణ్యగర్భాదికం పదం అవరం నికృష్టం యస్మాత్తస్మిన్ పరాత్మని దృష్టే సాక్షాత్కృతే అస్య సాక్షాత్కారవతో హృదయస్య బుద్ధేః చిదాత్మ నశ్చ గ్రంథివత్ దృఢసంశ్లేషరూపవత్త్వాత్ గ్రంథిరన్యోన్యాధ్యాసో భిద్యతే విదీర్య తే వినశ్యతీత్యర్థః. సర్వసంశయాః ఆత్మా దేహాదివ్యతిరిక్తో? న వా? వ్యతిరిక్తోఽపి కర్తృ త్వాదిధర్మయోగీ? న వా? అకర్తృత్వేఽపి తస్య బ్రహ్మణో భేదోఽస్తి? న వా? అభే దేఽపి తత్ జ్ఞానం కర్మాదిసహితం ముక్తిసాధనం కేవలం చేత్యాదయః ఛిద్యంతే ద్వైధీ

క్రియంతే. తత్త్వతః సాక్షాత్కృతస్య వస్తునః సంశయవిపర్యయవిషయత్వాదర్శనా దితి భావః. కర్మాణి సంచితాని పుణ్యాపుణ్యలక్షణాని క్షీయంతే స్వనిదానాజ్ఞాన వినాశేన వినశ్యంతీతి.

టీ. పరావరే = కార్యకారణస్వరూపమైన, తస్మిన్ = ఆబ్రహ్మము, దృష్టే సతి = చూడఁబడఁగా, హృదయగ్రంథిః = చిదచిద్గ్రంథి (అనఁగా నన్యోన్యాధ్యాసము), భిద్యతే=విడిపోవుచున్నది. సర్వసంశయాః=అన్ని సందేహములును, ఛిద్యంతే= ఛేదింపఁబడుచున్నవి. అస్య = ఈజీవునియొక్క, కర్మాణి=కర్మములు, క్షీయంతే = క్షీణించుచున్నవి.

తా. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అనెడి శాస్త్రస్థితివలన, అనాదియగు నీసంసారమందు బహుజన్మములనుండి సంపాదింపఁబడిన పుణ్యాపాపకర్మములవలనిఫలము కల్పకోటిశతములచే నయినను అనుభవింపక తీర దని తెలియుచుండఁగా ఆకర్మవిషయమైన చింత జ్ఞానికి లేకపోవు టెట్లు? అనెడి శంక కలుగఁగా, హిరణ్యగర్భాదిక పదముకంటె శ్రేష్ఠమైన, పరమాత్మసాక్షాత్కరింపఁబడుటవలన, నట్టి ఆత్మసాక్షాత్కారముగలవానికి హృదయగ్రంథి ఛేదింపఁబడు ననియు, అట్లు సాక్షాత్కరింపఁబడిన బ్రహ్మవస్తువునందు సంశయవిపర్యయవిష యములవలనఁ గలిగెడి సకలసంశయములు చీల్చివేయఁ (నివర్తింపఁ) బడు ననియు, మూలజ్ఞానమును సంచితకర్మయు నశించు ననియు శ్రుతి రూపక మగు నీశ్లోకముయొక్క అభిప్రాయము. [బుద్ధికిని చిదాత్మకును గ్రంథివలె దృఢసంశ్లేషరూపము గలిగియుండుటవలన హృదయగ్రంథి యనఁగా నన్యోన్యాధ్యాసము.]

అవ. కొన్నిశ్రుతులు కర్మజ్ఞానములు రెండిండిని మోక్షసాధనములుగ చెప్పు చున్నపుడు జ్ఞానముననే మోక్ష మెట్లనిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. తమేవ విద్వానత్యేతి మృత్యుం పంథా న చేతరః.
జ్ఞాత్వా దేవం పాశహానిః క్షీణైః క్లేశైర్న జన్మభాక్. 8

వ్యా. నను, 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః. ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మలిప్యతే నరే, విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ సహ,' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుత' ఇత్యాదిశ్రుతేః,'కర్మ ణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః, యథాన్నం మధుసంయుక్తం మధు చాన్నేన

సంయుతం, ఏవం తపశ్చ విద్యా చ సంయుక్తం భేషజం మహత్' ఇత్యాదిస్మృతేశ్చ కేవలస్య వా జ్ఞానస్య సముచ్చితస్య వా కర్మణో ముక్తిహేతుత్వం స్యాదిత్యాశంక్యో దాహృతవాక్యస్థలేఽపి తపశ్శబ్దస్య పాపనివృత్తిపరత్వాత్, అస్థితా ఇతి ఆఙ్ పూర్వక శబ్దస్య పాపనివృత్తిపరత్వాత్, సంసిద్ధిశబ్దేన చ జ్ఞానసాధనచిత్తశుద్ధ్యభిధానాద్విద్యా శబ్దేన చోపాసనాయా వివక్షితత్వాన్న కర్మణో ముక్తిసాధనత్వమిత్యభిప్రాయేణ సాధ నాంతరనిషేధపరం 'తమేవం విదిత్వాతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనా' యేతి శ్వేతాశ్వతరవాక్యమర్థతః పఠతి—తమేవేతి. తం పూర్వోక్తం పరమాత్మానం విద్వానేన మృత్యుం సంసారమత్యేతి అతిక్రామతి ఇతరస్సముచ్చయరూపః కేవలకర్మరూపోవా పంథా మార్గో మోక్షోపాయో న చ నైవ విద్యతే. నమూదాహృతాసు శ్రుతిష్వ న్వయవ్యతిరేకాభ్యామైహికానిష్టనివృత్తిరేవ ప్రాధాన్యేనావభాసతే నాముష్మికీత్యా శంక్యాముష్మికస్యానిష్టస్య భావిజన్మపూర్వకత్వాత్తస్య సనిదానస్యాభావప్రతిపాదకం * 'జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణి' రితి శ్వేతా శ్వతరవాక్యమర్థతః పఠతి—జ్ఞాత్వేతి. దేవం స్వప్రకాశం ప్రత్యగభిన్నం బ్రహ్మ జ్ఞాత్వా అపరోక్షతయానుభూయ స్థితస్య కామక్రోధాదీనాం సర్వేషాం పాశానాం హానిర్భవతిః. తైః పాశశబ్దాభిధేయైః రాగాదిభిః క్లేశైః క్షీణైర్నష్టైః భావిజన్మహేతుక ర్మారంభాయోగాచ్చైతన్న ప్రాప్నోతీత్యర్థః.

టీ. తమేవ = ఆయాత్మనే, విద్వాన్ = ఎఱింగినవాఁడు, మృత్యుం=మృత్యువును, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడు. ఇతరః పంథాః = జ్ఞానముకంటె వేఱొక మార్గము, న చ లేనేలేదు. దేవం = స్వప్రకాశుఁడగు పరమేశ్వరుని, జ్ఞాత్వా=తెలిసికొని, పాశహానిః=కామక్రోధాదిరూపసర్వబంధముల యొక్క హాని (క్షయము), భవతి= అగుచున్నది. క్లేశైః = పాశశబ్దమే పేరుగఁగల రాగాదులతోడి వ్యసనములు, క్షీణైః= నాశమును బొందుచుండఁగా, జన్మభాక్=జన్మముల నొందెడివాఁడు, న = కాఁడు.

తా. "కుర్వన్నేవేహ కర్మాణి......విద్యయాఽమృతమశ్నుతే" ఇత్యాదిశ్రుతులును, "కర్మణైవ హి సంసిద్ధి... భేషజం మహత్," ఇత్యాది స్మృతులును జ్ఞానసహితకర్మము ముక్తిహేతువగు నని చెప్పుచుండఁగా, కేవలజ్ఞానము ముక్తిహేతువగు నని చెప్పుట యెట్లనిన, ఈ చెప్పఁబడిన వాక్యములందు భేషజశబ్దమునకు పాపనివృత్తిపరత్వము కలిగియుండుటచేతను, సంసిద్ధిశబ్దముచేత జ్ఞానసాధనచిత్తశుద్ధి చెప్పఁబడుట వలనను, విద్యాశబ్దముచే ఉపాసనము విధింపఁబడుటవలనను కర్మము

ముక్తిసాధనము కానేరదు. "తమేవం విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ," అనెడి శ్రుతి పరమాత్మ నెఱింగినవాఁడే మృత్యుయుక్త మగు సంసారమునుండి విడువఁబడు ననియు, మోక్షప్రాప్తికి జ్ఞానముదక్క నితర సాధనము లే దనియుఁ జెప్పుచున్నది. మఱియు, "జ్ఞాత్వా దేవం...మృత్యుప్రహాణిః," అనెడి శ్రుతి, జ్ఞానికి భావిజన్మసహిత పరలోకసంబంధదుఃఖము లేదని చెప్పుచున్నది. కనుక బ్రహ్మజ్ఞానికి నిహసంబంధదుఃఖముగాని పరలోకసంబంధదుఃఖముగాని లేదు. అనఁగా పునర్జన్మము కలుగ దనుట. కర్మములు చిత్తశుద్ధిద్వారా పరంపరాజ్ఞానసాధనములగును గాని కేవలము జ్ఞానసాధనములు గావు.

అవ. జ్ఞానులకుఁ గూడ నిష్టానిష్టఫలంబులు గలుగుచున్నవి గాన, జ్ఞానులకు కర్మనివృత్తి లే దని శంకింపఁగా, జ్ఞానులకు శోకమోహాదు లుండ వనుటకు శ్రుతిని గను పఱచుచున్నాఁడు:—

శ్లో. దేవం మత్వా హర్షశోకౌ జహాత్యత్రైవ ధైర్యవాన్,
నైనం కృతాకృతే పుణ్యపాపే తాపయతః క్వచిత్. 9

వ్యా. నను శోకతరణాదిఫలం శ్రూయత ఏవ నానుభూయతే జ్ఞానినామపీష్టానిష్టప్రాప్తిపరిహారార్థం ప్రవృత్తిదర్శనాదిత్యాశంక్య దృఢాపరోక్షజ్ఞానినాం తదభావప్రతిపాదనపరం 'అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహా'తీతి కఠశ్రుతివాక్యమర్థతః పఠతి—దేవమితి. ధైర్యవాన్బ్రహ్మచర్యాదిసాధనసంపన్నో దేవం చిదానందాదిలక్షణం మత్వావగమ్యాత్రైవాస్మిన్నేవ జన్మని హర్షశోకౌ జహాతి. 'ఏతమేవ తపేన్నైషా చింతా కర్మాగ్నిసంభృతే' త్యుక్తార్థే విశేషప్రదర్శనపరం, 'నైనం కృతాకృతే తపత' ఇతి యాజ్ఞవల్క్యబ్రాహ్మణవాక్యమర్థతః పఠతి—నైనమితి. పూర్వమకృతం పుణ్యం కృతం చ పాపం తత్త్వవిదస్తాపహేతుర్న భవతీత్యుక్తం. ఇహ తు కృతమకృతంవా పుణ్యం పాపం వా తథావిధం తాపకం న భవతీత్యుచ్యత ఇతివిశేషః, తథాహి, తాపో నామ చిత్తవికారవిశేషః. పుణ్యం కృతం సద్ధర్మలక్షణం వికారముత్పాదయతి. అకృతం విషాదం పాపం పునస్తద్విపరీత్యేనాకృతం హర్షముత్పాదయతి కృతం విషాదం. తత్త్వవిదస్తు ఉభే అప్యుభయవిధవికారహేతూ న కదాచిద్భవతః. అవిక్రియబ్రహ్మరూపత్వజ్ఞానాదిత్యభిప్రాయః.

టీ. దేవం = పరమాత్మను, మత్వా = తెలిసికొని, ధైర్యవాన్ = ధీరుఁడు అత్రైవ = ఈ జన్మమందే, హర్షశోకౌ = సుఖదుఃఖములను, జహాతి = వదలిపెట్టు

చున్నాఁడు. ఏనం = ఈ బ్రహ్మవిదుని, కృతాకృతే = చేయఁబడినట్టియు, చేయఁబడ నట్టియు పుణ్యపాపే = పుణ్యపాపములు, క్వచిత్ = ఎప్పుడును, న తాపయతః = తపింపఁజేయవు.

తా. ఇష్టానిష్టప్రాప్తిపరిహారముకొఱకు జ్ఞానులందును ప్రవృత్తి కనఁబడుచుండుటవలన 'ఆత్మవేత్త దుఃఖమును తరించు' నని చెప్పఁబడిన ఫలము శాస్త్రముచే వినఁబడుచున్నదేకాని అనుభవసిద్ధముగఁ గనుపడుటలేదు. అనిన, బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుఁడు తత్త్వజ్ఞానముచేత చిదానందాద్విస్వరూపలక్షణములుగల పరమాత్మను అపరోక్షముగ నెఱింగి, యీజన్మమందే విషయలాభాలాభనిమిత్తకసుఖదుఃఖములను విడుచుచున్నాఁడు. "అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" అనెడి శ్రుతి దృఢాపరోక్షజ్ఞానముగలవానికి ఇష్టానిష్టప్రాప్తిపరిహారముకొఱకుఁ బ్రవృత్తియే లేదని ప్రతిపాదించుచున్నది. కనుక ఆత్మవేత్త దుఃఖమును తరించు ననుట అనుభవసిద్ధమే యగును. మఱియు, చేయఁబడని పుణ్యమును, చేయఁబడిన పాపమును జ్ఞానికి తాపహేతువులు గావని పూర్వమైనవశ్లోకమునఁ జెప్పఁబడిన అర్థమందు "నైనం కృతాకృతే తపత ఇతి" యనెడి యాజ్ఞవల్క్యబ్రాహ్మణ వాక్యము వర్తించుచున్నది. ఈయర్థ మెటులనఁగా, తాప మనునది చిత్తవికారభేదము కనుక పుణ్యము చేయఁబడిన దగుచు సుఖలక్షణ వికారమును గలిగించును. చేయఁబడనిదగుచు దుఃఖలక్షణవికారమును గలిగించును. దీనికి విపరీతముగా పాపము చేయఁబడని దగుచు సుఖలక్షణవికారమును గలుగఁజేయును, చేయఁబడిన దగుచు దుఃఖలక్షణవికారమును గలిగించును. జ్ఞానికో, 'నేను అవిక్రియబ్రహ్మరూపుఁడను' అనెడి తత్త్వజ్ఞానముండుటచేతఁ బూర్వోక్తద్వివిధ వికారహేతువులును ఎప్పటికిని గలుగవని తెలియవలెను.

అవ. ఈపైవాక్యములే కాక ఇంక నెన్నియో శ్రుతివచనములు బ్రహ్మజ్ఞానికి శోకమోహములు లేవని యుద్ఘోషించుచున్నవి.

శ్లో. ఇత్యాదిశ్రుతయో బహ్వ్యః పురాణైః స్మృతిభిస్సహ,
బ్రహ్మజ్ఞానేఽనర్థహానిమానందం చాప్యఘోషయన్. 10

వ్యా. నన్వియంత్యేవ వాక్యాని ప్రమాణాని? నేత్యాహ—ఇత్యాది శ్రుతయ ఇతి. ఆదిశబ్దేన 'ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః.' 'య

ఏతద్విదురమృతాస్తే భవంత్యథేతరే దుఃఖమేవాపయంతి. తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత సఏవ తదభవత్ నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యత' ఇత్యాద్యాశ్శ్రుతయో గృహ్యంతే. 'సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని, సంపశ్యన్నాత్మనా జీవై స్స్వారాజ్యమధిగచ్ఛతి. క్షేత్రజ్ఞస్యాత్మవిజ్ఞానాద్విశుద్ధిః పరమా మతే'త్యాది పురాణస్మృతివచనై స్సహ ప్రమాణానీత్యర్థః. ఉదాహృతానాం శ్రుతిస్మృతిపురాణ వాక్యానాం సర్వేషాం తాత్పర్యమాహ—బ్రహ్మజ్ఞానేతి.

టీ. బహ్వ్యః = అనేకములైన, ఇత్యాదిశ్రుతయః = ఈమొదలగు శ్రుతులు, పురాణైః = పురాణములతోడను, స్మృతిభిః = స్మృతులతోడను, సహ = కూడి, బ్రహ్మజ్ఞానే = బ్రహ్మజ్ఞానము కలుగఁగా, అనర్థహానిం = అనర్థపరిహారమును, ఆనందం చాపి = ఆనందమును, అఘోషయన్ = ప్రకటించినవి.

తా. "ఇహచేదవేదీ.........ముఖాత్ప్రముచ్యతే" ఇత్యాది శ్రుతులును, "సర్వభూతస్థమాత్మానం......గచ్ఛతి" ఇత్యాది స్మృతులును, "క్షేత్రజ్ఞస్యాత్మవిజ్ఞానాద్విశుద్ధిః పరమా మతా" ఇత్యాది పురాణవాక్యములును, బ్రహ్మజ్ఞానముచేత దుఃఖనివృత్తి యగు ననియు, ఆనందము గలుగు ననియు ఘోషించుచున్నవి.

అవ. ఆనంద మెన్ని విధములో చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆనందస్త్రివిధో బ్రహ్మానందో విద్యాసుఖం తథా,
విషయానంద ఇత్యాదౌ బ్రహ్మానందో వివిచ్యతే. 11

వ్యా. నను బ్రహ్మానంద ఇత్యానందపదస్య బ్రహ్మపదేన విశేషణాదానందాంతరమస్తీత్యవగమ్యతే. స కతివిధః? కీదృశశ్చానంద ఇత్యాకాంక్షాయాం తద్భేదదర్శనపూర్వకం బ్రహ్మానందవివేచనం ప్రతిజానీతే—ఆనంద ఇతి. బ్రహ్మానందో విద్యానందో విషయానంద ఇత్యనేన ప్రకారేణానందస్య త్రైవిధ్యమవగంతవ్యం, తత్రేతరయోరానందయోర్బ్రహ్మానందమూలకత్వాదాదావధ్యాయత్రయేణ బ్రహ్మానందో విభజ్య ప్రదర్శ్యత ఇత్యర్థః.

టీ. బ్రహ్మానందః = బ్రహ్మానంద మనియు, తథా = అలాగుననే, విద్యాసుఖం = విద్యాసుఖ మనియు, విషయానందః=విషయానందమనియు, ఇతి=ఈలాగున, ఆనందః= ఆనందము, త్రివిధః = మూఁడు విధములుగ, వివిచ్యతే = విభజింపఁబడుచున్నది.

తా. బ్రహ్మానందము విద్యానందము విషయానందము నని ఆనందము త్రివిధము. అందు బ్రహ్మానందము నిరూపింపఁబడును.

అవ. బ్రహ్మా మానంద మనుటకు తైత్తిరీయశ్రుతి ప్రమాణము:—

శ్లో. భృగుః పుత్రః పితుశ్శ్రుత్వా వరుణాద్బ్రహ్మలక్షణమ్,
అన్నప్రాణమనోబుద్ధీ స్త్యక్త్వానందం విజజ్ఞివాన్. 12

వ్యా. తత్రాదావేవ తైత్తిరీయశ్రుతిపర్యాలోచనాయామానందరూపం బ్రహ్మైవ గమ్యత ఇత్యభిప్రాయేణ భృగువల్ల్యా అర్థం సంక్షేపేణ దర్శయతి—భృగురితి. భృగునామకః పుత్రః పితుర్వరుణాఖ్యాద్బ్రహ్మలక్షణం 'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మే'త్యేవం రూపం శ్రుత్వాన్నమయాదికోశేషు తల్లక్షణాసంభవేన తేషామబ్రహ్మత్వం నిశ్చిత్యానందమయకోశే పంచమావయవత్వేన 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠే'తి శ్రుతం బింబభూతమానందం బ్రహ్మలక్షణయోజనయా బ్రహ్మత్వేన జ్ఞాతవానిత్యర్థః.

టీ. భృగుః = భృగుమహర్షి, పితుః = తండ్రియైన, వరుణాత్ = వరుణునివలన, బ్రహ్మలక్షణం = పరబ్రహ్మలక్షణమును, శ్రుత్వా = విని, అన్నప్రాణమనోబుద్ధీః = అన్నప్రాణమనోబుద్ధులను, త్యక్త్వా = వదలిపెట్టి, ఆనందం = ఆనందస్వరూప మగు బ్రహ్మమును, విజజ్ఞివాన్ = తెలిసికొనెను.

తా. భృగుమహర్షి తండ్రియగు వరుణునివలన బ్రహ్మస్వరూపమును విని, అన్నమయాదికోశములయందు బ్రహ్మలక్షణములు సంభవింపమిచే, ఆకోశములకు బ్రహ్మత్వము లేదని నిశ్చయించి, ఆనందమయకోశమందు పంచమావయవత్వముచేత "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా" అనెడి శ్రుతివలనఁ దెలియఁబడుచుండెడి బింబభూతమగు ఆనందమును బ్రహ్మలక్షణయోజనతో బ్రహ్మత్వముచేఁ దెలిసికొనెను. అనఁగా ఆనందబింబమునకు బ్రహ్మత్వమును నిశ్చయించెనని యభిప్రాయము.

అవ. ఆయోజనాప్రకారమును జూపెడి వాక్యార్థమును బలుకుచున్నాఁడు:—

శ్లో. ఆనందాదేవ భూతాని జాయంతే తేన జీవనమ్,
తేషాం లయశ్చ తత్రాతో బ్రహ్మానందో న సంశయః. 13

వ్యా. కథమానందే తల్లక్షణం యోజితవానిత్యాశంక్య తద్యోజనాప్రకారప్రదర్శనపరం 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి. ఆనందం ప్రయంత్యభిసంవిశం' తీతి వాక్యమర్థతః పఠతి—ఆనందాదితి. గ్రామ్యధర్మనిమిత్తకానందాదేవ భూతాని ప్రాణినో జాయంతే ఉత్పద్యంతే. తేన విషయభోగాదినిమిత్తకేనానందేన జీవనం ప్రాప్నువంతి. తేషాం ప్రాణినాం లయశ్చ తత్ర తస్మిన్

సుషుప్తికాలీనే స్వరూపభూతానంద ఏవ భవతి. సుషుప్తావానందాతిరేకేణ కస్యాప్యనుభవాభావాదతః ఆనందో బ్రహ్మైవ సర్వానుభవసిద్ధత్వాన్నాత్ర సంశయః కర్తవ్య ఇతి భావః.

టీ. భూతాని = ప్రాణులు, ఆనందాదేవ = ఆనందమువలననే, జాయంతే = పుట్టుచున్నవి. తేన = ఆయానందముచేతనే, జీవనం = ఉండఁగలుగుటయు (స్థితియు), భవతి = కలుగుచున్నది. తేషాం = ఆభూతములయొక్క, లయః = అవసానంబును, తత్ర = ఆబ్రహ్మమునందు, భవతి = అగుచున్నది. అతః = ఈకారణముచే, బ్రహ్మ = బ్రహ్మము, ఆనందః = ఆనందస్వరూపమే, న సంశయః = సందేహము లేదు.

తా. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని......ప్రయంత్యభిసంవిశంతి' అనఁగా, ప్రాణులు గ్రామ్యధర్మనిమిత్తకానందమువలననే పుట్టుచున్నవి. ఆప్రాణులు విషయభోగాదిక నిమిత్తకమగు ఆయానందముచేతనే జీవించుచున్నవి. మఱియు ఆప్రాణులయొక్క లయము సుషుప్తిసంబంధమగు స్వరూపభూతానంద మందె కలుగుచున్నది. అనెడి శ్రుతివాక్య ప్రకారము సుషుప్తియందు ఆనందానుభవముకంటె నితరానుభవ మెవనికిని లేనికారణమున ఆనందము బ్రహ్మమే యగు ననియు, ఈ సౌషుప్తానందానుభవము సర్వానుభవసిద్ధ మగుటవలన నీయర్థమందు సంశయము లే దనియు అభిప్రాయము.

అవ. ఈపైనఁ జెప్పినట్లే సామవేదశ్రుతియుఁ జెప్పుచున్న దని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. భూతోత్పత్తేః పురా భూమా త్రిపుటీద్వైతవర్జనాత్,
జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపా త్రిపుటీ ప్రళయే హి నో. 14

వ్యా. ఏవం తైత్తిరీయశ్రుతిపర్యాలోచనయా బ్రహ్మణ ఆనందరూపతాం ప్రదర్శ్య ఛాందోగ్యశ్రుతిపర్యాలోచనయాపి తాం దిదర్శయిషుః సనత్కుమారనారదసంవాదరూపే సప్తమాధ్యాయే స్థితస్య భూమరూపబ్రహ్మప్రతిపాదకస్య 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూ'మేత్యాది వాక్యార్థం సంక్షిపేణాహ—భూతోత్పత్తేరితి. భూతానామాకాశాదీనాం తత్కార్యాణాం జరాయుజాండజాదీనాం చోత్పత్తేః పూర్వం త్రిపుటీద్వైతవర్జనాత్ త్రయాణాం జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపాణాం పుటానామకారాణాం సమాహారస్త్రిపుటీ సైవ ద్వైతం తస్య వర్జనమభావస్తస్మాద్భూమా దేశతః కాలతో వస్తుతో వా పరిచ్ఛేదశూన్యః పరమాత్మా 'భావా నయనేద్రవ్యానయన' మితి న్యాయాద్భూమైవాసీదిత్యధ్యాహారః. తదేవ ద్వైతవర్జనముప

పాదయతి—జ్ఞాతృజ్ఞానేతి వక్ష్యమాణజ్ఞాత్రాదిరూపా త్రిపుటీ ప్రళయకాలే నాస్తీత్యేతత్సర్వవేదాంతసంమతమితి హిశబ్దం ప్రయుంజానస్యాయమభిప్రాయః.

టీ. భూతోత్పత్తేః పురా = భూతములు పుట్టుటకు పూర్వము, త్రిపుటీద్వైతవర్జనాత్ = త్రిపుటీరూప మగు ద్వైతము లేకపోవుటవలన, భూమా=దేశకాలవస్తువుల వలన పరిచ్ఛేదములేని పరబ్రహ్మము, అస్తి = కలదు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపా = జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపమగు, త్రిపుటీ = త్రిపుటి, ప్రళయే = ప్రళయకాలమప్పుడు, నో = లేదు, హి = ఇది నిశ్చయము.

తా. "యత్ర నాన్యత్పశ్యతి......స భూమా" యనెడి శ్రుతి ఏపరమాత్మయందు అన్య మెద్దియుఁ జూడఁబడదో, అన్య మెద్దియు వినఁబడదో, అన్య మెద్దియు నెఱుఁగఁబడదో ఆపరమాత్మ 'భూమ' శబ్దముచేఁ జెప్పఁదగిన దని చెప్పుచున్నది. ఆకాశాది పంచభూతములును తద్భూతకార్యము లగు జరాయుజాండజాది నానావిధభూతములును బుట్టుటకంటె (సృష్టికంటె) బూర్వము జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లనెడి త్రిపుటియు లేమిచే, దేశకాలవస్తుపరిచ్ఛేదములేని భూమశబ్దముచేఁ జెప్పఁదగిన పరమాత్మమాత్రమే యుండెను. ప్రళయకాలమందును బ్రహ్మేతర మెద్దియును లేదు. (ఇట్లు ఛాందోగ్యశ్రుతి.)

అవ. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. విజ్ఞానమయ ఉత్పన్నో జ్ఞాతా జ్ఞానం మనోమయః,
జ్ఞేయాశ్శబ్దాదయో నైతత్త్రయముత్పత్తితః పురా. 15

వ్యా. ఇదానీం జ్ఞాత్రాదిస్వరూపం దర్శయతి—విజ్ఞానమయ ఇతి. పరమాత్మన ఉత్పన్నో బుద్ధ్యుపాధికో జీవో విజ్ఞానమయో జ్ఞాతా; మనోమయః మనసి ప్రతిబింబితం మనోమయశబ్దవాచ్యం చైతన్యం జ్ఞానం; శబ్దస్పర్శాదయో జ్ఞేయాః ప్రసిద్ధాః. ఇదం త్రయం కార్యత్వాదుత్పత్తేః పురా కారణవ్యతిరేకేణ నాస్తీత్యర్థః.

టీ. ఉత్పన్నః = పరమాత్మవలనఁ బుట్టిన, విజ్ఞానమయః = విజ్ఞానమయుఁడు, జ్ఞాతా = జ్ఞాత యనఁబడును. మనోమయః = మనోమయకోశము, జ్ఞానం=జ్ఞాన మని చెప్పఁబడును. శబ్దాదయః = శబ్దాదివిషయములు, జ్ఞేయాః = జ్ఞేయము లని చెప్పఁబడును. ఏతత్త్రయం=ఈత్రిపుటి (మూఁడును)యు, ఉత్పత్తితః పురా = జగదుత్పత్తికి పూర్వము, న = లేదు.

తా. పరమాత్మవలనఁ బుట్టిన బుద్ధ్యుపాధిక జీవుఁడు (విజ్ఞానమయకోశము) జ్ఞాత యగును. మనస్సునందుఁ బ్రతిబింబరూపమును బొంది

నోమయకోశ శబ్దముచేఁ జెప్పఁదగిన చైతన్యము జ్ఞానమగును. శబ్దాది షయము లైదును జ్ఞేయము లగును. ఇవి మూఁడును జగత్తుతోపాటు ట్టినవిగాని తత్పూర్వము లేవు.

అవ. ఫలితముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. త్రయాభావే తు నిర్ద్వైతః పూర్ణ ఏవానుభూయతే,
సమాధిసుప్తిమూర్ఛాసు పూర్ణస్సృష్టేః పురా తథా. 16

వ్యా. ఫలితమాహ—త్రయేతి. జ్ఞాత్రాదిత్రయాభావే నిర్ద్వైతః ద్వైతరహితః ూర్ణ ఏవాత్మానుభూయతే. కుత్రానుభూయత ఇత్యత ఆహ—సమాధీతి. విద్వదనుభవ ప్రదర్శనాయ సమాధిగ్రహణం సర్వానుభవద్యోతనాయ సుషుప్తిమూర్ఛయో రుదా ారణం. సుషుప్త్యాద్యుత్థితస్య ద్వైతాదర్శనస్మరణాన్యథానుపపత్త్యా నిర్ద్వైతస్య తదను వితుస్సిద్ధిరితి భావః. భవతు సుషుప్త్యాదావద్వైతసిద్ధిః. ప్రకృతే కిమాయాత మిత్యత హ—పూర్ణ ఇతి. తథా సుషుప్త్యాదౌ పరిచ్ఛేదకాభావాత్పూర్ణస్తథా. సృష్టేః ురాపి తదభావా త్పూర్ణ ఇత్యర్థః.

టీ. త్రయాభావే తు = ఈమూఁడును లేనప్పుడు, సమాధిసుప్తిమూర్ఛాసు = మాధిదశయందును, గాఢనిద్రయందును, మూర్ఛాసమయమునను, నిర్ద్వైతః=ద్వైతము లేని, పూర్ణ ఏవ=పరిపూర్ణాత్మయే, అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది. తథా = అట్టులే, సృష్టేః పురా = సృష్టికి పూర్వమును, అనుభూయతే = అనుభవింపఁబడును.

తా. సమాధిసుప్తి మూర్ఛాసమయములందు జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపమగు ద్వైతము లేదు. కనుక నీయవస్థలయం దన్నిటిలోను పరి పూర్ణమగు బ్రహ్మమే ప్రకాశించుచున్నది. ఇచట విద్వదనుభవము కొఱకు సమాధియు, సర్వజనానుభవము కొఱకు సుషుప్తిమూర్ఛ లును గ్రహింపఁబడిన వని తెలియవలెను.

అవ. బ్రహ్మము ప్రళయకాలమం దుండిన నుండుఁగాక. అది యానందస్వరూప మగుటకు ప్రమాణ మే మని శంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. యో భూమా స సుఖం నాల్పే సుఖం త్రేధా విభేదిని,
సనత్కుమారః ప్రాహైవం నారదాయాతిశోకినే. 17

వ్యా. అస్తు బ్రహ్మణః పూర్ణత్వం. ఆనందరూపత్వే కిమాయాతమిత్యాశంక్యా న్వయవ్యతిరేకాభ్యాం భూమ్నస్సుఖరూపత్వప్రదర్శనపరం. 'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమ'స్తీతి వాక్యమర్థతోఽనుక్రామతి—యో భూమేతి. యః

పూర్వోక్తో భూమా న సుఖరూప ఏవ. అద్వితీయే దుఃఖ హేతోరభావాత్ అల్పే పరిచ్ఛిన్నే. తస్యైవ వివరణం త్రేధా విభేదినీతి హేతుగర్భం విశేషణం. సుఖం తత్ర న విద్యత ఇత్యర్థః. ఏవం కస్మై కేనాభిహితమిత్యత ఆహ—సనత్కుమార ఇతి. నారదస్య శిష్యత్వే కారణమాహ—అతిశోకిన ఇతి. అతిశయితః అధికః శోకో ఽస్యాస్తీత్యతి శోకీ తస్మై.

టీ. యో భూమా = ఏది వ్యాపకమగుబ్రహ్మమో, సః = అది, సుఖం = సుఖస్వరూపము. త్రేధా = మూఁడు విధములుగా, విభేదిని=భేదించినటువంటి, అల్పే= పరిచ్ఛిన్నమగు ద్వైతమందు, సుఖం = సుఖము, న = లేదు. ఏవం = ఈలాగున, అతి శోకినే = మిక్కిలి దుఃఖించుచున్న, నారదాయ=నారదునికొఱకు, సనత్కుమారః = సనత్కుమారుఁడు, ప్రాహ = చెప్పెను.

తా. పూర్వోక్త భూమశబ్దవాచ్యుఁడగు పరమాత్మయందు దుఃఖహేతువు లేనందున, ఆయఖండపరమాత్మ సుఖరూపుఁడే యగు ననియు, త్రిపుటీభేదముగల, పరిచ్ఛేదవస్తువునందు (ద్వైతమందు) సుఖము లేదు గనుక దుఃఖితుఁడగు నారదునికొఱకు సనత్కుమారుఁడు చెప్పినట్లు "యోవై భూమా తత్సుఖం, నాల్పే సుఖమస్తి" అనెడి ఛాందోగ్యశ్రుతియందుఁ జెప్పఁబడినది.

అవ. నారదునకు శోకకారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సపురాణాన్పంచ వేదాన్ శాస్త్రాణి వివిధాని చ,
జ్ఞాత్వాఽప్యనాత్మవిత్త్వేన నారదోఽతిశుశోచ హ. 18

వ్యా. తస్యాతిశోకిత్వే కారణమాహ—సపురాణానితి. నారదః పురాణైస్సహ వర్తంత ఇతి సపురాణాః పంచవేదాస్తాన్వివిధాని చ శాస్త్రాణి విదిత్వాప్యాత్మజ్ఞాన రహితత్వేనాతిశయేన శోకం ప్రాప్తః.

టీ. నారదః = నారదుఁడు, సపురాణాన్ = పురాణములతోఁగూడిన, పంచ వేదాన్=అయిదువేదములను, వివిధాని = అనేకములయిన, శాస్త్రాణి చ=శాస్త్రములను, జ్ఞాత్వాఽపి = తెలిసికొనియు, అనాత్మవిత్త్వేన = ఆత్మజ్ఞానములేక పోవుటవలన, అతి శుశోచ హ = మిక్కిలి దుఃఖించెను.

తా. సర్వవేదశాస్త్రపురాణేతిహాసవిదుఁ డయ్యు ఆత్మస్వరూప సాక్షాత్కారము గలుగకపోవుటచే మిక్కిలి శోకము గలిగిన నారదుఁడు సనత్కుమారులకడకు చనె నని పూర్వశ్లోకముతో నన్వయము.

దీనిం జేసి సద్గురుకటాక్షము దక్క శాస్త్రపరిచయమాత్రముననే బ్రహ్మస్వరూపసాక్షాత్కారము లభింప దని ఎఱుంగునది.

అవ. వేదశాస్త్రపఠనముచే శోక మధిక మయ్యె నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వేదాభ్యాసా త్పురా తాపత్రయమాత్రేణ శోకితా,
పశ్చాత్త్వభ్యాసవిస్మారభంగ గర్వైశ్చ శోకితా. 19

వ్యా. నను వేదశాస్త్రవిషయకజ్ఞానస్య శోకనివర్తకత్వేన ప్రసిద్ధస్య కథమతిశోకహేతుత్వమిత్యత ఆహ—వేదాభ్యాసాదితి. తాపత్రయేణాధ్యాత్మికాదిలక్షణేనైవ శోకితా శోకోఽస్యాస్తీతి శోకీ తస్య భావ స్తత్తా ఆసీదిత్యధ్యాహారః. పశ్చాత్త్వితి. తు శబ్దో విశేషద్యోతనార్థః. అభ్యాసః. పాఠాద్యావర్తనం విస్మారః పఠితస్య విస్మరణం భంగః స్వతోఽధికేన తిరస్కారః గర్వో న్యూనదర్శనేన స్వాధిక్యబుద్ధిః ఏతైః కారణైః శోకిత్వం.

టీ. వేదాభ్యాసాత్పురా=వేదాభ్యాసము చేయకముందు, తాపత్రయమాత్రేణ=తాపత్రయములచేత మాత్రమే, శోకితా = దుఃఖము, (భవతి = కలుగుచున్నది). పశ్చాత్=వేదభ్యాసానంతరము, అభ్యాస విస్మార భంగ గర్వైశ్చ = అభ్యాసముచేతను, అభ్యసించినది మఱచిపోవుటచేతను, దానివలన వచ్చెడి పరాభవముచేతను,తక్కువ వారిం జూచునప్పటి గర్వముచేతను కూడ, శోకితా = దుఃఖము (భవతి = కలుగుచున్నది.)

తా. వేదాభ్యాసమునకు పూర్వము తాపత్రయజనితదుఃఖ మొక్కటియే యుండెను. వేదాభ్యాసముచే, అనఁగా దానిని నిత్యము పఠించుటచేతను, పఠించినదానిని మఱచుటచేతను, అట్టి మఱపుచేఁ గలిగిన పరాభవమువలనను, నాయంత చక్కఁగా వేదము తెలిసినవాఁడు లేఁ డనెడి గర్వముచేతను, బ్రహ్మజ్ఞానరహితుఁడగువానికి, శోకకారణములు ఎక్కువై, దుఃఖమును హెచ్చుగఁ గలిగించును. దీనినిబట్టి బ్రహ్మజ్ఞానరహిత వేదశాస్త్రపఠనము మోక్షసాధనము కా దని తెలియఁదగును.

అవ. నారదునకు దుఃఖము కలుగుటకు కారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సోఽహం విద్వన్ప్రశోచామి శోకపారం నయాత్ర మామ్,
ఇత్యుక్త స్సుఖమేవాస్య పార మిత్యభ్యధాదృషిః. 20

వ్యా. నన్వేవం సర్వజ్ఞస్యాపి నారదస్యాతిశోకిత్వం జాతమితి కుతోఽవగమ్యత ఇత్యాశంక్య, 'సోఽహం భగవశ్శోచా' మీతి తదీయాదేవ వాక్యాదవగతమిత్యభి

ప్రేత్య 'తం మా భగవాన్ శోకస్య పారం తారయ'త్వితి తన్నివృత్త్యుపాయే తేన పృష్టే సతి సనత్కుమారో భూమశబ్దవాచ్యం సుఖరూపం బ్రహ్మైవ జ్ఞాయమానం శోక నివృత్త్యుపాయ ఇతి సుఖం త్వేవ జిజ్ఞాసితవ్యమిత్యారభ్యో త్తరగ్రంథసందర్భే ణో క్తవానిత్యాహ—సోఽహమితి.

టీ. హే విద్వన్ = ఓ బ్రహ్మవిదుఁడ వగు సనత్కుమారుఁడా, సోఽహం = అట్టి నేను, ప్రశోచామి=మిక్కిలి దుఃఖించుచున్నాను. అత్ర=ఇక్కడ, మాం=నన్ను, శోకపారం=దుఃఖముయొక్క అంతమును, నయ = పొందింపుము. ఇతి=ఇట్లు, ఉక్తః = చెప్పఁబడినవాఁడై, సుఖమేవ = సుఖమే, అస్య = ఈసంసారమునకు, పారం = అవధి, ఇతి=అని, ఋషిః=మహర్షి యగు సనత్కుమారుఁడు అభ్యధాత్ = పలికెను.

తా. "నేను మిక్కిలి సంసారదుఃఖముచే శోకించుచున్నాను. ఈ దుఃఖమునుండి నన్ను రక్షింపు" మని నారదుఁడు ప్రార్థింపఁగా, బ్రహ్మవిదుఁ డగు సనత్కుమారమహర్షి భూమశబ్దముచేఁ జెప్పఁదగిన సుఖరూప మగు బ్రహ్మమే దుఃఖాంత మని బోధించెను. అనఁగా జనన మరణ మనెడి ఈసంసారమువలనఁ గలిగెడి శోకము నివర్తింపఁజేసికొనుట కును, సంతతసుఖప్రాప్తికిని బ్రహ్మజ్ఞానము దప్ప వేఱుమార్గము లే దని తెలియవలెను.

అవ. విషయసుఖ మేల మంచిది కా దనిన చెప్పుచున్నాఁడు:—

శ్లో. సుఖం వైషయికం శోకసహస్రేణావృతత్వతః,
దుఃఖమేవేతి మత్వాహ నాల్పేఽస్తి సుఖమిత్యసౌ. 21

వ్యా. నను స్రగాదిజన్యేషు సుఖేషు బహుషు సత్సు నాల్పే సుఖమస్తీత్యుక్తి రనుపపన్నేతి చేన్న. తేషాం స్రగాదీనాం దుఃఖానుషంగేణ విషసంపృక్తాన్నవద్బహు దుఃఖరూపత్వస్య మునినాభిప్రేతత్వాదిత్యాహ—సుఖమితి.

టీ. వైషయికం = విషయజన్యమైన, సుఖం = సుఖము, శోకసహస్రేణ = బహుశోకములచేత, ఆవృతత్వతః = ఆవరింపఁబడుటవలన, దుఃఖమేవేతి = దుఃఖమే యని, మత్వా = తలఁచి, అల్పే = పరిచ్ఛిన్నమందు, సుఖం = సుఖము, నాస్తీతి = లే దని, అసౌ = ఈసనత్కుమారుఁడు, ఆహ = చెప్పెను.

తా. విషయసుఖము నశించెడిది గావున, బహుశోకములతోఁ గూడి యుండును. విషముతోఁ గూడిన యన్నము వలె విషయానం దము వలనిసుఖము దుఃఖావహమే యని సనత్కుమారుఁడు చెప్పెను.

అవ. ద్వైతమందు సుఖము లే దనుమాట నంగీకరించి, అద్వైతమందుఁ గూడ సుఖము లే దని పూర్వవాది శంకించుచున్నాఁడు:—

శ్లో. నను ద్వైతే సుఖం మాభూదద్వైతేఽప్యస్తి నో సుఖం,
అస్తి చేదుపలభ్యేత తథా చ త్రిపుటీ భవేత్. 22

వ్యా. ద్వైతే సుఖాభావమంగీకృత్యాద్వైతేఽపి తమాశంకతే—నన్వితి. తత్రానుపలబ్ధిం ప్రమాణయతి—అస్తి చేదితి. అద్వైతే యది సుఖం విద్యతే, తర్హి విషయసుఖాదివదుపలభ్యేత. యతో నోపలభ్యతేఽతో నాస్తీత్యర్థః. నన్వూపలభ్యేత ఇత్యాశంకమానం ప్రత్యాహ—తథేతి. అనుభవస్య అనుభవిత్రనుభావ్యసాపేక్షత్వాదద్వైతహానిరితి భావః.

టీ. నను = ఓయీ, ద్వైతే = ద్వైతమునందు, సుఖం = సుఖము, మాభూత్ = లేకపోనీ, అద్వైతేఽపి = అద్వైతమునందును, సుఖం = సుఖము, నాస్తి=లేదు. అస్తి చేత్ = ఉన్నయెడల, ఉపలభ్యేత = ప్రత్యక్షముగా పొందఁబడవలెను. తథాచ = అట్లగుచుండఁగా, త్రిపుటీ = త్రిపుటి, భవేత్ = అగును

తా. ఓసిద్ధాంతీ ! ద్వైతమందు సుఖము లేకపోవుఁగాక. అద్వైతమందును సుఖము లేదు. అట్లద్వైతమందు సుఖము లే దని చెప్పుటకు అనుభవము లేకపోవుటయే ప్రమాణము. అద్వైతమందు సుఖ మనుభవింపఁబడుచున్నది యంటివేని, అట్లనుభవింపఁబడుచుండఁగా జ్ఞాతృ జ్ఞానజ్ఞేయరూప మగు త్రిపుటి (ద్వైతము) ఉండుటచేత అద్వైతహాని యగును. అని పూర్వపక్షి యాక్షేపము.

అవ. ఇందుకు సిద్ధాంతి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాస్త్వద్వైతే సుఖం కింతు సుఖమద్వైతమేవ హి,
కిం మానమితి చేన్నాస్తి మానాకాంక్షా స్వయంప్రభే. 23

వ్యా. అద్వైతస్య సుఖాధికరణత్వనిషేధమంగీకరోతి—సిద్ధాంతీ మాస్త్వితి తత్ర హేతుమాహ—కింత్వితి. హి యస్మాత్కారణాదద్వైతమేవ సుఖం. అత స్సుఖాధికరణం న భవతీత్యర్థః. అద్వైతం సుఖమిత్యత్ర కిం ప్రమాణమిత్యాశంక్యానువాదపూర్వకం తస్య స్వప్రకాశత్వాత్ప్రమాణప్రశ్న ఏవానుపపన్న ఇత్యాహ—కిం మానమితి.

టీ. అద్వైతే = అద్వైతమునందు, సుఖం = సుఖము, మాస్తు = లేకపోనిమ్ము. కింతు = మఱి యేమనఁగా, అద్వైతమేవ హి = అద్వైతమే, సుఖం = సుఖము. కిం =

ఏది, మానమితి చేత్ = ప్రమాణ మంటివేని, స్వయంప్రభే = స్వప్రకాశమునందు, మానాపేక్షా = ప్రమాణముతో అవసరము, నాస్తి = లేదు.

తా. ఓపూర్వవాదీ! నీవు చెప్పినయట్లు అద్వైతము సుఖమున కాధారమైనది కాకఁబోవుఁగాక. ఏకారణముచేత అద్వైతమే సుఖమగునో ఆకారణముచేత అద్వైతము సుఖాధికరణము (సుఖమున కాధారము) కాదని తెలియవలెను. దీనికి ప్రమాణ మేమి యనెదవేని, స్వయముగాఁ బ్రకాశించుచుండెడి వస్తువునందు ప్రమాణాపేక్ష లేదు. అనఁగా అనువాదపూర్వకముగ నా యద్వైతమునకు స్వప్రకాశత్వము కలిగియుండుటవలన ప్రమాణప్రశ్నయే యుక్తము కాదు.

అవ. స్వప్రకాశ మనుటకు ప్రమాణ మే మనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వప్రభత్వే భవద్వాక్యం మానం యస్మాద్భవానిదం,
అద్వైతమభ్యుపేత్యాస్మిన్సుఖం నాస్తీతి భాషసే. 24

వ్యా. నను స్వప్రకాశకత్వేఽపి కిం ప్రమాణమిత్యాశంక్య త్వదీయమేవ వచనం ప్రమాణమిత్యాహ—స్వప్రభత్వఇతి. తదుపపాదయతి—యస్మాదితి. యతః కారణాద్భవతా ప్రమాణనైరపేక్ష్యేణాద్వైతమభ్యుపేత్య సుఖమేవాక్షిప్యతేఽతః స్వప్రభత్వ మిత్యర్థః.

టీ. యస్మాత్ = ఏకారణమువలన, భవాన్ = నీవు, ఇదం = ఈ, అద్వైతం = అద్వైతమును, అభ్యుపేత్య = అంగీకరించి, అస్మిన్ = ఈ యద్వైతమందు, సుఖం = సుఖము, నాస్తీతి = లే దని, భాషసే = పలుకుచున్నావో, (తస్మాత్ = ఆకారణము వలన), స్వప్రభత్వే = స్వప్రకాశత్వమందు, భవద్వాక్యం = నీవాక్యము, మానం = ప్రమాణమగును.

తా. అద్వైతము స్వప్రకాశ మనుటకు నీవాక్యమే మాకు ప్రమాణము. నీవు "అద్వైతమందు సుఖము లేదు" అనుటవలన అద్వైతము నంగీకరించి కదా మాటలాడుచున్నావు?

అవ. అద్వైతమును నే నొప్పుకొన ననెడి పూర్వవాదిమాటకు సమాధానము:—

శ్లో. నాభ్యుపైమ్యహమద్వైతం త్వద్వచోఽనూద్య దూషణమ్,
వచ్మీతి చేత్తదా బ్రూహి కిమాసీద్ద్వైతతః పురా. 25

వ్యా. న మయాఽద్వైతమభ్యుపగమ్యతే. కింతు త్వదుక్తమద్వైతమనూద్య దూష్యతేఽతో నోక్తసిద్ధిరితి శంకతే—నాభ్యుపైమీతి. వికల్పాసహత్వాదద్వైతానభ్యుపగమోఽనుపపన్న ఇతి మన్వానం పృచ్ఛతి—తదేతి.

టీ. అహం = నేను, అద్వైతం = అద్వైతమును, నాభ్యుపైమి = అంగీకరింపను, త్వద్వచః = నీవాక్యమును, అనూద్య = అనువదించి, దూషణం = దోషమును, వచ్మీతి చేత్ = చెప్పుచున్నానంటి వేని, తదా = అప్పుడు, ద్వైతతః = ద్వైతముకంటె, పురా= లోగడ, కిమాసీత్ = ఏమి యుండెనో, బ్రూహి = చెప్పుము.

తా. నే నద్వైతము నంగీకరింపను. కాని మీ రద్వైత మని యంటిరి గాన ఆమాట ననువదించి ఖండించెద నని పూర్వపక్షి యనఁగా, సిద్ధాంతి ద్వైతోపపత్తికి పూర్వ మేది యుండెనో చెప్పు మని పూర్వపక్షి నే ప్రశ్నించుచున్నాఁడు.

అవ. వికల్పమును జూపి ఖండించుచున్నాఁడు:—

శ్లో. కిమద్వైత ముత ద్వైతమన్యో వా కోటిరంతిమః,
అప్రసిద్ధో న ద్వితీయోఽనుత్పత్తే శ్శిష్యతేఽగ్రిమః. 26

వ్యా. కింశబ్దసూచితం వికల్పం దర్శయతి—కిమద్వైతమితి. తృతీయం పక్షం నిరాకరోతి—అంతిమ ఇతి. అంతిమః అప్రసిద్ధః. ద్వైతాద్వైతవిలక్షణస్య రూపస్య లోకే అదర్శనాదితి భావః. ద్వితీయం పక్షం నిరాకరోతి—న ద్వితీయ ఇతి. తత్ర హేతుమాహ—అనుత్పత్తేరితి. ద్వైతస్య తదానీమనుత్పన్నత్వాదితి భావః. అతః ప్రథమః పక్షః పరిశిష్యత ఇత్యాహ—శిష్యత ఇతి.

టీ. అద్వైతం కిం = అద్వైతమా, ఉత = లేక, ద్వైతం = ద్వైతమా, అన్యః కోటిర్వా = వేఱొక పక్షమా? అని వికల్పించి సిద్ధాంతి చెప్పుచున్నాఁడు. అంతిమః= కడపటిపక్షము; (వేఱొక పక్షము), అప్రసిద్ధః = ప్రసిద్ధమైనది గాదు. అనుత్పత్తేః = అప్పుడు పుట్టనందున, ద్వితీయః = రెండవపక్షము (ద్వైతము), న=కాదు. (అతః = కనుక) అగ్రిమః = మొదటిపక్షము (అద్వైతము), శిష్యతే = మిగిలియున్నది. (అదియే ముఖ్యపక్షము.)

తా. ద్వైతము పుట్టుటకు లోగడ, ద్వైతాద్వైతములకంటె వేఱగుపదార్థము గల దనుటకు వీలుపడదు. అట్టి దప్రసిద్ధము. ద్వైతము పుట్టుటకు పూర్వము ద్వైత ముండుట యసంభవము. తన యుత్పత్తికి పూర్వము తానే యుండు టెట్లు? ఈ రెండు వికల్పములును ఖండితములైనందున, ద్వైతోత్పత్తికి పూర్వ మద్వైతమే యున్న దని తేలుచున్నది.

అవ అద్వైత మనుభవసిద్ధము గాదు. యుక్తిమాత్రముచేతనే సిద్ధించు నని యాక్షేపింపఁగా, సిద్ధాంతి యుక్తిసిద్ధ మనుటయు ఘటింప దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వైతసిద్ధిర్యుక్త్యైవ నానుభూత్యేతి చేద్వద,
నిర్దృష్టాంతా సదృష్టాంతా వా కోట్యంతరమత్ర నో. 27

వ్యా. నను క్తేన ప్రకారేణాద్వైతం యుక్త్యైవ సిధ్యతి నానుభవేనేతి చోదయతి—అద్వైతేతి. అద్వైతసిద్ధిర్యుక్త్యైవేత్యుక్తం వికల్పాసహత్వాదనుపపన్నమితి మన్వానో యుక్తిం వికల్పయతి సిద్ధాంతీ వదేతి. వికల్పస్య న్యూనతాం నిరాకరోతి—కోట్యంతరమితి.

టీ. అద్వైతసిద్ధిః = అద్వైతసిద్ధి, యుక్త్యైవ = యుక్తిచేతనే కలిగెను, అనుభూత్యా = అనుభవముచేత, నేతి చేత్ = కాదంటివేని, యుక్తిః = యుక్తి, నిర్దృష్టాంతా = దృష్టాంతరహితమా, సదృష్టాంతా వా = దృష్టాంతసహితమా, వద = చెప్పుము. అత్ర = ఈ అద్వైతవిషయమై, కోట్యంతరం = మఱియొక కోటి, నో = లేదు.

తా. అద్వైతము కేవల యుక్తిసిద్ధమే, అనుభవసిద్ధము కాదు అనుటకు వీలులేదు. యుక్తి రెండువిధములు. దృష్టాంతరహితము, దృష్టాంతసహితము. మూఁడవవిధ మగు యుక్తి లేదు. ఇక్కడ యుక్తి ఈ రెండువిధములలో నెట్టిదో చెప్పు మని సిద్ధాంతి పూర్వపక్షిని నడుగుచున్నాఁడు.

శ్లో. నానుభూతిర్న దృష్టాంత ఇతి యుక్తిస్తు శోభతే,
సదృష్టాంతత్వపక్షే తు దృష్టాంతం వద మే మతమ్. 28

వ్యా. ప్రథమం పక్షం సోపహాసం నిరాకరోతి—నానుభూతిరితి. అద్వైతసిద్ధిర్యుక్త్యైవేతి వదతా అనుభూతిస్తావన్నాభ్యుపేయతే. యుక్తి స్తు దృష్టాంతప్రదర్శనమంతరేణ న కించిత్సాధయతి. అతో న దృష్టాంత ఇత్యుక్తిరయుక్తేతి భావః. ద్వితీయే వికల్పే ఉభయవాదిసంప్రతిపన్నో దృష్టాంతో వక్తవ్య ఇత్యాహ—సదృష్టాంతేతి.

టీ. అనుభూతిః = అనుభవము, న=లేదు, దృష్టాంతః = దృష్టాంతమును, నేతి = లేదనెడి, యుక్తిస్తు = యుక్తి, శోభతే=ప్రకాశించుచున్నది. సదృష్టాంతత్వపక్షేతు= దృష్టాంత మున్న దంటివేని, మే (చ) మతం = నాకు సమ్మతమగు, దృష్టాంతం = దృష్టాంతమును, వద = చెప్పుము.

తా. దృష్టాంతము లేదు. అనుభవము లేదు. యుక్తిమాత్రము కల దని చెప్పుట యసంగతము. ఏల యన ప్రపంచములో దృష్టాంతము లేని యుక్తియే లేదు. (యుక్తి యనఁగా నొక దృష్టాంతమును

బట్టి మఱియొకదానిని సాధించుటయే కదా.) దృష్టాంతము కల దంటివేని, మన యుభయులకు సమ్మతమగు దృష్టాంతమును జెప్పుము.

అవ. పూర్వపక్షి దృష్టాంతముచేతనే యద్వైతమును సాధింపఁ బ్రయత్నింపఁగా దానిని ఖండించుచున్నాఁడు:—

శ్లో. అద్వైతః ప్రళయో ద్వైతానుపలంభేన సుప్తివత్,
ఇతి చేత్సుప్తిరద్వైతే తత్ర దృష్టాంతమీరయ. 29

వ్యా. తర్హి దృష్టాంతేనైవాద్వైతం సాధయామీతి శంకతే పూర్వవాదీ—అద్వైత ఇతి. ప్రళయోద్వైత రహితో భవితుమర్హతి ద్వైతానుపలబ్ధిమత్త్వాత్ యో యోద్వైతానుపలబ్ధిమాన్ స స ద్వైతరహితః యథాస్వాప ఇతి నన్వేవం సాధయతస్తవ స్వసుషుప్తిర్దృష్టాంతః? పరసుషుప్తిర్వా? ఆద్యే తస్యాః పరం ప్రత్యసిద్ధత్వేన తత్సిద్ధయే దృష్టాంతాంతరం వక్తవ్యమిత్యాహ—సుప్తిరితి.

టీ. ద్వైతానుపలంభేన=ద్వైతము కనఁబడకుండుటచే, సుప్తివత్ = సుప్తివలెఁ ప్రళయః = ప్రళయము, అద్వైత ఇతి చేత్=అద్వైతమగు నని యంటివేని, సుప్తిః = సుషుప్తి, అద్వైతేతి = అద్వైతమగు ననెడి, అత్ర = ఈయంశమందు, దృష్టాంతం= దృష్టాంతమును, ఈరయ = చెప్పుము.

తా. ఓసిద్ధాంతీ ! ప్రళయము ద్వైతస్మృతి హేతుకజ్ఞానవంతము గామిచే ద్వైతము లేనిది యనఁదగును. ఏదేది స్మృతిహేతుకజ్ఞానవంతముకాదో అద్దియద్ది సుషుప్తివలె ద్వైతము లేనిది యగును. ఇట్లు అనుమానప్రమాణపూర్వక దృష్టాంతముచేత అద్వైతమును సాధింపరాదా యేమి? అయితే, సుషుప్తి అద్వైత మగు ననెడి విషయమందు దృష్టాంత మేమి? తన సుషుప్తి దృష్టాంత మగునా? పరసుషుప్తి దృష్టాంత మగునా? తన సుషుప్తియే దృష్టాంత మయ్యెడి పక్షమున, తన సుషుప్తికి పరసుషుప్తి ప్రత్యక్షసిద్ధ! మగుటచేత ఆపరసుషుప్తి సిద్ధించెడికొఱకు సుషుప్తి అద్వైత మగుననెడి విషయమందు మఱియొక దృష్టాంతమును జెప్పుము. అని సిద్ధాంతి యడిగెను.

అవ. పరుని సుషుప్తిని దృష్టాంతముఁ జేసి నాసుషుప్తియం దద్వైతము కల దని సాధించెద నని పూర్వపక్షి యనఁగా, అట్లు సంభవింప దని సిద్ధాంతి ఖండించుచున్నాఁడు:—

శ్లో. దృష్టాంతః పరసుప్తిశ్చేదహో తే కౌశలం మహాత్,
యః స్వసుప్తిం న వేత్త్యస్య పరసుప్తౌ తు కా కథా. 30

వ్యా. నను తస్యాః పరసుషుప్తిరేవ దృష్టాంత ఇతి ద్వితీయం వికల్పమాశంకతే— దృష్టాంత ఇతి. పరసుప్తేస్తవాప్రసిద్ధత్వేన త్వయా దృష్టాంతీకరణమనుపపన్నమితి సోపహాసమాహ సిద్ధాంతీ—అహో ఇతి. యో భవాన్ సుప్తేరనుభవగమ్యత్వానంగీకారేణ స్వసుప్తిమపి న వేత్తి. అస్య తవ పరసుప్తౌ కా కథా? పరసుప్తిజ్ఞానం న భవతీతి కిము వక్తవ్యమితి భావః.

టీ. పరసుప్తిః=అన్యుని సుషుప్తి, దృష్టాంతశ్చేత్=దృష్టాంతమంటివా, తే = నీ యొక్క, మహత్=గొప్పదైన, కౌశలం = కుశలతనుగూర్చి, అహో = ఏమన నగును. యః=ఎవఁడు, స్వసుప్తిం = తన సుషుప్తిని, న వేత్తి=ఎఱుంగఁడో, అస్య = అతనికి, పరసుప్తౌ=ఇతరుని సుప్తియందు, కా కథా = ఎక్కడి వార్త!

తా. అద్వైతమును సాధించెడికొఱకు దృష్టాంతముగాఁ జెప్పఁబడిన నాసుషుప్తికి పరసుషుప్తియే దృష్టాంతమగునుగదా. ఓపూర్వవాదీ! నీ నేర్పరితనము మిక్కిలి కొనియాడఁదగినదే. నీసుషుప్తియొక్కయనుభవము నంగీకరింపమిచే నీసుషుప్తినే నీ వెఱుంగనియపుడు, నీకు నా పరసుషుప్తిజ్ఞానము గలుగుచున్నదనిన, ఇఁక నేమి జెప్పవలెను! అనఁగాఁ బరసుషుప్తి నీకుఁ బ్రత్యక్షము గామిచే నీచేత నాపరసుషుప్తి దృష్టాంతము జేయఁబడుట యుక్తము కాదని యభిప్రాయము.

శ్లో. నిశ్చేష్టత్వాత్పరస్సుప్తో యథాహమితి చేత్తదా,
ఉదాహర్తుస్సుషుప్తేస్తే స్వప్రభత్వం బలాద్భవేత్. 31

వ్యా. నన్వనుమానాత్పరసుప్తిసిద్ధిరితి శంకతే—నిశ్చేష్టేతి. విమతః పరః సుప్తో భవితుమర్హతి. ప్రాణాదిమత్త్వే సతి నిశ్చేష్టత్వాత్ మద్వదిత్యనుమానాదిత్యర్థః. ఏవం తర్హి తవ సుప్తేః స్వప్రకాశత్వం పరిశిష్యత ఇత్యాహ సిద్ధాంతీ—తదేతి. తదా తర్హి మాం ప్రతి సుప్తిముదాహర్తుర్దృష్టాంతీకర్తుస్తవ సుప్తేః స్వప్రభత్వం స్వప్రకాశత్వం బలాత్సుప్త్యుదాహరణసామర్థ్యాదేవ భవేత్.

టీ. సుప్తౌ=సుషుప్తియందు, యథాహం = నావలె, పరః=పరుఁడు, నిశ్చేష్టాదితి చేత్=నిశ్చేష్టుఁడగుటవల్ల నంటివేని, తదా=అప్పుడు, ఉదాహర్తుః=సుషుప్తిని దృష్టాంతీకరించెడి, తే = నీయొక్క, సుషుప్తేః = సుషుప్తికి, స్వప్రభత్వం = స్వప్రకాశత్వము, బలాత్=సుషుప్త్యుదాహరణ సామర్థ్యమువలన, భవేత్ = అగును.

తా. సుషుప్తియందు 'నావలె పరుఁడు ప్రాణాదికము గలిగి నిశ్చేష్టుఁడగుటవలన పరసుషుప్తి అనుమానప్రమాణముచే సిద్ధించును' అనెద

వేని, సుషుప్తిని దృష్టాంతీకరించెడి నీయొక్క సుషుప్తికి స్వప్రకాశత్వము సుషుప్త్యుదాహరణసామర్థ్యమువలననే కలుగును.

అవ. బలాత్కారముగా స్వప్రకాశత్వ మెట్లు కలుగునో దానిం జెప్పుచున్నాఁడు:—

శ్లో. నేంద్రియాణి న దృష్టాంత స్తథాఽప్యంగీకరోషి తాన్,
ఇదమేవ స్వప్రభత్వం యద్భానం సాధనై ర్వినా. 32

వ్యా. కథం బలాద్భవతీత్యాశంక్యాహ—నేంద్రియాణీతి. సుప్తిగ్రాహకాణీంద్రియాణి న సంతి తేషాం స్వకారణే విలీనత్వాత్. దృష్టాంతశ్చ సంప్రతిపన్నో నాస్తి పరసుప్తేరప్రసిద్ధత్వస్యోక్తత్వా త్తథాపి తాం సుప్తిమంగీకరోషి. ఏవం చ సతి సాధనైర్వినా జ్ఞానసాధనమంతరేణాపి భానం ప్రకాశనమితి యదిదమేవ స్వప్రభత్వం సుషుప్తావిత్యర్థః. అత్రాయం ప్రయోగః—విమతా సుప్తిః స్వప్రకాశా అసత్స్వపి జ్ఞానసాధనేషు ప్రకాశమానత్వాత్ సాంఖ్యాభిమతాత్మవత్ప్రాభాకరాభిమతసంవేదనవత్ 'శాక్యాభిమతస్వాత్మవచ్చేత్యర్థః.

టీ. ఇంద్రియాణి=సుషుప్తిని గ్రహించెడి ఇంద్రియములు, న=లేవు, దృష్టాంతః=సరియైన దృష్టాంతము, న=లేదు. తథాపి=అట్లైనను, తాం=ఆసుషుప్తిని, అంగీకరోషి=ఒప్పుకొనుచున్నావు. సాధనైర్వినా = హేతువులు లేకుండ, యద్భానం=ఏప్రకాశము గలదో, తదిదమేవ = ఆ ఇదియే, స్వప్రభత్వం = స్వప్రకాశత్వము.

తా. ఓపూర్వవాదీ! ఆసుషుప్త్యవస్థయందు ఇంద్రియములు తమ కారణమందు లయించుటవలన సుషుప్తిని గ్రహించు ఇంద్రియములు లేవు. అప్రసిద్ధమగు పరసుషుప్తిని దృష్టాంతముగఁ జెప్పుటవలన సరియైన దృష్టాంతమును లేదు. ఐనను ఆసుషుప్తిని నంగీకరించితివి. అట్లంగీకరించుటయందు జ్ఞానసాధనము లేకయే యేప్రకాశనము గలదో యదియే సుషుప్తియందు స్వప్రకాశత్వమగు నని తెలియవలెను. ఇచట ననుమానప్రమాణమును గ్రహింపవలెను. ఎట్లనఁగా, విమతమగు సుషుప్తి జ్ఞానసాధనములు లేకపోయినను బ్రకాశించుచుండుటవలన, సాంఖ్యులకు సమ్మతమగు ఆత్మవలెను ప్రభాకరులకు సమ్మతమగు సంవేదనమువలెను, శాక్యులకు సమ్మతమగు స్వాత్మవలెను స్వప్రకాశత్వము గలది యగు నని యిట్లు అనుమానప్రమాణముచే నెఱుంగవలెను.

అవ. సుషుప్తియం దద్వైత మున్న నుండుఁగాక. అది సుఖరూప మను టేల యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్తాం మద్వైతస్వప్రభత్వే వద సుప్తౌ సుఖం కథమ్,
శృణు దుఃఖం తదా నాస్తి తతస్తే శిష్యతే సుఖమ్. 33

వ్యా. ఇత్థం ప్రశయస్య దృష్టాంతత్వేనోదాహృతాయాస్సుషుప్తేరద్వైతత్వం స్వప్రభత్వం చ ప్రసాధ్య తత్ర సుఖప్రసాధనాయ పూర్వపక్షిణ ఆకాంక్షాముత్థాపయతి—స్తామద్వైతేతి, సుఖప్రతియోగినో దుఃఖస్య తదానీమసత్త్వాత్సుఖమేవ పరిశిష్యత ఇత్యాహ—శృణ్వితి. సుఖదుఃఖయోః ప్రకాశతమసోరివ పరస్పరవిరోధిత్వాత్ దుఃఖాభావే సుఖమేవాభ్యుపేయమితి భావః.

టీ. అద్వైతస్వప్రభత్వే=అద్వైతత్వమును, స్వ ప్రకాశత్వమును, స్తాం=ఉండుఁగాక, సుప్తౌ=సుషుప్తియందు, సుఖం=సుఖము, కథం=ఎట్లు గలదో, వద = చెప్పుము. శృణు=చెప్పెద వినుము. తదా=ఆసమయమందు, దుఃఖం = దుఃఖము. నాస్తి = లేదు. తతః=అందువలన, తే=నీకు, సుఖం=సుఖము, శిష్యతే=మిగులుచున్నది.

తా. సుషుప్తియందు అద్వైతభావమును స్వప్రకాశత్వమును గానుండుఁగాక. ఆసుషుప్తియందు సుఖ మెట్లు గల దనిన, ఆసుషుప్తియందు దుఃఖము లేనికారణమున సుఖమే శేషించును. అనఁగా సుఖదుఃఖములు రెండింటికిని ప్రకాశాంధకారములవలె పరస్పరవిరోధిత్వము గలిగి యుండుటచేత, సుషుప్తియందు సుఖవిరోధి యగు దుఃఖము లేమివలన సుఖమే కల దని యంగీకరింపఁదగు నని యభిప్రాయము.

అవ. పైవిషయము నే శ్రుత్యనుభవములచేఁ గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. అంధస్సన్నప్యనంధస్స్యాద్విద్ధోఽవిద్ధోఽథ రోగ్యపి,
అరోగీతి శ్రుతిం ప్రాహ తచ్చ సర్వజనా విదుః. 34

వ్యా. సుప్తౌ దుఃఖాభావే కిం మానమిత్యాకాంక్షాయాం శ్రుత్యనుభవాదిత్యాహ—అంధ ఇతి. తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వాంఽధస్సన్నంధో భవతి. విద్ధస్సన్నవిద్ధో భవత్యుపతాపీ సన్ననుపతాపీ భవతి. తద్యద్యపీదం భగవశ్శరీరమంధం భవత్యనంధస్స భవ' తీత్యాదిశ్రుతిః దేహాభిమానప్రయుక్తానంధత్వాదీన్దోషాన్ సుప్తౌ నివారయతి—వ్యాధ్యాదినా పీడ్యమానస్యాపి సుప్తౌ తద్దుఃఖానుభవో నాస్తీత్యేతత్సర్వజనప్రసిద్ధం చేత్యర్థః.

టీ. అంధస్సన్నపి = గ్రుడ్డివాఁడైనను, అనంధ = గ్రుడ్డితనము లేనివాఁడు, స్యాత్=అగుచున్నాఁడు. విద్ధః = బాణముచే గ్రుచ్చఁబడినవాఁడు, అవిద్ధః = అట్లు గ్రుచ్చఁబడనివాఁడు (భవతి=అగుచున్నాఁడు). అథ=అట్లులే, రోగ్యపి = రోగముగల

వాఁడు, అరోగీ = రోగము లేనివాఁడు, (భవతి=అగుచున్నాఁడు.) ఇతి=ఈవిధముగా, శ్రుతిః = వేదము, ప్రాహ = చెప్పెను. తత్ = దానిని, సర్వజనాశ్చ = సర్వజనులును, విదుః = ఎఱుఁగుదురు.

తా. సుషుప్తిదశయందు గ్రుడ్డివానికి నేను గ్రుడ్డివాఁడ నని కాని, బాణపుదెబ్బ తగిలినవానికి దానిబాధ గాని, రోగికి, నేను రోగి నని గాని తెలియదు. దుఃఖ హేతువు లున్నను సుషుప్తియందు దుఃఖము లేకుండుట యనుభవసిద్ధము. ఈయర్థమునే "అంధస్సన్ననంధోభవతి" ఇత్యాది ఛాందోగ్యశ్రుతియు చెప్పుచున్నది.

అవ. దుఃఖము లేనంతమాత్రమున, సుఖమే యున్న దని చెప్పుటకు వీలు లే దని పూర్వపక్షి యాక్షేపింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. న దుఃఖాభావమాత్రేణ సుఖం లోష్టశిలాదిషు,
ద్వయాభావస్య దృష్టత్వాదితి చేద్విషమం వచః. 35

వ్యా. నను, యత్ర దుఃఖాభావ స్తత్ర సుఖమిత్యస్యా వ్యాప్తేర్లోష్టాదౌ వ్యభిచార ఇతి శంకతే—న దుఃఖేతి. దుఃఖాభావమాత్రేణ సుఖం కల్పయితుం న శక్యతే. లోష్ట శిలాదిషు ద్వయాభావస్య సుఖదుఃఖయోరభావస్య దర్శనాదిత్యర్థః. దృష్టాంత దార్ష్టాంతి కయోర్వైషమ్యా న్నైవమితి పరిహరతి—విషమమితి. వచో దృష్టాంతవచనం విషమం దార్ష్టాంతికాననుసారీత్యర్థః.

టీ. లోష్టశిలాదిషు=మట్టిగడ్డరాయి మొదలగువానియందు, ద్వయాభావస్య = సుఖదుఃఖములయొక్క అభావము, దృష్టత్వాత్ = కనుపించుటవలన, దుఃఖాభావ మాత్రేణ = దుఃఖము లేనంతమాత్రముచేతనే, సుఖం = సుఖము, నేతి చేత్ = కల్పింప రాదనెదవేని, వచః = నీవాక్యము, విషమం = దార్ష్టాంతికము ననుసరించినది కాదు.

తా. శిలాదులయందు సుఖదుఃఖములు రెండును లేవు. కావున "ఎచట దుఃఖము లేదో అచట సుఖము మిగులుచున్నది" అనెడి వాక్యమునకు వ్యాప్తి లేనందున, సుషుప్తియందు దుఃఖము లేనిమాత్రమున సుఖమును గల్పించుటకు శక్య మెట్లగును? ఈ లోష్టాదిశిలాదృష్టాంత వాక్యము దార్ష్టాంతికము ననుసరించినది కాదు.

అవ. పూర్వపక్షిమాటయందలి అననుకూలత్వమును జూపుచున్నాఁడు:—

శ్లో. ముఖదైన్యవికాసాభ్యాం పరదుఃఖసుఖోహనమ్,
దైన్యాద్యభావతో లోష్టే దుఃఖాద్యూహో న సంభవేత్. 36

వ్యా. దృష్టాంతస్యానుకూలత్వమేవోపపాదయతి—ముఖేతి. అన్యనిష్ఠయోః సుఖదుఃఖయోరూహనం యథాక్రమం ముఖదైన్యవికాసాభ్యాం లింగాభ్యాం కర్తవ్యం. అయం దుఃఖీ విషణ్ణవదనత్వాత్ త్వం ప్రతిపన్నవత్. అయం సుఖీ ప్రసన్నవదనత్వాత్త్వం ప్రతిపన్నవదిత్యర్థః. భవత్వేవం లోకే. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—దైన్యేతి. లోష్టాదౌ ముఖదైన్యాదిలింగాభావా త్సుఖదుఃఖయోరూహనమేవ న సంభవతి. అత స్తత్ర దుఃఖాభావోఽపి న నిశ్చేతుం శక్యత ఇత్యర్థః.

టీ. ముఖదైన్యవికాసాభ్యాం = ముఖమునందలి దీనత్వముచేతను వికాసముచేతను, పరదుఃఖసుఖోహనమ్ = ఇతరునియొక్క దుఃఖములు సుఖమును ఊహించుట, (అస్తి = కలదు). లోష్టే = మట్టిగడ్డయందు, దైన్యాద్యభావతః = దైన్యము మున్నగునవి లేకపోవుటవలన, దుఃఖాద్యూహాః = దుఃఖము మొదలగువాని యూహ, న సంభవేత్ = సంభవింపదు.

తా. చేతనుని ముఖమందుఁ దోఁచు దైన్యవికాసములనుబట్టి వానికిఁ గల దుఃఖము గాని సుఖమును గాని యూహింపవచ్చును. వాఁడు విషణ్ణవదనుఁడుగా నున్నయెడల వానికి దుఃఖము గలదనియు, ప్రసన్నవదనుఁడుగ నున్నయెడల సుఖముగలదనియు నూహింపవచ్చును. లోకమం దట్లుండుఁగాక, ప్రకృతమందు లాభ మేమి? అనెదవేని, లోష్టాదులు చైతన్యరహితము లగుటవలన వానియందు సుఖదుఃఖముల నూహించుటయే సంభవింపదు గనుక, దుఃఖాభావమును సయితము నిశ్చయింప శక్యము కాదు అని సిద్ధాంతి సమాధానము.

అవ. తన సుఖదుఃఖములకును, పరుని సుఖదుఃఖములకును గల భేదమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వకీయసుఖదుఃఖే తు నోహనీయే తత స్తయోః,
భావో వేద్యోఽనుభూత్యైవ తదభావోఽపి నాన్యతః. 37

వ్యా. ఇదానీం పరకీయసుఖదుఃఖాభ్యాం స్వకీయసుఖదుఃఖయో ర్వైలక్షణ్యం దర్శయతి—స్వకీయేతి. స్వనిష్ఠయోస్తు సుఖదుఃఖయోరనుభవసిద్ధత్వాన్నానుమేయత్వం. యత స్తత స్తయోస్సుఖదుఃఖయోర్భావః సద్భావో యథానుభూత్యైవ వేద్యః ప్రత్యక్షేణావగమ్యతే, తథా తదభావోఽపి తయోస్సుఖదుఃఖయోరభావోఽపి అన్యతః అన్యస్మాదనుమానాదేర్నావగమ్యతే. కింతు ప్రత్యక్షేణైవేత్యర్థః.

టీ. (యతః=ఏకారణమువలన), స్వకీయసుఖదుఃఖే తు=తనసంబంధములగు సుఖదుఃఖములైతే, ఊహనీయే = ఊహింపఁదగినవి, న = కావో, తతః = ఆహేతువువలన,

తయోః=ఆ సుఖదుఃఖములయొక్క, భావః=ఉనికి, అనుభూత్యైవ = అనుభవముచేతనే, వేద్యః = తెలియఁదగినది. తదభావోఽపి = ఆ సుఖదుఃఖములు లేకపోవుటయు, అనుభూత్యైవ=అనుభవముచేతనే, వేద్యః=తెలిసికొనఁదగినది. అన్యతః=ఇతరలోక సాధనము చేత, న వేద్యః = ఎఱుఁగఁదగినది కాదు.

తా. ఏకారణముచేతఁ దనయొక్క సుఖదుఃఖములు అనుభవసిద్ధములే కాని యూహింపఁదగినవి కావో, ఆకారణముచేతనే యా సుఖదుఃఖములయొక్క స్థితి (ఉనికి) యు అనుభవము (ప్రత్యక్షము) చేతనే తెలియఁదగును. తన సుఖదుఃఖములయొక్క అభావమును (లేమియు) ప్రత్యక్షముగ తెలిసికొనఁదగును గాని అనుమానాది ప్రమాణముల వలనఁ దెలియఁబడవు.

అవ. పై చర్చయొక్క ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తథా సతి సుషుప్తౌ చ దుఃఖాభావోఽనుభూతితః,
విరోధిదుఃఖరాహిత్యాత్సుఖం నిర్విఘ్నమిష్యతామ్. 38

వ్యా. ఫలితమాహ—తథేతి. తథాసతి స్వకీయస్య సుఖాదేరనుభవగమ్యత్వే సతి సుషుప్తౌ స్వకీయసుషుప్తావపి విద్యమానో దుఃఖాభావోఽనుభవేనైవ సిద్ధః. తతోఽపి కిం తత్రాహ—విరోధీతి. సుషుప్తౌ సుఖవిరోధినో దుఃఖస్యాభావాన్నిర్విఘ్నం బాధరహితం సుఖమిష్యతామభ్యుపేయతాం.

టీ. తథాసతి=అట్లుండగా, సుషుప్తౌ చ=సుషుప్తిదశయందు, విరోధిదుఃఖరాహిత్యాత్=సుఖమునకు విరోధి యగు దుఃఖముయొక్క లేకపోవుటవలన, దుఃఖాభావః=దుఃఖము లేకపోవుటయు, సుఖం చ = సుఖమును, అనుభూతితః = అనుభవమువలన, నిర్విఘ్నం = నిరాటంకముగా, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁగాక.

తా. ఇట్లు చెప్పుటచే ఫలిత మే మనఁగా, స్వకీయ సుఖాదికము అనుభవముచే నెఱుఁగవలసిన దగుచుండఁగా, తన సుషుప్తియందును గల దుఃఖాభావమును అనుభవముచేతనే సిద్ధమైన దగును. సుషుప్తియందు దుఃఖాభావమువలన లాభ మేమి యన, సుఖవిరోధి యగు దుఃఖము లేమివలన బాధరహితమగు సుఖము గల దని యంగీకరింపవలె నని తెలియవలెను.

అవ. సుషుప్తియందు సుఖము గల దనుటకు మఱియొక హేతువు:—

శ్లో. మహత్తరప్రయాసేన మృదుశయ్యాదిసాధనమ్,
క్రుతస్సంపాదయతే సుప్తౌ సుఖం చేత్తత్ర నో భవేత్. 39

వ్యా. శయ్యాదిసుఖసాధనసంపాదనాన్యథానుపపత్త్యాపి సుషుప్తౌ సుఖమస్తీత్యవగమ్యత ఇత్యాహ—తత్ర తస్యాం సుషుప్తౌ సుఖం న భవేచ్చేత్ మహత్తరప్రయాసేన బహువిధవిత్తవ్యయశరీరపీడనాదినా మృదుళం శయ్యాది కశిపుమంచాది సాధనం సుఖసాధనం కుతః కస్మాత్కారణాత్సంపాద్యతే ? న కుతోఽపీత్యర్థః.

టీ. తత్ర = ఆ, సుప్తౌ = సుషుప్తియందు, సుఖం=సుఖము, నో భవేచ్చేత్ = లేకపోయినయెడల, మహత్తరప్రయాసేన = గొప్ప ప్రయాసముచేత, మృదుశయ్యాది సాధనం = మెత్తని పరుపులు మొదలగు సాధనములు, కుతః = ఎందుకు, సంపాద్యతే= సంపాదింపఁబడుచున్నవి ?

తా. సుషుప్తియందు సుఖము లేనియెడల సుఖసాధనము లగు మృదుశయ్యాదుల నేల సేకరింపవలెను ? కావున సుషుప్తియందు సుఖమున్నది.

అవ. మృదుశయ్యాదులు దుఃఖనివృత్తికొఱకుఁ గాని సుఖసంపాదనమునకుఁ గావనివఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దుఃఖనాశార్థమేవై తదితి చేద్రోగిణ స్తథా,
భవ త్వరోగిణ స్త్వేత త్సుఖాయైవేతి నిశ్చిను. 40

వ్యా. అర్థాపత్తేరన్యథోపపత్తిం శంకతే—దుఃఖేతి. ఏతచ్ఛయ్యాదిసాధనసంపాదనం దుఃఖనివృత్తిఫలకం న నియతమితి పరిహరతి—రోగిణ ఇతి. రోగాదిదుఃఖే సతి తన్నివృత్తయే తద్భవతు. తదభావే తు నివర్త్యదుఃఖాభావాత్తత్సంపాదనం సుఖాయైవేత్యవగమ్యత ఇత్యర్థః.

టీ. ఏతత్=ఈమృదుశయ్యాదుల సంపాదనము, దుఃఖనాశార్థమేవేతి = దుఃఖనివృత్తికొఱకే యంటివేని, రోగిణః=రోగికి, తథా=అట్టులే, భవతు = అగుఁగాక. అరోగిణః=రోగములేనివారికి, ఏతత్=ఇది, సుఖాయైవ=సుఖముకొఱకే, ఇతి=అని, నిశ్చిను= నిశ్చయింపుమా.

తా. మృదుశయ్యాదులు దుఃఖనివృత్తికొఱకు రోగు లగుటచే దుఃఖముగలవారు సేకరింతురందువేని అట్లే కానిమ్ము. అయినను దుఃఖ కారణము లగు రోగము లేవియు లేనివారు గూడ వానిని సంపాదించు చున్నారు. కాన, అవి సుఖముకొఱకే యని నిశ్చయము. కాఁబట్టి, సుషుప్తిలో సుఖ మున్న దని భావము.

అవ. సుషుప్తియందలి సుఖము నిత్యము గదా. అది మృదుశయ్యాదిసాధనములవలనఁ గలుగుచున్న దనిన, అది యనిత్యమగు విషయసుఖమగునే" యని యాక్షేపము:—

శ్లో. తర్హి సాధనజన్యత్వాత్సుఖం వైషయికం భవేత్,
భవత్వేవాత్ర నిద్రాయాః పూర్వం శయ్యాసనాదిజమ్. 41

వ్యా. నను సౌషుప్త సుఖస్య శయ్యాదిసాధనజన్యత్వే ఆత్మస్వరూపత్వం వ్యాహన్యేతేతి శంకతే—తర్హీతి. కిం నిద్రాగమనాత్పూర్వకాలీనస్య విషయజన్యత్వ ముచ్యతే ? ఉత నిద్రాకాలీనస్యేతి వికల్ప్యాద్యమంగీకరోతి—భవత్వితి.

టీ. తర్హి = అట్లయితే, సాధనజన్యత్వాత్ = సాధనములచేతఁ గలుగుటవలన, వైషయికం=విషయజన్యమైన, సుఖం=సుఖము, భవేత్ = అగుచున్నది. అత్ర=ఇచ్చట, నిద్రాయాః = నిద్రకంటె, పూర్వం = మొదటిదైన, శయ్యాసనాదిజం = శయ్యాసనాది కమువలనఁ బుట్టిన, సుఖం = సుఖము, ఏవం = ఈవిధముగా, భవత్వేవ = కానిమ్ము.

తా. నిదుర పట్టుటకు ముం దనుభవింపఁబడెడి సుఖము మృదు శయ్యాదిసాధనజన్యమై విషయసంబంధ మగును గాని, నిదురపట్టిన తర్వాత ననుభవింపఁ బడెడిసుఖము సాధనజన్య మెట్లగును ? (సుషుప్తి యందు మృదుశయ్యాసనము లున్న వని నిదురించు వానికి తెలియదు గదా !)

అవ. ద్వితీయవికల్పము నిపుడు నిరాకరించుచున్నాఁడు:—

శ్లో. నిద్రాయాం తు సుఖం యత్తజ్జన్యతే కేన హేతునా,
సుఖాభిముఖధీరాదౌ పశ్చాన్మజ్జేత్పరే సుఖే. 42

వ్యా. ద్వితీయం నిరాకరోతి—నిద్రాయామితి. సుషుప్తౌ శయ్యాద్యనుసంధానా భావాత్తజ్జన్యత్వం తస్య న సంభవతీతి భావః. నను నిద్రాయామజన్యం సుఖం యద్యస్తి తర్హి తత్ విషయసుఖవత్కుతో నానుభూయత ఇత్యాశంక్యానుభవితుస్తదా తస్మిన్నిమగ్నత్వాన్న విషయసుఖవత్తదనుభవ ఇత్యభిప్రాయేణాహ—సుఖేతి. ఆదౌ నిద్రాయాః పూర్వస్మిన్ కాలే జీవః సుఖాభిముఖధీః శయ్యాదిజన్యసుఖాభిముఖా ధీర్బుద్ధిర్యస్య స తథోక్తస్తథావిధో భవతి. పశ్చాన్నిద్రాకాలే పరే ఉత్కృష్టే సుఖే మజ్జేత్ లీనో భవేత్.

టీ. నిద్రాయాం తు=నిద్రయందైతే, యత్=ఏసుఖము, అస్తి=కలదో, తత్ = అది, కేన హేతునా = ఏ కారణముచే, జన్యతే=పుట్టుచున్నది. ఆదౌ = నిద్రపట్టుటకుఁ బూర్వము, (జీవః = జీవుఁడు), సుఖాభిముఖధీః = సుఖాభిముఖ మగు బుద్ధిగలవాఁడై, పశ్చాత్=అనంతరము, పరే = నిరవధికమగు, సుఖే=సుఖమందు, మజ్జేత్ = మునుంగును.

తా. గాఢసుషుప్తిలోని సుఖము బ్రహ్మానందము. అది దేనివలనను పుట్టదు. జీవుఁడు మొదట శయ్యాదిజన్యమగు వైషయిక సుఖమనుభవించి దానివలన సుఖాభిముఖమనస్కుఁడై తరువాత స్వస్వరూపభూత బ్రహ్మానందము ననుభవింపుచున్నాఁడు.

అవ. ఈయర్థము నే శ్లోకత్రయముచే సంక్షేపముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జాగ్రద్వ్యాపృతిభిశ్శ్రాంతో విశ్రమ్యాథ విరోధిని,
అపనీతే స్వస్థచిత్తోఽనుభవేద్విషయే సుఖమ్. 43

వ్యా. సంక్షేపేణోక్తమర్థం శ్లోకత్రయేణ ప్రపంచయతి—జాగ్రద్వ్యాపృతిభిరిత్యాదినా—జీవో జాగ్రద్వ్యాపృతిభిర్జాగరణావస్థాయాం క్రియమాణైర్వ్యాపారవిశేషైః శ్రాంతో విశ్రమ్య మృదుశయ్యాదౌ శయనం కృత్వాఽథానంతరం విరోధిని వ్యాపారజనితే దుఃఖేఽపనీతే నివారితే సతి స్వస్థచిత్తోఽవ్యాకులమనా భూత్వా శయ్యాదౌ విషయే జాయమానం సుఖం అనుభవేత్సాక్షాత్కుర్యాత్.

టీ. (జీవః=జీవుఁడు), జాగ్రద్వ్యాపృతిభిః=జాగ్రదవస్థయందలి వ్యాపారములచేత, శ్రాంతః = అలసటఁజెందినవాఁడై, విశ్రమ్య=విశ్రమించి, అథ=అనంతరము, విరోధిని = విరోధియగు దుఃఖము, అపనీతేసతి = నిరాకరింపఁబడఁగా, స్వస్థచిత్తః = స్వస్థచిత్తుఁడై, విషయే=విషయమునందలి, సుఖం=సుఖమును, అనుభవేత్=అనుభవించును.

తా. జీవుఁడు జాగ్రదవస్థలో పలువిధము లగు శ్రమల నొంది, తన్నివృత్తికై మృదుశయ్యాదులయందు పవళించుటచే విశ్రమించి, పిమ్మట వ్యాపారజనితదుఃఖము నివారింపఁబడుచుండఁగా, వ్యాకులము లేని మనస్సుతో శయ్యాది విషయములవలని సుఖము ననుభవించుచున్నాఁడు.

అవ. విషయసుఖములను నిరూపించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మాభిముఖధీవృత్తౌ స్వానందః ప్రతిబింబతి,
అనుభూయైనమత్రాపి త్రిపుట్యా శ్రాంతిమాప్నుయాత్. 44

వ్యా. విషయసుఖం చ కీదృశమిత్యాకాంక్షాయాం తత్స్వరూపం దర్శయన్ పరే సుఖే నిమజ్జననిమిత్తత్వేన తదనుభవేఽపి శ్రమం దర్శయతి—ఆత్మాభిముఖేతి. అనాగతవిషయసంపాదనాదినా దుఃఖమనుభూయ తన్నివృత్తయే మృదుశయ్యాదౌ శయానస్య బుద్ధిరంతర్ముఖా భవతి. తస్యాం చ బుద్ధివృత్తౌ స్వరూపభూత ఆనందః స్వాభిముఖే దర్పణే ముఖమివ ప్రతిబింబతి. ఏష హి విషయానందః. అత్రాప్యస్యామపి

వేలాయామేనం విషయానందమనుభూయానుభవిత్రనుభవానుభావ్యలక్షణయా త్రిపుట్యాశ్రమం, ప్రాప్నుయాత్.

టీ. ఆత్మాభిముఖధీవృత్తౌ = ఆత్మాభిముఖచిత్తవృత్తియందు, స్వానందః=స్వరూపభూతానందము, ప్రతిబింబతి = ప్రతిబింబించుచున్నది. అత్రాపి=ఇచ్చటను, ఏనం = ఈవిషయానందమును, అనుభూయ=అనుభవించి, త్రిపుట్యా=త్రిపుటిచేత, శ్రాంతిం = శ్రమను, ప్రాప్నుయాత్=పొందును.

తా. జాగ్రద్వ్యాపారమును వదలినందున చిత్తమాత్మాభిముఖమగును. అట్టి చిత్తమం దానందరూప మగు ఆత్మ అద్దమునందు ముఖమువలె ప్రతిఫలించును. ఇదియును విషయానందమగును. ఈదశయందు జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లనెడి త్రిపుటియుండును గాన, నిదియు శ్రమగాఁ దోఁచును. (త్రిపుటి యనఁగా అనుభవించెడివాఁడును, అనుభవమును, అనుభవింపఁబడునదియును.)

అవ. దీనివలన ప్రకృతమున కేమి ప్రయోజన మనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. తచ్ఛ్రమస్యాపనుత్త్యర్థం జీవో ధావేత్పరాత్మని,
తేనైక్యం ప్రాప్య తత్రత్యో బ్రహ్మానందస్స్వయం భవేత్. 45

వ్యా. తతః కిం తత్రాహ—తచ్ఛ్రమస్యేతి. తస్య త్రిపుటీదర్శనజనితస్య శ్రమస్యాపనోదాయ స ఏవ జీవః పరమాత్మన్యానందరూపే బ్రహ్మణి ధావేచ్ఛీఘ్రం గచ్ఛేత్. గత్వా చ తేన బ్రహ్మణైక్యం తాదాత్మ్యం గత్వా, 'సతా సోమ్య తదాసంపన్నో భవ'తీతి శ్రుతేః స్వయమపి తత్రత్యస్తస్యాం సుషుప్తౌ స్థితో బ్రహ్మానందో భవేత్.

టీ. తచ్ఛ్రమస్య = ఆత్రిపుటినిఁ జూచుటచేఁగలిగిన శ్రమయొక్క, అపనుత్త్యర్థం = పోఁగొట్టుకొనుటకొఱకు, జీవః=జీవుఁడు, పరమాత్మని = పరమాత్మయందు, ధావేత్=శీఘ్రముగఁ బొందును. తేన=ఆబ్రహ్మముతో, ఐక్యం=ఏకత్వమును, ప్రాప్య=పొంది, తత్రత్యః = ఆసుషుప్తియం దుండెడి, బ్రహ్మానందః=బ్రహ్మానందము, స్వయం = తాను, భవేత్ = అగును.

తా. ఈత్రిపుటీశ్రమనివారణకై యాజీవుఁడు సుషుప్త్యవస్థయందలి బ్రహ్మముతో నైక్యమును పొందును. కావున తానును ఆ సుషుప్తియందుండెడి బ్రహ్మానందమగును.

అవ. ఈవిషయమై పలువిధంబు లగు దృష్టాంతములు వేదమందుఁ గలవని చెప్పుచున్నాఁడు:—

శ్లో. దృష్టాంతాశ్శకుని శ్శ్యేనః కుమారశ్చ మహాన్నృపః,
మహాబ్రాహ్మణ ఇత్యేతే సుప్త్యానందే శ్రుతీరితాః. 46

వ్యా. అస్మిన్నుపపాదితే సౌషుప్త ఆనందే శకున్యాదయో బహవో దృష్టాంతాః శ్రుత్యుక్తా విద్యంత ఇత్యాహ—దృష్టాంతా ఇతి. శకున్యాదిభిః పంచభిర్దృష్టాంతైః సుప్తావానందోపపాదనేన తత్ర సుఖం నాస్తీతి మతం నిరాకృతం.

టీ. శకునిః=పక్షియు, శ్యేనః=డేగయు, కుమారశ్చ = పిల్లవాఁడును, మహాన్ = గొప్పవాఁడైన, నృపః=రాజును, మహాబ్రాహ్మణః = బ్రహ్మవిదుఁడును, ఇత్యాది=ఈలాగంటి, దృష్టాంతాః=దృష్టాంతములును, సుప్త్యానందే = సుషుప్త్యానందము విషయమై, శ్రుతీరితాః=వేదముచేఁ జెప్పఁబడినవి.

తా. వేదములలో నిచ్చిన శకుని శ్యేనాది నైదు దృష్టాంతములను వరుసగా నిందుఁ జెప్పుచున్నాఁడు.

అవ. మొదటి దృష్టాంతము వివరించుచున్నాఁడు:—

శ్లో. శకునిస్సూత్రబద్ధస్సన్ దిక్షు వ్యాపృత్య విశ్రమం,
అలబ్ధ్వా బంధనస్థానం హస్తస్తంభాద్యుపాశ్రయేత్. 47

వ్యా. తత్ర తావత్ 'స యథా శకునిస్సూత్రేణ ప్రతిబద్ధో దిశందిశం పతిత్వాన్యత్రాయతనమలబ్ధ్వా బంధనమేవోపాశ్రయతే, ఏవమేవ ఖలు సోమ్య తన్మనో దిశం దిశం పతిత్వాఽన్యత్రాయతనమలబ్ధ్వా ప్రాణమేవోపాశ్రయతే, ప్రాణబంధనం హి సోమ్య మన ఇత్యస్య దృష్టాంతదార్ష్టాంతికప్రతిపాదనపరస్య ఛాందోగ్యశ్రుతివాక్యస్యార్థం సంక్షేపేణ దర్శయతి శ్లోకద్వయేన—శకునిరితి. హస్తాదౌ క్వచిదాధారే సూత్రేణ బద్ధః శకునిః పక్షీ ఆహారాదిగ్రహణాయ దిక్షు ప్రాచ్యాదిషు వ్యాపారం కృత్వా తత్ర విశ్రమం-విశ్రమ్యతే అస్మిన్నితి విశ్రమః ఆధారః తమలబ్ధ్వా బంధనస్థానం హస్తాదికమేవ యథాశ్రయేత్.

టీ. శకునిః=పక్షి, సూత్రబద్ధస్సన్=త్రాటిచేఁగట్టఁబడిన దగుచు, దిక్షు=దిక్కులయందు, వ్యాపృత్య=తిరిగి. విశ్రమం = విశ్రాంతిని, అలబ్ధ్వా=పొందక, బంధనస్థానం = కట్టినచోటైన, హస్తస్తంభాది = చేయియుస్తంభము మొదలగువానిని, ఉపాశ్రయేత్ = ఆశ్రయించును.

తా. "స యథా శకునిః ప్రాణస్య ప్రాణం" అను ఛాందోగ్యశ్రుతి స్తంభాదులకుఁ ద్రాటితోఁ గట్టఁబడిన పక్షి నలుదెసలం దిరిగి యెక్కడను విశ్రమించుట కాధారస్థానమును బొందఁజాలక తనకు బంధనస్థానము నెట్లాశ్రయించునో.

శ్లో. జీవోపాధి మనస్తద్వ ద్ధర్మాధర్మఫలాప్తయే,
స్వప్నే జాగ్రతి చ భ్రాంత్వా క్షీణే కర్మణి లీయతే. 48

వ్యా. తథా జీవోపాధిభూతం మనోపి పుణ్యాపుణ్యఫలయోస్సుఖదుఃఖయో రనుభవాయ స్వప్నజాగ్రదవస్థయో స్తత్రతత్ర భ్రాంత్వా భోగప్రదే కర్మణి క్షీణేసతి స్వోపాదానేఽజ్ఞానే లీయతే తల్లయే చ తదుపహితో జీవః పరమాత్మైవ భవతీత్యర్థః.

టీ. తద్వత్ = ఆపక్షివలెనే, జీవోపాధి = జీవున కుపాధియైన, మనః=మనస్సు, ధర్మాధర్మఫలాప్తయే = ధర్మాధర్మ ఫలంబులం బొందుటకు, స్వప్నే=స్వప్నదశయందును, జాగ్రతి=జాగ్రద్దశయందును, భ్రాంత్వా=తిరిగి, కర్మణి=కర్మ, క్షీణేసతి = క్షీణింపఁగా, లీయతే=లయమును బొందుచున్నది.

తా. ఆపక్షి నలుదెసలను దిరిగి తన ఆధారస్థానమునకుఁ జేరునట్లే, జీవున కుపాధియగు మనస్సు ధర్మాధర్మఫలములఁ బొందుటకొఱకు స్వప్నజాగ్రదవస్థలందు భ్రాంతిచే నచ్చటచ్చటఁ దిరిగితిరిగి, భోగప్రదమగు కర్మము క్షీణింపఁగా తన కుపాదానమగు జీవునితో అజ్ఞానమందు లయించును. అపుడు జీవుఁడు పరమాత్మయే యగును.

అవ. రెండవ దృష్టాంతమును వివరింపుచున్నాఁడు:—

శ్లో. శ్యేనో వేగేన నీడైకలంపటశ్శయితుం వ్రజేత్,
జీవస్సుప్త్యై తథా ధావేద్బ్రహ్మానందైకలంపటః. 49

వ్యా. ఇదానీం శ్యేనదృష్టాంతప్రపంచనపరస్య 'తద్యథాస్మిన్నాకాశే శ్యేనో వా సుపర్ణో వా విపరిపత్య శ్రాంతస్సంహత్య పక్షౌ స్వాలయాయైవ ధ్రియత ఏవమేవాయం పురుష ఏతస్మా ఆనందాయ ధావతి యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్య' తీత్యస్య బృహదారణ్యశ్రుతివాక్యస్యార్థం సంక్షిప్యాహ— శ్యేన ఇతి. యథా ఆకాశే సర్వతః ప్రచరన్ శ్యేన ఏతన్నామా పక్షీ గగనే సంచారనిమిత్త శ్రమపరిహారాయ శయితుం శయనం కర్తుం నీడైకలంపటః కులాయైకాభిలాషవాన్ వ్రజేత్ శీఘ్రం గచ్ఛేత్ తద్వదేవ జీవో మనఉపాధికశ్చిదాభాసోఽపి బ్రహ్మానందైకాభిలాషవాన్ స్వాపాయ శీఘ్రం గచ్ఛేత్ హృదయాకాశమితి శేషః.

టీ. శ్యేనః = డేగ, వేగేన = వేగముతో, నీడైకలంపటః - నీడ = గూటియందు, ఏక = ఒక్కదానియందే, లంపటః = ఆసక్తిగలదగుచు, శయితుం = శయనించుటకొఱకు, వ్రజేత్ = పోవును. తథా = అటులే, జీవః = జీవుఁడు, బ్రహ్మానందైకలంపటః=

బ్రహ్మానంద మొక్కటియందే ఆసక్తి గలవాఁ డగుచు, సుషుప్త్యై = సుషుప్తికొఱకు, ధావేత్ = (హృదయాకాశమునుగూర్చి) పరుగెత్తును.

తా. డేగ ఆకాశమందు నలుదిక్కుల సంచరించి, అలసి, శ్రమ నివారణకై విశ్రమించుటకు తన నివాసస్థాన మగు గూటియందుఁ బ్రవేశించునట్లే మనోపాధికుఁ డగు జీవుఁడైన చిదాభాసుఁడును బ్రహ్మానందానుభవాసక్తుఁడగుచు నిద్రించుటకై శీఘ్రముగ హృదయాకాశమును బొందుచున్నాఁడు. ఇట్లు "తద్యథాస్మిన్నాకాశే...స్వప్నం పశ్యంతి," యనెడి బృహదారణ్యకశ్రుతి చెప్పుచున్నది.

అవ. మూఁడవ దృష్టాంతమును విశదీకరించుచున్నాఁడు:—

శ్లో. అతిబాలస్స్తనం పీత్వా మృదుశయ్యాగతో హసన్,
రాగద్వేషాద్యనుత్పత్తేరానందైకస్వభావభాక్. 50

వ్యా. 'స యథా కుమారో వా మహారాజో వా మహాబ్రాహ్మణో వాఽతిఘ్నీమానందస్య గత్వా శయీతైవమేవ ఏతచ్ఛేత' ఇతి కుమారాదిదృష్టాంతత్రయప్రదర్శనపరం బాలాకిబ్రాహ్మణగతవాక్యం శ్లోకత్రయేణ వ్యాచష్టే—అతిబాల ఇత్యాదినా. యథా స్తనంధయః శిశుః ఆగళం స్తనం పీత్వా మృదుత్వాదిగుణయోగిని తల్పే శాయితః స్వకీయాది జ్ఞానశూన్యత్వేన రాగాదిరహితస్సన్ సుఖమూర్తి రేవావతిష్ఠతే.

టీ. అతిబాలః = అత్యంతము బాలుఁడు (చంటిబిడ్డ), స్తనం = స్తన్యమును, పీత్వా = త్రాగి, మృదుశయ్యాగతః = మెత్తని శయ్యను బొంది, హసన్ = నగుచు, రాగద్వేషాద్యనుత్పత్తేః = రాగము ద్వేషము మొదలగునవి జనింపమింజేసి, ఆనందైకస్వభావభాక్=ఆనంద మనియెడు ఏకవిధ మగు స్వభావమును పొందినవాఁడు (భవతి = అగుచున్నాఁడు).

తా. పసిబాలుఁడు తృప్తిగ స్తన్యమును గ్రోలి రాగద్వేషములు లేమింజేసి, మృదు వగు శయ్యయందు నగుచు, బ్రహ్మానందము ననుభవించుచున్నాఁ డని, "స యథా కుమారో......ఏతచ్ఛేత" అనెడి శ్రుతి తెలుపుచున్నది.

అవ. నాలవ దృష్టాంతమును బృహదారణ్యకశ్రుతిచే వివరించుచున్నాఁడు:—

శ్లో. మహారాజస్సార్వభౌమస్సంతృప్తస్సర్వభోగతః,
మానుషానందసీమానం ప్రాప్యానందైకమూర్తిభాక్. 51

వ్యా. యథా వా సార్వభౌమో రాజా విశదబుద్ధిత్వేఽపి సర్వైర్మానుషానందైర్వ్యక్తత్వా త్వాప్రార్థనీయాభావేన రాగాదిరహిత ఆనందమూర్తిరేవావతిష్ఠతే.

టీ. సార్వభౌమః = సర్వభూమండలాధిపతి యగు, మహారాజః = మహారాజు, సర్వభోగతః = సర్వభోగములచేత, సంతృప్తః = మిగుల తృప్తినొందినవాఁ డగుచు, మానుషానందసీమానం=మనుష్యుల యానందముయొక్క యవధిని, ప్రాప్య = పొంది, ఆనందైక మూర్తిభాక్ = ఆనందమే ముఖ్యమైన స్వరూపమును బొందినవాఁడు. (భవేత్ = అగును).

తా. సార్వభౌముఁ డగు మహారాజు మనుష్యలోకమునం గల సకలభోగముల ననుభవించుటచే నేకొంతయు లేక యానంద మూర్తియై యుండును.

అవ. అయిదవ యుపమానమును వివరించుచున్నాఁడు:—

శ్లో. మహావిప్రో బ్రహ్మవేదీ కృతకృత్యత్వలక్షణామ్,
విద్యానందస్య పరమాం కాష్ఠాం ప్రాప్యావతిష్ఠతే. 52

వ్యా. యథావా మహావిప్రో మహాబ్రాహ్మణః ప్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారవాన్ అహం కృతకృత్య ఇత్యేవం రూపాం విద్యానందస్య పరమాం సీమాం జీవన్ముక్తతాం ప్రాప్తః పరమానందస్వరూప ఏవావతిష్ఠతే తథా సుప్తోఽప్యానందరూప స్తిష్ఠతీతి శేషః.

టీ. మహావిప్రః = ఉత్తమబ్రాహ్మణుఁడు, బ్రహ్మవేదీ = బ్రహ్మవిదుఁడగుచు, కృతకృత్యత్వలక్షణామ్ = కృతకృత్యుఁడ నగుట స్వరూపముగాఁ గల, విద్యానందస్య= విద్యానందముయొక్క, పరమాం = శ్రేష్ఠమైన, కాష్ఠాం = అవధిని, ప్రాప్య = పొంది, అవతిష్ఠతే=ఉన్నాఁడు.

తా. సద్బ్రాహ్మణుఁడు ప్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారము గల వాఁడై, నేను ధన్యుఁడనైతి నని, విద్యానందమునకు పరమావధి యగు జీవన్ముక్తి నొంది పరమానందస్వరూపుఁడై యెట్లుండునో యట్లే సుషుప్తిఁ బొందినవాఁడును ఆనందరూపస్థితినిఁ బొందుచున్నాఁడు.

అవ. పై జెప్పిన దృష్టాంతముల తాత్పర్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ముగ్ధబుద్ధాతిబుద్ధానాం లోకే సిద్ధా సుఖాత్మతా,
ఉదాహృతానామన్యే తు దుఃఖినో న సుఖాత్మకాః. 53

వ్యా. నన్వేతే కుమారాదయస్త్రయ ఏవ కిమితి దృష్టాంతీకృతా నాన్య ఇత్యాశంక్య దృష్టాంతత్రయోదాహరణ తాత్పర్యమాహ—ముగ్ధేతి. వివేకశూన్యానాం మధ్యే అతిబాలస్సుఖీ, వివేకిషు సార్వభౌమః, అతివివేకిష్వానందాత్మసాక్షాత్కారవానేవ ఇతరే తు సర్వదా రాగాదిమత్త్వాదసుఖిన ఇతి దృష్టాంతీకృతా ఇత్యర్థః.

టీ. లోకే = లోకమున, ముగ్ధబుద్ధాతిబుద్ధానాం - ముగ్ధ = వివేకములేనివారి లోను, బుద్ధ=వివేకులలోను, అతిబుద్ధానాం=మహావివేకము గలవారిలోను, సుఖాత్మతా= ఆనందస్వరూపులైయుండుట, సిద్ధా = సిద్ధించినది. ఉదాహృతానాం=పైన ఉదాహరింపఁబడినవారికంటె, అన్యే తు=ఇతరులయితే, దుఃఖినః = దుఃఖము గలవారు, సుఖాత్మకాః=సుఖస్వరూపులు, న=కారు.

తా. లోకమందు వివేకశూన్యులలో నతిబాలుఁడు సుఖి. వివేకులలో సార్వభౌముఁడు సుఖి. అతివివేకులలో ఆత్మసాక్షాత్కారము గలవాఁడె పరమసుఖి. తదితరులు రాగద్వేషాదిపీడితు లగుటచేత సుఖవంతులు గారు.

అవ. దార్ష్టాంతికవాక్యతాత్పర్యమును వివరించుచున్నాఁడు:—

శ్లో. కుమారాదివదేవాయం బ్రహ్మానందైకతత్పరః,
స్త్రీపరిష్వక్తవద్వేద న బాహ్యం నాపి చాంతరమ్. 54

వ్యా. భవంత్వేతే సుఖినః ప్రకృతే కిమాయాతమిత్యాశంక్య దార్ష్టాంతికశ్రుతివాక్యస్య తాత్పర్యమాహ—కుమారాదితి. కుమారాదివత్కుమారాదయో యథానందభాజః, ఏవమయమపి సుషుప్తః బ్రహ్మానందైకతత్పరః బ్రహ్మానందైకభాగిత్యర్థః. బ్రహ్మానందైకపరత్వే యుక్తిప్రదర్శనపరం 'తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరమేవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో బాహ్యం కించన వేద నాంతర'మితిజ్యోతిర్బ్రాహ్మణగతం వాక్యమర్థతోఽనుక్రామతి—స్త్రీపరిష్వక్తేతి. యథా లోకే ప్రియయా స్త్రియా ఆలింగతః కామీ బాహ్యాభ్యంతర విషయజ్ఞానశూన్యత్వాత్సుఖమూర్తిర్భవతి తథా సుషుప్తౌ ప్రాజ్ఞేన పరమాత్మనైక్యంగతో జీవో బాహ్యాదివిషయజ్ఞానాభావాదానందరూప ఏవ భవతి.

టీ. అయం = ఈసుప్తుఁడు, కుమారాదివదేవ=పసిబాలుఁడు మొదలగువారివలె, బ్రహ్మానందైకతత్పరః = బ్రహ్మానందమునందు ఆసక్తుఁడగుచు, స్త్రీపరిష్వక్తవత్ = స్త్రీచేత నాలింగనము చేసికొనఁబడినవానివలె, బాహ్యం = బాహ్యవ్యాపారమును, న వేద = ఎఱుంగఁడు. అంతరం చాపి=అంతరవ్యాపారమును, న వేద=ఎఱుంగఁడు.

తా. పైశ్లోకమందుఁ జెప్పఁబడిన బాలకసార్వభౌమ బ్రహ్మవేత్తలు ఏప్రకార మానందనిమగ్నులైయుందురో ఆప్రకారమే సుషుప్తుఁడును బ్రహ్మానందతత్పరుఁ డగును. 'తద్యథా ప్రియయా...... వేద నాంతరం' అనెడి శ్రుతి ప్రియురాలిచే నాలింగనము జేసికొనఁ

బడిన పురుషుఁడు బాహ్యాంతరవిషయముల నెఱుంగకుండ నానంద మగ్నుఁ డయి యెట్లుండునో అట్లే సుషుప్తియందు జీవుఁడు ప్రత్యగాత్మయం దైక్యమై బాహ్యాంతరవిషయజ్ఞానశూన్యుఁ డగుటవలన, కేవలానందరూపుఁడై యుండు నని చెప్పుచున్నది.

అవ. బాహ్యాభ్యంతరము లన నేమియో చెప్పుచున్నాఁడు:—

శ్లో. బాహ్యం రథ్యాదికం వృత్తం గృహకృత్యం యథాంతరమ్,
తథా జాగరణం బాహ్యం నాడీస్థస్స్వప్న ఆంతరః. 55

వ్యా. అత్ర దృష్టాంతదార్ష్టాంతికవాక్యస్థయోర్బాహ్యాభ్యంతరశబ్దయోర్వివక్షితమర్థం క్రమేణ దర్శయతి—బాహ్యమితి. వృత్తం వృత్తాంతః. నాడీస్థః జాగ్రద్వాసనయా నాడీమధ్యే ప్రతీయమానః. ప్రపంచస్స్వప్న ఇత్యుచ్యతే.

టీ. రథ్యాదికం=వీథిలో జరిగిన, వృత్తం=వృత్తాంతము, బాహ్యం=బాహ్యము, గృహకృత్యం=ఇంటిలోనిపని, ఆంతరం=లోపలిది, యథా=ఎట్టులో, తథా=అవిధముగా, జాగరణం=జాగ్రదవస్థ, బాహ్యం=బాహ్యమగును. నాడీస్థః = జాగ్రద్వాసనచేత నాడీమధ్యమందు స్ఫురించెడి, ఆంతరః=ఆంతరప్రపంచము, స్వప్నః=స్వప్న మనఁబడును.

తా. ఏప్రకారముగా రాజవీథి మున్నగునది బాహ్య మగునో, ఇంటిలోని పని లోనిదగునో, ఆప్రకారముగా జాగ్రదవస్థబాహ్యము. నాడులయందు జాగ్రద్వాసనచే నంతఃకరణమునఁ దోఁచెడి ఆంతర ప్రపంచము స్వప్న మనఁబడును.

అవ. సుషుప్తియందు జీవుఁడు బ్రహ్మానందస్వరూపుఁడై యున్నాఁ డని యుక్తి ప్రదర్శనపరమగు శ్రుతితాత్పర్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పితాపి సుప్తావపితేత్యాదౌ జీవత్వవారణాత్,
సుప్తౌ బ్రహ్మైవ నో జీవస్సంసారిత్వాసమీక్షణాత్. 56

వ్యా. జీవస్సుప్తౌ బ్రహ్మానందరూపేణైవావతిష్ఠత ఇత్యత్ర యుక్తి ప్రదర్శనపరాయాః 'అత్ర పితాఽపితా భవ' తీత్యాదికాయాః శ్రుతేస్తాత్పర్యమాహ— పితేతి. అత్ర సుప్తావాధ్యాసికానాం పితృత్వాదిజీవధర్మాణాం శ్రుత్యైవ నివారితత్వాత్, జీవత్వాప్రతీతౌ బ్రహ్మత్వైవావశిష్యత ఇత్యర్థః.

టీ. పితాపి సుప్తావపితేత్యాదౌ=తండ్రియైనను సుషుప్తియందు తండ్రికాఁ డని చెప్పెడి ఈ మొదలగు శ్రుతియందు, జీవత్వవారణాత్ = జీవభావనిషేధమువలన, సుప్తౌ=గాఢనిద్రయందు, సంసారిత్వాసమీక్షణాత్=సంసారిత్వాభిమానము లేమింజేసి, బ్రహ్మైవ=బ్రహ్మమే యగును. జీవః=జీవుఁడు, న = కాదు,

తా. "అత్రపితాఽపితా భవతి" అను నీమొదలగు శ్రుతియందు సుషుప్తియందు అధ్యాసముచేసెడి పితృత్వాదిజీవధర్మములు నివారింపఁ బడుటచేత జీవుఁడు సుషుప్తియందు బ్రహ్మమే యగును. మఱియు సుషుప్తి యందు జీవత్వము స్ఫురింపక పోవుటచే బ్రహ్మమే శేషించును.

అవ. దేహాభిమాన ముండిన, సంసార ముండును. అది లేనియెడల, సంసార ముండ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. పితృత్వాద్యభిమానో యస్సుఖదుఃఖాకరస్సహి,
తస్మిన్నపగతే తీర్ణస్సర్వా న్ఛోకా న్భవత్యయమ్. 57

వ్యా. నను పితృత్వాభిమానాభావేఽపి సుఖిత్వాదిసంసారః కిం న స్యాదిత్యాశంక్య సంసారస్య దేహాభిమానమూలత్వా త్తదభావే అభావ ఇతి మన్వాన స్తత్ప్రతిపాదకం 'తీర్ణో హి తదా సర్వా న్ఛోకా న్హృదయస్య భవ' తీతి సమనంతర వాక్యం తాత్పర్యతో వ్యాచష్టే—పితృత్వాదీతి.

టీ. యః = ఏది, పితృత్వాద్యభిమానః = తండ్రి మొదలుగాఁ గల యభిమానమో, స హి=ఆయభిమానమే, సుఖదుఃఖాకరో = సంసారమూలము. తస్మిన్=ఆ యభిమానము, అపగతేసతి = తొలఁగఁగా, అయం = ఈపురుషుఁడు, సర్వాన్ = సమస్తములైన, శోకాన్=దుఃఖములను, తీర్ణః=దాఁటినవాఁడు, భవతి=అగును.

తా. సుషుప్తియందు పితృత్వాద్యభిమానము లేకపోయినను సుఖిత్వాదిసంసారము లేదా యనిన, పితృత్వాదిదేహాభిమానమే సుఖదుఃఖములకు మూలమగు సంసారము. కనుక దేహాభిమానము లేని పురుషుఁడు సర్వదుఃఖములను దాఁటుచున్నాఁడని "తీర్ణో హి తదా సర్వా న్ఛోకా న్హృదయస్య భవతి" యనెడి శ్రుతి చెప్పుచున్నది. అనఁగా సుషుప్తియందు దేహాభిమానము లేదు గనుక సంసారమును లే దని యభిప్రాయము.

అవ. సుషుప్తియందు సుఖానుభవమును స్పష్టపఱచెడి ఆథర్వణశ్రుతిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. సుషుప్తికాలే సకలే విలీనే తమసా వృతః,
సుఖరూపముపైతీతి బ్రూతే హ్యాథర్వణీ శ్రుతిః. 58

వ్యా. ననూదాహృతాభిః శ్రుతిభిర్న సుఖప్రాప్తిర్ముఖతోఽభిధీయమానోపలభ్యత ఇత్యాశంక్య తథాభిధానపరం కైవల్యశ్రుతివాక్యమర్థతః పఠతి—సుషుప్తీతి.

సకలే జాగ్రదాదిలక్షణే ప్రపంచే విలీనే స్వోపాదానభూతాయాం తమః ప్రధానాయాం ప్రకృతౌ విలయం గతే సతి, తమసా తయా ప్రకృత్యా ఆవృత ఆచ్ఛాదితో జీవస్సుఖరూపం బ్రహ్మోపైతీతి తస్యాశ్శ్రుతేరర్థః.

టీ. సుషుప్తికాలే = గాఢనిద్రయందు, సకలే = సర్వప్రపంచమును, విలీనే సతి = లయించినదగుచుండఁగా, తమసా = అజ్ఞానముచేత, వృతః = చుట్టుకొనఁబడిన జీవుఁడు, సుఖరూపం = ఆనందస్వరూపమును, ఉపైతి=పొందుచున్నాఁడు. ఇతి=అని, అథర్వణీ=అథర్వణవేదములోని, శ్రుతిః=శ్రుతివచనము, బ్రూతే=చెప్పుచున్నది.

తా. సర్వప్రపంచమును సుషుప్తికాలమున నజ్ఞానమున లయింపఁగా నట్టి యవిద్యతోఁగూడిన జీవుఁ డానందస్వరూప మగు బ్రహ్మమును బొందుచున్నాఁడని అథర్వణవేదమునందలి శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఈవిషయము శ్రుతిలోఁ జెప్పఁబడుటయే కాక యనుభవసిద్ధమై యున్నదనియుఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సుఖమస్వాప్సమత్రాహం న హై కించి దవేదిషమ్,
ఇతి సుప్తే సుఖాజ్ఞానే పరామృశతి చోత్థితః. 59

వ్యా. న కేవలమయం శ్రుతిప్రసిద్ధోఽర్థః. కింతు సర్వానుభవసిద్ధోఽపీత్యాహ—సుఖమితి. సుషుప్తాదుత్థితః పురుషః ఏతావంతం కాలం సుఖమస్వాప్సం. న కించిదవేదిషమిత్యేవం నిద్రాకాలీనే సుఖాజ్ఞానే పరామృశతి స్మరతి. అతోఽపి సుప్తౌ సుఖమస్తీత్యవగమ్యతే.

టీ. అత్ర = ఈగాఢనిద్రయందు, అహం = నేను, సుఖం = సుఖముగా, అస్వాప్సం = నిదురించితిని. కించిత్ =కొంచెమును, నావేదిషం హై = ఎఱుఁగను. ఇతి = ఈలాగున, సుప్తే = సుషుప్తికాలమునందలి, సుఖాజ్ఞానే = సుఖమును, అజ్ఞానమును, ఉత్థితః=నిదురనుండి మేల్కాంచినవాఁడు, పరామృశతి చ=స్మరించుచున్నాఁడు.

తా. "నేను హాయిగా నిద్రపోతిని. ఆనిదురలో నే నేమియు నెఱుఁగను." అని నిదురనుండి మేల్కాంచినవాఁ డాసుషుప్తియందలి యానందమును, అజ్ఞానమును స్మరించుటంబట్టి సుషుప్తియం దానందమున్న దని తెలుచున్నది.

అవ. సుఖానుభవము లేని సుఖస్మరణ మసంభవ మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. పరామర్శోఽనుభూతేఽస్తీత్యాసీదనుభవ స్తదా,
చిదాత్మత్వాత్స్వతో భాతి సుఖమజ్ఞానధీ స్తతః. 60

వ్యా. నను, పరామర్శస్యాప్రమాణత్వాత్కథం తద్బలాత్సుఖసిద్ధిరిత్యాశంక్య తస్యాప్రామాణ్యేఽపి తన్మూలభూతానుభవబలాత్తత్సిద్ధిరిత్యభిప్రాయేణాహ — పరామర్శ ఇతి. పరామర్శః స్మరణజ్ఞానమనుభూత ఏవ విషయే భవతి. నాననుభూత విషయ ఇత్యస్మాద్ధేతోస్తదా సుప్తౌ అనుభవ ఆసీదిత్యవగమ్యతే. నను సుప్తౌ మనస్సహితానాం జ్ఞానకరణానాం విలీనత్వాత్కథమనుభవసిద్ధిరిత్యాశంక్య కిం సుఖానుభవసాధనం నాస్తీత్యుచ్యతే,అజ్ఞానానుభవసాధనం వా? నాద్యః — స్వప్రకాశచిద్రూపత్వేన సుఖస్య కారణానపేక్షత్వాత్. న ద్వితీయః — స్వప్రకాశసుఖబలాదేవ తదావరకాజ్ఞాన ప్రతీతిసిద్ధేరిత్యభిప్రాయేణాహ — చిదాత్మేతి. తతస్స్వప్రకాశసుఖాదజ్ఞానధీ రజ్ఞానస్య ప్రతీతిర్భవతీతి.

టీ. పరామర్శః = స్మరించుట, అనుభూతే = అనుభవమునుబట్టియే, అస్తి=కలదు. తదా = ఆసుషుప్తియందు, అనుభవః = సుఖాజ్ఞానముల యనుభవము, ఆసీత్ = కలిగెను. ఇతి = అని (తెలియుచున్నది). సతః=సద్వస్తువుయొక్క, సుఖం=స్వరూపభూతానందము, చిదాత్మత్వాత్ = చైతన్యస్వరూప మగుటవలన, భాతి = ప్రకాశించుచున్నది. తతః = అందువలన, (చిద్రూపము గాననే), అజ్ఞానధీః = అజ్ఞానానుభవము, భాతి = స్ఫురించుచున్నది.

తా. అనుభవము లేనిచో స్మరించుట సంభవింపదు. జాగ్రదవస్థ యందు "నేను హాయిగా నిదురించితి" ననుటవలన సుషుప్తికాలమందలి సుఖానుభవంబును, 'నాకేమియు తెలియ దని' స్మరించుటచే అజ్ఞానానుభవమును తెలియుచున్నది. సద్వస్తువు స్వయంప్రకాశచైతన్య స్వరూపమగుటవలన, అజ్ఞానప్రతీతియు, అందువలననే సుఖప్రతీతియుఁ గలుగుచున్నవి.

అవ. పరామర్శ మనఁగా స్మరణము. అది ప్రమాణము గాదు. దానివలన సుషుప్తియందు సుఖాజ్ఞానంబులు గలవని ఎట్లు సిద్ధించు నని ప్రశ్న చేయఁగా, పై శ్లోకమునందు సమాధానముఁ జెప్పఁబడెను. ఈశ్లోకమునందు సుషుప్తిలో సుఖము ప్రకాశించినను, అది బ్రహ్మ మనుటకు కారణ మేమి యను పూర్వపక్షిప్రశ్నకు ఉత్తరము:—

శ్లో. బ్రహ్మవిజ్ఞానమానందమితి వాజసనేయినః,
పఠంత్యతస్స్వప్రకాశం సుఖం బ్రహ్మైవ నేతరత్. 61

వ్యా. నను సౌషుప్తసుఖస్య స్వప్రకాశసుఖత్వేఽపి బ్రహ్మానందః స్వయం భవే దిత్యత్రోక్తం బ్రహ్మరూపత్వం న సంభవతి మానాభావాదిత్యాశంక్య విజ్ఞానమానంద మిత్యాది బృహదారణ్యకవాక్యస్య సద్భావాన్నైవమిత్యాహ—బ్రహ్మవిజ్ఞానమితి.

టీ. బ్రహ్మ=బ్రహ్మము, విజ్ఞానం = జ్ఞానస్వరూప మనియు, ఆనందమితి=ఆనంద స్వరూప మనియు, వాజసనేయినః = శుక్లయజుర్వేదులు, పఠంతి=పఠించుచున్నారు. అతః = ఆహేతువువలన, స్వప్రకాశం = స్వయంప్రకాశమైన, సుఖం = సుఖము, బ్రహ్మైవ = బ్రహ్మమే, ఇతరత్ = వేఱొకటి, న = కాదు.

తా. బ్రహ్మము జ్ఞానానందస్వరూప మని బృహదారణ్యకశ్రుతి వాక్యము చెప్పుచున్నది. కాన సుషుప్తిలోని స్వప్రకాశరూప మగు సుఖ మానందరూప మగు బ్రహ్మమే యని భావము.

అవ. సుషుప్తిలోని సుఖమును, అజ్ఞానమును విజ్ఞానమయుం డగు చిదాభాసుఁడు జాగ్రద్దశలో స్మరించుచున్నాఁడు—ఎవ్వఁడే దనుభవించునో, వాఁడే దానిని స్మరించుట లోకసిద్ధము. సుషుప్తిలో విజ్ఞానమయుఁడు లేఁడు. కాన నప్పుడు విజ్ఞానమయుఁ డనుభవించె ననుటకు వీలు లేదు. సుషుప్తిలో నుండెడివాఁ డానందమయుఁడు ఆనంద మయుఁ డనుభవించినదానిని విజ్ఞానమయుఁ డెట్లు స్మరించు ననెడి యాక్షేపమునకు సమాధానము:—

శ్లో. యదజ్ఞానం తత్ర లీనౌ తౌ విజ్ఞానమనోమయౌ,
తయోర్హి విలయావస్థా నిద్రాఽజ్ఞానం చ సైవ హి. 62

వ్యా. నన్వనుభవస్మరణయోరైకాధికరణ్యనియమాత్సుఖమహామస్వాప్సం న కించిదవేదిషమితి చ సౌషుప్తసుఖాజ్ఞానయోర్విజ్ఞానమయశబ్దవాచ్యేన జీవేన స్మర్యమాణత్వాత్ తస్యైన సుఖాద్యనుభవితృత్వం వక్తవ్యమిత్యాశంక్య తదుపాధే ర్విజ్ఞానస్యాజ్ఞానకార్యస్యాజ్ఞానే విలీనత్వాన్నైవమిత్యభిప్రాయేణాహ—యదజ్ఞానమితి. న కించిదవేదిషమితి స్మరణాన్యథానుపపత్త్యా గమ్యమానం యదజ్ఞానమస్తి, తత్ర తస్మిన్నజ్ఞానే తౌ ప్రమాతృప్రమాణత్వేన ప్రసిద్ధౌ విజ్ఞానమనోమయౌ విలీనౌ విజ్ఞాన త్వాద్యాకారం పరిత్యజ్య కారణరూపేణావస్థితావత స్తదుపాధికస్య నానుభవితృత్వ మితి భావః. తత్రోపపత్తిమాహ—తయోరితి. హి యస్మాత్తయోర్విజ్ఞానమనోమయ యోర్విలయావస్థా నిద్రేత్యుచ్యతే. 'విజ్ఞానవిరతిస్సుప్తి' రిత్యభిధానాత్. తర్హి నిద్రాయా మేవ విలీనావితి వక్తవ్యమిత్యాశంక్యాహ—అజ్ఞానమితి. సైవ నిద్రా విద్వద్భిరజ్ఞాన మితి వ్యవహ్రియత ఇత్యర్థః.

టీ. యత్ అజ్ఞానం=ఏ అజ్ఞానము, (అస్తి=కలదో), తత్ర = దానియందు, తౌ విజ్ఞానమనోమయౌ=ఆ విజ్ఞానమనోమయకోశములు, లీనౌ=లయించుచున్నవి. తయోః= ఆ రెండుకోశములయొక్కయు, విలయావస్థా=లయించు సమయమే, నిద్రా=నిద్ర యనం బడును. సైవహి = అదియే, అజ్ఞానం = అజ్ఞాన మనఁబడును.

తా. అనుభవస్మరణములు రెండును ఏకాధికరణత్వ నియమము గలవగుటచేత, సుషుప్తియందుఁ గల సుఖాజ్ఞానములు విజ్ఞానమయుఁడగు జీవునిచేత స్మరింపఁబడుచుండుటవలన, ఆజీవుఁడే సుషుప్తియందుఁ గల సుఖాదికము ననుభవించుచున్నాఁ డని చెప్పరాదా ? అనిన, 'నేను సుషుప్తియం దేమియు నెఱుఁగ' ననెడి స్మరణముచేఁ దప్ప మఱియొక విధముగఁ దెలియఁబడని యే అజ్ఞానము గలదో ఆ అజ్ఞానమందు ప్రమాతృ ప్రమాణసిద్ధములగు విజ్ఞాన మనోమయకోశములు విజ్ఞానత్వ మనోమహత్త్వాకారమును విడిపించి, తమకుఁ గారణ మగు అజ్ఞానరూప స్థితినిఁ బొందుచున్నవి. అందువలన నా విజ్ఞానమయోపాధికుఁ డగు జీవుఁడు సుషుప్తియందుఁ గల సుఖాజ్ఞానముల ననుభవించుచుండ లే దని తెలియవలెను. ఇందుకు ఉపపత్తి "విజ్ఞానవిరతిః సుప్తిః" అని చెప్పఁబడిన యట్లు ఆ విజ్ఞానమనోమయములయొక్క విలయావస్థ నిద్ర యని చెప్పఁబడును. ఆ నిద్రయే అజ్ఞాన మని విద్వాంసులు వ్యవహరింతురు. కనుక ఆ విజ్ఞానమనోమయములు రెండును అజ్ఞానమందే విలయమును బొందుచున్న వని తెలియవలెను.

అవ. సుషుప్తియందు విజ్ఞానమయుఁడు లేఁడు గదా. ఒకని యనుభవమును మఱియొకఁ డెట్లు స్మరించు నని ఇదివఱలో చేసిన యాక్షేపమునకు సమాధానము:—

శ్లో. విలీనఘృతవత్పశ్చాత్స్యాద్విజ్ఞానమయో ఘనః,
విలీనావస్థ ఆనందమయశబ్దేన కథ్యతే. 63

వ్యా. నను తర్హి సౌషుప్త సుఖాద్యనుభవకాలేఽసతో విజ్ఞానమయస్య ప్రబోధే కథం తత్స్మర్తృత్వమిత్యాశంక్య విలయావస్థాయామపి తత్స్వరూపనాశాభావా ద్విలయావస్థోపాధి మతానందమయరూపేణానుభవితృత్వం విజ్ఞానశబ్దవాచ్య ఘనీభావోపాధిమత్త్వేన స్మర్తృత్వం చైకస్య ఘటత ఇత్యభిప్రాయేణాహ—విలీనేతి. యథాగ్నిసంయోగాదినా విలీనం ఘృతం పశ్చాద్వాయ్వాదిసంబంధవశాద్ఘనీభవతి. ఏవం జాగ్రదాదిషు భోగప్రదస్య కర్మణః క్షయవశాన్నిద్రారూపేణ విలీనమంతఃకరణం

పునర్భోగప్రదకర్మవశాత్ప్రబోధే విజ్ఞానాకారేణ ఘనీభవతి. అత స్తదుపాధిక ఆత్మాపి విజ్ఞానమయో ఘనస్స్యాత్. స ఏవ పూర్వం విలయావస్థోపాధికస్సన్నానందమయ ఇత్యుచ్యతే.

టీ. విలీనఘృతవత్=కరఁగిన నేతివలె, పశ్చాత్ = అనంతరమందు, ఘనః=గట్టిపడినవాఁడు, విజ్ఞానమయః=విజ్ఞానమయుఁడు, స్యాత్=అగును. విలీనావస్థః = విలయావస్థ, ఆనందమయశబ్దేన=ఆనందమయుఁ డను శబ్దముచేత, కథ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. సుషుప్తి సుఖాద్యనుభవకాలమందు లేని విజ్ఞానమయునకు ప్రబోధము గలుగుచుండఁగా, ఆసుషుప్తియందుఁ గల సుఖాది స్మరణ మెట్లగును? అనిన, అగ్నిసంబంధముచేఁ గరగిన నేయి వాయ్వాది సంబంధవశమున నెట్లు ఘనీభవించునో ఆప్రకారమే జాగ్రదాదుల యందు భోగము నిచ్చెడికర్మము క్షయించుటవలన నిద్రారూపమున లీన మయిన అంతఃకరణము, మఱల భోగప్రదకర్మవశమున ప్రబోధమందు విజ్ఞానాకారముగ ఘనీభవించుచున్నది. అందువలన నా యంతఃకరణోపాధికుఁ డగు ఆత్మయు విజ్ఞానమయత్వముచేత ఘనీభవించును. ఆ యాత్మయే పూర్వము విలయావస్థ నుపాధిగాఁ గలిగి ఆనందమయ శబ్ద వాచ్యుఁ డగును. అనఁగా, విలయావస్థయందును ఆవిజ్ఞానమయస్వరూప మునకు నాశము లేమివలన విలయావస్థను ఉపాధిగాఁ గల ఆనందమయ రూపముచేత ననుభవించెడి ధర్మమును, విజ్ఞానమయశబ్దముచేఁ జెప్పఁ దగిన ఘనీభావము నుపాధిగాఁ గలిగియుంటచేత స్మరించెడి ధర్మమును అను నీ రెండు ధర్మములును ఒక్కఁ డగు ఆత్మకు ఘటించు నని యభిప్రాయము.

అవ. పైదానినే స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. సుప్తిపూర్వక్షణే బుద్ధివృత్తిర్యా సుఖబింబితా,
సైవ తద్బింబసహితా లీనానందమయస్తతః. 64

వ్యా. విలీనావస్థ ఆనందమయ ఇత్యుక్తమేవార్థం స్పష్టీకరోతి—సుప్తీతి. సుప్తేః పూర్వస్మిన్నవ్యవహితే క్షణే యాంతర్ముఖా బుద్ధివృత్తిః స్వరూపభూతసుఖప్రతిబింబ యుక్తా భవతి. తతః అనంతరం తత్ప్రతిబింబసహితా సైవ వృత్తిర్నిద్రారూపేణ విలీనా ఆనందమయ ఇత్యభిధీయతే.

టీ. సుప్తిపూర్వక్షణే=సుషుప్తికి పూర్వక్షణమందును, సుఖబింబితా = సుఖప్రతిబింబముతోఁ గూడుకొనిన, యా బుద్ధివృత్తిః=ఏ బుద్ధి వృత్తి గలదో, సైవ = అదియే,

తద్బింబసహితా=ఆ ప్రతిబింబముతోఁ గూడిన దగుచు, తతః=అనంతరము, లీనా=కరఁగినదై, ఆనందమయః = ఆనందమయుఁ డని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. గాఢనిద్రకుఁ బూర్వక్షణమందు మృదుశయ్యాదిజన్యసుఖాకార మగు బుద్ధివృత్తి తన ప్రతిబింబముతోఁ గూడ నజ్ఞానమున లయించి ఆనందమయుఁ డని చెప్పఁబడును.

అవ. సుషుప్తిదశలో నానందమయుఁడు బ్రహ్మసుఖము ననుభవించుతెఱంగు:—

శ్లో. అంతర్ముఖో య ఆనందమయో బ్రహ్మసుఖం తదా,
భుఙ్క్తే చిద్బింబయుక్తాభిరజ్ఞానోత్పన్నవృత్తిభిః. 65

వ్యా. ఏవమానందమయస్వరూపం ప్రదర్శ్య తస్యైవ ప్రబోధకాలే విజ్ఞానమయరూపేణ స్మర్తృత్వసిద్ధయే తదానీం సుఖానుభవముపపాదయతి—అంతర్ముఖ ఇతి. సుఖప్రతిబింబసహితాంతర్ముఖధీవృత్తిజనితసంస్కారసహితాజ్ఞానోపాధికో య ఆనందమయస్తదా సుషుప్తౌ బ్రహ్మసుఖం స్వరూపభూతం సుఖం చిదాభాససహితాభిరజ్ఞానాదుత్పన్నాభిః సుఖాదిగోచరాభిః వృత్తిభి స్సత్త్వపరిణామవిశేషైర్భుంక్తే అనుభవతి.

టీ. అంతర్ముఖః = సుఖప్రతిబింబసహితాంతర్ముఖ బుద్ధివృత్తిజనిత సంస్కారసహితాజ్ఞానోపాధిగల, యః = ఏ, ఆనందమయః=ఆనందమయుఁడు, (అస్తి=కలఁడో) (సః = అతఁడు) తదా=ఆసుషుప్తిసమయమున, బ్రహ్మసుఖం=బ్రహ్మానందమును, చిద్బింబయుక్తాభిః=చైతన్య ప్రతిబింబముతోఁ గూడుకొనిన, అజ్ఞానోత్పన్నవృత్తిభిః = అజ్ఞానమువలన పుట్టిన వృత్తులచేత, భుఙ్క్తే = అనుభవించుచున్నాఁడు.

తా. సుఖప్రతిబింబసహిత మగు అంతర్ముఖబుద్ధివృత్తిజనితసంస్కారముతోఁ గూడిన అజ్ఞానోపాధికుఁ డగు ఆనందమయుఁడు, సుషుప్తికాలమందు స్వరూపభూతబ్రహ్మసుఖమును, చిదాభాససహితములును అజ్ఞానజన్య సుఖాదిగోచర సత్త్వపరిణామవిశేషములును అగు వృత్తులచేత ననుభవించుచున్నాఁడు.

అవ. జాగ్రదవస్థయందువలె సుషుప్తియందు 'నేను సుఖము ననుభవించుచున్నాను' అనెడి యభిమాన మేల గలుగదు? అనెడి శంకకు సమాధానము:—

శ్లో. అజ్ఞానవృత్తయః సూక్ష్మా విస్పష్టా బుద్ధివృత్తయః,
ఇతి వేదాంతసిద్ధాంతపారగాః ప్రవదంతి హి. 66

వ్యా. నను తర్హి జాగరణ ఇవ తదానీం సుఖమనుభవామీత్యభిమానః కుతో న స్యాదిత్యాశంక్యావిద్యావృత్తీనాం బుద్ధివృత్తివత్స్పష్టత్వాభావాదిత్యభిప్రాయేణాహ-అజ్ఞానవృత్తయ ఇతి. ఇదం కుతోఽవగతమిత్యత ఆహ—ఇతీతి.

టీ. అజ్ఞానవృత్తయః = అజ్ఞానవృత్తులు, సూక్ష్మాః = సూక్ష్మములైనవి, బుద్ధివృత్తయః=అంతఃకరణవృత్తులు, విస్పష్టాః = స్పష్టములైనవి. ఇతి=ఈలాగున, వేదాంతసిద్ధాంతపారగాః = వేదాంతసిద్ధాంత (రహస్యముల) నెఱిఁగినవారలు, ప్రవదంతి హి= చెప్పుచున్నారుగదా.

తా. సుషుప్తియందలి అజ్ఞానవృత్తులు సూక్ష్మములు గనుక జాగ్రదవస్థయందలి బుద్ధివృత్తులవలె స్పష్టములు కావు. అందువలన సుఖానుభవాభిమానము సుషుప్తియందు ఉండదు. ఇట్లు వేదాంతసిద్ధాంతపారగులు చెప్పెదరు.

అవ. పైశ్లోకమునఁ జెప్పిన విషయమునకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. మాండూక్యతాపనీయాదిశ్రుతిష్వేతదతిస్ఫుటమ్,
ఆనందమయభోక్తృత్వం బ్రహ్మానందే చ భోగ్యతా. 67

వ్యా. నన్వానందమయో బ్రహ్మానందం సూక్ష్మాభిరవిద్యావృత్తిభిర్భుఙ్క్త ఇత్యత్ర కిం ప్రమాణమిత్యత ఆహ—మాండూక్యేతి. ఏతచ్ఛబ్దార్థమేవాహ—ఆనందేతి.

టీ. ఏతత్ = ఈవిషయము, మాండూక్యతాపనీయాది శ్రుతిషు=మాండూక్యతాపనీయాది శ్రుతులయందు, అతిస్ఫుటం=విస్పష్టముగఁ జెప్పఁబడినది. (అతః=కనుక) ఆనందమయభోక్తృత్వం=ఆనందమయునకు భోక్తృత్వమును, బ్రహ్మానందే=బ్రహ్మానందమందు, భోగ్యతా చ=భోగ్యత్వమును గలదు.

తా. మాండూక్యతాపనీయాద్యుపనిషత్తులానందమయుఁడు భోక్తయనియు బ్రహ్మానందము భోగ్యమనియుం జెప్పుచున్నవి గాన నీయర్థము యథార్థము. భోక్త యన ననుభవించెడివాఁడు. భోగ్యమనఁగా ననుభవింపఁబడునది.

అవ. పైఁజెప్పిన మాండూక్యశ్రుతియర్థమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏకీభూతస్సుషుప్తిస్థః ప్రజ్ఞానఘనతాం గతః,
ఆనందమయ ఆనందభు క్చేతోమయవృత్తిభిః. 68

వ్యా. ఇదానీం 'సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్చేతోముఖ' ఇతి మాండూక్యాదిశ్రుతిగతం వాక్యమర్థతః పఠతి—ఏకీభూత ఇతి. సుప్తం సుషుప్తిస్తత్ర తిష్ఠతీతి సుషుప్త్యభిమానీత్యర్థః. ఆనందమయ ఆనందప్రచురః ఆనందభుక్ స్వరూపభూమానందం భుఙ్క్త ఇత్యానందభుక్. చేతోమయవృత్తిభిరితి. చేతశ్చైతన్యం తన్మయాస్తత్ప్రచురాశ్చిత్ప్రతిబింబసహితా ఇత్యర్థః. తాశ్చ తాః వృత్తయశ్చ చేతోమయవృత్తయస్తాభిరానందభుగితి యోజనా.

టీ. సుషుప్తిస్థః=సుషుప్తియం దుండెడి, ఏకీభూతః = విజ్ఞానాద్యుపాధివిలయము చేత నేకాకారత్వమును బొందిన, ఆనందమయః=ఆనందమయాత్మ, ప్రజ్ఞానఘనతాం= ప్రజ్ఞానఘనత్వమును, గతస్సన్ = పొందినవాఁడగుచు, చేతోమయవృత్తిభిః=చిత్ప్రతి బింబసహితములగు వృత్తులచేత, ఆనందభుక్=స్వరూపభూతానందము ననుభవించును.

తా. సుషుప్త్యభిమానియు, విజ్ఞానాద్యుపాధివిలయముచేత నేకాకారత్వమును బొందినట్టియు, ప్రజ్ఞానఘనుఁడును అగు ఆనంద మయాత్మ చిత్ప్రతిబింబసహితవృత్తులచేత స్వరూపానందము ననుభవిం చును. అని మాండూక్యశ్రుతి చెప్పుచున్నది.

ఆ మాండూక్యశ్రుతిలోని 'ఏకీభూతః' అనెడి పదమున కర్థము:—

శ్లో. విజ్ఞానమయముఖ్యైర్యో రూపైర్యుక్తః పురాధునా,
స లయేనైకతాం ప్రాప్తో బహుతండులపిష్టవత్. 63

వ్యా. తద్వాక్యగతస్యైకీభూత ఇతి పదస్యార్థమాహ—విజ్ఞానేతి. యః ఆత్మా పురా జాగరణావస్థాయాం విజ్ఞానమయముఖ్యైః 'స వా అయమాత్మా బ్రహ్మ విజ్ఞాన మయో మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః శ్రోత్రమయః పృథివీమయ ఆపోమయో వాయుమయ ఆకాశమయ స్తేజోమయోఽతేజోమయః కామమయోఽకామమయః క్రోధమయోఽక్రోధమయ' ఇత్యాదిశ్రుత్యుక్తై రూపైరాకారవిశేషైర్యుక్తోఽభూత్స ఏవాధునా లయేన విజ్ఞానమన ఆద్యుపాధివిలయేనైకతాం ఏకాకారతాం ప్రాప్తో గతో భవతి. తత్ర దృష్టాంతమాహ—బహ్వితి. బహుతండులజనితపిష్టవదిత్యర్థః.

టీ. యః = ఏయానందమయుఁడు, పురా = జాగ్రద్దశయందు, విజ్ఞానమయ ముఖ్యైః=విజ్ఞానమయుఁడు మొదలుగాఁగల, రూపైః = రూపములతో, యుక్తః=కూడు కొనియుండెనో, సః=అతఁడు, అధునా=ఇప్పుడు, బహుతండులపిష్టవత్ = అనేకములగు బియ్యములపిండివలె, లయేన = ఉపాధిలయముచేత, ఏకతాం = ఏకత్వమును, ప్రాప్తః= పొందును.

తా. 'స వా అయమాత్మా...క్రోధమయోఽక్రోధమయః'' అనెడి శ్రుతియందుఁ జెప్పఁబడినయట్లు, ఈయానందమయుఁడు జాగ్రద్దశలో నానావిధపదార్థములతో తాదాత్మ్యము పొంది, విజ్ఞానమయుఁ డనియు, మనోమయుఁ డనియు, ప్రాణమయుఁ డనియు వివిధరీతుల బహు రూపుఁడై యుండెను. ఆయుపాధు లన్నియు (కరఁగిన నేతివలె) లయిం పఁగా అనేకము లగు బియ్యములు విసరి తడుపఁగా దానివలని పిడుచ

ఏకవిధముగా నున్నటుల, ఆనందమయుఁ డేకాకారుఁడై యుండు నని భావము.

అవ. ఆమాండూక్యశ్రుతియందలి ప్రజ్ఞానఘనశబ్దార్థముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రజ్ఞానాని పురా బుద్ధివృత్తయోఽథ ఘనోఽభవత్,
ఘనత్వం హిమబిందూనా ముదగ్దేశే యథా తథా. 70

వ్యా. అథ ప్రజ్ఞానఘనశబ్దార్థమాహ—ప్రజ్ఞానానీతి. పురా పూర్వం జాగ్రదాదౌ ప్రజ్ఞానశబ్దవాచ్యా ఘటాదిగోచరా యా బుద్ధివృత్తయోఽభవన్, అథ సుషుప్తికాలే ఘటాదివిషయాభావే సతి ఘనోఽభవేత్, చిద్రూపేణైకరూపోఽభూత్. తత్ర దృష్టాంతమాహ—ఘనత్వమితి.

టీ. ఉదగ్దేశే=ఉత్తరదేశమందు, హిమబిందూనాం = మంచునకు, ఘనత్వం = గడ్డకట్టుట, యథా=ఎట్లగునో, తథా=ఆప్రకారమే, పురా=పూర్వముగల, ప్రజ్ఞానాని= ప్రజ్ఞానములు, అథ = సుషుప్తికాలమందు, ఘనః = చిద్రూపముచే నేకరూపము, అభవత్ = అయినది.

తా. ఉత్తరదేశమందు మంచుబిందువులు ఘనీభవించి, ఏకాకారముగ గడ్డకట్టినయట్లు, జాగ్రదాదికమందు ప్రజ్ఞానశబ్దముచేఁ జెప్పఁదగిన ఘటాదిగోచరబుద్ధివృత్తులు సుషుప్తికాలమందు ఘటాదివిషయము లేమింజేసి చిద్రూపముచే నేకరూప మగును.

శ్లో. తద్ఘనత్వం సాక్షిభావం దుఃఖాభావం ప్రచక్షతే,
లౌకికాస్తార్కికా యావద్దుఃఖవృత్తివిలోపనాత్. 71

వ్యా. ఇదానీం ప్రజ్ఞానఘనశబ్దార్థనిరూపణప్రసంగాదాగతం కించిదాహ—తద్ఘనత్వమితి. యదిదం వేదాంతేషు సాక్షిత్వేనాభిధీయమానం ప్రజ్ఞానఘనత్వ మస్తి, తదేవ లౌకికాః శాస్త్రసంస్కారరహితాః తార్కికా వైశేషికాదయ శ్శాస్త్రిణశ్చ దుఃఖాభావం ప్రచక్షతే దుఃఖాభావ ఇత్యాహుః. కుత ఇత్యత ఆహ—యావదితి. యావత్యో దుఃఖవృత్తయస్తాసాం సర్వాసాం విలయాదిత్యర్థః.

టీ. సాక్షిభావం = సాక్షిభావ మని చెప్పఁబడెడి, తద్ఘనత్వం = ఈప్రజ్ఞానఘనత్వమును, లౌకికాః = పామరులును, తార్కికాః = తర్కశాస్త్రవిదులును, యావద్దుఃఖవృత్తివిలోపనాత్ = సమస్తదుఃఖవృత్తులు లోపించుటవలన, దుఃఖాభావం = దుఃఖము లేకుండుటనుగ, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

తా. వేదాంతములయందు సాక్షిత్వముచేఁ జెప్పఁబడిన యీ ప్రజ్ఞానము 'దుఃఖాభావ' మని శాస్త్రసంస్కారము లేని లౌకికులును శాస్త్రవాదులగు తార్కికులును చెప్పెదరు. అట్లు చెప్పుటకుఁ గారణమే మన సర్వదుఃఖవృత్తులును సుషుప్తియందు విలయమును బొందుటచే నట్లు చెప్పెదరు.

అవ. మాండూక్యోపనిషత్తులోని చేతోముఖశబ్దార్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞానబింబితా చిత్స్యాన్ముఖమానందభోజనే,
భుక్తం బ్రహ్మసుఖం త్యక్త్వా బహిర్యాత్యథ కర్మణా. 72

వ్యా. పూర్వోదాహృత శ్రుతివాక్యగతచేతోముఖశబ్దార్థమాహ—అజ్ఞానేతి. ఆనందభోజనే సౌషుప్తబ్రహ్మానందాస్వాదనే ముఖం సాధనం అజ్ఞానబింబితా చిత్స్యాదజ్ఞానవృత్తౌ ప్రతిబింబితం చైతన్యమేవ భవేత్. నను సుషుప్తావానందమయరూపేణ జీవేన బ్రహ్మసుఖం చేద్భుజ్యతే. తర్హి తత్పరిత్యజ్యాథ బహిః కుతో జాగరణం దుఃఖాలయ మాగచ్ఛేదిత్యత ఆహ—భుక్తమితి. పుణ్యాపుణ్యకర్మపాశబద్ధత్వాత్తేన ప్రేరితో జీవః సాక్షాత్కృత మపి బ్రహ్మానందం పరిత్యజ్యాథ బహిర్యాతి జాగరణాదికం గచ్ఛతీత్యర్థః.

టీ. అజ్ఞానబింబితా = అజ్ఞానమునందు ప్రతిబింబించిన, చిత్ = చైతన్యము, ఆనందభోజనే = ఆనందానుభవమందు, ముఖం=సాధనము, స్యాత్=అగును. భుక్తం = అనుభవింపఁబడిన, బ్రహ్మసుఖం=బ్రహ్మానుభవమును, త్యక్త్వా=వదలిపెట్టి, అథ = అనంతరము, (జీవః=జీవుఁడు), కర్మణా=కర్మచేత, బహిః=బాహ్యమును (జాగ్రదాదికమును), యాతి = పోవుచున్నాఁడు.

తా. ఆనందమయునకు అజ్ఞానజన్యంబు లగు వృత్తులయందు ప్రతిబింబించిన చైతన్యము, బ్రహ్మానందానుభవమునకు సాధనము. కట్టి యానందానుభవమును మాని, మఱల జాగ్రత్తున కేల వచ్చునంటివేని, వాని జాగ్రద్భోగప్రదకర్మయే దానికి హేతువు.

అవ. ఇందుకు కైవల్యశ్రుతిప్రమాణముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. కర్మ జన్మాంతరేఽభూద్య త్తద్యోగాద్బుధ్యతే పునః,
ఇతి కైవల్యశాఖాయాం కర్మజో బోధ ఈరితః. 73

వ్యా. ఏతత్కుతోఽవగమ్యత. ఇత్యాశంక్య 'పునశ్చ జన్మాంతరకర్మయోగాత్స ఏవ జీవస్స్వపితి ప్రబుద్ధ' ఇతి కైవల్యశ్రుతివాక్యాదితి మన్వాన స్తద్వాక్యమర్థతః పఠం స్తదభిప్రాయమాహ—కర్మేతి.

టీ. జన్మాంతరే = వెనుకజన్మములందు, యత్కర్మ=ఏకర్మ, అభూత్=ఉండెనో, తద్యోగాత్ = దానిసంబంధమువలన, పునః = మఱల, బుధ్యతేతి = జాగ్రదాదికమును బొందుచున్నాఁడని, కైవల్యశాఖాయాం=కైవల్యోపనిషత్తునందు, కర్మజః=కర్మవలనఁ గలిగిన, బోధః=జాగ్రదవస్థ, ఈరితః=చెప్పఁబడెను.

తా. "పునశ్చ బుద్ధః" అను కైవల్యశ్రుతి, సుషుప్తిలోనుండి జాగ్రద్దశకు జీవుఁడు కర్మవశముననే వచ్చు నని చెప్పుచున్నది.

అవ. సుషుప్తియందు బ్రహ్మానంద మనుభవింపఁబడు ననుట కింకొక లింగమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కంచిత్కాలం ప్రబుద్ధస్య బ్రహ్మానందస్య వాసనా,
అనుగచ్ఛేద్యతస్తూష్ణీమాస్తే నిర్విషయస్సుఖీ. 74

వ్యా. సుప్తౌ బ్రహ్మానందోఽనుభూయత ఇత్యత్ర లింగం చాహ—కంచిదితి. ప్రబుద్ధస్య జాగరణం ప్రాప్తస్యాపి కంచిత్కాలం స్వల్పకాలపర్యంతం సుప్తావనుభూతస్య బ్రహ్మానందస్య వాసనా సంస్కారోఽనుగచ్ఛేదనుగచ్ఛతి. కుత ఏతదవగమ్యత ఇత్యాహ—యత ఇతి. యతః కారణాత్ప్రబోధాదౌ నిర్విషయో విషయానుభవరహితోఽపి సుఖీ సంస్తూష్ణీమాస్తేఽతోఽవగమ్యత ఇత్యర్థః.

టీ. యతః = ఏకారణమువలన, ప్రబుద్ధః = మేల్కాంచినవాఁడు, నిర్విషయః= విషయవర్జితుఁడై, సుఖీ = సుఖవంతుఁడై, ఆస్తే = ఉండెనో, (అతః=ఆకారణమువలన), ప్రబుద్ధస్య = నిదురనుండి మేల్కాంచినవానికి, కంచిత్కాలం = కొంచెముసేపు, బ్రహ్మానందస్య = బ్రహ్మానందముయొక్క, వాసనా=సంస్కారము, అనుగచ్ఛేత్ = అనుసరించి వచ్చును.

తా. నిదురనుండి మేల్కాంచినవాఁడు కొంతకాలము విషయచింత లేక సుఖముగా నుండును. అది యేల యన, అట్లుండుట సుషుప్తిలో ననుభవింపఁబడిన బ్రహ్మానందముయొక్క సంస్కారమే యని తెలియవలెను.

శ్లో. కర్మభిః ప్రేరితః పశ్చాన్నానాదుఃఖాని భావయన్,
శనైర్విస్మరతి బ్రహ్మానందమేషోఽఖిలో జనః. 75

వ్యా. తర్హి తూష్ణీం కుతో నావతిష్ఠత ఇత్యత ఆహ—కర్మభిరితి. కర్మభిః పూర్వోక్తైశ్చోదితః సర్వోఽపి ప్రాణీ పశ్చాన్నానావిధాని దుఃఖాన్యనుసంధధానః శనైర్బ్రహ్మానందం విస్మరతి.

టీ. కర్మభిః = కర్మలచేత, ప్రేరితః = ప్రేరేపింపఁబడి, పశ్చాత్ =అనంతరము, నానాదుఃఖాని = అనేక దుఃఖములను, భావయన్ = భావించుచు, ఏషః = ఈ, అఖిల జనః=సమస్తమైనజనము, శనైః=మెల్లఁగా, బ్రహ్మానందం=బ్రహ్మానందమును, విస్మరతి = మఱచుచున్నది.

తా. ప్రాణివర్గము సుషుప్తిలో బ్రహ్మానందము ననుభవించినను, కర్మవశంబున జాగ్రద్దశలోని దుఃఖములను స్మరించుచు క్రమక్రమముగా నట్టి బ్రహ్మానందమును మఱచును.

అవ. సుషుప్తిలో బ్రహ్మానందము గలదా యని సంశయింపఁ దగదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రాగూర్ధ్వమపి నిద్రాయాః పక్షపాతో దినే దినే,
బ్రహ్మానందే నృణాం తేన ప్రాజ్ఞోఽస్మిన్వివదేత కః. 76

వ్యా. ఇతోఽపి బ్రహ్మానందే న విప్రతిపత్తిః కార్యేత్యాహ—ప్రాగితి. ప్రత్యహం మనుష్యాణాం నిద్రాయాః ప్రాగూర్ధ్వమపి నిద్రారంభే నిద్రావసానే చ బ్రహ్మానందే స్నేహోఽస్తి యతో నిద్రాదౌ మృదుశయ్యాది సంపాదయంతి; తదవసానే చ తం పరిత్యక్తు మశక్తా స్తూష్ణీమాసతే; తేన కారణేన అస్మిన్నానందే కో బుద్ధిమాన్వివదేత? న కోఽపీత్యర్థః.

టీ. దినేదినే = ప్రతిదినమున, నిద్రాయాః = నిద్రయొక్క, ప్రాక్ = పూర్వమందును, ఊర్ధ్వమపి = అనంతరమందును, నృణాం=జనులకు, పక్షపాతః=పక్షపాతము, (భవతి = అగుచున్నది.) తేన = ఆహేతువుచేత, అస్మిన్ బ్రహ్మానందే = ఈ బ్రహ్మానందమునందు, ప్రాజ్ఞః=ప్రజ్ఞగలవాఁడు, కః=ఎవఁడు, వివదేత=వివాదమును బొందును? ఎవఁడును ద్వేషింపఁడని యర్థము.

తా. ప్రతిదినమందు నరులు నిద్రకుఁ బూర్వము సుఖసాధనంబులయిన శయ్యాదులం గోరుదురు. నిద్రానంతర మట్టులే సుఖులై యుండవలె నని కోరుదురు. దానంజేసి సుషుప్తియందు బ్రహ్మానందము కలదనుట నిర్వివాదాంశము.

అవ. పూర్వపక్షి యాక్షేపము చేయుచున్నాఁడు:—

శ్లో. నను తూష్ణీం స్థితో బ్రహ్మానందశ్చేద్భాతి లౌకికాః,
అలసాశ్చరితార్థాః స్యుశ్శాస్త్రేణ గురుణాఽత్ర కిమ్. 77

వ్యా. చోదయతి—నన్వితి. గురుశుశ్రూషాదినా లభ్యస్య బ్రహ్మానందానుభవస్య తూష్ణీంస్థితిమాత్రలభ్యత్వే గురుశుశ్రూషాదిపూర్వకం శ్రవణాదికం వృథా స్యాదిత్యర్థః.

టీ. నను = ఓయీ సిద్ధాంతీ! తూష్ణీంస్థితౌ = ఊరకుండునపుడు, బ్రహ్మానందః= బ్రహ్మానందము, భాతి చేత్ =ప్రకాశించెనేని, లౌకికాః = పామరులైన, అలసాః=సోమరులు, చరితార్థాః=కృతార్థులు, స్యుః=అగుదురు. శాస్త్రేణ=శాస్త్రముతోడను, గురుణా= గురువుతోను, అత్ర=ఈ బ్రహ్మానందవిషయమై, కిం=ఏమి ప్రయోజనము ?

తా. ఓసిద్ధాంతీ! గురుశుశ్రూషాదికము చేతను, శాస్త్రాభ్యాసము చేతను పొందఁదగిన బ్రహ్మానందానుభవము తూష్ణీంస్థితి నున్నంత మాత్రమున లభింపఁగలదేని, శాస్త్రవాసనలేని పామరులును సోమరులును గృతార్థు లగుదు రని చెప్పవలసివచ్చును. అప్పుడు వేదాంత శాస్త్రముతోను గురుశుశ్రూషాదిపూర్వక శ్రవణమననాదికముతోను బ్రయోజన మేమి ?

అవ. ఈ యాక్షేపణమునకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బాఢం బ్రహ్మేతి విద్యాశ్చే త్కృతార్థా స్తావతైవ తే,
గురుశాస్త్రే వినాఽత్యంతం గంభీరం బ్రహ్మ వేత్తి కః. 78

వ్యా. అయం బ్రహ్మానంద ఇతి జ్ఞానే సతి కృతార్థతా భవత్యేవ. తదేవ గురుశుశ్రూషాదికమంతరేణ న సంభవతీత్యాహ—బాఢమితి. అత్యంతం గంభీరం దురవగాహమవాఙ్మనసగమ్యం సర్వజ్ఞం సర్వాంతరం సర్వాత్మరూపం బ్రహ్మ గురుశాస్త్రే విహాయాన్యేన కేనాప్యుపాయేన కో జానీయాన్న కోఽపీత్యర్థః.

టీ. బాఢం=సరేకాని, బ్రహ్మేతి = ఈయానందము బ్రహ్మ మని, విద్యాశ్చేత్= ఎఱిఁగినయెడల, తావతైవ = అంతమాత్రముచేతనే, తే=వారు, కృతార్థాః=కృతార్థులగుదురు. గురుశాస్త్రే వినా = గురువులు శాస్త్రములు వినాగా, అత్యంతం = మిక్కిలి, గంభీరం=గంభీరమైన, బ్రహ్మ = బ్రహ్మమును, కః = ఎవఁడు, వేత్తి = తెలిసికొనఁగలఁడు ?

తా. ఓపూర్వవాదీ! నీవు చెప్పినది సరియే. సర్వవ్యాపారముల వదలినప్పటి సుఖము బ్రహ్మానంద మని పామరు లెఱింగిరేని వారు కృతకృత్యులే యగుదురు. మఱియు, అవాఙ్మానసగోచరమై సర్వజ్ఞమును సర్వాంతరమును, సర్వాత్మకము నగు బ్రహ్మమును గురుశాస్త్రములు వినాగా నే యితరోపాయముచేతను దెలియ శక్యముకాదు.

అవ. "నాకు నీవాక్యముచేతనే బ్రహ్మము తెలియును. నాకు కృతకృత్యతా బుద్ధి గలుగమికిఁ గారణ మేమి" యని ప్రశ్నింపఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జానామ్యద్యాహం త్వదుక్త్యాద్య కుతో మే న కృతార్థతా,
శృణ్వత్ర త్వాదృశో వృత్తం ప్రాజ్ఞంమన్యస్య కస్యచిత్. 79

వ్యా. నను త్వద్వాక్యాదేవ బ్రహ్మానందం జానతో మమ కుతః న కృతార్థతా లభ్యత? ఇత్యాశంక్యానువాదపూర్వకం సోపహాసముత్తరమాహ—జానామీతి.

టీ. త్వదుక్త్యా = నీవాక్యముచేత, అద్య=ఇప్పుడు, అహం = నేను, జానామి = బ్రహ్మము నెఱింగితిని. కుతః = ఎందువలన, మే=నాకు, కృతార్థతా = కృతార్థత, న = లేదు? అనెదవేని, అత్ర = ఈవిషయమై, త్వాదృశః = నీవంటి, ప్రాజ్ఞంమన్యస్య = తెలివిగలవాఁడ ననుకొనెడి, కస్యచిత్ = ఒకానొకని, వృత్తం = వృత్తాంతము, శృణు = వినుము.

తా. బ్రహ్మానంద మానందరూప మంటివి. నీమాటనుబట్టియే నా కాసంగతి దెలిసినది. నాకు సంసారదుఃఖము శమింపకుండుటకుఁ గారణ మేమి అని యడుగఁగా, వానికి సమాధానముగా నొక కథను జెప్పుచున్నాఁడు.

శ్లో. చతుర్వేదవిదే దేయమితి శృణ్వ న్నవోచత,
వేదాశ్చత్వార ఇత్యేవం వేద్మి మే దీయతాం ధనమ్. 80

వ్యా. తమేవ వృత్తాంతం దర్శయతి—చతుర్వేదేతి. కశ్చిచ్చతుర్వేదవిదే కస్మైచిదిదం బహుధనం దాతవ్యమితి, ఏవం విధం వాక్యం శ్రుత్వా వేదాశ్చత్వార ఇత్యస్మాదేవ వాక్యాదహం వేద్మి అతో మే దీయతామితి వక్తి తద్వద్భవానపీత్యర్థః.

టీ. చతుర్వేదవిదే = నాలుగు వేదములును దెలిసినవానికి, దేయమితి=ఈ ధన మీయఁదగిన దని, శృణ్వన్ = విన్నవాఁడగుచు, (కశ్చిత్=ఒకానొకఁడు), వేదాః = వేదములు, చత్వారఇతి=నాలు గని, వేద్మి=ఎఱుంగుదు నని, మే=నాకు, ధనం=ధనము, దీయతాం=ఈయఁబడుగాక. ఇతి=ఈలాగున, అవోచత=ఒకఁడు పలికెను.

తా. నాలుగు వేదములు తెలిసినవానికి ధనము నిచ్చెద నని యొక దాత యనెను. ఒక మూర్ఖుఁడు "నీవు నాలుగు వేదము లంటివి. వేదములు నాలు గని నాకుఁ దెలియును. కావున నా కాధన మిమ్ము" అని యడిగెను. నీ వడిగినప్రశ్న యామూర్ఖుని ప్రశ్నను బోలియున్నది.

శ్లో. సంఖ్యామేవైష జానాతి నతు వేదానశేషతః,
యది తర్హి త్వమప్యేవం నాశేషం బ్రహ్మ వేత్సి హి. 81

వ్యా. నను వేదాశ్చత్వార ఇతి యో వేద స వేదగతాం సంఖ్యామేవ వేత్తి న తు వేదానాం స్వరూపమితి చోదయతి—సంఖ్యామితి. సామ్యేన సమాధత్తే తర్హీతి.

ఏవం చతుర్వేదాభిజ్ఞంమన్య ఇవ త్వమప్యశేషం పూర్ణం యథాభవతి తథా బ్రహ్మ న వేత్సి నైవ జానాసి.

టీ. ఏషః=వీఁడు, సంఖ్యామేవ = వేదసంఖ్యను మాత్రమే, జానాతి = ఎఱుంగును. వేదాన్ =వేదములను, అశేషతః = సంపూర్ణముగా, న జానాతీతి = ఎఱుఁగఁడనెడ వేని. తర్హి = అట్లాయితే, త్వమపి=నీవును, ఏవం = ఈవిధంబున, అశేషం = పూర్ణముగా, బ్రహ్మ=బ్రహ్మమును, న వేత్సిహి = ఎఱుంగవు గదా.

తా. ఓపూర్వపక్షీ ! మూర్ఖునకు వేదములు నాలు గన్న మాటయే తెలియునుగాని వేదస్వరూపము సంపూర్ణముగాఁ దెలియదంటివేని, నీకును అట్లే బ్రహ్మస్వరూపము నిశ్శేషముగాఁ దెలియదు. అని సిద్ధాంతి సమాధానముఁ జెప్పెను.

అవ. వేదములకు స్వరూపభేదము గలదు. బ్రహ్మము ఏకరసము; బ్రహ్మమం దిట్టి భేదము లే దని శంకించుచున్నాఁడు:—

శ్లో. అఖండైకరసానందే మాయాతత్కార్యవర్జితే,
అశేషత్వసశేషత్వవార్తావసర ఏవ కః. 82

వ్యా. నను సంఖ్యాతిరిక్తవేదస్వరూపభేద ఇవ స్వగతాదిభేదశూన్యే ఆనందరూపే బ్రహ్మణి అజ్ఞాయమానస్యాంశస్యాభావాదసంపూర్ణజ్ఞానిత్వోపాలంభో న ఘటత ఇతి చోదయతి—అఖండైకేతి.

టీ. మాయా తత్కార్యవర్జితే=మాయతోను, తత్కార్యములతోను రహితమైనట్టి, అఖండైకరసానందే - అఖండ = అపరిచ్ఛిన్నమైన, ఏకరస = ఏకవిధమైన, ఆనందే = ఆనందస్వరూప మగు బ్రహ్మమందు, అశేషత్వసశేషత్వవార్తావసర ఏవ = నిశ్శేషము సశేషము అనియెడి వార్తలకు ప్రసక్తియే, కః = ఎక్కడిది ?

తా. మాయాతత్కార్యరహిత మగు బ్రహ్మము ఏకరూపము. నిశ్శేషత్వ సశేషత్వభేదము బ్రహ్మమునకు లేదు గాన తూష్ణీంస్థితియందు బ్రహ్మము నిశ్శేషముగా నాకు తెలియలే దనుటకు వలనుపడదు.

అవ. ఇప్పుడు, బ్రహ్మజ్ఞానమందును సంపూర్ణత్వాదికమును జూపుటకై బ్రహ్మము నెఱుఁగుదు నని చెప్పెడివానిని వికల్పించి యడుగుచున్నాఁడు:—

శ్లో. శబ్దానేవ పఠస్యాహో తేషామర్థం చ పశ్యసి,
శబ్దపాఠేఽర్థబోధస్తే సంపాద్యస్త్వేన శిష్యతే. 83

వ్యా. బ్రహ్మజ్ఞానేఽప్యశేషత్వాదికం దర్శయితుం బ్రహ్మ జానామీతి వదంతం వికల్ప్య పృచ్ఛతి—శబ్దానితి. కిమఖండైకరసమద్వితీయసచ్చిదానందరూపమిత్యాది

శబ్దానేవ పఠసి. అహో అథవా తేషాం శబ్దానామర్థం స్వగతాదిభేదశూన్యత్వాదికం చ పశ్యసి జానాసి? ఇతి వికల్పార్థః. ఆద్యపక్షే సావశేషత్వం దర్శయతి—శబ్దపాఠే ఇతి.

టీ. శబ్దానేవ = శబ్దములనే, పఠసి = పఠించుచున్నావా? తేషాం = వాని యొక్క, అర్థం = అర్థమును, అహో పశ్యసి = చూచుచున్నావా? శబ్దపాఠేఽపి = శబ్దపాఠమునను, తే=నీకు, అర్థబోధః = అర్థజ్ఞానము, సంపాద్యత్వేన = సంపాదింపఁ దగినదిగ, శిష్యతే = మిగిలియున్నది.

తా. ఓపూర్వపక్షీ! బ్రహ్మ మఖండైకరసము, నిశ్శేషము అను శబ్దములు మాత్రము నీకు తెలియును. వానియర్థము నీకు తెలియదు గాన వానిని తెలిసికొనుము.

అవ. నా కర్థజ్ఞానము గూడఁ గల దనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అర్థే వ్యాకరణాద్బుద్ధే సాక్షాత్కారోఽవశిష్యతే,
స్యాత్కృతార్థత్వధీర్యావత్తావద్గురుముపాస్స్వ భోః. 84

వ్యా. ద్వితీయేఽపి తద్దర్శయతి—అర్థ ఇతి. వ్యాకరణాదిత్యుపలక్షణం, నిగమాదేః. వ్యాకరణాదినా పరోక్షజ్ఞానే సంపాదితేఽపి సంశయాదినిరాసేనాపరోక్షీకరణమవశిష్యతే, తర్హి కదా? సంపూర్ణత్వజ్ఞానస్యేత్యాశంక్య తదవధిం దర్శయతి—స్యాదితి. యదా కృతార్థత్వబుద్ధిరుత్పద్యతే తదా జ్ఞానస్య సంపూర్ణతాఽవగంతవ్యేత్యర్థః.

టీ. భోః=ఓయీ, అర్థే = అర్థము, వ్యాకరణాత్ = వ్యాకరణమువలన, బుద్ధే= తెలియఁబడఁగా, సాక్షాత్కారః = సాక్షాత్కారము, అవశిష్యతే=మిగులును. కృతార్థత్వధీః=కృతార్థత్వబుద్ధి, యావత్ = ఎంతవఱకు, స్యాత్ = అగునో, తావత్=అంతదనుక, గురుం = గురువును, ఉపాస్స్వ = సేవింపుము.

తా. వ్యాకరణ సహాయముచే నర్థజ్ఞానము గలిగినను సాక్షాత్కారముకొఱకై యత్నింపుము. సాక్షాత్కారము గూడ నీకుఁ గలిగెనంటివేని, నీకు కృతార్థతాబుద్ధి గలిగే యుండవలయును. నీకు కృతార్థత్వబుద్ధి కలుగ లేదంటివి గాన అట్టి బుద్ధి కలుగునంతవఱకు గురువుల సేవింపుము.

అవ. ప్రకృతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆస్తామేతద్యత్ర యత్ర సుఖం స్యాద్విషయై ర్వినా,
తత్ర సర్వత్ర విద్ధ్యేతాం బ్రహ్మానందస్య వాసనామ్, 85

వ్యా. ఏవం ప్రాసంగికం పరిసమాప్య ప్రకృతమేవానుసరతి—ఆస్తామితి. యత్ర యత్ర యస్మిన్యస్మిన్కాలే తూష్ణీంభావాదౌ విషయానుభవమంతరేణ సుఖం భవతి, తత్ర తత్రసుఖస్య విషయజన్యత్వాభావాత్సామాన్యాహంకారావృతత్వాచ్చ వాసనానందత్వమవగంతవ్యమిత్యర్థః.

టీ. ఏతత్=ఈవిషయము, ఆస్తాం=ఉండుఁగాక, యత్ర యత్ర=ఎక్కడెక్కడ, విషయైర్వినా=విషయములు లేకుండ, సుఖం=సుఖము, స్యాత్=అగునో, తత్రసర్వత్ర= అచ్చట నంతటను, ఏతాం=ఈ, బ్రహ్మానందస్య = బ్రహ్మానందముయొక్క, వాసనాం = వాసననుగా, విద్ధి=ఎఱుంగుము.

తా. ఈప్రసంగ మటుండనిమ్ము. ఏయే కాలమున తూష్ణీంభావాదికమందు విషయానుభవరహితమగు సుఖము గలుగునో ఆసుఖము విషయమువలనఁ గలిగినది గామిచేతను, సామాన్యాహంకారముచేతఁ గప్పఁబడుటవలనను అది వాసనానంద మని తెలియవలెను.

అవ. బ్రహ్మానందవాసనానందములను జెప్పి, విషయానందమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. విషయేష్వపి లబ్ధేషు తదిచ్ఛోపరమే సతి,
అంతర్ముఖమనోవృత్తావానందః ప్రతిబింబతి. 86

వ్యా. ఏవం బ్రహ్మానందవాసనానందౌ దర్శయిత్వా ఇదానీమానందత్రైవిధ్యనియమనాయాత్మాభిముఖధీవృత్తావిత్యత్రోక్తమేవ విషయానందం పునరనువదతి—విషయేష్వపీతి. యదా స్రగాదివిషయలాభాత్తత్తదిచ్ఛోపరమో భవతి, తదా తదా మనస్యంతర్ముఖే సతి తస్మిన్ యః స్వాత్మానందః, ప్రతిబింబితో భవత్యయం విషయానంద ఇత్యర్థః.

టీ. విషయేషు = విషయములు, లబ్ధేషు = పొందఁబడఁగా, తదిచ్ఛోపరమేసతి = ఆవిషయములయందలి కోరికయొక్క శాంతి గలుగుచుండఁగా, అంతర్ముఖమనోవృత్తౌ= అంతర్ముఖ మగు చిత్తవృత్తియందు, ఆనందః=ఆనందము, ప్రతిబింబతి=ప్రతిఫలించును.

తా. స్రగాది విషయలాభము గలిగిన తరువాత వానియందలి కోరిక శమింపఁగా చిత్తవృత్తియందు సుఖము గలుగును. చిత్తవృత్తియందు స్వాత్మానందము ప్రతిఫలించును. ఇట్టి ప్రతిబింబానందమునే విషయానంద మనియుఁ జెప్పెదరు.

అవ. ఆనందఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందో వాసనా చ ప్రతిబింబ ఇతి త్రయమ్,
అంతరేణ జగత్యస్మిన్నానందో నాస్తి కశ్చన. 87

వ్యా. ఫలితమాహ—బ్రహ్మానందఇతి. ఉక్తప్రకారేణ స్వప్రకాశతయా సుషుప్తౌ ప్రతిభాసమానో యో బ్రహ్మానందో యశ్చ తూష్ణీంస్థితౌ విషయానుభవమంతరేణ ప్రతీయమానో వాసనానందో యోఽప్యభీష్టవిషయలాభాదంతర్ముఖే మనసి ప్రతిబింబితో విషయానంద ఏతత్త్రితయాతిరేకేణాస్మిన్ జగతి న కశ్చిదానందోఽస్తి. నను 'ఆనందస్త్రివిధో బ్రహ్మానందో విద్యాసుఖం తథా, విషయానంద' ఇత్యనేన ప్రకారేణానందత్రైవిధ్యముక్తం. ఇదానీంతు 'బ్రహ్మానందో వాసనా చ ప్రతిబింబ ఇతి త్రయ'మితి తద్విలక్షణమానందస్య త్రైవిధ్యముచ్యతే. అతః పూర్వోత్తరవిరోధః. కించ, 'యావద్యావదహంకారో విస్మృతోఽభ్యాసయోగతః, తావత్తావత్సూక్ష్మదృష్టేర్నిజానందోఽనుమీయతే' ఇతి. 'తాదృక్పుమానుదాసీనకాలేఽప్యానందవాసనాం, ఉపేక్ష్య ముఖ్యమానందం భావయత్యేవ తత్పర' ఇతి చోక్తప్రకారద్వయాతిరిక్తౌ నిజానందముఖ్యానందావభిధీయేతే—తథా ద్వితీయాధ్యాయే 'మందప్రజ్ఞంతు జిజ్ఞాసుమాత్మానందేన బోధయే' దితి, ఆత్మానందస్తతోఽన్యోఽభిధీయతే. 'యోగానందః పురుక్తోయ' ఇత్యత్ర యోగానందోఽపి కశ్చిదవభాసతే. 'బ్రహ్మానందాభిధే గ్రంథే తృతీయాధ్యాయ ఈరితః, అద్వైతానందఏవ స్యా' దిత్యత్రాద్వైతానందం చాన్యమవగచ్ఛామః. అతః 'అంతరేణ జగత్యస్మిన్నానందో నాస్తికశ్చనే'త్యుక్తిర్విరుధ్యేతేది చేన్నైవం. విద్యానందస్య విషయానందవదంతః కరణవృత్తివిశేషత్వేన విషయానందే చాంతర్భావస్య విషయానందవతః కరణవృత్తిశేషత్వేనవిషయానందేచాంతర్భావస్య 'విషయానందవద్విద్యానందో ధీవృత్తిరూపక' ఇత్యుత్తరత్ర ధీవృత్తిరూపత్వాభిధానేన వివక్షితత్వాన్నిజానందముఖ్యానందాత్మానంద యోగానందాద్వైతానందానాం తు బ్రహ్మానందాదనతిరిక్తత్వాచ్చ. తథాహి—'యావద్యావదహంకార' ఇత్యుదాహృతే శ్లోకే యోగలక్షణోపాయగమ్యతయా యోగానందత్వేన వివక్షితస్య నిజానందస్యైవ 'న ద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి యత్సుఖం, స బ్రహ్మానంద ఇత్యాహ భగవానర్జునం ప్రతి' ఇత్యస్మిన్నుత్తరశ్లోక ఏవ బ్రహ్మానందత్వాభిధానాన్నిజానందో బ్రహ్మానందాన్న భిద్యతే. తథా ముఖ్యానందోఽపి బ్రహ్మానంద ఏవ. 'తథా చ విషయానందో వాసనానంద, ఇత్యమూ, 'ఆనందౌ జనయన్నాస్తే బ్రహ్మానందః స్వయంప్రభ' ఇత్యత్ర జన్యత్వేనాముఖ్యభూతయోర్విషయానందవాసనానందయోర్జనకత్వేనాభిహితస్య బ్రహ్మానందస్యైవ తాదృక్పుమానుదాసీనకాలేఽపీత్యుదాహృతఏవ శ్లోకే, 'ఆనందవాసనామ్, ఉపేక్ష్య ముఖ్యమానందం భావయత్యేవ తత్పర' ఇతి

ముఖ్యానందత్వాభిధానాదాత్మానందాద్వైతానందయోస్తు బ్రహ్మానందత్వం, 'యోగానందః పురోక్తో యః స ఆత్మానంద ఇష్యతా' మితి తృతీయాధ్యాయాదౌ ప్రథమాధ్యాయే యోగానందతయా వివక్షితస్య బ్రహ్మానందస్యైవ యోగానందశబ్దేనానువాదపూర్వకం ఆత్మానందతామభిధాయ 'కథం బ్రహ్మత్వమేతస్య సద్వయస్యేతిచే'దితి ప్రశ్నపూర్వకమాకాశాదిశరీరాంతమిత్యాదినా ద్వితీయస్య బ్రహ్మత్వప్రతిపాదనమవగంతవ్యం. తస్మాద్బ్రహ్మానందో వాసనా చ ప్రతిబింబ ఇత్యుక్తం త్రైవిధ్యం సుస్థం. ననుతర్హి 'నన్వేవం వాసనానందాత్ బ్రహ్మానందాదపీతరం, వేత్తి యోగీ నిజానంద' మిత్యత్ర నిజానందస్య బ్రహ్మానందవాసనానందాభ్యాం భేదేన నిర్దేశో న యుజ్యత ఇతి న శంకనీయం. ఏకస్యైవ బ్రహ్మానందస్య జగత్కారణత్వోపాధిసాహిత్యరాహిత్యభేదవ్యపదేశోపపత్తేః. తథాహి బ్రహ్మానందనిరూపణావసరే * "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంత" ఇత్యాదినా జగత్కారణత్వాభిధానేన బ్రహ్మానందస్య సమాయత్వమవగమ్యతే. నిర్మాయస్య జగత్కారణత్వానుపపత్తేః నిజానందనిరూపణకాలేఽపి 'యావద్యావదహంకార' ఇత్యాదినా సకారణస్యాహంకారస్య విలయప్రతిపాదనాన్నిజానందస్య నిర్మాయత్వమితి సర్వమనవద్యమ్.

టీ. బ్రహ్మానందః=బ్రహ్మానంద మనియు, వాసనా చ = వాసనానంద మనియు, ప్రతిబింబ ఇతి=ప్రతిబింబానంద మనియు, త్రయమ్=ఈమూఁటిని, అంతరేణ=వినాగా, అస్మిన్=ఈ; జగతి = జగత్తునందు, కశ్చన ఆనందః = ఏయానందమును, నాస్తి=లేదు.

తా. బ్రహ్మానందము, వాసనానందము, ప్రతిబింబానందము నని ఆనందము త్రివిధము. ఈత్రివిధానందములు దప్ప నితరానంద మెద్దియును లేదు. పూర్వోక్తప్రకారముగ స్వప్రకాశత్వముచే సుషుప్తియందనుభవింపఁబడునది బ్రహ్మానందము. తూష్ణీంస్థితియందు స్త్రీపుత్రాది విషయానుభవములేకనే తోఁచుచుండునది వాసనానందము. ఇష్టవస్తుప్రాప్తివలన నంతర్ముఖమగు మనస్సునందుఁ బ్రతిబింబించునది విషయానందము.

వి. ప్ర. ౧౧-వ శ్లోకమునందు బ్రహ్మానందము, విద్యానందము, విషయానందము అని ఆనందత్రయము చెప్పఁబడినవి. ఇపుడు తద్విలక్షణముగ బ్రహ్మానంద వాసనానంద విషయానందములు చెప్పఁబడినవి. ఇది పూర్వోత్తర విరోధ మగును. మఱియు నే ద్వివిధానందత్రయముకంటె ౯౭-వ శ్లోకమునందు నిజానందమును, ౧౨౦-వ శ్లోకమునందు ముఖ్యానందమును చెప్పఁబడనున్నవి. ద్వాదశప్రకరణమందు ౪-వ శ్లోకములో

వీని యన్నిటికంటె నన్యమగు ఆత్మానందము చెప్పఁబడనున్నది. త్రయోదశప్రకరణ మందు మొదటి శ్లోకములో యోగానందము చెప్పఁబడనున్నది. తత్ప్రకరణ ౧౦౫-వ శ్లోకములో అద్వైతానందము చెప్పఁబడనున్నది. ఇటుల ననేకానందము లుండఁగా నీ శ్లోకమం దీయానందత్రయముకంటె నితరానందము లేదని చెప్పఁబడినది. కారణ మేమి?

ఉ. చతుర్దశప్రకరణము ౨-వ శ్లోకములో జెప్పఁబడుప్రకారము విద్యానందము విషయానందమువలెనే అంతఃకరణవృత్తి విశేషరూప మగుటవలన ఆ విద్యానందము విషయానందమం దణఁగియుండును. నిజానంద, ముఖ్యానంద, ఆత్మానంద, యోగా నంద, అద్వైతానందము లైదును బ్రహ్మానందముకంటె భిన్నములు గావు గనుక నివి బ్రహ్మానందమం దణఁగియున్నవి. ఎట్లనఁగా, నీయధ్యాయమందు ౯౦-వ శ్లోకమందు యోగలక్షణముచేఁ బొందఁదగిన దని చెప్పఁబడిన నిజానందము, ౧౦౦-వ శ్లోకమందుఁ జెప్పఁబడుప్రకారము, బ్రహ్మానందముకంటె నభిన్నము. అప్రకారము ముఖ్యానంద మును బ్రహ్మానందమే యగును. అది యెట్లనఁగా, ౮౮-వ శ్లోకమందుఁ జెప్పఁబడెడి ప్రకారము, అముఖ్యభూతము లగు విషయానంద వాసనానందములను గలిగించు బ్రహ్మానందమే, ౧౨౧-వ శ్లోకమునందు ముఖ్యానంద మని చెప్పఁబడుటవలన, ముఖ్యా నందమును, బ్రహ్మానందమే యగును. మఱియు, ఆత్మానందాద్వైతానందములు రెండును బ్రహ్మానందములో నణఁగియున్నవి. అది యెట్లనఁగా, త్రయోదశప్రకరణారంభమందు మొదటి శ్లోకప్రకారము, ప్రథమాధ్యాయమందు యోగానందత్వముచేఁ జెప్పబడిన బ్రహ్మానందమునకే యోగానందశబ్దముచేత ననువాదపూర్వకముగా ఆత్మానందత్వమును దెలిపి, పిమ్మట ద్వైతసహితమగు నీయాత్మానందమునకు బ్రహ్మత్వ మెటులఁ గలుగునసెడి ప్రశ్నపూర్వకముగ, సద్వితీయానందమునకు బ్రహ్మత్వము ప్రతిపాదింపఁబడెను. కనుక, ఆత్మానందము బ్రహ్మానందమే యగును. మఱియు, అద్వైతానందమునకు బ్రహ్మత్వము, ప్రతిపాదింపఁబడుటచేత నాయద్వైతానందము బ్రహ్మానందమే యగును. ఆకారణము వలన ఈశ్లోకమందుఁ జెప్పఁబడినప్రకారము బ్రహ్మానంద వాసనానంద విషయానందము లనెడి ఆనందములు మూఁడే కల వని తెలియవలెను.

ప్ర. ద్వాదశప్రకరణారంభమున మొదటి శ్లోకములోఁ జెప్పఁబడిన నిజానందము బ్రహ్మానంద వాసనానందములకంటె భేదముగా నిర్దేశింపఁబడరాదు గదా ?

ఉ. ఒక్కటియగు బ్రహ్మానందమే జగత్కారణత్వోపాధియొక్క యునికి లేముల భేదముచేత భేదముగాఁ దెలుపఁబడుచున్నది. అది యెట్లనఁగా, బ్రహ్మానందనిరూపణ సమయమందు, ఈయానందమువలననే భూతములు పుట్టుచున్నవని "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" త్యాది వాక్యముచే, బ్రహ్మమునకు జగత్కారణత్వమును

జెప్పుటవలన, మాయాసంబంధములేని బ్రహ్మమునకు జగత్కారణత్వము కూడదు కనుక బ్రహ్మానందమునకు మాయాసహితత్వము కలదని తెలియుచున్నది. మఱియు, నిజానంద నిరూపణకాలమందును తోంబదియెనిమిది మున్నగు శ్లోకముల ప్రకారము సకారణమగు అహంకారముయొక్క విలయమును జెప్పుటవలన, నిజానందమునకు మాయాసంబంధము లేదు. కనుక బ్రహ్మానంద వాసనానందములకంటె నిజానందము భేదముగాఁ జెప్పరాదని శంకింపఁదగ దని యభిప్రాయము.

అవ. బ్రహ్మానందమును నిరూపింపఁబూని ఇతరానందము నిరూపించుట అసంగతము కాదా యను శంకకు సమాధానము:—

శ్లో. తథా చ విషయానందో వాసనానంద ఇత్యమూ,
ఆనందౌ జనయన్నాస్తే బ్రహ్మానంద స్స్వయంప్రభః. 38

వ్యా. నన్వస్మిన్నధ్యాయే బ్రహ్మానందవివేచనస్యైవ ప్రస్తుతత్వాదితరానంద ద్వయప్రతిపాదనం ప్రకృతాసంగత మిత్యాశంక్య తయోర్బ్రహ్మానందజన్యత్వేన తద్బోధోపయోగిత్వాన్న ప్రకృతాసంగత మిత్యభిప్రాయేణాహ—తథేతి. తథాచ ఏవ మానందత్రైవిధ్యే సతి యస్స్వయంప్రకాశ ఆనందో విషయానందవాసనానందౌ జనయతి, స బ్రహ్మానందో వేదితవ్య ఇత్యర్థః.

టీ. తథా చ=అట్లుండఁగా, విషయానందః=విషయానంద మనియు, వాసనానంద ఇతి=వాసనానంద మనియు, అమూ - ఆనందౌ= ఈయానందములను, జనయన్=పుట్టించుచున్నదై, స్వయంప్రభః = స్వప్రకాశమైన, బ్రహ్మానందః = బ్రహ్మానందము, ఆస్తే = ఉన్నది.

తా. బ్రహ్మానందమే విషయానందవాసనానందములఁ బుట్టించును. కార్యమునుబట్టి కారణమును గుర్తించుటకై యీరెండానందములు నీ ప్రకరణమునందుఁ జెప్పంబడుట ప్రకరణవిరోధము కాదు.

అవ. ఉత్తరగ్రంథము నవతరింపఁజేయుచున్నాఁడు:—

శ్లో. శ్రుతియుక్త్యనుభూతిభ్యః స్వప్రకాశచిదాత్మకే,
బ్రహ్మానందే సుప్తికాలే సిద్ధే సత్యన్యథా శృణు. 39

వ్యా. వృత్తానుసంకీర్తనపూర్వకము త్తరగ్రంథమవతారయతి—శ్రుతీతి. శ్రుతిభిః 'సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూతస్సుఖరూపమేతి' తీత్యాదిభిర్యుక్తిభిస్సుఖమహమస్వాప్స మిత్యాదిపరామర్శాన్యథానుపపత్త్యాదిభి రనుభూత్యా చ అర్థాపత్తికల్పితేన సుషుప్త్యనుభవేన చ సుషుప్తకాలే స్వప్రకాశో బ్రహ్మానందస్సాధితః. ఇతః పరమన్యథా జాగరణావస్థాయామపి యో బ్రహ్మానందావగమో యో వక్ష్యతే తం శృణ్విత్యర్థః.

టీ. శ్రుతియుక్త్యనుభూతిభ్యః= శ్రుతి, యుక్తి, అనుభవములచేత, స్వప్రకాశ చిదాత్మకే = స్వప్రకాశచైతన్యస్వరూపమైన, బ్రహ్మానందే = బ్రహ్మానందము, సుప్తికాలే = సుషుప్తిసమయమున, సిద్ధే సతి = సిద్ధించిన దగుచుండఁగా, అన్యథా = మఱియొక కాలమందు, శృణు = (బ్రహ్మానందము నెఱిఁగెడి యుపాయమును) వినుము.

తా. సుషుప్తికాలమున స్వప్రకాశచైతన్యస్వరూప మగు బ్రహ్మానందము కల దని శ్రుత్యుక్త్యనుభవములచేత నిరూపించితిమి. కాలాంతరమందును బ్రహ్మానందమును దెలియుట కుపాయముం జెప్పెదము.

అవ. అట్టి యుపాయమును గనఁబఱచుటకు పూర్వము జీవునకు జాగ్రత్స్వప్నావస్థాప్రాప్తిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. య ఆనందమయస్సుప్తౌ స విజ్ఞానమయాత్మతామ్,
గత్వా స్వప్నం ప్రబోధం వా ప్రాప్నోతి స్థానభేదతః. 90

వ్యా. ప్రతిజ్ఞాతమేవ బ్రహ్మానందావగమోపాయం దర్శయితుం తదుపోద్ఘాతత్వేన సనిమిత్తాం జీవస్యావస్థాద్వయప్రాప్తిం దర్శయతి—య ఇతి. సుప్తౌ సుషుప్తికాలే విలీనావస్థ ఆనందమయత్వేన కథ్యత ఇత్యుక్తో య ఆనందమయః స విజ్ఞానశబ్దాభిధేయ బుద్ధ్యుపాధిమత్త్వేన విజ్ఞానమయతాం ప్రాప్యస్థానభేదతో వక్ష్యమాణస్థానవిశేషయోగేన స్వప్నం జాగరణం వా కర్మానుసారేణ గచ్ఛతి.

టీ. సుప్తౌ = సుషుప్తియందు, యః ఆనందమయః = ఏ యానందమయుఁడు గలఁడో, సః=వాఁడు, విజ్ఞానమయాత్మతాం=విజ్ఞానమయాత్మత్వమును, గత్వా=పొంది, స్వప్నం = స్వప్నమును గాని, ప్రబోధం వా = జాగ్రదవస్థను గాని, స్థానభేదతః = స్థానభేదమువలన, ప్రాప్నోతి = పొందుచున్నాఁడు.

తా. సుషుప్త్యవస్థాభిమాని యగు ఆనందమయుఁడు సుషుప్త్యనంతరము విజ్ఞానమయుఁ డగుచు, స్థానవిశేషయోగముచేత స్వప్నమును గాని, జాగ్రద్దశను గాని కర్మానుసారముగ పొందుచున్నాఁడు.

అవ. జాగ్రదాద్యవస్థలకు స్థానములం దెలుపుచున్నాఁడు:—

శ్లో. నేత్రే జాగరణం కంఠే స్వప్నస్సుప్తిర్హృదంబుజే,
ఆపాదమస్తకం దేహం వ్యాప్య జాగర్తి చేతనః. 91

వ్యా. ఇదానీం జాగ్రదాద్యవస్థోపయోగినీ స్థానాని దర్శయతి—నేత్ర ఇతి. నేత్రశబ్దస్య కృత్స్నదేహోపలక్షణపరతామభిప్రేత్య -నేత్రే జాగరణమిత్యంశస్యార్థమాహ—ఆపాదేతి. చేతనో జీవః.

టీ. నేత్రే = నేత్రమందు, జాగరణం = జాగ్రదవస్థ (అగుచున్నది). స్వప్నః= స్వప్నావస్థ, కంఠే = కంఠమునందు (అగుచున్నది). సుప్తిః = సుషుప్తిః, హృదంబుజే= హృదయకమలమునందు (అగుచున్నది). చేతనః = చేతనుఁడైన జీవుఁడు, ఆపాద మస్తకం=పాదములు మొదలు శిరస్సువఱకు, దేహం=దేహమును, వ్యాప్య = వ్యాపించి, జాగర్తి = జాగ్రదవస్థ ననుభవించుచున్నాఁడు.

తా. జీవుఁడు నేత్రమం దున్నపుడు, అనఁగా స్థూలశరీరమం దంతటను నున్నపుడు జాగ్రదవస్థ యగును. కంఠప్రదేశమం దున్నపుడు స్వప్నావస్థను బొందును. హృదయకమలమం దున్నప్పుడు సుషుప్త్యవస్థను బొందును.

అవ. దేహవ్యాప్తిని దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దేహతాదాత్మ్యమాపన్న స్తప్తాయఃపిండవ త్తతః,
అహం మనుష్య ఇత్యేవం నిశ్చిత్యైవావతిష్ఠతే. 92

వ్యా. దేహం వ్యాప్యేత్యనేన వివక్షితమర్థం దృష్టాంతప్రదర్శనేన స్పష్టయతి—దేహతాదాత్మ్యమితి. తత్ర ప్రమాణమాహ—తత ఇతి. యతో మనుష్యత్వాది జాతిమతా దేహేన తాదాత్మ్యం ప్రాప్తస్తతః అహం మనుష్య ఇత్యేవం నిశ్చిత్య సంశయాదిరహితజ్ఞానేన గృహీత్వైవావతిష్ఠతే.

టీ. తప్తాయఃపిండవత్=కాచిన యినుపగుండువలె, దేహతాదాత్మ్యం = దేహతాదాత్మ్యమును, ఆపన్నః = పొందినవాఁ డగుచు, తతః=దానివలన, అహం మనుష్య ఇత్యేవం = నేను మనుష్యుఁడ నని యిత్తెఱంగున, నిశ్చిత్యైవ = నిశ్చయించియే, అవతిష్ఠతే = ఉండుచున్నాఁడు.

తా. కాల్చిన యినుపగుండునందు, అగ్నికిని యినుపగుండునకును భేదము గ్రహింపలేనట్లు దేహతాదాత్మ్యమును బొందిన చిదాభాసునకును దేహమునకును భేదము గ్రహింపఁజాలము గాన నేను మనుష్యుఁడ ననియే ప్రతిమనుజుఁడు వ్యవహరించుచున్నాఁడు.

అవ. దేహతాదాత్మ్యమును బొందినవాని కవస్థాత్రయమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉదాసీన స్సుఖీ దుఃఖీ త్యవస్థాత్రయ మేత్యసౌ,
సుఖదుఃఖే కర్మ కార్యే త్వౌదాసీన్యం స్వభావతః. 93

వ్యా. దేహతాదాత్మ్యాభిమానహేతుకాన్యేవావస్థాంతరాణి దర్శయతి—ఉదాసీన ఇతి. తత్ర సుఖిత్వదుఃఖిత్వయోః కర్మజన్యత్వజ్ఞానాయ విశేషభూతయోః సుఖదుఃఖయోస్తద్ధేతుకత్వం దర్శయతి—సుఖేతి.

టీ. ఉదాసీనః = ఉదాసీనుఁ డనియు, సుఖీ = సుఖవంతుఁ డనియు, దుఃఖీ = దుఃఖవంతుఁ డనియు, ఇతి = ఈలాగున, అవస్థాత్రయం = మూఁ డవస్థలను, అసౌ = ఈజీవుఁడు, ఏతి = పొందుచున్నాఁడు. సుఖదుఃఖే తు = సుఖదుఃఖము లయితే, కర్మకార్యే=కర్మవలనఁ బుట్టినవి, ఔదాసీన్యం=ఉదాసీనత్వము, స్వభావతః = స్వభావసిద్ధమైనది.

తా. నేను సుఖి ననియు, నేను దుఃఖి ననియు, నే నూరకుంటి ననియు ననుచున్నాఁడు. సుఖము, దుఃఖము, ఔదాసీన్యము అను మూఁ డవస్థలం బొందుచున్నాఁడు. సుఖదుఃఖములు కర్మవలనఁ గలిగినవి, ఔదాసీన్యము స్వాభావిక మైనది.

అవ. సుఖదుఃఖావస్థలకు కారణభేదమువలన ద్వైవిధ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బాహ్యభోగా న్మనో రాజ్యాత్సుఖదుఃఖే ద్విధా మతే,
సుఖదుఃఖాంతరాళేషు భవే త్తూష్ణీ మవస్థితిః. 94

వ్యా. తయోశ్చ సుఖదుఃఖయోర్నిమిత్తభేదాత్ ద్వైవిధ్యమాహ—బాహ్యేతి. క్వాస్యౌదాసీన్యం కదా స్యాదిత్యత ఆహ—సుఖేతి. వ్యక్తిభేదవివక్షయా బహువచనం.

టీ. బాహ్యభోగాత్ = స్త్రీపుష్పాది బాహ్యవిషయములయొక్క యనుభవమువలన, మనోరాజ్యాత్=మనోరాజ్యమువలనను, సుఖదుఃఖే = సుఖదుఃఖములు, ద్విధా= రెండు విధములుగా, మతే = అభిమతములు. సుఖదుఃఖాంతరాళేషు = సుఖదుఃఖముల మధ్యకాలమున, తూష్ణీం = ఊరక, అవస్థితిః = ఉండుట అనఁగా ఔదాసీన్యావస్థ. భవేత్ = అగును.

తా. జాగ్రద్దశలో ఇష్టానిష్టవిషయముల ననుభవించుటచే సుఖదుఃఖములు గలుగుచున్నవి. ఇట్లే మనస్సులో ఇష్టానిష్టవిషయముల భావించుటచే సుఖదుఃఖములు ప్రాప్తించును. అట్టి సుఖదుఃఖానుభవము లేని సమయమున, జీవుఁ డుదాసీనుఁడై యుండును.

అవ. జాగ్రదాద్యవస్థానిరూపణఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న కాపి చింతా మేఽద్యద్య సుఖమాస ఇతి బ్రువన్,
ఔదాసీన్యే నిజానందభావం వక్త్యఖిలో జనః. 95

వ్యా. యదర్థం జాగ్రదాద్యుపన్యస్తం తదిదానీం దర్శయతి—న కాపీతి. సర్వోఽపి జనః ఇదానీం మమ కాపి చింతా గృహాదివిషయా నాస్తి. అతః సుఖం యథా

భవతి తథా తిష్ఠామీతి వదన్ ఔదాసీన్యకాలే స్వరూపానందస్ఫూర్తిం బ్రూతే, అతో జాగరణావస్థాయామపి నిజానందభానమస్తీత్యవగంతవ్యమిత్యభిప్రాయః.

టీ. అద్య = ఇప్పుడు, మే = నాకు, కాపి చింతా=ఏచింతయు, నాస్తి=లేదు. సుఖం = సుఖముగా, ఆసేతి = ఉంచున్నా నని, బ్రువన్ = చెప్పుచు, ఔదాసీన్యే = ఔదాసీన్యదశయందు, నిజానందభావం = తన నిజానందస్ఫూర్తిని, వక్తి = చెప్పుచున్నాఁడు.

తా. నా కేమియు చింత లేదు. నేను సుఖముగా నున్నా నని యూరకుండుసమయంబున ప్రతి మనుజుఁడును నిజానందమును జెప్పుచున్నాఁడు. ఇదియే జాగ్రద్దశయందలి స్వరూపానందస్ఫూర్తి.

అవ. ఇది వాసనానంద మనుటకు హేతువును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అహమస్మీత్యహంకారసామాన్యాచ్ఛాదితత్వతః,
నిజానందోన ముఖ్యోఽయం కిం త్వసౌ తస్య వాసనా. 96

వ్యా. నన్వౌదాసీన్యేఽవభాసమానస్య నిజానందత్వే తస్య బ్రహ్మానందత్వాత్పూర్వోక్తా వాసనానందతా న స్యాదిత్యాశంక్యాహంకారసామాన్యావృతత్వాన్న బ్రహ్మానందతేతి పరిహరతి.—అహమస్మీతి. దేవదత్తోఽహమిత్యాది విశేషణాన్యేనాహమస్మీత్యేవంరూపేణాహంకారసామాన్యేనావృతత్వాన్నాయం ముఖ్య ఇత్యర్థః. తర్హి తస్య కిం రూపతేత్యత ఆహ—కిం త్వసావితి.

టీ. అహమస్మీతి = నే నున్నా నని, అహంకారసామాన్యాచ్ఛాదితత్వతః = అహంకారసామాన్యముచేఁ గప్పఁబడిన దగుటవలన, అయం నిజానందః = ఈ నిజానందము, ముఖ్యః=ముఖ్యమగు, బ్రహ్మానందః=బ్రహ్మానందము, న=కాదు. కింతు = ఇంకనేమన, అసౌ = ఈనిజానందము, తస్య = ఆబ్రహ్మానందముయొక్క, వాసనా = వాసన యనంబడును.

తా. ఔదాసీన్యదశయందు, 'నేను' అనెడి యభిమాన ముండును. అట్టి యభిమానముచేఁ గప్పఁబడినందున, అప్పటి యానందము బ్రహ్మానందము కాదు. బ్రహ్మానందముయొక్క వాసన యగుటచేత వాసనానంద మనఁబడును.

అవ. వాసనానంద మనుటయందు దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. నీరపూరితభాండస్య బాహ్యే శైత్యం న తజ్జలమ్,
కింతు నీరగుణస్తేన నీరసత్తానుమీయతే. 97

వ్యా. ముఖ్యానందాతిరిక్తవాసనానందసద్భావే దృష్టాంతమాహ—నీరేతి. జలపూర్ణకుంభస్య బహిర్భాగస్పర్శనే నోపలభ్యమానం యచ్ఛైత్యమస్తి తత్తావజ్జలం న భవతి ద్రవత్వానుపలంభాత్. కిం తర్హి తదిత్యత ఆహ—కిం త్వితి. నీరగుణత్వం కథమవగమ్యత ఇత్యత ఆహ—తేనేతి. విమతం ఘటే ఉపలభ్యమానశైత్యం జలజన్యం భవితుమర్హతి శైత్యత్వాత్ జలే ఉపలభ్యమానశైత్యవదితి.

టీ. నీరపూరితభాండస్య = నీటిచే పూరింపఁబడిన ఘటముయొక్క, బాహ్యే= వెలుపలిభాగమందలి, శైత్యం = చల్లఁదనము, తత్ జలం = ఆజలము, న=కాదు. కింతు= మఱి యేమనిన, నీరగుణః = నీరగుణము. తేన = ఆగుణముచేత (ఆచల్లఁదనముచేత), నీరసత్తా = ఘటములోని నీటియొక్క యునికి, అనుమీయతే=ఊహింపఁబడుచున్నది.

తా. ఒక కుండనిండుగ నీరు పోసి దాని పైభాగమును స్పృశించినప్పుడు చల్లదనము తెలియును. ఆ చల్లదనము నీరు కాదు. అయిననా చల్లదనమునుంబట్టి లోపల నీరున్నదని యూహింపవచ్చును. అట్లులే వాసనానందము బ్రహ్మానందము కాకపోయినను, వాసనానందమునుబట్టి బ్రహ్మానందము నూహింపవచ్చును.

అవ. ఊహించెడు విధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యావద్యావదహంకారో విస్మృతోఽభ్యాసయోగతః,
తావత్తావత్సూక్ష్మదృష్టే ర్నిజానందోఽనుమీయతే. 93

వ్యా. భవత్వేవం నీరానుమాపకత్వం శైత్యస్య. ప్రకృతే కిమాయాత మిత్యాశంక్య తద్వాసనానందస్యాపి ముఖ్యానందానుమాపకత్వమాయాతమిత్యాహ—యావదితి. అభ్యాసయోగతః 'యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని, జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మనీతి శ్రుత్యభిహితనిరోధసమాధ్యభ్యాసయోగేన యావద్యావదహమాదివృత్తివిలయవశాచ్చిత్తవిలయవశాచ్చిత్తస్య సూక్ష్మతా జాయతే, తావత్తావన్నిజానందాభివ్యక్తిర్భవతీత్యనుమీయతే. అయమత్ర ప్రయోగః—అహంకారసంకోచవిశేషవిశిష్టక్షణేషు ద్వితీయాదిక్షణః పక్షః స పూర్వస్మాత్ క్షణాదధికనిజానందావిర్భావవాన్ అహంకారసంకోచవిశేషయుక్తకాలత్వా దహంకారసంకోచయుక్తాద్యక్షణవదితి.

టీ. యావద్యావత్ = ఎంతెంత, అహంకారః = అహంకారము, అభ్యాసయోగతః = అభ్యాసయోగమువలన, విస్మృతః = మఱువఁబడినదో, తావత్తావత్ = అంతంత, సూక్ష్మదృష్టేః = సూక్ష్మదృష్టివలన, నిజానందః = నిజానందము, అనుమీయతే = అనుమానప్రమాణముచే నూహింపఁబడుచున్నది.

తా. ఇట్లు చెప్పుటచేత ప్రకృతమందు లాభ మేమి యన, ఆ వాసనానందమునకును ముఖ్యానందము ననుసరించిన రూపకత్వము కలిగె నని తెలియవలెను. ఎట్లన, ఇంద్రియములను విషయములనుండి మఱలించి, మనస్సునందుఁ జేర్పవలె ననియు, ఆవృత్తిశూన్యమగు మనస్సును బుద్ధియందుఁ జేర్పవలెననియు, ఆ యింద్రియమనస్సహితబుద్ధిని అహంకారమందు (మహత్తత్త్వమందు)ఁ జేర్పవలె ననియు, ఆ యింద్రియమనోబుద్ధిసహితాహంకారమును ప్రత్యగాత్మయందు నిలుపవలె ననియుఁ జెప్పెడి "యచ్ఛేద్వాఙ్మనసీ...తద్యచ్ఛేదాంతరాత్మని," అనెడి శ్రుతిచేఁ జెప్పఁబడిన నిరోధసమాధ్యభ్యాసయోగముచేత, నెంతెంతమాత్రము అహమాదివృత్తివిలయవశమున చిత్తమునకు సూక్ష్మత్వము కలుగుచున్నదో అంతంతమాత్రము నిజానందము స్ఫురించుచుండు నని అనుమాన ప్రమాణముచేత నూహింపవలెను. ఆ యనుమాన మెటు లనిన, అహంకారసంకోచవిశేషముతోఁ గూడిన క్షణములయందు ద్వితీయాది క్షణభాగ మెద్ది కలదో ఆ ద్వితీయాదిక్షణభాగము అహంకారసంకోచవిశేషముతోఁగూడిన కాలముగలది యగుటవలన అహంకారసంకోచముతోఁ గూడిన మొదటి క్షణమువలెనే, పూర్వక్షణముకంటె నధికమగు నిజానందము నావిర్భవింపఁ జేయునది యగు నని ఇట్లనుమాన ప్రమాణముచే నూహించి తెలియవలెను.(ఇచట సంకోచ మనఁగా అహమాదివృత్తివిలయము).

అవ. ఈసూక్ష్మదృష్టి కవధిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వాత్మనా విస్మృతస్సన్ సూక్ష్మతాం పరమాం వ్రజేత్,
అలీనత్వాన్న నిద్రైషా తతో దేహోఽపి నో పతేత్. 99

వ్యా. బుద్ధిసౌక్ష్మ్యస్య కోఽవధిరిత్యాకాంక్షాయాం సాక్షాత్కారోఽవధిరిత్యాహ—సర్వేతి. తర్హి సా నిద్రైవ స్యాదిత్యత ఆహ—అలీనేతి. సర్వవృత్తివిలయేఽప్యంతఃకరణస్వరూపవిలయాభావాన్నేయం నిద్రా. బుద్ధేః కారణాత్మనావస్థానం సుషుప్తిరిత్యాచార్యైరుక్తత్వాదిత్యర్థః. అంతఃకరణస్వరూపవిలయాభావే లింగమాహ—తత ఇతి. యత్ర సుషుప్త్యాదావహంకారవిలయస్తత్ర దేహపాతో దృష్టః. ఇహ తు తదభావాదవిలీన ఇతి గమ్యతే.

టీ. (అహంకారః = అంతఃకరణము), సర్వాత్మనా = సకలవిధములచేత, విస్మృతస్సన్ = విస్మృతినిఁ బొందినదగుచు (వృత్తిశూన్యము గలదియగుచు), పరమాం =

ఉత్కృష్టమగు, సూక్ష్మతాం = సూక్ష్మత్వమును, వ్రజేత్=పొందును. అలీనత్వాత్ = అహంకారము లయింపనందున, ఏషా=ఇది, నిద్రా=నిద్ర, న=కాదు. తతః=ఆకారణము వలన, దేహోఽపి = దేహంబును, నోపతేత్=పడిపోదు.

తా. అహంకారము బొత్తిగ శూన్యమై అత్యంతశూన్యత్వమును బొందును. అనఁగా బ్రహ్మసాక్షాత్కారమే బుద్ధిసూక్ష్మత్వమున కవధి. ఆ కాలమందు సర్వవృత్తులును లయించినను అంతఃకరణము లయింపమిచే నీ స్థితి నిద్ర కాదు. అంతఃకరణము కారణరూపముగ నుండుటయే సుషుప్తి యని శ్రీశంకరాచార్యులు నుడివిరి. కనుక, నే సుషుప్త్యాదిక మందు అహంకారము విలయ మగునో ఆయా యవస్థయందు దేహము పడిపోవుట కనఁబడుచున్నది. బ్రహ్మానందనిష్ఠయందో దేహమట్లు పడ కుండుటవలన అహంకారము లయింపలే దని తెలియఁబడుచున్నది.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న ద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి యత్సుఖం,
స బ్రహ్మానంద ఇత్యాహ భగవానర్జునం ప్రతి. 100

వ్యా. ఫలితమాహ—న ద్వైతమితి యస్మిన్కాలే ద్వైతభానం నాస్తి నిద్రాపి నాగచ్ఛతి తస్మిన్కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి స బ్రహ్మానంద ఇత్యర్థః. అయం బ్రహ్మానంద ఇతి కుతోఽవగతమిత్యాశంక్య కృష్ణవాక్యాదిత్యాహ—ఇతీతి. గీతాయాం షష్ఠాధ్యాయ ఇతి శేషః.

టీ. (యత్ర=ఏకాలమందు), ద్వైతం=ప్రపంచము, న భాసతే=ప్రకాశింపదో, నిద్రా=నిదుర, నాపి=లేదో, తత్ర=ఆదశయందు, యత్ సుఖం=ఏసుఖము, అస్తి=కలదో, సః=అది, బ్రహ్మానందఇతి=బ్రహ్మానంద మని, భగవాన్=భగవంతుఁ డైన శ్రీకృష్ణుఁడు, అర్జునంప్రతి = అర్జునునిగూర్చి, ఆహ=చెప్పెను.

తా. ద్వైత మేమియుఁ గనుపింపక, నిద్రయును లేని స్థితిలోని సుఖస్ఫూర్తి బ్రహ్మానందమే యని శ్రీకృష్ణుఁ డర్జునునకు బోధించెను.

అవ. అట్టి శ్లోకములను అర్థక్రమముగాఁ బఠించుచున్నాఁడు:—

శ్లో. శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. 101

వ్యా. తత్ర శ్లోకైరుక్తవానిత్యాశంక్య తాన్ శ్లోకాన్ పఠత్యర్థక్రమానుసారేణ—శనైరితి. అయమర్థః ధృతిగృహీతయా ధైర్యయుక్తయా బుద్ధ్యా సాధనభూతయాశనైశ్శనైర్నసహసా ఉపరమేత్ మన ఉపరతిం కుర్యాత్. కియత్పర్యంతమిత్యత

ఆహ—ఆత్మేతి. మన ఆత్మసంస్థం ఆత్మని సంస్థా సమ్యక్ స్థితిః 'ఆత్మై వేదగ్ం సర్వం న తతోఽన్యత్కించిదస్తీ'త్యేవం రూపా యస్య తదాత్మసంస్థం తథావిధం కృత్వా కించిదపి న చింతయేత్. ఏష యోగస్య పరమోఽవధిః.

టీ. ధృతిగృహీతయా=ధైర్యయుక్తమగు, బుద్ధ్యా=బుద్ధిచేత, శనైశ్శనైః=మెల్ల మెల్లఁగా, ఉపరమేత్ = ఉపరమింపవలెను. మనః=మనస్సును, ఆత్మసంస్థం=ఆత్మయం దున్నదానినిగా, కృత్వా=చేసి, కించిదపి=దేనిని, న చింతయేత్=చింతింపఁగూడదు.

తా. యోగాభ్యాసపరుఁడు తన చిత్తమును ధైర్యముతో విష యములపై పోనీయక నియమించి, మెల్లమెల్లగా వృత్తులను లయింపఁ జేయవలెను. మనస్సును ప్రత్యగాత్మయందు నిలిపి మఱి దేనిని చింతింప రాదు. అని అర్జునునకు శ్రీకృష్ణుఁడుపదేశించెను.

అవ. ఇట్టి యభ్యాసపరుఁడు మొదట నేమి చేయవలెనో చెప్పుచున్నాఁడు:—

శ్లో. యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. 102

వ్యా. ఏతత్సంపాదనే ప్రవృత్తో యోగీ ప్రథమం కిం కుర్యాదిత్యత ఆహ— యత ఇతి. చంచలం స్వభావదోషాదత ఏవాస్థిరం ఏకత్ర విషయేఽనియతం. ఏవం విధం మనోయదా యదా యతోయతో యస్మాద్యస్మాచ్ఛబ్దాదేర్నిమిత్తాన్నిశ్చరతి నిర్గచ్ఛతి. తదాతదా తతస్తతస్తస్మాత్తస్మాచ్ఛబ్దాదేః సకాశాన్నియమ్య, తేషాం శబ్దాదీనాం మిథ్యాత్వాదిదోషదర్శనే నాభాసీకృత్య వైరాగ్యభావనాపూర్వకం నిరుధ్యైతన్మన ఆత్మన్యేవ వశం నయేత్ ఆత్మవశ్యతామాపాదయేత్, ఏవం యోగమభ్యస్యాభ్యాస బలాదాత్మన్యేవ మనః ప్రశామ్యతి.

టీ. చంచలం=చంచలమైనట్టియు, అస్థిరం=స్థిరము గానట్టియు, మనః=మనస్సు, యతోయతః=ఏయేశబ్దాదినిమిత్తమున, నిశ్చరతి = బయలువెడలుచున్నదో, తతస్తతః= ఆయాశబ్దాదికమువలన, ఏతత్ = ఈమనస్సును, నియమ్య=నిగ్రహించి, ఆత్మన్యేవ = ప్రత్యగాత్మయందే, వశం=వశమును, నయేత్=పొందింపవలెను.

తా. లయవిక్షేపస్వభావము గల మనస్సు ఏయేశబ్దాదినిమిత్త ములవలన వెలుపలికిఁ బోవునో, ఆయాశబ్దాదులనుండి దానిని మఱ లించి ప్రత్యగాత్మయందు నిలుపవలెను.

అవ. మనశ్శాంతివలన గలిగెడి లాభమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్. 103

వ్యా. మనః ప్రశాంతౌ కిం భవతీత్యత ఆహ—ప్రశాంతేతి. శాంతరజసం క్షీణమోహాదిక్లేశరజసం అత ఏవ ప్రశాంతమనసం ప్రకర్షేణ అత్యర్థం శాంతం విక్షేపశూన్యం మనో యస్య తం బ్రహ్మభూతం బ్రహ్మైవేదం సర్వమితి నిశ్చయవత్తయా జీవన్ముక్తం అకల్మషం అధర్మాదివర్జితమేనం యోగినం ఉత్తమం క్షయిత్వసాతిశయత్వాది దోషరహితం సుఖముపైతి ఉపగచ్ఛతి.

టీ. ప్రశాంతమనసం = ప్రశాంతిచెందిన మనసు గలిగినట్టియు, శాంతరజసం = రజస్తమోగుణరహితుఁడును, అకల్మషం = అధర్మాదిరహితుఁ డైనట్టియు, బ్రహ్మభూతం= అంతయు బ్రహ్మమయమే యని నిశ్చయము గలిగిన, ఏనం యోగినం = ఈయోగిని, ఉత్తమం = ఉత్తమమైన, సుఖం=సుఖము, ఉపైతి = పొందుచున్నది.

తా. రజస్తమోగుణరహితుఁడై పుణ్యపాపవర్జితుఁ డగుచు, శాంతమనస్కుఁడై సర్వమును బ్రహ్మమయముగ నెంచు యోగి బ్రహ్మానందసుఖమును బొందును.

అవ. ఇట్టిస్థితిని జెప్పెడి మఱికొన్ని భగవద్గీతశ్లోకములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 04

వ్యా. సంగృహీతార్థప్రపంచనపరాన్ తదీయానేవ శ్లోకాన్ పఠతి—యత్రేతి. చిత్తం యత్ర యస్మిన్కాలే యోగసేవయా యోగానుష్ఠానేన సర్వస్మాద్విషయాత్ నివారితం సదుపరమతే ఉపరతిం గచ్ఛతి. కించ యత్ర యస్మిన్కాలే ఆత్మనా సమాధిపరిశుద్ధేనాంతఃకరణేనాత్మానం పరం చైతన్యం జ్యోతిస్స్వరూపం పశ్యన్నుపలభమానః స్వస్మిన్నేవ తుష్యతి తుష్టిం భజతే న విషయేష్విత్యర్థః.

టీ. యత్ర=ఏకాలమునందు, యోగసేవయా=యోగానుష్ఠానముచేత, నిరుద్ధం= అరికట్టఁబడిన, చిత్తం=చిత్తము, ఉపరమతే = ఉపరమమును బొందుచున్నదో, యత్ర చ=ఏకాలమునందు, ఆత్మనా = సమాధిపరిశుద్ధాంతఃకరణముచేత. ఆత్మానం = పరంజ్యోతిస్వరూపచైతన్యమును, పశ్యన్=చూచుచు, ఆత్మన్యేవ=తనయందే, తుష్యతి = సంతోషించుచున్నాఁడో.

తా. ఏకాలమందు యోగి నిశ్చలమనస్కుఁడై పరంజ్యోతిస్వరూపచైతన్యమును (ప్రత్యగాత్మను) చూచుచున్నాఁడో అప్పుడు పరమోత్కృష్టమైన బ్రహ్మానందసుఖము ననుభవించుచున్నాఁడు.

శ్లో. సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః. 15

వ్యా. కించ యత్ర యస్మిన్కాలే ఆత్మని స్థితోఽయం యోగీ ఆత్యంతికం అత్యంతమేవ భవతీత్యాత్యంతికం అనంతం బుద్ధిగ్రాహ్యం ఇంద్రియనిరపేక్షయాబుద్ధ్యా గృహ్యమాణం అతీంద్రియం ఇంద్రియగోచరాతీతమవిషయజనితం యత్తదీదృశం సుఖం వేత్తి అనుభవతి. కించ ఆత్మని స్థితోఽయం తత్త్వతస్తస్మాదాత్మస్వరూపాన్నైవ చలతి న ప్రచ్యవతే.

టీ. బుద్ధిగ్రాహ్యం=బుద్ధిచేత గ్రహింపఁదగినట్టియు, అతీంద్రియం = ఇంద్రియాగోచరమైనట్టియు, ఆత్యంతికం=నిరవధికమైనట్టియు, యత్=ఏసుఖము గలదో, తత్ = దానిని, వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, యత్ర = ఏసమయమందు, స్థితః = ఉన్నట్టి, అయం=ఈయోగి, తత్త్వతః=తత్త్వమువలన, న చలతి=చలింపఁడో.

తా. శ్లోకమునకు రాఁబోవు శ్లోకములతో చేర్చి తాత్పర్యము వ్రాయఁబడును.

శ్లో. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. 106

వ్యా. కించ యమాత్మానం లబ్ధ్వా ప్రాప్య అపరం లాభం లాభాంతరం తతోఽధికం న మన్యతే 'ఆత్మలాభాన్న పరం విద్యత' ఇతి స్మృతేః. కించ యస్మిన్నాత్మతత్త్వే స్థితో గురుణా మహతాపి దుఃఖేన శస్త్రాభిఘాతాదిలక్షణేన ప్రహ్లాద ఇవ న విచాల్యతే.

టీ. యం=ఏఆత్మసుఖమును, లబ్ధ్వా = పొంది, తతః = అంతకంటె, అపరం = మఱియొక, లాభం = లాభమును, అధికం = అధికముగా, న మన్యతే = తలంపఁడో, యస్మిన్ = ఏయాత్మయందు, స్థితః = ఉన్నట్టివాఁడు, గురుణా = గొప్పదైన, దుఃఖేనాపి = (శస్త్రాభిఘాతాదిలక్షణముగల) దుఃఖముచేతనైనను, న విచాల్యతే = (ప్రహ్లాదునివలె) చలింపఁబడఁడో.

తా. ఈశ్లోక తాత్పర్యము పైదానితో చేర్చి వ్రాయఁబడును.

శ్లో. తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 107

వ్యా. ఇదానీముపపాదితం యోగం నిగమయతి—తం విద్యాదితి. శనైశ్శనైరిత్యాదినా యావద్భిర్విశేషణైర్విశిష్ట ఆత్మావస్థావిశేషో యోగ ఉక్తస్తం దుఃఖసంయోగవియోగం దుఃఖైస్సంయోగస్తేన వియోగస్తం విపరీతలక్షణయా యోగసంజ్ఞితం యోగ ఇత్యేవం సంజ్ఞా యస్యేతి తం యోగసంజ్ఞితం విద్యాత్ జానీయాత్. ఏవంవిధయోగానుష్ఠానే కించిత్కర్తవ్యతావిశేషమాహ—స నిశ్చయేనేతి. స పూర్వోక్తో యోగో నిశ్చయేనాధ్యవసాయేనానిర్విణ్ణచేతసా నిర్వేదరహితేన చిత్తేన యోక్తవ్యోఽనుష్ఠేయః.

టీ. తం = అట్టి, దుఃఖసంయోగవియోగం = దుఃఖములతోడి సంయోగముచేత వియోగమును, యోగసంజ్ఞితం = యోగ మనెడు పేరు గలదానినిగా, విద్యాత్ = తెలిసికొనవలయును. సః యోగః = అట్టియోగము, నిశ్చయేన = నిశ్చయముచేత, అనిర్విణ్ణచేతసా = ఖేదములేని చిత్తముగలవానిచేత, యోక్తవ్యః = అనుష్ఠింపఁదగినది.

తా. నిర్వికల్పసమాధిదశయందు చిత్తవృత్తు లుపరమించును. యోగి స్వస్వరూపదర్శనముచే తుష్టిఁ జెందును. నిరవధికమై యింద్రియాతీతమై విశుద్ధచిత్తముచే తెలియఁదగిన బ్రహ్మానందసుఖము నెఱుఁగును. అట్టి నిరతిశయానందస్థితినుండి చలింపఁడు. ఇంతకంటె సాధింపఁదగు వేఱొక లాభ మున్నదని తలంపఁడు. అట్టి స్థితియం దున్నవానిని శస్త్రపాతాదిదుఃఖములు గూడ ఆ బ్రహ్మానందసుఖమునుండి తొలఁగింపఁజాలవు. దుఃఖసంయోగవియోగమే యోగ మని విపరీతలక్షణచే యోగశాస్త్రమునఁ జెప్పఁబడినది. అట్టియోగము "దీనివలన తప్పక ఫలము గలుగు" ననెడి నిశ్చయముతో విసుకుఁ జెందక ప్రతిదినమును అభ్యసింపవలెను.

అవ. చెప్పిన యర్థమును ముగించుచున్నాఁడు:—

శ్లో. యుంజన్నేవ సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే. 108

వ్యా. ఇదానీముక్తమర్థముపసంహరతి—యుంజన్నితి. విగతకల్మషో విగతపాపో యోగాంతరాయవర్జితో యోగీ సదాత్మానమేవం యథోక్తేన ప్రకారేణ యుంజన్నను సందధానస్సుఖేనానాయాసేన బ్రహ్మసంస్పరం బ్రహ్మణా సంస్పర్శో యస్య సుఖస్య తద్బ్రహ్మసంస్పర్శం బ్రహ్మస్వరూపభూతమితి యావత్. అత్యంతమవినశ్వరం నిరతిశయం సుఖమశ్నుతే ప్రాప్నోతీత్యర్థః.

టీ. ఏవం = ఈవిధముగా, సదా = ఎల్లప్పుడు, ఆత్మానం = ఆత్మను, యుంజన్ = అనుసంధానము చేయుచున్న, విగతకల్మషః = పాపరహితుఁడైన, యోగీ = యోగాభ్యాసపరుఁడు, సుఖేన = అనాయాసముగా, బ్రహ్మసంస్పర్శం = బ్రహ్మస్వరూపమైన, అత్యంతం = నిరవధికమైన, సుఖం = సుఖమును, అశ్నుతే = పొందుచున్నాఁడు.

తా. ఈ చెప్పఁబడినవిధమున నిరంతరము ఆత్మానుసంధానము చేయు విగతకల్మషుఁడైన యోగి అనాయాసముగ బ్రహ్మస్వరూప మగు నిరవధికసుఖమును బొందును.

అవ. విసుగక చేసిన యోగాభ్యాసము ఫలించు ననుటకు దృష్టాంతము:—

శ్లో. ఉత్సేక ఉదధే ర్యద్వ త్కుశాగ్రేణైకబిందునా,
మనసో నిగ్రహ స్తద్వద్భవేదపరిఖేదతః. 109

వ్యా. అనిర్వేదేన క్రియమాణో యోగాభ్యాసః ఫలపర్యంతో భవతీత్యేతత్స దృష్టాంతమాహ—ఉత్సేక ఇతి. కుశాగ్రేణోద్ధృతేనైకేన బిందునా క్రియమాణ ఉదధే రుత్సేకః ఉద్ధృత్య బహిస్సేచనం పరిఖేదాభావే సతి యద్వత్కాలాంతరే భవేదేవ తద్వత్ మనసో నిగ్రహోఽపి శ్రమరాహిత్యేన క్రియమాణః కాలాంతరే సిద్ధ్యేత్ ఇదం చ టిట్టిభోపాఖ్యానం మనసి నిధాయోక్తమ్.

టీ. కుశాగ్రేణ=దర్భాగ్రముచేత, ఏకబిందునా = ఒక బిందువుచేత, ఉదధేః = సముద్రముయొక్క, ఉత్సేకః = వెలుపలికిఁ జిమ్ముట, యద్వత్=ఎట్టులో, తద్వత్ = అట్టులే, మనసః = మనస్సుయొక్క, నిగ్రహః = నిగ్రహము, అపరిఖేదతః = ఖేదము లేకుండ, భవేత్ = అగును.

తా. సముద్రములోని నీటిని దర్భాగ్రముచేత వెలుపలికిఁ జిమ్ము వానికి శ్రమము స్వల్పము. ఇట్టులే యెడతెగక చిమ్ముచుండినయెడల (ఎన్ని జన్మములకైనను) వానికి సముద్రశోషణఫలము ఘటించును. అట్టులే నిరంతర యోగాభ్యాసపరుఁ డెన్ని జన్మములకైనను చివరకు ముక్తుఁడై తీరును. ఈపై దృష్టాంతము టిట్టిభోపాఖ్యానము మనసులో నుంచుకొని చెప్పఁబడెను. ఆకథ యేమన:—టిట్టిభ మను నొక పక్షి సముద్రతీరమున గ్రుడ్లను బెట్టఁగా నవి సముద్రములోనికి కెరటములచే కొట్టుకొని పోఁబడెను. కొంతకాలమున కాపక్షి సముద్రుఁడు తన గ్రుడ్ల నపహరించె ననుకొని, సముద్రము నింకింపఁ జేసెద నని ప్రతిజ్ఞ యొనర్చి, యొక్క గరికపుడకను ముక్కునఁ గఱచికొని దానిని సముద్రములో ముంచి యొడ్డున విదల్చుచుండెను. దానిం గాంచి కులాభిమానముచే పక్షు లన్నియు దాని సాహాయ్యమునకై యత్నిం చేయ నారంభించెను. నారదుఁ డీసమాచారమును చూచి, వైకుంఠమందు శ్రీమహావిష్ణున కెఱింగించెను. ఆయన సన్నిధియందుండు పక్షిచక్రవర్తి యగు గరుత్మంతుఁడు "మాజాతియందు సముద్రున కింత యనాదరణమా" యని కోపించి తన ఱెక్కలతో సముద్రుని చెల్లాచెదరుగా చేయ నెంచఁగా సముద్రుఁడు భీతిల్లి యాతనిని శరణుజొచ్చి, టిట్టిభపక్షిగ్రుడ్లను దాని కిచ్చి, ఇఁక ముందు నే నెవ్వరి

పదార్థముల నపహరింప నని ప్రతిజ్ఞ చేసినట్లు భారతమున వర్ణింపఁబడెను. అట్లే పట్టుదలతో యోగాభ్యాసము చేసెడివానికి ఈశ్వరసాహాయ్యము గలుగు నని భావము.

అవ. ఈయర్థమందు మఱియొక శ్రుతిని బ్రమాణముగా నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. బృహద్రథస్య రాజర్షేశ్శాకాయన్యో మునిస్సుఖమ్,
ప్రాహ మైత్రాఖ్యశాఖాయాం సమాధ్యుక్తిపురస్సరమ్. 110

వ్యా. న కేవలమయమర్థో గీతాయామభిహితః కింతు మైత్రాయణీయశాఖాయామపీత్యాహ—బృహదితి. మైత్రాయణీయనామకే యజుశ్శాఖాభేదే శాకాయన్య నామా కశ్చిదృషిః స్వశిష్యత్వేనోపపన్నస్య బృహద్రథాఖ్యస్య రాజర్షేః బ్రహ్మసుఖం సమాధ్యభిధానపూర్వకం యథా భవతి తథో క్తవాన్.

టీ. బృహద్రథస్య = బృహద్రథుఁ డనెడి, రాజర్షేః=రాజర్షికి, శాకాయన్యః= శాకాయన్యుఁ డనెడి, మునిః = మునీశ్వరుఁడు, మైత్రాఖ్యశాఖాయాం = మైత్రాయణీయశాఖయందు, సమాధ్యుక్తిపురస్సరం = సమాధికథనపూర్వకముగా, సుఖం = సుఖమును, ప్రాహ=చెప్పెను.

తా. శాకాయన్యుఁ డను మహర్షి బృహద్రథుఁ డను రాజునకు సమాధిదశయందు బ్రహ్మానందసుఖావిర్భావము గలుగు నని మైత్రేయశాఖయందుఁ జెప్పఁబడినది.

అవ. మైత్రాయణీయశాఖామంత్రముల నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. యథా నిరింధనో వహ్ని స్స్వయోనావుపశామ్యతి,
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి. 111

వ్యా. కేన ప్రకారేణోక్తవానిత్యాశంక్య తత్ప్రతిపాదకాంస్తదీయాన్ మంత్రాన్ పఠతి—యథేతి. నిరింధనో దగ్ధకాష్ఠో వహ్నిస్స్వయోనౌ స్వకారణే తేజో మాత్రే ఉపశామ్యతి జ్వాలాదిరూపం విశేషాకారం పరిత్యజ్య తేజోమాత్రరూపేణ యథావతిష్ఠతే తథా తేనైవ ప్రకారేణ చిత్తమంతఃకరణమపి వృత్తిక్షయాన్నిరోధ సమాధ్యభ్యాసేన రాజసాదిసకలవృత్తినాశాత్స్వకారణే సత్త్వమాత్రే ఉపశామ్యతి సత్త్వమాత్రావశేషం భవతీత్యర్థః.

టీ. యథా=ఏప్రకారము, నిరింధనః=దహింపఁబడిన కట్టెలు గల, వహ్నిః=అగ్ని, స్వయోనౌ=తనకు కారణమైన తేజస్సునందు, ఉపశామ్యతి = ఉపశమించునో, తథా=

అలాగున, వృత్తిక్షయాత్ = వృత్తులు లయించుటవలన, చిత్తం = అంతఃకరణము, స్వయోనౌ=తన కారణమందు, ఉపశామ్యతి=ఉపశమించుచున్నది.

తా. కట్టె లన్నియు దహింపఁబడినప్పు డగ్ని తన కారణ మగు తేజస్సునందు లయించునట్లు, సకలవృత్తులు సమాధ్యభ్యాసముచేత లయించుటవలన (నశించుటవలన) నంతఃకరణమును నట్లే తన కారణ మగు సత్త్వమునందు లయించును.

అవ. దానివలనఁ గలుగు ప్రయోజనమును చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వయోనావుపశాంతస్య మనసస్సత్యకామినః,
ఇంద్రియార్థవిమూఢస్యానృతాః కర్మవశానుగాః. 112

వ్యా. తతః కిమత ఆహ—స్వయోనావితి. సత్యే ఆత్మని విషయే కామోఽస్యాస్తీతి సత్యకామీ తస్యాత ఏత స్వయోనావుపశాంతస్య అతఏవ ఇంద్రియార్థవిమూఢస్యేంద్రియార్థేషు విషయేషు శబ్దాదిషు విమూఢస్య జ్ఞానశూన్యస్య మనసః కర్మవశ మనుగచ్ఛంతీతి కర్మవశానుగాః ససాధనాః సుఖాదయః అనృతా మాయికత్వజ్ఞానేన మిథ్యాభూతాస్యు రిత్యర్థః.

టీ. సత్యకామినః = సత్యమునందు కోరికగల, స్వయోనౌ=తన కారణస్వరూపమందు, ఉపశాంతస్య = లయించినట్టియు, ఇంద్రియార్థవిమూఢస్య = శబ్దాదివిషయశూన్యమగు, మనసః = మనస్సునకు, కర్మవశానుగాః = కర్మవశముగాఁ గలిగెడి సుఖదుఃఖాదులు, అనృతాః=మిథ్యాభూతములు, (భవంతి=అగుచున్నవి.)

తా. ఆత్మయం దభిలాష గలిగినట్టి మనస్సు తన కారణ మగు సత్త్వమందు లయించుటంజేసి శబ్దాదివిషయములు లేని దగును. అందుచేతనే కర్మాధీనము లగు సుఖ దుఃఖములు మిథ్యాభూతములుగఁ దోఁచును.

అవ. ఇపుడు లోకానుభవమును తెలియఁజేయుచున్నాఁడు:—

శ్లో. చిత్తమేవ హి సంసారస్తత్ప్రయత్నేన శోధయేత్,
యచ్చిత్తస్తన్మయో మర్త్యో గుహ్య మేతత్సనాతనమ్. 113

వ్యా. నను చిత్తోపశాంతౌ జగన్మిథ్యా భవతీత్యేతదనుపపన్నం తదుపాదానకత్వాభావాత్తస్యేత్యాశంక్యాహ—చిత్తమేవేతి. యద్యపి స్వరూపేణ చిత్తోపాదానకం జగన్న భవతి తథాపి. తస్య భోగ్యత్వం చిత్తకారణమేవ హిశబ్దేనాత్ర సర్వానుభవం ప్రమాణయతి. సుషుప్త్యాదౌ చిత్తవిలయే భోగాదర్శనాదితి భావః. యతశ్చిత్తాత్మకః సంసారః అతస్తచ్చిత్తమేవ ప్రయత్నేనాభ్యాసవైరాగ్యాదిలక్షణేన శోధయేత్

రజస్తమోరాహిత్యేనైకాగ్ర్యం కుర్యాత్. నన్వాత్మనో విముక్తయే ఆత్మైవ శోధనీయో న చిత్త మిత్యాశంక్యాహ—యచ్చిత్త ఇతి. మర్త్య ఇత్యుపలక్షణం దేహిమాత్రస్య యో దేహీ యచ్చిత్తో యస్మిన్ పుత్రాదౌ విషయే చిత్తవాన్ భవతి స తన్మయః తదాత్మక ఏవ తత్సాకల్యవైకల్యయోరాత్మన్యేవ సమారోపణాత్. ఏతత్సనాతనం ఇదమనాదిసిద్ధం గుహ్యమతిరహస్యం. ఏతదుక్తం భవతి—స్వభావతః శుద్ధస్యాత్మనో యతశ్చిత్తసంపర్కా దేవ సంసారిత్వం, 'ధ్యాయతీవ లేలాయతీ' వేతి శ్రుతేః. అత శ్చిత్తస్య శోధనేనాత్మన స్సంసారనివృత్తిరితి.

టీ. హి=ఏహేతువువలన, సంసారః=సంసారము, చిత్తమేవ=మనస్సే, స్యాత్= అగునో, తత్=ఆచిత్తమును, ప్రయత్నేన = అభ్యాసముచేత, శోధయేత్=ఏకాగ్రము చేయవలెను. మర్త్యః=మనుజుఁడు, యచ్చిత్తః=దేనియందు మనస్సుకలవాఁడు, భవేత్= అగునో, తన్మయః = అట్టి స్వరూపముగలవాఁడు, భవతి=అగుచున్నాఁడు. ఏతత్=ఇది, సనాతనం=పురాతనమైన, గుహ్యం=రహస్యము.

తా. చిత్తము జగమున కుపాదానకారణము గాకపోయినను, ఆజగముయొక్క భోగ్యభోగత్వములకు చిత్తమే కారణము. ఎట్లన, సుషుప్త్యాదికమందు చిత్తవిలయ మగుచుండఁగా నచట భోగము కనఁబడమియు, జాగ్రదాదికమందు చిత్తవిలయము గామిచే నచట భోగము కనఁబడుటయు నను సర్వజనానుభవమే దీనికిఁ బ్రమాణము. మఱియు నేకారణముచేత సంసారము చిత్తరూపము గలదియో ఆకారణముచేత నాచిత్తమునే అభ్యాసవైరాగ్యాదులచేత శోధింపవలెను. ఆత్మయొక్క విముక్తికొఱకు ఆత్మనే శోధింపవలెనుగాని చిత్తమును శోధింప నేల ? అనిన, దేహి పుత్రాదివిషయమందు చిత్తము గలవాఁ డగుచు ఆపుత్రాదికమందుఁ గల సాకల్యవైకల్యములను తనయందే యారోపణము చేసికొనుటవలన, నాపుత్రాదిరూపము గలవాఁ డగును. ఈయర్థమనాది సిద్ధమగు పరమరహస్యము. "ధ్యాయతీవ లేలాయతీవ" అనెడి శ్రుతివచన ప్రకారము స్వాభావికముగఁ బరిశుద్ధుఁ డగు ఆత్మకు చిత్తసంబంధము చేతనే సంసారిత్వము ప్రాప్తించుచున్నది. కనుక, చిత్తమును శోధించుట చేత ఆత్మకు సంసారము నివర్తించు నని యభిప్రాయము.

అవ. చిత్తము నిర్మలమైనను సంసార మెట్లు లయించుననుటకు సమాధానము:—

శ్లో. చిత్తస్య హి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభమ్,
ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే. 114

వ్యా. నన్వనాదిభవపరంపరోపార్జితసుఖదుఃఖప్రద పుణ్యాపాపకర్మణోస్సతోశ్చిత్తశోధనేనాపి కథమాత్మనః సంసారనివృత్తిర్భవిష్యతీత్యాశంక్య చిత్తప్రసాదోపలక్షిత బ్రహ్మానుసంధానేన సకలకర్మక్షయోపపత్తేశ్శవమితి పరిహరతి— చిత్తస్యేతి. హి శబ్దేన 'తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే. 'ఉపపాతకేషు సర్వేషు పాతకేషు మహత్సు చ ప్రవిశ్య రజనీపాదం బ్రహ్మధ్యానం సమాచరేత్' ఇత్యాదిశ్రుతిస్మృతిప్రసిద్ధిం ద్యోతయతి. తతః కిమిత్యత ఆహ— ప్రసన్నేతి. ప్రసన్నఆత్మాచేతో యస్య స తథోక్తః ఆత్మని స్వస్వరూపేఽద్వితీయానందలక్షణే బ్రహ్మణి స్థితత్వాదేవాహామితి నిశ్చయేన దృశ్యజాతం పరిహృత్య చిన్మాత్రరూపేణావస్థాయాక్షయ్యమవినాశి యత్సుఖం స్వరూపభూతం తదశ్నుతే.

టీ. చిత్తస్య=అంతఃకరణముయొక్క, ప్రసాదేన=నైర్మల్యముచేత, శుభాశుభం=సుఖదుఃఖప్రదమగు, కర్మ = కర్మను, హంతి = నశింపఁజేయును. హి=ఇది శ్రుతి ప్రసిద్ధమనుట. ప్రసన్నాత్మా = నిర్మలమైన చిత్తముగలవాఁడు, ఆత్మని=స్వస్వరూపమునందు, స్థిత్వా=ఉండి, అక్షయ్యం=నశింపని, సుఖం=సుఖమును, అశ్నుతే=పొందును.

తా. అనాదియగు సంసారమందు పరంపరగా సంపాదింపఁబడిన సుఖదుఃఖప్రద పుణ్యపాపకర్మస్థితి గలిగియుండఁగా చిత్తశోధనముచేనైనను ఆత్మకు సంసారమెట్లు నివర్తించుననిన,పురుషుఁడు నిర్మల చిత్తముచేత సకలపుణ్యపాపరాశిని నశింపఁజేయును. "తద్యథేషీకాతూలమగ్నౌ......ప్రదూయంతే" ఇత్యాది శ్రుతులును, "ఉపపాతకేషు......సమాచరేత్," ఇత్యాది స్మృతులును, ఎండుగడ్డియు దూదియు నగ్నిచే దహింపఁబడినట్లు బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాప కర్మములన్నియు జ్ఞానాగ్నిచే దహింపఁబడు నని చెప్పుచున్నవి. కనుక నిర్మలచిత్తముగలవాఁడు స్వస్వరూపాద్వితీయబ్రహ్మమం దుండి నాశరహితబ్రహ్మానందమును బొందు నని మైత్రాయణీశాఖయందుఁ జెప్పఁబడె. నని తెలియవలెను.

అవ. ఈయర్థమునే దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు—

శ్లో. సమాసక్తం యథా చిత్తం జంతోర్విషయగోచరే,
యద్యేవం బ్రహ్మణి స్యాత్తత్కో న ముచ్యేత బంధనాత్. 115

వ్యా. ప్రసన్నాత్మాత్మని స్థిత్వేత్యుక్తమేవార్థం దృష్టాంతోక్తిపురస్సరం ప్రథయతి— సమాసక్తమితి. ప్రాణినశ్చిత్తం విషయగోచరః ఇంద్రియప్రచారభూమిస్తస్మి

న్యథా స్వభావతస్సమ్యగాసక్తం భవతి తదేవ చిత్తం బ్రహ్మణి ప్రత్యగభిన్నే పరమాత్మని యద్యేవమాసక్తం స్యాత్తర్హి కస్సంసారాన్న ముచ్యేత ? సర్వోఽపి ముచ్యేత ఏవేత్యర్థః.

టీ. జంతోః=ప్రాణియొక్క, చిత్తం=మనస్సు, విషయగోచరే=ఇంద్రియ ప్రచారమునందు, యథా=ఎట్లు, సమాసక్తం=తగుల్కొనెనో, ఏవం=ఈవిధముగా, బ్రహ్మణి = పరబ్రహ్మమునందు, సక్తం = చేరినదియైనది, స్యాద్యది = అయ్యెనేని, తత్ = అప్పుడు, బంధనాత్ = సంసారబంధమునుండి, కః = ఎవ్వఁడు, న ముచ్యేత = ముక్తినొందఁడు ? (ముక్తినొందు నని భావము.)

తా. మనుష్యుఁడు స్రక్చందనాదివిషయములయందుఁ దన చిత్తమును నిల్పినట్లు పరబ్రహ్మమునందు దృఢముగా నిల్పెనేని అట్టివాఁడు ముక్తుఁ డగుట కేమియు సందేహము లేదు. తప్పక ముక్తుఁ డగును.

అవ. మనస్సున కవాంతరభేదమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ,
అశుద్ధం కామసంపర్కాచ్ఛుద్ధం కామవివర్జితమ్. 116

వ్యా. ఉక్తార్థదార్ఢ్యాయ మనసోఽవాంతరభేదమాహ—మన ఇతి. తత్ర కారణమాహ—అశుద్ధమితి. కామ ఇత్యుపలక్షణం క్రోధాదేరపి.

టీ. మనః = మనస్సు, శుద్ధం చ = శుద్ధ మనియు, అశుద్ధమేవ చ = అశుద్ధ మనియు, ద్వివిధం=రెండువిధములుగా, ప్రోక్తంహి=చెప్పఁబడెను. కామసంపర్కాత్ = కోరికలయొక్క సంపర్కమువలన, అశుద్ధ=మలినమైనది, కామవివర్జితం = కామరహితమైనది, శుద్ధం=నిర్మలమైనది.

తా. మనస్సు రెండు విధములు. సంకల్పవికల్పాదులతోఁ గూడినది మలినచిత్త మగును. కామరహితమైనది నిర్మలచిత్త మనఁబడును.

అవ. ఇట్టి మనస్సు బంధమోక్షములకు హేతు వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః,
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్. 117

వ్యా. ద్వివిధస్య తస్యైవ క్రమేణ సంసారమోక్షయోర్హేతుతాం దర్శయతి—మన ఏవేతి.

టీ. మన ఏవ=మనస్సే, బంధమోక్షయోః=బంధమోక్షములకు, కారణం=హేతువు. విషయాసక్తం=విషయములయం దాసక్తి గల మనస్సు బంధాయ=బంధముకొఱకు,

భవతి=అగుచున్నది. నిర్విషయం = విషయరహితమగు మనస్సు, ముక్త్యై=ముక్తికొఱకు, భవతి = అగుచున్నది. (ఇతి = అని), స్మృతం = చెప్పఁబడినది.

తా. కామసహిత మగు మనస్సు బంధమునకు కారణము. నిష్కామ మగు మనస్సు మోక్షమునకు హేతువు. కావున ముముక్షువు మనస్సునుండి సర్వకామములను పాఱఁద్రోలవలె నని భావము.

అవ. సమాధినిష్ఠయందలి సుఖము నిరవధిక మనుటకు శ్రుతిప్రమాణము:—

శ్లో. సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే.

వ్యా. 'ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే' ఇత్యుక్తమేవార్థం శ్రుతిస్స్వయమేవ ప్రపంచయతి—సమాధీతి, ఆత్మని ప్రత్యక్స్వరూపే నివేశితస్య సమాధినిర్ధూతమలస్య సమాధినా ప్రత్యగ్బ్రహ్మణోరైక్యగోచరప్రత్యయావృత్త్యా నిర్ధూతమలస్య నిశ్శేషేణ నివారితరజస్తమోమలస్య చేతసస్తస్మిన్ సమాధౌ యత్సుఖముత్పద్యతే తదా సమాధావుత్పన్నం తత్సుఖం గిరా వాచా వర్ణయితుం న శక్యతే. అలౌకికసుఖత్వాదిత్యర్థః. కింతు స్వయం తత్స్వరూపభూతం సుఖమంతఃకరణేనైవ గృహ్యతే.

టీ. సమాధినిర్ధూతమలస్య=ప్రత్యగ్బ్రహ్మైక్యగోచరప్రత్యయావృత్తిచే నిశ్శేషముగఁ బోఁగొట్టఁబడిన రజస్తమోమలము గలిగినట్టియు, ఆత్మని = ఆత్మయందు, నివేశితస్య=స్థాపింపఁబడిన, చేతసః=చిత్తమునకు, యత్ సుఖం=ఏసుఖము, భవేత్=కలుగునో, (తత్ = ఆసుఖము), గిరా = వాక్యములచేత, వర్ణయితుం = వర్ణించుటకు, న శక్యతే= సాధ్యపడదు. తదా = అప్పుడు, తత్ = ఆసుఖమును, స్వయం = తనంతటనే, అంతఃకరణేన = అంతఃకరణముచేత, గృహ్యతే = గ్రహింపఁబడుచున్నది.

తా. ప్రత్యగ్బ్రహ్మైక్యగోచరప్రత్యయావృత్తిరూప మగు సమాధివలన రజస్తమోగుణములను నిశ్శేషముగ నివర్తించిన చిత్తమునకు, అట్టి సమాధిస్థితియందుఁ గలిగెడి సుఖము లౌకికసుఖము కానందున, నట్టి సుఖమును వాక్కుచే వర్ణింప శక్యము గాదు. స్వరూపభూత మగు నాసుఖము అంతఃకరణముచేతనే గ్రహింపఁబడఁదగినది.

అవ. ఇట్టి సమాధి దుర్లభముగదా! దానింబట్టి బ్రహ్మానందనిర్ణయ మెట్లు చేయ నగు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యద్యప్యసౌ చిరం కాలం సమాధిర్దుర్లభో నృణామ్,
తథాపి క్షణికో బ్రహ్మానందో నిశ్చాయయత్యసౌ.

వ్యా. నన్వస్యైవ సమాధేర్దుర్లభత్వాత్కథమనేన బ్రహ్మానందనిశ్చయసంభవ ఇత్యాశంక్యాహ—యద్యపీతి. అస్య సమాధేస్సంతతస్యాసంభవేఽపి క్షణికస్య తస్య సంభవాత్తేనైవాయమానందో నిశ్చేతుం శక్యత ఇత్యర్థః.

టీ. యద్యపి = విచారింపఁగా, అసౌసమాధిః = ఈసమాధి, చిరంకాలం = చిరకాలము, నృణాం = మనుష్యులకు, దుర్లభః = దుర్లభమైనది. తథాపి = అట్లైనను, క్షణికః=క్షణికమైన (కొంచెముకాలమే యుండెడి), అసౌ = ఈసమాధి, బ్రహ్మానందం= బ్రహ్మానందమును, నిశ్చాయయతి, = నిశ్చయింపఁజేయును.

తా. ఈసమాధి చిరకాలము నిల్పుట కష్టసాధ్యము. క్షణకాలము నిలిచినను, దానినిబట్టి బ్రహ్మానందము నిర్ణయింపవచ్చును.

అవ. అట్టి యానందనిశ్చయము శ్రవణాదులయందు శ్రద్ధగలవారికిఁ గలుగనే కలుగుచున్న దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రద్ధాళుర్వ్యసనీ యోఽత్ర నిశ్చినోత్యేవ సర్వథా,
నిశ్చితే తు సకృత్తస్మిన్ విశ్వసిత్యన్యదాఽప్యయమ్. 120

వ్యా. నన్వాత్మదర్శనాయ శ్రవణాదౌ ప్రవృత్తా అపి కేచిదానందనిశ్చయశూన్యా బహిర్ముఖా ఏవ వర్తంత ఇత్యాశంక్య శ్రద్ధాదిరహితానాం తథాత్వేఽపి శ్రద్ధాదిమతాం తన్నిశ్చయో భవత్యేవేత్యాహ—శ్రద్ధాళురితి. వ్యసనం సర్వథా సంపాదయిష్యామీత్యాగ్రహః తద్వాన్ వ్యసనీ. అత్ర సమాధౌ సర్వథా అవశ్యం. తతః కిమిత్యత ఆహ—నిశ్చితే త్వితి. అస్మిన్ బ్రహ్మానందే సకృదేకదా క్షణికసమాధౌ నిశ్చితే సతి అయం సకృన్నిశ్చయవా నన్యదాపి ఇతరస్మిన్నపి కాలే విశ్వసితి ఆనందోఽస్తీతి విశ్వాసం కరోతి.

టీ. యః = ఎవఁడు, అత్ర = ఈబ్రహ్మానందమునందు, వ్యసనీ = ఆసక్తిగలవాఁడగుచు, శ్రద్ధాళుః=శ్రద్ధ గలవాఁడో (సః=వాఁడు), సర్వథా = సర్వవిధంబులచేతను, నిశ్చినోత్యేవ = తప్పక నిశ్చయించుచునే యున్నాఁడు. తస్మిన్ = ఆబ్రహ్మానందము, సకృత్ = ఒక్కమాఱు, నిశ్చితే సతి = నిశ్చయింపఁబడఁగా, అయం = ఈయభ్యాసకుఁడు, అన్యదాపి = మఱియొక కాలమందును, విశ్వసితి = ఆనంద మున్న దని నమ్ముచున్నాఁడు.

తా. పట్టుదలయు, విశ్వాసమును గల యోగాభ్యాసకుఁడు సమాధియందలి యానందమును నిశ్చయించును. క్షణకాలమైనను ఒకమాఱు నిశ్చయించెనేని యెల్లప్పుడును దానినే నమ్మి యట్టి సమాధిసుఖప్రాప్తికై యత్నించును.

అవ. ఇట్టి విశ్వాసమువలని ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తాదృక్పుమానుదాసీనకాలేఽప్యానందవాసనామ్,
ఉపేక్ష్య ముఖ్యమానందం భావయత్యేవ తత్పరః. 121

వ్యా. తతోఽపి కిం తత్రాహ—తాదృగితి. తాదృక్పుమాన్ శ్రద్ధాదిపురస్సరం సకృన్నిశ్చయవాన్. పురుషః ఔదాసీన్యదశాయామపి ఉపలభ్యమానాం పూర్వోక్తామానందవాసనాముపేక్ష్య తత్పరో ముఖ్యానందే తాత్పర్యవాన్ భూత్వా తమేవ భావయతి.

టీ. తాదృక్ = అలాటి, పుమాన్ = పురుషుఁడు, ఉదాసీనకాలేఽపి = ఔదాసీన్యదశయందును, ఆనందవాసనాం = వాసనానందమును, ఉపేక్ష్య = లెక్కింపక, తత్పరః = ఆట్టి బ్రహ్మానందమం దాసక్తిగలవాఁ డగుచు, ముఖ్యం=ముఖ్యమైన, ఆనందమేవ = బ్రహ్మానందమునే, భావయతి = భావించును.

తా. సమాధ్యానందమందు నమ్మకము గలవాఁడు, ఔదాసీన్యదశయందు వాసనానంద ముండినను దాని నుపేక్షించి సమాధ్యానందమునే పొందఁగోరును.

అవ. ఇందులకుఁ దగిన దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి,
తదేవాస్వాదయత్యంతః పరసంగరసాయనమ్. 122

వ్యా. ఏవం వ్యవహారకాలే నిజానందం భావయతీత్యత్ర దృష్టాంతమాహ—పరేతి.

టీ. పరవ్యసనినీ=పరపురుషునియం దాసక్తిగల, నారీ=స్త్రీ, గృహకర్మణి=గృహవ్యాపారమునందు, వ్యగ్రాపి= ఉద్యుక్తురాలైనను, అంతః=లోపల, తదేవ=పూర్వ మనుభవింపఁబడినట్టి, పరసంగరసాయనం = పరపురుషునితో సంపర్క మనెడి సుఖవిశేషమునే, ఆస్వాదయతి = తలంచుచుండును.

తా. వ్యభిచారిణి యగు స్త్రీ గృహకృత్యముల నాచరించుచున్నను, మనస్సులో సర్వకాలములందును పరపురుష సంగసుఖమునే భావించుచుండును గదా! అట్లే యోగియు నౌదాసీన్యదశయందు సయితము సమాధ్యానందమునే పొందుచుండును.

అవ. దార్ష్టాంతికమందు సమన్వయించుచున్నాఁడు:—

శ్లో. ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాంతిమాగతః,
తదేవాస్వాదయత్యంతర్బహిర్వ్యవహరన్నపి. 123

వ్యా. దార్ష్టాంతికే యోజయతి—ఏవమితి.

టీ. ఏవం = ఈవిధముగా, పరే = ఉత్కృష్టమగునట్టియు, శుద్ధే=నిర... నట్టియు, తత్త్వే = తత్త్వమునందు, విశ్రాంతిం = విశ్రాంతిని, ఆగతః=పొందిన, ధీ... ధీరుఁడు, బహిః=వెలుపల, వ్యవహరన్నపి = వ్యవహరించుచున్నను, అంతః = ... తదేవ = ఆబ్రహ్మానందమునే, ఆస్వాదయతి = చవిగొనుచుండును.

తా. ఈవిధముగా పరమాత్మయందు చిత్తమును నిలిపిన ... విద్వాంసుఁడు వ్యవహారకాలమునందును బ్రహ్మానందసుఖము ననుభవించు... యుండును.

అవ. ధీరుఁ డన నెవ్వఁడో చెప్పుచున్నాఁడు:—

శ్లో. ధీరత్వమక్షప్రాబల్యే ఽప్యానందాస్వాదవాంఛయా,
తిరస్కృత్యాఖిలాక్షాణి తచ్చింతాయాం ప్రవర్తనమ్.

వ్యా. ధీరశబ్దార్థమాహ—ధీరత్వమితి. ఇంద్రియాణాం విషయాభి... పురుషాకర్షణసామర్థ్యేఽపి స్వరూపసుఖానుసంధానేచ్ఛయా సర్వాణీంద్రియా... స్కృత్యానందానుసంధాన ఏవ ప్రవర్తమానత్వం ధీరత్వమిత్యర్థః.

టీ. అక్షప్రాబల్యేఽపి = ఇంద్రియములు బలవంతములుగా నున్నను, ... స్వాదవాంఛయా - ఆనంద = ఆనందముయొక్క, ఆస్వాద = రుచిచూచుట... వాంఛయా = కోరికచేత, అఖిలాక్షాణి = సకలేంద్రియంబులను, తిరస్కృత్య... రించి, తచ్చింతాయాం = ఆబ్రహ్మానుసంధానమునందు, ప్రవర్తనం = ప్రవృత్తి... ధీరత్వం = ధీరత్వమనఁబడును.

తా. ఇంద్రియములు వెలుపలికి లాగుచుండినను, ఆనం... దాభిలాషచేత ఆయింద్రియముల నిరోధించి బ్రహ్మానుసంధానము... ప్రవర్తించుటయే ధీరత్వ మనఁబడును. అట్టివాఁడే ధీరుఁడు.

అవ. విశ్రాంతి యన నెట్టిదో చెప్పుచున్నాఁడు:—

శ్లో. భారవాహీ శిరోభారం ముక్త్వాఽఽస్తే విశ్రమం గతః,
సంసారవ్యాపృతిత్యాగే తాదృగ్బుద్ధిస్తు విశ్రమః.

వ్యా. విశ్రాంతిశబ్దస్య వివక్షితమర్థం సదృష్టాంతమాహ—భారవాహీతి. ... లోకే భారం వహన్ పురుషః శ్రమహేతుం శిరఃస్థితం భారం పరిత్యజ్య ... రహితో వర్తతే తథా సంసారవ్యాపారత్యాగే సతి శ్రమరహిత ఆసమితి జాయ... బుద్ధిస్సా విశ్రమశబ్దేనోచ్యత ఇత్యర్థః.

టీ. భారవాహీ = బరువు మోయువాఁడు, శిరోభారం = నెత్తిపైబరువును, ముక్త్వా=వదలి, విశ్రమం=విశ్రాంతిని, గతః = పొందినవాఁ డగుచు, ఆస్తే = ఉండును. సంసార వ్యాపృతిత్యాగే - సంసార=సంసారమునందు, వ్యాపృతి=వ్యవహారముయొక్క, త్యాగే=వదలిపెట్టుటయందుఁగలిగిన, తాదృగ్బుద్ధిః = అట్టి జ్ఞానము, విశ్రమః=విశ్రాంతి (యనఁబడును.)

తా. బరువుమోయువాఁడు తన నెత్తిపై బరువును దించుకొని నపుడు విశ్రాంతిసుఖమును పొందును. అట్టులే సమాధినిష్ఠాగరిష్ఠుఁడు సంసారవ్యవహారములను వదలివేయుటచే విశ్రాంతిసుఖము ననుభవించును. అట్టి సంసారవ్యవహారత్యాగమే విశ్రాంతి యనఁబడును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. విశ్రాంతిం పరమాం ప్రాప్తస్త్వౌదాసీన్యే యథా తథా,
సుఖదుఃఖదశాయాం చ తదానందైకతత్పరః. 126

వ్యా. ఇదానీం ఫలితమర్థమాహ—విశ్రాంతిమితి. పరమాం నిరతిశయాం విశ్రాంతి ముక్తలక్షణాం ప్రాప్తః పురుషః స్వస్య ఔదాసీన్యదశాయాం యథా పరమానందాస్వాదనే తాత్పర్యవాన్భవతి, ఏవం సుఖదుఃఖహేతుప్రాప్తికాలేఽపి తదనుసంధానం పరిత్యజ్య నిజానందాస్వాదన ఏవ తాత్పర్యవాన్ భవతీత్యర్థః.

టీ. యథా=ఏప్రకారము, ఔదాసీన్యే=ఉదాసీనదశయందు, పరమాం=ఉత్కృష్టమైన, విశ్రాంతిం=విశ్రాంతిని, ప్రాప్తః = పొందెనో, తథా=అట్లే, సుఖదుఃఖదశాయాం చ=సుఖదుఃఖదశయందును, తదానందైక తత్పరః = ఆబ్రహ్మానందమునందే ముఖ్యమైన యాసక్తి గలవాఁ డైయుండును.

తా. ఉత్కృష్టమైన విశ్రాంతి (పైశ్లోకమునఁ జెప్పినట్టిది) పొందిన తరువాత ఔదాసీన్యదశయందే కాక సుఖదుఃఖదశయందును (నిరంతర యోగాభ్యాసపరునకు) నెడతెగక బ్రహ్మానందసుఖము లభించును.

అవ. దుఃఖదశయందు దుఃఖ మభిమతము కానందున, దాని యనుసంధానము లేకపోయినను వైషయికసుఖం బనుకూలంబగుటవలన దానియం దభిరుచి గలుగక మానదు, కాన నాసమయమున సమాధిసుఖానుసంధాన మెట్లు ఘటించు ననినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అగ్నిప్రవేశహేతౌ ధీశ్శృంగారే యాదృశీ తథా,
ధీరస్యోదేతి విషయేఽనుసంధానవిరోధిని. 127

వ్యా. నను దుఃఖస్య ప్రతికూలత్వేన తదనుసంధానేచ్ఛాభావేఽపి వైషయిక సుఖస్యానుకూలత్వేన పురుషై రర్థ్యమానత్వా త్తదనుసంధానేచ్ఛా కుతో న భవేదిత్యా శంక్య తస్య విషయసంపాదనాదిద్వారాఽతీవ బహిర్ముఖత్వాపాదనేన నిజానందా నుసంధానవిరోధిత్వా త్తదిచ్ఛాపి వివేకినో న జాయత ఇతి దృష్టాంతప్రదర్శనపూర్వక మాహ—అగ్నీతి. శీఘ్రం దేహవిమోచనేచ్ఛాయాం దృఢతరాయాం సత్యాం తద్విలంబకారణే అలంకారాదౌ యథా అగ్నిప్రవేష్టుర్వైరస్య బుద్ధిరుత్పద్యతే ఏవం వైరాగ్యాదిసాధనసంపన్నస్య వివేకినో బ్రహ్మానుసంధానవిరోధిని విషయసుఖేఽ పీత్యర్థః.

టీ. అగ్నిప్రవేశహేతౌ = అగ్నియందు ప్రవేశించుటకు కారణము కలిగినపుడు, శృంగారే = శృంగారమందు, యాదృశీ ధీః = ఎట్టి బుద్ధిగలుగునో, తథా = ఆవిధంబు గనే, ఆత్మానుసంధానవిరోధిని=అనుసంధానమునకు విరుద్ధమగు, విషయే = స్రక్చందనాదివిషయమందు, అస్య=ఇతనికి, (తాదృశీ) ధీః=అట్టి బుద్ధి, ఉదేతి=కలుగును.

తా. పతివ్రత సహగమనముఁ జేయునపుడు తదంగముగా నలంకరించుకొనును. అప్పు డట్టి యలంకారమం దాసతికి నెట్టి వైరబుద్ధి యుండునో అట్టులే బ్రహ్మానందసుఖమునం దుండెడి యోగికి విషయ సుఖమం దాసక్తి యుండదు.

అవ. 'యోగి విషయములను బొత్తిగా నిరసించునా' యనిన నట్లు గా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవిరోధిసుఖే బుద్ధిః స్వానందే చ గమాగమౌ,
కుర్వంత్యాస్తే క్రమాదేషా కాకాక్షివదితస్తతః. 123

వ్యా. మాభూద్విరోధివిషయే సుఖేచ్ఛా అప్రయత్నసౌలభ్యేనాబహిర్ముఖత్వ హేతౌ విషయే కిం న భవతీత్యత ఆహ—అవిరోధీతి.

టీ. బుద్ధిః = బుద్ధి, అవిరోధిసుఖే = అనుసంధానమునకు విరుద్ధము గాని సుఖమందును, స్వానందే చ = స్వరూపానందమునను, గమాగమౌ = గమనాగమనములను, కుర్వంతీ = చేయుచున్న, ఏషా = ఈబుద్ధి, క్రమాత్ = వరుసగా, కాకాక్షివత్ = కాకికంటివలె, ఇతస్తతః=ఇటునటు, ఆస్తే=ఉండును.

తా. ఇట్టి యోగియొక్క చిత్తము కాకికంటివలె, విషయసుఖమును బ్రహ్మానందమును ఇటునటు నాస్వాదించును. యోగి విక్షేపదశయందు విషయసుఖమును, సమాధిదశయందు బ్రహ్మానందసుఖమును ఆస్వాదించుచుండును.

అవ. దృష్టాంతమును వివరించుచున్నాఁడు:—

శ్లో. ఏకైవ దృష్టిః కాకస్య వామదక్షిణనేత్రయోః,
యాత్యాయాత్యేవమానందద్వయే తత్త్వవిదో మతిః. 129

వ్యా. దృష్టాంతం వివృణోతి—ఏకైవ దృష్టిరితి. యథా కాకస్య దృష్టిః దృశ్యతేఽనయేతి. దర్శనసాధనం చక్షురింద్రియమేకమేవ వామదక్షిణనేత్రయోర్గోళకయోః పర్యాయేణ గమనాగమనే కరోతి, ఏవం వివేకినో బుద్ధిరప్యానందద్వయ ఇత్యర్థః.

టీ. కాకస్య = కాకికి, వామదక్షిణనేత్రయోః = ఎడమకుడికన్నులయందు, దృష్టిః = చూపు, ఏకైవ = ఒక్కటియే, యాత్యాయాతి = గమనాగమనములను జేయుచుండును, ఏవం = ఈవిధముగా, తత్త్వవిధః = బ్రహ్మవిదునియొక్క, మతిః = బుద్ధియు, ఆనందద్వయే = ఉభయవిధానందమునందును, (యాత్యాయాతి = పోవుచు వచ్చుచు నుండును).

తా. కాకి కుడియెడమకన్నులం దొక దృష్టియే కాన నొక కంటితోఁ జూచునపుడు రెండవ కంటితోఁ జూడనట్లు బ్రహ్మవిదునిబుద్ధి విషయానంద బ్రహ్మానందముల భిన్నకాలములలో ననుభవించును.

అవ. ఈయర్థమునే మఱియొక దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. భుంజానో విషయానందం బ్రహ్మానందం చ తత్త్వవిత్,
ద్విభాషాభిజ్ఞవద్విద్యా దుభౌ లౌకికవైదికౌ. 130

వ్యా. దార్ష్టాంతికం ప్రపంచయతి—భుంజాన ఇతి. తత్త్వవిత్, విషయాన్ భుంజానస్త్రజన్యం విషయానందముపనిషద్వాక్యాదవగతం బ్రహ్మానందం చ లౌకికవైదికావుభౌ విషయానందబ్రహ్మానందౌ భాషాద్వయవేదీవ జానీయాదిత్యర్థః.

టీ. తత్త్వవిత్ = బ్రహ్మవిదుఁడు, విషయానందం=విషయానందమును, బ్రహ్మానందం చ = బ్రహ్మానందమును, భుంజానః = అనుభవించుచు, ద్విభాషాభిజ్ఞవత్ = రెండు భాషలు తెలిసినవానివలె, ఉభౌ = రెండైన, లౌకికవైదికౌ=విషయానందబ్రహ్మానందములను, విద్యాత్ = తెలిసికొనును.

తా. రెండు భాషలు తెలిసినవాఁ డెట్లు ఒకొక్కకాలమం దొక్కొకభాష మాట్లాడునో, అట్లే, బ్రహ్మవిదుఁడు భిన్నకాలములందు విషయానందబ్రహ్మానందముల ననుభవించుచున్నాఁడు.

అవ. దుఃఖానుభవ కాలములో పరితాపము లేకుండుటకు కారణము:—

శ్లో. దుఃఖప్రాప్తౌ న చోద్వేగో యథాపూర్వం యతో ద్వివృక్,
గంగామగ్నార్ధకాయస్య పుంస శ్శీతోష్ణధీర్యథా. 131

వ్యా. నను దుఃఖానుభవదశాయాం ఉద్వేగే సతి కథం నిజానందానుభవ ఇత్యాశంక్యాహ—దుఃఖేతి. యతో యస్మాత్కారణా ద్వివేకీ ద్వివృక్ లౌకికవైదికవ్యవహారయో రుభయోరపి వేత్తా అతో దుఃఖప్రాప్తావపి పూర్వవదజ్ఞానదశాయా మివ న తస్యోద్వేగః వివేకేన తదా బాధ్యమానత్వాత్ అతో దుఃఖానుభవకాలేఽపి నిజానందానుసంధానం న విరుధ్యత ఇత్యర్థః. యుగపదుభయానుసంధానే దృష్టాంతమాహ—గంగేతి.

టీ. యతః = ఏ హేతువువలన, (వివేకీ = జ్ఞాని), ద్వివృక్ = రెండు దృష్టులు గలవాఁడో, (తతః = ఆకారణము వలననే), గంగామగ్నార్ధకాయస్య = గంగయందు సగము మునిఁగిన శరీరము గల, పుంసః=పురుషునకు, శీతోష్ణధీర్యథా = శీతోష్ణములవలె, యథాపూర్వం=వెనుకటివలెనే, దుఃఖప్రాప్తౌ=దుఃఖము లభించుచుండఁగా, ఉద్వేగః = పరితాపము, న = లేదు.

తా. మధ్యాహ్నమునందు గంగలో సగము మునిఁగినవానికి పైభాగమునందు వేడియు క్రిందిభాగమునందు చలియు నున్నట్లు, బ్రహ్మవిదునకు దుఃఖానుభవకాలమునను గూడ బ్రహ్మానుభవస్ఫూర్తి యుండుటంజేసి సంసారదశయందువలె పరితాపము గలుగదు.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇత్థం జాగరణే తత్త్వవిదో బ్రహ్మసుఖం సదా,
భాతి తద్వాసనాజన్యే స్వప్నే తద్భాసతే తథా. 132

వ్యా. ఫలితమాహ—ఇత్థమితి. సదా సుఖదుఃఖానుభవదశాయాం తూష్ణీం స్థితౌ చేత్యర్థః. న కేవలం జాగరణ ఏవ తద్భానం. కింతు స్వప్నావస్థాయామపీత్యాహ—తద్వాసనేతి. హేతుగర్భం విశేషణం జాగ్రద్వాసనాజన్యత్వాత్స్వప్నస్య తత్రాపి తద్బ్రహ్మసుఖం తథా జాగ్రదవస్థాయామివ భాసత ఇత్యర్థః.

టీ. ఇత్థం = ఈవిధమున, జాగరణే = జాగ్రద్దశయందు, తత్త్వవిదః = తత్త్వవిదునకు, బ్రహ్మసుఖం = బ్రహ్మానందము, సదా = ఎల్లప్పుడు, భాతి = ప్రకాశించుచున్నది. తద్వాసనాజన్యే = ఆజాగ్రద్వాసనవలనఁ గలిగిన, స్వప్నే=స్వప్నదశయందు, తథా = ఆవిధంబుననే, తత్ = ఆబ్రహ్మానందసుఖము, భాసతే = ప్రకాశించుచున్నది.

తా. ఇట్టి బ్రహ్మవిదునకు బ్రహ్మానందము జాగ్రద్దశయందే కాక స్వప్నదశయందును స్ఫురించుచుండును.

అవ. స్వప్నములోని విశేషమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అవిద్యావాసనాప్యస్తీత్యత స్తద్వాసనోత్థితే,
స్వప్నే మూర్ఖవ దేవైష సుఖం దుఃఖం చ వీక్షతే. 133

వ్యా. నను స్వప్నస్యానందానుభవవాసనాజన్యత్వే సతి ఆనంద ఏవ భాసత ఇత్యాశంక్యాహ—అవిద్యేతి. న కేవలమానందవాసనాబలాదేవ స్వప్నో జాయతే కింతు అవిద్యావాసనాబలాదపి. అత స్తద్వాసనాజన్యత్వా త్తత్రాజ్ఞస్యేవ సుఖాద్యనుభవో భవతీత్యర్థః.

టీ. అవిద్యావాసనాపి = అవిద్యయొక్క వాసనయు, అస్తీత్యతః = కల దను హేతువువలన, తద్వాసనోత్థితే = ఆయవిద్యావాసనవలనఁ గలిగిన, స్వప్నే=స్వప్న దశయందు, మూర్ఖవదేవ=అజ్ఞునివలెనే, ఏషః=ఇతఁడు, సుఖం=సుఖమును, దుఃఖం చ= దుఃఖమును, వీక్షతే = చూచుచున్నాఁడు.

తా. ఆనందానుభవవాసనచేతనే స్వప్నము గలుగునెడల స్వప్నమందును ఆనందమే స్ఫురించుచుండవలెను గదా యనిన, స్వప్నము కేవలానందవాసనాబలముచేతనే కలుగదు. అవిద్యావాసనాబలముచేతఁ గూడ గలుగును. కనుక, స్వప్నమందు అవిద్యావాసన యుండుటవలన, స్వప్నావస్థయందు జ్ఞాని అవివేకివలె సుఖదుఃఖముల ననుభవించును.

అవ. ప్రకరణమును ముగించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందాభిధే గ్రంథే బ్రహ్మానందప్రకాశకం,
యోగిప్రత్యక్షమధ్యాయే ప్రథమేఽస్మిన్నుదీరితమ్. 134

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం బ్రహ్మానందే
యోగానందో నామ ప్రథమోఽధ్యాయః.

వ్యా. ఏతావతా గ్రంథసందర్భేణోక్తమర్థం నిగమయతి—బ్రహ్మానందేతి. బ్రహ్మానందనామకే అధ్యాయపంచకాత్మకే గ్రంథేఽస్మిన్ ప్రథమేఽధ్యాయే సుషుప్త్యవస్థాయాం సుఖదుఃఖదశాయాం చ స్వప్రకాశచిద్రూపబ్రహ్మానందస్య ప్రకాశకం

యోగ్యనుభవరూపం ప్రత్యక్షముక్తమిత్యర్థః. ఇదం చోపలక్షణమాగమాదీనాం. తేషా మప్యత్ర దర్శితత్వాత్.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితే బ్రహ్మానందవ్యాఖ్యానే యోగానందో నామ ప్రథమోఽధ్యాయః.

టీ. బ్రహ్మానందాభిధే = బ్రహ్మానంద మను పేరు గల, గ్రంథే = గ్రంథమందు, ప్రథమే = మొదటిదైన, అధ్యాయే = అధ్యాయరూపం బగు, తత్ = ఆ, బ్రహ్మానంద ప్రకాశకం = బ్రహ్మానందమును బ్రకాశింపఁ జేసెడి, యోగిప్రత్యక్షం = యోగియొక్క యనుభవము, ఈరితం = చెప్పఁబడినది.

తా. ఈ బ్రహ్మానందప్రకరణమున బ్రహ్మానందమును బ్రకాశింపఁ జేసెడి యోగియొక్క యనుభవము దెలుపఁబడినది.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు బ్రహ్మానందమందలి యోగానంద మను ప్రథమాధ్యాయము సమాప్తము.

---

శ్రీ ర స్తు.
శ్రీ గణేశాయ నమః



# శ్రీ వేదాంతపంచదశి

## ద్వాదశ ప్రకరణము

### ఆ త్మా నం ద ప్ర క ర ణ ము

అవ. యోగికి నిజానుభవమును జెప్పి మందాధికారికి బ్రహ్మానందానుభవప్రకారముఁ జూపింపఁదలఁచి శిష్యప్రశ్న నుపక్రమించుచున్నాఁడు:—

శ్లో. నన్వేవం వాసనానందా ద్బ్రహ్మానందా దపీతరమ్,
వేత్తు యోగీ నిజానందం మూఢస్యాత్రాస్తి కా గతిః. 1

వ్యా ఖ్యా న మ్.

వ్యా. అథ బ్రహ్మానందాంతర్గతమాత్మానందనామకం ద్వితీయాధ్యాయమారభతే. తత్ర దేవం ప్రథమాధ్యాయే వివేకినో యోగేన నిజానందానుభవప్రకారం ప్రదర్శ్య మూఢస్య జిజ్ఞాసోరాత్మానందశబ్దవాచ్యత్వం పదార్థవివేచనముఖేన బ్రహ్మానందానుభవప్రకారప్రదర్శనాయ శిష్యప్రశ్నమవతారయతి—నన్వేవమితి.

టీ. నను=ఆర్యా! ఏవం=ఈవిధముగా, వాసనానందాత్ = వాసనానందము కంటెను, బ్రహ్మానందాత్ = బ్రహ్మానందముకంటెను, ఇతరం = వేఱైన, నిజానందం = నిజానందమును, యోగీ = యోగి, వేత్తు = ఎఱుఁగుఁగాక. అత్ర = ఈవిషయమున, మూఢస్య=మూఢునకు, కా గతిః=ఏమి త్రోవ, అస్తి=కలదు?

భా. ఓమహాత్మా! యోగాభ్యాసపరునకు నిజానందానుభవము కల దని చెప్పితిరి. మూఢునకుఁ గృతార్థతఁ జెందు నుపాయ మెద్దియో సెలవిండని శిష్యుఁ డడిగెను.

అవ. అతిమూఢునకు విద్యాధికారము లే దని గురుని ప్రత్యుత్తరము:—

శ్లో. ధర్మాధర్మవశా దేష జాయతాం మ్రియతామపి,
పునః పునర్దేహలక్షైః కిం నో దాక్షిణ్యతో మమ. 2

వ్యా. శిష్యేణైవం పృష్టో గురురతిమూఢస్య విద్యాధికార ఏవ నాస్తీత్యాహ— ధర్మేతి. ఏషోఽతిమూఢోఽనాదౌ సంసారేఽతీతేషు జన్మసు అనుష్ఠితసుకృతదుష్కృత వశాన్నానావిధదేహస్వీకారేణ పునః పునర్జాయతాం మ్రియతాం చేత్యర్థః.

టీ. ఏషః=ఈమూఢుఁడు, ధర్మాధర్మవశాత్=పుణ్యపాపవశమువలన, పునఃపునః=మాటిమాటికి, దేహలక్షైః=పెక్కుదేహములచేత, జాయతాం=పుట్టుఁగాక, మ్రియతామపి = చచ్చుఁగాక, నః=మాయొక్క, దాక్షిణ్యతః = మోమోటముచేత, కిం=ఏమి ప్రయోజనమో, వద=చెప్పుము.

తా. అట్టి మూఢుఁడు జన్మమరణప్రవాహములో కొట్టుకొని పోవుచుండును. అతనిపై మాయొక్క దాక్షిణ్యమువలనఁ బ్రయోజన మేమి ? (ప్రయోజనము లేదని యభిప్రాయము).

అవ. అందఱిని కృతార్థులఁజేయు దయాళురు గనుక మూఢునకును తరణోపాయమును జెప్పుఁడని శిష్యుఁడు వేఁడుచున్నాఁడు:—

శ్లో. అస్తి వోఽనుజిఘృక్షుత్వా ద్దాక్షిణ్యేన ప్రయోజనమ్,
తర్హి బ్రూహి స మూఢః కిం జిజ్ఞాసుర్వా పరాఙ్ముఖః. 4

వ్యా. సర్వానుగ్రాహకత్వాదాచార్యేణ తస్యాపి కాచన గతిర్వక్తవ్యేతి శిష్య ఆహ—అస్తీతి. వో యుష్మాకమనుజిఘృక్షుత్వాదనుగ్రహీతు మిచ్ఛవోఽనుజిఘృక్షవ స్తేషాం భావ స్తత్త్వం తస్మా చ్ఛిష్యోద్ధరణేచ్ఛాయుక్తత్వా ద్దాక్షిణ్యత స్తదుద్ధరణలక్షణం ప్రయోజనమస్తీత్యర్థః. ఏవం శిష్యవచనమాకర్ణ్య, గురు స్తం వికల్ప్య పృచ్ఛతి—తర్హీతి.

టీ. వః=మీరు, (షష్ఠికి ప్రథమార్థము), అనుజిఘృక్షుత్వాత్ = అనుగ్రహింప నిచ్ఛగలవారు గనుక, దాక్షిణ్యేన = దయచేత, ప్రయోజనం = లాభము, అస్తి=కలదు. తర్హి=అటులయితే, సః=ఆమూఢుఁడు, జిజ్ఞాసుః=బ్రహ్మ నెఱుఁగఁగోరినవాఁడో, పరాఙ్ముఖో వా కిం=పెడమొగముఁ బెట్టువాఁడో, బ్రూహి=చెప్పుము.

తా. "మీరు దయాళువులరు గాన నట్టి మూఢులను గూడ నుద్ధరింపవలెను" అని శిష్యుఁడు వేఁడఁగా, అట్టి మూఢుఁడు బ్రహ్మము నెఱుఁగఁ గోరిక గలవాఁడా కాఁడా యని గురువు శిష్యుని ప్రశ్నించెను.

అవ. పరాఙ్ముఖునకును జిజ్ఞాసువునకును కృతార్థత కుపాయముఁ జెప్పుచున్నారు:—

శ్లో. ఉపాస్తిం కర్మ వా బ్రూయా ద్విముఖాయ యథోచితమ్,
మందప్రజ్ఞం తు జిజ్ఞాసుమాత్మానం జేన బోధయత్. 5

వ్యా. యది మూఢస్య కాచన గతిర్వక్తవ్యా తర్హి మూఢః కిం రాగీ విరక్తో వా వదేతి. రాగీ చేద్రాగానుసారేణ కర్మ వోపాసనం వా వక్తవ్యమితి ప్రథమే పరిహార మాహ—ఉపాస్తిమితి. విముఖాయ తత్త్వజ్ఞానవిముఖాయ బహిర్ముఖాయేత్యర్థః. యథోచితం యథాయోగ్యం బ్రహ్మలోకాదికామశ్చేదుపాస్తిం బ్రూయాత్. స్వర్గాది కామశ్చేత్కర్మ బ్రూయాదిత్యర్థః. జిజ్ఞాసుత్వేఽపి సోఽతివివేకీ మందప్రజ్ఞో వేతి వికల్ప్య అతి వివేకినః పూర్వాచార్యోక్తప్రకారేణ యోగేన బ్రహ్మసాక్షాత్కార మభిప్రేత్య మందప్రజ్ఞస్య తద్దర్శనోపాయమాహ—మందేతి. యో మందప్రజ్ఞస్తం జ్ఞాతుమిచ్ఛుః జిజ్ఞాసుః తమాత్మానందేన ఆత్మానందవివేచనముఖేన బోధయేత్.

టీ. విముఖాయ=తత్త్వజ్ఞానమం దిచ్ఛలేనివానికి, యథోచితం=అధికారమునకు తగినట్లు, ఉపాస్తిం = ఉపాసనను గాని, కర్మ వా=కర్మనుగాని, బ్రూయాత్=చెప్పవల యును. మందప్రజ్ఞం తు = మందబుద్ధిగల, జిజ్ఞాసుం = జ్ఞానవాంఛగలవానినిగూర్చి' ఆత్మానందేన=ఆత్మానందముచేత, బోధయేత్=బోధింపవలయును.

తా. మూఢులనుగూడ నుద్ధరింపఁదగు నంటివి కావున చెప్పెద వినుము. అట్టి మూఢుఁడు రాగముగలవాఁడో విరక్తుఁడో యోజించి, తత్త్వజ్ఞానాపేక్షలేని రాగముగలవాఁడయినయెడల, అట్టివాఁడు బ్రహ్మ లోకాదికాంక్ష గలవాఁడాయెనేని వానికి యోగ్యమగు నుపాసనము నుపదేశింపవలెను. స్వర్గాదికము గోరెనేని యజ్ఞాదిపుణ్యకర్మవిధుల నుప దేశింపవలెను. పరతత్త్వమును దెలియఁ గోరెనేని, వాఁడతివివేకియో మందప్రజ్ఞుఁడో తెలిసికొని, అతివివేకి యైనయెడల పూర్వాచార్యయ మందుఁ జెప్పఁబడినప్రకారము యోగము నభ్యసింపఁజేయవలెను. మంద ప్రజ్ఞుఁడైనయెడల వానికి ఆత్మానందముచే బోధించి వానిని గృతార్థునిఁ జేయవలెను.

అవ. ఆత్మానందము పూర్వ మెవ్వరెవ్వరికి బోధింపఁబడెననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బోధయామాస మైత్రేయీం యాజ్ఞవల్క్యో నిజప్రియామ్,
నవా అరే పత్యురర్థే పతిః ప్రియ ఇతీరయన్. 5

వ్యా. ఏవం కేన కో బోధిత ఇత్యత ఆహ—బోధయామాసేతి. యాజ్ఞవల్క్యః ఏతన్నామకో యజుశ్శాఖావిశేషప్రవర్తకః కశ్చిదృషిః మైత్రేయీమేతన్నామికాం నిజప్రియాం స్వభార్యాం. 'న వా అరే పత్యురర్థే పతిః ప్రియ' ఇతి న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతీత్యాదిప్రకారేణ ఈరయన్ బ్రువన్ బోధ యామాస బోధితవానిత్యర్థః.

టీ. అరే=ఓమైత్రేయీ! పతిః = భర్త, పత్యురర్థే = భార్యకొఱకు, ప్రియః = ఇష్టుఁడు, న వేతి = కాఁడని, ఈరయన్ = చెప్పుచు, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్య మహర్షి, నిజప్రియాం = తన భార్యయైన, మైత్రేయీం=మైత్రేయినిగూర్చి, బోధయామాస = బోధించెను.

తా. బృహదారణ్యకోపనిషత్తున యాజ్ఞవల్క్యమహర్షి తన భార్య యగు మైత్రేయికి ఆత్మానందమును బోధించెను. అట్టివిధ మెట్లన, భర్తను భార్య ప్రేమించుట భార్యకొఱకే కాని భర్తకొఱకుఁ గాదని "నవా అరే పత్యుః" అనెడి శ్రుతిచే బోధించెను.

అవ. మైత్రేయీ బ్రాహ్మణప్రకరణమునఁ జెప్పఁబడిన యర్థమును సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. పతిర్జాయా పుత్రవిత్తే పశుబ్రాహ్మణబాహుజాః,
లోకా దేవా వేదభూతే సర్వం చాత్మార్థతః ప్రియమ్. 6

వ్యా. ఉత్తరత్ర "పరప్రేమాస్పదత్వేన పరమానంద ఇష్యతా"మితి వాక్యేన పరప్రేమాస్పదత్వేన హేతునాత్మనః పరమానందరూపతాం సిసాధయిషుః, ఆదౌ పరప్రేమాస్పదత్వహేతుసమర్థనాయ తావదుదాహృతవాక్యస్యోపలక్షణపరతామభిప్రేత్య తత్ప్రకరణస్థసకలపర్యాయవాక్యతాత్పర్యమాహ—పతిరితి. పతిజాయాదికం భోగ్యజాతం భోక్తృశ్శేషత్వాత్ భోక్తృ స్సంబంధేనైవ ప్రియం. న స్వరూపేణేత్యభిప్రాయః.

టీ. పతిః = పెనిమిటియు, జాయా = భార్యయు, పుత్రవిత్తే = పుత్త్రుఁడును ధనమును, పశుబ్రాహ్మణబాహుజాః = పశువులును, బ్రాహ్మణులును, క్షత్రియులును, లోకాః = లోకములును, దేవాః = దేవతలును, వేదభూతే = వేదములును భూతములును, సర్వం చ = సమస్తమును, ఆత్మార్థతః = తన ప్రయోజనమునకై, ప్రియం = ప్రేమాస్పదమైనది.

తా. పతి జాయాపుత్త్రాదులు, ధనము, పశువులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, లోకములు, దేవతలు, వేదములు పంచభూతములు మొదలగు సర్వభోగ్యజాతమును భోక్త యగు తనకు (ఆత్మకు) ప్రయోజనకారి యగుటచే ప్రేమాస్పదమగును. అనఁగా, నివియన్నియు భోక్తకు శేషమగుటవలన భోక్తయొక్క సంబంధముచేతనే ప్రియమగుచున్నవి కాని భోక్తృసంబంధము కానియెడల స్వరూపముచేత ప్రియములు గావని అభిప్రాయము.

అవ. పైనఁ జెప్పఁబడినవానిలో "నవా అరే పత్యుః కామాయ......భవతి" అనెడి శ్రుతివాక్యతాత్పర్యమును వివరించుచున్నాఁడు:—

శ్లో. పత్యావిచ్ఛా యదా పత్న్యాస్తదా ప్రీతిం కరోతి సా,
క్షుదనుష్ఠానరోగాద్యైస్తదా నేచ్ఛతి తత్పతిః. 7

వ్యా. ఇదానీం పూర్వోదాహృతస్య 'నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవతి. ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవ'తీత్యస్య వాక్యస్య తాత్పర్యార్థం విభజ్యదర్శయతి—పత్యావితి. యదా యస్మిన్ కాలే పత్న్యాః జాయాయాః పత్యౌ భర్తృవిషయే ఇచ్ఛా కామో భవతి తదా సా పత్నీ పత్యౌ ప్రీతిం స్నేహం కరోతి. యదా తు పతిః క్షుదాదినా ఇచ్ఛాభావహేతునా యుక్తో భవతి చేత్తదా తాం నేచ్ఛతి న కామయతే.

టీ. యదా = ఎప్పుడు, పత్న్యాః = భార్యకు, పత్యౌ = భర్తయందు, ఇచ్ఛా = కోరిక కలుగునో, తదా=ఆసమయమందు, సా = ఆభార్య, ప్రీతిం=ప్రేమను, కరోతి = చేయును. తదా = అప్పుడు, తత్పతిః = దానిభర్త, క్షుదనుష్ఠానరోగాద్యైః = ఆఁకలి, అనుష్ఠానము, రోగము మొదలగువానితో, (యుక్తో భవతి యది = కూడుకొనెనేని) తదా=అప్పుడు, నేచ్ఛతి=ఇచ్ఛయింపఁడు.

తా. భార్య తనకు కామసుఖము ననుభవింపఁ గోరిక కల్గినప్పుడు, తన భర్తను ప్రేమించును. ఆతఁ డప్పుడు ఆఁకలిచే దుర్బలుఁడై యున్నఁగాని, నియమపరుఁడై యున్నఁగాని, వ్యాధిగ్రస్తుఁడై యున్నఁ గాని భార్యతోఁ గామసుఖము నపేక్షింపఁడు.

అవ. దీనిఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న పత్యురర్థే సా ప్రీతిస్స్వార్థ ఏవ కరోతి తామ్,
పతిశ్చాత్మన ఏవార్థే న జాయార్థే కదాచన. 8

వ్యా. ఏవం చ సతి కిం ఫలితమిత్యత ఆహ—న పత్యురితి. జాయయా క్రియమాణా యా ప్రీతిస్సా పత్యురర్థే పత్యుః ప్రయోజనాయ న. కిం తు జాయా తాం పత్యౌ ప్రీతిం స్వార్థఏవ స్వప్రయోజనాయైవ కరోతి 'న వా అరే జాయాయై కామాయజాయాప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవ'తీత్యాది 'నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి. ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీ'త్యంతానాం వాక్యానాం తాత్పర్యం క్రమేణ విభజ్య దర్శయతి—పతిశ్చేత్యాదినా. పతిశ్చ భర్తాపి స్వప్రయోజనాయైవ జాయాయాం ప్రీతిం కరోతి న జాయా ప్రీతయే ఇత్యర్థః.

టీ. సా ప్రీతిః = ఆ ప్రేమ, పత్యురర్థే = పెనిమిటికొఱకు, న=కాదు. తాం=ఆ ప్రీతిని, స్వార్థఏవ=తనకొఱకే, కరోతి = చేయుచున్నది. పతిశ్చ = భర్తయు, ఆత్మన ఏవార్థే=తనకొఱకే, (ప్రీతిం=ప్రీతిని, కరోతి = చేయును.) జాయార్థే=భార్యకొఱకు, కదాచన=ఒకప్పుడును, న=కాదు.

తా. భార్య భర్తను ప్రేమించుట స్వసుఖాపేక్ష చేతనేకాని భర్తకొఱకుఁ గాదు. అటులే భర్త భార్యను ప్రేమించుటయు తన కొఱకేగాని భార్యకొఱకుఁ గాదు.

శ్లో. అన్యోన్య ప్రేరణేఽప్యేవం స్వేచ్ఛయైవ ప్రవర్తనమ్. 9

వ్యా. నన్వేకైకకామనయా ప్రవృత్తా ప్రీతిః స్వార్థా భవతు యుగపదుభయేచ్ఛయా ప్రవృత్తా తు ప్రీతేరుభయార్థ తా స్యాదిత్యాశంక్యాహ—అన్యోన్యేతి. ఏవముక్తేన ప్రకారేణ స్వేచ్ఛయైవ ప్రవర్తనముభయో రపీతి శేషః.

టీ. అన్యోన్య ప్రేరణే = పరస్పరము ప్రేమగల్గినప్పుడును, ఏవమేవ = ఈవిధముగా, స్వేచ్ఛయైవ=తన యిచ్ఛచేతనే, ప్రవర్తనం=ప్రవర్తనమగుచున్నది.

తా. భార్యాభర్త లన్యోన్యప్రేరణచే మెలఁగినప్పుడును తమ లాభమునకే గాని యొరుల లాభమునకుఁ గాదు.

అవ. భార్యాభర్తల ప్రేమ తమ స్వార్థమునకే యనుటకు దృష్టాంతము:—

శ్లో. శ్మశ్రుకంటకవేధేన బాలే రుదతి తత్పితా,
చుంబత్యేవ న సా ప్రీతిర్బాలార్థే స్వార్థఏవహి. 10

వ్యా. స్వేచ్ఛయా ప్రవర్తనమేవ దర్శయతి—శ్మశ్రుకంటకేతి. పిత్రా క్రియమాణం పుత్రముఖాదిచుంబనం న పుత్రప్రీత్యర్థం. తస్య శ్మశ్రుకంటకవేధేన రోదనకర్తృత్వాత్ అతస్తత్పితుః స్వతుష్ట్యర్థమేవేత్యవగంతవ్య మిత్యర్థః.

టీ. శ్మశ్రుకంటకవేధేన=మీసములనెడి ముండ్లయొక్క (ముండ్లు) గ్రుచ్చుకొనుటచేత, బాలే=పిల్లవాఁడు, రుదతి=ఏడ్చుచున్నను, తత్పితా=వానితండ్రి, చుంబత్యేవ = ముద్దాడుచునే యున్నాఁడు. సా ప్రీతిః = ఆ ప్రేమ, బాలార్థే = పిల్లవానికొఱకు, న=కాదు. స్వార్థ ఏవ హి=తనకొఱకే కదా!

తా. మీసములు గ్రుచ్చుకొని యేడ్చుచు వదలిపెట్టినఁజాలు నని యుండెడి కుఱ్ఱవానిని తండ్రి వదలక ముద్దాడుచున్నాఁడు. ఈ ముద్దు పెట్టుకొనుట తన సుఖమునకే కాని బాలుని సుఖముకొఱకు గాదు.

అవ. చేతను లగుపతి జాయాపుత్రాదులయందు ప్రేమ స్వార్థముకొఱకే చేయఁబడినదా? అన్యులనిమిత్తము చేయఁబడినదా యనుటకుఁ గూడ నవకాశము గలదు. అని

ప్రశ్నింప, అచేతనంబును ఇచ్ఛయే లేని ధనవిషయంబున నట్టి శంక కవకాశమే లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరిచ్ఛమపి రత్నాదివిత్తం యత్నేన పాలయన్,
ప్రీతిం కరోతి స స్వార్థే విత్తార్థత్వం న శంకితమ్. 11

వ్యా. చేతనేషు పతిజాయాపుత్రేషు క్రియమాణాయాః ప్రీతేః స్వార్థత్వపరార్థత్వసందేహసంభవాదచేతనత్వే నేచ్ఛామాత్రరహితస్య విత్తవిషయస్య తచ్ఛంకైవ నాస్తీత్యభిప్రేత్య 'న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతీ'త్యస వాక్యస్య తాత్పర్యమాహ—నిరిచ్ఛమపీతి.

టీ. నిరిచ్ఛమపి=కోరిక లేనిదైనను, రత్నాదివిత్తం=రత్నాదిధనము, యత్నేన=ప్రయత్నముచేత, పాలయన్ = కాపాడుచున్న, సః = అపురుషుఁడు, స్వార్థే = తన కొఱకుఁగా, ప్రీతిం=ప్రేమను, కరోతి = చేయుచున్నాఁడు. విత్తార్థత్వం=ధనముకొఱకు, ప్రేమించుచున్నాఁ డనుట, న శంకితం = సందేహింపఁబడలేదు.

తా. ధన మచేతన మగుటంజేసి దానికి కోరికయే లేదు. దానిని ఆసక్తితోఁ గాపాడి ప్రేమించుట దానినిఁ గాపాడు పురుషునినిమిత్తమే యని లోకవిదితము.

అవ. చేతనత్వమందును బరువును వహించుట మొదలగు నిచ్ఛలేని పశువిషయమైన శ్రుతివాక్యతాత్పర్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనిచ్ఛతి బలీవర్దే వివాహయిషతే బలాత్,
ప్రీతిస్సా వణిగర్థైవ బలీవర్దార్థతా కుతః. 12

వ్యా. చేతనత్వేఽపి వాహనాదీచ్ఛారహితపశువిషయస్య 'నవా అరే పశూనా'మిత్యస్య వాక్యస్య తాత్పర్యమాహ—అనిచ్ఛతీతి. బలీవర్దే అనడుహి అనిచ్ఛతి భారం వోఢుమిచ్ఛామకుర్వత్యపి బలాద్వివాహయిషతే వాహయితుం కామయతే. తత్ర వహనాదివిషయాయాః ప్రీతేః వణిగర్థత్వైవ న బలీవర్దార్థతేత్యర్థః.

టీ. బలీవర్దే=ఎద్దు, అనిచ్ఛత్యపి = ఇష్టపడకపోయినను, బలాత్=బలాత్కారము వలన, వివాహయిషతే = బరువుమోయ నిచ్ఛయించుచున్నది. సా ప్రీతిః=ఆప్రేమ, వణిగర్థైవ = వర్తకునికొఱకే యగును. బలీవర్దార్థతా = ఎద్దుకొఱ కనుట, కుతః = ఎట్లు? ఎద్దుకొఱకుఁ గా దని భావము.

తా. ఎద్దునకు గంత మోయుటకుఁ గాని బండి లాగుటకుఁ గాని ఇష్టము లేకపోయినను, అందు మూలకముగా ధనార్జనము చేయఁగోరు

వర్తకుఁడు, దానినిపట్టి కట్టినందున బలాత్కారముచే నది మోయు చున్నది. అట్లు చేయుట వర్తకుని ప్రయోజనముకొఱకే కాని వృషభము యొక్క ప్రీతికై కాదు.

అవ. ఒకదానిం బ్రేమించుట తన సుఖముకొఱకే యను మాటను చేతనాచేతన ముల నుదాహరించి దృఢపఱచుచున్నాఁడు:—

శ్లో. బ్రాహ్మణ్యం మేఽస్తి పూజ్యోఽహమితి తుష్యతి పూజయా,
అచేతనాయా జాతే ర్నో సంతుష్టిః పుంస ఏవ సా. 13

వ్యా. 'నవాఅరే బ్రహ్మణః కామా'యేతి వాక్యస్య తాత్పర్యమాహ—బ్రాహ్మ ణ్యమితి. బ్రాహ్మణ్యనిమిత్తయా పూజయా బ్రాహ్మణో ఽహమస్మీత్యభిమాననానేవ తుష్యతి. న జడా జాతిరిత్యర్థః.

టీ. (బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు) మే=నాకు, బ్రాహ్మణ్యం=బ్రాహ్మణత్వము, అస్తి= కలదు, అహం=నేను, పూజ్యః=పూజింపఁదగినవాఁడను, ఇతి=అని, పూజయా=గౌరవిం చుటచేత, తుష్యతి = సంతసించుచున్నాఁడు. సంతుష్టి = అట్టి సంతోషము, అచేత నాయాః=జడస్వరూపమైన, జాతేః=బ్రాహ్మణజాతికి, న=కాదు, సా=ఆసంతుష్టి, పుంస ఏవ = పురుషునకే యగును.

తా. బ్రాహ్మణుని పూజించినపు డాతఁడు నేను బ్రాహ్మణుఁడను, పూజనీయుఁడను అని జాత్యభిమానముచేఁ దాను సంతసించును గాని, అచేతన మగు బ్రాహ్మణజాతికి నట్టి సంతసము గలుగదు.

అవ. మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. క్షత్రియోఽహం తేన రాజ్యం కరోమీత్యత్ర రాజతా,
న జాతే ర్వైశ్యజాత్యాదౌ యోజనాయేద మీరితమ్. 14

వ్యా. 'న వా అరే క్షత్ర'స్యేత్యాదివాక్యస్య తాత్పర్యమాహ—క్షత్రియ ఇతి. రాజ్యోపభోగనిమిత్తం సుఖం క్షత్రియత్వజాతిమత ఏవ న క్షత్రియత్వజాతేరిత్యర్థః. ఇదం క్షత్రియోదాహరణం వైశ్యాద్యుపలక్షణార్థమిత్యాహ—వైశ్యజాత్యాదావితి.

టీ. అహం=నేను, క్షత్రియః = క్షత్రియుఁడను, తేన = దానిచేత, రాజ్యం = ప్రభుత్వమును, కరోమి = చేయుచున్నాఁడను. ఇత్యత్ర = అనుచోట, రాజతా = రాజత్వము, జాతేః = జాతికి, న = కాదు. వైశ్యజాత్యాదౌ = కోమటిజాతి మొదలగుజాతియందు, యోజనాయ = కూర్చుకొనుటకొఱకు, ఇదం=ఇది, ఈరితం = చెప్పఁ బడినది.

తా. “నేను రాజును, రాజ్యము చేయుచున్నాను” అనెడి రాజత్వాభిమానమును, అందలి సంతోషమును సామాన్యజాతి మాత్రమున కుండదు. మఱి యే మనఁగా, ఆ యభిమానము రాజునకే యుండును. ఇటులే వైశ్యులు మొదలగు జాతులయందును ఊహింపనగును.

అవ. మఱియొక దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వర్గలోకబ్రహ్మలోకౌ స్తాం మమేత్యభివాంఛనమ్,
లోకయోర్నోపకారాయ స్వభోగాయైవ కేవలమ్. 15

వ్యా. ‘న వా అరే లోకానాం కామాయే’ త్యాదివాక్యస్య తాత్పర్యమాహ— స్వర్గలోక ఇతి. లోకద్వయోపాదానం కర్మోపాసనాలక్షణసాధనద్వయసంపాద్య సకలలోకోపలక్షణార్థం.

టీ. స్వర్గలోక బ్రహ్మలోకౌ=స్వర్గలోక బ్రహ్మలోకములు, మమ=నాకు, స్తాం = అగుఁగాక, ఇతి = అని, అభివాంఛనం = కోరుట, కేవలం = పూర్తిగా, స్వభోగాయైవ= తన భోగముకొఱకే, లోకయోః = ఆలోకములయొక్క, ఉపకారాయ = ఉపకారము కొఱకు, న = కాదు.

తా. కర్మచేత స్వర్గలోకము గాని, యుపాసనచే బ్రహ్మలోకము గాని సంపాదింపఁగోరుట తన యుద్ధారముకొఱకే గాని యాలోకముల కుపకరించుటకుఁ గాదు.

అవ. దేవతావిషయిక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఈశవిష్ణ్వాదయో దేవాః పూజ్యంతే పాపనష్టయే,
న తన్నిష్పాపదేవార్థం తత్తు స్వార్థం ప్రయుజ్యతే. 16

వ్యా. కించ—ఈశవిష్ణ్వాదయ ఇతి. పాపనష్టయే పాపనివృత్తయ ఇత్యర్థః తత్పూజనం నిష్పాపదేవార్థం పాపరహితానాం దేవానాం ప్రయోజనాయ న. కింతు స్వార్థం పూజాకర్తుః ప్రయోజనాయ.

టీ. పాపనష్టయే = పాపపరిహారముకొఱకు, ఈశవిష్ణ్వాదయః = ఈశ్వరుఁడు, విష్ణువు మొదలగు, దేవాః = దేవతలు, పూజ్యంతే = పూజింపఁబడుదురు. తత్ = ఆ పూజించుట, నిష్పాపదేవార్థం = పాపరహితు లగు దేవతలకొఱకు, న=కాదు. కింతు = మఱియేమంటే, స్వార్థం = స్వప్రయోజనముకొఱకు, ప్రయుజ్యతే = చేయఁబడును.

తా. ఈశవిష్ణ్వాదులఁ బూజించుట తన పాపనివృత్తి యగుటకుఁ గాని పాపరహితు లగు దేవతలకొఱకుఁ గాదు. ఏదేవతల నెవరు పూజించినను తమ సుఖముకొఱకే యని భావము.

అవ. ఇంకొక దృష్టాంతమును గనఁబఱచుచున్నాఁడు:—

శ్లో. ఋగాదయో హ్యధీయంతే దౌర్బ్రాహ్మణ్యానవాప్తయే,
న తత్ప్రసక్తం వేదేషు మనుష్యేషు ప్రసజ్యతే. 17

వ్యా. కించ ఋగాదయ ఇతి. దౌర్బ్రాహ్మణ్యం వ్రాత్యత్వం. తచ్చ దౌర్బ్రాహ్మణ్యం మనుష్యేషు మనుష్యత్వావాంతరజాతిరూపం. తద్రహితేషు వేదేషు న ప్రసజ్యత ఇత్యర్థః.

టీ. దౌర్బ్రాహ్మణ్యానవాప్తయే = వ్రాత్యత్వమును పొందకుండుటకు, ఋగాదయః = ఋగ్యజుస్సామాథర్వవేదములు, అధీయంతే = అధ్యయనము చేయఁబడును. తత్ =అది (వ్రాత్యత్వము), వేదేషు=వేదములందు, ప్రసక్తం=ప్రాప్తమైనది, న=కాదు. మనుష్యేషు = మనుష్యులయందు, ప్రసజ్యతే = ప్రసక్త మగును.

తా. తమ వ్రాత్యత్వము పోవుటకు వేదములఁ బఠించుచున్నారు గాని వ్రాత్యత్వమే లేని వేదములకొఱకుఁ గాదు. వేదపఠనము వేదముల నుద్ధరించుటకుఁ గాదు. వేదాధ్యయనము చేయనియెడల బ్రాహ్మణులకు సంప్రాప్తమయ్యెడి దౌర్బ్రాహ్మణ్య నివృత్తికొఱకే వేదములఁ బఠించుచున్నారు.

అవ. పంచభూతములను ప్రేమించుటయు నాత్మార్థమే యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. భూమ్యాదిపంచభూతాని స్థానతృట్పాకశోషణైః,
హేతుభిశ్చావకాశేన వాంఛంత్యేషాం న హేతవః. 18

వ్యా. కించ—భూమ్యాదీతి. సర్వే ప్రాణినః స్థానప్రదానతృణ్ణివారణపాకకరణార్ద్రశోషణావకాశప్రదానాఖ్యైర్హేతుభిర్నిమిత్తైః పృథివ్యాదీని పంచభూతాని వాంఛంతి అపేక్షంతే. ఏషాం పృథివ్యాదీనాం తు హేతవః స్థానవాంఛాదీని నిమిత్తాని న సంత్యతో న స్వయమాకాంక్షంతీత్యర్థః.

టీ. స్థానతృట్పాకశోషణైః - స్థాన = ఉనికియు, తృట్ =దప్పియు, పాక=పచనము చేయుటయుఁ, శోషణైః = ఎండఁబెట్టుటయు, అవకాశేన చ = అవకాశమిచ్చుట యనెడి, హేతుభిః = హేతువులచేత, భూమ్యాదిపంచభూతాని = భూమి మొదలగు పంచభూతములను, వాంఛంతి=కోరుచున్నారు. ఏషాం=ఈపృథివ్యాదులకు, హేతవః = పూర్వోక్త ప్రయోజననిమిత్తములు, న (సంతి) = లేవు.

తా. మనుజుఁడు ఉండుటకు భూమిని, దప్పి తీర్చుకొనుటకు నీటిని, పాకమున కగ్నిని, ఎండఁ బెట్టుటకు గాలిని, తిరుగుటకు ఆకాశమును గోరును. భూమికి నునికితో నవసరము లేదు. నీటికి దప్పియే లేదు. ఇట్లే పంచభూతములకును మనుష్యునకు వలె ఉనికి మొదలుగాఁగల కోరికలు లేవు కావున పంచభూతములయందలి ప్రేమయు వానినిఁ గోరెడి మనుష్యునికొఱకే యని భావము.

అవ. 'న వా అరే సర్వస్య కామాయ భవతి' అను వాక్యమునకు తాత్పర్యము:—

శ్లో. స్వామిభృత్యాదికం సర్వం స్వోపకారాయ వాంఛతి,
తత్తత్కృతోపకారస్తు తస్య తస్య న విద్యతే. 19

వ్యా. ఇదానీం 'న వా అరే సర్వస్య కామా' యేత్యస్య వాక్యస్య తాత్పర్యమాహ—స్వామీతి. భృత్యాదిసర్వో జనః స్వామ్యాదికం సర్వం స్వోపకారాయ స్వప్రయోజనాయ వాంఛతి. ఏవం స్వామ్యాదిరపి.

టీ. స్వామిభృత్యాదికం = ప్రభువు, భృత్యుఁడు మొదలుగాఁ గల, సర్వం = సమస్తమును, స్వోపకారాయ=తన ప్రయోజనముకొఱకే, వాంఛతి=కోరుచున్నాఁడు. తత్తత్కృతోపకారస్తు = వారివారిచే చేయఁబడెడి యుపకారమైతే, తస్య తస్య = ఆయా వానికి, న విద్యతే = కాదు.

తా. ప్రభువు భృత్యుఁడు మొదలగు సర్వజనులును తమ తమ ప్రయోజనముకొఱకే యపేక్షించుచున్నారు. ఆ రాజభృత్యాదికము కొఱకుఁ జేయఁబడు ఉపకారము తమ తమ సౌఖ్యముకొఱకే కాని, ఆ రాజభృత్యాదిసౌఖ్యము కొఱకుఁ గాదు.

అవ. వేదమం దిన్ని యుదాహరణములు చెప్పఁబడుటకుఁ గారణము:—

శ్లో. సర్వవ్యవహృతిష్వేవమనుసంధాతుమీదృశం,
ఉదాహరణబాహుళ్యం తేన స్వాం వాసయేన్మతిమ్. 20

వ్యా. నను శ్రుతావేవం బహూదాహరణదర్శనం కిమర్థం కృతమిత్యాశంక్యాహ—సర్వవ్యవహృతిష్వితి. ఇచ్ఛాపూర్వకేషు సర్వేష్వపి భోజనాదివ్యవహారేషు ఏవమాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీత్యుక్తేన ప్రకారేణానుసంధాతుమనుసంధానాయ ఈదృశం పతిజాయాదిషు ప్రీతిదర్శనరూపముదాహరణబాహుళ్యముక్తమితి శేషః. తేన కారణేన స్వాం స్వసంబంధినీం మతిం బుద్ధిం వాసయేత్. సర్వస్యాపి స్వశేషత్వావగమేన స్వాత్మనః ప్రియతమత్వానుసంధానవతీం కుర్యాదిత్యర్థః.

టీ. సర్వవ్యవహృతిషు = సర్వవ్యవహారములందును, ఏవం = ఈవిధముగా, అనుసంధాతుం=భావించుటకొఱకు, ఈదృశం = ఈలాటి, ఉదాహరణబాహుళ్యముక్తం = పెక్కుదృష్టాంతములు చెప్పఁబడెను. తేన = ఆ హేతువుచేత, స్వాం = భోక్తయగు తన సంబంధమైన, మతిం=బుద్ధిని, వాసయేత్ =అభ్యసింపఁజేయవలెను.

తా. సర్వభోగ్యప్రపంచమును భోక్తయగు తనకు శేష మగుట వలన, బుద్ధికి భోగ్యపదార్థములయందుఁ గల ప్రీతిని మఱలించి, భోక్తయగు తనయందే బుద్ధిని ప్రీతి గల దానినిగఁ జేయవలయు నని బోధించుటకై వేదమందు ఇన్ని యుదాహరణములు చెప్పఁబడె నని యభిప్రాయము.

అవ. ప్రీతిస్వరూపమును ప్రశ్నోత్తరరూపముగ శ్లోకద్వయముచేఁ దెల్పుచున్నాఁడు:—

శ్లో. అథ కేయం భవత్ప్రీతిశ్శ్రూయతే యా నిజాత్మని,
రాగో వధ్వాదివిషయే శ్రద్ధా యాగాదికర్మణి. 21

వ్యా. నన్వాత్మశేషత్వేన సర్వస్య ప్రియత్వోక్తేరాత్మనః ప్రియతమత్వముక్తమనుపపన్నం ప్రీతి వికల్పే క్రియమాణే ప్రీతేరేవ దుర్నిరూపత్వా దిత్యభిప్రాయేణ ప్రీతి స్వరూపం పృచ్ఛతి-అథ కేయమితి. అథశబ్దః ప్రశ్నార్థః యా నిజాత్మని ప్రీతిః శ్రూయతే, ఇయం కా? కిం రాగరూపా? కిం వా శ్రద్ధారూపా? ఉత భక్తిరూపా? యద్వేచ్ఛారూపేతి కింశబ్దార్థః. చతుర్ష్వపి పక్షేషు ప్రీతేస్సర్వవిషయత్వం న సంభవతీత్యాహ—రాగ ఇతి. రాగశ్చేద్వధ్వాదిష్వేవ స్యాన్న యాగాదిషు. శ్రద్ధా చేద్యాగాదిష్వేవ స్యాన్న వధ్వాదిషు.

టీ. యా = ఏది, నిజాత్మని = స్వస్వరూపమునందు, శ్రూయతే = చెప్పఁబడుచున్నదో, ఇయం ప్రీతిః=ఈప్రేమ, అథ కా భవేత్ =ఏదైయుండును? రాగః = రాగము, వధ్వాదివిషయే=స్త్రీలు మొదలగు వారి విషయముననే (స్యాత్ = అగును.) శ్రద్ధా=శ్రద్ధ యనునది, యాగాదికర్మణి=యాగము మొదలగు కర్మలందే (అగును.)

తా. ఆత్మ ప్రియతమ మని వేదమునఁ జెప్పఁబడెను. ఆ ప్రీతి యెట్టిది? అనురాగస్వరూప మంటివా? అది స్త్రీలు మొదలగు భోగసాధనములందే కాని యాగాదులం దుండదు. శ్రద్ధ యంటివా? ఇది యాగాదులయం దుండును గాని స్త్రీలు మొదలగు వారియం దుండదు.

శ్లో. భక్తిః స్యాద్గురుదేవాదావిచ్ఛా త్వప్రాప్తవస్తుని,
తద్వాస్తు సాత్త్వికీ వృత్తిస్సుఖమాత్రానువర్తినీ. 22

వ్యా. భక్తిశ్చేత్ గుర్వాదిష్వేవ స్యాన్నేతరేషు. ఇచ్ఛా చేదప్రాప్తవస్తువిషయైవ స్యాన్నేతరవిషయా. అతో న సర్వవిషయత్వం ప్రీతేరిత్యర్థః. ఉక్తప్రకారచతుష్టయాతిరిక్తం పక్షమాదాయోత్తరమాహ—తర్హ్యాస్త్వితి. తర్హి ప్రీతేః రాగాదిరూపత్వాసంభవే సతి సుఖమాత్రానువర్తినీ సుఖమేవ సుఖమాత్రమనుసృత్య వర్తత ఇతి సుఖమాత్రానువర్తినీ సుఖైకగోచరేత్యర్థః. సాత్త్వికీ సత్త్వగుణపరిణామరూపా వృత్తిః ప్రీతిరస్తు.

టీ. భక్తిః=భక్తి, గురుదేవాదౌ=గురువు దేవుఁడు మొదలగు వానియందుండును. ఇచ్ఛాతు=కోరికయున్ననో, అప్రాప్తవస్తుని = దొరకని వస్తువునందు, భవేత్=ఉండును. తర్హి=అట్లులైతే, సుఖమాత్రానువర్తినీ = సుఖమాత్రము ననువర్తించినది, సాత్త్వికీ = సత్త్వగుణసంబంధియగు, వృత్తిః=వృత్తియే, ప్రీతిః=ప్రేమ యగుఁగాక.

తా. భక్తి యంటివా? అది గురుదేవతాదివిషయిక మగును. కాని యన్యవిషయికము గాదు. ఇచ్ఛ యంటివా? లభింపని వస్తువులయందుండును గాని లభించిన వస్తువులయం దుండదు. ఇట్లాక్షేపింపఁగా సిద్ధాంతిసుఖమాత్రము ననుసరించెడి సత్త్వగుణజన్యమగు వృత్తి విశేషమే ప్రీతి యని సమాధానముఁ జెప్పెను.

అవ. ప్రీతి ఇచ్ఛాదులకంటె వే అని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. ప్రాప్తే నష్టేఽపి సద్భావాదిచ్ఛాతో వ్యతిరిచ్యతే,
సుఖసాధనతోపాధేరన్నపానాదయః ప్రియాః. 23

వ్యా. నను తర్హి సా ప్రీతిరిచ్ఛైవేత్యాశంక్య పరిహరతి—ప్రాప్త ఇతి. ఇచ్ఛా తావదప్రాప్తసుఖాదిమాత్రవిషయా. ఇయం తు సర్వవిషయా. ప్రాప్తే లబ్ధే సుఖాదౌ నష్టేఽపి తస్మిన్ విషయే విద్యమానత్వాత్. అత ఇచ్ఛాతః ఇచ్ఛాయా వ్యతిరిచ్యతే భిద్యతే. ఇదానీం సుఖసాధనభూతేష్వన్నాదిష్వివాత్మన్యపి ప్రీతిదర్శనాదాత్మనోఽప్యన్నాదివత్సుఖసాధనత్వం స్యాదితి శంకతే—సుఖేతి. అన్నపానాదయస్సుఖసాధనతోపాధినా యథా ప్రియా దృష్టాః ఆత్మాప్యానుకూల్యాత్ప్రియత్వాదన్నాదిసమోఽన్నపానాదివత్సుఖసాధనం స్యాదిత్యర్థః.

టీ. ప్రాప్తే = లభించిన దానియందును, నష్టేఽపి = నశించిన దానియందును, సద్భావాత్=ఉండుటవలన, ఇచ్ఛాతః = ఇచ్ఛకంటె, వ్యతిరిచ్యతే=వేఱయిన దగును. సుఖసాధనతోపాధేః = సుఖసాధన మనెడి ధర్మమువలన, అన్నపానాదయః=అన్నము, పానము మొదలగునవి, ప్రియాః = అభిమతంబులు.

తా. దొరకిన దానియందును, నశించిన దానియందును ఇచ్ఛయుం డదు. ప్రీతి యట్టి రెండింటియందును ఉండును కాన ప్రీతి యిచ్ఛకంటె వ్యతిరిక్తమైనది. ఆత్మ ప్రీతి అన్నాదులవంటి దనెదవేని య ట్లనరాదు. అన్నపానాదులు సుఖసాధనము లగుటచే ప్రేమాస్పదము.

అవ. అన్నపానీయంబులకంటె ఆత్మకు భేదమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మానుకూల్యాదన్నాదిసమశ్చేదమునాత్ర కః,
అనుకూలయితవ్యస్స్యా న్నైకస్మి న్కర్మకర్తృతా. 24

వ్యా. అత్రేదమనుమానం సూచితం. విమత ఆత్మా సుఖసాధనం భవితు మర్హతి. ప్రియత్వాదన్నాదివదితి. అన్నపానాదిషు భోగ్యత్వ ముపాధి రిత్యభిప్రాయేణ పరిహర తి—అమునేతి. అత్ర లోకే అమునా సుఖసాధనతయానుకూలేనానుకూలయితవ్యః కస్స్యాత్ ? న కోఽపి స్యాదాత్మారిక్తస్య భోక్తురభావాదిత్యర్థః. నను స్వయమేవా నుకూలయితవ్యస్స్యాదిత్యత ఆహ—నైకస్మిన్నితి. ఏకస్యైవాత్మనో యుగపదుపకార్య త్వముపకారకత్వం చేతి ధర్మద్వయం విరుధ్యత ఇత్యర్థః.

టీ. ఆత్మా=ఆత్మ, ఆనుకూల్యాత్ = ఉపకరించుటవలన, అన్నాదిసమశ్చేత్ = అన్నాదులలో సముఁ డంటివేని, అమునా = ఈయాత్మచేత, కః = ఎవ్వఁడు, అను కూలయితవ్యః = అనుకూలింపఁ జేయఁదగినవాఁడు, స్యాత్ = అగును ? ఏకస్మిన్ = ఒక్కయాత్మయందే, కర్మకర్తృతా=కర్మత్వము కర్తృత్వమును, న=లేదు.

తా. ఆత్మయు నన్నాదులవలె ననుకూలము గనుక ప్రేమింపఁ బడుచున్న దంటివేని, యది సరి కాదు. అనుకూలుఁ డనఁగా నుపకరించు వాఁడు. ఆత్మ యన్నిటివలన నుపకారముఁ బొందునది గాని మఱియొక దాని కుపకరించునది కాదు. ఉపకార మను క్రియకు నొకే యాత్మ కర్మయుఁ కర్తయుఁ గానేరదు. ఎంతటివాఁడును తన భుజముపైని తా నెక్కి కూర్చుండఁ జాలఁడు.

అవ. ఆత్మ సుఖసాధనము గాకపోయినను, సుఖము వలె భోక్త కుపకరింపఁ గూడదా యనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. సుఖే వైషయికే ప్రీతిమాత్రమాత్మా త్వతిప్రియః,
సుఖే వ్యభిచర త్యేషా నాత్మని వ్యభిచారిణీ. 25

వ్యా. నన్వన్నాదివత్సుఖసాధనత్వాభావేఽపి సుఖవద్భోక్తృశేషతా స్యాది త్యాశంక్యాత్మనో నిరతిశయప్రేమాస్పదత్వా న్నైవమితి పరిహరతి—సుఖ ఇతి. వైష

యికే విషయజన్యే సుఖే ప్రీతిమాత్రం ప్రీతిరేవ న నిరతిశయా. ఆత్మాత్వతిప్రియో నిరతిశయప్రేమవిషయః అతో న విషయజన్యసుఖతుల్య ఇత్యర్థః. తత్రోభయత్రోపపత్తిమాహ—సుఖే వ్యభిచరతీతి. సుఖే వైషయికే సుఖే జాయమానా ఏషా ప్రీతిర్వ్యభిచరతి కదాచిత్సుఖాంతరం గచ్ఛతి; న తస్మిన్నేవ నియతాఽవతిష్ఠతే. ఆత్మని తు విద్యమానా ప్రీతిర్న వ్యభిచారిణీ విషయాంతరగామినీ న భవతి, అతో నిరతిశయా సేత్యర్థః.

టీ. వైషయికే=విషయములవలనం గలిగిన, సుఖే=సుఖమందు, ప్రీతిమాత్రం=ప్రీతిమాత్రము, (భవతి=కలుగుచున్నది). ఆత్మా తు=ఆత్మయయితే, అతి ప్రియః=పరమప్రేమాస్పదుఁడు. సుఖే=సుఖమందు, ఏషా=ఈ ప్రీతి, వ్యభిచరతి=మాఱిపోవుచున్నది. ఆత్మని=ఆత్మయందు, ఏషా=ఈ ప్రీతి, న వ్యభిచరతి=మార్పు నొందదు.

తా. విషయజన్యమగు సుఖమందు ప్రీతిమాత్రమే కలదుగాని నిరతిశయప్రియము లేదు. ప్రత్యగాత్మ నిరతిశయప్రీతి విషయుఁడగుట వలన సుఖమువలె భోక్తకు శేషత్వమును బొందఁడు. విషయసుఖమునందుఁ గల ప్రీతి మఱియొక విషయసుఖమునుగూర్చి మాఱుచున్నది. అందువలన నది విషయసుఖమందు ప్రీతిమాత్రమే యగును. ప్రత్యగాత్మయందుఁ గల ప్రీతి అన్యవిషయసుఖాపేక్ష లేనిది గనుక నిరతిశయమైనది.

అవ. వైషయికసుఖము సుఖాంతరము దొరకిన మాఱును. ఆత్మసుఖ మట్లు మాఱ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏకం త్యక్త్వాఽన్యదాదత్తే సుఖం వైషయికం సదా,
నాత్మా త్యాజ్యో న చాదేయః తస్మిన్వ్యభిచరేత్కథమ్. 26

వ్యా. సుఖగోచరాయాః ప్రీతేర్వ్యభిచారం దర్శయతి—ఏకమితి. ఆత్మని తు తదభావం దర్శయతి—నాత్మేతి. అయోగ్యత్వాదిత్యర్థః ఫలితమాహ—తస్మిన్నితి.

టీ. వైషయికం=విషయసంబంధమైన, సుఖం=సుఖము, సదా=ఎల్లప్పుడు, ఏకం=ఒకదానిని, త్యక్త్వా=వదలిపెట్టి, అన్యత్=మఱియొకదానిని, ఆదత్తే=గ్రహించును. ఆత్మా=ఆత్మ, త్యాజ్యః=వదలఁ దగినది, న=కాదు. ఆదేయశ్చ=గ్రహింపఁదగినదియు, న=కాదు. తస్మిన్=ఆ యాత్మయందు (సుఖం=కలిగెడి సుఖము), కథం=ఎట్లు, వ్యభిచరేత్=వదలిపోవును.

తా. విషయసుఖము నొకదాని ననుభవించుచుండ నంతకంటె నధికసుఖము లభించెనేని, తొల్లింటిదానియందు ప్రేమ తగ్గిపోవును.

ఆత్మ విడువఁబడునది గాదు. గ్రహింపఁదగినదియుఁ గాదు. ఆత్మ సిద్ధవస్తు వగుటం జేసి దానిస్వరూపము మాఱదు.

అవ. ఆత్మ విడువఁ దగినదియుఁ గాదు, గ్రహింపఁ దగినదియుఁ గాదంటివేని, యుపేక్షింపఁ దగిన దని యనవలసివచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. హానాదానవిహీనేఽస్మిన్నుపేక్షా చేత్తృణాదివత్,
ఉపేక్షితు స్స్వరూపత్వా న్నోపేక్ష్యత్వం నిజాత్మనః. 27

వ్యా. హానాదివిషయత్వాభావేఽప్యాత్మన స్తృణాదివదుపేక్షావిషయత్వం కిం న స్యాదితి శంకతే—హానేతి. హానం పరిత్యాగః. ఆదానం స్వీకారః, ఉపేక్షా ఔదాసీన్యం, ఆత్మనో హానాద్యవిషయత్వవదుపేక్షావిషయత్వమపి న సంభవత్యయోగ్యత్వాదిత్యభిప్రాయేణ పరిహరతి—ఉపేక్షితురితి. ఉపేక్షితుః ఉపేక్షాకర్తుః యో నిజాత్మా అవినాశిస్వరూపమస్తి తస్య స్వస్వరూపత్వాదేవ స్వవ్యతిరిక్తతృణాదివదుపేక్ష్యత్వ ముపేక్షావిషయత్వం న విద్యత ఇతి శేషః.

టీ. హానాదానవిహీనే = విడుచుటయు గ్రహించుటయును లేని, అస్మిన్ = ఇట్టి యాత్మయందు, తృణాదివత్ = గడ్డిపోచ మొదలగువానియందు వలె, ఉపేక్షా చేత్ = ఉపేక్షించుట కలుగునంటివేని, ఉపేక్షితుః = ఉపేక్షించెడువానికి, స్వరూపత్వాత్ = స్వరూపమైయుండుటవలన, నిజాత్మనః=తన యాత్మకు, ఉపేక్ష్యత్వం = ఉపేక్షింపఁ దగినదగుట, న = సంభవింపదు.

తా. "ఆత్మ వదలిపెట్టుటకును గ్రహించుటకును అనర్హ మంటివి. అటు లంటివేని ఉదాసీనములగు గడ్డిపోచలవలె ఉపేక్షింపఁ దగినదా?" అట్టిది గాదు. ఆత్మను ఎవ్వఁ డుపేక్షించునో వాని కాత్మ స్వరూపమగుటంజేసి దానియం దుపేక్ష కలిగియుండుటకు వీలులేదు. తన స్వరూపము నుపేక్షించువాఁడు లోకమున లేఁడుగదా!

అవ. "ఆత్మ త్యజింపఁదగినది కాదంటివి; దానికి విరుద్ధముగా లోకానుభవము కలదు." అని శంకించుచున్నాఁడు:—

శ్లో. రాగక్రోధాభిభూతానాం ముమూర్షా వీక్ష్యతే క్వచిత్,
తతో ద్వేషాద్భవేత్త్యాజ్య ఆత్మేతి యది తన్నహి. 28

వ్యా. నను హానవిషయత్వమాత్మనో నాస్తీత్యుక్తమనుపపన్నం. ద్వేషాత్త్యాజ్యత్వదర్శనాదితి శంకతే—రాగేతి. యతో ముమూర్షా దృశ్యతే తత ఆత్మని ద్వేషసంభవాత్ 'వృశ్చికాదివదాత్మాపి త్యాజ్య' ఇతి యద్యుచ్యేతేతి శేషః తత్త్యాగస్యాత్మవ్యతిరిక్తదేహవిషయత్వాన్నైవమితి పరిహరతి—తన్నహీతి.

టీ. క్వచిత్ = ఒకానొకప్పుడు, రాగక్రోధాభిభూతానాం = కామక్రోధములచే వశీకృతు లగువారికి, ముమూర్షా=చనిపోవుటయం దిచ్ఛ, వీక్ష్యతే=చూడఁబడుచున్నది. తతః=అందువలన, ద్వేషాత్=ద్వేషమువలన, ఆత్మా=ఆత్మ, త్యాజ్యః=త్యజింపఁదగినది, భవేదితి = అగునని, ఉచ్యతే యది = చెప్పెదవేని, తన్నహి = అది కాదు.

తా. కామక్రోధాదులచే ప్రేరితులై కొంద ఱొకానొకపుడు మరణమును గోరుదురు గనుక వృశ్చికాదులవలె ప్రత్యగాత్మ త్యజింపఁ దగినది యనెదవేని సరికాదు.

శ్లో. త్యక్తుం యోగ్యస్య దేహస్య నాత్మతా త్యక్తురేవ సా,
న త్యక్తర్యస్తి సద్వేషస్త్యాజ్యే ద్వేషేతు కా క్షతిః. 29

వ్యా. త్యక్తుమితి. త్యక్తుముత్సృష్టుం యోగస్యోచితస్య దేహస్యాత్మతా నాస్తి కస్య తర్హి సేత్యత ఆహ—త్యక్తురితి. త్యక్తుర్దేహత్యాగకారిణో దేహాతిరిక్తస్య జీవస్య సా ఆత్మ తేత్యర్థః. భవతు త్యక్తురాత్మత్వం. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—న త్యక్తరీతి. అతో నాత్మనస్త్యాజ్యత్వమిత్యభిప్రాయః. మా భూదాత్మని విద్వేషః; దేహే తూపలభ్యత ఏవేత్యాశంక్యాహ—త్యాజ్య ఇతి. త్యాజ్యే దేహగోచరే ద్వేషే సత్యపి కా క్షతిరాత్మనస్త్యాగాభావవాదినో మమేతి శేషః.

టీ. త్యక్తుం = పరిత్యజించుటకు, యోగ్యస్య = తగిన, దేహస్య = దేహమునకు, ఆత్మతా = ఆత్మత్వము, న = లేదు. సా = ఆయాత్మత్వము, త్యక్తురేవ = వదలిపెట్టెడి వానికే, (అస్తి=కలదు.) త్యక్తరి = త్యజించెడివానియందు, సః ద్వేషః = అట్టిద్వేషము, నాస్తి = లేదు. త్యాజ్యే = పరిత్యజింపఁదగిన దేహమందు, ద్వేషే తు = ద్వేష ముండి నచో, కా క్షతిః = నష్ట మేమి!

తా. త్యజింపఁదగిన దేహమునకు ఆత్మత్వములేదు గనుక దానినిఁ ద్యజింపవచ్చును. ఆత్మ త్యజించునదే కాని త్యజింపఁబడునది కాదు. శరీరము త్యాజ్యమైనచో ఆత్మ కేమి నష్టము?

అవ. ఇట్లు "న వా అరే పత్యుః కామాయ" అనెడి వాక్యము మొదలుకొని "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను వాక్యమువఱకుఁ గల శ్రుతియొక్క తాత్పర్యమును జెప్పి, యిపుడు యుక్తివలనఁ గూడ ఆత్మయొక్క పరమప్రేమాస్పద త్వమును సాధించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మార్థత్వేన సర్వస్య ప్రీతేశ్చాత్మా హ్యతిప్రియః.
సిద్ధో యథా పుత్రమిత్రాత్పుత్రః ప్రియతరస్తథా. 30

వ్యా. తదేవం 'న వా అరే పత్యుః కామాయే'త్యారభ్య 'ఆత్మనస్తు కామాయ సర్వం, ప్రియం'భవతీత్యంతాయాః శ్రుతేస్తాత్పర్యపర్యాలోచనయా ఆత్మనః ప్రియత మత్వం ప్రదర్శ్య యుక్తితోఽపి తద్దర్శయతి—ఆత్మేతి. సర్వస్య సుఖసహితస్య తత్సా ధనజాతస్య పతిజాయాదేరాత్మార్థత్వేన స్వస్యోపకారకత్వేన ప్రీతేశ్చ ప్రియత్వాద ప్యాత్మా ఉపకార్యః. స్వయమతిశయేన ప్రియస్సిద్ధో హి. ఏతదేవ దృష్టాంతప్రదర్శ నేన స్పష్టయతి—యథేతి. లోకే యథా పుత్రమిత్రా త్పుత్రస్య మిత్రభూతాత్ పుత్రద్వారా ప్రీతివిషయాత్ యజ్ఞదత్తాదేస్సకాశాత్ పుత్రో దేవదత్తాదిరవ్యవధా నేన ప్రీతివిషయత్వాత్తస్మాదతిశయేన ప్రియో భవతి పితుర్విష్ణుదత్తాదే స్తథా తద్వత్స్వ సంబంధిత్వేన ప్రీతివిషయాత్ సర్వస్మాత్స్వయమతిశయేన ప్రియో భవతీత్యర్థః.

టీ. మిత్రాత్ = స్నేహితునికంటె, పుత్రః = పుత్రుఁడు, యథా=ఏప్రకారము, ప్రియతరః = అధికప్రేమపాత్రుఁడో, తథా = ఆప్రకారము, సర్వస్య = భర్తృ భార్యాది సర్వభోగ్యప్రపంచమును, ఆత్మార్థత్వేన=ఆత్మకొఱకైనదగుటచేత, ప్రీతేశ్చ= ప్రీతిగలదగుటచేత, ఆత్మా = భోక్తయగు తాను, అతిప్రియః = నిరతిశయప్రీతివిష యుఁడు, అని, సిద్ధః = ప్రసిద్ధము.

తా. స్నేహితునికంటె పుత్రునియెడ ప్రేమ యధికము గదా! అట్లే తన కుపయోగించెడి సర్వపదార్థములయందలి ప్రేమకంటెను తనపై ప్రేమ యధిక మని భావము.

అవ. ఆత్మ పరమప్రేమాస్పదమనుటకు స్వానుభవప్రదర్శనమున దృఢీకరించు చున్నాఁడు:—

శ్లో. మా న భూవమహం కింతు భూయాసం సర్వదేత్యసౌ,
ఆశీ స్సర్వస్య దృష్టేతి ప్రత్యక్షా ప్రీతిరాత్మని. 31

వ్యా. ఏవమాత్మని శ్రుతియుక్తిభ్యా ముపపాదితాం నిరతిశయాం ప్రీతిం స్వాను భవప్రదర్శనేన ద్రఢయతి—మా న భూవమితి. అహం మా భూవమితి. న క్వాపి మమాసత్త్వ మస్తు. కింతు సర్వదా భూయాసం సదా మమ సత్తాస్తు ఇత్యేవంరూపా ఆశీః ప్రార్థనా సర్వస్య ప్రాణిజాతస్య సంబంధినీ దృష్టా. సర్వోఽప్యేవమేవ ప్రార్థయత ఇత్యర్థః. ఫలిత మాహ—ప్రత్యక్షేతి. యత ఏవం సర్వైః ప్రార్థ్యతే అత ఆత్మని నిర తిశయప్రీతిః ప్రత్యక్షసిద్ధేత్యర్థః.

టీ. అహం = నేను, మా న భూవం = లేనివాఁడనుగాను, అనఁగా నాకెప్పటి కిని నాశములేకపోవుఁగాక యనుట; కింతు = ఇంకనేమన, సర్వదా = ఎల్లప్పుడు,

భూయాసం = ఉండువాఁడనగుదునుగాక, ఇతి = అని, ఆశీః = కోరిక, సర్వస్య=సర్వ జనమునకు, దృష్టా = చూడఁబడినది. ఇతి = ఈహేతువున, ఆత్మని = ఆత్మయందు, ప్రీతిః = ప్రేమ, ప్రత్యక్షా = అనుభవసిద్ధము.

తా. "నే నుండకపోవద్దు. ఏది యెట్టు లుండినను నే నెప్పుడును నుండువాఁడను గాక" యని ప్రతిప్రాణియుఁ గోరును. కావున 'నే' నని చెప్పఁబడెడి యాత్మయందలి యధికప్రేమ ప్రత్యక్షము.

శ్లో. ఇత్యాద్యైభిస్త్రిభిః ప్రీతౌ సిద్ధాయామేవమాత్మని,
పుత్రభార్యాదిశేషత్వమాత్మనః కైశ్చిదీరితమ్. 32

వ్యా. వృత్తానుకీర్తనపురస్సరం మతాంతరం దూషయితుమనుభాషతే—ఇత్యాదిభిరితి. ఇతిశబ్దేనానుభవః పరామృశ్యతే. ఆదిశబ్దేన యుక్తి శ్రుతీ ఇత్యాదిభిః అనుభవ యుక్తిశ్రుతిలక్షణై స్త్రిభిః ప్రమాణై రేవముక్తేన ప్రకారేణాత్మని ప్రీతౌ సిద్ధాయామపి కైశ్చిత్ శ్రుతితాత్పర్యానభిజ్ఞైరాత్మనః పుత్రభార్యాదిశేషత్వం పుత్రాదీన్ప్రతి స్వస్యోపసర్జనత్వమీరితమభిహితమ్.

టీ. ఇత్యాదిభిః=ఈమొదలైన, త్రిభిః = శ్రుతియుక్త్యనుభవములు మూఁడింటిచేత, ఏవం = ఈవిధముగా ఆత్మని = ఆత్మయందు, ప్రీతౌ = ప్రేమ, సిద్ధాయాం = సిద్ధింపఁగా, కైశ్చిత్ = కొందఱిచేత, ఆత్మనః = ఆత్మకు, పుత్రభార్యాదిశేషత్వం = పుత్రుఁడు, భార్య మొదలగువారికి శేష మగుట (ఉపకరణమగుట), ఈరితం = చెప్పఁబడినది.

తా. శ్రుతియుక్త్యనుభవములచేత నీవిధముగా నాత్మయే పరమ ప్రేమాస్పద మని తేలినది. ఈ యంశము తెలియక కొందఱు భార్యాదులే పరమప్రేమాస్పద మని పొరపడి చెప్పిరి. వారు పుత్రభార్యాదులకు ఆత్మ ఉపకరణ మగుటయు పొరబాటే. ఆత్మ పుత్రభార్యాదులకన్నను ప్రేమాస్పద మని తెలియవలెను.

అవ. పుత్రభార్యాదులు పరమప్రేమాస్పదము లనువారు వారి వాదమునకు ప్రమాణములం జూపుచున్నారు:—

శ్లో. ఏతద్వివక్షయా పుత్రే ముఖ్యాత్మత్వం శ్రుతీరితం,
ఆత్మా వై పుత్ర నామేతి తచ్చోపనిషది స్ఫుటమ్. 33

వ్యా. ఇదం మతో౽వగతమిత్యత ఆహ—ఏతదితి ఏతద్వివక్షయైవ కైశ్చిదీర్యత ఇత్యేతదభివ్యక్తీకరణాభిప్రాయేణ 'ఆత్మా వై పుత్రనామాసీ'త్యాదికయా శ్రుత్యా

పుత్రస్య ముఖ్యాత్మత్వమీరితమిత్యర్థః. కించ తత్పుత్రస్య ముఖ్యాత్మత్వముపనిషది ఐతరేయోపనిషదాదౌ స్ఫుటం వ్యక్తమభిహిత మితిశేషః.

టీ. ఏతత్ వివక్షయా=ఇట్టి యర్థమును చెప్పవలె ననెడి కోరికచేత, పుత్రే=పుత్రుని యందు, ముఖ్యాత్మత్వం = ముఖ్యాత్మత్వము, ఆత్మా వై పుత్ర నామేతి=ఆత్మావై పుత్ర నామా ఽ నెడి, శ్రుతీరితం=శ్రుతిచేఁ జెప్పఁబడినది. తచ్చ = అదియు, ఉపనిషది=ఉప నిషత్తునందు, స్ఫుటం=స్పష్టముగాఁ జెప్పఁబడినది.

తా. "ఆత్మా వై పుత్రనామాసి' అను శ్రుతి పుత్రుఁడే యాత్మ యని చెప్పుచున్నది. ఈయర్థమే ఐతరేయశ్రుతియందును నిరూపింపఁ బడియెను.

అవ. ఇట్టి యైతరేయశ్రుత్యర్థమును పఠించుచున్నాడు:—

శ్లో. సోఽస్యాయమాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే,
అథాస్యేతర ఆత్మాయం కృతకృత్యః ప్రమీయతే. 34

వ్యా. కేన వాక్యేనేత్యాకాంక్షాయాం తద్వాక్యమర్థతః పఠతి—సోఽస్యేతి అస్య పితుః స అయం 'పురుషే హవాయమాదితో గర్భోభవ'తీతి ప్రకరణాదౌ పురుషే దేహే గర్భత్వేనోక్తః అయం సోఽగ్ర ఏవ కుమారం జన్మనోఽగ్రేఽధిభావతీత్యత్రాతి శయేన పాలనీయతయోక్తః పుత్రరూప ఆత్మా పుణ్యేభ్యః కర్మభ్యః పుణ్యకర్మానుష్ఠా నాయ ప్రతిధీయతే ప్రతినిధిత్వేనావస్థాప్యతే. పిత్రేతి శేషః. అథానన్తరం అస్య పితు రయం ప్రత్యక్షేణ పరిదృశ్యమాన ఇతరః పుత్రాదన్యో జనస్యాగ్రస్తః పితృరూప ఆత్మా స్వయం కృతకృత్యోఽనుష్ఠితకృత్యజాతస్సన్ ప్రమీయతః ఇత్యర్థః.

టీ. అస్య=ఈపురుషునియొక్క, సోఽయమాత్మా=ఈపుత్రరూపాత్మ, పుణ్యేభ్యః కర్మభ్యః=పుణ్యకర్మలకొఱకు, ప్రతిధీయతే=ప్రతినిధిగా నుంచఁబడును. అథ=అనంతర మందు, అస్య=ఈతండ్రియొక్క, ఇతరః=మఱియొక, అయం ఆత్మా=ఈయాత్మ, కృత కృత్యః=కృతకృత్యుఁడై, ప్రమీయతే=మరణించును.

తా. మనుజునకు తానును, తన పుత్రుఁడును ఇద్దఱును ఆత్మలే. దీనిలో పుత్రరూపుఁ డగు నాత్మను పుణ్యకర్మల నాచరించుటకుఁగాను భూలోకమున నిల్పి తాను కృతకృత్యుఁ డై తండ్రి తండ్రియొక్క దేహము మరణించును. అని యైతరేయశ్రుతి చెప్పుచున్నది. దీనినిబట్టి మరణించెడి తండ్రికంటె ఉండెడి పుత్రుఁడు ముఖ్యాత్మ యని తేలు చున్న దని పూర్వపక్షి భావము.

అవ. ఇదే యర్థమును జెప్పు మఱియొక శ్రుతిని పఠించుచున్నాఁడు:—

శ్లో. సత్యప్యాత్మని లోకోఽస్తి నాపుత్రస్యాత ఏవ హి,
అనుశిష్టం పుత్రమేవ లోక్యమాహుర్మనీషిణః. 35

వ్యా. ఉక్తార్థస్య దృఢీకరణాయ పుత్రరహితస్య పరలోకాభావ ప్రదర్శనపరస్య 'నాపుత్రస్య లోకోఽస్తీ'తి వాక్యస్యార్థమాహ—సత్యపీతి. యతః పుత్రస్య ముఖ్యాత్మత్వమస్త్యత ఏవాత్మని స్వస్మిన్ సత్యపి స్థితేఽప్యపుత్రస్య పుత్రరహితస్య పితుర్లోకః పరలోకో నాస్తి హి. ఇదం పురాణాదిషు ప్రసిద్ధమిత్యర్థః. వ్యతిరేకముఖేనోక్తస్యార్థస్యాన్వయముఖేన ప్రతిపాదకస్య 'అనుశిష్టం పుత్రం లోక్యమాహు' రితి వాక్యస్యార్థమాహ—అనుశిష్టమితి. మనీషిణః శాస్త్రార్థాభిజ్ఞాః అనుశిష్టం వక్ష్యమాణైస్త్వం బ్రహ్మేత్యాదిభిర్మంత్రైః శిక్షితమేవ పుత్రం లోక్యం లోకాయ హితం పరలోకసాధనమాహురిత్యర్థః.

టీ. అతఏవ=కనుకనే (పుత్రునికి ముఖ్యాత్మత్వము గలుగుటచేత). ఆత్మని=తండ్రియగు తాను, సత్యపి=ఉండినను, అపుత్రస్య=పుత్రులు లేనివానికి, లోకః= పరలోకము, నాస్తి=లేదు. హి=ఈయర్థము పురాణ ప్రసిద్ధము. మనీషిణః=విద్వాంసులు, అనుశిష్టం= శిక్షితుఁడైన, పుత్రమేవ=పుత్రునే, లోక్యం=పరలోకసాధనముగ, ఆహుః=చెప్పెదరు.

తా. తా నుండినను కుమారుఁడు లేనియెడల పరలోకము లే దని శ్రుతి చెప్పుచున్నది. ఇంకొక శ్రుతి సుశిక్షితుఁడగు పుత్రుఁడు పరలోకసాధన మని చెప్పుచున్నది. దీనినిబట్టి పరలోకసాధన మగు పుత్రుఁడే తనకంటె ముఖ్యుఁ డని పూర్వపక్షివాదము.

అవ. ఇహలోకసుఖమునకును పుత్రుఁడే కారణ మను శ్రుతిని పఠించుచున్నాఁడు:—

శ్లో. మనుష్యలోకో జయ్యస్స్యాత్పుత్రేణైవేతరేణ నో,
ముమూర్షుర్మంత్రయేత్పుత్రం త్వం బ్రహ్మేత్యాదిమంత్రకైః. 36

వ్యా. ఇదానీ మైహికసుఖస్యాపి పుత్రహేతుకత్వప్రతిపాదనపరం 'సోఽయం మనుష్యలోకః పుత్రేణైవ జయ్యో నాన్యేన కర్మణే'తి శ్రుతివాక్యమర్థతః పఠతి—మనుష్యలోక ఇతి మనుష్యలోకసుఖం పుత్రేణైవ జయ్యం స్యాత్సంపాద్యం స్యాదితరేణ కర్మాదినా సాధనాంతరేణ నో నైవ భవతి. పుత్రశూన్యస్య సుఖసాధనమపి ధనాదికం నిర్వేదజనకం భవతీతి భావః. అనుశిష్టం పుత్రం లోక్యమిత్యత్ర పుత్రానుశాసనముక్తం. ఇదానీం తస్యావసరం తన్మంత్రాంశ్చ దర్శయతి—ముమూర్షురితి. ఆదిశబ్దేన 'త్వం యజ్ఞస్త్వం లోక' ఇతి మంత్రౌ గృహ్యేతే. 'ఏభిస్త్వం బ్రహ్మే'త్యాదిస్త్రిభిర్మంత్రైః ముమూర్షుః పితామరణావసరే పుత్రం మంత్రయేత్ పుత్రస్యానుశాసనం కుర్యాదిత్యర్థః.

టీ. మనుష్యలోకః=మనుష్యలోకము, పుత్రేణైవ = కుమారునిచేతనే, జయ్యః= జయింపశక్యము, స్యాత్ =అగును. ఇతరేణ=మఱియొకదానిచే, న (జయ్యః-స్యాత్)= జయింప నలవి గాదు. ముమూర్షుః = మరణింపఁ దలంచినవాఁడు. పుత్రం = పుత్రుని, త్వం=నీవు, బ్రహ్మ=బ్రహ్మమవు, ఇత్యాదిమంత్రైః = ఈ మొదలగు మంత్రములచేత, మంత్రయేత్ = అభిమంత్రించవలెను.

తా. మనుష్యలోకమును పుత్రునిచేతనే జయింప నగును. అన్యసాధనములచే జయింప శక్యము గాదు. మరణించునపుడు 'త్వం బ్రహ్మ' (నీవు బ్రహ్మమవు) అను మంత్రమును జెప్పుచుఁ బుత్రుని నభిమంత్రింపవలెను.

అవ. ఈయర్థమును ముగించుచున్నాఁడు:—

శ్లో. ఇత్యాదిశ్రుతయః ప్రాహుః పుత్రభార్యాదిశేషతామ్,
లౌకికా అపి పుత్రస్య ప్రాధాన్యమనుమన్వతే. 37

వ్యా. ఉక్తమర్థం నిగమయతి—ఇత్యాదీతి. న కేవలమయం శ్రుతిసిద్ధోఽర్థః కింతు లోకప్రసిద్ధోఽపీత్యాహ—లౌకికా ఇతి.

టీ. ఇత్యాదిశ్రుతయః = ఈమొదలైన శ్రుతులు, పుత్రభార్యాదిశేషతాం = పుత్రభార్యాదులకు శేషత్వమును, ప్రాహుః = చెప్పుచున్నారు. లౌకికాః = పామరులును, పుత్రస్య = పుత్రునకు, ప్రాధాన్యం = ముఖ్యత్వమును, అనుమన్వతే = చెప్పుచున్నారు.

తా. "శ్రుతులును పామరులును పుత్రభార్యాదులకు తా నుపకరణ మనియే చెప్పుచున్నవి" అని పూర్వపక్షివాదము.

అవ. ఈయర్థమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వస్మిన్మృతేఽపి పుత్రాదిర్జీవేద్విత్తాదినా యథా,
తథైవ యత్నం కురుతే ముఖ్యాః పుత్రాదయస్తతః. 38

వ్యా. తదేవోపపాదయతి—స్వస్మిన్నితి. స్వస్మిన్పుత్రాదావేకేనాదిశబ్దేనభార్యాదయో గృహ్యంతే. ద్వితీయేన క్షేత్రాదయః. ఫలితమాహ—ముఖ్యా ఇతి. యస్మాత్స ప్రయాసం సోఢ్వాపి పుత్రాదిజీవనోపాయం సంపాదయతి, తతస్తస్మాత్పుత్రాదయో ముఖ్యాః ప్రధానభూతా ఇత్యర్థః.

టీ. స్వస్మిన్=తాను, మృతేఽపి=చచ్చినను, పుత్రాదిః = పుత్రభార్యాదికము, విత్తాదినా = ధనము క్షేత్రము మొదలగువానితో, యథా = ఏప్రకారము, జీవేత్ = జీవనము చేయునో, తథైవ=ఆప్రకారము, యత్నం = ప్రయత్నమును, కురుతే=చేయు

చున్నాఁడు. తతః = ఆ హేతువువలన, పుత్రాదయః = పుత్రుఁడు మున్నగువారలు, ముఖ్యాః = ప్రధానులు (అగుచున్నారు.)

తా. తాను మరణించినను పుత్రభార్యాదులు సుఖముగా జీవించుటకుఁగాను తన జీవితమునంతయు యత్నించుచున్నాఁడు గాన పుత్రభార్యాదులే ముఖ్యు లని చెప్పనొప్పును.

అవ. ఇట్లు లోక వేదప్రమాణములతో పుత్రాదులకు ప్రాధాన్యమును జెప్పఁగా దాని నంగీకరించుచున్నాఁడు:—

శ్లో. బాఢమేతావతా నాత్మా శేషో భవతి కస్యచిత్,
గౌణమిథ్యాముఖ్యభేదైరాత్మాఽయం భవతి త్రిధా. 39

వ్యా. ఏవం వేదలోకప్రసిద్ధిభ్యాం ప్రదర్శితం పుత్రాదిప్రాధాన్యమంగీకరోతి—బాఢమితి. తర్హ్యాత్మనశ్శేషిత్వోపపాదనం వ్యాకుప్యేదిత్యాశంక్యాహ—ఏతావతేతి. ఏతావతా పుత్రాదేః క్వచిత్ప్రాధాన్యమస్తీత్యేతావతా నహి ప్రతిజ్ఞామాత్రేణార్థసిద్ధి రిత్యాశంక్య యత్రయత్ర వ్యవహారే యస్య యస్యాత్మత్వం వివక్ష్యతే, తస్య తస్యాత్మనః తత్ర తత్ర ప్రాధాన్యదర్శనాయోపోద్ఘాతత్వేనాత్మత్రైవిధ్యమాహ—గౌణేతి. గౌణాత్మా మిథ్యాత్మా ముఖ్యాత్మా చేత్యయమాత్మా త్రిధా భవతి.

టీ. బాఢం=సరి, ఏతావతా = ఇంతమాత్రముచేత, ఆత్మా=ఆత్మ, కస్యచిత్ = దేనికిని, శేషం=ఉపకరణము, న భవతి=కాదు. అయం ఆత్మా=ఈయాత్మ, గౌణమిథ్యాముఖ్యభూతైః=గౌణాత్మ యనియు, మిథ్యాత్మ యనియు, ముఖ్యాత్మ యనియు నిట్టి భేదములచేత, త్రిధా = మూఁడు విధములు గలది, భవతి=అగుచున్నది.

తా. మంచిది. నీవు శ్రుత్యర్థముచేతను లోకానుభవముచేతను ఆత్మ యన్యమునకును నంగ మంటివి. అట్లు గాదు. ఆత్మ (1) గౌణాత్మ (2) మిథ్యాత్మ (3) ముఖ్యాత్మ యని మూఁడు తెఱంగులుగా చెప్పనగును.

అవ. ఆత్మ గౌణ మని చెప్పఁబడినట్లు లోకమం దుదాహరణము:—

శ్లో. దేవదత్తస్తు సింహోఽయమిత్యైక్యం గౌణమేతయోః,
భేదస్య భాసమానత్వాత్పుత్రాదే రాత్మతా తథా. 40

వ్యా. తత్ర పుత్రాదేర్గౌణాత్మత్వప్రదర్శనాయ లోకే గౌణప్రయోగముదాహరతి—దేవదత్త ఇతి. అయం దేవదత్తః సింహ ఇతి యత్ దేవదత్తసింహయోరైక్యం తద్గౌణమౌపచారికం, తత్ర హేతుమాహ—ఏతయోరితి. దార్ష్టాంతికే యోజయతి—పుత్రాదేరితి.

టీ. అయం దేవదత్తస్తు=ఈదేవదత్తుఁడయితే, సింహ ఇతి=సింహ మనెడి వ్యవహార మందు, ఏతయోః=ఈ దేవదత్తసింహములకు, భేదస్య = భేదము, భాసమానత్వాత్ = స్ఫురించుటవలన, ఐక్యం=ఆరెండింటికిని గల ఏకత్వము, గౌణం=ఔపచారిక మగును. తథా=అప్రకారము, పుత్రాదేః=పుత్త్రుఁడు మున్నగువానికి, ఆత్మతా=ఆత్మత్వము గౌణ మగును.

తా. దేవదత్తుఁడు సింహము అనునప్పుడు సింహమువంటివాఁడని యర్థము గాని, సింహమును అతఁడును నొకరే యని యర్థము కాదు. అట్టులే నా కుమారుఁడే నే ననుటలో కుమారుఁడును తానును నొక్కటియే యని యర్థము కాదు. లాభనష్టములయందు పుత్త్రాదులు తనయంత బాధ్యులే యని మాత్ర మర్థము.

అవ. మిథ్యాత్వమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. భేదోఽస్తి పంచకోశేషు సాక్షిణో న తు భాత్యసౌ,
మిథ్యాత్మతాఽతః కోశానాం స్థాణోశ్చోరాత్మతా యథా. 41

వ్యా. అనంతరం మిథ్యాత్మానం దర్శయతి—భేద ఇతి. పంచకోశేష్వానందమయాద్యన్నమయాంతేషు పంచసు కోశేషు సాక్షిణస్సకాశాద్విద్యమానోఽపి భేదో నావభాసతే. అతస్తేషాం మిథ్యాత్మత్వమిత్యర్థః. మిథ్యాత్మత్వే దృష్టాంతమాహ—స్థాణోరితి. వస్తుతశ్చోరాద్భిన్నస్య స్థాణోశ్చోరరూపత్వం యథా మిథ్యా తద్వదిత్యర్థః.

టీ. పంచకోశేషు=అన్నమయాదికోశములందు, సాక్షిణః=సాక్షియగు నాత్మకు, భేదః=భేదము, అస్తి=కలదు. అసౌ=ఈభేదము, న తు భాతి=ప్రకాశింపదు. అతః=ఈ హేతువువలన, స్థాణోః = మోడునకు, చోరాత్మతా యథా=చోరాత్మకత్వమువలె, కోశానాం=పంచకోశములకు, మిథ్యాత్మతా=మిథ్యాత్మత్వము, తథా=అట్టిది.

తా. అన్నమయాది పంచకోశములందును, తత్సాక్షియగు కూటస్థునకును భేదము కలదు. అయినను నది తెలియుట లేదు గాన పొలములో పాతిన మొద్దు దొంగ గాకపోయినను, దొంగ యని భ్రమించినట్లు, పంచకోశములు ఆత్మ గాకపోయినను నయ్యవి యాత్మ యని భ్రమింతురు గాన నయ్యవి మిథ్యాత్మ మనఁబడును.

అవ. ముఖ్యాత్మత్వమును నిరూపించుచున్నాఁడు.—

శ్లో. న భాతి భేదో నాప్యస్తి సాక్షిణోఽప్రతియోగినః,
సర్వాంతరత్వాత్తస్యైవ ముఖ్యమాత్మత్వమిష్యతే. 42

వ్యా. ఏవం గౌణమిథ్యాత్మానావుపపాద్యేదానీం సాక్షిణో ముఖ్యాత్మత్వ ముప పాదయతి—న భాతీతి. సాక్షిణస్సాక్షిరూపస్యాత్మనో గౌణాత్మనః పుత్రాదేరివ కస్మాదపి భేదో న భాతి మిథ్యాత్మనో దేహాదేరివ భేదో నాస్త్యపి, తత్రోభయత్ర హేతుః, అప్రతి యోగిన ఇతి హేతుగర్భితం విశేషణమప్రతియోగిత్వాద్యథా పుత్రాదేర్దేహాదేరపి స్వయం ప్రతియోగి విద్యతే నైవం స్వస్య వస్తుభూతః కశ్చిత్ప్రతియోగ్యస్తి దేహాదే స్సర్వస్యారోపితత్వాదితి భావః. నను భేదాభావేన సాక్షిణో గౌణమిథ్యాత్మత్వే మా భూతాం. ముఖ్యాత్మత్వం తు కుత ఇత్యత ఆహ—సర్వేతి. సర్వస్మాద్దేహపుత్రాదేరాంత రత్వా త్సర్వసాక్షిణః ప్రతీచస్సర్వాంతరత్వేన ప్రతీయమానత్వా త్తస్యైవ సాక్షిణ ఏవాత్మత్వం ముఖ్యమనౌపచారికమిష్యతే అభ్యుపగమ్యత ఇత్యర్థః. అత్రేదమనుమానం సూచితం—విమతస్సాక్షీ ముఖ్యాత్మా భవితుమర్హతి సర్వాంతరత్వాత్. యో ముఖ్యాత్మా న భవతి స సర్వాంతరోఽపి న భవతి యథాహంకారాదిరితి కేవలవ్యతిరేకీ.

టీ. అప్రతియోగినః = తనతో సమాన మగు మఱియొక సత్యవస్తువు లేని, సాక్షిణః=ఆత్మకు, భేదః=భేదము, న భాతి=ప్రకాశించుటలేదు. నాప్యస్తి=లేనేలేదు. సర్వాంతరత్వాత్ = అన్నిటికిని లోని దగుటవలన, తస్యైవ=ఆసాక్షికే, ముఖ్యం = ముఖ్యమైన, ఆత్మత్వం=ఆత్మత్వము, ఇష్యతే = అంగీకరింపఁబడుచున్నది.

తా. సాక్షిచైతన్యము తనకంటె వేఱగు సత్యపదార్థము లేమిం జేసి దేనికంటెను వేఱు గాదు. అందువలన నది కనుపించదు. అన్నిటికి నంతరాత్మ గనుక ముఖ్యాత్మ యనంబడును.

అవ. ఇట్లు ఆత్మ త్రివిధముగాక, పుత్రులే ముఖ్యాత్మ యని చెప్పెడి శ్రుతి కేమి సమాధాన మనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యేవం వ్యవహారేషు యేషు యస్యాత్మతోచితా,
తేషు తస్యైవ శేషిత్వం సర్వస్యాన్యస్య శేషతా. 43

వ్యా. భవత్వాత్మత్రైవిధ్యం. పుత్రాదేశ్శేషిత్వాభిధానే కిమాయాతమిత్యత ఆహ—సత్యేవమితి. ఏవమాత్మత్రైవిధ్యే సత్యపి ఏషు లౌకికవైదికలక్షణేషు పాలన పోషణబ్రహ్మోత్తత్వానుసంధానాదిషు వ్యవహారవిశేషేషు యస్య పుత్రాదేర్దేహాదేస్సాక్షిణో వా ఆత్మత్వముచితం భవతి తేషు తస్య పుత్రాదేర్దేహాదేః సాక్షిణో వా శేషిత్వం ప్రధానత్వం అన్యస్య తద్వ్యతిరిక్తస్య సర్వస్య శేషతా ఉపసర్జనత్వం భవతీతి శేషః.

టీ. ఏవం సతి=ఇట్లుండఁగా, యేషు వ్యవహారేషు = ఏ వ్యవహారములయందు (పాలన పోషణ బ్రహ్మోత్తత్వానుసంధానాది వ్యవహారములయందు), యస్య=ఏపుత్రాది కమునకు, ఆత్మతా = ముఖ్యాత్మత్వము, ఉచితా = తగియున్నదో, తేషు = అవ్యవ

హారములయందు, తస్యైవ=ఆపుత్రాదికమునకే, శేషిత్వం=ప్రాధాన్యము, భవతి=అగును. అన్యస్య=ఇతరమైన, సర్వస్య=సకలమునకు, శేషతా=అప్రాధాన్యము, (అగుచున్నది.)

తా. ఇట్లు ఆత్మకు త్రైవిధ్యము గలుగుచుండఁగా, ఏలౌకిక వైదికలక్షణములు గల పాలనపోషణబ్రహ్మతత్త్వానుసంధానాది వ్యవహారవిశేషములందు, ఏపుత్రాదికమున కయినను, దేహాదికమునకైనను, సాక్షికైనను ముఖ్యాత్మత్వము తగియుండునో అట్టి వ్యవహారముల యందు ఆ పుత్రాదికమునకైనను, దేహాదికమునకైనను, సాక్షికైనను ముఖ్యాత్మత్వమును, దానికంటె అన్యమగు సర్వమునకును అముఖ్యత్వమును జెప్పవలయును.

అవ. దీనినే స్పష్టీకరించుచున్నాఁడు:—

శ్లో. ముమూర్షోర్గృహరక్షాదౌ గౌణాత్మైవోపయుజ్యతే,
న ముఖ్యాత్మా న మిథ్యాత్మా పుత్రః శేషీ భవత్యతః. 44

వ్యా. ఏతదేవ ప్రపంచయతి—ముమూర్షోరిత్యాదినా శ్లోకపంచకేన, గృహరక్షాదౌ కర్మవిశేషే గౌణాత్మైవ పుత్రభార్యాదిరూప, ఏవోపయుజ్యతే ఉపయుక్తో భవతి. ఉత్తరత్ర జిజీవిషుత్వాదిత్యర్థః. ముఖ్యాత్మా సాక్షీ నోపయుజ్యతే. అవికారిత్వాన్నాపి మిథ్యాత్మా. తస్య మరణోన్ముఖత్వాదితి భావః. ఫలితమాహ—పుత్ర ఇతి. స్పష్టం.

టీ. ముమూర్షోః = చావసిద్ధమైనవానికి, గృహరక్షాదౌ = ఇల్లు కాపాడుట మొదలగు పనులయందు. గౌణాత్మైవ = గౌణాత్మయగు పుత్రుఁడే, ఉపయుజ్యతే = ఉపకరించుచున్నాఁడు, ముఖ్యాత్మా = ముఖ్యాత్మయగు సాక్షిచైతన్యము, న (ఉపయుజ్యతే)=ఉపయోగింపదు. మిథ్యాత్మా=మిథ్యాత్మయగు శరీరము, న =ఉపకరింపదు. అతః = ఈహేతువువలన, పుత్రః=గౌణాత్మయగు పుత్రుఁడు, శేషీ = ప్రధానుఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా. చనిపోయెడువాఁడు తన కుటుంబవ్యవహారముల నెరవేర్చుటకొఱకుఁ బుత్రునే యపేక్షించును. ఆ పనికి శీఘ్రముగా నశింపఁబోవు శరీరముగాని, నిర్వికారమగు ముఖ్యాత్మగాని ఉపయోగింపదు. అందుచేత గౌణాత్మ యగు పుత్రుఁడే యప్పుడు ప్రధానుఁ డగును.

అవ. గృహరక్షాదివ్యవహారములలో గౌణాత్మ యగు పుత్రుని నేల స్వీకరింపవలె ననినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అధ్యేతా వహ్నిరిత్యత్ర సన్నప్యగ్నిర్న గృహ్యతే,
అయోగ్యత్వేన యోగ్యత్వా ద్వటురేవాత్ర గృహ్యతే. 45

వ్యా. ఉక్తే గృహరక్షాదివ్యవహారే సత్యపి స్వస్మిన్ పుత్రాదిస్వీకారే దృష్టాంతమాహ—అధ్యేతేతి. అయమధ్యేతా వహ్నిరిత్యస్మిన్ ప్రయోగే స్వరూపేణ విద్యమానోఽప్యగ్నిశబ్దార్థత్వేన న గృహ్యతే తస్యాధ్యేతృత్వాయోగాత్. కింతు అధ్యేతృత్వే యోగ్యో వటుర్మాణవకఏవ అత్రాస్మిన్ప్రయోగే అగ్నిశబ్దార్థత్వేన గృహ్యతే యోగ్యత్వా దిత్యర్థః.

టీ. వహ్నిః=అగ్ని, అధ్యేతేతి=అధ్యయనము చేయునదియగు ననెడి, అత్ర = ఈప్రయోగమందు, అగ్నిః=అగ్ని, సన్నపి = సమీపమందుండినను, అయోగ్యత్వేన = యోగ్యత్వము లేమిచే, న గృహ్యతే = అది గ్రహింపఁబడదు. అత్ర = ఈప్రయోగమందు, వటురేవ = వటుఁడే, యోగ్యత్వాత్ = అధ్యయనము చేయుటకు యోగ్యుఁడగుటవలన, గృహ్యతే = అగ్నిశబ్దమువలన గ్రహింపఁబడును.

తా. ఈ చదువుకొనెడు వటువు అగ్నియే యని యెవఁడేని పల్కెనేని యగ్నిసముఁడగు వటువునే గ్రహించెదము గాని యగ్నిని గ్రహింపము. అగ్నికి అధ్యయనము చేయునట్టి సామర్థ్యము లేదు గాన దానిని గ్రహింపఁజాలము. అట్లే గృహరక్షణాదివ్యాపారములందు మరణామునకు సంసిద్ధుఁడగు తా నుపయోగింపఁడు గాన గౌణాత్మ యగు పుత్రుఁడే స్వీకరింపఁబడుచున్నాఁడు.

అవ. మిథ్యాత్మత్వప్రాధాన్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కృశోఽహం పుష్టిమాప్స్యామీత్యాదౌ దేహాత్మతోచితా,
న పుత్రం వినియుఙ్క్తేఽత్ర పుష్టిహేత్వన్నభక్షణే. 46

వ్యా. ఏవం గౌణాత్మప్రాధాన్యస్థలముదాహృత్య మిథ్యాత్మప్రాధాన్యస్థలముదాహరతి—కృశ ఇతి. అహం కృశో జాతః. అతోఽన్నభక్షణాదినా పుష్టిం సంపాదయిష్యా మీత్యాదౌ లోకవ్యవహారేఽన్నభక్షణయోగ్యస్య దేహస్యైవాత్మత్వం గ్రహీతుముచితం ఉక్తమర్థం లోకవ్యవహారప్రదర్శనేన ద్రఢయతి—పుత్రమితి.

టీ. అహం = నేను, కృశః=చిక్కియున్నాను. పుష్టిం=బలమును, ఆప్స్యామి = పొందఁగలను. ఇత్యాదౌ = ఈమొదలగు వ్యవహారమునందు, దేహాత్మతా = మిథ్యాభూత మగు దేహాత్మతయే, ఉచితం = గ్రహింపఁదగినది, అత్ర = ఈపుష్టి, హేత్వన్నభక్షణే = బలమునకు కారణమగు నన్నభక్షణమునందు, పుత్రం = కుమారుని, న వినియుఙ్క్తే = ఉపయోగింపఁడు.

తా. నేను చిక్కియున్నాను. నాకు బలము కావలెను. అని యపేక్షించినపుడు, పుష్టిహేతు వగు నన్నభక్షణమునకు తగిన, మిథ్యాత్మభూతమగు శరీరమే యుపయోగింపఁబడుచున్నది. గౌణాత్మ యగు పుత్త్రుఁ డచట నుపయోగింపఁబడఁడు. (ఆపని కాతఁ డనర్హుఁడు గాన.) ఇట్టిచోట మిథ్యాత్మయగు శరీరము గౌణాత్మ యగు పుత్త్రుని కంటె ముఖ్యమైనది.

అవ. మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తపసా స్వర్గమేష్యామీత్యాదౌ కర్త్రాత్మతోచితా,
అనపేక్ష్య వపుర్భోగం చరేత్కృచ్ఛ్రాదికం తతః. 47

వ్యా. కించ—తపసేతి. యదా తు తపః కృత్వా స్వర్గం సంపాదయిష్యామీత్యాది వ్యవహారం కరోతి తదా కర్తృశబ్దవాచ్యవిజ్ఞానమయస్యైవాత్మత్వముచితం, న దేహాదే రిత్యర్థః. తదేవోపపాదయతి—అనపేక్ష్యేతి. యతో న దేహస్యాత్మత్వ ముచితం తతో దేహభోగపరిత్యాగపూర్వకం కర్తురుపకారకం కృచ్ఛ్రచాంద్రాయణాదికం చరతీత్యర్థః.

టీ. తపసా = తపస్సుచేత, స్వర్గం = స్వర్గమును, ఏష్యామి = పొందఁగలను. ఇత్యాదౌ=ఇది మొదలగు వ్యవహారమునందు (యతః=ఏహేతువువలన), వపుర్భోగం= శరీరభోగమును, అనపేక్ష్య = కోరక, కృచ్ఛ్రాదికం = కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములను, చరేత్ = ఆచరించునో, తతః = ఆహేతువువలన, కర్త్రాత్మతా=మిథ్యాభూతమగు కర్త్రాత్మకత్వము, ఉచితా = తగియున్నది.

తా. నేను తపస్సు నాచరించి స్వర్గమును పొందెద నని యెంచినవాఁడు శరీరభోగములను త్యజించి, యుపవాసముల నొనర్చుచున్నాఁడు. ఈపనికి మిథ్యాత్మ యగు స్థూలశరీర ముపయోగపడదు. అందువలన నట్టి కర్త్రాత్మయే యావ్యవహారమునందు ప్రధాన మగుచున్నది.

అవ. ముఖ్యాత్మస్థలము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. మోక్ష్యేఽహమిత్యత్ర యుక్తం చిదాత్మత్వం తదా పుమాన్,
తద్వేత్తి గురుశాస్త్రాభ్యాం న తు కించిచ్చికీర్షతి. 48

వ్యా. కించ మోక్ష్యేఽహమితి. యదా పుమాన్ శమాదీన్సంపాద్య ముక్తిం ప్రాప్స్యామీతి మతిం కరోతి—తదా గురుశాస్త్రాభ్యామార్యోపదేశవాక్యార్థవిచారజన్యాపరోక్షజ్ఞానేనాహం కర్త్రాద్యాత్మా సచ్చిదానందబ్రహ్మాహమస్మీతి చిదాత్మానమవ

గచ్ఛతి. తస్య చిదాత్మత్వమేవోచితం. నను తత్ర కర్త్రాద్యాత్మత్వమిత్యర్థః. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' 'విజ్ఞానమానందం బ్రహ్మ' 'అనంతరో బాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘనఏవే'త్యాదిశ్రుతేః.

టీ. అహం=నేను, మోక్ష్యే = ముక్తుఁడ నగుదును, ఇత్యత్ర=ఇట్టి వ్యవహారమునందు, చిదాత్మత్వం = చైతన్యాత్మకత్వము, యుక్తం = తగియున్నది. తదా = ఆ సమయమునందు, పుమాన్ = పురుషుఁడు, గురుశాస్త్రాభ్యాం = గురువుచేతను, శాస్త్రముచేతను, తత్ =ఆచిదాత్మకత్వమును, వేత్తి=తెలిసికొనుచున్నాఁడు, కించిత్ = ఇంచుకయును, న చికీర్షతి = చేయనెంచఁడు.

తా. నేను ముక్తుఁడ నగుదును అని వ్యవహరించునపుడు, మిథ్యాత్మ యగు దేహము మోక్షమున కర్హము కాదు. గౌణాత్మ యగు పుత్త్రుఁడును దాని కర్హుఁడు కాఁడు. చిద్రూపమగు తన స్వరూపమే యర్హము కాన నదియే యా వ్యవహారమునందు ముఖ్యము.

అవ. ఆయా వ్యవహారములం దయ్యవియే ప్రధానము లనుటకు దృష్టాంతము:—

శ్లో. విప్రక్షత్త్రాదయో యద్వద్బృహస్పతిసవాదిషు,
వ్యవస్థితా స్తథా గౌణమిథ్యాముఖ్యా యథోచితమ్. 49

వ్యా. ఉదాహృతానాం త్రివిధానామాత్మనాం వ్యవహారవిశేషేషు వ్యవస్థయా ప్రాధాన్యే దృష్టాంతమాహ—విప్రేతి. యథా 'బ్రాహ్మణో బృహస్పతిసవేన యజే' తేత్యత్ర బ్రాహ్మణస్యైవాధికారో న క్షత్త్రియవైశ్యయోః. 'రాజా రాజసూయేన యజే'తేత్యత్ర రాజ్ఞఏవాధికారో న బ్రాహ్మణవైశ్యయోః. 'వైశ్యో వైశ్యస్తోమేన యజే' తేత్యత్ర వైశ్యస్యైవాధికారో నేతరయోః. ఏవం గౌణమిథ్యాముఖ్యభేదానామాత్మనాం యథా యోగ్యం స్వోచితవ్యవహారేషు ప్రాధాన్య మితి భావః.

టీ. విప్రక్షత్త్రాదయః = బ్రాహ్మణుఁడు క్షత్త్రియుఁడు మొదలగువారలు, బృహస్పతిసవాదిషు=బృహస్పతిసవనము మొదలగు క్రతువులయందు, యథా = ఏవిధముగా, వ్యవస్థితాః = నియమింపఁబడియున్నారో, తథా = ఆవిధముగా, యథోచితం = తగురీతిని, గౌణమిథ్యాముఖ్యాః = గౌణమిథ్యాముఖ్యాత్మలు, వ్యవస్థితాః = నియమింపఁబడియున్నవి.

తా. బృహస్పతిసవన మను క్రతువునందుఁ బ్రాహ్మణుఁడే ముఖ్యుఁడు. రాజసూయయాగమున క్షత్త్రియుఁడే ప్రధానుఁడు. వైశ్య

స్తోమమునకు వైశ్యుఁడే యర్హుఁడు. ఇట్లే గృహరక్షణమునకు గౌణాత్మ యగు పుత్త్రుఁడును, పుష్టికి మిథ్యాత్మ యగు శరీరమును, ముక్తికి చిద్రూపాత్మయు ముఖ్యములు.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తత్ర తత్రోచితే ప్రీతిరాత్మన్యేవాతిశాయినీ,
అనాత్మని తు తచ్ఛేషే ప్రీతిరన్యత్ర నోభయమ్. 50

వ్యా. ఫలితమాహ—తత్ర తత్రేతి. యస్మిన్ యస్మిన్వ్యవహారే యో య ఆత్మా ఉచితో భవతి. తత్ర తత్ర తస్మింస్తస్మిన్వ్యవహారే ఉచితే ఉపయోగితయా ప్రధాన భూతే ఆత్మన్యేవ ప్రీతిరతిశాయినీ అతిశయవతీ, తచ్ఛేషే తస్యాత్మనః శేషే శేష భూతేఽనాత్మని ఆత్మవ్యతిరిక్తే వస్తుని ప్రీతిః ప్రీతిమాత్రం న నిరతిశయం ప్రేమేత్యర్థః. అన్యత్ర ఆత్మతచ్ఛేషాభ్యామన్యస్మిన్వస్తుని నోభయముభయవిధమపి ప్రేమ నాస్తీత్యర్థః.

టీ. తత్ర తత్ర = అక్కడక్కడ, ఉచితం=తగిన, ఆత్మన్యేవ=ఆత్మయందే, అతిశాయినీ=అధికమైన, ప్రీతిః=ప్రేమ, అస్తి=కలదు. తచ్ఛేషే=ఆట్టియాత్మకు పరికరమగు, అనాత్మని తు=అనాత్మయందైతే, ప్రీతిః=ప్రేమమాత్రము, అన్యత్ర = ఇతరస్థలమందు, ఉభయం = ఉభయమును, న = లేదు.

తా. ఏ వ్యవహారమందే యాత్మయో, దానియం దధికప్రీతి యుండును. దాని యుపకరణమునందు ప్రీతిమాత్ర ముండును. తక్కిన వానియందు ప్రీతి గాని పరమప్రీతి గాని యేదియు నుండదు.

అవ. 'అన్యత్ర న' అని చెప్పిన యన్యపదార్థమును విభజించుచున్నాఁడు:—

శ్లో. ఉపేక్ష్యం ద్వేష్యమిత్యన్యద్ద్వేధా మార్గతృణాదికం,
ఉపేక్ష్యం వ్యాఘ్రసర్పాది ద్వేష్యమేవం చతుర్విధమ్. 51

వ్యా. అన్యత్ర నోభయమిత్యత్రాభిహితస్యాన్యశబ్దార్థస్యావాంతరభేదమాహ— ఉపేక్ష్యమితి. అన్య దన్యదిత్యుచ్యమానం వస్తు ఉపేక్ష్యం ఉపేక్షావిషయః ద్వేష్యం ద్వేషవిషయశ్చేతి ద్విధా ద్విప్రకారం భవతి. తదుభయముదాహరతి—మార్గేతి. మార్గగతం తృణలోష్టాదికముపేక్ష్యం స్వస్యోపద్రవహేతుర్వ్యాఘ్రాదికం ద్వేష్య మిత్యర్థః. ఫలితమాహ—ఏవమితి.

టీ. అన్యత్ =అన్యపదార్థము, ఉపేక్ష్యం=ఉపేక్ష్య మనియు, ద్వేష్యం=ద్వేష్య మనియు, ద్వేధా=రెండు విధములు. మార్గతృణాదికం=మార్గమందలి గడ్డిపరక మొదలగునది, ఉపేక్ష్యం=ఉపేక్ష్య మని చెప్పఁబడును. వ్యాఘ్రసర్పాది=పెద్దపులి పాము మొద

లగునవి, ద్వేష్యం=ద్వేష్య మని చెప్పఁబడును. ఏవం=ఈవిధముగా(పదార్థః=పదార్థము), చతుర్విధం=నాల్గు విధములు గలది.

తా. ముఖ్యాముఖ్యాత్మలకంటె (ఆత్మ తచ్ఛేషములకంటె) అన్య శబ్దముచేఁ జెప్పఁబడు వస్తువు ఉపేక్ష్యము, ద్వేష్యము నని ద్వివిధము. మార్గమందుండు గడ్డిపోచ మట్టిగడ్డ మొదలగునవి ఉపేక్ష్యములు. ఉపద్రవమును గలిగించు వ్యాఘ్రసర్పాదులు ద్వేషవిషయములు. ఈ ప్రకారము లోకమందు చతుర్విధవస్తువులు గలవు.

అవ. ఈ చాతుర్విధ్యమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా శేష ఉపేక్ష్యం చ ద్వేష్యం చేతి చతుర్ష్వపి,
న వ్యక్తినియమః కింతు తత్తత్కార్యాత్తథాతథా. 52

వ్యా. చాతుర్విధ్యమేవ దర్శయతి—ఆత్మేతి. నన్వాత్మాదీనాం చతుర్ణామతి ప్రియతమత్వాదికం కిం నియతం? నేత్యాహ—చతుర్ష్వపీతి. అయమేవ ప్రియత మోఽయమేవ ప్రియః. ఇదమేవోపేక్ష్యం. ఇదమేవ ద్వేష్యం నాన్యదితి నియమో నాస్తీత్యర్థః. కిం తర్హి త్యత ఆహ—కింత్వితు. తస్మాత్తస్మాత్కార్యవిశేషాదుపకారాది రూపాత్తథాతథా ప్రియాదిరూపేత్యర్థః.

టీ. ఆత్మా=ఆత్మ యనియు, శేషః=శేష మనియు, ఉపేక్ష్యం చ=ఉపేక్ష్య మనియు, ద్వేష్యం చేతి=ద్వేష్య మనియు, చతుర్ష్వపి=నాల్గింటిలో, వ్యక్తినియమః = వ్యక్తినియమము, న=లేదు. కింతు=ఇంక నే మనఁగా, తత్తత్కార్యాత్ = ఆయాపని వలన, తథా తథా=ఆయావిధముగా (భవతి=అగుచున్నది.)

తా. ఆత్మ, శేషము, ఉపేక్ష్యము, ద్వేష్యము అను నాల్గింటిలో నిది శేషమే యనియు, నిది యుపేక్ష్యమే యనియు, మొదలగు నీలాటి నియమములు లేవు. కార్యవశమున నొక్క వస్తువే భిన్న భిన్నములు కావచ్చును.

అవ. దీనినే యుపపాదించుచున్నాఁడు:—

శ్లో. స్యాద్వ్యాఘ్రస్సమ్ముఖో ద్వేష్యో హ్యుపేక్ష్యస్తు పరాఙ్ముఖః,
లాలనాదనుకూలశ్చే ద్వినోదాయేతి శేషతామ్. 53

వ్యా. సర్వత్రాప్యనియమయోజనాయ ప్రసిద్ధే ద్వేష్యవ్యాఘ్రే తదభావం దర్శ యతి—స్యాదితి. యదా వ్యాఘ్రః స్వభక్షణాయ సంముఖ ఆగచ్ఛతి తదా ద్వేష్యో భవతి. స ఏవ పరాఙ్ముఖో గచ్ఛతి చే దుపేక్ష్యో భవతి స ఏవ యది లాలనాత్

స్వానుకూలో భవతి తదా వినోదాయేతి వినోదసాధనం భవతీతి శేషతాం స్వస్యోపకారకత్వేన ప్రియత్వం భజత ఇత్యభిప్రాయః.

టీ. వ్యాఘ్రః=పెద్దపులి, సమ్ముఖః = ఎదురుగా వచ్చెనేని, ద్వేష్యః=ద్వేషింపఁదగినది, స్యాత్=అగును. పరాఙ్ముఖః=పెడమొగము పెట్టి పోవుచున్నదైన, ఉపేక్ష్యః=ఉపేక్షింపఁదగినది, స్యాత్ = అగును. లాలనాత్ = మచ్చికచేయుటవలన, అనుకూలశ్చేత్=అనుకూలమయ్యెనేని, వినోదాయ = వినోదముకొఱకు, శేషతాం=శేషత్వమును, ఏతి=పొందును.

తా. వ్యాఘ్రము తన కెదురుగా వచ్చెనేని ద్వేష్య మగును. అదియే తన్ను చూడక మఱియొక త్రోవను పోవుచుండె నేని యుపేక్ష్యమగును. అదియే మచ్చికచే శేషముగా (అనుకూలముగా) చేయఁబడెనేని తన వినోదముకొఱ కగును (శేష మగును).

అవ. ఒక్కటే మూఁడు విధము లగునేని వ్యవహారమునకు కట్టుబాటు లేక పోవునుగదా యని శంకించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యక్తీనాం నియమో మా భూల్లక్షణాత్తు వ్యవస్థితిః,
ఆనుకూల్యం ప్రాతికూల్యం ద్వయాభావశ్చ లక్షణమ్. 54

వ్యా. నన్వేకస్యైవ వస్తునః ప్రియత్వాదిధర్మత్రయాంగీకారే వ్యవహారవ్యవస్థా న స్యాదిత్యాశంక్యాహ—వ్యక్తీనామితి. వ్యక్తినియమాభావేఽపి లక్షణవశాద్వ్యవస్థా భవిష్యతీత్యర్థః. కిం లక్షణమిత్యాకాంక్షాయాం తల్లక్షణమాహ—ఆనుకూల్యమితి, అనుకూలత్వం ప్రియస్య లక్షణం వ్యావర్తకో ధర్మః. ప్రతికూలత్వం ద్వేష్యస్య లక్షణం. ఉపేక్ష్యస్య ఆనుకూల్యప్రాతికూల్యరూపద్వయాభావశ్చ లక్షణమిత్యర్థః.

టీ. వ్యక్తీనాం=వ్యక్తులకు, నియమః = కట్టుపాటు, మా భూత్ = లేకపోనిమ్ము, లక్షణాత్=లక్షణమువలననైతే, వ్యవస్థితిః=వ్యవస్థ (అగుచున్నది). ఆనుకూల్యం=అనుకూలత్వము, ప్రాతికూల్యం = ప్రతికూలత్వము, ద్వయాభావశ్చ = రెండును లేకపోవుటయు, లక్షణం=లక్షణము, భవతి=అగుచున్నది.

తా. ఇది ద్వేష్యము, ఇది యుపేక్ష్యము అని వ్యక్తినియమము లేకపోయినను, అనుకూలత్వము శేషమునకు లక్షణము. ప్రతికూలత్వము ద్వేషమునకు లక్షణము. ఈ రెండును లేకపోవుట యుపేక్ష్యమునకు లక్షణము.

అవ. ఇదివఱలోఁ జెప్పినదానినే సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మా ప్రేయాన్ ప్రియశ్శేషో ద్వేషోపేక్షే తదన్యయోః,
ఇతి వ్యవస్థితో లోకో యాజ్ఞవల్క్యమతం చ తత్. 55

వ్యా. ఏతావతా గ్రంథసందర్భేణోపపాదితమర్థం బుద్ధిసౌకర్యాయ సంక్షిప్య కథయతి—ఆత్మేతి. ఆత్మా ప్రత్యగానందః ప్రేమ్ణానతిశయేన ప్రియః శేషః స్వోపసర్జనభూతఃపదార్థః ప్రియస్తదన్యయోస్తాభ్యామాత్మన స్తచ్ఛేషాచ్చాన్యయోః వ్యాఘ్రపథిగతతృణాదిరూపయో ర్ద్వేషోపేక్షే యథాక్రమం భవత ఇతి. ఏవం చాతుర్విధ్యేన లోకో వ్యవస్థితః వ్యవస్థాం ప్రాప్తః ఉక్తప్రకారచతుష్టయాతిరిక్తం న కించిద్విద్యత ఇత్యభిప్రాయః. అయమర్థః శ్రుత్యభిమతోఽపీత్యాహ—యాజ్ఞవల్క్యేతి. ఆత్మాదీనాం ప్రియతమత్వాదికం యత్తద్యాజ్ఞవల్క్యమతం చ యాజ్ఞవల్క్యస్యాపి సమ్మతమిత్యర్థః.

టీ. ఆత్మా=ఆత్మ, ప్రేయాన్=పరమప్రేమాస్పదమైనది, శేషః = అనుకూలమైన వస్తువు, ప్రియః = ప్రియమైనది, తదన్యయోః = ఈరెండింటికన్నను వేఱైనవస్తువులయందును, ద్వేషోపేక్షే = ద్వేషమును ఉపేక్షయు (భవతః = అగుచున్నవి). ఇతి = ఇట్లు, లోకః=లోకము, వ్యవస్థితః=నియమితమైనది, యాజ్ఞవల్క్యమతం చ = యాజ్ఞవల్క్యమహర్షియొక్క సిద్ధాంతమును, తత్ = అదియే.

తా. ఆత్మ పరమప్రేమాస్పదమైనది, తన కనుకూలమగువస్తువు ప్రియము. ప్రతికూలమగునది ద్వేష్యము. ఈరెండును కానిది ఉపేక్ష్యము అని లోకము విభజింపఁబడినది. ఇదియే యాజ్ఞవల్క్యమహర్షి సిద్ధాంతము.

అవ. ఈయర్థమునకు మఱియొక శ్రుతిప్రమాణమును జూపుచున్నాఁడు:—

శ్లో. అన్యత్రాపి శ్రుతిః ప్రాహపుత్రాద్విత్తాత్తథాత్మనః,
సర్వస్మాదాంతరం తత్త్వం తదేతత్ప్రేయ ఈరితమ్. 56

వ్యా. న కేవలం మైత్రేయీబ్రాహ్మణ ఏవాత్మనః ప్రియతమత్వముక్తం. కింతు పురుషవిధబ్రాహ్మణేఽపీత్యభిప్రాయేణ తద్వాక్యార్థం సంగృహ్ణాతి—అన్యత్రాపీతి. 'తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదంతరంయదయమాత్మే'త్యనేన వాక్యేవ పుత్రవిత్తాదేస్సర్వస్మాదాంతరస్యాత్మతత్త్వస్య ప్రియత్వమీరితమిత్యర్థః.

టీ. అన్యత్ర = మఱియొకస్థలమందు, శ్రుతిః = శ్రుతి, పుత్రాత్ = కుమారునికంటెను, తథా=అవిధముగనే, విత్తాత్ = ధనముకంటెను, సర్వస్మాత్ = సమస్తపదార్థ

ములకంటెను, తదేతత్ = అయా, ఆత్మనః = ఆత్మయొక్క, తత్త్వం = స్వరూపము, ప్రేయః = ప్రియతరమైన దని, ఈరితం = చెప్పఁబడినది.

తా. కుమారునికంటెను, ధనముకంటెను, సమస్తపదార్థములకంటెను, ఆత్మతత్త్వమే ప్రియతమ మని 'తదేతత్ప్రేయః...యదయమాత్మా' అను శ్రుతి చెప్పుచున్నది.

అవ. సాక్షియే ముఖ్యాత్మ యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రౌత్యా విచారదృష్ట్యాయం సాక్ష్యేవాత్మా న చేతరః,
కోశాన్పంచ వివిచ్యాంతర్వస్తు దృష్టిర్విచారణా. 57

వ్యా. భవత్వేవం శ్రుతావభిధానం. ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ— శ్రౌత్యేతి. శ్రుత్యర్థపర్యాలోచనరూపయా విచారదృష్ట్యా సాక్షిణ ఏవ ముఖ్యమాత్మత్వం నేతరస్య పుత్రాదేరిత్యర్థః. విచారదృష్ట్యేత్యభిహితస్య స్వరూపమాహ—కోశానితి. అన్నమయాదీన్పంచ కోశాంస్తైత్తిరీయశ్రుత్యుక్తప్రకారేణాత్మనః పృథక్కృత్యాంతస్స్థితస్యాత్మనోఽనుభవో విచారణేత్యర్థః.

టీ. అయం = ఈ, సాక్ష్యేవ = సాక్షియే, శ్రౌత్యా=వేదసంబంధమైన, విచారదృష్ట్యా=చర్చచేత, ఆత్మా = ఆత్మ యనఁబడును. ఇతరః = మఱియొకటి, నచ = ఆత్మకాదు. పంచ = ఐదైన, కోశాన్ = కోశములను, వివిచ్య = విభజించి, అంతః=లోపల నుండునట్టి, వస్తుదృష్టి = ప్రత్యగభిన్నపరమాత్మవస్తువు (ప్రత్యగాత్మ) యొక్క వివేచనము, విచారణా = విచారణ యనంబడును.

తా. వేదములోఁ జెప్పినరీతిని విచారింపఁగా సాక్షియే యాత్మ యనియు, తద్వ్యతిరిక్తము ఆత్మ కా దనియు స్పష్టమగును. పంచకోశములను వేఱుపఱచి వానికంటెను వేఱగు ప్రత్యగాత్మను నిరూపించుటయే విచారణ యనంబడును.

అవ. అంతస్స్థిత మగు ఆత్మను కనుఁగొనువిధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. జాగరస్వప్నసుప్తీనామాగమాపాయభాసనం,
యతో భవత్యసావాత్మా స్వప్రకాశచిదాత్మకః. 58

వ్యా. అంతస్స్థితస్య వస్తునో దర్శనప్రకారమేవాహ—జాగరేత్యాదినా. జాగ్రదాద్యవస్థానాం మధ్యే ఉత్తరోత్తరావస్థాగమస్య పూర్వపూర్వావస్థానివృత్తేశ్చావభాసనం యతో నిత్యచైతన్యరూపాత్సాక్షిణో భవతి, స స్వప్రకాశచిద్రూప ఆత్మేత్యర్థః.

టీ. జాగరస్వప్నసుప్తీనాం = జాగ్రత్స్వప్నసుషుప్తు లను నవస్థలయొక్క, ఆగమాపాయభాసనం = రాకపోకలయొక్క ప్రకాశము, యతః = దేనివలన, భవతి = అగుచున్నదో, అసౌ = ఈచైతన్యరూపసాక్షి, స్వప్రకాశచిదాత్మకః=స్వయంప్రకాశ చైతన్యాత్మకమైన, ఆత్మా=ప్రత్యగాత్మ యనఁబడును.

తా. జాగ్రత్స్వప్నసుషుప్తులు క్రమముగా వచ్చుచు పోవుచు నుండఁగా వానిని గనుఁగొనెడి చైతన్యమే ప్రత్యగాత్మ యని భావము.

అవ. పైయర్థమును విశదీకరించుచున్నాఁడు:—

శ్లో. శేషాః ప్రాణాదివిత్తాంతా ఆసన్నాస్తారతమ్యతః,
ప్రీతి స్తథా తారతమ్యా త్తేషు సర్వేషు వీక్ష్యతే. 59

వ్యా. సంగ్రహేణోక్తం శ్రుత్యర్థం ప్రపంచయతి—శేషా ఇతి. సాక్షివ్యతిరిక్తాః ప్రాణాదివిత్తాంతా వక్ష్యమాణాః పదార్థాస్తారతమ్యేనాత్మన ఆసన్నాః సమీపవర్తినో భవంతి. తత్రోపపత్తిమాహ—ప్రీతిరితి. యథా తారతమ్యేనాంతరత్వం తద్వదేవ తేషు ప్రాణాదిషు తారతమ్యాత్ప్రీతిర్వీక్ష్యతే. సర్వైరపీతి శేషః.

టీ. శేషాః = శేషభూతములైన, ప్రాణాదివిత్తాంతాః = ప్రాణము మొదలుకొని విత్తపర్యంతమైన పదార్థములు, తారతమ్యతః = తారతమ్యమువలన, ఆసన్నాః=ఆత్మ సమీపవర్తనముగలవి యగుచున్నవి. తథా = అటులనే, తారతమ్యాత్ =తారతమ్యము వలన, తేషు సర్వేషు = వానియన్నింటియందు, ప్రీతిః = ప్రేమ, వీక్ష్యతే = చూడఁబడుచున్నది.

తా. ప్రాణము మొదలు ధనపర్యంతము ఒక్కొకదానికంటె నొక్కొకటి హెచ్చుతగ్గులుగా నాత్మను సమీపించుచున్నవి. కాన వానియందు ప్రేమయు న్యూనాధికభావముతో నుండును.

అవ. ఈయంశమం దనుభవమును జూపుచున్నాఁడు:—

శ్లో. విత్తాత్పుత్రః ప్రియః పుత్రా త్పిండః పిండా త్తథేంద్రియమ్,
ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా ప్రియః పరః. 60

వ్యా. ప్రీతేస్తారతమ్యేనానుభవమేవ విశదయతి—విత్తాదితి. పిండోఽన్నమయో దేహః. అయం భావః—సర్వైః ప్రాణిభిః పుత్రాదివిపత్పరిహారాయ విత్తవ్యయః క్రియతే. స్వదేహరక్షణాయ కదాచిత్పుత్రాదిరపి దీయతే. ఇంద్రియనాశపరిహారాయ తాడనాదినా. దేహపీడాప్యంగీక్రియతే. మరణప్రసక్తౌ తత్పరిహారాయేంద్రియ

వైకల్యమప్యంగీక్రియతే, అతఏవోత్తరమతిశయేన ప్రియత్వం సర్వానుభవసిద్ధం. ఆత్మనస్తు నిరతిశయప్రేమాస్పదత్వం విద్వదనుభవసిద్ధమితి.

టీ. విత్తాత్ =ధనముకంటె, పుత్రః=పుత్రుఁడు, ప్రియః=ప్రియుఁడు పుత్రాత్ = పుత్రునికంటెను, పిండః = స్థూలశరీరము, ప్రియః = ప్రియమైనది. పిండాత్ =శరీరము కంటెను, ఇంద్రియం = ఇంద్రియము, ప్రియం = ప్రియమైనది. ఇంద్రియాచ్చ = ఇంద్రియములకంటె, ప్రాణః = ప్రాణవాయువు, ప్రియః = ప్రియమైనది. ప్రాణాత్ = ప్రాణముకంటెను, ఆత్మా = ఆత్మ, పరః ప్రియః = మిగుల ప్రియమైనది.

తా. ధనముకంటె పుత్రుఁడును, పుత్రునికంటె శరీరమును, శరీరమునకంటె ఇంద్రియములును, ఇంద్రియములకంటె ప్రాణమును, ప్రాణవాయువుకంటెను (అనఁగా పైఁ జెప్పినవానికన్నిటికంటెను) ఆత్మయే మిగుల ప్రియమైనది. ఆత్మ సమస్తపదార్థములకంటెను ప్రేమయందు అధిక మని భావము.

అవ. ఈయర్థమును స్పష్టపఱచుటకై జ్ఞానియొక్కయు నజ్ఞానియొక్కయు విప్రతిపత్తి ప్రదర్శించుచున్నాఁడు:—

శ్లో. ఏవం స్థితే వివాదోఽత్ర ప్రతిబుద్ధవిమూఢయోః,
శ్రుత్యోదాహారి తత్రాత్మా ప్రేయానిత్యేవ నిర్ణయః. 61

వ్యా. ఏవమాత్మనః ప్రియతమత్వే ప్రమాణసిద్ధేఽపి జ్ఞాన్యజ్ఞానినోర్విప్రతిపత్తి నిరసనాయ శ్రుత్యా తద్విప్రతిపత్తిర్దర్శితేత్యాహ—ఏవం స్థిత ఇతి. తత్ర నిర్ణయమాహ—తత్రాత్మేతి. ఆత్మనః ప్రియతమత్వస్యోపపాదితత్వాత్.

టీ. ఏవం స్థితే = నిజ మట్లుండఁగా, అత్ర = ఈవిషయమై, ప్రతిబుద్ధవిమూఢయోః=జ్ఞానియొక్కయు నజ్ఞానియొక్కయు, వివాదః = వివాదము, శ్రుత్యా=వేదముచేత, ఉదాహారి = ఉదాహరింపఁబడినది, తత్ర = ఆ వివాదమందు, ఆత్మా = ఆత్మ, ప్రేయానిత్యేవ=ప్రియతముఁ డనియే, నిర్ణయః=నిర్ణయము.

తా. బృహదారణ్యకశ్రుతి పరమప్రేమాస్పద మెద్ది యను విషయమున జ్ఞానికిని నజ్ఞానికిని వాదము గలిగినట్లును, ఆత్మయే పరమప్రేమాస్పద మనెడి జ్ఞానియొక్క సిద్ధాంతమే నిశ్చిత మనియు వర్ణించెను.

అవ. అజ్ఞునకును బ్రహ్మవిదునకును జరిగిన వాదమును జూపుచున్నాఁడు:—

శ్లో. సాక్ష్యేవ దృశ్యాదన్యస్మాత్ప్రియానిత్యాహ తత్త్వవిత్,
ప్రేయాన్పుత్రాదిరేవేమం భోక్తుం సాక్షీతి మూఢధీః. 62

వ్యా. తామేవ విప్రతిపత్తిమాహ—సాక్షీతి.

టీ. అన్యస్మాత్ = ఇతరమైన, దృశ్యాత్ = దృశ్యమునకంటె, సాక్ష్యేవ = సాక్షియే (ప్రత్యగాత్మయే), ప్రేయానితి=మిక్కిలి ప్రియుఁడని, తత్త్వవిత్ = జ్ఞాని, ఆహ = చెప్పెను. ఇమం = ఈఆత్మను, భోక్తుం = అనుభవించుటకొఱకు, పుత్రాదిశేవ= పుత్రుఁడు మొదలగువారలే, సాక్షీ=సాక్షి యని, మూఢధీః=అజ్ఞుఁడు, ఆహ = చెప్పెను.

తా. అన్నిటికంటెను ఆత్మప్రియతమ మని బ్రహ్మవిదుని వాదము. పుత్రుఁడు, భార్యయు మొదలగునవియే తన యాత్మకంటె ప్రియతమము లని అజ్ఞునివాదము.

అవ. ఆత్మకంటె నన్యము ప్రియమని చెప్పెడివారలను విభజించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మనోఽన్యం ప్రియం బ్రూతే శిష్యశ్చ ప్రతివాద్యపి,
తస్యోత్తరం వచో బోధశాపౌ కుర్యాత్తయోః క్రమాత్. 63

వ్యా. ఆత్మాతిరిక్తస్య ప్రియత్వవాదినో విభజ్యోత్తరాభిదానాయ తమేవ వాదినం విభజ్య కథయతి—ఆత్మన ఇతి. ఉత్తరాభిధానప్రకారమాహ—తస్యోత్తరమితి. తయోః శిష్యప్రతివాదినోస్సంబంధినస్తస్య వచనస్యోత్తరం వచః ప్రత్యుత్తరరూపం వాక్యం క్రమేణ బోధశాపౌ బోధరూపం శాపరూపం చ కుర్యాదిత్యర్థః,

టీ. శిష్యశ్చ = శిష్యుఁడును, ప్రతివాద్యపి = ప్రతివాదియు, ఆత్మనః = తన యాత్మకంటె, అన్యం=అన్యవస్తువు, ప్రియం=ప్రియమని, బ్రూతే = పలుకుచున్నారు. తస్య = ఆవాక్యమునకు, ఉత్తరం = సమాధానమైన, వచః = వాక్యమును, తయోః = ఆ యిద్దరికిని, క్రమాత్ = వరుసగాను, బోధశాపౌ = బోధశాపములుగా, కుర్యాత్= చేయవలెను.

తా. తన యాత్మకంటె పుత్రాదికము ప్రియ మని భావించెడి శిష్యునకు, ఆతని యభిప్రాయము సరికా దని బోధ సేయుము. నా యభిప్రాయమే సరి యని కలహించెడి ప్రతివాదికి 'నీవు ప్రియ మని నమ్మెడి యన్య పదార్థము నిన్ను దుఃఖింపఁజేయును' అని శపింపుము.

అవ. ఈశ్రుతివాక్యమునకు నుత్తరవాక్య మగు 'స యోఽన్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియం రోత్స్యతీతి' అనునది బోధశాపప్రకారమును జెప్పుచున్నది. దాని యర్థమును వచించుచున్నాఁడు:—

శ్లో. ప్రియం త్వాం రోత్స్యతీత్యేవముత్తరం వక్తి తత్త్వవిత్,
స్వోక్తప్రియస్య దుష్టత్వం శిష్యో వేత్తి వివేకతః. 64

వ్యా. ప్రతివచనప్రదానరూపం 'స యోఽన్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియం త్వాం రోత్స్య'తీతి సమనంతర శ్రుతివాక్యమర్థతః పఠతి—ప్రియం త్వామితి. తత్త్వవిత్ శిష్యప్రతివాదినావుభావపి ప్రతి హే శిష్య హే ప్రతివాదిన్ ప్రియం త్వదభిప్రేతం పుత్రాదిరూపం స్వనాశేన త్వాం శిష్యం ప్రతివాదినం వా రోత్స్యతి రోదయిష్యతి. ఇత్యేవముక్తప్రకారేణోత్తరం ప్రతివచనం వక్తి బ్రవీతి. ఇదమేకమేవ వచనం శిష్యప్రతివాదినోరుభయోః కథముత్తరం జాతమిత్యాశంక్య శిష్యం ప్రత్యుత్తరం తావద్ద్యోతయతి—'స్వోక్తప్రియస్యే'త్యాదినా వీక్షతే త మహర్నిశ, మిత్యం తేన సార్ధశ్లోకచతుష్టయేన— స్వోక్తప్రియస్యేతి. శిష్యః స్వోక్తప్రియస్య స్వేనాభిహితస్య పుత్రాదిరూపస్య వివేకతః వక్ష్యమాణదోషవిచారేణ దుష్టత్వం వేత్తి అవగచ్ఛతి.

టీ. తత్త్వవిత్ = బ్రహ్మవిదుఁడు, ప్రియం=ప్రియమగువస్తువు, త్వాం=నిన్ను, రోత్స్యతీతి = రోదనము చేయించునని, ఉత్తరం = సమాధానమును, వక్తి = చెప్పుచున్నాఁడు. శిష్యః = శిష్యుఁడు, వివేకతః = వివేకమువలన, స్వోక్తప్రియస్య = తనచేఁ జెప్పఁబడిన ప్రియవస్తువునకు, దుష్టత్వం = దోషయుక్తత్వమును, వేత్తి=తెలిసికొనుచున్నాఁడు.

తా. బ్రహ్మవిదుఁడు నీవు ప్రియ మని నమ్మిన యన్యవస్తువు నిన్ను ఖేదింపఁజేయు నని శిష్యునితో ననును. దానిని విచారించి తా నిదివఱకు నమ్మిన పుత్రాదిపదార్థములు సదోషము లని యాతఁడు గ్రహించును.

అవ. శిష్యుఁడు గురువాక్యమువలన గ్రహించిన దోషమును గ్రంథకర్త నాలుగు శ్లోకములతో వర్ణించుచున్నాఁడు:—

శ్లో. అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్,
లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేన చ బాధతే. 65

వ్యా. దోషవిచారప్రకారమేవ దర్శయతి—అలభ్యమాన ఇతి శ్లోకత్రయేణ

టీ. అలభ్యమానః = లభింపని, తనయః = కుమారుఁడు, పితరౌ = తల్లిదండ్రులను, చిరం = చాలకాలము, క్లేశయేత్ = కష్టపెట్టును. లబ్ధోఽపి=పొందఁబడినవాఁడైనను, గర్భపాతేన = గర్భపాతముచేత, ప్రసవేన చ = ప్రసవముచేతను, బాధతే = బాధించుచున్నాఁడు.

తా. 65, 66, 67 శ్లోకముల తాత్పర్యము 63-వ శ్లోక తాత్పర్యముతోఁ జేర్చి వ్రాయఁబడినది,

శ్లో. జాతస్య గ్రహరోగాదిః కుమారస్య చ మూర్ఖతా,
ఉపనీతేఽప్యవిద్యాత్వం అనుద్వాహశ్చ పండితే. 66

టీ. జాతస్య = పుట్టినవానికి, గ్రహరోగాదిః = బాలారిష్టాదిగ్రహములు, రోగములు మొదలగునవి (అగుచున్నవి.) కుమారస్య చ=కుమారుఁ డగువానికి, మూర్ఖతా= మొఱకుతనము, భవతి=కలుగుచున్నది. ఉపనీతేఽపి = ఉపనీతుఁడైనను, అవిద్యాత్వం= విద్యారాహిత్యము, భవతి=కలుగుచున్నది. పండితః = పండితుఁ డగుచుండఁగా, అనుద్వాహశ్చ = వివాహము కాకపోవుట, భవతి=కలుగుచున్నది.

శ్లో. పునశ్చ పరదారాది దారిద్ర్యం చ కుటుంబినః,
పిత్రోర్దుఃఖస్య నాస్త్యంతో ధనీ చేన్మ్రియతే తదా. 67

టీ. పునశ్చ=తిరుగా, పరదారాది = పరస్త్రీగమనము మొదలగునది, భవతి = అగుచున్నది. కుటుంబినః = కుటుంబవంతునకు, దారిద్ర్యం చ=లేమిడియు, భవతి = అగుచున్నది. పిత్రోరపి = తలిదండ్రులయొక్క, దుఃఖస్య = దుఃఖమునకు, అంతః = అంతను, నాస్తి=లేదు. ధనీ చేత్=ధనవంతుఁ డాయెనా ? తదా=అప్పుడు, మ్రియతే= మరణించును.

శ్లో. ఏవం వివిచ్య పుత్రాదౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని,
నిశ్చిత్య పరమాం ప్రీతిం వీక్షతే తమహర్నిశమ్. 68

వ్యా. ఏవం పుత్రగతదోషసంకీర్తనం దారాదిసర్వవిషయదోషోపలక్షణార్థం. ఏవం వివిచ్యేతి. ఏవముక్తేన ప్రకారేణ పుత్రాదౌ విషయజాతే వివిచ్య విద్యమానాన్ దోషాన్ విభజ్య జ్ఞాత్వాస్మిన్ప్రీతిం పరిత్యజ్య నిజాత్మని ప్రత్యగ్రూపే సాక్షిణి పరమాం నిరతిశయాం ప్రీతిం నిశ్చిత్య తం ప్రత్యగాత్మానమహర్నిశం సర్వదా వీక్షతే అనుసంధత్త ఇత్యర్థః.

టీ. ఏవం=ఈవిధముగా, వివిచ్య = విచారించి, పుత్రాదౌ=పుత్రుఁడు మొదలగు వారియందు, ప్రీతిం = ప్రేమను, త్యక్త్వా = వదలి, నిజాత్మని = తన యాత్మయందు, పరమాం = ఉత్కృష్టమైన, ప్రీతిం = ప్రేమను, నిశ్చిత్య = నిశ్చయించుకొని, తం = ఆ యాత్మను, అహర్నిశం = రేయింబవలును, వీక్షతే = చూచును.

తా. సంతానము లేనపుడు, దంపతులకు సంతానము లేదే యను దుఃఖము. గర్భపాతము గలిగెనేని అదియు దుఃఖమే. ప్రసవ మప్పుడును దుఃఖమే. ఇది లోకవిదితము. శిశువు గలిగిన తరువాత వానికి గ్రహరోగాదులు గలిగె నేని నదియు దుఃఖమే. బాలుఁడు

మూర్ఖుఁ డయ్యెనేని మఱింత దుఃఖము. ఉపనయనమైన వెనుక వానికి చదువురాకున్న నప్పుడును దుఃఖమే. తరువాత పెండ్లి కాకున్న దుఃఖము. వాఁడు పరదారరతుఁ డయ్యెనా యదియు దుఃఖమే. కుటుంబియై వాఁడు దరిద్రుఁ డాయెనా యదియు దుఃఖమే. ధనికుఁడై మరణించెనా (అన్ని మంచి గుణము లుండియు మరణించెనా) ఇఁక నా దుఃఖమున కంతమే లేదు. ఇట్లు అశాశ్వతవస్తువుల నమ్మువాఁడు చెడు నని గురువాక్యమును గ్రహించి శిష్యుఁడు పుత్త్రాదికమును ప్రేమింపక, స్వస్వరూపమునందే పరమప్రేమగలిగి, స్వస్వరూప సాక్షాత్కారమును బొంది ముక్తుఁడగును.

అవ. ఈ వాక్యమే ప్రతివాదికి శాపమై పరిణమించునని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆగ్రహా ద్బ్రహ్మవిద్వేషా దపి పక్షమముంచతః,
వాదినో నరకః ప్రోక్తో దోషశ్చ బహుయోనిషు. 69

వ్యా. ప్రియం త్వాం రోత్స్యతీత్యస్యైవ వాక్యస్య ప్రతివాదినం ప్రతి శాపరూపత్వం ప్రకటయతి—ఆగ్రహాదితి. ఆగ్రహాత్ ఉక్తం పుత్రాదిప్రియత్వం సర్వథా న త్యజామీత్యేవంరూపాత్ బ్రహ్మవిద్వేషాదనేనోక్తంవిఘటయిష్యామీత్యేవంరూపాచ్చ పక్షం పుత్రాదీనామేవ ప్రియతమత్వాదికమపరిత్యజతః ప్రతివాదినో నరకప్రాప్తిస్తథా బహుయోనిషు నరతిర్యగాదిష్వనేకేషు జన్మసు దోషః పుత్రభార్యాదీష్టవియోగానిష్టప్రాప్తిరూపః ప్రోక్తః 'ప్రియం త్వాం రోత్స్య'తీతి శపతా జ్ఞానినేతి శేషః.

టీ. ఆగ్రహాత్=పట్టుదలవలన, బ్రహ్మవిద్వేషాదపి=బ్రహ్మవిదునియందలి ద్వేషమువలనను, పక్షం=తన పక్షమును, అముంచతః = వదలిపెట్టని, వాదినః=వాదికి, బహుయోనిషు = అనేకయోనులయందు, నరకః = నరకము, దోషః=దోషము, ఇతి=అని, ప్రోక్తః= చెప్పఁబడినది.

తా. బ్రహ్మవిదుఁడు చెప్పినమాటను వినక పెడసరముచే ఆత్మభిన్నమును ప్రియముగా గ్రహించిన వాది యనేక జన్మములందు నరకదుఃఖ మనుభవించును. ఇదియే బ్రహ్మవిదుని శాపము.

అవ. ఒకే వాక్యము శిష్యప్రతివాదులకు భిన్నార్థముల నెట్లిచ్చు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మవిద్బ్రహ్మరూపత్వాదీశ్వరత్వేన వర్ణితమ్,
యద్వక్తి తత్తథైవ స్యా త్తచ్ఛిష్యప్రతివాదినోః. 70

వ్యా. నను జ్ఞానినోక్తస్యైకస్యైవ వాక్యస్య శిష్యం ప్రత్యుపదేశరూపత్వం వాదినం ప్రతి శాపరూపత్వం చేతి విరుద్ధం రూపద్వయం కథం ఘటత ఇత్యాశంక్యోత్తర ప్రదాతురీశ్వరరూపత్వాత్తస్యాభిప్రాయానుసారేణోభయం భవిష్యతీతి మత్వా తదుప పాదకస్య 'ఈశ్వరోఽహం తథైవ స్యాత్' ఇతి సమనంతరవాక్యస్య తాత్పర్యమాహ— బ్రహ్మవిదితి. యతో బ్రహ్మవిదః స్వస్య బ్రహ్మత్వానుభవాదీశ్వరత్వమస్త్యతస్తేన యం శిష్యాదికం ప్రతి యద్యదిష్టమనిష్టం వాభిధీయతే తత్ తచ్ఛిష్యప్రతివాదినోః తస్య జ్ఞానినో యశ్శిష్యః యశ్చ ప్రతివాదీ తయోస్తథైవ స్యాదిష్టమనిష్టం వా అవశ్యం భవేదిత్యర్థః.

టీ. బ్రహ్మవిత్=బ్రహ్మవిదుఁడు, బ్రహ్మరూపత్వాత్ = బ్రహ్మస్వరూపుఁ డగుట వలన, ఈశ్వరత్వేన = ఈశ్వరత్వముచేత, యద్వత్=ఏ విధముగా, వర్ణితం=వర్ణింపఁ బడినదో, తత్తత్=ఆయా ఇష్టానిష్టరూపఫలము, తచ్ఛిష్యప్రతివాదినోః = ఆ శిష్యునకు ప్రతివాదికిని, తథైవ=ఆ విధముగనే, స్యాత్=అగును.

తా. బ్రహ్మవిదుఁడు బ్రహ్మస్వరూపుఁడు గాన నతం డీశ్వరుఁడు. కావున శిష్యప్రతివాదులకు జ్ఞానియొక్క ఇష్టానిష్ట ఫలము సంకల్ప మాత్రమున ఘటించును కాన నొక వాక్యమున కర్థద్వయ ముండ వచ్చును.

అవ. వ్యతిరేకముగాఁ జెప్పినదానిని నన్వయముతోఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యస్తు సాక్షిణమాత్మానం సేవతే ప్రియముత్తమమ్,
తస్య ప్రేయానసావాత్మా న నశ్యతి కదాచన. 71

వ్యా. వ్యతిరేకముఖేనోక్తస్యార్థస్యాన్వయముఖేన ప్రతిపాదకం 'ఆత్మానమేవ ప్రియముపాసీత స య ఆత్మానమేవ ప్రియముపాస్తే నేహాస్య ప్రియం ప్రమాయుకం భవతీతి' సమనంతరవాక్యమర్థతః పఠతి—యస్త్వితి తుశబ్ద ఉక్తవైలక్షణ్య ద్యోతనార్థః. అనాత్మప్రియత్వవాదినోఽన్యో యశ్శిష్యః ఆత్మానమేవోత్తమప్రియం నిరతిశయప్రేమగోచరం సేవతే సదాత్మానం స్మరతి. తస్య శిష్యాదేః ప్రేయాన్ ప్రియతమత్వేనాభిమతోఽసావాత్మా ప్రతివాద్యభిమతం ప్రియమివ న కదాచిద్వినశ్యతి. కింతు సదానందరూపస్సన్నవభాసత ఇత్యర్థః.

టీ. యస్తు=ఎవఁడు, సాక్షిణం = సాక్షియగు, ఆత్మానం=ఆత్మను, ఉత్తమం = ఉత్తమమైన, ప్రియం=ప్రియమైనదానినిగా, సేవతే = సేవించుచున్నాఁడో, తస్య = ఆ పురుషునికి, ప్రేయాన్=నిరతిశయప్రీతివిషయత్వమునకు సమ్మతమగు, అసావాత్మా = ఈ ప్రత్యగాత్మ, కదాచన=ఎప్పుడును, న నశ్యతి = నశింపదు.

తా. ఇట్లు స్వస్వరూపమే పరమప్రేమాస్పద మని యెంచి ప్రత్యగాత్మను ప్రేమించువాని కెన్నఁడును ఏ విధమైన దుఃఖమును సంభవించదు. ఆత్మను నమ్మినవానికి దుఃఖము లే దనుట వ్యతిరేకము. నమ్మినవానికి సుఖము కలుగు ననుట యన్వయము.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరప్రేమాస్పదత్వేన పరమానందరూపతా,
సుఖవృద్ధిః ప్రీతివృద్ధౌ సార్వభౌమాదిషు శ్రుతా. 72

వ్యా. ఇత్థమాత్మనః పరప్రేమాస్పదత్వహేతుం ప్రసాధ్యేదానీం ఫలితమాహ—పరప్రేమేతి. అత్రాయం ప్రయోగః—ఆత్మా పరమానందరూపః నిరతిశయప్రేమవిషయత్వాత్. యః పరమానందరూపో న భవతి. స నిరతిశయప్రేమవిషయో న భవతి. యథా ఘటాదిరితి. కేవలవ్యతిరేకి పరప్రేమాస్పదత్వహేతోరాత్మనః పరమానందరూపతా సాధనే సామర్థ్యద్యోతనాయ ప్రీతివృద్ధౌ సుఖవృద్ధిముదాహరతి—సుఖవృద్ధిరితి. యతః సార్వభౌమాది హైరణ్యగర్భాంతేషు పదవిశేషేషు యత్ర యత్ర ప్రీతిర్వర్ధతే తత్ర తత్ర సుఖాభివృద్ధిరస్తీతి తైత్తిరీయబృహదారణ్యకశ్రుత్యోరభిహిత మతః ప్రీతేర్నిరతిశయత్వే సతి ఆనందస్యాపి నిరతిశయత్వమవగంతుం శక్యత ఇతి భావః.

టీ. (ఆత్మనః = ప్రత్యగాత్మకు), పరప్రేమాస్పదత్వేన=ఉత్కృష్టమైన ప్రేమవిషయ మగుటచేత, పరమానందరూపతా = పరమానందస్వరూపత్వము (అగుచున్నది.) ప్రీతివృద్ధౌ=ప్రేమయొక్క యభివృద్ధి గలుగుచుండఁగా, సుఖవృద్ధిః=సుఖాభివృద్ధి, సార్వభౌమాదిషు=సార్వభౌముఁడు మొదలుగాఁ గల వారియందు, శ్రుతా=వినఁబడుచున్నది.

తా. ఆత్మ నిరతిశయప్రేమవిషయుఁ డగుటవలన పరమానందరూపుఁ డగుననియు, ఎద్ది పరమానందరూపవంతము కాదో యది ఘటాదికమువలె నిరతిశయప్రేమవిషయము కా దనియు(అనుమానప్రమాణముచేత) నెఱుంగవలెను. మఱియు, నే కారణమువలన సార్వభౌముఁడు మొదలు బ్రహ్మపర్యంతమును గల పదవిశేషములందు నెచ్చటెచ్చట ప్రీతి వృద్ధిబొందుచున్నదో అచ్చటచ్చట సుఖాభివృద్ధి గలదని తైత్తిరీయబృహదారణ్యకశ్రుతులయందుఁ జెప్పఁబడెను. ఆ కారణమువలన ప్రీతికి నిరతిశయత్వము కలుగుచుండఁగా ఆనందమునకు నిరతిశయత్వము కలుగు నని యెఱుఁగుటకు శక్య మగు నని తెలియవలెను.

అవ. పూర్వవాది యాక్షేపము:—

శ్లో. చైతన్యవత్సుఖం చాస్య స్వభావశ్చేచ్చిదాత్మనః,
ధీవృత్తి ష్వనువర్తేత సర్వాస్వపి చితిర్యథా. 73

వ్యా. నన్వాత్మనః పరమానందరూపత్వమనుపపన్నం. తథాత్వే చైతన్యస్యేవ తత్స్వరూపభూతస్యానందస్యాపి సర్వాసు ధీవృత్తిష్వనువృత్తిః ప్రసజ్యేతేతి శంకతే— చైతన్యవదితి.

టీ. అస్య చిదాత్మనః=ఈ చిద్రూపుఁడగు ఆత్మకు, చైతన్యవత్=చైతన్యమువలె, సుఖంచ = సుఖమును, స్వభావశ్చేత్ = సహజమయ్యెనేని, సర్వాస్వపి = సమస్తమైన, ధీవృత్తిషు=బుద్ధివృత్తులయందు, చితిర్యథా=చైతన్యమువలె, అనువర్తేత = అనువర్తింపవలెను.

తా. "ఓ సిద్ధాంతీ! ఆత్మకు చిద్రూప మెట్లు స్వాభావికమో, ఆనందరూపమును అట్లే సహజ మనుట కుదురదు. ఎందుచేత ననఁగా— చిద్రూపత్వము బుద్ధివృత్తులయం దనుగతమైయున్నట్లానందరూప మను గతమై యుండుట లేదుకదా! కాన, ఆనందరూపత్వ మాత్మకు స్వాభావము కాదు" అని పూర్వపక్షి యాక్షేపించెను.

అవ. పైయాక్షేపణకు దృష్టాంతపూర్వకముగా సిద్ధాంతి సమాధానముం జెప్పుచున్నాఁడు:—

శ్లో. మైవముష్ణప్రకాశాత్మా దీపస్తస్య ప్రభా గృహే,
వ్యాప్నోతి నోష్ణతా తద్వచ్చితేరేవానువర్తనమ్. 74

వ్యా. చిదానందయోరుభయోరప్యాత్మస్వరూపత్వే ఽపి వృత్తిషు చిత ఏవానువృత్తిర్నానందస్యేతి దృష్టాంతావష్టంభేన పరిహరతి—మైవమితి. యథోష్ణప్రకాశాత్మకస్య దీపస్య ప్రకాశ ఏవ గృహాదావనుగచ్ఛతి నోష్ణతా. ఏవం చైతన్యస్యైవానువృత్తి ర్నానందస్యేత్యర్థః.

టీ. మైవం=ఇట్లాక్షేపింపరాదు. దీపః=దీపము, ఉష్ణప్రకాశాత్మా = వేఁడియుఁ బ్రకాశమును స్వభావముగాఁ గలది, తస్య=ఆదీపముయొక్క, ప్రభా=వెలుఁగు, గృహే= ఇంటియందు, వ్యాప్నోతి=వ్యాపించుచున్నది. ఉష్ణతా=వేఁడిమి, న=వ్యాపించుటలేదు. తద్వత్=అటులనే, చితేరేవ=చైతన్యమునకే అనువర్తనం=అనువర్తించుట, భవతి=అగుచున్నది.

తా. ఓ పూర్వవాదీ! నీ విటుల నాక్షేపింపరాదు. ఏల యనఁగా, దీపమునకు వెలుఁగును వేఁడిమియు సహజము లైనను, వెలుతురు మాత్రమే యిల్లంతయు వ్యాపించుచున్నది. కాని వేఁడిమి వ్యాపించుట లేదు. అట్లే జ్ఞానానందస్వరూపుఁ డగు ప్రత్యగాత్మయొక్క జ్ఞానస్వరూపము మాత్రమే బుద్ధివృత్తులయందు వర్తించుచున్నది. కాని ఆనందము వర్తించుట లేదు. కావున ఆత్మకు పరమానందస్వరూపత్వము లే దని చెప్పరాదు.

అవ. చిదానందము లొక్కటే యయ్యేనేని చిద్రూపత్వమును గ్రహించిన బుద్ధివృత్తి యీ యానందము నేల గ్రహింపదు? అని శంకింపఁగా దృష్టాంతపూర్వకముగా సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. గంధరూపరసస్పర్శేష్వపి సత్సు యథా పృథక్,
ఏకాక్షేణైక ఏవార్థో గృహ్యతే నేతర స్తథా. 75

వ్యా. నను చిదానందయోరభేదే చిదభివ్యంజకధీవృత్తావేవానందాభివ్యక్తిరపి స్యాదిత్యాశంక్య తథా నియమాభావే దృష్టాంతమాహ—గంధేతి. యథైకద్రవ్యవర్తినాం గంధాదీనాం చతుర్ణాం మధ్యే ఘ్రాణాదినా ఏకేనేంద్రియేణ గంధాదిరేకైక ఏవ గుణో గృహ్యతే నేతరః, తథా చిదానందయోర్మధ్యే చిత ఏవావభాసనమిత్యర్థః.

టీ. గంధరూపరసస్పర్శేషు=గంధము, రూపము, రసము, స్పర్శమును, సత్స్వపి=ఒక వస్తువునందుండినను, యథా=ఏవిధముగా, పృథక్=వేఱుగా, ఏకాక్షేణ=ఒక యింద్రియము చేత, ఏక అర్థ ఏవ=ఒకవిషయముమాత్రమే, గృహ్యతే=గ్రహింపఁబడుచున్నదో, ఇతరః=ఇతర విషయము, న గృహ్యతే=గ్రహింపఁబడుట లేదో, తథా=అటులనే ఆనందము గ్రహింపఁబడుటలేదు.

తా. ఒక వస్తువునందు రూపరసగంధస్పర్శము లుండినను నేత్రమొక్క రూపమునే గ్రహించును. రసమును గ్రహింప నేరదు. రసనేంద్రియము రసమునే గ్రహించును, రూపమును గ్రహింపజాలదు. అట్లే కొన్ని బుద్ధివృత్తులు చైతన్యమునుమాత్రమే గ్రహించును. మఱికొన్ని బుద్ధివృత్తులు ఆనందమును మాత్రమే గ్రహించును.

అవ. దృష్టాంతదార్ష్టాంతికములకుఁ దారతమ్యమును శంకించి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. చిదానందౌ నైవ భిన్నౌ గంధాద్యాస్తు విలక్షణాః,
ఇతి చే త్తదభేదోఽపి సాక్షిణ్యన్యత్ర వా వద. 76

వ్యా. దృష్టాంతదార్ష్టాంతికయో ర్వైషమ్యం శంకతే—చిదానందావితి. విల క్షణాః భిన్నా ఇత్యర్థః. ఉక్తవైషమ్యం పరిహర్తుం దార్ష్టాంతికే చిదానందయోరభేదః కిం స్వాభావికః? ఉతౌపాధిక ఇతి వికల్పయతి—తదభేద ఇతి. తదభేదస్తయోశ్చిదానందయోరభేద ఐక్యం సాక్షిణ్యాత్మస్వరూపే వాఽన్యత్ర. తదుపాధిభూతాసు వృత్తిషు వేత్యర్థః.

టీ. చిదానందౌ = చైతన్యము ఆనందమును, నైవ భిన్నా=వేఱుగావు, గంధాద్యాస్తు=గంధము మొదలగునవి, విలక్షణాః = పరస్పరభిన్నములు, ఇతి చేత్=ఇట్లంటివేని, తదభేదోఽపి=వాని యభేదమును, సాక్షిణి వా=సాక్షియందో, అన్యత్ర వా=బుద్ధివృత్తులయందో, వద = చెప్పుము.

తా. రూపరసగంధాదులు వేఱు వే అగుటంజేసి యొక్కొక్కటి వేఱు వే అగు నింద్రియములచే గ్రహింపఁబడును. చిదానందము లభిన్నము లగుటవలన, బుద్ధివృత్తులచే చైతన్యము గ్రహింపఁబడినప్పుడు, తదభిన్నమైన యానంద మేల గ్రహింపఁబడదు? అని పూర్వపక్షి శంకింప, చిదానందము లాత్మయం దభిన్నములా? బుద్ధివృత్తులయం దభిన్నములా? యని, యతని సిద్ధాంతి యడుగుచున్నాఁడు.

శ్లో. ఆద్యే గంధాదయోఽప్యేవమభిన్నాః పుష్పవర్తినః,
అక్షభేదేన తద్భేదే వృత్తిభేదాత్తయోర్భిదా. 77

వ్యా. ప్రథమే పక్షే దృష్టాంతదార్ష్టాంతికయో స్సామ్యమాహ—ఆద్య ఇతి. ఆద్యే చిదానందయో స్సాక్షిణి భేదాభావపక్షే పుష్పవర్తినో గంధాదయోఽపి ఏవం చిదానందవదేవాభిన్నాః పరస్పరం భేదరహితాః ఇతరపరిహారేణైకస్యాపనేతుమశక్యత్వాదితి భావః. ద్వితీయ పక్షేఽపి సామ్యమాహ—అక్షేతి. అక్షాణాం గంధాదిగ్రాహకాణాం ఘ్రాణాదీంద్రియాణాం భేదేన తద్భేదే తేషాం గంధాదీనాం భేదాభ్యుపగమే తద్వదేవ వృత్తిభేదాత్ చిదానందాభివ్యక్తిహేతూనాం రాజస సాత్త్వికవృత్తీనాం భేదాత్తయో శ్చిదానందయోర్భిదా భేదో భవిష్యతీత్యర్థః.

టీ. ఆద్యే=మొదటి పక్షమునందు, పుష్పవర్తినః = పుష్పమం దుండెడి, గంధాదయోఽపి = గంధాది పంచవిషయములును, ఏవం=చిదానందములవలెనే, అభిన్నాః= అభిన్నములు. అక్షభేదేన = ఇంద్రియభేదముచేత, తద్భేదే = ఆ గంధాదులకు భేదము

కలుగుచుండఁగా, వృత్తిభేదాత్ = బుద్ధివృత్తులభేదమువలన, తయోః = ఆచిదానంద ములకు, భిదా = భేదము కలుగుచున్నది.

తా. పుష్పమునందు రూపరసగంధాదు లభిన్నము లైయున్నను, ఒక్కొక ఇంద్రియముచే నొక్కొక్కటియే గ్రహింపఁబడును. అట్లే చిదానందము లొక్కటియే యైనను, బుద్ధివృత్తులయందలి భేదముచే కొన్ని చిద్రూపమాత్రమును, మఱికొన్ని యానందరూపమును గ్రహించును. ఇందు విరోధ మేమియు లేదు. వేదాంతసిద్ధాంతమునందు గుణ గుణుల కభేదము గనుక నిట్లు చెప్పఁబడెను.

అవ. చిదానందము లొక్కటి యని ఎట్లు గ్రహింపనగు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్త్వవృత్తౌ చిత్సుఖైక్యం తద్వృత్తేర్నిర్మలత్వతః,
రజోవృత్తేస్తు మాలిన్యాత్సుఖాంశోఽత్ర తిరస్కృతః. 78

వ్యా. నను తర్హి చిదానందయోరైక్యం కుత్రోపలభ్యత ఇత్యాశంక్యాహ— సత్త్వవృత్తావితి. సత్త్వవృత్తౌ శుభకర్మోపస్థాపితాయాం సత్త్వగుణపరిణామరూపాయాం బుద్ధివృత్తౌ చిత్సుఖైక్యం చిదానందయోరైక్యమవభాసత ఇతి శేషః. తత్రోపపత్తిమాహ—తద్వృత్తేరితి. కుత్రస్తర్హి భేదోఽవభాసత ఇత్యత ఆహ—రజోవృత్తేరితి.

టీ. సత్త్వవృత్తౌ = సాత్త్వికవృత్తియందు, తద్వృత్తేః=ఆవృత్తియొక్క, నిర్మలత్వతః = నైర్మల్యమువలన, చిత్సుఖైక్యం = చైతన్యసుఖముల కేకత్వము, గృహ్యతే = గ్రహింపఁబడుచున్నది. రజోవృత్తేస్తు=రజోవృత్తియొక్క, మాలిన్యాత్ =మాలిన్యము వలన, సుఖాంశః = సుఖరూపత్వము, అత్ర = ఈరాజసవృత్తియందు, తిరస్కృతః = కప్పఁబడెను. (స్ఫురింప దనుట).

తా. సాత్త్వికవృత్తి నిర్మలమైన దగుటవలన దానియందు చిదానందములు రెండును స్ఫురించును. రాజసవృత్తి మాలిన్యముగలది గనుక దానియందు సుఖాంశము స్ఫురింపదు.

అవ. సుఖాంశము స్ఫురింపకపోవుటయందు దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తింత్రిణీఫలమత్యమ్లం లవణేన యుతం యదా,
తదామ్లస్య తిరస్కారాదీషదమ్లం యథా తథా. 79

వ్యా. విద్యమానస్యాపి సుఖాంశస్య తిరస్కారే దృష్టాంతమాహ—తింత్రిణీతి. యథా తింత్రిణీఫలే లవణయోగాదత్యమ్లత్వం తిరోహితం తద్వద్రజోవృత్తావానందస్య తిరోభావ ఇత్యర్థః.

టీ. యదా = ఎప్పుడు, అత్యమ్లం = మిక్కిలి పుల్లనైన, తింత్రిణీఫలం = చింత పండు, లవణేన = ఉప్పుతో, యుతం = కూడుకొన్నదో, తదా = అప్పుడు, అమ్లస్య = పుల్లదనముయొక్క, తిరస్కారాత్ = తగ్గిపోవుటవలన, యథా = ఎట్లు, ఈషదమ్లం = కొంచెము పులుపు గలది, (భవతి) = అగుచున్నదో, తథా = అట్లే యని వెనుకటి శ్లోకముతో నన్వయము.

తా. మిక్కిలి పుల్లని చింతపండులో ఉప్పు కలిసె నేని పులుసు తగ్గినట్లు సత్త్వగుణములో రజోగుణము గలిసె నేని అట్టి మిశ్రవృత్తులందు సుఖాంశము స్ఫురింపదు.

అవ. గూఢాభిప్రాయముతో శంకించుచున్నాఁడు:—

శ్లో. నను ప్రియతమత్వేన పరమానందతాత్మని,
వివేక్తుం శక్యతామేవం వినా యోగేన కిం భవేత్. 80

వ్యా. గూఢాభిసంధిం శంకతే—నన్వితి. ననూక్తేన ప్రకారేణాత్మనః పరమానందరూపత్వం పరప్రేమాస్పదత్వహేతునా గౌణమిథ్యాత్మరూపేభ్యః ప్రియోపేక్ష్యద్వేష్యేభ్యో వివేక్తుం వివిచ్య జ్ఞాతుం శక్యతాం నామ, తథాపి నాయం వివేకో ముక్తిసాధనం అపరోక్షజ్ఞానద్వారా ముక్తిహేతుర్యోగస్యాభిధానాదితి గూఢోఽభిసంధిః.

టీ. నను = ఓయీ, ఏవం = పూర్వోక్తప్రకారము, ప్రియతమత్వేన = మిక్కిలి ప్రియమయియుండుటచేత, ఆత్మని=ప్రత్యగాత్మయందు, పరమానందతా = పరమానందరూపత్వము, వివేక్తుం = వివేచనచేయుటకు, శక్యతాం = శక్యమగుఁగాక, యోగేన వినా=యోగము లేదేని, కిం భవేత్=ఏ మగును ?

తా. "ఆత్మ పరమానందరూపుఁడా ! యని విమర్శచేసిన నేమి ఫలము ? యోగము లేనిది యపరోక్షజ్ఞానము కలుగదు గదా." యని శంకించినవాని యభిప్రాయము.

అవ. సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యద్యోగేన తదేవేతి వదామో జ్ఞానసిద్ధయే,
యోగః ప్రోక్తో వివేకేన జ్ఞానం కిం నోపజాయతే. 81

వ్యా. గూఢాభిసంధేరేవోత్తరమాహ—యద్యోగేనేతి. యథా యోగస్యాపరోక్షజ్ఞానహేతుత్వమస్తి, ఏవం వివేకస్యాపీత్యత్రాపి గూఢోఽభిసంధిః. ఇదానీం చోద్యపరిహారయోరుభయోరభిసంధిం ప్రకటయతి—జ్ఞానేతి. యథాపరోక్షజ్ఞానసాధ

న త్వేన యోగోఽభిహితః పూర్వస్మిన్నధ్యాయే. ఏవ మస్మిన్నధ్యాయేఽభిహితేన గౌణమిథ్యాత్మ వివేకద్వారా కోశపంచకవివేకేనాపి జ్ఞాన ముత్పద్యత ఏవేత్యర్థః.

టీ. యోగేన = యోగముచేత, యత్ =ఏమి ఫలమో, తదేవేతి = అదియే యని, వదామః = చెప్పుచున్నాము. జ్ఞానసిద్ధయే = జ్ఞానసిద్ధికొఱకు, యోగః = యోగము, ప్రోక్తః = చెప్పఁబడినది. వివేకేన = వివేకముచేత, జ్ఞానం = జ్ఞానము, నోపజాయతే కిం=ఏల జనింపదు ?

తా. "యోగముచేతఁ గలిగెడి ఫలమే వివేకముచేతను గలుగును." అనఁగా, యోగము జ్ఞానసిద్ధికి సాధనము "వివేక మేమి చేయును?" అని ప్రశ్నింపఁగా వివేకమును అట్టి జ్ఞానసిద్ధికే సాధన మని సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

అవ. ఈయర్థమునందుఁ బ్రమాణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఇతి స్మృతం ఫలైకత్వం యోగినాం చ వివేకినామ్. 82

వ్యా. తత్ర కిం ప్రమాణమిత్యాశంక్యాహ—యత్సాంఖ్యైరాత్మానాత్మవివేకిభిః యత్ స్థానం మోక్షరూపం ప్రాప్యతే గమ్యతే తద్యోగైర్యోగిభిరపి గమ్యతే ఇత్యనేన యోగినాం వివేకినాం చ ఫలైకత్వం జ్ఞానద్వారా మోక్షలక్షణఫలస్యైకత్వ ముక్త మిత్యర్థః.

టీ. సాంఖ్యైః = ఆత్మానాత్మవివేకము గలవారిచేత, యత్ స్థానం = ఏస్థానము, ప్రాప్యతే=పొందఁబడునో, తత్ =ఆస్థానము, యోగైరపి=యోగులచేతను, గమ్యతేతి = పొందఁబడుచున్న దని, యోగినాం=యోగులకును, వివేకినాం=ఆత్మానాత్మవివేకము గలవారికిని, ఫలైకత్వం=ఒకటే ఫలము, స్మృతం=చెప్పఁబడినది.

తా. ఆత్మానాత్మవిచారపరులకును, యోగులకును, బ్రహ్మ సాక్షాత్కారద్వారా కైవల్యము గల్గు నని శ్రీకృష్ణుఁడు గీతలయందు చెప్పెను.

అవ. ఒక్క ఫలమునకు రెండు సాధనము లేల యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః,
ఇత్థం విచార్య మార్గౌ ద్వౌ జగాద పరమేశ్వరః. 83

వ్యా. నను వివేకయోగయోరేకమేవ చేత్ఫలం తర్హ్యుభయోరన్యతరస్యైవ

యుక్తం శాస్త్రేషు ప్రతిపాదనం నోభయోరిత్యాశంక్యాధికారివైచిత్ర్యాత్ యుక్త ముభయోః ప్రతిపాదనమిత్యభిప్రాయేణాహ—అసాధ్య ఇతి.

టీ. కస్యచిత్ = ఒకానొకనికి, యోగః = యోగము, అసాధ్యః = కష్టము, కస్యచిత్ = మఱియొకనికి, జ్ఞాననిశ్చయః = జ్ఞాననిశ్చయము, అసాధ్యః=అసాధ్యము, ఇత్థం = ఈలాగున, విచార్య = యోచించి, పరమేశ్వరః = పరమేశ్వరుఁడు, ద్వౌమార్గౌ= రెండు మార్గములను, జగాద=పల్కెను.

తా. కొందఱికి యోగ మసాధ్యము, మఱికొందఱికి తత్త్వ విచార మసాధ్యము. ఇట్టిసంగతి విచారించియే వారివారికి వీలగునట్లు సాంఖ్యయోగము లనెడి రెండు మార్గములను పరమేశ్వరుఁడు తెలి పెను.

అవ. సాంఖ్యయోగముల సామ్యమునే యుపపాదించుచున్నాఁడు:—

శ్లో. యోగే కోఽతిశయ స్తత్ర జ్ఞానముక్తం సమం ద్వయోః,
రాగద్వేషాద్యభావశ్చ తుల్యో యోగివివేకినోః. 84

వ్యా. నన్వత్యంతాయాససాధ్యస్య యోగస్య నిరాయాససులభాద్వివేకాదతి శయో వక్తవ్య ఇత్యాశంక్య సోఽతిశయః కిమపరోక్షజ్ఞానజనకత్వాదుచ్యతే. ఉత రాగద్వేషనివృత్తిహేతుత్వాదథవా ద్వైతానుపలబ్ధికారణత్వాదితి వికల్ప్య ప్రథమ పక్షే ఫలసామ్యమిత్యాహ—యోగ ఇతి. ద్వయోర్వివేకయోగయోరుభయోరపి జ్ఞానలక్షణఫలం సమముక్తం 'యత్సాంఖ్యైరిత్యాదినా.' అత స్తత్ర యోగే కోఽతి శయః? న కోఽపీత్యర్థః. ద్వితీయం ప్రత్యాహ—రాగద్వేషేతి.

టీ. తత్ర=ఆ రెండింటిలో, యోగే = యోగమునందు, కః అతిశయః=అతిశయ మేమి? ద్వయోః = రెండింటికి, జ్ఞానం = జ్ఞానము, సమం = సమాన మని, ఉక్తం=చెప్పఁ బడినది. రాగద్వేషాద్యభావశ్చ = రాగద్వేషాదులు లేమియు, యోగివివేకినోః=యోగి కిని విచారపరునకును, తుల్యః = సమానము.

తా. సాంఖ్యయోగములు రెండును జ్ఞానసాధనము లైనప్పుడు, విచారమునకు యోగమునకును తారతమ్యము లేదు. రాగద్వేషాదులు లేకపోవుటయు నీ యిరువురకు సమానమే యని భావము.

అవ. వివేకికి రాగాదులు లే వనుట నుపపాదించుచున్నాఁడు:—

శ్లో. న ప్రీతిర్విషయేష్వస్తి ప్రేయా నాత్మేతి జానతః,
కుతో రాగః కుతో ద్వేషః ప్రాతికూల్యమపశ్యతః. 85

వ్యా. వివేకినో రాగాద్యభావముపపాదయతి—న ప్రీతిరితి. ఆత్మా ప్రియతమ ఇతి జానతః పురుషస్య న తావద్విషయేషు ప్రీతిరస్తి అతో న తేషు రాగో జాయతే. రాగహేతో రానుకూల్యజ్ఞానస్యాభావాత్, నాపి ద్వేషః, తద్ధేతోః ప్రాతికూల్యజ్ఞానస్యాభావాదిత్యర్థః.

టీ. ఆత్మా=ఆత్మ, ప్రేయాన్ ఇతి = ప్రియతముఁ డని, జానతః = ఎఱింగిన వానికి, విషయేషు=విషయములయందు, ప్రీతిః = ప్రేమ, నాస్తి=లేదు. ప్రాతికూల్యం= ప్రతికూలత్వము, అపశ్యతః = చూడనివానికి, రాగః కుతః = రాగ మెక్కడిది? ద్వేషః కుతః=ద్వేష మెక్కడిది ? (రెండును లే వనుట).

తా. తనకు ప్రతికూల మగు పదార్థమే లే దని యెఱింగిన విచార పరునకు రాగద్వేషము లుండవు. ఆత్మయే పరమప్రేమాస్పద మనెడి నిశ్చయము కుదురుటచే విషయములయందు ప్రీతియు నుండదు.

అవ. వివేకికి వ్యవహారదశయందు అపకారము చేయువానియందు ద్వేషము గన్పట్టుచున్న దంటివేని, అది విచారపరునకును యోగికిని సమానమని చెప్పుచున్నాఁడు:—

శ్లో. దేహాదేః ప్రతికూలేషు ద్వేషస్తుల్యో ద్వయోరపి,
ద్వేషం కుర్వన్న యోగీ చేదవివేక్యపి తాదృశః. 86

వ్యా. నను వివేకినో వ్యవహారదశాయాం దేహాద్యుపద్రవకారిషు ద్వేషో దృశ్యత ఇత్యాశంక్య తదా యోగివివేకినోః స తుల్య ఇతి పరిహరతి—దేహాదేరితి. ప్రతికూలేషు వృశ్చికాదిషు ద్వేషకర్తుస్తదా యోగిత్వమేవ నాభ్యుపగమ్యతే చేత్ భవతాత్ర్హి తాదృశస్య వివేకిత్వమపి నాభ్యుపగచ్ఛామ ఇత్యాహ—ద్వేషమితి. తాదృశో ద్వేషకర్తా చేదవివేక్యపి వివేకవానపి న భవతీత్యర్థః.

టీ. దేహాదేః = శరీరము మొదలగు వానికి, ప్రతికూలేషు = అనుకూలములుగాని సర్పాదులయందు, ద్వయోరపి=సాంఖ్యయోగుల కిద్దరికిని, ద్వేషః=ద్వేషము, తుల్యః = సమానమైనది. ద్వేషం = ద్వేషమును, కుర్వన్ = చేయుచున్నవాఁడు, యోగీ న చేత్ = యోగియే కాఁ డంటివేని, తాదృశః = అట్టివాఁడు, అవివేక్యపి=వివేకరహితుఁ డును (భవతి = అగుచున్నాఁడు.)

తా. ప్రతికూలము లగు సర్పాదులయందు ద్వేషము యోగికిని జ్ఞానికిని సమమే. అట్టి ద్వేష మున్నచో నాతఁడు యోగియే కాఁ డంటి వేని వాఁడు జ్ఞానియు కాఁజాలఁడు.

శ్లో. ద్వైతస్య ప్రతిభానం తు వ్యవహారే ద్వయోస్సమం,
సమాధౌ నేతి చేత్తద్వన్నాద్వైతత్త్వవివేకినః. 87

వ్యా. నను వివేకినో ద్వైతదర్శనమస్తి. యోగినస్తు తన్నాస్తీతి తృతీయే వికల్పే యోగినోఽతిశయో భవిష్యతీత్యాశంక్య వివేకినస్తద్ద్వైతదర్శనం కిం వ్యవహారదశాయాముచ్యతే? ఉతాన్యదేతి వికల్ప్యాద్యే తద్యోగినోఽపి సమానమిత్యాహ—ద్వైతస్యేతి. ద్వితీయమాశంకతే—సమాధావితి. యోగినః సమాధికాలే ద్వైతదర్శనం నాస్తీత్యుచ్యతే చేత్ చేదిత్యధ్యాహారః. తర్హి వివేకినోఽపి వివేకదశాయాం ద్వైతాదర్శనం తుల్యమితి పరిహరతి—తద్వదితి. యోగినస్సమాధిదశాయామివాద్వైతత్త్వవివేకినః అద్వైతం తత్త్వమితి శ్రుతియుక్తిభ్యాం వివేచనం కుర్వతోఽపి తస్మిన్కాలే ద్వైతదర్శనం నాస్తీత్యర్థః.

టీ. వ్యవహారే = వ్యవహారదశయందు, ద్వైతస్య = ద్వైతప్రపంచముయొక్క, ప్రతిభానం తు=కనుపడుటయైతే, ద్వయోః=జ్ఞానికిని యోగికిని, సమం = సమానము, సమాధౌ = సమాధిదశయందు, (యోగినః=యోగికి), నేతి చేత్ = ద్వైతస్ఫురణము లేదంటివేని, తద్వత్ = అట్లులే, (ఆత్మానాత్మవివేకదశయందును), ద్వైతత్వం = ద్వైతభావము, వివేకినః = వివేచనముచేసిన వానికిని, న=లేదు.

తా. వ్యవహారదశయందు ద్వైతభావము యోగిజ్ఞానుల కిద్దఱికిని కలదు; సమాధిదశయందు ఇద్దఱికిని స్ఫురింపదు. కనుక వా రిద్దఱికిని సర్వవిధంబుల సామ్యమే ఘటించు నని భావము.

అవ. వివేకదశయందు ద్వైత మెట్లు స్ఫురింప దనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వివక్ష్యతే తదస్మాభిరద్వైతానందనామకే,
అధ్యాయే హి తృతీయే ఽతస్సర్వమప్యతిమంగళమ్. 88

వ్యా. కథం తదభావ ఇత్యాశంక్యోపరితనేఽధ్యాయే తదుపపాదయిష్యత ఇత్యాహ—వివక్ష్యత ఇతి. ఉక్తమర్థం నిగమయతి—సర్వమపీతి.

టీ. అస్మాభిః = మాచేత, అద్వైతానందనామకే=అద్వైతానంద మనెడి పేరుగల, తృతీయే అధ్యాయే = మూఁడవ యధ్యాయమునందు, తత్ =ఆ ద్వైతస్ఫురణము లేమి, వివక్ష్యతే = నిరూపింపఁబడును. అతః=ఈహేతువువలన, సర్వమపి = అంతయు, మంగళం = శుభమగును.

తా. వివేకదశయందు ద్వైతము స్ఫురింపదనుసంగతి అద్వైతానంద మను మూఁడవ ప్రకరణమున వర్ణింపఁబడును గాన నంతయు శుభము.

అవ. ఇట్టివాఁడు యోగియంటివేని, అదియే మాతాత్పర్య మని చెప్పుచున్నాఁడు:-

శ్లో. సదా పశ్యన్నిజానందమపశ్యన్ నిఖిలం జగత్,
అర్థాద్యోగీతి చేత్తర్హి సంతుష్టో వర్ధతాం భవాన్. 89

వ్యా. నను ద్వైతాదర్శనసహితాత్మదర్శనవతో యోగిత్వమేవ భవిష్యతీతి శంకతే—సదా పశ్యన్నితి. ఇష్టాపత్త్యా పరిహరతి—తర్హీతి.

టీ. సదా=ఎల్లప్పుడు, నిజానందం=నిజానందమును, పశ్యన్=చూచుచు, నిఖిలం జగత్=సమస్తమైన జగత్తును, అపశ్యన్ = చూడనివాఁ డగునేని, అర్థాత్=పర్యవసానమువలన, యోగీతి చేత్ = యోగి యగు ననెదవేని, తర్హి = అట్లైతే, సంతుష్టః= సంతుష్టిఁజెందిన, భవాన్=నీవు, వర్ధతాం=వర్ధిల్లుదువు గాక.

తా. నీ యిష్టప్రకారము సర్వదా స్వస్వరూపభూతానందాత్మానుభవముగలవాఁడగుచు జగత్ స్ఫురణము లేనివాఁడే యోగి యగు నని తెలిసికొనుము. ఇట్లు వాస్తవమును జెప్పితివి కనుక నీవు వర్ధిల్లుదువు గాక.

అవ. అధ్యాయ తాత్పర్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందాభిధే గ్రంథే మందానుగ్రహసిద్ధయే,
ద్వితీయాధ్యాయ ఏతస్మిన్నాత్మానందో వివేచితః. 90

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం, బ్రహ్మానందే ఆత్మానందో నామ ద్వితీయోఽధ్యాయః.

వ్యా. అధ్యాయతాత్పర్యం సంక్షిప్య దర్శయతి—బ్రహ్మానందేతి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్యకింకరేణ రామకృష్ణాఖ్యవిదుషా విరచితే బ్రహ్మానందవ్యాఖ్యానే ఆత్మానందో నామ ద్వితీయోఽధ్యాయః.

టీ. బ్రహ్మానందాభిధే = బ్రహ్మానంద మనెడి, ఏతస్మిన్ ద్వితీయాధ్యాయే=ఈ రెండవయధ్యాయ మనెడి, గ్రంథే=గ్రంథమునందు, మందానుగ్రహసిద్ధయే=మందబుద్ధి గలవారల యనుగ్రహముకొఱకు,ఆత్మానందః=ఆత్మానందము, వివేచితః=నిరూపింపఁబడినది.

తా. బ్రహ్మానంద మనెడి ఈ గ్రంథమునందు, మందాధికారుల నిమిత్తమై ఆత్మానంద మను ఈ ద్వితీయాధ్యాయము నిరూపింపఁబడినది.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు బ్రహ్మానందమందలి ఆత్మానంద మను ద్వితీయాధ్యాయము సమాప్తము.

---

శ్రీ ర స్తు.
శ్రీ గణేశాయ నమః



# శ్రీవేదాంతపంచదశి

## త్రయోదశ ప్రకరణము

### అద్వైతానంద ప్రకరణము

అవ. పై ప్రకరణములోఁ జెప్పఁబడిన ఆనందత్రితయముకంటె నిందుఁ జెప్పఁబడిన యోగానందము వే అని తలంపఁ గూడ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యోగానందః పురోక్తో యస్స ఆత్మానంద ఇష్యతామ్,
కథం బ్రహ్మత్వ మేతస్య సద్వయస్యేతి చేచ్ఛృణు. 1

వ్యాఖ్యానమ్.

వ్యా. నను 'ఆనందస్త్రివిధో బ్రహ్మానందో విద్యాసుఖం తథా విషయానంద' ఇతి ప్రథమాధ్యాయే ఆనందత్రయమేవ ప్రతిజ్ఞాయ ద్వితీయాధ్యాయే తదతిరిక్తాత్మానందనిరూపణాత్తద్విరోధో జాయత ఇత్యాశంక్యాహ—యోగానంద ఇతి. యథా ప్రతిజ్ఞాతస్యైవ బ్రహ్మానందస్య యోగజన్యసాక్షాత్కారవిషయత్వేన యోగానందత్వం నిరుపాధికత్వేన నిజానందత్వం చ వ్యవహృతం, తథా తస్యైవ గౌణమిథ్యాముఖ్యాత్మవివేచనేనావగమ్యత్వవివక్షయాత్మానందోఽభిహిత ఇతి భావః. నను సజాతీయాద్గౌణాత్మనః పుత్రభార్యాదేః మిథ్యాత్మనో దేహాదేర్విజాతీయాదాకాశాదేశ్చ విభిన్నస్య సద్వయస్యాత్మానందస్య ప్రథమాధ్యాయోక్తద్వితీయయోగానందరూపతా న సంభవతీతి శంకతే—కథమితి. సజాతీయత్వేనాభిమతస్య గౌణాత్మనః పుత్రాదేర్మిథ్యాత్మనో దేహాదేశ్చ తైత్తిరీయశ్రుత్యభిహితజగదంతఃపాతిత్వాదాకాశాదేశ్చ జగత ఆత్మానందాతిరేకేణాసత్త్వాచ్చాద్వితీయబ్రహ్మరూపతా తస్య ఘటత ఇతి స బహుమాన ముత్తరమాహ—శృణ్వితి.

టీ. పురా = పూర్వము; యః యోగానందః = ఏ యోగానందము, ఉక్తః = చెప్పఁబడెనో, సః = అయ్యది, ఆత్మానందః = ఆత్మానందము (అని), ఇష్యతాం =

తలంపఁబడుగాక. సద్వయస్య = రెండవ వస్తువుతోఁ గూడిన, ఏతస్య = ఈ యాత్మా నందమునకు, బ్రహ్మత్వం = బ్రహ్మభావము, కథం = ఎట్లు సిద్ధించును? ఇతి చేత్ = ఇట్లంటివేని, శృణు = వినుము.

తా. పూర్వము దెల్పిన ఆనందత్రయములోఁ జేరినదే యోగా నందము. అదియే యాత్మానందమని తెలియనగును. ఆత్మానందము నిరు పాధికము గదా, రెండవదానితోఁగూడిన యానందము మందాధికారికి బ్రహ్మానందమగు టెట్లందువేని తెల్పెద వినుము.

శ్లో. ఆకాశాదిస్వదేహాంతం తైత్తిరీయశ్రుతీరితమ్,
జగన్నాస్త్యన్యదానందాదద్వైతబ్రహ్మతా తతః. 2

వ్యా. ఆకాశాదీతి. * 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత' ఇత్యాదిక యా తైత్తిరీయశ్రుత్యాభిహితం జగత్స్వకారణభూతాదాత్మానందాద్యతః అన్యత్పృ థక్ నాస్తి. అతః కారణభూతస్యాత్మానందస్యాద్వితీయత్వ మిత్యభిప్రాయః.

టీ. తైత్తిరీయశ్రుతీరితం = తైత్తిరీయశ్రుతియందుఁ జెప్పఁబడిన, ఆకాశాది స్వదేహాంతం = ఆకాశము మొదలుకొని తన దేహముపర్యంతము, జగత్ = ప్రపం చము, ఆనందాత్ = ఆనందముకంటె, అన్యత్ = వేఱుగా, నాస్తి=లేదు. తతః = అందువలన, అద్వైతబ్రహ్మతా=అద్వితీయబ్రహ్మత్వము (నిరుపాధిక మగు నానందరూప మనుట) సంభవించును.

తా. 'తస్మాద్వా ఏతస్మాత్'అని మొదలిడి తైత్తిరీయకశ్రుతి యాత్మ వలన నాకాశము పుట్టెను. ఆకాశమువలన వాయువు, వాయువువలన అగ్నియు, అగ్నివలన నుదకమును, ఉదకమువలన భూమియు ఇత్తెఱం గున తన దేహపర్యంతము నాత్మకంటె వేఱు గాదు. కాన నీ యానంద మద్వితీయానంద మని చెప్పుట కభ్యంతరము లేదని భావము.

అవ. మీరు చూపిన శ్రుతిలో నాత్మకు కారణత్వము తెల్పఁబడెఁగాని యానందమునకుఁ గా దని శంకింప సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆనందాదేవ తజ్జాతం తిష్ఠత్యానంద ఏవ తత్,
ఆనంద ఏవ లీనం చే త్యుక్తానందాత్కథం పృథక్. 3

వ్యా. నన్వాదాహృత శ్రుతివాక్యే ఆత్మనః కారణత్వం శ్రూయతే, నానంద స్యేత్యాశంక్య తత్ప్రతిపాదకం తదీయమేవ 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే' ఇత్యాది వాక్యమర్థతః పఠతి—ఆనందాదేవేతి. వ్యాఖ్యాతం. ఫలిత

మాహ—ఇత్యుక్తేతి. అత్రేదమనుమానం సూచితం, వివుతం జగదానందాన్న భిద్యతే. తత్కార్యత్వాత్. యద్యత్కార్యం తత్తతో న భిద్యతే, యథా మృత్కార్యం ఘటాది మృదో న భిద్యత ఇతి.

టీ. తత్ = ఆ జగత్తు, ఆనందాదేవ = ఆనందమువలననే, జాతం = పుట్టెను. తత్ = ఆజగత్తు, ఆనంద ఏవ = ఆనందమునందే, తిష్ఠతి = స్థితి గలది. ఆనంద ఏవ= ఆనందముననే, లీనం = లయించుచున్నది. ఇతి = ఈలాగున, ఉక్తానందాత్ = తెల్పఁబడిన యానందముకన్న, కథం=ఎట్లు, పృథక్ = వేఱగును?

తా. ఆతైత్తిరీయముననే తరువాత 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే' అని ఆనందముననే జగదుత్పత్తి, దానియందే స్థితి, దానియందే లయము అని కూడ చెప్పఁబడినది. కాన కార్యకారణముల కభేద మను న్యాయమునుబట్టి కారణ మగు ఆనందమునకంటె జగత్తు వేఱు కాదు.

అవ. కార్యకారణముల కభేద మని నీవు సాధించితివి. కులాలునివలనఁ బుట్టిన ఘటము కారణమునకంటె వేఱుగా నుండలేదా? అట్లే దార్ష్టాంతికమందును ననుకొనుఁడనిన సమాధానము:—

శ్లో. కులాలా ద్ఘట ఉత్పన్నో భిన్న శ్చేతి న శంక్యతాం,
మృద్వ దేష హ్యుపాదానం నిమిత్తం న కులాలవత్. 4

వ్యా. కులాలాదుత్పన్నస్య ఘటస్య తతో భేదదర్శనాదనైకాంతికతా హేతో రిత్యాశంక్య కులాలస్య నిమిత్తకారణత్వాదిహ చానందస్యోపాదానత్వసమర్థనాచ్చైవ మిత్యాహ—కులాలాదితి. ఏష ఆత్మానందః మృద్వత్. మృద్ఘటస్యేవ ఉపాదానం కారణం; కులాల ఇవ నిమిత్తకారణం న భవతి.

టీ. కులాలాత్ = కుమ్మరవానివలన, ఉత్పన్నః=పుట్టిన, ఘటః = ఘటము, భిన్నశ్చేతి = కారణమునకంటె వేఱగు నని, న శంక్యతాం=శంకింపవలదు. హి=ఏ హేతువువలన, ఏషః = ఈ యానందరూపమగు బ్రహ్మము, మృద్వత్ = మట్టివలె, ఉపాదానం= ఉపాదానకారణమగునో, కులాలవత్ = కుమ్మరివలె, నిమిత్తం = నిమిత్తకారణము, న= కాదో.

తా. కారణ మగు కుమ్మరికంటె కార్య మగు ఘటము వేఱుగా నున్నట్లు ఆనందజగత్తులు భిన్న మని యేల యనుకొనఁగూడ దనఁ: అట్లు శంకింపఁజనదు. ఘటోత్పత్తినిఁగూర్చి కులాలుఁడు నిమిత్తకారణము;

మృత్తు ఉపాదానకారణము. అట్లే జగత్తున కాత్మ యుపాదానకారణము. ఘటము తన కుపాదానకారణ మగు మృత్తుకంటె నెట్లు వేఱు కాదో అట్లే జగత్తును తన కుపాదానకారణ మగు ఆనందముకంటె వేఱుకాదు. ఇక్కడి ఆనందమునకు ఘటమున కుపాదానకారణ మగు మృత్తుసాటి గాని, నిమిత్తకారణమగు కులాలుఁడు సాటి గాఁడు.

అవ. కులాలుఁడే యేల ఉపాదానకారణ మనఁగూడ దనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్థితి ర్లయశ్చ కుంభస్య కులాలే స్తో న హి క్వచిత్,
దృష్టౌ తౌ మృది తద్వత్స్యాదుపాదానం తయోశ్శ్రుతేః. 5

వ్యా. నను కుతో నోపాదానత్వం కులాలస్యాపీత్యాశంక్య స్థితిలయాధారత్వరూపోపాదానత్వలక్షణాభావాదిత్యాహ—స్థితిరితి. హి యస్మాత్కారణాత్ ఘటస్య స్థితిలయౌ కులాధారౌ న భవతోఽతో నోపాదానత్వమితి శేషః. కుత్ర తర్హి తా విత్యత ఆహ—దృష్టావితి. తౌ ఘటస్య స్థితిలయౌ తదుపాదానభూతాయాం మృద్యేవ దృష్టౌ ప్రత్యక్షేణోపలబ్ధౌ. భవత్వేవం తత్ర. ప్రకృతే కిమాయాతమిత్యతఆహ—తద్వదితి. యద్వత్ ఘటస్య మృదుపాదానం తద్వత్ జగతోఽప్యానంద ఉపాదానం స్యాత్ తత్ర హేతుః—తయోరితి. తయోర్జగత్స్థితిలయయోః శ్రుతేః ఆనందాద్ధ్యేవేత్యాదివాక్యే ఆనందహేతుకత్వశ్రవణాదిత్యర్థః.

టీ. హి=ఏకారణమువలన, క్వచిత్ = ఎక్కడను, కుంభస్య = కుండయొక్క, స్థితిః = ఉనికియు, లయశ్చ = నాశమును, కులాలే = కుమ్మరియందు, న స్తః = లేవో, తౌ=ఆస్థితిలయములు, మృది = మట్టియందు, దృష్టౌ=ప్రత్యక్షముగాఁ గనుపడుచున్నవి. తద్వత్=ఆప్రకారమే, తయోః = ఆ జగత్ స్థితిలయములకు, శ్రుతేః = ఆనందహేతుకత్వము వినఁబడుచుండుటవలన, (ఆనందః=ఆనందము), ఉపాదానం = ఉపాదానకారణము, స్యాత్ = అగుచున్నది.

తా. ఒక వస్తువునకు దేనియందు స్థితిలయములు గలుగుచున్నవో అదియే యుపాదానకారణ మనంబడును. ఘటమునకు స్థితిలయములు మృత్తునం దగుచున్నవి గాని, కుమ్మరియం దగుటలేదు. కాన ఘటమునకు మృత్తే యుపాదానకారణము. జగత్తునకు స్థితిలయములు ఆనందమువలన నని శ్రుతిలోఁ జెప్పఁబడినది గాన, ఆనందము జగత్తున కుపాదానకారణము. కావున మృద్ఘటంబులంబోలె, ఆనందమునకును జగత్తు

నకును అభేదము సిద్ధము జగత్తునకు ఆనందస్వరూప మగు బ్రహ్మమే యుపాదానకారణ మని తెలియవలెను.

అవ. ఉపాదానత్వములోని అవాంతరభేదములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపాదానం త్రిధా భిన్నం వివర్తి పరిణామి చ,
ఆరంభకం చ తత్రాంత్యౌ న నిరంశేఽవకాశినౌ. 6

వ్యా. ఆనందస్య స్వాభిమతం జగదుపాదానత్వం వక్తుం తదవాంతరభేదమాహ-ఉపాదానమితి. తత్ర వివర్తం పరిశేషయితుమితరౌ పక్షౌ దూషయతి—తత్రేతి. అంత్యౌ ఆరంభపరిణామపక్షౌ నిరంశే నిరవయవే వస్తుని నావకాశినౌ అవకాశవంతౌ న భవతః.

టీ. ఉపాదానం=ఉపాదానకారణము, ౧ వివర్తి=వివర్త్యుపాదాన మనియు; ౨ పరిణామి చ=పరిణామ్యుపాదాన మనియు, 3 ఆరంభకం చ=ఆరంభకోపాదాన మనియు, త్రిధా = మూఁడు విధములుగా నున్నది. తత్ర = ఈ మూఁడింటిలో, అంత్యౌ=కడపటి రెండును, నిరంశే=నిరవయవవస్తువునందు, అవకాశినౌ=అవకాశము గలవి, న=కావు.

తా. స్పష్టము.

అవ. ఇప్పు డారంభకవాదమతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆరంభవాదినోఽన్యస్మా దన్యస్యోత్పత్తిమూచిరే,
తంతోః పటస్య నిష్పత్తేర్భిన్నౌ తంతుపటౌ ఖలు. 7

వ్యా. తయోరనవకాశత్వమేవ దర్శయితుం తావదారంభకవాదినో మతమనువదతి—ఆరంభేతి ఆరంభవాదినో వైశేషికాదయః అన్యస్మాత్కార్యాపేక్షయాఽన్యస్మాత్కారణాదన్యస్య కారణాపేక్షయాఽన్యస్య కార్యస్యోత్పత్తిమూచిరే ఉక్తవంతః. కుత ఏవం వదంతీత్యత ఆహ—తంతోరితి. నిష్పత్తేరుత్పత్తేర్దర్శనాదితి శేషః. ఏతావతా కథం కార్యకారణభేదసిద్ధిరిత్యత ఆహ—భిన్నావితి. విరుద్ధపరిమాణత్వాద్విరుద్ధార్థక్రియావత్త్వాచ్చేతి భావః.

టీ. తంతోః=తంతువువలన, పటస్య = బట్టయొక్క, నిష్పత్తేః = ఉత్పత్తినిబట్టి, ఆరంభవాదినః=తార్కికులు, అన్యస్మాత్ = అన్యకారణమున, అన్యస్య=అన్యకార్యము యొక్క, ఉత్పత్తిం=పుట్టుకను, ఊచిరే=చెప్పిరి. తంతుపటౌ=తంతుపటములు, భిన్నౌ= వేఱు కదా.

తా. కారణాంతరమువలన కార్యాంతరోత్పత్తిని వైశేషికవాదులు చెప్పిరి. ఎందుచేత ననఁగా: తంతువువలన పటోత్పత్తి గనఁబ

డుటం జేసియు విరుద్ధపరిమాణము గలిగి విరుద్ధములైన క్రియలఁ గలిగి నవి గనుకను, నా తంతుపటములు భిన్నము లని చెప్పిరి. అనఁగా కార్య కారణములకు భేదమును తెల్పి రని భావము.

అవ. ఇప్పుడు పరిణామవాదమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. అవస్థాంతరతాపత్తిరేకస్య పరిణామితా,
స్యాత్ క్షీరం దధి మృత్కుంభస్సువర్ణం కుండలం యథా. 8

వ్యా. ఇదానీం పరిణామస్వరూపమాహ—అవస్థేతి. ఏకస్యైవ వస్తునః పూర్వావస్థాత్యాగపురస్సరమవస్థాంతరప్రాప్తిః పరిణామ ఇత్యర్థః. తముదాహరతి—స్యాదితి. యథా క్షీరమృత్సువర్ణానీనాం క్షీరాదివ్యవహారయోగ్యతాం పరిత్యజ్య దధ్యాదివ్యవహారయోగ్యతాపత్తిః.

టీ. ఏకస్య = ఒక వస్తువునకు, అవస్థాంతరాపత్తిః=పూర్వస్థితి చెడి వేఱొక స్థితి పరిణమించుట, పరిణామితా = పరిణామ మనఁబడును. క్షీరం=పాలు, దధి = పెరుఁగు గను, మృత్=మన్ను, కుంభః=ఘటముగను, సువర్ణం=బంగారము, కుండలం = కుండలము గను (భూషణవిశేషము), యథా=ఎటుల, స్యాత్=అగునో, ఆయావస్తువుగా పరిణమించు నను.

తా. ఏవస్తువు గాని తన తొల్లింటిరూపమును వీడి వేఱొకరూపమును వహించిన నది పరిణామముఁ జెందె ననఁబడును. పాలు పెరుఁగైనట్లు,మృత్తు కుండ యైనట్లు,సువర్ణ మనేక భూషణములైనట్లును, మొదటి రూపమును వదలి రూపాంతరమును బొందుట యని భావము.

అవ. ఇపుడు వివర్తకారణమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. అవస్థాంతరభానం తు వివర్తో రజ్జుసర్పవత్,
నిరంశేఽప్యస్త్యసౌ వ్యోమ్ని తలమాలిన్యకల్పనాత్. 9

వ్యా. ఇదానీం వివర్తలక్షణమాహ—అవస్థాంతరేతి. తుశబ్దోఽస్య పూర్వస్మాల్లక్షణద్వయాద్వైలక్షణ్యద్యోతనార్థః. పూర్వావస్థామపరిత్యజ్యైవావస్థాంతరభానం వర్తః. తముదాహరతి—రజ్జ్వితి. యథా రజ్జ్వాత్మనాఽవస్థితస్యైవ ద్రవ్యస్యసర్పాత్మనావభాసనం వివర్తః. నను వివర్తమానస్య రజ్జ్వాదేః సాంశత్వదర్శనాన్నిరంశే సోఽపి న ఘటత ఇత్యాశంక్య నిరవయవే గగనాదావపి తద్దర్శనాన్నైవమిత్యాహ—నిరంశేఽపీతి.

టీ. రజ్జుసర్పవత్ = త్రాటియందు పాము తోఁచినటుల, అవస్థాంతరభానం = మఱియొక వస్తువుగ ప్రకాశించుట, వివర్తః=వివర్త మగును. అసౌ=ఈ వివర్తము, నిరం

శేఽపి=నిరవయవస్వరూప మైనదైనను, వ్యోమ్ని=ఆకసమున, తలమాలిన్యకల్పనాత్ - తల = తలక్రిందుగా బోరలింపఁబడిన యింద్రనీలకటాహతుల్య మగుటయొక్కయు, మాలిన్య = నీలవర్ణము గల్గుటయొక్కయు, కల్పనాత్ = ఆరోపించుటవలన, అస్తి = అగును.

తా. ఏవస్తువు గాని తన వెనుకటి రూపమును వీడక,(పరిణామము పొందక) యన్యవస్తువుగా భాసించెనేని యది వివర్త మనంబడును. తాడు తాడుగానే యున్నను చీఁకటిలో నది పాముగా కనిపించుటయు, ఏమియు లేని ఆకసమున బోర్లించిన ఇంద్రనీలపాత్ర మున్నట్లు కనుపించుటయు, నల్లగా నున్నట్లు కనుపించుటయు వివర్తమునకు దృష్టాంతములు.

అవ. ఇట్లు నిరూపించుటవలని ఫలమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తతో నిరంశ ఆనందే వివర్తో జగదిష్యతామ్,
మాయాశక్తిః కల్పికా స్యా దైంద్రజాలిక శక్తివత్. 10

వ్యా. అసౌ వివర్తః వ్యోమ్ని తలత్వమధోముఖేంద్రనీలకటాహతుల్యత్వం మాలిన్యం నీలవర్ణతా తయోః కల్పనాదాకాశస్వరూపానభిజ్ఞైరారోప్యమాణత్వాదిత్యర్థః. ఫలితమాహ—తత ఇతి. తతో నిరంశేఽపి వివర్తసంభవాత్ జగన్నిరంశే ఆనందే వివర్తః కల్పిత ఇత్యంగీకార్యమిత్యర్థః. నన్వద్వితీయే ఆనందే జగత్కల్పన మనుపపన్నం కల్పనాహేతోరభావాదిత్యాశంక్యాహ—మాయేతి. శక్తేః కల్పకత్వం క్వ దృష్టమిత్యత ఆహ—ఐంద్రజాలికేతి. యథైంద్రజాలికనిష్ఠాయాః మణిమంత్రాదిరూపాయాః మాయాయాః శక్తేర్గంధర్వనగరాదికల్పకత్వం, తథేత్యర్థః.

టీ. తతః = అందువలన, నిరంశే = నిరయవస్వరూప మగు, ఆనందే = ఆనందరూపమగు బ్రహ్మమునందు, జగత్ = ప్రపంచము, వివర్తః=వివర్త మని, ఇష్యతాం = అంగీకరింపఁబడుఁగాక. ఐంద్రజాలికశక్తివత్ = గారడివాని శక్తివలె, మాయాశక్తిః = మాయాశక్తి, కల్పికా = కల్పనము చేయునది, స్యాత్ = అగును.

తా. ఐంద్రజాలికునియందు మణిమంత్రాదిరూప మగు గారడివిద్య యున్నట్లు, నిరవయవరూప మగు బ్రహ్మమందు, మాయాశక్తిచే ఈజగత్తు కల్పింపఁబడినది.

అవ. పరబ్రహ్మమం దొక శక్తి కల దనిన ద్వైతాపత్తి కలుగు నని శంకింపఁగా సమాధానము:—

శ్లో. శక్తిశ్శక్తాత్పృథఙ్నాస్తి తద్వద్దృష్టేర్నచాభిదా,
ప్రతిబంధస్య దృష్టత్వాచ్ఛక్త్యభావే తు కస్య సః. 11

వ్యా. నన్వానందాతిరిక్తాయాః మాయాయా అభ్యుపగమే ద్వైతాపత్తిరిత్యాశంక్య తస్య అనిర్వచనీయత్వేనానృతత్వం వక్తుముత్తరత్ర వక్ష్యమాణాయాః లౌకిక్యా అగ్న్యాదిశక్తేస్తావ ద్భేదేనాభేదేన వా నిర్వక్తుమశక్యత్వం దర్శయతి—శక్తిరితి. శక్తిరగ్న్యాది నిష్ఠా స్ఫోటాదిజనికా శక్తాదగ్న్యాది స్వరూపాత్పృథక్ భేదేన నాస్తి. కుత ఇత్యత ఆహ—తద్వదితి. తద్వత్తథాత్వస్య భేదేనాసత్త్వస్య దృష్టేర్దర్శనాదగ్న్యాదిస్వరూపాతిరేకేణానుపలభ్యమానత్వాదిత్యర్థః. నాప్యగ్న్యాదిస్వరూపమేవ శక్తిరిత్యాహ—న చేతి. అభిదా అభేదోఽపి న చ నైవ. తత్రాపి హేతుమాహ—ప్రతిబంధస్యేతి. మణిమంత్రాదిభిః శక్తికార్యస్య స్ఫోటాదేః ప్రతిబంధదర్శనాత్స్వరూపాతిరిక్తా శక్తిర్దృష్టవ్యేత్యభిప్రాయః. భవతు ప్రతిబంధదర్శనం శక్తేర్భేదోఽపి మాభూత్కో దోష స్తత్రాహ—శక్త్యభావ ఇతి. ప్రత్యక్షసిద్ధస్యాగ్న్యాదిస్వరూపస్య ప్రతిబంధాసంభవాత్తద్వ్యతిరిక్తశక్త్యనభ్యుపగమే సతి ప్రతిబంధోఽపి నిర్విషయస్స్యా దిత్యభిప్రాయః.

టీ. శక్తాత్ = శక్తిగలదానికంటె, పృథక్=వేఱుగా, శక్తిః = శక్తి, నాస్తి = లేదు. తద్వత్=అట్లే, దృష్టేః=కనుపించుటవలన, అభిదా=భేదములేమియు, నచ=కాదు. ప్రతిబంధస్య = ప్రతిబంధముయొక్క, దృష్టత్వాత్ = కనుపించుటవలన, శక్త్యభావేతు = శక్తిలేనియెడల, సః = ఆప్రతిబంధము, కస్య = దేనిది ?

తా. శక్తి గలది శక్తము. దాహకత్వాదిశక్తి అగ్న్యాదిస్వరూపముకంటె వేఱుగా కనుపడమిచే వే ఱని చెప్ప వీలు లేదు. వేఱుగాఁ గనుపడక పోవుటచే నవి రెండును ఒకటే యనుటకును వీలు లేదు. మణిమంత్రాదులచే శక్తి నిరోధింపఁబడినప్పుడు, అన్య మనకపోయినచో ప్రతిబంధము నిరర్థక మగును.

అవ. ఇంద్రియముల కగోచరమైన శక్తి యున్న దని యెట్లు తెలియనగు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శక్తేః కార్యానుమేయత్వాదకార్యే ప్రతిబంధనమ్,
జ్వలతోఽగ్నేరదాహే స్యాన్మంత్రాదిప్రతిబంధతా. 12

వ్యా. నన్వతీంద్రియాయాః శక్తేః కథం ప్రతిబంధోఽవగంతుం శక్యత ఇత్యాశంక్యాహ—శక్తేరితి. అతీంద్రియాపి శక్తిర్యతః కార్యలింగగమ్యా అతః అకార్యే

సత్యపి కారణే కార్యానుత్పత్తౌ సత్యాం ప్రతిబంధనం ప్రతిబంధః అవగమ్యత ఇతి శేషః. ఉక్తమర్థం దృష్టాంతప్రదర్శనేన స్పష్టయతి—జ్వలత ఇతి. లోకే స్వరూపేణ జ్వలతోఽగ్నేః సకాశాద్దాహాదిలక్షణే కార్యే అనుత్పద్యమానే సతి మంత్రాదిప్రతిబంధతా మంత్రాదీనాం శక్తిప్రతిబంధకత్వం స్యా దిత్యర్థః.

టీ. శక్తేః=శక్తి, కార్యానుమేయత్వాత్ =కార్యమువలన తెలియఁదగిన దగుటవలన, అకార్యే = కార్యము పుట్టనపుడు, ప్రతిబంధనం = అడ్డగింపు (అవగమ్యతే = (గ్రహింపఁబడును.) జ్వలతః=ప్రజ్వరిల్లుచున్న, అగ్నేః=అగ్నివలన, అదాహే=దాహాది లక్షణమైన కార్యము జనింపనపుడు, మంత్రాదిప్రతిబంధతా = మంత్రాదులచేత ప్రతిబంధకత్వము, స్యాత్ = కలుగును.

తా. కారణమైన అగ్ని మండుచుండినను దానియందు దాహరూపకార్యము లేనప్పుడు మణిమంత్రాదులు అగ్నిశక్తిని స్తంభించినవని యూహింపవచ్చును.

అవ. లౌకికశక్తిని గనుపఱచి మాయాశక్తిని శ్రుతిమూలకముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢాం మునయోఽవిదన్,
పరాస్య శక్తి ర్వివిధా క్రియాజ్ఞానబలాత్మికా. 13

వ్యా. ఇత్థం లౌకికశక్తిం స్వరూపతః ప్రమాణతశ్చోపపన్య స్యేదానీం మాయాశక్తిసద్భావే * 'తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢా' మితి శ్వేతాశ్వతరోపనిషద్వాక్యమర్థతః, పఠతి—దేవాత్మేతి. మునయః కాలస్వభావాది కారణవాదేషు దోషదర్శనవంతః జగత్కారణజిజ్ఞాసయా ధ్యానయోగమాస్థితాః అధికారిణః దేవాత్మశక్తిం దేవస్య ద్యోతమానస్య స్వప్రకాశ-చిదాత్మనః ప్రత్యగభిన్నస్య బ్రహ్మణః శక్తిం మాయారూపాం స్వగుణైః స్వకార్యభూతైః స్థూలసూక్ష్మశరీరైః నిగూఢామావృతాం అవిదన్ సాక్షాత్కృతవంత ఇత్యర్థః. తస్యామేవోపనిషది స్థితం 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చే'తి వాక్యాంతరమర్థతః పఠతి—పరాస్యేతి. అస్య బ్రహ్మణః పరా ఉత్కృష్టా జగత్కారణభూతా శక్తిర్వివిధా శ్రూయత ఇతి వాక్యశేషః. వివిధత్వమేవాహ—క్రియేతి. క్రియాజ్ఞానే ప్రసిద్ధే, బలమిచ్ఛాశక్తి జ్ఞానక్రియాశక్తి సాహచర్యాత్ క్రియాదిశక్తయః ఆత్మా స్వరూపం యస్యాః సా క్రియాజ్ఞానబలాత్మికా.

టీ. మునయః = ఋషులు, దేవాత్మశక్తిం=ప్రత్యగభిన్న స్వప్రకాశమాన పరమాత్మయొక్క మాయాశక్తిని, స్వగుణైః=తమ శరీరోపాధులచేత, నిగూఢాం=ఆవరింపఁ

బడినదానినిగా, అవిదన్ = తెలిసికొనిరి. అస్య=ఈ బ్రహ్మముయొక్క, పరా = ఉత్కృష్ట మైన, శక్తిః=శక్తి, క్రియాజ్ఞానబలాత్మికా=క్రియా, జ్ఞాన, ఇచ్ఛాశక్తు లని, వివిధా = నానావిధములుగా (శ్రూయతే = వినఁబడుచున్నది).

తా. జగత్కారణమును నిరూపింపఁ దలఁచి యోగనిష్ఠు లగు మునులు పరమాత్మయం దున్నట్టి శక్తిత్రయస్వరూపమును ధ్యానయోగము చేతఁ దెలిసికొని రని శ్వేతాశ్వతరోపనిషత్తునందుఁ జెప్పఁబడెను. ఈశక్తిత్రయము క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి యను నామములచే వ్యవహరింపఁబడును.

అవ.—మాయాప్రతిపాదిక వాసిష్ఠశ్లోకమును పఠించుచున్నాఁడు:—

శ్లో. ఇతి వేదవచః ప్రాహ వసిష్ఠశ్చ తథాబ్రవీత్,
సర్వశక్తి పరం బ్రహ్మ నిత్యమాపూర్ణమద్వయమ్. 14

వ్యా. ఇదం వాక్యద్వయం శ్రుత్యమిత్యత ఆహ—ఇతీతి. న కేవలం మాయాశక్తిః శ్రుతిప్రసిద్ధా. కింతు స్మృతిప్రసిద్ధాపీత్యాహ—వసిష్ఠ ఇతి. యథా శ్రుతిర్విచిత్రాం మాయాశక్తి ముక్తవతీ వసిష్ఠోఽపి తాం తథోక్తవాన్. వాసిష్ఠాభిధే గ్రంథ ఇతి శేషః. మాయాప్రతిపాదకాన్ వాసిష్ఠశ్లోకానేవ పఠతి—సర్వేతి. నిత్యమాపూర్ణ మద్వయమితి. బ్రహ్మణః పారమార్థికం రూపముక్తం. సర్వశక్తీతి తస్యైవ పోపాధికం రూపం.

టీ. ఇతి=ఇట్లు, వేదవచః = వేదవాక్యము, ప్రాహ=చెప్పెను. వసిష్ఠశ్చ=వసిష్ఠుఁడును, తథా=అట్లే, అబ్రవీత్=చెప్పెను. బ్రహ్మ = బ్రహ్మము, నిత్యం = నిత్య మనియు, ఆపూర్ణం=అంతట వ్యాపించిన దనియు,అద్వయం=అద్వితీయమనియు, పరం=ఉత్కృష్ట మైనదనియు, సర్వశక్తి = సర్వశక్తులు గల దనియు (వేదమును వసిష్ఠుఁడును చెప్పిరి.)

తా. పరబ్రహ్మము, నిత్యము, సర్వవ్యాపకము, పూర్ణము, అద్వితీయము అని వేదము చెప్పుచున్నది. జ్ఞానవాసిష్ఠ మనెడి గ్రంథమందును నిట్లే చెప్పఁబడినది.

శ్లో. యయోల్లసతి శక్త్యాసౌ ప్రకాశమధిగచ్ఛతి,
చిచ్ఛక్తి ర్బ్రహ్మణో రామ శరీరేషూపలభ్యతే. 15

వ్యా. తత్పరం బ్రహ్మ యదా యదా యయా యయా మాయాశక్త్యోల్లసతి వికసతి వివర్తత ఇత్యర్థః. తదా తదాఽసావసౌ శక్తిః ప్రకాశమధిగచ్ఛతి అభివ్యక్తిం ప్రాప్నోతి, ఇదానీం తామేవాభివ్యక్తిం ప్రపంచయతి—చిచ్ఛక్తి రితి ద్వాభ్యాం.

శరీరేషు దేవతిర్యఙ్మనుష్యాది లక్షణేషు చిచ్ఛక్తిశ్చేతనత్వవ్యవహారహేతుభూతోప లభ్యతే దృశ్యతే.

టీ. రామ = ఓ శ్రీరామా! యన్మాయాశక్త్యా = ఏమాయాశక్తిచేత, తత్ = ఆపర బ్రహ్మము, ఉల్లసతి = జగద్రూపముగాఁ గనఁబడుచున్నదో, అసౌ = ఈమాయాశక్తి, ప్రకాశం = ప్రకాశమును, అధిగచ్ఛతి = పొందుచున్నది. శరీరేషు=శరీరములయందు, బ్రహ్మణః=పరబ్రహ్మముయొక్క, చిచ్ఛక్తిః = చైతన్యశక్తి, ఉపలభ్యతే = తెలియఁబడు చున్నది.

తా. ఆపరబ్రహ్మ మెప్పుడెప్పుడు మాయాశక్తిచేత జగద్రూపమై కన్పట్టునో, అప్పుడప్పు డీమాయాశక్తి యెఱుంగఁబడును. దేవతిర్యఙ్మను ష్యాదిశరీరములయందు నీచైతన్యశక్తి తెలియఁబడుచున్నది. అని శ్రీరామునితో వసిష్ఠముని యానతిచ్చెను.

శ్లో. స్పందశక్తిశ్చ వాతేషు దార్ఢ్యశక్తి స్తథోపలే,
ద్రవశక్తి స్తథాంభస్సు దాహశక్తి స్తథానలే. 16

వ్యా. స్పందశక్తిశ్చలనహేతుభూతా ప్రకాశమధిగచ్ఛతీత్యుక్త్యాఽనభివ్యక్త దశాయామపి బ్రహ్మణి జగత్సత్తా దర్శితా.

టీ. వాతేషు=గాడ్పులయందు, స్పందశక్తిః = చలనరూపశక్తియు, తథా=అట్లే, ఉపలే=ఱాతియందు, దార్ఢ్యశక్తిః = కాఠిన్యశక్తియు, తథా = అట్లే, అంభస్సు = నీళ్ల యందు, ద్రవశక్తిః = ద్రవశక్తియు, తథా=అట్లే, అనలే = అగ్నియందు, దాహశక్తిః= దాహశక్తియు, అస్తి=కలదు.

తా. సులభము.

శ్లో. శూన్యశక్తి స్తథాకాశే నాశశక్తిర్వినాశిని,
యథాఽండేఽంతర్మహాసర్పో జగదస్తి తథాఽఽత్మని. 17

వ్యా. అనభివ్యక్తస్యాపి సత్త్వే దృష్టాంతమాహ—యథాండ ఇతి.

టీ. తథా=అటుల, ఆకాశే=ఆకసమునందు, శూన్యశక్తిః=శూన్యశక్తియు, వినా శిని = నశింపఁజేయుపస్తువునందు, నాశశక్తిః = నాశశక్తియు, అండే = గ్రుడ్డునఁదు, అంతః=లోపల, మహాసర్పః = గొప్ప సర్పము, యథా=ఎట్లు, అస్తి=ఉన్నదో, తథా = అట్లు, ఆత్మని=పరమాత్మయందు, జగత్=ప్రపంచము, అస్తి=ఉన్నది.

తా. ఆకాశమందు శూన్యశక్తియు, నశించెడి వస్తువులందు నాశశక్తియుఁ గలిగియున్నది. ఓరామా! మహాసర్పము గ్రుడ్డునందు

సూక్ష్మరూపముగ నున్నట్లు ఈ స్పందాదిశక్తిరూపప్రపంచమంతయు సూక్ష్మరూపమున పరమాత్మయం దిమిడియున్నది.

శ్లో. ఫలపత్రలతాపుష్పశాఖావిటపమూలవాన్,
నను బీజే యథా వృక్షః తథేదం బ్రహ్మణి స్థితమ్. 18

వ్యా. విచిత్రస్యాపి తస్య సత్త్వే దృష్టాంతమాహ—ఫలేతి.

టీ. నను = ఓరామా! ఫలపత్రలతాపుష్పశాఖావిటపమూలవాన్ = పండ్లు, ఆకులు, తీఁగెలు, పుష్పములు, కొమ్మలు, రెమ్మలు, వ్రేళ్లు గల, వృక్షః = చెట్టు, బీజే = విత్తునందు, యథా=ఎట్లుండెనో, తథా=అలాగున, ఇదం = ఈజగత్తు, బ్రహ్మణి=బ్రహ్మమందు, స్థితం=ఉన్నది.

తా. ఓరామా! ఫలకుసుమాదులతోఁ గూడిన మహావృక్షము విత్తునందు తెలియఁబడకయున్నట్టు బ్రహ్మమునందు జగత్తున్నదని తెలిసికొనుము.

శ్లో. క్వచి త్కాశ్చి త్కదాచిచ్చ తస్మాదుద్యంతి శక్తయః,
దేశకాలవిచిత్రత్వాత్ క్ష్మాతలాదివ శాలయః. 19

వ్యా. నను సర్వాసామపి శక్తీనాం యుగపదేవాభివ్యక్తిః కుతో న స్యాదిత్యాశంక్యాహ—క్వచిదితి. క్వచిద్దేశవిశేషే కదాచిత్కాలవిశేషే కాశ్చిచ్ఛక్త్యాదయస్తా సామయుగపదభివ్యక్తౌ దృష్టాంతమాహ—క్ష్మాతలాదితి. యథా భూమిగతానాం సర్వేషాం బీజానాం మధ్యే దేశవిశేషే కాలవిశేషే చ కేషాంచిదేవ బీజానామంకురోత్పత్తిర్న సర్వేషాం తద్వదిత్యర్థః.

టీ. దేశకాలవిచిత్రత్వాత్ = దేశకాలవైచిత్ర్యమువలన, క్ష్మాతలాత్=భూమినుండి, శాలయ ఇవ=వరిమొక్కలవలె, క్వచిత్=ఒకానొక దేశమున, కదాచిచ్చ=ఒకనొక కాలమున, కాశ్చిత్ శక్తయః = కొన్ని శక్తులు, తస్మాత్ = ఆబ్రహ్మమువలన, ఉద్యంతి=ఉదయించుచున్నవి.

తా. భూమియందు నాటఁబడిన విత్తులందు, ఆయాదేశకాలముల ననుసరించి మొక్కలు మొలిచినట్లు, బ్రహ్మమునుండి కొన్ని శక్తులుదయించుచున్నవి.

శ్లో. స ఆత్మా సర్వగో రామ నిత్యోదితమహావపుః,
యన్మనాఙ్మననీం శక్తిం ధత్తే తన్మన ఉచ్యతే. 20

వ్యా. ఇదానీం జగతః కల్పనామాత్రరూపతాం దర్శయితుం తత్కల్పకస్య మనసో రూపం తావద్దర్శయతి—స ఇతి. నిత్యోదితమహావపుః, నిత్యం సదా ఉదితం ప్రకాశ

మానం మహాద్దేశకాలాదిపరిచ్ఛేదరహితం వపుః స్వరూపం యస్య స తథా యద్యస్మిన్ కాలే మనాక్ ఈషన్మననీం స్వపరావబోధనరూపాం శక్తిం మాయాపరిణామరూపాం ధత్తే ధారయతి తత్తదా మన ఇత్యుచ్యతే.

టీ. రామ=ఓరామ! సర్వగః=సర్వవ్యాపకుఁడైనట్టియు, నిత్యోదితమహావపుః = నిత్యమై ప్రకాశమైన గొప్ప శరీరము గల, స ఆత్మా=ఆయాత్మ, మనాక్=ఇంచుక, మననీం=మననరూపమగు శక్తిని, యత్=ఎప్పుడు, ధత్తే=ధరించునో, తత్=అది, మనః=మనస్సని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. సర్వవ్యాపకమై యెల్లప్పుడును ప్రకాశించెడి యాత్మ ఏకాలమున దనను పరుని తెలియఁజేసెడి శక్తిని ధరించునో, అప్పుడు మనస్సని చెప్పఁబడుచున్నది.

శ్లో. ఆదౌ మనస్తదనుబంధవిమోక్షదృష్టీ
పశ్చాత్ప్రపంచరచనా భువనాభిధానా,
ఇత్యాదికా స్థితిరియం హి గతా ప్రతిష్ఠా
మాఖ్యాయికా సుభగబాలజనోదితేవ. 21

వ్యా. ఇదానీం కల్పనాప్రకారమాహ—ఆదావితి. ఆదౌ ప్రథమం మననశక్త్యుల్లాసేన మనోభవతి, తదను తదనంతరం బంధవిమోక్షదృష్టీ బంధవిమోక్షకల్పనే భవతః. పశ్చాదనంతరం బంధదృష్ట్యావేవ భువనాభిధానా భువనమిత్యభిధానం యస్యాః సా భువనాభిధానా ప్రపంచరచనా ప్రపంచస్య గిరినగరీసరిత్సముద్రాదేః రచనా కల్పనం భవతి, ఇత్యాదికా ఏవం ప్రకారా ఇయం జగతః స్థితిః ప్రతిష్ఠాం స్థైర్యంగతా ప్రాప్తా. కల్పితస్యాపి వాస్తవత్వప్రతీతౌ దృష్టాంతమాహ—అఖ్యాయికేతి. బాలజనాయోదితా ఉక్తా ఆఖ్యాయికా కథా యథా వాస్తవత్వబుద్ధిగతా, తథేదం జగదిత్యర్థః.

టీ. ఆదౌ=మొదట, మనః=మనస్సును, తదను = ఆవెనుక, బంధవిమోక్షదృష్టీ = బంధమోక్షకల్పనలును, పశ్చాత్=అనంతరము, భువనాభిధానా=భువన మనియెడి పేరు గల, ప్రపంచరచనా=గిరినద్యాదిప్రపంచకల్పనయు, భవతి=అగుచున్నది. ఇత్యాదికా= ఇది మొదలగు, ఇయం స్థితిః=ఈజగత్స్థితి, ప్రతిష్ఠాం = స్థైర్యమును, గతా=పొందినదై, సుభగబాలజనోదితా=ముద్దుపిల్లకుఁ జెప్పఁబడిన, ఆఖ్యాయికేవ = కట్టుకథవలె, భవతి = (ఈజగత్తు) అగుచున్నది.

తా. బ్రహ్మమునందు మొదట మనస్సును, తరువాత బంధమోక్షములును, ఆపిమ్మట ప్రపంచకల్పనయుఁ గ్రమముగా దృఢమై

తల్లిపిల్లల కన్నముపెట్టుచుఁ జెప్పెడి కట్టుకథవలె నిజముగా నీప్రపంచస్థితి గనఁబడును. కాని వాస్తవము గాదని భావము.

అవ. వాసిష్ఠమందలి యీ కథను జెప్పుచున్నాఁడు:—

శ్లో. బాలస్య హి వినోదాయ ధాత్రీ వక్తి శుభాం కథాం,
క్వచిత్సంతి మహాబాహో రాజపుత్రా స్త్రయ శ్శుభాః. 22

వ్యా. తామేవ వాసిష్ఠస్థాం కథాం కథయతి—బాలస్యేత్యాదినా.

టీ. బాలస్య=బాలునియొక్క, వినోదాయ=వినోదముకొఱకు, ధాత్రీ=ఉపమాత (దాది), శుభాం=ఇంపైన, కథాం = కథను, వక్తిహి = చెప్పుచున్నదిగదా ! హేమహాబాహో = ఓ గొప్ప బాహువులు గలవాఁడా! క్వచిత్=ఒకానొక తావున, శుభాః = సుందరులైన, త్రయః=ముగ్గురు, రాజపుత్రాః=రాజకొమరులు, సంతి=ఉన్నారు.

తా. ఓరామా ! రాజకుమారులను దాది ఎత్తుకొని యొక యింపైన కథను జెప్పెను. శ్లాఘనీయములగు బాహువులు గల యో బాలుఁడా! ఒక యూరిలో ముగ్గురు రాజకుమారు లున్నారు.

శ్లో. ద్వౌ న జాతౌ తథైకస్తు గర్భ ఏవ న చ స్థితః,
వసంతి తే ధర్మయుక్తా అత్యంతా సతి పత్తనే. 23

టీ. ద్వౌ=ఇద్దఱు, న జాతౌ=పుట్టరైరి. తథా=అటుల, ఏకస్తు = ఒకఁడైతే, గర్భ ఏవ=గర్భమునందే, న చ=లేఁడు. తే=వారును, అసతి పత్తనే=హుళక్కిపట్టణమునందు, ధర్మయుక్తాః=ధర్మములోఁ గూడుకొనినవారై, సంతి=నివసించియున్నారు.

తా. ఆముగ్గురిలో నిద్దఱు పుట్టనే లేదు. ఒకఁడైతే గర్భములోనే లేఁడు. అట్టిముగ్గురు అసలేలేని పట్టణములో మహాధర్మాత్ములై యున్నారు.

శ్లో. స్వకీయాచ్ఛూన్యనగరా న్నిర్గత్య విమలాశయాః,
గచ్ఛంతో గగనే వృక్షా౯ దదృశుః ఫలశాలినః. 24

టీ. స్వకీయాత్=తమదైన, శూన్యనగరాత్ = శూన్యపట్టణమునుండి, విమలాశయాః=మంచియభిప్రాయములు గల ఆ రాజపుత్రులు, నిర్గత్య=బయలుదేరి, గచ్ఛంతః=పోవుచు, గగనే=ఆకాశమునందు, ఫలశాలినః=పండ్లుగలిగిన, వృక్షా౯ = వృక్షములను, దదృశుః = చూచిరి.

తా. సద్భావములు గలిగిన యీ రాజపుత్రులు తమ శూన్యపట్టణమునుండి బయలుదేఱిపోవుచు, ఆకాశమునందు పండ్లతోఁ గూడిన వృక్షములను చూచిరి.

శ్లో. భవిష్యన్నగరే తత్ర రాజపుత్రాస్త్రయోఽపి తే,
సుఖమద్య స్థితాః పుత్ర మృగయావ్యవహారిణః. 25

టీ. పుత్ర=అబ్బాయీ, రాజపుత్రాః=రాజపుత్రులగు, తే=వారు, త్రయోఽపి=ముగ్గురును, భవిష్యన్నగరే=ముందుఁగలుగఁబోయెడి పట్టణమునందు, మృగయావ్యవహారిణః=వేఁటాడుచున్నవారై, సుఖమద్య స్థితాః=ఇపుడు సుఖముగా నుండిరి.

తా. ఆ రాజపుత్రులు ముగ్గురును ఆ భవిష్యన్నగరమునందు వేఁటాడుచు సుఖముగా నుండిరి.

శ్లో. ధాత్ర్యేతి కథితా రామ బాలకాఖ్యాయికా శుభా,
నిశ్చయం స యయౌ బాలో నిర్విచారణయా ధియా. 26

టీ. రామ=ఓ శ్రీరామా! ఇతి=ఈలాగున, ధాత్ర్యా = పిల్లల నాడించుదాదిచేత, బాలకాఖ్యాయికా=కుఱ్ఱవానికొఱకు కథ, కథితా=చెప్పఁబడెను. సః-బాలః=ఆ రాజపుత్రుఁడును, నిర్విచారణయా=కల్లనిజములను విచారింపని, ధియా=బుద్ధిచేత, నిశ్చయం=నిజమును, యయౌ=పొందెను.

తా. ఇట్లు దాదిచేఁ జెప్పఁబడిన కథ నా పసిబాలుఁడు, ఆలోచన లేని బుద్ధిగలవాఁడగుటచే నిజ మని నమ్మెను.

అవ. పైకథయందలి యర్థమునే దార్ష్టాంతికమునం దన్వయించుచున్నాఁడు:—

శ్లో. ఇయం సంసారరచనా విచారోజ్ఝితచేతసాం,
బాలకాఖ్యాయికేవేత్థమవస్థితిముపాగతా. 27

వ్యా. దృష్టాంతసిద్ధమర్థం దార్ష్టాంతికే యోజయతి—ఇయమితి.

టీ. ఇయం సంసారరచనా=ఈ సంసారకల్పన, విచారోజ్ఝితచేతసాం=విచారము లేని మనస్సు గలవారికి, బాలకాఖ్యాయికేవ = (పైశ్లోకములందు దాది) కుఱ్ఱవానికిఁ జెప్పినకథచందమున, అవస్థితిం=ఉనికిని (స్థితిని), ఇత్థం=ఈరీతిని, ఉపాగతా=పొందెను.

తా. ఓ శ్రీరామా! ఈసంసారరచన కల్లనిజముల యాలోచన లేనివారికి, బాలునికి పైకథయందువలె నమ్మకమును కలిగించును.

అవ. వసిష్ఠోక్తిని ముగించుచున్నాఁడు:—

శ్లో. ఇత్యాదిభిరుపాఖ్యానైర్మాయాశక్తేశ్చ విస్తరం,
వసిష్ఠః కథయామాస సైవ శక్తిర్నిరూప్యతే. 28

వ్యా. వసిష్ఠోక్త ముపసంహరతి—ఇత్యాదిభిరితి. ఏవం మాయాసద్భావే ప్రమాణ ముపన్యస్య తస్యాః అనిర్వచనీయత్వం వక్తుం ప్రతిజానీతే—సైవ శక్తిరితి.

టీ. ఇత్యాదభిః = ఈ మొదలగు, ఉపాఖ్యానైః = కథలచేత, వసిష్ఠః = వసిష్ఠ మహర్షి, మాయాశక్తేశ్చ = మాయాశక్తియొక్క, విస్తరం = ప్రభావమునుగూర్చి, కథయామాస = బోధించెను. సా శక్తిః ఏవ = ఆ శక్తియే, నిరూప్యతే = (మాచేతను) నిరూపింపఁబడును.

తా. విద్యారణ్యగురుండు వసిష్ఠుఁడు మాయాశక్తిని గూర్చి శ్రీరామునకు బోధించినరీతిని జెప్పి, మాయాశక్తిని నిరూపించెద ననుచున్నాఁడు.

అవ. మాయాశక్తియొక్క అనిర్వచనీయత్వమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కార్యాదాశ్రయతశ్చైషా భవేచ్ఛక్తిర్విలక్షణా,
స్ఫోటాంగారౌ దృశ్యమానౌ శక్తిస్తత్రానుమీయతే. 29

వ్యా. కార్యాదితి. ఏషా మాయాశక్తిః కార్యాత్స్వకార్యభూతాత్ జగతః ఆశ్రయతః స్వాశ్రయాద్బ్రహ్మణశ్చ విలక్షణా విపరీతస్వభావా భవేత్. మాయాశక్తేః కార్యాదాశ్రయతో వైలక్షణ్యం దృష్టాంతేన స్పష్టయతి—స్ఫోటాంగారావితి. వహ్నిగతశక్తేః కార్యరూపః స్ఫోటః ఆశ్రయరూపోఽంగారశ్చ ప్రత్యక్షగమ్యౌ శక్తిస్తు కార్యానుమేయా అతస్తాభ్యాం సా విలక్షణేత్యర్థః.

టీ. ఏషా శక్తిః = ఈశక్తి, కార్యాత్ =శక్తిచేఁ గల్పింపఁబడిన జగత్తుకంటెను, ఆశ్రయతశ్చ=తనకు నాధార మగు పరమాత్మకంటెను, విలక్షణా = వేఱైనది, భవేత్ = అగును. స్ఫోటాంగారౌ = స్ఫోటము(బొబ్బలెత్తుట)యును, అగ్నియు, దృశ్యమానౌ= మన కగపడుచున్నవి. తత్ర = ఆయగ్నియందు, శక్తిః = దహింపఁజేసెడి శక్తి, అనుమీయతే=ఉన్న దని ఊహింపఁబడుచున్నది.

తా. మాయాశక్తి బ్రహ్మము నాధారముఁ జేసికొనియున్నది. ఈజగత్తు మాయాశక్తికార్యము. అట్టియెడ నా మాయాశక్తి, తన కార్యమగు జగత్తునకంటెను, తన కాధార మగు బ్రహ్మమునకంటెను విలక్షణమై యున్నది. మనకుఁ దేజోరూప మగు నగ్ని కనఁబడుచున్నది. దానియందు చేతి నుంచినఁ బొబ్బలెత్తుట ప్రత్యక్షానుభవము. ఈ రెండింటినిబట్టి యగ్నియందు దహనశక్తి గల దని యూహించుచున్నాము. అట్లే కార్యమును (జగత్తును) బట్టి కారణమందలి (ఈశ్వర సంబంధమైన) మాయాశక్తి యున్న ట్లూహింపవచ్చును.

అవ. మృచ్ఛక్తియందు మఱియొక దృష్టాంతమును జూపుచున్నాఁడు:—

శ్లో. పృథుబుధ్నోదరాకారో ఘటః కార్యోఽత్ర మృత్తికా,
శబ్దాదిభిః పంచగుణైర్యుక్తా శక్తిస్త్వతద్విధా. 30

వ్యా. ఉక్తన్యాయం మృచ్ఛక్తావపి యోజయతి—పృథుబుధ్నేతి. యః పృథుబుధ్నోదరాకారః పృథు స్థూలం బుధ్నం వర్తులం ఉదరం యస్య పృథుబుధ్నోదరః. తథావిధ ఆకారో యస్య సః పృథుబుధ్నోదరాకారః తాదృక్ ఘటః కార్యః శబ్దస్పర్శరూపరసగంధాఖ్యపంచగుణోపేతా మృత్తికా ఆశ్రయః శక్తిస్త్వతద్విధా ఉభయవిలక్షణేత్యర్థః.

టీ. పృథుబుధ్నోదరాకారః = లావైనట్టియు, వర్తులమైనట్టియు, పొట్టవంటి యాకారము గలిగినట్టి, ఘటః=కుండ, కార్యః = మృచ్ఛక్తియొక్క కార్యము, అత్ర = దీనియందు, శబ్దాదిభిః=శబ్దము మొదలైన, పంచగుణైః = ఐదు గుణములతో, యుక్తా= కూడికొనియున్న, మృత్తికా=మట్టి, (ఆశ్రయః = శక్తి కాశ్రయము), శక్తిస్తు=మృత్తునందలి శక్తియైతే, అతద్విధా = అట్టిది కాదు. అనఁగా తన యాధారవస్తువుకన్నను కార్యముకన్నను విలక్షణ మని యర్థము.

తా. శబ్దస్పర్శరూపరసగంధము లనెడి ధర్మములతోఁ గూడినది మట్టి. అట్టి మట్టి శక్తి కాధారవస్తువు గుండ్రమై, లావై పొట్టవలె నుండు కుండ అట్టి శక్తియొక్క కార్యము. ఇచ్చటి శక్తి తన కార్య మగు ఘటముకంటెను, తన కాధార మగు మృత్తిక కంటెను విలక్షణ ముగా నున్నది గదా.

అవ. ఆ శక్తియొక్క వైలక్షణ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న పృథ్వాది ర్న శబ్దాదిః శక్తావస్తి యథా తథా,
అత ఏవ హ్యచింత్యైషా న నిర్వచనమర్హతి. 31

వ్యా. వైలక్షణ్యమేవాహ—న పృథ్వాదిరితి. శక్తౌ పృథుత్వాదికార్యధర్మో నాస్తి. శబ్దాదికః ఆశ్రయధర్మోఽపి న విద్యతే. అతో విలక్షణేత్యర్థః. తర్హి సా కీదృశీ త్యత ఆహ—యథా తథేతి. యథా తథేత్యుక్తమేవార్థం స్పష్టయతి—అత ఏవేతి. యత కార్యాదాశ్రయాచ్చ విలక్షణా అతఏవైషా అచింత్యా చింతితుమశక్యా. నను తర్హి అచింత్యత్వమేవ తస్యాః స్వరూపం స్యాదిత్యాశంక్యాహ—న నిర్వచనమితి. భేదేనా భేదేనాచింత్యత్వాదినా వా యేనకేనాఽపి రూపేణ నిర్వచనం నార్హతీత్యర్థః.

టీ. శక్తౌ = శక్తియందు, పృథ్వాదిః = లావు, గుండ్రము మొదలగు ఘటము యొక్క (కార్యముయొక్క) గుణములు, న = లేవు. శబ్దాదిః = శబ్దస్పర్శరూపములు

మొదలగు మృత్తిక (శక్తి, ఆశ్రయవస్తువు)యొక్క గుణములును లేవు, అతః=అందువలన (ఆశక్తి), యథా=ఎట్టిదో, తథా=అట్టిది, అస్తు=అగుఁగాక. హి=ఏ హేతువులవలన, ఏషా= ఈశక్తి కార్యాశ్రయవస్తువిలక్షణమో, అతఏవ = అందువలననే, అచింత్యా=చింతింప నసాధ్యము. నిర్వచనం=ఇట్టిది యని చెప్పుటకును, న అర్హతి=అర్హమైనది కాదు.

తా. ఈశక్తియందు కార్య మగు ఘటముయొక్క స్థూలత్వ వర్తులత్వాది గుణములును లేవు. తన కాశ్రయవస్తు వగు మృత్తిక యొక్క శబ్దస్పర్శాదు లగు నయిదు గుణములును లేవు. కార్యము యొక్క గాని, ఆశ్రయవస్తువుయొక్క గాని ధర్మము లీశక్తియందు లే నందుననే యాశక్తి ఆకార్యాశ్రయములు రెండింటికంటెను విలక్షణ మని చెప్పఁబడినది. అందుచేతనే, ఆ శక్తి యిట్టి దని మనస్సునందు చింతించుటకుఁ గాని, నిరూపించుటకుఁ గాని సాధ్యము గాకున్నది. అచింత్యత్వమును శక్తికి స్వరూప మని చెప్పుటకు వీలు లేదు. భేదముచేఁ గాని, యభేదముచేఁ గాని, మఱి యే రూపముచేఁ గాని ఆ శక్తిని వర్ణించుటకు విలు గాదు. శక్తి అనిర్వచనీయ మనుటయం దీపై యర్థ మంతయు నున్న దని తెలియవలెను.

అవ. కారణ మగు మృత్తుకంటె శక్తి విలక్షణ మైనచో, నది యేల మృత్తువలె ప్రత్యక్షముగా కనుపింప లే దనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. కార్యోత్పత్తేః పురా శక్తిర్నిగూఢా మృద్యవస్థితా,
కులాలాదిసహాయేన వికారాకారతాం వ్రజేత్. 32

వ్యా. నను కారణస్వరూపాతిరిక్తా శక్తిర్యద్యస్తి తర్హి కారణస్వరూపమివ సా కుతో నావభాసత ఇత్యాశంక్యాహ—కార్యోత్పత్తేరితి. మృచ్ఛక్తి ర్ఘటాదికార్యోత్పత్తేః పూర్వం మృది నిగూఢావతిష్ఠతే అతో నావభాసత ఇత్యర్థః. నిగూఢత్వే ఉపరిష్టాదపి న తస్యా అభివ్యక్తిస్స్యాదిత్యాశంక్యానభివ్యక్తస్యాపి నవనీతాదేర్మథనాదినేవ కులాలాదివ్యాపారేణ తస్యాభివ్యక్తిస్స్యాదిత్యాహ—కులాలాదీతి. ఆదిశబ్దేన దండచక్రాదయో గృహ్యంతే.

టీ. శక్తిః=మృత్తు నాశ్రయించినశక్తి, కార్యోత్పత్తేఃపురా = కార్య మగు ఘటము పుట్టుటకు పూర్వము, మృది = మట్టియందు, నిగూఢా = లోపల దాగుకొని, అవస్థితా=ఉండెను. కులాలాదిసహాయేన = కుమ్మరివాఁడు, వానిచక్రము మొదలగువస్తువులయొక్క సాయముచేత, వికారాకారతాం =ఘటము మొదలగు వస్తువుల యాకారమును, వ్రజేత్ = పొందును.

తా. ఘటోత్పత్తికి పూర్వము శక్తి మృత్తునందు చేరియుండెను. కుమ్మరివాఁడు దానిని ఘటాదివస్తువులుగా చేసినపుడా శక్తి ఘటాది కార్యవస్తురూపమును గాంచుచున్నది. మృత్తునం దీశక్తి క్షీరమునందు వెన్నవలె నణఁగియుండి, కార్యోత్పత్త్యనంతరము వెలువడుచున్నది.

అవ. కారణమునకు విలక్షణమైన శక్తి కార్యమునం దున్నచో, కార్యకారణముల భేద మేల స్ఫురింప దనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. పృథుత్వాదివికారాంతం స్పర్శాదిం చాపి మృత్తికామ్,
ఏకీకృత్య ఘటం ప్రాహుర్విచారవికలా జనాః. 33

వ్యా. నను కారణాతిరిక్తస్య శక్తికార్యస్య సత్త్వే కార్యకారణయోర్భేదో న కుతోఽవభాసత ఇత్యాశంక్య భేదప్రతీతిహేతోర్విచారస్యాభావాదిత్యాహ—పృథుత్వాదితి. అవివేకినో జనాః, పృథుబుధ్నత్వాదిరూపం కార్యం శబ్దస్పర్శాదిగుణరూపాం కారణభూతాం మృత్తికాం చావిచారత ఏకీకృత్య ఘట ఇత్యాచక్షతే.

టీ. విచారవికలాః=ఆలోచనలేని, జనాః=ప్రజలు, పృథుత్వాదివికారాంతం = లావు వర్తులత్వము మొదలగు రూపము గల కార్యమును, స్పర్శాదిం=శబ్దస్పర్శాదిగుణరూపమైన, మృత్తికాంచఅపి = కారణమైన మృత్తికను కూడ, ఏకీకృత్య=అనాలోచనచే నొకటిగాఁ జేర్చి, ఘటం = కుండ యని, ప్రాహుః = చెప్పుదురు.

తా. సామాన్యజనులు ఘటమును జూచి, పృథుత్వవర్తులత్వాది కార్యస్వరూపమును, శబ్దస్పర్శాదికారణమైన మృత్తుస్వరూపమును వేఱువేఱుగా తెలిసికొనలేక, వీని నన్నింటిని ఘట మనియే వ్యవహరించుచున్నారు.

అవ. పామరులు ఘట మని వ్యవహరించుట అవిమర్శమూల మనుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కులాలవ్యాపృతేః పూర్వం యో మృదంశస్స నో ఘటః,
పశ్చాత్తు పృథుబుధ్నాదిమత్త్వే యుక్తో హి కుంభతా. 34

వ్యా. ఉక్తస్య ఘటవ్యవహారస్యావిచారమూలత్వం కుత ఇత్యాశంక్యాహ— కులాలేతి. కులాలవ్యాపారాత్పూర్వభావినో మృదంశస్యాఘటస్య ఘటత్వేన వ్యవహారాదవిచారమూలత్వం స్యేతి భావః. కస్య తర్హి ఘటత్వమిత్యత ఆహ—పశ్చా

త్త్వేతి. కులాలవ్యాపారానంతరభావినః పృథుబుధ్నోదరాకారస్యైవ ఘటశబ్దవాచ్యత్వముచితం. తదుత్పత్త్యనంతరమేవ ఘటశబ్దప్రయోగదర్శనాదితి భావః.

టీ. కులాలవ్యాపృతేః = కమ్మరివాఁడు పనిచేయుటకు, పూర్వం = ముందున్న, యః-మృదంశః=(ఘటము కాని) ఏ మట్టియొక్క అంశము గలదో, సః=ఆ మృదంశము, ఘటః = కుండ, న = కాదు. పశ్చాత్తు = తర్వాతనైతే, పృథుబుధ్నాదిమత్త్వే = స్థూలత్వ వర్తులత్వాదికము కలిగినప్పుడు, కుంభతా = కుండ యని వ్యవహారించుట.

తా. కుమ్మరివాఁడు కుండలుచేయక మునుపు మృత్తికగా నున్న దానిని కుండ యనుట యవివేకము. ఆ మట్టినే కుమ్మరివాఁడు లావుగాను, గుండ్రముగాను చేసినతర్వాత దానిని ఘట మని వ్యవహారించుట యుక్తమే.

అవ. యథార్థముగా నున్న ఘటము అనిర్వచనీయ మగు శక్తియొక్క కార్యమనుట సరిగా లే దని శంకించి, ఘటముకూడ వాస్తవము గా దనుచున్నాఁడు:—

శ్లో. స ఘటో న మృదో భిన్నో వియోగే సత్యనీక్షణాత్,
నాప్యభిన్నః పురా పిండదశాయామనవేక్షణాత్. 35

వ్యా. నను పారమార్థికస్య ఘటస్యానిర్వచనీయశక్తికార్యత్వమయుక్త మిత్యాశంక్య ఘటస్యాపి పారమార్థికత్వమసిద్ధమిత్యాహ—స ఘట ఇతి. ఘటో మృదః పృథక్కృత్య ద్రష్టుమశక్యత్వాన్న మృదో భిద్యతే. నాఽపి మృదేవ. పిండావస్థాయామనుపలభ్యమానత్వాత్.

టీ. సః ఘటః = అట్టి ఘటము, మృదః=స్వకారణమైన మృత్తుకంటె, భిన్నః = వేఱైనది, న=కాదు. వియోగే సతి=ఆకుండ బ్రద్దలైనప్పుడు, అనీక్షణాత్ = ఘటము కనుపింపక పోవుటవలన (ఇతి పూర్వేణాన్వయః). పురా=మొదట, పిండదశాయాం= మట్టిముద్దగా నున్నప్పుడు, అనవేక్షణాత్=ఘటము కనుపించక పోవుటవలన, అభిన్నః= ఏక మైనదియు, నాపి = కానేరదు.

తా. కుండ బ్రద్దలైనపుడు అది ఘటముగా నగపడకపోవుటచే నట్టి ఘటము మట్టికంటె వేఱైనది కాదు. మట్టి ముద్దగా నున్నప్పుడును ఘటము కనుపడుట లేదు గాన, మృద్ఘటము లొకటే యనుటకును వీలు లేదు. అందుచే ఘటము కూడ అనిర్వచనీయమే. కావున శక్తియు, శక్తికార్య మైన ఘటమును, రెండును అనిర్వచనీయములై పారమార్థిక సత్యత్వములు కా వని తేలుచున్నది.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అతోఽనిర్వచనీయోఽయం శక్తివత్తేన శక్తిజః,
అవ్యక్తత్వే శక్తిరుక్తా వ్యక్తత్వే ఘటనామభృత్. 36

వ్యా. అతః శక్తివదనిర్వచనీయ ఏవ ఘటః. ఫలితమాహ—తేనేతి. నను శక్తికార్యయోరుభయోరప్యనిర్వచనీయత్వే శక్తిః కార్యం చేతి భేదవ్యవహారః కుత ఇత్యాహ—అవ్యక్తత్వ ఇతి.

టీ. అతః = అందువలన, అయం = ఈఘటము, అనిర్వచనీయః = నిరూపింప శక్యముగానిది, తేన = ఆకారణమువలన, శక్తిజః = శక్తివలన పుట్టిన కార్యము, శక్తివత్ = శక్తివంటిదే యగును. అవ్యక్తత్వే=నామరూపములు లేని దశయందు, శక్తిః= శక్తి యని, ఉక్తా = వ్యవహరింపఁబడుచున్నది. వ్యక్తత్వే = నామరూపములచే స్పష్టమైనప్పుడు, ఘటనామభృత్=ఘట మను పేరును పొందుచున్నది.

తా. శక్తియొక్క కార్య మగు ఘటము, శక్తివలెనే అనిర్వచనీయ మగును. ఆ ఘటము నామరూపవిభాగము లేనిస్థితిలో శక్తి యనఁబడును. నామరూపము లేర్పడినప్పుడు ఘట మని వ్యవహరింపఁబడుచున్నది.

అవ. మృత్తునందు మొదట వ్యక్తముగాని మాయాశక్తి తర్వాత వ్యక్త మగుటకు దృష్టాంతము:—

శ్లో. ఐంద్రజాలికనిష్ఠాపి మాయా న వ్యజ్యతే పురా,
పశ్చాద్గంధర్వసేనాదిరూపేణ వ్యక్తిమాప్నుయాత్. 37

వ్యా. పూర్వ మనభివ్యక్తా మాయాశక్తిః పశ్చాదభివ్యజ్యత ఇత్యేతన్న ప్రసిద్ధం మాయాస్వరూపం లభ్యత ఇత్యాశంక్యాహ—ఐంద్రజాలికేతి. పురా మణిమంత్రాది ప్రయోగాత్పూర్వం.

టీ. ఐంద్రజాలికనిష్ఠాపి = ఇంద్రజాలవిద్య తెలిసినవానియందుఁ గల, మాయా= మాయయు, పురా = మణిమంత్రాదులను ప్రయోగించుటకు మున్ను, న వ్యజ్యతే=వ్యక్త మగుట లేదు. పశ్చాత్=మణిమంత్రాదులప్రయోగము చేసిన పిమ్మట, గంధర్వ సేనాది రూపేణ=గంధర్వసేన మొదలగు రూపముచేత, వ్యక్తిమాప్నుయాత్ = స్పష్టమగును.

తా. ఇంద్రజాలవిద్య నేర్చినవానియందుఁ గల మాయాశక్తి మణిమంత్రాదిప్రయోగమునకు మున్ను వ్యక్తముగాక, పిమ్మట గంధర్వసేనాదిరూపముగ నభివ్యక్త మగుచున్నది.

అవ. మృత్తునకు సత్యత్వమును, ఘటాదికార్యమునకు మిథ్యాత్వమును ఛాందోగ్యమునందుఁ గూడ చెప్పఁబడినది యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం మాయామయత్వేన వికారస్యానృతాత్మతాం,
వికారాధారమృద్వస్తుసత్యత్వం చా బ్రవీచ్ఛ్రుతిః. 38

వ్యా. శక్తికార్యస్య ఘటాదేరనృతత్వం శక్త్యాధారస్య మృదాదేః సత్యత్వమిత్యేతచ్ఛాందోగ్యశ్రుతావప్యభిహితమిత్యాహ--ఏవమితి. మాయామయత్వేన మాయాకార్యత్వేన వికారస్య కార్యరూపస్య ఘటాదేరనృతాత్మతాం మిథ్యాత్వం వికారాణాం ఘటాదీనామాధారభూతాయాః మృదః సత్యత్వం 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమి'త్యాది శ్రుతిరుక్తవతీత్యర్థః.

టీ. ఏవం = ఇట్లు, శ్రుతిః = ఛాందోగ్యోపనిషత్తు, మాయామయత్వేన = మాయాశక్తివలనఁ బుట్టుటచేత, వికారస్య=ఘటము మొదలగు కార్యమునకు, అనృతాత్మతాం=మిథ్యాత్వమును, వికారాధారమృద్వస్తుసత్యత్వం చ = ఘటాదుల కాధారమైన మట్టియొక్క సత్యత్వమును, అబ్రవీత్ = చెప్పెను.

తా. "శ్రు. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అనెడి ఛాందోగ్యశ్రుతి, శక్తిజన్యము లగు ఘటాదు లన్నియు మిథ్యయే కాని వాస్తవము గా వనియు, ఘటాది కార్యసమూహమున కంతయు నాశ్రయభూత మగు మృత్తికయే పారమార్థికసత్య మనియు చెప్పుచున్నది.

అవ. ఆ శ్రుత్యర్థమునే వివరించుచున్నాఁడు:—

శ్లో. వాఙ్నిష్పాద్యం నామమాత్రం వికారో నాస్య సత్యతా,
స్పర్శాదిగుణయుక్తా తు సత్యా కేవలమృత్తికా. 39

వ్యా. ఇదానీం వాచారంభణమిత్యాద్యుదాహృతం వాక్యమర్థతః పఠతి--వాఙ్నిష్పాద్యమితి. వాగింద్రియేణోచ్చార్యం నామమాత్రం నామైవాస్య ఘటాదేర్న సత్యతా న నామాతిరేకేణ పారమార్థికం రూపమస్తి కింతు తదాధారభూతా మృదేవ సత్యేత్యర్థః.

టీ. వికారః=ఘటము మొదలగు కార్యసమూహము, వాఙ్నిష్పాద్యం=వాక్కుచేత వ్యవహరింపఁదగి, నామమాత్రం = ఘట మనెడి పేరుమాత్రమే గలది యగును. అస్య=ఈ ఘటాదికార్యమునకు, సత్యతా=వాస్తవత్వము, న = లేదు. స్పర్శాది గుణయుక్తా = శబ్దస్పర్శాదిపంచగుణయుక్తమైన, కేవలమృత్తికా తు = కేవలము మట్టిమాత్రమే యైలే, సత్యా=పారమార్థిక సత్యము.

తా. ఈఘటాదికార్యసమూహమునకు 'ఘట మనెడి వాగింద్రియ ముతో చెప్పెడి శబ్దమే' రూపము తప్ప నామమున కన్య మగు పారమార్థికసత్యత్వము దానియం దేమియు లేదు. మృత్తికయే సత్యము.

అవ. మృత్తిక సత్య మనుటకును, మాయాశక్తియు, శక్తిజన్య మగు ఘటాదికము అసత్యమనుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యక్తావ్యక్తే తదాధార ఇతి త్రిష్వాద్యయోర్ద్వయోః,
పర్యాయః కాలభేదేన తృతీయస్త్వనుగచ్ఛతి. 40

వ్యా. శక్తితత్కార్యయోరనృతత్వే తదాధారస్య సత్యత్వే చ కారణమాహ— వ్యక్తేతి. వ్యక్తో ఘటాదిలక్షణః కార్యః అవ్యక్తా తత్కారణభూతా శక్తిః తే వ్యక్తావ్యక్తే తదాధారస్తయోరాధారభూతా మృత్తికేత్యేతేషు త్రిషు మధ్యే ఆద్యయోః ప్రథమమోద్దిష్టయోర్ద్వయోః కార్యశక్త్యోః సంబంధినా యాకాలా తయోశ్ఛేదేన భేదస్య విద్యమానత్వాత్పర్యాయః క్రమేణ భవనం. తృతీయస్తదుభయాధారస్తు మృదాదిరనుగచ్ఛతి ఉభయత్రానువర్తతే. అయం భావః—శక్తికార్యయోః కదాచిత్కత్వాదనృతత్వం, ఆధారస్య తు కాలత్రయానుగామిత్వాత్సత్యత్వమితి.

టీ. వ్యక్తావ్యక్తే=వ్యక్త మగు ఘటాదికార్యమును, అవ్యక్త మగు శక్తియు, తదాధారః=ఆ ఘటాదికార్యమునకును, ఆ ఘటాదులకు కారణ మగు శక్తికిని, ఆధార మగు మృత్తికయు, ఇతి=ఈ, త్రిషు=మూఁటియందు, ఆద్యయోః=ప్రథమమునఁ జెప్పఁబడిన, ద్వయోః=రెండింటికిని, కాలభేదేన=కాలము భేదముచే, పర్యాయః=వ్యవహారము గలదు. తృతీయః=మూఁడవ దగు మృత్తిక, అనుగచ్ఛతి=కార్యమునందును శక్తియందును అనువర్తించుచున్నది.

తా. ఘటాదులు కార్యము ఘటాదులకు కారణము శక్తి. ఘటమునకును, శక్తికిని ఆశ్రయభూత మగునది మృత్తు. ఈ మూఁటిలో, కార్యశక్తులు రెంటను ఒకటి యున్నప్పుడు మఱియొకటి యుండదు. ఘటాదికార్య మున్నప్పుడు శక్తి యుండదు. శక్తి యున్నప్పుడు ఘటాదికార్యము కనుపించదు. మృత్తిక యైతే కార్యమున్నప్పుడు, శక్తియున్నప్పుడు, ఈ రెంటను లేనప్పుడును (త్రికాలములయందు) నుండుటవలన సత్యము ఘటాదికార్యమును శక్తియు, కొన్ని కాలములం దుండవు గాన నవి అనృతము లనియు, మిథ్య యనియు నెఱుంగ నగును.

అవ. ఘటాదు లసత్య మనుటకు మూఁడు కారణములను జూపుచున్నాఁడు:—

శ్లో. నిస్తత్త్వం భాసమానం చ వ్యక్తముత్పత్తినాశభాక్,
తదుత్పత్తౌ తస్య నామ వాచా నిష్పాద్యతే నృభిః. 41

వ్యా. ఇదానీం వికారస్యైవాసత్యత్వే హేతుత్రయమాహ— నిస్తత్త్వమితి. వ్యక్తం వ్యక్తశబ్దవాచ్యం ఘటాదికార్యం స్వరూపేణాసదేవ భాసతే తథోత్పత్తివినాశవదుపలభ్యతే ఉత్పత్త్యనంతరం వాగింద్రియజన్యనామాత్మకత్వేన వ్యవహ్రియతే చ.

టీ. వ్యక్తం=ఘటాదికార్యము, నిస్తత్త్వం=స్వరూపము లేనిదగుచు, భాసమానంచ= సామాన్యముగా ప్రకాశించుచున్నదై, ఉత్పత్తినాశభాక్ = ఉత్పత్తి వినాశములను బొందుచున్నది. తదుత్పత్తౌ=ఆకార్యోత్పత్తియందు, తస్య=దానికి, నామ = పేరు, నృభిః=మనుజులచే, వాచా=వాక్కుచేత, నిష్పాద్యతే=కల్పింపఁబడుచున్నది.

తా. ఘటాదికార్యజాతము, వాస్తవముగా లేనిదై, ఆపాతముగా ప్రకాశించుచున్నది, అట్లే ఉత్పత్తివినాశములు గలదియు నగుచున్నది. అట్లు కార్యము పుట్టినతర్వాత జనులచేత పేరుతో వ్యవహరింపఁబడుచున్నది.

శ్లో. వ్యక్తే నష్టేఽపి నామైతన్నృవక్త్రేష్వనువర్తతే,
తేన నామ్నా నిరూప్యత్వాద్వ్యక్తం తద్రూపముచ్యతే. 42

వ్యా. కించ—వ్యక్తేతి. వ్యక్తే కార్యస్వరూపే నష్టేఽపి ఏతత్కార్యాదభిన్నం నామనృవక్త్రేషు నృణాం శబ్దప్రయోక్తౄణాం మనుష్యాణాం వదనేష్వనువర్తతే. తతః కిం తత్రాహ— తేనేతి. వ్యక్తం కార్యం తు న వాచా వ్యవహ్రియమాణేన నామ్నా శబ్దేన నిరూప్యత్వాద్వ్యవహ్రియమాణత్వా త్తద్రూపం తస్య నామ్నో రూపమేవ రూపం యస్య తత్తథా నామాత్మకముచ్యత ఇత్యర్థః. అయం భావః—ఏమతో ఘటః ఘటశబ్దాత్మకో భవితుమర్హతి, ఘటశబ్దేన వ్యవహ్రియమాణత్వాత్ ఘటశబ్దవదితి.

టీ. వ్యక్తే=ఘటాదికార్యస్వరూపము, నష్టేఽపి = నశించినను, ఏతత్ నామ=ఈ పేరే, నృవక్త్రేషు=మనుష్యుల నోళ్లయందు, అనువర్తతే=అనువర్తించుచున్నది. వ్యక్తం= కార్య మగు ఘటాదికము, తేన నామ్నా=ఆ పేరు చేత, నిరూప్యత్వాత్ =వ్యవహరింపఁబడుచుండుటవలన, తద్రూపం = ఆ వెనుకటి పేరుయొక్క రూపము, ఉచ్యతే = వ్యవహరింపఁబడుచున్నది.

తా. ఘటాదికార్యముయొక్క పృథుబుధ్నోదరాకారము నశించినను, ఆ వెనుకటి పేరునే మనుష్యులు వాడుచుందురు. ఆ పేరుతోనే

జనులు వ్యవహరించినను అప్పు డది ఘట మనుటకు వీలు లేదు. అప్పుడు ఘట మనెడి నామము మాత్రము మిగిలినది కాని, కార్యరూప మగు ఘటము సత్యముగ లేదు. ఇట్లనుమానముచేతను ఘటము అసత్తని నిరూపింపఁబడినది.

అవ. ఆ హేతుత్రయమును చెప్పి అనుమానరచన చేయుచున్నాఁడు:—

శ్లో. నిస్తత్త్వత్వాద్వినాశిత్వా ద్వాచారంభణనామతః,
వ్యక్తస్య న తు తద్రూపం సత్యం కించి న్మృదాదివత్. 43

వ్యా. ఏవం హేతుత్రయం ప్రసాధ్యేదానీమనుమానరచనాప్రకారం సూచయతి—నిస్తత్త్వత్వాదితి. వ్యక్తస్య ఘటాదిరూపస్య కార్యస్య యత్పృథుబుధ్నోదరాకారం రూపమస్తి తత్కించిత్కిమపి సత్యం న భవతి. నిస్తత్త్వత్వా న్నిర్గతం తత్త్వం వాస్తవరూపం యస్మా త్తన్నిస్తత్త్వం తస్య భావో నిస్తత్త్వత్వం తస్మా త్తథా వినాశిత్వాన్మృది సత్యామేవ వినాశప్రతియోగిత్వాత్ వాచారంభణనామతః వాగింద్రియజన్య శబ్దమాత్రాత్మకత్వాత్త్రిష్వపి హేతుషు మృద్వదితి వైధర్మ్యదృష్టాంతః. అత్రైవం ప్రయోగః—ఘటాదిరూపః కార్యః అసత్యో భవితుమర్హతి నిస్తత్త్వత్వాత్, యదసత్యం న భవతి న తన్నిస్తత్త్వం యథా ఘటాద్యుపాదానం మృదితి కేవలవ్యతిరేకీ ఏవ మితరహేతుద్వయేఽపి యోజనీయం.

టీ. నిస్తత్త్వత్వాత్ = వాస్తవస్వరూపము లేని దగుటవలనను, వినాశిత్వాత్ = నశించెడి దగుటవలనను, వాచారంభణనామతః = వాగింద్రియముతో ఘట మని శబ్దము మాత్ర ముచ్చరించుటవలనను, వ్యక్తస్య = కార్య మగు ఘటాదికమునకు, మృదాదివత్ = మృత్సువర్ణములవలె, తత్ రూపం తు = ఆ రూపమయితే, కించిత్ = కొంచెమైనను, సత్యం = వాస్తవమైనది, న = కాదు.

తా. ౧. ఘటాదికార్యముయొక్క, పృథుబుధ్నోదరాకార రూపము వాస్తవస్వరూపము కలది గాకుండుటవలనను; ౨. నశించెడి దగుటవలనను; 3. వాగింద్రియముతో శబ్దమాత్రముగా వ్యవహరింపఁబడుటవలనను, మృత్తికవలె దానిరూప మెంతమాత్రమును సత్యము కాదు. పైఁ జెప్పిన మూఁడు కారణములవలనను, కార్యముయొక్క రూప మసత్య మని అనుమానరచనచే నిర్ధారణ చేయఁబడినది.

అవ. మృత్తికయొక్క సత్యత్వమును ఉపపాదించుచున్నాఁడు:—

శ్లో. వ్యక్తకాలే తతః పూర్వ మూర్ధ్వమప్యేకరూపభాక్,
స తత్త్వమవినాశం చ సత్యం మృద్వస్తు కథ్యతే. 44

వ్యా. ఏవం వికారస్యాసత్యత్వముపపాద్యేదానీం తదధిష్ఠానరూపాయాః మృదః సత్యత్వముపపాదయతి—వ్యక్తేతి. వ్యక్తకాలే స్థితికాలే ఽతః పూర్వం వ్యక్త్యుత్పత్తేః పూర్వస్మిన్ కాలే ఊర్ధ్వమపి వ్యక్తవినాశోత్తరకాలేఽపి ఏకరూపభాక్ ఏకాకారం సతత్త్వం తత్త్వేన వాస్తవరూపేణ సహ వర్తత ఇతి సతత్త్వమవినాశం వికారేణ సహ నాశరహితం యన్మృద్వస్తు తత్సత్యమితి కథ్యతే అత్రేదమనుమానం— వివతం మృద్వస్తు సత్యం భవితుమర్హతి. సతత్త్వత్వాత్, ఆత్మవదిత్యాది యోజ్యం.

టీ. వ్యక్తకాలే = ఘటాదిక మున్నప్పుడును, తతః పూర్వం = అంతకుపూర్వమును, ఊర్ధ్వమపి = కార్యము నశించిన తరువాతను, ఏకరూపభాక్ = ఒకే రూపము గలదిగాను, సతత్త్వం=వాస్తవరూపముతో నున్నదిగాను, అవినాశం చ=వికారముతోఁ గూడ నాశము లేనిదియు నైన, మృద్వస్తు=మృత్పదార్థము, సత్యం=సత్యమని, కథ్యతే= చెప్పఁబడుచున్నది.

తా. మృత్తు ఘటోత్పత్తికి పూర్వమును, ఘటస్థితికాలమునను, ఘటనాశానంతరమునను ఒకే రీతిగా తన వాస్తవరూపముతో నుండుట చేతను కార్యముతో నశింపకుండుటచేతను సత్య మని నిరూపింపఁబడినది.

అవ. ఘటాదిక మసత్యమైనయెడల, శుక్తియం దారోపింపఁబడిన రజతాదికము వలె, నధిష్ఠానజ్ఞానముచేత ఆరోపితస్వరూపము నివర్తించును గదా. అని పూర్వవాది ప్రశ్న:—

శ్లో. వ్యక్తం ఘటో వికారశ్చేత్యేతై ర్నామభిరీరితః,
అర్థశ్చే దనృతః కస్మా న్న మృద్బోధే నివర్తతే. 45

వ్యా. నను ఘటాదేః కార్యజాతస్యాసత్యత్వే తస్యారోపితరజతాదేరివాధిష్ఠానజ్ఞానేన నివర్త్యతా స్యాదితి శంకతే—వ్యక్తమితి. వ్యక్తమిత్యాదిభిస్త్రిభిః శబ్దై రభిధీయమానో యోఽర్థః కార్యరూపస్తస్య కారణాతిరేకేణాసత్త్వేఽంగీక్రియమాణే మృల్లక్షణకారణస్య జ్ఞానే కిం న తన్నివృత్తిస్స్యాదిత్యర్థః.

టీ. వ్యక్తం = వ్యక్త మనియు, ఘటః = ఘట మనియు, వికారశ్చ = వికార మనియు, ఇత్యేతైః=ఈ మొదలైన, నామభిః = శబ్దములచేత, ఈరితః = చెప్పఁబడిన, అర్థః = కార్యరూపము, అనృతశ్చేత్ = అసత్య మంటివేని, మృద్బోధే = మృత్తు యొక్క జ్ఞానము కలుగుచుండఁగా, కస్మాత్=ఎందువలన, న నివర్తతే = (ఘట మేల) నివర్తింపదు ?

తా. ఓ సిద్ధాంతీ ! వ్యక్తఘట వికారాదిశబ్దములచే వ్యవహరింపఁబడెడి కార్య మనృత మంటివేని, కార్యమున కధిష్ఠానమైన మృద్జ్ఞానము కలిగినప్పుడు, దానియం దారోపితమైన ఘటజ్ఞాన మేల నివర్తింపదు ?

అవ. ఇట్లు కార్యజ్ఞాననివృత్తి మాకును సమ్మతమే యని సిద్ధాంతి పరిహరించుచున్నాఁడు:—

శ్లో. నివృత్త ఏవ యస్మాత్తే తత్సత్యత్వమతిర్గతా,
ఈదృఙ్నివృత్తిరేవాత్ర బోధజా న త్వభాసనమ్. 46

వ్యా. ఇష్టాపత్తిరితి పరిహరతి—నివృత్త ఇతి. తత్రోపపత్తిమాహ—యస్మాదితి. యస్మాత్కారణాత్తవ ఘటాదివిషయా సత్యత్వబుద్ధిర్నష్టాఽతః స నివృత్త ఏవేత్యర్థః. నన్వారోపితరజతాదిరూపస్యైవాప్రతీతిరుపలభ్యతే న సత్యత్వబుద్ధ్యపగమ ఇత్యాశంక్య తస్య నిరుపాధికభ్రమత్వాదస్తు తథాత్వం. ఇహ తు సోపాధికభ్రమే సత్యత్వబుద్ధ్యపగమ ఏవ నివృత్తిస్స్యాదిత్యభిప్రాయేణాహ—ఈదృగితి. అత్ర సోపాధికభ్రమస్థలే ఈ దృగేవ సత్యత్వబుద్ధ్యపగమరూపైవ బోధజా అధిష్ఠానయాథాత్మ్యజ్ఞానజన్యా నివృత్తి రభ్యుపేయా న త్వభాసనం న స్వరూపాప్రతీతిరూపేత్యర్థః.

టీ. యస్మాత్=ఏహేతువువలన, తత్సత్యత్వమతిః గతా=ఘటము సత్య మనెడి బుద్ధి పోయినదో, (తస్మాత్=ఆకారణమువలన), నివృత్త ఏవ = (ఘటమును) నివర్తించినదే యగును. అత్ర=ఈ సోపాధికభ్రమస్థలమునందు, బోధజా=అధిష్ఠానము వాస్తవ మనెడి జ్ఞానమువలన కలిగిన, ఈదృఙ్నివృత్తిరేవ=ఇటువంటి నివృత్తియే (సత్యము కాదనుటయే నివృత్తి), అభాసనంతు = స్వరూపము తోఁచకపోవుటయు, న = కాదు.

తా. ఘటము సత్యము కాదనుకొనుటయే కార్యనివృత్తి యనంబడును. పూర్తిగా వస్తుప్రతీతి లేకపోవుట నిరుపాధికభ్రమస్థలముననే తప్ప ఇట్టి సోపాధికభ్రమస్థలములో నక్కఱ లేదు.

శ్లో. పుమా నధోముఖో నీరే భాతోఽప్యస్తి న వస్తుతః,
తటస్థమర్త్యవత్తస్మిన్నైవాస్థా కస్య చిత్క్వచిత్. 47

వ్యా. ఏవం క్వ దృష్టమిత్యత ఆహ—పుమానితి. జలేఽధోముఖత్వేన ప్రతిభాసమానోఽపి పుమాన్ పరమార్థతో నాస్తి. తత్రోపపత్తిమాహ—తటస్థేతి. కస్యచిద్వివేకినోఽవివేకినో వా తస్మిన్నధోముఖే పురుషే తీరస్థపురుష ఇవ సత్యత్వాభిమానః క్వచిద్దేశే కాలే వా నైవాస్తీతి.

టీ. పుమాన్=పురుషుఁడు, నీరే = నీటియందు, అధోముఖః = తలక్రిందుగా, భాతోఽపి = కనుపడినను, వస్తుతః = వాస్తవముగా, నాస్తి = లేఁడు. తస్మిన్ = ఆ తలక్రిందుగా కనఁబడెడి ప్రతిబింబమునందు, తటస్థమర్త్యవత్ = గట్టున నున్న మను ష్యునియందు వలె, కస్యచిత్=ఎవనికిని, క్వచిత్ = ఎప్పుడుగాని, ఎక్కడగాని, ఆస్థా= సత్యత్వనిశ్చయము, నైవ = లేనే లేదు.

తా. నీటిలో మనుష్యుని ప్రతిబింబము తలక్రిందుగా కనుపడి నను ఎట్టి మూర్ఖునకును, వాస్తవముగా నీటిలో తలక్రిందుగాఁ గల మనుష్యుఁ డున్నాఁ డని నమ్మక మెన్నఁడు కలుగదు గదా.

అవ. ఆరోపిత మసత్య మనెడి జ్ఞానముచేఁ గలుగు పురుషార్థము:—

శ్లో. ఈదృగ్బోధే పుమర్థత్వం మత మద్వైతవాదినాం,
మృద్రూపస్యాపరిత్యాగాద్వివర్తత్వం ఘటే స్థితమ్. 48

వ్యా. నన్వారోపితస్యాసత్యత్వజ్ఞానమాత్రాన్న పురుషార్థసిద్ధిరిత్యాశంక్యాహ— ఈదృగితి. అద్వైతవాదే ఆత్మానందాతిరిక్తస్య సర్వస్య మిథ్యాత్వనిశ్చయే సత్యద్వితీయానందాభివ్యక్తిలక్షణః పురుషార్థస్సిధ్యతీత్యభిప్రాయః. నను ఘటస్య మృద్వివర్తత్వే సిద్ధే తజ్జ్ఞానాద్ఘటసత్యత్వబుద్ధిర్నివర్తతే న చైతదిదానీం సిద్ధమిత్యాశంక్యాహ— మృద్రూపస్యేతి.

టీ. ఈదృక్ బోధే = ఇట్టిబోధ గలుగుచుండఁగా, పుమర్థత్వం = మోక్ష పురుషార్థము సిద్ధించు నని, అద్వైతవాదినాం=అద్వైతవాదులయొక్క, మతం = మతము, మృద్రూపస్య = కారణమైన మృద్రూపముయొక్క, అపరిత్యాగాత్ = కార్యావస్థయందు పరిత్యాగము చేయమివలన, ఘటే= ఘటమునందు, వివర్తత్వం = మృత్తే ఘటముగాఁ దోఁచుట, స్థితం=ఉన్నది.

తా. అద్వితీయానందస్వరూపుఁ డైన బ్రహ్మముకంటె నితరమైన దంతయు మిథ్య యను నిరూఢి జ్ఞానము కలిగినయెడల బ్రహ్మానందస్ఫూర్తి రూప మగు మోక్షపురుషార్థము సిద్ధించు నని యద్వైతసిద్ధాంతము. కారణరూప మగు మృత్తే కార్యరూప మగు ఘటమునందు వివర్తించి యున్నది. కార్యావస్థలోను, కారణరూప మగు మృత్తే ఘటముగా తోఁచుచున్నది గాని మృద్వ్యతిరేక పదార్థ మేమియు లేదు.

అవ. కారణరూపమును, పరిత్యజింపకపోయినను, మృత్పరిణామమే ఘట మని యేల యనరా దనుటకు సమాధానము:—

శ్లో. పరిణామే పూర్వరూపం త్యజేత్తత్క్షీరరూపవత్,
మృత్సువర్ణే నివర్తేతే ఘటకుండలయోర్నహి. 49

వ్యా. ఘటే మృద్రూపపరిత్యాగాభావేఽపి మృత్పరిణామతా ఘటస్య కిం న స్యాదిత్యాశంక్యాహ—పరిణామ ఇతి. యత్ర క్షీరాదౌ పరిణామోఽభ్యుపగమ్యతే తత్ర క్షీరాదిభావస్య పూర్వరూపస్య త్యాగ ఉపలభ్యత ఇత్యర్థః. నను వివర్తే పూర్వరూపాపరిత్యాగః క్వ దృష్ట ఇత్యాశంక్య, మృత్సువర్ణయోర్దృశ్యత ఇత్యాహ—మృత్సువర్ణేతి. మృత్సువర్ణే నివర్తయోర్ఘటకుండలయోః నిష్పన్నయోరపి తత్కారణభూత మృత్సువర్ణరూపే న నివర్తేతే ఇతి హి ప్రసిద్ధమిత్యర్థః.

టీ. పరిణామే = పరిణామవాదమునందు, క్షీరరూపవత్ = క్షీరరూపమువలె, పూర్వరూపం = మొదటి రూపమును, త్యజేత్ = విడువవలసియుండును. ఘటకుండలయోః = ఘటకుండలములయందు, మృత్సువర్ణే = మృత్సువర్ణములు, న నివర్తేతేహి = పూర్వరూపమును విడుచుటలేదు గదా,

తా. పరిణామవాదమునందు, కార్యావస్థయందు కారణ స్వరూపము మాఱిపోవలెను. క్షీరము దధిగా మాఱినప్పుడు క్షీరరూపము మాఱిపోవుటచే నక్కడ పరిణామము వివర్తవాదమునందు పూర్వరూపమును త్యజించుట లేదు. మృత్సువర్ణములు ఘటకుండలములుగానైనను వాని పూర్వరూపమును వదలుట లేదు. అందుచే నిది వివర్తవిషయముగాని పరిణామవిషయము గాదు.

అవ. కార్యమైన ఘటము నశించినపుడు మృద్వికార మగుట లేదు గాన వివర్తమనుటకు వీలు లేదు, అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘటే భగ్నే న మృద్భావః కపాలానామవేక్షణాత్,
మైవం చూర్ణేఽస్తి మృద్రూపం స్వర్ణరూపం త్వతిస్ఫుటమ్. 50

వ్యా. నను ఘటస్య మృద్వివర్తత్వమనుపపన్నం ఘటనాశే పునర్మృద్భావాదర్శనాదితి శంకతే—ఘట ఇతి. మృద్భావాభావే కారణమాహ—కపాలానామితి. కపాలానామపి నాశే మృద్భావో మృద్భావోపలబ్ధిః స్యాదితి పరిహరతి—మైవమితి. సువర్ణే త్వేతచ్చోద్యమేవానవకాశమిత్యాహ—స్వర్ణేతి.

టీ. ఘటే = కుండ, భగ్నే సతి = నశింపఁగా, కపాలానాం = పెంకులయొక్క, అవేక్షణాత్ = కనుపించుటవలన, మృద్భావః = మట్టియగుట, న = లేదు. (ఇతి చేత్ = ఇట్లంటివేని) మైవం = అది సరికాదు. మృద్రూపం = మృద్రూప మగు, చూర్ణః =

చూర్ణము, అస్తి = కలదు, స్వర్ణరూపం తు = సువర్ణరూపమైతే, అతిస్ఫుటం = శంకకు వీలే లేక స్పష్ట మగును.

తా. ఘటము నశించినపుడు పెంకులుగా నగపడినను, అది నిజముగా చూర్ణమై మృద్రూపముగానే యున్నది. కుండలాదులును అట్లే స్పష్టముగా సువర్ణరూపమును దాల్చుచున్నవి. అందుచేత వివర్తోదాహరణమే ఘటకుండలాదులయందు సిద్ధము.

అవ. క్షీరము దధి యగుటయు వివర్తమే యని యేల యనరాదని శంకించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. క్షీరాదౌ పరిణామోఽస్తు పునస్తద్భావవర్జనాత్,
ఏతావతా మృదాదీనాం దృష్టాంతత్వం న హీయతే. 51

వ్యా. నను పరిణామే దృష్టాంతత్వేనాభిహితానాం క్షీరమృత్సువర్ణాదీనాం మధ్యే యది మృత్సువర్ణయో ర్వివర్తదృష్టాంతత్వమంగీక్రియతే తర్హి తద్వదేవ క్షీరస్యాపి తథాత్వం స్యాదిత్యాశంక్యాహ—క్షీరాదావితి. తర్హి క్షీరవదేవావస్థాంతరమాపద్యమానయోస్తయోర్వివర్తదృష్టాంతతా న భవేదిత్యాశంక్యాహ—ఏతావతేతి. ఏతావతా క్షీరాదేః పరిణామత్వేన మృదాదీనాం మృత్సువర్ణాదీనాం దృష్టాంతత్వం వివర్తదృష్టాంతభావో న హీయతే న నశ్యతి. అయమభిప్రాయః—క్షీరస్య పూర్వరూపపరిత్యాగపురస్సరమవస్థాంతరప్రాప్తిసద్భావాత్పరిణామిత్వమేవ, మృత్సువర్ణయోస్తు అవస్థాంతరాపత్తిసద్భావేఽపి పూర్వరూపపరిత్యాగాభావాద్వివర్తతాపీతి.

టీ. పునః = దధిరూపమును పొందినతర్వాత, తద్భావవర్జనాత్ = క్షీరభావమును పొందకపోవుటవలన, క్షీరాదేః = క్షీరాదులయందు, పరిణామః = పరిణామమే, అస్తు = ఉండుఁగాక. ఏతావతా = ఇట్లనుటచే, మృదాదీనాం = మృత్సువర్ణాదులకు, దృష్టాంతత్వం = వివర్తదృష్టాంతభావము, న హీయతే = చెడదు.

తా. పరిణామ వివర్తములకు రెండు భేదములు; ౧.పరిణామమునందు పూర్వరూప పరిత్యాగ మున్నది. వివర్తమునందు పూర్వరూప పరిత్యాగము లేదు; ౨. కార్యము నశించినప్పుడు తిరిగి తన కారణరూపమును పరిణామమునందు పొందుట లేదు. వివర్తమునందు కార్యనాశమైనచో నది తిరిగి కారణరూపమును పొందును. దధి నశించిన తిరిగి పాలుగా కాదు గదా. అందుచే క్షీరము దధిగా మాఱుట పరిణామమే కాని వివర్తము కాదు. "మృత్సువర్ణములును అవస్థాంతరమును పొందుట వలనను ౮-వ శ్లోకములో వానిని నీవు పరిణామదృష్టాంతములుగా

చెప్పితివి. కాన అవియు పరిణామదృష్టాంతములుగా నంగీకరింపవలె నని పూర్వవాది యాక్షేపింపఁగా అవస్థాంతరమును పొందునంతమాత్రముచే పరిణామ మనుటకు వీలు లేదు. పూర్వరూపపరిత్యాగము లేదుగాన మృత్సువర్ణములు పరిణామదృష్టాంతములు గావు. ఇవి వివర్తదృష్టాంతములే.

అవ. మృత్సువర్ణోదాహరణములయం దారంభకత్వము వీల యంగీకరింపఁబడదనిన సమాధానము జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆరంభవాదినః కార్యే మృదో ద్వైగుణ్యమాపతేత్,
రూపస్పర్శాదయః ప్రోక్తాః కార్యకారణయోః పృథక్. 62

వ్యా. నను మృత్సువర్ణయోః పరిణామవివర్తావివారంభకత్వమపి కిం నాంగీక్రియత ఇత్యాశంక్యాహ—ఆరంభవాదిన ఇతి. ఆరంభవాదినో మతే కార్యే ఘటాదిరూపే మృదో మృత్తికాదేర్ద్రవ్యస్య ద్వైగుణ్యం కార్యాకారేణ కారణాకారేణ చ ద్విగుణత్వమాపద్యేత. తథా చ సతి గుణత్వాదిద్వైగుణ్యమప్యాపద్యేతేతి భావః. నత ఏవదిత్యాశంక్యాహ—రూపేతి. రూపాదీనాం గుణానాం కార్యకారణయోర్భేదస్య త్వయాంగీకృతత్వాదితి భావః.

టీ. ఆరంభవాదినః=ఆరంభవాదికి, కార్యే = ఘటాదికమునందు, మృదః=మృత్తుమొదలగు పదార్థమునకు, ద్వైగుణ్యం = ఇబ్బడించుట, ఆపతేత్ = సంభవించును. కార్యకారణయోః = కార్యకారణములయందు, రూపస్పర్శాదయః = రూపస్పర్శాదిపంచగుణములు, పృథక్ = వేఱువేఱుగా, ప్రోక్తాః = చెప్పఁబడినవి.

తా. ఆరంభవాదులు (వైశేషికవాదులు) మృత్సువర్ణములు ఘటకుండలాదులుగా చేయఁబడినప్పుడు, కారణమునం దుండెడి గుణములు ద్విగుణత్వమును బొందు నని చెప్పెదరు. ఆరంభకారణమునకు దృష్టాంతముగా ననేక తంతువులవలన పటము పుట్టుటను చెప్పెదరు. ఈ దృష్టాంతమున కార్యము కారణముకంటె భిన్న మగు కారణమువలనఁ బుట్టుచున్న దనెదరు. తంతువులు పొడవుగాను, గుండ్రములుగాను, అనేకములుగా నున్నవి. పటము దీర్ఘవిస్తృతమై ఏకమై యున్నది. అవి పరస్పర విరుద్ధపరిమాణములు కలిగియుండుటచేతను, విరుద్ధార్థక్రియాసాధనము లగుటచేతను, ఆరంభకమునందు కార్యకారణములు భిన్నములు. కార్యముయొక్కయు, కారణముయొక్కయు గుణములు

భిన్నము లని వైశేషికులే అంగీకరించుచున్నారు. కార్యకారణముల గుణములు భిన్నము లని యొకచోటను కార్యమందు కారణ గుణములు ద్విగుణించు నవి మఱియొకచోటను వైశేషికులు చెప్పుచున్నారు. కావున వీరివాదములో విరోధ మున్నది. అందుచే వారి వాద మంగీకరింపఁ దగదు. అందుచేత మృత్సువర్ణాదుల కారంభకత్వము గ్రహింప వలనుపడదు.

శ్లో. మృత్సువర్ణమయశ్చేతి దృష్టాంతత్రయమారుణిః,
ప్రాహాతో వాసయేత్కార్యానృతత్వం సర్వవస్తుషు. 53

వ్యా. నను మృత్సువర్ణయోః కిం ద్వయోరేవ వివర్తత్వే దృష్టాంతత్వం? నేత్యాహ—మృదితి.అరుణస్య పుత్ర ఉద్దాలకాఖ్యః కశ్చిదృషిః. 'యథా సోమ్యైకేన మృత్పిండే'నేత్యారభ్య కార్ష్ణాయసమిత్యేవ సత్య'మిత్యంతేన వాక్యసందర్భేణ కార్యస్యానృతత్వే మృత్సువర్ణయోః రూపం దృష్టాంతత్రయముక్తవానిత్యర్థః. కిమర్థమేవం దృష్టాంతత్రయముక్తవానిత్యాశంక్యాహ—అత ఇతి. అత ఏవం బహుషు మృదాదిషు కార్యానృతత్వముపలబ్ధమతో భూతభౌతికరూపే సర్వేషు వస్తుషు కార్యానృతత్వం వాసితం కుర్యాదిత్యర్థః.

టీ. ఆరుణిః=అరుణుని పుత్రుఁ డగు ఉద్దాలకమహర్షి, మృత్సువర్ణమయశ్చేతి = మృత్తు, సువర్ణము, ఇనుము నని, దృష్టాంతత్రయం=మూఁడు దృష్టాంతములను, ప్రాహ = చెప్పెను. అతః = అందుచే, సర్వవస్తుషు = అన్నివస్తువులయందు, కార్యానృతత్వం = ఘటాదికార్యములయొక్క మిథ్యాత్వము, వాసయేత్ = తెలిసికొనవలయును.

తా. శ్రు. "యథా సోమ్యైకేన మృత్పిండేన" యనియు, "కార్ష్ణాయసమిత్యేవ సత్య" మనియు చెప్పుచు, కార్యములు మిథ్యయే యనియు, కారణమే సత్య మనియుఁ జెప్పుటకు మృత్తును, సువర్ణమును, ఇనుమును దృష్టాంతములుగా ఉద్దాలకుఁడు చెప్పెను. ఈ దృష్టాంతములను బట్టి సర్వవస్తువులందును ఘటాదికార్యము మిథ్య యనియు, మృత్సువర్ణాద్యుపాదానకారణములే సత్య మనియు నెఱుంగ నగును.

అవ. కార్యవర్గము మిథ్య యని తెలిసికొనుటచే ప్రయోజనము:—

శ్లో. కారణజ్ఞానతః కార్యవిజ్ఞానం చాపి సోఽవదత్,
సత్యజ్ఞానేఽనృతజ్ఞానం కథమత్రోపపద్యతే. 54

వ్యా. నను, కార్యానృతత్వానుసంధానమపి కిమర్థముక్తమిత్యాశంక్య కారణజ్ఞానాత్కార్యజ్ఞానసిద్ధయ ఇత్యభిప్రాయేణాహ—కారణేతి. కారణస్య మృదాదేర్జ్ఞానాత్కార్యజాతస్య ఘటాదేర్జ్ఞానమపి 'యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాది'త్యాదివాక్యజాతేనోక్తవానిత్యర్థః. నను మృత్సువర్ణాదిరూపస్య పారమార్థికస్య కారణస్య విజ్ఞానాత్తద్విలక్షణస్య ఘటరూపకార్యాదేర్విజ్ఞానమనుపపన్నమితి శంకతే—సత్యేతి.

టీ. సః = ఆ ఉద్దాలకుఁడు, కారణజ్ఞానతః = కారణమును తెలిసికొనుటవలన, కార్యవిజ్ఞానం చాపి=కార్యము తెలియుటనున్ను, అవదత్=చెప్పెను. అత్ర=ఈ విషయమై, సత్యజ్ఞానే = సత్యమైన కారణజ్ఞానము కలిగినప్పుడు, అనృతజ్ఞానం=అసత్యమైన కార్యము తెలియుట, కథం=ఎట్లు, ఉపపద్యతే = ఘటించును ?

తా. ఉద్దాలకుఁడు కారణము తెలిసినయెడల కార్యవర్గమంతయుఁ దెలియు ననెను. సత్యమైన కారణమును తెలిసికొన్నచో, అనృతమైన కార్య మెట్లు తెలియును ?

అవ పైపూర్వపక్షమునకు సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు:—

శ్లో. సమృత్కస్య వికారస్య కార్యతా లోకదృష్టితః,
వాస్తవోఽత్ర మృదంశోఽస్య బోధః కారణబోధతః. 55

వ్యా. కార్యస్య సత్యానృతాంశద్వయరూపత్వాత్కారణజ్ఞానాత్కార్యగతసత్యాంశజ్ఞానం భవతీత్యభిప్రాయేణాహ—సమృత్కస్యేతి. సమృత్కస్యాధిష్ఠానభూతమృత్సహితస్య వికారస్య ఆరోపితస్య ఘటాదిరూపస్య కార్యతా కార్యశబ్దార్థత్వం లోకప్రసిద్ధమిత్యర్థః. భవత్వేవమేతావతా కారణజ్ఞానాత్కార్యజ్ఞానం సంభవతీతి చోద్యస్య కః పరిహారో జాత ఇత్యాశంక్య కార్యగతానృతాంశజ్ఞానాభావేఽపి తద్గతసత్యాంశజ్ఞానం భవత్యేవేతి పరిహరతి—వాస్తవ ఇతి. అత్ర కార్యే యో వాస్తవ మృదంశోఽస్తి, అస్య వాస్తవాంశస్య బోధో జ్ఞానం కారణజ్ఞానాద్భవతీత్యర్థః.

టీ. సమృత్కస్య=అధిష్ఠానమైన మృత్తుతోఁగూడిన, వికారస్య = మృత్కల్పితమైన ఘటాదిరూపమునకు, కార్యతా = కార్యశబ్దముచే వ్యవహారము, లోకదృష్టితః= లోకవాడుకవలన (ఘటితమగుచున్నది). అత్ర=ఈ కార్యమునందు, మృదంశః=మృత్తికయొక్క అంశమే, వాస్తవః = సత్యమైనది. అస్య=ఈ సత్యత్వముయొక్క, బోధః = జ్ఞానము, కారణబోధతః=సత్యమైన కారణజ్ఞానమువలన కలుగును.

తా. అధిష్ఠానముతోఁగూడిన ఆరోపితము కార్యమని లోకమునఁ జెప్పుదురు. కార్యమగు ఘటమునందు మృదంశమే యథార్థము.

ఇట్టి వాస్తవమైన జ్ఞానము, కారణము తెలిసినఁ గాని కలుగదు. కార్యముయొక్క కారణము తెలిసినయెడల అట్టి కారణజ్ఞానముచే కార్యము మిథ్య యనియు, వాస్తవముగా నదియు కారణముకంటె వేఱు గా దనియు తెలియును.

అవ. కార్యమం దున్న సత్యాంశబోధ గలిగినట్లు, అనృతాంశబోధమాత్ర మక్కఱ లేదా యని శంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అనృతాంశో న బోద్ధవ్య స్తద్బోధానుపయోగతః,
తత్త్వజ్ఞానం పుమర్థం స్యా న్నానృతాంశావబోధనమ్. 56

వ్యా. నను, కార్యగతసత్యాంశవదనృతాంశోఽపి బోద్ధవ్య ఇత్యాశంక్య ప్రయోజనాభావాన్నేవమిత్యాహ—అనృతాంశ ఇతి. ప్రయోజనాభావమేవ దర్శయతి—తత్త్వజ్ఞానమితి. తత్త్వస్యాబాధ్యస్య వస్తునో జ్ఞానం పుమర్థమితి పుంసో జ్ఞాతుః పురుషస్యార్థః ప్రయోజనం యస్మిన్ తత్పుమర్థమితి బహువ్రీహిః. అనృతాంశస్యవికారస్యావబోధనం ప్రయోజనవన్న భవతీత్యర్థః.

టీ. తద్బోధానుపయోగతః = అట్టి అనృతాంశబోధచే లాభము లేదు గనుక, అనృతాంశః=అసత్యాంశము, న బోద్ధవ్యః=తెలియవలసినపని లేదు, తత్త్వజ్ఞానం = అబాధితమైన వస్తువుయొక్క జ్ఞానము, పుమర్థం=పురుషార్థము గలది, స్యాత్ =అగును. అనృతాంశావబోధనం=అనృతాంశమును తెలిసికొనుట, న=పురుషార్థము కాదు.

తా. అనృతాంశ జ్ఞానముచే పురుషార్థము లేదు. ఇతర ప్రయోజనమును లేదు కాన దానినిఁ దెలియ నక్కఱలేదు. తత్త్వజ్ఞానమువలననే పురుషార్థము గలదు. ఎట్లనఁగా రజ్జుసర్పభ్రాంతియందు సర్పజ్ఞానముచే భయకంపాదిదుఃఖప్రాప్తియు, యథార్థ మగు రజ్జుజ్ఞానముచే దుఃఖనివృత్తివలనఁ బురుషార్థంబును గనఁబడుచున్నవి.

అవ. మఱల పూర్వవాది శంకించుచున్నాఁడు:—

శ్లో. తర్హి కారణవిజ్ఞానాత్కార్యజ్ఞానమితీరితే,
మృద్బోధాన్మృత్తికాబుద్ధేత్యుక్తం స్యాత్కోఽత్ర విస్మయః. 57

వ్యా. నను, కారణజ్ఞానాత్కార్యజ్ఞానం భవతీత్యేతచ్ఛ్రుత్యుబుద్ధా చమత్కారహేతుర్భవిష్యతీత్యభిప్రాయేణోక్తం. తదేతన్న సంభవతీతి శంకతే—తర్హీతి. కారణస్య మృదాదేర్జ్ఞానాత్కార్యగతం మృదాదిసత్యాంశజ్ఞానం భవతీత్యుక్తే మృజ్జ్ఞానాత్ మృదో జ్ఞానమిత్యుక్తం భవతి. ఏవంచ సతిశబ్దత ఏవ చమత్కారో నార్థత ఇత్యర్థః.

టీ. తర్హి=అట్లులయితే, కారణవిజ్ఞానాత్ = కారణమును తెలిసికొనుటవలన, కార్యజ్ఞానమితి = కార్యము తెలియు నని, ఈరితే = చెప్పినప్పుడు, మృద్బోధాత్ = మృదంశమును తెలిసికొనుటవలన, మృత్తికా బుద్ధేతి=మృత్తికయే తెలిసిన దని, ఉక్తం= చెప్పఁబడినది, స్యాత్=అగును. అత్ర=దీనియందు, విస్మయః కః=ఆశ్చర్య మేమి?

తా. కారణ మగు మృద్జ్ఞానముచే కార్య మగు ఘటాదికార్య జ్ఞానము కలుగు ననుట, మీ శబ్దచమత్కృతిని తెలుపుచున్నదే కాని, అర్థములో నేమియు చమత్కారము లేదు. మృదంశము తెలియుటచే మృత్తిక తెలియు ననిన, నిం దేమి వింత గలదు? అని పూర్వవాది శంకించెను.

అవ. సిద్ధాంతి దీనికి సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్యం కార్యేషు వస్త్వంశః కారణాత్మేతి జానతః,
విస్మయో మాస్త్విహాజ్ఞస్య విస్మయః కేన వార్యతే. 58

వ్యా. ఈదృగ్వివేకవతాం విస్మయాభావేఽపి తద్రహితానాం విస్మయస్స్యాదే వేతి పరిహరతి—సత్యమితి. కార్యేషు ఘటాదిషు విద్యమానో వాస్తవోఽంశః కారణ స్వరూపమేవేతి యే జానంతి, తేషామాశ్చర్యం మా భూదితరేషాం తద్జ్ఞానశూన్యానాం జాయమానో విస్మయో న నివారయితుం శక్యత ఇత్యర్థః.

టీ. సత్యం=నీవు చెప్పినది నిజమే, కార్యేషు=కార్యములయందు, వస్త్వంశః= సత్యాంశము, కారణాత్మేతి=కార్యము కారణరూపమే యని, జానతః=ఎఱిఁగినవానికి, ఇహ=ఈ విషయములో, విస్మయః = ఆశ్చర్యము, మాస్తు=లేకపోవుఁ గాక; అజ్ఞస్య = తెలియనివానికిఁ గలిగెడి, విస్మయః = ఆశ్చర్యము. కేన=ఎవరిచేత, వార్యతే=వారింపఁ బడును (వారింపఁ బడ దనుట).

తా. సరి, ఘటాదికార్యమునందలి వాస్తవస్వరూపము కారణ రూపమే యని తెలసిన నీ బోటివాని కాశ్చర్యము కలుగకున్నను, అట్టి పరిశీలన లేని యజ్ఞున కాశ్చర్యము కలుగును.

అవ. పైయర్థమునే వివరించుచున్నాఁడు:—

శ్లో. ఆరంభీ పరిణామీ చ లౌకికస్త్వేకకారణే,
జ్ఞాతే సర్వమతిం శ్రుత్వా ప్రాప్నువంత్యేవ విస్మయమ్. 59

వ్యా. అజ్ఞస్య విస్మయో భవేదిత్యుక్తమేవార్థం ప్రపంచయతి—ఆరంభీతి. ఆరంభో నామ సమవాయ్యసమవాయినిమిత్తాఖ్యకారణేభ్యో భిన్నస్య కార్యస్యోత్పత్తిస్తాం యో వక్తి సోఽయమారంభీత్యుచ్యతే. పూర్వరూపపరిత్యాగేన రూపాంతరప్రాప్తిలక్షణం పరిణామం యో వక్తి స పరిణామీత్యుచ్యతే. ప్రక్రియాద్వయమజానానో యో వ్యవహారమాత్రపరః స లౌకిక ఇత్యుచ్యతే. ఏషాం త్రయాణామపి కారణస్యైకస్య జ్ఞానాదనేకేషాం కార్యాణాం విజ్ఞానం భవతీతి వాక్యశ్రవణాద్విస్మయో భవేదేవేత్యర్థః.

టీ. ఆరంభీ = ఆరంభవాదియు, పరిణామీ చ=పరిణామవాదియు, లౌకికశ్చ = పామరుఁడును, ఏకకారణే = ఒక్క కారణము, జ్ఞాతే=తెలియఁబడఁగా, సర్వమతిం = సర్వకార్యములు తెలియు ననుటను, శ్రుత్వా=విని, విస్మయం=ఆశ్చర్యమును, ప్రాప్నువంత్యేవ = తప్పక పొందుచున్నారు.

తా. సమవాయ్యసమవాయినిమిత్తము లనెడి కారణములవలన భిన్న మగు కార్యము జనించు నని చెప్పెడి వైశేషికుఁడు ఆరంభవాది యనఁబడును. కారణము తన పూర్వాకారమును విడిచి భిన్నరూపమును బొందుట పరిణామ మనఁబడును. అట్టి పరిణామవాదమును వాదించు సాంఖ్యుఁడు పరిణామవాది యనఁబడును. ఈ ద్వివిధకార్యముఁ దెలియక వ్యవహారమాత్రాసక్తుఁ డగువాఁడు లౌకికుఁ డనఁబడును. ఈ ముగ్గురకు నేక కారణవస్తుజ్ఞానమువలన ననేక కార్యవర్గజ్ఞానము గలుగుచున్న దనెడి వాక్యమును వినుటచేత నీ ముప్వురకును ఆశ్చర్యము గలుగుచున్నది.

ఘటమునకు మృత్తికయు, వస్త్రమునకు నూలును సమవాయికారణ మగును. వేదాంతులు కార్యము కారణముకంటె నభిన్న మని చెప్పెదరు. కారణముకంటె కార్యము భిన్న మని తార్కికులు చెప్పెదరు. మృత్తికయందుఁ గల అనేకాణువులయొక్క సంయోగమును, నూలుయొక్క సంయోగమును, అనఁగా ఇత్యాది సంబంధము, సమవాయికారణ మనఁబడును. ఘటమునకు కుమ్మరియు వాని పని ముట్లును నిమిత్తకారణము. అట్లే వస్త్రమునకు సాలెవాఁడును వాని పని ముట్లును నిమిత్తకారణము. అని తెలియవలెను.

అవ. ఉన్నది యున్నట్లు చెప్పక నిట్లు చెప్పుట కేమి కారణ మనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అద్వైతేఽభిముఖీకర్తుమేవాత్రైకస్య బోధతః,
సర్వబోధః శ్రుతౌ నైవ నానాత్వస్య వివక్షయా. 60

వ్యా. నను యథాశ్రుతమర్థం పరిత్యజ్యేత్థం వ్యాఖ్యానే కిం కారణమిత్యాశంక్య శ్రుతేస్తత్ర తాత్పర్యాభావాదిత్యాహ—అద్వైత ఇతి. అద్వైతవిజ్ఞానే శిష్యమభిముఖీకర్తుమేవ ఛాందోగ్యశ్రుతావేకస్య కారణస్య విజ్ఞానాత్సర్వేషాం కార్యాణాం విజ్ఞానముక్తం. న తు కార్యాణామనేకేషాం విజ్ఞానసిద్ధ్యర్థమిత్యభిప్రాయః.

టీ. అద్వైతే = అద్వైతమునందు, అభిముఖీకర్తుమేవ = శిష్యు నభిముఖునిగాఁ జేయుటకే, అత్ర శ్రుతౌ=ఈ ఛాందోగ్యశ్రుతియందు, ఏకస్య=కారణముయొక్క, బోధతః = జ్ఞానమువలన, సర్వబోధః = అనేక కార్యవిజ్ఞానము, శ్రుతః = వినఁబడుచున్నది. నానాత్వస్య వివక్షయా = భేదముయొక్క ప్రతిపాదనేచ్ఛచేత, నైవ (శ్రుతః)=వినఁబడ లేదు.

తా. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్," అనెడి ఛాందోగ్య శ్రుతియందు సజాతీయ విజాతీయ స్వగతభేద రహిత మగు సద్రూపాత్మక బ్రహ్మమునందు శిష్యుని అభిముఖునిగాఁ జేయుటకొఱకే, ఒక కారణవస్తువుయొక్క జ్ఞానమువలన సర్వకార్యములయొక్క విజ్ఞానమును జెప్పఁబడెను గాని, అనేక కార్యములయొక్క విజ్ఞాన మావశ్యక మనెడి తాత్పర్యముతోఁ జెప్పఁబడలే దని యభిప్రాయము.

అవ. ఛాందోగ్యశ్రుతియందలి పూర్వోత్తరవాక్యసందర్భముచే ఫలించిన యర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏకమృత్పిండవిజ్ఞానాత్సర్వ మృన్మయధీర్యథా,
తథైకబ్రహ్మబోధేన జగద్బుద్ధిర్విభావ్యతామ్. 61

వ్యా. ఇదానీమేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానే దృష్టాంతప్రదర్శనపరస్య * 'యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యా' దితి వాక్యస్యార్థనిరూపణపురస్సరం దార్ష్టాంతికప్రదర్శనపరస్య * 'ఉత తమాదేశమప్రాక్షః యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాత' మితి వాక్యస్యార్థం ప్రదర్శయన్ ప్రకృతే ఫలితమాహ—ఏక మృత్పిండేతి యథా ఘటశరావాద్యుపాదానస్యైకస్య మృత్పిండస్యావబోధాత్తద్వికారాణాం సర్వేషాం ఘటాదీనాం బోధో భవతి. ఏవం సర్వోపాదానస్యైకస్య బ్రహ్మణో బోధాత్తత్కార్యస్య కృత్స్నస్య జగతో బోధో భవతీత్యవగంతవ్యమిత్యర్థః.

టీ. ఏకమృత్పిండవిజ్ఞానాత్=ఒక్క మృత్పిండ మను విజ్ఞానమువలన, సర్వమృన్మయధీః = సకలమృద్వికారము లగు ఘటశరావాదులయొక్క జ్ఞానము, యథా=ఎట్లు కలుగుచున్నదో, తథా=అటులనే, ఏకబ్రహ్మబోధేన=ఒక్క యద్వితీయ పరబ్రహ్మమును తెలిసికొనుటవలన, జగద్బుద్ధిః = కార్యమైన ప్రపంచమును దెలియుట, విభావ్యతాం = తెలిసికొనఁబడుఁ గాక.

తా. ఘటశరావాదులకు ఉపాదానకారణమైన ఒక మృత్పిండ జ్ఞానమువలన మృద్వికారము లగు సర్వఘటాదులయొక్క జ్ఞానమును ఎట్లు కలుగుచున్నదో, ఆ ప్రకారమే సర్వమునకు ఉపాదానకారణమగు అద్వితీయబ్రహ్మముయొక్క జ్ఞానమువలన తత్కార్యం బగు సర్వప్రపంచ జ్ఞానమును గలుగుచున్న దని భావము.

అవ. బ్రహ్మ జగత్స్వరూపములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. సచ్చిత్సుఖాత్మకం బ్రహ్మ నామరూపాత్మకం జగత్,
తాపనీయే శ్రుతం బ్రహ్మ సచ్చిదానందలక్షణమ్. 62

వ్యా. నను బ్రహ్మజగతోస్స్వరూపాపరిజ్ఞానే బ్రహ్మజ్ఞానాజ్జగతో జ్ఞానం భవతీత్యేతన్నావగంతుం శక్యత ఇత్యాశంక్య తదవగమాయ తదుభయస్వరూపం దర్శయతి—సచ్చిదితి. బ్రహ్మణస్సచ్చిదానందరూపత్వే కిం ప్రమాణమిత్యాశంక్య తాపనీయాదిశ్రుతయః ప్రమాణమిత్యభిప్రాయేణాహ—తాపనీయ ఇతి. ఉత్తరస్మిన్ తాపనీయే ఆథర్వణికైస్తావత్ * 'బ్రహ్మవేదం సర్వం సచ్చిదానందమాత్ర' మిత్యాదిప్రదేశేషు బ్రహ్మణస్సచ్చిదానందరూపత్వముక్తమిత్యర్థః.

టీ. బ్రహ్మ=పరబ్రహ్మము, సచ్చిత్సుఖాత్మకం=సచ్చిదానందరూపము. జగత్ = జగత్తు, నామరూపాత్మకం=నామరూపములే స్వరూపముగాఁ గలది. తాపనీయే=ఉత్తర తాపనీయోపనిషత్తునందు, బ్రహ్మ=బ్రహ్మము, సచ్చిదానందలక్షణం=సద్రూప, చిద్రూప, ఆనందరూపములే లక్షణముగాఁ గలది యని, శ్రుతం=చెప్పఁబడినది.

తా. పరబ్రహ్మము సచ్చిదానందమాత్రస్వరూప మనియు, జగత్తు కల్పితనామరూపాత్మక మనియు నృసింహోత్తరతాపనీయోపనిషత్తునందుఁ జెప్పఁబడినది.

అవ. ఇంక నితర శ్రుతులఁ బఠించుచున్నాఁడు:—

శ్లో. సద్రూపమారుణిః ప్రాహ ప్రజ్ఞానం బ్రహ్మ బహ్వృచః,
సనత్కుమార ఆనందమేవమన్యత్ర గమ్యతామ్. 63

వ్యా. ఆదిశబ్దేన వివక్షితాని శ్రుత్యంతరాణి దర్శయతి—సద్రూపమితి. అరుణ పుత్రేణోద్దాలకేన ఛాందోగ్యశ్రుతౌ, * 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీ, దిత్యాదినా సద్రూపం బ్రహ్మనిరూపితం. తథా బహ్వృచః ఋక్ శాఖాధ్యాయినః ఐతరేయో పనిషది. * 'ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మే'తి. ప్రజ్ఞానరూపత్వం బ్రహ్మణో దర్శ యంతి. ఏవం పూర్వోదాహృతాయాం ఛాందోగ్యశ్రుతావేవ సనత్కుమారాఖ్యో గురుః నారదాఖ్యశిష్యాయ. * 'భూమా త్వేవ విజిజ్ఞాసితవ్య' ఇత్యుపక్రమ్య 'యో వై భూమాతత్సుఖ'మితి భూమశబ్దాభిధేయస్య బ్రహ్మణ ఆనందరూపత్వముక్తవానిత్యర్థః. ఉక్తన్యాయమన్యత్రాప్యతిదిశతి—ఏవమితి. అన్యత్ర తైత్తిరీయకాదిశ్రుతిషు. * 'ఆనందో బ్రహ్మేతి వ్యజానా' దిత్యాదివాక్యైరానందరూపత్వాదికముక్తమితి ద్రష్టవ్యమితి భావః.

టీ. ఆరుణిః=ఆరుణిపుత్రుఁడగు ఉద్దాలకుఁడు, సద్రూపం=బ్రహ్మము సద్రూప మని, ప్రాహ=చెప్పెను. బహ్వృచః = ఋక్‌శాఖవారు, బ్రహ్మ=బ్రహ్మము, ప్రజ్ఞానం= ప్రజ్ఞాన స్వరూప మనిరి. ఏవం = ఇటులనే, సనత్కుమారః = సనత్కుమారుఁడు, ఆనందం=బ్రహ్మ మానంద స్వరూప మనెను. అన్యత్ర=తక్కిన తైత్తిరీయాది శ్రుతుల యందును, గమ్యతాం = ఇట్లే తెలియఁబడుఁగాక.

తా. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అనెడి ఛాందోగ్యశ్రుతి యందు, సృష్టికిఁ బూర్వ మీ ప్రపంచమంతయు సద్రూపముగా నుండె నని ఉద్దాలకుఁడు చెప్పెను. 'సత్' అనఁగా కాలత్రయాబాధ్య మగు బ్రహ్మవస్తువు. "ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" అనెడి ఐతరేయోప నిషద్వాక్యమందు ప్రజ్ఞానమే బ్రహ్మమని చెప్పఁబడెను. ప్రజ్ఞాన మనఁగా స్వయంప్రకాశమానత్వము. "యో వై భూమా తత్సుఖమ్" ఎద్ది భూమయో యదియె ఆనంద మని (బ్రహ్మ మని) ఛాందోగ్యమునందె సనత్కుమారుఁడు నారదున కుపదేశించెను. మఱియు "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" ఆనందమే బ్రహ్మము, అని తైత్తిరీయ శ్రుతి యందుఁ జెప్పఁబడెను. ఆనంద మనఁగా నిత్యసుఖము. ఇట్లు బ్రహ్మము సత్యజ్ఞానానందస్వరూప మని సిద్ధించుచున్నది.

అవ. జగత్తు నామరూపాత్మక మనుటకును శ్రుతిని జూపుచున్నాఁడు:—

శ్లో. విచిత్య సర్వరూపాణి కృత్వా నామాని తిష్ఠతి,
అహం వ్యాకరవాణీమే నామరూపే ఇతి శ్రుతీ. 64

వ్యా. సచ్చిదానందేష్వివ నామరూపయోరపి శ్రుతిం దర్శయతి—విచిత్యేతి. 'సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాభివదన్ యదాస్తే'ఇతి, 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి' చ శ్రుత్యా జగన్నిష్ఠే నామరూపే శ్రుత్యా దర్శితే ఇత్యర్థః.

టీ. సర్వరూపాణి = సర్వరూపములను, విచిత్య = సృజించి, నామాని = పేరులను, కృత్వా = కల్పించి, తిష్ఠతి = ఉన్నాఁడు. అహం=నేను, ఇమే=ఈ నామరూపములను, వ్యాకరవాణి=విస్తరించెద నని, శ్రుతీ=రెండు శ్రుతులును చెప్పుచున్నవి.

తా. "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాభివదన్ యదాస్తే" యనెడి శ్రుతి, బుద్ధిప్రేరకుఁ డగు పరమేశ్వరుఁడు సకల రూపములను గల్పించి వానితో వ్యవహరించుచున్నాఁ డని చెప్పుచున్నది. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" యనెడి శ్రుతి, ఆత్మ జీవరూపమునఁ బ్రవేశించి, యీ నామరూపములను విస్తరింపఁజేయుచున్నాఁ డని చెప్పుచున్నది. కనుక, నామరూపములు రెండును జగత్తునం దున్న వని యభిప్రాయము.

అవ. వేఱొక శ్రుతిని నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. అవ్యాకృతం పురా సృష్టేరూర్ధ్వం వ్యాక్రియతే ద్విధా,
అచింత్యశక్తిర్మాయైషా బ్రహ్మణ్యవ్యాకృతాభిధా. 65

వ్యా. తత్రైవ శ్రుత్యంతరముదాహరతి—అవ్యాకృతమితి. బృహదారణ్యకశ్రుతౌ. * 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌ నామాయమిదం రూపమితి సృష్టస్య జగతో నామరూపాత్మకత్వం దర్శితమిత్యర్థః. సృష్టేః పూర్వమిదం జగదవ్యాకృతమవ్యక్తనామరూపాత్మకమభూదూర్ధ్వం సృష్ట్యవసరే ద్విధా వాచ్యవాచకభావేన వ్యాక్రియతే వ్యక్తీకృత మిత్యర్థః. ఇదానీం తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీదిత్యత్రావ్యాకృతశబ్దస్యార్థమాహ—అచింత్యేతి. యేయం బ్రహ్మణి అచింత్యశక్తిర్మాయాస్తి ఏషాఽవ్యాకృతాభిధాస్మిన్వాక్యేఽవ్యాకృతశబ్దే నాభిధీయత ఇత్యర్థః.

టీ. సృష్టేః పురా=సృష్టికి పూర్వము (ఇదం = ఈ జగత్తు) అవ్యాకృతం = నామరూపములు స్పష్టముగా లేనిదై యుండెను. ఊర్ధ్వం=తరువాత, ద్విధా = రెండువిధములుగా, వ్యాక్రియతే = వ్యక్తము చేయఁబడుచున్నది. బ్రహ్మణి = బ్రహ్మమందు, ఏషా=ఈ, అచింత్యశక్తిః = నిరూపింప శక్యముగాని శక్తిస్వరూపము గల, మాయా = మాయ, అవ్యాకృతాభిధా = అవ్యాకృత శబ్దముచే జెప్పఁబడుచున్నది.

తా. ఈ జగత్తు సృష్టికి పూర్వము అవ్యక్తనామరూపములు గలదిగా నుండి, సృష్టికాలమున, నామరూపములచేతను (వాచ్యవాచకభావముచేత) వ్యక్తీకరింపఁబడుచున్నది. సృష్టికాలమున అచింత్య రచనా రూప మగు మాయాశక్తి అవ్యాకృత మనెడి పేరుచేత బ్రహ్మమం దున్న దని "తద్ధేదం తర్హ్యవ్యాకృత......సౌ నామాయమిదం రూపం" అనెడి బృహదారణ్యక శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఆ బృహదారణ్యక శ్రుత్యర్థమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. అవిక్రియబ్రహ్మనిష్ఠావికారం యాత్యనేకధా,
మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్. 66

వ్యా. తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతేత్యస్యార్థమాహ—అవిక్రియేతి. అవికారిణి బ్రహ్మణి వర్తమానా సా అనేకధా భూతభౌతికప్రపంచరూపేణ బహుధా వికారం పరిణామం ప్రాప్నోతి. మాయా బ్రహ్మణి వర్తత ఇత్యత్ర ప్రమాణమాహ—మాయాం త్వితి. మాయాం పూర్వోక్తాం ప్రకృతిం ప్రక్రియతే అనయేతి ప్రకృతిరుపాదాన కారణం విద్యాత్ జానీయాత్. మాయినం తస్యా ఆశ్రయత్వేన తద్వంతం మహేశ్వరం మాయానియామకం విద్యాదిత్యనువర్తతే. ఉభయత్ర తుశబ్దః పరస్పర వైలక్షణ్యద్యోతనార్థః.

టీ. అవిక్రియబ్రహ్మనిష్ఠా (సా) = నిర్వికారమైన బ్రహ్మస్వరూపమం దున్న మాయాశక్తి, అనేకధా=అనేక విధములుగా, వికారం=పరిణామమును, యాతి=పొందు చున్నది. మాయాంతు = మాయనో, ప్రకృతిం=ప్రపంచమున కుపాదాన కారణముగా, విద్యాత్ = తెలిసికొనవలయును. మహేశ్వరం తు = పరమాత్మనో, మాయినం = మాయ కాశ్రయునిగా, (మాయా నియామకునిగా) విద్యాత్ = తెలిసికొన నగును.

తా. బ్రహ్మము నిర్వికారము. ఆ బ్రహ్మము నాశ్రయించియున్న మాయాశక్తి భూతభౌతిక ప్రపంచముగా పెక్కురీతుల బరిణమించుచున్నది. మాయను జగత్తున కుపాదాన కారణముగాను మహేశ్వరుని మాయకు నియామకుని గను దెలిసికొనవలెను.

అవ. మాయతోఁ గూడిన బ్రహ్మముయొక్క ప్రథమసృష్టిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆద్యో వికార ఆకాశస్సోఽస్తి భాత్యపి చ ప్రియః,
అవకాశస్తస్య రూపం తన్మిథ్యా న తు తత్త్రయమ్. 67

వ్యా. ఇదానీం మాయోపహితస్య బ్రహ్మణః ప్రథమకార్యమాహ—ఆద్యఇతి. తస్య కారణాదాగతం రూపత్రయమాహ—సోఽస్తీతి. సచ్చిదానందరూప ఇత్యర్థః

తస్య ప్రాతిస్వికం రూపమాహ—అవకాశఇతి. తస్య పూర్వస్మాద్రూపత్రయాద్వైలక్ష ణ్యమాహ—తన్మిథ్యేతి. సదాదిరూపత్రయం వాస్తవమిత్యర్థః.

టీ. ఆద్యః = మొదటిదైన, కార్యః = కార్యము, ఆకాశః = ఆకాశము. సః = ఆ యాకాశము, అస్తి = ఉన్నది. భాతి = ప్రకాశించుచున్నది. అపి చ=ఇంతేగాదు, ప్రియః=ఇష్టమైనది. తస్య=ఆ యాకాశముయొక్క, రూపం = స్వరూపము, అవ కాశః=ఎడము, తత్ =అది, మిథ్యా=అసత్యము. త్రయం తు=ఆ మూఁడైన సత్తు, చిత్తు, ఆనందరూపము లన్ననో, న మిథ్యా = మిథ్యకాదు. సత్యము.

తా. మాయతోఁ గూడిన ఆ పరబ్రహ్మముయొక్క మొదటి కార్యము ఆకాశము. అవకాశము కలది యాకాశ మనఁబడును. అట్టి యాకాశమునందు సచ్చిదానందరూపము లుండియున్నవి. ఆకాశ మున్నది యను వ్యవహారములో సద్రూపమును, ఆకాశము తోఁచు చున్న దన్నప్పుడు చిద్రూపమును, ఆకాశము కావలె నన్నప్పుడు ఆనందరూపమును దానియందు కల వని గ్రహింప నగును. కారణ మగు బ్రహ్మముయొక్క ఈ మూఁడు లక్షణములును కార్యమైన యాకాశమం దున్నవి కార్యమైన యాకాశము మిథ్య యగును. సచ్చిదానందములు మూఁడును వాస్తవములు.

అవ. నాల్గవదైన యాకాశమునకు మిథ్యాత్వము కలుగుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. న వ్యక్తేః పూర్వమస్త్యేవ న పశ్చాన్నాపి నాశతః,
ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా. 68

వ్యా. తస్య చతుర్థరూపస్య మిథ్యాత్వే హేతుమాహ—నవ్యక్తేరితి. నను త్పత్తివినాశయోర్మధ్యే ప్రతీయమానస్యావకాశస్య కథమసత్త్వమిత్యాశంక్యాహ— ఆదావితి.

టీ. సహ=ఆయాకాశము, వ్యక్తేః=పుట్టుటకంటె, పూర్వం=ముందు, నాస్త్యేవ= లేనే లేదు. నాశతః = నశించుటకంటె, పశ్చాచ్చ = తర్వాతను, న = లేదు. యత్ = ఏ వస్తువు, ఆదౌ = మొదటను, అంతే చ = చివరను, నాస్తి = లేదో, తత్ = అది, వర్తమానేఽపి = వర్తమానకాలమునందు, తథా = అట్లు లేనిదే.

తా. ఆకాశ ముత్పత్తికి పూర్వమును, నశించిన తర్వాతను లేదు. ఏది ఆద్యంతములయందు లేనిదో అది వర్తమానకాలమందును లేనిదే. కనుక ఆకాశము మిథ్యయే.

అవ. ఈ చెప్పిన యర్థమునందు గీతావాక్యమును జూపుచున్నాఁడు:—

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవేత్యాహ కృష్ణోఽర్జునం ప్రతి. 69

వ్యా. ఉక్తార్థే శ్రీకృష్ణవాక్యం ప్రమాణయతి—అవ్యక్తాదీనీతి.

టీ. భారత = ఓయర్జునా! భూతాని = ఆకాశాదిభూతభౌతికములు, అవ్యక్తాదీని = మొదట లేనివై, వ్యక్తమధ్యాని=మధ్యకాలమందు మాత్ర మున్నవై, అవ్యక్తనిధనాన్యేవ = అంతమందు నాశము గలవి యగుచునే యున్నవి. ఇతి = ఇట్లుగా, అర్జునం ప్రతి = అర్జునునిఁ గూర్చి, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, ఆహ=చెప్పెను.

తా. అర్జునా! భూతభౌతిక ప్రపంచ మంతయు ఉత్పత్తికి పూర్వము లేక మధ్యకాలమందుఁ గనుపడుచు, అంత్యకాలమునందు నశించుచున్నది. అనఁగా ఆద్యంతములలో లేక వర్తమానకాలమందు మాత్రము కనపడుచున్నదానిని లేనిదానినిగానే యెంచుమని శ్రీకృష్ణుఁడర్జునున కుపదేశించెను.

అవ. ఆకాశమునందు సచ్చిదానందరూపము లున్న వనుట కనుభవమే ప్రమాణ మనుచున్నాఁడు:—

శ్లో. మృద్వత్తే సచ్చిదానందా అనుగచ్ఛంతి సర్వదా,
నిరాకాశే సదాదీనామనుభూతిర్నిజాత్మని. 70

వ్యా. సదాదిరూపత్రయస్యావకాశసత్త్వే కిం ప్రమాణమిత్యాశంక్యానుభూతి రేవ ప్రమాణమిత్యాహ—మృద్వదితి. మృద్వదితి దృష్టాంతప్రదర్శనార్థః. ఘటాదిషు యథాకాలత్రయేఽపి మృదనువర్తతే తథా సదాదిరూపత్రయం సర్వదానుగతమిత్యర్థః. నన్వవకాశం విహాయ సదాదిరూపత్రయం కథమనుభూతమిత్యాశంక్యాహ—నిరాకాశ ఇతి.

టీ. తే సచ్చిదానందాః=ఆ సచ్చిదానందములు మూఁడును, మృద్వత్ =మృత్తువలెనే, సర్వదా=ఎల్లప్పుడును, అనుగచ్ఛంతి=కార్యము ననుసరించుచున్నవి. నిరాకాశే= ఆకాశమును లేనిదిగా భావించిన, సదాదీనాం=సచ్చిద్రూపములయొక్క, అనుభూతిః = అనుభవము, నిజాత్మని=తన యాత్మయందు, (స్ఫురతి=) స్ఫురింపఁ గలదు.

తా. ఘటాదులయందును నే ప్రకారముగఁ గాలత్రయమందును మృత్తిక వర్తించుచున్నదో, ఆ ప్రకారమే ఆకాశమందు సచ్చిదానందములు మూఁడును సర్వదా వర్తించుచున్నవి. విచారణచేసి పైఁజెప్పిన 'ఆదావంతే చ' యనువ్యాసమును ననుసరించి కార్యవర్గమును లేని

దానినిగా భావించినయెడల, ఆ సచ్చిదానందములయొక్క యనుభవము స్పష్టముగాఁ గల్గును.

అవ. ఈసంగతినే దృఢపఱచుటకు మఱలఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అవకాశేవిస్మృతేఽథ తత్ర కిం భాతి తే వద,
 శూన్యమేవేతి చేదస్తు నామ తాదృగ్విభాతి హి. 71

వ్యా. తదేవోపపాదయతి—అవకాశ ఇతి. పూర్వవాదినశ్చోద్యమనువదతి—శూన్యమితి. అంగీకృత్య పరిహారమాహ—అస్త్వితి. శబ్దతః శూన్యమస్తు. అర్థతస్త్వవకాశాభావవిశేషణస్య విశేష్యత్వేన ప్రతీయమానం కించిదస్తీత్యవగంతవ్యమిత్యాహ—తాదృగితి. హిశబ్దో లోకప్రసిద్ధిద్యోతనార్థః.

టీ. అవకాశే=ఆకాశము, విస్మృతే = మఱచిపోఁగా, అథ=తరువాత, తత్ర = అక్కడ, తే=నీకు, కిం=ఏమి, భాతి=ప్రకాశించుచున్నదో, వద=చెప్పుము. శూన్యమేవ=శూన్యమే, భాతీతిచేత్=ప్రకాశించుచున్నది యంటివేని, అస్తు నామ = శబ్దమువలన శూన్యమగుఁగాక, తాదృక్=అట్టివిశేష్యము, విభాతి హి=ప్రకాశించుచునే యున్నది.

తా. ఓ పూర్వవాదీ! ఆకాశమును స్మరింపనపుడు (భావింపనపుడు) ఏమి స్ఫురించు ననిన, నీవు శూన్యమే యున్న దని బదులు చెప్పెదవు. శూన్య మనిన అభావ మగును. అభావ విశేషణమునకు విశేష్య ముండి తీరవలెనుగదా యని యనుగఁగా, విశేష్య మేదో యున్నట్లొప్పుదువు. అదియే యాకాశమును స్మరింపనపుడు గలిగెడి సచ్చిదానందానుభవ మని యెఱుంగుము.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. తాదృక్త్వాదేవ తత్సత్త్వమౌదాసీన్యేన తత్సుఖం,
 ఆనుకూల్యప్రాతికూల్యహీనం యత్తన్నిజం సుఖమ్. 72

వ్యా. భవత్వేవం. ప్రకృతే కిమాయాతమిత్యాశంక్య విశేష్యత్వేన ప్రతీయమానస్య సత్త్వమభ్యుపేయమిత్యాహ—తాదృక్త్వాదితి. తస్య సుఖస్వరూపత్వమాహ—ఔదాసీన్యేతి. ఔదాసీన్యవిషయత్వాత్తస్య సుఖస్వరూపత్వమిత్యర్థః. నన్వనుకూలత్వరహితస్య కథం సుఖస్వరూపత్వమిత్యాశంక్యాహ—ఆనుకూల్యేతి.

టీ. తాదృక్త్వాదేవ=అవకాశాభావమునకు విశేష్యముగాఁ దోఁచునది యగుటవలననే, తత్=అది, సత్త్వం=సత్యమైనది. తత్ = ఆ సద్రూపము, ఔదాసీన్యేన=ఆనుకూల్యప్రాతికూల్యములు లేక ఉదాసీనత్వముచేత, సుఖం=సుఖరూపమైన దగును. యత్ =

ఏ వస్తువు, అనుకూల్య ప్రాతికూల్యహీనం = అనుకూలత్వ ప్రతికూలత్వములు లేనిదో, తత్=ఆవస్తువు, నిజం=స్వకీయమైన, సుఖం=ఆనందము.

తా. అవకాశాభావమునకు విశేషణమైనట్టు గన్పట్టుటచే, ఆ వస్తువు సద్రూప మగును. ఆ సద్రూపము అనుకూలభావము గాని ప్రతికూలభావము గాని లేనిదై ఉదాసీనముగా నుండుటచే నది యానందరూప మనియుఁ జెప్పఁ దగును. అందుచేతనే యది నిజానంద మగును.

అవ. పైవిషయమునే వివరించుచున్నాఁడు:—

శ్లో. ఆనుకూల్యే హర్షధీః స్యాత్ ప్రాతికూల్యే తు దుఃఖధీః,
ద్వయాభావే నిజానందో నిజదుఃఖం న తు క్వచిత్. 73

వ్యా. తదేవోపపాదయతి—ఆనుకూల్యఇతి. నను నిజానందవన్నిజదుఃఖమపి కిం నస్యాదిత్యాశంక్య దుఃఖే నిజత్వప్రసిద్ధ్యభావాన్నైవమిత్యాహ—నిజదుఃఖమితి.

టీ. ఆనుకూల్యే=అనుకూలత యున్నచో, హర్షధీః=సుఖబుద్ధి, స్యాత్=అగును. ప్రాతికూల్యే=ప్రతికూలత్వమున్నచో, దుఃఖధీః=దుఃఖముతోఁ గూడినబుద్ధి, స్యాత్ = అగును. ద్వయాభావే = అనుకూలత్వ ప్రతికూలత్వములు రెండును లేనిచో (ఉదాసీనత్వమైన), నిజానందః = స్వస్వరూపానందము, స్యాత్=కలుగును. క్వచిత్=ఎప్పుడును, నిజదుఃఖం=స్వరూపముచలన దుఃఖము, న=కలుగదు.

తా. ప్రక్చందనాద్యనుకూలవస్తుప్రాప్తివలన నంతఃకరణమునకు సుఖము కలుగును. వ్యాఘ్రసర్పాది ప్రతికూలవస్తుప్రాప్తివలన అంతఃకరణమునకు దుఃఖము కలుగును. ఈ సుఖదుఃఖములు స్వస్వరూపసంబంధములు గావు. అనుకూలత్వప్రతికూలత్వరాహిత్య మైనచో సుషుప్తివలెయందు వలె స్వస్వరూపానంద మనుభవింపఁబడును. స్వస్వరూపమునకు దుఃఖము ధర్మ మని చెప్పుటను జెప్పఁబడి యుండలేదు. కాన నిజదుఃఖ మెన్నఁడును కలుగదు.

అవ. "నిజానందము నిత్యము గదా. అట్లైన దుఃఖ మెన్నఁడు కలుగక యుండవలెనుగదా" అనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిజానందే స్థిరే హర్షశోకయోర్వ్యత్యయః కుతః,
మనసః క్షణికత్వేన తయోర్మానసతేష్యతాం. 74

వ్యా. నను నిజానందస్య సదానందత్వాత్సర్వదా హర్ష ఏవ స్యాత్. న తు

శోకఇత్యాశంక్య తస్య నిత్యత్వేఽపి తద్గ్రాహిణో మనసః క్షణికత్వేన మానసయో స్తయోరపి క్షణికత్వమిత్యాహ—నిజానంద ఇతి.

టీ. నిజానందే = స్వరూపానందము, స్థిరేఽపి = నిత్యమైనదైనను, మనసః = మనస్సుయొక్క, క్షణికత్వేన = క్షణికత్వముచే, హర్షశోకయోః = సుఖదుఃఖములకును, క్షణాత్ =క్షణికత్వమువలన, వ్యత్యయః=మార్పు (కలుగుచున్నది). తయోః = ఆ సుఖ దుఃఖములకు, మానసతా=మనస్సుతో సంబంధము, ఇష్యతాం=ఒప్పుకొనఁబడుఁ గాక.

తా. నిజానందము నిత్యమే. అయినను అట్టి యానంద మున్న దని గ్రహించునది మనస్సు. మనస్సు క్షణికముగదా అందుచే మనస్సుతో సంబంధము గల సుఖదుఃఖములును (ఆనుకూల్య ప్రాతికూల్యముల వలనఁ గలిగిన సుఖదుఃఖములు) క్షణికము లగుచున్నవి. నిజానందమునకు మనస్సునకు సంబంధము లేదు కావున నిజానందము అంతఃకరణము నందలి సుఖదుఃఖములవలె నిమేషమాత్రము గాక, స్థిరమై, నిత్యమైన దై యున్నది.

అవ. విజ్ఞానాత్మయందు వలె, ఆకాశము మొదలు శరీరాంతమువఱకు, సచ్చి దానందము లున్న వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆకాశేఽప్యేవమానందః సత్తాభానే తు సమ్మతే,
వాయ్వాదిదేహపర్యంతం వస్తుష్వేవం విభావ్యతామ్. 75

వ్యా. దృష్టాంతే సిద్ధమర్థం దార్ష్టాంతికే యోజయతి—ఆకాశేఽపీతి. ఏవం విజ్ఞానాత్మన్యుక్తప్రకారేణేత్యర్థః. సత్తాభానే తు భవతాప్యభ్యుపగమ్యేతే అతో నోపపాదనీయే ఇత్యర్థః. ఆకాశే ప్రతిపాదితోఽర్థః వాయ్వాదిశరీరాంతేష్వభ్యుప గంతవ్య ఇత్యాహ—వాయ్వాదీతి.

టీ. ఏవం = ఇట్లు (విజ్ఞానాత్మయందు వలె), ఆకాశేఽపి = ఆకాశమునందును, ఆనందః = ఆనందము (ఉన్నది). సత్తాభానే తు = సద్రూపమును, చిద్రూపమును, సమ్మతే = అంగీకరింపఁబడుచున్నవి. ఏవం = ఈ ప్రకారము, వాయ్వాదిదేహ పర్యంతం = వాయువు మొదలు శరీర మంతముగాఁ గల, వస్తుషు = వస్తువులయందు, (వాయ్వగ్నిజల భూమ్యోషధ్యన్న శరీరములందును) విభావ్యతాం=భావింపవలెను.

తా. ఆకాశమునందును, విజ్ఞానాత్మయందు వలె నానంద మున్నది. ఆకాశమునందు సచ్చిద్రూపములు నీచే నొప్పుకొనఁబడినవి.

అందుచేత నాకాశమునందు సచ్చిదానందము లున్న వని తేలుచున్నది ఆకాశమునందు వలెనే, వాయ్వాది శరీరపర్యంత మున్న వస్తువుల యన్నింటియందును సచ్చిదానందము లున్న వని తెలిసికొనవలెను.

అవ. వాయ్వాదులయొక్క యితర ధర్మములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. గతిస్పర్శౌ వాయురూపం వహ్నేర్దాహప్రకాశనే,
జలస్య ద్రవతా భూమేః కాఠిన్యం చేతి నిర్ణయః. 76

వ్యా. తత్ర వాయ్వాదీనామసాధారణధర్మాన్ దర్శయతి — గతిస్పర్శావితి వ్యాఖ్యాం.

టీ. గతిస్పర్శౌ=గతియు (పోవుటయు) స్పర్శమును, వాయురూపం=వాయువుయొక్క రూపము, వహ్నేః=అగ్నికి, దాహప్రకాశనే = దహనమును ప్రకాశమును, జలస్య = నీటికి, ద్రవతా = ద్రవత్వమును, భూమేః = భూమికి, కాఠిన్యం చ = కాఠిన్యమును, ఇతి=రూపము లని, నిర్ణయః=శాస్త్ర నిర్ణయము.

తా. సచ్చిదానందములు వాయ్వాదులం దున్నవి. ఇవిగాక, వాయువునకు గతిస్పర్శములును, అగ్నికి దహనప్రకాశములును, జలమునకు ద్రవత్వమును, భూమికి కాఠిన్యమును, అసాధారణధర్మము లని శాస్త్రనిర్ణయము.

అవ. ఈ యసాధారణ ధర్మములనుబట్టి వాయ్వాదులకు వివిధాకారంబులును ఏర్పడిన వనుచున్నాఁడు:—

శ్లో. అసాధారణ ఆకాశే ఓషధ్యన్నవపుష్వపి,
ఏవం విభావ్యం మనసా తత్తద్రూపం యథోచితమ్. 77

వ్యా. అసాధారణేతి.

టీ. అసాధారణ ఆకాశే = అసాధారణ ధర్మములు గల యాకాశమునందును, ఓషధ్యన్నవపుష్వపి = ఓషధులయందును, అన్నమందును, శరీరమందును, తత్తద్రూపం= వాని వాని యసాధారణ ధర్మము లగు రూపము, ఏవం = ఇట్లే, యథోచితం = వాని ధర్మములకు తగినట్లు, విభావ్యం=తెలిసికొనఁదగును.

తా. ఆకాశమునకు వలె, ఓషధ్యన్నశరీరములకును, వాని యసాధారణ ధర్మములకును తగిన యాకారము లేర్పడిన వని తెలియవలెను.

అవ. నామరూప భేదము లున్నను వాయ్వాదు లన్నిటియందును సచ్చిదానందము లున్న వనుచున్నాఁడు:—

శ్లో. అనేకథా విభిన్నేషు నామరూపేషు చైకథా,
తిష్ఠంతి సచ్చిదానందా విసంవాదో న కస్యచిత్. 78

వ్యా. ఫలితమాహ—అనేకథేతి.

టీ. నామరూపేషు = నామరూపాదులయందు, అనేకథా=అనేక విధములుగా, విభిన్నేషు=భిన్నములైన వాయ్వాదు లన్నిటియందును, ఏకథా=ఒకే రీతిగా, సచ్చిదానందాః = సచ్చిదానందములు మూఁడును, తిష్ఠంతి=ఉన్న వనుటయందు, కస్యచిత్ = ఎవనికిని, విసంవాదః = వివాదము, న = లేదు.

తా. వాయ్వాదులు నామరూపాదులచే ననేక విధములుగా భిన్నము లైనను వాని యన్నింటిలోను, సచ్చిదానందము లున్న వనుట నిర్వివాదాంశము.

అవ. వాయ్వాదులకు నామరూపాదులలో భేదము ప్రత్యక్షముగా కనిపించుచున్నను, అట్టి భేదము వాస్తవము గా దనుచున్నాఁడు:—

శ్లో. నిస్తత్త్వే నామరూపే ద్వే జన్మనాశయుతే చ తే,
బుద్ధ్యా బ్రహ్మణి వీక్షస్వ సముద్రే బుద్బుదాదివత్. 79

వ్యా. తర్హి ప్రతీయమానయోర్నామరూపయోః కా గతిరిత్యాశంక్య కల్పితత్వమేవ గతిరిత్యాహ—నిస్తత్త్వేతి. కల్పితత్వే హేతుః—జన్మేతి.

టీ. ద్వే=రెండైన, నామరూపే = నామరూపములు, జన్మనాశయుతే=జన్మముతోను, నాశముతోను కూడుకొన్నవి. అనఁగా ఉత్పత్తి నాశములు గలవి, నిస్తత్త్వేచ= అందుచే వాస్తవములును (కావు). అతః = అందువలన, తే = ఆ నామరూపములను, సముద్రే = సముద్రమందు, బుద్బుదాదివత్ = నీటి బుగ్గలవలె, బ్రహ్మణి = బ్రహ్మమునందు, (కల్పితే = కల్పింపఁబడిన వని,) బుద్ధ్యా వీక్షస్వ = భావింపుము.

తా. వాయ్వాదుల నామరూపములు నీటి బుగ్గలవలె నుత్పత్తి నాశములు గలవి. కాలత్రయమందు నుండునవి గావు. అందుచేత ఆ నామరూపములు వాస్తవములు కా వని యెఱిఁగి బ్రహ్మసాక్షాత్కారమును పొందుము.

అవ. నామరూపములు కల్పితము లనుటవలన ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సచ్చిదానందరూపేఽస్మిన్పూర్ణే బ్రహ్మణి వీక్షితే,
స్వయమేవావజానాతి నామరూపే శనైశ్శనైః. 80

వ్యా. తతః కిమిత్యత ఆహ—సచ్చిదానందేతి.

టీ. అస్మిన్=ఈ, పూర్ణే=పూర్ణమైనట్టియు, సచ్చిదానందరూపే=సచ్చిదానంద స్వరూపుఁడైన, బ్రహ్మణి = బ్రహ్మము, వీక్షితే = సాక్షాత్కరింపఁబడఁగా, (జ్ఞాని), స్వయం=తాను, నామరూపే = కల్పితనామరూపములను, శనైః శనైః ఏవ=మెల్ల మెల్లగనే, అవజానాతి = ఉపేక్షించును.

తా. అద్వితీయమును, సచ్చిదానందస్వరూపమును, పూర్ణమును నైన బ్రహ్మముయొక్క సాక్షాత్కారము కలిగినచో, నామరూపములు కల్పితము లని మెల్ల మెల్లగాఁ దెలియఁ గలడు. అనఁగా నామరూపములు స్ఫురింపవు.

అవ. నామరూపములు కల్పితము లనియు, ద్వైతము మిథ్య యనియు, ఎంత నిశ్చయజ్ఞానము కలుగునో, అంత దృఢముగా బ్రహ్మసాక్షాత్కారము కలుగునని:—

శ్లో. యావద్యావదవజ్ఞా స్యాత్తావత్తావత్తదీక్షణం,
యావద్యావద్వీక్ష్యతే తత్తావత్తావదుభే త్యజేత్. 81

వ్యా. బ్రహ్మజ్ఞానదార్ఢ్యస్య ద్వైతావజ్ఞాపూర్వకత్వాచ్ఛ్రవణాదివత్ ద్వైతావజ్ఞాపి కర్తవ్యేత్యాహ—యావదితి.

టీ. యావత్ యావత్ = ఎంతెంత దృఢముగా, అవజ్ఞా = (ద్వైతమందు) మిథ్యాత్వనిశ్చయము, స్యాత్ =కలుగునో, తావత్తావత్ =అంతంత దృఢముగా, తత్ = ఆ బ్రహ్మయొక్క, ఈక్షణం=సాక్షాత్కారము, (స్యాత్ =కలుగును). యావద్యావత్ = ఎంతెంతవఱకు, తత్ =ఆ బ్రహ్మము, వీక్ష్యతే = సాక్షాత్కరింపఁబడునో, తావత్ తావత్ =అంతంతవఱకు, ఉభే=ఆ నామరూపములను రెండింటిని, త్యజేత్ = వాస్తవములు కావని త్యజింపవలెను.

తా. ద్వైతమిథ్యాత్వ జ్ఞానమును, నామరూపముల యనృతత్వమును ఎంత స్పష్టముగా గ్రహింపఁబడునో, అంతగా బ్రహ్మసాక్షాత్కార మగును. బ్రహ్మసాక్షాత్కార మెంతెంతమాత్రము గలుగునో, అంతంతమాత్రము నామరూపములు విడువఁబడును.

అవ. ద్వైతమందనాదరణాభ్యాసముయొక్కయు, బ్రహ్మాభ్యాసముయొక్కయు ప్రయోజనము జీవన్ముక్తి యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తదభ్యాసేన విద్యాయాం సుస్థితాయామయం పుమాన్,
జీవన్నేవ భవేన్ముక్తో వపురస్తు యథా తథా. 82

వ్యా. ఉభయాభ్యాసస్య ఫలమాహ—తదభ్యాసేనేతి.

టీ. తదభ్యాసేన = ఆ బ్రహ్మాభ్యాసముచేతను ప్రపంచమిథ్యాభ్యాసముచేతను, (౮౩-వ శ్లోకమునందు దీని పద్ధతిని వివరించుచున్నారు.) విద్యాయాం సుస్థితాయాం= బ్రహ్మజ్ఞానము దృఢము కాఁగా, అయం పుమాన్ = ఈ బ్రహ్మాభ్యాసపరుఁడు, జీవన్నేవ=జీవించియున్నను, ముక్తః=జననమరణరూపసంసారమునుండి విడువఁబడినవాఁడే. అట్టి వానికి పునర్జన్మ లేదు. పునర్మరణమును లేదు. వపుః=దేహము, యథాతథా=ఎట్లైనను, అస్తు = ఉండ నిమ్ము.

తా. ద్వైతమిథ్యాత్వాభ్యాసముచేతను, బ్రహ్మాభ్యాసముచేతను, అట్టి యభ్యాసము చేయు పురుషుఁడు, ఈ శరీరమును ధరించియున్నను బ్రతికియుండియే సంసారబంధ విముక్తుఁ డగుచున్నాఁడు.

అవ. బ్రహ్మాభ్యాసమును వివరించుచున్నాఁడు:—

శ్లో. తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనం,
ఏకదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః. 83

వ్యా. ఇదానీం బ్రహ్మాభ్యాసస్వరూపమాహ—తచ్చింతనమితి.

టీ. తచ్చింతనం = ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపధ్యానమును, తత్కథనం = ఆ బ్రహ్మస్వరూపమును గూర్చిన సంభాషణమును, అన్యోన్యం=ఒక రొకరికి, తత్ప్రబోధనం=ఆ బ్రహ్మస్వరూపబోధ చేసికొనుటయు, ఏతదేకపరత్వం చ=ఈ బ్రహ్మమునందే ప్రధానముగా చిత్తము నేకాగ్రపఱచియుంచుటయు, బ్రహ్మాభ్యాసం = బ్రహ్మాభ్యాస మని, బుధాః = పండితులు, విదుః = తెలిసికొనిరి.

తా. బ్రహ్మాభ్యాస మన, సర్వకాలములందు, సర్వావస్థలయందు, బ్రహ్మస్వరూపమును గూర్చియే ప్రసంగించుట, ధ్యానించుట, బోధ చేయుట, శ్రవణము చేయుట, బ్రహ్మస్వరూపమునందే చిత్తము నేకాగ్రముగా నుంచుట (సంతతప్రత్యగ్బ్రహ్మధ్యానము) బ్రహ్మాభ్యాస మనఁ బడును.

అవ. ద్వైతముయొక్క జ్ఞానము చిరకాలమునుండి వచ్చుచుండినను, బ్రహ్మాభ్యాసమును శ్రద్ధాన్వితుఁడై చేసిన, అట్టి ద్వైతజ్ఞానము నివర్తించు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వాసనానేకకాలీనా దీర్ఘకాలం నిరంతరం,
సాదరం చాభ్యస్యమానే సర్వదైవ నివర్తతే. 84

వ్యా. నన్వనాదికాలమారభ్య ప్రతిభాసమానస్య ద్వైతస్య కాదాచిత్కేన జ్ఞానాభ్యాసేన కథం నివృత్తిరిత్యాశంక్య దీర్ఘకాలనైరంతర్యేణ సత్కారసేవితేనాభ్యాసేన నివర్తత ఏవేత్యాహ—వాసనేతి.

టీ. సాదరం = ఆదరములోఁగూడ, నిరంతరం = ఎల్లప్పుడు, దీర్ఘకాలం = చాల కాలము, అభ్యస్యమానే = బ్రహ్మాభ్యాసము చేయఁబడిన దగుచుండఁగా, వాసనా = ద్వైతము సత్య మనెడి జ్ఞానము, అనేక కాలీనాపి=చిరకాలమునుండి యున్న దైనను, సర్వథా = అన్నివిధములను (తప్పక), నివర్తత ఏవ = నివర్తించును.

తా. ఈ ప్రపంచముయొక్క వాసన చిరకాలమునుండి యున్న దైనను, నిత్యము శ్రద్ధాన్వితుఁడై బ్రహ్మాభ్యాసము చేసినయెడల, వానికా ద్వైతవాసన నిశ్శేషముగ నివర్తించఁ గలదు.

అవ. బ్రహ్మ మద్వితీయ మైనను, మాయయొక్క దుర్ఘటఘటనాసామర్థ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మృచ్ఛక్తివద్బ్రహ్మశక్తిరనేకా నన్మృతాఁ సృజేత్,
యద్వా జీవగతా నిద్రా స్వప్నశ్చాత్ర నిదర్శనమ్. 85

వ్యా. నను బ్రహ్మణ ఏకస్యానేకాకారజగద్ధేతుత్వమనుపపన్నమిత్యాశంక్య మాయాసహితస్యోపపద్యత ఇత్యాహ—మృచ్ఛక్తివదితి. అనృతాన్కార్యాణీత్యర్థః. నను మృచ్ఛక్తేః సత్యత్వాదనేకహేతుత్వాత్ విషమో దృష్టాంత ఇత్యాశంక్య పక్షాంతరమాహ—యద్వా జీవేతి.

టీ. మృచ్ఛక్తివత్ =మృత్పిండమందు నిగూఢమైన శక్తి ఘటశరావాదికమును పుట్టించినట్లు, బ్రహ్మశక్తిః = పరబ్రహ్మము నాశ్రయించి యుండెడి మాయాశక్తి, అనేకాఁ=వివిధము లైన, అనృతాఁ = వాస్తవముగా లేని (పారమార్థికసత్యత్వము లేని) ప్రపంచమునందలి దృశ్యవస్తువులను, సృజేత్ = పుట్టించును. యద్వా = అట్లు గానిచో, అత్ర=ఈ విషయమునందు, జీవగతా = జీవునియందుఁ గల, నిద్రా=నిద్రాశక్తి, స్వప్నశ్చ=కలయును, నిదర్శనం = నిదర్శనము (అగును.)

తా. మృత్పిండమందలి శక్తి ఘటాదికార్యజాతము నెట్లు కల్పించుచున్నదో, అట్లే, ఈశ్వరసంబంధి యగు మాయాశక్తియు పారమార్థికసత్యత్వము లేని యీ ప్రపంచము నంతయు సృజించెను. అనఁగా మాయాశక్తితోఁగూడిన బ్రహ్మమే జగత్కారణ మని యర్థము. సత్యము గాని మాయాశక్తి యెట్లు ప్రపంచమును సృజింపఁగల దనిన, ఉత్పత్తి

నాశములు గలిగి (అందుచేత సత్యము గాని) నిద్రాశక్తి స్వప్నమును, "అట్టి స్వప్నములో రథగజాదులను సృజించుట లేదా" యని సిద్ధాంతి చెప్పుచున్నాఁడు. అసత్య మయ్యు, అనేక పదార్థములను మాయాశక్తి సృజించె ననుటకు నిద్రాశక్తియు, స్వప్నమును దృష్టాంతము.

అవ. నిద్రాశక్తి స్వప్నమును సృజించుచున్న దనెడి దృష్టాంతమునే స్పష్టపఱచు చున్నాఁడు:—

శ్లో. నిద్రాశక్తిర్యథా జీవే దుర్ఘటస్వప్నకారిణీ,
బ్రహ్మణ్యేషా స్థితా మాయా సృష్టిస్థిత్యంతకారిణీ. 36

టీ. యథా=ఎట్లు, జీవే = జీవునియం దున్న, నిద్రాశక్తిః = నిద్రాశక్తి, దుర్ఘట స్వప్నకారిణీ = నిజముగా సంభవింపని స్వప్నమును సృష్టించుచున్నదో, తథా=అట్లు, ఏషా మాయా=ఈ మాయాశక్తి, బ్రహ్మణి = బ్రహ్మమునందు, స్థితా=ఉన్నదై, సృష్టి స్థిత్యంతకారిణీ=జగత్తుయొక్క ఉత్పత్తిస్థితి లయములను జేయునది (అగుచున్నది.)

వ్యా. దృష్టాంతం విశదయతి—నిద్రేతి. దార్ష్టాంతికమాహ—బ్రహ్మణీతి.

తా. జీవునియందుఁ గల నిద్రాశక్తి స్వప్నమునందు జాగ్రద్దశ యందు ఘటింపఁజేసినట్లు, పరబ్రహ్మమే యాధారముగాఁ గల మాయాశక్తియు ప్రపంచమును సృజించెను. కలలోఁ గన్పడెడి వస్తువు లెట్లు నిజముగా లేవో, అట్లే మాయాశక్తిచే సృజింపఁబడిన యీ ప్రపంచము కూడ మిథ్యయే యని తెలిసికొనవలెను.

అవ. నిద్రాశక్తియొక్క అఘటనఘటనాసామర్థ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. స్వప్నే వియద్గతిం పశ్యేత్స్వమూర్ధచ్ఛేదనం యథా,
ముహూర్తే వత్సరౌఘం చ మృతపుత్రాదికం పురమ్. 37

వ్యా. దుర్ఘటకారిత్వమేవ దర్శయతి—స్వప్న ఇతి.

టీ. స్వప్నే = కలయందు, యథా = ఎట్లు, వియద్గతిం = ఆకాశగమనమును, స్వమూర్ధచ్ఛేదనం=తన తలను నఱకుటయు, ముహూర్తే = ముహూర్తకాలమునందు, (స్వల్పకాలమందు) వత్సరౌఘంచ=అనేక సంవత్సరములును, మృతపుత్రాదికం = చని పోయిన పుత్రమిత్రకళత్రాదులును గల, పురం=పట్టణమును, పశ్యేత్ = చూచునో.

తా. నిజముగా ఆకాశగమనము, తన తలను నఱకుట, ముహూర్తకాలములో ననేక సంవత్సరములు గడచుట, పుత్రాదులు చచ్చుట జరుగకపోయినను, అట్లు జరిగినట్లు కనిపించుట నిద్రాశక్తి సామర్థ్యమును జూపుచున్నది.

శ్లో. ఇదం యుక్తమిదం నేతి వ్యవస్థా తత్ర దుర్లభా,
యథాయథేక్ష్యతే యద్యత్తత్తద్యుక్తం తథా తథా. 88

వ్యా. స్వప్నస్య దుర్ఘటత్వే హేతుమాహ—ఇదమితి.

టీ. తత్ర=ఆ స్వప్నమందు, ఇదం యుక్తం=ఇది తగు ననియు, (సంభవ మనియు) ఇదం నేతి=ఇది తగినది కా దనే (ఇది యసంభవ మనియెడి), వ్యవస్థా = నియమము, దుర్లభా=లభింపదు (లేదు). యద్యత్=ఏదేది, యథా యథా=ఏయే రీతిని, ఈక్ష్యతే = చూడఁబడుచున్నదో, తత్తత్=అది యది, తథా తథా=అదేరీతిని, యుక్తం=తగినది.

తా. స్వప్నమునం దిది సంభవము, ఇది యసంభవ మనెడి నియమము లేదు. స్వప్నమునందు సంభవాసంభవ వివేకము లేదు గాన, కలయం దనుభవింపఁబడెడి దంతయు ఉన్న దనియే చెప్పనలెను.

శ్లో. ఈదృశో మహిమా దృష్టో నిద్రాశక్తేర్యథా తథా,
మాయాశక్తేరచింత్యోఽయం మహిమేతి కిమద్భుతమ్. 89

వ్యా. ఉక్తమర్థం కైముతికన్యాయేన స్పష్టయతి—ఈదృశ ఇతి.

టీ. ఈదృశః=ఇట్టి, నిద్రాశక్తేః=నిద్రాశక్తియొక్క, మహిమా = అఘటనఘటనాసామర్థ్యము, యథా=ఎట్లు, దృష్టః=చూడఁబడుచున్నదో, తథా=అట్లే, మాయాశక్తేః=మాయాశక్తియొక్క, అయం మహిమా = ఈ జగత్తును సృష్టింపఁగల సామర్థ్యము, అచింత్య ఇతి = చింతింప నసాధ్య మనుటలో, కిం అద్భుతం = ఏమి యాశ్చర్యము? ఆశ్చర్యము లే దనుట.

తా. పరిచ్ఛిన్నుఁ డగు జీవునియం దున్న నిద్రాశక్తికే యిట్టి సామర్థ్యము కనుపించుచుండఁగా, అపరిచ్ఛిన్నమైన పూర్ణమైన పరబ్రహ్మము నాశ్రయించిన మాయాశక్తికి ఈ ప్రపంచమును సృజింపఁగల సమర్థత యున్న ననుట యం దేమి వింత గలదు? నిద్రాశక్తికే యిట్టి ప్రభావ ముండఁగా, మాయాశక్తినిఁగూర్చి చెప్పవలసిన దేమి?

అవ. "ప్రయత్నాదికము లేక మాయాశక్తి జగత్తు నెట్లు సృజించె" ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శయానే ప్రసువే నిద్రా స్వప్నం బహువిధం స్వజేత్,
బ్రహ్మణ్యేవం నిర్వికారే వికారాన్ కల్పయత్యసౌ. 90

వ్యా. అప్రయతమాన బ్రహ్మనిష్ఠాయాః జగద్ధేతుత్వే దృష్టాంతమాహ—శయాన ఇతి.

టీ. శయానే=నిదురపోవుచున్న, పురుషే=మనుష్యునియందలి, నిద్రా=నిద్రాశక్తి, బహువిధం = అనేక విధములైన, స్వప్నం = స్వప్నములను, సృజేత్ = సృష్టించును. ఏవం=ఇట్లే, నిర్వికారే = వికారరహితమైన, బ్రహ్మణి = పరబ్రహ్మమం దున్న, అసౌ= ఈ మాయ, వికారాన్=కార్యసమూహ మగు నీ జగత్తును, కల్పయతి=కల్పించుచున్నది.

తా. ఏ ప్రయత్నమును లేక నిర్వికారుఁడై నిద్రించుచున్న జీవునియందుఁ గల నిద్రాశక్తి నానావిధస్వప్నపదార్థములను సృష్టించుచున్నది. అటువలెనే నిర్వికార మగు పరబ్రహ్మమందుఁ గల ఈ మాయాశక్తియు నానావిధకార్యవర్గమును నిర్మించుచున్న దని తెలియవలెను.

అవ. మాయచే చేతనాచేతన పదార్థసమూహ మగు ఈ ప్రపంచము సృజింపఁబడె ననుచున్నాఁడు:—

శ్లో. ఖానిలాగ్నిజలోర్వ్యండలోకప్రాణిశిలాదికాః,
వికారాః ప్రాణిధీష్వంతశ్చిచ్ఛాయా ప్రతిబింబితా. 91

వ్యా. మాయయా సృష్టాన్పదార్థాన్ దర్శయతి—ఖానిలేతి. నను పాంచభౌతికత్వేన సామ్యేఽపి కేషాంచిచ్చైతనత్వం, కేషాంచి జ్జడత్వం కుత ఇత్యాశంక్యాహ— ప్రాణీతి. ప్రాణిశరీరేష్వంతఃకరణేషు చైతన్యప్రతిబింబనాచ్చేతనత్వమితరత్ర తదభావా జ్జడత్వమిత్యర్థః.

టీ. ఖానిలాగ్నిజలోర్వ్యండలోకప్రాణిశిలాదికాః = ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి, బ్రహ్మాండము, లోకములు, ప్రాణిసమూహము, శిలలు మొదలగు, వికారాః=కార్యసమూహము, (మాయచే సృజింపఁబడెను), ప్రాణిధీషు = చేతన పదార్థముల యొక్క బుద్ధులయందలి, అంతః=లోన, చిచ్ఛాయా=సాక్షిచైతన్యముయొక్క ఛాయ, ప్రతిబింబితా=ప్రతిబింబించుచున్నది.

తా. మాయాశక్తిచే సృజింపఁబడిన పదార్థములు చేతనము లనియు, అచేతనము లనియు రెండు విధములు. చేతన వస్తువుల (మనుష్యులు మొదలగువారి) బుద్ధులయందు, లేక, అంతఃకరణములయందు, సాక్షిచైతన్యము ప్రతిఫలించుచున్నది. అచేతనముల కట్టి బుద్ధి లేదు. అందుచే నట్టి సాక్షియొక్క ప్రతిబింబమును లేదు.

అవ. చేతనాచేతన విభాగము చిదాభాసునియొక్క ఉండుట, లేకపోవుటవలనఁ గలుగుచున్నదే కాని బ్రహ్మముచే చేయఁబడలే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. చేతనాచేతనేష్వేషు సచ్చిదానందలక్షణం,
సమానం బ్రహ్మ భిద్యేతే నామరూపే పృథక్ పృథక్. 92

వ్యా. నను చేతనాచేతనవిభాగశ్చిద్రూపబ్రహ్మకృత ఏవ కిం న స్యాదిత్యాశంక్య బ్రహ్మణస్సర్వోపాదానత్వేన సర్వత్ర సమత్వాన్నైవమిత్యాహ—చేతనేతి.

టీ. ఏషు చేతనాచేతనేషు = ఈ చేతనాచేతన పదార్థములందు, సచ్చిదానంద లక్షణం బ్రహ్మ=సత్, చిత్, ఆనందములు స్వరూపముగాఁ గల బ్రహ్మము, సమానం = అధిష్ఠానముచేత సమానముగానే యున్నది. నామరూపే = నామరూపములు, పృథక్పృథక్ = వేఱువేఱుగా, భిద్యేతే = భేదించుచున్నవి.

తా. పరబ్రహ్మము చేతనాచేతన వస్తువులయందన్నింటియందును, అధిష్ఠానముగా నున్నది. నామరూపములు మాత్రమే ఒక్కొక్క కార్యమునకు వేఱుగా నున్నవి. అట్టి నామరూపభేదము లేనిచో, కార్యవర్గ మంతయు బ్రహ్మస్వరూపమే.

శ్లో. బ్రహ్మణ్యేతే నామరూపే పటే చిత్రమివ స్థితే,
ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానందధీర్భవేత్. 93

బ్రహ్మణశ్చిజ్జడసాధారణత్వే హేతుమాహ—బ్రహ్మణీతి. బ్రహ్మణస్సర్వకల్పనాధారత్వాత్సర్వగతత్వమిత్యర్థః. తత్కథమవగమ్యత ఇత్యాశంకాయాం కల్పితనామరూపత్యాగేఽధిష్ఠానం బ్రహ్మావగమ్యత ఇత్యాహ—ఉపేక్ష్యేతి.

టీ. ఏతే నామరూపే=ఈ నామరూపములు, బ్రహ్మణి=బ్రహ్మమునందు, పటే = గుడ్డయందు, చిత్రమివ=బొమ్మ (చిత్తరువు) వలె, స్థితే = ఉన్నవి. ద్వే నామరూపే = ఆ నామరూపములను రెండింటిని, ఉపేక్ష్య = విడిచిపెట్టి చూచినయెడల, సచ్చిదానందధీః = సచ్చిదానందరూపమగు బ్రహ్మమునందు బుద్ధి, భవేత్ = అగుఁ గాక.

తా. వస్త్రమునందు చిత్తరువు లున్నట్లు బ్రహ్మమునందు నామరూపాత్మక ప్రపంచము కల్పింపఁబడెను. అనఁగా చిత్తరువులకు వస్త్రమాధారమైనట్లు సర్వప్రపంచకల్పనకు బ్రహ్మ ముపాదానముగ నున్నదని యభిప్రాయము. కల్పిత నామరూపప్రపంచము నుపేక్షించినయెడల సచ్చిదానందరూప పరబ్రహ్మము తెలియఁబడును.

అవ. దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. జలస్థేఽధోముఖే స్వస్య దేహే దృష్టేఽప్యుపేక్ష్య తం,
తీరస్థ ఏవ దేహే స్వే తాత్పర్యం స్యాద్యథా తథా. 94

వ్యా. ఉక్తార్థే దృష్టాంతమాహ—జలస్థ ఇతి. నీరే అధోముఖే దేహే పరిదృశ్యమానేఽపి తత్రాదరం పరిత్యజ్య తీరస్థే స్వదేహేఽనన్యపరీతే మమత్వబుద్ధిర్యథాతథేత్యర్థః.

టీ. యథా=ఎట్లు, జలస్థే=జలమునందు ప్రతిబింబించిన, అధోముఖే=తలక్రిందులుగా నున్నట్టి, స్వస్య=తనయొక్క, దేహే = శరీరము, దృష్టేఽపి = చూడఁబడినను, తం=ఆ జలప్రతిబింబ శరీరమును, ఉపేక్ష్య=ఉపేక్షించి, తీరస్థే=తీరమునం దున్న, స్వే దేహే=తన దేహమునందే, తాత్పర్యం = తాత్పర్యము, స్యాత్ = కలుగునో, తథా= అట్లే, నామరూపముల నుపేక్షించిన, పరబ్రహ్మస్ఫూర్తి గలుగును.

తా. గట్టున నిలిచి, నీటియందు తన శరీరముయొక్క ప్రతిబింబమును జూచువాఁ డెట్లు, జలమునం దధోముఖముగాఁ గనఁబడెడి శరీరము తనది కా దని తెలిసికొని, గట్టున నున్న దేహమే తనదిగా భావించుచున్నాఁడో, అట్లే నామరూపముల నుపేక్షించి పరబ్రహ్మచింతనముఁ జేయవలెను.

అవ. ఇంకొక దృష్టాంతమును జూపుచున్నాఁడు:—

శ్లో. సహస్రశో మనోరాజ్యే వర్తమానే సదైవ తత్,
స్సర్వైరుపేక్ష్యతే యద్వ దుపేక్షా నామరూపయోః. 95

వ్యా. ఇదానీం సర్వజనప్రసిద్ధం దృష్టాంతాంతరమాహ—సహస్రశ ఇతి. ఉపేక్షా కర్తవ్యేతి శేషః.

టీ. సహస్రశః = అనేక విధములుగా, మనోరాజ్యే = మనోరాజ్యము, సదా= ఎల్లపుడు, వర్తమానేఽపి=ఉన్నను, సర్వైః = అందఱిచేతను, యద్వత్=ఎట్లు, ఉపేక్ష్యతే=(ఆ మనోరాజ్యము) ఉపేక్షచేయఁబడుచున్నదో, (తద్వత్=అటులే) నామరూపయోః = నామరూపములయొక్క, ఉపేక్షా = ఉపేక్ష (చేయవలెను).

తా. కోరికచే కల్పింపఁబడిన వస్తువుల నెట్లు జను లుపేక్షచేయుచున్నారో (అనఁగా లెక్కసేయుట లేదో) అటులే నామరూపముల నుపేక్ష చేయవలెను. అనఁగా నామరూపములు గల కార్యవర్గముతోఁ గూడిన ఈ ప్రపంచమునందును అనాదరణ, లేక మిథ్యాత్వనిశ్చయము చేయవలెను.

శ్లో. క్షణే క్షణే మనోరాజ్యం భవత్యేవాన్యథాన్యథా,
గతం గతం పునర్నాస్తి వ్యవహారో బహిస్తథా. 96

వ్యా. ప్రపంచవైచిత్ర్యే దృష్టాంతమాహ—క్షణ ఇతి. దార్ష్టాంతికమాహ— వ్యవహార ఇతి.

టీ. మనోరాజ్యం = మనోరథముచే కల్పించిన సామ్రాజ్యము, క్షణే క్షణే=అను క్షణమును, అన్యథాన్యథా=వేఱు వేఱు రీతిగా, భవత్యేవ=అగుచునే యున్నది. గతం= పోయినది, గతం=పోయినదే, పునః=తిరిగి, నాస్తి = రాదు. బహిః=వెలుపల నున్న, వ్యవహారః = వ్యవహారమును, తథా = అట్లే యగును.

తా. మనోరథకల్పిత వస్తుజాత మనుక్షణము మాఱుచు, పోయిన వస్తువులు తిరిగి వచ్చుట లేదు. అట్లే జాగ్రదవస్థయందును, పోయిన వస్తువు అనాత్మపదార్థము తిరిగి వచ్చుట లేదు.

శ్లో. న బాల్యం యౌవనే లభ్యం యౌవనం స్థావిరే తథా,
మృతః పితా పునర్నాస్తి నాయాత్యేవ గతం దినమ్. 97

వ్యా. తదేవ వివృణోతి—న బాల్యమితి.

టీ. యౌవనే=యౌవనమునందు, బాల్యం=బాల్యము, న లభ్యం=పొందఁబడదు. స్థావిరే=ముదిమియందు, తథా=అట్లే, యౌవనం = యౌవనమును, న లభ్యం = పొంద నలవి కాదు. మృతః=చనిపోయిన, పితా=తండ్రి, పునః=తిరిగి, నాస్తి=లేఁడు. గతం = కడచిన, దినం = రోజు, నాయాత్యేవ = ఎన్నఁటికిని రాదు.

తా. జాగ్రదవస్థయందును గడచిన కాలము తిరిగి రాకుండుట యెల్లరకును అనుభవసిద్ధము. యౌవనమందు బాల్యముగాని, ముదిమి యందు యౌవనముగాని మఱల రాదు. చనిపోయిన బంధువులుగాని, గడచిన దినముగాని ఎన్నఁటికిని తిరిగి రాఁబోవు.

అవ. ద్వైతమిథ్యాత్వనిర్ణయమును ముగించుచున్నాఁడు:—

శ్లో. మనోరాజ్యాద్విశేషః కః క్షణధ్వంసిని లౌకికే,
అతోఽస్మిన్భాసమానేఽపి తత్సత్యత్వధియం త్యజేత్. 98

వ్యా. ద్వైతక్షణికత్వముపసంహరతి—క్షణికత్వసాధనే ప్రయోజనమాహ—అతోఽస్మిన్నితి.

టీ. క్షణధ్వంసిని=క్షణకాలములో ధ్వంస మయ్యెడి, లౌకికే = ఈ ప్రపంచము నందు, మనోరాజ్యాత్ = మనోరాజ్యముకన్న, కః విశేషః (అస్తి) = ఏమి విశేష మున్నది ? రెండును క్షణికములే, రెండును నశ్వరములే యనుట. అతః = అందువలన, అస్మిన్=ఈ ప్రపంచము, భాసమానేఽపి = భాసించుచున్నను, తత్సత్యత్వధియం = ఆ ప్రపంచము సత్య మనెడు బుద్ధిని, త్యజేత్ = త్యజింపవలెను.

తా. మనోరథకల్పిత గృహక్షేత్ర పుత్రకళత్రాది సామ్రాజ్యము క్షణభంగుర మని మనము సదా చేయుచున్నాము కదా ! ఇంతకంటె

ఈ ప్రపంచమునం దేమి విశేష మున్నది? ఇదియు నశించునదే కదా! ఇందును మనకు ప్రియమైనవారు నశించుట చూచుచున్నారము గదా! అట్టియెడ దీనియం దేల మన కాదరణ! మన మీ ప్రపంచము సత్య మని యేల నమ్మవలెను? ఈ ప్రపంచము సత్యము కాదు. ఇది సృష్టికి పూర్వము గాని, ప్రళయానంతరము గాని లేదు. అందుచే దీనియందు సత్యత్వబుద్ధిని విడువుము.

అవ. ద్వైతము నుపేక్షించుటవలన ప్రయోజనమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉపేక్షితే లౌకికే ధీర్నిర్విఘ్నా బ్రహ్మచింతనే,
నటవత్కృత్రిమాస్థాయాం నిర్వహత్యేవ లౌకికమ్. 99

వ్యా. నను లౌకికోపేక్షాయాం కో లాభ ఇత్యాశంక్య బ్రహ్మణి ధీః స్థిరా భవతీత్యాహ—ఉపేక్షిత ఇతి. తర్హి జ్ఞానినో వ్యవహారః కథమిత్యాశంక్యాహ—నటవదితి.

టీ. లౌకికే=లోకమందున్న వస్తుజాతము, ఉపేక్షితే = ఉపేక్ష చేయఁబడఁగా, ధీః=బుద్ధి, బ్రహ్మచింతనే=బ్రహ్మచింతనమునందు,నిర్విఘ్నా=విఘ్నము లేనిదిగ, స్యాత్ = అగును. నటవత్ =నటునివలె, కృత్రిమాస్థాయాం = కపటపు నటనతో, లౌకికం = లోక వ్యవహారమును, నిర్వహత్యేవ = చేయుచునే యున్నాఁడు.

తా. లోకమం దున్న సర్వవస్తువులయందు వైరాగ్యము గలిగి వాని నుపేక్షించినయెడల బ్రహ్మవిచారమునందు నిరాటంకముగా బుద్ధి వర్తించును. అట్టి బ్రహ్మజ్ఞానము కలిగినంతట, నటుఁడు పూర్వాభ్యాస వశమున నాటకరంగమున నటించినట్లే, జ్ఞానియుఁ బూర్వాభ్యాసము ననుసరించి లోకవ్యవహారమును నిర్వహించును.

అవ. జ్ఞానికిని లౌకిక వ్యవహారము కలదంటివేని, వానికి వికారిత్వము ఘటించునే యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రవహత్యపి నీరేఽధః స్థిరా ప్రౌఢశిలా యథా,
నామరూపాన్యథాత్వేఽపి కూటస్థం బ్రహ్మ నాన్యథా. 100

వ్యా. నను జ్ఞానినో వ్యవహారాభ్యుపగమే వికారిత్వం ప్రసజ్యేతేత్యాశంక్య బుద్ధౌ వ్యవహారవత్యామపి తత్సాక్ష్యాత్మా నిర్వికార ఇతి సదృష్టాంతమాహ—ప్రవహతీతి. ఉదకే ఉపరి ప్రవహత్యపి అధఃస్థితా. ప్రౌఢా శిలా యథా న చలతి తథా ఏవం బుద్ధౌ సంసరంత్యామపి న జ్ఞానీ సంసరతీత్యర్థః.

టీ. నీరే=నీరు, ప్రవహత్యపి=పైన ప్రవహించుచున్నను, అధః=క్రింద నున్న, ప్రౌఢశిలా=పెద్ద బండ, యథా = ఏవిధముగా, స్థిరా=కదలకుండునో, తథా = అటులనే, నామరూపాన్యథాత్వేఽపి = నామరూపముల కన్యథాత్వము గలిగినను, కూటస్థం = నిర్వికారమైన, బ్రహ్మ=బ్రహ్మము, అన్యథా=వికారము గలది, న=కాదు.

తా. బండపైఁగా నీ రెంత పాఱుచుండినను, అడుగున నున్న ఆ బండి యెట్లు స్థిరముగా కదలక యుండునో, అటులే బుద్ధి నామరూపముల వ్యవహారము చేయుచుండినను, జ్ఞాని నిర్వికారుఁడైన బ్రహ్మస్వరూపముగానే యుండును.

అవ. అపరిచ్ఛిన్నమైన బ్రహ్మమందు పరిచ్ఛిన్నమైన జగత్తెట్లు భాసించు ననిన దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిశ్ఛిద్రే దర్పణే భాతి వస్తుగర్భం బృహద్వియత్,
సచ్ఛిద్ఘనే తథా నానా జగద్గర్భమిదం వియత్. 101

వ్యా. నన్వఖండే బ్రహ్మణి తద్విలక్షణస్య జగతః కథమవభాసనమిత్యాశంక్య నిశ్ఛిద్రే దర్పణే సావకాశవస్తునో యథా భానం తద్వదిత్యాహ—నిశ్ఛిద్ర ఇతి.

టీ. నిశ్ఛిద్రే = సందు లేని, దర్పణే = అద్దమునందు, వస్తుగర్భం = అనేక పదార్థములు గర్భమందుఁ గలిగినట్టియు, బృహత్ = గొప్పదైన, వియత్ =ఆకాశము, యథా = ఎట్లు, భాతి = భాసించునో, తథా = అట్లు, నానాజగద్గర్భం = అనేక జగత్తులు గర్భమందుఁ గల, ఇదం వియత్ = ఈ చిదాకాశము, సచ్ఛిద్ఘనే=సచ్చిదానంద రూపమైన బ్రహ్మమునందు, భాతి=ప్రకాశించుచున్నది.

తా. ఎక్కడను సందులేని యద్దమునందు, అనేక వస్తువులతో నిండియున్న గొప్ప యాకాశము ప్రకాశించినట్లు, సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మమునందు ఈ ప్రపంచము తోఁచు నని భావము.

అవ. దృశ్యము గాని బ్రహ్మమందు జగత్తు తోఁచుట యెట్లనఁగా సమాధానము:—

శ్లో. అదృష్ట్వా దర్పణం నైవ తదంతస్థేక్షణం తథా,
అమత్వా సచ్చిదానందం నామరూపమతిః కుతః. 102

వ్యా. నన్వదృశ్యే బ్రహ్మణి కథం జగత్ప్రతీతిరిత్యాశంక్య సచ్చిదానంద ప్రతీతి పురస్సరమేవ జగత్ప్రతీతిరితి సదృష్టాంతమాహ—అదృష్ట్వేతి.

టీ. దర్పణం = అద్దమును, అదృష్ట్వా = కనుఁగొనక, తదంతస్థేక్షణం = దాని యందు ప్రతిఫలించిన వస్తువులను కనుఁగొనుట, నైవ=సంభవింపదు. తథా = అలాగున,

సచ్చిదానందం = సచ్చిదానందస్వరూప మగు బ్రహ్మమును, అమత్వా = తెలియక, నామరూపమతిః=నామరూపముల జ్ఞానము, కుతః=ఎట్లు ఘటించును? ఘటింప దనుట.

తా. అద్దమును చూడక అద్దములో ప్రతిఫలించిన వస్తువులఁ గాంచుట సిద్ధింపదు. అటులనే సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మప్రతీతి గానిది నామరూపజ్ఞానమును కలుగదు.

అవ. నామరూపములు భాసించుటవలన నిర్విషయబ్రహ్మము స్ఫురించు టె ట్లనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రథమం సచ్చిదానందే భాసమానేఽథ తావతా,
బుద్ధిం నియమ్య నైవోర్ధ్వం ధారయేన్నామరూపయోః. 103

వ్యా. నను నామరూపయోరపి భాసమానత్వాత్కథం నిర్విషయబ్రహ్మప్రతీతి రిత్యాశంక్య తద్బుద్ధ్యపాయమాహ—ప్రథమమితి. సచ్చిదానందే బ్రహ్మణి కల్పిత నామరూపాత్మకే ప్రపంచే సచ్చిదానందమాత్రం బుద్ధ్యా గృహీత్వా నామరూపయో ర్బుద్ధిం న ధారయేత్.

టీ. ప్రథమం = మొదట, సచ్చిదానందే = సచ్చిదానందరూపమైన బ్రహ్మము, భాసమానే = ప్రకాశించుచుండఁగా, అథ=అనంతరము, తావతా = అంతమాత్రముతో, బుద్ధిం = బుద్ధిని, నియమ్య = నియమించి, ఊర్ధ్వం = అటుపైని, నామరూపయోః = నామరూపములయందు, న ధారయేత్ = ధరింపరాదు.

తా. సచ్చిదానంద స్వరూపబ్రహ్మమందుఁ గల్పింపఁబడిన నామ రూపాత్మక ప్రపంచవిషయమై బుద్ధివలన సచ్చిదానందమాత్రమునే గ్రహించి నామరూపములను బుద్ధియందు ధరింప కున్నయెడల, నిర్వి షయ మగు సచ్చిదానందస్వరూపబ్రహ్మము మాత్రమే బుద్ధికి స్ఫురిం చును. ఇదియే నిర్విషయబ్రహ్మసాక్షాత్కారోపాయ మని యభి ప్రాయము.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం చ నిర్జగద్బ్రహ్మ సచ్చిదానందలక్షణం,
అద్వైతానంద ఏతస్మిన్ విశ్రామ్యంతు జనాః స్థిరమ్. 104

వ్యా. ఫలితమాహ—ఏవమితి. ఏవం చ సతి నిర్జగద్బ్రహ్మ సచ్చిదానందలక్షణం భవతీత్యర్థః.

టీ. ఏవం చ=ఈరీతి, సచ్చిదానందలక్షణం = సత్తు చిత్తు ఆనందము స్వరూపముగాఁ గల, బ్రహ్మ = పరబ్రహ్మము, నిర్జగత్ = నిష్ప్రపంచస్వరూపము గలది యగును. ఏతస్మిన్ అద్వైతానందే = ఇట్టి యద్వైతానందస్వరూపమునందు, జనాః = జనులు, స్థిరం=స్థిరముగా, విశ్రామ్యంతు=శాంతిని పొందుదురు గాక. సుఖింతురు గాక.

తా. పైనఁ జెప్పిన విధముగా, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మము ప్రపంచ సంబంధము లేనిదై యున్నది. కనుక ముముక్షు లంద ఱిట్టి యద్వైతానంద స్వరూప మగు బ్రహ్మమునం దెల్లప్పుడును నిశ్చలముగ విశ్రమింతురుగాక.

అవ. ప్రకరణమును ముగించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందాభిధే గ్రంథే తృతీయోఽధ్యాయ ఈరితః,
అద్వైతానంద ఏవ స్యాజ్జగన్మిథ్యాత్వచింతయా. 105

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం, బ్రహ్మానందే అద్వైతానందో నామ తృతీయోఽధ్యాయః.

వ్యా. ఇదానీమధ్యాయార్థముపసంహరతి—బ్రహ్మానందేతి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్య కింకరేణ రామకృష్ణాఖ్యేన విదుషా విరచితే బ్రహ్మానందవ్యాఖ్యానే అద్వైతానందో నామ తృతీయోఽధ్యాయః.

టీ. బ్రహ్మానందాభిధే గ్రంథే=బ్రహ్మానంద మనెడి పేరు గల గ్రంథమునందు, తృతీయః అధ్యాయః = మూఁడవ భాగము, ఈరితః=చెప్పఁబడెను. జగన్మిథ్యాత్వచింతయా = ప్రపంచము మిథ్య యనెడి సంతతవిచారణచేత, అద్వైతానంద ఏవ = అద్వైతానందమే, (అద్వితీయ మగు బ్రహ్మానందసుఖమే) స్యాత్=కలుగును.

తా. బ్రహ్మానంద మనెడి ఈ గ్రంథమునందు, అద్వైతానంద మను మూఁడవ భాగము చెప్పఁబడినది. ప్రపంచముయొక్క మిథ్యాత్వానుసంధానలక్షణవిచారమువలన నిష్ప్రపంచపరిపూర్ణబ్రహ్మానందమే చిత్తమందుఁ బ్రత్యక్షముగ స్ఫురించును.

ఇది శ్రీవిద్యారణ్యకృత మగు పంచదశియందలి బ్రహ్మానందమందలి అద్వైతానంద మను తృతీయాధ్యాయము సమాప్తము.

అవ. ఆశ్రుతి నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. ఆత్మానం చేద్విజానీయాదయ మస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్కస్య కామాయ శరీరమను సంజ్వరేత్. 5

వ్యా. తచ్ఛ్రుతివాక్యం పఠతి—ఆత్మానం చేదితి.

టీ. అయం=ఈ ముముక్షువగు, పూరుషః = పురుషుఁడు, ఆత్మానం = ఆత్మను, అస్మీతి=నే నైతి నని, విజానీయాశ్చేత్ = తెలిసికొనెనేని, కిమిచ్ఛన్=ఏమి కోరుచు, కస్య=ఎవనియొక్క, కామాయ=ఇష్టముకొఱకు, శరీరం = తపించెడి శరీరమును గూర్చి, అనుసంజ్వరేత్ = పరితపించును. (పరితాపము నొందఁ డనుట.)

తా. శాస్త్రవిచారముచే కూటస్థాత్మయొక్క యథార్థ స్వరూపమును దెలిసికొని ఆ యాత్మయే నేనని నిశ్చయము గల జ్ఞాని ఏ భోక్తయొక్క ప్రీతికొఱకు, ఏ ఫలమును నిచ్ఛయించుచు, దేహము పరితపించిన దానితోపాటు తానును పరితపించును? తాను బ్రహ్మమ ననెడి నిశ్చయముచే జ్ఞానికి భోక్తృత్వాభిమానము లేదు. ద్వైతము మిథ్య యనెడి నిశ్చయముచే నది భోగ్యము కా దనియు తెలియును. అందుచే జ్ఞానికి భోక్తృత్వభోగ్యములవలనఁ గలిగెడి యైహికదుఃఖముగాని, అట్టి దుఃఖమువలని తాపము గాని లేదు.

అవ. ఆత్మకును, జీవునకును గల సంబంధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. జీవాత్మా పరమాత్మా చేత్యాత్మా ద్వివిధ ఈరితః,
చిత్తాదాత్మ్యాత్త్రిభిర్దేహైః జీవస్సన్ భోక్తృతాం వ్రజేత్. 6

వ్యా. ఆత్మని శోకసంబంధం దర్శయితుం తద్భేదమాహ—జీవాత్మేతి. ఆత్మనో జీవత్వే నిమిత్తమాహ—చిత్తాదాత్మ్యాదితి. చైతన్యస్య స్థూలసూక్ష్మకారణరూపైస్త్రిభిః శరీరైస్తాదాత్మ్యభ్రమే సతి చితో భోక్తృత్వం భవతి స భోక్తా జీవ ఇత్యుచ్యతే.

టీ. ఆత్మా=ఆత్మ, జీవాత్మా = జీవాత్మ యనియు, పరమాత్మా చేతి=పరమాత్మ యనియు, ద్వివిధః = రెండు విధములుగా, ఈరితః = చెప్పఁబడినది. త్రిభిః దేహైః= స్థూలసూక్ష్మకారణము లనెడి మూఁడు శరీరములతో, చిత్తాదాత్మ్యాత్ = చైతన్యము యొక్క తాదాత్మ్యభ్రాంతివలన, జీవస్సన్=జీవుఁ డగుచు, భోక్తృతాం=భోక్తృత్వమును, వ్రజేత్ = పొందును.

తా. ఆత్మవస్తువు జీవాత్మ యనియు, పరమాత్మ యనియు ద్వివిధముగాఁ జెప్పఁబడెను. ఆ యాత్మచైతన్యమునకు స్థూలసూక్ష్మ కారణ

శరీరములే తా ననెడి భ్రాంతి కలుగుటచేత, భోక్తృత్వమును పొంది, జీవుఁ డనఁబడుచున్నాఁడు.

అవ. ఇప్పుడు పరమాత్మస్వరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పరాత్మా సచ్చిదానంద స్తాదాత్మ్యం నామరూపయోః,
గత్వా భోగ్యత్వమాపన్న స్తద్వివేకే తు నోభయమ్. 7

వ్యా. ఇదానీం పరమాత్మనః స్వరూపమాహ—పరాత్మేతి. తస్య భోగ్యరూపత్వాపత్తిప్రకారమాహ—తాదాత్మ్యమితి. నామరూపకల్పనాధిష్ఠానత్వేన తత్తాదాత్మ్యం ప్రాప్య భోగ్యమశ్నుత ఇత్యర్థః. భోక్తృత్వాద్యభావే కారణమాహ—తద్వివేక ఇతి. తాభ్యాం శరీరత్రయజగద్భ్యాం వివేకే భేదజ్ఞానే సతి నోభయం భోక్తృభోగ్యరూపం నాస్తీత్యర్థః.

టీ. పరాత్మా = పరమాత్మ, సచ్చిదానందః = సత్యజ్ఞానానందస్వరూపుఁడు, (భవేత్ = అగును), నామరూపయోః = నామరూపములయొక్క, తాదాత్మ్యం = ఐక్యమును, గత్వా=పొంది, భోగ్యత్వం = భోగ్యస్వరూపమును, ఆపన్నః = పొందినవాఁడు, (భవేత్ = అగును). తద్వివేకే తు=ఆ శరీరత్రయమును విభజించి తెలిసికొనినప్పుడు, ఉభయం = భోక్తృభోగ్యస్వరూపము, న = లేదు.

తా. పరమాత్మ తాను సచ్చిదానందస్వరూపుఁ డైనను, నామరూపములతోడను, భోగ్యముతోడను, తాదాత్మ్యమును బొంది జీవుఁ డనఁబడును. జీవాత్మ భేదమును విచారించి తెలిసికొనినప్పుడు, భోక్తృభోగ్యములు, నామరూపములు తాను గాక వానికి విలక్షణుఁ డై యుండును.

అవ. ఈ యర్థమునే వివరించుచున్నాఁడు:—

శ్లో. భోగ్యమిచ్ఛన్ భోక్తురర్థే శరీరమనుసంజ్వరేత్,
జ్వరాస్త్రిషు శరీరేషు స్థితా న త్వాత్మనో జ్వరాః. 8

వ్యా. ఉక్తమర్థం వివృణోతి—భోగ్యమితి.

టీ. భోక్తుః=భోక్తయైన తనయొక్క, అర్థే=లాభము విషయమై, భోగ్యం = భోగ్యమును, ఇచ్ఛన్ = కోరుచు, శరీర మను = శరీరత్రయము ననుసరించి, సంజ్వరేత్ =దుఃఖించును. త్రిషు శరీరేషు=మూఁడు శరీరములందును, జ్వరాః = తాపములు, స్థితాః=ఉన్నవి. ఆత్మనస్తు=ఆత్మ కయితే, జ్వరాః = తాపములు, న = లేవు.

తా. పురుషుఁడు తాను భోక్త యను నభిమానముచే భోగ్యమును గోరుచు శరీరత్రయము ననుసరించి దుఃఖము నొందుచున్నాఁడు.

'శరీరత్రయవిలక్షణుఁ డగు నాత్మయే నే' నని తెలిసికొనినయెడల, ఆత్మకెట్టి దుఃఖములును లేవు గాన, ఆ పురుషునకును దుఃఖ ముండదు.

అవ. శరీరత్రయములో నే యే శరీరమం దే యే జ్వరము లున్న వనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యాధయో ధాతువైషమ్యే స్థూలదేహే స్థితా జ్వరాః,
కామక్రోధాదయ స్సూక్ష్మే ద్వయోర్బీజం తు కారణే. 9

వ్యా. కస్మిన్ శరీరే కోజ్వర ఇత్యాశంక్య స్థూలదేహే విద్యమానాన్ జ్వరాన్ దర్శయతి—వ్యాధయ ఇతి. లింగదేహకారణదేహగతాన్ జ్వరానాహ—కామేతి.

టీ. ధాతువైషమ్యే = ధాతుప్రకోపముచే భేదము గలుగఁగా, స్థూలదేహే= స్థూలదేహమునందు, స్థితాః = ఉన్న, వ్యాధయః = రోగములు, జ్వరాః=జ్వరములు, సూక్ష్మే=సూక్ష్మశరీరమునందు, కామక్రోధాదయః = కామక్రోధాదులు, జ్వరాః = జ్వరములు. ద్వయోః = స్థూలసూక్ష్మ శరీరములకు, బీజం తు = మూలమైన యవిద్య, కారణే = కారణ శరీరమునందు, (జ్వరః = జ్వరమగును.)

తా. స్థూలశరీరమునందు ధాతు ప్రకోపముచేఁ గలిగెడి వ్యాధి రూపము లగు జ్వరము లున్నవి. సూక్ష్మశరీరమునందు కామక్రోధాది రూపము లగు జ్వరము లున్నవి. స్థూలసూక్ష్మశరీరములు గలుగుటకు బీజము కారణ శరీర మగుటవలన నట్టి బీజమే కారణ శరీరమందుఁ గల జ్వరము.

అవ. పూర్వమందు చెప్పఁబడిన శ్రుత్యర్థమును వివరించుచున్నాఁడు:—

శ్లో. అద్వైతానందమార్గేణ పరాత్మని వివేచితే,
అపశ్యన్వాస్తవం భోగ్యం కిన్నామేచ్ఛేత్పరాత్మవిత్. 10

వ్యా. ఇదానీముదాహృతశ్రుతితాత్పర్యకథనవ్యాజేన పూర్వోక్తమేవార్థం విశదయతి—అద్వైతేతి. తృతీయాధ్యాయోక్తప్రకారేణ మాయాకార్యనామరూపాభ్యాం సచ్చిదానందే పరమాత్మని వివేచితే భేదేన జ్ఞాతే సతి సర్వం ప్రపంచం మిథ్యేతి జానన్ కిం నామ భోగ్యమిచ్ఛతి.

టీ. అద్వైతానందమార్గేణ=అద్వైతానంద ప్రకరణమున చెప్పిన మార్గముచేత, పరాత్మని=పరమాత్మ, వివేచితే = విచారింపఁబడె నేని, పరాత్మవిత్ = బ్రహ్మవిదుఁడు, వాస్తవం భోగ్యం = నిజ మైన భోగ్యమును, అపశ్యన్ = చూడక, కిన్నామ= దేనిని, ఇచ్ఛేత్=కోరును? దేనిని కోరఁ డనుట.

తా. అద్వైతానంద ప్రకరణమునందు చెప్పిన ప్రకారముగా పరబ్రహ్మమును మాయా తత్కార్యములనుండి విభజించి తెలిసికొనిన ఆత్మవిదుఁడు ఏ భోగ్యవస్తువును నపేక్షింపఁడు. (భోగ్యము మిథ్య యనెడి నిశ్చయజ్ఞానము కలిగెను. కాన భోగ్యము నిచ్ఛయింపఁడు.)

అవ. పై ప్రకారము పరమాత్మను దెలిసికొనినయెడల, భోక్తయే లేఁడు గాన వానికి శరీరమువలనఁగాని, జ్వరములవలనఁ గాని తాపము లేదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆత్మానందోక్తరీత్యాస్మిన్ జీవాత్మన్యవధారితే,
భోక్తా నైవాస్తి కోఽప్యత్ర శరీరే తు జ్వరః కుతః. 11

వ్యా. తతః పూర్వాధ్యాయోక్తరీత్యా జీవాత్మస్వరూపే అసంగకూటస్థచైతన్యరూపే నిశ్చితే సతి కామయితురభావాజ్జ్వరాదిసంబంధో నాస్తీత్యాహ—ఆత్మానందేతి.

టీ. ఆత్మానందోక్తరీత్యా = ఆత్మానందప్రకరణమునఁ జెప్పఁబడినట్లు, అస్మిన్ జీవాత్మని=ఈ జీవునకు వాస్తవస్వరూపమైన సాక్షిచైతన్యము, అవధారితే=తెలిసికొనఁబడఁగా, భోక్తా=భోక్త, నాస్త్యేవ=లేనే లేఁడు. అత్ర శరీరేతు=ఈశరీరమునం దయితే, జ్వరః=జ్వరము, కుతః=ఎక్కడిది?

తా. ఆత్మానంద ప్రకరణమునఁ జెప్పినరీతిగా జీవాత్మయొక్క వాస్తవస్వరూపము ఆత్మయే యని జీవాత్మల కభేదము నెఱింగినయెడల భోక్తయే లేఁడు గాన, అట్టివానికి శరీర తాపమే లేదు.

అవ. ఈ క్రింది శ్లోకములయందు, జ్ఞానికి దుఃఖాభావమును జెప్పుచున్నాఁడు:-

శ్లో. పుణ్యపాపద్వయే చింతా దుఃఖమాముష్మికం భవేత్,
ప్రథమాధ్యాయ ఏవోక్తం చింతా నైనం తపేదితి. 12

వ్యా. ఇదానీమాముష్మికం జ్వరం దర్శయతి—పుణ్యేతి. తస్యాభావః ప్రథమాధ్యాయే నిరూపిత ఇత్యాహ—ప్రథమేతి.

టీ. పుణ్యపాపద్వయే చింతా = పుణ్యపాపములయొక్క చింత, ఆముష్మికం దుఃఖం=ఆముష్మిక (పారలౌకిక) దుఃఖము, భవేత్ = అగును. ఏనం = ఈ బ్రహ్మవిదుని, చింతా=పుణ్యపాపములయొక్క చింత, న తపేదితి=తపింపఁజేయ దని, ప్రథమాధ్యాయ ఏవ=మొదటి యధ్యాయమునందే, ఉక్తం=చెప్పఁబడినది.

తా. పుణ్యము చేయకపోతినే యనియు, పాపము చేసితినే యనియుఁ గలిగెడి చింత ఆముష్మికదుఃఖ మనఁబడును. ఇట్టి యాముష్మిక

దుఃఖము జ్ఞానికి లేనే లేదు. ఇది యోగానంద ప్రకరణమందే చెప్పఁబడెను.

అవ. జ్ఞానికి ఆగామివిషయక చింత లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యథా పుష్కరపర్ణేఽస్మిన్ అపామశ్లేషణం తథా,
వేదనాదూర్ధ్వమాగామికర్మణోఽశ్లేషణం బుధే. 13

వ్యా. నను, జ్ఞానిన ఆరబ్ధకర్మవిషయా చింతా మాభూత్. ఆగామికర్మవిషయా చింతా భవత్యేవేత్యాశంక్య తద్యథా పుష్కరపలాశ, ఇత్యాదిశ్రుత్యా జ్ఞానిన ఆగామికర్మసంబంధనిరాకరణాత్తద్విషయాపి చింతా నాస్తీత్యాహ—యథేతి.

టీ. యథా=ఏ రీతిని, అస్మిన్ పుష్కరపర్ణే = ఈ తామరాకునందు, అపాం = నీటియొక్క, అశ్లేషణం=సంబంధము లేదో, తథా=ఆ రీతిని, అస్మిన్ బుధే = ఈ తత్త్వవిదునియందు, వేదనాత్=తత్త్వజ్ఞానంబుకంటె, ఊర్ధ్వం=తరువాత, ఆగామికర్మణః = రాఁబోవు కర్మయొక్క, అశ్లేషణం=సంబంధము లేకుండును.

తా. తామరాకుపై నీరు ఆకున కెట్లంటకుండ నుండునో, ఆ ప్రకారముగా జ్ఞానికిని ఆగామి కర్మఫలమునకును సంబంధము లేదు. ఈ యర్థము "తద్యథా పుష్కరపలాశ" అనెడి శ్రుతినుండి తీసికొనఁబడినది.

విశే. (1) ఆగామి (2) సంచిత (3) ప్రారబ్ధము లని కర్మ త్రివిధము:—౧. ఈ జన్మమందు జననము మొదలు మరణపర్యంతము చేయఁబడు పుణ్యపాపకర్మము ఆగామి యనఁడును. ౨. బ్రహ్మసృష్టి మొదలు ఈ జన్మారంభమువఱకు జీవుఁడా యా జన్మములందుఁ జేసిన కర్మము సంచిత మనఁబడును. 3. సంచితకర్మనుండి వర్తమాన జన్మమందు అనుభవింపవలసిన కర్మము ప్రారబ్ధ మనఁబడును.

అవ. జ్ఞానికి సంచిత కర్మయు నశించు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇషీకాతృణతూలస్య వహ్నిదాహః క్షణాద్యథా,
తథా సంచితకర్మాస్య దగ్ధం భవతి వేదనాత్. 14

వ్యా. 'తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంత' ఇతి శ్రుత్యవష్టంభేన సంచితకర్మవిషయాపి చింతా జ్ఞానినో నాస్తీత్యాహ—ఇషీకేతి.

టీ. ఇషీకాతృణతూలస్య=లేత యెండుగడ్డిపరకలును దూదియు, క్షణాత్=క్షణములో, వహ్నిదాహః=అగ్నిచే దహనము, యథా=ఏప్రకారమో, తథా=ఆ ప్రకారమే,

అస్య=ఈ బ్రహ్మవిదునియొక్క, సంచితకర్మ = పూర్వజన్మములందు సంపాదింపఁబడిన కర్మ, వేదనాత్=బ్రహ్మజ్ఞానమువలన, దగ్ధం=నాశము నొందును.

తా. "తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" అనెడి శ్రుత్యర్థమును పఠించుచున్నాఁడు. లేఁత గడ్డిపరకలు గాని, దూది గాని ఎట్లు అగ్నిచే ధ్వంసము చేయఁబడునో, ఆ విధమున జ్ఞానియొక్క సంచితకర్మములన్నియు తత్త్వజ్ఞానమువలన నశింపఁజేయఁబడును.

అవ. ఈ యర్థమున గీతావాక్యము నుదాహరించుచున్నాఁడు:—

శ్లో. యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 15

వ్యా. ఉక్తార్థే భగవద్వాక్యమపి ప్రమాణయతి—యథైధాంసీతి.

టీ. అర్జున=ఓ యర్జునా! సమిద్ధః = బాగుగా మండుచుండెడి, అగ్నిః = అగ్ని, ఏధాంసి=ఎండు సమిధలను, యథా=ఎట్లు, భస్మసాత్=భస్మముగా, కురుతే=చేయునో, తథా=అట్లు, జ్ఞానాగ్నిః = తత్త్వజ్ఞాన మనెడి యగ్ని, సర్వకర్మాణి=సమస్త కర్మలను, భస్మసాత్ = భస్మముగా, కురుతే=చేయును.

తా. ఓ యర్జునా! ప్రజ్వలించుచుండెడి యగ్ని సమిధలను భస్మీభూతముచేసినట్లు, జ్ఞానాగ్ని సర్వకర్మములను నశింపఁజేయును.

అవ. జ్ఞాని కర్మబద్ధుఁడు గాఁడని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాఁల్లోకాన్న హంతి న నిబధ్యతే. 16

వ్యా. యస్య నాహమితి.

టీ. యస్య=ఎవనికి, అహంకృతః = అహంకారపూర్వక మగు, భావః=భావము, న=లేదో, యస్య = ఎవనియొక్క, బుద్ధిః = బుద్ధి, న లిప్యతే = కర్మయొక్క ఫలమును వాంఛింపదో, సః=వాఁడు. ఇమాన్ లోకాన్=ఈ లోకములను, హత్వాపి=నశింపఁజేసినను, న నిబధ్యతే=కర్మచే బద్ధుఁడు గాఁడు.

తా. ఏ పురుషునకు నేను చేయు కర్మయం దభిమానము లేదో, ఎవనియొక్క బుద్ధి కర్మఫలాసక్తి లేనిదో, అట్టి అపరోక్షజ్ఞాని, శరీరము ననుసరించి యీ జనులనందఱిని జంపినను స్వస్వరూపభూతా విక్రియ

బ్రహ్మవిజ్ఞానము గలవాఁడగుటవలన, పరమార్థదృష్టిచేత చంపినవాఁడు కాఁడనియు, అట్టి కర్మకు బద్ధుఁడును గాఁడనియు తాత్పర్యము.

అవ. పైఛాందోగ్యశ్రుతిని ప్రమాణముగాఁ జూపుచున్నాఁడు:—

శ్లో. మాతాపిత్రోర్వధ స్తేయం భ్రూణహత్యాన్యదీదృశం,
న ముక్తిం నాశయేత్పాపం ముఖకాంతిర్న నశ్యతి. 17

వ్యా. అస్మిన్నేవార్థే * 'న మాతృవధేన న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా నాస్య పాపం న చక్షుషో ముఖా న్నీలం వే,'తి ఛాందోగ్యశ్రుతివాక్యమర్థతః పఠతి—మాతాపిత్రోరితి. చనేత్యేకం పదం. నీలమితి కాంతిరిత్యర్థః.

టీ. మాతాపిత్రోః వధః=తలిదండ్రులఁ జంపుటయు, స్తేయం=దొంగతనమును, భ్రూణహత్యా=శిశుహత్యయు, అన్యత్ ఈదృశం పాపం=ఇంకను నితరములైన యిట్టి పాపమును, ముక్తిం=ముక్తిని, న నాశయేత్ = నశింపఁజేయదు. ముఖకాంతిః=ముఖవర్చస్సును, న నశ్యతి=నశించదు.

తా. "న మాతృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా నాస్య పాపం చ న చక్షుషో ముఖాన్నీలం వా" యనెడి శ్రుత్యర్థమును జెప్పుచున్నాఁడు. మాతృవధ మొదలుగాఁ గల యెట్టి మహాపాపమును జ్ఞానియొక్క ముక్తిని గాని, ముఖవర్చస్సును గాని నశింపఁజేయ లేదు.

అవ. జ్ఞానియొక్క తృప్తిని ౨౦ శ్లోకములలో వర్ణించుచున్నాఁడు:—

శ్లో. దుఃఖాభావవదేవాస్యసర్వకామాప్తిరీరితా,
సర్వాన్కామా నసావాప్త్వా హ్యమృతోఽభవదిత్యతః. 18

వ్యా. ఉక్తచాతుర్విధ్యమధ్యే ద్వితీయప్రకారమాహ—దుఃఖేతి. ఈరితా శ్రుత్యేతి శేషః. అస్మిన్నర్థే ఐతరేయశ్రుతివాక్యమర్థతః పఠతి—సర్వానితి.

టీ. అస్య=ఈ బ్రహ్మవిదునకు, దుఃఖాభావవదేవ=దుఃఖము లేనట్లే, సర్వకామాప్తిః =సమస్తకామప్రాప్తివలని తృప్తి, ఈరితా = చెప్పఁబడినది. అసౌ=ఈ బ్రహ్మవిదుఁడు, సర్వాన్ కామాన్=సమస్తకామములను, ఆప్త్వా=పొంది, అమృతః=బ్రహ్మస్వరూపుఁడు, అభవదితి=అగు ననుట, హి=శ్రుతి ప్రసిద్ధము.

తా. బ్రహ్మవిదునకు దుఃఖము లేదు. వానికి పొందఁదగిన దేదియు లేదు. ఆతఁడు సర్వకామముల ననుభవించినవాఁడై బ్రహ్మస్వరూపుఁడే యగును. అని ఐతరేయ శ్రుతి చెప్పుచున్నది.

అవ. ఛాందోగ్యశ్రుతిని ప్రమాణముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. జక్షన్ క్రీడన్ రతిం ప్రాప్తః స్త్రీభిర్యానైస్తథేతరైః,
శరీరం న స్మరేత్ప్రాణః కర్మణా జీవయేదముమ్. 19

వ్యా. 'జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వా యానైర్వా జ్ఞానిభిర్వాఽజ్ఞానిభిర్వా వయస్యైర్వా నోపజనం స్మరన్నిదం శరీర'మితి ఛాందోగ్య శ్రుతివాక్యమర్థతః పఠతి—జక్షన్నితి.

టీ. స్త్రీభిః = స్త్రీలతోను, యానైః = ప్రయాణికులతోడను, తథా = అట్లే, ఇతరైః = ఇతరులతోను, జక్షన్ = భక్షించుచు, క్రీడన్=క్రీడించుచు, రతిం=రతిని, ప్రాప్తస్సన్=పొందినవాఁడగుచు, శరీరం=శరీరమును, న స్మరేత్=తలఁపఁడు. ప్రాణః=ప్రాణము, కర్మణా=ప్రారబ్ధకర్మచేత, అముం = ఈ బ్రహ్మవిదుని, జీవయేత్ = జీవింపఁజేయును.

తా. స్త్రీలతోఁగాని, ప్రయాణికులతోఁగాని, ఇతరులతోఁగాని భక్షించుచును క్రీడించుచును రమించుచును జ్ఞాని తన శరీరమును స్మరింపఁడనియు, వాని ప్రాణము ప్రారబ్ధకర్మముచేత జీవింపఁబడుచుండు ననియు, "జక్షన్ క్రీడన్ రమమాణః...స్మరన్నిదం శరీరం" అనెడి ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది.

అవ. తైత్తిరీయక శ్రుత్యర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వాన్ కామాన్ సహాప్నోతి నాన్యవజ్జన్మ కర్మభిః,
వర్తంతే శ్రోత్రియే భోగా యుగపత్క్రమవర్జితాః. 20

వ్యా. తత్రైవ తైత్తిరీయశ్రుతివాక్యం పఠతి—సర్వానితి. నను కర్మఫలభోగాంగీకారే జన్మాపి ప్రసజ్యేతేత్యాశంక్యాహ—నాన్యవదితి. జ్ఞానేన సంచితకర్మణాం దగ్ధత్వాదజ్ఞవజ్జన్మ నాస్తీత్యర్థః.

టీ. (అసౌ=ఈ బ్రహ్మజ్ఞాని), సర్వాన్ కామాన్=సమస్తకామములను, ఆప్నోతి=పొందును (అనుభవించును), కర్మభిః=సంచిత కర్మలచే, అన్యవత్=జ్ఞానవిహీనునికివలె, జన్మ=ఇంకొక జన్మము, న = లేదు. శ్రోత్రియే = శ్రోత్రియుఁడైన ఆ జ్ఞానియందు, భోగాః = భోగములు, క్రమవర్జితాః = క్రమములేక, యుగపత్ = ఒకే కాలమందు, వర్తంతే = వర్తించుచున్నవి.

తా. జ్ఞానియొక్క సంచిత కర్మములన్నియు జ్ఞానముచే దహింపఁబడును గనుక, అజ్ఞానికివలె నతనికి పునర్జన్మము లేదనియు, సర్వభోగ

ములును కాలక్రమము లేక ఏకకాలమందే వానియందు వర్తించు ననియు తైత్తిరీయక శ్రుతి చెప్పుచున్నది.

అవ. పై యర్థమునే సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. యువా రూపీ చ విద్వాన్ నీరోగో దృఢచిత్తవాన్,
సైన్యోపేతః సర్వపృథ్వీం విత్తపూర్ణాం ప్రపాలయన్. 21

వ్యా. ఇదానీం తైత్తిరీయకబృహదారణ్యకవాక్యం సంక్షిప్యార్థతః పఠతి—యువేతి.

టీ. యువా=యువకుఁడు, రూపీ చ=సౌందర్యవంతుఁడును, నీరోగః=రోగము లేనివాఁడును, దృఢచిత్తవాన్ = దృఢమైన చిత్తము కలవాఁడును, సైన్యోపేతః = సైన్యముకలవాఁడై, సర్వపృథ్వీం=సమస్తభూమండలమును, విత్తపూర్ణాం = ధనముతో సమృద్ధియగునట్లు, ప్రపాలయన్ = రాజ్యమును పాలించును.

తా. ఈ శ్లోకముతోఁ గలిపి తాత్పర్యము దిగువను వ్రాయఁబడును.

శ్లో. సర్వైర్మానుష్యకైర్భోగైః సంపన్నస్తృప్తభూమిపః,
యమానందమవాప్నోతి బ్రహ్మవిచ్చ తమశ్నుతే. 22

వ్యా. నను సార్వభౌమాదిహిరణ్యగర్భాంతానాం జీవనిష్ఠానామానందానాం కథం జ్ఞానిని సంభవ ఇత్యాశంక్య సర్వేషామానందానాం జ్ఞానినావగత బ్రహ్మాంశత్వాత్సంభవ ఇత్యాహ—సర్వైరితి.

టీ. సర్వైః మానుష్యకైః భోగైః = సమస్తమనుష్యసంబంధములైన భోగములతో, సంపన్నః = కూడుకొనినవాఁడై, తృప్తభూమిపః=తృప్తిని జెందిన మహారాజు, యం ఆనందం=ఏ యానందమును, అవాప్నోతి = పొందుచున్నాఁడో, తమేవ = ఆ యానందమునే, బ్రహ్మవిచ్చ = బ్రహ్మవిదుఁడును, అశ్నుతే = అనుభవించును.

తా. యౌవనము, సౌందర్యము, నీరోగత్వము, దృఢచిత్తము, మంచిసైన్యము, విత్తసమృద్ధిగల మహారాజ్యము మొదలగు సమస్త భోగములను కలిగి మనుష్యమాత్రునకు వీలయిన సర్వభోగముల ననుభవించెడి మహారాజున కెట్టి సుఖము గలదో, బ్రహ్మవిదునకును అట్టి సుఖమే ప్రాప్తించును. సార్వభౌమాదిహిరణ్యగర్భాంతముగఁ గల సర్వజీవనిష్ఠానందములును బ్రహ్మాంశములే యగుటవలన, పరబ్రహ్మస్వరూపుఁ డగు జ్ఞానియందు గల వని యభిప్రాయము.

అవ. పైఁ జెప్పిన సార్వభౌమునికిని జ్ఞానికిని సామ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. మర్త్యభోగే ద్వయోర్నాస్తి కామస్తృప్తిరతస్సమా,
భోగాన్నిష్కామతైకస్య పరస్యాపి వివేకతః. 23

వ్యా. నను సార్వభౌమశ్రోత్రియయోర్విషయప్రాప్తిసామ్యాభావాత్కథమానంద సామ్యమిత్యాశంక్య నైరపేక్ష్యసామ్యాత్తత్ప్రాప్తిసామ్యమిత్యాహ — మర్త్యేతి. తృప్తిసామ్యే హేతుమాహ—భోగాదితి.

టీ. మర్త్యభోగే=మనుష్యలోకమందలి భోగములయందు, ద్వయోః = మహారాజునకును, జ్ఞానికిని, కామః=ఇచ్ఛ, నాస్తి=లేదు. అతః=అందువలన, తృప్తిః=తృప్తి, సమా=వారిద్దరికిని సమమే. ఏకస్య=మహారాజునకు, భోగాత్ = విషయభోగమువలన, నిష్కామతా=కోరిక లేకుండుట. పరస్యాపి=జ్ఞానికి, వివేకతః = జ్ఞానమువలన, (నిష్కామతా = కోరిక లేకుండుట.)

తా. మానుషికభోగములయందు మహారాజునకును జ్ఞానికిని కోరిక లేదు. మహారాజునకు సకల భోగములను తనకు తృప్తి కలిగి నంతవఱకు అనుభవించుటచేతను, బ్రహ్మవిదునకు జ్ఞానోదయముచేతను భోగములందు కోరిక కలుగదు.

అవ. వివేకము జ్ఞానికి మానుషికభోగములం దెట్లు నిష్కామతను గలిగించు ననినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రోత్రియత్వాద్వేదశాస్త్రైర్భోగ్యదోషానవేక్షతే,
రాజా బృహద్రథో దోషాంస్తాన్ గాథాభిరుదాహరత్. 24

వ్యా. వివేకత ఇత్యుక్తమర్థం వివృణోతి—శ్రోత్రియత్వాదితి. విషయదోషాః కస్యాం శాఖాయాం కేన నిరూపితా ఇత్యాశంక్య బృహద్రథేన మైత్రాయణీయాంఖ్య శాఖాయాం గాథాభిరుక్తా ఇత్యాహ—రాజేతి.

టీ. శ్రోత్రియత్వాత్ = శ్రోత్రియత్వమువలన, (జ్ఞాని యగుటవలన) వేద శాస్త్రైః=వేదశాస్త్రశ్రవణముచేత, భోగ్యదోషాన్ = భోగ్యవస్తువులయందలి దోషములను, అవేక్షతే = కనుఁగొనుచున్నాఁడు. బృహద్రథః రాజా=బృహద్రథ మహారాజు, తాన్ దోషాన్=ఆ భోగ్యపదార్థదోషములను, గాథాభిః = ఉపాఖ్యానములచే, ఉదాహరత్ = ఉదాహరించెను.

తా. వేదశాస్త్రపఠనమునను గలుగు భోగ్యపదార్థముల యందలి దోషములను శ్రోత్రియుఁ డగు జ్ఞాని చూచుచున్నాఁడు. అందుచేత

జ్ఞాని కట్టి భోగములపై కోరిక యుండదు. భోగ్యవస్తువులయందలి దోషములను బృహద్రథమహారాజు శ్రుతియందు చెప్పియున్నాఁడు.

అవ. వానియందలి దోషములు తెలియుటచే భోగ్యములయందు కామ ముండదని దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దేహదోషాం శ్చిత్తదోషాన్ భోగ్యదోషా ననేకశః,
శునా వాంతే పాయసే నో కామ స్తద్వద్వివేకినః. 25

వ్యా. వివేకినః కామానుదయే దృష్టాంతమాహ—శునేతి.

టీ. దేహదోషాన్=శరీరదోషములను, చిత్తదోషాన్=చిత్తదోషములను, భోగ్యదోషాన్=భోగ్యవస్తుదోషములను, అనేకశః=వివిధ రీతులుగా, బృహద్రథుఁ డుదాహరించెను. (కావున), శునా వాంతే=కుక్క కక్కినదానియందు, కామః=కోరిక, (యథా) న=ఎట్లు కలుగదో, వివేకినః=జ్ఞానికి, పాయసేఽపి=పరమాన్నమందును, తద్వత్=అట్లే, కామః న = కోరిక యుండదు.

తా. కుక్క కక్కినందు కోరిక యె ట్లుండదో, అట్లే దేహాది దోషముల నెఱింగిన జ్ఞానికి పాయసాదిభోగములందును గోరిక కలుగదు.

అవ. సార్వభౌముని యానందముకంటె బ్రహ్మజ్ఞాని యానందముయొక్క విశేష మేమియో చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిష్కామత్వే సమే ఽప్యత్ర రాజ్ఞస్సాధనసంచయే,
దుఃఖమాసీత్ భావినాశాదతి భీరనువర్తతే. 26

వ్యా. సార్వభౌమాచ్ఛ్రోత్రియస్యాధిక్యమాహ—నిష్కామత్వ ఇతి.

టీ. (ద్వయోః=మహారాజునకును జ్ఞానికిని), నిష్కామత్వే=కోరిక లేకుండుట, సమేఽపి = సమానమైనను, రాజ్ఞః = రాజునకును, సాధనసంచయే = అనుభవించుటకు కావలసిన సాధనసంపాదనమునందు, దుఃఖం=దుఃఖము, ఆసీత్=కలదు. భావినాశాత్ అతిభీః = రాఁబోవు కాలమునందలి నాశమువలన భీతియు, అనువర్తతే=కలుగుచున్నది.

తా. బ్రహ్మజ్ఞానికిని, సార్వభౌమునకును మానుషభోగములందు నిష్కామత్వము సమ మైనను, (సార్వభౌమున కనుభవించుటచే తృప్తి గలుగుచున్నది గాన) రాజునకు భోగసాధనసంపాదనమువలనను భవిష్యత్కాలమునందీ సంపత్తి పోవు ననెడి భయమువలనను తాపము కలుగును. జ్ఞాని కెట్టి దుఃఖమును లేదు. అందుచే జ్ఞానియొక్క

ఆనందము, సమస్త సంపత్తులతోఁ గూడుకొనిన సార్వభౌముని సుఖముకంటెను గొప్ప దని భావము.

అవ. జ్ఞానియం దింకొక విశేషమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. నోభయం శ్రోత్రియస్యాత స్తదానందోఽధికోఽన్యతః,
గంధర్వానంద ఆశాఽస్తి రాజ్ఞో నాస్తి వివేకినః. 27

వ్యా. సార్వభౌమత్వం సాధనసాధ్యం పశ్చాచ్చ తన్నాశభీతిశ్చేతి దోషద్వయ వత్త్వాచ్ఛ్రోత్రియే తు తదుభయాభావాదాధిక్యమిత్యర్థః. శ్రోత్రియస్యాధిక్యాంతరమాహ—గంధర్వేతి.

టీ. శ్రోత్రియస్య=బ్రహ్మవిదునకు, ఉభయం=సార్వభౌమునకు పై శ్లోకములోఁ చెప్పిన రెండు దుఃఖకారణములును, న=లేవు. అతః=ఇందువలన, తదానందః=ఆ జ్ఞాని యొక్క ఆనందము, అన్యతః = మహారాజుయొక్క ఆనందముకన్నను, అధికః = ఉత్కృష్టమైనది. రాజ్ఞః=మహారాజునకు, గంధర్వానందే = గంధర్వానందమునందు, ఆశా=కోరిక, అస్తి=ఉన్నది. వివేకినః=బ్రహ్మజ్ఞానికి, న=ఆశలేదు.

తా. పై శ్లోకములోఁ జెప్పిన యాధిక్యమే కాక జ్ఞానియం దింకొక విశేషము గలదు. సార్వభౌమునకు మనుష్యానందముననే యిచ్ఛ లేదు గాని గంధర్వానందమునం దిచ్ఛ యున్నది. జ్ఞానికి దానియందును కోరిక లేదు. అందువలన జ్ఞాని యానందము పరమోత్కృష్ట మని భావము.

అవ. గంధర్వానందమును నిరూపించుచున్నాఁడు:—

శ్లో. అస్మిన్కల్పే మనుష్యస్సన్ పుణ్యపాకవిశేషతః,
గంధర్వత్వం సమాపన్నో మర్త్యగంధర్వ ఉచ్యతే. 28

వ్యా. ఇదానీం గంధర్వానందే ద్వైవిధ్యం దర్శయితుం శ్లోకద్వయేన గంధర్వభేదమాహ—అస్మిన్నితి.

టీ. అస్మిన్ కల్పే=ఈ కల్పమందు (43,20,000 సంవత్సరము లొక మహాయుగము, 71 మహాయుగము లొక మన్వంతరము, 14 మన్వంతరము లొక కల్ప మనఁబడును.) మనుష్యస్సన్=మనుష్యుఁడై, పుణ్యపాకవిశేషతః = పుణ్యపరిపక్వము వలన, గంధర్వత్వం = గంధర్వత్వమును, సమాపన్నః=పొంది, మర్త్యగంధర్వ ఇతి = మనుష్యగంధర్వ నామముతో, ఉచ్యతే=వ్యవహరింపఁబడును.

తా. ఒక కల్పమంతయు మనుష్యదేహముతో చేసిన పుణ్య పరిపాకవిశేషమువలన గంధర్వదేహమును పొంది, మర్త్యగంధర్వుఁ డనఁబడును.

అవ. గంధర్వత్వమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. పూర్వకల్పే కృతాత్పుణ్యాత్కల్పాదావేవ చేద్భవేత్,
గంధర్వత్వం తాదృశోఽత్ర దేవగంధర్వ ఉచ్యతే. 29

వ్యా. పూర్వేతి.

టీ. పూర్వకల్పే = గతకల్పమునందు, కృతాత్ పుణ్యాత్=చేయఁబడిన పుణ్యవిశేషమువలన, కల్పాదౌ ఏవ=కల్పారంభముననే, గంధర్వత్వం = గంధర్వత్వము, భవేచ్చేత్=కలిగెనేని, తాదృశః=అట్టివాఁడు, అత్ర=ఈ లోకముననే, దేవగంధర్వ ఇతి = దేవగంధర్వుఁ డని, ఉచ్యతే=వ్యవహరింపఁబడుచున్నాఁడు.

తా. పూర్వకల్పమందు చేసిన పుణ్యమువలన ఈ కల్పమందు గంధర్వుఁడుగా నున్న వాఁ డీ లోకముననే దేవగంధర్వుఁ డనఁబడును.

అవ. చిరలోక పిత్రానందమును జూపుటకొఱకు చిరలోక పితరులను, దేవానందము త్రివిధ మని తెల్పుటకు దేవభేదమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అగ్నిష్వాత్తాదయో లోకే పితరశ్చిరవాసినః,
కల్పాదావేవ దేవత్వం గతా ఆజానదేవతాః. 30

వ్యా. చిరలోకపిత్రానందప్రదర్శనాయ చిరలోకపితౄనాహ—అగ్నిష్వాత్తాదయ ఇతి. దేవానందత్రైవిధ్యజ్ఞానాయ దేవభేదమాహ—కల్పాదావితి.

టీ. లోకే=పితృలోకమునందు, చిరవాసినః = చాలకాలముగా వసించిన, అగ్నిష్వాత్తాదయః=అగ్నిష్వాత్తుఁడు మొదలగువారు, పితరః=పితృదేవతలు (అనఁబడుదురు). కల్పాదౌ వేవ=ఈ కల్పప్రారంభముననే, దేవత్వం=దేవత్వమును, గతాః=పొందిన దేవతలు, ఆజానదేవతాః=ఆజానదేవత లనఁబడుదురు.

తా. అదివరలో పితృలోకమున చాలకాల ముండిన యగ్నిష్వాత్తాది పితృదేవతలు కల్పాదియందే దేవత్వమును పొంది, ఆజానదేవత లనఁబడుదురు.

అవ. ఆజానదేవతలచేతను పూజనీయులను జెప్పుచున్నాఁడు:—

శ్లో. అస్మిన్ కల్పేఽశ్వమేధాదికర్మ కృత్వా మహత్పదం,
అవాప్యాజానదేవైర్యాః పూజ్యాస్తాః కర్మదేవతాః. 31

వ్యా. అస్మిన్ కల్ప ఇతి.

టీ. అస్మిన్ కల్పే=ఈ కల్పమునందు, అశ్వమేధాది కర్మ=అశ్వమేధాది మహాక్రతువులను, కృత్వా = చేసి, మహత్పదం = గొప్పస్థితిని, అవాప్య=పొంది, యాః = ఎవరు, దేవైః = దేవతలచేత, పూజ్యాః = పూజింపఁదగినవారో, తాః = వారు, కర్మదేవతాః = కర్మదేవతలు (అని = చెప్పఁబడుదురు.)

తా. ఈ కల్పమం దశ్వమేధాది మహాక్రతువులం జేసి, పూర్వకల్పములందే చేయఁబడిన పుణ్యమువలన, ఈ కల్పమునను దేవభావమును బొందినవారు కర్మదేవత లనబడుదురు. అట్టివారు దేవతలచేతను పూజనీయులు.

అవ. దేవతలను, ఇంద్రబృహస్పతులను, విరాడ్ఢిరణ్యగర్భులను జెప్పుచున్నాఁడు:—

శ్లో. యమాగ్నిముఖ్యా దేవాస్స్యుర్జ్ఞాతావింద్రబృహస్పతీ,
ప్రజాపతిర్విరాట్ప్రోక్తో బ్రహ్మాసూత్రాత్మనామకః. 32

వ్యా. యమాగ్నీతి. ఇంద్రబృహస్పతీ ప్రసిద్ధావిత్యర్థః.

టీ. యమాగ్నిముఖ్యాః = యముఁడు, అగ్ని మొదలగువారు, దేవాః=దేవతలు, స్యుః = అగుదురు. ఇంద్రబృహస్పతీ = ఇంద్రుఁడును బృహస్పతియు, జ్ఞాతౌ=తెలియఁబడినవారు (ప్రసిద్ధులు). ప్రజాపతిః = ప్రజాపతి, విరాట్ = విరాట్టుగా, ప్రోక్తః = చెప్పఁబడెను. బ్రహ్మా = బ్రహ్మ, సూత్రాత్మనామకః = సూత్రాత్మ యనఁబడును.

తా. యముఁడును, అగ్నియు మొదలగు దేవతలును, ఇంద్రబృహస్పతులును సమష్టిస్థూలశరీరోపాధికుఁ డగు విరాట్టును, సూత్రాత్మ యనఁబడు హిరణ్యగర్భుఁడును నొకరికన్న నొకరు శతగుణిత మధికమైన యానందము గలవారై యున్నారు.

అవ. పైఁ జెప్పఁబడిన వా రందఱును జ్ఞానికన్న తక్కువ వా రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. సార్వభౌమాదిసూత్రాంతా ఉత్తరోత్తరకామినః,
అవాఙ్మనసగమ్యోఽయమాత్మానందస్తతః పరః. 33

వ్యా. సార్వభౌమాదిసూత్రాంతానాం శ్రోత్రియాత్ న్యూనత్వద్యోతనాయాహ—సార్వభౌమాదీతి. ఏభ్యః సర్వేభ్యోఽధికమానందమాహ — అవాఙ్మనసేతి. యతోఽయమాత్మానందః అవాఙ్మనసగమ్యః అతః ఏభ్యస్సర్వేభ్యోఽధిక ఇత్యర్థః.

టీ. సార్వభౌమాదిసూత్రాంతాః = మహారాజు మొదలు హిరణ్యగర్భునివఱకు నుండెడి సమస్త దేవతలును; ఉత్తరోత్తరకామినః = తమకు పైనున్నవారిస్థితినిఁ గోరువారు. అయం ఆత్మానందః = ఈ జ్ఞానియొక్క ఆత్మానందము, అవాఙ్మనసగమ్యః = వాక్కుచేతఁగాని, మనస్సుచేతఁగాని తెలియ నశక్యము, అతః = ఇందువలన, పరః = ఉత్కృష్ట మైనది.

తా. సార్వభౌముఁడు మొదలుకొని హిరణ్యగర్భునివఱకు నున్నవార లందఱకు తమకన్నను గొప్పవారైన దేవతలుగా కావలె ననెడి వాంఛ గలదు. జ్ఞాని నిత్యతృప్తుఁడు. ఏ వాంఛయు లేనివాఁడు. కావున నతఁడు పైఁ జెప్పినవా రందఱికన్నను గొప్పవాఁడు.

అవ. బ్రహ్మజ్ఞానికి సర్వజీవులచే ననుభవింపఁబడిన యానందము కల దనుట:—

శ్లో. తైస్తైః కామ్యేషు సర్వేషు సుఖేషు శ్రోత్రియో యతః,
నిస్పృహ స్తేన సర్వేషామానందాస్సంతి తస్య తే. 34

వ్యా. ఇదానీం సర్వేషామానందాశ్శ్రోత్రియే విద్యంతే. తస్య తేషు నిస్పృహత్వాదిత్యాహ—తైస్తైరితి.

టీ. యతః = ఏహేతువువలన, శ్రోత్రియః=జ్ఞాని, సర్వేషు కామ్యేషు సుఖేషు= సమస్త కామ్యసుఖములయందును, తైస్తైః=ఆయా సుఖములతో, నిస్పృహః = కోరిక లేనివాఁడో, తేన=ఆ హేతువుచేత, సర్వేషాం=జీవులందఱియొక్క, తే ఆనందాః = ఆ యానందములు, తస్య = జ్ఞానికి, సంతి = ఉన్నవి.

తా. జ్ఞానికి సకలజీవులయొక్క సుఖములందును నిస్పృహాయే కాన, ఆ జీవు లందఱియొక్క ఆనందమును జ్ఞానికి కల దని భావము.

అవ. జ్ఞానికి సర్వభోగములును కల వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. సర్వకామాప్తి రేషోక్తా యద్వాసాక్షిచిదాత్మనా,
స్వదేహవత్సర్వదేహేష్వపి భోగా నవేక్షతే. 35

వ్యా. ఉపపాదితమర్థముపసంహరతి—సర్వేతి. ఇదానీం పక్షాంతరమాహ—యద్వేతి. యథా స్వదేహే ఆనందాకారబుద్ధిసాక్షిత్వేనానందిత్వమితరేష్వపి దేహేషు తద్వదిత్యర్థః.

టీ. ఏషా ఉక్తా = ఈ పై ౧ం శ్లోకములలో చెప్పఁబడిన యర్థము, సర్వకామాప్తిః = సర్వకామప్రాప్తి యగును. యద్వా=లేనిచో, సాక్షిచిదాత్మనా=తన బ్రహ్మానందమును నెఱుంగు చిదాత్మచేత, స్వదేహవత్ = తన దేహమువలె, సర్వదేహేషు అపి= అందఱి దేహములయందును, భోగాన్=భోగములను, అవేక్షతే=చూచుచున్నాఁడు.

తా. జ్ఞాని సర్వబుద్ధిసాక్షి యగు బ్రహ్మమే యగుచున్నాఁడు. కాన, తన దేహమందలి యానందమును తెలిసికొనినట్లు, తాను సాక్షియై ఇతరుల బుద్ధులయందలి యానందమును దెలిసికొనుచున్నాఁడు. అందుచే జ్ఞానికి సర్వజీవులయొక్క ఆనందమును ఆతఁడు సాక్షిస్వరూపుఁడగుట వలనఁ గలుగుచున్నది.

అవ. అజ్ఞాని కట్టి యానందము లే దనుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞస్యైతదస్త్యేవ న తు తృప్తిరబోధతః,
యో వేద సోఽశ్నుతే సర్వాన్కామానిత్యబ్రవీచ్ఛ్రుతిః. 36

వ్యా. ననూక్తప్రకారేణాజ్ఞస్యాపి సర్వానందప్రాప్తిరస్తీత్యాశంక్య పక్షేప్య సర్వబుద్ధిసాక్ష్యహామితి జ్ఞానాభావాన్నైవమిత్యాహ—అజ్ఞస్యేతి. ఉక్తార్థే తైత్తిరీయ శ్రుతిం ప్రమాణయతి—వేదేతి. గుహాయాం నిహితం బ్రహ్మ యో వేద సోఽశ్నుత ఇతి యోజనా.

టీ. అజ్ఞస్య=అజ్ఞానికి, అబోధతః = వివేకము లేకపోవుటవలన, ఏతత్ (సర్వకామాప్తిః)=ఈ సర్వకామాప్తి, నాస్త్యేవ = లేనే లేదు. తృప్తిస్తు=తృప్తియు, న= లేదు. యః=ఎవ్వఁడు, వేద=బ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడో, సః=అట్టి మనుజుఁడు, సర్వాన్ కామాన్=సమస్త భోగములను, అశ్నుతే=పొందును, ఇతి=అని, శ్రుతిః = శ్రుతి, అబ్రవీత్ = చెప్పెను.

తా. అజ్ఞానికి జ్ఞానము లేక పోవుటచేత, సర్వకామప్రాప్తి గాని తృప్తిగాని లేదు. ప్రత్యగభిన్న బ్రహ్మము నపరోక్షముగాఁ దెలిసికొనిన జ్ఞాని సర్వకామములను జెందు నని తైత్తిరీయక శ్రుతియందుఁ జెప్పఁ బడినది.

శ్లో. యద్వా సర్వాత్మతాం స్వస్య సామ్నా గాయంతి సర్వదా,
అహమన్నం తథాన్నాదశ్చేతి సామ్నా హ్యధీయతే. 37

వ్యా. ఇదానీం తృతీయప్రకారమాహ—యద్వేతి. 'ఇమాన్ లోకాన్కామా న్నీకామరూప్యనుసంచర' న్నిత్యాదినేత్యర్థః.

టీ. యద్వా = పై రెండు పక్షములును గానియెడల, స్వస్య = తనయొక్క సర్వాత్మతాం = సర్వవ్యాపకత్వమును, సర్వదా = ఎల్లకాలములందును, సామ్నా = సామశ్రుతులచేత, గాయంతి = పాడుచున్నారు. అహం = నేను, అన్నమితి=అన్న

మనియు (భోగ్యము ననియు), తథా = అట్లే, అన్నాదశ్చేతి = భోక్త ననియు, సామ్నా = సామశ్రుతిచే, అధీయతే హి = చెప్పఁబడుచున్నది.

తా. జ్ఞాని యెల్లప్పుడును, నేనే భోగ్యమును నేనే భోక్తను అని యిట్లు సామగానముఁ జేయుచున్నాఁడు.

శ్లో. దుఃఖాభావశ్చ కామాప్తిరుభే హ్యేవం నిరూపితే,
కృతకృత్యత్వమన్యచ్చ ప్రాప్తప్రాప్యత్వమీక్ష్యతామ్. 38

వ్యా. అతీతగ్రంథేన సిద్ధమర్థం సంక్షిప్యాహ—దుఃఖేతి.

టీ. దుఃఖాభావః = (జ్ఞానికి) దుఃఖము లేకుండుటయు, కామాప్తిశ్చ = సర్వకామప్రాప్తియు, ఉభే = ఈ రెండును, నిరూపితే హి = చెప్పఁబడినవి గదా! కృతకృత్యత్వం = చేయఁబడిన సమస్తకార్యములు గలవాఁడై యుండుటయు, అన్యచ్చ = మఱియు, ప్రాప్తప్రాప్యత్వం = పొందఁబడిన సమస్త ఫలసమూహము గలవాఁడై యుండుటయు, ఈక్ష్యతాం = వీక్షింపఁబడుఁగాక.

తా. పై శ్లోకములందు జ్ఞానికి దుఃఖము లే దనియు, సర్వభోగములయొక్క ఆనందము కల దనియుఁ జెప్పఁబడెను. ఉత్తరగ్రంథమునం దాతని కృతకృత్యత్వమును, ప్రాప్తప్రాప్యత్వమును జెప్పఁబడును.

అవ. ఈ విషయమును తృప్తిదీపమునఁ జెప్పితి మని స్మరించుచున్నాఁడు:—

శ్లో. ఉభయం తృప్తిదీపే హి సమ్యగస్మాభిరీరితం,
త ఏవాత్రానుసంధేయాః శ్లోకా బుద్ధివిశుద్ధయే. 39

వ్యా. అవశిష్టం కృతకృత్యత్వం ప్రాప్తప్రాప్యత్వమిత్యుభయం తృప్తిదీపే ద్రష్టవ్యమిత్యాహ—త ఏవేతి.

టీ. తృప్తిదీపే=తృప్తి దీపమునందు, అస్మాభిః=మాచేత, ఉభయం=కృతకృత్యత్వమును ప్రాప్తప్రాప్యత్వమును, సమ్యక్ = సవిస్తరముగా, ఈరితం హి = చెప్పఁబడెను గదా. తే ఏవ శ్లోకాః=ఆ శ్లోకములే, అత్ర=ఈ సందర్భమునందును, బుద్ధి విశుద్ధయే= బుద్ధియందు సందేహ నివృత్తికొఱకు, అనుసంధేయాః = జ్ఞప్తికి తెచ్చుకొనఁ దగును.

తా. జ్ఞానియొక్క కృతకృత్యత్వమును ప్రాప్తప్రాప్యత్వమును తృప్తి దీపమునఁ జక్కఁగా నిరూపింపఁబడినవి. వానినే ఈ సందర్భమున జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలెను.

అవ. జ్ఞానికి కృతకృత్యత్వమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఐహికాముష్మిక వ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే,
బహుకృత్యం పురాస్యాభూత్తత్సర్వమధునాకృతమ్. 40

టీ. అస్య=ఇతనికి, పురా = జ్ఞానోదయమునకు మున్ను, ఐహికాముష్మిక వ్రాతసిద్ధ్యై = ఈ లోకముయొక్కయు, పరలోకముయొక్కయు, ఇష్టవస్తుసంపాదనము కొఱకు, ముక్తేశ్చ = ముక్తియొక్క, సిద్ధయే = సంసారమునకు, బహుకృత్యం=పెక్కు కార్యములు చేయవలసినవిగా, అభూత్ = ఉండెను. అధునా = జ్ఞానోత్పత్తి తరువాత, తత్సర్వం = ఆ చేయవలసిన కార్యము లన్నియు, కృతం = చేయఁబడినట్లే.

తా. జ్ఞానోత్పత్తికి పూర్వము విద్వాంసునకు చేయఁ దగిన కార్యము లెన్నియో యుండెను. తత్త్వజ్ఞానోదయానంతరము అట్టి కార్యము లన్నియు చేయఁబడిన వగును. జ్ఞానికి చేయవలసిన కార్యము లేవియు నుండవు. అందు కనియే, జ్ఞానిని కృతకృత్యుఁ డందురు.

అవ. కృతకృత్యు డగుటవలననే జ్ఞానికి తృప్తి గలుగు చున్నదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. తదేతత్కృతకృత్యత్వం ప్రతియోగిపురస్సరం,
అనుసందధదేవాయ మేవం తృప్యతి నిత్యశః. 41

టీ. అయం=ఈ విద్యావంతుఁడు, తత్ ఏతత్ కృతకృత్యత్వం=ఆ యీ కృతకృత్యత్వమును, ప్రతియోగి పురస్సరం = ప్రతియోగిపురస్సరముగా, అనుసందధత్ = అనుసంధానములచేయుచు, ఏవం=ఈ రీతిగా, నిత్యశః = ఎల్లప్పుడును, తృప్యత్యేవ = తృప్తిని బొందుచున్నాఁడు.

తా. జ్ఞాని ప్రతియోగిపురస్సరముగా కృతకృత్యత్వము ననుసంధానము చేయుచు నిత్యతృప్తుఁడై యుండును.

అవ. జ్ఞానికి, అజ్ఞులకువలె, సంసారదుఃఖము లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. దుఃఖినోఽజ్ఞాః సంసరంతు కామం పుత్రాద్యపేక్షయా,
పరమానందపూర్ణోఽహం సంసరామి కిమిచ్ఛయా. 42

టీ. దుఃఖినః=దుఃఖముఁ జెందెడి, అజ్ఞాః=జ్ఞానవిహీనులు, పుత్రాద్యపేక్షయా=పుత్రులు, భార్యలు మొదలుగాఁ గల వారలయందలి ప్రేమచేత, కామం=ఎక్కువగా,

సంసరంతు = సంసారములో పడియుందురు గాక. పరమానందపూర్ణః = ఉత్కృష్టమైన బ్రహ్మానందము ననుభవించెడి, అహం = నేను, కిమిచ్ఛయా = ఎట్టి కోరికచేత, సంసరామి = సంసారమును జెందుదును.

తా. ఐహికసుఖాపేక్షగలవారు భార్యాపుత్రాదికమందలి ప్రేమ చేత దుఃఖమును పొందుచు సంసారములోఁ జిక్కియుందురు. అంతియ కాని, బ్రహ్మానందనిమగ్నుఁడైన తత్త్వజ్ఞాని కెన్నటికి సంసార మను నది లేదు.

అవ. జ్ఞాని వైదికకర్మానుష్ఠానముఁ జేయువారి కన్నను నధికుఁ డనుచున్నాఁడు:—

శ్లో. అనుతిష్ఠంతు కర్మాణి పరలోకయియాసవః,
సర్వలోకాత్మకః కస్మాదనుతిష్ఠామి కిం కథమ్. 43

టీ. పరలోకయియాసవః = స్వర్గాది లోకములను కోరెడివారు, కర్మాణి = వేద చోదితకర్మములను, అనుతిష్ఠంతు = చేయుదురుగాక. సర్వలోకాత్మకః = సమస్తలోకములకు స్వరూపభూతుఁడ నైన నేను, కస్మాత్=ఏ కారణమువలన, కిం=ఏ కర్మమును, కథం = ఏ విధముగా, అనుతిష్ఠామి = ఆచరించెదను.

తా. పరలోకములను ఇచ్ఛయించెడి వారలు జ్యోతిష్టోమాది కర్మముల నాచరింతురు గాక. సర్వలోకాత్మకుఁడ నైన నే నెందులకు కర్మముల నాచరించెదను ? ఆతఁడే పరలోకస్వరూపుఁ డగుటవలన ఆతనికి పరలోకవాంఛయు లేదు. అందువలన కర్మములఁ జేయవలసినది లేదు.

శ్లో. వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదానధ్యాపయంతు వా,
యేఽత్రాధికారిణో మే తు నాధికారోఽక్రియత్వతః. 44

టీ. అత్ర=ఈ ప్రపంచమునందు, యే = ఎవరు, అధికారిణః = అధికారముగలవారో, తే=వారు, శాస్త్రాణి=శాస్త్రములను, వ్యాచక్షతాం=శిష్యులకుఁ జెప్పుదురుగాక, వేదాన్=చతుర్వేదములను, అధ్యాపయంతు వా=అధ్యయనము చేయించినఁ జేయింతురు గాక. మే తు=నా కయితే, అక్రియత్వతః=నిష్క్రియా స్వరూపుఁడ నగుటవలన, అధికారః=వేదాధ్యయనము చేయుటకుఁగాని చేయించుటకుఁగాని యధికారము, న=లేదు.

తా. వేదాధ్యయనాధికారము గలవారు అధ్యయనము చేయుదురు గాక, పరులచే చేయింతురు గాక. నిష్క్రియాస్వరూపుఁడ నగుట వలన జ్ఞాని నగు నాకు నట్టి వేదాధ్యయనాధ్యాపనాధికారము లేదు.

అవ. జ్ఞానికి స్నానశౌచాదులయందును వాస్తవమైన యిచ్ఛ లే దనుట:—

శ్లో. నిద్రాభిక్షే స్నానశౌచే నేచ్ఛామి న కరోమి చ,
ద్రష్టారశ్చేత్కల్పయంతి కిం మే స్యాదన్యకల్పనాత్. 45

టీ. నిద్రాభిక్షే = నిద్రనుగాని భిక్షనుగాని, స్నానశౌచే = స్నానమును గాని, శౌచమునుగాని, న ఇచ్ఛామి = కోరను, న కరోమి = చేయను. ద్రష్టారః = నన్నుఁ జూచువారు, కల్పయంతిచేత్ = కల్పించుచుందురేని, అన్యకల్పనాత్ = ఇతరులు కల్పించుటచేత, మే=నాకు, కిం స్యాత్ = ఏ మగును ? బాధగాని, ప్రత్యవాయము గాని లే దని భావము.

తా. నిద్రాభిక్షులయందుఁ గాని, స్నానశౌచాదులయందుఁ గాని, జ్ఞానికి కోరిక లేదు. కర్తృత్వమును లేదు. జ్ఞానిని జూచెడువా రాతఁడు కర్మములను జేయుచున్నాఁ డని కల్పనము జేసెదరు. ఇతరు లట్లు కల్పనము చేయుటవలన జ్ఞాని కేమియు బాధ లేదు.

అవ. పై యర్థమం దింకొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. గుంజాపుంజాది దహ్యేత నాన్యారోపితవహ్నినా,
నాన్యారోపితసంసారధర్మానేవమహం భజే. 46

టీ. అన్యారోపితవహ్నినా = ఇతరులచే కల్పింపఁబడిన యగ్నిచేత, గుంజాపుంజాది = గురిగింజలరాశి మొదలగునది, న దహ్యేత = దహింప లేదు. ఏవం = ఈ విధముగా, అహం = నేను, అన్యారోపితసంసారధర్మాన్ = ఇతరులచే కల్పింపఁబడిన సంసార ధర్మములను, న భజే = పొందను.

తా. గురిగింజల పోగుదగ్గర, గురిగింజల కుప్పను, తెలివిలేని కోఁతులు మొదలగునవి యగ్నిగా నారోపించినమాత్రమున ఆ గురిగింజలరాశి యంతయును దహింపఁజేయనట్లు, అజ్ఞానులచే జ్ఞానియం దారోపింపఁబడిన సంసార ధర్మములు జ్ఞాని కేమియు బాధ గలిగింపవు.

అవ. జ్ఞానికి శ్రవణాదికముతోను అవసరము లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శృణ్వంత్వజ్ఞాతతత్త్వాస్తే జానన్ కస్మాచ్ఛృణోమ్యహం,
మన్యంతాం సంశయాపన్నా న మన్యేఽహమసంశయః. 47

టీ. అజ్ఞాతతత్త్వాః = బ్రహ్మస్వరూపము నెఱుఁగనివారు, శృణ్వంతు = శ్రవణమును జేయుదురు గాక. అహం = నేను, జానన్ = పరతత్త్వము నెఱిఁగి, కస్మాత్ =

ఎందు నిమిత్తము, శృణోమి = వినెదను ? సంశయాపన్నాః = సంశయములు గలవారు, మన్యంతాం = మననము చేయుదురు గాక. అసంశయః = సందేహము లేని, అహం = నేను, న మన్యే = మననమును చేయను.

తా. బ్రహ్మతత్త్వమును తెలియనివారు శ్రవణమును జేయుదురు గాక. సంశయము గలవారు మననమును జేయుదురు గాక. సందేహము లేక వస్తుతత్త్వమును ఎఱిఁగిన జ్ఞానికి శ్రవణమననాదులతోఁ బని లేదు.

అవ. అట్లే నిదిధ్యాసమును జ్ఞాని కక్కఱ లే దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. విపర్యస్తో నిదిధ్యాసేత్కిం ధ్యానమవిపర్యయే,
దేహాత్మత్వవిపర్యాసం న కదాచిద్భజామ్యహమ్. 48

టీ. విపర్యస్తః = విపరీతభావము గలవాఁడు, నిదిధ్యాసేత్ = నిదిధ్యాసమును జేయుఁ గాక. అవిపర్యయే = విపరీతభావము లేనివాని విషయమై, ధ్యానం=నిదిధ్యాసనము, కిం = ఎందుకు ? అహం = నేను, కదాచిత్ = ఒకప్పుడును, దేహాత్మత్వవిపర్యాసం = దేహాదికమే నే ననెడి విపరీతభావనను, న భజామి = పొందను.

తా. దేహాదికమే యాత్మ యనెడి విపరీతభావము గలవాఁడు నిదిధ్యాసనముఁ జేయవలెను గాని, అట్టి విపరీతభావము లేక యథార్థమైన (దేహేంద్రియాదివిలక్షణమైన) బ్రహ్మస్వరూపము నెఱింగిన జ్ఞానికి నిదిధ్యాసనముతోఁ బని లేదు.

అవ. మనుష్యుఁడను నే ననెడి వ్యవహారమును, దేహాదికము నే నని యభిమానమును లేకపోయిన నెట్లు చేయఁగలఁ డనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అహం మనుష్య ఇత్యాదివ్యవహారో వినాప్యముం,
విపర్యాసం చిరాభ్యస్తవాసనాతోఽవకల్పతే. 49

టీ. అహం = నేను, మనుష్యః = మనుష్యుఁడ ననెడి, ఇత్యాది వ్యవహారః = ఈ మొదలగు వ్యవహారము, అముం విపర్యాసం వినాపి = ఈ విపరీతభావనము లేక పోయినను, చిరాభ్యస్తవాసనాతః = చిరకాలమునుండి యభ్యసింపఁబడిన సంస్కారవశముగా, అవకల్పతే = కలుగవచ్చును.

తా. నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను అను మొదలుగాఁ గల వ్యవహారము, దేహాదికమే యాత్మ యనెడి విపరీతభావన లేని వానికిని, చిరకాలాగతవాసనావశముగా నుండవచ్చును.

అవ. ఇట్టి వాసనా నివృత్తికొఱకైనను నిదిధ్యాసనమును చేయవలదా యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆరబ్ధకర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే,
కర్మాక్షయే త్వసౌ నైవ శామ్యేద్ధ్యానసహస్రతః. 50

టీ. ఆరబ్ధకర్మణి = ప్రారబ్ధకర్మ, క్షీణే సతి = క్షయింపఁగా, వ్యవహారః = నేను మనుష్యుఁడను అను మొదలగు వ్యవహారము, నివర్తతే = నివర్తించును. అసౌ = ఇట్టి వ్యవహారము, కర్మాక్షయే = ప్రారబ్ధకర్మ క్షయింపనపుడు, ధ్యానసహస్రతః = వేయి ధ్యానముల వలనను, నైవ శామ్యేత్ = పోనే పోదు.

తా. నేను మనుష్యుఁడ ననెడి వ్యవహారము ఆరబ్ధపర్యంతమును ఉండి, యది నశింపగానే నశించును. ఆరబ్ధక్షయము గానిచో యెన్ని ధ్యానములు చేసినను ఆ వ్యవహారము పోదు.

అవ. అట్టి వ్యవహారము హెచ్చు గాకుండఁ జేయుటకైనను నిదిధ్యాసనము చేయరాదా యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. విరళత్వం వ్యవహృతేరిష్టం చేద్ధ్యానమస్తు తే,
అబాధికాం వ్యవహృతిం పశ్యన్ ధ్యాయామ్యహం కుతః. 51

టీ. తే = నీకు, వ్యవహృతేః = వ్యవహారముయొక్క, విరళత్వం = పలుచదనము (తగ్గిపోవుట), ఇష్టం చేత్ = కావలె నంటివేని, ధ్యానం = నిదిధ్యాసనము, అస్తు = ఉండుఁగాక. వ్యవహృతిం = వ్యవహారమును, అబాధికాం = బాధ కలిగింపని దానినిగా, పశ్యన్ = ఎఱిఁగిన, అహం = నేను, కుతః = ఎందుకు, ధ్యాయామి = ధ్యానము చేయుదును.

తా. వ్యవహారమును తగ్గింపవలె నని కోరిక గలవాఁడు ధ్యానముఁ జేసినఁ జేయుఁ గాక. వ్యవహారమువలన నా కేమియు బాధ లే దని యెఱిఁగినవానికి దానిని దగ్గింపవలె నని కోరికయే యుండదు. అందువలన వానికి ధ్యానముతోఁ బని లేదు.

అవ. విక్షేప నివృత్తికొఱకైనను ధ్యానము చేయరాదా యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. విక్షేపో నాస్తి యస్మాన్మే న సమాధిస్తతో మమ,
విక్షేపో వా సమాధిర్వా మనసస్స్యాద్వికారిణః. 52

టీ. యస్మాత్=ఏ హేతువువలన, మే=నాకు, విక్షేపః=చిత్తచాంచల్యము, న = లేదో, తతః=ఆ హేతువువలన, మమ = నాకు, సమాధిః = చిత్తనిరోధము, న = లేదు. విక్షేపో వా=విక్షేపముగాని, సమాధిర్వా=చిత్తైకాగ్రత గాని, వికారిణః=వికారముగల, మనసః = మనస్సునకు, స్యాత్ = అగును. (మనోధర్మము లనుట.)

తా. ఎవనికి చిత్తచాంచల్య ముండునో వాఁడు చిత్తనిరోధము చేయవలెను. విక్షేపసమాధులు రెండును వికారి యగు మనస్సుయొక్క ధర్మములు. నిర్వికారస్వరూపుఁ డగు జ్ఞానికి సమాధియు నక్కఱ లేదు.

అవ. సమాధ్యనుభవము సంపాదింపఁదగినదే కదా! యనినఁ జెప్పుచున్నాఁడు:-

శ్లో. నిత్యానుభవరూపస్య కో మేఽత్రానుభవః పృథక్,
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ నిశ్చయః. 53

టీ. నిత్యానుభవరూపస్య = ఎప్పుడు ననుభవస్వరూపుఁడ నగు, మే = నాకు, అత్ర = ఈ సమాధియందు, పృథక్ = వేఱైన, అనుభవః అనుభవము, కః = ఏ మున్నది? కృత్యం = చేయవలసినది, కృతం = చేయఁబడినది, ప్రాపణీయం = పొంద వలసినది, ప్రాప్తం = పొందఁబడినది, ఇత్యేవ = ఇట్లే, నిశ్చయః = నిశ్చయము.

తా. నిత్యము బ్రహ్మస్వరూపము నేనే యనెడి యనుభవము గల నాకు (జ్ఞానికి) క్రొత్తగా సంపాదింపవగిన యనుభవ మే మున్నది? నేను కృతకృత్యుఁడను, ప్రాప్తప్రాప్తవ్యుఁడను అనియే నా నిశ్చయము.

అవ. ఇందుచేత స్వేచ్ఛావృత్తి ఘటించునే యనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాన్యథాపి వా,
మమాకర్తురలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్. 54

టీ. లౌకికో వా = లోకసంబంధమైన దైనను, శాస్త్రీయోవా = శాస్త్రసంబంధ మైనను, అన్యథాపి వా = నిషిద్ధరూప మైనను, వ్యవహారః = వ్యవహారము, అకర్తుః = కర్తను గానట్టియు, అలేపస్య = భోక్తను గానట్టియు, మమ = నాకు, ఆరబ్ధం యథా = ప్రారబ్ధానుసారముగా, ప్రవర్తతాం = ప్రవర్తించుఁ గాక.

తా. లౌకికవ్యవహారము (స్నానభిక్షాదికము) శాస్త్రీయ వ్యవహారము (ప్రణవజపము మొదలగునది), నిషిద్ధవ్యవహారమును (శాస్త్ర నిషిద్ధమైన పను లన్నియును) ప్రారబ్ధకర్మానుసారముగా ప్రవర్తించుఁ గాక. కర్తృత్వభోక్తృత్వములు లేని నన్ను అట్టి వ్యవహార మేమియుఁ జేయలేదు.

అవ. లోకానుగ్రహార్థ మైనను కర్మధ్యానాదులను చేయవలదా? యనినం జెప్పుచున్నాఁడు:—

శ్లో. అథవా కృతకృత్యోఽపి లోకానుగ్రహకామ్యయా,
శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేఽహం కా మమ క్షతిః. 55

టీ. అథవా=అట్లుగాక, కృతకృత్యోఽపి=కృతార్థుఁడ నైనను, లోకానుగ్రహకామ్యయా=లోకము ననుగ్రహింపవలె ననెడి కోరికచేత, శాస్త్రీయేణ = శాస్త్రమందుఁ జెప్పఁబడిన, మార్గేణైవ=మార్గముననే, అహం = నేను, వర్తే=వర్తించెదను. మమ=నాకు, కా క్షతిః=ఏమి లోటు?

తా. కృతకృత్యుఁడ నైనను, లోకమును బాగుపఱచుటకొఱకు శాస్త్రానుసార మగు మార్గముననే వర్తించెదను. అట్టి వ్యవహారముచే నా కేమియు బాధ లేదు.

అవ. ఈ శరీరాదులే వ్యవహారము చేయుచున్నను జ్ఞాని కెట్టి వికారమును కలిగింప వని చెప్పుచున్నాఁడు:—

శ్లో. దేవార్చనస్నానశౌచభిక్షాదౌ వర్తతాం వపుః,
తారం జపతు వాక్తద్వత్పఠత్వామ్నాయమస్తకమ్. 56

శ్లో. విష్ణుం ధ్యాయతు ధీర్యద్వా బ్రహ్మానందే విలీయతాం,
సాక్ష్యహం కించిదప్యత్ర న కుర్వే నాపి కారయే. 57

టీ. వపుః=శరీరము (ఉపాధి), దేవార్చనస్నానశౌచభిక్షాదౌ =దేవార్చనము, స్నానము, శౌచవిధి, భిక్ష మొదలగువానియందు, వర్తతాం = ఉండుఁగాక. వాక్ = వాక్కు, తారం = ప్రణవమును, జపతు = జపించుఁ గాక, తద్వత్ = అటువలెనే, ఆమ్నాయమస్తకం = ఉపనిషచ్ఛాస్త్రమును, పఠతు = పఠించుఁ గాక, ధీః=బుద్ధి, విష్ణుం= విష్ణుమూర్తిని, ధ్యాయతు=ధ్యానించుఁ గాక, యద్వా = అటు గాకున్న, బ్రహ్మానందే= బ్రహ్మానందమునందు, విలీయతాం = లీనమగుఁ గాక, అత్ర = ఈ బుద్ధ్యాదివ్యవహార విషయమై, సాక్షీ = సర్వసాక్షి నగు, అహం = నేను, కించిదపి = కొంచె మైనను, న కుర్వే = చేయను. నాపి కారయే = చేయింపను.

తా. శరీరము దేవార్చనస్నానశౌచభిక్షాదికార్యములయందు వర్తించుచుండుఁ గాక, వాక్కు ప్రణవమునుగాని ఉపనిషదాదివేదాంత శాస్త్రమునుగాని యుచ్చరించుచుండుఁ గాక, బుద్ధి విష్ణుమూర్తిని

ధ్యానించుచుండుఁ గాక, లేదా బ్రహ్మానందమందు విలీనమైయుండుఁ గాక, వీని కన్నిటికిని సాక్షి నగు నేను ఎద్దియుఁ జేయువాఁడను గాను, చేయించువాఁడనుం గాను.

అవ. బ్రహ్మవిదునియొక్క స్థితిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. కృతకృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః,
తృప్య న్నేవం స్వమనసా మన్యతేఽసౌ నిరంతరమ్. 58

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి,
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టః. 59

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య,
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి. 60

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్,
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్. 61

శ్లో. ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే,
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః. 62

శ్లో. అహో పుణ్యమహో పుణ్యం ఫలితం ఫలితం దృఢం,
అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్. 63

తా. ఈ పై శ్లోకములకు అర్థ తాత్పర్యములు తృప్తిదీపము చివర వ్రాయఁబడినవి. అచ్చటఁ జూడఁ దగును. బ్రహ్మానందము గలవాఁడు కృతకృత్యుఁ డనియు, ప్రాప్తప్రాప్యుఁ డనియు, ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారముగలవాఁ డనియు, సాంసారికదుఃఖము లేనివాఁ డనియు, అజ్ఞానరహితుఁ డనియు వర్ణింపఁబడినది. అందుచే వానికి సంపూర్ణమైన తృప్తి గలదు కనుక బ్రహ్మజ్ఞానియొక్క తృప్తిని వర్ణించెడి తృప్తిదీపమందలి శ్లోకములు తిరిగి యిచ్చట వ్రాయఁబడినవి. అట్టి బ్రహ్మానందముచేత నేను ధన్యుఁడను, నేను ధన్యుఁడను, నా పుణ్యము ఫలించెను అని ఆనంద స్వరూపుఁ డై యుప్పొంగుచున్నాఁడు.

శ్లో. అహో శాస్త్రమహో శాస్త్రమహో గురురహో గురుః,
అహో జ్ఞాన మహో జ్ఞాన మహో సుఖ మహో సుఖమ్. 64

తా. ఈ శ్లోకమున్ను తృప్తిదీపమునందు చెప్పఁబడినది. తన గురువు, శాస్త్రము, జ్ఞానము, సుఖము వీనియొక్క మహిమనుగూర్చి ఆశ్చర్యము నొందుచున్నాఁడు.

అవ. ప్రకరణము నుపసంహరించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందాభిధే గ్రంథే చతుర్థోఽధ్యాయ ఈరితః,
విద్యానందస్తదుత్పత్తిపర్యంతోఽభ్యాస ఇష్యతామ్. 65

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం, బ్రహ్మానందే
విద్యానందో నామ చతుర్థోఽధ్యాయః.

వ్యా. ఇమమధ్యాయార్థముపసంహరతి—బ్రహ్మానందాభిధ ఇతి.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్య
కింకరేణ రామకృష్ణాఖ్యేన విదుషా విరచితే బ్రహ్మానందవ్యాఖ్యానే
విద్యానందో నామ చతుర్థోఽధ్యాయః.

టీ. బ్రహ్మానందాభిధే = బ్రహ్మానంద మనెడి ఆ గ్రంథమునందు, చతుర్థోఽధ్యాయః=నాల్గవ అధ్యాయ మగు, విద్యానందః=విద్యానందము, ఈరితః = చెప్పఁబడినది. తదుత్పత్తిపర్యంతః = ఆ విద్యానందము గలిగెడివఱకు, అభ్యాసః = అభ్యాసము (బ్రహ్మాభ్యాసము), ఇష్యతాం = చేయఁబడుఁ గాక.

తా. బ్రహ్మానంద మనెడి గ్రంథమునందు నాలవ యధ్యాయ మగు విద్యానందము చెప్పఁబడినది. కావున ముముక్షువు లగువారు బ్రహ్మసాక్షాత్కారపర్యంతము దృఢాభ్యాసమును చేసి తరింతురు గాక.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు బ్రహ్మానందమందలి
విద్యానంద మను చతుర్థాధ్యాయము సమాప్తము.

---

శ్రీ రస్తు.
శ్రీ గణేశాయ నమః



# శ్రీవేదాంతపంచదశి

## పంచదశప్రకరణము

## విషయానందప్రకరణము

అవ. ఈ ప్రకరణమునందుఁ జెప్పెడి యర్థమును సూచించుచున్నాఁడు:—

శ్లో. అథాత్ర విషయానందో బ్రహ్మానందాంశరూపభాక్,
నిరూప్యతే ద్వారభూత స్తదంశత్వం శ్రుతిర్జగౌ. 1

### వ్యాఖ్యానమ్

వ్యా. పంచమాధ్యాయస్య ప్రతిపాద్యమర్థమాహ—అథేతి. నను విషయానందస్య లౌకికత్వాన్మోక్షశాస్త్రే నిరూపణ మను పపన్నమిత్యాశంక్య తస్య లౌకికప్రసిద్ధత్వేఽపి బ్రహ్మానందైకదేశత్వేన బ్రహ్మజ్ఞానోపయోగిత్వాదుక్త మిత్యాహ—ద్వారేతి. బ్రహ్మానందైకదేశత్వే కిం ప్రమాణమిత్యాశంక్యాహ—తదంశత్వమితి.

టీ. అథ=అనంతరము, అత్ర=ఈ ప్రకరణమునందు, ద్వారభూతః=సాధనమైన, బ్రహ్మానందాంశరూపభాక్=బ్రహ్మానందస్వరూపముయొక్క అంశను పొందిన, విషయానందః=విషయానందము, నిరూప్యతే=నిరూపింపఁబడును. తదంశత్వం=ఆ బ్రహ్మానందముయొక్క అంశ మనుటను, శ్రుతిః = శ్రుతి, జగౌ=చెప్పెను.

తా. బ్రహ్మానందసాధన మగు విషయానంద మీ ప్రకరణమున నిరూపింపఁబడును. ఆ విషయానందము బ్రహ్మానందాంశ మని శ్రుతియుఁ జెప్పుచున్నది.

అవ. శ్రుత్యర్థమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏషోఽస్య పరమానందో యోఽఖండైకరసాత్మకః,
అన్యాని భూతాన్యేతస్య మాత్రామేవోపభుంజతే. 2

వ్యా. ఉదాహృతాసు వివిధాస్వపి వృత్తిషు బ్రహ్మణశ్చిద్రూపత్వం భాతీత్యాహ— వృత్తిష్వితి. శాంతాసు విశేషమాహ—శాంతాస్వితి. చ శబ్దోఽనుక్తద్వయ సముచ్చయార్థకః.

టీ. సర్వాసు = సమస్తమైన, ఏతాసు వృత్తిషు = ఇట్టి మనోవృత్తులయందు బ్రహ్మణః = పరబ్రహ్మయొక్క, చిత్స్వభావతా = చైతన్యస్వభావము, ప్రతిబింబతి = ప్రతిబింబించుచున్నది. శాంతాసు=సాత్త్వికవృత్తులయందు, సుఖం చ=ఆనందస్వరూపమును, ప్రతిబింబతి=ప్రతిఫలించుచున్నది.

తా. మనోవృత్తులు 1. సాత్త్విక, 2. రాజస, 3. తామసము లని మూఁడు విధములుగా నున్నవి. వైరాగ్యము, ఓర్పు, ఔదార్యము ఇవి సాత్త్వికవృత్తుల కుదాహరణములు. అత్యాశయు, ప్రేమయు, కోరికయు, కోపమును ఈ మొదలగునవి రాజసవృత్తులు. మఱపు, భయము మున్నగునవి తామసవృత్తులు. సాత్త్వికము లైన యంతఃకరణవృత్తులయందు పరబ్రహ్మముయొక్క జ్ఞానానందస్వరూపములు ప్రతిఫలించును.

అవ. ఈ చెప్పిన యర్థమునందు శ్రుతివాక్యమును జూపుచున్నాఁడు:—

శ్లో. రూపం రూపం బభూవాసౌ ప్రతిరూప ఇతి శ్రుతిః,
ఉపమా సూర్యకేత్యాది సూత్రయామాస సూత్రకృత్. 6

వ్యా. ఉక్తార్థే శ్రుతివాక్యమర్థతః పఠతి—రూపమితి. తత్రైవ వ్యాససూత్రైకదేశం పఠతి—ఉపమేతి. అతఏవ చేతి సూత్రస్య పూర్వభాగః.

టీ. అసౌ = ఈ పరమాత్మ, రూపం రూపం = ప్రతిరూపమునందు, ప్రతిరూపః= ప్రతిబింబము, బభూవ = ఆయెను. ఇతి = అని. శ్రుతిః=కాఠకశ్రుతి, సూత్రకృత్= సూత్రకారు లగు వ్యాసాచార్యులు, సూర్యకేత్యాది = ఉదకమునందు ప్రతిఫలించిన సూర్య ప్రతిబింబము మొదలగునది, ఉపమా = సాదృశ్యముగా, సూత్రయామాస = సూత్రమును జేసెను.

తా. ఆ పరమాత్మ ప్రతిశరీరమునందును ప్రతిబింబించిన ప్రతిబింబరూపముగా నున్నాఁడు అని కఠశ్రుతి చెప్పెను. సూత్రకారు లగు వేదవ్యాసులవారు "అత ఏవ చోపమా సూర్యకాదివత్" అనెడి సూత్రమునందు ఉదకమున ప్రతిఫలించిన సూర్యాదుల నుపమానముగాఁ జెప్పెను.

అవ. ఒకే వస్తువున కుపాధిభేదముచే నానారూపత్వము గలుగు ననుటకు శ్రుతి:—

శ్లో. ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః,
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్. 7

వ్యా. స్వరూపేణైకస్యోపాధిసంపర్కాన్నానాత్వే శ్రుతిం పఠతి—ఏకఏవేతి.

టీ. భూతాత్మా=పరమాత్మ, ఏక ఏవ హి సన్ = ఒక్కఁడే అయ్యుండి, భూతే భూతే=ప్రతి శరీరమునందు, వ్యవస్థితః = ఉండును. జలచంద్రవత్=జలమునందు ప్రతిఫలించిన చంద్రునివలె, ఏకధా=ఒక్కఁడుగాను, బహుధా చైవ=అనేక విధములుగను, దృశ్యతే=కనుఁగొనఁబడుచున్నాఁడు.

తా. పరమాత్మ తా నొక్కఁడై యుండియు, ప్రతిశరీరమునందు, ఉదకమందు ప్రతిఫలించిన చంద్రునివలెనే, నుపాధిస్వరూపముచే నానావిధములుగను, ఉపహితస్వరూపములచే నొక్కఁడుగను చూడఁబడుచున్నాఁడు.

అవ. నిర్దుష్టమైన పరబ్రహ్మము ఒకచోట చిన్మాత్రుఁడుగా ప్రకాశించినట్లును ఒకచోట చిదానందములుగా ప్రకాశించినట్లును చెప్పుట సరి కాదని శంకింపఁగా దృష్టాంతముచే సమాధాన మిచ్చుచున్నాఁడు:—

శ్లో. జలే ప్రవిష్టశ్చంద్రోఽయమస్పష్టః కలుషే జలే,
విస్పష్టో నిర్మలే తద్వద్ ద్వేధా బ్రహ్మాపి వృత్తిషు. 8

వ్యా. నను, నిరవద్యస్య బ్రహ్మణః క్వచిచ్చిన్మాత్రభానమితరత్ర చిదానందభాన మిత్యేవం విభాగకరణమనుపపన్నమిత్యాశంక్య చంద్రదృష్టాంతేన పరిహరతి—జలే ప్రవిష్ట ఇతి. ఉక్తమర్థం దార్ష్టాంతికే యోజయతి—తద్వదితి.

టీ. జలే = జలమునందు, ప్రవిష్టః = ప్రతిబింబించిన, అయం చంద్రః = ఈ చంద్రుఁడు, కలుషే జలే = మురికి నీటియందు, అస్పష్టః = స్పష్టముగా కనుపడఁడు. నిర్మలే=నిర్మలమైన నీటియందు, విస్పష్టః=మిక్కిలి స్పష్టముగాఁ గనపడును. తద్వత్ = అటువలె, బ్రహ్మాపి = బ్రహ్మమును, వృత్తిషు = సాత్త్విక రాజస తామసవృత్తులయందు ద్వేధా=వృత్తులమాలిన్య భేదముచే రెండు విధములుగా కనబడును.

తా. సచ్చిదానందస్వరూపు డొక్కఁడే యైనను, స్వచ్ఛములైన సాత్త్వికవృత్తులయందు స్పష్టముగాను, రాజస తామస వృత్తులయందస్పష్టముగాను, ఒకే చంద్రుఁడు నిర్మలజలమునందు, మలినజలమునందును వలె ద్వివిధముగాఁ గనపడును.

అవ. దానినే చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘోరమూఢాసు మాలిన్యాత్సుఖాంశశ్చ తిరోహితః,
ఈషన్నైర్మల్యత స్తత్ర చిదంశ ప్రతిబింబనమ్. 9

వ్యా. తదేవోపపాదయతి—ఘోరేతి.

టీ. ఘోరమూఢాసు=రాజస తామస వృత్తులయందు, మాలిన్యాత్ =మలినత్వ ముండుటవలన, సుఖాంశః = పరబ్రహ్మముయొక్క ఆనందము, తిరోహితః = చక్కగా స్ఫురింపదు. తత్ర=ఆ రాజస తామస వృత్తులయందు, ఈషత్ నైర్మల్యతః= కొంచెము నిర్మలత్వ ముండుటచే, చిదంశ ప్రతిబింబనం = జ్ఞానస్వరూపస్ఫూర్తి (అగును).

తా. రాజస తామస వృత్తులయందు మాలిన్య ముండుటచే, ఆనందస్వరూపము స్ఫురింపదు. అట్టి వృత్తులయందును కొంచెము నైర్మల్య మున్నది గాన జ్ఞానస్ఫూర్తి మాత్రము కలుగుచున్నది.

అవ. మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. యద్వాపి నిర్మలే నీరే వహ్నేరౌష్ణ్యస్య సంక్రమః,
న ప్రకాశస్య తద్వత్స్యాచ్చిన్మాత్రోద్భూతి రేవ చ. 10

వ్యా. నను చంద్రోపాధేరుదకస్య ద్వైవిధ్యాదంశభానముపపన్నం. ప్రకృతే తూపాధిభూతస్యాంతఃకరణస్యైకత్వాదేకాంశభానమనుపపన్నమిత్యాశంక్య దృష్టాంతాంతరమాహ—యద్వాపీతి.

టీ. యద్వాపి=ఇంకొక పక్షమునందును, నిర్మలే నీరే=స్వచ్ఛమైన నీటియందు, వహ్నేః = అగ్నియొక్క, ఔష్ణ్యస్య = ఉష్ణత్వముయొక్క, సంక్రమః=సంక్రమించుట కలుగును. ప్రకాశస్య = తేజోరూపముయొక్క, సంక్రమః = మేళనము, న = లేదు. తద్వత్ =అటులనే, చిన్మాత్రోద్భూతి రేవచ = జ్ఞానరూపముయొక్క స్ఫూర్తియు నగును.

తా. తేట యగు నీటిలో అగ్నియొక్క ఉష్ణత్వము మాత్రము సంక్రమించును. తేజోరూపము సంక్రమింపదు. అట్లే రాజస తామస వృత్తులయందు పరబ్రహ్మముయొక్క చిదంశము (జ్ఞాన స్వరూపము) మాత్రము స్ఫురించును గాని ఆనందాంశము స్ఫురింపదు.

అవ. సాత్త్విక వృత్తులయందు జ్ఞానానందములు రెండును స్ఫురించు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కాష్ఠే త్వౌష్ణ్యప్రకాశౌ ద్వావుద్భవం గచ్ఛతో యథా,
శాంతాసు సుఖచైతన్యే తథైవోద్భూతి మాప్నుతః. 11

వ్యా. ఇదానీం శాంతాసు వృత్తిషు చిదానందయోః ప్రతీతౌ దృష్టాంతాంతర మాహ—కాష్ఠే త్వితి.

టీ. కాష్ఠే తు=కట్టెయందైతే, ఔష్ణ్యప్రకాశౌ ద్వౌ = ఉష్ణత్వప్రకాశత్వములు రెండును, యథా=ఏప్రకారము, ఉద్భవం=పుట్టుటను, గచ్ఛతః=పొందుచున్నవో, తథైవ = అటులే, శాంతాసు = సాత్వికవృత్తులయందు, సుఖచైతన్యే = జ్ఞానానంద స్వరూపములు రెండును, ఉద్భూతిం = ప్రకాశమును, అప్నుతః = పొందుచున్నవి.

తా. అగ్నియొక్క వేడిమియు ప్రకాశంబును రెండు కట్టెయందు స్ఫురించుచున్నట్లు సాత్త్వికవృత్తులయందు జ్ఞానానందములు రెండును భాసించును.

అవ. ఈ వ్యవస్థ స్వాభావికంబును, అనుభవసిద్ధంబును నగు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వస్తుస్వభావమాశ్రిత్య వ్యవస్థా తూభయోస్సమా,
అనుభూత్యనుసారేణ కల్ప్యతే హి నియామకమ్. 12

వ్యా. నన్వేవం వ్యవస్థా కుతః కృతేత్యాశంక్యాహ—వస్త్వితి. తత్ర కిం నియామకమిత్యాశంక్యాహ—అనుభూతీతి.

టీ. వ్యవస్థా తు = ఈ చెప్పఁబడిన వస్తుధర్మవిచిత్రస్ఫురణరూపభేదవ్యవహారమైతే, వస్తుస్వభావం = వస్తుస్వభావమును, ఆశ్రిత్య=అనుసరించి, ఉభయోః = రెండింటియందును, సమా = తుల్యము, అనుభూత్యనుసారేణ = అనుభవానుసారముగా, నియామకం = హేతువు, కల్ప్యతే హి = కల్పింపఁబడును గదా!

తా. ఇట్టి యేర్పాటు దృష్టాంతదార్ష్టాంతికములయందు రెండింటియందును, వస్తుస్వరూపమునుబట్టి సమానముగా నుండును. వస్తుస్వరూపమట్లు లుండుటకు ననుభవానుసారముగా హేతువు కల్పించుకొనవలెను.

అవ. అనుభవమును జూపుచున్నాఁడు:—

శ్లో. న ఘోరాసు న మూఢాసు సుఖానుభవ ఈక్ష్యతే,
శాంతాస్వపి క్వచిత్ కశ్చిత్సుఖాతిశయ ఈక్ష్యతామ్. 13

వ్యా. అనుభూతిమేవ దర్శయతి— న ఘోరాస్వితి. శాంతాస్వప్యానందప్రకాశోఽస్తి సోఽపి క్వచిత్కశ్చిత్సుఖాతిశయో భవతీత్యాహ—శాంతాస్వితి.

టీ. ఘోరాసు=రాజసవృత్తులయందు, సుఖానుభవః=సుఖానుభవము, నేక్ష్యతే=అనుభవింపఁబడదు. మూఢాసు=తామస వృత్తులయందును, సుఖానుభవః=సుఖానుభవము, న=లేదు. శాంతాస్వపి = సాత్త్వికవృత్తులయందును, క్వచిత్ = ఒకానొకనియందు, కశ్చిత్ సుఖాతిశయః = ఒకానొక సుఖవిశేషము, ఈక్ష్యతాం = అనుభవింపఁబడును.

తా. రాజసతామసవృత్తులయం దానందానుభవము కనుపడదు. సాత్త్వికవృత్తులయందును, ఒకానొకనియం దొకానొకవిధ మైన యానంద స్ఫూర్తి గలుగును.

అవ. రాజసతామస వృత్తులయందు సుఖానుభవము లే దని స్పష్టముగ చెప్పుచున్నాఁడు:—

శ్లో. గృహక్షేత్రాదివిషయే యదా కామో భవే త్తదా,
రాజసస్యాస్య కామస్య ఘోరత్వా త్తస్య నో సుఖమ్. 14

వ్యా. పూర్వోక్తఘోరమూఢవృత్తిషు సుఖాభావమేవాభినీయ దర్శయతి—గృహక్షేత్రేతి.

టీ. గృహక్షేత్రాదివిషయే = ఇండ్లు క్షేత్రము మొదలగువాని విషయమందు, యదా=ఎప్పుడు, కామః=కోరిక, భవేత్=కల్గునో, రాజసస్య = రజోగుణోద్భవమైన, అస్య కామస్య=ఈ కోరిక, ఘోరత్వాత్ = భయంకరమైన దగుటవలన, తస్య=దానికి, సుఖం = ఆనందము, నో = లేదు.

తా. గృహక్షేత్రవిత్తాదులయందు కోరిక కల్గినపుడు, అది ఘోరరూప మగును. అందువలన ఆ కామము సుఖరూపము గాదు.

శ్లో. సిద్ధ్యేన్న వేత్యస్తి దుఃఖమసిద్ధౌ తద్వివర్ధతే,
ప్రతిబంధే భవేత్క్రోధో ద్వేషో వా ప్రతికూలతః. 15

వ్యా. సుఖాసిద్ధౌ దుఃఖం వర్ధతే. సుఖస్య ప్రతిబంధే తు క్రోధో భవతి. సుఖాభావే కారణాంతరమాహ—ద్వేషో వేతి. తత్ర ప్రతికూలదుఃఖస్య సత్త్వాదిత్యర్థః.

టీ. (గృహక్షేత్రాది విషయః=గృహక్షేత్రవిత్తాదికము), సిద్ధ్యేత్=సిద్ధించునా? నవా=లభింపదా? ఇతి=అని, దుఃఖం = దుఃఖము, అస్తి=కలదు. అసిద్ధౌ=సిద్ధింపనపుడు, తత్=ఆ దుఃఖము, వివర్ధతే=వృద్ధి యగును. ప్రతిబంధే=గృహక్షేత్రాదివిషయ సుఖమునకు ప్రతిబంధము గలిగినప్పుడు, క్రోధః=కోపము, భవేత్=కలుగును. ప్రతికూలతః=అపని ప్రతికూలమయినయెడల, ద్వేషో వా=ద్వేషమయినను, భవేత్ = కలుగును.

తా. గృహక్షేత్రవిత్తాదులు కల్గునా? కలుగవా? యని దుఃఖమును, అవి లభింపనపుడు దుఃఖాతిశయమును, ప్రతిబంధము కలిగినపుడు కోపమును, ప్రతికూలించినపుడు ద్వేషమును కలుగుచున్నవి.

అవ. తామసవృత్తులందు సుఖానుభవము లేదనుట కింకొక కారణము:—

శ్లో. అశక్యశ్చేత్ప్రతీకారో వివాదస్స్యాత్స తామసః,
క్రోధాదిషు మహద్దుఃఖం సుఖశంకాపి దూరతః. 16

వ్యా. పరిహారస్యాశక్యత్వే విషాదో భవతి. తస్యాపి తామసత్వాన్న తత్ర సుఖమిత్యాహ—అశక్య ఇతి. క్రోధాదిష్విత్యాదయః స్పష్టార్థాః.

టీ. ప్రతీకారః=పరిహారము, అశక్యశ్చేత్ = శక్యముగాని యెడల, వివాదః=కలహము, స్యాత్=కలుగును. సః=ఆ వివాదము, తామసః = తమోగుణముచే జనించినది, స్యాత్ = అగును. క్రోధాదిషు = క్రోధము, ద్వేషము, వివాదము కలిగినప్పుడు, సుఖశంకాపి = సుఖశంకయును, దూరతః = దూర మగుటవలన, మహద్దుఃఖం = అధిక మగు దుఃఖము కలుగును.

తా. తన కిష్టముగాని దానికి పరిహారము (దానిని నివారించుటకు) చేయుటకుఁ జేతఁగానిచోఁ గలహము కలుగును. అది తమోగుణవృత్తివలనఁ గలిగిన దగును. ఇట్లు క్రోధద్వేషవివాదాదులవలన గొప్ప దుఃఖమే కాని సుఖము లేశమును లేదని భావము.

శ్లో. కామ్యలాభే హర్షవృత్తిశ్శాంతా తత్ర మహత్సుఖం,
భోగే మహత్తరం లాభప్రసక్తావీషదేవ హి. 17

టీ. కామ్యలాభే = కోరిన విషయము సిద్ధించినపుడు కలిగెడి, హర్షవృత్తిః = సంతోషవృత్తి, శాంతా=సాత్త్వికవృత్తి యనఁబడును. తత్ర=ఆ సాత్త్వికవృత్తియందు, మహత్సుఖం=గొప్ప యానందము కలదు. భోగే=ఇష్టవస్తు భోగమునందు, మహత్తరం=అంతకన్న నధికసుఖము, లాభప్రసక్తౌ = తనకు లాభము కలుగు నని తోఁచునపుడు, ఈషదేవ హి = కొంచెమైన సుఖమే (స్యాత్ = అగును).

తా. తాను కోరిన విషయము లభించినచో హర్షము గలుగును. అది సాత్త్వికవృత్తి యగును. ఇష్టవస్తు భోగమువలన ఇంకను గొప్ప సుఖము కలుగును. సుఖము కలుగఁ గల దని తోఁచినపుడు కొంచెము సుఖము కలుగును.

శ్లో. మహత్తమం విరక్తౌ తు విద్యానందే తదీరితం,
ఏవం క్షాంతౌ తథౌదార్యే క్రోధలోభనివారణాత్. 18

టీ. విరక్తౌ తు = వైరాగ్యము కలిగినప్పుడు, మహత్తమం = మిక్కిలి గొప్ప యానంద మని, విద్యానందే=విద్యానంద మను పాల్గవ ప్రకరణమందు, ఈరితం=చెప్పఁ బడెను. ఏవం=ఈ విధముగా, క్షాంతౌ=ఓర్పు గలిగినప్పుడును, తథా=అట్లే, ఔదార్యే= ఉదారభావము గలిగినప్పుడును, క్రోధలోభనివారణాత్ = కోపము, పేరాసయు లేక పోవుటవలన, మహత్తమం సుఖం=గొప్ప యానందము (భవేత్ = కలుగును.)

తా. క్రోధలోభములు లేక, సహనము, ఔదార్యము కలిగి నప్పుడు గొప్ప సుఖము కలుగును. విరక్తి కలిగినపు డన్ననో, నిరతి శయానందము కలుగు నని విద్యానందప్రకరణమున, 34-వ శ్లోకమందుఁ జెప్పఁబడినది.

అవ. ఈ సుఖము శాంత్యాదులు కలిగినపుడు సర్వానుభవసిద్ధమై యున్న దను చున్నాఁడు:—

శ్లో. యద్యత్సుఖం భవేత్తత్త ద్బ్రహ్మైవ ప్రతిబింబనాత్,
వృత్తిష్వంతర్ముఖా స్వస్య నిర్విఘ్నం ప్రతిబింబనమ్. 19

వ్యా. ఏవం క్షాంత్యాదీనాం సిద్ధమిత్యాహ—వృత్తిష్వితి.

టీ. యద్యత్ సుఖం=ఏ యే సుఖము, భవేత్ = కలుగునో, తత్తత్=అయ్యది, ప్రతిబింబనాత్ = చిత్ప్రతిబింబమువలన, బ్రహ్మైవ=బ్రహ్మమే యగును. వృత్తిషు = మనోవృత్తులు,అంతర్ముఖాసుసతీషు=అంతర్ముఖము లగుచుండఁగా, అస్య=ఈ పరబ్రహ్మము యొక్క, ప్రతిబింబనం = ప్రతిఫలించుట, నిర్విఘ్నం = నిరాటంకముగా కలుగును.

తా. ఏ సుఖము కలిగినను, అది యంతయు బ్రహ్మమే. మనో వృత్తులు అంతర్ముఖము లైనయెడల, ఆ బ్రహ్మముయొక్క ఆనందప్రతి బింబము పూర్తిగాఁ గలుగును.

అవ సర్వత్ర బ్రహ్మస్వరూపానుభవమును జూపఁ దలఁచి యా బ్రహ్మరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్తా చితిస్సుఖం చేతి స్వభావా బ్రహ్మణ స్త్రయః,
మృచ్ఛిలాదిషు సత్తైవ వ్యజ్యతే నేతరద్వయమ్. 20

వ్యా. ఇదానీం సర్వత్ర బ్రహ్మస్వరూపానుభూతిప్రదర్శనాయ తత్స్వరూపం స్మారయతి—సత్తేతి. మృచ్ఛిలాదిషు సన్మాత్రమిత్యర్థః. ఘోరమూఢయోర్ద్వయోః సత్తా చితీ ద్వే శాంతవృత్తౌ సచ్చిదానందాః త్రయోఽపి వ్యక్తాః.

టీ. సత్తా=సత్తయు, చితిః=స్ఫూర్తియు, సుఖం చేతి=ఆనందము ననెడి, త్రయః= మూఁడును, బ్రహ్మణః = పరబ్రహ్మముయొక్క, స్వభావాః = లక్షణములు. మృచ్ఛిలాదిషు = మృత్పాషాణాదులయందు, సత్తైవ = సద్రూపత మాత్రమే, వ్యజ్యతే=కనవచ్చుచున్నది. ఇతరత్ ద్వయం = తక్కిన జ్ఞానానందములు రెండును, న = స్ఫురింపవు.

తా. సచ్చిదానందములు మూఁడును బ్రహ్మలక్షణములు. మృత్పాషాణాదులయందు బ్రహ్మముయొక్క సద్రూపము మాత్రమే కనవచ్చుచున్నది వానియందు జ్ఞానానందస్ఫూర్తి లేదు.

శ్లో. సత్తా చితి ర్ద్వయం వ్యక్తం ధీవృత్త్యో ర్ఘోరమూఢయోః,
శాంతవృత్తౌ త్రయం వ్యక్తం మిశ్రం బ్రహ్మేత్థమీరితమ్. 21

వ్యా. ఏవం సప్రపంచం బ్రహ్మాభిహితమిత్యాహ—మిశ్రమితి.

టీ. ఘోరమూఢయోః=రాజసతామసములైన, ధీవృత్త్యోః=బుద్ధి వృత్తులయందు, సత్తా=సద్రూపంబును, చితిః = చిద్రూపమును, ద్వయం = రెండును, వ్యక్తం = భాసించుచున్నవి. శాంతవృత్తౌ = సాత్త్వికవృత్తియందు, త్రయం = సద్రూప చిద్రూపానందరూపములు మూఁడును, వ్యక్తం = స్ఫురించుచున్నవి. ఇత్థం = ఈ విధముగా, మిశ్రం బ్రహ్మ = మాయాశబలితబ్రహ్మము, ఈరితం = చెప్పఁబడెను.

తా. రాజసతామసవృత్తులయందు సద్రూపచిద్రూపంబులు మాత్రమే తోఁచును. సాత్త్వికవృత్తియందు సచ్చిదానందరూపములు మూఁడును తోఁచును. ఇట్లు మాయాశబలిత బ్రహ్మస్వరూపము చెప్పఁబడెను.

అవ. "మాయాశబలితము కాని బ్రహ్మ మున్న దని తెలియు టెట్లు?" అనఁగాఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. అమిశ్రం జ్ఞానయోగాభ్యాం తౌ చ పూర్వమునీరితౌ,
ఆద్యేఽధ్యాయే యోగచింతా జ్ఞానమధ్యాయయోర్ద్వయోః. 22

వ్యా. అమిశ్రం కుతో జ్ఞాయత ఇత్యాశంక్యాహ—అమిశ్రమితి. తౌ చ జ్ఞానయోగౌ పూర్వమేవోక్తావిత్యర్థః. కుత్రోక్తావిత్యాశంక్య యోగః ప్రథమాధ్యాయే ఉక్త ఇత్యాహ—ఆద్యఇతి. సమనంతరాధ్యాయయోర్జ్ఞానముక్తమిత్యాహ—జ్ఞానమితి.

టీ. అమిశ్రం = నిష్ప్రపంచబ్రహ్మస్వరూపము, జ్ఞానయోగాభ్యాం = జ్ఞానయోగముల చేత (౧౧, ౧౨, ౧3 ప్రకరణములందు, ఉక్తం=చెప్పఁబడెను), తౌ చ =

ఆ జ్ఞానయోగములు రెండును, పూర్వం = ఇదివరలో, ఉదీరితౌ = చెప్పఁబడినవి, ఆద్యే అధ్యాయే = ఒకటవ యధ్యాయమునందు, యోగచింతా=యోగచింతయు, ద్వయోః అధ్యాయయోః = తరువాతి రెం డధ్యాయములయందు, జ్ఞానం=జ్ఞానము, ఉదీరితం = చెప్పఁబడెను.

తా. నిష్ప్రపంచబ్రహ్మస్వరూపము 11, 12, 13-వ ప్రకరణములలో చెప్పఁబడెను. యోగచింత 11-వ ప్రకరణమునందును, జ్ఞానము 12, 13-వ ప్రకరణములందును చెప్పఁబడెను.

అవ. మాయాస్వరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. అసత్తా జాడ్యదుఃఖే ద్వే మాయారూపత్రయం త్విదం,
అసత్తా నరశృంగాదౌ జాడ్యం కాష్ఠశిలాదిషు. 23

వ్యా. నను సచ్చిదానందానాం బ్రహ్మరూపత్వే మాయాయాః కిం రూపమిత్యాశంక్యాహ—అసత్తేతి. నృశృంగాదావసత్త్వం మృచ్ఛిలాదిషు జాడ్యమితి వివేకః.

టీ. అసత్తా=అసత్తయు, ద్వే జాడ్యదుఃఖే=జాడ్యదుఃఖములు రెండును, ఇదం= ఇది, మాయారూపత్రయం = మాయయొక్క రూపత్రయ మగును. నరశృంగాదౌ = మనిషికొమ్ము మొదలగువానియందు, అసత్తా=అభావ మెఱుంగ నగును. కాష్ఠశిలాదిషు= కొయ్యలు, ఱాలు మొదలగువానియందు, జాడ్యం = జడత్వము కలదు.

తా. అసత్త, జడత్వము, దుఃఖము ననునవి మాయయొక్క లక్షణములు. నరశృంగాదులయందు అభావం బెఱుంగ నగును. కాష్ఠ శిలాదులయందు జడత్వ మూహింప నగు.

అవ. మాయయొక్క దుఃఖరూపమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఘోరమూఢధియోర్దుఃఖమేవం మాయా విజృంభితా,
శాంతాదిబుద్ధివృత్త్యైక్యా న్మిశ్రం బ్రహ్మేతి కీర్తితమ్. 24

వ్యా. దుఃఖం కుత్రేత్యాశంక్యాహ—ఘోరమూఢేతి. ఏవం సర్వత్ర మాయా ప్రతిభాసత ఇత్యాహ—ఏవమితి. శాంతాదిషు వృత్తిషు బ్రహ్మణో మిశ్రత్వే కిం కారణమిత్యత ఆహ—శాంతాదీతి.

టీ. ఘోరమూఢధియోః = రాజసతామసవృత్తులయందు, దుఃఖం = దుఃఖము కలదు. ఏవం = ఈ విధముగా, మాయా = మాయాశక్తి, విజృంభితా = సర్వజగత్తును వ్యాపించియున్నది. శాంత్యాదిబుద్ధివృత్త్యైక్యాత్ = సాత్త్వికాదివృత్తులతో ఏకత్వము వలన, బ్రహ్మ=బ్రహ్మము, మిశ్ర మితి=మిశ్ర మని, కీర్తితం=చెప్పఁబడును.

తా. రాజసతామసవృత్తులయందు దుఃఖము గల దని యెఱుంగవలెను. సాత్త్విక రాజస తామసవృత్తులతో నైక్యముఁ జెందుటవలన బ్రహ్మమును మిశ్ర మని చెప్పఁబడును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏవం స్థితేఽత్ర యో బ్రహ్మ ధ్యాతుమిచ్ఛేత్పుమానసౌ,
నృశృంగాదిముపేక్షేత శిష్టం ధ్యాయేద్యథాయథమ్. 25

వ్యా. ఏతదభిధానం కిమర్థమిత్యాశంక్య బ్రహ్మధ్యానార్థమిత్యాహ—ఏవమితి. నృశృంగాదిముపేక్ష్యాన్యత్ర బ్రహ్మధ్యానం కర్తవ్యమిత్యాహ—నృశృంగాదిమితి.

టీ. ఏవం = ఇట్లు మాయారూపత్రయము, స్థితే = ఉండఁగా, యః పుమాన్ = ఏ సాధకుఁడు, బ్రహ్మ = బ్రహ్మస్వరూపమును, ధ్యాతుం = ధ్యానించుటకు, ఇచ్ఛేత్ = పూనుకొనును. అసౌ = వీఁడు, నృశృంగాదిం = నరవిషాణము మొదలగు నభావమును, ఉపేక్షేత = ఉపేక్షింపవలెను. శిష్టం = తక్కినదానిని, యథాయథం = ఉచితరీతిని, ధ్యాయేత్ = ధ్యానము చేయవలెను.

తా. సోపాధికబ్రహ్మమును సాధకుఁడు ధ్యానించుటకు మిశ్ర బ్రహ్మము చెప్పఁబడెను. అందు నరవిషాణములవలె నభావరూపము నుపేక్షించి తక్కినదానిని నుచితరీతిని బ్రహ్మధ్యానము చేయఁదగును.

అవ. "శిష్టం" అని పైశ్లోకములోఁ జెప్పినదానిని వివరించుచున్నాఁడు:—

శ్లో. శిలాదౌ నామరూపే ద్వే త్యక్త్వా సన్మాత్రచింతనం,
త్యక్త్వా దుఃఖం ఘోరమూఢధియోః సచ్చిద్విచింతనమ్. 26

వ్యా. అన్యత్రేత్యుక్తం. తత్ర కథం ధ్యేయమిత్యత ఆహ—శిలాదావితి. ఘోరమూఢబుద్ధిషు దుఃఖం పరిత్యజ్య సచ్చిద్రూపయోశ్చింతనం కర్తవ్యమిత్యాహ—త్యక్త్వేతి.

టీ. శిలాదౌ = పాషాణాదులయందు, ద్వేనామరూపే=నామరూపములు రెండింటిని, త్యక్త్వా=ఉపేక్షించి, సన్మాత్రచింతనం=కేవలసద్రూపధ్యానమును (చేయవలెను). ఘోరమూఢధియోః = రాజసతామసవృత్తులయందు, దుఃఖం=దుఃఖమును, త్యక్త్వా = వదలి, సచ్చిద్విచింతనం=సచ్చిద్రూపములు రెండింటియొక్క ధ్యానమును(చేయవలెను.)

తా. పాషాణాదులయందు నామరూపములను త్యజించి సన్మాత్రముగా ధ్యానింపవలయును. రాజసతామసవృత్తులయందు సత్యజ్ఞానములు రెంటియొక్క స్వరూపధ్యానమును జేయవలయును.

అవ. సాత్త్వికవృత్తులయందు సచ్చిదానందరూపములు మూఁటిని ధ్యానింపనగును:—

శ్లో. శాంతాసు సచ్చిదానందాంస్త్రీనప్యేవం విచింతయేత్,
కనిష్ఠమధ్యమోత్కృష్టాస్తిస్రశ్చింతాః క్రమాదిమాః. 27

వ్యా. సాత్త్వికవృత్తిషు సచ్చిదానందాస్త్రయోఽపి ధ్యేయా ఇత్యాహ—శాంతాస్వితి. ఏషాం ధ్యానానాం కిం సామ్యం, నేత్యాహ—కనిష్ఠేతి.

టీ. శాంతాసు=సాత్త్వికవృత్తులయందు, త్రీన్=మూఁడైన, సచ్చిదానందానపి=సచ్చిదానందములను మూఁటిని, ఏవం = ఇవ్విధమున నే, విచింతయేత్=ధ్యానింపవలెను. ఇమాః = ఈ, తిస్రః చింతాః = మూఁడు ధ్యానములును, క్రమాత్ = క్రమముగా, కనిష్ఠమధ్యమోత్కృష్టాః = సామాన్యముగాను, మధ్యమముగాను, ఉత్కృష్టముగాను (చేయ నగును).

తా. సాత్త్వికవృత్తులయందు బ్రహ్మముయొక్క సచ్చిదానందములను మూఁటిని ధ్యానింపవలెను. మృచ్ఛిలాదిజడపదార్థములయందలి సద్రూపమును సామాన్యముగా ధ్యానింపవలెను. రాజసతామసములయందలి సచ్చిద్రూపముల నంతకన్న నెక్కువగా ధ్యానింపవలెను. సాత్త్వికవృత్తులయందు సచ్చిదానందములను మూఁటిని నెక్కువగా ధ్యానింపవలెను.

అవ. నిర్గుణోపాసన కనధికారులు సగుణబ్రహ్మోపాసనమును జేయవలె ననుటః—

శ్లో. మందస్య వ్యవహారేఽపి మిశ్రబ్రహ్మణి చింతనం,
ఉత్కృష్టం వక్తుమేవాత్ర విషయానంద ఈరితః. 28

వ్యా. ఇదానీం నిర్గుణబ్రహ్మధ్యానేఽనధికారిణోఽనుగ్రహాయ మిశ్రబ్రహ్మధ్యానేఽధికార ఇత్యభిప్రాయేణాహ—మందస్యేతి.

టీ. మందస్య = మందాధికారియొక్క, వ్యవహారేఽపి = వ్యవహారమునందును, మిశ్రబ్రహ్మణి = సోపాధికబ్రహ్మమందు, చింతనం = ధ్యానము, ఉత్కృష్టం = మంచిదని, వక్తుమేవ = చెప్పుటకే, అత్ర = ఇచ్చట, విషయానందః = విషయానందము, ఈరితః = చెప్పఁబడెను.

తా. నిర్గుణోపాసన కనధికారులైనవారు మిశ్రబ్రహ్మోపాసనమును చేయవలెనని చెప్పుటకే ఈ విషయానంద ప్రకరణము వ్రాయఁబడినది.

అవ. ఇఁక నిర్గుణోపాసనవిధానమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఔదాసీన్యే తు ధీవృత్తే శ్శైథిల్యాదుత్తమోత్తమం,
చింతనం వాసనానందే ధ్యానముక్తం చతుర్విధమ్. 29

వ్యా. ఏవం సవృత్తికం ధ్యానత్రయముక్త్వాఽవృత్తికం ధ్యానమాహ—ఔదాసీన్యేత్వితి. ఏభ్యో ధ్యానేభ్యోఽధికమిత్యర్థః. ఉక్తం నిగమయతి—ధ్యానమితి.

టీ. ఔదాసీన్యే = ఉదాసీనదశయందు, వాసనానందే తు = వాసనానందకాలమునం దయితే, చింతనం=ధ్యానము, ధీవృత్తేః = మనోవృత్తులయొక్క, శైథిల్యాత్ = తగ్గిపోవుటవలన, ఉత్తమోత్తమం = పరమోత్కృష్టము, (ఏవం = ఇట్లు, ధ్యానం = బ్రహ్మధ్యానము, చతుర్విధం=నాల్గు విధములుగా, ఉక్తం=చెప్పఁబడెను.

తా. ఇదివఱకు చెప్పఁబడిన మూఁడు విధములైన ధ్యానమునకంటె, వృత్తు లుపశమించిన తరువాత వాసనానందమందు చేయఁబడెడు బ్రహ్మధ్యాన ముత్తమోత్తమ మని తెలియనగును. ఇట్లు ధ్యానము నాలుగు విధము లని చెప్పఁబడెను.

అవ. వాసనానందమందలి ధ్యానమును ధ్యానభేదముగా నేల యనరాదు? అది యేల యుత్తమోత్తమ మనినఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. న ధ్యానం జ్ఞానయోగాభ్యాం బ్రహ్మవిద్యైవ సా ఖలు,
ధ్యానేనైకాగ్ర్యమాపన్నే చిత్తే విద్యా స్థిరీ భవేత్. 30

వ్యా. అయం ధ్యానావాంతరభేదః కిం నేత్యాహ—న ధ్యానమితి. తర్హి కిమేతదిత్యాహ—బ్రహ్మవిద్యేతి. ఇయం బ్రహ్మవిద్యా కథముత్పన్నేత్యాశంక్యాహ—ధ్యానేనేతి.

టీ. జ్ఞానయోగాభ్యాం=జ్ఞానయోగము లున్నంతమాత్రాన, ధ్యానం=ధ్యానము, న = నిరూపింపఁబడలేదు. సా=అది (౧౧, ౧౨, ౧౩ ప్రకరణములయందు నిరూపింపబడిన యర్థము), బ్రహ్మవిద్యైవ ఖలు = బ్రహ్మవిద్యయే కదా !. ధ్యానేన = ధ్యానముచేత, ఏకాగ్ర్యం = ఏకాగ్రతను, ఆపన్నే = పొందిన, చిత్తే=చిత్తమునందు, విద్యా = జ్ఞానము, స్థిరీభవేత్ = దృఢ మగును.

తా. యోగజ్ఞానములఁ దెలిపెడి ౧౧, ౧౨, ౧౩ ప్రకరణములయందు నిరూపింపఁబడిన యర్థమే యీ ౧౪-వ ప్రకరణమందును నిరూపింపఁబడినదే కాని ధ్యానము నిరూపింపఁబడలే దని తెలియవలెను. ఆ ప్రకరణములయందుఁ బ్రతిపాదింపఁబడిన బ్రహ్మవిద్యయే

యిచ్చుటంకూడ నిరూపింపఁబడినది. పూర్వోక్తసచ్చిదానందచింతన రూప ధ్యానముచేతఁ జిత్తైకాగ్ర్యము కలుగుచుండఁగా నట్టి చింతనమందు బ్రహ్మవిద్య యుదయించి స్థిరముగా నిలుచును.

అవ. ఇది బ్రహ్మవిద్య యనుటకు కారణమును జెప్పుచున్నాఁడు.—

శ్లో. విద్యాయాం సచ్చిదానందా అఖండైకరసాత్మతాం,
ప్రాప్య భాంతి న భేదేన భేదకోపాధివర్జనాత్. 31

వ్యా. అస్యా విద్యాత్వే హేతుమాహ—విద్యాయామితి.

టీ. విద్యాయాం = బ్రహ్మవిద్యయందు, సచ్చిదానందాః = సత్యజ్ఞానానంద స్వరూపములు, అఖండైకరసాత్మతాం = అపరిచ్ఛిన్నమైన ఏకాకారత్వమును, ప్రాప్య= పొంది, భాంతి = లేజరిల్లుచున్నవి. భేదకోపాధివర్జనాత్ = భేదమును కలుగఁజేసెడి ఉపాధులు లేకపోవుటవలననే, భేదేన = వేఱుగ, న భాంతి = ప్రకాశింపవు.

తా. అదియే విద్య యనుటకుఁ గారణ మే మనఁగా—జ్ఞానదశ యందు, బ్రహ్మలక్షణము లైన సచ్చిదానందములు, సజాతీయవిజాతీయ స్వగతభేద శూన్యమైన (అపరిచ్ఛిన్నమైన) కేవల వస్తుమాత్రముగా ప్రకాశించుటయే. ఆ జ్ఞానదశయందు భేదమునకుఁ గారణము లైన యుపాధులు లేకపోవుటవలన బ్రహ్మలక్షణము లగు సచ్చిదానందములు భేదముగాఁ బ్రకాశింపవు.

అవ. ఆ యుపాధులను పరిహరించెడి విధమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. శాంతా ఘోరాశ్శిలాద్యాశ్చ భేదకోపాధయో మతాః,
యోగాద్వివేకతో వైషాముపాధీనా మపాకృతిః. 32

వ్యా. భేదకోపాధివర్జనాదిత్యుక్తం. తానేవ భేదకోపాధీనాహ—శాంతా ఇతి. ఏతేషాం పరిహారః కేనోపాయేనేత్యాశంక్యాహ—యోగాదితి.

టీ. శాంతాః = సాత్త్వికవృత్తులును, ఘోరాః = రాజసవృత్తులును, శిలాద్యాశ్చ = పాషాణాది చింతనములును, భేదకోపాధయః = భేదమును కలిగించునట్టి యుపాధు లని. మతాః = చెప్పఁబడును. యోగాత్ = యోగమువలనఁగాని, వివేకతో వా = ఆత్మానాత్మవివేకమువలనఁగాని, ఏషాం ఉపాధీనాం = ఈ యుపాధులయొక్క, అపాకృతిః = పరిహారము (స్యాత్ = అగును).

తా. రాజసవృత్తులును, సాత్త్వికవృత్తులును, తామసవృత్తు లగు పాషాణాదులును, బ్రహ్మలక్షణము లగు సచ్చిదానందములకు భేదమును

గలిగించెడి యుపాధు లని చెప్పఁబడుచున్నవి. యోగమువలనఁగాని, ఆత్మానాత్మవివేకమువలనఁగాని ఈ యుపాధులను పరిహరింప నగును.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. నిరుపాధిబ్రహ్మతత్త్వే భాసమానే స్వయంప్రభే,
అద్వైతే త్రిపుటీ నాస్తి భూమానందోఽత ఉచ్యతే. 33

వ్యా. ఫలితమాహ—నిరుపాధీతి. త్రిపుటీభానాభావాత్ భూమానంద ఇత్యుచ్యతే ఇత్యర్థః.

టీ. స్వయంప్రభే=స్వప్రకాశమై, నిరుపాధి బ్రహ్మతత్త్వే=ఉపాధిరహిత బ్రహ్మస్వరూపమైన, అద్వైతే=అద్వితీయ వస్తువునందు, భాసమానే (సతి)=ప్రకాశించుచుండఁగా, త్రిపుటీ=జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లనెడి త్రిపుటి, నాస్తి=లేదు. అతః = అందువలన, భూమానంద ఇతి = భూమానంద మని, ఉచ్యతే = చెప్పఁబడును.

తా. స్వయంప్రకాశస్వరూపమై సదాభాసమానం బగు నిరుపాధికాద్వితీయబ్రహ్మతత్త్వమున, జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లనెడి త్రిపుటి లేదు. కాన నట్టిస్థితి భూమానంద మనఁబడును. అనఁగా భూమశబ్దవాచ్య మగు నానంద మగు నని వేదాంతశాస్త్రమందు స్పష్టముగాఁ జెప్పఁబడినది.

అవ. గ్రంథమును ముగించుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మానందాభిధే గ్రంథే పంచమోఽధ్యాయ ఈరితః,
విషయానంద ఏతేన ద్వారేణాంతః ప్రవిశ్యతామ్. 34

వ్యా. గ్రంథముపసంహరతి—బ్రహ్మానందేతి.

టీ. బ్రహ్మానందాభిధే గ్రంథే=బ్రహ్మానందమనెడి గ్రంథమునందు, విషయానందః=విషయానంద మను, పంచమోఽధ్యాయః=పంచమాధ్యాయము, ఈరితః=చెప్పఁబడెను. ఏతేన ద్వారేణ=ఈ విషయానందముద్వారా, అంతః = బ్రహ్మానందమునందు, ప్రవిశ్యతాం=ప్రవేశింపఁబడుఁ గాక.

తా. బ్రహ్మానంద మనెడి గ్రంథమునందు, ఈ పంచమాధ్యాయములో విషయానందము చెప్పఁబడెను. ఈ విషయానందముద్వారా బ్రహ్మానందస్వరూపమును గ్రహింతురు గాక.

అవ. గ్రంథాంతమున మంగళాచరణమును జేయుచున్నాఁడు:—

శ్లో. ప్రీయాద్ధరిహరోఽనేన బ్రహ్మానందేన సర్వదా,
పాయాచ్చ ప్రాణినస్సర్వాన్ స్వాశ్రితాన్ శుద్ధమానసాన్. 35

ఇతి శ్రీవిద్యారణ్యకృతౌ, వేదాంతపంచదశ్యాం, బ్రహ్మానందే
విషయానందో నామ పంచమోఽధ్యాయః.

వ్యా. ప్రీయాదితి. స్పష్టత్వాన్న వ్యాఖ్యాయతే.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునివర్య
కింకరేణ రామకృష్ణాఖ్యేన విదుషా విరచితే బ్రహ్మానందవ్యాఖ్యానే
విషయానందో నామ పంచమోఽధ్యాయః.

సమాప్తేయం సవ్యాఖ్యా పంచదశీ.

టీ. హరిహరః=హరిహరాత్మకుఁ డగు పరమేశ్వరుఁడు, అనేన బ్రహ్మానందేన = బ్రహ్మానంద మనెడి యీ గ్రంథముచేత, ప్రీయాత్ = ప్రీతిని జెందుఁగాక. శుద్ధమానసాన్ = పరిశుద్ధమనస్కులైనట్టియు, స్వాశ్రితాన్ = తన్ను ఆశ్రయించిన, సర్వాన్ ప్రాణినః=ఎల్లజీవులను, సర్వదా=ఎల్లప్పుడు, పాయాచ్చ=రక్షించును గాత.

తా. హరిహరస్వరూపుం డగు పరమేశ్వరుఁడు ఈ గ్రంథముచే ప్రీతుఁ డగు గాక. (ఈ గ్రంథమును ఈశ్వరార్పణమును జేసె నని భావము) మఱియు, అప్పరమేశ్వరుఁడు, శుద్ధమనస్కులై తన్నాశ్రయించిన జీవుల నెల్లకాలము ప్రోచుఁ గావుత. అని యాశీర్వచన పూర్వకమంగళము గ్రంథకర్త యొనరించెను.

ఇది శ్రీవిద్యారణ్యకృతం బగు పంచదశియందు బ్రహ్మానందమందలి
విషయానంద మను పంచమాధ్యాయము సమాప్తము.

శ్రీవేదాంతపంచదశి సంపూర్ణము.

---

# పారిభాషిక పద వివరణము



## అ

అంతఃకరణము.
అంతరింద్రియము. } = మనోబుద్ధి చిత్తాహంకారములు.

అంతర్ముఖః = సద్గురూక్తలక్ష్యదృష్టిగలవాఁడు.

అంత్యప్రత్యయము=పూర్వమభ్యసించుచుండెడియాయా దేవతావిషయాకారవృత్తి.

అకృతాభ్యాగమదోషము = కారణము లేనిదే కార్యము కలుగు ననుట.

అక్షః = ఇంద్రియములు.

అక్షరం = కారణము (నశింపనిది).

అక్షరః = నశింపని.

అజః = పరమాత్మ (పుట్టుకలేనిది).

అతిదేశించుట = ఒకచోటఁ జెప్పఁబడిన దానిని సామ్యమునుబట్టి మఱియొక చోట నుపయోగించుట.

అద్వయః = ఏకము.

అధ్యాసః = (శుక్తియందు రజతభ్రాంతి వలె) ఒకవస్తువును జూచి అది మఱియొకవస్తువు అనుకొనుట.

అధ్యాత్మ = శ్రోత్రాదీంద్రియములు.

అధ్యేతృ = చదువుకొనువారు.

అనవచ్ఛిన్నం = అవరణరహితము.

అనవస్థాదోషము=ఒకదోషమును ఖండింపనింకొకదోషము పొడముచు నెప్పటికిని ముగింపులేనిదోషము.

అనుగతం = వెంబడించునది.

అనుపపత్తి = యుక్తిలేమి

అనుబంధచతుష్టయము = ౧. అధికారి, ౨. విషయము, 3. సంబంధము, ४. ప్రయోజనము.

అనువృత్తం = అనుసరించిన.

అనువ్యవసాయం = ఘటమునందు చిదాభాసుని ప్రకాశమున్ను బ్రహ్మచైతన్య ప్రకాశమున్ను జేరి ద్విగుణమైయుండుటవలన ఘటము స్ఫుటముగా జ్ఞాతమై ప్రకాశించు జ్ఞాతత్వము. ఇది తార్కికులుచెప్పెడి జ్ఞానాంతరము.

అన్వయః = అనువృత్తి = (పూసలలోని దారమువలె) నంతటను వ్యాపించి (నిండి) యుండునది.

అపరోక్షము = ప్రత్యక్షము.

అభిధాయకం = చెప్పునది.

అభిధేయం = చెప్పఁబడునది.

అవగతం = తెలియఁబడినది.

అవభాసః = స్ఫురించుట, స్ఫూర్తి.

అవిద్య = అజ్ఞానము.

అవ్యక్తము=ఇంద్రియములకు గోచరింపనిది.

## ఆ

ఆగమాః = వేదములు.

ఆగ్రహః = అభినివేశము.

ఆత్మజ్ఞః=ఆత్మను దెలిసికొనినవాఁడు, జ్ఞాని.

ఆత్మనిష్ఠః = నిరంతరాత్మావలోకనము గలవాఁడు.

ఆధిః = మనోవికారము.

ఆపరోక్ష్యం = ప్రత్యక్షము కాకుండుట.
ఆభాసః = లేనిది యున్నట్టు తోఁచుట.

## ఇ

ఇష్టాపూర్తం = ఇష్టమనఁగా యాగాదికర్మ సముదాయము, పూర్త మనఁగా చెరువులు బావులు సత్రములు తోఁటలు మున్నగు జనోపయోగముకొఱకుఁ జేయఁబడు స్మార్తకర్మలు.

## ఉ

ఉజ్జగించుట = విడుచుట.
ఉపనిషత్ = బ్రహ్మము, బ్రహ్మబోధక వేదాంతవాక్యములు.
ఉపపత్తిః = యుక్తి.
ఉపలబ్ధం = పొందఁబడినది.
ఉపలబ్ధి = తెలివి.
ఉపహాసం = పరిహాసము = హేళనము.
ఉపాదానం = ముఖ్యకారణము.
ఉపాదేయం = గ్రాహ్యము.
ఉపాధిః = ఆత్మప్రతిబింబాధారశరీరము.

## ఏ

ఏకరసః = తన్మాత్రము (మాఱులేనిది)

## క

కరణం = ఇంద్రియము; సాధనము.
కాకదంతపరీక్ష = పొల్లును దంచినట్లు ఫలము లేనిపని.
కాణాదః = తార్కికుఁడు.
కూటస్థః = జననాదివికారరహిత పరబ్రహ్మము; సాక్షి, చైతన్యము, ప్రత్యగాత్మ.
కృతకృత్యః = జ్ఞాని.
కృతప్రణాశదోషము = కార్యము కనఁబడుచుండఁగా, కారణము లే దనుట.
క్షణికము=క్షణకాలములోనదృశ్యమగునది
క్షణికవాదినః = బౌద్ధులలో నొకతెగ.
క్షతిః = హాని.
క్షరం = నశించునది.
క్షేత్రం = శరీరము,
కైముతికన్యాయము = 'కిముత' యను శబ్దముచేఁ జెప్పఁబడునది గనుక 'కైముతికము' ఉదాహరణము:—దండమును నమలువానికి అప్పడములు నమలుట యెంతపని ?

## గ

గుణము = ఒకవస్తువునం దొకస్థలమున మాత్రమే యుండునది.
గుహా = కోశపంచకము.

## చ

చిదాభాసః = జీవుఁడు.
చైతన్యాభాసః = చిదాభాసుఁడు, జీవుఁడు.

## జ

జిజ్ఞాసుః = ఆత్మను దెలియఁగోరు ముముక్షువు.
జ్ఞః = ఆత్మ (తెలియువాఁడు).
జ్ఞప్తిః = చైతన్యము.
జ్ఞేయం=ఇంద్రియములకు గోచరమగునది.

## త

తమః = అజ్ఞానము.
తాదాత్మ్యం = ఐక్యము, ఏకత్వము.
త్రిపుటి = జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు.

## ద

దిగంబరః = బౌద్ధులలో నొకతెగ.
దృశిః = ఆత్మ.
దృశ్యం = చూడఁబడునది.
ద్రష్టా = చూచువాఁడు.

## ధ

ధర్మము = వస్తుగుణము.

ధర్మి = గుణముగలది.

ధీః = బుద్ధి, బ్రహ్మజ్ఞానము.

ధీరః=ఇంద్రియములు బాహ్యవిషయముల వైపెకిఁ బరుగిడుచున్నను, వానిని నిరోధించి బ్రహ్మానుసంధానమునందు చిత్తవృత్తులను నిలుప సమర్థుఁడగువాఁడు; ప్రాపంచిక వ్యాపారమును మఱచి సర్వదా బ్రహ్మనిష్ఠుఁడుండువాఁడు.

## న

నశ్వరం = నశించునది.

నిత్యముక్తః = కూటస్థుఁడు.

నిర్వృతిః = జననమరణరూపసంసారమునుండి విముక్తి; నిత్యసుఖము; మోక్షము.

## ప

పరావరః = కారణస్వరూపముచేత 'పరుఁడ'నియు కార్యాత్మకస్వరూపముచేత 'అవరు'ఁడనియు గ్రహింపఁబడు బ్రహ్మము.

పరావరా = ఒకరినుండి యొకరికి క్రమముగ ప్రాప్తించినది; శ్రేష్ఠమైనట్టియు కనిష్ఠమైనట్టియు సర్వవిద్యా విషయములందు వ్యాపించియున్నది = బ్రహ్మవిద్య.

పరివర్తనం = మార్పు.

పార్థక్యం = భేదము.

ప్రజ్ఞానం = అంతఃకరణవృత్తితోఁగూడి ఇంద్రియములద్వారా బాహ్యవిషయములను దెలిసికొనెడిజ్ఞానము.

ప్రమా = సత్యబుద్ధి.

ప్రమాణం = ప్రమాతతోఁగూడిన మనోవృత్తి.

ప్రమాత=అంతఃకరణప్రతిఫలితచైతన్యము.

ప్రమేయం = ఘటాదివిషయములు.

ప్రతిపత్తి = జ్ఞానము.

ప్రతిబంది = వాది యొకదోషమును గనుపఱుపఁగా ప్రతివాది యట్టి మఱియొక దోషమును వానివాదమందే కనుపఱచుట.

ప్రసులోమం = వ్యతిరేకము.

ప్రత్యక్ = దృశ్యవస్తువుకంటె విలక్షణముగనుండునది. (దృశ్యము, అనృతము, జడము, దుఃఖమును లేని) ఆత్మ

దృక్కు = (జడదుఃఖరూపముగాని) సచ్చిదానందరూపము.

ప్రత్యక్షం = ఎదుటనున్నది.

ప్రత్యక్తత్త్వము=ఉపాధివశమున మఱుగుపడియున్న యథార్థాత్మస్వరూపము.

ప్రత్యయః = జ్ఞానము.

ప్రధానం = అనేకపదార్థములయందు ఏది అనువర్తించియుండునో అది.

ప్రసాధనం = సిద్ధి.

## బ

బంధః=జననమరణరూప సంసారబంధము.

బహిర్ముఖాః = దేహాత్మవాదులు.

## భ

భాగత్యాగము = విరుద్ధాంశపరిత్యాగము.

భానం = ప్రకాశము.

భాసకం = ప్రకాశింపఁజేయునది (ఆత్మ).

భాస్యం = ప్రకాశింపఁజేయఁబడునది.

## మ

మనోరాజ్యం = సంతతవిషయధ్యానము.

మాధ్యమికాః=శూన్యవాదులగు బౌద్ధులు.

ముముక్షుః = ఆత్మజ్ఞాన (మోక్షము)నందు ఆసక్తిగలవాఁడు.
మూలావిద్య = జన్మాంతరవాసనలవలన స్వస్వరూపమును మఱచుటకు కారణమగు అజ్ఞానము.
మేయం = విషయమగువస్తువు.

## ల

లక్ష్యార్థః = శబ్దముచేఁ జెప్పఁదగనిది.
లింగం = హేతువు; సూక్ష్మశరీరము.
లోకాయతికాః = వేదబాహ్యులు.

## వ

వస్తుః = ఆత్మ.
వాక్యార్థః = పదసముదాయజన్యార్థము.
వాచారంభణం = వ్యవహారక్షమములగు జడానృత నామరూపములు.
వాచ్యార్థః = ముఖ్యార్థము.
వాసనా = పూర్వసంస్కారము.
విక్షేపః = బహిర్దృష్టి.
విజ్ఞాతా= తెలిసికొనువాఁడు, ప్రత్యగాత్మ.
విజ్ఞానం = విశిష్టజ్ఞానము.
విజ్ఞానవాదినః = బౌద్ధులలో నొకతెగ.
విదితం = తెలియఁబడినది.
విద్యా = ఆత్మజ్ఞానము, నిర్వికారాత్మబుద్ధి.
విద్వాన్ = ఆత్మజ్ఞాని.
విపర్యయః = విపర్యయగ్రహణము.
విపర్యాసః=అదికానిదానిని అదియనుకొనుట
విప్రతిపత్తిః = వివాదము, తగవు.
విలక్షణం = విరుద్ధస్వభావముగలది.
వివక్షితం = చెప్పఁదలఁచినది
వివర్తము = స్వరూపహాని లేకుండ పదార్థాంతరముగ తోఁచుట.
విషయాః = దృశ్యములగు జడములు.
విషయీ = ఆత్మ.
విసంవాది భ్రమ = వ్యర్థమగు భ్రమ.
విహితకర్మ = వేదచోదితకర్మ.
వేదనం = జ్ఞానము.
వైశేషికాః = తార్కికులు.
వైషమ్యం = హెచ్చుతగ్గులు.
వ్రాత్యః = ఉపనయనాదిసంస్కారములు లేని బ్రాహ్మణుఁడు.
వ్యాపకం = అంతటను నుండునది.
వ్యావృత్తం = మఱలినది.
వ్యావృత్తిః=హారములోనిపూసలవలె నొకదానినొకటి అంటకుండుట.
వ్యాహతిః = భంగము.

## స

సంవర్గవిద్య = వ్యష్టిసమష్టిరూపములఁ జెందిన వాయువు; ఉపాసనాదేవతయే తా ననెడి అభిమానముతోఁ జేయు ఉపాసనావిధానము.
సంవాదిభ్రమము = లాభమును గలుగఁజేయు భ్రమ.
సంశ్రయము = ఆశ్రయము.
సంసృతిః = జననమరణప్రవాహము.
సంవిత్ = జ్ఞానము.
సమాధానము = ధైర్యపఱచుట.
సమాధిః = అంతర్దృష్టి.
సామానాధికరణ్యం = రెండు ధర్మములు ఒక వస్తువునం దుండుట.
సూక్ష్మం = తెలియశక్యముకానిది.
స్మృతి = గడచినదానిని స్మరించుట.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1966. కాపీలు-1500.